

290 వెర
2-1-5

# ఖురానెషరీఫ్

తెనుఁగు తర్జుమా

వ్యాఖ్యాన సహితము.



290 వెా

మొదటి సంపుటము

**1:15** కాండములు.



అనువాదకుఁడు:

ఇస్లామ్ సేవకుఁడు,

(కర్నూల్ జిల్లా కంబము నివాసి)

మౌల్వీమున్షీఫాజిల్,

ముహమ్మద్ అబ్దుల్‌గఫూర్,

వైస్ ప్రిన్సిపాల్ ఇస్లామియా అరబీ కాలేజి,

కర్నూలు.

1948

అల్లాహు అక్బర్.

# కృతజ్ఞత.

ఓ పరమ దయాళువగు అల్లాః! నీ దివ్య గ్రంథమగు ఖురానెషరీ
తెనుఁగులో తర్జుమా వ్యాఖ్యానములు చేసి ముద్రించునట్టి అవకాశము నీవ
కొసంగినందులకు కృతజ్ఞత, నా జీవితకాలమంతయు సలిపినను తక్కువయే.
ఏలాటి పొరపాటులు సంభవించియున్నను ఓ దేవా! నీ అమితదయచే
క్షమించి నీ ప్రీతికి నన్ను పాత్రునిగాఁ జేయుదువని నమ్మి భయభక్తు
మనఃపూర్వకముగా నీ కృతజ్ఞత సలుపుచున్నాఁడను.

స్వర్గనివాసులైన నా తండ్రిగారగు షేఖ్ ముహమ్మద్ ఖాసిమ్ సాహె
వారు, నన్ను బాల్యమునుండి పెంచి విద్య నేర్పించుటలో చాల పాటుప
వారు ఖురానెషరీఫ్ తెనుఁగు తర్జుమా ముద్రింపఁబడిన చదువవలెనని
చాల ఇష్టముండెను. కాని దైవవశమున వారిమనోవాంఛ సఫలముకాకము
వారు కంబములో 28-11-39 తేది పరలోకము చేరిరి. దేవుఁడు వారియాత్మ
శాంతి నొసఁగుగాత!

చిత్తూరు బోర్డు హైస్కూలు, ఆంధ్ర పండితులును బహుగ్రంథ
యితలును సహజకవులును, అగు విద్వాన్ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగ
గ్రంథ సవరణ గావించి మహోపకార మొనర్చినందులకు వారికి కృతజ్ఞ
వందనము లర్పించుచున్నాఁడను.

అమూల్యములగు తమ సదభిప్రాయముల నొసంగి నన్నీకార్యమ
ప్రోత్సహించిన పండిత మిత్రబృందమునకు నా మనఃపూర్వక వందనము లర్పిం
చున్నాఁడను.

ఖురానెషరీఫ్ ముద్రించుటకు సహాయ్యమొనర్చిన పోషకులయెడ స
కృతజ్ఞుఁడనై వారి పవిత్రనామముల నిందు లిఖించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు,

చిత్తూరు,
1—5—41.

ముహమ్మద్ అబ్దుల్ గఫూర్

---

ఇది నేను చిత్తూరు బోర్డుహైస్కూలులో ఉర్దూమున్షీగా పనిచేయుచుండినపుడు,
క్రీ॥ శ॥ 1941వ సం॥లో మొదటి మూఁడు కాండములు ముద్రించినపుడు వ్రాసినది.

بسم اللہ الرحمٰن الرحیم

# پیش لفظ

از

## خادمِ قرآن مقصود علیخاں

یہ امر مسلمہ ہے کہ دنیا میں سب سے زیادہ جو کتاب پڑھی جاتی ہے، وہ **قرآن مجید** ہے اور یہ امر بھی مسلمہ ہے کہ دنیا میں سب سے بڑا اور عظیم الشان انقلاب پیدا کرنے والی کتاب یہی **قرآن مجید** ہے، جس نے تھوڑی سی مدت میں بڑی بڑی سرکش قوموں کے غرور توڑ دیئے، مفاسد کو زیر و زبر کر ڈالا، اور محاسن کی ایسی تجلی کی کہ ساری دنیا جگمگا اٹھی اس امر میں بھی کوئی شک نہیں ہے کہ مسلمانوں نے اپنی مقدس کتاب کی بڑی ہی عقیدت سے ایسی خدمت کی کہ دنیا کی کوئی قوم اپنی مذہبی کتاب کی ایسی خدمت کی مثال پیش نہیں کرسکتی۔ آج ساری دنیا کے طول و عرض میں ہزاروں لاکھوں قرآن مجید کے قلمی نسخوں کا موجود ہونا۔ اور فن کتابت اور حسن کاری میں اپنا آپ جواب ہونا، اس کا شاہد ہے۔ دنیا میں کوئی کتاب سوا "قرآن مجید" کے، ایسی نہیں ہے، جس کے ہر ہر لفظ ہر ہر نقطہ کی چھان بین کی گئی ہو، اُس کے الفاظ، اُس کے نقطے، اُس کی آیات گنی گئی ہوں، اور اُس کا ایک ایک لفظ ہر زمانہ میں لاکھوں انسانوں کے دل و دماغ میں محفوظ رہا ہو۔

اِس مقدس کتاب کے ترجمے بھی مختلف زبانوں میں علماء نے کئے، اس پر ہزارہا حاشیے لکھے گئے، ہزاروں تفسیریں، جن میں بعض کی مجلدات کی تعداد سو، ڈیڑھ سو تک پہنچتی ہے، تحریر کی گئیں۔ ہندوستان کی مختلف زبانوں میں اس کے ترجمے ہوئے۔ اُردو میں ترجمہ کا سہرا حضرت **شاہ عبدالقادر** صاحب دہلوی (رحمۃ اللہ علیہ) کے سر ہے کہ اس قدر احتیاط اور

کے ساتھ حضرت شاہ صاحب نے ترجمہ فرمایا کہ آج تک گو کہ سینکڑوں اردو کے ترجمہ ہو گئے مگر
رت شاہ صاحب قدس سرہ" کا احسان ہر ترجمہ کرنے والے نے مانا، اسی طرح فارسی میں بھی
اندان کے محترم بزرگ حضرت **شاہ ولی اللہ** (رحمۃ اللہ علیہ) نے ترجمہ فرمایا۔

ضرورت تھی کہ اسلام کی تبلیغ اور اشاعت کے لئے، اور اس مقدس پیغام کو ایسے
وں تک پہنچانے کے لئے، جو اردو، فارسی اور عربی سے ناآشنا ہوں، اس ملک کی دیگر
وں میں بھی ترجمے کئے جائیں۔ چنانچہ مرہٹی کا ترجمہ چھپ چکا ہے، اور کنڑی کا ترجمہ زیر طبع
۔ تلنگی زبان میں کوئی ترجمہ نہ تھا۔ الحمد للہ مولوی عبدالغفور صاحب کرنولی (فاضل دیوبند)
جو تلنگی زبان کے بھی عالم ہیں، اس کمی کو پورا کردیا، اور اس اہم کام کی تکمیل کی۔ دوسری طرف
تعالیٰ نے سر مرزا اسمٰعیل سابق صدر اعظم باب حکومت اور مولوی میر لائق علی صاحب حال صدر اعظم
حکومت اور خان بہادر نواب احمد نواز جنگ بہادر کو توفیق عطا فرمائی کہ ہر ایک صاحب نے
کار خیر کے واسطے پانچ پانچ ہزار روپے نذر گزرانے۔ ان کے سوا نواب دوست محمد خاں صاحب
یگر حضرات نے بھی مدد کرکے ثواب حاصل کیا۔ چنانچہ آج اللہ تعالیٰ کے فضل و احسان اور
حضرات کی اعانت سے قرآن مجید کا یہ تلنگی ترجمہ دنیا کے سامنے پیش ہے۔ امید ہے کہ
گی داں حضرات کو اس سے عظیم الشان فائدہ پہنچے گا، اور جن حضرات نے اس میں اعانت
ی ہے، اللہ تعالیٰ ان کو جزائے خیر دے گا۔

آخر میں یہ عرض کرنا بھی ضروری ہے کہ مترجم مولوی عبدالغفور صاحب نے حسبۃً للہ یہ کام
ام دیا، انھوں نے کوئی معاوضہ یا اجرت کسی طرح سے بھی نہیں لی؛ بلکہ گھر بار چھوڑ کر اور
مت سے رخصت لے کر، تصحیح اور پروف بینی کے واسطے ۴ ماہ تک سکندرآباد میں اقامت
۔ حق تعالیٰ ان کو بھی جزائے خیر دے اور ان کی سعی کو مشکور فرمائے۔ آمین

**مقصود جنگ**

حیدرآباد دکن
حمایت نگر
یکم آبان ۱۳۵۷ف

# తొలి పలుకు.

## బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

లోకములో అన్నిటికంటె నెక్కువగా పఠింపఁబడు గ్రంథము ఖురానె షరీఫ్ అనునది సర్వజన సమ్మతము. మఱియు జగత్తులో గొప్పమార్పు కలిగించు నట్టి గ్రంథము కూడ ఖురానె షరీఫ్ అను విషయము సర్వజన సమ్మతము. ఈ గ్రంథమే గర్వించి మదించి న్యాయము తప్పియున్న గొప్పగొప్ప జాతులవారి మదమును, గర్వమును అణఁగఁద్రొక్కి వారి చెడుగులను, దుర్మార్గములను తొలఁగించి లోకమంతటను కొంతకాలములోనే తన మేలిమి జ్యోతిని ప్రకాశింపఁజేసినది. ముసల్మానులు తమ ఈ పవిత్ర మతగ్రంథమును మహాభక్తితో సేవించినట్లు లోకములోని యితర జాతులవారు తమ గ్రంథములను సేవించినట్లు ఒక యుదాహరణముకూడ కానుపించదు అనుదానిలో నేలాటి సందేహము లేదు. ఇపుడు లోకమంతటను లక్షలకొలఁది వ్రాఁతప్రతులు పలువిధములైన మేలి వ్రాఁతపద్ధతిలో నుండుటయే దీనికి సాక్షి. ఖురానెషరీఫ్ యొక్క ప్రతి చుక్క-(నుక్తా) ప్రతి అక్షరము, ప్రతి పదము, ప్రతి వాక్యమును పరిశీలింపఁబడి లెక్కింపఁబడియున్నది. దీని ప్రతిపదమును ప్రతికాలములోను లక్షలకొలఁది జనులు కంఠపాఠముచేసి గ్రహించియున్నారు. ఇట్లు లోకములోని యే గ్రంథమును గూర్చియు శ్రద్ధవహింపఁబడలేదు. గొప్పగొప్ప విద్వాంసులు ఈ పవిత్ర గ్రంథమును అనేకభాషలలో అనువదించియున్నారు. మఱివేలకొలఁది పండితులు దీనికి టీక, వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. అందు కొన్ని వ్యాఖ్యాన గ్రంథములు నూఱు, నూటబది సంపుటములు గలవిగా నున్నవి.

హిందూదేశములో అనేకభాషలలోనికి దీని తర్జుమా చేయఁబడినది. మొట్టమొదట ఉర్దూభాషలో హజ్రత్ షాహ్ అబ్దుల్ ఖాదిర్ సాహెబ్ వారు (అల్లాః వారికి దయచేయుగాత!) చాలజాగ్రతతోను, గొప్పభక్తితోను ఖురానె షరీఫ్ తర్జుమాచేసిరి. వారిపిమ్మట ఇప్పటివఱకు వందలకొలఁది ఉర్దూ తర్జుమాలు అయినవి. అవన్నియు వారి తర్జుమాను అనుసరించియున్నవి. అనువాదకులందఱును వారి తర్జుమాను ఆదర్శనముగాఁ జేసికొని వారి యుపకారము నొప్పుకొనిరి. ఇటులే షాహ్ సాహెబ్ వారి వంశమునకు పెద్దలుగానున్న హజ్రత్ షాహ్ వలీయుల్లాః సాహెబ్ వారు [దేవుని యనుగ్రహము వారికి గలుగుగాత!] పారసీకభాషలో ఖురానెషరీఫ్ తర్జుమాచేసిరి. ఉర్దూ, పారసీక భాషలు తెలియని జనులలో ఇస్లామ్ మతప్రచారము చేయుటకును వారికి ఈ పవిత్రసందేశమును అందఁజేయుటకును ఈ దేశములోని యితర భాషలలో ఖురానెషరీఫ్ యొక్క తర్జుమాచేయుట చాలఅవసరమైయుండెను. అందులకే మరాటిభాషలో తర్జుమా

కావింపఁబడి ముద్రింపఁబడెను. కన్నడ భాషలోకూడ తర్జుమా ముద్రింపఁబడు చున్నది. కాని తెనుఁగుభాషలో తర్జుమా లేకుండెను. దేవుని అనుగ్రహమువలన తెనుఁగు భాషలో పండితులును లోకప్రసిద్ధిచెందిన దారుల్ ఉలూమ్ (అరబీ కళాశాల) దేవబందులో విద్యనభ్యసించి ఉత్తీర్ణులైన కర్నూలు నివాసులగు మౌల్వీ అబ్దుల్ గఫూర్ సాహెబ్‌వారు ఈ కొఱఁతను దీర్చిరి. ఈ గొప్ప కార్యమును పూర్తిచేయుటకు పరమదయాళువగు దేవుని అనుగ్రహమువలన పూర్వము హైదరాబాద్ ప్రభుత్వమునకు ప్రధానమంత్రిగానున్న సర్ మిర్జా ఇస్మాయీలు సాహెబ్‌వారును, ప్రస్తుతము హైదరాబాద్ ప్రభుత్వమునకు ప్రధానమంత్రిగానున్న మౌల్వీ మీర్ లాయిఖ్ అలీ సాహెబ్‌వారును, ఖాన్ బహదూర్ నవాబ్ అహ్మద్‌నవాజ్ జంగ్ బహదూరువారును ఒక్కొకరు ఐదేసివేలు రూపాయలు ఒసంగిరి. వీరు ముగ్గురేకాక యితర సహోదరులును ఈఘనకార్యమందు తోడుపడి పుణ్యము సంపాదించుకొనిరి. కావున ఇపుడు దేవుని యనుగ్రహమువలనను వీరి సహాయము వలనను ఖురానెషరీఫ్ యొక్క తెనుఁగు తర్జుమా (వ్యాఖ్యాన సహితము) ముద్రింపఁబడి లోకములో వెలువడుచున్నది. దీనివలన తెనుఁగు తెలిసిన సహోదరులకు గొప్పలాభము లభించునని ఆశయము గలదు. ఇందు తోడుపడిన సహోదరులందఱకును మహోన్నతుఁడగు అల్లా గొప్ప పుణ్యఫలితము లొసంగుగాత! అనువాదకులగు మౌల్వీ అబ్దుల్ గఫూర్ సాహెబ్‌వారు ఖురానెషరీఫ్ తర్జుమా కార్యమును దేవుని ప్రీతికొఱకుమాత్రము నెఱవేర్చిరి. అందులకు వారెట్టి ప్రతిఫలమును పుచ్చుకొనలేదు అను విషయము వెల్లడింపవలసియున్నది. పరమదయాళువగు దేవుఁడు వారికిఁగూడ గొప్పపుణ్య ఫలితము నొసంగి వారు గావించియున్న ప్రయత్నమును సఫలము చేయుగాత!

ఇట్లు

(మౌల్వీ నవాబ్ హాకీమ్)

మఖ్‌సూద్ జంగ్ (బహదూర్)

హైద్రాబాద్,
22-8-48.

# పీఠిక.

## ఖురానె షరీఫ్.

ఇది ఇస్లామ్ మతమునకు మూలగ్రంథము. హజ్రత్ ముహమ్మద్ రసూలు వారికి దేవుఁడొసంగిన యుత్తమోత్తమ గ్రంథము. ఇది అరబీభాషలోనున్నది. దీని మహిమనుగూర్చి ఎంత వ్రాసినను తక్కువయే. (దీనిగూర్చి మేము జగత్ ప్రవక్త రెండవభాగములో వ్రాసియున్నారము. చూడుఁడు పేజి 329). ఇది సర్వ జగత్తులకును తుదిదినము (ఖయామతు) వఱకును సన్మార్గము చూపునది. ఇందలి ధర్మముల ననుసరించు మానవకోటి యుభయలోకములలో నుత్తమస్థానమును పొందును. దేవుని యేకత్వము (తౌహీదు) రాజకీయము, గార్హస్థ్యము, మానసికము, బోధనార్థమై పూర్వము గడచిన ప్రవక్తలయొక్కయు వారి సంఘముల యొక్కయు వృత్తాంతములు, పరలోకము, మొదలగు సమస్త విషయములను గూర్చిన ధర్మములిందుఁగలవు. గ్రంథమిట్టిది కావుననే సర్వజనాదరణీయమై అన్నిభాషలలోనికి తర్జుమా చేయఁబడియున్నది. తెనుఁగునను ఒకరిద్దఱు దీనికి తర్జుమాచేసియున్నారు. కాని అవి సమంజసముగాలేక పలుదోషముల కెడమిచ్చుచున్నవి. ఆ తర్జుమాలచే ఖురానెషరీఫ్ యొక్క అర్థము సరిగా బోధపడక పోవుటచే చదువరులు ఇస్లామ్‌నుగూర్చి వాస్తవము దెలిసికొనలేక తప్పు అభిప్రాయము పడుచున్నారు. కావున అరబీభాషయందించుక జ్ఞానముగల నేను, పెక్కు తర్జుమావ్యాఖ్యాన గ్రంథములను పరిశీలించి ఖురానెషరీఫ్‌నకు సరియైన తెనుఁగు తర్జుమా చేయుట నా ముఖ్య ధర్మమని భావించి సులభశైలిలో దానిని తెనిఁగించుటకు 1929 సం॥లో ప్రారంభించితిని. కాని దైవికముగ మధ్యలో ననేక ఆటంకములు సంభవించుచు తుదకు దేవుని యనుగ్రహమువలన 19-1-45 తేదీన వ్రాఁతపని సంపూర్తి చేయఁగలిగితిని. చదువరులకు ఖురానెషరీఫ్ భావములు సరిగ బోధపడుటకుఁగాను దాని వ్యాఖ్యానము (తఫసీరు) చాల అవసరమని తలఁచి వీలైనంతవఱకు సంగ్రహముగా వ్యాఖ్యానముకూడ చేసితిని. ఈ నా కృషి యెంతవఱకు సఫలమాయెనో చదువరులే నిర్ణయింపఁగలరు.

ఈ గొప్పగ్రంథము ముద్రించుటకు దేవునిపై నాధారపడి చాల ప్రయత్నించుచుంటిని. తుదకు దేవుని యనుగ్రహమువలన ఈ విషయము ఆలీజనాబ్ నవాబ్ హకీమ్ మఖ్‌సూద్ జంగ్ బహదూర్ వారికిఁ దెలిసి వారు ఈ పనికిఁగాను పూనుకొని చాల కృషిసలిపిరి. పరమదయాళువగు అల్లాః కృపచే వారి ప్రయత్నము సఫలమాయెను. వారు వలయు ధనము సమకూర్పఁగలిగిరి. ఈ ధనసహాయ మొనర్చినవారిలో జనాబ్ సర్ మిర్జా ఇస్మాయిల్ సాహెబ్ వారును, జనాబ్ మౌల్వీ మీర్ లాయిఖ్ అలీ సాహెబ్ వారును, జనాబ్ ఖాన్ బహదూర్ నవాబ్ అహ్మద్ నవాజ్ జంగ్ బహదూర్ వారును చాల ముఖ్యులు. ఖురానెషరీఫ్‌ను ముద్రించుటలో అన్నివిధముల తోడుపడిన వారలకందఱకును

నా మనఃపూర్వకముగా కృతజ్ఞత చెల్లించుచున్నాను. పరమదయాళువ అల్లాః వారందఱకు ఉభయలోకములలోను మేలుదయచేయుగాత!

ఖురానెషరీఫ్‌లోని ధర్మములు హజ్రత్ ముహమ్మద్ పైగంబరులవా తమ జీవితకాలములోనే ఆచరించి లోకమునకు మార్గదర్శకులైనవారు. కావ ఖురానెషరీఫ్‌ను బాగుగా గ్రహింపవలెనన్న హజ్రత్ రసూలువారి దివ్యచ త్రము తప్పక తెలిసియుండవలెను. అందుకు చదువరులు మేము వ్రాసి ప్రకటిం యున్న జగత్ ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ పైగంబరులవారి దివ్యచరిత్రప రెండుభాగములు చదువవలెను.

ఖురానెషరీఫ్‌లోని ఒకవాక్యమునకు ఆయత్ అని పేరు. ఇట్టివి ఖురానె షరీఫ్‌లో ఆఱువేల రెండువందల ముప్పదియేడు (6237) గలవు. కొన్ని వాక్యముల సమూహామునకు రుకూ అనిపేరు. ఒక రుకూ లేక కొన్ని రుకూల సమూహము సూరా అనఁబడును. ఇట్టి సూరాలు ఖురానెషరీఫ్‌లో 114 గలవు. సూరాలు, మక్కీ, మదనీ అని రెండువిధములు. మక్కీ: హజ్రత్ ముహమ్మద్ రసూలువారికి నలుబదవయేట మక్కాపురములో ప్రవక్తపదవి (పైగంబరీ) దేవునిచే లభించెను. దీనిపిదప హజ్రత్ రసూలువారు మక్కాపుర ములో పదుమూఁడు సంవత్సరములుండిరి. ఈ కాలములో దేవునిచే వారికి లభించిన ఖురాను వాక్యముల సమూహామును మక్కీ సూరా అనుదురు.

మదనీ:— హజ్రత్ ముహమ్మద్ రసూలువారు మక్కాపురమును విడిచి మదీనాపురము చేరిరి. అచ్చట పది సంవత్సరము లుండి పరలోకముచేరిరి. ఈ కాలములో వారికి దేవునిచే లభించిన ఖురాను వాక్యముల సమూహామును మదనీ సూరా అనుదురు.

ఖురానెషరీఫ 23 సంవత్సరములలో హజ్రత్ రసూలువారికి దేవునిచే లభించెను. దేవునిచే వారికి ఖురానెషరీఫ వాక్యములు లభించుటను వహీ (దేవుని సందేశము) అనుదురు. హజ్రత్ జిబ్రీలు దూత దేవుని సందేశము (వహీ) హజ్రత్ రసూలువారికి అందఁజేయుచుండెను. హజ్రత్ రసూలువారికి దేవుని వాక్యములు కంఠపాఠమగుచుండెను. దేవునిసందేశము వచ్చిన తక్షణము తమ శిష్యులను పిలిచి ఆవాక్యములను వ్రాయించుచుండిరి. హజ్రత్ రసూలు వారి శిష్యులుకూడ ఖురానెషరీఫ్‌ను కంఠపాఠము చేయుచుండిరి. అట్లు హజ్రత్ రసూలువారి జీవితకాలములోనే వారి సమక్షమున సంపూర్ణముగ ఖురానెషరీఫ్ వ్రాయఁబడెను. మఱి పెక్కుమంది శిష్యులు (సహాబా) పూర్తి ఖురానెషరీఫ్ కంఠపాఠముచేసి నమాజులలో పఠించుచుండిరి. హజ్రత్ రసూలువారి పిదప హజ్రత్ అబూబకరువారు ఖలీఫా (ప్రతినిధి) అయిరి. వీరి పరిపాలనకాలమందు ఖురానెషరీఫ్ మొత్తము ఒక గ్రంథముగా సమకూర్చిరి. హజ్రత్ ఉస్మాన్

గనీ ఖలీఫా అయిన పిదప వారు ఖురానెషరీఫ్ యొక్క అనేకప్రతులు నకలు చేయించి ఇస్లామ్ రాజ్యములోని ముఖ్యపట్టణములకు పంపిరి. అట్లు ఖురాను ప్రతులు లిఖింపఁబడి లోకములో వ్యాపించెను. ఆకాలములో ముద్రణశాలలు లేకుండినను ప్రతులు వ్రాయువారు పెక్కురుండిరి. అట్లు ఖురానెషరీఫ్ కంఠోక్తి పూర్వకముగను, వ్రాఁతమూలముగను, సురక్షితముగా ఏలాటి హెచ్చు తగ్గులు లేకుండ లోకమంతటను వ్యాపించి ఇప్పటికి సన్మార్గమునూపుచున్నది. ఇఁక తుది దినమువఱకు చూపఁగలదు. ఒక చిన్నబాలుఁడుకూడ ఖురానెషరీఫ్‌ను సంపూర్ణముగకంఠపాఠముచేయును. ఇదిఖురానెషరీఫ్ యొక్క మహిమయే. పఠనసౌకర్యములకై ఖురానెషరీఫ్‌ను ముప్పదికాండము (జూజు) లుగ భాగించియున్నారు.

ఖురానెషరీఫ్‌ను భయభక్తులతో పఠింపవలెను. ఖురానెషరీఫ్ అరబీ భాషలో నున్నది గావున ముసల్మానుభక్తులు తాము అరబీభాషను నేర్చుకొని తమ బిడ్డలకును నేర్పుట చాల అవసరము. ఖురానెషరీఫ్‌ను చదివి దాని భావములు గ్రహించి దానిననుసరింపవలెను. దీనివలన పూర్వము ముసల్మానులకున్న సర్వవిధముల వైభవములు తిరిగి లభింపఁగలవు. ఖురానెషరీఫ్‌ను హజ్రత్ రసూలువారి యాచారము (సున్నత్)ను సంపూర్ణముగ అనుసరింపకపోవుట వలననే ముసల్మానులు కోట్లకొలఁదిగ సంఖ్యలోనుండియు మునుపటి స్వాతంత్ర్యము, ఉన్నతస్థానము, రాజ్యము మొదలగు గౌరవములు గోలుపోయి, పరులకులోఁబడి యుండవలసిన స్థితి వచ్చినది. కావున ముసల్మానులు తమ స్థితి విధులను యోచించి యుత్తమస్థానమును పొందుటకు కృషి సలుపుదురుగాక! ఖురానెషరీఫును శుద్ధిగానుండి పఠింపవలెను. ఖురానును వజూ గుసులు చేయక అపవిత్రముగానుండి తాకకూడదు. గుసులు చేయక చదువకూడదు. స్త్రీలురజస్వలలైన కాలములలో పఠింపఁగూడదు. ఖురానెషరీఫ్ పఠింపఁబోవు నపుడు

అ-ఊ-జు-బిల్లాహి-మినష్-షైతా-నిర్రు-జీమ్ (దేవుని యనుగ్రహమునుండి తొలఁగింపఁబడ్డ సైతాను కీడునుండి రక్షణపొందుటకై నేను దేవుని శరణు చొచ్చుచున్నాను.) అని చదువవలెను. దీని పిదప బిస్మిల్లా-హిర్రహ్మా-నిర్రహీమ్ అని చదువవలెను. అరబీ లిపి చదువలేనివారికొఱకు మేము ఖురానెషరీఫ్ మూలమును తెలుఁగు లిపిలో వ్రాసియున్నారము. అరబీ భాషలోనున్న కొన్ని అక్షరముల ఉచ్చారణకుఁ దగిన అక్షరములు తెనుఁగులో లేవు. అందుకు మేముకొన్ని గుర్తులు నియమించియున్నారము. కావున దానిని ననుసరించి పాఠకులు తమ యుచ్చారణ అరబీభాష తెలిసినవారియొద్ద సవరించుకొని ఖురానెషరీఫ్‌ను నమాజు మొదలగువానిలో పఠింపవలెను.

## తెనుఁగులోలేని అరబీ అక్షరములు, వాని యుత్పత్తి స్థానములు.

| | | | |
|---|---|---|---|
| ث | స దంత్యము(నాలుకకొన ముందటి పండ్ల కొనలకు తగులవలెను.) | ط | త దంత్యము (నాలుక కొనపై దంతమూలము.) |
| ح | హ మధ్యకంఠము(బీచ్ హల్ఖ్) | ظ | జ దంత్యము (నాలుకకొన ముందటి పండ్లకొనలకు తగులవలెను.) |
| خ | ఖ పై కంఠ్యము (అవ్వలెహల్ఖ్) | ع | అ మధ్యకంఠము (బీచ్ హల్ఖ్) |
| ذ | జ దంత్యము(నాలుకకొనముందటి పండ్లకొనలకు తగులవలెను.) | غ | గ కంఠ్యము (అవ్వలెహల్ఖ్) |
| ز | ఝ నాలుకయు ముందటి పండ్ల మధ్యభాగము. | ف | ఫ క్రింది పెదవి మధ్య పైదంతముల కొనలకు తగులవలెను. (ఇంగ్లీషులోని F యొక్క ఉచ్చారణ.) |
| ص | స దంత్యము(నాలుకయు ముందటి పండ్లమధ్య భాగము.) | ق | ఖ నాలుకమూలము దానిపై భాగమునకు తగులవలెను. |
| ض | జ నాలుక మూలము యొక్క ప్రక్క భాగము పై దవుడల మూలమునకు తగులవలెను. | | |

సాధ్యమైనంతవఱకు మేము ఖురా నెషరీఫ్‌ను తెనుఁగు లిపిలో పఠన పద్ధతి నియమములనుబట్టి వ్రాసియున్నారము. అయినకొన్ని నియమములు వ్రాతలో వ్రాయలేకపోయితిమి. అవి యిచ్చట వ్రాయుచున్నారము. చదువరులు గమనింపవలెను. (న్) నకారపొల్లుకు తరువాత య, వ, న, మ, అక్షరములు వచ్చినచో నకారపొల్లు అనునాసికములవలె ముక్కునుండి ఉచ్చరింపవలెను. దీర్ఘమునకును గుడిదీర్ఘమునకును, కొమ్ముదీర్ఘమునకును, పిదప, అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ,లు వచ్చినచో దీర్ఘములు ప్లుతములగును. ప్లుతమనఁగా మూఁడుమాత్రలకాలము. దీనినే మద్ అనుదురు.

హెచ్చరిక:— తర్జుమా వ్యాఖ్యానములలో హజ్రత్ మహమ్మదు పైగంబరులవారి పేరువచ్చునపుడెల్ల చదువరులు సల్-లల్లాహు-అలైహి-వ-సల్లమ్. అని పలుకవలెను. ఇటులే హజ్రత్ ఆదము మొదలగు ప్రవక్తల వారిపేర్లు వచ్చినపుడెల్ల అలై-హిస్-సలామ్ అని పలుకవలెను. హజ్రత్ పైగంబరులవారి శిష్యుల (సహాబా) వారిపేర్లువచ్చినచో రజి-యల్లాహు-త-ఆలా-అన్‌హు అని పలుకవలెను.

## తెనుఁగులోలేని అరబీ అక్షరములు, వాని యుత్పత్తి స్థానములు.

| | | | |
|---|---|---|---|
| ث | స దంత్యము(నాలుకకొన ముందటి పండ్ల కొనలకు తగులవలెను.) | ط | త దంత్యము (నాలుక కొనపై దంతమూలము.) |
| ح | హ మధ్యకంఠము(బీచ్‌హల్క్) | ظ | జ దంత్యము (నాలుకకొనముందటి పండ్లకొనలకు తగులవలెను.) |
| خ | ఖ పై కంఠ్యము (అవ్వలెహల్క్) | ع | అ మధ్యకంఠము (బీచ్‌హల్క్) |
| ذ | జ దంత్యము(నాలుకకొనముందటి పండ్లకొనలకు తగులవలెను.) | غ | గ కంఠ్యము (అవ్వలెహల్క్) |
| ز | జ నాలుకయు ముందటి పండ్ల మధ్యభాగము. | ف | ఫ క్రింది పెదవి మధ్య పైదంతముల కొనలకు తగులవలెను. (ఇంగ్లీషులోని F యొక్క ఉచ్చారణ.) |
| ص | స దంత్యము(నాలుకయు ముందటి పండ్లమధ్య భాగము.) | ق | ఖ నాలుకమూలము దానిపై భాగమునకు తగులవలెను. |
| ض | జ నాలుక మూలము యొక్క ప్రక్క భాగము పై దవుడల మూలమునకు తగులవలెను. | | |

సాధ్యమైనంతవఱకు మేము ఖురానెషరీఫ్‌ను తెనుఁగు లిపిలో పఠన పద్ధతి నియమములనుబట్టి వ్రాసియున్నారము. అయినకొన్ని నియమములు వ్రాఁతలో వ్రాయలేకపోయితిమి. అవి యిచ్చట వ్రాయుచున్నారము. చదువరులు గమనింపవలెను. (న్) నకారపొల్లుకు తరువాత య, వ, న, మ, అక్షరములు వచ్చినచో నకారపొల్లు అనునాసికములవలె ముక్కునుండి ఉచ్చరింపవలెను. దీర్ఘమునకును గుడిదీర్ఘమునకును, కొమ్ముదీర్ఘమునకును, పిదప, అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ,లు వచ్చినచో దీర్ఘములు ప్లుతములగును. ప్లుతమనఁగా మూఁడుమాత్రలకాలము. దీనినే మద్ అనుదురు.

హెచ్చరిక:— తర్జుమా వ్యాఖ్యానములలో హజ్రత్ ముహమ్మదు పైగంబరులవారి పేరువచ్చునపుడెల్ల చదువరులు సల్-లల్లాహు-అలై-హి-వ-సల్లమ్. అని పలుకవలెను. ఇటులే హజ్రత్ ఆదము మొదలగు ప్రవక్తల వారిపేర్లు వచ్చినపుడెల్ల అలై-హిస్-సలామ్ అని పలుకవలెను. హజ్రత్ పైగంబరులవారి శిష్యుల (సహాబా) వారిపేర్లువచ్చినచో రజి-యల్లాహు-త-ఆలా-అన్హు అని పలుకవలెను.

# జగత్ ప్రవక్త.

శ్రీ॥ శే॥ ఆలీజనాబ్ ఉమర్ ఆలీషా సాహెబ్, ఎమ్. ఎల్. ఏ. (ఢిల్లీ) గారి

## అభిప్రాయము

ఆ. గీ. శ్రితజగత్ ప్రవక్త శ్రీ మహమ్మద్ పయం
బరుల వారిదివ్య, చరితఁ దెలుఁగు
గద్య వ్రాసి లోక కల్యాణ మునరుఁ దో
డ్పడె మొహమ్మదబ్దులు గఫూరు.

తే. గీ. శ్రీ మహమ్మద్ చరిత్ర వ్రాసినను వినినఁ
జదివినను సర్వపాపముల్ సమసిపోవు
ఇంక పారాయణము సేయు నెల్ల వారి
కీశ్వరుఁడు వచ్చి సాక్షాత్కరించు సతము.

తే. గీ. మున్షిఫాజిల్ మహమ్మదబ్దుల్ గఫూరు
సాహెబుంగారు శ్రీ రసూల్ సార్వభౌము
చరిత వ్రాసి తరించె ఆజన్మ కింక
వేరె పుణ్యంబు తపసును కోరు టేల.

పిఠాపురము,
28—7—36.

ఇట్లు,
ఉమర్ అలీషా.

| సూరాల పట్టిక | | | కాండముల పట్టిక | |
| --- | --- | --- | --- | --- |
| నెంబరు | సూరాల పేర్లు | పుట | కాండము | పుట |
| 1 | ఫాతిహా | 1 | 1 | 1 |
| 2 | బఖరా | 4 | 2 | 68 |
| 3 | ఆలెఇమ్రాన్ | 160 | 3 | 136 |
| 4 | నిసా | 244 | 4 | 197 |
| 5 | మాఇదా | 329 | 5 | 259 |
| 6 | అన్ఆమ్ | 391 | 6 | 316 |
| 7 | ఆరాఫ్ | 462 | 7 | 373 |
| 8 | అన్ఫాల్ | 543 | 8 | 484 |
| 9 | తౌబా | 580 | 9 | 496 |
| 10 | యూనుస్ | 648 | 10 | 561 |
| 11 | హూద్ | 690 | 11 | 628 |
| 12 | యూసుఫ్ | 733 | 12 | 692 |
| 13 | రఅద్ | 776 | 13 | 754 |
| 14 | ఇబ్రాహీమ్ | 798 | 14 | 818 |
| 15 | హిజ్ర్ | 817 | 15 | 882 |
| 16 | నహల్ | 835 | | |
| 17 | బనీయిస్రాయీల్ | 882 | | |



# ఖురానె షరీఫ్

## సూరయే ఫాతిహా 1. కాండము

## 1. సూరయేఫాతిహా, మక్కీ, 7 వాక్యములు.



ఈ సూరాకు చాల పేరులు గలవు. అవి ఫాతిహా, సూరతుష్ షిఫా ఉమ్ముల్ కితాబ్ అను నవి. ఫాతిహా అనగా ప్రారంభము. ఇది ఖురానె షరీఫునకు ప్రారంభములోఁ గలదు. కావున ఈ పేరు గలిగెను. షిఫా అనఁగా స్వస్థత. ఈ సూరాను జబ్బుపడినవారిపై పఠించినచో దేవుని అనుగ్రహమువలన వారికి స్వస్థత లభించును.

ఉమ్ముల్ కితాబ్:— ఉమ్ అనగా తల్లి, లేక మూలము. కితాబ్ అనగా ఖురానుగ్రంథము. ఎట్లు విత్తనమునందు, వృక్షము, దాని శాఖలు, ఆకులు, పువ్వులు, ఫలములు ఇమిడి యున్నవో అటులే ఈ సూరాయందు ఖురానె షరీఫులో నున్న భావములు, విషయములు గలవు. పూర్తిగ ఖురానెషరీఫులో అయిదు విషయములు వివరింపఁబడినవి. 1. దేవుని యేకత్వము (తౌహీదు) ఇది సూరాలోని మొదటి వాక్యములో గలదు. 2. విశ్వసించినవారికి ఉభయలోకములలో జయము మోక్షములును విశ్వసింపని వారికి ఉభయలోకములలోను దుర్గతి పట్టును, అని తెలుపుట. ఇది రెండవ మూడవ వాక్యములలోఁగలదు. 3. దేవుని ప్రార్థన. ఈ విషయము నాలుగవ వాక్యములో చెప్పఁబడినది. 4. ఉభయలోకములలోను విజయమును మోక్షమును చేకూరునట్లు చేయు సన్మార్గము. ఇది అయిదవ వాక్యమునందు గలదు, 5. దేవుని విశ్వసించి ధర్మములను అనుసరించి దేవుని దయకు పాత్రులైనవారి చరిత్రములును, దేవుని నమ్మక పాపములకులోనై దేవుని కోపమునకుఁ బాత్రులైనవారి వృత్తాంతములును. ఇది ఆఱవ ఏడవ వాక్యములలో గలదు. ఈ యైదు విషయములును ఈ సూరాలో సంగ్రహముగా తెలుపఁబడినవి.

బిస్మిల్లా-హిర్రహ్మా-మానిర్రహీమ్.

అమిత దయగలవాఁడును, ప్రేమించు వాఁడునగు దేవుని పేర.

వ్యా॥ దీనిని తస్మియాఅనుదురు. ఇది ప్రతి సూరాకు ప్రారంభము నందుండును. దీని బట్టి సూరాప్రారంభ మైనదని తెలియనగును. భక్తులు తమ కార్యములకు తొలుత దేవుని నామము పఠింపవలెను. దానికిఁగాను దీనిని పఠింపవలెను. కావున దీనిని ప్రతి ధర్మకార్యము చేయుటకు ప్రారంభించునపుడు చదువ వలెను. దీనివలన దేవుని యనుగ్రహము తోడుపడును. కార్యము నిర్విఘ్నమగును. అనేక శుభములు లభించును. చాల పుణ్యము చేకూరును. పాపకార్యములు చేయుటకు ముందు చదువరాదు. 'అల్లాహు' అరబీ భాషలో దేవునికి సంజ్ఞావాచకము. రహ్మాన్, రహీమ్, అనునవి దయ, అనుగ్రహములను దెలుపునట్టి నామములు. రహ్మాన్ అనగా అమిత దయగలవాఁడు. సర్వమునకును అతని దయ ఆవరించి యున్నది. రహీమ్ ప్రేమ అనుగ్రహములు గలవాఁడు. భక్తవత్సలుఁడు. ఆతడు ప్రేమకు నిలయుఁడు మఱి ప్రేమ పరిపూర్ణుఁడు. రహ్మాన్ దేవునికి సంజ్ఞావాచకముగా కూడ వాడఁబడుచున్నది.

1. అల్ హమ్ దు-లిల్లాహి-అబ్బిల్ ఆలమీన్.

2. అర్రహ్మా-మా-నిర్రహీమ్. 3. మాలికి-యామిద్దీన్.

1. సమస్తస్తోత్రములు, సర్వలోకములకు పోషకుఁడును, 2. అమిత దయగలవాఁడును, ప్రేమించువాఁడును, 3. తీర్పుదినమునకు సర్వాధికారియునగు దేవునికై యున్నవి.

వ్యా॥ 1. దేవుని సృష్టిలోగల ఒక్కొక్క జాతి సమూహము ఆలమ్ (లోకము) అనఁబడును. ఆలమ్ అనగా సూచించునది. అనగా సృష్టిలోని ప్రతిదియును తన్ను సృష్టించిన ఒక సృష్టికర్తయున్నాఁడు అనిసూచించును. సృష్టిలోని జాతి సమూహములు లెక్కకు మించినవి. అందు దేవదూతలు, మానవులు, జంతువులు, పక్షులు, మొదలగునవి. వీని అన్నిటికిని దేవుఁడు సృష్టికర్త. దేవుఁడు అద్వితీయుఁడు. సర్వశక్తుఁడు. అన్నిటికిని వాని వానికి తగినట్లు వసతులు కల్పించి పోషించువాఁడు (రబ్) కూడ దేవుఁడే. 2. పోషణకుఁగాను, దయ ప్రేమలుండవలెను. పోషకుఁడగు దేవుఁడు అమిత దయ గలవాఁడు (రహ్మాన్) ప్రేమగలవాఁడు (రహీమ్). 3. లోకము దేవుని

లకు సన్మార్గము చూపును. అట్టి సన్మార్గమే తమకు చూపవలెనని భక్తుల వేఁడుచున్నారు. 6. దేవుని యనుగ్రహము పొందినవారు నబీలు (ప్రవక్తలు) సిద్దీఖులు (సత్యవంతులు), షహీదులు (దేవుని మార్గమునందు ధర్మయుద్ధములందు తమ ప్రాణములను అర్పించినవారు). సాలిహీన్ (సత్ప్రవర్తకులు) అనువారు ఈనలువురమార్గమే సన్మార్గమును, అనుసరింపఁదగినదియును వీరిని గూర్చి వివరములు ఇఁకమీఁద ఖురానె షరీఫులో వచ్చును. 7. ఎట్లు మంచి వారి మార్గము అనుసరింపఁ దగినదో అట్లు దుష్టుల మార్గము విడనాడ దగినది. దేవుని కోపమునకు పాత్రులైనవారిని తప్పుత్రోవల పోయిన వారిని అనుసరించుట చాల హానికరము. ఎవరు సన్మార్గమును సత్యమును దెలిసియు దురాచారములు గావింతురో వారు దేవుని కోపమునకు పాత్రులై కఠినశిక్ష పొందుదురు. ఇట్టివారు యూదులు (యహూదీలు). వీరి చరిత్రము ఇఁకమీఁద ఖురానె షరీఫులో వివరింపఁబడును. సన్మార్గమును సత్యమును గూర్చి సందేహములలోఁబడి వాని తప్పి తప్పుత్రోవల పోయినవారు దుర్మార్గులు. ఇట్టివారు నసారీలు. వీరి విషయములుకూడ ఇఁకమీఁద వచ్చును.

ఈ సూరాలోని భావములనుబట్టి రెండు భాగములు గలవు. మొదటి వాక్యమునుండి నాలుగు వఱకు దేవుని సంబంధమైనవి. మిగిలిన వాక్యములు భక్తులకు సంబంధించినవి. ఇందు దేవుఁడు తన భక్తులు తన్నే విధముగా స్తుతించి వేఁడవలెనో సూచించుచున్నాఁడు. ఈ సూరాను నమాజులోని ప్రతి రకాతులో చదువవలెను. దీనిని పూర్తిగా పఠించిన పిదప ఆమీన్ అని పలుకవలెను. ఆమీన్ అనగా (తథాస్తు) ఓ దేవా! మేము వేఁడుకొనినట్లు అగుగాక అని యర్థము.

---

# సూరయే బఖరామదనీ 286 వాక్యములు.

---

ఇదియొక గొప్పసూరా. ఇందు ననేక ధర్మములు చెప్పఁబడినవి. ఇందు ఆవునకు సంబంధించిన కథగలదు. కావున దీనికి సూరయేబఖరా (ఆవు) అనిపేరుగలిగెను.

బిస్మిల్లా-హిర్రహ్మా-నిర్రహీమ్.

అమితదయగలవాఁడును ప్రేమించువాఁడునగు దేవుని పేర.

1. అలిఫ్-లామ్-మీమ్. ఇట్టిపాడియక్షరములు కొన్ని సూరాలకు ప్రారంభమున గలవు. వీనిని హురూఫె ముఖత్త ఆత్ అనుదురు. వీని వాస్తవమైన అర్థము దేవునికే యెఱుక. ఇది యొక గొప్పరహస్యము. అయిన కొందఱు విద్వాంసులు వీనికి అర్థముచేసియున్నారు. అచ్చటచ్చట వానిని వ్రాయుదుము. 'నేను దేవుఁడను సర్వజ్ఞుఁడను, అని దీని యర్థము చేసి యున్నారు. కొందఱు ఇది ఈ సూరా పేరు అందురు.

2. జాలికల్-కితాబు-లారైబ-ఫీహి-హుదల్-లిల్-ముత్తఖీన్.

2. ఈ గ్రంథమునుగూర్చి యెట్టిసందేహము లేదు. ఇది భక్తులకు సన్మార్గము చూపును.

వ్యా॥ 2. సూరయే ఫాతిహాలో సన్మార్గము చూపుమని దేవునిని భక్తులు వేఁడియుండిరి. అందుకు నిచ్చటనుండి ఖురాను అంత్యమువఱకు జవాబున్నది. ఖురానే షరీఫు దేవుని గ్రంథము. ఈవిషయమును గూర్చి యెట్టి సందేహము లేదు. ఇందు సన్మార్గముగలదు. దీని ననుసరింపవలెను. భయభక్తులు గలవారికి నిది సన్మార్గముచూపును. భక్తులే దీనివలన సన్మార్గులగుదురు. భయభక్తులులేని యవిశ్వాసులు దీనిబోధను చెవియొగ్గి వినరు. మఱి దీనిననుసరింపరు. కావున ఖురానుగ్రంథము భక్తులకు సన్మార్గదర్శకము అని చెప్పఁబడెను.

3. అల్లజీన-యూమినూన-బిల్-గైబి-వయుఖీ-మూనస్-సలాత-వమిమ్మా రజఖ్-నాహుమ్-యున్-ఫిఖూన్.

3. ఆ భక్తులు, అగోచరముల (గైబు)ను విశ్వసించువారును, నమాజును స్థిరముగా సలుపువారును, మఱి మేము వారికి నొసంగిన దానినుండి దానము చేయువారును.

వ్యా॥ 3. ఈ వాక్యములలో భక్తుల గుణములు వివరింపఁబడినవి. విశ్వాసమును ఈమాన్ అనుదురు. మనస్సులో నమ్మి యానమ్మికను వాక్కుమూలముగా వెల్లడించుట ఈమాన్ అనబఁడును. గైబ్ అనగా ఇంద్రియములకు గోచరింపనిది. ఇట్టివానిని దేవుఁడు తనప్రవక్తలమూలమున మానవులకుఁదెలుపును. విశ్వాసముగల భక్తులువానిని నమ్ముదురు. అవిశ్వాసులును నాస్తికులును వానిని తిరస్కరించి పాపులై దేవుని కోపమునకు పాత్రులగుదురు. అట్టి అగోచరము (గైబు)లు, నరకము, స్వర్గము, దేవదూతలు (ఫరిస్తే) పునరుత్థానదినము (ఖియామత్) మొదలైనవి. భక్తులు

నమాజు వేళకు శ్రద్ధతోను భయభక్తులతోను దప్పక స్థిరముగా దేవుని ప్రీతికొఱకు సలుపుదురు. నమాజు అయిదుపూఁటలుచేసి తీరవలసినది. నమాజుసలుపుట విశ్వాసము (ఈ మాను) నకు గుఱుతు. భక్తులు దేవుఁడు తమకు నొసంగిన ధనధాన్యములనుండి దేవుని ప్రీతికొఱకు కొంత పేదలకు దానముచేయవలెను. అందు జకాతు (విధిదానము) మనఃపూర్వకముగా చేయు ప్రీతిదానములు (సదఖాత్) చేరును.

4. వల్లజీన-యూమి-నూన-బిమా-ఉన్‌జిల-ఇలైక-వమా-ఉన్‌జిల-మిన్-ఖబ్‌లిక-వబిల్-ఆఖిరతి-హుమ్-యూఖినూన్, ఉలా-ఇక-అలా-హుదమ్-మిర్-అబ్బిహిమ్-వ-ఉలా-ఇక-హుముల్-ముఫ్-లి-హూన్.

4. నీకు నొసంగఁబడిన దానిని, నీకంటెముందుగా నొసంగఁబడిన దానిని విశ్వసించువారును, పరలోకమునందు నమ్మికగలవారును, 5. అగువారే తమ దేవుని సన్మార్గమునందున్నవారు, మఱియు వారే మోక్షము పొందువారు.

వ్యా॥ 4-5. హజ్రత్ ముహమ్మదు పైగంబరువారికి దేవునిచే నొసంగఁబడిన ఖురాను గ్రంథమును మఱియు వీరికిపూర్వము గడచిన ప్రవక్తలకు దేవునిచే నొసంగఁబడిన గ్రంథములగు తౌరాతు, ఇన్జీలు, జబూరు, మొదలైన గ్రంథములను భక్తులు విశ్వసింపవలెను. ఏదైన నొక దేవదత్త గ్రంథమును తిరస్కరించినచో విశ్వాసహీనులగుదురు. పరలోకమును అఖిరత్ అనుదురు. భక్తులు దీనినికూడ విశ్వసింపవలెను. ఇంతవఱకు చెప్పఁబడిన విషయములను విశ్వసించి నమాజు సలిపి దానముచేసినవారే దేవునిచే చూపింపఁబడిన సన్మార్గము నవలంబించినవారగుదురు. మఱియు నిట్టివారే యిహపరములందు విజయముగాంచి మోక్షముపొందువారు. ఇంతవఱకు విశ్వాసుల విషయమును వారు పొందు ఫలితమును గూర్చి చెప్పఁబడెను. ఇఁక అవిశ్వాసులనుగూర్చి చెప్పఁబడుచున్నది.

6. ఇన్నల్లజీన-కఫరూ-సవాఉన్-అలైహిమ్-అ-అన్-జర్-త హుమ్-అమ్-లమ్-తున్-జిర్-హుమ్-లా-యూమినూన్.

7. ఖతమల్లాహు-అలా-ఖులూ-బిహిమ్-వ-అలాసమ్-ఇహిమ్-వ-అలా-అబ్-సారి-హిమ్-గిషావతున్-వలహుమ్-అజాబున్-అజీమ్.

6. నిశ్చయముగా అవిశ్వాసులైన వారికి నీవు భయబోధ నిచ్చినను ఇయ్యకపోయినను వారికది సమానమే. వారు విశ్వసింపరు. దేవుఁడు వారి హృదయములపైనను వారి చెవులపైనను ముద్రవేసియున్నాఁడు. మఱి వారికన్నులపై తెరకప్పియున్నది. మఱి వారికి గొప్ప బాధ (శిక్ష) యున్నది.

వ్యా॥ 6-7. ఈ వాక్యములందు అబూజెహల్ మొదలగు అవిశ్వాసులైనట్టి వారిని గూర్చి చెప్పఁబడినది. ఇస్లామునకు విరోధులై విశ్వాసులను నశింపఁజేయవలెనని పట్టుపట్టినట్టి వారికి బోధించినను, బోధింపకపోయినను వారికది సమానమే. వారు నమ్మరు. మఱియు వారి హృదయముల పైనను చెవులపైనను ముద్రపడియున్నది. అనఁగా నెట్లు ముద్రవేయఁబడిన వస్తువులో నితర వస్తువు ప్రవేశించుటకు వీలులేదో యటులే వారి హృదయము అవిశ్వాస ద్వేషములచే కఠినమైనది. ఖురాను సదుపదేశము చెవియొగ్గి వినరు. బోధ వారి హృదయములలో ప్రవేశింపదు. ఎట్లు కన్నులపై తెర కప్పియుండినచో నెదుటి వస్తువు కినఁబడదో, యటులే వారికి సన్మార్గము గోచరింపదు. కావున వారు విశ్వసింపక గొప్ప నరకబాధకు పాలగుదురు. ఇఁక వంచకుల విషయము వివరింపఁబడుచున్నది. వంచకులను మునాఫిఖీఞ అనుదురు. అనఁగా హృదయములో అవిశ్వాసముంచి విశ్వాసులను మోస పుచ్చుటకై కపట విశ్వాసమును వెలిఁబుచ్చువారు. ఇట్టివారిని సాధారణముగా కనిపెట్టుట చాలకష్టము. కావున వారిగుణములు వివరముగా రాఁబోవు వాక్యములలో చెప్పఁబడినవి.

8. వమినన్నాసి-మన్-యఖూలు-ఆమన్నా-బిల్లాహి-వబిల్ యామిల్ ఆఖిరి-వమా-హుమ్-బిమూ-మినీన్. 9. యుఖా-ది-ఊ-నల్లాహ-వల్లజీన -ఆమనూ-వమా-యఖ్-దఊన-ఇల్లా-అన్ఫుస-హుమ్- వమా - యష్ - ఉరూన్. 10. ఫీ-ఖులూ-బి-హిమ్-మరజున్-ఫజా-ద-హు-ముల్లాహు-మఱజన్-వలహుమ్ అజాబున్-అలీమ్మమ్-బిమాకానూ-యక్-జి-బూన్.

8. కొందఱు ప్రజలు మేము దేవుని యందును తుదిదినమునందును విశ్వాస ముంచితిమని పలుకుదురు. మఱి వారు విశ్వాసులు కానే కారు. 9. దేవునిని, విశ్వాసులను వారు మోసగించుచున్నారు. నిజమేమనఁగా! వారు తమ్ముతామే తప్ప నితరులను మోసగించుటలేదు. కాని అదివారు గ్రహింపకున్నారు. 10. వారి హృదయములలో రోగమున్నది. మఱి వారి

రోగమును దేవుఁడు హెచ్చుగాఁజేసెను. మఱియు వారు అసత్యము పలుకు చుండుటవలన వారికి నొప్పించు బాధయున్నది.

వ్యా॥ 8-9-10. హజ్రత్ ముహమ్మదు వారు మక్కా-పురము విడిచి మదీనాపురము చేరిన పిదప నచట ఇస్లామ్ ప్రబలెను. మదీనాలోనున్న ఔసుఖజరజ్ అను వారును కొందఱు యూదులును ఇస్లామ్ మతములో చేరిరి. కాని యందు కొందఱు చేరకుండిరి. బదరు యుద్ధములో ముసల్మానులు విజయముగాంచిరి. మక్కా-ఖురైషులు ఓడిపోయిరి. ఇస్లామ్ విజయమును చూచి కొందఱు యూదులును ఇతర అరబ్బులును ముస్లిములను మోసపుచ్చుటకై ఇస్లామ్‌లో చేరిరి. వీరందఱికిని అబ్దుల్లాబిన్ ఉబై బిన్‌సలూలు నాయకుఁడు. ఇతఁడు లోలోపల ఇస్లామును నశింపఁజేయవలెనని విరోధులతో కలిసి కుట్రలు చేయుచుండెను. మనస్ఫూర్తిగా విశ్వసింపక నోటి మాటలతోనే విశ్వసించినచో అది వంచన అనఁబడును కదా? అందుచే వంచకులు విశ్వాసులు కానేరరు. సర్వజ్ఞుఁడగు దేవునికి వారి వంచన, కుట్రలు తెలియకుండునా? దేవుఁడు తన ప్రవక్తమూలమున వంచకుల విషయము తెలుపుటచేతను వంచకుల చేష్టలవలనను విశ్వాసులు వారిని గుర్తింపఁగలరు. కావున వంచకుల కుట్రలు సాగనేరవు. అయిన వంచకులు తాము దేవునిని విశ్వాసులను మోసపుచ్చుచున్నామని భ్రమపడిరి. తుదకు వంచనవలన వంచకులే నష్టపడుదురు. కాని వంచనవలన వారికది తోఁచదు. వారి హృదయములో వంచన, ఇస్లామునందు ద్వేషము, ముస్లిముల విషయమున అసూయ, అను రోగములు ముందుగానే యుండెను. మఱి ఇస్లామ్ వ్యాపించుకొలఁదిని ముస్లిములు హెచ్చుకొలఁదిని వంచకుల మనోరోగము హెచ్చసాగెను. వారు మనస్సులో లేని విశ్వాసమును వెలిబుచ్చి యసత్యముపలాడుటవలన వారికి తీవ్రముగా నొప్పించు నరకబాధయున్నది.

11. వఇజా-ఖీల-లహుమ్-లాతుఫ్-సిదూ-ఫిల్-అర్-జి-ఖాలూ- ఇన్నమా - నహ్ను-ముస్-లిహూన్. 12. అలా-ఇన్నహుమ్-హుముల్- ముఫ్‌సిదూన-వలాకిల్-లాయష్-ఉరూన్-

11. మఱియు భువి (దేశము)లో నుపద్రవము గలిగింపకుఁడు అని వారితోఁ జెప్పినచో మేము చక్కఁబఱచువారము మాత్రమే అని వారు పలుకుదురు. 12. జాగ్రత్తపడుఁడీ నిశ్చయంబుగ వారే యుపద్రవములు చేయువారు. కాని వారు దానిని గ్రహింపరు.

వ్యా॥ 11, 12. వంచకులు తమ అవిశ్వాసముచే సత్కార్యములు చేయకుండిరి. ఇస్లామ్ యొక్క విరోధులతోఁ గలిసి కుట్రలుసలుపుచు దేశములో శాంతము లేకుండ చేయుచుండిరి. ఎవరైన వీరితో మీరిట్లు ఎందులకు చేయుదురు? అని యడిగినచో తాముచేయు కార్యములు మంచివి. వీనివలన పూర్వమువలె విశ్వాసులకును అవిశ్వాసులకును స్నేహభావము కుదురును. ఎట్టి కీడు కలుగదు. మేముచేయునది సవరణ అని పలుకుదురు. కాని వీరికుట్రల వలన మతాభివృద్ధిగాని దేశములో శాంతముగాని కలుగదు. వీరే వినాశకారకులు. అయిన వీరి వంచన రోగమువలన వీరిదోషము వీరికిఁ దెలియదు. అని హెచ్చరింపఁబడియెను.

13. వఇజా-ఖీల-లహుమ్-ఆమినూ-కమా-ఆమనన్నాసు-ఖాలూ-అనూమిను-కమా-ఆమనస్సుఫహాఉ-అలా-ఇన్నహుమ్-హుముస్-సుఫహాఉ-వలాకిల్-లాయఅ-లమూన్.

13. మఱియు వారితో సర్వజనులు విశ్వసించినట్లు మీరును విశ్వసింపుఁడు అని చెప్పినచో మూఢులు విశ్వసించినట్లు మేమును విశ్వసింపవలయునా? అని వారు పలుకుదురు. జాగ్రత్తపడుఁడీ, వారే మూఢులు, కాని వారికది తెలియదు.

వ్యా॥ 13. పైగంబరులవారి శిష్యకోటివలె మీరును నిజముగా విశ్వసింపుఁడు అని వంచకులతో, ఎవరైన చెప్పినచో వారు తమ వంచనచే అవివేకముచే నిజము తెలిసికొనలేక సర్వమును దేవుని ప్రీతికొఱకు వినియోగించిన ముసల్మానుభక్తులను మూఢులు అనిచెప్పుదురు. వాస్తవముగఁ జూచిన ఇహలోకతుచ్ఛభోగముల కై పరలోక మోక్షమును వదలుట చాల మూఢత్వము. అందుచేతనే వంచకులేమూఢులు అని హెచ్చరింపఁబడియెను.

14. వ-ఇజా-ల-ఖుల్ల-జీన-ఆమనూ-ఖాలూ-ఆ-మన్నా-వఇజా-ఖలౌ-ఇలా-షయా-తీనిహిమ్ ఖాలూ-ఇన్నా-మఅ-కుమ్ ఇన్నమా-నహ్ను-ముస్-తహ్-జి-ఊన్. 15. అల్లాహు-యస్ తహ్ జిఉ-బిహిమ్-వయ-ముద్దు-హుమ్-ఫీ-తుగ్-యానిహిమ్-యఅ-మహూన్. 16. ఉలా-ఇకల్లజీ-నష్-తరవుజ్-జలా-లత-బిల్-హుదా-ఫమా. అబిహత్-తిజాఅతు-హుమ్. వమా-కానూ-ముహ్-తదీన్.

14. మఱియువారు ముసల్మానులతోఁ గలియునపుడు మేము విశ్వసించినారము అని పలుకుదురు, మఱి వారు తమ పిశాచములవంటి దుష్టనాయకులతో ఏకాంతమునందుఁ గలసినపుడు నిశ్చయముగా మేము మీతో నున్నారము. మేము ముసల్మానుల నెగతాళి మాత్రము చేయుచుందుము, అని చెప్పుదురు. 15. దేవుఁడు వారి పరిహాసమునకు శిక్షవిధించును. వారిని వారి దుర్మార్గములోనే వదలుచున్నాఁడు. వారు అంధులై యున్నారు. 16. వారే సన్మార్గమునకు బదులుగ దుర్మార్గమును కొన్నవారు. కాని వారి బేరము లాభకరము కాలేదు. మఱియు వారు సన్మార్గము పొందినవారును కారైరి.

వ్యా॥ 14,15,16. వంచకులు ముసల్మానులతోఁ గలిసి మేముకూడను ఇస్లామ్‌లో చేరినాము అని పలుకుచు ఇస్లామ్ వలన గలుగు లాభములను పొందుచు సంతసించుచుండిరి. తిరిగి యావంచకులు ఒంటరిగా తమ దుష్టనాయకులతోఁ గలిసి కొనినపుడు, అయ్యా! మేము ముసల్మానులతో కలియునది, మనస్ఫూర్తిగాకాదు. వారి రహస్యములు కనుఁగొనుటకును వారివలన లాభము పొందుటకును వారితో పరిహాసమాడుటకును. మఱిమేము మతమునందును ప్రతి విషయమందును మీతోనే యున్నారము. మిమ్మువదలము అని పలుకుదురు. వంచకులు పన్ను కుటిలను దేవుఁడు కొన్నాళ్ళు మన్నించి విడచిపెట్టినను దప్పక వారికి వెనుక శిక్షవిధించును. దేవుఁడు వారిని కొన్నాళ్ళు వదలి పెట్టినందున అజ్ఞానాంధులై దేవులాడుచున్నారు. వారు సన్మార్గమును వదలి దుర్మార్గము గైకొన్నారు. వారు చేసిన వ్యాపారము లాభము గలిగించలేదు. ఎందుకన వంచనచే కుటిచే వారి గుట్టుబయలుపడి యిహామునందు మానము పోగొట్టుకొనిరి. పరలోకమునందు నరక బాధకు పాలైరి. తుదకు వారు గావించిన కుట్రలవలన సన్మార్గులును గాక పోయిరి.

17. మస-లుహుమ్-కమస-లిల్-లజీస-తౌ-ఖద-నారన్-ఫలమ్మా-అజా-అత్-మాహౌ.లహూ-జహ-బల్లాహు-బినూ-రిహిమ్-వత-రక-హుమ్-ఫీజులు-మాతిల్-లాయుబ్-సిరూన్. 18. సుమ్మున్ - బుక్మున్ - ఉమ్ - యున్-ఫహుమ్-లా-యర్-జిఊన్.

17. వారి విషయము ఒకఁడు అగ్నిని వెలిగించగా కొంద ఱావెలుతురులో చుట్టుపట్లనున్న వానినిచూచి దైవవశమున అది ఆఱిపోయినపుడు

చీకట్లుకాఁగా వారేమియు చూడ లేకపోయినట్లైనది. 18. వారు చెవిటివారు మూఁగవారు. గ్రుడ్డివారు. కావున వెలుతురునకు మరలరు.

వ్యా॥ 17, 18. ఈ వాక్యములలో వంచకుల విషయమును గూర్చి యొక పోలికయియ్యబడెను. ఎట్లు అగ్ని వెలిగినపుడు చుట్టుపట్ల నున్నవి ప్రకాశింపఁగా చూడఁగలిగి యగ్ని చల్లారగానే చీఁకటిక్రమ్ముకొన్న నేమియు చూడ లేకపోయినటులే వంచకులు విశ్వాసమును కాంతినిపొంది దానివలన ఇహలోక సౌఖ్యములుపొంది చావగానే యావంచకపు విశ్వాసమువలన పర లోకమునందు మోక్షము పొందలేక నరక బాధలకు పాలైరి. వంచకులు చెవిటివారు. కావున సత్యమువినరు. మూఁగవారు కావున సత్యము పలుకరు. గ్రుడ్డివారు. కావున లాభనష్టములను చూడరు. సత్యమునుగూర్చి గ్రుడ్డియు చెవిటియు మూఁగయు గలవారు తమ దుర్మార్గమువదలి సన్మార్గమునకు మరలివత్తురా? రారు.

19. ఔ-కసయ్యిబిమ్-మినస్-సమాయి-ఫీహి-జులుమాతున్-వరఅ్-దున్-వబర్-ఖున్-యజ్-అలూనా అసాబి-అహుమ్-ఫీ-ఆజా-నిహిమ్-మినస్-సవా-ఇఖి-హ జరల్-మౌతి-వల్లాహు-ముహీతుమ్-బిల్-కాఫిరీన. 20. యకాదుల్ బర్ ఖు-యఖ్-తఫు-అబ్-సారహుమ్-కుల్లమా-అజా-అలహుమ్-మషౌ-ఫీహి-వఇజా-అజ్-లమ-అలైహిమ్-ఖామూ-వలౌ-షా-అల్లాహు-లజహబ-బిసమ్-ఇహిమ్ వ-అబ్సా-రిహిమ్-ఇన్నల్లాహ-అలా-కుల్లిషైఇన్-ఖదీర్.

19. లేక, వారివిషయము ఆకాశమునుండి వచ్చు ఘోరవర్షము వలె నున్నది. అందు చీఁకట్లు ఉఱుములు మెఱుపులున్నవి. వారు ఘోరమైన ఉఱుములవలన చావుభీతిచేత తమవ్రేళ్ళను చెవులలో దూర్చుకొనుచున్నారు. మఱియు దేవుఁడు అవిశ్వాసులను కూడ ఆవరించియే యున్నాఁడు. 20. మెఱుపులు వారికన్నులను నెగురఁగొట్టుకొని పోవునట్లున్నవి. వారికి వెలుతురు అగునప్పుడెల్ల వారు అందునడతురు. మఱియు చీఁకటిక్రమ్ముకొనినచో వారు నిలిచిపోదురు. మఱి దేవుఁడు కోరినచో వారి చెవులను కన్నులను దీసికొనిపోవును. నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తులుగలిగి యున్నాఁడు.

వ్యా॥ 19:20. ఈ వాక్యములలోను మఱొక పోలికలో వంచకుల విషయము చెప్పఁబడెను. ఎట్లు ప్రజలు కారుమేఘములు క్రమ్ముకొని ఘోర

వర్షము కురియునపుడు ఉఱుముల భయంకరమైన శబ్దమువలన చావుభయ ముచే చెవులలో వ్రేళ్లుదూర్చుకొని భయంకరమైన చీకటిలో మెఱుపుల కాంతిలో కొంతదూరము నడచి తిరిగి నిలిచిపోవుదురో వంచకులు ఇస్లామ్‌లోనున్న ధర్మములను విని తమకుఁ గలుగు ఆపదలను మనుచూచి ఇహలోక తుచ్ఛ సౌఖ్యములను యోచించి యవిపోవు ... యను ప్రాణసంకటములోపడుచు ఒకప్పుడు ఇస్లామ్ మహిమను దాని ... మనుచూచి సన్మార్గమునకువత్తురు. కాని యేదైనకష్టము వారికి కలిగిన ... సన్మార్గమువిడిచి యవిశ్వాసమును అవలంబింతురు. తమ్మతాము కాపాడు కొనుటకై పలువిధములైన యత్నములుచేయుదురు. కాని సర్వజ్ఞుఁడును సర్వశక్తుఁడును అగు దేవుని శిక్షనుండి వారు తప్పించుకొనఁజాలరు.

21. యా-అయ్యు-హన్నాసుఅ-బుదూ-అబ్బకు-ముల్లజీ-ఖలఖ ... వల్ల-జీన-మిన్-ఖబ్-లికుమ్-లఅల్లకుమ్-తత్తఖూన్. 22. అల్లజీ - జఅ లకుముల్-అర్జ-ఫిరాషవ్-వస్-సమాఅ-బినాఅన్-వఅన్-జల-మినస్-స మాఅన్-ఫఅఖ్-రజ-బిహీ-మినస్-సమరాతి-రిజ్-ఖల్-లకుమ్-ఫలా - తజ్ అలూ-లిల్లాహి-అన్దాదన్-వఅన్-తుమ్-తఅ - లమూన్.

**21.** ఓప్రజలారా! మీరు భక్తిపరులగుటకై మిమ్మలను మీ పూర్వీ కులను పుట్టించిన మీపోషకుఁడగు దేవునిని పూజింపుఁడు. 22. ఆతఁడే మీకొఱకు భూమిని పఱుపుగాను ఆకాశమును పైకప్పుగానుజేసి యాకాశము నుండి నీళ్లను కురియించి దానివలన మీ యాహారము కొఱకు ఫలములను కల్పించెను. కావున మీరు దేవునికి సాటి కల్పింపకుఁడు. మఱియు అది మీకు తెలిసియేయున్నది.

వ్యా॥ 21:22. ఈ వాక్యములలో దేవుని యేకత్వము (తౌహీదు) ను గూర్చియు ఆతనినే పూజింపవలసినది యనియు తెలియుచున్నది. దేవుఁడు లేఁడని పలుకు నాస్తికులకు నిందు గొప్పసూచనలున్నవి. కర్తలేనిది యేదియు నేర్పడదు. మొదట మనుష్యుఁడు తన పుట్టుకనుగూర్చి యోచింప వలెను. ఎట్లు పుట్టి పెరిగి జ్ఞానవంతుఁడగుచున్నాఁడు? ఎట్లు తన పోషణ వసతులు లోకమునందేర్పడినవి? ఆకాశమును అందలి సూర్యచంద్రాదులును, వర్షమును, భూమియు, అందలి ఫలములును, ఎట్లు మానవునకు ప్రయోజన

కారులగుచున్నవి? ఇవి యన్నియు సృష్టికర్తలేనిదే తమంతటతామే యైనవా? ఇట్లెవరును చెప్పఁజాలరు. తమంతటతామే యగుట ప్రకృతివిరుద్ధము. ఎట్లు ఒకయోడ కర్తలేనిది తనంతటతానే యేర్పడి సామానువేసికొని నావికుఁడులేనిదే తనంతటతానే సముద్రప్రయాణము సలిపి రేవునకుఁ జేరదో, అటులే ఈ లోకమును ఇందలి సమస్తమును ఎట్టి కలతలులేకుండ క్రమముగా జరుగుట సృష్టికర్తలేనిది కానేరదు. లోకసృష్టికర్తనే అల్లాః (దేవుఁడు)అని పలుకుదురు. ఇట్టి పోషకుఁడగు దేవుఁడే మానవుల పూజలు పొందుట కర్హుఁడు. ఆతనికి నెవరును సాటిలేరు. ఎందుకనఁ సర్వమును ఆతనిసృష్టియే. ఆతనికి మించినది యెద్దియునులేదు. ఎట్టి మహనీయుఁడైనను దేవునికి సేవకుఁడే. కావున మానవులు తమ్ము సృష్టించిపోషించు సర్వశక్తుఁడగు దేవునినివదలి తాముకల్పించుకొన్నట్టియు నెట్టిలాభనష్టములు చేయఁజాలనివియు నగు విగ్రహములను పూజింపఁగూడదు. ఎవరును దేవునికి సాటిలేరు, అనియు ఆతనికిఁదప్ప పూజకు నితరులెవరును పాత్రులుగారు అనియు, నందఱకును దెలియును.

23. వఇన్ కున్-తుమ్-ఫీ రైబిమ్-మిమ్మా-నజ్-జల్ నా-అలా- అబ్దినా - ఫాతూ-బి-సూరతిమ్ మిమ్-మిస్ లిహీ-వద్ ఊ-షుహ-దాఅకుమ్-మిన్ - దూని ల్లాహి-ఇన్ కున్ తుమ్-సాదిఖీన్, 24. ఫఇల్-లమ్-తఫ్-అలూ-వలన్ -తఫ్అలూ-ఫత్తఖున్-నాఅల్లతీ-వఖూదు-హన్నాసు-వల్-హి-జారతు-ఉ-ఇద్దత్-లిల్- కాఫిరీన్.

23 మఱియు మేము, మా భక్తునికొసంగిన ఖురానునుగూర్చి మీకు సందేహమున్నచో దీనివంటి యొక సూరాను మీరు దీసికొనిరండు. మఱియు మీరు సత్యవంతులైనచో దేవునిని వదలి మీసమస్త సహాయులను పిలిచికొనుఁడు. 24. ఇప్పుడు మీరిట్లు చేయలేకపోయితిరా! మఱెన్నఁడును చేయఁజాలరు. కావున ప్రజలును ఱాళ్ళును వంటచెఱకులు కాఁగల నరకాగ్నినుండి తప్పించుకొనుఁడు. అది అవిశ్వాసుల కొఱకు సిద్ధమైయున్నది.

వ్యా॥ 23-24. ఈ వాక్యములలో ఖురానెషరీఫు దేవునిగ్రంథమనియు హజరత్ ముహమ్మదు దేవుని ప్రవక్తయనియు సప్రమాణముగా రుజువుచేయఁబడినది. ఎట్లన, అవిశ్వాసులు, ఖురానువాక్యములను విని, ఇవి దేవుని వాక్యములుకావు.ముహమ్మదువారివాక్యములు. వీరుకూడమానవులే. అనిసందేహింప

సాగిరి. దానికిఁగాను దేవుఁడు ఓయి అవిశ్వాసులారా! ఖురాను దేవుని గ్రంథమనుటలో మీకు సందేహమున్నచో మఱియు మీరు పలుకుమాటలలో సత్యమున్న యెడల మీరును మీసహాయులును చేరి ఖురానెషరీఫులోని సూరావంటి యొక సూరా (మూఁడు వాక్యములు గలది) కల్పించి తీసికొనిరండు. అని ప్రకటింపఁగా అవిశ్వాసులందఱును గొప్పవిద్వాంసులయ్యును అట్లు చేయఁజాలక పోయిరి. మఱియు నికముందు కూడ ప్రళయమువఱకును చేయఁజాలరు. అని ప్రకటింపఁబడియెను. ఈ ప్రకటన ననుసరించి యింతవఱకు నెవ్వరును చేయజాలకైరి. మహమ్మదువారు చదువుటను వ్రాయుటను తెలియనివారు. వారు ఎవరియొద్దను పాఠశాలయందును చదువునేర్చిన వారుకారు. ఇట్టివారు ఇట్టి అద్భుతమైన శైలియు ధర్మములునుగల ఖురానె షరీఫు తమంతటతామే చేయఁజాలరు. మఱియు వారివిరోధులు అరబీభాషలో గొప్పపండితులును మహాకవులును అయి ఖురానెషరీఫువంటి ఒక్క సూరాను కల్పింపఁజాలక సులభమార్గమును వదలి ధనప్రాణములకు నష్టకరమగు యుద్ధమునకై సిద్ధులైరి. కావున ఖురానెషరీఫు దేవుని గ్రంథమనియు, అట్టి గ్రంథమును పొందిన, హజ్రత్ మహమ్మదు దేవుని ప్రవక్తయనియు ఏర్పడెను. కావున నిజముదెలిసిన పిదప విశ్వసింపవలెను. లేనిచో తిరస్కరించువారుఅవిశ్వాసుల (కాఫర్ల) కొఱకున్న ఘోరమైన, నరకాగ్నికి ఆహుతులగుదురు జనులును ఱాళ్లను వంటచెఱకులుగాఁగొను అగ్ని యెంత బాధాకరమగునో చదువరులే యూహింపవలెను. కావున దీనినుండి తప్పించుకొను మార్గము విశ్వసించుట దప్ప వేరులేదు.

25. వబష్‌షిరల్లజీన-ఆమనూ వ-అమిలుస్-సాలిహాతి-అన్న-లహుమ్-జన్నాతిన్-తజ్‌రీ మిన్-తహ్‌తిహల్-అన్‌హారు-కుల్లమా-రుజిఖూ-మిన్‌హా-మిన్-సమరతిన్-రిజ్‌ఖన్ ఖాలూ హాజల్లజీ-రుజిఖ్‌నా-మిన్-ఖబ్‌లు వ-ఊతూ-బిహీ-ముతషాబిహన్-వలహుమ్-ఫీహా-అజ్‌వాజుమ్-ముతహ్హరతున్ వహుమ్-ఫీహా-ఖాలిదూన్.

25. మఱియు విశ్వసించి సత్కార్యములు చేసిన వారికి కాలువలు ప్రవహించునట్టి స్వర్గవనములు గలవు. అను సంతోషవార్తనిమ్ము. అచ్చటి ఫలములు తినుటకుఁగాను వారికి నొసంగఁబడునపుడెల్ల ఇవి ఇంతకు ముందు మాకు దొరికి నవియే అని వారు పలుకుదురు. మఱియు వారికి ఒకటినొకటి

పోలిన ఫలములొసంగఁబడును. మఱియు వారికినందు పవిత్రలైన స్త్రీలు న్నారు:- మఱియు నందువారు ఎల్లప్పుడునుందురు.

వ్యా॥ 25. మునుపటి వాక్యములలో అవిశ్వాసులకు ఘోర నరకాగ్ని బాధలున్నవని చెప్పఁబడియెను. ఈ వాక్యములలో సత్కార్యములుచేసిన విశ్వాసులకున్న పుణ్యఫలితమగు స్వర్గసౌఖ్యమున్నదను సంతోషవార్త యియ్యఁబడెను. దేవుని ప్రీతిపొంది స్వర్గసౌఖ్యములు లభించుటకై ముఖ్యమైన యాధారము విశ్వాసము (ఈమాన్). విశ్వాసముతోఁబాటు సత్కార్యములు చేయవలెను. పాపకార్యములను వదలవలెను. స్వర్గవనము (జన్నత్) లో నీటికాలువలు ప్రవహించుట చాల ఆనందకరము. స్వర్గనివాసులకు ఆహారమునకై ఫలములు లభించును. అవి రూపములోను రంగులోను ఒకటి నొకటి పోలియుండును. కాని ప్రతిఫలముయొక్క రుచి వేఱుగానుండును. స్వర్గములోని ఫలములు రూపములో ఇహలోకమందున్న ఫలములను పోలి యుండును. కాని రుచిలో మాత్రము చాల వ్యత్యాసముండును. ఇట్టిపోలికను బట్టియే స్వర్గనివాసులు, ఫలము లభించునప్పుడెల్ల ఇది ముందుదొరకినదియే యని పలుకుదురు. కాని భుజించిన పిదప రుచి వేఱుగానున్నదని సంతసింతురు. స్వర్గమునందు పవిత్రలైన స్త్రీలుండుదురు. వారియందు ఇహలోక స్త్రీలలో నుండు రజస్సు, మలమూత్రములు, మొదలగు అసహ్యములుండవు. స్వర్గస్త్రీలు ఆత్మ పవిత్రతయును దేహశుద్ధియునుగలిగి యుండుదురు. స్వర్గనివాసులు స్వర్గములోనే సదాయుండుదురు. అందలి సౌఖ్యములు స్థిరముగా ననుభవించుచునే యుందురు. అందువారికెట్టి కొరతగాని దుఃఖముగాని యుండదు.

ఇంతవఱకు ముఖ్యమైన మూడు విషయములనుగూర్చి చెప్పఁబడియెను. అవి 1. మేము ఎక్కడనుండి వచ్చితిమి. ఏస్థితిలోనుంటిమి. దీనినే మబ్దా (ప్రారంభసృష్టి) అనుదురు. 2. ఏమితినవలెను, ఎచ్చట నివసింపవలెను. దీనినే మఆష్ (జీవన స్థితి) అనుదురు. 3. మరణించిన పిదప ఏఫలిత మగును. దీనినే మఆద్ అనుదురు.

26. ఇన్నల్లాహ - లాయస్ - తహ్-ఈ-అన్-యజ్-రిబ -మసలమ్-మా-బఊ-జతన్-ఫమా-ఫౌఖహా-ఫ అమ్మల్లజీన-ఆమనూ-ఫయఅ-లమూన- అన్నహుల్-హఖ్ఖు-మిర్-అబ్బిహిమ్-వ-అమ్మల్లజీన-కఫరూ-ఫయఖూలూన-మాజా-అరా-దల్లాహు-బి హాజా-మస-లన్-యుజిల్లు-బిహీ-కసీరన్-వయహ్దీ-బిహీ-కసీరా.

వమా-యుజిల్లు బిహీ-ఇల్-లల్-ఫాసిఖీన్. 27. అల్లజీన-యన్-ఖుజూన-అహ్-దల్లాహి-మిమ్-బఅ-ది-మీసాఖిహీ-వయఖ్-తఊన-మా-అమ-రల్లాహు బిహీ-అన్-యూసల-వ-యుఫ్-సిదూన-ఫిల్-అర్జి-ఉలా-ఇక, హుముల్-ఖాసిరూన్.

26. నిశ్చయంబుగా దేవుఁడు చిన్నదోమను గాని, దానిని మించిన దానిని గాని ఉదాహరణముగా నిచ్చుటలో సిగ్గుపడఁడు. కావున విశ్వాసులైన వారు తమప్రభువు ఇచ్చిన యుదాహరణము సరియైనది యని తెలిసికొందురు. కాని అవిశ్వాసులైనవారు ఈ ఉదాహరణమువలన దేవుని యిష్టమేమి అని పలుకుదురు. దేవుఁడు ఈ యుదాహరణము వలన ననేకులను సన్మార్గమునుండి తొలఁగించుచున్నాఁడు. మఱియు దీనివలన చాలమందికి సన్మార్గము చూపుచున్నాఁడు. 27. మఱియు దేవునితో స్థిరమైన ఒడఁబడిక గావించికొనిన పిదప దానిని త్రెంపునట్టివారును, దేవుఁడు కలుపుఁడు అని యాజ్ఞాపించినదానిని త్రెంచునట్టివారును, దేశము (భువి) లో వినాశము (ఫసాదు) కలిగించునట్టి వారును అగు దుర్మార్గులను మాత్రమే యీ యుదాహరణము వలన దేవుఁడు సన్మార్గమునుండి తొలఁగించుచున్నాఁడు. వీరే నష్టము పొందువారు.

వ్యా॥ 26, 27. అవిశ్వాసులు, ఖురానువంటి కొన్ని వాక్యములు చేయలేక పోయిరి. అయిన మఱొక విధమున ఖురానునుగూర్చి సందేహింప సాగిరి. అదియేమనగా ఖురానెషరీఫులో పెక్కు ఉదాహరణములున్నవి, అందు ఈఁగ, సాలెపురుగు, మొదలైనవి యుదాహరణముగాఁగొనఁబడినవి, ఈ యుదాహరణములను అవిశ్వాసులు విని దేవుఁడు గొప్పవాఁడు. వాని వాక్కులో నిటువంటి హీనమైన యుదాహరణము లుండనచ్చునా? కావున మేము నమ్మఁజాలము అని పలుకసాగిరి. దానికి ఈ వాక్యములలో సమాధానము ఇయ్యఁబడినది. పోల్చుటలో ఎద్దాని గూర్చి యుదాహరణమియ్యఁబడునో యా విషయము ననుసరించి పోలికయుండును. కాని పోల్చువాని గౌరవమునుబట్టి యుండదు. కావున దేవుఁడు ఇచ్చిన ఉదాహరణములు ఆయా విషయముల ననుసరించియుండును. ఈ యుదాహరణములు సరియైనవి అని హృదయ శుద్ధిగల విశ్వాసులు తెలిసికొనుదురు. కాని ద్వేష రోగముగల అవిశ్వాసులు, వంచకులు మొదలైన దుర్మార్గులు నిజము తెలిసికొనక సందేహించి దీనివలన దేవుని యిష్టమేమి అని ప్రశ్నింతురు. అవిశ్వాసులు తిరస్కరించి సన్మార్గము వదలి దుర్మార్గులగుదురు. విశ్వాసుల విశ్వా

సము, మఱింత స్థిరపడును. ఉదాహరణములు విని దుర్మార్గులగు వారి దుర్గుణములు ఈ వాక్యములో వివరింపఁబడినవి. వారు దేవునితోఁగావించిన ఒడంబడికను లెక్క-చేయక దానిని త్రెంపుదురు. దేవుఁడు బంధువుల బంధుత్వమును కలుపుఁడు అని ఆజ్ఞాపించి యుండగా దానిని త్రెంపుదురు.మఱియు నితర సత్కార్యములను ఆచరింపరు. దేశములో అల్లరులు, గావించి విశ్వాసులతో విరోధించి వీరి విరోధులను వారిపై కలహమునకు ప్రేరేపించి దేశములో వినాశమునకు కారకులగుదురు. ఇట్టి దుర్గుణములవలన ఇస్లామ్‌నకును విశ్వాసులకును నష్టముగాదు. ఆదుర్మార్గులే తమకు తాము నష్టముచేసికొనుచున్నారు.

28. కైఫ-తక్-ఫురూన-బిల్లాహి-వకున్-తుమ్-అమ్-వాతన్-ఫ-అహ్-యాకుమ్-సుమ్మ-యుమీ-తుకుమ్-సుమ్మ-యుహ్-ఈకుమ్- సుమ్మ- ఇలైహి-తుర్-జఊన్.

28. ఎట్లుమీరు దేవుని విషయమున అవిశ్వాసు లగుదురు? మఱి మీరు నిర్జీవులుగా నుండఁగా మిమ్ములను దేవుఁడుసజీవులు గాఁజేసెను. ఆవలమిమ్ములనుచంపును. ఆపై మిమ్ములను సజీవులుగాఁ జేయును. మరల మీరు ఆతని యొద్దకే మరలుదురు.

వ్యా॥ 28. ఇందు దేవునిని నమ్మి యాతనినే పూజింపవలయునను విషయము సప్రమాణముగాఁ జెప్పఁబడుచున్నది. దేవుని తిరస్కరించుటకు వీలులేదు. మానవుడు పుట్టకమునుపు జీవములేనివాఁడుగా నుండెను. అట్టి వానికి ప్రాణము పోసి తల్లి గర్భమునుండి పుట్టించెను. పుట్టిన నాఁటినుండి కావలసిన అన్ని వసతుల నిచ్చి పోషించి తిరిగి చావునిచ్చుచున్నాఁడు. పాపపుణ్యముల తీర్పుకొఱకు అచ్చట సజీవి గాఁజేయును. అపుడు పాపపుణ్యముల తీర్పుకై దేవుని యెదుట మానవుఁడు నిలువ వలసియున్నది. ఇట్టి విషయములు గమనించిన పిదప మానవులు దేవునిని ఎట్లు తిరస్కరింపఁగలరు?

29. హువల్లజీ-ఖలఖ-లకుమ్-మాఫిల్-అర్‌జి-జమీ-అన్- సుమ్మస్-తవా-ఇలస్-సమాయి-ఫసవ్వా-హున్న-సబ్-అసమా-వాతిన్-వ-హువ-బికుల్లి-షైఇన్-అలీమ్.

29. ఆతఁడే మీ కొఱకు భూమిలోనున్న సమస్తమును సృజించెను. పిదప ఆకాశముల నుద్దేశించి వానిని ఏడు ఆకాశములుగాస్థిరపఱిచెను.(సృష్టిం

చెను.) ఆతఁడు సర్వముఁ దెలిసినవాఁడు.

వ్యా॥ 29. మునుపటి వాక్యములో మానవుల సృష్టియే ఒక ప్రమాణముగా నుండెను. ఈ వాక్యములో దేవుని శక్తిని దెలుపునట్టి మఱొక ప్రమాణముచెప్పఁబడినది. భూమిని అందలి సమస్తమును మానవుల ప్రయోజనమునకై సృష్టించి యేఁడు ఆకాశముల సృష్టించెను. ఆకాశములోనున్న సూర్యచంద్రాదులు మానవులకు నుపయోగకరము. వీనిని గమనించి దేవుని దెలిసికొనవలెను. దేవుఁడు సర్వజ్ఞుడు, ఆతనికి నిద్దియును మఱుఁగులేదు.

30. వ-ఇజ్-ఖాల అబ్బుక-లిల్-మలా-ఇకతి-ఇన్నీ-జాఇ-లున్-ఫిల్ - అర్ జి-ఖలీ-ఫతన్ ఖాలూ-అతజ్-అలు-ఫీహా-మన్-యుఫ్-సిదు-ఫీహా-వయస్-ఫికుద్-దిమాఅ-వనహ్ను-నుసబ్బిహు-బిహమ్దిక-వ ను-ఖద్దిసు-లక-ఖాల-ఇన్నీ. అ అ లము-మాలా-త అ - లమూన్.

30. మఱియు నీ ప్రభువు దేవదూతలతో నేను భూమిలో నొక ప్రతినిధిని సృష్టింపఁబోవుచున్నాను. అని చెప్పినప్పుడువారు, ఏమి నీవు అందు వినాశము కలుగఁజేయునట్టి వానిని, నెత్తురు చిందించునట్టి వానిని, జేయుదువా! మఱి మేము నీ స్తోత్రములు పాడుచున్నారము. మఱి నీపవిత్రతను కొనియాడుచున్నారము అని పలికిరి. (అపుడు) మీకుఁ దెలియనిది నిశ్చయముగా నాకుఁదెలియును. అని దేవుఁడు సెలవిచ్చెను.

వ్యా॥ 30. ఈ వాక్యములలో దేవుఁడు, ఆదిపురుషుఁడగు ఆదమును సృష్టించి, యాతనిని తన ప్రతినిధిగా నియమించి మానవ లోకమునకు గౌరవము నొసంగిన విషయము చెప్పఁబడుచున్నది. ఇది దేవుఁడు మానవులకుఁ గావించిన గొప్ప అనుగ్రహము. ఈ విషయమునైన మానవులు గమనించి దేవుని భక్తులు అగుదురుగాక!

దేవుఁడు ఈ ప్రతినిధి విషయము దేవదూతలతోఁ జెప్పఁగా వారు తమనిధేయతను దెలుపుటకై మేము నీ భక్తులము. ప్రతినిధి లోకములోని కలహములను తీర్పు చేయును. కావున ఉపద్రవములు గలుగును. మేము నీపవిత్రతను గొనియాడుచున్నారము. ఆపదవికి మేము యోగ్యులముగదా అని విన్నవించిరి. దానికిఁగాను దేవుఁడుప్రతినిధిని నియమించుటలో నున్న విశేషములు మీకుఁదెలియవు. అవి నాకుఁ దెలియును. అని చెప్పెను. ఖలీఫా అనగా ప్రతినిధి. లోకమును ధర్మప్రకారముగా నడుపుటకై మానవుఁడు దేవునికి

ప్రతినిధి. ఆదిపురుషుడగు ఆదము దేవునికి మొట్టమొదటి ప్రతినిధి. ఆతని సంతానములోనే గొప్పగొప్ప ప్రవక్తలు, సత్ప్రవర్తకులు, ఋషులు రాజులు మొదలగువారు గలిగిరి. లోకములో ధర్మమును నడిపించుటకై ఒక ఖలీఫాను నియమించుట ముసల్మానుల విధియైయున్నది. అట్లుకానిచో అధర్మములు చెలరేగును, శాంతియు నుండ నేరదు, దౌర్జన్యము లోకమంతటను వ్యాపించును.

31. వ-అల్లమ-ఆదమల్ అస్మాఅ-కుల్లహా-సుమ్మ-అర జ - హుమ్-అలల్-మలా-ఇకతి-ఫఖాల-అంబి-ఊనీ-బి-అస్మాయి-హాఉలాయి-ఇన్-కున్తుమ్ - సాదిఖీన్. 32. ఖాలూ-సుబ్-హానక-లా-ఇల్మ-లనా-ఇల్లా-మా అల్లమ్-తనా-ఇన్నక-అన్తల్-అలీముల్-హకీమ్. 33. ఖాల-యా-ఆదము-అంబీ-హుమ్-బిఅస్మా-ఇహిమ్-ఫలమ్మా-అంబఅ-హుమ్-బిఅస్మాయిహిమ్-ఖాల-అలమ్-అఖుల్-లకుమ్ ఇన్నీ అ అ-లము-గైబస్-సమా-వాతి-వల్-అర్ జి-వ-అఅ-లము-మాతుబ్దూన-వమా కున్తుమ్-తక్తుమూన్.

31. మఱియు దేవుఁడు సమస్తవస్తువుల నామములను ఆదమునకు నేర్పిన పిదప ఆ వస్తువులన్నిటిని దేవదూతల యెదుటనుంచి మీరు సత్యవంతులైనచో వీనినామములను నాకుఁదెలుపుఁడు అని చెప్పఁగా 32. నీవు పరమ పవిత్రుఁడవు. నీవు మాకు నేర్పినది దప్ప నితరము దెలియదు. నిశ్చయముగా నీవే సర్వజ్ఞుఁడవు, వివేచనాపరుఁడవు అని విన్నవించిరి. 33. ఓ ఆదము! ఈ వస్తువుల పేళ్లను దేవదూతలకుఁ దెలుపుము అని దేవుఁడు చెప్పెను. ఆ పిదప ఆదము వాని పేళ్లను వారికిఁదెలుపఁగా, ఏమి? ఆకాశములోనివియు భూమిలోనివియు అగు మర్మములు నాకుఁదెలియును అనియు మీరు వెల్లడి పుచ్చునదియును, మీరు దాఁచునదియును నాకుఁదెలియును అనియు మీతోఁజెప్పలేదా అని దేవుఁడు చెప్పెను.

వ్యా॥ 31, 32, 33. దేవుఁడు ఆదమునకు సమస్తవస్తువుల పేళ్లను వాని గుణములను వాని లాభములన్నిటిని దెలిపి వాని గూర్చి దేవతలను ప్రశ్నించెను. దేవదూతలు చెప్పలేకపోయి తమ వినయమును వెల్లడించిరి. లోకమునందు రాజ్యపరిపాలనమునకు గాను లోకజ్ఞానము కావలెను. వట్టిభక్తి పూజలవలన లోకరాజ్యము జరుగనేరదు. దేవదూతలు వట్టి భక్తిపూజలు సలుపువారు. ఇహసంబంధమైన విషయములు వారికిఁదెలియనేరవు. అందుచే

వారు తమ వినయము దెలిపిరి. ఆ పిదప దేవుఁడు ఆదముతో ఆ వస్తువులఁ గూర్చి ప్రశ్నింపగా వానికి ప్రత్యుత్తరమిచ్చెను. ఆతనిజవాబు విని దేవదూతలు ఆశ్చర్యము నొందిరి. ఆదముయొక్క గొప్పతనమును ఆతనకి ప్రాతినిధ్యమునకుఁ గాను కావలసిన యోగ్యత స్పష్టపడెను. దేవదూతలు కూడ ఆదమునకు విద్యాజ్ఞానములందు గల గొప్పతనమును ఒప్పుకొనిరి. దీనివలన పూజలకన్న విద్యగొప్పది అను విషయము తెలియుచున్నది. దేవదూతలు ఎల్లపుడు దేవునిని పూజించువారు. కాని ఆదమువంటివిద్య వారికి లేనందున వారు ప్రతినిధులగుటకు అర్హులుగాకపోయిరి. ఈ విషయము స్పష్టమైన తరువాత సమస్తవిషయములును రహస్యములును, దేవదూతలు తాము అర్హులు, అనువిషయము మనస్సులో దాఁచియుంచిన విషయమును, నాకుఁ దెలియును అని దేవుఁడు దేవదూతలతో చెప్పెను.

34. వఇజ్-ఖుల్నా-లిల్-మలా-ఇకతిస్-జుదూ - లి - ఆదమ-ఫసజదూ-ఇల్లా-ఇబ్లీస అబా-వస్-తక్బర-వ కాన-మినల్ -కాఫిరీన.

34. మఱియు ఆదమునకు సాష్టాంగ నమస్కారము చేయుఁడు అని మేము దేవదూతలతోఁ జెప్పఁగా ఇబ్లీసు (సైతాను) దప్ప నందఱును సాష్టాంగపడిరి. ఆతఁడు (సైతాను) తిరస్కరించి గర్వించి అవిశ్వాసియాయెను.

వ్యా॥ 34. ఆదముయొక్క ప్రాతినిధ్యము స్థిరపడగానే యాతని గౌరవార్థము దేవదూతలు ఆతనిని నమస్కరింప వలెనని దేవునాజ్ఞఆయెను. వీరితోఁ బాటు జిన్నాతులకు కూడ నాజ్ఞఆయెను. అందరు దేవునాజ్ఞ శిరసావహించి నమస్కరించిరి. కాని జిన్నాతుజాతికి జేరిన ఇబ్లీసు (సైతాను) అనువాఁడు తాను సలిపిన పూజలను తనకుఁగల విద్యను స్మరించి నేను శ్రేష్ఠుఁడనను గర్వముపొంది, దేవునాజ్ఞను సమ్మతింపక నమస్కరింప లేదు. అందుచేవాఁడు తిరస్కారియగు అవిశ్వాసియాయెను.

35. వఖుల్ నా-యా-ఆదముస్-కున్-అన్త-వజౌ-జుకల్-జన్నత - వకులా-మిన్ హా-రగదన్-హైసు-షీతుమా-వలా-తఖ్-అబా-హాజిహిష్-షజ-రత-ఫ-తకూనా-మినజ్ జా-లిమీన్. 36. ఫ-అజల్ల-హుమష్-షైతా-ను-అన్ హా-ఫఅఖ్-రజ-హుమా-మిమ్మాకానా. ఫీహి-వఖుల్-నహ్బితూ-బఅ-జుకుమ్-లి-బఅ-జిన్ - అదువ్వున్. వలకుమ్-ఫిల్-అల్ జి-ముస్-తఖ్రున్-వమతా-ఉన్-ఇలా-హీన్.

వాక్యములు నేర్పించెను. వారిద్దఱు అట్లు క్షమాపణకోరఁగా దేవుఁడు క్షమించి కరుణించెను. నిశ్చయంబుగా దేవుఁడే పాపములను పొరపాటులను క్షమించి అనుగ్రహించువాఁడు.

38. ఖుల్-నహ్-బితూ-మిన్‌హా-జమీ-అన్-ఫ-ఇమ్మా-యాతి-యన్న కుమ్-మిన్నీ-హుదన్-ఫమన్-తబి-అ-హుదాయ-ఫలా-ఖౌఫున్-అలై-హిమ్-వలా-హుమ్-యహ్-జనూన్. 39. వల్లజీన-క-ఫరూ-వకజ్-జబూ-బిఆయా తినా-ఉలా-ఇక-అస్-హాబున్నారి-హుమ్-ఫీహా-ఖాలిదూన్.

38. అందునుండి మీరందరును దిగిపొండు, మరల మీయొద్దకు నా యొద్దనుండి సన్మార్గబోధన వచ్చినచో మీలో నెవరు నాబోధను అనుసరింతురో వారికి నెట్టి భయముండదు. 39. మఱియు వారు దుఃఖింపరు. మఱియు నెవరు తిరస్కరించి నా సూచనలను అబద్ధములని పల్కుదురో వారు నరకాగ్నియందు స్థిరనివాసము చేయుదురు. అని మేము చెప్పితిమి.

వ్యా॥ 38, 39. దేవుఁడు ఆదమును క్షమించిన పిదప తిరిగి స్వర్గమునకు పోవుటకై సెలవు నొసంగక ఇహలోకములోనే కొంతకాలముండవలసినది అని ముందునిచ్చిన ఆజ్ఞనే స్థిరపఱచెను. ఎందుకన ఆదము, ఆతని సంతతియు లోకములోనుండి ధర్మము ననుసరించి రాజ్యపరిపాలన చేయవలసియుండెను. దానికిఁదగినతావు భూమియేకాని స్వర్గముకాదు. ప్రవక్తలమూలమున దేవుఁడొసంగుధర్మమార్గము ననుసరించువారు తిరిగి స్వర్గనివాసులగుదురు. అందు ఎట్టి భయముగాని దుఃఖముగాని యుండనేరదు. తిరస్కరించి అవిశ్వాసులైనవారికి నరకాగ్ని బాధయున్నది. అందు సదా యుందురని దేవుఁడు బోధించెను. అపుడు వారికి మనశ్శాంతిగలిగెను.

40. యాబనీ-ఇస్రా-యీ-లజ్-కురూ-నిఅ-మతి-యల్లతీ-అన్-అమ్‌తు అలై-కుమ్-వ-ఔఫూ-బి-అహ్‌దీ-ఊఫి-బిఅహ్ది కుమ్-వ-ఇయ్యా-య-ఫర్-హబూన్,

40. ఓ యిస్రాయీలు సంతతివారలారా! నేను మీకై చేసిన ఉపకారములను జ్ఞప్తికిఁదెచ్చుకొనుఁడు. మఱి మీరు నాతోఁ గావించిన ఒడంబడికను నెఱవేర్పుఁడు. నేను మీతోఁగావించిన ఒడంబడికను నెఱవేర్తును. మఱియు నాకే భయపడుఁడు.

వ్యా॥ 40. దీనికి ముందు ఉదహరించిన వాక్యములలో సమస్త

జనులపై కలిగిన దేవుని యనుగ్రహము చెప్పఁబడెను. ఈ వాక్యములలో ఇస్రాయీలు (యాకూబు) సంతతివారిపై గలిగిన దేవుని అనుగ్రహము వివరింపఁబడుచున్నది. ఇస్రాయీలీయులు గొప్ప విద్వాంసులనియు, ధర్మ శాస్త్రములు దెలిసినవారలనియు ప్రఖ్యాతిగాంచియుండిరి. అరబ్బులుకూడ అటులేభావించుచు ఇస్లామ్ మతములోవీరుచేరుదురో లేదా అని వేచియుండిరి. కావున యిస్రాయీలీయులఁ గూర్చి వారియెడ దేవుఁడు ఎట్లు అనుగ్రహించెను. వారు ఎట్లు దేవుని మేలు మఱచి కృతఘ్నులైరో యావిషయముప్రజలకు తేటతెల్లమగునట్లు చెప్పఁబడుచున్నది. వారియందున్న లోపములను ప్రజలు తెలిసికొని వారి ననుసరింపకుండుటకును, ఇస్రాయీలీయులు దేవుని యనుగ్రహమును తలంచుకొనియైన సన్మార్గము నవలంబింతురు గాక అని వారి విషయము వివరింపఁబడుచున్నది. ఇస్రాయీలీయులలో యాఖూబు ప్రవక్తగారినుండి ఏసుక్రీస్తుప్రవక్తగారివఱకు నాలుగువేలమంది ప్రవక్తలు (నబీలు) గడచిరి. తౌరాతు మొదలైన గ్రంథములు వారికి నియ్యఁబడెను. ఇస్రాయీలీయులు ఫిరౌను, అను రాజుచేతిలోఁ జిక్కి బానిసలైయుండగా వారిని మూసా ప్రవక్తగారి మూలమున విడుదల గావించెను, ఇటువంటి పెక్కు ఉపకారములు దేవుఁడు వారికిచేసెను. తౌరాతు (ధర్మశాస్త్రము)లో నిట్లుండెను. ''ధర్మశాస్త్రము ననుసరించి దేవుఁడు పంపఁబోవు ప్రవక్తలనునమ్మి వారి ననుసరించినచో సిరియాదేశము ఇస్రాయీలీయులవశములోనుండును'' వారు దీనిని అంగీకరించిరి. కాని తరువాత తాము గావించిన దేవుని ఒడంబడికకు వ్యతిరేకముగా ధర్మ విరుద్ధముగా నడచుకొనుచు లంచములుపుచ్చుకొనుచు సత్యమును దాఁచుచు, కొందఱు ప్రవక్తలను హింసించి చంపుచు, తౌరాతులో మహమ్మదువారినిగూర్చియున్న వాక్యములను తారుమారు చేయుచు దుర్మార్గులైరి. సత్యము (ఇస్లామ్) నవలంబించినచోవారికిఁగలుగుచున్న ఇహలోక లాభములు పోవునని భయపడుచుండిరి. అట్లు వలదు. దేవునకే భయపడుఁడు అని వారికి చెప్పఁబడుచున్నది.

41. వ-ఆమినూ-బిమా-అన్-జల్తు-ముసద్దిఖ్-లిమా-మఅకుమ్-వలా తకూనూ-అవ్వల-కాఫిరిమ్-బిహీ-వలా-తష్-తరూ-బి-ఆయాతీ-సమనన్ - ఖలీలన్-వ-ఇయ్యాయ-ఫత్తఖూన్.

41. మఱియు, మీయొద్దనున్నగ్రంథమును సత్యపఱచునది అగు నేను పంపిన ఖురాను గ్రంథమును విశ్వసింపుఁడు. మఱియు దీనిని తిరస్కరించు

వారిలో మీరు మొట్టమొదటివారు కాకుండుఁడు. మఱియు నా సూచనలకు బదులుగా కొద్ది వెల పుచ్చుకొనకుఁడు, మఱియు నాకేభయపడుఁడు.

వ్యా॥ 41. రాఁబోవు ప్రవక్తలు తౌరాతును సత్యమని పలుకుదురు. ఎవరు సత్యమని చెప్పరో వారు నిజమైన ప్రవక్తలుగారు అని తౌరాతు (ధర్మశాస్త్రము)లో నుండెను. దాని ననుసరించిఖురాను తౌరాతుసత్యపఱచు చున్నది. కావున ఇది దేవుని గ్రంథము, ముహమ్మదువారు దేవుని ప్రవక్తలని ఇస్రాయీలియులు నమ్మవలెనని చెప్పఁబడియె. మక్కా ఖురైషులు తెలియక ఖురానును తిరస్కరించిఅవిశ్వాసులైరి. ఓయిస్రాయీలియులారా! మీరు తెలిసియు తిరస్కరించినచో మొట్టమొదటతిరస్కరించినవారగుదురు. మిమ్ము ననుసరించి తిరస్కరించువారి పాపముకూడ మీకు చేరును. కావున అట్లు చేయకుఁడు. ఇహలోక భోగములకొఱకు విశ్వాసము వదలకుఁడు. నాకే భయపడి పాపములను వదలి సత్కార్యములు చేయుఁడు. అని దేవుని సెలవు.

42. వలా-తల్-బిసుల్-హఖ్ఖ-బిల్-బాతిలి-వతక్-తుముల్-హఖ్ఖ-వ-అన్-తుమ్-తఅ-లమూన్. 43. వ-అఖీ-ముస్-సలాత-వఆ-తుజ్జకాత-వర్-కఊ-మఅర్-రాకిఈన్.

42. మఱియు మీరు సత్యముతో అసత్యము కలుపకుఁడు. తెలిసియు సత్యమును దాఁచకుఁడు. 43. నమాజును స్థిరముగా సలుపుఁడు. జకాతు(విధిదానము) నొసంగుఁడు. మఱియు రుకూచేయు వారితో కలిసి రుకూచేయుఁడు.

వ్యా॥ 42, 43. ఇస్రాయీలియులు (యూదులు) సత్యమును దాఁచి అసత్యమును వెల్లడించుచు ప్రజలను మోసపుచ్చుచుండిరి. ఇది తప్పు అని తెలిసియు వారట్లు చేయుచుండిరి. అట్లు చేయవలదని ఇందుచెప్ప బడియె. మందున్న మతములలో సామాజిక (జమాఅత్)ప్రార్థన లేకుండెను. వేరువేరుగా చేసికొనునుండిరి. యూదుల ప్రార్థనలోవంగుట (రుకూ) లేకుం డెను. కావున మోక్షము పొందవలెనన్న ఇస్లామ్‌లో చేరి దాని ననుసరించి సమాజ ప్రార్థనలు, (నమాజు) ను రుకూను చేయవలెను అని చెప్పఁబడియె. (జకాతు) విధిదానము ధనముగలవారు విధిగా నియ్యవలసినది. ఇందు నిఱు పేదలకు మేలున్నది. దానముచేయువారికి పుణ్యము చేకూరును. పేరాస నశించును.

44. అతా-మురూ-నన్నాస-బిల్-బిర్రి-వతన్-సౌన-అన్-ఫు-సకుమ్-వ

అన్తుమ్-తత్-లూనల్-కితాబ-అఫలా-తఅ-ఖిలూన్.

44. ఏమి? మీరు ప్రజలకు సత్కార్యము చేయుఁడు అని ఆజ్ఞాపించుచు మీ యాత్మలను మఱచిపోవుచున్నారే, మఱి మీరుగ్రంథమును పఠించుచున్నారు, ఎందులకు యోచింపరు.

వ్యా॥ 44. ఇస్రాయీలియులే యూదులు అనఁబడుచున్నారు. ఆ యూదులలో కొందఱు విద్వాంసులు తమ వారితో ఈ ఇస్లామ్ మతము సత్యమైనది. అవలంబింపఁదగినది. అని చెప్పుచు తాము మాత్రము ఇస్లామ్‌లో చేరకుండిరి, మఱియు నితరులకు సత్కార్యములు చేయుఁడు అని చెప్పుచు తాము మాత్రము చేయకుండిరి. మంచిమార్గము చూపుటయే చాలును. అనుసరింప నక్కరలేదు. అని పొరపాటు పడుచుండిరి. ఇట్లు చేయవలదు. ధర్మమార్గము చూపు బోధకులు తాము ముందుగా దాని ననుసరించినచో వారు తమ యాత్మలకు కూడ మేలుచేసినవారగుదురు. దీనిగూర్చి యోచనచేయవలెను గదా! బుద్ధిమంతులు తమ యాత్మలను ముందు సవరించుకొనుదురు. తరువాత నితరులకు బోధింతురు.

45. వస్ - తఈనూ-బిస్ -సబ్ రి-వస్ సలాతి-వఇన్నహా-లకబీ-రతున్ ఇల్లా అలల్ -ఖాషి-ఈన్. 46. అల్లజీన-యజున్నూన-అన్నహుమ్- ములాఖూ అబ్బిహిమ్-వఅన్నహుమ్-ఇలై-హి-రాజి-ఊన్.

45. ఓర్పుతోను, నమాజుతోను సహాయముకోరుఁడు. నిశ్చయముగా అది భారమైనదియే. 46. కాని భయభక్తులుగలవారై తాము దేవునిదర్శింపగలమనియు తుదకు ఆతనియొద్దకే మరలవలసియున్నదనియు నమ్మువారికి అది భారముగాదు.

వ్యా॥ 45, 46. యూదులలో విద్వాంసులు ఖురాను దేవుని గ్రంథమనియు, మహమ్మదువారు దేవుని ప్రవక్తలనియు తెలిసియు విశ్వసింపకుండిరి. దానికి గొప్పకారణము వారికి గౌరవపదవియందును, ధనమందును గల పేరాస. దీనికిఁగాను ఓర్పు ప్రార్థనలు మంచిమందు. నమాజువలననవినయము గలుగును. ఓర్పువలన ధనాశ నశించును. ఓర్పువలనను నమాజు సహాయమువలనను, మోక్షమార్గము లభించును. నమాజు నియమముగాను మనఃపూర్వకముగాను సలుపుట భారముగాను కష్టముగానుతోఁచునది. కాని భయభక్తులు గలిగి దేవుని దర్శింపఁగలము. తుదకు దేవుని సన్నిధానమునకు

పోవలసియున్నది. అని నమ్మికయున్నచో నమాజు సలుపుట భారముగా తోఁచదు. అది మిక్కిలి సులభముగాను ఉత్సాహముగాను తోఁచును.

47. యాబనీ-ఇస్-రా-ఈలజ్-కురూ-నిఅ-మతియల్-లతీ-అన్-అమ్‌తు అలైకుమ్-వ-అన్నీ-ఫజ్జల్-తుకుమ్-అలల్-ఆలమీన్.

47. ఓ ఇస్రాయీలు సంతతివారలారా! నేను మీకుఁగావించిన ఉపకారములను, సర్వలోకముల వారికంటె మీకిచ్చిన ఘనతను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు.

వ్యా॥ 47. భయభక్తులు కలిగి ప్రార్థనలు సలుపుట కష్టమైనమార్గమైనచో దేవుని యుపకారములైనను తలంచి కృతజ్ఞత సలుపుట సులభముగదా. దీనిం బట్టియె ఈవాక్యములలో యూదులకు వారి సమకాలికులపైఁ గలగిన గొప్ప తనమును కీర్తిని వారు స్మరింపవలెనని చెప్పఁబడియె. యూదులు దేవుని గ్రంథములు పొందినవారు. వారిలో గొప్పగొప్ప ప్రవక్తలును, రాజులును కలిగిరి. వారికాలమందు వారే గొప్పవారుగానుండిరి. కాని వారుగావిం చిన అక్రమముల వలనను, ముహమ్మదు వారిని తిరస్కరించి ఇస్లామ్‌లో చేరనందునను, వారి గౌరవము నశించి యీ గౌరవము దేవునిచే ముసల్మాను లకు లభించెను. ఇదంతయు దేవుని మహిమయే.

48. వత్తఖూ-యామల్-లాతజ్ జీ-నఫ్‌సున్-అన్-నఫ్‌సిన్-షైఅన్-వలా-యుఖ్‌బలు-మిన్-హా-షఫా-అతున్-వలా-యూ-ఖజు-మిన్-హా-అద్‌లున్-వలాహుమ్-యున్-సరూన్.

48. మఱి ఒకరి నొకరు తోడుపడనిదియు, ఎవ్వనిగూర్చియు సిఫా రసు చెల్లనిదియు, బదులు తీసుకొనఁబడనిదియు ఎట్టి సహాయము దొరకని దియు నగు దినమునకు మీరు భయపడుఁడు.

వ్యా॥ 48. ఇస్రాయీలియులు, మేము ప్రవక్తల సంతతి వారలము. మేమెట్టిపాపములు చేసినను మాపెద్దలు మమ్ము విడిపింతురు. అని చెప్పు కొనుచుండిరి. ఇట్లు తలంచుట తప్పు. పాపపుణ్యముల తీర్పుకొఱకు ఒక దినము నియమింపఁబడి యున్నది. మృతినొందిన వారందఱు ఆ దినమున మరల సజీవులగుదురు. దీనినే ఖియామత్ అనుదురు. అపుడు ఎవ్వరులోఁబడు పడినను సిఫారసు వలనను పాపములకు బదులుగ ధనమిచ్చినను బలవంత ముగా సహాయముచేసినను పాపాత్ములను విడిపింపఁజాలరు. కావున విశ్వ

సించి సత్కార్యములుచేసి దేవుని ప్రీతివడసి నరకమునుండి ముక్తిపొందుటకు ప్రయత్నించవలెను, ఇతరులపై నాధారపడియుండ కూడదు అని హెచ్చరింపఁబడిరి.

49. వఇజ్-నజ్జైనా-కుమ్-మిన్-ఆలి-ఫిర్-ఔన-యసూ-మూన-కుమ్-సూఅల్-అజాబి-యుజబ్బి హూన-అబ్నా-అకుమ్-వయస్-తహ్-యూన-నిసా అకుమ్-వఫీ-జాలి-కుమ్-బలా-ఉమ్-మిర్-రబ్బికుమ్-అజీమ్. 50. వఇజ్-ఫరఖ్నా-బికు-ముల్-బహ్ర-ఫఅన్-జైనా-కుమ్-వ-అగ్-రఖ్నా-ఆల-ఫిర్-ఔన-వఅన్-తుమ్-తన్‌జురూన్.

49. మఱి ఫిర్ఔను ప్రజలు మీ కుమారులను నఱుకుచు మీకుమార్తెలను బ్రతుకనిచ్చుచు మీకు విపరీతబాధలు పెట్టుచుండఁగా వారినుండి మిమ్ము విడిపించితిమి. మఱియు నిందు మీ ప్రభువువలన గొప్ప పరీక్షయుండెను. 50. మఱి మీకునుఁగాను నదినిచీల్చి మిమ్ము రక్షించితిమి. మీరు చూచుచుండఁగనే ఫిర్ఔనుప్రజలను మేము ముంచి వేసితిమి.

వ్యా॥ 49, 50. ఈజిప్టురాజగు ఫిర్ఔను ఒక భయంకరమైన కలగాంచి దాని ఫలమునుగూర్చి జ్యోతిష్కుల నడుగగా వారు నీకు బానిసలుగానున్న ఇస్రాయీలియులలో నొకఁడు పుట్టి నిన్ను నీరాజ్యమును నీమతమును నశింపఁజేయును అని చెప్పిరి. అపుడారాజు ఇస్రాయీలియులలోఁ బుట్టు మగబిడ్డలను నఱుక వలసినది, ఆడుబిడ్డలను తన సేవకొఱకు వదలవలసినది అని చాటించెను. అట్లు వాని ప్రజలగు సేవకులు మగబిడ్డలను చంపుచు ఆడుబిడ్డలను వదలుచుండిరి. దేవుఁడు ఆకాలముననే మూసాను పుట్టించి పిర్ఔను ఇంటిలో నాతని పోషణగావించి తుదకు మూసా ప్రవక్తవలననే ఇస్రాయీలియుల బానిసతనపు కట్టుబాటు తొలఁగించెను. దీనిగూర్చిన వివరము ఖురానేషరీఫులోనే ముందు వ్రాయుదుము. ఆఖరున మూసా తన ఇస్రాయీలియులను దీసికొని రాత్రి బయలుదేరెను. మధ్య దారిలో ఎఱ్ఱసముద్రముండెను. దేవునాజ్ఞచే మూసా తనచేతి కఱ్ఱతో సముద్రమును గొట్టఁగా అదిచీలి దారి ఏర్పడెను. మూసా తన ప్రజలతో సురక్షితముగా ఆవలియొడ్డు చేరెను. అంతలో ఫిర్ఔను తన పరిజనులతో మూసాను వెంబడించుచువచ్చి ఇస్రాయీలియులు సముద్రము దాటిపోవుట చూచి వారిని పట్టుకొనవలెనని దానిలో దిగెను. వాఁడునువానిప్రజలును దాని మధ్యలోఁ జేరగానె చీలియున్న సముద్రము కలిసికొనెను, అందువారందఱు

మునిఁగి చచ్చిరి. ఇదంతయు ఇస్రాయీలీయులు చూచుచు శత్రువు నశించెనని సంతసించిరి. ఈ విషయములను ఇఁక చెప్పఁబోవు విషయములను జ్ఞప్తికిఁ దెచ్చుకొని యైన దేవునియెడ కృతజ్ఞత చూపుఁడు. అని ఇస్రాయీలీయులకు చెప్పఁబడుచున్నది.

51. వఇజ్-వాఅద్ నా-మూసా-అర్-బఈన-లై-లతన్-సుమ్మత్-తఖజ్ తుముల్-ఇజ్‌ల-మిమ్-బఅ దిహీ-వఅన్‌తుమ్-జాలిమూన్.52. సుమ్మ-అఫౌనా అన్-కుమ్-మిమ్-బఅ-ది-జాలిక-లఅల్ల కుమ్-తష్-కురూన్. 53. వఇజ్-ఆతైనా-మూసల్-కితాబ-వల్-ఫుర్-ఖాన-ల-అల్ల-కుమ్-తహ్-తదూన్.

51. మఱియు మేము మూసాతో నలువదిరాత్రుల వాగ్దానము చేసి యుండినపుడు మీరు మూసాతరువాత ఆవుదూడను దేవునిగాఁ జేసికొంటిరి. (కావున) మీరు దుర్మార్గులు. 52. ఆపిదప మీరు కృతజ్ఞులరై యుండుటకై మిమ్ము క్షమించితిమి. 53. మఱియు మీరు సన్మార్గులు అగుటకై (తౌరాతు) గ్రంథమును, (సత్యమును అసత్యమునుండి వేరుచేయునట్టి ధర్మములను) సూచనలును మూసాకు నొసంగితిమి.

వ్యా॥51,52 53. మూసా ప్రవక్తమూలమున ఇస్రాయీలీయులు ఫిర్‌ఔను పెట్టుచున్న కష్టములనుండి రక్షింపఁబడిరి. దీని పిదప ఇస్రాయీలీయులు నడచుకొనుటకు ధర్మశాస్త్రము కావలసివచ్చెను. అపుడు దేవుడు మూసాతో నీవు నలువదిరాత్రులు 'తూరు అను కొండయొద్ద నుపవసింపుము. నీకు మతగ్రంథము నొసంగుదును' అని వాగ్దానము చేసెను. దానికిఁగాను మూసా తూరుకొండకుఁబోయెను. ఆయన పోయిన పిదప ఇస్రాయీలీయులు సామిరీ అను కమసాలిచేసిన ఆవుదూడ విగ్రహమును పూజింపసాగిరి. ఇట్లుచేయుట అధర్మమును దుర్మార్గమును అన్యాయమును; అయినప్పటికిని ఇస్రాయీలీయులు దేవుఁడుచేసిన మేలును మఱవకుందురని వారి ఘోరపాపమును క్షమించెను. (ఈ విషయము ఇఁకముందు ఖురానులో వివరముగా వచ్చును.) దేవుఁడు మూసాకు నొసంగిన మతగ్రంథము తౌరాతు. సత్యమును అసత్యమునుండి వేరుపఱచునట్టి ధర్మములును, గొప్ప అమానుషము (మోజిజా) లును మూసాకు నొసంగఁబడిన సూచనలు. ఇదంతయు ఇస్రాయీలీయులు సన్మార్గమవలంబింతురని ఇయ్యఁబడెను. ఇట్టి మేళ్ళను జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలసినదియని సూచింపఁబడియె.

54. వ-ఇజ్-ఖాల-మూసా-లిఖౌమిహీ యా-ఖౌమీ-ఇన్నకుమ్ జలమ్-తుమ్-అన్-ఫుసకుమ్ బిత్-తిఖా-జికుముల్-ఇజ్ల-ఫతూబూ-ఇలా-బారి-ఇకుమ్-ఫఖ్తులూ-అన్-ఫుసకుమ్-జాలికుమ్-ఖైరుల్-లకుమ్-ఇన్ద-బారి-ఇకుమ్-ఫతాబ-అలైకుమ్-ఇన్నహూ-హువత్-తవ్వాబుర్-అహీమ్.

54. మఱియు మూసా తన కులము వారితో ఓయి! మీరు ఆవుదూడ విగ్రహము చేసికొని మీయాత్మలకు నష్టము గావించితిరి, కావున మీరిపుడు మీసృష్టికర్తయొద్ద క్షమాపణ వేడుఁడు. మఱి మీదురాత్మలను చంపుఁడు. ఇది మీ సృష్టికర్తయొద్ద మీకు మేలగును. అని చెప్పెను. ఆ పిదప! దేవుఁడు వారిని క్షమించెను. నిశ్చయముగా దేవుఁడే క్షమించు వాఁడును, దయగల వాఁడును.

వ్యా॥ 54. ఈ వాక్యములలో ఆవుదూడను పూజించుటవలన గలిగిన పాపమునకు పరిహారము చెప్పఁబడియెను. ఇస్రాయీలియులలో కొందఱు ఆవుదూడను పూజించిరి. మఱికొందఱు పూజింపలేదు. పూజించినవారిని పూజచేయనివారు చంపవలెను. అపుడు ఆపాప పరిహారమగును. అది దేవుని సెలవుకాఁగా ఇస్రాయీలియులు అట్లే గావించిరి. వారి క్షమాపణ అంగీకరింపఁబడెను.

55. వ-ఇజ్-ఖుల-తుమ్ యా-మూసా-లన్-నూమిన-లక హత్తా-నఅల్లాహ-జహ్-అతన్-ఫ-అఖ-జత్-కుముస్-సాఇ-ఖతు-వ-అన్-తుమ్-తన్-జురూన్.
56. సుమ్మ-బఅస్-నాకుమ్-మిమ్-బఅ-ది-మౌతికుమ్-లఅల్లకుమ్-తష్-కురూన్.

55. మఱియు ఓమూసా! మేము దేవునిని కన్నులార చూచునంతవఱకు నిన్ను నమ్మఁజాలము. అని మీరు చెప్పినపుడు మీరు చూచుచుండఁగనే మీపై పిడుగుపడెను. 56. ఆపిదప మీరు కృతజ్ఞులరై యుండుదురని మీరుచచ్చినపిదప మిమ్ము లేపితిమి.

వ్యా॥ 55, 56. ఇస్రాయీలియులలో డెబ్బదిమంది పెద్దలు మేము దేవుని వాక్కు వినుదుమని మూసా వెంబడి తూరుకొండకు పోయిరి. అచ్చట దేవుఁడు మూసాతో మాటలాడెను. అదివిని మఱుగునుండి ఎవరు మాట్లాడుచున్నారో మాకు తెలియదు. దేవునిని కన్నులార మేముచూచునంతవఱకు నిన్నునమ్మఁజాలముఅని వారుచెప్పిరి. వెంటనే వారిపై పిడుగుపడఁగా వారు మృతినొందిరి. వారి చావునుచూచి మూసా వారిని క్షమించి మరల లేపవలె

నని దేవుని వేఁడుకొనఁగా దేవుఁడు కనికరించి చచ్చినవారిని లేపెను. ఇది గొప్ప మేలుగదా? దీనిని మఱవకుఁడు అని వారికి చెప్పబడియె.

57. వ-జల్-లల్నా-అలై-కుముల్-గమామ-వ-అన్-జల్నా-అలై కుముల్ - మన్న-వస్-సల్వా-కులూ-మిన్-తయ్యి-బాతి-మా-రజఖ్- నాకుమ్-వమా-జలమూనా-వలాకిన్-కానూ-అన్-ఫుసహుమ్-యజ్ లిమూన్.

57. మఱియు మీపై మేఘచ్ఛాయనుజేసి మన్సల్వాలను మీకొఱకు పంపితిమి. మేము మీకు నొసంగిన పరిశుభ్రమైన వస్తువులను తినుఁడు. (అని వారితో చెప్పితిమి). వారు మాకు నష్టమేమియుచేయలేదు. కానివారు తమ నష్టమే చేసికొనుచుండిరి.

వ్యా॥ 57. ఫిర్ఔను మునిఁగిపోయిన తరువాత ఇస్రాయీలీయులు దేవుని సెలవుచే ఈజిప్టునుండి సిరియా (షామ్) దేశమునకుఁ బోవునపుడు దారి మధ్యనున్న మైదానములలో వారి గుడారములు చినిఁగి ఎండబాధ పడుచు వెంటనున్న ఆహార సామగ్రులు అయిపోఁగా అహారములేక కష్టపడు చుండిరి. అపుడు మేఘముల నీడ వారిపై పడుచుండెను. ఆహారముకొఱకు కృషిలేకనే మన్సల్వాలు దొరకుచుండెను. మన్ అనునది ఒక మధురమైన వస్తువు. దనియాలను పోలియుండును. సల్వా ఒక విధమైనపక్షి. పూరేడు వంటిది. పక్షులు తమంతటతామే వారికి దొరకుచుండెను. వాని మాంసము భక్షించుచు మన్ అనునది చాలాకాలమువఱకుఁ దినుచుండిరి. దీనితోనే తృప్తిఁజెందుఁడు. ఏదినము ఆహారము ఆదినమే తినుఁడు. మఱుసటిదినము నకుఁగాను సేకరించి యుంచకుఁడు. వీనికి బదులుగ నితర వస్తువులు కోరకుఁడు అని దేవునాజ్ఞయుండెను కాని వారు దానికి వ్యతిరేకముగా మన్, సల్వా మఱుసటి దినమునకుఁగాను సేకరించిపెట్టుచు, గోధుమ దోస మొదలగు కూరగాయలు కావలెనని కోరిరి. దానివలన వారికి నష్టమేయాయెను. కృషిలేకుండ హాయిగా ఆహారము దేవునిచే లభించుచుండెను. తరువాత వారు సేద్యము మొదలైన కృషికి పాటుపడవలసివచ్చెను.

58. వ-ఇజ్-ఖుల్-నద్-ఖులూ-హాజి-హిల్-ఖర్ - యత - ఫకులూ-మిన్- హా-హైసు-షితుమ్-రగదన్-వద్-ఖులుల్-బాబ-సుజ్జదన్ - వఖూలూ - హిత్తతున్-నగ్-ఫిర్-లకుమ్-ఖతా-యాకుమ్ - వస - నజీదుల్ముహ్సి- సినీన్.

59. ఫ-బద్ద-లల్లజీన-జలమూ-ఖౌలన్-గైరల్లజీ-ఖీల-లహుమ్-ఫ-అన్ - జల్నా - అల-ల్లజీన-జలమూ-రిజ్-జమ్-మినస్-సమాయి-బిమా-కానూ-యఫ్-సుఖూన్.

58. మఱియు మీరీ పురమునందు ప్రవేశించి మీయిష్టము చొప్పున తినుఁడు. మఱియు ద్వారమునందు సాష్టాంగ నమస్కారము చేయుచు క్షమింపుమని చెప్పుచు ప్రవేశింపుడు. మీపాపములను క్షమింతుము. మఱి సత్కార్యములు చేయువారికి హెచ్చుగా నిత్తుమని చెప్పితిమి. 59. ఆపిదప దుర్మార్గులైనవారు, వారితోఁ జెప్పిన మాటను వ్యతిరేకముగా తారుమారు చేసిరి. కావున, దుర్మార్గులపై వారు చేయుచున్న అవిధేయత వలన ఆకాశము నుండి ఆపదను దింపితిమి.

వ్యా॥ 58, 59. ఇస్రాయీలియులు మైదానములలో తిరుగుచు విసుగు చెందిరి. అపుడు ఎరూషలేము (బైతుల్ ముఖద్దస్) అను పురములో ప్రవేశింపుఁడు. అచ్చట మీరు ఇష్టపడిన ఆహార పదార్థములు మీకు దొరకును. పురద్వారములో ప్రవేశించునపుడు కృతజ్ఞత చూపుటకై సాష్టాంగ నమస్కారము (సిజ్దా) దేవునికిఁ గాను జేయుచు క్షమాపణ కోరుఁడు. మీరు క్షమింపఁ బడుదురు. అని వారికి దేవుని సెలవయ్యెను. కాని వారు దానికి వ్యతిరేకముగా నమస్కారమునకు బదులు ద్వారమునుండి పిఱుఁదులతో జాఱుచు, క్షమాపణ కోరుటకు బదులుగా పరిహాసముగా గోధుమలు గోధుమలని చెప్పుచు పురములో ప్రవేశించిరి. వారుగావించిన అవిధేయతకుఁగాను ప్లేగు అను ఆపద, ఆకాశమునుండి వారిలో వ్యాపించెను. మధ్యాహ్నము లోపల డెబ్బదివేల మంది యూదులు చచ్చిరి.

60. వఇజిస్-తస్ఖా-మూసా-లి-ఖౌమిహీ-ఫఖుల్-నజ్-రిబ్-బిఅసా కల్-హజర్-ఫన్ఫజరత్-మిన్హుస్-నతా-అష్-అత-ఐనన్-ఖద్-అలిమ - కుల్లు-ఉనాసిమ్-మష్-అబహుమ్-కులూ-వష్-అబూ-మిర్-రిజ్-ఖిల్లాహి-వలా-తఅ-సౌ-ఫిల్-అర్జి-ముఫ్-సిదీన్.

60. మఱియు మూసా తన జనులకొఱకు నీళ్లుకోరఁగా నీ కఱ్ఱతో ఱాతిని గొట్టుము అని మేము చెప్పితిమి. కావున దానినుండి పండ్రెండు ఊటలు ప్రవహింపసాగెను. ప్రతి కుటుంబము తనతనత్రాగు చోటు (రేవు) ను గుర్తించెను. దేవుఁడు ఒసంగిన యాహారము తినుఁడు. త్రాగుఁడు. మఱి దేశములో నుపద్రవములు గలిగించుచుఁ దిరుగకుఁడు (అని మేము చెప్పితిమి).

వ్యా॥ 60. ఈ వాక్యములలో దేవునిచే ఇస్రాయీలియులకుఁ గలిగిన మేలును వారు స్మరింపవలెనని చెప్పఁబడియె. ఇస్రాయీలియులు తీహ్ అను మైదానములో చిక్కుకొని నీళ్ళులేక అల్లాడుచుండఁగా మూసాప్రవక్త నీళ్లు కావలెనని దేవునిని వేఁడుకొనెను. అప్పుడు, దేవుఁడు మూసాతో నీచేతి కఱ్ఱతో ఱాతినిగొట్టుము అని సెలవిచ్చెను. దాని ననుసరించి మూసా ఱాతిని గొట్టఁగా దానినుండి పండ్రెండు ఊటలు బయలుపడెను. ఇస్రాయీలియులలో కూడ పండ్రెండు కుటుంబము లుండెను. ఒక్కొక్క కుటుంబమున కొక్కొక్క యూటనియమింపఁబడెను. అచ్చటనుండివారు నీళ్లు తీసికొనుచుండిరి. ఇట్టి దేవుని యుపకారమును తలఁచి దేశములలో అక్రమము చేసి అశాంతము కలిగించుచు తిరుగకుఁడు అని వారికి చెప్పఁబడియె.

61. వ-ఇజ్-ఖుల్-తుమ్-యా-మూసా-లన్-నస్-బిర-అలా-త-ఆమిన్
వాహిదిన్-ఫద్ఉ-లనా-అబ్బక-యుఖ్-రిజ్-లనా-మిమ్మా-తుమ్-బితుల్-అర్
జు-మిమ్‌బఖ్-లిహా-వఖిస్సా-ఇహా-వఫూ-మిహా-వ-అదసిహా-వ-బస-లిహా-ఖాల
అతస్-తబ్-దిలూ-నల్లజీ-హువ-అద్నా-బిల్లజీ-హువ-ఖైరున్-ఇహ్బితూ-
మిస్-రన్-ఫ-ఇన్న-ల-కుమ్-మా-సఅల్-తుమ్ వ-జురి-బత్-అలైహి-ముజ్-జిల్లతు
వల్-మస్కనతు-వ-బాఊ-బి-గజబిమ్-మినల్లాహి-జాలిక-బి-అన్న-హుమ్-
కానూ-యక్-ఫురూన-బి-ఆ-యా-తిల్లాహి-వ-యఖ్-తులూ-నన్-నబీ-ఈన-
బిగైరిల్-హఖ్ఖి-జాలిక-బిమా-అసౌ-వకానూ-యఅ-తదూన్.

61. మఱియు మీరు 'ఓమూసా! మేము ఒకేవిధమైన యాహారముపై నుండఁజాలము. కావున భూమినుండి యుత్పత్తియగు కూరలు, దోస, గోధుమ, మసూరపప్పు, ఎఱ్ఱగడ్డలు అనునవి మాకొఱకు ఇచ్చునట్లు నీప్రభువును మాకై వేఁడుము' అని మూసాతో మీరు చెప్పినపుడు ఏమి మీరు శ్రేష్ఠమైన దానికి బదులుగా అల్పమైన దానిని దీసికొనుటకు ఇష్టపడుచున్నారా? ఏదైననొక పురములో దిగుఁడు, మీరు కోరునది మీకు లభించును, అని మూసాపలికెను. మఱియు వారి కొఱకు అగౌరవమును, పేదఱికమును స్థిరపఱుపఁబడియెను. ఇది, వారు దేవుని యాజ్ఞలను తిరస్కరించుచుండి నందువలనను, అన్యాయముగా వారు ప్రవక్తలను చంపుచుండినందునను, వారు

అవిధేయు లై నందువలనను, మత నియమములను అతిక్రమించుచుండి నందువలనను గలుగెను.

వ్యా॥ 61. ఈ వాక్యములలో ఇస్రాయీలియులు మన్, సల్వా అను శ్రేష్ఠమైన ఆహారమును తిని విసుగుచెంది దానికన్న అల్పమైన కూరగాయలు దోస మొదలైన వస్తువులు కావలెనని కోరిరి. అపుడు మూసాప్రవక్త పై వాక్యములోనున్న జవాబిచ్చెను. అటులేవారు ఒక పురములో దిగిరి. ఈ వాక్యములో యూదుల స్థితినిగూర్చి ప్రకటింపఁబడియె. వారు ఇఁక ఎచ్చట నుండినను వారికి గౌరవముండదు. దీని ననుసరించియే రాజ్య గౌరవమును వారు గోలు పోయిరి. ఇప్పటికిని యూదులు ముసల్మానులకుఁగాని లేక క్రైస్తవులకుఁ గాని దాసులుగానున్నారు. లోకమంతటను ఎచ్చటచూచిన వారి రాజ్యములేదు. యూదులలో చాల పేదఱిక ముండును. ధనవంతులుండినను అధికారుల భయముచే బీదవారల మని వెల్లడింతురు. ఇట్లు యూదులు దేవుని కోపమునకు పాత్రులై సర్వగౌరవములను బోఁగొట్టుకొనిరి. దానికి కారణము వారు చేయుచున్న అక్రమములే. దేవుని యాజ్ఞలను తిరిస్కరించుట వారి యలవాటయి యుండెను. దేవుని ప్రవక్తలను అన్యాయముగా చంపిరి. కొందఱు ప్రవక్తలను దూషించిరి. కొందఱిని తిరస్కరించిరి. ఇట్టిఘోరపాపము చేసినందువలననే యూదులు దేవునికోపమునకుపాత్రులైరి.

62. ఇన్నల్లజీన-ఆమనూ-వల్లజీన-హాదూ-వన్-నసారా-వస్-సాబి-ఈన మన్-ఆమన-బిల్లాహి-వల్-యౌమిల్-ఆఖిరి-వ-అమిల-సాలి-హన్-ఫలహుమ్-అజ్-ఉహుమ్-ఇన్-ద-రబ్బిహిమ్-వలా-ఖౌఫున్-అలైహిమ్-వలాహుమ్-యహ్-జనూన్.

62. నిశ్చయముగా ముసల్మానులైనవారును, యూదులైనవారును, నస్రానీయులును, సాబియీనులును అను వీరిలో ఎవరు దేవునిని తుదిదినము (ఖయామతు) ను నమ్మి సత్కార్యములు చేయుదురో వారికొఱకు వారి ప్రభువువద్ద వారి పుణ్యమున్నది. మఱియు వారికి నెట్టిభయముగాని దుఃఖము గాని యుండనేరదు.

వ్యా॥ 62. పై వాక్యములలో ఎవరు దేవుని యాజ్ఞలను అనుసరింపక నిషేధింపఁబడిన వానిని చేయుచు మితిమీఱి పోయిరో వారికి లభించినశిక్ష విషయము చెప్పఁబడెను. ఇఁక ఈ వాక్యములో విశ్వాసమును సత్కార్యములును ముఖ్యముగా మోక్ష పుణ్యములకు ఆధారములు. కాని ప్రత్యేకమైన

సంఘముకాదు. ఎవరైననుసరే విశ్వసించి సత్కార్యములు చేసినచో పుణ్యము పొందుదురు. అను విషయము చెప్పబడియె. యూదులు మూసా ప్రవక్తను అనుసరించువారు. నస్రానీలు ఏసుక్రీస్తు ప్రవక్త యొక్క మతస్థులు. సాబియీనులను వారు ఇరాకుదేశములోనున్న ఒక తెగవారు. వారు నక్షత్రములను శక్తులను, దేవతలను విగ్రహములను పూజించుచుండిరి, వానికి బలులు చేయుచు ప్రార్థనలు సలుపుచు దేవుని ప్రీతి పడయుటకు నిది మార్గమని విశ్వసించి యుండిరి,

63, వ-ఇజ్-అఖజ్నా-మీసా-ఖకుమ్-వ-రఫఅనా-ఫౌఖ-కుముత్ తూర-ఖుజూ-మా-ఆతైనాకుమ్-బిఖువ్వతిఁ-వజ్ కురూ-మా ఫీహి - లఅల్లకుమ్ - తత్తఖూఁ, 64. సుమ్మ-తవల్ -లైతుమ్-మిమ్-బఅ-ది-జాలిక-ఫలౌలా- ఫజ్ లుల్లాహి-అలైకుమ్-వ-రహ్మతు-హూ-లకున్తుమ్-మినల్ -ఖాసిరీఁ,

63, మఱియు మీనుండి ఒడంబడిక మేము పుచ్చుకొనునపుడు తూరు కొండను మీపైనెత్తి మీరు భక్తిపరులగుటకై మేము మీకు నొసంగిన గ్రంథమును గట్టిగాపట్టుఁడు, మఱియు నందు నుండు దానిని జ్ఞప్తి నుంచుకొనుఁడు. అని చెప్పితిమి. 64. ఆ పిదపకూడ మీరు మరలితిరి. కావున దేవుని యనుగ్రహమును ఆతని కృపయును మీపై లేకుండనుండినచో మీరు నశించియుందురు.

వ్యా॥ 63, 64. ఇస్రాయీలియులకు తౌరాతుగ్రంథము ఇయ్యఁబడెను. అపుడు దీనిలోని ధర్మములు చాల కఠినముగా నున్నవి. మేము దీనిననుసరింపఁజాలము అని వారు పలుకసాగిరి. దానికిఁగాను తూరు అను కొండ వారి తలపైనుండునటుల దేవుఁడుచేసి గ్రంథమును అనుసరింతుము అని యొడంబడిక చేయుఁడు లేనిచో కొండ మీతలపై పడును. అని చెప్పఁగ భయపడి వారు ఒప్పుకొనిరి. కాని దానిపిదపనే వారు గావించిన ఒడంబడిక నుండి మరలిపోయిరి. దాని ధర్మములను అనుసరింపక అక్రమములు చేయ సాగిరి. అట్లు వారు ఒడంబడికను త్రెంచినందువలన వారు నశించియుందురు. కాని దేవుని అను గ్రహమువలన వారు రక్షింపఁబడిరి. ఈ విషయము స్మరింపుఁడు అని చెప్పఁబడియె,

65. వ-లఖద్ -అలిమ్-తుముల్లజీ-నఅ-తదౌ-మిఁ-కుమ్-ఫిస్ . సబ్తి-ఫఖుల్నా-లహుమ్-కూనూ-ఖిర-దతఁ-ఖాసియీఁ; 66. ఫ-జఅల్-నాహా - నకాలల్-లిమా బైన-యదైహా-వమా-ఖల్ ఫహా-వమా-ఇజతల్-లిల్-ముత్తఖీన్

65. మఱియు, శనివారమునందు మీలో అతిక్రమించినవారిని మీరు బాగుగా నెఱింగియున్నారు. మేము వారితో మీరు నీచులైన కోఁతులు కండు అని చెప్పితిమి. 66. ఆ పిదప ఈ విషయమును అపుడు అచ్చటనున్న వారికిని, వారి తరువాత రానున్న వారికిని బుద్ధినిచ్చునదిగాను భయభక్తులు గలవారికి బోధనగాను జేసితిమి.

వ్యా॥ 65, 66. తౌరాతు గ్రంథములో శనివారమునాఁడు ఏలాటి పనిచేయక ప్రార్థనలు సలుపవలెననియు చేఁపలు వేటాడకూడదు అనియు ఇస్రాయీలియులకు దేవునాజ్ఞయుండెను. కాని వారు తంత్రములతో శనివారమునాడు వేటాడసాగిరి. అందులకు వారు దేవుని కోపమునకుఁ బాత్రులై దేవునాజ్ఞచే కోఁతులుగా మాఱిపోయి మూఁడు దినములవఱకు బ్రతికి మృతినొందిరి. ఇది దావూదు ప్రవక్త కాలమున సంభవించెను. వారికి విధింపఁబడిన శిక్ష వారికాలములోనున్న వారికిని పిదప రానున్నవారికిని బుద్ధి నిచ్చునదిగాఁ జేయఁబడెను

67. వఇజ్-ఖాల-మూసా లిఖౌమిహీ-ఇన్నల్లాహ - యామురు-కుమ్-అన్-తజ్బహూ-బఖ-రతన్-ఖాలూ-అతత్-తఖిజునా-హుజువన్-ఖాల-అఊజు-బిల్లాహి-అన్-అకూన-మినల్-జాహిలీన్. 68. ఖాలుద్‌ఉ-లనా-ఱబక్క-యుబయ్యిల్-లనా-మాహియ-ఖాల-ఇన్నహూ-యఖూలు-ఇన్నహా - బఖ - రతున్ - లాఫారి-జున్-వలా-బిక్-రున్-అవా-నుమ్-బైన-జాలిక-ఫఫ్-అలూ-మా-తూ-మరూన్. 69. ఖాలుద్‌ఉ-లనా-ఱబ్బక-యుబయ్యిల్-బలనా-మా లౌనుహా-ఖాల ఇన్నహూ-యఖూలు-ఇన్నహా-బఖఱతున్-సఫ్రావు-ఫాఖిఉల్-లౌనుహా- తసుర్రున్నా-జిరీన్- 70. ఖాలుద్‌ఉ-లనా-ఱబ్బక-యుబయ్యిల్- లనా-మాహియ-ఇన్నల్-బఖర-తషాబహ-అలైనా-వఇన్నా-ఇన్‌షా అల్లాహు-లముహ్తదూన్. 71. ఖాల-ఇన్నహూ-యఖూలు-ఇన్నహా-బఖఱతున్-లాజలూలున్-తుసీరుల్-అర్‌జ-వలా-తస్-ఖిల్-హర్‌స-ముసల్లమతున్-లాషియత-ఫీహా-ఖాలుల్- ఆన-జిత-బిల్-హఖ్ఖి-ఫజబ-హూహా-వమా-కాదూ-యఫ్-అలూన్.

67. మఱియు మూసా తనజనులతో, మీరు ఒకగోవును కోయవలెనని మీకు దేవుఁడు ఆజ్ఞనిచ్చుచున్నాఁడని చెప్పినపుడు వారు ఏమి నీవు మాతో పరిహాస మాడుచున్నావా అని పలికిరి, (అపుడు) మూసా నేను మూఢు

లలో చేరకుండుటకై దేవుని శరణుజొచ్చుచున్నానని చెప్పెను. 68. వారు అదిఎట్టి (వయస్సుగల) ఆవో మాకుఁదెలుపునట్లు నీప్రభువును మాకొఱకు వేఁడుము. అనిచెప్పఁగా అది ముసలిదిగాని, లేతదిగాని యుండక మధ్యదిగా నుండవలెనని దేవుఁడు సెలవిచ్చుచున్నాఁడు. కావున మీకు నాజ్ఞయైన దానిని చేయుఁడుఅని మూసాపలికెను. 69. అపుడు, వారు దానిరంగు ఎట్టిదో మాకుఁదెలుపునట్లు మాకొఱకు నీప్రభువును వేఁడుము అని చెప్పఁగా చూచు వారికి సంతోషము గలుగఁజేయునట్టి గాఢమైన పసుపువన్నెగల గోవుఅని దేవుఁడు సెలవిచ్చుచున్నాఁడని మూసాపలికెను. 70. (అపుడు) అది ఎట్టిదో మాకుఁ దెలుపునట్లు మాకొఱకు నీప్రభువును వేఁడుము. ఎందుకన మాకు ఆయావునుగూర్చి సందేహము గలిగినది. దేవుఁడు కోరినచో తప్పక మాకు దారిదొరకును అనిచెప్పగా 71. ఆగోవు భూమినిదున్ని పొలమునకు నీళ్లుతోడి కృషిచేసినదిగా నుండక, అందు ఎట్టిలోపములుగాని మచ్చలుగాని లేకయుండ వలెను అని దేవుఁడు సెలవిచ్చుచున్నాఁడని మూసావారితో పలుకగా ఇపుడు నీవు సత్యము దెచ్చితివి- అని వారుపలికిరి. ఆ పిదప వారు దానిని కోసిరి. వారిట్లు చేయుదురని తోచలేదు.

వ్యా॥ 67: 71. ఇందు ఇస్రాయీలీయులలో సంభవించిన ఒక విషయము చెప్పఁబడుచున్నది. మూసాప్రవక్త కాలమున ఒక యూదుఁడు గొప్ప ధనవంతుఁడుండెను. ఆతనికి బిడ్డలు లేకుండిరి. ఆస్తి లభించునని ఆసతో ఆతని దాయాది ఒకఁడు ఆతనిని చంపివేసెను. కాని వానిని గుర్తింప లేకపోయిరి. దీనిగూర్చి జనులు కలహించుచు ఒకరిపైనొకరు ఆ హత్య మోపుచు మూసాను దానిగూర్చి అడిగిరి. మూసా దానికిఁగాను దేవునాజ్ఞచే ఒక గోవును కోయుఁడు. హత్య గావించినవాఁడు తెలియఁబడును. అనిచెప్పఁగా జనులు ఏమయ్యా ఆవును కోయుట ఎక్కడ? హంతకుఁడు తెలియుట ఎక్కడ? ఏమి పరిహాసము లాడుచున్నావే? అని పలికిరి. అపుడు మూసా, దేవుని ప్రవక్త పరిహాసములాడఁడు. ఎగతాళి చేయుట మూఢులపని మూఢులసంఘములో నేను చేరకుండుటకై దేవుఁడు నన్ను రక్షించుఁగాత అని చెప్పెను. జనులు వాస్తవము తెలిసినపిదప ఆగోవు ఎట్టిదో అనిప్రశ్నలు వేయసాగిరి. వారు ప్రశ్నలు వేయుకొలఁది గోవును గూర్చిన నిబంధనలు హెచ్చసాగెను. మొట్టమొదటనే సాధారణమైన గోవునుకోసి యుండినచో వారికి చాలియుండును, కాని వారు తమస్వభావమునుబట్టి అధిక ప్రసంగము లాడిరి. పైవాక్యములలో వివరింపఁబడిన ఆవు ఒక పేదవాని యొద్దనుండెను. అతఁడు ఆవుచర్మము నిండుగ బంగారు నిచ్చిన ఇత్తునని చెప్పెను. అంతవెలనిచ్చి

యూదులు కొనుదురను నమ్మిక లేకుండెను. కాని ఇష్టములేక విధిలేక ఆవును కొని కోసిరి. ఆయావుకండతో చచ్చినవానిని తాకఁగా వాడు బ్రతికి తన్ను చంపినవాఁడు తన దాయాదియగు ఫలానివాఁడని తెలిపి తిరిగి మృతినొందెను. ఇటులే మృతినొందినవారు తిరిగి తుదిదినమున సజీవులగుదురని నమ్మవలెను. దీనిగూర్చి ఇంకముందు వాక్యములలో కూడవచ్చును. ఈవ్యాఖ్యానము ఆచటకూడ నన్వయించును.

72. వ-ఇజ్-ఖతల్-తుమ్-నఫ్సన్-ఫద్దా-రాతుమ్ - ఫీహా - వల్లాహు - ముఖ్-రిజుమ్-మాకున్-తుమ్-తక్-తుమూన్.

73. ఫఖుల్-నజ్-రిబూహు-బిబఅ్ - జిహా-కజాలిక - యుహ్యి - ఇల్లా హుల్-మౌతా-వ-యురీ-కుమ్-ఆయాతిహీ-లఅల్ల-కుమ్-తఅ్ - ఖిలూన్.

72. మఱి మీరు ఒకనిని చంపి నింద ఒకరిపై నొకరు మోపసాగితిరి. మీరు దాఁచుచున్నదానిని దేవుఁడు బయలు పెట్టవలసియుండెను.

73. కావున మేము ఆవుమాంసపు కండతో శవమును తాఁకుడు అని చెప్పితిమి. ఇటులే దేవుఁడు చచ్చిన వారిని బ్రతికించును. మఱియు మీకు తనశక్తిసూచనలను మీరు యోచించుటకుఁగాను చూపుచున్నాఁడు.

వ్యా॥ 72, 73. వాక్యముల వ్యాఖ్యానము చూచుకొనునది.

74. సుమ్మ-ఖసత్-ఖులూ-బుకుమ్-మిమ్-బఅ్ది-జాలిక-ఫ-హియ - కల్ హిజాఅతి-ఔ-అషద్దు-ఖస్-వతన్-వఇన్న-మినల్-హిజా-అతి - లమా - యతఫజ్జరు-మిన్-హుల్-అన్-హారు-వఇన్న-మిన్-హా-లమా-యష్-షఖ్ఖఖు-ఫయఖ్-రుజు-మిన్-హుల్-మాఉ-వఇన్న-మిన్హా-లమా-యహ్బితు మిన్-ఖష్ - యతిల్లాహి-వ-మల్లాహు-బిగా-ఫిలిన్-అమ్మా-తఅ్-మలూన్.

74. దీని పిదపకూడ మీమనస్సులు కఠినము లాయెను. కావున అవి రాళ్లవలెగాక వానికన్నను నెక్కువ కఠినములుగా నాయెను. కొన్ని రాళ్లలోనుండి కాలువలు ప్రవహించును. మఱి వానిలో కొన్ని చీలిపోయి అందుండి నీళ్లు బయలుపడును. మఱియు వానిలో కొన్ని దేవుని భయముచే పడిపోవును. మీరుచేయు క్రియలనుండి దేవుఁడు అజాగ్రత్తగా లేఁడు.

వ్యా॥ 74. దీనికిముందు వాక్యములలో వివరింపఁబడిన దేవుని మహిమలను చూచియు ఇస్రాయీలియులు మెత్తపడక పోవుటచే వారి మనస్సులు కఠినము లాయెనని దేవుఁడు వారిని మందలించుచున్నాఁడు. వారి మనస్సులు మూఁడువిధములైన రాళ్లకన్నను కఠినములైనవి. కొన్ని రాళ్లనుండి

నీటికాలువలు ప్రవహించును. దానివలన లోకులకు ప్రయోజనమున్నది. కొన్నిటినుండి నీళ్లు ప్రవహించును. దానివలన కొంతమేలుగలుగును. కొన్ని రాళ్లనుండి నీళ్లు బయటపడకున్నను అవి పైనుండి క్రిందికి పడుచున్నవి. అవి దేవునికి భయపడి అట్లు జారుచున్నవి. వీరి హృదయములు వానికన్న కఠినములై నిష్ప్రయోజనములైనవి. చచ్చినవానిని బ్రతికించునట్టి దేవుని మహిమను చూచియు వారి హృదయములు దేవునియందు భయభక్తులు పొందక కఠినములైనవి. ఇట్లు ముసల్మానులు భక్తులు కాకూడదు అను బోధ యిందుగలదు. దేవుఁడు యూదులుచేయు క్రియలనుండి అజాగ్రత్తగాలేఁడు. సర్వము ఆతనికి తెలియును. కావున భయభక్తులు గలిగి సత్కార్యములు వారు ఆచరింపవలెను.

75. అఫ-తత్-మఊన-అన్-యూమినూ-లకుమ్-వఖద్-కాన-ఫరీ-ఖుమ్-మిన్-హుమ్-యస్-మఊన-కలా-మల్లాహి-సుమ్మ-యుహర్రి-ఫూనహూ-మిమ్-బఅది-మా-అఖ-లూహు-వహుమ్-యఅ-లమూన్. 76. వఇజా-లఖుల్-లజీన-ఆమనూ-ఖాలూ-ఆమన్నా-వ-ఇజా-ఖలా-బఅ-జుహుమ్-ఇలా-బఅ-జిన్-ఖాలూ-అతు హద్దిసూనహుమ్-బిమా. ఫత-హల్లాహు-అలై-కుమ్-లియు-హాజ్జూకుమ్-బిహీ-ఇన్ద-అబ్బి-కుమ్-అఫలా-తఅ-ఖిలూన్. 77. అవ-లా-యఅ-లమూన-అన్నల్లాహ-యఅ-లము-మా-యుసిర్రూన-వమా-యుఅ-లినూన్.

75. ఓ ముసల్మానులారా! ఇఁక వారు (యూదులు) మీ మాటను నమ్మెదురని ఆసించుచున్నారా? వారిలోని ఒక తెగ, దేవుని వాక్కు వినుచు దానిని గ్రహించిన పిదపకూడను తెలిసియు దానిని తారుమారు చేయుచుండెను. 76. మఱియు వారు ముసల్మానులతో కలియునపుడు మేము ముసల్మానులమైతిమి. అని చెప్పుదురు. మరల వారు ఏకాంతమున ఒకరితో నొకరు కలియునప్పుడు, ఏమి మీకు దేవుఁడు దెలిపినదానిని, ముసల్మానులు దానినిబట్టి మీ దేవునియొద్ద మీతో వాదులాడుటకై వారితోఁ జెప్పుచున్నారు. ఏల దానిని మీరు గ్రహింపరు. అని చెప్పుదురు. 77. వారు, దాచునదియు వెలిబుచ్చునదియు దేవునికిఁ దెలియును అని వారికిఁ దెలియదా?

వ్యా॥ 75, 77. యూదుల దుష్టస్వభావములను ఈ వాక్యమునకు ముందును తరువాతను వివరించి యిట్టి దుష్టగుణములుగల యూదులు మీ

మాటను నమ్మి మీకు విధేయులగుదురా" అను ఆశ మీకుండకూడదు. అని ముసల్మానులను దేవుఁడు హెచ్చరించుచున్నాఁడు. యూదులలో కొందఱు దేవుని వాక్కును తౌరాతు గ్రంథమును విని, మఱికొందఱు తూరుకొండపై దేవుని వాక్కును విని గ్రహించి వానిని తారుమారుచేసి తప్పుభావములు కల్పించుచుండిరి. ఇట్లు తారుమారుచేయుట పాపమనియు తప్పు అని తెలిసియు అట్లువారు చేయుచుండిరి. యూదులలోని కొందఱు వంచకులు ముసల్మానులతో కలిసి మేము విశ్వసించినాము. ముహమ్మదు ప్రవక్తను గూర్చి తౌరాతు గ్రంథములో ప్రకటనలుగలవు. అని చెప్పుచుండిరి. పిదప వీరు యూదులతో కలిసినపుడు ఏమి మీరు అట్లు తౌరాతులోని విషయములను ముసల్మానులకుఁ దెలుపవచ్చునా? వారు దానినిబట్టి మీతో వాదులాడరా? అని వారిని యూదులు మందలింతురు. ఇట్లు వీరు దాఁచుటకు యత్నించిన ఆ విషయములు దేవుఁడు ముసల్మానులకు దెలుపలేఁడా? దేవునికి సర్వము తెలియును అను జ్ఞానము యూదులకు లేదా అని దేవుఁడు వారిని మందలించుచున్నాఁడు.

78. వమిన్హుమ్-ఉమ్మియ్యూన-లాయఅ్-లమూ-నల్-కితాబ-ఇల్లా అమా.నియ్య వ-ఇన్-హుమ్ ఇల్లా-యజున్నూన. 79. ఫవైలుల్-లిల్లజీన-యక్-తుబూనల్-కితాబ-బి-ఐదీహిమ్-సుమ్మ-యఖూలూన-హాజా మిన్-ఇన్-దిల్లా-హి-లియష్-తరూ-బిహీ సమనన్-ఖలీలన్-ఫవైలుల్-లహుమ్-మిమ్మా-కతబత్-ఐదీ-హిమ్-వవైలుల్-లహుమ్-మిమ్మా-యక్-సిబూన.

78. మఱియు వారిలో కొందఱు పామరులున్నారు. తప్పు నమ్మకములు తప్ప తౌరాతు గ్రంథము వారికిఁ దెలియదు. వారి యొద్ద వట్టియూహలు తప్ప మఱెద్దియును లేదు. 79. కావున తమ చేతులార గ్రంథమును వ్రాసి వానివలన కొంత వెల పుచ్చుకొనవలెనని ఇది దేవుని యొద్దనుండి వచ్చినది. అని చెప్పునట్టి వారికి వినాశమున్నది. కావున వారు తమ చేతులార వ్రాసినందులకు వారికి వినాశమున్నది. మఱియు వారు సంపాదించుచున్న దానికిఁగాను వారికి వినాశమున్నది.

వ్యా॥ 78, 79. యూదులలో కొందఱు చదువురాని పామరులుగలరు వారికి తౌరాతు గ్రంథములోని నిజమైన ధర్మములు విషయములు దెలియవు. కాని దుష్టవిద్వాంసులు కొంత ధనము పుచ్చుకొనుటకై తారుమారుచేసి చెప్పిన తప్పు నమ్మకములు వారికిఁ గలవు. అవి "యూదులు తప్ప నితరులెవ్వరును స్వర్గమునకు పోరు. యూదులను వారి పెద్దలు తల్లిదండ్రులు దేవుని

యొద్ద సిఫారసుచేసి విడిపింతురు'' అనునవి. ఇట్టివి ప్రమాణములులేని వట్టి యూహలు మాత్రమే. యూదులలో కొందఱు, పామరులనుండి ధనము సేకరించుటకుఁగాను వారికి సంతోషము గలిగించుటకుఁ గాను తౌరాతులో లేని విషయములు కల్పించి వానిని తప్పుగా వ్రాసి ఇది దేవునివద్దనుండి వచ్చిన విషయములని మోసపుచ్చుచుండిరి. అట్టి వారికి వినాశమున్నది. కావున అట్లు చేయుట ఘోరపాపము. అని తెలిసికొనవలెను.

80. వఖాలూ లన్-తమస్స-నన్నారు-ఇల్లా-అయ్యామమ్-మఅదూదతన్ ఖుల్-అత్-తఖజ్-తుమ్ ఇన్దల్లాహి-అహ్దన్-ఫలన్-యుఖ్ - లిఫల్లాహు-అహ్ద హూ-అమ్-తఖూలూన-అలల్లాహి-మాలా -తఅ-ల.మూన్. 81. బలా మన్-కసబ-సయ్యి-అతన్-వ-అహాతత్-బిహీ-ఖతీ-అతుహూ-ఫఉలా-ఇక - అస్-హాబున్నారి-హుమ్-ఫీహా-ఖాలిదూన్. 82. వల్ల-జీన-ఆమనూ-వ-అమిలుస్ - సాలి-హాతి-ఉలా-ఇక-అస్-హాబు-ల్-జన్నతి-హుమ్-ఫీహా-ఖాలి-దూన్.

80. మఱియు వారు (యూదులు) మాకు నరకాగ్ని కొన్నిదినములు మాత్రము తగులును అని చెప్పుదురు. ఏమి మీరు దేవునినుండి వాగ్దానము పొందియున్నారా? అటులైనచో దేవుఁడు తానిచ్చిన వాగ్దానమునకు వ్యతిరేకముగా నెన్నఁడును చేయఁడు. లేక మీకుఁ దెలియని దానిని దేవునిపైఁ జెప్పుచున్నారా? అని ఓ ముహమ్మదు! చెప్పుము. 81. అట్లుకాదు, ఎవరు పాపములు చేయఁగా వారిని వారి పాపములు చుట్టుకొనునో వారే నరక నివాసులు. అందువారు సదాయుండుదురు. 82. ఏమ ఎవ్వరు విశ్వసించి సత్కార్యములు చేసిరో వారే స్వర్గనివాసులు. అందు వారు సదా యుండుదురు.

వ్యా॥ 80, 82. ఈ వాక్యములలో యూదులు తలఁచియున్న మూఢ విశ్వాసములను రద్దుచేసి, నరకమునకును స్వర్గమునకును బోవుటకు కారణము లెట్టివి అనునది స్థిరము చేయఁబడెను. యూదులు మేము ప్రవక్తల వంశము వారలము. మేము పాపములు చేసిన నష్టములేదు, ఎల్లపుడు నరకములో నుండము. కొన్నిదినములు మాత్రముండుదుమని చెప్పుదురు. ఏమి ఇట్లు దేవుఁడు వాగ్దానము చేసియున్నాఁడా? దేవుఁడు చేసిన వాగ్దానము నెఱవేర్చును, ఎప్పటికి విరుద్ధముగా చేయఁడు, వాస్తవములో దేవుఁడు అట్లు వాగ్దానము చేయలేదు. యూదులు అబద్ధములు కల్పించినారు. యూదులు తలఁచునట్లుకాదు, పాపకార్యములే చేసి పుణ్యమనునది లేనివారు ఎల్లపుడు నరకములోనే పడియుండుదురు. విశ్వసించి సత్కార్యములు చేసినవారు

ఎల్లప్పుడు స్వర్గసౌఖ్యములోనే యుందురు.

83. వఇజ్ అఖజ్ నా-మీసాఖ-బనీ-ఇస్రాయీల - లాత అ - బుదూన - ఇల్ -లల్లాహ-వబిల్ -వాలిదైని-ఇహ్సానన్-వజిల్ -ఖుర్బావల్-యతామా - వల్ -మసాకీని.వఖూలూ-లిన్నాసి-హుస్ నన్ వఅఖీ-ముస్ సలాత-వ-ఆతుజ్ జకాత-సుమ్మ-తవల్ లైతుమ్-ఇల్లా-ఖలీ-లమ్ మిన్ కుమ్ - వఅన్తుమ్ - ముఅ-రిజూన్.

83. మఱియు మేము ఇస్రాయీలీయుల సంతతి వారి నుండి "మీరు దేవుని నే పూజింపవలెననియు తల్లిదండ్రులకును, బంధువులకును తండ్రిలేని బిడ్డలకును నిఱుపేదలకును, మేలుచేయుఁడు అఱియు సర్వజనులకును మంచి మాట పలుకుఁడు. అనియు, నమాజు సలుపుఁడనియు జకాతు దానము చేయుఁడు అనియు" ఒడంబడిక పుచ్చుకొంటిమి. ఆ పిదప మీలోకొందఱు తప్ప నందఱును తిరిగిపోయితిరి. మఱి మీరు తిరుగువారే!

వ్యా॥ 83. ఇందు దేవుఁడు ఇస్రాయీలీయులనుండి పుచ్చుకొన్న ఒడంబడికను పిదప వారిలో కొందఱు తప్ప నందఱు తాము గావించిన ఒడంబడికకు వ్యతిరేకముగా కార్యములు చేసినది చెప్పెను. వాక్యాంతమున, ఇస్రాయీలీయుల స్వభావమే ఆడినమాట తప్పుట, అని తెలుపఁబడెను.

84. వ-ఇజ్ అఖజ్ నా-మీసా-ఖకుమ్ లా తస్ ఫికూన దిమా- అకుమ్ వలా-తుఖ్ -రిజూన-అన్ -ఫుసకుమ్ మిన్ -దియారికుమ్.సుమ్మ-అఖ్ -రర్ - తుమ్ వఅన్తుమ్-తష్-హదూన్.

85. సుమ్మ-అన్తుమ్-హాఉ-లాయి-తఖ్ -తులూన-అన్ -ఫుసకుమ్ వతుఖ్ రిజూన ఫరీ-ఖమ్ మిన్ కుమ్-మిన్-దియా-రిహిమ్-తజా-హరూన-అలైహిమ్-బి-ఇస్మి వల్ -ఉద్వాని-వఇన్ -యాతూ-కుమ్ -ఉసా రా-తుఫా-దూహుమ్ వ-హువ- ము-హర్రముఙ-అలైకున్ -ఇఖ్రాజు-హుమ్ -అఫతూ-మినూన-బి-బఅ-జిల్ -కితాబి-వతక్ -ఫురూన-బి-బఅ-జిన్ -ఫమా-జజాఉ-మన్ -యఫ్-అలు-జాలిక-మిన్ -కుమ్ ఇల్లా-ఖిజ్ యున్-ఫిల్ హాయాతిద్-దున్యా-వ-యౌమల్ -ఖియామతి-యురద్ -దూన-ఇలా-అష-ద్దిల్ -అజాబి-వ-మల్లాహు-బిగా- ఫిలిన్ - అమ్మా- తఅ-మలూన్. 86.ఉలా-ఇకల్లజీ-నష్-తరు-ఉల్ -హయాతద్-దున్యా-బిల్ -ఆఖిరతి

ఫలా యుఖఫ్ ఫఫు అన్ హుముల్ అజాబు వలా హుమ్ యున్ సరూన్.

84. మఱియు మీరు ఒకరినొకరు నఱకుకొనకూడదనియు తమవారినే ఇండ్లనుండి పాఱఁదోలకూడదనియు మీతో నొడంబడిక మేము చేసికొనినపుడు మీరు ఒప్పుకొంటిరి. మఱి మీకిది తెలిసియేయున్నది. పిదప మీరే ఒకరినొకరు నఱకుకొనుచున్నారు. మఱికొందఱిని వారి యిండ్లనుండి తఱుఁమఁగొట్టుచున్నారు. తమవారికి విరోధముగా నితరులకు పాపముగాను అన్యాయముగాను తోడుపడుచున్నారు. 85. మఱియు వారు మీయొద్దకు నితరులకు ఖైదీలై వచ్చినచో మీరు వారి బదులిచ్చి వారిని విడిపింతురు. మఱి వారిని తఱుముట మీకు నిషిద్ధమై యుండెను. ఏమి? మీరు గ్రంథములోని కొన్నిటిని సమ్మతించి మఱికొన్నిటిని తిరస్కరించుచున్నారు. కావున మీలోనెవరు దీనిని చేయుదురో వారికి ఇహలోక జీవితమునందు అగౌరవమును, తీర్పు దినమందు కఠినమైన బాధలందు వేయఁబడుటయును తప్ప వేరుశిక్ష లేదు. మఱియు దేవుఁడు మీరుచేయు కర్మలయెడ అజాగ్రత్తగా లేఁడు. 86. వీరే పరలోకమునకు బదులుగ ఇహలోక జీవితమును కొనినవారు. కావున వీరి బాధ తగ్గింపఁబడదు. మఱి వీరికి నెట్టి సహాయమును లభింపదు.

వ్యా|| 84: 86. మదీనాపురమునందు యూదులలో బనీఖురైజా, బనీనజీరు అను రెండు కుటుంబములుండెను. వారిలోవారికి ఎల్లప్పుడు కలహములు జరుగుచుండెను. ఔసు, ఖజ్‌రజ్ అను రెండు కుటుంబములవారు విగ్రహములను పూజించువారు. వీరుకూడ మదీనాలోనే యుండిరి. వీరిమధ్యకూడ విరోధముండెను. కావున బనీఖురైజా వారు ఔసువారితో చేరుకొనిరి. బనీనజీరువారు ఖజ్‌రజ్ వారితో సఖ్యము కుదుర్చుకొనిరి. వారిమధ్య యుద్ధము సంభవించినచో ఒకరికినొకరు తోడుపడుచు యూదులే ఒకరినొకరు నఱకుకొనుచు తమవారినే యిండ్లనుండి తఱుముచుండిరి. తౌరాతుగ్రంథములో ఒకరినొకరు నఱకఁగూడదనియు ఇండ్లనుండి తఱుమఁగూడదనియు, ఒకవేళ ఎవఁడైన యూదుఁడు విరోధులచేతిలోఁజిక్కి ఖైదీయైనచో వానికి బదులుగా ధనమునొసంగి వానిని విడిపింపవలెను, అని ధర్మములుండెను. యూదులు తమలో తమకున్న ద్వేషముల వలన మదీనాలోనున్న ఔసు, ఖజ్‌రజులకు అన్యాయముగా తోడుపడుచు యుద్ధములో తమవారగు యూదులనే నఱకుచు గెలిచినవారు ఓడిపోయిన వారిని వారియిండ్లనుండి తఱుముచుండిరి. దీనివలన తౌరాతులో నున్న కొన్నిధర్మములను వదలినవారైరి. మఱియు ఎవఁడైన యూదుఁడు ఖైదీగా వచ్చినయెడల తమపక్షము వారితోఁజెప్పి ధనమిచ్చి వానిని విడిపించుచుండిరి. ఇది వారు తౌగాతు ధర్మము ననుసరించియే

చేయుచుండిరి. కావునకొన్ని ధర్మములను తిరస్కరించి కొన్ని ధర్మములను ఆచరించుట వలన మోక్షము లభింపదు. ఇహమునందు గౌరవమును, పరమునందు మోక్షమును కోరువారు దేవుఁడు విధించిన సర్వధర్మములను ఆచరింపవలెను. లేనిచో ఇహమునందు అగౌరవమునకును పరమునందు నరకబాధలకును పాలుపడుదురు. ఎట్టి మోక్షముగాని సహాయముగాని లభింపదు.

87. వలఖద్-ఆతైనా-మూసల్-కితాబ-వఖఫ్-ఫైనా-మిమ్-బఅదిహీ-బిర్-ఉసులి-వ-ఆతైనా-ఈసబ్నమర్-యమల్-బయ్యినాతి-వఅయ్యద్నాహు-బి-రూహిల్-ఖుదుసి-అఫకుల్లమా-జా-అకుమ్-అసూలుమ్-బిమా-లా-తహ్వా-అన్-ఫుసుకుముస్-తక్బర్-తుమ్-ఫ-ఫరీఖన్-కజ్-జబ్-తుమ్-వ-ఫరీఖన్-తఖ్-తులూన.

87. మఱియు నిశ్చయముగా మేము మూసాకు (తౌరాతు) గ్రంథము నొసంగితిమి. మఱియు నతనిపిదప వరుసగా ప్రవక్తలను పంపితిమి. మఱియు మర్యమ్ కుమారుఁడగు ఈసాకు స్పష్టమైన సూచనలనిచ్చి పరిశుద్ధాత్మతో నాతనిని బలపఱచితిమి. ఆపిదప, మీయాత్మలకు ఇష్టములేని యాజ్ఞను మీయొద్దకు ఎవరైన ప్రవక్త తేఁగా మీరు గర్వపడి కొందఱిని అబద్ధపఱచితిరి. మఱి కొందఱిని చంపితిరి.

వ్యా॥ 87. ఇందు ఇస్రాయీలియులలో నున్న ద్వేషము, గర్వము, అవిధేయత, ప్రవక్తలను తిరస్కరించుట మొదలగు దుర్గుణములు వివరింపఁబడినవి. యూదులు ధర్మములను అనుసరింపక తమ కోరికలనే అనుసరించుచు తమకు ఇష్టములేని ధర్మములు తెచ్చిన దేవుని ప్రవక్తలను తిరస్కరించుచు మితిమీఱి పోవుచుండిరి. ఇస్రాయీలియులకు బోధించుటకై దేవుఁడు మూసాప్రవక్తకు తౌరాతు గ్రంథము నొసంగెను. కాని యూదులు దానిలోని ధర్మములను అనుసరింపక దానికి విరుద్ధముగా నడచుకొనుచు అందలి విషయములను తారుమారు చేయుచుండిరి. మూసా ప్రవక్తకు పిదప ఇస్రాయీలియులకు బోధించుటకు అనేక ప్రవక్తలు వచ్చిరి. తుదకు బీబీ మర్యమ్ కుమారుఁడగు ఈసా (ఏసుక్రీస్తు) ప్రవక్త ఇస్రాయీలియులకు బోధించుటకు వచ్చెను. దేవుఁడు ఈసాప్రవక్తకు అనేక సూచన (మహిమలు)లు ఒసంగెను. అవి, దేవుని సెలవుచే మృతులను బ్రతికించుట, కుష్ఠరోగులను, పుట్టుగ్రుడ్డులను బాగుచేయుట, గైబు(అగోచర)వృత్తాంతములను దెలుపుట, అనునవి. ఇవిగాక పరిశుద్ధాత్మ అగు జిబ్రాయీలు దూత ఈసా ప్రవక్తకు తోడుగా నుండెను. ఇట్టి మహిమలు చూచియు యూదులు ఏసుక్రీస్తును విశ్వసింపక

ఆతని బోధనలను వినక ఆతనిని అబద్ధవాది అని పలికిరి. మఱియు తమ యొద్దకు వచ్చిన దేవుని ప్రవక్తలలో జకిరియా, యహ్యా (యోహాను) అను వారిని వధించిరి. ఇపుడు యూదులు హజ్రత్ ముహమ్మదు ప్రవక్తను నమ్మక తిరస్కరించుచున్నారు. వీరికి విరోధముగ పెక్కుకుట్రలు సలుపుచున్నారు.

88. వ-ఖాలూఖులూ-బునా-గుల్-ఫున్-బల్-లఅన-హుముల్లాహు-బి కుఫ్-రి-హిమ్-ఫ-ఖలీ-లమ్-మా-యూమి-నూన్.

88. మఱియు వారు "మా హృదయములు ఒఱలోనున్నవి" అని పలుకుదురు. అట్లుకాదు, వారి అవిశ్వాసము వలన దేవుఁడు వారిని శపించియున్నాఁడు. కావున వారిలో కొందఱు మాత్రమే విశ్వసించుచున్నారు.

వ్యా॥ 88. యూదులు తమ్ము పొగడుకొనుచు మామనస్సులు ఒఱలో భద్రముగా నున్నవి. మా మతధర్మములఁ దప్ప నితర మతముల బోధలు మా మనస్సులకుఁబట్టవు. కావున నితరులకు విధేయులుగాము. అని పలుకుదురు. దేవుఁడు వీరిమాటను రద్దు పఱచుచు వీరు తలఁచునది పొరపాటు. బోధలు మనస్సులకు పట్టకుండుటకు కారణము దేవుఁడు వారి యవిశ్వాసమువలన వారిని శపించి తన దయకుఁ బాత్రులుగాకుండ చేయుటయే. కాని వేఱు కాదు. అందుచే యూదులలో కొందఱు మాత్రమే సన్మార్గము అవలంబించి విశ్వాసులగుదురు.

89. వలమ్మా-జా-అహుమ్-కితాబుమ్-మిన్-ఇన్-దిల్లాహి-ముసద్దిఖు లిమా-మఅ-హుమ్-వకానూ-మిన్-ఖబ్లు-యస్-తఫ్-తిహూన-అలల్-లజీన-కఫరూ ఫలమ్మా-జా-అహుమ్-మా-అ-అఫూ-కఫరూ-బిహీ-ఫల అ-నతు ల్లాహి-అలల్-కాఫిరీన్.

89. మఱియు వారియొద్దనున్న గ్రంథమును సత్యపఱచునట్టి గ్రంథము (ఖురాను) దేవుని యొద్దనుండి వారియొద్దకువచ్చెను. మఱి దీనికి ముందు అవిశ్వాసులపై విజయము కోరుచుండిరి. పిదపవారు గుర్తెఱింగినది వారియొద్దకు రాఁగా దానిని తిరస్కరించిరి. కావున అవిశ్వాసులకు దేవుని శాపమున్నది.

వ్యా॥ 89. యూదులవద్దనున్న గ్రంథము తౌరాతు. అది దేవుని గ్రంథమని సత్యపఱచుచు వారియొద్దకు వచ్చిన గ్రంథము ఖురానెషరీఫు. ఇది ముహమ్మదు ప్రవక్తగారికి నొసంగఁబడిన గ్రంథము. ముహమదువారు ప్రవక్తకాక పూర్వము యూదులు అవిశ్వాసుల (కాఫర్ల) చే నోడిపోయినప్పు డెల్ల "ఓ దేవా! రాఁబోవు ఆఖరు ప్రవక్తకొఱకు మాకు కాఫర్లపై విజయము

నొసంగు" మని ప్రార్థనలు సలుపుచు కాఫర్లతోఁగూడ "ఆఖరు ప్రవక్తరా నున్నాఁడు. మేము ఆయనతోఁగలిసి మిము నశింపఁజేయుదు" మని యూదులు చెప్పుచుండిరి. కాని ముహమ్మదు ప్రవక్త వచ్చినపుడు యూదులు విశ్వసింపక తిరస్కరించిరి. కావున యూదులు దేవుని దయకు దూరులై శాపమునకుఁ బాత్రులైరి.

90. బీ-సమష్-తరౌ-బిహీ-అన్-ఫుస-హుమ్-అన్-యక్-ఫురూ-బిమా-అన్-జలల్లాహు-బగ్-యన్-అన్-యునజ్-జిలల్లాహు-మిన్-ఫజ్లిహీ-అలా-మన్-యషాఉ-మిన్-ఇబాదిహీ-ఫబాఊ-బిగజబిన్-అలా-గజబిన్-వలిల్-కాఫిరీన-అజాబుమ్-ముహీన్.

90. దేవుఁడు తన యనుగ్రహముచే తాను ఇష్టపడిన భక్తులకు తన సందేశము (వహీ) పంపుటయందు యూదులు అసూయపడి దేవుఁడు పంపిన గ్రంథము (ఖురాను)ను తిరస్కరించి తమ యాత్మలను అమ్మి పుచ్చుకొన్నది చాలచెడ్డది. కావున వారు దేవుని కోపమునకు పాత్రులైరి. మఱియు అవిశ్వాసులకు అగౌరవమైన బాధయున్నది.

వ్యా॥ 90. యూదులు అసూయచే ఖురానును తిరస్కరించి దేవుని కోపమునకుఁ బాత్రులైరి. కాఫిర్లకుఁ గలుగు నరకబాధవారికి అగౌరవము గలిగించును. అందు ఎట్టిగౌరవముండదు.

91. వఇజా-ఖీల-లహుమ్-ఆమినూ-బిమా-అన్-జలల్లాహు-ఖాలూ-నూమిను-బిమా-ఉన్-జిల-అలైనా-వయక్-ఫురూన-బిమా-వరా-అహూ-వహు-వల్-హఖ్ఖు-ముసద్దిఖల్-లిమా-మఅ-హుమ్-ఖుల్-ఫలిమ-తఖ్-తులూన-అమ్-బియా-అల్లాహి-మిన్-ఖబ్లు-ఇన్-కున్తుమ్-మూమినీన్. 92. వలఖద్-జా-అకుమ్-మూసా-బిల్-బయ్యినాతి-సుమ్మత్-తఖజ్-తుముల్-అఇజ్ల-మిమ్-బఅదిహీ-వఅన్-తుమ్-జాలిమూన్.

91. మఱియు దేవుఁడు పంపినదానిని మీరు విశ్వసింపుఁడు అని వారితోఁ జెప్పినప్పుడెల్ల మాకు నొసంగఁబడిన దానిని మేము నమ్ముచున్నా మని వారు చెప్పుదురు. మఱిదాని దప్పనితరమును తిరస్కరించుచున్నారు. వారు తిరస్కరించునది సత్యమైన గ్రంథము. మఱి వారియొద్దనున్న గ్రంథమును సత్యపఱచునది. అటులైన మీరు విశ్వాసులైనచో దీనికి ముందు మీరు దేవుని ప్రవక్తలను ఎందులకు వధించుచుంటిరి. అని ఓ ముహమ్మదు!

పలుకుము. 92. మఱియు మీయొద్దకు మూసా స్పష్టమైన సూచనలు దీసికొని వచ్చెను. పిదప మీరు అతఁడు పోయిన తరువాత ఆవుదూడ విగ్రహమును జేసికొంటిరి. మఱి మీరు దుర్మార్గులు.

వ్యా॥ 91, 92. ఖురానును నమ్ముఁడు. అనియూదులతోఁ జెప్పఁగా వారుమేము తౌరాతు గ్రంథమును నమ్మియున్నాము. అది చాలును అని పలుకుదురు. ఇట్లుపలికి ఇతర దేవదత్త గ్రంథములను తిరస్కరించుచున్నారు. సరే మీరు తౌరాతు గ్రంథమును నమ్మినవారే. అట్లైన దేవుని ప్రవక్తలను ఎందులకు వధించితిరి? మూసాప్రవక్త తూరుకొండకు పోఁగానే దేవుని పూజవదలి ఆవుదూడ విగ్రహమును పూజింపసాగితిరి. అపుడు తౌరాతు గ్రంథధర్మము లెక్కడపోయినవి? ఇపుడు తౌరాతు గ్రంథమును సాకుగాఁ గొనుచున్నారా? అని దేవుఁడు యూదులను మందలించుచున్నాఁడు.

93. వఇజ్-అఖజ్‌నా-మీసా-ఖకుమ్-వ-రఫఅ్‌నా-ఫౌఖ-కుము-త్తూర-ఖుజూ-మా-ఆతైనాకుమ్-బి-ఖువ్వతిఁ-వస్‌మ-ఊ-ఖాలూ-సమిఅ్‌నా-వ-అసైనా-వ-ఉష్-రిబూ-ఫీ-ఖులూ-బి-హిముల్-ఇజ్‌ల-బికుఫ్-రిహిమ్-ఖుల్-బీసమా-యా-ముఉకుమ్-బిహీ-ఈమా-నుకుమ్-ఇఁ-కుఁ-తుమ్-మూ-మినీఁ.

93. మఱియు మీనుండి ఒడంబడిక మేము పుచ్చుకొనునపుడు తూరు కొండను మీపై నెత్తి మేము మీకు నొసంగిన గ్రంథమును గట్టిగా పట్టుఁడు వినుఁడు. అనినపుడు వింటిమి మఱి అతిక్రమించితిమి అని చెప్పితిరి. మఱి వారి అవిశ్వాసమువలన వారి హృదయములో ఆవుదూడ ప్రేమనిండుకొనెను. మీరు విశ్వాసులైనచో మీ విశ్వాసము మీకు సెలవిచ్చునది చాల చెడ్డది. అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 93. ఇందు యూదులు తమ గ్రంథమగు తౌరాతునుదూర్చి జేసిన అక్రమము చెప్పఁబడుచున్నది. తలలపైని కొండనుచూచి అదిపైఁబడునను భయముచే గ్రంథ ధర్మముల ననుసరింతుమని చెప్పి మనస్సులలో లేదా తరువాతనో మేము తిరస్కరించి అతిక్రమించితిమని చెప్పిరి. దానికితోడు ఆవుదూడ ప్రేమ వారి హృదయములలో నెలకొనియున్నది. దానివలన వారి హృదయములు పోనుపోను అవిశ్వాసమలినము పట్టినవియాయెను. వాస్తవమైన విశ్వాసమున్నచో అట్లు చేయరు. కావున యూదుల విశ్వాసము వారికి బోధించునది చాలచెడ్డది. కీడును గలిగించునది, అని చెప్పఁబడియె.

94. ఖుల్-ఇఁ-కానత్-లకుముద్-దారుల్ ఆఖిరతు-ఇఁ-దల్లాహి-ఖాలి-సతమ్.మిఁ-దూనిన్నాసి-ఫత-మన్న-ఉల్-మౌత-ఇఁ-కుఁ-తుమ్-సాది

ఖీఁ. 95. వలఁయతమఁన్నౌహు అబదమ్‌బిమాఖద్దమత్‌ఐదీహిమ్ - వ
ల్లాహు అలీముమ్-బిజ్-జాలిమీఁ. 96. వలతజిదన్న-హుమ్-అహ్రా - రస
న్నాసి-అలా-హాయాతిఁ-వ మినల్లజీన అష్-రకూయవద్దు - అహదుహుమ్ -
లౌ-యు-అమ్మరు అల్ ఫసనతిఁవమాహువ బిముజహ్-జిహీ-హీ - మినల్-
అజాబి-అఁ-యుఅమ్మరు వల్లాహు-బసీరుమ్-బిమా-యఅ-మలూఁ.

94. ఇతర ప్రజలకు లేక ప్రత్యేకముగా మీకొఱకే పరలోక గృహ మున్నయెడల (ఇందు) మీరు సత్యవంతులైనచో మీరు చావును కోరుఁడు అని ఓ ప్రవక్తా! చెప్పుము. 95. మఱియు వారు తమ చేతులారఁచేసి పంపి యున్న పాపములవలన వారు ఎన్నఁడును చావును కోరరు. మఱి దేవుఁడు పాపులను బాగుగా నెఱుంగును. 96. మఱియు సర్వజనులకన్నను, పెక్కు దైవారాధకులకన్నను జీవితముపై నెక్కుడు ఆస వారికి నుండుటను నీవుచూ చెదవు. వారిలో నొక్కొక్కడు, వేయి సంవత్సరముల వయస్సు గలుగవలె నని కోరుచున్నాఁడు. ఇంతకాలము బ్రతుకుటఁగూడ వారిని శిక్షనుండి తప్పింపఁజాలదు. వారుచేయునది దేవుఁడు చూచుచునే యున్నాఁడు.

వ్యా॥ 94: 96. యూదులు, మేముమాత్రమే పరలోక గృహమగు స్వర్గమునకు పోవుదుము. ఇతరు లెవ్వరును పోఁజాలరు. మాకు నరకశిక్షయు లేదు. అని డంబాలు కొట్టుకొనుచుండిరి. కావున వాస్తవముగా మీకొఱకే స్వర్గమున్నచో చావునుకోరి చచ్చినపిదప స్వర్గములో చేరుఁడు. ఎందులకు చావు భయమువలన చింతించెదరు. అని మందలింపఁబడిరి. వారి వాస్తవ విష యము ఏమనఁగా వారు అనేక పాపకృత్యములు చేసియున్నారు. చచ్చినచో నరకములో పడుదుమని వారికి భీతిగలదు. అందుచే వారు ఎన్నఁడును చావును కోరరు. అదియును గాక ఇహలోక జీవితము వేయిసంవత్సరములు గలిగిన బాగుండును. చాలకాలము బ్రతుకవలెనని అందఱికన్న వారికి ఎక్కువ ఆస గలదు. కావున వారు కొట్టుకొనుడంబాలు నిరాధారములైనవి అని స్పష్ట ముగాఁ జెప్పఁబడియె. పెక్కు దైవారాధకులను అరబీలో ముష్‌రిక్ అను దురు. వీరు ఇహలోక జీవనమే జీవనము. పరలోకము లేదని నమ్మినవారు. ఇట్టివారికి చాలకాలము బ్రతుకవలెనని ఆసగలదు. కాని యూదులకన్ననో వీరికన్న ఎక్కువ జీవితముపై ఆసగలదు. మఱి యూదులు పరలోకము మాకొఱకే యున్నది అని చెప్పియు ఇట్లాసించుట వారికిఁ దగదుగదా!

97. ఖుల్-మన్-కాన-అదువ్వల్-లిజిబ్-రీల-ఫ- ఇన్నహూ - నజ్-జల

హూ-అలా-ఖల్-బిక-బిఇజ్-నిల్లాహి-ముసద్దిఖల్-లిమా-బైన-యదైహి - వ-హుదన్-వ-బుష్రా-లిల్-మూ-మినీన్. 98. మన్-కాన-అదువ్వల్-లిల్లాహి-వమలా-ఇకతిహీ-వరుసు-లిహీ-వజిబ్-రీల-వ-మీకాల-ఫ-ఇన్నల్లాహ-అదువ్వుల్-లిల్ కాఫిరీన్.

97. ఎవఁడు జిబ్రీలునకు విరోధియైన (ఏమి నష్టము చేయఁగలఁడు) నిశ్చయముగా నతఁడు దేవునాజ్ఞచే ఖురానును నీ మనస్సులో దింపెను. ఆ ఖురాను దానికి పూర్వపు గ్రంథములను సత్యపఱచుచు విశ్వాసులకు సన్మార్గము చూపుచు వారికి సంతోషవార్త నిచ్చుచున్నది. 98. ఎవరు దేవునికిని ఆతని దూతలకును ఆతనిప్రవక్తలకును జిబ్రీలునకును 'మీకాలు'నకును విరోధులగుదురో అట్టి అవిశ్వాసులకు దేవుఁడు శత్రువు. అని చెప్పుము.

వ్యా॥ 97: 98. "ముహమ్మదు వద్ద దేవసందేశము దెచ్చునట్టి జిబ్రీలు దూతమాకు విరోధి. ఆయన మాకు అనేక ఆపదలుదెచ్చి యున్నాఁడు. కావున అతని వదలి ఇతర దూతలు దేవసందేశము (వహీ) దెచ్చిన మేము విశ్వసింతుమని" యూదులు చెప్ప సాగిరి. దానిని దేవుఁడు రద్దుచేయుచు జిబ్రీలుతో విరోధముచేసి ఎవరేమి హానిచేయఁజాలరు. ఆతఁడు గాని ఇతర దూతలుగాని దేవుని సెలవుచే వత్తురు. కావున ఎవరు దెచ్చిననేమి? జిబ్రీలు ఖురానును దెచ్చునట్టి దూత. ఆతని విరోధియు నితర దూతల విరోధియు ప్రవక్తల శత్రువు దేవునికికూడ శత్రువు. అట్టివారు అవిశ్వాసులు (కాఫర్లు) వారిని దేవుఁడు అనుగ్రహింపఁడు. అని చెప్పఁబడియె.

99. వలఖద్-అన్-జల్నా-ఇలైక-ఆయాతిమ్-బయ్యినాతిన్-వమా-యక్ఫురు-బిహా-ఇల్-లల్-ఫాసి-ఖూన్. 100. అవ-కుల్లమా-ఆహదూ-అహ్-దన్-నబజహూ-ఫరీఖుమ్-మిన్-హుమ్-బల్-అక్-సరు-హుమ్-లాయూమినూన్. 101. వలమ్మా-జా-అహుమ్-రసూలుమ్-మిన్-ఇన్దిల్లాహి-ముసద్దిఖుల్-లిమా-మఅ-హుమ్-నబజ-ఫరీ-ఖుమ్-మినల్లజీన-ఊతుల్-కితాబ-కితా-బల్లాహి-వరా-అ-జుహూ-రిహిమ్-కఅన్న-హుమ్-లాయఅ-లమూన్. 102. వత్-తబఊ-మాతత్-లుష్-షయాతీను-అలా-ముల్కి-సులైమాన-వమా-కఫఱ-సులైమాను-వలా-కిన్నష్-షయాతీన-కఫరూ-యుఅల్లిమూనన్-నాసస్-సిహ్ర-వమా-ఉన్-జిల-అలల్-మల-కైని-బిబా-బిల-హారూత-వమారూత-వమా-యు-అల్లి-మాని

మిన్ - అహదిన్ - హత్తా - యఖూలా - ఇన్నమా - నహ్ను - ఫిత్ - నతున్ - ఫలా - తక్ - ఫుర్ - ఫయత - అల్లమూన - మిన్ - హుమా - మా యుఫర్రి - ఖూన - బిహీ - బైనల్ - మర్ ఇ - వజౌజిహీ - వమా - హుమ్ - బిజారీన - బిహీ - మిన్ - అహదిన్ - ఇల్లా - బి - ఇజ్నిల్లాహి - వయత - అల్లమూన - మా - యజుర్రుహుమ్ వలా - యన్ - ఫఉహుమ్ - వలఖద్ - అలిమూ - లమనిష్ - తరాహు - మాలహూ - ఫిల్ - ఆఖిరతి - మిన్ - ఖలాఖిన్ - వల - బీస - మా - షరౌ - బిహీ - అన్ - ఫుస - హుమ్ - లౌకానూ - యఅ - లమూన్.
103. వలౌ - అన్నహుమ్ - ఆమనూ - వత్తఖౌ - లమసూబతుమ్ - మిన్ - ఇన్ - దిల్లాహి - ఖైరున్ - లౌకానూ - యఅ - లమూన్.

99. మఱియు మేము నీ యొద్దకు స్పష్టమైన సూచనలను పంపితిమి. మఱి దుర్మార్గులుతప్ప వాని నెవరును తిరస్కరింపరు. 100. వారు ఒడంబడిక చేయునపుడెల్ల వారిలో కొందఱు దానిని వీఁపు వెనుక పాఱవేయుదురు. మఱివారిలోని పెక్కురు (నమ్మకము లేనివారు) విశ్వసింపరు. 101. మఱియు వారి యొద్దకు దేవుని వద్దనుండి, వారి యొద్దనుండు గ్రంథమును సత్యపరచునట్టి ప్రవక్త రాఁగా గ్రంథముగల వారిలో కొందఱు తమవీఁపుల వెనుక దేవుని గ్రంథమును దెలియని వారలుగా పాఱవేసిరి. 102. మఱియువారు, సులైమాను రాజ్యకాలమున సైతానులు పఠించునట్టి దానిని అనుసరించిరి. మఱి సులైమాను అవిశ్వాసికాలేదు. కాని సైతానులు జనులకు జాలవిద్యను నేర్పుచు అవిశ్వాసులైరి. మఱియు వారు భాబిల్ నగరమందు హారూతు, మారూతు అను దేవదూతలకు నొసంగఁబడినదానిని అనుసరించిరి. మఱియు ఆ ఇద్దఱుదూతలు మేము శోధనకుఁగానున్నారము. కావున మీరు అవిశ్వాసులు కాకుండుఁడు. అని చెప్పునంత వఱకు ఎవరికిని వారు నేర్పకుండిరి. ఆ పిదప వారు ఆయిద్దఱినుండి భార్యభర్తలకు ఎడబాటు కలిగించునట్టి జాల విద్య నేర్చుకొనుచుండిరి. మఱియు వారు వానివలన దేవుని సెలవులేక, ఎవరికిని నష్టము కలిగింపఁజాలరు. వారు తమకు నష్టము గలిగించు నద్దానిని, తమకు లాభమునియ్యని దానిని నేర్చుకొనుచున్నారు. మఱెవ్వఁడు జాల విద్యను స్వీకరించెనో వానికి పరలోకమందు నెట్టిభాగము లేదని వారు బాగుగ నెఱింగియున్నారు. వారు దేనికి బదులుగ తమ్మునుతాము అమ్ముకొన్నారో అది చాలచెడ్డది. వారికి బుద్ధియున్నచో దానిని నేర్చుకొనరు. 103. మఱియు వారు విశ్వసించి భయభక్తులు గలిగియుండిరేని దేవుని యొద్దనుండి

మంచి ఫలితము పొందియుందురు. వారికి జ్ఞానమున్నచో బాగుగానుండును.

వ్యా॥ 99. హజ్రత్ ముహమ్మదు ప్రవక్తకు దేవుఁడు ఖురానులో నున్న స్పష్టమైన సూచనలు ధర్మములు నొసంగెను. దానిచేవారి ప్రవక్త పదవి ఋజువగుచున్నది. దుర్మార్గులు, అవిధేయులు మాత్రమే దేవునిసూచ నలను తిరస్కరింతురు. 100. పూర్వమునుండియు ఆడినమాటకు వ్యతిరేక ము చేయుటయును, దేవునితోను ప్రవక్తలతోను ఎవరితోనైనను, గావిం చిన ఒడంబడికలను లెక్కచేయక త్రెంపుటయును కొందఱు యూదులక స్వభావమే. అనేక యూదులకు తౌరాతు గ్రంథమునందు విశ్వాసములేదు. ఇట్టి యూదులు ఒడంబడికను త్రెంపుటలో వెనుదీయరు. 101. యూదుల యొద్దకు వచ్చిన ప్రవక్త హజ్రత్ ముహమ్మదువారు, యూదులవద్దనున్న గ్రంథము తౌరాతు. ఇది దేవుని గ్రంథమని ముహమ్మదువారు సత్యపఱచ చున్నారు. ఇట్లుచేసిన పిదపఁ గూడ కొందఱు యూదులు తమ మత గ్రంథ మును అనుసరింపక, అందుగల ధర్మములను లెక్కచేయక, తెలియనట్లుగ దానిని నిరాకరించిరి. వారికి తమ గ్రంథమందే గౌరవమును నమ్మికయును లేనపుడు, ఇఁకవారు నమ్ముదుగని ఎవరు ఆసింపగలరు? 102. యూదుల తమ మతగ్రంథమును వదలి జాలవిద్య ననుసరింపసాగిరి. జాలవిద్య నేర్చు కొనుట ఘోరపాతకము. దానివలన విశ్వాసము నశించును, నరకములభించును సులైమాను ఒకగొప్పప్రవక్త. ఆయన దావూదునకు పుత్రుఁడు. ఆతని రాజ్య కాలమందు ఆతనికి దేవునాజ్ఞచే జిన్నాతులు లోఁబడియుండిరి. జిన్నాతులనే సైతానులనుదురు. వారు మనుష్యులతో కలసిమెలసియుండిరి. ఆ సైతానుల వలన యూదులు జాలవిద్య నేర్చుకొనసాగిరి. సైతానులు ఈ జాలవిద్య "మేము సులైమానువద్ద నేర్చుకొంటిమి. దానిబలము చేతనే ఆయన మమ్ము లోఁబఱచుకొని యున్నాఁడు." అనునింద మోపసాగిరి. దేవుఁడు దాని రద్దు చేయుచు సులైమాను జాలవిద్యనేర్చి అవిశ్వాసికాలేదు. ఆయన గొప్ప విశ్వాసి. కాని సైతానులు ప్రజలకు జాలవిద్యనేర్పి అవిశ్వాసులైరి. అని చెప్పెను. యూదులు సైతానులతోనే కాక హారూతు మారూతు అనువారి వద్ద జాలవిద్యనేర్చుకొని అవిశ్వాసులగుచుండిరి. హారూతు మారూతు అను ఇద్దఱు దేవదూతలు. వారు మనుష్యరూపమున బాబిల్ నగరములో నుండిరి ఇట్లు వారు దేవునిచే యూదుల పరీక్షకొఱకు నియమింపఁబడిరి. యూదులు జాలవిద్య నేర్చుకొని అవిశ్వాసులగుదురా? లేక దానివదలి తౌరాతు నను సరించి మోక్షమార్గమున పోవుదురా? అను పరీక్షకుంగాను ఉండిరి. వారి యొద్దకు నెవఁడైన జాలవిద్య నేర్చుకొనుటకు వచ్చినచో, ఓయి! మేము

పరీక్షించుటకుఁగాను వచ్చిన వారలము. నీవు జాలవిద్య నేర్చుకొని, అవిశ్వాసి కాకుండుము అని చెప్పుదురు, కాని వచ్చినవాఁడు వారిమాటవినక జాలవిద్య నే నేర్చుకొని దానివలన భార్యభర్తల మధ్య తగవులు కల్పించి వారిని వేరుచేయుటకు యత్నించును. ఎట్టి వాఁడును దేవునాజ్ఞ లేనిది రవంతయును ఇతరులకునష్టము చేయఁజాలడు. కావున యూదులు జాలవిద్య నేర్చుకొనిదాని ననుసరించుట ఘోరపాతకము. దానివలన పరలోకమునందు ఎట్టి స్వర్గసౌఖ్య మునందు భాగము లభింపదు. ఇది మొదలు చెడువ్యాపారము అని తెలిసియు వారట్లు చేయుచుండిరి. 103. దేవునియొద్ద సత్కార్యములు చేసినవారికి లభించు ఫలము చాలశ్రేష్ఠమైనది. కావున విశ్వసించి సత్కార్యములు చేసి పాపములను వదలవలెను.

104. యా-అయ్యుహల్-లజీన-ఆమనూ-లా-తఖూలూ-రాఇనా-వ ఖూ-లున్-జుర్‌నా-వస్-మఊ-వలిల్-కాఫిరీన-అజాబున్-అలీమ్. 105. మా-యవద్దుల్-లజీన-కఫరూ-మిన్-అహ్లిల్-కితాబి-వలల్-ముష్-రికీన-అన్-యునజ్-జల-అలైకుమ్-మిన్-ఖైరిన-మిర్-రబ్బి-కుమ్-వల్లాహు-యఖ్-తస్సు-బిరహ్-మతిహీ-మన్-యషాఉ-వల్లాహు-జుల్-ఫజ్-లిల్-అజీమ్.

104. ఓవిశ్వాసులారా! 'రాఇనా' అని చెప్పకుఁడు. ఉన్‌జుర్నా అని చెప్పుఁడు. మఱియు చెవియొగ్గి వినుఁడు. అవిశ్వాసులకు దుఃఖకరమైన బాధ యున్నది. 105. గ్రంథముగల వారిలోను విగ్రహారాధకులలోను అవిశ్వాసులైనవారు మీప్రభువునుండి మీకు ఏదైనమేలు లభించుటను ఇష్టపడరు. మఱియు దేవుఁడు తాను ఇష్టపడిన వారిని తన అనుగ్రహమునకుగాను ప్రత్యే కించుకొనుచున్నాడు. దేవుఁడు గొప్ప అనుగ్రహము గలవాడు.

వ్యా॥ 104. యూదులు హజ్రత్ ముహమ్మదు వారి సభలోవచ్చి కూర్చుండి వారియుపదేశములు వినుచుందురు. సరిగా వినరానపుడు తిరిగి చెప్పుఁడుఅని పలుకునపుడు రాఇనా (మమ్ము అనుగ్రహింపుఁడు) అని పలుకుదురు. యూదులను చూచి ముసల్మానులు కూడ అవసరము గలిగినపుడు 'రాఇనా' అనిచెప్పసాగిరి ముసల్మానులు ఉన్‌జుర్నా (కటాక్షింపుఁడు) అని చెప్పవలెను, రాఇనా, అనిపలుకకూడదు. చెవియొగ్గి వినుఁడు, తిరిగి అడుగుటకు అవసరముండదని దేవుఁడు సెలవిచ్చెను. ఎందుకన 'రాఇనా' అను పదమును యూదులు కొంతఒత్తి రాఈనా (మాగొల్లవాఁడా) అనిఅర్థముచేసికొనుచు, పరిహాసము లాడుదురు. అదియునుగాక రాఇనా అనుపదమునకు యూదులభాషలో అవివేకి అను అర్థముకూడఁగలదు. కావున ఇట్టి పలు అర్థ

ములుగల పదము పైగంబరుల వారివిషయమున ఉపయోగింపకూడదు, అను మర్యాద దేవుఁడు ముసల్మానులకు నేర్పుచున్నాడు. మఱి ప్రవక్తతో పరిహాసములాడు యూదులు దుఃఖకరమైన నరకబాధకు పాలగుదురు.

105. గ్రంథము గలవారు, యూదులును, నస్రానీయులును. వీరినే అహ్లెకితాబ్ అనుదురు. యూదులు ఆఖరున రానున్న గొప్ప ప్రవక్త తమ వంశములోనే పుట్టవలెనని కోరుచుండిరి. కావున ఇస్మాయీలు సంతతివారగు ముహమ్మదు ప్రవక్తగారు ఆఖరుప్రవక్తగా అగుటయును ఖురాను గ్రంథము ముహమ్మదువారికి లభించుటయును యూదులకు ఇష్టము లేదు. అటులే మక్కాలో నున్న విగ్రహారాధకులు ఇష్టపడరు. వారు అవిశ్వాసులు. కావున దేవుని అనుగ్రహము ముసల్మానులకుఁ గలుగుట వారికి ఇష్టము లేదు, అయిననేమి? దేవుఁడు తన ఇష్టమువచ్చిన వారికి ప్రవక్తపదవి నిచ్చును, ఆతఁడుచాల అనుగ్రహము చేయువాఁడు, ఆతని దయకు అడ్డుపడువారు ఎవరు గలరు!

106. మానన్ సఖ్-మిన్-ఆయతిన్-ఔ-నున్-సిహా- నాతి - బిఖైరిమ్ - మిన్‌హా-ఔమిస్‌లిహా-అలమ్-తఅ-లమ్-అన్నల్లాహ-అలా-కుల్లి-షైఇన్-ఖదీర్.
107. అలమ్-తఅ- లమ్ అన్నల్లాహ-లహూ-ముల్-కుస్-సమా-వాతి-వల్-అర్ జి-వమా-లకుమ్-మిన్-దూ-నిల్లాహి-మిన్-వలీ-ఇన్-వలా-నసీర్.

106. మేము ఒక వాక్యమును మార్చిన, లేక మఱచినట్లుచేసిన, దానికన్న శ్రేష్ఠమైనదో లేక దానివంటిదో పంపుచున్నాము. ఏమి? దేవుఁడు సర్వశక్తుఁడను విషయము నీకుఁ దెలియదా? 107. భూమ్యాకాశముల రాజ్యము దేవునికే యున్నదని నీవు ఎఱుంగవా? మఱియు దేవుఁడు తప్ప మీకెవరును స్నేహితులునుగాని, సహాయము చేయువారునుగాని లేరు,

వ్యా॥ 106, 107. ఈ వాక్యములలో కొన్ని వాక్యములలోని ధర్మముల మార్పును గూర్చి చెప్పఁబడినది. దేవుఁడు కాలమునకుఁ దగినట్లు ప్రజలకు అనుకూలముగను కొన్ని ధర్మములుమార్చి వానికిబదులుగ అటువంటివో లేక వానికన్న శ్రేష్ఠములైనవో నియమించుచున్నాఁడు. అది పూర్వ మత గ్రంథములలోఁ గూడ సంభవించెను, అటులే ఖురానులో కూడ సంభవించినది. అది ఏలాటి దోషమును కానేరదు. దానిని సాకుగా పెట్టుకొని యూదులు తమ మత గ్రంథములలోఁ గలిగిన మార్పులు గమనింపక ద్వేషములో ఇస్లామ్ మత గ్రంథముపై నిందమోపసాగిరి. దానిని రద్దుచేసి ఆకాశములోను భూమిలోను దేవునిదే రాజ్యముచెల్లును, ఆతని ఆజ్ఞలే ఆతని ఇష్టముచొప్పుననే జరుగవలెను, ఎవరునురద్దుచేయలేరు. దేవుఁడు నిషేధిం

చిన దానిని మానుకొనుట, ఆతఁడు చేయుఁడు అని ఆజ్ఞాపించిన ధర్మము లను ఆచరించుట భక్తులపని. దేవుఁడు తన భక్తులకు తోడుపడువాఁడు. ఇతరు లెవ్వరును ఏమియును చేయఁజాలరు. కావున భక్తులు దేవునాజ్ఞలను శిర సావహించి యుండవలెను.

108. అమ్-తురీ-దూన-అన్-తస్-అలూ-అసూ-లకుమ్-కమా-సుఇల మూసా-మిన్-ఖబ్లు.వమన్-యత-బద్దలిల్-కుఫ్‌ఆ-బిల్-ఈమాని-ఫఖద్-జల్ల సవా-అస్-సబీల్.

108. ఓముసల్మానులారా! పూర్వము మూసా ప్రశ్నింపఁబడినట్లు మీరు కూడ మీ ప్రవక్తతో ప్రశ్నింపఁగోరుచున్నారా? ఎవఁడు విశ్వాసము నకు బదులుగా అవిశ్వాసము స్వీకరించునో వాఁడుసన్మార్గము తప్పినవాడగును.

వ్యా॥ 198. యూదులు కలిగించు సందేహములు విని వారి మాటలకు మోసపోయి, వారు ముందు తమ ప్రవక్తయగు మూసాను, అధికముగా ప్రశ్నించినట్లు ముసల్మానులు తమ ప్రవక్తయగు ముహమ్మదు వారిని నిష్ప్రయోజనముగా ప్రశ్నింపఁగూడదు. అని దేవుఁడు హెచ్చరించుచున్నాఁడు. ఎవఁడు సందేహపడి విశ్వాసము వదలునో వాఁడు సన్మార్గము వదలినవాఁడై అవిశ్వాసియగును. కావున యూదుల కుట్రలనుండి జాగ్రత్తగా నుండవలెను.

109. వద్ద-కసీ-రుమ్-మిన్-అహ్లిల్-కితాబి-లౌ-యరుద్దూ-నకుమ్-మిమ్-బఅ్‌ది-ఈమా-నికుమ్-కుప్ఫారన్-హసదమ్-మిన్-ఇన్‌ది-అన్-ఫుసి-హిమ్-మిమ్-బఅ్‌ది-మా-తబయ్యన-లహు-ముల్-హఖ్-ఖు-ఫఅ-ఫూ-వస్-ఫహూ-హత్తా-యాతి-యల్లాహు-బి-అమ్-రిహీ-ఇన్నల్లాహ-అలా-కుల్లి-షైఇన్-ఖదీర్. 110.వ-అఖీ-ముస్-సలాత-వఆ-తుజ్-జకాత-వమా-తుఖద్దిమూ.లిఅన్-ఫుసి-కుమ్-మిన్-ఖైరిన్-తజిదూహు-ఇన్-దల్లాహి-ఇన్నల్లాహ-బిమా-తఅ-మలూన-బసీర్.

109. అనేకులు యూదులు వారికి సత్యము స్పష్టపడిన తరువాత కూడ తమ అసూయచే మీరు ముసల్మానులైన పిదప మిమ్ము కాఫర్లను (అవిశ్వాసుల)గా మార్పవలెనని కోరుచున్నారు. కావున దేవుఁడు తనయాజ్ఞపంపు వఱకు వారిని మన్నించి వారి జోలికి పోకుండుడు. నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తుఁడు. 110. మఱియు నమాజును స్థిరముగా సలుపుచుండుఁడు, జకాతు (విధిదానము) ఒసంగుచుండుఁడు. మఱి మీరు ఏమేలుచేసి ముందుగా మీకొఱకు పంపుకొనుదురో యద్దానిని మీరు దేవునియొద్ద పొందుదురు. నిశ్చయముగా దేవుఁడు మీరు చేయునదంతయు చూచుచునే యున్నాఁడు.

వ్యా॥ 109, 110. ముసల్మానులయందు యూదులకున్న అసూయయు, వారు ముసల్మానులగూర్చి పన్ను కుట్రలును వారి హృదయములోనున్న చెడు తలంపులును, దేవుఁడు ముసల్మానులకును దెలిపి హెచ్చరికపఱచుచున్నాఁడు. యూదులు ఇస్లామ్ మతము సత్యమని ఎఱింగియు ముహమ్మదువారు తౌరాతు (గ్రంథప్రకటనలను అనుసరించి నిజమైన ప్రవక్త అనివారికి స్పష్టపడియు, యూదులు అట్లు ద్వేషము చూపుచున్నారు. కావున యూదులగూర్చి ముసల్మానులకు దేవుని యాజ్ఞవచ్చునంతవఱకు వారు క్షమగలిగి వారిని మన్నించి వారిజోలికి పోకూడదు. దేవుఁడు సర్వశక్తుఁడు. యూదులకు అపజయమును మీకు విజయమును ఇయ్యఁగలఁడు. అని దేవుని సెలవయ్యెను. అట్లు ముసల్మానులు వర్తించిరి. తుదకు మదీనాపురమునకు చుట్టుపట్లనుండక యూదులు తొలగిపోవలయునని దేవునాజ్ఞ ఆయెను. అటులే యూదులు మదీనా వదలి దూరదేశములలో తమ నివాసము లేర్పఱచుకొనిరి. ముసల్మానులు స్థిరముగా అయిదు పూఁటలు నమాజు సలుపుచు విధిదానమగు జకాతు బీదలకు నొసంగుచు, మంచి పనులుచేయుచుండవలెను. దేవుఁడు జనులుచేయు కర్మలను చూచుచునేయున్నాఁడు. ఎద్దియును వృథాపోదు దీని ఫలితము దేవునియొద్ద లభించును. అని ముసల్మానులను ఉత్సాహపఱచెను.

111. వఖాలూ-లఁ-యద్-ఖులల్-జన్నత-ఇల్లా-మఁ-కాన-హూదఁ-జౌ-నసాఆ-తిల్-క-అమా-నియ్యు-హుమ్-ఖుల్-హాతూ-బుర్-హాన-కుమ్-ఇఁ-కుఁ-తుమ్-సాదిఖీఁ. 112. బలా-మఁ-అస్-లమ-వజ్-హహూ-లిల్లాహి-వహువ-ముహ్-సినుఁ-ఫలహూ-అజ్-రుహూ-ఇఁ-ద-రబ్బిహీ-వలా-ఖౌ-ఫుఁ-అలై-హిమ్-వలా-హుమ్-యహ్-జనూఁ.

111. యూదులును నస్రానీలును దప్ప నితరులెవ్వరును స్వర్గమునకు పోరు అని వారు పలుకుదురు. ఇవి వారు కల్పించుకొన్న వట్టి యూహాలు మాత్రమే. మీరు సత్యవంతులైనచో దీని గూర్చి మీ సనదు (ప్రమాణ పత్రము) దీసికొనిరండు. అని ఓ ముహమ్మదు! పలుకుము. 112. అట్లుకాదు, ఎవరు దేవునికి విధేయులై సత్కార్యములు చేయుదురో వారికితమ ప్రభువునొద్ద వారి పుణ్య ఫలితమున్నది. మఱి వారికి భయముగాని దుఃఖముగాని యుండదు.

వ్యా॥ 111, 112. యూదులును. నస్రానీలు (క్రైస్తవులు)ను "మేము మాత్రమే స్వర్గమునకు పోదుము. ఇతరులు స్వర్గమునకుఁబోఁజాలరు." అని చెప్పుదురు. ఇది వారి వట్టి భ్రమ మాత్రమే. వారు చెప్పునది నిజమైనచో

దానికి రుజువు పఱచునట్టి సనదు, (ప్రమాణపత్రము) వారు దీనికొనిరావలెను. అట్లు వారి దగ్గఱలేదు. అబద్ధములు పలుకుచున్నారు. వారు పలుకునది నిజముకాదు. ఎవరైననుసరే, దేవునికి విధేయులై సత్కార్యములు చేసినచో స్వర్గములభించును. వారెట్టి భయముగాని దుఃఖముగాని పొందరు. అని యూదుల నసారీలమాట రద్దుచేయఁబడెను.

113. వఖా-లతిల్-యహూదు-లైసతిన్-నసాఱా-అలా-షైఇన్- వఖా-లతిన్-నసాఱా-లైసతిల్-యహూదు-అలా-షైఇన్-వహుమ్- యత్- లూనల్-కితాబ-కజా-లిక-ఖాలల్-లజీన-లాయఅ-లమూన-మిస్‌ల-ఖౌలి-హిమ్-ఫల్లాహు-యహ్-కుము-బైనహుమ్-యౌమల్-ఖియా-మతి-ఫీమా-కానూ- ఫీహి- యఖ్-తలి-ఫూఁ.

113. మఱియు నసారీలు ఏమార్గమందును లేరని యూదులు చెప్పుదురు. యూదులు ఏమార్గమందును లేరని నసారీలు చెప్పుదురు. మఱి వారందఱు గ్రంథములను పఠించుచునే యున్నారు. ఇటులే వారు పలుకునట్లు మూఢులుకూడ పలికిరి. కావున దేవుఁడు వీరు కలహించు దానిగూర్చి తీర్పు దినమునందు తీర్పుచేయును.

వ్యా॥ 113. ఈ వాక్యములో యూదులును క్రైస్తవులును మతవిషయమున కలహించు విధము చెప్పఁబడియె. క్రైస్తవులు ఏసుక్రీస్తును దేవుని కుమారుఁడు అని పలికినందున వీరు ఏధర్మమార్గమందును లేక అవిశ్వాసులైరి. అని యూదులు పలుకుదురు. యూదులు ఏసుక్రీస్తును తిరస్కరించినందున ధర్మమార్గము వదలి అవిశ్వాసులైరని నస్రానీలు (క్రైస్తవులు) చెప్పుదురు. మఱి వారందఱు తమ తమ గ్రంథములగు తౌరాతు (ధర్మశాస్త్రము) ఇన్జీలు (బైబిలు) చదువుచు ఇట్లు ఒకరి నొకరు నిందించుకొనుచున్నారు. వారు పలుకునటులే గ్రంథములు చదువని విద్యలేని మూఢులైన విగ్రహారాధకులైన, అరబ్బులు మొదలగు వారు తామున్న మతమే శ్రేష్ఠమైనది. ఇతరుల మార్గము సరికానిదని పలుకుదురు. వారందఱు ఇహలోకమందు వాదులాడుదురు. కాని వాస్తవము తీర్పు దినమందు తేటతెల్లమగును. ఎవరు సన్మార్గులో ఎవరు దుర్మార్గులో దేవుని తీర్పువలన తెలియనగును.

114. వమన్ అజ్-లము-మిమ్మమ్-మనఅ-మసా-జి-దల్లాహి-అన్-యుజ్‌కఱ-ఫీహస్-ముహూ-వ-సఆ-ఫీ-ఖరాా-బిహా-ఉలా-ఇక-మా-కాన-లహుమ్-అన్-యద్-ఖులూహా-ఇల్లా-ఖా-ఇఫీన్-లహుమ్-ఫిద్-దున్‌యా-ఖిజ్- యున్- వల-

హుమ్-ఫిద్-దున్యా-ఖిజ్యున్-వలహుమ్-ఫిల్-ఆఖిఅతి-అజాబున్-అజీమ్.

114. మఱి దేవుని మసీదులలో ఆతని నామమును ఉచ్చరించుటకు ఆటంకపఱచి, మసీదులను నాశముచేయుటకు ప్రయత్నించిన వారికన్న నెవరు దుర్మార్గులున్నారు? ఇట్టివారు మసీదులోనికి ప్రవేశించుటకు యోగ్యులుగారు. కాని భయపడుచు (ప్రవేశింతురు.) వీరికి ఇహలోకమందు అగౌరవమును పరలోకమందు ఘోరమైన బాధయును ఉన్నవి.

వ్యా॥ 114. మక్కాలోనున్న విగ్రహారాధకులు హజ్రత్ ముహమ్మదువారిని వారి శిష్యులను మక్కాలోని కాబామసీదులో నమాజుచేయకుండ చేసి తుదకు వారిని మక్కా విడిచి మదీనాపురమునకు పోవునట్లుచేసిరి. పైగంబరుల వారు మదీనాపురముచేరిన ఆఱవయేట కాబామసీదును దర్శింపవలెనని 1400. మంది శిష్యులలోఁగూడిబయలుదేఱి హుదేబియా అనుచోటునచేరిరి. అపుడు మక్కాఖురైషులు ముసల్మానులు కాబామసీదునకు రాకూడదని ఆటంకపఱచిరి. ఇట్లుచేసి కాబాలో విగ్రహములనుంచి నందున మసీదును నాశముచేసిన వారైరి. దీనికన్న నెక్కుడు దుర్మార్గము లోకమున లేదు. ఇట్టి కాఫర్లు మసీదులలో ప్రవేశించుటకు అర్హులుకారు. ఒకవేళ వచ్చిన భయపడి రావలెను. తుదకు మక్కాపురమును ముసల్మానులు జయించి యందు ముష్రికులు (విగ్రహారాధకులు) రాకూడదని ప్రకటించిరి. దీని పిదప ఎవఁడైన వచ్చిన ప్రాణభయముతోనే రహస్యముగా వచ్చును. అని తెలుపఁబడియె. దేవుని మసీదులను నాశముచేయువారికి ఇహమునందు అగౌరవమును పరమునందు ఘోరమైన నరకబాధయును లభించును.

115. వలిల్లాహిల్-మష్-రిఖు-వల్-మగ్-రిబు-ఫ-ఐనమా-తువల్లూ-ఫ-సమ్మ-వజ్-హుల్లాహి-ఇన్నల్లాహ-వాసి-ఉన్-అలీమ్.

115. మఱియు తూర్పు పడమరలు దేవునివే. కావున మీరు ఏ వైపునకు ముఖముచేసిన నచ్చట దేవుని సమ్ముఖమున్నది. నిశ్చయముగా దేవుఁడు అమితముగా ననుగ్రహించు వాఁడును, సర్వము తెలిసిన వాఁడును.

వ్యా॥ 115. ముసల్మానులు మక్కాలోనున్నపుడు కాబా మసీదునకును బైతుల్ ముఖద్దసునకును ముఖముచేసి నమాజు చేయుచుండిరి. మక్కా విడిచి మదీనాపురమునకు వచ్చిన పిదప కాబామసీదు వైపున ముఖముచేయక బైతుల్ ముఖద్దస్ వైపునకు ముఖముచేసి నమాజుచేయసాగిరి. ఏ వైపున ముఖముచేసిన నేమి? అన్నిదిక్కులు దేవునివే. ఏ వైపు ముఖము చేసిన ఆ వైపున దేవుఁడు న్నాఁడు. అతని సన్నిధాన మచటనుండును. ఆతని అనుగ్రహము అమితమైనది.

అన్ని యెడల వ్యాపించినది. మఱి భక్తులుచేయు కర్మల నతఁడెఱుంగును. ఎద్దియు నతనికి మఱుఁగులేదు. అని ముసల్మాను భక్తులు మనశ్శాంతిగలిగి యుండవలెనని దేవుఁడు సెలవిచ్చుచున్నాఁడు.

116. వ-ఖాలుత్-తఖ-జల్లాహు-వలదన్-సుబ్-హానహూ-బల్-లహూ-మాఫిస్-సమా-వాతి-వల్-అర్జి-కుల్లుల్-లహూఖానితూన్. 117. బదీ-ఉస్ సమా-వాతి-వల్-అర్జి-వఇజా-ఖజా-అమ్-అన్-ఫఇన్నమా-యఖూలు-లహూ-కున్-ఫయకూన్.

116. వారు, దేవుఁడు బిడ్డలుగలిగి యున్నాఁడు, అని చెప్పుదురు. (కాని) ఆతఁడు పరమ పవిత్రుఁడు. మఱి ఆకాశములలోను, భూమిలోను నుండు సమస్తము ఆతనిదే. సర్వము ఆతనికి లోఁబడియున్నది. 117. ఆతఁడే ఆకాశములకును భూమికిని సృష్టికర్త. ఆతఁడు ఏదైన చేయవలెనన్న దానిని 'అగుము' అని చెప్పఁగానే యది అగును.

వ్యా॥ 116, 117. యూదులు ఉజైరును, క్రైస్తవులు ఏసుక్రీస్తును, అరబ్బులలోని విగ్రహారాధకులు దేవదూతలను, దేవుని బిడ్డలు అని చెప్పుదురు. ఈవాక్యములో నిట్టివారి మాటలు రద్దుచేయఁబడినవి. బిడ్డపుట్టవలెనన్న భార్యగావలెను. దేవుఁడు సాటిలేనివాఁడు. భార్య ఎట్లులభించును? ఇట్టి లోపములనుండి, దేవుఁడు పరమ పవిత్రుఁడు. భూమ్యాకాశములలోనున్న సమస్తము దేవుఁడుసృష్టించినది. అందఱు ఆతనికి లోఁబడినదాసులు. దాసిసలు. దాసిసలు పుత్రులెట్లు అగుదురు? ఆయన సృష్టింపవలెనని కోరిన, ఆతని ఆజ్ఞ మాత్రమే చాలును. ఉపకరణములు అక్కఱలేదు. అట్టిసర్వశక్తునకు ఎట్టి లోపములేదు.

118. వ ఖాలల్-లజీన లాయఅ-లమూన-లౌలా-యుకల్-లిము-నల్లాహు-ఔ-తాతీనా-ఆయతున్-కజాలిక-ఖాలల్-లజీన-మిన్-ఖబ్-లిహిమ్-మిస్ల-ఖౌ-లిహిమ్-తషా-బహత్-ఖులూ-బుహుమ్-ఖద్-బైయన్నల్-ఆయాతి-లి-ఖౌమిన్-యూఖి-నూన్.

118. మఱియు ఏమియు తెలియనివారు దేవుఁడు మాతో నేందులకు మాటలాడఁడు? లేక మాయొద్దకు సూచన (గుఱుతు) ఎందులకు రాదు? అని పలుకుదురు. ఇటులే వీరికి ముందు గడచిన వారుకూడ వీరు చెప్పినటు వంటి మాటలే చెప్పియున్నారు. ఈయందఱి హృదయములు ఒకేవిధముగా

సున్నవి. నిశ్చయముగా మేము, నమ్మినట్టి వారి కొఱకు సూచనలు స్పష్టముగాఁ దెలిపియున్నాము.

వ్యా॥ 118. తెలివియు విద్యయు లేని పామరులగు విగ్రహారాధకులైన అరబ్బులు, దేవుఁడు మాతోనే స్వయముగా నెందులకు మాటలాడడు. లేక ముహమ్మదు 'ప్రవక్త' యని దెలుపునట్టి స్పష్టమైన సూచన (గుఱుతు) ఎందులకు చేయడు? అని పలుకసాగిరి. దేవుఁడు వారి మాటలను రద్దుచేయుచు వారు చెప్పునది క్రొత్త మాటకాదు, వారికి ముందున్న యూదులు క్రైస్తవులు తమ ప్రవక్తలనట్లే యడిగిరి. వారు ద్వేషము, విరోధముచేత అట్లు అడుగుచున్నారు వాస్తవము చూచిన, హజ్రత్ ముహమ్మదు, ప్రవక్త అని దెలుపునట్టి గుఱుతులు స్పష్టముగాఁ దెలుపఁబడినవి. కాని నమ్మకము గలవారికి అవి యుపయోగపడును. ద్వేషము వలనను అవివేకముచేతను అంధులైనవారికి ఎట్లు ప్రయోజనకరము లగును?

119. ఇన్నా-అర్-సల్-నాక బిల్-హఖ్ఖి-బషీ-రన్-వ-న-జీ-రన్ - వ లా తుస్-అలు-అన్ అస్-హాబిల్-జహీ.మ్.

119. నిశ్చయముగా మేము, నీకు సత్యమైన మతమును నొసంగి సంతోష వార్త నిచ్చువానిగను, భయము పెట్టువానిగను జేసి పంపితిమి. నరక నివాసులను గూర్చి నీవు ప్రశ్నింపఁబడవు.

వ్యా॥ 119. ఓ ముహమ్మదు! నిన్ను సత్యమైన ఇస్లామ్ మతమునకు ప్రవక్తగాఁ జేసి మేము పంపితిమి. విశ్వసించి ఇస్లాము మతము ననుసరించిన వారికి స్వర్గముగలదు. అను సంతోషవార్త నిచ్చుటయు, తిరస్కరించి అవిశ్వాసులైన వారికి నరకముగలదు, అని భయపెట్టుటయు నీపని. కాని అవిశ్వాసులు ఎందుచేత ముసల్మానులు కాలేదు. అని నీవు ప్రశ్నింపఁబడవు. దానికి నీవు జవాబుదారివి కావు. అని దేవుఁడు సెలవిచ్చుచున్నాడు.

120. వలన్-తర్-జా-అన్-కల్-యహూదు-వలన్-నసారా-హత్తా తత్ తబిఅ-మిల్లతహుమ్ ఖుల్ ఇన్న-హుదల్లాహి-హువల్-హుదా-వల-ఇనిత్ తబఅ త-అహ్వా-అహుమ్-బాదల్లజీ-జా అక-మినల్-ఇల్ము-మాలక-మినల్లాహి-మిన్ వలీ-యిన్-వలా-నసీర్, 121. అల్-లజీన-ఆతైనా-హుముల్-కితా - బ-యత్ లూనహు-హఖ్ఖ తిలా వతిహీ. ఉలా ఇక-యుఅ్మినూన - బిహీ - వమన్-యక్-ఫుర్-బిహీ-ఫ ఉలా-ఇక హుముల్-ఖాసిరూన.

120. యూదులుగాని, నసారీలుగాని, నీవు వారి మతమును అనుస

రించు నంతవఱకు వారు నీతో సంతోషపడరు. దేవుఁడు చూపిన మార్గమే సన్మార్గమని ఓ మహమ్మదు! చెప్పుము. మఱి నీకు జ్ఞానముకలిగిన పిదపను నీవు వారి కోరికలను అనుసరించినచో దేవుని చేతినుండి నిన్ను రక్షించు స్నేహితుండు గాని సహాయుఁడుగాని ఎవఁడును లేఁడు. 121. మేము ఎవరికి గ్రంథము నొసంగితిమో వారు దానిని పఠింపవలసినట్లు పఠించుచున్నారు. ఇట్టివారే దానిని విశ్వసించువారు. ఎవరు దానిని తిరస్కరింతురో వారే నష్టము పొందువారు.

వ్యా॥ 120. యూదులు, క్రైస్తవులు, ఎవరు వారి మతమును అనుసరింతురో వారితో సంతోషపడుదురు. కావున ఓ మహమ్మదు! ఇట్టి స్వభావము గల యూదులు క్రైస్తవులు నీవు వారి కోరికలను అనుసరించు నంతవఱకు నీతో సంతోషపడరు. ఏయే కాలమందు ఏయే ప్రవక్తమూలమున దేవుఁడు మతమార్గము చూపునో అదియే సన్మార్గము. మహమ్మదు వారి మూలమున, దేవుఁడు ఇస్లామ్ మతమును చూపెను. కావున వారి కాలమందును వారి పిదప్పను, ఇస్లామ్ మతమే సన్మార్గము. కాని ఇతర మతములు కానేరవు. అని చెపమని దేవుఁడు చెప్పుచున్నాఁడు. దేవుని వద్దనుండి వచ్చిన ఖురానువలన జ్ఞానము కలిగిన పిదప ఒకవేళ ముసల్మానులు ఇతర మతములను అనుసరించినచో, వారిని దేవుని శిక్షనుండి రక్షించు స్నేహితుండు గాని సహాయుఁడు గాని ఎవఁడును లేడు. 121. యూదులలో కొందఱు భయభక్తులుగలిగి తౌరాతు గ్రంథమును పఠించువారుగలరు. వారు దాని ననుసరించి మహమ్మదువారు దేవుని ప్రవక్త అని విశ్వసించిరి. ఇట్టివారిలో అబ్దుల్లాబిన్ సలాము మొదలైన వారు ముఖ్యులు. యూదులలో ఎవరు దానిని సరిగా పఠింపక అందున్న భావములను తిరస్కరించి తారుమారుచేసిరో వారు నష్టము పొందిరి. మఱి నరక నివాసులైరి.

122. యాబనీ-ఇస్రా-ఈలజ్-కురూ-నిఅ-మతి-యల్లతీ-అన్-అమ్‌తు-అలై-కుమ్-వ-అన్నీ-ఫజ్-జల్‌తు-కుమ్-అలల్-ఆలమీన్. 123. వత్తఖూ-యౌమన్-లాతజ్-జీనఫ్-సున్-అన్-నఫ్-సిన్-షై-అన్-వలా-యుఖ్-బలు-మిన్-హా-అద్-లున్-వలా-తన్ ఫఉహా-షఫా-అతున్-వలా-హుమ్-యున్-సరూన్.

122. ఓ యిస్రాయీలు సంతతి వారలారా! నేను మీకుఁగావించిన ఉపకారములను, సర్వలోకముల వారికంటె మీకిచ్చిన ఘనతను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. 123. మఱి మీరు పునరుత్థాన దినమునకు భయపడుఁడు. ఆదిన

మున ఒకరికొకరు తోడుపడఁజాలరు. మఱి వారిబదులు స్వీకరింపఁబడదు. మఱి ఎవరి సిఫారసును వారికి లాభమియ్యదు. వారికి నెట్టి సహాయము లభింపదు.

వ్యా॥ 122, 123. మొట్ట మొదట ఏవిషయములను ఇస్రాయీలీయులు గమనింపవలెనని చెప్పఁబడెనో వానిని వివరించిన పిదప వారికి బాగుగబోధ పడి వారుసన్మార్గము నవలంభింపుటకు వీలగునట్లు ఇచ్చుట వానిని జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడని వారికిది హెచ్చరిక.

124. వఇజిబ్‌తలా-ఇబ్‌రా-హీమ-రబ్బుహూ-బి-కలిమా-తిన్ - ఫ-అతమ్మ-హున్న-ఖాల-ఇన్నీ-జా-ఇలుక-లిన్నా సి-ఇమా-మన్-ఖాల - వమిన్ - జుర్రీ-యతీ-ఖాల-లా-యనాలు-అహ్‌-దిజ్ జా-లిమీన్.

124. మఱియు ఇబ్రాహీమును ఆతని ప్రభువు అనేక విషయములలో పరీక్షింపఁగా ఆతఁడు వానిని పూర్తిచేసెను. అప్పుడు దేవుఁడు జనులందఱికిఁగాను నిన్ను 'ఇమాము'గాఁ జేయుదును అని చెప్పఁగా నాసంతానములో కూడఁ (ఇమాములను) జేయుమని ఇబ్రాహీము అడిగెను. అపుడు దేవుఁడు నావాగ్దానము దుర్మార్గులకు చెందదు. అని పలికెను.

వ్యా॥ 124. ఈ వాక్యములలో హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తనుగూర్చి చెప్పఁబడినది. ఆతని కుమారుఁడగు ఇస్‌హాఖ్ సంతతివారే, ఇస్రాయీలు యులును నస్రానీయులును. అటులే ఇబ్రాహీము కుమారుఁడగు ఇస్మాయీలు సంతతివారు హజ్రత్ ముహమ్మదు వారు. వీరందఱును ఇబ్రాహీమును తమ వంశమునకు పెద్ద అని గౌరవింతురు. దేవుఁడు ఇబ్రాహీమునకు అనేక ఆజ్ఞలు, ధర్మములు ఒసంగి వానిని అనుసరింపవలెనని సెలవు ఇచ్చెను. ఇబ్రాహీము తన దేవుని యాజ్ఞలను పూర్తిచేసెను. దానికి దేవుడు మెచ్చుకొని ఇబ్రాహీమును జనులందఱికిఁగాను ఇమాముగా చేయుదునని యాతనికి వాగ్దానము చేసెను. "ఇమామ్" అనగా అనుసరింపఁదగిన పెద్ద మతగురువు. దేవుఁడు చేసిన వాగ్దానము ననుసరించి ఇబ్రాహీము పిదప వచ్చిన ప్రవక్తలును జనులును ఆయనను అనుసరించుచున్నారు. ఇబ్రాహీము "ఈ పదవి నాసంతతి వారికిఁగూడ చెందవలెనని" దేవునితో విన్నవింపఁగా దుర్మార్గులైన వారికి నావాగ్దానము చెందదు. ఇట్టివారు, మతగురువులు (ఇమామ్) కాఁజాలరు. సన్మార్గులు ఆ పదవిని పొందఁగలరు. అని దేవుఁడు సెలవిచ్చెను. హజ్రత్ ముహమ్మదువారు ఇబ్రాహీము, ప్రవక్తను అనుసరించియున్నారు. ఆపదవి వీరికి లభించెను. వీరి కాలమున నున్న యూదులు క్రైస్తవులు ఇబ్రాహీము

యొక్క మతమార్గమును వదలి పోయిరి. కావున దేవుని వాగ్దానము వారికి చెందఁజాలదు. కావున వారందఱు మహమ్మదు వారిని అనుసరింపవలెను.

125. వఇజ్-జఅల్-నల్-బైత మసా-బతల్-లిన్నాసి-వ-అమ్-నన్-వత్-తఖిజూ-మిమ్-మఖా-మి-ఇబ్-రా-హీమ-ముసల్లన్-వ-అహిద్-నా-ఇలా-ఇబ్-రా-హీ-మ-వఇస్-మా-ఈల-అన్-తహ్హిరా-బైతియ-లిత్తా-ఇ-ఫీన-వల్-ఆకి-ఫీన-వర్-రుక్క-ఇస్-సుజూద్.

125. మఱియు మేము, కాబామసీదును జనులు కూడు చోటుగాను, శాంతికరమైన ప్రదేశముగాను, చేసితిమి. మఱి మీరు, ఇబ్రాహీము నిలుచు చోటును నమాజుస్థలముగాఁ జేసికొనుఁడు. మఱియు ప్రదక్షిణము, ఏతికాఫ్, రుకూ, సిజ్దా చేయువారికిఁగాను, నాగృహమును పరిశుద్ధముగా నుంచుఁడని మేము ఇబ్రాహీమునకును ఇస్మాయీలునకును, ఆజ్ఞనిచ్చితిమి.

వ్యా॥ 125. కాబామసీదు దేవుని గృహము. అచ్చట జనులు యాత్రికుఁగాను వత్తురు. అచ్చట వచ్చిన వారికెట్టి భయముండదు. అందుచే అది శాంతి కరమైనచోటు. హజ్రత్ ఇబ్రాహీము కాబామసీదును కట్టునపుడు ఒక బండ పైనిలుచుచుండెను. దానినే మఖామె ఇబ్రాహీము అనుదురు. అచ్చట నిలిచి నమాజు చేయవలెనని ఆజ్ఞయయ్యెను. దీని ననుసరించి, యాత్రికు (హాజీ) లు అచ్చట నిలిచి నమాజు సలుపుదురు. యాత్రికుల కొఱకును, అచట వసించి ప్రార్థనలు సలుపువారికిఁగాను కాబామసీదును, అన్ని విధములుగ పరిశుద్ధముగా నుంచవలెనని, ఇబ్రాహీమునకును ఇస్మాయీలునకును దేవుఁడు ఆజ్ఞనిచ్చెను. ఏతికాఫ్ అనగా మసీదులోనే వసించి నియమముగా ప్రార్థనలు సలుపుట. రుకూ నమాజులో వంగుట. సిజ్దా నమాజులో సాష్టాంగ నమస్కారము చేయుట. ఇస్మాయీలు, ఇబ్రాహీమునకుబీబీహాజరాయందు పుట్టిన జ్యేష్ఠ కుమారుఁడు. వీరిని గూర్చి "జగత్ ప్రవక్త" చరిత్రలో వ్రాసియున్నాము. చూడుఁడు. పేజి 11.

126. వఇజ్-ఖాల ఇబ్-రా-హీము-రబ్బిజ్-అల్-హా-జా-బలదన్-ఆమినన్-వర్-జుఖ్-అహ్-లహు మినస్-సమ-రా-తి-మన్ఆమన-మిన్-హుమ్ బిల్లాహి వల్-యౌమిల్-ఆఖిరి-ఖాల-వమన్-కఫర ఫ-ఉమత్తి-ఉహూ-ఖలీ-లన్-సుమ్మ-అజ్-తర్రుహూ-ఇలా-అజా-బిన్నా-రి-వ-బీ-సల్-మసీర్.

126. మఱియు ఇబ్రాహీము, ఓప్రభువా! ఈస్థలమును శాంతికరమైన పురముగాఁజేసి ఇందువసించువారిలో దేవునియందును, తుదిదినమందున

విశ్వాసముగల వారికి ఫలముల, ఆహారము నొసంగుము అని చెప్పినపుడు, మఱెవ్వరు అవిశ్వాసు లగుదురో వారికిఁగూడ కొంత లాభము అందజేసెదను. పిదపవారిని నరకబాధలోనికి నెట్టుదును, అది చాలచెడు నివాసస్థలము. అని దేవుఁడు పలికెను.

వ్యా॥ 126. ఇబ్రాహీము కాబామసీదును కట్టునపుడు కాబామసీదు చుట్టునున్న మైదానమును పురముగా జేయునట్లును అచ్చట వసించు విశ్వాసులకు ఫలముల ఆహారము నొసంగునట్లును దేవునిని వేడుకొనెను. అటులే అచ్చట పురము యేర్పడి, అందు శాంతిగలిగెను. దాని పేరే మక్కా-పురము. ఆహారమును గూర్చి విశ్వాసులకు అవిశ్వాసులకు భేదములేదు. అందఱికిని తినుటకు ఆహారము నొసంగుదునని దేవుఁడు సెలవిచ్చెను. ఆహారమునకు, మత గురువుపదవి (ఇమామత్) కిని చాల భేదముగలదు. ఆహారము అవిశ్వాసులకును విశ్వాసులకును లభించును. కాని మతగురువుపదవి విశ్వాసులకు మాత్రము లభించును.

127, వఇజ్-యర్ఫఉ-ఇబ్-రా-హీముల్-ఖవా-ఇద-మినల్-బైతి-వఇస్-మా-ఈలు-అబ్బనా-తఖబ్బల్-మిన్నా-ఇన్నక-అన్-తస్-సమీఉల్-అలీమ్. 128. అబ్బనా-వజ్-అల్నా-ముస్-లిమైని-లక-వ-మిన్-జుర్రీ-యతినా-ఉమ్మతమ్-ముస్-లిమతల్-లక-వఅరినా-మనా-సికనా-వతుబ్-అలైనా-ఇన్నక-అన్-తత్-తవ్వా-బుర్-రహీమ్. 129. అబ్బనా-వబ్-అస్-ఫీహిమ్-అసూ-లమ్-మిన్-హుమ్-యత్-లూ-అలైహిమ్-ఆ-యాతిక-వ-యు-అల్లిము-హుముల్-కితా-బ-వల్-హిక్-మత-వ-యుజక్కీ-హిమ్-ఇన్నక-అన్తల్-అజీ-జుల్-హకీమ్.

127. మఱియు ఇబ్రాహీమును, ఇస్మాయీలును, కాబామసీదు పునాదుల నెత్తుచు, ఓ మాప్రభువా ! మా 'పనిని' అంగీకరింపుము, నిశ్చయముగా నీవు వినువాడవును, సర్వము దెలిసినవాడవును. 128. ఓ మాప్రభువా! మమ్ము నీ విధేయులను గాఁజేయుము. మఱిమాసంతానములో నొకసంఘమును నీకు విధేయులుగానుండునట్లు చేయుము. కాబాయాత్ర ధర్మములును మాకుఁదెలుపుము. మఱిమమ్ములను క్షమింపుము. నిశ్చయముగా నీవే క్షమాపణ అంగీకరించువాఁడవును దయాళుఁడవును. 129. ఓమాప్రభువా! వీరిలో నుండియే, నీవాక్యములను వీరికై పఠించు నతఁడును, వీరికి గ్రంథమును రహస్యములు (సూక్ష్మములైన మతవిషయములును) నేర్పు నతఁడును, వీరిని పరిశుద్ధులుగాఁజేయు నతఁడును అగు ఒక ప్రవక్తను పంపుము. నిశ్చయముగా నీవే సర్వశక్తుఁడవును,

యు క్తిశాలివిని. అని వేడిరి.

వ్యా॥ 127,128,129. కాబామసీదు పునాదులెత్తుచు హజ్రత్, ఇబ్రాహీము, హజ్రత్ ఇస్మాయీలు, దేవునిని పైవాక్యములలోనున్నట్లు వేడుకొనిరి. మాపనిని అనగా కాబామసీదు కట్టడమును. తండ్రికుమారులు, తమసంతానములో దేవునికివిధేయతగలిగిన ఒకసంఘము ఏర్పడవలెననియు ఒకప్రవక్తను పంపునుయు దేవునిని వేడిరి. వారిప్రార్థనము ననుసరించి హజ్రత్ ఇస్మాయీలుగారి సంతానములోనే జగత్ ప్రవక్తయగు హజ్రత్ ముహమ్మదు వారు, మక్కాపురములోపుట్టిపెరిగి దేవునిచే ప్రవక్తపదవిపొంది, ఇస్లామ్ మతమును బోధించి, ఖురాను గ్రంథమును జనులకు వినిపించి, మతరహస్యములను తత్వములను వారికిఁదెలిపి ముసల్మానులైనవారి హృదయములను ఆత్మలను సర్వనీచగుణములనుండి పరిశుద్ధులుగాఁ జేసిరి. ఇట్లు వారిద్దఱి ప్రార్థన ఫలించెను.

130. వమన్‌యర్‌గబు‌అన్-మిల్లతి-ఇబ్‌రాహీము - ఇల్లా - మన్‌సఫిహ-నఫ్-సహూ-వల-ఖదిస్ -తఫైనాహు-ఫిద్-దున్-యావ - ఇన్నహూఫిల్-ఆఖి-అతి-లమినస్-సాలి-హీన్. 131. ఇజ్-ఖాల-లహూ అబ్బుహూఅస్-లిమ్-ఖాల-అస్-లమ్తు-లి-అబ్బిల్-ఆలమీన్. 132. వ - వస్సా-బిహాఇబ్‌రాహీము-బనీహి-వ-యఅ-ఖూబు-యా-బనియ్య-ఇన్నల్లా-హస్-తఫాలకుముద్-దీన-ఫలా-తమూతున్న-ఇల్లా-వఅన్-తుమ్-ముస్-లిమూన్.

130. మఱియు, ఎవఁడు తన ఆత్మను అవివేకముగాఁ జేసికొనెనో వాఁడు దప్ప నితరులెవ్వరు ఇబ్రాహీముయొక్క మతమును వదలగలరు? మఱియు నిశ్చయముగా మేము ఆతనిని ఇహలోకములో నెన్నుకొంటిమి. 131. మఱియు నతఁడు పరలోకమునందు సత్పవర్తకులలోఁజేరి యూతఁడు. దేవుఁడు ఆతనితో నీవు విధేయత గలిగి యుండుమని చెప్పినపుడు, నేను సర్వలోక ప్రభువునకు విధేయుఁడను అయితినని ఆతఁడు పలికెను. 132. ఈ విషయమునే ఇబ్రాహీము తన పుత్రులకు బోధించెను. యాఖూబు కూడను తన పుత్రులతో ఓ నాకుమారులార, దేవుఁడు మీకొఱకు, ఈ మతమును ఏర్పఱిచెను. కావున మీరు ముసల్మానులు, కానిదే చావకుఁడు అని బోధించెను.

వ్యా॥ 130,131,132. హజ్రత్ ఇబ్రాహీముగారు, దేవునియందుభయభక్తులుగలిగి ఆతనికే విధేయులై యుండిరి. సర్వమునువదలి దేవునినే పూజించుచుండిరి. వారిని దేవుఁడు తన ప్రవక్తగాను, తనప్రియుని (ఖలీలుల్లా)గా నెన్నుకొనెను. వారట్టి గొప్పమతము గలవారు. వారి మతమును వదలు

వాఁడు, తన అవివేకముచే తన నష్టమే చేసికొనిన వాఁడగును. బుద్ధిమంతులు, ఇబ్రాహీము మతము ననుసరింతురు. హజ్రత్ ఇబ్రాహీమును గౌరవించుచు వారి మతమును వదలి పెక్కు విగ్రహములను కల్పించుకొన్న విగ్రహారాధకులకు నిందు మందలింపున్నది. యాఖూబు ప్రవక్త హజ్రత్ ఇబ్రాహీము కుమారుఁడు. ఇస్హాఖు ప్రవక్త యొక్క పుత్రుఁడు. యాఖూబు సంతతివారే ఇస్రాయీలియులు. ఆయనకూడ ఇబ్రాహీము మతమునే తనపుత్రులకు బోధించి దేవునియందు విధేయత గలిగి ముసల్మానులై చావవలెను అని పలికెను. (ముసల్మాన్ అనగా దేవునికి విధేయుఁడని అర్థము). కావున వీరి బోధకు విరోధముగా నడుచుకొనువాఁడు విధేయుఁడుగాఁడు.

133. అమ్-కున్-తుమ్-షుహ-దాఅ-ఇజ్-హజఅ-యఅ-ఖూబల్-మౌతు ఇజ్-ఖాల-లి-బనీహి-మా-తఅ-బుదూన-మిమ్-బఅ-దీ-ఖాలూ-నఅ-బుదు-ఇలా-హక-వ-ఇలాహ-ఆబా-ఇక-ఇబ్-రాహీమ-వఇస్-మా-ఈల-వ-ఇస్-హాఖ-ఇలా-హన్-వాహి-దన్-వ-నహ్ను-లహూ-ముస్-లిమూన్. 134. తిల్క-ఉమ్మ-తున్-ఖద్-ఖలత్-లహా-మా-కస-బత్-వ-లకుమ్-మా-కసబ్-తుమ్-వలా-తుస్-అలూన-అమ్మా-కానూ-యఅ-మలూన్.

133. ఏమి యాఖూబునకు మరణము సమీపించినప్పుడు తన పుత్రులతో నా తరువాత మీరు ఎవనిని పూజింతురు అని అడుగఁగా వారు నీ ప్రభువును, నీతండ్రి తాతలగు ఇబ్రాహీము ఇస్మాయీలు ఇస్హాఖుల యొక్క ప్రభువును అగు ఒక్క దేవునిని పూజింతుము. మఱి ఆతనికే విధేయులమై యుందుము అని పలికినపుడు మీరుంటిరా ? 134. ఈ సంఘము గడచిపోయినది. వారుచేసినది వారికొఱకే. మీరు చేసినది మీకొఱకే. వారు చేయుచున్న దాని గూర్చి మీరు ప్రశ్నింపఁబడరు.

వ్యా॥ 133. యాఖూబు తన పుత్రులకు యూదుల మతము బోధించె నని యూదులు చెప్పుచుండిరి. అది యిందు రద్దుచేయఁబడినది. యాఖూబు తన పుత్రులకిచ్చు బోధను మీరుండి వింటిరా? మీరుఅక్కడకూడ లేనప్పుడు ఈ తీరున ఎట్లు చెప్పఁగలరు? ఇస్మాయీలు సంతతిలోనున్న విగ్రహారాధకుల కిందు మందలింపున్నది. హజ్రత్ ఇబ్రాహీము, ఇస్మాయీలు ఇస్హాఖు వారి మతము ఒక దేవుని పూజించుట మాత్రము. కావున మీరును విగ్రహారాధన వదలి దేవునినే ఆరాధింపుఁడు అని హెచ్చరింపఁబడియె. యాఖూబు తండ్రి ఇస్హాఖు. ఆతని తాత ఇబ్రాహీము, ఇస్మాయీలు యాఖూబునకు పెద్దతండ్రి కావున ఆతడుకూడ యాఖూబు తండ్రి అని చెప్పఁబడియె.

వ్యా॥ 134. యూదులును, నస్రానీలును తల్లితండ్రులు చేసిన పాప పుణ్యములు వారి పుత్రులు అనుభవింతురని చెప్పుచుండిరి. ఇందు ఆదిరద్దు చేయఁబడినది. ఎవరు చేసిన పాపపుణ్యముల ఫలితము వారే అనుభవింతురు. కాని బిడ్డలుగాని తల్లిదండ్రులుగాని ఒకరిపాపపుణ్యముల ఫలితముఅనుభవింపరు.

135. వఖాలూ-కూనూ-హూదన్-ఔ-నసారా-తహ్-తదూ- ఖుల్-బల్-మిల్లత-ఇబ్-రాహీమ-హనీ-ఫన్-వమా-కాన-మినల్-ముష్-రికీన్.

135. మఱి, మీరు యూదులో లేక నస్రానీలోకండు. మీరుసన్మార్గము పొందుదురు అనివారు చెప్పుదురు. అట్లుకానేరదు. మేము ఇబ్రాహీము యొక్క స్థిరమైన మతమును అనుసరింతుము. ఆయన విగ్రహారాధకులలో చేరినయతఁడు కాఁడు. అని ఓముహమ్మదు! చెప్పుము.

వ్యా॥ 135. యూదులు ముసల్మానులతో మీరు యూదులు కండు అనియు నస్రానీలు మీరునస్రానీలుకండు. అయినచో సన్మార్గు లగుదురనియు చెప్పసాగిరి. మేము మీ ఉభయుల మతము అనుసరింపము. మీ మతములు, ఇబ్రాహీము ప్రవక్త మతమునకు విరోధముగానున్నవి. కావున ఇబ్రాహీము ప్రవక్త యొక్క స్థిరమైన మతము ననుసరింతుము. ఆయన దేవునికి విధేయుఁడు. విగ్రహారాధన చేయువారిలో ఆయనచేరలేదు. అని పలుకవలెనని చెప్పఁబడెను. దేవుఁడు తన ప్రవక్తలమూలమున పంపిన మతము ఒక్క ఇస్లామ్. ఇందు ప్రతికాలములోను విశ్వాసములు (ఏతిఖాదాత్) ఒక్కటిగానేయున్నవి. ఏమియు మార్పు కలుగలేదు. కాలము ననుసరించి కొన్ని మతాచారములు మాఱుచు వచ్చినవి. కాని మూలధర్మములు మాఱలేదు. ఇబ్రాహీముగారి మతాచారములనే మిల్లత్ అనుదురు. ముసల్మానులు, ఇబ్రాహీము ప్రవక్తగారి మతాచారములను అనుసరింతురు.

136. ఖూలూ-ఆమన్నా-బిల్లాహి-వమా-ఉన్-జిల-ఇలైనా-వమా-ఉన్-జిల-ఇలా-ఇబ్-రాహీమ-వఇస్-మాఈల-వఇస్-హాఖ-వయఅ-ఖూబ-వల్ అస్-బాతి-వమా-ఊతియ-మూసా-వఈసా-వమా-ఊ-తియన్-నబీ-యూన మిర్-అబ్బిహిమ్-లా-ను-ఫర్రిఖు-బైన-అహ-దిమ్-మిన్-హుమ్-వ-నహ్ను-లహూ-ముస్-లిమూన్.

136. మేము దేవునిని, మాకు నొసఁగబడినదానిని, ఇబ్రాహీమునకును ఇస్మాయీలునకును ఇస్హాఖునకును, యాఖూబునకును, ఆతని కుమారులకును, మూసాకును. ఈసాకును, ఇతర ప్రవక్తలకును వారి ప్రభువునుండి

యియ్యఁబడిన దానిని విశ్వసించితిమి. వారిలో నెవరి మధ్యను భేదము చేయము (పాటింపము). మఱి మేము దేవునకే విధేయులము అని పలుకుఁడు.

వ్యా॥ 136. ఇందు ముసల్మానులు ఎట్లు విశ్వసింపవలయునో బోధింపఁబడినది. దేవుఁడు పంపిన సమస్తప్రవక్తలను, గ్రంథములను విశ్వసింపవలెను. కొందఱిని నమ్మి కొందఱిని తిరస్కరించినచో అది సరియైన విశ్వాసము కాదు. అట్లుచేసిన అవిశ్వాసులగుదురు. ఏప్రవక్తకు ఏగ్రంథము ఏకాలమందు నొసంగఁబడినదో ఆయాకాలము అయ్యది అనుసరింపఁదగినది. హజ్రత్ ముహమ్మదువారు, అందఱికన్న పిదపవచ్చిన జగత్ప్రవక్త. కావున, వీరిని నమ్మి ఖురానెషరీఫు ననుసరించి ఇస్లామ్ మతము స్వీకరింపవలెను. కాని యూదులును క్రైస్తవులును తమతమ ప్రవక్తలను నమ్మి ఇతర ప్రవక్తలను, గ్రంథములను, తిరస్కరింతురు. కావున సన్మార్గము పొంది మోక్షము లభింపవలెనన్న ముసల్మానులు విశ్వసించునట్లు ఇతరులుకూడ విశ్వసింపవలెను. దీనిఁగూర్చి రాఁబోవు వాక్యములో చెప్పఁబడుచున్నది.

137. ఫఇన్-ఆమనూ-బిమిస్లి-మా-ఆమన్-తుమ్-బిహీ-ఫఖ-దిహ్-తదా-వఇన్-తవల్లౌ-ఫఇన్నమా-హుమ్-ఫీ-షిఖా-ఖిన్-ఫసయక్-ఫీక-హుముల్లా-హు-వ-హువస్-సమీ-ఉల్-అలీమ్. 138. సిబ్-గతల్లాహి-వమన్ - అహ్-సను-మినల్లాహి-సిబ్-గతన్-వ-నహ్నుల-హూ-ఆ-బిదూన్.

137. కావున, వారు కూడను మీరు విశ్వసించినట్లు విశ్వసించినచో వారును సన్మార్గము పొందినవారగుదురు. మఱి, వారు తిరిగిపోయినచో వారే విరోధము వహించినవారు. కావున వారినుండి రక్షించుటకు నీకు దేవుఁడు చాలును. ఆతఁడే వినువాఁడును, సర్వము తెలిసినవాఁడును. 138. మేము దేవుని (మత) రంగును స్వీకరించితిమి. దేవుని (మత) రంగుకన్న నెవరిరంగు శ్రేష్ఠమైనది! మఱి మేము ఆతనినే పూజించువారలము. (అని ఓ ముసల్మానులారా! పలుకుఁడు.)

వ్యా॥ 137. ఓ ముసల్మానులారా! మీరు విశ్వసించునట్లు యూదులును నసారానీలును విశ్వసింపక సన్మార్గమునుండి మరలి విరోధము చేతను మోసముచేతను అట్లు చేయుచున్నారు. కావున వారి మోసమునకు విరోధమునకును భయపడకుఁడు. వారి కుటిలనుండి మిమ్ము రక్షించి విజయము నొసంగుటకు మీకు దేవుఁడే చాలును. ఆతఁడు సర్వమును వినును. సర్వము నెఱుంగుచున్నాఁడు. 138. యూదులు క్రైస్తవులును దేవుని వాక్యములను తిరస్కరించి ఇస్లామ్‌లో చేరకపోయిరి, మా యొద్ద రంగున్నది. ముసల్మానుల

వద్ద అట్టి రంగులేదని క్రైస్తవులు డంబములాడసాగిరి. క్రైస్తవులు ఒక పసుపు రంగుచేసి యుంచిరి. బిడ్డపుట్టిన లేక ఎవఁడైన ఇతరమతస్థుఁడు క్రైస్తవమతము అవలంబించిన, వానిని ఆరంగులో ముంచి పవిత్రమైన క్రైస్తవుఁడాయెనని చెప్పువాడుక వారికిఁగలదు. దానికిఁగాను ముసల్మానులతో ఓ ముస్లిములారా! మేము దేవుని సత్యమైన మతమగు ఇస్లామ్‌లో చేరి యారంగును (ఆత్మ శుద్ధిని) స్వీకరించి పవిత్రులమైతిమి. దేవుఁడొసంగిన రంగుకన్న వేఱు రంగులు శ్రేష్ఠమైనవా! కావు. మఱి మేము దేవునికి విధేయులమై ఆతనినే పూజించు చున్నారము. అని పలుకుఁడని బోధింపఁబడియె.

139. ఖుల్-అతు-హాజ్జూ-ననా-ఫిల్లాహి-వహువ- అబ్బునా - వఱబ్బు-కుమ్-వలనా-అఅ - మాలునా-వ-లకుమ్-అఅ - మా-లుకుమ్-వ-నహ్‌ను-లహూ ముఖ్‌లిసూన్. 140. అమ్-తఖూ-లూన-ఇన్న-ఇబ్-ఱాహీమ-వఇస్-మా-ఈల-వఇస్-హాఖ-వయఅ-ఖూబ-వల్-అస్-బాత-కానూ-హూదన్-ఔ - నసా-ఱా-ఖుల్-అ-అన్-తుమ్-అఅ-లము-అ-మిల్లాహు-వమన్-అజ్-లము-మిమ్మన్-కతమ-షహా-తదన్-ఇన్-దహూ-మినల్లాహి-వ-మల్లాహు-బి-గా ఫిలిన్-అమ్మా-తఅ-మలూన్.141. తిల్-క-ఉమ్మతున్-ఖద్-ఖలత్-లహా-మా-కసబత్-వ-లకుమ్-మా కసబ్-తుమ్-వలా-తుస్-అలూన-అమ్మా-కానూ-యఅ-మలూన్.

139. ఏమి, మీరు మాతో దేవుని విషయము వాదించుచున్నారా! మఱి ఆతఁడు మాకును ప్రభువు. మీకును ప్రభువు. మాకర్మములు మాకును, మీకర్మములు మీకును. మఱి మేము దేవుని వారలము మాత్రమే. అని ఓమహమ్మదు! పలకుము. 140. ఏమి మీరు, ఇబ్రాహీమును, ఇస్మాయీలును, ఇస్హాఖును, యాఖూబును, ఆతని పుత్రులను యూదులుగా లేక నసారీలుగా నుండిరి. అని పలుకుచున్నారా? మీరు ఎక్కువ తెలిసినవారా? లేక దేవుఁడా? దేవునివద్దనుండి ఋజువు అయిన సాక్ష్యమును దాఁచినవానికన్న ఎక్కువ దుర్మార్గుఁడు ఎవఁడున్నాఁడు? మఱి మీరుచేయు దానినుండి దేవుఁడు అజాగ్రత్తగాలేఁడు. 141. ఆజనులు గడచిపోయిరి. వారు చేసినది వారికొఱకే. మీరు చేసినది మీకొఱకే. వారుచేయుచున్న దానిఁగూర్చి మీరు ప్రశ్నింపఁబడరు.

వ్యా॥ 139. విగ్రహారాధకులును అవిశ్వాసులును ముసల్మానులతో దేవుని ఏకత్వము (తౌహీదు) గూర్చియు దేవుని యాజ్ఞలను అనుసరించు విషయములను గూర్చియు వాదించుచుండిరి. దానిని రద్దుచేయుటకై "దేవుఁడు

అందఱికిని ప్రభువును పోషకుఁడును. మేము చేయుకర్మల ఫలితము మాకు లభించును. ఓ విగ్రహారాధకులారా! మీరు చేయుకర్మల ఫలితము మీరు అనుభవింతురు. ముసల్మానులమైన మేము ఏకార్యముచేసినను దేవునికొఱకే చేయుదుము. ఎట్టి వ్యత్యస్తములును చేయము. మేము భక్తిపూర్వకముగా దేవునినే సేవింతుము'' అని పలుకుటకై దేవుని సెలవయ్యెను. 140. యూదులును, క్రైస్తవులును, ఇబ్రాహీము మొదలైన ప్రవక్తలు యూదులుగాను క్రైస్తవులుగానుండి రని చెప్పుచుండిరి. ఈ వాక్యములలో అది రద్దుచేయఁబడినది. దేవునికి సర్వము తెలియును. మీరు ఆతనికంటె ఎక్కువ తెలిసినవారు కారు. ఇబ్రాహీము మొదలగు ప్రవక్తలు, దేవుని మతమగు ఇస్లాము ననుసరించుచుండిరి. యూదమతముగాని, క్రైస్తవమతముగాని అవలంబించి యుండలేదు. ఇవి అన్నియు వారి పిదప ఏర్పడినవి. కావున ఇబ్రాహీము మొదలగు ప్రవక్తలు యూదులును క్రైస్తవులును కానేరరు. అనియు తౌరాతు ఇన్జీలులోనున్న వాక్యముల ననుసరించి ముహమ్మదు దేవుని ప్రవక్త అని దెలిసియు సాక్ష్యమియ్యక దానినిదాఁచువానికన్న నెక్కువ దుర్మార్గుఁడు ఎవఁడున్నాఁడు? ఎవఁడును లేఁడు. దేవునికి సర్వముదెలియును. మానవులు చేయుకర్మలనుండి అజాగ్రత్తగాఁలేఁడు. కర్మములనుబట్టి శిక్షవిధించును. అని మందలింపఁబడియె. 141. యూదులును క్రైస్తవులు మొదలైనవారును తమతమ పెద్దలు తమ్ము రక్షింతురు అని గర్వించి సత్కార్యములు అక్కఱలేవు అని మోసపోయి యుండిరి. అట్లు మోసపోకుఁడు ఎవరు చేసిన పాపపుణ్యములు వారే అనుభవింతురు. తల్లిదండ్రులుచేసిన పాపపుణ్యముల ఫలితమువారి బిడ్డలు అనుభవింపరు. అటులే బిడ్డలుగావించిన మంచి చెబ్బరల ఫలితము వారి పెద్దలు అనుభవింపరు. అని బాగుగా బోధపడుటకై మరల హెచ్చరింపఁ బడియె.

## రెండవ కాండము.

142 సయఖూలుస్-సుఫ-హాఉ-మినన్-నాసి-మా-వల్లా-హుమ్-అన్-ఖిబ్‌లతిహి-ముల్-లతీ-కానూ-అలైహా-ఖుల్-లిల్లాహిల్-మష్-రిఖు-వల్-మగ్రిబు-యహ్దీ-మన్-యషాఉ-ఇలా-సిరాతిమ్-ముస్తఖీమ్. 143. వకజాలిక-జ-అల్నాకుమ్-ఉమ్మతన్-వసతల్-లితకూనూ-షుహ-దాఅ-అలన్నాసి-వయకూ-నర్ రసూలు-అలైకుమ్-షహీదన్-వమా-జఅల్-నల్ ఖిబ్-లతల్-లతీ-కున్త-అలైహా-ఇల్లా-లినఅ-లమ-మన్-యుత్-తబి-ఉర్-రసూల-మిమ్మన్-యన్-ఖలిబు-అలా-అఖిబై-హి-వఇన్-కానత్-లకబీ-రతున్-ఇల్లా-అలల్ల-జీన-హదల్లాహు-వ

మా-కానల్లాహు-లియుజీఅ-ఈమా-నకుమ్-ఇన్నల్లా-హా-బిన్నాసి-లరఊఫుర్-రహీమ్.

142. ఇఁకమీద మూఢజనులు, ముందున్న తమ ఖిబ్లానుండి ముసల్మానులను, ఏదిమరలించెనని చెప్పుదురు. తూర్పు పడమరదిక్కులు దేవునివే ఆతఁడు తాను కోరినవారికి సన్మార్గము చూపును అని ఓ ముహమ్మదు! పలుకుము.

143. మఱియు నిటులే మీరు జనులకు సాక్షులగుటకును, ప్రవక్త మీకు సాక్షిగానుండుటకును మిమ్ము మధ్య సంఘముగాఁ జేసితిమి. మఱియు, ఎవరు, ప్రవక్తను అనుసరింతురో, ఎవరు అనుసరింపక తిరిగిపోవుదురో అనునది పరీక్షించుటకు నీవు అనుసరించుచుండిన ఖిబ్లాను మార్చితిమి. నిశ్చయముగా నిది భారమైనది. కాని దేవుఁడు సన్మార్గము చూపినవారికిది భారముకాలేదు. మఱి దేవుఁడు మీ విశ్వాసమును వృథాచేయునట్టి వాఁడుకాఁడు. నిశ్చయముగా దేవుఁడు జనులపై కనికరముగల వాఁడును, అనుగ్రహము గలవాఁడును.

వ్యా॥ 142. నమాజు ప్రార్థనలలో ఏదిక్కునకు ముఖముచేయుదురో ఆవైపును ఖిబ్లాఅనుదురు. కాబామసీదు ఖిబ్లాగా నియమింపఁబడక పూర్వము ముసల్మానులు బైతుల్ ముఖద్దస్ ఉండు దిక్కునకు ముఖముచేసి నమాజు సలుపుచుండిరి. ఇస్రాయీలియుల ప్రవక్తలందఱు బైతుల్ ముఖద్ధస్ దిక్కునకు ముఖముచేసి ప్రార్థనలు సలుపుచుండిరి. హజ్రత్ ఇబ్రాహీము, ఇస్మాయీలు, ప్రవక్తలకు కాబామసీదు ఖిబ్లాగానుండెను. హజ్రత్ ముహమ్మదువారుకూడ కాబామసీదు ఖిబ్లాగానుండవలెనని కోరుచుండిరి. దేవుఁడు ఈ వాక్యములలో ఖిబ్లాను మార్చుటలో సంభవించు విషయములను ముందుగానే దెలుపుచున్నాఁడు. మూఢులైన యూదులును, విగ్రహారాధకులును వంచకులును ముసల్మానుల ఖిబ్లా ఎందుకు మాఱినది. వీరికి మతములో స్థిరములేదు. కాఁబోలు అను సందేహములు పుట్టింతురు. కావున దానికి జవాబుకూడ నిందు తెలుపఁబడినది. ప్రత్యేకమైన ఒక దిక్కులో ఏమియు మహిమలేదు, అన్నిదిక్కులు దేవునివే. ఆతఁడు ఏదిక్కును ఖిబ్లాగా నియమించునో భక్తులు దేవుని సెలవుననుసరించి ఆదిక్కునకు ముఖముచేసి ప్రార్థనలు (నమాజు) సలుపవలెను. దాని రహస్యము నెవరు ఎఱుఁగగలరు. దేవుఁడు తాను ఇష్టపడిన వారికి సరియైన ధర్మమార్గము చూపును. ముందుగానే రాఁబోవు విషయము, బోధింపఁబడుటచే ముసల్మానులకు విరోధుల సందేహముల వలన నష్టము గలుగక మరింత విశ్వాసము బలపడెను. ఒక మతము ననుసరించువారు ప్రార్థనలలో ఒకే దిక్కున ముఖముచేసి నిలుచుటలో వారియందు ఐకమత్యము కుదురును. ఐకమత్యము సమస్త విజయములకు మూలాధారము.

వాక్య॥ 143. ఎట్లు కాబామసీదును మీకొఱకు సర్వశ్రేష్ఠమైన ఖిబ్లాగా నియమించి మీకు సన్మార్గము చూపితిమో అటులే మీరు మీసత్ప్రవర్తనము వలన హెచ్చుతగ్గులులేనివారలై జనులకు సాక్షులగుటకుగాను మిమ్ము మధ్యస్థులుగాఁ జేసితిమి. మఱి మిమ్ముగూర్చి ముహమ్మదు ప్రవక్త సాక్ష్యమిచ్చును. ధర్మమునందు హెచ్చు తగ్గులు లేకుండ నుండుటయే ఉత్తమము. ఇస్లామునకు ముందున్న మతస్థులు కొందఱు ఆత్మశుద్ధిని వదలి దేహసౌఖ్యమునే పోషించుకొనుచు పశుప్రాయులై యుండిరి. అట్టివారు యూదులు మొదలైనవారు. మఱికొందఱు దేహమును హింసించుచు అనేక బాధలుపడి సంసారమును వదలి అడవులలోనే వసించి ఆత్మనుగూర్చి కృషిసలుపుచుండిరి. ఈరెండుమార్గములకు మధ్య ఇహమును, పరమును దేహమును ఆత్మను, పాటించువారు శ్రేష్ఠులు. ఇట్టిది ఇస్లామ్ బోధించుమార్గము. దీని ననుసరించియే ముసల్మానులను మధ్యస్థమైన మతముగలవారినిగా నియమించెనని దేవుఁడు సెలవిచ్చెను. హజ్రత్ ముహమ్మదువారు ముసల్మానులకు మార్గదర్శకులు గావున వారు ఉత్తమోత్తములు. తీర్పుదినమునందు కూడ నూహు మొదలైన ప్రవక్తల మతస్థులు, వారు మాకు బోధించలేదని దేవుని సమ్ముఖమున వారిని తిరస్కరింతురు. అపుడు ముసల్మానులు ప్రవక్తల పక్షమున వారు మతప్రచారము చేసినట్లు సాక్ష్యమిత్తురు. ముహమ్మదు ప్రవక్తవారు ముసల్మానులిచ్చిన సాక్ష్యము వాస్తవము అని సాక్ష్యమిత్తురు. ఈవిషయము దేవుని గ్రంథమగు ఖురానెషరీఫువలన దెలిసినదని ముసల్మానులు పలుకుదురు. హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్త కాలమునుండియు కాబామసీదే ఖిబ్లాగానుండెను. అటులే స్థిరముగా ఎప్పటికిని ముసల్మానులకు ఖిబ్లా కాబామసీదే కాని కొన్ని నెలలవఱకు బైతుల్ ముఖద్దస్ ఖిబ్లాగా నియమింపఁబడెను. దానికి కారణము దేవుఁడు ఈ వాక్యములలో తెలుపుచున్నాఁడు. ఇది ఒక పరీక్షగా నుండెను. స్థిరబుద్ధి విశ్వాసముగల భక్తులు దేవుని ఆజ్ఞ ఎట్లుండునో అట్లు నడువవలెనని ప్రవక్తను అనుసరించిరి. కాని కొందఱు వంచకులు తమ అవిశ్వాస రోగముచే సందేహములు గలిగి సన్మార్గమునుండి వెనుకకు మరలిపోయిరి. వంచకులు, భక్తులతో కలసిమెలసియుండిరి. ఈ పరీక్షవలన వంచకులును భక్తులును వేఱుపడిరి. ఈ విషయము దేవునికి ముందుగానే తెలిసినను లోకములో ప్రజలకు ఎవరు భక్తులు ఎవరు వంచకులు అనువిషయము తేటపడుటకు మొదటి ఖిబ్లా మార్చఁబడెను. ఇట్టి మార్పు సామాన్యముగా ప్రజలకు కష్టముగాఁదోఁచును. కాని దీని రహస్యములు దెలిసి సన్మార్గమందు స్థిరముగా నున్నవారికి నెట్టికష్టముగాని భారముగాని తోఁచదు. దేవునాజ్ఞను శిరసావహించుటయే వారి ధర్మము. బైతుల్ ముఖద్దసు వైపున విశ్వాసపూర్వకముగా సలిపిన నమాజులును, ఈ మార్పు

నందు గలిగిన విశ్వాసము వృథాపోదు. దానిఫలితము దేవుని సమ్ముఖమున మీకు లభించునని దేవుఁడు ముసల్మానులకు సెలవిచ్చుచున్నాఁడు. అనుగ్రహమును కనికరమును దయయును గల దేవుఁడు మీ విశ్వాసమును వృథాచేయఁడు. అని ఆఖరువాక్యమువలన సూచింపఁబడియె.

144. ఖద్-నరా-త-ఖల్లుబ-వజ్-హిక-ఫిస్-సమా ఇ-ఫల-నువల్లి-యన్నక ఖిబ్-లతన్-తర్-జాహా-ఫ వల్లి-వజ్-హక-షత్-రల్-మస్-జిదిల్-హరామి-వ హైసు-మా కున్తుమ్-ఫ వల్లూ-వుజూ-హకుమ్-షత్ రహూ-వ-ఇన్నల్లజీన-ఊ తుల్-కితా బ-లయఅ లమూన-అన్న హుల్-హక్ఖు-మిర్-అబ్బిహిమ్-వ- మ ల్లాహు-బిగా-ఫిలిన్-అమ్మా-యఅ-మలూన్.

144. నిశ్చయగా మాటిమాటికి ఆకాశము వైపున నీవు ముఖము నెత్తుటను మేము చూచుచున్నాము. కావున నీవుసంతసము నొందునట్టి ఖిబ్లా వైపునకు నిన్ను త్రిప్పెదము. నీవు మస్ జిదెహరామ్ దిక్కునకు నీముఖము చేయుము. మఱి మీరు ఎచ్చటనుండినను దానివైపునకే మీముఖములను త్రిప్పుఁడు. మఱి గ్రంథములుగలవారు అది తమ దేవుని వద్దనుండివచ్చిన సత్యము అని యెఱుంగుదురు. మఱియు దేవుఁడు వారుచేయు కర్మలనుండి అజాగ్రత్తగలేఁడు.

వ్యా॥ 144. హజ్రత్ ముహమ్మదు పైగంబరుల వారు హజ్రత్ ఇబ్రాహీము ననుసరించువారు. ఇబ్రాహీము ప్రవక్తగారి ఖిబ్లా కాబామసీదు. దీనిఁ బట్టి హజ్రత్ ముహమ్మదు రసూలువారును తమ ఖిబ్లా కాబామసీదు ఏర్పడవలెనని కోరుచు దేవుని సెలవుకై దేవునిదూత ఆకాశమునుండి ఉత్తరువు దెచ్చునేమో అని దానితట్టు ముఖము నెత్తి మాటిమాటికి చూచుచుండిరి. దేవుఁడు ఈ విషయమునే తెలియఁజేయుచు సంతసము గలిగించునట్టి ఖిబ్లా వైపునకు ముఖముచేయునట్లు సెలవు నొసంగుదునని చెప్పి మస్ జిదెహరామ్ (కాబామసీదు) వైపునకు నమాజులలో ముఖము త్రిప్పునట్లు సెలవు నొసంగెను. ఇట్లు ఎచ్చటనుండినను అందఱు ముసల్మానులు తమతమ ప్రార్థనలలో కాబా మసీదు దిక్కునకు ముఖము చేయవలెను. కాబామసీదును మస్ జిదె హరామ్ అందురు. హరామ్ అనగా నిషిద్ధము. మసీదు సరిహద్దులలో యుద్ధమాడుట, వేఁటాడుట, చెట్లు గడ్డికోయుట మొదలైనవి నిషేధింపఁబడినవి. గ్రంథము గలవారు యూదులు, క్రైస్తవులు. వీరినే అహ్లెకితాబ్ అందురు. వీరు ఖిబ్లా మార్పును గూర్చి వాదులాడుదురు. కాని ఆఖరు ప్రవక్తయగు ముహమ్మదు వారి ఖిబ్లా కొన్ని దినములు బైతుల్ ముఖద్దసుగా నుండును. పిదప స్థిరముగా కాభామసీదు ఖిబ్లాగా నియమింపఁబడును అను విషయము వారికి తెలియును.

ఇట్లు సంభవించునని వారి గ్రంథములలో ప్రవక్తలు ప్రకటించియున్నారు. వారికి నిది వాస్తవమని తెలిసియు అసూయచే ముసల్మానులతో వాదులాడుదురు. కావున వారి పలుకులను లెక్క పెట్టకుఁడు. వారి కర్మలను దేవుఁడు ఎఱుఁగును. ఆకర్మల ఫలితము వారికి నొసంగును.

145. వల-ఇన్-అతైతల్లజీన-ఊతుల్-కితాబ-బి-కుల్లి-ఆయతిన్-మా-తబిఊ-ఖిబ్-లతక-వమా-అన్‌త-బితా-బిఇన్-ఖిబ్-లత-హుమ్-వమా-బఅ-జుహుమ్-బితా-బిఇన్-ఖిబ్-లత-బఅ-జిన్-వల-ఇనిత్ తబఅ-త-అహ్వా-అహుమ్-మిమ్-బఅ-ది-మా-జా-అక-మినల్-ఇల్మి-ఇన్నక-ఇజ్-ల-లమినజ్-జాలిమీన్.

145. మఱియు నీవు సకలసూచనలను గ్రంథముగలవారి యొద్దకుఁ దెచ్చినను నీ ఖిబ్లాను వారు అనుసరింపరు. మఱి నీవును వారి ఖిబ్లాను అనుసరింపఁజాలవు. మఱి వారిలో నొకరి ఖిబ్లా నొకరు అనుసరింపరు. మఱియు నీకు జ్ఞానమువచ్చిన పిదపను నీవు వారి కోరికలను అనుసరించినచో నిశ్చయముగా నీవును, అన్యాయముచేయువారిలో చేరిన వాఁడవగుదువు.

వ్యా॥ 145. యూదులును క్రైస్తవులును సన్మార్గమవలంబించిన బాగుగానుండునని హజ్రత్ రసూలువారు, ఇష్టపడుచుండిరి. దానిఁగూర్చి దేవుఁడు, "ఓ ప్రవక్త! నీవెన్ని సూచనలు వారికిఁ దెచ్చియిచ్చినను వారు తమ ద్వేషము వదలి నీ ఖిబ్లాయగు కాబామసీదును అనుసరింపరు. నీవు దేవుని సెలవు ప్రకారము కాబామసీదు ఖిబ్లాను వదలి వారి ఖిబ్లాను అనుసరింపఁ జాలవు. యూదులు క్రైస్తవులు ఒకరి ఖిబ్లాను ఒకరు అనుసరింపరు. వారు వేఱువేఱు ఖిబ్లా గలిగియున్నారు. యూదులు మొదలైనవారు తమ కోర్కెల వైపునకు నిన్ను మార్చుటకు యత్నింతురు. కాని నీవట్లుచేయవు. అయిన ఒకవేళ నీకు దేవునిచే జ్ఞానములభించిన పిదపను వారి తప్పుకోరికలను నీవు అనుసరించినచో నీవు అన్యాయముచేయు వర్గములో చేరుదువు." అనెను. ఇందు సకల ముసల్మానులకు హెచ్చరిక యున్నది. దేవుని ధర్మములనే అనుసరింపవలెను, మానవులు తమ ఇష్టానుసారముగా పోఁగూడదు.

146. అల్లజీన-ఆతైనాహు-ముల్-కితాబ-యఅ-రిఫూ-నహూ-కమా-యఅ-రిఫూన-అబ్నా-అహుమ్-వ-ఇన్న-ఫరీ-ఖమ్-మిన్-హుమ్-లయక్-తుమూనల్-హఖ్-ఖ-వహుమ్-యఅ-లమూన్, 147. అల్-హఖ్ఖు-మిర్-రబ్బిక-ఫలా-తకూ-నన్న-మినల్-ముమ్-తరీన్.

146. మేమెవరికి గ్రంథము నొసంగితిమో వారు తమ పుత్రుల నెట్లు

గుర్తింతురో అట్లు ఆయనను గుర్తించుచున్నారు. నిశ్చయముగ వారిలో కొందఱు తెలిసియు సత్యమును దాఁచుచున్నారు. 147. నీ ప్రభువు సెలవిచ్చునదియే సత్యము. కావున నీవు సందేహించు వర్గములో చేరకుము.

వ్యా॥ 146. దేవునిచే గ్రంథము పొందినవారలగు యూదులును క్రైస్తవులును తమతమ మత గ్రంథములగు తౌరాతు, ఇన్జీలు,(బైబిలు)లో రాఁబోవు ఆఖరు ప్రవక్తనుగూర్చి ప్రకటింపఁబడిన గుర్తులను విషయములను హాజ్రత్ ముహమ్మదు ప్రవక్తవారియందు సంపూర్ణముగా నున్నవని గుర్తించి కొందఱు విద్వాంసులు విశ్వసించిరి. మఱి కొందఱు విశ్వసింపకపోయిరి. ఎట్లు తమ పుత్రులను గుర్తించుటలో సందేహముండదో అటులే ముహమ్మదు వారు ఆఖరు జగత్ ప్రవక్తయని గుర్తించుటలో సందేహముండదు. అయిన కొందఱు అసూయా ద్వేషములచే నిజము తెలిసియు నమ్మకపోయిరి. 147. నిజము దేవుని సందేశము(వహీ)వలన తెలియునది. ఇది దేవునాజ్ఞ. కావున మూఢుల సందేహములనులెక్క పెట్టకూడదు. ఇందుముసల్మాను భక్తులకు హెచ్చరికగలదు.

148. వలికుల్లిన్-విజ్‌హతున్-హువ-ముపల్లీహా-ఫస్-తబి-ఖుల్-ఖైరాతి-ఐన-మా-తకూనూ- యాతి-బికుముల్లాహు-జమీ-అన్-ఇన్నల్లాహ-అలా-కుల్లి-షై-ఇన్-ఖదీర్.

148. మఱి ప్రతివారికి నొక దిక్కున్నది. వారు దాని వైపునకు ముఖము చేయుదురు. కావునమీరుసత్కార్యములలో మించిపోవుఁడు. మీరెచ్చటనుండినను దేవుఁడు మిమ్ములనుచేర్చును. నిశ్చయముగా దేవుఁడు సర్వముపై శక్తిగలవాఁడు.

వ్యా॥ 148. ప్రతి మతమువారును తమతమ ప్రార్థనలలో ఏదో యొక వైపునకు ముఖముచేయుదురు. యూదులు ఒక దిక్కునకు, క్రైస్తవులు మఱొక దిక్కునకు ముఖము చేయుదురు. ప్రార్థనలో ఏదిక్కునకు ముఖముచేసిననేమి? అది మతమునకు మూలధర్మముకాదు. ఇట్టివిషయములోవాదులాడుచు, మతము యొక్క ముఖ్యోద్దేశములైన సత్కార్యములు వదలుట ఉత్తమముగాదు. కావున ఓముసల్మానులారా! మీరుసత్కార్యములు పుణ్యధర్మములు చేయుటలో ఒకరినొకరు మించిపోవుటకుయత్నింపుఁడు. ఇదియే శ్రేష్ఠమైనది. ఇదియే యుభయ లోకములలో పనికివచ్చునది. మీరెచ్చటనుండి ఏదిక్కునకు ముఖముచేసి ప్రార్థించినను, తీర్పుదినము (ఖియామతు) నందు దేవుఁడు మీయందరిని ఒక్కచోట చేర్చి మీమీ కర్మల తీర్పుచేయును. ఇట్లు చేయుటకు దేవునికి శక్తిగలదు. ఆతఁడు సర్వశక్తుఁడు.

149. వమిన్-హైసు-ఖరజ్త-ఫవల్లి వజ్-హక-షత్-రల్- మస్జిదిల్-

హరామి-వఇన్నహూ-లల్ హఖ్ఖు-మిర్ - అబ్బిక-వమల్లాహు-బిగాఫిలిన్-అమ్మా-తఅ్-మలూన్. 150. వమిన్-హైసు-ఖరజ్త-ఫవల్లి-వజ్హక-షత్రల్-మస్-జిదిల్-హరామి-వ హైసు-మాకున్తుమ్-ఫవల్లూ-వుజూహకుమ్-షత్రహూ-లిఅల్లా-యకూన-లిన్నాసి-అలైకుమ్-హుజ్జతున్-ఇల్-లల్లజీన-జలమూ-మిన్హుమ్ ఫలా-తఖ్షౌహుమ్-వఖ్షౌనీ-వలి-ఉతిమ్మ-నిఅమతీ-అలైకుమ్-వల-అల్లకుమ్-తహ్-తదూన్.

149. మఱి నీవు ఎచ్చటనుండి బయలుదేరినను నీముఖము మస్జిదెహరాము దిక్కునకు చేయుము. మఱియు నిది నిశ్చయముగా నీప్రభువునుండి వచ్చిన సత్యము. మఱి దేవుఁడుమీరుచేయు కర్మలనుండి అజాగ్రత్తగాలేఁడు. 150. మఱిమీరు ఎచ్చటనుండి బయలుదేఱినను మస్జిదెహరామ్ దిక్కునకు ముఖముచేయుడు. మఱియు మీలో జనులు వాదులాడకుండుటకై మీరెచ్చట నుండినను దానివైపునకే ముఖముచేయుఁడు. కాని వారిలోని అన్యాయవాదులకు జంకకుఁడు, నాయందు భయభక్తులుగలిగియుండుఁడు. మఱి మీపై నాయనుగ్రహమును పూర్తిచేయుటకును, మీరు సన్మార్గము పొందుటకును (ఖిబ్లా నియమించితిమి).

వ్యా॥ 149: 150. ఖిబ్లా విషయములో మొట్టమొదటి మార్పు గావున పలుమార్లు నొక్కి చెప్పవలసియున్నది. అదియును గాక ఎచ్చట నుండినను ఏపురములో నుండినను సర్వకాలములందును కాబా మసీదు(మస్జిదెహరామ్) దిక్కునకు ముఖము చేసి ప్రార్థనలు సలుపవలెనని ధర్మము విధింపఁబడియె. యూదులు మొదలగు జనులు ఈవిషయము వాదులాడకుండుటకు అట్లు చేయవలెను. ఎందుకన తౌరాతు గ్రంథములో ఆఖరు ప్రవక్తయొక్క ఖిబ్లా ఇబ్రాహీము ప్రవక్తను అనుసరించి కాబామసీదు అగునని యుండెను. కాబామసీదు ఖిబ్లాగా కాకున్నచో యూదులు వాదులాడఁగలరు. ఈజనులలో అవిశ్వాసులగు ఖురైషులు మొదలైనవారు అన్యాయముగా వాదింతురు. వారి నిందలకు లెక్కపెట్టక, జంకక, దేవునికే భయపడవలెనని ముసల్మానులకు బోధింపఁబడియె. ముసల్మానులపై దేవుని యనుగ్రహము పూర్తియగుటకుగాను, వారు ధర్మమార్గము పొందుటకుగాను, ముందున్న ఖిబ్లామార్చఁబడి కాబా మసీదు ఖిబ్లాగా నియమింపఁబడియెను.

151. కమా-అర్-సల్నా-ఫీకుమ్-రసూలమ్-మిన్-కుమ్-యత్లూ-అలైకుమ్-ఆయాతినా-వ-యుజక్కీకుమ్-వయుఅల్లి-ముకుముల్-కితాబ-వల్-హిక

త-వ-యు-అల్లిముకుమ్-మాలమ్-తకూనూ-తఅ్‌లమూన్. 152. ఫజ్‌-కురూనీ-అజ్‌-కుర్‌-కుమ్ వష్కురూ-లీ-వలా-తక్‌-ఫురూన్.

151. ఎట్లు మీలోనుండి మా సూచన (వాక్యము)లు మీ యెదుట చదువు నట్టియు మిమ్ములను పవిత్రులుగాఁజేయునట్టియు, మీకు గ్రంథమును దాని రహస్యములును నేర్పునట్టియు, మీకుఁ దెలియని వానిని నేర్పు నట్టియు ఒక ప్రవక్తను మీయొద్దకుఁ బంపితిమో అటులే మా యను గ్రహము పూర్తి చేసితిమి. 152. కావున మీరు నాకు జ్ఞప్తి చేయుఁడు, నేనును మీకు జ్ఞప్తి చేయుదును. మఱి కృతజ్ఞత చెల్లింపుఁడు, కృతఘ్నులు కాకుండుఁడు.

వ్యా॥ 151, 152. దేవుఁడు హజ్రత్ ముహమ్మదువారినీ ఖురైషులవంశములోనే పుట్టించి వారిని ప్రవక్తగాఁజేసి వారి యొద్దకుఁబంపి వారిని బోధించి ఖురాను గ్రంథము దాని రహస్యములు దెలిపి ప్రజలయందున్న దురాచారములను చెడుగుణములను పోఁగొట్టి సుగుణవంతులనుగాఁజేసి పవిత్రుల గావించెను. ఇది గొప్ప మేలు. ఇటులే ఖిబ్లాను మార్చి అనుగ్రహము పూర్తి చేయఁబడెనని చెప్పఁబడియె. ఇట్టిమేలును మఱవక, ఎల్లపుడు దేవునికి జ్ఞప్తి చేసి యతనిని ధ్యానింపవలెను. ఇట్లుచేసిన దేవుఁడుకూడ తన భక్తులను జ్ఞప్తి యందుంచుకొని వారిని తన అనుగ్రహముచే సంపూర్ణులనుగాఁ జేయును. ఈ విషయము ఎంతో గొప్పదిగదా! భక్తులు ఎల్లపుడు దేవుని మేలును మఱవక కృతజ్ఞులై యుండవలెను. దేవుని మేలును మఱచుట మహాపాపము.

153. యా-అయ్యు-హల్లజీన-ఆమనుస్‌-తఈనూ-బిస్‌-సబ్‌రి-వస్-సలాతి-ఇన్నల్లాహ-మఅస్-సాబిరీన్. 154. వలా-తఖూలూ-లిమన్‌-యుఖ్-తలు-ఫీ-సబీ-లిల్లాహి-అమ్-వాతున్-బల్‌-అహ్-యా-ఉన్-వలాకిల్‌-లాతష్-ఉరూన్.

153. ఓ విశ్వసించిన వారలారా! ఓర్పుతోను, నమాజుతోను సహాయము కోరుఁడు. (పొందుఁడు). నిశ్చయముగా దేవుఁడు ఓర్పుగల వారితో నున్నాఁడు. 154. మఱి దేవునిమార్గమందు చంపఁబడినవారిని మృతులని చెప్పకుఁడు, వారు సజీవులుగా నున్నారు. కాని మీరు గ్రహింపఁజాలరు.

వ్యా॥ 153,154. మానవుఁడు కష్టమో సుఖమో పొందుచుండును. సుఖము పొందినపుడు దేవుని కృతజ్ఞతలు చెల్లింపవలెను. కష్టములు గలుగు నపుడు, నిరుత్సాహము చెందక దేవునిని ప్రార్థించుచు ఓర్పుగలిగి యుండవలెను. ప్రార్థనవలన ఓర్పువలన కష్టములు తేలికనై పోవును. సహనమనునది గొప్ప విషయము. సహించువారికి దేవుఁడు తోడుగా నుండును. ధర్మమార్గ

మందు దేవుని కొఱకు కష్టములు సహించి దుష్టులచే వధింపఁబడు భక్తులు మృతులుగారు. వారు దేవుని సన్నిధానమున సజీవులుగా నున్నారు. ఈ విషయము ప్రజలకు గోచరింపదు. ధర్మమార్గమందు వధింపఁబడిన వారిని షహీదులు అనుదురు. ఇది గొప్ప పదవి.

155. వలనబ్‌లువన్నకుమ్-బిషైఇమ్‌మినల్‌ఖౌఫి-వల్‌జూఇ-వనఖ్-సిమ్‌మినల్‌అమ్‌వాలి-వల్‌అన్‌ఫుసి-వస్‌సమరాతి-వబష్‌షిరిస్-సాబిరీన్. 156. అల్లజీన-ఇజా-అసాబత్‌హుమ్-ముసీబతున్‌ఖాలూ-ఇన్నా-లిల్లాహి- వ ఇన్నా-ఇలైహి-రాజి-ఊన్. 157. ఉలా-ఇక-అలైహిమ్-సలవాతుమ్- మిర్-అబ్బిహిమ్-వరహ్మతున్-వఉలా-ఇక-హుముల్-ముహ్‌తదూన్.

155. మఱియు నిశ్చయముగా కొద్ది భయముతోను, ఆఁకటితోను, ధన, ప్రాణఫలములతోను, మిమ్ము పరీక్షింతుము. 156. మఱి ఆపద కలుగునపుడు మేము దేవుని వారలమే.తుదకు ఆతని యొద్దకే పోవువారలమే. అని చెప్పుచు సహించునట్టి వారికి సంతోషవార్త నిమ్ము. 157. ఇట్టి వారి పైననే వారి ప్రభువునుండి అనుగ్రహము దయయు నున్నవి. మఱి వీరే సన్మార్గము పొందినవారు.

వ్యా॥ 155, 156, 157. శత్రులవలని భయముచే, ధర్మ మార్గమందు ధనము పోవుటచేఁగలుగు ఆకటిబాధచే, ప్రాణధన, ఫలనష్టములచే భక్తులు పరీక్షింపఁబడుదురు. అపుడు సర్వమును మేమును దేవుని సొత్తులము. సర్వము ఆతనిదే. తుదకు మేము ఆతనియొద్దకే మరలుదుము. అని చిత్తశాంతి పొంది సహించువారికి దేవునిదయ అనుగ్రహము గలుగును అని సంతోషవార్త ఇయ్యఁబడినది. ఇట్టి ఓర్పు భక్తిగలవారె నిజమైనభక్తులు అని హెచ్చరింపఁబడియె.

158. ఇన్నస్-సఫా-వల్-మర్‌వత-మిన్‌షఆ-ఇరిల్లాహి-ఫమన్-హజ్జల్‌బైత-అవిఅ-తమర-ఫలా-జునాహ-అలైహి-అన్-యత్‌తవ్వఫ-బిహిమా - వమన్‌తతవ్వఅ-ఖైరన్‌ఫ ఇన్నల్లాహ-షాకిరున్‌అలీమ్.

158. నిశ్చయముగా, సఫా, మర్వాయందు దేవుని సూచన (గుర్తు) లున్నవి, కావున ఎవరు, కాబావసీదు (దేవునిగృహము) యాత్రచేయుదురో లేక ఉమ్రాచేయుదురో వారు ఈ రెంటిమధ్య ప్రదక్షిణించినచో వారికెట్టి దోషములేదు. మఱెవఁడు తనసంతోషముతో సత్కార్యముచేయునో దేవుఁడు వాని ఫలితము నొసఁగువాఁడును సర్వజ్ఞుఁడును.

వ్యా॥ 158. సఫా, మర్వా అను కొండను మక్కా పురమునందు కాబా

మాసీదునకు సమీపముననున్నవి. పూర్వమునుండి కాబాయాత్ర(హజ్)యును దాని దర్శనమును (ఉమ్రా)చేయువారు ఆ రెంటిమధ్య ప్రదక్షిణించుచుండిరి. ఇప్పుడు ముసల్మానులు కూడ అట్లు చేయవలెను. అందు దోషములేదు. అవి దేవుని సూచనలు. అచ్చట భక్తిపూర్వకముగ ప్రదక్షిణింపవలెను. మఱెవరు స్వేచ్ఛగా సత్కార్యములు చేయుదురో వారికి వాని ఫలితమిచ్చును. దేవునికి సర్వము దెలియును.

159. ఇన్నల్లజీన-యక్-తు-మూన-మా-అన్-జల్నా-మినల్-బయ్యినాతి-వల్-హుదా-మిమ్-బఅ్-ది-మా-బయ్యన్నా-హు-లిన్నాసి-ఫిల్-కితాబి-ఉలా-ఇక-యల్-అను-హుముల్-లాహు-వయల్-అను-హుముల్-లాఇ-నూన్. 160.ఇల్-లల్లజీన-తాబూ-వ-అస్-లహూ-వ-బయ్యనూ-ఫ-ఉలా-ఇక-అతూబు-అలైహిమ్-వ-అనత్-తవ్వాబుర్-రహీమ్. 161. ఇన్నల్లజీన-కఫరూ-వమాతూ-వహుమ్-కుప్ఫారున్-ఉలాఇక-అలైహిమ్-లఅ్-నతుల్లాహి-వల్-మలా-ఇకతి-వన్నాసి-అజ్-మఈన్. 162. ఖాలి-దీన-ఫీహా-లా యు-ఖఫ్-ఫఫు-అన్-హుముల్-అజాబు-వలాహుమ్-యున్-జరూన్.

159. నిశ్చయముగా నెవరు, మేము పంపిన స్పష్టమైన సూచనలను ధర్మములను, ప్రజలకొఱకు గ్రంథములో స్పష్టపఱచిన పిదపను, దాచుచుందురో వారిని దేవుఁడును శపించును. అందఱును శపించుచున్నారు. 160.కాని ఎవరు క్షమాపణ వేఁడి తమ కర్మలను దిద్దుకొని సత్యమును వెల్లడించిరో నేను వానిని క్షమించుచున్నాను. మఱి నేను క్షమించువాఁడను, దయగలవాఁడను. 161. నిశ్చయముగా నెవరు అవిశ్వాసులై ఆ యవిశ్వాసములోనే మృతినొందిరో వారిపై దేవుని యొక్కయు, దేవదూతల యొక్కయు, సర్వమానవుల యొక్కయు శాపమున్నది. 162. వారు ఆ శాపమనుభవించుచు చిరకాలముందుదురు. వారికి నరకబాధ తగ్గింపఁబడదు మఱి వారికి విరామము లభింపదు.

వ్యా॥ 159: 162 దేవుఁడు తౌరాతు గ్రంథములో ముహమ్మదు ప్రవక్తను గూర్చి స్పష్టమైన సూచనలు ప్రకటించి యుండెను. వానిని యూదులు దాఁచిరి. సత్యము దాఁచుట వలన ఘోరపాతకము లభించును. అట్టివారు శాపమునకు అర్హులు. దేవుఁడే గాక జీవులును అట్టిపాపులను శపింతురు. లేకున్న వారి పాపఫలితముగ అందఱికిని బాధ గలుగును. ఇట్లున్నప్పటికిని ఎవరు తమ పాపములకు పశ్చాత్తాపపడి దేవుని క్షమాపణ కోరుదురో వారు దేవునిచే క్షమింపఁబడి దేవుని దయకు పాత్రులగుదురు. ఎందుకన దేవుఁడు క్షమించువాఁ

డును, దయగలవాఁడును. అట్లు క్షమాపణ కోరక ఎవరు సత్యమును దాఁచి దేవుని తిరస్కరించి అవిశ్వాసస్థితిలోనే మృతి నొందుదురో వారు దేవుని శాపమునకు అర్హులై నరక నివాసులగుదురు. ఆ నరకబాధ తగ్గదు. ఎట్టి విరామమును వారికి లభింపదు.

163. వ-ఇలాహుకుమ్-ఇలాహున్-వాహిదున్-లా-ఇలాహ-ఇల్లాహువర్-రహ్మానుర్-రహీమ్.

163. మఱి మీ పూజ్యుఁడగు దేవుఁడు ఒక్కఁడేను. ఆతఁడు దప్ప వేఱు దేవుఁడులేఁడు. ఆతఁడు అమితదయగలవాఁడును, ప్రేమించువాఁడును.

వ్యా॥ 163. ఇందు దేవుని ఏకత్వము చెప్పఁబడెను. ఇకముందు వాక్యములలో దేవుని ఏకత్వమును రుజువుపఱచునట్టి సూచనలు తెలుపఁబడుచున్నవి.

164. ఇన్న-ఫీఖల్-ఖిస్-సమావాతి-వల్-అర్-జి-వఖ్-తిలాఫిల్-లైలి-వన్-నహారి-వల్-ఫుల్-కిల్లతీ-తజ్-రీ-ఫిల్-బహ్రి బిమా-యన్-ఫ-ఉన్నాస-వమా-అన్-జలల్లాహు-మినస్-సమా ఇ-మిమ్-మా ఇన్-ఫ-అహ్యా-బిహిల్-అర్‌జ-బఅ-ద-మౌతిహా-వ-బస్స-ఫీహా-మిన్-కుల్లి-దాబ్బతిన్-వతస్-రీఫిర్-రియాహి-వస్-సహాబిల్-ముసఖ్-ఖరి-బైనస్-సమా ఇ-వల్-అర్-జి-లఆయాతిల్-లిఖౌ-మిన్-యఅ-ఖిలూన్.

164. నిశ్చయముగా ఆకాశమును భూమిని సృష్టించుటయందును, రాత్రింబవళ్లు మాఱుటయందును, ప్రజలకు నుపయోగకరములైన వానిని దీసికొనిపోవు ఓడలయందును దేవుఁడు ఆకాశమునుండి నీళ్లను కురియించి నిర్జీవమైన భూమికి నీళ్లచే ప్రాణమిచ్చి యందు సర్వజంతువులను వ్యాపింపఁజేయుటయందును, వాయువుల మార్పునందును, ఆకాశము భూమి మధ్య దేవునికి ఆధీనమైయుండు మేఘములయందును, బుద్ధిమంతులకు సూచనలున్నవి.

వ్యా॥ 164. ఈ వాక్యములలో దేవుని ఏకత్వమును ఆతని కరుణయును సూచించు శక్తి సూచనలు గ్రహించు బుద్ధిమంతులకున్నవి. ఆకాశ సృష్టియందు యోచించిన ఇంత పెద్ద ఆకాశమునందలి సూర్యచంద్రాదులు ఎట్టి యాధారము లేకుండ నిలుచుటయును చాల వింతైనదిగదా ? భూమియందలి సముద్రములు, నదులు, కొండలు, చెట్లు, చేమలు, జంతుజాలములు వాని ఆహారములకుఁగాను వసతులును చచ్చి యెండిపోయిన భూమిని వానచే ప్రాణమొసంగి పచ్చగాచేయుటయును యోచింపఁదగినవి. రాత్రింబవళ్లు గలుగుట వాని హెచ్చుతగ్గులు, ఋతువుల వాయువుల మార్పులు ఇవన్నియు బుద్ధిశాలు

లగు జనులకు దేవుని శక్తిని సూచించు గొప్పసూచనలు. ఇవన్నియు గ్రహించి వీనిని ఎట్టి లోపము లేకుండ నడపువాఁడు ఒక్కఁడు సర్వశక్తిగల ప్రభువగు అల్లాః ఉన్నాఁడని విశ్వసింపక తప్పదు. మఱి ప్రజలకు నుపయోగకరములైన సామగ్రిని దీసికొని భయంకరమైన సముద్రమును క్షేమముగా దాటించు ఓడలయందును దేవుని శక్తి సూచనలున్నవి.

165. వమినన్-నాసి-మన్-యత్తఖిజు-మిన్-దూనిల్లాహి-అన్దాదన్-యుహిబ్బూ-నహుమ్-కహుబ్బిల్లాహి-వల్లజీన ఆమనూ-అషద్దు-హుబ్బల్-లిల్లాహి-వలౌ-యరల్లజీన-జలమూ-ఇజ్ యరౌనల్-అజాబ అన్నల్-ఖువ్వత-లిల్లాహి-జమీ-అన్-వఅన్నల్లాహ-షదీదుల్-అజాబ్.

165. మఱి ప్రజలలోని కొందఱు దేవునికి సాటి కల్పించుచు దేవుని ప్రేమించునట్లు వానిని ప్రేమించుచున్నారు. మఱియు విశ్వాసులకు దేవునియందే అధికప్రేమయున్నది. మరియు దుర్మార్గులు నరకబాధ పొందునపుడు సర్వశక్తి దేవునికే యున్నదనియు, దేవునిశిక్ష చాలకఠినమైనదనియు, తెలిసికొనినచో (అట్లు సాటికల్పింపరు.)

వ్యా॥ 165. మానవులు సర్వసృష్టిలో శ్రేష్ఠులయ్యు వారిలో కొందఱు తమ అవివేకముచే దేవుని వదలి ఆతనికి సాటిగ నితరులనుజేసి ఎట్లు దేవునిని మనస్ఫూర్తిగా ప్రేమింపవలెనో అట్లు ప్రేమించుచున్నారు. ఇదిచాల అన్యాయమును, దుర్మార్గమును. ఏలాభనష్టములు చేయఁజాలని దైవంబులనుకొలుచుట మానవజాతికి తగినదికాదు. అందుచేతనే విశ్వాసులును భక్తులును దేవునినే నమ్మి సాటికల్పింపక ఆతనియందు అధికమైనప్రేమ భక్తి గలిగి ఎట్టికష్టములోను అతనిసహాయముకోరుదురు. ఆతని ఆజ్ఞలనే అనుసరింతురు. ఇదియే భక్తులగు ముసల్మానుల మార్గము. దేవునికి సాటికల్పించిన పాపము క్షమింపఁబడదు. ఇట్టిదుర్మార్గులైన పాపులు వారికి పరలోకమందు గలుగు నరక బాధను చూచి వారిని విడిపించు దైవము లేక దేవుని కఠిన శిక్షకు లోఁబడియుండుటచూచినచో వారు దేవునికి సాటికల్పింపరు. ఇతర దైవములను పూజింపరు అని చెప్పఁబడియె.

166. ఇజ్-తబర్రఅల్లజీనత్-తుబిఊ-మినల్లజీ-నత్తబఊ-వర-అవుల్-అజాబ-వతఖత్త-అత్-బిహిముల్-అస్బాబ్. 167. వఖాలల్లజీ-నత్తబఊ-లౌ అన్న-లనా-కర్రతన్-ఫనత బర్రఅ మిన్‌హుమ్ కమా-తబర్రఊ-మిన్నా-కజాలిక-యురీ-హిముల్లాహు-అఅ-మాలహుమ్-హసరాతిన్-అలైహిమ్-వమాహుమ్-బి

ఖారిజీన-మినన్-నార్.

166. అపుడు ఆ నాయకులు తమ్ము అనుసరించిన వారిని అసహ్యపడుదురు. మఱి నరక బాధనుచూతురు. వారి సర్వ సంబంధములు తెగిపోవును. 167. అపుడు అనుచరులు మాకు తిరిగి ఇహలోకమునకు పోవుట లభించినచో మేముకూడ వారెట్లు మమ్ముగూర్చి అసహ్యపడిరో అటులేవారిని గూర్చి మేము అసహ్య పడుదుము. దేవుఁడు ఇట్లు వారి కర్మలను వారికి పశ్చాత్తాప కరములుగాఁ జూపును. (ఇట్లువారికర్మలు వృథాఅయినట్లు వారికిఁజూపును.) మఱివారు నరకాగ్నినుండి ఎప్పటికిని రాఁజాలరు.

వ్యా॥ 166, 167. అవిశ్వాసులకు శిక్షవిధింపఁబడునపుడు వారు ఎవరిని అనుసరించి పూజించిరో ఆ చిల్లర దేవతలు తమ భక్తులకు నెట్టి సహాయము చేయలేక వారిని గూర్చి అసహ్యపడుదురు. అచ్చట ఏలాటి సంబంధముండదు. ఎట్టి బంధుత్వము పనికిరాదు. అవిశ్వాసులైన అనుచరులు తమ దుర్గతిని చూచి మాకు ఈ నరకబాధ తొలఁగి మరల ఇహలోకమునకు మరలుట లభించిన ఎంత బాగుగానుండును! మేము సన్మార్గము అవలంబించి ఇపుడు మాకు తోడుపడఁజాలక వీడిపోయిన చిల్లర దేవతలను నాయకులను మేముకూడ వదలుదుము. అని అసంభవమగు కోరిక కోరుదురు. వారు అవిశ్వాస స్థితిలోఁజేసిన కర్మలు వృథాఅయి అవి వారికి పశ్చాత్తాపము గలుగఁజేయునవి అగును. అవిశ్వాసులు నరకమునుండి ఎప్పటికిని బయటికి రాఁజాలరు. వారు తిరిగి ఇహలోకమునకుఁబోవుట అసంభవము. అని సూచింపఁబడియె.

168. యా-అయ్యు-హన్నాసు-కులూ-మిమ్మా-ఫిల్-అర్జి-హలా-లన్ తయ్యి-బన్-వలా-తత్-తబిఊ-ఖుతువా-తిష్-షైతాని-ఇన్నహూ-లకుమ్-అదువ్వుమ్-ముబీన్. 169. ఇన్నమా-యా-మురు-కుమ్-బిస్-సూఇ-వల్-ఫహ్-షాఇ-వ-అన్-తఖూలూ-అలల్లాహి-మలా-తఅ-లమూన్.

168. ఓ జనులారా! భూమిలోని వస్తువులలో శాస్త్ర సమ్మతములై పవిత్రములైన వానిని భుజింపుఁడు. సైతాను పాదములను అనుసరింపకుఁడు. 169. నిశ్చయముగా అతఁడు మీకు స్పష్టమైన (వెల్లడియైన) శత్రువు. అతఁడుఁ దుష్కార్యములును అసహ్యములును చేయుటకును, మీకుఁదెలియని అసత్యములను దేవునిపై మోపుటకును, మీకు నాజ్ఞచేయును.

వ్యా॥ 168, 169. మానవులు ఏయేవస్తువులను భుజింపఁ గూడదని దేవుఁడు నిషేధించెనో వానిఁదప్ప మిగిలిన శాస్త్రీయములై పవిత్రములై హానికరములుగానివి భుజింపవలెను. స్వయముగా ధర్మమైన వస్తువులను నిషే

ధింపఁగూడదు. కొందఱు హలాల్ జంతువులను సైతాను ప్రేరేపణచే దేవతల పేరుతో వదలుదురు. అట్లు చేయఁగూడదు. ముద్దారు మొదలైనవి నిషిద్ధములు. ధర్మమార్గమును అనుసరింపవలెను. సైతాను పాపకార్యములను, అసహ్యములను జేయునట్లు ప్రేరేపించును. వాని ననుసరింపఁగూడదు. మత ధర్మములలో లేనివి కల్పించునట్లు సైతాను బోధించును. వాని ననుసరించిన దేవునిపై అసత్యముల మోపినట్లగును. పిశాచము మానవులకు శత్రువు. ఇది మఱుఁగుగాదు. వాఁడు కనఁబడకున్నను, వాఁడు మనస్సులలో కల్పించు కలఁతలను బట్టి వానిని దెలిసికొనవచ్చును.

170. వ-ఇజా-ఖీల-లహు-ముత్-తబిఊ-మా-అన్-జలల్లాహు- ఖాలూ-బల్-నత్-తబిఉ-మా-అల్-ఫైనా- అలైహి-ఆబా-అనా-అవ-లౌ-కాన-ఆబా- ఉహుమ్-లాయఅ-ఖిలూన-షైఅన్-వలాయహ్-త- దూన్. 171 వ- మసలుల్-లజీన-కఫరూ-కమస-లిల్-లజీ-యన్-ఇఖు-బిమా-లాయస్-మఉ-ఇల్లా-దుఆ-అన్-వనిదా-అన్-సుమ్మున్-బుక్-మున్-ఉమ్-యున్-ఫహుమ్-లాయఅ-ఖిలూన్

170. వారితో దేవుఁడు పంపినదాని ననుసరింపుఁడు అని చెప్పినచో అట్లు ఎన్నటికిఁగాదు, మేము మాతాత ముత్తాతలుండిన మార్గము ననుసరింతుము. అని చెప్పుదురు. వారి తాతముత్తాతలకు కొంచెమైన జ్ఞానము లేకున్నను వారికి సన్మార్గము తెలియకున్నను (అట్లు అనుసరింతురు.) 171. మఱి అవిశ్వాసుల పోలిక, పిలుపును దప్పమఱెద్దియును వినని దానిని పిలుచునట్టి వానివలెనున్నది. వారు చెవిటివారు, మూఁగవారు, గ్రుడ్డివారు. కావున గ్రహింపరు.

వ్యా॥ 170. అవిశ్వాసులతో దేవుఁడు పంపిన ధర్మములను అనుసరింపుఁడు అని చెప్పినచో, మేమటు చేయము. మాతాతముత్తాతలు ఏలాగు నడచుచుండిరో ఆ ప్రకారము నడచుకొందుము. అని పలుకుదురు ఇట్లు పలుకుట సరికాదు. వీరితాత ముత్తాతలకు లౌకిక వ్యవహార జ్ఞానముండినను, ధర్మమార్గము సన్మార్గము తెలియదు. వారుచేయు దురాచారముల నెట్లు వీరు అనుసరింపవచ్చును? ఇది చాల ఆశ్చర్యకరమే. ఇప్పటికొందఱు ముసల్మానులు ధర్మవిరుద్ధమగు ఆచారములను అనుసరించుచు ఇవి మాతాతముత్తాతలునడచిన ఆచారములని పలుకుదురు. ఇది మహాపాతకము. ఖురానెషరీఫులోను మహామ్మదు రసూలువారి యుపదేశములలో నెట్లుండునో అట్లు నడచుకొనుట సత్యమైన ముసల్మాను భక్తుల కర్తవ్యము. 171. అవిశ్వాసులకు ధర్మమార్గము బోధించుట ఎట్లున్నదో దానిపోలిక చెప్పఁబడినది. జంతువులను మేపువాఁడు కేకలు

వేసిపిలుచు శబ్దముమాత్రము జంతువులు వినును. దాని అర్థము గ్రహింపజాలవు. అటులేబోధకుల బోధను అవిశ్వాసులు వినుదురు. కాని దానిభావము గ్రహింపరు. దానిననుసరింపరు. సత్యము పలుకరు. ఆ అవిశ్వాసులు సత్యము విననందున చెవిటివారు. సత్యమార్గము చూడనందున గ్రుడ్డివారు. సత్యముపలుకనందున మూఁగవారు. వినుట చూచుట పలుకుట అను మూఁడు శక్తులు వ్యర్థాచేసినందున వారు ఏదియు గ్రహింపలేరు.

172. యా-అయ్యు-హల్లజీన-ఆమనూ-కులూ-మిన్ -తయ్యి-బాతి-మా-రజఖ్నా-కుమ్-వష్-కురూ-లిల్లాహి-ఇన్-కున్తుమ్-ఇయ్యాహు-తఅ-బుదూన్. 173. ఇన్నమా-హర్రమ-అలై కుముల్-మైతత-వద్దమ-వ-లహ్మల్-ఖిన్-జీరి-వమా-ఉహిల్ల-బిహీ-లిగై-రిల్లాహి-ఫ-మనిజ్-తుర్ర-గై ర-బాగిన్-వలా-ఆదిన్-ఫలా-ఇస్మ-అలైహి-ఇన్నల్లాహ-గఫూరుల్-రహీమ్.

172. ఓ విశ్వాసులారా! మేము ఒసంగినపవిత్రవస్తువులను భుజింపుఁడు. మఱి మీరు దేవునిభక్తులయినచో ఆతని కృతజ్ఞతలు సలుపుఁడు. 173. ఆతఁడు మీకొఱకు చచ్చినజంతువులను నెత్తురును, పందిమాంసమును, దేవునిదప్ప నితరులపేరుతో పిలువఁబడిన జంతువును నిషేధించియున్నాఁడు. మఱెవఁడు పాపము చేయక, అతిక్రమింపక సహింపరాని స్థితిలోనున్నచో వానికి నెట్టి పాపములేదు. నిశ్చయముగ, దేవుఁడు క్షమించువాఁడును, ప్రేమగలవాఁడును.

వ్యా॥ 172, 173. ముందువాక్యములలో అవిశ్వాసుల విషయము చెప్పి ఇఁక భక్తులగు ముసల్మానులు దేవుఁడు ఒసంగిన పవిత్ర వస్తువులను భుజించి యాతని మేలు మఱువక కృతజ్ఞత సలుపవలెనని బోధింపఁబడియె. ఆ పిదప దేవుఁడు తన భక్తుల కొఱకు ఏ అపవిత్రవస్తువులను తినకూడదని నిషేధించెనో వానిలో కొన్ని వివరింపఁబడినవి. ఒక జంతువు తనంతట ప్రాణము విడిచి చచ్చిన అది ముర్దార్ (మైతా) అనఁబడును. దాని మాంసము తినకూడదు. ధర్మప్రకారముగ తినఁదగిన జంతువును (బిస్మిల్లాః) చేసి తినవలెను. జబాచేయునపుడు ప్రవహించు నెత్తురును, పందిమాంసమును, తినకూడదు. దేవుని పేరుతోగాక యితరులపేరుతో భక్తితో వదలిన జంతువుల మాంసముసు బిస్మిల్లాః చేసినను తినకూడదు. దేవుని పేరుతో మొక్కుబడిచేయవలెను. ఆతని వదలి ఇతరుల పేరుతో మొక్కుబడిచేయరాదు. కావలెనన్న ధర్మప్రకారముగా దేవునిపేరుతో జబాచేసి దాని మాంసము నిరుపేదలకు పెట్టి దాని పుణ్యముకోరిన వారికి నొసంగవచ్చును. దీనినే ఈసాలెసవాబ్ (ఫాతిహా) అనుదురు. పీర్ వలీ షహీదులపేరుతో జంతువులు విడువరాదు. అది మహా

పాతకము. ఒకవేళ ఆహారము దొరకక ఆకలిబాధకు సహింపలేక ప్రాణహానిగలుగునను సందేహమున్నచో ప్రాణము కాపాడుకొనుటకుగాను నిషేధింపబడిన హరామ్ వస్తువులు కొద్దిగాతిని ప్రాణము కాపాడుకొనవలెను. హరామ్ తినుటలో హద్దుమీఱక పాపమునకు బోకుండనుండవలెను. ఇట్టి స్థితిలో హెచ్చుతగ్గులు అయిన దేవుఁడు క్షమించును. ఇట్టి స్థితిలో హరామ్ భుజించిన దోషములేదు. ఇట్లు ధర్మము విధించి సెలవునొసంగుట దేవునికృప. కావుననే దేవుఁడు క్షమించువాఁడును, దయచూపువాఁడును.

174. ఇన్నల్లజీ-లయక్ - తుమూన మా-అన్-జలల్లాహు-మినల్ కితాబి వయష్-తరూన బిహీ-సమనన్-ఖలీలన్-ఉలా ఇక మా-యాకులూన-ఫీ బుతూ-నిహిమ్-ఇల్లన్నార-వలా-యుకల్లిము హుముల్లాహు-యౌమల్-ఖియామతి వలా-యుజక్కీ-హిమ్ వ లహుమ్ అజాబున్-అలీమ్. 175. ఉలా-ఇకల్లజీ-నష్-తరఉజ్-జలా-లత-బిల్-హుదా-వల్ అజాబ బిల్ -మగ్-ఫిరతి-ఫమా- అస్ బరహుమ్ అలన్ నార్ .176జాలిక-బి-అన్న-ల్లాహ-నజ్-జలల్ -కితాబ-బిల్-హఖ్ఖి-వ-ఇన్నల్లజీ-నఖ్-తలఫూ-ఫిల్ -కితాబి-లఫీ-షిఖా-ఖి-మ్బ-ఈద్.

174. నిశ్చయముగ నెవరు దేవుఁడు పంపిన గ్రంథమును దాఁచుచు, దానికి బదులుగ కొంతవెల పుచ్చుకొనుచున్నారో, వారు తమ పొట్టలలో అగ్నిమాత్రము నించుచున్నారు (దూర్చుచున్నారు). మఱి దేవుఁడు వారితో తీర్పుదినమున మాటలాడఁడు. మఱి వారిని పవిత్రులుగాఁజేయఁడు. మఱి వారికి దుఃఖకరమైన బాధయున్నది. 175. వారే సన్మార్గమునకు బదులుగదుర్మార్గమును, మోక్షము (క్షమాపణ) నకు బదులుగ నరకబాధను కొనినవారు. వారికి నరకమునందు ఎంత సహనము కలదో! 176. ఇది దేవుఁడు సత్యమైన గ్రంథము పంపినందు వలనఁగలిగెను. మఱియు గ్రంథములో భేదాభిప్రాయము గలిగిన వారు చాల (దూరమైన) ద్వేషములో నున్నారు.

వ్యా॥ 174, 175, 176. తౌరాతు గ్రంథములో హజ్రత్ ముహమ్మదు ప్రవక్తనుగూర్చి ప్రకటనలును, ధర్మములునుండెను. యూదులు నిజము ప్రకటింపక దానిని దాఁచుచు ప్రజలయొద్ద లంచములు పుచ్చుకొనుచుండిరి. సత్యమును దాఁచుటయే మహాపాతకము. మఱి దానిపై ధర్మములుదాఁచి లంచములు పుచ్చుకొనుచుండిరి. ఆలంచములతో వారి పొట్టలనింపుట అగ్నిని మ్రింగినట్లే. ఎట్లు అగ్గికాల్చివేయునో, అటులే ఆలంచముల వలని పాపము వారిని కాల్చివేయును. ఇట్టి వారితో దేవుడు తీర్పుదినము (ఖియామతు)నందు

ప్రేమతో సంభాషింపడు. ఇది అన్ని శిక్షలకన్న కఠినమైనది. పుట్టించి పెంచిన ప్రభువగు ప్రియుఁడు మాటలాడకున్న ఏమి దుర్గతి అగునో యూహింపనలవికాదు. మఱి దేవుఁడు వారిని పవిత్రులనుఁగా జేయఁడు. మఱివారికి పీడించు నరకబాధయున్నది. ఇట్టివారు ధర్మమార్గమువదలి దానికి బదులు దుర్మార్గము స్వీకరించినవారు. పాపక్షమాపణము వలని మోక్షమునకు బదులుగ నరకబాధను కొనినవారు. ఇవన్నియు చూడ వారికి నరకాగ్ని బాధసహించుటకు నెట్టి ఓపిక గలదు? ఇదిచాల ఆశ్చర్యకరము. ఎవరును సహింపఁజాలరు. కావున ఇస్లామ్ మార్గము ననుసరించి దేవుని ప్రీతివడయుటకు మానవులు యత్నింపవలెను. ఈధర్మములు సత్యమైన దేవుని గ్రంథము దేవుఁడు పంపినందు వలన గలిగినవి దుష్టులకు శిక్ష గ్రంథము ననుసరించియే గలుగును. దేవుని గ్రంథములో అభిప్రాయ భేదములు గలిగి దానికి వ్యతిరేకముగా పోయినవారు చాలదూరమైన మహాద్వేషమున పడినవారు. కావున దేవుని గ్రంథమగు ఖురానె షరీఫును అనుసరింప వలెను.

177. లైసల్-బిర్ర-అన్ తువల్లూ-వుజూ-హకుమ్-ఖిబలల్-మష్-రిఖి-వల్ మగ్-రిబి-వలా-కిన్నల్-బిర్ర-మన్-ఆమన-బిల్లాహి-వల్-యౌమిల్-ఆఖిరి-వల్-మలా-ఇకతి-వల్-కితాబి-వన్_నబీ-ఈన-వ-ఆతల్-మాల-అలా-హుబ్బిహీ-జవిల్-ఖుర్‌బా-వల్-యతామా-వల్-మసాకీన-వబ్-నస్-సబీలి-వస్-సాఇలీన-వ ఫిర్-రిఖాబివఅఖామస్-సలాత-వఆ-తజ్-జకాత-వల్-మూఫూన-బిఅహ్దిహిమ్-ఇజా-ఆహదూ-వస్-సాబిరీన-ఫిల్-బాసాఇ-వజ్-జర్రాఇ-వహీన-ల్-బాసి-ఉలా-ఇకల్లజీన-సదఖూ-వ-ఉలా-ఇక-హుముల్-ముత్తఖూన్.

177. మీరు మీముఖములను తూర్పులేక పడమర వైపునకుఁ జేయుటయే సత్కార్యముగాదు. కాని ఎవరు దేవునియందును, తుది దినమందును, దేవదూతలయందును, దేవుని గ్రంథములందును, ప్రవక్తలయందును, విశ్వాసముంతురో, ఎవరు ధనముపై ప్రేమగలిగియు దానిని బంధువులకును, తల్లిదండ్రులులేనిబిడ్డలకును, నిఱుపేదలకును, బాటసారులకు, యాచకులకును, బానిసల మెడలు విడిపించుటకును, ఒసంగుదురో, ఎవరు నమాజుచేయుదురో, ఎవరు జకాతు (దానము) చేయుదురో వారును, తాముచేసిన వాగ్దానమును పూర్తి చేయువారును, దారిద్ర్య కష్టములందును, రోగనష్టములందును, యుద్ధసమయములందును, ఓర్పుగలవారు, సజ్జనులు. వారే సత్యవంతులు. వారేభక్తులు.

వ్యా॥ 177. ఖిబ్లా మాఱిపోయినందున వివాదములు తీవ్రమాయెను.

ఒకరినొకరునిందించుకొన సాగిరి, దానికిఁగాను దేవుఁడు ఒకదిక్కునకు ముఖము చేయుటయే సత్కార్యమును, పుణ్యకార్యమునుకాదు. అని, చేయవలసిన సత్కార్యములు ఈ వాక్యములలో పేర్కొనెను. వానిని ఆచరింపవలెను అవియె ముఖ్యధర్మములు. ఖిబ్లాఅనునది ప్రార్థనచేయువాని మనస్సునునిలుపును. లోకవ్యవహారములయందు విముఖుఁడై ఒకదిక్కునకు ముఖముచేసి ప్రార్థనసలిపిన మనస్సుస్థిరమగును. అంతేకాని ఇదియొకటియే పూర్తియగు మతధర్మముగాదు. ముఖ్యధర్మములు పెక్కులున్నవి. వానిని ఆచరించిన ఆత్మశుద్ధి గలిగి సుగుణములు అలవడును, అనిబోధింపఁబడియెను. దేవునియందును పాపపుణ్యముల తీర్పుకొఱకు రానున్న తుదిదినమందును, దేవునిదూతలందును, దేవుఁడు తన ప్రవక్తలకు నొసంగిన గ్రంథములందును, ఆతని ప్రవక్తలందును, దృఢవిశ్వాసము గలిగియుండవలెను. ప్రవక్తలయందు విశ్వాసము, అనఁగా వారియెడ మర్యాదయును, వారి యాచారములను అనుసరించుటయును. తరువాత ప్రాణసమమగు ధనమును దేవుని ప్రీతికొఱకు బంధువులకును, అనాథశిశువులకును, నిఱుపేదలకును, ప్రయాణములో చిక్కి ఖర్చునకులేక బాధపడుచున్న బాటసారులకును, యాచకులకును, బానిసలుగా నుండినవారిని విడిపించుటకును, నొసంగవలెను. ప్రతిదినము అయిదుపూఁటలునమాజు (ప్రార్థన) చేయవలెను. ఒకపూఁట నమాజు వదలిన అది సరికాదు. జకాతు (విధిదానము) నొసంగవలెను. జకాతునిచ్చుటకు శక్తిగల ధనవంతులు తమయొద్దనుండు ధనములో నలువదింట ఒకభాగము నిఱుపేదలకు సంవత్సరమునకు ఒకతూరి యొసంగవలెను. అందఱు భక్తులు (ముసల్మానులు) జకాతు నిచ్చిన బీదవారు చాలవఱకు సౌఖ్యము నొందుదురు. చేసిన వాగ్దానము పూర్తిచేయవలెను. ఆడినమాటతప్పరాదు బీదతనమునందు ధనములేనపుడుగలుగుకష్టములందును రోగపీడితులైనపుడును యుద్ధసమయమునందును ఓర్పుగలిగి యుండవలెను. ఇట్టి సమయములలో ఓర్పే గొప్పసాధనము. పై వివరింపఁబడిన విషయములవలననే సత్కార్య నిర్వాహకులగుదురు. ఇట్టివారే తమ విశ్వాసములో నిజమైనవారును భయభక్తులు గలవారును.

178. యా-అయ్యుహల్లజీన-ఆమనూ-కుతిబ-అలైకుముల్-ఖిసాసు-ఫిల్-ఖత్లా-అల్-హుర్రు-బిల్-హుర్రి-వల్-అబ్దు-బిల్-అబ్ది-వల్-ఉన్-సా-బిల్-ఉన్సా-ఫమన్-ఉఫియ-లహూ-మిన్-అఖీహి-షైఉన్-ఫత్-తిబా-ఉన్-బిల్-మఅ-రూఫి-వ-అదా-ఉన్-ఇలైహి-బి-ఇహ్సానిన్-జాలిక-తఖ్-ఫీ-ఫుమ్-మిర్-రబ్బి-కుమ్-వర-హ్మతున్-ఫ-మని-అ-తదా-బఅద-జాలిక-ఫలహూ-అజా

బున్-అలీమ్. 179. వలకుమ్-ఫిల్-ఖిసాసి-హయాతున్-యా-ఉలిల్-అల్-బాబి-ల-అల్లకుమ్-తత్తఖూన్.

178. ఓ విశ్వాసులారా! వధింపఁబడిన వారివిషయము సమానముగ బదులు తీసికొనుట (ఖిసాస్) విధింపఁబడినది. స్వేచ్ఛాపరునకు బదులుగ స్వేచ్ఛాపరుని, బానిసకు బదులుగ బానిసను, స్త్రీకి బదులుగ స్త్రీని (వధింపవలెను). పిదప ఎవనికేని ఆతని సోదరునుండి కొంత క్షమాపణ లభించినచో ధర్మప్రకారము దాని ననుసరింపవలెను. మఱి మంచితనముగా దానినొసంగవలెను. ఇది మీ ప్రభువునుండి గలిగిన సౌకర్యమును, అనుగ్రహమును. మరల దీని పిదపఁగూడ నెవఁడు అతిక్రమించునో వానికి దుఃఖకరమైన శిక్షయున్నది. 179. మఱి ఓ బుద్ధిమంతులారా! సమానముగా బదులు తీసికొనుటలో మీకు గొప్ప ప్రాణలాభమున్నది. మీరు రక్షణపొందుటకుఁగాను ఇది విధింపఁబడియె.

వ్యా॥ 178. ఇస్లామునకు పూర్వము అరబ్బులు మొదలైనవారు, హత్య విషయమున అనేక అన్యాయములు చేయుచుండిరి. ఎవఁడైన ఒక్క స్వేచ్ఛాపరుని వధించిన వాని హత్యకు బదులుగ నిద్దఱిని వధించుచుండిరి. గొప్ప వంశము వారి బానిసకు బదులుగ హీనవంశములో స్వేచ్ఛాపరుని వధించుచుండిరి. స్త్రీకి బదులుగ మగవానిని వధించుచుండిరి. ఇట్లుచేయుట న్యాయము కాదు. హత్యవిషయములో సమానముగా బదులు తీసికొనవలెను. స్వేచ్ఛాపరుఁడు (ఆజాద్) వధించినచో హత్యగావించిన వానినే చంపవలెను. స్త్రీకి బదులుగ చంపిన స్త్రీనే చంపవలెను. అందఱి ప్రాణములు సమానములు. హత్యకు బదులు తీసికొనుటలో హెచ్చుతగ్గులు చేయకూడదు. వధింపఁబడిన వాని వారసులలో నెవఁడైన ఒక్కఁడు హత్యచేసిన వానిని క్షమించినచో మిగిలిన వారసులు హత్యగావించిన వానిని చంపఁగూడదు. ఇష్టపడినచో క్షమింపవచ్చును. లేక హత్యకు పరిహారముగ ధనము (దియత్) పుచ్చుకొనవచ్చును. క్షమించువాఁడు 'సహోదరుఁడు' అని చెప్పుటలో దయను సూచించుచున్నది. హంతకుని క్షమించిన పిదప హత్యకు బదులుగ నియ్యఁబడు ధనము వధింపఁబడిన వాని వారసులకు మంచితనముగా నొసంగవలెను. ఇట్లు క్షమింపవచ్చును. ధనము పుచ్చుకొనవచ్చును, అను ధర్మము విధించుట దేవుని యనుగ్రహము. క్షమించిన పిదప హంతకుని ఎవరైన వారసులు వధించిన అది అక్రమము. అట్టివానికి దుఃఖకరమైన శిక్షయున్నది. వాఁడు హత్యకు బదులుగ వధింపఁబడును. 179. సమానముగాను న్యాయముగాను హత్యకు బదులు తీసికొనుటలో గొప్పలాభమున్నది. ఇది బుద్ధిమంతులు గ్రహింపఁగలరు. అందుచేతనే వారు సంబోధింపఁబడిరి. హత్య చేయుటకు యత్నించువాఁడు తాను హత్య

కు బదులుగ వధింపఁ బడును. అని గ్రహించుటచే తనప్రాణమును ఎట్టి ప్రాణ మును రక్షింప బడును. అదియునుగాక అరబ్బులలో ఒకఁడు పడి పంబడినచో ఆకారణమువలన అనేక కుటుంబములలో యుద్ధము చెలరేగి అనేకప్రాణములు పోవుచుండెను. హత్యకు బదులు తీసికొనుటలో నట్లుగాదు, కావున మానవు లలో హత్యలు తగ్గిపోవును. గొప్ప ప్రాణలాభము కలిగినట్లగును. పాపాత్ములు నుండి రక్షణ గలుగుటకుఁగానే యీధర్మములు విధింపఁబడియెను.

180. కుతిబ-అలై-కుమ్-ఇజా-హజర-అహద-కుముల్-మౌతు-ఇన్-తరక ఖైరనిల్-వసియ్యతు-లిల్-వాలిదైని-వల్-అఖ్‌రబీన-బిల్-మఅరూఫి-హఖ్ఖన్-అలల్-ముత్తఖీన్. 181. ఫమన్-బద్దలహూ-బఅ-దమా-సమి-అహూ-ఫఇన్నమా-ఇస్మహూ-అలల్లజీన-యుబద్దిలూనహూ-ఇన్నల్లాహ-సమీ-ఉన్-అలీమ్. 182. ఫ-మన్-ఖాఫ-మిమ్-మూసిన్-జన-ఫన్-ఔ-ఇస్మన్-ఫ-అస్-లహ-బైన హుమ్-ఫలా-ఇస్మ-అలైహి-ఇన్నల్లాహ-గఫూరుర్-రహీమ్.

180. మీలో నెవ్వనికైన మరణకాలము సమీపించునప్పుడు ధనము వదలినచో ధర్మప్రకారముగా తల్లిదండ్రులకును బంధువులకును వసియ్యత్ (మరణశాసనము) చేయుట మీకు విధింపబడినది, ఈ ధర్మము భక్తులకు విధింపఁ బడినది. 181. ఆ పిదప దానిని వినిన తరువాత మార్చినచో ఆ పాపము వసి య్యతును మార్చిన వారి పైననేయున్నది. నిశ్చయముగా దేవుఁడు వినువాఁ డును, సర్వజ్ఞుడును. 182. మఱి వసియ్యత్ చేయువాఁడు. పక్షపాతము లేదా పాపముచేయునని భీతిగలిగినచో నెవఁడు వారి మధ్యసంధి కుదుర్చినచో వానికి నెట్టి దోషములేదు. నిశ్చయముగా దేవుఁడు క్షమించువాఁడును, దయాళువును.

వ్యా॥ 180, 182. ఈ వాక్యములలో చనిపోవువారు వదలు ఆస్తిలో తల్లిదండ్రులకును బంధువులకును హక్కు విధింపఁబడినది. ధర్మముగాను న్యా యముగాను చనిపోవువాఁడు తన ఆస్తిలో భాగము వారివారికి ఇవ్వవలసిన భాగములను గూర్చి వసియ్యత్ (మరణ శాసనము) చేయవలెను. తల్లిదండ్రు లకును ఇతర బంధువులకును ఆస్తిలో ఎంత భాగమున్నదో ఆ వివరము సూర నిసాలోనున్నది. కొన్ని సమయములలో బంధువులకు ఆస్తిహక్కు లేదు. అపుడు తప్పక వసియ్యత్ చేయవలెను. వసియ్యత్ ఆస్తిలో మూడవ భాగ ములోపల చేయవలెను. దానికి మించిచేయరాదు. తల్లి లేక తండ్రి కాఫిరులుగా నున్నచో వారికి ముసల్మానుఁడగు తమ కుమారుని ఆస్తిలో హక్కు లేదు. కాని వసియ్యత్ ద్వారా వారికి ధనసహాయము చేయవచ్చును. చనిపోవువాఁడు ఎట్లు

శాసనము చేయునో అట్లు ఆ స్తి ధనము పంచవలెను. ఆతఁడు చనిపోయిన పిదప దానిలో తారుమారుచేసిన దాని పాపము మార్చువారికే గాని చనిపోయినవానికి లేదు. ఒకవేళ చనిపోవువాఁడు శాసనము (వసీయత్) చేయుటలో పక్షపాతముగాని పాపముగాని చేసినచో ఆతని బంధువులలో ఆస్తి భాగముల విషయము హెచ్చుతగ్గులు ధర్మప్రకారముగాచేసి వారి మధ్య తగవులు లేకుండ సవరించి సంధికుదుర్చునట్టి వానికి పాపములేదు. దేవుఁడు క్షమించును, దయచూపును.

183. యా-అయ్యు-హల్లజీన-ఆమనూ-కుతిబ-అలైకు-ముస్-సియాము కమా-కుతిబ-అలల్లజీన-మిన్-ఖబ్లికుమ్-ల-అల్లకుమ్-తత్తఖూన్. 184. అయ్యా-మమ్-మఅ-దూదాతిన్-ఫమన్-కాన-మిన్-కుమ్-మరీజన్-ఔ-అలా-సఫరిన్-ఫ ఇద్ద-తుమ్-మిన్ అయ్యా-మిన్-ఉ-ఖర-వ-అలల్లజీన-యుతీఖూ-నహూ-ఫిద్-య తున్-త-ఆము-మిస్కీనిన్-ఫమన్-త-తవ్వఅ-ఖైరన్-ఫహువ-ఖైరుల్-లహూ-వ అన్-తసూమూ-ఖైరుల్-లకుమ్-ఇన్-కున్తుమ్-త-అ-లమూన్.

183. ఓ ముసల్మానులారా! మీ పూర్వీకులకెట్లు ఉపవాస ధర్మము విధింపఁబడెనో అటులే మీరు భక్తులరగుటకై మీకు నుపవాసములు విధింపఁబడినవి. 184. అవి గణింపఁబడిన కొద్దిదినములే. మఱి మీలో నెవఁడు రోగి లేక బాటసారిగానుండునో వాఁడు ఆలెక్క ఇతర దినములలో పూర్తి చేయవలెను. మఱి శక్తి గలిగినవారు ఒక నిఱుపేదకు భోజనము పెట్టవలెను. మఱెవఁడు సంతసముతో సత్కార్యముచేయునో వానికి అది మేలగును. మఱి మీరు ఎఱింగినచో మీరు ఉపవాసముండుటయే మీకు మేలు.

వ్యా॥ 183, 184. సౌమ్ అనగా మానుకొనుట. ఇస్లామ్ మతధర్మము ననుసరించి తినుటను, త్రాగుటను, సంభోగమును, ప్రభాతకాలమునుండి సూర్యుఁడు అస్తమించువఱకు మానుకొనుట. ఉపవాసము పూర్వము ఆదము ప్రవక్త నుండి యుండి నదియే. ఇది ప్రతిమతములో నుండిన ధర్మము. ఉపవాసము పూర్తిగా రమజాను నెలలోనుండుట విధియైన ధర్మము. ఇదియే కొన్నిదినములని చెప్పఁబడెను. ఉపవాసమువలన భక్తి కుదురవలెను. కామక్రోధములు అణఁగవలెను. చిత్తశుద్ధి లభింపవలెను. ఆహారములేక ఆఁకటిబాధ పడు బీదల కష్టము తెలియఁగవలెను. ఇన్నియు భక్తిపూర్వకముగా నుపవసించుటవలన లభించును. మానవునకు నిత్యము అవసరములైన అన్నపానాదులు దేవుని కొఱకు వదలుట భక్తి గలిగించునదియే మఱియుఁగు స్థలములలోకూడ సర్వజ్ఞుఁ

హైన దేవునకే భయపడి అన్నపానాదులు వదలుదురుగదా ? ఇదియే మోక్ష మార్గము. రోగపీడితులైన వారును, ప్రయాణములోనున్నవారును రమజాను నెలలో ఉపవాసము చేయలేక పోయినచో తరువాత నెలలో తప్పిపోయిన దినముల లెక్క ప్రకారముగా నుండవలెను. రోగములోను ప్రయాణము లోను కష్టములు సంభవించును గాన సౌకర్యము విధింపఁబడెను. రమజానునెల ఉపవాసములు ముసల్మానులకు విధింపఁబడిన ప్రారంభ ములో కొందఱకు అలవాటు లేనందున వరుసగా నొక నెల ఉపవాసముండుట కష్టముగానుండెను. అందుకు రోగము, ప్రయాణము వలన ఆటంకము లేకున్నను శక్తిగలిగియు ఉపవాసముండలేని వారు ఒక ఉపవాసమునకు బదులు ఒక నిరు పేదకు రెండు పూఁటలు భోజనము పెట్టవలెను. అను సౌకర్యముండెను. ఆ పిదప రాఁబోవు వాక్యములో శక్తిగలవారు తప్పక ఉపవాసముండవలెనని విధిం పఁబడెను. కావున ఇపుడు శక్తి గలుగియు నుపవాసముండని వారు ఘోర పాపము చేసినవారగుదురు. కాని వయస్సు చెల్లిన వృద్ధులును రోగనివారణ కాదు అని ఆసవదలిన రోగపీడితులును ఉపవాసము వదలవచ్చును. ఇట్టివారు ఒక్కొక్క ఉపవాసమునకు బదులుగ నొక్కొక్క బీదవానికి రెండు పూటలు భోజనము పెట్టవలెను. లేక నూటనలువది తులముల యెత్తు గోధుమలు, లేక ఇతర ధాన్యము ఇన్నూట యెనుబది తులముల యెత్తు బీదలకు నొసంగవలెను. దీనినే ఫిద్యా అనుదురు. ఇది విధిగా నొసంగవలసినది. భక్తులు తమ సంత సములో విధిగానొసంగ వలసిన ఫిద్యాకంటె హెచ్చుగా బీదలకు దానము చేసినచో వారికిచాల మేలగును. ఉపవాసముండుటలోన నేకరహస్యములుగలవు. దానివలన అనేకలాభములుగలవు. కావున ఉపవాసముండుటయే యుత్తమము.

185. షహ్రు-రమజా-నల్లజీ-ఉన్‌జిల-ఫీహిల్-ఖుర్-ఆను- హుదల్-లి న్నాసి-వబయ్యి-నాతిమ్-మినల్-హుదా వల్-ఫుర్-ఖాని-ఫమన్-షహిద-మిన్ కుముష్-షహ్ర-ఫల్-యసుమ్-హు-వమన్ - కాన- మరీ-జన్ ఔ-అలా-సఫరిన్- ఫ-ఇద్దతుమ్-మిన్-అయ్యా-మిన్-ఉఖర్-యురీ-దుల్లాహు-బికుముల్- యుస్‌ర- వలా-యురీదు-బికుముల్-ఉస్‌ర-వలితుక్-మిలుల్-ఇద్దత-వలి-తుకబ్బి-రుల్లాహ- అలా-మా-హ దాకుమ్-వల-అల్లకుమ్-తష్‌కురూన్.

185. రమజాను నెలలో ఖురానె షరీఫు ఒసంగఁబడెను. అది ప్రజలకు సన్మార్గముఁజూపునది. స్పష్టమైన సన్మార్గ సూచనలు గలది. సత్యాసత్యములను వేఱు పఱచునది. కావున మీలో నెవఁడు ఆ నెలనుపొందునో తప్పక యందును పవాస ముండవలెను; మఱియు నెవఁడు రోగిగా లేక ప్రయాణిగానుండునో డు

యాతఁడు ఆలెక్క ఇతర దినములలో పూర్తిచేయవలెను. దేవుఁడు మీ యెడ సౌకర్యముచేయఁ గోరుచున్నాఁడు. మఱి మిమ్ము కష్టపెట్టుటకు కోరఁడు. ఇది మీరు లెక్కపూర్తిచేయుటకుఁగాను మఱి మీకు సన్మార్గము చూపినందులకు దేవుని మహిమ కొనియాడుటకుఁగాను, మఱిమీరు కృతజ్ఞతలు చెల్లించుటకుఁగాను.

వ్యా॥ 185. ఉపవాసముండవలసిన నెల రమజాను. రమజాను నెలలోనే ఖురానె షరీఫు పంపఁబడుటకు ఆరంభమాయెను. ఇది లోకమంతకు సన్మార్గము చూపునది. ఇందు స్పష్టమైన సూచనలు ధర్మములు కలవు. దీని ననుసరించువారు ఇహపరము లందు విజయము మోక్షము పొందుదురు. సత్యాసత్యములు ధర్మాధర్మములు దీనివలన తెలియనగును. ఇట్టి మహిమగల దేవుని గ్రంథము రమజాను నెలలోనే పంపఁబడెను గావున రమజాను నెల మహిమగలది. ఇస్లామునకు ముఖ్యధర్మమగు ఉపవాసము ఈ నెలలోనేయుండునట్లు విధింపఁబడెను. రమజాను నెలలో ప్రతిభక్తుఁడు, (రోగము ప్రయాణములేనివాఁడు) తప్పక ఉపవాస ముండవలెను. రోగి ప్రయాణి రమజానులో తప్పిపోయిన దినముల ఉపవాసము లెక్కప్రకారము ఇతర మాసములో నుండవలెను. ఇదియును దేవునివలనఁ గలిగిన గొప్ప సౌకర్యము. దేవుఁడు తన భక్తులసౌకర్యముల పాటించును గాని కష్టపెట్టఁడు. సన్మార్గమును జూపి మోక్షప్రాప్తులఁ జేసిన దేవుని మహిమ కొనియాడవలెను. ఆతనికి కృతజ్ఞత చెల్లింపవలెను. ఆతనిదయలేనిచో లోకము అధర్మాంధకారములో పడి నశించును గదా?

186. వ-ఇజా-స-అల-క-ఇబాదీ అన్నీ-ఫ-ఇన్నీ-ఖరీ-బున్-ఉజీబు-దఅ-వ తద్-దాఇ ఇజా-దఆని-ఫల్-యస్-తజీబూ లీ-వల్-యూమినూ-బీ-లఅల్లహుమ్-యర్-షుదూన్.

186. మఱి నాభక్తులు నన్నుఁగూర్చి నీతో నడిగిన నేను సమీపముననుండియున్నాను. నన్ను వేఁడువాని ప్రార్థనను అంగీకరించుచున్నాను. కావున వారు సన్మార్గము పొందుటకై నా ఆజ్ఞల ననుసరింపవలెను. మఱి నాయందు విశ్వాసముగలిగి యుండవలెను.

వ్యా॥ 186. ముందువాక్యములలో దేవుని మహిమ కొనియాడవలెను, అనియుండెను. దేవుని మహిమకొనియాడుట ఎట్లు? ఆతఁడు దూరముగానున్న బిగ్గఱగా అఱవవలెను. దగ్గఱగానున్నచో తిన్నగా నామస్మరణము చేయవలెను. అను ప్రశ్నగలిగెను. దేవుఁడు దగ్గఱగానున్నాఁడు. కంఠనాళముకన్న చేరువలో నున్నాఁడు. కేకలు వేయనక్కఱలేదు. నిశ్శబ్దముగానే ప్రార్థన చేసిన దేవుఁడు వినును, దానిని అంగీకరించును. దేవునికి నితరులు మధ్యస్థులక్కఱ

లేదు. ఆతఁడే స్వయముగా తనభక్తులువేఁడు ప్రార్థనలను విని అంగీకరించుచున్నాఁడు. కావున భక్తులు సన్మార్గము పొందుటకై దేవుని యాజ్ఞలను శిరసావహించి వాని ననుసరింపవలెను. మనః పూర్వకముగా ఆతనియందు దృఢ విశ్వాసము గలిగి యుండవలెను. ఇదియే మోక్షమార్గము.

187. ఉహిల్ల-లకుమ్-లైల-తస్-సియామిగ్-రఫసు-ఇలా-నిసా-ఇకుమ్-హున్న-లిబాసుల్-లకుమ్-వ-అన్తుమ్-లిబాసుల్-లహున్న-అలిమల్లాహు-అన్నకుమ్-కున్-తుమ్తఖ్తానూన-అన్-ఫుసకుమ్-ఫతాబ-అలైకుమ్-వ-అఫా-అన్కుమ్-ఫల్ ఆన-బా-షిరూ-హున్న-వబ్-తగూ-మా-కత-బల్లాహు-లకుమ్-వకులూ వష్-రబూ-హత్తా-యత-బయ్యన-లకుము-ల్-ఖైతుల్-అబ్యజు-మినల్-ఖైతిల్-అస్వది-మినల్-ఫజ్రి-సుమ్మ-అతిమ్ముస్-సియామ-ఇలల్-లైలి-వలా-తుబాషిరూ-హున్న-వ-అన్తుమ్-ఆ-కిఫూన-ఫిల్- మసాజిది-తిల్క-హుదూ దుల్లాహి-ఫలా-తఖ్-రబూహా-కజాలిక-యుబయ్యి-నుల్లాహు- ఆయాతిహీ-లిన్నాసి-లఅల్ల-హుమ్-యత్తఖూన్.

187. ఉపవాసపు రాత్రులందు మీరు మీ స్త్రీలతో కలియుట ధర్మ సమ్మతమైనది (హలాలైనది). వారు మీ వస్త్రములు. మీరు వారివస్త్రములు. మీరు మీయాత్మలకునష్టము చేయుచుండుట దేవునికి తెలుసు. కావున మీపై కనికరించి మిమ్ము క్షమించెను. మఱి మీ స్త్రీలతో కలియుఁడు. మఱి దేవుఁడు మీకొఱకు లిఖించియున్న దానిని కోరుఁడు. ఉదయకాలపు తెల్లచాఱ, నల్ల చాఱనుండి స్పష్టపడు లోపల భోజనము చేయుఁడు. ఆ పిదప ఉపవాసమును రాత్రివఱకు పూర్తి చేయుఁడు. మఱిమీరు మసీదులో ప్రార్థనకై నివసించు కాలమున మీ స్త్రీలతో కలియకుఁడు. ఇవి దేవుడు నియమించిన హద్దులు. వీని చేరువకు పోకుఁడు. ప్రజలు భక్తిపరులగుటకై యిట్లు దేవుఁడు తనసూచనలను స్పష్టముగాఁ దెలుపుచున్నాఁడు.

వ్యా॥ 187. ఉపవాసము విధింపఁబడిన ప్రారంభములో రాత్రి నిద్ర పోయినపిదప తిరిగి మేలుకొనిన, భుజించుట త్రాగుట స్త్రీలతో కలియుట మానుకొనుచుండిరి. ఇది కష్టతరముగా నష్టకరముగానుండెను. కావున దేవుఁడు దానిఁగూర్చి పూర్తి రాత్రి తినవచ్చును త్రాగవచ్చును స్త్రీలతో కలియవచ్చును. అని సెలవు నొసంగి ముందుజరిగిన పొరపాట్లను క్షమించెను. కావున ఉపవాసమందు దినములలో సూర్యుఁడు అస్తమించిన పిదప తెల్లవాఱు వఱకు

తినవచ్చును. త్రాగవచ్చును. స్త్రీలతో కలియవచ్చును. రమజాను నెలలో మసీదులలో ప్రార్థనకొఱకు వసించుట ధర్మము గానున్నది., దానినే ఏతికాఫ్ అనుదురు. ఇట్లు మసీదులలోనున్న దినములలో రాత్రికూడ స్త్రీసంభోగము చేయరాదు. వస్త్రమునకు దేహమునకు నెంతసమీప సంబంధమో భార్యాభర్తలకంతసమీప సంబంధముకలదు. కావున వారు పరస్పరము వస్త్రములని చెప్పఁబడిరి. తెల్లచాఱఅనగా తెల్లవారుజాము. దీనినే సుబ్‌హిసాదిఖ్ అనుదురు. నల్లచాఱఅనఁగా రాత్రి చీకటి. స్త్రీలతో కలియుటకుముఖ్యోద్దేశ్యము సంతానము. దానినే దేవుఁడులిఖించియున్నాఁడు. దానినేకోరుఁడు. అని చెప్పఁబడెను. ఇంతవఱకు వివరింపఁబడిన ధర్మములు దేవుఁడు నియమించిన హద్దులు. వానిని దాఁటిపోరాదు. ఆ హద్దులను మీఱి పోవుటకై సమీపంపనురాదు. అనఁగా ధర్మములకు విరుద్ధముగా నడవరాదు. ఇట్లు దేవుఁడు తనఆజ్ఞలను సూచనలను వివరించి స్పష్టముగా చెప్పుట ప్రజలకు భక్తి కుదురుటకుఁగాను. స్వంతముగా నెద్దియు కల్పించుకొనక దేవుని సూచనలనే అనుసరింప వలెను.

188. వలా-తాకులూ-అమ్‌వాలకుమ్-బైనకుమ్-బిల్-బాతిలి-వ-తుద్‌లూ-బిహా-ఇలల్-హుక్కామి-లి-తాకులూ-ఫరీఖమ్ మిన్-అమ్‌వా-లిన్నాసి-బిల్-ఇస్మి-వ-అన్తుమ్-తఅలమూన్.

188. మఱిమీరు ఒకరి సొమ్ము నొకరు అన్యాయముగా గైకొనకుఁడు. మఱి ప్రజలసొత్తులోని కొంతభాగమును అధర్మముగా గొనుటకుఁగాను దానిని అధికారుల యొద్దకుఁ గొని పోకుఁడు. ఇది మీకుఁదెలిసియే యున్నది.

వ్యా॥ 188. ఉపవాస కాలమున పగటిపూఁట ఆహారము తినకూడదు అని యుండెను. ఇఁక ఈ వాక్యములో సర్వకాలమందును తినరాని సొత్తును గూర్చి చెప్పఁబడుచున్నది. ఇందు లంచము, జూదము, వడ్డీ, మోసము, దొంగతనము, లాటరీ మొదలగు వానివలన లభించుసొత్తు అధర్మపు సొత్తు. దానిని సంపాదించకూడదు. ధర్మముగా వ్యాపారము కూలి, మొదలైన వృత్తులవలన ధనము సంపాదింపవలెను. అన్యాయమైన వ్యాజ్యములు అబద్ధసాక్ష్యము చెప్పి ఇతరులసొత్తు లభించుటకై అధికారుల యొద్దకు పోకూడదు. ఇట్టి వ్యాజ్యము అసత్యమని అన్యాయమని తెలిసియు అట్లు చేయుటతగునా? ఎప్పటికినితగదు.

189. యస్-అలూనక-అనిల్-అహిల్లతి-ఖుల్-హియ-మవా-ఖీతు-లిన్నాసి-వల్-హజ్జి వలై-సల్-బిర్రు-బిఅన్-తాతుల్-బుయూత-మిన్-జహూ-రిహా వలాకిన్నల్-బిర్ర-మని త్తఖా-వాతుల్-బుయూత-మిన్-అబ్వా-బిహా-వ త్తఖుల్లా

హా-లఅల కుమ్-తుష్-లిహూన్.

189. నీతో బాలచంద్రునిగూర్చి ప్రజలు ప్రశ్నించుచున్నారు. ఇది ప్రజలకును కాబాయాత్రకును కాలపరిమాణము. అని చెప్పుము. మీరు ఇండ్లకు వెనుకత్రోవలో వచ్చుటలో సత్కార్యము (పుణ్యము) లేదు. కాని సత్కార్యము దేవునియందు భయభక్తులుగలిగి యుండుటయే. మఱి ఇండ్లలో వాని ద్వారములగుండా ప్రవేశించుడు. మీరు మోక్షము పొందుటకై దేవునియందు భయభక్తులుగలిగి యుండుడు.

వ్యా॥ 189. ప్రజలు పైగంబరుల వారితో సూర్యుడు హెచ్చుతగ్గులు లేకుండ ఒకేస్థితిలో నుండును, కాని బాలచంద్రుడు హెచ్చుచుతగ్గుచు నుండును. అది ఎందులకు అని ప్రశ్నించిరి. చంద్రుని హెచ్చుతగ్గులవల్ల ప్రజలకు కాలము నెలలు తెలియును. మఱి కాబాయాత్ర నెలలుకూడ తెలియనగును చంద్రుని హెచ్చుతగ్గులవల్ల విద్వాంసులును విద్యలేనివారును నెలలు తేదులు. తెలిసికొనగలరు. కావున చాంద్రమానము సర్వజనులకు తెలియునది. సౌరమానము విద్వాంసులకే తెలియగలదు.

ఇస్లామునకు పూర్వము కాబా యాత్ర (హజ్)కొఱకు సిద్ధమైన పిదప ఇంటికి పోవలసినచో ఇంటిద్వారమునుండి పోకుండ వెనుకటి గోడ దుమికియో లేదా రంధ్రము వేసియో యింటిలో ప్రవేశించుచుండిరి. ఇట్లు చేయుట సత్కార్యమును పుణ్య కార్యము నని తలంచుచుండిరి. దేవుడు ఇదిభక్తిమార్గముకాదు. ఇంటికి రావలెనన్న యథా ప్రకారముగ ముఖ్యద్వారములోనే ప్రవేశింపవలెను. దేవునికి భయపడి భక్తిగలిగి సుగుణములను అవలంబించి చెడునడతలను వదలుట పుణ్యకార్యము అని మందలించెను. దేవునికి భయపడుట వలననే మోక్షము చేకూరును. కావున దేవునియందు భయభక్తులు గలిగి యుండవలెను. ఈ వాక్యములో కాబాయాత్ర (హజ్)విషయము వచ్చెను. ఇక ముందు వాక్యములలో వీని ధర్మములు వివరింపబడుచున్నవి.

190. వఖా-తిలూ-ఫీ-సబీ-లిల్లా-హిల్లజీన-యుఖాతి - లూనకుమ్ వలా-తఅ-తదూ-ఇన్నల్లాహ-లా యు-హిబ్బుల్-ముఅ-తదీన్. 191. వఖ్-తులూహుమ్-హైసు-సఖిఫ్-తుమూ-హుమ్ వ-అఖ్-రిజూ-హుమ్-మిన్-హైసు-అఖ్-రజూకుమ్ వల్-ఫిత్-నతు-అషద్దు-మినల్-ఖత్ లి-వలా-తుఖా-తిలూహుమ్-ఇన్దల్ - మస్-జిదిల్-హరామి-హత్తా-యుఖా-తిలూ-కుమ్-ఫీహి-ఫయిన్ ఖాతలూకుమ్-ఫఖ్ తులూ-హుమ్-కజాలిక-జజా-ఉల్-కాఫిరీన్. 192. ఫయి-నిన్-తహౌ-ఫ-ఇన్న

ల్లాహ-గఫూరుర్-రహీమ్. 193. వఖాతిలూహుమ్-హత్తా-లాతకూన-ఫిత్-నతున్-వయ-కూనద్-దీను-లి-ల్లాహి-ఫ-ఇనిన్-తహౌ-ఫలా-ఉద్-వాన-ఇల్లా- అలజ్-జాలిమీన్.

190. మఱియు మీతో యుద్ధమాడు వారితో దేవుని మార్గమందు యుద్ధము చేయుఁడు. మఱి అక్రమము చేయకుఁడు. నిశ్చయముగా దేవుఁడు అక్రమము చేయువారిని ప్రేమింపఁడు. 191. మఱివారు మీ కెచట దొరకిన నచ్చట వారిని చంపుఁడు, వారు మిమ్ములనెచ్చటనుండి తఱిమి వేసిరో మీరును వారిని అచ్చటనుండి తఱిమివేయుఁడు. చంపుటకన్న మతము నాటంక పఱచుట ఘోరమైనది. మస్జిదెహారాము వద్ద వారు మీతో యుద్ధమాడు నంతవఱకు మీరు వారితో యుద్ధమాడకుఁడు. మఱి వారే మీతో యుద్ధమాడిన మీరును వారిని వధింపుఁడు. ఇదియే అవిశ్వాసులకు శిక్ష. 192. మరల వారు మానుకొనినచో నిశ్చయముగా దేవుఁడు క్షమించువాఁడును దయాళువును. 193. మఱి ఉపద్రవము (ఫసాదు) లేకుండ పోవునంతవఱకును దేవుని యాజ్ఞ స్థిరపడునంతవఱకును వారితో యుద్ధమాడుఁడు. ఆపిదప వారు మానుకొన్నచో నెట్టి దౌర్జన్యము అక్రమము జరుగదు. కాని దుర్మార్గులపై జరుగును.

వ్యా॥ 190, 193. హజ్రత్ హిబ్రాహీము ప్రవక్త కాలమునుండియు మక్కా-పురము శాంతిప్రదేశముగా నుండెను. అచ్చట యెవరైన తమ ప్రాణ శత్రువు దొరకినను చంపకుఁడ వదలిపెట్టుచుండిరి. జీఖాదా, జిల్‌హజ్ ముహర్రము, రజబు అను నెలలో యేలాటి యుద్ధములేక శాంతిగా అరబ్బులుండు చుండిరి. ఈ నెలలోనే కాబా యాత్రకు ప్రజలు వచ్చుచుండిరి. కావున ఈ నెలలు గౌరవింపఁ దగినవని చెప్పుదురు. హజ్రత్ ముహమ్మదు వారు తాము మక్కా-పురము వదలి మదీనా పట్టణముచేరిన ఆఱవయేఁట తమ శిష్యులతో కాబామసీదు దర్శనార్థము బయలుదేఱి మక్కా-పురమునకు సమీపమున నున్న హుదేబియా ప్రదేశము చేరిరి. అప్పుడు మక్కా- ఖురైషులు మక్కా-పురము లోనికి ముసల్మానులను రానియ్యక యుద్ధమునకు సిద్ధమైరి. కాని పైగంబరుల వారు మేము యుద్ధమునకై రాలేదు. కాబా దర్శనము (ఉమ్రా) కొఱకు వచ్చినామని మక్కా-ఖురైషులతో సంధిచేసికొనిరి. అందు ఇపుడు మరలిపోయి రాఁగలయేఁట ముసల్మానులు మక్కా-పురమునకు వచ్చి మూఁడు దినములు మాత్రముండి పోవలసినది అని షరతుండెను. దానిననుసరించి ముసల్మానులు కాబా దర్శనము చేయకయే మరలి మదీనా-పురము చేరిరి. ఆ పిదప సంధిషరతు ననుసరించి రెండవయేఁట జీఖాదా నెలలో ముసల్మానులు కాబా దర్శనమునకై బయలుదేఱుచు, ఈతూరి మక్కా- ఖురైషులు సంధికి విరుద్ధముగా మమ్ములను

మక్కాలో రానియ్యక యుద్ధముచేసిరా మేము కాబా యాత్ర నెలలలో మక్కా సరిహద్దులలో నెట్లు యుద్ధమాడవలెను అని హజ్రత్ మహమ్మదు వారితో విన్నవించిరి. దానికిఁగాను దేవుఁడు ఈవాక్యములలో, అవిశ్వాసులు, (కాఫర్లు) మీతో కాబాయాత్ర నెలలోను కాబామసీదు హద్దులలోను యుద్ధముచేసిన మీరుకూడ యుద్ధముచేయుఁడు. అందుదోషములేదు. కాని మీరు ప్రారంభము చేయకూడదు. కాఫర్లు మొదలిడిన మీరు దాని పిదప యుద్ధముచేయవచ్చును. ప్రాణ ధర్మరక్షణార్థమును, దేశములో శాంతము నెలకొల్పుటకును ధర్మయుద్ధము చేయవలెను. యుద్ధములో బిడ్డలను స్త్రీలను చంపకూడదు. ఇట్లుచేయుట అక్రమము. ఇది దేవునికి ప్రీతికాదు. ఖురైషులు హజ్రత్ మహమ్మదువారిని వారిశిష్యులను హింసించి తుదకు మక్కాపురము వదలిపోవునట్లు చేసిరి. మఱి ఇస్లామ్ మతమును అణఁగ ద్రొక్కవలెనని అనేక ఆటంకములు, కుట్రలు జరపిరి. ఇట్లుచేయుటవధించుటకన్న ఘోరమైనది. కావున శాంతము నెలకొను వఱకు అవిశ్వాసులతో యుద్ధముచేయవలెను. అవిశ్వాసులు, కుట్రలు యుద్ధము మానుకొన్నచో యుద్ధము నిలిపి వేయవలెను. వారినిదేవుఁడు క్షమించును. అధర్మము మొదలంటనశించి, దేవుని ఆజ్ఞ ధర్మము స్థిరపడువఱకును, ప్రజలకు నెట్టి భయములేకుండ దేవునికొఱకే మతము నవలంబించునట్టి శాంతముగలుగు వఱకును విరోధులతో యుద్ధమాడవలెను. దౌర్జన్యముచేయువారిపై మాత్రమే దౌర్జన్యము జరుగును. అన్యాయము మానుకొన్నవారిపై నెట్టి దౌర్జన్యము జరుగదు. కాబామసీదును మస్జిదేహరామ్ అనుదురు.

194. అష్-షహ్రుల్-హరాము-బిష్-షహ్రిల్-హరామి-వల్-హురుమాతు-ఖిసాసున్-ఫమనిఅ-తదా-అలైకుమ్-ఫఅ-తదూ-అలైహి-బి-మిస్లి-మా-అతదా-అలైకుమ్ - వత్తఖుల్లాహ - వఅ-లమూ-అన్నల్లాహ-మా-అల్-ముత్తఖీన్. 195. వ-అన్-ఫిఖూఫీ-సబీ-లిల్లాహి-వలా-తుల్ఖూ-బి-ఐదీకుమ్-ఇలత్-తహ్-లుకతివ-అహ్సినూ-ఇన్నల్లాహ-యు-హిబ్బుల్-ముహ్సినీన్.

194. గౌరవమైన నెల గౌరవమైన నెలకు బదులుగా నున్నది. గౌరవములో సరిసమానముండవలెను. మఱి మీపై నెవరు దౌర్జన్యము చేయుదురో మీరును అంత దౌర్జన్యము వారిపై చేయుఁడు. దేవునికి భయపడుఁడు. దేవుఁడు భయభక్తులు గలవారికి తోడై యున్నాఁడని తెలిసికొనుఁడు. 195. మఱి దేవుని మార్గమందు ఖర్చు చేయుఁడు. మీ చేతులార మీప్రాణములను వినాశములోపడవేయకుఁడు. సత్కార్యములు చేయుఁడు. నిశ్చయముగా దేవుఁడు సత్కార్యములు చేయువారిని ప్రేమించును.

వ్యా॥ 194. పైగంబరులవారు ఆఱవయేఁట జీఖాదా నెలలో కాబా దర్శనార్థము ప్రయాణమై అవిశ్వాసులచే ఆటంకము చేయఁబడి తిరిగివచ్చిరి. దానికి మఱుసటి యేఁడు జీఖాదా నెలలోనే దర్శనమునకై ప్రయాణమైరి. గడచిపోయిన గౌరవమైన నెలకు బదులు ఈ గౌరవమైననెల యున్నది. ఎట్టి లోపము గలుగదు. అవిశ్వాసులు యాత్ర నెలను గౌరవించి మీ కాబాదర్శనమునకు అడ్డుపడకున్నచో మీరును గౌరవము పాటింపుఁడు. లేక అవిశ్వాసులు గౌరవముపాటింపక మీతో యుద్ధము చేసిన మీరును వారి నెదుర్కొనుఁడు. నెల గౌరవము పాటింప నక్కఱలేదు. గౌరవించుటలో సమానత్వముండ వలెను. శత్రువులు ఎంత దౌర్జన్యము చేయుదురో దానికి ప్రతీకారముగ అంతటి దౌర్జన్యము చేయవలెను. ఇట్టి సమయములో హద్దుల మీఱక దేవుని శిక్షకు భయపడవలెను. దేవునియందు భయభక్తులుగల వారికి దేవుని సహాయముండును.195.ధర్మయుద్ధమునకై ఆధారమైన ధనము మొదలైనవానిని ఖర్చు చేయుటలో వెనుదీయఁగూడదు. ధర్మయుద్ధము (జిహాద్) దేవుని సెలవుచే చేయఁబడునుగాన, అది దేవుని మార్గమునందు వ్యయమైనట్లగును. డబ్బుఖర్చు చేయక ధర్మ యుద్ధమువదలి పిఱికితనము వహించిన శత్రువులు బలపడి మిమ్ములను నశింపఁజేయుదురు. ఇందుచే మీరు మీచేతులార ప్రాణనష్టము చేసికొనిన వారగుదురు. కావున లోకమునశాంతము నెకొలుపుటకును స్వాతంత్ర్యము బడయుటకును బానిస పిశాచము తొలగించుటకును సర్వవిధముల కృషిసలిపి ఖర్చుచేసి తీఱవలెను. సత్కార్యములు చేయవలెను. ఇట్టి భక్తులను దేవుఁడు ప్రేమించును. ఇఁక ముందు వాక్యములో కాబాయాత్ర నియమములు చెప్పఁబడుచున్నవి.

196. వ-అతిమ్ముల్-హజ్జ-వల్-ఉమ్రత-లిల్లాహి-ఫ-ఇన్-ఉహ్సిర్-తుమ్-ఫమస్-తైసర-మినల్-హద్ఇ-వలా-తహ్-లిఖూ-రుఊ-సకుమ్-హత్తా-యబ్-లుగల్-హద్-యు మహిల్లహు-ఫమన్-కాన-మిన్-కుమ్-మరీజన్-ఔ-బిహీ-అజమ్-మిర్-రాసిహీ-ఫఫిద్-యతుమ్-మిన్-సియామిన్-ఔ-సద-ఖతిన్-ఔ-నుసుకిన్-ఫ-ఇజా-అమిన్తుమ్-ఫమన్-తమత్తఅ-బిల్-ఉమ్రతి-ఇలల్-హజ్జి-ఫమస్-తైసర-మినల్-హద్యి-ఫమల-లమ్-యజిద్-ఫసియాము సలాసతి అయ్యామిన్ ఫిల్-హజ్జి-వసబ్-అతిన్-ఇజా రజఅ-తుమ్-తిల్క-అష్-రతున్-కామి-లతున్-జాలిక-లిమల్-లమ్-యకున్-అహ్-లుహూ-హాజిరిల్-మస్-జిదిల్-హరామి-వత్త-ఖుల్లాహ-వఅ-లమూ-అన్నల్లాహ-షదీదుల్-ఇఖాబ్.

196. మఱి దేవుని కొఱకు హజ్ (కాబాయాత్ర) ఉమ్రా (కాబా దర్శనము) పూర్తిచేయుఁడు. మఱి మీకు కేదియైన ఆటంకముగలిగినచో మీకు లభించు ఖుర్బానీ మీరు చేసి తీఱవలెను. మఱి ఖుర్బానీ జంతువు దాని చోటునకు చేరునంతవఱకు మీరు మీ తలక్షౌరము చేసికొనకుఁడు. మఱి మీలో నెవఁడైన రోగియైనచో లేదా వానికి తలబాధయున్నచో ఉపవాసములు, లేక దానము, లేక ఖుర్బానీ దానికి బదులున్నది. మఱి మీలో నెవఁడైన మనశ్శాంతిపొంది ఉమ్రాతో హజ్జును కలిపి లాభము పొందినయెడల నాతఁడు తనకు లభించిన ఖుర్బానీ ఇయ్యవలెను. మఱియు నెవ్వనికైన ఖుర్బానీ లభింపనిచో ఆతఁడు హజ్ కాలములో మూఁడు దినములు ఉపవాసమును హజ్ నుండి మరలినపిదప ఏడుదినములును ఉపవాసముండవలెను. ఇది పూర్తి పదిదినముల ఉపవాసము ఆయెను. ఈ ధర్మము, ఎవరి గృహస్థులు కాబామసీదు దగ్గఱలేరో వారికొఱకున్నది. దేవునికి భయపడుఁడు. నిశ్చయముగ దేవుని శిక్ష చాల కఠినమైనది అని తెలిసికొనుఁడు.

వ్యా॥ 196. హజ్ (కాబాయాత్ర) ఇస్లామ్ మత ముఖ్యధర్మములలో నొకటి. శక్తిగల భక్తులు తమ జీవితకాలములో నొకతూరి చేసితీఱవలసినది. దీని నియమములును ఉమ్రా (కాబాదర్శనము) ధర్మములును ఒక్కటేను. కాని కాబా యాత్రలో అరఫాతు అను మైదానమునకుపోయి యచట నిలుచుట అనుధర్మము ఎక్కువయున్నది. ఉమ్రాలో ఇదిలేదు. ఈ రెంటిని ప్రారంభించినచో పూర్తి చేసి తీఱవలెను. వీనిని చేయుటలో దేవుని ప్రీతిపడయుటకు అని యుద్దేశించవలెను. ప్రఖ్యాతికిఁగాను లేక ప్రజలు మెచ్చుటకుఁగాను చేయరాదు. దానివలన ఫలితములేదు. హజ్, ఉమ్రా చేయుటకు సంకల్పించి ఇహ్రాము (దీక్ష) కట్టుకొనిన పిదప మధ్యలో శత్రువువలననో వ్యాధివలననో ఆటంకము గలిగి కాబామసీదు చేరలేకపోయినచో దానికి పరిహారముగా శక్తిలభించినచో ఖుర్బానీమక్కాపురమునకుఁబంపవలెను. అది ఒంటెగా ఆవుగా మేఁకగా నుండవచ్చును. ఖుర్బానీ మక్కాపురముచేరి జబా అయినదని నిశ్చయమైన పిదప క్షౌరము చేసికొనవచ్చును. హజ్, ఉమ్రానిబంధనలు తొలఁగిపోవును. ఆటంకములు తొలఁగిపోయిన పిదప హజ్, ఉమ్రా బదులుగా చేయవలెను. హజ్, ఉమ్రాచేయు దినములలో తలబాధగాని, వ్యాధిగాని గలిగి తలక్షౌరము చేసికొనవలసివచ్చినచో చేసికొనవచ్చును. దానికి పరిహారముగా మూఁడు దినములు ఉపవాసముగాని ఆఱుగురు నిఱుపేదలకు భోజనదానము చేయుటగాని ఒక మేఁక ఖుర్బానీగాని చేయవలెను.

ఎట్టి ఆటంకములేకుండ శాంతితో నెవ్వరైన ఒకేతూరి ఉమ్రాతో

హజ్ కలిపి చేసినచో దానికిఁగాను ఒకమేఁక లేక గోవు ఒంటెలోని ఏడవభాగము ఖుర్బానీయియ్యవలెను. ఖుర్బానీజంతువు లభింపకపోయిన, లేక ఖుర్బానీచేయు శక్తి లేకపోయినచో దానికిబదులు హజ్ సమయములో మూఁడు దినములును హజ్ పూర్తియైన పిదప ఏడుదినములును మొత్తము పదిదినములు ఉపవాస ముండవలెను. ఉమ్రా, హజ్ కలిపి ఒకేతూరి చేయుటనే ఖిరాన్, తమత్తో అనుదురు. మక్కా పురనివాసులకుఁ దప్పనితరులకు ఈధర్మమున్నది. మక్కాపురనివాసులు, ఉమ్రా, హజ్ వేఱువేఱుగా చేయవలెను. (దీనిని ఇఫ్రాద్ అనుదురు.)ధర్మములు ఆచరించుటలో దేవునియందు భక్తిగలిగి యుండవలెను. దేవుని శిక్షచాల కఠినమైనది. కావున దానికి భయపడవలెను.

197. అల్-హజ్ జు-అష్-హురుమ్.మఅలూమాతున్-ఫమన్-ఫరజ-ఫీహిన్నల్-హజ్జ-ఫలా-రఫ-స-వలా-ఫుసూఖ-వలాజిదాల-ఫిల్-హజ్జి-వమా-తఫ్-అలూ-మిన్-ఖైరిన్-య అ-లమ్-హుల్లాహు-వత జవ్వదూ-ఫయిన్న-ఖైరజ్-జాదిత్-తఖ్వా-వత్తఖూనీ-యా-ఉలిల్-అల్-బాబ్.

197. హజ్ (కాబాయాత్ర) నెలలు తెలిసినవే. కావున వానిలోనెవరు హజ్ చేయ పూనుకొనుదురోవారు తమభార్యలతో కలియుటగాని అక్రమములుగాని జగడములుగాని హజ్ సమయములో చేయరాదు. మఱి మీరు ఏసత్కార్యము (పుణ్యము) చేయుదురో దేవుఁడు దాని నెఱుంగును. దారిఖర్చులు సిద్ధము చేసికొనుఁడు. దానివలనమేలు భిక్షమునుండి రక్షణగలుగును. మఱి ఓబుద్ధిమంతులారా! నాకే భయపడుఁడు.

వ్యా॥ 197. షవ్వాలు, జీఖాదా, జిల్ హజ్ (బకరీదు పండుగ వఱకు) అను నెలలలో కాబాయాత్ర నుద్దేశించి పూర్తిచేసికొనవలెను. ఈనెలలను ముందు వెనుకలు చేయరాదు. ఈనెలలు అందఱకును దెలిసినవే. హజ్ లేక ఉమ్రాకొఱకు నుద్దేశించి వాని నియమములు చేయఁబూనుకొనినపిదప స్త్రీసంభోగము, దుర్భాషలు పాపకార్యములు మొదలైన అక్రమములు, జగడములు చేయరాదు. భక్తితో శాంతికరముగా కాబాయాత్ర సలుపవలెను. ఏసత్కార్యము చేసినను దేవునికిఁదెలియును. కావున దేవునికి ప్రీతిగా మంచి పనులుచేసి వాని ఫలితములు పొందవలెను. కొందఱు దారిఖర్చులేక కాబాయాత్రకు పోవుచు మేము తృప్తిచెంది దేవునిపై నాధారపడిన వారలము. అని పలుకుచుండిరి. తుదకు అవస్థలకు పాలై భిక్షమెత్తుచు జనులను పీడించుచుండిరి. దానికిఁగాను అట్లుచేయవలదు. దారిఖర్చులు సేకరించుకొని రావలెను. భిక్షము నెత్తవద్దు. దానిని మానుకొనుట చాలమేలు, బుద్ధిమంతులు అట్లు

చేయక దేవునికి భయపడవలెను.

198. లైస-అలై-కుమ్-జునా-హున్-అన్ తబ్-తగూ-ఫజ్-లమ్-మిర్ రబ్బి కుమ్-ఫయిజా-అఫజ్ తుమ్-మిన్-అరఫాతిన్-ఫజ్ కురుల్లాహ-ఇన్దల్-మష్-అరిల్-హరామి-వజ్-కురూహు కమా-హదాకుమ్-వఇన్-కున్తుమ్-మిన్-ఖబ్లిహీ-లమి-నజ్జాల్లీన్. 199. సుమ్మ-అఫీజూ-మిన్-హైసు-అఫా-జన్నాసు-వస్తగ్- ఫిరుల్లాహ-ఇన్నల్లాహ-గఫూరుల్-రహీమ్. 200. ఫ-ఇజా-ఖజై-తుమ్-మనా-సిక-కుమ్-ఫజ్-కురుల్లాహ-కజిక్-రికుమ్-అబా-అకుమ్-ఔ-అషద్ద-జిక్-రన్-ఫమినన్-నాసి-మన్-యఖూలు-రబ్బనా-ఆతినా-ఫిద్-దున్యా-వమా-లహూ-ఫిల్-అఖిరతి-మిన్-ఖలాఖ్. 201. వ-మిన్-హుమ్-మన్-యఖూలు-రబ్బనా-ఆతినా-ఫిద్- దున్యా-హాస-నతన్-వ-ఫిల్-అఖిరతి-హాస-నతన్-వఖినా-అజా-బన్నార్. 202.ఉలా-ఇక-లహుమ్-నసీబుమ్-మిమ్మా-కసబూ-వల్లాహు-సరీఉల్-హిసాబ్. 203. వజ్-కురుల్లాహ-ఫీఅయ్యా-మిమ్-మఅ-దూదా-తిన్-ఫమన్-తఅజ్జల-ఫీ-యౌ - మైని-ఫలా-ఇస్మ-అలైహి-వమన్-త-అఖ్ఖర-ఫలా-ఇస్మ-అలైహి-లిమనిత్-తఖా-వత్-ఖుల్లాహ-వఅ-లమూ-అన్నకుమ్-ఇలైహి-తుహ్-షరూన్.

198. మీ దేవుని అనుగ్రహమును సంపాదించు కొనుటవలన మీపై దోషము లేదు. మఱి అరఫాతునుండి మీరు మరలివచ్చునపుడు మష్అరెహరాము వద్ద దేవునిని ధ్యానింపుఁడు. మఱియు స్మరింపుఁడు. ఆతఁడు మీకు నేర్పించిన విధానమున ఆతనికి జ్ఞప్తిచేయుఁడు. మఱియు నిశ్చయముగా మీకు దీనికి ముందు సన్మార్గము తెలియకుండెను. 199. పిదప ప్రజలు ఎచ్చట నుండి మరలుదురో అచ్చటినుండి మీరును మరలుఁడు. దేవుని క్షమాపణ కోరుఁడు. నిశ్చయముగా దేవుఁడు క్షమించువాఁడును దయాళువును. 200. ఆ పిదప మీరు కాబాయాత్ర ఆచారములు పూర్తిచేసినపుడు మీతాత ముత్తాతలను ఎట్లు జ్ఞప్తికిఁదెచ్చుకొనుచుంటిరో, అట్లును, దానికన్న హెచ్చుగాను దేవుని స్మరింపుఁడు. మఱి ప్రజలలో కొందఱు, ఓ మా ప్రభూవా! మాకు ఇహలోకమందే( మేలు) ఒసఁగుము అని చెప్పుదురు. ఇట్టివారికి పరలోకమునందు నెట్టి భాగమును లభింపదు. 201. మఱి వారిలో కొందఱు ఓ మా ప్రభువా! మాకు ఇహమునందును, పరమునందును, మేలు నొసంగుము, మఱిమమ్ము నరక బాధ నుండి రక్షింపుము అనిపలుకుదురు. 202. ఇట్టివారికే వారు సంపాదించిన దాని

నుండి భాగము లభించును. మఱి దేవుఁడు త్వరలోనే లెక్క తీసికొనువాఁడు. 203. మఱి లెక్కింపఁబడు కొద్దిదినములు దేవుని స్మరింపుఁడు. మఱి ఎవఁడు తొందరగా రెండు దినములలోనే తిరిగిపోవునో వానిపై నెట్టిదోషమునులేదు. మఱెవఁడు, నిదానించి నిలిచిపోవునో, వానిపైనను నెట్టిదోషములేదు. ఇది దేవునికి భయపడువారికి నున్నది. దేవునికి భయపడుఁడు. మీరందఱును ఆతని వద్దకే రప్పింపఁబడుదురని తెలిసికొనుఁడు.

వ్యా॥ 198. కాబాయాత్రకొఱకు పయనమైనపుడు వ్యాపారము చేయ వచ్చును. దానివలన దోషముగాని పాపముగాని లేదు. వ్యాపారము దేవుని అనుగ్రహమని చెప్పఁబడిరెు. అయినను, ముఖ్యోద్దేశ్యమగు కాబాయాత్ర త్రికరణశుద్ధిగా నుండవలెను. వ్యాపారమే ముఖ్యముగా నుద్దేశింపఁగూడదు. అరఫాతు అను మైదానము మక్కానుండి కొన్ని మైళ్లదూరమున నున్నది. యాత్రికులు బకరీదునెల తొమ్మిదవ తేదిని అచట బసచేయుదురు. అచ్చట నిలిచి దేవుని ప్రార్థించుట కాబాయాత్ర యాచారములలో ముఖ్యమైన ధర్మము. అరఫాతు నుండి తిరిగి వచ్చునపుడు మార్గమందు ముజ్దలఫా ప్రదేశమున్నది. అది ఒక కొండగలదు. దానినే మష్అరుల్ హరామ్ అని అనుదురు. దానిపై యాత్రికుల అధిపతి (ఇమామ్) నిలుచును. మఱియు యాత్రికులు అచట రాత్రి బసచేయవలెను. అచ్చట దేవుని ధ్యానించి ఆతని పవిత్రనామస్మరణచేయవలెను. అవిశ్వాసులు ఇతరదైవములను కలిపి ప్రార్థించుచుండిరి. అట్లు వలదు. దేవుఁడు తమకెట్లు బోధించి సన్మార్గము చూపెనో యట్లు ప్రార్థింపవలెను. ఇస్లామునకును ఖురానునకును పూర్వము సన్మార్గము మీకుఁ దెలియకుండెను. దేవుఁడు అనుగ్రహించి తెలిపెను. కావున అటులే స్మరింపవలెను. 199. కొందఱు అరఫాతునకు పోక ముజ్దలఫానుండియే మరలి వచ్చుచుండిరి. అట్లు వలదు. సర్వజనులును ఎట్టి భేదములేక అరఫాతునకుఁ బోయి అచ్చటినుండియే మరలి రావలసినది. అని బోధింపఁబడిరెు. అరఫాతు మైదానములో ధనికుఁడని బీదవాఁడని రాజని బంటుఅని భేదము కనుపించదు. అందఱు యాత్రికులు, తలగుడ్డలేకుండ కుట్టని రెండు వస్త్రములు మాత్రము ధరించియుందురు. అందలి సమానత్వము ఎచ్చటను కానుపించదు. కావున ఆ సమానభావము కాబాయాత్ర యందలి ప్రతిధర్మములో పాటింపవలెను. దేవుని సన్నిధానమున తమ పొరపాటులకు క్షమాపణ కోరుఁడు. దేవుఁడే క్షమించువాఁడును, దయాళువును. 200, 201. బకరీదునెల పదియవతేదిని, రాళ్లురువ్వుట, (రమీ-జెమ్రా) ఖుర్బానీక్షౌరము, కాబాప్రదక్షిణము, సఫా మర్వా మధ్య పరుగిడుట (సయీ) మొదలగు ఆచారములు చేసినపిదప మక్కాపురమునకు సమీపముననున్న మినా అను చోటున యాత్రికులు మూఁడు దినము

లవఅకు నిలుతురు. ఇస్లామునకు పూర్వము యాత్రికులు మినాలో నిలిచి తమ తమ తాతముత్తాతలు గావించిన పనులను పేర్కొని డంబాలు కొట్టుకొను చుండిరి. దానికి బదులు, దేవుని నామ స్మరణము (జికిర్) చేయవలెను. మీ పెద్దలను తలంచుచున్న దానికన్న అధికముగా దేవునిని తలంచి ఆతనిని ప్రార్థింపుండు. అని బోధించి పురాతన పద్ధతిని రద్దుచేసెను. దేవుని ప్రార్థించువారిలోను రెండు తెగలవారు గలరు. కొందఱు ఇహలోకమునే ముఖ్యముగానుద్దేశించి ఏలాంటి మేలుగాని సౌఖ్యముగాని భోగములుగాని యిహలోకములోనే లభింపవలెను, అని వేడుచు పరలోకమును వదలివేయుదురు. కాని నిజమైన భక్తులు ఉభయలోకముల మేలును సౌఖ్యమును పాటించి ఆ రెంటిలోను మేలును అగ్నిబాధనుండి విముక్తియును గలుగునట్లు దేవుని ప్రార్థింతురు. 202. ఇట్టి వారికే వారికర్మలఫలితముపరలోకనందు లభించును. దేవుడుభక్తులకర్మల లెక్క త్వరలోనే తీసికొనును. తీర్పు దినము శీఘ్రములో రానున్నది. అచ్చట లెక్క తీసికొనుటలో నెట్టిఆలస్యము జరుగదు. కావున పరలోకమునుండి అజాగ్రత్తగా నుండఁగూడదు. 203. యాత్ర ఆచారములు ముగిసినపిదప అనగా (బకరీదునెల 11, 12, 13-వ తేదుల యందు) మినాచోటున మూఁడు దినముల వఱకుండుట ధర్మము. అచ్చటనుండిన దినములలో దేవునిని ధ్యానింపవలెను. ఆతని పవిత్రనామము కొనియాడవలెను. ఎవరైన మూఁడు దినములు నిలువక తొందఱగానే రెండు దినముల తరువాత మినా వదలిపోయిన దోషములేదు. లేక పూర్తి మూఁడుదినములుండి పోయినను సరే. ఇది భయభక్తులుగలిగి దేవునికి భయపడు వారికి నున్నది. కావున ముఖ్యముగా దేవునియందు భయభక్తులు గలిగి పాపకార్యములను వదలి సదా పుణ్యకార్యములను చేయవలెను. తుదకు అందఱు దేవుని సన్నిదిధానము చేరవలసియున్నది. కావున మంచికార్యములుచేసి దేవుని ప్రీతిపడయుటకు యత్నింపవలెను.

204. వ-మినన్-నాసి-మన్-యుఅ్జిబుక-ఖౌలుహూ-ఫిల్-హాయాతిద్దున్యా-వయుష్-హిదుల్లాహ-అలా-మాఫీ ఖల్బిహీ-వహువ-అలద్దుల్-ఖిసామ్. 205. వఇజా-తవల్లా-సఆ-ఫిల్-అర్జి-లియుఫ్-సిద-ఫీహా-వయుహ్లికల్-హర్స-వన్-నస్ల-వల్లాహు-లా-యుహిబ్బుల్-ఫసాద్. 206. వ ఇజా-ఖీల-లహుత్-తఖిల్లాహ-అఖజత్-హుల్ ఇజ్జతు-బిల్-ఇస్మి-ఫహస్బుహూ-జహన్నము-వలబీసల్-మిహాద్. 207. వమినన్-నాసి-మన్ యష్రీ-నఫ్-సహుబ్-తిగాఅ-మర-జాతిల్లాహి-వల్లాహు-రఊ-ఫుమ్-బిల్-ఇబాద్.

204. మఱి ప్రజలలోని కొందఱిపలుకులు ఇహలోక జీవనమునందు నీకు సమ్మతమగుచున్నవి. మఱి వారు తమ మనస్సులోనున్న దానికి దేవునిని సాక్షిగా పెట్టుచున్నారు. మఱివారు ఘోరమైన జగడములాడువారు. 205. మఱి నీయొద్దనుండి మరలినచో దేశములో వినాశముగలిగించుటకును, పొలములను జీవులను నాశముచేయుటకును యత్నించుచు తిరుగుదురు. మఱిదేవుఁడు ఫసాదును (ఉపద్రవమును) ప్రేమింపఁడు. 206. మఱి దేవునికి భయపడుఁడు. అని వారికి చెప్పినపుడు వారిగర్వము పాపమునకై వారినిప్రేరేపించును. కావున వారికి నరకముచాలును. మఱి అదిచాలచెడ్డనివాసము. మఱి ప్రజలలో కొందఱు దేవుని ప్రీతిపడయుటకై తమ యాత్మలను అమ్ముచున్నారు. మఱి దేవుఁడు తన భక్తులయెడ చాల కనికరము గలవాఁడు.

వ్యా॥ 204, 207. మునుపటి వాక్యములలో దేవుని ప్రార్థించువారు రెండుతెగలుగా నుందురని చెప్పఁబడియె. ఇఁక ఈవాక్యములలోను ప్రజలు విశ్వాస భక్తి కర్మలను బట్టి రెండుతెగలు గలరని చెప్పఁబడుచున్నది. మొదటి రకము వంచకులది. వంచకులనే అరబీలో మునాఫిఖ్ అనుదురు. ఈ తెగవారు ప్రజలకు చూపుటకు విశ్వాసము వెల్లడింతురు. దాని ననుసరించి మాటలు కూడ వినువారికి సమ్మతమగునట్లు తీపుగాను విశ్వాస పూరితముగా నున్నట్లు నటించి పలుకుదురు. మఱి నమ్మకముగలుగుటకై మామనస్సులోనుండు దానికి దేవుఁడే సాక్షి. అని బాసలు చేయుదురు. కాని వారికర్మలు వారిచిత్తశుద్ధిని దెలుపవు. ఎందుకన వారికర్మలను బట్టిచూచిన విశ్వాసమునకు వ్యతిరేకములే. నమాజులు సలుపరు. ఉపవాసముండరు. జకాతుదానముచేయరు. హజ్ చేయరు. ఘోరపాపములో మునింగియుండియు మతసేవకులని దేశోద్ధారకులనిప్రజలతో బొంకునట్టి వారు ప్రతికాలములోను ప్రతిదేశములోను గలరు. ఇట్టివంచకులవలననే జాతి దేశము పరాధీనమై హీనదశలోపడిపోవును. వారు రహస్యముగా కుట్రలు సలిపి దేశనాశము, జంతువులను జీవులనుచంపుట, పొలములనుకాల్చి నాశముచేయుట మొదలగు వినాశకరములైన కార్యములు చేయుదురు. ఇట్టి వారికి భక్తిబోధకూడ సరిపడదు. గర్వము వలనను పాపకార్యములను జేయుటకై పూనుకొనుదురు. మఱి స్వలాభాపేక్షవల్లను పనికిమాలిన జగడములు వివాదములు పెట్టుకొనుదురు. దేవుఁడు ఎప్పటికిని ఉపద్రవమును అశాంతనును ప్రేమింపడు. గర్వించు వంచకులను నరకమేచాలును. అదిచాల బాధాకరమైన దియును చాలచెడ్డదియును. కావున వంచనవదలి నిజమైన భక్తిగలిగి యుండవలెను. 206. ఈవాక్యములో నిజమైన ముసల్మాను భక్తులుండవలసిన పద్ధతులు చెప్పఁబడినవి. త్రికరణశుద్ధిగ సర్వమును దేవునిప్రీతికొఱకు వినియోగించి జాతి, సంఘము, దేశము, ప్రజలమేలుకొఱకు శక్తికొలఁది వంచనలేకుండ

పాటుపడవలెను. దేవుఁడు తనభక్తులయెడ చాల కనికరముగలవాఁడు కావున లోకము యొక్క మేలుకై పాటుపడి యాతని దయవడయుటకై భక్తులు యత్నించవలెను.

208- యా.అయ్యు-హల్లజీన-ఆమనుద్-ఖులూ-ఫిస్-సిల్మి-కాఫ్ఫ-తస్-వలా-తత్-తబిఉ-ఖుతువా-తిష్-షమాతీ-నిఇన్నహూ-అదువ్వున్-ముబీన్.209.ఫఇన్-జలల్-తుమ్-మిం-బఅ-ది-మా జా-అత్-కుముల్-బయ్యినాతు-ఫఅ-లమూ-అన్నల్లాహ-అజీ-జున్-హకీమ్.210.హల్-యన్-జురూన-ఇల్లా-అన్-యాతియ-హుముల్లాహు-ఫీజులల-లిమ్-మినల్-గమామి.వల్-మలా-ఇకతు-వఖు-జియల్-అమ్రు-వ-ఇలల్లాహి-తుర్-జఉల్-ఉమూర్.

208. ఓ. విశ్వాసులారా ! ఇస్లామ్‌లో సంపూర్ణముగా ప్రవేశింపుఁడు. మఱి సైతాను జాడల ననుసరింపకుఁడు' నిశ్చయముగా వాఁడు మీకు విస్పష్ట విరోధి. 209. మఱి మీకు స్పష్టమైన ధర్మములు (ఆజ్ఞలు) వచ్చిన పిదపను మీరు జాఱినచో నిశ్చయము గా దేవుఁడు సర్వశక్తుఁడనియు వివేచనాపరుఁడు అనియుఁ దెలిసికొనుఁడు. 210. ఏమి ? వారు దేవుఁడును దేవదూతలును మేఘములనుండి రాఁగా కార్యముముగిసి (తీరి) పోవలెనని వేచియున్నారా ! మఱి సర్వకార్యములును దేవుని యొద్దకే మరలును.

వ్యా॥ 208. ఈవాక్యములో భక్తులును విశ్వాసులును అగు ముసల్మానులు సంపూర్ణముగా ఇస్లామ్ మతము ననుసరింపవలెను. ధర్మమునకును ముసల్మానులకును విరోధియగు పిశాచపుజాడలందును. దుర్మార్గములు అగు తప్పుత్రోవలందునుపోకూడదు. త్రికరణశుద్ధిగా మతమునందలి ప్రతిధర్మమును ఆజ్ఞను అనుసరించి అధర్మములను విడనాడి సంపూర్ణ భక్తులు కావలెను. అని బోధింపఁబడియెను. ఈ వాక్యములోని 'సిల్మి' అను పదము ఇస్లామ్ విధేయతకును శాంతికిని ఐకమత్యమునకును చేరును. అందుచే ముసల్మానులు, ఇస్లామ్‌లోను, విధేయతయందును శాంతి ఐకమత్యము నెలకొలుపుటయందును సంపూర్ణులై యుండవలెను. 209. ఇందు ఇస్లామ్ మతధర్మములు ఆజ్ఞలు స్పష్టముకానందరికిని దెలిసినవి. ధర్మమార్గము దెలిసిన పిదప దానినుండి జాఱి పిశాచి త్రోవయగు దుర్మార్గమునందు నడచినచో దేవుఁడు సర్వశక్తుఁడు. ధర్మమువదలి తప్పుత్రోవను పోయినఁదులకుశిక్షించును. శీఘ్రముగానే శిక్షకలుగలేదే అని మోసపోకుఁడు. ఆతఁడు వివేచనాపరుఁడు. కొంతకాలము విరామము నిచ్చియున్నాఁడు. ఆతని ప్రతికార్యము వివేచనలేనిది యుండదు, కావున భయభక్తులతో సన్మార్గ

లగు జనులకు దేవుని శక్తిని సూచించు గొప్పసూచనలు. ఇవన్నియు గ్రహించి వీనిని ఎట్టి లోపము లేకుండ నడపువాఁడు ఒక్కఁడు సర్వశక్తిగల ప్రభువగు అల్లాః ఉన్నాఁడని విశ్వసింపక తప్పదు. మఱి ప్రజలకు నుపయోగకరములైన సామగ్రిని దీసికొని భయంకరమైన సముద్రమును క్షేమముగా దాటించు ఓడలయందును దేవుని శక్తిసూచనలున్నవి.

165. వమినన్-నాసి-మన్-యత్తఖిజు-మిన్-దూనిల్లాహి-అన్దాదన్-యుహిబ్బూనహుమ్-కహుబ్బిల్లాహి-వల్లజీన ఆమనూ-అషద్దు-హుబ్బల్-లిల్లాహి-వలౌ-యరల్లజీన-జలమూ-ఇజ్ యరౌనల్-అజాబ అన్నల్-ఖువ్వత-లిల్లాహి-జమీ-అన్-వఅన్నల్లాహ-షదీదుల్-అజాబ్.

165. మఱి ప్రజలలోని కొందఱు దేవునికి సాటి కల్పించుచు దేవుని ప్రేమించునట్లు వానిని ప్రేమించుచున్నారు. మఱియు విశ్వాసులకు దేవునియందే అధిక ప్రేమయున్నది. మఱియు దుర్మార్గులు నరకబాధ పొందునపుడు సర్వశక్తి దేవునికే యున్నదనియు, దేవునిశిక్ష చాలకఠినమైనదనియు, తెలిసికొనినచో (అట్లు సాటికల్పింపరు.)

వ్యా॥ 165. మానవులు సర్వసృష్టిలో శ్రేష్ఠులయ్యు వారిలో కొందఱు తమ అవివేకముచే దేవుని వదలి ఆతనికి సాటిగ నితరులనుజేసి ఎట్లు దేవునిని మనస్ఫూర్తిగా ప్రేమింపవలెనో అట్లు ప్రేమించుచున్నారు. ఇదిచాల అన్యాయమును, దుర్మార్గమును. ఏలాభనష్టములు చేయఁజాలని దైవంబులనుకొలుచుట మానవజాతికి తగినదికాదు. అందుచేతనే విశ్వాసులును భక్తులును దేవునినే నమ్మి సాటికల్పింపక ఆతనియందు అధికమైనప్రేమ భక్తి గలిగి ఎట్టికష్టములోను అతనిసహాయముకోరుదురు. ఆతని ఆజ్ఞలనే అనుసరింతురు. ఇదియే భక్తులగు ముసల్మానుల మార్గము. దేవునికి సాటికల్పించిన పాపము క్షమింపఁబడదు. ఇట్టిదుర్మార్గులైన పాపులు వారికి పరలోకమందు గలుగు నరక బాధను చూచి వారిని విడిపించు దైవము లేక దేవుని కఠిన శిక్షకు లోఁబడియుండుటచూచినచో వారు దేవునికి సాటికల్పింపరు. ఇతర దైవములను పూజింపరు అని చెప్పఁబడియె.

166. ఇజ్-తబర్రఅల్లజీనత్-తుబిఊ-మినల్-లజీ-నత్తబఊ-వర-అవుల్-అజాబ-వతఖత్త-అత్-బిహిముల్-అస్బాబ్. 167. వఖాలల్లజీ-నత్తబఊ-లౌ-అన్న-లనా-కర్రత-ఫనత బర్రఅ మిన్హుమ్ కమా-తబర్రఊ-మిన్నా-కజాలిక-యురీ-హిముల్లాహు-అఅ-మాల-హుమ్-హసరాతిన్-అలైహిమ్-వమాహుమ్-బి

డును, దయగలవాఁడును. అట్లు క్షమాపణ కోరక ఎవరు సత్యమును దాఁచి దేవుని తిరస్కరించి అవిశ్వాసస్థితిలోనే మృతి నొందుదురో వారు దేవుని శాపమునకు అర్హులై నరక నివాసులగుదురు. ఆ నరకబాధ తగ్గదు, ఎట్టి విరామమును వారికి లభింపదు.

163. వ-ఇలాహుకుమ్-ఇలాహున్-వాహిదున్-లా-ఇలాహ-ఇల్లా-హువర్-రహ్మానుర్-రహీమ్.

163. మఱి మీ పూజ్యుఁడగు దేవుఁడు ఒక్కఁడేను. ఆతఁడు దప్ప వేఱు దేవుఁడులేఁడు. ఆతఁడు అమితదయగలవాఁడును, ప్రేమించువాఁడును.

వ్యా॥ 163. ఇందు దేవుని ఏకత్వము చెప్పఁబడెను. ఇకముందు వాక్యములలో దేవుని ఏకత్వమును రుజువుపఱచునట్టి సూచనలు తెలుపఁబడుచున్నవి.

164. ఇన్న-ఫీఖల్-ఖిస్-సమా-వాతి-వల్-అర్-జి-వఖ్-తిలాఫిల్-లైలి-వన్-నహారి-వల్-ఫుల్-కిల్లతీ-తజ్-రీ-ఫిల్-బహ్రి బిమా-యన్-ఫ-ఉన్నాస-వమా-అన్-జలల్లాహు-మినస్-సమా ఇ-మిమ్-మా ఇన్-ఫ-అహ్యా-బిహిల్-అర్జ-బఅ-ద-మౌతిహా-వ-బస్స-ఫీహా-మిన్-కుల్లి-దాబ్బతిన్-వతస్-రీఫిర్-రియాహి-వస్-స-హాబిల్-ముసఖ్-ఖరి-బై నస్-సమా ఇ-వల్-అర్ జి-లఆయా-తిల్-లిఖా-మిన్-యఅ-ఖిలూన్.

164. నిశ్చయముగా ఆకాశమును భూమిని సృష్టించుటయందును, రాత్రింబవళ్లు మాఱుటయందును, ప్రజలకు నుపయోగకరములైన వానిని దీసికొనిపోవు ఓడలయందును దేవుఁడు ఆకాశమునుండి నీళ్లను కురియించి నిర్జీవమైన భూమికి నీళ్లచే ప్రాణమిచ్చి యందు సర్వజంతువులను వ్యాపింపఁజేయుటయందును, వాయువుల మార్పునందును, ఆకాశము భూమి మధ్య దేవునికి ఆధీనమైయుండు మేఘములయందును, బుద్ధిమంతులకు సూచనలున్నవి.

వ్యా॥ 164. ఈ వాక్యములలో దేవుని ఏకత్వమును ఆతని కరుణయును సూచించు శక్తి సూచనలు గ్రహించు బుద్ధిమంతులకున్నవి. ఆకాశ సృష్టియందు యోచించిన ఇంత పెద్ద ఆకాశమునందలి సూర్యచంద్రాదులు ఎట్టి యాధారము లేకుండ నిలుచుటయును చాల వింతయైనదిగదా? భూమియందలి సముద్రములు, నదులు, కొండలు, చెట్లు, చేమలు, జంతుజాలములు వాని ఆహారములకుఁగాను వసతులును చచ్చి యెండిపోయిన భూమిని వానచే ప్రాణమొసంగి పచ్చగాచేయుటయును యోచింపఁదగినవి. రాత్రింబవళ్లు గలుగుట వాని హెచ్చుతగ్గులు, ఋతువుల వాయువుల మార్పులు ఇవన్నియు బుద్ధిశాలు

204. మఱి ప్రజలలోని కొందఱిపలుకులు ఇహలోక జీవనమునందు నీకు సమ్మతమగుచున్నవి. మఱి వారు తమ మనస్సులోనున్న దానికి దేవునిని సాక్షిగా పెట్టుచున్నారు. మఱివారు ఘోరమైన జగడములాడువారు. 205. మఱి నీయొద్దనుండి మరలినచో దేశములో వినాశముగలిగించుటకును, పొలములను జీవులను నాశముచేయుటకును యత్నించుచు తిరుగుదురు. మఱిదేవుఁడు ఫసాదును (ఉపద్రవమును) ప్రేమింపఁడు. 206. మఱి దేవునికి భయపడుఁడు. అని వారికి చెప్పినపుడు వారిగర్వము పాపమునకై వారినిప్రేరేపించును. కావున వారికి నరకముచాలును. మఱి అదిచాలచెడ్డనివాసము. మఱి ప్రజలలో కొందఱు దేవుని ప్రీతిపడయుటకై తమ యాత్మలను అమ్ముచున్నారు, మఱి దేవుఁడు తన భక్తులయెడ చాల కనికరము గలవాఁడు.

వ్యా॥ 204, 207. మునుపటి వాక్యములలో దేవుని ప్రార్థించువారు రెండుతెగలుగా నుందురని చెప్పఁబడియె. ఇఁక ఈవాక్యములలోను ప్రజలు విశ్వాస భక్తి కర్మలను బట్టి రెండుతెగలు గలరని చెప్పఁబడుచున్నది, మొదటి రకము వంచకులది. వంచకులనే అరబీలో మునాఫిఖ్ అనుదురు. ఈ తెగవారు ప్రజలకు చూపుటకు విశ్వాసము వెల్లడింతురు, దాని ననుసరించి మాటలు కూడ వినువారికి సమ్మతమగునట్లు తీపుగాను విశ్వాస పూరితముగా నున్నట్లు నటించి పలుకుదురు. మఱి నమ్మకముగలుగుటకై మామనస్సులోనుండు దానికి దేవుఁడే సాక్షి. అని బాసలు చేయుదురు. కాని వారికర్మలు వారిచిత్తశుద్ధిని దెలుపవు. ఎందుకన వారికర్మలను బట్టిచూచిన విశ్వాసమునకు వ్యతిరేకములే. నమాజులు సలుపరు. ఉపవాసముండరు, జకాతుదానముచేయరు. హజ్ చేయరు. ఘోరపాపములో మునింగియుండియు మతసేవకులని దేశోద్ధారకులని ప్రజలతో బొంకునట్టి వారు ప్రతికాలములోను ప్రతిదేశములోను గలరు. ఇట్టివంచకులవలననే జాతి దేశము పరాధీనమై హీనదశలోపడిపోవును. వారు రహస్యముగా కుట్రలు సలిపి దేశనాశము, జంతువులను జీవులనుచంపుట, పొలములనుకాల్చి నాశముచేయుట మొదలగు వినాశకరములైన కార్యములు చేయుదురు. ఇట్టి వారికి భక్తిబోధకూడ సరిపడదు. గర్వము వలనను పాపకార్యములను జేయుటకై పూనుకొనుదురు. మఱి స్వలాభాపేక్షవల్లను పనికిమాలిన జగడములు వివాదములు పెట్టుకొనుదురు, దేవుఁడు ఎప్పటికిని ఉపద్రవమును అశాంతమును ప్రేమింపడు. గర్వించు వంచకులకు నరకమేచాలును. అదిచాల బాధాకరమైనదియును చాలచెడ్డదియును. కావున వంచనవదలి నిజమైన భక్తిగలిగి యుండవలెను. 206. ఈవాక్యములో నిజమైన ముసల్మానుభక్తులుండవలసిన పద్ధతులు చెప్పఁబడినవి. త్రికరణశుద్ధిగ సర్వమును దేవునిప్రీతికొఱకు వినియోగించి జాతి, సంఘము, దేశము, ప్రజలమేలుకొఱకు శక్తికొలఁది వంచనలేకుండ

పాటుపడవలెను. దేవుఁడు తనభక్తులయెడ చాల కనికరముగలవాఁడు కావున లోకము యొక్క మేలుకై పాటుపడి యాతని దయవడయుటకై భక్తులు యత్నించవలెను.

208- యా.అయ్యు-హల్లజీన-ఆమనుద్-ఖులూ-ఫిస్-సిల్మి-కాఫ్ఫ-తస్-వలా-తత్-తబిఊ-ఖుతువా-తిష్-షమాతీ-నిఇన్నహూ-అదువ్వున్-ముబీన్.209.ఫఇన్-జలల్-తుమ్-మిం-బఅ-ది-మాజా-అత్-కుముల్-బయ్యినాతు-ఫఅలమూ-అన్నల్లాహ-అజీ-జున్-హకీమ్.210.హల్-యన్-జురూన-ఇల్లా-అన్-యాతియ-హుముల్లాహు-ఫీజుల-లిమ్-మినల్-గమామి.వల్-మలా-ఇకతు-వఖు-జియల్-అమ్రు-వ-ఇలల్లాహి-తుర్-జఉల్-ఉమూర్.

208. ఓ. విశ్వాసులారా! ఇస్లామ్‌లో సంపూర్ణముగా ప్రవేశింపుఁడు. మఱి సైతాను జాడల ననుసరింపకుఁడు' నిశ్చయముగా వాఁడు మీకు విస్పష్ట విరోధి. 209. మఱి మీకు స్పష్టమైన ధర్మములు (ఆజ్ఞలు) వచ్చిన పిదపను మీరు జాఱినచో నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తుఁడని యు వివేచనాపరుఁడు అనియుఁ దెలిసికొనుఁడు. 210. ఏమి? వారు దేవుఁడును దేవదూతలును మేఘములనుండి రాఁగా కార్యముముగిసి (తీరి) పోవలెనని వేచియున్నారా! మఱి సర్వకార్యములును దేవుని యొద్దకే మరలును.

వ్యా॥ 208. ఈవాక్యములో భక్తులును విశ్వాసులును అగు ముసల్మానులు సంపూర్ణముగా ఇస్లామ్ మతము ననుసరింపవలెను. ధర్మమునకును ముసల్మానులకును విరోధియగు పిశాచపుజాడలందును. దుర్మార్గములు అగు తప్పుత్రోవలందునుపోకూడదు. త్రికరణశుద్ధిగా మతమునందలి ప్రతిధర్మమును ఆజ్ఞను అనుసరించి అధర్మములను విడనాడి సంపూర్ణ భక్తులు కావలెను. అని బోధింపఁబడియెను. ఈ వాక్యములోని 'సిల్మి' అను పదము ఇస్లామ్ విధేయతకును శాంతికిని ఐకమత్యమునకును చేరును. అందుచే ముసల్మానులు, ఇస్లామ్‌లోను, విధేయతయందును శాంతి ఐకమత్యము నెలకొలుపుటయందును సంపూర్ణులై యుండవలెను. 209. ఇందు ఇస్లామ్ మతధర్మములు ఆజ్ఞలు స్పష్టముగానందరికిని దెలిసినవి. ధర్మమార్గము దెలిసిన పిదప దానినుండి జాఱి పిశాచి త్రోవయగు దుర్మార్గమునందు నడచినచో దేవుఁడు సర్వశక్తుఁడు.ధర్మమువదలి తప్పుత్రోవను పోయినఁదులకుశిక్షించును. శీఘ్రముగానే శిక్షకలుగలేదే అని మోసపోకుఁడు. ఆతఁడు వివేచనాపరుఁడు. కొంతకాలము విరామము నిచ్చియున్నాఁడు. ఆతని ప్రతికార్యము వివేచనలేనిది యుండదు, కావున భయభక్తులతో సన్మార్గ

మగు ఇస్లామ్‌మతమును అనుసరింపుఁడు. అని హెచ్చరింపఁబడియెను. 210. సన్మార్గమునువదలి దుర్మార్గముననుసరించువారు, దేవుఁడును దేవదూతలునువచ్చి కార్యముపూర్తిచేయవలెనని వేచియున్నారా! దేవుని యాజ్ఞచే దేవదూతలు మేఘముల నుండివచ్చి ఈ లోకమును నశింపఁజేసిన కార్యము ముగిసిపోవును. ఇట్లు తుదిదినమున జరుగును. ఇదియే ఖియామత్ అనఁబడును. అట్లు వేచియుండుటవలన ఫలమేమి? అన్ని కార్యములు తుదకు దేవుని యొద్దకే చేరవలసియున్నవి. సమస్తమునుగూర్చి తీర్పు కావలసియున్నది. అపుడు ఎవరును పుణ్యకార్యములు చేయఁజాలరు. ఇహమునందే సన్మార్గమగు ఇస్లాము ననుసరించి పుణ్యకార్యముచేసిన దేవుని సన్నిధానమున దాని ఫలితము పొందఁగలరు, ఇందు ఏలాటి సందేహములేదు. అని హెచ్చరింపఁబడియె.

211. సల్-బనీ-ఇస్రాయీల కమ్-ఆతైనా-హుమ్-మిన్ - ఆయా-తిమ్-బయ్యినతిన్-వమన్-యుబద్దిల్-నిఅ-మతల్లాహి-మిమ్-బఅ-ది-మా-జాఅత్‌హు-ఫయిన్నల్లాహ-షదీదుల్-ఇ-ఖాబ్. 212. జుయ్యిన-లిల్లజీన-కఫరుల్-హయాతుద్-దున్యా-వయస్-ఖరూన-మినల్లజీన ఆమనూ-వల్లజీ-నత్-తఖౌ ఫౌఖహుమ్ యౌమల్-ఖియామతి-వల్లాహు-యర్.జుఖు-మన్-యషాఉ-బిగైరి-హిసాబ్.

211. ఇస్రాయీలియుల నడుగుము. మేము వారికి ఎన్నిస్పష్టమైన సూచనల నొసంగితిమో? మఱెవఁడు దేవుని అనుగ్రహము గలిగిన పిదప దానిని తారుమారు చేయునో నిశ్చయముగవానికి దేవునిశిక్ష చాలకఠినమైనది. 212. అవిశ్వాసులు ఇహలోక జీవితముపై మోహపడినారు. మఱి విశ్వాసులతో పరిహాస మాడుచున్నారు. తీర్పుదినమునందు భక్తులైనవారు అవిశ్వాసులకన్న గొప్పగానుండుదురు. మఱి దేవుఁడు తాను కోరినవారికి లెక్కలేకుండ సంపద నొసంగును.

వ్యా॥ 211. మునుపటి వాక్యములలో ఇస్లామ్ మతము సంపూర్ణముగ భయభక్తులతో ననుసరింపవలెను. లేనిచో దేవుని శిక్షకు పాత్రులగుదురు. అని హెచ్చరింపఁబడియెను. ఈ వాక్యములలో ముసల్మానులకు పూర్వికులైన ఇస్రాయీలియులకు సంభవించిన విషయము ముసల్మానుల బోధనకొఱకు తెలుపఁబడుచున్నది. ఇస్రాయీలియులు యాఖూబు ప్రవక్త సంతతివారు. వీరికి బోధించుటకై అనేక ప్రవక్తలు వచ్చిరి. హజ్రత్ మూసాప్రవక్త గారికి తౌరాతుగ్రంథ మొసఁగఁబడెను. ఇస్రాయీలియులు (యూదులు) దేవుఁడు ఒసంగిన గొప్పసూచనలను ధర్మములను అనుసరింపక దేవుని శిక్షకునుకోపమునకును పాత్రులై గౌరవము రాజ్యము గోలుపోయి ఇతరులకు అధీనులై హీన

దశకుపాలైరి. దేవుఁడు ఒసంగిన ధర్మమార్గము ఆతనిగొప్ప అనుగ్రహము ననుసరింపక దాని తారుమారుచేసినచో దేవునిశిక్ష చాల కఠినమైనది, దానికి పాత్రులగుదురు. కావున ముసల్మానుభక్తులు ఇస్లామ్ మతమును దాని అన్ని ధర్మములను మనఃపూర్వకముగా అనుసరింపవలెను, లేనిచో వట్టిమాటలవలన లాభములేదు, పూర్వికులవలె వారికిఁగూడ అధోగతి పట్టును. 212. ఈ వాక్యములలో అవిశ్వాసులు ఎందులకు ధర్మమార్గము విడనాడుదురో దాని కారణము చెప్పఁబడుచున్నది. అవిశ్వాసులు ఇహలోక సౌఖ్యములపై మోహ పడినారు. దాని జీవనమునే లెక్కించుచున్నారు. సత్యమైన పరలోక సుఖము పాటింపరు. తుచ్ఛభోగములు అనుభవించుచు పరలోకమును గూర్చి కష్టపడు భక్తులగు ముసల్మానులను చూచి వారు పరిహాసమాడుదురు. ఇది వారి మూఢత్వము. వాస్తవమైన గౌరవము, గొప్పతనము. పరలోకమునందు లభింప వలెను. అది విశ్వాసులగు భక్తులకే లభించును. తీర్పు దినమునందు అవిశ్వా సులకన్న వారు మేటిగానుండుదురు. సంపద మొదలగు భాగ్యములు దేవుఁడు తాను ఇష్టపడినవారికి లెక్కలేకుండ నొసంగును. ఇందు విశ్వాసమునకు అవి శ్వాసమునకు సంబంధము లేదు, తెలివిలేని మూఢులు ధనవంతులుగాను, గొప్ప విద్వాంసులు బీదవారలుగా నుండుట దీనికి సాక్ష్యము, కావున ప్రతిస్థితిలో దేవునిపై నాధారపడి పరలోకమునకుఁ గాను యత్నింపవలెను.

213, కానన్నాసు-ఉమ్మతన్-వాహిదతన్-ఫ-బఅ-సల్లాహున్-నబీ-యీన-ముబష్-షిరీన-వ-మున్-జిరీన-వ-అన్జల-మఅ-హుముల్-కితాబ-బిల్-హఖ్ఖి-లి-యహ్కుమ-బైనన్నాసి-ఫీమఖ్-తలఫూ-ఫీహి-వమఖ్-తలఫ-ఫీహి-ఇల్-లల్లజీన-ఊతూహు-మిన్-బఅ-ది-మా-జాఅత్-హుముల్-బయ్యినాతు-బగ్-యమ్-బైన-హుమ్-ఫ-హదల్లా-హుల్లజీన-ఆమనూ-లిమఖ్-తలఫూ-ఫీహి-మినల్-హఖ్ఖి-బిఇజ్నిహీ-వల్లాహుయహ్దీ-మన్-యషాఉ-ఇలా-సిరాతిమ్-ముస్తఖీమ్,

213. మానవులందఱును ఒకే మతమునందుండిరి. పిదప దేవుఁడు సంతోషవార్తను, భయబోధను ఇచ్చునట్టి ప్రవక్తలను పంపెను. మఱి ప్రజలు ఏవిషయమునందు వివాదపడుదురో దానిఁగూర్చి తీర్పుచేయుటకుఁగాను దేవుఁడు వారికి సత్యమైన గ్రంథమొసంగెను. గ్రంథమొసంగఁబడిన ప్రజలే తమలోని ద్వేషమువలన తమకు స్పష్టమైన ధర్మములు (ఆజ్ఞలు) వచ్చిన పిదపఁ గూడ గ్రంథమునుగూర్చి వివాదములాడిరి. పిదప దేవుఁడు వారు వివాదములా

మగు ఇస్లామ్‌మతమును అనుసరింపుఁడు. అని హెచ్చరింపఁబడియెను. 210. సన్మార్గమునువదలి దుర్మార్గమునననుసరించువారు, దేవుఁడును దేవదూతలునువచ్చి కార్యముపూర్తిచేయవలెనని వేచియున్నారా! దేవుని యాజ్ఞచే దేవదూతలు మేఘముల నుండివచ్చి ఈ లోకమును నశింపఁజేసిన కార్యము ముగిసిపోవును. ఇట్లు తుదిదినమున జరుగును. ఇదియే ఖయామత్ అనఁబడును. అట్లు వేచియుం డుటవలన ఫలమేమి? అన్ని కార్యములు తుదకు దేవుని యొద్దకే చేరవలసియు న్నవి. సమస్తమునుగూర్చి తీర్పు కావలసియున్నది. అపుడు ఎవరును పుణ్య కార్యములు చేయఁజాలరు. ఇహమునందే సన్మార్గమగు ఇస్లాము ననుసరించి పుణ్యకార్యముచేసిన దేవుని సన్నిధానమున దాని ఫలితము పొందఁగలరు, ఇందు ఏలాటి సందేహములేదు. అని హెచ్చరింపఁబడియె.

211. సల్-బనీ-ఇస్రాయీల కమ్ ఆతైనా-హుమ్-మిన్ - ఆయ- తిమ్-బయ్యినతిన్-వమన్-యుబద్దిల్-నిఅ-మతల్లాహి-మిమ్-బఅ-ది-మా-జాఅత్‌హు-ఫయిన్నల్లాహ-షదీదుల్-ఇ-ఖాబ్. 212. జుయ్యిన-లిల్లజీన-కఫరుల్-హయా తుద్-దున్యా-వయస్-ఖరూన-మినల్లజీన ఆమనూ-వల్లజీ-నత్-తఖౌ ఫౌఖహుమ్ యౌమల్-ఖియామతి-వల్లాహు-యర్.జుఖు-మన్-యషాఉ-బిగైరి-హిసాబ్.

211. ఇస్రాయీలియుల నడుగుము. మేము వారికి ఎన్నిస్పష్టమైన సూచనల నొసంగితిమో? మఱెవఁడు దేవుని అనుగ్రహము గలిగిన పిదప దానిని తారుమారు చేయునో నిశ్చయముగవానికి దేవునిశిక్ష చాలకఠినమై నది. 212. అవిశ్వాసులు ఇహలోక జీవితముపై మోహపడినారు. మఱి విశ్వాసు లతో పరిహాస మాడుచున్నారు. తీర్పుదినమునందు భక్తులైనవారు అవిశ్వాసు లకన్న గొప్పగానుండుదురు. మఱి దేవుఁడు తాను కోరినవారికి లెక్కలేకుండ సంపద నొసంగును.

వ్యా॥ 211. మునుపటి వాక్యములలో ఇస్లామ్ మతము సంపూర్ణముగ భయభక్తులతో ననుసరింపవలెను. లేనిచో దేవుని శిక్షకు పాత్రులగుదురు. అని హెచ్చరింపఁబడియెను. ఈ వాక్యములలో ముసల్మానులకు పూర్వికులైన ఇస్రాయీలియులకు సంభవించిన విషయము ముసల్మానుల బోధనకొఱకు తెలుపఁబడుచున్నది. ఇస్రాయీలియులు యాఖూబు ప్రవక్త సంతతివారు. వీరికి బోధించుటకై అనేక ప్రవక్తలు వచ్చిరి. హజ్రత్ మూసాప్రవక్తగారికి తౌరాతుగ్రంథ మొసంగఁబడెను. ఇస్రాయీలియులు (యూదులు) దేవుఁడు ఒసంగిన గొప్పసూచనలను ధర్మములను అనుసరింపక దేవుని శిక్షకునుకోపము నకును పాత్రులై గౌరవము రాజ్యము గోలుపోయి ఇతరులకు అధీనులై హీన

ఇస్లామ్‌లో చేరితి మన్నమాటతోనే స్వర్గము దేవునిప్రీతి గలుగ నేరదు. త్రిక రణశుద్ధిగ ధర్మములనుసరించి ధర్మప్రచారముచేసి అందు సంభవించు కష్టములకు సహించినఁగాని దేవుని ప్రీతిలభింపదు. పూర్వము గడచినప్రవక్తలు వారి అను చరులు, ధర్మప్రచారమునకై అనేకబాధలు కష్టములుపడి తుదకు దేవుని సహా యము ఎప్పుడువచ్చునా అని పలుకసాగిరి. అట్టి స్థితిలో దేవుని సహాయము సమీపములోనే రానున్నది అని తెలుపఁబడెను. తుదకు దేవునితోడువలన ధర్మ ప్రచారకులే విజయము పొందఁగలిగిరి. వారివిషయమును ముసల్మానులు గమనించి వారి పద్ధతిని అనుసరించి ధర్మప్రచారముచేసి లోకములో ధర్మమును శాంతిని నెలకొలుపవలెను. కష్టములకును నష్టములకును బాధలకును ఓర్చి ధర్మమార్గ మందు స్థిరముగానుండి ధర్మప్రచారము చేసిన విజయము చేకూరును. ఇందు, ధన, దేహ ప్రాణ నష్టములు లెక్కింపరాదు. దేవుని సహాయముపై నాధార పడి మతప్రచారము సాగింపవలెను. అపుడు దేవుని ప్రీతియును లభించునని తలఁపవలెను. క్రియాశూన్యమగు వట్టి మాటలవలన విజయమును పడయఁ జాలము. కావున కృషి సలుపవలెను. ఇందు దేశస్వాతంత్ర్యము కొఱకు కృషి చేసిన మత స్వాతంత్ర్యము కూడ లభించును. దేశము పరులకు అధీనమైనచో మతము ప్రబలదు. కావున మన హిందూదేశములో స్వాతంత్ర్యము లభించు టకు ముసల్మానులు వంచనలేకుండ కృషి సలుపవలెను.

215. యస్-అలూనక-మాజా-యున్-ఫిఖూన-ఖుల్-మా-అన్-ఫఖ్-తు మ్-మిన్-ఖైరిన్-ఫలిల్-వాలిదైని వల్-అఖ్-రబీన-వల్-యతామా-వల్-మసా కీన-వబ్-నిస్-సబీలి-వమా-తఫ్-అలూ-మిన్-ఖైరిన్-ఫ-ఇన్నల్లాహ-బిహీ-అలీమ్.

215. ఏమి ఖర్చుచేయవలెను? అనివారు నిన్నడుగుచున్నారు. మీరు ఖర్చుచేయునట్టిధనము, తల్లిదండ్రులకును, బంధువులకును, ప్రయాణికులకును, వినియోగింపవలెను. మఱి మీరే మేలుచేసినను అదినిశ్చయముగా దేవునికిఁ దెలియును. అని చెప్పుము.

వ్యా॥ 215. ముందువాక్యములలో ఇస్లామ్ మతధర్మములను పూర్తిగా ననుసరింపవలెను అనియు, దేవుని ప్రీతి, స్వర్గము, పడయుటకు కృషి సలుప వలెను అనియు బోధింపఁబడియెను ఇఁక దానిశాఖలు వివరింపఁబడుచున్నవి. ఏమి ఖర్చుజేయవలెను? దాని అర్హపాత్రములెవ్వి? అను ప్రశ్నగలిగెను. ధనవంతులు తమశక్తికొలది ఖర్చుచేయవలెను. దానికి తల్లిదండ్రులు బంధు వులు మొదలగువారు పాత్రులు. ప్రతికాలములో సమయోచితముగా సత్

డుచున్న విషయమందు విశ్వాసులకు తన ఆజ్ఞచే సత్యమును చూపెను. మఱి దేవుఁడు తానుఇష్టపడినవారికి సన్మార్గమును జూపుచున్నాఁడు.

వ్యా॥ 213. ప్రప్రథమము (హాజ్రత్ ఆదము ప్రవక్త కాలము) నుండి ప్రజలందఱు ఒకసత్యమతమునందే యుండిరి. కాలముగడచి పోనుపోను అందు తారుమారై ప్రజలు వేరువేరు మార్గముల పోసాగిరి. తిరిగి ప్రజలకు ధర్మమార్గమును జూపుటకై దేవుఁడు తన ప్రవక్తలను బంపివారికి గ్రంథములనొసంగెను. ప్రవక్తలు సన్మార్గము ననుసరించు వారికి మోక్షము లభించునను సంతోష వార్తనిచ్చుచు, తప్పుత్రోవలలో పోవువారు దేవుని కోపమునకు పాత్రులై నరకము పడయుదురని భయబోధ నిచ్చుచుండిరి. ప్రజలు అభిప్రాయ భేదములు గలిగి వాదములాడు విషయములలో తీర్పుచేయుటకు మతగ్రంథములు ఆధారములు. దేవదత్త గ్రంథములలో ప్రజలు అందలి ధర్మములు దెలిసియు, తమలోని ద్వేషము వలనను, స్వలాభాపేక్ష వలనను, ధర్మములను తారుమారు చేయుచుండిరి. ఇట్లుచేయుటలో యహూదీలు నస్రానీలు చాల ప్రసిద్ధులు. ధర్మము తారుమారగు కాలమున దేవుఁడు తాను ఇష్టపడినవారికి సత్యమగు ధర్మమార్గమునుజూపెను. ఆఖరుప్రవక్తయగు హాజ్రత్ ముహమ్మదు రసూలువారి మూలమున ముసల్మానులకు ఖురానెషరీఫునొసంగి ధర్మమార్గము చూపెను. కావున మానవులందఱును ధర్మమార్గమగు ఇస్లాము ననుసరింపవలెను.

214. అమ్-హసిబ్-తుమ్-అన్-తద్-ఖులుల్-జన్నత-వలమ్మా-యాతికుమ్-మస-ల్లజీన-ఖలౌ-మిన్-ఖబ్-లికుమ్-మస్సత్-హుముల్-బాసాఉ-వజ్-జ్రాఉ-వజుల్-జిలూ-హత్తా-యఖూ-లర్-రసూలు-వల్లజీన-ఆమనూ-మఅహూ-మతా-నస్రుల్లాహి-అలా-ఇన్న-నస్-రల్లాహి-ఖరీబ్.

214. ఏమి? మీరు స్వర్గములో ప్రవేశింతురని తలంచితిరా? మఱి మీకు ముందు గడచినవారికి సంభవించినట్టి స్థితి గతులు మీకు ఇంకను సంభవింపలేదు. వారికి కష్టములు బాధలు గలిగినవి. మఱి వారు బాధింపఁబడి, ప్రవక్తయును, ఆతనితోనున్న విశ్వాసులును, దేవుని సహాయము ఎప్పుడు వచ్చునా అని చెప్పసాగిరి. వినుఁడు. దేవుని సాహాయ్యము సమీపములోనే రానున్నది.

వ్యా॥ 214. ఇందు దేవుని ప్రీతియు స్వర్గమును పొందుటకు మార్గము సూచింపఁబడినది. మత ప్రచారములో ననేక ఆటంకములును, బాధలును, కష్టములును, సంభవించును. ధనదేహప్రాణ నష్టములు కష్టములు సంభవించును. అపుడు ఓర్పు గలిగి ధర్మప్రచారము సాగింపవలెను. వట్టిమాటలతోను

217. యస్-అలూనక అనిష్-షహ్-రిల్-హరామి-ఖితాలిన్-ఫీహి-ఖుల్ ఖితాలున్-ఫీహి-కబీరున్-వ-సద్దున్-అన్ సబీ-లిల్లాహి - వ-కుఫ్రుమ్-బిహీ-వల్-మస్జిదిల్-హరామి-వ ఇఖ్ రాజు -అహ్-లిహీ-మిన్‌హు-అక్బరు-ఇన్దల్లాహి-వల్-ఫిత్-నతు-అక్బరు-మినల్-ఖత్ లి-వలా-యజాలూన-యుఖాతిలూనకుమ్-హత్తా-యరుద్దూ-కుమ్-అన్-దీనికుమ్. ఇనిస్-తతాఊ-వమన్-యర్-తదిద్-మిన్-కుమ్-అన్-దీనిహీ-ఫయముత్-వహువ-కాఫిరున్-ఫ-ఉలా-ఇక-హబితత్-అఅమాలుహుమ్-ఫిద్-దున్యా-వల్-ఆఖిరతి-వఉ -లాయిక-అస్-హాబున్నారి-హుమ్-ఫీహా-ఖాలిదూన్. 218. ఇన్నల్ల-జీన-ఆమనూ-వల్లజీన-హాజరూ-వజాహదూ ఫీసబీలిల్లాహి-ఉలాఇక-యర్ జూన-రహ్మతల్లాహి-వల్లాహు-గఫూరుర్ రహీమ్.

217. వారునీతో హరామ్ (నిషిద్ధ) మాసములో యుద్ధమాడుటనుగూర్చి ప్రశ్నించుచున్నారు. అందు యుద్ధమాడుట మహాపాపము అని చెప్పుము. మఱి దేవుని మార్గమును ఆక్షేపించుటయును దేవుని తిరస్కరించుటయును, కాబామసీదునుండి ఆటంకపఱచుటయును, అచ్చటివారిని తఱుముటయును, దేవుని యొద్దచాల ఘోరమైన పాతకమగును. ప్రజలను మతమునుండి తొలఁగించుట వధించుటకన్న ఘోరమైనది. మఱి అవిశ్వాసులు శక్తిపొందినచో మీరు మీమతమునుండి భ్రష్టులగు నంతవఱకు సదామీతో యుద్ధమాడుచునే యుందురు. మఱిమీలో నెవ్వరైనను మతభ్రష్టులై అవిశ్వాసులుగానే చచ్చినచో అట్టివారికర్మములు ఇహమునందును పరమునందును వృథాపోవును. మఱివారు నరకనివాసులు. అందేవారు చిరకాలముందురు. 218. నిశ్చయముగా నెవరు విశ్వసించిరో, మఱియు నెవరు తమజన్మభూమిని విడనాడి దేవుని మార్గమందు యుద్ధమాడిరో వారుదేవుని కృపను ఆసించుచున్నారు. మఱి దేవుఁడు క్షమించు వాఁడును, దయాళుఁన్నను.

వ్యా॥ 217. రజబునెలలో యుద్ధమాడకూడదు అనుధర్మము గలదు. అందులకే దానికి హరామ్ (నిషేధింపఁబడిన) నెల అనిపేరు. హజ్రత్ మహమ్మదువారు, మదీనానుండి తమశిష్యులలో కొందఱిని మక్కాపుర ప్రాంతమునకు పోయి అవిశ్వాలగు ఖురైషుల విషయము విచారించుకొనిరండు అని పంపిరి. శిష్యులుపోయి నఖ్లాఅనుచోట బసచేసిరి. ఆదారినుండి కొందఱు అవిశ్వాసులు పోవుచు శిష్యుల నెదుర్కొనిరి. శిష్యులు ఆ దినము జమూదస్సాని

పాత్రులను గమనించి ధనము ఖర్చుచేయవలెను, లోభితనము వహింపరాదు. ఎట్టిమేలుచేసినను దేవునికిఁ దెలియును. అతఁడుదాని ఫలితము నొసంగును. కావున భక్తితో దానముచేయుచు నుండవలెను.

**216.** కుతిబ-అలై కుముల్-ఖితాలు-వహువ-కుర్-హుల్-లకుమ్-వ-అసా-అన్-తక్-రహూ-షై-అన్-వహువ-ఖైరుల్-లకుమ్-వ-అసా-అన్-తుహిబ్బూ-షై-అన్-వహువ-షర్రుల్-లకుమ్-వల్లాహు-యఅ-లము-వ-అన్తుమ్-లాతఅ-లమూన్.

**216.** మీరు యుద్ధముచేయునట్లు మీకు విధింపఁబడినది. అది మీకు భారముగాఁదోఁచును. మఱిబహుశః మీకునష్టముగాఁ దోఁచునది, మీకు మేలుగానుండును. బహుశః మీకు మంచిది అనితోఁచునది మీకుకీడుగా నుండును కాఁబోలు. దేవుఁడు సర్వము నెఱుంగును. మీకుఁదెలియదు.

వ్యా॥ **216.** హజ్రత్ పైగంబరులవారు మక్కా-పురమును విడిచి మదీనాపురము చేరినపిదప శత్రువులతో యుద్ధమాడవచ్చును అని సెలవయ్యెను. దానికి ముందు శత్రువులుపెట్టు బాధలను సహించుచు ఓర్పుగలిగియుండిరి. ఇపుడు శత్రువులతో మాన, ప్రాణ, ధర్మ, దేశరక్షణార్థమై యుద్ధమాడవలసినది అని విధింపఁబడియెను. సహజముగా యుద్ధము ప్రతిమానవునకును భారముగాఁదోఁచునదియే. కాని శాంతినెలకొలుపుటకు యుద్ధమాడి తీరవలసినదే. దానివలన విజయము మొదలగు మేళ్లుగలుగును. యుద్ధమాడక పిఱికితనము వహించిన శత్రువు బలపడి దేశవినాశముతోఁ బాటు మాన ప్రాణ ధర్మనష్టములు గలుగును. ఎట్లురోగులకు ఉపయోగకరమగు చేదుమందు త్రాగుటకు కష్టముగానుండునో అటులేఉపయోగకరమగు యుద్ధము భారముగాఁ దోఁచును కాని అందు మేలుండును. ఎట్లు రోగి అపథ్యములను కోరి నష్టము చేసికొనునో అటులేయుద్ధము వదలుట మంచిదనితోఁచును. కాని అది నష్టకరము. ఎద్ది మేలో ఎద్దికీడో దేవునికి ఎఱుక. మానవులు దాని తత్వము నెఱుంగఁజాలరు. కావున దేవునాజ్ఞలను శిరసావహించి అమలు చేయవలెను. ముసల్మానులకు యుద్ధము చేయుట భారముగాతోఁచుటకు ఇంకొక కారణముగలదు. ప్రప్రథమమున ముసల్మానుల సంఖ్య కొద్దిగా నుండెను, శత్రువులు లెక్కలేకుండిరి. యుద్ధమాడిన ఇపుడున్న కొద్దిమంది భక్తులు కూడ వధింపఁబడి ధర్మప్రచారము ఆగిపోవునేమో అని జంకుండెను. కాని విజయము అపజయము సంఖ్యపై నాధార పడియుండదు. దేవునిదయగలిగిన కొద్దిమందియే విజయము నొందుదురు, దాని కీడు మేలు దేవునికే దెలియును. అని హెచ్చరింపఁబడియెను.

నెల ఆఖరు దినమని తలంచి అవిశ్వాసులను వధించిరి. అది రజబు నెల మొదటి తేదియైయుండెను. పొరపాటుతో జరిగిన యుద్ధమును పురస్కరించుకొని అవిశ్వాసులు యుద్ధమాడఁగాని నెలలో ముసల్మానులు యుద్ధమాడిరి. అని నిందింపసాగిరి. దానిఁగూర్చి ప్రజలు పైగంబరులవారిని ప్రశ్నించిరి. దానికి జవాబు ఈవాక్యములోనియ్యబడెను. హరామ్ నెలలో యుద్ధమాడుట మహా పాపమే. కాని ముసల్మానుల వలన పొరపాటుగా ఇది సంభవించెను. కావున క్షమింపఁదగినదే. కాని అవిశ్వాసులు తాముచేయుచున్న మహాపాతకములు ఈ హరామ్ నెలలో వధించుటకన్న ఘోరమైనవి. మక్కా ఖురైషులు దేవుని విశ్వసింపక దేవుని మార్గమగు ఇస్లామును ప్రజలు అవలంబింపకుండ ఆక్షేపించుచు అనేక ఆటంకములు కలిగించుచు ముసల్మానులు కాబామసీదును దర్శించుటకుఁగాను రాకుండఁజేసి, ముసల్మానులను తమ పురమగు మక్కాపురమునుండి తఱిమివేసిరి. ఇవన్నియు దేవునిసన్నిధానమున మహాపాతకములు. అదియునుగాక ప్రజలను మతమునుండి తొలఁగించుట వధించుటకన్న గొప్ప పాపము పేదలైన ముసల్మానులు తాము స్వీకరించిన ఇస్లామ్ మతమును విడనాడవలెనని ఖురైషులు వారికి పెట్టరాని బాధలు పెట్టుచుండిరి. కాని ముసల్మాను భక్తులు ఆహింసలను సహించుచుండిరి. మఱిఅవిశ్వాసులు శక్తిపొందినచో ముసల్మానులు తమ మతము వదలువఱకు వారితో యుద్ధమాడుచునేయుందురు. ఇదిఅవిశ్వాసులకు స్వభావము, కావున వారి నిందలను హింసలను భక్తులు లెక్కపెట్టరాదు. యుద్ధమాడవలసి వచ్చినచో వెనుదీయఁగూడదు. తమ మతమునందు స్థిరముగా నుండవలెను. అట్లుగాక ఎవరయిన తాము స్వీకరించిన ఇస్లామ్ మతమును వదలి మతభ్రష్టులై అవిశ్వాసస్థితిలోనే చచ్చినచో వారికర్మలు ఉభయలోకములలోను వృథాపోవును. ఇహమునందు హక్కు దొరకదు. నికాహ్ (పెండ్లిసంబంధము) తెగిపోవును. మఱియు నితర ఇహలోక సౌఖ్యములు పోవును. పరలోకమునందు దీనికి ముందుచేసిన పుణ్యముల ఫలితము లభింపదు. భ్రష్టుత్వపాపమువలన నరక నివాసము లభించును. అందు సదా యుండవలసివచ్చును. మతము వదలి తిరిగి మతము స్వీకరించినచో పూర్వపు పుణ్యములు లభింపవు. కాని దీనిపిదప పుణ్యముల ఫలితము లభించి నరకనివాసము తప్పిపోవును.

వ్యా॥ 218. మతభ్రష్టుల సమాచారము పిదప భక్తుల విషయము చెప్పబడుచున్నది. విశ్వసించి, మతము స్వీకరించినందులకు విరోధులు పెట్టుబాధలకు సహించి తుదకు తమ జన్మభూమి వదలి శాంతిలభించు దేశమునకు వలసపోయి దేవుని మార్గమందు కృషిసల్పి ధర్మయుద్ధము లాడినట్టి ముసల్మానుభక్తులు దేవునిప్రీతికిని ప్రేమకును పాత్రులు. అందుచేతనే వారు దేవుని కృపను ఆశించి

యుందురు. ఒకవేళ ఇట్టిభక్తులలో పొరపాటు జరిగిన దేవుఁడు వారిని క్షమించి వారియందు కృపచేయును. కావున ముసల్మానులకు ఈవాక్యములందలి గుణములుండవలెను.

219. యస్-అలూ-నక-అనిల్-ఖమ్రి - వల్-మైసిరి-ఖుల్-ఫీహిమా-ఇస్మున్-కబీరున్-వ-మనాఫిఉ-లిన్నాసి-వ-ఇస్ముహుమా-అక్బరు-మిన్-నఫ్-ఇహిమా-వయస్-అలూ-నక-మాజా-యున్-ఫిఖూన-ఖులిల్-అఫ్వ-కజాలిక-యుబయ్యినుల్లాహు-లకు-ముల్-ఆయాతి-లఅల్లకుమ్-తత-ఫక్కరూన. 220. ఫిద్-దున్యా-వల్-ఆఖిరతి-వయస్-అలూ-నక-అనిల్-యతామా-ఖుల్-ఇస్లాహుల్లహుమ్-ఖైరున్-వ-ఇన్-తుఖా-లితూ-హుమ్-ఫ-ఇఖ్-వానుకుమ్-వల్లాహుయఅ-లముల్-ముఫ్-సిద-మినల్-ముస్-లిహి-వలౌ-షా-అల్లాహు-ల-అఅ-నత-కుమ్-ఇన్నల్లాహ-అజీ-జున్-హకీమ్.

219. వారు నీతో సారాయిని గూర్చియు జూదమును గూర్చియు ప్రశ్నించుచున్నారు. ఆరెంటిలోను మహాపాపమున్నది. మఱి ప్రజలకులాభము నుగలదు. కాని వాని లాభముకన్న వాని పాపము చాల అధికమైనది. అనిచెప్పుము. మఱి ఏమిఖర్చుచేయవలెనని నీతో వారు ప్రశ్నించుచున్నారు. ఖర్చులు పోను మిగిలినది అని చెప్పుము. ఇట్లు మీరు ఇహమును పరమునుగూర్చి యోచించుటకై దేవుఁడు మీకొఱకు ధర్మములను దెలుపుచున్నాఁడు. 220. మఱి ముసల్మానులునీతో తండ్రులులేని బిడ్డలను గూర్చిప్రశ్నించుచున్నారు. వారికార్యము సవరించుటశ్రేష్ఠము. వారిఖర్చును మీరుకలుపుకొన్నచో వారుమీసహోదరులే. చెఱుచు వాఁడెవఁడో సవరించు వాఁడెవఁడో దేవునికిఁదెలియును. మఱి దేవుఁడు కోరినచో మిమ్ములను కష్టపెట్టియుండును. నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనాపరుఁడును అని పలుకుము.

వ్యా॥ 219. ఈవాక్యములోను ఇఁక ఇతరవాక్యములలోను మద్యపానమును గూర్చియు జూదమునుగూర్చియు చాలకఠినముగా నిషేధింపఁబడినది. కావున కైపును గలిగించుప్రతివస్తువును(హరామ్)నిషిద్ధము. అట్టి వస్తువుకొద్దియైనను ఎక్కువయైనను సేవింపఁగూడదు. ఈ కైపువస్తువులలో కల్లు సారాయి మొదలైనవస్తువులు చేరినవి. రెండుపక్షములందు పందెములు పెట్టిఆడు ఆఁట జూదము. ఈకాలమందు పెక్కురకములు లాటరీల బయలుదేఱినవి. ఇవియన్నియు జూదపు శాఖలే. ఇవన్నియు నిషిద్ధములు (హరామ్). లాటరీలలో అదృష్టము గలదు అని మోసపోయి అనేకులు చెడుచున్నారు. కావున వాని జోలికి పోకూడదు.

ప్రజలు వీనింగూర్చి ప్రశ్నించిరి. అందుకుగాను ఈ మద్యపానములోను జూద
ములోను గొప్ప పాపముగలదు. వాని జోలికి పోకూడదు. అయిన ఈ రెంటి
లో ప్రజలకు కొంతలాభముగలదు. కల్లుసారాయి వ్యాపారికి ధనము లభించును
అది సేవించువారికి తత్కాలపు సౌఖ్యము లభించును. జూదములో గెలుచువానికి
కష్టములేక ధనము లభించును. ఇదియు నొక లాభమే. కాని ఈ రెంటిలో
నున్న లాభముకన్న వాని నష్టముచాల అధికమైనది. మానవులను అన్ని కీడుల
నుండి తొలంగించునట్టి తెలివి మద్యపానమువలన కైపుచే పోవును. దేహా
రోగ్యము చెడును. అన్నకోశ బలము తగ్గును. తుదకు క్షయరోగము పట్టి నశిం
చును. ధననష్టము గలుగును. ఆలుబిడ్డలు గుడ్డకు తిండికి లేక మలమల మాడు
దురు. జగడములు తగవులు హత్యలు జరుగును. మద్యపానము వలన సుగుణ
ములు చెడి వ్యభిచారము మొదలగు దుర్గుణములు పట్టువడును. మొత్తముమీద
మద్యపానము వలన ఆత్మ, మాన, దేహ, ధననష్టములు గలుగును. అటులే
జూదములోకూడ ఓడిపోవువానికి ధననష్టము గలుగును. దాని వలన నిఱుపేద
యై హీనదశకు పాలగును. ఇందు కూడ జగడములు హత్యలు గలుగును.
జూదమాడువాఁడు ఏకృషియును చేయక సోమరియై పోవును. లాభము కన్న
నష్టము అధికమున్నది. కావున వాని జోలికి పోకూడదు. వాని వలన దేశము
నాశమగుచున్నది. కావున వాని నిర్మూలించుటకు ప్రతిభక్తుఁడును ప్రభుత్వ
మును యత్నింపవలెను.

ఏమి ఖర్చుచేయవలెను అని ప్రశ్నగలిగెను. మనుష్యుఁడు తనసొంత
ఖర్చులుపోను మిగిలిన ధనములో సమయోచితముగా తగిన పాత్రము చూచి
ఖర్చుచేయవలెను. తన యొద్దనున్న సమస్త ధనము పరలోకమునకుగాను దాన
ముచేసిన తానును తన సంసారమును బాధపడును. అట్లు వలదు. ఎట్లు పరలోక
మునుగూర్చి యోచించుచుందురో అటులే ఇహలోకవ్యవహారములు జరుపు
టను గూర్చియు యోచింపవలెను. ఇందులకే దేవుఁడు ధర్మములను వివరముగా
ప్రజలకుఁ దెలుపుచున్నాఁడు. కొందఱు తండ్రిలేని బిడ్డలసొమ్ము విషయము
అశ్రద్ధగా ఖర్చుచేయుచుండిరి. అందులకు తండ్రులులేని బిడ్డల సొమ్ము తినఁ
గూడదు. అని దేవుని సెలవుగలిగెను. కొందఱు భక్తులయొద్ద తండ్రిలేనిబిడ్డలు
పోషింపఁబడుచుండిరి. వారి అన్నపానాదులు వేరుచేసిరి. దీనివలన ఆ బిడ్డ
లకు ధననష్టము గలుగసాగెను. దానింగూర్చి ప్రశ్నగలిగెను. దానికి నిందు
జవాబు ఇయ్యఁబడినది. తండ్రిలేని బిడ్డలవిషయము సవరించుటలో వారి సొత్తును
కాపాడుట శ్రేష్ఠము. మీ ఇంటి ఖర్చుతో వారి ఖర్చులు కలుపుకొని వారిని
పోషించుట మంచిదియే. వారు మీ సహోదరులే. అందు తప్పిదములేదు.
అయిన ఎవరు వారిసొమ్మును హరించి వారిని చెఱుతురో, ఎవరు వారి మేలు

కొఱకు పాటుపడుదురో సర్వమును దేవునికిఁ దెలియును. మేలు చేయువారికి పుణ్యము నిచ్చును. చెఱుచు వారికి శిక్షవిధించును. దేవుఁడు సర్వశక్తుఁడు. వివేచనాపరుఁడు. దేవుఁడు కోరినచో తండ్రిలేని బిడ్డలపోషణ విషయమున కఠిన ధర్మములు విధించి మిమ్ము కష్టపెట్టియుండును. కాని దేవుఁడు అట్లు చేయక సౌకర్యములు గలిగించెను. కావున ఆ బిడ్డల విషయము శ్రద్ధపుచ్చుకొని గౌరవముతో తమ సోదరులవలె కాపాడవలెను. లేనిచో వారు చెడుదురు. వారు చెడుటవలన సంఘమునకును చాల నష్టము గలుగును. అందుచేతనే అనాథ శిశువులను పోషించుటకుఁగాను చాల తాకీదు గలదు. కావున ముసల్మానులు ఈ విషయమందు చాల శ్రద్ధవహింపవలెను.

221. వలా-తన్-కిహుల్-ముష్‌రి-కాతి-హత్తా-యూమిన్న-వల-అమ-తుమ్-మూమి-నతున్-ఖైరుమ్-మిమ్-ముష్-రికతిన్-వలౌ-అఅ-జబత్-కుమ్-వలా-తున్-కిహుల్-ముష్-రికీన-హత్తా-యూమినూ-వల-అబ్దుమ్-మూ-మినున్-ఖైరుమ్-మిన్-ముష్-రికిన్-వలౌ-అఅ-జబ-కుమ్-ఉలా-ఇక-యద్-ఊన-ఇలన్నారి-వల్లాహు-యద్-ఊ-ఇలల్-జన్నతి-వల్-మగ్-ఫిరతి-బిఇజ్-నిహీ-వ-యు-బయ్యిను-ఆయా-తిహీ-లిన్నా-సి-లఅల్ల-హుమ్-యత-జక్క-రూన్.

221. మఱి దేవునికిసాటి కల్పించునట్టి స్త్రీలను వారు విశ్వసించు నంతవఱకు మీరు వివాహమాడకుఁడు. అవిశ్వాసురాలగు స్త్రీ మీకు మెప్పుకలిగించినను ఆమెకంటెను నిశ్చయముగా, విశ్వసించి ముసల్మానైన బానిస స్త్రీ శ్రేష్ఠురాలు. మఱి అవిశ్వాసులకు (ముసల్మాను స్త్రీలకు) వివాహము చేయింపకుఁడు. అవిశ్వాసి మీకు పసందు అయినను నిశ్చయముగా విశ్వసించి ముసల్మానుఁడైన బానిస, వాని (అవిశ్వాసి) కంటె శ్రేష్ఠుఁడు. వీరు నరకమార్గమునకు పిలుచువారు. మఱి దేవుఁడు తన సెలవుచే స్వర్గమునకు మోక్షమార్గమునకు పిలుచుచున్నాఁడు. ప్రజలు బోధను గ్రహించుటకై తన సూచనలను విశదముగా వారికిఁ దెలుపుచున్నాఁడు-

వ్యా॥ 221. ఈవాక్యములలో వివాహ సంబంధమును గూర్చి చెప్పఁబడినది. దేవునికి సాటికల్పించు స్త్రీ పురుషులకన్న విశ్వసించిన ముసల్మాను బానిస స్త్రీ పురుషులు శ్రేష్ఠులు. అవిశ్వాసులు, ధనముచేఁగాని సౌందర్యముచేఁగాని మెచ్చుకొనదగిన వారైనను, వారు పోవుమార్గము నరకమార్గము. వారు విగ్రహములను పూజింతురు. పెక్కు దైవములను కల్పింతురు. విశ్వాసము లేనందున అనేక పాపములు చేయుదురు. ఒక్క దేవునినమ్మి ముసల్మాను

అయిన బానిసగాని బానిసస్త్రీగాని, ధనములోఁగాని సౌందర్యములోఁగాని అవిశ్వాసులకన్న తక్కువవైనప్పటికిని విశ్వాసమువలన వారు శ్రేష్ఠులు. ముసల్మానులు పోవుమార్గము స్వర్గమార్గము. మోక్షమార్గము. కావున ఇట్టి మత భేదములుగల వారి మధ్య వివాహ సంబంధముండరాదు. కావున ముసల్మానులు అవిశ్వాసురాండ్రను పెండ్లాడ కూడదు. అటులే ముసల్మాను స్త్రీలను అవిశ్వాసులకు నిచ్చి పెండ్లిచేయింపఁగూడదు. ఇది నిషిద్ధము హరామ్. దేవుఁడు చూపు మార్గము స్వర్గమును, మోక్షమును, క్షమాపణమును లభింపఁజేయునది. ప్రజలుబోధ నను గ్రహించి సన్మార్గయుతులగుటకై దేవుఁడు తన సూచనలను వివరించుచున్నాడు. అని చెప్పఁబడియె.

222. వ-యస్-అలూ-నక-అనిల్-మహీజి-ఖుల్-హువ-అజన్-ఫఅ-తజిలున్-నిసాఅ ఫిల్-మహీజి-వలా-తఖ్-రబూ-హున్న-హత్తా-యత్-హుర్న-ఫఇజా-తతహ్-హుర్న-ఫాతూ-హున్న-మిన్-హైసు-అమర-కుముల్లాహు-ఇన్నల్లాహయు-హిబ్బుత్-తవ్వా-బీన-వల్-ముత-తహ్హి-రీన్. 223.నిసా-ఉకుమ్-హర్ సుల్లకుమ్-ఫాతూ-హర్ సకుమ్-అన్నా-షితుమ్-వఖద్దిమూ-లిఅన్-ఫుసికుమ్-వత్తఖుల్లాహ-వఅ-లమూ-అన్నకుమ్-ములా-ఖూహు-వ-బష్-షిరిల్-మూమినీన్.

222. మఱివారు (ముసల్మానులు) నిన్ను స్త్రీల ఋతువులను గూర్చి అడుగుచున్నారు. అది అసహ్యము నష్టకరము కావున ఋతుకాలమునందు స్త్రీలనుండి వేఱుగా నుండుఁడు. వారు శుద్ధియగు నంతవఱకు వారిని సమీపింపకుఁడు. మఱి వారు పవిత్రురాండ్రు అయినపుడు దేవుఁడు మీకు సెలవిచ్చిన చోటునరండు (కలియుఁడు). నిశ్చయముగా దేవుఁడు క్షమాపణకోరు వారిని పవిత్రులు (శుద్ధులు) గానుండు వారిని ప్రేమించును అని చెప్పుము. 223. మీ స్త్రీలు మీ క్షేత్రములు (పొలమువంటివారు) కావున మీ క్షేత్రములకు మీరు కోరినట్లు రండు. మఱి మీరు మీయాత్మలకుఁగాను భవిష్యత్తునుగూర్చి ప్రయత్నింపుఁడు. మఱి దేవునికి భయపడుఁడు. మఱిమీరు దేవునిసన్నిధానమునకుఁ బోవలసి యున్నదని తెలిసికొనుఁడు. మఱి ఓ ప్రవక్త! విశ్వాసులకు సంతోష వార్తనిమ్ము.

వ్యా॥ 222; 223. యూదులును నస్రానీలును ఇతర మతస్థులును స్త్రీల ఋతు కాలములో హెచ్చుతగ్గులుగా వించుచుండిరి. కొందఱు స్త్రీలు ఋతుమతులు కాఁగానే, వారి పడక వారి గది వేఱుగానుంచి వారిని అంటకుండ వారు వండినభోజనము వగైరాలు భుజింపకుండనుండిరి, కొందఱు ఋతుపుకాలములోను స్త్రీలతో కలియుచుండిరి. ముసల్మానులు ఏలాగున ప్రవర్తింప

వలెను అని వారు ప్రశ్నించిరి. దాని కుత్తరము ఈవాక్యములలో నియ్యఁబడినది. ఋతు కాలములో స్త్రీలు ఇంటిలోనుండ వచ్చును. వంటచేయవచ్చును. వారి నంటుకోవచ్చును. ఒకేపడక యుండవచ్చును. కాని భార్యాభర్తలు కలియకూడదు. అది అసహ్యమును హానికరమును నష్టకరమును. కావున స్త్రీలు ఋతువునుండి శుద్ధియగువఱకు వారితో కలియకూడదు. శుద్ధిస్నానాదులు అయినపిదప యథాప్రకారముగా సంతానము కొఱకు భార్యాభర్తలు కలియవచ్చును. స్త్రీలు పురుషులకు క్షేత్రములు, (పొలమువంటి వారు). ఎట్లు పొలములుబీజోత్పత్తికి కారణములో అటులే స్త్రీలు సంతానమునకు కారకురాండ్రు. సంతానము కలుగఁజేయుచోటునందే కోరినట్లుకలియవచ్చును. కాని వేఱు చోటున కలియకూడదు. అది పాపము. దేవుఁడు క్షమాపణ కోరువారిని శుద్ధిగా నుండువారిని ప్రేమించును. కావున అసహ్యపు పనులను మానుకొని దేవునికి భయపడి, ఆతని యొద్దకే పోవలసియున్నామని యెఱింగి భయభక్తులతో నుండవలెను. భయభక్తులు గలిగి దేవుఁడు నియమించిన హద్దులను ధర్మములను మీఱకయుండు విశ్వాసులకు ఉభయలోక విజయమును, దేవుని ప్రీతియును లభించుననుసంతోష వార్త ఇయ్యఁబడెను.

224. వలా-తజ్-అలు-ల్లాహ-ఉర్-జతల్-లి-ఐమా-నికుమ్-అన్-తబ్రూ-వతత్తఖూ-వతుస్-లిహూ-బైనన్నాసి-వల్లాహు-సమీ-ఉన్-అలీమ్, 225. లా-యు-ఆఖిజు-కుముల్లాహు-బిల్-లగ్వి-ఫీ-ఐమా-నికుమ్ వలాకిన్-యు-ఆ-ఖిజుకుమ్-బిమా-కసబత్-ఖులూ-బుకుమ్-వల్లాహు-గఫూరున్-హలీమ్,

224. మఱి మీరు ఉపకారమును భక్తిని ప్రజలమధ్య సంధి కూర్చుటను వదలుకొనుటకై మీరు దేవుని నామమును ఒట్టుగా పెట్టుకొనకుఁడు. మఱి దేవుఁడు సర్వమును వినుచు నెఱుంగుచున్నాఁడు. 225. మీరు వృథాగా చేయు ఒట్టులనుగూర్చి దేవుఁడు మిమ్ము పట్టఁడు. కాని మీ హృదయ పూర్వకముగాఁజేయు మీ యొట్టులను గూర్చిపట్టును. మఱి దేవుఁడు క్షమించువాఁడును, సహించువాఁడును.

వ్యా॥ 224. ఇఁక ఒట్టుపెట్టుకొనుటకు గూర్చి ధర్మములు చెప్పఁబడుచున్నవి. కొందఱు ఏదో యొక మంచికార్యము చేయము. అని దేవుని పేరుతో నొట్టుపెట్టుకొనుదురు. ఉ॥ తల్లిదండ్రులకుఁగాని స్నేహితులకుఁగాని ఉపకారము సహాయము చేయుమని ఒట్టుపెట్టుకొనుదురు. ఇట్లు మంచికార్యములు చేయకుండుటకుఁగాను దేవుని నామము ఒట్టునకు అడ్డుగా చేసికొనకూడదు. అట్లు ఒట్టు పెట్టుకొనిన దానికై ప్రాయశ్చిత్తము (కఫ్ఫారా)చేసికొనవలెను.

కఫ్ఫారా విషయము సూరయే మాయిదా వాక్యము 89 చూచునది. మాటి మాటికి దేవుని నామముతో ఒట్టుపెట్టుకొనకూడదు, సాధ్యమైనంతవఱకు ఒట్టును వదలవలెను. దేవుఁడు సర్వమును వినుచు నెఱుంగుచున్నాఁడు. కావున ప్రతివిషయములో దేవునియందు భయభక్తులు గలిగియుండవలెను. 225. కొందఱు నిష్ప్రయోజనముగా సంకల్పము లేకుండనే ఒట్టులు పెట్టుకొనుచుందురు. మన స్సంకల్పము లేనందున ఇట్టి యొట్టులను దేవుఁడు పట్టఁడు. మఱి శిక్షింపఁడు. కాని మనఃపూర్వకముగా పెట్టుకొను ఒట్టులను పాటించును. ధర్మవిరుద్ధము కాని ఒట్టులను పూర్తిచేయవలెను. పూర్తి చేయనిచో దానికికఫ్ఫారాచేసికొన వలెను. ధర్మవిరుద్ధమైన కార్యములకుఁగాను ఒట్టుపెట్టుకొన్నచో దానినివదలిదా నికి వ్యతిరేకముగాఁ జేసి దానికిఁగాను కఫ్ఫారా ఇయ్యవలెను. బాసలుచేయువి షయములో మనఃపూర్వకముగాఁ జేయనిబాసలను దేవుఁడుక్షమించుచున్నాఁడు. మనఃపూర్వకముగా జేయుబాసలనుగూర్చి శిక్షించుటలో సహించి ఆలస్యము చేయు చున్నాఁడు. మానవులకు క్షమాపణ కోరుటకు నవకాశము నిచ్చు చున్నాఁడు.

226. లిల్లజీన-యూలూన-మిన్-నిసా-ఇహిమ్-తరబ్బుసు-అర్ బఅతి-అష్-హురిన్ - ఫయిన్-ఫాఊ-ఫ-ఇన్నల్లాహ-గఫూరుర్-రహీమ్, 227. వ-ఇన్-అజముత్-తలాఖ-ఫ-ఇన్నల్లాహ-సమీఉన్-అలీమ్.

226. ఎవరు తమ స్త్రీలతో కలియమని ఒట్టుపెట్టుకొనుదురో వారికి నాలుఁగు నెలల గడువున్నది. మరల వారు కలిసికొనినచో దేవుఁడు క్షమిం చువాఁడును, దయాళువును. 227. మఱి విడిచిపెట్టుటకు పూనుకొన్నచో నిశ్చయముగా దేవుఁడుసర్వమును వినుచు నెఱుంగుకొన్నాఁడు.

వ్యా॥ 226, 227. ఎవఁడైన తన స్త్రీతో కలియను అని ఒట్టుపెట్టుకొని నచో వానికి నాలుగు నెలల గడువున్నది. ఆ గడువుకాలములోపల తన స్త్రీతో కలిసినచో ఆమె భార్యగానేయుండును. తలాఖ్ (విడియాకు) గాదు. ఒట్టునకు విరుద్ధముచేసి నందులకు కఫ్ఫారా ఇయ్యవలెను. దీనిని దేవుఁడు క్షమించును. దేవుఁడు పరమదయాళువు, భక్తులపొరపాట్లు క్షమించును. నాలుగు నెలలు గడచునంతవఱకు భార్యాభర్తలు కలియనిచో తలాఖ్ (విడియాకు) అగును. భర్త తన భార్యను విడాకిచ్చి వదలుకొనవలెనని నిశ్చయించుకొన్నచో దాని ధర్మములను అనుసరించవలెను. వృథా స్త్రీని కష్టపెట్టవలెనని యుద్దేశపడఁ గూడదు. ధర్మప్రకారముగా సంసారముచేయవలెను. లేనిచో శాస్త్రప్రకార ముగా వదలిపెట్టవలెను. దేవునికి సర్వమును దెలియును. కావున ఆతని శిక్షకు భయపడవలెను.

228. వల్-ముతల్లఖాతు-యత-రబ్బస్న-బి-అన్-ఫుసి-హిన్న-సలా-సత-ఖురూ-యిన్-వలా-యహిల్లు-లహున్న-అన్-యక్-తుమ్న-మాఖల-ఖల్లాహు-ఫీ-అర్-హామి-హిన్న-ఇన్-కున్న-యూమిన్న-బిల్లాహి వల్-యూమిల్-ఆఖిరి-వబఊలతు-హున్న-అహఖ్-ఖు-బిరద్ది-హిన్న-ఫీ-జాలిక-ఇన్-అరాదూ-ఇస్లాహన్-వలహున్న-మిస్-లుల్లజీ-అలైహిన్న-బిల్-మఅ-రూఫి-వలిర్-రిజాలి-అలైహిన్న-దర-జతున్-వల్లాహు-అజీజున్-హకీమ్-

228. మఱియు తలాఖ్ (విడాకు) ఇయ్యఁబడిన స్త్రీలు మూఁడు ఋతువుల వఱకు తాము వేఁచియుండవలెను. వారు దేవుని యందును తుదిదినమందును విశ్వాసముగల వారైనచో దేవుఁడు వారిగర్భములలో పుట్టించిన దానిని దాచుట వారికిధర్మముగాదు. వారి భర్తలు ధర్మప్రకారముగా నుండుటకు ఇష్టపడినచో మరలవారిని చేర్చుకొనుటకు ఆ గడువులోపల వారిభర్తలకు హక్కుగలదు. ఎట్లుస్త్రీలపై భర్తలకు హక్కుగలదో అటులే ధర్మప్రకారముగా స్త్రీలకు గూడ హక్కుగలదు. మఱి పురుషులకు స్త్రీలపై ఘనత (దర్జా) గలదు. దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనాపరుఁడును.

వ్యా॥ 228. ఇఁక తలాఖ్ ధర్మములు చెప్పఁబడుచున్నవి. భర్తతనభార్యను వదలుటకై నీకు తలాఖు నిచ్చితిని లేక వదలి పెట్టితినని పలికినచో అది తలాఖ్ అగును. దానినే విడాకు అని చెప్పుదురు. అట్లు తలాఖ్ ఇయ్యఁబడిన స్త్రీలు మూఁడు ఋతువుల కాలము తమయాత్మలను కట్టిపెట్టి వేఁచియుండవలెను. దీనినే ఇద్దత్ అనుదురు. ఈ గడువు కాలములో స్త్రీలుగర్భముదాల్చినచో దాఁచిపెట్టఁగూడదు. ఎందుకన గర్భవతుల గడువు (ఇద్దత్) కాన్పువఱకుండును. అదియునుగాక దాఁచినచో మూఁడు ఋతువులు గడచిన పిదప ఇతర వివాహముచేసికొనవచ్చును. అపుడు గర్భములు కలతనొందును. దాఁచి పెట్టుట చాల పాపము. అందుకేవారు విశ్వాసము గల వారైనచో దాఁచి పెట్టరు. అని మందలింపఁబడెను. గడువుకాలములో భర్త తానుఇచ్చిన తలాఖునకు గాను సిగ్గుపడి బుద్ధిగలిగి తిరిగి తనభార్యను తనయొద్దనే యుంచుకొననుద్దేశించినచో ఆ భర్తకు అట్లుచేయుటకుహక్కుగలదు. కొన్నిసమయములలో కోపములో తలాఖునిత్తురు. తరువాత పశ్చాత్తాప పడుదురు. బిడ్డలుండినచో ఇంకను చాల దుఃఖకరమగును. కావున దేవుఁడు తిరిగి భార్యాభర్తలు కలిసిపోవుటకు హక్కునిచ్చియున్నాఁడు. ఇది దేవునికృప. తిరిగి కలిసిపోవుటలో భార్యను హింసించునుద్దేశముండగూడదు. సరిగా ధర్మప్రకారము సంసారము చేయు

నుద్దేశముండవలెను. లేనిచో దేవుని శిక్షకు భయపడ వలసివచ్చును. ఇందు స్త్రీ పురుషుల హక్కులను గూర్చి చెప్పఁబడినది. స్త్రీలపై భర్తలకు హక్కులు గలవు. అటులే భర్తపై సమముగా స్త్రీలకును హక్కులుగలవు. స్త్రీలు తమ ధనమును స్వేచ్ఛగా ఖర్చుచేయవచ్చును. ఆస్తిలోను హక్కులుగలవు. ఇస్లాము నకు ముందు స్త్రీలకువలాటి హక్కులులేక వారుచాల హీనదశలోనుండిరి. ఇస్లాము వారికి హక్కులను గౌరవమునొసంగెను. వారిహక్కులనుగూర్చి ఖురానె షరీఫులో అనేక ధర్మములుగలవు. ఈవాక్యములో అవన్నియు నిమిడియున్నవి. పురుషులు సంసారమును నడపుటకు చాల పాటు పడుదురు. కావున వారికి స్త్రీలపై కొంతఘనత (దర్జా) ఇయ్యబడినది. ఒక సభకు అధ్యక్షుఁడు ఒకరాజ్యమునకు రాజు ఎట్లో అటులే గృహపరిపాలనమునకు పురుషుఁడు అధికారి. అంతేకాని స్త్రీలు పురుషులకుబానిసలుగారు. ఈహక్కు అధికారము లిచ్చుటలో దేవునికి శక్తిగలదు. అందు అనేకరహస్యములు గలవు. కావున ఈధర్మములకు విరుద్ధముగా పోవువారిని శిక్షించును.

229. అత్-తలాఖు-మర్రతాని-ఫఇమ్-సాకుమ్-బిమఅ-రూఫిన్-ఔతస్-రీహుమ్-బిఇహ్సానిన్-వలా-యహిల్లు-లకుమ్-అన్-తాఖుజూ-మిమ్మా-ఆతైతు మూ-హున్న-షైఅన్-ఇల్లా-అన్-యఖాఫా-అల్లా-యుఖీమా-హుదూ-దల్లాహి-ఫయిన్-ఖిఫ్తుమ్-అల్లా-యుఖీమా-హుదూ-దల్లాహి-ఫలా-జునాహ-అలైహి మా-ఫీమఫ్-తదత్-బిహీ-తిల్క హుదూ-దుల్లాహి-ఫలా-తఅ-తదూహా-వ-మన్-యత-అద్ద-హుదూ-దల్లాహి-ఫఉలా-ఇక-హుముజ్-జాలిమూన్.

229. తిరిగి చేర్చుకొను తలాఖు రెండుతూర్లేను. ఆ పిదప ధర్మ ప్రకారముగా ఆపుకొనవలెను. లేక మంచితనముతో వదలి పెట్టవలెను. భార్యా భర్తలిద్దఱును దేవుఁడు నియమించిన హద్దులను అనుసరింపలేరను భీతిగలిగిన తప్ప మీరు స్త్రీలకు నొసంగినదానిని మరల తీసికొనుట మీకు ధర్మముకాదు. మరల వారిద్దఱు దేవుని నియమములను అనుసరింపలేరను భీతిమీకు గలిగినచో భార్యతాను బదులిచ్చి విడుదల గావించుకొన్నచో వారిద్దఱికిని దోషములేదు. ఇవి దేవుఁడు నియమించిన హద్దులు. వీనిని దాఁటిపోకుఁడు. మఱెవరు ఆ హద్దులను మించిపోవుదురో వారే దుర్మార్గులు.

వ్యా॥ 229. ఇస్లామునకు పూర్వము భర్త తన భార్యను పది ఇరువది లేక ఎన్నిమార్లుకోరిన అన్నిమార్లు తనయిష్టప్రకారముగా తలాఖ్ (విడాకులు)నిచ్చుచు తిరిగి గడువు(ఇద్దత్)లో చేర్చుకొనుచుండెను. కావున ఆ దురాచారమును రద్దు

చేయుచు, ఒకటి లేక రెండు తలాఖులిచ్చినచో గడువులోపల తిరిగి వివాహ ములేకయే భార్యను చేర్చుకొనవచ్చును. లేక వదలిపెట్టవచ్చును. దీనినే తలా ఖరజ్ఈ అనుదురు. గడువు గడచిపోయిన పిదప వారిద్దఱు ఇష్టపడినచో తిరిగి యథాప్రకారముగా వివాహమాడవలెను. లేనిచో చేర్చుకొనఁగూడదు. రెండుతూర్లుగాకమూడుతూర్లు తలాఖునిచ్చినచో తిరిగి చేర్చుకొనుటకు తిరిగి పెండ్లాడుటకునుహక్కులేదు. మూఁడు తలాఖులుపొందిన స్త్రీ వేఱు పురుషుని పెండ్లాడి సంసారముచేసిన పిదప, రెండవభర్తతలాఖునిచ్చి గడువు గడచినపిదప మూఁడు తలాఖులిచ్చిన మొదటి భర్త తిరిగి పెండ్లిచేసికొనఁగలఁడు. కావున తలాఖునిచ్చుటలో ఆత్రముతో మూఁడుతలాఖులు ఇయ్యఁగూడదు.ఇచ్చినచో చింతపడవలసి వచ్చును. వీలులేనపుడు తలాఖు ఇయ్యవలెను. కాని వృథాగా తలాఖు నియ్యఁగూడదు. ఇది దేవునికి సమ్మతముగాదు. భర్త తన భార్యకు నిచ్చిన మహరు సొత్తును తలాఖునకు బదులుగా పుచ్చుకొనగూడదు. ఇది నిషిద్ధము. తగవుహెచ్చి ధర్మప్రకారముగా సంసారము సాగదు అను భీతి యుండి, భర్తలోపము లేకున్నచో భార్య తలాఖునకు బదులుగా తన మహరు సొమ్మును భర్తకునిచ్చి తలాఖుపొంది వివాహ బంధములనుండి విడుదల గా వించుకొన్నచో వారిద్దఱిపై నెట్టి దోషములేదు. దీనినే ఖులా అనుదురు. దేవుఁడు నియమించిన తలాఖ్ ధర్మములను నియమములను అనుసరింపవలెను. వాని మీఱి నడచుకొనువారు సన్మార్గము దప్పినవారు. వారు దేవునికి ప్రి యులు కానేరరు. కావున దేవుని ధర్మములను అనుసరింపవలెను.

230. ఫయిన్-తల్లఖహా-ఫలా-తహిల్లు-లహూ-మిమ్-బఅ-దు-హత్తా-తన్ కిహ-జౌ-జన్-గైరహూ-ఫయిన్-తల్లఖహా-ఫలా-జునాహ-అలైహిమా-అన్-యత-రాజఆ-ఇన్‌జన్నా-అన్-యుఖీమా-హుదూ-దల్లాహి-వతిల్క-హుదూ-దుల్లాహి-యుబయ్యినుహా-లిఖౌమిన్-యఅ-లమూన్.

230. మరల మూఁడవతూరి ఆస్త్రీకి తలాఖునిచ్చినచో ఆస్త్రీవానిదప్ప నితర భర్తను పెండ్లాడువఱకు మొదటిభర్తకు ఆమె ధర్మపత్ని కానేరదు. ఆపిదప రెండవభర్త తలాఖు నిచ్చినచో తిరిగి ఆయిద్దఱు దేవునిధర్మములను అనుసరిం పఁగలమని వారుదలఁచినచో వివాహముచేసికొని కలిసికొనిన వారిపై దోష ము లేదు. ఇవిదేవుఁడు నియమించిన హద్దులు. వీనిని తెలిసికొనువారికి వివ రించుచున్నాఁడు.

వ్యా॥ 230. ఈ వాక్యములో, రెండుతలాఖుల పిదప మూఁడవ తలాఖు ఇచ్చినచో దాని ధర్మము చెప్పఁబడినది. మూఁడు తలాఖులు పొందిన స్త్రీని

మొదటి భర్త ధర్మముగా సంసారము చేయఁగలనని దలఁచినచో ఆమెను రెండవభర్త పెండ్లాడి సంసారముచేసి తలాఖునిచ్చి దాని గడువు (ఇద్దత్)గడచినపిదప తిఱిగి ఆతఁడు (మొదటి భర్త) పెండ్లిచేసికొని కలిసికొనవచ్చును. ఇట్లు రెండవభర్తను పెండ్లాడవచ్చునను ధర్మముండుటచే సహజముగా మూఁడవతలాఖు నిచ్చుటకుభర్త పూనుకొనఁడు. ఇవన్నియు దేవుఁడు ప్రజలకుఁగాను నియమించిన ధర్మములు. వాని ననుసరించిన లోకక్షేమమున్నది.

231. వ-ఇజా-తల్-లఖ్తుమున్-నిసాఅ-ఫ-బలగ్న-అజల-హున్న-ఫ-అమ్-సికూ-హున్న-బిమఅ-రూఫిన్-ఔ-సర్రిహూ-హున్న-బి-మఅ-రూఫిన్-వలా-తుమ్-సికూ-హున్న-జిరా-రన్‌లిత-అ-తదూ-వ-మన్-యఫ్-అల్-జాలిక-ఫఖద్-జలమ-నఫ్-సహూ-వలా-తత్-తఖి-జూ-ఆయా-తిల్లాహి-హుజువన్-వజ్-కురూ-ని-అ-మ-తల్లాహి-అలైకుమ్-వమా-అన్-జల-అలైకుమ్-మినల్-కితాబి-వల్-హిక్మతి-య-ఇజు-కుమ్-బిహీ-వత్త-ఖుల్లాహ-వఅ-లమూ-అన్నల్లాహ-బికుల్లి-షైయిన్-అలీమ్.

231. మఱి మీరు మీస్త్రీలకు విడియాకునిచ్చిన పిదప వారు తమ గడువును సమీపించినచో వారిని ధర్మప్రకారముగా చేర్చుకొనుఁడు. లేదా ధర్మప్రకారముగా విడిచిపెట్టుఁడు. మఱి వారిని సతాయించు (హింసించు)టకును వారికి అన్యాయము చేయుటకును ఆపిపెట్టకుఁడు. మఱెవఁడు అట్లు చేయునో ఆతఁడే తన నష్టముచేసికొనును. మఱి దేవుని ధర్మములను ఎగతాళిగాఁ జేసికొనకుఁడు. మఱి మీపైనున్న దేవుని అనుగ్రహమును, మీకు గ్రంథమును జ్ఞానమును ఒసంగి దానివల్ల మీకిచ్చు బోధను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. మఱి దేవునికి భయపడుఁడు. దేవునికి సర్వము దెలియునని దెలిసికొనుఁడు.

వ్యా। 231. కొందఱు విడియాకునిచ్చి గడువు నడుమతిరిగి భార్యలను చేర్చుకొనుచు సంసారము ధర్మముగాఁజేయక తిరిగి తలాఖునిచ్చి మరల మునుపటివలె గడువు ముగియకముందే చేర్చుకొనుచు భార్యలను అన్యాయముగా హింసించుచుండిరి. అట్లు చేయవలదు. ధర్మముగా సంసారము చేయవలెనని బుద్ధిగలిగినచో తిరిగి గడువులోపల చేర్చుకొనవలెను. లేక ధర్మ ప్రకారముగ వదలిపెట్టవలెను. అట్లుచేయక మాటి మాటికి తలాఖునిచ్చి తిరిగిచేర్చుకొనుచు హింసించుట ధర్మముకాదు. ఇట్లు చేయుటవలన ఆతనికి నష్టముగలుగును. ఆతని మనస్సునకు శాంతిగలుగదు. మఱి భార్యబంధువులు అసహ్యపడి విరోధింతురు. ఇట్లు చేయుట దేవుని ధర్మములను ఎగతాళి చేసినట్లగును.

దీనివలనఁగలుగు దేవుని శిక్షకు భయపడవలెను. మరి వివాహసంబంధము దేవుని అనుగ్రహము. మఱి దేవుఁడు ఖురాను గ్రంథమును జ్ఞానమును నొసంగెను. ఇదియు గొప్ప మేలు. వీనిని జ్ఞప్తికిఁదెచ్చుకొని కృతజ్ఞులై దేవుని ధర్మములకు విధేయులై యుండవలెను. ఎవరెట్లు ఆచరింతురో సర్వము దేవునికిఁ దెలియును. కావున దీని నెఱింగి దేవుని శిక్షకు భయపడవలెనని హెచ్చరింపఁబడియె.

232. వ-ఇజా-తల్లఖ్-తుమున్-నిసాఅ-ఫ-బలగ్న-అ-జలహున్న-ఫలా-తఅ్ జులూ-హున్న-అన్-యన్-కిహ్న-అజ్-వాజ-హున్న-ఇజా-తరా-జౌ-బైన-హుమ్-బిల్-మఅ-రూఫి-జాలిక-యూ-అజు-బిహీ-మన్-కాన-మిన్-కుమ్-యూమిను-బిల్లాహి-వల్-యౌమిల్-ఆఖిరి-జాలి-కుమ్-అజ్కా-లకుమ్-వఅత్-హరు-వల్లాహు-యఅ-లము-వఅన్తుమ్-లా-తఅ-లమూన్.

232. మీరు మీ స్త్రీలకు తలాఖునిచ్చిన పిదప వారు తమ గడువును ముగించి ధర్మప్రకారముగా వారే ఇష్టపడి తమ భర్తల పెండ్లాడవలెనన్న మీరు వారిని అడ్డుచేయకుఁడు. మీలో నెవరికి దేవునియందును తుది దినమందును విశ్వాసము గలదో వారికి ఈ బోధ ఇయ్యఁబడుచున్నది. ఇందు మీకు చాల మేలును పవిత్రతయును గలదు. అది దేవునికిఁదెలియును. మీకుఁ దెలియదు.

వ్యా॥ 232. ఒకటి లేక రెండు తలాఖులిచ్చిన పిదప గడువు (ఇద్దత్) గడచిన పిదప తిరిగి పూర్వపుభర్తలతోనే ఇష్టపడి ధర్మ ప్రకారముగా పెండ్లాడవలెనని స్త్రీలు కోరినచో అటులే గావింపవలెను. స్త్రీ బంధువులు దానికి అడ్డుచేయరాదు. అని విశ్వాసులకు బోధయున్నది. కావున వారు ధర్మప్రకారముగా నడుచుకొనవలసినది. విశ్వాసములేనివారు తమ ఆత్మల ఇష్టప్రకారముగా నడచుకొందురు. కాని భక్తులు దేవుని ధర్మములను శిరసావహించి అనుసరింతురు. స్త్రీ మునుపటి భర్తనే పెండ్లాడుట మంచిది. అందు చాల మేలును పవిత్రతయును గలదు. ధర్మములన్నియు దేవునికిఁ దెలియును. మానవులగు మీకుఁదెలియదు అనిమందలింపఁబడియెను.

233. వల్-వాలిదాతు-యుర్-జిఅ-న-ఔలా-దహున్న-హౌ-లైని-కామిలైని-లిమన్-అరాద-అన్-యు-తిమ్మర్-రజా-అత-వఅ-లల్-మౌలూది-లహూ రిజ్ ఖు-హున్న-వకిస్-వతు-హున్న-బిల్-మఅ-రూఫి-లా-తుకల్లఫు-నఫ్-సున్-ఇ

ల్లా-వుస్-అహా- లాతు-జా(ర-వాలి-దతుమ్-బి-వలదిహా-వలా-మౌలూ- దుల్-లహూబి-వలదిహీ-వఅ-లల్-వారిసి-మిస్లు-జాలిక-ఫయిన్-అరాద-ఫిసా-లన్-అన్-తరాజిమ్-మిన్-హుమా-వతషా-వురిన్-ఫలా-జునాహ-అలైహిమా వఇన్-అరత్-తుమ్-అన్-తస్-తర్-జిఊ-ఔలా-దకుమ్-ఫలా జునాహం-అలై-కుమ్-ఇజా-సల్లమ్-తుమ్-మా-ఆతై-తుమ్-బిల్-మఅ-రూఫి-వత్తు-ఖుల్లాహ-వఅలమూ అన్నల్లాహ-బిమా-తఅ-మలూన-బసీర్.

233. మఱియు తల్లులు, పూర్తి రెండుసంవత్సరములు పాలుగడువు పూర్తి చేయవలెనని కోరినవారికి తమ చేతిబిడ్డలను పాలకై ఇయ్యవలెను. ధర్మప్రకారముగా బిడ్డ సొంతగాఁడగు తండ్రి పాలిచ్చు స్త్రీలకు భోజనమును వస్త్రముల నియ్యవలెను. శక్తికిమించిన కష్టము ఎవ్వరికి నియ్యఁబడదు. తల్లికి ఆమె బిడ్డవలన కష్టము కలుగఁజేయఁగూడదు. బిడ్డ సొంతగాఁడగు తండ్రికిని తన బిడ్డవలన నష్టము కలుగఁగూడదు. ఇటులే వారసులపైనను విధింపఁబడినది. మరల తల్లిదండ్రులు తమ సమ్మతముతోను పరస్పర అభిప్రాయముతోను రెండు సంవత్సరములలోనే బిడ్డల పాలువదలింపవలెనని ఇష్టపడినచో వారిపై నెట్టిదోషములేదు. మఱిమీరు మీబిడ్డలకు దాదిపాలిప్పింప వలెనని కోరి ధర్మప్రకారముగా నియ్యవలసినది, ఇచ్చివేసినచో మీకు నెట్టి దోషములేదు. మఱి మీరు దేవునికి భయపడుఁడు, మఱి మీరుచేయునదంతయు దేవుఁడు చూచుచున్నాఁడని తెలిసి కొనుఁడు.

వ్యా॥ 233. విడియాకు పొందిన స్త్రీలకు పాలుత్రాగు బిడ్డలున్నచో వారు తమ బిడ్డలకు పాలియ్యవలసినది. తల్లితండ్రులు రెండు సంవత్సరములు పూర్తి చేయవలెనని కోరినచో ఆ రెండు సంవత్సరములు పాలియ్యవలెను. బిడ్డ దేహారోగ్యమునుబట్టి తల్లిదండ్రులు రెండుసంవత్సరముల లోపలనే పాలు వదలింపవలెనని సమ్మత పడినచో నట్లుకూడ చేయవచ్చును. దానివలన నెట్టి దోషమును పాపమును గలుగదు. బిడ్డలకు పాలిచ్చుకాలములో తల్లుల అన్న వస్త్రాదుల ఖర్చులు శక్తికొలఁది బిడ్డలతండ్రులు భరింపవలెను. ఇందు తల్లికి గాని తండ్రికిఁగాని నష్టము గలుగఁగూడదు. నిష్కారణముగా తల్లి తనబిడ్డకు పాలియ్యనని తిరస్కరించి భర్తను కష్టపెట్టగూడదు. అటులే కారణములేక యే తండ్రి బిడ్డను తల్లినుండి విడిపించి యితరులవద్ద పాలిప్పించి పాలిచ్చు తల్లికి అన్నవస్త్రాదులు తక్కువచేసి కష్టపెట్టఁగూడదు. ధర్మముగాను న్యాయముగాను నడచుకొనవలెను. తల్లిపాలే బిడ్డలకు శ్రేష్ఠము. ఇందు ననేక లాభ

ములు దేహారోగ్యము గుణములనుబట్టి గలుగును. ఒకవేళ బిడ్డతండ్రి చనిపోయి నచో వాని వారసులు బిడ్డకు పాలిప్పించుటకు పై ధర్మముల ననుసరింపవలెను. సకారణముగా తల్లిదండ్రులు సమ్మతించి దాది ఖర్చులు ధర్మప్రకారమిచ్చి బిడ్డకు దాది పాలిప్పించిన ఎట్టిదోషమును పాపమును గలుగదు. ఈ ధర్మముల నాచరించుటలో దేవునికి భయపడవలెను. హెచ్చుతగ్గులు చేయరాదు. అన్యాయము గావింపరాదు. దేవుఁడు సర్వము చూచుచున్నాఁడు. ఆతనికి నెద్దియును మఱుఁగులేదు. అని తెలిసికొని భయభక్తులు గలిగి గృహస్థ ధర్మముల నాచరింపవలెనని హెచ్చరింపఁబడియెను.

234. వల్లజీన-యుతవఫ్-ఫౌనమిన్‌కుమ్-వయ-జరూన-అజ్-వాజన్-యత-రబ్బస్‌న-బిఅన్-ఫుసిహిన్న-అర్-బఅత-అష్‌హురిన్-వ-అష్‌రన్-ఫ-ఇజా-బలగ్న-అజల-హున్న-ఫలా-జునాహ-అలైకుమ్-ఫీమా-ఫఅల్న-ఫీ-అన్-ఫుసిహిన్న-బిల్-మఅ-రూఫి-వల్లాహు-బిమా-తఅ-మలూన-ఖబీర్.

234. మఱియు మీలో నెవరైన మృతినొంది తమ స్త్రీలను వదలి పోయినచో నట్టి విధవస్త్రీలు నాలుగు నెలల పదిరోజులు వేఁచి యుండవలెను. ఆపిదప వారు తమ గడువును ముగించి తమ విషయము ధర్మప్రకారముగా నేదైన చేసికొన్నచో మీపై నెట్టి దోషములేదు. మఱి దేవునికి మీరుచేయు నదంతయు నెఱుక.

వ్యా॥ 234. ఇందు భర్తచనిపోయిన పిదప గర్భవతులుకాని విధవలు పునర్వివాహము చేసికొనకుండ తమ యాత్మలను కట్టిపెట్టి నాలుగు నెలల పదిరోజులు వేఁచియుండవలెను. ఆ గడువు ముగిసిపోయిన పిదప గర్భములేకుండినచో ధర్మప్రకారముగా సింగారముగాని తిరిగి వివాహముగాని చేసికొనినచో నెట్టి దోషములేదు. అని చెప్పఁబడియె. గర్భవతులైనచో నట్టి స్త్రీలు కాన్పుఅగువఱకు వేఁచియుండవలెను. ఈ గడువులో విధవలు, సింగారము మొదలగు అలంకారము చేసికొనఁగూడదు. కారణములేనిదే తానున్న ఇల్లు వదలి పోఁగూడదు. కొందఱు నలువది దినములలోనే భర్త గృహమునుండి అలంకరించుకొని తమ తల్లిదండ్రుల యింటికి పోవుదురు. అట్లు పోఁగూడదు. దేవుని ధర్మముల ననుసరింపవలెను. అందు లోకక్షేమమున్నది. వ్యతిరేకముగా నడవఁగూడదు. కొందఱు బంధువులు విధవలను పునర్వివాహము చేసికొనకుండుటకు నిర్బంధింతురు. అట్లు చేయఁకూడదు. దేవుఁడు విధవలకు పునర్వివాహపు హక్కు నిచ్చియున్నాఁడు.అందువారికి మేలుగలదు. దేవునికి సర్వమును దెలియును. ప్రజల కర్మలను నెఱుంగును. వారికర్మల ఫలితమిచ్చును.

235. వలా-జునాహ-అలైకుమ్-ఫీమా- అర్రజ్-తుమ్-బిహీ-మిన్-ఖిత్-బతిన్-నిసాయి-ఔ-అక్నన్-తుమ్-ఫీ-అన్ఫుసి-కుమ్-అలి-మల్లాహు-అన్నకుమ్-సతజ్-కురూ-నహున్న-వలాకిల్-లాతువా-ఇదూహున్న-సిర్రన్-ఇల్లా-అన్-త ఖూలూ-ఖౌలమ్-మఅ-రూఫన్-వలా-తఅ-జిమూ-ఉఖ్-దతన్-నికాహి-హత్తా-యబ్లు-గల్-కితాబు-అజలహూ-వఅ-లమూ-అన్నల్లాహ-యఅ-లము-మాఫీ-అన్-ఫుసికుమ్-ఫహ్-జరూహు-వఅ-లమూ-అన్నల్లాహ-గఫూరున్-హలీమ్.

236. మఱి స్పష్టముగా గాక మాటలధ్వనివలన వివాహవిషయము దెలిపి నను లేదా ఆవిషయము మీమనస్సులలో దాఁచిపెట్టినను మీపై నెట్టిదోష ము లేదు. నిశ్చయముగా మీరు ఆ స్త్రీల విషయము చర్చింతురని దేవునికిఁ దెలిసియేయున్నది. కాని ధర్మప్రకారముగా నేదో యొకమాట చెప్పుట తప్ప మఱుఁగుగా వారినుండి వివాహ వాగ్దానము తీసికొనకుఁడు. మఱి నియమింపఁ బడిన గడువుకాలము ముగియు నంతవఱకు పెండ్లాడుటను నుద్దేశింపకుఁడు. మఱి మీ హృదయములలో నున్నదంతయు దేవునికిఁ దెలియును. అని మీరు దెలిసికొని ఆతనికి భయపడుఁడు. నిశ్చయముగా దేవుఁడు క్షమించువాఁడును, సహించువాఁడును అని దెలిసికొనుఁడు.

వ్యా॥ 235. భర్త చనిపోయినస్త్రీగాని, లేక మూఁడు తలాఖులు పొందిన స్త్రీగాని గడువు (ఇద్దత్) కాలములో నుండునంతవఱకు నట్టి స్త్రీల నెవరును గడువు (ఇద్దత్) ముగిసిపోవునంతవఱకు వివాహమాడఁగూడదు. స్పష్టముగా వివాహవార్త పంపఁగూడదు. మఱి మఱుఁగుగా వివాహ వాగ్దానము పుచ్చుకొనఁగూడదు. కాని వివాహము చేయు తలంపును మాటలధ్వని వలన తన ఇష్టము దెలిపిన తప్పు గాదు. నిన్ను ప్రతి మనుజుఁడు కోరును. లేక ఎచ్చటనైన నేను పెండ్లిచేసికొనవలెనని యున్నానని స్త్రీకిఁ దెలిపిన ఆతని వివాహపు తలంపు ధ్వనించును. స్పష్టముకాని యిట్టి మాటలవలన దోషములేదు. మానవుని మనస్సులోనున్న సర్వము దేవునికిఁ దెలియును. కావున దేవునికి భయపడియుండవలెను. ఏదైన పొరపాటు గలిగిన క్షమాపణ కోరిన దేవుఁడు క్షమించును. పాపముచేసినవారికి శీఘ్రముగా శిక్ష నియ్యక సహించువాఁడును ఆతఁడే అని దెలిసికొనవలెను. అని హెచ్చరింప బడియె. గడువు (ఇద్దత్) కాలములో నికాహ్ (పెండ్లి) చేసికొన్నచో పెండ్లి కానేరదు. అందు మహాపాపముగలదు. ఇద్దత్ (గడువు) కాలము ముగిసిన పిదప పెండ్లిచేయుట ధర్మమగును.

237. లా-జునాహ-అలైకుమ్-ఇన్-తల్లఖ్-తుమున్-నిసాఅ-మాలమ్-తమస్సూహున్న-ఔ-తఫ్రిజూ-లహున్న-ఫరీజతన్-వమత్తిఊహున్న-అలల్-మూసిఇ-ఖదరుహూ-వ-అలల్-ముఖ్-తిరి-ఖదరుహూ-మతా-అమ్-బిల్-మఅ-రూఫి-హఖ్-ఖన్-అలల్-ముహ్సినీన్.

236. మీరు స్త్రీలను తాకకముందే స్త్రీలకొఱకు మహరు నియమింపకయుండి వారికి తలాఖు నిచ్చినచో మీపై నెట్టి దోషములేదు. మఱి వారికి ఖర్చుకుఁగాను నొసంగుఁడు. ధనవంతులు తమశక్తికొలఁది మఱి బీద వారు తమ శక్తికొలఁది ఖర్చు ధర్మప్రకారముగా నియ్యవలసినది. ఇది సత్కార్యము చేయువారిపై విధింపఁబడినది.

వ్యా॥ 236. మహరు నియమింపకయే చేసికొనిన వివాహము చెల్లును. కాని తరువాత యథాప్రకారముగా మహరు నియమింపవలెను. మహరు అనగా భర్త భార్యకుఁగాను వివాహము జరుగునపుడు ఒప్పుకొను ధనము. అది వారి శక్తి యోగ్యత కొలఁది నియమింపఁబడును. ఒకవేళ ఇంతమహరు అని నియమింపకయే వివాహము జరిగిన పిదప భర్త తన భార్యను తాకకముందే (అనగా వారు కలియకముందే) లేక భార్యాభర్తలు ఏకస్థలము (ఖల్వత్) లో వసింపకముందే తలాఖు నిచ్చినచో మహరు ఇయ్యనక్కఱలేదు. కాని ధర్మప్రకారముగా భర్త తన శక్తికొలఁది ఉపకార రూపమున కొంత ధనము నొసంగి తీరవలెను. ఇట్లొసంగుటవల్ల స్త్రీ బంధువులకు ద్వేష ముండ నేరదు. ప్రజలలో నామెనుగూర్చి సందేహములు పుట్టవు. భర్తయే ఏదో కారణమువలన తలాఖు నిచ్చెను. కాని పెండ్లికూఁతులో నేమియు లోపము లేదని తెలియనగును. లేనిచో భర్త ధనము ఎందులకు నొసంగునని యూహింపఁబడును. గర్భాధానము కాక ఏకస్థలము (ఖల్వతు) లో వసింపకముందే తలాఖు నిచ్చిన గడువు (ఇద్దత్) కాలములేదు.

237. వ-ఇన్-తల్లఖ్-తుమూహున్న-మిన్-ఖబ్లి-అన్-తమస్సూహున్న-వఖద్-ఫరజ్తుమ్-లహున్న-ఫరీజతన్-ఫనిస్-ఫు-మా-ఫరజ్తుమ్-ఇల్లా-అన్-యఅ-ఫూన-ఔ-యఅ-ఫు-వల్లజీ-బియదిహీ-ఉఖ్దతున్-నికాహి-వ-అన్-తఅ-ఫూ-అఖ్రబు-లిత్-తఖ్వా-వలా-తన్-సవుల్-ఫజ్ల-బైనకుమ్-ఇన్నల్లాహ-బిమా-తఅ-మలూన-బసీర్.

237. మీరు స్త్రీలకొఱకు మహరు నియమించియుండి స్త్రీలను తాకక

ముందే వారికి తలాఖునిచ్చినచో స్త్రీలు క్షమించిన లేక వివాహ సంబంధాధికారము ఎవ్వని చేతిలో నున్నదో యాతఁడు క్షమించినఁదప్ప మీరు నియమించియున్న మహరులో సగము నియ్యవలెను. మఱిమీరు క్షమించుటయే భక్తికి సమీపించిన మార్గము. మఱిమీరు పరస్పరము ఉపకారముచేసికొనుటను మఱచిపోకుఁడు. నిశ్చయముగ దేవుఁడుమీరు చేయునదంతయు చూచుచు నేయున్నాఁడు.

వ్యా॥ 237. ఈ వాక్యమునందు వివాహమునందు మహరు ఇంత అని నియమింపఁబడియుండి భార్యాభర్తలు కలియక మునుపే భర్త విడియాకు (తలాఖు) నిచ్చినచో, నియమింపఁబడిన మహరులో సగము స్త్రీకియ్యవలెను. స్త్రీ కోరినచో ఆసగము కూడ క్షమించి మహరు బొత్తిగా తీసికొనక పోవచ్చును. అటులే వివాహసంబధాధికారియగుభర్త తక్కిన సగముకూడ భార్య నుండి పుచ్చుకొనక క్షమించి పూర్తిగ నొసంగిన నొసంగవచ్చును. భర్త పూర్తి మహరు ఇచ్చివేయుటయేమంచిది, అది భక్తిమార్గముఎందుకన, వివాహబంధము తెఁపుటలోను, ఉంచుటలోను, భర్తకు నధికారము గలదు. తలాఖు నిచ్చుటలో భార్యతప్పు ఏమియు లేదు. కావున భర్త తానుచేసిన పనికి తానే గొప్పమనస్సుచేసి పూర్తి మహరు నిచ్చుటశ్రేష్ఠము. పరస్పరము మేలును ఉపకారమును చేసికొనుచుండవలెను. ఉభయపక్షములవారి బంధువులును వివాహ సంబంధము తెగినది అని ద్వేషములుపెట్టుకొనక ఒకరికినొకరు మేలు చేసికొనుచు స్నేహభావములో నుండవలెను. ఆఖరున దేవుఁడు సర్వకర్మలను చూచుచున్నాఁడు. కావున భయభక్తులుగలిగి యుండవలెను. తలాఖు మహరునకు సంబంధించిన ఇతర ధర్మముల వ్రాయుదుము. మహరు నియమింపఁబడియుండి భార్యాభర్తలు కలిసిన పిదప తలాఖునిచ్చిన పూర్తిమహరు ఇయ్యవలెను. మహరు నియమింపకనే వివాహమాయెను. భార్యాభర్తలు కలిసిన పిదప తలాఖునిచ్చెను. అపుడు మహరెమిసల్ అనగా భార్య కుటుంబములో నామె, మేనత్త మొదలగు స్త్రీలకునెంత మహరుండునో అంత ఇయ్యవలెను. మహరు నియమింపఁబడియుండి భార్యాభర్తలు కలిసిన, లేక కలియకపోయిన, భర్త చనిపోయినచో, నియమింపఁబడిన మహరు పూర్తిగా నియ్యవలెను. మహరు నియమింపక యున్నపుడు భర్త చనిపోయినచో భార్యాభర్తలు కలిసిన, కలియకపోయిన మహరెమిసల్ ఇయ్యవలెను.

238. హా-ఫిజూ-అలస్-సలవాతి-వస్-సలాతిల్-వుస్తా-వఖూమూ-లిల్లాహి-ఖానితీన్. 239. ఫ-ఇన్-ఖిఫ్తుమ్-ఫరిజాలన్-ఔ-రుక్-బానన్-ఫ-ఇజా అమిన్తుమ్-ఫజ్-కురుల్లాహ-కమా-అల్లమ-కుమ్-మాలమ్-తకూనూ-తఅ-లమూన్,

238. జాగ్రత్తగా అన్నినమాజులను మధ్యనుండు నమాజును సలుపు చుండుడు. మఱి దేవుని యెదుట భయభక్తులతో నిలువఁబడుఁడు. 239. మరల మీకు భయమున్నచో నడచుచుఁగాని స్వారిచేయుచుఁగాని నమాజు సలుపుఁడు. ఆ పిదప మీకు శాంతము లభించినచో, మీకుఁ దెలియని దానిని మీకు దేవుఁడు నేర్పినట్లు దేవునిని స్మరింపుఁడు.

వ్యా॥238-239. మునుపటి వాక్యములలో గృహస్థ ధర్మములు వివరింపఁ బడియెను. లోకవ్యవహారములో మునిఁగి ప్రార్థనలను మఱచిపోకుండ జాగ్రత్తగా అయిదుపూఁటల నమాజులను కాపాడుకొనుచు సలుపుచుండవలెను. అందు మధ్యనుండు నమాజునుగూర్చి ముఖ్యముగా శ్రద్ధవహింపవలెను. ఆ నమాజు. అసరునమాజు. అది సూర్యాస్తమానమునకు ఒకటి రెండుగంటలముందు సలుపఁబడును. అపుడు సర్వజనులు తమతమ పనులలో నిమగ్నులై యుందురు. మఱచిపోకుండ దానిఁగూర్చి శ్రద్ధవహింపవలెను. అన్నిధర్మములను ఆచరింపవలెను. దేవునిప్రార్థనలు భయభక్తులతో తప్పక నియమముగా సలుపుచుండవలెను. దీనివలన మానవుఁడు తప్పుత్రోవలలోపోక సుగుణుఁడై మంచిభక్తుఁడగును. కావున నమాజు అయిదుపూఁటలు సలుపవలెనని చాల తాకీదున్నది. ఎట్టి స్థితిలోనువిడువఁగూడదు. శత్రుభయమున్నను యుద్ధముజరుగుచున్నను నమాజు కాలము వచ్చినపుడు శాంతిగానిలిచి యథాప్రకారముగా నమాజుచేయలేనిచో నడచుచుఁగాని స్వారి చేయుచుఁగాని నమాజు సలుపవలెను. ఇందు ఖిబ్లా ఏవైపున నున్నను, పర్వాలేదు. నమాజుచేయవచ్చును. భయముపోయి శాంతము లభించినచో యథాప్రకారముగా దేవుఁడు దెలిపియున్న పద్ధతిని నమాజు సలుపవలెను. నమాజుసలుపునపుడు భయభక్తులతో దేవునెదుట నిలిచియున్నామని భావించి నమ్రశిరస్కులై నమాజుసలుపవలెను. ఇట్లు నమాజుచేసినచో ముసల్మానులకు నెట్టికొఱఁతయు నుండదు. మాటలతోనే మేము ముసల్మానులమని చెప్పుకొనుచు క్రియాశూన్యులై నమాజుసలుపక జకాతుదానమియ్యక సుగుణములను విడనాడి ఇస్లామ్ ధర్మములకు వ్యతిరేకముగాఁ బోవువారు బుద్ధి దెచ్చుకొని నిజమైన ముసల్మాను భక్తులై హజ్రత్ పైగంబరులవారి శిష్యులవలె లోకమును నుద్ధరింతురుగాక!

240. వల్లజీన-యుతవఫ్-ఫౌన-మిన్‌కుమ్-వయజరూన అజ్-వాజన్-వసియ్యతల్-లి-అజ్-వాజిహిమ్-మతా-అన్-ఇలల్ హౌలి-గైర-ఇఖ్రాజిన్-ఫఇన్-ఖరజ్న-ఫలా-జునాహ-అలైకుమ్-ఫీమా-ఫ-అల్న-ఫీఅన్-ఫుసి-హిన్న-మిమ్ మఅ-రూఫిన్-వల్లాహు-అజీ-జున్-హకీమ్. 241. వలిల్...

ఉమ్.బిల్-మ-అ్రూఫి-హఖ్ఖన్-అలల్-ముత్తఖీన్. 142. కజా-లిక-యు బయ్యి-నుల్లాహు-లకుమ్-ఆయా-తిహీ-లఅల్లకుమ్-తఅ-ఖిలూన్.

240. మఱియు మీలో నెవరైన చనిపోయి తమ స్త్రీలను వదలి పోయినచో ఆ స్త్రీలను యింటినుండి తొలఁగింపక ఒక సంవత్సరమువఱకు ఖర్చు యియ్యవలసినది అని మరణశాసనము గావింపవలెను. ఆపిదప స్త్రీలు తమంతటదామె వెళ్ళిపోయి తమ యాత్మలవిషయమై ధర్మకార్యముచేసి కొన్నచో మీపై నెట్టిదోషములేదు. మఱి దేవుఁడు సర్వశక్తుఁడును, వివేచనా పరుఁడును. 241. తలాఖు పొందిన స్త్రీలకు ధర్మప్రకారముగా ఖర్చునియ్య వలెను. ఇది భయభక్తులుగలవారిపై విధింపఁబడినది. 242. ఇటులే దేవుఁడు మీరు గ్రహించుటకై తన సూచనలను మీకు వివరముగాఁదెలుపుచున్నాఁడు.

వ్యా॥ 240. భర్త చనిపోయినచో విధవ ఒక సంవత్సరము భర్త యింటిలోనే యుండవచ్చును, ఖర్చులు భర్త ఆస్తిలోనుండియే ఇయ్యబడు చుండును. భార్య తనంతట తానే ఒకసంవత్సరము పూర్తికాక మునుపే వెళ్లి పోయి తన విషయమై ధర్మకార్యమగు పెండ్లి సింగారములు చేసికొన్నచో భర్త వారసులపై నెట్టి దోషములేదు. ఇస్లామ్‌లో మొట్టమొదట ఈధర్మ ముండెను. తరువాత విధవ నాలుగు నెలలు పదిదినములు వేఁచియుండవలెను. భర్తకు సంతానములేనిచో ఆతని యాస్తిలో నాలుగవ పాలును సంతాన మున్నచో ఎనిమిదవ భాగమును భార్యకు హక్కు అని నియమింపఁబడెను. దేవుఁడు సర్వశక్తుఁడు. ధర్మవిరుద్ధముగాఁ బోవువారిని శిక్షించును. 241; 242. దీనికి మునుపటి వాక్యములలో తలాఖుపొందినస్త్రీలకు ఖర్చుఇయ్యవలెనని యుండెను. అందు ప్రత్యేకముగా కొన్నివిధములలో తలాఖుపొందిన స్త్రీలకు ఖర్చుయియ్యవలెనని యుండెను. ఇందు సర్వవిధముల, తలాఖుపొందినవారికి ఖర్చు ఇయ్యవలసినది అని చెప్పఁబడియె. తలాఖు మొదలగువానిగూర్చి ధర్మములను చెప్పినటులు తన సూచనలను మీరు గ్రహించి అనుసరించుటకై దేవుఁడు వివరించుచున్నాఁడు. కావున మీరు గ్రహించి, దేవునియందు విశ్వాసభక్తులు గలిగియుండుఁడు అని హెచ్చరింపఁబడియె.

243. అలమ్-తర-ఇలల్లజీన-ఖరజూ-మిన్-దియారిహిమ్-వహుమ్-ఉలూ ఫున్-హజరల్-మౌతి-ఫఖాల-లహుముల్లాహు-మూతూ-సుమ్మ-అహ్యా హుమ్-ఇన్నల్లాహ-లజూ-ఫజ్‌లిన్-అలన్నాసి-వలాకిన్న-అక్-సరన్నాసి-లా యష్కురూన్. 244. వఖాతిలూ-ఫీ-సబీ-లిల్లాహి-వఅ-లమూ-అన్నల్లాహ-సమీ-ఉన్-అలీమ్.

243. చావు భీతిచేతను ఇండ్లనుండి బయలుదేఱిన వేలకొలఁది జనులను నీవు చూఁచితివా? ఆ పిదప దేవుఁడు వారితో మీరు చావుఁడు అని పలికెను. మరల వారిని సజీవులనుగాఁ జేసెను. నిశ్చయముగా దేవుఁడు జనులను అనుగ్రహించువాఁడు. కాని అనేకులు కృతజ్ఞతలు సలుపరు. 244. మఱి దేవుని మార్గమందు యుద్ధమాడుఁడు. నిశ్చయముగా దేవుఁడు వినుచు నెఱుంగుచు నున్నాఁడని తెలిసికొనుఁడు.

వ్యా॥ 243. ఇంతవఱకు గృహస్థధర్మములు చెప్పఁబడియెను. ఇఁక పూర్వికులకు సంభవించిన విషయములు బోధనార్థమై వివరింపఁ బడుచున్నవి. పూర్వము ఒక సంఘములో పెక్కు వేలమంది జనులుండిరి. వారిపై శత్రువు దాడివెడలి వచ్చెను. వారు దేవునిపై సాధారపడి ధైర్యములో శత్రువును మార్కొనక యుద్ధము చేసినచో చచ్చిపోవుదుమని పిఱికి తనము వహించి చావు భయముతో తమ యిండ్లు వదలి పాఱిపోయిరి. రానున్న చావు తప్పిపోదుగదా! దేవునాజ్ఞచే దారిమధ్యలో నొకచోట వారు మృతినొందిరి. తిరిగి ఏఁడు దినములపిదప ఒక ప్రవక్త యొక్క ప్రార్థన (దువా) వలన ఆచచ్చిన వారు సజీవులైరి. దేవుని క్షమాపణ వేఁడుకొనిరి. ఈ వృత్తాంతమువలన, ప్రాణము, ధనముపైఁగల ప్రేమవలన, దేవునిమార్గమందు ప్రాణము ధనము, అర్పించుటకు వెనుదీయరాదు. ఏ స్థితిలోనైన రానున్న చావు రాకమానదు. ఇతరులకులోఁబడి స్వాతంత్ర్యము గోలుపోయి బ్రతుకుటకంటె దేవుని ప్రీతికై ధర్మయుద్ధము చేయుచు ప్రాణములు గోలుపోవుట శ్రేష్ఠము. ధనము ఖర్చుచేసిన బీదతనము వచ్చునని ధర్మకార్యములందును, బీదసాదలకు మేలుచేయుటయందును లోభము వహించుట అవివేకము. దేవుఁడు సర్వజనులయందును అనుగ్రహము గలవాఁడు. ధైర్యసహనములు గలిగికృషి సలుపువారికి దాని ఫలితము నొసంగుచునే యున్నాఁడు. కాని అనేకులు దేవునియందు కృతజ్ఞత వహింపక అవిశ్వాసులగుచున్నారు. 244. మఱి దేవునిమార్గమందు, అనఁగా ప్రాణ, మాన, దేశరక్షణార్థమై ధైర్యసహనములతో పిఱికితనమువహింపక శత్రువుల నెదుర్కొని యుద్ధమాడవలెను. పిఱికితనము వహించిన చావు బానిసతనము దప్ప వేఱు ఫలితము లభింపదు. దేవుఁడు సర్వమును వినుచు నెఱుంగుచు న్నాఁడు. కావున దేవు నాజ్ఞలను శిరసావహించివాని ననుసరింపవలెను.

245. మన్-జల్లజీ-యుఖ్రి-జుల్లాహ-ఖర్ జన్-హసనన్-ఫ యుజా-ఇఫు హూ-లహూ-అజ్-అఫన్-కసీ-రతన్-వల్లాహు-యఖ్ బిజు.వయబ్-సుతు-వ ఇలైహి-తుర్-జఊన్.

245. ఎవరు దేవునికి మంచి (ధర్మమైన) అప్పునిత్తురో వారికి పెక్కురెట్లు హెచ్చించి దాని నొసంగును. మఱి దేవుఁడే తగ్గించువాఁడును హెచ్చించువాఁడును. మఱి తుదకు మీరాతని యొద్దకే మరలవలసియున్నది.

వ్యా॥ 245. ఇందు దేవుని పక్షమున, ప్రాణ, మాన, ధర్మరక్షణార్థమై యుద్ధమునకుఁగాను ముఖ్యముగా ధనము ఖర్చుచేయవలసినది. యుద్ధమున కాయుధములను తయారుచేయుటకు ధనము ఖర్చుచేయుటలో వెనుదీయఁగూడదు. దానికొఱకు ఖర్చుచేయు ధనము దేవునికి మంచి అప్పునిచ్చినట్లు. దానికి దేవుఁడు పెక్కుమడుఁగులు హెచ్చుగా నిచ్చును. కావున ఉత్సాహములో ఖర్చుచేయవలెను. యుద్ధములో విజయము గలిగిన విజయపుసొమ్మేగాక స్వాతంత్ర్యము అను గొప్పధనముగూడ చేకూరును. లేనిచో బానిసతనము లభించును. ధనము తగ్గించుట అనఁగా నిఱుపేదగాఁజేయుట, హెచ్చించుట అనఁగా ధనవంతునిగాఁజేయుట దేవుని చేతిలో నున్నది. లోభబుద్ధి వహించి సంఘము నుద్ధరించు కార్యములకును, ధర్మయుద్ధములకును ధనము ఖర్చుచేయకపోవుటవలన ప్రయోజనములేదు. దేవుఁడుకోరినచో దాఁచిపెట్టిన ధనము వేఱుదారిని పోవును. తుదకు అందఱును దేవుని సన్నిధానమునకు పోవలసియున్నారు. అచ్చట అందఱి కర్మలు శోధింపఁబడి వానివాని ఫలితము వాని వాని కియ్యఁబడును. కావున దేవునాజ్ఞల ననుసరించినచో ఉభయలోకములలోను మేలు గలుగును.

245. అలమ్-తర-ఇలల్-మలఇ-మిమ్-బనీ-ఇస్రాయీల-మిమ్-బఅ్-దిమూసా-ఇజ్-ఖాలూ-లినబియ్యిల్-లహు-ముబ్-అస్-లనా-మలికన్-నుఖాతిల్-ఫీ-సబీ-లిల్లాహి-ఖాల-హల్-అసైతుమ్ - ఇన్ - కుతిబ అలైకుముల్-ఖితాలు-అల్లా - తుఖాతిలూ - ఖాలూ-వమా-లనా-అల్లా-నుఖాతిల-ఫీ-సబీ-లిల్లాహి-వఖద్-ఉఖ్-రిజ్నా-మిన్-దియారినా-వ-అబ్నా-యినా-ఫలమ్మా-కుతిబ-అలైహిముల్-ఖితాలు-తవల్-లౌ-ఇల్లా-ఖలీలమ్-మిన్-హుమ్-వల్లాహు-అలీముమ్-బిజ్-జాలిమీన్. 247. వఖాల-లహుమ్-నబియ్యుహుమ్-ఇన్నల్లాహ-ఖద్-బఅస-లకుమ్-తాలూ-త-మలికన్-ఖాలూ-అన్నా-యకూను-లహుల్-ముల్కు-అలైనా-వ-నహ్ను-అహఖ్ఖు-బిల్-ముల్కి-మిన్-హు-వలమ్-యూత-స-అ-తమ్-మినల్-మాలి-ఖాల-ఇన్నల్లాహస్-తఫాహు-అలై-కుమ్-వ-జాదహూ-బ

స్-తతస్-ఫిల్-ఇల్ మి-వల్-బిస్మి-వల్లావహు-యూతీ-ముల్-కహూ - మన్-య
షాఉ-వల్లావహు-వాసి-ఉన్-అలీమ్.

246. మూసా తరువాత ఇస్రాయీలియులలోని జనులు తమ ప్రవక్త తలో మాకొఱకు ఒకరాజును నియమింపుము. మేము దేవుని మార్గమందు యుద్ధమాడుదుము. అని చెప్పినట్టి వారిని నీవు చూచితివా? అపుడు ప్రవక్త మీరు యుద్ధమాడవలెనని విధింపఁబడినచో యుద్ధమాడక పోదురేమో అని చెప్పఁగా వారు"యుద్ధమాడక పోవుటకై మాకేమైనది. మేము మాయిండ్ల నుండి మాబిడ్డలనుండి తఱుమఁబడితిమి"అని చెప్పిరి. ఆ పిదప యుద్ధమాడ వలెను. అని వారికి విధింపఁబడఁగా వారిలో కొందఱు దప్ప నందఱు వెనుకకు తిరిగిరి. మఱి దేవుఁడు దుర్మార్గుల నెఱుంగును. 247. మఱియు వారిప్రవక్త వారితో నిశ్చయముగా దేవుఁడు మీకొఱకు తాలూతును రాజుగా నియ మించినాఁడు అని చెప్పఁగా, ఆతనికి మాపై రాజ్య మెట్లు చెల్లును. ఆతని కన్న మేమే రాజ్యమునకు హక్కుగలవారము. మఱి ఆతనికి విశాలమైన ధనము లభించియుండలేదే అని వారు చెప్పసాగిరి. అపుడు ప్రవక్త నిశ్చయ ముగా దేవుఁడు మీపై ఆతని నెన్నుకొనియున్నాఁడు. ఆతనికి విశాలమైన విద్యయును దేహము నొసంగియున్నాఁడు. మఱి దేవుఁడు తాను కోరినవారికి తన రాజ్యము (దేశము) నొసంగుచున్నాఁడు. మఱి దేవుఁడు చాల ననుగ్రహిం చువాఁడును, సర్వజ్ఞుఁడును.

వ్యా॥ 246. ఇఁక పూర్వీకుల విషయము ప్రజలకు బోధనార్థమై వివరింప బడుచున్నది. పూర్వీకుల విషయములు విని వారియందున్నట్టి దుర్గుణములను వదలి మంచి గుణములను స్వీకరింపవలెనని ఖురానెషరీఫులో నచ్చటచ్చట పూర్వీకుల విషయము చెప్పఁబడినది హజ్రత్ మూసాప్రవక్తగారిపిదప ఇస్రా యీలియులు కొంత కాలమువఱకు బాగుగానుండిరి. తరువాత చెడిపోయిరి, జాలూతుఅను రాజు వారి దేశమును వశపఱచుకొని వారిని వారియిండ్లనుండి తఱుమఁగొట్టెను. ఇస్రాయీలియులు పాఱి వచ్చి బైతుల్ ముఖద్దసులో వసింప సాగిరి. అప్పటికాలములో సామియేలుప్రవక్తయుండెను. ఇస్రాయీలియులలో కొందఱుజనులు తమ ప్రవక్తయొద్దకుఁబోయి మేము హీనదశలో నున్నాము. మాకు రాజును నియమింపుఁడు. మేము శత్రువులతో దేవునికై యుద్ధమాడు దుము అని విన్నవించిరి. ప్రవక్త వారివిషయము నెఱుంగును. కావున బహుశః మీరు యుద్ధమాడుఁడు అని విధింపఁబడినపుడు మీరు పిఱికితనము వహింతు రేమో అని చెప్పఁగా యుద్ధమెందులకు చేయము? శత్రువు మమ్ము పెట్టిన బాధలు మఱచిపోయితిమా అని చెప్పిరి. కాని యుద్ధముచేయ వలసినది అని

విధింపబడినప్పుడు కొందఱుదప్ప నందఱు యుద్ధమాడకపోయిరి. ప్రాణధర్మరక్ష ణార్థమై ధర్మయుద్ధము చేయనివారు తమనష్టము చేసికొనుదురు. వారుదుర్మా ర్గులు. వారిని దేవుఁడెఱుఁగును. వారిని ఉభయలోకములలో శిక్షించును. ఇహ మునందు పరదేశరాజులకు లోఁబడి హీనదశలోఁబడి యుందురు. పరమునం దు నరకపాత్రులగుదురు. 247. ఇస్రాయీలీయులు రాజును నియమింపుమని ప్రవక్తతో విన్నవించిరి. దానికిఁగాను, తాలూతును దేవుఁడు ఎన్నుకొని యాతనిని రాజుగా నియమించెను అని ప్రవక్త చెప్పఁగా ఇస్రాయీలీయులు తమ సహజగుణముతో ఓహో రాజ్యమునకు మేము హక్కుదారులము. మే ము యోగ్యులము. అని చెప్పుచు తాలూతు నొద్ద ధనములేదు. ఆయన రా జెట్లగును? అని పలుకసాగిరి. రాజగుటకు, గొప్ప విద్య, జ్ఞానము, ఆరోగ్యము గల దృఢకాయము అవసరము. అవిఅన్నియు తాలూతుపొందియున్నాఁడు. అదియునుగాక దేవుఁడు ఇష్టపడిన వారికి రాజ్యము నొసంగును. దేవునికి అందఱి యోగ్యతలు తెలియును. రాజ్యము నొసంగఁగోరినచో దానికి అను కూలమైన సాధనములు కల్పించి వారికి ధైర్యసహనముల నొసంగును. దేవుఁడు ఒసంగిన అనుకూల సాధనములతో ప్రజలురాజ్యస్వాతంత్ర్యమునకు కృషిసలుప వలెను. అట్లు గాక చేతులు కట్టుకొని కూర్చుండి స్వరాజ్యము వచ్చునని తలం చుట వెఱ్ఱితనము. దేవుఁడు విశాలముగా నొసంగువాఁడు.

248. వఖాల-లహుమ్-నబియ్యుహుమ్-ఇన్న-ఆయత-ముల్కిహీ-అన్ యాతియకుముత్-తాబూతు-ఫీహి-సకీనతుమ్-మిర్-రబ్బికుమ్ - వబఖియ్యాతు మ్-మిమ్మా-తరక-ఆలు-మూసా-వ-ఆలు - హారూన- తహ్మిలు- హుల్-మలా- ఇకతు-ఇన్న-ఫీజాలిక-ల-ఆయతల్-లకుమ్-ఇన్-కున్తుమ్-మూమినీన్.

248. మఱియు వారి ప్రవక్త వారితో తాలూతురాజ్యమునకు గుర్తు గా మీయొద్దకు తాబూతు అను పెట్టె వచ్చును. అందు మీ ప్రభువునుండి మీ మనశ్శాంతియును మూసాయొక్కయు హారూనుయొక్కయు సంతా నము వదలిపెట్టిన వస్తువులును గలవు. ఆ పెట్టెను దేవదూతలు ఎత్తితెత్తురు. మీరు విశ్వాసులేయైనచో నందు నిశ్చయముగా మీకు గొప్ప సూచనయు న్నది అని చెప్పెను.

వ్యా॥ 248. ఇస్రాయీలీయులు తాలూతురాజ్యమునుగూర్చి విని తమ ప్రవక్తతో మాసందేహములు వీడిపోవునట్లు ఇంకొక వేఱుగుర్తు దెలుపు మని వేడఁగా తాబూతువచ్చును అని ప్రవక్త వారితో చెప్పెను. తాబూ తు అనునది ఒకపెట్టె. మూసా హారూను ప్రవక్తలు వదలిన పవిత్రవస్తువు

లందుండెను. ఇస్రాయీలియులు యుద్ధములో తమ సైన్యమునకు నెదుటదాని నుంచి యుద్ధమాడుచు విజయముపొందుచుండిరి. దానివలన మనశ్శాంతిగల్గు చుండెను. జాలూతు అను రాజు ఇస్రాయీలియులను ఓడించి ఆ పెట్టెను కూడ దీసికొనిపోయెను. ఆ పెట్టె జాలూతు, ఏ పట్టణములో పెట్టుచుండెనో ఆ పురములో ఏదో యొక పీడప్రబలుచుండెను. వారుభయపడి దానిని రెండెద్దులబండిలోనుంచి వదలిపెట్టిరి. ఆ పెట్టెబండిని, దేవదూతలు తోలుకొని వచ్చి తాలూతు గృహమునొద్ద వదలిరి. పెట్టె తిరిగి లభించుట చూచి ఇస్రాయీలియులు తమ మంచిదినము వచ్చినదని తలంచి, తాలూతును రాజుగా నొప్పుకొని యుద్ధమునకు సిద్ధమైరి. ఇందువిశ్వాసులకు గొప్పసూచన యున్నది. ఇస్రాయీలియులు తాలూతును రాజుగానియమించుకొని యుద్ధమాడి విజయము పొందుటకు నుత్సాహము గలుగఁజేసెను. ఇదియునుగాక, హజ్రత్ ముహమ్మదు పైగంబరులవారు ఏ చదువును చదువక పూర్వీకుల వాస్తవమైన విషయము దెలుపుట వారి ప్రవక్త పదవికి గొప్పసూచనయని విశ్వాసులకు దెలుపఁబడియెను.

249. ఫలమ్మా ఫసల-తాలూతు-బిల్-జునూది-ఖాల-ఇన్నల్లాహ-ముబ్-తలీకుమ్-బి-నహరిన్-ఫ-మన్-షరిబ-మిన్‌హు-ఫ-లైస-మిన్నీ- వమల్-లమ్-యత్-అమ్‌హు-ఫ-ఇన్నహూ-మిన్నీ-ఇల్లా-మ-నిగ్-తరఫ-గుర్‌ఫతమ్-బియదిహీ-ఫ-షరిబూమిన్-హు-ఇల్లా ఖలీలమ్ మిన్-హుమ్-ఫలమ్మా-జావ-జహూహువ-వల్లజీన-ఆమనూ-మ-అహూ-ఖాలూ-లా - తాఖత-లనల్-యౌమ-బిజాలూత-వజు-నూదిహీ-ఖాలల్ లజీన-యజున్నూన- అన్న - హుమ్-ములాఖుల్లా-హి-కమ్-మిన్-ఫి-అతిన్-ఖలీలతిన్-గల-బత్-ఫి-అతన్-కసీ-రతమ్-బి-ఇజ్-నిల్లాహి-వల్లాహు-మ-అస్-సాబిరీన్. 250. వలమ్మా-బరజూ-లిజా-లూత-వజు-నూదిహీ-ఖాలూ-రబ్బనా అఫ్-రిగ్-అ-లైనా-సబ్‌రన్-వసబ్బిత్-అఖ్- దామనా-వన్-సుర్‌నా అలల్-ఖౌమిల్-కాఫిరీన్. 251. ఫహజ-మూహుమ్-బి-ఇజ్‌నిల్లాహి-వ-ఖ-తల-దావూదు.జాలూత-వ-ఆ-తాహుల్లా - హుల్-ముల్క-వల్-హిక్మత-వ-అల్ల-మహూ-మిమ్మా-యషాఉ-వ-లౌలా-దఫ్-ఉల్లాహిన్నాస బ-అ - జహుమ్-బి-బఅ-జిల్-ల-ఫస-దతిల్-అర్-జు-వలా-కిన్నల్లాహ-జూ-ఫలిన్-అలల్-ఆల-మీన్. 252. తిల్క-ఆయాతుల్లాహి-నత్లూ-హా-అ-లైక-బిల్

హాఖ్ ఖ-వ-ఇన్న క-లమి-నల్-ముర్-సలీన్.

249. ఆ పిదప తాలూతు తన సైన్యమును తీసికొని బయలుదేఱి నిశ్చయముగా దేవుఁడు ఒక నది మూలమున మిమ్ము పరీక్షించును. కావున ఎవరు దానినుండి నీళ్లు త్రాగుదురో వారు నావారుకారు. ఘ ఎవరు దాని రుచి చూడరో వారు నావారు. కాని ఒకచేరెఁడు తనచేతితో పుచ్చుకొన్నవాఁడును (నావాఁడే) అని తాలూతు చెప్పెను. ఆ పిదప వారిలో కొందఱుదప్ప నందఱును ఆ నదినీళ్లు పూర్తిగ త్రాగిరి. మరల తాలూతు ఆతనితో చాఁటు విశ్వాసులును ఆ నదిని దాఁటిపోగా ఈ దినము జాలూతుతోను ఆతని సైన్యముతోను పోరాడుటకు మాకు శక్తిలేదు అని వారు చెప్పసాగిరి. దేవునినిదర్శింపగలమని, నిశ్చయించినవారు, 'దేవుని సెలవుచే కొద్దిమంది జనులు పెక్కు తూర్లు పెక్కుమంది జనులపై విజయము పొందిరి. దేవుఁడు సహించువారితోనున్నాఁడు.' అని చెప్పిరి. 250. మఱియు వారు (తాలూతుసైన్యము) జాలూతునకును ఆతని సైన్యమునకును ఎదురుపడఁగా, ఓ మా ప్రభువా! మాకు ఓర్పు నొసంగుము. మా పాదములను స్థిరముగా నుంచుము. అవిశ్వాసులపై మా పక్షమున తోడుపడుము అని పలికిరి. 251. ఆ పిదప దేవుని సెలవుచే విశ్వాసులు జాలూతుసైన్యమును ఓడించిరి. మఱి దావూదు, జాలూతును వధించెను. దేవుఁడు దావూదునకు రాజ్యమును జ్ఞానమునొసంగి తాను కోరిన దానిని ఆతనికి నేర్పించెను. మఱి దేవుఁడు కొందఱిచే కొందఱిని ఓడింపనిచో లోకము నాశమై యుండును. కాని దేవుఁడు లోకులపై చాల అనుగ్రహముగలవాఁడు. 252. ఇవన్నియు దేవుని సూచనలు. వాస్తవముగా వానిని నీకు వినుపించుచున్నాము. మఱియు నిశ్చయముగా నీవు మా ప్రవక్తలలో చేరినవాఁడవు.

వ్యా॥ 249. ఇస్రాయీలియులు తాలూతును రాజుగా నొప్పుకొని పెక్కువేలమంది యుద్ధమునకై సిద్ధమై బయలుదేఱిరి. వారికి దాఱిలో దప్పి ఆయెను. వారు పోవుమార్గమందు నదికనబడెను. దాహమును సహించి రాజు మాటను ఎవరు వినుదురు అనునది పరీక్షించుటకై తాలూతు తనసైన్యములో ఎవరుకడుపునిండుగ నీళ్లుత్రాగుదురో, వారునావారుకారు. వారుఅవిధేయులు. ఎవరు బొత్తిగా త్రాగరోవారును, ఒక్కచేరెఁడు నీళ్లుమాత్రము త్రాగువారును నావారే అని దేవునిసెలవుచే పలికెను. ఇస్రాయీలియులు కొద్దిమంది తప్ప అందఱును తమసహజ గుణమగు అవిధేయతను అనుసరించియు, దప్పిని సహింపలేకయు కడుపుబ్బునట్లు త్రాగిరి. వాఱందఱును నదినిదాఁటి అమితమైన శత్రుసైన్యబలమును చూచి మేము యుద్ధమాడఁజాలము అనిపలుకసాగిరి. అందు విశ్వాసులును సహనముగలవారును దేవుని దర్శింపగలమని

విశ్వాసనిశ్చయము గలవారును జయాపజయములు సైన్యపుసంఖ్యనుబట్టిలేదు. కొద్దిమంది అనేకులపై విజయము పెక్కుసార్లు పొందియున్నారు. మేము సంఖ్యలో కొద్దిగా నుండినప్పటికిని దేవుని సహాయముచే శత్రుసైన్యముపై విజయము పొందగలమని ధైర్యవాక్కులు పలికిరి. 250. ఆపిదప యుద్ధమునకై పూనుకొని, శత్రువులను ఎదుర్కొనునపుడు సహనము, యుద్ధరంగము వీడి పోకుండ స్థిరత్వము నొసంగి శత్రువులపై విజయము నొసంగవలెను. అని దేవుని వేడుకొనిరి. 251. అటులే దేవుని సహాయము వలన తాలూతుసైన్యము జాలూతుసైన్యమును ఓడించెను. జాలూతు అనువాఁడు గొప్పయుద్ధవీరుఁడు. ఆతఁడు యుద్ధరంగమునందువచ్చి నన్నుమార్కొనువాఁడు మీసైన్యములోగలఁడా అని పలికెను. అపుడు దావూదువానిని మార్కొని వధించెను. దీనికి ముందే ఎవరు జాలూతును వధింతురో యాతనికి నాకూతునిచ్చి పెండ్లిచేసెదను. నా పిదప ఆతఁడు రాజగును అని తాలూతురాజు ప్రకటించి యుండెను. దాని ననుసరించి దావూదు, ఆతని కుమార్తెను వివాహమాడి తాలూతు పిదప రాజయ్యెను. దేవుఁడు, దావూదునకు ప్రవక్త పదవిగూడ నొసంగి జ్ఞానసంపత్తియగు జబూరు గ్రంథమునొసంగి, తెలియని విషయములను నేర్పెను. లోకములో దుర్మార్గులు హెచ్చి దేశమును పాడు చేయుచు దుర్బలులను హింసించి తమ సౌకర్యములనే పాటించుచు నుందురు. అట్టి దుర్మార్గులను, అటులే వదలి పెట్టినచో దేశము నాశమగును. అందుకు దేవుఁడు అట్టి దుర్మార్గులను ఓడించి వారి దుర్మార్గము నణచివేయుటకై మంచివారిని నియమించును. కావున యుద్ధములు సంభవించుచుండును. దేవుఁడు లోకక్షేమమునకై అనుగ్రహించి అట్లు చేయును. లేనిచో దేశములు నాశమైయుండును. 252. ఇంతవఱకుఁదెలుపఁబడిన వాస్తవమైన విషయములు దేవుఁడు తన వాక్యముల మూలమున మహమ్మదువారికిఁ దెలిపెను. వారు చదువను వ్రాయను దెలియనివారు. అట్టివారయ్యు అట్టి వాస్తవమైన విషయమై విషయములు దెలుపుట దేవుని వలననే యగును. కావున వారు దేవుని ప్రవక్తలలో చేరినవారు అని సూచింపఁబడియెను. విజయము పొందవలెనన్న, పై వివరింపఁబడిన గుణములు సైన్యములోను, సేనాధిపతిలో నుండవలెను. అవి విద్య, జ్ఞానము, దృఢకాయము సహనము, ధైర్యము విధేయత, స్థిరత్వము, యుద్ధసామగ్రికై ధనము ఖర్చు చేయుట ఐక్యమత్యము మొదలగునవి. కాలమునకుఁ దగినట్లు యుద్ధసామగ్రి సిద్ధముచేసికొన్న పిదప దేవునియందు విశ్వాసము, ఆతని సహాయము వేఁడుట మున్నగు గుణములుండవలెను.

# మూడవ కాండము

253. తిల్-కర్-రుసులు-ఫజ్-జల్నా-బ-అ-జ,హుమ్-అలా-బ-అ-జిన్-మిన్-హుమ్-మన్-కల్ల-మల్లాహు-వ-రఫఅ-బ-అ-జహుమ్-దరజా-తిన్-వ-ఆ-తైనా-ఈసబ్న-మర్-యమల్-బయ్యి-నా-తి-వ-అయ్యద్నా-హు-బిరూహిల్-ఖుదుసి-వలౌ-షా-అల్లాహు-మఖ్-తతలల్ల-జీని-మిమ్ బఅ-ది-హిమ్-మిమ్-బ-అ-ది-మా జా-అత్-హుముల్-బయ్యినాతు-వలా-కినిఖ్-తలఫూ-ఫ-మిన్-హుమ్-మన్-ఆమన-వ-మిన్-హుమ్-మన్-కఫర-వలౌ-షా-అల్లాహు-మఖ్-తతలూ-వలా-కిన్నల్లాహ-యఫ్-అలు-మా-యురీద్-

253. ప్రవక్తలలో కొందఱికి కొందఱిపై ఘనతనొసంగితిమి. వీరిలో కొందఱితో దేవుఁడు సంభాషించెను. మఱికొందఱి పదవులను హెచ్చించెను. మఱి మేము మర్యము కుమారుఁడగు ఈసాకు స్పష్టమైన సూచనల నొసంగి ఆతనికి పరిశుద్ధాత్మ (జిబ్రయీలు) సహాయము నొసంగితిమి. ఈ ప్రవక్తల తరువాత వచ్చిన ప్రజలు వారికి స్పష్టమైన దేవునాజ్ఞలువచ్చిన తరువాత (దేవుఁడు ఇష్టపడియుండినచో) వారు కలహింపకయుండి యుందురు. కాని వారు వేఱు వేఱు అయిపోయిరి. వారిలో కొందఱు విశ్వసించిరి. మఱికొందఱు విశ్వసింపకపోయిరి. దేవుఁడు కోరినచో వారు కలహింపక యుండి యుందురు. కాని దేవుఁడు తాను కోరినది చేయును.

వ్యా॥ 253. ఇంతవఱకు పేర్కొనఁబడిన ప్రవక్తలలో ఒకరిపై నొకరికి దేవుఁడు ఘనతనొసంగియున్నాఁడు. అందఱును ప్రవక్తలే. వారిలో, ఆదము, మూసా, ప్రవక్తలతో దేవుఁడు సంభాషించెను. ప్రవక్తలలోకొందఱు ఒక పురమునకు మఱికొందఱు ఒక దేశమునకు, మఱికొందఱు (ముహమ్మదు వారు) లోకమంతటికిని ప్రవక్తలుగా దేవునిచే పంపఁబడిరి. ఇట్లు ఒకరిపై నొకరికి (దర్జా) పదవులను గొప్పవిగాఁ జేసెను. బీబీమర్యమ్ కుమారుఁడగు ఈసా ప్రవక్తకు, స్పష్టమైన సూచనలు, రోగులను బాగుచేయుట, మృతినొందిన వారిని దేవుని సెలవుచే బ్రతికించుట మొదలగు అమానుషము (మోజిజా) ల నొసంగి పరిశుద్ధాత్మయగు జిబ్రీలుదూత సహాయమునిచ్చి బలపఱచెను. ప్రవక్తల పిదప వారి జనులు, మతగ్రంథములో భేదాభిప్రాయములు గలిగి ఒకరితో నొకరు కలహింపసాగిరి. దేవుని స్పష్టమైన సూచనలు దెలిసియు అట్లు కలహించిరి. కొందఱు భక్తిమార్గమందు స్థిరముగానుండి విశ్వాసులైరి. మఱికొందఱు దేవుని ధర్మములను, సూచనలను తిరస్కరించి అవిశ్వాసులైరి.

దేవుఁడు కోరినచో అట్లు కలహములును, అభిప్రాయభేదములును గలిగియుండవు. కాని దేవుఁడు తాను ఇష్టపడినది చేయును. ప్రజలకు జ్ఞానము నొసంగెను. వారు దానిని సరియైన త్రోవలో నుపయోగింపవలెను.

264. యా-అయ్యు-హల్ల-జీన-ఆమనూ-అన్-ఫి-ఖూ-మిమ్మా-రజఖ్నా కుమ్-మిన్-ఖబ్లి-అన్-యాతియ-యౌముల్-లా బై-ఉన్-ఫీహి-వలా-ఖుల్లతున్ వలా-షఫా-అతున్-వల్-కాఫిరూన-హుముజ్-జాలిమూన్.

254. ఓ విశ్వాసులారా! బేరముగాని, స్నేహముగాని, సిఫారసుగాని పనికిరాని దినము రాకమునుపే, మేము మీకు నొసంగియున్న దానిలోనుండి ఖర్చు (దానము) చేయుఁడు. మఱి అవిశ్వాసులే అన్యాయముచేయువారు.

వ్యా॥ 254. తఱచుగ మానవుఁడు ధనాశచే పెక్కు తప్పులును పాపములను చేయును. ధనమును దేవునిమార్గమందు నిఱుపేదలు మొదలగు వారికి దానముచేయవలెనన్న ప్రాణసంకటముగాఁదోఁచును. మానవుఁడు చేర్చిపెట్టిపోయిన ధనము పరులపాలగును. ఆతనికి నష్టము, పాపముదప్ప వేఱు లాభము గలుగదు. రాఁబోవు (ఆఖరు) దినము కర్మల తీర్పు దినమునందు బేరము జరుగదు, చేర్చిన ధనమిచ్చి పుణ్యములను కొనఁజాలరు. ఒకరి స్నేహము పనికిరాదు. ఒకరి సిఫారసు మాధ్యస్థము వలన ప్రయోజనముండదు. నరకముదప్పదు. మానవుఁడు తానుచేసికొన్న పుణ్యకార్యములే తనకుతోడు పడును. కావున అట్టిదినము రాకమునుపే (చావకముందే) దేవుఁడొసంగిన ధనము దానముచేసి ఉభయలోకముల మేలు సంపాదించుకొనవలెను. దేవుని నమ్మక అవిశ్వాసులైనవారే దేవుని ధర్మముల ననుసరింపక తమయాత్మలవిషయమై అన్యాయము గావించుకొనువారు. కావున వారుఅన్యాయస్థులును, దుర్మార్గులును.

259. అల్లాహు-లా-ఇలాహ-ఇల్లా-హువల్-హయ్యుల్-ఖయ్యూము-లా-తాఖు-జుహూ-సినతున్-వలా-నౌమున్-లహూమాఫిస్-సమా-వాతి-వమా-ఫిల్-అర్జి-మన్-జల్లజీ-యష్‌ఫఉ-ఇన్దహూ-ఇల్లా-బిఇజ్నిహీ-యఅలము-మా-బైన-ఐదీ-హిమ్-వమా-ఖల్ఫ-హుమ్-వలా-యుహీతూన-బిషైఇమ్-మిన్-ఇల్మిహీ-ఇల్లా-బిమా-షాఅ-వసిఅ-కుర్-సియ్యు-హుస్-సమా-వాతి-వల్-అర్జ-వలా-యఊదుహూ-హిఫ్‌జు-హుమా-వహువ-వల్-అలియ్యుల్-అజీము.

255. అల్లాః దప్పమఱొకఁడు దేవుఁడు లేఁడు. ఆతఁడు శాశ్వతుఁడును

సర్వమును కాపాడు వాడును. ఆతనికి తూఁగుగాని నిద్రగాని పట్టదు. ఆకాశములలోను భూమిలోనున్న సమస్తమును ఆతనిదే. ఆతని సెలవు లేనిదే ఎవరు ఆతనియొద్ద సిఫారసుచేయఁగలరు! ఆతఁడు మానవులకు నికముందు రానున్నదియును వారికి ముందు గడచినది సమస్తము నెఱుంగును. దేవునికిఁ దెలియు విషయములలో తానుకోరి దెలిపినదిదప్ప నితరము వారు గ్రహింపఁజాలరు. ఆతని సింహాసనము ఆకాశములను భూమిని వ్యాపించియున్నది. ఆ రెంటిని కాపాడుట దేవునికి భారము (కష్టము) కాదు. మఱియు నాతఁడే సర్వాధికుఁడును గొప్పవాఁడును.

వ్యా॥ 255. ఈ వాక్యములో దేవుని యేకత్వము (తౌహీదు) ను, ఆతని మహిమయు చెప్పఁబడినవి. ఆతఁడు అద్వితీయుఁడు. ఆతఁడు శాశ్వతుఁడు. ఆతనికి సాటిలేదు. ఆతఁడు సర్వమును సృష్టించి కాపాడుచు సర్వమునకు ఆధారమైయున్నాఁడు. ఆతఁడు ఎట్టికళంకమును లోపమును లేని పరమ పవిత్రుఁడు. ఆతనికి తూఁగుగాని నిద్రగాని పట్టదు. ఘనతగలవాఁడు. సర్వము ఆతనిదే. భూమ్యాకాశములు ఆతనిదే. ఆతఁడు సర్వజ్ఞుఁడును సర్వశక్తుఁడును, సర్వాధికుఁడును. ఆతనిసెలవులేనిదే ఎవరును సిఫారసు చేయఁజాలరు. సిఫారసుచేయువారు ఆతని సెలవు పొందియే చేయఁగలరు. ఎట్టిపనియైనను ఆతనికి కష్టమైనదికాదు. భూమ్యాకాశములను వాని మధ్యనున్న సమస్తమును కాపాడుట ఆతనికేమియుకష్టముగాని భారముగానిగాదు. సర్వమునకును సర్వజనుల యూహలకును మించినవాఁడు. ఆతనిమహిమ కొనియాడ వీలుకానిది. ఇట్టిదేవుని యాజ్ఞలను మానవులు దప్పక ఆచరింపవలసినది. ఆతనియందు విశ్వాసము భయభక్తులు గలిగి మానవులు తమ లోపములను గుర్తెఱింగి, పరమదయాళువగు దేవుని ప్రార్థించుచుండవలెను. (ఈవాక్యమును ఆయతుల్ కుర్సీఅనుదురు.)

256. లా-ఇక్రాహ-ఫిద్-దీని-ఖత్-త-బయ్యనర్-రుష్దు-మినల్-గయ్యి-ఫమన్-యక్ఫుర్-బిత్తాగూతి-వ-యూమిన్-బిల్లాహి-ఫఖ-దిస్-తమ్-సక-బిల్-ఉర్-వతిల్-వుస్ఖా-లన్-ఫిసామ-లహా-వల్లాహు-సమీఉన్-అలీమ్. 257. అల్లాహు-వలియ్యుల్ల-జీన-ఆమనూ-యుఖ్-రిజుహుమ్-మినజ్-జులు-మాతి-ఇలన్నూరి-వల్ల-జీన-కఫరూ-ఔలియా-ఉహు-ముత్తాగూతు-యుఖ్-రి-జూన-హుమ్మినన్నూరి-ఇలజ్-జులు-మాతి-ఉలాఇక-అస్-హాబున్నారి-హుమ్-ఫీహా-ఖాలిదూన్.

256. మతము విషయమున బలాత్కారము లేదు. నిశ్చయముగా సన్మా

తల్లజీ-కఫర-వల్లాహు-లాయహ్దిల్-ఖౌమజ్-జాలిమీన్.

258. ఏమి? దేవుఁడు (నమ్రూదునకు) రాజ్యము నొసంగినందుచే ఇబ్రాహీముతో ఆతని ప్రభువు విషయము వాదించిన వానిని నీవు చూడలేదా? ఇబ్రాహీము, నాప్రభువు బ్రతుకు నిచ్చువాఁడును. చంపువాడును అని చెప్పినపుడు, వాఁడు నేనును బ్రతుకునిచ్చుచు, చంపుచున్నానని చెప్పగా ఇబ్రాహీము, దేవుఁడు సూర్యుని తూర్పునుండి ఉదయింపఁజేయు (పుట్టించు) చున్నాఁడు. కావున నీవుసూర్యుని పడమటినుండిపుట్టింపుము అని చెప్పఁగావాఁడు బిత్తరపోయి ఎట్టి యుత్తరము నియ్యఁజాలకపోయెను. మఱి దేవుఁడు దుష్టులకుసన్మార్గము చూపఁడు.

వ్యా॥ 258. ఇబ్రాహీము ప్రవక్తకాలములో నమ్రూదు అను రాజుండెను. వాఁడు తనరాజ్యగర్వముచే నేనే ప్రభువును. అందఱును నాకు సాష్టాంగ నమస్కారము (సిజ్దా) లు చేయవలెను. అని యుత్తరువుచేసెను. ప్రజలు అటులేవానికి సాష్టాంగనమస్కారములు చేయుచుండిరి. హజ్రత్ ఇబ్రాహీము, దేవుఁడొకఁడే. ఆతనిఁ దప్ప నితరులను పూజింపఁగూడదు. అని బోధించుచుండిరి. ఒకదినము నమ్రూదు కొలువుకూటమునకు ఇబ్రాహీము పోయి ఆతనికి సాష్టాంగనమస్కారములు చేయలేదు. అపుడు నమ్రూదు నేనుప్రభువును. నా కెందులకు సాష్టాంగనమస్కారము చేయలేదు. అని అడుగఁగా నేను రాజును ప్రభువు అనను. పుట్టించి గిట్టించునట్టి దేవుఁడే నా ప్రభువు. అనఁగా నమ్రూదు నేనేను, బ్రతుకిచ్చుచు చంపుచున్నాను. అని చెప్పి ఒక నేరము లేనివాని చంపి నేరము మోపఁబడిన వానిని చంపక వదలిపెట్టెను. అపుడు ఇబ్రాహీము, నమ్రూదు తెలివిలేని మూర్ఖుఁడగుచున్నాఁడు. అని తలంచి దేవుఁడు సూర్యునితూర్పునుండి పుట్టించుచున్నాఁడు. నీవే ప్రభువైనచో సూర్యుని పడమటనుండి పుట్టింపుము. అని చెప్పఁగా అతఁడు దిగ్భ్రమచెంది యుత్తరము నియ్యఁజాలకపోయెను. దేవుఁడు ఒసఁగిన రాజ్యమువలన గర్వించి దుష్టత్వమునకు పూనుకొన్న నమ్రూదు తన లోపము దెలిసియు దేవునివిశ్వసింపకపోయెను. దేవుఁడు దుర్మార్గులకు సన్మార్గముచూపఁడు. ఇందుసూర్యుని దేవునిగా పూజించునట్టివారికి బోధనమున్నది. సూర్యుఁడు దేవునికి లోఁబడి యున్నాఁడు. కావున సూర్యుఁడు పూజలకు ప్రార్థనలకు అర్హుఁడు కాఁడు.

259. ఔ-కల్లజీ-మర్ర-అలా-ఖర్యతిన్-వహీయ-ఖావి-యతున్-అలా-ఉరూ-షిహా-ఖాల-అన్నా-యుహ్ యీ-హాజి-హిల్లాహు-బఅ-ద-మౌతిహా-ఫ-అమా-త-హుల్లాహు-మి-అత-ఆమిన్-సుమ్మ-బఅసహూ-ఖాల-కమ్-లబిస్త-ఖాల లబిస్తు-యౌమన్-ఔ-బఅ-జ-యౌమిన్-ఖాల-బల్-లబిస్త-మిఅత-ఆమిన్-ఫన్-

జుర్-ఇలా-తఆమిక-వషరా-బిక-లమ్-యతసన్నహ్-వన్-జుర్-ఇలా-హిమారిక-వలినజ్-అలక-ఆయతల్-లిన్నాసి-వన్-జుర్-ఇలల్-ఇజామి-కైఫ-నున్-షిజుహా-సుమ్మ-నక్సూహా-లహ్మన్-ఫలమ్మా-తబయ్యన-లహూ-ఖాల-అఅ-లము-అన్నల్లాహ-అలా-కుల్లి-షైఇన్-ఖదీర్.

259. లేక, కప్పులు పడి నాశమైయుండిన పురమునుండి పోవునట్టి యాతనిని నీవు చూడలేదా? ఆతఁడు, దేవుఁడెట్లు దీని చావుపిదప దీనికి జీవము పోయును అనెను. ఆ పిదప దేవుఁడు ఆతనిని నూఱుసంవత్సరములవఱకు మృతునిగాఁజేసెను. తిరిగి యాతనిని లేపి నీవు ఎంతసేపుంటివి అని దేవుఁ డడుగఁగా. నేను ఒక దినమో లేక ఒక దినముకన్న తక్కువకాలమో యుంటి నని చెప్పఁగా దేవుఁడు లేదు లేదు, నీవు నూఱుసంవత్సరములుంటివి. నీ యన్నపానాదులను చూడుము. అవి కుళ్లలేదు. మఱి గాడిదను చూడుము. మఱి మేము ప్రజలకొఱకుఁగాను నిన్ను దృష్టాంతముగాఁ జేయఁదలంచితిమి. మఱి గాడిద యెముకలు చూడుము. ఎట్లు వాని నుద్ధరించి కలిపి తిరిగి వానిపై మాంసమును గప్పుచున్నామో అని చెప్పెను. ఆ పిదప ఆతనికి విషయము స్పష్టపడఁగా నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తులు గలవాఁడని యెఱుంగుదును అని చెప్పసాగెను.

వ్యా॥ 259. ఇందు ఉజైరు ప్రవక్తకు సంభవించిన విషయము చెప్పఁబడినది. ఈతని కాలమందు బఖ్తునసర్ అను అవిశ్వాసుఁడు రాజుగానుండెను. ఆ రాజు బైతుల్ ముఖద్దసు (జెరూసలేము)ను నాశముచేసి ఇస్రాయీలియులలో ననేకులను ఖైదీలుగాఁ దీసికొనిపోయెను. ఆ ఖైదీలలో ఉజైరుప్రవక్త కూడ నుండెను ఆ పిదప ఉజైరు చెఱసాలనుండి విడుదలపొంది వచ్చునపుడు మార్గమందొక పురము పాడుపడియుండఁగాఁ జూచి తన మనస్సులో దేవుఁడు దీని నెట్లు తిరిగి బాగుగాఁజేసి యందు చనిపోయిన వారిని బ్రతికించును. అని అనుకొనెను. అప్పటనే యాతని ప్రాణముపోయెను. ఆతనికిస్వారిగానున్న గాడిదకూడ చనిపోయెను. అంతట నూఱు సంవత్సరములు గడచెను. ఆతని విషయము ఎవరికిని దెలియకపోయెను. ఆ కాలములో బఖ్తునసరు దుష్టరాజు చనిపోయెను, మఱొక రాజు ఆ పురమును జెరూసలేమును తిరిగి వృద్ధి పొందునట్లు చేసెను. నూఱుసంవత్సరములైన తరువాత దేవుఁడు ఉజైరును తిరిగి సజీవునిగాఁజేసెను. ఆతని భోజనము నీళ్లు కుళ్లకుండ నుండెను. ఆతని గాడిద కుళ్ళిపోయి దాని పాత ఎముకలు పడియుండెను. ఆగాడిదయు ఆతని యెదుటనే తిరిగి సజీవముగాఁ జేయఁబడెను. ఇదంతయు ప్రజలకు దేవునిశక్తిని

దెలుపుటకు దృష్టాంతముగా నుండుటకై సంభవించెను. ఉజైరు మృతినొందు నపుడు కొంత ప్రొద్దెక్కియుండెను. తిరిగి బ్రతుకునపుడు రాత్రి కాకుండుటను చూచి ఒకదినమో లేక దానికన్న తక్కువదినమో యుంటినని తలంచెను. కాని దేవుఁడు ఆతఁడుండిన కాలము దెలిపి ఆతని యెదుటనే గాడిదను బ్రతికించెను. అపుడు ఉజైరు, దేవుఁడు చచ్చినవారిని బ్రతికించును. అది దేవునికి సుళువైనపని. ఆతఁడు సర్వశక్తుఁడు అని దెలియును. అది ఇపుడు కన్నులార కూడ చూచితిని. అని చెప్పసాగెను. ఆ పిదప ఉజైరు జెరూసలేమునకు పోఁగా ఎవరును ఆతనిని గుర్తింపలేకపోయిరి. అపుడు ఆయన తన కంఠోక్తిగానున్న తౌరాతును వినిపింపఁగా నపుడు ప్రజలు గుర్తించిరి. ఆయనకు సంభవించిన విషయము నందఱకును దెలిపెను.

260. వ-ఇజ్-ఖాల-ఇబ్రా-హీము-అబ్బి-అరినీ-కైఫ-తుహ్-యిల్-మౌతా-ఖాల-అవలమ్-తూమిన్-ఖాల-బలా-వలాకిల్-లియత-మయిన్న-ఖల్బీ ఖాల-ఫ-ఖుజ్.అర్-బఅ-తమ్-మినత్-త్తైరి-ఫ-సుర్-హున్న-ఇలైక సుమ్మజ్-అల్-అలా-కుల్లి-జబ-లిమ్-మిన్-హున్న-జుజ్-అన్-సుమ్మద్-ఉ హున్న-యాతీనక-సఅయన్-వఅలమ్-అన్నల్లాహ- అజీజున్-హకీమ్.

260. మఱియు ఇబ్రాహీము, ఓ నాప్రభువా ! మృతులను నీవెట్లు సజీవులుగాఁ జేయుదువో నాకు చూపింపుము అని చెప్పినపుడు దేవుఁడు, ఏమి? నమ్మలేదా అని చెప్పఁగా, ఎందుకులేదు, (నేను నమ్మితిని). కాని నా హృదయమునకు శాంతము గలుగుటకుఁగాను (అడిగితిని) అని చెప్పెను. అప్పుడు దేవుఁడు నీవు నాలుగు పక్షులను పట్టుకొని వానిని నీతో మరపించుము. ఆ పిదప వానిని తునుకలుగాఁజేసి వాని యొక్కొక్క తునుకను ఒక్కొక్క కొండపైనుంచి, తిరిగి వానిని పిలువుము. అవి నీయొద్దకు పరుగెత్తుచు వచ్చును అని పలికెను. మఱి నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనాపరుఁడును అని తెలిసికొనుము.

వ్యా॥ 260. ఈ వాక్యములోఁగూడ దేవుఁడు మృతులను తిరిగి సజీవులనుగా చేయును. అని తెలుపు నొక విషయము చెప్పఁబడినది. ఇబ్రాహీము గొప్ప ప్రవక్త. ఆయన దేవుఁడు ఎట్లు మృతులకు తిరిగి ప్రాణములుపోయునో కన్నులార చూచి మనశ్శాంతి గలుగఁజేసికొనవలెనని దేవుని వేఁడుకొనెను. దేవుఁడు సెలవిచ్చినట్లు నాలుగు రకముల పక్షులను పట్టుకొని వానిని మరపించి తరువాత నొకనాఁడు తునుకలుగాఁ కోసి ఒక్కొక్క తునుకను ఒక్కొక్క కొండపై నుంచెను, ఆ పిదప ఆ పక్షులను రమ్మని పిలువగా అవి సజీవ

ముకై ఆయనయొద్దకు పరుగెత్తి వచ్చెను. దేవుఁడు సర్వశక్తుఁడు. తానుకోరి నది చేయును. మృతులను సజీవులనుగా చేయుట ఆతనికి దుష్కరముకాదు. ఆతని ప్రతికార్యములో నేదోయొక మహిమ రహస్యముండును. ఇటులే చని పోయిన జనులను వారి కర్మల తీర్పుకై తుదిదినము(ఖియామతు)నందులేపును.

**261.** మసలుల్-లజీన-యున్-ఫిఖూన-అమ్-వాల-హుమ్-ఫీ-సబీ-లిల్లాహి-క మసలి-హబ్బ-తిన్-అంబతత్-సబ్అ-సనా-బిల-ఫీ-కుల్లి-సుంబు-లతిమ్-మిఅతుహ బ్బ - తిన్-వల్లాహు-యుజా-ఇపు - లిమన్-యషాఉ-వల్లాహు-వాసి-ఉన్-అలీమ్.

261. దేవుని మార్గమందు తమ ధనమును ఖర్చు చేయువారి పోలిక, ఒక్కొక్క విత్తనమునుండి యేడు వెన్నులు పుట్టి ప్రతి వెన్నులో నూఱేసి గింజలు గలిగిన దానివలె నున్నది. మఱి దేవుఁడు తానుకోరిన వారికి హెచ్చుగా నొసంగును. మఱి దేవుఁడు అమితముగా ననుగ్రహించు వాఁడును సర్వఁజ్ఞుఁడును.

వ్యా॥ 261. ఈవాక్యమునందు భక్తులు తమ ధనమును దేవుని మార్గమందు ప్రజల మేలుకొఱకు ఖర్చుచేయుటకై ప్రోత్సాహము గలదు. దేవుని మార్గమందుభక్తితో కొద్దిధనము ఖర్చుపెట్టినను దాని ఫలితము అధికముగా నుభయలోకములలోను లభించును. దాని యుదాహరణము, ఒక విత్తనమును పోలియున్నది. మంచి సత్తువగల భూమిలో ఒక్క విత్తనము నాటిన దానికి ఏడువందల గింజలు లభించును. అటులే భక్తులు చేసిన దాన ఫలితము అధికముగా లభించును. దేవుఁడు అమితముగానొసంగువాఁడు. ఆతఁడు కోరిన వారికి నింకను అధికముగా నొసంగును. ఆతనికి కొఱఁతలేదు. దానముచేయు వారి యుద్దేశముల నెఱుంగును. దాని ననుసరించి వారికితగిన ఫలితమునొసంగును. ఆతఁడు సర్వమును దెలిసినవాఁడు. ఆతనికి నెద్దియును మఱుఁగులేదు.

**262.** అల్లజీన-యున్-ఫిఖూన-అమ్వా-లహుమ్-ఫీ-సబీ-లిల్లాహి-సుమ్మ-లా-యుత్-బీఊన-మా -అన్-ఫఖూ-మన్నన్-వలాఅజల్-లహుమ్-అజ్-రుహుమ్-ఇన్ద-రబ్బి-హిమ్-వలా-ఖౌఫున్-అలైహిమ్ - వలా-హుమ్-యహ్-జనూన్.

**263.** ఖౌలుమ్-మఅ-రూఫున్-వ-మగ్-ఫిరతున్-ఖై రుమ్-మిన్-సదఖతిన్-యత్బఉహా-అజన్-వల్లాహు-గనియ్యున్-హలీమ్.

262. ఎవరు తమధనమును దేవునిమార్గమందు ఖర్చుచేసి దాని తరువాత తమ యుపకారము నెన్నక, కష్ట పెట్టకయుందురో వారికి తమప్రభువు నొద్ద పుణ్య (ఫలిత) ము లభించును. వారు భయముగాని దుఃఖముగాని పొందరు.

263 దానము చేసిన పిదప కష్టపెట్టుటకంటె మంచిమాటపలుకుటయును, క్షమించుటయును మేలు. మఱియు దేవుఁడు నిర్లక్ష్యము, సహనము గలవాఁడు.

వ్యా॥ 262 263. ఇందు దానముచేయుపద్ధతి చెప్పఁబడినది. భక్తులు దేవుని మార్గమందు దానముచేసి మేముమేలు చేసితిమని చెప్పుకొనరు. ఎవరికిమేలు చేయుదురో వారికి కష్టములు పెట్టరు. గౌరవముతో దానముచేసి పంపుదురు. వారికి దానిపుణ్యఫలితము దొరకును. పరలోకమందు భయముగాని దుఃఖముగాని గలుగదు. మేలుచేసి దాని చెప్పుకొనుట, మఱికష్టపెట్టుటకంటె, దానము కోరిన వారికి మంచిమాట పలికి క్షమించి పంపివేయుట శ్రేష్ఠము. దేవునికి ఏ యక్కఱయులేదు. ఆతఁడు లక్ష్యములేనివాఁడు. ధనవంతులు దానముచేయనిచో ఆతనికి నష్టములేదు. ఎవరు దానము చేయుదురో వారే మేలుపొందుదురు. ధనవంతులు బీదవారిని కష్టపెట్టినను తత్క్షణమే శిక్షింపక వదలుచున్నాఁడు. ఎందుకన నాతఁడుసహనముగలవాఁడు. కావునధనవంతులు విరామము దొరికినదని గర్వింపరాదు.

264. యా-అయ్యు-హల్లజీన-ఆమనూ- లా-తుబ్-తిలూ-సద ఖా తి-కుమ్-బిల్-మన్ని-వల్-అజా-కల్లజీ-యున్-ఫిఖు-మాలహూ- రిఆ-అన్నాసి- వలా-యూమిను బిల్లాహి-వల్-యామిల్-ఆఖిరి-ఫ-మసలుహూ-కమ-సలి-సఫ్వానిన్-అలైహి-తురా-బున్-ఫ-అసా-బహూ-వాబిలున్-ఫ-తర-కహూ-సల్-దన్-లా యఖ్-దిరూన-అలా-షైఇమ్-మిమ్మా-కసబూ-వల్లాహు-లాయహ్-దిల్-ఖౌమల్-కాఫి-రీన్.

264. ఓ విశ్వాసులారా ! లోకుల మెప్పునకుఁగాను తన ధనమును ఖర్చు చేయుచు, దేవునియందును తుది దినమందును విశ్వాసములేనివానివలె, మీరు చేసిన మేలును చెప్పికొని కష్టములు పెట్టి మీదానములను వృథా చేసికొనకుఁడు. వాని పోలిక, కొద్దిగా మన్నుగల నున్నని బండపై గొప్పవర్షము కురిసి దానిని నున్నగా వదలినట్లున్నది. ఇట్టివారు తాము చేసిన దాని ఫలితము పొందఁజాలరు. మఱి దేవుఁడు అవిశ్వాసులకు సన్మార్గము చూపఁడు.

వ్యా॥ 264. ఇందు దేవుఁడు విశ్వాసులగు మునల్మానుభక్తులఁగూర్చి మీరు దానమును మేలును చేసి తిరిగి దానము పుచ్చుకొన్నవారితో లేక యితరులతో "మేము దానము చేసితిమి. మేలు చేసితిమి." అని చెప్పికొని దాని ఫలితమగు పుణ్యము పోఁగొట్టుకొనకుఁడు. దీనివలన దేవుని ప్రీతిపడయజాలరు అని చెప్పుచున్నాఁడు. దానము పుచ్చుకొని యుపకారము పొందిన వారి మనస్సునకు నొప్పియును కష్టమును గలుగును. ఎట్లు ప్రజల ప్రీతి పడ

యుటకును ప్రఖ్యాతికిని దానము చేయువానికి వాని ఫలితమగు పుణ్యము లభింపదో అటులే మేలుచేసి దానముచేసి చెప్పుకొనువారి దానములు వృథాపోవును. దేవునియందును తుదిదినమందును విశ్వాసములేని వారట్లు చేయుదురు. కాని విశ్వాసులు తమ దానముల వృథాచేసికొనరు. భక్తివిశ్వాసములు లేక ప్రజలకు చూపుటకై దానముచేయువారిదియును మేలుచేసిచెప్పి కొని హింసించువారిదియును పోలిక నున్నని జాతిబండవలెనున్నది. ఆ బండపై కొంత మట్టి యున్నది. ఆ కొద్దిమన్నుపై గొప్పవర్షము కురిసి అది కూడ పోయి బండ నున్నగా నైపోయెను. అట్టి బండపై విత్తనమునాటిన దాని వలన ఫలితము లభింపఁజాలదు. అటులే భక్తిలేక డంబముగాఁజేయుదానము వలన ఫలితము లభింపఁజాలదు. సన్మార్గము అవిశ్వాసులకు లభింపదు. వారు పెడత్రోవనే పోవుదురు. భక్తిపూర్వకముగాఁజేయు దానఫలితమునకుపోలిక ముందువాక్యములలో చెప్పఁబడినది.

265. వమ.సలుల్ల-జీన-యున్- ఫిఖూన-అమ్-వాల-హుముబ్-తిగాఅ-మర్ జా-తిల్లాహి-వతస్-బీతన్-మిన్-అన్.ఫుసి-హిమ్-కమసలి-జన్న-తిమ్ - బిర బ్వతిన్-అసా-బహా-వాబిలున్-ఫ-ఆతత్-ఉకు-లహా-జిఅ-ఫైని ఫ-ఇల్ - లమ్ - యుసిబ్ హా-వాబిలున్-ఫ-తల్లున్-వల్లాహు-బిమా-తఅ-మలూన - బసీర్.226.అ య-వద్దు-అహ-దుకుమ్-అన్-తకూన-లహూ-జన్నతుమ్ మిన్-నఖీలిన్ వ అఅ-నా-బిన్-తజ్రీ-మిన్-తహ్తి-హల్-అన్-హారు-లహూ-ఫీహా-మిన్-కుల్లిస్-సమ- రాతి-వ-అసా-బహుల్-కిబరు-వలహు-జుర్రియ-తున్-జు-అఫాఉ-ఫ అసా-బహా - ఇఅ-సారున్-ఫీహి-నారున్ ఫహ్-తర-ఖత్ క-జాలిక-యు-బయ్యి-నుల్లహు- లకు-ముల్-ఆ-యాతి-ల-అల్లకుమ్-తత ఫక్క-రూన్.

265. మఱియు దేవునిప్రీతి పడయుటకును, తమ యాత్మలస్థిరత్వము నకును తమ ధనమును ఖర్చుచేయువారి పోలిక మిట్టభూమిపైనున్న ఒకతోఁట వలె నున్నది. దానిపై గొప్పవర్షము పడి యది రెండింతల ఫలము దెచ్చెను. మఱియు దానిపై గొప్ప వర్షము పడనిచో సోన చాలును. 266. ఏమి మీలో నెవ్వనికైన ఖర్జూరమును ద్రాక్షయునుగల తోఁటయుండి యందు కాలువలు ప్రవహించుచు సర్వవిధముల ఫలము లభించుచుండి ఆతనికి ముసలితనమును గలిగి బలహీనులగు బిడ్డలుండ, ఆ తోఁటపై అగ్నిగల సుడిగాలి వీఁచి యది కాలిపోవుటను మీలో నెవ్వఁడైన ఇష్టపడునా ? మీరుయోచింపుటకుగాను

ఇట్లు స్పష్టముగా తన సూచనలను దేవుఁడు మీకుఁ దెలుపుచున్నాఁడు.

వ్యా॥ 265, 266. ఈ రెండు వాక్యములలో భక్తిపూర్వకముగ దేవుని ప్రీతికొఱకుగాను దానము చేయువారు పొందు ఫలితమునుగూర్చియు, దానముచేసి చెప్పుకొనువారును, ప్రజల మెప్పుకొఱకు చేయువారి దానము నిష్ఫలమగు టనుగూర్చియుఁ దెలుపు రెండు ఉదాహరణములు చెప్పఁబడినవి. మొదటిది సారవంతమైన మిట్టభూమిపై నున్నతోఁటపై గొప్పవర్షముపడిన బాగుగా ఫలించి సాధారణవనములకన్న రెండింతలు ఫలమిచ్చును. గొప్పవర్షము పడ కున్నను కొద్దివానయే దానికిఁజాలును. అది ఫలించును. అటులే భక్తిపూర్వకముగ దేవుని ప్రీతి పడయుటకు చిత్తశుద్ధితో ఎక్కువ దానముచేసిన దాని పుణ్యఫలితము హెచ్చుగా లభించును. చిత్తశుద్ధిగలిగి కొంచెము దానము చేసిన నదికూడ పుణ్యఫలితము నొసంగును. దేవుఁడు మానవులు చేయు సర్వ క్రియలను చూచుచున్నాఁడు. కావున ప్రతికార్యము చిత్తశుద్ధిగలిగి భక్తిపూర్వకముగాఁ జేయవలెను. రెండవది కష్టపడి సంపాదింపలేని బలహీనులైన బిడ్డలుగల ముసలివానికి జీవనాధారమైన తోఁటయందు ఖర్జూరము ద్రాక్ష మొదలగు ఫలవృక్షములుండి నీటిపాఱుదల వసతులుండి, బాగుగ ఫలమిచ్చు నపుడు, అగ్నివలె కాల్చు విషముతో నిండిన సుడిగాలి వీచి యాతోఁటకాలి పోవుటకు ఎవరును ఇష్టపడరు. అటులే మానవుఁడు తాను చేసిన దానము మేలు పొగడి చెప్పికొని ఇతరుల మెప్పునకై చిత్తశుద్ధిలేక చేసిన దానిపుణ్య ఫలితము నశించును. అది అక్కఱ కలిగినపుడు పనికిరాదు. దానిఫలితము విషవంత మగును. దేవుఁడు తన సూచనలను ప్రజలు బాగుగా యోచింపవలెనని వివరించి స్పష్టముగాఁ దెలుపుచున్నాఁడు. కావున మనము దానిని యోచించి అనుసరింపవలెను.

267. యాఅయ్యు-హల్లజీన-ఆమనూ-అన్ ఫిఖూ-మిన్ త - య్యిబాతి-మా కసబ్ తుమ్-వమిమ్మా-అఖ్-రజ్నా-లకుమ్-మినల్ -అర్ జి-వలా-తయమ్మ-ముల్-ఖబీస-మిన్ హు-తున్-ఫిఖూన-వలస్తుమ్-బి-ఆఖిజీ-హి-ఇల్లా-అన్ -తుగ్-మిజూ-ఫీహి-వఅ-లమూ-అన్నల్లాహ-గ-నియ్యున్-హమీద్.

267. ఓ విశ్వాసులారా! మీరు సంపాదించిన దానినుండి (ఉత్తమ) పవిత్రమైన దానిని మేము మీకొఱకు భూమినుండి దీసిన వానినుండి ఖర్చుచేయుఁడు. మఱిమీరు చెడు వస్తువులనే ఖర్చుచేయుట కుద్దేశింపకుఁడు. మఱి మీరైనచో అట్టిదానిని కన్నులు మూసికొనిగాని తీసికొనరు. మఱి దేవుఁడు లక్ష్యములేని వాఁడనియు స్తోత్రపాత్రుఁడనియుఁ దెలిసికొనుఁడు.

వ్యా॥ 267, మునుపటి వాక్యములలో, దానమునకై ప్రోత్సాహపఱి

చుచు దాత భక్తితో చిత్తశుద్ధిగలిగి చేయవలెను. దానము చేసినపిదప పొగడికొనఁగూడదు. దానము గ్రహించినవానిని కష్టపెట్టకూడదని చెప్పఁబడెను. ఇఁక దానముచేయు వస్తువు ఎట్టిదిగానుండవలెనని చెప్పఁబడుచున్నది. దానముచేయువస్తువు మంచిదిగా ఉత్తమముగా నుండవలెను. చెడినదిగాని అధమమైనదిగాని యుండకూడదు. చెడువస్తువులను పుచ్చుకొనవలెనన్న ఎల్లరకును అసహ్యమే. కాని అక్కఱగలవాఁడు కన్నులుమూసికొని తన గౌరవమును పాటింపక తీసికొనును. కాని దేవునికి అట్టిచెడువస్తువుఅక్కఱలేదు. ఆతఁడు అక్కఱలేనివాఁడు. గౌరవపాత్రుఁడు. స్తోత్రపాత్రుఁడు. ఇట్టిఅసహ్యవస్తువులను ఒప్పుకొనఁడు. కావున దానము చేయువారు పుణ్యఫలితము కోరినవారు, మంచి వస్తువులను తాముచేతివృత్తిచే సంపాదించిన వానిలోనుండియు భూమిలోనుండి లభించు ధాన్యము మొదలగు వస్తువులనుండి యుత్తమమైనవి దేవుని మార్గమందు ఆతని ప్రీతికొఱకు దానముచేయవలెను.

268. అష్-షైతాను-య-ఇదుకు-ముల్-ఫఖ్ర-వయామురుకుమ్-బిల్-ఫహ్షాయి-వల్లాహు-యఇదుకుమ్-మగ్-ఫిరతమ్-మిన్హు-వఫజ్-లన్-వల్లాహు వాసిఉన్-అలీమ్. 269. యూతిల్-హిక్మత-మన్-యషాఉ-వమన్-యూతల్-హిక్మత-ఫఖద్-ఊతియ-ఖైరన్-కసీరన్-వమా-యజ్-జక్కరు-ఇల్లా-ఉలుల్-అల్బాబ్.

268. సైతాను మీకు దారిద్ర్యము గలుగునని చెప్పుచు నీచకార్యములను చేయుటకు ప్రోత్సాహపఱచును. మఱి దేవుఁడు తానుక్షమించుననియు అనుగ్రహించుననియు వాగ్దానము చేయుచున్నాఁడు. మఱియు దేవుఁడు చాల అనుగ్రహించువాఁడును, సర్వజ్ఞుఁడును. 269. తానుకోరిన వారికి జ్ఞానము నొసంగుచున్నాఁడు. ఎవ్వనికి జ్ఞానము లభించునో వానికి గొప్పమేలు లభించుచున్నది. బుద్ధిమంతులే బోధను గ్రహించువారు.

వ్యా॥ 268. దానముచేసిన ధనము తగ్గిపోయి దారిద్ర్యము గలుగును. దానముచేయక లోభము వహింపవలెనని సైతాను మానవుల హృదయములలో ఊహలుపుట్టించును. భక్తుఁడిట్టి యూహలకులోఁబడక దానము చేయుటకు పూనవలెను. దానమువలన దేవుఁడు మానవుల పొరపాట్లను క్షమించును. సంపదలను హెచ్చుగా ననుగ్రహించుననివాగ్దానముచేయుచున్నాఁడు. దానము చేయువారి సంపదగౌరవముహెచ్చుచుండును, లోభుల సంపద తుదకు నశించును. వారికి ఎట్టిగౌరవమును లభింపదు. దేవుఁడు అమితముగా ననుగ్రహించువాఁడు. సర్వము తెలిసినవాఁడు. కావున మానవుల కర్మలకుఁదగినట్లు ఫలితము నొసంగును. 269. దేవుఁడుతానుకోరినవారికి దివ్యజ్ఞానము నొసంగును. దానిచే

మంచిచెబ్బరలను ఎఱింగి ధర్మకార్యముల నాచరింపఁగలరు. ఆదివ్యజ్ఞానము పొందినవారు ఉభయలోకములలోను గొప్పమేలు పొందుదురు. బోధన గ్రహించువారు బుద్ధిమంతులే. బుద్ధిహీనులు బోధనుగ్రహింపలేరు. మఱియుతమ అవివేకముచే దాని ననుసరింపరు. దేవుఁడు మనకు జ్ఞానము బుద్ధినొసంగుగాత.

270. వ-మా-అన్-ఫఖ్ తుమ్-మిన్-నఫ-ఖతిన్-ఔ-నజర్తుమ్-మిన్-నజ్ రిన్-ఫ-ఇన్నల్లాహ-యా-అ-లముహూ-వమా-లిజ్-జాలి-మీన-మిన్-అన్సార్.

270. మఱి మీరే దానముచేసినను లేక ఏ మ్రొక్కుబడి చేసినను అది దేవునికి నిశ్చయముగాఁదెలియును.మఱి దుర్మార్గులకు నెవరునుసహాయులులేరు.

వ్యా॥ 270. మనుష్యులుచేయుసర్వవిధముల దానములను, మ్రొక్కుబడులను దేవుఁడు ఎఱుంగును. వానివాని యోగ్యత ననుసరించిఫలితమిచ్చును. కావున మంచిఫలితము నిచ్చుదానము మ్రొక్కుబడిచేయవలెను. దేవునికి దప్పనితరులకు మ్రొక్కుబడి చేయరాదు. ఏదోయొక కష్టమోలేక వ్యాధియో గలిగినపుడు అది నివారణమైనచో దేవునిపేరిట నిఱుపేదలకు, ధన ధాన్య దానములు చేయుదును అని మ్రొక్కుకొన్నచో దానిని నజర్ అనుదురు. దానిని పూర్తిచేయవలెను. దానములు చేయక తాముచేసిన మ్రొక్కు బడులను చెల్లింపని వారుదుర్మార్గులు. ఇట్టివారినిపరలోకమందు శిక్షనుండితప్పించి సహాయముచేయువారు ఎవరునులేరు. కావునపుణ్యకార్యములు చేసికొనవలెను. ధనవంతులు పిసినిగొట్టు తనము వహించుటవలన సంఘమునకు చాలనష్టమును అపకీర్తియును కలుగును. కావున ముసల్మానుధనవంతులు తమ ధనమును తమ తమ యాత్మభోగములకే ఖర్చుచేయక సంఘము నుద్ధరింపఁ జేయుటకై శక్తివంచనలేక ఖర్చుచేసి యుభయలోకములలో మేలుపొందవలెను.

271. ఇన్-తుబ్-దుస్-సద ఖాతి-ఫని-ఇమ్మా-హియ-వ-ఇన్-తుఖ్-ఫూ హా-వతూ-తూహల్-ఫు-ఖరాఅ-ఫహువ-ఖైరుల్ లకుమ్-వ-యుకఫ్-ఫిరు-అ న్-కుమ్-మిన్-సయ్యి-ఆతి-కుమ్-వల్లాహు-బిమా-తఅ-మలూన-ఖబీర్.

271. మీరుదానములను బహిరంగముగా నొసంగిన మంచిదియే. మఱి గుప్తముగా దానము నిఱుపేదలకు చేసిన అది మీకుమేలే. మఱి మీకొన్ని పాపములను పోఁగొట్టును. మఱియు మీరుచేయు కర్మలు దేవునికి బాగుగా నెఱుకయే.

వ్యా॥ 271. భక్తిపూర్వకముగ దానము బహిరంగముగా చేయ వచ్చును. అదియును మంచిదియే. అట్లుచేసిన ఇతరులుచూచి తాముకూడ దానము చేయుటకు పూనుకొనుదురు. దీనిబట్టియే అదియును మంచిదగుచున్నది.

కాని లోకుల మెప్పుకొఱకు వెల్లడిగా చేయకూడదు. జకాతుదానము వెల్లడిగానే చేయవలెను. అదితప్పక చేయవలసిన దానము. కావున అందు భక్తి చెడునను సందేహముండదు. గుప్తముగా నిఱుపేదలకు దానముచేయుట యుత్తమము. దానివలన కొన్నిపాపములు హరించును. అందు భక్తికిని చిత్తశుద్ధికిని లోటుండదు. ఎట్లుచేసినను దేవునికి మానవులసర్వకర్మలు దెలియును. దాని దానికి తగిన ఫలితము నొసంగును.

172. లైస-అలైక-హుదాహుమ్-వలాకిన్నల్లాహ-యహ్దీ-మన్-యషాఉ-వమా-తున్-ఫిఖూ మిన్-ఖైరిన్-ఫలిఅన్-ఫుసికుమ్-వమాతున్-ఫిఖూన-ఇల్లబ్-తిగాఅ వజ్-హిల్లాహి-వమా-తున్-ఫిఖూ-మిన్-ఖైరిన్-యువఫ్ఫ-ఇలైకుమ్ వఅన్తుమ్-లాతుజ్-లమూన్.

272. వారిని సన్మార్గమునకుఁ దెచ్చుట నీపనిగాదు. కాని దేవుఁడు తానుకోరిన వారిని సన్మార్గమునకుఁ దెచ్చును. మఱిమీరు ఖర్చు (దానము) చేయు ధనము మీకొఱకే. మీరుఖర్చుచేయునది దేవునిప్రీతి పడయుటకేగానే యుండవలెను. మీరుచేయు దానము లన్నిటిఫలితము పూర్తిగా మీకు లభించును. మఱి మీపై నెట్టి అన్యాయము గలుగదు.

వ్యా॥ 272. ముసల్మానులు కాని వారికి (అవిశ్వాసులకు) ముసల్మానులు దానము చేయకూడిరి. అట్లువలదు. నిఱుపేదలైన వారెవరైన సరే. వారికి దానముచేయవచ్చును. అవిశ్వాసులను సన్మార్గము (ఇస్లామ్) అవలంబించునట్లు చేయుట దేవుని పని. ధర్మమార్గము బోధించుటయే ప్రవక్తలపని. సన్మార్గమునకు వారు రాలేదే అను బాధ్యత వారిపై లేదు. కావున ఆచింతపెట్టుకొనరాదు. దానముచేయుటలో ముఖ్యముగా దేవుని ప్రీతి నుద్దేశింపవలెను. దానముచేయు వారికే దానిఫలితము పూర్తిగాచేరును. అందు ఎట్టిలోపమును అన్యాయమును గలుగదు.

273. లిల్-ఫుఖరా-ఇల్లజీన-ఉహ్సిరూఫీ సబీ లిల్లాహి-లాయస్-తతీ-ఊన-జర్బన్-ఫిల్-అర్జి-యహ్-సబు హుముల్-జాహిలు-అగ్ నియాఅ-మినత్-తఅఫ్ఫుఫి-తఅ-రిఫు-హుమ్-బి-సీ-మాహుమ్-లాయస్-అలూ-నన్నాస-ఇల్-హాఫన్-వమా-తున్-ఫిఖూ-మిన్-ఖైరిన్-ఫఇన్నల్లాహ-బిహీ-అలీమ్.

273. దేవుని మార్గమందు చిక్కువడి సంపాదన కొఱకు దేశసంచారము చేయలేని వారికి దానము చేయవలెను. వారి విషయము తెలియనివారు. వారు క్షము నడుగక పోవుటచే వారిని ధనవంతులని భావింతురు. అట్టి వారి

ముఖములను చూచి దెలిసికొందువు. వారు ప్రజలను పీడించుచు నడుగరు. మీ రేదానము చేయుదురో నిశ్చయముగా అది దేవునికిఁ దెలియును.

వ్యా॥ 273. ఈ వాక్యములో దానమునకు ముఖ్యముగా నెవరు యోగ్యులు అనిచెప్పఁబడినది. హజ్రత్ మహమ్మదు వారి శిష్యులలో అనేకులు తమ దేశమును విడనాడి మదీనాపురము చేరియుండిరి. వారిలో కొందఱు పైగంబరులవారి సమ్ముఖమునసుండి ఖురానెషరీఫు నేర్చుకొనుచు, మతవిద్యను గ్రహించుచు, సంపాదనచేయుటకు అవకాశములేక దేవుని మార్గమందే నిలిచియుండిరి. వారికి గృహములులేకుండ మసీదుప్రక్కన ఒకతిన్నెపై వసించుచుండిరి. వీరే అస్‌హాబె సుప్ఫా. అట్టివారికి అన్నపానాదులు సమకూర్చుట ధనవంతులపనియై యుండెను. కావున అట్టివారికి దానముచేయుట చాలశ్రేష్ఠము. ఇపుడు కూడ అట్టిగుణములుగలవా రున్నచో వారిఖర్చును ధనవంతులు భరింపవలెను. ఇస్లామ్‌లో పై కారణములులేక భిక్షమే వృత్తిగాఁ జేసికొని, దృఢకాయులుగానుండి సోమరులై భిక్షమెత్తుటనిషిద్ధము. ఏదోయొకవృత్తిచే జీవింపవలెను. నిజముపేదలైనవారి ముఖములను చూచినచో వారి యాఁకటి బాధ తెలియనగును. వారి దేహములు చిక్కిపోవుట, వారి ముఖములు పసుపురంగుగా మారుట, మొదలగునవి గుర్తులు. కావున దానముచేయువారు నిజముపేదలను గుర్తించి భక్తిపూర్వకముగా దానము చేయవలెను. దేవునికిసర్వము తెలియును. వానివానికిఁ దగిన ఫలితము నొసంగును.

274. అల్లజీన యున్ ఫిఖూన అమ్వాలహుమ్ బిల్ లైలి-వన్-నహారి సిర్రన్-వ అలా-నియతన్-ఫ-లహుమ్ అజ్రు-హుమ్- ఇన్ద-అబ్బి హిమ్ - వలా-ఖౌఫున్-అలైహిమ్-వలా హుమ్ యహ్-జనూన్.

274. ఎవరు తమ ధనమును దేవునిమార్గమందు రాత్రింబగళ్ళు గుప్తముగాను వెల్లడిగాను ఖర్చుచేయుదురో, వారికి తమ ప్రభువునొద్ద ఫలితమున్నది, మఱి వారికి నెట్టి భయముగాని దుఃఖముగాని గలుగదు.

వ్యా॥ 174. ఇందు దానముచేయు కాలమును తీరును దెలుపఁబడినవి. దానము చేయుటలో రాత్రి అని పగలు అని లేదు. ఎల్లప్పుడును చేయవచ్చును. గుప్తముగాను బహిరంగముగాను సమయోచితముగా దానముచేయవచ్చును. ఇట్లు దానముచేయువారికి వారి ప్రభువగు దేవునియొద్ద దానఫలితము లభించును. అందు నెట్టి కొఱంత గలుగదు. తీర్పు దినమునందు లోభులకుఁ గలుగు భయముగాని దుఃఖముగాని దాతలకు గలుగనేరదు.

275. అల్లజీన-యా-కులూ-నర్-రిబా-లాయఖూ మూన-ఇల్లా-కమా-యఖూముల్లజీ-యత-ఖబ్బతు-హుష్-షైతాను-మినల్-మస్సి-జాలిక-బి-అన్నహుమ్-ఖాలూ-ఇన్నమల్-బై ఉ-మిస్లుర్-రిబా-వ-అహల్లల్లా-హుల్-బైఅ-వ-హర్రమర్-రిబా-ఫ-మన్-జా-అహూ-మా-ఇ-జ-తుమ్-మిర్-రబ్బిహీ-ఫన్-తహా-ఫలహూ-మా-సలఫ-వ-అమ్-రుహూ-ఇల-ల్లాహి-వమన్-ఆద-ఫ-ఉలా-ఇక-అస్-హాబున్నారి-హుమ్-ఫీహా-ఖాలి-దూన్. 276. యమ్-హ-ఖుల్లా-హుర్-రిబా-వయుర్-బిస్-సద-ఖాతి-వల్లాహు-లా-యు-హిబ్బు-కుల్ల-కఫ్ఫా-రిన్-అసీమ్. 277. ఇన్నల్లజీన-ఆమనూ-వ-అ-మిలుస్-సాలిహాతి-వ-అఖా-ముస్-సలాత-వఆత-ఉజ్-జకాత-లహుమ్-అజ్-రుహుమ్-ఇన్ద-రబ్బి-హిమ్-వలా-ఖౌఫున్-అలై-హిమ్-వలాహుమ్-యహ్-జనూన్. 278. యా-అయ్యు-హల్లజీన-ఆమను త్తఖుల్లాహ-వజరూ-మా-బ-ఖియ-మినర్-రిబా-ఇన్-కున్తుమ్-మూమినీన్. 279. ఫ-ఇల్-లమ్-తఫ్-అలూ-ఫా జనూ-బి-హర్బిమ్-మినల్లా-హి-వ-రసూ-లిహీ-వఇన్-తుబ్తుమ్-ఫల-కుమ్-రు-ఊసు-అమ్వా-లికుమ్-లా తజ్-లిమూన-వలా-తుజ్-లమూన్. 280. వ-ఇన్-కాన-జూ.ఉస్-రతిన్-ఫన-జిరతున్-ఇలా మైసరతిన్-వ-అన్-తసద్దఖూ-ఖైరుల్ లకుమ్ ఇన్ కున్తుమ్-తఅ-లమూన్. 181. వ-త్తఖూ-యామన్-తుర్-జ-ఊన-ఫీహి-ఇలల్లాహి - సుమ్మ-తువఫ్ఫా-కుల్లు-నఫ్-సిమ్-మా-కసబత్-వ-హుమ్-లా-యుజ్-లమూన్.

275. వడ్డిని అనుభవించువారు సైతానుపట్టి పిచ్చిచేష్టలు చేయువారి వలె నిలుతురు. ఇది, వారు (వడ్డి పుచ్చుకొనువారు) వర్తకముకూడను వడ్డివంటిదే అని చెప్పినందులకు నగును. మఱియు దేవుఁడు వర్తకమును ధర్మమైన దిగాఁ జేసెను. మఱి వడ్డి నిషేధించెను. కావున ఎవనికి తన ప్రభువునుండి బోధనగలిగిన పిదప వడ్డిని వ్యాపారము మానుకొనునో దానికి పూర్వము పుచ్చుకొన్నది వానిదేను. వానిగూర్చి తీర్పు దేవునియొద్దనున్నది. మఱెవరు తిరిగి వడ్డి పుచ్చుకొనుదురో వారే నరకనివాసులు. అందు వారు చిరకాల ముందురు. 276. దేవుఁడు వడ్డిని నశింపఁజేయును. మఱి దానములను హెచ్చించును. మఱియు వృద్ధిచేయును. కృతఘ్నులును పాపులును అగునట్టి

వారిని దేవుఁడు ప్రేమింపఁడు. 277. విశ్వసించి సత్కార్యములు చేయువారికి తమ ప్రభువునొద్ద ఫలితమున్నది. మఱియు వారికి భయముగాని దుఃఖము గాని యుండనేరదు. 278. ఓ విశ్వాసులార ! దేవునికి భయపడుఁడు. మీరు విశ్వాసులైనచో నిలువయున్న వడ్డిని విడిచిపెట్టుఁడు.

279. మఱి మీరు వడ్డి విడిచిపెట్టనిచో దేవునితోను ఆతని ప్రవక్తతోను మీరు యుద్ధమాడుటకు సిద్ధపడుఁడు. మఱిమీరు (మానుకొని) క్షమాపణకోరినచో మీమూలధనము మీకున్నది. మీరు ఎవ్వరియెడను అన్యాయము చేయకుఁడు. అంత మీకును అన్యాయము జరుగనేరదు. 280. అప్పుపుచ్చుకొన్నవాఁడు బీదవాఁడైన చో సంపద సౌకర్యములు గలుగునంతవఱకు గడువులియ్యవలెను. మఱి మీరు దెలిసినచో క్షమించి దానముగ వదలిపెట్టుట మీకు మేలు. 281. మీరు దేవుని యొద్దకు రప్పింపఁబడి, యొక్కొక్కనికి తాను చేసిన కర్మల ఫలితము సంపూర్ణముగా నొసంగఁబడి, ఎట్టి అన్యాయము జరుగని దినమునకు భయపడుఁడు.

వ్యా॥ 273. ఇంతవఱకు దానమును దాని ఫలితమును దాని ప్రయోజనములును, చెప్పఁబడియెను. దానివలన దాతకుఁ గలుగు దయ, హృదయ మృదుత్వము మొదలగు సుగుణములు సర్వజనులకు తెలిసియేయున్నది. ఇఁక దానమునకు విరోధమైన వడ్డియు దానివలనఁ గలుగు నష్టములును విరోధమును హృదయ కఠినత్వమును మొదలగు దుర్గుణములు వివరింపఁబడి అది నిషేధింపఁబడినది. ఎంత లాభము దానిలోనున్నదో అంత నష్టము వడ్డివ్యాపారమందుఁ గలదు. దీనివలన ఋణవంతులు చాల బాధలుపడుచు నిఃపేద లగుచున్నారు. వడ్డివ్యాపారము చేయువారు వారియందుండు దుర్గుణములవలన మనస్సునకు నిలుకడలేక పిశాచము పట్టినవానివలె పిచ్చిచేష్టలు చేయుచుం దురు. ఎట్లు ఇహలోకములో వర్తించుచుండిరో అటులే పునరుత్థాన దినమున తమ తమ గోరీలనుండి వడ్డివ్యాపారులు పిశాచముపట్టి పిచ్చిచేష్టలు చేయు నట్టివారివలె లేచి నిలుతురు. వారు వడ్డిని వర్తకమును ఒకటిగాఁ జేసి, నిషేధింపఁబడిన వడ్డిని ధర్మమని చెప్పుచు దాని ననుభవించుచుండినందువలన వారికి ఆ దుర్గతి పట్టెను. వడ్డికిని వర్తకమునకును చాల భేదముగలదు. వర్తకములో నేదో యొక వస్తువునకు బదులుగ మఱొక వస్తువు గ్రహింపఁబడు చున్నది. అందుగలుగు లాభము వస్తువునకు బదులగును. ఇట్లు వడ్డిలో లేదు. వడ్డిపుచ్చుకొనువారు తాము పుచ్చుకొను పైకమునకు బదులుగ నద్దియును వడ్డి యిచ్చువారికిచ్చుటలేదు కావున ఆ రెంటి మధ్య చాల భేదమున్నది. మఱియు దేవుఁడు వడ్డిని నిషేధించియున్నాఁడు. వర్తకము చేయుటకు సెలవిచ్చియున్నాఁడు. ధర్మమును అధర్మము నొకటి కానేరవు. దేవుఁడు తన ప్రవక్తలమూలముగా నొసంగుబోధనలు విని వడ్డివ్యాపారము మానుకొన్నచో

దీనికి ముందు లభించిన వడ్డిసొత్తు ఋణవంతులకు తిరిగి ఇయ్యనక్కఱ లేదు. ఆ సొత్తు వారిదే. దానింగూర్చి తీర్పు దేవునిసన్నిధానమున అగును. దేవుండు దయచేసి క్షమించిన క్షమించవచ్చును. (ఒకవేళ పూర్వపువడ్డివాపసు చేసిన చేయవచ్చును: కాని చేయవలెనని నిర్బంధములేదు.) కాని దేవుని యాజ్ఞలు బోధలు విని తిరిగి వడ్డి వ్యాపారము చేసినచో అది మహాపాతకము. దానివలన అట్టివారు నరకనివాసులగుదురు. అందు చిరకాలముందురు. 276. దేవుండు వడ్డిని మొదలంట నశింపంజేయును. అందు వృద్ధిగలుగదు. తుదకు అది నశించును. ఆ సొత్తునందు బరకత్తుండదు. దానమువలన దాతలకు వృద్ధి కలదు. దానమువలన దాతల సొత్తుతగ్గదు. దేవుండు వాని నభివృద్ధిచేయును. దేవుండు ధనవంతులకు ధనమిచ్చెను. కనీసము దానము చేయకున్నను వడ్డిలేకుండనైన అక్కఱగలవారికి అరువిచ్చి అట్లు దేవుని కృతజ్ఞత సలుపవచ్చును. అట్లు చేయక వడ్డి వ్యాపారములో మునింగి కృతఘ్నత వహించి పాపియైనట్టి వానిని దేవుండు ప్రేమింపండు. అనుగ్రహింపండు. ఒక భక్తునికి దీనికన్న వేఱు శిక్ష యక్కఱలేదు. ఇదియే గొప్ప శిక్ష. 277. ఈ వాక్యమునందు విశ్వాసులగు భక్తులుండుతీరు చెప్పంబడినది. వారు విశ్వసించి సత్కార్యములగు పుణ్యకార్యములు (దానము మొదలగునవి) చేసి భయభక్తులతో నమాజు (ప్రార్థన) లు సలిపి విధిదానము (జకాతు) చేసి తమ ఫలితము తమప్రభువగు దేవుని యొద్ద పొందుదురు. వారికి నరక భయమును దుఃఖమునుగలుగదు. వడ్డివ్యాపారులకు అట్టిభయమును దుఃఖమునుగలుగును. 278.279. వడ్డినిషేధమునకుముందు పుచ్చుకొన్నది పోనిండు. నిషేధింపంబడిన పిదప వడ్డి నిల్వయున్నచో వదలిపెట్టుండు, పుచ్చుకొనకుండు. ఇట్లు చేయుట పూర్ణవిశ్వాసులకు కష్టముకాదు. విశ్వాసమున్నచో నిలువయున్న వడ్డి వదలిపెట్టుండు. లేనిచో మీరు దేవునితోను ఆతని ప్రవక్తతోను యుద్ధమాడుచున్నారని దెలిసికొనుండు. మఱి దానికొఱకు సిద్ధమగుండు. దేవునితోను ఆతని ప్రవక్తతోను ఏ విశ్వాసముగల భక్తుండు యుద్ధముచేయంగలండు? కావున ఇట్టి ఘోరపాతకమైన వడ్డి వ్యాపారమును మానుకొనవలెను. వడ్డి మానుకొన్నచో మూలధనమునకు లోటులేదు. అది తగ్గింపంబడదు. అది పూర్తిగా ఋణవంతుండు ఋణదాతకు నొసంగవలెను. నిలువయున్న వడ్డిమాత్ర మియ్యకూడదు. ఇందు ఉభయులకును నష్టములేదు. కావున నిలువయున్న ఋణవంతులపై అన్యాయము చేయరాదు. మఱియు మీ మూలధనములో మీరు పూర్వము అనుభవించిన వడ్డి మినహాయింపంబడదు. అట్లు మీపై కూడ నన్యాయము జరుగదు అని చెప్పం

బడిెను. 280. వడ్డి వ్యాపారము నిషేధింపఁబడెను. ఇఁక మూలధనమును గూర్చి ఋణవంతుఁడు బీదవాఁడై అప్పుదీర్చుటకు శక్తిలేనిచో సంపద సౌకర్యములు గలుగునంతవఱకు గడువునియ్యవలెను. తొందఱపెట్టరాదు. ఋణదాత దానము యొక్కయు ఉపకారము యొక్కయు మేలు నెఱింగినచో, అప్పును దానముగా వదలిపెట్టుట యాతనికి శ్రేష్ఠము అని బోధింపఁబడిెను. 280. తుదిదినమునందు కర్మతీర్పు అగును. దేవుని సన్నిధానమున రప్పింపఁబడి వారి వారి కర్మలఫలితము వారు పొందుదురు. అచ్చట ఎట్టి అన్యాయమును జరుగదు. కావున పరలోక సౌఖ్యముకోరువారు వడ్డి వ్యాపారము మాని దానము మొదలగు పుణ్యకార్యములు చేసి వాని సంపూర్ణఫలితము పొందవలెను. లేక వడ్డి వ్యాపారము మొదలగు పాపకార్యములచే వాని ఫలితమగు నరకనివాసము పొందవచ్చును. కావున అట్టి రాఁబోవు దినమునకు భయపడి పుణ్యకార్యములు చేయవలెను.

హెచ్చరిక:—వడ్డి వ్యాపారమును మొదలంట నశింపఁజేయుటకై హజ్రత్ మహమ్మదు వారు ఇట్లు ఉపదేశించి యున్నారు. "వడ్డి పుచ్చుకొనువాఁడును వడ్డి నిచ్చువాఁడును వడ్డి పత్రము వ్రాయువాఁడును అందుకు సాక్షులుగానుండు వారును దేవుని కోపమునకు పాత్రులగుదురు." కావున ముసల్మానులు వడ్డి వ్యాపారము చేయరాదు. వడ్డికి అప్పుఁదీయరాదు. వడ్డి పత్రమును వ్రాయరాదు. అందు సాక్షులుగా నుండరాదు

282. యా-అయ్యు-హల్లజీన.అమానూ-ఇజా-తదా-యన్తుమ్-బిదై-నిన్-ఇలా-అజ-లిమ్-ముసమ్మన్-ఫక్తు-బూహు-వల్-యక్తుబ్-బైనకుమ్-కాతిబుమ్-బిల్-అద్లి-వలా-యాబ-కాతి-బున్-అన్-యక్తుబ-కమా-అల్లమ-హుల్లాహు-ఫల్-యక్-తుబ్-వల్-యుమ్-లిలిల్లజీ-అలై-హిల్-హఖ్ఖు-వల్-యత్త-ఖిల్లా-హ-రబ్బ-హూ-వలా-యబ్-ఖస్-మిన్-హు-షైఅన్-ఫఇన్-కానల్లజీ-అలై-హిల్-హఖ్ఖు-సఫీ-హన్-ఔజ-ఈ-ఫన్-ఔ-లా-యస్-తతీఉ-అన్-యుమిల్ల-హువ-ఫల్-యుమ్-లిల్-వలియ్యుహూ-బిల్-అద్లి-వస్తష్-హిదూ-షహీదైని-మిర్-రిజాలి-కుమ్-ఫ-ఇల్లమ్-యకూనా-రజులైని-ఫ-రజులున్-వమ్-ర-అతాని-మిమ్మన్-తర్ జౌన-మినష్-షుహ-దాఇ-అన్-తజిల్ల-ఇహ్దా-హుమా-ఫతు-జక్కి-ర-ఇహ్-దాహుమల్-ఉఖ్-రా-వలా-యాబష్-షుహ-దాఉ-ఇజా-మా-దుఊ-వలా-తస్-అమూ-అన్-తక్-తుబూ-హు-సగీరన్-ఔ-కబీరన్-ఇలా-అజ-లిహీ-

జాలికుమ్-అఖ్-సతు-ఇన్దల్లాహి-వఅఖ్వము-లిష్-షహాదతి-వ-అద్నా-అల్లా తర్-తాబూ-ఇల్లా-అన్-తకూన-తిజారతన్-హాజిరతన్-తుదీరూనహా-బైనకుమ్-ఫలైస-అలైకుమ్-జునాహున్-అల్లా-తక్తుబూహా-వ-అష్హిదూ-ఇజా-తబా-యఅతుమ్-వలా-యుజార్రి కాతిబున్-వలా-షహీదున్-వఇన్-తఫ్-అలూ-ఫఇన్నహూ-ఫుసూఖుమ్-బికుమ్-వత్తఖుల్లాహ-వయు-అల్లిము-కుముల్లాహు-వల్లాహు-బికుల్లి-షైఇన్-అలీమ్. 283. వఇన్-కున్తుమ్-అలా-సఫరిన్-వలమ్-తజిదూ-కాతిబన్-ఫరిహానుమ్-మఖ్బూజతున్-ఫఇన్-అమిన-బఅజుకుమ్-బఅజన్-ఫల్-యు-అద్దిల్లజీ-తుమిన-అ-మానతహూ-వల్-యత్తఖిల్లాహ-రబ్బహూ-వ-లా-తక్తు-ముష్-షహాదత-వమన్-యక్-తుమ్హా-ఫ-ఇన్నహూ ఆసి-మున్-ఖల్బుహూ-వల్లా-హు-బిమా-తఅ-మ-లూన-అలీమ్.

282. ఓ విశ్వాసులార! మీరు ఒకరితో నొకరు అప్పువ్యవహారము ఒక నియమితకాలము వఱకు చేసినచో, దానిని వ్రాసికొనుఁడు. మీలో పత్రము వ్రాయువాఁడు న్యాయముగా వ్రాయవలెను. మఱియు వ్రాయువాఁడు తనకు దేవుఁడు నేర్పినట్లు వ్రాయుటకు తిరస్కరింపకుండ వ్రాయవలెను. మఱియు ఋణవంతుఁడు తనపైనున్న అప్పును చెప్పుచు వ్రాయింపవలెను. మఱియు నతఁడు తనప్రభువగు దేవునికి భయపడవలెను. మఱి దానిలోనుండి తక్కువ చేయకూడదు. మఱియు అప్పుపుచ్చుకొన్నవాఁడు బుద్ధిహీనుఁడుగానో బలహీనుఁడుగానో తాను చెప్పి వ్రాయింప లేనివాఁడుగానో యుండిన అతనిపోషణకర్త న్యాయముగా వ్రాయింపవలెను. మఱి మీలో నిద్దఱు మగవారిని సాక్షులుగా పెట్టుకొనుఁడు. ఇద్దఱు మగవారు లేనిచో మీరిష్టపడు సాక్షులలో ఒకమగవాఁడును, ఇద్దఱు స్త్రీలును సాక్షులుగానుండ వచ్చును. ఆ యిద్దఱు స్త్రీలలో నొకతె మఱచిపోయినచో రెండవయామె, ఆ మఱచిపోయిన యామెను జ్ఞప్తికి దెచ్చును. మఱియు సాక్షులు పిలువఁబడునపుడు వారు వచ్చుటకు తిరస్కరింపఁగూడదు. మఱియు అప్పు కొంచెమైనను, గొప్పదైనను, దానిగడువు వఱకు వ్రాయుటలో అశ్రద్ధవహింపకుఁడు. ఇది దేవునియొద్ద చాల న్యాయమైనదియును, సాక్ష్యమును స్థిరముగా నుంచునదియును, మీరు సందేహములలో పడకుండ చేయునదియగును. కాని మీరు ఒకరితో నొకరు చేయు బేరము రొక్కమైనచో దానిని వ్రాయకున్న మీకు నేమియు దోషము లేదు. మఱి మీరు(నగదు) బేరము చేయునపుడు సాక్షులనుంచుకొనుఁడు మఱి

యు వ్రాయువాఁడు సాక్షియును నష్టముపొందఁగూడదు. (వారు నష్టమును గలిగింపఁగూడదు*). మఱి మీరట్లు చేసినచో అది మీకు దోషకరము. మఱి మీరు దేవునికి భయపడుఁడు. మఱి దేవుఁడు మీకు నేర్పుచున్నాఁడు. మఱియు దేవుఁడు సర్వమును దెలిసినవాఁడు. 283. మఱియు మీరు ప్రయాణమందుండి, వ్రాయువాఁడు మీకు దొరకనిచో సొమ్ము (గిరవు) కుదువపెట్టవలెను. మఱి ఒకరిపై నొకరికి నమ్మకము గలిగినచో నమ్మకముగా నిచ్చిన దానిని తిరిగి యాతఁడు వాపసు చేయవలెను. మఱియు నతడు తన ప్రభువగు దేవునికి భయపడవలెను. మఱి మీరు సాక్ష్యమును దాఁచకుఁడు. మఱెవఁడు సాక్ష్యమును దాఁచునో నిశ్చయముగా వాని హృదయము పాపములతోఁగూడినది. మఱియు దేవుఁడు మీరు చేయునది యెఱుంగుచున్నాఁడు.

వ్యా॥ 282. ఇంతవఱకు దానధర్మములకై ప్రోత్సాహమును వడ్డివ్యాపార నిషేధమును చెప్పఁబడియె. ఇక వడ్డిలేక అప్పునొసంగు వ్యవహారమెట్లు జరుపవలెనో అది చెప్పఁబడుచున్నది. అప్పునిచ్చునపుడు జగడములు వ్యాజ్యములు గలుగకుండ పత్రము వ్రాసికొనవలెను. అప్పుతీర్చుటకు ఎంత గడువు నియమింపఁబడునో అదియును, ఋణదాతయొక్కయు ఋణవంతునియొక్కయు పేర్లు మొదలగు విషయములు పూర్తిగా తగవునకు అవకాశము లేనట్లుగ న్యాయముగాను ఏలాటి మోసము లేకుండునట్లును వ్రాసికొనవలెను. వ్రాయువాఁడు పక్షపాతములేక ధర్మప్రకారముగా పత్రము వ్రాయవలెను. పత్రము వ్రాయు పద్ధతులు తెలిసియు వ్రాయుటకు తిరస్కరింపరాదు. అప్పు పుచ్చుకొనువాఁడు వ్రాయింపవలెను. అతఁడు బాల్యముచేతనో ముసలితనముచేతనో వ్రాయింపలేనిచో అతని పోషణకర్త పత్రమున్యాయముగా వ్రాయింపవలెను. ఆపత్రమందు కనీసము న్యాయస్థులైన ఇద్దఱుమగవారు సాక్షులుగ నుండవలెను. మగవారుదొరకనిచో ఒక మగవాఁడును ఇద్దఱు స్త్రీలును సాక్షులుగా నుండవచ్చును. సాక్ష్యమిచ్చునపుడొకతె మఱచిపోయిన ఇంకొకతె యామెకు జ్ఞప్తికిఁ దేగలదు. అక్కఱపడినపుడు సాక్షులను పిలిచినచో వారుతప్పకవచ్చి సాక్ష్యమియ్యవలెను. అప్పుకొంచెమైనను పెద్దదైనను వ్రాతమూలముగ నుంచవలెను. అందు ఏలాటి అశ్రద్ధవహింపరాదు. ఇందున్యాయమును సాక్ష్యస్థిరత్వమును గలదు. మఱచిపోవుటకు నవకాశముండదు. కాని బేరమురొక్కమైనచో వ్రాయకున్న దోషములేదు. కాని సాక్షులుంచుట మంచిది. అట్లుచేయుచో ఇఁకముందు ఏలాటి తగవురానేరదు.

---

* ఇచ్చట రెండు పాఠాంతరములుగలవు. రెంటికిని అర్థము గలదు. మొదటిది పత్రము వ్రాయువాఁడును సాక్షులును నష్టము పొందఁగూడదు. వారు తమ సొంత పనులలో నున్నపుడు వదలిరమ్మని తొందఱపెట్టగూడదు. వారుతమ పనిని వదలిపెట్టివత్తురు కావున వారిఖర్చులు భరింప

283. ప్రయాణములో నున్నపుడు పత్రము (దస్తావేజు) వ్రాయుటకు లేఖరి దొరకనిచో అప్పుపుచ్చుకొనువాఁడు ఏదైన వస్తువు కుదువపెట్టవలెను. ఇట్లుచేయుటవలన అప్పునిచ్చువారికి నమ్మకముండును. పనులుజరుగును. ప్రయాణములో లేక యూరిలోనున్నను కుదువపెట్టవచ్చును. కుదువపెట్టిన వస్తువునుండి ఏదైన లాభము గలిగినచో అది కుదువ పెట్టినవాని సెలవుచే ఆ ఋణదాత తన అప్పులో దానిని మినహాచేసికొనవలెను. కొందఱు ఇండ్లుకుదువ పెట్టుదురు. దానికి బాడుగవచ్చును. లేక అప్పుఇచ్చినవాఁడు బాడుగ నియ్యక ఆయింటిలోనుండును. ఇట్లుచేయుట ధర్మముకాదు. బాడుగ వచ్చినచో అది అప్పులో మినహాయింపవలెను. ఇటులే మిగిలిన కుదువనుండి రాఁబడి నూహింపవలెను. నమ్మకముచే నేదైన వస్తువునుంచినచో ఆ అమానతు వస్తువును భద్రముగానుంచి తిరిగి ఏలాటిలోపములేకుండ సొమ్మువానికిఅప్పగింపవలెను. ఇందుదేవునికి భయపడవలెను. ఏలాటి నమ్మకద్రోహము చేయరాదు. నిజమైన సాక్ష్యము దాఁచకూడదు. ఎవరు సాక్ష్యమును దాఁచియుంతురో వారి హృదయము పాపముతో కూడినది యగును సాక్ష్యమును దాఁచువాఁడు మనఃపూర్వకముగానట్లు చేయును. కావున ఆతని హృదయము పాపముకలది యగును. దానికి శిక్షకలదు. మానవులు చేయు సర్వకార్యములును దేవునికిఁ దెలియును. కావున న్యాయముగాను ధర్మముగాను నడచుకొనవలెను.

248. లిల్లాహి-మా ఫిస్-సమావాతి-వమా-ఫిల్-అర్ జి-వఇన్-తుబ్దూ-మా ఫీ-అన్-ఫుసి-కుమ్-ఔ-తుఖ్-ఫూహు-యుహాసిబ్-కుమ్-బిహిల్లాహు-ఫయగ్-ఫిరు-లి-మన్-యషాఉ-వయు-అజ్-జిబు-మన్-యషాఉ-వల్లాహు-అలా-కుల్లి-షైఇన్-ఖదీర్.

248. ఆకాశములోను భూమిలోనున్న సర్వము దేవునిదే. మఱి మీరు మనస్సులలో నున్నది వెలిపుచ్చినను లేక దాఁచినను దేవుఁడు దానిలెక్క మీతోఁ దీసికొనును. ఆపిదప దేవుఁడు తానుకోరిన వారిని క్షమించును. మఱియు తానుకోరిన వారిని శిక్షించును. మఱిదేవుఁడు సర్వశక్తుఁడు.

---

వలెను. అట్లుచేయక వారికి నష్టమును కష్టమును గలిగింపరాదు. రెండవది వ్రాయువాఁడును సాక్షులును సమయమునకు రాక, లేక పక్షపాతమువహించి, వ్రాతలోను సాక్ష్యములోను తారుమారు చేసి ఒకపక్షము వారికి నష్టము గలిగింపఁగూడదు. న్యాయముగ వ్రాయవలెను. నిజమైన సాక్ష్యము నియ్యవలెను. వ్రాతలో తారుమారుచేసి సాక్ష్యము దాఁచినచో పాపమగును. లేక వ్రాయు వారిని సాక్షులను, తొందఱలు పెట్టికష్టము కలిగించినను పాపమగును. ఇట్టివిషయములందు దేవుని శిక్షకు భయపడి న్యాయముగా వర్తింపవలెను. దేవుఁడు తనభక్తులకుఁ దెలియని విషయములను ధర్మములను నేర్పుచున్నాఁడు. ఆతఁడు సర్వజ్ఞుఁడు.

వ్యా॥ 284. ఈ గొప్పసూరాలో నింతవఱకు అనేక బోధలును ధర్మములును చెప్పఁబడినవి. వానినన్నిటిని భయభక్తులతోను మనఃపూర్వకముగాను అనుసరింపవలెను. చేయవలసిన ధర్మముల నాచరించి నిషేధింపఁబడిన వానిని వదలుకొనవలెను. దానికిఁగాను ఇందు భూమ్యాకాశములలోనున్న సమస్తము దేవునిదే. అవి యన్నియు దేవునిచే సృష్టింపఁబడి యాతనికధీనమైయున్నది. దేవుఁడు మానవులు తమ మనస్సులలో నిశ్చయించిన యుద్దేశముల నెఱుగుచు దాని లెక్కతీసికొని వాని వానికిఁ దగిన ఫలితము నొసంగును. మానవుఁడు తాను నిశ్చయించిన ఉద్దేశము మాటరూపకముగానో లేక క్రియారూపకముగానో వెలిపుచ్చును. లేక మనస్సులోనే దాఁచిపెట్టును. వెలిపుచ్చినను దాఁచినను సర్వమును దేవునికిఁ దెలియును. కపటము అసూయ మొదలగు దుర్గుణములు మనస్సులోనుండునవి. అవియును శిక్షకుఁదగినవి. దేవుఁడు లెక్కచూచి తాను ఇష్టపడిన పాపాత్ములను క్షమించును. మఱి తాను కోరిన వారిని శిక్షించును. ఆతఁడు సర్వశక్తుఁడు. కావున మానవులు భయభక్తులతో ధర్మకార్యములుచేయుచు దేవునిప్రీతిపడసి ముక్తి పొందవలెను.

285. ఆమనర్-రసూలు-బిమా ఉన్-జిల-ఇలైహి-మిర్‌రబ్బిహీ-వల్-మూమినూన-కుల్లున్- ఆమన-బిల్లాహి-వమలాఇ-కతిహీ - వకు-తుబిహీ-వరు-సులిహీ-లా-నుఫర్రిఖు-బైన-అహ-దిమ్-మిర్-రుసు-లిహీ-వఖాలూ - సమిఅ-నా-వఅత-అ-నా-గుఫ్-రానక-రబ్బనా-వ-ఇ-లైకల్-మసీర్. 286. లా-యుకల్లి-ఫుల్లాహు నఫ్-సన్-ఇల్లా-వుస్-అహా-లహా.మాకస-బత్-వ-అలైహా-మక్-తస-బత్-గబ్బనా లాతు-ఆ-ఖిజ్ నా-ఇన్-నసీనా-ఔ-అఖ్-తానా-రబ్బనా -వలా-తహ్-మిల్-అలైనా-ఇస్-రన్-కమా-హామల్-తహూ-అలల్లజీన-మిన్-ఖబ్-లినా-రబ్బనా-వలా తుహమ్మిల్-నా-మాలా-తాఖత-లనా-బిహీ-వఅ-ఫు అన్నా-వగ్-ఫిర్-లనా-వర్ హమ్‌నా-అన్త-మౌలానా-ఫన్-సుర్-నా-అలల్-ఖౌమిల్-కాఫిరీన్.

285. ప్రవక్త తన ప్రభువునుండి తనకు నొసంగఁబడిన గ్రంథమును విశ్వసించెను. ముసల్మానులుకూడ విశ్వసించిరి. అందఱును దేవునిని ఆతని దూతలను ఆతని గ్రంథములను ఆతని ప్రవక్తలను విశ్వసించిరి. మేము ఆతని ప్రవక్తల మధ్య నెట్టి భేదము (వ్యత్యాసము) లు కల్పింపము అని చెప్పుదురు. మఱియు వారు మేము వింటిమి. విధేయులైతిమి. మా ప్రభువా! నీ క్షమాపణ కోరుచున్నారము. నీయొద్దకు మరలి వచ్చువారలము అని పలికిరి. 286.

దేవుఁడు, ఏ యాత్మకైనను దాని శక్తికి మించిన కష్టమియ్యఁడు. అది సంపాదించినది (పుణ్యఫలితము) దానికి లభించును. అది చేసిన పాపములఫలితము దానికే లభించును. ఓ మా ప్రభువా! మేము మఱచినను లేక పొరపాటుచేసినను మమ్ము పట్టకుము. ఓ మా ప్రభువా! మఱి మాకు ముందు గడచిన వారిపై నీవువైచినట్టి భారము మాపై మోపకుము. ఓ మా ప్రభువా! మఱి మేము సహింపలేని భారమును మాపై నుంచకుము. మఱి మమ్ము వదలిపెట్టుము, మమ్ము క్షమింపుము. మఱి మమ్ము కరుణింపుము. నీవే మాకు సహాయుఁడవు. కావున నీవు అవిశ్వాసులపట్ల మాకు సహాయముచేయుము. (విజయము నొసంగుము). అని పలుకుఁడు.

వ్యా॥ 285. ఇఁక ఈగొప్పసూరా ముగియుచున్నది. సూరా ప్రారంభమునుండి యింతవఱకు బోధింపఁబడిన విశ్వాస ధర్మములను ప్రవక్తయును ముసల్మానులును విశ్వసించిరని దేవుఁడు సాక్ష్యమిచ్చుచున్నాఁడు. దేవుని వేడుకొను ప్రార్థన పద్ధతియు నిందు చెప్పఁబడుచున్నది. దేవుఁడొసంగు గ్రంథమును ప్రవక్తయగు హజ్రత్ ముహమ్మదువారును వారి శిష్యులగు ముసల్మాను భక్తులును భక్తిపూర్వకముగ నమ్ముచున్నారు. దేవుని, ఆతని దూతలను, ఆతఁడు ప్రవక్తలకు నొసంగిన మత గ్రంథములను, ఆతఁడు పంపిన ప్రవక్తలను విశ్వసించుచున్నారు. ప్రవక్తలమధ్య వ్యత్యాసములుచేయరు. ఒక ప్రవక్తనువిశ్వసించి మఱొకప్రవక్తను తిరస్కరింపరు. దేవుఁడు పంపిన ప్రవక్తలందఱినివిశ్వసింతురు. యూదులు హజ్రత్ ఈసాప్రవక్తను, క్రైస్తవులు హజ్రత్ ముహమ్మదురసూలు వారిని నమ్మక తిరస్కరింతురు. ఇట్లు ముసల్మానులు చేయరు. అందఱు ప్రవక్తలను విశ్వసింతురు. ముసల్మానులు దేవుఁడు పంపిన సందేశములను విని వానికి విధేయులై నడచుకొనుచు దేవుని క్షమాపణ కోరుచు తుదకు దేవుని యొద్దకే మరలిపోవలసియున్నది అని నమ్మెదురు. ఇవి ముసల్మాను భక్తులకుండవలసిన సుగుణములు.

వ్యా॥ 286. దేవుఁడు మానవులపై శక్తికొలఁదిచూచి భారము మోపును. మానవులశక్తికిమించిన మతధర్మమెద్దియును లేదు. కొందఱికి కొన్ని కష్టతరముగాఁ దోఁచినను అవి వాస్తవములో కష్టతరములైనవికావు. భక్తిపూర్వముగ ననుసరించిన అవి సులువుగానే యుండును. దేవుఁడు నియమించినధర్మములనుగూర్చియే లెక్కదీసికొనును. మానవుఁడు తాను చేసిన సత్కార్యముల పుణ్యఫలితము తానే అనుభవించును. అటులే పాపము చేసినవాఁడు తానే దాని శిక్ష ననుభవించును. ఎవరు చేసికొన్నది వారికే. ఇఁక మఱచిన లేక పొరపాటు గలిగినను మాతప్పు పట్టక క్షమించి వదలిపెట్టుము. పూర్వీకులగు ఇస్రాయీలీయులు మొదలైనవారిపైనుంచినటువంటి కష్టతరములైన భారము

లను మాపై మోపక సులువైన ధర్మములను నియమించి శక్తికిమించినవానిని నియమింపకుము. మా పాపములను, తుడిచివేసి మమ్ము శిక్షింపక వదలిపెట్టి క్షమించి మమ్ము కరుణింపుము. విశ్వాసులగు మాకు నీవే సహాయుఁడవును రక్షకుఁడవును. కావున అవిశ్వాసులగు శత్రువులపై ధర్మయుద్ధములందును మతసంవాదములందును మాకు విజయము నొసంగుము. అని ప్రార్థన సలుపునట్లు బోధింపఁబడియె, దేవుని ప్రార్థించునపుడు భయభక్తులతోను మనఃపూర్వకముగాను ప్రార్థింపవలెను. త్రికరణ (మనోవాక్కాయకర్మల) శుద్ధిగలిగియుండవలెను. అపు డది ఫలించును.

— 3. సూరయే ఆలె ఇమ్రాన్ మదనీ 200 వాక్యములు. —

ఇమ్రానుసంతతి విషయ మిందుండుటవలన దీని కీపేరు గలిగెను. ఇది హజ్రత్ పైగంబరులవారికి దేవునిచే మదీనాపురములో నొసఁగబడెను. అందుచే ఇది మదనీసూరా. ఇందు 200 వాక్యములుగలవు. దీనికిముందున్న సూరా ప్రారంభములో సన్మార్గము స్వీకరించుటలో విశ్వాసులను అవిశ్వాసులను గూర్చి చెప్పఁబడియెను. ఈ సూరాలో ఖురాను వాక్యములోని 'ముతషాబిహాత్, (రెండర్థములు గలవాని) అర్థములచేకలఁతలనొందువారినిగూర్చి, భయభక్తులుగల విద్యావంతులు వాని యర్థములనుగూర్చి ఎట్టి కలఁతలు నొందక విశ్వాసపూర్ణులగుదురు గాక యని ఆ విషయము చెప్పఁబడుచున్నది. మును పటి సూరాలో యూదులనుగూర్చి వివరముగాను నస్రానీల విషయము కొంచెముగాను చెప్పఁబడియెను. ఇఁక ఈ సూరాలో నస్రానీల (క్రైస్తవుల) విషయము వివరముగాను వారి నమ్మకములనుగూర్చి ఖండనలును గలవు. ముందు సూరాలో ధర్మయుద్ధము మొదలగు ధర్మములు చెప్పఁబడియెను. ఇఁక ఈసూరాలోకూడను వానికి తర్వాత రావలసిన ధర్మములు చెప్పఁబడుచున్నది.

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్.

అమిత దయగలవాఁడును, ప్రేమించువాఁడును అగు దేవుని పేర!

1. అలిఫ్-లామ్-మీమ్. దీని వ్యాఖ్యానము సూరేబఖరాలో వ్రాసియున్నాము. అచ్చట చూచుకొనునది. (చూ: పే: 5).

2. అల్లాహు-లా-ఇలాహ-ఇల్లా-హువల్-హయ్యుల్-ఖయ్యూమ్.

2. అల్లాతప్పమఱొకఁడు పూజ్యుఁడు లేఁడు. ఆతఁడు నిత్యజీవుఁడు (శాశ్వతుఁడు) ను సర్వమును కాపాడువాఁడును.

వ్యా॥ 2. ఈ వాక్యములో దేవుని యేకత్వము దెలుపఁబడినది. దీనిఁగూర్చి సూరేబఖరాలోని 254-వ వాక్యములో వ్రాసియున్నాము. అచ్చట చూచుకొనునది. నజ్రాను పురమునుండి అఱువదిమంది క్రైస్తవుల విద్వాం

సులు హజ్రత్ ముహమ్మదు పైగంబరులవారి సమ్ముఖమునకువచ్చి మతవిషయములో సంభాషించిరి. క్రైస్తవులు ఏసుక్రీస్తును దేవుడు అనియు, లేక దేవుని కుమారుడు అనియు లేక ఆయన ముగ్గురు దేవతలలో ఒక్కడు అనియు నమ్మెదరు. ఆ విశ్వాసము ఈ వాక్యములోను ఇక రాబోవు వాక్యములలోను రద్దుచేయబడినది. దేవుడు ఒక్కడు ఆతనికి సాటిలేదు. ఆతడే పూజ్యుడు. ఆతడు నిత్యజీవుడు. సర్వము సృష్టించి పోషించుచు సర్వమునకు ఆధారమైయున్నాడు. ఏసుక్రీస్తు తల్లిగర్భమునుండి పుట్టినయాతడు. ఆయన నిత్యజీవుడుకాడు. ఆతడు లోకమును సృష్టించి పోషించునతడుకాడు. కావున ఆయన దేవుడెట్లగును? ఆతనికి దేవునివలె పూజలుసలుపుట ఎట్లుతగును? కావున ఇట్లు నమ్మరాదు. ఆయన దేవుని సేవకుడు. దేవుని ప్రవక్తమాత్రమే.

3. నజ్-జల-అలై-కల్-కితాబ-బిల్-హఖ్ఖి-ముసద్దిఖల్-లిమా-బైన-యదైహి-వ-అన్-జలత్-తౌరాత-వల్-ఇన్-జీల-మిన్-ఖబ్లు-హుదల్-లిన్నాసి-వ-అన్-జలల్-ఫుర్-ఖాన. 4. ఇన్నల్లజీన-కఫరూ-బి-ఆయాతిల్లాహి-లహుమ్-అజా-బున్-షదీదున్-వల్లాహు-అజీ-జున్-జున్-తిఖామ్.

3. దేవుడు నీకు సత్యమైన గ్రంథమొసంగెను. అది పూర్వగ్రంథములను సత్యపఱచుచున్నది. దానికిముందు ప్రజలకు సన్మార్గముచూపుటకు తౌరాతును ఇన్జీలునుపంపెను. మఱియు ఫుర్ఖాను (సత్యము అసత్యము వేఱుపఱచునట్టి సూచనలు) పంపెను. 4. దేవునిసూచనలను తిరస్కరించినవారికి నిశ్చయముగా కఠినమైనశిక్ష (బాధ) యున్నది. మఱిదేవుడు సర్వశక్తుడు, శిక్షనొసంగువాడు.

వా॥ 3: 4. దేవుడు హజ్రత్ ముహమ్మదు ప్రవక్తకు క్రమముగా ఖురాను గ్రంథమొసంగెను. అదిసత్యమైనదియును సత్యధర్మములు గలదియును. అది దానికిపూర్వము పవిత్రులకు దేవునిచే నొసంగబడిన గ్రంథములు నిజమైనవి, వానిని దేవుడొసంగెను అని సత్యపఱచును. దేవుడు ఖురానొషరీఫునకు ముందు ప్రజలకు సన్మార్గముచూపుటకై మూసాప్రవక్తకు తౌరాతుగ్రంథమును, ఏసుక్రీస్తుప్రవక్తకు ఇన్జీలు గ్రంథము నొసంగెను. మఱియు ఆయాకాలమునకు తగినట్లు ఆయాప్రవక్తలకు సత్యమును స్థిరపఱచుచు అసత్యములను అధర్మములను రద్దుపఱచునట్టి సూచనలు ప్రమాణములు మతగ్రంథములు దేవుడొసంగెను. ఫుర్ఖాను అనుపదమునకు ఇవన్నియు అన్వయించును. దేవుడు పంపిన సూచనలను ధర్మములను తిరస్కరించువారికి తీవ్రమైనకఠినశిక్షయు

న్నది. దేవుఁడుసర్వశక్తుఁడును శిక్షనొసంగువాఁడును. కావున తిరస్కరించి అవిశ్వాసులగు వారు అతని శిక్షనుండి తప్పించుకొనఁజాలరు.

5. ఇన్నల్లాహ-లా-యఖ్ ఫా-అలైహి-షైఉన్-ఫిల్-అర్ జి-వలా - ఫిస్-సమాఇ. 6. హువ-ల్లజీ-యు-సవ్విరు-కుమ్-ఫిల్ -అర్-హామి-కైఫ - యషాఉ - లాఇలాహ-ఇల్లా-హువల్-అజీ - జుల్-హకీమ్.

5. భూమ్యాకాశములలోనున్నది ఎద్దియును దేవునికిమఱుఁగు లేదు. 6.ఆతఁడు(దేవుఁడు)తానుఇష్టపడినట్లు మిము గర్భములందు చిత్రించుచున్నాఁడు. ఆతఁడుతప్ప వేఱు దేవుఁడు లేఁడు. ఆతఁడు సర్వశక్తుఁడును, వివేచనాపరుఁడును.

వ్యా॥ 5. ఎట్లు దేవుఁడు సర్వశక్తుఁడో అటులే ఆతఁడు సర్వజ్ఞుఁడు. భూమిలోఁగాని, ఆకాశములోఁగాని, ఉన్నది ఎద్దియును ఆతనికిమఱుఁగు లేదు. విశ్వాసులను అవిశ్వాసులను సన్మార్గులను దుర్మార్గులను వారికర్మలను ఎఱుంగును. దానిననుసరించి వారికిఁదగినఫలితమొసంగును. పైఁజెప్పిన దేవునిశక్తులు ఏసుక్రీస్తునందులేవు. కావున ఆయన దేవుఁడుగాని దేవునికుమారుఁడు గాని కానేరఁడు అని హెచ్చరికగలదు. ఎట్లన దేవునికుమారుఁడు దేవునివంటివాఁడుగానుండవలెను. కుమారుఁడు తండ్రినిపోలియుండును. అట్లుకానేరదు. కావున ఆ విశ్వాసమువదలఁదగినది. 6. దేవుఁడు తనయిష్టముచొప్పున తల్లిగర్భమునందు బిడ్డలను పుట్టించుచున్నాఁడు. అందు ఆఁడుబిడ్డ, మగబిడ్డ సురూపి కురూపి మొదలగు చిత్రములు చేయుచున్నాఁడు. సర్వశక్తుఁడును ఉచితమెద్ది అని యెఱుంగినవాఁడును. కావున ఆతఁడుచేయుకార్యములలో నెట్టి అనుచితముండదు. ఏసుక్రీస్తు తండ్రిలేకయే తల్లి గర్భమునుండి పుట్టుటవలననే దేవుఁడుగాని దేవుని కుమారుఁడుగాని కానేరఁడు. ఏసుక్రీస్తు కూడ తనతల్లి గర్భమునందు దేవుని అద్వితీయ శక్తిచే చిత్రింపఁబడిన యాతఁడే. దేవుఁడు ఆదమును తల్లిదండ్రులు లేకయే పుట్టించెను. ఏసుక్రీస్తును తండ్రిలేకుండనే పుట్టించెను. కావున దేవుని శక్తికి మించినది ఎద్దియునులేదు.

7. హువ-వల్లజీ-అన్-జల-అలై-కల్-కితాబ-మిన్హు-ఆయా-తుమ్ - ముహ్కమాతున్-హున్న-ఉమ్ముల్-కితాబి-వఉఖరు-ముత-షాబిహా-తున్-ఫ-అమ్మల్లజీన-ఫీ-ఖులూ-బిహిమ్-జైగున్-ఫ-యత్-తబి-ఊన-మా-తషా-బహ - మిన్-హుబ్-తిగా-అల్-ఫిత్-నతి-వబ్-తిగాఅ-తావీలిహీ-వమా-య-అ-లము-తావీలహు-ఇల్-లల్లాహు-వర్ రాసి ఖూన-ఫిల్-ఇల్మి-యఖూ-లూన-ఆమన్నా- బి

హి- కుల్లున్-మిన్-ఇన్‌ది-రబ్బినా-వమా-యజ్-జక్కరు-ఇల్లా-ఉలుల్-అల్బాబ్. 8. రబ్బనా-లా-తుజిగ్-ఖులూ-బనా-బఅ-ద-ఇజ్-హదైతనా-వ-హబ్ - లనా-మిల్-లదున్క-రహ్మ-తన్-ఇన్నక-అన్‌తల్-వహ్హాబ్. 9. రబ్బనా-ఇన్నక-జామి-ఉన్నాసి-లియౌ-మిల్-లా-రైబ-ఫీహి-ఇన్నల్లాహ-లా-యుఖ్-లిఫుల్-మీఆద్.

7. ఆతఁడే (దేవుఁడు) నీకు గ్రంథ మొసంగినది. అందు కొన్ని ముహ్కమాత్ (స్పష్టమైన అర్థముగల) వాక్యములు గలవు. అవి గ్రంథమునకు మూలములు. మఱి ఇతర వాక్యములు కొన్ని ముతషాబిహాత్ వాక్యములున్నవి (స్పష్టముగా అర్థము కానివి). కావున ఎవరి హృదయములో వంకరయున్నదో వారు దుర్మార్గము వ్యాపింపఁజేయుటకుఁగాను వాని యర్థము తాము కోరినట్లు చేయుటకుఁగాను స్పష్టార్థములుకాని వాని ననుసరించుచున్నారు. వాని సరియైన అర్థము దేవునికే తెలియును. మఱి స్థిరమైనవిద్యాజ్ఞానములుగలవారు "మేము దానిని నమ్మితిమి. సమస్తమును మా ప్రభువునుండి వచ్చినదే" అని పలుకుదురు. మఱియు బుద్ధిమంతులే బోధనలను గ్రహించువారు. 8. ఓ ప్రభువా! నీవు మాకు సన్మార్గము చూపిన పిదప మా హృదయములను తప్పుత్రోవలకు పోనియ్యకుము. మఱి నీ దయను మాపై నుంపుము. నీవే సర్వమును ఒసంగువాఁడవు. 9. ఓ మాప్రభువా! నీవు సర్వజనులను ఒక దినము చేర్తువు. ఆదినమునుగూర్చి యేలాటి సందేహము లేదు. నిశ్చయముగా దేవుఁడు ఎప్పటికిని తానిచ్చిన మాటకు వ్యతిరేకము చేయఁడు అని పలుకుదురు.

వ్యా॥ 7. నజ్రానునుండి వచ్చిన క్రైస్తవ విద్వాంసులు మత సంవాదములో సరియైన సమాధానమియ్యలేక పోయి ఏసుక్రీస్తును 'కలిమతుల్లాహి' (దేవుని వాక్కు) రూహుల్లాహి (దేవుని ఆత్మ) అని ముసల్మానులు చెప్పుదురు గదా? ఇదియే మాకు చాలును అని పలికిరి. దానికి నిందు సరియైన సమాధాన మియ్యఁబడినది. ఖురానెషరీఫులోను, ఇతర మత గ్రంథములలోను గల వాక్యములు రెండువిధములు. ఒకటి గ్రహించుటకు ఏలాటి చిక్కులేకుండ స్పష్టమైన ఒకే అర్థముగల వాక్యములు. ఇట్టి వాక్యములే గ్రంథమునకు మూలాధారములు, వీని ననుసరింపవలెను. వీనినే ముహ్కమాత్ అందురు. రెండవది ఒక అర్థము లేక రెండుఅర్థములుగల వాక్యములు. ఇట్టివానిని ముతషాబిహాత్ అందురు. హృదయములలో వంకర (తప్పుత్రోవ పోవుగుణము)గలవారు. అట్టి అర్థములుగల వాక్యములకు తమ యిష్టానుసారము తప్పుటర్థములు చేసి సన్మార్గము వీడి అవిశ్వాసమును దుర్మార్గమును వ్యాపింపఁజేసి కలఁతలు పుట్టింతురు. అట్టి వాక్యములలో కలిమతుల్లాహిరూహుల్లాహి చేరినవి. దేవునివాక్కు మహిమ

వలన ఏసుక్రీస్తు తండ్రిలేకుండ పుట్టెను. కావున కలిమతుల్లాహిఅనియు గౌరవార్థము రూహుల్లాహి అనియు చెప్పినమాత్రమున ఏసుక్రీస్తు దేవుఁడుగాని దేవుని కుమారుఁడుగాని కానేరఁడు. ఈతనిఁగూర్చిగల ఇతర వాక్యములను బట్టి ఏసుక్రీస్తు దేవుని సేవకుఁడును ప్రవక్తయును మాత్రమే అని నిశ్చయమగును. ముతషాబిహాత్ యొక్క వాస్తవమైన అర్థము దేవునికే తెలియును. కావున స్థిరమైన విద్యాజ్ఞానములు గలవారు కలఁతలుపడక అన్నియు దేవుఁడొసంగిన వాక్యములే. వాని విశ్వసించితిమి అని చెప్పుదురు. బుద్ధిమంతులు దేవుఁడు చేయు బోధనలను గ్రహింతురు. వారు తప్పుత్రోవలకుఁబోరు- 8. విద్యావంతులు, మితమైన జ్ఞానముచే తమపైననే ఆధారపడక ఎల్లపుడుసర్వజ్ఞుఁడగు దేవునిని భయభక్తులతో ఇందు చెప్పఁబడినట్లుప్రార్థింతురు. 9.మృతినొందినవారందఱు, తమ పాపపుణ్యముల తీర్పుకొఱకు పునరుత్థాన దినమున దేవునిచే రప్పింపఁబడుదురు. ఆ దినము వచ్చుటలో ఏలాటి సందేహము లేదు. ఆ దినమున తప్పుత్రోవలలో పోయి దేవుని వాక్యములకు అపార్థములు కల్పించినవారు తమ తమ పాపఫలితములు పొందుదురు. దేవుఁడు తాను గావించిన వాగ్దానమును పూర్తి చేయును. దానికి వ్యతిరేకముగా నెప్పటికిని పోఁడు. అని విద్వాంసులు భయభక్తిగలిగియుందురు. అని హెచ్చరింపఁబడిరి.

10. ఇన్నల్ల-జీన-కఫరూ-లన్-తుగ్-నియ-అన్-హుమ్-అమ్వాలుహుమ్-
వలా-ఔలా-దుహుమ్-మినల్లాహి-షైఅన్-వ-ఉలా-ఇక-హుమ్-వఖూ-దున్నార్.
11. కదాబి-ఆలి-ఫిర్-ఔన-వల్ల-జీన-మిన్-ఖబ్-లిహిమ్-కజ్-జబూ-బిఆయా
తినా-ఫ-అఖ-జహు-ముల్లాహు-బిజునూ-బిహిమ్-వల్లాహు-షదీదుల్-ఇఖాబ్.
12. ఖుల్-లిల్ల-జీన-కఫరూ-సతుగ్-లబూన-వ-తుహ్-షరూన-ఇలా-జహన్నమ
వబీసల్- మిహాద్. 13. ఖద్-కాన-లకుమ్- ఆయతున్-ఫీ- ఫిఅతై-నిల్-తఖతా
ఫీ- అతున్-తుఖా-తిలు-ఫీ-సబీ-లిల్లాహి-వ-ఉఖ్రా-కాఫి-రతున్-యరా- నహు
మ్-మిస్-లైహిమ్-రాయల్-ఐని-వల్లాహు-యు- అయ్యిదు-బినస్-రిహీ-మఙ్-
యషాఉ-ఇన్న-ఫీ-జాలిక-లఇబ్-రతల్-లి-ఉలిల్-అబ్సార్.

16. నిశ్చయముగా, అవిశ్వాసులైనవారికి వారి ధనమును వారి సంతానమును దేవుని యొద్ద పనికిరావు. మఱివారే నరకాగ్నికి వంటచెఱకులు, 11. వారి విషయము ఫిరౌను జనులవలెను, వారికి ముందు గడచినవారివలె ఉన్నది. వారు మా సూచనలను (తిరస్కరించి) అబద్ధములని పలికిరి. కావున దేవుఁడు

వారి పాపములఁబట్టి వారిని పట్టెను. మఱి దేవుఁడు కఠినముగా శిక్ష విధించు వాఁడు. 12. అవిశ్వాసులైన వారితో "మీరు శీఘ్రములోనే లోఁబడుదురు. మఱి మీరు నరకమునకు పోవుదురు. అది చాల చెడ్డ నివాసము" అని ఓ ప్రవక్తా! చెప్పుము. 13. మార్కొనిన రెండు సైన్యములలో మీకు సూచన యున్నది. అందు ఒకసైన్యము దేవుని మార్గమందు యుద్ధమాడుచుండెను, రెండవది అవిశ్వాసుల సైన్యము. ముసల్మానులు అవిశ్వాసులను తమకన్న రెండింతలుగ కన్నులార చూచుచుండిరి. మఱియు దేవుఁడు తాను ఇష్టపడిన వారికి తన సహాయముచే బలమునిచ్చుచున్నాఁడు. ఇందు కన్నులు గలవారికి బోధనయున్నది.

వ్యా॥ 10. పై వాక్యములో పాపపుణ్యముల తీర్పుకొఱకు ఒక దిన మున్నది. అని చెప్పి అందు అవిశ్వాసులకు వారి ధనముగాని వారి సంతానముగాని దేవుని సమ్ముఖమున శిక్షనుండి తప్పించుటకు పనికిరావు, వారు నరకమునకు వంటచెఱకులుకాఁగలరు. కావున యూదులుక్రైస్తవులుపెక్కుదైవారాధకులుఅగు అవిశ్వాసులు ధనమును సంతతినినమ్మి మోసపోకవిశ్వాసము స్వీకరింపవలెను. 11. ధనసంతాన గర్వముచే మదించి దేవుని సూచనలను తిరస్కరించిన ఫిరౌను జనులు మొదలగువారివలె వారును దేవుని కఠిన శిక్షకు పాత్రులగుదురు. వారు పాపములుచేసినందున దేవుఁడు వారిని పట్టి శిక్షించెను. అటులే ముహమ్మదు ప్రవక్తను తిరస్కరించువారికి దుర్గతి అగును అని ముందు హెచ్చరికగలదు. 12. ఇందు రాఁబోవు ముసల్మానులవిజయము ను వారి విరోధుల అపజయమును సూచింపఁబడినది. హజ్రత్ ముహమ్మదు వారు మక్కాపురము విడిచి మదీనాపురమువచ్చి చేరిన పిదప ఖురైషులు, యూదులు, మొదలగు ఇస్లామ్మత విరోధులు పెక్కుమార్లు యుద్ధములు ముసల్మానులతోఁ జేసిరి. తుదకు దేవుఁడు ముందుగానే ప్రకటించినట్లు ముసల్మానులు విజయముపొందిరి. అవిశ్వాసులు లోఁబడిరి. అరేబియాదేశ మును ఇతర దేశములును ముసల్మానులకు అధీనములాయెను. ఈ విజయము ముసల్మానులకు దేవుని గ్రంథమను ఖురాను ధర్మమును హజ్రత్ ముహమ్మదువారి నడవడికను సంపూర్ణముగా ననుసరించినందువలనఁ గలిగెను. ఎప్పుడు ముసల్మానులు ఇస్లామ్ మతధర్మములను వీడిరో వారి విజయమును రాజ్యమును వారినుండి తొలఁగెను. కావున ముసల్మానులు తమ పూర్వస్థితికి రావలెనన్న ఖురానును హజ్రత్ ముహమ్మదువారిని పూర్తిగ అనుసరింపవలెను. అవిశ్వాసులకు వారి పాపముల ఫలితము నరకనివాసము. అది దుఃఖకరమైన చెడు నివాసము. 13. ఇందు బదరు యుద్ధములో సంభవించిన విషయము తెలుపఁబడెను. విజయము దేవుని చేతిలోనున్నది. తాను కోరినవారికి తనసహా

యమిచ్చి బలమిచ్చును. కన్నులు కలవారు దానిని చూచి బుద్ధి తెచ్చుకొందురు. బదరులో 313 మంది ముసల్మానుల సైనికులు అవిశ్వాసులగు ఖురైషుల సైనికులు దాఁదాపు వేయిమంది. ముసల్మానులయొద్ద ఆయుధములు మొదలైనవి ఎక్కువ లేకుండెను. ఖురైషులు అధిక యుద్ధసామగ్రితో వచ్చియుండిరి. హజ్రత్ మహమ్మదువారును వారి శిష్యులును విరోధులసైన్యము రెండింత లుండుట కన్నులార చూచియు దేవునిపై నాధారపడి యుద్ధమాడిరి. దేవుని సహాయమువలన ధర్మపక్షమందు యుద్ధమాడుచున్న ముసల్మానులు కొద్దివారయ్యు విజయము పొందిరి. ఇది చూచువారికి దేవుని మహిమ తెలియును. కావున బుద్ధిమంతులు దేవుని విశ్వసించి ఆతని అనుగ్రహమునకు పాత్రులగుదురు.

14. జుయ్యిన-లిన్నాసి-హుబ్-బుష్-షహ-వాతి-మినన్-నిసాఇ-వల్-బనీన-వల్-ఖనా-తీరిల్-ముఖన్-తరతి-మినజ్-జహ-బి-వల్-ఫిజ్జతి-వల్-ఖైలిల్-ముసవ్వమతి-వల్-అన్-ఆమి.వల్-హర్సి-జాలిక-మతా-ఉల్-హయా-తిద్దున్యా-వల్లాహు-ఇన్దహూ-హుస్నుల్-మ-ఆబ్.

14. ప్రజలకు, స్త్రీలు, కుమారులు, కూర్చిన వెండి బంగారు రాసులు, గుర్తులు గల మేలి గుఱ్ఱములు, పశువులు, పొలములు, మొదలగు మనోహరమైన వస్తువుల ప్రేమ బాగుగఁగనఁబడును. ఇది ఇహలోక జీవనముయొక్క లాభము. మఱి దేవుని యొద్దనున్నది మంచినివాసము.

వ్యా|| 14.హజ్రత్ పైగంబరులవారి యొద్దకువచ్చిన కైస్తవ విద్వాంసుల అధ్యక్షునికి మతవిషయ సంభాషణలో ఇస్లామ్ మతము సత్యమని స్పష్టమాయెను. కాని ఆతఁడు ఇస్లామును స్వీకరింపక రోమను రాజువలన ఆతనికి గలిగిన గౌరవపదవి ధనము మొదలగునవి హజ్రత్ పైగంబరులవారితో విన్నవించెను. అందుకు మునుపటి వాక్యములోను ఈవాక్యములోను సహజముగ మానవులు, స్త్రీలు, కుమారులు మొదలగువాని మోహములోనే నిమగ్నులై పరలోకమును వదలుదురు. అట్లువలదు. దేవుని సన్నిధానమున లభించు నివాసము చాలమంచిది. దానికిమించినదిలేదు. కావున ఇహలోకసౌఖ్యములు పోవునని పరమును వీడరాదు. సాధారణముగా లోకులు ఈవాక్యములో చెప్పఁబడిన ఆఱు విషయములలో నిమగ్నులైయుందురు. మేలిగుఱ్ఱములకు గుర్తులు వేయుదురు. కావున భక్తులు వీనిని పరమునకు నుపయోగకరములైన సాధనములుగాఁ జేసికొనవలెను.

15. ఖుల్-అవు-నబ్బి-ఉకుమ్-బి-ఖైరిమ్-మిన్-జాలి-కుమ్-లిల్లజీ - నత్-

ఖా-ఇన్ద-రబ్బిహిమ్-జన్నా-తున్-తజ్రీ-మిన్-తహ్తి-హల్ అన్-హారు-ఖాలిదీన-
ఫీహా-వ అజ్వాజుమ్-ముతహ్హ-హరతున్ వరిజ్-వానుమ్-మినల్లాహి- వల్లాహు
బసీరుమ్-బిల్-ఇబాద్. 16. అల్లజీన యఖూ-లూన రబ్బనా-ఇన్ననా- ఆమ
న్నా-ఫగ్-ఫిర్-లనా-జునూ-బనా-వఖినా-అజా-బన్నార్.17.అస్-సాబిరీన-వస్
సాదిఖీన-వల్-ఖానితీన-వల్-మున్-ఫిఖీన-వల్-ముస్-తగ్-ఫిరీన-బిల్-అస్-హార్.

15. దానికంటె మేలైనది మీకు దెలుపుదునా! అని ఓ ప్రవక్తా! పలుకుము. భక్తిపరులకు తమప్రభువుదగ్గఱ స్వర్గవనములున్నవి. అందు కాలువలు ప్రవహించును. అందు వారు సదాయుందురు. మఱియు పవిత్ర స్త్రీలు గలరు. మఱి దేవుని ప్రీతిగలుగును. మఱి దేవుఁడు భక్తులను చూచుచున్నాఁడు. 16. వారు "ఓ మా ప్రభువా! మేము విశ్వసించితిమి. కావున మాపాపములను క్షమింపుము. మఱి నరకాగ్నినుండి మమ్ము తప్పింపుము అని పలుకుదురు. 17. వారు సహనముగలవారును, సత్యవంతులును, విధేయులును, ఖర్చు (దానము) చేయువారును, వేకువజామున తమ పాపముల క్షమాపణకోరువారును,

వ్యా॥ 15:16:17. ఇహలోకభోగములు నశించునవి. వానికి శాశ్వతము లేదు. వానికంటె మేలైనది పరలోకసౌఖ్యము. దేవుని ప్రీతియును స్వర్గనివాసము ఆందలి సౌఖ్యములు సదాయుండునవి. మఱియు దేవునిప్రీతికంటె మించినది ఏద్దియునులేదు. స్వర్గసౌఖ్యములును దేవునిప్రీతియును భయభక్తులుగలిగి పైవాక్యములలో వివరింపఁబడిన సుగుణములుగలవారికే లభించును. అట్టివారే నరకాగ్ని బాధనుండి తప్పించుకొందురు. క్రియాశూన్యమైన వట్టిమాటలవలన మోక్షముచేకూరదు. దేవుఁడు భక్తులుచేయు కార్యములను చూచుచునే యున్నాఁడు. వారి భక్తికొలఁది వారికి ఫలితమొసంగును. కావున భ్రమపడి భక్తులు మోసపోక దేవుని ధర్మములను సదా భక్తి వినయములతో అనుసరింపవలెను. వేకువజామున ప్రార్థనలుసలిపి పాపక్షమాపణకోరుటలో ఆసమయమునందు మనస్సు చలింపక నిలుకడగానుండును. అపుడు సాధారణప్రజలకు నిద్ర గాఢముగావచ్చును. ఏలాటిశబ్దములుండవు. అట్టిసమయమున భయభక్తులతో దేవునిప్రార్థించుటకు వీలగును.

18. షహి-దల్లాహు అన్నహూ-లా-ఇలాహ-ఇల్లా-హువ వల్-మలా-ఇకతు-వ-ఉలుల్-ఇల్మి-ఖా-ఇమన్-బిల్-ఖిస్తి-లా ఇలాహ-ఇల్లా-హువల్- అజీ-జుల్-హకీమ్.

19. దేవుఁడుతప్ప వేఱుపూజ్యుఁడులేఁడు అనుటకు దేవుఁడును దేవదూ

తలును విద్యావంతులును సాక్షులు. ఆతఁడే న్యాయాధికారి. ఆతఁడుతప్ప వేఱు దేవుఁడులేఁడు. ఆతఁడు సర్వశక్తుఁడును సర్వజ్ఞుఁడును వివేచనాపరుఁడును.

వ్యా॥ 18. భక్తుల విశ్వాసఫలితమును వారిగుణములును వివరించినపిదప అన్నిటికి మూలమైనదేవుని యేకత్వము (తౌహీదు)నుగూర్చి యిందు చెప్పఁబడినది. దేవుఁడు తానుఒక్కఁడే అనియు తానే పూజ్యుఁడనియు అనేక సూచనలమూలమున ప్రజలకు స్పష్టపఱచియున్నాఁడు. అదియే ఆతనిసాక్ష్యము. దేవదూతలును విద్యావంతులును దేవుఁడుఒక్కఁడేయని యెఱింగి సాక్ష్యమిచ్చుచున్నారు. దేవదూతలు దేవునియుత్తరువులను శిరసావహించువారు. వారు దేవునికివిరుద్ధముగాపోఁజాలరు విద్యావంతులు ప్రతికాలములోను దేవుఁడు ఒక్కఁడే అని సప్రమాణముగాపలుకుచువచ్చినారు. దేవుఁడు న్యాయాధికారి న్యాయమునకు వ్యతిరేకముగ తీర్పుచేయఁడు. ఎవరుచేసిన పాపపుణ్యములకు వారేబాధ్యులు. క్రైస్తవులు ఏసుక్రీస్తు అందఱిపాపములకు పరిహారముగ తనఆత్మను అర్పించియున్నాఁడు అని నమ్మెదురు. ఇందు దానిరద్దుగలదు. దేవుఁడు సర్వశక్తుఁడు. కావున పాపులు ఆతనిశిక్షనుండి తప్పించుకొనిపోఁజాలరు. సర్వజ్ఞుఁడు కావున ప్రజలుచేసిన ప్రతికర్మ ఆతనికి దెలియును. దాని ఫలితము వారికి నొసంగును.

19. ఇన్నద్-దీన-ఇన్‌దల్లా-హిల్-ఇస్లాము-వ-మఖ్-తల-ఫల్లజీన - ఊతుల్-కితాబ-ఇల్లా-మిమ్-బఅ్-ది-మా-జా అ-హుముల్-ఇల్ము-బగ్‌యమ్-బైన హుమ్-వమన్-యక్-ఫుర్-బి-ఆయాతిల్లా-హి-ఫ-ఇన్నల్లాహ-సరీఉల్-హిసాబ్. 20. ఫ-ఇన్-హాజ్జూక-ఫఖుల్-అస్-లమ్తు-వజ్-హియ-లిల్లాహి-వ-మనిత్ తబ-అని-వఖుల్-లిల్ల-జీన-ఊతుల్-కితాబ-వల్-ఉమ్మీ యీన-అ-అస్-లమ్‌తుమ్-ఫ-యిన్-అస్‌లమూ-ఫ-ఖదిహ్‌-తదౌ-వఇన్-తవల్‌లౌ-ఫ-ఇన్నమా-అలైకల్-బలాగు-వల్లాహు-బసీరుమ్-బిల్-ఇబాద్.

19. నిశ్చయముగా దేవునికి ప్రియ (సమ్మత) మైన మతము ఇస్లాము. గ్రంథములుగలవారు తమకు జ్ఞానముగలిగినపిదప తమలోని ద్వేషముచే విరోధులైరి. ఎవరు దేవుని సూచనలను తిరస్కరింతురో వారిలెక్క దేవుఁడు శీఘ్రముగా తీసికొనును. 20. మరలవారు నీతో వివాదములాడినచో నేనును నా అనుచరులును దేవునియాజ్ఞలకు శిరసావహించితిమని పలుకుము. గ్రంథముగల వారితోను, ఏమి మీరు విధేయులైతిరా అని పలుకుము. మఱి వారు విధేయులైనచో వారు సన్మార్గము పొందినవారైరి. మఱి తిరస్కరించి ముఖము

త్రిప్పుకొన్నచో ప్రచారముచేయుటయే నీ పని. మఱియు దేవుఁడు మానవులను చూచుచునే యున్నాఁడు.

వ్యా॥ 19. ఇస్లామ్ అనఁగా విధేయత సర్వము వినియోగించుట. మానవులు దేవుని యాజ్ఞలకు విధేయులై తమ సర్వవాంఛలను దేవుని యాజ్ఞలకు లోఁబడియున్నట్లు చేయుట. మొట్టమొదటి ప్రవక్తయగు హజ్రత్ ఆదము నుండి ఆఖరు ప్రవక్త హజ్రత్ ముహమ్మదురసూలువారివఱకు అందఱు ప్రవక్తలు మానవులకు బోధించినది ఒక మతమే. అది దేవునికి విధేయులైయుండుట. అదియే ఇస్లామ్. అదియే దేవునికి సమ్మతమైనదియును ప్రియమైనదియును. త్రికరణశుద్ధిగ దేవుని యాజ్ఞలను ధర్మములను అనుసరించుటయే మోక్షమార్గమును సన్మార్గమును. యూదులు క్రైస్తవులు దేవునిగ్రంథములు పొందినవారు. వారు హజ్రత్ పైగంబరులవారు దేవుని ప్రవక్తలని వారు బోధించు మతము దేవునికి ప్రియమైన ఇస్లామ్మతమని తెలిసియు ద్వేషముచే విరోధులైరి. తిరస్కరించు వారి కర్మల లెక్క తీసికొని దేవుఁడు వారి పాప కార్యములకు కఠిన శిక్ష విధించును. 20. నిజము తెలిసిన పిదపఁ గూడ వారు (క్రైస్తవులు యూదులు) వివాదములాడినచో కాలహరణము కాకుండుటకై నేనును నన్ను అనుసరించువారలగు ముసల్మానులును దేవుని యాజ్ఞలకు శిరసావహించితిమి అని పలుకుము. వృథా వివాదములలో కాలము పోఁగొట్టకూడదు. తెలిసియు ద్వేషమునకు పూనుకొన్నవారు సన్మార్గమునకు వత్తురా? గ్రంథముగలవారు చదువులేనివారు (అరబ్బులు) దేవునికివిధేయులై ఇస్లామ్ స్వీకరించినచో వారు సన్మార్గముపొందినవారగుదురు. లేక తిరస్కరించి అవిధేయులైనచో వారి కర్మల ఫలితము వారికి లభించును. ప్రవక్త పని ప్రచారముచేయుట మాత్రమే. వారు విశ్వాసులుకాలేదే అను బాధ్యతప్రవక్తకును బోధకులకును లేదు. మానవులు చేయు కర్మలను దేవుఁడు చూచుచునే యున్నాఁడు. వారి కర్మలకుఁ దగిన ఫలితము ఉభయలోకములలో నొసంగును.

21. ఇన్నల్లజీన-యక్ఫురూన-బి-ఆ-యాతిల్లాహి-వ-యఖ్తులూ-నన్-నబియ్యీన-బిగైరి-హఖ్ఖిన్-వ-యఖ్తులూ-నల్లజీన-యామురూన-బిల్-ఖిస్తి-మినన్-నాసి-ఫ-బష్షిర్-హుమ్ బి అజా-బిన్-అలీమ్. 22. ఉలా-ఇకల్ల-జీన-హాబితత్-అఅ-మాలు-హుమ్-ఫిద్-దున్యా-వల్-ఆఖిరతి-వమా-లహుమ్ మిన్-నాసిరీన్.

21. ఎవరు దేవునియాజ్ఞలను తిరస్కరించుచు దేవుని ప్రవక్తలను అన్యాయముగ చంపుచు న్యాయముగ వర్తింపవలెను అని ఆజ్ఞాపించునట్టి ప్రజ

లను చంపుచున్నారో వారికి దుఃఖకరమైన బాధయున్నది. అని వారికిసంతోష వార్త నిమ్ము. 22. అట్టివారి కర్మలు ఇహమునందును పరమునందును వృథా పోయినవి. మఱియు వారికి సహాయుండు ఎవండును లేండు.

వ్యా॥ 21 : 22. యూదులు అనేక ప్రవక్తలను చంపిరి. బోధకులను కూడ చంపుచుండిరి. వారు హజ్రత్ ముహమ్మదువారిని వారి శిష్యులను చంపుటకు యత్నించిరి. న్యాయముగా వర్తింపవలెనని బోధించువారిని ప్రవక్తలను చంపుట అన్యాయముగదా! దానికి మించిన హింస వేఱున్నదా? అందులకే అట్టి దుష్టులకు దుఃఖకరమైన నరకబాధయున్నది. అందు వారు శాశ్వతముగా వసింతురు. అను వార్త వారికిఁ దెలుపఁబడియె. అట్టివారి కర్మలు ఉభయలోకములలోను నిష్ఫలమై పోవును. వారికి దేవుని శిక్షనుండితప్పించునట్టి సహాయులు యెవఁడునులేఁడు. అట్టి దుర్మార్గులకు ఎవరుతోడుపడఁగలరు! అట్టి పాపమునకు భక్తులుపూనరాదు.

23. అలమ్-తర-ఇలల్లజీన ఊతూ-నసీ-బమ్-మినల్-కితా-బి-యుద్-ఔన-ఇలా-కితా-బిల్లాహి,లి-యహ్కుమ-బైన-హుమ్-సుమ్మ-యత-వల్లా- ఫరీఖుమ్.మిన్-హుమ్-వహుమ్-ముఅ-రిజూన. 24. జా-లిక-బి-అన్న-హుమ్-ఖాలూ-లన్-తమస్స-నన్నారు-ఇల్లా-అయ్యా-మమ్-మఅ-దూదాతిన్-వగర్ర-హుమ్-ఫీ-దీనిహిమ్-మా-కానూ-యఫ్-తరూన్. 25. ఫకైఫ ఇ-జా-జమఅ-నాహుమ్-లియౌ-మిల్-లా-రైబ-ఫీహి-వ-వుఫ్ ఫియత్-కుల్లు-నఫ్-సిమ్-మా- కస-బత్-వహుమ్-లా-యుజ్-లమూన్.

23. గ్రంథములనుండి కొంతభాగము లభించినవారిని దేవునిగ్రంథము వైపునకు రండు. అది తీర్పుచేయును అని పిలువఁగా వారిలో కొందఱు తిరస్కరించుచు ముఖము త్రిప్పుకొని పోవుటను నీవు చూడలేదా! 24. వారట్లు చేయుటకు కారణమేమనఁగా వారు "కొన్నిదినములు మాత్రమే మమ్ము నరకాగ్ని తాఁకును" అని చెప్పుదురు. వారు తాము కల్పించిన విషయములనుబట్టి వారు తమ మతమందు మోసపోయియున్నారు. 25. మరల మేము సందేహాములేనట్టి దినమునందు వారిని చేర్చినపుడు వారి గతి యేమగునో! ప్రతియాత్మయును తాను చేసిన కర్మల ఫలితము పూర్తిగ పొందును. మఱి ఎట్టి అక్రమము వారిపై జరుగనేరదు.

వ్యా॥ 23 : 25. యూదులును క్రైస్తవులును దేవుఁడొసంగిన గ్రంథములనుండి కొంతభాగము గలిగియున్నారు. దాని జ్ఞానము వారికి కొంతగలదు.

అట్టివారికి కొంత గలదు. అట్టివారిని దేవుని గ్రంథములగు ఖురానును తౌరాతును ఇన్జీలును అనుసరించి మత విషయములలో తీర్పు పొందవచ్చును అని పిలువంగ వారు తిరస్కరించి ముఖము త్రిప్పుకొని పోవుదురు. వారి కోరికలకు విరుద్ధముగానున్న తమ మతగ్రంథమునుకూడ లెక్కపెట్టక తిరస్కరించువారు వారి గ్రంథములును నిజపఱచు గ్రంథమగు ఖురానును లెక్కపెట్టి దానిని అనుసరింతురా ! తిరస్కరించువారిలో కొందఱి స్వభావ మదియై యున్నది. దానింగూర్చి చింత చేయనక్కఱలేదు. వారు మేము దేవుని కుమారులము. దేవుని పవిత్రకులవంశమువారలము. పాపములు చేసినను పర్వాలేదు. కొన్ని దినములు మాత్రము నరకములో నుందుము. తరువాత స్వర్గములో ప్రవేశింతుము అని తప్పునమ్మిక వారికిం గలిగినందున వారు అట్లు తిరస్కరించుటకు కారణ మగుచున్నది. అట్లు వారు కల్పించికొన్న మతమునందుం దగులుకొని మోసపోయి ధర్మమును విడనాడుచున్నారు తీర్పుదినమునందు వారి వారి కర్మఫలితము వారికి లభించు దినమున వారి గతి ఏమగునోయూహింపవలెను. అపుడు ఏలాటి అక్రమము జరుగదు. కర్మలకు తగిన ఫలితము లభించును. కావునమానవులు తప్పు నమ్మకములకు మోసపోక భయభక్తులతో సత్కార్యములుఆచరింపవలెను.

26. ఖులిల్లా-హుమ్మ-మాలికల్-ముల్కి-తూతిల్-ముల్ క-మన్-తషాఉ-వతన్ జిఉల్-ముల్క-మిమ్మన్-తషాఉ-వతు-ఇజ్జు-మన్-తషాఉ-వ-తు-జిల్లు-మన్ తషాఉ-బియ-ది-కల్-ఖై రు-ఇన్న క-అలా కుల్లి-షై యిన్-ఖదీర్. 27. తూలి-జుల్ లై ల-ఫిన్ నహారి-వ-తూలి-జున్-నహార-ఫిల్-లై లి-వతుఖ్-రిజుల్-హయ్యా-మినల్-మయ్యితి-వతుఖ్-రిజుల్-మయ్యిత-మినల్-హయ్యి-వ-తర్ జుఖు మన్ తషాఉ-బిగై రి-హిసాబ్.

27. రాజ్యమునకు అధిపతి యగు దేవా ! నీవు ఇష్టపడిన వారికి రాజ్య మొసంగుదువు మఱినీవు కోరినవారినుండి రాజ్యముతొలంగింతువు. మఱియు నీవు ఇష్టపడినవారికి గౌరవ మొసంగుదువు. మఱినీవు కోరినవారిని అవమానింతువు. నీచేతిలోనే మేలున్నది. నిశ్చయముగా నీవు సర్వశక్తుండవు. 27. నీవు రాత్రిని పగటిలోనికి ప్రవేశింపం జేయుచున్నావు. మఱి పగటిని రాత్రిలోనికి ప్రవేశింపం జేయుచున్నావు. మఱి నీవు జీవులను నిర్జీవులనుండి తీయుచున్నావు. మఱి నిర్జీవులను జీవులనుండి తీయుచున్నావు. మఱినీవు కోరినవారికి లెక్కలేకుండ సంపదలునొసంగుదువు. (అనుగ్రహింతువు.) అని పలుకుము.

వ్యా॥ 26. క్రైస్తవులు రాజ్యము గౌరవము పోవును అని ఇస్లామ్‌లో

చేరకుండిరి. యూదులు ప్రవక్తపదవి మావంశములోనేయుండును అని భ్రమ పడి దేవునిశక్తినిమఱచిపోయిరి. అందుకు ఈవాక్యములో ప్రార్థనమూలమున సర్వము దేవునిచేతిలోనున్నది. రాజ్యమునకు ఆతఁడే అధిపతి. తానుకోరిన వారికి రాజ్యమొసంగును. అందు ఇహలోకరాజ్యమును, దైవిక రాజ్యమగు ప్రవక్త పదవియునుగలదు. దేవుఁడు కోరినివారికి గౌరవము సమ్మానము దయ చేయును. తానుకోరినవారిని రాజ్యము లాగుకొని హీనదశలో పడవేయును. సర్వవిధముల మేలు దేవునిచేతిలోనున్నది. ఆతఁడు సర్వశక్తుఁడు. తాను ఇష్టపడి నట్లుచేయును. ఆతనికెవరును అడ్డుపడలేరు. దేవుఁడు సెలవిచ్చినట్లు హజ్రత్ ముహమ్మదువారికి ప్రవక్తపదవి లభించి కొంతకాలములోనే అరేబియాదేశ మును దానికి చుట్టుపట్లనున్న దేశములును ముసల్మానులకు అధీనములై అందు ఇస్లామ్‌రాజ్యము స్థాపింపఁబడెను. 27. రాత్రింబవళ్ళను హెచ్చు తగ్గులుగాఁ చేయుశక్తి దేవునికేయున్నది. కొన్నిఋతువులలో రాత్రిపగటికంటె హెచ్చు గానుండును. కొన్నిఋతువులలో రాత్రికంటె పగలు హెచ్చుగానుండును. నిర్జీవినుండిజీవులను, జీవులనుండి నిర్జీవులను పుట్టించుట దేవునిపనియే. దాని యుదాహరణములు, గ్రుడ్డునుండి పక్షిని పక్షినుండి గ్రుడ్డును రేతస్సునుండి మానవుని మానవునుండి రేతస్సును పామరునుండి విద్యావంతుని విద్యావంతు నుండి పామరుని పుట్టించుట. దేవుఁడు తాను ఇష్టపడిన వారికి లెక్కలేకుండ ఉభయలోకములకు సంబంధమైనవి అనుగ్రహించుచున్నాఁడు. అందు ఇహలోక సంపదలును పరలోక మోక్షమునుగలవు.

28. లాయత్-తఖి-జిల్-మూమి-నూనల్-కాఫి-రీన-ఔలియాఅ-మిన్-దూనిల్-మూమి-నీన-వమన్-యఫ్-అల్-జాలిక-ఫలైస-మినల్లాహి-ఫీషైయిన్-ఇల్లా-అన్-తత్తఖూ-మిన్‌హుమ్-తుఖా-తన్-వయుహజ్జి-రు-కుముల్లాహు-నఫ్-సహూ-వ-ఇలల్లా-హిల్-మసీర్. 29. ఖుల్-ఇన్-తుఖ్-ఫూ-మా-ఫీ-సుదూ-రికుమ్-ఔ-తుబ్-దూహు-యఅ-లమ్-హుల్లాహు-వయఅ-లము-మాఫిస్-సమా-వాతి-వమా-ఫిల్-అర్-జి-వల్లాహు-అలా-కుల్లి-షైయిన్-ఖదీర్. 30. యౌమ-తజిదు-కుల్లు-నఫ్-సిమ్-మా-అమి-లత్-మిన్-ఖైరిమ్-ముహ్-జరన్-వమా అమి-లత్-మిన్-సూయిన్ తవద్దు-లౌ-అన్న-బైనహా-వబై-నహూ-అమ-దమ్-బఈ-దన్-వయుహజ్-జిరు-కుముల్లా-హు-నఫ్-సహూ-వల్లాహు-రఊ-ఫుమ్-బిల్-ఇబాద్.

28. ముసల్మానులు ముసల్మానులనువీడి అవిశ్వాసు(కాఫరు)లతో సఖ్య

ము చేయరాదు. మఱెవరట్లుచేయుదురో వారికి దేవునితో ఏలాటి సంబంధ ముండనేరదు. కాని అవిశ్వాసులనుండి నష్టము కలుగకుండుటకై సఖ్యముచేయ వచ్చును. మఱియు దేవుఁడు తన్నుఁగూర్చి భయపెట్టుచున్నాఁడు. మఱి దేవుని యొద్దకు తిరిగిపోవలసియున్నది. 29. మీరు మీ హృదయములలోనున్నది దాఁచినను, లేక వెలిపుచ్చినను అది దేవునికిఁదెలియును. మఱియు అతఁడు ఆకాశములలోను భూమిలోనున్న సమస్తము నెఱుంగును. మఱియు దేవుఁడు సర్వశక్తుఁడు. 30. ఆదినమున ప్రతి మానవుఁడును తాను చేసినపుణ్యము తన యెదుట కనును. పాపముచేసిన దానివిషయము, పాపమునకు తనకును చాల దూరమగుఁగాక అని కోరును. మఱియు దేవుఁడు తన్నుగూర్చి మిమ్ము భయ పెట్టుచున్నాఁడు. మఱియు దేవుఁడు భక్తులయందు చాల దయగలవాఁడు.

వ్యా॥ 27. ముసల్మానులు, తమ ముసల్మానులనువదలి వారలకువిరోధ ముగా కాఫర్లతో స్నేహము చేయరాదు. అట్లుచేయుటవిశ్వాసమునకు విరో ధము. ముసల్మానుల లాభమునకు కాఫర్లనుండి నష్టము కలుగకుండుటకై వారి తో సఖ్యముచేయవచ్చును. లోకవ్యవహారములును, వర్తకము మొదలగు విష యములును, కాఫర్లతో కలిసి న్యాయముగాను మర్యాదగాను చేయవచ్చును ఏకాఫర్లు ముసల్మానులకు విరోధులుగాకయుందురో వారితో సంధిసఖ్యము చేయవచ్చును. రాజకీయ విషయములలో ముసల్మానులకు స్వాతంత్ర్యము, లా భముగలుగునపుడు, ఇతరమతస్థులతో సఖ్యముచేసికొని, తమస్వాతంత్ర్యము కొఱకు పాటుపడవలెను. తమకు నష్టముగలిగించు సంధిగాని సఖ్యముగాని ఇత రులతో ముసల్మానులు చేయరాదు, అట్లుముసల్మానులకునష్టము కలిగించుటకు సఖ్యము చేసినచో, దేవునికిని అట్టివారికిని ఏలాటి సంబంధముండదు. వారు దేవునిశిక్షకు పాత్రులగుదురు. తుదకు దేవునియొద్దకే మరలవలసియున్నది. అపుడు తత్ఫలితము లభించును. తీర్పుదినము రానున్నది. ఆదినము పుణ్య ములుచేసినవారు తమపుణ్యములను తమ ఎదుటకందురు. వానిచూచి సంతసిం తురు. కానిపాపులు తమ పాపములను జూచి పాపములకును వారికిని చాలదూ రమున్నచో బాగుండునే అనికోరుదురు. వారిపాపఫలితము వారికిలభించియే తీరును. కావున దేవునిశిక్షకు భయపడి ముసల్మానులు తమమతసహోదరులకు నష్టముకలిగించుటకై మతవిరోధులగు కాఫర్లతో సఖ్యముచేయరాదు. దేవుఁ డుభక్తులయందు దయగలవాఁడు. కావున శిక్షకుపాత్రులుకాకుఁడ భక్తిమార్గ మనుసరింపవలెను అని ముందుగానే భయపెట్టుచున్నాఁడు. కావున దేవుఁడు సెలవిచ్చినట్లు భక్తులు అనుసరించినచో ఆతనిదయకు పాత్రులగుదురు.

30. ఖుల్-ఇన్‌కున్తుమ్ - తుహిబ్బూనల్లాహా-ఫత్-తబిఊనీ-యుహ్బి-

బిబ్-కుముల్లాహు-వ-యగ్-ఫిర్-లకుమ్-జునూ-బకుమ్-వల్లాహు-గఫూరుర్ ర హీమ్. 31. ఖుల్-అతీ-ఉల్లాహ-వర్-రసూల-ఫ-ఇన్-తవల్లౌ-ఫయిన్నల్లాహ లా-యు-హిబ్-బుల్-కాఫి-రీన్.

31. మీరు దేవునియందు ప్రీతిగలిగియున్నచో నన్ను అనుసరింపుడు. దేవుడు మిమ్ము ప్రేమించును. మఱియుమీపాపములను క్షమించును. దేవుడు క్షమించువాడు. దయగలవాడు అని చెప్పుము. 32. మీరు దేవునికిని ప్రవక్తకును విధేయులు కండు అని పలుకుము. పిదప వారు తిరస్కరించినచో దేవుడు తిరస్కరించువారిని ప్రేమింపడు.

వ్యా॥ 31 : 32. యూదులు క్రైస్తవులు మేము దేవుని కుమారులము, మేము ప్రియులము, అని చెప్పుకొనుచు, ఇస్లామును స్వీకరింపకుండిరి అటులే పెక్కుమంది మేము దేవునియందు ప్రేమ భక్తిగలిగియున్నామని చెప్పుచు అనేక అధర్మకార్యములు చేయుదురు. కావున దేవునియందు భక్తి ప్రేమ లున్నచో దానికి గుర్తుగా దేవుని ప్రవక్తయగు హజ్రత్ ముహమ్మదు పైగంబరులవారి ననుసరింపవలెను. ఎంత ప్రేమయుండునో అంత విధేయత గలిగి యుండవలెను, వట్టిమాటలవలన ఫలితములేదు. పైగంబరులవారి ననుసరించి నచో దేవుడు ప్రేమించును, ఇస్లాము స్వీకరింపకముందు చేసిన పాపములను క్షమించును. దయచూపును. దేవుడు క్షమించువాడును దయచూపువాడును. దేవుని గ్రంథమగు ఖురానును అనుసరించిన దేవునికి విధేయులైనట్లు. దేవుని ప్రవక్తయగు హజ్రత్ ముహమ్మదురసూలువారి యాచారములను వారి పద్ధతుల ననుసరించినచో వారికి విధేయులైనట్లు. అట్లు విధేయులు గాకుండ తిరస్కరించినచో అవిశ్వాసులగుదురు. అవిశ్వాసులు దేవునికి ప్రియులుకారు. వారిని దేవుడు ప్రేమింపడు. కావున దేవునికి ప్రియులు కావలెనన్న దేవునికిని అతని ప్రవక్తకును విధేయులై యుండవలెను.

33. ఇన్నల్లాహస్-తఫా-ఆదము-వనూహన్-వ-ఆల-ఇబ్రాహీమి వ-ఆల-ఇమ్రాన-అలల్-ఆల-మీన్. 34. జుర్రీ-యతన్,బఅ-జుహా-మిమ్-బఅ-జిన్-వల్లాహు-సమీ-ఉన్-అలీమ్. 35. ఇజ్.ఖాల-తిమ్-ర-అతు,ఇమ్రాన-రబ్బి-ఇన్నీ నజర్తు-లక-మాఫీ-బత్నీ-ముహర్రరన్-ఫ-తఖబ్బల్-మిన్నీ-ఇన్నక-అన్తస్-స మీ-ఉల్-అలీమ్.36.ఫ-లమ్మా-వజ-అత్-హా-ఖాలత్-రబ్బి-ఇన్నీ-వజఅ-తుహా. ఉన్ సా-వల్లాహు-అఅ-లము-బి-మా-వజ-అత్-వ లైసజ్ - జకరు-కల్-ఉన్ సా-వ-

ఇన్నీ-సమ్-మైతుహా-మర్యము-వ-ఇన్నీ-ఉ-ఈజుహా బిక-వ-జు-ర్రియతహా-మి
నష్-షైతానిర్-రజీమ్. 37. ఫత-ఖబ్బలహా-రబ్బుహా-బిఖ-బూలిన్.హస- నిన్-
వ-అమ్-బతహా-నబా-తన్-హసనన్-వ-కఫ్-ఫలహా-జకరియ్యా-కుల్లమా-దఖల-
అలైహా-జక-రియ్యల్-మిహ్రా-రాబ-వజద-ఇన్దహా-రిజ్‌ఖన్-ఖాల-యామర్ - య
ము-అన్నా-లకి-హాజా-ఖాలత్-హువ-మిన్-ఇన్‌దిల్లాహి-ఇన్నల్లాహ-యర్‌జుఖు-
మన్-యషాఉ బి గైరిహి-సాబ్.

33. నిశ్చయముగా దేవుఁడు, ఆదమును, నూహును, ఇబ్రాహీమునంత
తిని, ఇమ్రానుసంతతిని, సర్వలోకములకు పై నెన్నుకొనెను. 34. వారొకరొకరి
సంతానముగా నున్నారు. మఱియు దేవుఁడు సర్వమును వినుచు నెఱుంగుచు
న్నాఁడు. 35. ఇమ్రాను భార్య, ఓ నా ప్రభువా! నేను నాగర్భమందున్న దాని
నీ సేవకొఱకు స్వేచ్ఛగానుండుటకుఁగాను మ్రొక్కుకొంటిని . కావున నా
మొక్కుబడిని అంగీకరింపుము. నిశ్చయముగ నీవే వినువాఁడవును, సర్వ
జ్ఞుఁడవును, అని చెప్పెను. 36. ఆ పిదప ఆమె బిడ్డను ప్రసవించినపుడు
ఓ దేవా! ఆఁడుబిడ్డను ప్రసవించితినే అని చెప్పెను. మఱియు దేవుఁడు ఆమె
ప్రసవించిన దాని విషయము బాగుగ నెఱుంగును. ఆ ఆఁడుబిడ్డవలె మగబిడ్డ
గా నేరఁడు అని దేవుఁడు సెలవిచ్చెను. మఱియు ఆమె నేను ఆ బిడ్డకు మర్యమ్
అని నామకరణ మొనర్చితిని. మఱియు ఆమెను ఆమెసంతానమును, దుష్టుఁడైన
సైతానునుండి రక్షించుటకై నీకు ఒప్పగించుచున్నాను. అని చెప్పెను. 37.
పిదప దేవుఁడు మర్యమును బాగు (ప్రీతి)గా అంగీకరించి, ఆమెనువృద్ధినొందిం
చెను, ఆ మెకు జకరియ్యాను పోషణకర్తగా దేవుఁడు నియమించెను. జకరియ్యా ఆమె
యుండు చోటునకు పోవునపుడెల్ల ఆమెయొద్ద ఆహారముచూచుచుండును. ఆయన
ఓమర్యమా! ఇది నీకెక్కడనుండి వచ్చెనని అడుగఁగా ఆమె అది దేవునియొ
ద్దనుండి అని చెప్పెను. దేవుఁడు తాను కోరినవారికి లెక్కలేకుండఁగనొసంగును.

వ్యా॥ 33 36. మునుపటి వాక్యములలో దేవునిప్రీతి పడయవలెను. ఆతని
ప్రవక్తను అనుసరింపవలెనని చెప్పఁబడెను. ఇఁక ఈవాక్యములలో దేవుఁడు
ప్రేమించి ఎన్నుకొనినవారి విషయము దెలుపఁబడుచున్నది. దేవుఁడులోకసృష్టి
లోని మూలపురుషుఁడగు హజ్రత్ ఆదమును గొప్పగాను ప్రవక్తగానుచేసి గౌ
రవమొసంగెను. ఆతనిసంతతిలో హజ్రత్ నూహుప్రవక్తయాయెను. హజ్రత్
నూహుకాలములోనే జలప్రళయముగలిగి దుష్టులగు అవిశ్వాసులు నశించిరి.
నూహును, ఆతనిసంతతియును ఒకయోడ మూలమున రక్షణపొందెను. ఆతని

సంతానమే వృద్ధినొంది లోకములో వ్యాపించెను. ఆయన పిదప విగ్రహారాధన పరిబలంగా దేవుఁడు హజ్రత్ ఇబ్రాహీమును ప్రవక్తగా నెన్నుకొని ఆతని సంతానములో ననేకులను ప్రవక్తలనుజేసెను. ఆతని సంతతిలోనే ఇమ్రాను (బీబీ మర్యమ్ యొక్క తండ్రి) కుటుంబమును దేవుఁడు ఎన్నుకొనెను. బీబీ మర్యమ్ కుమారుఁడే హజ్రత్ ఈసా ప్రవక్త. వారు తమ కాలములోని లోకుల కన్న గొప్పగానుండిరి. హజ్రత్ మూసా ప్రవక్త తండ్రి పేరుకూడ ఇమ్రాను. వారందఱు ఒకే సంతతివారు. ఏసుక్రీస్తుకూడ ఆ సంతానములోనే చేరిన యాతఁడు. కావున ఇతరులవలె ఆయనకూడ ప్రవక్తయును మానవుఁడును. కాని దేవుఁడు కాఁడు అని హెచ్చరింపఁబడియెను. ఇమ్రానుభార్య బిడ్డపుట్టినచో దేవుని సేవ కొఱకును, ప్రార్థనకొఱకును, ఏలాటి ఇతర కార్యములు లేకుండ అర్పింతును అని దేవుని వేఁడుకొనెను. ఆకాలమునందు మగబిడ్డను దేవునిగుడి సేవకొఱకు అర్పించుచుండిరి. ఆఁడుబిడ్డలను ఆ సేవకొఱకు అర్పించుటలేదు. ఇమ్రానుభార్యకు ఆఁడుబిడ్డ జన్మించెను. కావున నేను చేసిన మొక్కుబడికి ఆఁడుబిడ్డ తగదే అని చింతిల్లెను. కాని జన్మించిన ఆఁడుబిడ్డకంటె ఆమె కోరిన మగబిడ్డ శ్రేష్ఠుఁడు కాఁడు. ఆఁడుబిడ్డ యోగ్యత దేవునికి బాగుగాఁ దెలియునని దేవుఁడు సెలవిచ్చెను. ఆ పిదప ఆబిడ్డకు మర్యమ్ (మరియమ్మ) అని నామకరణము గావించెను. దేవుని కోపమునకు పాత్రుఁడైన సైతానుకుట్రలనుండి ఆమె బిడ్డను ఆమె సంతతిని రక్షింపవలెను అని దేవుని వేఁడుకొనెను. దేవుఁడు ఆమె చేసిన మొక్కుబడిని అంగీకరించెను. బీబీమర్యమును బాగుగా వృద్ధినొందించెను. ఆమెకు పోషణకర్తగా జక్రియాప్రవక్త నియమింపఁబడెను. ఆమె ఆయనసంరక్షణములోనుండెను. బీబీమర్యమ్ పెద్దదై దేవుని గుడిలోనే ప్రార్థనలు సేవలు సలుపుచుండెను. దేవుని అనుగ్రహమువలన ఆమెకు అకాలపు ఫలములు లభించుచుండెను. జక్రియా ఆమె యుండుగదిలో అవియుండుట చూచుచు ఎచ్చట నుండి లభించుచున్నవి అని అడుగఁగా దేవుని అనుగ్రహమువలన లభించుచున్నవి. దేవుఁడు తానుకోరినవారికి లెక్కలేకుండ నొసంగును. అని భక్తిపూర్వకముగ చెప్పెను.

38. హునాలిక దఆ జకరియ్యా రబ్బహూ-ఖాల-రబ్బి-హబ్ లీ-మిల్-లదున్ క-జుర్రీయతన్. తయ్యిబతన్-ఇన్నక సమీఉద్-దుఆఇ. 39. ఫనా-దత్ హుల్ మలాఇకతు-వహువ-ఖాయిమున్-యుసల్లీ-ఫిల్ మిహ్రాబి అన్నల్లాహ-యుబష్షిరుక-బి-యహ్యా ముసద్దిఖమ్-బి-కలిమతిమ్ మినల్లాహి-వసయ్యిదన్-వ-హసూరన్ వ నబీయమ్ మినస్ సాలిహీన్. 40. ఖాల-రబ్బి-అన్నా-

యకూను-లీ-గులామున్-వఖద్-బలగ-నియల్-కిబరు-వమ్-ర-అతీ-ఆఖి-రున్-ఖా
ల-కజా-లికల్లాహు-యఫ్-అలు-మా-యషాఉ. 41. ఖాల రబ్బిజ్-అల్-లీ-ఆయ
తన్-ఖాల-ఆయ-తుక-అల్లా-తుకల్లి మన్నాస-సలా-సత-అయ్యా-మిన్-ఇల్లా-రమ్
జావజ్-కుర్-రబ్బక-కసీ-రన్-వసబ్బిహ్-బిల్-అషియ్యి-వల్-ఇబ్-కార్.

38. అచ్చటనే జకరియా తనప్రభువును ప్రార్థించెను. ఓ నాప్రభువా! నీయొద్దనుండి నాకు పవిత్రమైన సంతానమొసంగుము. నీవే ప్రార్థనవినువాండవు. అనిపలికెను. 39. ఆతఁడు గదిలో నిలిచి ప్రార్థించుచుండినపుడు దేవదూతలు "దేవుఁడు నీకు యహ్యాయాఅను కొడుకుపుట్టు సువార్తనిచ్చుచున్నాఁడు. ఆతఁడు దేవునివాక్కును స్థిరపఱచును. అధికారి మఱి పెద్దఅగును. ఇంద్రియ నిగ్రహుఁడును, సత్ప్రవర్తకులలోచేరిన ప్రవక్తఅగును". అనిపలికిరి. 40. జక్రియా "ఓ నా ప్రభువా! నాకెట్లు కొడుకుగలుగును. మఱి నాకు ముసలితనమువచ్చినది. మఱి నాభార్యగొడ్డురాలు అని పలుకఁగా 'ఇటులే దేవుఁడు తానుకోరినదిచేయును'అని దేవుఁడుచెప్పెను. 41. జక్రియా 'ఓ దేవా! నాకొఱకు ఏదైన గుఱుతునిము'అని పలికెను. దేవుఁడు నీకు గుర్తు "నీవుమూఁడుదినములు సైఁగలుచేయుటతప్ప ప్రజలతో మాటలాడలేవు. నీవు ఎక్కువగా నీప్రభువును స్మరింపుము. రాత్రియుదయకాలములో దేవునిపవిత్రతను కొనియాడుము." అనిపలికెను.

వ్యా॥ 38 : 41. జక్రియాప్రవక్త బీబీమరియమ్మ భక్తిమహిమలనుచూచి అకాల ఫలములనొసంగు సర్వశక్తుఁడగు దేవుఁడు, వృద్ధుఁడైననాకు కొమారుని ఒసంగును అని భయభక్తులతో నచ్చటనే పైవాక్యములోనున్నట్లు ప్రార్థించెను. దేవుఁడు ఆతని ప్రార్థనవిని దానికి ఫలితముగా, పవిత్రమైన కొడుకు పుట్టును. ఆతనిపేరు యహ్యా(యోహాను)అగును. ఆకొమారుఁడు దేవుని వాక్కువలన తండ్రిలేకుండ పుట్టఁబోవు బీబీమరియమ్మకుమారుఁడగు ఈసాప్రవక్తను గూర్చి సాక్ష్యమిచ్చి ఆతనిని నిజపఱచును. ఆతఁడు కులమునకును మతమునకును పెద్ద (అధికారి) అగును. ఆతఁడు ఇంద్రియములను జయించి స్త్రీలతో సంసారము చేయఁడు. ఆతఁడు భయభక్తులుగల ప్రవక్తయగును. అని దేవదూతల మూలముగా జకరియాకు దేవుఁడు సువార్తనిచ్చెను. జక్రియాప్రవక్తకు చాల ముసలితనము వచ్చియుండెను. దానికితోడు ఆతని భార్య సంతానములేని గొడ్రాలు. సంతానము గలుగుటకు వీలులేకుండెను. అందుకు జక్రియా తన మనశ్శాంతికిఁగాను దేవునితో విన్నవింపఁగా దేవుఁడు సర్వశక్తుఁడు తానుకోరినట్లు చేయును. అని బదులు వచ్చెను. దానికి దృష్టాంతము నిమ్మని జక్రియా అడు

గ(ంగా “నీభార్యగర్భము దాల్చినది అను దానికి గుర్తు నీవు మూఁడు దినములు సైఁగలు చేయుటతప్ప ప్రజలతో మాటలాడలేవు. పూర్తి మూఁడు దినములు దేవునిధ్యానించుచు ఆతని పవిత్రనామమును స్మరింపుము. అని దేవుని సెలవాయెను. దేవుఁడు సెలవిచ్చినటే జక్రియాకు యహ్యా (యోహాను) అను కొడుకు పుట్టెను. ఆయహ్యానబీ ఏసుక్రీస్తునుగూర్చి సాక్ష్యమిచ్చెను.

42. వఇజ్-ఖాలతిల్-మలా-ఇకతు-యామర్-యము- ఇన్నల్లాహస్తఫాకి-వతహ్హ-హరకి-వస్తఫాకి-అలా-నిసాఇల్-ఆలమీన్. 43. యామర్-యముఖ్-నుతీ-లిరబ్బికి-వస్-జుదీ-వర్-కఈ-మఅర్-రాకిఈన్. 44. జాలిక-మిన్-అమ్-బాయిల్-గైబి-నూహీహి-ఇలైక-వమాకున్త-లదైహిమ్-ఇజ్-యుల్-ఖూన అఖ్లామ-హుమ్-అ-య్యుహుమ్-యక్ఫులు-మర్-యమ-వమాకున్త-లదైహిమ్-ఇజ్-యఖ్-తసిమూన్.

42. దేవదూతలు “ఓమర్యమా! దేవుఁడు నిన్ను ఎన్నుకొనెను, మఱినిన్ను పరిశుద్ధురాలినిగాఁజేసెను. లోకములోనున్న స్త్రీలపైకి నిన్ను ఎన్నుకొనెను.43. ఓమర్యమా! నీవు దేవుని భయభక్తులతో ప్రార్థింపుము. సిజ్దాచేయుము. మఱియు రుకూచేయువారితో రుకూచేయుము అని చెప్పిరి. 44 అవి అగోచరవిషయములలోని వార్తలు. వానిని నీకుఁ దెలుపుచున్నాము. మఱియు నీవు (ఓముహమ్మదు) మర్యమును పోషించు వారెవరు అని వారు కలములు వేయునపుడు వారి యొద్దలేకుంటివి. మఱియువారు వివాదములాడునపుడు నీవువారి యొద్దలేకుంటివి.

వ్యా॥ 42:44. ఇమ్రానుకుటుంబము విషయములో జక్రియా పేరువచ్చెను. కావున ఆయననుగూర్చి మునుపటి వాక్యములలో చెప్పఁబడియెను. ఇఁక ఇమ్రాను సంతతిగూర్చి చెప్పఁబడుచున్నది. ఇట మరియమునుగూర్చి ఆమె భయభక్తులును, పవిత్రతయును దెలుపఁబడినవి. ఆమెతో దేవదూతలు సంభాషించిరి. ఆమె చాల మహిమగలది. కావున దేవుఁడు ఆమెను తన సేవకురాలినిగా నెన్నుకొనెను. ఆమెకు ఆ కాలమందున్న లోకమందలి స్త్రీలకంటె చాలగౌరవ మొసంగెను. సిజ్దాఅనఁగా సాష్టాంగపడుట. రుకూఅనఁగా ప్రార్థనలో వంగుట. మరయమును ఆమెతల్లి దేవునిగుడి సేవకొఱకు అర్పించియుండెను. దేవుని గుడికి సంబంధించిన మతగురువులలో మరియమునకు ఎవరు పోషణకర్తలుగా నుండుట అను విషయములో వివాదము జరిగెను. అప్పుడు ఆకాలపు పద్ధతినిబట్టి కలములు (చీటి) వేసిరి. జక్రియా పేరువచ్చెను. ఆయన మరియమునకు పోషణకర్తగా నియమింపఁబడెను. ఈవిషయము హజ్రత్ ముహమ్మదుప్రవక్తకుఁ దెలి

యదు. అరబ్బులకుకూడ తెలియదు. ఆ విషయము సంభవించినపుడు హజ్రత్ రసూలువారు అచ్చట లేకుండిరి. చూడని వినని విషయము వాస్తవముగా దెలుపుటకు శక్యముగాదు. కావున వానిని దేవుఁడు దెలుపుచున్నాఁడు అని గ్రహింపఁదగును.

45. ఇజ్-ఖాలతిల్-మలా-ఇకతు-యా-మర్యము-ఇన్నల్లాహా-యుబష్షిరుకి-బికలి-మతిమ్-మిన్-హుస్-ముహుల్-మసీహు-ఈసబ్ను-మర్-యమ-వజీహన్-ఫిద్-దున్యా-వల్-ఆఖిరతి-వ-మినల్-ముఖర్రబీన్. 46. వయు-కల్లి-మున్నాస-ఫిల్-మహ్ది-వ కహ్-లన్-వ-మినస్-సాలి-హీన్. 47. ఖాలత్-రబ్బి-అన్నా యకూను-లీ-వలదున్-వలమ్-యమ్-సస్నీ-బషరున్-ఖా-కజాలి-కిల్లాహు-యఖ్-లుఖు-మా-యషాఉ-ఇజా-ఖజా-అమ్రన్-ఫ-ఇన్నమా-యఖూలు-లహూ-కున్-ఫయకూన్. 48. వయు-అల్లి-ముహుల్-కితాబ-వల్-హిక్మత-వత్తౌరాత-వల్-ఇన్జీల్. 49. వర సూలన్-ఇలా-బనీ-ఇస్రా-యీల-అన్నీ-ఖద్-జీ-తుకుమ్-బి-ఆయతిమ్-మిర్-రబ్బి-కుమ్-అన్నీ-అఖ్-లుఖు-లకుమ్-మినత్-తీని-క-హైఅతిత్-తైరి-ఫ అన్-ఫుఖు-ఫీహి-ఫ-యకూను-తైరమ్-బి-ఇజ్-నిల్లాహి-వ-ఉబ్-రి-ఉల్-అక్మహ-వల్ అబ్-రస-వ-ఉహ్-ఇల్-మౌతా-బిఇజ్-నిల్లాహి-వ-ఉ-నబ్బి-ఉకుమ్-బిమా-తాకులూన-వ-మాతద్-దఖి-రూన-ఫీ-బుయూ-తికుమ్-ఇన్న-ఫీ-జాలిక-ల-ఆయతల్-లకుమ్-ఇన్-కున్తుమ్-మూమినీన్. 50. వ-ముసద్ది-ఖల్-లిమా-బైన-యదయ్య-మినత్-తౌరాతి-వలి-ఉహిల్ల-లకుమ్-బఅ-జల్లజీ-హుర్రిమ-అలైకుమ్-వ-జీతు-కుమ్-బి-ఆయతిమ్-మిర్-రబ్బికుమ్-ఫత్తఖుల్లాహా-వ-అతీ-ఊని. 51. ఇన్నల్లాహా-రబ్బీ-వరబ్బు-కుమ్-ఫఅ-బుదూహు-హాజా-సిరా తుమ్-ముస్తఖీమ్.

45. దేవదూతలు ఓ మర్యము! దేవుఁడు నీకు తనవాక్కు-సువార్త నిచ్చుచున్నాఁడు. దానిననుసరించి గలుగువానిపేరు మర్యము కుమారుఁడగు ఈసా మసీహ్. అతఁడు ఇహమునందును పరమునందును గౌరవముగల యాతఁడు. మఱియు దేవుని ప్రియులైన భక్తులలో చేరినయాతఁడు. 46. మఱియు అతఁడు ఉయ్యాలలోనున్నపుడును పెద్దవాఁడైనపుడును ప్రజలతో మాటలాడును. మఱియు అతఁడు సత్ప్రవర్తకులలో నొకఁడైయుండును అని చెప్పినపుడు 47. ఓ నా ప్రభువా! నాకెట్లు పుత్రుఁడుగలుగును. ఏ పురుషుఁడును నన్ను తాకలేదే

అని మర్యము పలికెను. దేవుఁడు తానుకోరినది పుట్టించును. ఒకపనికోరి దానిని అగు మనిచెప్పినతోడనే అదిఅగును అని దేవుఁడుపలికెను. 48. మఱియు దేవుఁడు ఆతనికి గ్రంథమును తత్వజ్ఞానమును తౌరాతును ఇన్జీలును నేర్పును. 49. మఱియు ఇస్రాయీలియులకుఁగా ప్రవక్తగా నియమించును. ఈసా "మీ యొద్దకు నేను మీప్రభువునుండి సూచనలను దెచ్చితిని. నేను మట్టిలో పక్షుల రూపముచేసి అందు ఊఁదినచో అవి దేవునియాజ్ఞవలన పక్షులగును. మఱియు నేను పుట్టుగ్రుడ్డిని కుష్ఠురోగులను బాగుచేయుదును. మీయిండ్లలో మీరు తిను నదియును కూర్చిపెట్టునదియును మీకుఁదెలుపుదును. నిశ్చయముగా నిందు మీకునమ్మికయున్నచో సూచనయున్నది. 50. మఱియు నాకు పూర్వమువచ్చిన గ్రంథమగు తౌరాతును సత్యపఱచుచున్నాను. మఱియు మీకు నిషేధింపఁబడినకొన్ని వస్తువులను హలాల్ (ధర్మములైనవి)గా చేయుటకును వచ్చితిని. మఱి మీ యొద్దకు దేవుని సూచనలు దీసికొనివచ్చితిని. కావున మీరు దేవునికి భయపడుఁడు. మఱి నాకు విధేయులుకండు. 51. నిశ్చయముగా దేవుఁడు నాప్రభువును మీప్రభువును. కావున ఆతనినే ప్రార్థింపుఁడు. ఇదియే స్థిరమైనసన్మార్గము"అనిపలికెను.

వ్యా॥ 45: 47. ఇఁక ఈవాక్యములలో ఈసామసీహు(ఏసుక్రీస్తు)నుగూర్చి చెప్పఁబడుచున్నది. ఈసాకు దేవునివాక్కు (కలిమతుల్లాహి)అని చెప్పఁబడినది. ఎందుకన ఆయన తండ్రిలేకయే దేవుని వాక్శక్తివలనపుట్టెను. దేవదూతలు, బీబీ మర్యమునకు దేవునితరఫున ఆమెకుపుత్రుఁడుగలుగును. ఆయన సాధారణమైన బిడ్డవలెగాఁడు. ఆయన పొత్తిబిడ్డగానున్నపుడు ఉయ్యాలలోనే ప్రజలతో సంభాషించును. పూర్తివయస్సు వచ్చినపుడుకూడ ప్రజలకుబోధించును. ఆయన ఉభయలోకములలోను గౌరవముపొందును. తండ్రిలేనిబిడ్డ అను నిందయుండఁజాలదు. ఆతఁడు దేవునిసాన్నిధ్యముపొందిన భక్తులలో చేరినయాతఁడగును. అని సువార్తనిచ్చిరి. ఆమె నాకుపెండ్లికాలేదే. ఏపురుషుఁడును నన్ను తాఁకలేదే. ఎట్లు నాకుపుత్రుఁడుగలుగును. అని విన్నవించెను. దేవుఁడు సర్వశక్తుఁడు, తానుకోరినట్లు తనవాక్కు మహిమవలన పుట్టించును. అందులకు సందేహము వలదు. ఆతఁడు సంకల్పసిద్ధుఁడుకదా! అని శాంతిధైర్యములు కలుగునట్లుచెప్పిరి.

48 : 50. మఱియు దేవుఁడు ఆతనికి తత్వజ్ఞానములును తౌరాతు ఇన్జీలు గ్రంథములును నేర్పును. ఆతనిని ఇస్రాయీలియులకు ప్రవక్తగాచేయును. ఆతఁడు ప్రజలకు బోధించును. ఈసాప్రవక్తకు దేవుఁడు పెక్కుఅమానుషము (మోజిజా) లొసంగియుండెను. అవి దేవుని సెలవుచే మట్టిలోపక్షులుచేసి వానికి ప్రాణముపోయుట, పుట్టుగ్రుడ్డివారిని కుష్ఠరోగులనుబాగుచేయుట, మృతులను బ్రతికించుట, ఇంటిలోని మర్మములనుదెలుపుట మొదలగునవి. ఈసాప్రవక్త

కాలమందు గొప్పగొప్పవైద్యులుండిరి. వైద్యులు బాగుచేయలేనిరోగులను ఈసాప్రవక్త దేవుని సెలవుచే బాగుచేయుచుండెను. అందుచే ఆకాలమునకు తగిన అమానుషములు ఈసాప్రవక్తకు దేవుఁడు ఒసంగెను. ఆయన, తౌరాతు గ్రంథము దేవునిగ్రంథము. దాని ననుసరింపవలెను. అని బోధించెను. ఆయనకు పూర్వము కొన్ని కఠినమైన నియమములుండెను. యూదుల దుష్టత్వమువలన కొన్నివస్తువులు నిషేధింపఁబడియుండెను. ఆ నిషేధములు ఈసా తొలగించెను. దేవుఁడు సూచనలిచ్చి పరిరక్షగాఁజేసి నన్నుపంపెను. కావున దేవునికి భయపడి నన్ను అనుసరింపుఁడు. 51. దేవుఁడు నాకును మీకును ప్రభువు. అందఱు ఆతనిసేవకులే. ఆతనినే పూజింపవలెను. ఇదియే సన్మార్గము. మోక్షము గలిగించునది. అనిబోధించెను. కావున ఏసుక్రీస్తు దేవునికి ప్రియుఁడైన భక్తుఁడును ప్రవక్తయును. కాన ఆయన దేవుఁడుగాని దేవుని కుమారుఁడుగాని కానేరఁడు.

52. ఫలమ్మా–అహస్స–ఈసా–మిన్–హుముల్–కుఫ్ర–ఖాల–మన్–అన్సారీ–ఇలల్లాహి–ఖాలల్–హవారియ్యూన–నహ్ను–అన్–సారుల్లాహి–ఆమన్నా–బిల్లాహి–వష్–హద్–బిఅన్నా–ముస్లిమూన్. 53. రబ్బనా–ఆమన్నా–బిమా–అన్–జల్త–వత్–తబఅ్–నర్–రసూల–ఫక్–తుబ్నా–మ–అష్–షాహిదీన్. 54. వ–మకరూ. వ–మకరల్లాహు–వల్లాహు–ఖైరుల్–మాకిరీన్. 55. ఇజ్–ఖాలల్లాహు–యా–ఈసా–ఇన్నీ–ముతవఫ్ఫీక–వరాఫి–ఉక ఇలయ్య–వ–ముతహ్హిరుక–మినల్లజీన–కఫరూ–వజా ఇలుల్లజీనత్–తబఊక–ఫౌఖల్లజీన–కఫరూ ఇలా–యౌమిల్–ఖియామతి–సుమ్మ–ఇలయ్య–మర్–జిఉ–కుమ్–ఫఅహ్కుము–బైనకుమ్–ఫీమా–కున్తుమ్–ఫీహి–తఖ్–తలిఫూన్. 56. ఫ–అమ్మల్–లజీన–కఫరూ–ఫఉ–అజ్–జిబు–హుమ్–అ–జాబన్–షదీదన్–ఫిద్–దున్యా–వల్–ఆఖిరతి–వమా–లహుమ్–మిన్–నాసిరీన్. 58. వ–అమ్మల్లజీన–ఆమనూ–వ–అమి–లుస్–సాలిహాతి ఫయువఫ్–ఫీహిమ్–ఉజ–రహుమ్–వల్లాహు లాయుహిబ్బుజ్–జాలిమీన్. 58. జాలిక–నత్లూహు–అలైక–మినల్–ఆయాతి. వజ్–జిక్–రిల్–హకీమ్.

52. ఆపిదప ఈసాఇస్రాయీలీయుల తిరస్కారమును తెలిసికొని దేవుని మార్గమందు నాకు తోడుపడు వారెవరు? అనిపలుకఁగా హవారీలు(శిష్యులు) మేము దేవునికి తోడుపడువారము. దేవుని నమ్మితిమి. మేము విధేయులమైతి

మని (ఓ ఈసా) నీవు మాకు సాక్షిగనుండుము. 53. ఓ మాప్రభువా! నీవు పంపినదానిని విశ్వసించితిమి. మఱియు ప్రవక్తకు విధేయులైతిమి. కావున విశ్వసించిన సాక్షులలో మమ్మువ్రాసికొనుము అనిపలికిరి. 54. మఱియు అవిశ్వాసులు కుట్రలుచేసిరి. దేవుఁడు ఉపాయముచేసెను. దేవుఁడు ఉపాయశాలులలో మేటి. 55. దేవుఁడు “ ఓ ఈసా! నేను నిన్ను దీసికొందును. మఱి నాయొద్దకు ఎత్తుకొందును. మఱి అవిశ్వాసులనుండి నిన్ను పరిశుద్ధునిగాఁ జేయుదును. (తప్పింతును). నిన్ను అనుసరించిన వారిని పునరుత్థానదినమున అవిశ్వాసులకు పైఁగానున్నట్లు చేయుదును. పిదప మీరందఱు నా యొద్దకు మరలి రావలసియున్నది. మీరు కలహించుచున్న విషయమును గూర్చి తీర్పుచేయుదును. 56. అవిశ్వాసులైనవారిని ఇహమునందును పరమునందును కఠినముగా శిక్షింతును. మఱియు వారికి నెవరును సహాయులులేరు. 58. మఱియు విశ్వసించి సత్కార్యములు చేసినవారికి వారిఫలితము పూర్తిగా దేవుఁడు ఇచ్చును మఱి దేవుఁడు దుర్మార్గులను ప్రేమింపఁడు అనిపలికెను. 58. ఓముహమ్మదు! మేము నీకు వినిపించు యీ విషయము సూచనలు గలదియును, స్థిరమైన బోధనగలదియును (అగును).

వ్యా॥ 52. ఈసాప్రవక్త ఇస్రాయీలియు (యూదు) లకు బోధించెను. కాని వారువిరోధులై తిరస్కరింపసాగిరి ఆయనవారి తిరస్కారము తెలిసికొని నాకు మతప్రచారములో తోడుపడి దేవుని ప్రీతిపడయు వారెవరుగలరు? అని అడుగఁగా వారిశిష్యులు కొందఱు మేముమీమత ప్రచారములో తోడుపడి దేవునికి సహాయులగుదుము అని పలికిరి. హవారీ అనఁగా సహాయుఁడు. నీవు మా విశ్వాసమునకు సాక్షినుండుము. అని 53. ఆయన శిష్యులు, (సహాయులు) దేవునిసన్నిధిని ఓమాప్రభువా! నీవు ఈసాప్రవక్తకు నొసంగిన గ్రంథమునునమ్మి ఆప్రవక్తకు విధేయులమైతిమి. నీవుమమ్ము సాక్షులలోను విశ్వాసులలోను వ్రాసికొనుము. అని వేడుకొనుచున్నారు. 54. అవిశ్వాసులగు యూదులు ఈసాప్రవక్తనుగూర్చి ఆకాలపు రాజునొద్ద ఈసా తౌరాతుగ్రంథమును వ్యతిరేకము చేయుచు మతమును పాడుచేయుచున్నాఁడు అనిచెప్పి కుట్రలుసలిపిరి. ఆరాజు ఈసాప్రవక్తను పట్టుకొనిగంపు శిక్షింతునని యుత్తరువుచేసెను. అట్లు విశ్వాసులు కుట్రలుసలుపుచుండిరి. కానిదేవుఁడు ఈసాప్రవక్తనురక్షించి శత్రువులచేతిలోచిక్కకుండ నుపాయముచేసి వారికుట్రలను వృథాచేసెను. కావున దేవునియుపాయముకంటె మించిన యుపాయములేదు. దానికి మించిపోవువారు ఎవరును లేరు. 55. ఆరాజు ఈసానుపట్టి సిలువపై నెక్కించి కఠినమైన శిక్షవిధింపవలెనని యుత్తరువుచేసెను. కానిదేవుఁడు ఈసాప్రవక్తను తన సర్వశక్తితో సజీవిగానే ఆకాశముపైకెత్తుకొని, అపవిత్రులగు దుష్టులనుండి ఆతనిని పరిశుద్ధగా

జేసి తనయొద్దకుఁదీసికొనెను. అట్లు దుష్టులకుట్ర వ్యర్థమాయెను. ఈసాప్రవక్తను నమ్మి ఆతని అనుసరించిన నస్రానీలను ముసల్మానులను, దేవుఁడుయూదులపై అధికారిగా పునరుత్థాన దినమువఱకు చేయును తీర్పుదినమున అన్నికలహములఁగూర్చి తీర్పుఅగును. ప్రవక్తలను తిరస్కరించి దుర్మార్గమునందుపడి పాపకార్యములు చేసినవారికి కఠినమైనశిక్ష విధింపఁబడును. ఇహమునందును, పరమునందును, కఠినశిక్షలకు పాత్రులగుదురు. అట్టిదుష్టులకు దేవుని శిక్షనుండి రక్షించు సహాయులు ఎవరునులేరు. ప్రవక్తలనునమ్మి విశ్వసించి సత్కార్యములుచేసి భక్తులగు విశ్వాసులు తమ పుణ్యముల ఫలితము కొంచెమైన తక్కువకాకుండ పూర్తిగపొందుదురు. పాపములుచేయు దుర్మార్గులును, అన్యాయస్థులును దేవునికి ప్రియులుగారు. అట్టివారిని దేవుఁడు ప్రేమింపఁడు. కావున దేవుని ప్రీతికోరువారు విశ్వసించి సత్కార్యములు చేయవలెను. 58. ఇట్లుతెలిపిన ఈసాప్రవక్త విషయము వినువారికి సూచనలును స్థిరమైనబోధయునున్నది. ఇందుహజ్రత్ముహమ్మదు ప్రవక్తఅని తెలియనగును ఎట్లన, వారు ఈసాప్రవక్త విషయము వాస్తవముగఁ దెలుపుచున్నారు.

హెచ్చరిక:-హజ్రత్ ముహమ్మదు రసూలువారు ఇట్లుపదేశించియున్నారు:- తుదిదినము(ఖియామత్)సమీపించునపుడు అధర్మములు చెలరేఁగును. లోకములో అవిశ్వాసమును దుర్మార్గమును పైశాచమును(షైతనత్)ప్రబలును. అపుడు సర్వశక్తుఁడగు దేవుఁడు ఈసాప్రవక్తను ఆకాశమునుండి భూమిపైకి పంపును. ఈసాప్రవక్త వచ్చి దజ్జాలుఅను దుష్టునివధించును. ఆదుష్టునకు అనుచరులైన యూదులందఱిని వధించును. ఒక్కయూదుఁడు కూడ తనప్రాణము కాపాడుకొనజాలఁడు. చెట్లు రాళ్లుకూడ మావెనుక యూదుఁడు దాఁగుకొనియున్నాఁడు అని శబ్దముతో పలుకును. మఱియు ఈసాప్రవక్త సిలువ (సలేబు)ను పగలఁగొట్టును. క్రైస్తవులతప్పువిశ్వాసములను సవరించును. మఱి ఇస్లామ్ మతప్రచారముచేసి దానిని లోకమంతను వ్యాపింపఁజేయును. అపుడు అన్ని మతవివాదములుపోయి ఒక్క ఇస్లామ్ మతము స్థిరముగానిలుచును.

59. ఇన్న-మసల-ఈసా-ఇన్దల్లాహి-కమసలి-ఆదమ-ఖలఖహూ-మిన్-తురాబిన్-సుమ్మ-ఖాల-లహూ-కున్-ఫయకూన్. 60. అల్-హఖ్ఖు-మిర్-రబ్బిక-ఫలా-తకుమ్-మినల్-ముమ్-తరీన్. 61. ఫమన్-హాజ్జక-ఫీహి-మిమ్-బఅది-మా-జాఅక-మినల్-ఇల్మి-ఫఖుల్-త-ఆలౌ-నద్-ఉ-అబ్నా-అనా-వ-అబ్నా-అకుమ్-వనిసా-అనా-వనిసా-అకుమ్-వ-అన్-ఫుసనా-వ-అన్ఫుసకుమ్-సుమ్మ-నబ్-తహిల్-ఫన

జ్-అల్-లఅ-న-తల్లాహి-అలల్-కాజిబీన్. 62. ఇన్న-హాజా-లహువల్-ఖస-సుల్-హఖ్ఖు-వమా-మిన్ ఇలాహిన్-ఇల్-లల్లాహు-వ-ఇన్నల్లాహ-లహువల్-అ-జీ-జుల్-హకీమ్. 63. ఫ-ఇన్-తవల్-లౌ-ఫ-ఇన్నల్లాహ-అలీముమ్ - బిల్ ముఫ్-సిదీన్.

54. నిశ్చయముగా ఈసా పోలిక విషయము ఆదమువలె నున్నది. దేవుఁడు ఆదమును మట్టితోఁ జేసిన పిదప ఆతనిని (ప్రాణివి) అగుమని చెప్పఁగా ఆయన ఆయెను. 60. ఇది నీప్రభువునుండి వచ్చిన సత్యము. కావున నీవు సందేహించువారిలో చేరకుము. 61. నీకు వాస్తవమైన విషయము తెలిసిన తరువాత దానిఁగూర్చి నీతో ఎవరు వివాదములాడుదురో వారితో రండు ? మాకుమారులను, మీకుమారులను, మాస్త్రీలను, మీస్త్రీలను, మాయాత్మలను మీయాత్మలను పిలిచికొని మన మందఱము మొఱపెట్టుదుము. మఱి అబద్ధవాదులపై దేవుని శాపము గలుగు గాక అని చెప్పికొందము అని చెప్పుము. 62. నిశ్చయముగా ఈ విషయము సత్యమైనది. దేవుఁడు తప్ప వేఱు పూజ్యుఁడు లేఁడు. మఱియు నిశ్చయముగా దేవుఁడే సర్వశక్తుఁడును సర్వజ్ఞుఁడును. 62. పిదప వారు ఒప్పుకొనక తిరిగిపోయినచో ఉపద్రవములుచేయువారిని దేవుఁడే ఎఱుఁగును,

వ్యా॥ 59. ఈసాప్రవక్త తండ్రి లేకుండ పుట్టినందున యూదులు నిందమోపిరి. క్రైస్తవులు ఆతనిని దేవునికుమారుఁడని విశ్వసింపసాగిరి. ఇందు దానిఁగూర్చి చెప్పఁబడుచున్నది. ఈసా జన్మము ఆదము పుట్టుకను పోలియున్నది. ఆదము తల్లి తండ్రులు లేకుండ మట్టితో సృష్టింపఁబడెను. ఈసాప్రవక్తకు తల్లిమూలమున జన్మము లభించినది. కావున దేవుని శక్తికి మించినది ఎద్దియునులేదు, యూదులు నిందింపలేరు. క్రైస్తవులు ఈసా ప్రవక్తకు తండ్రిలేనందున, ఆయన దేవుని కుమారుఁడని చెప్పఁగూడదు. ఎందుకన ఆదముతల్లిదండ్రులు లేకుండఁపుట్టెను. కావున ఆయనకూడ దేవుని కుమారుఁడు అని చెప్పవచ్చును గదా ! అట్లు ఎవరును చెప్పుటలేదు. 60. కావున ఈసా ప్రవక్తనుగూర్చి దేవుఁడు తెలిపిన విషయము సత్యమైనది. అందు ఏలాంటి సందేహము పడవలదు అని హెచ్చరింపఁబడియెను. 61. నజ్రాను క్రైస్తవులు ఈసా ప్రవక్తనుగూర్చి పైవాక్యములను విని సత్యము ఒప్పుకొనకపోయిరి. వివాదము తెగిపోవుటకుఁగాను అట్లు వారు అంగీకరింపక వాదులాడుచునేయున్నచో శపథము (ముబాహలా) చేయుటకు పిలువుము అని పైగంబరులవారికి దేవుఁడు సెలవిచ్చెను. ముబాహలా అనఁగా ఉభయపక్షములవారును తమ తమ కుమారులను స్త్రీలను ఒకచోటచేర్చి ఎవరు అబద్ధము పలుకుచున్నారో వారు దేవుని శాపమునకు పాత్రులై నశింతురు

గాత అని భయభక్తులతో దేవుని వేడుకొనుట. అట్లు చేయుటకు పైగంబరుల వారు తమ జనులతో సిద్ధులై నజ్రాను క్రైస్తవులను పిలిచిరి. కాని వారు ఆలోచించి ప్రవక్తతో అట్లు చేసిన మావంశము నశించును అని భీతిల్లి మేము ముబాహాలా చేయము. సంవత్సరమునకు కొంత ధనము పన్నుగా చెల్లింతుము అని ఒప్పుకొనిపోయిరి. 62. ఏసుక్రీస్తునుగురించి దేవుఁడు చెప్పినవిషయము సత్యమైనది ఈసా దేవుఁడుగాని దేవునికుమారుఁడుగాని కానేరఁడు. అల్లాః తప్ప వేఱు దేవుఁడును, పూజ్యుఁడును లేఁడు. దేవుఁడు అద్వితీయుఁడు. ఆతఁడు సర్వశక్తుఁడు, ఆతని శక్తికి మించినది ఎద్దియును లేదు. ఆతఁడు సర్వజ్ఞుఁడు. ఎద్ది ఎట్లు చేయుట యుచితమో ఆతనికి దెలియును. 63. ప్రమాణములను చూచియు సత్యము ఒప్పుకొనక శపథము చేయుటకు రాక తిరస్కరించిమరలిపోయినచో వారు ఉపద్రవములుచేయువారగుదురు. సత్యము తెలిసికొనవలెను అని వారి ఇష్టము కాదు. కావున అట్టిదుష్టులను దేవుఁడు ఎఱుంగును. వారికి తగిన శిక్షవిధించును.

64. ఖుల్-యా-అహ్లల్ కితాబి-తఆలౌ-ఇలా-కలిమతిన్-సవా- ఇమ్-బైననా-వ-బైనకుమ్ అల్లా-నఅ్బుద-ఇల్-లల్లాహా-వలా-నుష్రిక-బిహీ-షైఅన్ వలా-యత్-తఖిజ-బఅ్-జునా-బఅ్-జన్-అర్బా-బమ్-మిన్-దూ-నిల్లాహి- ఫ-ఇన్ తవల్లౌ-ఫఖూ-లుష్-హదూ-బి-అన్నా-ముస్లిమూన్. 65. యా-అహ్లల్-కితాబి-లిమ-తు-హాజ్-జూన-ఫీ-ఇబ్రాహీమ-వమా ఉన్-జిలతిత్-తౌరాతు- వల్-ఇన్-జీలు-ఇల్లా-మిమ్-బఅ్-దిహీ-అఫలా-తఅ్-ఖిలూన్. 66. హా అన్తుమ్-హా-ఉలా-ఇ-హాజజ్-తుమ్-ఫీమా-లకుమ్-బిహీ-ఇల్మున్-వల్లాహు-యఅ్-లము- వ- అన్తుమ్-లా-తఅ్-లమూన్. 67. మా-కాన-ఇబ్రా-హీము-యహూ-దియ్యఁ-వలా-నస్ రా-నియ్యన్-వలాకిన్-కాన-హానీఫమ్-ముస్లిమన్-వమా-కాన-మినల్-ముష్రికీన్. 68. ఇన్న-ఔలన్నాసి బి-ఇబ్రా హీమ-లల్లజీనత్-తబ-ఊహు-వ-హాజన్ నబియ్యు-వల్లజీన-ఆమనూ-వల్లాహు-వలియ్యుల్-మూమినీన.

64. ఓ గ్రంథములుగలవారలారా! మీయొద్దను మాయొద్దను సమముగా నున్న ధర్మమునకు రండు. (అది ఏదన) మనము దేవునినే పూజింపవలెను. మఱియు ఆతనికి సాటి కల్పింపరాదు. మఱియు దేవుని వదలి ఎవరును, ఇతరులను ప్రభువులుఁ జేసికొనిఁగూడదు అని ఓ ప్రవక్తా! పలుకుము. పిదప వారు

సమ్మతింపక తిరిగి పోయినచో మేము దేవునికి విధేయులమైతిమని మీరు సాక్షులుగ నుండుఁడు అనివారితో పలుకుము. 65. ఓ గ్రంథముగలవారలారా! మీరెందులకు ఇబ్రాహీము విషయమై వాదులాడుచున్నారు. మఱి తౌరాతు, ఇన్జీలు గ్రంథములు ఆతని తరువాతనే యొసంగఁబడినవి. మీరది గ్రహింపలేమి? 66. సరే! మీరు మీకు కొంత దెలిసియున్న విషయమునుగూర్చివాదులాడితిరి. ఇఁక మీకేమియును దెలియని విషయమునుగూర్చి యెందులకు మీరు వాదులాడుచున్నారు? అది దేవునికిఁ దెలియును. మఱి మీకుఁ దెలియదు. 67. ఇబ్రాహీము, యహూదీగగాని నస్రానీగాగాని లేకుండెను. గాని హనఫీగాను, విధేయుఁడుగా నుండెను. మఱి ముష్రికులతో చేరిన యాతఁడును కాఁడు. 68. ఇబ్రాహీమునకు చేరినవారు ఆతని ననుసరించినవారును ఈప్రవక్తయును, విశ్వసించినవారును. మఱియు దేవుఁడు విశ్వాసులకుసహాయుఁడు (రక్షకుడు).

వ్యా॥ 64. ఇంతవఱకు ఏసుస్తునుగూర్చి నిజమైన విషయములను బోధించి తిరస్కరించినవారి వివాదము తీరిపోవునట్లు ముబాహలా (ప్రమాణము) చేయుటకు రమ్మని సెలవయ్యె. అందులకు క్రైస్తవులు సిద్ధముగాక పోయిరి. వారి లోపము వెల్లడియాయెను. ఇఁక పూర్వమునుండి అందఱు ప్రవక్తలు బోధించుచు వచ్చిన దేవుని యేకత్వధర్మమునకు రండుఅని యూదులకును క్రైస్తవులకును చెప్పఁబడుచున్నది. యూదులకు తౌరాతు గ్రంథము క్రైస్తవులకు ఇన్జీలుగ్రంథము వారి వారి ప్రవక్తలమూలమున లభించియుండెను. ఆ గ్రంథములలోకూడ దేవుఁడు ఒక్కఁడే. ఆతనికి సాటి ఎవరునులేరు. ఆతని వదలి ఇతర దైవములను పూజింపరాదు అను ధర్మము కలదు. ఖురానె షరీఫులోను ఆ ధర్మమేగలదు. కావున అందఱియొద్ద సమమైన ధర్మమగు దేవుని యేకత్వము (తౌహీదు) ను అనుసరించి దేవుని పూజింపవలెను. ఆతనికి సాటిగా నెవరిని కల్పింపరాదు. ప్రవక్తలను మతగురువులు మొదలగువారిని దేవునికి సమానులనుగా చేయకూడదు అని చెప్పఁగా యూదులు క్రైస్తవులు అట్లుసమ్మతింపక తమ తప్పు విశ్వాసములోనే పడినచో "ఓ ముసల్మానులారా! మేము దేవుని విధేయులమైతిమి. దీనికి మీరు సాక్షులుగ నుండుఁడు" అని పలుకుఁడని దేవుని సెలవయ్యెను. 65. హజ్రత్ ఇబ్రాహీమును యూదులును క్రైస్తవులును ముసల్మానులు నుసమముగా గౌరవింతురు. ఆయనను పెద్దగాతలంతురు. కాని యూదులు, ఆతనిని యూదుఁడని క్రైస్తవులు ఆయన తమ మతస్థుఁడని పలుకుచుయున్నారని ముసల్మానులతో వాదులాడుచుండిరి. తౌరాతును అనుసరించినవారు యూదులు. ఇన్జీలును అనుసరించినవారు క్రైస్తవులు. ఆ రెండు గ్రంథములును ఇబ్రాహీముప్రవక్తకు తరువాత వచ్చినవి. కావున ఆయన ఎట్లు యూదుఁడుగాని లేక క్రైస్తవుఁడుగాని అగును? ఇట్టిమాటనుకూడ మీరు గ్రహింపరా అని వారికి సెలవింపు

గలదు. 66. ఈసా ప్రవక్తనుగూర్చి కొంతవఱకు మీకుఁ దెలిసి వాదులాడితిరి. కాని ఇబ్రాహీము ప్రవక్త విషయము మీకేమియును తెలియదే! ఆయనను గూర్చి ఎందులకు మీరు వాదులాడుదురు? తెలియని విషయమునుగూర్చి వాదులాడుట మీ అవివేకముగదా! సర్వము దేవునికిఁ దెలియును. మీకు తెలియదు కావున దేవుఁడు హజ్రత్ ముహమ్మదువారికి పంపు సందేశము (వహీ)ను మీరు అనుసరింపవలెను అని ఇందు యూదులకును క్రైస్తవులకును మందలింపు గలదు. 67. 68. ఇబ్రాహీము యహూదీ(యూదుఁడు)గా కాని నస్రానీ(క్రైస్తవుఁడు)గా కాని లేకుండెను. ఆయన హనీఫుగనుండెను. హనీఫు అనగా తప్పుత్రోవలను విడనాడి ఒక్క సన్మార్గమందు పోవువాఁడు. దేవుని యాజ్ఞలకు విధేయుఁడు (ముస్లిము) అయి ముష్రికుల సంఘములో చేరిన యాతఁడుగా లేకుండెను. ముష్రికు అనగా దేవునికి సాటి కల్పించి పెక్కు దైవములను ఆరాధించువాఁడు. ఇబ్రాహీము ప్రవక్తను పెద్దగాఁ దలచువారు ఆయనను అనుసరింపవలెను. ఎవరు ఆయన మార్గమందు పోవుదురో వారు ఆయనకు చేరినవారు. అట్టివారు ఎవరనఁగా ఆయన కాలమందు ఆతని విశ్వసించి ఆతని మార్గమును అనుసరించినవారును ఈప్రవక్తయగు హజ్రత్ ముహమ్మదువారును, వారి ననుసరించిన ముసల్మానులును. దేవుఁడు ముసల్మానులకు తోడుపడువాఁడును రక్షకుఁడును. వారికి సన్మార్గము చూపి వారి సర్వకార్యములను సవరించి ఉభయలోకములందు విజయమును మోక్షమును ఒసంగును.

69.వద్దత్-తా-ఇఫతుమ్-మిన్-అహ్లిల్-కితాబి-లౌ-యుజిల్లూనకుమ్-వమా-యుజిల్లూన-ఇల్లా-అన్ఫుసహుమ్ వమా-యష్-ఉరూన్. 70 యా-అహ్లల్-కితాబి-లిమ-తక్-ఫురూన-బి ఆయాతిల్లాహి-వఅన్ తుమ్-తష్-హదూన్. 71. యా-అహ్లల్-కితాబి-లిమ-తల్-బిసూనల్-హక్ఖ-బిల్-బాతిలి-వతక్-తుమూనల్-హక్ఖ-వఅన్తుమ్-తఅ-లమూన.

69. గ్రంథముగలవారిలో కొందఱు మిమ్ము సన్మార్గమునుండి తొలగించుటకు ఇష్టపడుదురు. మఱి వారు తమ్ము తామే దుర్మార్గములోపడవేసికొనుచున్నారు. మఱి వారు (దానిని) గ్రహింపరు. 70. ఓ గ్రంథముగలవారలారా! మీరు తెలిసియు ఎందులకు దేవుని సూచనలను తిరస్కరించుచున్నారు? 71. ఓ గ్రంథముగలవారలారా! ఎందులకు మీరు సత్యములో అసత్యము కలుపుచున్నారు? మఱి మీరు తెలిసియు సత్యమును ఏల దాఁచుచున్నారు?

వ్యా॥ 69. యూదులు, ముసల్మానులకు సందేహములుగలిగించి పెక్కు

విధముల కుట్రలు సలిపి ఇస్లామ్ మార్గమునుండి వారిని తొలఁగించి వారిని దుర్మార్గములో పడవేయవలెనని కోరుచున్నారు. ఇట్లు చేయుటవలన ముసల్మానులు సన్మార్గము విడువరు. కాని యూదులు ద్వేషముతో ఇస్లామ్‌ను అవలంబింపక దుర్మార్గులగుచున్నారు. కాని వారు విషయము గ్రహింపరు. 69. ఓ యూదులారా! మీరు ఇతరులను దుర్మార్గులుగాఁ జేయవలెనని ఎందులకు యత్నింతురు? మీకు తౌరాతుగ్రంథము తెలియును. అందు రాఁబోవు ఆఖరు ప్రవక్తనుగూర్చి ప్రకటనలును దేవుని సూచనలును గలవు. కాని తిరస్కరించి ఎందులకు అవిశ్వాసులగుదురు. ఖురాను గ్రంథమును, ఆఖరు ప్రవక్తయగు ముహమ్మదును విశ్వసించి దాని ఫలితము పొందుఁడు అని ఇందు హెచ్చరిక గలదు. 71. యూదులు తమ ఇష్టప్రకారముగా మత ధర్మములని దాచి వానికి తప్పు అర్థములు కల్పించి, సత్యమగు ధర్మములతో అసత్యము కలుపుచుండిరి. అటులే ముహమ్మదురసూలు వారినిగూర్చియున్న వాక్యములను తారుమారుచేసి వానిని ప్రజలకు తెలుపక దాఁచిపెట్టుచుండిరి. అట్లు చేయవలదు అని ఇందు వారికి హెచ్చరిక కలదు.

72. వఖాలత్-తాఇ-ఫతుమ్-మిన్-అహ్‌లిల్-కితాబి-ఆమినూ-బిల్లజీ-ఉన్‌జిల-అలల్లజీన-ఆమనూ-వజ్-హన్-నహారి-వక్-ఫురూ-ఆఖిరహూ-లఅల్లహుమ్ యర్-జిఊన్. 73. వలా-తూమినూ-ఇల్లా-లిమన్-తబిఅ-దీనకుమ్-ఖుల్-ఇన్నల్-హుదా-హుదల్లాహి-అన్-యూతా-అహదుమ్-మిస్‌ల-మా-ఊతీతుమ్-ఔ-యుహాజ్జూకుమ్-ఇన్ద-రబ్బి-కుమ్-ఖుల్-ఇన్నల్-ఫజ్‌ల-బి-యదిల్లాహి-యూతీహి-మన్-యషాఉ-వల్లాహు-వాసిఉన్-అలీమ్. 74. యఖ్-తస్సు-బిరహ్-మతిహీ-మన్-యషాఉ-వల్లాహు-జుల్-ఫజ్-లిల్-అజీమ్.

72. మఱియు గ్రంథము గలవారిలో కొందఱు, ముసల్మానులకు నొసంగఁబడిన దానిని దినారంభములో మీరు విశ్వసించి దినాంతమున తిరస్కరింపుఁడు. అటులైనవారు మరలుదురేమో అని పలికిరి. 73. మఱి మీమతమును అనుసరించినవారినితప్ప ఇతరులను నమ్మకుఁడుఅని వారుపలికిరి. నిశ్చయముగా దేవుఁడు చూపు మార్గమే సన్మార్గము. మీకు నొసంగబడినట్లు ఇతరులకును నొసంగఁబడుననియు లేక మీప్రభువునొద్ద మీతో వాదులాడుదురని, (ఇట్లు పలుకుదురా! అని) ఓ ముహమ్మదు! పలుకుము. అనుగ్రహించుట దేవుని చేతిలోనున్నది. తాను కోరినవారికి అనుగ్రహము చేయును. మఱియు దేవుఁడు చాల అనుగ్రహించువాఁడునుఁ సర్వజ్ఞుఁడును. 74. దేవుఁడు తాను ఇష్టపడినవారికి

అనుగ్రహముప్రత్యేకించును. మఱియు దేవుడు గొప్పఅనుగ్రహముగలవాడు.

వ్యా॥ 72. ఈవాక్యములలో యూదులు చేయు కుట్రలు వివరింపబడు చున్నవి. వానితెలిసికొని ముసల్మానులు మోసపోకుండుటకై హెచ్చరిక చేయఁబడుచున్నది. కొందఱు యూదులు తమవారిలోని కొందఱితో మీరు ప్రొద్దున ఇస్లామ్‌లోచేరి ఆదినమందే సాయంకాలము ఇస్లామ్‌ను వదలి పెట్టుఁడు. ఇదిచూచి బలహీనులైన ముసల్మానులకు సందేహము గలుగును. ఏదోకారణమువలన తెలివిగల యూదులు స్వీకరించిన మతమునువదలినారు అనిముసల్మానులు తమ మతమును విడుతురేమో! అనిపలుకుచు కుట్రలుసలిపిరి. కానివారి కుట్రలకు ముసల్మాను భక్తులు మోసపోలేదు. యూదులు తమజనులతో వారు మీమతస్థులను తప్ప ఇతరులను (అనఁగా ముసల్మానులను) నమ్మకుఁడు అని దుర్బోధచేసి కుట్రలు సలుపుచుండిరి. ఎవరు ఎట్టి కుట్రలు చేసినను ఫలములేదు. దేవుఁడు చూపుమార్గమే సన్మార్గము. కావున ఓ యూదులారా! మీకు దేవునిగ్రంథము లభించినట్లు ఇతరులకు లభింపకూడదా? వారు గ్రంథము పొంది మీతో మతవివాదము చేయుదురని, అట్లు కుట్రలు సలుపుచు ముసల్మానులను తప్పుత్రోవలలో పడవేయుటకు యత్నించుచున్నారా? అట్లుచేసియు ఫలములేదు. దేవుఁడు తాను కోరినవారికి ప్రవక్తపదవినొసంగి సన్మార్గము చూపును. సర్వము ఆతనిచేతిలో నున్నది. ఆతని అనుగ్రహమునకు అడ్డుపడువారు ఎవరును లేరు. ఎవరు ఎద్దానికి యోగ్యులో దేవునికి తెలియును. తన విశాలమైన అనుగ్రహముచే యూదులు కానివారికి ప్రవక్తపదవి మొదలగు అనుగ్రహము లొసంగును.

75. వ-మిన్-అహ్-లిల్-కితాబి మన్-ఇన్-తామన్-హు-బిఖిన్తారిన్-యు-వద్దిహీ-ఇలైక-వమిన్-హుమ్-మన్-ఇన్-తామన్‌హు-బిదీ-నారిన్-లాయు-అద్దిహీ ఇలైక-ఇల్లా-మాదుమ్తు-అలైహి-ఖాయిమన్-జాలిక - బి - అన్న-హుమ్-ఖాలూ-లైస-అలైనా-ఫిల్-ఉమ్మియ్యీన-సబీలున్-వ - యఖూలూన-అలల్లాహిల్-కజిబ వ-హుమ్-యఅ-లమూన్.

76. బలా-మన్-ఔఫా-బిఅహ్దిహీ-వత్తఖా-ఫ-ఇన్నల్లాహ-యుహిబ్బుల్-ముత్తఖీన్. 77. ఇన్నల్లజీన-యష్తరూన-బిఅహ్దిల్లాహి-వ-ఐమానిహిమ్-సమనన్-ఖలీలన్-ఉలాఇక-లా-ఖలాఖ-లహుమ్-ఫిల్-ఆఖిరతి- వలా-యుకల్లిముహుముల్లాహు-వలా-యన్-జురు-ఇలైహిమ్-యౌమల్-ఖియామ- మ

తి-వలా-యుజక్కీ-హిమ్-వలహుమ్-అజా-బున్ అలీమ్.

75. గ్రంథముగలవారిలో కొందఱు నీవు వారియొద్ద ఒక రాశి ధనము అమానతుగా పెట్టినచో వారు దానిని తిరిగి యిచ్చివేయుదురు. మఱియు వారిలో కొందఱు నీవు ఒక్క దీనారము వారియొద్ద అమానతుగా నుంచినచో నీవు వారి తలపై నెక్కి నిలుచునంతవఱకు దానిని తిరిగి యిచ్చివేయరు. అది ఎందుకనఁగా వారు, "ఉమ్మీల" (అరబ్బుల) విషయము మాపై ఏలాటి దోషము లేదు అని పలికిరి. మఱియు వీరు తెలిసియు దేవునిపై అబద్ధములు మోపుచున్నారు. 76. ఎందులకు దోషము కాదు! ఎవరు తమ ఖరారును పూర్తిజేసి దేవునికి భయపడుదురో అట్టి భక్తులను దేవుఁడు ప్రేమించును. 77. ఎవరు తాము దేవునితోఁజేసిన ఖరారునకును తమ ప్రమాణములకును బదులుగ కొంత ధనము పుచ్చుకొనుచున్నారో అట్టివారికి పరలోకమం దెట్టి భాగ్యములేదు. మఱి దేవుఁడు వారితో మాటలాడఁడు. మఱియు తీర్పుదినమున వారి తట్టు చూడఁడు. మఱి వారిని పరిశుద్ధులుగాఁ జేయఁడు. మఱియు వారికి దుఃఖకరమైన బాధ యున్నది.

వ్యా॥ 75. ఇంతవఱకు యూదులు మతవిషయములో చేయుచున్న కుట్రలు ద్రోహములు చెప్పఁబడియె. ఇఁక వారు ధనము ఖరారులవిషయమున చేయు నమ్మికద్రోహము చెప్పఁబడుచున్నది. యూదులలో కొందఱు భక్తులు గలరు. వారు చాల నమ్మకము గలవారు. వారియొద్ద ఒక బంగారురాశి అమానతుగానుంచినను భయములేదు. వారు దానిలో ఏలాటి ద్రోహము చేయక ధనస్వామి అడిగినపుడు అప్పగింతురు. ఇట్టివారు ఇస్లామ్‌లో చేరిరి. వారు అబ్దుల్లాబిన్‌సలామ్ మొదలగువారు. ఆ యూదులలో కొందఱు నమ్మకద్రోహులు గలరు. ఒక్క దీనారము అమానతుగా నుంచినను, వారు సులభముగా తిరిగి యియ్యరు. వారి వెంటఁబడి పీడించునంతవఱకును లేక న్యాయస్థానములకు పోయి వ్యాజ్యములాడునంతవఱకును అప్పగింపరు. ఇట్టి దుర్గుణము వారిలోకలుగుటకు కారణము గలదు. వారు "మేము దేవునికిప్రియులము. మామతములో చేరనివారగు ఉమ్మీ (అరబ్బుల) సొమ్ము మేము దోఁచుకొన్న మాకు దోషము లేదు. అది ధర్మమే అగును" అని దేవునిపై అబద్ధములు మోపుదురు. నమ్మికద్రోహము చేయుట పాపము. దేవుఁడు దానిని సమ్మతింపఁడు అని తెలిసియు వారట్లు చెప్పుచున్నారు. 76. దానికి రద్దుగలదు. యూదులు చెప్పునది తప్పు. ఎవరు నమ్మికద్రోహము చేయుదురో వారికి దోషమున్నది. (దాని శిక్ష 77 వ వాక్యములో చెప్పఁబడినది.) ఎవరు దేవునికి భయపడి తాము చేయు ఖరారును వాగ్దానమును పూర్తిచేయుదురో వారు దేవునికి ప్రియు

లైన భక్తులు. అట్లు కానివారు దేవునికి ప్రియులుకారు. ఆతని కోపమునకు పాత్రులగుదురు. 78. ఎవరు ప్రవక్తమూలమున మతము నవలంబించి దేవునితో సత్కార్యములు చేయుదుమని ఒప్పుకొనియు దానికి విరుద్ధముగా పోయి తాము చేసిన ప్రమాణములకు వాగ్దానములకు బదులుగ కొంతధనము పుచ్చుకొందురో అట్టి పాపులకు పరలోకమందు స్వర్గసౌఖ్యమందు భాగము లభింపదు. అట్టి వారిలో దేవుడు తీర్పుదినమున దయతో మాటలాడడు. మఱి దయతో వారివైపు చూడడు. మఱి వారి పాపములను క్షమించి వారిని పరిశుద్ధులనుగాఁ జేయఁడు. మఱి వారికి దుఃఖకరమైననరకబాధకలుగును. కావున ముసల్మాను భక్తులు అట్టి పాపము జోలికి పోకూడదు. అబద్ధములుపలుకుట, నమ్మికద్రోహముచేయుట, వాగ్దానమునకు వ్యతిరేకముచేయుట, వంచకుల గుర్తులు అని హజ్రత్ పైగంబరులవారుపదేశించియున్నారు.

78. వ ఇన్న మిన్-హుమ్-లఫరీఖన్-యల్ ఊన-అల్-సినత-హుమ్-బిల్-కితాబి-లి-తహ్ సబూహు-మినల్-కితాబి-వమా-హువ మినల్-కితాబి-వయఖూలూన-హువ-మిన్-ఇన్దిల్లాహి-వమా హువ-మిన్-ఇన్దిల్లాహి-వ-యఖూలూన-అలల్లాహిల్-కజిబ-వహుమ్-యఅ-లమూన్.

78. మఱియు వారిలో కొందఱు తమనాలుకలను త్రిప్పి గ్రంథమును చదువుదురు. మీరు, అది గ్రంథములోనిది అని తలఁచుటకు (అట్లుచదువుదురు). మఱియు అది గ్రంథమునకు చేరినదిగాదు, మఱియువారు అది దేవుని యొద్దనుండి వచ్చినది అని పలుకుదురు. మఱి అది దేవునినుండి వచ్చినదిగాదు. మఱియువారు తెలిసియు దేవునిపై అబద్ధములు పలుకుచున్నారు.

వ్యా॥ 78. కొందఱు యూదులు, తౌరాతు గ్రంథములో మార్పులుచేసి ముసల్మానులు అది తౌరాతులోనిది అని తలఁచునట్లు తారుమారు చేసి పఠింతురు. దానికి తప్పుఅర్థములుకల్పించి, దేవునికి భయపడక, అది దేవుని గ్రంథములో చేరినది. దేవుఁడు పంపిన ధర్మమని ప్రజలతో పలుకుదురు. అది దేవుని గ్రంథములోనిదికాదు. దేవుఁడు అట్లుపంపలేదు. ఆదుష్టయూదులు, తమఇష్టానుసారముగకల్పించి దేవునిపై అబద్ధములు మోపుచున్నారు. వారు చేయునది పాపము, తప్పు, అని తెలిసియు వారట్లుచేయుచున్నారు. కావున ఆస్తికగృష్టుల మాటలకు మోసపోకూడదు.

79. మాకాన-లిబషరిన్-అన్-యూతియ-హుల్లాహుల్-కితాబ-వల్ హుక్మ-వన్-నుబువ్వత-సుమ్మ-యఖూల-లిన్నాసి కూనూ-ఇబాదల్-లీ-మిన్-దూని

ల్లాహి-వలాకిన్-కూనూ-రబ్బానీయీన బిమా-కున్తుమ్-తుఅల్లి-మూనల్ కితాబ వబిమా-కున్తుమ్ తద్రుసూన్. 80. వలా-యామురకుమ్-అన్-తత్తఖిజుల్-మలా-ఇకత-వన్-న-బియ్యీన-అర్-బాబన్-అయామురుకుమ్ బిల్-కుఫ్రి-బఅద-ఇజ్-అన్తుమ్-ముస్లిమూన్.

79. దేవుఁడు గ్రంథమును జ్ఞానమును ప్రవక్తపదవియును ఏమానవునకు ఒసంగునో ఆతఁడు ప్రజలతో మీరు దేవునివదలి నాకు భక్తులు కండు అని చెప్పఁదగదు. కాని ఆతఁడు మీరు దేవునివారలు కండు అనిచెప్పును. ఎందుకన మీరు గ్రంథమును నేర్పుచుంటిరి. మఱి దానిని పఠించుచుంటిరి. 80. మఱియు మీరు దేవదూతలను ప్రవక్తలను దైవములుగా చేసికొనుఁడు అని చెప్పుట ఆతనికితగదు. ఏమి ఆతఁడు మీరు విశ్వాసులైన తరువాత మీకు అవిశ్వాసము బోధించునా ?

వ్యా॥ 79. 80. కొందఱు యూదులు, క్రైస్తవులు నజ్రాన్ క్రైస్తవులుండిన సమయమున, హజ్రత్ ముహమ్మదు పైగంబరులవారితో ఓముహమ్మదు! ఏసుక్రీస్తును క్రైస్తవులు పూజించునట్లు మేముకూడ నిన్ను పూజింపవలెను అని నీవు కోరుచున్నావా! అని పలికిరి. అది ఇందురద్దుచేయఁబడినది. క్రైస్తవులు కొందఱు ప్రవక్తలను దేవునిగాను, దేవుని కుమారునిగా నెంచి, ఆప్రవక్తలే తమ విషయమిట్లు బోధించిరి అని చెప్పుచుండిరి. దానికి కూడ నిందురద్దుగలదు. దేవుఁడు ఎవ్వనికి తన గ్రంథము తత్వజ్ఞానము, ప్రవక్త పదవి ఒసంగునో ఆతఁడు ఎప్పటికిని దేవుని పూజించుటను వదలి నన్ను ఆరాధించుఁడు అని ప్రజలకు బోధింపఁడు. ఆతఁడు ప్రజలతో మీరు దేవునికిప్రియులైన భక్తులుకండు అని బోధించును. ఎందుకన వారు పూర్వమునుండియు మతగ్రంథములు ప్రజలకు నేర్పుచు వానిని పఠించుచు వాని ననుసరించుచుండిరి. అందువలన మత గ్రంథధర్మములకు విరుద్ధముగా దేవుని వదలి దూతలను ప్రవక్తలను దేవతలనుగా చేసికొని వారిని పూజింపుఁడుఅని ప్రవక్త బోధింపనేరఁడు. ప్రజలు దేవుఁడు ఒక్కఁడే అని విశ్వసించిన పిదప ఇతర దైవములను కల్పింపుఁడు అని అవిశ్వాసము ఎన్నటికిని నేర్పఁడు. యూదులు క్రైస్తవులు తప్పు విశ్వాసములు గలిగి ప్రవక్తలపై నిటువంటి నింద మోపుచున్నారు.

81. వ-ఇజ్-అఖజల్లాహు మీసాఖన్-నబీయ్యీన-లమా-ఆతైతుకుమ్-మిన్-కితాబిన్-వహిక్మతిన్-సుమ్మ-జాఅకుమ్-రసూలుమ్-ముసద్దిఖుల్-లిమా-మ-అకుమ్-లతూ-మినున్న-బిహీ-వల-తన్-సురున్నహూ-ఖాల-అ అఖ్-రర్-

తుమ్-వ-అఖజ్-తుమ్-అలా-జాలికుమ్ ఇస్రీ ఖాలూ-అఖ్-రర్నా ఖాల- ఫష్-హదూ-వ-అనా-మఅకుమ్ మినష్-షాహిదీన్. 82. ఫమన్-తవల్లా-బఅ-ద-జాలిక-ఫ-ఉలా ఇక-హుముల్-ఫాసిఖూన్. 83. అఫగైర-దీనిల్లాహి-యబ్-గూన-వ లహూ-అస్లమ-మన్-ఫిస్-సమావాతి-వల్-అర్జి-తౌఅన్-వ-కర్-హన్-వ-ఇలైహి-యుర్-జఊన్.

81. మఱియు దేవుఁడు ప్రవక్తలనుండి వాగ్దానము పుచ్చుకొన్నప్పుడు మీకు నేను గ్రంథమును జ్ఞానమును ఒసంగిన పిదప మీయొద్దకు మీగ్రంథమును సత్యపఱచునట్టి ప్రవక్త వచ్చినచో మీరు ఆ ప్రవక్తను విశ్వసింపవలెను. మఱియు అతనికి తోడుపడవలెను. ఏమి మీరు ఖరారు చేసితిరా! మఱియు నా నిబంధనమును ఒప్పుకొంటిరా అని పలుకఁగా మేము ఖరారుచేసితిమి అని చెప్పిరి. దేవుఁడు మీరు సాక్షులుగ నుండుఁడు. నేనును మీతో సాక్షిగ నుందునని సెలవిచ్చెను. 82. దానిపిదప ఎవరు తిరస్కరించి మరలుదురో వారే అవిధేయులు. 83. ఏమి వారు దేవుని మతము తప్ప వేఱుమతము కోరుచున్నారా? మఱియు ఆకాశములలోను భూమిలోనున్నసర్వజనులును ఇష్టముతోను అనిష్టముతోను దేవునికి విధేయులై యున్నారు. మఱియు ఆతనియొద్దకే సర్వజనులు మరలి పోవలసియున్నది.

వ్యా॥ 81:83. దేవుఁడు తాను పంపిన ప్రవక్తలనుండి ఈవాక్యములో సెలవిచ్చినట్లు వాగ్దానము పుచ్చుకొనెను. ప్రవక్తల మూలమున వారివారి జనులయొద్ద వాగ్దానము పుచ్చుకొనెను. వెనుక వచ్చిన ప్రవక్త తనకు పూర్వము వచ్చిన ప్రవక్తను విశ్వసించి యాతనికి తోడుపడవలెను. ముందు వచ్చిన ప్రవక్త లేనిచో ఆప్రవక్తమతస్థులు వెనుకవచ్చిన ప్రవక్తను విశ్వసించి మతప్రచారములో ఆయనకు తోడుపడవలెను. అట్లుచేసిన ఖరారునకును నిబంధనకును, ప్రవక్తలును దేవుఁడును సాక్షులు. అట్టిసాక్షులుగల దస్తావీజునకు వ్యతిరేకముగ పోకూడదు. దేవుఁడుఅందఱు ప్రవక్తలకన్న వెనుకహజ్రత్ ముహమ్మదు ప్రవక్తను ఖురానుగ్రంథమును ఒసంగిపంపెను. పూర్వము గడిచిన ప్రవక్తలందఱును రాఁబోవు ఆఖరుప్రవక్తను గూర్చి విశ్వసింపవలెను అని ప్రకటించి తమతమ మతస్థులకు బోధించియుండిరి. దానిననుసరించి యూదులును క్రైస్తవులును హజ్రత్ ముహమ్మదువారిని విశ్వసించి వారికితోడుపడవలెను. హజ్రత్ ముహమ్మదువారు తమకుపూర్వము వచ్చిన మత గ్రంథములను సత్యపఱచుచున్నారు. కావున దేవుని నిబంధనమును అనుసరించి దేవుని గ్రంథము

గలవారందరు హజ్రత్ పైగంబరులవారిని విశ్వసింపవలెను. ఎవరు నిబంధనల కు వ్యతిరేకముగాపోయి, వెనుక వచ్చిన దేవుని ప్రవక్తను తిరస్కరింతురో వారు దేవునికి అవిధేయులు దానికి తగిన శిక్ష పొందుదురు. ఏమి? అట్టివారు దేవునిమతమగు విధేయత (ఇస్లామ్)ను వదలి ఇతరమతములకోరుచున్నారా? అట్లు చేయుట తప్పు. భూమ్యాకాశములలోనున్న సమస్త జనులును ఇష్టమున్నను లేకున్నను దేవునికి విధేయులై యున్నారు. మఱియు అందఱును తీర్పు దినమున దేవుని సన్నిధికి మరలి రావలసియున్నారు. అచ్చట వారి కర్మలను గూర్చి తీర్పు అగును. కావున బుద్ధిమంతులు ఆ దినమునకుఁగాను సత్కార్యములు ఇహమునందే సలుపుదురు. ఇచ్చట అవిధేయులై అచ్చట దేవునికి ఏమని ముఖము చూపఁగలరు?

84. ఖుల్-ఆ-మన్నా-బిల్లాహి-వ-మా-ఉన్-జిల-అలైనా-వ-మా-ఉన్ జిల-అలా ఇబ్రాహీమ-వ ఇస్మా-ఈల-వ ఇస్-హాఖ-వ-యాఅ - ఖూబ వల్ అస్బాతి-వమా-ఊతియ-మూసా-వ-ఈసా-వన్ నబీ-యూన-మిర్-రబ్బి - హిమ్ - లా-నుఫర్రిఖు-బైన అహదిమ్-మిన్-హుమ్-వ-నహ్-ను- లహూ- ముస్లి- మూన్.

85. వ-మన్-యబ్ తగి-గైరల్-ఇస్లామి-దీనన్-ఫ-లన్ యుఖ్బల-మిన్ హు-వహువ-ఫిల్-ఆఖిరతి-మినల్-ఖాసిరీన్.

84. మేము దేవునిని, మాకు నొసంగఁబడిన దానిని, ఇబ్రాహీమునకు, ఇస్మాయీలునకును, ఇస్‌హాఖునకును, యాఖూబునకును, అతని పుత్రులకును, మూసాకును, ఈసాకును సర్వప్రవక్తలకును తమ ప్రభువునుండి లభించిన దానిని విశ్వసించితిమి. వారిలో నెవరి మధ్యను భేదము చేయము. మఱియు మేము దేవునికే విధేయులము అని పలుకుఁడు. 85. మఱెవఁడు ఇస్లామ్ మతము తప్ప వేఱు మతము కోరునో అది ఎన్నటికిని అంగీకరింపఁబడదు. మఱియు అతఁడు పరలోకమునందు నష్టముపొందు వారితో చేరును.

వ్యా॥ 84, 85. యూదులు, క్రైస్తవులు, తిరస్కరించి ఇస్లామ్ స్వీకరింపనిచో ముసల్మానులిట్లు విశ్వసింపుఁడు అని చెప్పఁబడియె. ముసల్మానులు తమ మతగ్రంథమగు ఖురానును విశ్వసించి దాని ననుసరింపవలెను. దేవునికి విధేయులై భయభక్తులుగలిగియుండవలెను. ఆదమునుండి హజ్రత్ ముహమ్మదు పైగంబరులవారివఱకు దేవుని ప్రవక్తలు ఎందఱు వచ్చిరో అందఱిని దేవుని ప్రవక్తలనుగా విశ్వసింపవలెను. యూదులు క్రైస్తవులవలె ఒకరి ప్రవక్తను విశ్వసించి మఱొక ప్రవక్తను తిరస్కరించినచో అది విశ్వాసము కానేరదు. అదియును అవిశ్వాసమే. ఖురానె షరీఫులో కొందఱు ప్రవక్తల పేళ్ళను

వారికి దేవునిచే నొసంగఁబడిన గ్రంథముల పేళ్ళునుగలవు. మఱి అనేక ప్రవక్తలపేళ్లులేవు. కావున ఉన్నవారిని లేనివారిని కూడ విశ్వసింపవలెను. ఎవరు దేవుని మతమగు ఇస్లామ్‌మతమును వదలి వేఱు మతమును స్వీకరింతురో వారు దేవునికి ఇష్టులుకారు. దానివలన దేవునిప్రీతి మోక్షము లభింపఁజాలదు. అట్టివారు స్వర్గసౌఖ్యములను గోలుపోయి నరకములో పడుదురు. కావున సర్వజనులును దేవునికి ప్రియమైన ఇస్లామ్ మతము స్వీకరింపవలెను.

86. కైఫ-యహ్‌దిల్లాహు-ఖౌమన్-క-ఫరూ-బఅ-ద-ఈమాని-హిమ్-వ-షహిదూ-అన్నర్-రసూల-హఖ్ఖున్-వ-జాఅ-హుముల్-బయ్యినాతు-వల్లాహు-లా-యహ్దిల్-ఖౌమజ్-జాలిమీన్. 87. ఉలా-ఇక-జజా-ఉహుమ్-అన్న-అలైహిమ్-లఅ-నతల్లాహి-వల్-మలా-ఇకతి-వన్నాసి-అజ్-మ-ఈన్. 88. ఖాలి-దీన-ఫీ-హా-లా యు-ఖఫ్-ఫఫు-అన్ హుముల్-అజాబు-వలా-హుమ్-యున్-జరూన్. 89. ఇల్-లల్లజీన-తాబూ-మిమ్-బఅ-ది-జాలిక-వ-అస్‌లహూ-ఫ-ఇన్నల్లాహ-గఫూరుర్-రహీమ్.

86. విశ్వసించి ప్రవక్త సత్యమనిసాక్ష్యమిచ్చువారియొద్దకు స్పష్టమైన సూచనలు వచ్చిన పిదపను అవిశ్వాసులైన జనులకు దేవుఁడు ఎట్లుసన్మార్గము చూపును ? మఱియు దేవుఁడు దుర్మార్గులకు (దుష్టులకు) సన్మార్గముచూపఁడు. 87. అట్టివారికి శిక్షయు, వారిపై దేవునియొక్కయు, దేవదూతలయొక్కయు సర్వజనులయొక్కయుశాపమున్నది. 88. అందు వారు సదా యుందురు. వారి బాధ తగ్గదు. మఱియు వారికి విరామము లభింపదు. 89. కాని పిదప ఎవరు క్షమాపణ కోరి సత్కార్యములు చేయుదురో వారికి నిశ్చయముగ దేవుఁడు క్షమించువాఁడును దయాళువును.

వ్యా॥ 86 : 89. యూదులు, క్రైస్తవులు, తమ తమ మతగ్రంథముల మూలమున హజ్రత్ ముహమ్మదువారే దేవుని ప్రవక్త అని సాక్ష్యమిచ్చి, పూర్వమునుండి విశ్వాసముగలిగియు, నిజము తెలిసియు, వారి వంశముగాకచేరని అరబ్బులలో ప్రవక్త పుట్టెనే అని అసూయా ద్వేషములతో తిరస్కరించి అవిశ్వాసులైరి. అట్టి దుర్మార్గులు సన్మార్గమునకు రాఁజాలరు. అట్టి దుర్మార్గులకు దేవుఁడు రక్షణమార్గమగు సన్మార్గములు చూపఁడు. తెలిసియు అట్లు విరోధము చూపువారు సన్మార్గమునకు రారు. అట్టివారు ఉభయలోకములలోను దేవుని కోపమునకు పాత్రులగుదురు. అట్టి దుష్టులను దేవదూతలును సర్వజనులును శపింతురు. ఆ శాపఫలితముగా వారు నరకనివాసులై యందు సదా యుం

దురు. కాని, తమ పాపములకు పశ్చాత్తాపముపడి దేవుని క్షమాపణ కోరి, సత్కార్యములు చేసినచో దేవుడు క్షమించి దయచేయును. కావున ప్రజలు అట్టి దయామయుని అనుగ్రహమును చూచి తమ పాపములను వదలుకొని సత్కార్యములు చేయుదురు గాక!

90. ఇన్నల్లజీన-కఫరూ-బఅ్‌ద-ఈమా-నిహీమ్-సుమ్మజ్-దాదూ-కుఫ్‌రల్-లన్-తుఖ్-బల-తౌబతుహుమ్-వ-ఉలా-ఇక-హుముజ్-జాల్లూన్. 91. ఇన్నల్లజీన-కఫరూ-వమాతూ-వ-హుమ్-కుఫ్ఫారున్-ఫలన్-యుఖ్-బల-మిన్-అహదిహిమ్-మిల్-ఉల్-అర్‌జి-జహ-బన్-వలవిఫ్-తదా-బిహీ-ఉలా-ఇక లహుమ్-అజా-బున్-అలీ-మున్-వమా-లహుమ్-మిన్-నాసిరీన్.

90. ఎవరు విశ్వసించిన తరువాత తిరస్కరించి, ఆతిరస్కారములోనే వృద్ధిపొందుచుందురో వారి క్షమాపణ అంగీకరింపబడదు. మఱి అట్టివారే పరమ దుర్మార్గులు. 91. ఎవరు విశ్వసింపక అవిశ్వాసులుగానే మృతినొందిరో అట్టివారు భూమి నిండుగ బంగారు (తమ పాపపరిహారార్థముగా) బదులుగా నిచ్చినను అంగీకరింపబడదు. అట్టివారికి దుఃఖకరమైన బాధయున్నది. మఱియు వారికి ఎవరును సహాయులు లేరు.

వ్యా॥ 90, 91. మునుపటి వాక్యములో పాపమునుండి త్రికరణశుద్ధిగా క్షమాపణ కోరి భక్తులైనవారి క్షమాపణ అంగీకరింపబడును అని చెప్పబడియెను. ఇంక ఇతరులగూర్చి చెప్పబడుచున్నది. మనఃపూర్వకముగ పశ్చాత్తాపపడక కొన్ని అవిశ్వాసపు కార్యములు చేయుచు తమ అవిశ్వాస తిరస్కారములోనే వృద్ధిపొందుచున్నట్టివారి క్షమాపణ అంగీకరింపబడదు. విశ్వసింపక అవిశ్వాసులుగానే మృతినొందినవారు ఇహమునందు ఒకవేళ భూమినిండుగా దానము చేసియుండినను అది అంగీకరింపబడదు. ఎందుకన వారిఅవిశ్వాసము వలన వారి దానపుణ్యము వారికి లభింపదు. ప్రతి సత్కార్యము ఫలించుటకు విశ్వాసము (ఈమాన్) మూలాధారము. విశ్వాసములేని దానములు పరలోకమందు ఫలింపవు. అటులే అవిశ్వాసులుగ మృతినొందినవారు, భూమినిండుగ బంగారు తమ పాపములకు పరిహారము (బదులుగ) ఒసంగినను అది అంగీకరింపబడదు. పరలోకమునందు భక్తి విశ్వాసములతో చేసిన సత్కార్యములు పనికివచ్చును. కాని, అవిశ్వాసముతో కూడిన ఎట్టిసత్కార్యములైననునిర్జీవితో సమానము. అవి ఫలింపవు. ఇహమునందు నేరముచేసినవారు లంచమిచ్చియో, లేక ఇతరుల సహాయమువలననో శిక్షనుండి తప్పించుకొందురు. కాని, పరలోకమందు అట్టి యాటలు సాగవు. ఎవరునుతోడుపడిశిక్షనుండి తప్పింపజాలరు.

కావున మానవులు విశ్వసించి త్రికరణశుద్ధిగా పుణ్యములుచేసి దాని ఫలిత మగు దేవుని ప్రీతియు స్వర్గసౌఖ్యము పడయుదురు గాక!

## నాల్గవ కాండము

92. లన్-తనా-లుల్-బిర్ర-హత్తా-తున్-ఫి-ఖూ-మిమ్మా-తుహిబ్బూన-వమా-తున్-ఫిఖూ-మిన్-షైఇన్-ఫ-ఇన్నల్లాహ-బిహీ-అలీమ్.

92. మీరు ప్రియమైనదానిని ఖర్చుచేయనంతవఱకు మీరు భక్తి (పుణ్యము) పొందఁజాలరు. మఱియు మీరు ఖర్చుచేయునది దేవునికి తెలియును.

వ్యా॥ 92. భక్తిలో సంపూర్ణులై పూర్తి పుణ్యము కావలెనన్న త్రికరణశుద్ధిగా చాల ప్రియమైన దానిని దేవునికొఱకు వినియోగింపవలెను. దానముచేయు వస్తువు ఉత్తమమైనదిగా నుండవలెను. పనికిమాలిన వస్తువులను దానముచేయుటవలన భక్తిగాని పుణ్యముగాని చేకూరదు. తమకు ఎంతప్రియమైన దానిని ఎంత చిత్తశుద్ధితో దేవునిమార్గమందు దానముచేయుదురో అంతటి పరిశుద్ధమైన భక్తి కుదురును. దాన మేరీతిగా నెంత చేయుదురో దేవునికిఁదెలియును. దానికిఁ దగిన పుణ్యఫలితము నొసంగును. యూదులకు ఇహలోక గౌరవ పదవులు చాల ప్రియమైనవి. అందువలన వారు ఇస్లామ్‌నుస్వీకరింపకుండిరి. కావున వారు భక్తి పుణ్యములు పొందవలెనన్న వారికి ప్రియమైనదానినిదేవునికొఱకు వదలి ఇస్లామ్‌లో చేరవలెను. అప్పుడు వారు భక్తినిపొంది దేవునికి ప్రియులగుదురని హెచ్చరింపఁబడిరి. ఈవాక్యము ననుసరించి ముసల్మాను భక్తులు తమకు ప్రియములైనవి దేవునికొఱకు దానము చేసిరి.

93. కుల్లత్-తఆమి-కాన-హిల్లల్-లిబనీ-ఇస్రాయీల ఇల్లామాహర్రమ ఇస్రాయీలు-అలా-నఫ్-సిహీ-మిన్-ఖబ్లిఅన్-తునజ్జల-తౌరాతు-ఖుల్ ఫాతూ-బిత్-తౌరాతి ఫత్లూహా-ఇన్-కున్తుమ్-సాదిఖీన. 94.ఫమ-నిఫ్‌తరా-అలల్లాహిల్-కజిబ-మిమ్-బఅ-ది జాలిక ఫ-ఉలాఇక హుముజ్ జాలిమూన. 95. ఖుల్-సదఖల్లాహు-ఫత్-తబిఊ మిల్లత-ఇబ్రాహీమ-హనీఫన్ - వమాకాన-మినల్-ముష్‌రికీన. 96. ఇన్న-అవ్వల-బైతిన్-ఉజిఅ లిన్నాసి-లల్లజీ-బి-బక్కత-మూబారకన్-వహుదల్ లిల్-ఆలమీన. 97. ఫీహి ఆయాతుమ్-బయ్యినాతుమ్-మఖాము-ఇబ్రాహీమ-వమన్-దఖలహూ-కాన-ఆమినన్-వలిల్లాహి-అలన్నాసి-హిజ్జుల్-బైతి-మనిస్-తతాఅ-ఇలైహి-సబీలన్-వ-మన్-కఫర-ఫ-ఇన్నల్లా

హనీయ్యుక్-అనిల్-ఆలమీక్.

93. తౌరాతుగ్రంథము ఒసంగఁబడక పూర్వము యాఖూబు తన ఆత్మపై నిషేధించుకొన్న వస్తువులు తప్ప, అన్ని ఆహారపదార్థములు ఇస్రాయీలు సంతతివారికి ధర్మమైనవి (హలాలు)గా నుండినవి. మీరు సత్యవంతులైనచో, తౌరాతును తీసికొనిరండు. మఱి దానిని పఠింపుఁడు అని ఓ ప్రవక్తా! పలుకుము. 94. మరల ఎవరు దాని పిదప దేవునిపై అబద్ధములు కల్పింతురో వారు దురాత్ములు. 95. దేవుఁడు సత్యము పలికెను. కావున, సన్మార్గుఁడగు ఇబ్రాహీము మతమును అనుసరింపుఁడు అని పలుకుము. ఆయన పెక్కు దైవారాధకులతో చేరినవాఁడు కాఁడు. 96. నిశ్చయముగా ప్రజలకొఱకు మొట్టమొదట (ప్రార్థనకై) నియమింపఁబడిన గృహము మక్కాపురములో నున్నది. అది శుభము గలదియును సర్వలోకులకును సన్మార్గదర్శియును. 97. అందు మఖామెఇబ్రాహీము మొదలగు స్పష్టమైన సూచనలును గలవు. అందు ప్రవేశించువానికి అభయము లభించును. మఱియు అచ్చటికి పోవుశక్తిగల ప్రజలకు ఆ గృహయాత్ర దేవునికొఱకు చేయుట విధియైయున్నది. మఱి ఎవఁడు తిరస్కరించునో ఆతఁడు "దేవుఁడు సర్వలోకులను లక్ష్యముచేయనివాఁడ"ని తెలిసికొనునది.

వ్యా॥ 93. యూదులు ముసల్మానులతో మీరు ఇబ్రాహీము ప్రవక్తను అనుసరించుచున్నామని చెప్పుచు ఆతని కుటుంబమువారికి నిషేధమైన ఒంటె మాంసము తినుచు దానిపాలుత్రాగుచున్నారే అని నిందింపసాగిరి. ఇందుదాని రద్దుగలదు. తౌరాతు గ్రంథము మూసా ప్రవక్తకు నొసంగఁబడకముందు అన్ని భక్ష్యపదార్థములు తినవచ్చునని ఇస్రాయీలియులకు ధర్మముండెను. అందు ఒంటె మాంసము, దాని పాలు చేరినవి. ఇబ్రాహీము ప్రవక్తపిదప యాఖూబు ప్రవక్త తాను ఒక వ్యాధిలో చిక్కి దేవుఁడు తనకు బాగుచేసినచో తనకు ప్రియమైనదానిని దేవునికొఱకు వదలెదను అని మ్రొక్కుబడిచేసికొనెను. ఆతని వ్యాధి కుదిరెను. అందుకు తనకు చాల ప్రియమైన ఒంటె మాంసమును దాని పాలును వదలిపెట్టెను. ఆతనిని అనుసరించి ఆతనిసంతానముకూడ వదలిపెట్టెను. కాని దేవుఁడు దానిని నిషేధించియుండలేదు. అట్లు దేవునిగ్రంథమగు తౌరాతులోకూడలేదు. అటులున్నచో (మీరు చెప్పునది సత్యమైనచో) ఓ యూదులారా! మీరు తౌరాతుగ్రంథము తీసికొనివచ్చి పఠించి చూపుఁడు అని వారి వివాదము తీరుటకుఁగాను చెప్పఁబడియె. వారట్లు చూపలేకపోయిరి. 94. అట్లు సత్యము తెలిసిన పిదప వారు తమ అబద్ధవాక్యములు వదలక దేవునిపై కల్పనలు చేసినచో సన్మార్గము తప్పి దుర్మార్గులగుదురు. దాని ఫలితము వారు అనుభవింతురు.

వ్యా॥ 95. దేవుఁడు ధర్మాధర్మములను గూర్చియు ఇస్లాముని దాని ప్రవక్తనుగూర్చియు పలుకువిషయములు సత్యమైనవి. మీరు వానిని అబద్ధపుఁ బంజాలరు. కావున ముసల్మానులు ఇబ్రాహీము ననుసరించునట్లు ఓ! యూదులారా! మీరుకూడ అనుసరింపుఁడు. ఇబ్రాహీముప్రవక్త సన్మార్గమునందు స్థిరముగా నుండినయాతఁడు ఆతఁడు దేవునియందు భయభక్తి గల వాఁడు. దేవునినే యారాధించువాఁడు. వెక్కు దైవములను ఆరాధించువారిలో చేరినవాఁడు కాఁడు. కావున మీరుకూడ ఉజైరు, ఏసుక్రీస్తు మొదలగువారి నారాధించుట మానుకొనుఁడని యూదులకును క్రైస్తవులకును హెచ్చరిక గలదు.

వ్యా॥96:97. యూదులు, ఇబ్రాహీముప్రవక్త సంతానము, సిరియా(షామ్) దేశములోనే యుండి బైతుల్ ముఖద్దస్‌నకు అభిముఖులై ప్రార్థనలు సలుపుచుండిరి. ఓ ముసల్మానులారా! మీకు ఇబ్రాహీము ప్రవక్తతో సంబంధముండినయెడల బైతుల్ ముఖద్దస్‌నువదలి కాబామసీదును ఎందులకు ఖిబ్లాగా చేసికొందురు అని యూదులు నిందింపసాగిరి. దానికిందు సమాధానము గలదు. మొట్టమొదట ప్రజల ప్రార్థనలకొఱకు శుభములు గలదియు, సన్మార్గము చూపునదియుగా నియమింపబడిన గృహము మక్కాపురములో నుండు కాబా మసీదు. మిగిలిన పవిత్రస్థలములును, బైతుల్ ముఖద్దస్‌ను కాబా మసీదునకు పిదప ఏర్పడినవి. కాబా మసీదు చాలకాలమునుండి భక్తులకు పుణ్యక్షేత్రముగా నున్నది. అందు ఆత్మిక దైహిక పవిత్రములు భక్తులకు చేకూరును. నూహు ప్రవక్త కాలమందు సంభవించిన జలప్రళయమునకు పిదపహజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తయొక్కయు ఆతని కుమారుఁడగు ఇస్మాయీలు ప్రవక్తయొక్కయు పవిత్ర హస్తములతో కాబా మసీదు కట్టబడెను. అందు ఇబ్రాహీము ప్రవక్త ఏ రాతిపై నిలిచి కట్టడముకట్టెనో అది ఇప్పటికిని ఉన్నది. అందు వారి పాదముల గుర్తులుకూడ గలవు. ఆ రాతినే "ముఖామె ఇబ్రాహీము" అందురు. కాబా మసీదులో ప్రవేశించువారికి అభయములభించును. పూర్వము అరేబియాలో చాల అరాజకముండి ప్రజలకు శాంతము లేకుండ ప్రాణ ధనములకు దుష్టుల భయముండినపుడు కూడ మక్కావారికి కాబామసీదు మహిమవలన ఏలాటి చోర భయము లేకుండ శాంతియుండెను. కాబాయాత్ర జరుగు నాల్గు నెలలలో నేలాటి భయము ప్రజలకు లేకుండెను. మక్కాపురములోనికి వచ్చిన యాత్రికులు తమవలెనే అచ్చటి యాత్రకువచ్చిన విరోధులనుకూడ హింసింపకుండిరి. పూర్వమునుండియు అందఱును దానిని గౌరవించుచు వచ్చిరి. కావున అట్టి పవిత్రమైన కాబామసీదు ముసల్మానుల ఖిబ్లాగా నియమింపఁబడెను. అట్టి మహిమ గల గృహమును దర్శించుటకుఁగాను శక్తిగలవారు దేవుని ప్రీతికొఱకు పోవలెను. కాబా మసీదుయాత్ర సలుపుట (హజ్) ముసల్మానులకు విధి

హ్యైన ధర్మము. అచ్చటికి పో శక్తి గలవారు తమ జీవితకాలములో ఒకతూరి హ్యైన పోయితీరవలెను. అట్లు శక్తి గలిగియు తిరస్కరించువారు నష్టము చేసి కొనువారగుదురు. వారేగతి పొందినను దేవునికి లక్ష్యములేదు. దేవుఁడు సర్వ లోకులను లక్ష్యము చేయని వాఁడు. ఆతనికి ఒకరి యక్కఱలేదు. కావున ఒకరి తిరస్కారమువలన ఆతనికేమియు నష్టమును కలుగదు. తిరస్కరించు వారే నష్టపడుదురు.

98. ఖుల్-యా-అహ్లల్-కితాబి-లిమ-తక్-ఫురూన-బి-ఆయాతిల్లాహి-వల్లాహు-షహీదున్-అలా-మా-తఅ-మలూన్. 99. ఖుల్-యా-అహ్లల్-కితాబి-లిమ-తసుద్దూన-అన్-సబీ-లిల్లాహి-మన్-ఆమన-తబ్ గూ-నహా-ఇవజన్-వఅన్తుమ్-షుహదాఉ-వమల్లాహు-బిగాఫిలిన్-అమ్మాతఅ-మలూన్.

98. ఓ గ్రంథముగలవారలారా! మీరెందుకు దేవుని సూచనలను తిరస్కరించుచున్నారు. మఱియు దేవుఁడు మీరుచేయుకర్మలకు సాక్షిగానున్నాఁడు, అని ఓ ప్రవక్తా! పలుకుము. 99. ఓ గ్రంథముగలవారలారా! మీరుతెలిసియు తప్పుత్రోవను కోరుచు విశ్వసించినవారిని ఎందులకు దేవుని మార్గమునుండి ఆటంక పరచుచున్నారు. మఱి మీరుచేయు కర్మలనుండి దేవుఁడు అజాగ్రత్తగా లేఁడని ఓప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 98. ఇఁక యూదులును నస్రానీలును చేయు కుట్రలను వారి తిరస్కారమునుగూర్చి చెప్పఁబడుచున్నది. దేవుని గ్రంథము గలిగియు, దేవుని ఆఖరు ప్రవక్తయగు మహమ్మదువారు దేవునిప్రవక్తఅని తెలిసియు, వారికొసంగఁబడిన గ్రంథమగు ఖురానెషరీఫు దేవుని గ్రంథమని రుజువైన పిదప మీరు ఎట్లు తిరస్కరించి అవిశ్వాసులు అగుదురు. మీరుచేయు ప్రతికార్యము దేవునికిఁదెలియును. దానికిఁదగిన ఫలితములు ఆతఁడొసంగును. 99. యూదులును నసారీయులును తాము ఇస్లామ్‌ను విశ్వసింపక విశ్వసించిన ముసల్మానులకు అనేక సందేహములు కలిగించుచు దేవుని మార్గమగు ఇస్లామ్‌నుండి అటంకపఱచుచు, వారు మతభ్రష్టులు కావలెనని కుట్రలు సలుపుచుండిరి. ఒకతూరి యూదులు అన్సారులమధ్య కలహములుపుట్టించుటకు వారిపూర్వ కలహములనుగూర్చి పలికిరి, కలహము కూడ సంభవించునట్లుండెను. అప్పుడావిషయము పైగంబరులవారికి తెలిసి కలహము సంభవింపకుండ సమాధానపఱచిరి. యూదులట్లుచేయుచు సన్మార్గమగు ఇస్లామ్‌ను వదలి వంకరమార్గమైన దుర్మార్గమున కిష్టపడి తెలిసియు అట్లుచేయుచున్నారు. అటు చేయుట ధర్మముకాదు. వారుచేయుకుట్రలను కర్మలను దేవుఁడు జాగ్రత్తగానే చూచుచున్నాఁడు.వారి

కర్మలకు దగిన శిక్ష ఒకేతూరి విధింపుసు.

100. యా-అయ్యుహల్లజీన-ఆమనూ-ఇన్-తుతీఊఫరీఖమ్మినల్లజీన-ఊ-తుల్-కితాబ-యరుద్దూకుమ్-బఅ్-ద-ఈమానికుమ్-కాఫిరీన్. 101. వకైఫ-తక్-ఫురూన-వఅన్తుమ్-తుత్లా-అలైకుమ్ ఆయాతుల్లాహి-వఫీకుమ్-రసూలుహూ వమన్-యఅ్-తసిమ్-బిల్లాహి-ఫఖద్-హుదియ-ఇలా-సిరాతిమ్-ముస్తఖీమ్.

100. ఓవిశ్వాసులారా! గ్రంథముగలవారిలోని కొందఱిమాట మీరు విని అనుసరించినచో వారుమీ విశ్వాసమును క్షీణింపఁజేసి మిమ్ము అవిశ్వాసులఁగా మార్చివేయుదురు. 101. మఱియు దేవుని వాక్యములు మీకు చదివి వినిపింపఁబడుచున్నవి. మఱియుమీలో దేవునిపవిత్రయును గలఁడు. మీరెట్లు అవిశ్వాసులు కాఁగలరు. మఱియు నెవఁడు స్థిరముగా దేవుని ఆశ్రయించునో వాఁడు స్థిరమైన సన్మార్గముపొందును.

వ్యా॥ 100. మునుపటి వాక్యములలో తెలిసియు కుట్రలు చేయుయూదులు నస్రానీలు మందలింపఁబడిరి. ఇఁక ముసల్మానులు వారిమాటలకు మోసపోకూడదు. వారికుట్రమాటలను వినినచో తిన్నగా విశ్వాసము వదలి అవిశ్వాసములోపడుదురు. కావున జాగ్రత్తగా నుండవలెనని ముసల్మానులకు హెచ్చరిక.
వ్యా॥ 101. ముసల్మానులు యూదుల యొక్కయు నసారీల యొక్కయు మోసమునకు లోఁబడి దేవునిమార్గమగు ఇస్లామ్‌ను వీడి అవిశ్వాసులు అగుట సాధ్యముకానిది. హజ్‌రత్ పైగంబరులవారు ముసల్మానుల మధ్యనుండి వారు దేవునిగ్రంథమగు ఖురానె షరీఫు వాక్యములు వినుపించుచుండినపుడు ముసల్మానుల విశ్వాసము ప్రబలును. ఎవరి హృదయములో దేవునిభక్తి విశ్వాసములు నాటుకొనునో వారు విశ్వాసము వదలఁజాలరు. సర్వమును త్యజించి దేవుని భక్తిమార్గమును ఆశ్రయించినవారే సన్మార్గమును పొందినవారు. వారు సన్మార్గమునసుసరించి దేవుని ప్రీతిపడయఁగలరు.

102. యా-అయ్యుహల్లజీన-ఆమనుత్-తఖుల్లాహ-హఖ్ఖ-తుఖాతిహీ-వలా-తమూ-తున్న-ఇల్లా-వఅన్తుమ్-ముస్లిమూన్. 103. వఅ్-తసిమూ బిహబ్-లిల్లాహి-జమీఅన్-వలా-తఫర్రఖూ వజ్‌కురూ-నిఅ్-మతల్లాహి-అలైకుమ్-ఇజ్-కున్తుమ్-అఅ్-దాఅన్-ఫ-అల్లఫ-బైన-ఖులూబికుమ్-ఫ-అస్-బహ్-తుమ్-బి-నిఅ్-మతిహీ-ఇఖ్వానన్-వకున్తుమ్-అలా-షఫా-హుఫ్రతిమ్-మినన్-నారి-ఫ-అన్-

ఖజ-కుమ్-మిన్ హా-కజాలిక-యుబయ్యి-నుల్లాహు-లకుమ్-ఆయాతిహీ-ల-అల్లకు
మ్-తహ్-తదూన్. 104. వల్-తకుమ్-మిన్-కుమ్-ఉమ్మతున్-యద్-ఊన-ఇలల్-
ఖైరి-వ-యా-మురూన-బిల్-మఅ-రూఫి-వయన్ హౌన-అనిల్-మున్కరి-వ-ఉలా
ఇక-హుముల్-ముఫ్-లిహూన్. 105. వలా-తకూనూ-కల్లజీన-తఫర్రఖూ-వఖ్-
తలఫూ-మిమ్-బఅ-ది-మాజా-అ-హుముల్-బయ్యినాతు-వ ఉలాఇక-లహుమ్-
అజాబున్-అజీమ్.

102. ఓ విశ్వాసులారా! మీరు దేవునికి భయపడవలసినరీతిగా భయపడుఁడు. మఱియు మీరు ముసల్మానులుగానే మృతినొందవలెను. 103. మఱియు మీరందఱును కూడి దేవుని త్రాటిని గట్టిగా పట్టుకొనుఁడు. మఱియు భిన్నాభిప్రాయులు కాకుండుఁడు. మఱియు దేవుఁడు మీకు చూపిన అనుగ్రహమును జ్ఞప్తికిఁదెచ్చుకొనుఁడు. మీరు ఒకరికొకరు శత్రువులుగానున్నప్పుడు మీహృదయములలో ప్రేమను కల్పించెను. కావున మీరు ఆతని అనుగ్రహముచే ఒకరికొకరు సోదరులైతిరి. మఱియు మీరు అగ్నిగుండపు టొడ్డుననుంటిరి. దేవుఁడు దానినుండి మిమ్ము తప్పించెను. మీరు సన్మార్గము పొందుదురని దేవుఁడు తన వాక్యములను మీకుస్పష్టముగా నిట్లు తెలుపుచున్నాఁడు. 104. మఱియు మీలో నొకసంఘము ధర్మమార్గమునకు పిలుచునదియు సత్కార్యములు చేయుటకై ఆజ్ఞాపించునదియు పాపకార్యములను నిషేధించునదియు నుండవలెను. అట్టి సంఘములోని వారే విజయము పొందువారు. 105. ఎవరు స్పష్టమైన ఆజ్ఞలు వచ్చిన పిదపను భిన్నాభిప్రాయులై కలహించిరో వారివలె మీరును కాకుండుఁడు. మఱియు అట్టివారికి గొప్పబాధయున్నది.

అవతారిక :— హజ్రత్ పైగంబరులవారికి మదీనాపురములో తోడు పడినవారు అన్సారులు. వారు ఇస్లామునకు పూర్వము ఔసు, ఖజ్రజ్ అను రెండు కుటుంబములుగా నుండిరి. పూర్వమునుండి వారి మధ్య అమిత విరోధము ఉండి, ఎల్లప్పుడు యుద్ధములు జరుగుచుండెను. అందు బుఆసు అను యుద్ధము, నూట ఇరువది సంవత్సరములవఱకు జరిగెను. అందు ఉభయ పక్షములవారు, కవిత్వములు చేసియుండిరి. అంతటి విరోధము గల ఆ రెండు కుటుంబములును దేవుని అనుగ్రహమువలన హజ్రత్ ముహమ్మదు రసూలువారి స్నేహమహిమ వలన ఇస్లామ్ మతములో చేరి ఐకమత్యము గలవయ్యెను. ఇట్టి సోదరభావము చూచి మదీనాలోనుండిన యూదులు సహింపఁజాలక వారిమధ్య మరల విరోధ

ము కల్పింపవలెనని కుట్రలు సలుపుచుండిరి. వారి కుట్రలకుఁ దగిన ఒక సమయము దొరకెను. ఒకచోట ఆ రెండు కుటుంబములవారుండఁగా ఒక యూదుఁడు బుఆసు యుద్ధమునందు పాడిన పాటలను చదివి వినిపించెను. అందుచే పూర్వ ద్వేషములు మరల ప్రజ్వరిల్లెను. అపుడు రెండు పక్షములవారును కత్తులు దూసికొని యుద్ధమునకు సంసిద్ధులైరి. ఈవిషయము హజ్రత్ పైగంబరులవారికి తెలిసిన వెంటనే తమ శిష్యులను వెంటఁబెట్టుకొని ఆచోటునకు పోయి ఓ ముసల్మానులారా! దేవునికి భయపడుఁడు. నేను మీమధ్య నుండగా నిట్లు చేయఁదగునా? మిమ్ము దేవుఁడు అవిశ్వాసమను నంధకారమునుండి ఇస్లామ్ అను వెలుతురులోనికి తీసికొని వచ్చెనుగదా! అట్లు వచ్చియు ఇదేమి పూర్వపు మూఢత్వము పూనుకున్నారు అని పలుకగానే అన్సారులు కత్తులు పారవేసి తాము చేసిన పనికి సిగ్గుపడి ఒకరినొకరు కౌఁగలించుకొని ఏడ్వసాగిరి. యూదులు పన్నిన కుట్రకు మోసపోతిమి గదా అని చింతించి ఇఁకమీఁద జాగ్రత్తగానుండవలెనని నిశ్చయించుకొనిరి. ఈవిషయమే పై వాక్యములలో చెప్పఁబడినది

వ్యా॥ 102. ముసల్మానులు దేవునియందు చాల భయభక్తులు గలిగి యుండవలెను. ఏ కార్యములోను దేవుని యాజ్ఞకు వ్యతిరేకముగా నడవఁగూడదు. ఇస్లామ్‌లో స్థిరముగా నుండి మృతినొందువఱకు భయభక్తులతో ఇస్లామ్ ధర్మములను అనుసరించుచు ముసల్మానులుగానే మృతినొందవలెను. 103. ఖురానె షరీఫు, దేవుని త్రాడుగాఁ జెప్పఁబడినది. దేవుని సన్నిధానమునందు ఆతని ప్రీతిని పడయుటకు ఖురానె షరీఫును స్థిరముగా నవలంబింపవలెను. దానికి విరుద్ధముగా తమ ఇష్టానుసారముగానడవఁగూడదు. అందఱు ముసల్మానులునుకూడి ఐకమత్యమువహించి ఖురానెషరీఫునుఅనుసరింపవలెను. ఐకమత్యము వీడి పెక్కు చీలికలుగాచీలిపోరాదు. అందుచాలనష్టములున్నవి. దేవుఁడు తన అనుగ్రహముచే ఇస్లామ్‌నకు పూర్వము విరోధులుగా నున్నవారి హృదయములందు ఐకమత్యము కల్పించి సోదరులుగాఁ జేసెను. ఇస్లామునకు పూర్వము పాపకార్యములు చేయుచు నరకాగ్నిగుండములో పడుటకు సంసిద్ధులైయున్నవారిని దానినుండి తప్పించి సన్మార్గమును చూపి మోక్షమార్గము నొసంగెను. ఇట్టి దేవుని అనుగ్రహమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని కలహము వీడి సన్మార్గులై యుండవలెను. 104. ధర్మప్రచారము చేయుటకును సత్కార్యములు చేయుటకై బోధించుటకును పాపకార్యములు నిషేధించుటకును ముసల్మానులలో కొందఱు మత విద్వాంసులుండవలెను. అపుడు భక్తి, సోదరభావము, మతాభివృద్ధి. లోకవిజయము గలుగును. మత ప్రచారకులు ఖురాను ధర్మములను, హజ్రత్ రసూలువారి యుపదేశములను, వారి నడవడికను బాగుగా నె

ఱిఁగి, కాల పరిస్థితుల నెఱిఁగి గొప్ప అనుభవముగలవారుగా నుండవలెను. లేనిచో లాభములకు బదులు నష్టములే కలుగును. సంఘములో దురాచారము లు ప్రబలినప్పుడు బోధించి మంచిమార్గమునకు త్రిప్పనిచో వాని చెడుఫలితము లు సంఘములోని మంచివారికిని చెడ్డవారికిని లభించును. కావున ముసల్మా నులు ఈ విషయమందు శ్రద్ధపుచ్చుకొందురుగాక! 105. యూదులు క్రైస్త వులు దేవునినుండి స్పష్టమైన ధర్మములు వచ్చిన పిదపను వారిలో భేదములు కల్పించుకొని తమ ఇష్టానుసారముగా వర్తించి మత ధర్మములను వీడి ఉభయ లోకములలోను గొప్పబాధకు పాత్రులైనట్లు ముసల్మానులుకూడ కాఁగూడదు.

106. యౌమ-తబ్-యజ్జు-వుజూహున్-వతస్వద్దు-వుజూహున్-ఫ-అమ్మ ల్లజీ-నస్-వద్దత్-వుజూహు-హుమ్-అకఫర్తుమ్-బఅ్-ద-ఈమానికుమ్-ఫజూఖుల్-అజాబ-బిమా-కున్తుమ్-తక్ఫురూన్. 107. వ-అమ్మల్లజీన-నబ్ యజ్జత్-వుజూహు హుమ్-ఫ-ఫీరహ్మతిల్లాహి హుమ్-ఫీహా-ఖాలిదూన్. 108. తిల్ క-ఆయాతు ల్లాహి-నత్లూహా-అలైక-బిల్-హఖ్ఖి-వమల్లాహు-యురీదు-జుల్మల్-లిల్-ఆల మీన్. 109.వలిల్లాహి-మా ఫిస్-సమావాతి-వమా-ఫిల్అర్ జి-వ-ఇలల్లాహి-తుర్ జఉల్-ఉమూర్.

106. ఆదినమున, కొందఱిముఖములు తెల్లనివగును. మఱికొందఱిముఖములు నల్లనివగును. కావున ఎవరి ముఖములు నల్లనివగునో వారితో మీరు విశ్వసించిన పిదప అవిశ్వాసులై తిరిగదా! ఇఁక అవిశ్వాస ఫలితమగు నరకబాధ అనుభ వింపుఁడు అని చెప్ప బడును. 107. మఱియు ఎవరిముఖములుతెల్లనివాయెనో వారు దేవుని కృపకు పాత్రులగుదురు. వారు దేవుని కృప అను స్వర్గములో సదా యుందురు. 108. ఇవి దేవుని వాక్యములు. వానిని వాస్తవముగ చదివి నీకు వినుపించుచున్నారము. మఱియు దేవుఁడు లోకులకు అన్యాయము చేయఁ గోరఁడు. 109. మఱియు ఆకాశములోను భూమిలోనున్న సమస్తము దేవునిదే. మఱియు సమస్తము దేవుని యొద్దకే మరలవలసియున్నది.

వ్యా॥ 106 : 109. ఈవాక్యములతో తీర్పుదినమునందు, విశ్వాసులకును అవిశ్వాసులకును గల భేదము తెల్పఁబడుచున్నది. విశ్వాసుల ముఖములు వారి భక్తివిశ్వాసములవలన గలుగు తేజస్సుచే ప్రకాశించుచు తెల్లనివై తేటగా నుండును. వారు పరమానందముతో నుందురు. అవిశ్వాసులును వంచకులును, మతభ్రష్టులును, తమ అవిశ్వాస,వంచనలచే హీనస్థితిలోఁబడియుందురు. వారి ముఖములు నల్లనివిగా నుండును. వారి కెట్టి గౌరవముగాని సంతసముగానియుం

డదు. అట్టివారితో అవిశ్వాస తిరస్కారముల ఫలితమగు నరకబాధ అనుభవింపుడని చెప్పఁబడును. ఆ పలుకుకూడ వారికి బాధాకరముగా నుండును. విశ్వాసులు దేవుని ప్రీతి పడసి స్వర్గసౌఖ్యముల ననుభవించుచు నందు సదా నివసింతురు. ఇవన్నియును సత్యములైన దేవుని వాక్యములు. దేవుఁడు తన ప్రవక్తమూలమున మానవులకు ధర్మములను దెలుపుచున్నాఁడు. దేవుఁడు నియమించు ప్రతి ధర్మము న్యాయమైనది. దేవుఁడు మానవులపై ఎట్టిఅన్యాయము చేయఁడు. సర్వము ముందుగానే దెలుపుచున్నాఁడు. భూమ్యాకాశములలో నున్న సమస్తము దేవునికి లోఁబడియున్నది. తుదకు సమస్తము దేవునియొద్దకు మరలవలసియున్నది. కావున దేవుఁ డెందులకు అన్యాయము చేయును? ఎప్పటికిని చేయఁడు. మానవులు తమ అవివేకముచే దుర్మార్గమునందుపోయి దాని ఫలితము వారే అనుభవింతురు.

110. కున్తుమ్-ఖైరఉమ్మతిన్-ఉఖ్‌రిజత్-లిన్నాసి-తామురూన-బిల్‌మఅ్రూఫి-వతన్-హౌన-అనిల్-మున్కరి-వతూమినూన-బిల్లాహి- వలౌ - ఆమన-అహ్లుల్-కితాబి-లకాన-ఖైరల్-లహుమ్-మిన్-హుముల్-మూమినూన-వ-అక్సరుహుముల్-ఫాసిఖూన్. 111. లన్-యజుర్రూకుమ్-ఇల్లాఅజన్-వఇన్-యుఖాతిలూకుమ్-యువల్లూ - కుముల్-అద్బార-సుమ్మ-లా యున్-సరూన్. 112, జురిబత్-అలైహిము-జ్జిల్లతు-ఐన-మా-సుఖిఫూ-ఇల్లా-బిహబ్ - లిమ్-మినల్లాహి-వహబ్లిమ్-మినన్నాసి-వ-బాఊ-బి-గజబిమ్-మినల్లాహి-వజురిబత్-అలైహిముల్ మస్కనతు-జాలిక-బిఅన్నహుమ్-కానూ-యక్ఫురూన-బి-ఆయాతిల్లాహి-వయఖ్‌తలూనల్-అంబియాఅ-బిగైరి-హఖ్ఖిన్-జాలిక-బిమా-అసౌ-వ కానూ - యఅ్‌తదూన్.

110. మీరు సర్వమతస్థులకన్న శ్రేష్ఠులు. మీరు ప్రజలమేలుకొఱకు ఏర్పడితిరి. మీరు ధర్మమును బోధింతురు. మఱియు అధర్మమును నిషేధింతురు. మఱియు మీరు దేవునియందువిశ్వాసముగలిగియుందురు. మఱియు గ్రంథముగలవారు, విశ్వసించినచో వారికి మేలైయుండును. వారిలో కొందఱు విశ్వాసులుగా నున్నారు. మఱియు వారిలో అనేకులు, అవిధేయులుగా నున్నారు. 111. వారు మిమ్ము కొంచెము బాధించుటతప్ప ఏలాటి నష్టము మీకు చేయఁజాలరు. మఱియు వారు మీతో యుద్ధమాడినచో వారు మీకు వీఁపు చూపి పాఱిపోవుదురు. వారికెట్టి సహాయమును లభింపదు. 112. వారు దేవునినుండి

యు ప్రజలనుండియు అభయదస్తావీజు పొందితేతప్ప వారెచ్చటనుండినను వారి కవమానము విధింపఁబడెను. మఱియు వారు దేవుని కోపమునకుపాత్రులైరి. కాన వారికి హీనదశయు విధింపఁబడెను. ఇది వారు దేవుని సూచనలను తిరస్కరించినందువలనను అన్యాయముగా ప్రవక్తలను చంపుచుండినందువలనను, అవిధేయులైనందునను, నియమములు మించిపోవుచుండినందువలనను సంభవించెను.

వ్యా॥ 110. హజ్రత్ పైగంబరులవారు, సర్వజగత్తునకు ప్రవక్తగా నియమింపఁబడి ప్రవక్తలలో ఘనతను పొందినవారు. వారిననుసరించు ముసల్మానులు కూడ సర్వ మతస్థుల కన్న శ్రేష్ఠులు. ముసల్మానులు సర్వలోకులకు మేలుచేయుటకును, ధర్మమును బోధించి అధర్మమును నిషేధించుటకును నియమింపఁబడిరి. కావున వారు తమ యుద్యమము నెరవేర్చుచుండునంతవఱకు ఘనతను మేలును పొందుదురు. ముసల్మానులు సత్కార్యములు సలిపి తాము ఇతరులకు మార్గదర్శకులు కావలెను. వారు దేవుని యందు భక్తి విశ్వాసములు గలిగి యుండవలెను. ముసల్మానులు విశ్వసించినట్లు గ్రంథము గల వారగు యూదులును నస్రానీలును విశ్వసించినచో వారికి కూడ ఘనతయును మేలును లభించియుండును. కాని వారిలో కొందఱుమాత్రము విశ్వసించి ఆమేలును పొందిరి. కాని అనేకులు అవిధేయులై విశ్వసింపక అవిశ్వాసులైరి. వారిలోని అవిధేయులగు దుష్టులు, ముసల్మానులను దూషించుచు బాధించుటతప్ప వేఱు నష్టములు వారికిఁ జేయఁజాలరు. వారిసంఖ్య ఎక్కువగానున్నను ఒకవేళ ముసల్మానులకును వారికిని యుద్ధము సంభవించినచో వారు ధైర్యసాహసములు విడిచి ముసల్మానుల ఎదుట నిలువఁజాలక వీఁపు చూపి పాఱిపోవుదురు. మఱి వారికి తోడుపడి ధైర్యము నొసంగువారెవరును దొరకరు అని ముందుగానే వారిస్థితిగతులు ముసల్మానులకుఁ దెలుపబడెను. అందుచే ముసల్మానులకు ధైర్య సాహసములు ప్రబలెను. కొన్ని సంవత్సరములలోనే యూదులు చేసిన కుట్రలు సాగక వారు పరాజితులై తమ పురములను వీడిపోవలసివచ్చెను. 112. యూదులకు సంభవించిన దుర్గతి యిందు చెప్పఁబడియెను. వారుగావించుచున్న పాపముల ఫలితముగ వారి రాజ్యముతోఁబాటు మానమునుపోగా వారితరులకు లోఁబడి హీనదశ ననుభవించిరి. అప్పటినుండి ఇప్పటివఱకును యూదులు దేవుఁడు సెలవిచ్చినట్లు హీనదశలోనేపడి ప్రాణభీతి గలిగియున్నారు. ఎచ్చటను వారికి గౌరవమును అభయమును లేదు. ఇఁకమీఁదను వారికి రాజ్య గౌరవములు లభింపవు. కాని వారు దేవుని సెలవు ననుసరించి ప్రార్థన (తపస్సు) లో నిమగ్నులై ముసల్మానులతో యుద్ధమాడనివారు, ధర్మయుద్ధములో వధింపఁబడరు. ఇట్టివారికి అభయముగలదు.

ఇటులే స్త్రీలను యుక్తవయస్సుపొందనిబాలురును యుద్ధములో వధింపఁబడరు. ఇట్టి వారికి దేవుని వలన అభయము గలగు. మఱియు ప్రజలు చేసికొన్న నిబంధన ఒడంబడిక దస్తావీజులవలన వారికి ఆత్మ ధనరక్షణ లభించును. కాని స్వాతంత్ర్యము లభింపదు.

113. లైసూ-సవాఅన్-మిన్-అహ్లిల్-కితాబి-ఉమ్మతున్-ఖాయిమతున్-యత్లూన-ఆయాతిల్లాహి-ఆనాఅల్-లైలి-వహుమ్-యస్జుదూన్. 114. యూమినూన-బిల్లాహి-వల్-యామిల్-ఆఖిరి-వయామురూన-బిల్-మఅరూఫి-వయన్-హౌన-అనిల్-మున్కరి-వయుసారిఊన-ఫిల్ఖైరాతి-వ-ఉలాఇకమినస్-సాలిహీన్ 115. వ-మాయఫ్అలూ-మిన్ఖైరిన్-ఫలన్-యుక్ఫరూహు-వల్లాహు-అలీముమ్ బిల్-ముత్తఖీన్.

113. వారందఱును సములుకారు. గ్రంథముగల వారిలోను కొందఱు సన్మార్గులు గలరు. వారు రాత్రులందు దేవుని వాక్యములు పఠించుచున్నారు. మఱియు వారు సాష్టాంగము (సిజ్దా)లు చేయుచున్నారు. 114. వారు దేవుని యందును తుదిదినమందును విశ్వాసము గలిగి యున్నారు. మఱియు వారు, ధర్మమును బోధించుచు, అధర్మమును నిషేధించుచున్నారు. మఱియు వారు సత్కార్యములకే పరుగెత్తుచున్నారు. మఱియు వారు పుణ్యాత్ములలోచేరిన వారు. 114. మఱియు వారుచేయు ఎట్టి సత్కార్యమును, తిరస్కరింపఁబడదు. మఱియు భయభక్తులు గలవారిని దేవుఁడు బాగుగానెఱుంగును.

వ్యా॥ 113 : 115. యూదులందఱును సములుకారు. వారిలోను కొందఱు "ఇస్లామ్"ను స్వీకరించి సన్మార్గులైన భక్తులును గలరు. వారు లోకమంత నిద్రలోమునిగి యున్నప్పుడు లేచి దేవుని గ్రంథములోని వాక్యములను పఠించుచు నమాజు సలుపుచు అందు సాష్టాంగము (సిజ్దా) లు చేయుదురు. వారు దేవునియందు స్థిరమైన భక్తి విశ్వాసములు గలిగి తీర్పు దినమును నమ్మి తమ యాత్మలను సవరించుకొనుచు ఇతరులనుకూడ సత్కార్యములనుచేయుఁడనియు పాపకార్యములు వదలుఁడనియు బోధింతురు. సత్కార్యములు చేయుటలో ఒకరినొకరు మించిపోవుటకు ప్రయత్నింతురు. అందు ఏలాటి సోమరితనము వహింపరు. పుణ్యకార్యములకై పరుగెత్తుచు చాలశ్రద్ధతో చేయుదురు. ఇట్టి గుణముగలవారే మంచి అదృష్టవంతులైన పుణ్యాత్ములు. వారుచేసిన ప్రతి సత్కార్యము తిరస్కరింపఁబడక వారికి పుణ్యఫలితము లభించును. దేవునికి సర్వము తెలియును. భక్తులను దుర్మార్గులను వేఱుపఱచును. అందఱికి సమానముగాఁ జేయఁడు. ఎవరికిఁదగినిఫలితము వానికి నొసంగును.

116. ఇన్నల్లజీన-కఫరూ-లన్-తుగ్నియ-అన్-హుమ్-అమ్వాలుహుమ్-వలా-ఔలాదుహుమ్-మినల్లాహి షైఅన్-వఉలాయిక-అస్హాబున్నారి-హుమ్-ఫీహా-ఖాలిదూన్. 117. మసలు-మా-యున్ఫిఖూన-ఫీహాజిహిల్ హయాతిద్-దున్యా-కమసలి-రీహిన్-ఫీహా-సిర్రున్-అసాబత్-హర్స-ఖౌమిన్-జలమూ-అన్ఫుసహుమ్-ఫఅహ్-లకత్హు-వమా-జలమ-హుముల్లాహు-వలాకిన్-అన్ఫుసహుమ్-యజ్లిమూన్.

116. అవిశ్వాసులైనవారిని, వారిధనము, వారిబిడ్డలు, దేవుని శిక్షనుండి తప్పింపఁజాలరు. మఱియు వారు నరకాగ్ని నివాసులు. అందు వారు సదా యుందురు. 117. వారు ఇహలోకజీవితములో చేయు ధనవ్యయము తీవ్రమైన చలిగాలితగిలి నాశమొందిన దుర్మార్గుల పొలమును బోలియున్నది. మఱియు దేవుఁడు వారియెడ అన్యాయముచేయలేదు. కాని వారే తమయాత్మలకు అన్యాయము చేసికొనుచున్నారు.

వ్యా॥ 116: 117. మునుపటి వాక్యములలో భక్తి విశ్వాసములు గల ముసల్మానులు చేయు సత్కార్యముల ఫలితమునుగూర్చి చెప్పబడియె. ఇఁక అవిశ్వాసులను గూర్చి చెప్పఁబడుచున్నది. వారు తమ ధనముపైనను సంతానముపైనను ఆధారపడుట అవివేకము. అవి దేవునిశిక్షనుండి రవంతయు తప్పింపఁజాలవు. వారు విశ్వసింపక అవిశ్వాసులుగానే చచ్చినచో వారు నరకనివాసులగుదురు. వారందు సదా యుందురు. వారు ఇహలోకజీవితకాలమందు చేసిన దానము ఫలింపదు. మఱియు వారు ఇస్లామ్నకు విరోధముగా ఖర్చు చేయు ధనము వృథ పోవును. దానివలన నుభయలోకములలోను వారికేట్టి ఫలము లభింపదు. వారుచేయుఖర్చులు నాశమునొందుట, దుర్మార్గులపొలము చలిగాలివీచి నాశమొంది ఫలింపని యట్లు అవిశ్వాసులదానములు ఫలింపవు. ప్రతి సత్కార్యము ఫలించుటకు విశ్వాసము (ఈమాన్)మూలమైనది. విశ్వాసములేనిదానములు ఫలింపవు. అవి దేవునికి ప్రియమైనవిగావు. అవిశ్వాసులు తమ యాత్మలపైఁ దామే అన్యాయమును నష్టమును చేసికొనుచున్నారు. దేవుఁడు వారికెట్టి అన్యాయముచేయలేదు.

118. యా-అయ్యు-హల్లజీన-ఆమనూ-లా-తత్-తఖిజూ-బి-తానతన్-మిన్-దూనికుమ్-లాయా-లూనకుమ్-ఖబాలన్-వద్దూ-మా-అనిత్తుమ్-ఖద్-బదతిల్-బగ్జా-ఉ-మిన్-అఫ్వాహి-హిమ్-వమా-తుఖ్ఫీ-సుదూరుహుమ్-అక్బరు-ఖద్-

బయ్యన్నా-లకుముల్-ఆయాతి-ఇన్-కున్‌తుమ్-తఅఖిలూన్. 119.హా-అన్‌తుమ్-ఉలాఇ-తుహిబ్బూనహుమ్-వలా-యుహిబ్బూ-నకుమ్-వతూమినూన-బిల్‌కితాబి-కుల్లిహీ వఇజా-లఖూకుమ్-ఖాలూఆమన్నా-వఇజా-ఖలౌ-అజ్జూ అలైకుముల్-అనామిల-మినల్-గైజి-ఖుల్-మూతూ-బిగైజికుమ్-ఇన్నల్లాహ-అలీముమ్-బి-జాతిస్-సుదూర్.120.ఇన్‌తమ్‌సస్‌కుమ్-హసనతున్-తసూహుమ్-వఇన్‌తుసిబ్‌కుమ్-సయ్యిఅతున్-యఫ్‌రహూ-బిహా-వఇన్‌తస్‌బిరూ-వతత్తఖూ-లా-యజుర్రుకుమ్-కైదుహుమ్ షైఅన్-ఇన్నల్లాహ-బిమా-యఅ-మలూన-ముహీత్.

118. ఓ ముసల్మానులారా! మీరు తమవారినితప్ప నితరులను రహస్యము తెలుపునట్టి స్నేహితులుగాఁ జేసికొనకుఁడు. వారు మిము నాశముచేయుటకు శక్తివంచనలేకుండ ప్రయత్నింతురు. మీనష్టమునువారు కోరుచున్నారు. వారి నోట్ల నుండి వారి విరోధము బయలుపడుచున్నది. మఱియు వారు తమ హృదయములలో దాఁచునది చాల అధికమైనది. మీకు తెలివియున్నచో మేము మీకు స్పష్టమైన సూచనలు తెలిపియున్నాము. 119. వినుఁడు మీరు వారికి స్నేహితులుగానున్నారు. మఱివారు మీకుస్నేహితులుగాలేరు. మీరు అన్ని గ్రంథములను నమ్ముచున్నారు. మఱియు వారు మీతోకలియునపుడు "మేము కూడ ముసల్మానులమ"ని పలుకుదురు. మఱియు వారేకాంతముననున్నప్పుడు మీపైని కోపముతో తమవ్రేళ్లను కఱచుకొందురు. మీరు మీకోపముచే చావుఁడని ఓ ప్రవక్తా! పలుకుము. నిశ్చయముగా దేవుఁడు హృదయములలోనున్నది యెఱుంగును. 120. మీకేదైన మేలుగలిగినచో వారికది దుఃఖము కలిగించును. మఱియు మీకేదైన కీడుగలిగినచో వారికది సంతోషముగానుండును. మఱియు మీరు సహించుచు భయభక్తులు గలిగియుండినచో వారి కుట్ర మీకేలాటి నష్టమును కలిగింపఁజాలదు. నిశ్చయముగా వారుచేయునది అంతయు దేవునికి అధీనమై యున్నది.

వ్యా॥ 118-120. అవిశ్వాసులును, యూదులును, వంచకులును, ముసల్మానులతో స్నేహితులుగా నటించుచు, కొన్నిరహస్యములు తెలిసికొనుచు నష్టములుకలిగించుటకు వెనుదీయక కుట్రలుసలుపుచుండిరి. ముసల్మానులువంచన భావములేకుండ వారిని స్నేహితులుగాభావించుచు తమరహస్యములుకొన్నిటిని వారికిఁదెలుపుచుండిరి. అట్లుచేయకూడదు. నిజముగా ముసల్మానులైన భక్తులతో అట్టిస్నేహముంచవలెను. కాని హృదయములలో ద్వేషముంచుకొని ముస

ల్మానులు వినాశము కోరుచు ఎదుటవచ్చినపుడు మేముకూడ విశ్వాసులమని పలుకుచు వెనుకకు పోయినపుడు ముసల్మానులపైని కోపముతో తమ వ్రేళ్ళను కఱచుకొను దుష్టులు స్నేహమునకు యోగ్యులుకారు. అట్టివారితో జాగ్రత్తగా ప్రవర్తింపవలెను. వారిహృదయములలోని ద్వేషములన్నియు దేవుఁడెఱుంగును. ఆతఁడువారికిఁ దగిన శిక్షవిధించును. దుష్టులు తమకోపముచే తామే నశింతురు. ఇతరులకేనష్టమును చేయఁజాలరు. ముసల్మానులకేదైన విజయము గాని మేలుగాని గలిగినచో అవిశ్వాసులైన ద్రోహులు సహింపఁజాలక దుఃఖింతురు. మఱి నష్టముగాని కీడుగాని సంభవించినచో వారికి మిక్కిలి సంతోషకరముగానుండును. స్నేహమువదలినచో వారు కుట్రలుసలిపి ఇంకను కష్టము కలిగింతురేమో ననుసందేహము ననవసరము. కావున నిట్టి స్వభావముగల దుష్టులకుట్రవలన ముసల్మానులకేనష్టమును గలుగదు. కావునముసల్మానులు సహనము (ఓర్పు) వహించి భయభక్తులతో నుండవలెను. దుష్టులుచేయు కుట్రలు వారికర్మలు దేవునికి బాగుగాఁదెలియును. అవన్నియు దేవునికిమించిపోవు. వారి కుట్రలుసాగవు. తుదకు ముసల్మానులే విజయము పొందుదురు.

121. వఇజ్‌గదౌత-మిన్-అహ్లిక-తుబవ్విఉల్-మూమినీన-మఖాఇద లిల్-ఖితాలి-వల్లాహు-సమీఉన్-అలీమ్. 122. ఇజ్-హమ్మత్-తాఇఫతాని-మిన్‌కుమ్-అన్ తఫ్‌షలా-వల్లాహు-వలియ్యుహుమా-వ-అలల్లాహి-ఫల్-యత-వక్కలిల్-మూమినూన్. 123. వలఖద్-నసర-కుముల్లాహు-బిబద్రిన్-వఅన్తుమ్-అజిల్లతున్-ఫత్తఖుల్లాహ-ల-అల్లకుమ్-తష్కురూన్. 124. ఇజ్‌తఖూలు-లిల్-మూమినీన-అలన్-యక్-ఫీయకుమ్-అన్-యుమిద్దకుమ్-రబ్బుకుమ్-బిస-సలాసతి ఆలాఫిమ్-మినల్-మలాఇకతి-మున్‌జలీన్. 125. బలాఇన్-తస్‌బిరూ-వతత్తఖూ-వ-యాతూకుమ్-మిన్-ఫౌరిహిమ్-హాజా-యుమ్-దిద్-కుమ్-రబ్బుకుమ్-బిఖమ్సతి-ఆలాఫిమ్-మినల్-మలాఇకతి-ముసవ్విమీన్. 126. వమాజఅల-హుల్లాహు-ఇల్లా-బుష్‌రా-లకుమ్-వలి-తత్-మఇన్న-ఖులూబుకుమ్-బిహీ-వమన్నస్‌రు-ఇల్లా-మిన్-ఇన్-దిల్లా-హిల్-అజీజిల్-హకీమ్. 127. లి-యఖ్‌తఅ-తరఫమ్-మినల్లజీన-కఫరూ-ఔ-యక్-బితహుమ్-ఫయన్-ఖలిబూ-ఖాఇబీన్. 128. లైస-లక-మినల్-అమ్రి-షైఉన్-ఔయతూబ-అలైహిమ్-ఔ-యుఅజ్‌జిబహుమ్

ఫఇన్నహుమ్-జాలిమూన్. 129. వలిల్లాహి-మాఫిస్-సమావాతి-వమాఫిల్-అరజి-యగ్-ఫిరు-లిమన్-యషాఉ-వ-యు-అజ్-జిబు మన్-యషాఉ-వల్లాహు-గ఼ఫూరుర్-రహీమ్.

121. నీవు నీయింటినుండి ప్రాతఃకాలమందు బయలుదేఱి యుద్ధమునకై ముసల్మానులకు స్థలములు నియమింపసాగితివి. మఱియు దేవుఁడుసర్వము వినువాఁడును, సర్వజ్ఞుఁడును. 122. మీలోని రెండు తెగలవారుధైర్యమువీడుటకు సిద్ధమైనపుడు దేవుఁడు వారికి సహాయుఁడై యుండెను. మఱియు ముసల్మానులు దేవునిపైననే యాధారపడియుండవలెను. 123. మఱియు దేవుఁడు బదర్ యుద్ధమందు, మీరు బలహీనులుగా నున్నపుడు మీకు తోడుపడెను. కావున మీరు కృతజ్ఞత సలుపుటకై దేవునికి భయపడుఁడు. 124. అప్పుడు నీవు ముసల్మానులతో మీప్రభువు ఆకాశమునుండి మూఁడు వేలమంది దేవదూతలనుపంపి మీకుతోడుపడినమీకు చాలదా? అని చెప్పుచుంటివి. నిశ్చయముగా మీరు సహనము వహించి, భయభక్తులుగలిగియుండినచో, శత్రువువచ్చి ఆకస్మికముగా మీపై బడినచో, చిహ్నములుగల ఐదువేలమంది దేవదూతలను మీప్రభువు పంపి మీకు తోడుపడును. 125. మఱియు దేవుఁడు, దానివలన మీకు సంతోషమును, మీ మనస్సులకు శాంతియును కలుగుటకు దానిని నియమించెను. సర్వశక్తుఁడును, సర్వజ్ఞుఁడును అగు దేవునివలననే సహాయము (విజయము) లభించును. 126. అవిశ్వాసులైనవారిలో కొందఱినీ నశింపజేయుటకును, లేక వారిని లోఁబఱుచుకొనుటకును అట్లు చేసెను. మరల వారు అపజయము పొంది మరలిపోవుదురు. 127. ఈ విషయ మందు నీ కేమియు అధికారము లేదు. దేవుఁడు వారిని క్షమించును లేక వారిని శిక్షించును. ఎందుకన వారు చాల అన్యాయము చేయుచున్నారు. 128. మఱియు ఆకాశములోను, భూమిలోనునున్న సమస్తము దేవునిదే. తాను కోరిన వారిని క్షమించును. మఱియు తాను ఇష్టపడినవారిని శిక్షించును. మఱియు దేవుఁడు క్షమించువాఁడును, దయాళువును.

వ్యా॥ 121. మునుపటి వాక్యములలో సహనము భయభక్తులు వహింపవలెను అని యుండెను. ముసల్మానులు కొందఱు వంచకుల కుట్రలవలన సహనముభక్తి వీడి నశించు స్థితిలో నుండగ దేవుఁడు వారికి తోడుపడి సంరక్షించెను. ఈ విషయము ఈ వాక్యములలో చెప్పఁబడెను. ఈ వాక్యములు ఒహుదుయుద్ధములో సంభవించిన విషయములు తెలుపుచున్నవి. ఒహుదు యుద్ధమునకు పూర్వము హిజ్రీ రెండవ యేట బదర్ యుద్ధము ముసల్మానులకునుఖురైషులకును జరిగి అందు బలహీనులై యుద్ధసామగ్రి లేకున్న ముసల్మానులకు దేవుని సహా

యమువలన గొప్ప విజయముకలిగెను. మక్కా ఖురైషుల సైన్యము ముసల్మానుల సైన్యముకన్న మూఁడింతలు హెచ్చుగా నుండెను. డెబ్బదిమంది ఖురైషుల నాయకులు చచ్చిరి. డెబ్బదిమంది ముసల్మానుల చేతిలోఁ జిక్కిరి. ఓడిపోయిన ఖురైషులు మక్కాపురమునకు పోయి పగదీర్చుకొనుటకు గొప్ప సైన్యమును జేర్చుకొని హిజ్రీ మూఁడవయేట మదీనాపైదాడివెడలివచ్చిరి. ఆ వార్త పైగంబరులవారికిఁ దెలిసి తమ శిష్యుల సలహాపొందిరి. హజ్రత్ పైగంబరులవారు మదీనాలోనేయుండి యుద్ధము సలిపినచో బాగుండునని తలఁచిరి. వంచకులనాయకుఁడగు అబ్దుల్లాబిన్ సలూనులుకూడ ఆఅభిప్రాయమే యిచ్చెను, కాని అనేకులు ముసల్మానులు మదీనాపురమునకు బయట పోయి శత్రువులను మార్కొనవలెనని అభిప్రాయమిచ్చిరి. అందుకు హజ్రత్ పైగంబరులవారు సిద్ధులై కవచము ధరించి ప్రాతఃకాలముననే తమ యింటినుండి బయలుదేఱిరి. వారివెంట వేయిమంది ముసల్మానులు బయలుదేఱిరి. మదీనాపురమునకు మూఁడుమైళ్లదూరమున ఒహుదుకొండ గలదు. అచ్చట పైగంబరులవారు తమసైన్యమును నిలిపిరి. దారిలోనే వంచకుల నాయకుఁడగు అబ్దుల్లాబిన్‌సలూలు నామాటను మీరు వినలేదు. కావున నేను యుద్ధముచేయను అని తనమూఁడువందలమంది అనుచరులతో హజ్రత్ పైగంబరులవారిని వదలి పోయెను. అప్పుడు ముసల్మానుల సైన్యము ఏడువందలు మాత్రమేయుండెను. శత్రువుల సైన్యము మూఁడువేలుండెను. బనుహారిసా, బనూసల్మా అను రెండుతెగలవారు, అది చూచి ధైర్యమువదలి యుద్ధరంగమునువదలి పోవుటకు సిద్ధమైరి. అపుడు దేవుని అనుగ్రహామువలన వారి మనస్సులు దృఢపడినవి. జయాపజయములు దేవుని చేతిలో నున్నవి. సైనికుల సంఖ్యపై లేవు. బదరు యుద్ధమందు ముసల్మానుల సంఖ్య తక్కువగానున్నను దేవుని చేతిలోజయాపజయములుండుటనుబట్టి తమకు జయము గలిగెను గదా అని నిశ్చయించుకొని దేవునిపై నాధారపడిరి. వారట్లు వంచకుల కుట్రలవలన సంరక్షింపఁబడిరి. బదరు యుద్ధములో దేవదూతలు ముసల్మానుల పక్షమున శత్రువులతో యుద్ధమాడిరి. శత్రువులు ఓడిపోయిరి. బదరు యుద్ధములో శత్రువులకు సహాయయముగా కుర్జుబిన్ జాబిర్ అనువాఁడు గొప్పసైన్యముతీసికొనివచ్చుచున్నాఁడని వదంతి వెలువడెను. అప్పుడు వారు వచ్చినచో ముసల్మానులకు తోడుపడుటకు ఐదువేల దేవదూతలను దేవుఁడు పంపును అని సువార్త నిచ్చెను. దానివలన ముసల్మానుల మనస్సులకు శాంతియును, సంతోషమును గలిగెను. వారు ధైర్యసాహసములతో యుద్ధమాడిరి. కొందఱు అవిశ్వాసులను నాశము చేయుటకును మఱికొందఱిని పరాజితులుగా జేయుటకును దేవుఁడు ముసల్మానులకు తోడుపడెను. జయము దేవుని శక్తిలో నున్నది, సైనికుల సంఖ్యపై

నాధారపడియుండలేదు. దేవుఁడు సెలవిచ్చినట్లే బదర్ యుద్ధములో అబూజెహల్ మొదలగు కఠినులైన కాఫర్లు చచ్చి మిగిలినవారు పరాజితులై పారిపోయిరి. దేవుఁడు సర్వశక్తుఁడును, సర్వజ్ఞుఁడును. అతని శక్తికి మించిన దేదియును లేదు. తాను కోరినవారికి జయ మొసంగును. భక్తులు దేవుని సెలవు ననుసరించి కృషి సలుపవలెను. దాని ఫలితము దేవుఁ డొసంగును. 127. ఒహాదుయుద్ధమందు, ముందు ముసల్మానులకు విజయము గలిగెను. ముసల్మానులు కొల్లగొట్టిన సొమ్మును సేకరించుటను, కొండపై నియమింపఁబడిన ముసల్మాను సైనికులు చూచి మాకు జయము గలిగెను అను సంతసముతో పైగంబరులవారి సెలవులేకనే తమ స్థానమును వదలిరి. కొందఱు మాత్రము అచ్చటనే యుండిరి. ఇది శత్రువులు చూచి ఆ కొండ వెనుకవైపునుండి వచ్చి అచ్చటనున్నవారిని చంపిరి. కొల్లగొట్టిన సొమ్మును సేకరించుచున్న ముసల్మానులపై ఆకస్మికముగా వచ్చి పడి ఘోరముగా వధించిరి. డెబ్బదిమంది ముసల్మానులు వధింపఁబడిరి. హజ్రత్ పైగంబరులవారికి గాయము తగిలి ఒక పల్లు విఱిగి దేహమంతయు నెత్తురుతో నిండి తెలివి తప్పి (సొమ్మసిల్లి) పడిపోయిరి. పైగంబరులవారు మృతినొందిరి అను వదంతి లేచెను. ముసల్మానులు చెల్లాచెదరైరి. పైగంబరులవారు తెలివినొంది శత్రువు గావించిన ఘోరహింసను చూచి దుష్టనాయకులను శపింప కోరిరి. అప్పుడు దేవుఁడు అట్లు చేయవలదు అని ఆజ్ఞాపించెను. అందు నీకేమి అధికారము లేదు. నీవు దేవుని సెలవు ననుసరించి ప్రచారమును యుద్ధమును చేయవలసినది మాత్రమే. మిగిలిన జయాపజయము లొసంగుట, క్షమించుట, శిక్షించుట దేవుని పని. ఒహాదు యుద్ధములో ముసల్మానులతో పోరాడిన అవిశ్వాసులు కొద్దికాలములోనే దేవుని అనుగ్రహమువలన ఇస్లామ్‌లో చేరి గొప్ప మతసేవగావించిరి. కావున భూమ్యాకాశములలోనున్న సమస్తము దేవుని యధికారములోనున్నది. తాను కోరినవారిని విశ్వాసులను క్షమించును. అవిశ్వాసులను శిక్షించును. దేవుఁడు క్షమించువాఁడును, దయగలవాఁడును. అందుకే దేవుఁడు ఒహాదులో ముసల్మానులను హింసించిన అవిశ్వాసులను క్షమించి కరుణించి ముసల్మానులునుగాఁ జేసెను. ఒహాదు యుద్ధము ఇఁకమీఁది వాక్యములలో వచ్చును. బదరు యుద్ధ వివరము సూరయే అన్ఫాలులో వచ్చును.

130. యా అయ్యుహల్లజీన-ఆమనూ-లా-తాకులుర్-రిబా-అజ్-ఆఫన్ ముజా-అఫతన్-వత్తఖుల్లాహ-లఅల్లకుమ్-తుఫ్ లిహూన్. 131. వత్తఖున్నారల్లతీ-ఉ-ఇద్దత్-లిల్-కాఫిరీన్.

130. ఓవిశ్వాసులారా ! వడ్డిరెండింతలుగా పుచ్చుకొనకుడు. మీరు రక్షణపొందుటకై దేవునికి భయపడుడు. 131. అవిశ్వాసులకుఁగాను సిద్ధపఱచియున్న నరకాగ్ని నుండి తప్పించికొనుఁడు.

వ్యా॥ 130 : 131. వడ్డివ్యాపారము వలన ధైర్యము భక్తిసన్నగిల్లి అధైర్యమును లోభమును ప్రబలును. ఇవి దేవునిమార్గమందు త్యాగము చేయుటకు అడ్డుపడును. కాన వీనిని దేవుఁడు నిషేధించుచున్నాఁడు. అదియనుగాక ముసల్మానులకును యూదులకును పూర్వము వడ్డివ్యాపారము జరుగుచుండెను. ఆ వ్యాపారసంబంధము వలనయూదులువంచకుల మూలము నకుట్రలుసలపి ముసల్మానులకు నష్టము గలిగించుటకు యత్నించుచుండిరి. దానిఫలితమే అబ్దుల్లాబిన్‌సలూలు ఒహోదు యుద్ధములో రాకపోవుటకు కారణము. అందుచే వడ్డివ్యాపారమే యుండరాదని నిషేధింపఁబడెను. పూర్వము వడ్డికివడ్డి పుచ్చుకొనుచుండగా ఋణవంతుని సొమ్మంతయు వడ్డిపాలై పోవుచుండెను. కావున అసలువడ్డివ్యాపారము అధర్మమనియు దానిపై రెండింతలు వడ్డిపుచ్చుకొనుట ఇంకను ఘోరపాతకము అనిభావమే. కాని కొంతవడ్డిపుచ్చుకొనవచ్చునను భావముగాదు. ఎవరైన మసీదులో దుర్భాషలాడినపుడు ఓయి మసీదులో దుర్భాషలాడకుము అని చెప్పినచో మసీదుబయట దుర్భాషలాడవచ్చునని భావముగాదుగదా ! అసలు దుర్భాషలు చెడ్డవి. ప్రార్థనసలుపుచోట దుర్భాషలాడుట మఱింత తప్పు అనిభావము. అటులే వడ్డి రెండింతలు పుచ్చుకొనకూడదని భావము గ్రహించునది. వడ్డిపుచ్చుకొనుటలో లాభము లేదు. దానినివదలి దేవుని యందు భక్తిగలిగియుండినచో విజయమోక్షములు చేకూరును. వడ్డిపుచ్చుకొనువారికి నివాసస్థలము నరకాగ్ని. కావున భక్తులు దానినుండి తప్పించుకొనవలెను.

132. వఅతీఉల్లాహ-వర్‌రసూల-లఅల్లకుమ్‌తుర్‌-హమూన్. 133. వసారిఊ-ఇలా-మగ్‌ఫిరతిమ్‌-మిర్‌-రబ్బికుమ్‌-వజన్నతిన్‌-అర్‌జుహాస్‌-సమూవాతు-వల్‌-అర్‌జు-ఉఇద్దత్‌-లిల్‌-ముత్తకీన్‌. 134. అల్లజీన-యున్‌ఫిఖూన-ఫిస్‌-సర్రాఇ-వజ్‌-జర్రాఇ-వల్‌-కాజిమీనల్‌-గైజ-వల్‌-ఆఫీన-అనిన్నాసి-వల్లాహు-యుహిబ్బుల్‌-ముహ్సినీన్‌. 135. వల్లజీన-ఇజా-ఫఅలూ-ఫాహిషతన్‌-ఔ-జలమూ-అన్‌ఫుసహుమ్‌-జకరుల్లాహ-ఫస్తగ్‌ఫరూ-లిజునూబిహిమ్‌-వమన్‌-యగ్‌ఫిరుజ్‌-జునూబ-ఇల్‌-లల్లాహు-వలమ్‌-యుసిర్రూ-అలా-మా-ఫఅలూ-వహుమ్‌-యఅలమూన్‌. 136. ఉలాయిక-జజాఉహుమ్‌-మగ్‌ఫిరతుమ్‌-మిర్‌రబ్బిహిమ్‌-వజ

న్నాతున్-తజ్రిమిన్-తహ్తి-హల్ అన్హారు-ఖాలిదీన-ఫీహా-వ-నిఅ-మ అజ్రుల్ ఆమిలీన్.

132. మఱియు మీరు అనుగ్రహింపఁబడుటకై దేవునికిని ప్రవక్తకును విధేయులుకండు. 133. మఱియు మీప్రభువునుండి క్షమాపణ పొందుటకును భూమ్యాకాశములంత వెడల్పుగల స్వర్గమును పొందుటకును పరుగెత్తుఁడు స్వర్గము భక్తులకొఱకు సిద్ధముగాచేయఁబడినది. 134. ఆభక్తుల సౌఖ్యకాలమందును ఖర్చుచేయువారు. మఱియు వారు కోపమును అణఁచుకొనువారు. మఱియు ప్రజలను క్షమించువారు. మఱియుదేవుఁడు సత్కార్యములను చేయువారిని ప్రేమించును. 135. మఱియు తామేదైన పాపకార్యము చేసినను లేక తమ యాత్మలపై అన్యాయముచేసికొన్నను దేవుని స్మరించి తమ పాపములకు క్షమాపణ కోరుదురు. మఱియు దేవుఁడు తప్ప ఎవఁడు పాపములను క్షమించువాఁడు గలఁడు. మఱియు వారు తాము చేసిన పాపకార్యములకై హఠము సాధింపరు. మఱయు (ఇది) వారికి తెలిసియే యున్నది. 136- వారికి ప్రభు క్షమాపణయును గాదు. కాలువలు ప్రవహించు స్వర్గవనములును గలవు. అందు వారు సదా యుందురు. మఱియు సత్కార్యములుచేయువారికి అందు గలుగు ఫలితము చాల మంచిది.

వ్యా॥ 132. హజ్రత్ పైగంబరులవారి యాజ్ఞలను అనుసరించి వారికి విధేయులై యుండినచో దేవునికివిధేయులైయున్నట్లే ఎందుకనవారు దేవుని సెలవు పొందియే ఆజ్ఞాపింతురు. మఱియు దేవుఁడుకూడ భక్తులు ఆతనిప్రవక్తమాటవినవలెనని సెలవిచ్చియున్నాఁడు కావున ఉభయలోకములలోను విజయము మోక్షము దేవునిదయపొందవలెనన్న దేవునికిని ఆతనిప్రవక్తకునువిధేయులై యుండవలెను. ప్రవక్తఆజ్ఞను మీఱినందువలననే ఒహదుయుద్ధములో ముసల్మానులకు నష్టముగలిగెను. కావున అట్లుచేయక ప్రవక్తకువిధేయులై యుండవలెను. 133. దేవుని క్షమాపణ (అనుగ్రహము) స్వర్గముపొందవలెనన్నదానికి సాధనములైన సత్కార్యములు చేయవలెను. అందు ఏలాటి సోమరితనము వహింపక చాల ప్రయత్నము చేయవలెను. మానవుని యూహలో భూమ్యాకాశములకన్న పెద్దవేవియును లేవు. అంతటి వెడల్పుగల స్వర్గమునకు పొడ వెంత యుండవలెనో దేవునికే యెఱుక. ఇది యూహించుటకుఁగాను భూమ్యాకాశములంతటి వెడల్పుగలది అని చెప్పఁబడెను, ఆ స్వర్గనివాసము భక్తులకు లభించును. 134. ఆ భక్తులు ఎట్టి సుగుణములుగలవారో ఈ వాక్యములలో చెప్పఁబడియున్నది. భక్తులు సంపద గలిగి సౌఖ్యములో నున్నపుడు దేవుని మఱవక దేవుని మార్గమందు ప్రాణత్యాగము చేయునట్లు ధనమును ఖర్చుచేయుదురు.

కష్టకాలమందును వడ్డివ్యాపారులవలె లోభము వహింపకుండ దేవుని ప్రీతి కొఱకు ధనము ఖర్చు (దానము) చేయుదురు. ప్రతీకారముచేయుశక్తిగలిగియు కోపమును అణఁచుకొనుదురు. ఇతరులు చేసిన తప్పులకు శిక్షింపక క్షమించి యుపకారము చేయుదురు. కావున అట్టివారిని దేవుఁడు ప్రేమించును. హజ్రత్ పైగంబరులవారును వారి శిష్యులును ఇట్లే వర్తించుచుండిరి. 135. భక్తులు తాము చేసిన పాపమునకును, అన్యాయమునకును పశ్చాత్తాపపడి దేవుని స్మరించి దేవునిశిక్షకు భయపడి తమ పాపములు, న్యాయములే యని సమర్థింపఁబూనక భయభక్తులతో దేవుని సన్నిధానమందు క్షమాపణ వేఁడుకొందురు. పాపములే చేయుచు నందే నిమగ్నులై యుండుట చాల చెడుగు. దాని శిక్ష చాల కఠినమగునని వారికిఁ దెలియును. కావున వారు పాపకార్యములను వదలుకొని భయభక్తులుగలిగి దేవుని ప్రార్థింతురు. దేవుఁడుతప్ప ఎవఁడును క్షమించువాఁడులేఁడు. కావున దేవుని సమ్ముఖముననే వేఁడవలెను. అట్టిభక్తులకు వారి సత్కార్యముల ఫలితము మంచిదిగానే లభించును. వారిని దేవుఁడు క్షమించి వారికి స్వర్గనివాసము దయచేయును. ఆ స్వర్గమునందుండు వృక్షముల క్రిందుగను మేడలక్రిందుగను నీటి కాలువలు ప్రవహించుచుండును.

137. ఖద్‌ఖలత్-మిన్‌ఖబ్‌లికుమ్-సునసున్-ఫసీరూ-ఫిల్-అర్జి-ఫన్‌జురూ-కైఫ-కాన-అఖిబతుల్-ముకజ్జిబీన్. 138. హాజా-బయానుల్-లిన్నాసి వహుదన్-వమౌఇజతుల్-లిల్-ముత్తఖీన్. 139. వలా-తహినూ-వలా-తహ్‌జనూ-వఅన్తుముల్-అఅ్‌లౌన-ఇన్-కున్-తుమ్-మూమినీన్. 140. ఇన్-యమ్‌సస్‌కుమ్-ఖర్‌హున్-ఫఖద్-మస్సల్-ఖౌమ-ఖర్‌హుమ్-మిస్‌లుహూ- వతిల్‌కల్-అయ్యాము-నుదావిలుహా-బైనన్నాసి-వలియఅ్‌లమల్లా-హుల్లజీన-ఆమనూ-వయత్తఖిజ-మిన్‌కుమ్.షుహదాఅ-వల్లాహు-లాయుహిబ్బుజ్-జాలిమీన్. 141. వలి-యుమహ్హి-సల్లాహుల్-లజీన-ఆమనూ-వ-యమ్‌హఖల్-కాఫిరీన్. 142. అమ్-హసిబ్‌తుమ్-అన్-తద్-ఖులుల్-జన్నత-వలమ్మా-యఅ-లమిల్లాహుల్లజీన-జాహదూ-మిన్‌కుమ్-వయఅ-లమస్-సాబిరీన్: 143. వలఖద్-కున్‌తుమ్-తమన్-నౌనల్-మౌత-మిన్‌ఖబ్లి-అన్ తల్-ఖౌహు-ఫఖద్-రఐ-తుమూహు-వఅన్‌తుమ్-తన్-జురూన్.

137. మీకుపూర్వము అనేకవిషయములు సంభవించియున్నవి. కావున

భూమిలో సంచారముచేసిచూడుడు. తిరస్కరించినవారిగతి యేమాయెనో. 138. ఇదిప్రజలకొఱకు వివరింపబడియున్నది. భయభక్తులుగలవారికిసన్మార్గమును బోధయునున్నవి. 139. మఱియు మీరు ధైర్యముపీడకుడు, దుఃఖపడకుడు. మీరు సంపూర్ణవిశ్వాసులుగానున్నచో మీరే అధికులగుదురు. (విజయమునుపొందుదురు). 140.మీకు గాయముతగిలినట్లు వారికిని తగిలియున్నది. మఱియు మేము ఈటినములు (కాలము) ప్రజలయందు మార్చుచుందుము. దేవుడు మీలో నిజమైనవిశ్వాసులను వేఱుపఱచుటకును మీలోకొందఱిని షహీదులుగాజేయుటకును అట్లుచేసెను. మఱియు దేవుడు అన్యాయస్థులను ప్రేమింపడు. 141. మఱియు ముసల్మానులను పరిశుద్ధులుగా జేయుటకును, అవిశ్వాసులను తుడిచివేయుట (నాశము)కునుచేసెను. 142. ఏమి మీరు స్వర్గములో (ఊరకనే) ప్రవేశింతురనితలచితిరా? ఇంకను దేవుడు మీలోయుద్ధమాడినవారిని సహించి స్థిరముగానున్నవారిని చూడలేదు! 143. మఱియు మీరు చావునుచూడకపూర్వము దానిని కోరుచుంటిరి. ఇంకమీరు కన్నులార దానిని చూచుకొంటిరి.

వ్యా॥ 137. ముసల్మానులకు పూర్వము అనేకులు మతస్థులుగడచియున్నారు వారికి అనేకవిషయములు సంభవించియున్నవి. అప్పుడు అనేకప్రవక్తలు వచ్చి జనులకుబోధించిరి. అందుకొందఱుప్రవక్తలనునమ్మి ముసల్మానులైరి. మఱికొందఱుతిరస్కరించి అవిశ్వాసులైరి. విశ్వాసులకును, అవిశ్వాసులకును యుద్ధముకూడజరిగెను. తుదకు అవిశ్వాసులేపరాజితులై నాశమునొందిరి. విశ్వాసులుజయించిరి. నిశ్చయముగలేకున్నచో భూమిలో తిరిగిచూడుడు. ఆదు, సమూదు మొదలగు తిరస్కారులగతినితెలుపు పాడు ప్రదేశములు యింకను గలవు. వానినిచూచి బుద్ధితెచ్చుకొనవలెను. అవిశ్వాసులు ఒహదుయుద్ధములో ముసల్మానులకు నష్టముగలించితిమని గర్వపడవలదు. ముసల్మానులు తాము నష్టముపొందితిమని ధైర్యమునుపీడి ఆసవదలరాదు, తుదకు ముసల్మానులే అవిశ్వాసులనుఓడించి, విజయముగాంతురు. 138. ఈఖురానుగ్రంథములో ప్రజలకు చాలినంతవివరములుగలవు. భయభక్తులుగలవారు వానిని విని తెలిసిని, సన్మార్గమునుపొందుదురు. భయభక్తులులేనివారు బోధనవలన లాభముపొందరు. 139. ఒహదుయుద్ధమునందు ముసల్మానులకు చాల నష్టముగలిగెను. వారిలో అనేకయుద్ధవీరులు మృతినొందిరి. హజ్రత్ పైగంబరులవారికిని గాయము తగిలెను. అట్టిస్థితిలో ఓ ముసల్మానులారా! మీరు ధైర్యముపీడి పిఱికితనము వహింపరాదు, మీరు నిజమైన సంపూర్ణ ముసల్మానులైనచో మీరే అధికులై విజయముపొందుదురు. అని దేవుని సెలవయ్యెను. అరగా విని ముస

ల్మానులందఱు మరల ధైర్యసాహసములతో శత్రువులను మార్కొనగా వారు యెదుటనిలువఁజాలక వీఁపుచూపిపాఱిపోయిరి. 140:141. ముసల్మానులు తమకు ఒహుదుయుద్ధములో నష్టములుగలిగి గాయములుతగిలెనని చింతపడరాదు. మక్కా కాఫిర్లకుకూడ బదర్ యుద్ధమందు అట్టినష్టములుగలిగి గాయములుతగిలెను. దేవుడు ప్రజలయందు దినములు (కాలము) మార్చుచుండును. ఒకప్పుడు ఒకపక్షమువారికి విజయము మఱొక్కప్పుడు మఱొకపక్షమువారికి విజయము నిచ్చును. దేవునిపద్ధతులు ఇటులేయున్నవి. ఒకప్పుడు దుఃఖము మఱొకప్పుడు సుఖముగలుగుచుండును. అందు చాలమేళ్లుగలవు. కష్టముకలిగినప్పుడు నిజమైన ముసల్మానులును వంచకులును స్పష్టపడుదురు. దేవుఁడు ఎప్పటికిని అన్యాయస్థులను, దుర్మార్గులను ప్రేమింపఁడు. ఒకవేళ దుర్మార్గులగు అవిశ్వాసులకువిజయముగలిగినను అది సదాయుండునదిగాదు. తుదకు అవిశ్వాసులు దేవుని శిక్షకులోఁబడి నశింతురు. దేవుఁడు ముసల్మానులపాపములనుక్షమించి పరిశుద్ధులుగాఁజేసి స్వర్గవీరు (షహీదు)లగొప్పపదవి నొసఁగును. 142. స్వర్గనివాసము సులభముగా లభించునది గాదు. దానికిదేవుని మార్గమందు యుద్ధముసలిపి సహనమువహించి స్థిరముగానుండవలెను.అందుకుఁగానే ఒహుదు యుద్ధములో మొదట విజయము గలిగి తరువాత యుద్ధరంగమున ఫలితము మారిపోయెను. అందుగొప్పపరీక్ష యుండెను. ఎవరుభక్తులు ఎవరు ధైర్యశాలులు అనునది తేటతెల్లమాయెను. 143. బదరు యుద్ధములోచేరిశత్రువులతో యుద్ధమాడనిముసల్మానులు, యుద్ధములో మేముండిన బాగుండునే స్వర్గవీరు (షహీదు) లపదవి మాకులభించియుండునే అనియుద్ధమునకువేఁచియుండిరి. అదిఒహుదు యుద్ధములో సంభవించినది. మీరుకోరుచుండినచావు నిపుడు మీరుమీకన్నులార చూచుచున్నారుగదా ! ఇఁక ధైర్యముతో ముందంజవేసి స్థిరముగ యుద్ధముండుఁడు.

144. వమా-ముహమ్మదున్-ఇల్లారసూలున్-ఖద్ఖలత్-మిన్-ఖబ్లిహిర్-రుసులు-అఫఇమ్-మాత-ఔ-ఖుతిలన్-ఖలబ్తుమ్-అలా-అఅ-ఖాబికుమ్-వమన్-యన్-ఖలిబ్-అలా-అఖిబైహి-ఫలన్-యజుర్రుల్లాహ-షైఅన్-వస-యజ్-జిల్లాహుష్-షాకిరీన్. 145. వమా-కాన-లినఫ్సిన్-అన్తమూత-ఇల్లా-బి ఇజ్-నిల్లాహి-కితాబమ్-ముఅజ్జలన్-వమన్-యురిద్-సవాబద్-దున్యా- నూతిహీ-మిన్హా-వమన్-యురిద్-సవాబల్-ఆఖిరతి-నూతిహీ-మిన్హా-వస-నజ్-జిష్ - షాకిరీన్. 146. వక-అయ్యిమ్-మిన్-నబియ్యిన్-ఖాతల-మఅహూ-రిబ్బియూన-కసీ

రున్-ఫమా-వహానూ-లిమా-అసాబహుమ్-ఫీసబీలిల్లాహి-వమా-జఉఫూ-వమస్తకానూ-వల్లాహు-యుహిబ్-బుస్సాబిరీన్. 147. వమాకాన-ఖౌలహుమ్ ఇల్లాఅన్-ఖాలూ-రబ్బనగ్-ఫిర్-లనా-జునూబనా-వఇస్రాఫనా-ఫీ-అమ్రినా-వసబ్బిత్-అఖ్-దామనా-వన్సుర్నా-అలల్ ఖౌమిల్-కాఫిరీన్. 148- ఫఆతా-హుముల్లాహు-సవా బద్దున్యా-వహుస్న-సవాబిల్-ఆఖిరతి-వల్లాహు-యుహిబ్-బుల్-ముహ్సినీన్.

144. మఱియు ముహమ్మదు, ఒక ప్రవక్తమాత్రమే. ఆతనికి పూర్వము అనేక ప్రవక్తలు గడచి యున్నారు. మఱి యాయన చనిపోయిన లేక వధింపఁబడినచో మీరు వెనుకకు మరలిపోవుదురా! మఱియు నెవఁడు వెనుకకు మరలునో వాఁడు దేవునికి రవంతయును నష్టముచేయఁజాలఁడు. కృతజ్ఞత వహించిన వారికి శీఘ్రములోనే దేవుఁడు(మంచి)ఫలమొసఁగును. 145. మఱియు దేవుని సెలవులేనిదే ఎవఁడును చావఁడు. అది ఒక నియమితకాలము వఱకు వ్రాయఁబడి యున్నది. మరియు నెవరు ఇహలోక ఫలితముకోరుదురో వారికి దానినే యొసంగుదుము. మఱియు నెవరు పరలోకఫలితమును కోరుదురో వారికి దాని నొసంగుదుము. మఱియు కృతజ్ఞతసలుపువారికి శీఘ్రములో నేమంచి ఫలితమొసంగుదుము 146. మఱియు అనేకప్రవక్తల పక్షమున అనేకభక్తులు అవిశ్వాసులతో యుద్ధమాడియున్నారు. వారికి దేవుని మార్గమందు కష్టములు గలిగినను వారిధైర్యమునుపీడలేదు. వారుబలహీనులునుకాలేదు. లోఁబడనులేదు. దేవుఁడు సహనపరులను ప్రేమించును. 147. మఱియు ఓ మాప్రభువా! మా పాపములను మాకార్యములలో మేముమితిమీఱి పోయిన దానినిక్షమింపుము. మఱియు మాపాదములను స్థిరముగా నుంచుము. అవిశ్వాసులను జయించుటకు మాకు సహాయపడుము అనిమాత్రము వారు పలికిరి. పిదప దేవుఁడు వారికి ఇహలోకములో మంచిఫలితమును పరలోకములో మంచి ఫలితమును నొసంగెను. దేవుఁడు సత్కార్యములు చేయువారిని ప్రేమించును.

వ్యా॥ 144. ఒహదు యుద్ధములో హజ్రత్ రసూలువారు వధింపఁబడిరని వదంతి లేచెను. అది విని కొందఱు ముసల్మానులు ధైర్యము వీడిరి. మఱి కొందఱు ప్రవక్త పిదప మేము బ్రతికి ఏమి ఫలము అని ధైర్యముతో శత్రువులను మార్కొని వధింపఁబడిరి. మఱికొందఱు శత్రువులతో సంధి చేసికొనవలెనని తలఁచిరి. కొందఱు వంచకులు ముహమ్మదు నిజమైన ప్రవక్తయైనచో ఎందుకు వధింపఁబడునని చెప్పుచు ఇస్లామ్ను వదలిపెట్టవలెనని చెప్పసాగిరి

వారందఱినిగూర్చి యీ వాక్యములలో మందలింపుగలదు. మహమ్మదు దేవుఁడు కాఁడు. ఆయనకూడ పూర్వము గడచిపోయిన ప్రవక్తలవలె ఒక ప్రవక్త. పూర్వము వచ్చిన ప్రవక్తలందఱును బ్రతికియున్నారా ? ఒకవేళ మహమ్మదు ప్రవక్త చనిపోయిన లేక శత్రువులచే వధింపఁబడినను ఓ ముసల్మానులారా ! ధైర్యము వీడి వెనుకకు మరలి సన్మార్గమగు ఇస్లామ్ మతమును వదలి మతభ్రష్టులగుదురా ? అట్లు కాఁగూడదు. అట్లగువారు దేవునికి నష్టము కలిగింపఁజాలరు. వారు తమ ఆత్మ నష్టము తప్ప వేఱేమియు చేయఁజాలరు. దేవునికి విధేయులై ఆతని కృతజ్ఞత సలుపువారి కుభయలోకములలోను మంచిఫలితము దేవుఁ డొసంగును. 145. ఎవరును దేవుని సెలవులేనిది చావరు. చావు వచ్చుటకు ఒకకాలము నియమింపఁబడియున్నది. అది తప్పదు. కావున దేవునిపై నాధారపడియుండువారు. ఎన్ని ఆపదలు వచ్చినను భయపడి ధైర్యము వీడరాదు. ఎటులైన ఒకదినము ఏకారణములోనో చావవలసియున్నది. ఎవరు ఇహలోక సౌఖ్యములలోనే పాటించి వానినేకోరుదురో దేవుఁడు వారికి ఇహమునే యొసంగును. మఱియు ఎవరు పరలోకమును పాటించి కృతజ్ఞతలుసలుపుచు పరలోక పుణ్యఫలితమును కోరుదురో వారికి ఉభయలోకముల సౌఖ్యములు దేవుఁ డొసంగును. కావున ముసల్మానులు పరలోకమును పాటింపవలెను. 146, 147. ఈ వాక్యములలో పూర్వము గడచిన ప్రవక్తలును, వారి యనుచరులును ధైర్యసాహసములతో అవిశ్వాసులతో పోరాడిన విషయమును తెలిపి ముసల్మానులును అటులే అనుసరింపవలెనని హెచ్చరింపఁబడెను. వారు కష్టములకు ధైర్యము వీడక, సోమరితనము వహింపక, శత్రువులకు లోఁబడక దేవుని మార్గమందు వారికిఁ గలిగిన కష్టములను సహించిరి. అట్టిసహనపరులను దేవుఁడు ప్రేమించును. వారు తమ పాపములను, అక్రమములను దేవునికి విన్నవించి, వానిని క్షమించి యుద్ధరంగమందు వారిని స్థిరముగానుంచి ధైర్యసాహసములు దయచేసి శత్రువులనుజయించుటకు మాకు సహాయపడుము అని దేవుని వేఁడుకొనిరి. కాని ధైర్యము వీడినమాటలు పలుకలేదు. ఓ ముసల్మానులారా! మీరు అందఱికన్న శ్రేష్ఠులు. మీరు మీకుఁదగినట్లు ధైర్యము చూపవలెను. 148. ధైర్యసాహసములుగల భయభక్తులకు ఇహలోకములో విజయమును పరలోకములో మోక్షమును దేవుఁ డొసంగును. మఱియు సత్కార్యములుచేసి దేవునికి విధేయులైయున్నవారిని దేవుఁడు ప్రేమించును. కావున ముసల్మానులుకూడ దేవునికి విధేయులై సత్కార్యములు చేసి ప్రీతి పడయుదురుగాక !

149. యా-అయ్యుహల్-లజీన-ఆమనూ- ఇన్-తుతీఉల్లజీన-కఫరూ యరుద్దూకుమ్-అలా-అఅ-ఖాబికుమ్-ఫతన్-ఖలిబూ-ఖాసిరీన్. 150. బలిల్లాహు-

మౌలాకుమ్-వహువ ఖైరున్ నాసిరీన. 151, సనుల్ఖీ-ఫీ ఖులూ-బిల్లజీన-కఫరుర్-రుఅ-బ-బిమా-అష్రకూ-బిల్లాహి మాలమ్-యునజ్జిల్-బిహీ-సుల్తానన-వ-మావాహుమున్నారు-వ-బీస-మస్ వజ్జాలిమీన.152.వలఖద్-సదఖ-కుముల్లాహు వఅ-దహూ-ఇజ్-తహుస్సూ-నహుమ్-బి-ఇజ్నిహీ-హత్తా-ఇజా-ఫషిల్తుమ్-వతనా-జఅ-తుమ్-ఫిల్ అమ్రి-వ-అసైతుమ్-మిమ్బఅది-మా-అరాకుమ్ - మా-తుహిబ్బూన-మిన కుమ్-మన-యురీదుద్-దున్యా-వమిన్కుమ్-మన-యురీదుల్-ఆఖిరత-సుమ్మ-సరఫకుమ్-అన్హుమ్-లియబ్తలియకుమ్-వలఖద్-అఫా-అన కుమ్ వల్లాహు-జూఫజ్లిన్-అలల్-మూమినీన్.

149. ఓ ముసల్మానులారా! మీరు అవిశ్వాసుల మాటలను వినినచో వారు మిమ్ము వెనుకకు మరలింతురు. మఱి మీరు నష్టపడుదురు. 150. దేవుఁడే మీకు సహాయుఁడు. అతని సహాయమే చాల శ్రేష్ఠమైనది. 151. ఏలాటి ప్రమాణము లేనిదే దేవునికి సాటి కల్పించినందున ఇఁక అవిశ్వాసుల హృదయములలో భయము కల్పింతుము. వారి నివాసము నరకాగ్నియై యున్నది. అది దుర్మార్గుల చెడ్డ నివాసస్థానము. 152. మఱియు దేవుఁడు మీకిచ్చిన తన వాగ్దానమును సత్యపఱచెను. అప్పుడు మీరు దేవుని సెలవుచే అవిశ్వాసులను నఱుకుచుంటిరి. పిదప మీరే పిఱికితనము వహించితిరి. మఱియు ఆజ్ఞవిషయము వేర్వేఱుగానైతిరి. మీకు ప్రియమైనదానిని మీకు చూపించిన తర్వాత మీరు అవిధేయులైతిరి. మీలో కొందఱు ఇహమును కోరువారుండిరి. కొందఱు పరమును కోరువారుండిరి. మరల మిమ్ము పరీక్షించుటకై అవిశ్వాసుల యెదుట మీరు పాఱిపోవునట్లు చేసితిమి. మఱియు దేవుఁడు మిమ్ము క్షమించెను. దేవుఁడు విశ్వాసుల యెడ అనుగ్రహముగలవాఁడు.

వ్యా॥ 149. ఒహదు యుద్ధములో ముసల్మానులకు నష్టముగలిగినందున వారి హృదయములు కలఁతనొంది యుండినవి. ఇదే సమయమని అవిశ్వాసులును, వంచకులును, ముసల్మానులను నిందింపసాగిరి. ఇఁకమీఁద ముసల్మానులు ధైర్యమువీడి యుద్ధమాడకుందురని వారి కోరిక. దానికి దేవుఁడు ముసల్మానులు అవిశ్వాసుల మాటలు విని మోసపోఁగూడదు. అట్లు చేసిన సన్మార్గముపొందిన పిదప దుర్మార్గములోపడి ఉభయలోకములలోను నష్టము పొందుదురని హెచ్చరించెను. 150. అవిశ్వాసులును, వంచకులును, ముసల్మానుల మేలు కోరువారుగారు. వాస్తవముగా సహాయపడువాఁడు దేవుఁడేగాని ఇతరులు కానేరరు. దేవునిసహాయమే శ్రేష్ఠమైనదనిముసల్మానులకు దేవుని సెలవయ్యెను.

దేవుని సహాయమువలననే సంఖ్యలో హెచ్చుగానుండిన అవిశ్వాసుల హృదయములలో (ముసల్మానుల) భయము గలిగెను. ముసల్మానులు ఒహాదు యుద్ధములో గాయము తగిలి చాల కష్టములోనున్నను, అవిశ్వాసులు తిరిగి వారిపై రాలేక భీతిల్లి మరలిపోయిరి. అవిశ్వాసులకు దేవునిపై నమ్మకములేదు. వారు ఏలాటి ప్రమాణము (సనదు) లేనిదే దేవునికి సాటిగా పెక్కు దైవములను కల్పించియున్నారు. దీనివలననే వారి హృదయములలో చావు భీతిగలదు. పెక్కు దైవములను ఆరాధించుటవలన వారికి నరకము లభించును. అదిదుర్మార్గులకుగానున్న చాల చెడ్డనివాసస్థలము. 152. ముసల్మానులు భక్తి సాహసములుగలిగి దేవునికిని ప్రవక్తకును విధేయులైయున్నచో వారికిజయము గలుగునని దేవుని వాగ్దానముండెను. అట్టులే ఒహాదుయుద్ధమునందు ప్రారంభములో దేవుని సెలవుచే ముసల్మానులు అవిశ్వాసులను మార్కొని వధించుచుండిరి. ముసల్మానుల సైన్యమునకు వెనుకనున్న కొండపై ఏబదిమంది విలుకాండ్రను హజ్రత్ పైగంబరులవారు నియమించి రెండవ యుత్తరువువఱకు అచ్చటనుండి కదలకూడదని ఆజ్ఞాపించిరి. ముసల్మానులు జయముపొంది కొల్లసొమ్మును సేకరించునపుడు కొండపైనున్న విలుకాండ్రు చూచి తమ పని నెఱవేరినదనియు తామకూడ దిగి కొల్లసొమ్ము సేకరింపవచ్చునని దిగసాగిరి. అందు కొందఱు మాత్రము తాము నచ్చటికి పోకూడదనియు, తాము అక్కడనే యుండవలెనని పలికిరి. ఇట్లు పైగంబరులవారి యుత్తరవునుగూర్చి వేర్వేఱుఅభిప్రాయములు పడిరి. పదునొకండుగురు తప్ప మిగిలినవారు తమ స్థానమును వదలి దిగసాగిరి. అవిశ్వాసులు ఇది చూచి వెనుకటి తట్టునుండి వచ్చి ముసల్మానుల పైఁబడి ఘోర హత్య గావించిరి. ఆ విషయములే నిందు తెలుపఁబడినవి. విజయము గలిగిన పిదప పాఱిపోవుచున్న అవిశ్వాసులు ముసల్మానులపైకి మరలి వచ్చి ముసల్మానులను ఓడించిరి. ఇందు ముసల్మానులకుపరీక్ష యుండెను. ఎవరు నిలుతురో ఎవరు పాఱిపోవుదురో అను విషయము తేటతెల్లమాయెను. పైగంబరులవారి ఆజ్ఞను అతిక్రమించినందున నష్టము గలుగును అనువిషయము కూడ ముసల్మానులకు తెలిసెను. తర్వాత దేవుఁడు ముసల్మానులను క్షమించి అనుగ్రహించెను. వాస్తవముగా దేవుఁడు ముసల్మానుల యెడ అనుగ్రహము గలవాఁడు.

153. ఇజ్ తుస్ఇదూన వలా-తల్-ఊన-అలా-అహదిన్-వర్-రసూలు-యద్ఊకుమ్-ఫీఉఖ్రాకుమ్-ఫ-అసాబకుమ్-గమ్మమ్-బి-గమ్మిల్-లికైలా-తహ్జనూ-అలా-మాఫాతకుమ్-వలా-మాఅసాబ-కుమ్-వల్లాహు-ఖబీరుమ్-బి

మాతఅ-మలూన్. 154. సుమ్మ-అన్‌జల అలైకుమ్-మిన్‌బఅ-దిల్ గమ్మి- అమనతన్-నుఆసన్-యగ్‌షా-తాఇఫతమ్-మిన్‌కుమ్-వతాఇఫతున్-ఖద్-అహమ్మత్‌హుమ్-అన్‌ఫుస్‌హుమ్-యజున్నూన-బిల్లాహి-గైరల్-హఖ్ఖి-జన్నల్-జాహిలియ్యతి-యఖూలూన హల్-లనా-మినల్ అమ్రి-మిన్‌షైఇన్-ఖుల్ ఇన్నల్-అమ్ర-కుల్లహూ-లిల్లాహి-యుఖ్ఫూన-ఫీఅన్‌ఫుసిహిమ్-మాలా- యుబ్‌దూన-లక-యఖూలూన-లౌకాన-లనా-మినల్-అమ్రిషైఉన్ మా-ఖుతిల్ నా-హాహునా ఖుల్-లౌకున్‌తుమ్-ఫీబుయూతికుమ్-లబరజల్లజీన కుతిబ-అలైహిముల్-ఖత్‌లు-ఇలా-మజాజిఇహిమ్-వలియబ్-తలియల్లాహు-మాఫీ సుదూరికుమ్-వలి-యుమహ్హిస-మాఫీఖులూబికుమ్-వల్లాహు-అలీముమ్-బిజాతిస్-సుదూర్. 155. ఇన్నల్లజీన-తవల్‌లౌ-మిన్‌కుమ్-యౌమల్-తఖల్-జమ్ఆని ఇన్నమస్-తజల్లహుముష్‌షైతాను-బిబఅ-జి-మా-కసబూ-వలఖద్-అఫల్లాహు-అన్‌హుమ్-ఇన్నల్లాహ-గఫూరున్-హలీమ్.

153. అప్పుడు మీరు పాఱిపోవుచుంటిరి. మఱియు వెనుకకుగూడ తిరిగి యెవరిని చూడకపోవుచుంటిరి. మఱియు ప్రవక్త మీ వెనుకనుండి మిమ్ము పిలుచుచుండెను. మఱియు మీచేతినుండి పోయినదానినిగూర్చియు, మీకు గలిగిన కష్టమునుగూర్చియు మీరు వ్యసనపడకుండుటకై మీకు దుఃఖమునకు బదులుగా దుఃఖమును దేవుఁడు గలిగించెను. మఱియు మీరు చేయుపనులన్నియు దేవునికిఁ దెలియును. 154. మరల దేవుడు దుఃఖము పిదప శాంతికరమగు తూఁగును మీకుగలిగించెను. అది మీలో కొందఱిని క్రమ్ముకొనెను. మఱియు కొందఱు తమ యాత్మలఁగూర్చి విచారపడుచుండిరి. వారు దేవునిగూర్చి పామరులవంటి తప్పుతలంపులు తలఁచుచుండిరి. మాకేమైన అధికారమున్నదా అని పలుకుచుండిరి. సర్వాధికారము దేవునిదే అని ఓ ప్రవక్తా! పలుకుము. వారు నీయెదుట వెలిబుచ్చనివిషయము తమ హృదయములలో దాఁచుకొనుచున్నారు. కొద్ది అధికారమైనను మాకున్నచో మేమిచ్చట వధింపఁబడియుండమని చెప్పుచున్నారు. మీరు మీయిండ్లలోనున్నను, ఎవరు వధింపఁబడవలెనని వ్రాయఁబడియున్నదో వారు తప్పక తమ వధ్యస్థానములకు బయలుదేఱివత్తురు. అని ఓప్రవక్తా! పలుకుము. మఱియు దేవుఁడుమీహృదయములందు నున్నదానిని పరీక్షించుటకుఁగాను మఱి మీ మనస్సులను పరిశుద్ధముగాఁ జేయుటకుఁగాను

నిట్లుచేసెను. దేవుఁడు హృదయములలోని రహస్యమును ఎఱుఁగువాఁడు. 155. రెండుసైన్యములు కలిసినదినమున మీలో వీఁపుచూపి పాఱినవారు గావించియున్న పాపమునుబట్టి సైతాను వారిని జాఱించెను. మఱియు నిశ్చయముగా దేవుఁడు వారినిక్షమించెను. దేవుఁడు నిశ్చయముగా క్షమించువాఁడును. క్షమ గల వాఁడును.

వ్యా॥ 153. ఒహూదు యుద్ధమందు, విలుకాండ్రుగావించిన పొరపాటువలన శత్రువులు ముసల్మానులపైఁబడివధించుచుండఁగాముసల్మానులకేమియుతోఁచక ఎవరుపట్టినదారిని వారు పాఱిపోసాగిరి. అప్పుడువారివెనుకనుండి హజ్రత్ పైగంబరుల వారు తమ స్థానములోనే స్థిరముగానిలిచి యుండి, ఓముసల్మానులారా! నావైపునకు రండని పిలుచుచుండిరి. పాఱిపోవువారు వెనుక తిరిగి కూడ చూడకుండ పరుగెత్తుచు పైగంబరులవారి పిలుపును వినలేక పోవుచుండిరి. పైగంబరుల వారి ఆజ్ఞను మీఱి వారి హృదయమును దుఃఖపెట్టినందులకు ఈ అపజయదుఃఖము ముసల్మానులకుగలిగెను. ఇఁకమీఁద (విజయధనము)లాభము గలిగినను కష్టము గలిగినను విచారపడక పైగంబరులవారి యాజ్ఞలను అనుసరింపవలెను. మీరుచేయు అన్నిపనులును దేవుఁడెఱుంగుచున్నాఁడు. వానికి వానికిఁదగిన ఫలితమొసంగును. 154. ఒహూదు యుద్ధములో వధింపఁబడవలసినవారు వధింపఁబడి యుద్ధరంగము వదలవలసినవారు వదలిపోయి మిగిలిన భక్తులు యుద్ధరంగములోనే నిలిచియుండిరి. దేవుఁడు తన అనుగ్రహముచే ఆ ముసల్మానుభక్తులకు వారి హృదయములకు శాంతి గలుగుటకుఁగాను తూఁగు వచ్చునట్లుచేసెను. వారునిలిచియె తూఁగసాగిరి. దానిపిదప వారుమేలుకొని తమ హృదయములలో నేలాటి భయములేకుండచూచి హజ్రత్ పైగంబరులవారి చుట్టునిలిచి శత్రువులను మార్కొని పాఱద్రోలిరి. శత్రువులు వారియెదుట నిలువలేక యుద్ధరంగమునుండి పాఱిపోసాగిరి. ఆసమయమున పిఱికిపందలగు కొందఱువంచకులు తమ యాత్మరక్షణకొఱకు విచారపడుచుండిరి. వారు ముసల్మానుల మేలుకోరువారుగారు. కాని విశ్వాసులసైన్యము తిరిగివచ్చి తమ్ము వధించునేమోయని చింతమాత్రముండెను. దేవునివిషయము, దేవుఁడుగావించిన విజయవాగ్దానము ఎక్కడపోయెను? ముసల్మానులు ఇఁక నెన్నఁటికిని చేరరు. ఇస్లామునశించెను అను చెడుతలంపులో దేవుని మహిమ తెలియనివారు రులవలె పలుకసాగిరి. మఱియు మాచేతిలోనేమున్నది. మాకు అధికారము లేదు. మామాటవినక మదీనాపురమునకు బయటపోయి యుద్ధముచేసిరి. కావున నష్టము కలిగెను. అని పలుకసాగిరి. అందుకుసమాధానముగా జయాపజయములెప్పటికి దేవుని యధికారములోనున్నది. ఎవరిచేతనేమియుకాదు అని ఓ ప్రవక్తా! పలుకుమని హెచ్చరింపఁబడెను. హజ్రత్ పైగంబరులవారియెదుట వంచకులు ఏమియు

చెప్పలేక తాము ఒంటరిగానున్నప్పుడు తమ మనస్సులలోనున్నది వెలిబుచ్చుచు మాకే అధికారమున్నచో మా బంధువులగు అన్సారులు యుద్ధరంగములో మృతినొందియుండరు. మామాట చెల్లకపోయినందున మావారు చనిపోయిరి. అని పలుకసాగిరి. దానికిజవాబు ఎవరెచ్చటపడి చావవలెననియున్నదో వారచ్చటికేపోయి చత్తురు. వారు ఇండ్లలోనున్నను తమతమ చచ్చుచోటులకే తెంచియే తీరుదురు. ఇట్లు విచారపడుటవలన లాభములేదు. కానున్నది కాకమానదు. దేవునికి సర్వముతెలియును. ఇదంతయు భక్తులపరీక్షకొఱకు సంభవించెను. నిజమైనభక్తులును, వంచకులును స్పష్టపడిరి. భక్తులకు దేవునిప్రీతి లభించెను. వంచకులగుట్టు బయలుపడెను. 155. ఒహుదు యుద్ధమునందు, ముసల్మానులును అవిశ్వాసులును పోరాడునపుడు పైగంబరులవారి సెలవులేకనే కొండపై నియమింపఁబడిన సైనికులు తమస్థానములువదలి గొప్ప పొరపాటు చేసిరి. దానికికారణము వారి పూర్వపుపొరపాటు. దానివలన సైతాను వారిని పైగంబరులవారియుత్తరవును దాఁటునట్లుచేసెను. వారిపొరపాటును దేవుఁడు క్షమించెను. కావున ఇఁక వారినెవరును నిందింపఁగూడదు. నిశ్చయముగా దేవుఁడు క్షమించువాఁడు. మానవులపాపములకు తత్క్షణమే శిక్షచేయక క్షమగలిగియున్నాఁడు. దేవునికే క్షమ (ఓర్పు) లేకున్నచో ఒక్కప్రాణియు ప్రాణముతో నుండఁజాలదుగదా!

156. యా-అయ్యుహల్లజీన-ఆమనూ-లాతకూనూ-కల్లజీన - కఫరూ-వఖాలూ-లి-ఇఖ్వానిహిమ్-ఇజా-జరబూ-ఫిల్-అల్‌జి-ఔకానూ - గుజ్‌జల్-లౌకానూ-ఇన్‌దనా-మామాతూ-వమా-ఖుతిలూ-లియజ్-అలల్లాహు- జాలిక-హస్‌రతన్-ఫీఖులూబిహిమ్-వల్లాహు-యుహ్‌యీ-వ-యుమీతు వల్లాహు - బిమా-తఅ-మలూన-బసీర్. 157. వలఇన్-ఖుతిల్‌తుమ్-ఫీసబీలిల్లాహి-ఔ-ముత్తుమ్-లమగ్‌ఫిరతుమ్-మినల్లాహి-వరహ్మతున్-ఖైరుమ్-మిమ్మా - యజ్‌మఊన్. 158. వల-ఇమ్-ముత్తుమ్-ఔ-ఖుతిల్‌తుమ్-ల-ఇలల్లాహి-తుహ్‌షరూన్.

156. ఓ ముసల్మానులారా! అవిశ్వాసులు తమ సోదరుల విషయము వారు భూమిలో ప్రయాణముచేయునపుడు లేక యుద్ధములోనున్నప్పుడు మాయొద్దనే యుండియుండినచో మృతినొందకయుందురు. మఱియు వధింపఁబడకయుందురని చెప్పుదురు. అట్టి అవిశ్వాసులవలె మీరు కాకుండుఁడు. దేవుఁడు వారి హృదయములకు ఇది వ్యసనకరమగునదిగాఁ జేయుటకుగాను అట్లు వారు

పలుకుదురు. మఱియు దేవుఁడే ప్రాణ మొసఁగువాఁడును చంపువాఁడును.
మఱియు మీరు చేయునది యంతయు దేవుఁడు చూచుచున్నాఁడు. 157. మీరు
దేవుని మార్గమందు వధింపఁబడిన లేక చనిపోయిన దేవుని క్షమాపణయును
అనుగ్రహమును వారు సేకరించుదానికంటెను మీకు శ్రేష్ఠములైనవి. 158.
మఱియు మీరు చనిపోయిన లేక చంపఁబడిన నిశ్చయముగా మీరందఱును
దేవుని యొద్దకే రప్పింపఁబడుదురు.

వ్యా॥ 156. అవిశ్వాసులైన వంచకులు తమ బంధువులలోని ముసల్మాను
భక్తులు దేవునిమార్గమందు ప్రచారమునకై ప్రయాణముచేసి చనిపోయిన
లేక యుద్ధరంగమందు శత్రువులచే వధింపఁబడిన వారు మాయొద్దనేయుండిన
చనిపోక, చంపఁబడక యుందురని పలుకుదురు. విశ్వాసు లిట్టి మాటలు పలుక
రాదు. తమ హృదయములలోనైన అట్లు తలంపఁగూడదు. అవిశ్వాసులైన
వంచకులవలె కాఁగూడదు. వంచకుల పలుకులవలన తుదకు వారికి
మనస్తాపము (వ్యసనము) గలుగును. కాని ఏలాంటి ప్రయోజనము లేదు. వాస్త
వములో ప్రాణమును, చావును దేవుఁడొసంగుచున్నాఁడు. ఆయుస్సుగలవాఁడు
ఎక్కడికి పోయినను యుద్ధము సలిపినను జావఁడు. ఆయుస్సు లేనివాఁడు ఇం
టిలో నెంత జాగ్రత్తగానున్నను వానిని చావునుండి తప్పించువారెవరును లేరు.
కావున భక్తులు ఆ చింత వదలి తమ కార్యములు జరుపవలెను. దేవుఁడు అం
దఱు చేయు కర్మలను చూచుచున్నాఁడు. ఆతఁడు వానికిఁ దగిన ఫలితమొసం
గును. 157. దేవునిమార్గమందు చనిపోయిన లేక చంపఁబడిన దేవుఁడు పాప
ములను క్షమించి అనుగ్రహించును. కావున అవిశ్వాసులు సేకరించు ఇహలోక
సౌఖ్యముకంటె దేవుని క్షమాపణ అనుగ్రహము ముసల్మాను భక్తులకు మేలై
నవి. 158. ఒకవేళ ప్రయాణములోను యుద్ధములోను చావు రాకున్నను,
ఎచ్చటనైనను ఒక దినము మానవులకు చావు రావలసినదే. అందఱును తుదకు
ఒక దినము దేవుని సమ్ముఖమునకు తీర్పుకొఱకు చేరవలసియున్నది. అచ్చట
అందఱి కర్మలగూర్చి తీర్పగును. కావున దేవునిమార్గమందుచనిపోయిన లేక
వధింపఁబడినవారికి మంచి పుణ్యఫలితము లభించును, ఇదియే మంచిది.

159. ఫబిమా-రహ్మతిమ్-మనల్లాహి-లిన్‌త లహుమ్-వలౌ-కున్‌త-ఫజ్జన్-గలీజల్-ఖల్బి-లన్-ఫజ్జూ-మిన్-హౌలిక-ఫ-అ్ఫు-అన్‌హుమ్-వస్‌తగ్-ఫిర్ లహుమ్-వషా-విర్‌హుమ్-ఫిల్-అమ్రి-ఫఇజా-అజమ్‌త-ఫత-వక్కల్ అలల్లాహి-ఇన్నల్లాహ-యుహిబ్బుల్-ముతవక్కిలీన్. 160. ఇన్-యన్-సుర్‌కుముల్లాహు-ఫలా గాలిబ-లకుమ్-వఇన్-యఖ్-జుల్-కుమ్-ఫమన్-జల్లజీ-యన్-సురుకుమ్-మి

మ్-బిల-దిహీ-వ-అలల్లాహి-ఫల్-యతవక్కలిల్-మూమినూన్.

159. ఆ పిదప దేవుని యనుగ్రహమువలననే వారి విషయమున నీవు మృదుమనస్కుఁడవైతివి. మఱియు నీవు దుర్గుణుఁడవును కఠిన హృదయుఁడవును అయి యుండినచో వారు నీయొద్దనుండి పాఱిపోయియుందురు. కావున నీవు వారిని క్షమింపుము. మఱియు వారికొఱకు (దేవుని) క్షమాపణ కోరుము. మఱియు కార్యములలో వారి యభిప్రాయము తీసికొనుచుండుము. ఆ పిదప నీవు కార్యమునకు సిద్ధమైనపుడు దేవునిపై ఆధారపడుము. నిశ్చయముగా దేవుఁడు (తనపై) ఆధారపడువారిని ప్రేమించును. 160. దేవుఁడు మీకు సహాయపడినచో ఎవరు మిమ్మెదిర్చి జయముపొందఁజాలరు. మఱియు దేవుఁడు మీకు సహాయపడనిచో మఱి యెవరు మీకు సహాయపడఁగలవారు? కావున ముసల్మానులు దేవునిపైననే ఆధారపడియుండవలెను.

వ్యా॥ 159. ఒహూదు యుద్ధములో ఆజ్ఞను మీఱినవారిని దేవుఁడు క్షమించెనని ప్రకటించి ఇఁక హజ్రత్ పైగంబరులవారుకూడ క్షమింపవలెనని దేవుని సెలవగుచున్నది. యుద్ధములో సైనికులు సేనాధిపతి యాజ్ఞను మీఱినచో వారికి చాల కఠిన శిక్ష విధించుట సహజము. కాని హజ్రత్ పైగంబరులవారు సుగుణములు కలిగి కఠినముగా పలుకువారు గారు. వారిహృదయము చాల మృదువైనది. వారు కఠినచిత్తులుగారు. అదియును దేవుని అనుగ్రహము. అట్టి సుగుణములుండుటవలననే వారి శిష్యులు ఎట్టి కష్టములు గలిగినను వారిని వదలి వెళ్లకుండిరి. హజ్రత్ పైగంబరువారి ముఖదర్శనమే ముసల్మాను భక్తులకు పరమానందముగా నుండునది. ఓ ప్రవక్తా! నీవు సుగుణుఁడవు. కావున యుద్ధములో తప్పు గావించినవారిని క్షమించి వారిని క్షమించునట్లు దేవునివేఁడుకొనుము. ఏదైన ఒక కార్యముచేయవలెనన్న ముసల్మానుల యభిప్రాయము తెలిసికొనుము. దానివలన ముసల్మానుల హృదయములకు శాంతి గలుగును. మఱి ఒక పనిచేయుటకై సిద్ధపడినచో దాని విషయము దేవుని సహాయముపై నాధారపడవలెను. దేవుని సహాయము తప్ప నితరుల సహాయము దొరకనేరదు. దేవుఁడు తోడుపడినచో ఏలాటి శత్రువైనను ముసల్మానులను జయింపఁజాలఁడు. (బదరుయుద్ధము దానికి సాక్షి.) కావున దేవునిపైననే ముసల్మానులు ఆధారపడియుండవలెను.

161. వమా-కాన-లినబియ్యిన్-అన్యగుల్ల-వమన్-యగ్లుల్ యాతి-బిమాగల్ల-యామల్ ఖియామతి-సుమ్మ-తువఫ్ఫా కుల్లునఫ్ సిమ్-బిమా-కసబత్ వహుమ్-లాయుజ్-లమూన్. 162. అఫమనిత్-తబఅ-రిజ్వానల్లాహి-కమమ్‌బా

అ-బి-సఖతిమ్-మినల్లాహి-వ-మా-వాహు-జహన్నము-వబీసల్-మసీర్. 163.హుమ్ దరజాతున్-ఇన్‌దల్లాహి-వల్లాహు-బసీరుమ్-బిమా-యఅ-మలూన్. 164.లఖద్-మన్నల్లాహు-అలల్-మూమినీన-ఇజ్-బఅస-ఫీహిమ్-రసూలమ్-మిన్-అన్ఫుసిహిమ్-యత్లూ-అలైహిమ్-ఆయాతిహీ-వ-యుజక్కీహిమ్-వయు-అల్లిము-హుముల్-కితాబ-వల్-హిక్మత-వఇన్-కానూ-మిన్-ఖబ్లు-లఫీ-జలాలిమ్-ముబీన్.

161. మఱియు ప్రవక్త ఎన్నటికిని దాఁచిపెట్టఁడు. మఱియు నెవరు దాఁచిపెట్టుదురో వారు తాము చేసిన ద్రోహమును తీర్పుదినమున తీసికొని వచ్చెదరు. మరల ప్రతి మనుజుఁడును దాను సంపాదించిన దాని ఫలితము పూర్తిగా పొందును. మఱియు వారిపై నేలాటి అన్యాయమును గలుగదు. 162. ఏమి దేవుని యిష్టమును అనుసరించినవాఁడు, దేవుని కోపమునకు పాత్రుఁడై నరకనివాసము పొందువానికి సమానుఁడగునా ! మఱియు ఆ నరక నివాసి పోవు స్థలము చాల చెడ్డది. 163. దేవుని యొద్ద వీరిపదవులు(దర్జాలు) వేర్వేఱుగాఁగలవు. మఱియు దేవుఁడు వారు చేయునది చూచుచున్నాఁడు. 164. దేవుఁడు వారిలోనుండియే దేవుని వాక్యములు చదివి వినిపించునట్టియు వారికి పవిత్రులుగాఁ జేయునట్టియు, వారికి గ్రంథమును తత్వమును నేర్పునట్టియు ప్రవక్తను వారి యొద్దకు పంపి విశ్వాసులకు ఉపకారముచేసెను. మఱియు వారు దానికి ముందు స్పష్టమైన దుర్మార్గములో పడియుండిరి.

వ్యా॥ 161. ప్రవక్తనుగూర్చి ఆయన ఏలాటిది దాఁచిపెట్టఁడు. హృదయములో ఒకటి బయట నింకొకటిపెట్టఁడు. ఒహదుయుద్ధములో అతిక్రమించిన వారినిగూర్చి హృదయములో నేలాటిద్వేషముగాని కోపము(అయిష్టము)గాని దాచిపెట్టలేదు. మఱి అందఱికి హక్కుగల విజయధనములోను ప్రవక్త యెద్దియును దాచుకొనలేదు. ఆలాటిభావము ప్రవక్తనుగూర్చితలంపరాదు. ఎవరు ఏలాటి నమ్మికద్రోహముగాని దాచిపెట్టుటగాని చేయుదురో అదంతయుపరలోకమందు తీర్పుదినమునందు బయటపడును. అందఱును తాము చేసిన క్రియలఫలితము పూర్తిగా పొందుదురు. అందేలాటి అన్యాయముగలుగదు. 162. ప్రవక్త దేవుని యిష్టము ననుసరించిపోవును. ఆయన దేవునికి ప్రియుఁడుగా నుండును. పాపముచేసి దేవుని కోపమునకు పాత్రులై నరకనివాసము పొందువారు ఆతనితో సరిసమానులుకారు. దేవుని ప్రీతిపొందినవారికిని కోపమునకు పాత్రులైనవారికి చాల వ్యత్యాసముగలదు. కావున ప్రవక్త నమ్మికద్రోహముగాని పాపముగాని ఎన్నటికిని చేయఁడు. ద్రోహులు పొందు నివాసము నరకము. అది చాలచెడ్డది, 163. ప్రవక్తయును ఇతర మానవులును సమానులుకారు. ప్రవక్తపదవి చాల

గొప్పది. ప్రవక్త దేవుని యిష్టము ననుసరించుచుండును. సాధారణమైన మానవులవలె నమ్మకద్రోహముగాని పాపముగాని చేయఁడు. దేవుఁడు అందఱు చేయుచున్న కర్మలను చూచుచున్నాఁడు. వారికిఁ దగిన ఫలిత మొసంగును. ప్రజల కర్మలఁబట్టి వారికిఁ దేవుని యొద్ద పలువిధములైన పదవులుగలవు. దేవుని భక్తులు దేవునికి ప్రియులై స్వర్గములో గొప్ప పదవులు పొందుదురు. అవిశ్వాసులు తమ పాపముల కొలఁది నరకములో స్థానముపొందుదురు. సుగుణములలో గొప్పస్థానము పొందినవారినే దేవుఁడు తన ప్రవక్తగా నియమించును. 164. హజ్రత్ ముహమ్మదువారు ప్రవక్త కాక మునుపు మానవులు తప్పుత్రోవలలోఁ బడియుండిరి. దేవుఁడు వారిని ప్రవక్తగాఁ జేసి పంపి లోకులకు చాల ఉపకారము చేసెను. వారును మానవుల జాతికి చేరినవారే. దేవదూత(ఫరిష్తే) మొదలగు ఇతర జాతులకు చేరిన ప్రవక్త వచ్చినచో అంతప్రయోజనముండదు. కావున నిదియును దేవుఁడు మానవులకుఁ గావించిన గొప్ప మేలు. హజ్రత్ రసూలువారు దేవుని వాక్యములను వినిపించి, తమ దివ్యమైనయుపదేశములచే మానవులను పవిత్రులుగాఁ జేసి వారికి దేవుని గ్రంథమగు ఖురానె షరీఫులోని తత్త్వరహస్యములు నేర్పుదురు. హజ్రత్ రసూలువారు తమ జీవిత కాలములో కొన్ని సంవత్సరకాలములోనే పశుప్రాయులైయున్న ప్రజలను గొప్పజనముగా జేసి వారి మూలమున లోకమంతయు ఉన్నతపదవికిఁ దెచ్చిరి.

165. అవలమ్మా అసాబత్కుమ్-ముసీబతున్-ఖద్ అసబ్తుమ్ మిస్లైహా-ఖుల్తుమ్-అన్నాహాజా-ఖుల్-హువ-మిన్ ఇన్ది-అన్ ఫుసికుమ్ - ఇన్నల్లాహా అలాకుల్లి-షైఇన్-ఖదీర్. 166. వమాఅసాబకుమ్-యౌమల్-తఖల్-జమ్ఆని-ఫ-బి-ఇజ్నిల్లాహి-వలి-యఅ-లమల్-మూమినీన్. 167. వ-లి-యఅ-లమల్లజీన-నాఫఖూ-వఖీల-లహుమ్ తఆలౌ-ఖాతిలూ-ఫీ-సబీలిల్లాహి ఆవిద్-ఫఊ-ఖాలూ-లౌ-న-అ-లము ఖితాలల్-లత్-తబఅ-నాకుమ్-హుమ్ లిల్-కుఫ్రి-యౌమఇజిన్ అఖ్రబు-మిన్-హుమ్ లిల్-ఈమాని-యఖూలూన-బిఅఫ్వాహిహిమ్-మా-లైస-ఫీ-ఖులూబిహిమ్-వల్లాహు-అఅలము-బిమా యక్తుమూన్. 168 అల్లజీన-ఖాలూ-లిఇఖ్వానిహిమ్-వఖఅదూ-లౌ-అతాఊనా-మాఖుతిలూ-ఖుల్ ఫద్రఊ-అన్-అన్ఫుసికుముల్ మౌత-ఇన్కున్తుమ్-సాదిఖీన్.

168. ఏమి మీకొక కష్టముగలిగినపుడు, మీరు రెండంతలు వారికి గలిగించియుండియు ఇది ఎచ్చటనుండివచ్చెనని పలుకుదురా? ఆకష్టము మీవల

న నే గలిగినది. అని ఓ ప్రవక్తా! పలుకుము. నిశ్చయముగా దేవుఁడు సర్వ శక్తుఁడు. 166 మఱియు రెండుసైన్యములు కలిసినదినము మీకు కలిగినకష్టము దేవుని సెలవువలన నే గలిగెను. మఱియు విశ్వాసులును వంచకులును స్పష్ట పడుటకుఁగాను అట్లుచేసెను. 167. మఱియు మీరు వారితోరండు దేవునిమార్గ మందు యుద్ధముచేయుఁడు లేక శత్రువులనుపాఱద్రోలుఁడు అని చెప్పఁగామాకు యుద్ధముతెలిసినచో నిశ్చయముగా మీ వెంటవచ్చియుందుము అనివారుచెప్పిరి. వారు ఆ దినమున విశ్వాసమున కంటె అవిశ్వాసమునకు సమీపముననుండిరి. వారి హృదయములలో లేనిదానిని నోటితో పలుకుచున్నారు. మఱియు వారు దాఁచునది దేవునికి బాగుగాఁ దెలియును. 168. వారు తమ యిండ్లలోకూ ర్చుండియుండి తమ సహోదరులు తమ మాటవిని యుండినచో వధింపఁబడి యుండరు గదా యని పలుకసాగిరి. మీరు సత్యవంతులైనచో మీరు చావు నుండి తప్పించుకొనుఁడని ఓప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 165. ఒహొదు యుద్ధములో ముసల్మానులకు కష్టమును నష్టమును (అపజయమువలన) గలిగెను. ముసల్మానులు దీనినిగూర్చి విచారపడుచు మేము దేవుని మార్గమందు యుద్ధము సలుపువారలమే. మాకు ఈకష్టము ఎచ్చట నుండి గలిగెనని యాశ్చర్యముతో పలుకసాగిరి. దానికిఁగాను ఓ ముసల్మాను లారా! మీకు కష్టము కలుగగా ఎచ్చటనుండి గలిగెనని పలుకుచున్నారా. దీనికిపూర్వము బదర్ యుద్ధములో మీకంటెరెండింతలు కష్టనష్టములు మక్కా ఖురైషులకు మీవలన గలిగియున్నది. ఖురైషులు డెబ్బదిమంది వధింపఁబడి, డెబ్బదిమంది ఖైదీలైరి. ఆఖైదీలవిషయమున మీరు వారినివదలుటకును, వారిని శిక్షించుటకును, అధికారము గలిగియుండియు మీరు వారిని వదలిపెట్టడానికి బదులు ధనమును పుచ్చుకొంటిరి. ఒహొదుయుద్ధములో ముసల్మానులు డెబ్బది మంది వధింపఁబడిరి. కాని శత్రువులకు ఖైదీగా నొక్కఁడును పట్టువడలేదు. బదరుయుద్ధములో చిక్కువడిన ఖైదీలను వదలినచో ఇఁక మీఁద అంతమంది ముసల్మానులు వధింపఁబడుదురని దేవుని సెలవుకాఁగా దానికి ముసల్మానులు సమ్మతించిరి. దాని ననుసరించి ఒహొదుయుద్ధములో డెబ్బదిమంది ముసల్మా నులు వధింపఁబడిరి. దానికిఁగూడ కారకులు స్థానము వదలిన విలుకాండ్రులు. కావున ఈ యాపద (అపజయము) మీవలననే మీకు లభించిన దని ముసల్మా నులకు ఓదార్పు (సమాధానము) గలదు. దేవుఁడుసర్వశక్తుఁడు తాను ఇష్టపడిన వారికి ఒకప్పుడు జయమును మఱొక్కప్పుడు అపజయమును ఒసం గును ఒహొదులో పూర్తిగా ముసల్మానులకు జయముగలుగలేదు. అందెవరు నిజమైన ముసల్మానులు, ఎవరు వంచకులు అను విషయము స్పష్టమాయెను. వంచకులు యుద్ధరంగమునకు పోకుండుటచే వారి వంచనబయలుపడెను. ముస

ల్మానులు వంచకులతో మీరు దేవునిమార్గమందు యుద్ధము చేయుఁడు లేక దేవునిప్రీతికిఁగాను లేకపోయిన మీఆలుబిడ్డలను రక్షించుటకునైన శత్రువులను మీ పురప్రాంతములనుండి పాఱద్రోలుఁడని చెప్పగా వంచకులు యుద్ధము జరుగదనియు అట్లు ఒకవేళ జరిగినను తమకు యుద్ధముచేయుటకుఁ దెలియదని పలికిరి. వంచకులు తమహృదయములలో అవిశ్వాసము నుంచుకొని నోటితో విశ్వాసమును (ఈమాన్) వెల్లడించుచుండిరి. ఇప్పుడువారు ముసల్మానులను వీడి మోసపుమాటలను పలుకుటవలన వారి అవిశ్వాసము స్పష్టపడెను. వారు విశ్వాసమునకంటె అవిశ్వాసమునకే చేరువగానుండిరి. వంచకులు మాకు యుద్ధము తెలియదనిచెప్పి వారిహృదయములలో నున్నది దాఁచుచుండిరి. అది దేవునికిఁ దెలియును. అదియే మనముసల్మానులు ఓడిపోయిన బాగుగానుండును. మాకు సంతోషముగలుగును అనివంచకులు పిఱికితనమువహించి యుద్ధమునకు బోక తమయిండ్లలో కూర్చుండియుండి తమ బంధువులగు అన్సారులు తమమాటవిని యుద్ధమునకు పోకయుండినచో వారుఒహదుయుద్ధములోవధింపఁబడియుండరని పలుకసాగిరి. దానికి ఇండ్లలోనుండి చావును తప్పించుకొను శక్తి మీకున్నచో మీరుతప్పించుకొనుఁడు. ఒకదినము చావువచ్చుటనుండి సను రావలసియున్నది అదితప్పదు. పిఱికితనముతో ఇండ్లలోచచ్చుటకంటె యుద్ధరంగమునందు ఆత్మ, మత, దేశ, వంశ రక్షణార్థమై చచ్చుట యుత్తమము. కావున వారు చచ్చినను సజీవులు. ఈ జీవమునుగూర్చి రాఁబోవు వాక్యములలో చెప్పఁబడియున్నది.

169. వలా-తహ్సబన్నల్లజీన-ఖుతిలూ-ఫీసబీలిల్లాహి - అమ్వాతన్-బల్-అహ్యా-ఉన్-ఇన్ద-రబ్బిహిమ్-యుర్జఖూన్. 170. ఫరిహీన-బిమా-ఆతా-హుముల్లాహు-మిన్-ఫజ్లిహీ-వయస్తబ్-షిరూన-బిల్లజీన-లమ్-యల్-హఖూ-బిహిమ్-మిన్-ఖల్ఫిహిమ్-అల్లాఖౌఫున్-అలైహిమ్-వలాహుమ్-యహ్జనూన్. 171. యస్తబ్షిరూన-బినిఅ-మతిమ్-మినల్లాహి-వఫజ్లిన్ - వఅన్నల్లాహ-లాయుజీఉ-అజ్రల్-మూమినీన్.

169, 170. దేవునిమార్గమందు వధింపఁబడినవారిని మృత్యులనితలంపవలదు. వారు తమ ప్రభువునొద్దసజీవులుగానుండి, ఆహారము పొందుచున్నారు. వారు తమకు దేవుఁడు తన యనుగ్రహమువలన నొసంగినదానిచే సంతసించుచున్నారు. మఱియు ఎవరు వెనుకనుండి యింకను వచ్చి వారిని చేరకున్నవారినిఁగూర్చిఏలాటి భయమునుదుఃఖమునులేదని వారుసంతోషపడుచున్నారు.

171. వారు దేవుఁడొసంగిన పుణ్యఫలితములకును, దేవుని యనుగ్రహమునకును విశ్వాసుల కర్మఫలితము దేవుఁడు వృథాగా చేయఁడను విషయమునకును సంతోషించుచున్నారు.

వ్యా॥ 169-170. మానవుఁడు ఇంటిలో కూర్చుండిన మాత్రమున చావు తప్పదు. కాని యుద్ధరంగములో వధింపఁబడిన వీరులదివ్యమైన చావును పొంగొట్టుకొనును. అట్టి యుద్ధవీరులు (షహీదులు) చచ్చినను వారు దేవుని సన్నిధానమున సజీవులుగానున్నారు. వారికి దగిన యాహారము దేవునిచే లభించి వారు దానిని అనుభవించుచు దేవుని ననుగ్రహము వలన ఏలాంటి దుఃఖములులేక సంతోషములోనుందురు. అటులే ఒహాదు యుద్ధములో వధింపఁబడిన యుద్ధవీరులు దేవుని యొద్ద సజీవులుగానుండి సంతసమొందుచు తమ వెనుక రానున్నము సల్మాను యుద్ధవీరుల విషయము ఏలాటి భయము దుఃఖముగలుగదని సంతసపడుచున్నారు. దేవుఁడు ముసల్మానులకర్మల పుణ్యఫలితములు వృథాచేయఁడు ఎవరికిఁదగిన ఫలితము వారికి నొసంగును. ఈవిషయముకూడ వారిని సంతోషపెట్టుచున్నది. కావునఇప్పుడుకూడ ముసల్మానులు ఇస్లామునకుగానుతమ యాత్మధర్మ దేశసంరక్షణార్థమై ప్రాణములు ఇయ్యవలసి వచ్చినచో దానికి వెనుదీయక పూర్వపు ముసల్మానుల ననుసరింపవలెను.

172. అల్లజీ-నస్తజాబూ-లిల్లాహి-వర్-రసూలి మిమ్-బఅ-దిమా- అసాబహుముల్-ఖర్హు-లిల్లజీన-అహ్సనూ-మిన్హుమ్ - వత్తఖౌ- అజ్రున్ అజీమ్.

173. అల్లజీన-ఖాల-లహుమున్నాసు-ఇన్ నన్నాస-ఖద్-జమఊ-లకుమ్-ఫఖ్-షౌహుమ్-ఫజాదత్ హుమ్-ఈమాన్-వఖాలూ-హస్బు-నల్లాహు-వ-నిఅమల్-వకీల్.

174. ఫన్ ఖలబూ-బినిఅ-మతిమ్-మినల్లాహి-వ-ఫజ్ లిల్-లమ్-యమ్-సస్హుమ్ సూఉన్-వత్తబఊ-రిజ్వానల్లాహి-వల్లాహు-జుల్-ఫజ్ లిన్-అజీమ్.

172. ఎవరు తమకు గాయముతగిలిన పిదపను దేవుని యొక్కయు ప్రవక్త యొక్కయు ఆజ్ఞలను శిరసావహించి సత్కార్యములుచేసిభయభక్తులుగలిగియున్నారో వారికి గొప్పపుణ్యఫలితమున్నది.

173. ప్రజలు మక్కావారు మిమ్ములమారొక్కనుటకు కూడియున్నారు. కావునమీరు వారికి భయపడుఁడని వారి (ముసల్మానుల) తో చెప్పగా వారి విశ్వాసము హెచ్చి మాకు దేవుఁడెచాలును. ఆతఁడు బాగుగా కార్యము నెఱవేర్చువాఁడు అనిపలికిరి. 174. ఆపిదప ముసల్మానులు దేవుని నుండి మేలును అనుగ్రహమునుపొంది, ఏలాటి కీడుపొందక తిరిగివచ్చిరి. వారు దేవుని యిష్టము

ననుసరించిరి. మఱియు దేవుఁడు చాలఅనుగ్రహము గలవాఁడు.

వ్యా॥ 172-173. ఒహుదుయుద్ధము ముగిసినపిదప ఖురైషులసేనాధిపతి యగు అబూసుఫ్యాన్ మక్కాపురమునకు పయనమాయెను. ఆమధ్యదారిలో గాయములుదగిలిన ముసల్మానులను వదలిపెట్టివచ్చితిమి. మరల మదీనాపురమునకు పోయి మార్గానిని ముసల్మానులను నిర్మూలించిన బాగుండునని యుద్దేశపడెను. ఈవార్త పైగంబరుల వారికిఁదెలిసి నిన్నయుద్ధములోఁజేరి పాలుగొన్న వారందఱు మరల శత్రువులను మార్కొనుటకు బయలుదేఱవలెనని చాటించిరి. ముసల్మానులందఱు గాయములలో బాధపడుచున్నను దేవుని సెలవుచే ప్రకటించిన ప్రవక్తయాజ్ఞను అనుసరించిరి. ముసల్మానులందఱు మదీనాపురమునకు ఎనిమిదిమైళ్ళ దూరముననున్న హమ్రాఉల్ అసదు అనుచోటున చేరిరి. ముసల్మానులు వెంబడించుచున్నారనువార్త అబూసుఫ్యాన్‌విని భీతిల్లి యుద్ధము చేయునుద్దేశముమానుకొని మక్కాపురమునకు పాఱిపోయెను. మదీనాపురమునకు అబ్దుల్‌ఖైసు అనువారి వర్తకుల బిడారము (ఖాఫిలా) వచ్చుచుండెను. అబూసుఫ్యానువారికి కొంతధనమిచ్చి మదీనాపురమునకుఁబోయి ముసల్మానులు మాకు భయపడునట్లు వదంతులు పుట్టింపుఁడని ప్రేరేపించెను. అట్లువారువచ్చి మక్కాఖురైషులు గొప్పసైన్యమును మిమ్ము నశింపఁజేయుటకై సేకరించియున్నారు. మీరువారికి భయపడుఁడను చెప్పసాగిరి. ముసల్మానులు భయపడలేదు. వారివిశ్వాసము వృద్ధిపొందెను. మఱియు దృఢవిశ్వాసములో మాకు దేవుఁడేచాలును, ఆతఁడు మాకుఁదోడుపడి సూకార్యములు బాగుగా నెఱవేర్చును అనిపలికిరి. మఱిదేవునికిభయపడి సత్కార్యములుచేసిన భక్తులకు గొప్ప పుణ్యఫలితము లభించును. ముసల్మానులు హమ్రాఉల్ అసద్‌చేరిరి. అచ్చట యుద్ధముసంభవింపలేదు. ఏలాటికీడునుముసల్మానులకుఁగలుగలేదు. అపుడచ్చటికి నొకవర్తకబిడారము వచ్చియుండెను. వారితో వ్యాపారము జరిగి ముసల్మానులకు చాల లాభముగలిగెను దేవుని యనుగ్రహమువలన యేలాటి కీడుపొందక శత్రువులకు భయముగల్గించి ముసల్మానులు మదీనాపురమునకు తిరిగివచ్చిరి. దేవునియనుగ్రహము చాలగొప్పది. కావున అందఱు ముసల్మానులును హజ్రత్ పైగంబరులవారి శిష్యులు ఎట్లు దేవునియిష్టమును ప్రవక్తయాజ్ఞలననుసరించి భయభక్తులుగలిగి సత్కార్యములుచేసి శత్రువునకుభయపడక దేవునిపై ఆధారపడిరో ఆటులే ఎల్లరు గావించినచో ఉభయలోకములందును విజయముపొందుదురు.

175.ఇన్నమాజాలికుముష్-షైతాను-యుఖవ్విఫు-ఔలియాఅహూ-ఫలా తఖా-ఫూహుమ్-వఖాఫూనీ-ఇన్‌కున్‌తుమ్-మూమినీన్. 176.వలాయహ్‌జున్-

కల్లజీన-యుసారిఊన-ఫిల్-కుఫ్రి-ఇన్నహుమ్-లన్-యజుర్రుల్లాహ-షైఅన్- యు రీదుల్లాహు-అల్లాయజ్అల-లహుమ్-హజ్జన్-ఫిల్-ఆఖిరతి-వలహుమ్-అజాబున్-అజీమ్. 177. ఇన్నల్లజీనష్-తరఉల్-కుఫ్ర-బిల్-ఈమాని లన్-యజుర్రుల్లాహ-షైఅన్-వలహుమ్-అజాబున్-అలీమ్. 178. వలాయహ్సబన్నల్లజీన-కఫరూ-అన్నమా-నుమ్లీ-లహుమ్-ఖైరుల్-లిఅన్ఫుసిహిమ్-ఇన్నమా-నుమ్లీ-లహుమ్-లియజ్-దాదూఇస్మన్-వలహుమ్-అజాబుమ్-ముహీన్.

175. అట్లుపలుకువాఁడు సైతానుమాత్రము. అతఁడు తనస్నేహితులను గూర్చి మీకు భయముగలిగించుచున్నాఁడు. కావున మీరు వారికి భయపడకుఁడు మఱియు మీరు విశ్వాసులైనచో నాకే భయపడుఁడు. 176. అవిశ్వాసములో పరుగెత్తువారినిగూర్చి నీవు చింతింపవలదు. వారు దేవునికి రవంతయును నష్టముగలిగింపఁజాలరు. దేవుఁడు వారికి పరలోకమందు ఏలాటిభాగమొసంగుటకు ఇష్టపడలేదు. వారికి ఘోరబాధయున్నది. 177. ఎవరు విశ్వాసమునకుబదులుగా అవిశ్వాసమును స్వీకరింతురో వారు దేవునికి ఏలాటినష్టము చేయఁజాలరు. మఱియు వారికి దుఃఖకరమైన బాధయున్నది. అవిశ్వాసులైనవారు మేము ఒసంగుగడువు వారికి మేలనితలంపరాదు. వారు తమపాపములను వృద్ధిచేసికొనుటకుఁగాను వారికి గడువొసంగుచున్నాము. మఱి వారికి అవమానకరమగు నరకబాధయున్నది.

వ్యా॥ 175. మక్కా ఖురైషులపక్షమువారువచ్చి భీతి గలిగించువార్తలు పలుకుదురు. వారలు సైతానులు. వారు తమస్నేహితులగు అవిశ్వాసులగూర్చి ముసల్మానులకు భయముగలిగించుచున్నారు. దేవునికి భయపడువారలగు ముసల్మానులకు భయము గలిగించుచున్నారు. దేవునికి భయపడువారలగు ముసల్మానులకు ఏలాటి శత్రుభయముకలుగదు. కావున నిజమైనముసల్మానులు వారికి భయపడక దేవునికే భయపడవలెను. 176. సైతానులమాటవిని అవిశ్వాసమునకు పరుగిడువారు వంచకులు. వీరి చర్యలంగూర్చి మీరు చింతపడవలదు. వంచకులు దేవునిమతమగు ఇస్లామ్‌నకును దేవునిప్రవక్తకును ఏలాటినష్టము చేయఁజాలరు. దేవుఁడు అట్టి ద్వేషముగల వంచకులకు పరలోకములో నేలాటిసౌఖ్యము నొసంగఁడు వారునరకబాధనుపొందుదురు. 177. దేవుని విశ్వసింపక ఇస్లామ్‌లో చేరని వారందఱు దేవునికిగాని ఇస్లామునకుగానిరవంత నష్టముచేయఁజాలరు. కాని అవిశ్వాసులు తమ నష్టమే చేసికొని తుదకు దుఃఖకరమైన నరకబాధలకు పాలగుదురు.

178. సంపదలును ఇహమందలి సౌఖ్యములును ఎక్కువవయస్సు వచ్చువఱకును పొందుచు దేవునికోపమునకు పాత్రులై చోమాకు ఇవిఎట్లులభించునని అవిశ్వాసులు చెప్పునంటకు మోసపోఁగూడదు. ఇవన్నియు గలిగి గడువును (విరామము) లభించినందున వారుతమ దుష్టస్వభావములచే పాపములను వృద్ధిచేసికొనుచున్నారు. ఇహలోక భోగములను బట్టి వారు గౌరవవంతులని తలంప రాదు. వారికి అవమానకరమగు నరకబాధయున్నది.

179. మా-కానల్లాహు-లియజరల్-మూమినీన-మా అన్‌తుమ్-అలై హి-హత్తా-యమీజల్-ఖబీస-మినత్-తయ్యిబి-వమా-కానల్లాహు-లియుత్-లిఅకుమ్-అలల్-గైబి-వలాకిన్నల్లాహ-యజ్‌తబీ-మిర్-రుసులిహీ-మన్-యషాఉ-ఫఆమినూ-బిల్లాహి-వరుసులిహీ-వఇన్-తూమినూ-వతత్తఖూ-ఫలకుమ్-అజ్రున్-అజీమ్.

179. పవిత్రులనుండి అపవిత్రులను దేవుఁడు వేఱుపఱచక ఇప్పుడుండు స్థితిలోనే ముసల్మానులను వదలిపెట్టఁడు. మఱియు దేవుఁడు మీకు అగోచర (గైబు) విషయములను దెలుపువాఁడుకాఁడు. కాని తనప్రవక్తలలో తానుఇష్టపడిన వారినిఏర్పఱచుకొనును. కావునమీరు దేవునిని ఆతని ప్రవక్తలను విశ్వసింపుఁడు. మఱియు మీరు విశ్వసించి భయభక్తులుగలిగియుండినచో మీకు గొప్ప పుణ్యఫలిత మున్నది.

వ్యా॥ 179. ఎట్లు ఇహలోక సంపదలుగలిగియుండుమాత్రమున వారు దేవునికి ప్రియులని యూహింపఁదగదో అట్లే (ఒహదు యుద్ధములో) ముసల్మానులకు, కష్టములు గలిగినచో వారు దేవునికి ప్రియులుకారు అని యూహింపరాదు. వాస్తవములో దేవుఁడు ముసల్మానులలో నిజమైనవారెవరు వంచకు లెవరు అను విషయము స్పష్టపఱచుటకు కొన్ని కష్టములుపెట్టి పరీక్షించును. అపుడు నిజమైన పరిశుద్ధ భక్తులును అపవిత్రులైన వంచకులును వేఱుపడుదురు. కష్టముపెట్టి పరీక్షింపకయే వంచకులపేర్లు దెలుపుట దేవునకు సులభమే. కాని దేవుఁడు అట్లు చేయఁడు. మఱి అందఱికి అగోచర విషయములు స్వయముగాఁ దెలుపఁడు. మానవులలోనే తాను కోరిన వారిని ప్రవక్తగా ఏర్పఱచుకొని తాను కోరిన అగోచర విషయములను వారికిఁ దెలుపును. ప్రవక్తల మూలమున ఆ విషయములు ప్రజలకుఁ దెలియును. కావున ముసల్మానులు దేవునియందును ఆతని ప్రవక్తలయందును విశ్వాసముగలిగి భయభక్తులు గలిగియుండవలెను. దానివలన వారికి గొప్ప పుణ్యఫలితములులభించును.

180. వలాయహ్-సబన్నల్లజీన-యబ్-ఖలూన-బిమా-ఆతాహుము-ల్లా

హు-మిన్-ఫజ్లిహీ-హువ-ఖైరల్-లహుమ్-బల్-హువ-షర్రుల్-లహుమ్-స యుతవ్వఖూన-మా-బఖిలూ-బిహీయౌమల్-ఖియామతి-వలిల్లాహి-మీరా సుస్-సమావాతి-వల్-అరజి-వల్లాహు-బిమా-తఅ-మలూన-ఖబీర్.

180. దేవుఁడు అనుగ్రహించి యొసంగిన దానిలో లోభమువహించు వారు తమ కది మేలని తలంపవలదు. అది వారికి చెఱుపే. దేనియందు వారు లోభమువహించిరో అది తీర్పుదినమునందు వారి మెడలకు హారమగును. (తుదకు) ఆకాశమునకును భూమికిని దేవుఁడే వారసుఁడు. మఱి మీరు చేయునది దేవునికిఁ దెలియును.

వ్యా॥ 180. ఈసూరాలో ప్రారంభమునుండియు యూదుల క్రైస్తవులనుగూర్చి చెప్పఁబడుచు మధ్యలో ఒహదుయుద్ధవిషయమును తెలిపి మరల యూదుల చెడుగుణములు వివరించుచు, ఆ చెడుగుణములు ముసల్మాను భక్తులు వదలుకొనవలెనని ఇఁక హెచ్చరిక గలదు. ఎక్కువమంది వంచకులు, యూదులకు సంబంధించినవారు. ఎట్లు వంచకులు దేవుని మార్గమందు యుద్ధము చేసి దేహ ప్రాణములను అర్పించుటకు సాహసింపక తమ వంచనగుట్టుబయలు పఱతురో అటులే దేవుఁడనుగ్రహించి వారికి నొసంగిన ధనమును ఖర్చు (దానము) చేయకలోభమువహించి నరకమునొందుచున్నారు. యూదులకు దానమన్న ప్రాణములు పోవును. అట్లు వారు ధనము దాఁచిపెట్టి లోభమువహించుటవారికి మేలుగాదు. వారికి చెఱుపే అగును. ఒకవేళ ఇహలోకమందు ఏలాటి ఆపద రాకున్నను తీర్పుదినమునందు వారి సొత్తు వారి మెడకు హారమగును. దానివలన వారికి చాల బాధ కలుగును, వారిసొత్తు పెద్దపాము రూపమున వారి మెడకు చుట్టుకొని వారిని బాధించును అని హజ్రత్ పైగంబరులవా రుపదేశించియున్నారు. కావున మానవుఁడు తన జీవితకాలములోనే దేవుని ప్రీతి పడయుటకు విధిదానము (జకాతు) మొదలగు పుణ్యములు చేయవలెను. తుదకు అందఱి సొత్తునకు దేవుఁడే వారసుఁడు అగును. అపుడు ధనమువలన ఎవరికిని ఏలాటి లాభము గలుగదు. దానము చేసిన, లోభమువహించిన సర్వము దేవునికిఁ దెలియును. ఎవరి కర్మలకుఁ దగిన ఫలితము వారికి నొసంగును. కావున పుణ్యఫలితమగు దానము చేయవలెను.

181. లఖద్-సమిఅల్లాహు-ఖౌలల్ల-జీన-ఖాలూ-ఇన్నల్లాహ-ఫఖీరున్-వనహ్ను-అగ్-నియాఉ-సనక్తుబు-మాఖాలూ-వఖత్లహుముల్-అంబియాఅ బిగైరి-హఖ్ఖిన్-వ-నఖూలు-జూఖూ-అజాబల్-హరీఖ్. 182. జాలిక-బిమా-ఖద్ద

మత్-ఐదీకుమ్-వఅన్నల్లాహ-లైస-బిజల్లా మిల్-లిల్-అబీద్.

181: 182. దేవుఁడు బీదవాఁడు మేముధనవంతులమని చెప్పినవారిమాటను నిశ్చయముగా దేవుఁడువినెను. వారుపలికినదియును వారు అన్యాయముగ ప్రవక్తలను వధించినదియును మేము వ్రాయుదుము. మఱియు దహించు అగ్నిబాధను అనుభవింపుఁడు (రుచిచూడుఁడు). ఇదిమీరు తమ చేతులార ముందుగనే చేసిన కర్మలకు ఫలితమున్నది. మఱియు దేవుఁడు మానవులకు అన్యాయము చేయఁడు. అని పలుకుదుము.

వ్యా॥ 181: 182. యూదులుతమ దుష్టస్వభావముచే లోభమువహించినట్లు కాక దేవునిమార్గమందు దానముచేయుఁడు. అట్లుచేయు దానముమొదలగునవి దేవునికి అప్పునిచ్చినట్లగును. మఱియు దేవునికి మంచి అప్పుఇండని దేవునిసెలవుకాఁగా యూదులు పరిహాసంచుచు దేవుఁడు బీదవాఁడు. మేము ధనవంతులము. మమ్ము దేవుఁడు అప్పు అడుగుచున్నాఁడని పలుకసాగిరి. సత్కార్యములలో భక్తులు ఖర్చుచేయునది అప్పుఅని సెలవిచ్చి దానిఫలితము ఉభయ లోకములలో ఖర్చుచేసినవారికే యొసంగుచున్నాఁడు. దీనిచే దేవునికేమియు లాభములేదు. సర్వము దేవుఁడొసంగినదే. కానిదుష్టులగు యూదులుచెప్పినది దేవుఁడువినెను. దానికిఁదగిశిక్షవిధించును. అదియునుగాక యూదులు పూర్వముచుండి దేవుని ప్రవక్తలను అన్యాయముగా చంపుచుండిరి. దానికిఁగూడ వారికి శిక్షయున్నది. కాల్చిదహింపఁచేయునట్టి నరకాగ్ని బాధవారికున్నది. దాని రుచిపొందుఁడని వారితో చెప్పఁబడును. అప్పుడు వారు పరిహాసఫలితము రుచిచూతురు. దేవుఁడు మానవులకు రవంతయును అన్యాయము చేయఁడు. వారు ముందుగనే చేసిపంపిన కర్మలఫలితము అచ్చటననుభవింతురు.

183. అల్లజీన-ఖాలూ-ఇన్నల్లాహ-అహిద ఇలైనా-అల్లా-నూమిన-లిరసూలిన్ హత్తా-యాతీనా-బి-ఖుర్బానిన్-తాకులు-హున్నారు-ఖుల్-ఖద్-జాఅకుమ్-రుసులున్-మిన్-ఖబ్లీ-బిల్-బయ్యినాతి-వబిల్లజీ-ఖుల్తుమ్-ఫ-లిమ-ఖతల్తుమూహుమ్-ఇన్-కున్తుమ్ సాదిఖీన్. 184. ఫఇన్-కజ్జబూక-ఫఖద్కుజ్జిబ-రుసులుమ్ మిన్ఖబ్లిక-జాఊ బిల్-బయ్యినాతి-వజ్జుబురి వల్-కితాబిల్ మునీర్.185. కుల్లు-నఫ్సిన్ జాఇఖతుల్-మౌతి-వఇన్నమా-తువఫ్ఫౌన-ఉజూరకుమ్-యౌమల్ ఖియామతి-ఫమన్-జుహ్జిహ-అనిన్ నారి-వ-ఉద్ఖిలల్ జన్నత ఫఖద్ ఫాజ-వమల్-హయాతుద్-దున్యా ఇల్లా-మతా-ఉల్-గురూర్.

183. అగ్ని తిని వేయునట్టి ఖుర్బానీని మాయొద్దకు దెచ్చునంతవరకు ఏ ప్రవక్తయందును విశ్వాస ముంచగూడదని దేవుఁడు మాకు సెలవిచ్చియు న్నాఁడని పలికినచో వారిలో నాకంటె పూర్వము వచ్చిన అనేకులు ప్రవక్తలు తెలిపిన అనేక సూచనలతోఁబాటు మీరుచెప్పినదియును తీసికొని మీయొద్దకు వచ్చినపుడు మీరుస్వతంత్రులైనచో ఎందుకు వారినిచంపితిరని ఓప్రవక్తా! పలు కుము. 184. ఆపిదప వారు నిన్ను తిరస్కరించినచో నీకంటె పూర్వము సూచ నలను చిన్న గ్రంథములనుప్రకాశమానమైన గ్రంథమును తీసికొనివచ్చిన ప్రవక్త లుకూడ తిరస్కరింపఁబడిరి. 185. ప్రతిప్రాణియును చావునుపొందవలసియున్న ది. మఱియు తీర్పుదినమందు మీకర్మలఫలితము పూర్తిగా లభించును. కావున ఎవఁడు నరకాగ్నినుండి తప్పింపఁబడి స్వర్గములో ప్రవేశపెట్టఁబడెనో వాఁడు విజయముపొందెను. మఱియు ఇహలోకజీవనము మోసపుచ్చునదిమాత్రమేను.

వ్యా॥ 183. పూర్వము కొందఱు ప్రవక్తలకాలములో ఎవరైన దేవు నికి ఖుర్బానీగాని కానుకగాని అర్పించినచో అదిదేవుని సమ్మతమాయెనని తెలుపుటకై ఆకాశమునుండి అగ్నివచ్చిదానినికాల్చివేయుచుండెను. అదిసాకు గా పెట్టుకొని యూదులు, అట్టిఅగ్నివచ్చి కానుకలను కాల్చునంతవఱకు ఏ ప్రవక్తను నమ్మఁగూడదనిదేవుఁడు మాకుసెలవిచ్చియున్నాఁడు. కావునమేము మిమ్ము నమ్మము అని హజ్రత్ పైగంబరుల వారితోచెప్పిరి. దానికి ప్రత్యు త్తరమీవాక్యమునందు ఇయ్యబడినది. అట్టిసూచనను మఱియు ఇతరసూచన లను తెచ్చి చూపిన ప్రవక్తలను యూదులు అన్యాయముగా చంపిరి. ఖుర్బానీ తిను అగ్నివచ్చినచో మేము నమ్ముదుమని చెప్పుటలో మీరు సత్యవంతులైనచో మీ పూర్వికులు ఎందులకు ప్రవక్తలను వధించిరి. అందఱు ప్రవక్తలును ఒకే విధమైన సూచన (మోజిజా) లను చూపలేదు. ఆకాలమునకుఁ దగిన సూచ నలు దేవుని సెలవుచే చూపిరి. యూదులు వృథాగా వాదులాడుదురు అది వారి స్వభావమే. 184 ఓ ప్రవక్తా! వారు నిన్ను తిరస్కరించినచో నీవుచింత పడనక్కఱలేదు. నీకు పూర్వము వచ్చిన ప్రవక్తలు అనేక సూచనలను చిన్న పెద్దగ్రంథములను తీసికొనివచ్చిరి. కాని దుష్టులు వారిని తిరస్కరించిరి అని హజ్రత్ పైగంబరులవారిని దేవుఁడు ఊరడించుచున్నాఁడు. 185. ప్రతి ప్రాణియును చావు రుచి చూడవలసి యున్నది. ప్రవక్తలను తిరస్కరించిన వారు విశ్వసించిన వారు ఒక దినము చచ్చి మరల సజీవులై తీర్పు దినమందు తమ తమ కర్మల ఫలితములు పూర్తిగా పొందుదురు. ఇహలోక జీవనము నందలి అనిత్య మోహములకు మానవులు మోసపోయి పరలోకమును పాటిం పరు. అది గొప్ప పొరపాటు. వాస్తవమైన విజయము పరలోకమునందు నరకము తప్పి స్వర్గము లభించుటయే. స్వర్గనివాసమునుపొందినవారే మోక్ష

మును విజయమును పొందినవారు కావున పరలోక సుఖమునకు మానవులు పాటుపడవలెను.

186. ల-తుబ్ ల-వున్న-ఫీ-అమ్వాలికుమ్-వఅన్-ఫుసికుమ్-వలతస్ మఉన్న-మినల్లజీన-ఊతుల్-కితాబ-మిన్-ఖబ్లికుమ్-వమినల్లజీన-అష్రకూ - అజన్-కసీరన్-వఇన్-తస్బిరూ వతత్తఖూ-ఫఇన్న-జాలిక-మిన్-అజ్మిల్-ఉమూర్-

186. నిశ్చయముగా మీరు మీ సొత్తులలోను మీయాత్మలలోను పరీక్షింపఁబడుదురు. మఱియు నిశ్చయముగా పూర్వగ్రంథములు గలవారినుండియు-పెక్కు దైవారాధనలనుండియు మీరు అనేక దూషణను విందురు. మఱి మారు ఓర్పువహించి భయభక్తులు గలిగియుండినచో ఇవి ధైర్యముతో చేయఁదగినవే.

వ్యా॥186. ఈవాక్యము మోమునల్మానులకిట్లు చెప్పఁబడుచున్నది. ఇఁకమీఁదను మీసొత్తులవిషయమునందును మీప్రాణములవిషయమునందును పరీక్ష గలుగును. దేవుని ప్రీతికై ఆత్మధనములకుసంబంధించిన త్యాగములుమీరుచేయవలసివచ్చును. వధింపఁబడుట, గాయములు దగులుట, రోగులగుట ధననష్టము మొదలైనవి సంభవించును. మఱి యూదులు, క్రైస్తవులు మొదలగు పూర్వగ్రంథములు గలవారును పెక్కు దైవములను ఆరాధించు ముష్రికులును అనేక నిందలను మోపి, దూషణలాడి మీ మనస్సులకు నొప్పి కలిగింతురు. అందులకు మీరు సహించి దృఢవిశ్వాసముతో ఓర్పుగలిగి దేవునియందు భయభక్తులుగలిగి యుండవలెను. ఇది ధైర్యసాహసములతోఁ జేయఁదగిన విషయము.

187. వ ఇజ్ అఖ-జల్లాహు-మీసాఖల్లజీన-ఊతుల్-కితాబ-లతు-బయ్యినున్నహూ-లిన్నాసి-వలాతక్తుమూనహూ-ఫనబజూహు వరాఅ-జుహూరిహిమ్-వష్తరౌ-బిహీ-సమనన్-ఖలీలన్-ఫబిస-మాయష్తరూన్. 188. లాతహ్సబన్నల్లజీన-యఫ్రహూన-బిమా-అతౌ-వ-యుహిబ్బూన-అన్-యుహ్మదూ-బిమా-లమ్-యఫ్ అలూ-ఫలా-తహ్సబన్నహుమ్-బి-మఫాజతిమ్-మినల్-అజాబి-వలహుమ్-అజాబున్-అలీమ్. 189. వలిల్లాహి-ముల్కుస్-సమావాతి-వల్ అర్జి-వల్లాహు-అలా-కుల్లి షైఇన్-ఖదీర్-

187. మఱియు దేవుఁడు గ్రంథముగలవారితో మీరు గ్రంథమును ప్రజలకుఁ దెలుపవలెను. దానిని దాఁచకూడదు అను నిబంధన (ఖరారు) పుచ్చుకొనెను. ఆ పిదప వారుఆ నిబంధనను తమ వీఁపు వెనుక పాఱవేసి దానికి

బదులుగా కొంత వెలను పుచ్చుకొనిరి. వారు పుచ్చుకొనునది చాల చెడ్డది. 188. ఎవరు తాము చేసిన దానికి సంతోషపడుచు తాము చేయనిపనికై స్తోత్రములు కోరుదురో వారు శిక్షనుండి రక్షణపొందిరి అని ఓ ప్రవక్తా! నీవు తలంపకుము. మఱియు వారికి బాధకరమైన శిక్షయున్నది. 189. మఱియు ఆకాశములయొక్కయు భూమియొక్కయు ప్రభుత్వము దేవునిదే. దేవుఁడు సర్వశక్తుఁడు.

వ్యా॥ 187. ఇస్రాయీలియ (యూదులు క్రైస్తవు)ల విద్వాంసులతో దేవుఁడు తన ప్రవక్తల మూలమున దేవుని గ్రంథములలోని ధర్మములను, రాఁబోవు ప్రవక్తనుగూర్చియున్న ప్రకటనలను ప్రజలకుఁ దెలుపవలెను. వానిని దాఁచకూడదు అని నిబంధన పుచ్చుకొనెను. వారట్లు ఒప్పుకొనియు ఇహలోక తుచ్ఛభోగములకు లోఁబడి లంచములు పుచ్చుకొని పామరులకు నిజమైనధర్మములను తెలుపక దాఁచి తారుమారుచేసిరి. హజ్రత్ ముహమ్మదువారిని గూర్చియున్న ప్రకటన (బషారాతు) లను దాఁచిపెట్టి దానికి వేఱు అర్థము చేసిరి. వారుగావించియున్న ఖరారును అనుసరింపక దానినిమఱుఁగుపుచ్చిరి. సత్యము దాఁచి దానికి బదులుపుచ్చుకొను ధనము చాల చెడ్డది. ఇందు ముసల్మానుల విద్వాంసులు అట్లుచేయకూడదను హెచ్చరికగలదు. 188. యూదులు సత్యమును దాఁచి తమ కుట్రలు చెల్లుచున్నవనియు తమ్ము ఎవరునుపట్టఁజాలరనియు సంతసించుచు జనులు తమ్ము స్తుతింపవలెనని కోరుచుండిరి. అటులే వంచకులును యుద్ధసమయములలో ఇండ్లలో దాఁగి మేము రక్షణపొందితిమని సంతసించి ముసల్మానులు యుద్ధమునుండి మరలివచ్చినపుడు పైగంబరులవారియొద్దకు వంచకులుపోయి, ఏదో యొక అబద్ధకారణము చెప్పి దానికి ప్రజలు తమ్ము స్తుతింపవలెనని కోరుదురు. అట్లు చేయువారు దేవునిశిక్షనుండి రక్షణ పొందిరని తలంపరాదు. వారికి తప్పక ఘోరమైన నరకబాధయున్నది. 189 భూమ్యాకాశముల ప్రభుత్వము దేవునిదే. అతఁడు సర్వశక్తుఁడు. వారు అతని శిక్షనుండి తప్పించుకొనఁజాలరు. ముసల్మానులు, యూదులవలెను వంచకులవలె నడచుకొనరాదు.

190. ఇన్న-ఫీ-ఖల్ ఖిస్-సమా-వాతివల్ అర్ జి-వఖ్-తిలాఫిల్ లైలి-వన్-నహారి-ల-ఆయాతిల్-లిఉలిల్-అల్-బాబ్. 191. అల్లజీన-యజ్ కురూనల్లాహ-ఖియామన్-వ-ఖుఊదన్-వ-అలా-జునూబిహిమ్-వయతఫక్కరూన-ఫీ ఖల్ ఖిస్-సమావాతి-వల్ అర్ జి-రబ్బనా-మాఖలఖ్ త-హాజా-బాతిలన్-సుబ్ హానక-ఫఖినా అజాబన్నార్. 192. రబ్బనా-ఇన్నక-మన్-తుద్-ఖిలిన్నార-ఫఖద్-

అఖ్-జై తహూ-వమా-లిజ్జాలిమీన-మిన్-అన్సార్. 193. రబ్బనా-ఇన్ననా-సమిఅ్నా-మునాదియన్-యునాదీ-లిల్-ఈమాని-అన్-ఆమినూ-బి-రబ్బికుమ్-ఫ ఆమన్నా-రబ్బనా-ఫగ్ఫిర్లనా-జునూబనా-వకఫ్ఫిర్-అన్నా-సయ్యి-ఆతినా వ-తవఫ్ఫనా-మఅల్-అబ్రార్. 194. రబ్బనా-వఆతినా-మావఅత్తనా-అలా-రుసులిక-వ-లాతుఖ్జినా-యౌమల్-ఖియామతి-ఇన్నక-లాతుఖ్లిఫుల్-మీఆద్. 195. ఫస్తజాబ-లహుమ్-రబ్బుహుమ్-అన్నీ లాఉజీఉ-అమల-ఆమిలిమ్-మిన్కుమ్-మిన్-జకరిన్-ఔ-ఉన్సా-బఅ్జుకుమ్-మిమ్-బఅ్జిన్-ఫల్లజీన-హాజరూ-వఉఖ్రిజూ-మిన్-దియారిహిమ్-వఊజూ-ఫీసబీలీ-వఖాతలూ-వఖుతిలూ-లఉకఫ్ఫిరన్న-అన్-హుమ్-సయ్యి-ఆతిహిమ్-వ-ల-ఉద్-ఖిలన్నహుమ్-జన్నాతిన్-తజ్రీ-మిన్-తహ్తి-హాల్-అన్-హారు-సవాబమ్-మిన్-ఇన్-దిల్లాహి-వల్లాహు-ఇన్దహూ-హుస్నుస్-సవాబ్.

190: 191., నిశ్చయముగా ఆకాశములయొక్కయు భూమియొక్కయు సృష్టియందును, రాత్రింబవళ్ళు వచ్చిపోవుటలోను, నిలిచి, కూర్చుండి, ప్రక్కలపై పరుండి దేవుని స్మరించుచుండు బుద్ధిమంతులకు సూచన లున్నవి. మఱియు వారు భూమ్యాకాశముల సృష్టియందు యోచించుచున్నారు. వారు ఓమాప్రభువా! నీవు ఈ సృష్టిని వ్యర్థముగా పుట్టించలేదు. నీవు పరమపవిత్రుండవు. కావున నరకాగ్ని బాధనుండి మమ్ము రక్షింపుము. 192. ఓమాప్రభువా! నీవు ఎవనిని నరకాగ్నిలోఁ బడవేయుదువో వానిని నీవు అవమానపఱచితివి. మఱి పాపులకు తోడుపడువారెవరునులేరు. 193. ఓమాప్రభువా! విశ్వాసము వైపునకు పిలుచుచు మీప్రభువును విశ్వసింపుఁడు అని పిలుచువాని పిలుపును మేము విని విశ్వసించితిమి. ఓ మాప్రభువా! మాపాపములను క్షమింపుము. మఱి మా పొరపాటులను మమ్మునుండి తొలగింపుము. మఱి పుణ్యవంతులతోఁబాటు మాకు మరణము దయచేయుము. 194. ఓ మాప్రభువా! మఱి ప్రవక్తమూలమున మాకు నీవు వాగ్దానముచేసినదాని నొసంగుము. తీర్పుదినమందు మమ్ము అవమానపఱపకుము. నిశ్చయముగా నీవు వాగ్దానమునకు వ్యతిరేకముగాఁ జేయువు అని వేఁడుదురు. 195. పిదప వారి ప్రభువు వారి ప్రార్థన అంగీకరించి మీలో పురుషుఁడుగాని, స్త్రీగాని చేసిన కర్మలను వ్యర్థ

ము చేయును. వీరందఱు ఒకరినొకరు చేరినవారని సెలవిచ్చెను. ఎవరు తమ దేశమును విడచి, తమ ఇండ్లనుండి తఱుమఁబడి నామార్గమందు కష్టములు పొంది, యుద్ధమాడి వధింపఁబడిరో వారి పాపములను వారినుండి తొలఁగింతును. మఱియు కాలువలు ప్రవహించు స్వర్గవనములో వారికి నివాస మొసంగుదును, ఇది దేవుని యొద్దనుండి వచ్చిన పుణ్యఫలితము. దేవుని యొద్ద మంచి పుణ్యఫలితములున్నవి అని సెలవిచ్చెను.

వ్యా॥ 189: 191. బుద్ధిమంతులు భూమ్యాకాశములను అందలి సమస్తమును యోచించినచో ఇంతటి గొప్పసృష్టి క్రమముగానడచుట రాత్రింబవళ్లు వచ్చుట పోవుట మొదలగునవి కాలఋతువులక్రమము ఒక సృష్టికర్త లేక జరుగనేరదు అని నిశ్చయించి దేవునిని ప్రతిస్థితిలో ఎల్లప్పుడును స్మరింతురు. యోచించినపిదప ఓ మా ప్రభువా నీవు ఈసృష్టిని వ్యర్థముగాఁజేయలేదు. దీనికి గొప్ప ఫలితమున్నది. అదియే పరలోకజీవనము. ఇహమునందు మానవుడు విశ్వసించి సత్కార్యములుచేసినచో దాని ఫలితముగా పరలోకమందు నరకమునుండి మోక్షము స్వర్గములభించును. 192. అందులకే బుద్ధిమంతులగు భక్తులు తమ్ము దేవుఁడు నరకమునుండి తప్పింపవలెను. నరకములోవేసి అవమానపఱచవలదని వేఁడుకొనుచున్నారు. నరకములోపడిన అవిశ్వాసులకు రక్షించి తోడుపడువారెవరునులేరు. 193. హజ్రత్ పైగంబరులవారు దేవుని విశ్వసింపుఁడని ప్రచారముచేసి ప్రజలకు విశ్వాసమునకురండని పిలుచుట, విని విశ్వసించినవారు మేము విశ్వసించితిమి. కావున మా ఘోరపాపములను పొరపాటులను క్షమించి భక్తులగు పుణ్యాత్ములతోఁబాటు మాకు మరణమొసంగుమని దేవునితో వేఁడుకొనుచున్నారు. 194. విశ్వాసులకు ఇహమునందు శత్రువులపై జయమును లోకరాజ్యమును పరమునందు మోక్షమునొసంగుదునని దేవుఁడు పవిత్రులమూలమున ప్రజలకుఁ దెలిపియున్నాఁడు. ఆ వాగ్దానము ప్రకారముగా మాకు నొసంగుమనియు తమకు ఏలాటిఅవమానము తీర్పు దినమందు కాకుండునట్లుచేయుము అని భక్తులు ప్రార్థించుచున్నారు. మఱి దేవుఁడు తనమాట తప్పనివాఁడు. 195. మానవులందఱును ఆదము, హవ్వానుండిపుట్టినవారు. స్త్రీలు పురుషులు, ఎవరుచేసిన పాపపుణ్యముల ఫలితము, వారికేలభించును. ఎవరి కర్మఫలమును వృథాపోదు. అందు స్త్రీపురుషుల భేదములేదు. మంచిచెడుగులకు దానికిఁదగిన ఫలితము లభించును. కావున ఇస్లామ్‌లోచేరి దేవుని విశ్వసించినందులకు దుష్టులగు అవిశ్వాసులు (మక్కా ఖురైషులు) ముసల్మానులకు పెట్టరానిబాధలు పెట్టిరి. తుదకు ముసల్మానులు తమ జన్మభూమిని, గృహములను వదలి మదీనాపురము చేరిరి. అచ్చటకూడ శత్రువులు వదలక వారిపై దండెత్తివచ్చిరి. అప్పుడు ముసల్మానులు యుద్ధమాడి యుద్ధములోవధింపఁబడిరి. అట్టి భక్తులపాప

ములను పొరపాట్లను దేవుఁడుక్షమించి వారిపుణ్యముల ఫలితముగా వారికిస్వర్గ నివాసము నిత్తునని సెలవిచ్చుచున్నాఁడు అట్టి భక్తుల కర్మలు వృథాపోవు.

196. లా-యగుర్రన్నక-తఖల్లు - బుల్లజీన-కఫరూ ఫిల్ బిలాద్. 197. మతాఉన్-ఖలీలున్-సుమ్మ-మావాహుమ్-జహన్నము-వబీసల్-మిహాద్. 198.లాకినిల్లజీ-నత్తఖౌ-రబ్బహుమ్-లహుమ్-జన్నాతున్-తజ్రీ-మిన్-తహ్తిహల్-అన్-హారు-ఖాలిదీన-ఫీహా-నుజులమ్-మిన్-ఇన్‌దిల్లాహి-వమా-ఇన్‌దల్లాహి-ఖైరుల్ లిల్-అబ్రార్.

196. పురములలో అవిశ్వాసుల సంచారమువలన నీవు మోసపోకుము. 197. ఇదికొద్ది భాగ్యఫలము. పిదప వారికి స్థిరనివాసము నరకమున్నది. అది చాల చెడ్డనివాసము. 198. కాని ఎవరు తనప్రభువునకు భయపడుచుండిరో వారికి కాలువలు ప్రవహించు స్వర్గవనములున్నవి. అందువారు దేవునినుండి ఆతిథ్యము పొందుచు అందు సదాయుందురు. మఱి దేవుని యొద్దనుండునవి పుణ్యవంతులకు చాల శ్రేష్ఠమైనవి.

వ్యా॥ 196:198. అవిశ్వాసులు పురములలో తిరుగుచు, వ్యాపారము చేయుచు ధనము సంపాదించుచు విఱ్ఱవీగుచున్నారు. వీరి భోగభాగ్యములు చూచిముసల్మానులు మోసపోఁగూడదు. ఇదికొద్దిసౌఖ్యము, కొన్నిదినములు మాత్రముండునది. పిదపసదా నరకబాధ అనుభవించుచుందురు. అందుండివారికి విముక్తి లేదు. కావున విశ్వసించి భయభక్తులుగలిగి యుండవలెను. దానిఫలితము శాశ్వత స్వర్గసౌఖ్యము, అందుపుణ్యాత్ములు దేవునికి అతిథులగుదురు.ఎట్లు అతిథిచింతలేకుండ ఆతిథ్యము పొందునో అటులే సత్కార్యములుచేసిన విశ్వాసులును,సౌఖ్యమును సదా అనుభవింతురు. దేవుని యొద్దనుండు పుణ్యఫలితమే శ్రేష్ఠమైనది. ఇహలోక భోగములు నశించునవి.

199. వఇన్న-మిన్-అహ్లిల్-కితాబి-లమన్-యూమిను-బిల్లాహి-వమా ఉన్ జిల-ఇలైకుమ్ వమా ఉన్‌జిల ఇలైహిమ్-ఖాషి-ఈన-లిల్లాహి - లాయష్‌తరూన బిఆయాతిల్లాహి-సమనన్-ఖలీలన్-ఉలాఇక-అజ్రుహుమ్-ఇన్‌ద-రబ్బిహిమ్-ఇన్నల్లాహ-సరీఉల్-హిసాబ్.

199. మఱియుగ్రంథము గలవారిలో కొందఱు దేవునిని, మీకొసంగఁబడిన గ్రంథమును, వారికి నొసంగబడిన గ్రంథమును విశ్వసించి దేవునికి భయపడువారును గలరు. వారు దేవునివాక్యములకు బదులుగాకొద్దివెల పుచ్చుకొనరు, అట్టివారికి వారిప్రభువువద్ద వారి ఫలితమున్నది. నిశ్చయముగా దేవుఁడు శీఘ్ర

ముగా లెక్క తీసికొనువాఁడు.

వ్యా॥199. ఇందు ప్రత్యేకముగా యూదులలోను క్రైస్తవులలోనుగల విశ్వాసులగు భక్తులనుగూర్చి చెప్పఁబడుచున్నది. ఆ భక్తులు దేవునిని హాజరీల్ పైగంబరులవారి మూలమున ముసల్మానులకు నొసంగఁబడిన ఖురానెషరీఫును తమకు నొసంగబడిన మతగ్రంథములగు తౌరాతు ఇన్జీలును విశ్వసించి దేవునికి నమ్రులై ఆతనియందు భయభక్తులు గలిగియున్నారు. వారు ఇతరులవలె లంచము పుచ్చుకొని దేవుని వాక్యములను దాఁచి తారుమారుచేయువారు కారు. ఇట్టివారికి దేవుఁడు వారి కర్మల ఫలిత మొసంగును. కర్మలతీర్పుకుఁగాను శీఘ్రములోనే తీర్పుదినము రానున్నది. అపుడు దేవుఁడు వెంటనే కర్మలగూర్చి తీర్పుచేయును. అందేలాటి ఆలస్యము జరుగదు.

200. యా-అయ్యుహ ల్లజీన-ఆమనుస్-బిరూ-వసాబిరూ-వరాబితూ-వత్తఖుల్లాహ-లఅల్లకుమ్-తుఫ్-లిహూన్.

200. ఓవిశ్వాసులారా! మీరు ఓర్పు గలిగియుండుఁడు. సాహసమువహింపుఁడు. సిద్ధముగనుండుఁడు. మీరు విజయము పొందుటకై దేవునికి భయపడుచుండుఁడు.

వ్యా॥ 200. ఇది సూరాకు అంత్య వాక్యము. ఇందు సూరాలోని ముఖ్యాంశములు ముసల్మానులు అనుసరించుటకై దేవుఁడు సెలవిచ్చుచున్నాఁడు. విశ్వాసులు అన్ని కష్టములలోను ఓర్పువహించి స్థిరవిశ్వాసముగలిగియుండవలెను. శత్రువులను మార్కొనునపుడు తెంపు వహించి స్థిరముగా ఱొమ్మిచ్చి నిలువవలెను. కాలమునకుఁ దగినట్లు శత్రువులను మార్కొని ఆత్మ, ధర్మ, దేశరక్షణార్థమై దేవుని ప్రీతికొఱకు యుద్ధసామగ్రులు తయారుచేసికొని ఏలాటి లోపములేకుండ సిద్ధముగా నుండవలెను. ఇవన్నియు పూర్తిగా సిద్ధపఱచుకొనిన పిదప దేవునిపై నాధారపడి ఆతనికి భయపడియుండవలెను. అపుడు ఉభయలోకములలోను విజయము చేకూరును. ఇప్పటి ముసల్మానులు తమ పూర్వపు ఐశ్వర్యములు తమకు లభింపవలెనన్న ఈఖురాను వాక్యమును ఆదర్శముగాఁ జేసికొని దాని ననుసరింపవలెను. అపుడు ఇహమునందు తాము గోలుపోయిన లోకరాజ్యమును పరమునందు మోక్షమును లభించును. దేవుఁడు ముసల్మానులందఱకును తన దివ్యమైన ఖురాను గ్రంథము ననుసరించునట్లు బుద్ధి నొసంగుగాత (ఆమీన్ సుమ్మ ఆమీన్).

—♦ సూరయేనిసా (స్త్రీలు) మదనీ 177 వాక్యములు. ♦—

ఇది ఒక గొప్ప సూరా. ఇందు స్త్రీలనుగూర్చిన ధర్మములు పెక్కుగలవు. అందుచే దీనికి సూరయేనిసా (స్త్రీలసూరా) అని పేరుగలిగెను.

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్.
అమిత దయగలవాఁడును ప్రేమించువాఁడునగు దేవుని పేరు.

1. యాఅయ్యుహన్నాసుత్తఖూ-రబ్బకుముల్లజీ-ఖలఖకుమ్-మిన్-నఫ్సిన్-వాహిదతిన్-వఖలఖ-మిన్-హాజౌజహా-వబస్స-మిన్-హుమా-రిజాలన్-కసీరన్-వనిసాఅన్-వత్తఖుల్లాహల్లజీ-తసాఅలూన-బిహీ-వల్-అర్హామ-ఇన్నల్లాహ-కాన-అలైకుమ్-రఖీబా.

1. ఓ జనులారా! మిమ్ము ఒకయాత్మనుండిపుట్టించి దానినుండి దాని జతనుపుట్టించి, ఆయిద్దఱివలన అనేకపురుషులను స్త్రీలను వ్యాపింపఁజేసిన మీ ప్రభువునకు భయపడుఁడు. మఱియు మీరు ఎవనిపేరుతో ఒకరినొకరు అడుగుకొందురో ఆ దేవునికి భయపడుఁడు, మఱి బంధువిషయముగూర్చి జాగ్రత్తగానుండుఁడు నిశ్చయముగా దేవుఁడు మిమ్ము కనిపెట్టియున్నాఁడు.

వ్యా॥ 1. దేవుఁడు ముందు ఆదమునుపుట్టించెను. ఆయననుండియే ఆయనకు జతగా హవ్వానుపుట్టించెను. ఈయిద్దఱి భార్యాభర్తలవలన అనేకులు పురుషులను స్త్రీలనుపుట్టించి లోకములో వ్యాపింపఁజేసెను, దేవుఁడు సృష్టికర్తయును పోషకుఁడును, కావున ఆతఁడే పూజలకర్హుఁడు. ఆతనికి విధేయులై జనులు యుండవలెను. ఆతఁడు తన ప్రవక్తలమూలమున పంపినధర్మములను అనుసరింపవలెను. మానవుఁడు తన ప్రతివిషయములో దేవునిపై నాధారపడియున్నాఁడు. తనకు నేదైన సహాయము నితరులతో కావలసినచో దేవునిపేరుతో నడుగును. తమ కార్యములలో నమ్మకమునకుగాను దేవుని నామముతో ప్రమాణముచేయును. కావున మానవుఁడు అట్టిదేవునికి భయపడి ఆతనికి విధేయుఁడై యుండవలెను. జనులందఱును ఒకతండ్రితోఁ బుట్టినవారు. వారికి పరస్పర ఐకమత్యముండవలెను. వారు ఒకరికొకరు తోడుపడి సోదరభావము వహింపవలెను. ప్రత్యేకముగా బంధువులతో సమీపసంబంధముండును. కావున వారివిషయము చాల జాగ్రత్తగానుండి వారి హక్కులనొసంగుచు వారియందు ప్రేమగలిగియుండవలెను. బంధుత్వమును తెంపరాదు. అట్లు చేయువారు దేవుని కోపమునకు పాత్రులగుదురు. దేవుఁడు అందఱికర్మలను కనిపెట్టియున్నాఁడు, కావున సర్వము అతనికిఁదెలియును. ఎవరికర్మలకుఁ దగినఫలితము వారికి నొసంగును. దేవునికి భయపడి బంధువులకు అన్యాయముచేయక వారికి మేలు చేయుచుండవలెను.

2. వ-ఆతుల్-యతామా-అమ్వాలహుమ్-వలా-తత-బద్దలుల్-ఖబీసబిత్-

తయ్యిబి-వలా-తాకులూ-అమ్వాలహుమ్-ఇలా-అమ్-వాలికుమ్-ఇన్నహూ-కాన-హూబన్-కబీరా. 3, వఇన్-ఖిఫ్తుమ్-అల్లాతుఖ్సితూ-ఫిల్-యతామా-ఫన్కిహూ-మాతా-బ-లకుమ్-మినన్-నిసాఇ-మస్నా-వసులాస-వరుబా-అ-ఫఇన్-ఖిఫ్తుమ్-అల్లా-తఅ-దిలూ-ఫవాహిదతన్-ఔ-మా-మలకత్-ఐ-మానుకుమ్-జాలిక-అద్నా-అల్లా-తఊలూ.4.వఆతున్-నిసాఅ-సదుఖాతిహిన్న-నిహ్లతన్-ఫఇన్-తిబ్న-లకుమ్-అన్-షైఇన్-మిన్హు-నఫ్సన్-ఫకులూహు-హనీఅమ్-మరీఅ.

2. తండ్రిలేని బిడ్డలధనము వారికిచ్చివేయుఁడు. మంచిదితీసికొని చెడ్డదియియ్యకుఁడు. వారిసొత్తును మీసొత్తుతోఁగలుపుకొని తినివేయకుఁడు. నిశ్చయముగా అది ఘోరపాతకము. 3. మఱి తండ్రిలేని ఆడుబిడ్డలవిషయమున మీరు న్యాయముచేయలేరని భయపడినచో ఇష్టపడిన ఇతరస్త్రీలను ఇద్దఱినుగాని ముగ్గురనుగాని నలుగురనుగాని వివాహమాడుఁడు. మఱియు మీరు వారిమధ్య న్యాయముగా వర్తింపలేము అని భయపడినచో ఒక్కతెనే వివాహమాడుఁడు. లేక మీకు సొత్తుగానుండు మీ బానిసస్త్రీలను పెండ్లాడుఁడు ఇట్లు చేయుటలో మీరు అన్యాయముగా వర్తింపరను ఆశయము గలదు. మఱియు మీరు స్త్రీలకు వారి మహరు సంతసముతో నిచ్చివేయుఁడు. పిదప స్త్రీలు తమ యిష్టముతోనే తమ మహరులోనుండి కొంతభాగము మీకు వదలిపెట్టినచో దానిని సంతోషముతో అనుభవింపుఁడు.

వ్యా॥ 2. బంధువులలో తండ్రిలేని బిడ్డల విషయము చాల జాగ్రత్త వహింపవలెను. తండ్రిలేని బిడ్డలు యుక్తవయస్సుగలిగి నపుడు వారిధనమును వారియాస్తిని వారిరక్షణకర్త ఒప్పగించవలెను. అందేలాటి ద్రోహము చేయరాదు. వారిమంచివస్తువు తీసికొని దానికిబదులుగా చెడువస్తువునియ్యరాదు. రక్షణకర్త తనయింటి ఖర్చులతోఁగూడ ఆబిడ్డలఖర్చులు కలుపుకొని పోషింపవచ్చును అని సెలవుగలదు. దానికిసాకుపెట్టుకొని ఆబిడ్డల సొత్తును ఎక్కువ ఖర్చుచేసి తనసొత్తునుమిగిలించుకొనరాదు. అట్లు చేయుట మహాపాపము. తండ్రిలేని బిడ్డలసొత్తును హరింపరాదు. బంధువులుగానుండియు అట్లుచేయుటమహాపాపముగదా! 3. తండ్రిలేని ఆడుబిడ్డలు ధనము సౌందర్యము గలిగియున్నప్పుడు సౌందర్యములేకున్నను ధనముసందలి ఆశతో సంరక్షణకర్తలు ఆబిడ్డలనుఇతరులకిచ్చి వివాహముచేయక ధనము నితరులకుఁ జేరునని తామే యిష్టము లేకున్నను వారిని పెండ్లాడి వారివిషయమున న్యాయముచేయలేక పోవుచుండిరి. అట్లు వలదు. మీరున్యాయముగా వర్తింపలేనప్పుడు వారినివదలి ఇతరస్త్రీలను ఒకే

తూరి నలుగురు వఱకు మీరిష్టపడిన వారిని పెండ్లాడవచ్చును. భార్యలొకతె కన్న యెక్కువగానున్నపుడు వారిమధ్యవస్త్రము భోజనము రాత్రిపడక మొదలగు విషయములలో ధర్మప్రకారముగా హెచ్చుతగ్గులు లేకుండ వర్తింపవలెను. వారిహక్కులను న్యాయముగా పూర్తిచేయలేనపుడు ఒక్కభార్యతో తృప్తిచెంది యుండవలెను. లేక బానిసస్త్రీలను వివాహమాడవచ్చును. ఒకభార్యలేక బానిసస్త్రీలను వివాహమాడుటవలన అన్యాయము జరుగదు. అను ఆశయముగలదు. కావునశక్తిగలిగి న్యాయముగావర్తింపగలమని ధైర్యముగలవారు ఒకతెకన్న ఎక్కువమంది స్త్రీలను వివాహమాడవచ్చును. నలుగురుభార్యలకన్న ఎక్కువమందిని వివాహమాడకూడదు. 4.పురుషుఁడు వివాహమాడునపుడు స్త్రీకిచ్చుధనము మహారు అనబడును. భర్తలు తమభార్యలకు మహారులను ఏలాటి జగడములేకుండ సంతోషముతో నిచ్చివేయవలెను. భార్యలు ఏలాటి బలవంతములేక తమంతట తామే సంతోషముతో మహారులోని కొంతభాగము వదలిపెట్టిన లేక తాముపుచ్చుకొన్నపిదప కొంతభర్తలకు వాపసు చేసిన ఆభాగము భర్తలు అనుభవింపవచ్చును. అందువలాటి దోషములేదు.

5. వలా-తూతుస్-సుఫహాఅ-అమ్వాల-కుముల్-లతీ-జఅ-లల్లాహు-లకుమ్-ఖియామన్-వర్-జుఖూహుమ్-ఫీహా-వక్సూహుమ్-వఖూలూ-లహుమ్-ఖౌలమ్-మఅ-రూఫా.

5.మఱియు దేవుఁడుమీకు జీవనాధారముగాఁ జేసిన మీధనమును అవివేకులకునిచ్చి వేయకుఁడు. మఱియు వారికి దానినుండి ఆహారమును వస్త్రములిచ్చుచుండుఁడు. వారికిఁదగినమాటలతో తృప్తిపఱపుఁడు.

వ్యా॥ 5. ధనమును కాపాఁడజాలక దానిని వృథాఖర్చుపెట్టు అవివేకులకు ఇయ్యగూడదు. ధనమునుదేవుఁడు జీవనాధారముగాఁ జేసియున్నాడు. అట్టిదానిని పాడుచేసి నిఱుపేదలై భిక్షమెత్తుట వివేకమైన పనిగాదు. ధనము ఎవరిస్వాధీనములో నుండునో వారుదానినుండి వారికి అన్నవస్త్రము లిచ్చుచుండవలెను. వారికిఁదగిన బుద్ధులుచెప్పుచుండవలెను. ఈ అవివేకులలో బుద్ధిలేని కుమారులున్ను, భార్యలును చేరుదురు. వారిచేతికి ధనమియ్యరాదు. వారి ఖర్చులను జరుపుచుండవలెను.

6. వబ్తలుల్-యతామా-హత్తా-ఇజా-బలగున్-నికాహ-ఫయిన్-ఆనస్తుమ్-మిన్హుమ్-రుష్-దన్-ఫద్ఫఊ-ఇలైహిమ్-అమ్వాలహుమ్ - వలాతాకులూహా-ఇస్రాఫన్-వబిదారన్-అన్యక్బరూ-వమన్కాన-గనియ్యన్-ఫల్-యస్

తఅ-ఫీహ్-వమన్-కాన-ఫఖీరన్-ఫల్-యాకుల్-బిల్-మఅ-రూఫి-ఫఇజా-దఫఅ తుమ్-ఇలైహిమ్-అమ్-వాలహుమ్-ఫఅష్-హిదూ అలైహిమ్-వకఫా-బిల్లాహి-హసీబా.

6. తండ్రిలేని బిడ్డలను వివాహమునకు యుక్తవయస్సు వచ్చునంతవఱకు పరీక్షింపుఁడు. పిదప మీరువారియందు యోగ్యతచూచినచో వారిధనమును వారికప్పగించుఁడు. వారు పెద్దవారగుదురను తలంపుతో (భీతితో) వారిసొత్తును వృథాగాను,తొందఱగాను,తిని వేయకుఁడు. మఱియుధనవంతుఁడగు సంరక్షకుడు తండ్రిలేని బిడ్డలసొత్తును ముట్టగూడదు. మఱియు బీదవాఁడుగా నున్న సంరక్షకుఁడు ధర్మప్రకారముగా తినవలెను. పిదపవారిసొత్తును వారికప్పగించునపుడు దానికిసాక్షులనుంచుకొనుఁడు. మఱియుదేవుఁడులెక్క తీసికొనుటకుచాలును.

వ్యా॥ 6. తండ్రిలేని బిడ్డలకు సంరక్షకులుగానున్నవారు అవలంబింపవలసిన ధర్మము లిందు చెప్పఁబడినవి. ఆ బిడ్డలను లోకవ్యవహారములందు సరిగ శిక్షణచేయుచు వారు వివాహమునకుఁ దగిన యుక్తవయస్సుపొందునంతవఱకు వారిని పరీక్షించుచుండవలెను. వారు యుక్తవయస్సు పొందిన పిదప వారికి లోకవ్యవహారమునందు యోగ్యత బుద్ధి సరిగా నున్నచో వారి ఆస్తిసొత్తులను వారికి అప్పగింపవలెను. అపుడు సాక్షుల నుంచుకొనవలెను. అట్లు చేయుటలో జగడములకు వీలుండదు. దేవుఁడు సర్వము దెలిసినవాఁడు. ప్రతి మనుజునికర్మల లెక్క తీసికొనును. కావున తండ్రిలేని బిడ్డలసొత్తు విషయమున న్యాయముగ నడచుకొనవలెను. సంరక్షకుఁడు ధనవంతుఁడైనచో తాను చేయు సేవకుఁగాను వారి సొత్తునుండి జీతముపుచ్చుకొనఁగూడదు. సంరక్షకుఁడు బీదవాఁడైనచో తాను వారికి చేయు సేవకు బదులు ధర్మముగా జీతముపుచ్చుకొనవచ్చును. మఱియు తండ్రిలేని బిడ్డల సొత్తును వృథాగాగాని తొందఱగాగాని వారు పెద్దవారై తమ సొత్తును తీసికొనుదురను ఉద్దేశముతో తిని వేయఁగూడదు. వారి యాస్తిని భద్రముగా కాపాడి వారికి అప్పగించవలెను. ఎవరైన బిడ్డలు వదలి చనిపోయినచో ముసల్మానులు వారి ఆస్తిని కాపాడుటకు నమ్మకముగల వారిని సంరక్షకులుగా నియమించి దానికి సాక్షులుగానుండి బిడ్డలు పెద్దవారైన పిదప వారి యాస్తిని పెద్దమనుష్యులయెదుట అప్పగించుట ధర్మము.

7. లిర్ రిజాలి-నసీబున్-మిమ్మా-తరకల్-వాలిదాని-వల్-అఖ్-రబూన-మిమ్మా-ఖల్ల-మిన్‌హు-ఔ-కసుర-నసీబమ్-మఫ్‌రూజా. 8. వఇజా-హాజరల్-ఖిస్మత-ఉలుల్-ఖుర్బా-వల్-యతామా-వల్-మసాకీను-ఫర్-జుఖూహుమ్- మిన్-

హుమ్-వఖూలూ-లహుమ్-ఖౌలమ్-మఅ్-రూఫా. 9. వల్-యఖ్-షల్లజీన-లౌ
తరకూ-మిన్-ఖల్-ఫిహిమ్-జుర్రియతన్-జిఆ-ఫన్-ఖాఫూ-అలైహిమ్ - ఫల్-
యత్తఖుల్లాహ-వల్-యఖూలూ-ఖౌలన్-సదీదా. 10. ఇన్నల్లజీన - యాకు
లూన-అమ్వాలల్-యతామా-జుల్మన్-ఇన్నమా యాకులూన-ఫీ-బుతూనిహిమ్
నారన్-వసయస్-లౌన-సఈరా.

7. తల్లిదండ్రులును, బంధువులును వదలిన ఆస్తిలో పురుషులకును భాగము గలదు. మఱియు తల్లిదండ్రులును, బంధువులును వదలిన ఆస్తి కొంచెమైనను, ఎక్కువైనను అందు స్త్రీలకును భాగమున్నది. భాగమిట్లు విధింపఁబడియున్నది. (భాగము విదితముగా నియమింపఁబడియున్నది.) మఱియు ఆస్తిని పంచునపుడు బంధువులును, తండ్రిలేని బిడ్డలును బీదవారునువచ్చినచో అందు వారికి కొంత నొసంగుఁడు. మఱి వారితో మంచి మాటలు పలుకుఁడు. 9. మఱియు ఎవరు తమ వెనుక చిన్నచిన్న బిడ్డలను తాము విడిచిపోయి, వారి విషయము భీతిచెందుదురో వారు భయపడవలెను. మఱియు వారు దేవునికి భయపడి ధర్మమైన మాటలు పలుకవలెను. 10. ఎవరు తండ్రిలేని బిడ్డల సొత్తును అన్యాయముగా తినుచున్నారో వారు తమ పొట్టలలో అగ్నిని నింపుకొనుచున్నారు. మఱియు వారు శీఘ్రముగానే నరకాగ్నిలో ప్రవేశింతురు.

వ్యా॥ 7. హజ్రత్ పైగంబరులవారికి పూర్వము తల్లిదండ్రులు బంధువులు వదలిన ఆస్తిలో కుమారులకు అందు పెద్దవానికి మాత్రమే భాగముండెను. అందు కుమార్తెలకును చిన్న బిడ్డలకును భాగము లేకుండెను. అది చాలఅన్యాయము గదా! అందు దేవుఁడు దానినిగూర్చి ఈ వాక్యములలోను ఇఁక రాఁబోవు వాక్యములలోను పురుషులకును, స్త్రీలకును, కుమారులకును, కుమార్తెలకును, చిన్నవారికిని, పెద్దవారికిని ఆస్తి కొద్దిగానున్నను అధికముగానున్నను వారి వారికి దేవుఁడు భాగములు నియమించియున్నాఁడు. ఆ భాగములప్రకారము ఆస్తి పంచుకొనవలెను. అందేలాటి అన్యాయము జరుగకూడదు. 8. ఆస్తి పంచుకొను సమయములో ఆస్తిలో హక్కులేని బంధువులు అనాథ శిశువులును, నిఱుపేదలును వచ్చినపుడు ఆస్తిలోనుండి కొంత వారికి నియ్యవలెను. అట్లు ఇయ్యలేకపోయినను వారి మనస్సులకు నొప్పిగలుగకుండమంచిమాటలు పలుకవలెను. దుర్భాషలాడకూడదు. 9. తండ్రిలేని బిడ్డలకు సంరక్షకులుగానున్నవారును, ఇతరులును ఆ బిడ్డల విషయములో, న్యాయముగా వర్తింపవలెను. వారు తాము చనిపోయి తమ వెనుక తమ బలహీనులగు చిన్న చిన్న

బిడ్డలను వదలినచో వారికి ఇదే గతి పట్టును అని భయపడి తమ బిడ్డల మేలు కోరునట్లు ఆ తండ్రిలేని బిడ్డల విషయము వారు సూహించి దేవునికి భయపడి వారి విషయమున మంచిమాటలు పలికి వారికి నొప్పి కాకుండ తోడుపడి యుపకారము చేయవలెను. 10. తండ్రిలేని బిడ్డల ధనమును అన్యాయముగా తినరాదు. అది మహాపాపము. దాని ఫలితము నరకాగ్నికి ప్రవేశము. వారు పొట్టలలో నింపునది అన్నముగాదు. అగ్ని ! అది నరకాగ్ని !!

11. యూసీ-కుముల్లాహు-ఫీ-ఔలాదికుమ్-లిజ్జకరి-మిస్‌లు- హజ్జిల్-ఉన్‌సయైని-ఫఇన్-కున్న నిసాఅన్-ఫౌఖస్నతైని-ఫలహున్న-సులుసా- మాతరక-వఇన్-కానత్. వాహిదతన్-ఫలహన్-నిస్ఫు-వలి-అబవైహి-లి-కుల్లి-వాహిదిమ్-మిన్‌హు-మస్సుదుసు మిమ్మాతరక-ఇన్‌కాన-లహూ-వలదున్-ఫ-ఇల్ల్‌మ్ యకుల్-లహూ-వలదున్-వవరిసహూ-అబవాహు-ఫలి-ఉమ్మిహిస్-సులుసు - ఫఇన్‌కాన లహూ-ఇఖ్‌వతున్-ఫలిఉమ్మిహిస్-సుదుసు-మింబఅ-ది-వసియ్యతిన్-యూసీ-బిహా-ఔదైనిన్-ఆబాఉకుమ్-వఅబ్‌నాఉకుమ్- లాతద్‌రూన - అయ్యుహుమ్-అఖ్‌రబు-లకుమ్-నఫ్‌అన్-ఫరీజతమ్-మినల్లాహి-ఇన్నల్లాహ-కాన- అలీమన్-హకీమా.

11. దేవుఁడు మీ బిడ్డల విషయము మగబిడ్డకు ఆఁడుబిడ్డకు లభించు భాగమువంటి రెండు భాగము లియ్యవలెనని మీకు ఆజ్ఞాపించుచున్నాఁడు. చనిపోయినవారికి ఆఁడుబిడ్డలే యుండి(ఇద్దఱికంటె నెక్కువమందియున్నచో) వారికి ఆస్తిలో మూఁడింట రెండుభాగములున్నవి. మఱియు ఒక్కతెయున్నచో ఆమెకు సగముగలదు. చనిపోయినవానికి బిడ్డలున్నచో ఆతని తల్లిదండ్రులకు ఒక్కొక్కవానికి ఆఱింట ఒక్కొక్కభాగము గలదు. మఱియు చనిపోయినవానికి బిడ్డలులేనిచో వాని తలిదండ్రులు వారసులగుదురు. అందు ఆతని తల్లికి మూఁడింట ఒక భాగముగలదు. పిదప చనిపోయినవానికి అన్నదమ్ములున్నచో ఆతనితల్లికి ఆఱింట ఒక భాగముగలదు. ఈ ఆస్తిని పంచుట, చనిపోయినవాని వసియ్యత్తు (మరణశాసనము)ను అప్పును తీర్చిన పిదప మిగిలినదానిలో నున్నది. మీతండ్రులలోను మీకుమారులలోను ఎవరు మీకు ఎక్కువలాభకారులో మీకుఁదెలియదు. ఇది దేవుఁడు విధించినయాజ్ఞ. నిశ్చయముగా దేవుఁడు సర్వజ్ఞుఁడును వివేచనాపరుఁడును.

వ్యా॥ 11. ఇఁక చనిపోయినవాని ఆస్తిభాగములువివరింపఁబడుచున్నవి. చనిపోయినవాని ఆస్తిలో ముందు వాని సమాధి ఖర్చులుదీసి అప్పునుదీర్చి

మిగిలిన ఆస్తిలో చనిపోయినవాఁడు వసియ్యత్ (మరణ శాసనము) చేసిన యెడల అది మూఁడింట నొక భాగములోగానే తీర్చివేసి మిగిలిన ఆస్తిని వారసులు పంచుకొనవలెను. కుమార్తెకు ఒక భాగము. కుమారునికి అంతటి రెండు భాగములు. ఉ॥ ఒక రూపాయ కూఁతురు భాగమునకువచ్చిన కుమారునికి రెండు రూపాయలు వచ్చును. కుమారులు కుమార్తెలున్నప్పుడు పంచుకొనవలెను. చనిపోయినవారికి కుమారులు లేకుండ కుమార్తెలేయున్నచో, ఒక్కతె యున్నచో సగము దొరకును, ఇద్దఱు కుమార్తెలు లేక వారికంటె నెక్కువమంది కుమార్తెలుండిన వారందఱకు మూఁడింట రెండు భాగములు వచ్చును. చనిపోయినవానికి సంతానముండి తల్లిదండ్రులున్నచో తండ్రికిఆఱింట ఒకభాగమును తల్లికి ఆఱింట ఒకభాగము వచ్చును. చనిపోయినవానికి సంతానము లేకుండ తల్లిదండ్రులున్నచో తల్లికి మూఁడింట ఒక భాగమును, తండ్రికి మిగిలిన మూఁడింట రెండు భాగములు వచ్చును. చనిపోయినవానికి సంతానము లేక అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు ఒక్కనికన్న ఎక్కువమందియున్నచో అపుడు తల్లికి ఆఱింట ఒకభాగము వచ్చును. మిగిలినది వానితండ్రికివచ్చును. అపుడు వానిఅన్నదమ్ములకు భాగములేదు. చనిపోయినవానికిఒక్కఁడుతమ్ముఁడు లేక అన్న లేక ఒకతె చెల్లియయున్నచో వాని తల్లికి మూఁడింట ఒక భాగము వచ్చును. మిగిలినది తండ్రికి వచ్చును. ఈ వాక్యములో బిడ్డల భాగములును తల్లిదండ్రుల భాగములును వివరింపఁబడినవి. అందు కుమారుల భాగములకును తండ్రుల భాగములకు భేదముగలదు. దాని విషయము ఎవరివలన మీకు ఎక్కువలాభము గలుగునోమీకుఁ దెలియదు. ఈభాగములు దేవుఁడునియమించినది. దాని రహస్యములు యుక్తాయుక్తములు దేవునికిఁ దెలియును. కావున మీరు దేవుని యాజ్ఞప్రకారము భాగము పరిష్కారము చేసికొనుఁడు. అందేలాటి హెచ్చుతగ్గు చేయకుఁడు.

12. వలకుమ్-నిస్ఫు-మాతరక-అజ్వాజుకుమ్-ఇల్-లమ్-యకుల్-లహున్న-వలదున్-ఫఇన-కాన-లహున్న-వలదున్-ఫలకుముర్-రుబుఉ-మిమ్మాతరక్న-మిన్-బఅ-ది-వసియ్యతిన్-యూసీన-బిహా-ఔ-దైనిన్-వలహున్నర్-రుబుఉ-మిమ్మా-తరక్తుమ్ ఇల్-లమ్యకుల్-లకుమ్-వలదున్-ఫఇన్-కానలకుమ్-వలదున్-ఫలహున్నస్-సుమును-మిమ్మాతరక్తుమ్-మిమ్ బఅ-దివసియ్యతిన్-తూసూన-బిహా-ఔ-దైనిన్-వఇన్-కాన-రజులున్-యూరసు-కలాలతన్-అవిమ్-రఅతున్-వలహూఅఖున్-ఔ-ఉఖ్తున్-ఫ-లి-కుల్లి-వాహిదిమ్-మిన్-హుమస్-సుదుసు-ఫఇన్-కానూ-అక్సర-మిన్ జాలిక-ఫహుమ్-షురకాఉ-ఫిస్-సులుసి-మిమ్

బఅ్-ది వసియ్యతిన్-యూసా-బిహా-ఔ-దైనిన్ గైర-ముజార్రిన్- వసియ్యతమ్-మినల్లాహి-వల్లాహు-అలీమున్-హలీమ్. 13. తిల్క-హుదూదుల్లాహి- వమఁ-యుతి ఇల్లాహ వరసూలహూ-యుద్ ఖిల్-హు-జన్నాతిఁ-తజ్రీ-మిన్ - తహ్‌-తిహల్-అఁహారు-ఖాలిదీన-ఫీహా-వజాలికల్-ఫౌజుల్-అజీమ్.14. వమఁ-యుఅ-సిల్లాహ-వ-రసూలహూ-వయత-అద్ద-హుదూదహూ-యుద్ ఖిల్హు నారఁ-ఖాలిదఁ-ఫీహా-వలహూ-అజాబుమ్-ముహీఁ.

12. మీభార్యలకు బిడ్డలులేనిచో వారువదలిపెట్టిన ఆస్తిలో మీకుసగము వచ్చును. మఱియువారికి బిడ్డలున్నచో వారువదలిపెట్టిన ఆస్తిలో మీకు నాల్గవభాగముగలదు. ఇది వారు గావించిపోయిన వసియ్యతును, వారి అప్పును తీర్చినపిదప పంచవలసినది. మీరు వదలిపెట్టిన ఆస్తిలో మీకు బిడ్డలులేనిచో మీభార్యలకు నాల్గవభాగముగలదు. మఱియు మీకు సంతానమున్నచో మీ స్త్రీలకు మీరువదలిపెట్టిన ఆస్తిలో ఎనిమిదవభాగము గలదు. ఇదిమీరుచేసిన వసియ్యతును మీయప్పును తీర్చినపిదప పంచవలసినది. మఱియు తండ్రి,బిడ్డలులేని పురుషుఁడుగాని స్త్రీగాని చనిపోయి వారికి ఒకఁడు సోదరుఁడు లేక ఒక చెల్లెలుండినచో వారిలో ఒక్కొక్కనికి ఆఱింట ఒకభాగముగలదు. వారు ఒకనికన్న యెక్కుడు మందియున్నచో వారందఱును మూఁడవభాగములో సరిగాపంచుకొనవలెను. (వారసులకు) నష్టముకలిగింపకచేసిన మరణశాసనము (వసీయతు)ను అప్పును తీర్చినపిదప ఆస్తిని పంచవలసినది. ఇదిదేవునాజ్ఞ. మఱియు దేవుఁడు సర్వజ్ఞుఁడును (క్షమ) సహనము గలవాఁడును. 13. ఇవిదేవుఁడు నియమించినహద్దులు (ధర్మములు). మఱియు దేవుఁడు ఎవరు దేవునికిని ఆతని ప్రవక్తకును విధేయులై యుందురో వారికిదేవుఁడు కాలువలుప్రవహించు స్వర్గవనములలో నివాసమొసంగును. అందువారు సదాయుందురు. ఇదియేగొప్ప జయము. 14, మఱియునెవరు దేవుని నియమములను అతిక్రమింతురో వారిని దేవుఁడు నరకములో పడవేయును. వారందు సదాయుందురు. మఱియు వారికి అవమానకరమగు నరకబాధకలదు.

వ్యా॥ 12. భార్యచనిపోయిన ఆమెకుబిడ్డలులేనిచో భర్తకు ఆమెఆస్తిలో సగముగలదు. ఆమెకు సంతానమున్నచో భర్తకునాల్గవభాగములభించును. భర్తచనిపోయి ఆయనకు సంతానము లేనిచో ఆతనిభార్యకు నాల్గవభాగము గలదు. ఒకతెకన్నఎక్కువమంది భార్యలున్నచో వారందఱునుఆనాల్గవభాగములో సరిసమానముగ పంచుకొనవలెను. భర్తచనిపోయి యాతనికి సంతానమున్నచో భార్యలకుఎనిమిదవభాగము ఆతనిఆస్తిలోఁగలదు. భార్యలమువారు

అప్పువంటిది. అది భర్తఆస్తిలోనుండి ముందు తీర్చి మిగిలిన యాస్తిలో భాగములుపంచవలెను. చనిపోయినవానికి తండ్రిగానిబిడ్డలుగానిలేనిచో వానిని "కలాలా" అందురు. పురుషుఁడుగానిస్త్రీగాని చనిపోయి వారికి తండ్రియును బిడ్డలును లేనప్పుడు సహోదరుఁడును సహోదరియు నున్నచో వారికి భాగమువచ్చును. అన్నదమ్ములును, అక్కచెల్లెండ్రును మూఁడువిధములుగానున్నారు. "హాఖీఖీ" అనగా ఒక్కతల్లితండ్రికి పుట్టినవారు. "అల్లాతీ" సవతితల్లి బిడ్డలు. అందు తండ్రి ఒక్కఁడును తల్లి వేఱు. అఖ్యాఫీ తల్లిఒకతె తండ్రి వేఱు. ఉదా:- ఒకస్త్రీపెండ్లాడి మొదటిభర్తలో బిడ్డలుకనెను. మొదటిభర్త చనిపోయి లేక తల్లాఖు పొంది రెండవవానిని వివాహమాడినచో రెండవభర్తవలన కలిగిన బిడ్డలును మొదటిభర్త బిడ్డలును సోదరులగుదురు. ఈవాక్యములోమూఁడవరకములోచేరిన అఖ్యాఫీ అన్నదమ్ముల అక్కచెల్లెండ్ర భాగమును గూర్చి చెప్పఁబడినది. చనిపోయినవానికి తండ్రియుబిడ్డలును లేనపుడు అఖ్యాఫీ సోదరుఁడు ఒక్కఁడు లేక సహోదరి ఒకతె యున్నచో ఆఱవభాగమువచ్చును. పెక్కుమంది యున్నచో వారికి మూఁడవభాగము లభించును. అందుసహోదరుఁడు సహోదరి సమానముగా పంచుకొనవలెను. మిగిలిన రెండు రకముల అన్నదమ్ములకు (చనిపోయినవానికి తండ్రియును బిడ్డలును లేనిచో) పూర్తి ఆస్తి లభించును. అందు మొదటి రకము (హాఖీఖీ) వారికి ఆస్తి చెందును. వారు లేనప్పుడు రెండవ రకము అల్లాతీవారికి ఆస్తి చెందును. వసియ్యతు పూర్తిచేయుటలో వారసులకు నష్టముగలుగకూడదు. అనఁగా ఆస్తిలో మూఁడింటనొకభాగముకంటె నెక్కువ వసియ్యతు చేయరాదు. 13. ఆస్తిభాగముల విషయము దేవుఁడు ఆజ్ఞ విధించియున్నాఁడు. కావున యేలాటి అన్యాయములేక ఆస్తి పంచుకొనవలెను. దేవుఁడు సర్వజ్ఞుఁడు. ఎవరెట్లు చేయుదురో అది దేవునికిఁ దెలియును. దేవుఁడు క్షమగలవాఁడు. అవిధేయులకు శిక్షవిధించుటలో ఆలస్యము చేయును. కావున వారు మోసపోకూడదు.

14. ఈధర్మములన్నియు దేవుఁడు నియమించినది. వీని నతిక్రమింపఁగూడదు. అతిక్రమించి అవిధేయులైనవారికి నరకశిక్షయున్నది. దేవుని యాజ్ఞలను అనుసరించుభక్తులకు స్వర్గనివాసము లభించును. నరకముతప్పి స్వర్గములభించుటయే గొప్పజయమును మోక్షమును దేవునిప్రవక్తకు అవిధేయులగువారికిఁగూడ అదే శిక్షగలదు. ఆతనికి విధేయులగువారికి మోక్షముగలదు.

హెచ్చరిక: ఆస్తి హక్కులగూర్చి వివరములు ప్రత్యేకముగా మతవిద్వాంసులు పుస్తకములు వ్రాసియున్నారు. ఆవివరములిచ్చట వివరించుటకు వీలులేదు. కావున ఇష్టపడువారు ఆ వివరగ్రంథములనుచూచుకొనునది.

15. వల్లాతీ-యాతీనల్-ఫాహిషత-మిన్-నిసాఇకుమ్-ఫస్ - తష్హిదూ-

అల్లైహిన్న-అర్-బఅతమ్-మిన్-కుమ్-ఫఇన్-షహిదూ-ఫ-అమ్సికూహున్న-ఫిల్ బుయూతి-హత్తా-యతవఫ్ఫా హున్నల్-మౌతు-ఔ-యజ్-అలల్లాహు-లహున్న-సబీలా. 16. వల్లజాని-యాతియానిహా-మిన్కుమ్-ఫఆజూహుమా - ఫఇన్ తాబా-వ-అస్లహా-ఫఅఅ్రిజూ-అన్హుమా-ఇన్నల్లాహ-కాన-తవ్వాబర్-రహీమా. 17. ఇన్నమత్-తౌబతు-అలల్లాహి-లిల్లజీ-యఅమలూనస్-సూఅ-బిజహాలతిన్-సుమ్మయతూబూన-మిన్-ఖరీబిన్-ఫఉలాఇక-యతూబుల్లాహు-అలైహిమ్-వకానల్లాహు-అలీమన్,హకీమా. 18. వలైసతిత్-తౌబతు-లిల్లజీన-యఅమలూనస్-సయ్యిఆతి-హత్తా-ఇజా-హజర-అహదహుముల్మౌతు ఖాల-ఇన్నీ-తుబ్-తుల్-ఆన-వలల్లజీన-యమూతూన-వహుమ్-కుఫ్ఫారున్ ఉలాఇక అఅ్తద్నా-లహుమ్-అజాబన్-అలీమా.

15. మఱియు మీ స్త్రీలలో నెవ్వరైన రోఁతపని చేసినచో దానికి మీలోని నలుగురు సాక్షులను తీసికొనిరండు. ఆ పిదప వారు సాక్ష్యమిచ్చినచో అట్టి స్త్రీలకు చావు వచ్చునంతవఱకును లేక దేవుఁడు వారికొఱకు ఏదైన మార్గము నియమించునంతవఱకును ఇండ్లలో వారిని కట్టిపెట్టుఁడు. 16. మఱియు మీలో నిద్దఱు రోఁతపని చేసినచో వారిని శిక్షింపుఁడు. ఆ పిదప వారిద్దఱు క్షమాపణ కోరి తమ నడవడికను సవరించుకొన్నచో వారిని వదలిపెట్టుఁడు. నిశ్చయముగా దేవుఁడు క్షమాపణ అంగీకరించువాఁడును దయాళుఁడును. 17. ఎవరు అజ్ఞానముచే పాపకార్యముచేసి శీఘ్రముగా క్షమాపణకోరుచున్నారో వారి క్షమాపణ దేవుఁడు తప్పక అంగీకరించును. మఱి దేవుఁడు అట్టివారిని క్షమించును. మఱి దేవుడు సర్వజ్ఞుఁడును వివేచనాపరుఁడును. 18. పాపకార్యములనే చేయుచుండినవారిలో నెవ్వనికైన మరణకాలము వచ్చినపుడు నే నిప్రుడు క్షమాపణ కోరుచున్నానని పలికిన వాని క్షమాపణ అంగీకరింపఁబడదు. మఱియు అవిశ్వాసులుగానే మృతినొందుచున్న వారి క్షమాపణకూడ అంగీకరింపఁబడదు. మేము వారికొఱకు బాధాకరమైన శిక్ష సిద్ధముచేసియున్నాము.

వ్యా॥ 15. స్త్రీలు వ్యభిచారముచేసినట్లు నలుగురు సాక్ష్యమిచ్చినచో వారిని శిక్షగా ఇండ్లలోనే బందీగా నుంచవలెను. మగవారు వ్యభిచారము చేసినచో అధికారి కోరినట్లు వారికి శిక్ష విధింపవలెను. ఇట్లు మొట్టమొదట దేవునాజ్ఞయాయెను. తరువాత పెండ్లియైన స్త్రీగాని పురుషుఁడుగాని వ్యభి

చారముచేసి నలుగురి సాక్ష్యమువలన రుజువైనచో వారిని రాళ్ళతో రువ్వించంప వలెను. పెండ్లికానివారు ఆ పని చేసినచో వారిని నూఱు కొరడా దెబ్బలుకొట్ట వలెను. ఈ శిక్ష బహిరంగముగా విధింపవలెను. దానిని చూచినవారికి బుద్ధి గలుగును. ఆ పిదప వారు కావించిన పాపకార్యమునకు పశ్చాత్తాపము నొంది క్షమాపణకోరి సత్కర్ములై మంచి నడవడికలో నున్నయెడల వారిని మరల నిందింపఁగూడదు. వారి జోలికి పోఁగూడదు. దేవుఁడు వారిక్షమాపణ నంగీకరించి వారి పాపములను క్షమించును. మఱియు అనుగ్రహించును. 17. అజ్ఞానముచే పాపములుచేసి వెంటనే తమ పాపములకు పశ్చాత్తాపమునొంది క్షమాపణ కోరువారి క్షమాపణ దేవుఁడు తప్పక అంగీకరించును. తెలిసియు కావలెనని పాపములు చేసినవారిని క్షమించుట దేవుని యనుగ్రహము. దేవు నికి సర్వము దెలియును. ఎవరెట్లు క్షమాపణ కోరుదురో వారిని దగినట్లు దే వుఁడు క్షమించును. 18. పాపములే చేయుచు పశ్చాత్తాపపడక అవసానకాల ము(సక్రాత్)లో పరలోకమునకు సంబంధించినవిషయములు కన్నులార చూచినపుడు పాపములు క్షమింపుమని దేవుని వేఁడిన అంగీకరింపఁబడదు. అటులే అవిశ్వా సము (కుఫరు) లోనే చనిపోవువారు క్షమింపఁబడరు. చావు రాకమునుపే, వి శ్వసించినచో పూర్వపుపాపములు క్షమింపఁబడును. అవిశ్వాసస్థితిలో మృతి నొందువారు క్షమింపఁబడరు. అట్టి వారికొఱకు నరకబాధ సిద్ధముగా నున్నది.

19. యా-అయ్యుహల్లజీన-ఆమనూ-లాయహిల్లు-లకుమ్-అన్-తరిసున్-ని సాఅ-కర్హన్-వలా-తఅ-జులూ-హున్న-లితజ్-హబూ-బి-బఅజి-మా-ఆతైతు మూ-హున్న-ఇల్లా-అన్-యాతీన-బిఫా-హిషతిమ్-ముబయ్యినతిన్-వ-ఆషిరూ-హున్న-బిల్-మఅ-రూఫి-ఫఇన్-కరిహ్-తుమూహున్న-ఫ అసా-అన్-తక్రహూ-షైఅన్-వయజ్-అలల్లాహు-ఫీహి-ఖైరన్-కసీరా. 20. వఇన్-అరత్తుమ్-ఇస్ తిబ్దాల-జౌజిమ్-మకానజౌజిన్-వఆతైతుమ్-ఇహ్-దాహున్న-ఖిన్-తారన్-ఫలా-తాఖుజూ-మిన్హు-షైఅన్-అతా-ఖుజూనహూ-బుహ్తానన్-వఇస్మమ్ ముబీనా. 21. వకైఫ-తాఖుజూనహూ-వఖద్-అఫ్జా-బఅ-జుకుమ్-ఇలా-బఅ జిన్-వ-అఖజ్న-మిన్కుమ్-మీసాఖన్-గలీజా.

19. ఓవిశ్వాసులారా! బలవంతముగా మీరు స్త్రీలకు వారసులుగా అగుట మీకు ధర్మముగాదు. మీరిచ్చిన దానినుండి కొంతదీసికొనుటకుగాను వారిని ఆటంకపరపకుఁడు. కాని, వారు స్పష్టముగా అసహ్య కార్యముచేసినచో అట్లు చేయవచ్చును. మఱియు మీరు స్త్రీలతో మంచితనముతో సంసారముచే

యుఁడు, మఱి మీకు వారు ఇష్టముకానిచో మీకిష్టములేని దానిలో దేవుఁడు గొప్ప మేలునుఁడుంచి యుండునేమో. 20. ఒక భార్యను విడనాడి వేఱొకతెను పెండ్లిచేసికొనవలెనని యుద్దేశించి అందు మీరు ఒకర్తెకు చాల ధనమిచ్చియుం డినచో దానిలో కొంచెమైనను మరల పుచ్చుకొనకుఁడు. మీరు అన్యాయము గాను స్పష్టమైన పాపముతోను, ఆధనమును దీసికొనుదురా! 21. మఱెట్లు దానిని తీసికొనఁగలరు. మఱి మీరు ఒకరితోనొకరు కలిసియున్నారు, భార్య లు మీయొద్దస్థిరమైన కరారు తీసికొని యున్నారు.

వ్యా॥ 19. ఇస్లామ్‌నకు పూర్వము స్త్రీలకుచాల అన్యాయము జరుగు చుండెను. దేవుఁడు దానిని రద్దుపఱచుచున్నాఁడు. స్త్రీలుఏదైన అసహ్యకార్య ము చేసినచో దానికిఁదగిన బుద్ధిచెప్పవలసినది ధర్మమే. కాని వారికి అన్యా యములుచేయరాదు. ఇస్లామ్‌నకు పూర్వము ఎవఁడైన చనిపోయినచో వాని భార్యలను వారసులో వాని అన్నదమ్ములో లేక వాని రెండవభార్య కుమా రుఁడో ఆమెను బలవంతముగా తమ ఇంటిలోనే యుంచుకొని ఇష్టపడినచో తానే పెండ్లిచేసికొనును. లేక ఇతరులకు పెండ్లి చేయించి మహారుపైకము తా ననుభవించుచుండెను, లేక ఆమె చచ్చునంత వఱకు తన యింటిలోనే యుంచుకొని ఆమె ఆస్తినంతయు తీసికొనుచుండెను. ఇట్లు పెక్కువిధముల అన్యాయములు చేయుచుండిరి. అవి కూడదు. భర్త చనిపోయినచో ధర్మ ప్రకారముగా ఆమె మరల తాను కోరిన వారిని వివాహమాడవచ్చును. చని పోయినవాని దాయాదులకు ఆమెను ఆటంకపఱచుటకు అధికారములేదు. కాని ఆమె నీతిమాలిన పనిచేసినచో ఆమెను ఆటంక పఱపవచ్చును. దీని పిదప భార్యలతో ధర్మముగా సంసారముచేయవలెను. వారి గుణములగూర్చి యేలాటి అనిష్టమున్నచో దానిసహించి సంసారము గడపవలెను. మాన వులకు ఇష్టముకాని దానిలో బహుశః దేవుఁడు ఉభయలోకముల గొప్పమే లుంచి యుండునేమో. ఎవరికిని దెలియదు. కావున దేవునిపై నాధారపడి దేవుని సెలవుననుసరించి భార్యలతో మంచితనముగా సంసారముచేయవలెను. అందు మేలుగల్గును. 20. ఇస్లామ్‌నకు పూర్వము ఎవఁడైన క్రొత్త భార్యనుచేసి కొనవలెనని కోరినచో ముందున్న భార్యపై నిందలుమోపి, అన్యాయముచేసి బలవం తముగా తానిచ్చియున్న మహరు పైకమును పుచ్చుకొని క్రొత్త భార్యకునిచ్చి వివాహమాడుచుండెను. దేవుఁడుఅట్టిదురాచారమును రద్దుచేయుచు, అట్లుచే యుటకు ఎట్లుబుద్ధిపుట్టును. 21. వివాహమునాడి భార్యాభర్తలుకలిసిసంసారము చేసి వివాహకాలమందు తాను భార్యను భరింతునని మాటనిచ్చిదానికి వ్యతి రేకముగా ఒక మానవుఁడు ఎట్లునడచుకొనఁగలఁడు అనిమందలించుచున్నాఁడు.

22. వలాతన్‌కిహూ-మానకహ-ఆబాఉకుమ్-మినన్-నిసాఇ-ఇల్లా-మా-

ఖద్-సలఫ-ఇన్నహూకాన-ఫాహిషతన్-వమఖ్తన్-వసాఅ-సబీలా.

22. మఱియు మీతండ్రులు వివాహమాడిన స్త్రీలను మీరు పెండ్లాడకుఁడు. కానిముందుగడచినది (క్షమింపఁబడినది). నిశ్చయముగా నిదిచాలసిగ్గులేనిపని, అసహ్యకార్యము, దుర్మార్గము.

వ్యా॥ 22. ఇస్లామ్‌నకుపూర్వము తండ్రిచనిపోయినచో ఆతని కుమారులు తమ సొంతతల్లి దప్ప మిగిలిన సవతితల్లులను వివాహమాడుచుండిరి, దేవుఁడు దానిని నిషేధించుచున్నాఁడు. అట్లువివాహమాడుట సిగ్గులేనితనము. దానిచే దేవుని కోపమునకు పాత్రులగుదురు. ఎందుకన ఇదిచాల అసహ్యకరమైనది. దుర్మార్గమైనది. ఇస్లామ్‌నకుపూర్వము అట్లువివాహమాడియుండినచో దానిని వదలిపెట్టి ఇఁకమీఁద అట్లువివాహమాడరాదు.

23. హుర్‌రిమత్-అలైకుమ్-ఉమ్మహాతుకుమ్-వబనాతుకుమ్-వఅఖవాతుకుమ్-వఅమ్మాతుకుమ్-వ-ఖాలాతుకుమ్-వ-బనాతుల్‌అఖి-వబనాతుల్-ఉఖ్తి-వ-ఉమ్మహాతు-కుముల్లాతీ-అర్‌జఅ-నకుమ్-వఅఖ-వాతుకుమ్-మినర్‌రజాఅతి-వఉమ్మహాతు-నిసాఇకుమ్-వరబాఇబు-కుముల్లాతీ - ఫీ-హుజూరికుమ్-మిన్‌నిసాఇ-కుముల్లాతీ-దఖల్-తుమ్-బిహిన్న-ఫ-ఇన్-లమ్-తకూనూ-దఖల్‌తుమ్-బిహిన్న-ఫలా-జునాహ-అలైకుమ్-వహలాఇలు-అబ్‌నాఇ-కుముల్లజీన-మిన్-అస్లాబికుమ్-వఅన్-తజ్‌మఊ-బైనల్-ఉఖ్తైని-ఇల్లా-మాఖద్-సలఫ - ఇన్నల్లాహ-కాన-గఫూరర్-రహీమా.

23. మీతల్లులును, మీకుమార్తెలును, మీఅక్క-చెల్లెండ్రును, మీ మేనత్తలును, మీతల్లుల అక్క-చెల్లెండ్రును, అన్నదమ్ముల కుమార్తెలును, అక్క-చెల్లెండ్ర కుమార్తెలును, మీకు పాలిచ్చిన తల్లులును, (దాదులు) మీకు పాలువరుసతోనైన అక్క-చెల్లెండ్రు (దాదుల కుమార్తెలు) ను మీభార్యలతల్లులును, మీరు సంసారము చేసిన మీభార్యల కుమార్తెలు మీరక్షణలోనుండువారును, మీకు వివాహమునకు నిషేధింపఁబడినారు. మఱియు మీరు స్త్రీలతో సంసారము చేయనిచో వారి కూఁతులను వివాహమాడుట మీకుఁ దోషముగాదు. మీకు పుట్టిన మీ కుమారుల భార్యలును మీ వివాహమునకు నిషేధింపఁబడినవారు. మఱియు ఇద్దఱు అక్క-చెల్లెండ్రను వివాహమాడుటయును నిషేధింపఁబడినది. కాని పూర్వము గడచినది క్షమింపఁబడినది. నిశ్చయముగా దేవుఁడు క్షమించువాఁడు. దయాళువు.

వ్యా॥ 23. ఇస్లామునకు పూర్వము కొందఱు సవతి తల్లులను వివాహమాడుచుండిరి. దాని రద్దుపఱచి ఇఁక వివాహమాడరాని యితర స్త్రీలనుగూర్చి చెప్పఁబడుచున్నది. ఏడువిధములగు బంధువులతో వివాహమాడుట (నిషిద్ధము) హరాము. ఎవఁడైన నీతిమాలినవాఁడు అందు నెవ్వరినైన పెండ్లాడవచ్చును అది ధర్మము అని పలికి వివాహమాడినచో వాఁడు మతభ్రష్టుఁడు (కాఫిరు) అగును. ఆ యేడు బంధువులు, తల్లి, కుమార్తె, అక్కచెల్లెండ్రు, మేనత్త, తల్లి అక్కచెల్లెండ్రు, అన్నదమ్ములకుమార్తెలు, అక్కచెల్లెండ్ర కుమార్తెలు. తల్లి ధర్మములో, తల్లికి తల్లి, తండ్రికి తల్లి, వారి తల్లులు చేరినవారు. కూతురు ధర్మములో మనుమరాలు చేరినది. అక్కచెల్లెండ్రు మూఁడువిధములు. ఒక తల్లి దండ్రికి పుట్టినవారు. తల్లి ఒకతె తండ్రి వేఱు. తండ్రిఒకఁడు తల్లి వేఱు. ఇట్టి మూఁడువిధములఅక్కచెల్లెండ్రను, వారి కూఁతురులను, ఇట్టిఅన్నదమ్ముల కూఁతురులను వివాహమాడకూడదు. మేనత్త ధర్మములో తాత ముత్తాతల మూఁడు విధముల అక్కచెల్లెండ్రు చేరినవారు. పినతల్లి (ఖాలా) ధర్మములో తల్లి, అవ్వకు సంబంధించిన మూఁడువిధముల అక్కచెల్లెండ్రు చేరినవారు. అన్నదమ్ముల కుమార్తె ధర్మమునకు పై మూఁడువిధముల అన్నదమ్ముల కూఁతురులు చేరినవారు మఱియు బంధుత్వ సంబంధముగాక పాలుకుసంబంధించిన ఏ స్త్రీలతో వివాహమాడరాదో చెప్పఁబడినది. ఒక బాలుఁడు రెండున్నర సంవత్సరముల వయస్సులోపల పాలు త్రాగినచో, అది యొక గుటకేఁడు అయినసరే దాది తల్లియగును. ఆ సంబంధముచే, ఆతఁడు దాదిని, దాది కూఁతురులను, వివాహమాడకూడదు. దాదిని తల్లిగాభావించి, దాదిభర్తను తండ్రిగాభావించి సొంత తల్లి, తండ్రుల వరుసకు ఎందఱు స్త్రీలతో (ఏడువిధములైన బంధువులతో) వివాహమాడకూడదో పాలు వరుసనుకూడ వివాహమాడకూడదు. (ఏడువిధముల బంధువులు పైన వ్రాసియున్నాము.) మఱియు వివాహ సంబంధమువలన నిషేధింపఁబడు స్త్రీలనుగూర్చి చెప్పఁబడినది. భార్యతల్లి, తనకుగాక నితర భర్తకు పుట్టియున్న భార్యకుమార్తె, భార్యతో కలిసి సంసారముచేసిన పిదప ఆమె కూఁతురు తన సొంత కూఁతురువలె నిషేధింపఁబడును. పెండ్లిపిదప తన భర్త తన భార్యతో కలియక పూర్వమే తలాఖు (విడాకు) నిచ్చినచో ఇఁక ఆమె పూర్వభర్తవలనఁ గలిగిన కూఁతురును అతఁడు వివాహమాడవచ్చును. తనకు పుట్టినకొడుకుల భార్యలను తన మనుమలభార్యలను వివాహమాడకూడదు. దత్తు కుమారుల భార్యలను వారి భర్తలు చనిపోయిన లేక విడాకు నిచ్చిన వివాహమాడవచ్చును. వారి ధర్మము సొంతకుమారుల భార్యలవంటిది గాదు. భార్యయున్నప్పుడు ఆమె (యొక్క పై వివరింపఁబడిన మూఁడువిధముల) అక్కచెల్లెండ్రను వివాహమాడకూడదు. ఆమె చనిపోయిన లేక తలాఖుపొంది ఇద్దత్

(మూఁడు ఋతువులకాలము) గడచిన పిదప వివాహమాడవచ్చును. అట్లు తన భార్యయున్నప్పుడు, ఆమె మేనత్తనుగాని, ఆమె పినతల్లి (ఖాలా) నిగాని ఆమె అక్క-చెల్లెండ్ర కూఁతునుగాని ఆమె అన్నదమ్ముల కూఁతులనుగాని వివాహమాడకూడదు. ఇస్లామునకు పూర్వము వివాహమాడరాని స్త్రీలనుగాని ఇద్దఱు అక్క-చెల్లెండ్రను భార్యలనుగాఁ జేసికొనుటగాని సంభవించినచో ఆపాపమును దేవుఁడు క్షమించుచున్నాఁడు. అది వదలిపెట్టుఁడు. ఇఁకమీఁద అట్టి వివాహము చేయరాదు. నిశ్చయముగా దేవుఁడు క్షమించువాఁడు దయగలవాఁడు. (ఇప్పటి ముసల్మానులు వివాహధర్మములను బాగుగ గమనించి తెలిసిన మత విద్వాంసులను అడిగి తెలిసికొని వివాహములు సలుపుదురు గాక !

## అయిదవ కాండము

24.వల్-ముహ్సనాతు-మినన్-నిసాయి-ఇల్లా-మామలకత్-ఐమానుకున్- కితాబల్లాహి-అలైకుమ్-ఉహిల్లలకుమ్-మావరాఅ-జాలికుమ్-అన్తబ్-తగూ - బిఅమ్వాలికుమ్-ముహ్సినీన-గైరముసాఫిహీన-ఫమస్-తమ్-తఅ-తుమ్- బిహీ-మిన్-హున్న-ఫ-ఆతూహున్న-ఉజూరహున్న-ఫరీజతన్-వలాజునాహ-అలైకుమ్-ఫీమాతరాజైతుమ్-బిహీ-మిమ్బఅ-దిల్_ఫరీజతి-ఇన్నల్లాహ-కాన-అలీమన్-హకీమా.

25 వమల్లమ్-యస్-తతిఅ-మిన్కుమ్-తౌలన్-అన్-యన్కిహ-ల్-ముహ్సనాతిల్ మూమినాతి-ఫమిమ్-మా-మలకత్-ఐమానుకుమ్- మిన్ - ఫతయాతికుముల్ - మూమినాతి-వల్లాహు-అఅ-లము-బి-ఈమానికుమ్-బఅ-జుకుమ్- మింబఅ-జిన్-ఫన్-కిహూ-హున్న-బిఇజ్ని-అహ్-లిహిన్న-వ-ఆతూహున్న- ఉజూరహున్న-బిల్-మఅ-రూఫి-ముహ్సనాతిన్-గైర-ముసాఫిహాతిన్-వలాముత్ - తఖిజాతి-అఖ్దానిన్-ఫఇజా-ఉహ్సిన్న-ఫఇన్-అతైన బిఫాహిషతిన్-ఫఅలైహిన్న- నిస్ఫు-మాఅలల్-ముహ్సనాతి-మినల్-అజాబి-జాలిక-లిమన్-ఖషియల్-అనత-మిన్-కుమ్-వఅన్-తస్బిరూ-ఖైరుల్-లకుమ్-వల్లాహు-గఫూరుర్-రహీమ్.

24. మఱియు భర్తలుగలస్త్రీలను వివాహమాడుట నిషేధింపఁబడినది. కాని మీచేతికి సొత్తుగాలభించు బానిసస్త్రీలు(నిషేధింపఁబడలేదు.) దేవునిధర్మము మీకువిధింపఁబడినది. మఱియు, ఆస్త్రీలు దప్ప మిగిలినవారి నిధనమిచ్చి వ్యభిచారము గాకాకుండ వివాహబంధనములో తెచ్చుటకుఁగాను మీరుకోరవచ్చు

ను. ఆపిదప మీరు స్త్రీలలో లాభముపొందిన తరువాత ఆస్త్రీలకుఁగాను నియమింపఁబడియున్న మహారులను ఇచ్చివేయుఁడు. మహారు నియమింపఁబడినతరువాత మీరుఇష్టపడి ఏదైన నియమించుకొన్నచో మీకుదోషము లేదు. నిశ్చయముగా దేవుఁడు సర్వజ్ఞుఁడు వివేచనాపరుఁడు. 25. మఱియు స్వతంత్రులగుముసల్మాను స్త్రీలను వివాహమాడుటకుమీలోశక్తిలేనివారు మీలోని ముసల్మాను బానిసస్త్రీలను వివాహమాడవచ్చును. మఱియు మీవిశ్వాసము దేవునికి బాగుగ తెలియును. మీరందఱుఒకరికొకరు సంబంధించినవారు. కావున బానిస స్త్రీల యజమానుల సెలవుతో వ్యభిచారముగాకాకుండ మఱుగుగా స్నేహము చేయకుండ వివాహబంధములో తెచ్చుకొనుటకై వారిని వివాహమాడి వారి మహారులను ధర్మప్రకారముగా నిచ్చివేయుఁడు.మఱియు ఆబానిసస్త్రీలు వివాబంధములో వచ్చినపిదప అసహ్య కార్యముచేసినచో స్వతంత్రులగు స్త్రీలకు నిచ్చు శిక్షలో సగముశిక్ష వారికి విధింపుఁడు. మీలోనెవరు కష్టములలో పడుదురని భయపడుదురో వారికి బానిసస్త్రీలను వివాహమాడవచ్చును అను ధర్మముగలదు. మఱియుమీరు ఓర్పుగలిగియున్నచో మీకు మంచిది. మఱియు దేవుఁడు క్షమించువాఁడు ప్రేమించువాఁడు.

వ్యా॥ 24. ముందు వాక్యములో, బంధుత్వముగల స్త్రీలలో వివాహము చేయఁదగనివారిని వివరించి ఇఁక ఈ వాక్యములో. భర్తలుగల స్త్రీలను వివాహమాడఁగూడదు. అను ధర్మము చెప్పఁబడుచున్నది. భర్తగలస్త్రీ ఆమె భర్త చనిపోయి, లేక అతనివలన ఆమె తలాఖుపొంది దాని ఇద్దత్ (గడువు) పూర్తియైన గాని ఆమె ఇతరులతో వివాహమాడ లేదు. కాని ముసల్మానులు, కాఫిరలతో చేయు యుద్ధములో, కాఫిర్లస్త్రీలు బానిసరాండ్రుగా చేతికిచిక్కినచో ఒక ఋతువు గడచిన పిదప వారిని వివాహమాడవచ్చును. వారి భర్తలగు కాఫిర్లు తలాఖు నియ్యనక్కఱలేదు. ఇంతవఱకు చెప్పఁబడిన, బంధువులును, భర్తగలస్త్రీలును తప్ప మిగిలిన స్త్రీలను వివాహమాడవచ్చును. దానికి నాలుగు షరతులు గలవు. భార్యాభర్తలు వివాహసంబంధమునుఒప్పుకొనుట, (ఈజాబ్-ఖుబూల్) మహరు నియమించుట, కనీసము ఇద్దఱు సాక్షులుండుట, వివాహ బంధనములోనుంచుట అనగా కొన్ని దినములువఱకు అని గడువు ఉండరాదు. ఎట్లు వ్యభిచారములో నుండునో అట్లు దినములు నియమింపఁగూడదు. వివాహమువలన ముఖ్యోద్దేశము, భక్తి కుదురుట, సంతానాభివృద్ధి. వివాహమైన తరువాత భార్యతో కలిసిన పిదప పూర్తి మహరు ఇయ్యవలెను. భార్యాభర్తలు కలియక పూర్వమే భర్త తలాఖు ఇచ్చినచో నియమింపఁబడియున్న మహరులో సగము మహరు ఇయ్యవలెను. భార్యాభర్తలు ఇష్టపడి మహరు, ఎక్కువచేసికొన్నను లేక దానిని తగ్గించుకొన్నను

దోషములేదు. దేవుఁడు మీ లాభనష్టముల నెఱుంగును. ఏదియుక్తమో ఏది అయుక్తమో సర్వము దేవునికిఁ దెలియును. కావున ముసల్మానులు దేవునిధర్మములను భయభక్తులతో అనుసరింపవలెను. 25. స్వతంత్రులు (ఆజాద్) అగు ముసల్మానుస్త్రీలను వివాహమాడి వారి ఖర్చులను భరించుటకు శక్తిలేనివారు ముసల్మానులగు బానిసస్త్రీలను వివాహమాడవచ్చును. బానిసస్త్రీల యజమానుల సెలవుపొంది వివాహము జరుగవలెను. విశ్వాసములో నెవరు దృఢభక్తిగలవారో ఆ విషయము దేవునికి బాగుగ తెలియును. స్వతంత్ర (ఆజాద్) స్త్రీకంటె బానిసస్త్రీ హెచ్చుగా విశ్వాసముగలిగియుండవచ్చును. అదియునుగాక మానవులందఱును, ఆదము హవ్వానుండి పుట్టినవారు. అందఱు మానవులు సమానులే. మఱియు ఒక్క మతమగు ఇస్లామ్‌లో చేరినవారే కావున బానిసస్త్రీలను వివాహమాడుటకు అసహ్యపడరాదు. పెండ్లి కానిచో వ్యభిచారమను కష్టములో పడుదురని భీతిగలవారు బానిసస్త్రీలనైన వివాహమాడి వ్యభిచారము చేయక తమ్ముతాము రక్షించుకొనవలెను. బానిసస్త్రీలను వివాహమాడక ఓర్పుగలిగి భక్తిపరులై యుండుట చాల శ్రేష్ఠమే. ఎందుకన బానిసస్త్రీలకు పుట్టిన బిడ్డలకు బానిసలు అను కళంకము గలుగును. అయినను వ్యభిచారభీతిగలవారు బానిసస్త్రీలను వివాహమాడినను దేవుఁడు క్షమించును. బానిసస్త్రీలు పెండ్లియైన పిదప వ్యభిచారమను అసహ్యకార్యము చేసినచో ఏఁబది కొరడా దెబ్బలు కొట్టవలెను. స్వతంత్ర స్త్రీలకు పెండ్లి కాకముందు వారు వ్యభిచారముచేసిన నూఱు కొరడా దెబ్బలు కొట్టవలెను. అప్పుడు బానిసస్త్రీలకు సగము ఏఁబది దెబ్బలు.

27. యురీ-దుల్లాహు-లి-యుబయ్యిన-లకుమ్-వయహ్దీ-యకుమ్-సునన-ల్-లజీనమిన్-ఖబ్లికుమ్-వయతూబ-అలైకుమ్-వల్లాహు-అలీమున్-హకీమ్. 27. వల్లాహు యురీదు-అన్-యతూబ-అలైకుమ్-వయురీదుల్లజీన-యత్-తబిఊనష్-షహవాతి-అన్-తమీలూ-మైలన్-అజీమా. 28. యురీ-దుల్లాహు-అన్-యుఖఫ్ఫిఫ-అన్కుమ్-వ-ఖులిఖల్-ఇన్సాను-జఈఫా,

26. దేవుఁడు మీకు స్పష్టముగాఁ దెలుపవలెననియు, మీ పూర్వుల సన్మార్గమును మీకు చూపవలెననియు, మిమ్ము కరుణించి క్షమింపవలెననియు కోరుచున్నాఁడు. మఱియు దేవుఁడు సర్వజ్ఞుఁడు వివేచనాపరుఁడు. 27. మఱియు దేవుఁడు మీపై కరుణింపవలెనని యిష్టపడుచున్నాఁడు. ఎవరు కామమోహములను అనుసరించుచున్నారో వారు, మీరు చాల వంకరగల తప్పుత్రోవలందు పడవలెననియిష్టపడుచున్నారు. 28. దేవుఁడు మీభారమునుతగ్గింప

వలెననికోరుచున్నాఁడు. మఱి మానవుఁడు బలహీనుఁడుగాసృజింపఁబడినాఁడు.

వ్యా॥ 26. మీకు ధర్మాధర్మములును తప్పుఒప్పులును దెలుపుటకు పూర్వము గడచిన ప్రవక్తల సన్మార్గము మీకు దెలుపుటకును కరుణించిక్షమించుటకును దేవుని యిష్టము మీలాభనష్టములును మీకేదితగునో ఏదితగదో అనువిషయమును దేవునికి బాగుఁగ తెలియును. మీకుభయలోకములలో మేలు పొందించునట్టి ధర్మములే దేవుఁడుమీకునియమించును. కావునమీరు ఆ ధర్మములను భక్తిపూర్వకముగా ననుసరించి సన్మార్గము పొంది దేవునిదయకు పాత్రులుకావలెను. 27. పై వివరింపఁబడిన ధర్మములు కామ మోహములకు లోఁబడినవారికి కష్టము గానుండునవి. అందుచేతనే అట్టివారు భక్తులగు ముసల్మానులుకూడ దుష్టులవలె సన్మార్గము వదలి తప్పుత్రోవలో పడవలెనని యిష్టపడుదురు. కావున ముసల్మానులు బాగుగ గమనించి, వ్యభిచారము మొదలగు తప్పుత్రోవలఁబోక సన్మార్గమందే స్థిరముగానుండి దేవుని దయకు పాత్రులు కావలెను. 28. మానవుఁడు బలహీనుఁడుగ సృజింపఁబడెను. ఆతనికి స్థిరగుణము, సహనము చాల తక్కువ. అందుచేతనే దేవుఁడు ఆతనికి కష్టతరములైన ధర్మములు నియమించలేదు. ప్రతి ధర్మములోను, భారములేకుండ సులభముగను, సౌకర్యమును పాటించెను. మానవుఁడు తన కామ మోహములనుసహింపలేఁడు. అందుకు స్త్రీలతో కలియఁగూడదు అను కఠిన ధర్మము నేర్పఱుపక ధర్మమార్గమున పెండ్లి చేసికొని వ్యభిచారదోషము చేయక సౌఖ్యములను అనుభవింపవచ్చును అని సెలవిచ్చియున్నాఁడు. అటులే ఇతర ధర్మముల నూహింపవలెను. మానవుఁడు తనయిష్టానుసారముగా పశుప్రాయుఁడై సంచరింపకతన కోరికలను దేవుని ధర్మములకు లోఁబడి తీర్చుకొనుచు సన్మార్గుఁడైయుండవలెను.

29. యాఅయ్యుహల్లజీన-ఆమనూ-లా తాకులూ-అమ్వాలకుమ్-బైనకుమ్-బిల్-బాతిలి-ఇల్లా-అన్-తకూన-తిజారతన్-అన్-తరాజిమ్-మిన్‌కుమ్-వలాతఖ్తులూ-అన్-ఫుసకుమ్-ఇన్నల్లాహ-కాన-బికుమ్-రహీమా. 30. వ-మన్‌యఫ్అల్-జాలిక-ఉద్వానన్-వజుల్మన్-ఫసౌఫనుస్లీహి-నారన్-వకాన-జాలిక-అలల్లాహి-యసీరా. 31. ఇన్-తజ్‌తనిబూ-కబాఇర-మాతుగ్-హౌన అన్‌హు-నుకఫ్ఫిర్-అన్-కుమ్-సయ్యిఆతికుమ్-వనుద్‌ఖిల్-కుమ్-ముద్‌ఖలన్-కరీమా. 32. వలా తతమన్-నౌ-మాఫజ్-జలల్లాహు-బిహీ-బఅ-జకుమ్-అలా-బఅ-జిన్-లిర్-రిజాలి-

నసీబుమ్-మిమ్-మక్తసబూ-వలిన్-నిసాఇ-నసీబుమ్-మిమ్-మక్-తసబ్న - వస్
అలుల్లాహ-మిన్-ఫజ్లిహీ-ఇన్నల్లాహ-కాన-బికుల్లిషై-ఇన్ అలీమా.33. వలికు
ల్లిన్-జఅల్నా-మవాలియ-మిమ్మా-తరకల్-వాలిదాని-వల్-అఖ్రబూన-వల్లజీన
అఖదత్-ఐమానుకుమ్-ఫాతూహుమ్-నసీబహుమ్-ఇన్నల్లాహ- కాన-అలా-కుల్లి-
షైఇన్-షహీదా.

29. ఓ విశ్వాసులార! మీరు ఒకరిసొమ్ము నొకరు అన్యాయముగా తినకుడు. కాని పరస్పరము ఇష్టముతోఁ జరుగు వ్యాపారము వలనలభించుదానిని తినుడు. మఱియు ఒకరినొకరు చంపుకొనకుడు. నిశ్చయముగా దేవుఁడు మీపై కరుణగలిగియున్నాఁడు. 30. మఱియు నెవఁడు అక్రమముగాను, దౌర్జన్యముగాను అట్లు చేయునో వానిని మేము నరకాగ్నిలో పడవేయుదుము. అది దేవునికి సులభము. 31. మీకు నిషేధింపఁబడు ఘోరపాపములను మీరు వదలుకొన్నచో మీ పొరపాట్లను క్షమింతుము. మఱి మిమ్ము గౌరవమైన స్థలములో ప్రవేశపెట్టుదుము. 32. దేవుఁడు మీలో కొందఱకు కొందఱిపై నిచ్చియున్న ఘనతను మీరు ఆశింపకుఁడు. పురుషులకు తాము సంపాదించినదాని నుండి భాగముగలదు. మఱియు స్త్రీలకు తాము సంపాదించినదానినుండిభాగము గలదు. మీరు దేవుని ఆతని అనుగ్రహమును వేఁడుఁడు. నిశ్చయముగా దేవునికి సర్వముఁ దెలియును. 33. మఱియు తల్లిదండ్రులును బంధువులునువదలిన యాస్తికి వారసులుగ మేము నియమించియున్నాము. మఱియు మీరు ఎవరితో ఒడంబడికగావించుకొనియున్నారో వారి భాగమును వారికి ఇచ్చివేయుఁడు. నిశ్చయముగా దేవుఁడు సర్వమునకు సాక్షిగా నున్నాఁడు.

వ్యా॥ 29. ఇఁక ముసల్మానులు పరస్పర మెట్లుండవలెనో దానిగూర్చి చెప్పఁబడుచున్నది. ఒకరిసొమ్మును ఒకరు దొంగతనముగాగాని, మోసపుచ్చిగాని తినఁగూడదు. ధర్మముగా పరస్పరము ఇష్టముతో జరుగు వ్యాపారము వలన లభించు ధనము తీసికొని దానిననుభవింపవచ్చును. ఎట్లుఒకరిసొమ్మును అపహరించుట అధర్మమో అటులే ఒకరి ప్రాణము తీయుటకూడ అధర్మము. ఒకరినొకరు చంపుకొనఁగూడదు. అది ఘోరపాపము. అట్లు చేయకూడదుఅని దేవుఁడు విధించినందున లోకమునకు చాల మేలు గలిగెను. అది దేవునిగొప్ప యనుగ్రహము. 30. అన్యాయముగ పరుల సొమ్మును హరించి పరులనువధించి అక్రమమును దౌర్జన్యము చేసిన వారిని దేవుఁడు నరకాగ్నిలో పడవేయును. అది దేవునికి చాల సులభము. ఎవరు అడ్డుపడలేరు. కావున ముసల్మానులు, ఆ ఘోరపాపములజోలికి పోఁగూడదు. 31. దొంగతనము, హత్య వ్యభిచా

రము¹ మొదలగు ఘోరపాపములను మానుకొన్నచో దేవుఁడు తన అనుగ్రహముచే ఆ ఘోరపాపములకు సంబంధించిన పొరపాటులను చిన్నతప్పిదములను క్షమించి గౌరవ స్థలమగు స్వర్గనివాసము ఒసంగును. 32. కొందఱుస్త్రీలు పురుషులకు మాకంటె నెక్కువ ఘనత లభించినది. వారు ధర్మయుద్ధము మొదలగు సత్కార్యములుచేయుదురు. స్త్రీలగు మాకు అట్టి ఘనత లేదే అని చెప్పుకొనిరి. అందుకు దేవుఁడు కొందఱకు గొప్ప పదవి ఘనతను ఒసంగియున్నాఁడు. అట్టి ఘనత పొందనివారు అది మాకు లభింపవలెనని యాశపడరాదు. అందు ద్వేషము అసూయ పుట్టును. దేవుఁడు ఎవరికిఁ దగిన ఘనతను వారికి నొసంగియున్నాఁడు. కావున ఒకరిపై నొకరు అసూయపడుటకు బదులుగ దేవునియనుగ్రహమును వేడుకొనవలెను. పురుషులు తమకుఁ దగిన కార్యములుచేసి దాని ఫలితము వారు పొందుదురు. అటులే స్త్రీలు తాముచేసిన సత్యమును సత్కార్యముల ఫలితము తాము పొందుదురు. దేవునికి సర్వముఁ దెలియును. ఎవరి నెట్లు పెట్టవలెనో అట్లు పెట్టియున్నాఁడు. అందు ఏలాటిలోపము లేదు. భక్తుల పని తమ యోగ్యత ననుసరించి దేవుని ధర్మములను అనుసరించుచు, దేవుని వేడుచుండవలెను. 33. తల్లిదండ్రులువదలిన ఆస్తిలో, స్త్రీగాని పురుషుఁడుగాని ఒక్కొక్కనికి వానికిఁ దగినట్లు దేవుఁడు భాగము నియమించి వారిని వారసులుగఁ జేసియున్నాఁడు. ఈ ధర్మములను అందఱు ననుసరింపవలెను. వారసులుగాక కొందఱు స్నేహితులుగ ఒడంబడిక చేసికొనుచుండిరి. ఒడంబడికప్రకారము వారి భాగము వారి కియ్యవలెను. దేవుఁడు సర్వమునకు సాక్షిగానున్నాఁడు. ఎవరు ఎట్లు ధర్మములను అనుసరింతురో దాని చూచుచునేయున్నాఁడు. వారి భక్తికిఁ దగినట్లు వారి కర్మల ఫలిత మొసంగును.

34. అర్ రిజాలు-ఖవ్వామూన-అలన్-నిసాఇ-బిమా ఫజ్-జలల్లాహు-బఅజహుమ్-అలా-బఅజిన్-వబిమా-అన్ ఫఖూ-మిన్-అమ్వాలిహిమ్-ఫస్ సాలిహాతు-ఖానితాతున్-హాఫిజాతుల్-లిల్-గైబి-బిమా-హాఫిజల్లాహు-వల్లాతీ- తఖాఫూన-నుషూజహున్న ఫఇజూ-హున్న-వహ్-జురూహున్న-ఫిల్ మజాజిఇ-వజ్రిబూ-హున్న-ఫఇన్-అతఅ-నకుమ్-ఫలాతబ్ గూ-అలైహిన్న సబీలన్-ఇన్నల్లాహా కాన-అలియ్యన్-కబీరా. 35. వఇన్-ఖిఫ్ తుమ్-షిఖాఖ-బైనిహిమా-ఫబ్ అసూ-హకమమ్-మిన్-అహ్ లిహీ-వహకమమ్ మిన్-అహ్లిహా-ఇన్-యురీదా-ఇస్లాహన్-యు-అఫ్-ఫిఖిల్లాహు-బైనహుమా-ఇన్నల్లాహ-కాన-అలీమన్-ఖబీరా.

33. దేవుఁడు కొందఱకు కొందఱిపై ఘనత నొసంగియున్నందునను, పురుషులు తమ ధనమును ఖర్చుచేసినందుచేతను పురుషులు స్త్రీలపై అధికారులు. కావున పతివ్రతలగు స్త్రీలు విధేయతగలిగి భర్తలు లేనిసమయమున దేవుని రక్షణవలన (ధనమును మానమును) కాపాడుదురు. మఱియు స్త్రీలు అవిధేయత చూపుదురని మీకు భీతియున్నచో వారికి బుద్ధిచెప్పుఁడు, మఱి వారిని పడకలలో వేఱుగా నుంచుఁడు. మఱి వారిని కొట్టుఁడు. ఆ పిదప వారు మీకు విధేయులైనచో వారిని నిందించుటకు త్రోవ వెతకకుఁడు. నిశ్చయముగా దేవుఁడు సర్వాధికుఁడును, గొప్పవాఁడును. 35. మఱియు భార్యాభర్తల మధ్య ద్వేషమున్నదని మీకు భీతి గలిగినచో భర్త బంధువులనుండి యొక మధ్యవర్తిని భార్య బంధువులనుండి యొక మధ్యవర్తిని నియమింపుఁడు. ఆయిద్దఱు మధ్యవర్తులు, సఖ్యముకూర్ప నెంచినచో దేవుఁడు, భార్యాభర్తలమధ్య సఖ్యముకూర్చును. నిశ్చయముగా దేవుఁడు సర్వజ్ఞుఁడును, జాగరూకుఁడును.

వ్యా॥ 34. ఇందు, పురుషులకు స్త్రీలపైనున్న ఘనతను అధికారమును దానికి కారణములు చెప్పఁబడినవి. సహజముగ దేవుఁడు పురుషులకు అనేక కార్యములు చేయుటకు విద్య, బలము మొదలగు యోగ్యతల నొసంగియున్నాఁడు. అందు స్త్రీలు వారికి సమానులు కానేరరు. మఱియు భర్త మహరు, అన్నవస్త్రాదులిచ్చి భార్యను భరించుచున్నాఁడు. అతఁడు తనభార్యనుపోషించుచు నామె మానమును కాపాడును. అందుకు పురుషులు స్త్రీలపై అధికారులును, వారికంటె అధికులును. కావున నీతిమంతులును, పతివ్రతలగు స్త్రీలు తమ భర్తలకు విధేయులై భర్తలేని సమయములో భయభక్తులుగలిగి భర్త సొత్తును వాని మానమును కాపాడుదురు. అందు ఏలాటి దోషము రానియ్యరు. ఇట్లు చేయుట పతివ్రతల ధర్మము. ఒకవేళ భార్య, ధర్మమైనమాట వినక అవిధేయతచూపినచో, భర్త మొదట నోటిమాటలతో బుద్ధిచెప్పవలెను. అపుడు కూడ వినకపోయినచో, ఆమెనుపడకనుండి వేఱుచేయవలెను. అపుడుకూడ వినకపోయినచో గాయము తగలకుండ కొట్టవలెను. తప్పిదమునకుఁ దగినట్లుగ శిక్షింపవలెను. పశువును మోదునట్లు ఎముకలు విఱిగి గాయములు తగులునట్లు కొట్టరాదు. ఈ విషయమున భర్త జాగ్రత్తగ నుండవలెను. తరువాత భార్య మాట విని విధేయత చూపినచో, ఆమెను నిందించుటకు వేఱు సాకులుఁ ద్రోవ వెతకఁగూడదు. ఆమెతో ధర్మముగా సంసారము చేయవలెను. దేవునికి భయపడవలెను. అతఁడు సర్వాధికుఁడు, సర్వాధికారి గనుక అతని శిక్షకుభయపడవలెను. 35. భార్యాభర్తలలో ద్వేషముండి వారిద్దఱు సవరించుకొనలేకపోయినచో, వారి మధ్య సఖ్యము కుదుర్చుటకు వారిద్దఱి బంధువులనుండి ఒక్కొక్క మధ్యవర్తిని నియమింపవలెను. వారిద్దఱు సవరించుటకు యత్నించి

న్చో వారి ప్రయత్నములు దేవుఁడు సఫలముగాఁజేసి భార్యాభర్తలమధ్య సఖ్యము కూర్చును. దేవునికి సర్వముఁ దెలియును. అందఱి విషయములఁ గూర్చి జాగరూకుఁడుగా నున్నాఁడు. కావున సఖ్యముఁ గూర్చుటలో ఏలాటి కష్టము కలుగదు.

39.వఅ్-బుదుల్లాహ-వలాతుష్-రికూ-బిహీ-షై-అన్-వబిల్-వాలిదైనిఇహ్సానన్-వబి-జిల్-ఖుర్బా-వల్-యతామా-వల్-మసాకీన-వల్-జారి-జిల్-ఖుర్బా వల్-జారిల్-జునుబి-వస్-సాహిబి-బిల్-జమ్బి-వబ్-నిస్-సబీలి - వమా-మలకత్-ఐమానుకుమ్-ఇన్నల్లాహ-లాయుహిబ్బు-మన్-కాన-ముఖ్తాలన్ - ఫఖూరా. 37.అల్లజీన-యబ్ఖలూన-వయామురూనన్నాస-బిల్-బుఖ్లి-వయక్ తుమూన-మా-ఆతాహుముల్లాహు-మిన్-ఫజ్లిహీ-వఅఅ్-తద్నా-లిల్-కాఫిరీన-అజాబమ్-ముహీనా.38.వల్లజీన-యున్ఫిఖూన-అమ్వాలహుమ్-రి-ఆ-అన్నాసి-వలాయూమినూన-బిల్లాహి-వలాబిల్-యామిల్-ఆఖిరి-వ-మన్-యకునిష్-షైతాను-లహు-ఖరీనన్-ఫసా-అ-ఖరీనా. 39. వమాజా-అలైహిమ్-లౌ-ఆమనూ-బిల్లాహి - వల్-యౌమిల్-ఆఖిరి-వ-అన్ ఫఖూ-మిమ్మా-రజఖ-హుముల్లాహు- వకానల్లాహు బిహిమ్ అలీమా. 40. ఇన్నల్లాహ-లాయజ్లిము-మిస్ఖాల-జర్రతిన్-వఇన్-తకు-హసనతన్-యుజాఇఫ్హా-వయూతి-మిల్-లదున్హు-అజ్రిన్-అజీమా.41.ఫకైఫఇ-జా-జీనా-మిన్-కుల్లి-ఉమ్మతిమ్-బిషహీదిన్-వ-జీనా బిక-అలా-హాఉలాఇ- షహీదా. 42. యౌ-మఇజిన్-యవద్దుల్-లజీన-కఫరూ-వ-అసఉర్-రసూల-లౌ-తుసవ్వాబిహిముల్-అర్-జు-వలా-యక్తుమూ-నల్లాహ-హదీసా.

36. మఱియు మీరు దేవునినే యారాధింపుఁడు. మఱియు అతనికి సాటి కల్పింపకుఁడు. మఱియు తల్లిదండ్రులకును, బంధువులకును, తండ్రిలేని బిడ్డలకును, పేదలకును, దగ్గఱను, దూరముననుండు ఇరుగుపొరుగు వారికిని, స్నేహితులకును, బాటసారులకును, మీకు సొత్తుగానుండు బానిసలకును, ఉపకారముచేయుఁడు. నిశ్చయముగ గర్వించి డంబములాడువారిని దేవుఁడు ప్రేమింపఁడు. 37. తాము లోభులై ఇతర ప్రజలకు లోభము నేర్పుచు దైవానుగ్రహముచే లభించిన దానిని దాఁచిపెట్టువారిని దేవుఁడు ప్రేమింపఁడు మఱియు

మేము అవిశ్వాసులకుగాను, అవమానకరమగు బాధసిద్ధపఱచి యున్నా
ము. 38. మఱియు వారు లోకులుచూచి పొగడవలెనని తమ ధనమునుఖర్చు
పెట్టుచున్నారు. మఱియు వారు దేవునిని, తుదిదినమును విశ్వసింపరు. మఱి
యు సైతాను ఎవనికి స్నేహితుడాయెనో వాఁడు చాల చెడ్డ స్నేహితుఁడు.
39.మఱియు వారు దేవునిని, తుదిదినమును విశ్వసించి, దేవుఁడు వారికిఇచ్చిన
దానినుండి ఖర్చుచేసియుండిన వారికేమి నష్టముగలిగియుండును ? మఱియు
దేవునికి వారివిషయము బాగుగఁదెలియును. 40. నిశ్చయముగా దేవుఁడు
రవ్వంతయును అన్యాయముచేయఁడు. మఱియు సత్కార్యమున్నచో దాని
రెండింతలుచేయును. మఱియు తన యొద్దనుండి గొప్ప పుణ్యఫలితమొసం
గును. 41. మఱియు ప్రతి సంఘమునుండి ఒక్కసాక్షినిదెచ్చి, వీరిపై నిన్ను
సాక్షిఁగా పెట్టినపుడు వారి గతి ఏమగునో? 42. ఆ దినమునందు, అవిశ్వా
సులై, ప్రవక్తను అవిధేయులై యున్నవారు తాము మట్టిలో సమములైపో
యిన బాగుండునే యని వారు కోరుదురు. మఱియు వారు దేవునినుండి ఏ
మాటను దాఁచఁజాలరు.

వ్యా॥ 36. దేవునిని భయభక్తులతో ఆరాధింపవలెను.అందేలాటి కల్ప
నలు చేయరాదు , దేవునికి సాటిగ నితరులను కల్పించుట ఘోరపాతకము.
దేవుని హక్కుగు ప్రార్థనపిదప మానవుల హక్కులు చెప్పబడినవి. శక్తికొ
లఁది మానవుఁడు తన తల్లిదండ్రులకును ఇతర బంధువులకును, తండ్రిలేని బిడ్డల
కును, నిఱుపేదలకును తోడుపడి ధనసహాయము మొదలగు నుపకారములు
చేయవలెను. బంధుత్వములోను లేక ఇంటికి సమీపములో దూరములోనున్న
ఇరుగుపొరుగువారికిని, స్నేహితులకును బాటసారులకును బానిసలకును మేలు
చేయవలెను. స్నేహితులలో, సహపాఠులును, సహప్రయాణికులును, ఒక గురు
వు శిష్యులును చేరుదురు. ధనమదముచే గర్వించి డంబములాడుచు ఇతరులను
లక్ష్యపెట్టని వానిని దేవుఁడు ప్రేమింపఁడు. అట్టివాఁడు దేవుని కోపమునకు
పాత్రుఁడగును. 37. ఖర్చుచేయఁదగిన విషయములలో ఖర్చుపెట్టక దానము
చేయక లోభము వహించి, ఇతరులనుకూడ లోభమునకై ప్రోత్సాహపఱచు
చు దేవుఁడొసంగిన ధనమును విద్యను దాఁచునట్టివారిని దేవుఁడు ప్రేమింపఁడు.
ధనికుల లోభమువలన సంఘమునకుచాల నష్టముగలుగును.మంచికార్యము లనే
కములు నిలిచిపోవును. దేవునియందు విశ్వాసముగల భక్తులు సర్వము దేవుని
ప్రీతికొఱకు వినియోగింతురు. కాని అవిశ్వాసులు, గర్వము మదము లోభ
ము మొదలగు దుర్గుణములకు లోనై వారు వాని ఫలితమగు నరక పాపము
పొందుదురు. దానిచే వారికి అవమానము గలుగును. ఈ వాక్యములు యూదు
లకు నన్వయించుచున్నవి. వారు ధనమునువిద్యను దాఁచిపెట్టుదురు. 38. ఎవరు

దేవుని ప్రీతికొఱకు ఖర్చుచేయుచు, లోకులుచూచి పొగడవలెనని ఖర్చుచేయుచు, దేవునిని తుది దినమును విశ్వసింపకున్నారో వారు, సైతాను ప్రోత్సాహమువలన అట్లు చేయుచున్నారు. సైతాను చాలచెడ్డస్నేహితుఁడు. వానిమాటలు వినువారికి మేలుగలుగదు. 39. అవిశ్వాసమును వదలి విశ్వసించి దేవుఁడొసంగిన దానిని దేవుని ప్రీతికొఱకు ఖర్చుచేసినవారికి ఏమియు నష్టముగలుగక ఉభయలోకములో మేలుగలిగియుండును. దేవునికి వారివిషయము బాగుగఁ దెలియును. వారికర్మలర ననుసరించి ఫలితమొసంగును. 40. దేవుఁడు ఎవరికర్మలను వృథాచేయఁడు. రవంత అన్యాయము చేయఁడు. అవిశ్వాసులకు శిక్ష విధించునది న్యాయమేను. దేవుఁడు సత్కార్యముచేసిన వారికి దాని పుణ్యము రెండింతలుగాను హెచ్చించి తన అనుగ్రహముచే గొప్ప పుణ్యఫలిత మొసంగును. 41. తుదిదినము (ఖియామతు)నందు తీర్పుకొఱకు అందఱు మతస్థులును వారి వారి ప్రవక్తలును సమావేశమగుదురు. ప్రవక్తలును తాము మతప్రచారముచేసితిమి, అవిశ్వాసులును దుర్మార్గులును విశ్వసింపలేదని సాక్ష్యమిత్తురు. అటులే విశ్వసించిన విశ్వాసులఁగూర్చి సాక్ష్యమిత్తురు. హజ్రత్ ముహమ్మదువారును తమ మతస్థులనుగూర్చి సాక్ష్యమిత్తురు. అపుడు అవిశ్వాసుల గతి ఏమగునో చెప్పశక్యముగాదు. వారుచాల దుర్గతిలో పడుదురు. ఆదినమున దేవుని విశ్వసింపక ప్రవక్తను తిరస్కరించిన అవిశ్వాసులు తాముకూడ మట్టిలోకలిసి మట్టియైపోయియుండిన బాగుండునే, తిరిగి సజీవులుకాకుండిన బాగుండునే అని కోరుదురు. అపుడువారు తాముచేసిన అక్రమములు దేవుని సముఖమున దాఁచఁజాలరు. తాముచేసిన పాపములకగు శిక్షనుండి తప్పించుకొనఁజాలరు.

43. యా-అయ్యు-హల్లజీన-ఆమనూ-లా తఖ్-రబుస్-సలా-త-వ-అన్తుమ్-సుకారా-హత్తా-తఅ్-లమూ-మాతఖూలూన-వలా- జునుబన్-ఇల్లా-ఆబిరీ-సబీలిన్-హత్తాతగ్-తసిలూ-వఇన్-కున్తుమ్-మర్ జా-ఔ-అలా సఫరిన్-ఔ-జా-అ-అహదుమ్-మిన్కుమ్ మినల్-గా ఇతి-ఔ-లామస్ తుమున్-నిసా అ-ఫలమ్ తజిదూ-మాఅన్-ఫతయమ్మమూ-స-ఈదన్-తయ్యిబన్-ఫమ్-సహూ-బి-వుజూ-హికుమ్-వ-ఐదీకుమ్-ఇన్నల్లాహ-కాన-అఫువ్వన్-గఫూరా.

43. ఓవిశ్వాసులారా! మీరు మత్తులో నున్నపుడు మీరు పలుకునది మీరు గ్రహించునంతవఱకు నమాజునకు సమీపింపకుఁడు మఱియు మీరు ప్రయాణములో లేనపుడు స్నానముచేయవలసియున్నపుడు స్నానముచేయునంతవఱకును నమాజునకు సమీపింపకుఁడు. మఱియుమీరు రోగపీడితులై యున్న

పుడును, లేక ప్రయాణములోనున్నపుడును, లేక మలమూత్రవిసర్జన చేసివచ్చి నపుడును లేక స్త్రీలతో కలిసినపిదప మీకు నీళ్లుదొరకనిచో పరిశుద్ధమైన మట్టిని ఉద్దేశించి దానితో మీముఖములనుచేతులను రాచుకొనుఁడు. నిశ్చయముగా దేవుఁడు క్షమించువాఁడు అనుగ్రహించువాఁడు.

వ్యా॥ 43. భార్యాభర్తల ధర్మములును, బంధువుల హక్కులును పూర్తిచేయుటకును గర్వము మదము లోభము వదలుటకును భయభక్తులు ఆవశ్యకములు. అవికుదురుటకుమార్గము నమాజుప్రార్థన. అందుకుగాను ఇఁకనమాజును త్రికరణశుద్ధిగా సలుపవలెను అంతియు దానికి వ్యతిరేకమైనవానిని వదలుకొనవలెనని చెప్పఁబడుచున్నది. ఇస్లామ్‌లో ప్రప్రథమమున మత్తుపదార్థములగూర్చి నిషేధము రాకుండెను. అది క్రమముగా నిషేధింపఁబడెను. నిషేధమునకు పూర్వము కొందఱు మత్తునుసేవించి నమాజుచేయసాగిరి. అందు కొందఱు తాము నమాజులో చదువు ఖురానువాక్యములను మత్తువలన తారుమారుచేసి చదివిరి. అందుకు మత్తులోనున్నపుడు నమాజులో చదువు వాక్యములను గ్రహింపరాని స్థితిలోనున్నపుడు నమాజుచేయరాదు అని దేవుని సెలవయ్యెను. అయిదు ప్రొద్దులు నమాజుచేయవలసియున్నది. కావున మత్తును సేవించుటకు అవకాశము లేక కొంతవఱకు మద్యపానము తగ్గెను. తుదకు దేవుఁడు దాని నిషేధింపఁగా ముసల్మానులు మద్యపానము పూర్తిగా మానుకొనిరి. స్త్రీలతో కలిసినపిదప స్నానముచేసి శుద్ధియగునంత వఱకు నమాజుచేయరాదు. రోగపీడితులై స్నానముచేసిన నష్టముగలుగును అను భీతియున్నపుడును, ప్రయాణములోనున్నపుడును త్రాగుటకుమాత్రమునీళ్లుండిస్నానమునకుచాలినంత నీళ్లు దొరకనిచో అపుడును, స్నానమునకు బదులుగ తయమ్ముమ్ చేయవలెను. గుసులునకు కారణములు స్త్రీలతో కలియుట, రేతస్ఖలనము మొదలగునవి. ఒకతూరి పరిశుద్ధమైన మట్టిపై పవిత్రతకొఱకు సంకల్పించి రెండుచేతులు తట్టి ముఖముపై రాచుకొనవలెను. రెండవతూరి మన్నుపై చేతులుతట్టి వానితో రెండుచేతులను మోచేతులవఱకు రాచుకొనవలెను. ఇదియే తయమ్ముమ్ చేయు పద్ధతి. నీళ్ళకు బదులుగ పరిశుద్ధమైన మట్టివలన శుద్ధి లభించును. ఇందు విసయముకూడ గలదు. వజూగుసులునకు బదులుగ పై కారణములతో తయమ్ముము చేసికొని నమాజుసలుపవలెను, నమాజు ఏస్థితిలోనుకూడ వదలరాదు. దేవుఁడు భక్తులపొరపాటులను క్షమించి అనుగ్రహించును. మత్తులో ప్రార్థనచేసిన వారి తప్పిదములను దేవుఁడు క్షమించును. అని తెలుపఁబడియెను. ఇఁకమీఁద అట్లుచేయవలదు అని హెచ్చరింపఁబడియె.

44. అలమ్ తర-ఇలల్లజీన-ఊతూ-నసీబమ్-మినల్-కితాబి-యష్‌తరూనజ్-జ

లాలత-వ-యురీదూన-అన్-తజిల్-లుస్-సబీల్. 45. వల్లాహు-అఅ-లము-బి-అఅ-దాఇకుమ్-వకఫా-బిల్లాహి-వలియ్యన్-వకఫా-బిల్లాహి-నసీరా. 46. మిన ల్లజీన-హాదూ-యుహర్రి-ఫూనల్-కలిమ-అమ్-మవా-జిఇహీవ-యఖూలూన-సమిఅ-నా-వ-అసైనా-వస్-మఅ-గై-ర-ముస్మఇన్-వరాఇనా-లయ్యమ్-బి-అల్ సినతిహిమ్ వతఅ-నన్-ఫిద్దీని-వలౌ అన్నహుమ్ ఖాలూ-సమిఅ-నా-వఅతఅ-నా-వస్మఅ-వన్-జుర్నా-లకాన-ఖైరల్-లహుమ్-వఅఖ్వమ-వలాకిల్-లఅ-న-హుము ల్లాహు-బికుఫ్రిహిమ్-ఫలా-యుఅ మినూన-ఇల్లా-ఖలీలా. 47. యా-అయ్యుహల్లజీన-ఊతుల్-కితాబ-ఆమినూ బిమా-నజ్-జల్నా-ముసద్దిఖల్-లిమా-మఅకుమ్-మిన్-ఖబ్లి-అన్-నత్ మిస-వుజూహన్-ఫ-నరుద్దహా-అలా-అద్బారిహా-ఔ-నల్-అన హుమ్-కమా-లఅన్నా-అస్ హాబస్-సబ్ తి-వకాన-అమ్-రుల్లాహి-మఫ్ ఊలా.

44. గ్రంథములో నొకభాగ మీయబడినవారిని నీవు చూడలేదా? వారు దుర్మార్గమును కొనుచున్నారు. మఱియు మీరుకూడమార్గము తప్పిపోవలెనని వారు కోరుచున్నారు. 45. మీ శత్రువులను దేవుఁడు బాగుగ నెఱుంగును. మఱియు దేవుని రక్షణయును, ఆతని సహాయమును చాలును. 46. కొందఱు యూదులు వాక్యములను తారుమాఱు చేయుదురు. మఱియు మేము వింటిమి. అవిధేయులైతిమి అని వారు పలుకుదురు. మఱియు నీవు వినుము. నీవు వినకుందువు గాక అనియు, వారు తమ నాలుకలను ద్రిప్పి 'రాఇనా' అనియు పలుకుదురు. మఱి వారు మతమును నిందించుచున్నారు. మఱియు వారు మేము వింటిమి. విధేయులైతిమి. నీవు వినుము. మమ్ము చూడుము అని పలికినచో వారికి మేలగును. మఱియు అది క్రమముగా నుండును. కాని వారి అవిశ్వాసమువలన దేవుఁడు వారిని శపించియున్నాఁడు. కావున వారిలో కొందఱు మాత్రమే విశ్వసించుచున్నారు. 47. ఓ గ్రంథముగలవారలార! ముఖములను రూపుమాపి వానిని వాని వీఁపుపట్టునకు త్రిప్పుటకు ముందు లేక వానిని శనివారమునాఁడు అవిధేయులైనవారిని మేము శపించునట్లు శపింపకముందు, మీయొద్దనున్న గ్రంథమును సత్యపఱచునట్టి మేము పంపిన గ్రంథమును మీరు విశ్వసింపుఁడు. మఱియు దేవుని యాజ్ఞ జరిగియే తీరును.

వ్యా॥ 44 ఈ వాక్యములలో యూదుల దుర్గుణములును వారి కుట్రలును వివరింపఁబడుచున్నవి. ముసల్మానులు వారి కుట్రలను తెలిసికొని జాగ్రత్తగ నుండవలెను. అట్టి దుర్గుణములను వదలుకొనవలెను. యూదులు దేవునిగ్రంథ

మగు తౌరాతులో హజ్రత్ ముహమ్మదు పైగంబరులవారి విషయమున్న వాక్యములను దాచి, వానికి తప్పు అర్థములు కల్పించి సన్మార్గమునకు బదులుగ దుర్మార్గము స్వీకరించుచున్నారు. తాము దుర్మార్గము స్వీకరించినది చాలక ముసల్మానులుకూడ సన్మార్గము తప్పి దుర్మార్గములో పడిన బాగుండునని వారు కోరుచు కుట్రలు సలుపుచున్నారు. 35. ఇట్టి యూదులుముసల్మానులకు శత్రువులు. వారి విషయము దేవునికి బాగుగ తెలియును. వారి కుట్రలనుండి ముసల్మానులను దేవుఁడు రక్షించి తోడుపడును. కావున యూదుల ద్వేషమునకు భయపడకూడదు ఇస్లామ్‌మతమునందు స్థిరముగా నుండుఁడు అని ముసల్మానులకు తెలుపఁబడియెను. 46. యూదులు తౌరాతు గ్రంథములో వారికి ఇష్టము కాని వాక్యములను పదములను తారుమారుచేసి తప్పు అర్థములు కల్పింతురు. వారు చాల అవిధేయులు. హజ్రత్ పైగంబరులవారు యూదులలో ఏదైన ధర్మము చెప్పినచో మేము వింటిమి అని గట్టిగా పలికి మెల్లగా మేము అనుసరింపము అని పలుకుదురు. మఱియు, రెండు అర్థములుగల మాటలు పలికి తాము చేయు కుట్రలు ముసల్మానులకు తెలియవు అని భ్రమపడుదురు. అందు పైగంబరులవారితో నీవు వినుము. నీవు వినకుందువు గాక అని పలుకుదురు. పైఅర్థము చూచుటకు బాగుగానే యున్నది అనగామామాటవినుము, ఇతర దూషణలు నిందలు వినకుందువుగాక. అని నీవు వినక చెవిటివాఁడవగుదువు గాక అని వారు అర్థము నుద్దేశించుచుండిరి. రాఇనా అను పదమును ఒత్తి పలికి దానికి తప్పు అర్థము నుద్దేశించుచుండిరి. దీనిఁగూర్చి సూరయేబఖరాలో వ్రాసియున్నాము. (చూ.వ 51) యూదులు మా కుట్రలు దేవుని ప్రవక్తకు తెలియవు అని నిందించుచుండిరి. దానికి దేవుఁడు వారి కుట్రలను పైగంబరుల వారికిఁ దెలిపెను. యూదులు, తప్పు అర్థములుగల పదములు పలుకుటకు బదులుగ ఒకే మంచి అర్థముగల పదము పలికినచో వారికి మేలుగలిగియుండును. అట్లు మంచి పదములు పలుకుట క్రమముగా నుండును. కాని యూదులు తమ అవిశ్వాస తిరస్కారములచే దేవుని అనుగ్రహమునుండి తొలఁగి ఆతని శాపమునకు పాత్రులైనవారు. వారి చెడుస్వభావమునుబట్టి వారిలో కొందఱు తప్ప మిగిలినవారందఱును విశ్వసింపరు. 48. యూదుల కుట్రలనువారి దుర్గుణముల వివరించిన పిదప ఈ వాక్యములో, యూదులు దేవునిశిక్ష రాకమునుపే ఖురానుగ్రంథమును విశ్వసింపవలెనని వారికి హెచ్చరిక కలదు. ఖురానుగ్రంథము, తౌరాతుగ్రంథము దేవుని గ్రంథమని సత్యపఱచుచున్నది. కావున యూదులు తప్పక ఖురానె షరీఫును విశ్వసింపవలెను. లేనిచో దేవుఁడు వారి ముఖములను చెక్కి వీఁపువైపునకు త్రిప్పివేయును. శనివారము నాఁడు చేపల వేఁటాడకూడదు అను దేవుని యాజ్ఞను తిరస్కరించి దేవుని శాపమునకు పాత్రులైన

వారివలె వారును శాపమునకు పాత్రులగుదురు. దేవుని యాజ్ఞ జరిగియే తీరును. దానికి అడ్డుపడువారు ఎవరును లేరు.

48. ఇన్నల్లాహ-లాయగ్ ఫిరు-అన్-యుష్రక-బిహీ-వయగ్ ఫిరు-మాదూన-జాలిక-లిమన్ - యషాఉ-వమన్- యుష్రిక్-బిల్లాహి-ఫఖదిఫ్ తరా-ఇస్మన్-అజీమా.

48. నిశ్చయముగా దేవుఁడు, ఆతనికిసాటికల్పించువానినిక్షమింపఁడు. మఱి దానికి తప్ప నితరపాపమును చేసినవారిలో తాను ఇష్టపడినవానిని క్షమించును. మఱిఎవఁడుదేవునిసాటికల్పించెనోవాఁడుగొప్పపాపమగుఅపనిందనుకల్పించెను.

వ్యా॥ 48. దేవునికి సాటి కల్పించుట ఘోరపాతకము. దానిని దేవుఁడు క్షమింపఁడు. కావున, ఆ పాపమును మానుకొని దేవునిక్షమాపణకోరవలెను. అట్లుగాక దేవునికి సాటి కల్పించుచు మృతినొందినచో వాఁడుక్షమింపఁబడఁడు. వాఁడు సదా నరకములోనే యుండును. దానికితప్ప నితర పాపములను దేవుఁడు తాను కోరినవారిని క్షమింపవచ్చును లేక శిక్షింపవచ్చును. అనఁగా ఆ పాపములను క్షమింపవలెనని దేవునిలో క్షమాపణ కోరకయే మృతినొందినవారి పాపములను క్షమించుట దేవుని యిష్టము. కాని సాటి కల్పించినవారిని (ముష్రికులను) క్షమింపఁడు. అది ఘోరపాతకము. దేవునికి సాటి కల్పించువారు గొప్ప పాతకమగు అపనిందను కల్పించువారగుదురు. యూదులు కొందఱు ప్రవక్తలను దేవునికి సాటిగా చేసిరి. అందుకు వారికికూడ నిందు హెచ్చరికగలదు.

49. అలమ్-తర-ఇలల్లజీన-యుజక్కూన-అన్ఫుసహుమ్-బలిల్లాహు-యుజక్కీ-మన్-యషాఉ-వలాయుజ్లమూన-ఫతీలా. 50. ఉన్ జుర్-కైఫ - యఫ్తరూన-అలల్లా-హిల్-కజిబ-వకఫా-బిహీ-ఇస్మమ్-ముబీనా.

49. తాము పవిత్రులమని తమ్ము తాము కొనియాడుకొనువారిని నీవు చూడలేదా! దేవుఁడు తాను ఇష్టపడినవారిని పవిత్రులుఁగఁజేయును. వారిపై సన్నని దారమంతటి అన్యాయమును జరుగనేరదు. 50. వారు దేవునిపై నెట్లు అబద్ధములు కల్పించుచున్నారో నీవు చూడుము. మఱి ఈస్పష్టమైన పాపమే వారికి చాలును.

వ్యా॥ 49. యూదులు అనేక దుర్గుణములు గలిగియు మేము దేవుని కుమారులము, దేవునికి ప్రియులము, మేము పవిత్రులము అని తమ్ము తాము పొగడుకొనుదురు. అట్లు వారు కొనియాడుకొనుట వారి తప్పు. వాస్తవములో దేవుఁడు తాను కోరినవారిని విశ్వాసమూలమున పవిత్రులనుగాఁ జేయును.

ఊరక యూదులు ఆత్మస్తుతి చేసికొనుటలో లాభములేదు. ఆత్మస్తుతిచేసికొను వారికి లభించు శిక్ష వారి కర్మల ననుసరించియుండును. వారిపై రవంతయును అన్యాయము జరుగనేరదు. 50. యూదులు అనేక పాపములకు లోనై తిరిగి మేము దేవునికి ప్రియులమని చెప్పుకొనుచు దేవునిపై అబద్ధములు కల్పించు చున్నారు. దేవుఁడు పాపులను ప్రేమింపఁడు. శిక్షపొందుటకు ఈ స్పష్టమైన పాపమే వారికి చాలును.

51. అలమ్-తర-ఇలల్లజీన-ఊతూ-నసీబమ్-మినల్-కితాబి-యూమినూన బిల్-జిబ్తి-వత్-తాగూతి-వయఖూలూన-లిల్లజీన-కఫరూ-హాఉలాఇ-అహ్దా-మినల్లజీన-ఆమనూ-సబీలా. 52. ఉలాఇ-కల్లజీన-లఅన-హుముల్లాహు - వమన్ యల్-అనిల్లాహు-ఫలన్-తజిద-లహూ-నసీరా. 53. అమ్-లహుమ్- నసీబుమ్ మినల్-ముల్కి-ఫఇజల్-లాయూతూ-నన్నాస-నఖీరా. 54. అమ్-యహ్-సుదూ నన్నాస-అలా-మా-ఆతా-హుముల్లాహు-మిన్-ఫజ్లిహీ-ఫఖద్-ఆతైనా- ఆల-ఇబ్రాహీమల్-కితాబ.వల్-హిక్మత-వ-ఆతైనా-హుమ్-ముల్కన్-అజీమా.55. ఫమిన్-హుమ్-మన్-ఆమన-బిహీ-వమిన్-హుమ్-మన్-సద్ద-అన్‌హు-వకఫా- బిజ హన్నమ-సఈరా.

51. ఏమి గ్రంథమునుండి కొంత భాగము లభించినవారిని నీవు చూడ లేదా! వారు విగ్రహములను, సైతానును విశ్వసించుచున్నారు. మఱియు వారు అవిశ్వాసుల విషయమున ముసల్మానులకంటెను అవిశ్వాసులే ఎక్కువ సన్మార్గమందున్నారు అని పలుకుచున్నారు. 52. ఇట్టివారిని దేవుఁడు శపించి యున్నాఁడు. మఱి ఎవ్వనిని దేవుఁడు శపించునో వానికిసహాయునినీవుపొందఁ జాలవు. 53. వారికి ప్రభుత్వములో భాగమున్నదా? అటులున్నచో వారు ప్రజలకు రవంతయును ఇయ్యకనే యియ్యరు. 54. దేవుఁడు తన యనుగ్రహముచే ప్రజలకు నొసంగినదానిపై వారు అసూయపడుచున్నారా! మఱియు మేము ఇబ్రాహీము సంతతివారికి గ్రంథమును జ్ఞానము నిచ్చితిమి. మఱియు మేము వారికి గొప్పరాజ్య మొసంగితిమి. 55. ఆ పిదప వారిలో కొందఱు దానిని నమ్మిరి. మఱికొందఱు దానిని తిరస్కరించిరి. ఆ తిరస్కరించువారికిదహించు నరకాగ్ని చాలును.

వ్యా: 51. ఇందు యూదుల దుర్గుణములు చెప్పఁబడుచున్నవి. యూదు

లకు హజ్రత్ పైగంబరులవారిపై ద్వేషము హెచ్చెను. అప్పుడు యూదులు పైగంబరులవారి విరోధులగు మక్కా ఖురైషులతో కలిసికొనిరి. ఖురైషుల సఖ్యమునకుఁగాను, ఖురైషులుపూజించునట్టి విగ్రహములను యూదులు గౌరవించుచు ముసల్మానులకంటెను మీరు (ఖురైషులు) సన్మార్గమందున్నారు అని పలుకసాగిరి. దానికి కారణము యూదులకు ముసల్మానులపైనున్న అసూయయే. అదియునుగాక యూదులకు అది స్వభావమే. పూర్వమునుండియు వారు అనేక ప్రవక్తలకు విరోధులై దేవుని కోపమునకును శాపమునకును పాత్రులైరి. దేవుని కోపశాపములకు పాత్రులైనవారికి ఎవరు సహాయము చేయఁగలరు ? యూదులు ముసల్మానులకు విరోధముగ మక్కా ఖురైషులతో సఖ్యము చేసికొనుచున్నారు. కాని వారికి దానివలన ప్రయోజనములేదు. తుదకు వారికి అవమానమును అపజయమును లభించును. కడకు అటులే సంభవించెను. 53. యూదులు, మేమే రాజ్యమునకు యోగ్యులము. మావంశములోనే ప్రవక్తలును రాజులును అగుదురు అని తలఁచియుండిరి. వారికి ప్రభుత్వములో భాగమున్నదా ? లేదు. ఒకవేళ యున్నచో వారు తమ లోభముచే ప్రజలకు రవంతయు దానము చేయనే చేయరు. 54. యూదులు, హజ్రత్ పైగంబరులవారిని ముసల్మానులను వారి విజయమును చూచి అసూయచే మండిపోవుచుండిరి. అసూయపడుట వారి యవివేకము. దేవుఁడు పూర్వమునుండియు హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తసంతతివారికి ప్రవక్త పదవిని, తన గ్రంథమును, జ్ఞానమును ప్రభుత్వమును ఒసంగియున్నాఁడు. హజ్రత్ పైగంబరులవారును హజ్రత్ ఇబ్రాహీముసంతతివారే. ఎట్లు యూదులు వారిపై అసూయపడఁగలరు. 55. దేవుఁడొసంగిన గ్రంథమును కొందఱు విశ్వసించిరి. కొందఱు తిరస్కరించిరి. తిరస్కరించినవారికినరకాగ్ని శిక్షకలదు. కావునహజ్రత్ పైగంబరులవారికి దేవునిచేలభించినగ్రంథమగుఖురానునుతిరస్కరించినవారికినిశిక్ష నరకాగ్నియే.

56. ఇన్నల్లజీన-కఫరూ-బి-ఆయాతినా-సౌఫ-నుస్లీహిమ్- నారన్- కుల్లమా-నజిజత్-జులూదుహుమ్-బద్దల్నాహుమ్-జులూదన్-గైరహా - లియజూఖుల్-అజాబ-ఇన్నల్లాహ-కాన-అజీజన్- హకీమా. 57. వల్లజీన-ఆమనూ-వఅమిలుస్-సాలిహాతి-సనుద్-ఖిలుహుమ్-జన్నాతిన్-తజ్రీ-మిన్-తహ్తి-హల్-అన్హారు-ఖాలిదీనఫీహా- అబదన్-లహుమ్-ఫీహా-అజ్వా-జుమ్ ముతహ్హారతున్ -వనుద్-ఖిలుహుమ్-జిల్లన్-జలీలా,

56. నిశ్చయముగా ఎవరు మా సూచనలను తిరస్కరించిరో వారికి

మేము నరకాగ్నిలో పడవేయుదుము. వారి చర్మము కాలిపోవునప్పుడెల్ల దానికి బదులుగ వేఱు చర్మమును వారు బాధ రుచి చూచుటకై కల్పించుచుందుము. నిశ్చయముగ దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనాపరుఁడును. 57. మఱియు నెవరు విశ్వసించి సత్కార్యములుచేసిరో మేము నిశ్చయముగ క్రిందుగ కాలువలు ప్రవహించు స్వర్గవనములలో వారిని ప్రవేశపెట్టుదుము. అందు వారు సదా యుందురు. అందు వారికి పవిత్రలగు స్త్రీలు గలరు. మఱియు వారికి దట్టమైన నీడలో నివాస మొసంగుదుము.

వ్యా॥ 56. ఈవాక్యములలో అవిశ్వాసులకును, విశ్వాసులకును లభించు ఫలితము చెప్పఁబడినది. అవిశ్వాసులు ఎల్లపుడు నరకాగ్నిలోపడి కాలుచుందురు. వారి చర్మములు కాలిపోవునపుడెల్ల తిరిగి క్రొత్తచర్మములు పుట్టుచుండును. అట్లు వారికి తీరని బాధానుభవములు కలుగును. కావున మానవులు దేవుని సూచనలను తిరస్కరింపక ఆతని ప్రవక్తలను గ్రంథములను విశ్వసించి నరకమునుండి రక్షణపొందవలెను. విశ్వసించి సత్కార్యములు చేసినవారికి వారి పుణ్యఫలితమగు స్వర్గసౌఖ్యము లభించును. అందు వారు ఎల్లపుడును ఉందురు. అందు పవిత్రలైన స్త్రీలుందురు ఎండ తగలక చల్లని దట్టమైన నీడలలో సౌఖ్యములనుభవింతురు. కావునమానవులు స్వర్గసౌఖ్యములకై విశ్వసింపవలెను.

58. ఇన్నల్లాహ-యామురుకుమ్ అన్-తవద్దుల్-అమానాతి-ఇలా-అహ్లిహా-వఇజా-హకమ్‌తుమ్-బైనన్-నాసి-అన్-తహ్కుమూ-బిల్-అద్‌లి-ఇన్నల్లాహ-నిఇమ్మా-యఇజు-కుమ్-బిహీ-ఇన్నల్లాహ-కాన-సమీఅ-అమ్-బసీరా. 59. యా-అయ్యుహల్లజీన-ఆమనూ-అతీ-ఉల్లాహ-వఅతీ-ఉర్-రసూల-వ-ఉలిల్-అమ్‌రి-మిన్-కుమ్-ఫఇన్-తనా-జఅతుమ్-ఫీషైఇన్-ఫరుద్దూహు-ఇలల్లాహి-వర్‌రసూలి-ఇన్-కున్తుమ్-తూమినూన-బిల్లాహి-వల్-యామిల్-ఆఖిరి-జాలిక-ఖైరున్-వ అహ్సను-తావీలా.

58. మీయొద్ద అమానతుగానుంచిన వస్తువులను, ఉంచినవారికి ఇచ్చివేయుఁడనియు, మీరు ప్రజలమధ్య తీర్పుచేయునపుడు న్యాయముగా తీర్పుచేయుఁడు అనియు దేవుడు మీకు ఆజ్ఞాపించుచున్నాఁడు. నిశ్చయముగా దేవుఁడు మీకు సదుపదేశము చేయుచున్నాఁడు. ఆతఁడు సర్వము వినుచు చూచుచున్నాఁడు. 59. ఓ విశ్వాసులార! మీరు దేవునికి విధేయులుకండు. మఱియు ప్రవక్తకును, మీలోని అధికారులకును మీరు విధేయులుకండు. ఆపిదప ఏదైన విషయమందు మీకు భేదాభిప్రాయములు గలిగినచో దేవునియందును, తుది

దినమందును మీకు విశ్వాసమున్నచో ఆ విషయమునుగూర్చి దేవుని యొక్కయు ప్రవక్తయొక్కయు వైపునకు మరల్చుఁడు. ఇది చాల మంచిది. మఱి దాని ఫలితమును చాల శ్రేష్ఠమైనది.

వ్యా॥ 58. అమానతు అనఁగా ఒకవస్తువును నమ్మకముగా ఒకరియొద్ద దాఁచియుంచుట. యూదులలో నమ్మికద్రోహము, తీర్పుచేయుటలో లంచములు పుచ్చుకొని అన్యాయముగా తీర్పుచేయుట అను దుర్గుణములుండినవి. ఆ దుర్గుణములజోలికి పోకూడదని ముసల్మానులకు దేవుని సెలవయ్యెను. హజ్రత్ పైగంబరులవారుకూడ "లా-ఈమాన-లిమన్-లా-అమాన-తలహూ" అమానతు గుణములేనివానికి విశ్వాసమునుకూడ లేదు)అనియుపదేశించియున్నారు. నమ్మికద్రోహము, అన్యాయముగ తీర్పుచేయుట ఘోరపాతకములు. దేవుఁడు ఉపదేశించునది మంచి యుపదేశము. దానికి విరుద్ధముగా ముసల్మానులు నడచుకొనఁగూడదు. నిశ్చయముగ దేవుఁడు సర్వము వినుచు చూచుచున్నాఁడు. కావున ఎవరు నమ్మికద్రోహము చేయుదురో ఎవరు న్యాయముగా తీర్పుచేయుదురో దేవునికిఁ దెలియును. వారికిఁ దగినఫలిత మొసంగును. 59. ముసల్మానులు, దేవునికిని ఆతని ప్రవక్తలకును విధేయులై యుండవలెను ముసల్మానులరాజును, వాని మూలముననియమింపఁబడు, ఖాజీ, సేనాధిపతి మొదలగు అధికారులు, న్యాయముగ మతమువననుసరించి విధించు ఆజ్ఞలను అనుసరింపవలెను. ఒకవేళ అధికారులమధ్యయును ముసల్మానులమధ్యయును అభిప్రాయభేదములుగలిగినచో, దానిగూర్చి దేవునిగ్రంథమగు ఖురానెషరీఫును హజ్రత్ పైగంబరువారి బోధలను, (సున్నతు) అనుసరించిచూడవలెను. ఆ విషయము ఖురానెషరీఫును పైగంబరులవారి యుపదేశమును అనుసరించియున్నచో దానిని అందఱుఒప్పుకొనవలెను. దేవునియందునుతీర్పుదినమందును విశ్వాసముగల ముసల్మానులు ప్రతివిషయములో మతముననుసరింతురు. అభిప్రాయభేదములుగలిగినపుడు ఖురానె షరీఫును హజ్రత్ పైగంబరులవారి యుపదేశములను అనుసరించుటమంచిది. దాని ఫలితముకూడ చాల శ్రేష్ఠమైనది. కావున ముసల్మానులు ప్రతివిషయములోను ఇస్లామ్ ధర్మములను అనుసరింతురుగాక!

60. అలమ్ తర-ఇలల్లజీన-యజ్ ఉమూన-అన్నహుమ్- ఆమనూ-బిమా-ఉన్ జిల-ఇలైక-వమాఉన్-జిల-మిన్-ఖబ్లిక-యురీదూన-అన్ యత-హాకమూ-ఇలత్-తాగూతి-వఖద్-ఉమిరూ-అన్-యక్ఫురూ-బిహీ-వ-యురీదుష్-షైతానుఅన్ యుజిల్లహుమ్-జలాలమ్-బఈదా. 61. వఇజా-ఖీల-లహుమ్ తఆలౌ-ఇలా-మా-అన్-జలల్లాహు-వఇలర్-రసూలి-ర-ఐతల్-మునాఫిఖీన-యసుద్దూన-అన్క- సు

దూ దా. 62. ఫ కైఫ-ఇజా-అసాబత్ హుమ్-ముసీబతుమ్-బిమా-ఖద్దమత్- ఐదీ హిమ్-సుమ్-జాఊక-యహ్లిఫూన-బిల్లాహి-ఇన్-అరద్నా-ఇల్లా- ఇహ్సానన్ వతౌఫీఖా.63.ఉలా-ఇకల్లజీన-యఅలముల్లాహు-మాఫీ ఖులూబిహిమ్-ఫఆఅ్‌రిజ్-అన్-హుమ్-వ-ఇజ్-హుమ్-వఖుల్-లహుమ్-ఫీ-అన్-ఫుసిహిమ్-ఖౌలమ్-బలీగా. 64. వమా-అర్సల్నా-మిన్-రసూలిన్-ఇల్లా-లియుతాఅ-బిఇజ్-నిల్లాహి-వలౌ-అన్నహుమ్-ఇజ్-జలమూ-అన్ఫుస-హుమ్-జాఊక-ఫస్తగ్-ఫరుల్లాహ- వస్తగ్-ఫర-లహుముర్-రసూలు-ల-వజదుల్లాహ-తవ్వాబర్-రహీమా. 65. ఫలా-వరబ్బిక-లాయూమినూన - హత్తా-యుహక్కి-మూక-ఫీమా-షజర - బైనహుమ్-సుమ్మ-లాయజిదూ-ఫీఅన్-ఫుసిహిమ్-హరజమ్-మిమ్మా-ఖజైత-వయుసల్లిమూ-తస్లీమా. 66. వలౌ-అన్నా-కతబ్నా-అలైహిమ్- అనిఖ్-తులూ- అన్ఫుసకుమ్-అవిఖ్-రుజూ-మిన్-దియా-రికుమ్మా-ఫఅలూహు-ఇల్లా- ఖలీలున్ - మిన్హుమ్వలౌ-అన్నహుమ్-ఫఅలూ-మాయూ-అజూన-బిహీ-లకాన- ఖైరల్- లహుమ్వఅషద్ద-తస్-బీతా. 67. వఇజల్-ల-ఆతైనా-హుమ్-మిల్-లదున్నా-అజ్రన్-అజీమా. 68. వల-హదైనాహుమ్-సిరాతమ్-ముస్తఖీమా. 69. వమన్-యుతి-ఇల్లాహ-వర్-రసూల-ఫ-ఉలా ఇక-మఅల్లజీన-అన్-అమల్లాహు- అలైహిమ్-మినన్-నబియ్యీన-వస్సిద్దీఖీన-వష్-షుహదా-ఇ-వస్-సాలిహీన- వహసున-ఉలా ఇక-రఫీఖా. 70. జాలికల్-ఫజలు-మినల్లాహి-వకఫా-బిల్లాహి-అలీమా.

60. నీ కొసంగబడిన దానిని నీపూర్వులకు నొసంగఁబడిన దానిని విశ్వసించితి మని పలుకుచు సైతానువద్ద తీర్పునకై పోవుటను కోరుచున్నవారిని నీవు చూడలేదా? మఱియు సైతానును తిరస్కరింపవలెనని వారికి ఆజ్ఞయై యున్నది. మఱియు సైతాను వారిని చాల దూరమైన దుర్మార్గములో పడవేయవలెనని కోరుచున్నాఁడు. 61. మఱియు వారితో దేవుఁడు పంపిన ఆజ్ఞలను ప్రవక్తను అనుసరించుటకు రండు అని పలికినచో, ఆవంచకులు, తిరస్కరించి నీనుండి మరలిపోవుటను నీవు చూచెదవు. 62. కావున వారు తమ చేతులారచేసికొన్న దానికిఁగాను వారికి బాధగలిగినపుడు, దేవుని సాక్షిగా మేము మేలును, ఐక్యమును మాత్రము కోరితిమి అని ప్రమాణములుచేయుచు

నీయొద్దకు వచ్చునపుడు వారిగతియేమగును! 63. వారిహృదయములోనున్నది. దేవునికిఁదెలియును. కావున వారినుండి ముఖము త్రిప్పుకొనుము. మఱియు వారికి బుద్ధిచెప్పుము. మఱియు వారినిగూర్చి వారిహృదయములలో నాటుకొనునట్టి మాట పలుకుము. 64. దేవుని సెలవుచే ప్రవక్తను (ప్రజలు) అనుసరింపవలెననియే మేము ప్రతిప్రవక్తను పంపుచున్నాము. మఱియు వారు తమయాత్మలకు నన్యాయముచేసి కొన్నపుడు నీయొద్దకువచ్చి దేవునిలో క్షమాపణకోరియుండినవారు దేవునిని, క్షమించువానిగను, దయాళువుగను పొందియుందురు. 65. నీప్రభువు సాక్షి! వారు తమలోని జగడముల తీర్పునకుఁగాను నిన్ను పెద్దగాఁజేసికొని నీవుచేయు తీర్పునుగూర్చి వారు తమ మనస్సులలో సంకటపడక సంతోషముతో నంగీకరించు నంతవఱకు వారు విశ్వాసులు కానేరరు. 66. మఱియు, మీరు మీయాత్మలను వధించుకొనుఁడు లేక మీయిండ్లను వదలి పొండు అని వారిని మేము ఆజ్ఞాపించినచో వారిలో కొందఱు తప్ప ఎవరును అట్లు చేయరు. మఱియు వారు, తమకుఁగలుగు బోధనుఅనుసరించినచోవారికి మతస్థిరత్వము గలిగియుండును. 67. మఱియు నపుడు వారికి గొప్పపుణ్యఫలితమొసంగుదుము. 68. మఱియు సన్మార్గము చూపుదుము. 69. ఎవరు దేవునికిని ఆతని ప్రవక్తకును విధేయులై యుందురో వారు, దేవునిఅనుగ్రహము పొందిన ప్రవక్తలతోను, సత్యవంతులలోను, షహీదులతోను, సత్ప్రవర్తకులతోనుకూడియుందురు. మఱివారి సాంగత్యము చాలమంచిది. 70. అది దేవుని యనుగ్రహము. మఱియు సర్వజ్ఞుఁడగు దేవుఁడే చాలును.

వ్యా॥ 60. యూదులు జగడములు తీర్చుటలో లంచములు పుచ్చుకొని తీర్పులో పక్షపాతము చూపుచుండిరి. అందువలన వంచకులును, మోసగాండ్రును తమ జగడములను తీర్చుకొనుటకు యూదుల విద్వాంసుల యొద్దకు పోవుటకు ఇష్టపడుచుండిరి. హజ్రత్ ముహమ్మదు పైగంబరువారు జగడములను న్యాయముగ తమ వారని పరాయివారని పక్షపాతము లేక తీర్పుచేయుదురు. అందుకు కపట విశ్వాసులగు వంచకులు హజ్రత్ పైగంబరువారియొద్దకు తీర్పుకొఱకు వచ్చుటకు జంకుచు యూదులయొద్దకు పోవుటకు యత్నించుచుండిరి. ఈ వాక్యములలో, అట్టి వంచకులనుగూర్చి చెప్పఁబడినది. మదీనాపురములో ఒక కపటి విశ్వాసి (మునాఫిఖ్) అగు వంచకునకు ఒక యూదునకును జగడమాయెను. అందు యూదునిపక్షమున న్యాయముండెను. ఆ జగడమును తీర్చుకొనుటకు వంచకుఁడు కాబుబిన్అష్రఫుఅను సైతానువంటి యూదవిద్వాంసునియొద్దకుపోవుదుమనియు, యూదుఁడు హజ్రత్ పైగంబరులవారియొద్దకు పోవుదము అని చెప్పుకొని తుదకు వారిద్దఱు హజ్రద్ పైగంబరులవారియొద్దకు పోయిరి. హజ్రత్ రసూలువారు విచారించి న్యాయముగ యూదునికి అను

కూలముగ తీర్పుచేసిరి. వంచకుఁడు నేను ముసల్మానుఁడను నాకు ప్రతికూలముగ తీర్పుచేసినారని దానిని అంగీకరింపక మరల హజ్రత్ ఉమరువద్దకు పోదమురా అని యూదుని పిలుచుకొని పోయెను. వంచకుఁడు తనకు అనుకూలముగ హజ్రత్ ఉమరు తీర్పుచేయునని తలంచి అట్లు చేసెను. ఈ జగడము పైగంబరుల వారు తీర్పుచేసియున్నారు. అది నాకు అనుకూలమైనది. అందుకుఁగాను తిరిగి మీ యొద్దకువచ్చినాము అని యూదుఁడు హజ్రత్ ఉమరుగారితో పలుకఁగా విని వారు ఇంటిలోనికిపోయి ఖడ్గముతెచ్చి వంచకుని వధించి పైగంబరు వారి తీర్పును తిరస్కరించినవారి తీర్పు ఇదియే అని పలికిరి. వంచకుని వారసులు హజ్రత్ పైగంబరువారి యొద్దకువచ్చి ఉమరు మా బంధువును చంపెను. మా బంధువు మీతీర్పును తిరస్కరించి ఉమరు వద్దకు పోలేదు. పరస్పర ఐక్యము సంధికూర్చుకొనుటకు ఆయన యొద్దకుపోయెను అని ప్రమాణములుచేయసాగిరి. అందుకుఁగాను ఈ వాక్యములో వాస్తవము తెలుపఁబడెను.

వ్యా॥ 61. వంచకులు తమ జగడములలో, తమకు ప్రతికూలముగతీర్పు కాఁగూడదు అని యుద్దేశించి తాము ముసల్మానులు అని పలికియు ప్రవక్త యొద్దకు రాకుండ ఇస్లామ్‌నకు విరోధులగు యూదులయొద్దకు పోవుదురు. మఱియు దేవుని యాజ్ఞలను అనుసరింపరు. ఎటులైన ప్రాణములుదక్కించుకొనుటకు యత్నింతురు. 62. వంచకులు పైగంబరులవారి తీర్పును తిరస్కరించి దానికి ఫలితముగ ఏదైన బాధ గలిగినచో తప్పుప్రమాణములు చేయుచు పైగంబరులవారియొద్దకు వచ్చుట తప్ప వారికి వేఱుగతిలేదు. 63. వంచకుల హృదయములలోనుండు కపటమును, ద్వేషమును అవిశ్వాసమును దేవునికిఁదెలియును. వారు చేయు ప్రమాణములునిజమైనవికావుఅని దేవుఁడు పైగంబరుల వారికిఁదెలిపి వంచకులనుండి ముఖము త్రిప్పుకొనుము, వారి జోలికిపోకుము. కాని వారికి బుద్ధిచెప్పుచు వారి హృదయములు తప్పుత్రోవనుండి మరలునట్లు వారికి బోధచేయుము అని సెలవిచ్చెను. 64. ఈ వాక్యములో దేవుఁడుతాను ప్రవక్తలను ఏ యుద్దేశముతో పంపునో దానిగూర్చి చెప్పుచున్నాఁడు. ప్రతి ప్రవక్తయును దేవుని సెలవుచే ప్రజలకు ధర్మమార్గము చూపును. కావున ప్రజలు దేవుని ప్రవక్తను అనుసరింపవలెను. భయభక్తులతో ఆతని తీర్పును అంగీకరింపవలెను. అటులే వంచకులు తమ వంచన వదలి నిజమైనభక్తి అవలంబింపవలెను. ఏదైన తప్పిదము చేసినచో దానికి పశ్చాత్తాపపడి దేవుని క్షమాపణ కోరవలెను. వారుప్రవక్త సన్నిధికి వచ్చినచో ప్రవక్తకూడ వారికొఱకు దేవునిక్షమాపణ కోరినయెడల దేవుఁడు క్షమించి అనుగ్రహించును. వంచకులు సన్మార్గము వదలి తప్పిదముచేసి దాని దాఁచుటకు తప్పు ప్రమాణములు చేయుచున్నారు. అట్లు వలదు. దానివలన వారికి ప్రయోజనములేదు. 65.

దేవుఁడు ఈ వాక్యమునందు ప్రమాణముతో నొక్కి ప్రజలు ప్రవక్తను అనుసరింపవలెను. ప్రవక్త చేయు తీర్పునుగూర్చి మనస్సులో నేలాటి సంకటముగాని సందేహముగాని లేక అంగీకరింపవలెను. అట్లు అంగీకరింపనివారు నిజమైన ముసల్మానులు కానేరరు. కావున వంచకులు పూర్తిగ విశ్వాసులుకావలెనన్న తమ ప్రతి విషయములో దేవుని ప్రవక్తను అనుసరింపవలెను.

వ్యా। 66 : 68. మానవుల ఆత్మలును దేహములును సర్వమును దేవునివే. ఒకవేళ దేవుఁడు మీరుమీయాత్మలను చంపుకొనుఁడు లేక మీరుఇండ్లు వదలిపొండు అని యాజ్ఞనిచ్చినచో నిజమైన కొందఱు భక్తులు తప్ప వంచకులు మొదలగువారు అట్లు చేయఁజాలరు. కావున దేవుఁడు తన దయచే ముసల్మానులకు అట్లు ఆజ్ఞచేయలేదు. వారి మేలుకొఱకే బోధచేసియున్నాఁడు. దాని ననుసరించినచో నిజమైన ముసల్మానులు సులువుగా కాఁగలరు. కాని వంచకులకు అది తోఁచదు. వంచన వదలి నిజమైన విశ్వాసము అవలంబించినచో దేవుని అనుగ్రహముగలిగి మంచి పుణ్యఫలితము సన్మార్గము లభించును. ఉభయలోకములలోను మేల్లు గలుగును. 69. నిజమైన ముసల్మానులు దేవునికిని ఆతని ప్రవక్తకును విధేయులై యుందురు. వారికి పుణ్యఫలితము లభించును. ప్రవక్తలయొక్కయు, సత్యవంతు (ప్రవక్తల చెప్పునది సత్యమని పలుకువార) లయొక్కయు, షహీదు (దేవుని మార్గమందు ధర్మయుద్ధమాడి వధింపఁబడువార) లయొక్కయు ధర్మము ననుసరించి సత్కార్యములుచేయువారియొక్కయు మంచి సాంగత్యము వారికి లభించును. వారు వారితోఁగూడి స్వర్గవనములలో నుందురు. కావున ముసల్మానులు తమ ప్రతి కార్యములోను ఇస్లామ్ ధర్మముల అనుసరింపవలెను. 70. ఆభక్తులసాంగత్యములభించుట దేవుని గొప్ప అనుగ్రహము. ఎవరు వంచకులు ఎవరు నిజమైన ముసల్మానుభక్తులు అను విషయము దేవునికిఁబాగుగ దెలియును. ఎవరికిఁదగినట్లు వారికి ఫలితమొసంగును. కావునవంచకులు ఆ భక్తుల సాంగత్యమును అట్టి పుణ్యమును పొందఁగలరు. అనిహెచ్చరింపఁబడియె.

71. యా-అయ్యుహల్లజీన-ఆమనూ-ఖుజూ-హిజ్-రకుమ్-ఫన్ ఫిరూ-సుబాతిన్-అవిన్ ఫిరూ-జమీఆ. 72. వఇన్న మిన్ కుమ్-లమల్-లయుబత్తిఅన్న-ఫఇన్-అసాబత్ కుమ్-ముసీబతున్-ఖాల-ఖద్-అన్-అమల్లాహు-అలయ్య-ఇజ్-లమ్అకుమ్-మఅహుమ్-షహీదా. 73. వలఇన్-అసాబకుమ్ ఫజ్ లుమ్ మినల్లాహి-లయఖూలన్న-కఅల్-లమ్-తకుమ్-బైనకుమ్-వబైనహూ - మవద్దతున్ -యాలైతనీ-

జన్నం-మఅహుమ్-ఫఅఫూజఫౌజన్-అజీమా.74.ఫల్-యుఖాతిల్-ఫీసబీలిల్లాహిల్లజీన-యష్రూనల్-హాయాతద్-దున్యా-బిల్-ఆఖిరతి-వ-మన్-యుఖాతిల్-ఫీసబీలిల్లాహి ఫయుఖ్-తల్-ఔ-యగ్లిబ్-ఫసౌఫ-నూతీహి-అజ్రన్-అజీమా. 75.వ-మాలకుమ్-లాతుఖాతిలూన-ఫీసబీలిల్లాహివల్-ముస్-తజ్-అఫీన-మినర్-రిజాలి-వన్-నిసాఇ-వల్-విల్దానిల్-లజీన-యఖూలూన- రబ్బనా-అఖ్రిజ్నా- మిన్-హాజిహిల్-ఖర్యతిజ్-జాలిమి-అహ్లుహా-వజ్అల్-లనా-మిల్-లదున్-క-వలియ్యన్-వజ్-అల్-లనామిల్-లదున్-క-నసీరా.76. అల్లజీన-ఆమనూ-యుఖాతిలూన-ఫీ-సబీలిల్లాహి-వల్లజీన కఫరూ-యుఖాతిలూన-ఫీసబీలిత్-తాగూతి-ఫఖాతిలూ-ఔలియా-అష్-షైతాని-ఇన్న-కైదష్-షైతాని-కాన-జఈఫా.

**71.** ఓముసల్మానులార! మీరు మీ ఆయుధములను తీసికొనుఁడు. ఆపిదప వేఱు వేఱు సైన్యములుగ బయలుదేఱుఁడు. లేక అందఱును కలిసి బయలు దేఱుఁడు. **72.** మఱియు మీలో కొందఱు ఆలస్యముచేయువారును గలరు. పిదప మీకేమైన ఆపద గలిగినచో దేవుఁడు మాపై అనుగ్రహము గలిగి యున్నాఁడు, కావున మేమువారివెంట లేకుంటిమి అని పలుకుదురు. **73.** మఱియు దేవుని యనుగ్రహము మీకు గలిగినచో మీమధ్యను వారి మధ్యను స్నేహము లేకున్నట్లుగ అయ్యో! మేము వారితో కలిసియుండిన ఎంత బాగుండును. మేము గూడ గొప్ప విజయము పొందియుందుమే అని పలుకుదురు. **74.** కావున ఇహలోక జీవమునకు బదులుగ పరలోకము స్వీకరించువారు దేవునిమార్గమందు యుద్ధము చేయవలసినది. మఱియు ఎవఁడు దేవుని మార్గమందు యుద్ధమాడి వధింపఁబడిన లేక విజయముపొందిన వానికి గొప్ప పుణ్యఫలిత మొసంగుదుము. **75.** మఱియు ఓ ప్రభువా! దుష్టులుండు ఈ పురమునుండి మమ్ము తీసివేయుము. మఱినీ యొద్దనుండి మాకొఱకు సంరక్షకుని నియమింపుము. మఱియు నీయొద్దనుండి మాకు తోడుపడువానిని నియమింపుము అని పలుకునట్టి బలహీనులగు పురుషులను, స్త్రీలను బిడ్డలనుగూర్చి మీరేల దేవునిమార్గమందుయుద్ధ మాడరు. మీ కేమైనది! **76.** విశ్వాసులైనవారు దేవుని మార్గమందు యుద్ధమాడుదురు. మఱి అవిశ్వాసులైనవారు సైతానుమార్గమందు యుద్ధమాడుదురు. కావున మీరు (ఓ విశ్వాసులార!) సైతాను స్నేహితులపై యుద్ధమాడుఁడు. నిశ్చయముగ సైతాను కుట్ర బలహీనమైనది.

వ్యా॥ 71. ఇందు ధర్మయుద్ధము (జిహాద)ను గూర్చి దేవుని సెలవగు

చున్నది. దేవునికిన్ని, ఆతని ప్రవక్తకును విధేయులుగ ముసల్మానులుండవలెనని మునుపటి వాక్యములో చెప్పఁబడినది. అందు యుద్ధమనునది చాల భారముగతోఁచునది. వంచకులు యుద్ధమునకు వెనుదీయుదురు. దీనివలన వారి అవిశ్వాసమును, వంచనయును తేటతెల్లమగును. అందువలనవంచకులనుగూర్చియు చెప్పఁబడినది. ముసల్మానులు ప్రతికాలమునందును ఆయాకాలములకుఁ దగినట్లు యుద్ధ ఆయుధములు సిద్ధపఱచుకొనవలెను. యుద్ధమునకు పోవునపుడు సమయోచితముగ పోవలెను. సైన్యములు వేఱు వేఱుగా పోవలసివచ్చినపుడు అట్లు చేయవలెను. లేక సైన్యములన్నియు చేరిపోవలసివచ్చినపుడు అట్లు చేయవలెను. 72. ముసల్మానుల వేషము వేసికొన్న వంచకులను వారి నాయకుఁడగు అబ్దుల్లాబిన్ఉబై, యుద్ధమునకై వెనుదీయుదురు. అందు ఆలస్యము చేసి ప్రాణముఁ దక్కించుకొనవలెనని ప్రయత్నము చేయుదురు ఒకవేళ యుద్ధములో ముసల్మానులకు ప్రాణనష్టముఁగాని అపజయముఁగాని గలిగినచో వంచకులు సంతసించి దేవుని అనుగ్రహమువలన మేము ఆపదనుతప్పించుకొంటిమి అని పలుకుదురు. 73. ఒకవేళ ముసల్మానులకు యుద్ధములో జయము గలిగి విజయధనము (గనీమత్) లభించినచో వంచకులు వ్యసనపడి మేము కూడ యుద్ధమునకు పోయియుండిన ఎంత బాగుండును. మాకుకూడ గొప్పలాభము గలిగియుండునే అని పలుకుదురు. వారు పలుకునపుడు వారికిని ముసల్మానులకును సాంగత్యము లేనట్లుగ వారు పలుకుదురు. కాని అట్లుకాదు. వారు ముసల్మానులవలె నటించి ముసల్మానులతో కలిసి మెలసియుండియు యుద్ధమునందు పాలుగొనక వేఱైపోయి ముసల్మానులపై అసూయ పడుచున్నారు. 74. వంచకులు యుద్ధమును చేయకపోయిన పోనిండు. నిజమైన భక్తిగలిగి పరలోకమునే పాటించునట్టి ముసల్మానులు ధర్మమును కాపాడుటకు దేవునికి విధేయులై ధర్మయుద్ధము సలుపవలెను. అందు ఏలాటి నష్టముగలిగినదానిని లక్ష్యపెట్టరాదు. యుద్ధమందు వధింపఁబడినవారికి దేవుని ప్రీతి లభించును. యుద్ధమందు జయముగలిగిన అందు గొప్ప లాభమును గలదు. 75. ఇందు యుద్ధము చేయుటకుఁగాను కారణములు చెప్పఁబడినవి. మొదటిది దేవుని మతధర్మమును నెలకొల్పి దానినిశత్రువులనుండి రక్షించుట. రెండవది. శత్రువులగు అవిశ్వాసులచేత చిక్కియున్న బలహీనులగు ముసల్మానుస్త్రీపురుషులను బిడ్డలను సంరక్షించుట. హజ్రత్ పైగంబరులవారు మక్కాపురము విడిచి మదీనాచేరిరి. శక్తిగల ముసల్మానులుకూడ మదీనా పురము చేరిరి. కాని శక్తిలేని ముసల్మానులు మక్కాపురములోనే యుండిరి. మక్కాలోని కాఫర్లు ముసల్మానులకు చాల కష్టములు పెట్టివారిని హింసించుచు ఇస్లామ్ వదలిపెట్టవలసినది అని వారిని బలవంతము చేయుచుండిరి. ముసల్మానులు శత్రుబాధల

నుండి రక్షణపొందుటకై దేవుని ప్రార్థించుచుండిరి. అందుకు దేవుఁడు ధర్మయుద్ధము సలిపి కష్టములు పడుచున్న ముసల్మానులను కాపాడవలెనని సెలవిచ్చెను. ఎల్లప్పుడును ముసల్మానులను హింసించి వారి స్వాతంత్ర్యమును హరించుకొన్నట్టి దుష్టరాజులను ముసల్మానులు ఎదుర్కొని స్వాతంత్ర్యము పడయుటకు ప్రయత్నింపవలెను. 76. ఇందు యుద్ధమునకై ముసల్మానులకు ప్రోత్సాహముగలదు. ముసల్మానులు, దేవునిపక్షమున ధర్మమును న్యాయమును కాపాడుటకు యుద్ధమాడుదురు. అవిశ్వాసులు, దుర్మార్గుఁడగు సైతాను పక్షమున యుద్ధమాడుదురు. వారి కుట్రలు చెల్లవు. అవి చాల బలహీనములైనవి. కావున ముసల్మానులువానిలక్ష్యపెట్టక ధైర్యసాహములువహింపవలెను.

77. అలమ్-తర ఇలల్లజీన-ఖీల-లహుమ్-కుఫ్-ఫూ-ఐదియకుమ్-వఅఖీముస్ సలాతవఆతుజ్-జకాత-ఫలమ్మా-కుతిబ-అలైహిముల్-ఖితాలు-ఇజా-ఫరీఖుమ్-మిన్ హుమ్ - యఖ్ షౌ- నన్నాస-కఖష్-యతిల్లాహి-ఔ అషద్ద-ఖష్-యతన్-వఖాలూ-రబ్బనా లిమ-కతబ్ త-అలైనల్-ఖితాల-లౌ లా-అఖ్-ఖర్తనా- ఇలాఅజలిన్ ఖరీబిన్-ఖుల్-మతాఉద్-దున్యా-ఖలీలున్-వల్ -ఆఖిరతు-ఖైరుల్-లిమనిత్-తఖా వలాతుజ్-లమూన-ఫతీలా. 78. ఐనమాతకూనూ-యుద్-రిక్ కుముల్-మౌతు-వలౌ-కున్తుమ్-ఫీబురూజిమ్-ముషయ్యదతిన్-ఇవన్-తుసిబ్-హుమ్-హసనతున్-యఖూలూ-హాజిహీ-మిన్-ఇన్దిల్లాహి-వఇన్- తుసిబ్-హుమ్-సయ్యిఅతున్-యఖూలూ-హాజిహీ-మిన్-ఇన్దిక-ఖుల్-కుల్లుమ్-మిన్-ఇన్దిల్లాహి-ఫమా-లిహాఉలాఇల్-ఖౌమి-లాయకా-దూన-యఫ్-ఖహూన-హదీసా.

77. మీచేతులను ఆపుకొనుఁడు. మఱినమాజు స్థిరముగా సలుపుఁడు. మఱి జకాతుదానము చేయుఁడు అని ఎవరికి సెలవు గలిగినదో వారికి మరల మీరు యుద్ధము చేయుఁడు అని విధింపఁబడగా వారిలోనికొందఱు దేవునికి భయపడుదానికంటె హెచ్చుగా ప్రజలకు భయపడసాగిరి. మఱి ఓ ప్రభువా! మాకు యుద్ధధర్మము నెందులకు విధించితివి. ఎందులకు మమ్మికొంతకాలము వదలిపెట్టకపోతివి అనిపలుకసాగినట్టివారిని నీవుచూడలేదా! ఇహలోకములోని లాభము కొంచెమే. భయభక్తులుగలవారికి పరలోకము చాలశ్రేష్ఠమైనది అందు మీకు రవంతయును అన్యాయము జరుగనేరదు. అనిపలుకుము. 78. మీరెచ్చటనుండినను మీకు చావువచ్చియేతీరును. మఱియుమీరు గొప్పకోటబురుజులలోనున్నను చావువచ్చును. మఱియు ప్రజలకునేదైనమేలుగలిగినచో ఇది దేవునినుండి

లభించినది. అనిపలుకుదురు. మఱివారికేదైన కీడుగలిగినచో ఇదినీవలన గలిగినది అనిపలుకుదురు. "సర్వము దేవునినుండియే గలుగుచున్నది" అని ఓప్రవక్తా! పలుకుము. మఱివారికేమైనది. వారేమాటనైనను గ్రహింపకున్నారు.

వ్యా॥77. ముసల్మానులు మదీనాపురమునకు పోకముందు, వారుమక్కాపురములోనున్నపుడు మక్కాఖురైషులు వారికి పెట్టరాని బాధలు పెట్టుచుండిరి. అందుకు ముసల్మానులు హజ్రత్ పైగంబరులవారి సన్నిధికివచ్చి మీరుసెలవిచ్చినమేముకాఫిర్లతో యుద్ధమాడుదుముఅని పలికిరి. దానికి హజ్రత్ రసూలువారు యుద్ధమునకై దేవునిసెలవుకాలేదు. ఓర్పుసహనముగలిగియుండుఁడు నమాజు సలుపుచు, జకాతుదానము చేయుచుండుఁడని వారితో పలికిరి. అపుడు సరే అని ముసల్మానులు అంగీకరించిరి. ఆపిదప ముసల్మానులు మక్కాపురము విడిచి మదీనాపురముచేరిరి. ముసల్మానులపై కాఫిర్లు (శత్రువులు) దాడి వెడలి వచ్చిరి. అపుడు ముసల్మానులు ధర్మయుద్ధము (జిహాద్) శత్రువులతో చేయవలెనని దేవుని సెలవయ్యెను. అపుడు విశ్వాసమందు స్థిరత్వముగల ముసల్మాను భక్తులు దేవునియాజ్ఞశిరసావహించి సంతసించిరి. విశ్వాస బలములేనికొందఱు యుద్ధమునకు భయపడుచు ఇంకనుకొంతకాలము యుద్ధమునుగూర్చి ఆజ్ఞలేకుండిన బాగుండునే అని పిఱికిమాటలు పలుకసాగిరి. దేవునిశిక్షకు భయపడునట్లు దానికంటె హెచ్చుగాను వారు శత్రువులకు భయపడసాగిరి. ఇట్టివారిని ఓప్రవక్తా! నీవుచూడలేదా? అని హజ్రత్ పైగంబరులవారితో దేవుఁడు చెప్పుచున్నాఁడు. యుద్ధములకు భయపడుటకును కారణము ఇహలోక లాభములోను సౌఖ్యములందును జీవితమందునుగల ఆస. ఇహలోకలాభము స్థిరమైనదికాదు. అదికొంచెమే చావుభీతిచే యుద్ధమాడకున్నను చావువచ్చియేతీరును. ఎచ్చట దాగినను పెద్దపెద్దకోటబురుజులలో దాగినను చావురాక తప్పదు. కావునధర్మయుద్ధముచేసి యుద్ధవీరులై పరలోకసౌఖ్యములు పొందుట చాలశ్రేష్ఠమైనది. దేవునియందు భయభక్తులుగలవారికి పరలోకముకంటె శ్రేష్ఠమైనది ఎద్దియును లేదు. అట్టిభక్తులుచేసిన కర్మఫలితము వారికి పూర్తిగలభించును. అందేలాటి లోపముగాని అన్యాయముగాని జరుగదు. 78. వంచకులవిషయము చాలఆశ్చర్యకరమైనది. అదిఒకతీరునలేదు. యుద్ధమునందలి యత్నము సఫలమై విజయము గలిగినచో ఇది దేవునివలన గలిగినది. పైగంబరులవారి యత్నమునకు ఏలాటి సంబంధములేదు అనిపలుకుదురు. ఒకవేళ యుద్ధమందలి యత్నముచెడి అపజయమును నష్టమును గలిగినయెడల అది పైగంబరువారివలన గలిగినది. అని నిందింతురు. దానికి ఓప్రవక్తా! లాభమును నష్టమును ఇచ్చుట దేవునిచేతిలోనున్నది. నేనుచేయునదికూడ దేవుని సెలవుతో చేయుచున్నాను. కావున

నన్ను నిందించుట సరికాదు. అదిమీ అవివేకమును తెలుపుచున్నది. అనివారితో పలుకుము అని చెప్పెను.

79. మా-అసాబక-మిన్-హసనతిన్-ఫమినల్లాహి-వ-మా-అసాబక-మిన్ సయ్యి-అతిన్-ఫమిన్-నఫ్సిక-వఅర్సల్నాక-లిన్నాసి-రసూలన్-వకఫా-బిల్లాహి షహీదా.

79. నీకుఁ గలుగు మేలు దేవునివలననే యున్నది. మఱి నీకుఁ గలుగు కీడు నీ యాత్మలవలననే యున్నది. మఱియు మేము నిన్ను ప్రజలకు ప్రవక్తగఁ జేసి పంపియున్నాము. మఱియు దీనికి దేవుని సాక్ష్యమే చాలును.

వ్యా॥ 79. ఇందు మేలు, కీడు గలుగుటకు వాస్తవమైన కారణము చెప్పఁబడుచున్నది. నష్టము లాభము, మేలు కీడు కలిగించుట దేవునిశక్తిలో నున్నది. మేలు దేవుని అనుగ్రహామువలన మానవులు పొందుదురు. కీడు నష్టములు తమ తమ పాపకార్యముల ఫలితముగ పొందుదురు. కావున నష్టముగలిగినపుడు వంచకులు హాజ్రత్ పైగంబరులవారిని నిందింపరాదు. పైగంబరులవారు మేలు కీడుసృజించుటలేదు. అది దేవునికిఅధీనమైనది. దానికికారణము మానవుల కర్మలు. దేవుఁడు హాజ్రత్ ముహమ్మదు వారిని ప్రజలకుఁగాను ప్రవక్తగాఁజేసి పంపియున్నాఁడు. వారిపని మఱి ప్రచారముచేయుట. దేవుఁడు అందఱి కర్మలనుచూచుచు వారికిసాక్షిగా నున్నాఁడు. పిదపకర్మలకుఁ దగినఫలితమిచ్చును.

80. మన్-యుతి-ఇర్-రసూల-ఫఖద్-అతా-అల్లాహ-వ-మన్-తవల్లా-ఫమా-అర్సల్నాక-అలైహిమ్-హఫీజా. 81. వ-యఖూలూన-తాఅతున్-ఫ-ఇజా-బరజూ-మిన్-ఇన్దిక-బయ్యత-తా ఇఫతుమ్-మిన్హుమ్-గైరల్లజీ-తఖూలు-వల్లాహు-యక్తుబు-మా యుబయ్యితూన-వఅఅ్-రిజ్-అన్-హుమ్-వ-తవక్కల్-అలల్లాహి-వకఫా-బిల్లాహి-వకీలా.

80. ఎవఁడు ప్రవక్తకు విధేయుఁడగునో ఆతఁడు దేవునికి విధేయుఁడాయెను. మఱియు తిరస్కరించువారిపై మేము నిన్ను రక్షకునిగాఁ జేసి పంపలేదు. 81. మఱియు వారు నీకు విధేయులమైతిమి అని పలుకుదురు. ఆ పిదప నీయొద్దనుండి వెళ్ళిపోయినపుడు వారిలో కొందఱు రాత్రులందు నీతో పలికిన దానికి విరుద్ధముగా తమలో తాము ఆలోచన చేయుదురు. మఱి వారు ఆలోచన చేయునది దేవుఁడే వ్రాసియుంచుచున్నాఁడు. కావున వారినుండి ముఖములు త్రిప్పుకొనుము. మఱియు దేవునిపై నాధారపడియుండుము. మఱి యు కార్యములు నెఱవేర్చుటకు దేవుఁడే చాలును.

వ్యా॥ 80. హజ్రత్ ముహమ్మదువారిని దేవుఁడు తన ప్రవక్తగాఁజేసి లోకములో పంపెను. ప్రజలు వారి బోధన విని వారికి విధేయులుకావలెను. వారికి విధేయులైనవారు దేవునికి విధేయులైనట్లే. ప్రవక్తను తిరస్కరించి అవిధేయులైనవారు దేవునికి అవిధేయులే. కావున వారిని శిక్షించుట దేవుని పని. ప్రవక్త పని మతప్రచారముచేయుట మాత్రమే. కాని ప్రజలు పాపములు చేయకుండ వారినిఆటంకపఱచుట ప్రవక్తపని కాదు. పాపపుణ్యములతీర్పుచేయుట దేవుని పని. 81. వంచకులు హజ్రత్ పైగంబరులవారియొద్దకు వచ్చినపుడు మేము మీకు విధేయులము. మిమ్ము అనుసరింతుము అని పలుకుదురు కాని అచ్చటినుండి వెళ్ళిపోయి రాత్రులలో కొందఱు మఱుగుగా వారు తమలో తాము ప్రవక్తకు విరోధముగా ఆలోచనలు చేయుదురు. వారి ఆలోచనలు దేవునికి తెలియును. అవి వ్రాయఁబడును. వానికిఁ దగినశిక్ష దేవుఁడొసంగును. వంచకులనుండి ముఖము త్రిప్పుకొని వారి ఆలోచనలను లెక్కచేయక సర్వ కార్యములందు దేవునిపై నాధారపడియుండుము. దేవుఁడు సర్వకార్యములు నెఱవేర్పఁజాలినవాఁడు అనిపైగంబరువారికి చెప్పఁబడినది. దాని ననుసరించి ముసల్మానులు సంపూర్ణముగా పైగంబరులవారికి విధేయులై తమ కార్యములలో దేవునిపై ఆధారపడియుండవలెను.

82. అఫలా-యతదబ్బరూనల్-ఖుర్ఆన-వలౌకాన - మిన్ఇన్ది గైరిల్లాహి-ల-వజదూ-ఫీ-హిఖ్-తిలాఫన్-కసీరా.

82. వారు ఖురానును యోచింపరా! మఱి అది దేవునినుండి గాక యితరులనుండివచ్చి యుండినచో అందు చాల తారతమ్యములుండియుండును.

వ్యా॥ 82. ఇంతవఱకు హజ్రత్ ముహమ్మదువారు దేవుని ప్రవక్తలనియు ప్రజలు వారిని అనుసరింపవలెననియు బోధింపఁబడియె. వంచకులును అవిశ్వాసులును ఖురాను గ్రంథము దేవునిది అని మేము ఎట్లు నిశ్చయింపఁ గలము అని సందేహింపఁగలిగిరి. అందుకు ఈ వాక్యమందు వారికి సమాధాన మియ్యఁబడినది. ఖురాను దేవుని గ్రంథముగాక ఇతరులదియైనచో అందుఅనేక తారతమ్యములును, విషయములలో పరస్పర వ్యత్యాసములుండి గ్రంథము ఆదినుండి అంత్యమువఱకు ఒక తీరున ఉండదు, ఖురానె షరీఫులో యోచించి గ్రహించినవారికి అట్టి తారతమ్యములు కనఁబడవు. కావున బుద్ధిగలవారు ఖురాను గ్రంథములోని ధర్మములను విషయములను దానిశైలితీరును అద్భుతమైన ఆకర్షణశక్తినిజూచి అది దేవుని గ్రంథమని ఒప్పుకొనితీరుదురు.

83. వఇజా-జాఅహుమ్-అమ్రుమ్-మినల్-అమ్ని-అవిల్-ఖౌఫి-అజాఊ బిహీ-వలౌరద్దూహు-ఇలర్-రసూలి-వ-ఇలా-ఉలిల్-అమ్రి-మిన్-హుమ్ -

ల-అలిమహుల్-లజీన-యస్తమ్-బితూనహూ-మిన్-హుమ్-వలౌలా-ఫజ్లుల్లా హి-అలైకుమ్-వరహ్మతుహూ-లత్-తబఅ్-తుముష్షైతాన-ఇల్లాఖలీలా. 84. ఫఖాతిల్-ఫీసబీలిల్లాహి-వలాతుకల్లఫు-ఇల్లానఫ్సక-వహర్రిజిల్-మూమినీన-అసల్లాహు-అన్-యకుఫ్ఫ-బాసల్లజీన-కఫరూ-వల్లాహు-అషద్దుబాసన్-వఅషద్దు తన్కీలా. 85. మన్-యష్ఫఅ్-షఫా-అతన్-హసనతన్-యకుల్-లహూ-నసీబుమ్-మిన్హా-వమన్యష్-ఫఅ్-షఫా-అతన్-సయ్యి-అతన్-యకుల్-లహూకిఫ్లుమ్-మిన్హా-వకానల్లాహు-అలాకుల్లిషైఇమ్ముఖీతా. 86. వఇజా-హుయ్యీతుమ్-బితహియ్యతిన్-ఫహయ్యూ-బిఅహ్-సన-మిన్-హా-ఔరుద్దూహా-ఇన్నల్లాహ-కానఅలా-కుల్లిషైఇన్-హసీబా. 87. అల్లాహు-లాఇలాహ-ఇల్లాహువ-లయజ్-మఅన్నకుమ్ ఇలా-యౌమిల్-ఖియామతి-లారైబ-ఫీహి-వమన్-అస్-దఖు-మినల్లాహి-హదీసా.

83. మఱియు వారియొద్దకు శాంతివార్తగాని భయవార్తగాని వచ్చినచో వారు దానిని చాటుదురు. మఱియు వారు ఆ వార్తను ప్రవక్తకును తమ అధికారులకును అందజేసియుండినచో వారిలో దానిగూర్చి విచారింపగలవారు తెలిసికొందురు. మఱి మీపై దేవుని యనుగ్రహమును ఆతని కృపయును లేకుండినచో కొందఱు తప్ప మిగిలినవారు సైతానును అనుసరించియుందురు. 84. కావున నీవు దేవునిమార్గమందు యుద్ధము సలుపుము. నీపై నీ యాత్మది మాత్రము బాధ్యతగలదు. మఱి ముసల్మానులను (యుద్ధమునకు) ప్రేరేపింపుము. శీఘ్రముగానే దేవుఁడు అవిశ్వాసుల యుద్ధము ఆపివేయును. మఱి దేవుఁడు యుద్ధములోను చాల కఠినుఁడు. మఱి శిక్షించుటలోను చాల కఠినుఁడు. 85. ఎవఁడు మంచి సిఫారసు చేయునో అందు వానికి నొక భాగము లభించును. మఱెవఁడు చెడ్డ సిఫారసుచేయునో అందు వానికి నొక భాగము లభించును. మఱి దేవుఁడు సర్వముపై శక్తిగలవాఁడు. 86. మఱియు ఎవరైన మిమ్ము దీవించినచో, మీరును, దానికంటె మేలుగా దీవింపుఁడు. లేక అదే దీవన తిరిగి పలుకుఁడు. నిశ్చయముగా దేవుఁడు ప్రతివిషయము గమనించువాఁడు. 87. అల్లాః తప్ప వేఱు దేవుఁడు లేఁడు. నిశ్చయముగా ఆతఁడు మిమ్ము పునరుత్థాన దినమునందు సమావేశపఱచును. అందు ఏలాంటిసందేహము లేదు. మఱి దేవుని వాక్కుకంటె నెవరి వాక్యము సత్యమైనది గలదు !

వ్యా॥ 83. వంచకులును, వివేకములేని కొందఱు ముసల్మానులును ఏదైన నొక శాంతివార్త (అనగా శత్రువులతో సంధికూర్పు విషయమును ముసల్మానులకు విజయము గలిగిన వార్త) గాని లేక భయవార్త (అనగా ముసల్మానులకు అపజయము శత్రువులు ముసల్మానులపై దాడివెడలినవార్త) గాని వినినతోడనే దానివిషయము విచారింపకనే దానిని చాటింతురు. కొన్ని సమయములలో దానివలన ఉపద్రవములుసంభవించి నష్టముగలుగుచుండెను. కావున అట్లు విచారింపక వదంతులను చాటింపరాదు. అట్టి వార్తలు హజ్రత్ పైగంబరువారికిని, అధికారులుగనున్న ముసల్మానులకును దెలుపవలెను. వారుదాని వాస్తవము విచారించి నిజమైన విషయము దెలిసికొని ప్రజలకుఁదెలుపుదురు. వదంతులవలన అనేక సాంఘిక కలహములు పుట్టును. కావున ఎవరికి తోఁచినట్లు వారు వార్తలను చాటింపరాదు. దేవుఁడు తన అనుగ్రహమువలన ముసల్మానులకు సన్మార్గముచూపుచు రక్షించుచున్నాఁడు. లేనిచో కొందఱు బుద్ధిమంతులు తప్ప మిగిలిన సామాన్యమైన జనులు తప్పుత్రోవఁబోయి సైతాను కుట్రలకు లోనైయుందురు. 84. వంచకులును, స్థిరవిశ్వాసములేని ముసల్మానులును శత్రువులకు భయపడి యుద్ధమునకు సిద్ధముకానిచో నీవు మాత్రము దేవునిపై నాధారపడి యుద్ధము సలుపుము. నీయాత్మనుగూర్చి నీకు బాధ్యత గలదు. ఇతరులు రానిచో ఆ నింద నీపైలేదు. అయిన ముసల్మానులను యుద్ధమునకు ప్రేరేపింపుము. దేవుఁడు అవిశ్వాసుల బలమును క్షీణింపఁజేసి వారి యుద్ధమును ఆపివేయును అని పైగంబరులవారికి దేవుని సెలవయ్యెను. ఒహుదుయుద్ధము పిదప అబూసుఫ్యాను యుద్ధమునకు ముసల్మానులు రావలసినదిఅని పలికెను. దానికి హజ్రత్ పైగంబరులవారు ఒప్పుకొని మరుసటి సంవత్సరము పైగంబరులవారు దేవుని సెలవుచొప్పున బయలుదేఱిరి. వారివెంట డెబ్బదిమంది శిష్యులుండిరి. కాని అబూసుఫ్యానుభీతిల్లి యుద్ధమునకురాలేదు. ఇట్లు దేవుఁడుఅవిశ్వాసుల యుద్ధమును ఆపివేసెను. అవిశ్వాసులకు భయపడి యుద్ధము చేయఁజాలని వారు ఎట్లు దేవుని శిక్షను, ఆతని యుద్ధమును సహింపఁగలరు! 85. ఎవరినైన మంచి సిఫారసుచేసి యొకరికి మేలు కలిగించినచో ఆ పుణ్యమందు భాగము లభించును. అటులే చెడ్డ సిఫారసుచేసినచో పాప భాగము లభించును. కావున మంచి సిఫారసు చేయవలెను. ఇందు ధర్మయుద్ధమునకై ప్రేరేపించుట చేరినది. దేవుఁడు సర్వశక్తుఁడు కర్మలకుఁ దగినట్లు పాప పుణ్యము లొసంగుట ఆతనికి సులభమైన పని. 86. ఈ వాక్యములో ముసల్మానులు కలిసినపుడు ఒకరినొకరు దీవించు విషయము చెప్పఁబడినది. ఎవరైన సలాము మొదలగు దీవనలు చేసినచో వినువారు దానికి బదులు చెప్పవలెను. ఆ పదములనే తిరిగి చెప్పవలెను.

లేక దానికంటె నెక్కువ మంచి పదములు పలుకవలెను. అస్ సలాము అలైకుమ్ అని చెప్పినచో తిరిగి వ అలైకుముస్ సలామ్ అనియు లేక అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహి అని చెప్పవలెను. ఇదియును దేవుని సన్నిధానమున మంచి సిఫారసు చేయు దానిలో చేరినది. సలామునకు అర్థము దేవుఁడు మిమ్మును సంరక్షించుగాత అని. దేవునియొద్ద అన్ని కర్మలలెక్కయున్నది. దానిననుసరించి ఫలిత మిచ్చును. 87. అందఱు మానవులను దేవుఁడు పునరుత్థానదినమున ఒకచోట చేర్చి వారి కర్మల తీర్పుచేయును. అందు ఏలాటి సందేహాము లేదు. దేవుని వాక్కు సత్యమైనది. కావున పైఁ జెప్పఁబడిన ధర్మములను బాగుగ ఆచరింపవలెను. అందు నేలాటి సోమరితనము వహింపరాదు.

88. ఫమాలకుమ్-ఫిల్-మునాఫికీన-ఫిఅతైని వల్లాహు-అర్కసహుమ్-బిమా-కసబూ-అ-తురీదూన-అన్-తహ్దూ-మన్-అజల్-లల్లాహు-వమన్-యుజ్లిలిల్లాహు-ఫలన్ తజిద-లహూసబీలా.89. వద్దూ-లౌతక్-ఫురూన-కమా-కఫరూ-ఫతకూనూన-సవాఅన్-ఫలాతత్-తఖిజూ-మిన్-హుమ్-ఔలియాఅ-హత్తా-యుహాజిరూ-ఫీసబీలిల్లాహి-ఫఇన్-తవల్-లౌ-ఫఖుజూహుమ్-వఖ్-తులూహుమ్-హైసు-వజత్-తుమూహుమ్-వలాతత్ తఖిజూ-మిన్-హుమ్-వలియ్యన్-వలానసీరా.90.ఇల్-లల్లజీన-యసిలూన-ఇలా-ఖౌమిమ్-బైనకుమ్-వబైనహుమ్-మీసాఖున్-ఔజాఊకుమ్-హసిరత్-సుదూరుహుమ్-అన్ యుఖాతిలూకుమ్-ఔ-యుఖాతిలూ-ఖౌమహుమ్-వలౌ-షాఅల్లాహు-లసల్లతహుమ్-అలైకుమ్ ఫలఖాతలూకుమ్-ఫ-ఇ-నిఅతజలూకుమ్ ఫలమ్-యుఖాతిలూకుమ్-వ-అల్-ఖౌ-ఇలైకుముస్-సలమ-ఫమా-జఅలల్లాహు-లకుమ్-అలైహిమ్-సబీలా,

88. ఓ ముసల్మానులారా! మీకేమైనది. మీరు వంచకుల విషయమున రెండుసంఘములుగా చీలిపోయినారు. మఱియు దేవుఁడు వారు చేసినకర్మలవలన వారిని మరలించెను. ఏమిమీరు దేవుఁడు ఎవరిని సన్మార్గమునుండి తప్పించెనో వారిని సన్మార్గమునకుఁ దెచ్చుటకు కోరుచున్నారా! మఱియు దేవుఁడు ఎవరిని సన్మార్గము నుండితప్పించెనో వారికిఁగానునీవుఏమార్గమును పొందఁజాలవు.89. వారు అవిశ్వాసులైనట్లు మీరును అవిశ్వాసులై వారికి సమానులయి పోవలెనని వారుకోరుచున్నారు. కావున వారుతమ గృహములను విడిచి దేవునిమార్గమందు వయలుదేఱి రానంతవఱకు వారిలో నెవ్వరితోనైనను సఖ్యము చేసికొనకుఁడు,

ఆపిదప వారు తిరస్కరించినచో వారిని పట్టుకొనుడు. మఱివారు మీ కెచ్చట దొరకుదురో అచ్చట నే వారిని వధింపుడు మఱివారిలో నెవ్వని నైనను స్నేహితునిగా గాని సహాయునిగా గాని చేసికొనకుడు. 90. కాని మీరు ఎవరితో ఒడంబడిక చేసికొనియున్నారో వారితో కలిసికొన్న వారినిగాని లేక ఎవరు మీతో గాని వారికులము వారితో గాని యుద్ధము చేయుటకు వారిహృదయములు సంకటపడుచు మీ యొద్దకు వచ్చిన వారిని మీరుపట్టకుడు. మఱియు చంపకుడు. మఱియు దేవుడు కోరినచో మీకంటె వారికెక్కువ బలమిచ్చియుండును. అపుడు వారుమీతో యుద్ధము చేసియుందురు. కావున వారుమిమ్ము విడిచి పోయి మీతో యుద్ధము చేయక మీతో సంధిచేసికొన్నచో (మీరు వారితో రోధించుటకు) దేవుడు వారినిగూర్చి మీకు త్రోవయియ్యలేదు.

వ్యా॥ 88. వంచకులు తమ హృదయములలో అవిశ్వాసముంచుకొని ముసలానుల శత్రువులకు తోడుపడుచు కుట్రలు సలుపుచుండిరి. అట్టి వంచకుల విషయము ముసల్మానులలో అభిప్రాయ భేదము గలిగి వంచకులను వదలిపెట్ట వలెను; వారితో కలిసిమెలసి యుండరాదు. అని కొందఱు వంచకులతో కలిసియుండి వారిని బోధించి సన్మార్గమునకు మరల్ప వలెనని కొందఱును పలుక సాగిరి. దానిఁ గూర్చి దేవుడు ముసల్మానులకు వంచకుల వాస్తవ విషయము దెలుపుచు ముసల్మానులు వంచకులఁగూర్చి అభిప్రాయ భేదములు పడక ఒకే అభిప్రాయముగలిగి వారిని వదలిపెట్టవలెను. వారి కర్మలఫలితముగ వారికి సన్మార్గము లభింపలేదు. విశ్వాసముచూపియు వంచనవలనతిరిగి అవిశ్వాసమునకు మరలిరి. ఇట్టివారిని ఓ ముసల్మానులారా! మీరు సన్మార్గమునకు దెచ్చుట అసంభవము మానవులను సన్మార్గమునకు తెచ్చుటయును సన్మార్గము నుండి తప్పించుటయును దేవుని చేతిలోనున్నది. కావున ఆచింతమీకుండకూడదు. 89, వంచకులు తాము అవిశ్వాసులు గానున్నదిగాక మిమ్ము కూడ అవిశ్వాసులుగా చేయవలెనని కోరుచున్నారు. అట్టివంచకులతో, వారుతమ గృహములను వదలి స్థిరమైన విశ్వాసము వహించి మీయొద్దకు రానంతవఱకు వారితో సఖ్యముచేసికొనకుడు. వారికితోడు పడకుడు. అట్లు వారు కుట్రలువదలక విశ్వసింపకున్నచో మీచేతికి చిక్కినపుడు వారినిపట్టి ఖైదీలుగాచేసికొనుడు. మఱియు పోరాడునట్టివారిని వధింపుడు. 90. కాని మీతో సంధిచేసికొని ఒడంబడికగావించుకొని యున్న వారితో ఆవంచకులు కలిసికొని వారితో సంబంధము గలిగించుకొన్నచో వారును సంధిలోచేరిన వారగుదురు కావున వారిని పట్టకుండు, వధింపకుడు. అటులే వారుమీతో యుద్ధముచేయలేక మఱియు మీపక్షము చేరి తమకులము వారితో యుద్ధముచేయక వేఱుగానుండగోరి మీతో సంధి చేసికొని దానిషరతులను పూర్తి చేయునట్టి వారినికూడ పట్టకుడు వధింపకుడు

దేవుని అనుగ్రహమువలన వారుమీకు భయపడి యుద్ధముచేయలేక సంధికివచ్చి నారు. కావున వారిని పట్టుటయు చంపుటయు మీకు న్యాయముకాదు. దేవుఁడు కోరినచో వారికి ధైర్యమునొసంగి మీతోయుద్ధముచేయునట్లు వారిని చేయును. కావున ప్రతిసమయములో న్యాయమును పాటింపుఁడు.

91. స-తజిదూన-ఆఖరీన-యురీదూన-అన్-యామనూకుమ్- వయామనూ-ఖౌమహుమ్-కుల్లమా-రుద్దూ-ఇలల్-ఫిత్-నతి-ఉర్కిసూ-ఫీహా-ఫఇల్-లమ్ యఅ-తజిలూకుమ్-వ-యుల్-ఖూఇలైకుముస్-సలమ-వయకుఫ్ఫూ-ఐది- యహుమ్-ఫఖుజూహుమ్-వఖ్-తులూహుమ్- హైసు-సఖిఫ్తుమూ-హుమ్ - వఉలాఇకుమ్-జఅల్నా-లకుమ్-అలైహిమ్-సుల్-తానమ్-ముబీనా.

91. మీనుండియు తమ కులమువారినుండియు రక్షణపొందఁగోరు నట్టి యితర వంచకజనులను మీరుచూచెదరు. సమయముదొరుకునప్పుడెల్ల ఉపద్రవములు వారు చేయుదురు. కావున వారు మిమ్ము వదలక మీతో సంధిచేసికొనక తమ చేతులను (యుద్ధమునుండి) ఆపుకొనకయున్నచో వారిని పట్టుకొనుఁడు. మఱియు వారు మీకెచ్చట దొరకుదురో అచ్చట వారిని చంపుఁడు. మఱియు వారినిగూర్చి మీకు స్పష్టమైన సన్నదు నిచ్చియున్నాము.

వ్యా॥ 91. అసదుగత్ఫాను అను కుటుంబములవారు మదీనాపురమునకు వచ్చి ముసల్మానులయొద్ద రక్షణ (అభయము) పొందుటకు ఇస్లామ్‌లో చేరి యొడంబడిక చేసికొని తమ జాతివారియొద్దకుపోయినపుడు ముసల్మానులతో యుద్ధము చేయము అని వారితో కలిసికొనుచు ముసల్మానులయొద్దను తమ కులమువారియొద్దను రక్షణ (అభయము) పొందఁగోరుదురు, వారు తమ కరారుపై నుండక సమయము దొరకనిచో తమ కులమువారు బలవంతులైనచో తమ ఒడంబడికకు వ్యతిరేకముగ తమ జనుల పక్షమునచేరి ముసల్మానులతో యుద్ధము మొదలగు ఉపద్రవములు చేయుచుండిరి. అట్టి ద్రోహులను, వదలిపెట్టఁగూడదు. వారు తమ యొడంబడిక ప్రకారము ముసల్మానులతో యుద్ధమాడుటను వదలిపెట్టి సంధిచేసికొనక యుద్ధము చేసినచో వారు పూర్వము చేసిన సంధి షరతులు తెగిపోవును. వారట్లు ద్రోహముచేసినందున ముసల్మానులు వారితో యుద్ధము చేయుటకు సనదు సరియైన కారణము (ప్రమాణము) లభించును. అపుడు వారిని పట్టి ఖైదుచేయవచ్చును. యుద్ధముఁగోనఁలికవచ్చును.

92. వమాకాన-లిమూమినిన్-అన్-యఖ్-తుల-మూమినన్-ఇల్లా-ఖతఅన్ వ-మన్-ఖతల-మూమినన్-ఖతఅన్-ఫతహ్రీరు-రఖబతిమ్-మూమినతిన్-వదియతు

మ్-ముసల్లమతున్-ఇలా-అహ్లిహీ-ఇల్లా-అన్-యస్సద్దఖూ-వఇన్-కాన-మిన్-ఖౌమిన్-అదువ్విల్-లకుమ్-వహువ-మూమినున్-ఫతహ్రీరు-రఖబతిన్-మూమినతిన్-వఇన్-కాన-మిన్ ఖౌమిమ్-బైనకుమ్ వబైనహుమ్-మీసాఖున్-ఫదియతుమ్ ముసల్లమతున్-ఇలా-అహ్లిహీ-వతహ్రీరు-రఖబతిమ్-మూమినతిన్-ఫమల్-లమ్-యజిద్-ఫసియాము-షహ్రైని-ముతతాబిఐని-తౌబతమ్-మినల్లాహి-వకానల్లాహు-అలీమన్-హకీమా. 93. వమన్-యఖ్తుల్-మూమినమ్-ముతఅమ్మిదన్-ఫజజాఉహూ-జహన్నము-ఖాలిదన్-ఫీహా-వగదిబల్లాహు-అలైహి-వ-లఅనహూ-వ-అఅద్దలహూ-అజాబన్-అజీమా.

92. మఱి పొరపాటులో తప్ప ఒక ముసల్మానుఁడు మఱియొక ముసల్మానుని చంపఁడు. మఱెవఁడైన పొరపాటులో ముసల్మానుని చంపినచో అతఁడు ఒక ముసల్మానుబానిసను స్వేచ్ఛాపరునిగా (ఆజాద్) చేయవలెను. మఱి హత్యకు పరిహారధనము వధింపఁబడినవాని యింటివారికి నొసంగవలెను. కాని వారు క్షమించివేసినచో (అక్కఱలేదు). మఱి వధింపఁబడినవాఁడు ముసల్మానుఁడై మీ శత్రువులకు చేరినవాఁడైనచో ఒక ముసల్మాను బానిసను స్వేచ్ఛాపరునిగా చేయవలెను. మఱియు వధింపఁబడినవాఁడు, మీరు ఒడంబడిక గావించుకొనియున్న జనులకు చేరినవాఁడైనచో హత్యకు పరిహారధనము అతనియింటివారి కిచ్చి వేయవలెను. మఱియు ఒక ముసల్మాను బానిసను స్వేచ్ఛాపరునిగా చేయవలెను. మఱియు శక్తిలేనివాఁడు వరుసగ రెండు నెలలు ఉపవాసముండవలెను. ఇది దేవుఁడు క్షమించుటకుఁగాను విధించెను. మఱియు దేవుఁడు సర్వజ్ఞుఁడును వివేచనాపరుఁడును. 93. మఱియు నెవఁడు కావలెనని యుద్దేశించి ముసల్మానుని చంపునో వానికి శిక్ష నరకము. అందు వాఁడు చిరకాలముండును. మఱియు వానిపై దేవుని కోపమును శాపమును గలుగును. వానికిఁగాను ఘోరబాధ సిద్ధమై యున్నది.

వ్యా॥ 92. ఈ వాక్యములో హత్యనుగూర్చిన ధర్మములు గలవు. కా వలెనని ముసల్మానుని చంపుట ఘోరపాతకము. పొరపాటులో చంపినదానికి పరిహారముగలదు. పొరపాటులో చంపుటకు ఉదాహరణములు. వేటాడునపుడు దూరములో జంతువు అని కొట్టినపుడు అచ్చట ముసల్మానునకు తగులుట. లేక బాణము తుపాకి తప్పిపోయి తగులుట. యుద్ధసమయములో ఎవఁడైన ముసల్మానుఁడు కాఫర్లలో కలిసియున్నపుడు అతఁడు ముసల్మానుఁడు అని తెలియక చంపుట, అట్లు పొరపాటులో వధించిన వానిని దేవుఁడు క్షమింపవలె

నన్ను శక్తియున్నచో ఒక ముసల్మాను బానిసను స్వేచ్ఛాపరునిగా (ఆజాద్) చేయవలెను. శక్తిలేనిచో వరుసగ రెండు నెలలు పూర్తిగ ఉపవాసములుండ వలెను. ఇది దేవుని హుక్కు. ఎవరును క్షమింపలేరు. చంపఁబడినవాని ఇంటి వారికి అనగా ఆతని వారసులకు హత్యకు బదులుగ దాదాపు రెండువేల ఏడు వందల నలుబది రూపాయలు మూఁడు సంవత్సరములలోపల కిస్తువారిగ ఇయ్య వలెను. దీనినే దియత్ (ఖూన్‌బహా) అనుదురు. ఆ ధనమును తీసికొనకవార సులు క్షమించిన క్షమింపవచ్చును. చంపఁబడినవాని వారసులు, ముసల్మాను లుగా గాని లేక కాఫర్లుగా గాని యుండి వారి మధ్యను ముసల్మానులమధ్య ను సంధివలన సఖ్యమున్నచో వాని వారసులకు పరిహారధనము ఇయ్యవలెను. చంపఁబడినవాని వారసులు కాఫర్లుగానుండి వారికిని ముసల్మానులకునుసఖ్యము లేక విరోధమున్నచో వాని వారసులకు పరిహారధనము ఇయ్యనక్కఱలేదు. బానిసను వదలుట లేక ఉపవాసములుండుట పై మూఁడు విధములలోను తప్పని విధి. దీనివలన దేవుఁడు వాని పాపమును క్షమించి మన్నించును, 93. ఈవాక్య ములో కావలెనని ఉద్దేశించి ముసల్మానుని చంపినవానిగూర్చి చెప్పఁబడినది. అట్టివానికి ఇహలోకములోను శిక్షగలదు. పరలోకములోను ఘోరనరకబాధ గలదు, ఇహమునందు, హత్యధర్మము ననుసరించి వాఁడు అధికారిచే వధింపఁ బడును. దేవుని కోపమునకును శాపమునకును శిక్షకును పాత్రుఁడగును. అట్టి వాదిగతి యేమగునో చదువరులే యూహింపవలెను. కావున ముసల్మానులు అట్టి హత్యలు గావింపరాదు.

94. యాఅయ్యుహల్లజీన-ఆమనూ-ఇజా-జరబ్‌తుమ్‌ఫీ సబీలిల్లాహి-ఫతబ య్యనూ-వలాతఖూలూ-లిమన్-అల్‌ఖా-ఇలైకుముస్-సలామ-లస్‌త-ముమిన న్‌తబ్-త-గూన-అరజల్-హయాతిద్-దున్యా-ఫఇనదల్లాహిమగానిము-కసీరతున్- కజాలిక-కున్తుమ్-మిన్-ఖబ్లు-ఫ-మన్నల్లాహు-అలైకుమ్-ఫతబయ్యనూ- ఇన్నల్లా హా-కాన-బిమా-తఅమలూన-ఖబీరా.

94. ఓవిశ్వాసులారా! మీరు దేవుని మార్గమందు (యుద్ధమునకు) ప్ర యాణము చేయునపుడు బాగుగ విచారింపుఁడు, మఱి మీకు సలాముచేసిన వా నిని నీవు ముసల్మానుఁడవు కావు అని చెప్పకుఁడు. ఇహలోక జీవితఫలము లను మీరు కోరుచున్నారా! దేవునియొద్ద అనేక ఫలితము(గనీమతు)లున్నవి. దీనికి పూర్వము మీరును ఇటులేయుంటిరి. ఆ పిదప దేవుఁడు మిమ్ము అను గ్రహించెను. కావున విచారింపుఁడు. నిశ్చయముగ దేవునికి మీరు చేయునది తెలియును,

వ్యా॥ 94. హజ్రత్ పైగంబరులవారు శత్రువులతో యుద్ధముచేయుటకై ముసల్మానుల సైన్యమును పంపిరి. ఆశత్రువులలో ఒక్కడు ముసల్మానుడుండెను. ఆతడుతన సొత్తును పశువులను వేఱుగాఁజేసికొని నిలిచియుండి ముసల్మానుల సైన్యమునుచూచి కలిమాచదివి సలాముచేసెను. ముసల్మానులు ఆతనిని కపటిగానెంచి ప్రాణ ధనముల రక్షణకుఁగాను నటించుచున్నాఁడని భావించి వాస్తవము విచారింపకనే వానిని వధించి వానిసొత్తును విజయధనముగ తీసికొనిరి. దీనిగూర్చి దేవుఁడు ఈ వాక్యములో ముసల్మానులకు బుద్ధి చెప్పెను. ముందు విచారింపవలెను. సలాముచేసి కలిమాచదివిన వానిని ముసల్మానునిగ భావింపవలెను. హృదయములోని అవిశ్వాసము ఎవరికిఁతెలియదు. కావున ఆ బాధ్యత మీకులేదు. దానిగూర్చి దేవుఁడు చూచుకొనును. దీనికి ముందు మీరుకూడ ఇస్లాములోఁజేరినపుడు కలిమా (లాఇలాహాఇల్-లల్లాహుముహమ్మదుర్-రసూలుల్లాహి) పలికియే మీ ప్రాణధనములను కాపాడుకొంటిరి. కావున ముసల్మానులెవరు, అవిశ్వాసులెవరు అని విచారింపకయే ఇహలోక తుచ్ఛములగు కొల్లసొత్తునకుఁగాను చంపకుఁడు. దేవుని యొద్ద గొప్ప ఫలితము లున్నవి. ఆతఁడు మీకు చాల నొసంగును. మీరుచేయునది సర్వము దేవునికిఁతెలియును. కావున జాగ్రత్తగనుండుఁడు.

95. లాయస్తవిల్-ఖాఇదూన-మినల్-మూమినీన-గైరుఉలిజ్-జరరి వల్-ముజాహిదూన-ఫీసబీలిల్లాహిబిఅమ్వాలిహిమ్-వఅన్-ఫుసిహిమ్-ఫజ్జలల్లాహుల్-ముజాహిదీన- బిఅమ్వాలిహిమ్-వఅన్ఫుసిహిమ్-అలల్-ఖాఇదీన- దరజతన్-వకుల్లన్-వఅదల్లాహుల్-హుస్నా-వఫజ్జలల్లాహుల్-ముజాహిదీన-అలల్ ఖాఇదీన-అజ్రిన్-అజీమా. 96. దరజాతిమ్-మిన్హు-వమగ్ఫిరతన్-వరహ్మతన్ వకానల్లాహు-గఫూరర్-రహీమా.

95. ఏలాటి లోపములులేక యింటకూర్చుండు ముసల్మానులును, తమ ధనమును ప్రాణమును వినియోగించి దేవుని మార్గమందు ధర్మయుద్ధము సలుపు ముసల్మానులును సరిసమానులుకారు. ఇంటకూర్చుండియుండు వారికంటె ఎవరు తమ ధనమును ప్రాణమును వినియోగించి ధర్మయుద్ధము సలుపుదురో వారికి దేవుఁడు ఇంటకూర్చుండియుండువారి కంటె గొప్ప పదవి నొసంగియున్నాఁడు. మఱియు ఆతఁడు అందఱకును మంచి వాగ్దానముచేసియున్నాఁడు. మఱి ఇంట కూర్చుండియుండువారికంటె ధర్మయుద్ధము సలుపువారి పుణ్యఫలితము దేవుఁడు హెచ్చుగాఁజేసియున్నాఁడు. 96. ఆతనియొద్దనుండి వారికి

గొప్ప పదవులును, క్షమాపణయును, కృపయునుగలుగును. మఱియు దేవుఁడు క్షమించువాఁడును దయాళువును.

వ్యా॥ 95. ఇందు ధర్మయుద్ధము (జహాదు) నకై ముసల్మానులకు ప్రోత్సాహము గలదు. మునుపటి వాక్యములలో పొరపాటుగ ముసల్మానులను వధించుటనుగూర్చి మందలింపుండెను. అందుకు ముసల్మానులు ధర్మయుద్ధము మాను కొనుదురేమో అను సంశయముగలిగెను. ఎందుకన యుద్ధములో అట్టి పొరపాట్లు సంభవించును. దానికిఁగాను దేవుఁడు ధర్మయుద్ధమునకై ముసల్మానులను ప్రోత్సాహపఱచుచు పొరపాట్లను క్షమించువాఁడనని చెప్పెను. గ్రుడ్డి, కుంటి, మొదలగు అంగహీనులును, యుద్ధముచేయలేని రోగులును తప్ప ఇతర ముసల్మానులు సమయము పడినపుడెల్ల యుద్ధము సలుపవలెను. అందుకొందఱు యుద్ధమునకుపోని యెడల యుద్ధవీరులకు లభించిన పుణ్యఫలితములు పరలోక రాజ్యపదవులు, ఎట్టి లోపము (కుంటితనము గ్రుడ్డితనము) లేక యింటఁ గూర్చుండు వారికి లభింపవు. ప్రాణములు, ధనములు దేవుని మార్గమందు వినియోగించు యుద్ధవీరులును ఇంటకూర్చుండియుండువారును సరిసమానులు కారు. యుద్ధవీరులకు గొప్ప పదవులుగలవు. కొందఱు ముసల్మానులు యుద్ధము కొందఱుచేయనిచో అందఱిబాధ్యత తీరును. అందఱును వదిలినచో సర్వులును పాపులగుదురు. కావున ముసల్మానులు తమ ధర్మస్వాతంత్ర్యములనుకాపాడుటకు పోరాడుచుండవలెను.

97. ఇన్నల్లజీన-తవఫ్-ఫాహుముల్-మలాఇకతు-జాలిమీ-అన్-ఫుసి-హిమ్ ఖాలూ-ఫీమ-కున్తుమ్-ఖాలూ-కున్నా-ముస్ - తజ్-అఫీన-ఫిల్-అర్ జి-ఖాలూ-అలమ్ తకున్-అర్ జుల్లాహి-వాసిఅతన్-ఫ తుహా-జిరూ-ఫీహా-ఫ-ఉలాఇక-మావాహుమ్-జహన్నము-వసాఅత్.మసీరా. 98. ఇల్-లల్-ముస్ తజ్ - అఫీన-మినర్-రిజాలి-వన్-నిసాఇ-వల్-విల్దాని-లా-యస్ - తతీ ఊన-హీలతన్-వలా-యహ్తదూన-సబీలా. 99. ఫ-ఉలాఇక-అసల్లాహు-అన్-యఅ-ఫు-వ-అన్ హుమ్-వకానల్లాహు-అఫువ్వన్-గఫూరా. 100. వమన్-యుహాజిర్-ఫీసబీలిల్లాహి-యజిద్ ఫిల్ అర్ జి-మురాగమన్-కసీరన్-వసఅతన్-వ-మన్-యఖ్రుజ్ - మిమ్-బైతిహీ-ముహాజిరన్-ఇలల్లాహి-వరసూలిహీ-సుమ్మ-యుద్-రిక్ హుల్-మౌతు-ఫఖద్-వఖఅ-అజ్రుహు-అలల్లాహి-వకానల్లాహు-గఫూరర్-రహీమా.

97. ఎవరు తమ యాత్మలకు అన్యాయముచేసి కొనిరో వారి ప్రాణ

ములను దేవదూతలు తీయునపుడు మీ రేస్థితిలోనుంటిరి అని వారి నడుగఁగా వారు మేము బలహీనులముగా దేశములోనుంటిమి అని పలుకుదురు. అపుడు దేవదూతలు. దేవునిభూమి విశాలమైనదిగా లేకుండెనా! మీరు మీజన్మదేశమును వదలి అందుపోయియుండవలసినది గదా అని పలుకుదురు. కావున అట్టి వారి నివాసము. 98. ఏలాటి యత్నము చేయఁజాలక, ఏలాటి దారియును పొందఁజాలక నిజముగ బలహీనులుగనున్న పురుషులను, స్త్రీలను బిడ్డలను. 99. దేవుఁడు సమీపములోనే క్షమించును. మఱియు దేవుఁడు క్షమించువాఁడును, అనుగ్రహించువాఁడును. 100. మఱియు నెవఁడు దేవునిమార్గమందు తన జన్మభూమినివదలి పోవునో ఆతఁడు భూమిలో చాల స్థలమును సంపత్సౌకర్యములను పొందును. మఱెవఁడు తన యింటినివదలి దేవునియొక్కయు ఆతని ప్రవక్తయొక్కయు సన్నిధికి పోవలెనని బయలుదేఱిన పిదప ఆతనికి చావువచ్చునో ఆతని పుణ్యఫలితము దేవుని యొద్ద స్థిరమాయెను. దేవుఁడు క్షమించువాఁడును దయాళువును.

వ్యా॥ 97. ముసల్మానులు అవిశ్వాసుల రాజ్యములోనుండి తమ మతధర్మములను నిరాటంకముగా చేయలేనపుడు బలముగలిగినచో ముసల్మానులు ధర్మయుద్ధము (జిహాద్) చేసి స్వాతంత్ర్యముపొంది మతధర్మములను ఆచరింపవలెను, అట్టియుద్ధముచేయలేనపుడు పోవశక్తిగలవారు ముసల్మానుల రాజ్యమునకు తమ జన్మభూమిని వదలిపోవలెను. లేనిచో పాపులగుదురు. వాస్తవముగ బలహీనులై తమ జన్మభూమిని వదలలేని ముసల్మానుల పాపము దేవుఁడు క్షమించును అని ఈ వాక్యములలో చెప్పఁబడినది. 100. ఈ వాక్యములో దేవుని కొఱకు తమ జన్మభూమిని వదలిపోవుటకు ప్రోత్సాహము గలదు. జన్మభూమిని వదలిపోయినచో పరదేశములో కష్టమగుననియు వారికి మధ్యలో చావు వచ్చునను అనియు భీతినొందరాదు. దేవుని అనుగ్రహమువలన పరదేశములో నివసించుటకు చాలచోటును, సంపదయు సౌకర్యములును లభించును. దారి మధ్యలో చనిపోయినచో, పుణ్యము లభించును. చావు రావలసినకాలమునకువచ్చును, కావునదానికిభీతిల్లరాదు. జన్మభూమివదలి పోవుటకుహిజ్రత్ అనిపేరు.

101. వఇజా-జరబ్తుమ్-ఫిల్ అల్ జి-ఫలైస-అలైకుమ్-జునాహున్-అన్-తఖ్సురూ-మినస్-సలాతి-ఇన్-ఖిఫ్తుమ్-అన్ యఫ్-తిన-కుముల్లజీన - కఫరూ-ఇన్నల్-కాఫిరీన-కానూ-లకుమ్-అదువ్వమ్-ముబీనా.

101. మఱియుమీరు భూమిలో ప్రయాణము చేయునపుడు, మిమ్మవిశ్వాసులు హింసింతురు అనుభయము మీకున్నచో, మీరునమాజులో కొంత

భాగము తగ్గించినచో మీకుదోషములేదు. నిశ్చయముగా అవిశ్వాసులు మీకు స్పష్టమైన శత్రువులు.

వ్యా॥ 101. ప్రయాణికులు నాలుగురకాతులుగల ఫరజ్ నమాజులలో రెండు రకాతులు తగ్గించి రెండు రకాతులుమాత్రము చేయవలెను. రకాతు అనగా నమాజులో ఒక్క ఖియాము (నిలుచుట) ఒక్క రుకు రెండుసిజ్దాలు. మొదట ప్రయాణములో శత్రుభయ మున్నచో నమాజును తగ్గింప వలెను అని ధర్మ ముండెను. ఆపిదప శత్రుభయమున్నను లేకున్నను నాలుగు రకాతుల నమాజు రెండు రకాతులుగానే చేయవలెను అని విధింపఁబడెను. ఇప్పుడు కూడప్రయాణముచేయు ముసల్మానులు నమాజును తగ్గించి చేయవలెను. దీనినే నమాజె ముసాఫిర్ అనుదురు. ప్రయాణము మూఁడు మన్జిలు అనఁగా 48 మైళ్ళదూర ముండవలెను. దానికిఁ దగ్గిన ప్రయాణములో నమాజు యథాప్రకారముగా నాలుగు రకాతులు చేయవలెను.

102. వ-ఇజా-కున్-ఫీహిమ్-ఫఅఖమ్త-లహుముస్సలాత-ఫల్తఖుమ్-తాఇఫతుమ్-మిన్హుమ్-మఅక-వల్యాఖుజూ- అస్లిహతహుమ్- ఫఇజా-సజదూ-ఫల్యకూనూ-మిన్-వరాఇకుమ్-వల్-తాతి-తాఇఫతున్-ఉఖ్రా- లమ్-యుసల్లూ-ఫల్-యుసల్లూమఅక వల్-యాఖుజూ-హిజ్రహుమ్-వఅస్-లిహతహుమ్-వద్దల్లజీన-కఫరూ-లౌతగ్-ఫులూన-అన్-అస్-లిహతికుమ్-వఅమ్తి - అతికుమ్-ఫ-యమీలూన-అలైకుమ్ మైలతన్-వాహిదతన్- వలాజునాహ-అలైకుమ్ ఇన్కాన-బికుమ్-అజమ్-మిమ్మతరిన్ ఔకున్తుమ్-మర్జా-అన్-తజఊ-అస్లిహతకుమ్-వఖుజూ-హిజ్-రకుమ్-ఇన్నల్లాహ-అఅద్ద-లిల్కాఫిరీన-అజాబమ్-ముహీనా. 103. ఫఇజా- ఖజైతుముస్ సలాత-ఫజ్కురుల్లాహ-ఖియామన్-వ-ఖుఊదన్ వఅలా-జునూబికుమ్ ఫఇజత్-మానన్తుమ్ ఫఅఖీముస్సలాత - ఇన్నస్-సలాత-కానత్-అలల్-మూమినీన-కితాబమ్-మౌఖూతా. 104. వలాతహినూ- ఫిబ్-తిగా-ఇల్-ఖౌమి-ఇన్తకూనూ-తా-లమూన-ఫఇన్నహుమ్-యాలమూన-కమాతాలమూన-వతర్జూన-మినల్లాహి-మా లాయర్జూన-వకానల్లాహు- అలీమన్-హకీమా.

102. నీవు ముసల్మానులతోఁ గూడియున్నపుడు వారిని నమాజుకుఁగాను

నిలువబెట్టినపుడు వారిలో కొందఱు తమ ఆయుధములు తీసికొని నీవెంట
నమాజులో నిలువవలెను. మరల వారు సిజ్దా చేసిన పిదప మీ వెనుకకు పోవలెను.
మఱియు నింకను నమాజు చేయకయున్న వారలు నీతో గూడి నమాజు సలుపవలెను.
మరల వారు తమ రక్షకవచమును తమ ఆయుధములను తీసికొనవలెను. మీరు
మీ ఆయుధములయెడను సామగ్రియెడను అజాగ్రత్తపడినచో ఒకేతూరి మీపై
పడవలెనని అవిశ్వాసులు కోరుచున్నారు. మీకు వానవలన కష్టము గలిగినచో
లేక మీరు రోగపీడితులైనచో మీరు మీ ఆయుధములను తీసియుంచిన దోష
ము లేదు. మఱియు మీరు మీ రక్షణమందు జాగ్రత్త గలిగియుండుడు. నిశ్చయ
ముగా దేవుఁడు అవిశ్వాసులకొఱకు అవమానకరమగు బాధ సిద్ధపఱచియున్నాఁడు.
103. మీరు నమాజును పూర్తి చేసిన పిదప నిలిచియు కూర్చుండియు పరుండి
యు దేవుని స్మరించుఁడు. ఆ పిదప మీకు శాంతి గలిగినపుడు నమాజును స్థిరముగా
సలుపుఁడు. నిశ్చయముగా నమాజు ముసల్మానులకు విధియైన ధర్మము. మఱియు
దానికి వేళ నియమింపఁబడియున్నది. 104. అవిశ్వాసులను వెంబడించుటలో
ధైర్యమును వీడకుఁడు. మీకు బాధ కలిగియున్నపుడు మీవలె వారికిని బాధ కలిగి
యున్నది. మఱి వారికి దేవునియందు లేనట్టి ఆశ మీకు దేవునియందు గలదు.
దేవుఁడు సర్వజ్ఞుఁడును వివేచనాపరుఁడును.

వ్యా॥ 102. ఇందు శత్రువులతో యుద్ధము జరుగునపుడు ఎట్లు నమాజు
చేయవలెనో అది చెప్పఁబడినది. యుద్ధరంగములో శత్రువులు ఎదురుగా
నున్నపుడు నమాజు వేళ వచ్చినచో, సైన్యములో సగము మొట్టమొదట ఇమా
ముతో కలిసి తన నమాజులో సగము భాగము చేసికొనవలెను. మిగిలిన సగ
ము సైన్యము శత్రువులకు నెదురుగా నిలిచియుండవలెను. మొదటివారు
నమాజు చేసికొనిపోయి శత్రువులకు నెదురుగా నిలిచిన పిమ్మట మిగిలిన సగ
ము సైన్యము వచ్చి ఇమాముతో సగము నమాజు చేసికొనిపోయి శత్రువులకు
నెదురుగా నిలువవలెను. మిగిలిన సగము నమాజు ఎచ్చట నిలిచినవారచ్చట
వేఱువేఱుగా చేసికొనవలెను. నమాజులో నిలుచునపుడు కవచము ఆయుధము
ధరించియే యుండవలెను. వాన, లేక రోగమువలన కష్టముగా నున్నపుడు
ఖడ్గము మొదలగు ఆయుధములు ధరింపకున్న దోషము లేదు. అపుడుకూడ రక్ష
కముగానున్న కవచమును, శిరస్త్రాణమును ధరించియే యుండవలెను. శత్రు
వులు సమయము చూచుచుందురు. మీరు అజాగ్రత్తగనున్నచో ఒకేతూరి
మీపైఁబడి మిమ్ము మార్తురు. కావున దేవుఁడు తన అనుగ్రహము వలన
పైని జెప్పిన విధమున నమాజు చేయుటకు సెలవిచ్చెను. దీనినే నమాజె ఖౌఫ్,
అనుదురు. యుద్ధరంగములో అంత అవకాశము దొరకనిచో, ప్రతి భటుఁడు
వేఱువేఱుగా వీలుగలిగినట్లు నిలిచి లేక కూర్చుండి, లేక స్వారిచేయుచు,

మాజు చేసికొనవలెను. అంతటి అవకాశముకూడ లేనపుడు నమాజును ఆపి రెండవ సమయములో దానిని పూర్తిచేసికొనవలెను. ముసల్మానులు దేవుని ఆజ్ఞ ననుసరించినచో వారికి అవిశ్వాసులు లోఁబడుదురు. కావున ముసల్మానులు అవిశ్వాసులకు భయపడకూడదు. 103. నమాజు ముగిసిన పిదప ముసల్మానులు తమ ప్రతి స్థితిలో దేవుని స్మరించుచుండవలెను. దానికి ఒకవేళ లేదు. ప్రతి నిమిషములోను దేవునిని ధ్యానించుచుండవలెను. భయము పోయి శాంతి గలిగినపుడు యథాప్రకారముగా భయభక్తులతో నమాజుసలుపవలెను. నమాజునకు వేళ విధింపఁబడినది. ఆయావేళకు ఆయానమాజు చేసితీరవలెను. నమాజు ధర్మమును ఆచరింపనివారు నిజమైనముసల్మానులు కానేరరు. ఉభయలోకముల విజయము నమాజునందు గలదు. 104. శత్రువులైన అవిశ్వాసులను వెంబడించుటలోను, వారిని వెదకుటలోను ముసల్మానులు ధైర్యమువీడకూడదు. యుద్ధములో ముసల్మానులకు గాయములు తగిలి బాధయున్నట్లు అవిశ్వాసులకును గాయములబాధగలదు. బాధయున్నది అని ధైర్యము వీడరాదు. ముసల్మానులకు దేవునియందు ఆశ గలదు. దేవుఁడు వారికి ఉభయలోకముల విజయ మొసంగునని నమ్మికకూడ గలదు. అట్లు అవిశ్వాసులకు ఆశలేదు, నమ్మిక లేదు. కావున ముసల్మానులు ధైర్యసాహసములతో శత్రువులకంటె మించిపోవలెను. దేవుఁడు సర్వజ్ఞుఁడును. యుక్తాయుక్త వివేచనాపరుఁడును. అను సెలవిచ్చు ధర్మములలో ముసల్మానులకు గొప్పలాభములు గలవు.

105. ఇన్నా-అన్-జల్నా-ఇలైకల్-కితాబ-బిల్-హఖ్ఖి-లి - తహ్కుమ-బైనన్-నాసి-బిమా-అరాకల్లాహు-వలా-తకుల్-లిల్-ఖాఇనీన - ఖసీమా. 106. వస్తగ్ఫిరిల్లాహ-ఇన్నల్లాహ-కాన-గఫూరర్-రహీమా. 107. వలా-తుజాదిల్-అనిల్లజీన యఖ్తానూన-అన్ఫుసహుమ్-ఇన్నల్లాహ - లాయుహిబ్బు మన్-కాన-ఖవ్వానన్-అసీమా. 108. యస్-తఖ్ఫూన-మినన్-నాసి-వలా-యస్తఖ్ఫూన-మినల్లాహి-వహువ-మఅహుమ్-ఇజ్-యుబయ్యితూన-మా - లాయర్జా-మినల్-ఖౌలి-వకానల్లాహు-బిమా-యఅమలూన-ముహీతా. 109.హా-అన్తుమ్-హా-ఉలాఇ-జాదల్తుమ్-అన్హుమ్-ఫిల్హయాతిద్-దున్యా - ఫమన్-యుజాదిలుల్లాహ-అన్హుమ్-యౌమల్-ఖియామతి-అమ్-మన్-యకూను - అలైహిమ్-వకీలా. 110. వమన్-యఅమల్-సూఅన్-ఔ-యజ్లిమ్- నఫ్సహు-

సుమ్మ-యస్తగ్-ఫిరిల్లాహ-యజిదిల్లాహ-గఫూరర్-రహీమా. 111. వమన్-యక్సిబ్-ఇస్మన్-ఫఇన్నమా-యక్సిబుహూ-అలా-నఫ్సిహీ- వకానల్లాహు-అలీమన్-హకీమా. 112. వమన్‌యక్సిబ్-ఖతీఅతన్-ఔ-ఇస్మన్-సుమ్మ-యర్మి-బిహీ-బరీఅన్-ఫఖదిహ్‌తమల-బుహ్తానన్-వ-ఇస్మమ్-ముబీనా.

105. దేవుఁడు నీకు సూచించిన ప్రకారము నీవు ప్రజలమధ్య న్యాయముగ తీర్పుచేయుటకై సత్యమైన గ్రంథమును నీకు మే మొసంగితిమి. మఱియు నీవు ద్రోహుల పక్షమున వాదింపకుము. 106. దేవుని క్షమాపణ వేఁడుము. నిశ్చయముగ దేవుఁడు క్షమించువాఁడు దయాళువు. 107. ఎవరు తమ యాత్మకు ద్రోహము చేసికొనుచున్నారో వారి పక్షమున నీవువాదులాడకుము. ద్రోహిని పాపిని నిశ్చయముగా దేవుఁడు ప్రేమింపఁడు. 108. వారు ప్రజలనుండి సిగ్గుపడుచున్నారు. వారు దేవునియెడ సిగ్గుపడుటలేదు. మఱి దేవునికి ఇష్టము కాని విషయమునుగూర్చి వారు రాత్రులలో ఆలోచించునపుడు దేవుఁడు వారితో నున్నాఁడు. మఱియు వారు చేయునది దేవునికి అధీనమైయున్నది. 109. మీరు వినుఁడు. మీరు వారి పక్షమున ఇహలోక జీవితమందు వాదులాడుచున్నారు. కాని తీర్పుదినము (ఖియామతు) నందు, వారి పక్షమున దేవునితో ఎవఁడు వాదులాడును. లేక వారికిఁగాను ఎవఁడు రక్షకుఁడు కాఁగలఁడు? 110. మఱెవఁడు పాపము చేయునో లేక తన యాత్మకు అన్యాయము చేసికొనునో వాఁడు ఆపిదప దేవుని క్షమాపణ వేఁడినచో వాఁడు దేవుని క్షమించువానిగను దయాళువుగను పొందును.111 మఱెవడుఏదైన పాపము చేసినచో వాఁడుతన యాత్మనష్టమే చేసికొనుచున్నాఁడు. మఱి దేవుఁడుసర్వజ్ఞుఁడు వివేచనాపరుఁడు.112. మఱెవఁడు తప్పుగాని పాపముగానిచేసి దానిని, నేరముచేయని వేఱొకనిపైమోపినచోఅట్టి వాఁడుతనతలపై అపనిందనుస్పష్టమైన పాపమునుధరించును.

వ్యా॥ 105. వంచకులు స్థిరమైన విశ్వాసములేనివారు ఏదైన పాపము గాని నేరముగానిచేసినచో దాని శిక్షనుండి తప్పించుకొనుటకును పేరుచెడకుండుటకును, పైగంబరులవారి సన్నిధికివచ్చి ప్రమాణములుచేయుచు, తంత్రముగా మాటలాడి తాము అమాయకులని రుజువుచేయుచు, ఆ నేరమును, ఇతరులపై మోపుటకు ప్రయత్నింతురు. అట్టి విషయములో పైగంబరులవారు న్యాయముగ తీర్పుచేయుటకై ఖురానెషరీఫు ధర్మముల ననుసరింపవలెను అని ఈ వాక్యములో బోధింపఁబడుచున్నది. పైగంబరుల వారి కాలములో ఒక ముసల్మానుఁడు, ఒక ముసల్మాను ఇంటిలో కన్నము వేసి ఒక పిండిమూటను కొన్ని ఆయుధములను దొంగిలించుకొని పోయెను. ఆ పిండిమూటకు రంధ్రముండిదాని

నుండి పిండిరాలుచుపోయెను. అదిచూచి దొంగ ఆ సొమ్మును తీసికొనిపోయి తన స్నేహితుఁడగు నొక యూదుని యింటిలో అమానతుగా దాఁచిపెట్టెను. ఉదయముకాగానే సొమ్ముపోయినవాఁడు పిండిగుర్తును బట్టి దొంగయింటికి పోయెను. వాని యింటిలో చూడగ సొమ్ములేకుండెను. ఆ పిదప పిండిజాడనుబట్టి యూదుని యింటిలోనికిపోయి చూడగవాఁడు ఫలానివాఁడుతెచ్చి పెట్టినాఁడు అని పలికెను. అపుడు దొంగిలించిన ముసల్మానుఁడును అతని కుటుంబమువారును, నేరము ఒప్పుకొనక, దానిని ఆ యూదునిపై మోపసాగిరి. దీనిగూర్చి తీర్పు పొందుటకై పైగంబరులవారియొద్దకు అందఱుపోయిరి. ముసల్మానులు, ప్రమాణములు చేయుచు, యూదుఁడే దొంగిలించినాఁడు అని పలువిధములుగ చెప్పుచు తప్పు సాక్ష్యము పలికిరి. యూదుఁడు నేరస్థుఁడు అను తీర్పు కానుండఁగా దేవుఁడు ఈ వాక్యములను పంపి వాస్తవమును దెలుపగా యూదుఁడు నేరగాఁడుకాఁడు. ఆ ముసల్మానుఁడే నేరగాఁడు అని ఏర్పడెను. దేవుని సెలవు ప్రకారము తీర్పుచేయవలెను. ద్రోహుల పక్షమున వాదింపరాదు అని పైగంబరులవారికిని అందఱు ముసల్మానులకును హెచ్చరిక గలిగెను. 106. వాస్తవము విచారింపకయే ద్రోహుల మాటలు విని నేరముచేయని యూదుని నేరగానిగాతలంచుట సరిగాదు. కావున దానిగూర్చి దేవుని క్షమాపణ వేడవలెను. దేవుఁడు క్షమించి అనుగ్రహించును అని పైగంబరువారికిని ఇతర ముసల్మానులకును హెచ్చరిక గలిగెను. 107, 108. ద్రోహులను దేవుఁడు ప్రేమింపఁడు. కావున అట్టివారికై దేవుని సన్నిధానమున క్షమాపణ వేఁడవలదు అని పైగంబరులవారితో పలుకుచు మోసగాండ్రు ప్రజలతో సిగ్గుపడుచు నేరము దాఁచుటకు యత్నించుచున్నారు. కాని సర్వమునుచూచుచు నెఱుంగు దేవునికి సిగ్గుపడుటలేదు. రాత్రిలలో దురాలోచనలు చేయుదురు. కావున అట్టి దుర్మార్గులనుగూర్చి సిఫారసు చేయవలదు అని హెచ్చరింపఁబడియె. ఎందుకన హజ్రత్ పైగంబరులవారు చాల మృదుహృదయులు. అందఱియందును దయగలవారు. కావున వారిని క్షమింపుము అని దేవుని వేఁడుట వారి స్వభావము. కావున అట్లువలదు అని దేవుఁడుసెలవిచ్చెను. 109. ఈ వాక్యములో, దొంగ పక్షమున వాదులాడినవారికి మందలింపు గలదు. తీర్పుదినమందు అన్ని రహస్యములు బయలుపడును. అపుడు దొంగను శిక్షనుండి రక్షించువారెవరు గలరు? 110. పాపము, నేరముచేసినవాఁడు భయభక్తులతో దేవుని క్షమాపణ కోరినచో దేవుఁడు దయగలవాఁడు కావున క్షమించును. కావున క్షమాపణ కోరవలెను. 111. నేరముచేయువాని శిక్ష నేరగానికే గలుగును. ఇతరులకుఁ గలుగదు. దేవునికి సర్వము దెలియును. యుక్తాయుక్తములు దెలిసిన వివేచనాపరుఁడు. కావున నేరమునకుఁదగిన శిక్ష

నేరగానికి యొసంగును. 112. పాపముగాని నేరముగానిచేసి దానిని నేర ముచేయని అమాయకునిపై మోపినచో వానికి రెండు పాపములగును. ఒకటి చేసిన నేరము. రెండవది పరులపై మోపిన అపనింద. ఆ రెంటిశిక్ష అనుభవిం చియే తీరవలెను. దానిపరిహారము దేవుని భయభక్తులతో క్షమాపణ వేడుటయే.

113. వలౌలా-ఫజ్లుల్లాహి-అలైక-వరహ్మతుహూ-లహమ్మత్-తా ఇఫతుమ్--మిన్-హుమ్ అన్-యుజిల్లూక-వమా-యుజిల్లూన-ఇల్లా-అన్ఫుసహు మ్-వమాయజుర్రూనక-మిన్-షైఇన్-వ-అన్జలల్లాహు-అలైకల్-కితాబ-వ ల్-హిక్మత-వ-అల్లమక-మాలమ్-తకున్-తలమ-వకాన-ఫజ్లుల్లాహి-అలైక అజీమా. 114.లా ఖైర-ఫీకసీరిమ్-మిన్-నజ్వాహుమ్-ఇల్లా మన్-అమర-బి-సదఖతి న్-ఔ-మఅరూఫిన్-ఔ-ఇస్లాహిమ్-బైనన్నాసి-వమన్-యఫ్-అల్-జాలికబ్- తిగాఅ-మరజాతిల్లాహి-ఫసౌఫ-నూతీహి-అజ్రన్ అజీమా. 115. వమన్-యు షాఖిఖిర్-రసూల-మిమ్-బఅదిమా-తబయ్యన లహుల్-హుదా-వయత్-తబిఅ గైర-సబీలిల్-మూమినీన-నువల్లిహీ-మాతవల్లా-వ-నుస్-లిహీ-జహన్నమ-వసా అత్ మసీరా.

113. మఱియు నీపై దేవుని అనుగ్రహమును ఆతని కృపయును లేకుం డినచో వారిలోని కొందఱు నిన్ను న్యాయమార్గమునుండి తప్పింపఁగోరియుం డిరి. మఱియు వారు తమ యాత్మలను మాత్రమే తప్పుత్రోవఁబడ వేయుచు న్నారు. మఱియు వారు నీకేమియునష్టముచేయఁజాలరు. మఱియు దేవుఁడు నీకు గ్రంథమును జ్ఞానమొసంగి నీకుఁదెలియని విషయములను నేర్పెను. మఱి యు దేవుని యనుగ్రహము నీపై చాలగలదు. 114. వారి రహస్యమైన అ నేక ఆలోచనలలో మేలు లేదు. కాని దానమునుగూర్చియు, సత్కార్యము లను గూర్చియు, ప్రజలమధ్య సంధికూర్చుటనుగూర్చియు బోధించునట్టివాని యాలోచనలో మేలున్నది. మఱెవఁడు ఈ కార్యములను దేవుని ప్రీతికొఱకు చేయునో వానికి గొప్పపుణ్యఫలిత మొసంగుదుము. 115. మఱెవఁడు తనకు సన్మార్గము స్పష్టపడిన పిదప ప్రవక్తకు వ్యతిరేకముగాఁబోయి ముసల్మానుల మార్గమును వీడి వేఱుత్రోవను అనుసరించునో వాఁడు అవలంబించిన త్రోవ వైపునకే వానిని మరల్తుము. మఱియు వానిని నరకములో పడవేయుదుము. అది చాల చెడ్డనివాస స్థలము.

వ్యా॥ 113. పై వాక్యములలో చెప్పఁబడిన విషయముగూర్చి యిందు చెప్పఁబడుచున్నవి. ద్రోహులు నేరమునుండి తప్పించుకొనుటకై తప్పుసాక్ష్యము పలికి తప్పు ప్రమాణములుచేసిరి. ఆ సాక్ష్యములను అనుసరించి యూదుఁడే నేరగాఁడు అని తీర్పుకానుండగా దేవుఁడు తన అనుగ్రహమువలన పైగంబరులవారికి వాస్తవమును దెలిపి మోసగాండ్రు పన్నిన కుట్రను సాగనీయక న్యాయమార్గము చూపించెను. లేనిచో మోసగాండ్ర కుట్రసాగియుండి న్యాయమార్గము తప్పిపోయి యుందురు. దేవుఁడు రక్షించెను. దీనివలన ఇఁకమీద మోసగాండ్రకు మోసమునకై వీలుండదు. పైగంబరులవారు తమకు దేవుడొసంగిన ఖురానెషరీఫును దివ్యజ్ఞానమును అనుసరించి తీర్పుచేయవలెనని చెప్పబడియెను. 114. కొందఱు వంచకులు రహస్యముగా దురాలోచనలు చేయుదురు. అందుచాలవఱకు మేలులేదు. ఏదోకుట్రలనుగూర్చి గుసగుసలాడుదురు అట్లుచేయవలదు. అందు ఏలాటి మేలులేదు. మేలుగలపనులు భిక్షాదానమునకై ప్రజలను ప్రోత్సాహపఱచుట. సత్కార్యములుపదేశించుట. తగవుగలవారిమధ్య సంధి గూర్చుట. ఈ కార్యములనుగూర్చి రహస్యముగా దేవుని ప్రీతికొఱకు ఆలోచనలు సలిపినను మేలైనదే. దానికి దేవుఁడు గొప్ప పుణ్యఫలిత మొసంగును. ప్రయోజనములేని గుసగుసలను మానుకొనవలెను. 115. సన్మార్గము న్యాయము స్పష్టపడియు దేవునిప్రవక్తకు వ్యతిరేకముగా ప్రవర్తించి ముసల్మానులను వీడిపోవువాఁడు నరకములో చేరును. పై వాక్యములలో చెప్పఁబడిన మోసగాఁడైన దొంగ తన నేరము బయలుపడినది అని దాని శిక్షకు ఒప్పుకొనక ముసల్మానులను వీడిపోయి, ముసల్మానులకు శత్రువులైన కాఫర్లతో చేరి పోయెను. ఇట్టి వారికి నరకమే నివాసమగును. కావున న్యాయమునకు బద్ధులై ముసల్మానులుండవలెను.

116. ఇన్నల్లాహ-లాయగ్ ఫిరు-అన్-యుష్రక-బిహీ-వయగ్ ఫిరు-మా దూన-జాలిక-లిమన్-యషాఉ-వ-మన్-యుష్రిక్-బిల్లాహి-ఫఖద్-జల్ల-జలాలమ్-బఈదా. 117. ఇన్-యద్ఊన-మిన్-దూనిహీ-ఇల్లా-ఇనాసన్-వఇన్ యద్ఊన-ఇల్లా-షైతానమ్-మరీదా. 118. ల-అనహుల్లాహు-వఖాల-లఅత్-తఖిజన్న-మిన్-ఇబాదిక-నసీబమ్-మఫ్ రూజా. 119. వల-ఉజిల్-లన్నహుమ్-వల-ఉమన్నియన్నహుమ్-వల-ఆమురన్నహుమ్-ఫల్-యుబత్తికున్న-ఆజానల్-అన్-ఆమి-వల-ఆమురన్నహుమ్-ఫల్-యుగయ్యిరున్న-ఖల్-ఖల్లాహి-వమన్-యత్-తఖి

జిష్-షైతాన-వలియ్యన్-మిన్-దూనిల్లాహి-ఫఖద్-ఖసిర-ఖుస్రానమ్-ముబీనా. 120. యఇదుహుమ్-వయుమన్నీహిమ్-వమా. యఇదు-హుముష్-షైతాను-ఇల్లా-గురూరా. 121. ఉలాఇక-మావాహుమ్-జహన్నము-వ-లాయజిదూన-అన్ హా-మహీసా. 122. వల్లజీన-ఆమనూ-వ-అమిలుస్-సాలిహాతి-సనుద్-ఖిలుహుమ్-జన్నాతిన్-తజ్రీ-మిన్-తహ్తిహాల్-అన్-హారు-ఖాలిదీన. ఫీహా-అబదన్-వఅదల్లాహి-హఖ్ఖన్-వమన్-అస్దఖు-మినల్లాహి-ఖీలా.

116. దేవునికి సాటి కల్పించు విషయమును నిశ్చయముగ దేవుఁడు క్షమింపఁడు. అది తప్ప ఇతర పాపములను తాను ఇష్టపడినవానినిక్షమించును. మఱెవఁడు దేవునికి సాటి కల్పించెనో వాఁడు చాల క్రూరమైనదుర్మార్గమున పడెను. 117. అవిశ్వాసులు దేవుని వదలి స్త్రీలను ప్రార్థించుచున్నారు. మఱియు వారు దుర్మార్గుఁడగు సైతానును ప్రార్థించుచున్నారు. 118. దేవుఁడు ఆతనినిశపించియున్నాఁడు. మఱియు సైతాను, నేను నిశ్చయముగ నాభక్తుల నుండి నియమితమైన భాగము తీసికొందును. 119. వారిని సన్మార్గమునుండి తప్పింతును. వారికి ఆశలను కలిగింతును. వారు పశువుల చెవులను చీల్చునట్లును, దేవుని సృష్టిని మార్చునట్లును నేర్పుదును అని పలికెను. మఱెవఁడు దేవుని వదలి సైతానును స్నేహితునిగాఁ జేసికొనెనో వాఁడు స్పష్టమైన నష్టములో పడెను. 120. సైతాను వారికి వాగ్దానముచేయుచున్నాఁడు. మఱియు వారికి ఆశలు కలిగించుచున్నాఁడు. మఱియు సైతాను చేయు వాగ్దానములు మోసములు మాత్రమేను. 121. అట్టివారి నివాసము నరకము. మఱియు వారు దానినుండి తప్పించుకొనిపోఁజాలరు. 122. మఱియు మేము విశ్వసించి సత్కార్యములు చేసినవారిని క్రిందుగ కాలువలు ప్రవహించు స్వర్గవనములలో ప్రవేశింపఁజేయుదుము. అందు వారు సదా యుందురు. దేవుని వాగ్దానము సత్యమైనది. దేవునిమాటకంటె సత్యమైనది ఎవరిమాట గలదు!

వ్యా॥ 116. దేవునికి సమముగ నితరులను సాటిగ కల్పించి చిల్లర దేవతలను పూజించుట ఘోరపాతకము. అటులే దేవుఁడు నియమించిన ధర్మములను వదలి దానిని తిరస్కరించి పోవుట మహాపాతకము. దీనినే షిర్క్ అందురు. షిర్కుదప్ప మిగిలిన పాపములు చేసిన వారిలో దేవుఁడు తాను కోరిన వారిని క్షమించును అను నమ్మకము గలదు. కాని దేవునికి సాటి కల్పించి, దుష్టుఁడగు సైతాను త్రోవను పోయిన వారికి క్షమాపణ లభింపనేరదు. కావున వారు సన్మార్గమును వీడి చాలదుర్మార్గములోపడిపోయినవారగుదురు.

117. అవిశ్వాసులు దేవునిని వదలి తాము పూజించు ఇతర దైవములకు స్త్రీలపేర్లుంచియుండిరి. కొందఱు జడములను ఆరాధింతురు. దేవుని కోపము నకు పాత్రుఁడైన సైతాను ప్రోత్సాహమువలన వారట్లు చేయుచున్నారు. కావున వారు చిల్లర దేవతలను ప్రార్థించినను, సైతానును ప్రార్థించినట్లేఅగును. 118. సైతాను (ఇబ్లీసు) దేవుని యాజ్ఞను తిరస్కరించి సాష్టాంగము (సిజ్దా) చేయక దేవుని కోపమునకును శాపమునకును పాత్రుఁడాయెను' ఆదమువలన వానికి దుర్గతి పట్టెనని తలఁచి వాఁడు దేవుని యెదుట నేను, నీ భక్తులను దుర్మార్గులుగఁజేసి వారు నాకు తమ సంపదలలో నొకభాగము నిచ్చునట్లు చేయుదును. వారు ఇహలోకములోనే మునిఁగిపోయి పరలోకము వదలునట్లు వారికి పెక్కు ఆశలు గలిగింతును. వారు విగ్రహములపేర పశువులను వదలి వాని చెవులను చీల్చునట్లును, దేవుని సృష్టిని తమ కల్పనలవలన మార్చునట్లు చేయుదును అని పన్నాగము పూనెను. మగవారు స్త్రీలవలె నటించుట, ము సలితనమును దాఁచుకొని గడ్డము మీసములకు నల్లరఁగుపూసికొనుట,ఖోజా అయిపోవుట, ధర్మమును అధర్మముగాను, అధర్మమును ధర్మముగానుచేయుట దేవుని సృష్టిస్వభావములను మార్చుటలో చేరునవి. మానవులకు సైతాను ఆది నుండియే శత్రువు. దేవుని ధర్మములను వదలి అట్టి శత్రువును స్నేహితునిగాఁ జేసికొని వాని ననుసరించువాఁడు ఉభయలోకములలోను నష్టము పొందును. సైతాను మానవులకు పెక్కు పేరాసలు చూపును. తుదకు అవి నిజముగాక మోసములగును. కావున సైతాను పనులకు మానవులు మోసపోఁగూడదు. సన్మార్గమువదలి సైతాను ననుసరించునట్టివారు నరకముపాలగుదురు. అందు సదా వారుండుదురు. అందుండి తప్పించుకొనఁజాలరు. కావున విశ్వసించి సత్కార్యములు చేసి దేవుని వాగ్దానము ననుసరించి ఇహలోకమందు విజయ మును పరలోకమందు సౌఖ్యములను పొందవలెను. దేవుని వాగ్దానము నిజమై నది. దానికి వ్యతిరేకము కానేరదు. కావున ఇస్లామ్‌లో మానవులు చేరవలెను

123. లైస-బి-అమానియ్యికుమ్-వలా-అమానియ్యి-అహ్లి-లిల్-కితాబి మన్-యఅ-మల్-సూఅన్-యుజ్‌జ-బిహీ-వలాయ-యజిద్-లహూ-మిన్-దూని ల్లాహి-వలియ్యన్-వలానసీరా. 124. వ-మన్-యఅ-మల్-మినస్-సాలిహాతి-మిన్-జకరిన్-ఔ-ఉన్‌సా-వహువ-మూమినున్-ఫ-ఉలాఇక-యద్‌ఖులూనల్-జన్నత-వలాయుజ్‌లమూన-నఖీరా. 125.వమన్-అహ్‌సను-దీనమ్-మిమ్మన్-అస్లమ-వజ్-హహూ-లిల్లాహి-వహువ-ముహ్‌సినున్-వత్-తబఅ-మిల్లత-

ఇబ్రాహీమ-హనీ-ఫన్-వత్-తఖజల్లాహు-ఇబ్రాహీమ-ఖలీలా. 126. వలిల్లాహి-మాఫిస్-సమావాతి-వమాఫిల్-అర్జి-వకానల్లాహు-బికుల్లిషై-ఇమ్-ముహీతా.

123. మీకోరికలను అనుసరించిగాని గ్రంథములుగల వారి కోరికలప్రకారముగాని (మోక్షము) లేదు. ఎవఁడు పాపకార్యము చేయునో వాఁడు దాని శిక్ష అనుభవించును. మఱియు దేవుఁడు తప్ప వానికి రక్షకుఁడును, సహాయుఁడును ఎవరును దొరకనేరరు. 124. మఱియు, విశ్వాసముగలిగి సత్కార్యములు చేయు స్త్రీలుగాని పురుషులు గాని స్వర్గములో ప్రవేశింతురు. మఱి వారికి రవంతయును అన్యాయము జరుగదు. 125. మఱియు దేవుని యాజ్ఞల శిరసావహించి, సత్కార్యములు చేయుచు, సన్మార్గుఁడగు ఇబ్రాహీమును అనుసరించునట్టివాని మతముకంటె ఎవ్వని మతము శ్రేష్ఠమైనది! మఱియు దేవుఁడు ఇబ్రాహీమును తన స్నేహితునిగాఁ జేసికొనెను. 126. మఱియు ఆకాశములోను భూమిలోనున్న సమస్తమును దేవునిదే. మఱియు సర్వమును దేవుఁడు వ్యాపించియున్నాఁడు.

వ్యా॥ 123. గ్రంథముగలవారు అనగా యూదులు నస్రానీలు. వారు మేము చేయు పాపములకు మాకు శిక్ష లభింపదు. మా పెద్దలును ప్రవక్తలును మమ్ము రక్షింతురు అని పలుకసాగిరి. అట్లు కొందఱు ముసల్మానులుకూడ భావింపసాగిరి. ఇందు దానికి రద్దుగలదు. పుణ్యము, మోక్షము వట్టి కోరికలను బట్టి లభింపదు. దానికిఁగాను విశ్వాసము, సత్కార్యములు కావలెను. పాపకార్యములను వదలుకొనవలెను. పాపకార్యములు చేసినవారు తప్పక దానిశిక్ష అనుభవించితీరుదురు. ఇహలోకములోఁ గలుగునష్టకష్టములు కొంతవఱకు వానికి పరిహారములగును. మిగిలినదానికి దేవుని క్షమాపణ కోరవలెను. కావున కోరికలు వదలి స్థిరవిశ్వాస భక్తులతో దేవుని యాజ్ఞ శిరసావహించి సత్కార్యములు చేసి స్వర్గము పొందవలెను. 125. హజ్రత్ పైగంబరులవారును వారి శిష్యులును భయభక్తులతో సత్కార్యములు చేయుచు దేవుని యాజ్ఞల శిరసావహింతురు. దేవునికి స్నేహితుఁడు (ప్రియుఁడు) ను, సర్వమును వదలి దేవునినే ఆశ్రయించి సన్మార్గుఁడైన ఇబ్రాహీము ప్రవక్తను అనుసరించుచున్నారు. కాని యూదులు నస్రానీలు అట్లులేదు. కావున వారు ముసల్మానులకంటె శ్రేష్ఠమైన మతమునుగలవారుకారు. 126. సర్వముదేవునిదే. సర్వమును దేవుఁడు వ్యాపించియున్నాఁడు. సర్వము అతనికిఁ దెలియును. కావున ఎవరి కర్మలకు తగిన ఫలితము వారి కొసంగును.

127. వయస్తఫ్-తూనక-ఫిన్-నిసాఇ-ఖులిల్లాహు-యుఫ్తీకుమ్-ఫీహిన్న

వమా-యుత్లా-అలైకుమ్-ఫిల్-కితాబి ఫీయతామల్-నిసాయిల్-లాతీ-లాతూతూ-నహున్న-మా-కుతిబ-లహున్న-వతర్గబూన-అన్-తన్-కిహూ-హున్న-వల్ముస్తజ్-అఫీన-మినల్-విల్దాని-వఅన్-తఖూమూ-లిల్-యతామా-బిల్-ఖిస్తి-వమాతఫ్-అలూ-మిన్-ఖైరిన్-ఫఇన్-నల్లాహ-కాన-బిహీ-అలీమా.

127. మఱియు స్త్రీలనుగూర్చి గల ధర్మము నిన్ను అడుగుచున్నారు. దేవుఁడు వారి విషయము సెలవు ఒసంగుచున్నాఁడు. మఱియు తండ్రిలేని స్త్రీలకొఱకు నియమింపఁబడియున్న హక్కులను మీరువారికినియ్యక వారిని పెండ్లాడ కోరుచున్న విషయమునుగూర్చియు బలములేనిబిడ్డలనుగూర్చియు మీకు చదివి వినిపింపఁబడు ఖురానుగ్రంథవాక్యములను దేవుఁడు మీకుఁదెలుపుచున్నాఁడు. తండ్రిలేని బిడ్డల విషయమున న్యాయముగ వర్తింపుఁడు అనిదేవుఁడు సెలవిచ్చుచున్నాఁడు. అని ఓ ప్రవక్తా పలుకుము. మఱియు మీరుచేయుప్రతిసత్కార్యమును దేవునికిఁదెలియును.

వ్యా॥ 127. ఈసూరాకు ప్రారంభమున తండ్రిలేని ఆఁడుబిడ్డలను పెండ్లాడు విషయము చాల నిర్బంధ ధర్మముగా విధింపఁబడియుండెను. న్యాయముగ వర్తింపనిచో బంధువులలో నెవరును పెండ్లాడకూడదు అని సెలవయ్యెను. దాని అనుసరించి ముసల్మానులు తండ్రిలేని ఆఁడుబిడ్డలను వివాహ మాడకుండిరి. కొన్నిసమయములలో తండ్రిలేని స్త్రీల వివాహము బంధువులలోనే జరుగుట మేలుకరముగ నుండును. అందుకు ముసల్మానులు హజ్రత్ పైగంబరులవారిని దానిగూర్చి న్యాయమడిగిరి. అందుకు దేవుఁడు, తండ్రిలేని స్త్రీలను బంధువులు (వలీ) వివాహమాడవచ్చును. ముందు ఖురానులో నొసంగిన నిర్బంధ ధర్మముగా వారి మహరుఇయ్యక అన్యాయముగ పెండ్లాడువారినిగూర్చి యుండెను. న్యాయముగ వర్తించినచో ఆ నిర్బంధములేదు అని సెలవయ్యెను. పూర్వము తండ్రిలేనిఆఁడుబిడ్డలు సౌందర్యములోనుధనములోనుహెచ్చుగానున్నచో వారి సంరక్షకులు (వలీ) ధనము ఇతరులకు చేరునని భీతిచే తామేపెండ్లాడుచుండిరి. కాని మహరు తక్కువగా నియమించుచుండిరి. తండ్రిలేని స్త్రీలు రూపవతులుకాకయున్నచో వారిఆస్తిని ఆసించి వారిని ఇతరులకిచ్చి పెండ్లిచేయకుండిరి. దానినికూడ దేవుఁడునిషేధించెను. పూర్వము బలహీనులగు బిడ్డలకు ఆస్తిహక్కులు లేకుండెను. దానినికూడ రద్దుచేసి వారికికూడ ఆస్తిభాగములు నియమింపఁబడెను. ఏసత్కార్యముగాని మేలుగాని స్త్రీ-కు బిడ్డలకు చేసినను అది దేవునికిఁదెలియును. దేవుఁడు వానికిఁదగిన ఫలత మొసంగును. కావున ముసల్మాను భక్తులు సపూర్ణముగ అనాథశిశువులఁగూర్చియు స్త్రీలను

గూర్చియు దేవుఁడు సెలవిచ్చిన ధర్మముల ప్రకారము నడచుకొనవలెను.

128. వఇనిమ్-రఅతున్-ఖాఫత్-మిమ్-బఅ-లిహా-నుషూజన్-ఔ ఇఅ-రాజన్-ఫలా-జునాహ-అలైహిమా-అన్-యుస్లిహా-బైనహుమా-సుల్హా-వస్-సుల్హు-ఖైరున్-వ-ఉహ్జిరతిల్-అన్ఫుసుష్-షువా-వఇన్తుహ్సినూ-వతత్తఖూ-ఫఇన్నల్లాహ-కాన-బిమా-తఅ-మలూన-ఖబీరా. 129. వలన్-తస్-తతీఊ-అన్తఅ-దిలూ-బైనన్-నిసాఇ-వలౌ హరస్తుమ్-ఫలా-తమీలూ-కుల్-లల్-మైలి-ఫతజరూహా-కల్-ముఅల్లఖతి-వఇన్-తుస్లిహూ-వతత్తఖూ-ఫఇన్నల్లాహ-కాన-గఫూరర్-రహీమా. 130. వఇన్-యతఫర్రఖా-యుగ్-నిల్లాహు-కుల్లమ్-మిన్-సఅతిహీ-వకానల్లాహు-వాసిఅన్-హకీమా.

128. మఱియు భర్తతనతో జగడమాడును అనియు తన్ను తిరస్కరించుననియు భార్యభయపడిన యెడల వారిద్దఱు, సమాధానముచేసికొన్నచో వారిపై నెట్టిదోషములేదు. మఱియు సమాధానపడుట చాలమంచిది. మఱియు మానవులయాత్మలలో పేరాసఇమిడియున్నది. మఱియుమీరు మేలుచేసి భక్తిపరులుకండు. మీరుచేయు కర్మలన్నియు దేవునికిఁ దెలియును. 129. ఆసించినను మీరు స్త్రీలను సరిసమానముగా నుంచఁజాలరు. కావున పూర్తిగ ఒక్కతె పక్షమునవ్రాలి మఱొక స్త్రీని అటుఇటు లేనట్లుగ వదలిపెట్టకుఁడు. మఱియు మీరు సవరించుకొని భక్తిపరులైయుండినచో దేవుఁడు క్షమించువాఁడును దయాళువును (అగుచున్నాఁడు). 130. భార్యాభర్తలు వేరైపోయినచో దేవుఁడు తన విశాలమైన అనుగ్రహముచే వారిద్దఱిని ఒకరితో నొకరికి అక్కఱలేకున్నట్లుగాఁజేయును. మఱియు దేవుఁడు విశాలముగ అనుగ్రహించువాఁడును వివేచనా పరుఁడును.

వ్యా॥ 128. భర్తకు భార్యయందు ఇష్టములేనపుడు భార్యతన మహరులోని కొంతభాగమువదలిపెట్టి లేక తన ఖర్చులలో తగ్గించుకొని భర్తను సమాధానపఱచుకొన్నచో అందు ఉభయులకును దోషములేదు. అట్లు భర్తకు కొంత లాభము గలిగినయెడల సంతోషపడును. ఎందుకన ప్రతియాత్మలోను ధనమునందు ఆశయును, లోభమును గలదు. కావున భార్య తన భర్తను సంతోషపఱచగలదు. భర్తలకుఁగూడ దేవుఁడు బుద్ధిచెప్పుచున్నాఁడు. మీరు భార్యలతో ధర్మప్రకారముగా సంసారముచేసినచో, జగడములును అయిష్టములును గలుగవు. మీరు స్త్రీలకు మేలుచేసి భయభక్తులుగలిగియుండుట యుత్తమము.

సర్వము దేవునికిఁ దెలియును. దాని ఫలిత మొసంగును.129. ఒక్క తెకన్న ఎక్కు వమంది భార్యలున్నచో ప్రేమ మొదలగు ప్రతివిషయములో అందఱిని సరి సమానముగా చూచుట దుర్లభము. ఎంత ప్రయత్నించినను అది కానేరదు. కావున అన్యాయము మాత్రము చేయరాదు. ఒకతెపక్షమున నే వ్రాలిపోయి మఱొకతెను పూర్తిగ అటుఇటు లేకుండ వదలిపెట్టకూడదు. ఇష్టమున్నచో న్యాయముగ సంసారముచేయవలెను. లేనిచో తలాఖునిచ్చి వదలిపెట్టవలెను. తాను సంసారముచేయక తలాఖు ఇయ్యక ఆపిపెట్టుట ధర్మము కాదు. వీలైనంతవఱకు సవరించుకొని సంసారము గడుపుటమంచిది. ఏదైన పొరపాటుగలిగిన దేవుఁడు క్షమించును. 130. విధిలేక భార్యను భర్త వదలిపెట్టినచో ఆమె చింత పడనక్కఱలేదు. దేవుఁడు తన విశాలమైన అనుగ్రహముచే వారి కార్యములను నెఱవేర్చును. ఒకరితో నొకరికి అక్కఱలేనట్లుగ వారివారికిఁ దగినట్లు ఏర్పాటు చేయును.

131. వలిల్లాహి-మాఫిస్-సమావాతి-వమా-ఫిల్-అర్‌జి-వలఖద్-వస్-సైనల్‌లజీన-ఊతుల్-కితాబ-మిన్-ఖబ్లికుమ్-వఇయ్యాకుమ్-అనిత్-తఖుల్లాహ-వఇన్-తక్-ఫురూ-ఫఇన్న-లిల్లాహి-మా-ఫిస్-సమా-వాతి-వమా-ఫిల్-అర్‌జి-వకానల్లాహు-గనియ్యన్-హమీదా. 132. వలిల్లాహి-మాఫిస్-సమావాతి వమాఫిల్ అర్‌జి వకఫా-బిల్లాహి-వకీలా. 133. ఇన్-యషా యుజ్-హిబ్-కుమ్-అయ్యుహాన్నాసు-వయాతి-బిఆఖరీన-వకానల్లాహు-అలాజాలిక-ఖదీరా.134. మన్‌కాన యురీదు-సవాబద్-దున్యా-ఫఇన్‌దల్లాహి-సవాబుద్-దున్యా-వల్-ఆఖిరతి-వకానల్లాహు-సమీ-అమ్‌బసీరా.

131. మఱియు ఆకాశములలోను భూమిలోనున్న సమస్తము దేవునిదే. మీకు పూర్వము గ్రంథములబ్ధించిన వారికిని మీకును దేవునికి భయపడుచుండవలెననియే ఆజ్ఞచేసితిమి. మఱియు మీరు తిరస్కరించినచో ఆకాశములోను భూములలోనున్న సమస్తము దేవునిదే. మఱియు దేవుఁడు లక్ష్యములేనివాఁడును స్తవనీయుఁడును.132. మఱియు ఆకాశములోను భూమిలోనున్న సమస్తము దేవునిదే. సమస్త కార్యములను నిర్వహించుటకు తానేచాలును. 133. దేవుఁడు కోరినచో ఓప్రజలారా! మిమ్ము్మలోలగించి మీకు బదులుగ నితరులను తేఁగలడు. మఱియు దానిపై దేవునికి శక్తి గలదు. 134. ఎవఁడు ఇహలోక ఫలితము నేకోరునో వానికదియే గలదు. దేవుని యొద్ద ఇహలోకము యొక్కయు

పరలోకముయొక్కయు ఫలితములున్నవి(అనివాఁడు తెలిసికొనవలెను).మఱియు దేవుఁడు సర్వమును వినుచు చూచుచున్నాఁడు.

వ్యా॥ 131, 132. ఇంతవఱకు పెక్కుధర్మములు చెప్పఁబడినవి. వాని గూర్చి ప్రోత్సాహమును, మందలింపును గలదు. ఇఁక ఈ వాక్యములలో దేవునియందు భయభక్తులు గలిగి ధర్మములను ఆచరింపక తిరస్కరించినచో దేవునికి నష్టములేదు. ఆతనికి మానవుల లక్ష్యమునులేదు. భయభక్తులు గలిగి యుండిన భక్తులకే మేలగును, గాని దేవునికి మేలుకాదు. సర్వము దేవునిదే. ఆతనికి మించి యెద్దియును పోఁజాలదు. సర్వ కార్యములను ఆతఁడే నిర్వహించుచున్నాఁడు. కావున సర్వమునకు ఆతని సంరక్షణయే చాలును. కావున ఆతనికి భయపడియుండవలెను. ఇది క్రొత్తధర్మముకాదు. పూర్వమునుండియు అందఱు మానవులకు ప్రవక్తలమూలమున దేవుని ఆజ్ఞగలిగియున్నది. 133. జనులుతిరస్కరించి అవిశ్వాసులైనచో దేవుఁడు అందఱిని నశింపఁజేసి, వారికి బదులుగ ఆతనికి విధేయులుగనుండు వారిని తేఁగలడు. అట్లు చేయుటకు దేవునికి శక్తిగలదు. కావున మానవులు భయభక్తులు వహించి దేవునికి విధేయులైయుండవలెను. 134. పరలోకమందు విశ్వాసములేనివారు తమ ప్రయత్నములన్నియు ఇహలోకమునందలి ఫలితములకుఁగాను చేయుదురు. అది మానవులకు సరికాదు. ఇహలోకతుచ్ఛసౌఖ్యములలో నిమగ్నులై దేవునికి అవిధేయులగుట వివేకముగాదు. కావున దేవునికి విధేయులైనచో ఇహలోకమునందు విజయమును పరలోకమునందు మోక్షమును లభించును. ఉభయలోకముల ఫలితములు భక్తులుకోరుదురు. దేవుఁడు మానవులు పలుకుమాటలను వినుచు వారుచేయు సర్వకర్మలను చూచుచున్నాఁడు. వారివారి కర్మలకుఁదగిన ఫలితమొసంగును.

135. యాఅయ్యుహల్లజీన- ఆమనూ-కూనూ-ఖవ్వామీన బిల్-ఖిస్తి షుహదాఅ-లిల్లాహి-వలౌ-అలా అన్ఫుసికుమ్-అవిల్-వాలిదైని-వల్-అఖ్రబీన-ఇన్యకున్-గనియ్యన్-ఔ-ఫఖీరన్-ఫల్లాహు-ఔలా-బిహిమా-ఫలా తత్-తబిఉల్-హవా-అన్ తఅదిలూ-వఇన్-తల్ఊ-ఔ-తుఅరిజూ-ఫఇన్నల్లాహ-కా-నబిమా-తఅ-మలూన-ఖబీరా.

135. ఓ ముసల్మానులారా! మీరు న్యాయముపై స్థిరముగానుండుఁడు. మీకుఁ గాని మీతల్లిదండ్రులకుఁగాని బంధువులకుఁగాని నష్టము గలిగినను దేవుని కొఱకు నిజమైన సాక్ష్యమిండు. ఎదురుకక్షివాఁడు ధనవంతుఁడుగాగాని లేక నిఱుపేదగాగాని యున్నచో వారియెడ దేవుఁడు మీకంటె నెక్కువ దాక్షి

న్యాముగలవాఁడు. కావున న్యాయము చేయుటలో మీ ఆత్మలాభములను (మనోవాంఛలను) అనుసరింపకుఁడు. మఱియు మీరు సాక్ష్యము తారుమాఱు చేసినచో లేదా దాఁచినచో మీరు చేయునదంతయు దేవునికిఁ దెలియును.

వ్యా॥ 135. భక్తులు న్యాయముగ హెచ్చుతగ్గులు లేక తమకు నష్టము కలుగినను సాక్ష్యము దాఁచక తారుమాఱుచేయక నిజము చెప్పవలెను. ఇహలోక తుచ్ఛలాభముకొఱకు తప్పు సాక్ష్యము పలికి పరలోక నష్టము చేసికొనకూడదు. ఎదురుకక్షవాఁడు ధనవంతుఁడని వాని ధనమును చూచి వానికిఁ బ్రతికూలముగ నెట్లు సాక్ష్యమియ్యవలెనని మొగమోటము వహింపరాదు. అటులే ఎదురు కక్షవాఁడు నిఱుపేదయని దాక్షిణ్యమువహించి తప్పుసాక్ష్యము పలుకరాదు. వారికిఁ దగినట్లు సంరక్షించుట దేవునిపని. మానవులపని న్యాయమార్గమున నడచుకొనుటయే. కావున మనస్సు కోరినట్లు నడచుకొనక న్యాయముగా నిజమైన సాక్ష్యముపలుకవలెను. సాక్ష్యమును తారుమాఱుచేసిన లేక కొంత చెప్పి కొంత దాఁచిన అది పాపమగును. సర్వము దేవునికి దెలియును. దానికిఁ దగిన శిక్ష ఒసంగును. కావున సాక్ష్యము నిజముగాను స్పష్టముగాను ఇయ్యవలెను. అందు ఏలాటి లోపము చేయరాదు.

136. యా-అయ్యుహల్లజీన-ఆమనూ-ఆమినూ-బిల్లాహి-వరసూలిహీ వల్-కితా-బిల్లజీ-నజ్జల-అలా-రసూలిహీ-వల్-కితాబిల్లజీ-అన్-జల-మిన్-ఖబ్లు వమన్-యక్ఫుర్-బిల్లాహి-వ-మలాఇకతిహీ-వకుతుబిహీ-వ-రుసులిహీ-వల్-యామిల్-ఆఖిరి-ఫఖద్-జల్ల-జలాలమ్-బఈదా.

136. ఓ ముసల్మానులార ! దేవునియందును, ఆతని ప్రవక్తయందును, ఆతఁడు తన ప్రవక్తకు నిచ్చిన గ్రంథమందును, పూర్వము పంపిన గ్రంథమునందును స్థిరముగవిశ్వాసముగలిగియుండుఁడు. మఱెవఁడు దేవునిని ఆతనిదూతలను, ఆతని గ్రంథములను, ఆతని ప్రవక్తలను, తుదిదినము (ఖియామతు) ను విశ్వసింపఁడో వాఁడు చాల దూరమైన దుర్మార్గములో పడును.

వ్యా॥ 136. ముసల్మానులు తమ విశ్వాసము (ఈమాను)నందు చలింపక స్థిరముగానుండి ఇస్లామ్ మత ధర్మములను సంపూర్ణముగ ననుసరింపవలెను. ఒకదానిని అనుసరించి మఱొకటి వదలుట సరికాదు. విశ్వసింపనివారు సన్మార్గము వీడి దుర్మార్గము ద్రొక్కినవారు.

137. ఇన్నల్లజీన-ఆమనూ-సుమ్మ-కఫరూ-సుమ్మ-ఆమనూ సుమ్మ-కఫరూ సుమ్మజ్-దా దూ-కుఫ్రల్-లమ్-యకునిల్లాహు-లియగ్ ఫిర-లహుమ్-వలా-లియ

హ్దియహుమ్ సబీలా. 138. బష్-షిరిల్-మునాఫిఖీన-బిఅన్న-లహుమ్-అజాబన్-అలీమా. 139. అల్లజీన-యత్-తఖిజూనల్-కాఫిరీన-ఔ-లియా-అ-మిన్-దూనిల్-మూమినీన-అయబ్-తగూన-ఇన్దహుముల్ ఇజ్-జత-ఫఇన్నల్ - ఇజ్జత-లిల్లాహి-జమీఆ. 140. వఖద్-నజ్జల అలై కుమ్-ఫిల్-కితాబి-అన్-ఇజా-సమిఅ-తుమ్-ఆయాతిల్లాహి-యుక్ఫరు-బిహా-వ-యుస్తహ్జఉ-బిహా- ఫలా-తఖ్ఉదూ-మఅహుమ్-హత్తాయఖూజూ-ఫీహదీసిన్-గైరిహీ-ఇన్నకుమ్-ఇజమ్ - మిస్-లుహుమ్-ఇన్నల్లాహ-జామిఉల్-మునాఫిఖీన-వల్-కాఫిరీన-ఫీ - జహన్నమ-జమీఆ. 141. అల్లజీన-యతరబ్బసూన-బికుమ్-ఫఇన్-కాన-లకుమ్-ఫత్హుమ్-మినల్లాహి-ఖాలూ-అలమ్-నకుమ్-మఅకుమ్-వఇన్-కాన-లిల్-కాఫిరీన- నసీబున్-ఖాలూ అలమ్-నస్-తహ్విజ్-అలైకుమ్-వనమ్-నఅకుమ్-మినల్-మూమినీన-ఫల్లాహు-యహ్-కుము-బైనకుమ్-యామల్-ఖియామతి-వలన్-యజ్- అలల్లాహు-లిల్-కాఫిరీన-అలల్-మూమినీన-సబీలా.

137, ఎవరు ముసల్మానులై మరల అవిశ్వాసులై మరల ముసల్మానులై మరల అవిశ్వాసులై అవిశ్వాసమునే వృద్ధిచేసికొనిరో అట్టివారిని దేవుడు ఎన్నటికిని క్షమింపఁడు. మఱి వారికి మార్గము చూపఁడు. 139. ఓ ప్రవక్తా ! వంచకులకు దుఃఖకరమైన బాధ గలదు అని వారికిఁ దెలుపుము. 139. ఆ వంచకులు ముసల్మానులను వదలి, అవిశ్వాసులను స్నేహితులుగాఁ జేసికొనుచున్నారు. వారు అవిశ్వాసులయొద్ద గౌరవమును కోరుచున్నారా ! గౌరవమంతయు దేవుని చేతిలో నున్నది. 140. మఱియు దేవునివాక్యములనుగూర్చి తిరస్కారమును పరిహాసమును మీరు వినునపుడు అట్లు చేయువారితో వారు ఇతర సంభాషణలు ప్రారంభింపనంతవఱకు వారితోఁగూడి కూర్చుండకుఁడు అని మీకు ఖురానులో దేవుఁడు ఆజ్ఞచేసియున్నాఁడు. అట్లు మీరు చేసితిరేని మీరును వారివలె అగుదురు. నిశ్చయముగ దేవుఁడు వంచకులను అవిశ్వాసులను నరకములో ఒక్కచోట చేర్చును. 141. ఆ వంచకులు మీ విషయమున వేఁచియున్నారు. కావున మీకు దేవునినుండి విజయము లభించినచో ఏమి మీతోఁగూడి మేముండలేదా అని పలుకుదురు. మఱియు అవిశ్వాసులకు (విజయములో) కొంతభాగము లభించినచో వంచకులు వారితో ఏమి మీతో పోరాడుటకు మాకు శక్తి లేకుండెనా ! మఱియు మేము మిమ్ము ముసల్మా

నులనుండి రక్షింపలేదా అని పలుకుదురు. కావున దేవుఁడు తీర్పుదినమునందు మీమధ్య తీర్పుచేయును. మఱియు దేవుఁడు ఎన్నఁడును అవిశ్వాసులకు ముసల్మానులపై విజయమార్గము నొసంగఁడు.

వ్యా॥ 137. విశ్వసించి మరల మతభ్రష్టుఁడై మరల విశ్వసించి మరల విశ్వాసమును వీడి అందే వృద్ధిపొంది అవిశ్వాసస్థితిలోనే చచ్చినవారికి మోక్షములేదు. అట్టి చంచలస్వభావముగలవారికి సన్మార్గముకూడ లభింపనేరదు. 138. వంచకులు ముసల్మానుల సఖ్యమును వదలి శత్రువులగు అవిశ్వాసులతో స్నేహముచేసికొనుచు వారియొద్ద గౌరవముగలుగునని ఆశించుచుండిరి. అది భ్రమ మాత్రమే. అన్ని గౌరవములు దేవుని చేతిలో నున్నవి. ఆతనికి విధేయులైన భక్తులకు ఉభయలోకములలోను గౌరవము లభించును. కావున అవిశ్వాసులతో చేరిన వంచకులకు ఉభయలోకములలోను అవమానము నరకబాధ మాత్రము లభించును అని హెచ్చరింపఁబడియె. 140. వంచకులు, తమతమ సభలలో దేవుని వాక్యములను తిరస్కరించుచు, వాని పరిహసించుచుండిరి. అందుకు దేవుఁడు "ముసల్మానులు అట్టి సభలలో కూర్చుండకూడదు, సభవారు ఇతర సంభాషణ ప్రారంభము చేయునంతవఱకు ఆ సభలో నుండకూడదు. అట్లుకాక ఆ సభలోనే కూర్చుండి ఆ తిరస్కారము, ఆ యెగతాళి వినినచో, మనస్సులో అసహ్యమున్నప్పటికిని వినువారును ఆ వంచకులలో చేరినవారై పాపము ఒడికట్టుకొనుదురు'' అని సెలవిచ్చెను. ఈ ధర్మము దీనికి ముందు ఖురానె షరీఫులో సూరె అన్ ఆములో చెప్పఁబడినది. ఎట్లు, అవిశ్వాసులును వంచకులును తిరస్కారముచేయువారితో చేరుకొనిరో అటులే నరకబాధలోఁగూడ చేరుకొనుదురు. 141. ఇందు వంచకుల కుట్ర తెలుపఁబడుచున్నది. ముసల్మానులకు యుద్ధములో విజయముగలిగినపుడు మాకుకూడ విజయ ధనములో భాగము లభింపవలెను. మేము మీతో నుంటిమి అని స్నేహభావము తెలుపుదురు. వాస్తవములో వారు ముసల్మానులకు అపజయముగలిగి వారు నశించిన బాగని వేచియుందురు. అందువలననే ముసల్మానులపై అవిశ్వాసులకు విజయము లభించినచో వంచకులు కాఫిర్లతో కలిసి ఏమయ్యా మీకు మీతో పోరాడుటకు శక్తిగలిగి యీ ముసల్మానుల పక్షము చేరక మీకు తోడుపడి మిమ్మ ముసల్మానులు వధింపకుండ మిమ్ము రక్షించితిమి గదా! మీకు లభించిన విజయ ధనములో మాకుఁ గూడ భాగము రావలెను. అని వంచకులు పలుకుదురు. వంచకులకు నరకమును, ముసల్మాను భక్తులకు స్వర్గమును లభించును. దీని గూర్చి తీర్పు దేవుఁడు తీర్పు దినము (ఖియామతు) నందు చేయును. వంచకులు ముసల్మానుల నాశ

మును కోరుచున్నారు. అట్లు ఎన్నటికిని కానేరదు. దేవుఁడు ముసల్మాను లందఱిని అన్ని దేశములలో నిర్మూలించునట్లుగ ఆవిశ్వాసులకు బలము శక్తియును నొసంగఁడు.

142. ఇన్నల్-మునాఫిఖీన-యుఖాదిఊనల్లాహ-వహువ-ఖాదిఉహుమ్-ఇజాఖామూ ఇలస్-సలాతి-ఖామూకుసాలా-యురాఊనన్-నాస-వలా-యజ్ కురూనల్లాహ-ఇల్లాఖలీలా. 143. ముజబ్-జబీన-బైనజాలిక-లాఇలా-హాఉ-లా వలా-ఇలా-హాఉ-లాఇ-వమన్ యుజ్-లిలిల్లాహు-ఫలన్-తజిద-లహూ-సబీల

142. నిశ్చయముగా వంచకులు దేవుని మోసపుచ్చుచున్నారు. మఱి దేవుఁడు వారి మోసమునకు శిక్షవిధించును. మఱియు వంచకులు నమాజున నిలుచునపుడు చాల సోమరితనముతో ప్రజలుచూచుటకు నిలుతురు. మఱి వారు దేవునిని చాల కొద్దిగా స్మరింతురు. 143. వారు ఇటునటుగాక మ లో ప్రేలాడుచున్నారు. మఱి దేవుఁడు ఎవనికి మార్గము తప్పించెనో వా కొఱకు వేఱుమార్గము నీవు పొందఁజాలవు.

వ్యా॥ 142. వంచకులు పైకి మాత్రము విశ్వాసులవలె నటించి లో అవిశ్వాసులుగానుండి, ముసల్మానులనుండియు అవిశ్వాసులనుండియు వే పొందుటకు యత్నింతురు. అట్లు వారు దేవునిని మోసపుచ్చుటకు చూతు కాని దేవుఁడు వారిని కొంతకాలము వదలిపెట్టి పిదప వారి కుట్రలు ముస నులకుఁ దెలిపి వంచకులను అవమానపఱచెను. పరలోకములోను వారికి బాధగలుగును. అట్లు వారు తాము కావించిన మోసము వంచనమేలని తల మోసపోయిరి. ఇస్లామ్‌లో ముఖ్యధర్మమైన నమాజును వంచకులు భక్తి ర్వకముగ సలుపరు. ప్రజలుచూచి మెచ్చుకొనుటకువచ్చి సోమరితనము ఏలాటి యుత్సాహము లేకుండనిలుతురు. వారు దేవునిని భక్తితో స్మరిం స్మరించునట్లు నటింతురు. 143. వంచకులకు విశ్వాసమునందు స్థిరత్వము దున ఒకపుడు ముసల్మానుల పక్షమున ప్రాలుదురు. మఱొకపుడు అవిశ్వా పక్షమునకుపోవుదురు ఇటునటు స్థిరముగాఁగాక మధ్యలోదేవులాడుచున్నా మనఃపూర్వకముగ విశ్వాసులుకారు. మఱియు బహిరంగముగాను అవి సులుకూడకారు. ఇట్టి చంచలస్వభావముగలవారికి సన్మార్గము దొరక నే దేవుఁడు మార్గముతప్పించినవారికి మఱొక త్రోవదొరకనేరదు.

144. యాఅయ్యుహల్లజీన-ఆమనూ-లాతత్-తఖిజుల్-కాఫిరీన-యాఅ-మిన్-దూనిల్-మూమినీన-అతురీదూన అన్-తజ్-అలూ-లిల్లాహి-అ

మ్-సుల్-తానమ్ముబీనా. 145. ఇన్నల్-మునాఫిఖీన-ఫిద్-దర్కిల్-అస్ఫలి మినన్-నారి-వలన్-తజిద-లహుమ్నసీరా. 146. ఇల్-లల్లజీన-తాబూ-వఅస్-లహూ వఅ-తసమూ బిల్లాహి-వఅఖ్లసూ-దీనహుమ్-లిల్లాహి-ఫఉలాఇక-మఅల్ మూమినీన-వసౌఫ-యూతిల్లాహుల్-మూమినీన-అజ్రన్-అజీమా. 147. మాయఫ్-అలుల్లాహు-బి-అజాబికుమ్-ఇన్-షకర్తుమ్-వఆమన్తుమ్-వకానల్లాహు షాకిరన్-అలీమా.

144. ఓవిశ్వాసులార! మీరు ముసల్మానులను వదలి అవిశ్వాసులను మీ స్నేహితులుగఁ జేసికొనకుఁడు. ఏమి మీరుమీపై దేవుని స్పష్టమైననిందకు హేతువు (ప్రమాణము) కల్పించుకొనకోరుచున్నారా! 145. నిశ్చయముగా వంచకులు నరకాగ్నిలోను అన్నిటికంటె క్రిందటిభాగములో నుందురు. మఱి వారికి సహాయు నెవనిని నీవు పొందఁజాలవు. 146. కాని ఎవరు క్షమాపణకోరి తమకార్యములను సవరించుకొని దేవుని నాశ్రయించి తమ మతమును ప్రత్యేకముగా దేవునికిఁ జేసి విధేయులగుదురో వారు విశ్వాసులలోఁ గూడియుందురు. మఱియు త్వరలోనే దేవుఁడు ముసల్మానులకు గొప్ప పుణ్యఫలితమొసంగును. 147. మీరు కృతజ్ఞతవహించి, విశ్వసించినచో దేవుఁడు మిమ్ము శిక్షించి పొందుఫలమేది? మఱి దేవుఁడు యోగ్యతనుగుర్తించువాఁడును సర్వజ్ఞుఁడును.

వ్యా॥ 144. వంచకులు, ముసల్మానులను వదలి శత్రువులగు అవిశ్వాసులతో సఖ్యము చేసికొనుచుండిరి. అట్లు చేయుట వంచనకుసూచన. కావున ముసల్మానులు తమ ముసల్మాను సహాయాదరులను వదలి తమ శత్రువులగు అవిశ్వాసులతో మనఃపూర్వకముగ స్నేహము చేసికొని ముసల్మానుల రహస్యములను వారికిఁ దెలుపఁగూడదు. అట్లు స్నేహముచేసికొన్నచో దేవుఁడు మిమ్ము నిందించి శిక్షించుటకు అది హేతువగును. కావున అట్లు చేయవలదు. 145. ఈవాక్యములో వంచకులకు లభించు నరకబాధ తెలుపఁబడుచున్నది. నరకములో ఒకటిపై నొకటిగ భాగములు గలవు. అందు అన్నిటికంటెక్రిందిభాగము చాల బాధించునది. అందు వంచకులు వసింతురు. అందుండువారిని తప్పించు స్నేహితుఁడు వారి కెవఁడును దొరకఁడు. కావున ముసల్మానులు, వంచకులలోనుండు దుర్గుణముల వహింపఁగూడదు. 146. వంచకులు తమ వంచనవదలి దేవునితో క్షమాపణ కోరి తమ పాపకార్యములు వదలి సత్కార్యములు చేసి దేవుని మతమగు ఇస్లామ్ను, గట్టిగా పూని దేవునిపై నాధారపడి ఆతనినే ఆశ్రయించి భయభక్తులు వహించినచో దేవుఁడు వారి పాపములను క్షమి

చును. వారు ఉభయలోకములలోను ముసల్మానులతోఁ గూడియుందురు. ముస ల్మానులకు లభించు గొప్ప పుణ్యఫలితములు వారికిఁగూడ లభించును. 147. దేవుఁడు అందఱి యోగ్యత తెలిసినవాఁడు. అందఱి కర్మలను బాగుగ నె ఱుఁగువాఁడు. దేవునియందు కృతజ్ఞత వహించి విశ్వాసము గలిగిన వారిని శిక్షింపఁడు. వారి కర్మల ఫలితము వారి కొసంగును. ఆతఁడు అవిశ్వాసులను వంచకులను శిక్షించును.

## ఆఱవ కాండము

148. లాయుహిబ్బు-ల్లా-హుల్-జహ్ర-బిస్-సూఇ-మినల్-ఖౌలి- ఇ ల్లా-మన్-ఝులిమ-వకానల్లాహు-సమీ-అన్-అలీమా. 149. ఇన్తుబ్దూ-ఖైరన్- ఔ-తుఖ్ఫూహు-ఔ-తఅ-ఫూ-అన్ సూఇన్-ఫఇన్నల్లాహ-కాన - అఫువ్వన్- ఖదీరా.

148. ఒకరి లోపములను వెల్లడించుటను దేవుఁడు ప్రేమింపఁడు కాని ఎవ్వనికి అన్యాయము జరిగినదో (వాఁడు వెల్లడింపవచ్చును.) మఱియు దేవుఁడు సర్వము వినువాఁడు సర్వము తెలిసికొనువాఁడు. 149. మీరు ఏదైన సత్కార్యమును వెల్లడిగాఁజేసినను లేక దాని దాఁచినను లేక చెడుగును క్షమించినను, దేవుఁడు క్షమించువాఁడు సర్వశక్తుఁడు అని యెఱుఁగుఁడు.

వ్యా॥ 148. ఎవరికైన ఒకరి తప్పులు, లోపములు, దెలిసినచో వాని వెల్లడింపరాదు. అట్లు చేయుట దేవునికి ఇష్టముకాదు. వీలైనంతవఱకు ఒకరి తప్పులను లోపములను దాఁచవలెను. కాని ఎవరైన ఒకనికి అన్యాయము చేసి నచో ఆ అన్యాయమును ప్రజలతో చెప్పుకొనవచ్చును. అది తప్పుగాదు. సర్వ ము దేవుఁడు వినువాఁడు. సర్వము దెలిసినవాఁడు. కావున ఎవరికర్మలకుఁ దగిన ఫలితము వారి కొసంగును. 149. ఎవనికి అన్యాయము జరిగినదో ఆతఁడు ఓర్పువహించి క్షమించుట యుత్తమము. అయిన ఆతఁడు తనకుఁ గలిగిన అన్యాయమునకు పరిహారము తీసికొనవచ్చును. దేవుఁడు సర్వశక్తిగలిగియు మానవుల పాపములను క్షమించుచున్నాఁడు గదా! మానవులుకూడ తమకు అన్యాయము చేసినవారిని క్షమింపవలెను.

150. ఇన్నల్లజీన-యక్ఫురూన-బిల్లాహి-వరుసులిహీ-వయురీదూన- అన్ యుఫర్రిఖూ-బైనల్లాహి-వరుసులిహీ-వయఖూలూన-నూమిను-బి-బఅ జన్- వన క్ఫురు-బిబఅ-జిన్-వయురీదూన-అన్-యత్తఖిజూ-బైన జాలిక-సబీలా. 151

ఉలాఇక-హుముల్-కాఫిరూన.హఖ్ఖన్-వఅఅ్-తద్నా-లిల్-కాఫిరీన-అజాబమ్ ముహీనా. 152. వల్లజీన-ఆమనూ-బిల్లాహి-వరుసులిహీ-వలమ్-యుఫర్రిఖూ-బైన అహదిమ్-మిన్-హుమ్-ఉలాఇక-సౌఫ-యూతీహిమ్-ఉజూరహుమ్- వకానల్లాహు-గఫూరర్-రహీమా.

150, 151. ఎవరు దేవునిని ఆతనిప్రవక్తలను తిరస్కరించి దేవునియందును ఆతని ప్రవక్తలయందును (విశ్వాసవిషయమున) భేదముకల్పింపకోరుచు, కొందఱిని విశ్వసించుచున్నాము మఱికొందఱిని తిరస్కరించుచున్నామని చెప్పుచు, దానిమధ్య ఒక మార్గము కల్పింపకోరుచున్నారో వారు నిజమైన అవిశ్వాసులు. మఱియు మేము వారికొఱకు అవమానకరమగు బాధసిద్ధపఱచియున్నాము. 152. మఱియు దేవునిని ఆతని ప్రవక్తలను విశ్వసించి, ప్రవక్తలనుగూర్చి విశ్వాసములో భేదము కల్పింపనివారికి దేవుఁడు శీఘ్రములోనే వారిపుణ్యఫలితము లొసంగును. మఱియు దేవుఁడు క్షమించువాఁడు దయాళువు.

వ్యా॥ 150, 151. ఈ వాక్యములలో యూదులును నస్రానీలును వహించు విశ్వాసమునుగూర్చి చెప్పఁబడినది. కొందఱు దేవుని నమ్మి ప్రవక్తలను విశ్వసింపరు. దేవుని ప్రవక్తలను తిరస్కరించుట దేవుని తిరస్కరించినట్లే. యూదులు హజ్రత్ ఈసాప్రవక్తను హజ్రత్ ముహమ్మదురసూలును విశ్వసింపరు. మఱియు నసారీలు (క్రైస్తవులు) హజ్రత్ ముహమ్మదు పైగంబరుల వారిని విశ్వసింపరు. కావున అట్లు కొందఱిని నమ్మి కొందఱిని తిరస్కరించుటసంపూర్ణమైనఅవిశ్వాసము. దానికినరక శిక్షలభించును. దేవునిని ఆతని ప్రవక్తలందఱిని విశ్వసింపవలెను. ఒక్కప్రవక్తను తిరస్కరించిన అందఱిని తిరస్కరించినట్లగును. అట్లుచేయువారు విశ్వాసమునకును అవిశ్వాసమునకును మధ్య ఒక మార్గము కల్పింప చూతురు. అది దేవునికి అంగీకారముకాదు. 152. ఈ వాక్యములో ముసల్మానుల విశ్వాసమునుగూర్చి చెప్పఁబడినది. ముసల్మానులు దేవునిని ఆతని ప్రవక్తలమధ్య ఏలాటి భేదముపాటింపక సంపూర్ణముగ అందఱిని విశ్వసింతురు. కావున వారికి దేవుఁడు గొప్పఫలితము లొసంగును. వారి పొరపాటులను క్షమించి కరుణించును.

153. యస్-అలుక-అహ్లుల్-కితాబి- అన్-తునజ్జిల - అలైహిమ్ - కితాబమ్-మినస్-సమాఇ-ఫఖద్-సఅలూ-మూసా-అక్బర- మిన్-జాలిక - ఫఖాలూ-అరినల్లాహ-జహ్రతన్-ఫఅఖజత్-హుముస్-సాఇఖతు-బిజుల్మిహిమ్- సు

మ్మత్-తఖ-జుల్-ఇజ్ల-మిమ్-బఅది-మా-జాఅత్-హుముల్-బయ్యినాతు- ఫ-అఫౌనా-అన్-జాలిక-ఆతైనా-మూసా-సుల్-తానమ్-ముబీనా. 154. వరఫ అనా-ఫౌఖహుమత్-తూర బి-మీసాఖిహిమ్.వఖుల్నా-లహుముద్-ఖులుల్-బాబసుజ్-జదన్-వఖుల్నా-లహుమ్-లాతఅ-దూ-ఫిస్సబ్తి-వఅఖజ్నా-మిన్‌హుమ్ మీసాఖన్-గలీజా,

153. గ్రంథముగలవారు, నీవు వారిపై వ్రాసిన యొక గ్రంథమును ఆకాశమునుండి దింపునట్లు వారు నిన్ను అడుగుచున్నారు. మఱి వారు దాని కన్న అధికమైనది మూసా నడిగియున్నారు. వారు మాకు దేవునిని స్పష్టముగా చూపింపుము అని అడిగిరి. కావున వారు గావించిన పాపములకుఁగాను వారిపై పిడుగుపడెను. పిదప వారు తమకు స్పష్టమైన సూచనలు వచ్చిన తరువాతను ఆవుదూడను (దేవునిగా) చేసికొనిరి. పిదప మేము దానిని క్షమించితిమి. మఱియు మేము మూసాకు స్పష్టమైన బలమునొసంగితిమి. 154. మఱియు మేము వారినుండి యొడంబడిక పుచ్చుకొనుటకై వారిపై కొండ నెత్తితిమి. మఱియు మేము వారితో మీరు సాష్టాంగపడుచు ద్వారములో ప్రవేశింపుఁడు అని చెప్పితిమి. మఱియు శనివార ధర్మమును అతిక్రమింపకుఁడు అని వారితో పలికితిమి. మఱి మేము వారినుండి స్థిరమైన ఒడంబడికను తీసికొంటిమి.

వ్యా॥ 153. కొందఱు యూదులు హజ్రత్ ముహమ్మదువారియొద్దకు వచ్చి మీరు నిజమైన దేవుని ప్రవక్తలైనచో ఒకేతూరి వ్రాసిన గ్రంథమును దింపుఁడు అని ద్వేషభావముతో నడిగిరి. దానికిందు జవాబియ్యఁబడినది. ఓ ప్రవక్తా! యూదులు నిన్ను అడిగినది ఆశ్చర్యకరమైనమాటకాదు. వారి స్వభావమే యది. మూసా ప్రవక్తతో దేవునినే మాకు స్పష్టముగా చూపుము. లేనిచో మేము విశ్వసింపము అని ప్రశ్నించియున్నారు. దానికిఁగాను వారిపై పిడుగుపడి యూదులు చచ్చిరి. అపుడు మూసాప్రవక్త ప్రార్థనలవలన దేవుఁడు వారికి మరల ప్రాణముపోసెను. అట్టి దేవుని మహిమను చూచియు వారు ఆవుదూడను దేవునిగాఁ జేసికొని పూజించిరి. తుదకు దేవుఁడు వారి పాపమును క్షమించెను. ఆవుదూడను పూజించినవారు వధింపఁబడిరి. అట్లు మూసా ప్రవక్తకు దేవుఁడు స్పష్టమైన బలము నొసంగెను. ఈ విషయములు వివరముగా సూరే బఖరాలో వ్రాసియున్నాము. 154. యూదులు తౌరాతుగ్రంథములోని ధర్మములు చాల కఠినములుగా నున్నవి అని పలుకసాగిరి. అందుకు వారి తలలపై దేవుఁడు తన శక్తిచే తూరుకొండ నెత్తెను. అపుడు యూదులు ఆ కొండ తమ తలలపై పడునను భీతిచే మేము తౌరాతు ధర్మములు సమ్మతిం

చితిమి అని వాగ్దానము చేసిరి. యూదులకు ఒక గ్రామములో సాష్టాంగము (సిజ్దా) చేయుచు తలలు వంచుకొని ప్రవేశింపుఁడు అని దేవుని యాజ్ఞకాఁగా దానికి వ్యతిరేకముగ వారు పిఱ్ఱలతో జాఱుచు పోయిరి. దానికి శిక్షగా ప్లేగు అను రోగము వారియందు వ్యాపించి వేలకొలఁది మంది మరణించిరి. యూదులకు శనివారమునాఁడు చేపలు వేటాడకూడదు అని సెలవయ్యెను. దానికి వ్యతిరేకముగ శనివారమునాఁడు తంత్రములతో చేపలను గుంటలు త్రవ్వి అందు పడునట్లుచేసి మఱుసటిదినము పట్టుకొనుచుండిరి. దానికి శిక్షగా యూదులు కోఁతులైరి. ఈ విషయములుకూడ సూరే బఖరాలో వివరముగా వచ్చినవి. అక్కడ చూచుకొనుఁడు.

155. ఫ-బిమా-నఖ్-జిహిమ్-మీసాఖహుమ్-వకుఫ్రిహిమ్-బి- ఆయాతిల్లాహి-వఖత్‌లి-హిముల్-అంబియాఅ బిగైరి-హఖ్ఖిన్-వఖౌలిహిమ్-ఖులూబునా-గుల్ఫున్-బల్-తబ-అల్లాహు-అలైహా-బికుఫ్రిహిమ్ ఫలా-యూమినూన-ఇల్లా ఖలీలా. 156. వ-బికుఫ్రిహిమ్- వఖౌలిహిమ్ - అలా-మర్‌యమ-బుహ్తానన్-అజీమా. 157. వఖౌ-లిహిమ్-ఇన్నా ఖతల్-నల్-మసీహా-ఈసబ్న-మర్‌యమ-రసూలల్లాహి-వమా-ఖతలూహు-వమాసలబూహు-వలాకిన్-షుబ్బిహా-లహుమ్-వఇన్నల్-లజీనఖ్-తలఫూ-ఫీహి-లఫీ.షక్కిమ్-మిన్‌హు మాలహుమ్-బిహీ-మిన్-ఇల్మిన్-ఇల్లా-ఇత్-తిబా-అజ్-జన్ని-వమా- ఖతలూహు- యఖీనా. 158. బల్- రఫఅ-హుల్లాహు-వకానల్లాహు- అజీజన్-హకీమా. 159. వఇమ్-మిన్-అహ్‌లిల్-కితాబి-ఇల్లా-లయూమినన్న-బిహీ-ఖబ్ల- మౌతిహీ-వయౌమల్ ఖియామతి.యకూను-అలైహిమ్-షహీదా.

155. వారికి లభించిన శిక్ష వారు గావించిన ఒడంబడికను త్రెంచుటవలనను, వారు దేవుని సూచనలను తిరస్కరించుటవలనను అన్యాయముగా వారు ప్రవక్తలను చంపుటవలనను, వారు మా హృదయములు తెరలలోనున్నవి అని చెప్పుటవలనను. అట్లుకాదు. వారి అవిశ్వాసమువలననువారిహృదయములపై దేవుఁడు ముద్ర వేసియున్నాఁడు. కావున కొందఱు తప్ప మిగిలిన అనేకులు విశ్వసింపరు. 156, 157. వారికి లభించినశిక్ష వారి తిరస్కారమువలనను, వారు మర్యముపై గొప్పఅపనింద మోపినందునను, దేవుని ప్రవక్తయు మర్యముకు పుత్రుఁడునగు ఈసాను చంపితిమని వారుపలికినందులకును, మఱి

వారు ఆతని చంపలేదు. మఱి సిలువపై నెక్కింపలేదు. కాని వారు సందేహము న మునింగిరి. మఱియు ఆతనిగూర్చి భేదాభిప్రాయములుగలవారు ఆతని విష యము సందేహించుచున్నారు. ఆతనిగూర్చి వారికి వాస్తవమైన విషయము తెలియదు. కాని వారు ఊహను మాత్రము అనుసరించుచున్నారు. మఱియు నిశ్చయముగ వారు ఆతని వధింపలేదు. కాని దేవుఁడు ఆతనిని తనయొద్దకు నెత్తు కొనెను. మఱి దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనాపరుఁడును. మఱియు గ్రం థముగలవారిలో ప్రతి మనుజుఁడును ఈసాను, ఆతని చావునకు పూర్వము విశ్వసించును. మఱియు ఆతఁడు తుది దినమునందు వారికి సాక్షియగును.

వ్యా॥ 155. ఈవాక్యములో యూదులకు లభించిన శిక్షకు కారణములు చెప్పఁబడినవి. యూదులు తాము గావించిన ఒడంబడికలను త్రెంపి దేవునిసూ చనలను తిరస్కరించి అన్యాయముగా దేవుని ప్రవక్తలను చంపిరి. హజ్రత్ము హమ్మదువారు యూదులకు ఇస్లామ్ ధర్మములను బోధింపఁగా వారు మాహృ దయములు చాల భద్రముగా తెరలలోనున్నవి. మీ బోధలు మాహృదయము లలోచొరవు అని పలుకుచుండిరి. అందుకు దేవుఁడు వారుచెప్పునది సరికాదు. వారి తిరస్కారము వలన వారి హృదయములపై ముద్రపడియున్నది అనెను. ఎట్లు ముద్రపడినవస్తువులో బయటినుండి ఎద్దియును చొరదో అట్లు వారిహృద యములలో సన్మార్గవిషయమును బోధలును చొరవు. యూదులలో, అబ్దుల్లా బిన్‌సలాము మొదలగు వారు కొందఱు విశ్వసించి యిస్లామ్‌లోచేరిరి. మిగిలి నయూదులందఱును విశ్వసింపలేదు. 156: 158. యూదులపై దేవునికి కోపము గలుగుటకు ఇంకనుకారణములుగలవు. అవి-ఈవాక్యమందు చెప్పఁబడినవి.యూ దులు ఈసా (ఏసు) ప్రవక్తను తిరస్కరించి ఆతని తల్లిపై అపనిందమోపిరి. ఏ సుక్రీస్తు దేవునిమహిమవలన తండ్రిలేకనే బీబీమర్యము గర్భమునుండిపుట్టెను. అందుకుయూదులు మర్యముపై అపనిందమోపిరి. యూదులు ఏసుక్రీస్తును వధిం చి సిలువపై నెక్కించితిమి అని డంబములాడుచుండిరి. వారట్లు చెప్పుట వల నను యూదులు దేవుని కోపమునకు పాత్రులై అనేక బాధలకు లోఁబడిరి. యూదులుపలుకునది అబద్ధము. వారు ఏసును వధింపనులేదు. ఆతని సిలువపై నెక్కింపనులేదు. ఏసును పోలినవానిని వధించి వారుసందేహములోపడి ఏసు క్రీస్తునే వధించినామని మఱికొందఱు లేదని అభిప్రాయభేదములు గలిగినవా రైరి. వారికి నిజమైనసంగతి తెలియదు. వారుచేయునది యూహామాత్రమే. వా స్తవము ఏమనగా ఏసుక్రీస్తును చంపుటకై ఆయన యుండిన యింటిలోనికి యూదులలో నొకండు ప్రవేశించెను. అపుడు దేవుఁడు ఏసుక్రీస్తును తనగొప్ప శక్తిచే తనయొద్దకు ఆకాశముపైకి నెత్తుకొని ఇంటిలో ప్రవేశించినవానిరూప ము ఏసురూపముగా మార్చెను. మిగిలినయూదులు ఇంటిలో ప్రవేశించి తమ

మనుష్యునేచంపిరి. తరువాత తమమనుష్యుఁడుకనఁబడకపోయెను. అందుకుయూదులు కలహింపసాగిరి. చనిపోయినవాఁడు ఏసుక్రీస్తు అనికొందఱుకాదని కొందఱు చెప్పసాగిరి. తుదకువారికి వాస్తవము తెలియకపోయెను. వారు పన్నిన కుట్రసాగలేదు. దేవుఁడుసర్వశక్తుఁడును వివేచనాపరుఁడును. ఆతనిశక్తి కిమించినది ఎద్దియునులేదు. 159. ఏసుక్రీస్తుఆకాశముపైనున్నాఁడు ఆయన తుదిదినము (ఖియామతు) నకు సమీపమున ఆకాశమునుండి దిగివచ్చి ఇస్లామ్ మతప్రచారముచేసి దజ్జాలు అనుదుష్టుని చంపును. అపుడు గ్రంథము గలవారు అనఁగా యూదులు క్రైస్తవులు అందఱును ఏసుక్రీస్తు చావకముందు ఆతనిని నమ్మెదురు. యూదులు ముందు తిరస్కరించియుండిరి. మరల విశ్వసింతురు. క్రైస్తవులు ఆతనిని దేవునిగాను, దేవుని కుమారునిగాను భావించి సన్మార్గము తొలఁగియుండిరి. కావున వారపుడు ఏసుక్రీస్తు దేవుని ప్రవక్తమాత్రమే అని విశ్వసింతురు. తుదిదినమునందు యూదులు క్రైస్తవులు గావించియున్న కర్మలను అధర్మములనుగూర్చి దేవునియెదుట ఏసుక్రీస్తు సాక్ష్యమిచ్చును.

160. ఫబి జుల్మిమ్ మినల్లజీన హాదూ హర్రమ్నా అలైహిమ్-తయ్యిబాతిన్-ఉహిల్లత్-లహుమ్-వబిసద్దిహిమ్-అన్-సబీలిల్లాహి-కసీరా. 161. వ-అఖ్జిహిముర్-రిబా-వఖద్-నుహూ-అన్హు-వఅక్లిహిమ్-వఅమ్వాలన్నాసి-బిల్-బాతిలి-వఅఅ్తద్నా-లిల్కాఫిరీన-మిన్హుమ్-అజాబన్-అలీమా. 162. లాకినిర్-రాసిఖూన-ఫిల్-ఇల్మి-మిన్హుమ్-వల్-మూమినూన-యూమినూన-బిమాఉన్జిల-ఇలైక-వ-మాఉన్జిల-మిన్-ఖబ్లిక-వల్-ముఖీమీనస్-సలాత-వల్-మూతూనజ్-జకాత-వల్మూమినూన-బిల్లాహి-వల్-యౌమిల్-ఆఖిరి-ఉలాఇక-స-నూతీ-హిమ్-అజ్రన్-అజీమా.

160. మఱియు యూదుల పాపకార్యములవలనవారికి ధర్మముగానున్న అనేక పవిత్రవస్తువులను మేము నిషేధించితిమి. మఱియు వారు అనేకులను దేవునిమార్గమునుండిఆటంకపఱచుచుండినందువలనను, 161. వారికి నిషేధింపబడిన వడ్డిని వారు పుచ్చుకొనుటవలనను, అన్యాయముగ, లోకులసొమ్ముతినుటవలనను, (ఆశిక్ష వారికి కలిగెను). మఱియు వారిలో అవిశ్వాసులైనట్టివారికిఁ గాను మేము దుఃఖకరమైన బాధ సిద్ధపఱచియున్నాము. 162. కాని వారిలో స్థిరమైన జ్ఞానముగలవారును, ముసల్మానులును నీకొసంగఁబడినదానిని, నీకు ముందు (ప్రవక్తలకు) ఒసంగఁబడినదానిని నమ్ముచున్నారు. మఱియు నమా

జును స్థిరముగా సలుపువారును, విధిదానము (జకాతు) చేయువారును అల్లాః యందును తుదిదినమందును విశ్వాసముగలవారును, అగునట్టివారికి మేము గొప్ప పుణ్యఫలిత మొసంగుదుము.

వ్యా॥ 160, 161. యూదులు గావించుచున్న పాపకార్యములకును వారి దౌష్ట్యమునకును కఠినముగా ధర్మములు విధింపఁబడెను. తౌరాతుగ్రంథమునకు ముందు వారు తినుచున్న మంచి పదార్థములు కొన్నివారికి శిక్షకుఁగాను నిషేధింపఁబడినవి. అవి ఒంటె, బాతు మొదలగునవి. ఆవు మేఁకల ఎముకలకును వీఁపునకును తగిలియుండు కొవ్వుగాక మిగత కొవ్వును తినకూడదుఅని విధింపఁబడెను. యూదులు తాము సన్మార్గమును అవలంబించియు ఇతరులను కూడ సన్మార్గమునుండి తప్పించుచుండిరి. ఇది వారి స్వభావమై యుండెను. అందులకే అనేక ప్రవక్తలను వధించి ఈసా ప్రవక్తను, ముహమ్మదు పైగంబరుల వారిని నమ్మక తిరస్కరించిరి. వడ్డిపుచ్చుకొనకూడదు అను ధర్మము యూదులకు తెలియును. కాని వారు దానిని అతిక్రమించి వడ్డివ్యాపారము చేయుచు లోకుల సొమ్మును అధర్మముగా తినివేయుచుండిరి. ఇట్టి పాపకార్యములు చేసినందులకే వారు ఘోరశిక్షలొంది ఇహమునందు గౌరవముచెడి అవమానమునకు పాలైరి. మఱి పరలోకములోను యూదులలో విశ్వసింపని వారికి నరకబాధ గలదు. 162. యూదులలో అబ్దుల్లాబిన్‌సలామ్‌ను అతని అనుచరులును స్థిరమైన జ్ఞానముగలిగి ఇస్లామ్‌లో చేరిరి. వారును ముసల్మానులును దేవుఁడొసంగిన అన్ని గ్రంథములను విశ్వసించుచు నమాజు, దానము మొదలగు సత్కార్యములు చేయుచు, దేవునియందును తుది దినము (ఖియామతు) నందునమ్మికగలిగియుండినచో గొప్పపుణ్యఫలితమగుస్వర్గము (జన్నత్) లభించు

163. ఇన్నా-ఔ-హైనా-ఇలైక-కమా-ఔ-హైనా- ఇలా-నూహిన్ - వన్-నబీయీన-మింబఅ్-దిహీ-వ-ఔ-హైనా-ఇలా-ఇబ్రాహీమ-వ- ఇస్మాఈల వ-ఇస్‌హాఖ-వయఅ్-ఖూబ-వల్-అస్బాతి-వ-ఈసా-వ-అయ్యూబ-వయూనుస-వ-హారూన-వసులైమాన-వఆతైనా-దావూద-జబూరా. 164. వరుసులన్-ఖద్-ఖసస్నా-హుమ్-అలైక-మిన్-ఖబ్లు-వరుసులల్-లమ్-నఖ్సుస్‌హుమ్ - అలైక-వకల్లమల్లాహు-మూసా-తక్లీమా. 165. రుసులమ్-ముబష్షిరీన-వమున్-జిరీన-లిఅల్లా-యకూన-లిన్నాసి-అలల్లాహి-హుజ్జతుమ్-బఅ్-దర్-రుసులి- వకానల్లాహు-అజీజన్-హకీమా. 166. లాకినిల్లాహు-యష్‌హదు-బిమా-అన్-జల- ఇలైక

అన్-జలహూబి-ఇల్మిహీ-వల్-మలా-ఇకతు-యష్హదూన-వకఫా - బిల్లాహి - షహీదా.

163. మేము, నూహుకును ఆతని తరువాత వచ్చిన ప్రవక్తలకును సందేశము (వహీ) పంపినట్లు నీకును సందేశము (వహీ) పంపితిమి. మఱియు మేము ఇబ్రాహీమునకును, ఇస్మాయీలునకును ఇస్హాఖునకును, యాఖూబునకును, ఆతని సంతతివారికిని ఈసాకును, యూనుసునకును, హారూనునకును, సులైమానునకును సందేశము (వహీ) పంపితిమి. మఱియు మేము దావూదునకు జబూరు గ్రంథ మొసంగితిమి. 164. మఱియు దీనికిముందు నీకుఁ దెలిపియున్న ప్రవక్తలకుసందేశముపంపియున్నాము. మఱియు మేమునీకుఁ దెలుపకయున్న ప్రవక్తలకును సందేశము పంపియున్నాము. మఱియు దేవుఁడు మూసాతో ప్రత్యేకముగా మాటలాడెను. 165. ప్రవక్తలు వచ్చిన పిదప జనులు దేవునిపై సాకుపెట్టకుండుటకై సంతోషవార్త నిచ్చువారలుగను, భయ బోధ నిచ్చువారలగను జేసి ప్రవక్తలను పంపెను. మఱి దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనాపరుఁడును. 166, కాని దేవుఁడు, నీకు పంపిన గ్రంథమునుగూర్చి తాను దానిని జ్ఞానపూర్వకముగా పంపెను అని సాక్ష్యమిచ్చుచున్నాఁడు. మఱియు దేవదూతలుకూడసాక్షులుగానున్నారు. మఱి దేవునిసాక్ష్యమేచాలును.

వ్యా॥ 163. యూదులు హజ్రత్ ముహమ్మదు పైగంబరులవారియొద్దకు వచ్చి ఆకాశమునుండి గ్రంథము దింపుము అని వారిని అడిగియుండిరి, వారికి జవాబియ్యకముందు వారి దుష్టకార్యములు పై వాక్యములలో వివరింపఁబడి ఇఁక ఈ వాక్యములలో వారికి సమాధానము ఇయ్యఁబడుచున్నది. దేవుఁడు అనేక ప్రవక్తలకు తన సందేశము పంపినట్లు ముహమ్మదుప్రవక్తకుకూడ సందేశము (వహీ) పంపెను. అందఱు ప్రవక్తలకు ఒకేతూరి ఆకాశమునుండి లిఖితమైన గ్రంథములు పంపలేదు. సమయోచితముగ నతని ఇష్టము ప్రకారము కొందఱితో స్వయముగా మాటలాడెను. (మూసా ప్రవక్తతో మాటలాడెను). కొందఱికి తన దూతల (ఫరిష్తే) మూలమున తన సందేశము (వహీ)పంపెను. మఱికొందఱికి లిఖితమైన గ్రంథమే పంపెను. (మూసా ప్రవక్తకు లిఖితమైన, తౌరాతు గ్రంథ మొసంగెను). ఇవన్నియు దేవుని సందేశములు అని జనులు నమ్మవలెను. కాని లిఖితరూపము గానే వచ్చినగాని మేము నమ్మము అని పలుకుట అవివేకము. ఇది భక్తులకు తగదు. ఇది విశ్వసింపకుండుటకు ఒక నెపము మాత్రమే గాని వేఱుకాదు. నూహుప్రవక్తను తిరస్కరించిన జనులకు దేవుని శిక్ష గలిగెను. ఆదమునుండి, నూహువఱకు వచ్చిన ప్రవక్తలకాలములో జనులకు శిక్షగలుగలేదు, అపుడు మతప్రచారము ప్రారంభదశలో నుం

డెను. దావూదు ప్రవక్త కొసంగఁబడిన గ్రంథమునకు పేరు జబూరు. దేవుఁడు అనేక ప్రవక్తలను పంపియున్నాఁడు. వారిలో కొందఱి పేరును వారి విషయములను ఖురానెషరీఫులోఁ దెలిపియున్నాఁడు. అనేక ప్రవక్తలపేర్లను వారి విషయములను అందు తెలుపఁబడలేదు. వారికందఱికిని దేవుని సందేశము వచ్చెను. కావున ముసల్మానులు దేవుఁడు పంపిన అందఱు ప్రవక్తలను విశ్వసింపవలెను. ఈసూరా మదనీసూరా. దీనికిముందు మక్కీ-సూరాలలో కొందఱు ప్రవక్తల విషయములు వివరింపఁబడినవి. ఖురానెషరీఫులో వచ్చిన ప్రవక్తల పేర్లు:—ఆదము, ఇద్రీసు, నూహు, హూదు, సాలిహ్, ఇబ్రాహీము, లూతు, ఇస్మాఈలు, ఇస్హాఖు, యాఖూబు, యూసుఫు, అయూబు షుఐబు, మూసా, హారూను, యూనుసు, దావూదు, సులైమాను, ఇల్యాసు, అల్‌యసఉ, జకిరియా, యహ్యా, ఈసా, జుల్‌కిఫ్లి, హజ్రత్ ముహమ్మదు. ఈ ప్రవక్తలవిషయము సూరయె అంబియాలో వివరము వ్రాయుదుము. హజ్రత్ ముహమ్మదువారి చరిత్రము కోరువారు మేము ప్రకటించిన జగత్‌ప్రవక్త(రెండు భాగములు) అను గ్రంథము చూడవలెను. 165. దేవుఁడు ప్రవక్తలను పంపియున్నాఁడు. విశ్వసించి సత్కార్యములు చేసిన వారికి మోక్షముగలదు అని సంతోషవార్త నిచ్చిరి. మఱియు తిరస్కరించి అవిశ్వాసులైనవారికి నరకబాధ గలదు అని భయబోధ నిచ్చిరి. ఎందుకన, తీర్పుదినమునందు జనులు మాకు దేవుని యిష్టము అనిష్టము తెలియలేదే అను సాకు దేవునిపై మోపకుండుటకై ప్రవక్తలను దేవుఁడు పంపెను. దేవుఁడు సర్వశక్తుఁడు. యుక్తాయుక్తములు దెలిసిన వివేచనాపరుఁడు. 166. అవిశ్వాసులు, యూదులు, ఖురానుగ్రంథమును తిరస్కరించిన తిరస్కరింపనిండు. కాని దేవుఁడు తానుపంపినఖురానుగ్రంథమును జ్ఞానపూర్వకముగా పంపెను అనియు అందు గొప్పజ్ఞానమును విద్యయును గలదు అనియు సాక్ష్యమిచ్చుచున్నాఁడు. దేవుని సాక్ష్యమే చాలును. దేవదూతలుగూడఖురానుగ్రంథము దేవుడుపంపినగ్రంథమని సాక్ష్యమిచ్చుచున్నారు

167. ఇన్నల్లజీన-కఫరూ వసద్దూ-అన్-సబీలిల్లాహి-ఖద్-జల్లూ జలాలమ్-బఈదా. 168. ఇన్నల్లజీన-కఫరూ-వజలమూ-లమ్-యకునిల్లాహు-లియగ్ఫిర-లహుమ్ వలా-లియహ్దియహుమ్-తరీఖా. 169 ఇల్లాతరీఖ-జహన్నమ-ఖాలిదీన-ఫీహా-అబదన్ వకాన-జాలిక-అలల్లాహి-యసీరా. 170. యా-అయ్యుహన్నాసు-ఖద్ జా అకుముర్-రసూలు-బిల్-హఖ్ఖి-మిర్-రబ్బికుమ్-ఫ-ఆమినూ-ఖైరల్-లకుమ్-వఇన్ తక్ఫురూ-ఫఇన్న-లిల్లాహి-మాఫిస్-సమావాతి-వల్ అర్జి-వకానల్లాహు-అలీమ

న్-హకీమా.

167. అవిశ్వాసులై దేవుని మార్గమునుండి ఆటంకపఱచినవారు చాల దూరమైన దుర్మార్గములోపడినవారు. 168. అవిశ్వాసులై అన్యాయము చేసినట్టివారిని దేవుఁడు క్షమించువాఁడు గాని, సన్మార్గము చూపువాఁడుగాని కాఁడు. 169. కాని వారికి నరకమార్గము చూపును. వారందు సదా యుందురు. మఱియు, ఇది దేవునికి చాల సులువైన పని. 170. ఓజనులార! మీప్రభువునుండి సత్యము దీసికొని మీయొద్దకు ప్రవక్తవచ్చియున్నాఁడు. కావున మీరు విశ్వసింపుఁడు. మీకు మేలగును. మఱియు మీరు విశ్వసింపనిచో ఆకాశములో భూమిలోనున్న సమస్తము దేవునిదే అని తెలిసికొనుఁడు. మఱియు దేవుఁడు సర్వజ్ఞుఁడు వివేచనాపరుఁడు.

వ్యా॥ 167. ఇంతవఱకు ఖురానెషరీఫు దేవుని గ్రంథమనియు, హజ్రత్ ముహమ్మదువారు దేవుని ప్రవక్తని రుజువుచేయఁబడెను. దీని పిదప పైగంబరు వారిని తిరస్కరించి అవిశ్వాసులై ఇతరులనుకూడ సన్మార్గమునుండి ఆటంకపఱచువారు దుర్మార్గములోపడినవారు అనియు ఇట్టి వారిని దేవుఁడు క్షమింపఁడు, అనియు వారికి మోక్షము దొరకదు, అనియు వారికి నరకమే ప్రాప్తియగును, అనియు దానిలోనే ఎల్లపుడుందురు అని హెచ్చరింపఁబడుచున్నది. 170. దేవుని ప్రవక్త హజ్రత్ ముహమ్మదు, సత్యమైన మతమును, గ్రంథమును దీసికొని ప్రజలయొద్దకు దేవునినుండి వచ్చియున్నారు. వారిని విశ్వసించినచో ప్రజలకు మేలు గలుగును. ఇహమునందు విజయమును పరమునందు మోక్షమును లభించును. సర్వము దేవునికి కధీనమై యున్నది. ఆతనికి సర్వము దెలియును. ప్రజలకర్మలకుఁదగిన ఫలిత మొసంగును. కావున హజ్రత్ రసూలువారిని నమ్మి వారిననుసరించుట మానవుల కర్తవ్యము.

171. యాఅహ్లల్-కితాబి-లాతగ్లూ-ఫీదీనికుమ్-వలాతఖూలూఅలల్లాహి-ఇల్-లల్.హఖ్ఖ-ఇన్నమల్-మసీహు-ఈసబ్నుమర్యము-రసూలుల్లాహి-వకలిమతుహూ-అల్ఖాహా-ఇలల్-మర్యము-వరూహుమ్-మిన్-హు-ఫఆమినూ-బిల్లాహి-వరుసులిహీ-వలా-తఖూలూ-సలాసతున్-ఇన్తహూ-ఖైరల్లకుమ్-ఇన్నమల్లాహు-ఇలాహున్-వాహిదున్-సుబ్హానహూ-అన్-యకూన-లహూ-వలదున్-లహూమాఫిస్-సమావాతి-వమాఫిల్-అర్జి-వకఫా-బిల్లాహి-వకీలా.

171. ఓ గ్రంథము గలవారలార! మీరు మీమతములో హద్దులను మీరకుఁడు. మఱి దేవుని గూర్చి సత్యముదప్ప వేఱుమాట పలుకకుఁడు. నిశ్చయముగా మర్యము కుమారుఁడగు ఈసా దేవుని ప్రవక్త. దేవుఁడు మర్యమునకు పంపిన ఆతని వాక్కును, దేవునినుండి వచ్చిన ఆత్మయును, మాత్రమే. కావున దేవునిని ఆతని పవిత్రవక్తలను విశ్వసింపుఁడు. మఱి దైవములు ముగ్గురున్నారని పలుకకుఁడు. దాని మానుకొనుఁడు. మీకు మేలగును. నిశ్చయముగా దేవుఁడు ఒక్కఁడే. దేవునికి పుత్రులుండుట తగదు. ఆకాశములో భూమిలోనున్న సమస్తమును ఆతనిదే. మఱియు దేవుఁడే చాలిన సంరక్షకుఁడు. (దేవుని సంరక్షణయే చాలును.)

వ్యా॥ 171. యూదులును నసారీలు (క్రైస్తవులు)ను తమతమ పవిత్రవక్తలను, అతిశయముగా పొగడుచు, మత విషయములలో హద్దులు మీఱుచుండిరి. అందు క్రైస్తవులు, ఈసాప్రవక్తను, గూర్చి దేవుఁడని, దేవుని కుమారుఁడని, తప్పు విశ్వాసముంచుచుండిరి. దేవుని విషయమునకూడ అసత్యము పలుకుచుండిరి. అట్లు కూడదు అని ఈవాక్యములో చెప్పఁబడుచున్నది. ఏసుక్రీస్తు దేవుఁడుగాని దేవుని కుమారుఁడుగాని కాదు. ఆతఁడు దేవుని ప్రవక్తమాత్రమే. తండ్రి లేకయే దేవుని వాఙ్మహిమవలన పుట్టెను. ఏసుక్రీస్తు ఆత్మను దేవుఁడే పంపినది. కావున ఏసుక్రీస్తు దేవుని సృష్టిలో చేరినయాతఁడు. ఆయన ప్రవక్తయని విశ్వసింపవలెను. దేవుఁడు ఒక్కఁడే అని విశ్వసింపవలెను. క్రైస్తవులు, ఏసును, ఆతనితల్లి మర్యమును, దేవునిని కలిపి ముగ్గురు దేవుళ్లు అని పలుకుదురు. అది తప్పు. అట్లు విశ్వసింపఁగూడదు. అట్లు పలుకుట మానుకొనవలెను. దాని వలన ఉభయ లోకములలో మేలగును. లేనిచో తప్పు విశ్వాసమువలన నరకము ప్రాప్తియగును. దేవునికి భార్యగాని పుత్రుఁడుగాని లేరు. ఆతఁడు ఇట్టి సంబంధములనుండి పరమ పవిత్రుఁడు. భూమ్యాకాశములలోనున్న సమస్తము ఆతనికి అధీనమైయున్నది. ఆతఁడు అందఱికును సంరక్షకుఁడు. ఆతని సంరక్షణతప్ప వేఱుసంరక్షణ వారికి లభింపఁబోదు. కావున దేవుని యేకత్వము(తౌహీదు)ను విశ్వసించి ఆతనికి భార్యగాని బిడ్డలుగాని కల్పింపరాదు.

172. లన్‌యస్ తన్‌కిఫల్-మసీహు-అన్-యకూన-అబ్దల్-లిల్లాహి-వలల్-మలాఇకతుల్-ముఖర్రబూన-వ-మన్-యస్తన్‌కిఫ్ అన్ ఇబాదతిహీ-వయస్తక్-బిర్-ఫస-యహ్-షురుహుమ్ ఇలైహి-జమీఆ. 173. ఫఅమ్మల్-లజీన-ఆమనూ-వఅమిలుస్-సాలిహాతి-ఫయు వఫ్ఫీహిమ్-ఉజూరహుమ్-వయజీదుహుమ్ మిన్‌ఫజ్‌లిహీ-వఅమ్మల్-లజీనస్-తన్‌కఫూ-వస్తక్‌బరూ-ఫయుఅజ్-జిబుహుమ్-

అజాబన్-అలీమా. 174. వలా-యజిదూన-లహుమ్-మిన్-దూనిల్లాహి-వలీయన్ వలానసీరా.

172. ఈసాగాని, దేవుని సన్నిధానముపొందిన దేవదూతలుగాని, దేవునికి దాసులుగానుండుట అవమానమని తలంపరు. మఱెవరు, దేవుని నారాధించుటను తిరస్కరించి గర్వము వహింతురో వారందఱిని దేవుఁడు తనయొద్దకు రప్పించును. 173. ఆపిదప ఎవరు విశ్వసించి సత్కార్యములుచేసిరో వారికి వారి పుణ్యఫలితములు పూర్తిగా నొసంగి తన అనుగ్రహము వారికి మఱింత హెచ్చుగా నొసంగును. మఱియు ఎవరు తిరస్కరించి, గర్వము వహించిరో వారికి దుఃఖకరమైన బాధ నొసంగును. 174. మఱియు దేవుఁడు తప్ప మఱెవ్వరును సంరక్షించువారుగాని సహాయపడువారుగాని యుండఁబోరు.

వ్యా॥ 172. క్రైస్తవులు ఈసాను, పెక్కు దైవారాధకులు, దేవదూతలను పూజింతురు. ఇందు, ఏసుక్రీస్తును దేవతలకును దేవునియందుగల భక్తి సూచింపఁబడినది. ఏసుక్రీస్తును దేవదూతలును దేవునికి దాసులు. కావున దేవునారాధించుట అవమానమని తలంపరు. కావున, వారి అనుచరులు, దేవునియందే భయభక్తులు గలిగి యుండవలెను. తీర్పు దినమునందు, అందఱు మానవులను దేవుఁడు రప్పించునప్పుడు, విశ్వసించి భయభక్తులు గలిగి సత్కార్యములు చేసిన వారికి వారి పుణ్యఫలితము స్వర్గనివాసమొసఁగును. తన అనుగ్రహముచే వారికి మఱింత స్వర్గసౌఖ్యము లొసంగును. ఎవరు, దేవునిసేవను (భక్తి) పూజలను తిరస్కరించి గర్వము వహింతురో వారికి వారి కర్మల ఫలితముగ నరకబాధ లభించును. అప్పుడు వారికి తోడుపడువారు దేవుఁడు తప్ప ఎవరును ఉండఁబోరు. అపుడు అవిశ్వాసులకు వారు ఆరాధించుచున్న చిల్లరదేవతలును, క్రైస్తవులకు ఏసుక్రీస్తును పనికిరారు.

175. యాఅయ్యుహన్నాసు-ఖద్-జాఅకుమ్-బుర్-హానుమ్-మిర్-రబ్బికుమ్-వఅన్-జల్నా-ఇలైకుమ్-నూరమ్-ముబీనా. 176. ఫఅమ్మల్లజీన-ఆమనూ-బిల్లాహి-వఅ-తసమూ-బిహీ-ఫసయుద్-ఖిలుహుమ్-ఫీ-రహ్మతిమ్-మిన్‌హు-వఫజ్లిన్-వయహ్దీహిమ్-ఇలైహి-సిరాతమ్-ముస్తఖీమా.

175. ఓజనులార! మీప్రభువునుండి మీయొద్దకు ప్రమాణము (సన్నదు) వచ్చియున్నది. మఱియు మేము మీయొద్దకు స్పష్టమైన జ్యోతిని పంపియున్నాము. కావున, ఎవరు దేవుని విశ్వసించి ఆతనినే ఆశ్రయించియున్నారో వారిని తన దయానుగ్రహములకు పాత్రులుగఁజేసి తనయొద్దకు చేరుసట్లుగ

వారికి సన్మార్గము చూపును.

వ్యా॥ 175, 176. ముందు గడచిన వాక్యములలో దేవుని సందేశము ఖురానెషరీఫును గూర్చి చెప్పబడుచు మధ్యలో ఏసుక్రీస్తునుగూర్చి క్రైస్తవులకున్న తప్పు విశ్వాసము ఖండించి మరల, ఈ వాక్యములో దేవుని యేకత్వమునుగూర్చియు ఖురానెషరీఫునుగూర్చియు చెప్పబడుచున్నది. జనులందఱిని సంబోధించుచు దేవుఁడిట్లు సెలవిచ్చుచున్నాఁడు. మీద్దయొకగొప్ప ప్రమాణమును సన్నదును, సత్యమునుదెలుపునట్టి ప్రకాశమానమైన జ్యోతియగు ఖురానెషరీఫు వచ్చియున్నది. దాని నమ్మి యనుసరింపుఁడు. మఱి దేవుని విశ్వసించి ఆతని సేవ్రతికార్యములో నాశ్రయించి యాతనిపైననేఆధారపడియుండవలెను. అట్లుచేయువారికి దేవుఁడు దయచూపి ఆతనికి ప్రీతికరమైన సన్మార్గము చూపి స్వర్గములో నివాసమొసంగును. దాని వ్యతిరేకించువారునరకములోపడుదురు.

177, యస్-తఫ్తూనక-ఖులిల్లాహు-యుఫ్తీకుమ్-ఫిల్ కలాలతి-ఇనిమ్‌రుఉన్ హలక లైసలహూ-వలదున్‌వలహూ-ఉఖ్తున్ ఫలహానిస్ఫు-మాతరక-వహువ యరిసుహా-ఇల్-లమ్-యకుల్-లహా-వలదున్-ఫఇన్-కానతస్‌నతైని ఫలహుమస్-సులుసాని-మిమ్మాతరక-వ-ఇన్-కానూ-ఇఖ్‌వతర్-రిజాలన్-వనిసా-అన్-ఫలిజ్-జకరి-మిస్లు-హజ్జిల్-ఉన్-స-యైని-యుబయ్యినుల్లాహు-లకుమ్- అన్-తజిల్లూ-వల్లాహు-బికుల్లిషైఇన్-అలీమ్.

177. "కలాలా" నుగూర్చిన ధర్మము నిన్నుఅడుగుచున్నారు. దేవుఁడు 'కలాలా'నుగూర్చిన ధర్మముమీకుఁదెలుపుచున్నాఁడు. అని ఓ ప్రవక్త! పలుకుము. ఎవఁడైన పురుషుఁడు చనిపోయి బిడ్డలులేక ఆతనికి ఒక్కతె సహోదరియున్నచో ఆతఁడు వదలిపోయిన ఆస్తిలో ఆమెకు సగమున్నది. బిడ్డలు లేక చనిపోయిన సహోదరి ఆస్తికి ఆమె సహోదరుఁడు వారసుఁడగును. మఱియు ఆతనికిద్దఱు అక్కచెల్లెండ్రున్నచో ఆతఁడు వదలిన ఆస్తిలో మూఁడింట రెండు భాగములు వారిద్దఱికిచేరును. మఱియు అన్నదమ్ములును, అక్కచెల్లెండ్రు నున్నచో మగవానికి, ఇద్దఱు ఆఁడువారల భాగమువచ్చును. మీరు దారి తప్పి పోకుండుటకై దేవుఁడు మీకు స్పష్టముగాఁ దెలుపుచున్నాఁడు. మఱియు దేవుఁడు సర్వము దెలిసినవాఁడు.

వ్యా॥ 177. చనిపోయినవానికి తండ్రి, బిడ్డలులేనిచో వానిని, కలాలా అనుదురు. ఈ సూరాప్రారంభములో 'కలాలా'నుగూర్చిన ధర్మములు చెప్పఁబడినవి. ముసల్మానులు దానిగూర్చి వివరములు దెలుపవలెను అని హజ్రత్

రసూలువారిలో విన్నవించిరి. దానికి దేవుఁడు కలాలా గూర్చి ధర్మములు తెలుపుచున్నాఁడు. ఒక్క పురుషుఁడు చనిపోయి వానికి తండ్రిగాని బిడ్డలుగాని లేనిచో వానిఅన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు వారసులగుదురు. వారిలో హఖీఖీ (ఒక్కతండ్రి, తల్లికిపుట్టినవారు)అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు వారసులగుదురు. వారు లేనపుడు అల్లాతీ (సవతితల్లికుమారులగు అన్నదమ్ములు అక్కచెల్లెండ్రు) వారసులగుదురు అఖ్యాఫీ అన్నదమ్ములఁగూర్చిన ధర్మము ఈ సురాకు ప్రారంభములో చెప్పఁబడినది. చనిపోయిన వానికి ఒక్క సహోదరి (బహెన్) యున్నచో ఆమెకు ఆతనియాస్తిలో సగమువచ్చును. ఇద్దఱు అక్కచెల్లెండ్రున్నచో వారిద్దఱికి మూఁడు భాగములలో రెండుభాగములు చేరును. ఆతనికి, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రున్నచో, చెలియలకువచ్చు భాగమువంటి రెండుభాగములు సహోదరునకు వచ్చును. ఆతనికి అన్నదమ్ములే యున్నచోవారు సమముగా పంచుకొనవలెను. ఒక స్త్రీ చనిపోయి ఆమెకు తండ్రిగాని బిడ్డలుగాని లేనిచో సహోదరుఁడున్నచో ఆమె ఆస్తియంతయు వానికి చేరును. అందు హఖీఖీ సహోదరుఁడు మొదటి వారసుఁడు. హఖీఖీ లేనపుడు సవతితల్లి కుమారులగు అన్నదమ్ములు వారసులగుదురు. దేవుఁడు ధర్మములన్నియు వివరించి ముసల్మానులకుఁ దెలుపుచున్నాఁడు. ఆధర్మములను అనుసరించి దారితప్పిపోక సన్మార్గమునందు స్థిరముగానుండవలెను. తెలియని ధర్మములను అడిగి తెలిసికొనవలెను. తెలిసికొనక తమ యిష్టానుసారముగా పోఁగూడదు. దేవునికి సర్వము దెలియును.

సూరతు మాయిదా, (ఆహారముతో నిండిన తబుకు) మదనీ, 120 వాక్యములు.

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్.

పరమదయాళువును ప్రేమించువాఁడునగు దేవుని పేర.

1. యాఅయ్యుహల్‌లజీనఆమనూ‌ఔఫూబిల్‌ఉఖూదిఉహిల్లత్‌లకుమ్‌బహీమతుల్‌అన్‌ఆమిఇల్లామాయుత్‌లాఅలైకుమ్‌గైర‌ముహిల్లిస్‌సైదివఅన్‌తుమ్‌హురుమున్‌ఇన్నల్లాహాయహ్కుముమాయురీద్‌యాఅయ్యుహల్‌లజీనఆమనూలాతుహిల్లూషఆఇరల్లాహివలష్‌షహ్‌రల్‌హరామవలల్‌హద్‌యవలల్‌ఖలాఇదవలాఆమ్మీనల్‌బైతల్‌హరామయబ్‌తగూనఫజ్‌లమ్‌మిర్‌రబ్బిహిమ్‌వరిజ్‌వానన్‌వఇజాహలల్‌తుమ్‌ఫస్‌తాదూవలాయజ్‌రిమన్నకుమ్‌షనఆనుఖౌమిన్‌అన్‌సద్దూకుమ్‌అనిల్‌

మస్ జిదిల్-హారామి-అన్-తఅ-తదూ-వ-తఆ-వనూ-అలల్ బిర్రి-వత్ - తఖ్వా - వలా-తఆవనూ-అలల్-ఇస్మి-వల్-ఉద్వాని వత్-తఖుల్లాహా-ఇన్నల్లాహా-షదీదుల్-ఇఖాబ్.

1. ఓ విశ్వాసులార ! ఒడంబడికలను పూర్తిచేయుఁడు. ఇఁకమీఁద మీకు చదివి తెలుపునవి దప్ప మిగిలిన చతుష్పాదజంతువులలో పశువులను బోలినవి మీకు ధర్మములైనవిగాఁ జేయఁబడినవి. మీరు ఇహ్రాములో నున్నపుడు వేఁటాడుట ధర్మముగా నెంచకుఁడు. దేవుఁడు తాను కోరినది ఆజ్ఞాపించును. ఓ విశ్వాసులార ! దేవుని సూచనలను గని గౌరవమైన నెలనుగాని, కాబామసీదునకుఁబోవు ఖుర్బానీ జంతువులనుగాని మెడలలో పట్టులుగలిగి కాబామసీదునకుఁ బోవు జంతువులనుగాని దేవుని అనుగ్రహమును, ప్రీతినికోరుచు గౌరవమైన గృహము నుద్దేశించి వచ్చువారినిగాని మీరు అవమానపఱచకుఁడు. మఱియు మీరు ఇహ్రామును వదలుకొన్న పిదప వేఁటాడవచ్చును. మఱియు మిమ్ము పవిత్రమగు మసీదునొద్దకు రాకుండ ఆటంకపఱచినట్టి జనులయందుగల విరోధమువలన మీరు వారిపై అన్యాయము చేయవలదు. మఱియు, సత్కార్యములందును భక్తివిషయములందును ఒకరికొకరు తోడుపడుఁడు. మఱియు, పాపమునకు, అన్యాయమునకు తోడుపడకుఁడు. మఱి దేవునికి భయపడుఁడు. నిశ్చయముగా దేవుని శిక్ష చాల కఠినమైనది.

వ్యా॥ 1. ముసల్మానులు, తాము ఇస్లామ్‌లో చేరి దాని ధర్మములను ఖురానును ప్రవక్తను ననుసరించునట్లు ఒప్పుకొనిన ఒడంబడికలను, ప్రజలతోఁ జేసికొన్న ఒడంబడికలను పూర్తిగా నెఱవేర్చవలెను. ఆడినమాట తప్పరాదు. సూరయే నిసాలో, యూదులు గావించినపాపకార్యములకు శిక్షగా పూర్వము తినవచ్చుననిన ఒంటె మొదలగునవి నిషేధింపఁబడియుండెను. ముసల్మానులు, తమ ఒడంబడికలు పూర్తిచేయుచు, ఆజంతువులనుండి లాభముపొందవచ్చునని వారికి దేవుని సెలవగుచున్నది. ఒంటె, ఆవు, గొఱ్ఱె, మేఁక అనువానిని ధర్మప్రకారముగ జబాచేసి వాని మాంసము తినవచ్చును. అవి హలాల్ జంతువులు. వాని పోలిన ఇతరములగు జింక, దుప్పి మొదలగునవికూడ తినవచ్చును. కాని కొన్ని పదార్థములు రాఁబోవు వాక్యములలో నిషేధింపఁబడును. అవి పందిమాంసము మొదలగునవి. కాబాయాత్ర (హజ్) కు నుద్దేశించి యాత్రధర్మములను ఆచరించి యాత్రను ముగించునంతవఱకు ఇహ్రాము అనుదురు. అపుడు భూమిపై జంతువులను వేఁటాడకూడదు. చేఁపలను వేఁటాడవచ్చును. యాత్ర ముగిసిన పిదప వేఁటాడవచ్చును. దేవుఁడు మానవులకు పోషకుఁడును

ప్రభువును. తాను కోరినది, ఆజ్ఞాపించును. ఆతని ఆజ్ఞకు లోనై భక్తులు నడచుకొనవలెను. 2. దేవుని సూచనలలో, కాబామసీదు, ఇతర మసీదులు సఫా మర్వా, జమాౄత్ (ఇచ్చటకాబాయాత్ర ధర్మములు ఆచరింపఁబడును.) దేవదత్తగ్రంథములు, సర్వ ధర్మములు చేరును. భక్తులు వీనిని గౌరవింపవలెను. వీనిని అగౌరవపఱుపకూడదు. గౌరవమైన నెలలు నాలుగు. అవి జూఖాదా, జిల్ హాజ్, ముహర్రమ్, రజబు అనునవి. ఈనెలలలో, శాంతితో నుండవలెను. యుద్ధములు గావింపకూడదు. యాత్రికులను ఆటంకపఱుపకూడదు. శత్రువులను మార్కొనవచ్చును. దీనిగూర్చి సూరయేతౌబాలోవచ్చును. యాత్రికులు కాబామసీదు హద్దులలో ఖుర్బానీ చేయుటకు గుర్తుకుఁగాను జంతువుల మెడలలో పట్టాలు వేయుదురు. అట్టి జంతువులను ఆటంకపఱుపరాదు. దేవునిప్రీతికిగాను వచ్చు యాత్రికులను ఆటంకపఱచి వారిని అవమానింపరాదు. వారిని గౌరవింపవలెను. హిజ్రీ ఆఱవయేఁట హజ్రత్ పైగంబరువారును వారి శిష్యులును, కాబాయాత్రకు బయలుదేఱిరి. అపుడు మక్కా ఖురైషులు, (అవిశ్వాసులు) కాబామసీదునకు రాకుండ ముసల్మానులను అడ్డగించిరి. అపుడు ముసల్మానులకు చాల కోపమువచ్చియు పైగంబరులవారి సెలవుచే అణఁగిరి. అపుడు సంధి కుదిరెను. దానినే హుదైబియా సంధి అనుదురు. ఎంత విరోధమున్నను, విరోధుల విషయమున న్యాయముగా వర్తింపవలెను అని దేవుని సెలవయ్యెను. అటులే ముసల్మానులు, సదా న్యాయమునే పాటించి విజయము పొందిరి. ప్రతి సమయములోను ధర్మకార్యములకు తోడుపడవలెను. కాని అధర్మ కార్యములలో, ఒకరి కొకరు తోడుపడకూడదు. అన్యాయము జరుగకుండ ఆపవలెను. కొందఱు న్యాయము అన్యాయముచూడక తమపక్షమువారని తోడుపడుదురు. అది గొప్ప పొరపాటు. దానివలన లోకములో శాంతముండదు. కావున ప్రతి విషయములోను, దేవునికి భయపడి పనిచేయవలెను. దేవుఁడు విధించుశిక్షచాలకఠినమైనది. ఆతనిశిక్షనుండి ఎవరునుతప్పించుకొనఁజాలరు.

3. హుర్రిమత్-అలైకుముల్ -మైతతు-వద్-దము-వలహ్ముల్-ఖిన్ జీరి - వమాఉహిల్లలిగైరిల్లాహి బిహీ-వల్ -మున్-ఖనిఖతు-వల్ -మౌఖూజతు-వల్ - ముతరద్దియతు-వన్-నతీహతు-వ-మా-అకలస్-సబుఉ-ఇల్లా-మాజక్ -కై తుమ్-వ-మాజుబిహ-అలన్-నుసుబి-వఅన్-తస్-తఖ్ సిమూ-బిల్ అజ్ లామి-జాలికుమ్-ఫిస్ఖున్-అల్-యౌమ-యఇసల్ -లజీన-కఫరూ-మిన్-దీనికుమ్-ఫలా-తఖ్ - షౌహుమ్-వఖ్ షౌని-అల్-యౌమ-అక్-మల్ తు-లకుమ్-దీనకుమ్-వఅత్-మమ్ తుమ్-అలై

కుమ్‌నిఅ-మతీ-వరజీతు-లకుముల్-ఇస్లామ-దీనన్-ఫమనిజ్-తుర్ర-ఫీమఖ్-మసతిన్-గైర-ముతజాని-ఫిల్-లిఇస్మిన్ ఫఇన్నల్లాహ-గఫూరుర్-రహీమ్.

3. (స్వాభావికముగ) చచ్చిన జంతువును, రక్తమును, పందిమాంసమును, దేవునిపేరుతో గాక ఇతరులపేరుతో వదలిపెట్టిన జంతువును, గొంతు పిసుకుటచే చనిపోయినదియును, దెబ్బతగిలి చచ్చినదియును, పైనుండి పడిచచ్చినదియును, కొమ్ముతగిలి చచ్చినదియును, క్రూరమృగము తినినదియును, మీకు నిషిద్ధము. మీరు జబాచేసినది నిషిద్ధముకాదు. మఱియు విగ్రహములకు బలిగా జబాచేయఁబడినదియు నిషిద్ధము. మఱియు బాణముల మూలమున శకునము చూచుట మీకు నిషిద్ధము. ఇవన్నియు పాపకార్యములు. ఈదినము అవిశ్వాసులు మీమతమునుగూర్చి ఆశ వదలిరి. కావున మీరు వారికి భయపడకుఁడు. మఱి నాకే భయపడుఁడు. ఈదినము, మీకొఱకుగాను మీమతమును పరిపూర్ణముగాఁజేసి నా అనుగ్రహమును మీపై పూర్తిగాఁజేసి మీకొఱకుగాను ఇస్లామ్‌ను మీమతముగ సమ్మతించితిని. మఱియు నెవఁడు పాపమునకు పూనుకొనక ఆఁకటికి సహింపలేనిచో దేవుఁడు క్షమించువాఁడును దయాళువును (అగును).

వ్యా॥ 3. ఈవాక్యములో తినరానివి చెప్పఁబడినవి. ధర్మప్రకారముగ జబా (బిస్మిల్లాః) చేసి తినఁగల జంతువులు తమంతట తామే చనిపోయినచో అవి ముర్దారు అనఁబడును వానిమాంసము తినరాదు. చావువలన వానిలో రక్తము అందే యిమిడిపోవును. దానివలన దేహారోగ్యము చెడును. ఆత్మికనష్టముకూడ గలుగును. అందుచేతనే నెత్తురుకూడ తినరాదు. అదికూడ నిషిద్ధము(హరాము) జంతువులను జబా చేయునపుడు బయలుదేఱు రక్తము హరాము. దానిని తినరాదు. పందిమాంసముకూడ నిషిద్ధము (హరాము) పంది, అధికముగా మలము తినునది. అందు సిగ్గు అనుగుణము బొత్తిగాలేదు. కావున దాని మాంసమువలన అనేక రోగములును సిగ్గుడితనమును పుట్టును. హలాల్ జంతువులను చిల్లర దేవతల పేరుతో మ్రొక్కుకొన్నచో, ఆజంతువుల మాంసముకూడ తినకూడదు. జంతువులు దేవుని పేరుతో వదలవలెను. సర్వము దేవునిసొత్తు. ఆతనిసెలవు ననుసరించి కొన్ని జంతువులను ఆతని పేరుతోనే జబాచేసి మానవులు భక్షింపవచ్చును. (బిస్మిల్లా హిఅల్లాహు అక్బరు అని పలికి కోయుటను జబా అనుదురు) జబా చేయకయే గొంతు పిసుకుటవలనను, దెబ్బ తగులుటవలనను, పైనుండి పడుటవలనను, కొమ్ము పోటువలనను, క్రూరజంతువు చంపి తినుటవలనను చచ్చిన జంతువుల మాంసము తినకూడదు. అవి ప్రాణముతో నుండినపుడు జబా చేసినచో తినవచ్చును. విగ్రహముకొఱకుగాను బలిచేసిన జంతువుల మాంసముకూడ తినకూడదు. అరబ్బులలో ఒక యాచారముండెను. అది యేమన, ఏర్పడిన

నొక కార్యము చేయవలెనన్న పాబులు అనువిగ్రహమునకు నెదుట నుంచఁ బడిన బాణములలో ఏదో యొకటి ఎత్తుదురు. అందు దేవుఁడు ఆజ్ఞాపించెను అని యున్నచో వారు తలఁచుకొన్న కార్యము చేయుదురు. లేనిచో ఆకార్యము ఒక సంవత్సరము వఱకు మానుకొందురు. అట్లు చేయకూడదు. అట్లు శకునము చూచుటవలన ప్రయోజనము లేదు. చేయఁదలఁచుకొన్న కార్యము దేవునిపై నాధారపడి చేయవలెను. ఇవన్నియు పాపకార్యములు. కావున నిషేధింప బడినవానిని వదలుకొని హలాలు పదార్థములు భుజింపవలెను. 1. ఈవాక్యము మక్కాపురము జయింపఁబడిన పిదప ఇస్లామ్ మతధర్మములు సంపూర్ణముగ ముసల్మానులకు దెలుపఁబడిన పిదప ముసల్మాను భక్తులు దేవునికిని ఆతని ప్రవక్తకును విధేయులై ఏలాటి లోపములేకుండిన స్థితిలో దేవుఁడు పంపినది. ముసల్మానుల విజయమును, ఇస్లామ్ వ్యాప్తిని, అవిశ్వాసులుచూచి తమ కుట్రలు విరోధములు ముసల్మానులపై చెల్లవు అనియు ముసల్మానులు సన్మార్గమగు ఇస్లామ్‌ను వదలరు అను విషయము వారికిఁ దెలిసి ఇక వారికుట్రలు సాగవు అని నిరాశులైరి. కావున ముసల్మానులు దేవునికే భయపడవలెను. అవిశ్వాసులకు భయపడకూడదు. వారేమియు ముసల్మానులకు హానిచేయఁజాలరు. ఇస్లామ్ మతము దేవుని అనుగ్రహము. దానివలన ముసల్మానులకు ఉభయ లోకములలో విజయమును మోక్షమును చేకూరును. ఇస్లామ్ మతము సంపూర్ణమైనది. ప్రళయము (ఖియామత్) వఱకు దీని ధర్మములే ఆచరింపఁదగినవి. అందు మార్పుగాని హెచ్చుతగ్గులుగాని జరుగవు. ఇస్లామ్ మతము దేవునికి ప్రియమైనది. కావున దేవుఁడు ఆమతమును ముసల్మానులకుఁగాను సమ్మతించి ఏర్పఱచెను. కావున ముసల్మానులు, దేవుని యనుగ్రహమువలన తమకు లభించిన ఖురాను గ్రంథమును, దేవుని ప్రవక్తలగు హజ్రత్ రసూలువారిని సంపూర్ణముగ ననుసరింపవలెను. 2. ఆఁకటిదప్పికిసహింపలేక ప్రాణము పోవునట్టి స్థితి వచ్చినపుడు ప్రాణము దక్కించుకొనుటకు నిషిద్ధమైన (హరాము)పదార్థములు, తినవచ్చును. రుచికిఁగాను తినరాదు. ప్రాణము కాపాడుకొనుటకుఁగాను తినినచో దేవుఁడు క్షమించి కరుణించును. ఇట్లు సెలవిచ్చుట దేవుని యనుగ్రహము గదా!

4. యస్ అలూనక-మాజా ఉహిల్ల-లహుమ్- ఖుల్ ఉహిల్లలకుముత్-తయ్యిబాతు-వమా-అల్లమ్-తుమ్-మినల్-జవారిహి-ముకల్లిబీన తుఅల్లి మూనహున్న-మిమ్మా-అల్లమకుముల్లాహు-ఫకులూ-మిమ్మా-అమ్సక్న-అలైకుమ్-వజ్కురుస్మల్లాహి-అలైహి-వత్తఖుల్లాహ-ఇన్నల్లాహ-సరీఉల్-హిసాబ్.

4. తమకు ఏది హలాల్ (తినవచ్చును), అని జనులు నిన్ను అడుగుచున్నారు. పవిత్రములైన పదార్థములు మీకు హలాలైనవి. మఱియు మీకు దేవుఁడు నేర్పినదానినుండి వేటాడు జంతువులకు వేట నేర్పి, వానిని వదలినపుడు అవి మీకొఱకు పట్టుకొన్న జంతువు మాంసమును మీరు తినుఁడు. మఱియు వేటకుఁగాను వదలునపుడు దేవుని నామము పలుకుఁడు. మఱియు దేవునికి భయపడుఁడు. నిశ్చయముగా దేవుఁడు శీఘ్రముగా లెక్క తీసికొనువాఁడు అని ఓ ప్రవక్త ! పలుకుము.

వ్యా॥ 4. మునుపటి వాక్యములో తినరాని వస్తువులను గూర్చి చెప్పఁబడెను. ఇక ఏవస్తువులను తినవచ్చును అని ప్రశ్న గలిగెను. దానికిందు జవాబియ్యఁబడినది. దేహమునకును, ఆత్మకును నష్టము గలిగింపని పవిత్రములైన మంచి పదార్థములు తినవచ్చును. అవి హలాలు (ధర్మములైనవి). వేట నేర్చుకొన్న కుక్క, డేగ మొదలగునవి. తాము తినక తమ స్వామికొఱకు పట్టుకొన్న జంతువు మాంసమును తినవచ్చును. దానికి కొన్ని షరతులు గలవు. 1. వేటకుఁగాను వదలునట్టి మృగము వేటను నేర్చుకొనియుండవలెను. 2. వేటకుఁగాను వదలవలెను. 3. జంతువును తినకూడదు అని కుక్కకు నేర్పియుండవలెను. అది తినినచో అది హలాలు కాదు. డేగ వేటకు పోవునపుడు పిలిచినచో తిరిగి రావలెను. రానిచో, అది పట్టినది హలాలు కాదు. ఎందుకన అది బాగుగ స్వాధీన పడలేదు. 4. వేటకుఁగాను వదలునపుడు బిస్మిల్లాహి అని పలికి వదలవలెను. 5. వేటాడు మృగము జంతువును గాయపఱచుటవలన నెత్తురు కారవలెను. ఈ షరతులలో నేదైన ఒక్క షరతు పూర్తి కానిచో జంతువు హలాలు కాదు. జంతువు ప్రాణముతోనున్నచో యథాప్రకారముగా జబా చేసినచో హలాలగును. వేటలోనె మునిఁగి దేవునిని మఱచిపోగూడదు. దేవునికి భయపడుచు భక్తి గలిగి యుండవలెను. దేవుఁడు ప్రతివిషయమునుగూర్చి శీఘ్రముగా వారి వారి కర్మల లెక్కించి తగిన ఫలిత మొసంగును.

5. అల్ యౌమ-ఉహిల్ల-లకుముత్-తయ్యిబాతు-వతఆముల్లజీన-ఊతుల్ కితాబ-హిల్లుల్-లకుమ్-వ-తఆముకుమ్-హిల్లుల్-లహుమ్ వల్-ముహ్సనాతు-మినల్-మూమినాతి వల్-ముహ్సనాతు-మినల్లజీన-ఊతుల్ కితాబ-మిన్-ఖబ్లికుమ్-ఇజా ఆతైతుమూహున్న ఉజూరహున్న-ముహ్సినీన-గైర-ముసాఫిహీన వలా-ముత్తఖిజీ అఖ్దానిన్-వమన్ యక్ఫుర్-బిల్-ఈమాని-ఫఖద్-హబిత-అమలుహూ వహువ-ఫిల్ ఆఖిరతి-మినల్-ఖాసిరీన్.

**5.** ఈ దినము పవిత్ర పదార్థములన్నియు మీకు హలాల్ (ధర్మసమ్మతములు) అయినవి. మఱియు గ్రంథముగలవారియాహారము మీకుధర్మసమ్మతము (హలాల్) అయినది. మఱియు మీయాహారమును వారికి ధర్మసమ్మతము (హలాల్) అయినది. మఱియు వ్యభిచారముగాని మఱుఁగుస్నేహముగానిచేయక నీతికొఱకు నీతిమంతురాండ్రైన ముసల్మాను స్త్రీలను, మీకు పూర్వము గ్రంథములు పొందిన వారి స్త్రీలను, వారికియ్యవలసిన మహరు ఇచ్చినపుడు మీరు వివాహమాడవచ్చును. మఱియు ఎవఁడువిశ్వాసమార్గమునుతిరస్కరించునో వానికర్మలు వ్యర్థమయిపోయివాఁడు పరలోకమునందునష్టముపొందువారిలోచేరును.

వ్యా॥ 5. దేవుఁడు ఇస్లామ్ మతమును సంపూర్ణముచేసి దేహమునకు ఆత్మకును నష్టముకలిగింపని మంచిపదార్థములు తినవచ్చును అని సెలవిచ్చెను. ముసల్మానులు తినగలజంతువులను యూదులును నస్రానీలును, బిస్మిల్లాహి అని (దేవునిపేరు చెప్పి) జబాచేసినచో దాని మాంసము, ముసల్మానులు తినవచ్చును. అటులే ముసల్మానులు జబాచేసినదాని మాంసము యూదులును నస్రానీలును తినవచ్చును. నీతిగల ముసల్మాను స్త్రీలను, యూదులు నస్రానీల స్త్రీలను పెండ్లాడవచ్చును. అది ధర్మమును నీతిని పాలించుటకుగాను జరుగవలెను. అందువ్యభిచారముగాని, మఱుఁగగు స్నేహముగాని చేయరాదు. ఇందు మగవారు నీతిమంతులుగా నుండవలెనని, హెచ్చరిక. ఇప్పటి నస్రానీలు తెఱచుగ మతమునుగాని దేవునిగాని నమ్మినవారుకారు. కావున వారి స్త్రీలను వివాహమాడుట ముసల్మానులకు తగదు. అదియునుగాక అందు అనేక నష్టములును గలుగును. భర్త భార్యకు నొసంగు ధనమును మహరు అనుదురు. ఎవరు, విశ్వాసమార్గమగు ఇస్లామ్‌ను దాని ధర్మములను తిరస్కరింతురో వారు పరలోకమందు నష్టము పొందుదురు. వారికి మోక్షము లభింపదు. వారి కర్మలు వృథాపోయి నిష్ఫలమగును. కావున భక్తులు విశ్వాసమును కాపాడుకొనవలెను.

6. యాఅయ్యుహల్లజీన-ఆమనూ-ఇజా-ఖుమ్తుమ్-ఇలస్-సలాతి - ఫగ్సి లూ-ఉజూహకుమ్-వఐదియకుమ్-ఇలల్-మరాఫిఖి వమ్సహూ-బిరుఊసికుమ్-వఅర్జులకుమ్-ఇలల్ కఅ్-బైని-వఇన్-కున్తుమ్-జునుబన్-ఫత్-తహ్హరూ -వ ఇన్-కున్తుమ్-మర్జా-ఔఅలా-సఫరిన్-ఔజాఅ-అహదుమ్ - మిన్‌కుమ్-మినల్-గాఇతి-ఔ-లామస్-తుమున్నిసాఅ-ఫలమ్-తజిదూ-మాఅన్-ఫతయమ్మమూ-సఈదన్-తయ్యిబన్-ఫమ్-సహూ-బివుజూహికుమ్-వ-ఐదీకుమ్-మిన్‌హు - మా-యురీదుల్లాహు-లియజ్అల-అలైకుమ్-మిన్-హరజిన్-వలాకిన్-యురీదు-లియుతహ్హి

హ్హ-హిరకుమ్ వలియుతిమ్మ-నిఅమతహూ అలైకుమ్-లఅల్లకుమ్ తష్కురూన్.

౬. ఓ విశ్వాసులారా! మీరు నమాజునకుఁగాను నిలుచునపుడు మీ మొగములను, మోఁచేతులవఱకు మీచేతులను కడుగుకొనుఁడు. మీతలలను తుడుచుకొనుఁడు, మఱియు చీలమండలవఱకు మీకాళ్లను కడుగుకొనుఁడు. మఱియు మీకు మైల (జనాబత్) తలిగినచో మీరు స్నానముచేయుఁడు. మఱి యు మీరు రోగులైయున్నను లేక ప్రయాణమందున్నను లేక మీలో నెవరైన మఱుగుదొడ్డినుండి వచ్చిన లేక స్త్రీలతో కలిసిన పరిశుభ్రమైన మట్టినుద్దేశించి, దానితో మీ మొగములను చేతులను తుడుచుకొనుఁడు. దేవుఁడు మిమ్ము నిర్బంధింప కోరఁడు. కాని మీరు కృతజ్ఞులగుటకై మిమ్ము పవిత్రులుగఁ జేయుటకును తనయనుగ్రహమును మీకుసంపూర్ణముగఁ జేయుటకును కోరుచున్నాఁడు.

వ్యా॥ ౬. ఈ వాక్యములో వజూ, గుసులు (స్నానము) తయమ్మమ్‌ను గూర్చి చెప్పఁబడినది. నమాజు (ప్రార్థన) కుఁగాను దేహశుద్ధి కావలెను. నమాజునకు పూర్వము వజూ చేసికొనవలెను. అందు మొగము చేతులు మోఁచేతులవఱకు కడుగుకొనవలెను. రెండు చేతులను, నీళ్ళతో తడిపి తల తుడిచికొనవలెను. దీనినే మసా అనుదురు. కాళ్లు చీలమండలవఱకు కడుగుకొనవలెను. ఇవి వజూనందలి నాలుగు ఫరజులు. మిగిలిన వజూలోని సున్నత్. ముస్తహబ్బులు ఫిఖాగ్రంథములలో గలదు. స్త్రీలతో కలిసిన లేక కలగాంచి వీర్యవిసర్జనము (ఎహ్తెలామ్) అయినపుడు నమాజు చేయవలెనన్న గుసులు (స్నానము) చేయవలెను. దానికి వజూ చాలదు. గుసులులో పుక్కిలించుట, ముక్కును నీళ్లతో కడుగుట దేహమంతట నీళ్లుపోసికొనుట అనునవి మూఁడు ఫరజులు. మిగిలినవి సున్నత్ ముస్తహబ్బులు. మైల (జనాబత్) తగులుట అరుదు గావున దానికిఁగాను స్నానము విధింపఁబడెను. నీళ్ళు దొరకక, లేక నీళ్లు ఉపయోగించినచో దేహమునకు నష్టము గలుగునని భీతియున్నచో, అపుడు వజూ, గుసులునకు బదులుగ తయమ్మమ్‌నుచేసికొని నమాజు (ప్రార్థన) చేయవలెను. తయమ్మమ్‌నకుఁగానుసంకల్పించి, పరిశుభ్రమైన మట్టిపై రెండుచేతులు తట్టి మొగముపై రాచుకొనవలెను. రెండవతూరి చేతులు మట్టిపై తట్టి చేతులపై రాచుకొనవలెను. దేవుఁడు తన అనుగ్రహమువలన భక్తులకు కష్టములు గలుగకుండ ధర్మములలోను సౌకర్యములను కల్పించెను. దేవుఁడు భక్తులను పవిత్రులుగఁ జేయవలెనని ధర్మములు విధించి తన అనుగ్రహము భక్తులకు సంపూర్ణముగఁ గలిగించుచున్నాఁడు. కావున భక్తులు దేవునికి కృతజ్ఞులైయుండవలెను. (వజూ, గుసులు, తయమ్మమ్ నమాజు పద్ధతులను చూడఁగోరువారు, జగత్ ప్రవక్త రెండవభాగము చూడవలెను.)

7. వజ్-కురూ-నిఅ మతల్లాహి-అలైకుమ్-వమీసా-ఖహుల్లజీ-వాసఖకుమ్-బిహీ-ఇజ్-ఖుల్తుమ్-సమిఅ-నా-వ-అతఅనా-వత్తఖుల్లాహ ఇన్నల్లాహ-అలీముమ్ బిజాతిస్-సుదూర్. 8. యాఅయ్యు-హల్లజీన-ఆమనూ కూనూ-ఖవ్వామీన-లిల్లాహి-షుహదాఅ-బిల్-ఖిస్తి-వలాయజ్-రిమన్న-కుమ్-షన-ఆను-ఖౌమిన్-అలా అల్-లాతఅ-దిలూ-ఇఅ-దిలూ-హువ-అఖ్-రబు-లిత్-తఖ్వా-వత్-తఖుల్లాహ-ఇన్నల్లాహ-ఖబీరుమ్-బిమా-తఅ-మలూన్. 9. వ-అదల్లాహుల్-లజీన-ఆమనూ-వ-అమిలుస్-సాలిహాతి-లహుమ్-మగ్-ఫిరతున్-వ-అజ్రున్-అజీమ్. 10. వల్లజీన-కఫరూ వకజ్-జబూ బిఆ-యాతినా-ఉలాఇక-అస్ హాబుల్ -జహీమ్. 11. యాఅయ్యు-హల్లజీన-ఆమనుజ్-కురూ-నిఅ-మతల్లాహి-అలైకుమ్ - ఇజ్-హమ్మ-ఖౌమున్-అన్-యబ్-సుతూ-ఇలైకుమ్-ఐది-యహుమ్-ఫకఫ్-ఫ-ఐ-దియహుమ్-అన్కుమ్-వత్త-ఖుల్లాహ-వ-అలల్లాహి-ఫల్-య-తవక్కలిల్-మూమినూన్.

7. మఱియు మీపైనున్న దేవుని యనుగ్రహమును ఆతఁడు మీయొద్దపుచ్చుకొన్న నిబంధనమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. అప్పుడుమీరు మేమువింటిమి మఱియు విధేయులమైతిమి అనిచెప్పియుంటిరి. మఱియు దేవునికి భయపడుచు నుండుఁడు. నిశ్చయముగా హృదయములలోనున్నది దేవునికిఁ దెలియును. 8. ఓవిశ్వాసులారా! దేవునికొఱకు న్యాయముగా సాక్ష్యమిచ్చుటకు నిలువుఁడు. మఱియు ఒకరి విరోధమువలన మీరున్యాయమును వదలుకొనకుఁడు. న్యాయముగా వర్తింపుఁడు. ఇదియే భయభక్తులకు సమీపమైనది. మఱి దేవునికి భయపడుచు నుండుఁడు. మీరుచేయునది దేవునికి బాగుగ తెలియును. 9. విశ్వసించి సత్కార్యములు చేసినవారికి క్షమాపణము ను గొప్ప పుణ్యఫలితమును గలదు అని దేవుఁడు వాగ్దానము చేసియున్నాఁడు. 10. మఱియు ఎవరు అవిశ్వాసులై మాసూచనలను తిరస్కరించిరో వారు నరకనివాసులు. 11. ఓవిశ్వాసులారా! ప్రజలుమీపై (దౌర్జన్యము చేయుటకై) చేతులు చాచినపుడు దేవుఁడు వారిచేతులను మీనుండి తొలగించి మీకుచేసిన తన యనుగ్రహమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. మఱియు దేవునికి భయపడుచునుండుఁడు. మఱియు విశ్వాసులు దేవునిపైననే యాధారపడి యుండవలెను.

వ్యా॥ 7. దేవుఁడు ముసల్మానులకు ఇస్లామ్ మతమును ఖురానుగ్రంథమునొసంగి చాల అనుగ్రహించెను. మఱియు ముసల్మానులు దేవునిమాట విని

యాతనికి విధేయులై కష్టసుఖములలోను ఇస్లామ్ సేవ చేయుచుందుమని హజ్రత్ పైగంబరులవారితో సంబంధనము (అహదు) చేసియుండిరి. ఆవిషయములను జ్ఞప్తికి దెచ్చుకొని దేవునియందు భయభక్తులుగలిగి యుండవలెను. మానవుల హృదయములలోనున్న సమస్త రహస్యములును దేవునికి దెలియును. కావున భక్తులు పరిపూర్ణ విశ్వాస భక్తులతో ధర్మముల నాచరింపవలెను. 8. దేవుని ప్రీతికొఱకు ఎవరి మొగమాటమును లేకుండ న్యాయముగ సత్యమైన సాక్ష్యమియ్యవలెను. తప్పుసాక్ష్యము పలుకరాదు. విరోధుల విషయమున న్యాయముగ వర్తింపవలెను. విరోధమున్నదని అన్యాయము చేయరాదు. విరోధమున్నను స్నేహమున్నను అన్యాయము చేయరాదు. న్యాయముగా వర్తించుటయే భక్తిమార్గము. ఆవిషయమందు దేవునిశిక్షకు భయపడుచుండవలెను. మానవులుచేయు సర్వకర్మలు దేవునికి దెలియును. వారివారికి దగిన ఫలితమొసంగును. 9.విశ్వసించిసత్కార్యములు చేసిన ముసల్మాను భక్తుల పొరపాటులనుక్షమించి వారికి తనఅనుగ్రహమువలన స్వర్గసౌఖ్యములగు గొప్పపుణ్యఫలితము లొసంగునట్లు దేవు డువాగ్దానము చేసియున్నాడు. కావునభక్తులు దేవుని వాగ్దానమును పొందుటకు కృషి సలుపవలెను. 10, హజ్రత్ పైగంబరుల వారిని నమ్మక, ఖురాను గ్రంథములోని దేవుని సూచనలనుతిరస్కరించిన అవిశ్వాసులకునరకనివాసము లభించును. అందుసదాయుండవలసి వచ్చును. కావున మానవులు నరకమునుండి తప్పించుకొను మార్గము చూడవలెను. అది విశ్వాసమార్గము. 11. మక్కా ఖురైషులు, యూదులు మొదలగు విరోధులు, హజ్రత్ పైగంబరుల వారిని, ముసల్మానులను, హింసించుటకు పెక్కు కుట్రలు సలుపుటకు యత్నించిరి. కాని వారి కుట్రలనుండి దేవుడు ముసల్మానులను రక్షించి వారికి శత్రువులపై గొప్ప విజయమొసంగెను. ఇది దేవుని గొప్ప అనుగ్రహము. ఈ మేలును ముసల్మానులు జ్ఞప్తికి దెచ్చుకొని, దేవునియందు భయభక్తులు గలిగియుండి తమ సమస్త కార్యములలో నాతనిపై ఆధారపడి యుండవలెను.

12. వలఖద్-అఖజల్లాహు-మీసాఖ-బనీఇస్రాయీల-వబఅస్నా మిన్-హుముస్-నై-అష-ర-నఖీబన్-వఖా-లల్లాహు-ఇన్నీ-మఅకుమ్-లఇన్-అఖమ్-తుముస్సలాత-వ-ఆతైతుముజ్- జకాత -వ- ఆ- మన్తుమ్- బిరుసులీ-వఅజ్- జర్తుమూ-హుమ్-వఅఖ్-రజ్-తుముల్లాహ-ఖర్-జన్ హసనల్-లఉకఫ్ఫిరన్న- అన్ కుమ్-సయ్యిఆతికుమ్-వల-ఉద్-ఖిలన్నకుమ్-జన్నాతిన్-తజ్రీ-మిన్- తహ్-తి-హల్- అన్హారు-ఫమన్-కఫర-బఅ-ద-జాలిక-మిన్ కుమ్-ఫఖద్-జల్ల-సవా-అస్సబీల్. 13. ఫబి

మానఖ్జిహిమ్-మీసాఖహుమ్-లఅన్నాహుమ్-వజఅల్నా ఖులూబహుమ్-ఖాసియతన్-యుహర్రిఫూనల్ కలిమఅమ్ మవాజిఇహీ-వనసూ-హజ్జమ్ మిమ్మా-జుక్కిరూ-బిహీ-వలాతజాలు-తత్తలిఉ-అలా-ఖాఇనతిమ్-మిన్హుమ్-ఇల్లా ఖలీలమ్ మిన్-హుమ్-ఫఅఫు అన్హుమ్-వస్‌ఫహ్-ఇన్నల్లాహ-యుహిబ్బుల్ ముహ్సినీన్. 14. వమినల్లజీన ఖాలూ-ఇన్నా-నసారా అఖజ్నా-మీసాఖహుమ్-ఫనసూ-హజ్జమ్-మిమ్మాజుక్కిరూ-బిహీ-ఫ-అగ్రైనా-బైనహుముల్ అదావత వల్-బగ్జాఅ ఇలా-యౌమిల్-ఖియామతి-వసౌఫ యునబ్బిఉ హుముల్లాహు బిమా కానూ-యస్నఊన్.

12. మఱియు దేవుఁడు ఇస్రాయీలియులతో ఒడంబడిక పుచ్చుకొనెను. మఱియు వారిలో పన్నెండుమంది నాయకులను నియమించెను. మఱియు మీరు నమాజు (ప్రార్థన)ను స్థిరముగా సలుపుచు, విధిదానము (జకాతు) చెల్లించుచు, నా ప్రవక్తలను విశ్వసించి వారికి తోడుపడుచు, మంచిరీతిగా దేవునికి అప్పునొసంగుచు నుండినచో నేను మీతో నున్నాను. మఱియు నిశ్చయముగ వానినుండి మీ పాపములను తొలగింతును. మఱియు కాలువలు ప్రవహించు స్వర్గ వనములలో మిమ్ము ప్రవేశింపఁ జేయుదును. మఱియుదీని పిదప మీలో నెవఁడు అవిశ్వాసి యగునో వాఁడు నిశ్చయముగా సన్మార్గము తప్పి పోయెను అని దేవుఁడు వారితో పలికెను. 13. ఆపిదప వారు తమ యొడంబడికను త్రెంపినందున వారిని మేము శపించితిమి. మఱియు వారి హృదయములను కఠినములైనవిగాఁ జేసితిమి. వారు వాక్యములను వానిస్థానముల నుండి తారుమారు చేయుచున్నారు. మఱియు వారికి బోధింపఁబడిన దానిని వారు మఱచి పోయిరి. మఱియు వారుచేయు ఏదైన ద్రోహమును సదా నీవు ఎఱుంగుచుందువు. కాని వారిలో కొందరుతప్ప అట్లుచేయరు. కావున నీవు వారి నిక్షమించి వదలి పెట్టుము. నిశ్చయముగ దేవుఁడు మేలుచేయువారిని ప్రేమించును. 14. మఱియు మేము నసారా నీలు అని చెప్పి కొనువారినుండియు మేము ఒడంబడికను తీసికొంటిమి. ఆ పిదప వారికి బోధింపఁబడిన దానిని వారు మఱచిపోయిరి. కావున తుది దినము వఱకును వారిమధ్య విరోధమును కపటము నుండునట్లు కల్పించితిమి. మఱియు వారు చేయుచున్న కర్మలను గూర్చి దేవుఁడు వారికిఁ దెలుపును.

వ్యా॥ 12. హజ్రత్ పైగంబరులవారి మూలమున దేవుఁడు ముసల్మానులతో ఒడంబడిక పుచ్చుకొన్నట్లు పూర్వమును ఇస్రాయీలియులతోను నస్రాసి

లతోను ఒడంబడిక పుచ్చుకొనెను. ఇస్రాయీలియులును నస్రానీలును దేవునితో కావించిన ఒడంబడికను త్రెంపి వారికి లభించిన దేవుని బోధలను మఱచి వానికి వ్యతిరేకముగ ప్రవర్తించుచు నున్నందువలన వారు దేవుని కృపనుండితొలఁగి దేవుని శిక్షకు పాత్రులైరి. ఈవిషయము ఈవాక్యములలో చెప్పఁబడుచున్నది. మూసాప్రవక్తగారు ఇస్రాయీలియులలో పండ్రెండు మందిని ఎన్నుకొని వారిని నాయకులుగాఁ జేసిరి. వారు ఇస్రాయీలీయులకు బుద్ధిచెప్పుచు వారివిషయములను జాగ్రత్తగా చూచుకొనుచు ఒడంబడికను పూర్తిచేయునట్లు చూచుచుండిరి. దేవుఁడు తోడుగ నుండి వారికి తోడుపడుచుండును అనివారితో పలికెను. పాపములుపోయి దేవుని ప్రీతి వడసి స్వర్గనివాసములభింపవలెనన్న నమాజుప్రార్థనలు సలుపుచు విధిదానము చేయుచు దేవుఁడు సంప్రవక్తలనునమ్మి వారికి మతప్రచారములో తోడుపడి దేవునిప్రీతికొఱకుధర్మమార్గమందుధనము ఖర్చుచేయవలెను అని ఇస్రాయీలియులకు బోధచేయఁబడెను. దేవునిమార్గమందు భక్తితో ఖర్చుచేయుట దేవునికి అప్పునిచ్చినట్లు. ఎట్లు అప్పుతిరిగి ఋణదాతకు లభించునో అటులే దేవునిమార్గమందు ఖర్చు చేసిన ధనఫలితము తప్పకలభించును. ఒడంబడిక చేసియు ఆడినమాటతప్పి అవిశ్వాసియైనవాఁడు సన్మార్గము తప్పినవాఁడగును. 13. ఇందు ఇస్రాయీలియులు తాముచేసిన ఒడంబడికను త్రెంపి దానికివిరోధముగాఁ బోయినందువలన వారు దేవుని దయనుండి తొలఁగి దేవుని కోపము (శాపము) నకు పాత్రులైరి. దాని ఫలితముగ వారి హృదయములు కఠినములుగ నాయెను. వారు దేవుని గ్రంథములలోని వాక్యములను తారుమాఱుచేసి వానికి తప్పు అర్థములు కల్పింపసాగిరి. వారికి బోధింపఁబడిన ధర్మములనువారుఅనుసరింపకవానిని మఱచిపోయివానికివ్యతిరేకముగానడచుకొనసాగిరి. వారిలో కొందఱు (అబ్దుల్లా బిన్ సలామువంటివారు) తప్ప మిగిలినవారందఱు పూర్వము ఇపుడును ఎల్లప్పుడును ఏదో యొక ద్రోహము చేయుచునేయుందురు. అదినీకు దెలియుచుండును. కావునఇట్టి స్వభావముగలవారిని క్షమించి వదలిపెట్టుటమంచిది. వారు మీ మేలునైన తలఁచిసన్మార్గము అవలంబింతురేమో! దేవుఁడు మేలుచేయువారిని ప్రేమించును. కావునముసల్మానులు సదా మేలుచేయుటకు యత్నించుచుండవలెను. 14.ఇస్రాయీలియుల (యూదుల)వలె నస్రానీ (క్రైస్తవు)లుకూడ తాముగావించిన యొడంబడికను త్రెంపి వారికిబోధింపఁబడిన బోధలను వారు అనుసరింపక వానిని మఱచిపోయిరి. దానికి ఫలితముగ వారిలో ననేక మతశాఖలు ఏర్పడి పరస్పర విరోధమును కపటమును గలిగియున్నారు. వారి కర్మలనుగూర్చి దేవుఁడు వారి ఫలితము నెఱుఁగును. ఇది సదాయుండును. వారుండునంతవఱకు మానుకొనరు. ఎందుకన ఎపుడు మతగ్రంథము (ప్రాత క్రొత్త నిబంధన) లలో తారుమాఱు గలుగునో ఆ మతస్థులు సన్మార్గమునకు వత్తురని యాశయుండదు. కావున వారు ఎల్లపుడు మతవైరములలోనే పడి

యుందురు. ఇస్లామ్ మతగ్రంథమగు ఖురానె షరీఫును ఎట్టి మార్పు లేకుండ నుండుటవలన సన్మార్గము సురక్షితముగా నున్నది. కొందఱికి అభిప్రాయ భేద ములు గలిగి శాఖలు ఏర్పడినను అధిక సంఖ్యాకులు ఖురానుగ్రంథము ననుస రించి సన్మార్గమందు స్థిరముగా నున్నారు. ఇకముందును, ఉండఁగలరు.

15. యా-అహ్ల-లిల్-కితాబి-ఖద్-జాఅకుమ్-రసూలునా-యుబయ్యిను లకుమ్-కసీరమ్-మిమ్మాకున్తుమ్-తుఖ్-ఫూన-మినల్-కితాబి-వ-యఅ-ఫూఅన్-కసీరిన్-ఖద్-జాఅకుమ్-మినల్లాహి-నూరున్-వ-కితాబుమ్-ముబీన్. 16. యహ్దీ-బిహిల్లాహు-మనిత్-తబఅ-రిజ్వానహూ-సుబులస్-సలామి-వ యుఖ్ - రిజుహు మ్-మినజ్-జులుమాతి-ఇలన్-నూరి-బి-ఇజ్నిహీ-వయహ్దీహిమ్-ఇలా- సిరాతిమ్-ముస్-తఖీమ్.

15. ఓ గ్రంథముగలవారలారా! మీయొద్దకు మా ప్రవక్త వచ్చెను. మీరు గ్రంథమునుండి దాఁచుచున్నట్టి యనేక విషయములను అతఁడు మీకుఁ దెలుపుచున్నాఁడు. మఱియు అనేక విషయములను వదలిపెట్టుచున్నాఁడు. నిశ్చయముగా దేవునినుండి మీయొద్దకు జ్యోతియును స్పష్టముగాఁ దెలుపునట్టి గ్రంథమును వచ్చెను. 16. దాని మూలమున దేవుఁడు తన ప్రీతిని పడయఁ గోరువారిని రక్షణమార్గములు చూపుచున్నాఁడు. మఱియు తన సెలవుచే వారిని అంధకారమునుండి వెలుతురులోనికిఁ దీసికొనివచ్చి సన్మార్గమందు వారిని నడపుచున్నాఁడు.

వ్యా॥ 15. యూదులును క్రైస్తవులును తమ మత గ్రంథములలోని పెక్కు విషయములను దాఁచుచు, వానిని తార్మారుచేయుచు, హజ్రత్ పైగంబరువారి విషయమున్న ప్రకటనలను మఱియు నితర ధర్మములను దాఁచుచుండిరి. కావున దేవుఁడు లోకమునకు సన్మార్గమును మోక్షమార్గములునుచూపి యూదులును, క్రైస్తవులును దాఁచుచున్న ధర్మములను వెల్లడించుటకుఁగాను తన ప్రవక్తయగు హజ్రత్ ముహమ్మదువారిని పంపెను. యూదులు, క్రైస్తవులు దాఁచుచున్న విషయములలో అవసరమునైన విషయములను దెలుపుచు, అవసరములేని విషయములను ప్రవక్త వదలిపెట్టును అని దేవుని సెలవయ్యెను. దేవునినుండి వచ్చిన జ్యోతి హజ్రత్ ముహమ్మదురసూలు వారు. వారికి నొసంగఁబడిన స్పష్టముగా ధర్మములను దెలుపునట్టి గ్రంథము ఖురానె షరీఫు. దేవుని ప్రీతి పొందఁగోరువారు దానిననుసరించి, అవిశ్వాసాంధకారములనుండి బయటికి వచ్చి సన్మార్గమగు ఇస్లామ్ ననుసరించి రక్షణమార్గముపొందుదురు.

17. లఖద్-కఫరల్లజీన-ఖాలూ-ఇన్నల్లాహా-హువల్-మసీహుబ్ను-మర్యమ-ఖుల్-ఫమన్-యమ్-లికు-మినల్లాహి-షైఅన్-ఇన్ అరాద-అన్-యుహ్లికల్-మసీహబ్న-మర్యమ-వ-ఉమ్మహూ వమన్-ఫిల్-అల్ జి-జమీ-అన్-వలిల్లాహి-ముల్కుస్-సమావాతి-వల్-అర్ జి-వమా-బైనహుమా-యఖ్లుఖు-మా-యషా ఉ-వల్లాహు-అలా-కుల్లి షైఇన్-ఖదీర్. 18. వఖాలతిల్-యహూదు-వన్నసారా-నహ్ను-అబ్నా ఉల్లాహి-వ-అహిబ్బా-ఉహూ-ఖుల్-ఫలిమ-యుఅజ్జిబుకుమ్-బి-జునూబికుమ్-బల్-అన్తుమ్-బషరుమ్-మిమ్మన్-ఖలఖ-యగ్ఫిరు-లిమన్-యషా ఉ-వయుఅజ్జిబు-మన్-యషా ఉ-వలిల్లాహి-ముల్కుస్-సమావాతి-వల్-అర్ జి-వమా-బైనహుమా-వ-ఇలైహిల్-మసీర్.

17. మర్యము కుమారుఁడే దేవుఁడు అని పలికినవారు నిశ్చయముగ అవిశ్వాసులైరి. మర్యము కుమారుఁడగు ఏసును, ఆతని తల్లిని, భూమిలోనున్న సర్వజనులను దేవుఁడు నాశముచేయవలెనని కోరినచో ఎవరు తప్పింపఁగలరు? అని ఓ ప్రవక్తా! పలుకుము. మఱియు ఆకాశములలోను భూమిలోను ఆ రెంటి మధ్యనున్న దానిలోను దేవుని ప్రభుత్వముగలదు. దేవుఁడు తాను కోరినది సృష్టించును. మఱియు దేవుఁడు సర్వముపై శక్తి గలవాఁడు. 18. మఱియు యూదులును, నస్రానీలును, "మేము దేవుని కుమారులమును, ప్రియులమును, అని పలుకుదురు. మఱెందులకు దేవుఁడు మీ పాపముల కొరకు మిమ్ము శిక్షించుచున్నాఁడు. మీరును, ఆతని సృష్టికిఁ జేరిన మానవులు మాత్రమే. దేవుఁడు తాను కోరినవారిని క్షమించును. మఱియు తాను కోరినవారిని శిక్షించును. మఱియు ఆకాశములోను భూమిలోను ఆ రెంటిమధ్యనున్న దానిలోను దేవుని ప్రభుత్వము గలదు. మఱియు ఆతని యొద్దకు మరలవలసియున్నది అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 17. తండ్రి లేక బీబీ మర్యమునకుఁబుట్టిన ఏసుక్రీస్తు దేవుఁడని పలుకువారు అవిశ్వాసులు. దేవునికి పుట్టుట గాని, గిట్టుట గాని లేదు. దేవుఁడు సర్వశక్తుఁడు. సర్వము ఆతనికి లోనైయున్నది. ఏసుక్రీస్తును, ఆతని తల్లిని భూమిలోనున్న సర్వజనులను ఒక్క క్షణములో నాశముచేయవలెనని కోరినచో అట్లు చేయుటకు దేవునికి శక్తి గలదు. ఆతనికి అడ్డుపడువారెవరునులేరు. ఏసుక్రీస్తు దేవుఁడైనచో తన చావును తప్పించుకొనగలఁడుగదా! అట్లు కానేరదు. ఏసుక్రీస్తు దేవునికి లోనైన యాతఁడు. భూమ్యాకాశములలోను వాని

మధ్యనున్న సమస్తములోను దేవుని ప్రభుత్వమున్నది. ఆతని అధికారమే చెల్లును. ఆతఁడు తాను కోరినది సృష్టించును. ఆదమును తల్లిదండ్రులు లేకయే తన సర్వశక్తితో పుట్టించెను. హవ్వాను తల్లి లేకుండనే సృజించెను. అటులే ఏసుక్రీస్తును తండ్రి లేకుండనే తల్లినుండి పుట్టించెను. అంతమాత్రాన ఏసుక్రీస్తు దేవుఁడు ఎట్లు కాఁగలఁడు? అట్లు విశ్వసించుట చాల తప్పు. దాని ఫలితము నరక నివాసమే. 18. యూదులును, క్రైస్తవులును మేము దేవుని కుమారులము. ఆతని ప్రియులము అని పలుకుదురు. అవి సరికావు. ఎందుకన దేవుఁడు వారు గావించిన పాపములకు శిక్షనొసంగుచున్నాఁడు. యూదులు తాము గావించుచున్న పాపములకుఁగాను దేవుని కోపమునకు పాత్రులై దేవుని శిక్షకుపాత్రులైరి. అట్టివారు దేవునికి ప్రియులు కానేరరు. వీరును సృష్టికిఁజేరిన సాధారణమానవులే. దేవుఁడు న్యాయముగా కర్మలకుఁ దగినట్లు ఫలిత మొసంగును. ఆతఁడు సర్వశక్తుఁడు. ఆతఁడు తన అనుగ్రహము చే తాను కోరినవారి పాపములను క్షమించును. తాను కోరినవారికి న్యాయముగ శిక్ష విధించును. అందఱును ఆతనియొద్దకు మరలవలసియున్నది. అపుడు తీర్పు అగును దేవునికి విధేయులైనవారే ఆతని ప్రియులు.

19. యా-అహ్లల్-కితాబి-ఖద్ జాఅకుమ్-రసూలునా-యుబయ్యిను-లకుమ్-అలా-ఫత్రతిమ్-మినర్-రుసులి-అన్ తఖూలూ-మాజాఅనా మిమ్-బషీరిన్-వలా నజీరిన్-ఫఖద్-జాఅకుమ్-బషీరున్-వనజీరున్-వల్లాహు-అలా-కుల్లిషైఇన్-ఖదీర్.

19. ఓ గ్రంథముగలవారలార! ప్రవక్తలు వచ్చుట ఆగిపోయిన పిదప మీ యొద్దకు సువార్తను, భయబోధ నిచ్చువాఁడును రాలేదే యని మీరు పలుకకుండ, మీకు స్పష్టముగాఁ దెలుపునట్టి మా ప్రవక్త మీ యొద్దకువచ్చెను. కావున మీ యొద్దకు సువార్తను, భయబోధ నిచ్చునట్టి యాతఁడు విచ్చేసెను. మఱియు దేవుఁడు సర్వముపై శక్తిగలవాఁడు.

వ్యా॥ 19. ఏసుక్రీస్తు పిదప చాదాపు ఆఱువందలసంవత్సరములవఱకు ఏ ప్రవక్తయును రాలేదు. అందువలన, లోకమంతట ధర్మముపోయి అధర్మము వ్యాపించి అవిశ్వాసాంధకారములో జగత్తు మునిఁగియుండెను. అపుడు దేవుఁడు లోకమునంతటికిని ధర్మమార్గము చూపుటకై హజ్రత్ ముహమ్మదువారిని ప్రవక్తగఁజేసి పంపెను. వారు మతధర్మములను స్పష్టముగాఁ దెలుపుచు, దేవునికి విధేయులైనవారికి మోక్షముగలదు అను సువార్తయును అవిధేయులై అవిశ్వాసులగువారికి, నరకశిక్ష గలదు అని భయపెట్టుదురు. కావున యూదు

లును, క్రైస్తవులును ఇతర జనులును తమ తప్పుత్రోవలను వదలి హజ్రత్ రసూలు వారిని విశ్వసించి మోక్షముపొందవలెను. దేవుఁడు సర్వశక్తుఁడు. మీరు విశ్వసింపనిచో ఇతర జనులు ప్రవక్తను విశ్వసించునట్లు చేయును. దేవుని పని మీపైననే యాధారపడియుండలేదు.

20. వఇజ్ ఖాల-మూసా-లిఖౌమిహీ.యాఖౌమిజ్ కురూనిఅ-మతల్లా హీ-అలైకుమ్ ఇజ్-జఅల-ఫీకుమ్-అంబియాఅ-వజఅలకుమ్ముసులూకన్- వ-ఆతా కుమ్-మాలమ్-యూతి-అహదమ్-మినల్-ఆలమీన్. 21. యాఖౌమిద్-ఖులుల్ అర్ జల్ ముఖద్దసతల్-లతీ-కతబల్లాహు-లకుమ్ వలాతర్ తద్దూ-అలా-అద్ బారి కుమ్-ఫతన్ ఖలిబూ-ఖాసిరీన్. 22. ఖాలూ-యామూసా ఇన్న-ఫీహా-ఖౌమన్ జబ్బారీన-ఫఇన్నా-లన్-నద్ ఖులహా-హత్తాయఖ్ రుజూ మిన్ హా-ఫఇన్-యఖ్ రుజూ-మిన్ హా- ఫఇన్నా-దాఖిలూన్. 23. ఖాల-రజులాని-మినల్లజీన-యఖాఫూన అన్-అమల్లాహు-అలైహిమద్-ఖులూ-అలైహిముల్ బాబ-ఫఇజా-దఖల్తుమూ హు-ఫఇన్నకుమ్ గాలిబూన్ వఅలల్లాహి-ఫతవక్కలూ-ఇన్ కున్తుమ్- మూమినీన్. 24. ఖాలూ-యామూసా-ఇన్నా-లన్-నద్ ఖులహా-అబదమ్-మాదామూ ఫీహా ఫజ్ హబ్ అన్త వరబ్బుక-ఫఖాతిలా ఇన్నా హాహునా- ఖాఇదూన్. 25. ఖాల- రబ్బి- ఇన్నీ-లా-అమ్ లికు-ఇల్లా-నఫ్సీ-వఅఖీ-ఫఫ్ రుఖ్-బైననా- వ బైనల్ - ఖౌ మిల్-ఫాసిఖీన్. 26.ఖాల-ఫఇన్నహా-ముహర్రమతున్-అలైహిమ్- అర్ బఈన సనతన్ యతీహూన-ఫిల్-అర్ జి-ఫలా- తాస అలల్ -ఖౌమిల్ ఫాసిఖీన్.

20. మఱియు మూసా తన జనులతో ఓ నాజనులార! దేవుఁడు మీలో ప్రవక్తలను పుట్టించి మిమ్ము రాజులుగఁ జేసి లోకులకు నొసంగని దానిని మీకొసంగి మీకుఁజేసిన మేలును (అనుగ్రహమును) జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. 21. ఓ నా ప్రజలార! మీకొఱకు దేవుడు నియమించియున్న పవిత్రదేశము లో ప్రవేశింపుఁడు. వీఁపిచ్చిమరలకుఁడు. అట్లు చేసితిరేని మీరు నష్టములో పడిపోవుదురు అని పలికెను. 22. (అపుడు) వారు "ఓమూసా! అందు, బలిష్ఠులైన జనులున్నారు, వారు అచటినుండి వెళ్ళిపోవునంతవఱకు మేము అందు ప్రవేశింపము. మఱియు వారు వెళ్లిపోయినచో మేము తప్పక ప్రవేశింతుము అని చెప్పిరి. 23. (అపుడు) దేవుని యనుగ్రహము పొందిన ఇరువురు

భక్తులు ఓ జనులార! మీరు వారి నెదుర్కొని ద్వారముగుండ ప్రవేశింపుఁడు. మీరు ద్వారములో ప్రవేశించినచో మీరే జయము పొందుదురు. మఱి మీరు విశ్వాసులైనచో దేవునిపై నాధారపడుఁడు అనిపలికిరి. 24. ఓమూసా ఆ బలిష్ఠులు అందుండునంతవఱకు, మేము అందు ఎన్నటికిని ప్రవేశింపము. కావున నీవును, నీదేవుఁడును పోయి యుద్ధముచేయుఁడు. మేమిచ్చటనే కూర్చుండి యుండువారము అని వారు పలికిరి. 25. అపుడు "ఓ నా ప్రభువా! నాయాత్మపైనను నా సోదరుని పైనను మాత్రము నాకు అధికారముగలదు. కావున మా మధ్యయును అవిధేయులైనవారి మధ్యను తీర్పుచేసి వేయుము." అని మూసా పలికెను. 26. నిశ్చయముగా ఆ భూమి వారికిఁగాను నలుబది సంవత్సరముల వఱకు నిషేధింపఁబడినది. వారు భూమియందు దేవులాడుచు తిరుగుచుందురు. కావున అవిధేయులైన జనుల గూర్చి నీవు చింతింపకుము. అని దేవుఁడు సెల విచ్చెను.

వ్యా॥ 20: 26. ఈ వాక్యములలో హజ్రత్ మూసా ప్రవక్తను గూర్చియు ఆతని జనులగు ఇస్రాయీలియులను గూర్చి చెప్పఁబడుచున్నది. దేవుఁడు హజ్రత్ ఇబ్రాహీము కుమారుఁడగు ఇస్హాఖు సంతతిలో ననేక ప్రవక్తలను రాజులను పుట్టించెను. సిరియా దేశము (షామ్) ఇబ్రాహీము ప్రవక్త సంతతి వారికి నొసంగుదు నని దేవుఁడు సెలవిచ్చి యుండెను. హజ్రత్ యూసుఫ్ ప్రవక్త రాజ్య కాలములో ఆతని తండ్రియగు యాఖూబు ప్రవక్తయును ఆతని సంతతియును, ఈజిప్టు (మిసరు)లోనే నివసింప సాగిరి. ఆపిదప మూసా ప్రవక్త ఇస్రాయీలియులను ఫిరౌను బానిస తనమునుండితప్పించి, సిరియా దేశము వశపఱచు కొనుటకుఁగాను బయలుదేఱెను. అపుడుఆయన తన జనులతో మీపైనున్న దేవుని యనుగ్రహమును, మీసమకాలికులలో మీకు నొసంగిన ఘనతను జ్ఞప్తికి దెచ్చుకొనుఁడు అనిపలుకుచు పవిత్రదేశములో ప్రవేశింపుఁడు అని పలికెను. ఆ దేశము (సిరియా)ను అమాలిఖాఅను బలవంతులైన వారు ఆక్రమించుకొని యుండిరి. ఇస్రాయీలియులు, వారి బలమును తెలిసికొని పిఱికి తనము వహించి, వారు ఆ దేశములో నుండునంత వఱకు మేము అందు ప్రవేశింపము అని మూసా ప్రవక్త యాజ్ఞను అతిక్రమించిరి. యుద్ధమాడక పిఱికి తనము వహించినచో మీరు స్వాతంత్ర్యముగోలుపోయి నష్టము పొందుదురని మూసా ప్రవక్త వారిని మందలించెను. కానివారుయుద్ధమునకు సిద్ధులు కాలేదు. అపుడు దేవుని భక్తులు యోషేబిన్‌నూన్ కాలిబ్ బిన్‌యోఫునా అను ఇరువురు మీరు ద్వారములో ప్రవేశించినచో జయము పొందుదురు. మీరు దేవునిపై నాధారపడి యత్నింపుఁడు అని పలికిరి. కాని

యూదులు, దానికిఁగూడ వినక మేము పోనేపోము. కావలెనన్న ఓమూసా! నీవును నీ ప్రభువగు దేవుఁడును పోయి యుద్ధమాడుఁడు అని మూసాతో పలికిరి. అపుడు మూసా ప్రవక్త దేవా! నీవే తీర్పుచేయుము అని దేవునితో విన్నవించెను. అందుకు దేవుఁడు యూదులు గావించిన అవిధేయతకుఁగాను, వారు నలువది సంవత్సరముల వఱకు, సిరియా దేశములోనికి పోఁజాలక, దేవులాడుచుందురని సెలవిచ్చెను. అటులే జరిగి యూదులు ఆకాలమందు అనేక కష్టములకు పాల్పైరి. ఆగడువు తీరిన పిదప యోషే మిగిలియున్న జనులతో పోయి సిరియా దేశమును పట్టుకొనెను. యూదులు తమ పెద్దల స్వభావమును బట్టి హజ్రత్ ముహమ్మదు పైగంబరుల వారిని విశ్వసింపక తోడుపడక పోయినను, అన్సారులు ముహాజిరులు (పైగంబరువారి శిష్యులు) బదరు మొదలగు ధర్మయుద్ధములలో, హజ్రత్ రసూలు వారిసెలవు ననుసరించి తమ ప్రాణములనైనను లక్ష్యింపక ఇస్లామ్ శత్రువులను మాఱ్కొని కొలఁది సంవత్సరములలోనే అనేక దేశములను జయించి ధర్మమును స్థాపించిరి. మూసా ప్రవక్త గారి జనులకును హజ్రత్ ముహమ్మదు వారిశిష్యులకునున్న తారతమ్యము చదువరు లెఱుంగఁగలరు.

27. వత్లుఅలైహిమ్ - నబ-అబ్నై-ఆదమ-బిల్హఖ్ఖి-ఇజ్ఖర్రబా-ఖుర్బానన్ఫతు-ఖుబ్బిల-మిన్-అహదిహిమా-వలమ్యుతఖబ్బల్-మినల్-ఆఖరి ఖాల-లఅఖ్తులన్నక-ఖాల-ఇన్నమా-యతఖబ్బలుల్లాహు-మినల్ముత్తఖీన్. 28. లఇమ్-బసత్త-ఇలయ్య-యదక-లితఖ్తులనీ-మాఅన-బిబాసితిన్-యదియ-ఇలైక-లిఅఖ్తులక-ఇన్నీ-అఖాఫుల్లాహ-రబ్బల్ఆలమీన్. 29. ఇన్నీ-ఉరీదు-అన్-తబూఅ-బిఇస్మీవఇస్మిక-ఫతకూన-మిన్-అస్హాబిన్నారి-వజాలిక-జజాఉజ్జాలిమీన్. 30. ఫతవ్వఅత్-లహూ-నఫ్సుహూ-ఖత్ల-అఖీహి-ఫఖతలహూ-ఫఅస్బహ-మినల్-ఖాసిరీన్. 31. ఫబఅసల్లాహు-గురాబన్-యబ్హసు ఫిల్ అర్జి-లియురియహూ-కైఫ-యువారీ-సౌఅత-అఖీహి-ఖాలయావైలతా-అఅజజ్తు-అన్-అకూన-మిస్ల-హాజల్-గురాబి-ఫఉవారియ-సౌఅత-అఖీ-ఫఅస్బహ-మినన్-నాదిమీన్.

27. మఱియు ఆదము పుత్రుల యిరువుర నిజమైన విషయము వారికి వినిపింపుము. వారిద్దఱును దేవునికి మ్రొక్కుకొనఁగా వారిలోనొకని మ్రొక్కుబడి అంగీకరింపఁబడెను. మఱియు రెండవ యాతనిది యంగీకరింపఁబడలేదు. (ఖాబీలు) రెండవ

యాతఁడు నేను నిన్ను చంపుదును అని పలుకఁగా దేవుఁడు భక్తుల మొక్కుబడిని మాత్రము అంగీకరించుచున్నాఁడు. 28. నీవు నన్ను చంపుటకు చెయ్యిచాచినచో నేను నిన్ను చంపుటకు చెయ్యిచాచను. సర్వలోకములకు పోషకుఁడగు దేవునికి నేను భయపడుచున్నాను. 29. నీవు నాపాపమును, నీపాపమును పొంది నరకనివాసులలో నొకఁడవగుదువుగాక అని నేను కోరుచున్నాను. మఱియు ఇదిదుష్టులకు శిక్షఅని (హాబీలు) పలికెను. 30. అపిదప ఆతనియాత్మ యాతనిని తనసహోదరుని జంపుటకు ప్రేరేపించెను. పిదప ఆతఁడు ఆతనిని (హాబీలు) చంపెను. కావున ఆతఁడు నష్టముపొందువారిలో నొకఁడాయెను. 31. అిదప ఆతని సోదరుని శవమును ఎట్లుదాఁచిపెట్టవలెనో ఆతనికి చూపుటకై భూమినిత్రవ్వునట్టి యొక కాకిని దేవుఁడుపంపెను. ఆతఁడు అయ్యో నేను నాసహోదరుని శవమును దాఁచిపెట్టుటలో ఈకాకికి సైతము సమానుఁడను కాకపోతినే అని పలికి పశ్చాత్తాపముతో ఏడ్వసాగెను.

వ్యా॥27. ఆదముప్రసక్తుకు హాబీలు ఖాబీలు అను ఇద్దరుకుమాళ్లుండిరి. వారి వృత్తాంతము ఇస్రాయీలీయులకు తెలుపఁబడుచున్నది. ఖాబీలు తనసహోదరుఁడగు హాబీలును అసూయచేత చంపెను. హాబీలు దేవునియందు భయభక్తులుగలయాతఁడు. అన్యాయముగ దేవుని భక్తుల చంపుట ఘోరపాతకము. యూదులు తమ శత్రువులతో యుద్ధముచేయుటకు భీతిల్లిరి. కాని దేవునిభక్తులగు అనేకప్రవక్తలను చంపిరి. అటులే హజ్రత్ పైగంబరులవారిని వధించుటకు పెక్కు కుట్రలు సలిపిరి. దేవుఁడు సెలవిచ్చినదానిని చేయక నిషేధించినదానిని చేయుస్వభావము యూదులకుఁగలదు. అట్లయినను వారు మేముదేవునికి ప్రియులమని చెప్పికొనుట వారికెట్లు తగును. రాఁబోవు వాక్యములకు ఈవృత్తాంతము ఉపోద్ఘాతమువంటిది. ఆదము ధర్మప్రకారముగ హాబీలునకు నిచ్చి పెండ్లిచేయఁదలచిన పెండ్లికూతును ఖాబీలుకోరెను అందుకు ఆదము మీరిద్దఱు దేవునికి మొక్కుబడి (నియాజ్) చేసికొనుఁడు. ఎవరి మొక్కుబడిని (కానుక) దేవుఁడు అంగీకరించునో యాతఁడు పెండ్లిచేసికొనవచ్చును. అనిపలికెను. అందుకు వారిద్దరు అట్లు చేసిరి. హాబీలు కానుకను దేవుఁడు అంగీకరించెను. ఆకాలమందు అంగీకరింపఁబడిన కానుకను (ఖుర్బానీని) ఆకాశము నుండిఅగ్ని వచ్చి కాల్చుచుండెను. అటులే హాబీలు కానుకను అగ్నివచ్చి కాల్చివేసెను. ఖాబీలు తనకానుక అంగీకరింపఁబడలేదని అసూయపడి తనసహోదరుని దండించి తుదకు చంపివేసెను. అప్పుడుహాబీలు దేవుఁడు భక్తిగలవారి మొక్కుబడిని అంగీకరించును. కావున నీవును భక్తిని వహింపుము. నీవు నన్నుచంప యత్నించినను నేనునిన్ను చంప యత్నింపను. నేను ఆపాపము కట్టుకోను. దేవుని శిక్షకు భయపడుచున్నాను. నాపాపమును నీపాపమును నీవే అనుభవింపఁగలవు. దానికిఫలముగ నరకవాసివగుదువు అనిపలికెను. ఎప్పుడైనతనసహోదరుఁడు అన్యాయముగా పూనుకొని చంపయ

త్నించినచో వానినిచంపుట న్యాయమే. కాని తాను ఓప్పుగలిగి వధింపఁబడినచో గొప్ప పుణ్యఫలితము (షహాదత్) లభించును. కానిశత్రువుల విషయమున అట్లు చేయరాదు. వీరైనంతవఱకు ధైర్యముతో శత్రువును మార్కొనవలెను. ఖాబీలు తనసహోదరుని చంపి భక్ష్యుఁడగు తనసహోదరుని గోలుపోయిపరమునందు నరక పాత్రుఁడై నష్టపొందిన వారిలోచేరెను. అదియునుగాక ఖాబీలు హత్యలకు మార్గ దర్శకుఁడాయెను. కావున అతని వెనుకను కలుగఁబోవు హత్యలపాపములలో వాఁడు కూడ భాగస్థుఁడాయెను.31. ఈహత్యకు ముందుఎవరునుచచ్చియుండలేదు. కావున శవమును ఏమిచేయవలెనో ఖాబీలునకు తెలియకుండెను. ఒక కాకి భూమిత్రవ్వి ఒక చచ్చినకాకిని పూడ్చుచుండుటను ఖాబీలు చూచి తన సహోదరుని శవము ను అటులే పూడ్చవలెనని తెలిసికొని కాకియంత తెలివి నాకు లేకపోయెనే అని వ్యసనపడసాగెను. ఆపిదప వానికి తనపాపఫలితము గకలిగినదుర్గతినిచూచి పశ్చా త్తాపపడసాగెను. అన్యాయముగ హత్యచేయువారికిని బంధుత్వమును త్రెంపువారికిని ఇహలోకమునందును శిక్షలభించును అని హజ్రత్ ముహమ్మదువారు సెలవిచ్చి యున్నారు.

32. మిన్-అజ్లి-జాలిక-కతబ్నా-అలా-బనీ-ఇస్రాయీల-అన్నహూ-మన్-ఖతల-నఫ్సమ్-బిగైరి-నఫ్సిన్-ఔ-ఫసాదిన్-ఫిల్-అర్జి-ఫకఅన్నమా-ఖతలన్నాస-జమీఅన్-వమన్-అహ్యాహా ఫకఅన్నమా-అహ్యా-యన్నాస-జమీఅన్ వలఖద్-జాఅత్ హుమ్-రుసులునా-బిల్-బయ్యినాతి-సుమ్మ-ఇన్న-కసీరమ్-మిన్హుమ్-బఅ-ద-జాలిక-ఫిల్-అర్జి-లముస్-రిఫూన్. 33. ఇన్నమా-జజా-ఉల్లజీన యుహా-రిబూనల్లాహ-వరసూలహూ-వయస్-ఔన-ఫిల్-అర్జి-ఫసాదన్-అన్ యుఖత్తలూ-ఔ-యుసల్లబూ-ఔ-తుఖత్తఅ-ఐదీహిమ్-వ-అర్జులుహుమ్ - మిన్-ఖిలాఫిన్-ఔ-యున్-ఫౌ-మినల్-అర్జి-జాలిక-లహుమ్-ఖిజ్యున్ - ఫిద్-దున్యా-వలహుమ్-ఫిల్-ఆఖిరతి-అజాబున్-అజీమ్. 34. ఇల్-లల్లజీన-తాబూ-మిన్-ఖబ్లి-అన్-తఖ్దిరూ-అలైహిమ్-ఫఅ-లమూ-అన్నల్లాహ-గఫూరుర్రహీమ్

32. ఈకారణమువలననే ఎవఁడు, ఒకని హత్యకు బదులుగా కాక, భూమిలో సుపద్రవమునకు కాక, ఒక యాత్మను చంపునో అట్లు వాఁడు సర్వ జనులను చంపినవాఁడగును. మఱెవఁడు ఒక్క యాత్మను బ్రతుకనిచ్చునో యట్టివాఁడు సర్వజనులను బ్రతుకనిచ్చినవాఁడగును అని మేము ఇస్రాయీలి యులకు ఆజ్ఞ విధించితిమి. మఱియు వారియొద్దకు స్పష్టమైన సూచనలను దీసి

కొని మా ప్రవక్తలు వచ్చిరి. ఆ పిదప కూడ వారిలో పెక్కుమంది భూమి యందు అక్రమములుచేయుచున్నారు. 33. ఎవరు దేవునితోను ఆతనిప్రవక్త తోను యుద్ధమాడుచు దేశములో అల్లరులు కల్పింప ప్రయత్నింతురో అట్టి వారిని చంపవలెను. లేక యురిపై వారి నెక్కింపవలెను. లేక వారి యొక ప్రక్క చేతులను ఒకప్రక్క కాళ్ళను తెగనఱకవలెను. లేక వారిని దేశభ్రష్టులుగాఁ జేయవలెను. ఇది వారికి ఇహమునందుగల అవమానము. మఱియు వారికి పరలోకమందు ఘోరబాధయున్నది. కాని ఎవరు మీచేతులలోచిక్కక పూర్వమే క్షమాపణ వేఁడుకొనుదురో (వారికి శిక్షలులేవు). దేవుఁడుక్షమించు వాఁడును, దయాళువును అని మీరు తెలిసికొనుఁడు.

వ్యా॥ 32. అన్యాయముగ హత్య గావించుటలో ఉభయలోకములలో నష్టమును తుదకు పశ్చాత్తాపమును పడవలసివచ్చును అను కారణమువలననే ఇస్రాయీలియులు, అన్యాయముగ ఒకని చంపరాదు. అట్లు చంపిన సర్వజనులను చంపినట్లు అగును. ఎందుకన వానిజూచి యితరులుకూడ హత్యలుగావించుటకు ధైర్యముపొంది గావింతురు. అటులే ఒకని ప్రాణమును రక్షించిన సర్వజనులప్రాణమును రక్షించినట్లగును. ఎట్లనగాఅందఱును దుర్మార్గులనుండి బలహీనులప్రాణములనురక్షించుటకు కృషిసలుపుదురు. ఈధర్మము తౌరాతు గ్రంథములో ఇస్రాయీలియులకు విధింపఁబడెను. మఱియు దేవుని ప్రవక్తలు మత ధర్మములను బోధించుచు అనేక స్పష్టమైన సూచనలు చూపించిరి. అట్లు ఇస్రాయీలియులు చూచియు తమ అక్రమములను మానుకొనలేదు. దేశములో ఉపద్రవములు గలిగించుచు ప్రవక్తలను ధర్మప్రచారకులను చంపుచు హింసించుచు వచ్చిరి. ఇది వారి స్వభావమైపోయెను. దానిబట్టియే ఇస్రాయీలియులు, దేవుని పరమభక్తులగు హజ్రత్ ముహమ్మదువారిని, వారిశిష్యులగు ముసల్మానులను చంపుటకు వారిని పలువిధములుగ హింసించుటకును కుట్రలు సలుపుచున్నారు. వారు తమ మతధర్మమును విడనాడి యిట్లు అల్లరులు గావించుచున్నారు. అట్లు దౌర్జన్యముచేసి దేశములో హత్యలు అల్లరులు గావించునట్టివారికి శిక్ష రాఁబోవు వాక్యములో చెప్పఁబడుచున్నది. 33. దేవుని ప్రవక్తలతో యుద్ధమాడుట దేవునితో యుద్ధమాడుట యగును. ఎందుకన ప్రవక్తలు దేవుని ప్రతినిధులు. ప్రవక్తలతో యుద్ధమాడుచు దేశములో అశాంతియు కల్పించుచు, దారికొట్టుచు అపవాదములు కల్పించి జనులమధ్య కలఁతలు పుట్టించి శాంతిభంగమునకు కారకులగుచు అన్యాయముగ హత్యలు గావించుచున్నట్టివారికి ఈనాలుగు విధముల శిక్షలలో ఏదోయొకటి విధింపవలెను. (1) వధించుట. (2) ఉరి శిక్ష ఇచ్చుట. (3) కుడిచెయ్యి, ఎడమకాలు తెగఁగొట్టుట. (4) దేశమునుండి వెడలఁగొట్టుట. ఇందు నేరగాని ఇతర స్థలమున

చెఱలుంచుటయు చేరును. దారిగొట్టు దొంగలు ఒకనిని చంపి వాని సొమ్ము లాగుకొనలేకపోయినచో దానికి శిక్ష వధించుట. చంపి సొత్తు లాగుకొన్నచో దానికి శిక్ష ఉరిపై నెక్కించుట. చంపక ధనము లాగుకొన్నచో దానికి శిక్ష కుడిచెయ్యి ఎడమకాలు తెగనఱకుట. దోఁచుటకు యత్నించునపుడు దొంగ పట్టుపడినచో దానికి శిక్ష చెఱసుంచుట లేక దేశమునుండి వెడలఁగొట్టుట. నేరగాండ్రు పట్టుపడక పూర్వమే పాపములను మానుకొని దేవుని సమ్ముఖమున క్షమాపణ కోరుకొన్నచో దేవుఁడు తన హక్కులను క్షమించును కాని జనుల హక్కులు వారు ఇయ్యవలెను. దొంగిలించిన సొత్తు అప్పగించవలెను. చంపినచో దానికి బదులు తీసికొనఁబడును. అది క్షమింపఁబడదు. కాని వధింపఁబడిన వాని వారసులు క్షమించిన క్షమింపవచ్చును. సొత్తుగాఁడు తన సొత్తును తీసికొనక వదలిపెట్టిన పెటవచ్చును. దేవుఁడు క్షమించువాఁడును దయాళువును. కావున నేరగాండ్రు తమ నేరములను మానుకొని దేవుని క్షమాపణకును దయకును పాత్రులు కావలెను.

35. యాఅయ్యు-హల్లజీన-ఆమనుత్-తఖుల్లాహ -వబ్ తగూ-ఇలైహిల్-వసీలత-వజాహిదూ-ఫీసబీలిహీ-లఅల్లకుమ్-తుఫ్లిహూన్. 36. ఇన్నల్లజీన-కఫరూ లౌఅన్నలహుమ్ మాఫిల్-అర్ జి-జమీ-అన్-వమిస్ లహూ-మఅహూ-లియఫ్ తదూ బిహీ-మిన్-అజాబి-యౌమిల్-ఖియామతి-మాతుఖుబ్బిల-మిన్-హుమ్-వలహుమ్-అజాబున్-అలీమ్. 37. యురీదూన-అన్ యఖ్ రుజూ-మినన్-నారి-వమాహుమ్-బిఖారిజీన-మిన్ హా-వలహుమ్-అజాబుమ్-ముఖీమ్.

35. ఓ విశ్వాసులారా! మీరు మేలుపొందుటకుఁగాను దేవునికి భయపడుఁడు మఱి ఆతని సాన్నిధ్యము పొందించు మార్గమును వెతకుఁడు. మఱియు ఆతనిమార్గమందు కృషిసలుపుఁడు. 36. అవిశ్వాసులైనవారు తీర్పుదినమునందుగల బాధనుండి తప్పించుకొనుటకుఁగాను దానికిబదులుగ వారు భూమిలోనున్న సమస్తమును దానితోఁబాటు అంతధనమును వారికి ఉండి యిచ్చినను అంగీకరింపఁబడదు. మఱియు వారికి దుఃఖకరమైనబాధయున్నది. 37. వారు నరకాగ్నినుండి వెడలి వచ్చుటకు కోరుదురు. కాని వారు అందుండిబయటికి రాజాలరు. మఱివారికి శాశ్వతమైనబాధ యున్నది.

వ్యా॥ 35. ఇందు ముసల్మానులకు భక్తిమార్గము చూపింపఁబడినది. దేవునికి భయపడి ఆతఁడు విధించిన ధర్మములను చేయుచు ఆతఁడు నిషేధించినదానిని వదలుకొనుచుండవలెను, దేవుని సాన్నిధ్యము పొందుటకుమార్గము వెతకవలెను.

అది భక్తిమార్గము. దేవునిప్రీతికొఱకు సత్కార్యములు చేయుచు వానిఫలితమగు దేవుని సాన్నిధ్యము ముసల్మానుభక్తులుపొందవలెను. దేవునిమార్గమందు కృషిసలిపి దేవునిమతమగు ఇస్లామ్‌ను స్థాపింపవలెను. ఆకృషిలో అన్నివిధములైన సత్కార్యములునుశత్రువులతో ధర్మయుద్ధమును చేయును. ఈపనులుచేసినచో ఇహమునందు జయమునుపరమునందు మోక్షము(నజాత్)లభించును. 36. ఇందు అవిశ్వాసులగతి చెప్పఁబడినది. ఇహలోకమందున్న పెండ్లిబంగారు మొదలగు ధనమును దీనికితోడుగ అంతటి ధనమునుఇచ్చి తుదిదినము (ఖియామతు)నందుగలుగు బాధతప్పించుకొనవలెనన్న అవిశ్వాసులకు వీలులేదు. అపుడు ధనముబదులుగ పుచ్చుకొనబడదు. అవిశ్వాసులు నరకబాధకుతాళలేక దానినుండి బయటికి రావలెనని కోరుదురు. కాని అట్లు వారుబయటికి రాఁజాలరువారు అందుశాశ్వతముగబాధఅనుభవించుచుందురు.

38. వస్ సారిఖు-వస్ సారిఖతు-ఫఖ్ తఊ-ఐదియహుమా-జజాఅమ్-బిమా కసబా-నకాలమ్-మినల్లాహి-వల్లాహు-అజీజున్ హకీమ్. 39. ఫమన్-తాబ-మింబఅ్-ది-జుల్మిహీ-వఅస్ లహ-ఫఇన్నల్లాహ-యతూబు-అలైహి-ఇన్నల్లాహ-గఫూరుర్ రహీమ్- 40. అలమ్-తఅ్-లమ్-అన్నల్లాహ-లహూ-ముల్కు-స్-సమావాతి-వల్-అర్ జి-యు-అజ్ జిబు-మన్-యషాఉ-వయగ్ ఫిరులిమన్-యషాఉ-వల్లాహు-అలా కుల్లి-షైఇన్-ఖదీర్.

38. మఱియు పురుషుడైనను స్త్రీయైనను దొంగతనము చేసినచో వారి చేతులను నరికివేయుఁడు. ఇట్లువారుచేసినదానికి ప్రతిఫలమును దేవునికతన శిక్షయును మఱియు దేవుఁడు సర్వశక్తుఁడును వివేకనాపరుఁడును. 39. మఱెవఁడు తన దుర్మార్గము విడపక్షమాపణ వేడుకొనితన్ను సవరించుకొనునో వానిక్షమాపణ దేవుఁడు అంగీకరించును. నిశ్చయముగ దేవుఁడు క్షమించువాఁడును దయాళువును. 40. ఆకాశములలోను భూమిలోను దేవునికే ప్రభుత్వము గలదు. అనినీవుఁదెలియదా! దేవుఁడు తానుకోరినవారిని శిక్షించును. మఱియు తానుకోరినవారిని క్షమించును. మఱియు దేవుఁడు సర్వముపై శక్తిగలవాఁడు.

వ్యా॥ 38. ఈవాక్యములో దొంగతనమునకు శిక్షవిధింపఁబడినది. తొలుత దొంగతనముచేసినట్టి దొంగ కుడిచేతిని మనికట్టువఱకు నఱుకవలెను. అందు స్త్రీపురుషులుసమానులే. ఈశిక్ష వారొనగాపెంచిన నేరమునకు బదులగును. దొంగిలించినధనము ధనస్వామికి అప్పగింపవలెను.దొంగసొత్తుపోఁగొట్టినచో దానికి బదలుధనము కట్టియియ్యవలెను. లేనిచో ధనస్వామితో క్షమాపణ కోరుకొనవలెను. ఇట్టిశిక్షవలన ఇతరులకు బుద్ధివచ్చును. దొంగతనము నిలిచిపోవును. దేవుఁడు సర్వశక్తుఁడు

వివేచనాపరుడు. కావునలోకశాంతికొఱకు తగినధర్మములను విధించును. దొంగతనా నుగావించిన నేరముల పిదప భక్తిపూర్వకముగ దేవునితో క్షమాపణకోరి తన గుణములు సవరించుకొని సత్కార్యములుచేసినచో దేవుడు దయగలవాడు క్షమించును. సర్వశక్తిగలిగి సర్వాధికారియగు దేవునికి నేరముచేసిన వారిని శిక్షించుట క్షమించుటతగును. ఆతని యిష్టముచొప్పున పరిపాలించును.

41 యా-అయ్యుహర్రసూలు-లాయహ్జున్-కల్లజీన-యుసారిఊన-ఫిల్-కుఫ్రి-మినల్లజీన-ఖాలూ-ఆమన్నా-బిఅఫ్వాహిహిమ్-వలమ్-తూమిన్-ఖులూబుహుమ్-వమినల్లజీన-హాదూ-సమ్మాఊన-లిల్కజిబి-సమ్మాఊన-లిఖౌమిన్-ఆఖరీన-లమ్-యాతూక-యుహర్రిఫూనల్-కలిమ-మింబఅది-మవాజిఇహీ-యఖూలూన-ఇన్ఊతీతుమ్-హాజా-ఫఖుజూహు-వఇల్-లమ్-తూతూహు-ఫహ్జరూ-వమన్యురిదిల్లాహు-ఫిత్-నతహూ-ఫలన్-తమ్లిక-లహూ-మినల్లాహి-షైఅన్-ఉలాఇకల్లజీన-లమ్-యురిదిల్లాహు-అన్-యుతహ్హిర-ఖులూబహుమ్-లహుమ్ఫిద్-దున్యా-ఖిజ్యున్-వలహుమ్ ఫిల్-ఆఖిరతి-అజాబున్-అజీమ్. 42. సమ్మాఊన-లిల్కజిబి-అక్కాలూన-లిస్సుహ్తి-ఫఇన్-జాఊక-ఫహ్కుమ్-బైనహుమ్-ఔ-అఅ-రిజ్-అన్-హుమ్-వఇన్-తుఅ్రిజ్-అన్-హుమ్-ఫలన్యజుర్రూక-షైఅన్-వఇన్హకమ్త-ఫహ్కుమ్-బైనహుమ్-బిల్ఖిస్తి-ఇన్నల్లాహ-యుహిబ్బుల్-ముఖ్సితీన్. 43. వకైఫ-యుహక్కిమూనక-వఇన్దహుముత్-తౌరాతు-ఫీహా-హుకుమ్ల్లాహి-సుమ్మ-యతవల్లౌన-మింబఅ్-దిజాలిక-వమా-ఉలాఇక-బిల్-మూమినీన్.

41. ఓ ప్రవక్తా! "మేము ముసల్మానుల మని తమ నోటితో పలుకుచు. విశ్వసింపని హృదయములు గలిగి అవిశ్వాసములో పడుటకు పరుగెత్తువారివలన నీవు దుఃఖపడకుము. మఱియు యూదులైనవారు అబద్ధములను చెవియొగ్గి వినువారు. నీయొద్దకు రానివారికొఱకు వారు వినువారు. వారు వాక్యములను వాని స్థానములనుండి తార్మాఱు చేయుదురు. "మీకిట్టి యాజ్ఞ లభించినచో దాని నంగీకరింపుడు. మఱియు ఈయాజ్ఞా లభింపనిచో మీరు తొలఁగిపొండు" అని ప్రజలతో పలుకుదురు. మఱియు దేవుఁడు ఎవరిని దారి తప్పింపఁగోరునో వారి విషయము దేవునియొద్ద నీవేమియు చేయఁజాలవు. ఇట్టివారి హృదయములను పవిత్రములుగఁ జేయుటకు దేవుఁడు కోరలేదు.

వారికి ఇహలోకమందు అవమానము గలదు. మఱియు పరలోకమందు వారికి ఘోరమైన బాధయును గలదు. 42. వారు అబద్ధములను చెవియొగ్గి వినువారును, నిషిద్ధము(హరామ్)అయినదానిని చాల తినువారును, కావున వారునీయొద్దకు వచ్చినచో, వారిమధ్యతీర్పు చేయుము. లేక వారినుండి ముఖముత్రిప్పుకొనుము. మఱియు నీవు వారి నుండి ముఖము త్రిప్పుకొన్నచో వారు నీకేమియు హాని చేయఁజాలరు. మఱియు నీవు తీర్పు చేసినచో న్యాయముగ తీర్పు చేయుము. నిశ్చయముగ దేవుఁడు న్యాయము చేయువారిని ప్రేమించును. 43. మఱివారెట్లు నిన్ను న్యాయకర్తగఁ జేయుదురు. మఱి వారియొద్ద తౌరాతు గ్రంథమున్నదే. అందు దేవుని యాజ్ఞ గలదు. దాని పిదప కూడ వారు తిరస్కరించుచున్నారు. మఱివారు విశ్వాసము గలవారు కారు.

వ్యా॥ 41. ఇందు వంచకులను యూదులను గూర్చి చెప్పఁబడినది. వంచకులు నోటి మాటలతో విశ్వాసము వెల్లడింతురు. వారి హృదయములలో విశ్వాసము (ఈమాన్) లేదు. వారు అవిశ్వాసములో పడుటకు పరుగెత్తుదురు. ఇట్టివారిఁ గూర్చి వారెందులకు నిజమైన ముసల్మానులు కారని చింతపడకూడదు అని దేవుఁడు హజ్రత్ పైగంబరులవారికిఁ దెలుపు చున్నాఁడు. యూదులలో ఒక స్త్రీయును పురుషుఁడును వ్యభిచారము చేసిరి, వారిద్దఱు పెండ్లియైనవారు. పెండ్లియైనవారు వ్యభిచారము చేసినచోవారినిరాళ్ళతోరువ్వి చంపవలెను అని తౌరాతు గ్రంథములో దేవుఁడు ఆజ్ఞవిధించియుండెను. ఆయిద్దఱిని ఆ శిక్షనుండి తప్పించుటకై యూదులు హజ్రత్ పైగంబరులవారి యొద్దకు దాని గూర్చి ధర్మము తెలిసికొనవలెను అని కొందఱిని పంపుచు కొరడాదెబ్బలు కొట్టవలెను అని పలికిన ఒప్పుకొనుఁడు. రాళ్ళతో రువ్వి చంపవలెనని విధించినచో ఒప్పుకొనకుఁడు అని పలికిరి. హజ్రత్ పైగంబరువారు దేవుని సెలవుచే, రాళ్లతోరువ్వి కొట్టవలెనని శిక్ష విధించిరి. ముందు యూదులు తిరస్కరించిరి. తుదకు వారి మతగ్రంథములోను ఆ శిక్షయే గలదని ఋజువుఅయి ఆశిక్ష విధింపఁబడెను. హజ్రత్ పైగంబరువారు, ఇంతవఱకు అమలులో లేక చచ్చి యుండిన ధర్మమును తిరిగి అమలులోనికి తెచ్చి యుద్ధరించిరి. ఈవిషయముల గూర్చి యీవాక్యమందు చెప్పుచు యూదులలోనున్న దుర్గుణములు దేవుఁడు వెల్లడించు చున్నాఁడు. యూదులు అబద్ధములు విని వాని అంగీకరింతురు. గ్రంథములలోని ధర్మములను వాక్యములను తారుమారుచేయుదురు. వారి కిష్టము వచ్చినట్లు ధర్మములను మార్చుకొనుదురు. ఇట్టి చెడ్డ స్వభావము గల వారికి సన్మార్గము లభింపదు. వారు అవిశ్వాసమునుండి పవిత్రులు కారు. ఎట్లు ఒకరోగి వైద్యుఁడిచ్చిన మందు సేవింపక పథ్యముచేయక తుదకు చచ్చిన

వైద్యునిపై నిందలేదో అటులే యూదులు వంచకులు దుర్మార్గము వలన శిక్షకు పాలైనచో దేవునిపై నిందరాదు. ఇహమునందు వారి రహస్యములు బయలుపడి వారికి అవమానము లభించును. పరలోకమందు వారు గావించుచున్న అధర్మములకు ఘోరమైన నరకబాధ యున్నది. 42. అబద్ధములు విని అంగీకరించుచు, లంచములు మొదలగు నిషిద్ధమైన సొత్తులను తినివేయుదురు. ముందు తీర్పు చేయుటలో చేయక వదలి పెట్టుటలో పైగంబరుల వారికి సెల వుండెను. కాని పిదప న్యాయముగ తీర్పు చెయవలసినదని దేవుని సెలవయ్యెను. న్యాయము లోకమునకు ఆధారము. న్యాయము చెడిన లోకములో నుపద్రవములు సంభవించును. ధనవంతులు పేదలు అను భేదము లేక ప్రతిమానవుని గూర్చి న్యాయముగ తీర్పుచేయుట దేవునికి ప్రీతి. అట్టివారిని దేవుడు ప్రేమించును. ముసల్మానులు, శత్రువు స్నేహితులు అను భేదము లేకుండ న్యాయము పాటింపవలెను. 43. యూదుల విషయము చాల ఆశ్చర్యకరమైనది. వారి మతగ్రంథమగు తౌరాతులో వ్యభిచారశిక్ష యుండియు దాని వదలి పెట్టి ఓ ప్రవక్తా! నిన్ను న్యాయకర్తగ నియమించుకొను చున్నారు. వారు దేవుని ధర్మములను తిరస్కరించు చున్నారు. వారికి తౌరాతు గ్రంథము నందును ఖురానెషరీఫు నందును విశ్వాసము లేదు అని హెచ్చరింపబడిెను. ఇకరాంబోవు వాక్యములలో తౌరాతును ఇన్జీలు గ్రంథములగూర్చి చెప్పంబడును.

44. ఇన్నా అన్‌జల్-నత్ తౌరాత ఫీహా హుదన్-వనూరున్ - యహ్కుము-బిహన్-నబియ్యూనల్లజీన-అస్‌లమూ లిల్లజీన హాదూ వర్‌రబ్బానియ్యూన-వల్-అహ్బారు-బిమస్ తుహ్ఫిజూ-మిన్ కితాబిల్లాహి-వకానూ అలైహి షుహదాఅ-ఫలాతఖ్-షఉన్నాస-వఖ్షౌని-వలాతష్‌తరూ-బిఆయాతీ -సమనన్ ఖలీలన్-వమల్‌లమ్ యహ్కుమ్-బిమా-అన్‌జలల్లాహు-ఫ ఉలాఇక-హుముల్-కాఫిరూన. 45. వ-కతబ్నా అలైహిమ్-ఫీహా అన్నన్-నఫ్స-బిన్నఫ్సి-వల్-ఐన బిల్-ఐని-వల్-అన్ఫ-బిల్-అన్ఫ-వల్-ఉజున-బిల్-ఉజుని-వస్-సిన్న బిస్-సిన్ని-వల్-జురూహ ఖిసాసున్-ఫమన్-తసద్దఖ బిహీ ఫహువ కఫ్ఫారతుల్-లహూ వమల్-లమ్ యహ్కుమ్-బిమా-అన్-జలల్లాహు-ఫఉలాఇక-హుముజ్-జాలిమూన. 46. వ-ఖఫ్ఫైనా-అలా-ఆసారిహిమ్-బిఈసబ్ని-మర్యమ-ముసద్దిఖల్ - లిమా బైన-యదైహి-మినత్-తౌరాతి-వఆతైనా హుల్ ఇన్‌జీల-ఫీహి-హుదన్ వనూ

రున్-వముసద్దిఖల్-లిమా బైన-యదైహి-మినత్-తౌరాతి-వఆతైనాహుల్-ఇన్జీల-ఫీహి-హుదన్-వనూరున్-వముసద్దిఖల్-లిమా బైన-యదైహి-మినత్-తౌరాతి-వహుదన్-వమౌఇజతల్-లిల్ముత్తఖీన్. 47. వల్-యహ్కుమ్-అహ్లుల్-ఇన్జీలి-బిమా-అన్-జలల్లాహు-ఫీహి-వ-మల్-లమ్-యహ్కుమ్-బిమా-అన్జలల్లాహు-ఫ-ఉలాఇక-హుముల్-ఫాసిఖూన్.

44. మేము తౌరాతు గ్రంథమును పంపితిమి. అందు సన్మార్గమును జ్యోతియును గలదు. దేవునికి విధేయులైన ప్రవక్తలు, దాని ననుసరించి యూదులకు ఆజ్ఞాపించుచుండిరి. మఱియు భక్తులును విద్వాంసులును అటులే ఆజ్ఞాపించుచుండిరి. ఎందుకనగ దేవుని గ్రంథమునకు రక్షకులుగాను దాని విషయము సాక్షులుగ నియమింపఁబడి యుండిరి. కావున జనులకు భయపడకుఁడు. మఱి నాకు భయపడుఁడు. మఱి నా వాక్యములకు బదులుగ కొద్ది వెల పుచ్చుకొనకుఁడు. మఱెవరు దేవుఁడు పంపిన ప్రకారము ఆజ్ఞ చేయరో అట్టివారే అవిశ్వాసులు. 45. మఱియు ఆ గ్రంథమందు, ప్రాణమునకు బదులు ప్రాణము కన్నునకు బదులు కన్ను, ముక్కునకు బదులు ముక్కు, చెవికి బదులు చెవి, పల్లుకు బదులు పల్లు, గాయములకు బదులుగ వానికి సరిసమానముగ బదులు తీసికొన వలెనని వారికి విధించితిమి. మఱెవఁడు దానిని క్షమించునో వాని పాపములకు పరిహారము కలదు. మఱెవరు దేవుఁడు పంపినదాని ప్రకారము ఆజ్ఞాపింపరో అట్టివారే దుర్మార్గులు. 46. మఱియు ఆ ప్రవక్తల వెనుక వారి జాడలననుసరించుచు, తనకు పూర్వముండిన తౌరాతు గ్రంథమును సత్యపఱచునట్టి మర్యమ్ కుమారుఁడగు ఈసాను పంపితిమి. మఱియు అతనికి ఇన్జీలు గ్రంథమొసంగితిమి. అందు సన్మార్గమును జ్యోతియును గలదు. మఱియు అది తనకు పూర్వమున్న గ్రంథమగు తౌరాతును సత్యపఱచునది. మఱియు సన్మార్గము చూపునది. మఱియు భయభక్తులు గలవారికి బోధ నిచ్చునది. 47. మఱియు ఇన్జీలు గ్రంథము గలవారు అందు దేవుఁడు పంపిన యాజ్ఞ ప్రకారము ఆజ్ఞ చేయవలెను. మఱెవరు దేవుఁడు పంపినదాని ప్రకారము ఆజ్ఞాపింపరో అట్టివారే అవిధేయులు.

వ్యా॥ 44. తౌరాతు గ్రంథము దేవునిచే మూసా ప్రవక్తకొసంగఁబడినది. దేవుని పొందఁగోరు భక్తుల కందు సన్మార్గమును సందేహము లనెడు అంధకారములో పడువారికి ధర్మ మార్గము చూపునట్టి వెలుతురును గలదు. తౌరాతులో పెక్కు మత ధర్మములుండినవి. వాని ననుసరించి ప్రవక్తలును మత విద్వాంసులును తీర్పు చేయుచుండిరి. తౌరాతులో ఏలాటి తార్మాలు చేయక కాపాడ వలెనని విద్వాంసులకును భక్తులకును బాధ్యత గలదు. వారు

ఆ బాధ్యతను సరిగ చూచునంత వఱకు తౌరాతులో మార్పు కలుగకుండెను. కాని తుచ్ఛ లాభములకు లోనైన దుష్ట విద్వాంసులు అందు మార్పులు కలిగింప సాగిరి. తుదకు అసలు గ్రంథము తార్మారాయెను. ప్రజలకు భయపడి తుచ్ఛ లాభములకు లోనై గ్రంథములోని ధర్మములను తార్మారు చేయక దేవుని శిక్షకు భయపడుచు భక్తి వహించి యుండవలెను అని ముసల్మానులకును యూదులకును హెచ్చరిక. ముసల్మానులు తమ మత గ్రంథమగు ఖురానును ఒక్క యక్షర వ్యత్యాసము లేకుండ ఇంతవఱకును కాపాడుచు వచ్చిరి. ఇంక మీదను కాపాడఁగలరు. ఇదంతయు దేవుని యనుగ్రహము. దేవుఁడు పంపిన ధర్మములను తిరస్కరించి తమ యిష్టాను సారముగా యూదులవలె చేసినచో అవిశ్వాసులగుటలో సందేహము లేదు. దేవుని ధర్మములని నమ్మి వానికి వ్యతిరేకముగ నడచుకొన్నచో అది అవిశ్వాసుల పనియే గాని వేఱుగాదు. కావున ముసల్మానులు తమ ప్రతి కార్యములోను మతధర్మములను అనుసరింపవలెను. 45. ఎవఁడైన ఒకనిని చంపినచో హంతకుని వధింపవలెను. కన్ను పగులఁగొట్టిన నేరగాని కన్ను పగులఁ గొట్టవలెను. ముక్కు కోసిన ముక్కు, చెవి కోసిన చెవి కోయవలెను. పల్లు విఱుగఁ గొట్టిన పల్లు విఱుగఁ గొట్టవలెను. గాయములు చేసిన వానికి వీలైనచో సరిసమానముగ గాయపఱచ వలెను. క్షమించినచో గాయములు పొందిన వాని పాపములు నశించును. వానికి పుణ్యము లభించును. ఈ ధర్మములు తౌరాతు గ్రంథములో యూదులకు విధింపఁబడినవి. ఈ ధర్మములను ముసల్మానులు కూడ అనుసరింప వలెను. ధర్మ ప్రకారముగా పేదలు ధనవంతులు గొప్పవారు హీనులు అను భేదము లేకుండ అందఱకును సరిసమానముగ శిక్ష విధింపవలెను. హెచ్చు తగ్గులు చేయరాదు. అట్లు భేదము పాటించుట అన్యాయమును దుర్మార్గమును. 46. తౌరాతు ననుసరించుచు వచ్చుచున్న ప్రవక్తలను వెనుక దేవుడు ఏసు క్రీస్తును ప్రవక్తగాఁ జేసి పంపెను. ఆయన పూర్వము గడచిన ప్రవక్తల పద్ధతులను అనుసరించుచు, తౌరాతు దేవుని గ్రంథమని సాక్ష్య మిచ్చుచుండెను. ఆతనికి దేవుఁడు ఇన్జీలు గ్రంథమొసంగెను. అందును తౌరాతులో నున్నట్లు సన్మార్గము వెలుతురును గలవు. ఇన్జీలులో తౌరాతు గ్రంథము నిజమైన దేవుని గ్రంథమని సాక్ష్యము గలదు. భయభక్తులు గలవారే గ్రంథములోని బోధలను చెవియొగ్గి విని వాని ననుసరింతురు. ఇన్జీలులో దేవుఁడు పంపిన ధర్మములను అనుసరించి అందలి విషయములను దాఁచఁగూడదు అని నస్రానీలకు ఆజ్ఞయై యుండెను. ఇన్జీలులో ఆఖరు ప్రవక్త (ఫారఖలీతు) హజ్రత్ పైగంబరును గూర్చియున్న ప్రకటనలను దాఁచుటకుఁగాని వానికి తప్పు అర్థములు చేయుటకుఁగాని క్రైస్తవులు పూనుకొనఁ గూడదు. అట్లు చేయువారు దేవునికి అవిధేయు లగుదురు.

48. వ-అన్-జల్నా-ఇలైకల్-కితాబ-బిల్-హఖ్ఖి-ముసద్దిఖల్- లిమా-బైన-యదైహి-మినల్-కితాబి-వ-ముహైమినన్-అలైహి-ఫహ్కుమ్- బైనహుమ్-బిమా-అన్-జలల్లాహు-వలా - తత్తబిఅ-అహ్వా-అహుమ్-అమ్మా- జాఅక-మినల్-హఖ్ఖి-లికుల్లిన్-జఅల్నా-మిన్-కుమ్-షిర్-అతన్-వ-మిన్- హాజన్-వలౌ-షాఅల్లాహు-ల-జఅలకుమ్ ఉమ్మతన్-వాహిదతన్-వలాకిల్-లియబ్-లువకుమ్ ఫీమా-ఆతాకుమ్-ఫస్-తబిఖుల్-ఖైరాతి-ఇలల్లాహి-మర్జిఉకుమ్-జమీఅ- అన్-ఫయునబ్బిఉకుమ్-బిమా-కున్తుమ్ ఫీహి-తఖ్తలిఫూన్. 49. వ- అనిహ్కుమ్ బైనహుమ్-బిమా-అన్-జలల్లాహు-వలా-తత్త-బిఅ-అహ్వాఅహుమ్-వహ్-జర్హుమ్-అన్-యఫ్తినూక-అమ్-బఅ్జి-మా అన్-జలల్లాహు-ఇలైక-ఫఇన్ - తవల్లౌ-ఫ-అలమ్-అన్నమా-యురీదుల్లాహు-అన్-యుసీబ-హుమ్-బి-బఅ్జి-జునూబిహిమ్-వ-ఇన్న కసీరమ్-మినన్నాసి-లఫాసిఖూన్. 50. అఫ-హుక్మల్-జాహిలియ్యతి-యబ్గూన-వమన్-అహ్సను-మినల్లాహి - హుక్మల్ - లి-ఖౌమిన్ యూఖినూన్.

48. మఱియు ఓ ప్రవక్తా! పూర్వగ్రంథములను సత్యపఱచుచు వాని సంరక్షించునట్టి సత్యమైన గ్రంథము నీకు పంపితిమి. కావున దేవుఁడు పంపిన దాని ప్రకారము వారిమధ్య తీర్మానము చేయుము. నీయొద్దకు వచ్చిన సన్మార్గమునువదలి వారియిష్టానుసారముగా నడచుకొనకుము. మేము మీలోనొక్కొక్క జాతికిని ఒక్కొక్క మతమును మార్గమును నియమించియున్నాము. మఱియు దేవుఁడు ఇష్టపడియుండినచో మిమ్మందఱిని ఒక మతస్థులనుగఁజేసియుండును. కాని మీకొసంగియున్న ధర్మములలో మిమ్ము పరీక్షించుటకుఁగాను (వేర్వేఱుగాఁ జేసియున్నాఁడు). కావునసత్కార్యములు చేయుటలో తొందరపడుఁడు. మీరందఱును దేవునియొద్దకు చేరవలసియున్నది. పిదపమీరు కలహించుచున్న విషయమునుగూర్చి దేవుడు మీకుఁ దెలుపును. 49. మఱియు దేవుఁడుపంపిన దాని ప్రకారము వారికి తీర్మానము చేయుము. వారి కోరికల ననుసరించి పోకుము. మఱియు దేవుఁడు నీకుఁ బంపిన యాజ్ఞనుండి వారు నిన్ను తప్పింపకుండ జాగ్రత్తగ నుండుము. పిదప వారు తిరస్కరించినచో వారు గావించిన కొన్ని పాపములకుఁగాను శిక్ష వారికి విధింపవలెననియు దేవుఁడు కోరియున్నాఁడు అని తెలిసికొనుము. మఱియు ప్రజలలో అనేకులు అవిధేయులుగా

నున్నారు. 50. వారేమి మరల అజ్ఞానకాలపు తీర్మానమునుకోరుచున్నారా? నమ్మకగలజనులకు దేవునికంటెబాగుగ తీర్మానముచేయువాఁడెవఁడుగలఁడు.

వ్యా॥ 48. దేవుఁడు హజ్రత్ ముహమ్మదువారికి సత్యమైన ఖురాను గ్రంథ మొసంగెను. ఇది తౌరాతు ఇన్జీలు మొదలగు దేవదత్తగ్రంథములునిజమైనవి అని పలుకుచున్నది. ఆ గ్రంథములలోని ధర్మములు విషయములు ఖురానుగ్రంథములోను గలవు. వానిని ఖురానె షరీఫు కాపాడుచున్నది. లేనిచో అవియన్నియును మఱుఁగుపడిపోయియుండును. యూదులలో నొక జగడము జరిగెను. అందు ఒకపక్షమువారి పెద్దపెద్ద విద్వాంసులు హజ్రత్ పైగంబరులవారియొద్దకు వచ్చి మీరు మాకు అనుకూలముగ తీర్మానముచేసిన మేమందఱము ఇస్లామ్‌లో చేరుదుము అని పలికిరి. దానికి హజ్రత్ రసూలువారు తిరస్కరించిరి. హజ్రత్‌వారు యూదుల కోరికలను అనుసరింపక దేవుఁడు పంపిన ధర్మములను అనుసరింపవలెను అని దేవుఁడు సెలవిచ్చెను. దేవుఁడు మానవులలో సంఘములకు వారికిఁ దగినఉపధర్మముల నియమించియున్నాఁడు. మతనులలో మూలధర్మములు ఒక్కటియైనను శాఖలలో కొన్ని వ్యత్యాసములు గలవు. అన్ని ధర్మములకు ముఖ్యమైన యుద్దేశము సత్కార్యములుచేసి దేవుని ప్రీతి పడసి మోక్షముపొందుటయే. దానికిఁగాను దేవుఁడు మానవులను పరీక్షించును. కావున మానవులు మత వ్యత్యాసములలో పడక సత్కార్యములు చేయుటలో చాల కృషి సలుపవలెను. మానవులు కలహించి అభిప్రాయభేదములుగల విషయములగూర్చి తుదిదినమునందు దేవుఁడు తీర్పుచేయును. అపుడు అందఱికిని వాస్తవము తేటతెల్లమగును, 49. ఏది యెట్లున్నను, ఓ ప్రవక్తా! నీవు మాత్రము దేవుఁడు పంపిన ధర్మములను అనుసరించి తీర్మానము చేయుచుండుము. ప్రజలు చెప్పుకొను మాటలను, వారికోరికలను, లెక్కపెట్టకుము. ఒకవేళ వారు ధర్మముల ననుసరింపక తిరస్కరించినచో నీవు చింతింపకుము. వారు దాని శిక్ష ఇహమునందును పరమునందును పొందుదురు లోకములో దేవునికి విధేయులగు భక్తులు కొద్దిమందియేయుందురు. ఎక్కుమంది అవిధేయులే యుందురు అని దేవుని సెలవయ్యెను. 50. దేవుఁడు విధించిన ధర్మములను ఆజ్ఞలను వదలి తమ మోటు కోరికలను అనుసరింపకోరువారు దేవునిని నిజముగ నమ్మినవారుకారు. దేవునియందు నమ్మికగలవారు దేవుని యాజ్ఞలను మనఃపూర్వకముగ శిరసావహింతురు. సర్వజ్ఞుఁడును పరమ దయాళువునగు దేవునికంటె ఎవరు మంచి ధర్మములను ఆజ్ఞలను విధింపఁగలరు? ఎవరును విధింపఁజాలరు. కావున దేవుని యాజ్ఞలను అనుసరింపవలెను.

51. యాఅయ్యుహ్-ల్లజీన ఆమనూ-లాతత్ - తఖిజుల్ -యహూద-వన్-

నసారా-ఔలియాఅ-బఅ-జుహుమ్-ఔలియాఉ-బఅ జన్-వమన్-యతవల్లహుమ్ మిన్కుమ్ ఫఇన్నహూ-మిన్హుమ్-ఇన్నల్లాహ-లాయహ్దిల్-ఖౌముజ్-జాలిమీన్. 52.ఫతరల్లజీన-ఫీ-ఖులూబిహిమ్-మరజున్-యుసారిఊన-ఫీహిమ్-యఖూలూన-నఖ్ షా-అన్-తుసీబనా-దాఇరతున్-ఫఅసల్లాహు-అన్-యాతియ బిల్-ఫత్ హి-ఔ-అమ్రిమ్-మిన్-ఇన్దిహీ-ఫయుస్బి-హూ-అలా-మా-అసర్రూ-ఫీఅన్-ఫుసిహిమ్-నాదిమీన్. 53. వయఖూ-లుల్లజీన-ఆమనూ-హా ఉలాఇల్లజీన - అఖ్సమూ-బిల్లాహి-జహ్దఐమానిహిమ్-ఇన్నహుమ్-లమఅకుమ్-హబితత్-అఅ-మాలుహుమ్ ఫఅస్-బహూ ఖాసిరీన్.

51. ఓముసల్మానులారా! యూదులను నస్రానీలను స్నేహితులుగంజేసికొనకుడు. వారు ఒకరికొకరు స్నేహితులు. మఱియు మీలో నెవడు వారితో స్నేహము చేయునో అతడు వారితో చేరినవాడగును. దేవుడు దుర్మార్గులకు సన్మార్గము చూపడు. 52. ఇక ఎవరి హృదయములలో (వంచన) రోగమున్నదో వారు వారి స్నేహముననై ప్రయత్నించుటను నీవుచూచెదవు. వారు మాపై ఆపదవచ్చునేమో అని మేముభయపడు చున్నారమనిపలుకుదురు. కావున సమీపమునందే దేవుడు జయమును లేక ఏదైన తనయాజ్ఞ నిచ్చును. అపుడు తమయాత్మలలో దాచు చున్న విషయమునుబట్టి వారు పశ్చాత్తాపపడుదురు. 53.మఱియు "మేముమీతో నున్నారమని దేవుని పేరుతో చాలప్రమాణములు చేసినవారుపీరేనా" అనిముసల్మానులు పలుకుదురు. వారికర్మలువ్యర్థాపోయెను కావున వారునష్టముపొందినవారైరి.

వ్యా॥51. ముసల్మానులకు విరోధులైన యూదులతోను నస్రానీలతోను స్నేహము చేయరాదు. వారు ఇస్లామ్‌ను నశింపజేయవలెనని కుట్రలు సలుపుదురు. అట్టివిరోధులతో సఖ్యముచేయుట వలన ముసల్మానులకు హానికలుగును. అట్లు ముసల్మానుల విరోధులతో చేరువారు వారితో కలిసిన వారగుదురు. ఇస్లామ్ ను నిరోధించుటలో యూదులును నస్రానీలు (క్రైస్తవులు) ఒకరికొకరుతోడు పడుదురు. అటులే ఇతర అవిశ్వాసులు చేయుదురు. వంచకులును వారి నాయకుడగు అబ్దుల్లాబిన్‌సలూలును యూదులతో స్నేహముచేయుచు ముసల్మానులకు అపజయము గలిగినచో తమకు యూదుల సహాయము లభించునని నిశ్చయించుకొనియుండిరి. ఇట్టి స్వభావముగలవారికి సన్మార్గము లభింపదు. 52. వంచకులు ఆపదవచ్చునేమో అని భీతిల్లి ఇస్లామ్‌నకు శత్రువులైనవారితో సఖ్యము వహించుటకు యత్నముచేయుచు వచ్చిరి. కాని మక్కా-పురమును

ముసల్మానులు జయించి అరేబియాదేశమంతయును వారికి వశమై యూదులు దేశభ్రష్టులైనపుడు వంచకులు తామెంచిన ఆశపోయెనే అని పశ్చాత్తాపము నొందవలసివచ్చెను. 53. వంచకుల కుట్ర ముసల్మానులకుఁ దెలిసి వారు వంచకుల విషయమున ఆశ్చర్యమొంది మాతో నున్నారమని బాసలు చేసిన వారు వీరేనా అని పలుకసాగిరి. వంచకుల వంచనవలన వారి కర్మలు వృథమై నరక శిక్షకుపాత్రులై నష్టముపొందినవారైరి.

54. యాఅయ్యుహ-ల్లజీన-ఆమనూ-మన్-యర్-తద్ద-మిన్‌కుమ్-అన్-దీనిహీ-ఫసౌఫ-యాతిల్లాహు-బిఖౌ మిన్ యు-హిబ్బుహుమ్-వయు-హిబ్బూనహూ-అజిల్లతిన్-అలల్-మూమినీన-అఇజ్-జతిన్-అలల్-కాఫిరీన-యుజాహిదూన-ఫీసబీ-లిల్లాహి-లాయఖాఫూన-లౌమత-లాఇమిన్-జాలిక-ఫజ్‌లుల్లాహి-యూతీహి-మన్-యషాఉ-వల్లాహు-వాసిఉన్-అలీమ్. 55. ఇన్నమా-వలియ్యు-కుముల్లాహు-వ-రసూలుహూ-వల్లజీన-ఆమనుల్లజీన-యుఖీమూనస్-సలాత-వయూతూనజ్-జకాత-వహుమ్-రాకిఊన్. 56. వమన్-యతవల్-లల్లాహ-వ-రసూలహూ-వల్లజీన-ఆమనూ-ఫఇన్న-హిజ్-బల్లాహి-హుముల్-గాలిబూన్.

54. ఓ విశ్వాసులార ! మీలో నెవఁడైన తన మతమునుండి మరలి పోవునో సమీపములోనే దేవుఁడు తనకు ప్రియులై తన్ను ప్రేమించునట్టి జనులను తీసికొనివచ్చును. వారు ముసల్మానులయెడ మృదుహృదయులును, అవిశ్వాసులయెడ కఠినులును, దేవునిమార్గమందు యుద్ధమాడువారును, మఱియు వారు నిందించువారి నిందలకు భయపడనివారగుదురు. ఇది దేవుని యనుగ్రహము. తాను కోరినవారి కొసంగును, మఱియు దేవుఁడు విశాలముగ నొసంగువాఁడును సర్వజ్ఞుఁడును. 55. దేవుఁడును, ఆతని ప్రవక్తయును, నమాజును స్థిరముగ సలుపువారును, విధిదానము (జకాతు) ఒసంగువారును, వినయము గలవారును అగు విశ్వాసులు మాత్రమే మీకు స్నేహితులు. 56. ఎవరు దేవునికిని, ఆతని ప్రవక్తకును, ముసల్మానులకును, స్నేహితులగుదురో, అట్టివారలగు దేవుని జనులే అందఱిపై జయముపొందువారు.

వ్యా॥ 54. ఇందు ఇస్లామ్‌మతసేవను, రక్షణనుగూర్చి భవిష్యత్ ప్రకటన గావింపఁబడుచున్నది. ఎవఁడైన ఇస్లామ్‌ను వదలి మతభ్రష్టుఁడైనచో ఇస్లామ్‌నకు నష్టముకాదు. మతభ్రష్టునిదే నష్టము అగును. అట్టివారికి బదులుగ దేవునికి ప్రియులై సర్వము వినియోగించుచు దేవుని మార్గమందు ధర్మ

యుద్ధములు సలుపువారును ఇస్లామ్‌మతసేవచేయుటలో విరోధులనిందలకు భీతి ల్లక భయభక్తులతోను తమ ముసల్మాను సహోదరులకు వినయులును మత విరోధులగు అవిశ్వాసుల విషయమున కఠినులునగునట్టి జనులను దేవుఁడు తీసి కొనివచ్చును. హజ్రత్ మహమ్మదు రసూలువారి పిదప కొందఱు స్థిరవిశ్వా సములేనివారు మతభ్రష్టులై ఇస్లామ్‌నకు విరోధముగ నిలిచిరి. అపుడు హజ్రత్ అబూబకరుగారు ఖలీఫాగా నుండిరి. వారు ఆ మతభ్రష్టులను మార్కొని వారి యుపద్రవములను అణఁచి అరేబియాదేశమంతటను శాంతము నెలకొల్పిరి. ప్రతి కాలమందును అనేకులు ఇస్లామ్‌నకు విరోధులైరి. కాని దేవుఁడు సెలవిచ్చి నట్లు ఇప్పటివఱకును, భయభక్తులతో ఇస్లామ్ మతసేవచేయు ముసల్మానుభక్తు లుండుచు వచ్చిరి. ఇఁకమీఁదను ఉండఁగలరు. ఇదంతయును దేవునిఅనుగ్రహ ము. తాను ఇష్టపడినవారికి మతసేవ భాగ్య మొసంగును. ఎవరు దానికి అర్హు లో వారిని దేవునికి బాగుగ తెలియును. 55. పూర్వపువాక్యములో యూదుల తోను నస్రానీలతో స్నేహము చేయరాదని దేవుని సెలవయ్యెను. ఇఁక ఈ వాక్యమందు ముసల్మానులు ఎవరితో స్నేహము చేయవలసినది చెప్పఁబడియె. వాస్తవములో దేవుఁడే ముసల్మానులకు సహాయుఁడు. కావున ముసల్మానులు ఆతని ప్రవక్తయందును ఆతని భక్తులగు ముసల్మానులందును స్నేహభావము ప్రేమయు నుంచవలెను. నిజమైన ముసల్మానులు అయిదుపూఁటలు నమాజు స్థిరముగా సలుపువారు ధనముండినచో నిఱుపేదలకుఁగాను జకాతు (దానము) చేయువారు. గర్వములేక వినయముగలవారు. 56. అవిశ్వాసులు మొదలగు వారు సంఖ్యలో ముసల్మానులకంటె చాల ఎక్కువగా నున్నారే వారిని వదలి ముసల్మానులతో చేరుట హానికరమే అని తలఁచువారి కిందు హెచ్చరికగలదు. ముసల్మానులు సంఖ్యలో కొలఁదిమందిగా నున్నను, ఏపక్షమున దేవుఁడును ఆతని ప్రవక్తయును నిజమైన ముసల్మానుభక్తులుందురో ఆ పక్షమే జయము పొందును. కావున ముసల్మానులు నిజమైన భక్తి వహించినచో వారిని ఏ శక్తి యును జయింపఁజాలదు. వారు 'హిజ్ బుల్లాహి' దేవుని జనులు అను బిరుదు పొందుదురు.

57. యా అయ్యుహల్లజీన-ఆమనూ-లాతత్-తఖిజుల్లజీ-నత్ - తఖజూ-దీనకుమ్-హుజు-వన్-వ-లఇబమ్-మినల్లజీన. ఊతుల్-కితాబ-మిన్ - ఖబ్లికుమ్-వల్-కుఫ్-ఫార-ఔలి-యాఅ-వత్-తఖుల్లాహ-ఇన్‌కున్తుమ్-మూమినీన్, 58. వ-ఇజా-నాదైతుము - ఇలస్-సలా-తిత్-తఖజూహా-హుజువన్-వలఇ-బన్ - జా

లిక-బి-అన్నహుమ్-ఖౌముల్-లా-యఅ-ఖిలూన్.

57. ఓ విశ్వాసులార! మీకు పూర్వము గ్రంథమొసంగఁబడినవారిలో నెవరు మీ మతమును ఎగతాళిగాను ఆఁటగాను జేసికొనిరో వారిని మఱియు అవిశ్వాసులను మీరు స్నేహితులుగఁ జేసికొనకుఁడు. మఱి మీరు విశ్వాసులైనచో దేవునికి భయపడుఁడు. 58. మఱియు మీరు నమాజునకు పిలుచునపుడు దానిని పరిహాసముగను ఆటగను వారు చేయుదురు. వారికి బుద్ధిలేనందువలన అట్లు చేయుదురు.

వ్యా॥ 57. యూదులును, నస్రానీలును, విగ్రహారాధకులును, ఇస్లామ్ మతమును నిందించుచు దానిగూర్చి పరిహాసమాడుదురు. అట్టి చెడు స్వభావముగలవారితో ఏ ముసల్మానుఁడైనను స్నేహభావముంచ నేరఁడు. కావున అట్టి పరిహాసకులతో స్నేహముచేయరాదు. అట్టి పరిహాసకులతో సఖ్యము చేయుట చాల పాపము. దేవుని శిక్షకు భయపడవలెను. ముసల్మానులకు విరోధముగ నుండు ఏ సంఘమువారితోను సఖ్యముచేయరాదు. 58. బుద్ధిహీనులు నమాజు పిలుపు (అజాను) విని పరిహాసమాడుదురు. ప్రార్థనకుఁగాను పిలుచుటలో పరిహసింపఁదగిన విషయములేదు. నమాజు పిలుపు (అజాను)లో దేవుని యేకత్వమును, హజ్రత్ ముహమ్మదువారి ప్రవక్తపదవినిగూర్చియును, నమాజుచేసినచో మోక్షము లభించును అను విషయములు గలవు. కావున బుద్ధిమంతులు ఎగతాళిచేయరు. మదీనాలో ఒక నస్రానీ అజాను వినునపుడెల్ల అబద్ధముపలుకువాఁడు కాలిపోవుగాత అని చెప్పుచుండును. దేవుని మహిమ చూడుఁడు. ఒక రాత్రి వాని యింటికి అగ్ని తగిలి వాఁడును వాని యింటిలో నున్నవారును కాలి భస్మమైపోయిరి. నరకాగ్నిలో కాలి పోవకముందే ఇహమునందే వాఁడు కాలిపోయెను.

59. ఖుల్-యాఅహ్లల్-కితాబి-హల్-తన్ఖిమూన-మిన్నా-ఇల్లా-అన్-ఆమన్నా-బిల్లాహి-వమా-ఉన్జిల-ఇలైనా-మిన్-ఖబ్లు-వఅన్న-అక్సరకుమ్-ఫాసిఖూన్. 60. ఖుల్-హల్-ఉనబ్బిఉకుమ్-బిషర్రిమ్-మిన్-జాలిక-మసూబతన్-ఇన్దల్లాహి-మల్-లఅన-హుల్లాహు-వగజిబ-అలైహి-వజఅల-మిన్-హుముల్-ఖిరదత-వల్-ఖనాజీర-వ-అబ-దత్-తాగూత-ఉలాఇక-షర్రున్ మకానన్-వ-అజల్లు-అన్-సవాఇస్-సబీల్. 61. వ-ఇజా-జాఉకుమ్-ఖాలూ-ఆమన్నా-వఖద్-దఖలూ-బిల్ కుఫ్రి-వ-హుమ్-ఖద్-ఖరజూ-బిహీ-వల్లాహు-అ'-

లము-బిమా-కానూ-యఖ్తమూన్.62. వతరా-కసీరమ్-మిన్-హుమ్-యుసారిఊన-ఫిల్ ఇస్మి-వల్-ఉద్వాని-వఅక్ లి-హిముస్-సుహ్త-లబీస-మా-కానూ-యఅ-మలూన్. 63. లౌలా-యన్-హాహుముర్-రబ్బానియ్యూన-వల్-అహ్బారు-అన్ ఖౌలి-హిముల్-ఇస్మ-వఅక్-లి-హిముస్-సుహ్త-లబీస-మా-కానూ-యస్నఊన్.

59. ఓ గ్రంథముగలవారలార! మేము దేవునిని మఱియు మాకుపంపఁబడినదానిని మఱియు మాకు పూర్వము పంపఁబడినదానిని విశ్వసించితిమని మీరు మమ్ము నిందించుచున్నారా! మఱియు మీలో పెక్కుమంది అవిధేయులుగా నున్నారు అని ఓ ప్రవక్తా! పలుకుము. 60. వీరిలో దేవుని యొద్దఎవరికి చెడుఫలిత మున్నదో మీకుఁ దెలుపుదునా అని ఓ ప్రవక్తా! పలుకుము. దేవుఁడు ఎవరిని శపించి కోపించి కొందఱిని కోఁతులుగను పందులుగను జేసివేసెనోవారును. సైతానును ఆరాధించినట్టివారును. ఇట్టివారు చాలహీన(నీచ)స్థానముగలవారును, సన్మార్గము నుండి తప్పిపోయినవారు. 61. మఱియు మీ యొద్దకు వారు వచ్చునపుడు మేము విశ్వసించితిమని పలుకుదురు. కాని వారు అవిశ్వాసులుగనే మరలిరి. మఱియు వారు దాఁచిపెట్టినది దేవునికి బాగుగఁదెలియును. 62. మఱియు వారిలో పెక్కురు పాపమునకును దౌర్జన్యము (అక్రమము) నకును నిషిద్ధ (హరాము) మైనదానిని తినుటకును పరుగెత్తుటను నీవు చూచెదవు. వారు చేయు కర్మలు చాల చెడ్డవి. 63. ఎందులకు గురువులును, విద్వాంసులును వారి పాపపు మాటలను నిషిద్ధమైనదాని తినుటనునిషేధింపరు! వారు చేయు కర్మలు చాల చెడ్డవి.

వ్యా॥ 59. యూదులు నిష్కారణముగ ముసల్మానులను నిందించుచువారితో పరిహాసమాడుదురు. దానికిఁగాను ఈవాక్యమందు, ముసల్మానుల విషయము చెప్పఁబడుచున్నది. దేవునివిశ్వసించి, దేవుని గ్రంథములగు ఖురానును తౌరాతును ఇన్జీలును విశ్వసించి ధర్మమార్గమునపోవువారిని గేలిచేయుట ఎట్లువివేకమగును. కాని యూదులలో పెక్కుమంది అవిధేయులుగలరు. వారిస్వభావమే అవిధేయతగ్గానది. 60. పరిహసింపఁదగిన వారు దేవునికి అవిధేయులై సైతాను మొదలగు విగ్రహములను పూజించి దేవుని కోపమునకు పాత్రులై-నీచమైన స్థితిని పొంది కోఁతులుగను పందులుగను మారిపోయినారు. ఈ విషయములు యూదులకు సంభవించినవి. ఈ విషయములు సూరయే బఖరాలో చూచుకొనునది. 61. కొందఱు యూదులును నస్రానీలును వంచనవహించినవారు ముసల్మానుల యొద్దకు వచ్చునపుడు మేముకూడ ముసల్మానులము అని పలికి

ముసల్మానులను మోసపుచ్చుటకు యత్నింతురు. కాని వారు వచ్చి మరలి పోవునపుడు నోటిమాటలవలన వారికి విశ్వాసము లభింపలేదు. వారు అవిశ్వాసులుగానే యున్నారు. వారు తమ హృదయములలో దాఁచునట్టి అవిశ్వాసమును వంచనయును దేవునికి బాగుగాఁ దెలియును. దానికి దేవుఁడు శిక్ష విధించును. 62. వారు (యూదులు నస్రానీలు) పాపకార్యములకు జంకరు. అక్రమమునకు దౌర్జన్యమునకు వెనుదీయరు. లంచములు మొదలగు నిషిద్ధమైన సొత్తులను దినివేయుదురు ఇట్టి దుర్గుణములు వారిలో సామాన్యజనులవి. ఇఁక రాఁబోవు వాక్యములో, వారి పెద్దల దుర్గుణములు వివరింపఁబడుచున్నవి, 63. ఒక సంఘము (జాతి) నశించుటకు కారణము ఆ సంఘములోని పెద్దలగు గురువులు (భక్తులు, దుర్వేషులు) ను మత విద్వాంసులును జనులు చేయు పాపకార్యములను నిషేధింపక తమ ఇహలోకభోగములకు లోనై పోవుట. కావున గురువు (దుర్వేషు) లు విద్వాంసులు ఏలాటి భయములేకుండ ధర్మమార్గమును తమ మతస్థులకు బోధింపవలెను. లేనిచో సంఘము చెడి అధమగతికి పాలగును. ముసల్మాను గురువు (దుర్వేషు) లును విద్వాంసులును తమ తమ యుద్యమము నెరవేర్తురు గాక.

64. వఖాలతిల్-యహూదు-యదుల్లాహి-మగ్‌లూలతున్ - గుల్లత్ ఐదీహిమ్-వలుఇనూ-బిమా-ఖాలూ-బల్-యదాహు-మబ్-సూతతాని- యున్-ఫిఖు-కైఫ-యషాఉ-వలయజీదన్న-కసీరమ్-మిన్-హుమ్-మా-ఉన్‌జిల- ఇలైక మిర్-రబ్బిక-తుగ్-యానన్-వ-కుఫ్రన్-వఅల్-ఖైనా-బైనహు-ముల్-అదావత వల్-బగ్-జాల-ఇలా-యామిల్-ఖియామతి-కుల్లమా-ఔఖదూ-నారల్- లిల్ హారబి-అత్-ఫ-అ-హల్లాహు-వ-యస్ఔన-ఫిల్-అర్‌జి-ఫ-సాదన్-వల్లాహు-లా యుహిబ్బుల్-ముఫ్-సిదీన్. 65. వ-లౌ-అన్న-అహ్లల్-కితాబి-ఆమనూ-వత్తఖౌ-లకఫ్ ఫర్నా-అన్-హుమ్-సయ్యి-ఆతిహిమ్-వల - అద్ ఖల్నాహుమ్- జన్నాతిన్-నఈమ్. 66. వలౌ-అన్నహుమ్-అఖాముత్-తౌరాత-వల్ - ఇన్‌జీల-వ-మా.ఉన్‌జిల-ఇలైహిమ్-మిర్-రబ్బిహిమ్-ల-అకలూ-మిన్ - ఫౌఖిహిమ్ - వమిన్-తహ్‌తి-అర్‌జులిహిమ్-మిన్‌హుమ్-ఉమ్మతుమ్-ముఖ్‌తసిదతున్ - వకసీరుమ్-మిన్-హుమ్-సాఅ-మా-యఅ-మలూన.

64. మఱియు యూదులు దేవుని చేతులు కట్టువడినవి అని పలుకు

చున్నారు. వారి చేతులే కట్టువడుగాక. వారు పలికినదానికి వారికి శాపమున్న ది. దేవుని చేతులు విచ్చలవిడి గానున్నవి. తాను కోరినట్లు వినియోగపఱుచు చున్నాఁడు మఱియు నీ ప్రభువునుండి నీకొసంగఁబడినదానివలన వారిలో పెక్కుమందికి అవిధేయతయును తిరస్కారమును మఱి హెచ్చుగా నగును. మఱియు వారిమధ్య విరోధమును వైరమును తుదిదినమువఱకుండునట్లు మేము చేసితిమి. వారు యుద్ధమునకై అగ్ని రగుల్చునప్పుడెల్ల దానిని దేవుఁడు చల్లార్చుచున్నాఁడు. మఱియు వారు దేశములో ఉపద్రవములు కల్పించుచు పరుగిడుచున్నారు. దేవుఁడు ఉపద్రవము (ఫసాదు)లు చేయువారిని ప్రేమింపఁడు. 65. మఱియు గ్రంథముగలవారు విశ్వసించి భయభక్తులు వహించి యుండిరేని వారినుండి వారి పాపములను తొలఁగించి వారిని సౌఖ్యములుగల స్వర్గవనములలోనికి ప్రవేశింపఁజేసి యుందుము. 66. మఱియు వారు తౌరాతును ఇన్జీలును, దేవుఁడు వారికి పంపినదానిని స్థిరముగ ననుసరించియుండిరేని వారు పైనుండియు క్రిందనుండియు (ఆహారములు) తినియుందురు. వారిలో కొందఱు సన్మార్గమందున్నారు. మఱియు వారిలోని అనేకులు పాప కార్యములు చేయువారు కలరు. (వారిలో ననేకులు చేయునది పాపకార్యమే).

వ్యా॥ 64. యూదులు తమ అక్రమముల వలనను పాపకార్యముల వలనను చెడు స్వభావము గలవారై మంచి చెబ్బరలు తోఁచక దేవుని విషయమున పలుకరాని మాటలు పలుక సాగిరి. వారి పాపములకు ఫలితముగ దారిద్ర్యమును నీచత్వము గలిగి రాజ్యముపోయి అనేక కష్టములకు పాలగుచు ఇది తమ పాపముల ఫలితమని తెలిసికొనక దేవుఁడు బీదవాఁడు లేక లోభియైనాఁడు అని పలుక సాగిరి. ఖర్చుచేయక చేతులు కట్టుకొనెను అనుదానికి భావము బీదతనము లేక లోభితనము దేవునికి మానవులవంటి అవయవములు లేవు. కావున దేవుని చేతులు మానవుల చేతుల వలె నూహింపరాదు. యూదుల చేతులు కట్టువడుగాక అని దేవుని శాపము వలన వారు అన్ని విధములుగ అధోగతికి పాలైరి. యూదులు పలుకునట్లు దేవునిచేతులు కట్టువడలేదు. ఆతఁడు తాను కోరినట్లు తన భక్తుల కొసంగును. ఎవరు దేవుని యనుగ్రహమునకు అర్హులో వారి కొసంగును కావున దేవుఁడు హజ్రత్ మహమ్మదు వారిని వారి ననుసరించిన వారిని అనుగ్రహించెను. దుష్ట స్వభావముగల యూదులు ఖురాను గ్రంథములోని సమాధానములను విని యందలి ధర్మములను అనుసరింపరు. కాని తమ యందుగల దుష్ట స్వభావముచే ఇంకను హెచ్చుగా దుర్మార్గములు చేయుటకు పూనుకొనుదురు. ఎట్లు మంచి యాహారము వలన రోగికి రోగము హెచ్చినచో ఆహార లోపము కాదో అట్లు ఖురాను వలన యూదుల దుర్మార్గము హెచ్చిన దానిలోపము కాదు. వారి దుష్ట

స్వభావమే దానికి కారణము. యూదులునునస్రానీలునుముసల్మానులకువిరోధముగ కుట్రలు సలిపి యుద్ధాగ్నిని రగుల్చుటకు యత్నించిరి. కాని వారి కుట్రలు దేవుని మహిమ వలన సాగలేదు. తుదకు విరోధులే లొంగిపోయిరి. ముసల్మానులకు అఖండ విజయము చేకూరెను. ముసల్మానుల విరోధులకు పరస్పరము ద్వేషము వైరము గలిగెను కావున ముసల్మానులందఱును హజ్రత్ పైగంబరులవారి శిష్యులవలె సోదర భావము గలిగి ఐక్య మతము వహించి యుండినంతవఱకు విరోధులగు యూదుల నసారీల కుట్రలు సాగవు. లోకములో శాంతము నెలకొలుపుట ఇస్లామ్ మతములోని ముఖ్య ధర్మము. ఉపద్రవములు చేసి శాంతికిభంగము కల్పించువారిని దేవుఁడు ప్రేమింపఁడు. కావునముసల్మానులు ఇస్లామ్ ననుసరించి లోకములో శాంతము నెలకొలుపుటకు కృషిసలుపుదురుగాక. 65. తౌరాతును ఇన్జీలును స్థిరముగా అనుసరింపవలెనన్న దేవుఁడు పంపిన గ్రంథమగు ఖురానె షరీఫును తప్పక అనుసరింపవలెను. దానిలోని ధర్మములను అమలులోనికి తేవలెను. దీనివలన విశ్వాసము భయభక్తులు కుదిరినచో పాపము హరించి సర్వసౌఖ్యములుగల స్వర్గ నివాసము లభించును, ఇహలోకమునందును దారిద్ర్యము హీనదశ తొలగి, ఆకాశమునుండియు భూమినుండియు, గొప్ప సంపదలు లభించి సురక్షితముగా భుజింపఁ గలరు. యూదులలో అబ్దుల్లాబిన్ సలాము మొదలగు వారివంటివారు కొందఱు సన్మార్గము (ఇస్లామ్) నవలంబించువారు గలరు. కాని పెక్కుమంది దుర్మార్గులే గలరు. వారుచేయు కర్మములు పాపములతో కూడుకొన్నవి.

67. యాఅయ్యుహర్-రసూలు-బల్లిగ్-మాఉన్‌జిల-ఇలైక-మిర్- రబ్బిక-వఇల్-లమ్-తఫ్‌అల్-ఫమా-బల్లగతరిసాలతహూ-వల్లాహు-యఅ-సిముక-మినన్నాసి-ఇన్నల్లాహ-లాయహ్దిల్-ఖౌమల్-కాఫిరీన్.

67. ఓప్రవక్తా! నీప్రభువునుండి నీకు పంపఁబడిన దాని అందఁజేయుము మఱినీవట్లు చేయనిచో దేవుని సందేశమును అందఁజేయని వాఁడవగుదువు. మఱియు దేవుడు ప్రజలనుండి నిన్ను రక్షించును. నిశ్చయముగా దేవుఁడు అవిశ్వాసులైన జనులకు సన్మార్గము చూపఁడు.

వ్యా॥ 67. పూర్వ వాక్యములలో యూదుల విషయము చెప్పి ఇఁక ఇస్లామ్ మతప్రచారములో ఏలాటి కొఱత చేయకూడదనియు దేవుని యొద్దనుండి వచ్చు సర్వ ధర్మములను ప్రచారము చేసి వానిని ప్రజలకు అందఁజేయవలెను. ఒకవేళ ఒక ధర్మమును అందఁజేయక (ప్రచారము చేయక) వదలి పెట్టినచో బొత్తిగనే దేవుని సందేశము అందఁజేయలేదు అను మాటవచ్చును.

అని నొక్కి దేవుఁడు పైగంబరుల వారితో పలుకుచున్నాఁడు. దేవుని సెలవు ననుసరించి హాజ్రత్ రసూలువారు, 23. సం॥ వఱకు ఇస్లామ్ మత ప్రచారము చేసిరి. అందు ఏలాటి కొఱత చేయలేదు, విరోధులు ఎన్నియో హింసలు గావించిరి. కాని హజ్రత్ రసూలువారు లెక్కచేయలేదు. అందుకు దేవుఁడు నిన్ను ప్రజల కుట్రనుండి రక్షించెదనని సెలవిచ్చెను. అటులే దేవుఁడు అనేక సమయములలో పైగంబరుల వారిని కాపాడెను. పెక్కుమందిప్రాణశత్రువులుండియు రసూలువారు వధింపఁబడను లేదు. మఱియువారు పట్టువడనులేదు. కొందఱు అవిశ్వాసులు విశ్వసింపలేదు అని ఓప్రవక్త చింతపడవలదు. మీ యుద్యమము ప్రచారము చేయుట. సన్మార్గమును ప్రజలు నవలంబించునట్లు చేయుట దేవుని పని. తమ దుష్టస్వభావమును బట్టి చెడిన వారినెవరైన ఏమి చేయఁగలరు. మత ప్రచారములో పట్టుదల, ఉత్సాహము, గలిగి విరోధుల నిందలకు జంకక స్థిరముగ నుండవలెను.

68. ఖుల్-యాఅహ్లల్-కితాబి-లస్తుమ్-అలా-షైఇన్-హత్తా-తుఖీముత్ తౌరాత-వల్-ఇన్జీల-వమాఉన్జిల-ఇలైకుమ్-మిర్రబ్బికుమ్- వలయజీదన్న-కసీరమ్-మిన్-హుమ్-మాఉన్జిల ఇలైక-మిర్రబ్బిక-తుగ్యాన్-వకుఫ్రన్-ఫలా తాస-అలల్-ఖౌమిల్-కాఫిరీన్. 69. ఇన్నల్లజీన-ఆమనూవల్లజీన-హాదూ-వస్-సాబిఊన-వన్-నసారా మన్-ఆమన-బిల్లాహి-వల్-యౌమిల్-ఆఖిరి-వఅమిల సాలిహన్-ఫలా-ఖౌఫున్-అలైహిమ్-వలాహుమ్-యహ్జనూన్.

68. ఓ గ్రంథముగలవారలార! మీరు తౌరాతును ఇన్జీలును మఱియు మీప్రభువునుండి మీకు పంపఁబడిన దానిని మీరు స్థిరముగ ననుసరింప నంతవఱకు మీరు ఏమతమార్గమందును లేనివారగుదురు అని ఓప్రవక్తా! పలుకుము. మఱియు నీప్రభువునుండి నీకొసంగఁబడిన దాని వలన వారిలో పెక్కుమందికి అవిధేయతయును తిరస్కారమును మఱి హెచ్చుగా నగును. కావున అవిశ్వాసులైన జనుల విషయము నీవు చింత చేయకుము. 69. నిశ్చయముగ ముసల్మానులైన వారును, యూదులైనవారును, సాబియీనులును, నసారీలును, ఎవరైననుసరే దేవునిని తుదిదినమును విశ్వసించి సత్కార్యములు చేసిరేని వారికెట్టి భయమునుగాని దుఃఖముగాని యుండనేరదు.

వ్యా॥ 68. తౌరాతును ఇన్జీలును, ఖురానె షరీఫును అనుసరింప నంత వఱకు ఎవరును నిజమైనభక్తులుకానేరరు. కావున యూదులును క్రైస్తవులును ఖురాను గ్రంథమును విశ్వసించి దాని ననుసరించియే తీరవలెను. వారు తమ

ద్వేషముచే విశ్వసింపనిచో వారు విశ్వసింప లేదే అని చింత పైగంబరులవారికి నుండరాదు అని దేవుని సెలవయ్యెను. 69. వట్టి మాటలతో మోక్షము లభింపదు. ఎవరైనను సరే దేవునిని యాతని ప్రవక్తలందఱిని దేవుడు పంపిన సర్వ గ్రంథములను కర్మల తీర్పుకొఱకు రానున్న తీర్పు దినమును నమ్మి సత్కార్యములు చేసిన వారికి ముక్తి లభించును. వారికి ఏలాటి నరకము వలని భయముగాని దుఃఖముగానీ యుండదు. ఎవరైన దేవుడు పంపిన నిజమైన ఒక్క ప్రవక్తను తిరస్కరించినను విశ్వాసము చెడి అవిశ్వాసులకు లభించు నరక బాధ వారికి లభించును. సాబియీనులు నక్షత్రములను పూజించువారు. కావున హజ్రత్ ముహమ్మదు వారిని నమ్మని వారగు యూదులును నసారీలు (క్రైస్తవు) లును మొదలగువారు తమ మోక్షమునకై కృషి సలుపవలెను.

70. లఖద్-అఖజ్నా-మీసాఖ-బనీ-ఇస్రాఈల-వఅర్సల్నా-ఇలైహిమ్-రుసులన్-కుల్లమా-జాఅహుమ్-రసూలుమ్-బిమా-లాతహ్వా-అన్ఫుసుహుమ్-ఫరీఖన్-కజ్జబూ-వఫరీఖన్-యఖ్తులూన్. 71. వహసిబూ అల్లా తకూన-ఫిత్నతున్-ఫఅమూ-వసమ్మూ-సుమ్మతాబల్లాహు అలైహిమ్-సుమ్మ అమూ-వసమ్మూ-కసీరుమ్-మిన్హుమ్-వల్లాహు-బసీరుమ్-బిమా-యఅ-మలూన్.

70. ఇస్రాయీలు సంతతి వారితో మేము నిబంధనను పుచ్చుకొంటిమి. మఱియు వారియొద్దకు ప్రవక్తలను పంపితిమి. వారికిష్టము లేని విషయములను ప్రవక్తలు వారియొద్దకు దెచ్చినపుడెల్ల వారు కొందఱిని తిరస్కరించిరి. మఱి కొందఱిని చంపిరి. మఱియు వారు తమకు ఏలాటి శిక్షగలుగదని తలంచిరి. కావున వారు అంధులైరి. మఱి చెవిటివారైపోయిరి. ఆ పిదప దేవుడు వారి క్షమాపణను అంగీకరించెను. మరల వారిలో పెక్కురు అంధులును చెవిటివారును అయిపోయిరి. మఱియు వారు చేయు కర్మలను దేవుడుచూచుచునేయున్నాడు.

వ్యా॥ 70. పై వాక్యములలో మోక్షమునకు మార్గము సూచింపబడియెను. దాని ననుసరించి ఇస్రాయీలీయులను చరణము (అసలు)నుచూడవలెను. దేవుడు ప్రవక్తల మూలమున ఇస్రాయీలియులతో మేము దేవునికి విధేయులై ధర్మములను అనుసరింతుమని నిబంధన తీసికొనియుండెను. వారియొద్దకు అనేక ప్రవక్తలు వచ్చిరి. ఇస్రాయీలియులు తమకు ఇష్టములేని ధర్మములను ప్రవక్తలు బోధించినచో దానిని వినక తిరస్కరించి ప్రవక్తలలో కొందఱిని తిరస్కరించి మఱికొందఱిని చంపిరి. అట్లు అక్రమములు చేసియు పరలోకములో శిక్షయు ఇహలోకములో దాని చెడుఫలితమును లభింపదని తలంచి భ్రమపడిరి. మఱి దేవునివాక్యములను చూడక వినక అంధులును చెవిటివారును

రుసు అయిపోయిరి. యూదులు గావించిన దుష్టత్వమునకు ఫలితముగ బక్తె నసరు అనురాజు వారిని జయించి వారిని బానిసలుగఁ జేసిపెట్టెను. కొన్ని యేండ్లకు తరువాత కొందఱు పారసీక రాజుల యత్నమువలన యూదులు తమ హీనదశ నుండి ముక్తి పొంది జెరూసులేము (బైతుల్ ముఖద్దస్) వచ్చి చేరిరి. అపుడు వారు తమ పాపములనుండి క్షమాపణకోరగా దేవుఁడు క్షమించెను. కాని మరలవారు తమ పూర్వపు దుష్టత్వమును చేయుచు జక్రియా, యహ్యా ప్రవక్తలను చంపిరి. ఏసుక్రీస్తును దూషించి చంప యత్నించిరి. వారి కర్మలను దేవుఁడు చూచుచునే యున్నాఁడు. వారికిఁ దగిన ఫలిత మొసంగును. కావున వారు ముసల్మానులకు లొంగి తమ పాపములను అనుభవించుచున్నారు.

72. లఖద్-కఫరల్లజీన-ఖాలూ-ఇన్నల్లాహ-హువల్-మసీహుబ్ను-మర్య్మ-వఖాలల్-మసీహు-యాబనీ-ఇస్రాయీలఅ-బుదుల్లాహ-రబ్బీ-వరబ్బకుమ్-ఇన్నహూ-మన్-యుష్రిక్-బిల్లాహి-ఫఖద్-హర్రమల్లాహు-అలైహిల్-జన్నత-వమావాహున్నారు-వమా-లిజ్జాలిమీన-మిన్-అన్సార్. 73. లఖద్-కఫరల్లజీన-ఖాలూ-ఇన్నల్లాహ-సాలిసు-సలాసతిన్-వమామిన్-ఇలాహిన్-ఇల్లా-ఇలాహున్-వాహిదున్-వఇల్-లమ్-యన్తహూ-అమ్మా-యఖూలూన-లయమస్-సన్నల్లజీన-కఫరూ-మిన్-హుమ్-అజాబున్-అలీమ్. 74. అఫలా-యతూబూన-ఇలల్లాహి-వయస్-తగ్-ఫిరూనహూ-వల్లాహు-గఫూరుర్-రహీమ్. 65. మల్-మసీహుబ్ను-మర్యమ-ఇల్లా-రసూలున్-ఖద్-ఖలత్-మిన్-ఖబ్-లి-హిర్-రుసులు-వఉమ్మహూ-సిద్దీఖతున్-కానా-యాకులాని-త్-తఆమ-ఉన్జుర్-కైఫ-నుబయ్యిను-లహుముల్-ఆయాతి-సుమ్మన్-జుర్-అన్నాయుఫకూన్. 76. ఖుల్-అతఅ-బుదూన-మిన్-దూనిల్లాహి-మాలా-యమ్లికు-లకుమ్-జర్రన్-వలా-నఫ్-అన్-వల్లాహు-హువస్-సమీఉల్-అలీమ్. 77. ఖుల్-యా-అహ్లల్-కితాబి-లా-తగ్లూ-ఫీదీనికుమ్-గైరల్-హఖ్ఖి-వలా-తత్-తబిఊ-అహ్వాఅ-ఖౌమిన్-ఖద్-జల్లూ-మిన్-ఖబ్లు-వఅజల్లూ-కసీరన్-వజల్లూ-అన్-సవాఇస్-సబీల్.

72. మర్యము కుమారుఁడగు ఏసే దేవుఁడని పలికినవారు నిశ్చయముగ అవిశ్వాసులైరి. మఱియు ఓ యిస్రాయీలియులారా! నా ప్రభువును మీ ప్రభు

వునునగు దేవునిని పూజింపుఁడు. ఎవఁడు దేవునికిసాటి కల్పించునో అట్టివానికి దేవుఁడు స్వర్గము నిషేధించెను. మఱి వాని నివాసము నరకము. మఱియు పాపులకు సహాయముచేయువాఁడెవఁడును లేఁడు అని ఏసుక్రీస్తు పలికియుండెను. 73. ముగ్గురిలో దేవుఁడు మూఁడవవాఁడు అని పలికినవారు నిశ్చయముగా అవిశ్వాసులైరి వాస్తవములో దేవుఁడు ఒక్కఁడేను. మఱి వారు తమ పలుకులను మానుకొననిచో వారిలో అవిశ్వాసమందున్నవారికి బాధాకరమైన శిక్షగలదు. ఎందులకు వారు దేవునివంక తిరిగి తమ పాపములకు క్షమాపణ కోరరు ? మఱి దేవుఁడు క్షమించువాఁడును, దయగలవాఁడును. 75. మర్యము పుత్రుఁడగు ఏసు ఒక ప్రవక్త మాత్రమేను. ఆతనికి పూర్వము అనేకులు ప్రవక్తలు గడచిపోయిరి. మఱియు ఆతని తల్లి భక్తురాలు (వలీ) వారిద్దఱును అన్నము తినుచుండినవారేను. చూడుము మేము వారి కెట్లు సూచనలు దెలుపుచున్నారమో మరల వారెట్లు వెనుకకుఁ దిరిగిపోవుచున్నారో చూడుము. 76. ఏమి మీరు దేవునివదలిపెట్టి మీకు కీడుగాని మేలుగాని చేయలేనట్టిదానిని పూజించుచున్నారా అని ఓ ప్రవక్తా ! పలుకుము. మఱియు సర్వము వినుచు సర్వము నెఱుంగునట్టివాఁడే దేవుఁడు. ఓ గ్రంథముగలవారలార ! అధర్మముగా మీరు మీమత విషయములలో అతిశయించిపోకుఁడు. పూర్వము ఎవరు సన్మార్గము తప్పిపోయి అనేకులను సన్మార్గమునుండి తప్పించిరో అట్టి దుర్మార్గుల కోరికలను మీరు అనుసరించి పోకుఁడు అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 72. ఇఁక నస్రానీ (క్రైస్తవుల) విశ్వాసమునుగూర్చి చెప్పఁబడుచున్నది. క్రైస్తవులు ప్రవక్తయగు ఏసుక్రీస్తును దేవుఁడు అని పలుకసాగిరి. అట్లు పలుకుట విశ్వాసమునకు విరుద్ధము. ఏసుక్రీస్తు ప్రవక్త మానవుఁడు దేవుని ప్రవక్త మాత్రమే. దేవుఁడు ఒక్కఁడే. ఆతఁడు నా ప్రభువును మీ ప్రభువును. ఆతనినే పూజింపవలెను. ఆతనికి సాటి కల్పించువారికి స్వర్గము లభింపదు. వారికి నరకనివాసమే లభించును. అట్టి పాపులకు ఏ గురువును, ప్రవక్తయును తోడు పడఁజాలఁడు. వారిని నరకమునుండి తప్పింపఁజాలఁడు. దేవునికి సాటి కల్పించుట (షిర్క్) చాల ఘోరమైన పాపము. దాని ఫలితము నరకనివాసమే అని ఏసుక్రీస్తు పలికెను. 73. క్రైస్తవులు మర్యము, ఏసుక్రీస్తు, దేవుఁడు చేరి ముగ్గురు దేవుళ్ళు. అందు దేవుఁడుకూడ ఆ ముగ్గురిలో చేరిన మూఁడవవాఁడు అని పలుకుచు త్రిమూర్తిత్వమును విశ్వసింతురు. ఇట్లుపలికి విశ్వసించుట అవిశ్వాసమే. దేవుని యేకత్వమును తిరస్కరించునట్లగును. దేవుఁడు ఒక్కఁడే. ఆతఁడుదప్ప వేఱు దైవము లేఁడు. ఒకటి మూఁడు, మూఁడు ఒకటి అని వాదించుట విరుద్ధమైన విషయముగదా ! ఇట్టి తప్పు విశ్వాసములను వారు మానుకొననిచో

పరమునందు నరకబాధలకు పాలగుదురుఅని హెచ్చరింపఁబడియెను. 74. తప్పు విశ్వాసమును మానుకొని నిజమైన భక్తితో దేవునితో క్షమాపణ కోరినచో దేవుఁడు క్షమించి యనుగ్రహించును. వారట్లు ఎందులకుచేయరు? అట్లుచేయుట వారికి మంచిది అని యిందు ప్రోత్సాహముగలదు. 75. ఏసుక్రీస్తునకు పూర్వము అనేకులు పవిత్రులు గడచియున్నారు. వారందఱును దేవుఁడు ఒక్కఁడే అని ప్రకటించిరి. అటులే ఏసుక్రీస్తుకూడ దేవునికి భక్తుఁడైన ఒక్క ప్రవక్త. పూర్వపు పవిత్రులకంటె ఆయన మించిపోలేదు. కావున క్రీస్తు దేవుఁడని విశ్వసించుట సరికాదు. ఆతని తల్లి బీబీ మర్యము దేవునిని విశ్వసించిన భక్తురాలు (వలీ). తల్లి కుమారులిద్దఱును, సాధారణ మానవులవలె అన్నము తినుచుండినవారు. ఆఁకలిదప్పులకు లోనైన మానవులు దేవుఁడెట్లు కాఁగలరు? అది యసంభవము. కావున మానవులను దేవునిగా భావింపరాదు. సర్వము దేవునికి లోనైయున్నది. ఆతనికి మించినది యెద్దియునులేదు. దేవుఁడు బోధించు స్పష్టమైన విషయములను వినియు సన్మార్గము తప్పి తప్పుత్రోవనుపోవుట మానవుల దురదృష్టముగదా! 76. లాభనష్టములు, కీడుమేళ్లుచేయలేని శక్తిహీనులను ఆరాధించుట మానవులకుఁ దగదు. సర్వమును విని, సమస్తమును దెలిసికొనునట్టి లాభనష్టములు కల్గించునట్టి సర్వశక్తిగలిగినవాఁడే దేవుఁడగును. కాని శక్తిహీనులు, అక్కఱగలవారు దేవుళ్ళు కానేరరు. 77. మత విషయములలో అతిశయించిపోఁగూడదు. హద్దులలోనే యుండవలెను. తమయిష్టానుసారముగ ధర్మములలో హెచ్చుతగ్గులు చేయరాదు. క్రైస్తవులు,ఏసుక్రీస్తును గౌరవించి ప్రవక్తపదవినుండి తీసికొనిపోయి దేవునిగానే భావింపసాగిరి. ధర్మముగా అనుభవింపవచ్చును అను వస్తువులను వదలి వైరాగ్యముకూడ వహింపసాగిరి. గ్రంథము (ఇన్జీలు) లో గల ధర్మములను అనుసరింపవలెను. దారితప్పిపోయి దుర్బోధన చేయునట్టి దుర్మార్గుల మాటలను అనుసరింపఁగూడదు. అసలు బైబిలులో దేవునికి సాటి కల్పింపవచ్చును అని లేకుండెను. విగ్రహారాధకులను చూచి పోలూసు, ఆతప్పు విశ్వాసము కల్పించెను. ఆపిదప అందఱు దాని ననుసరింపసాగిరి.

78. లుఇన-ల్లజీన-కఫరూ-మిమ్-బనీ-ఇస్రాయీల-అలా-లిసాని-దావూద వ-ఈసబ్ని-మర్యమ-జాలిక-బిమా-అసౌ-వకానూ-యఅ-తదూన్. 79. కానూ-లాయతనా-హౌన-అమ్-మున్కరిన్-ఫ-అలూహు-లబీస-మాకానూ-యఫ్ - అలూన్. 80. తరా-కసీరమ్-మిన్-హుమ్-యతవల్లౌ-న్నల్లజీన-కఫరూ-లబీస-మాఖద్దమత్-లహుమ్-అన్-ఫుసుహుమ్-అన్-సఖితల్లాహు-అలైహిమ్-వఫిల్-అజాబి-

హుమ్-ఖాలిదూన్. 81. వలౌ-కానూ-యూమినూన-బిల్లాహి-వన్-నబియ్యి-వమా-ఉన్-జిల-ఇలైహి-మత్-తఖజూ-హుమ్-ఔ-లియాఅ-వలాకిన్న-కసీరమ్-మిన్-హుమ్-ఫాసిఖూన్.

78. ఇస్రాయీలియులలో అవిశ్వాసులైనట్టివారు దావూదు మఱియు మర్యము పుత్రుడగు ఏసుమూలమున శపింపబడిరి. ఇది వారు అవిధేయతగలిగి నియమములను అతిక్రమించుటవలన గలిగెను. 79. వారు కావించుచున్న పాప కార్యములను ఒకరికొకరు నిషేధింపకుండిరి. వారు చేయుచుండినది చాల చెడ్డది. 80. వారిలో పెక్కుమంది, అవిశ్వాసులతో సఖ్యము చేయుటను నీవు చూచు చున్నావు. వారు తమకొఱకు ముందుగానే పంపుకొన్నది చాలచెడ్డది. అందుచే మన వారిపై దేవునికి కోపముగలిగెను. మఱియు వారు శాశ్వతముగ నరకబాధ లోనే యుందురు. 81.మఱియు దేవునియందును, ప్రవక్తయందును అతనికిపంప బడినవానియందును వారికి విశ్వాసమేయుండినచో వారు అవిశ్వాసులను సఖ్యులుగాఁజేసికొనియుండరు. కాని వారిలో చాలమంది అవిధేయులుగానున్నారు.

వ్యా॥ 78. ఇస్రాయీలియులు, యూదులు మొదలగువారిలోని యవిశ్వాసులు తమ దుష్టస్వభావమునుబట్టి దేవుని యాజ్ఞలను అనుసరింపక అవిధేయులై మతము హద్దులను మీఱిపోవుచుండిరి. వారు చేయుచుండిన పాపకార్యములును అన్యాయములును హద్దు మీఱినవి. అందుచేతనే దేవుఁడు తన గొప్ప ప్రవక్తలగు దావూదు ఏసు వారి మూలమున ఇస్రాయీలియులను శపించి తన యనుగ్రహమునుండి వారిని తొలఁగించెను. దానికి ఫలితముగ వారు దేవునికోపమునకు పాత్రులై అనేక బాధలకు పాలైరి. 79. యూదులు పాపకార్యములను చేయువారిని నిషేధింపక వారితోనే కలిసి మెలసియుండిరి. ఏదైన ఒకజాతిలో పాపములు చెలరేగునపుడు వాని నిషేధించువారు లేనపుడు ఆ పాపముల ఫలితము అందఱికి లభించి జాతియంతయు హీనదశకు పాలగును. 80. మదీనాలోని యూదులు తమ దుష్టస్వభావముచే ముసల్మానుభక్తులకు విరోధముగ మక్కాలోని విగ్రహారాధకులగు అవిశ్వాసులతో సఖ్యముచేసికొని ముసల్మానులతో యుద్ధముచేయుటకు పూనిరి. ఇట్టి పాపకార్యములు చేయుటవలన దాని ఫలితము వారికి దేవుని కోపమును, నరకములోని శాశ్వతబాధయును లభించును. 81. యూదులకు దేవునియందును, హజ్రత్ ముహమ్మదువారియందును దేవుఁడుపంపిన సందేశమునందును నిజమైన విశ్వాసమున్నచో ముసల్మానులను వదలి వారు దేవుని విరోధులగు అవిశ్వాసులతో సఖ్యముచేయరు. కానివారిలో పెక్కుమంది దేవునియాజ్ఞలను మీఱిపోయి అవిధేయులైయున్నారు. అందువలననే ముసల్మానుల సఖ్యమువదలి కాఫర్లతో స్నేహము కుదుర్చుకొనుచున్నారు.

## * ఏడవ కాండము *

82. లతజిదన్న-అషద్దన్నాసి-అదావతల్-లిల్లజీన-ఆమనుల్-యహూద వల్లజీన-అష్రకూ-వలతజిదన్న-అఖ్రబహుమ్-మవద్దతల్-లిల్లజీన-ఆమ-నుల్లజీన-ఖాలూ-ఇన్నా-నసారా-జాలిక-బి-అన్న-మిన్-హుమ్-ఖిస్సీ-సీన-వరుహ్బానన్-వఅన్నహుమ్-లాయస్-తక్-బిరూన్. *83. వఇజా సమిఊ-మాఉన్జిల-ఇలర్-రసూలి-తరా-అఅ-యునహుమ్-తఫీజు-మినద్-దమఇ-మిమ్మా-అరఫూ-మినల్-హఖ్ఖి-యఖూలూన-రబ్బనా-ఆమన్నా-ఫక్-తుబ్-నా-మఅష్-షాహిదీన్. 84. వ-మాలనా-లానూమిను-బిల్లాహి-వమా-జాఅనా-మినల్-హఖ్ఖి-వనత్-మఉ-అన్-యుద్-ఖిలనా-రబ్బునా-మఅల్-ఖౌమిస్-సాలిహీన్. 85. ఫఅసా-బహుముల్లాహు-బిమా-ఖాలూ-జన్నాతిన్-తజ్రీ-మిన్-తహ్తి-హల్-అన్హారు-ఖాలిదీన-ఫీహా-వ-జాలిక-జజాఉల్-ముహ్సినీన్. 86. వల్లజీన-కఫరూ-వకజ్-జబూ-బి-ఆయాతినా-ఉలాఇక-అస్-హాబుల్-జహీమ్.

82. మనుష్యులందఱిలోను ముసల్మానులకు చాలవిరోధులైనవారలుగ యూదులను, విగ్రహారాధకులను నీవు పొందుదువు. మఱియు ప్రజలలో ముసల్మానులకు ప్రేమలో చాల దగ్గఱగ నుండువారలుగ మేమునస్రానీయులము అని చెప్పువారిని నీవు పొందుదువు. ఇదియెందుకనగ, నసారీలలో విద్వాంసులును భక్తులును గర్వమువహింపనివారును ఉండుటచేతను. 83. మఱియు ప్రవక్తకు పంపఁబడినదానిని వారు వినునపుడు, వారు సత్యము తెలిసికొనినందున వారి కన్నులనుండి నీరు కారుటను నీవు చూచెదవు. వారు ఓయుప్రభువా! మేము విశ్వసించితిమి. కావున మమ్ము విశ్వాసులతోకూడఁజేర్చి వ్రాయుము. 84. మఱియు మేము దేవునిని, మాయొద్దకు వచ్చిన సత్యమును విశ్వసింపకుండుటకు మాకే మైనది ? మఱియు మాప్రభువు మమ్ము పుణ్యాత్ములతోఁగూడ చేర్చి (స్వర్గములో) ప్రవేశింపఁజేయునని మాకు ఆశయముగలదు అని వారుపలుకుచున్నారు. 85. పిదప వారు పలికిన దానికి ఫలితముగ దేవుఁడు కాలువలు ప్రవహించు స్వర్గవనములు వారి కొసంగెను. అందు వారు శాశ్వతముగా నుందురు. మఱియు పుణ్యములు చేయువారికి ఫలితమున్నది. 86. మఱియు ఎవరు అవిశ్వాసులై మా సూచనలను తిరస్కరింతురో అట్టి వారు నరకనివాసులు.

వ్యా॥ 82 : 84. ఈవాక్యములలో యూదులును, విగ్రహారాధకులును

ముసల్మానులయెడ వహించిన విరోధము తెలుపఁబడినది. హజ్రత్ ముహమ్మదు వారికిని వారి శిష్యులకును, మక్కా కాఫర్లు అనేక బాధలుపెట్టిరి. అందుచేత పెక్కుమంది ముసల్మానులు అబిసీనియాకు వలసపోయిరి. తుదకు హజ్రత్ పైగంబరులవారుకూడ తమ జన్మభూమియగు మక్కాపురమునువదలి మదీనా పురమునకు పోయిరి. అక్కడకూడ మక్కా కాఫర్లు ముసల్మానులను శాంతిగ నుండనియ్యలేదు. వారికి తోడుగ మదీనాలోను దానికి చుట్టుపట్లనున్న యూదులును హజ్రత్ పైగంబరులవారికి విరోధులైరి. యూదులు పైగంబరులవారికి అన్నములో విషముపెట్టిరి. తెలియకుండ రసూల్ వారిపై బండవైచి చంపవలెనని కుట్రచేసిరి. జాలవిద్యలు చేసిరి. పన్నరాని కుట్రలు పన్నిరి. నస్రానీలు (క్రైస్తవులు) ముసల్మానుల అభివృద్ధిని చూచి సహింపలేకున్నను వారిలో పెక్కుమంది మృదుహృదయులును, భక్తులును, విద్వాంసులును, గర్వములేనివారును ఉండిరి. అందుచేతనే అబిసీనియారాజును, రోమనురాజు (ఖైసరె రూమ్)ను, ఈజిప్టురాజగు ముఖోఖస్, పైగంబరువారి యుత్తరములను గౌరవించిరి. అబిసీనియారాజు ఇస్లాంనలో చేరెను. అచ్చటినుండి డెబ్బదిమంది ముసల్మానులైన క్రైస్తవులు పైగంబరులవారియొద్దకు వచ్చియుండిరి. అపుడు వారు ఖురానె షరీఫును విని భయభక్తులతో కన్నీరు కార్చుచు నోటినుండి మేము విశ్వాసులము అను భక్తితోకూడిన పలుకులు పలుకసాగిరి. వీరి విషయమే 83, 84 వ వాక్యములలో చెప్పఁబడినది. విశ్వాసమునకు ఫలితము స్వర్గనివాసము అని తెలుపఁబడియెను. క్రైస్తవులలో విద్య, భక్తి, వినయమున్నయెడల వారు ముసల్మానులతో మంచి సంబంధముంపఁగలరు. ఆ సుగుణములులేని నామమాత్ర క్రైస్తవులు అనఁబడు పెక్కుమంది ముసల్మానుల మతముపై చాల ద్వేషము చూపుచు ముసల్మానులను నశింపఁజేయుటకు యత్నించుచున్నారు. కాని ముసల్మానులు నిజమైన ఇస్లామ్ భక్తిని గలిగియుండునంతవఱకు వారి విరోధులు వారికే హానియును చేయఁజాలరు. కావున ముసల్మానులందఱు ఖురానె షరీఫులోని ధర్మము లనుగ్రహించి వారి ననుసరించి హజ్రత్ పైగంబరువారి నడవడికను, సంపూర్ణముగ ననుసరింపవలెను. 86. ఇందు అవిశ్వాసులకులభించు ఫలితము చెప్పఁబడినది:

87. యాఅయ్యుహల్లజీన-ఆమనూ-లాతుహర్రిమూ-తయ్యిబాతి- మాఅహల్లల్లాహు-లకుమ్-వలాతఅ-తదూ-ఇన్నల్లాహ-లాయుహిబ్బుల్-ముఅ-తదీన్.88.వకులూ-మిమ్మా రజఖ-కుముల్లాహు-హలాలన్-తయ్యిబన్- వత్త-ఖుల్లాహల్లజీ-అన్తుమ్-బిహీ-ముఅ్మి-నూన్.

87. ఓ విశ్వాసులారా! దేవుఁడు మీకొఱకు హలాల్ (ధర్మముగా) చేసిన మంచిపదార్థములను మీరు నిషేధించి కొనకుఁడు. మఱి మితము మీఱి పోకుఁడు. మితము మీఱి పోవువారిని దేవుఁడు నిశ్చయముగ ప్రేమింపఁడు. 88. మఱియు దేవుఁడు మీకొసంగిన ధర్మ (హలాల్) పదార్థములను భుజింపుఁడు. మఱియు మీరు విశ్వసించియున్న దేవునికి భయపడుఁడు.

వ్యా॥ 87:88. ఈవాక్యములలో ముసల్మానులు ఏలాగు ధర్మములైన మంచి పదార్థములను ఉపయోగింప వలెనో బోధింపఁబడినది. నసారీలు ధర్మములైన పదార్థములను నిషిద్ధము (హారామ్) చేసికొని వైరాగ్యము (రుహబానియత్) వహించి యుండిరి. అట్లువలదు. దేవుఁడు ధర్మముగాఁ జేసిన పదార్థములను మితముగా ననుభవింపవలెను. వైరాగ్యము వహింపరాదు. కాని యేదైన సత్యమునకుఁగాను వదలిన అది వైరాగ్యములోఁ జేరదు. యూదులు ఇహలోక భోగములలో మునిఁగి ధర్మమును అధర్మమును లెక్కచేయక దేవుని యందలి భక్తిని వీడిన వారైరి. అట్లు ముసల్మానులు ఇహలోక భోగములలో పడి దేవుని యందలి భయభక్తులను వదలరాదు. ధర్మముగా లోక సౌఖ్యములను అనుభవించుచు దేవునికి భయపడుచు నుండవలెను. ఇదియే మితమైన మధ్యమమార్గము.

89. లాయుఆ-ఖిజుకుముల్లాహు-బిల్-లగ్వి-ఫీ- ఐమానికుమ్ - వలాకిన్ - యుఆఖిజుకుమ్ -బిమా-అఖత్-తుముల్-ఐమాన-ఫకఫ్-ఫారతుహూ- ఇత్ ఆము-అషరత్ మసాకీన మిన్ ఔసతి మాతుత్ ఇమూన అహాలికుమ్ ఔ-కిస్వతుహుమ్ ఔ-తహ్రీరు-రఖబతి-ఫమల్ లమ్ యజిద్ ఫసియాము-సలాసతి - అయ్యామిన్-జాలిక-కఫ్ఫారతు-ఐమానికుమ్-ఇజా-హలఫ్తుమ్-వహ్ఫజూ - ఐమానకుమ్-కజాలిక-యుబయ్యినుల్లాహు-ఆయాతిహీ-లఅల్లకుమ్ తష్కురూన్.

89. మీరు ఉద్దేశము లేకుండఁ జేసిన ప్రమాణములను గూర్చి దేవుఁడు మిమ్ము పట్టఁడు. కాని మీరు నిశ్చయించి మనఃపూర్వకముగఁ జేసిన ప్రమాణముల గూర్చి మిమ్ముపట్టును. కావున దానికి పరిహారముగ మీరు మీ గృహములకు పెట్టునట్టి మధ్యమమైన యాహారము పదిమంది బీదలకు పెట్టవలెను. లేక పదిమంది పేదలకు వస్త్రము లియ్యవలెను. లేకఒక బానిసను వదలి పెట్టవలెను. (ఆజాద్ జేయవలెను.) మఱియు ఎవరికి శక్తి లేదో వారు మూఁడు దినములు ఉపవాస ముండవలెను. ఇది మీరుచేయు బాసలకు పరిహారము. మీరు చేయు ప్రమాణములను కాపాడుఁడు. మీరు కృతజ్ఞులై యుండుటకై యిట్లే దేవుఁడు తన యాజ్ఞలను మీకుఁ దెలుపుచున్నాఁడు.

వ్యా॥ 89. కొందఱు ఉద్దేశము లేకుండనే నిష్ప్రయోజనముగ దేవుని తోడు అని ప్రమాణము (ఖసమ్) చేయుదురు. దానిని దేవుఁడు పట్టఁడు. అనగా దానివలన పాపము కలుగదు. దానికి పరిహారము (కఫ్ఫారా) లేదు. కాని బుద్ధి పూర్వకముగ నుద్దేశించి దేవునితోడు అని ప్రమాణము చేసినచో ఆప్రమాణము ను నెఱవేర్చవలెను. ఏదైన కారణముచే నెఱవేర్చక పోయినచో దానికి పరిహారము (కఫ్ఫారా) చేయవలెను. పదిమంది బీదలకు అన్నము పెట్టవలెను. లేక పదిమంది పేదలకు వస్త్రములు దానముచేయవలెను. ఒక్కొక్క బీదవానికి ఒక షరాయియును ఒక యంగీయును లేక ఒక లుంగీ మఱియు ఒక దుప్పటి ఇయ్యవలెను. లేక ఒక బానిసను స్వేచ్ఛాపరునిగ (ఆజాద్) చేయవలెను. పై వివరింపఁబడిన పరిహారములు చేయలేని వారువరుసగ మూఁడు దినములు ఉపవాసము (రోజా) ఉండవలెను. వీలైనంత వఱకు ప్రమాణము చేయకుండుట మంచిది. ప్రమాణము చేసినచో దాని నెఱవేర్చవలెను నెఱవేర్పలేని స్థితిలో పరిహారము (కఫ్ఫారా) చేయవలెను. ఇట్లు ప్రమాణములను కాపాడవలెను. దేవుఁడు తన అనుగ్రహము వలన తన ధర్మములను భక్తులకు తెలుపుచున్నాఁడు. కావున భక్తులు దేవుని యెడ కృతజ్ఞులై యుండవలెను.

90. యాఅయ్యుహల్లజీన-ఆమనూ-ఇన్న-మల్-ఖమ్రు-వల్-మైసిరు-వల్ అన్సాబు-వల్ అజ్లాము-రిజ్సుమ్-మిన్-అమలిష్-షైతాని-ఫజ్తనిబూహు-లఅల్లకుమ్-తష్కురూన్. 91. ఇన్నమా-యురీదుష్.షై.తాను-అన్- యూఖిఅ - బైనకుముల్-అ దావత-వల్-బగ్జాఅ ఫిల్-ఖమ్రి-వల్-మైసిరి-వయసుద్దకుమ్-అన్ జి-క్రిల్లాహి-వఅనిస్-సలాతి-ఫహల్ అన్తుమ్-ముन్తహూన్. 92. వఅతీఉల్లాహ - వఅతీఉర్-రసూల-వహ్జరూ-ఫఇన్-తవల్-లైతుమ్-ఫఅలమూ-అన్నమా - అలారసూలినల్-బలాగుల్-ముబీన్. 93. లైసఅలల్లజీన-ఆమనూ-వఅమి-లుస్ - సాలిహాతి-సుమ్మత్-తఖా-వఆమనూ-సుమ్మత్ తఖా-వ-అహ్సనూ-వల్లాహు-.యుహిబ్బుల్-ముహ్సినీన్.

90. ఓ విశ్వాసులార! సారాయి జూదము విగ్రహములు శకునమునకు గాను ఎత్తుబాణము లన్నియు అసహ్యమైన సైతాను పనులు. కావున మీరు ముక్తి పొందుటకై వానినుండి తొలఁగి యుండుఁడు 91. సారాయి జూదముల మూలముననే మీమధ్య విరోధమును వైరమును కలిగించుటకును మిమ్ము దేవుని ధ్యానమునుండియు నమాజునుండియుతొలగించుటకును సైతానుకోరుచున్నాఁడు.

కావున మీరిప్పుడైనను మానుకొనుదురా! 92. దేవునికి విధేయులుకండు. మఱి ప్రవక్త యాజ్ఞలను అనుసరింపుఁడు. మఱి భయపడుచుండుఁడు. ఇదప మీరు వెను దిరిగినచో స్పష్టముగా ధర్మప్రచారము చేయుటయే మా ప్రవక్త విధి యని తెలిసికొనుఁడు. 93. విశ్వసించి సత్కార్యములు చేసినవారు ఇఁక మీఁదను వారు భయపడి నమ్మిసత్కార్యములు చేసిమఱింత భయపడివిశ్వసించిమరల భయపడి పుణ్యకార్యములు చేసినపుడు దీనికిముందు వారుభుజించిన దానివలన వారికిపాపములేదు. మఱియు దేవుఁడు సత్కార్యములుచేయువారిని ప్రేమించును.

వ్యా॥ 90. సారాయి మొదలగు మత్తుపదార్థములు ఈ వాక్యమునందు సంపూర్ణముగ నిషేధింపఁబడినవి. మద్యపానము జూదము విగ్రహారాధన రాఁబోవు మంచి చెబ్బరుల గూర్చి విగ్రహముల నెదుటనుండు బాణములను ప్రయోగించుట చాల అసహ్యములైన సైతాను పనులు. దీనిని ముసల్మానులు సంపూర్ణముగ మానుకొనవలెను. మద్యపానము వలన బుద్ధిచెడి ధనముపోయి జగడములు సంభవించును. దానివలన అనేక పాప కార్యములకు పాలగును. దైవభక్తి చెడును. అటులే జూదములోను ధననష్టము తగవులు దేవునిని మఱచిపోవుట మొదలైన పాపములు సంభవించును. జూదమాడువారు దానిలో నిమగ్నులై దేవుని ధ్యానము నమాజును వదలి పెట్టుదురు. మఱి ఇతర కార్యములను గూడ వదలి పెట్టుదురు. కావున ఇప్పుడైనను మానుకొనుదురా! అనగాఁ హజ్రత్ పైగంబరువారి శిష్యులు విని మేము మానుకొంటిమి అని పలుక సాగిరి. దాని ఫలితముగ మదీనాపురము నంతటను ముసల్మానులు పాఱవేసిన సారాయి కాలువలుగ ప్రవహించెను. అప్పటినుండి ముసల్మానులందఱునుమద్యపానము మానుకొనిరి. 92. దేవుఁడు విధించు ధర్మములను హజ్రత్ రసూలు వారు ఆజ్ఞాపించు ఆజ్ఞలను ముసల్మానులు అనుసరింపవలెను. అనుసరింపనిచో వారికే నష్టమగును, కాని ప్రవక్తపని దేవుని ధర్మములను మానవులకు అందఁజేయుటయే. మానవుల అవిధేయతకు ప్రవక్త జవాబుదారి కాఁడు. 93. సారాయి నిషేధింపంబడక ముందు దానిని త్రాగిన ముసల్మానులకు పాపమున్నదా అని ముసల్మానులు ప్రశ్నించిరి. దానికి నిందు జవాబియ్యఁబడినది. నిషేధమునకు పూర్వము మత్తు పదార్థములు సేవించిన వారికి నెట్టి పాపములేదు. వారు ఇఁకమీఁదను భక్తి మార్గములో స్థిరముగా నుండి దానియందు సంపూర్ణులై దేవుని ప్రీతికి పాత్రులు కావలెను. సత్కార్యములు చేయు వారిని దేవుఁడు ప్రేమించును. కావున ముసల్మానులు సదా సత్కార్యములు చేయుచుండవలెను.

94. యాఅయ్యు-హల్లజీన-ఆమనూ-లయబ్లువన్నకుముల్లాహు-బిషై

ఇమ్-మినస్-సైది-తనాలుహూ-ఐదీ-కుమ్-వ-రిమాహుకుమ్-లియఅ్-లమల్లా హు-మన్-యఖా-ఫుహూ-బిల్-గైబి-ఫమనిఅ్-తదా-బఅ్-దజాలిక-ఫలహూ-అ జాబున్-అలీమ్. 95. యా-అయ్యుహల్లజీన-ఆమనూ-లాతఖ్-తులుస్-సైద వ అన్తుమ్-హురుమున్-వమన్-ఖతలహూ-మిన్‌కుమ్-ముత-అమ్మిదన్-ఫజజా-ఉమ్-మిస్లు-మాఖతల-మినన్-నఅమి-యహ్‌కుము-బిహీ-జవా-అద్‌లిమ్-మిన్-కుమ్-హద్యమ్-బాలిగల్-కఅ్-బతి-ఔ-కఫ్ఫారతున్-తఆము-మసాకీన-ఔ-అద్లు-జా లిక-సియామల్-లియజూ-ఖ-వబాల-అమ్రిహీ-అఫల్లాహు-అమ్మా-సలఫ-వమన్-ఆద-ఫయన్-తఖిముల్లాహు మిన్‌హు-వల్లాహు-అజీజున్-జున్-తిఖామ్. 96. ఉహిల్ల లకుమ్-సైదుల్-బహ్‌రి-వతఆముహూ-మతాఅల్-లకుమ్-వలిస్-సయ్యారతి-వహుర్రిమ-అలైకుమ్-సైదుల్-బర్రి-మాదుమ్తుమ్-హురుమన్-వత్తఖుల్లా-హల్ల జీ-ఇలైహి-తుహ్‌షరూన్.

94. ఓ విశ్వాసులార! చూడకయే ఎవఁడు దేవునికి భయపడునోయని తెలిసికొనుటకు, మీచేతులకును మీబల్లెములకును అందునట్టి వేఁటనుగూర్చి నిశ్చయముగా దేవుఁడు మిమ్ము పరీక్షించును. దీని పిదప ఎవఁడు అతిక్రమించునో వానికి దుఃఖకరమైన బాధయున్నది. 95. ఓ విశ్వాసులార! మీరు ఇహ్రాములో నుండునంతవఱకు వేఁటజంతువులను చంపకుఁడు. మఱెవఁడు మీలో కావలెనని వేఁట జంతువును చంపునో దానికి బదులుగ వాఁడుచంపినదాని వంటిది పశువులలో నొసంగుట విధియున్నది. ఆ జంతువును మీలో నిద్దఱు న్యాయవంతులు నియమింపవలెను. బదులుగ నియ్యఁబడు జంతువు ఖుర్బానీకొఁ గాను కాబా యొద్దకు చేరవలెను. లేక కొందఱు పేదలకు అన్నముపెట్టుటయు పరిహారముగా నున్నది. లేక దానికి సరిగ నుపవాసములుండవలెను. తాను గావించిన క్రియకుఁగాను శిక్ష ననుభవించుటకు (ఇది నియమింపఁబడియె.) కడచి పోయినదానిని దేవుఁడు క్షమించెను. మరల నెవఁడు తిరిగి యట్లు చేయునో వానికి శిక్ష విధించును. మఱి దేవుఁడు సర్వశక్తుఁడును, శిక్షించువాఁడును. 96. సముద్రములో వేఁటాడుట మీకు ధర్మము (హలాలు) గాఁ జేయఁబడినది. మీకును, ప్రయాణికుల లాభమునకుఁగాను దానిని భుజించుట ధర్మమైనది. మీరు ఇహ్రాములో నుండునంతవఱకు భూమిపై వేఁటాడుట మీకు నిషేధింపఁబడినది. మఱియు మీరందఱును, ఎవనియొద్దకు రప్పింపఁబడుదురో యట్టి దేవునికి భయపడుఁడు.

వ్యా॥ 94. కొన్ని స్థితులలో నిషిద్ధములైన విషయములు ఈ వాక్యములలో చెప్పబడుచున్నవి. ఇహ్రామము అనగా కాబాయాత్ర (హజ్) కొఱకు సంకల్పించుట (నియ్యత్) చేయుట. కాబాయాత్ర పూర్తి చేయునంతవఱకు భూమిలోని వేట జంతువులను వేటాడగూడదు. ఇందు జింక, దుప్పి, పక్షులు మొదలగునవి చేరినవి. యాత్రికులు వేటాడకూడదు అని దేవుని సెలవయ్యెను. ఆ వేట జంతువులు చాల సులభముగా చేతికిని బల్లెములకును చిక్కునంత స్థితిలో నుండినను ముసల్మానుభక్తులు దేవునిని చూడకపోయినను ఆతనికి భయపడి వేటాడకుండిరి. ఈ పరీక్షకొఱకే ఈ యాజ్ఞ విధింపబడెను. ఎవఁడు ఆజ్ఞను మీఱి వేటాడునో వానికి దుఃఖకరమైన బాధయున్నది. 95. ఒకవేళ ఎవరైనను వేటాడుట నిషిద్ధమని తెలిసియు కావలెనని వేటాడి జంతువును చంపినచో దానికి పరిహారముగా దాని వెల యెంతయగునో యిద్దఱు న్యాయస్థులు పెద్దమనుష్యులు తీర్మానము చేయవలెను. ఆ వెలకు వచ్చు ఒంటె లేక ఆవు లేక మేక కాబామసీదు హద్దులలో ఖుర్బానీ చేయవలెను. దాని మాంసమంతయు బీదలకు దానము చేయవలెను. వేటాడినవాఁడు దాని మాంసము తినరాదు. లేక ఆ వెలకు వచ్చు ధాన్యము బీదలకు దానము చేయవలెను. లేక ఎందఱు బీదలకు ఆ ధాన్యము పంచిపెట్టవలసియుండునో అన్ని దినములు ఉపవాసముండవలెను. ఇదంతయు వాఁడు కావించిన నేరమునకు పరిహారము. యాత్రికులు వేటాడకూడదు అను ధర్మము పూర్వమునుండియు నుండెను. అయినను ఖురానులో నిషిద్ధము రాక మునుపు కావించినవారిని దేవుఁడు క్షమించివేసెను. ఇఁకమీఁద అట్టి అక్రమములు చేయరాదు. తిరిగి చేసినచో దేవుఁడు శిక్షించును. ఆతఁడు సర్వశక్తుఁడు. ఆతని శిక్షనుండి ఎవరును తప్పించుకొనఁజాలరు. 96. అడవి జంతువులను యాత్రికులు వేటాడకూడదు. నీళ్ళలోని చేపలను వేటాడవచ్చును. తినవచ్చును. సముద్రములోను, చెఱువులలోనున్న చేపలను యాత్రికులు పట్టవచ్చును. తినవచ్చును. అటులే ఇతర ప్రయాణికులుకూడ తినవచ్చును. అందు ఏలాటి నిషిద్ధములేదు. దేవుఁడు విధించిన ధర్మములను అనుసరించుటలో దేవునికి భయపడవలెను. తుదకు తీర్పుకొఱకు ఆతనియొద్దకే మరలవలసియున్నది అని తెలిసికొనవలెను.

97. జ-అలల్లాహుల్-కఅ-బతల్-బైతల్-హరామ-ఖియా-మల్-లిన్నాసి-వష్-షహ్-రల్-హరామ-వల్-హద్య-వల్-ఖలాఇద-జాలిక-లితఅ-లమూ-అన్నల్లాహ-యఅ-లము-మా-ఫిస్-సమావాతి-వమాఫిల్-అర్జి-వ అన్నల్లాహ-బికుల్లి-షైఇన్-అలీమ్. 98. ఇఅ-లమూ-అన్నల్లాహ-షదీదుల్-ఇఖాబి-వ-

అన్నల్లాహ-గఫూరుర్-రహీమ్. 99. మా-అలర్-రసూలి-ఇల్-లల్-బలాగు-వల్లాహు-యఅ్-లము మాతుబ్దూన-వ-మాతక్తు-మూన్.

97. దేవుఁడు గౌరవమందిన కాబాగృహమును, ప్రజలకు నివాస కారణముగాను, గౌరవముగలైన నెలలను, ఖుర్బానీ జంతువులను, మెడలకు పట్టాలు వేసి కాబామసీదునకు గొనిపోవు జంతువులను (ప్రజలకు సౌకర్యములవిగాను) చేసెను. ఆకాశములోను భూమిలోనున్నది దేవునికి దెలియును అని మీరు తెలిసికొనుటకుఁగాను మఱి దేవుఁడు సర్వజ్ఞుఁడని మీరు తెలిసికొనుటకుఁగాను ఇది వివరింపఁబడియెను. 98. నిశ్చయముగా దేవుని శిక్ష చాలకఠినమైనదనియు దేవుఁడు క్షమించువాఁడును దయాళువును అనియు మీరు తెలిసికొనుఁడు. 99. ప్రవక్తకు ప్రచారముచేయుటతప్ప వేఱు బాధ్యతలేదు. మఱి మీరు వెల్లడిగాఁ జేయునదియును, దాఁచి చేయునదియును సర్వమును దేవునికిఁ దెలియును.

వ్యా॥ 97. లోకములో మొట్టమొదట దేవుని ప్రార్థనకొఱకు కట్టఁబడిన గృహము కాబా మసీదు. అందు చాల మహిమ గలదు. దానివలననే మక్కాపురము ఎడారిలో ఏర్పడి, అందు ప్రజలు నివసించుటకు కారణమయ్యెను. కావలసినఅన్ని ఫలములు ధాన్యములు కొఱతలేకుండ లభించును. లక్షలకొలఁది యాత్రికులు ప్రతి సంవత్సరము వత్తురు. ముసల్మానులు అచ్చట తమ రాజకీయ సాంఘిక, మతవిషయములఁగూర్చి చర్చింతురు. అందు శాంతిలభించును. కాబా మసీదు సురక్షితముగా నుండునంతవఱకు లోకమునుండును. అది లేనపుడు లోకములో ప్రళయము (ఖియామత్) కలుగును. ముహర్రము మొదలగు గౌరవ మాసములో ప్రజలు యుద్ధములు లేక శాంతములో నుండుదురు. ఖుర్బానీజంతువులను గొనిపోవువారికికూడ శాంతములభించును. దొంగలు మొదలగు దుష్టులు కూడ వారిని తొందఱ పెట్టరు. శాంతికన్న వేఱు సౌకర్యము ప్రజలకు ఏద్ది గలదు. ఎడారి ప్రదేశములలో నట్టి మహిమగల కాబా గృహము దానికి సంబంధించిన విషయములు ఏర్పడునని దేవునికి పూర్వము నుండియే తెలియును. అయినను ఈవిషయములు దేవునికిఁ దెలియునని మీరు కూడ తెలిసికొనవలెను. దేవుఁడు సర్వజ్ఞుఁడు. అన్ని విషయములు సంభవింపక పూర్వమే ఆతనికిఁ దెలియును. 98. దేవుఁడు నియమించిన పైధర్మములకు వ్యతిరేకముగ పోవువారికి కఠినమైన శిక్ష యున్నది. ఒకవేళ పొరపాటులో నేరము చేసి దానికి క్షమాపణ కోరుకొన్నచో దేవుఁడు క్షమించి కరుణించును అని తెలిసికొనుఁడు అని హెచ్చరింపఁబడియెను. 99. దేవుని ప్రవక్తయగు హజ్రత్ వారు దేవుని ధర్మములను ప్రజల కందఁజేసిరి. వారి బాధ్యత ప్రచారముచేయుట మాత్రమే. వారు తమ యుద్యమము నెఱవేర్చిరి. ఇఁక ప్రజలు ఆ ధర్మములను అనుసరించి మోక్షము పొందవలసినది. దేవునికి సర్వము దెలియును. బహిరంగ

ముగ చేయు కర్మలను మఱుఁగుగాఁ జేయు పనులను ఆతఁడు చూచుచునే యున్నాఁడు. వాని వానికిఁ దగిన ఫలిత మొసంగును.

100. ఖుల్-లాయస్‌తవిల్-ఖబీసు వత్-తయ్యిబు-వలౌ-అఅ-జబక-కస్రతుల్-ఖబీసి-ఫత్తఖుల్లాహ-యా-ఉలిల్-అల్బాబి-లఅల్లకుమ్-తుఫ్లిహూన్.

100. ఒకవేళ అపవిత్రముయొక్క హెచ్చుదనము నీకు బాగుగఁ దోచినను అపవిత్రములు పవిత్రములు సరిసమానులు కావు. కావున ఓబుద్ధిమంతులారా! మీరు మోక్షముపొందుటకై దేవునికిభయపడుఁడు. అని ఓప్రవక్తా! పలుకుము.

వ్యా॥100 మద్యపానము జూదము మొదలగు అధర్మ కార్యములను నిషేధించుచు ఇఁక అపవిత్రములైనవి తెలుపుచున్నాఁడు. అవి యెంతనెక్కువగా నుండినను పవిత్ర వస్తువులతో సరిసమానములు కావు. అధర్మముగా సంపాదించిన సొత్తు ఎంత యుండినను ధర్మముగా సంపాదించిన కొంత సొత్తుతో అది సమానము కాదు. చూచువారికి అపవిత్రమైన వస్తువుల అధిక సంఖ్య బాగుగ తోచును. కాని అది పవిత్రమైన దానితో సమానము కాదు. కడవెడు గాడిదె పాలుకంటె గంటెడు ఆవుపాలు మేలుగదా! ఒక గంటెడు పేడకంటె ఒకఅత్తరుబొట్టు మేలుగదా! కావున భక్తులు ధర్మమైనది కొద్దిగా నున్నను దానితో తృప్తి చెందవలెను. బుద్ధిమంతులు ఆధర్మపు సొత్తు జోలికి పోక ధర్మ సంపాదనయే చేయుదురు. అందు దేవుని శిక్షకు భయపడవలెను. దేవునికి భయపడి ధర్మమైన పవిత్రములైన వానిని సంపాదించిన వారికి మోక్షము చేకూరును.

101. యా-అయ్యుహల్లజీన-ఆమనూ-లాతస్‌అలూ-అన్-అష్యాఅ-ఇన్‌తుబ్ద-లకుమ్-తసూ-కుమ్-వ-ఇన్-తస్‌అలూ-అన్ హా-హీన-యునజ్జ-లుల్-ఖుర్‌ఆను-తుబ్ద-లకుమ్-అఫల్లాహు-అన్‌హా-వల్లాహు-గఫూరున్-హలీమ్. 102. ఖద్-సఅ లహా-ఖౌముమ్-మిన్‌ఖబ్-లికుమ్-సుమ్మ-అస్బహూ-బిహా-కాఫిరీన్.

101 ఓ విశ్వాసులారా! మీకుఁ దెలుపఁ బడినచో మీకు బాధాకరమగునట్టి విషయములను గూర్చి మీరు ప్రశ్నింపకుఁడు. ఖురాను పంపఁబడు కాలమునందు ఆ విషయములను గూర్చి మీరు ప్రశ్నించినచో అవి మీకు దెలుపఁబడును. వానిగూర్చి దేవుఁడు క్షమించెను. మఱియు దేవుఁడు క్షమించువాఁడును క్షమగలవాఁడును. 102. అట్టి విషయములను గూర్చి మీ పూర్వికులును ప్రశ్నించిరి. ఆపిదప వారు వానిని తిరస్కరించిన వారైరి.

వ్యా॥ 101. కొందఱు హజ్రత్ పైగంబరుల వారితో నాతండ్రి ఎవఁడు? నేను స్వర్గమునకు పోదునా నరకమునకు పోదునా అను పనికిమాలిన ప్రశ్నలు

వేసిరి. అందుకు అట్టిపనికిమాలిన విషయములు అడుగఁగూడదు. దానికి జవాబి య్యఁబడినచో అడిగిన వానిలోపము బయలుపడి వాని మనస్సునకు కష్టముగలు గును. దానివలన చెడుగు వాటిల్లును, అధిక ప్రసంగము లాడకూడదు. అయిన ను మత ధర్మముల విషయములో సందేహ మున్నచో అడిగి తన సందేహము తీర్పుకొన వచ్చును. అది అధిక ప్రసంగ మనఁబడదు. ఖురానె షరీఫు దేవుని యొద్దనుండి వచ్చు కాలమునందు ప్రశ్నించుట వలన దేవుఁడు ఖురాను మూల మున ప్రజలకు తెలుపును. కావున అధిక ప్రసంగములు మానుకొన వలెను. ఇంతవఱకు ప్రశ్నించిన విషయములను క్షమించెను, ఇఁకమీద జాగ్రత్తగనుండ వలెను. 102. ముసల్మానులకు పూర్వము గడచిన మతస్థులు తమతమ ప్రవక్తల తో అటులే అధిక ప్రసంగములాడి తుదకు కఠిన ధర్మములు రాగా వాని నను సరింపక తిరస్కరించిన వారైరి. అట్లు మీరు ఓ ముసల్మానులార! కాకూడదు. అని హెచ్చరిక.

103. మా-జఅలల్లాహు-మిమ్_బహీ రతిన్-వలా-సాఇబతిన్ - వలావసీల తిన్-వలాహామిన్-వలాకిన్నల్ -లజీన కఫరూ యఫ్తరూన-అలల్లాహిల్ - కజిబ- వఅక్- సరహుమ్-లాయఅ-ఖిలూన్.104.వఇజా-ఖీల-లహుమ్_తఆలౌ ఇలా-మా అన్-జలల్లాహు-వఇలర్-రసూలి-ఖాలూ-హస్బునా మావజద్నా-అలైహి- ఆబా అనా_అవ-లౌ-కాన ఆబాఉహుమ్ - లాయఅ-లమూన-షైఅన్- వలా- యహ్తదూన్.

103. దేవుఁడు బహీరానుగాని లేక సాయిబానుగాని లేక వసీలాను గాని లేక హామీనుగాని నియమించి యుండలేదు. కాని అవిశ్వాసులు దేవుని పై అబద్ధములు కల్పించుచున్నారు. మఱి వారిలో పెక్కుమందికి బుద్ధిలేదు. 104. మఱియు దేవుఁడు పంపిన దాని వైపునకును ప్రవక్త వైపునకును రండు అని వారితో చెప్పఁబడఁగా మా తాత ముత్తాతలు పోవుచుండిన మార్గమే మాకు చాలును అని వారు పలుకుదురు. ఏమి వారి తాత ముత్తాతలకు ఏమి యు తెలియకున్నను వారికి సన్మార్గము తెలియకున్నను వారువారినను సరింతురా!

వ్యా॥ 103. అవిశ్వాసులు తమ యిష్టాను సారముగ కొన్ని యాచార ములు కల్పించు కొనిరి, వారికి తరువాత వచ్చినవారు ఆ దురాచారములను అనుసరింప సాగిరి. అందు బహీరా మొదలగు జంతువులు చేరినవి. వానిని దేవుఁడు నియమింపలేదు. వానిని అవిశ్వాసులు కల్పించుకొనిరి అని అది రద్దు చేయఁబడినది. ఒక యొంటెలేక జంతువుయొక్క పాలు విగ్రహముల కొఱకు వదలి పెట్టుచు వాని పాలు ప్రజలకు నిషిద్ధమని అనుచుండిరి దీనిని బహీరా అను

దురు. విగ్రహముల పేరుతో వదలి పెట్టి దానిపై నెక్కుక వదలి పెట్టుచుండిన జంతువును సాఇబా అనుదురు ఏదైన ఒంటె వరుసగ పెంటిదూడలనే కని పోతుదూడలను కననిచో దానిని విగ్రహము కొఱకు వదలి పెట్టుచుండిరి. దానిపేరే వసీలా. ఒంటెపోతు పెంటియొంటెలపై నెక్కి కొన్నిదూడలనుకని నట్లు చేసిన దానిని విగ్రహముల పేరుతో వదలు చుండిరి. దానినే హామీ అనుదురు. ఇవన్నియు పాపకార్యములు. బుద్ధిలేని చేష్టలు. కాఫర్లు తమంతట తామే నియమించుకొన్న దురాచారములు. దేవుడు నియమింపలేదు. కావున వాని వదలి పెట్టవలెను. హలాల్ హరామ్ దేవుడు విధింపవలెను. కాని మానవులు తమ యిష్టానుసారముగ నియమింపకూడదు. 104. దేవుడు విధించిన ధర్మములను ప్రవక్త యాజ్ఞలను అనుసరింపవలెను అని బోధింపఁబడినచో సాధారణముగ మూఢులు మేముమాతండ్రులును తాతముత్తాతలును అనుసరించిన యాచారములను అనుసరింతుము. వానికి వ్యతిరేకముగ నడచుకొనము అని పలుకుదురు. వారితాత ముత్తాతలకు మతజ్ఞానమును సన్మార్గమును బొత్తిగ తెలియక దురాచారములు ఆచరించుచుండినను ఆదోవనే మీరు పోవుదురా! అట్లు పోఁగూడదు. ప్రవక్త మూలమున దేవుఁడొసంగిన ధర్మమార్గమునందు పోవలెను. కావున ముసల్మానులు తమ ప్రతికార్యములోను ఇస్లామ్ మత ధర్మములను అనుసరింపవలెను. తాత ముత్తాతలు పోయిన అధర్మమార్గము నందు పోఁగూడదు. అందువలన ఉభయలోకములలోను నష్టము గలుగును.

105. యాఅయ్యుహల్లజీన-ఆమనూ అలైకుమ్-అన్‌ఫుసకుమ్-లాయజు ర్రుకుమ్-మన్-జల్ల ఇజహ్‌తదైతుమ్-ఇలల్లాహి మర్‌జి-ఉకుమ్-జమీఅన్ ఫయు నబ్బి-ఉకుమ్-బిమాకున్తుమ్-తఅమలూన్.

105. ఓవిశ్వాసులార! మీరు మీయాత్మలను కాపాడుకొనుఁడు. మీరు సన్మార్గమందున్నపుడు దుర్మార్గములో పడినవాఁడు మీకేలాటి కీడును చేయఁజాలఁడు. మీరందఱును దేవునియొద్దకే మరల వలసి యున్నది అచ్చట దేవుఁడు మీరు చేయుచున్న కర్మలు మీకుఁ దెలుపును.

వ్యా॥ 105. అవిశ్వాసులు ఇస్లామ్ మతబోధ వినియు తమ తాత ముత్తాతల దురాచారములను వదలక దుర్మార్గములోనే పడినచో ముసల్మానులు దానిగూర్చి చింత పడకూడదు. తమ మత ప్రచారోద్యమును నెఱవేర్చుచు విశ్వాస మార్గమున పోవుచు దేవుని యందు భయభక్తులు గలిగి యుండవలెను. అపుడు దుర్మార్గులైన వారివలన ముసల్మానులకు ఏలాటినష్టము గలుగదు. తాము సత్కార్యములు చేసిన చాలును. ఇతరులకు సన్మార్గము చూపనక్కఱ

లేదు అని ముసల్మానులు తలంపరాదు. మత ప్రచారము వారి భక్తిమార్గమునకు చేరినది. అధర్మములని షేధించుచు ధర్మములకుఁగాను ఆజ్ఞాపించుచు మత ప్రచారము సలుపుచుండవలెను. అందఱు మానవులును తుదకు తీర్పునకుఁగాను దేవుని సన్నిధానము చేర వలసి యున్నది. అపుడు ఎవరు సన్మార్గమందుండిరో ఎవరు దుర్మార్గములో పడిరో విశదమగును. ఎవరి కర్మలకుఁ దగిన ఫలితము వారు పొందుదురు.

106. యాఅయ్యుహల్లజీన-ఆమనూ-షహాదతు-బైనికుమ్ ఇజా-హజర అహదకుముల్-మౌతు-హీనల్-వసియ్యతిస్-నాని-జవా అద్ లిమ్-మిన్-కుమ్-ఔ-ఆఖరాని మిన్-గైరికుమ్-ఇన్-అన్తుమ్-జరబ్తుమ్-ఫిల్-అర్ జి-ఫఅసాబత్-కుమ్ ముసీబతుల్-మౌతి-తహ్బిసూన-హుమా-మిం-బ-అ-దిస్-సలాతి-ఫ-యుఖ్-సిమాని-బిల్లాహి ఇనిర్-తబ్తుమ్-లా-నష్తరీ-బిహీ సమనన్-వలౌకాన-జా-ఖుర్బా వలా నక్తుము షహాదతల్లాహి-ఇన్నా ఇజల్-లమిన్-ఆసి-మీన్. 107. ఫఇన్-ఉసిర-అలా-అన్న-హుమస్-తహఖ్ఖా-ఇస్మన్-ఫఆఖరాని-యఖూమాని- మఖామహుమా-మినల్లజీనస్ తహఖ్ఖ-అలైహిముల్-ఔలయాని- ఫయుఖ్ సిమాని-బిల్లాహి-లషహాదతునా-అహఖ్ఖు-మిన్-షహాదతిహిమా-వ-మఅ-తదైనా-ఇన్నా ఇజల్-లమినజ్-జాలిమీన్. 108. జాలిక అద్నా-అన్- యాతూ-బిష్-షహాదతి అలా-వజ్-హిహా-ఔ-యఖాఫూఅన్-తురద్ద-ఐమానుమ్-బఅ-ద-ఐ-మానిహిమ్ వత్తఖుల్లాహ-వస్-మఊ-వల్లాహు-లాయహ్దిల్-ఖౌమల్-ఫాసిఖీన్.

105. ఓ విశ్వాసులార! మీలో నెవ్వరికైన చావు వచ్చినచో మరణశాసనము చేయునపుడు మీవారలగు యిద్దఱు న్యాయస్థులు సాక్షులుగ నుండవలెను. లేక మీరు ప్రయాణములో నుండి మీకు మరణాపద గలిగినచో ఇతరు లిద్దఱు సాక్షులుండవలెను. ఆయిద్దఱిని నమాజునకు పిదప మీరు నిలువఁబెట్టవలెను. మీకు సందేహము గలిగినచో వారిద్దఱు ఎవనికిఁగాను సాక్ష్యమిత్తుమో వాఁడు మాబంధువైనను మేము ప్రమాణము చేసి సొత్తు పుచ్చుకొనము. మఱి మేము దేవుని సాక్ష్యము దాఁచము. అటులైనచో మేము నిశ్చయముగా పాపులగుదుము అని దేవుని పేరుతో ప్రమాణము చేయవలెను. 107. ఆపిదప ఆ యిద్దఱు సాక్షులు సత్యము దాఁచి పాపముచేసిరి యను విషయము తెలిసినచో హక్కు పోయిన వారిలో మరణించిన వానికి అందఱికంటె చాల దగ్గఱైన

వారిద్దఱు సాక్షులు ఆయిద్దఱికి స్థానమున నిలచి వారిద్దరికంటె మా సాక్ష్యము సత్యమైనది మఱి మేము అతిక్రమించలేదు. అట్లైనచో మేము అన్యాయస్థుల మగుదుమని దేవుని పేరుతో ప్రమాణము చేయవలెను. 108. దీనివలన వారు సరియైన సాక్ష్యమిత్తురనియు బంధువుల సాక్ష్యము పిదప తమ సాక్ష్యము రద్దు చేయఁబడునని భయపడుదురని ఆశయము గలదు. మఱి దేవునికి భయపడుచు నుండుఁడు. (ఆతని యాజ్ఞను) వినుఁడు. మఱియు దేవుఁడు అవిధేయులైనట్టి వారికి మార్గము చూపఁడు.

వ్యా॥ 106:107. అందరికి చావు తప్పక వచ్చునది. దేవుని సన్నిధానము పొందక ముందే ముసల్మానులు తమ ఆస్తిని గూర్చి మరణ శాసనము(వసియ్యతు) చేయవలెను. దానికి ఇద్దఱు నమ్మికగల ముసల్మానులను సాక్షులుగ నుంచవలెను. వారిద్దఱు సత్యముగ సాక్ష్య మియ్యవలెను. ప్రయాణములో నుండునపుడు ముసల్మానులు సాక్షులు దొరకనిచో ఇతర మతస్థులను ఇద్దఱిని సాక్షులుగ నుండవలెను. వారిద్దఱు చనిపోవు వాఁడు అప్పగించిన సొత్తును దెచ్చి వారసులకు ఒప్పగింపవలెను. అందు ఏలాటి నమ్మక ద్రోహము చేయరాదు. వారసులకు సందేహము గలిగినచో ఆయిద్దఱు దేవుని పేరుతో మేమబద్ధము పలుకము. సొత్తు హరింపము అని ప్రమాణము ప్రార్థన పిదప చేయవలెను. ఇది వారసులకు ఆ సాక్షుల ద్రోహము రుజువు కాకున్నపుడు జరుగ వలసిన పద్ధతి. ఒకవేళ ఆయిద్దఱు సాక్షులు ద్రోహముచేసి సొత్తును అపహరించి సత్యము దాఁచిరి అని వారసులకు రుజువైనచో వారసులు తమ మాట నిజము అని ప్రమాణము చేయవలెను. అప్పుడు సాక్షులు అపహరించిన సొత్తు వారసులకు వాపసుచేయవలెను లేక దాని వెల కట్టి యియ్యవలెను. 108. ఇట్లు ప్రమాణ మూలకముగ తీసికొనుటలో సాక్ష్యము దాఁచరు అని ఆశయము గలదు. మఱియు సాక్షుల అబద్ధము తెలిసిన పిదప వారసులు ప్రమాణము చేసినచో సాక్షులు చేసి యుండిన ప్రమాణము రద్దు చేయఁబడును అని ధర్మమున్నచో సాక్షులు తమసాక్ష్యమును ప్రమాణమును రద్దు చేయఁబడును అని భీతిల్లి సత్యమే పలుకుదురు. ప్రతి విషయములో దేవుని శిక్షకు భయపడవలెను. దేవుని యాజ్ఞలను విని శిరసావహింపవలెను. అవిధేయతయే స్వభావముగల వారికి సన్మార్గము లభింపదు. వారు దుర్మార్గమునందే పోవుదురు గదా! ఈవాక్యములు ఒక జరిగినవిషయము గూర్చి వచ్చినవి. ఆవిషయము ఇట్లున్నది. బుదైలు అను ఒక ముసల్మానుఁడు తమీము అదీఅను ఇద్దఱు నస్రానీలతోఁ జేరి వ్యాపారమునకుఁగానుసిరియా (షామ్) దేశమునకుఁ బోయెను. సిరియా దేశము చేరిన పిదప బుదైలు రోగపీడితుఁడాయెను. ఆతఁడు తనయొద్దనున్న సొత్తుల పట్టిక వ్రాసి సామానుల

లో పెట్టెను. ఈ విషయము తనలో నున్న నస్రానీలతో చెప్పలేదు. రోగము హెచ్చుకాఁగా ఆ యిద్దఱితో నాసొత్తును నావారసులకు అందఁజేయుఁడు అని మరణ శాసనము (వసియ్యత్) చేసి మరణించెను. ఆయిద్దఱు నస్రానీలు ఆసొత్తును దెచ్చి వారసులకు నందఁజేసిరి. కాని ఒక విలువైన వెండిపాత్రనుఇయ్యక దాఁచి పెట్టుకొనిరి. వారసులు సొత్తుల పట్టికను చూచి ఆయిద్దఱితో మా బంధువుఁడు ఏదైన వస్తువు అమ్మెవాఁడా అని ప్రశ్నించిరి. వారు లేదు అని పలికిరి. దాని పిదప హజ్రత్ రసూలువారి యొద్దకు పోయి ఆ ఇద్దఱిపై దావా చేసిరి. వారసుల యొద్ద సాక్ష్యము లేనందున ఆయిద్దఱు "మేమునమ్మక ద్రోహము చేయలేదు. ఏవస్తువును దాఁచలేదు అని దేవుని పేరుతో ప్రమాణము చేసి నందు నస్రానీల పక్షమున తీర్పు చేయఁబడెను. కొంతకాలమునకు తరువాత ఆ వెండిపాత్ర మక్కాపురములో ఒకకమసాలి యొద్దనుండెను. ఆఇద్దఱు నస్రానీలు వానికి అమ్మి యున్నారని తెలిసెను. ఆయిద్దఱితో వారసులు అడుగఁగా మేము చచ్చిన వారినుండి వెలకు తీసికొంటిమి అని పలుక సాగిరి. అందుకు వారసులు తిరిగి హజ్రత్ పైగంబరులవారి యొద్దకుపోయి యీ విషయము దెలిపిరి. ఆయిద్దఱు నస్రానీలు వెండిపాత్ర వెలకు తీసినట్లు సాక్ష్యము లేనందున వారసులు ఆపాత్ర మాబంధువునిదేను. ఇద్దఱు నస్రానీలు ముందు చేసిన ప్రమాణము అబద్ధము అని ప్రమాణము చేసిరి. నస్రానీలు ఆపాత్రను వేయి దిర్హాముల (పావలాల)కు అమ్మియుండిరి. ఆవెల నస్రానీలు, వారసులకు ఇయ్యవలెను అని తీర్మానమాయెను

169. యౌము-యజ్మ—ఉల్లాహుర్-రుసుల-ఫయఖూలు-మాజా-ఉజిబ్తుమ్-ఖాలూ-లాఇల్మ-లనా-ఇన్నక-అన్త-అల్లాముల్-గుయూబ్.

109. ఏదినమునందు దేవుఁడు ప్రవక్తలందఱిని సమావేశపఱుచునో (ఆ దినమునందు) మీకేమి ప్రత్యుత్తరము లభించినది అని దేవుఁడు పలుకును. (అపుడు) వారు (ప్రవక్తలు) మాకుఁ దెలియదు. నీవే సర్వ రహస్యములు నెఱుంగువాఁడవు అని వారు పలుకుదురు.

వ్యా॥ 109. దేవుఁడు తీర్పుదినము (ఖియామతు)నందు ప్రవక్తలను వారి జనులను సమావేశపఱచి ఓ ప్రవక్తలార! మీరు చేసిన మత ప్రచారమును గూర్చి మీ జనులు ఏమి ప్రత్యుత్తరమిచ్చిరి అని యడుగును. ఆ దినమునందు గలుగు భయముచే ఓ దేవా! మాకుఁ దెలియదు. నీవే సర్వము దెలిసినవాఁడవు. మేము ఇహలోకము వదలి వచ్చిన పిదప మా జనులు (ఉమ్మత్) ఏమి చేసిరో మాకుఁ దెలియదు. నీవే సర్వ రహస్యములు దెలిసినవాఁడవు అని విన్నవింతురు. కావున ఆదినమునకు భయపడి జనులుధర్మమార్గమనుసరింపవలెను.

110. ఇజ్-ఖాలల్లాహు-యా-ఈసబ్న-మర్యమజ్-కుర్-నిఅ్-మతీ-అలైక-వఅలా-వాలిదతిక-ఇజ్-అయ్యత్తుక-బి-రూహిల్-ఖుదుసి-తుకల్లిమున్నాస-ఫిల్-మహ్‌ది-వకహ్‌లన్-వఇజ్-అల్లమ్-తుకల్-కితాబ-వల్-హిక్మత వత్-తౌరాత-వల్-ఇన్జీల-వఇజ్-తఖ్‌లుఖు-మినత్-తీనికహైఅతిత్-తైరి బి-ఇజ్‌నీ ఫతన్‌ఫఖు-ఫీహా-ఫతకూను-తైరమ్ బి-ఇజ్‌నీ-వతుబ్‌రిఉల్-అక్మహ-వల్-అబ్రస బి-ఇజ్‌నీ-వఇజ్-తుఖ్‌రిజుల్-మౌతా-బి-ఇజ్‌నీ వఇజ్-కఫఫ్‌తు-బనీ-ఇస్రాఈల-అన్‌క-ఇజ్-జిఅ్‌తహుమ్-బిల్-బయ్యినాతి-ఫఖాలల్లజీన-కఫరూ మిన్-హుమ్-ఇన్-హాజా-ఇల్లా-సిహ్‌రుమ్-ముబీన్. 111. వఇజ్-ఔ-హైతు ఇలల్-హవారియ్యీన అన్-ఆమినూ-బీ-వ-బిరసూలీ-ఖాలూ-ఆమన్నా-వష్-హద్-బి-అన్ననా ముస్లిమూన్.

110. అప్పుడు మర్యము కుమారుడగు ఓయీసా! నేను నీకును, నీతల్లికిని గావించిన నా యనుగ్రహమును జ్ఞప్తికిదెచ్చుకొనుము. అప్పుడుపరిశుద్ధాత్మతో నీకు బలము నిచ్చితిని. నీవు ఉయ్యాలలోను పెద్దవాడవైనప్పుడును ప్రజలతో మాటలాడుచుంటివి. మఱియు అప్పుడు గ్రంథమును, జ్ఞానమును, తౌరాతును, ఇన్జీలును నీకు నేర్పితిని. మఱియు నప్పుడు నీవు మట్టితో పక్షిరూపము నా సెలవుచే చేసి యూదినపుడు నాయాజ్ఞచే అవి ఎగురుపక్షులగుచుండెను. మఱియు నీవు పుట్టుగ్రుడ్డిని, కుష్ఠరోగిని నా సెలవుచే బాగుపఱచుచుంటివి. మఱియు నప్పుడు నీవు నా సెలవుచే మృతులను లేపి నిలువబెట్టుచుంటివి. నీవు ఇస్రాయీలుల యొద్దకు స్పష్టమైన సూచనలు తీసికొనివచ్చినప్పుడు వారిలో అవిశ్వాసులైనవారు ఇది స్పష్టమైనజాలవిద్య మాత్రమే అని పలికినప్పుడు వారి కుట్రనుండి నిన్ను రక్షించితిని. 111. మఱియు నన్నును, నా ప్రవక్తను విశ్వసింపుడు అని వారల మనస్సులలో నేను వేసినపుడు వారు మేము విశ్వసించితిమి. అని పలికిరి. మఱి మేము విధేయులమైతిమని నీవు సాక్షిగనుండుము అని పలికిరి అని దేవుడు పలుకును. వ్యా॥ 110, 111. ఈ అధ్యాయము (రుకూ) రాబోవు అధ్యాయమునకు ఉపోద్ఘాతమువలెనున్నది. దేవుడు మఱి ఏసుక్రీస్తుకు గావించిన అనుగ్రహములన్నియు దెలిపి రాబోవు అధ్యాయములో తీర్పుదినమందు (116 వ వాక్యములోని) ప్రశ్న వేయును. ఏసుక్రీస్తు పవిత్ర తండ్రిలేక బీబి మర్యమునకు బుట్టెను, అందువలన బీబీ మర్యముపై అపనింద యూదులు మోపిరి. దానికి ఏసుక్రీస్తు ఉయ్యాలలో నున్నపుడు అనగా కొన్ని

నెలల బిడ్డగా నున్నపుడే మాటలాడెను. అందుచే ఆయన తల్లిపైని అపనింద వదలిపోయెను. పరిశుద్ధాత్మ అనగా జిబ్రీలుదూత, ఆదూత ఏసుక్రీస్తుకు తోడుగానుండెను. వారిద్దఱి మధ్య దేవుఁడు గొప్ప సంబంధముంచెను. దానిమహిమ వలననే దేవుని సెలవుచే మట్టితో పక్షులు చేసి వానికి ప్రాణముపోసెను. వైద్యులకు సాధ్యముకాని పుట్టుగ్రుడ్డిని కుష్ఠరోగులను బాగుపఱచెను. మృతులను గోరీలనుండి సజీవులుగ లేపెను, తౌరాతు ఇన్జీలు జ్ఞానము నేర్పెను. ఇట్టి మహిమసూచనలను (మోజిజే) యూదులు మొదలగు ఇస్రాయీలియులు జాల విద్య అని పలికి ఏసును వధింపవలెనని కుట్రచేసిరి. దేవుఁడు తన సర్వశక్తిచే ఏసుక్రీస్తునుదుష్టులనుండి రక్షించి ఆకాశముపైకి నెత్తుకొనెను. హవారీలు (శిష్యులు) ఏసును విశ్వసించునట్లు దేవుఁడు చేసెను. ఇవన్నియు దేవుఁడుఏసుక్రీస్తు ప్రవక్తకు గావించిన యనుగ్రహములు.

112. ఇజ్-ఖాలల్-హవారియ్యూన-యా-ఈసబ్న-మర్యమ-హల్-యస్తతీఉ-రబ్బుక-అన్-యునజ్జిల-అలైనా-మాఇదతమ్-మినస్-సమాఇ-ఖాలత్-తఖుల్లాహ-ఇన్-కున్తుమ్-మూమినీన్. 113. ఖాలూనురీదు-అన్-నాకుల-మిన్హా-వతత్-మఇన్న-ఖులూబునా-వనఅ-లమ-అన్-ఖద్-సదఖ్తనా-వ-నకూన-అలైహా-మినష్-షాహిదీన్. 114. ఖాల-ఈసబ్ను-మర్యమల్లాహుమ్మ - రబ్బనా-అన్జిల్-అలైనా మాఇదతమ్-మినస్-సమాఇ-తకూను-లనా-ఈదల్-లిఅవ్వలినా-వ-ఆఖిరినా-వఆయతమ్-మిన్క-వర్జుఖ్నా- వఅన్త-ఖైరుర్ - రాజిఖీన్- 115. ఖాలల్లాహు-ఇన్నీ మునజ్జిలుహా అలైకుమ్-ఫమన్-యక్ఫుర్-బఅ - దుమిన్కుమ్-ఫఇన్నీ-ఉఅజ్జిబుహూ-అజాబల్-లా-ఉఅజ్జిబుహూ-అహదమ్ మినల్-ఆలమీన్.

112. హవారీలు "ఓ మర్యముకుమారుఁడగు ఈసా! నీ ప్రభువు ఆకాశమునుండి ఆహారముతో నుండిన ఒక తట్ట మాపై దింపఁగలఁడా అని పలుకఁగా మీరు విశ్వాసులైనచో దేవునికి భయపడుఁడు అని ఈసా పలికెను. 113. (అప్పుడు) వారు మేము దానినుండితిని మామనస్సులు శాంతిపడుటకును, నీవు మాతో సత్యము పలికితివి అని తెలిసికొనుటకును, దానిగూర్చి మేము సాక్షులుగ నుండుటకును కోరుచున్నారము అనిపలికిరి. 114. (అప్పుడు) మర్యమ్ కుమారుఁడగు ఈసా "ఓ దేవా! మాప్రభువా! ఆకాశమునుండి ఆహారముతో నుండిన ఒక తట్టనును, మాకు, మాపూర్వికులకును, మా వెనుక రాఁబోవువారి

కిని పండుగ అగునట్లును. నీయొద్దనుండి సూచనగాను, ఆకాశమునుండి మాపై దింపుము. మఱి మాకు అహారమొసంగుము. నీవే శ్రేష్ఠమైన యాహారముల నొసంగువాఁడవు'' అనిపలికెను. 115. (అపుడు) దేవుఁడు, దానినిమీపై దింపుదును. ఆ పిదప మీలో నెవఁడు కృతఘ్నుఁడగునో వానికి లోకములో నెవ్వనికి విధింపనట్టి శిక్ష విధింతును అని పలికెను.

వ్యా॥ 112 : 115. ఏసు ప్రవక్త శిష్యులు (హవారీలు) మేము దేవుని మహిమను కనుగొని దానిగూర్చి సాక్ష్యమిచ్చుటకు ఆకాశమునుండి ఆహారముతో నుండిన యొక తట్టను మాకొఱకు దేవుఁడు దింపవలెను అని కోరిరి. దానికిఁగాను ఏసుక్రీస్తు దేవునిని పైవిధముగ వేఁడుకొనఁగా ఆహారముతో నుండిన ఒక తట్టు దిగెను. అందుండినది వారు భుజించి తృప్తిచెందిరి. కొందఱు కృతఘ్నత చూపినందున వారు చాల కఠినముగ శిక్షింపఁబడిరి. భక్తులు, ఆహారము సంపాదించుటకు కృషి సలుపవలెను. కాని కృషిలేకయే ఆకాశమునుండి దిగిన ఆహారమును తినుదుమని వేఁడుట మంచిదికాదు. ఇందు ముసల్మానులకుబోధన కలదు. కావుననే హజ్రత్ పైగంబరులవారి శిష్యులు అట్లు కోరలేదు.

116. వఇజ్-ఖాలల్లాహు-యా-ఈసబ్న-మర్యమ-అఅన్త-ఖుల్త-లిన్నాసిత్-తఖిజూనీ వఉమ్మియ-ఇలాహైని-మిన్-దూనిల్లాహి-ఖాల-సుబ్-హానక-మా యకూను-లీ-అన్-అఖూల-మా లైసలీ-బి-హఖ్ఖిన్-ఇన్-కున్తు-ఖుల్తుహూ-ఫఖద్-అలిమ్ తహూ-తఅ-లము-మాఫీ-నఫ్సీ-వలా అఅ-లము-మాఫీ-నఫ్సిక-ఇన్నక-అన్తల్ అల్లాముల్-గుయూబ్. 117. మాఖుల్తు-లహుమ్-ఇల్లా-మా-అమర్తనీ-బిహీ-అనిఅ-బుదుల్లాహ-రబ్బీ-వరబ్బకుమ్-వకున్తు-అలైహిమ్-షహీదమ్-మాదుమ్తు-ఫీహిమ్ ఫలమ్మా-తవఫ్-ఫైతనీ-కున్త-అన్తర్-రఖీబ-అలైహిమ్-వఅన్త-అలాకుల్లి-షైఇన్-షహీద్. 118. ఇన్-తుఅజ్-జిబ్-హుమ్-ఫఇన్నహుమ్-ఇబాదుక వఇన్-తగ్ఫిర్-లహుమ్-ఫఇన్నక-అన్తల్-అజీజుల్-హకీమ్. 119. ఖాలల్లాహు హాజా-యౌము-యన్ఫఉస్-సాదిఖీన-సిద్ఖుహుమ్ లహుమ్-జన్నాతున్-తజ్రీ-మిన్-తహ్తి-హల్-అన్-హారు-ఖాలిదీన-ఫీహా-అబదన్-రజి యల్లాహు-అన్-హుమ్-వరజూ-అన్హు-జాలికల్-ఫౌజుల్-అజీమ్. 120. లిల్లాహి-ముల్కుస్-సమావాతి-వల్-అర్జి-వమా-ఫీహిన్న-వహువ-అలాకుల్లి-షైఇన్-ఖదీర్.

116. మఱియు ఓమర్యముకుమారుఁడగు ఈసా! నీవు ప్రజలతో దేవుని వదలి నన్నును, నాతల్లిని దేవునిఁగాఁ జేసికొనుఁడు అని చెప్పితివా అని దేవుఁడు పలుకును. అపుడు ఈసా "నీవు పరమపవిత్రుఁడవు. నాకు పలుకుటకు హక్కు లేనిమాటను నేను పలుకుట నాకు సరిగాదు. నేనట్లు చెప్పియుంటి నేని అది నీకు తప్పక తెలిసియుండును. నాయాత్మలో నున్నది నీవెఱుంగుదువు. మఱి నీయందున్న దానిని నేను ఎఱుంగను. నిశ్చయముగ నీవే సర్వరహస్యములు తెలిసిన వాఁడవు. 117. నాప్రభువును, మీప్రభువును అగు దేవు నారాధింపుఁడు అని నీవు నన్ను అజ్ఞాపించియున్న విషయమును మాత్రమే వారితోఁ జెప్పితిని. మఱి నేను వారిలో నున్నంతకాలము వారి విషయము చూచుచుంటిని. మఱి నీవు నన్ను తీసికొన్న పిదప నీవే వారి విషయము చూచుచుంటివి. మఱి నీవే సర్వమును తెలిసినవాఁడవు. 118. నీవు వారిని శిక్షించినచో వారు నీదాసులు, మఱి వారిని నీవు క్షమించినచో నీవేసర్వశక్తుఁడవును, వివేచనాపరుఁడవునుఅని ఏసు పలుకును. 119. ఈదినమున సత్యవంతులకు వారి సత్యము లాభమిచ్చును, (పనికివచ్చును) వారికి కాలువలు ప్రవహించునట్టి స్వర్గ వనములు గలవు. అందు వారు సదా యుందురు. దేవుఁడు వారితో ఇష్టపడెను. మఱియు వారు దేవునితో సంతోషపడిరి. ఇదియే గొప్పవి జయము అని దేవుఁడు పలుకును. 120. ఆకాశములోను, భూమిలోను వానియందున్న సమస్తములోను దేవునిదే ప్రభుత్వము. మఱియు ఆతఁడే సర్వముపై శక్తిగలవాఁడు.

వ్యా॥ 116 : 119. మునుపటి (110) వాక్యములలో దేవుఁడు ఏసుక్రీస్తుకును ఆతని తల్లికిని గావించిన యనుగ్రహములను, తీర్పుదినమున వారికిఁదెలిపి వారి మతస్థులయెదుట ఈప్రశ్న వేయును. ఎందుకన క్రైస్తవులుఏసును, ఆతని తల్లిని దేవుళ్లుగాఁ జేసికొనిరి. అపుడు ఈసా భయభక్తులతో ఓ దేవా! నీవు పరమపవిత్రుఁడవు, నీకు సాటిగ నితరులను దేవునిగా జేసికొనుఁడు అని నేను చెప్పుదునా? నిన్నే యారాధింపుఁడు అని ప్రజలకు బోధించితిని. నేను వారి యొద్ద నున్నంతకాలము వారి విషయము నాకుఁ దెలియును. ఆ తరువాత వారి విషయము నీకే దెలియును. నీకు సర్వము దెలియును. ప్రజలు నీదాసులు, నీకు లోఁబడినవారు. నీవు వారిని శిక్షించిన అది న్యాయమే. లేక క్షమించుట కును నీకు శక్తిగలదు. క్షమింపఁగలవు. నీ శిక్షనుండి తప్పించుకొనుటకు ఎవరికిని శక్తి లేదు అని విన్నవించును. ఏసుక్రీస్తు తన జవాబు ముగించి తన సత్యము వెల్లడించి నపుడు దేవుఁడు నీవు పలుకునదిసత్యము. కావున ఈదినము తీర్పు దినము (ఖియామత్) ఇందు సత్యవంతులకు వారిసత్యము పనికివచ్చును. దాని ఫలితముగ స్వర్గవనములు లభించును. అందు శాశ్వత నివాసము లభించును. అన్నిటికన్న గొప్పదియగు దేవుని యిష్టము భక్తులకు లభించును. దానివలన

భక్తులు సంతోషపడుదురు. నరకము తప్పి స్వర్గము లభించి దేవుని ప్రీతి పడయుటయే గొప్ప జయమును మోక్షమును అని పలుకును. కావున ప్రజలు దేవుని ప్రీతి పడయుటకు ఇహమునందే సత్యము వహించి సంపూర్ణ భక్తులు (ముసల్మానులు) కావలెను. 120. దేవుడు సర్వశక్తుడు. సర్వత్ర దేవుని రాజ్యమున్నది. ఆతని రాజ్యములో సత్కార్యములు చేసినవారికి వారికి తగిన గొప్ప పుణ్యఫలితము లభించును. అటులే అవిశ్వాసులై దుష్టకార్యములుచేసినవారికి పాపకార్యముల ఫలితముగ నరకశిక్ష గలుగును. ఇహలోకములోను పరలోకములోను అవిశ్వాసులగు దుష్టులు చెడుదురు. కావున అందఱు మానవులు దేవుని విశ్వసించి ఉభయలోకముల మేలు పొందుదురుగాక.

సూరయే అన్ ఆమ్ (పశువులు) మక్కీ 165 వాక్యములు.

సూరయే అన్ ఆమ్. ఇందు పశువులనుగూర్చిన ధర్మముగలదు. కాన అన్ ఆమ్ అని పేరు గలిగినది. ఇది మక్కాలో హజ్రత్ రసూలువారికి దేవునిచే లభించినది. కావున ఇది మక్కీ. ఇందు, 165 వాక్యములు గలవు. ఇందు దేవుని యేకత్వమునుగూర్చి సూచనలు, ప్రమాణములు ధర్మములు గలవు.

బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీమ్.
పరమదయాళువును ప్రేమించువాడునగు దేవునిపేర.

1. అల్ హమ్దు-లిల్లా-హిల్లజీ-ఖలఖస్-సమా వాతి-వల్-అర్ జి-వ-జ-అలజ్ జులుమాతి-వన్-నూర సుమ్మల్ల-జీన-కఫరూ-బి-రబ్బిహిమ్-యఅ్-దిలూన్ - వ హువల్లజీ-ఖలఖకుమ్-మిన్-తీనిన్- సుమ్మఖజా-అజలన్-వ-అజలమ్- ముసమ్మన్-ఇన్దహూ-సుమ్మ-అన్తుమ్-తమ్-తరూన్. 3. వహువల్లాహు-ఫిస్-సమావాతి-వ ఫిల్-అర్ జి-యఅ్-లము-సిర్రకుమ్ వ-జహ్రకుమ్-వయఅ్-లము-మా తక్-సిబూన్

1. ఆకాశములను, భూమిని పుట్టించి, చీకటులను, వెలుతురునుచేసినట్టి దేవునికే సర్వస్తోత్రములున్నవి. ఆ పిదపకూడ అవిశ్వాసులైనవారు తమ ప్రభువుతో నితరులను సమానులుగఁ జేయుచున్నారు. 2. ఆతఁడే మిమ్ము మట్టిలో పుట్టించిన యాతఁడు. మరల ఒక కాలము నియమించెను. మఱియు నొక గడువు దేవునియొద్ద నియమింపఁబడియున్నది. ఆ పిదపకూడ మీరు సందేహపడుచున్నారు. 3. మఱియు, ఆతఁడే ఆకాశములందును భూమియందునున్న దేవుఁడు. ఆతఁడుమీరహస్యములనుమీసువెల్లడించుదాని నెఱుఁగుచున్నాఁడు. మఱి మీరు చేయునదంతయును ఆతనికిఁ దెలియును.

వ్యా॥ ఈవాక్యమునందు దేవుఁడు తన విషయము మానవులకుఁ దెలుప

చున్నాఁడు. ఆకాశములను అందలి సమస్తమును భూమియందలి సమస్తమును సృష్టించిన సర్వశక్తుఁడే దేవుఁడు. అందు రాత్రింబవళ్లలో చీఁకటి వెలుతురు, అటులే జ్ఞానము, అజ్ఞానము, సన్మార్గము దుర్మార్గము, బ్రతుకు చావు, మొదలగు వ్యతిరేకములైనవానిని కల్పించిన సర్వశక్తుఁడగు ప్రభువు సర్వస్తోత్రములకు అర్హుఁడు. ఆతనికిఁదప్ప నెవరును ఆరాధింపఁదగినవాఁడు లేఁడు. దేవుని మహిమలను గుర్తెఱిఁగియు అవిశ్వాసులు, పెక్కుదైవములను కల్పించుచు వానిని దేవునికి సమానులుగఁ జేయుచున్నారు. అవిశ్వాసులలో కొందఱు సూర్యచంద్రాదులను, కొందఱు రాళ్లను, కొందఱు చెట్లు చేమలను, కొందఱు అగ్నిని మఱికొందఱు జంతువులను దేవునిగా, దేవునికి సమానముగా నెంచి పూజింతురు. దేవుని వదలి యితర దైవములను కల్పించుట మానవులకుఁదగదు. కావుననే రాఁబోవు వాక్యములో మానవులెట్లు సృష్టింపఁబడిరో తెలుపఁబడుచున్నది. 2. మానవులకు ఆదిపురుషుఁడగు ఆదమును మట్టితోఁ జేసి ఆతని దేహములో దేవుఁడు ప్రాణముపోసి తన సర్వశక్తిచే ఆతనిని సజీవునిగాఁ జేసెను. ఆతని మూలమున మానవులు పుట్టి లోకమంతటను వ్యాపించిరి. మానవులకొఱకు ఒక కాలము నియమించెను. అది పూర్తియైన పిదప వారికి చావు వచ్చుచున్నది. మానవుఁడు తాను తిను ఆహారముకూడ మట్టినుండియే పుట్టుచున్నది. ఆ యాహారము మూలమున సంతానమునకు మూలాధారమైన రేతస్సు కలుగుచున్నది. తుదకు చచ్చి దేహము మట్టిలో కలియుచున్నది. అటులే ఈలోకము నశించును. తిరిగి మానవుల కర్మల తీర్పుకొఱకు ఒక గడువు నియమింపఁబడియున్నది. అదియే తీర్పుదినము (ఖియామత్). ఆ దినము తప్పక వచ్చును. కాని యది వచ్చుకాలము దేవునికే తెలియును. 3. భూమ్యాకాశములలోను సర్వాధికారముగలవాఁడు వానిని సృష్టించినట్టి దేవుఁడు ఒక్కఁడే. ఆతఁడు తప్ప వేఱు దైవము లేఁడు. ఆతనికి సర్వము తెలియును. మానవుల రహస్యములును, వారు వెల్లడించునవియును ఆతనికిఁ దెలియును. మానవులు చేయు ప్రతి కర్మయును దేవునికిఁ దెలియును. వానికిఁ దగిన ఫలిత మొసంగును. కావున మానవులు తమ ప్రతి విషయములోను దేవుని సహాయమే వేఁడవలెను. ఆతనికి సాటి కల్పింపరాదు.

4. వ-మా తాతీహిమ్-మిన్-ఆయతిమ్-మిన్-ఆయాతి-రబ్బిహిమ్-ఇల్లా-కానూ-అన్‌హా-ముఅరిజీన్. 5. ఫఖద్-కజ్-జబూ-బిల్-హఖ్ఖి-లమ్మా-జాఅహుమ్-ఫసౌఫ-యాతీహిమ్-అమ్-బాఉ-మా-కానూబిహీ-యస్-తహ్-జిఊన్-6. అలమ్-యరౌ-కమ్-అహ్లక్నా-మిన్-ఖబ్లిహిమ్-మిన్-ఖర్నిమ్-మక్... కన్నా

హుమ్-ఫిల్-అర్జి-మాలమ్-నుమక్కిల్-లకుమ్-వఅర్-సల్నస్- సమాఅ - అలైహిమ్-మిద్రారన్-వజఅల్నల్-అన్హార-తజ్రి-మిన్-తహ్తి హిమ్-ఫ- అహ్లకా్నహుమ్-బిజునూబిహిమ్-వ-అన్షానా-మిమ్-బఅ-దిహిమ్-ఖర్నన్-ఆఖరీన్.

4. మఱియు అవిశ్వాసుల యొద్దకు వారి ప్రభువు సూచనలలో నేదైన యొక సూచన వచ్చినచో దానినుండి వారు ముఖము త్రిప్పుకొనుచున్నారు. 5 కావున వారు తమ యొద్దకు సత్యము వచ్చినపుడు అది అబద్ధమని పలికిరి. కావున వారు దేనిగూర్చి పరిహాసమాడుచుండిరో దాని ప్రతి ఫలము వారికి రానున్నది. 6 వారికి పూర్వము ఎన్ని సంఘములవారిని నశింపజేసితిమో వారు చూడలేదా. మీకొసంగని బల సంపదలు వారికి లోకములో నొసంగి యుంటిమి. మఱి వారిపై ఆకాశము నుండి వర్షధారలు కురియించితిమి. వారికిఁగాను ప్రవహించు కాలువలు ఏర్పఱచితిమి. పిదప వారిపాపముల వలన వారిని నశింపఁజేసితిమి. మఱియు వారిపిదప ఇతర సంఘముల వారిని పుట్టించితిమి.

వ్యా॥ 4. అవిశ్వాసులు (కాఫిర్లు) దేవుఁడు తన ప్రవక్తల మూలమున పంపు తన మహిమను దెలుపు సూచనలను సందేశ వాక్యములను వినక తిరస్కార భావముతో పెడ మొగము పెట్టిరి. సత్యము (ఖురానెషరీఫు)ను అవిశ్వాసులు విని యందలి పూర్వులకు సంభవించిన ఫలితములను విని పరిహాసమాడసాగిరి. పాపముల వలన నాశము గలుగునా అని వెగతాళి చేయసాగిరి. అందుకుదాని ఫలితము శీఘ్రములో మీరు అనుభవింపఁగలరు. అపుడు దాని వాస్తవము మీకుఁ దెలియనగును అనిమందలించుచు రాఁబోవు వాక్యములో పూర్వము గడచిన ఆదు సమూదు మొదలగు సంఘముల వారు తమ సంపదలచే మైమఱచి పాపములు చేసి నాశమొందిరి అను విషయము తెలుపఁబడుచున్నది. 6. మక్కా ఖురైషులలోని కాఫర్లను ఇతర అవిశ్వాసులను తమ పూర్వికులకు లభించిన ఫలితమును తెలిసికొనియైన తాము బుద్ధి తెచ్చుకొని సన్మార్గమునకు రావలెను. పూర్వికులు సకాల వర్షముల వలనను కాలువల వలనను మీకంటె సంపదలు హెచ్చుగా పొంది అన్నివిధముల సౌఖ్యములలో వృద్ధిపొందిరి. అట్టి వారే తాము కావించిన పాపములకుఁగాను నశించిరి. వారిపిదప ఇతర సంఘములు పుట్టి వృద్ధి పొందినవి. ఒకరి నాశముపలన లోకమునందులోటురాదు. కావున మీరుకూడ అట్టి దుర్గతి పొందకుండుటకై ప్రవక్తను నమ్మి సత్యమైనఖురాను గ్రంథము ననుసరింప వలెను అని హెచ్చరింపఁ బడియెను.

7. వలౌ-అన్జల్నా-అలైక-కితాబన్-ఫీఖిర్తాసిన్-ఫ-లమసూహు- బి-

ఐదీహిమ్-లఖా-లల్లజీన-కఫరూ-ఇన్-హాజా-ఇల్లా-సిహ్రుమ్-ముబీన్. 8. వఖాలూ-లౌలా-ఉన్జిల-అలైహి-మలకున్-వలౌ-అన్జల్నా-మలకల్-లఖుజియల్-అమ్రు-సుమ్మ-లాయున్-జరూన్. 9. వలౌ-జఅల్నాహు-మలకల్-లజఅల్నాహు-రజులన్-వల-లబస్నా-అలైహిమ్-మాయల్బిసూన. 10. వలఖదిస్-తుహ్జి-అ-బిరుసులిమ్-మిన్-ఖబ్లిక-ఫహాఖ-బిల్లజీన-సఖిరూ-మిన్-హుమ్-మాకానూ-బిహీ-యస్-తహ్జి-ఊన్.

7. ఓ ప్రవక్తా! ఒకవేళ మేము కాగితములో వ్రాసిన గ్రంథమును నీకొసంగిన అవిశ్వాసులు దానిని తమ చేతులార తాకినను విశ్వాసహీనులు ఇది స్పష్టమైన జాల విద్యమాత్రమే అని పలుకుదురు. 8 మఱియు ప్రవక్త యొద్దకు దేవదూత ఎందులకు దిగి రాలేదు అని అవిశ్వాసులు పలుకుచున్నారు. మఱి మేము దేవదూతను పంపినచో కార్యము ముగిసిపోయి యుండును. పిదప వారికి అవకాశము లభింపక పోయి యుండును. 9. మఱియు మేము దేవదూతను ప్రవక్తగాఁ జేసి పంపి యుంటిమేని అతఁడు కూడ మానవ రూపములోనే వచ్చి యుండును. మఱి ఇపుడు గలుగుచున్న సందేహములే అపుడు కూడ వారికిఁ గలుగును. 10. నీకు పూర్వము గడచిన ప్రవక్తలతోను అప్పటివారు పరిహాసమాడుచుండిరి. కావున పరిహాస మాడుచున్నవారిని వారి పరిహాస ఫలితమువచ్చి క్రమ్ముకొనెను.

వ్యా॥ 7. మక్కాలోని కాఫిర్లు కొందఱు హజ్రత్ రసూలి వారితో ఆకాశమునుండి వ్రాసిన గ్రంథముదిగి దానితోఁబాటు నలుగురు దేవదూతలు (ఫరిష్తే) వచ్చి యిది దేవుని గ్రంథము అని సాక్ష్యమిచ్చినచో మేము నమ్మెదము అని పలికిరి. దానికి నిందు జవాబియ్యఁ బడినది. ఖురానును విని యిది జాలవిద్య అని పలుకునట్టి విరోధులైన అవిశ్వాసులు తమ ద్వేషముచే వారియొద్దకు కాగితములలో వ్రాసిన గ్రంథము ఆకాశమునుండి దిగి దానిని వారు తమ చేతులార తాకినను తిరిగి అది జాలవిద్యయే అని పలుకుదురు. కాని విశ్వసింపరు. దుష్టులకు సన్మార్గ మెట్లు లభించును? వారు సందేహములోనే పడియుందురు. 8. ప్రవక్తతో ఒకదూత (ఫరిష్తా) యుండి ఈయన దేవుని ప్రవక్త అని మాయెదుట పలుకవలెను అని కాఫిర్లు పలికిరి. దానికి నిందు జవాబియ్యఁబడినది. దేవదూత తన వాస్తవ రూపములో వచ్చినచో మనుష్యులు అతని రూపము చూడలేరు. ఆజ్ఞ్యోతిని భరింపలేక చచ్చిపోవుదురు. ప్రవక్తలు మాత్రము దేవదూతల వాస్తవ రూపమును చూచి భరింపఁగలరు. హజ్రత్ రసూలువారు రెండుతూర్లు

మాత్రము జిబ్రీలు దూతను అతని వాస్తవ రూపములో చూచి యున్నారు. మ
రియు మానవులు కోరినట్లు దేవుఁడు తన సూచనలను చూపించినచో దాని
పిదప మానవులు తిరస్కరించినచో వారు దేవుని శిక్షకు పాత్రులై నశింతురు.
వారికి మరల అవకాశము (ముహ్లత్) దొరకదు. కావున మానవులు కోరు సూ
చనలు (మూజిజే) అన్నియును చూపక యుండుటయును దేవుని యనుగ్రహమే.
లేనిచో లోకము నశించి పోవును. 9. దేవదూత ప్రవక్తగా మానవుల యొద్దకు
వచ్చినను ఆతఁడు మానవుల రూపము దాల్చియే రావలయును. ఎందుకన మాన
వులు తమ జాతికి చేరిన మానవులతోనే సంబంధముంచి గ్రహింపఁగలరు.
వేఱు రూపము దాల్చి వచ్చినచో భీతిల్లి దానికి దగ్గఱకుఁగూడ పోనే
రరు. దుష్ట స్వభావము గలగి సందేహమును గలవారు దేవదూత మానవరూ
పము దాల్చి ప్రవక్తగా వచ్చినను అపుడు కూడ తమ సందేహములు వదలరు.
10. దుష్టులకు జవాబిచ్చిన పిదప దేవుఁడు హజ్రత్ రసూలు వారిని ఓదార్చు చు
న్నాఁడు. ఓ ప్రవక్తా! నీవు దుష్టుల నిందలకును వారి పరిహాసమునకును చింతపడ
వద్దు. ఇది క్రొత్తగాదు. పూర్వము అనేక ప్రవక్తలు వచ్చిరి. వారితోను దుష్టు
లు ఇటులే ప్రవర్తించిరి. ప్రవక్తలను హింసించిన దుష్టులు తమ పాపములకు
శిక్షపొంది నశించిరి. అటులే నిన్ను హింసించు దుష్టులుకూడ నశింపఁగలరు. తు
దకు నీప్రచారమే సాగును.

11. ఖుల్-సీరూ-ఫిల్-అర్‌జి-సుమ్మన్-జురూ-కైఫ-కాన-ఆఖిబతుల్-ముకజ్‌జిబీన్.

11. మీరు భూమిలో సంచారముచేసి తిరస్కరించు వారిగతి(ఫలితము)
ఏమాయెనో చూడుఁడు అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 11. పూర్వము అనేక సంఘములవారు ప్రవక్తలను తిరస్కరించి
దాని ఫలితముగ నశించిరి. భూమిలో తిరిగి చూచిన పాడుపడిన వారి దేశ
ములు కనఁబడును. అది చూచి బుద్ధిమంతుఁడు బుద్ధి తెచ్చుకొనవలెను. అదుర్గ
తియే ప్రవక్తలతో పరిహాస మాడువారిది యగును అని తెలిసికొనవలెను.

12. ఖుల్-లిమన్-మాఫిస్-సమావాతి-వల్-అర్‌జి-ఖుల్-లిల్లాహి-కతబ
అలా-నఫ్సిహిర్-రహ్మత-లయజ్-మఅన్నకుమ్-ఇలా-యౌమిల్-ఖియామతి-
లా-రైబ-ఫీహి-అల్లజీన-ఖసిరూ-అన్-ఫుసహుమ్-ఫహుమ్-లాయూమినూన్. 13.
వలహూ-మాసకన-ఫిల్-లైలి-వన్-నహారి-వహువస్-సమీఉల్-అలీమ్. 14.
ఖుల్-అ-గైరల్లాహి-అత్-తఖిజు-వలియ్యన్-ఫాతిరిస్-సమావాతి-వల్-అర్‌జి వ
హువ-యుత్-ఇము-వలా యుత్-అము-ఖుల్-ఇన్నీ-ఉమిర్తు-అన్-అకూన-అవ్వల

మన్-అస్ల ము-వలాతకూనన్న-మినల్-ముష్రికీన్. 15. ఖుల్-ఇన్నీ-అఖాఫు- ఇన్-అసైతు-రబ్బీ-అజాబ-యౌమిన్-అజీమ్. 16. మన్-యుస్-రఫ్ అన్ హు- యౌమఇజిన్ ఫఖద్-రహిమహూ వజాలిక-ఫౌజుల్-ముబీన్.

12. ఆకాశములలోను భూమిలోనున్న సమస్తము ఎవరిది యని అడుగుము దేవునిదే అని పలుకుము. ఆతఁడు తాను కరుణచేయవలెనని యే విధించుకొని యున్నాఁడు. తుది దినమునందు మిమ్ము సమావేశ పఱచును. ఆదినమును గూర్చి ఏలాటి సందేహము లేదు. ఎవరు తమ యాత్మలకు నష్టము చేసికొనిరో వారు విశ్వసింపరు. 13. రాత్రింబవళ్ళలో వసించున దంతయు దేవునిదే మఱియు ఆతఁడే సర్వము వినువాఁడు సర్వజ్ఞుఁడు. 14. ఏమి? ఆకాశములకును భూమికిని సృష్టికర్తయగు దేవుని దప్ప నితరులను నేను సహాయునిగాఁ చేసికొనవలయునా? మఱి ఆతఁడే సర్వమునకు ఆహార మిచ్చుచున్నాఁడు. మఱి ఆతనికి నెవ్వఁడును ఆహార మిచ్చుట లేదు. అని ఓ ప్రవక్త! పలుకుము అందఱికంటె ముందుగా నేను దేవునికి విధేయుఁడు కావలెననియు దేవునికి సాటి కల్పించు వారితో నీవు చేరకూడదనియు నాకు అజ్ఞయైనది అని ఓ ప్రవక్తా వలుకుము. 15. నేను నా ప్రభువు మాట విననిచో నాకు గొప్ప దినమునందు శిక్ష గలుగును అని నేను భయపడుచున్నాను అని ఓ ప్రవక్తా! పలుకుము. 16. ఆదినమునందు ఎవనికిశిక్ష లేకుండ పోయెనో, వానిని దేవుఁడు కరుణించెను. మఱి ఇదియే గొప్పజయము.

వ్యా॥ 12. భూమ్యాకాశములలో దేవునిదే అధికారము చెల్లును. సర్వము దేవుఁడు సృష్టించినదే. ఈవిషయము విగ్రహారాధకులు ఎఱింగియు దేవునికి సాటి కల్పించుచుండిరి. పాపముల శిక్షనుండి తప్పించు వారెవరును లేరు. దేవుఁడు పాపులను తత్ క్షణమే శిక్షింపకుండుటకు కారణము ఆతని కరుణయే. కర్మల తీర్పు కొఱకు తీర్పు దినము (ఖియామతు) రానున్నది. అందువలాటి సందేహము లేదు. అపుడు మానవులందఱు తమతమ కర్మల పాపపుణ్యముల తీర్పు పొందుదురు. అపుడు ఎవరు తమ యాత్మలకు నష్టము చేసికొని విశ్వసింక అవిశ్వాసులైరో వారికి తప్పక శిక్ష లభించును. కావున మానవులు ఆదినమునకు భయపడి విశ్వసించి తీరవలెను. 13:15. రాత్రియందును పగలందును వసించి సౌఖ్యముపొందు ప్రతిజీవియు దేవునికి అధీనమై యున్నది. అందఱి మొఱలను వినుచు సర్వము ఎఱింగి సర్వమునకు సృష్టికర్తయై సర్వమునకు పోషకుఁడైన దేవుఁడే అందఱకు అన్ని అవస్థలందును తోడుపడువాఁడు ఆతఁడే. సర్వమునకు ఆహార మొసంగుచున్నాఁడు. ఆతనికి ఆహారము మొదలగు అక్కఱలు లేవు. కావున అట్టి దేవుని వదలి శక్తిహీనులైన యితర దైవముల సహాయము నేను

కోరను, ఆతనికే నేను విధేయుఁడను. విగ్రహారాధకులతో నేను చేరను. నేను దేవునిమాట విననిచో నాకు గొప్ప దినమగు తీర్పు దినమందు శిక్షగలుగునని నాకు భయముగలదు అని ప్రకటింపవలెనని పైగంబరులవారికి దేవుని సెలవా మెను. 16. దేవుని ప్రీతియును స్వర్గమును లభించుట గొప్ప విషయము. ముందు తీర్పు దినమునందలి బాధ మానవులనుండితొలఁగినచో అదియేగొ ప్పజయమును మోక్షమును. అది తొలఁగుటకుఁగాను విశ్వసించి సత్కార్యములు చేయవలెను.

17. వఇన్-యమ్సస్-కల్లాహు-బి జుర్రిన్-ఫలాకాషిఫ లహూ- ఇల్లా-హువ-వఇన్-యమ్సస్క-బిఖైరిన్-ఫహువ-అలాకుల్లి-షైఇన్-ఖదీర్. 18. వహువల్-ఖాహిరు-ఫౌఖ-ఇబాదిహీ-వహువల్-హకీముల్-ఖబీర్. 19. ఖుల్-అయ్యు షైఇన్-అక్బరు-షహాదతన్-ఖులిల్లాహు-షహీదుమ్-బైనీ-వబైనకుమ్-వ-ఊహియ-ఇలయ్య-హాజల్-ఖుర్ఆను-లి-ఉన్జిరకుమ్-బిహీ-వ-మమ్బలగ - అఇన్న కుమ్-లతష్-హదూన-అన్న-మఅల్లాహి-ఆలిహతన్-ఉఖ్రా-ఖుల్-లాఅష్-హదు ఖుల్-ఇన్నమా-హువ-ఇలాహున్-వాహిదున్-వఇన్ననీ-బరీఉమ్-మిమ్మా - తుష్రికూన్. 20. అల్లజీన-ఆతైనా-హుముల్ కితాబ-యఅ-రిఫూనహూ-కమా-య అ-రిఫూన-అబ్నా-అహుమ్-అల్లజీన-ఖసిరూ-అన్ఫుసహుమ్-ఫహుమ్-లాయూమినూన్.

17. మఱియు దేవుఁడు నీకు కష్టము కలిగించినచో ఆతఁడు దప్ప మఱెవరును దానిని దొలఁగింపలేరు. మఱి దేవుఁడు నీకు మేలు చేసినచో ఆతఁడు సర్వముపై శక్తిగలవాఁడు. 18. మఱియు ఆతఁడే తన దాసులపై అధికారము గలవాఁడు. మఱియు ఆతఁడే వివేచనాపరుఁడును, సర్వజ్ఞుఁడును. 19. అందఱి కంటె గొప్పసాక్షి ఎవఁడు అని అడుగుము. దేవుఁడు నాకును మీకును సాక్షి. మఱి మీకును మఱియు ఈ ఖురాను ఎవ రెవరికి చేరునో వారికి భయపెట్టుటకుగాను ఈ ఖురాను సందేశము నాకు పంపఁబడినది అని ఓ ప్రవక్తా! పలుకుము. ఏమి మీరు దేవునితోఁగూడ ఇతర దైవములున్నవి అని సాక్ష్యమిత్తురా! (అట్లు) నేను సాక్ష్యమియ్యను అని ఓ ప్రవక్తా! పలుకుము. ఆతఁడు ఒక్కఁడే దేవుఁడు. మఱి మీరు ఆతనితో సాటి కల్పించునట్టి దానినుండి నేను అసహ్యపడుచున్నాను అని ఓ ప్రవక్తా! పలుకుము. 20. మేము, ఎవరికి గ్రంథమొసంగియున్నామో వారు తమపుత్రులనుగుర్తించునట్లు ప్రవక్తను గుర్తించుచున్నారు. ఎవరు తమ యాత్మలను నష్టములోపడ వేసిరో వారు విశ్వసింపరు.

వ్యా॥ 17: 18. మానవులకు కష్టసుఖములు దేవునివలననే కలుగుచున్నవి. కష్టములను దేవుఁడు దప్ప నితరు లెవ్వరును తొలఁగింపఁజాలరు. అటులే దేవుఁడు అనుగ్రహించు మేలును ఎవరును ఆటంకపఱచఁజాలరు. దేవుఁడు సర్వశక్తుఁడు. ఆతని శక్తికి మించినది లేదు. ఆతనికి సర్వముపై అధికారము గలదు. సర్వసృష్టి ఆతనికి అధీనమైయున్నది. ఏభక్తునికి నెద్ది అనుగ్రహింపవలయునో ఆతనికే దెలియును, ఆతఁడు వివేచనాపరుఁడు. ఎవరికి ఎద్దియుక్తమో అదియే చేయును. 19. సర్వజ్ఞుఁడును సర్వశక్తుఁడునగు దేవుని సాక్ష్యముకంటె మఱెవరి సాక్ష్యము శ్రేష్ఠమైనది యగును ? కాదు. కావున మీమధ్యను నామధ్యను దేవుఁడే సాక్షి. నేను దేవుని సందేశము మీకుఅందఁజేసినదియును దానికి మీరు జవాబిచ్చినదియును దేవునికిఁ దెలియును. కావున, ఆతఁడుఎవరికిఁదగిన తీర్పు వారికిఁజేయును అని హజ్రత్ పైగంబరులవారు పలుకవలెనని దేవుని సెలవయ్యెను. నేను ప్రవక్తను అను విషయమును రుజువుపఱచునట్టి దేవుని గ్రంథమగు ఖురాను ఉన్నది. అందు ఉభయలోకములలోను మేలుకూర్చునట్టి ధర్మములు గలవు. దీనిమూలమున మీకును, ఇఁకమీఁద ఈ ఖురాను ఎవరెవరికిఁ జేరునో వారికిని (అనఁగా లోకమంతటికిని) భయబోధ నిచ్చుచున్నాను. ఇట్టి సూచనలు తెలిసియు దేవుఁడు ఒక్కఁడే అని పలుకక మీరు దేవునితోఁ గూడ ఇతర దైవములున్నవి అని ఓ అవిశ్వాసులార ! సాక్ష్యమిచ్చిన ఇందు. కాని నేను మాత్రము అట్లు సాక్ష్యమియ్యను. దేవుఁడు ఒక్కఁడే. ఆతనికి సాటిలేదు అని సాక్ష్యమిత్తును. మఱి మీరు దేవునికి సాటిగ కల్పించుచున్న దైవములనుండి అసహ్యపడుచున్నాను. వారిని తిరస్కరించుచున్నాను అని హజ్రత్ రసూలువారు ప్రకటింపవలెను అని దేవుని సెలవు. 20. దేవుఁడును, ఆతని గ్రంథమగు ఖురానును, హజ్రత్ ముహమ్మదు దేవుని ప్రవక్తయనిసాక్ష్యమిచ్చునది. ఇదియునుగాక దేవుని గ్రంథములగు తౌరాతు ఇన్జీలుగ్రంథములు పొందిన యహూదీలు నస్రానీలు తమ తమ గ్రంథములలో ముహమ్మదువారిని గూర్చియున్న ప్రకటనలనుబట్టి వారునుసాక్షులు. వారు, ముహమ్మదురసూలు దేవుని ప్రవక్తయని బాగుగ నెఱుంగుదురు. అందు వారికి ఏలాటి సందేహము లేదు. ఎట్లు తమ పుత్రులను ఇతరుల బిడ్డలనుండి గుర్తింతురో అట్టులే యూదులు హజ్రత్ రసూలువారిని గుర్తింతురు. కాని యూదులు నస్రానీలు తెలిసియు, ఇహలోక తుచ్ఛభోగములకు లోఁబడి ద్వేషముతో రసూలువారిని నమ్మక యుభయలోకములలో చెడుచున్నారు.

21. వమన్ అజ్‌లము-మిమ్మ-నిఫ్-తరా-అలల్లాహి-కజిబన్-ఔ - కజ్-జబ-బిఆయాతిహీ-ఇన్నహూ-లాయుఫ్-లిహుజ్-జాలిమూన్.

21. మఱియు, దేవునిపై అసత్యములు కల్పించువానికంటెను లేక దేవుని సూచనలను తిరస్కరించువానికంటెను ఎక్కుడు దుర్మార్గుఁ డెవఁడు గలఁడు! నిశ్చయముగా దుర్మార్గులు మేలుపొంద నేరరు.

వ్యా॥ 21. ఎవఁడైన దేవుని ప్రవక్త కానిదే నేను దేవుని ప్రవక్తను అని దేవునిపై అసత్యము (నింద) కల్పించినచో వాఁడు దుర్మార్గుఁడు. వాఁడు ఉభయలోకములలో చెడును. ఇహమునందును వానికి విజయము లభింపదు. అటులే దేవుని ప్రవక్త యని తెలిసియు ఆతని సూచనలను తిరస్కరించి అవి సత్యములు గావు అని పలుకువాఁడును దుర్మార్గుఁడు. వాఁడును తుదకు నశించును. ఎట్టి మోక్షముగాని ఎట్టి మేలుగాని పొందఁడు. కావున జనులు రాఁబోవు దినమునకును తమఫలితముగూర్చి భయపడి, సత్యమైన పవిత్రుఁడగు హజ్రత్ ముహమ్మదును విశ్వసింపవలెను.

22. వయౌమ-నహ్శురుహుమ్-జమీఅన్-సుమ్మ-నఖూలు-లిల్లజీన- అష్రకూ-ఐన-షుర-కాఉకుముల్లజీన కున్తుమ్-తజ్-ఉమూన్. 23. సుమ్మ-లమ్-తకున్-ఫిత్-నతుహుమ్-ఇల్లా-అన్-ఖాలూ-వల్లాహి-రబ్బినా-మాకున్నా- ముష్రికీన్. 24. ఉన్-జుర్-కై ఫ-కజబూ-అలా-అన్-ఫుసిహిమ్-వజల్ల-అన్_హుమ్- మాకానూ-యఫ్-తరూన్. 25. వమిన్-హుమ్-మన్-యస్-తమిఉ-ఇలైక- వజఅల్నా-అలా-ఖులూ-బిహిమ్-అకిన్నతన్-అన్-యఫ్ఖ-హూహు-వఫీఆజానిహిమ్- వఖ్రన్-వఇన్-యరౌ-కుల్ల-ఆయతిల్-లా-యూమినూ-బిహా-హత్తా ఇజా - జాఊక-యుజాదిలూనక-యఖూ-లుల్లజీన-కఫరూ- ఇన్-హాజా-ఇల్లా అసాతీరుల్ - అవ్వలీన్. 26- వహుమ్-యన్-హౌన-అన్హు-వయన్-ఔన-అన్హు-వఇన్-యుహ్లికూన-ఇల్లా-అన్ఫుసహుమ్-వమా-యష్ఉరూన్.

22. మఱియు మేము వారందఱిని సమావేశపఱచు దినమునందు దేవునితో సాటికల్పించుచున్న వారితో మీరు తలఁచుచున్న మీదైవములు ఎక్కడ అని అడుగుదుము. 23. అపిదప మా ప్రభువగు దేవునియాన మేము సాటి కల్పించలేదు అని చెప్పుట తప్ప వారికి వేఱు సాకుండదు. 24. చూడుము, వారెట్లు తమ యాత్మలపై అబద్ధము లాడిరో మఱి వారు కల్పించుచుండినవి వారినుండి మఱుఁగుపడి పోయెను. 25. మఱివారిలో కొందఱు నీవైపు చెవి పెట్టియుందురు. మఱివారు దాని గ్రహింప కుండునట్లు వారి హృదయములపై తెరలను వారి చెవులయందు చెవుడు నుంచియున్నాము. వారు అన్ని సూచ

నలను చూచి నప్పటికిని వానిని విశ్వసింపరు. తుదకు నీయొద్దకు వాదించుట కు వచ్చునపుడు ఇవి పూర్వీకుల పుక్కిటిపు కథలు మాత్రమే అని అవిశ్వాసు లు పలుకుదురు. 26. మఱియు వారు దానినుండి (ప్రజలను) నిషేధించు చు న్నారు. మఱి వారిదానినుండి దూరమగుచున్నారు. మఱివారు తమ యాత్మ లనే నాశము చేసి కొనుచున్నారు. మఱి వారది గ్రహింపరు.

వ్యా॥ 22:23. దేవునికి సాటి కల్పించువారు తమ దైవములు కష్టములలో తోడుపడుదురు అని తలంచు చుండిరి. తీర్పు దినమునందలి కష్టమునుండి రక్షిం చుటకు ఆ దైవములు ఎక్కడ పోయెను అని దేవుఁడు వారితో పలుకును. అపు డు అవిశ్వాసులు తాము ఇహలోకములో దేవునికి సాటిగ నెవరిని కల్పించ లేదు. విగ్రహారాధన చేయలేదు అని ప్రమాణము చేసి తిరస్కరింతురు. తిర స్కారము తప్ప వారికి వేఱు దోవ దొరకనేరదు. 24. విగ్రహారాధకులు తా ము సలుపుచున్న విగ్రహారాధనను తిరస్కరించి స్పష్టమైన అబద్ధము పల్కిరి. అందువలన వారి దేవతల శక్తిలేని తనము తేటతెల్లమాయెను. కావున అట్టి దుర్గతి రాకుండ మానవుఁడు యత్నింప వలెను. సాటిలేని ఒక్క దేవునే పూ జింపవలెను. 25. అవిశ్వాసులలో కొందఱు పైగంబరు వారి యుపదేశములను ఖురానె షరీఫును బోధను గ్రహించుటకుఁగాను వినక అందులోపము లెంచుట కును వాని నిందించుటకును చెవియొగ్గి వినుదురు. అట్టి స్వభావము గల వారికి సత్యమును విని గ్రహించు శక్తి క్షీణించిపోవును. వారి హృదయములు గ్రహిం పఁజాలవు. వారి చెవులు సత్యమును వినఁజాలవు. కావుననే అట్టిగతి వారికిపట్టి నది. వారు ఎన్ని మహిమలను సూచనలను వినినను చూచినను ఇవి తాతముత్తా తలనాటి పుక్కిటికథలు అని తిరస్కరింతురు. కాని విశ్వసింపరు. వారిస్వభావ ము జగడమాడుట. కావుననే హజ్రత్ పైగంబరుల వారితో పనికిమాలిన వివా దములు పెట్టుకొనుదురు. తాము ధర్మమార్గమును సత్యమతమును విడనాడినది గాక యితర జనులను నిషేధింతురు. ప్రజలు పైగంబరుల వారియొద్దకు పోయి వారి బోధను వినకుండ చేయుదురు. వారిని అడ్డు పడుదురు. ఇట్టి దుర్గుణముల వలన అవిశ్వాసులు నాశము పొందుదురు కాని పైగంబరుల వారికి ఏలాటినష్ట ముగాని హానిగాని లభింపదు. తుదకు సత్యమే జయము పొందును. అటులే విరోధించుచున్న అబూజెహల్ మొదలగు మక్కా ఖురైషులు నశించిరి. ఇ స్లామ్ మతము లోకమంతటను వ్యాపించెను.

27. వ-లౌతరా-ఇజ్-వుఖిఫూ-అలన్నారి-ఫఖాలూ-యా-లైతనా-నురద్దు- వలానుకజ్-జిబ-బిఆయాతి-రబ్బినా-వనకూన-మినల్-మూమినీన్. 28. బల్ బదా-లహుమ్-మా-కానూ-యుఖ్ఫూన-మిన్-ఖబ్లు-వలౌ-రుద్దూ-లఆదూ-లిమా

నుహూ అన్హు—వ ఇన్నహుమ్ లకాజిబూన్. 29. వఖాలూ ఇన్హియ-ఇల్లా-హాయతునద్దున్యా-వమా-నహ్ను-బిమబ్-ఊసీన్. 30. వలౌ-తరా-ఇజ్-వుఖిఫూ-అలా-రబ్బిహిమ్-ఖాల-అలైస-హాజా-బిల్-హఖ్ఖి ఖాలూ-బలా-వరబ్బినా-ఖాల-ఫజూ-ఖుల్-అజాబ-బిమా-కున్తుమ్-తక్-ఫురూన్.

27. మఱి వారిని నరకాగ్ని పై నిలువఁబెట్టినపుడు అయ్యో! మమ్ము త్రిప్పి పంపివేసిన బాగుండునే! మఱి మేము మా ప్రభువు సూచనలను తిరస్కరింపమే! మఱి మేము విశ్వాసులలో చేరుదుమే అని వారు పలుకు నప్పటిస్థితి నీవు చూడ గలిగిన బాగుండెడిది. 28. అట్లుకాదు. వారు పూర్వము దాఁచుచున్నది బయలు పడెను. మఱి వారు తిరిగి పంపఁబడినను వారికి నిషేధింపఁబడినపనులనే తిరిగి వారు చేయుదురు. నిశ్చయముగ వారు అబద్ధములాడువారు 29. మఱి వారు మాకు ఇహలోక జీవనముకంటె వేఱు జీవనము లేదు. మఱిమేము తిరిగి సజీవులము కాము అని పలుకుచున్నారు. 30. మఱి వారు తమ ప్రభువుఎదుట నిలుచునపుడు నీవు చూచిన బాగుండును. అపుడు దేవుఁడు ఇది నిజము గాదా అని పనుకును. (అపుడు) వారు ఎందులకుఁగాదు! మా ప్రభువుసాక్షి అని పలుకుదురు. అపుడు దేవుఁడు మీరు మీయవిశ్వాసమునకు బదులుగ నరక బాధను అనుభవింపుఁడు అని పలుకును.

వ్యా॥ 27. అవిశ్వాసులు ప్రవక్తతో పరిహాసముచేయుట, దేవుని సూచనలను తిరస్కరించుట, నరకాగ్ని చూచునంత వఱకే. నరకమును అందలి బాధలను తమ కన్నులార చూచినతోడనే తమ డంబములు వదలి తిరిగి ఇహలోకమునకుఁబోయి విశ్వాసులతో చేరి దేవుని సూచనలను తిరస్కరింపము అని కోరుదురు. కాని అట్లువారు తిరిగి పోఁజాలరు. వారు ఇహలోకములో రహస్యముగా చేయుచున్న పాపకార్యముల ఫలితము బయలు పడెను. వారి కర్మల ఫలితమే వారికి లభించును. వారు నరకమును చూచి తిరిగి ఇహలోకమునకుఁ బోయి విశ్వాసు లగుదురని భక్తి పూర్వకముగ చెప్పుట లేదు. ఆపద తొలఁగిన చాలును అని వారికోరిక. ఒకవేళ తిరిగి వారు ఇహలోకమునకు పోయినను నరకమును మఱచిపోయితిరిగి తమ దుష్టస్వభావమునకు లోఁబడి నిషేధింపఁబడిన కార్యములే చేయుదురు. వారు పలుకునది అబద్ధమే. నిజము కాదు, ఆపదలు కలిగి నపుడు నీతితో నుందుమని పలికి ఆపదలు పోయిన తరువాత పాపములు చేయువారు అనేకులు గలరుకదా! 29. పరలోకమందువిశ్వాసము లేనివారు ఇహలోకములోనే సౌఖ్యములు అనుభవింప వలెను ఇదియే మాలోకము. దీనికిఁదప్ప వేఱులోకమా! లేదు. మేము చచ్చి తిరిగి సజీవులము

కాము. కావున ప్రాణమున్నంత కాలము సౌఖ్య భోగములు అనుభవింప వలెను అని పలుకుదురు. 30. మానవులు తప్పక తిరిగి సజీవులై దేవుని యెదుట తమ కర్మల తీర్పుకొఱకు నిలుతురు. అపుడు ఈదినము సత్యము కాదాఅని అవిశ్వాసులు మందలింపఁ బడుదురు. అపుడు తిరస్కరించుటకు మార్గముండదు. ఒప్పుకొనియే తీరవలెను. కావున పరమును తిరస్కరించి అవిశ్వాసులైన వారు తమ కర్మల ఫలితముగ నరకబాధ అనుభవింపవలెను అని దేవుని సెలవగును. కావున బుద్ధిమంతుఁడగు మానవుఁడు సత్యమతమగు ఇస్లామ్‌ను స్వీకరించి ఖురానె షరీఫును అనుసరింపవలెను.

31. ఖద్-ఖసిరల్ల-జీన-కజ్-జబూ-బిలిఖా-ఇల్లాహి-హత్తా-ఇజా-జాఅత్ హుముస్-సాఅతు-బగ్-తతన్-ఖాలూ-యా- హస్‌రతనా-అలా - మాఫర్‌రత్నా-ఫీహా-వహుమ్-యహ్మిలూన-ఔజా-రహుమ్-అలా - జహూరిహిమ్-అలా-సాఅ-మా-యజిరూన్.32.వమల్-హయా-తుద్-దున్యా-ఇల్లా-లఇబున్-వలహ్-వున్-వలద్-దారుల్-ఆఖిరతు-ఖైరుల్-లిల్లజీన-యత్తఖూన - అఫలా- తఅ-ఖిలూన్.

31. దేవుని దర్శించుట అబద్ధమని తలఁచినవారు నష్టము పొందిరి. తుదకు అకస్మాత్తుగా వారికి పునరుత్థాన కాలము వచ్చునపుడు అయ్యో దాని విషయము మేమెంత కొఱఁత చేసితిమి అని చింతపడుచు పలుకుదురు. మఱివారు తమ వీఁపులపై తమభారములను మోయుదురు. జాగ్రత్తపడుఁడీ, వారు మోయు భారము చాల చెడ్డది. 32. మఱి ఇహలోక జీవనము ఆట వినోదములు మాత్రమే. మఱి పరలోక గృహము భక్తిపరులకు చాల శ్రేష్ఠమైనది. ఏమి మీరు గ్రహింపరు. 31. చచ్చితిరిగి సజీవులై దేవుని సన్నిధానమునకు పోవుదుము. ఆతని నిదర్శింతుము అని నమ్మని కాఫిర్లు చచ్చి తీర్పుదినమునందు సజీవులగునపుడు చాల వ్యసనపడి ఇక లోకమునందు పరలోక విషయమును అశ్రద్ధ వహించి చాలనష్టము లోటు గావించుకొంటిమి అని చింతింతురు. అప్పటి పశ్చాత్తాపము పనికిరాదు. అపుడు ఇహలోకములో తాము గావించిన పాపకార్యముల భారము తమవీఁపులపై మోయుదురు. వారుదాని భరింపలేక పోవుదురు. అది చాల చెడు ఫలిత మొసంగు భారము. దాని ఫలితము నరక నివాసము. 32. కాఫర్లు ఇహలోక జీవనమే జీవనము. వేఱు జీవనము లేదు అని పలుకుచుండిరిగదా! వాస్తవము చూచిన పరలోకమునకు ఎదుట ఇహలోక జీవనము ఒకయాట, ఒకవినోదము మాత్రమే. భక్తులకు శ్రేష్ఠమైనది పరలోకగృహము.

అందు సదా స్వర్గ సౌఖ్యములు లభించును. కావున ఇహలోకమునందు పరలోక గృహమగు స్వర్గము పొందుటకు మానవుడు కృషి సలుపవలెను. అది వదలి ఇహలోక కామ భోగములకు లోనై పరలోక చింతవదలుటజ్ఞానులకు దగదు.

33. ఖద్-నఅ లము-ఇన్నహూ-లయహ్జును కల్లజీ-యఖూలూన-ఫఇన్నహుమ్-లాయుకజ్-జిబూకవ-వలాకిన్నజ్-జాలిమీన-బి-ఆయా-తిల్లాహి-యజ్హదూన్. 34. వలఖద్-కుజ్-జిబత్-రుసులుమ్-మిన్-ఖబ్లిక ఫసబరూ-అలా-మా కుజ్-జిబూ-వఊజూ-హత్తా-అతాహుమ్-నస్రునా-వలా-ముబద్దిల-లికలిమాతిల్లాహి-వలఖద్-జాఅక-మిన్-నబఇల్ ముర్-సలీన్. 35. వఇన్-కాన-కబుర అలైక-ఇఅరాజు-హుమ్-ఫఇనిస్-తతఅత-అన్ తబ్-తగియ-నఫఖన్ ఫిల్-అర్జి ఔ సుల్లమన్-ఫిస్-సమా ఇ-ఫతా-తియహుమ్ బి-ఆయతిన్ వలౌ-షా అల్లాహు-ల-జమఅ-హుమ్-అలల్-హుదా ఫలాతకూనన్న-మినల్-జాహిలీన్. 36. ఇన్నమా యస్తజీ-బుల్లజీన-యస్-మఊన వల్-మౌతా-యబ్-అసు హుముల్లాహు సుమ్మ ఇలైహి-యుర్ జఊన్.

33 వారు పలుకు మాటలవలన నీకు దుఃఖము గలుగుచున్న విషయము మాకు బాగుగ దెలియును. కావున వారు నీవు అబద్ధవాదివి అని నిన్ననుట లేదు. కాని ఆ దుర్మార్గులు దేవుని సూచనలను తిరస్కరించు చున్నారు. 34. నీకంటె పూర్వము గడచిన అనేకులు ప్రవక్తలు (ప్రజలచే) తిరస్కరింపబడిరి. కావున వారు ఆతిరస్కారమునకును వారికి గలిగిన హింసలకును ఓర్చుకొనిరి. తుదకు వారికి మా సహాయము లభించెను. మఱెవరును దేవుని వాక్యములను మార్పజాలరు. మఱియు నీకుప్రవక్తల కొన్ని విషయములు తెలిసి యున్నవి. 35. మఱివారి తిరస్కారము నీకుభారముగా దోచినచో నీవు భూమిలో నొక సురంగముగాని ఆకాశము లోనికి నొక నిచ్చెనగాని వెదకి తేగలిగితివేని యొక సూచన వారికిగాను తీసికొనిరమ్ము. మఱి దేవుడు కోరినచో వారందఱిని సన్మార్గమునకు దెచ్చియుండును. కావున నీవు మూఢులలో చేరిన వాడవు కాకుము. 36. ఎవరు చెవియొగ్గి వినుదురో వారు స్వీకరింతురు. మఱి దేవుడు మృతులను సజీవులుగా జేయును. మరలఆతని యొద్దకే రప్పింపబడుదురు.

వ్యా॥ 33: 34. హజ్రత్ రసూలువారు ప్రజలయందు చాలప్రేమ గలవారు. అందఱును సన్మార్గము స్వీకరించి యుభయలోకములలో మేలుపొందిన బాగుండును అనివారికోరిక. దానికి విరుద్ధముగ కొందఱు అవిశ్వాసులు ఓ ప్రవక్తా!

నీవు చెప్పు బోధ మేము వినము. నీవు దేవుని ప్రవక్తవు అని చెప్పునది సత్య గాదు అని తిరస్కరించుచుండిరి. దుష్టుల పలుకులు హజ్రత్ రసూలువారికి ముగాఁ దోఁచునవి. అందుకు దేవుఁడు హజ్రత్ ముహమ్మదు వారినిఊరడి చు అవిశ్వాసులు నిన్ను తిరస్కరించుట లేదు. కాని వారు దేవుని సూచన వాక్యములను తిరస్కరించుచున్నారు. (ఎందుకన మక్కా ఖురైషులు హజ్ర ముహమ్మద్ వారిని వారికి ప్రవక్తపదవి లభింపక ముందు సాదిఖ్ (సత్యవ డు) అని పిలుచుచుండిరి. కాఫర్లు దేవుని వాక్యములను మతబోధను నమ్మక స్కరించు చుండిరి. కాని ముహమ్మదు వారిని వారు సాదిఖ్ (సత్యవా అని పలుకుచుండిరి. నీకు పూర్వము అనేక ప్రవక్తలు గడచిరి. వారిని అవిశ్వాసులు దూషించి హింసించిరి. వారు దానికి సహించియోర్పువ చిరి. తుదకు దేవుని సహాయము ప్రవక్తలకు లభించెను. వారి శతృవులు మొందిరి. దేవుఁడు పలుకు వాక్యములను అతని వాగ్దానమును ఎవరునుమా జాలరు. కావున తుదకు నీకు దేవుని సహాయము లభించును. శత్రువులు న గలరు. పూర్వము గడచిన ప్రవక్తల విషయములు నీకుఁ దెలిపి యున్నా వాని చూచి సహనము వహింపుము అని దేవుని సెలవయ్యెను. 35. జన దేవుని వాక్యములను తిరస్కరించి ఇస్లామ్ మతమును స్వీకరింపక దేవుని ప్ర తో దేవుని సూచన ( మోజజా) సదాయుండిన ప్రజలు చూచి విశ్వసింప రు అని పలుకుచుండిరి. వానికి హజ్రత్ రసూలువారు అట్లు సూచన యు యందఱు విశ్వసించిన బాగుండునుఅని తలఁచిరి. అందుకు దేవుఁడు సమయోచితముగ సూచనల పంపు వారము. మేము పంపు సూచనలకంటె నది వారు కోరునట్లు నీకు దొరికిన యెడల భూమిలో సురంగము వేసి ఆకాశము లోనికి నిచ్చెన పెట్టి యొక సూచన తెచ్చి అవిశ్వాసులకుచూ దేవుఁడు కోరినచో అందఱు ను సన్మార్గము స్వీకరించునట్లు చేయఁగ కాని అట్లు చేయలేదు. దానికి నీవు చింతపడ నక్కఱలేదు. 36. అంద నమ్మెదురని యాశ పెట్టుకొనకుము. ఎవరు హృదయ పూర్వకముగా చెవి గ్గి దేవుని వాక్యములను వినుదురో అట్టివారు బోధన స్వీకరించి విశ్వసింప తిరస్కార భావముగల అవిశ్వాసులు విననిచో వారెట్లు స్వీకరింపఁగలరు. ఆ అవిశ్వాసుల హృదయములు చచ్చినవి. వారుబ్రతికియు మృతులవలెన రు. వారు తీర్పు దినమునందు సజీవులై దేవుని సన్నిధానమున నిలచినపుడ మునందు తిరస్కరించుచున్న విషయములను కన్నులార చూచి నమ్మగలరు. పుడు నమ్మియు ప్రయోజన ముండదు. అని హెచ్చరింపఁ బడియెను.

37. వఖాలూ-లౌలా-నుజ్-జిల-అలైహి-ఆయతుమ్-మిర్ - రబ్బిహి

ఖుల్-ఇన్నల్లాహ-ఖాదిరున్-అలా-అన్-యునజ్జిల-ఆయతన్- వలాకిన్న-అక్-సరహుమ్-లా-యఅ్-లమూన్. 38. వమా-మిన్-దాబ్బతిన్-ఫిల్-అర్జి - వలా-తాఇరిన్-యతీరు-బిజనా-హైహి-ఇల్లా-ఉమ-మున్-అమ్-సాలుకుమ్ - మాఫర్-ర త్నా-ఫిల్-కితాబి-మిన్-షైఇన్-సుమ్మ-ఇలా-రబ్బిహిమ్-యుహ్షరూన్. 39. వల్లజీన-కజ్జబూ-బిఆయాతినా-సుమ్మున్-వబుక్మున్-ఫిజ్-జులుమాతి-మన్-యష-ఇల్లాహు-యుజ్-లిల్ హు-వమన్-యషా-యజ్-అల్ హు-అలా సిరాతిమ్-ము స్తఖీమ్.

37. మఱియు ప్రవక్తయొద్దకు ఆతని ప్రభువునుండి యెందుకు సూచన రాలేదు అని వారు పలుకుదురు. దేవుఁడు సూచన పంపుటకుశక్తిగలిగియున్నాఁడు. కాని వారిలో పెక్కుమందికి తెలియదు అని ఓ ప్రవక్త! పలుకుము. 38. భూమిపై సంచరించు జంతువుగాని తన ఱెక్కలతో నెగురు పక్షిగాని (సృష్టిలో) మీవంటివే. మేము గ్రంథములో నేద్దియును వదలిపెట్టలేదు. పిదప వారందఱును తమ ప్రభువునొద్దకు రప్పింపఁబడుదురు. 39. మఱియు మా సూచనలను తిరస్కరించువారు చెవిటివారును, మూఁగలును అంధకారములలోనున్న వారును. దేవుఁడు తాను కోరిన వారిని దుర్మార్గములో పడవేయును. మఱి తాను కోరినవారిని సన్మార్గమునకుఁ దెచ్చును.

వ్యా॥ 37. కాఫిర్లు హజ్రత్ పైగంబరులవారితో నీవు భూమినుండి యూటలు ప్రవహించునట్లును, కాలువలు ప్రవహించుచు కర్జూర ద్రాక్షవృక్షములు గల తోఁటలు గలుగునట్లును, ఆకాశమునుండి దాని యొక తునుక క్రింద పడునట్లును, దేవునిని ఆతని దూతలను మాయెదుట వచ్చునట్లును నీవు చేసినచో మేము విశ్వసింతుము అని పలికి వారు కోరినట్లు ఎందులకు ఒకసూచన (మోజిజా) ప్రవక్తయొద్దకురాదు అని అడుగసాగిరి. అందుకు దేవుఁడు తనకుమీరు కోరినట్లు సూచనలు పంపుటకు శక్తిగలదు. ఆతఁడు సర్వశక్తుఁడు. భూమ్యాకాశములలోని కార్యములు వాని వానికి తగినట్లు జరుగుచున్నవి. వానిలోని రహస్యములు వాని తీరు మీలోని పెక్కుమందికి దెలియదు. మానవులు కోరినట్లు దేవుఁడు సూచనలు పంపినచో లోకమే అల్లకల్లోలమగును. 38. ఇందు, మానవులు కోరినట్లు సూచనలు (మోజిజే) పంపకుండుటకు కారణములను సమాధానములను సూచింపబడినవి. భూమిలోనిజంతువులును, ఆకాశములో నెగురు పక్షులును సృష్టిలో మానవులవంటివే. మానవులకు బుద్ధియు జ్ఞానమును గలవు. వాని ననుసరించి కృషి సలిపి తన జీవన వసతులు కల్పించుచు మహత్తరమైన వస్తువులు కల్పించుకొనుచున్నారు. అట్లు

జంతువులకు పక్షులకు బుద్ధి స్వాతంత్ర్యము లేదు. దేవుఁడు ఒసంగిన సహజసాధనములతో తమ జీవనము గడపుచున్నవి. మానవులకు బుద్ధిస్వాతంత్ర్యములు గలవు. కావున గమనించి ఏద్ది సన్మార్గము ఏద్ది దుర్మార్గము అని తెలిసికొని సన్మార్గము అవలంబింపవలెను. తన బుద్ధిని ఉపయోగింపక బలవంతపెట్టునట్టి సూచనలు వచ్చిన విశ్వసింతుమని చెప్పుట మానవులకుఁ దగదు. సర్వము దేవుఁడుగ్రంథము (లౌహెమహ్ఫూజు)లో లిఖించియున్నాఁడు. ఏద్దియును వదలలేదు. తుదకు అందఱును తిరిగి సజీవులై దేవుని సన్నిధానమున నిలుతురు. అప్పుడు కర్మల తీర్పు అగును. 38, 39. దేవుని సూచనలను నమ్మక తిరస్కరించి ధర్మబోధను వినక చెవిటివారగుదురు. తాము ఇతరులతో ధర్మమార్గము అడుగక మూఁగలగుదురు. అవిశ్వాస మనెడి యంధకారములోపడి భక్తిమార్గము చూడరు. ఇట్టి స్థితిలో వారెట్లు సన్మార్గమునకు రాఁగలరు. కావున వారు తాము చేసికొన్న కర్మలవలననే దేవునిచే సన్మార్గముపొందనివారైరి. ఎవరు దేవుఁడొసంగిన బుద్ధిజ్ఞానములను ఉపయోగింతురో దేవుఁడు వారిని సన్మార్గమునకుఁ దెచ్చును. అట్టివారు ధర్మబోధనలవలన మంచి ఫలితము పొందఁగలరు.

40. ఖుల్-అర-ఐతకుమ్-ఇన్-అతాకుమ్-అజాబుల్లాహి-ఔ-అతత్-కుముస్-సాఅతు-అగైరల్లాహి-తద్ఊన-ఇన్-కున్తుమ్-సాదిఖీన్. 41. బల్-ఇయ్యాహు-తద్ఊన-ఫయక్షిఫు-మాతద్-ఊన-ఇలైహి-ఇన్-షాఅ-వతన్సౌన మాతుష్రికూన్.

40. చూడుఁడు! దేవుని శిక్షగాని లేక ప్రళయము (ఖియామత్) గాని మీపై వచ్చినచో మీరు దేవుని వదలి యితరులను వేఁడెదరా! మీరుసత్యవంతులైనచోఁ దెల్పుఁడు. అట్లుకాదు, మీరు ఆతనినే వేఁడెదరు. ఆ యిదప తాను కోరినచో, ఏకష్టమునకుఁగాను మీరు ఆతని వేఁడుదురో దాని తొలఁగించుచున్నాఁడు. మఱి మీరు దేవునికి సాటిగ కల్పించుచున్నవానిని మఱచిపోవుదురు అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 40, 41. మానవుఁడు తనకు ఆపదవచ్చినపుడు తన చిల్లరదేవతలను వదలి విధిలేక సర్వశక్తుఁడగు దేవునినే వేఁడును. ఇహమునందలి యాపదలను, ప్రళయము (ఖియామతు) నందలి బాధలను దేవుఁడే తొలఁగింపవలెను. బాగుగ, యోచించినచో దేవుఁడే పూజ్యుఁడు. ఆతనినే యారాధింపవలెను. అవివదలి చిల్లర దేవతలనుపూజించుటసరికాదు. మఱియుఉభయలోకములలోని ఆపదలలోఆచిల్లర దేవతలనుమఱచిపోవలసివచ్చును.అవికష్టములందు పనికిరావు.

42. వలఖద్-అర్సల్నా-ఇలా-ఉమమిమ్-మిన్-ఖబ్లిక ఫఅఖజ్నా-హుమ్-

బిల్-బాసాఇ-వజ్-జర్రాఇ-ల-అల్లహుమ్ యత - తజర్రఊన్. 43. ఫలౌ-లా ఇజా-జాఅహుమ్-బాసునా-తజర్రఊ-వలాకిన్-ఖసత్-ఖులూ-బుహుమ్ - వజ య్యన-లహుముష్ షైతాను-మా-కానూ-యఅమలూన్. 44. ఫలమ్మా-నసూ-మా-జుక్కిరూ-బిహీ-ఫతహ్నా-అలైహిమ్-అబ్వాబ-కుల్లి-షైఇన్ - హత్తా-ఇజా-ఫరిహూ-బిమా-ఊతూ-అఖజ్నా-హుమ్-బగ్-తతన్-ఫఇజా-హుమ్-ముబ్లిసూన్. 45. ఫఖుతిఅ-దాబిరుల్-ఖౌ-మిల్లజీన-జలమూ-వల్-హమ్దు - లిల్లాహి-రబ్బిల్-ఆలమీన్.

42. మఱియు నీకు పూర్వముండిన పెక్కు సంఘములవారియొద్దకు ప్రవక్తల నంపితిమి. ఆ పిదప వారు వినయము గలిగియుండుటకై వారికి యిబ్బందులును కష్టములును పెట్టితిమి. 43. పిదప వారెందులకు వారిపై మాబాధ వచ్చినపుడు వారువినయము వహింపలేదు! కాని వారిహృదయములు కఠినములాయెను. మఱి వారు చేయుచున్న కర్మలు మంచివిగా తోఁచునట్లు సైతాను వారికి చూపించెను. 44. పిదప వారు తమకు గలిగిన బోధను మఱచిపోఁగా వారికి అన్నివస్తువుల ద్వారములను తెఱచితిమి. తుదకు వారు తమ కొసంగఁబడినవానివలన సంతోషపడిరి. మేము వారిని అకస్మాత్తుగా పట్టుకొంటిమి. కావున అపుడు వారు ఆశ వదలినవారైరి. పిదప ఆ దుర్మార్గులు నిర్మూలింపఁబడిరి. మఱి సర్వలోకములకు పోషకుఁడైన దేవునికే సర్వస్తోత్రములున్నవి.

వ్యా॥ 42. ఈవాక్యములలో పూర్వము గడచిన సంఘములవారికి వారి తిరస్కారమునకుఁగాను వచ్చిన ఆపదలు చెప్పఁబడుచున్నవి. ఒక మానవుఁడు ఏదైన పాపముచేసినచో వానికి దేవునివలన వానికిబుద్ధిగలుగుటకుఁగాను కొంచెము కష్టము గలుగును. అపుడుపాపములను మానుకొని దేవునిక్షమాపణకోరవలెను. కఠినహృదయుఁడు కాఁగూడదు. సైతాను కుట్రలకు మోసపోఁగూడదు. సైతాను ఒక చెడ్డపనిని కూడ మంచిదే అని మోసపుచ్చును. కావున క్షమాపణ కోరినచో మానవుఁడు రక్షింపఁబడును. అట్లుగాక, మఱింత దుర్మార్గము వహించినచో, వాని మఱపించుటకు దేవునివలన వానికి సంపదల ద్వారములు తెఱవఁబడును. వాఁడు దానికి కృతజ్ఞత సలుపక పాపకార్యములలోనే మునిఁగి పోయిదానికి శిక్షగా వాఁడు దేవునిచే పట్టఁబడును. అపుడు వాఁడు అన్ని యాసలు వదలును. అట్టి దుర్మార్గులు తమ దుర్మార్గమువలన లోకశాంతికిభంగ పఱచకుండునట్లు నిర్మూలింపఁబడిరి. అదియును దేవుని యనుగ్రహమే. కావున సర్వలోకములకు పోషకుఁడగు దేవుఁడు స్తోత్రార్హుఁడు. ఆతనికే సర్వవిధములైన

స్తుతులు చెల్లును.

46. ఖుల్-అరఐతుమ్-ఇన్-అఖజల్లాహు-సమ్ అరుమ్-వఅబ్ - సారకుమ్-వఖతమ-అలా-ఖులూ-బికుమ్-మన్ ఇలాహున్-గైరుల్లాహి-యాతీకుమ్ -బిహి-ఉన్-జుర్ - కైఫ-నుసర్రిఫుల్-ఆయాతి-సుమ్మ హుమ్-యస్ దిఫూన్. 47. ఖుల్ -అరఐ-తకుమ్-ఇన్-అతాకుమ్ -అజా-బుల్లాహి-బగ్ -తతన్ ఔ-జహ్రా-రతన్ - హల్ -యుహ్-లకు-ఇల్-లల్ -ఖౌ-ముజ్-జాలిమూన్. 48. వమా-నుర్-సిలుల్- ముర్-సలీన-ఇల్లా-ముబష్-షిరీన వమున్-జిరీన-ఫమన్-ఆమన వఅస్-లహ- ఫలా - ఖౌఫున్-వలాహుమ్-యహ్-జనూన్, 49. వల్లజీన-కజ్-జబూ-బి-ఆయాతినా - యమస్సు-హుముల్ -అజాబు-బిమా-కానూ-యఫ్-సుఖూన్ -

46. చూడుండు. దేవుండు మీచెవులను కన్నులను పోంగొట్టి మీహృదయములపై ముద్రవేసినచో దేవుండు దప్ప ఏదైవము అవి మీకు దెచ్చియిచ్చునా ? అని ఓ ప్రవక్తా ! పలుకుము. చూడుము. మేమిట్లు సూచనలను వారికి తెలుపుచున్నారమో! ఆ పిదప వారు ముఖము త్రిప్పుకొనిపోవుచున్నారు. 47. చూడుండు! అకస్మాత్తుగాంగాని వెల్లడిగాంగాని దేవుని యాపద మీపై వచ్చినచో దుర్మార్గులు తప్ప నితరు లెవరు నశింపంగలరు ? అని ఓపవ్రక్తా ! పలుకుము. 48. మఱియు మేము ప్రవక్తలను సంతోషవార్త నిచ్చువారలుగను భయబోధ నిచ్చువారలునుగచేసి పంపుచున్నారము. ఆపిదప ఎవరు విశ్వసించిసత్కార్యములు చేసిరో వారికి భయముగాని దుఃఖముగాని యుండనేరదు. మఱెవరు మాసూచనలను తిరస్కరించి అవిధేయులైరో వారికి బాధ గలుగును.

వ్యా॥ 46. హజ్రత్ రసూలువారి విరోధులతో నిట్లు చెప్పవలెనని దేవుని సెలవగుచున్నది. వినుటకు చెవులును చూచుటకు కన్నులును గ్రహించుటకు హృదయమును దేవుండు ఒసంగియున్నాండు. తానిచ్చినవి దేవుండు తీసికొని చెవిటివారిగను అంధులుగను గ్రహింపలేని వారలుగను చేసినచో నితర దేవతలు అవి తిరిగి యియ్యంగలరా? ఎవరును ఒసంగంజాలరుగదా ! కావున మానవులు సన్మార్గమును గ్రహింపవలెను. దేవుని బోధనుతిరస్కరింపరాదు. అకస్మాత్తుగాంగాని లేకకన్నులార చూచుచుండగనే దేవుండు ఆపదను పంపినచో ఎవరు రక్షింపంగలరు ? దేవునికి సాటి కల్పించి చిల్లర దేవతలను పూజించు దుర్మార్గులే ఆపదలకు లోనై నశింతురు. విశ్వసించిన భక్తులు రక్షింపంబడుదురు. వారికి భయముగాని దుఃఖముగాని యుండదు. దేవుండు పూర్వము

నుండియు ప్రజలకు సన్మార్గము బోధించుటకై ప్రవక్తలను పంపుచు వచ్చును. వారు విశ్వసించువారికి ఉభయలోకములలో మేలు గలిగి స్వర్గము లభించునని యు, తిరస్కరించి అవిశ్వాసులైనవారికి నరకమున్నది అనియు బోధించుచు వచ్చిరి. కావున విశ్వసించి సత్కార్యములు చేసిన భక్తులకు ఏలాటి భయము గాని దుఃఖముగాని యుండఁబోదు. వారు సదా స్వర్గసౌఖ్యములు పొందుచుం డుదురు. మఱి ప్రవక్తలను తిరస్కరించి దేవుని సూచనలను నమ్మక తాము కోరినట్లు సూచనలు (మోజజే) చూపింపవలెనని ప్రవక్తలతో పరిహాసమాడిన వారికి నరకబాధ లభించును. అందు వారు సదా బాధలు పడుచుందురు. (దేవుఁడు మమ్ము రక్షించుగాత!)

50. ఖుల్ - లాఅఖూలు —లకుమ్ -ఇన్దీ-ఖజా-ఇనుల్లాహి-వలా-అఅ-లముల్-గైబ-వలా-అఖూలు-లకుమ్-ఇన్నీ మలకున్-ఇన్-అత్-తబిఉ-ఇల్లా-మా యూహా-ఇలయ్య-ఖుల్-హల్-యస్-తవిల్-అఅమా-వల్-బసీరు-అఫలా-తత ఫక్క-రూన్.

50. నాయొద్ద దేవుని ధనాగారము (ఖజానా) లున్నవనిగాని నాకు సర్వరహస్యము (గైబు)లు తెలియుననిగాని మఱి నేను దేవునిదూత (ఫరిష్తా) అని గాని మీతో పలుకుటలేదు. నాయొద్దకు వచ్చు దేవుని సందేశమునుమాత్రము నేను అనుసరించుచున్నాను అని ఓ ప్రవక్తా! పలుకుము. అంధుఁడును దృష్టిగలవాఁడును సమానులగుదురా? కావున ఎందులకు మీరు ఆలోచింపరు? అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 50. ఇందు ప్రవక్తయొక్క నిజమైనస్థితి తెలుపఁబడినది. ప్రవక్త యొద్ద దేవునిశక్తిలోనున్న అన్ని సంపదల నిలయము (ఖజానా) లుఁడవు. మానవులు కోరినట్లు ప్రవక్త వానినుండి తీసి చూపింపఁడు. సర్వము దేవునికి అధీనమైయున్నది.అటులే ప్రవక్తకు దేవుని యొద్దనున్న సర్వరహస్యములు తెలియవు. దేవుఁడు ఎంత తెలుపునో అంతమాత్రము ప్రవక్తకుఁ దెలియును. ప్రవక్త కూడ మానవజాతిలో చేరినవాఁడే. దానికి విరుద్ధముగ దేవదూత (ఫరిష్తా) కాఁడు. అయిన ప్రవక్తకును ఇతర మానవులకును ఒక భేదముగలదు. అది దేవుని సందేశము (వహీ) నేరుగా ప్రవక్తకు వచ్చును. దానివలన ప్రవక్త తన పలుకులలోను క్రియలలోను ఇతర మానవులను మించిపోవును. ఎంత భేదము గ్రుడ్డివానికిని దృష్టిగలవానికిని గలదో అంతటి వ్యత్యాసము ప్రవక్తకును ఇతరులకును గలదు. ప్రవక్త హృదయ నేత్రములు దేవుని సందేశము వలనను దాని మహిమవలనను చూడఁగల విషయములు ఇతర మానవులు

చూడలేరు. ప్రవక్త చేయు కార్యమును, దేవుని సెలవు ననుసరించియే యుం డును. ఆతని సుగుణములు, ఆతని భక్తి నీతులు ఇతర మానవులకంటె శ్రేష్ఠములైనవిగా నుండును. అందు యోచించువారికి ప్రవక్త సత్యము తేటతెల్లమగును. కావున మానవులు ప్రవక్తను అనుసరించినచో దేవుని ప్రీతిని పడయఁగలరు.

51. వఅన్‌జిర్-బిహిల్లజీన-యఖాఫూన-అన్-యుహ్‌షరూ-ఇలా - రబ్బిహిమ్-లైస-లహుమ్-మిన్-దూనిహీ-వలియ్యున్-వలా-షఫీ-ఉల్-లఅల్లహుమ్ యత్తఖూన్. 52. వలా-తత్-రుదిల్లజీన-యద్‌ఊన-రబ్బహుమ్-బిల్-గదాతి-వల్ అషియ్యి-యుదీదూన-వజ్‌హ-హూ-మా-అలైక-మిన్-హిసాబిహిమ్- మిన్ షైఇన్-వ-మా-మిన్-హిసాబిక-అలైహిమ్-మిన్ షైఇన్-ఫతత్- రుదహుమ్ - ఫతకూన-మినజ్-జాలిమీన్. 53. వకజాలిక-ఫతన్నా-బఅ-జహుమ్ బిబఅ-జిల్ -లియఖూలూ-అ-హా-ఉలాఇ-మన్నల్లాహు-అలైహిమ్-మిమ్-బైనినా- అలైసల్లాహు-బి-అఅ-లమ-బిష్-షాకిరీన్. 54. వఇజా-జాఅ-కల్లజీన-యూమినూన - బిఆయాతినా-ఫఖుల్ -సలామున్-అలైకుమ్-కతబ-రబ్బు-కుమ్-అలా-నఫ్ - సిహిర్ - రహ్మ-మత-అన్నహూ-మన్-అమిల-మిన్-కుమ్-సూఅమ్-బిజహా-లతిన్ - సుమ్మ-తాబ-మిమ్-బఅదిహీ-వఅస్-లహ-ఫఇన్నహూ-గఫూరుర్-రహీమ్, 55. వకజాలిక-నుఫస్-సిలుల్-ఆయాతి-వలి తస్-తబీన-సబీలుల్-ముజ్రిమీన్.

51. మఱియు దేవుఁడుదప్ప తమకు ఇతరు లెవ్వరును సహాయులుగాని సిఫారసు చేయువారును గాని లేకుండు స్థితిలో తమ ప్రభువునొద్దకు పోయి చేరవలసి యున్నది అని భయపడువారికి ఖురాను మూలమున భయబోధనిమ్ము. బహుశః వారు భీతిపరులగుదురు. 52. మఱియు ఎవరు తమ ప్రభువును ఉదయము సాయంకాలము ప్రార్థించుచు ఆతని ప్రీతిని పడయఁ గోరుచున్నారో వారిని నీవు దూరము చేయకుము. ఎంత మాత్రమును వారిలెక్క నీపై లేదు. మఱెంత మాత్రమును నీలెక్క వారిపైనను లేదు. కావున నీవు వారిని దూరపఱచినచో అన్యాయస్థులలో చేరినవాఁడవగుదువు. 53. మఱియు మా అండఱిలోను వీరి నేనా దేవుఁడు అనుగ్రహించినది యని పలుకుటకై వారిలో కొందఱి మూలమున కొందఱిని మేమిట్లు పరీక్షించితిమి. ఏమి కృతజ్ఞత సలుపని వారిని బాగుగ దేవుఁడు ఎఱుఁగఁడా! 54. మఱియు మా సూచనలను విశ్వసించునట్టివారు నీ యొద్దకు వచ్చినపుడు మీకు సలామ్. దేవుఁడు కరుణించుటయే తన

విధిగా నియమించుకొని యున్నాఁడు. మీలో నెవఁడు అజ్ఞానముతో తప్పు చేసిన పిదప దేవుని క్షమాపణ కోరుకొని సత్ప్రవర్తకుఁడైనచో దేవుఁడు క్షమించువాఁడును దయాళువును అని ఓ ప్రవక్తా! పలుకుము. 55. మఱియు పాపుల మార్గము స్పష్టపడుటకై యిట్లు మాసూచనలను వివరించి మీకుఁ దెలుపుచున్నారము.

వ్యా॥ 51. దేవుని సూచనలను ద్వేషముతో తిరస్కరించుచు తాము కోరినట్లు సూచనలు తీసికొనిరమ్ము అని పలుకునట్టి యవిశ్వాసులను పోనిమ్ము. ఇఁక దేవుని యందు విశ్వాసము గలిగి తీర్పు దినమునందు దేవుని యెదుట చేరఁగలమనిన వారి తీర్పుదినమునందు దేవుఁడుదప్ప బాధలనుండితప్పించువారు ఎవరును లేరు. ఎవరును తోడుపడరు. మఱెవరును సిఫారసుచేసి రక్షింపరు అని భయపడువారికి ఖురాను బోధ వినిపించి వారిని భయపెట్టవలెను. ఎందుకన అన్ని పాపములను వదలి భయభక్తులుగలవారు ఖురాను బోధను విని అనుసరింపఁగలరు. 52. కాఫిర్ల (అవిశ్వాసుల) లోని కొందఱు ధనికులు హజ్రత్ పైగంబరుల వారితో మేము మీబోధ వినవలెనని యున్నాము. కాని మీ యొద్ద కూర్చుండు వారు బీదలును బానిసలును నీచులును కావున మేము వారితో కలిసి కూర్చుండలేము. మాకొఱకు వేఱుసభ ఏర్పాటు చేయుఁడు అని పలికిరి. అందుకు దేవు డు అట్లువలదు. అవిశ్వాసులు తమ ధన గర్వముచే ఏభక్తులను వారు నీచులనుగా చూచుచున్నారని వారు రాత్రింబవళ్లు దేవుని ప్రార్థించుచు దేవుని ప్రీతి పడయుటకు కోరువారు దేవునియొద్ద ధనమునకు గౌరవము లేదు. భక్తియే దేవునికి ప్రియము కావున భయభక్తులు గల ముసల్మానులను అవిశ్వాసులైన ధనికుల కొఱకు దూరము చేయవద్దు. అవిశ్వాసులు కోరినచో ఆబీద ముసల్మానులతోనే కూర్చుండి బోధ వినవలెను. అట్లుగాక ధనికుల కొఱకు భక్తులగు బీదలను దూరము చేసినచో అది న్యాయము కాదు. మతమును స్వీకరించిన బీదలగు భక్తుల మూలమున ధనికులను దేవుఁడు పరీక్షించుచున్నాఁడు. ధనికులు తమ ధనగర్వముచే బీదలను నీచముగా చూచి ఇట్టివారే దేవుని దయకు పాత్రులైనవారా. మేము కామా! అనిపలుకుదురు. దేవునికి సర్వము దెలియును ఎవరు భక్తిపూర్వకముగ దేవునికి కృతజ్ఞతసలుపుదురోవారే దేవుని దయకు పాత్రులు. దేవుఁడు మొగములను ధనమును చూడఁడు. హృదయములను చూచును. 54. ఇందు ముసల్మాను భక్తులకు దేవుని దయయు రక్షణయు లభించును. గర్వితులైన ధనికుల పలుకుల వలన బీద ముసల్మానులు చింతింపఁగూడదు. పొరపాటుతో ఏదైన తప్పు (పాపము) చేసినచో క్షమాపన వేడి సత్ప్రవర్తకులైనచో దేవుఁడు దయగలవాఁడు. కావున క్షమించును. 55. దేవుఁడు తన వాక్యములను వివరించి దెలుపుచున్నాఁడు. దానివలన

పాపుల మార్గము ఇదియని తెలియును. భక్తులు పాపుల మార్గమునకుం బోక సన్మార్గమందు స్థిరముగా నుండగలరు.

56. ఖుల్-ఇన్నీ-నుహీతు-అన్అఅ-బుదల్లజీన-తద్ ఊన-మిన్-దూనిల్లాహి-ఖుల్-లా-అత్-తబిఉ-అహ్వా-అకుమ్-ఖద్-జలల్తు-ఇజన్-వమా-అనా-మినల్-ముహ్తదీన్. 57. ఖుల్-ఇన్నీ-అలా-బయ్యినతిమ్-మిర్-రబ్బీ-వకజ్-జబ్తుమ్-బిహీ-మా-ఇన్దీ-మాతస్-తఅ-జిలూన-బిహీ-ఇనిల్-హుక్మ్-ఇల్లా-లిల్లాహి-యఖుస్సుల్-హఖ్ఖ-వహువ-ఖైరుల్-ఫాసిలీన్. 58. ఖుల్-లౌ-అన్న-ఇన్దీ-మాతస్-తఅ-జిలూన-బిహీ-లఖుజియల్-అమ్రు-బైనీ-వబైనకుమ్-వల్లాహు-అఅలము-బిజ్-జాలిమీన్. 59. వఇన్దహూ-మఫాతిహుల్-గైబి-లాయఅ-లముహా-ఇల్లా-హువ-వయఅలము-మా-ఫిల్-బర్రి-వల్-బహ్రి-వ-మాతస్-ఖుతు-మిన్-వరఖిన్-ఇల్లా-యఅ-లముహా-వలా-హబ్బతిన్-ఫీ-జులు-మాతిల్-అర్జి-వలా-రత్బిన్-వలా-యాబిసిన్-ఇల్లా-ఫీ-కితా-బిమ్-ముబీన్.

56. మీరు దేవుని వదలి ప్రార్థించునట్టి యితరులను నేను ప్రార్థింప కూడదు అని నాకు నిషేధము గలదు అని ఓ ప్రవక్త! పలుకుము. నేను మీ యిష్టాను సారముగ నడువను. (అట్లు నడచినచో) నేను మార్గము తప్పినవాఁడనై సన్మార్గము పొందినవారిలో చేరని వాఁడ నగుదును అని ఓ ప్రవక్త! పలుకుము. 57. నా ప్రభువునుండి నాకు లభించిన స్పష్టమైన ప్రమాణముపై నేనున్నాను. మీరు దానిని తిరస్కరించితిరి. మీరు దేనికిఁగాను తొందర చేయుచున్నారో యది నాయొద్దలేదు. దేవునికిఁదప్ప నితరులకు అధికారములేదు. దేవుఁడుసత్యము దెలుపుచున్నాఁడు. మఱియు ఆతఁడే అందఱికంటె శ్రేష్ఠమైన తీర్పుచేయు వాఁడు అని పలుకుము. మీరు దేనికిఁగాను తొందర చేయుచున్నారో అది నా యొద్ద నున్నచో నామధ్యను మీమధ్యయును జగడము తీరిపోయి యుండును. మఱియు దేవుఁడు దుర్మార్గులను బాగుగ నెఱుంగును అని పలుకుము. 59. మఱియు రహస్యముల బీగములు ఆతని యొద్దనే యున్నవి. ఆతఁడు దప్ప నితరులెవ్వరును వాని నెఱుంగరు. మఱియు భూమిలోను సముద్రములో నున్నవి దేవుని కెఱుక. మఱియు రాలునట్టి ప్రతి యాకును దేవునికిఁదెలియును. మఱి భూమిలోని చీఁకట్లలోఁబడునట్టి ప్రతి గింజయును పచ్చిదియును ఎండినదియును (సర్వము) ప్రకాశమానమైన గ్రంథములో గలదు.

వ్యా॥ 56. ఇందు అవిశ్వాసులకు సంబోధనగలదు. హజ్రత్ పైగంబరుల

వారు కాఫిర్లతో నిట్లు పలుకవలెనని దేవుని సెల వగుచున్నది. దేవుని వలన నాకు లభించిన దివ్యజ్ఞానమును దేవుని సెలవును నేను దేవుని యేకత్వము (తౌహీదు) నందే స్థిరముగా నుండవలెనని బోధించుచున్నవి. మఱి మీరు దేవుని వదలి పూజించునట్టి చిల్లర దేవతలను నేను పూజింపను. అదినాకు నిషిద్ధము. మీరెన్ని కుట్రలు చేసిన చేయుఁడు. నేను మీతప్పు కోరికలను అనుసరింపను. మఱి సన్మార్గము వదలను. మీకోరికలను అనుసరించినచో సన్మార్గము తప్పిన వాఁడనగుదును. అట్లు ఎన్నటికిని కానేరదు. ప్రవక్తలే సన్మార్గము తప్పిపోయినచో నిఁక లోకములో ధర్మమే నశించునుగదా! 57. దేవుఁడు నాయొద్దకు ఆతని సందేశము (వహీ) పంపుచున్నాఁడు. అందుగొప్ప ప్రమాణములును సూచనలును గలవు. నేను వానిని స్వీకరించి అనుసరించుచున్నాను. మీరు అవి అబద్ధములని పలికి తిరస్కరించితిరి. కావున దాని ఫలితమును గూర్చి యోచింపుఁడు. కాఫిర్లు (అవిశ్వాసులు) మేము అబద్ధము అని పలుకు విషయము సత్యమైనచో ఆకాశమునుండి మాపై రాళ్ళవర్షము లేక ఏదైన ఘోరమైన యాపద దింపుము అని పలుకుచుండిరి. అందుకు పైగంబరులవారు అట్లుచేయుట నా అధికారములో లేదు. అది దేవుని చేతిలోనున్నది. దేవుఁడు బోధించునదిసత్యము. దానితిరస్కరించి అబద్ధము అనిపలుకువారినిగూర్చి ఆతఁడే సరియైనతీర్పు చేయును- ఆతనికి మించి యెవరును పోలేరు. శిక్ష విధించుట నాచేతిలో నున్నచో ఎప్పుడో మీకును నాకు నున్న వివాదము తీరిపోయి యుండును. కాని దేవుఁడు సర్వజ్ఞుఁడు సర్వశక్తుఁడు. ఆతఁడు తాను కోరినట్లు సమయోచితముగాఁ జేయును. కాఫిర్లు ఆపద రావలెనని తొందర చేసినను తత్క్షణమే ఆపద పంపఁడు. అదియును ఆతని కరుణయే. దేవునికి శక్తిలేదనిగాని ఆతనికి దుర్మార్గులు తెలియరని గాని కారణము వలన ఆపద వచ్చుటలో ఆలస్య మగుట లేదు. కాని ఆతనిదయ వలననే ఆలస్యము అగుచున్నది అని జనులు గ్రహించునది. 59. సర్వరహస్యములు దేవునికే తెలియును. రహస్యము (గైబు) ల బీగములు ఆతని యొద్దనే యున్నవి. భూమ్యాకాశములలో నున్న సమస్తము దేవునికిఁ దెలియు. ఆతనికిఁ దెలియనిది యెద్దియును లేదు. సర్వము ప్రకాశమాన గ్రంథము (లౌహెమహ్ఫూజు) లో నున్నది. కావున మానవులు చేయు ప్రతికార్యము దేవునికిఁ దెలియు. దానికిఁదగిన ఫలితమును కలదు.

60. వహువల్లజీ- యత - వఫ్- ఫాకుమ్- - బిల్ -లైలి-వయఅ-లము- మాజరహ్తుమ్-బిన్-నహారి-సుమ్మ-యబ్-అసుకుమ్-ఫీహి-లియుఖ్-జా- అజలుమ్-ముసమ్మన్-సుమ్మ-ఇలైహి-మర్ జి-ఉకుమ్-సుమ్మ-యునబ్బి-ఉకుమ్ బిమా

కున్తుమ్-తఅమలూన్.

60. మఱియు ఆతఁడే రాత్రియందు మిమ్ము తన వశమునకు ఆత్మల తీసికొనుచున్నాఁడు. మఱియు పగటిపూఁట మీరు చేసినవన్నియు ఆతనికిఁ దెలియును. ఆ పిదప నియమింపఁబడిన కాలము పూర్తియగుటకై పగటి పూఁట మిమ్ము లేపుచున్నాఁడు. పిదప మీరుఆతనియొద్దకు రప్పింపఁబడుదురు. ఆ పిదప మీరు చేయుచున్న కర్మలను దేవుఁడు మీకుఁ దెలుపును.

వ్యా॥ 60. మానవుఁడు రాత్రి నిద్రపోయినపుడు తన దేహమునుగూర్చియే ఆతనికి తెలివియుండదు. అన్ని శక్తులు పోయినట్లగును. దేవుఁడు కోరినచో నిద్రలోనే చావు నిచ్చును. కాని అట్లుగాక తిరిగి నిద్రనుండి లేపుచున్నాఁడు. ఎందుకన మానవుఁడు ఇహలోకమునందు ఎంతకాల ముండవలెనని దేవుఁడు నియమించియున్నాఁడో ఆకాలము కావలెను. నిద్రనుండి మేలుకొని చేయు ప్రతికార్యమును దేవునికిఁ దెలియును. ఆ కర్మల ఫలితము మానవుఁడు పొందవలెను. అందుకు చావు నిచ్చుచున్నాఁడు. తిరిగి తీర్పుదినమునందు దేవుని సన్నిధానమున నిలువవలసియున్నది. అపుడు మానవులకర్మలఁగూర్చి వారికి తెలుపఁబడును. నిద్రపోయి తిరిగి మేలుకొనుట చచ్చిన పిదప తిరిగి సజీవులగుటకు పోలిక గలదు. అందుకుఁ దానివిషయమిచ్చట చెప్పఁబడియెను.

61. వహువల్-ఖాహిరు-ఫౌఖ-ఇబాదిహీ-వయుర్-సిలు-అలైకుమ్-హఫజతన్-హత్తా-ఇజా-జాఅ అహద-కుముల్-మౌతు-తవఫ్-ఫత్ హు-రుసులునా-వహుమ్-లా యుఫర్రితూన్. 62. సుమ్మ-రుద్దూ-ఇలల్లాహి-మౌలా-హుముల్ హఖ్ఖి-అలా-లహుల్-హుక్మ-వహువ-అస్-రఉల్-హాసిబీన్.

61. మఱియు ఆతఁడే తన దాసులపై సంపూర్ణాధికారముగలవాఁడు. మఱియు ఆతఁడు మీకు రక్షకులను బంపుచున్నాఁడు. తుదకు మీలో నెవ్వనికైన చావు వచ్చినచో యమదూతలు వాని యాత్మను తీసికొనుచున్నారు. మఱి వారెట్టి కొఱత చేయరు. 62. పిదప వారు తమ సత్యమైనప్రభువగుదేవుని యొద్దకు చేర్పఁబడుదురు. వినుఁడు. ఆతనికే సర్వాధికారమున్నది. మఱియు బహు శీఘ్రముగా ఆతఁడు లెక్క తీసికొను వాఁడు.

వ్యా॥ 61. దేవునికి సర్వసృష్టి యాధీనమై యున్నది. ఆతని యాధికారమే చెల్లును. దాసు (ప్రజ) లను రక్షించుటకును, వారి కర్మల లెక్క పెట్టుటకును దేవదూతలు దేవునిచే నియమింపఁబడియున్నారు. ఒక మనుష్యుని కాలముతీరి చావు సమీపించినపుడు దూతలు వత్తురు. దేవుని సెలవు ప్రకారము ప్రాణము తీయుదురు. అందు ఏలాటి కొఱత చేయరు. తిరిగి తమ తమ కర్మల లెక్కకుఁ

గాను తీర్పు దినమునందు మానవులు దేవుని యొద్దకు రప్పింపబడుదురు. అపుడు మానవుడు తన జీవితకాలములో చేసియున్న పనుల లెక్కంతయు ఒక్క నిమిషములో జరుగును. అందు ఏలాటి ఆలస్యము కాదు. కావున మానవుడు తన సర్వాధికారియగు ప్రభువైన దేవుని ప్రీతిపడయుటకు విశ్వాసము గలిగి సత్కార్యములు చేయవలెను.

63. ఖుల్-మన్-యునజ్జీకుమ్-మిన్-జులుమాతిల్-బర్రి-వల్-బహ్రి తద్ఊనహూ-తజర్రు-అన్-వఖుఫ్-యతన్-లఇన్-అన్‌జానా-మిన్-హాజిహీ-ల-నకూనన్న-మినష్-షాకిరీన్. 64. ఖులిల్లాహు యునజ్జీ-కుమ్ మిన్‌హా-వమిన్-కుల్లి-కర్బిన్-సుమ్మ-అన్తుమ్-తుష్-రికూన్. 65. ఖుల్-హువల్-ఖాదిరు-అలా-అన్-యబ్అస-అలైకుమ్-అజా-బమ్-మిన్ ఫౌఖి-కుమ్ ఔ-మిన్-తహ్-తి-అర్జులికుమ్-ఔ-యల్-బిసకుమ్-షియ-అన్-వ-యుజీఖ బఅ-జకుమ్-బాస-బఅ-జిన్ ఉన్‌జుర్-కైఫ-నుసర్రిఫుల్-ఆయాతి-లఅల్లహుమ్-యఫ్-ఖహూన్.

63. వినయముతో రహస్యముగా వేడుచు ఈయాపదనుండి మమ్ము రక్షించినచో మేము తప్పక కృతజ్ఞత సలుపుదుమని వేడుకొనునపుడు భూ సముద్రముల చీకటులనుండి మిమ్ము ఎవడు రక్షించును అని ఓ ప్రవక్తా! పలుకుము. 64. దానినుండియు ఒక్కొక్క యిబ్బందినుండియు, దేవుడే మిమ్ము రక్షించుచున్నాడు. ఆ పిదపకూడ మీరు ఆతనికి సాటి కల్పింతురు అని ఓ ప్రవక్తా! పలుకుము. 65. మీపైనుండి గాని లేక మీపాదముల క్రిందనుండి గాని మీకు ఆపద పంపుటకును, లేక మిమ్ము తెగలు తెగలుగాజేసి పరస్పర కలహములవలన ఒకరికొకరికి బాధ కలిగించుటకును ఆతనికి శక్తిగలదు అని ఓ ప్రవక్తా! పలుకుము. చూడుము. వారు గ్రహించుటకై మేమెట్లు సూచనలను వివరించి తెలుపుచున్నారమో!

వ్యా॥ 63, 64. మనుష్యులు తమకు సముద్రములోను, భూమిలోను కష్టములు పడినపుడు దేవునినే వేడుదురు. ఆపద తొలగినచో దేవుని మేలుమఱువము ఆతనిని సదా కృతజ్ఞత సలుపుదుమని మొఱలు పెట్టుకొనుచు వాగ్దానము చేయుదురు. దేవుడు కరుణించి యాపదనుండి రక్షించినచో వారు ఆపదలో చేసిన వాగ్దానమును మఱచిపోయి, తిరిగి చిల్లర దేవతలకు మ్రొక్కుదురు. అట్లు దేవుని మేలును మఱచిపోవుదురు. 65. అట్లుచేసి దేవుని శిక్షనుండి తప్పించుకొనజాలరు. ఆకాశమునుండి రాళ్ళవాన లేక భూమినుండి భూకంపము మొదలగు ఆపదలు పంపుటకు దేవునికి శక్తిగలదు, లేక ప్రజలు పరస్పరము వైరము

గలిగి తెగలుతెగలుగా చీలిపోయి ఒకరితో నొకరు కలహములు చేసికొని హత్యలు చేసికొనునట్లు దేవుఁడు చేయఁగలఁడు. పరస్పర కలహములు పుట్టుట కూడ గొప్ప యాపదయే. జనులు గ్రహించి సన్మార్గము ననుసరించుటకై దేవుఁడు తన సూచనలను, వాక్యములను వివరించి ప్రపక్త్యమూలమున తెలుపు చున్నాఁడు. కావునమానవులుదేవునిబోధనుగ్రహించిసన్మార్గమవలంబింతురుగాక.

66. వకజ్-జబ-బిహీ-ఖాముక-వహువల్-హఖ్ఖు-ఖుల్-లస్తు - అలై కుమ్-బి-వకీల్. 67. లికుల్లి-నబఇమ్-ము స్త-ఖ్రరున్-వసౌఫ-తఅ-లమూన్. 68. వఇజా-రఐ-తల్లజీన-యఖూ-జూన-ఫీ-ఆయాతినా-ఫ-అఅ.రిజ్-అన్-హుమ్ హత్తా యఖూజూ-ఫీ-హదీసిన్-గైరిహీ-వఇమ్మా-యున్-సి-యన్న-కష్-షైతాను-ఫలా తఖ్-ఉద్-బఅ-దజ్-జిక్రా-మఅల్-ఖౌమిజ్-జాలిమీన్. 69. వమా-అలల్లజీన-యత్తఖూన-మిన్-హిసా-బిహిమ్-మిన్-షైఇన్-వలాకిన్-జిక్రా - లఅల్లహుమ్-యత్తఖూన్.

66:67. మఱియు, ఇది సత్యమైయున్నను దీనిని నీకులమువారుతిరస్కరించు చున్నను 'మీపై నేను రక్షకుఁడనుకాను. ప్రతి విషయమునకు ఒకకాలము నియమింపఁడియున్నది. మఱి సమీపములోనే మీరు తెలిసికొనఁగలరు' అని ఓ ప్రవక్తా! పలుకుము. 68. మఱి మాసూచనల విషయము వాదించువారిని నీవు చూచినచో అట్టివారు (దాని వదలి) ఇతర విషయములనుగూర్చి ముచ్చ టించుకొనునంతదాక వారినుండి తొలఁగియుండుము. మఱి ఒకవేళ సైతాను నిన్ను మఱువఁజేసినచో జ్ఞప్తికి వచ్చిన పిదప ఇట్టి దుర్మార్గులతో కూర్చుండి యుండకుము. 69. మఱి వాదించునట్టివారిని గూర్చి భయభక్తులుగలవారిపై నె ట్టిబాధ్యతలేదు. కాని వారు భయభక్తులు వహించుటకుఁగాను, భక్తులు వారికి బోధించుట విధియై యున్నది.

వ్యా॥ 66, 67. సత్యమైన గ్రంథమగు ఖురానును తిరస్క రించినచో దేవుని శిక్ష వచ్చును, అను సత్యమైన విషయమును, నీ కులమువా రగు ఖురైషులు అబద్ధమని తిరస్కరించిరి గదా! దానికి ఓ అవిశ్వాసులారా! మీరు అబద్ధమని పలికినందులకు మీపై ఆపద తెచ్చుటకు నాకు అధికారము లేదు. అది నాపనికాదు. నాపని ప్రచారము చేయుటయే. ప్రతి విషయము సంభవించుటకు ఒక కాలము నియమింపఁబడియున్నది. అది దేవునికేఁదెలియును. అది వచ్చునపుడు మీరే తెలిసికొనఁగలరు అని జవాబు పలుకుమని పైగంబరుల వారికి దేవుని సెలవయ్యెను. 68. దుర్మార్గులగు అవిశ్వాసులుదేవునివాక్యములు

విని ద్వేషముతో లేనినిందలు మోపుచు పరిహాసమాడుచుందురు. అట్టిసభలలో ముసల్మానభక్తులు కూర్చుండకూడదు. అట్లు కాఫర్లు పరిహాసమాడునపుడు వారితో కలిసి మెలసి కూర్చుండినచో ఆ పాప ఫలితము భక్తులుకూడ పొందుదురు. ఒకవేళ మఱచి కూర్చుండినచో జ్ఞప్తికి వచ్చినపుడు ఆసభ వదలిపోవలెను. 69. అట్లు వదలిపోయినచో కాఫిర్లకు లభించు పాపములో ముసల్మానులు భాగస్థులు కానేరరు. అట్లు వదలివచ్చుటవలన కాఫిరకు బుద్ధివచ్చును. మేము పరిహాసమాడునది సరికాదు అని వారికి తోచగలదు. ముసల్మానులు తమశక్తికొలంది దుష్టులకు బోధింపవలెను. దానివలన దుష్టులు సన్మార్గమవలంబింతురేమో అని ఆశయము గలదు.

70. వజ-రల్లజీ-నత్-తఖజూ-దీనహుమ్-లఇ-బన్-వలహ్వ-వన్-వ-గర్రత్‌హుముల్-హయా-తుద్-దున్యా-వజక్కిర్-బిహీ-అన్-తుబ్-సల-నఫ్ - సుమ్-బిమా-కసబత్-లైస-లహా మిన్-దూనిల్లాహి-వలియ్యున్-వలా-షఫీ-ఉన్-వఇన్‌తఅ-దిల్-కుల్ల-అద్-లిల్-లాయూఖజ్ మిన్‌హా-ఉలాఇకల్లజీన-ఉబ్-సిలూ - బిమా-కసబూ-లహుమ్-షరాబుమ్-మిన్-హమీమిన్-వ-అజాబున్-అలీముమ్-బిమా-కానూ-యక్-ఫురూన్.

70. మఱియు ఓ ప్రవక్తా! ఎవరు తమ మతమును, ఒక యాటగను, వేడుకగను చేసికొన్నారో వారిని నీవు వదలిపెట్టుము. మఱి ఇహలోకజీవనము వారిని మోసపుచ్చియున్నది. మఱి దేవుఁడు దప్ప నెవఁడునుసహాయముచేయువాఁడుగాని సిఫారసుచేయువాఁడుగాని లేని స్థితిలో నెవఁడును తన కర్మలలో పట్టువడకుండుటకై ఖురాను మూలమున వానిని ప్రబోధింపుము. మఱియు వారు బదులు (పరిహారము)గ సర్వమొసంగినను అంగీకరింపఁబడదు. అట్టివారే తమ కర్మలలో పట్టువడినవారు వారి అవిశ్వాసమునకు బదులుగ వారికి సలసలమని కాగు నీళ్లు త్రాగవలసియున్నది. మఱి వారికి దుఃఖకరమైన బాధగలదు. 71. కాఫిర్లు (అవిశ్వాసులు) స్వీకరింపవలసియున్న ఇస్లామ్ మతమును ఆటగాను, వేడుకగాను చేసికొనిరి. ఆ మతము దేవునిచే వారికొఱకు నియమింపఁబడియున్నను దానిగూర్చి పరిహాసమాడుచున్నారు. వారికి లభించియున్న ఇహలోకసంపదలకు వారు మోసపోయి పరలోకమును మఱచియున్నారు. ఇట్టివారినుండి తొలఁగియుండవలెను. అయినను వారికి ఖురాను వినిపించి దాని మూలమున వారికి బోధచేయవలెను. ఎందుకన ఆబోధనువిని దుర్మార్గము వదలి సన్మార్గమునకు వచ్చి పాపకార్యములను వదలి పాపముల శిక్షనుండి రక్షణపొందఁగలరు.

దుర్మార్గులకు నరకబాధనుండి తప్పించు సహాయము లేవరు నుండఁజాలరు. దేవుని సహాయము తప్ప ఇతరుల సహాయము దొరకదు. పాపాత్ముఁడు తన పాపముల శిక్షనుండి రక్షణపొందుటకు సర్వపరిహారము (బదులు) ఒసంగినను అవి యంగీకరింపఁబడవు. మఱి వాని శిక్ష తొలఁగదు. అవిశ్వాసులు దప్పితీర్చుకొనుటకుఁగాను సలసలకాగు నీళ్ళు త్రాగవలసివచ్చును. మఱి దుఃఖకరమైన నరకబాధలు గలుగును. కావున మానవుఁడు ఇహసంపదలకే మోసపోక పరమునకుఁగాను కృషి సలుపవలెను.

71. ఖుల్-అనద్-ఊ మిన్ దూనిల్లాహి-మా లాయన్-ఫఉనా-వలా-యజుర్రునా-వనురద్దు అలా అఅ-ఖాబినా-బఅద-ఇజ్-హదా-నల్లాహు-కల్లజీస్-తహ్-వత్-హుష్-షైతాను-ఫిల్-అర్జి-హైరాన-లహూ-అస్-హాబున్-యద్-ఊనహూ-ఇలల్-హుదఅ-తినా-ఖుల్-ఇన్న-హుదల్లాహి-హువల్-హుదా-వ ఉమిర్నా-లి-నుస్-లిమ-లిరబ్బిల్-ఆలమీన్. 72. వఅన్-అఖీముస్-సలాత-వత్త-ఖూహు వహువ-ల్లజీ ఇలైహి తుహ్-షరూన్. 73. వహువల్లజీ-ఖల-ఖస్-సమావాతి-వల్-అర్-జ-బిల్-హఖ్ఖి వయౌమ యఖూలు కున్ ఫయకూన్. 74. ఖౌలుహుల్-హఖ్ఖు-వలహుల్-ముల్కు-యౌమ-యున్-ఫఖు ఫిస్-సూరి-ఆలిముల్-గైబి-వష్-షహాదతి-వహువల్-హకీముల్-ఖబీర్.

71. దేవుని వదలి మాకు లాభముగాని నష్టముగాని చేయఁజాలనట్టి వానిని మేము ప్రార్థింపవలయునా! మఱి దేవుఁడు మాకు సన్మార్గము చూపిన పిదప సైతానులు ఒకనిని భూమిలో మార్గము తప్పింపఁగా నతఁడు దేవులాడుచుండ ఆతని స్నేహితులు సన్మార్గమునకుఁగాను మాయొద్దకు రమ్ము అని పిలుచుచున్నపుడు ఏమియు తోఁచని వానివలె మేముకూడ సన్మార్గమునుండి మరల వలయునా అని ఓ ప్రవక్తా! పలుకుము. దేవుఁడు చూపించినదే సన్మార్గము. మఱి మేముసర్వలోకముల ప్రభువునకు విధేయులముగనుండవలెననియు. 72. నమాజు స్థిరముగ సలుపవలెననియు దేవునికి భయపడవలెననియు మాకు ఆజ్ఞ యైనది. మఱి ఆతని యొద్దకే మీరందఱు రప్పింపఁబడుదురని ఓ ప్రవక్తా! పలుకుము. 73. మఱియు ఆతఁడే ఆకాశములను భూమిని ప్రయోజనార్థము సృష్టించినవాఁడు. మఱి ఏదినమునందు అగుము అని పలుకునో అప్పుడే అగును. 74. ఆతని మాట సత్యమైనది. సూరు (కొమ్ము) ఊదఁబడు దినమునందు దేవునిదే ప్రభుత్వముండును. ఆతఁడు రహస్యములును బహిరంగములును తెలిసినవాఁడు. మఱియు,

అతఁడు వివేచనా పరుఁడును సర్వజ్ఞుఁడును.

వ్యా॥ 71:72. విగ్రహారాధకులు ముసల్మానులతో మీరు ఇస్లామ్ మతము ను వదలి మాతో చేరుఁడు అని పలికిరి. దానికిఁగాను ఈవాక్యములలో జవాబి య్యఁబడినది. సత్యమతమైన ఇస్లామ్‌లో చేరి దేవుని ప్రార్థించునట్టి ముసల్మాను భక్తులు, ఏలాటి కీడు మేలు చేయరాని శక్తి హీనులగు చిల్లర దేవతలను ప్రా ర్థింప నేరరు. సర్వశక్తుండును సర్వజ్ఞుఁడును భూమ్యాకాశములు మొదలగునవి ప్రయోజనార్థము సృష్టించి పోషించు వాఁడునగు దేవునే ముసల్మానులు ప్రా ర్థింతురు. సన్మార్గమగు ఇస్లామ్‌ను వారు వదలినచో దోవతప్పి మార్గము దెలియక దేవులాడు వాని పోలిన వారగుదురు. మార్గము తప్పిన వానిని వాని స్నేహి తులు సన్మార్గమునకు రమ్మని పిలచినను వానికి ఏమియు తోచక దేవులా డును అటులే మోక్షము లభించుటకు మార్గము ఇస్లామ్. దాని ననుసరించు హ జ్రత్ పైగంబరుల వారును వారి శిష్యులును మార్గదర్శకులును స్నేహితులును కావున ఇస్లామ్‌ను వదలి అవిశ్వాసుల మార్గము అవలంబింపఁ గూడదు. దేవుఁ డు చూపిన మార్గమగు ఇస్లామ్ మతమే సన్మార్గము. కావున ముసల్మానులు దేవునికి విధేయులై ఆయిదు పూఁటలు స్థిరముగా నమాజు సలుపుచు దేవుని యందు భయభక్తులు గలిగి యుండవలెను దేవుని యొద్దకు తీర్పు దినమునందు అందఱును చేరుదురు. 73. తీర్పుదినము (ఖియామత్) దేవుని సెలవు కాఁగానే అగును. 74. దేవుఁడు సెలవిచ్చినట్లు అగును. ప్రాణులు తిరిగి సజీవు లగుట కై సూరు (కొమ్ము) ఊఁదఁబడును. ఆదినము సర్వాధికారము దేవునికే చెల్లును ఎవనికిఁగాని యేలాటి అధికారముండ నేరదు. సర్వజ్ఞుఁడగు దేవుఁడే ప్రాజ్ఞుఁడు.

75. వఇజ్-ఖాల-ఇబ్రాహీము-లి-అబీహి-ఆజర-అతత్-తఖిజు - అస్నా-మన్-ఆలిహతన్-ఇన్నీ-అరాక-వఖౌ-మక-ఫీ-జలాలిమ్-ముబీన్. 76- వ-క-జా లిక-నురీ-ఇబ్రాహీమ-మల-కూతస్-సమా-వాతి-వల్-అర్‌జి-వలి-యకూన-మినల్-మూఖినీన్. 77. ఫలమ్మా-జన్న-అలైహిల్-లైలు-రఆ-కౌకబన్-ఖాల-హాజా-ర బ్బీ-ఫలమ్మా-అఫల-ఖాల లా-ఉహిబ్బుల్-ఆఫిలీన్. 78. ఫలమ్మా-రఅల్-ఖమర బాజిగన్-ఖాల-హాజా-రబ్బీ-ఫలమ్మా-అఫల-ఖాల-లఇల్-లమ్-యహ్‌దినీ-రబ్బీ ల-అకూనన్న-మినల్-ఖౌ-మిజ్-జాల్లీన్. 79.ఫలమ్మా-రఅష్-షమ్స-బాజిగతన్ ఖాల-హాజా-రబ్బీ హాజా-అక్బరు-ఫలమ్మా అఫలత్-ఖాల-యా-ఖౌమీ-ఇన్నీ-బరీఉమ్-మిమ్మా తుష్‌రికూన్. 80. ఇన్నీ వజ్-జహ్తు-వజ్-హీయ-లిల్లజీ-ఫత

రస్-సమావాతి-వల్-అర్జ్-హనీఫన్-వమా-అనా-మినల్-ముష్-రికీన్.

75. మఱియు ఇబ్రాహీము తన తండ్రియగు ఆజరుతో "ఏమి నీవు విగ్రహములను దేవునిగాఁ జేసికొనుచున్నావా! నీవును నీకులమువారును స్పష్టమైన దుర్మార్గములో నుండుటను నేను చూచుచున్నాను అని పలికిన విషయము నీవు స్మరింపుము. 76. మఱియు నిటులే ఇబ్రాహీమునకు నమ్మికగలుగుటకై యాతనికి ఆకాశములలోని భూమిలోని మహిమలను జూపితిమి. 77.ఆపిదప ఆతనికి రాత్రి చీఁకటి క్రమ్ముకొనఁగా ఆతఁడొక నక్షత్రమును చూచి యిదియే నాప్రభువు అని పలికెను. ఆ పిదప ఆ నక్షత్రము అస్తమింపఁగనే, నేను అస్తమించువానిని ప్రేమింపను అనిపలికెను. 78.పిదప చంద్రుఁడుదయించుచుండఁగఁ జూచి ఇదియే నాప్రభువని పలికెను. మరల అది యస్తమింపఁగనే, దేవుఁడు నాకు సన్మార్గము చూపనిచో నేను సన్మార్గము తప్పిన జనులతో చేరినవాఁడనగుదునని పలికెను. 79. ఆపిదప సూర్యుఁ డుదయింపఁగాఁ జూచి ఇదియే నా ప్రభువు. ఇది అన్నిటికంటె పెద్దది అని పలికెను. పిదప సూర్యుఁడు అస్తమించిపోఁగా ఓనాకులమువారలార! మీరు దేవునికి సాటికల్పించునట్టివానినుండి నేను తొలఁగిపోవుచున్నాఁడను. 80. నిశ్చయముగా నేను సర్వమును వదలి నా ముఖమును ఆకాశములను భూమిని సృష్టించినవానివైపునకుఁ ద్రిప్పుచున్నాను. మఱి నేను దేవునికి సాటికల్పించునట్టివారిలోఁ జేరినవాఁడనుకాను అని యిబ్రాహీము పలికెను.

వ్యా॥ 75 : 80. మునుపటి వాక్యములలో దేవుని యేకత్వము(తౌహీదు.ను గూర్చియు ముసల్మానుల మత స్థిరత్వమునుగూర్చియు చెప్పఁబడియె) ఇఁక హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్త విషయము దెలుపుచు ఆయన ఎట్లు దేవుని యేకత్వమును ప్రజలకుఁ దెలిపెనో అది సూచింపఁబడుచున్నది. ఇబ్రాహీము తండ్రి ఆజరు. ఆతనికి తారఖ్ అని పేరుగలదు. ఆతఁడు విగ్రహములను పూజించువాఁడు. కీడుమేలు చేయలేని విగ్రహములను మానవులు తమచేతులార చెక్కి చేసిన విగ్రహములను పూజించుట సరికాదు అని ఇబ్రాహీము తెలిసికొని దేవుని యేకత్వమును స్థిరముగా నమ్మెను. విగ్రహారాధన సరికాదు. అది దుర్మార్గము అని ఇబ్రాహీము తన తండ్రితో పలికెను. 76. ఇటులే అనఁగా విగ్రహారాధన చేయుట తప్పు అని తెలిపినట్లు భూమ్యాకాశములలోని మహిమ విధిత్రములను దేవుఁడు ఇబ్రాహీమునకు దెలిపెను. భూమ్యాకాశములలోని మహిమములను సూచనలను గుర్తించినందున హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తనుదృఢవిశ్వాసము గలిగెను. ఆతని కులమువారు నక్షత్రములను సూర్యచంద్రాదులను పూజించుచుండిరి. ఇవన్నియు ఉదయించుచు అస్తమించుచున్నవి. కావున ఇవి దేవతలు కానేరవు. ఇవి సర్వశక్తుఁడగు దేవునికి లోఁబడియున్నవిఅని హజ్రత్

ఇబ్రాహీము తన జనులకుఁ దెలిపెను. నక్షత్రమును చూచి యిదియే నా ప్రభువు అనెను. అనగా ఓ జనులారా! మీరు పలుకునట్లు ఇది నా ప్రభువే. కాని అస్తమించిపోయినదే! కావున అది నా ప్రభువుకాదు అని స్థిరముగాఁ దెలిపెను. ఇటులే మిగిలినవి యూహింపవలెను. ఆకాశములోని నక్షత్రములు, సూర్యుఁడు చంద్రుఁడు మొదలైన గ్రహములు తమ తమ చోటులో సమయము మించక అటుఇటుపోక క్రమముగా ఉదయించుచు అస్తమించుచున్నవి. ఇవన్నియు ఒక సర్వశక్తుఁడగు దేవునికి లోఁబడియున్నవి అని తెలియుచున్నది. కావున చిల్లర దేవతలను విగ్రహములను విడనాడి, సర్వమునకు సృష్టికర్తయగు దేవుని సమ్ముఖమున భక్తిపూర్వకముగ నిలుచుచున్నానని ఇబ్రాహీము ప్రకటించెను.

81. వహాజ్జహూ-ఖౌముహూ-ఖాల-అతుహాజ్జూన్నీ-ఫిల్లాహి-వఖద్-హదానీ-వలా-అఖాఫు-మాతుష్రికూన-బిహీ-ఇల్లా-అన్ యషా-అ-రబ్బీ - షైఅన్ వసిఅ-రబ్బీ-కుల్ల-షైఇన్ ఇల్మన్ అఫలా తత-జక్కరూన్. 82. వకైఫ- అఖాఫు-మా అష్రక్-తుమ్-వలా-తఖాఫూన-న్నఅకుమ్ అష్రక్-తుమ్ బిల్లాహి-మాలమ్-యునజ్జిల్-బిహీ-అలైకుమ్ సుల్-తానన్-ఫ-అయ్యుల్-ఫరీ-ఖైని-అహఖ్ఖు బిల్-అమ్ని -ఇన్-కున్తుమ్-తఅ-లమూన్. 83 అల్లజీన-ఆమనూ - వలమ్-యల్-బిసూఈమానహుమ్-బిజుల్మిన్ ఉలాఇక లహుముల్-అమ్ను-వహుమ్-ముహ్-తదూన్.

81 మఱియు ఆతనితో ఆతనికులమువారు వాదించిరి. (అపుడు) ఏమిమీరు దేవుని విషయము నాతో వాదించుచున్నారా! మఱి దేవుఁడు నాకు సన్మార్గము చూపించి యున్నాఁడు. మఱి మీరు దేవునికి సాటి కల్పించుచున్నట్టి వానికి నేను భయపడను. కాని నా ప్రభువు ఏమి చేయునో అని భయపడుదును. సర్వమును దేవునికిఁ దెలియును. ఏమి మీరు గమనింపరా? 82. మఱి మీరు దేవునికి సాటి కల్పించు దేవతలకు నేను ఎట్లు భయపడుదును. మఱి దేవుఁడు మీకు ప్రమాణము పంపని దానిని దేవునికి సాటిగ కల్పించు విషయమును గూర్చి మీరు భయపడుట లేదే. కావున రెండు పక్షముల వారిలో నెవరు శాంతి పొందుటకు అర్హులో మీకు తెలిసినచో పలుకుఁడు. అని ఇబ్రాహీము పలికెను. 83. ఎవరు విశ్వసించి తమ విశ్వాసములో నెట్టి లోపము కల్పింపరో అట్టివారికి శాంతి యున్నది. మఱివారే సన్మార్గమందున్నవారు.

వ్యా॥ 81. హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్త దేవుని యేకత్వమును ప్రకటింపఁగా ఆతని కులమువారు ఆతనితో వాదింప సాగిరి. దానికి ఇబ్రాహీము

"దేవుఁడు నాకు తన సూచనలు తెలిపి సన్మార్గము చూపెను. కావున నేను సన్మార్గము వదలి తప్పు త్రోవకు రాను" అని పలుకఁగా విగ్రహారాధకులు ఓయిబ్రాహీము! నీవు మా దేవతలకు భయపడుము. అవి నీకు కీడు కలిగించును అని బెదరించిరి దానికి నేను మీ చిల్లర దేవతలకు భయపడను. అవి కీడు గాని మేలుగాని చేయలేవు. అవి శక్తిహీనవి. నేను దేవునికి భయపడుదును. ఆతఁడు సర్వజ్ఞుఁడును సర్వశక్తుఁడును. ఆతఁడు కీడు మేలు చేయఁగలడు. కావున మీరు గమనించి బుద్ధి తెచ్చుకొని విగ్రహారాధన మానుకొని అద్వితీయుఁడైన దేవునే పూజింపుఁడు. 82 నేను మీ చిల్లర దేవతలకు ఎందుకు భయపడవలెను. నేను స్వీకరించిన దేవుని యేకత్వము (తౌహీదు) తప్పుగాదు. మీరు చేయు విగ్రహారాధన సరిగాదు. దానికి సన్నదు (ప్రమాణము) లేదు. కావున దానికి శిక్ష లభించునని మీరు భయపడవలెను. దేవుని పూజించువారికి శాంతియును రక్షణయును లభించును. దేవునికి సాటిగ నితర దేవతలను కల్పించువారికి శాంతిగాని రక్షణగాని లభింపదు. 83. విశ్వాసము (ఈమాను) వహించి అందు ఏలాటి లోపము చేయనివారు శాంతియును సన్మార్గము పొందినవారు. విశ్వాసములో లోపము కల్పించుట అనఁగా దేవునికి సాటి కల్పించుట (అనగా షిర్కు చేయుట). విశ్వాసమునకు షిర్కు విరుద్ధము. కావునసర్వవిధములషిర్కు నుండి భక్తులు తొలఁగి యుండవలెను.

84. వతిల్క-హుజ్-జతునా-ఆతైనాహా-ఇబ్రాహీమ-అలా-ఖౌమిహీ-నర్ఫఉ-దరజాతిమ్-మన్-నషాఉ-ఇన్న-రబ్బక-హకీమున్-అలీమ్.

84. మఱియు ఇది మాసూచన. ఇబ్రాహీము తన కులమువారిని ఎదురుకొనుటకై ఆతనికి మేమొసంగితిమి. మేము కోరిన వారి దర్జా (పదవు) లను గొప్పవిగాఁ జేయుచున్నాము. నిశ్చయముగా నీప్రభువు వివేచనాపరుఁడును సర్వజ్ఞుడును.

వ్యా॥ 84. ఇబ్రాహీము పవిత్రతనకు దేవుఁడు ఒసంగిన ప్రమాణసూచనల వలన తన కులమువారిపై వివాదములో జయముపొంది వారిని నిరుత్తరులనుగాఁ జేసెను. ఇబ్రాహీము గారి దర్జాలను (పదవులను) ఉభయ లోకములలోను గొప్పవిగాఁ జేసెను. ఇవన్నియు చేయుట వివేచనాపరుఁడును సర్వజ్ఞుడును అగు దేవుని పనియే.

85. వవ-హబ్నా-లహూ-ఇస్హాఖ వ-యఅ-ఖూబ-కుల్లన్-హదైనా-వనూహన్-హదైనా-మిన్-ఖబ్లు-వ-మిన్-జుర్రీయతిహీ-దావూద-వసులైమాన-వ-అయ్యూబ-వ-యూసుఫ-వ-మూసా-వ-హారూన-వ-కజాలిక-నజ్‌జిల్-ముహ్సి-

సినీన్. 86. వజకరియ్యా-వ-యహ్యా-వఈసా-వఇల్-యాస-కుల్లున్-మినస్
సాలిహీన్. 87. వఇస్మాఈల-వల్-యస్అ-వ-యూనుస-వలూతన్- వకుల్లన్
ఫజ్-జల్నా-అలల్-ఆలమీన్. 88. వమిన్-ఆబాఇహిమ్-వజుర్రి-యాతిహిమ్-
వఇఖ్-వానిహిమ్-వజ్ తబైనా-హుమ్-వహదైనాహుమ్-ఇలా-సిరాతిమ్ -ము
స్త-ఖీమ్. 89. జాలిక-హుదల్లాహి-యహ్దీ- బి-హీ-మన్-యషాఉ-మిన్ - ఇ
బాదిహీ-వలౌ అష్-రకూ ల-హబిత-అన్-హుమ్-మా-కానూ-యఅ-మలూన్.
90.ఉలాఇకల్లజీన-ఆతైనా-హుముల్ -కితాబ-వల్ హుక్మ-వన్-నుబువ్వత-ఫఇన్
యక్ఫుర్-బిహా-హాఉలాఇ-ఫఖద్-వక్కల్నా-బిహా-ఖౌమల్ - లైసూ బిహా - బి
కాఫిరీన్. 91.ఉలాఇ-కల్లజీన-హదల్లాహు ఫబిహు దా-హుముఖ్ - తదిహ్-ఖుల్
లా-అస్-అలుకుమ్-అలైహి-అజ్రన్- ఇన్-హువ-ఇల్లా-జిక్రా లిల్-ఆలమీన్.

85 మఱియు మేము ఇబ్రాహీమునకు ఇస్హాఖును, యాఖూబును ఒసం
గితిమి. అందఱికిని సన్మార్గము చూపితిమి. మఱియు వీరికంటెపూర్వము మేము
నూహునకు సన్మార్గము చూపితిమి. మఱియు ఇబ్రాహీము సంతతివారిలో దా
వూదునకును సులైమానునకును అయ్యూబునకును యూసుఫునకును మూసా
కును హారానునకును మేము సన్మార్గము చూపితిమి. మఱియు నిటులే సత్కా
ర్యములు చేయువారికి మేము ప్రతిఫల మొసంగుచున్నారము. 86. మఱియు
జకరియ్యాకును ఈసాకును ఇల్యాసునకును మేము సన్మార్గము చూపితిమి. అం
దఱును పుణ్యాత్ములలో చేరిన వారేను. 87. మఱియు ఇస్మాయీలునకును
అల్యసఅకును, యూనుసునకును, లూతునకును సన్మార్గము చూపితిమి. మఱియు
సర్వలోకులకు పై వీరందఱికిని ఘనత నొసంగితిమి. 88. మఱివారి వారితండ్రుల
లోను వారి సంతతి వారిలోను వారిసహోదరుల లోను కొందఱికి సన్మార్గము
చూపితిమి మఱి మేమువారి నెన్నుకొంటిమి. మఱివారిని సన్మార్గమున నడువఁ
జేసితిమి. 89. ఇది దేవుని మార్గము. తానుకోరిన తన భక్తులను అందు నడువఁ
జేయుచున్నాఁడు. మఱివారు దేవునికి సాటి కల్పించి యుండిరేని వారు చేసిన
కర్మలు వ్యర్థమాయయి యుండును. 90. వీరికే మేము గ్రంథమును జ్ఞానమును
ప్రవక్త పదివి నొసంగితిమి. కావున వీనిని మక్కా నివాసులు విశ్వసింపనిచో
తిరస్కరింపక విశ్వసించునట్టి జనులను మేము నియమించి యున్నారము. 91.
దేవుఁడు వీరికి సన్మార్గము చూపి యున్నాఁడు. కావున నీవును వారిమార్గము
ననుసరింపుము. ఖురాను పరిచారమునకుఁగాను నేను మిమ్ము కూలిఅడుగుటలేదు.
ఇది సర్వలోకులకు పరిబోధనము అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 85. దేవుఁడు ఇబ్రాహీమునకు ప్రవక్తపదవినొసంగి గొప్పఘనత నొసంగి యనుగ్రహించినదిగాక ఆతనికి ముసలితనమునందు బీబీ సారాయందు ఇస్హాఖు అను పుత్రు నొసంగెను. ఆ పుత్రునికి యాఖూబు అను కుమారుని అనుగ్రహించెను. ఇబ్రాహీము తన జీవితకాలములోనే పౌత్రునిగాంచి సంతసించెను. యాఖూబును ఇస్రాయీలు అనుదురు. ఈతని సంతతిలో గొప్ప గొప్ప ప్రవక్తలును రాజులును పుట్టిరి. వారిలో కొందఱి పేళ్ళు ఈవాక్యములో చెప్పఁబడినవి. ఇబ్రాహీము ప్రవక్త, నూహుప్రవక్త సంతతితో చేరినయాయన. నూహుకాలమునందు జలప్రళయము గలిగెను. అందు నూహును, ఆతనిని విశ్వసించినవారును రక్షింపఁబడిరి మిగిలిన జనులు నశించిరి. నూహు సంతానమే లోకమంతటను వ్యాపించెను. కావుననేఆయనను ఆదమెసానీ అనఁగాం రెడవ ఆదము అని చెప్పుదురు. దావూదు కుమారుఁడు సులైమాను. వీరు ప్రవక్తపదవితోఁగూడ గొప్పరాజ్యముచేసినవారు. అయ్యూబు యూసుఫు చాల కష్టములు పడి సహించినవారు. యూసుఫుయాఖూబునకు పుత్రుఁడు. యూసాహారూను అన్నదమ్ములు. 86. జకరియ్యా, యహ్యా ఈసా, ఇల్యాసు, వీరందఱు ప్రవక్తలును, పుణ్యాత్ములును. 87. ఇస్మాఈలు ప్రవక్త ఇబ్రాహీమునకు బీబి హాజరాయందు పుట్టిన జ్యేష్ఠకుమారుఁడు. ఈతని సంతానములోనే జగత్ప్రవక్త హజ్రత్ ముహమ్మదువారు జన్మించిరి. అల్యసఅ, యూనసు, లూతు వీరందఱు హజ్రత్ ఇబ్రాహీమువంశమువారు. దేవుఁడు వారికి వారి కాలములోని జనులపై ఘనతనొసంగెను. అందఱికి సన్మార్గము చూపి దానియందు నడువఁజేసెను. 89. దేవుఁడు తాను కోరిన భక్తులకు జ్ఞానమార్గము ధర్మమార్గము చూపుచు తన యేకత్వము వారికిఁ దెలుపుచు దానికి ఫలితముగ వారికి గొప్ప గొప్ప దర్జాలు ఒసంగుచున్నాఁడు. దేవునికి సాటి కల్పించుట షిర్కు అనఁబడును. ఎవరైన అట్లు చేసినచో వారికర్మలు వృథాపోవును. స్వర్గము తప్పి నరకము లభించును. సామాన్యులు ఆటుండ ప్రవక్తలు ఒకవేళ షిర్కుచేసినచో వారి కర్మలుకూడ వృథాపోవును. 90. పై వివరింపఁబడిన ప్రవక్తలందఱికిని దేవుఁడు మతగ్రంథములు జ్ఞానము, ప్రవక్తపదవి ఒసంగియున్నాఁడు. మక్కాపురవాసులు దేవుని గ్రంథమును మతమును తిరస్కరించినచో దేవుని పని వారిపై నాధారపడియుండలేదు. దేవుఁడు దానికొఱకు ఇతర జనులను నియమించును. వారు విశ్వసించి దానిని ప్రచారముచేయుదురు. మదీనావారును ముహాజిరులును మక్కా విడిచి మదీనా చేరిన (ముసల్మాను భక్తులు) సంపూర్ణముగ విశ్వసించి ఇస్లామ్‌ను వ్యాపింపఁజేసిరి. 91. ప్రవక్తలందఱును బోధించు ముఖ్య ధర్మములు ఒకటివే. అవి మూలములు (ఉసూల్). అందఱును వాని ననుసరింపవలెను. కావున హజ్రత్ పైగంబరులవారుకూడ ఆ మూలధర్మములను

అనుసరింపవలెను అని దేవుని సెలవయ్యెను. ఆయా కాలమునకుc దగినట్లు కొన్ని శాఖలు, ఉపశాఖలు (ఫురూఉ) మారుచుండును. దానివలన మతములోనిమూల ధర్మములు మారవు. హజ్రత్ పైగంబరులవారు ఇస్లామ్‌మతప్రచారము ఉచితముగ చేయుదురు. దానికి ప్రతిఫలముగ ప్రజలనుండికూలి (మజూరీ) అడుగరు. కావున ప్రజలు బోధ విననిచో పైగంబరులవారికి నష్టముకాదు. ప్రజలకే నష్టమగును. ఎందుకన ఖురాను లోకులందఱికి బోధనగా నున్నది. దాని ననుసరించినచో ఉభయలోకములలోని వారికి మేలు గలుగును. లేనిచో నష్టముగలుగును.

92. వమా-ఖదరుల్లాహ-హఖ్-ఖ-ఖద్‌రిహీ-ఇజ్-ఖాలూ-మా - అన్-జలల్లాహు-అలా-బషరిమ్-మిన్-షైఇన్-ఖుల్-మన్-అన్-జలల్-కితాబల్లజీ-జాఅ బిహీ-మూసా-నూరన్-వహుదల్-లిన్నాసి-తజ్-అలూ-నహూ-ఖరాతీస-తుబ్‌దూనహా-వతుఖ్-ఫూన-కసీరన్-వ-ఉల్లిమ్-తుమ్-మాలమ్-తఅ్-లమూ-అన్తుమ్ వలా-ఆబా-ఉకుమ్-ఖులిల్లాహు-సుమ్మ-జర్-హుమ్-ఫీ- ఖౌజి-హిమ్ - యల్-అబూన్. 93. వహాజా-కితాబున్-అన్‌జల్నాహు-ముబారకుమ్-ముసద్ధి-ఖుల్-లజీ-బైన-యదైహీ-వలి-తున్-జిర-ఉమ్మల్-ఖురా-వ-మన్-హౌలహా-వల్లజీన-యూమినూన-బిల్ ఆఖిరతి-యూమినూన-బిహీ-వహుమ్-అలా-సలాతిహిమ్ - యుహాఫి-జూన్.

92. దేవుcడు, ఏ మానవునకును సందేశమును పంపలేదు అని పలుకునపుడు అవిశ్వాసులు దేవుని (శక్తి)ని సరిగ తెలిసికొనలేదు. ప్రజల కొఱకు మూసా తెచ్చిన జ్యోతియును సన్మార్గమునుగల గ్రంథము ఎవcడు పంపెను. దానిని మీరు కాగితములు కాగితములుగ చేసి ప్రజలకు చూపుచుంటిరి. మఱి అనేక విషయములను దాcచిపెట్టుచుంటిరి. మఱియు మీకును మీతండ్రులకును తెలియనివానిని మీకు నేర్పెను అని అడుగుము. దేవుcడే పంపెను అని ఓప్రవక్తా! పలుకుము. పిదప వారు తమ పనికిమాలిన వివాదములోపడి తన్నుకొనునట్లు వారిని వదలిపెట్టుము. 93. ఈ ఖురానుగ్రంథమును మేము పంపితిమి. ఇది శుభముగలది. దీనికి పూర్వపుగ్రంథములను, సత్యపఱచునది. మఱి నీవు మక్కా-వారికిని దానిచుట్టునుండువారికిని భయబోధ నిచ్చుటకుcగాను ఖురాను పంపితిమి. మఱియు పరలోకము విశ్వసించువారు ఖురాననందు విశ్వాసము గలిగి తమ నమాజుల విషయము జాగ్రత్తగా నున్నారు.

వ్యా॥ 92. అవిశ్వాసులు, దేవుcడు ఏ మానవునకును గ్రంథముగాని

సందేశముగాని పంపలేదు అని తిరస్కరించుచు ఖురానును కూడ తిరస్కరింప సాగిరి. దానికి సమాధాన మీయఁబడినది. దేవుఁడు మానవునకును ఏమియు పంపకున్నచో మూసాప్రవక్త తెచ్చిన తౌరాతుగ్రంథము ఎక్కడిది? ఎవరు దానిని పంపిరి. అందు ప్రజలకు ధర్మములు బోధించు సన్మార్గమును జ్యోతియు గలవు. ప్రజలు వానిలోని కొన్ని విషయములను వెల్లడిచేయుచు మఱికొన్నిటిని దాఁచుచు వచ్చిరి. అయినను అందలి ధర్మములు, ఉపదేశములు, విషయములు ప్రజలు తమ సొంతబుద్ధితో తెలిసికొనలేరు. అవి దేవుని మూలముననే ప్రజలకు తెలియవలెను. ఎవరికిఁ దెలియనివిషయములను దేవుఁడు తనగ్రంథములు ప్రవక్తల కిచ్చి వారి మూలమున పూర్వము తెలియని ధర్మమార్గము తెలిపెను. ఇట్టి స్పష్టమైనవిషయములు అవిశ్వాసులునమ్మనిచో వారినివదలిపెట్టుముఅని ప్రవక్తకు దేవుని సెలవు అగుచున్నది. 93. ఇఁక ఈవాక్యములో ఖురానునుగూర్చి చెప్పఁ బడుచున్నది. దేవుఁడు ప్రవక్తకు గ్రంథము పంపనిచో ఇట్టిమహిమగలఖురాను గ్రంథము ఎచ్చటినుండి వచ్చినది? తప్పక యిది దేవునిగ్రంథము. దేవుఁడు తన ప్రవక్తలకు సందేశము (వహీ) పంపుచు గ్రంథమొసంగును అను విషయము స్థిరమైనది. ఖురానుగ్రంథమునకు పూర్వము దేవునిచే ప్రవక్తలకొసంగఁబడి గ్రంథముసత్యమైనది అనిఖురాను సాక్ష్యమిచ్చును. దీనిమూలమున మక్కా పురమువారికిని వారిచుట్టునుండువారికిని సర్వలోకములకును బోధనయున్నది. ప్రళయము(ఖియామతు) వఱకును సర్వజగత్తునకు ఖురానుమార్గదర్శకమును బోధకమునగును. పరలోకమున్నది. అందు ఇహమునందలికర్మల ఫలితము లభించును అని నమ్మకముగలవారు ఖురానను విశ్వసించి ప్రార్థనల (నమాజుల) విషయమున జాగ్రత్తగ నుండి వానిని నియమముతో భయభక్తులతో సలుపుదురు.

94. వమన్-అజ్‌లము-మిమ్-మనిఫ్-తరా-అలల్లాహి కజిబన్-ఔ-ఖాల-ఊహియ-ఇలయ్య-వలమ్-యూహా-ఇలైహి-షైఉన్ - వమన్-ఖాలసఉన్- జిలు-మిస్లమా-అన్-జలల్లాహు-వలౌ-తరా-ఇజిజ్-జాలిమూన-ఫీ-గమ-రాతిల్ - మౌతి వల్-మలాఇ-కతు-బాసితూ-ఐ-దీహిమ్-అఖ్ రిజూ-అన్-ఫుసకుమ్-అల్-యౌమ తుజ్ జౌన-అజాబల్-హూని-బిమా-కున్తుమ్-తఖూలూన-అలల్లాహి -గైరల్ -హఖ్ఖి-వ-కున్తుమ్-అన్- ఆయాతిహీ-తస్-తక్ - బిరూన్. 95. వలఖద్-జి- తుమూనా-ఫురాదా-కమా-ఖలఖ్నా-కుమ్-అవ్వల-మర్‌రతిన్-వతర-క్తుమ్ -మా-ఖవ్వల్నాకుమ్-వరాఅ-జుహూరికుమ్- వమా-నరా-మఅకుమ్-షుఫ-ఆ - అకుముల్-లజీన-జఅమ్-తుమ్-అన్న-హుమ్-ఫీకుమ్-షుర-కాఉ-లఖత్-తఖత్త-అ-బైనకుమ్

వజల్ల-అన్-ఈమ్-మాకున్తుమ్-తజ్-ఉమూన్.

94. మఱియు దేవునిపై అబద్ధముగానింద మోపిన వానికంటెను దేవునిసందేశ ములేకయేనాకు దేవునిసందేశము వచ్చినదిఅని పలుకువానికంటెను మఱి దేవుఁడుపంపినదానివంటిది నేనునుపంపుదునుఅని పలుకువాని కంటెను ఎక్కుడు దుర్మార్గుఁడెవఁడున్నాఁడు! మఱి దుర్మార్గులు చావుకష్టములలో నున్నపుడు దేవ దూతలు తమచేతులను చాచుచు ఓయీ మీరుమీయాత్మలనుతీసివేయుఁడు. మీరు దేవునిపై అసత్యములు పలుకుచుండి నందువలనను ఆతని సూచనలను గర్వముతో తిరస్కరించుచుండినందు వలనను ఈదినము అవమాన కరమైన బాధ మీకు ఫలితముగా లభించును అని పలుకుట నీవు చూచినచో గొప్ప విష యమును గనుగొందువు. 95. మఱియు మేము మిమ్ము మొదటితూరి పుట్టించి నట్లు మీరు మాయొద్దకు ఒంటరిగా వచ్చిరి. మఱి మేము మీకొసంగిన దా నిని వెనుక వదలి వచ్చితిరి. మఱి మీకు తోడుపడుదురని మీరు తలఁచినట్టి మీ సహాయులు మీతో నుండుట మేము చూచుట లేదే! నిశ్చయముగా మీసం బంధము తెగిపోయినది. మఱి మీరు తలఁచుచున్నది వృథా పోయెను.

వ్యా॥ 94 దేవునిపై అపనిందల మోపుట అనఁగా సాటిలేని దేవునికి సాటి కల్పించుట. భార్యయు బిడ్డలులేని దేవునికి భార్య బిడ్డలున్నారని పలుకు ట ఘోరపాతకము. నేను దేవుని ప్రవక్తనుఅని అబద్ధముపలుకుటకూడ ఘోర పాతకము. అటులే దేవుని వాక్యముల వంటి వాక్యములు నేనును కల్పింపఁ గల ను అని డంబాలు కొట్టుకొనుట కూడ మహాపాపము. ఇట్టివారికంటె నెక్కుఁ డు దుర్మార్గుఁడెవఁడునులేఁడు. ఇట్టి దుర్మార్గులకు చావు వచ్చి ప్రాణములు పోవునపుడు కష్టములు గలుగును. ప్రాణము దేహము నుండి బయటికి వచ్చు టకు వెనుదీయును. అపుడు దేవదూతలు వాని శిక్షించుటకై తమ చేతులు చాచు చు మీరు మీయాత్మలను తీసి వేయుఁడు అని గద్దింతురు. అపుడు మీరు కా వించుచున్న పాపములకును దేవునిపై పలికిన అసత్యములకును గర్వముపూని దేవుని సూచనలను తిరస్కరించి నందులకును ఈదినము మీకు అవమానకరమై న బాధ గలుగును అనియుఁదలింతురు. ఓప్రవక్తా! నిన్ను ధిక్కరించునట్టి అవిశ్వా సుల దుర్గతి చూచినచో ఏమిరా ఇట్లు డంబాలు కొట్టుచున్నవారి గతి యిట్లా యెను అని నీకు ఆశ్చర్యమును జాలియుకలుగును. 95. పుట్టినపుడు మానవుఁడు ఒంటరిగా నేపుట్టును. వాని వెంటధనము మొదలగు ఏలాటిసామానులుండవు. తాను పెద్దవాఁడై తనకు దేవుడొసంగినసంపదలకువిట్టిపీగునట్టిమానవుఁడుప్రాణమువిడిచి పోవునపుడుతనవెంటఏమియుతీసికొనిపోఁజాలడు. ఒంటరిగానే పోవును. ఏలాటి

ంసపడలు పనికిరావు. దేవునికి సాటిగ తాను కల్పించి పూజించుచున్న దేవతలు అపుడు సాయపడలేరు. అడ్డు రాఁజాలరు. సిఫారసు చేసి నరకము నుండి తప్పింపఁ జాలరు. ఇహమునందు చిల్లర దేవతలసహాయము దొరుకునని తలఁచుచున్న కోరిక వృథా పోవును. అన్ని విధముల సంబంధములు తెగిపోవును. కావున మానవుఁడు దేవుని విశ్వసించి యిస్లామ్ ననుసరింపవలెను.

96. ఇన్నల్లాహ-ఫాలి-ఖుల్-హబ్బి-వన్-నవా-యుఖ్రిజుల్-హయ్య-మినల్-మయ్యితి-వముఖ్-రిజుల్-మయ్యితి-మినల్-హయ్యి-జాలికుముల్లాహు ఫఅన్నా-తూఫకూన్. 97. ఫాలిఖుల్-ఇస్బాహి-వ-జఅ-లల్లైల-సకనన్-వష్-షమ్సవల్-ఖమర-హుస్-బానన్-జాలిక-తఖ్-దీరుల్-అజీజిల్-అలీమ్. 98. వ హువల్లజీ-జఅల-లకుమున్-నుజూమ-లితహ్-తదూ-బిహా-ఫీ-జులుమాతిల్-బర్రి వల్-బహ్-రి-ఖద్-ఫస్-సల్నల్-ఆయాతి-లిఖౌమిన్-యఅ-లమూన్. 99.వహువల్లజీ-అన్-షఅకుమ్-మిన్-నఫ్సిన్-వాహి-దతిన్-ఫముస్-తఖర్రున్-వ-ముస్-తౌద-ఉన్-ఖద్-ఫస్-సల్నల్-ఆయాతి-లిఖౌమిన్-యఫ్ఖహూన్. 100. వహువల్లజీ-అన్జల మినస్-సమాఇ-మాఅన్-ఫఅఖ్-రజ్నా బిహీ-నబాత-కుల్లి-షైఇన్-ఫఅఖ్-రజ్నా-మిన్హు-ఖజిరన్-నుఖ్రిజు-మిన్హు-హబ్బమ్-ముత-రాకి-బన్-వ-మినన్-నఖ్లి-మిన్-తల్ఇ-హా-ఖిన్-వానున్-దానియతున్-వజన్నాతిమ్-మిన్-అనా-బిన్-వజ్-జైతూన-వర్-రుమ్మాన-ముష్-తబిహన్-వ-గైర-ముత-షాబిహిన్-ఉన్-జురూ-ఇలా-సమరిహీ-ఇజా-అస్మర-వయన్-ఇహీ-ఇన్న-ఫీ-జాలికుమ్-లఆయాతిల్-లిఖౌమిన్-యూమినూన్.

96. దేవుఁడు గింజను విత్తనమును చీల్చి మొలకలెత్తఁ జేయువాఁడు. ఆతఁడు, నిర్జీవినుండి జీవమును ప్రాణినుండి నిర్జీవిని తీయుచున్నాఁడు. ఆతఁడే దేవుఁడు మఱెచ్చటికి (అతనిని వదలి) మీరు పోవుచున్నారు. 97. ఆతఁడు ఉదయపు వెలుతురును తీయువాఁడు. మఱి ఆతఁడు విశ్రాంతికై రాత్రిని లెక్క-కు కుఁగాను సూర్యచంద్రులను జేసెను. ఇది సర్వశక్తుఁడును సర్వజ్ఞుఁడును అగు దేవుఁడు నియమించిన నియామకము. 98. భూమిలోని సముద్రములోని చీఁకటులలో మీరు వానిమూలమున మార్గము తెలిసికొనుటకై నక్షత్రములను దేవుఁడు పుట్టించెను. నిశ్చయముగ తెలిసికొనునట్టి జనులకు మేము సూచనలను వివరముగాఁ దెలిపితిమి. 99. మఱియు ఆతఁడు ఒక యాత్మనుండియే మిమ్ము

పుట్టించెను. పిదప మీకు ఒక నివాసమును మీరు అప్పగింపఁబడు ఒక స్థలమును గలదు. నిశ్చయముగ గ్రహించు నట్టి జనులకు మేము సూచనలను వివరముగాఁ దెలిపితిమి. 100. మఱియు ఆతఁడే ఆకాశమునుండి నీళ్ళు కురిపించెను. పిదప దానివలన పచ్చికను పుట్టించితిమి. పిదప దానిమూలమున పచ్చని పైరు దానినుండి ఒకటిపై నొకటిగానుండు గింజలను ఖర్జూర వృక్షము యొక్క పాళనుండి క్రిందికి వంగిన పండ్ల గెలలను ద్రాక్ష తోఁటలను పుట్టించితిమి. మఱియు ఒకటి కొకటి పోలునవి పోలనివి అగు జైతూను (ఆలివులు) ను దానిమ్మను పుట్టించితిమి. ప్రతివృక్షము ఫలించు చున్నపుడు దాని ఫలమునుపక్వమునుచూడుఁడు వీనియందు విశ్వసించునట్టి జనులకు సూచన లున్నవి.

వ్యా|| 96. ధాన్యము మొదలగు వానిగింజలు ఖర్జూరము మొదలగు వాని విత్తనములు భూమిలో వేసిన పిదప అవి నేలను చీల్చుకొని వానినుండి మొలక బయటికి వచ్చునట్లు దేవుఁడు చేయుచున్నాఁడు. దేవుఁడు ప్రాణములేని రేతస్సు, అండమునుండి ప్రాణిని పుట్టించు చున్నాఁడు. అటులే ప్రాణినుండి ప్రాణములేని రేతస్సును అండమును పుట్టించుచున్నాఁడు. ఇట్టి శక్తిగలవాఁడే దేవుఁడు. ఈతఁడే పూజింపఁ దగినవాఁడు. ఇట్టి దేవుని వదలి మఱివని కొఱకు ప్రజలు తప్పుతోవఁ బోవుచున్నారు? 97. రాత్రి చీఁకటిని అంతరింపఁజేసి యుదయపు వెలుతురును పుట్టించువాఁడును దేవుఁడే. రాత్రియందు ప్రాణులు విశ్రాంతి పొందుదురు. అపుడు కాపాడు వాఁడును దేవుఁడే. ఆతఁడు సూర్య చంద్రులను పుట్టించెను. వాని వలన జనులకు అనేక ప్రయోజనములు గలవు. వాని వలన సూర్యమానము చంద్రమానము లేర్పడుచున్నవి. అవి దేవుఁడు నియమించిన పద్ధతి ననుసరించి ఎట్టి వ్యత్యాసము లేక నడుచుచున్నవి. వీని నన్నిటిని నియమించువాఁడు శర్వశక్తుఁడును సర్వజ్ఞుఁడును అగుఁ దేవుఁడే. 98. రాత్రి చీఁకటిలో సముద్రములోను భూమిలోను మార్గము తెలిసికొని ప్రయాణము సాగించుటకు దేవుఁడు నక్షత్రములను సృజించి యున్నాఁడు. వాని మూలమున రాత్రియందు దిక్కులు తెలిసికొనఁగలరు. దేవుఁడు తన సూచనలను వివరముగా తెలివిగల మానవులకుఁ దెలుపుచున్నాఁడు. వానితెలిసికొని దేవునియందువిశ్వాసము గలిగి చిల్లర దేవతలను విగ్రహములను వదలవలెను. 99. దేవుఁడు ఆదమును మొట్టమొదట పుట్టించెను. ఆతని మూలమున మానవు లందఱును పుట్టిరి. మానవునకు పుట్టి గిట్టుటలో అనేక స్థితిగతు లున్నవి. ముందు తల్లిగర్భమునందు కొన్ని నెలలు వసించుచున్నాఁడు. అందు ఇహలోకమునకు రాఁగలుగుటకు క్రమముగా శక్తి పొందుచున్నాఁడు. పిమ్మట తల్లిగర్భమునుండి బయల్పడి ఇహలోకములో వసించి పెరిగి పెద్దవాఁడై చావు వచ్చినపుడు చచ్చి అమానతుగా గోరిలో నుంచఁబడు చున్నాఁడు. గోరిలోనుండి పరలోకము (ఆఖిరత్)లోని

నివాసమునకు క్రిమముగ పోవ శ క్తి పొందుచున్నాడు. తీర్పు దినమునందులేచి తన కర్మలకుఁ దగినట్లు నరకములోనో స్వర్గములోనో వసించును. కావున బుద్ధి గలవారు దేవుని సూచనలను గ్రహించి తమ గమ్యస్థానమును గూర్చి యోచింప వలెను. 100. దేవుఁడే ఆకాశమునుండి వర్షము కురిపించి దాని మూలముగ పచ్చికపైరు ఖర్జూరపుపాళె(కప్పుడు తోడిపూగుత్తి) నుండి పండ్లగెలలు ద్రాక్షపండ్లు జైతూను దానిమ్మ మొదలగు ధాన్య ఫలములు ప్రజల ఆహారమునకై పుట్టించుచున్నాడు. కొన్ని ఫలములు రూపములో పోలిక కలిగి యున్నను, వాని రుచి వేఱువేఱుగా నుండును. ఫలములు పిందెలు కాయలుగా నున్నపుడు దాని రుచి వేఱుగానుండును. అవి పక్వమునకు వచ్చినపుడు దాని తీపు రుచులు భక్షించువారికి సంతోషము కలిగించును. విశ్వాసులకు వీనియందు దేవుని మహిమను తెలుపు సూచనలు గలవు. పైవాక్యములలో వివరింపఁబడిన దేవుని క్రియల వలన దేవుని యేకత్వము (తౌహీదు) రుజువగుచున్నది. దేవుఁడు ఒక్కఁడే. ఆతఁడే సర్వజగత్తునకు పోషకుఁడుం మానవులకును ఇతర ప్రాణులకును జీవనాధారములు ఏర్పఱచుచున్నాఁడు. ఎట్లు దేవుడు మానవులకు దేహ పోషణకుఁగాను ఏర్పాటు చేసెనో అట్లు ఆత్మ పోషణకుఁగాను ఆకాశము నుండి తన సందేశము తన భక్తులగు ప్రవక్తలకు నంపి వారి మూలమున మానవులకు అజ్ఞానాంధకారమునుండి గట్టెక్కుటకు ధర్మమనెడి జ్యోతిని చూపించెను. దాని ఫలితముగ మానవులహృదయములలో విశ్వాస బీజము మొలకలెత్తెను. వారుసత్ప్రవర్తకులైరి ఎట్లుదేవునిక్రియవంటివిమానవులుచేయలేరో అట్లు దేవుని వాక్యముల వంటివి మానవులు కల్పింపఁజాలరు అనియూహింపవలెను.

101. వజఆలూ-లిల్లాహి-షురకా-అల్-జిన్న-వ-ఖలఖు-హుమ్-వఖరఖూ లహూ-బనీన-వబనాతిమ్-బిగైరి-ఇల్మిన్-సుబ్‌హానహూ-వత-ఆలా-అమ్మా-యసిఫూన్. 102. బదీఉస్-సమావాతి వల్-అర్‌జి-అన్నా యకూను-లహూ-వలదున్-వలమ్-తకుల్-లహూ-సాహి-బతున్-వఖలఖ-కుల్ల-షైఇన్-వహువ-బికుల్లి-షైఇన్ అలీమ్. 103. జాలికుముల్లాహు-రబ్బుకుమ్-లా ఇలాహ-ఇల్లా-హువ - ఖాలిఖు-కుల్లి-షైఇన్-ఫఅ-బుదూహు-వహువ-అలా-కుల్లి-షైఇన్-వకీల్. 104. లాతుద్‌రికు-హుల్-అబ్‌సారు-వహువ-యుద్‌రికుల్-అబ్-సార-వహువల్-లతీఫుల్-ఖబీర్.

101 మఱియు దేవుఁడు జిన్నాతులను పుట్టించియుండగ, కాఫిర్లువారిని దేవునికి సాటిగ కల్పించుచున్నారు. మఱి వారు మూఢత్వముతో దేవునికి

కొడుకులును కుమార్తెలు నున్నారని కల్పనచేయుచున్నారు. దేవుఁడు పరమ పవిత్రుఁడు. మఱి వారు పలుకు విషయములకుఁ దేవుఁడు చాల దూరముగా నున్నాఁడు. 102. దేవుఁడు ఆకాశములకును భూమికిని సృష్టికర్త. ఆతనికి భార్యయే లేదు. కావున ఆతనికి కొడుకు ఎట్లు పుట్టును. మఱి ఆతఁడే సర్వమును సృష్టించెను. మఱి ఆతఁడు ప్రతి విషయమును తెలిసినవాఁడు. 103. ఆతఁడే మీ ప్రభువగు దేవుఁడు. ఆతఁడు తప్ప వేఱు దేవుఁడు లేఁడు. ఆతఁడు సర్వమునకు సృష్టికర్త. కావున ఆతనినే మీరు పూజింపుఁడు. మఱి ఆతఁడే సర్వమునకు రక్షకుఁడు. 104. ఆతనిని కన్నులు ఆవరింపఁజాలవు. మఱి ఆతఁడు కన్నులను ఆవరింపఁగలఁడు. మఱి ఆతఁడు అతిసూక్ష్ముఁడును, సర్వజ్ఞుఁడును.

వ్యా॥ 101. కాఫిర్లు జిన్నాతులను ప్రార్థించుచు వారి సహాయము వేఁడుచుండిరి. జిన్నాతులుకూడ మానవులవలె దేవునిచే సృష్టింపఁబడినవారు. వారును శక్తిహీనులే. వారెట్లు మానవులకు తోడుపడఁగలరు? యూదులు ఉజైరును, క్రైస్తవులు ఏసుక్రీస్తును దేవుని కొడుకులు అనియు, కాఫిర్లు దేవదూతలను దేవుని కుమార్తెలు అని పలుకుదురు. అట్లు వారు పలుకునది వారి మూఢత్వముచేతనే, దేవుఁడు అట్టి సంబంధములనుండి పవిత్రుఁడు. అట్టి విషయములతో ఆతనికి దూరసంబంధముకూడ లేదు.102,103. దేవుఁడు ముందులేని భూమ్యాకాశములను తనశక్తితో పుట్టించెను. సర్వమునకు ఆతఁడే సృష్టికర్త. ఆతనికి బిడ్డలు పుట్టవలెనన్న భార్య కావలెనుగదా. ఆతనికిభార్యయే లేదే! ఎచ్చటినుండి బిడ్డ గలుగును. సర్వము ఆతనికిఁ దెలియును. సర్వము ఆతని సృష్టి! ఆతనికి సర్వము లోఁబడియున్నది. మఱెట్లు పుట్టిగిట్టు మానవులు దేవుని బిడ్డలుకాఁగలరు. ఆతనికి భార్యాభర్తలవంటి సంసారసంబంధము లేదు. సర్వమునకుసృష్టికర్తయును, సర్వమునకు పోషకుఁడును ప్రభువనగు సాటిలేని దేవునిని మానవులు పూజింపవలెను. చిల్లర దేవతలనుగాని, విగ్రహములనుగాని జిన్నాతులైన సైతానులనుగాని పూజింపరాదు. సర్వమునకు దేవుఁడు రక్షకుఁడు. ఆతనికిఇతరులెవ్వరును ఏలాటి హాని చేయఁజాలరు.104. దేవుఁడు అతిసూక్ష్ముఁడు.ఆతనిని చూచుటకు ఇహలోకమందు మానవుల కన్నులకు శక్తిలేదు. అవి దేవునిని ఆవరింపఁజాలవు. పరలోకమునందు దేవుఁడు తన అనుగ్రహముచే భక్తులకుదర్శనము నొసంగును. అపుడు భక్తులు దేవునిని చూడఁగలరు. కాని దేవుఁడు సర్వమును చూచుచు నెఱుంగువాఁడు. ఆతనిచూపునకు మించినది ఎద్దియునులేదు. కావున మానవులు దేవుని శక్తిచిహ్నమగు లోకమును అందలివస్తువులను గమనించి దేవునిని గుర్తింపవలెను. మానవుఁడు ముందు తనలోనున్న దేవుని శక్తిచిహ్నములనుగుర్తింపవలెను.

105. ఖద్-జాఅకుమ్-బసాఇరు-మిర్-రబ్బికుమ్-ఫమన్-అబ్‌సర - ఫలి-నఫ్‌సిహీ-వమన్-అమియ-ఫఅలైహా-వమా-అనా-అలైకుమ్-బిహఫీజ్. 106. వ-క-జాలిక-నుసర్రిఫుల్-ఆయాతి-వలి-యఖూలూ-దరస్త-వలి-నుబయ్యి-నహూ-లిఖౌమిన్-యఅలమూన్. 107. ఇత్-తబిఅ-మా-ఊహియ-ఇలైక-మిర్-రబ్బిక-లాఇలాహ-ఇల్లాహువ-వఅఅ-రిజ్-అనిల్-ముష్‌రికీన్. 108. వలౌ-షా అల్లాహు-మా-అష్రకూ-వ-మా-జఅల్నాక-అలైహిమ్-హఫీజన్-వమా-అన్త - అలైహిమ్-బివకీల్.

105. మీ ప్రభువునుండి మీ యొద్దకు సూచనలువచ్చియున్నవి. కావున ఎవఁడు గమనించి చూచెనో వానిదే లాభము. మఱెవఁడు (చూడక) అంధుఁడాయెనో వానిదే నష్టము. మఱి నేను మీకు రక్షకుఁడనుకాను అని ఓ ప్రవక్తా! పలుకుము. 106. మఱియు వారు నీ వెవరియొద్దనో నేర్చుకొంటివి అని పలుకుటకును, తెలివిగలవారికి స్పష్టపడుటకును, మేమిట్లు సూచనలను పలువిధములుగా వివరించి తెలుపుచున్నారము. 107. నీప్రభువునుండి నీకువచ్చు సందేశమును నీవు అనుసరింపుము. దేవుఁడు తప్ప వేఱు ఆరాధింపఁదగినవాఁడు మఱి నీకు లేఁడు. విగ్రహారాధకులనుండి ముఖము త్రిప్పుకొనుము. 108. మఱి దేవుఁడు కోరియుండినచో వారు దేవునికి సాటి కల్పించియుండరు. మఱి మేము నిన్ను వారిపై రక్షకునిఁగాఁ జేయలేదు. మఱి నీవు వారికి జవాబుదారివి కావు.

వ్యా॥ 105. దేవుఁడు తన ప్రవక్త మూలమున తనసూచనలను దెలిపియున్నాఁడు. మఱి మానవులు దేవునిని తమ కన్నులారచూడకపోయినను ఆతని స్పష్టమహిమలు వారి కన్నులయెదుటనున్నవి. వానిని గమనించి చూచి దేవుని విశ్వసించినచో ఉభయలోకములలో మేలు గలుగును. అంధుఁడై వానిని గమనింపక తిరస్కారము వహించినచో ఉభయలోకములలో కీడుగలుగును. ప్రవక్తపని మతప్రచారము చేయుటమాత్రమే. కాని బలవంతముచేసి దేవునిసూచనలు ప్రజలు గ్రహించునట్లుచేయుటకాదు. 106. హజ్రత్ పైగంబరులవారు ఎవరియొద్దనుచదివినవారుకారు. వారు దేవునిసందేశము (వహీ) వలన ప్రజలకు దేవుని సూచనలు, ధర్మములు తెలిపిరి. వానిని విని అవిశ్వాసులు, ముహమ్మదు ఎవరివద్దనో నేర్చుకొని వచ్చి చెప్పుచున్నాఁడు అని పలుకసాగిరి. తెలివిగల భక్తులు దేవుని వాక్యములు విని అవి స్పష్టముగా దేవుని వాక్యములే అని తెలిసికొనిరి. దీనికిఁగాను దేవుఁడు తన సూచనలను పలువిధములుగా ప్రజలకుఁ దెలుపుచున్నాఁడు. అవిశ్వాసరోగముగలవారు నిందింతురు. విశ్వాసజ్యోతిగలవారు విశ్వసింతురు. 107. కావున ప్రవక్త పని దేవుని సందేశమును (వహీని) అనుస

రించుట, దేవుఁడు ఒక్కఁడే అని ప్రకటించుచు ఆతనిపైననే యాధారపడి అవిశ్వాసుల మాటలు లెక్కచేయక తన ప్రచారము సాగించుట. 108. దేవుఁడు కోరినచో బలవంతముగ అందఱిని విశ్వాసులుగఁ జేయఁగలఁడు. కాని అట్లు చేయక మానవులకు స్వాతంత్ర్య మొసంగియున్నాఁడు. వారు గమనించి తమ యిష్టానుసారముగ విశ్వాసమో, అవిశ్వాసమో వహించి వానికిఁ దగిన ఫలితము పొందవలెను. కావున ఓ ముహమ్మదు ! నీవు వారికి రక్షకుఁడవుకావు. అవిశ్వాసుల కర్మలకు నీవు జవాబుదారివికావు. ఆ బాధ్యత నీకు లేదు. నీపని ధర్మప్రచారము చేయుట మాత్రమే అని ప్రవక్తకు దేవుని సెలవయ్యెను.

109. వలా-తసుబ్-బుల్లజీన-యద్-ఊన-మిన్ దూనిల్లాహి-ఫయ-సుబ్బుల్లాహ-అద్-వమ్-బి గైరి-ఇల్మిన్-కజాలిక-జై-యన్నా-లికుల్లి-ఉమ్మతిన్- అమలహుమ్-సుమ్మ-ఇలా-రబ్బిహిమ్-మర్-జిఉహుమ్-ఫయునబ్బి-ఉహుమ్- బిమా-కానూ-యఅ-మలూన్. 110.వఅఖ్-సమూ-బిల్లాహి-జహ్-ద-ఐ-మానిహిమ్ లఇన్-జాఅత్-హుమ్-ఆయతుల్- లయూ-మినున్న-బిహా-ఖుల్ -ఇన్న- మల్-ఆయాతు-ఇన్-దల్లాహి-వమా-యుష్-ఇరుకుమ్-అన్నహా-ఇజా-జాఅత్ - లా-యూమినూన్. 111- వ-నుఖల్లిబు అఫ్ఇ-దతహుమ్-వ-అబ్సా-రహుమ్- కమా లమ్-యూమినూ-బిహీ-అవ్వల-మర్రతిన్-వ-నజరుహుమ్-ఫీ-తుగ్- యానహిమ్ యఅ-మహూన్.

109. మఱియు ఓ ముసల్మానులార ! అవిశ్వాసులు దేవుని వదలి పూజించునట్టి యితర దైవములను మీరు దూషింపకుఁడు. ఎందుకన వారు అక్రమముగా బుద్ధిలేక దేవునిని దూషింతురు. ఇటులే ప్రతి జాతికిని తమ తమ యాచారములు బాగుగఁ దోఁచునట్లు చేసితిమి. పిదప వారందఱును తమప్రభువునొద్దకు చేరవలసియున్నది. అపుడు ఆతఁడు వారు చేయుచున్న కర్మలనుగూర్చి వారికిఁ దెలుపును. 110. మఱియు అవిశ్వాసులు చాల తాకీదుతో (గట్టిగ) దేవుని ప్రమాణముచేయుచు, తమయొద్దకు నేదైన నొక సూచన వచ్చినచో వానిని విశ్వసింతు మనుదురు సూచనలు దేవునియొద్దనున్నవి అని ఓ ప్రవక్తా ! పలుకుము. మఱి ఓ ముసల్మానులార ! ఆ సూచనలు వారియొద్దకు వచ్చినచో వారు విశ్వసింతురనియే మీకెటు తెలియును ? 111. మఱియు వారు మొదటితూరి దానిని ఎట్లు విశ్వసింపలేదో అట్లు వారి హృదయములను వారి కన్నులను త్రిప్పి వేయుదుము. వారు తమ యక్రమమార్గమునందు దేవులాడు

నట్లుగ వారిని వదలిపెట్టుదుము.

వ్యా॥ 109. ముసల్మానులు ఇస్లాంమతప్రచారము చేయవలెను. అందు ఇతర మతస్థుల మత సిద్ధాంతములఁగూర్చి చర్చింపవచ్చును. కాని మత ప్రచారము చేయునపుడు అవిశ్వాసులు మొదలగు ఇతర జాతులవారు ఆరాధించు దేవతలను, వారి పెద్దలను దూషింపరాదు. అట్లు ముసల్మానులు చేసినచో అవిశ్వాసులు అక్రమముగా బుద్ధిలేక సర్వమునకు ప్రభువైన దేవుని దూషింతురు. దానికి కారకులు ముసల్మానులు అగుదురు. కావున అట్లు దూషింపరాదు. ఎందుకన ప్రతిజాతివారికి తమ తమ యాచారము ప్రియముగా నుండును. అదిమంచిది అని వారికిఁ దోఁచును. అందఱి కర్మల తీర్పునకుఁగాను ఒకదినము రానున్నది. అపుడు అందఱు దేవుని సన్నిధానమున నిలుతురు. అచ్చట తమ తమ కర్మల ఫలితము పొందుదురు. 110. కాఫిర్లు హజ్రత్ పైగంబరులవారితో మీరు సఫా అను కొండను స్వచ్ఛమైన బంగారుగఁజేసి వేసిన మేము విశ్వసింతుము అని దేవుని ప్రమాణముచేసి చాల నొక్కి పలుకుచుండిరి. దానికిఁగాను ఓప్రవక్త! నీవు వారితో నిట్లు పలుకుము. "మీరు కోరినట్లు సూచనలు (మోజిజా) తెచ్చి చూపుట నాపనికాదు. నేను ధర్మప్రచారము చేయువాఁడను. సూచనలు దేవుని చేతిలో నున్నవి. ఆ విషయము దేవుఁడు కోరినట్లు చేయును." కొందఱు ముసల్మానులు కాఫిర్లు కోరు సూచనలు చూపిన బాగుండును. కాఫిర్లు విశ్వసింతురు అని తలఁచిరి. దానికి నిట్లు జవాబియ్యఁబడినది. కాఫిర్ల విషయము మీకుఁ దెలియదు. వారు సూచనలు చూచి విశ్వసింతురని మీకెట్లు తెలియును? ఒకవేళ వారు కోరినట్లు సూచనలు వచ్చినపుడు వారు విశ్వసింపనిచో వారిపై దేవునికి కోపము గలుగగా నశింతురు. కావున అట్లు తలఁపఁగూడదు. 111. కాఫిర్లు ఖురానువంటి దేవుని గ్రంథమును విని దానిని విశ్వసింపక తమ దుష్టత్వములోనే పడిరి. దానికి ఫలితముగ వారి హృదయములు సత్యమును గ్రహింపఁజాలవు. మఱి వారి కన్నులు సత్యమునుచూడఁజాలవు. భక్తివిశ్వాసములుగల వారు దేవుని సూచనలు చూచిన వెంటనే మొట్టమొదటనే విశ్వసింతురు. అవిశ్వాసరోగముగలవారు ఎన్ని సూచనలు చూచినను ఏదో యొక సాకు పెట్టుకొని తమ దుర్మార్గములోనే పడియుందురు.

## ఎనిమిదవ కాండము

112. వలౌ-అన్ననా-నజ్-జల్నా-ఇలైహిముల్-మలా-ఇకత-వకల్లమ-హుముల్-మౌతా-వహషర్నా-అలైహిమ్-కుల్లషైఇన్-ఖుబులమ్-మాకానూ-లియూ-మినూ-ఇల్లా-అన్-యషా-అల్లాహు-వలాకిన్న-అక్-సర-హుమ్-యజ్ హ

లూన్. 113. వలిత స్గా-ఇలైహి-అఫ్‌ఇ-దతుల్లజీన-లాయుఅ్‌మినూన-బిల్-ఆఖిరతి-వలి-యర్‌జౌహు-వలి-యఖ్‌తరిఫూ-మాహుమ్-ముఖ్‌తరిఫూన్. 114. వలితస్‌గా-ఇలైహి-అఫ్‌ఇ-దతుల్లజీన-లాయూమినూన-బిల్-ఆఖిరతి-వలి-యర్‌జౌహు-వలి-యఖ్‌తరిఫూ - మాహుమ్ - ముఖ్‌తరిఫూన్. 115.అఫ-గైరల్లాహి-అబ్‌తగీ-హకమన్-వహువల్లజీ-అన్‌జల-ఇలైకుముల్-కితాబ-ముఫస్సలన్-వల్లజీన-ఆతైనాహుముల్-కితాబ-యఅ్‌లమూన-అన్నహూ-మునజ్‌జలుమ్-మిర్-రబ్బిక-బిల్-హఖ్ఖి-ఫలా-తకూనన్న-మినల్ ముమ్‌తరీన్. 116. వతమ్మత్-కలిమతు-రబ్బిక-సిద్‌ఖన్-వఅద్‌లన్-లా-ముబద్దిల-లి-కలిమాతిహీ-వ-హువస్-సమీ-ఉల్-అలీమ్.

112. మఱియు మేము వారియొద్దకు దేవదూతలను పంపినను, చచ్చిన వారు వారితో మాటలాడినను, వారికన్నుల యెదుట అందఱిని బ్రతికించినను, వారు విశ్వసింపనే విశ్వసింపరు. కాని దేవుఁడు కోరినచో (విశ్వసింపఁగలరు). మఱి వారిలో ననేకులు మూఢులుగా నున్నారు. 113. మఱియు నిట్లే ప్రతిప్రవక్తను మనుష్యులలోని జిన్నాతులలోని సైతానులను విరోధులుగఁ జేసియున్నాము. వారు మోసపుచ్చుటకు ఒకరికొకరు ఇంపైన పల్కులు నేర్పుదురు మఱి నీప్రభువు కోరియుండినచో వారట్లు చేసియుండరు. కావున వారిని వారి కల్పనలను వదలి పెట్టుము. 114. మఱి పరలోకమును విశ్వసింపని వారి హృదయములు దాని వైపునకు తిరుగ వలెననియు వారు దానిని సమ్మతింప వలెననియు వారు చేయుచున్న పాపకార్యములు చేయుచు నుండవలెననియు అట్టి యింపైనపలుకులు నేర్పుచున్నారు. 115. ఏమి నేను దేవుని వదలి యితర న్యాయకర్తను కోరవలెనా! మఱి యాతఁడేను మీకు స్పష్టమైన గ్రంథ మొసంగి యున్నాఁడు. అని ఓప్రవక్తా! పలుకుము. మఱి మేమెవరికి గ్రంథ మొసంగితిమో వారు ఖురాను గ్రంథము నీప్రభువునుండి సత్యముగా వచ్చినది యని యెఱుంగుచు న్నారు. కావున నీవు సందేహించు వారితో చేరకుము. 116. మఱి నీ ప్రభువు వాక్కు పూర్తిగ సత్యమైనది. న్యాయమైనది దేవుని వాక్కును మార్చి వేయువాఁడెవఁడును లేఁడు. మఱి ఆతఁడు సర్వము వినువాఁడును సర్వము తెలిసినవాఁడును.

వ్యా॥ 112. ద్వేషముగల అవిశ్వాసులు కోరునట్లుగాని లేక దానికంటె మించిన సూచనలు గాని వారికిఁ జూపినను వారు విశ్వసింపరు. ఒకవేళ దేవ

దూతలు ఆకాశమునుండి దిగి వచ్చి వారు ముహమ్మదు దేవుని ప్రవక్త అనియు ఖురాను దేవుని గ్రంథము అనియు పలికినను చచ్చిన వారు (శవములు) బ్రతికి తమ గోరీలనుండి లేచి మాటలాడి (హజ్రత్) ముహమ్మదు నిజమైన ప్రవక్త అని సాక్ష్యమిచ్చినను సర్వ జనులు వచ్చి సాక్ష్య మిచ్చినను అవిశ్వాసరోగముగల జనులు విశ్వసింపరు. అపుడు ఏదో యొక సందేహము లోపమును పెట్టి విశ్వసింపరు. కాని దేవుఁడు కోరిన బలవంతముగా వారిని విశ్వాసులుఁగఁ జేయఁగలఁడు. కాని దేవుఁడట్లు చేయఁడు. కాని పెక్కుమంది కీవిషయము తెలియక మూఢులై యున్నారు. 113. ఓ ప్రవక్తా! అవిశ్వాసులు నీకు విరోధులై ధర్మ ప్రచారమునకు అడ్డుపడునట్లు పూర్వము గడచిన ప్రవక్తలకుఁ గూడ దుర్మార్గులైన మనుష్యులును జిన్నాతులు (భూతములు)ను విరోధులైరి. వీరి విరోధము క్రొత్తదిగాదు. నీవు సహించుచు మత ప్రచారము సాగింపుము. ప్రవక్తల విరోధులు ఇంపైన పలుకులు పలుకుచు మోసపు మాటలు ఒకొరికొకరు నేర్పుదురు. మఱియు కుట్రలు సలుపుదురు. దుష్టులు చేయు కల్పనలను గూర్చి చింతింపక వారిని వదలి పెట్టుము. దాని గూర్చిఁ దేవుఁడు చూచుకొను దేవుఁడు కోరినచో వారట్లు చేసియుండరు గాని వారికి కొద్దికాలము గడువు దొరికినది. కావున వారట్లు చేయుదురు. 114. దుష్టులుచేయు కుట్రలు వారి మోసపు పలుకులు పరలోకమందు విశ్వాసము లేనివారును ఇహలోకములోని భోగములకు లోనైననవారును విని వాని సమ్మతించి తమ పాప కార్యములలోపడి యుండుటఁగాను వారట్లు చేయుచున్నారు. 115. దుష్టుల మోసపు పలుకులకు దేవుని ప్రవక్తయును ముసల్మానులును లొంగరు. వారు దేవునియందు విశ్వాసము గలిగి దేవుఁడే తమకు న్యాయకర్తగా అని నమ్మియున్నారు. దేవుఁడు ప్రవక్తకు ఖురాను గ్రంథ మొసంగెను. అందు సర్వ ధర్మములు స్పష్టముగా వివరింపఁ బడి యున్నవి. దానిని ప్రవక్తయును ముసల్మానులును అనుసరింతురు. ఖురాను గ్రంథము దేవుఁడొసంగినది. అది సత్యమైనది. అని దేవునిచే తౌరాతు ఇన్జీలు గ్రంథము లొసంగఁ బడిన వారగు యూదులును నసారీలును తమ మత గ్రంథములలో ఖురానె షరీఫును ముహమ్మదు వారిని గూర్చి యున్న భవిష్యత్ ప్రకటనలను బట్టి యెఱింగి యున్నారు. దాని గూర్చి ఏలాటి సందేహము వహింపరాదు. 116. దేవుని వాక్కు న్యాయమైనది. సత్యమైనది. అందేలాటి మార్పు కలుగనేరదు. ఎందుకన దేవుని వాక్కు అగు ఖురానె షరీఫు సర్వము వినువాఁడును సర్వము తెలిసిన వాఁడగు దేవునిది. కాఁబట్టియే యేధర్మము సరియైనదో దేవునికి ఎఱుక. కావున ప్రవక్తయును ముసల్మానులును ఖురాను గ్రంథము ననుసరించియే నడుతురు.

117. వఇన్-తు-తిఅ అక్-సర-మన్-ఫిల్-అర్ జి-యుజిల్లూక-అన్-సబీ-లిల్లాహి-ఇన్-యుత్-తబి-ఊన-ఇల్-లజ్-జన్న-వ-ఇన్-హుమ్-ఇల్లా - యఖ్రుసూన్. 118. ఇన్న-రబ్బక-హువ-అఅ-లము-మన్-యజిల్లు-అన్-సబీలిహీ-వహువ-అఅ-లము-బిల్-ముహ్-తదీన్. 119. ఫకులూ-మిమ్మా-జుకి-రస్ముల్లాహి-అలైహి-ఇన్-కున్తుమ్-బి-ఆయాతిహీ-మూమినీన్. 120. వ-మాలకుమ్-అల్లా-తాకులూ-మిమ్మా-జుకి-రస్ముల్లాహి-అలైహి-వఖద్-ఫస్సల-లకుమ్-మా-హర్రమ అలైకుమ్-ఇల్లా-మజ్ తురిర్-తుమ్-ఇలైహి-వ-ఇన్న-కసీరన్-ల-యుజిల్లూన-బి-అహ్-వా-ఇహిమ్-బిగైరి-ఇల్మిన్-ఇన్న-రబ్బక-హువ-అఅ-లము-బిల్-ముఅ-తదీన్. 121. వజరూ జాహిరల్-ఇస్మి-వ-బాతినహూ-ఇన్నల్-లజీన-యక్-సిబూనల్-ఇస్మ-సయుజ్-జౌన-బిమా-కానూ-యఖ్ తరిఫూన్. 122. వలా-తాకులూ-మిమ్మా-లమ్-యుజ్-క-రిస్ముల్లాహి-అలైహి-వ-ఇన్నహూ - లఫిస్-ఖున్-వ-ఇన్నష్-షయాతీన-లయూ-హూన-ఇలా-ఔలియా-ఇహిమ్-లి-యుజా-దిలూకుమ్-వఇన్-అతఅ-తుమూహుమ్-ఇన్నకుమ్-లముష్-రికూన్.

117. మఱి లోకములో అధిక సంఖ్యగలవారి మాటను నీవు అనుసరించి నచో వారు నిన్ను దేవుని మార్గమునుండి తప్పింతురు. వారు తమ యూహలనే యనుసరించువారు. మఱి వారు చేయునదియూహల మాత్రమేను. 118. దేవుని మార్గము తప్పిపోవువా రెవరో నీప్రభువునకు బాగుగఁ దెలియును. మఱెవరు ఆతని మార్గమందున్నారో ఆతనికి బాగుగఁ దెలియును. 119. కావున ఆతని వాక్యములందు మీకు విశ్వాసమున్నచో ఏ జంతువుపై దేవుని పేరు ఉచ్చరింపఁ బడినదో దాని మాంసము తినుఁడు. 120. మఱి మీకేమైనది? ఏజంతువుపై దేవుని పేరు ఉచ్చరింపఁబడినదో దాని మాంసము మీరు తినరు! మఱిమీకు నిషేధింపఁబడినవానిని మీకు స్పష్టముగాఁ దెలిపియున్నాఁడు. కాని విధిలేని సమయమున చచ్చినదానిని తినవలసివచ్చినచో అది నిషిద్ధముకాదు. మఱి పెక్కుమంది తమ యిష్టానుసారముగ అజ్ఞానముతో (ఇతరులను) సన్మార్గము నుండి తప్పింతురు. నియమములను అతిక్రమించువారిని నీప్రభువు బాగుగనెఱుంగును. 121. మఱి బహిరంగమైన పాపములను రహస్యమైన పాపములను వదలిపెట్టుఁడు. ఎవరు పాపములు చేయుదురో వారు తమ కర్మల ఫలితము శీఘ్రములోనే పొందుదురు. 122. మఱియు ఎద్దానిపై దేవునిపేరు ఉచ్చరింపఁ

బడదో యాజంతువునుండి తినకుఁడు. మఱి దానిని తినుట పాపకరము. మఱి మీతో వాదులాడుటకై సైతానులు తమ స్నేహితులను ప్రేరేపింతురు. మఱి మీరు వారి ననుసరించినచో మీరుకూడ దేవునికి సాటి కల్పించినవారగుదురు.

వ్యా॥ 117. లోకచరిత్రను చూచినచో బుద్ధిమంతులును జ్ఞానులును క్రమపద్ధతిని నడచువారును కొందఱు మాత్రము కలరు. పెక్కుమంది తమ యిష్టముచొప్పున నిరాధారమైన యూహలననుసరించు పామరులు కలరు. వారి సంఖ్య యెక్కువగానున్నందున వారి మాటలు అనుసరింపఁదగవు. అట్లు అనుసరించినచో దేవునిమార్గమగు సన్మార్గమునుండి తప్పిపోవలసివచ్చును. కావున అట్లు నడవకూడదు అని హజ్రత్ రసూలువారితో పలుకుచు సర్వులకు దేవుఁడు తెలిపెను. పామరులు తమ యూహలను అనుసరించి తమ సైతానుల ప్రేరేపణవలన ముసల్మానులు తమ చేతులార జబాచేసి (కోసి)న జంతువుమాంసము తినుదురు. కాని దేవుఁడు చంపిన జంతువు మాంసము ఏలకు వారు తినరుఅని పలుకసాగిరి. అందుకు రాఁబోవు వాక్యములలో జవాబియ్యఁబడినది. ధర్మము (హలాల్) అధర్మము (హరాము) అని నియమించుట, సర్వజ్ఞుఁడగు దేవుని పని దేవుఁడు సెలవిచ్చినట్లు నడచుకొనుట భక్తులవిధి. ప్రాణము తీయువాఁడు దేవుఁడు అయినను జంతువుపై దేవునిపేరు ఉచ్చరించి జబాచేయుటవలన దేవుని నామమహిమవలన దాని మాంసము పవిత్రమగుచున్నది. స్వయముగ చచ్చిన జంతువులలో అపవిత్రతలేదు అందు అపవిత్రమైన రక్తము ఇంకిపోవును. కావున దాని మాంసము తినకూడదు అని నిషేధింపఁబడినది 118 ఎవరు దుర్మార్గులు, ఎవరు సన్మార్గులు అనునది దేవునికి ఎఱుక. ఆతఁడు వారి వారికిఁ దగిన ప్రతిఫల మొసంగును. 119. కావున ముసల్మానులు తమ విశ్వాసమును ధర్మమును అనుసరించి దేవునిపేరు ఉచ్చరించి (బిస్మిల్లాహి అని) జబా చేయఁబడిన జంతువుల మాంసము తినవలెను. దేవునియందును, ఆతని ప్రవక్తయందును ఖురానుయందును విశ్వాసముగల భక్తులు దేవుని సెలవు ననుసరించి పోవుదురు. 120. ఆకటిబాధను సహింపలేక ప్రాణముపోవు స్థితిలో విధిలేక ప్రాణమును కాపాడుకొనుటకు ముర్దారు మొదలగు (హరామ్) నిషిద్ధములైన వస్తువులు తినవచ్చును అని దేవుఁడు సెలవిచ్చుచు, ఏయే వస్తువులు నిషేధింపఁబడినవో అవి వివరముగాఁ దెలిపియున్నాఁడు. అందు దేవుని పేరు ఉచ్చరించి జబాచేయఁబడినజంతువులమాంసము తినకూడదు అని లేదుగదా! మఱెందుకు మీరు ఆ జంతువుల మాంసము తినరు అని మందలింపఁబడినది. పెక్కురు తెలివిలేని ఊహలను అనుసరించి యితరులను, సన్మార్గమునుండి తప్పింతురు. ధర్మము అతిక్రమించిపోవుదురు. వారి విషయము దేవునికిఁ దెలియును 121. ఓముసల్మానులార! మీరు కాఫిర్ల మాటలకు

ద్వారా. సన్మార్గము వదలకూడదు. సర్వవిధములైన పాపములను మాను
పాపము చిన్నదిగాని, పెద్దదిగాని, రహస్యముగాగాని, బహిరంగ
చేయకూడదు. పాపకార్యములు చేయువారికి తప్పక శిక్ష లభించును.
చుకొనజాలరు. 122. దేవునిపేరు ఉచ్చరింపక కోయబడిన జంతు
సము తినగూడదు. అది నిషిద్ధము (హరామ్). అటులే ఇతర దేవ
ఉచ్చరించి కోయబడిన జంతువుల మాంసముకూడ తినకూడదు.
పాపము. ధర్మ, అధర్మములు నియమించుటలో దేవుని సెలవునను
. అందు మానవులు తమ యిష్టము చొప్పున పోకూడదు. అట్లు
అనబడును. కాఫిర్ల వాదనలకు ముసల్మానులు లెక్క పెట్టక
నుసరింపవలెను. లేనిచో వారితో చేరినవారగుదురని హెచ్చరింబడిరి.

3 అవమన్-కాన-మైతన్-ఫ-అహ్యైనా-హు-వజ-అల్నా-లహూ-
నూరన్-యమ్షీ-బిహీ-ఫిన్-నాసి-కమమ్-మసలుహూ-ఫిజ్-జులు-మాతి-లైస
-మిన్హా-కజాలిక-జుయ్యిన-లిల్ కాఫిరీన-మా కానూ-యఅమలూన్.

3. ఒకడు నిర్జీవిగా నుండెను మేము వానిని సజీవిగా జేసి వానికి
సంగగా ఆతడు దాని వలన ప్రజలలో సంచరించు చున్నాడు. ఇట్టి
ధకారములలో పడి అందుండి రాజాలనట్టి స్థితిలోనున్న దానితో
! ఇట్లు అవిశ్వాసులకు తాముచేయు కర్మలు మంచివిగా దోచునట్లు
రవి.

3. ఇందు కాఫిర్లు ముసల్మానులను సన్మార్గమునుండి తప్పింప వలెను
యత్నములు సాగనేరవు అను విషయము హెచ్చరింపబడినది.
న ధర్మమార్గము తెలియక అజ్ఞానములోపడి నిర్జీవిగా నుండిన వారిని
జ్ఞానము లనెడు ప్రాణము పోసి వారిని సజీవిగాజేసి ఖురానే ష
జ్యోతి నొసంగినందున వారు సత్ప్రవర్తకులై ప్రజలలో నిర్భయము
మన్నవారు హజ్రత్ రసూలువారును వారిశిష్యులగు ముసల్మానులును.
అవిశ్వాసమును దుర్మార్గమును అనెడి అంధకారములలో పడి
రాజాలనట్టి కాఫిర్లు ధర్మము స్వీకరించుటకొరకు సరిపోలుదురా. ఎన్న
నులు కారు. ఎందుకన కాఫిర్లు అధర్మ కార్యములను ధర్మముగా
అవిశ్వాస మనెడి అంధకారమును వెలుతురుగా భావించుచున్నారు.

4. వ-కజాలిక-జఅల్నా-ఫీకుల్లి-ఖర్యతిన్-అకాబిర-ముజ్-రిమీహా-లి
హా-ఫీహా-వమా-యమ్-కురూన-ఇల్లా బి-అన్-ఫుసిహిమ్-వ-మాయష-

ఉరూన్. 125. వఇజా-జాఅత్-హుమ్-ఆయతున్-ఖాలూ-లన్-నూమిన-హత్తా-నూతా-మిస్ల-మాఊతియ-రుసు-లుల్లాహి-అల్లాహు అఅ్-లము-హైసు-యజ్-అలు-రిసా-లతహూ-సయుసీ-బుల్ల-జీన-అజ్రమూ-సగారున్-ఇన్దల్లాహి-వ-అజా-బున్-షదీదుమ్-బిమా-కానూ-యమ్-కురూన్. 126. ఫమన్-యురిదిల్లాహు-అన్‌యహ్-దియహూ-యష్‌రహ్ సద్రహూ-లిల్-ఇస్లామి-వమన్-యురిద్-అన్-యుజిల్లహూ-యజ్-అల్-సద్రహూ-జయ్యిఖన్-హరజన్-కఅన్నమా-యస్సఅ-అదు-ఫిస్-సమాఇ-కజాలిక-యజ్-అలుల్లా-హుర్-రిజ్స-అలల్-లజీన-లా-యూమినూన్.

124. మఱియు నిట్లే ప్రతి పురములోను అందలి దుష్టనాయకులు అందు కుట్రలు చేయునట్లుగఁ జేసితిమి. వారు చేయు కుట్రల కీడు వారియాత్మలకే చెందును. మఱి వారది గ్రహింపరు. 125. మఱియు వారియొద్దకు ఏదైన నొక సూచన వచ్చినచో దేవుని ప్రవక్తలకు నొసంగఁ బడినట్లు మాకొసంగఁబడు వఱకు మేము నమ్మనే నమ్మము అని పలుకుదురు. ఎవరికి తన సందేశము నంపవలెనో దేవునికి బాగుగఁ దెలియును. శీఘ్రములోనే పాపులకు వారు చేయుచున్న కుట్రలకుఁగాను వారికి దేవునియొద్ద అవమానమునుకఠినమైన బాధయును లభించును. 126. కావున దేవుఁడు తాను ఎవనికి సన్మార్గము చూపఁగోరునో వాని హృదయమును ఇస్లామ్‌నకుఁగాను విప్పివేయును. మఱెవనిని మార్గము తప్పింపఁగోరునో ఆకాశముపైకి నెక్కువానివలె వాని హృదయము చాల సంకుచితముగాఁ జేయును. దేవుడిట్లు విశ్వసింపని వారికి శిక్ష విధించును.

వ్యా॥ 124. ఓప్రవక్తా! మక్కా ఖురైషులలో దుష్టనాయకులు ఇతర జనులు ఇస్లామ్‌లో చేరకుండ పన్ను కుట్రలు క్రొత్తవిగావు. పూర్వముకూడ ఇటులే జరిగినది. ప్రతిపురములోను దేవుని ప్రవక్త బోధించు దానికి ఆయాపురముల లోని దుష్టనాయకులు అనేక కుట్రలు సలిపియున్నారు. వారి కుట్రల వలన ముసల్మాను భక్తులకు నష్టములేదు. కాని దానివలన కాఫిర్లకే నష్టము గలుగును. దానిచే దేవుని శిక్షకు వారు పాత్రులగుదురు. కాని వారికిది తెలియుట లేదు. 125. దేవుని ప్రవక్త తాను సత్యవంతుఁడని దేవుని సూచన (మోజిజా) చూపినచో దుష్టనాయకులు పన్ను కుట్రలలోనిది యొక కుట్ర. దేవుని ప్రవక్తల యొద్దకు దేవుని సందేశము దేవదూతలు ఎట్లు తెచ్చుదురో అటులే మాయొద్దకు దేవుని సందేశము (వహీ) వచ్చినగాని మేము విశ్వసింపము అని పలుకుదురు. దానికిసిందుజవాబియ్యఁబడినది. దేవునిసందేశము పొందుటకు ఎవరు

అర్థాలలో దేవునికేఁ తెలియును. ప్రవక్త పదవి మానవుల కృషి ప్రార్థనల వలన లభించునదికాదు. మానవు లందఱును దానికి యోగ్యులుకారు. సర్వజ్ఞుఁడగు దేవునికే అందఱి యోగ్యత తెలియును. కావున గర్వముతో కుట్రలు సల్పుచు పలుకు మాటలకు పాపులకు ఉభయ లోకములలోను అవమానమును ఘోరశిక్షయును లభింపనున్నది. 126. దేవుని అనుగ్రహమువలన పుణ్యాత్ములకు సన్మార్గము లభించును. వారి హృదయములు విప్పఁబడి ఇస్లామ్‌ను స్వీకరించుటకు సిద్ధములగును. ఇస్లామ్‌నకుఁగాను వారి హృదయములలో ఏలాటి సంకటముండ నేరదు. ఆకాశముపై నెక్కుటకు ప్రయత్నించి యెక్కలేక హృదయము సంకోచము నొందునో అట్టి సంకోచము దుర్మార్గుల హృదయములు పొందును. వారి హృదయములలో సత్యము నాటుకొనదు. విశ్వసింప నందునవారికి దేవుని శిక్ష లభించును. వారు ఏలాటి పవిత్ర మొందఁజాలరు. దేవుఁడు మానవులకు బుద్ధి జ్ఞానము లొసంగి యున్నాఁడు వాని మూలమున యోచించి సత్యమునందు ద్వేషముంచక సన్మార్గము అవలంబింపవలెను. దుష్ట స్వభావము గల వారికి ఎంతబోధ చెప్పిన నిష్ఫలమగునుగదా!

127 వహాజా-సిరాతు-రబ్బిక-ముస్త-ఖీమన్-ఖద్-ఫస్-సల్నల్-ఆయాతి లిఖామిన్-యజ్-జక్కరూన్. 128. లహుమ్-దారుస్-సలామి-ఇన్ద రబ్బిహిమ్-వహువ-వలియ్యుహుమ్-బిమా-కానూ-యఅ-మలూన్.

127. మఱియు నిది నీప్రభువుయొక్క సన్మార్గము గమనించునట్టి వారికిఁగాను మేము సూచనలను స్పష్టముగాఁ దెలిపితిమి. 128. ఇట్టివారి కొఱకే వారి ప్రభువునొద్ద శాంతియుతమగు గృహమున్నది. వారు గావించుచున్న సత్కార్యముల వలన దేవుఁడు వారికి సహాయుఁడు.

వ్యా॥ 127:128. ఓప్రవక్త! మేము నీకు ఖురాను గ్రంథమొసంగి చూపిన మార్గమగు ఇస్లామ్ నీప్రభువు నియమించిన సన్మార్గము. తెలివి గలిగి గమనించువారికి సూచన లన్నియు స్పష్టముగా వివరించి యున్నాము. కావున గమనించి ఇస్లామ్‌ను స్వీకరించి ధర్మమార్గము ననుసరించి సత్కార్యములు చేసినట్టి ముసల్మాను భక్తులకు ఏలాటి యాపదలేక శాంతి యుతమగు గృహము (స్వర్గము)ను దేవుని సహాయమును వారికి లభించును. దేవుని సహాయము పొందిన భక్తులు ఉభయ లోకములలోను జయమును మోక్షమును పొందుదురు.

129. వ-యౌమ-యహ్‌షురుహుమ్-జమీ-అన్-యామఅ-షరల్-జిన్ని-ఖదిస్-తక్-సర్తుమ్-మినల్-ఇన్‌సి-వఖాల ఔలి-యాఉహుమ్-మినల్ - ఇన్‌స-

రబ్బనస్-తమ్‌తఅ-బఅ-జునా-బి-బఅ-జిన్-వ-బలగ్నా-అజల-నల్లజీ-అజ్-జల్త-లనా-ఖాలన్-నారు-మస్వాకుమ్-ఖాలిదీన-ఫీహా-ఇల్లా-మా-షా-అల్లాహు-ఇన్న-రబ్బక-హకీమున్-అలీమ్. 130. వ-క-జాలిక-నువల్లీ-బఅ-జజ్-జాలిమీన-బఅ-జమ్-బిమా-కానూ-యక్-సిబూన్.

129. మఱియు దేవుఁడు వారి నందఱిని ఒక్కచోట చేర్చు దినమున ఓ జిన్నాతుజాతివారలార! మీరు మానవులలోని పెక్కుమందిని మీకు విధేయులుగఁ జేసికొంటిరి అని పలుకును. మఱి మనుష్యులలోనున్నవారి స్నేహితులు ఓ మాప్రభువా! మేము ఒకరితో నొకరు లాభముపొందితిమి. మఱి నీవు మాకొఱకు నియమించియుండిన గడువు (కాలము) నకు చేరితిమి అని పలుకుదురు. (అపుడు) దేవుఁడు మీ నివాసము అగ్నియన్నది. అందు సదా మీరు యుండుదురు. కాని దేవుఁడు కోరినవారికి నరకము తప్పును అని పలుకును. నిశ్చయముగ నాప్రభువు వివేచనాపరుఁడును, సర్వజ్ఞుఁడును. 130. మఱియునిటులే దుర్మార్గులను వారి కర్మల ననుసరించి ఒకరితో నొకరిని చేర్చుదుము.

వ్యా॥ 129. మునుపటి వాక్యములో దేవునికి ప్రియులైనవారిని గూర్చి చెప్పఁబడియె. ఇఁక ఈవాక్యములో సైతానులకు ప్రియులైనవారి విషయము తెలుపఁబడుచున్నది. తీర్పుదినమునందు ఇట్లుప్రశ్నోత్తరములుజరుగును. జిన్నాతు (భూతము)లు పెక్కుమంది మనుష్యులను సన్మార్గమునుండి తప్పించి తమకు విధేయులుగఁ జేసికొనిరి. అవిశ్వాసులు విగ్రహములను పూజించుటచే సైతానులను పూజించినట్లే యగును. అపుడు విగ్రహారాధకులు ఓమాప్రభువా! మా జీవిత కాలములో ఒకరితొనొకరు లాభముపొందినాము. ఆరాధింపలేదు అని సాకులు పలుకుదురు. అవియన్నియు అచ్చట సాగవు. దాని ఫలితము నరకాగ్ని నివాసము. అందు సదా యుండవలెను అని దేవుని సెలవగును. దేవుఁడు కోరినచో నరకనివాసము తప్పిపోగలదు. కాని దేవునికి సాటి కల్పించువారినిక్షమింపను అని దేవుఁడు పలికినందున కాఫిర్లు నరకమునుండి బయటికి రాఁజాలరు. దేవుఁడు సర్వజ్ఞుఁడు. కావున నేరస్థుల నేరముల నెఱుంగును. వివేచనాపరుఁడు కావున ఎవరికిఁ దగిన శిక్ష వారికి విధించును. 130. జిన్నాతులను వారి స్నేహితుల విషయము మీరు విన్నట్లు, దుర్మార్గులను నరకములోచేర్చుదుము. అనగా ఏయే తరగతికి చేరినదుర్మార్గులకు ఆయాతరగతులలో ఒక్కచోట నరకములో నివాసము లభించును.

131. యామఅ-షరల్-జిన్ని-వల్-ఇన్సి-అలమ్-యాతి-కుమ్-రుసులుమ్-మిన్‌కుమ్-యఖుస్సూన-అలైకుమ్-ఆయాతీ-వయున్-జిరూనకుమ్-లిఖాఅ

యూమికుమ్-హాజా-ఖాలూ-షహిద్నా-అలా-అన్ఫుసినా-వ-గర్రత్-హుముల్ హయాతుద్-దున్యా-వ-షహిదూ-అలా-అన్-ఫుసిహిమ్-అన్నహుమ్-కానూ కాఫిరీన్. 132. జాలిక-అల్-లమ్-యకుర్-రబ్బుక-ముహ్లికల్-ఖురా-బిజుల్ - మిన్-వ-అహ్లుహా-గాఫిలూన్- 133. వ-లికుల్లిన్-దరజాతుమ్-మిమ్మా - అమిలూ-వమా-రబ్బుక-బిగా-ఫిలిల్-అమ్మా-యఅ-మలూన్.

131. ఓ జిన్నాతు మఱియు మనుష్యజాతివారలార! ఏమి నాయాజ్ఞలను మీకు వినిపించువారును, మీకీదినము రానున్నది అని భయపెట్టువారును అగు ప్రవక్తలు మీనుండియే మీ యొద్దకు రాలేదా! (అను ప్రశ్నకు) మేము మాపాపములను ఒప్పుకొంటిమి అని వారు పలుకుదురు. మఱి వారిని ఇహలోక జీవనము మోసపుచ్చెను. మఱి వారు, తాము అవిశ్వాసులైరి అను విషయము తామే యొప్పుకొనిరి. 132. ఇది యెందుకనగ నీప్రభువు జనులకు ధర్మాధర్మములు తెలుపకుండ వారు తెలియనివారుగ నుండినపుడు వారిపాపములకుఁగాను వారి పురములను నాశముచేయఁడు. 134. మఱి ప్రతియొకరికిని వారు చేసిన కర్మలకుఁ దగినట్లు తరగతులున్నవి. మఱి వారు చేయు కర్మలనుండి నీ ప్రభువు అజాగ్రత్తగా లేఁడు.

వ్యా॥ 131. తీర్పుదినమునందు జిన్నాతులను మనుష్యులను దేవుఁడు ప్రశ్నించును. దేవుఁడు మనుష్యులలో కొందఱిని ప్రవక్తలుగ నియమించియున్నాఁడు. ఆ ప్రవక్తల మూలమున జిన్నాతులకును, మనుష్యులకును ధర్మమార్గము బోధింపఁబడెను. మంచి కార్యములు చేయవలెను. పాపకార్యములు చేయకూడదు. దానికిఁగాను తీర్పుదినము రానున్నది. అందు అందఱి కర్మలఁగూర్చి తీర్పు జరుగును. కర్మలకుఁ దగినట్లు ఫలము లభించును. ప్రవక్తలువచ్చి బోధించిరి అను విషయము, తాము ఇహలోకభోగములకు మోసపోయి ప్రవక్తలను నమ్మక మేము అవిశ్వాసులరమైతిమి అని తుదకు కాఫిర్లు ఒప్పుకొనుదురు. 132. ప్రవక్తలను పంపి దేవుఁడు మానవులకును జిన్నాతులకును ధర్మమార్గము తెలుపుచున్నాఁడు. ప్రవక్తల మూలమున వారికి ధర్మాధర్మములు తెలుపకుండ వారి పాపములకుఁగాను వారి పురములను నాశముచేయఁడు. మొదట తెలుపును. తరువాత తిరస్కరించి అవిశ్వాసులైనవారిని నశింపఁజేయును. ఇది దేవుని పద్ధతి. 133. దేవునికి సర్వము దెలియును. ఎవరి కర్మ లెట్టివో దేవునికిబాగుగఁ దెలియును. వానికిఁ దగినట్టు తరగతులు నియమించును. కావున పాపపుణ్యములకుఁ దగినట్లు ఫలితము లభించును. అందు ఏలాటి అన్యాయము జరుగదు.

134. వరబ్బు-కల్-గనియ్యు-జుర్ రహ్మతి-ఇన్-యషా-యుజ్-హిబ్-

కుమ్-వ-యస్-తఖ్-లిఫ్-మిమ్-బఅ-దికుమ్-మా-యషాఉ-కమా-అన్-షఅకుమ్-మిన్-జుర్రి-యతి-ఖౌమిన్-ఆఖరీన్. 135. ఇన్న-మా-తూ-అదూన-లఆతిన్-వ-మా-అన్తుమ్-బి-ముఅ-జి-జీన్. 136. ఖుల్-యా-ఖౌమిఅ-మలూ-అలా-మకానతి-కుమ్-ఇన్నీ-ఆమిలున్-ఫ-సౌఫ-తఅ-లమూన-మన్-తకూను-లహూ-ఆఖి-బతుద్-దారి-ఇన్నహూ-లా యుఫ్లిహుజ్జాలిమూన్.

134. మఱియు నీప్రభువు లక్ష్యములేనివాఁడును, కరుణగలవాఁడును. ఆతఁడు కోరినచో మిమ్ము తీసివేసి ఎట్లు మిమ్ము ఇతరుల వంశమునుండిపుట్టించెనో అట్లు మీ వెనుక తాను కోరినవారిని నియమించును. 135. దేనిగూర్చి మీతో వాగ్దానము చేయఁబడినదో అది తప్పక రానున్నది. మఱిమీరు (దేవునిని) లొంగఁజేయఁజాలరు.136. ఓ జనులారా! మీరు మీచోటున పనిచేయుఁడు. నేను నాపని చేయుదును. శీఘ్రములోనే ఎవరికి పరలోకములో మంచిఫలితము లభించునో మీరు తెలిసికొనఁగలరు. నిశ్చయముగ దుర్మార్గులు మోక్షము పొందఁజాలరు అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 134. దేవుఁడు తన ప్రవక్తయగు హజ్రత్ ముహమ్మదును పంపి ధర్మమార్గము మీకు చూపించెను. మీరు సన్మార్గమును వదలిఅవిశ్వాసములోనే పడియుండిరేని దేవునికి లక్ష్యములేదు. మీదుర్మార్గమువలన దేవునికి ఏలాటి కొఱతలేదు. అందఱును, ఆతనిపై నాధారపడియున్నారు. ఆతఁడు చాల దయగలవాఁడు. కావుననే ప్రవక్తల మూలమున మీకు సన్మార్గము చూపుచున్నాఁడు, మీరు విననిచో మిమ్ము నశింపఁజేసి మీకు బదులుగ నితరులను నియమింపఁగలఁడు. వారు దేవునికి విధేయులై యుండఁగలరు. మిమ్మునశింప జేసి యితరులను నియమించుట దేవునికి కష్టముకాదు. ఎట్లు మీ పూర్వీకులను నశింపఁజేసి మిమ్ము పుట్టించెనో అట్లు మీవెనుక ఇతరులను నియమించునని నిశ్చయింపుఁడు. 135. తీర్పుదినము రానున్నది. అని మీతో ఓ జనులార! చెప్పఁబడుచున్నది. అది తప్పక రానున్నది. దానినుండి మీరు తప్పించుకొనఁజాలరు. దేవుని శక్తికి మించిమీరుపోఁజాలరు. లోకమందలివారందఱును కలసి దేవుని యాజ్ఞను రద్దుచేయఁజాలరు. ఆతఁడుసర్వశక్తుఁడు. ఆతనినిలొంగఁజేయుటకు ఎవరికి శక్తిగలదు! లేదు. కావున దేవుఁడు చూపిన సన్మార్గము నవలంబింపవలెను. 136. ఓ జనులారా! నేను నాయుద్యమమునెరవేర్చితిని దేవుని సందేశము మీకు అందఁజేసితిని. లాభనష్టములు తెలిపితిని. దానిమీఁద కూడ మీరు విననిచో మీయిష్టము చొప్పున మీరు చేయుఁడు. నేను నాపని చేయుదును. తుదకు ఉభయలోకములలో ఎవరికి మంచి ఫలితము లభించునో మీకే

తెలిసికొనఁగలరు. దుర్మార్గులును, అన్యాయస్థులును ఎప్పటికిని మేలుగాని మోక్షముగాని పొందనేరరు అని పలుకునట్లు ప్రవక్తకు దేవుని సెలవయ్యెను. దేవుఁడు సెలవిచ్చినట్లు హాజ్రత్ రసూలువారితో విరోధించుచున్న మక్కా-ఖురైషులు మొదలగు అవిశ్వాసులు నశించి పైగంబరులవారికే జయము లభించెను. లోకమంతటను ఇస్లామ్ మతమువ్యాపించెను.

137- వ-జఅలూ-లిల్లాహి-మిమ్మా-జరఅ మినల్-హర్ సి-వల్-అన్-ఆమి నసీబన్-ఖాలూ-హాజా-లిల్లాహి-బి-జఅ-మిహిమ్-వహాజా-లిషుర-కాఇనా - ఫమాకాన-లిషురకా-ఇహిమ్-ఫలా-యసిలు-ఇలల్లాహి-వమా-కాన-లిల్లాహి - ఫహువ-యసిలు-ఇలా-షురకా-ఇహిమ్-సాఅ-మాయహ్కుమూన్.

137. మఱియు, వారు దేవుఁడు సృజించినపొలములధాన్యమునుండియు పశువులనుండి ఒక భాగము దేవునికిఁగాను నియమింతురు. మరల తమయూహలనుబట్టి ఇది దేవుని భాగము. మఱియు నిది మా దేవతల భాగము అని పలుకుదురు. ఆపిదప వారి దేవతలకుఁగానున్నది మాత్రము దేవునికిచేరదు. మఱి దేవునికిగానున్నది వారిదేవతలకుచేరుచున్నది. వారుతీర్పుచేయుచున్నది చాలచెడ్డది.

వ్యా॥ 137. ఇఁక కాఫిర్లలోనున్న దురాచారములును తప్పు విశ్వాసములును వివరింపఁబడుచున్నవి. కాఫిర్లు తమ పొలముల ఫలితములోను, తమ పశువులలోను, దేవుని పేరుతో ఒక భాగము తీయుదురు. అటులే వారి దేవతలకును విగ్రహములకునుగాను ఒకభాగము తీయుదురు. ఒకవేళ దేవునిభాగములోని ధాన్యము ఫలమువారిదేవతల భాగములో కలిసిపోయినచో దానినివేఱుచేయక దానిలోనే కలుపుదురు. దేవునిపేరుతో మొక్కుబడి చేసిన జంతువు బాగుగానున్నచో దాని మార్చి ఇది దేవతలకుఁగాను అని పలుకుదురు. ఒకవేళ దేవతల భాగమునుండి దేవుని భాగములో కలసినచో దాని వేఱుగాఁ జేయుదురు. చిల్లరదేవతలు ఆగ్రహమునొంది తమకు కీడు చేయుదురని వారు తలఁచి అట్లు చేయుదురు. ఇవన్నియు వారి మూఢవిశ్వాసములు వారు చేయు తీర్పు కూడ న్యాయమైనదికాదు. ఎందుకన దేవుఁడు సృజించిన దానిలో చెడ్డది దేవుని భాగమనియు శ్రేష్ఠములైనవి విగ్రహముల భాగమనియు నియమించుట చాల అన్యాయమును, ఘోరపాతకమును. సర్వమునకు సృష్టికర్త దేవుఁడు. ఆతనికే మొఱలిడవలెను.

138. వ-కజాలిక-జయ్యన-లికసీరిమ్-మినల్-ముష్-రికీన - ఖత్ల-ఔలా-దిహిమ్-షురకాఉహుమ్-లి-యుర్దూహుమ్-వలి-యల్-బిసూ-అలైహిమ్- దీన

హుమ్-వలౌ-షా అల్లాహు-మా-ఫఅ-లూహు-ఫజర్-హుమ్-వ-మాయఫ్ తరూన్.

138. మఱియు నటులే విగ్రహారాధకులలో పెక్కుమందికి వారి సైతానులు, వారిని నాశముచేయుటకును వారి మతములో కల్పడము చేయుటకును, వారు తమ బిడ్డలను చంపుట వారికి బాగుగ తోఁచునట్లు చేసిరి. మఱి దేవుఁడు కోరియుండినచో వారట్లు చేసియుండరు. కావున నీవు వారిని వారు కల్పించు అబద్ధములలోనే వదలిపెట్టుము.

వ్యా॥ 138. విగ్రహారాధకులలో పెక్కుమంది తమ సైతానుల ప్రేరేపణవలన తమ కుమార్తెలను ఒకనికిచ్చి పెండ్లిచేయవలసివచ్చును అని వారిని దయలేకుండ చంపుచుండిరి. మఱికొందఱు తమ బిడ్డలను విగ్రహములకుఁగాను బలిచేయుచుండిరి. మఱికొందఱు ఎక్కువబిడ్డలైనచో వారికి భోజనముపెట్టవలసివచ్చును, పేదఱికము వచ్చును అని కఠినహృదయులై చంపుచుండిరి. ఇదంతయు వారు తమ నాశమునకుఁగాను చేయుచుండిరి. మఱి దేవతలకు తమ బిడ్డలను బలిగానిచ్చుట మతధర్మమని యెంచుచుండిరి. ఎట్లు దేవునికిని చిల్లర దేవతలకు తమ పంట, పశువులలో భాగములు నియమించుచుండిరో అటులే ఇట్టి దుష్టత్వము చేయుచు మంచిది యనితలఁచుచుండిరి. దేవుఁడు కోరినచో బలవంతముగా నాపఁగలఁడు. కాని అట్లు చేయలేదు. వారినిగూర్చి ఓ ప్రవక్త! నీవు చింతింపకుము. వారిని వదలిపెట్టుము. దానిగూర్చి దేవుఁడు తీర్పుచేయును.

139. వఖాలూ-హాజిహీ-అన్ఆమున్-వ-హర్సున్ - హిజ్రున్-లా-యత్ అముహా-ఇల్లా-మన్-నషాఉ-బి-జ అ-మిహిమ్-వఅన్ఆమున్ హుర్రిమత్-జుహూరుహా-వఅన్-ఆముల్-లాయజ్-కురూనస్-మల్లాహి-అలైహిఫ్ - తిరా-అన్-అలైహి-సయజ్-జీహిమ్-బిమా-కానూ-యఫ్-తరూన్. 140. వఖాలూ-మాఫీ-బుతూని-హాజి-హిల్-అన్-ఆమి-ఖాలిసతుల్-లి-జుకూరినా-వ- ముహర్రమున్.అలా-అజ్-వాజినా-వఇన్-యకుమ్-మైతతన్-ఫహుమ్-ఫీహి-షురకావు-సయజ్-జీహిమ్-వస్-ఫహుమ్-ఇన్నహూ-హకీమున్-అలీమ్.

139. మఱియు వారు ఈ పశువులును పంటయును నిషిద్ధములు, మాయిష్టము వచ్చిన వారు తప్ప నితరులు వీనిని తినరాదు అని తమ యూహలను బట్టి పలుకుచున్నారు. మఱి దేవునిపై అబద్ధములు కల్పించుచు కొన్ని పశువుల వీఁపులపై నెక్కుట నిషేదించిరి. మఱి కొన్ని పశువులను జబాచేయు (కోయు) నపుడు దేవుని పేరు ఉచ్చరింపరు. శీఘ్రములోనే వారు కల్పించు అబద్ధములకుఁగాను దేవుఁడు వారిని శిక్షించును. 140. మఱియు వారు ఈ పశువుల గర్భ

ముల లోనున్న వానిని మా పురుషులే తినవలెను. మఱి మాస్త్రీలకుఁ గాను నిషిద్ధము. మఱియు అది చచ్చినదిగా నున్నచో అందఱును తినవచ్చును అని పలుకుచున్నారు. దేవుఁడు వారి పలుకులకుఁగాను శిక్ష విధించును. ఆతఁడు వివేచనా పరుఁడును సర్వజ్ఞుఁడును.

వ్యా॥ 139. కాఫిర్లు (అవిశ్వాసులు) తమ యిష్టాను సారముగా కొన్ని ఆచారములు కల్పించుకొని అవి దేవునికి ప్రియములు. అవి దేవుఁడు నియమించి నవి అని దేవునిపై అసత్యములు పలుకుచుండిరి. అవి యిందు రద్దు చేయఁబడి నవి. కాఫిర్లు తమచిల్లర దేవతలకుఁగాను విగ్రహములకుఁగాను పశువులు పంటలు మొక్కుబడి చేసికొనుచు వానిని తమ యిష్టము వచ్చినవారు అనఁగా పురుషులు పూజారులు మహంతులు తినవలెను. స్త్రీలు తినగూడదు అని పలుకు చుండిరి. పశువులలో బహీరా సాయిబా వసీలా హామీ అనువానిపై సవారి చేయ కూడదు. వానిపై బరువు మోపకూడదు అని నిరాధారములైన పద్ధతులు నియమించుకొనిరి. కొన్ని పశువులను విగ్రహములకుఁగాను వదలిపెట్టి వానినికోయునపుడు దేవునిపేరు ఉచ్చరింప కూడదు. లేనిచో విగ్రహములు ఆగ్రహము నొందును అని మూఢవిశ్వాసము లుంచి యుండిరి. ఇవన్నియు అసత్యములు. గ్రంథ ఆధారములు లేని కల్పనలు. దేవుఁడు వారి కల్పనలకుఁగాను తప్పక శిక్ష విధించును. 140. గర్భములోనున్న సాయిబా బహీరా అను పశువులను కోసినచో అందున్న పిల్ల ప్రాణములో నున్న దానిని పురుషులు తినవచ్చును. స్త్రీలు తినఁగూడదు అనియు అది చచ్చియున్నచో పురుషులును స్త్రీలును తినవచ్చును అను నియమము కాఫిర్లు నియమించుకొని యుండిరి. ఇవన్నియు కల్పనలు నిరాధారములు. ఇట్లు కల్పించి పాపములు చేయువారు దేవునికిఁ దెలియును. వారికిఁ దగిన శిక్షవిధించును. ఆతఁడు వివేచనాపరుఁడు. కావున కొంతవిరామ మిచ్చియున్నాఁడు. సమయమువచ్చినపుడు వారికిఁదగినశిక్ష తప్పకవిధించును.

144. ఖద్-ఖసిరల-జీన-ఖతలూ-ఔలా-దహుమ్-సఫహామ్ బిగైరి-ఇల్మిన్ వ-హర్రమూ-మా-రజఖ-హుముల్లా-హుఫ్ తిరా-అన్-అలల్లాహి-ఖద్-జల్లూ-వ మాకానూ-ముహ్తదీన్.

141 మూఢత్వములో తెలివిలేక తమ బిడ్డలను చంపినవారును దేవునిపై అసత్యములు కల్పించుచు తమకు దేవుఁడొసంగిన దానిని నిషేధించు కొన్నవారును నిశ్చయముగా నష్టము పొందిరి. మఱివారు దుర్మార్గులైరి. మఱివారు సన్మార్గమునకు రాలేదు.

వ్యా॥ 141. నిష్కారణముగ తాము కన్న బిడ్డలను వధించుట కంటెను దేవుఁడొసంగిన వస్తువులను వృథా చేయుట కంటెను వేఱు నష్టము వినాశము

దుర్మార్గము ఎద్ది కలదు? ఎద్దియును లేదు. ఇట్టి కఠిన హృదయులును, దురాచారములకు లోనైన వారును తమ దుష్టత్వములోపడి జ్ఞానమును బుద్ధిని పోఁగొట్టుకొన్నవారు ఎట్లు సన్మార్గమునకు రాఁగలరు.

142. వహువల్లజీ-అన్-ష-అ-జన్నాతిమ్-మఅ-రూషాతిన్-వ-గైర-మఅ-రూషాతిన్-వన్-నఖ్ల-వజ్-జర్అ-ముఖ్-తలిఫన్-ఉకు-లుహూ వజ్-జైతూన్- వర్-రుమ్మాన-ముత-షాబి-హిన్-వ-గైర-ముత-షాబి-హిన్-కులూ-మిన్-సమరిహీ-ఇజా-అస్మర-వ-ఆతూ-హక్-ఖహూ-యౌమ-హసాదిహీ-వలా-తుస్-రిఫూ - ఇన్నహూ-లాయుహిబ్బుల్-ముస్రిఫీన్. 143. వ-మినల్-అన్ఆమి-హమూలతన్-వ-ఫర్షన్-కులూ-మిమ్మా-రజఖ-కుముల్లాహు-వలా-తత్-తబిఊ-ఖుతు-వాతిష్-షైతాని-ఇన్నహూ-లకుమ్-అదువ్వుమ్-ముబీన్.

142. మఱియు ఆతఁడే పందిళ్ళపై నెక్కింపఁబడు తోఁటలను పందిళ్లపై నెక్కింపఁబడని తోఁటలను ఖర్జూర వృక్షములను పొలములను సృజించెను. వాని ఫలములు వేర్వేఱుగా నున్నవి. మఱియు దానిమ్మను జైతూను (ఆలివుల) ను పుట్టించెను. అవి యొకటికొకటి పోలికలు గలవిగాను పోలికలు లేనివిగా నున్నవి. అవి ఫలించినపుడు వాని ఫలములను తినుఁడు. వానిని కోయు దినమునందు వాని హక్కును ఇచ్చి వేయుఁడు. మఱి వృథాగా ఖర్చు చేయకుఁడు. నిశ్చయముగ దేవుడు వృథాగా ఖర్చుచేయువారిని ప్రేమింపఁడు. 143. మఱియు పశువులలో బరువు మోయునట్టివి భూమికిఁ దగులునట్టివి దేవుఁడు సృజించెను. మఱి మీకు దేవుఁడొసంగిన దానినుండి తినుఁడు. మఱి సైతాను పాదజాడలను అనుసరింపకుఁడు. వాఁడు మీకు స్పష్టమైన విరోధి.

వ్యా॥ 142. తోఁటలు రెండువిధములు. ఒకటి ద్రాక్ష మొదలగునవి. పందిళ్లపై నెక్కింపఁబడునవి. రెండవది అట్లు కానివి. మామిడి టెంకాయల వృక్షములు మొదలగునవి. పలువిధములైన పైరు పంటలు ఫలములు మనుష్యుల యాహారము కొఱకు దేవుఁడు సృజించెను. కొన్ని ఫలములు రంగు రూపములలో పోలియుండినను రుచిలో వ్యత్యాసము గలిగియుండును. పొలము ఫలములు కోయు దినమునందు వానినుండి కొంత బీదలకు దానము చేయవలెను. వర్షము వలననే పండు పంటలో పదవభాగమును బావుల నీళ్లు పెట్టుట వలన పండు పంటలో ఇరువదవభాగమును దానము చేయవలెను. ధర్మముగా దానిని తినవలెను. వృథా ఖర్చు చేయరాదు. అందు చాల నష్టముగలదు. అట్లు వృథా ఖర్చుచేయువారు దేవునికి ప్రియులుకారు. వారు దేవుని కోపమునకు

పాతుౖలగుదురు. కావున ముసల్మానులు భక్ష్యములు వృథా (ఇస్రాఫ్) చేయుట మానుకొనవలెను. 143. ఒంటె గుఱ్ఱము మొదలగు జంతువులు బరువు మోయునవి. గొఱ్ఱె మొదలగు చిన్న జంతువులు భూమికిఁ దగులునవి. అవి బరువు మోయఁజాలవు. ఇవన్నియు దేవుఁడు మానవుల కొఱకుసంగెను. కావున దేవుని సెలవు ప్రకారము వాని ననుభవింపవలెను. అందు తమ యిష్టానుసారముగ పద్ధతులు నియమించుకొని సైతాను ననుసరింపఁగూడదు. సైతాను మానవులకు విరోధి. వాని ననుసరించినచో ఉభయ లోకములలోను నష్టము గలుగును. వానిమాట ననుసరించి విగ్రహములకు మొక్కుబడి మొదలగు పాపకార్యములు చేసి మానవులు చెడరాదు.

144. సమా-నియత-అజ్-వాజిన్-మినజ్-జానిస్-నైని-వ-మినల్-మఅ-జిస్-నైని-ఖుల్-ఆజ్-జకరైని-హర్రమ-అమిల్-ఉన్-సయైని-అమ్మష్-తమలత్ అలైహి-అర్-హాముల్-ఉన్-సయైని-నబ్బి-ఊనీ-బి-ఇల్మిన్-ఇన్ కున్తుమ్-సాదిఖీన్. 145. వ-మినల్-ఇబి-లిస్నైని-వ మినల్-బఖ-రిస్-నైని-ఖుల్-ఆజ్-జకరైని హర్రమ-అమిల్-ఉన్-సయైని-అమ్మష్-తమలత్-అలైహి-అర్-హాముల్-ఉన్-సయైని-అమ్-కున్తుమ్-షుహ-దాఅ-ఇజ్-వస్సా-కుముల్లాహు-బిహాజా-ఫమన్-అజ్లము-మిమ్మ-నిఫ్-తరా-అలల్లాహి-కజిబల్-లియు-జిల్లన్-నాస-బిగైరి-ఇల్మిన్-ఇన్నల్లాహ-లా-యహ్-దిల్-ఖౌమజ్-జాలిమీన్.

144. దేవుఁడు ఎనిమిది పెంటిపోతులను సృష్టించెను. అందు గొఱ్ఱెలలో రెండు మఱి మేకలలో రెండు. ఈ రెంటిలోని పోతులనా లేక పెంటి పశువులనా లేక ఈ రెంటిలోని పెంటిదాని గర్భములలో నున్న వానిని దేవుఁడు నిషేధించెనా. మీరు సత్యవంతులరైనచో ప్రమాణము (సనదు) తెచ్చినాకుఁ దెలుపుఁడు అని ఓ ప్రవక్తా! యడుగుము. 145 మఱియు ఒంటెలలో రెంటిని ఆవులలో రెంటిని దేవుఁడు సృజించెను. ఈ రెంటిలోని పోతులనా లేక పెంటి పశువులనా లేక ఈ రెంటిలోని పెంటి వాని గర్భములలో నున్న వానిని దేవుఁడు నిషేధించెనా అని ఓ ప్రవక్తా! యడుగుము. ఏమి దేవుఁడిట్లు మిమ్ము ఆజ్ఞాపించునపుడు మీరుంటిరా! మఱి ధర్మములు తెలియకుండ ప్రజలను దుర్మార్గులుగాఁ జేయుటకై దేవునిపై అసత్యములు కల్పించిన వానికంటె దుర్మార్గుఁడెవఁడున్నాఁడు. నిశ్చయముగ దుర్మార్గులకు దేవుఁడు సన్మార్గము చూపఁడు.

వ్యా॥ 144.145. నిశ్చయముగ దుర్మార్గులకు దేవుఁడు సన్మార్గము

చూపుఁడు. ఇస్లామ్‌నకు పూర్వము అరబ్బులు హలాల్ (ధర్మము) హరామ్ (అధర్మము, నిషిద్ధము) గూర్చి తమయిష్టాను సారముగా ఆచారములు కల్పించుకొని యుండిరి. పై వాక్యములలో వాని గూర్చి వివరింపఁ బడియె. ఇఁక ఈ వాక్యములలో దేవుఁడు ప్రజలకొఱకు హలాల్ (ధర్మముగా) చేసిన పశువులు వివరించుచు వీనిలో దేనిని దేవుఁడు నిషేధించెను? దానికి శాస్త్రి ప్రమాణము (సనదు) తీసికొని రండు అని అవిశ్వాసులతో చెప్పఁబడియెను పశువుల లో గొఱ్ఱె మేఁక ఒంటె ఆవు అను వానిలో పోతు పెంటిది అను జతలుగాను దేవుఁడు సృష్టించెను. వీనిని దేవుని పేరుతో జబా చేసి తినవచ్చు. వీనిలో దేనిని కూడ దేవుఁడు హరామ్ (నిషేధము) చేయలేదు. వస్తువులను తినవచ్చు ను తినకూడదు అని సెలవిచ్చుట దేవుని పని. ఆతఁడు తన ప్రవక్తల మూలమున ప్రజలకు ధర్మాధర్మము (హలాల్-హరాము) లు తెలిపెను. లేక ఎవరి తోనైన స్వయముగా మాటలాడి సెలవియ్యవలెను. అవిశ్వాసులు పలుకు మాటలు ఈ రెంటికి సంబంధింపవు. వీరు కల్పించుకొన్న దురాచారములు దేవుఁడు ఏప్రవక్త మూలముననను దెలుపలేదు. మఱి వారితో స్వయముగా మాటలాడి తెలుపలేదు. అందుకు మీ దెగ్గర సనదుండినచో తెచ్చి చూపుఁడుఅని 144. వ వాక్యములోను దేవుడు ఆజ్ఞాపించు నపుడు మీరు స్వయము హాజరై యుంటి గా అని 145 వాక్యములో చెప్పఁబడియె. కావున ధర్మములు తెలియకుండ నిరాధారములైన మాటలు పలికి ప్రజలను సన్మార్గమునుండి తప్పించువారు చాల దుర్మార్గులు. అట్టిదుర్మార్గులకు సన్మార్గము లభింప నేరదు.

146 ఖుల్-లాఅజిదు-ఫీ-మా-ఊహియ-ఇలయ్య-ముహర్రమన్-అలా-తాఇమిన్-యత్-అముహు-ఇల్లా-అన్-యకూన-మైతతన్-ఔ-దమన్ - మస్-ఫూహన్-ఔ-లహ్మ-ఖిన్-జీరిన్-ఫఇన్నహూ-రిజ్‌సున్-ఔ-ఫిస్-ఖన్-ఉహిల్లా-లిగై-రిల్లాహి-బిహీ-ఫ-మనిజ్-తుర్ర-గైర-బాగిన్-వలా-ఆదన్-ఫఇన్న-రబ్బక-గఫూరుర్-రహీమ్.

146- తనంతట తానుచచ్చినదానినిగాని లేకప్రవహించు రక్తమునుగాని లేక అపవిత్రమైన పంది మాంసమును గాని లేక దేవుని పేరు ఉచ్చరింపక అధర్మముగా నితరులపేరుఉచ్చరింపఁబడినదానినిగాని తినువారు తినకూడదు అనిమాత్రము నాకు వచ్చు దేవుని సందేశములో నున్నది. మరల ఎవరైన విధిలేక అవిధేయుఁడు కాకుండ అతిక్రమింపక (భక్షించినచో) నీప్రభువు క్షమించువాఁడును దయాళువును అని ఓప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 146. అవిశ్వాసులు ముర్దారును(తనంతట తానుచచ్చినది.), జంతు

వును కోసిన పిదప బయటికి వచ్చు రక్తమును, పందిమాంసమును, విగ్రహములకు గాను బలిచేసిన జంతువుల మాంసమును తినుచుండిరి. ఇవి తినకూడదు. ఇవి నిషిద్ధములు. దేవుఁడు పంపిన సందేశము (వహీ) లో ముర్దారు మొదలగునవి తిన కూడదు అని యున్నది. కాని ఓ అవిశ్వాసులారా! మీరు గొర్రె మేఁక ఆవు ఒంటెలను హరామ్ (నిషేధము) చేయుచున్నారే! అవి నిషిద్ధములని దేవుని సందేశములో లేదే! దేవుని పేరుతో వానిని జబాచేసి వానిమాంసము తినవచ్చును అని దేవుని సెలవు. ఆఁకటి బాధచే ప్రాణము పోవు స్థితిలో ముర్దారు మొదలగు నిషిద్ధములైనవి మితముగా తిని ప్రాణము కాపాడుకొన వచ్చును. దేవుని దయవలన అట్టి సౌకర్యములు మనుష్యులకు లభించెను.

147. వ-అలల్-లజీన-హాదూ-హారమ్నా-కుల్ల-జీ-జుఫురిన్-వ-మినల్-బఖరి-వల్-గనమి-హర్రమ్నా-అలైహిమ్ షుహూమ హుమా-ఇల్లా-మాహమలత్ జుహూరుహుమా-అవిల్-హవాయా ఔ-మఖ్ తలత-బిఅజ్ మిన్-జాలిక-జజైనా-బి-బగ్ ఇ-హిమ్-వఇన్నా-లసా-దిఖూన్. 148. ఫఇన్-కజ్-జబూక-ఫఖుర్-రబ్బుకుమ్-జూ-రహ్మతిన్-వాసి-అతిన్-వలా-యురద్దు-బాసుహూ-అనిల్-ఖౌమిల్-ముజ్రిమీన్.

147. మఱియు మేము యూదులకు గోర్లుగల ప్రతి జంతువును నిషేధించి యున్నాము. మఱియు వారికి ఆవు మేఁకల కొవ్వులో వీఁపులకుఁ దగిలి యున్నదానిని లేక పేగులపై నున్నదానిని లేక యెముకలకుఁ దగిలి యున్నదానిని దప్ప మిగిలిన కొవ్వును నిషేధించితిమి. వారు చేయుచున్న అక్రమముల కుఁగాను ఇట్లు వారిని శిక్షించితిమి. మఱియు మేము సత్యము పలుకువారలము. 148. పిదప వారు నీవు అబద్ధము పలుకుచున్నావు అని పలికినచో మీ ప్రభువు చాల విశాలమైన కరుణగలవాఁడు. మఱి పాపులనుండి దేవుని శిక్ష తొలఁగింపఁ బడదు అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 147. గిట్టెలు చీలక గోర్లుగల జంతువులు ఒంటె బాతు మొదలగునవి. యూదులు చేసిన అక్రమములు లెక్కలేనివి. వారి అక్రమములు అనేక వాక్యములలో వివరింపఁ బడినవి. ఒంటె బాతు మాంసము, ఆవు మేఁక క్రొవ్వు నిషిద్ధములు కాకున్నను యూదులు గావించుచున్న యక్రమములకుఁగాను వారికి శిక్షగా అవి నిషేధింపఁబడినవి. ఆవు మేఁకల కొవ్వులో వాని వీఁపునకును పేగులకును ఎముకలకును దగిలియున్న కొవ్వు నిషేధింపఁ బడలేదు. మిగిలిన చోట్లనున్న కొవ్వు నిషేధింపఁబడినది. యూదులు ఈ వస్తువులు హజ్రత్ ఇబ్రాహీము కాలమునుండి నిషేధింపఁబడినవి అని అసత్యములు పలుకుదురు. దేవుఁడు

చెప్పునది సత్యము అని హెచ్చరింపబడిరి. 148. ఓ ప్రవక్తా! నీ విరోధులగు విగ్రహారాధకులును యూదులును నీవు బోధించునది అసత్యము అని పలికినచో నీవు చింతింపకుము. దేవునిదయ చాల విశాలమైనది. కావున దుష్టులకు కొంత విరామము (గడువు) లభించినది. వారు దేవుని దయకు పాత్రులగుటకు విశ్వసించి సత్కార్యములు చేయవలెను. లేనిచో పాపులను దేవుని శిక్షనుండి ఎవరును రక్షింపజాలరు.

149, సయఖూ-లుల్లజీన-అష్రకూ-లౌ-షా-అల్లాహు - మాఅష్రక్నా - వలా-ఆబావునా-వలా-హర్రమ్నా-మిన్-షైఇన్-కజాలిక-కజ్-జబల్లజీన-మిన్-ఖబ్లిహిమ్-హత్తా-జాఖూ-బాసనా-ఖుల్-హల్-ఇన్దకుమ్-మిన్-ఇల్మిన్ - ఫతుఖ్-రిజూహు-లనా-ఇన్-తత్-తబిఊన-ఇల్లజ్-జన్న-వ ఇన్-అన్తుమ్-ఇల్లా - తఖ్రుసూన్. 150. ఖుల్-ఫలిల్లా-హిల్-హుజ్జతుల్-బాలిగతు ఫలౌ - షాఅ లహదాకుమ్-అజ్-మఈన్. 151. ఖుల్-హలుమ్మ-షుహదా-అకుముల్లజీన-యష్హదూన-అన్నల్లాహ-హర్రమ-హాజా-ఫఇన్-షహిదూ-ఫలా తష్-హద్ - మఅహుమ్-వలా-తత్తబిఅ-అహ్వా-అల్లజీన-కజ్-జబూ-బి-ఆయాతినా-వల్లజీన-లా-యూమినూన-బిల్-ఆఖిరతి-వ-హుమ్-బి-రబ్బిహిమ్-యఅ-దిలూన్.

149. ఇంక దేవునికి సాటికల్పించినవారు 'దేవుడు కోరినచో మేమును మా తాత ముత్తాతలును దేవునికి సాటి కల్పించియుండము, మఱి ఏ వస్తువును నిషేధించుకొనియుండము' అని పలుకుదురు. ఇటులే, వీరికిపూర్వము గడచిన వారు ప్రవక్తలను తిరస్కరించిరి. తుదకు తిరస్కరించినవారు మా శిక్షను అనుభవించిరి. మీ యొద్ద ఏదైన జ్ఞానము (విద్య) యున్నచో దానిని మాకు దెలుపుడు. మీరు మీయూహలను మాత్రము అనుసరించువారలు. మఱి మీరు అసత్యములాడువారు అని ఓ ప్రవక్త! పలుకుము. 150. సంపూర్ణమైన ప్రమాణము దేవునిదే. దేవుడు కోరినచో మీకందఱికిని సన్మార్గము చూపియుండును. అని ఓ ప్రవక్తా! పలుకుము. 151. ఈవస్తువులను దేవుడు నిషేధించెను అని సాక్ష్య మిచ్చునట్టి మీసాక్షులను దీసికొనిరండు అని ఓ ప్రవక్తా! పలుకుము. పిదప వారట్టి సాక్ష్యమిచ్చినచో నీవు వారి సాక్ష్యమును నమ్మకుము, మఱి మా సూచనలను తిరస్కరించినవారి కోరికలను నీవు అనుసరింపకుము. మఱి పరలోకమునందు విశ్వాసములేనట్టివారు ఇతరులను తమ ప్రభువునకు సమానులుగఁ జేయుచున్నారు.

వ్యా॥ 149. అవిశ్వాసులు కొన్ని జంతువుల మాంసమును నిషేధించుకొనుచుండిరి. దానిగూర్చి శాస్త్రప్రమాణము తీసికొనిరండు అని చెప్పఁబడియుండెను. దానికి అవిశ్వాసులు ఇట్లు చెప్పఁబోవుదురు అని తెలుపఁబడియె. అనగా దేవుఁడు కోరినచో మేమెందులకు విగ్రహారాధన మొదలగు అక్రమములు చేయుదుము. దేవునికి దానిని ఆపుటకుశక్తి గలదుకదా! దేవుఁడుమమ్ము ఆపకుండ విచ్చలవిడిగా వదలినందున మేము చేయు పనులు అక్రమములు కావు. అవి దేవునికి ప్రియములే అని వారి భావము. దానికి రద్దుచేయఁబడినది. వీరికి పూర్వమున్న అవిశ్వాసులు కూడను ఇటులే పలుకుచు వచ్చిరి. వారి దుర్మార్గము, అక్రమము, హెచ్చుకాఁగా వారు దేవుని శిక్షకు పాత్రులైనశించిరి. లోకములో నొక ప్రభుత్వమున్నది. దానికి విరోధులైనవారికి ప్రభుత్వము ముందుముందు కొంత హెచ్చరికచేసి తమ విరోధమును అక్రమమునుమానుకొనవలసినది అని మందలించును. విరోధులు, మానుకొనక తమ అక్రమములే చేయుచున్నచో కొంతగడువునిచ్చును. దానికిఁగూడ ఉపద్రవములు చేయువారు మానుకొననిచో, వారి యక్రమములను ప్రజలందఱికి తెలియునట్లుగ విచారణ చేసి వారికి ఉరిశిక్ష, లేక సదాబందీనివాసము ప్రభుత్వమువిధించును. విరోధులు గావించు నేరమునకు తత్క్షణమే ప్రభుత్వము శిక్షింపక కొంత గడువు నిచ్చినందున ఆ నేరములు, సత్కార్యములు కావుగదా! అటులే అవిశ్వాసుల విషయము ఊహింపవలెను. దేవుఁడు తన ప్రవక్తల మూలమున ధర్మమార్గము ప్రజలకుఁ దెలిపెను. ఆ పిదప అవిశ్వాసులు చేయు అక్రమములకును పాపములకును దేవునిచే వారికి హెచ్చరికకూడ కలుగుచుండును. వారికి కొంతగడువు కూడ దొరకును. దానికిఁగూడ అవిశ్వాసులు తమ పాపకార్యములను మానుకొననిచో తుదకు దేవుని శిక్ష రాళ్ళవానరూపమున యాకాశమునుండి లేక భూకంపము రూపమున భూమినుండి లేక కఱవు మొదలగు నితరరూపములందు అవిశ్వాసులకు లభించి వారు నశింతురు. ఇచ్చట మఱొకప్రశ్న కలుగవచ్చును. దేవుఁడు మానవుల స్వభావములోనే పుణ్యములుచేయు శక్తినేయుంచి పాపములు చేయు శక్తియే వారియందు లేకుండ చేసియుండిన బాగుండునుగదా, అని. దానికి సమాధానమిట్లున్నది. అదియేమన, ఈప్రశ్నవలన మానవుఁడు, మానవుఁడే కాక జడ కావలెనని తేటతెల్లమగుచున్నది. మంచిచెబ్బరులు చేయు శక్తియే లేనపుడు వాఁడు రాయి లేక చెట్టుగా పుట్టుటమంచిది. లేక ఒకపశువు తన స్వాభావిక నియమమును దాఁటలేక తన పనినిచేయుచు పోవును. అట్లు మానవుఁడు కాఁజాలఁడుగదా! ఎట్లు మానవుఁడు లోకవ్యవహారములలో బుద్ధిని తెలివిని ఉపయోగించి తన కార్యములను నెరవేర్చుచు, అద్భుతమైన యంత్రములు కల్పించుచు వానివలన సౌఖ్యములుపొందుచున్నాఁడో అటులే ఆత్మిక

విషములో సన్మార్గమును, దుర్మార్గమును పరిశీలించి, పాపకార్యములనువదలి పుణ్యకార్యమునుచేసి పరలోకసౌఖ్యములు పొందుటకుగాను తన బుద్ధి జ్ఞానములను ఉపయోగింపవలెను. దేవుడు పామును సృష్టించి యందు విషము పెట్టెను. ఆ పాముకాటువలన మానవుడు నశించుచున్నాడు. అందు పాముకాటు గలిగినవాని ప్రయత్నము లేకున్నను వాడు చచ్చుచున్నాడు! ఇటులేఅవిశ్వాసము వహించినవానికి సదా నరక నివాసమును, విశ్వాసము వహించినవానికి సదా స్వర్గనివాసమును లభించును అనిగ్రహింపవలెను. ఆక్షేపణలవలన లాభములేదు. కావున సన్మార్గము అవలంబింపవలెను. వట్టి యూహాలవలన ప్రయోజనము లేదు. అవిశ్వాసులు తమ యూహాలను అనుసరింతురు. 150. పై వ్యాఖ్యవలన దేవుని ప్రమాణము (సనదు) సంపూర్ణమైనది. అందు ఏలాటి కొఱతలేదు. అందఱిని బలవంతముగా నొకమార్గమందు నడపించుట సహజ ధర్మవిరుద్ధము అని తెలియనాయెను. 151. శాస్త్రీయజ్ఞానప్రమాణముగూర్చి (దలీలె అఖ్లీ) పై వాక్యములో చెప్పబడియె. ఇక ఓ అవిశ్వాసులారా ! మీరు నిషేధించుకొన్నదానిని దేవుడు నిషేధించియున్నాడు అని పలికినట్లు విన్న సాక్షులు తీసికొనిరండు అని ఓ ప్రవక్తా! పలుకుము. అవిశ్వాసులకు అట్టి సాక్ష్యముదొరకనేరదు. ఒకవేళ ఒకరిద్దఱు తప్పుసాక్ష్యమిచ్చుటకు సిద్ధమైనచోవారిసాక్ష్యము వినకుము. దానిని సమ్మతింపకుము. అవిశ్వాసుల అధర్మ కోరికలను అనుసరింపకుము. పరలోకమందు విశ్వాసములేనివారు దేవునికి సాటి కల్పింతురు. కావున వారి మాటలు వినకుము అని ప్రవక్తకు దేవుని సెలవు.

152. ఖుల్-తఆలౌ-అత్లు-మా-హర్రమ రబ్బుకుమ్-అలైకుమ్-అల్లా-తుష్రికూ-బిహీ-షైఅన్-వబిల్-వాలిదైని ఇహ్సానన్-వలా-తఖ్తులూ-ఔ-లాదకుమ్-మిన్-ఇమ్లా-ఖిన్-నహ్ను-నర్-జుఖుకుమ్-వ-ఇయ్యాహుమ్-వలా-తఖ్-రబుల్-ఫవా-హిష-మా-జహర-మిన్హా వ-మా-బతన-వలా-తఖ్-తులున్-నఫ్సల్లతీ-హర్ర-మల్లాహు-ఇల్లా బిల్-హఖ్ఖి-జాలిక-వస్సాకుమ్-బిహీ-లఅల్లకుమ్ తఅఖిలూన్. 153. వలా-తఖ్రబూ-మాలల్-యతీమి-ఇల్లా-బిల్లతీ - హియ-అహ్సను-హత్తా-యబ్లుగు-అషుద్ద-హూ-వ-ఔ-ఫుల్-కైల-వల్ - మీ-జానబిల్-ఖిస్తి-లానుకల్లిఫు-నఫ్సన్ ఇల్లా-వుస-అహా-వఇజా-ఖుల్తుమ్-ఫఅదిలూ వలౌ-కాన-జా-ఖుర్బా-వబి-అహ్దిల్లాహి-ఔఫూ-జాలికుమ్-వస్సా-కుమ్-బిహీ లఅల్లకుమ్-తజక్కరూన్. 154. వ-ఇన్న-హాజా-సిరాతీ-ముస్తఖీమన్-ఫత్ తబి

ఊవహ్ వలా-తత్-తబి-ఉస్-సుబుల-ఫ త ఫర్రఖ-బికుమ్-అన్-సబీలిహీ-జాలికుమ్ వస్సాకుమ్-బిహీ-లఅల్ల-కుమ్-త త్తఖూన్.

152. రండు. దేవుఁడు మీకు నిషేధించియున్న విషయము మీకు వినిపింతును. మీరు దేవునికి సాటి కల్పింపకుఁడు. మఱియు మీరుతల్లిదండ్రులకు మేలు చేయుఁడు. మఱి బీదతనమువలన మీరు మీబిడ్డలను చంపకుఁడు. మఱి మేము మీకును వారికిని. ఆహార మొసంగుచున్నారము. బహిరంగములైనవియును రహస్యములైనవియును అగు సిగ్గుమాలిన పనులను సమీపింపకుఁడు. న్యాయమందు దప్ప దేవుఁడు చంపఁగూడదు అని నిషేధించియున్న ప్రాణిని వధింపకుఁడు. ఇది మీరు గ్రహించుటకై దేవుఁడు మీకాజ్ఞాపించుచున్నాఁడు. 153. మఱియు తండ్రిలేని బిడ్డ తన యుక్తవయస్సుకు వచ్చునంతవఱకు, వానిసొత్తును బాగుపఱచుట తప్ప నితరమునకుఁగాను దానిని సమీపింపకుఁడు. మఱియు న్యాయముగా కొలఁతలను తూనికలను సంపూర్ణముగ నియ్యుఁడు. ఎవ్వనికైనను మేము వాని శక్తికి మించినది విధించుటలేదు. మఱి మీరు పలుకునపుడు న్యాయముగ పలుకుఁడు. అది మీబంధువునకు ప్రతికూలముగనైనను సరే. మఱి దేవుని యొడంబడికను పూర్తిచేయుఁడు. ఇది మీరు బోధన గ్రహించుటకై దేవుఁడు మీకాజ్ఞాపించుచున్నాఁడు. 154.మఱియు ఇదియే, నాసన్మార్గము. కావున మీరు దాని ననుసరింపుఁడు. ఇతర మార్గముల ననుసరింపకుఁడు. అవి మిమ్ము దేవుని మార్గమునుండి తప్పించును. ఇది మీరు భయభక్తులుగలిగి యుండుటకై దేవుఁడు మీకాజ్ఞాపించుచున్నాఁడు అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 152. ఇంతవఱకు అవిశ్వాసులు తమంతటతాము నిషేధించుకొన్న విషయములును, వారిసాకులునువివరింపఁబడినవి. ఇఁక ఈవాక్యములలో దేవుఁడు నిషేధించిన విషయములు చెప్పఁబడుచున్నవి. అవిశ్వాసులు, దేవుఁడు నిషేధించిన విషయములను ఆచరించుచుండిరి. కావున, వానిని మానుకొనవలెనని ప్రజలకు నిందు హెచ్చరికగలదు. పూర్వమునుండియు ప్రవక్తలు, దేవునికి సాటి కల్పింపవలదని ప్రజలతో చెప్పుచు వచ్చిరి. కాని అవిశ్వాసులు దేవునికి సాటి కల్పించిరి. దేవునికి సాటి కల్పించుట ఘోరపాతకము. దాని ఫలితము సదానరక నివాసము. తల్లిదండ్రులను కొందఱు చాల హింసింతురు. అట్లు చేయకూడదు. తల్లిదండ్రుల ఉపకారము బిడ్డలపై చాల గలదు. కావున దేవుఁడు ఖురానె షరీఫులో అనేక వాక్యములలో తల్లిదండ్రులకు మేలుచేయవలెను అని యాజ్ఞాపించియున్నాఁడు. తల్లి తండ్రులు సంతోషించిన దేవుఁడుకూడ సంతోషపడును అని హాజ్రత్ రసూలువారు ఉపదేశించియున్నారు. కావున దేవుని ప్రియమును కోరువారు తల్లిదండ్రుల ప్రియము పొందుటకు వారి సేవచేయవలెను. కొందఱు

పేదలు, తమకే ఆహారము బాగుగ లభించుటలేదే, బిడ్డలకెచ్చటినుంచి పెట్టుదుమని తాము కన్నబిడ్డలను కనికరములేక చంపుచుండిరి. అట్లు చేయకూడదు. అందఱికిని అన్నముపెట్టువాఁడు దేవుఁడు. కావున దేవునిపై నాధారపడి బిడ్డలను పోషింపవలెను. చాల బిడ్డలు అగుదురని భయపడ నక్కఱలేదు. వ్యభిచారము మొదలగు సిగ్గుమాలిన పనులను సమీపింపఁగూడదు. దానికి కారణములగు చెడుచూపులు మొదలగువాని జోలికిపోగూడదు. ఇందు అన్నివిధముల పాపకార్యములు చేయకూడదని నిషిద్ధము గలదు. ఎవఁడైన ఒకనిని హత్యచేసినచో దానికి బదులుగ హత్య చేసినవానిని వధింపవచ్చును. ఇది న్యాయము, అన్యాయముగ హత్యలు చేయరాదు. దేవుఁడుపదేశించినదానిని గ్రహించి మానవులు పాపకార్యములు మానుకొనవలెను. 163. తండ్రిలేని బిడ్డలసొత్తును వారి పోషకులు కాపాడవలెను. దానిని వృథా ఖర్చుచేయకూడదు. యుక్త వయస్సు వచ్చునంతవఱకు అట్లు చేయవలెను. దాని పిదప వారి వస్తువులనువారి పోషకులు అప్పగింపవలెను. కొలఁతల పళ్లు త్రాసులుసరియైనవిగానుంచికొలత చేయునపుడును, తూయునపుడును మోసముచేయక సంపూర్ణముగ నియ్యవలెను. మానవుఁడు తన శక్తికొలఁది దేవుని ధర్మములను అనుసరింపవలెను. శక్తికి మించినది దేవుఁడు విధింపఁడు. న్యాయము చెప్పునపుడు, బంధువుఁడు, పరాయివాఁడు అను భేదము పాటింపఁగూడదు. న్యాయము చెప్పినచో బంధువునకు నష్టము కలుగునని, అన్యాయముగాని, అసత్యముగాని పలుకరాదు. విశ్వసించినవారు దేవునితో ఒడంబడిక గావించినవారలు. కావున, దేవుఁడు ఏ కార్యము చేయవలెనని యాజ్ఞాపించెనో అద్దానిని ముసల్మానులు చేయవలెను. దేనిని చేయకూడదు అని నిషేధించెనో దానిని మానుకొనవలెను. దేవుని పేరుతో శపథము (ఖసమ్) చేసినచో, అది మతమునకు విరుద్ధము కానిచో దానిని పూర్తిచేయవలెను. 154. పై వివరింపఁబడిన ధర్మములను భయభక్తులతో ఆచరింపవలెను. అదియే దేవుఁ డుపదేశించిన స్థిరమైన సన్మార్గము, దానిని వదలి యితరతప్పుత్రోవఁల బోయినచో దేవుని మార్గమునుండితొలఁగినవారగుదురు. సన్మార్గము దేవుఁడు చూపెను. దాని ననుసరించుట భక్తులకర్తవ్యము. సన్మార్గమునందు నడచుటవలన భక్తి కుదురును.

155. సుమ్మఆతైనా-మూసల్-కితాబ-తమామన్-అలల్లజీ-అహ్సన - వతఫ్-సీలల్-లికుల్లి-షైఇన్-వహుదన్-వరహ్మ-తల్-లఅల్లహుమ్- బిలిఖాఇ-రబ్బి-హిమ్-యూమినూన్.

155. పిదప సత్కార్యములు చేయు వారిపై ననుగ్రహము పూర్తి చేయుటకును, ప్రతి విషయమును వివరించుటకును సన్మార్గమును దయను చూపుట

కును వారు తమ ప్రభువును చేరగలమని విశ్వసించుటకును, మూసా ప్రవక్తకు మేము గ్రంథము నొసంగితిమి.

వ్యా॥ 155. మూసా ప్రవక్తకు పూర్వము వచ్చిన ప్రవక్తలు పైవాక్యములలో చెప్పఁబడిన ధర్మములను ప్రజలకు బోధించుచు వచ్చిరి. అపిదప మూసా ప్రవక్తకు తౌరాతు గ్రంథము దేవుఁడొసంగెను. అందు మత ధర్మములు వివరముగా నుండెను. ఆకాలమందు సత్కార్యములు చేయుచున్నవారికి దేవుని యనుగ్రహము పూర్తిగ నొసంగఁబడెను. మూసా జనులగు ఇస్రాయీలియులు దేవుని సన్నిధానమున చేరగలము అని విశ్వసించుటకుఁగాను మూసా ప్రవక్త మూలమున వారికి తౌరాతు గ్రంథము లభించెను. దానివలన వారు సన్మార్గమును దేవుని కరుణయు పొందఁగలరు.

156. వహాజా-కితాబున్-అన్‌జల్నాహు-ముబారకున్-ఫత్-తబి-ఊహు-వత్-తఖూ-లఅల్లకుమ్-తుర్ హమూన్. 157. అన్-తఖూలూ - ఇన్నమా-ఉన్-జిలల్ కితాబు-అలా-తాఇ-ఫతైని-మిన్-ఖబ్లినా-వఇన్నా-కున్నా-అన్ దిరా-సతిహిమ్-ల-గాఫిలీన్. 158. ఔ-తఖూలూ లౌ-అన్నా-ఉన్-జి-ల-అలైనల్ -కితాబు-లకున్నా అహ్దా-మిన్-హుమ్-ఫఖద్-జాఅకుమ్-బయ్యినతుమ్-మిర్-రబ్బి-కుమ్ వహుదన్-వరహ్మతున్_ఫ-మన్-అజ్-లము మిమ్మన్-కజ్-జబ-బి-ఆయా-తిల్లాహి-వ సదఫ అన్ హా-సనజ్ జిల్లజీన యస్-దిఫూన-అన్- ఆయాతి నా-సూఅల్ అజాబి-బిమా-కానూ యస్-దిఫూన్. 159. హల్-యన్ జురూన ఇల్లా-అన్-తాతి-యహుముల్-మలాఇ-కతు-ఔ-యాతియ-రబ్బుక ఔ -యాతి య-బఅ జు-ఆయాతి-రబ్బిక-యౌమ-యాతీ-బఅజు-ఆయాతి-రబ్బిక-లా-యన్ ఫఉ నఫ్ సన్-ఈమానుహా-లమ్-తకున్-ఆమనత్-మిన్-ఖబ్లు-ఔ-కసబత్ — ఫీ-ఈమాని హా-ఖైరన్-ఖులిన్-తజిరూ ఇన్నా మున్-తజిరూన్.

156. మఱియు మేము పంపిన ఈ గ్రంథము శుభములుగలది. కావున మీరుదాని ననుసరింపుఁడు. మఱి మీకు దేవుని దయ గలుగుటకై మీరు భయ భక్తులు గలిగి యుండుఁడు. 157. "మాకు పూర్వముండిన రెండు జాతులవారికి మాత్రము గ్రంథ మొసంగఁబడెను. మఱి మాకు దాని పఠనము తెలియకుండెను అని మీరు పలుకకుండుటకును మాకు గ్రంథ మొసంగఁ బడి యుండినచో వారికంటెను బాగ మేము సన్మార్గము అనుసరించి యుందుము" అని మీరు అన

కుండుటకును మేము మీకు ఖురాను గ్రంథము పంపితిమి. కావున మీ యొద్దకు మీ ప్రభువునుండి ప్రమాణమును సన్మార్గమును కరుణయును వచ్చెను. మఱి దేవుని సూచనలను తిరస్కరించి వానినుండి ముఖము త్రిప్పుకొన్న వానికన్న యెక్కుండు దుర్మార్గుండెవండున్నాడు! మా సూచనలనుండి ముఖము త్రిప్పుకొనుచున్నవారికి వారి తిరస్కారమునకుం గాను మేము వారికి చాల చెడ్డ శిక్ష విధింతుము. 159. ఏమి? వారు తమపై దేవదూతలు రావలెనని గాని లేక నీ ప్రభువు రావలెను అనిగాని లేక నీ ప్రభువుయొక్క యేదైన సూచన రావలెనని గాని యెదురు చూచుచున్నారా! నీ ప్రభువుయొక్క కొన్ని సూచనలు వచ్చు దినమున దీనికి పూర్వము విశ్వసింపని వానికి వాని విశ్వాసమును లేక తన విశ్వాసములో సత్కార్యము చేయక యున్నవానికి వాని సత్కార్యమును లాభమియ్యవు. మీరును ఎదురు చూడుండు. మేమును ఎదురు చూచెదము అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 156. ఈ గ్రంథమగు ఖురానె షరీఫు సంపూర్ణమైన దేవుని గ్రంథము. ఇందు సర్వవిధముల శుభములునుగలవు. ఆత్మిక గృహస్థ రాజకీయ మొదలగు సర్వధర్మములును గలవు. కావున ఖురాను ననుసరింపవలెను. దాని ననుసరించుటలో భక్తులు ఏలాటి లోపము చేయకుండ దేవుని యందు భయభక్తులు గలిగి యుండినచో దేవునిదయకు వారు పాత్రులగుదురు. 157, 158. ఖురాను గ్రంథమునకు పూర్వము అరబ్బులకు మతగ్రంథ మొసంగంబడలేదు. తౌరాతు ఇన్జీలు యూదులకును నస్రానీలకును ఒసంగం బడినవి అని వారికిం దెలిసి యుండెను. అవి అరబీ భాషలో లేనందున వాని విషయములు అరబ్బులకుం దెలియకుండెను. కావున మాకుం దెలియదు. మాకు గ్రంథమియ్యం బడలేదు అను సాకు పెట్టుకొని మేము శిక్షకు పాత్రులము కాము అని చెప్పకుండుటకు ఖురాను గ్రంథము మీకొసంగంబడెను. మీసాకు మాటలు చెల్లవు. మీరు దీని ననుసరించి భక్తులై లోకమునకు భక్తిమార్గము చూపవలెను. కావున దేవుని అనుగ్రహము వలన మీయొద్దకు స్పష్టమైన ప్రమాణము (దలీల్) అగు ఖురానె షరీఫు వచ్చినది. అందు సన్మార్గము గలదు. దాని ననుసరించిన వారు దేవుని దయకు పాత్రులగుదురు. కావున అట్టి మహిమగల దేవదత్త గ్రంథమగు ఖురానులోని దేవుని సూచనలను అసత్యములని చెప్పి దానిని తిరస్కరించు వాని యెక్కుండుకన్న దుర్మార్గుండు ఎవండును లేండు. అట్టి దుర్మార్గులకుం దగినకఠినశిక్ష దేవుండు విధించును. కావున మానవులు జాగ్రత్తపడి యుండవలెను. 159. దేవుండు మానవులకు సన్మార్గము చూపు విషయములో తన ప్రవక్తలనుమఱియు గ్రంథములను పంపి తన ధర్మము సంపూర్ణముగ నెఱవేర్చుచు వచ్చెను. తుదకు ఆఖరు ప్రవక్తయగు హజ్రత్ ముహమ్మదును, ఆఖరు గ్రంథమగు ఖురానె షరీ

పును దేవుఁడు పంపెను. ఇఁక ఏలాటి కొఱతలేదు. దీని పిదప కూడ విశ్వసిం పనివారు దేవదూతలు లేక దేవుఁడు లేక ప్రళయకాలపు సూచనలు రావలె ను అని ఎదురు చూచుచున్నారా! అట్లు ఎదురుచూచియు ప్రయోజనము లేదు. ఎట్లు మానవుఁడు చచ్చుచు అవసానకాలమందున్నపుడు విశ్వసించిన లేక క్షమాపణ (తౌబా) కోరిన ప్రయోజనముండదో అటులే లోకము నశింపనుండి దానికి అవసానకాలమువంటి సూచనలు సూర్యుఁడు పడమటినుండి యుదయిం చుట మొదలగు నవి చూచునపుడు ఇంతవఱకు విశ్వసింపక సత్కార్యములు చే యక యున్నట్టివారు విశ్వాసము వహించి సత్కార్యము (తౌబా) చేసిన అవి యంగీకరింపఁబడవు. అవి పనికిరావు. అవిశ్వాసులారా! మీరు దానికొఱకుగాను ఎదురుచూచుచుండుఁడు. మేముకూడ ఎదురుచూచుచుందుము. ఎవరిగతి యేమి కానున్నదో తెలియనగును అని హెచ్చరింపఁబడియె.

160. ఇన్నల్లజీన-ఫర్రఖూ-దీనహుమ్-వకానూ-షియఅల్-లస్త-మిన్ హుమ్-ఫీ-షైఇన్-ఇన్నమా-అమ్రుహుమ్-ఇలల్లాహి - సుమ్మ - యునబ్బి - ఉ హుమ్-బిమా-కానూ-యఫ్-అలూన్.

160 ఎవరు తమ మతములో భేదములు కల్పించి వేర్వేఱు సంఘములు గ నైపోయిరో వారి విషయము గూర్చి నీకెట్టి బాధ్యత లేదు. వారి విషయ ము దేవుఁడు చూచుకొనును. పిదప వారు చేయుచున్న కర్మలను గూర్చి వారి కిఁ దెలుపును.

వ్యా॥ 160. దేవుని మతము పూర్వమునుండియు ఒకటియే. అదియే స న్మార్గము. అందు భేదములు కల్పించి వేర్వేఱు దారినిపోయి అనేక సంఘము ములుగ నేర్పడిన వారి పాపముల విషయము ఓ ప్రవక్తా! నీవు జవాబుదారివి కావు. ఆబాధ్యత నీదికాదు. ఆవిషయము దేవుఁడు చూచుకొనును. వారివారికిఁ దగిన ఫలిత మొసంగును. భేదములు కల్పించుకొని అనేక శాఖలుగ చీలిపోయిన వారిలో యూదులు క్రైస్తవులు మొదలగు వారు గలరు. ముసల్మానులు అట్లు పలుశాఖలుగ చీలిపోఁగూడదు. అట్లు అయిపోవు వారికిని హజ్రత్ పైగంబరు లవారికిని ఎట్టి సంబంధ ముండనేరదు. అని హెచ్చరింపఁ బడియెను.

161. మన్-జాఅ-బిల్-హసనతి-ఫలహూ-అష్రు అమ్-సాలిహా-వమన్ జాఅ-బిస్-సయ్యి-అతి-ఫలా-యుజ్ జా-ఇల్లా-మిస్-లహా-వహుమ్-లా - యుజ్-లమూన్.

161. ఎవఁడు ఒక్క సత్కార్యము చేసి తెచ్చునో వానికి దాని పది అంతలు పుణ్యము గలదు. మఱెవఁడు ఒక పాపకార్యము చేసితెచ్చునో వానికి

దాని యంతటి శిక్షయేలభించును. మఱివారికేలాంటిఅన్యాయము జరుగనేరదు.

వ్యా॥ 161. ఇందు పాప పుణ్యములు లభించు తీరు చెప్పఁబడినది. ఒక సత్కార్యముచేసినవానికి కనీసముపదింతలు పుణ్యములభించును. అనఁగా ఒక సత్కార్యము చేసినచో పది సత్కార్యములు చేసినంతటి పుణ్యము లభించును. దేవుఁడు కోరినచో పదింతలకన్న హెచ్చుగా పుణ్యము నొసంగును. దానికి అంత్యములేదు. పాపకార్యమునకు ఒకపాపమే లభించును. దానికంటె నెక్కువ పాపము లభింపదు. దానికి శిక్షకూడ ఒక్కటి మాత్రము. అందు దేవుఁడు కోరిన తగ్గింప వచ్చును. లేక క్షమించిన క్షమింపవచ్చును. అందు పాపులకు ఏలాంటి అన్యాయము జరుగదు.

162. ఖుల్-ఇన్ననీ-హదానీ-రబ్బీ-ఇలా-సిరాతిమ్-ముస్తఖీమ్. దీనన్-ఖయ్యిమ-మన్ మిల్లత-ఇబ్రాహీ-హనీఫన్ వమాకాన-మినల్ ముష్రి-కీన్. 163. ఖుల్-ఇన్న-సలాతీ-వనుసుకీ-వ-మహ్-యాయ వమమాతీ-లిల్లాహి - రబ్బిల్ - ఆలమీన్- 164. లా-షరీక-లహూ-వ-బి-జాలిక-ఉమిర్తు-వ-అనా - అవ్వలుల్ - ముస్లి-మీన్. 165. ఖుల్-అగైరల్లాహి-అబ్గీ-రబ్బన్-వహువ-రబ్బు-కుల్లి- షైఇన్-వలా-తక్-సిబు-కుల్లు-నఫ్సిన్-ఇల్లా-అలైహా-వలా-తజిరు-వాజిరతున్-విజ్ర ఉఖ్రా-సుమ్మ ఇలా-రబ్బికుమ్-మర్-జిఉకుమ్-ఫ-యునబ్బి-ఉకుమ్-బిమా - కున్తుమ్-ఫీహి-తఖ్-తలిఫూన్. 166. వహువ-వల్లజీ-జఅలకుమ్-ఖలాఇ-ఫల్ -అర్జి-వరఫఅ-బఅ-జకుమ్-ఫౌఖ-బఅ-జిన్-దర-జాతిల్ లియబ్-లువకుమ్-ఫీ-మా - ఆతాకుమ్-ఇన్నరబ్బక-సరీఉల్-ఇఖాబి-వ-ఇన్నహూ-ల-గఫూరుర్_రహీమ్.

162. దేవుఁడు నాకు స్థిరమైన సన్మార్గము అనఁగా దేవుని భక్తుఁడగు ఇబ్రాహీముయొక్క చక్కనిమతమునుచూపెను. మఱి ఇబ్రాహీముదేవునికిసాటికల్పించువారిలో చేరినయాతఁడుకాఁడు అనిఓ ప్రవక్తా! పలుకుము. 163. నా ప్రార్థన (నమాజు), నా ఖుర్బానీ, నా జీవితము, నా మరణము, సర్వలోకములకు పోషకుఁడగు దేవునికే యున్నవి. 164. ఆతనికి సాటిలేదు. ఇదియే నాకైన యాజ్ఞ. మఱియు నేను విధేయులలో మొదటివాఁడను అని ఓ ప్రవక్తా! పలుకుము. 165. ఏమి నేను దేవుని వదలి యితరప్రభువును వెదకవలెనా? మఱి ఆతఁడే ప్రతి వస్తువునకు ప్రభువు. మఱెవఁడు పాపముచేయునో దాని బాధ్యత వానిపైననే యున్నది. ఒకని భారము మఱొకఁడు మోయఁడు. పిదప మీరంద

ఱను మీప్రభువునొద్దకు పోవలసియున్నది. కావున (అపుడు) మీరు ఏ విషయమునుగూర్చి వివాదములాడుచుంటిరో దానిని మీకుఁ దెలుపును అని ఓ ప్రవక్తా! పలుకుము. 166. మఱియు ఆతఁడేను మిమ్ము భూమిలో ప్రతినిధులుగఁ జేసెను. మఱియు దేవుఁడు మీకిచ్చినదానిలో మిమ్ము పరీక్షించుటకుఁగాను, మీలో నొకరికి నొకరిపై నున్నతపదవి నొసంగెను. నీప్రభువు శీఘ్రముగ శిక్షనొసంగువాఁడు. మఱియు ఆతఁడేను, క్షమించువాఁడును కరుణించువాఁడును.

వ్యా॥ 162. అవిశ్వాసులు ఎన్నియోమార్గములను, దేవతలను కల్పించుకొనియుండిరి. ఇందు దానికి రద్దుగలదు. హజ్రత్ ఇబ్రాహీము దేవునికి పరమ భక్తుఁడు. ఆయన దేవునికి విధేయుఁడు. ఆయన అవిశ్వాసులతో చేరిన యాతఁడుకాఁడు. ఆతని మతము చక్కనిది. ఆ మతమునే అనుసరింపవలెనని దేవుని సెలవు పైగంబరులవారికైనది. అదియే స్థిరమైన సన్మార్గము. అందు ఏలాటి వంకరలు లేవు. దానినే మిల్లతె ఇబ్రాహీమ్ అందురు. 163. ఇందు దేవుని యేకత్వమును, దేవునికి సర్వము వినియోగింపవలెను అనువిషయమును వెల్లడింపఁబడినది. ఇదియే భక్తిలో నున్నతమైన గొప్పస్థానము. ప్రార్థనలు, ఖుర్బానీ, జీవితము (బ్రతుకు) మరణము సర్వము దేవునిప్రీతికిఁగానుండవలెను. ఈవిషయమందు హజ్రత్ రసూలువారు కడతేరినవారు. 164. దేవునికి సాటిలేదు. ఆతఁడు అద్వితీయుఁడు. అందఱు ఆతనికి విధేయత చూపవలెను. దేవునికి విధేయులగుటలో హజ్రత్ రసూలువారు మొట్టమొదటివారు. విధేయతయం దందఱికంటె మించినవారు. ముసల్మానులు అనగా విధేయులు. దీనినిబట్టి ఇస్లామ్ అవలంబించినవారిలో హజ్రత్ రసూలువారు మొట్టమొదటివారు. వారి తరువాతనే మిగిలినవారు ఇస్లామ్‌లో చేరినవారలు 165. ఎట్లు దేవుఁడు సాటిలేనివాఁడో అటులే లోకమును పోషించువాఁడు ఆతఁడు ఒక్కఁడే. లోకపోషణలో ఆతనికి ఎవరును సాటిలేరు. సర్వము ఆతనిపోషణకులోఁబడియున్నది. కావున ఆతఁడు దప్ప వేఱు ప్రభువు ఎవఁడును లేఁడు. సర్వవిషయములందు ఆతని సహాయమే వేఁడవలెను. అవిశ్వాసులు ముసల్మానులతో మీరు దేవుని యేకత్వమును, బోధించు మతమును, వదలి మామార్గమునకు రండు అందు ఏదైన పాపము గలిగినచో దాని భారము మాపై నున్నది. దాని మేము భరింతుము అని పలుకుచుండిరి. దానికి నిందు జవాబియ్యబడినది. ఎవరు చేసిన పాపములకు వారే బాధ్యులు. ఇతరులు వారి పాపముల భారమును మోయరు. కావున ఓ అవిశ్వాసులారా! మీరు పలుకునది సరికాదు. కాని మీరు దేవుని విషయము వాదించుచున్నారు. దానిగూర్చి దేవుని సమ్ముఖమున తీర్పు జరుగును. అపుడు మీగతి మీకుఁ దెలియనగును. 166. మానవులు ఇహలోకమునందు దేవునికి ప్రతినిధులు. లోక కార్యములు జరుపుటకు దేవుఁడు మానవులకు స్వాతంత్ర్య

మొసంగియున్నాఁడు. మఱియు ఒక జాతివారు పోయిన పిదప ఇతర సంఘము వారు వారికి ప్రతినిధులుగ భువిలో వసించుచున్నారు. మానవులందఱు ఒకే తీరున లేరు రంగులోను రూపములోను సంపదలలోను అధికార బలములలోను ఒకరిపై నొకరు ఘనతగలిగియున్నారు. ప్రతి స్థితిగతులలోను దేవుఁడు మానవులను పరీక్షించును. ప్రభుత్వముగలవారు న్యాయముగ పరిపాలింతురా, లేక అన్యాయములు చేయుదురా. ధనవంతులు, తమసంపదలకు, గాను దేవునికికృతజ్ఞులరై యుందురా లేదా, బీదలు, రోగులు ఓర్పుచేయుదురా లేదా! ఈ విషయములలో ఎవరు దేవుని ధర్మములను అనుసరింతురు. ఎవరు అనుసరింపరు అను విషయము దేవుఁడు పరీక్షించును. ఈపరీక్షలో ఎవరు కడ తేరరో వారిని దేవుఁడు శిక్షించును. ఎవరు కొంత కొఱత (పొరపాటు) చేయుదురో వారి కొఱతలను పొరపాటులను క్షమించును. ఎవరు పరీక్షలో సంపూర్ణముగ కడ తేరుదురో వారిని దేవుఁడు కరుణించును.

సూరయేఆరాఫ్ మక్కీ 206 వాక్యములు.

ఇందు ఆరాఫ్‌నుగూర్చి చెప్పబడినది. కావున దీనికిఈపేరుగలిగెను. స్వర్గమునకును నరకమునకు మధ్యనుండు గోడపైని స్థలమును ఆరాఫ్ అనుదురు.

బిస్మిల్లా-హిర్రహ్మా-నిర్రహీమ్.

పరమదయాళువును ప్రేమించువాఁడునగు దేవునిపేర.

1. అలిఫ్-లామ్-మీమ్-సాద్.

సూరాలకు ముందువచ్చు ఇట్టి యక్షరములనుగూర్చి సూరేబఖరాలోవ్రాసియున్నాము. కొందఱు మతవిద్వాంసులు వీనియర్థము "నేనుదేవుఁడను. తీర్పుచేయువాఁడను అనిచేసియున్నారు." అయిన దీనివాస్తవమైనఅర్థము దేవుని కేఎఱుక.

2. కితాబున్-ఉన్-జిల-ఇలైక-ఫలా-యకున్-ఫీసద్రిక-హరజుమ్ మిన్‌హులి-తున్-జిర-బిహీవజిక్రా-లిల్-మూమినీన్. 3. ఇత్-తబిఊ-మాఉన్-జిల-ఇలైకుమ్-మిర్ రబ్బికుమ్-వలా-తత్-తబిఊ-మిన్-దూనిహీ-ఔ-లియాఅ-ఖలీలమ్-మాతజక్కరూన్.

2. నీవు గ్రంథము మూలమున భయపెట్టుటకును, విశ్వాసులకు బోధచేయుటకును, ఈగ్రంథము నీకొసంగఁబడినది. కావున దీనిప్రచారమువలన నీహృదయమునకు కష్టములు గలుగఁగూడదు. 3. మీ ప్రభువునుండి మీకొసంగఁబడిన దానిని మీరుఅనుసరింపుఁడు. మఱియు దేవుని వదలి యితర స్నేహితులను మీరు అనుసరింపకుఁడు. మీరు చాలతక్కువగా బోధను గ్రహింతురు.

వ్యా॥ 2. దేవుఁడు హజ్రత్‌రసూలువారికి ఖురానుగ్రంథ మొసంగెను,

వారు దాని ప్రచారము ప్రజలలో చేయవలసియుండెను. అందు అవిశ్వాసులు చూపు తిరస్కారమువలనను వారి ద్వేషమువలనను మనస్సునకు గొప్ప కష్టముగలిగి ప్రచారము మానుకొనఁగూడదు. ప్రచారము చేయుచు ప్రజలకు వారి ఫలితముగూర్చి జాగ్రత్తపఱచి వారిని భయపెట్టవలెను. ఖురాను గ్రంథమువలన ముసల్మానులకు బోధనియ్యవలెను అని దేవుఁడు పైగంబరుల వారికినిందు సెలవిచ్చెను. మానవులందఱును దేవుఁడొసంగిన ఖురాను గ్రంథము ననుసరింపవలెను. అందు ఉభయలోకములో మేలున్నది. ప్రభువగు దేవుని వదలి యితర సైతానులవంటి స్నేహితుల మాటను అనుసరింపకూడదు. మానవుఁడు పూర్తిగ గమనించినచో దేవుని బోధను వదలి దుర్మార్గుల మాట వినఁడు. కాని మానవుఁడు అంతగా బోధను గ్రహింపక దుర్మార్గమునకుఁ బోవుచున్నాఁడు. దేవుని గ్రంథములను ఆతని పవిత్రులను అనుసరింపనివారిగతి యేమాయెనో దెలుపుటకుఁగాను పూర్వీకుల విషయము గొంబోవు వాక్యములలో చెప్పఁబడుచున్నది.

4. వకమ్-మిన్-ఖర్యతిన్-అహ్లక్నాహా-ఫజాఅహా-బాసునా-బయాతన్ ఔహుమ్-ఖాఇలూన్. 5. ఫ-మా కాన-దఅవాహుమ్-ఇజ్-జాఅహుమ్-బాసునా ఇల్లా-అన్-ఖాలూ-ఇన్నా-కున్నా-జాలిమీన్. 6. ఫల-నస్-అలన్నల్-లజీన-ఉర్-సిల ఇలైహిమ్-వల్-నస్-అలన్నల్-ముర్-సలీన్. 7. ఫల-నఖుస్-సన్న-అలైహిమ్-బిఇల్మిన్ వమా-కున్నా-గాఇబీన్.

4. మఱి ఎన్నియో పురములను నశింపఁజేసితిను. కావున రాత్రివేళలందు లేక మధ్యాహ్నము వారు పరుండుచుండినపుడు వారికి మాశిక్ష లభించెను. 5. ఆపిప నమాశిక్ష వారికి లభించినపుడు మేమే పాపులము అనిపలుకుట తప్ప వేఱు మాట పలుకలేదు. 6. కావున మేమెవరి యొద్దకు ప్రవక్తలను పంపితిమో వారిని తప్పక ప్రశ్నింతుము. మఱియు మేము తప్పక ప్రవక్తలను అడుగుదుము. 7. పిదప మాకు సర్వము తెలిసియున్నందున వారికి వారి విషయములు దెలుపుదుము. మఱి మేము వారి సమక్షమున నేయుంటిమి.

వ్యా॥ 4. దేవుని ప్రవక్తలకు విరోధులై విశ్వసింపని పెక్కుపురముల వారిని దేవుఁడు నాశము చేసెను. కొందఱు రాత్రివేళ నశించిరి. మఱికొందఱు మధ్యాహ్నము విశ్రాంతికిఁగాను నిద్రపోవునపుడు నశించిరి. దేవుని ప్రవక్తలు తమ పనిని నెఱవేర్చిన పిదప దుర్మార్గులగు అవిశ్వాసులు తమ దుర్మార్గములో మితిమీఱి ఇహలోకభోగములలోపడి భయములేని వారైనపుడు ఆకస్మికముగా దేవుని శిక్ష వచ్చి వారిని పట్టెను. అపుడు దుర్మార్గులు కన్నులు తెఱచి మేమే పాపులము దుర్మార్గులము అని కేకలు వేయుట తప్ప వేఱుమాట పలుకలేదు. 5. తీర్పుదినము

(ఖియామతు) నందు దేవుఁడు తాను ఏజనులయొద్దకు తన ప్రవక్తలను పంపి యుండెనో యాజనులతో ఓజనులారా! మీరు నా ప్రవక్తల మతప్రచారమును ఎంతవఱకు అంగీకరించితిరి. అని ప్రశ్నించును. అటులే ప్రవక్తలతో మీజనులు మీ మాటనువినిరా లేదాఅనిప్రశ్నించును. 7. ఆదినమునందు మానవులందఱికినివారికర్మ లను దేవుఁడు తెలుపును. దేవుఁడు సర్వజ్ఞుఁడుసదామానవులకర్మలనుచూచుచుండు ను. దేవునికి తెలియనిదిలేదు. మానవులుచేయు సర్వకర్మలు దేవునికి తెలియును. కావున కర్మలననుసరించి ఫలితమొసంగును.

8. వల్-వజ్-ను-యౌ-మఇ-జినిల్-హఖ్ఖు-ఫమన్-సఖులత్-మవా-జీను హూ-ఫఉలా-ఇక-హుముల్-ముఫ్-లి-హూన్. 9. వమన్-ఖఫ్-ఫత్-మవాజీనుహూ ఫఉలా-ఇకల్లజీన-ఖసిరూ-అన్-ఫుసహుమ్-బిమా-కానూ-బి-ఆయాతినా-యజ్- లిమూన్.

8. మఱియు ఆదినమున కర్మల తూనిక న్యాయముగ జరుగును. ఇదప ఎవరి తూనికలు బరువు గలవిగా నగునో వారే మోక్షము పొందువారలు. 9. మఱెవరి తూనికలు తేలికవిగా నగునో వారు మాసూచనలను తిరస్కరించు చుండి నందువలన తమ యాత్మల నష్టము చేసికొనినవారు.

వ్యా॥ 8. తీర్పు దినమునందు మానవుల కర్మలు తూఁచఁబడును. భక్తి పూర్వకముగఁ జేసిన కర్మలు బరువుగలవిగా నుండును. ఎవరి మంచికర్మలు బరువుగానగునో వారు మోక్షముపొంది స్వర్గములో చేరుదురు. ఎవరి మంచికర్మ లు బరువులేక తేలికవిగా నుండునో వారికి మోక్షము లభింపదు. వారు నష్టము పొందిన వారై నరక నివాసు లగుదురు. అందు ఏలాటి అన్యాయము జరు గదు. కర్మలను తూచుట ఎట్లు? దాని త్రాసు ఎట్టిది అని ప్రశ్న కలుగవచ్చు ను. అందుకు మానవుఁడు దేవుఁడు తనకిచ్చిన బుద్ధితో గాలిని దేహములోని యుష్ణమును తూఁచునట్టి యంత్రములు చేసియున్నాఁడు గదా! సర్వశక్తుఁడగు దేవుఁడు మానవుల కర్మలను తూఁచునట్టి త్రాసును చేయుట అసాధ్యమా! కావున తీర్పు దినమునందు కర్మలను తూఁచు త్రాసుండును అని విశ్వాసము భక్తులుంచవలెను.

10- వలఖద్-మక్-కన్నాకుమ్-ఫిల్-అర్జి-వజఅల్నా-లకుమ్-ఫీహా-మ- ఆ-ఇష-ఖలీలమ్-మాతష్-కురూన్.

10. మఱియు మేము మీకు భూమిపై స్థాన మొసంగితిమి. మఱియు నందు మీకుజీవనవసతులనుకల్పించితిమి. మీరుకృతజ్ఞతసలుపునది చాలతక్కువ.

వ్యా॥ 10. ఇఁక ఈ వాక్యములలో దేవుఁడు తాను మానవులకుఁగాను

చేసిన మేళ్ళను వారికిఁ దెలిపి వారు దేవునికి కృతజ్ఞులరై యుండవలెనని ప్రో త్సాహ పఱచుచున్నాఁడు. దేవుఁడు మానవులను పుట్టించి వారి నివాసమునకుఁ దగినట్లు భూమిని యేర్పఱచి వారి జీవమునకుఁగాను వసతులు కల్పించెను. ఈ మేలునకుఁగాను ఎంత కృతజ్ఞత సలిపినను తక్కువయే. కాని మానవులలో చె క్కరు దేవునికి కృతజ్ఞత సలుపునది చాల తక్కువ. దేవుఁడు చేసిన మేలును మఱచుట చాల దోషముగదా! భూమ్యాకాశములలోని సమస్త వస్తువులు దే వుని సెలవుచే మానవులకు నుపయోగపడుచున్నవి. కావున మానవుఁడు తన సృ ష్టి కర్తయగు దేవునికి సదా కృతజ్ఞుఁడై యుండవలెను.

11. వలఖద్-ఖలఖ్-నాకుమ్-సుమ్మ-సవ్వర్నా-కుమ్-సుమ్మ-ఖుల్నా-లిల్-మలా-ఇ-కతిస్-జుదూ-లిఆదమ-ఫసజదూ-ఇల్లా-ఇబ్లీస-లమ్-యకుమ్ - మినస్-సాజిదీన్. 12. ఖాల-మా-మనఆక-అల్లా-తస్జుద-ఇజ్-అమర్తుక-ఖాల - అనా-ఖైరుమ్-మన్హు-ఖలఖ్-తనీ-మిన్-నారిన్-వ-ఖలఖ్తహూ-మిన్-తీన్ 13. ఖాల ఫహ్-బిత్-మిన్హా-ఫమా-యకూను-లక-అన్-తత-కబ్బర-ఫీహా-ఫఖ్-రుజ్ - ఇన్నక-మినస్-సాగి-రీన్. 14. ఖాల-అన్-జిర్నీ-ఇలా-యామి-యుబ-అసూన్. 15 ఖాల-ఇన్నక-మినల్-మున్-జరీన్. 16. ఖాల-ఫబిమా-అగ్-వైతనీ-లఅఖ-ఉదన్న-లహుమ్-సిరాత-కల్-ముస్తఖీమ్. 17. సుమ్మ-ల-ఆతి-యన్నహుమ్-మిమ్-బైని-ఐదీహిమ్-వమిన్ ఖల్-ఫిహిమ్-వ-అన్-ఐమానిహిమ్-వ-అన్-షమా-ఇలిహిమ్-వలా-తజిదు-అక్-సరహుమ్-షాకిరీన్- 18. ఖాలఖ్-రుజ్ - మిన్హా-మజ్-ఊమమ్-మద్-హూరా.లమన్-తబి-అక మిన్-హుమ్-ల-అమ్-ల-అన్నజహన్నమ-మిన్-కుమ్-అజ్-మఈన్.

11. మఱియు మేము మిమ్ము సృష్టించితిమి. పిదప మీ రూపములను జేసితిమి. ఆ పిదప మేము దేవదూతలతో మీరు ఆదమునకు సాష్టాంగ నమస్కారము (సిజ్దా) చేయుఁడు అని పలుకఁగా ఇబ్లీసు తప్ప అందఱును సిజ్దా చేసిరి. ఇబ్లీసు సిజ్దా చేయువారితో చేరలేదు. 12. (అపుడు) దేవుఁడు(ఇబ్లీసుతో) నేను నీకాజ్ఞాపించినపుడు నీవు సిజ్దా చేయకుండుటకు నీకేమి యాటంకము కలిగెను అని అడుగఁగా ఆతనికంటెను నేను శ్రేష్ఠుఁడను. నీవు నన్ను అగ్నితోఁ జేసితివి. మఱి ఆతనిని మట్టితోఁ జేసితివి అని ఇబ్లీసు పలికెను. 13. (అపుడు) నీవిచ్చటినుండి దిగిపొమ్ము. నీవిచ్చట గర్వమువహించుట నీకుఁదగదు. కావున

బయటికి వెడలిపొమ్ము. నీవు అవమానముపొందినవారిలో చేరినవాఁడవు అని దేవుఁడు పలికెను. 14. (అపుడు) ప్రజలు గోరీలనుండి లేవఁదీయఁబడు దినము వఱకు నాకు గడువిమ్ము అని యిబ్లీసు పలుకఁగా 15. నీకు గడువియ్యఁబడినది అని దేవుఁడు సెలవిచ్చెను. 17. అపుడు ఇబ్లీసు, నీవెట్లు నన్ను దారి తప్పించితివో అటులే నేను మానవులకొఱకు నీచక్కనిమార్గమందు కూర్చుండుదును. 17. పిదప వారిపైకి వారి ముందునుండియు, వారి వెనుకనుండియు, వారి కుడిప్రక్కలనుండియు వారి యెడమప్రక్కలనుండి వచ్చెదను. మఱి వారిలోకృతజ్ఞత సలుపువారలుగ చాలమందిని నీవుపొందవు అనిపలికెను. 18. నీవిచ్చటినుండి దుర్గతి పొందుచు దూరముచేయఁబడినవాఁడవై బయటికి వెడలిపొమ్ము. మానవులలో నెవరు నిన్ను అనుసరింతురో మి మ్మందఱితోను నరకము నింపి వేసెదను అని దేవుఁడు పలికెను.

వ్యా॥ 11. దేవుఁడు ఈ వాక్యములలో, ఆదిపురుషుఁడగు ఆదమును సృష్టించి యాతని కొసంగిన సన్మానముగూర్చి తెలుపుచున్నాఁడు. మానవులకు తండ్రియగు ఆదమును సృష్టించుట యాతని సంతానమును సృష్టించినటులేను. అందుకు మిమ్ము సృష్టించితిమని చెప్పఁబడియె. ముందు మానవుల వసతులకొఱకు భూమిని, యందలి సమస్తమును దేవుఁడు సృష్టించెను. ఆ పిదప ఆదమునకు సర్వసృష్టికంటె సుందరమైన రూప మొసంగి మట్టితో సృజించి ప్రాణముపోసెను. ఆదమునకు కావలసిన విద్యాజ్ఞానములు దేవుఁడొసంగెను. దేవదూతలను ఆతనిని దేవుఁడు పరీక్షింపఁగా ఆదము దేవదూతలకు మించిపోయెను. కావున భూలోకములో దేవుని ప్రతినిధి కాఁబోవు ఆదమునకు గౌరవార్థము దేవదూతలు సాష్టాంగపడవలెనని దేవుని సెలవయ్యెను. అపుడు దేవుని యాజ్ఞచొప్పున తమ విధేయత వెల్లడించుటకై దేవదూతలు ఆదమునకు సిజ్దా (సాష్టాంగ నమస్కారము) చేసిరి. జిన్నాతులకు చేరిన ఇబ్లీసు తన భక్తిప్రార్థనలవలన దేవదూతలలో చేరి యున్నతస్థానము పొందియుండెను. వాని పుట్టుక అగ్నితో నుండెను. దానిస్వభావమువలన వానికోపాగ్నిమండి గర్వమువహించి దేవుని యాజ్ఞను తిరస్కరించి నేను శ్రేష్ఠుఁడను. నేను అగ్నిలో పుట్టితిని. ఆదము మట్టితో సృజింపఁబడెను. మట్టికంటె అగ్ని శ్రేష్ఠము. కావున నేను శ్రేష్ఠుఁడను అని వాదించుచు ఆదమునకు సిజ్దా చేయలేదు. అపుడు స్వర్గములో గర్వించి దేవుని యాజ్ఞను తిరస్కరించువారుండుట తగదు. కావున నీకులభించి యున్న యున్నతస్థానమునుండి దిగి భూమిపైకి వెడలిపొమ్ము. నీవు అవమానమునకును, దేవుని కోపమునకు పాత్రుఁడవు. కావున పొమ్ము అని దేవుని సెలవయ్యెను. అపుడు ఇబ్లీసు (సైతాను) 'లోకమునశించితిరిగి మృతులు తీర్పుదినమునకుఁగాను గోరీలలోనుండి లేచు దినమువఱకు గడువిచ్చినన్నువదలిపెట్టుము.

ఆదమువలన నాకీదుర్గతి పట్టెను. నేను దుర్మార్గుఁడనైతిని. కావున నేనుకూడ మానవులను సన్మార్గమునుండి తప్పించి దుర్మార్గమునకుఁ దెచ్చెదను. దానికొఱకు నీవు నియమించిన సన్మార్గములో కూర్చుండి వారికి ఆటంకపఱచుచు దుర్మార్గమునకు వారిని మరల్చుచుందును. నాశక్తికొలఁది వారి చుట్టుపట్లనుండి వచ్చి వారిని పలువిధములుగ బొంకించి దుర్మార్గులుగఁ జేయుదును. అని శపథము చేసెను. 'సరే అటులే నీకు గడువు నియ్యఁబడినది. నీతోను, నిన్ను అనుసరించువారితోను నేను నరకము నింపివేసెదను' అని దేవుఁడు పలికెను. లోకసృష్టిలో దేవుని గుణము (సిఫాతు)లు వెల్లడి కావలెనన్న సన్మార్గులు, దుర్మార్గులుండవలసినదిగదా! అపుడు మంచి చెబ్బరులు తెలియనగును. లోకసృష్టికి పూర్వమే మానవలోకములో నిట్లు జరుగవలసియున్నది యని సర్వజ్ఞుఁడగు దేవునికిఁ దెలిసియే యున్నది.

19 వయా ఆద-ముస్-కున్-అన్త-వజౌ-జుకల్-జన్నత-ఫకులా-మిన్-హైసు-షితుమా-వలా-తఖ్-రబా-హాజి-హిష్ షజరత-ఫతకూనా-మినజ్-జాలిమీన్ 20. ఫ-వస్వస-లహుమ్-ముష్-షైతాను లి-యుబ్దియ-లహుమా-మా ఊరియ-అన్హుమా-మిన్-సౌ-ఆతి-హిమా-వఖాల-మా-నహాకుమా-రబ్బుకుమా-అన్-హాజి-హిష్-షజ-రతి-ఇల్లా-అన్-తకూనా-మలకైని-ఔ-తకూనా-మినల్-ఖాలిదీన్ 21. వఖాసమ-హుమా-ఇన్నీ-లకుమా-లమి-నన్-నాసిహీన్. 22. ఫదల్లా-హుమా-బిగురూ-రిన్-ఫలమ్మా-జా-ఖష్-షజ-రత-బదత్-లహుమా-సౌ-ఆతు-హుమా-వ-తఫిఖా-యఖ్-సిఫాని-అలైహిమా-మిన్-వరఖిల్-జన్నతి-వనాదా-హుమా-రబ్బు-హుమా-అలమ్ అన్-హాకుమా-అన్-తిల-కుమష్-షజరతి-వ-అఖుల్-లకుమా-ఇన్నష్-షైతాన-లకుమా-అదువ్వుమ్-ముబీన్. 23. ఖాలా-రబ్బనా-జలమ్నా-అన్-ఫుసనా-వఇల్-లమ్-తగ్ఫిర్-లనా-వతర్-హమ్నా-ల-నకూనన్న-మినల్-ఖాసిరీన్. 24. ఖాలహ్-బితూ-బఅ-జుకుమ్-లిబఅ-జిన్-అదువ్వున్ - వలకుమ్ ఫిల్-అర్జి-ముస్తఖర్రున్-వ-మతా-ఉన్-ఇలా-హీన్. 25. ఖాల-ఫీహా-తహ్-యౌన-వఫీహా-తమూతూన-వ-మిన్-హా-తుఖ్-రజూన్.

19. ఓ ఆదమా నీవును, నీభార్యయును స్వర్గములో వసించి అందు మీ కిచ్చటనుండి కోరుదురో యచ్చటినుండి తినుఁడు. మఱి యీవృక్షమును సమీపింపకుఁడు, మఱిమీరు పాపులగుదురు. 20. పిదప వారిద్దఱి చూపులనుండి

మఱుగా నుండిన వారిద్దఱి రహస్యమైన అంగములు వారికి బయలుపడఁజేయు టకై సైతాను వారిద్దఱిని మోసపుచ్చెను. మఱియు మీరు దేవదూతలుగాయి పోవుదురేమో లేక సదా స్వర్గములోనే వసింతురేమో అని మీ ప్రభువు ఈ వృక్షమునుండి మిమ్ములని షేధించెను అని సైతాను పలికెను. 21. మఱియు మీ మేలు కోరువాఁడను అని వారిద్దరియెదుట ప్రమాణముచేసెను. ఆపిదప వారిద్దఱిని మోసముతో మరలించుకొనెను. ఆపిదప వారిద్దఱు ఆవృక్షమును రుచిచూడఁగా వారిద్దఱి రహస్యమైన అంగములు వారికి స్పష్టపడెను. మఱివారు తమపై స్వర్గములోని యాకులనుంచుటకు మొదలిడిరి. మఱియు వారిప్రభువు వారినిపిలిచి ఏమి నేనుమీకు ఈవృక్షమును నిషేధించి యుండలేదా! మఱి సైతాను మీకు స్పష్టమైన విరోధియని మీతో చెప్పియుండలేదా! అనిపలికెను. 23. (అపుడు) వారిద్దఱును "ఓమా ప్రభువా! మేము మాయాత్మలపై నన్యాయము గావించుకొంటిమి. మఱినీవు మమ్ము క్షమింపనిచో మఱి నీవుమమ్ము కరుణింపనిచో మేము నష్టముపొందిన వారలమగుదుమని పలికిరి. 24. మీరుదిగిపొండు. మీరు ఒకరికొకరు శత్రువులగుదురు. మఱి మీకు భూమిపై నివాసమున్నది. మఱికొంతకాలము వఱకు లాభముపొందవలసి యున్నది. 25. మీరు అందేజీవింతురు. మఱి అందే మరణింతురు. మఱి అందునుండియే తీయఁబడుదురు అని దేవుఁడు పలికెను.

వ్యా॥ 19. ఇఁక ఈ వాక్యములలో ఆదమునకును, ఆతనిభార్యయగు హవ్వాకును లభించియున్న స్వర్గనివాసమునుండి తప్పించుటకై సైతానుపన్నినకుట్ర చెప్పఁబడుచున్నది. ఆదమునకు తోడుగనుండుటకు దేవుఁడు హవ్వాను ఆదమునుండియే సృష్టించి వారిద్దఱిని స్వర్గవనములలో నుండుటకు సెలవిచ్చెను. కాని యొక ప్రత్యేకమైన వృక్షఫలమును తినకూడదు. దానినితినినచో పాపములభించును అని దేవుఁడు సెలవిచ్చెను. 20. వారిద్దఱు సౌఖ్యముగ నుండుట సైతాను (ఇబ్లీసు)నకు పట్టలేదు. వారియందుఅసూయవహించి ఎట్లువారివలన తనకు దుర్గతిపట్టెనో యాపగ దీర్చుకొనవలెనని కుట్రలు సలుపుచుండెను. ఆదము హవ్వా స్వర్గములోనున్నపుడు వారిదేహములపై స్వర్గవస్త్రములుండెను. వారి రహస్యమైన అంగములు వారికిఁ దెలియకుండెను. అచ్చట వారికి మలమూత్ర విసర్జన మొదలగు తొందఱలు లేకుండెను. ఆవృక్షఫలము తినుటవలన స్వర్గవస్త్రము వదలిపోవును. అపుడు వారిద్దఱికి తెలియకుండిన మర్మాంగములు దెలియును. కావున సైతాను ఎటులైన ఆవృక్షఫలములు వారుతినునట్లు చేయవలెనని యత్నించుచుండెను. తుదకు వారినిట్లు మోసపుచ్చెను. మీరు యీవృక్షఫలము తింటిరేని మీరు దేవదూతలు అయిపోవుదురు. లేకమీకు సదా స్వర్గనివాసము లభించును. మీరుస్వర్గమునుండి బయటికిరారు అని దేవునిపేరుదీసికొని ప్రమాణము చేయుచు నేనుమీ మేలు కోరునట్టి స్నేహితుఁడను. కావున నామాటవినుఁడు అనిబొంకించివారుతనమాట

వినునట్లు వారినిజేసి వృక్షఫలము తినునట్లుచేసెను. వారిద్దఱు దేవదూతలు లేక సదా స్వర్గనివాసము లభించును. దేవుని పేరుతో ప్రమాణము చేయుచున్నాఁడు వీనిమాటనిజము అని తలఁచి దేవుఁడు నిషేధించిన దానినిమఱచిపోయి వృక్షఫలమును తినిరి. తినఁగానే స్వర్గవస్త్రములు వీడిపోయి వారి మర్మాంగములు కనఁబడసాగెను. వారిద్దఱు సిగ్గుపడి తమదేహములను దాఁచుటకై వానిపై స్వర్గములోని యాకులను పెట్టసాగిరి. అపుడు దేవుఁడు వారితోనిట్లు పలికెను. మీరీ వృక్షమునకుసమీపింపకుఁడు. అట్లుసమీపించి దానిఫలములుతినినచో మీరుపాపులగుదురు అనిమీమేలుకోఱకు దానిని నిషేధించి యుంటినిగదా! ఇబ్లీసు మీకుస్పష్టమైన విరోధి. వానిమాటలకు మోసపోకుఁడు అని మీతో పలికియుంటినిగదా! ఎందులకు మీరట్లుచేసితిరి. కావున మీరందఱు స్వర్గమునుండి భూమిలోనికి దిగిపొండు. అచ్చట మీకు నివాసముగలదు. అందు మీకు సంతానము పుట్టిగిట్టును. ప్రళయకాలము వచ్చినపుడు తీర్పునకుఁగాను మరలమీరుభూమినుండియే తీయఁబడుదురు అని దేవుని సెలవయ్యెను. ఆదము హవ్వా తాముకావించిన పొరపాటునకుసిగ్గుపడి తమపుట్టుకలోనున్నమట్టిస్వభావమునుబట్టి అణకువనువినయమును వహించి దేవునితో క్షమాపణ వేడిరి. దేవుఁడు వారి పొరపాటును క్షమించి కరుణించెను. ఇబ్లీసు వారిద్దఱి క్షమాపణను చూచి వీరు పొరపాటు చేసినను అందు స్థిరముగానుండక తిరిగి దేవునితో క్షమాపణకోరి దానివలన దేవునికి ప్రియులగుచున్నారు. నాకుట్ర వీరిపై సదా సాగదు అని తెలిసికొనెను. ఇప్పటికి కూడ సైతానువానిఅనుచరులును దేవుని భక్తులనుసన్మార్గమగు ఇస్లామ్ నుండి తప్పించుటకు కుట్రలుసలుపుదురు. యుద్ధములుకావింతురు. అందు స్థిరముగానున్న భక్తులకు దేవుని సైన్యమగు దూతలు (ఫరిష్తే) తోడుపడుదురు. కావునభక్తులు సైతానుట్రోవను పోక ఇస్లామ్ మార్గమందు స్థిరముగా నుండురుగాక!

26. యాబనీ-ఆదమ-ఖద్-అన్-జల్నా-అలైకుమ్-లిబాసన్-యువారీ-సౌ-ఆతికుమ్- వరీషన్-వలిబాసుత్-తఖ్వా-జాలిక-ఖైరున్-జాలిక-మిన్- ఆయాతిల్లాహి-ల-అల్ల-హుమ్-యజ్-జక్క-రూన్.

26. ఓ ఆదము సంతతి వారలార! మీరహస్యాంగములను కప్పుటకుఁగా అలంకారముగా నుండుటకుఁగాను మేముమీకొఱకు వస్త్రములు కల్పించితిమి. మఱి భక్తి వస్త్రము అన్నిటికంటె శ్రేష్ఠమైనది. వారు గమనించుటకుఁగాను ఇవి దేవుని సూచన లున్నవి.

వ్యా॥ 26. వస్త్రములకు కావలసిన ప్రత్తి మొదలగు వస్తువులను దేవుఁడు సృష్టించెను. వస్త్రములు చేయు పద్ధతి మానవులు గ్రహించునట్లు వారికి బుద్ధి నొసంగెను. వస్త్రములు కట్టి మానము కాపాడుకొనవలెను. వస్త్రముల

లో మేలి వస్త్రములు గలవు. వానిని ధరించుట వలన మానవులకు అలంకారము కూడ లభించుచున్నది. ఈవస్త్రములకంటె మానవులకు ముఖ్యముగ మేలైన వస్త్రము భక్తివస్త్రము. అనగా పాపకార్యములజోలికిపోక పుణ్యకార్యములు చేయుచు దేవునియందు భయభక్తులు గలిగి యుండవలెను. దేహమునకు కట్టిన వస్త్రములు ఎంత బాగున్నను భక్తివస్త్రమగు సుగుణములు లేనిచో అవిపనికిరావు కావున మానవులు ఆనాడు దేవుఁడొసంగిన వానిని గ్రహించి దేవునికి కృతజ్ఞులైరె యుండవలెను.

27. యాబనీ-ఆదమ-లాయఫ్-తినన్న కుముష్ షైతాను-కమా -అఖ్‌రజ-అబవైకుమ్-మినల్‌-జన్నతి-యన్ జిఉ అన్‌హుమా-లిబాస-హుమా-లి - యురియహుమా-సౌ-ఆతి హిమా-ఇన్న హూ-యరాకుమ్-హువ-వ-ఖబీలుహూ-మిన్ హైసు-లాతరౌ-నహుమ్-ఇన్నా-జ-అల్నష్ షయాతీన-ఔలియాఅ-లిల్లజీన - లాయుఅ-మినూన. 28 వఇజా-ఫఅలూ-ఫాహిషతన్-ఖాలూ-వజద్నా-అలైహి-ఆబాఅనా-వల్లాహు-అమరనా-బిహా-ఖుల్-ఇన్నల్లాహ - లాయామురు - బిల్-ఫహ్శాఇ-అత-ఖూలూన-అలల్లాహి-మా-లా-తఅ-లమూన్. 29. ఖుల్-అమర రబ్బీ-బిల్-ఖిస్తి-వఅఖీమూ-వుజూ-హకుమ్-ఇన్ద-కుల్లి-మస్-జిదిన్-వద్ - ఊహు-ముఖ్‌లి-సీన లహుద్ దీన-కమా-బదఅకుమ్-తఊదూన్. 30. ఫరీఖన్-హదా-వఫరీఖన్-హఖ్ఖ-అలైహిము జ్జలాలతు-ఇన్న-హుము త్తఖజుష్-షయాతీన-ఔలియాఅ-మిన్-దూ ల్లాహి-వ యహ్-సబూన-అన్న హుమ్-ముహ్‌తదూన్.

27. ఓ ఆదము సంతతివారలార! ఎట్లు సైతాను మీతల్లి దండ్రులను స్వర్గమునుండి దీసివారిద్దఱి రహస్య అంగములు వారికి కనబడునట్లు చేయుటకు వారి (స్వర్గ) వస్త్రములను దీసి వేయించెనో అట్లువాఁడు మిమ్ము దుర్మార్గములో పడవేయకుండుగాక. వాఁడును వాని జాతివారును మీరు వారిని చూడని చోటునుండిమిమ్ము చూచుదురు. మేము సైతానులను అవిశ్వాసులకు స్నేహితులుగఁ జేసితిమి. 28. మఱియు వారు ఏదైన దుష్టకార్యము చేయునపుడు మాతాత ముత్తాతలుఁ తండ్రులుఁ ఇటులే చేయుచు వచ్చుటను గాంచితిమి. మఱి దేవుఁడు కూడ ఇటులే మాకు ఆజ్ఞాపించినాఁడు అని పలుకుదురు. దేవుఁడు దుష్టకార్యములకుఁగాను ఆజ్ఞాపింపఁడు. ఏమి? మీకుఁదెలియని దానిని దేవునిపై మీరు పలుకుచున్నారా అని ఓ ప్రవక్తా! పలుకుము. 29. నా ప్రభువు న్యాయము

విధించి యున్నాఁడు. మఱియు ప్రతి నమాజు వేళకు ముఖములు చక్కఁగా నుంచవలెననియు అతనికి విధేయులై భయభక్తులతో అతనిని ప్రార్థింప వలెను అనియు సెలవిచ్చి యున్నాఁడు. మొట్టమొదట ఎట్లు దేవుఁడు మిమ్ము సృష్టించెనో అట్లుమరల మీరు వత్తురు. 30. దేవుఁడు కొందఱికి సన్మార్గము చూపెను. మఱికొందఱికి దుర్మార్గము విధింపఁబడెను, వీరు దేవుని వదలి సైతానులను స్నేహితులుగఁ జేసికొనిరి. మఱియు వారు తాము సన్మార్గమందున్నారని అనుకొనుచున్నారు.

వ్యా॥ 27. ఆదము సంతతి నరులగు మానవులకు పూర్వము వారి తల్లిదండ్రులగు ఆదము హవ్వాలలో సైతాను విరోధించి వారిద్దఱున్న స్వర్గమునుండి వారిని తొలఁగించుటకు వాఁడు పన్నిన కుట్రలు దెలుపుచు మానవులు అట్టి విరోధిని ననుసరింప కూడదు అని హెచ్చరింపఁ బడుచున్నది. సైతానులు తఱచుగ మానవుల కంటికి కానరారు. సైతానులు మానవులను చూచెదరు. కంటికి కానరాక మానవులపైఁబడు శత్రువునుండి చాల జాగ్రత్తగ నుండవలెను. అట్టి విరోధి విరోధము చాల హానికరము. అట్టివాని నెదుర్కొనుట చాల కష్టము. కావున మానవులు సర్వశక్తుఁడును అతిసూక్ష్ముఁడును సర్వమును చూచుచుతాను కానరానట్టి దేవునిశరణు చొచ్చవలెను. అవిశ్వాసులు సైతానులమాటవినీ వారినితమకు స్నేహితులుగఁ జేసికొన్నప్పుడు దేవుఁడుకూడవారియిష్టానుసారముగవారు పోవునట్లు వారిని వదలిపెట్టును. 28. పూర్వము అరబ్బులలో స్త్రీలు పురుషులు దిగంబరులై కాబా మసీదును ప్రదక్షిణించుచుండిరి. అది దుష్టకార్యమునుఅసహ్యమునుగదా. అయినవారు ఇట్లుమా పెద్దలగుతండ్రులుచేయుచు వచ్చినారు. దేవుఁడుకూడ ఇటులే ఆజ్ఞాపించియున్నాఁడు అని తెలివిలేని మాటలు పలుక సాగిరి. దానికి నిందు రద్దుచేయఁబడినది. దేవుఁడు ఎన్నటికిని మానవులు దుష్టకార్యములు చేయవలెను అని ఆజ్ఞాపింపఁడు అవిశ్వాసుల తాత ముత్తాతలు సైతాను మాటలు విని మోసపోయిన వారు. దేవుఁడు న్యాయమైన ధర్మమార్గము బోధించును. కాని అధర్మమును ఎన్నటికిని బోధింపఁడు. చూడుఁడు. ఆదముహవ్వా మీతల్లిదండ్రులు సైతాను మాటలకు మోసపోయి దిగంబరులై సిగ్గుతో ఆకులను కప్పుకొనసాగిరి. కావునదిగంబరులగుట సైతానుపని. వస్త్రములు కట్టి మానము దాఁచుట మీతల్లి దండ్రులగు ఆదముహవ్వా పని. కావున దిగంబరులై కాబా మసీదును ప్రదక్షిణించుట సరికాదు. 29. నమాజు చేయు వేళలలో ముఖములు చక్కఁగా కాబా మసీదు వైపునకు చేయువలెను. నమాజు మనఃపూర్వకముగ స్థిరబుద్ధిలోను భక్తితోను సలుపవలెను. ప్రార్థనలు సలుపునపుడు భయభక్తులతో సలుపవలెను. అందును ఏలాటి లోపముండరాదు. ప్రార్థన పద్ధతి హజ్రత్ పైగంబరువారు బోధించిన రీతిగానుండవలెను.

సన్మార్గమందు మానవులు స్థిరముగా నడువవలెను. ఎందుకన మానవులు ఎట్లు సజీవులుగా పుట్టిరో అటులే వారుచచ్చిన పిదప కర్మల తీర్పునకుc గానుతిరిగి సజీవులగుదురు. వారు దేవుని సన్నిధానమున నిలిచి కర్మలలెక్క నియ్యవలసి యున్నది. 30. మానవులు కొందఱు తమ బుద్ధిని ప్రయోగించి ధర్మమార్గ ములనుసరించి దేవుని ప్రీతికి పాత్రులైరి. మఱికొందఱు తమ బుద్ధిని చెఱచి స న్మార్గము అనుసరింపక దుష్టులగు సైతానులను తమ స్నేహితులుగc జేసికొని దుర్మార్గులై నరకమునకు పాలైరి. ఎట్లు విషము తెలిసి తిన్నను తెలియకతిన్న ను దాని వలన తినువాcడు చచ్చునో అటులే అవిశ్వాసము వహించిన వారు నరకములో పడి బాధలకు పాలగుదురు. అవిశ్వాసులు తాము పోవు మార్గము సన్మార్గమని తలcచుదురు. దుష్టులు తాముచేయు దుష్టకార్యములు వారికి మంచి విగా తోcచునుగదా! అట్టి తలంపుల వలన దుర్మార్గము సన్మార్గము కానేరదు.

31. యాబనీ-ఆదమ-ఖుజూ-జీనతకుమ్-ఇన్దకుల్లి-మస్-జిదిన్-వకులూ-వష్రబూ-వలా-తుస్‌రిఫూ-ఇన్నహూ-లా-యు-హిబ్బుల్-ముస్-రిఫీన్.

31. ఓఆదముబిడ్డలార! మీరు ప్రతి నమాజువేళలో మీవస్త్రములను అలంకారమును ధరింపుcడు. మఱియు తినుcడు. త్రాగుcడు. మఱి మితిమీఱ కుcడు. మితిమీఱువారిని దేవుcడు ప్రేమింపcడు.

వ్యా॥ 31. కాబా మసీదును ప్రదక్షిణించునపుడు వస్త్రములు ధరింప వలెను. వానివలన మానవులకు అలంకారము గలుగును. అటులే ప్రతి నమాజు చేయునపుడుకూడ వస్త్రములు ధరించి ప్రార్థన చేయవలెను. ఇస్లామ్‌నకు పూర్వము కొందఱు దిగంబరులై కాబామసీదును ప్రదక్షిణించుటభక్తికార్య మని తలcచుచు అట్లు చేయుచుండిరి. అట్లు చేయcగూడదు. వస్త్రములు ధరింప వలెనని దేవుని సెలవయ్యెను. కొందఱు కాబాయాత్ర (హజ్)లో కొంతఅన్న ము తినుచు, నెయ్యి తినక వదలిపెట్టుచుండిరి. కొందఱు మేcకపాలు, దాని మాంసము మానుకొనుచుండిరి. ఇవి అన్నియు భక్తికి చేరిన పనులుగావు. దేవుc డొసంగిన ఆహారములను మితముగ తినవచ్చును. త్రాగవచ్చును. అందు ఏలాంటి కొఱత చేయరాదు. కాని దేవుcడు నియమించిన నియమములు మీఱి పోcగూడదు. అజీర్ణమగునట్లు తినుట అధర్మములైన మద్యపానములు సేవిం చుట ఆcకలిలేనపుడు కావలెనని తిని ఆరోగ్యము చెఱచుకొనుట, వృథాఖర్చు చేయుట మొదలైన పనులు చేయరాదు. మితిమీఱిపోవువారిని దేవుcడు ప్రే మింపcడు. కావున భక్తులు (ముసల్మానులు) తమ ప్రతి కార్యములోను మితము గా ఖర్చుచేసి దేవుని ప్రియమునకు పాత్రులు అగుదురుగాక!

32. ఖుల్-మన్-హర్రమ-జీన-తల్లా-హిల్లతీ-అఖ్‌రజలి-ఇబాదిహీ-వత్-

తయ్యి-బాతి-మినర్-రిజ్ఖి-ఖుల్-హియ-లిల్లజీన-ఆమనూ-ఫిల్-హయా-తిద్-దున్యా-ఖాలి-సతన్-యౌమల్-ఖియామతి-కజాలిక-నుఫస్సి-లుల్-ఆయాతి-లి-ఖౌమిన్-యఅలమూన్. 33. ఖుల్-ఇన్నమా-హర్రమ-రబ్బియల్-ఫవా-హిష-మా-జహర-మిన్హా-వ మా-బతన-వల్-ఇస్మ-వల్-బగ్య-బిగైరిల్-హఖ్ఖి-వ-అన్-తుష్-రికూ-బిల్లాహి-మాలమ్-యునజ్-జిల్-బిహీ-సుల్-తానన్-వఅన్-తఖూలూ-అలల్లాహి-మాలా-తఅ-లమూన్.

32. దేవుఁడు తన సేవకులకొఱకు తాను పుట్టించిన అలంకారమును, మంచి యాహారవస్తువులను ఎవఁడు నిషేధించెను అని ఓ ప్రవక్తా! పలుకుము. ఈమంచి పదార్థములు ఇహలోకజీవనమునందు విశ్వాసులకు నున్నవి. ఇవి తీర్పుదినమునందు విశ్వాసులకు మాత్రమే గలవు అని ఓ ప్రవక్తా! పలుకుము. ఇట్లు తెలిసికొనువారికిఁగాను సూచనలు వివరించి తెలుపుచున్నారము. 33. నా ప్రభువు బహిరంగములైనవియును, రహస్యములైనవియునగు అసహ్యకార్యములను, పాపములను, అన్యాయముగ అక్రమము చేయుటను, దేవుఁడు పంపిన సన్నదు (ప్రమాణము) లేనిది దేవునికి సాటికల్పించుటను మీకు తెలియని విషయములను దేవునిపై కల్పించుటను నిషేధించెను అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 32. కొందఱుతమ యిష్టానుసారముగా తినునట్టియు త్రాగునట్టియు ధరించునట్టియు వస్తువులను నిషేధించుకొని యుండిరి. దానికి నిందు రద్దుగలదు. దేవుఁడు మానవుల కొఱకు అలంకారముగా నుండునట్లు వస్త్రములను సృష్టించెను. వస్త్రములు ధరింపక వైరాగ్యము పూనుట సరికాదు. అటులే మంచి పదార్థములు మానవుల కొఱకు దేవుఁడు సృష్టించెను. భక్తులు వానినను భవించి దేవునికి కృతజ్ఞులరై యుండవలెను. కావున ఇహలోకములో వస్తువులన్నియు విశ్వాసులకే యున్నవి. అయినను అందు అవిశ్వాసులు కూడ భాగస్థులుగ నున్నారు. వారు ఇహలోక సౌఖ్యములుఅనుభవించుచున్నారు. కొన్ని సమయములలో భక్తుల విశ్వాసము మందగిల్లినపుడు అవిశ్వాసులకు వారికృషివలన వారికి విశ్వాసులకంటె ఎక్కువ ఇహలోక సౌఖ్యములు లభించుచున్నవి. అందు విశ్వాసులకు మందలింపును హెచ్చరికయు గలదు. అవిశ్వాసుల కర్మల ఫలితము ఇహామునందే లభించినట్లగును. కాని పరలోకమునందు (తీర్పు దినమునందు) అవిశ్వాసులకు స్వర్గ సౌఖ్యములు లభింపవు. ఆసౌఖ్యములు విశ్వాసుకు మాత్రమే లభించును. 33. ఈవాక్యములో, దేవుఁడు నిషేధించినవి తెలుపఁబడి

నవి. అసహ్యములలో అన్ని విధములైన సిగ్గులేని పనులు చేరుచున్నవి. అవి మ ఱుఁగుగాఁగాని వెల్లడిగాఁగానిచేయరాదు. తమయాత్మలకు శిక్షకలుగఁ జేయునట్టి పాపములు చేయరాదు. ఇతరులపై అక్రమముగా అన్యాయము చేయరాదు. ఏలాటి శాస్త్రీయ ప్రమాణము లేనట్టి విగ్రహారాధన చేయరాదు. దేవునికి సాటి కల్పింపరాదు. దేవుఁడు విధింపని యాచారములను దేవుఁడు విధించినాఁడు అని అబద్ధములు కల్పింపరాదు.

34. వలికుల్లి-ఉమ్మతిన్-అజలున్-ఫఇజా-జాఅ-అజలుహుమ్-లా-యస్తా-ఖిరూన-సాఅతన్-వలా-యస్తఖ్-దిమూన్.

34. మఱియు ప్రతి సంఘము (జాతి) వారికి ఒకకాలము నియమింపఁబడియున్నది. కావున వారి కాలము వచ్చినపుడు ఒక గడియ వెనుకగాని ముందుగాని వారు కానేరరు.

వ్యా॥ 34. ప్రతి జాతివారికిని ఒక కాలము నియమింపఁబడి యున్నది. అంతవఱకు వారి లోకములో నుండవలసి యున్నది. పాపములు చేయువారును దేవునిపైన సత్యములు కల్పించువారు నుదేవునినుండి తమకు శిక్ష లభించ లేదే అని మోసపోకూడదు. శిక్షవచ్చి వినాశకాలము వచ్చినపుడు ఒక్క నిమిషమైనను వెనుకముందు కానేరదు.

35. యాబనీ-ఆదమ-ఇమ్మా-యాతి-యన్నకుమ్-రుసులుమ్-మిన్‌కుమ్ యఖుస్సూన-అలైకుమ్-ఆయాతీ-ఫమనిత్-తఖా-వఅస్-లహ-ఫలా-ఖౌఫున్-అలైహిమ్-వలాహుమ్-యహ్-జనూన్. 36. వల్లజీన-కజ్-జబూ-బిఆయాతినా-వస్తక్-బరూ-అన్‌హా-ఉలాఇక-అస్-హాబున్-నారి-హుమ్-ఫీహా-ఖాలిదూన్.

35. ఓ ఆదము సంతతి వారలార! మీనుండియే మీయొద్దకు ప్రవక్తలు వచ్చి నా సూచనలను మీకుఁ దెలిపినపుడు ఎవరు భయభక్తులు వహించి సత్కార్యములు చేయుదురో వారికి భయముగాని దుఃఖముగాని యుండనేరదు. 36. మఱెవరు మా సూచనలను తిరస్కరించి వాని గూర్చి గర్వము వహింతురో వారు నరక నివాసులగుదురు. అందు సదా యుందురు.

వ్యా॥ 35. మానవులందఱికి నిందు హెచ్చరిక గలదు. తల్లి దండ్రులగు ఆదము హవ్వావారు పూర్వముండిన నివాసమగు స్వర్గము మరల లభింప వలెనన్న దేవుఁడు పంపు పవిత్రులను విశ్వసించి దేవుని సూచనలను ధర్మములను నమ్మి భయభక్తులువహించి పాపములువదలి సత్కార్యములుచేయవలెను. భయముగాని దుఃఖముగాని లేనట్టి స్వర్గనివాసములభించును. అట్లుగాక ప్రవక్తలను తిరస్కరించి దేవునిసూచనలు నిజముగావు అనిపలికి వానివిషయము గర్వము

వహించి వాని ననుసరింపక దుర్మార్గులైనచో నరకబాధలకు పాలై అందు సదా వసింతురు. కావున మానవులు తమ వినాశకాలము రాకముందే హెచ్చరికపడి భక్తి మార్గమునందు స్థిరముగా నడువవలెను.

37. ఫమన్-అజ్‌లము-మిమ్మనిఫ్-తరా-అలల్లాహి-కజిబన్-ఔ-కజ్జబ-బి ఆయాతిహీ-ఉలాఇక-యనాలు-హుమ్-నసీబుహుమ్-మినల్-కితాబి-హత్తా ఇజా జాఅత్-హుమ్-రుసులునా-యత-వఫ్-ఫౌనహుమ్-ఖాలూ-ఐన-మాకున్తుమ్-తద్ఊన-మిన్-దూనిల్లాహి-ఖాలూ-జల్లూ-అన్నా-వ-షహిదూ-అలా-అన్ఫుసి-హిమ్-అన్నహుమ్-కానూ కాఫిరీన్.

37. మరల దేవునిపైనసత్యములు కల్పించిన వానికంటెను లేక దేవుని సూచనలను తిరస్కరించిన వానికంటెను ఎక్కడు దుర్మార్గుడెవడున్నాడు. ఇట్టి వారికి అదృష్ట వ్రాతలో నున్నట్టి భాగము వారికి లభించును. తుదకు మాదూతలు వారిప్రాణము తీయుటకు వారియొద్దకు వచ్చునపుడు దేవుని వదలి మీరు ఎవరిని ప్రార్థించు చుంటిరో వారెక్కడ అని పలుకుదురు. వారు మమ్ము వదలిపోయిరి. మఱివారు తాము అవిశ్వాసులరుగ నుండిరి యని తామే యొప్పుకొనుదురు.

వ్యా॥ 37. దేవునియొక్క నిజమైన ప్రవక్తలను విశ్వసింపవలెను. దేవుని ప్రవక్తకానివాడు నేను దేవుని ప్రవక్తను అని పలికినచో వాడు దేవునిపైన సత్యము కల్పించిన వాడగును. వానికి మించిన దుర్మార్గుడెవడును లేడు. అటులే దేవుడు సెలవియ్యని ధర్మములను దేవుడు విధించినాడు అనికల్పించుటకూడ దుర్మార్గము. దేవుని సూచనలను వాక్యములను తిరస్కరించుట కూడ చాల దుర్మార్గము. ఇట్టి దుర్మార్గులకు ఇహలోకములో నెంత గతి పట్టవలెనని వారి వ్రాతలో నున్నదో అంత తప్పక వారికి లభించును. అందు వారి యాహార ము దుఃఖములు వచ్చుట్లు అవమానము చేయను. తుదకు వారి కాలము తీరి దేవ దూతలు వచ్చి ప్రాణము తీయునపుడు ఏమయ్యా మీరు దేవునికిసాటికల్పించుచున్న మీ దేవతలు ఎక్కడ. మీరు దేవుని ప్రార్థన వదలి యితరులను ప్రార్థించు చుంటిరే వారెక్కడ ఇపుడు మిమ్ము రక్షింపకుండ ఎక్కడికిపాఱిపోయినారు అని మందలింతురు. అపుడు అవిశ్వాసులు ఏమిచేయుదుము. వారుమమ్ము విడి ఎక్కడికి పాఱిపోయినారో మాకు తెలియదు అని పలుకుచు పూజకు అర్హులు కాని వారిని మేము పూజించితిమి. భక్తి హీనులనుప్రార్థించితిమి. ఇపుడు వారు మాకు తోడుపడజాలరు. మేము అవిశ్వాసులము అని వారు ఒప్పుకొనుదురు. అపుడు సిగ్గుపడి యొప్పుకొనుట వలన వారికి లాభము లేదు. అపుడు

వారికి రాఁబోవు వాక్యములో నున్న యాజ్ఞ కలుగును.

38. ఖాలద్-ఖులూ-ఫీఉమ-మిన్-ఖద్ ఖలత్-మిన్-ఖబ్లి-కుమ్-మినల్-జి న్ని-వల్-ఇన్ సి-ఫిన్-నారి-కుల్లమా-దఖలత్-ఉమ్మతున్-లఅ-నత్-ఉఖ్ తహా-హ త్తా-ఇజద్-దారకూ-ఫీహా-జమీ-అన్-ఖాలత్-ఉఖ్రా హుమ్-లి-ఊలాహుమ్-ర బ్బనా-హాఉలాఇ-అజల్లూనా-ఫ-ఆతిహిమ్-అజా-బన్-జి అ-ఫమ్-మినన్-నారి-ఖా ల-లికుల్లిన్-జి అఫున్-వలాకిల్-లాతఅ-లమూన్. 39. వ-ఖాలత్-ఊలా-హు మ్-లిఉఖ్ రా-హుమ్-ఫమా-కాన-లకుమ్-అలైనా-మిన్-ఫజ్ లిన్-ఫజూ-ఖుల్-అ జాబ-బిమా-కున్తుమ్-తక్-సిబూన్.

38. మీకు పూర్వము గడచిన జిన్నాతుల యొక్కయు మానవుల యొక్కయు జాతులతోపాటు మీరును నరకాగ్నిలో ప్రవేశింపుఁడు అని దేవుడు సెలవిచ్చును. ఒక జాతి అందు ప్రవేశింపునపుడెల్ల అది తనవంటి యితర జాతిని శపించును. తుదకు అందఱును అందు పడిపోయినపుడు వెనుక వచ్చిన వారు తమకు పూర్వము వచ్చినవారిని గూర్చి ఓమా ప్రభువా! వీరేను మమ్ము సన్మార్గమునుండి తప్పించిన వారు. కావున వీరికి రెండింతలుగ అగ్నిబాధ నొసంగుము అని పలుకుదురు. అందఱకును రెండింతలు (బాధ) గలదు. కాని మీ కది తెలియదు అని దేవుఁడు పలుకును. 39. మఱియు పూర్వికులు తమకు వెనుకవచ్చిన వారితో మీకు మాపైనెట్టి ఘనతలేదు. కావున మీరిపుడు మీరుచేయుచున్న కర్మలకుఁగాను నరకబాధరుచి చూడుఁడు అని పలుకుదురు.

వ్యా॥ 38. అవిశ్వాసులకు నరకములో తమవంటి యవిశ్వాసులైనట్టి జిన్నాతులతోను మనుష్యులతోను ప్రవేశింపవలసినది యని దేవుని యాజ్ఞయగును. అవిశ్వాసులు ఒకొరొకొకరు తోడు పడఁజాలరు. కాని ఒకొరినొకరు శపించుకొందురు. అందఱును నరకములో చేరినపుడు దుష్ట నాయకుల విషయము వారి యనుచరులు వీరి వలన మేము చెడిపోయితిమి. సన్మార్గమువదలి దుర్మార్గము స్వీకరించితిమి. కావున వీరికి రెండింతలు నరకాగ్నిబాధ లభింపవలెను. ఒకటి దారి తప్పినందులకును రెండవది ఇతరులను దారితప్పించి నందులకునుమీరఁదటికిని రెండింతలు బాధలభించును. మీరుమీ పూర్వికులకు లభించిన శిక్షలువిని బుద్ధి తెచ్చుకొనక దుర్మార్గము స్వీకరించితిరి. కావున మీరును అట్టి బాధలకు అర్హులు. అపుడు పూర్వికులు తమ వెనుకవచ్చిన వారితో అయ్యో! మాకు రెండింతలు బాధ కలుగవలెనని కోరినందులకు మీ కేమి? మేలు లభించినది. మీబాధ తగ్గెనా. లేదుకదా. మీరు చేసిన కర్మల ఫలితము మీరు అనుభవింపుఁడు అని పలుకుదురు.

40. ఇన్నల్లజీన-కజ్-జబూ బి-ఆయాతినా-వస్తక్- బరూఅన్‌హా-లా-తు ఫత్తహు-లహుమ్-అబ్వా-బుస్-సమాఇ-వలా-యద్-ఖులూనల్-జన్నత హత్తా-యలిజల్-జమలు-ఫీ-సమ్మిల్-ఖియాతి-వ-కజాలిక-నజ్-జిల్-ముజ్రిమీన్. 41. లహుమ్-మిన్-జహన్నమ-మిహాదున్-వమిన్-ఫౌఖి-హిమ్-గవాషిన్-వ-కజా - లిక నజ్-జిజ్-జాలి-మీన్.

40. మాసూచనలను తిరస్కరించి వాని విషయము అహంకారము పూనిన వారి కొఱకు ఆకాశముయొక్క ద్వారములు తెఱవఁబడవు. ఒంటె సూది బెజ్జమునుండి దూరిపోవునంత వఱకు వారు స్వర్గములో ప్రవేశింపఁజాలరు. మఱియు నిటులే మేము పాపులకు ఫలిత మొసంగుచున్నాము. 41. వారి కొఱకు నరకముయొక్క పఱుపును వారికిపైన దాని దుప్పటులు నున్నవి. మఱియు నిటులే మేము దుర్మార్గులకు ఫలిత మొసంగుచున్నాము.

వ్యా॥ 40. ఇందు అవిశ్వాసులకు లభించు ఫలితము చెప్పఁబడినది. వారి కొఱకు ఆకాశముయొక్క ద్వారములు తెఱవఁబడవు. అనఁగా అవిశ్వాసులు తమ జీవితకాలములో చేసిన కర్మలు ఆకాశముపైకి నెక్కవు. అవి యంగీకరింపఁబడవు. మఱియు వారు చచ్చిన పిదప వారి యాత్మలు ఆకాశమునకు పోఁజాలవు. అవి సిజ్జీను అను స్థానమునకుఁ బోవును. విశ్వాసులకర్మలు, ఆకాశముపై నెక్కి అంగీకరింపఁబడును. వారు చచ్చిన పిదప వారి యాత్మలు ఏడు ఆకాశములపైకిఁ బోయి ఇల్లీయ్యీను, అను ఉన్నతస్థానమునకు చేరును. పలువిధములుగ అవిశ్వాసులకు అగౌరవమును బాధలును గలుగును. విశ్వాసులకు గౌరవమును, స్వర్గసౌఖ్యములునులభించును. అవిశ్వాసులు సదా నరకములో నుందురు. వారికి నరకమునుండి మోక్షముగలిగి వారు స్వర్గములో ప్రవేశించుట అసంభవము. ఎట్లు ఒక సూది చిన్నబెజ్జమునుండి ఒక పెద్ద యొంటె దూరిపోవుట అసాధ్యమో అటులే అవిశ్వాసులు స్వర్గములో ప్రవేశించుట అసాధ్యము. 41. అవిశ్వాసులకు నరకములో అగ్ని పఱుపులు అగ్ని దుప్పట్లుండును. అనఁగా వారికి నరకాగ్ని చుట్టుకొనియుండు ఏ ప్రక్కకుఁ దిరిఁగినను వారికి సౌఖ్యముండక అగ్నిబాధయే గలుగుచుండును. దుర్మార్గులకు ఇది సరియైన శిక్ష. కావున మానవులు నరకమునుండి తప్పించుకొను దోవ ఇహమునందే చూచుకొనవలెను. అది దేవుని విశ్వసించి సత్కార్యములుచేయుటయే.

42. వల్లజీన-ఆమనూ-వ-అమిలుస్-సాలిహాతి-లా నుకల్లిఫు - నఫ్సన్ - ఇల్లా-వుస్-అహా-ఉలాఇక-అస్-హాబుల్-జన్నతి-హుమ్-ఫీహా-ఖాలిదూన్. 43.

వ-నజఅ్-నా-మాఫీ-సుదూరి-హిమ్-మిన్-గిల్లిన్ తజ్రీ-మిన్-తహ్తి-హిముల్-అన్హారు-వ-ఖాలుల్-హమ్దు లిల్లా-హిల్లజీ-హదానా-లిహాజా-వ-మా- కున్నా-లినహ్-తదీ-లౌలా-అన్-హదా-నల్లాహు-లఖద్-జాఅత్-రుసులు-రబ్బినా-బిల్హఖ్ఖి-వనూదూ-అన్తిల్-కుముల్-జన్నతు-ఊరిస్-తుమూహా-బిమా-కున్తుమ్-తఅ్-మలూన్.

42. మఱియు విశ్వసించి సత్కార్యములుచేసినవారు స్వర్గనివాసులు, వారందు సదా యుందురు. మేము ఎవ్వనిపైనను వాని శక్తికి మించిన భారము వేయము. 43. మఱియు వారి హృదయములలోనున్న కపటమును దీసి వేయుదుము. వారి (నివాసముల) క్రిందుగ కాలువలుప్రవహించును. మఱియుమమ్ము ఇచ్చటికిఁదెచ్చినట్టి దేవునికికృతజ్ఞతస్తోత్రములున్నవి. దేవుఁడుమాకు మార్గము చూపియుండనిచో మేము సన్మార్గముపొందియుండము. మా ప్రభువుప్రవక్తలు దెచ్చియుండిన విషయము సత్యమైనది అని విశ్వాసులుపలుకుదురు. మఱియు నిది స్వర్గమున్నది. మీరు చేయుచున్న కర్మలకుఁగాను మీరు దీనికి వారసులైతిరి అని వారితో చెప్పఁబడును.

వ్యా॥ 42. విశ్వాసులకు లభించు ఫలితముచెప్పఁబడుచున్నది. విశ్వసించి సత్కార్యములు చేసినవారికి స్వర్గము లభించును. విశ్వసించి సత్కార్యములు చేయుట మానవుని శక్తికి మించినదికాదు. దేవుఁడు మానవుల శక్తికొలఁది ధర్మములు విధించుచున్నాఁడు. కావున స్వర్గమునకుఁగాను విశ్వసించి సత్కార్యములు చేయుట శక్తికి మించినదికాదు. కావున అందఱును పాటుపడుదురుఁగాక! 43. స్వర్గనివాసులలో పరస్పరము కపటము అసూయలుండవు. ఒకరినొకరుచూచి సంతసింతురు. లేక ఇహలోకమందు విశ్వాసులకు ఏదైన విషయమందు పరస్పరము కపటమును ద్వేషమునున్నచో వారు స్వర్గములో ప్రవేశింపక ముందె అవి దేవుని దయవలన దూరమై వారి హృదయములు నిష్కపటములుగా నుండును. వారందఱు పరస్పరము సంతోషముతో నుందురు. స్వర్గనివాసులు తమకు లభించిన ఫలితమునకుఁగాను దేవునిని స్తుతించి ఆతనికి కృతజ్ఞత సలుపుదురు. దేవుఁడు ప్రవక్తల నంపి వారి మూలమున సత్యమైన మార్గము చూపించినందున మేముప్రవక్తలనునమ్మి వారి బోధనలను అనుసరించినందున దేవుని యనుగ్రహమువలన మాకు స్వర్గములభించెను అని దేవునిని స్తుతింతురు. అప్పుడు దేవుని దూత ఓ విశ్వాసులార, స్వర్గనివాసులార! మొట్టమొదట మీతండ్రి ఆదమున్న స్వర్గమునకు మీ సత్కార్యములవలన మీరు దానికి వారసులైతిరి. ఇఁక మీరిచ్చటనే సదా యుందురు అని పలుకును.

44. వనాదా-అస్-హాబుల్-జన్నతి-అస్-హాబన్నారి-అన్-ఖద్-వజద్నా మా-వఅ-దనా-రబ్బునా-హాఖ్-ఖన్-ఫహాల్-వజత్తుమ్-మా-వఅద - రబ్బుకుమ్ - హాఖ్-ఖన్-ఖాలూ-నఅమ్-ఫ-అజ్-జన-ముఅజ్-జినుమ్-బైనహుమ్-అల్-లఅనతుల్లాహి-అలజ్-జాలిమీన్. 45. అల్లజీన-యసుద్దూన-అన్-సబీ-లిల్లాహి- వ-యబ్-గూనహా-ఇవజన్-వహుమ్-బిల్-ఆఖిరతి-కాఫిరూన్. 46 వ-బైనహుమా హిజా-బున్-వఅలల్-అఅ-రాఫి-రిజాలున్-యఅ-రిఫూన-కుల్లమ్ - బి - సీమా-హుమ్-వ-నాదౌ-అస్-హాబల్-జన్నతి-అన్-సలాము న్-అలైకుమ్-లమ్- యద్-ఖులూహా-వహుమ్-యత్-మఊన్. 47.వ-ఇజా-సురిఫత్-అబ్-సారుహుమ్-తిల్ ఖాఅ-అస్-హాబిన్-నారి-ఖాలూ-రబ్బనా-లా-తజ్-అల్నా-మఅల్ - ఖామిజ్ - జాలిమీన్.

44. స్వర్గనివాసులు, నరకనివాసులను పిలిచి మాప్రభువు మాతో చేసిన వాగ్దానము సత్యముగాఁ గంటిమి. కావున మీతో మీప్రభువుచేసిన వాగ్దానము మీరుకూడ సత్యముగా పొందితిరా అని పలుకఁగా వారు అవును పొందితిమి అని పలుకుదురు. 45. ఆ పిదప, దేవునిమార్గమునుండి ప్రజలను ఆటంకపఱచుచు అందు వంకఱను కోరుచు పరలోకమును తిరస్కరించుచుండినట్టివారికి దేవుని శాపమున్నది అని వారి మధ్య నొక పలుకు వాఁడు పలుకును. 46. స్వర్గనరకముల మధ్య నొకగోడ యుండును. 'ఆరాఫ్' పైన మనుష్యులుండుదురు. వారు ప్రతి యొక్కరికిని వారి గుర్తులనుబట్టి తెలిసికొందురు. మఱియు వారు స్వర్గనివాసులతో మీకు సలామ్ అని పలుకుదురు. వారు ఇంకను స్వర్గములో ప్రవేశింపలేదు, అయిన వారు ప్రవేశింతురని యాశగలిగియున్నారు. మఱియు వారి కన్నులు నరకనివాసులవైపు తిరుగునపుడు ఓ మాప్రభువా! మమ్మపాపులతోఁబాటు చేర్పకుము అని పలుకుదురు.

వ్యా॥ 44. విశ్వాసులు స్వర్గములోను అవిశ్వాసులు నరకములోనుచేరిన పిదప వారి మధ్య సంభాషణలు జరుగును. దేవుఁడు తనప్రవక్తల మూలమున, విశ్వసించి సత్కార్యములు చేసినవారికి స్వర్గమున్నది అని వాగ్దానము చేసెను. అది సత్యమైనది. మేము స్వర్గములో ప్రవేశించినాము. విశ్వసింపక తిరస్కరించినవారికి నరక మున్నది అని దేవుఁడు పలికినమాట నిజమని మీరుగాంచితిరా అని స్వర్గనివాసులైన విశ్వాసులు, నరకనివాసులైన అవిశ్వాసులతో నడుగుదురు. అపుడు నరకనివాసులు, దేవుని వాగ్దానము సత్యమాయెను. మఱియు

మేము నరకము అనుభవించుచున్నారము అని పలుకుదురు. అపుడు దేవుని తర ఫున ఒక దూత దేవునిమార్గము తాము అనుసరింపక దానినుండి ప్రజలను ఆటంకపఱచుచు వంకరమార్గమును కోరుచు పరలోకమును తిరస్కరించినట్టి పాపులకు దేవుని గొప్పశాపముగలదు అని పలుకును. 46. నరకమునకునుస్వర్గ మునకును మధ్య అడ్డుగా నొక గోడయుండును. ఆగోడపైనుండు స్థానమును ఆరాఫ్ అనుదురు. కర్మల తీర్పులో ఎవరి పుణ్యముల తూకము బరువైనదో వారు స్వర్గములోను ఎవరి పుణ్యముల బరువు తగ్గి పాపములబరువు ఎక్కువ నాయెనోవారు నరకములో ప్రవేశింతురు. ఎవరిపాపమును పుణ్యములును సరి సమానములుగానుండునో వారు స్వర్గములో ప్రవేశింపక ఆరాఫు అను స్థానము లో నిలిచియుందురు. వారు స్వర్గములో ప్రవేశింపఁగలరని వారికి ఆశయము గలదు. వారు తుదకు స్వర్గములో ప్రవేశింతురు. ఆరాఫునుండి వారు స్వర్గనివా సులను వారి కాంతుల గుర్తులను చూచి నరకనివాసులను వారి నల్లని ముఖము లను చూచి తెలిసికొందురు. ఆరాఫునందుండువారు స్వర్గనివాసులను అభినందిం చుచు వారికి సలామ్ చేయుదురు. 47. వారి కన్నులు నరకనివాసులపై పడఁ గానే నరకము నందలి బాధలను చూచి భయపడి ఓ దేవా! మమ్మపాపులతో బాటు చేర్పకుము అని వేడుకొనుదురు.

48. వనాదా-అస్-హాబుల్-అఅ-రాఫి-రిజాలన్-యఅ - రిఫూనహుమ్-బి-సీమా-హుమ్-ఖాలూ మా-అగ్నా-అన్కుమ్-జమ్-ఉకుమ్ వ-మా కున్తుమ్-తస్ తక్-బిరూన్. 29. అ-హా ఉలా-ఇల్లజీన-అఖ్-సమ్తుమ్-లా-యనాలు-హుముల్లా హు-బి-రహ్మతిన్-ఉద్-ఖులుల్-జన్నత-లాఖౌ-ఫున్-అలైకుమ్-వలా-అన్తుమ్-తహ్జనూన్.

48. మఱియు ఆరాఫులోనుండువారు, తమకు గుర్తులవలన దెలిసిన నరకనివాసులను పిలిచి ఓయీ! మీకు మీసమూహములును మీరు వహించి యున్న గర్వమును పనికిరాలేదే! 49. ఎవ్వరి విషయము మీరు, దేవుని దయ గలుగదు అని ప్రమాణములుచేసి మీరు చెప్పితిరో వారు వీరేనా అని పలు కుదురు. దేవుఁడు మీరు స్వర్గములో ప్రవేశింపుఁడు మీకు భయముగాని దుఃఖ ఖముగాని యుండదు అని ఆరాఫులోనుండువారికి సెలవిచ్చును.

వ్యా॥ 48, 49. నరకములో పడియుండు పెద్ద పెద్ద కాఫిర్లను చూచి, వారి నల్లముఖములవలనను, పూర్వము ఇహలోకములో చూచియున్న గుర్తు లనుబట్టి వారిని గుర్తించి ఆరాఫులోని ప్రజలు వారితో నిట్లు మందలించుచు పలుకుదురు. ఓయీ నరకనివాసులారా! మీరు మీయధిక సంఖ్యను సంపదలను

చూచి గర్వముతో డంబాలు కొట్టుకొనుచు విశ్వసింపక తిరస్కరించుచుంటిరి గదా. ఇపుడు నరకమునుండి తప్పించుటకు అవి పనికి వచ్చినవా! మీ సమూహములును గర్వమును ఎక్కడపోయినది అని పలుకుచు స్వర్గములోనున్న బీద ముసల్మానులను (విశ్వాసులను) వారికి చూపి వీరి విషయము మీరు వీరికి దేవుని దయ గలుగదు. వీరు బీదలు బలహీనులు అని ప్రమాణములు చేయుచు పలుకుచుంటిరిగదా! చూడుఁడు. వారికి దేవుని దయగలిగివారు స్వర్గములో ప్రవేశించునట్లు వారికి దేవుని సెలవయ్యెను. మఱి మీరు నరకములోపడి కష్టపడుచున్నారు గదా! అని పలుకుదురు. ఆపిదప దేవుఁడు ఆరాఫులో నిలిచియున్నవారు స్వర్గములో ప్రవేశింపవలెను అని సెలవిచ్చెను. అపుడు వారు స్వర్గములో ప్రవేశింతురు.

50. వనాధా-అస్‌హాబున్నారి-అస్-హాబల్-జన్నతి-అన్-అఫీజూ-అలైనా-మినల్-మాఇ-ఔ-మిమ్మా-రజఖ-కుమాల్లాహు-ఖాలూ-ఇన్నల్లాహ-హర్రమ-హుమా-అలల్-కాఫిరీన 51. అల్లజీ-నత్-తఖజూ-దీనహుమ్-లహ్‌వన్-వ-లఇ-బన్-వ-గర్రత్-హుముల్-హయా-తుద్-దున్యా-ఫల్-యౌమ-నన్సాహుమ్-కమా-నసూ-లిఖాఅ-యౌమి-హిమ్-హాజా-వ-మాకానూ-బి ఆయాతినా-యజ్-హదూన్.

50. నరకనివాసులు, స్వర్గనివాసులను పిలిచి కొద్ది నీళ్లో లేక దేవుఁడు మీకొసంగిన యాహారములోను కొంత మాపై వేయుఁడు అని పలుకుదురు. (అపుడు) స్వర్గనివాసులు, దేవుఁడు ఆ రెంటిని అవిశ్వాసులకుఁగాను నిషేధించియున్నాఁడు అని పలుకుదురు. 51. అవిశ్వాసులు తమ మతమును ఆటగాను వినోదముగాను చేసికొనిరి. మఱి వారు ఇహలోక జీవనముపై మోసపోయిరి. కావున, వారెట్లు ఈదినము యొక్క దర్శనమును మఱచిపోయి మా సూచనలను తిరస్కరించుచుండిరో అట్లు ఈదినమునందు మేము వారిని మఱతుము.

వ్యా॥ 50. నరకనివాసులు, నరకములోని బాధలను సహింపలేక ఆఁకలి దాహము తీర్చుటకుఁగాను స్వర్గనివాసులతో స్వర్గములోని నీళ్ళు, ఆహారమొసంగుఁడు అని వేఁడుదురు. వారికి ప్రత్యుత్తర మిట్లు ఇయ్యఁబడును. స్వర్గములోని వస్తువులు అవిశ్వాసులకుఁజెందవు. అవి వారికి నిషిద్ధములు. 51. నరకములోని కాఫిర్లు ఇహలోకభోగములకు మోసపోయి, ఇఁక పరలోకములేదు. ఇదే స్వర్గము అనుచు దేవుఁడు పంపిన సన్మార్గమును వదలి ఆట వినోదములను తమ మతముగాఁ జేసికొని దేవుఁడు తన ప్రవక్తల మూలమున పంపిన సూచ

నలను తిరస్కరించుచుండిరి. ఎట్లు వారు తీర్పుదినమును మఱచి అది రాదు అని యూహించి దేవుని సూచనలను తిరస్కరించిరో అట్లు వారి విషయము అనుగ్రహము గలుగదు, వారి కోరికలు అంగీకరింపఁబడవు.

52. వలఖద్-జీనా-హుమ్-బి-కితాబిన్-ఫస్సల్నా-హు-అలా- ఇల్మిన్-హుదన్-వ-రహ్మతల్-లిఖౌమిన్-యూమినూన్. 53. హల్-యన్-జురూన ఇల్లా-తా-వీలహూ-యౌమ-యాతీ-తావీ-లుహూ-యఖూ-లుల్-లజీన - నసూహు-మిన్-ఖబ్లు-ఖద్-జాఅత్-రుసులు-రబ్బినా-బిల్-హఖ్ఖి-ఫ-హల్-లనా-మిన్-షుఫ-ఆఅ ఫ-యష్-ఫఊ-లనా-ఔ-ను-రద్దు-ఫ-నఅ-మల-గైర ల్లజీ-కున్నా-నఅ-మలు-ఖద్-ఖసిరూ-అన్ ఫుసహుమ్-వ-జల్ల-అన్ హుమ్-మా-కానూ-యఫ్-తరూన్.

52. మఱియు మేము జ్ఞానపూర్వకముగా వారి యొద్దకు గ్రంథము పంపి దానిని చాల స్పష్టముగా వివరించి యున్నాము. అది విశ్వాసులకుఁగాను సన్మార్గము చూపునదియును (దేవుని) కరుణకు కారణముగా నున్నది. 53. ఏమి వారు దాని తుది ఫలితము సంభవింపవలెననియే ఎదురు చూచుచున్నారా! దాని తుది ఫలితము సంభవించు దినమునందు ఎవరు పూర్వము దీనిని మఱనిపోయియుండిరో వారు మాప్రభువు ప్రవక్తలు సత్యము తెచ్చియుండిరి, కావున ఇపుడు ఎవరైన మావిషయము సిఫారసుచేయువారు గలరేని వారు మాకొఱకు సిఫారసు చేయవలెను. లేక మమ్ము తిరిగి ఇహలోకమునకు పంపివేసినచో మేము చేయుచున్న కర్మలకు విరుద్ధముగాఁ జేయుదుము అని పలుకుదురు. నిశ్చయముగా వారు తమ యాత్మలకు నష్టము గావించుకొనిరి. మఱి వారు కల్పించుచున్నవి వారిని వీడిపోయెను.

వ్యా॥ 52. ఇఁక ఈవాక్యములో దేవుఁడు తన ఆఖరు ప్రవక్తయగు హజ్రత్ ముహమ్మదువారికి ఖురానుగ్రంథ మొసంగి దానిమూలమున ప్రజలకు సన్మార్గము చూపెను. అందు జ్ఞానము, భక్తి రక్షణ దేవుని దయ లభించు మార్గమున్నది. కావున విశ్వసించిన ముసల్మానులు ఖురానుగ్రంథము ననుసరించి సన్మార్గులై దేవుని కరుణకు పాత్రులగుచున్నారు. నరకములోపడినపిదప పశ్చాత్తాపము నొందుటవలన లాభమేమి అని మందలింపఁబడియెను. 53. ఖురానెషరీఫులో విశ్వసింపనివారికి దేవుని శిక్ష లభించును అని గలదు. అవిశ్వాసులు, విశ్వసింపక దాని తుది ఫలితమగు శిక్ష సంభవించునా అని యెదురు చూచుచున్నారు. దేవుని శిక్ష వచ్చిన పిదప విశ్వసించుటకు అవకాశముండదు. అప్పటి విశ్వాసముకూడ పనికిరాదు. కావున దేవుని శిక్షనుండి తప్పించుటకు ఎవరైన

సిఫారసు చేయుదురా అని కోరుదురు. ఎవరును కాఫిర్లకు సిఫారసు చేయరు. అపుడు తిరిగి ఇహలోకమునకుఁ బంపివేసినచో మేము చేయుచున్న పాపకార్యములకు విరుద్ధముగ పుణ్యకార్యములు చేయుదుము అని కోరుదురు. అట్లు కానేరదు. కావున వారు నష్టముపొంది నశించినవారై వారు కల్పించుచున్న యూహలు పనికిరాక పోవును.

54. ఇన్న-రబ్బ-కుముల్లా-హుల్లజీ-ఖల-ఖస్-సమావాతి-వల్-అర్‌జ-ఫీ- సిత్తతి-అయ్యా-మిన్-సుమ్మస్-తవా-అలల్-అర్-షి-యుగ్-షిల్-లైలన్-నహారయత్-లుబుహూ-హసీ-సన్-వష్-షమ్స-వల్-ఖమర-వన్-నుజూము-ముసఖ్ఖరాతిమ్-బి-అమ్రిహీ-అలా-లహుల్-ఖల్ఖు-వల్-అమ్ము-తబా-ర-కల్లాహు-రబ్బుల్-ఆల-మీన్. 55. ఉద్-ఊ-రబ్బకుమ్-తజర్రు-అన్-వఖుఫ్-యతన్-ఇన్నహూ-లా-యుహిబ్బుల్-ముఅ-తదీన్. 56. వలాతుఫ్-సిదూ-ఫిల్-అర్‌జి-బఅద-ఇస్లాహిహా-వద్-ఊహు-ఖౌఫన్-వ-తమ-అన్-ఇన్న-రహ్మతల్లాహి - ఖరీబుమ్-మినల్-ముహ్సినీన్.

54. ఆఱుదినములలో ఆకాశములను భూమిని సృష్టించిన దేవుఁడే మీ ప్రభువు. పిదప ఆతఁడు అర్షు (సింహాసనము) పై ఆసీనుఁడాయెను. ఆతఁడు రాత్రిని పగటిపై కప్పుచున్నాఁడు. అది దానిని త్వరితముగ వెంబడించుచుండును. సూర్యుని చంద్రుని నక్షత్రములను తన యాజ్ఞకు లోనైయుండునట్లుగ సృష్టించెను. వినుఁడు సృష్టించుట, ఆజ్ఞాపించుట ఆతని పనియే. సర్వలోకములకు పోషకుఁడగు దేవుఁడు గొప్ప మహిమగలవాఁడు. 55. మీరు మీ ప్రభువును, వినయముతోడను రహస్యముగాను వేఁడుడు. ఆతఁడు మితిమీఱువారిని ప్రేమింపఁడు. 56. భూమిపై సవరణ గలిగిన పిదప నందు అల్లరులు గావింపకుఁడు. మఱి దేవుని భయముతోను, ఆశతోను ప్రార్థింపుఁడు. నిశ్చయముగ దేవుని కరుణ సత్కార్యములు చేయువారికి సమీపముననే యున్నది.

వ్యా॥ 44. ఇఁక ఈవాక్యములలో దేవుఁడు లోకసృష్టినిగూర్చి తెలిపి అందు తనకు అధికారముగలదు. కావున మానవులు తాను పంపు ప్రవక్తలను విశ్వసించి సత్కార్యములు భయభక్తులతోఁజేసి దేవుని కరుణకు పాత్రులు కావలెను. రాఁబోవు అధ్యాయములలో తానుపంపిన ప్రవక్తలవిషయమును, వారి జనుల విషయమును తిరస్కరించినవారిగతి ఇహమునందేమాయెనో దెలుపఁబడును. అందు మానవులకు హెచ్చరిక గలదు. దేవుఁడు ఆకాశములను భూమిని తటాలున పుట్టింపక ఆఱుదినములలో క్రమముగ సృష్టించెను. మానవులు

లెక్కించు వేయి సంవత్సరములు. దేవునియొద్ద ఒక దినము అనఁబడును. ఆ లెక్కను అనుసరించి ఆఱువేల సంవత్సరములలో క్రమముగా భూమ్యాకాశములు సృష్టింపఁబడి ప్రాణులు వసించుటకుఁదగునట్లుఏర్పడినవి. ఇంతకాలము లేక ఒక నిమిషములోకూడ దేవుఁడు తాను కోరినట్లు చేయఁగలఁడు. అయినను క్రమముగా సృష్టికావలెనని దేవుని యిష్టము. కావున అటులే సంభవించెను. ప్రస్తుతము ఏదైన ఒకప్రాణి క్రమముగా వృద్ధిపొందుట మేము చూచుచున్నారముగదా! అర్షిపై ఆసీనుఁడాయెను. అర్షఅనఁగా సింహాసనము. సింహాసనముపై ఆసీనుఁడాయెను అను విషయము దేవుని రాజ్యమును అధికారమును లోకముపై గలదు అని సూచించును. దేవుఁడు రాత్రి చీఁకటిలో పగటి వెలుతురును కప్పుచున్నాఁడు. అట్లు రాత్రి చీఁకటిపై పగటి వెలుతురును క్రమ్ముకొనునట్లు చేయుచున్నాఁడు. అనగా, రాత్రి వెనుక పగలు, పగలు తరువాత రాత్రి తప్పకుండ వచ్చుచుండును. వాని క్రమము తప్పదు. అందు ఒక నిమిషము ఆలస్యము కానేరదు. సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు దేవునిచే సృష్టింపఁబడి దేవుని యాజ్ఞకు లోఁబడియున్నవి. ఆతని యాజ్ఞలేనిది ఏద్దియును చలింపదు. సృష్టించుట, ఆజ్ఞాపించుట దేవునిపని. ఇతరులదికాదు. ఆతఁడు గొప్పమహిమ (ఘనత) గలవాఁడు. ఆతఁడే సర్వలోకములకు పోషకుఁడును ప్రభువును. 55. కావుననే అట్టి ప్రభువును భయభక్తులతోను రహస్యముగాను నిశ్శబ్దముగాను ప్రార్థింపవలెను. మితిమీఱి కేకలు వేయుచు గట్టిగా ప్రార్థింపఁగూడదు. దేవుని వేఁడుటలో, తగిన విషయములను వేఁడవలెను. మితిమీఱువారిని దేవుఁడు ప్రేమింపఁడు. 56. ధర్మప్రచారమువల్ల భూమిపై శాంతిగలిగియున్నపుడు అల్లరులు కలిగించి శాంతమునకు భంగము గలిగింపరాదు. దేవునిశిక్షకుభయపడి దేవుని దయగలుగునని యాశకలిగి భయభక్తులతో దేవునిని ప్రార్థించుచుండవలెను. భూమిలో శాంతిలేనిచో ప్రార్థనలు శాంతముగఁ జరుగనేరవు. కావున అక్రమములు చేయక సత్కార్యములు చేయుచు నుండవలెను. సత్కార్యములు చేయువారిని దేవుఁడు ప్రేమించును.

57. వహువల్లజీ-యుర్సిలుర్-రియాహ-బుష్రమ్-బైన-యదై- రహ్మతిహీ-హత్తా-ఇజా-అఖల్లత్-సహా-బన్-సిఖాలన్-సుఖ్నాహు-లి - బలదిమ్-మయ్యితిన్-ఫఅన్-జల్నా-బిహిల్-మాఅ-ఫ-అఖ్-రజ్నా-బిహీ-మిన్- కుల్లిస్-సమరాతి-కజా-లికనుఖ్-రిజుల్-మాతా-లఅల్లకుమ్-తజక్కరూన్.58.వల్-బలదుత్-తయ్యిబుయఖ్రుజు-నబాతుహూ-బి-ఇజ్ని-రబ్బిహీ-వల్లజీ-ఖబుస- లాయఖ్-రుజు-ఇల్లా-నకిదన్-కజాలిక-నుసర్రి-ఫుల్-ఆయాతి లిఖామిన్-యష్-కురూన్

57. మఱియు ఆతఁడేను తన దయ అగు వర్షమునకు ముందుగా సంతోష వార్త నిచ్చునట్టి వాయువులను పంపుచున్నాఁడు. తుదకు అవి బరువైన మేఘముల నెత్తుకొని వచ్చునపుడు వానిని చచ్చిన పురము వైపునకుఁ గొనిపోయి వానినుండి నీళ్ళను కురిపించుచున్నాము. ఆ పిదప ఆ నీళ్ళవలన పలువిధములైన ఫలములను దీయుచున్నాము. ఇటులే మేము మృతులను దీయుదుము. మీరు గమనింతురు గాక! 58. పవిత్రమైన మంచి నేలనుండి దాని పచ్చిక దేవుని సెలవు వలన బాగుగ బయటికి వచ్చును. మఱియు మంచిది కాని దానినుండి (పంట) బాగుగ వుత్పత్తి గాదు. కృతజ్ఞత గలువువారికిఁగాను ఇట్లు మేము సూచనలను వివరించి చెప్పుచున్నారము.

వ్యా॥ 57. ఈ వాక్యములో భూమ్యాకాశముల మధ్యను కూడ దేవుని యధికారమున్నది. వానరాక పూర్వము వాయువులు వీఁచుచున్నవి. అవి జలముతో నిండిన మేఘములను ఎత్తుకొని వచ్చును. దేవుని సెలవు ననుసరించి ఎండిన పురము (నేల)పై వర్షము కురియుచున్నది. ఎండిపోయి చచ్చిన నేల పొలములనుండి పలువిధములైన ఫలములు పండుచున్నవి. ఎట్లు చచ్చి(ఎండి)న నేలనుండి వర్షమువలన పచ్చిక ఫలములు పైరు బైటికి వచ్చుచున్నవో అటులే తీర్పుదినమునకుఁగాను మృతులందఱును సజీవులై బయలుదేరుదురు. దీనిని బాగుగ యోచింపవలెను. దేవుఁడు సర్వశక్తుఁడు. ఆతని శక్తికి మించినది ఎద్దియును లేదు. పవిత్రమైన మంచి నేల మంచి ఫలము తెచ్చుచున్నది. చెడిన చోటి నేలలో అంత బాగుగ పైరుగాదు. పచ్చిక ఫలములు పండవు. అందు వానదోషముకాదు. నేల స్వభావమునుబట్టి మంచి నేలలో మంచి ఫలములు హెచ్చుగా నగును. మంచిదికాని చోటి నేలలో హెచ్చుగా ఫలము ఫలింపదు. ఇటులే దేవుని ప్రవక్తలు దేవుని యొద్దనుండి సందేశము (వహీని) గ్రహించి దానిని ప్రజలకుఁ దెలుపుదురు. మంచి స్వభావముగల మనుష్యులు బాగుగ గ్రహించి దాని యనుసరించి గొప్పభక్తులగుదురు. దుష్టస్వభావముగల జనులు, ధర్మబోధను గ్రహింపక అవిశ్వాసులై చెడుదురు. అందు దేవుని ప్రవక్తల దోషముకాదు. కావున రాఁబోవు వాక్యములలో ప్రవక్తలను వారి జనులను గూర్చి చెప్పఁబడుచున్నది.

59. లఖద్-అర్-సల్నా-నూహన్-ఇలా-ఖౌమిహీ-ఫ-ఖాల-యా-ఖౌమిఅ-బుదుల్లాహ-మాలకుమ్-మిన్-ఇలాహిన్-గైరుహూ-ఇన్నీ అఖాఫు - అలైకుమ్-అజాబ-యౌమిన్-అజీమ్. 60. ఖాలల్-మలఉ మిన్-ఖౌమిహీ-ఇన్నా-లనరాక-ఫీ-జలా-లిమ్-ముబీన్. 61. ఖాల-యా-ఖౌమి-లైస-బీ-జలాలతున్-వలా

కిన్నీ-రసూలుమ్-మిర్-రబ్బిల్-ఆలమీన్. 62. ఉబల్లిగు-కుమ్-రిసాలాతి-రబ్బీ-వ-అన్-సహు-లకుమ్-వ అఅ-లము-మినల్లాహి-మా-లా-తఅ-లమూన్. 63. అ-వ-అజిబ్-తుమ్-అన్-జాఅకుమ్-జిక్రుమ్-మిర్-రబ్బికుమ్-అలా-రజు-లిమ్-మిన్-కుమ్-లియున్-జిరకుమ్-వలి-తత్తఖూ-వ-లఅల్లకుమ్-తుర్-హమూన్. 64. ఫ-కజ్-జబూహు-ఫ-అన్-జైనాహు-వల్లజీన-మఅహూ-ఫిల్-ఫుల్కి-వ-అగ్-రఖ్నల్-లజీన కజ్-జబూ-బి-ఆయాతినా-ఇన్నహుమ్-కానూ-ఖౌమన్-అమీన్.

59. నిశ్చయముగా మేము నూహును ఆతని జాతియొద్దకు నంపితిమి. కావున ఆతఁడు ఓనాజాతివారలారా దేవునినే పూజింపుఁడు. ఆతఁడు దప్ప వేఱు దేవుఁడు మీకు లేఁడు. ఆమహాదినమునందు మీకు శిక్ష గలుగును అని నాకు భయమున్నది అని పలికెను. 60. ఆతని జాతిలోని నాయకులు నీవు స్పష్టముగ మార్గము తప్పియుండుటను మేము చూచుచున్నారము అనిపలికిరి. 61. నూహు "ఓనాజాతివారలారా! నేను మార్గము తప్పలేదు. కాని నేను సర్వలోకములకు ప్రభువగు దేవుని ప్రవక్తను. 62. నేను నాప్రభువు సందేశమును మీకందఁజేయుచున్నాఁడను. మఱి మీకు బోధచేయుచున్నాఁడను. మీకుఁ దెలియని వానిని నేను దేవునినుండి తెలిసికొను చున్నాఁడను. 63. మీకు భయబోధ నిచ్చుటకును మీరు భక్తిపరు లగుటకును మీపై దేవునికరుణ కలుగుటకును మీనుండియే ఒక పురుషుని మూలమున మీ ప్రభువునుండి మీ యొద్దకు బోధవచ్చినది అని మీకాశ్చర్యము గలిగినదా అని పలికెను. 64. ఆపిదప వారు ఆతనిని తిరస్కరించిరి. కావున ఆతనిని ఆతనితోఁబాటు నావలో నున్నవారినిరక్షించి మా సూచనలను తిరస్కరించిన వారిని ముంచి వేసితిమి. నిశ్చయముగా వారు గుడ్డివారైన జనులుగా నుండిరి.

వ్యా॥ 59. ఆదముప్రవక్తను గూర్చి ఈ సూరాకుప్రారంభములో చెప్పబఁడినది. ఆదము తరువాత ఆతని సంతానము పది తరములవఱకు దేవునినే ఆరాధించుచు దేవుని యేకత్వము (తౌహీదు)ను విశ్వసించి యుండిరి. ఆపిదప కొందఱు భక్తులు చని పోఁగా జ్ఞాపకార్థము వారి పటములు చేయసాగిరి. కొద్ది కాలము గడచిన తరువాత పటములకు బదులుగ భక్తుల విగ్రహములు చేసికొనిరి. కొంతకాలము గడచి జ్ఞాపకార్థముంచిన విగ్రహములను ఆరాధింప సాగిరి. విగ్రహారాధన ప్రజలలో చాల వ్యాపించెను. దానిని నిషేధించుటకుగాఁను దేవుఁడు నూహును ప్రవక్తగా జేసిపంపెను. ఆయన తనజాతివారికి దేవుని యేకత్వమును బోధించుచు విగ్రహారాధన చేయకూడదు అని నిషేధించెను. కాని

కొందఱు తప్ప మిగిలిన వారు ఆతని బోధ వినక ఆతనిని తిరస్కరింప సాగిరి. నూహుపలువిధములుగ బోధించుచు దేవుని శిక్ష రానున్నది భయపడుఁడు. దుర్మార్గము వదలి భక్తి మార్గమునకు రండు అని బోధింపఁగా జనులలోని దుష్ట నాయకులు ఓనూహు! నీవు పెద్దల మార్గము వదలి దారి తప్పి పోవుచున్నావు అనిపలికిరి. దానికి నూహు నేను దేవుని ప్రవక్తను. దేవుఁడు నాయొద్దకు తన సందేశము పంపుచున్నాఁడు. మీకు ఆవిషయములు తెలియవు. కావున నాబోధ విని సన్మార్గము అనుసరించి దేవుని ప్రీతి పడయుఁడు. దేవుఁడు మానవుల నుండియే ప్రవక్తను పంపెనని మీరు ఆశ్చర్య పడవలదు. ఆదము, దేవుని ప్రవక్త, ఆతని ప్రతినిధి (ఖలీఫా) గదా! ఆతని సంతానము లోనే ప్రవక్త పదవికి అర్హులైన వారికి ప్రవక్త పదవి దేవుఁ డొసంగు చున్నాఁడు. కావున మీరు ప్రవక్త బోధను విని పాపములను వదలి భక్తిపరులై దేవుని దయకు పాత్రులు కావలెను. అని బోధించెను. అట్లు నూహు ప్రవక్త 950 తొమ్మిదినూర్లయేబది సంవత్సరములు బోధించెను. 64 కాని ఆతని జాతివారిలో కొందఱు తప్ప మిగిలిన వారు విశ్వసింపలేదు. అపుడు జలప్రళయము (తూఫానెనూహు) వచ్చెను. నూహును ఆతనిని విశ్వసించిన వారును నావలో కూర్చుండిరి. దాని మూలమున దేవుఁడు వారిని రక్షించెను. మిగిలిన వారందఱు జలములో మునిగి నశించిరి. మునిగినవారు సత్యమును చూడని అంధులు కావుననే వారు శిక్షకు పాత్రులైరి.

65. వఇలా-ఆదిన్-అఖా-హుమ్-హూదన్-ఖాల-యాఖౌ-మిఅ-బుదుల్లాహ-మాలకుమ్-మిన్-ఇలాహిన్- గైరుహూ-అఫలా-తత్తఖూన్. 66. ఖాలల్ మల-ఉల్-లజీన-కఫరూ-మిన్-ఖౌమిహీ-ఇన్నా-లనరాక-ఫీ-సఫా-హాతిన్ - వఇన్నా-ల-నజున్నుక-మినల్-కాజిబీన్. 67. ఖాల-యా-ఖౌమి-లైస-బీ- సఫాహాతున్-వలా-కిన్నీ-రసూలుమ్-మిర్-రబ్బిల్-ఆలమీన్.68.ఉబల్లి-గుకుమ్-రిసా రా-లాతి-రబ్బీ-వ-అనా-లకుమ్-నాసి-హున్ అమీన్. 69. అవ-అజిబ్-తుమ్-అన్-జాఅకుమ్-జిక్రుమ్-మిర్-రబ్బికుమ్-అలా-రజులిమ్-మిన్ కుమ్-లి-యున్-జిరకుమ్-వజ్ కురూ-ఇజ్-జఅలకుమ్-ఖుల-ఫాఅ-మిమ్-బఅ-ది-ఖౌమి-నూహిన్ - వజాదకుమ్-ఫిల్-ఖల్ ఖి-బస్-తతన్-ఫజ్-కురూ-ఆలా-అల్లాహి-లఅల్లకుమ్-తుఫ్- లిహూన్. 70. ఖాలూ-అజీ-తనా-లి-నఅ-బుదల్లాహా-వ హ్-దహూ-వ-నజర-మాకాన- యఅ-బుదు - ఆబా - ఉనా-ఫా-తినా- బిమా -తఇదునా-ఇన్-కున్త-మినస్- సాది

ఖీన్. 71. ఖాల ఖద్-వఖఅ-అలైకుమ్-మిర్-రబ్బికుమ్-రి-జ్-సున్-వ గజబున్-అ-తుజా-ది-లూననీ-ఫీ-అస్మాఇన్-సమ్-మైతుమూహా అన్తుమ్-వ-ఆబా-ఉకుమ్-మా-నజ్-జలల్లాహు-బిసుల్-తానిన్-ఫన్-తజిరూ-ఇన్నీ-మఅ-కుమ్-మినల్-మున్తజిరీన్. 72. ఫఅన్-జైనాహు-వల్-లజీన-మఅ-ఉహూ-బి-రహ్మ తిమ్-మిన్నా వ-ఖత అ-నా-దాబి-రల్ల-జీన-కజ్-జబూ-బి-ఆయా-తినా-వ-మా-కానూ- మూమినీన్.

65. మఱియు మేము ఆద్‌వారియొద్దకు వారి సహోదరుఁడగు హూదును పంపితిమి. అతఁడు ఓనాజాతివారలారా! దేవునినే మీరు ఆరాధింపుఁడు. ఆతఁడుదప్ప వేఱు దేవుఁడు మీకులేఁడు. కావున మీరుభయపడరా! అని పలికెను. 66. ఆతని జాతిలో అవిశ్వాసులైన నాయకులు నీకు బుద్ధి లేకుండుటను మేము చూచుచున్నారము. మఱి నీవు అబద్ధవాదివి అని మేము తలఁచుచున్నాము. అని పలికిరి. 67. ఓ నాజాతివారలారా! నేను బుద్ధిహీనుఁడనుకాను. కాని సర్వలోకములకు ప్రభువగు దేవుని ప్రవక్తను. 68. నేనునాప్రభువుసందేశమును మీకందఁజేయు చున్నాఁడను. మఱి మీ మేలు కోరువాఁడను విశ్వాస పాత్రుఁడను. 69. మీకు భయబోధ నిచ్చుటకు గాను మీనుండియే ఒక పురుషుని మూలమున మీప్రభువునుండి మీయొద్దకు బోధవచ్చినది యని మీకాశ్చర్యము గలిగినదా. మఱి నూహుజాతి పిదప మిమ్ము నాయకులఁగఁజేసి మీదేహములను విరివిగాఁ జేసిన దానిని మీరు జ్ఞప్తికి దెచ్చుకొనుఁడు. మఱి మీరు మోక్షము పొందుటకై దేవుని యనుగ్రహములను స్మరింపుఁడు. అని హూదు పలికెను. 70. వారు మేము ఒక దేవుని మాత్రము ఆరాధించి మాతాత ముత్తాతలు పూజించు చున్నవారిని వదలిపెట్టవలెనని చెప్పుటకా నీవు మా యొద్దకువచ్చితివి. కావున నీవు సత్యవంతుఁడవైనచో ఎద్దాని గూర్చి నీవు మాకు భయపెట్టు చున్నావో అది తీసికొనిరమ్ము అని పలికిరి. 71. మీప్రభువునుండి శిక్షయును కోపమును మీపై పడెను. మీ రెండులకు మీరును మీతాత ముత్తాతలును పెట్టుకొన్న కొన్ని పేర్ల విషయము నాతో వాదించుచున్నారు. దానిగూర్చి దేవుఁడు ప్రమాణము (సనదు) పంపలేదు. కావున మీరు వేచియుండుఁడు. నేనునుమీతో బాటు వేచి యుందును అని హూదు పలికెను. 72. ఆపిదప మాదయవలన ఆతనిని ఆతని వెంట నున్నవారిని రక్షించితిమి. మఱి మా సూచనలను తిరస్కరించినవారిని నిర్మూలించితిమి. మఱి వారువిశ్వాసము వహించువారలు కాకుండిరి.

వ్యా॥ 65. ఆదుఅనువారు నూహునకు మనుమఁడుఁగు ఇరము యొక్క సంతతివారు. వీరి నివాసము యమను దేశములోని అహ్‌ఖాఫుఅను ప్రదేశమున

సుండెను. హజ్రత్ హూదు ప్రవక్త ఆదువంశమునకు చేరిన యాతఁడు. కావున ఆదువారికి సహోదరుఁడాయెను. ఆదువారిలో విగ్రహారాధన చాల ప్రబలి యుండెను. ఆహారమునకుఁగాను ఒక దేవత, వర్షమునకుఁగాను ఒక దేవత, ఇటులే అనేక దేవతలను విగ్రహములను చేసి పూజించుచుండిరి. హూదు ప్రవక్త విగ్రహారాధన చేయకూడదు. ఇది ఘోర పాపము. దీనివలన మీరు దేవుని శిక్షకును కోపమునకును పాత్రులగుదురని భయపెట్టెను. 66. ప్రవక్త బోధ విని అవిశ్వాసులలో దుష్టనాయకులు ఏమయ్యా నీవు బోధించునది మాతాత ముత్తాతల యాచారమునకు విరుద్ధముగా నున్నదే. మమ్ము వదలి వేఱుమార్గము నందు పోవుచున్నవే. కావున నీకు బుద్ధిలేనట్లు మాకుఁ దోచుచున్నది. నీమాటలు దేవుని సందేశము. నీమాట విననిచో మాకు శిక్ష గలుగును అని అబద్ధముగా పలుకుచున్నావు. కావున నీవు సత్యవంతుఁడవు కావు. అని పలికిరి. 67. అప్పుడు హూదు ప్రవక్త నేను బుద్ధిహీనుఁడను కాను. నేను బోధించు విషయములు జ్ఞానమును అనుసరించి యున్నవి. నేను బోధించునది నా సొంతపలుకులుగావు. నేను దేవుని ప్రవక్తను. ఆతని సందేశము మీకందఁ జేయుచున్నాను. అందు ఏలాటి కొఱత చేయుటలేదు. నేను మీమేలు కోరియే మీకు బోధ వినిపించుచున్నాఁడను నేను ద్రోహిని కాను. నేనువిశ్వాస పాత్రుఁడను. నాయందుమీరు నమ్మకముంచుఁడు. అట్లు కాక మీరు మీయవివేకముచే నన్ను తిరస్కరించి నష్టము పొందకుఁడు. నేను మీవంటి మనుష్యుఁడను. దేవుని ప్రవక్తనై వచ్చినాను అని ఆశ్చర్యపడకుఁడు. పూర్వమునుండియు మనుష్యులే ప్రవక్తలుగా వచ్చి మనుష్యులకు బోధించిరి. చూడుఁడు నూహు ప్రవక్తను తిరస్కరించిన వారిగతి యేమాయెనో! నూహుజాతి పిదప మీకు భూమిలో నాయకులుగఁ జేసి మీకు దేహబల మొసంగి మిమ్ము అనుగ్రహించెను. కావున దేవుని మేళ్ళను మఱవక వానిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని విగ్రహారాధన మానుకొని ఒక్కదేవునినే యారాధింపుఁడు. మీకు మోక్షము లభించును అని పలికెను. 70. దానికి వారు నీమాట విని మాతాత ముత్తాతలు ఆరాధించుచున్న పెక్కుదేవతలను విగ్రహములను వదలి ఒక్కదేవునినే యారాధింప వలయునా? అట్లు చేయము. నీవు దేవుని శిక్ష కలుగును అని మమ్ము బెదరించుచున్నావుగదా! నీవు సత్యవంతుఁడవైనచో ఆశిక్షను దీసికొని రమ్ము అని పలుకసాగిరి, 71. అపుడుహూదు మీదుర్మార్గము సంపూర్ణమైనది. దేవుని శిక్ష వచ్చుటలో ఆలస్యములేదు. అది తప్పక వచ్చును. మీరు ప్రతిపనికిఁగాను ఒక చిల్లర దేవత కల్పించుకొని వాని పేరు పెట్టుకొని యున్నారు. అవి నామమాత్రాన దేవతలు. ఎట్టి ప్రమాణము (సనదు) లేని విషయము. అట్టి విషయములో నాతో మీరు వాదులాడు

చున్నారా! సరే మీమధ్యను నామధ్యను దేవుఁడు తీర్పు చేయును. ఎవరిగతి ఎట్లు కానున్నదో ఎదురు చూడుఁడు. నేనుకూడ మీతోఁబాటు వేచియుందు ను అనిపలికెను. 72. అవిశ్వాసుల దుర్మార్గము హెచ్చిపోయెను. దానికిఁగాను ఏడు రాత్రులును ఎనిమిది దినములును భయంకరమైన తుపాను గాలివీచి దెబ్బ లు తగిలి తలక్రిందులుగ పడిఅవిశ్వాసులు తుదముట్టనశించిరి. వీరు మొదటి ఆదు వారు. వీరి వేఱొకశాఖ సమూదు. దీనినే రెండవ ఆదుఅని చెప్పుదురు. ఇఁక రాఁబోవు వాక్యములలో సమూదు (రెండవఆదు)నుగూర్చి చెప్పఁబడుచున్నది.

73. వఇలా-సమూద-అఖా-హుమ్-సాలి-హన్-ఖాల-యాఖౌమిఅ-బుదు ల్లాహ-మాలకుమ్-మిన్-ఇలా-హిన్-గైరుహూ-ఖద్-జాఅత్-కుమ్-బయ్యినతుమ్ మిర్-రబ్బికుమ్-హాజిహీ-నాఖ-తుల్లాహి-లకుమ్-ఆయతన్-ఫజరూహా-తాకుల్- ఫీ-అర్జిల్లాహి-వలా-తమస్సూహా-బిసూఇన్-ఫయా-ఖుజకుమ్-అజాబున్ఆలీమ్. 74. వజ్కురూ ఇజ్-జఅ-లకుమ్-ఖుల-ఫాఅ-మిమ్ బఅది-ఆదిన్-వ-బవ్వ-అకుమ్ ఫిల్-అర్జి-తత్_తఖి-జూన-మిన్-సుహూ-లిహా-ఖుసూరన్-వతన్-హితూ-నల్-జి బాల-బుయూతన్-ఫజ్-కురూ-ఆలా-అల్లాహి-వలా-తఅ-సౌ-ఫిల్-అర్జి-ముఫ్- సిదీన్. 75. ఖాలల్-మల-ఉల్లజీ-నస్-తక్బరూ-మిన్-ఖౌమిహీ-లిల్_లజీ_నస్- తుజ్-ఇఫూ-లిమన్-ఆమన-మిన్-హుమ్ -- అ - తఅ-లమూన-అన్న-సాలి-హ మ్-ముర్-సలుమ్-మిర్-రబ్బిహీ-ఖాలూ-ఇన్నా-బిమా-ఉర్సిల బిహీ - మూమి నూన్. 76- ఖాలల్-లజీ-నస్-తక్బరూ-ఇన్నా-బిల్లజీ-ఆమన్తుమ్-బిహీ - కాఫి రూన్. 77. ఫఅఖ-రున్-నాఖత-వ-అతౌ-అన్-అమ్రి-రబ్బిహిమ్-వ - ఖాలూ- యాసాలి-హుఅ-తినా-బిమా-తఇదునా-ఇన్కున్త-మినల్-ముర్-సలీన్. 75. ఫ అఖ-జత్-హుముర్-రజ్ -ఫతు-ఫ-అస్-బహూ-ఫీ-దారిహిమ్ జాసి-మీన్. 79. ఫ తవల్లా-అన్హుమ్-వఖాల-యా-ఖౌమి -లఖద్-అబ్-లగ్-తుకుమ్-రిసాలత- ర బ్బీ-వ-నసహ్తు-లకుమ్-వలా-కిల్-లా-తుహిబ్బూ-నన్నాసిహీన్.

73. మఱియు సమూదు వారియొద్దకు వారి సహోదరుఁడగు సాలిహును పంపితిమి. అతఁడు ఓనాజాతివారలారా! మీరు దేవునినే యారాధింపుఁడు. ఆ తఁడుదప్ప వేఱు దేవుఁడుమీకులేఁడు. మీయొద్దకు మీప్రభువునుండి ప్రమాణము వచ్చియున్నది. ఇది దేవుని యొంటె మీకొఱకు సూచనగా నున్నది. కావున

దానిని దేవుని భూమిపై మేయుటకు వదలి పెట్టుడు. మఱిదానికి ఏలాటి కీడు చేయకుడు. మఱి (మీరట్లుచేసితిరా) మీకు దుఃఖకరమైన బాధకలుగును. 74. మఱియు ఆదువారి పిదప దేవుఁడు మిమ్ము నాయకులుఁగఁ జేసి మీకు భూమిపై నివాస మొసంగెను. కాన మీరు అందలి మెత్తని నేలపై మేడలుకట్టుచున్నారు. మఱి కొండలను తొలచి ఇండ్లను చేయుచున్నారు. కావున దేవుని యనుగ్రహములను స్మరింపుఁడు. మఱి భూమిపై అల్లరులు చేయుచు తిరుగకుఁడు అనిపలికెను. 75. ఆతని జనులలో గర్వికులైనవారు వారిలో విశ్వసించినట్టి నిరుపేదలతో ఏమి సాలిహను ఆతని ప్రభువు పంపినాఁడు అని మీకు నిశ్చయముగఁ దెలియునా అని పలుకసాగిరి. పేదలు మేము సాలిహ వ్రివక్త దెచ్చినవానిని విశ్వసించితిమి అని పలికిరి. గర్వికులైనవారు మీరు విశ్వసించిన దానిని మేము విశ్వసింపము అని పలుకసాగిరి. ఆపిదప వారు ఒంటెను కోసి వేసిరి. మఱివారు దేవుని యాజ్ఞను అతిక్రమించిరి. మఱియు ఓసాలిహా-నీవు ప్రవక్త అయినచో నీవు మాకు దేని గూర్చి భయపెట్టుచుంటివో దానిని మాపైఁదీసికొని రమ్ము అని వారు పలికిరి. 76. కావున భూకంపము వచ్చి వారిని పట్టగా వారు తమ ఇండ్లలో తలక్రిందులుగ తెల్లవాఱుసరికి పడిచచ్చిరి. 77. పిదప సాలిహ వారినుండి ముఖము త్రిప్పుకొని ఓనాజాతివారలారా! నేను నాప్రభువు సందేశమును మీకందఁ జేసితిని. మఱి మీమేలు కోరితిని. కాని మీరు మీమేలును కోరువారిని ప్రేమింపరు అని పలికెను.

వ్యా॥ 73. సాలిహ ప్రవక్త సమూదు వారికిబోధించెను. సమూదువారు మేము కోరినట్లు ఒక రాతిబండనుండి గర్భముతోనుండు ఒక ఒంటెను తీసిమాకు చూపినచో మేము నిన్ను విశ్వసింతుము అని పలికిరి. అటులే సాలిహ ప్రవక్త దేవునితో వేఁడుకొనఁగా దేవుఁడు తన మహిమతో గర్భముతోనుండిన ఒక ఒంటెను రాతిబండనుండి పుట్టించెను. దాని పిదప సమూదు వారిలోమీరు కోరినట్లు దేవుని ప్రమాణమగు సూచన మీయొద్దకు వచ్చెను. విశ్వసించి ఒక్క-దేవునినే యారాధింపుఁడు. విగ్రహారాధన వదలిపెట్టుఁడు. ఈయొంటె దేవుని శక్తివలన వచ్చినది. నేను దేవుని ప్రవక్తను అని సూచించు సూచనయున్నది. దీనిని మేయుటకు వదలి పెట్టుఁడు. దానికేలాటి కష్టముపెట్టకుఁడు. దానిని మీరు హింసించినచో దేవుని శిక్ష మీకుఁ గలుగును. 74. ఆదువారు నశించిన పిదప భూమిపై మీకు దేవుఁడు నివాసమిచ్చెను. మీరు పెద్దపెద్ద మేడలు కట్టుచున్నారు. కొండలను తొలఁచి ఇండ్లు చేయుచున్నారుగదా! ఇవన్నియు మీపైనున్న దేవుని యనుగ్రహములుగదా! కావున దేవుని మేళ్ళను మఱపక ఆతనికి కృతజ్ఞులైయుండుఁడు. భూమిపై నేలాటి యుపద్రవములు చేయుచు తిరుగకుఁడు. దేవునికి సాటి కల్పింపకుఁడు. దీనివలన భూమిపై చాల చెడుగు గలుగును.

అని సాలిహా ప్రవక్త బోధించెను. 75. కాని సమూదు వారిలోని పెద్దపెద్ద దుష్టనాయకులు పరిహాసముగా విశ్వసించిన పేదలతో ఏమయ్యా? సాలిహా దేవుని ప్రవక్తయని మాకు తెలియలేదే! మీకు మాత్రము బాగుగ తెలిసినదా అని పలుకసాగిరి. దానికి విశ్వాసు (ముసల్మాను) లు అవును మాకుఁ దెలిసినది. మేము ఆతనిని విశ్వసించినాము. ఆయన దెచ్చిన దేవుని సందేశమును కూడ నమ్మి అనుసరించు చున్నారము అని పలికిరి. 76. దానికి గర్వితులు సిగ్గుపడి ఓహో! మీరు విశ్వసించిన యేమి పాఱిపోయినది. మీవంటి బీదలవలన ఏమగును. మేము మీరు నమ్మిన దానిని నమ్మము అని పలుకసాగిరి. 77. దేవుని మహిమ వలన గలిగిన యా ఒంటె చాల పెద్దదిగనుండెను. అది యేపొలములో మేయుటకుఁ బోవునో ఇతర పశువులు దానికి భయపడి మేయక పాఱిపోసాగెను. దానికి నీళ్ళకుఁగాను ఒకదినము వంతుండెను. అది తనవంతు దినమున ఏబావిలో నీళ్లు త్రాగినను దాని నీళ్ళంతయు త్రాగివేయుచుండెను. ఎట్లు దాని పుట్టుక సహజమైనది కాదో అటులే దాని ఆహారము కూడ సాధారణమైనది కాకుండెను. సమూదువారు చూచి తమ పశువులకు ఇబ్బంది గలుగుచున్నదని తలఁచి యాఒంటెను చంపివేయ వలెను అని నిశ్చయించుకొనిరి. వారిలో ఖుదారు అను దుష్టుఁడు దాని పాదములను కోసివేసెను. దాని పిదప సమూదువారు సాలిహాప్రవక్తను కూడ చంపవలెనని సిద్ధమయిరి. దేవుఁడు విధించిన ధర్మములను మీఱి ఓ సాలిహా నీవు పలుకుచున్న శిక్షను మాపైఁ దెచ్చిపెట్టుము. నీవు నిజముగా దేవుని ప్రవక్తవైనచో అట్లు చేయుదువు అని నిర్భయమైన మాటలు పలుకసాగిరి. వారు పాపములో పరిపూర్ణులైరి. కావున దేవుని శిక్ష వారికిఁ గలుగుటకు ఏలాటి అడ్డు లేకుండెను. 76. కావున క్రిందినుండి భూకంపమును పైనుండి భయంకరమైన శబ్దమును గలిగి వారు తమ ఇండ్లలో తల క్రిందులుగ పడి చచ్చిరి. సాలిహా మఱియు ఆతనిని విశ్వసించిన వారునురక్షింపఁబడిరి. 77. సమూదువారు నశించిన పిదప సాలిహా ప్రవక్త సిరియా దేశనముకు లేకమక్కాపురమునకుఁ బోవుచు సమూదువారి శవములనుచూచి నేను నా ప్రభువు సందేశమును మీకందఁ జేసితిని. మీ మేలుకోరి మిమ్ము బోధించితిని. కాని నశింపనున్న మీరు మీ మేలు కోరిన వారి మాట వినరు. మఱి వారిని ప్రేమింపరు అని పలికెను. ప్రవక్తలు ప్రజల మేలు కోరుదురు. కావున వారి బోధను విని యనుసరింపవలెను. లేనిచో సమూదు వారికి పట్టిన దుర్గతి పట్టును.

80. వలూ-తన్-ఇజ్ ఖాల-లిఖౌ-మిహీ-అ-తా తూ-నల్ ఫాహి-షత-మా సబఖ-కుమ్-బిహా-మిన్ అహదిమ్ మినల్-ఆలమీన్. 81. ఇన్న-కుమ్-ల-తా తూనర్ రిజాల షహ్-వతన్ - మిన్ దూనిన్-నిసాఇ-బల్-అన్-తుమ్-ఖౌముమ్-

ముస్-రిఫూన్. 82. వమా-కాన-జవాబ-ఖౌమిహీ-ఇల్లా-అన్-ఖాలూ - అఖ్-రిజూ-హుమ్-మిన్-ఖర్-యతి-కుమ్-ఇన్న-హుమ్-ఉనాసున్ - యత-తహ్హ - హరూన్. 83. ఫఅన్-జైనాహు-వ-అహ్-లహూ ఇల్-లమ్-రఅత-హూ- కానత్-మినల్-గాబిరీన్. 84. వ-అమ్-తర్నా-అలైహిమ్-మత-రన్-ఫన్-జుర్. కైఫ కాన-ఆఖి-బతుల్-ముజ్రిమీన్.

80. మేము లూతును పంపినపుడు ఆతఁడు తన జాతివారితో ఏమి ఇంతకు పూర్వము లోకములో ఎవఁడును చేయని అసహ్య కార్యమును మీరు చేయుచున్నారా! 81. మీరు స్త్రీలను వదలి కామముతో పురుషుల యొద్దకు పోవుచున్నారు. మఱిమీరు మితిమీఱి పోవువారుగా నున్నారు అని పలికెను. 82. మఱి ఆతని జాతివారు మీపురమునుండి వీరిని వెడలఁగొట్టుఁడు. వీరు పరమ పవిత్రులుగా నుండవలెనని కోరుచున్నారు. అని మాత్రము జవాబిచ్చిరి. 83. ఆపిదప మేము ఆతనిని ఆతని యింటివారిని రక్షించితిమి. కాని ఆతని భార్యను రక్షించలేదు. ఆమె అచ్చట నుండువారితోఁ జాటుండిపోయెను. 84. మఱియు మేము వారిపై రాళ్ళవానను కురిపించితిమి. కావున పాపుల గతి యేమాయెనో చూడుము.

వ్యా॥ 80. లూతు ప్రవక్త హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తయొక్క అన్నకుమారుఁడు. తన దేశమగు ఇరాఖును వదలి సిరియా దేశమునకు హజ్రత్ ఇబ్రాహీముతో కూడ వచ్చియుండెను. సదూము వారికి బోధించుటకుఁగాను దేవుఁడు లూతును వారియొద్దకుఁ బంపెను. సదూము వారు అనేక పాపకార్యములు చేయుచుండిరి. ఇంతవఱకు మానవులు స్త్రీలను వదలి పురుషులతో సంభోగము చేయకుండిరి. ఈ యసహ్య కార్యమును లోకము ఎఱుంగకుండెను. సదూము వారు క్రొత్తగా ఆపాపములో పడియుండిరి. లూతు ప్రవక్త ప్రజలకు అట్లు చేయవలదని బోధించెను. ఇది నీచకార్యము. ఘోరపాతకము. దీని ఫలితము చాల చెడ్డది. 81. స్త్రీలను వదలి పురుషులతో కలియుట సహజ ధర్మమునకు విరుద్ధము. అది మితిమీఱి పోవుట. కావున దాని వదలిపెట్టుఁడు అని బోధించెను. 82. కాని సదూమువారు లూతును ఆతని యింటివారిని పురము నుండి వెడలఁగొట్టవలెను. మేము చేయునది నీచకార్యము. కావున నీచులతో పరమ పవిత్రులగు వారుండకూడదు. కావున వీరిని తఱుముఁ గొట్టుట మేలని పలికిరి. 83. సదూము వారు దేవుని ప్రవక్తను తిరస్కరించి తమ దుష్టత్వములో మితిమీఱి పోసాగిరి. ఈదుష్టులతో లూతుభార్య చేరి యుండెను. ఆమె లూతు ఇంటికి ఎవరైన అతిథులు వచ్చిన పురము వారికిఁ దెలుపుచు వారితో

ఆ నీచ కార్యము చేయుటకు ప్రేరేపించుచుండినది. కావున దేవుని శిక్ష రాక పూర్వము లూతుభార్య తప్ప మిగిలిన లూతు ఇంటివారు దేవుని సెలవు పొంది సదూము వారి పురము వదలి పోయిరి. వారు సురక్షితముగా వెడలి పోయిన పిదప దుష్టులపై రాళ్లవాన కురిసి పాపులు నశించిరి. వీరి దుర్గతి చూచి మానవులు బుద్ధి తెచ్చుకొని యట్టి నీచకార్యములు మానుకొనవలెను. ఇట్టి అసహ్య కార్యము చేయువారికి ఇస్లామ్‌లో చాల కఠినశిక్ష యున్నది. అట్టివారిని రాళ్ళతోఁ గొట్టిచంపవలెను.

85. వఇలా-మద్-యన అఖా హుమ్-షు-ఐబన్-ఖాల-యా-ఖౌమిఅ-బుదుల్లాహ-మాలకుమ్-మిన్-ఇలా హిన్-గైరుహూ-ఖద్-జాఅత్ కుమ్-బయ్యినతుమ్-మిర్-రబ్బి-కుమ్-ఫ-ఔ ఫుల్-కైల-వల్-మీజాన-వలా-తబ్-ఖసున్నాస-అష్యా-అహుమ్-వలా-తుఫ్-సిదూ ఫిల్-అర్-జి-బఅద-ఇస్లా-హిహా - జాలికుమ్-ఖైరుల్ లకుమ్-ఇన్-కున్తుమ్-మూమినీన్. 86. వలా-తఖ్-ఉదూ - బికుల్లి-సిరాతిన్-తూఇ-దూన-వ-తసుద్దూన-అన్-సబీ లిల్లాహి-మన్-ఆమన-బిహీ - వతబ్-గూనహా-ఇవజన్-వజ్-కురూ-ఇజ్-కున్తుమ్-ఖలీలన్-ఫకస్-సరకుమ్-వన్-జురూ-కైఫ-కాన-ఆఖి-బతుల్-ముఫ్-సిదీన్.87.వఇన్-కాన-తాఇ-ఫతుమ్-మిన్-కుమ్ ఆమనూ-బిల్-లజీ-ఉర్-సిల్తు-బిహీ-వతాఇ-ఫతుల్-లమ్-యూమినూ-ఫస్-బిరూ-హత్తా-యహ్-కు-మల్లాహు-బైననా-వహువ-ఖైరుల్-హాకిమీన్.

85. మఱియు, మద్యను వారియొద్దకు వారి సహోదరుఁడగు షుఐబును పంపితిమి. ఆతఁడు ఓ నాజాతివారలార ! మీరు దేవునినే యారాధింపుఁడు. ఆతఁడు దప్ప వేఱు దేవుఁడు మీకు లేఁడు. మీప్రభువునుండి మీ యొద్దకు ప్రమాణము (సూచన) వచ్చినది. కావున కొలతలను తూకములను పూర్తిగ నియ్యుఁడు. జనులకు వారి వస్తువులను తగ్గించి యియ్యకుఁడు. మఱి భూమిపై సవరణయైన పిదప అందు చెడుగు చేయకుఁడు. మీరు విశ్వాసులు రైనచో ఇది మీకు మేలైనది. 86. మఱి ప్రజలను బెదరించుటకును దేవుని విశ్వసించినవారిని దేవుని మార్గమునుండి ఆటంకపఱచుటకును, అందు వంకఱ కోరుటకును దోవలలో కూర్చుండకుఁడు. మఱి మీరు కొద్దిమందిగానుండగా దేవుఁడు మిమ్ము వృద్ధిపొందించినదానిని స్మరింపుఁడు. మఱి యుపద్రవములు చేయువారి గతి యేమాయెనో చూడుఁడు. 97. మఱియు మీలో కొందఱు దేవుఁడు నాకిచ్చి పంపినదానిని విశ్వసించి మఱికొందఱు విశ్వసింపకున్నచో

దేవుఁడు మామధ్య తీర్పుచేయునంతవఱకు వేచియుండుఁడు అని పలికెను.

వ్యా॥ 85. మద్యను వారు విగ్రహారాధన చేయుటయేగాక కొలతలలోను తూకములలోను ప్రజలను మోసపుచ్చుచు వారి హక్కులను కొట్టుచుండిరి. తూకములోను కొలతలోను తక్కువచేయుట మోసపుచ్చుట ఘోరపాతకము. కావున షుఐబు ప్రవక్తమద్యను వారికి బోధించుచు నేను నిజమైనప్రవక్తను. దానిగూర్చి ప్రమాణ (సూచన) మీకుఁ దెలిసినది. నన్ను మీరు విశ్వసింపక తిరస్కరించితిరేని మీరు దేవుని శిక్షకు పాత్రులగుదురు. కావున ప్రజలహక్కులను పూర్తిగ నియ్యుఁడు. న్యాయముగ హెచ్చుతగ్గులు లేక తూచి కొలచి ప్రజలకు వారి వస్తువులు పూర్తిగ నియ్యుఁడు. కొందఱు తమకు ఇతరులవలన ఏదైన వస్తువు రావలసియున్నచో తమ హక్కుకన్న హెచ్చుగా కొలిచి, తూచి తీసికొనుదురు. తాము ఇతరులకు ఇయ్యవలసియున్నచోతప్పుగాకొలిచి తూచి తక్కువగా నిత్తురు. ఇట్టి ద్రోహము, అన్యాయము విశ్వాసులు (ముసల్మానులు) చేయరు. అట్లు చేయువారు సరియైన ముసల్మాను (భక్తులు) లు కానేరరు. ఇట్టి మోసములవలన దేశములో చెడుగు గలుగును. సవరణగలిగి శాంతి గలిగిన పిదప పాపముచేసి దేశములో ఉపద్రవములు గలిగింపరాదు.

86. మద్యను వారు దోవలలో కూర్చుండి ప్రజలను బెదరించి యన్యాయముగా ప్రజల సొత్తు లాగుకొనుచుండిరి. మఱియు షుఐబు ప్రవక్తయొద్దకు పోయి ధర్మబోధ వినకూడదు అని విశ్వాసులను ఆటంకపఱచుచు, దేవుఁడు పంపిన మతములో లోపములు కల్పించుచు ప్రజల మనస్సులు కలతనొందునట్లు చేయుచుండిరి. ఇట్లు చేయకూడదు. ఓ మద్యనువారలార! మీరు సంఖ్యలోను, ధనమునందును తక్కువగా నుండగా దేవుఁడు మిమ్ముసంఖ్యలో నెక్కువగాఁ జేసి మీధనమును వృద్ధిపఱచెను. దేవుని యనుగ్రహములను స్మరించి దేవుని కృతజ్ఞులరై విశ్వసించి సత్కార్యములు చేసి దేవుని ప్రీతి పడయుఁడు. మీకు పూర్వము గడచిన దుర్మార్గులగతి యేమాయెనో యోచించి చూడుఁడు. ఆ దుర్మార్గులెట్లు తమ పాపముల ఫలితముపొంది నశించిరో దాని గమనించి మీగతికూడ అట్లు కాకుండుటకై మార్గము చూడుఁడు. అది విశ్వాసమార్గము.

87. ఓ మద్యనువారలారా! దేవుఁడు నాకిచ్చినదానిని మీలో కొందఱు విశ్వసించి మఱికొందఱు విశ్వసింపక భేదాభిప్రాయముగలిగియున్నారు గదా! దేవుఁ డొసఁగినదానిని అందఱును విశ్వసింపవలసిన విషయమే. అయిన మీలో కొందఱు విశ్వసింపక అవిశ్వాసులుగానున్నారు. అటులైనచో ఆకాశమునుండి దేవుని శిక్ష వచ్చి మీమధ్యను మామధ్యను తీర్పుచేయునంతవఱకు వేచియుండుఁడు. దేవుని తీర్పు వచ్చిన పిదప ఎవరు నశించి ఎవరు రక్షింపఁబడుదురో మీకుఁ దెలియనగును. దేవుఁడు చేయు తీర్పు చాల న్యాయమైనదిగా నుండును.

ఆతఁడు ఏలాటి యన్యాయము చేయఁడు. ఎవరి కర్మలకుఁ దగిన ఫలితము వారి కొసంగును అని షుఐబు ప్రవక్త మధ్యను వారితో పలుకఁగావారిలో నాయకు లిచ్చిన జవాబు రాఁబోవు వాక్యములలో చెప్పఁబడినది.

## తొమ్మిదవ కాండము

87. ఖాలల్-మల-ఉల్-లజీనస్-తక్బరూ-మిన్-ఖౌమిహీ-లనుఖ్-రిజన్నక-యా-షుఐబు-వల్లజీన-ఆమనూ-మఅక మిన్-ఖర్యతినా-ఔ-లత-ఊదున్న-ఫీ-మిల్లతినా-ఖాల అవ-లౌ-కున్నా-కారిహీన్. 89. ఖదిఫ్-తరైనా-అల్లాహి-కజి-బన్-ఇన్-ఉద్నా-ఫీ-మిల్-లతికుమ్-బఅ-ద ఇజ్-నజ్జా-నల్లాహు-మిన్‌హా-వమా- యకూను-లనా-అన్ నఊద-ఫీహా-ఇల్లా-అన్-యషా-అల్లాహు-రబ్బునా-వసిఅ-రబ్బునా-కుల్లషైఇన్-ఇల్మన్-అలల్-లాహి-తవక్కల్-నా-రబ్బనఫ్-తహ్-బైననా-వబైన-ఖౌమినా-బిల్-హఖ్ఖి-వ-అన్త-ఖైరుల్-ఫాతిహీన్. 90. వఖాలల్-మలఉల్-లజీన-కఫరూ-మిన్-ఖౌమిహీ-ల-ఇ-నిత్-తబ-అతుమ్-షుఐబన్ - ఇన్నకుమ్-ఇజల్-ల-ఖాసిరూన్, 9. ఫఅఖజత్-హుముర్-రజ్-ఫతు-ఫ-అస్-బహూ-ఫీదారిహిమ్-జాసిమీన్, 92. అల్-లజీన-కజ్-జబూ-షుఐబన్-కఅల్ - లమ్-యగ్-నౌ-ఫీహా-అల్లజీన-కజ్-జబూ-షుఐబన్-కానూ-హుముల్-ఖాసిరీన్. 83. ఫతవల్లా-అన్-హుమ్-వ-ఖాల-యాఖౌమి-లఖద్-అబ్-లగ్-తుకుమ్-రిసాలాతి-రబ్బీ-వ-నసహ్-తు-లకుమ్-ఫకైఫ-ఆసా-అలా-ఖౌ-మిన్-కాఫిరీన్.

88. అతని జాతిలో గర్వితులైన నాయకులు మేము తప్పక ఓ షుఐబు! నిన్నును నీతో విశ్వసించినవారిని మాపురమునుండి వెడలఁగొట్టుదుము. లేదా తిరిగి మీరు మామతములోనికి రండు అని పలికిరి. షుఐబు, మేము ఇష్టపడకున్నను తిరిగి రావలయునా ? 89. దేవుఁడు మమ్ము మీమతమునుండి రక్షించిన పిదప తిరిగి దానిలో చేరినచో మేము దేవునిపై అసత్యము కల్పించినవారల మగుదుము. మాప్రభువగు దేవుఁడు కోరిన తప్ప మేము తిరిగి యందు రాఁజాలము. సర్వమును మాప్రభువునకుఁ దెలిసియేయున్నది. మేము దేవునిపైననే ఆధారపడియున్నారము. ఓ మాప్రభువా ! మామధ్యను మా జాతివారిమధ్యను న్యాయముగ తీర్పుచేయుము. మఱి నీవే అందఱికంటె బాగుగ తీర్పుచేయువాఁడవు అని పలికెను. 90. మఱియు, ఆతని జాతిలో అవిశ్వాసులైన నాయకులు మీరు షుఐబును అనుసరించినచో తప్పక మీరు నష్టముపొందినవారగుదురు అని

పలికిరి. 91. ఆపిదప వారికి భూకంపము వచ్చి పట్టఁగా వారు తెల్లవాఱుసరికి తమ యిండ్లలో తలక్రిందులుగ పడి చచ్చిరి. 92. షుఐబును తిరస్కరించినవారు అందు ఎప్పుడును వసించియుండనట్లు నశించిపోయిరి. షుఐబును తిరస్కరించినవారే నష్టముపొందినవారైరి. 93. పిదప వారినుండి మరలిపోయి ఓ నా జాతివారలార! నా ప్రభువు సందేశమును మీకందఁజేసితిని. మఱి మీ మేలును కోరితిని. కావున అవిశ్వాసులై పోయినవారినిగూర్చి ఏమి చింతింపవలెను అని షుఐబు పలికెను.

వ్యా॥ 88, 89. మద్యను వారిలో గర్వమువహించిన పెద్ద నాయకులు ఓ షుఐబు! నీబోధ మాకు పట్టదు. నీవు నీబోధ ప్రచారము వదలి మామతములోనికి రమ్ము. లేనిచో నిన్ను నీతోఁబాటు విశ్వాసులను మాపురమునుండి వెడలఁగొట్టెదము అని బెదరింపసాగిరి. అందుకు షుఐబు ప్రవక్త ఓ జనులార! మీమతము ధర్మమైనదికాదు. అందు అవిశ్వాసముగలదు. మీరు అనేక పాపములుచేయుచున్నారు. మీమతములోనికి వచ్చుటకుమాకిష్టములేదు. అట్లుమాకు ఇష్టములేకున్నను బలవంతముగా మీమతములో కలుపుకొనుదురా! అట్లు ఎన్నటికిని కానేరదు. దేవుఁడు మీదుర్మార్గమతము నుండి మమ్ము రక్షించి సన్మార్గము చూపిన పిదప మీమతములోనికి మేము రాఁజాలము. అట్లు మీమతములో చేరినచో దేవునిపై అబద్ధము కల్పించినవారగుదుము. ఎట్లన ఇంతవఱకు దేవుని సందేశము మీకు వినిపించి దేవుని మతమే సత్యమైనది. మేము సత్యమువలుకుచున్నారము అని పలికిన పిదప మీతప్పుదోవకు వచ్చినచో, మాప్రచారము అసత్యమని ఒప్పుకొనినట్లే గదా! అట్లు కానేరదు. మేము సత్యమును వదలఁజాలము. దేవుఁడు సర్వశక్తుఁడును సర్వజ్ఞుఁడును. ఆతఁడు మమ్ముమరల్పగలఁడు. కావున దేవుని యిష్టమును ఆటంకపఱచువారు ఎవరును లేరు. ఆతఁడు కోరినట్లు చేయఁగలఁడు, మాచేతిలోలేదు. మీ బెదిరింపుల వలన మాకు భయము లేదు. ఎందుకన మేము సర్వశక్తుఁడగు దేవునిపైననే యాధారపడియున్నారము. సర్వము ఆతని చేతిలోనున్నది. కావున మీమధ్యను మామధ్యను న్యాయముగ తీర్పుచేయుటకై ఆతనినే వేఁడుకొనుచున్నారము. ఆతనికంటె బాగుగ న్యాయముగతీర్పుచేయువారెవరును లేరు అని జవాబిచ్చెను.90.అపుడు దుష్టనాయకులు ప్రజలతో మీరు షుఐబు మాట వినినచో మీకు నష్టము గలుగును. మొదటిది మీతాతముత్తాతల మతము పోవును. తూనిక కొలతలలో సరిగా వర్తించుటవలన ఇహలోకలాభము పోవును అని సన్మార్గమునుండి తప్పించుటకు యత్నించిరి. కావున వారి పాపకార్యములు మితిమీఱిపోయెను. దేవుని శిక్షకు పాత్రులైరి. అపుడు వారిపై మేఘములు క్రమ్ముకొనెను. అందుఅగ్నిజ్వాలములుండెను. ఆకాశమునుండి భయంకరమైన శబ్దము గలిగెను. భూకంపమువచ్చి

తెల్లవారుసరికి అవిశ్వాసులు తమ తమ యిండ్లలో నేతలక్రిందులుగపడిచ చచ్చిరి.

వ్యా॥ 92. దుష్టనాయకులు షుఐబును అతనితోఁబాటు విశ్వాసులను పురమునుండి వెడలఁ గొట్టెదమని ప్రజ్ఞచేసిరిగదా! చూడుఁడు. వారిదుర్గతి ఏమాయెనో! వారు తమ నగరములో లేనట్లుగనే నశించి పోయిరి. వారు విశ్వసించిన నష్టము గలుగును అని పలికిరి గదా! తుదకు అవిశ్వాసులే నష్టము పొందిరి గదా! 93. షుఐబును ఆతనితోఁ బాటు విశ్వసించినవారును దేవునిచే రక్షింపఁబడిరి. మద్యను వారు నశించిన పిదప షుఐబు ప్రవక్త వారిని గూర్చి యిట్లు పలుకు చున్నాడు. నేను సర్వవిధముల మేలుకోరి దేవుని సందేశము అందజేసి మత ప్రచారము చేసితిని. కాని దుష్టులు వినక తమ కర్మల ఫలితము పొంది నశించిన వారి విషయము చింతించి ప్రయోజనములేదు. అవిశ్వాసుల దుర్గతిని చూచి ప్రజలు బుద్ధితెచ్చుకొని ఖురాను గ్రంథమును విశ్వసించి దేవుని ప్రీతి పడసి యుభయ లోకములలో జయము పొందుదురుగాక!

94. వ-మా-అర్-సల్నా-ఫీ-ఖర్యతిమ్ మిన్-నబియ్యిన్-ఇల్లా- అఖజ్నా-అహ్-లహా-బిల్-బాసాఇ-వజ్-జర్రాఇ-ల-అల్లహుమ్-యజ్-జర్ర- ఊన్. 95. సుమ్మ-బద్దల్నా-మకా-నస్-సయ్యి-అతిల్-హసనత-హత్తా- అఫౌ - వఖాలూ-ఖద్-మస్స-ఆబా-అనజ్-జర్రాఉ-వస్-సర్రాఉ ఫఅఖజ్నాహుమ్-బగ్-తతన్-వ హుమ్-లా-యష్-ఉరూన్.

94. మఱియు మేము ప్రవక్తను పంపిన ప్రతిపురములోను ఆఁదుండు వారు వినయముగల వారగుటకై వారికి కష్టమును దుఃఖమును గలుగఁ జేసితిమి. 95. ఆపిదప కీడును మేలుగా మార్చితిమి. తుదకు వారు వృద్ధిపొంది మాతాత ముత్తాతలకు కష్టములును సుఖములును గలిగినవి అనిపలుక సాగిరి. పిదప మేము వారిని ఆకస్మికముగ పట్టితిమి. మఱి వారికి (అది) తెలియకుండెను.

వ్యా॥ 94,95. దేవుఁడు తన ప్రవక్తలను ప్రజల యొద్దకు పంపుచువచ్చెను. ప్రజలు ప్రవక్తబోధ వినక తిరస్కారము వహించినచో ప్రజలకుబుద్ధి వచ్చి భయభక్తులు వహించుటకు గాను క్షామము రోగములు మొదలగు కష్టములు గలుగును. కష్టదుఃఖములు గలిగియు ప్రజలు సన్మార్గమునకు రానిచో కష్టములు తొలఁగి సౌఖ్యములు గలుగుచున్నవి. ఎందుకన ప్రజలు దేవుని మేలునుస్మరించి యైన కృతజ్ఞులై విశ్వాసు లగుదురేమోయని. కాని దుష్టస్వభావముగల దుర్మార్గులు ఇహలోక సౌఖ్యములకును సంపదలకును సంతాన వృద్ధికిని మోసపోయి మఱి హెచ్చుగా దుర్మార్గమునకు లోనై ప్రవక్తలను తిరస్కరించుచు కష్టమునకు వెనుక సుఖము వచ్చుచుండును. ఇట్లుండ

మా పూర్వికులైన తాతముత్తాతలకు కూడ సంభవించెను. ఇందువిశ్వాసమునకును అవిశ్వాసమునకును సంబంధము లేదు అని గర్వముతో పలుకుదురు. అపుడు ఆకస్మికముగ దుర్మార్గులకు తెలియకుండనే దేవుని శిక్షవచ్చి వారిని పట్టును. వారు తమ కర్మల ఫలితము పొంది నశింతురు. కావున మానవునకు నేదైన కష్టము గలిగినపుడు తాను చేయుచున్నట్టి పాపమును వదలి భయభక్తులు వహింపవలెను. సంపదలు సౌఖ్యములు లభించునపుడు దేవునియందుకృతజ్ఞతచూపవలెను. పాపములను మానుకొనవలెను.

96. వలౌ-అన్న-అహ్-లల్-ఖురా-ఆమనూ-వత్-తఖౌ-ల-ఫతహ్‌నా-అలైహిమ్-బరకాతిమ్-మినస్-సమాఇ-వల్-అర్‌జి-వలాకిన్-కజ్-జబూ-ఫ-అఖజ్‌నా-హుమ్-బిమా-కానూ-యక్-సిబూన్. 97. అఫ-అమిన-అహ్-లుల్-ఖురా-అన్-యాతి-యహుమ్-బాసునా-బయాతన్-వ హుమ్-నాఇ-మూన్. 98. ఔ అమిన అహ్-లుల్-ఖురా-అన్-యా-తియ-హుమ్-బాసునా-జు-హన్-వహుమ్-యల్-అబూన్. 99- అఫ-అమినూ - మక్-రల్లాహి-ఫలా-యా-మను మక్-రల్లాహి-ఇల్-లల్-ఖౌముల్-ఖాసిరూన్.

96. మఱియు పురనివాసులు విశ్వసించి భయభక్తులు వహించి యుండిరేని మేము ఆకాశమునుండియు వారికిఁగాను మేలు శుభము లొసంగి యుందుము. కానివారు మా సూచనలను తిరస్కరించిరి. కావున వారి కర్మలకు బదులుగా మేము వారిని పట్టితిమి. 97. ఏమి? పురనివాసులు రాత్రియందుపరుండియుండగనే మా శిక్ష (ఆపద) వారికి వచ్చును అను భయము వారికి లేదా! 98. లేక పురనివాసులు ప్రొద్దెక్కినపుడు ఆటాడుచుండునపుడు మాశిక్షవారికి వచ్చునని వారికి భయములేదా! 99. ఏమివారు దేవుని శిక్షనుండి నిర్భయులుగా నున్నారా! నష్టముపొందువారు తప్ప నితరు లెవరును దేవుని శిక్షనుండి నిర్భయులుగా నుండరు.

వ్యా॥ 96. ప్రజలను శిక్షింపవలెను అనియే దేవుని యిష్టము కాదు. దుర్మార్గులు తమ తమ దుర్మార్గముల వలన ప్రవక్తలను దేవుని సూచనలను తిరస్కరించి దేవుని శిక్షకు పాత్రులగుచున్నారు. ఏయే పురములకు దేవుఁడు తన ప్రవక్తలను పంపెనో అచ్చటివారు ప్రవక్తల మాటలను విని దేవుని విశ్వసించి సత్కార్యములు చేసి పాపకార్యములు వదలి భయభక్తులు వహించి యుండినచో వారు దేవుని దయకు పాత్రులై ఆకాశమునుండియు భూమినుండియు వారికి మేలు శుభములు, దేవుని యనుగ్రహములు గలిగియుండును. కాని

తెల్లవారుసరికి అవిశ్వాసులు తమ తమ యిండ్లలో నేతలక్రిందులుగ పడిచచ్చిరి.

వ్యా॥ 92. దుష్టనాయకులు షుఐబును ఆతనితోఁబాటు విశ్వాసులను పురమునుండి వెడలఁగొట్టెదమని ప్రజ్ఞచేసిరిగదా! చూడుఁడు. వారిదుర్గతి యేమాయెనో! వారు తమ నగరములో లేనట్లుగనే నశించి పోయిరి. వారు విశ్వసించిన నష్టము గలుగును అని పలికిరి గదా! తుదకు అవిశ్వాసులే నష్టము పొందిరి గదా! 93. షుఐబును ఆతనితోఁ బాటు విశ్వసించినవారును దేవునిచే రక్షింపఁబడిరి. మధ్యను వారు నశించిన పిదప షుఐబు ప్రవక్త వారిని గూర్చి యిట్లు పలుకు చున్నాఁడు. నేను సర్వవిధముల మేలుకోరి దేవుని సందేశము అందఁజేసి మత ప్రచారము చేసితిని. కాని దుష్టులు వినక తమ కర్మల ఫలితము పొంది నశించిన వారి విషయము చింతించి ప్రయోజనములేదు. అవిశ్వాసుల దుర్గతిని చూచి ప్రజలు బుద్ధితెచ్చుకొని ఖురాను గ్రంథమును విశ్వసించి దేవుని ప్రీతి పడసి యుభయ లోకములలో జయము పొందుదురుగాక!

94. వ-మా-అర్-సల్నా-ఫీ-ఖర్యతిమ్ మిన్-నబియ్యిన్-ఇల్లా- అఖజ్నా-అహ్-లహా-బిల్-బాసాఇ-వజ్-జర్రాఇ-ల-అల్లహుమ్-యజ్-జర్ర-ఊన్. 95. సుమ్మ-బద్దల్నా-మకా-నస్-సయ్యి-అతిల్-హసనత-హత్తా- అఫౌ - వఖాలూ-ఖద్-మస్స-ఆబా-అనజ్-జర్రాఉ-వస్-సర్రాఉ ఫఅఖజ్నాహుమ్-బగ్-తతన్-వహుమ్-లా-యష్-ఉరూన్.

94. మఱియు మేము ప్రవక్తను పంపిన ప్రతిపురములోను అందుండు వారు వినయముగల వారగుటకై వారికి కష్టమును దుఃఖమును గలుగఁజేసితిమి. 95. ఆపిదప కీడును మేలుగా మార్చితిమి. తుదకు వారు వృద్ధిపొంది మాతాతముత్తాతలకు కష్టములును సుఖములును గలిగినవి అనిపలుక సాగిరి. పిదప మేము వారిని ఆకస్మికముగ పట్టితిమి. మఱి వారికి (అది) తెలియకుండెను.

వ్యా॥ 94,95. దేవుఁడు తన ప్రవక్తలను ప్రజల యొద్దకు పంపుచువచ్చెను. ప్రజలు ప్రవక్తబోధ వినక తిరస్కారము వహించినచో ప్రజలకుబుద్ధి వచ్చి భయభక్తులు వహించుటకు గాను క్షామము రోగములు మొదలగు కష్టములు గలుగును. కష్టదుఃఖములు గలిగియు ప్రజలు సన్మార్గమునకు రానిచో కష్టములు తొలఁగి సౌఖ్యములు గలుగుచున్నవి. ఎందుకన ప్రజలు దేవుని మేలునుస్మరించి యైన కృతజ్ఞులై విశ్వాసు లగుదురేమోయని. కాని దుష్టస్వభావముగల దుర్మార్గులు ఇహలోక సౌఖ్యములకును సంపదలకును సంతాన వృద్ధికిని మోసపోయి మఱి హెచ్చుగా దుర్మార్గమునకు లోనై ప్రవక్తలను తిరస్కరించుచు కష్టమునకు వెనుక సుఖము వచ్చుచుండును. ఇట్లుకూడ

మాపూర్వీకులైన తాతముత్తాతలకు కూడసంభవించెను. ఇందువిశ్వాసమునకును అవిశ్వాసమునకును సంబంధము లేదు అని గర్వములో పలుకుదురు. అపుడు ఆకస్మికముగ దుర్మార్గులకు తెలియకుండనే దేవుని శిక్షవచ్చి వారిని పట్టును. వారు తమ కర్మల ఫలితము పొంది నశింతురు. కావున మానవునకు నేదైన కష్టము గలిగినపుడు తాను చేయుచున్నట్టి పాపమును వదలి భయభక్తులు వహింపవలెను. సంపదలు సౌఖ్యములు లభించునపుడు దేవునియందుకృతజ్ఞతచూపవలెను. పాపములను మానుకొనవలెను.

96. వలౌ-అన్న-అహ్-లల్-ఖురా-ఆమనూ-వత్-తఖౌ-ల-ఫతహ్‌నా-అలైహిమ్-బరకాతిమ్-మినస్-సమాఇ-వల్-అర్‌జి-వలాకిన్-కజ్-జబూ-ఫ - అఖజ్‌నా-హుమ్-బిమా-కానూ-యక్-సిబూన్. 97. అఫ-అమిన-అహ్ - లుల్-ఖురా-అన్-యాతి-యహుమ్-బాసునా-బయాతన్-వ హుమ్-నా ఇ-మూన్. 98. ఔ అమిన అహ్-లుల్-ఖురా-అన్-యా-తియ-హుమ్-బాసునా-జు-హాన్-వహుమ్-యల్-అబూన్. 99- అఫ-అమినూ - మక్-రల్లాహి-ఫలా-యా-మను మక్-రల్లాహి-ఇల్-లల్-ఖౌముల్-ఖాసిరూన్.

96. మఱియు పురనివాసులు విశ్వసించి భయభక్తులు వహించి యుండిరేని మేము ఆకాశమునుండియు వారికిఁగాను మేలు శుభము లొసంగి యుందుము. కానివారు మా సూచనలను తిరస్కరించిరి. కావున వారి కర్మలకు బదులుగా మేము వారిని పట్టితిమి. 97. ఏమి? పురనివాసులు రాత్రియందుపరుండియుండగనే మాశిక్ష (ఆపద) వారికి వచ్చును అను భయము వారికి లేదా! 98. లేక పురనివాసులు ప్రొద్దెక్కినపుడు ఆటాడుచుండునపుడు మాశిక్షవారికి వచ్చునని వారికి భయములేదా! 99. ఏమివారు దేవుని శిక్షనుండి నిర్భయులుగా నున్నారా! నష్టముపొందువారు తప్ప నితరు లెవరును దేవుని శిక్షనుండి నిర్భయులుగా నుండరు.

వ్యా॥ 96. ప్రజలను శిక్షింపవలెను అనియే దేవుని యిష్టము కాదు. దుర్మార్గులు తమ తమ దుర్మార్గముల వలన ప్రవక్తలను దేవుని సూచనలను తిరస్కరించి దేవుని శిక్షకు పాత్రులగుచున్నారు. ఏయే పురములకు దేవుఁడు తన ప్రవక్తలను పంపెనో అచ్చటివారు ప్రవక్తల మాటలను విని దేవుని విశ్వసించి సత్కార్యములు చేసి పాపకార్యములు వదలి భయభక్తులు వహించి యుండినచో వారు దేవుని దయకు పాత్రులై ఆకాశమునుండియు భూమినుండియు వారికి మేలు శుభములు, దేవుని యనుగ్రహములు గలిగియుండును. కాని

వారట్లు చేయక అవిశ్వాసులై ప్రవక్తలను తిరస్కరించి పాపకార్యములు చేయసాగిరి. దానికి ఫలితముగ వారు నశించిరి. 97. ఇంక ఈవాక్యములలో హజ్రత్ పైగంబరులవారిని నమ్మక అవిశ్వాసులైన వారికి మందలింపు గలదు. హజ్రత్ ముహమ్మదు వారికిపూర్వముండిన జనులు ప్రవక్తలను నమ్మనందున నశించిరి. ఇంక రసూలు వారిని విశ్వసించని వారికిఁగూడ అదుర్గతి పట్టునని వారికి భయములేదా! రాత్రిపూఁట మైమఱచి నిద్ర సౌఖ్యములో నిమగ్నులై యున్నపుడు దేవుని శిక్షవచ్చి వారిపైఁ బడిన వారేమి చేయఁగలరు. ఎందుకువారు నిర్భయులుగా నున్నారు. లేక పగటిపూఁట ఇహలోక కార్యములలోను ఆట పాటల లోను నిమగ్నులై యున్నపుడు ఆకస్మికము దేవుని శిక్ష వచ్చునని వారికి భయము లేదా! మఱెందులకు నిర్భయులుగా నున్నారు. దేవుని శిక్షకు భయపడక ఇహలోక భోగములలో మునిగి పోవుట నష్టము పొందువారి పని. కావున ఉభయ లోకములలో నష్టమునుండి తప్పించుకొనుటకు దేవుని శిక్షకు భయపడి విశ్వసించి సత్కార్యములుచేయుట మానవులధర్మము అని హెచ్చరింపఁబడియె.

100. అవ-లమ్-యహ్‌ది-లిల్-లజీన-యరి-సూనల్-అర్జ-మిమ్-బఅది-అహ్‌-లిహా-అల్-లౌ-నషాఉ-అసబ్నాహుమ్-బి-జునూ-బిహిమ్-వనత్-బఉ-అలా-ఖులూ-బిహిమ్-ఫహుమ్-లా-యస్-మఊన్. 101. తిల్కల్-ఖురా-నఖుస్సు అలైక-మిన్-అంబా-ఇహా-వ-లఖద్-జాఅత్-హుమ్-రుసులుహుమ్-బిల్-బయ్యినాతి-ఫమా-కానూ-లి-యూమినూ-బిమా-కజ్-జబూ-మిన్-ఖబ్లు కజాలిక-యత్-బ-ఉల్లాహు-అలా-ఖులూ-బిల్-కాఫిరీన్. 102. వమా-వజద్నా-లి-అక్-సరిహిమ్-మిన్-అహ్-దిన్-వ-ఇన్-వజద్నా-అక్-సర-హుమ్-ల-ఫాసిఖీన్.

100. భూమిపై నున్నవారు నశించిన పిదప భూమికి వారసులైనట్టివారిని మేము కోరినచో వారి పాపములకుఁగాను వారిని పట్టుదుము అనునది వారికి స్పష్టపడలేదా. మఱిమేము వారి హృదయములపై ముద్ర వేసియున్నారము. కావున వారు (బోధను) వినరు. 101. మఱియు ఈ పురముల విషయములు కొన్నిటిని నీకుఁదెలుపుచున్నారము. మఱి నిశ్చయముగా వారియొద్దకు వారప్రవక్తలు సూచనలు తీసికొని వచ్చియున్నారు. ముందువారు తిరస్కరించి యున్నదానిని మరల విశ్వసింపరైరి. ఇట్లు అవిశ్వాసుల హృదయములపై దేవుఁడు ముద్రవేయు చున్నాఁడు. 102. మఱి వారిలోని పెక్కుమంది వారు చేసిన ఒడంబడికను నెరవేర్చునట్లు మేము కనుఁగొనలేదు. మఱి వారిలోని పెక్కుమందిని అవిధేయులుగ కనుగొంటిమి.

వ్యా॥ 100. పూర్వము అనేకులు, ప్రవక్తల బోధలను వినక అవిశ్వాసులైనందున నశించిరి. వారిపిదప భూమికి వారసులైనట్టివారు తమ పూర్వికుల దుర్గతిని చూచి బుద్ధి తెచ్చుకొనవలెను. తాముకూడ పాపములు చేసినచో పూర్వికుల వలె దేవుని శిక్షకు పాత్రులగుదురని వారికి స్పష్టముగాఁ దెలియు లేదా అని హెచ్చరింపఁ బడియెను. 101. మానవుఁడు ఒకతూరి ఒక విషయమును అబద్ధమని తలఁచి దాని తిరస్కరించినచో ఎన్నితూర్లు బోధించినను వాఁడు నమ్మఁడు. ఆస్థితిలో వాని హృదయముపై ముద్ర పడిపోయి బోధను వినఁజాలఁడు. ఆస్థితినే దేవుఁడు ముద్రవేసెను అని చెప్పఁ బడియెను. కావున ప్రవక్తలు జనులకు దేవుని సూచనలు బోధించి తమ ధర్మమును నెరవేర్చిరి. తిరస్కరించినట్టి జనులు దేవుని కోపమునకు పాత్రులైరి. 102. మానవు లందఱును తాము పుట్టక పూర్వము దేవునితో నీవు మాప్రభువని ఆత్మలోకము (ఆలమె అర్వాహ్) లో ఒప్పుకొని యున్నారు. ఆ యొడంబడిక (అహదు)ను దెలుపుటకై ప్రవక్తలువచ్చి దేవునినే పూజింపుఁడు అనిబోధించిరి. కాని పెక్కురు మానవులు తాము చేసియుండిన వాగ్దానము నెరవేర్చక విగ్రహారాధనలో పడిపోయి దేవునికి అవిధేయులైరి. మఱియు కష్టములు పడినపుడు పెక్కురు మానవులు దేవునిని ప్రార్థించి కష్టములు తొలఁగిన విశ్వసింతుము అని పలికియు దాని నెరవేర్చక అవిధేయులైరి. పెక్కుమంది మానవులు పరస్పరము చేయు ఒడంబడికలను కూడ నెరవేర్చక అవిధేయు లగుచున్నారు అని చెప్పఁ బడియెను.

103. సుమ్మ-బఅస్నా-మింబఅ-దిహీమ్-మూసా-బిఆ-యాతినా-ఇలా-ఫిర్-ఔన-వ-మల-ఇహీ-ఫజలమూ-బిహా-ఫన్-జుర్-కైఫ-కాన-ఆఖి-బతుల్-ముఫ్సిదీన్. 104. వ-ఖాల-మూసా-యా-ఫిర్-ఔను-ఇన్నీ-రసూలుమ్-మిర్-రబ్బిల్ ఆలమీన్. 105. హఖీ-ఖున్-అలా-అల్-లాఅఖూల-అ-లల్లాహి-ఇల్లల్-హఖ్-ఖద్-జీతుకుమ్-బి-బయ్యినతిమ్-మిర్-రకుబ్బిమ్-ఫఅర్-సిల్-మఇయ-బనీఇస్రా-ఈల్. 106. ఖాల-ఇన్‌కున్త-జీత-బి-ఆయతిన్-ఫాతి-బిహా-ఇన్-కున్త-మినస్-సాదిఖీన్. 107.ఫఅల్ ఖా-అసాహు-ఫఇజా హియ సుఅ-బానుమ్-ముబీన్. 108. వనజఅ-యదహూ-ఫఇజా-హియ-బైజాఉ-లిన్-నాజిరీన్.

103. ఆపిదప, వారి తరువాత మేము మూసాకు మా సూచనల నిచ్చి యాతనిని ఫిర్ఔను, యొద్దకును వాని నాయకులయొద్దకును పంపితిమి. కావున వారు ఆసూచనలను తిరస్కరించి యవిశ్వాసులైరి, కావున దుర్మార్గులగతి యే

మారెనో చూడుము. 104.మఱియు మూసా "ఓ ఫిర్ ఔను" నేనుసర్వలోక ములప్రభువుయొక్క ప్రవక్తను. 105. దేవుని నుండి సత్యము మాత్రమే పలుకుట నాకు దగును, మీప్రభువునుండి సూచనను తీసికొనివచ్చి యున్నాఁడను. "కావున ఇస్రాయీలియులను నా వెంటపంపి వేయుము." అని పలికెను. 106. నీవు ఏదైన సూచన తెచ్చి యుంటివేని నీవు సత్యవంతుఁడవే యేని దానిని దీసికొని రమ్ము" అని ఫిర్ఔను పలికెను, 107. అపుడు మూసా తన చేతికఱ్ఱను క్రిందఁబడ వేయఁగా అదిస్పష్టమైన పెద్దపాము ఆయెను. 108. మఱియు మూసా తన చేతిని తీయఁగా అది చూచువారికి తెల్లగా కనఁబడెను.

వ్యా॥ 103. ఇఁక ఈవాక్యములలో నూహు హూదు సాలిహ లూతు షుఐబు ప్రవక్తల పిదప వచ్చిన ప్రవక్త మూసా విషయము చెప్పఁబడుచున్నది. ఫిర్ఔను ఈజిప్టు (మిసరు) నకు రాజు. ఆతఁడు ప్రభుత్వగర్వముతో తానే దేవుఁడని పలుకుచు ప్రజలు తన్ను పూజింప వలెనని చాటించెను. ఇస్రాయీలియులను బానిసలుగఁ జేసికొని వారిని హింసించుచుండెను. ఇస్రాయీలియులను ఫిర్ఔను బాధనుండి రక్షించుటకుఁగాను దేవుఁడు మూసా ప్రవక్తను నియమించెను. మూసాప్రవక్త ఫిర్ఔనును పలువిధములుగ బోధించి వానికిని వాని నాయకులకును దేవుని సూచనలు చూపించెను. కాని ఫిర్ఔనుతోఁబాటు వానిజనులు దేవుని సూచనలను తిరస్కరించి దేవుని శిక్షకు పాత్రులై నశించిరి. వారి గతి తెలిసికొని ప్రజలు బుద్ధితెచ్చుకొనవలెను. 104. మూసాప్రవక్తఫిర్ఔను వద్దకు పోయి నేను దేవుని ప్రవక్తను. నీకు లోఁబడియున్న ఇస్రాలీయులను నా వెంట పంపివేయుము. సిరియా దేశమునకు వారిని దీసికొని పోవుదును. వారు స్వేచ్ఛముగా తమ దేవుని ప్రార్థింపఁగలరు. సిరియా దేశము ఇస్రాయీలియుల దేశము. వారిపెద్దలగు హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్త ఇరాఖు దేశమును వదలి సిరియాలోనే వసింపసాగిరి. పిదప యూసుఫు ప్రవక్తకాలములోఇస్రాయీలియులు ఈజిప్టునకు పోయి వసింపసాగిరి. ఆపిదప ఫిర్ఔను కాలములో ఇస్రాయీలియులకు అనేక బాధలు కలుగసాగెను. వారిని రక్షించుటకు దేవుఁడు మూసాను ప్రవక్తగాఁ జేసి ఫిర్ఔను వద్దకు పంపెను. నేను దేవుని ప్రవక్త అని తెలుపు సూచనకూడ నేను తెచ్చియున్నాను అనిపలుకఁగా ఫిర్ఔను దానిని చూపించుము అనెను. అపుడుమూసా ప్రవక్త తనచేతికఱ్ఱను నేలపైవేయఁగానే అది పెద్దపాముఆయెను. అది చూచి ఫిర్ఔను భయపడసాగెను. మరల మూసాప్రవక్త ఆపామును తన చేతితో పట్టుకొనగానే అది తిరిగి చేతికఱ్ఱగా మాఱిపోయెను. రెండవ సూచన మూసాప్రవక్త యిట్లు చూపెను. తన చేతిని తన చంకలోనికి దీసికొని పోయి బయటికిఁ దీయఁగానే అది తెల్లగా చాల కాంతితో ప్రకాశింప సాగెను. అది అందఱును చూచిరి. దీని పిదప జరిగినవిష

యము రాఁబోవు వాక్యములలో చెప్పఁబడినది.

109. ఖాలల్-మలఉ-మిన్-ఖౌమి-ఫిర్-ఔన-ఇన్న హాజా-ల-సాహిరున్ అలీమ్. 110. యురీదు-అన్-యుఖ్-రిజకుమ్-మిన్-అర్-జికుమ్-ఫ-మాజా-తామురూన్. 111. ఖాలూ-అర్జిహ్-వ-అఖాహు-వ-అర్-సిల్-ఫిల్-మదాఇని-హాషిరీన్. 112. యాతూక-బికుల్లి-సాహిరిన్-అలీమ్. 113. జాఅస్-సహ-రతు-ఫిర్-ఔన-ఖాలూ-ఇన్న-లనా-ల-అజ్రిన్-ఇన్-కున్నా-నహ్ నుల్-గాలిబీన్. 114. ఖాల-నఅమ్-వ-ఇన్నకుమ్-లమినల్-ముఖర్రబీన్. 115. ఖాలూ-యా-మూసా ఇమ్మా-అన్-తుల్-ఖియ-వ-ఇమ్మా-అన్-నకూన-నహ్ నుల్-ముల్-ఖీన్. 116. ఖాల-అల్-ఖూ-ఫలమ్మా-అల్-ఖౌ-సహరూ-అఅ-యు-నన్నాసి-వస్తర్-హబూహుమ్-వ-జాఊ-బి-సిహ్రిన్-అజీమ్. 117. వ-ఔ-హైనా-ఇలా-మూసా-అన్-అల్-ఖి-అసాక-ఫ-ఇజా-హియ-తల్-ఖఫు-మా-యాఫికూన్. 118. ఫవఖ-అల్-హఖ్-ఖు-వ-బతల-మా-కానూ-యఅ-మలూన్. 119. ఫ-గులిబూ-హునాలిక-వన్-ఖలబూ-సాగిరీన్. 120. వ-ఉల్-ఖియస్-సహ-రతు-సాజదీన్. 121. ఖాలూ ఆమన్నా-బి రబ్బిల్-ఆలమీన్. 122. రబ్బి-మూసా-వహారూన్.

109. ఫిర్ఔను జనుల నాయకులు ఈతఁడు జాలవిద్యనెఱింగిన గొప్ప మంత్రికాఁడుగా నున్నాఁడు. 110. మిమ్ము మీ దేశమునుండి వెడలఁగొట్టవలెనని కోరుచున్నాఁడు. కావున మీరేమి సెలవిత్తురు అని పలికిరి. 111. ఓ ఫిర్ఔను ఆతనికిని ఆతని సహోదరునకును కొంతకాలము గడువునిమ్ము. మఱి నీవు పురములలో బంటులను పంపుము. 112. వారు పోయి జాలవిద్య నెఱింగిన గొప్ప మంత్రికాండ్రను నీయొద్దకు తీసికొని వత్తురు అని పలికిరి. 113. మంత్రకాండ్రు ఫిర్ఔనుయొద్దకు వచ్చి మేము గెలినచో మాకు కూలి (బహుమానము) ఉన్నదా అని పలికిరి. 114. ఫిర్ఔను, ఔను. మఱియు మీరు నిశ్చయముగా ఆస్థానములో చేరినవారగుదురు అని పలికెను. 115. వారు ఓమూసా తొలుత నీవు వేయుదువా లేక మేము వేయుదుమా అనిపలికిరి. 116. మూసా! మీరే వేయుఁడు అని పలికెను. ఆపిదప వారు వేసి ప్రజల కన్నులకు కట్టుకట్టిరి. మఱి వారు ప్రజలకు భయము గలిగించిరి. మఱి వారు గొప్ప జాలవిద్యను తెచ్చిరి. 117. మఱియు మేము ఓమూసా! నీచేతికఱ్ఱను పడవేయుము అని సెలవిచ్చితిమి. అపుడు అది మంత్రకాండ్రు కల్పించినదానిని మ్రింగసాగెను.

118. కావున నిజము స్పష్టపడెను. మఱి వారు చేసినది అసత్యమాయెను. 119. కావున ఫిర్ఔను జను లచ్చట ఓడిపోయి అవమానము పొంది మరలిరి. 120. 121. మఱి మంత్రికాండ్రు సాష్టాంగ నమస్కారము (సిజ్దా) చేసి మూసా హారూనులకు ప్రభువును సర్వలోకముల పోషకుఁడునగు దేవునిని మేము విశ్వసించితిమి అని పలికిరి.

వ్యా॥ 109. మూసా ప్రవక్త చూపిన సూచనలను ఫిర్ఔను చూచి భయపడి ఇది గొప్ప జాలవిద్య యని తలఁచి తన ప్రజలను, నాయకులను సమావేశపఱచి వారి యభిప్రాయము అడిగెను. ఆ సభలో నాయకులు, ప్రజలతో అయ్యా! మూసా గొప్ప జాలవిద్య నెఱింగినవాఁడుగా నున్నాఁడు. అతఁడు తన జాలవిద్య బలమున ప్రజలను తనకు విధేయులుగాఁ చేసికొని మిమ్ము మీ దేశమగు మిసరునుండి వెడలఁగొట్టవలెనని కోరుచున్నాఁడు. కావున మీ యభిప్రాయము తెలుపుఁడు. ఏమి చేయవలెను అని అడుగఁగా అందఱును ఫిర్ఔనుతో నిట్లు విన్నవించిరి. మూసా హారూనుల విషయము తొందఱపడ వలదు. వారిద్దఱికిని కొంత గడువునిచ్చి యంతలో బంటులను పురములలోనంపి గొప్పగొప్పమంత్రకాండ్రను రప్పించి మూసాను ఓడింపవలెను. (హారూనుమూసాప్రవక్త సహోదరుఁడు. దేవునిచే మతప్రచారమునందు మూసాకు తోడుగా నియమింపఁబడెను.) ఫిర్ఔను తన ప్రజలమాట సమ్మతించి తనబంటులనుపంపి పెద్దపెద్దమంత్రకాండ్రను రప్పించెను. 113.మంత్రికాండ్రు ఫిర్ఔనువద్దకు వచ్చి మేముగెలిచితిమేని మాకుబహుమానము (కూలి) ఇత్తువాఅనియడిగిరి.(అట్లువారు కూలి అడుగుటవలన వారి మధ్యను ప్రవక్తమధ్యను భేదము తెలియనాయెను. ఎట్లన ప్రవక్త చేయు మతప్రచారమునకును కూలి (బదులు.) అడుగఁడు అపుడు ఫిర్ఔను కూలి ఏమి? దానికంటె హెచ్చుగా నొసఁగుదును. మీరు నా దర్బారులో నుండగలరు అని పలికెను. 115. దాని పిదప మంత్రకాండ్రును ఫిర్ఔను జనులును ఒక మైదానములో చేరిరి. అపుడు మూసా ప్రవక్తతో ఓయీ మూసా! నీవు తొలుత నీచేతికఱ్ఱను పడవేయుదువా లేక మేము మాచేతి కఱ్ఱలను త్రాళ్ళను పడవేయవలెనా అని మంత్రికాండ్రు ప్రశ్నించిరి. దానికి మూసాప్రవక్త ముందు మీరే వేయుఁడు. మీబలమునంతను చూపుఁడు. తరువాత నేను నాచేతికఱ్ఱను వేయుదును. అపుడు సత్యము, అసత్యము ప్రజలకు తెలియనగును అని పలికెను. అపుడు మంత్రకాండ్రు తమ తమ చేతికఱ్ఱలను త్రాళ్ళను భూమిపై పడవేసిరి. అవి పాములవలె ప్రజలకు కనఁబడునట్లు ప్రజల కన్నులకు కట్టుకట్టిరి. మైదానమంత పాములుండునట్లు ప్రజలకు తోఁచి ప్రజలు భయపడసాగిరి. అపుడు మూసాప్రవక్త దేవుని సెలవుపొంది తన చేతి కఱ్ఱను పడవేయఁగానే అది పెద్దపామై మంత్రకాండ్రు కల్పించియున్నదానిని

మ్రింగసాగెను. మంత్రిగాండ్రు ఏమియు చేయలేకపోయి ఓడిపోయిరి. ఆపిదప వారు మూసా చూపినది జాలవిద్యకాదు. అది దేవునివలన గలిగిన సూచన అని నమ్మి విశ్వాసులైరి. ఫిర్‌ఔనును, వాని జనులును ఓడిపోయి అవమానముపొంది అచ్చటినుండి మరలిపోయిరి. 120. మంత్రకాండ్రు దేవుని మహిమ చూచి పరవశులై సిజ్దా చేసిరి. ఫిర్‌ఔను తాను దేవుడని పలుకుచుండినందువలన వారు తమ విశ్వాసము వెల్లడించునపుడు, ఎవఁడు మూసా హారూనులకు ప్రభువో ఆతఁడు మాప్రభువు. ఆతఁడే సర్వలోకములను పోషించు దేవుఁడు ఆతనినే విశ్వసించితిమి అని పలికిరి.

123. ఖాల-ఫిర్‌ఔను-ఆమన్తుమ్-బిహీ-ఖబ్ల-అన్-ఆజన-లకుమ్- ఇన్న-హాజా-ల-మక్రుమ్-మకర్-తుమూహు-ఫిల్-మదీనతి-లి-తుఖ్-రిజూ - మిన్‌హా-అహ్‌లహా-ఫసౌఫ-తఅ-లమూన్. 124. ల-ఉఖత్తి-అన్న-ఐది-యకుమ్-వ - అర్‌జులకుమ్-మిన్- ఖిలాఫిన్-సుమ్మ-ల-ఉసల్లి బన్నకుమ్-అజ్-మఈన్. 125. ఖాలూ ఇన్నా-ఇలా-రబ్బినా-మున్-ఖలిబూన్. 126. వమా-తన్-ఖిము-మిన్నా- ఇల్లా-అన్-ఆమన్నా-బి-ఆయాతి-రబ్బినా-లమ్మా-జాఅత్నా-రబ్బనా-అఫ్-రిగ్- అలైనా-సబ్రన్-వ-వ-తఫ్-ఫనా-ముస్లిమీన్.

123. ఫిర్‌ఔను, నేను సెలవియ్యక మునుపే మీరు విశ్వసించితిరా! ఇది మీరందఱు కలిసి యీపురమునుండి ప్రజలను వెడలఁగొట్టవలెనని మీరు ఇచ్చట గావించిన కుట్రగా నున్నది. కావున మీరిపుడే తెలిసికొనఁగలరు. 124. నేను తప్పక మీ(యొక్క-ప్రక్క-) చేతులను, మఱొక ప్రక్క కాళ్ళను కోసి వేయుదును. పిదప మి మ్మందఱను ఉరి సిలువపై నెక్కింతును అని పలికెను. 125. వారు "మేము తప్పక మాప్రభువునొద్దకు పోవలసినవారలము. 126. మా ప్రభువు సూచనలు మాయొద్దకు వచ్చినపుడు మేము వానిని నమ్మితిమి అనియేగదా! నీవు మాతో విరోధించుచున్నావు. ఓ మాప్రభువా! మాకు సహన మొసంగుము. మఱి ముసల్మానులుగ మృతినొందునట్లును చేయుము అని పలికిరి.

వ్యా॥ 123. ఫిర్‌ఔనుకు వాని జనులయెదుట గలిగిన అవమానమును పోఁగొట్టుకొనుటకును ప్రజలు తన్ను వదలిపోకుండుటకును విశ్వసించిన మంత్రకాండ్రతో నిట్లు చెప్పసాగెను. "ఓహో! మీరందఱు గొప్ప కుట్ర సలిపినారు. మూసా మీకు జాలవిద్యలో గురువు కాఁబోలు! ఇట్లు కుట్ర సలిపి ఇచ్చటి నివాసులగు ఖిబ్తీలను తఱుమఁగొట్టి మీరు ఇచ్చటి రాజ్యము స్వాధీన

పట్టుచుకొనవలెనని యత్నించితిరా! మీరు నా సెలవులేనిదే మూసాను ఎందుకు నమ్మితిరి. మి మ్మందఱి విషయము నేను ఏమిచేయనున్నానో శీఘ్రములోనే తెలిసికొనగలరు. అది యేమన, మీకుడి చేతులను మీ యెడమకాళ్ళను నఱికి మిమ్ము సిలువపై నెక్కింతును అని పలికెను. 125. అపుడు విశ్వసించినమంత్ర కాండ్రు ఓ ఫిర్ఔను! ఏమి చేసిన చేయుము. మేము విశ్వాసము వదలము. మేము మా ప్రభువునొద్దకు పోవువారలము. సరే! నీవే మమ్ము చంపిన మాకు పర్వాలేదు. నీయిష్టముచొప్పున చేయుము. నీవు మాతో విరోధించుటకు కారణములేదు. మేము మూసాప్రవక్త మూలమున దేవుని సూచనలు చూచి విశ్వసించితిమి. విశ్వాసము వదలము. కావున నీవు పెట్టు కష్టములను మేముసహించునట్లు ఓపిక మాకు దేవుఁడొసంగి మమ్ము ఇస్లామ్‌నందు స్థిరముగా నుంచి ముసల్మానులుగ మమ్ము చంపునట్లు మా ప్రభువగు దేవుని ప్రార్థించుచున్నారము అని తమ దృఢవిశ్వాసము వెల్లడించిరి. దుష్టులు ఎంత హింసించినను భక్తులగు ముసల్మానులు ఇట్లు తమ దృఢవిశ్వాసమును వెల్లడింతురుగాక!

127. వఖాలల్ మలఉ-మిన్ ఖౌమి-ఫిర్ఔన-అతజరు-మూసా-వ-ఖౌమహూ లి యుఫ్-సిదూ ఫిల్-అర్ జి-వయజరక--వ-ఆలి-హాతక -ఖాల-సనుఖత్తిలు అబ్-అనాహుమ్ వనస్-తహ్ ఈ-నిసా-అహుమ్ వ-ఇన్నా-ఫౌఖ-హుమ్ ఖాహిరూన్. 128. ఖాల-మూసా-లి-ఖౌమి హిస్-త-ఈనూ-బిల్లాహి-వస్ - బిరూ - ఇన్నల్-అర్ జ-లిల్లాహి-యూరిసుహా-మన్-యషాఉ-మిన్-ఇబాదిహీ - వల్ - ఆఖిబతు-లిల్ - ము త్త-ఖీన్. 129. ఖాలూ-ఊజీనా మిన్-ఖబ్లి-అన్-తాతీనా-వ మింబఅది-మా-జీతనా-ఖాల-అసా రబ్బుకుమ్ అన్-యుహ్-లిక అదువ్వకుమ్ - వ-యస్-తఖ్ లిఫకుమ్-ఫిల్ -అర్ జి-ఫయన్ జుర-కైఫ-తఅ-మలూన్.

127. ఫిర్ఔనుజనుల నాయకులు, ఏమి నీవుమూసాను, ఆతనిజనులను వదలుచున్నావా! వారు దేశములో ఉపద్రవములు గలిగించి నిన్నును నీవిగ్రహములను ఆపివేయుదురుగదా! అని ఫిర్ఔనుతోఁ బలికిరి. ఫిర్ఔను "మేము వారి కొమారులనుజంపి వారికుమార్తెలను బ్రతుకనిచ్చెదము. మఱి మేము వారిపై నధికారబలముగలిగియున్నారము" అనిపలికెను. 128.మూసా తనజనులతో దేవుని సహాయము కోరుఁడు. మఱి ఓర్పుగలిగియుండుఁడు. నిశ్చయముగా భూమి దేవునిది. తన భక్తులలో తాను కోరినవారికి దానికి వారసులుగఁ జేయును. తుదకు మంచి ఫలితము భయభక్తులుగలవారికున్నది అని పలికెను. 129. నీవు మాయొద్దకు రాకమునుపును, నీవు వచ్చిన పిదపను మేము బాధింపఁబడితిమి అని మూసాజనులు

పలికిరి సమీపములోనే మీ ప్రభువు మీ శత్రువును నాశముచేసి మిమ్ము దేశములో రాజులుగఁ జేయును పిదప మీరెట్లు వర్తింతురో దేవుఁడు చూచును అని మూసా పలికెను.

వ్యా॥ 127. మంత్రకాండ్రు విశ్వసించినందువలన ఇస్రాయీలీయులను, కొందఱు ఫిర్ఔను జనులగు ఖిబ్తీలును మూసా ప్రవక్తను అనుసరింపసాగిరి. కావున ఫిర్ఔను జనుల నాయకులు భయపడి ఫిర్ఔనుతో నీవు మూసాను, ఆతని జనులను స్వేచ్ఛగా వదలిపెట్టినచో వారు ప్రజలను తమవైపు మరల్చుకొని దేశమును తమ వశము చేసికొని నిన్ను నీ విగ్రహములను దేవతలను ప్రజలు వదలిపెట్టునట్లు వారు చేయుదురు, కావున ఇస్రాయీలీయుల విషయము కఠినముగా వర్తింపవలెను అని పలికిరి. (ఫిర్ఔను తాను పెద్దదేవుఁడు అని పలుకుచు కొన్ని చిల్లర దేవత విగ్రహములను తన విగ్రహములనే పూజించునట్లు శాసించి యుండెను.) నాయకుల మాట విని సరే ఇస్రాయీలీయుల మగబిడ్డలను చంపి ఆఁడుబిడ్డలను వదలిపెట్టుఁడు అని పలికెను. మూసాపుట్టకపూర్వము కూడ ఫిర్ఔను ఇస్రాయీలీయుల మగబిడ్డలను వధించుచుండెను. అదియెందుకన :— జ్యోతిష్కులు ఇస్రాయీలీయులలో నొకఁడు పుట్టును. ఆతనివలన నీ రాజ్యము నశించును అని పలికిరి. 128. ఫిర్ఔను పలికిన విషయము విని ఇస్రాయీలీయులు భీతిల్లిరి. అపుడు మూసా ప్రవక్త మీరు భయపడవలదు. దేవుని సహాయము కోరుచు దుష్టులు పెట్టు కష్టములకు ఓర్పుగలిగియుండుఁడు. సర్వము దేవుని చేతిలో నున్నది. భూమి దేవునిది. తాను కోరినవారికి అందలి రాజ్యము ఒసంగును. మఱి తుదకు విజయము భక్తులకే లభించును అని నిశ్చయింపుఁడు అని పలికెను. 129. అపుడు ఇస్రాయీలీయులు ఏమయ్యా! నీవు మాయొద్దకు రాకమునుపు మాకు పలువిధములైన కష్టములు గలిగినవి. ఫిర్ఔను మాపుత్రులను వధించుచు మమ్ము బానిసలుగఁజేసి హింసించుచుండెను. ఇపుడు నీవు వచ్చిన పిదపకూడ మాకు అట్టి కష్టములు రానున్నవే. ఎపుడు ఈ కష్టములు పోవునో అని పలుకసాగిరి. దానికి మూసాప్రవక్త వారినిట్లు ఓదార్చెను. ఇఁక మీరు భయపడనక్కఱలేదు. దేవుని సహాయము మీకు శీఘ్రములోనే రానున్నది. మీ శత్రువు నశించును. వాని దేశము, రాజ్యము సుమస్తము మీకు లభించును. ఎట్లు ఇపుడు మీకు కష్టములలో దేవుని పరీక్షకలుగుచున్నదో అటులే మీరు రాజ్యసౌఖ్యములలో ఎట్లు ప్రవర్తింతురో అను పరీక్ష కలుగును. సంపదలు కలిగినపుడు మానవుఁడు వినయమువహించి దేవునికికృతజ్ఞుఁడై యుండవలెను. ఈ వాక్యములు హజ్రత్ రసూలువారికి మక్కాపురములో లభించినవి. అపుడు మక్కా ఖురైషులు (కాఫిర్లు) పైగంబరులవారికిని వారి శిష్యులకును పెట్టరాని బాధలు పెట్టుచుండిరి, దానికి ముసల్మానులు ఓర్చుకొని

యుండిరి. వీరి శత్రువు బలవంతుఁడుగా నుండెను. ఎట్లు ఫిర్ఔను బాధనుండి ఇస్రాయీలియులు రక్షింపఁబడి శత్రువుపై జయముపొందిరో అటులే ముసల్మానులు కూడ తమ శత్రువుపై జయముపొందుదురు అను ఈవాక్యముల మూలమున హెచ్చరింపఁబడియెను. దేవుని సహాయమువలన అటులే ముసల్మానులు జయముపొందిరి. మఱియు ఖురైషులు (కాఫిర్లు) నశించిరి.

130. వ-లఖద్-అఖజ్నా-ఆల-ఫిర్ఔన-బిస్-సినీన-వనఖ్-సిమ్మినస్ సమరాతి-ల-అల్లహుమ్-యజ్-జక్కరూన్. 131. ఫ-ఇజా-జాఅత్-హుముల్-హసనతు-ఖాలూ-లనా-హాజిహీ-వ-ఇన్-తుసిబ్-హుమ్-సయ్యిఅతున్-యత్-తయ్యరూ-బి-మూసా-వ-మమ్-మఅహూ-అలా-ఇన్నమా-తాఇరుహుమ్-ఇన్దల్లాహి-వలా-కిన్న-అక్-సరహుమ్-లా-యఅ-లమూన్. 132. వ-ఖాలూ-మహ్మా-తాతినా-బిహీ-మిన్-ఆయతిల్-లి-తస్-హరనా-బిహా-ఫమా-నహ్నులక-బి-మూమినీన్. 133. ఫ-అర్-సల్నా-అలైహిముత్-తూఫాన-వల్-జరాద-వల్-ఖుమ్మల-వజ్-జఫా-దిఅ-వద్-దమ-ఆయాతిమ్-ముఫస్-సలాతిన్-ఫస్తక్-బరూ-వ-కానూ-ఖౌమమ్-ముజ్రి-మీన్. 134. వలమ్మా-వఖఅ-అలైహిముర్-రిజ్జు-ఖాలూ-యా-మూసద్ఉ-లనా-రబ్బక-బిమా-అహిద-ఇన్దక-లఇన్-కషఫ్త-అన్నర్-రిజ్జ-ల-నూమినన్న-లక-వల-నుర్-సిలన్న-మఅక-బనీ-ఇస్రాయీల్. 135. ఫలమ్మా-కషఫ్నా-అన్-హుముర్-రిజ్జ-ఇలా-అజలిన్-హుమ్-బాలిగూహు ఇజా-హుమ్-యన్-కుసూన్. 136. ఫన్-తఖమ్నా-మిన్-హుమ్-ఫ-అగ్రఖ్-నాహుమ్-ఫిల్-యమ్మి-బి-అన్నహుమ్-కజ్-జబూ-బి-ఆయాతినా-వ-కానూ-అన్హా-గాఫిలీన్. 137. వ-ఔ-రస్-నల్-ఖౌమల్-లజీన-కానూ-యుస్-తజ్-అఫూన-మషా-రిఖల్-అర్జి-వ-మగా-రిబీ-హాల్-లతీ-బారక్నా-ఫీహా-వతమ్మత్-కలిమతు-రబ్బి-కల్-హుస్నా-అలా-బనీ-ఇస్రాఈల-బిమా-సబరూ-వ-దమ్మర్నా-మా-కాన-యస్-నఉ-ఫిర్-ఔను-వ-ఖౌముహూ-వ-మా-కానూ-యఅ-రిషూన్.

130. మఱియు ఫిర్ఔను జనులు బోధను గ్రహించుటకుఁగాను వారికి కఱవును ఫలముల నష్టమును గలిగించితిమి. 131. ఆ పిదప వారికి మేలు కలిగినచో అపుడు ఇది మాకు తగినది. మఱి వారికి కీడు కలిగినచో ఇది మూసా

యొక్కయు, ఆతని జనులయొక్కయు అపశకునమువలన గలిగినది అని పలుకుదురు. వినుఁడు. వారి యపశకునములన్నియు దేవునియొద్దనున్నవి. కాని వారిలో పెక్కుమంది యెఱుంగరు. 132. మఱి నీవు ఏదైన సూచన తెచ్చిదాని వలన మాపై జాలవిద్య చేసినను మేము నిన్ను విశ్వసించువారలము కాము అని వారు పలుకసాగిరి. 133. ఆ పిదప మేము వారిపై తుపానును మిడుతల దండును పేనులను కప్పలను రక్తమును అను సూచనలను వేర్వేఱుగా పంపితిమి. ఆ పిదపకూడ వారు గర్వము వహించుచుండిరి. మఱి వారు పాపులుగ నుండిరి. 134. మఱియు వారిపై నేదైన బాధపడినపుడు ఓ మూసా! నీవు నీ ప్రభువు తెలిపిన రీతిగా మాకొఱకు ఆతనితో వేఁడుము. నీవు మానుండి యీ బాధను తొలగించితివేని మేము తప్పక నిన్ను విశ్వసింతుము. మఱి యిస్రాయీలీయులను నీవెంటఁ బంపివేయుదుము అని పలుకుదురు. 135. ఆ పిదప మేము వారు పూర్తి చేయవలసిన గడువువఱకు వారినుండి బాధను తొలగింపగానే వారు తమ యొడంబడికను తెంపివేయుచుండిరి. 136. కావున మేము వారిని శిక్షించితిమి. మఱి వారు మా సూచనలను తిరస్కరించి వానినిలక్ష్యపెట్టకుండి నందులకు వారిని సముద్రములో ముంచి వేసితిమి. 137. మఱి ఎవరు బలహీనులుగ నెంచఁబడుచుండిరో వారికి మేము శుభములుంచిన భూమియొక్క తూర్పు పడమరలకు వారసులుగఁ జేసితిమి. మఱియు ఇస్రాయీలీయులు ఓర్పు గలిగియున్నందున వారివిషయము నీప్రభువుచేసియున్న మంచివాగ్దానము పూర్తియాయెను. మఱియు ఫిర్ఔనును ఆతని జనులును చేసియున్నదానిని వారు ఎత్తుగాఁజేసి నిర్మించియున్నదానిని నాశముచేసితిమి.

వ్యా॥ 130:131. దీనికి పూర్వపు వాక్యములలో దేవుఁడు ఫిర్ఔనును వాని జాతిని నాశము చేయును అని ఇస్రాయీలీయులతో చెప్పఁబడెను. ఇఁక ఈ వాక్యములలో వారికి క్రమముగా కలిగిన వినాశము చెప్పఁబడు చున్నది మొట్ట మొదట ఫిర్ఔను జనులు తమ దుష్టత్వమును వదలి బుద్ధితెచ్చుకొని మూసా ప్రవక్త బోధను అంగీకరించుటకుఁగా క్షామమును ఫలముల నష్టమును గలుగసాగెను. కాని ఫిర్ఔను జాతివారు సన్మార్గమునకు రాక మఱి హెచ్చుగా దుర్మార్గమునకు లోనైరి. ఆపిదప క్షామము తొలఁగి బాగుగ వర్షము పడి మేలు గలిగెను. అపుడు మా యదృష్టము మంచిది. మాకుఁ దగినట్లు మాకు సౌఖ్యములు గలుగుచున్నవి. దానికి మేము అర్హులము అని చెప్పెదురు. మఱి దాని మధ్యలో ఏదైన ఒక బాధ గలిగినపుడు అయ్యో యిది మూసాయొక్కయు ఆతని జనులయొక్కయుదురదృష్టము వలననువారి అపశకునమువలనను ఈకీడు మూడినది అని మూసాను నిందింతురు. వాస్తవములో వారికి సంభవించిన బాధలకును కీడునకు కారణములు వారి పాపకార్యములే. కాని వారికది తెలియదు.

సర్వము దేవునికిఁ దెలియును. 132. మూసాప్రవక్త చూపించిన దేవుని సూచన (మోజిజా) లను ఫిర్ఔను వారలుచూచి అయ్యో! నీవెన్ని సూచనలుచూపించిజాల విద్యచేసి కట్టుకట్టినను మేమువిశ్వసింపము. ఎందుకు వృథా పాటుపడుదువు అని పలికిరి. ఇంత మూఢత్వము వహించినవారు విశ్వసింతురు అను ఆశ ఎవరికి నుండఁగలదు. 133. కావున వారిపై విడివిడిగా ఆపదలు గలుగసాగెను. మొట్టమొదట తుఫాను వచ్చి పంటలు పాడగునని భీతిగలిగెను. అపుడు ఫిర్ఔను జనులు మూసాతో ఈ ఆపద పోవునట్లు నీవు దేవునిని వేడుకొని దానిని తొలగి పుము. మేము నిన్ను విశ్వసించి ఇస్రాయీలియులను బానిసత్వమునుండి వదలిపెట్టి స్వేచ్ఛగా నీవెంట పోవునట్లు వారికి స్వాతంత్ర్య మొసంగుదుమని పలుకసాగిరి. అటులే మూసా ప్రవక్త దేవునిని ప్రార్థింపఁగ తుపాను నిలిచి పంటలు బాగుగ పండసాగెను. ఆపద తొలఁగఁగానే ఫిర్ఔను జనులు గావించిన తమ వాగ్దానము మఱచి గర్వము వహించిరి. ఆపిదప మిడుతల దండు వారిపొలములపై పడెను. ఫిర్ఔను జనులు దానికి భయపడి తిరిగి మూసాతో వేడుకొనఁగా ఆ యాపద తొలఁగెను. కాని దుష్టులు తమ మాటను మఱచి తిరిగి గర్వము వహించిరి. ఆపిదప ఫిర్ఔను జనుల దేహములలోను వస్త్రములలోను ధాన్యములలోను పేనులు అమితముగ పడసాగెను. వారు ఆ బాధకు తాళలేక తిరిగి మూసాతో వేఁడుకొనఁగా అబాధ తొలఁగెను. కాని దుష్టులు విశ్వసింపలేదు. దానిపిదప దుష్టుల యిండ్లలో కప్పలబాధ అధికమాయెను. ఏకుండలో చూచిన కప్పలే కనఁబడసాగెను. దుష్టులకు ఆబాధవలన చాల విసుగుపుట్టెను. అపుడు పూర్వము వలె మూసాతో వేఁడగా ఆబాధ తొలఁగెను. కాని దుష్టులు విశ్వసింపలేదు. దానిపిదప దుష్టుల అన్నమును నీళ్లును నెత్తురుగా మాఱిపోసాగెను. ఆబాధకు దుష్టులు సహింపలేక మునుపటి వలె తిరిగి మూసాతో వేఁడుకొనఁగా ఆయన దేవుని ప్రార్థింపఁగా ఆబాధ తొలఁగెను. కాని దుష్టులు విశ్వసింపనేలేదు, వారిదుష్టత్వము పరిపూర్ణమాయెను. కావున దేవుఁడు మూసాను, ఇస్రాయీలియులను రక్షించి ఫిర్ఔనును ఆతని జనులను ఎఱ్ఱ సముద్రములో ముంచిచంపెను. 134. బాధగలుగునపుడు పశ్చాత్తాప పడినచో ఆబాధ తొలఁగును అని దేవుని మాట యున్నది. దాని ననుసరించి బాధ తొలఁగినచో మేము విశ్వసింతుము అని లేదా ఓ మూసా దేవుఁడు నీకు నేర్పిన ప్రార్థన పద్ధతి ననుసరించి ప్రార్థింపుము. దేవుఁడు అంగీకరించును అని పలికిరి. 135. ఒక బాధపోయి మఱొక ఆపదవచ్చు గడువులోనే ఫిర్ఔను వారలు తాము విశ్వసించి ఇస్రాయీలియులను పంపి వేయుదుము అని పలికిన మాటను తప్పి పోసాగిరి. 136. కావున ఫిర్ఔనును వాని జనులను సముద్రములో ముంచితిమి. అది యెట్లన దేవుని సెలవు పొంది మూసా తనజను

లగు ఇస్రాయీలీయులను వెంట తీసికొని మిసరు (ఈజిప్టు) వదలి సిరియా (షామ్) దేశమునకు ప్రయాణమాయెను. ఈ విషయము ఫిర్ఔనుకుఁ దెలిసి తన సైన్యముతో వారిని వెంబడించెను. వారి దారిమధ్య ఎఱ్ఱసముద్రముండెను. దేవుని మహిమవలన అందు దారి కలుగఁగా వారు సముద్రము దాటి పోయిరి. ఇది చూచి ఫిర్ఔనుకూడ తన జనులతో ఆదారిన పోయెను. దారి మధ్యలో చీలిపోయి యున్న సముద్రము తిరిగి కలిసికొనగా ఫిర్ఔను తన జనులతోఁబాటు మునిగిపోయెను. 137. బలహీనులుగ నున్నవారు ఇస్రాయీలీయులు. అట్టివారికి దేవుఁడు ఈజిప్టు (మిసరు) సిరియా (షాము) దేశములొసంగెను. సిరియా దేశములోని భూమి చాల శ్రేష్ఠమైనది. అచ్చట మంచి పంటలును ఫలములును పండును. గొప్పగొప్ప ఫలముల వనములుగలవు. అచట అనేక ప్రవక్తల సమాధులు గలవు. కావున చాల శుభముగల దేశము. అటులే మిసరు కూడ చాల ఫలవంతమైన దేశము. అందు యూసుఫ్ ప్రవక్త రాజ్యము చేసిరి. అచ్చటనే వారి సమాధిగలదు. యాఖూబు ప్రవక్త కూడ అచ్చటికి పోయి యుండిరి. మూసాప్రవక్త అచ్చటనేపుట్టి పెరిగి పెద్దయాయెను. కావున అచ్చటకూడ శుభములుగలవు. దేవుఁడు తానుఇస్రాలీయులకు మేలుచేయుదునని చేసిన వాగ్దానము పూర్తిచేసెను. ఫిర్ఔను జనులు గావించుచున్న కుట్రలు సాగక తుదకు వారు దేవుని కోపమునకు పాత్రులైరి. వారు కట్టిన పెద్ద పెద్ద మేడలు భూమికి సమములుగా నైపోయెను. ఇట్లుదుష్టులు నశించి భక్తులు శుభములు పొందిరి.

138. వజా-వజ్‌నా-బిబనీ-ఇస్రాఈ-లల్-బహ్ర_ఫ-అతౌ-అలా-ఖౌమిన్ యఅ-కుఫూనఅలా-అస్నా-మిల్-లహుమ్-ఖాలూ-యామూ - సజ్-అల్-లనా ఇలాహన్-కమా-లహుమ్ ఆలి-హతున్-ఖాల-ఇన్న కుమ్- ఖౌమున్- తజ్ - హలూన్.139.ఇన్న-హౌఉలా-ఇ-ము-తబ్బ-రుమ్-మాహుమ్-ఫీహి-వ-బాతి-లుమ్-మాకానూ-యఅమలూన్. 140. ఖాల-అగై-రల్లాహి-అబ్-గీకుమ్-ఇలాహన్-వ-హువ-ఫజ్-జలకుమ్-అలల్-ఆల మీన్- 141. వఇజ్-అన్-జైనా-కుమ్-మిన్-అలి-ఫిర్-ఔన-యసూ మూనకుమ్-సూఅల్-అజాబి-యుఖత్తి-లూన- అబ్నా-అకుమ్-వ-యస్-తహ్‌-యూన-నిసా అకుమ్-వ-ఫీ-జాలి-కుమ్-బలా-ఉమ్ - మిర్-రబ్బికుమ్-అజీమ్.

138. మఱియు మేము ఇస్రాయీలీయులను సముద్రము దాటింపఁగా వారు విగ్రహములను పూజించుచునట్టి జనుల యొద్దకు వచ్చిరి. వారుఓమూసా!

వీరి విగ్రహములవలెనొకవిగ్రహము మాకొఱకు నిర్మించుము అని పలుకసాగిరి. మూసా “నిశ్చయముగ మీరు పామరజనులుగా నున్నారు. 139. వీరాచరించునది నాశమగును. మఱివీరు చేయునది తప్పు” అని పలికెను. 140. “ఏమి? దేవుని వదలి వేఱు దేవునిని మీకొఱకు నేను కోరవలయునా! మఱి ఆతఁడే సర్వ లోకులపై మీకు ఘనత నొసంగెను.” అని మూసా పలికెను. 141 మఱియు ఫిర్ఔను జాతివారలు మీపుత్రులను చంపి మీకుమార్తెలను సజీవులుగనుంచుచు మీకు ఘోరబాధలు గలిగించుచుండగ మేము మిమ్ము రక్షించిన దానినిస్మరింపుఁడు. మఱి యిందు మీ ప్రభువునుండి మీకు గొప్ప మేలుగలుగెను.

వ్యా॥ 138:141. దేవునిమహిమ వలన ఇస్రాయీలియులుసముద్రమును సురక్షితముగా దాఁటి పోయిరి. వారు పోవు మార్గమునందు ఒక జాతి వారు ఆవు విగ్రహములను పూజించుచుండిరి. అది చూచి యిస్రాయీలియులు మాకుఁగూడ ఒక విగ్రహము నిర్మింపుము. మేము దానినిపూజింతుమని పలుక సాగిరి. అది మూసాప్రవక్తవిని “ఓయీ జనులారా! మీరు పామరులుగా నున్నారు. మీకు దేవుని మహిమ తెలియదు. విగ్రహారాధన తప్పు. అది యధర్మము. నామూలమున ఈ విగ్రహారాధన నాశము కానున్నది. ఏమి సర్వసత్తుఁడగు దేవుని వదలి కదలని మెదలని విగ్రహమును మీకొఱకు చేయవలెనా? అది యెన్నటికిని కానేరదు. దేవుఁడు మీకు చేసిన మేలును స్మరింపుఁడు. మీకు సర్వసృష్టిపై ఘనతనొసంగియున్నాఁడు. మానవులు తమచేతులార చెక్కిన విగ్రహములను పూజించుట సరికాదు. అది జ్ఞానధర్మములకు విరుద్ధము. అదియునుగాక, ఫిర్ఔను నుండి మీకుఁ గలుగుచున్న బాధలనుండి దేవుఁడు మిమ్ము రక్షించెను. ఇంతలోనే దేవుని మేలు మఱచి, రాళ్లను కర్రలను పూజించుట చాల శోచనీయము అని మందలించెను. (ఈజప్టులో ఫిర్ఔను జనులు విగ్రహారాధన చేయువారు. ఇస్రాయీలియులు వారికి లోఁబడియుండి వారితో కలసిమెలసియుండువారు. ప్రతిదినము, విగ్రహారాధన చూచుచుండుటవలన వారికికూడ అందు మనస్సుపోయెను. దానియలవాటుపడెను. కావున వారు తుదకు బంగారుతో ఆవుదూడను చేసికొని పూజింపసాగిరి. ఈ విషయము రాఁబోవు వాక్యములలో చెప్పఁబడును.)

142. వ-వాఅద్నా-మూసా-సలాసీన-లై-లతన్-వఅత్-మమ్-నాహా-బిఅ-షిరిన్-ఫతమ్మ-మీఖాతు-రబ్బిహీ-అర్బ-ఈన-లైలతన్-వ-ఖాల-మూసా-లిఅఖీహి-హారూ-నఖ్-లుఫ్-నీ-ఫీఖౌమీ-వ-అస్-లిహ్-వలా-తత్-తబిఅ-సబీ-ఉల్-ముఫ్-సిదీన్-వలమ్మా-జాఅ-మూసా-లి-మీఖాతినా-వ-కల్లమహూ-రబ్బుహూ

ర్బ్బి-అరినీ-అన్-జుర్-ఇలైక-ఖాల-లన్-తరానీ-వ-లాకినిన్-జుర్-ఇలల్
ఇనిస్-తఖర్ర-మకాన-హూ-ఫసౌఫ-తరానీ-ఫలమ్మా-తజల్లా-రబ్బుహూ
లి-జఅ-లహూ-దక్కన్-వఖర్ర-మూసా సఇఖన్-ఫలమ్మా-అఫాఖ-ఖాల
నక-తుబ్తు-ఇలైక-వఅనా-అవ్వలుల్-మూమినీన్. 144. ఖాల-యా-
-ఇన్నిస్ తఫైతుక-అలన్నాసి-బిరిసాలాతీ-వ-బి-కలామీ-ఫఖుజ్-మా-ఆ
క-వ-కుమ్ మినష్-షాకిరీన్. 145. వ-కతబ్నా-లహూ-ఫిల్-అల్-వాహి-మిన్
ఇన్-మా-ఇజతన్-వ-తఫ్-సీలల్-లికుల్లి-షై-ఇన్-ఫ-ఖుజ్‌హా-బి-ఖువ్వతిన్-
ముర్-ఖౌమక-బి-అహ్-సనిహా స-ఉరీకుమ్-దారల్-ఫాసిఖీన్. 146. స
ఫు-అన్-ఆయాతి-యల్ లజీన-యత-కబ్బరూన-ఫిల్-అర్‌జి-బిగైరిల్-
ని-వఇన్-యరౌ-కుల్ల-ఆయతి-ల్-లాయూమినూ-బిహా-వఇన్-యరౌ-స
ర్-రుష్‌ది-లా-యత్-తఖిజూహు-సబీలన్-వఇన్-యరౌ-సబీలల్-గయ్యి-
తఖిజూహు-సబీలన్-జాలిక-బి-అన్నహుమ్ కజ్-జబూ-బి-ఆయాతినా-వ-
-అన్‌హా-గాఫిలీన్. 147. వల్లజీన-కజ్-జబూ-బి-ఆయాతినా-వ-లిఖా-అల్
తి-హబి-తత్-అఅ-మాలుహుమ్-హల్ యుజ్-జౌన-ఇల్లా-మా-కానూ-
మలూన్.

2. మఱియు మేముమూసాతో ముప్పదిరాత్రులు వాగ్దానముచేసితిమి. మఱి
రాత్రులు హెచ్చుగాఁజేసి దానిని పూర్తిచేసితిమి. కావున ఆతని ప్రభువు
గడువు నలుబది రాత్రులు పూర్తిగనాయెను. మఱియు మూసా
సహోదరుఁడగు హారానుతో "నీవు నాకు బదులుగ నాజనులలోనుండి
చుచుండుము. మఱి దుష్టుల మార్గము ననుసరింపకుము" అని పలికెను.
మఱియు మూసా మేము నియమించిన కాలమునకు రాఁగా ఆతని ప్రభు
ఆతనితో మాటలాడెను. మూసా ఓనాప్రభువా! నీవు నాకు అగఁబడుము.
నిన్ను చూచెదను అని పలుకఁగా నీవు నన్ను చూడలేవు. కాని నీవుపర్వ
వైపు చూడుము. అది తన స్థానములో నిలిచినచో నీవు నన్ను చూచెదవు
నేవుఁడు పలికెను. ఆ పిదప ఆతని ప్రభువు పర్వతముపై ప్రకాశింపఁగా
తునుకలు తునుకలుగాఁ జేసివేసెను. మఱి మూసా తెలివి తప్పి పడి
ను. పిదప తెలివివచ్చి ఓప్రభువా! నీవు పరమపవిత్రుఁడవు. నీతో క్షమా

పణ కోరుచున్నాఁడను. మఱి అందఱికంటె ముందు నేను విశ్వాసము తెచ్చిన వాఁడను అని మూసా పలికెను. 144.ఓమూసా! ప్రజలందఱిలోను నీకు నాసందేశము నిచ్చి నీతో మాటలాడి నిన్ను నేను ఎన్నుకొంటిని. కావున నేను నీకొసంగినదానిని తీసికొనుము. మఱి కృతజ్ఞుఁడవగుము అని దేవుఁడు పలికెను. 145. మఱియు మేము మూసాకొఱకు పలకలలో సర్వవిధములైన బోధలను అన్నివిషయములకు వివరమును వ్రాసితిమి.. కావున వానినిగట్టిగా పట్టుకొనుము. మఱి అందలి చాల యుత్తమములైన ధర్మములను గ్రహించునట్లు నీజనులకు ఆజ్ఞాపించుము. సమీపములోనే అవిధేయుల నివాసము మీకు చూపెదను. 146. అన్యాయముగా భూమిపై గర్వముచేయువారిని నాసూచనలనుండి మరలింతును. మఱి వారు అన్ని సూచనలను చూచినను వానిని విశ్వసింపరు. మఱివారు ధర్మమార్గమునుచూచినచో దానినిమార్గముగ గ్రహింపరు. మఱివారు, అధర్మమార్గమునుచూచినచో దానిని మార్గముగగ్రహింతురు. ఇది ఎందుకన, వారు మా సూచనలను తిరస్కరించి వానిని లక్ష్యము చేయకుండిరి. 147. మఱెవరు మాసూచనలను పరలోక దర్శనమును నమ్మక తిరస్కరించిరో వారి కర్మలు వృథాపోయెను. వారు తాము చేయుచున్న కర్మల ఫలితమే వారు పొందుదురు.

వ్యా॥ 142. ఇస్రాయీలీయులు పలువిధములైన బాధలనుండి రక్షణ పొంది శాంతితో నండుచు, దేవుఁడు మాకు ధర్మములు పంపిన మేము అనుసరింతుము అని మూసా ప్రవక్తతో విన్నవించిరి. దానికిఁగాను మూసా ప్రవక్త దేవునిని వేఁడగా తూరుకొండయొద్ద వచ్చి నలువది రాత్రులు వసించి ప్రార్థన సలిపిన మత ధర్మము లొసంగుదునని దేవుఁడు సెలవిచ్చెను. మూసా ప్రవక్త ఆ గడువును పూర్తిచేయుటకు సిద్ధమై పోవుచు తనకు బదులుగ ఇస్రాయీలీయుల పైఅధికారిగ తనసోదరుఁడగు హారూనును నియమించెను. జనులు తప్పత్రోవల పోకుండునట్లు బోధచేయుచు సవరించుచుండవలెను. నా వెనుక దుష్టులు చేయు నుపద్రవములను సవరించుచు వారి మార్గము అనుసరింపకుండుము అనిచాల తాకీదు చేసిపోయెను. 148. మూసా ప్రవక్త తూరుకొండకు పోయి జీఖాదా మొదటి తేదినుండి జిల్ హజ్ పదియవ తేది (నలువది దినములు) పూర్తిగ ఉపవాసముండుచు ప్రార్థన సలిపెను. దాని పిదప దేవుఁడు మూసాతో మాటలాడెను. దేవుని మాటలు వినగానే దేవునిని దర్శింపవలెనని మూసాకు ఉత్సాహముగలిగి ఓ దేవా! నీ దివ్యదర్శనము నాకు చూపింపుము. నీవు నాకు కనఁబడుము. నేను నిన్ను చూచెదను అని విన్నవించెను. అపుడు దేవుఁడు నా దర్శనమును ఎద్దియును భరింపఁజాలదు. ఇహలోకములోని అస్థిరమైన వారి కన్నులు నన్ను చూడఁజాలవు. నీవుకూడ చూడలేవు. అయిన పర్వతమువైపు చూడుము. అది స్థూలవస్తువులలో గట్టిది. అది నా తేజస్సును భరింపఁగలిగనచో

నీకన్నులుకూడ భరింపఁగలవు. పర్వతము భరింపలేనిచో నీవునుసహింపఁజాలవు అని పలికి దేవుఁడు తన కొంత తేజస్సును పర్వతమునకు చూపెను. అది తత్క్షణమే దేవుని తేజస్సును భరింపఁజాలక బ్రద్దలై పోయెను. మూసా ఆ పర్వతమునకు సమీపములోనే నిలిచి చూచుచుండినందువలన దాని భయంకరమైనస్థితిని చూచి ఆతఁడుకూడ తెలివితప్పిపడిపోయెను. (ఒకపుడు పిడుగు ఒక వస్తువుపై పడి దానిని కాల్చివేయునపుడు సమీపములోనుండి చూచువారుకూడ తెలివి తప్పి పడిపోవుదురుగదా! అటులే ఇచ్చట నూహింపవలెను.) కొంతసేపునకు మరల మూసాకు తెలివి వచ్చెను. అపుడు ఆతఁడు ఓ దేవా! నేను కోరరాని కోరికను కోరితిని. దేహసంబంధమైన కన్నులు ఇహలోకమందు నీదర్శనమును సహింపఁజాలవు అని నమ్మితిని. ఇట్లు ప్రత్యక్షరూపమున విశ్వసించిన వారిలో నేను మొదటివాఁడను. నాపొరపాటును క్షమింపుము అని విన్నవించెను. 144. అపుడు దేవుఁడు ఓ మూసా! నీకు నాదర్శనము లభింపలేదని చింతింపకుము. నీతో నేను స్వయముగ మాటలాడితిని. నాసందేశము నీకిచ్చి నిన్నుప్రవక్తగఁ జేసి, అందఱిలోను నిన్ను ఎన్నుకొంటిని. ఇదియు గొప్పయనుగ్రహమేగదా! కావున నే నొసంగినవి మనఃపూర్వకముగఁ దీసికొని కృతజ్ఞత సలుపుచు నుండుము అని సెలవిచ్చెను. 145. ఆపిదప దేవుఁడు మూసా ప్రవక్తకు తౌరాతు గ్రంథ మొసంగెను. అది పలకలలో వ్రాయఁబడియుండెను. ఆ పలకలలో, సర్వవిధముల బోధలును సర్వవిషయముల వివరములును వ్రాయఁబడియుండెను. వానిని తీసికొని స్థిరముగా వాని ననుసరింపవలెనని మూసాప్రవక్తమూలమున ఇస్రాయీలియులకు దేవుని సెలవయ్యెను. అందలి సర్వధర్మములును ఉత్తమములైనవియేను. అయిన అందు కొన్ని ధర్మములు ఒకటికంటె నొకటి మంచివిగా నుండును. అదియెట్లన:—ఎవఁడైన ఒకనికి కష్టము కలిగించినచో దానికి బదులు తీసికొనుట న్యాయమైన ధర్మము. అయిన ఓర్పువహించి బదులు తీసికొనక క్షమించుట చాల మంచిది. భక్తులు సదా యుత్తమోత్తమధర్మములను అనుసరింపవలెనని ప్రోత్సహింపఁబడియెను. కావున సర్వధర్మముల ననుసరించి దేవునికి విధేయులై యుండవలెను అట్లుకాకఅవిధేయులైనచో, అవిధేయులకు నివాసమగు నరకము వారుపొందవలసివచ్చును.146. ఎవరు అన్యాయముగ దేవుని సూచనలవిషయము గర్వము వహించి ప్రవక్తలను తిరస్కరింతురో వారుతమ గర్వమువలన దేవునిసూచనలను విశ్వసింపరు. వారు తమగర్వములో ధర్మమార్గముచూచినను దానిననుసరింపక అధర్మమార్గమును అనుసరింతురు. దీనికి కారణము వారు దేవుని సూచనలను అసత్యములని తలఁచి వాని విషయము అశ్రద్ధ చూపుటయే. ఇట్టిస్థితిలో మానవుఁడున్నపుడు వానికి ధర్మబోధ వలన ప్రయోజనముండదు. 147. కావున వారు దేవుని సూచనలను తిరస్కరించి పరలోకము

లేదని తలంచి తమ కోరికలను అనుసరించి చేయు కర్మలు వృథాపోవును. వాని వలన నరకము తప్పి మోక్షములభింపదు. ఎవరు ఎట్టికర్మలుచేయుదురో వారు వానికిఁ దగినఫలితముపొందుదురు.

148. వత్-తఖజ-ఖౌము మూసా-మింబఅ-దిహీ-మిన్-హులియ్యి-హిమ్-ఇజ్ లన్-జసదల్-లహూ-ఖువారున్ అలమ్-యరౌ అన్నహూ-లా-యు-కల్లిము-హుమ్ వలా యహ్దీహిమ్-సబీలన్-ఇత్-తఖ-జూహు-వకానూ-జాలి-మీన్. 149. వలమ్మాసుఖిత-ఫీ-ఐదీ హిమ్ వ రఔ-అన్నహుమ్-ఖద్-జల్లూ-ఖాలూ-లఇల్ లమ్ యర్-హమ్నా-రబ్బునా-వ - యగ్-ఫిర్-లనా లనకూనన్న-మినల్-ఖాసిరీన్. 150. వలమ్మా-రజఅ - మూసా - ఇలా - ఖౌమిహీ - గజ్బాన-అసి-ఫన్-ఖాల-బీ-స మాఖలఫ్-తుమూనీ-మిం-బఅదీ-అ అజిల్తుమ్-అమ్ర - రబ్బికుమ్ వ-అల్-ఖల్-అల్-వాహ-వ-అఖజ-బి రాసిఅఖీహి యజుర్రుహూ ఇలైహి ఖాలబ్న ఉమ్మ ఇన్నల్-ఖౌ-మస్-తజ్-అఫూనీ-వ-కాదూ-యఖ్-తులూ-ననీ ఫలా-తుష్ మిత్-బియల్-అఅ దాఅ-వలా-తజ్-అల్నీ మఅల్-ఖౌమిజ్ - జాలిమీన్. 151. రబ్బిగ్-ఫిర్ లీ-వ-లి-అఖీ-వ-అద్ ఖిల్నా-ఫీరహ్మతిక-వ అన్త-అర్-హముర్-రాహిమీన్.

148. మఱియు, మూసా జనులు ఆతని పిదప తమ నగలతో నొక యావుదూడ విగ్రహమును చేసిరి. అందు శబ్దముండెను. ఏమి అది వారితో మాటలాడుట లేదనియు, వారికి మార్గము కూడ చూపుట లేదనియు వారు చూడలేదా! వారు దానిని దేవునిగాఁ జేసికొనిరి. మఱి వారు దుర్మార్గులైరి. 149. మఱి వారు పశ్చాత్తాపపడి తాము మార్గము తప్పిరి యని తెలిసికొని నపుడు మాప్రభువు మమ్ము కరుణించి క్షమింపకున్నచో మేము తప్పక నాశము పొందినవారలమగుదుమని చెప్పసాగిరి. 150. మఱియు మూసా తనజనుల యొద్దకు వచ్చినపుడు కోపముతో నిండి చింతించుచుండెను. నేనువెళ్ళిన పిదప మీరు నా వెనుక ఆచరించినది చాల చెడ్డది. మీప్రభువుయాజ్ఞనుగూర్చి ఏదులకు తొందరపడితిరి అని మూసా పలికెను. మఱియు పలకలను పడవేసి తనసహోదరుని తల పట్టి తన వైపునకు ఈడ్చసాగెను. అపుడు "ఓ నాతల్లి కుమారుఁడా! జనులు నన్ను బలహీనునిగ నెంచి నన్ను చంపనుండిరి. కావున శత్రువులు నాపై నవ్వునట్లు చేయకుము. మఱి నేను పాపులవర్గమునకు చేరినవాఁడని నీవు తలంపకుము" అని హారూను పలికెను. 151. ఓనాప్రభువా! నన్నును నాసహోదరుని

క్షమింపుము. మఱి మమ్ము నీకరుణకు పాత్రులుగఁ జేయుము. మఱి నీవు అందఱికంటె నధికముగా కరుణించువాఁడవు అని మూసా పలికెను.

వ్యా॥ 148. ఇస్రాయీలియులవద్ద ఫిరౌనువారి నగలుండెను. మూసా ప్రవక్త తూరుకొండకుఁ బోఁగా సామరీ అను కమసలివాఁడు బంగారు నగలతో నొక యావుదూడను చేసెను. అందు వట్టిశబ్దము కలుగసాగెను. దానినే దేవునిగా గ్రహించి యిస్రాయీలియులలో పెక్కుమంది పూజింపసాగిరి. హారూను "అదిదోషము. చేయకూడదు" అని నిషేధించెను. కాని ఇస్రాయీలియులు ఆతని మాట వినక ఆతనిని చంప నెత్నించిరి. వట్టి శబ్దమునకు మోహులై సంభాషింపను, మంచిచెబ్బరలమార్గము చూపను శక్తిలేనట్టిదూడను దేవునిగాఁ జేసికొనుట చాల అవివేకమును, ధర్మమార్గ విరుద్ధమును. కావున దానిని పూజించినవారు దుర్మార్గులు. 149. తుదకు మూసా ప్రవక్త, బుద్ధి చెప్పిన పిదప ఇస్రాయీలియులకు తెలివివచ్చి తాము చేసినది ఘోరపాతకము. దానికి పరిహారము కానిచో సదా మేము నష్టమును, నాశమును పొందువారలమగుదుమని వారు దేవునితో క్షమాపణ కోరుటకు సిద్ధులైరి. 150. మూసా ప్రవక్త తూరుకొండవద్దనున్నపుడే దేవుఁడు, సామరీచేసిన ఆవుదూడను నీజనులు పూజించుచున్నారు అని మూసాకుఁ దెలిపియుండెను. కావున అది మూసా వినినతోడనే కోపములోనుండి తన జనులు గావించిన దుష్టకార్యమునకుచింతించుచు తిరిగివచ్చెను. మూసా తన జనులలో ఏమయ్యా! నేను వెళ్ళిన పిదప మీరు గావించిన పని మంచిదికాదు. ఆవుదూడ పూజ చాల చెడ్డది. దానివలన దేవుని కోపము మీకుఁ గలుగును. నేను తూరుకొండకు పోయి వచ్చునంతలో మీరేల తొందరపడితిరి. దేవుని యాజ్ఞలు నేను తీసికొని వచ్చునంతలో ఏమి మునిగిపోయినది. మీరు ఇంతలోనే చేయరాని పనిని మీరు చేసితిరిగదా! అని మందలించి కోపములో తౌరాతుపలకలను క్రిందపడవేసెను. ఆపిదప తనసహోదరుఁడగు హారూను సరిగ జనులకు బుద్ధి చెప్పలేదని తలఁచి యాతని తలను గడ్డమును పట్టి తన వంకకు లాగ సాగెను. అపుడు హారూను ఓ నాతల్లికుమారుఁడా! నేను నాశక్తికొలఁది బోధించితిని. కాని జనులు నన్ను చంప యత్నించిరి. నేనుబోధించుటలో ఏలాటికొఱత చేయలేదు. నాపైకోపపడకుము. నేను దుష్టులతో చేరినవాఁడని తలంపకుము. నీవు నాపై కోపపడుటచూచి శత్రువులు నవ్వుదురు. అట్లు చేయకుము. తల్లికుమారుఁడా! అనుటలో కనికరముకలుగును అని అట్లు చెప్పెను. అధర్మకార్యము చూచినపుడు ప్రవక్తకుచాల కోపము వచ్చుట సహజము. అందుకే మూసాప్రవక్తకు విగ్రహారాధన చూచి అంత కోపమువచ్చి ఏమియు తోచక తన యన్నపై కోపము చూపెను. దేవునికిఁ గాను కలిగిన కోపముగాన దోషము కానేరదు. 151. మూసా ప్రవక్తకు కోప

శాంతి కాఁగానే తమవలన ఏదైన పొరపాటు జరిగినచో క్షమించి కరుణించు మని దేవునిని వేఁడుకొనసాగెను.

152. ఇన్నల్లజీనత్-తఖజుల్-ఇజ్ల స యనాలుహుమ్-గజబుమ్ మిర్-రబ్బిహిమ్-వ-జిల్లతున్ ఫిల్-హయాతిద్-దున్యా-వ-కజాలిక-నజ్ జిల్-ముఫ్తరీన్. 153. వల్-లజీన-అమిలుస్-సయ్యి-ఆతి-సుమ్మా-తాబూ-మింబఅ్-దిహా-వ ఆమనూ-ఇన్న-రబ్బక మింబఅ్-దిహా-లగఫూరుర్ రహీమ్.

152. ఎవరు ఆవుదూడను దేవునిగాఁ జేసికొనిరో వారికి తప్పక వారి ప్రభువునుండి కోపమును ఇహలోక జీవనమందు అవమానమును లభించును. మఱియు నిట్లే అసత్యములు కల్పించు వారిని శిక్షింతుము. 153. మఱెవరు పాపకార్యములు చేసిన పిదప క్షమాణకోరి విశ్వసింతురో వారిని, క్షమాపణ కోరిన పిదప తప్పక నీప్రభువు క్షమించు వాఁడును కరుణించువాఁడును.

వ్యా॥ 152. ఆవుదూడను పూజించిన వారికి లభించిన దేవుని కోపము (శిక్ష) సూరమేబఖరాలో చెప్పఁబడినది. ఆపూజ చేయకుండిన వారుపూజ చేసిన వారిని వధించుట, ఆవుదూడ పూజ చేసిన వారు మతభ్రష్టులైరి. కావున దానికి శిక్ష వధించుట. ధర్మమునకు విరుద్ధముగ అధర్మము (అసత్యము) కల్పించువారికిఁ గూడ దేవుని శిక్ష కలుగును. కావున మత ధర్మములలో ఏలాటి కల్పనలు (బిద్అత్) చేయరాదు.153.పాపకార్యములు చేసిన పిదప పశ్చాత్తాప పడి దేవునితో క్షమాపణ కోరినచో దేవుఁడు క్షమించి కరుణించును. క్షమాపణ కోరిన పిదప వారు చేయుచున్న పాపకార్యములను మానుకొని మనఃపూర్వకముగ విశ్వసించి సత్కార్యములు చేయవలెను.

154. వలమ్మా సకత-అన్-మూ-సల్-గజబు-అఖజల్ అల్-వాహ-వఫీ-నుస్-ఖతిహా-హుదన్-వరహ్మాతుల్-లిల్లజీన-హుమ్-లిరబ్బిహిమ్ - యర్హబూన్.

154. మఱియు మూసా కోపము శాంతి పడఁగా ఆతఁడు పలకల నెత్తికొనెను. ఎవరు తమ ప్రభువునకు భయపడుదురో వారికి సన్మార్గమును కరుణయు గలదు అని అందు వ్రాయంబడి యుండెను.

వ్యా॥ 154. మూసా ప్రవక్తకు తన జనులపై వచ్చిన కోపము చల్లారగనే కోపములో తాను పడవేసిన తౌరాతు పలకల నెత్తికొనెను. అందుసన్మార్గము చూపు ధర్మములు నుండెను. ఆధర్మము లనుసరించినచో దేవుని కరుణకు భక్తులు పాత్రులగుదురు. భయభక్తులుగలవారే ధర్మము లనుసరింతురు. భయ

భక్తులు లేని దుష్టులు అనుసరింపరు అని వ్రాయఁబడి యుండెను.

155. వఖ్తార-మూసా-ఖౌమహూ-సబ్-ఈన-రజు-లల్-లి- మీఖాతి నా-ఫలమ్మా-అఖ-జత్-హుముర్-రజ్ఫ-తు-ఖాల-రబ్బీ-లౌ - షీత-అహ్-లక్త హుమ్-మిన్-ఖబ్లు-వ-ఇయ్యాయ-అతుహ్-లికునా-బిమాఫల-అస్-సుఫ-హాఉ- మి న్నా-ఇన్ హియ-ఇల్లా-ఫిత్-నతుక-తుజిల్లు-బిహా-మన్-తషాఉ-వతహ్దీ- మన్-తషాఉ-అన్త-వలియ్యునా-ఫగ్-ఫిర్-లనా వర్-హమ్నా-వఅన్త-ఖైరుల్ - గాఫి రీన్. 156. వక్-తుబ్-లనా-ఫీహాజి హిద్-దున్యా-హసనతన్-వఫిల్-ఆఖిరతి- ఇ న్నా-హుద్నా-ఇలైక-ఖాల-అజాబీ-ఉసీబు-బిహీ మన్-అషాఉ-వ-రహ్మతీ-వసి అత్ కుల్ల-షైఇన్-ఫస-అక్-తుబుహా-లిల్-లజీన-యత్త-ఖూన-వ-యూతూ-నజ్ జకాత-వల్-లజీన-హుమ్-బి-ఆయాతినా-యూమినూన్.

155. మఱియు మేము నియమించిన గడువునకుఁగాను మూసా తన జను లలో డెబ్బది మందిని ఎన్నుకొనెను. ఆపిదప వారికి భూకంపము పట్టఁగా ఓనా ప్రభువా ! నీవు కోరియుండినచో వారిని నన్నును దీనికి పూర్వమే నశింపఁజేసి యుందువు. మాజనులలోని మూఢులు గావించిన పనికిఁగాను మమ్ము నశింపఁ జేయుదువా! ఇదంతయు నీపరీక్షయున్నది. అందునీవు కోరిన వారిని మార్గము తప్పింతువు. మఱినీవు కోరిన వారికి సన్మార్గము చూపుదువు. నీవుమారక్షకుఁడవు. కావున మమ్ము క్షమించి కరుణింపుము. మఱి నీవే అందఱికంటెబాగుగా క్షమిం చువాఁడవు. 156 మఱి ఇహలోకములోను పరలోకములోను మాకొఱకు మేలు వ్రాయుము. నిశ్చయముగా మేము నీవంక తిరిగితిమి అని మూసాపలికెను. నేను కోరిన వారికి నాశిక్ష విధింతును. మఱినాకరుణ సర్వమునకు వ్యాపించియున్న ది. కావున ఎవరు భయపడి విధిదానము (జకాతు) చెల్లించుచు మాసూచనల ను విశ్వసింతురో వారికిఁ గాను దానిని వ్రాయుదును.

వ్యా॥ 155. ఇస్రాయీలీయులు మూసాతో మేము దేవుని మాటలు మాచెవులార వినునంతవఱకు నీమాటలను ఒప్పుకొనము అని పలికిరి. అందుకు మూసా వారిలోని డెబ్బది నాయకులను ఎన్నుకొని తూరు కొండకుఁ బోయెను. అచ్చట వారు దేవుఁడు మూసాతో మాటలాడునది విని మేము దేవునిని కన్నులార చూచునంతవఱకు మేమునమ్మము అని పలుకసాగిరి. ఇట్లు వీరు గావించిన అవిధేయతకు క్రిందినుండి భూకంపమును పైనుండి పిడుగునుపడి డెబ్బదిమంది చచ్చిరి. అపుడుమూసా ప్రవక్త భయభక్తులతో క్షమింపవలెనని

దేవునిని ప్రార్థింపఁగా తిరిగి వారు సజీవులైరి. పార్థనలోని భావము ఇట్లున్నది. ఓనా ప్రభువా! నీవు ఇష్టపడినచో మేము ఇచ్చటికి రాకమునుపే వారితోఁ బాటు నన్ను చంపియుందువు. అట్లు చేయక నీవాక్యములు వినుటకు వారికి అవకాశ మొసంగితివి. కొందఱు మూఢులు గావించిన నేరమునకుఁ గాను మమ్మెలందఱిని చంపుదువా! అట్లు నీవుచేయవు. దీని మూలమున నీవుమమ్మెపరీక్షించుచున్నావు. భూకంపము కలిగి పిడుగుపడునపుడు భయభక్తులతో స్థిరత్వము గలియుండుటకు సహానము నీవే యొసంగవలెను. సన్మార్గముచూపుట నీచేతిలోనున్నది. కావున మాపొరపాటులను క్షమించి కరుణింపుము. నీవేమాకు రక్షకుఁడవు. పోషకుఁడవు. కష్టములలో తోడు పడువాఁడవు. 156. మూసా ప్రవక్త ప్రార్థించు నపుడు ఉభయ లోకములలోను మేలు మాకొఱకు వ్రాయుము అనగా మాకొసంగుము అని పలికినదానికి జవాబిట్లు దేవుఁడు ఇచ్చెను. పాపులను శిక్షించుట నాయిష్టము. నేను కోరిన వారిని శిక్షింతును. కాని నా కరుణ సర్వులకు వ్యాపించియున్నది. అయిన నాప్రత్యేకమైన దయ భయభక్తులు గలిగి జకాతుదానము చెల్లించుచు నావాక్యములను, నా సూచనలను విశ్వసించువారికి గాను వ్రాయుదును. అనఁగా వారికి నొసంగుదును.

157. అల్-లజీన-యత్-తబి-ఊనర్-రసూ-లన్-నబియ్యల్-ఉమ్మి-యల్-లజీ-యజిదూనహూ-మక్తూ-బన్-ఇన్దహుమ్-ఫిత్-తౌరాతి వల్-ఇన్జీలి యా-మురుహుమ్-బిల్-మఅ-రూఫి-వ-యన్-హా-హుమ్-అనిల్-మున్-కరి వ-యుహిల్లు-లహుముత్-తయ్యి-బాతి-వ-యుహ్రిము-అలైహి ముల్-ఖబా-ఇస-వ-యజఉ అన్-హుమ్-ఇస్-రహుమ్-వల్-అగ్-లా-లల్లతీ-కానత్-అలైహిమ్-ఫల్లజీన-ఆమనూ-బిహీ-వ-అజ్జరూహు-వ నస రూహు-వత్-తబ-ఉన్-నూరల్లజీ-ఉన్-జిల-మఅహూ-ఉలా-ఇక-హుముల్-ముఫ్-లిహూన్.

157. తమయొద్దనున్న తౌరాతు ఇన్జీలు గ్రంథములలో ఏ ఉమ్మీప్రవక్తను గూర్చి లిఖింపఁబడి యుండుటను వారు కనుఁగొనుఁ చున్నారో యాతనిని అనుసరించువారి కొఱకు కరుణను లిఖింతును. ఆతఁడు వారికి ధర్మమును బోధించుచు అధర్మమును నిషేధించుచున్నాఁడు. మఱి పవిత్రములైన వస్తువులను వారికొఱకు ధర్మములైనవి గాఁ జేయుచున్నాఁడు. మఱి అపవిత్రములను వారికిఁగాను నిషేధించుచున్నాఁడు. మఱి వారిపై నున్నవారి భరములను వారిపైనున్న నిర్బంధనములను తొలఁగించు చున్నాఁడు. కావున ఎవరు ఆతనిని విశ్వసించి ఆతనిని సన్మానించి ఆతనికి తోడుపడి ఆతనికి ఒసంగఁ బడిన జ్యోతి ననుసరించిరో

వారే మోక్షము పొందువారు.

వ్యా॥ 157. ఉమ్మీ యనునది హజ్రత్ ముహమ్మదువారికి బిరుదు. ఒకరి యొద్ద చదువను వ్రాయను నేర్చుకొనని వాడని యర్థము. హజ్రత్ పైగంబరుల వారు ఎవరి యొద్దను చదువను వ్రాయను నేర్చికొనలేదు. వారికి దేవుని వలన ప్రవక్త పదవి లభించిన పిదప ఉభయ లోకములలోను మేలు కలిగించునట్టి ధర్మములు వారుపదేశింప సాగిరి. ఇది వారికి దేవుని వలన లభించినదివ్యజ్ఞానము. వీరిని గూర్చి తౌరాతు ఇన్జీలులో ప్రకటనలు గలవు. వీరే రాఁబోవు ఆఖరు ప్రవక్తని యా గ్రంథములలో సూచింపఁ బడినది. ఇస్రాయీలీయులలో కొందఱు తమ గ్రంథములను బట్టి హజ్రత్ ముహమ్మదు వారిని విశ్వసించిరి. హజ్రత్ రసూలువారి ననుసరించువారు దేవుని కరుణకు పాత్రు లగుదురు. ముహమ్మదువారు ధర్మ మార్గమును బోధింతురు. అధర్మ మార్గమునకు పోకూడదు అని నిషేధింతురు. ఇస్రాయీలీయులకు వారి దుష్టత్వముల వలన కొన్ని తినఁ దగిన వస్తువులు నిషేధింపఁబడి యుండెను. హజ్రత్ రసూలువారు వానిని తిరిగి హలాలు చేసిరి. యూదులు తమ యిష్టానుసారముగాకొన్నియపవిత్రము (హరాము) లైన వస్తువులను ధర్మములు (హలాల్) గాచేసికొని యుండిరి. అట్టి వానిని ముహమ్మదు వారు నిషేధించిరి. యూదులపైకొన్ని భారములగు కఠినధర్మములును నిర్బంధనలు నుండెను. వానినితొలఁగించి సుకరములైన ధర్మములు నియమించిరి. కావున ఎవరు హజ్రత్ రసూలు వారిని విశ్వసించి వారిని గౌరవించి మత ప్రచారములో వారికి తోడుపడి వారికొసంగఁ బడిన ఖురాను జ్యోతిని వారి యాచారములనెడి జ్యోతిని అనుసరింతురో వారేధన్యులు. ఇట్టి వారే యుభయ లోకములలో జయమును మోక్షమును పొందువారు.

158. ఖుల్-యా-అయ్యు-హన్నాసు-ఇన్నీ-రసూలుల్లాహి - ఇలైకుమ్-జమీఅ-అనిల్-లజీ-లహూ-ముల్-కుస్-సమావాతి-వల్-అర్-జి లా - ఇలాహ-ఇల్లా-హువ-యుహ్-యీ-వ-యుమీతు-ఫ-ఆమినూ-బిల్లాహి-వ-రసూలి-హిన్-నబియ్యిల్-ఉమ్మీ-యిల్-లజీ-యూమిను-బిల్లాహి-వ-కలి-మాతిహీ-వత్ తబి-ఊ-లఅల్ల-కుమ్-తహ్-తదూన్.

158. ఓ జనులార ! ఆకాశములలోను భూమిలోను ఎవరి ప్రభుత్వము గలదో అట్టి దేవుని ప్రవక్తగా నేను మీయందఱి యొద్దకు వచ్చియున్నాఁడను. ఆతఁడు దప్ప వేఱు దేవుఁడు లేఁడు. ఆతఁడు ప్రాణముపోయువాఁడును, చావు నిచ్చువాఁడును. కావున మీరు దేవునిని ఆతని ఉమ్మీ ప్రవక్తను విశ్వసిం

పుడు. ఆ ప్రవక్త దేవునియందును ఆతని సర్వవాక్యములందును విశ్వాసము గలవాఁడు. మీరు సన్మార్గము పొందుటకై ఆతని ననుసరింపుఁడు అని ఓ ప్రవక్త! పలుకుము.

వ్యా॥ 158. హజ్రత్ ముహమ్మదువారు, దేవుని ప్రవక్తలందఱికంటె ఆఖరున వచ్చినవారు. వారు సర్వలోకమునకు ప్రవక్తగా నియమింపఁబడినవారు. కావున ఒక అరేబియా జనులే కాక లోకమంతయును వారిని విశ్వసింపవలెను. వారి యాచారములను, దేవునిచే వారికొసంగఁబడిన ఖురాను గ్రంథమును మానవులందఱును అనుసరింపవలెను. సర్వాధికారియైన దేవుఁడు వారిని సర్వజనులకుఁగాను ప్రవక్తగా నియమించియున్నాఁడు. ముహమ్మదువారును దేవునిని దేవుఁడు పంపిన సర్వగ్రంథములను విశ్వసించువారు. కావున సన్మార్గము పొంది యుభయలోకముల మేలు కోరువారందఱు మానవులు హజ్రత్ రసూలువారిని విశ్వసించి వారి ననుసరింపవలెను. వారి ననుసరించువారు పూర్వము గడచిన ప్రవక్తలను గ్రంథములన్నిటిని విశ్వసించినవారగుదురు. కావున ఇస్రాయీలియులు (యూదులు, క్రైస్తవులు) మొదలగు ఇతర జనులుతప్పక ఖురానె షరీఫును విశ్వసించి హజ్రత్ ముహమ్మదువారిని నమ్మి వారి ననుసరించి యుభయలోకముల మేలు పొందుదురుగాక! ఇఁక రాఁబోవు వాక్యములలో తిరిగి యిస్రాయీలియుల విషయము తెలుపఁబడును.

159. వ-మిన్-ఖౌమి-మూసా-ఉమ్మతున్-యహ్దూన-బిల్-హఖ్ఖి-వ-బిహీ-యఅ-దిలూన్.

**159.** మఱియు మూసా జనులలో కొందఱు ప్రజలకు సత్యమార్గము చూపువారును దాని ననుసరించి న్యాయము చేయువారును గలరు.

వ్యా॥ 159. మూసా జనులగు ఇస్రాయీలియులు (యూదులు) పెక్కురు, అసత్యమార్గము ననుసరించుచు అనేక అన్యాయములు చేయుదురు. కాని వారిలోఁ గూడ కొందఱు అబ్దుల్లాబిన్ సలాామువంటి భక్తులుగలరు. వారు సత్యమార్గము ననుసరించుచు, ఇతర ప్రజలకుఁగూడ ధర్మమార్గము చూపుచుందురు.

160. వ ఖత్త-అ-నా-హుముస్-నై-అష్-రత-అస్బాతన్-ఉమమన్-వ-ఔ-హైనా-ఇలా-మూసా-ఇదిస్-తస్-ఖాహు-ఖౌముహూ-అనిజ్-రిబ్-బి-అసాకల్-హజర-ఫంబ-జసత్-మిన్-హున్ నతా అష్-రత-ఐనన్-ఖద్ అలిమకుల్లు-ఉనాసిమ్-మష్రిబహుమ్-వ-జల్-లల్నా-అలైహిముల్-గమామ వ-అన్-జల్నా-అలైహిముల్-మన్న-వస్-సల్వా-కులూ-మిన్-తయ్యిబాతి-మా-రజఖ్నాకుమ్

వ - మా - జ-లమూనా-వ లాకిన్-కానూ.అన్-ఫుసహుమ్- యజ్ - లిమూన్.
161. వ ఇజా-ఖీల- లహుముస్-కునూ-హాజిహిల్-ఖర్యత- వ - కులూ-మిన్హా - హైసు-షీతుమ్-వ ఖూలూ-హీత్-తతున్-వద్ ఖులుల్ -బాబ-సుజ్-జదన్-నగ్-ఫిర్-లకుమ్-ఖతీ-ఆతికుమ్-స నజీదుల్-ముహ్-సినీన్. 162. ఫ బద్దలల్ - లజీన-జులమూ-మిన్-హుమ్ ఖౌలన్-గైరల్-లజీ-ఖీల-లహుమ్-ఫ-అర్- సల్నా - అలైహిమ్-రిజ్ జమ్-మినస్-సమాఇ బిమా-కానూ-యజ్-లిమూన్.

160. మఱియు వారిని పండ్రెండు పెద్ద పెద్ద కుటుంబములుగ వేర్వేఱుగాఁ జేసితిమి. మూసా జనులు ఆతనిలో నీళ్లు అడుగఁగా ఓమూసా! నీ చేతికఱ్ఱతో ఈరాతిని గొట్టుము అని మేము మూసాకు ఆజ్ఞాపించితిమి. అపుడు ఆ బండనుండి పండ్రెండు ఊటలు ప్రవహింపసాగెను. ప్రతి కుటుంబము తన నీళ్లు త్రాగు చోటును కనుఁగొనెను. మఱియు మేము వారిపై మేఘముల నీడను చేసితిమి. మఱి వారికిఁగాను మన్నసల్వాలను దింపితిమి. మేము మీకొసంగిన పవిత్రములైన వస్తువులను తినుఁడు అని మేము పలికితిమి, మఱి వారు మాకేమియు నష్టము చేయలేదు. కాని వారు తమకు తామే నష్టము చేసికొనుచుండిరి. 161. మఱియు, మీరు ఈపురములో బసచేయుఁడు. మఱియు నందు మీరు కోరిన చోటునుండి తినుఁడు. మఱి మమ్ము క్షమింపుము అని పలుకుఁడు. మఱియు సాష్టాంగనమస్కారము (సిజ్దా) చేయుచు ద్వారములో-ప్రవేశింపుఁడు. మేము మీపాపములను క్షమింతుము. సత్కార్యములు చేయువారికి హెచ్చుగా నొసంగుదుము అనివారికి ఆజ్ఞ కాఁగా 162. వారిలో దుర్మార్గులైనట్టివారు వారికిఁ జెప్పఁబడిన మాటను వేఱు మాటతో మార్చివేసిరి. కావున వారుచేయుచున్న దుష్టత్వముఁకుఁగానువారిపై ఆకాశమునుండి బాధనుపంపితిమి.

వ్యా॥ 160 : 162. ఇస్రాయీలియులు వారి తాతలను అనుసరించి యేర్పాటుల సౌకర్యములకుఁగాను పండ్రెండు పెద్ద పెద్ద కుటుంబములుగా విభజింపఁబడిరి, ప్రతి కుటుంబముపై నొక నాయకుఁడు నియమింపఁబడెను. అతఁడు తన కుటుంబమువారి కార్యములు చక్కగా నుండునట్లు చూచుకొనును. తీహు అను మైదానములో ఈ విషయములన్నియు సంభవించినవి. వీని వివరములు నూరతు బఖరాలో వ్రాసియున్నారము. అచ్చట చూచుకొనునది.

163. వస్-అల్-హుమ్-అనిల్-ఖర్య-తిల్-లతీ-కానత్-హాజిరతల్-బహ్రి-ఇజ్-యఅ-దూన-ఫిస్-సబ్-ఇజ్-తాతీ హిమ్-హీతా-నుహుమ్ యౌమ-సబ్ తిహిమ్-షుర్రఅన్-వ యౌమ-లాయస్-బితూన-లాతాతీహిమ్ కజా-లిక- నబ్లూ

వాలుమ్-బిమా-కానూ-యఫ్-సుఖూన్. 164. వ-ఇజా-ఖాలత్-ఉమ్మ - తుమ్-మిన్-హుమ్-లిమ-తఇ-జూన-ఖౌమ-నిల్లాహు-ముహ్-లికుహుమ్-ఔ - ముఅజ్-జిబు-హుమ్-అజాబన్-షదీదన్-ఖాలూ-మఅ జిరతన్-ఇలా-రబ్బికుమ్-వ-ల-అల్ల-హుమ్-యత్-తఖూన్. 165. ఫలమ్మా-నసూ-మా-జుక్కిరూ-బిహీ- అన్ - జైనల్-లజీన-యన్-హౌన-అనిస్-సూఇ-వ-అఖజ్-నల్-లజీన-జలమూ-బి-అజాబిమ్-బఈసిమ్-బిమా- కానూ-యఫ్ - సుఖూన్.166. ఫలమ్మా-అతౌ-అమ్మా నుహూ-అన్-హు-ఖుల్నా-లహుమ్-కూనూ-ఖిరదల్-ఖాసిఈన్.

163. మఱియు సముద్రతీరమునందున్న పురమునుగూర్చి ఓ ప్రవక్త! యూదులతో నడుగుము. అచ్చటి వారు శనివారమునాటి ధర్మమునుగూర్చి అతిక్రమించుచుండిరి. శనివారమునాడు చేపలు వారియొద్దకునీటిపైన నేవచ్చుచుండెను. కాని శనివారము కాని దినమున వారియొద్దకు చేపలు రాకుండెను. ఇట్లు వారు అవిధేయత గలిగియున్నందున మేము వారిని పరీక్షించితిమి. 164. మఱియు వారిలో కొందఱు జనులు, దేవుఁడు ఎవరిని నశింపఁజేయనున్నాఁడో లేదా కఠినముగా శిక్షింపనున్నాఁడో వారిని మీ రేల బోధింతురు అని పలుకఁగా మీ ప్రభువునొద్ద మాపై నింద లేకుండుటకును, వారు భయభక్తులు వహించుటకును అని వారు పలికిరి. 165. పిదప వారు వారికీయఁబడిన బోధను మఱచి పోఁగా పాపకార్యములను నిషేధించుచుండినవారిని రక్షించితిమి. మఱియు పాపులు అవిధేయత గలిగియున్నందున వారికికఠినశిక్ష విధించితిమి. 166. పిదప వారు వారికి నిషేధింపఁబడినదానిలో మితిమీఱిపోవుచుండఁగా మీరు నీచము లైన కోతులు కండు అని వారితో పలికితిమి.

వ్యా॥ 163. ఈ వాక్యములలో దావూదుప్రవక్త కాలములో జరిగిన విషయము, హజ్రత్ ముహమ్మదువారి కాలములోనున్న యూదులతో అడుగవలెనని, దేవుని సెలవు రసూలువారికి అగుచున్నది. ఐలా, అను పురము ఎఱ్ఱసముద్రతీరమున నుండెను. అచ్చటివారు చేపలను వేటాడుచుండెడివారు. శనివారమునాడు చేపలు వేటాడకూడదని యూదులకు దేవుని యాజ్ఞ(?)గవు ఆయెను. శనివారమునాడు చేపలు నీళ్ళపై కనఁబడుచు తీరమును సమీపించుచుండెను. శనివారము కాని దినములలో చేపలు కనఁబడకుండెను. ఇందు వారికి పరీక్షయుండెను. అచ్చటి వారు ఇది చూచి చేపలు పట్టుటకు ఒక తంత్రము చేసిరి. అదియేమన, శనివారమునాడు సముద్రముప్రక్కన గుంతలు త్రవ్వి అందు సముద్రపు నీరు వచ్చునట్లుచేసిరి. ఆనీళ్ళవెంట చేపలుకూడ ఆగుంతలలో

రాసాగెను. తరువాత చేపలు తిరిగి పోకుండ కట్టకట్టి ఆదివారమునాడు గుంతలలోని చేపలు పట్టుకొనసాగిరి. ఇట్లు వారు శనివారమునాడు చేపలు పట్టలేదని మోసపోయియుండిరి. ఇది తంత్రము. ఇట్లు చేయరాదని కొందఱు నిషేధించిరి. మఱికొందఱు కొన్నాళ్లు బోధించి యూరకుండిరి. మఱికొందఱు తాము చేపలు పట్టకపోయినను నిషేధింపక యూరకుండిరి. అట్లు కొన్నాళ్లు జరిగెను. కాని దుష్టులు తమ తంత్రము వదలలేదు. కొందఱు భక్తులు సదా బోధించుచు అట్లు చేయరాదని బుద్ధిచెప్పుచుండిరి. అట్టి భక్తులతో కొందఱు అయ్యా! మీరెందుకు ప్రయాసపడుదురు. దుష్టులు మీబోధ వినరు. వారు దేవునిశిక్ష పొంది నశించిన నశింపవలెను. లేదా యేదైన కఠినబాధనైన వారికిరావలెను. అంతవఱకు తమ దుష్టకార్యము వదలరు అని పలుకఁగా బోధకులు, అయ్యా! మేము బోధించునది ఎందుకనఁగా మేము బోధించలేదు అను నింద మాపై రాకూడదు. దేవుని సమ్ముఖమున మేము బోధించుటలో కొఱత చేయలేదు అని విన్నవింపఁగలము. మఱియు ఒకవేళ యీ దుష్టులకు మాబోధవలన బుద్ధిగలిగి దేవునికి భయపడి భయభక్తులు వహింతురేమో అని వారు పలికిరి. 165, 166. ఆదుష్టులు బోధను మఱచిపోయి వినని యట్లు నటించి తమ దుష్టకార్యమును వదలక అవిధేయులైరి. అందుకు వారికి దేవునిశిక్షలభించెను. బోధకులను దేవుఁడు ఆయాపదనుండి రక్షించెను. పిదప దుష్టులు, నీచమైన కోతులుగ మాఱిపోయిరి. వారట్లు మూఁడు దినములుండి చచ్చిరి.

167. వ-ఇజ్-తఅజ్-జన-రబ్బుక-లయబ్-అసన్న-అలైహిమ్-ఇలా-యామిల్-ఖియామతి-మన్-యసూముహుమ్-సూఅల్-అజాబి-ఇన్న-రబ్బక-లసరీఉల్-ఇఖాబి-వఇన్నహూ-లగఫూరుర్-రహీమ్. 168. వ-ఖత్-తఅ-నాహుమ్-ఫిల్-అర్జి-ఉమమమ్-మిన్-హుముస్-సాలిహూన-వమిన్-హుమ్-దూన-జాలిక-వ-బలౌ-నాహుమ్ బిల్-హస-నాతి-వస్-సయ్యి-ఆతి-లఅల్ల-హుమ్-యర్జిఊన్. 169. ఫ-ఖలఫ-మింబఅది-హిమ్-ఖల్-ఫున్-వరిసుల్-కితాబ-యా-ఖుజూన-అరజ-హాజల్-అద్నా-వ-యఖూలూన-సయుగ్-ఫరు-లనా వఇన్-యాతీహిమ్-అరజుమ్-మిస్లుహూ-యాఖుజూహు అలమ్-యూఖజ్-అలైహిమ్-మీసాఖుల్-కితాబి-అల్-లాయఖూలూ-అలల్లాహి-ఇల్-లల్-హఖ్ఖ వ-దరసూమా-ఫీహి-వద్-దారుల్-ఆఖిరతు-ఖైరుల్-లిల్-లజీన-యత్-తఖూన్. అఫలా-తఅఖిలూన్. 170. వల్-లజీన-యుమస్సి-కూన బిల్-కితాబి-వ-అఖా-మస్-సలాత-

ఇన్నా-లా-నుజీఉ-అజ్రల్ ముస్లిహీన్.171.వఇజా-నతఖ్-నల్-జబల - ఫౌఖ-
హుమ్-క అన్నహూ-జుల్లతున్- వ-జన్నూ-అన్నహు-వాఖి-ఉమ్-బిహిమ్-ఖుజూ
మా ఆతై-నాకుమ్-బి-ఖువ్వ-తిన్-వజ్-కురూ మాఫీహి-లఅల్ల-కుమ్-తత్త ఖూన్.
167. మఱియు తుదిదినము వఱకును నీప్రభువు యూదులకు కఠినబాధలు
పెట్టునట్టి వారిని వారిపై పంపుచుండును అని తెలిపిన విషయమును స్మరింపు
ము. నిశ్చయముగ నీప్రభువు శీఘ్రముగా శిక్షించువాఁడు. మఱియు అతఁడు
క్షమించువాఁడును కరుణించు వాఁడును. 168. మఱియు మేము ఇస్రాయీలి
యులను వేర్వేఱు తెగలుగా భువిలోఁ జేసివేసితిమి. వారిలోకొందఱు సత్కా-
ర్యులుగా నున్నారు. మఱికొందఱు దుర్మార్గులుగా నున్నారు. మఱియు వారు
(సన్మార్గమునకు) మరలుటకఁగాను మేము వారిని సౌఖ్యములలోను కష్టముల
లోను పరీక్షించితిమి. 169. ఆపిదప వారి తరువాత అయోగ్యులు వారి స్థాన
మునకు వచ్చి గ్రంథమునకు వారసులైరి. వీరు ఈతుచ్ఛ జీవితముయొక్క సొ
త్తులను తీసికొనుచున్నారు. మఱివారు మాకు క్షమాపణ లభించును (మేము
క్షమింపఁ బడుదుము) అని వారు పలుకుదురు. మఱి ఇటువంటి సొత్తు తిరిగి
వారియొద్దకు వచ్చినచో దానిని తీసికొనుదురు. దేవుని విషయము సత్యము తప్ప
వేఱు మాట పలుకఁగూడదు అని గ్రంథములోనున్నట్టి యొడంబడిక వారినుం
డి తీసికొనఁబడలేదా! మఱివారు అందున్న దానిని పఠించి యున్నారు. మఱి
భయభక్తులు గలవారికి పరలోక నివాసము మేలైనది. ఏమి మీరు గ్రహింపరు.
170. మఱెవరు గ్రంథమును స్థిరముగా పట్టుకొను (అనుసరించు)చు నమాజును
స్థిరముగా సలుపుదురో అట్టిసత్కార్యుల పుణ్య ఫలితమును వృథా చేయము.
171. మఱియువారిపై కొండలను గొడుగుగానెత్తితిమి. మఱివారు అదివారిపై
పడును అని భయపడిరి. మేముమీకొసంగిన దానిని స్థిరముగా పట్టుఁడు. మఱిమీరు
భక్తిపరులగుటకై అందున్నదానిని జ్ఞాపకముంచికొనుఁడు అని మేముచెప్పితిమి.
వ్యా॥ 167. దేవుఁడు ప్రవక్త మూలమున యూదులకు నిట్లుతెలిపెను.
యూదులు తౌరాతు గ్రంథములోని ధర్మములను అనుసరింపక వదలి పెట్టినచో
వారికి తుదిదినము (ప్రళయము) వఱకును వారికి కఠిన బాధలు పెట్టునట్టివారు
వారిపై నియమింపఁ బడుదురు. యూదులు తౌరాతును అనుసరింపక అనేక
యన్యాయములు చేసిరి. కావున యూదులు అప్పటినుండి పరరాజులకు లోఁబడి
కఠినమైన బాధలకు లోనై భూమిపై నెట్టి రాజ్యాధికారము లేక హీనదశలో
పడియున్నారు. కావున యూదులు ఒకపుడు గ్రీకు రాజులకు లోఁబడియుండిరి.
మఱొకపుడు బఖ్తె నసరుయొక్క హింసలకు పాలైరి యూదులు హజ్రత్ ము
హమ్మదువారి కాలమువఱకు మజూసీలకు లోఁబడి యుండిరి. ఆపిదప వారు

ముసలాన్ములకు లోఁబడియుండవలసివచ్చెను. కావునయూదులకులోకమునందు ఎచ్చటను రాజ్యము లేనందున వారికెట్టి గౌరవమును లేదు. ఇట్లువారు ప్రళయము (ఖియామతు) వఱకుందురు. తుదకు ఈసా ప్రవక్త వచ్చిన పిదప ముసల్మానులు యూదులను వధించి నిర్మూలింతురు. అపుడు యూదులు దజ్జాలునకు లోనై యుందురు. దేవుఁడు దుర్మార్గములను వదలని వారిని శీఘ్రముగా శిక్షించును. అయిన పాపులు పశ్చాత్తాపము నొంది పాపములు క్షమింపుమని దేవునిని వేఁడుకొన్నచో దేవుఁడు కరుణించి క్షమించును. కావున పాపులు నిరాశ చెందరాదు. దేవునితో క్షమాపణ వేఁడుకొన వలెను. 168. యూదులు గావించుచున్న అక్రమములకుఁ గాను వారి రాజ్యము పోయి వారు పరస్పర ద్వేషములఁ బట్టి అనేక తెగలుగ అయి అనేకదేశములలో పోయిరి. (వీరి విషయములు విని ముసల్మానులు జాగ్రత్త పడవలెను అని వివరింపఁబడుచున్నవి). యూదులలో కొందఱు భక్తులుగా నుండి సత్కార్యములు చేయుచు వచ్చిరి. కాని వారిలో పెక్కుమంది ధర్మమార్గము వదలి పాపములును అన్యాయములను చేయుచువచ్చిరి. దేవుఁడు వారిని పలువిధములుగ పరిశోధించెను. ఒకపుడు సౌఖ్యములు పొంది కృతజ్ఞత సలిపి సత్కార్యము చేయుదురు గాకఅని దేవుఁడు వారికి మేళ్ళు చేసెను. మఱొకపుడు బాధలకుభయపడి బుద్ధిదెచ్చికొని పాపములు వదలు కొనుదురుగాక అని కష్టములు గలిగించెను. 169. పూర్వికులకు వెనుక వచ్చినవారు చాల అయోగ్యులు. పూర్వికులలో కొందఱు మంచివారలు గానుండిరి. వెనుక వచ్చినవారు తౌరాతు గ్రంథమునకు వారసులై ఇహలోక తుచ్ఛలాభము (సొత్తు)నకుఁగాను లంచములు పుచ్చుకొని గ్రంథములోని కొన్ని ధర్మములను దాఁచి మఱికొన్నిటి భావములను మార్చి గ్రంథధర్మములకు విరుద్ధముగ తీర్పులు చేయసాగిరి. ఇట్టి యక్రమములు చేయుచు మాకెట్టి నష్టముగాని పాపముగాని కలుగదు. మేము దేవుని బిడ్డలము. మేముగావించిన పాపములకు దేవుఁడు మమ్ము క్షమించును అని పలుకుచు సిగ్గులేకఇకమీద లంచము పుచ్చుకొను సమయము వచ్చినచో లంచము పుచ్చుకొనుటకు వెనుదీయరు. ఇట్లు చేయుట అధర్మము. దేవునిపై నసత్యము పలుకరాదు. దేవుని ధర్మములకు విరుద్ధము చేయఁగూడదు అని తౌరాతు గ్రంథములో నున్నది. దాని ననుసరింతుమని వారు ఒడంబడిక గావించి యున్నారు. అదియునుగాక వారు దానిని పఠించుచున్నారు. అట్లు తెలిసియు అధర్మమునకు పూనుకొనుట చాల శోచనీయము గాదా! ఇహలోక తుచ్ఛ భోగములకై పరలోక నిత్య సౌఖ్యములను పోఁగొట్టుకొనుట మంచిదికాదు. భక్తులకు పరలోకమే మేలైనది. అందలి నివాసము సత్యమైనది. అందు ఏలాటి దుఃఖముండ నేరదు. ఏమి వారీవిషయము గ్రహింపరా!. 170. ఇపుడైనను గ్రహించి సత్యము ననుసరింపవలెను. క్షమా

పణ వేఁడుకొని సత్కార్యములు చేయవలెను. తౌరాతు గ్రంథములోని ధర్మ ములను స్థిరముగా ననుసరించుచు దేవుని ప్రార్థనలు సలుపువారి కష్టములు వృ థాపోవు. తౌరాతు గ్రంథము ననుసరించి హజ్రత్ ముహమ్మదు వారిని విశ్వ సించి ఖురాను గ్రంథము ననుసరించి నమాజులను స్థిరముగా భయభక్తులతో సలుపువారి కర్మలు వృథాపోవు. వానిఫలితము వారికి తప్పక లభించును. 171. మూసా ప్రవక్త కాలమునందు ఇస్రాయీలీయులు తౌరాతు గ్రంథములోని ధర్మములను అనుసరింపవలెను అని వారితో ఒడంబడిక తీసికొనునపుడు తూరు కొండ వారిపై గొడుగువలె నెత్తఁబడెను. అదివారిపై పడునని వారు భీతిల్లిరి ఇంత బలముగాఁ దీసికొన్న యొడంబడికను యూదులు మఱచిపోయి అధర్మము లు చేయసాగిరి.

172. వఇజ్-అఖజ-రబ్బుక-మింబనీ-ఆదము-మిన్ జుహూరిహిమ్-జుర్రీ-య త-హుమ్-వ-అష్-హదహుమ్-అలా-- అన్-ఫుసిహిమ్- అలస్తు- బిరబ్బి-కుమ్- ఖాలూ-బలా-షహిద్నా-అన్-తఖూలూ-యామల్-ఖియామతి-ఇన్ - కున్నా- అన్-హాజా-గాఫిలీన్. 173. ఔ-తఖూలూ-ఇన్నమా-అష్-రక ఆబాఉనా-మిన్- ఖబ్లు-వ-కున్నా-జుర్రీ-యతమ్-మింబఅ-దిహిమ్-అఫ-తుహ్-లికునా-బిమా- ఫఅ- లల్-ముబ్-తిలూన్. 174. వ-కజాలిక-నుఫస్-సిలుల్-ఆయాతి-వ-లఅల్లహుమ్ యర్-జిఊన్.

172. మఱియు నీప్రభువు ఆదము సంతతి వీఁపులనుండి వారి సంతానము ను దీసి వారి యాత్మలపై వారే కరారు చేయునట్లు చేసి నేను మీ-ప్రభువును కానా అని పలుకఁగా ఎందుకు కావు (నీవు మాప్రభువు). మేము కరారు చేసి తిమి అని పలికిరి. తీర్పు దినమునందు దీని విషయము మాకుఁ దెలియదు. అని మీరు చెప్పకుండుటకును, 173. లేదా దీనికి పూర్వము మా తాత ముత్తాతలు సాటి కల్పించిరి. మేము వారి తరువాత వచ్చినవారి సంతానము వారలము. కా వున దుర్మార్గులు చేసినదానికిఁగానుమమ్ము నశింపఁజేయుదువాఅనిమీరుపలుక కుండుటకును ఈకరారు పుచ్చుకొంటిమి. 174. మఱివారు (సన్మార్గమునకు) మరలుటకుఁగాను ఇట్లు మేము సూచనలు వివరించి తెలుపుచున్నారము.

వ్యా॥ 172. మునుపటి వాక్యములో ప్రత్యేకముగ యూదులతో దేవుఁ డు తీసికొన్న యొడంబడికను దెలిపెను. ఇఁక ఈవాక్యములలో సర్వ మానవులు దేవుఁడు తమ ప్రభువని యొప్పుకొని చేసిన కరారును దెలుపు చున్నాఁడు. దేవుఁడు ఆదమును సృష్టించి యాతనికి గలుగు సంతానమును బయలుపెట్టి

వారితో నేనుమీప్రభువునుకానా అని అడుగఁగా అందఱును నీవు మాప్రభువు అని యొప్పుకొనిరి. ఆదినమునే రోజెమీసాఖ్ అనుదురు. దీనిబట్టిప్రతిమానవుని హృదయములో దేవుఁడుఒక్కఁడు, ఆతఁడుప్రభువు అను విషయము నాటుకొని యుండును. ఆవిషయము ప్రవక్తలయొక్కయు భక్తులయొక్కయుబోధన వలన బలపడి మానవులువిశ్వాసులగుచున్నారు. కొందఱుచెడుసహవాసమువలనసహజ ముగా వారికి నున్న దేవుని యేకత్వజ్ఞానమును పోఁగొట్టుకొని అవిశ్వాసులు(కాఫి ర్లు) అగుచున్నారు. కావున మానవులు తీర్పుదినమునందు దేవుని యేకత్వము (తౌహీదు) మాకుఁ దెలియదు అని చెప్పుటకు వీలులేదు. ఎందుకన మానవుఁ డు తన పుట్టుకతోనే యావిషయమును సహజముగ పొందుచున్నాఁడు. అటులే మానవులు తీర్పు దినమునందు ఓదేవా! మేము నిర్దోషులము. మాతాత ముత్తా తలు నీకు సాటి కల్పించిరి. మేము వారిననుసరించితిమి. కావున పూర్వము దు ర్మార్గులు గావించిన దానికిఁగాను మమ్ము నశింపఁ జేయుదువా! మమ్ము నరక ములో పడవేయుదువా! అనిపలుకుటకు వీలులేదు. ఎందుకన దేవుఁడు ఒక్కఁ డు, ఆతనికి సాటిలేదు అనువిషయము ప్రతిమానవుఁడును సహజముగ తెలిసి కొనఁ దగినది. తాత ముత్తాతల యాచారము కావున మేము అనుసరించితిమి అని పలుకుటకు వీలులేదు. 174. దేవుఁడు తన సూచనలను మానవులకు వివర ముగాఁ దెలుపు చున్నాఁడు దాని ననుసరించి మానవులు దుర్మార్గమును వదలి సన్మార్గమునకు మరలవలెను.

175. వత్‌లు-అలైహిమ్-నబ-అల్ లజీ-ఆతైనాహు-ఆయాతినా-ఫన్- సలఖ-మిన్‌హా-ఫ-అత్‌బఅ-హుష్-షైతాను-ఫ-కాన-మినల్-గావీన్. 176. వలౌ షీనా-లర-ఫఅ-నాహు-బిహా-వలా-కిన్నహూ-అఖ్-లద-ఇలల్-అర్‌జి-వత్-తబ అ-హవాహు-ఫ-మసలు-హూ-క-మసలిల్-కల్‌బి-ఇన్-తహ్‌మిల్-అలైహి- య ల్-హస్-ఔ-తత్-రుక్-హు-యల్-హస్-జాలిక-మసలుల్-ఖౌమిల్-లజీన-కజ్ జబూ-బి-ఆయాతినా-ఫఖ్-సుసిల్-ఖసస-ల-అల్లహుమ్-యత-ఫక్కరూన్.177. సాఅ- మసల-నిల్-ఖౌముల్-లజీన-కజ్-జబూ-బి-ఆయాతినా-వ-అన్-ఫుస-హుమ్ కానూ-యుజ్లిమూన్.

175. మఱియు ఓ ప్రవక్త! మేము మా సూచనలను ఒకని కిచ్చితిమి. పిదప ఆతని వెంట సైతాను పడెను. కావున ఆతఁడు దుర్మార్గులలో చేరిపో యెను. ఇట్టివాని విషయము వారికిఁ దెలుపుము. 176. మఱి మేము ఇష్టపడి

యుండినచో ఆ సూచనలవలన వాని పదవిని ఉన్నతిగాఁ జేసియుండును. కాని యాతఁడు నేలవంక వ్రాలెను. మఱి వాని కోరికలను వెంబడించెను. కావున వాని విషయము కుక్కవలె నున్నది. నీవు కుక్కపై బరువువేసిన అది నాలుక బయటికి వ్రేలాడఁదీయును. లేదా వదలిపెట్టిన అది నాలుక బయటికివ్రేలాడఁ దీయును. ఇది మాసూచనలను తిరస్కరించిన వారి పోలికయున్నది. కావున వారు గమనించుటకై ఈవిషయములు వారికిఁ దెలుపుము. 177. మాసూచనలను తిరస్కరించుచు వారి యాత్మలనష్టమేచేసికొనుచుంటినవారిపోలిక చాలచెడ్డది.

వ్యా॥ 175, 176. ఈ వాక్యములలో ఇస్రాయీలియులలోనున్న 'బల్అమ్‌బిన్‌బాఊరా' అను ఒక విద్వాంసుని విషయము చెప్పఁబడినది. ఆ విద్వాంసుఁడు గొప్ప భక్తుఁడుగా నుండెను. ఆతని ప్రార్థన (దుఆ) దేవుఁడు అంగీకరించుచుండెను. ఆతనికి దేవుఁడు తన సూచన లొసంగియుండెను. తుదకు ఆతఁడు ఒకస్త్రీ మాటలకు లోనై ధనమునకు ఆశపడి మూసా ప్రవక్తకు వ్యతిరేకముగా పనులు చేయసాగెను. మూసా ప్రవక్తకు ఏలాటి నష్టము వాని యత్నమువలన కలుగలేదు, కాని ఆతఁడు దేవుని దయనుండి తొలఁగి దేవుని కోపమునకు పాత్రుఁడై సైతానును వెంబడింపసాగెను. తుదకు దుర్మార్గులవర్గములో చేరిపోయెను. దేవుఁడు కోరియుండినచో ఆతఁడు దేవుని సూచనలవలన వానికి గొప్పపదవి (దర్జా) లభించియుండును. కాని యా విద్వాంసుఁడు తనకున్న విద్యనుబట్టి సన్మార్గమునకు పోక, ఇహలోక తుచ్ఛభోగములకులోనై తన కోరికలను అనుసరించి నేలవంక వ్రాలెను. అనఁగా హీనదశలో పడిపోయెను. అపుడు వాని గతి కుక్కవలెనాయెను. కుక్క తన బలహీనతవలన శ్వాసనిశ్వాసములు సరిగా తీయలేక దానిపై బరువువేసినను వేయక వదలిపెట్టినను లేదా దానిని అదలించినను అదలించక వదలిపెట్టినను తన నాలుకను బయటికిఁ దీసి వగర్చుచుండును, ఇటులే తుచ్ఛభోగములకు లోనైనందున, సుగుణములు పోయెను. దేవుఁడు విద్యజ్ఞానములు వానికి ఒసంగిన ఒసంగకపోయిన వానియందు సమానమే. కావున వానికి ఇహలోక తుచ్ఛభోగములఆశమెండై వాఁడు నాలుక బయటికిఁ దీయు కుక్కవలె హీనదశ పొందెను. లేదా వాని గతి కుక్కవలెనై వగర్చుచుండెను. వానికి ఏగతిపట్టియుండినసరే, ఇందు మత విద్వాంసులకు హెచ్చరిక గలదు. ఎవరు మత విద్యను అనుసరింపక తమ కోరికలను అనుసరింతురో వారికి దుర్గతి పట్టును. వట్టి మత గ్రంథములు చదివిన మాత్రాన ప్రయోజనము లేదు. అందలి ధర్మములను భయభక్తులతో అనుసరింపవలెను. 177. సన్మార్గము వదలి దుర్మార్గులై తమయిష్టానుసారము పోవువారు కుక్కను పోలుదురు. కుక్కవలెనగుట చాల చెడ్డది. మానవులై కుక్కను పోలుట చాల అవమానకరము. కావున ఏ మానవుఁడును తన్ను కుక్కతో సరి

సమానము౦ జేయుటకు యత్నింపడు. దేవుని సూచనలను తిరస్కరించువానిని వదలిపెట్టుటవలన మానవులదే నష్టమగును. దానివలన దేవునికి నష్టము లేదు.

178. మన్-యహ్‌దిల్లాహు-ఫ-హువల్-ముహ్‌తదీ-వ-మన్-యుజ్-లిల్ ఫ-ఉలా-ఇక-హుముల్-ఖాసిరూన్.

178. దేవుడు ఎవరికి సన్మార్గము చూపునో వారే సన్మార్గులగుదురు. మ ఱెవరికి మార్గము తప్పించునో వారే నష్టము పొందువారగుదురు.

వ్యా॥ 178. ఎవని కెంత విద్యయును జ్ఞానమునుండినను దేవుని యను గ్రహము కలిగినపుడే మానవుడు సన్మార్గముపొంది భక్తుడగును. దేవుని యనుగ్రహము లభింపనిచో అవి లాభపడవు. సన్మార్గము తప్పి దుర్మార్గు లగుట చాల నష్టకరము. కావున మానవుడు తన విద్యపై గర్వపడక సదా దేవుని యనుగ్రహమునకు౦గాను దేవునిని వేడుకొనుచుండవలెను,

179. వల-ఖద్-జరఅనా-లి జహన్నమ-కసీరమ్-మినల్-జిన్ని-వల్-ఇన్‌సి లహుమ్-ఖులూ-బుల్-లాయఫ్-ఖహూన-బిహా-వల-హుమ్-అఅ-యునుల్-లా యుబ్-సిరూన-బిహా-వల-హుమ్-ఆజా-నుల్-లాయస్-మఊన-బిహా-ఉలా-ఇక కల్-అన్ ఆమి-బల్-హుమ్-అజల్లు-ఉలా ఇక-హుముల్-గాఫిలూన్.

179. మఱియు, జిన్నాతులలోను మానవులలోను చాలమందిని నరక మునకు౦గాను మేము పుట్టించియున్నారము. వారికి హృదయములున్నవి. కాని వానితో వారు గ్రహించుటలేదు. మఱి వారికి కన్నులు గలవు. కాని వానితో వారు చూచుటలేదు. మఱి వారికి చెవులున్నవి. కాని వానితో వారు వినుట లేదు. వారు పశువులవలె నున్నారు. మఱి వారు అంతకంటెను హెచ్చుగా మార్గము తప్పినవారుగా నున్నారు. వీరేను అజాగ్రత్తగా నున్నవారు.

వ్యా॥ 179. దేవుడు మానవులను, జిన్నాతులనుసృష్టించెను. అందు అనేకులు తమపాపకార్యములవలన నరకములో పడుదురు. వాస్తవములో మానవులును, జిన్నాతులును దేవుని ప్రార్థించి సత్కార్యములుచేసి స్వర్గములో పోవలసినది. అయిన పెక్కుమంది తమ దుష్టత్వముతో తుదకు నరకములో చేరుదురు. కావున మానవుడు జాగ్రత్తపడి విశ్వసించి సత్కార్యములు చేయుచునుండవలెను. దేవుడు మానవులకు తన సూచనలను గమనించి బోధను గ్రహించుటకు౦గాను హృదయములును, దేవుని మహిమలను బాగుగ గమనించి చూచుటకు కన్ను లును, దేవుని వాక్యములను విని సమ్మతించుటకు౦గాను చెవులునుఒసంగియున్నా౦ డు. కాని దుష్టులు అట్లు చేయుటలేదు. పశువులవలె తిని త్రాగుటలోనే నిమ గ్నులై ఇహలోకభోగములకు లోనై హృదయములను, కన్నులను చెవులను

వాని వాని పనులలో నుపయోగించుటలేదు. మానవులకు దేవుఁడు ఆత్మికబలము పొందుటకుఁగాను వసతులు కల్పించియున్నాఁడు. కావున వారు పశువులుకాఁ గూడదు. బాగుగా గమనించినచో దుష్టులు పశువులకంటెఅధములుగానున్నారు. అది ఎట్లన, పశువులు తమ యజమానుల పిలుపు విని వచ్చుచున్నవి. ఏదైన పని వద్దని అదలించిన అవి చేయక నిలిచిపోవుచున్నవి. మఱియు పశువులకు నొసంగఁబడిన శక్తులకుఁ దగిన పనులు అవి నెరవేర్చుచున్నవి. దుష్టులు అట్లు చేయక దేవుఁడు వారి కొసంగిన శక్తులను వేఱు దోవలలో నుపయోగించి చెడి నశించుచున్నారు. ఇట్టివారే తమ నష్టలాభముల విషయము లక్ష్యములేక అజాగ్రత్తగా నున్నారు.

180. వ-లిల్లా-హిల్-అస్మా-ఉల్-హుస్నా-ఫద్-ఊహు-బిహా-వ-జరుల్ లజీన-యుల్-హిదూన-ఫీ-అస్మా-ఇహీ-స-యుజ్-జౌన-మా-కానూ - యఅ-మలూన్.

180. దేవునికి మంచిపేర్లు గలవు. కావున మీరు ఆపేర్లతో ఆతనిని పిలువుఁడు. మఱి దేవుని పేర్ల విషయములో తప్పుత్రోవనపోవువారిని వదలి పెట్టుఁడు. తప్పక వారు తమ కర్మల ఫలితము పొందఁగలరు.

వ్యా॥ 180. ఇఁక ముసల్మాను భక్తులు దేవుని విషయము అజాగ్రత్తగ నుండకూడదు. దేవునికి మంచి పేర్లుగలవు. కావున ఆపేర్లను స్మరింపవలెను. దేవుని నామములు స్మరించుటవలన ఆయాపేర్ల భావములు హృదయములో నాటుకొని సదా దేవుని ధ్యానమే యుండఁగలదు. దేవునికితగని పేర్లుపెట్టిపిలుచు వారు తప్పుత్రోవన పోవువారు. ఇట్టివారిని వదలి పెట్టవలెను. వారు తమకర్మల ఫలితము తప్పకపొందుదురు. దేవుని పేర్లు స్మరింపవలెను. దేవుని పేర్లను ఒకరికిచెడుగు చేయుటకుగాను జాలవిద్య (జాదూ) మొదలగు మంత్రములలో నుపయోగింపఁగూడదు అని దేవుని సెలవు.

181. వ-మిమ్మన్-ఖలఖ్నా-ఉమ్మతున్-యహ్-దూన-బిల్-హఖ్ఖి-వ-బిహీ- యఅ-దిలూన్.

181 మఱియు మేము పుట్టించిన జనులలో కొందఱు సత్యమైన మార్గము (ప్రజలకు) చూపుచు దానినను సరించియే న్యాయము చేయుచున్నారు.

వ్యా॥ 181. ఇందు ముసల్మానులఁగూర్చి చెప్పఁబడినది. హజ్రత్ మహమ్మదు వారి మతస్థులగు ముసల్మానులు సత్యమును స్వీకరించి సత్యమార్గమును ప్రజలకు చూపుచు సత్యమును అనుసరించి న్యాయము చేయుచున్నారు. వారు ఇస్లామ్ మతధర్మములుసరిగాననుసరించు చుఅందుఏలాటి హెచ్చుతగ్గులుచేయరు.

182. వల్-లజీన-కజ్-జబూ-బి-ఆ-యాతినా-స-నస్-తద్- రిజు-హుమ్ మిన్-హైసు-లా-యఅ-లమూన్. 183. వ-ఉమ్లీ-లహుమ్ ఇన్న-కైదీ-మతీన్.

182. మఱెవరు మాసూచనలను తిరస్కరించిరో వారికి తెలియకుండగ తిన్నతిన్నగా మేము వారిని పట్టుదుము. 183. మఱివారిని కొంతకాలము వదలి పెట్టుదును. నిశ్చయముగా నాయత్నము చాల స్థిరమైనది.

182. దేవుని సూచనలు అసత్యములని పలికి ప్రవక్తలను తిరస్కరించు నట్టి వారిని దేవుఁడు కొంతకాలము వదలిపెట్టును. అందువారికి అనేక సంపదలు ఇహలోక సౌఖ్యములు గలుగును. దానికి అవిశ్వాసులు మోసపోయి మేము చేయు పనులు మంచివి యని తమ దుష్టకార్యములో మిఱిమీఱి పోవుదురు. తత్క్షణమే దేవుఁడు అవిశ్వాసులను శిక్షింపక వదలిపెట్టి తిన్నతిన్నగా వారి దుర్మార్గము హెచ్చుగుకొలఁది వారిని పట్టుచుండును. వారు తమ దుర్మార్గము లో సంపూర్ణులు కాగానే వారికి దేవుని శిక్ష కలుగుచున్నది. ఇదియే దేవుని స్థిరమైన యత్నము. దేవుని యత్నమునకు ఎవరును అడ్డు రాఁజాలరు. అది సాగియే తీరును. కావున మానవులు తమకుఁ గలుగు కొంత లాభమునకు మోసపోక విశ్వాసులు కావలెను.

184. అవలమ్-యతఫక్కరూ-మా-బిసా-హిబిహిమ్-మిన్ - జిన్నతిన్ ఇన్-హువ-ఇల్లా-నజీరుమ్-ముబీన్. 185. అవ-లమ్-యన్ జురూ-ఫీమల-కూతిస్ సమా-వాతి-వల్-అర్ జి-వ-మా-ఖల-ఖల్లాహు-మిన్-షై ఇన్-వ-అన్-అసా-అన్-యకూన-ఖదిఖ్-తరబ-అజలు-హుమ్-ఫ-బి-అయ్యి-హదీసిన్-బఅదహూ-యూమి నూన్. 186. మన్-యుజ్ లి-లిల్లాహు-ఫలా-హాదియ-లహూ-వ-యజరు-హుమ్ ఫీ-తుగ్యా-నిహిమ్-యఅ-మహూన్.

184. ఏమి? వారు తమతోనుండు వానికి పిచ్చిలేదని గమనింప లేదా! ఆతఁడు స్పష్టముగా భయబోధ నిచ్చువాఁడు. 185. ఏమి? వారు భూమ్యాకాశములలోని ప్రభుత్వమును దేవుఁడు సృష్టించిన సర్వమును వారి కాలము సమీపించియుండు నేమో అను విషయమును గమనించి చూడలేదా! కావున వారు ఖురాను తరువాత ఏమాటను విశ్వసింపఁ గలరు. 186. దేవుఁడు ఎవరికి దారి తప్పించునో వారికి సన్మార్గము చూపువా రెవరును లేరు. మఱివారు వారి దుష్టత్వము లోపడి దేవులాడునట్లుగ వానిని దేవుఁడు వదలిపెట్టును.

వ్యా॥ 184. హజ్రత్ ముహమ్మదువారు దేవుడు పంపిన ఖురాను బోధను ప్రజలకు వినిపించు చుండిరి. మక్కా నివాసులు వారిమాటను వినక దేవుని

సూచనలను తిరస్కరింప సాగిరి. అందుకు దేవుఁడిట్లు సెలవిచ్చుచున్నాఁడు ముహమ్మదు ప్రవక్త బాల్యమునుండి మీతో నున్న యాతఁడు. ఆతనివిషయము మీకు బాల్యము నుండియు తెలియును. ఆతనికిపిచ్చిలేదు. ఆతఁడు మంచి బుద్ధి గలవాఁడు. ఆయన సత్యవంతుఁడు (సాదిఖ్), నమ్మఁదగినవాఁడు (అమీన్) అని మీరే బిరుదు లిచ్చియున్నారుగదా! అట్టి ముహమ్మదు దేవునిప్రవక్తగా నియమింపఁబడి భయబోధ మీకిచ్చుచున్నాఁడు. ఆతని విషయము మీరు గమనింపలేదా. ఆతని విషయము మీకు బాగుగఁ దెలిసియేయున్నది గదా. దేవునిసృష్టిని గమనించి చూడుఁడు. అందు ఎట్టి మహిమలు గలవో! అంతటను దేవుని ప్రభుత్వమున్నది. ఆతఁడు పంపిన ఖురాను గ్రంథము విశ్వసించుటలో మీకేమి ఆటంకమున్నది. ఎద్దియును లేదు. అట్లు కానిచో మీ వినాశకాలము సమీపించినది అని తెలిసికొన వలెను. ఖురానువంటి గ్రంథమును విశ్వసింపనివారు ఇఁక ఇతర గ్రంధముల మాటను విశ్వసింపఁ గలరా? అట్లు కానేరదు. 186. సర్వము దేవుని చేతిలో నున్నది. సన్మార్గము చూపుట, దారితప్పించుట, దేవుని యిష్టము. దేవుఁడు కోరనిచో ఎవరు ఎన్ని ప్రయత్నములు చేసినను దుర్మార్గునిని సన్మార్గమునకుఁ ద్రిప్పజాలరు. అయిన మానవుఁడు సన్మార్గము అవలంబించుటకు నుద్దేశించినచో దేవుఁడు తన యనుగ్రహము వలన సన్మార్గము ననుసరించునట్లు చేయును. అట్లుకాక దుర్మార్గములోనే పడియుండుట కుద్దేశించినచో దేవుఁడు కూడను వానిని వదలి పెట్టు చున్నాఁడు. అపుడువాఁడు దుర్మార్గములోనే పడి దేవులాడుచుండును. కావున మానవులు తమకు దేవుఁడు సన్మార్గము చూపునట్లుగ ఆతనిని వేఁడుకొను చుండవలెను.

187. యస్-అలూనక-అనిస్-సాఅతి-అయ్యాన-ముర్-సాహా-ఖుల్-ఇన్నమా-ఇల్ముహా-ఇన్ద-రబ్బీ-లాయుజల్లీహా-లి-వఖ్-తిహా - ఇల్లా- హువ-సఖులత్-ఫిస్సమా-వాతి-వల్-అర్జి-లా-తాతీ-కుమ్-ఇల్లా-బగ్-తతన్ యస్-అలూనక-కఅన్నక-హఫియ్యున్-అన్-హా ఖుల్ ఇన్నమా-ఇల్ముహా-ఇన్దల్లాహి - వలా-కిన్న-అక్-సరన్నాసి-లా-యఅ-లమూన్.

187. తుదిదినము (ఖియామత్) వచ్చుకాల మెపుడు అని వారు నిన్ను అడుగుచున్నారు. అది నా ప్రభువునకు మాత్రమే తెలియును. ఆతఁడే దానిని దాని కాలమునకు సరిగ బయలుపఱచును. అది ఆకాశములలోను భూమిలోను చాల భారమైనది. మీపై అది అకస్మాత్తుగనే వచ్చును అని ఓప్రవక్త! పలుకుము. నీకుఁ దెలిసియున్నట్లుగ వారు తుదిదినమును గూర్చి నిన్ను అడుగుచున్నారు. అది దేవునికి మాత్రము తెలియును. కాని అది జనులలో పెక్కుమంది

గ్రహింపరు. అని ఓప్రవక్త! పలుకుము.

వ్యా॥ 187. మానవుఁడు తన చావు కాలము ఎపుడు వచ్చును అని తెలిసికొనఁజాలఁడు. కావున లోకమంత నశించి తుదిదినము (ఖయామత్)వచ్చుకాలము మానవునకు తెలియనగునా! తెలియనేరదు ప్రజలు హజ్రత్ ముహమ్మదు వారితో తుదిదినము (ప్రళయము) ఎపుడు ఏదినమునందు వచ్చును. అది వచ్చుకాలము మాకుఁ దెలుపుము అని అడుగసాగిరి. దానికి జవాబిట్లు ఇయ్యఁబడినది. ప్రళయము వచ్చు సరియైనకాలము ఎవరికిని తెలియదు. అది వచ్చుకాలము దేవునికి మాత్రమే తెలియును. ఆతఁడు దానిని దాని సరియైన సమయములో బయలుపఱచి లోకమంతటను నశింపఁజేయును. భూమ్యాకాశములలో అదిచాల భారమైన విషయము. అది సంభవించుదినము చాలపెద్దది. అది వచ్చునది ఎవరికిని తెలియదు. అది అకస్మాత్తుగ సంభవించును. దాని కాలము దేవుని ప్రవక్తలకుఁ గూడ తెలియదు. ప్రవక్తలకు దేవుఁడెంత తెలుపునో యంతమాత్రము వారికిఁ దెలియును. దేవుఁడు తెలుపని విషయములను తమ ప్రయత్నము వలన తెలిసి కొనలేరు. అట్టి విషయమును గూర్చి తెలిసికొనుటకుయత్నింపరు వారి పని దేవుని సందేశమును ప్రజలకు అందఁజేయుటయే. కాని యీవిషయములను పెక్కురు జనులు తెలిసికోనరు. అందులకే తెలియరాని విషయములను గూర్చి ప్రశ్నింతురు. తుదిదినము వచ్చుకాలము మఱుఁగుగా నుండుటలో మానవులు అది ఎపుడు వచ్చునోఅని భీతికలిగి సత్కార్యములే చేయుచుందురు గదా ! ఓప్రవక్త! నీవు విచారించి తుదిదినము ఎపుడు వచ్చును అను విషయము నీవు తెలిసికొని యున్నట్లుగ వారు నిన్ను దానిగూర్చి యడుగుచున్నారు. వాస్తవములో అది వచ్చు కాలము నీకుఁదెలియదు. అది దేవునికి మాత్రము తెలియును. దేవదూతలకుఁ గూడ తెలియదు.

188. ఖుల్-లా-అమ్‌లికు-లి-నఫ్సీ-నఫ్-అన్-వలా-జర్రన్-ఇల్లా-మాషా అల్లాహు-వలౌ-కున్తు-అఅ్-లముల్-గైబ-లస్-తక్‌సర్తు-మినల్-ఖైరి-వ-మామస్-సనియస్-సూఉ-ఇన్-అనా-ఇల్లా-నజీరున్-వ-బషీరుల్-లిఖౌమిన్-యూమినూన్.

188. దేవుఁడు కోరినది తప్ప నేను నాయాత్మకుఁగాను మేలుగానికీడుగాని జేసికొను అధికారము నాకు లేదు. మఱినాకు గుప్తము (గైబు) తెలిసియుండినచో నేను చాల మేళ్ళు గ్రహించి యుందును. మఱి ఏకీడును నాకుఁ గలిగి యుండదు. నేను విశ్వసించు జనులకు భయబోధ నిచ్చువాఁడను. సంతోష వార్త వినిపించు వాఁడను అని ఓప్రవక్త! పలుకుము.

వ్యా॥ 188. మానవుఁడు ఎంత భక్తుఁడును ఎంత దేవునికి ప్రియుఁడును అయినను సరే, లాభ నష్టములు మేలు కీడు చేసికొను స్వాతంత్ర్యము వానికి లేదు.

దేవునికిఁ దెలిసిన సర్వగుప్తములును రాఁబోవువిషయములును అన్నియు ఒకమా నవునికిఁ దెలియవు. సర్వజ్ఞుఁడగు దేవునికే తెలియును. కావున జగత్తునకంతయు ప్రవక్తగా వచ్చిన మహమ్మదు రసూలువారు కూడ ఇట్లు ప్రకటింప వలెనని దేవుని సెలవగుచున్నది. మేలుగాని కీడుగాని లాభముగానినష్టముగానిచేయుట దేవుని చేతిలో నున్నది. మేలు కీడు కలిగించుకొను అధికారము నాకులేదు. నేను రాఁబోవు విషయములన్నిటిని రహస్యములన్నిటిని ఎఱుంగను. అట్లు సర్వ రహస్యములును గుప్తములును నాకు తెలిసి యుండినచో నేను లాభను లే పొందియుందును. ఏలాటి కీడు కలుగకుండ చూచికొని యుందును. అట్లు కాక నాకు ఒకపుడు మేలు కలుగుచున్నది. మఱొకపుడు నష్టము కలుగుచున్నది. నేను విశ్వాసులకు బోధించువాఁడను. పాపములు చేసినచో శిక్ష గలుగును అని భయపెట్టువాఁడను. సత్కార్యములుచేసినచో దేవునిప్రీతిలభించి స్వర్గసౌఖ్యము లు లభించును అను సంతోష వార్త విశ్వాసులకు వినిపించు చున్నాను. దే వుఁడు నాకు పంపిన సందేశములను ప్రజలకుఁ దెలుపుట నాపని. కావున దేవుఁ డు తన ప్రవక్తలకు ఏయే గుప్తవిషయములును రహస్యము (గైబు) లును తెలు పునో అంతమాత్రము వారికిఁ దెలియును. దానికి మించిన గుప్తము (గైబు) లు తెలియవు. మత ధర్మములు తత్వజ్ఞానము మొదలగు మతవిషయములు సం పూర్ణముగ ప్రవక్తకుఁ దెలియును.

189. హువల్-లజీ ఖలఖ-కుమ్-మిన్-నఫ్-సిన్-వాహిదతిన్-వ-జఅల-మిన్ హా-జౌజహా-లి-యస్-కున-ఇలైహా-ఫలమ్మా-త-గష్-షాహా-హమలత్-హమ్ లన్-ఖఫీ-ఫన్-ఫ మర్రత్-బిహీ-ఫలమ్మా-అస్-ఖలద్-దఅ-వల్లాహ-రబ్బ-హుమా లఇన్-ఆతై-తనా-సాలిహల్-లన-కూనన్న-మినష్-షాకిరీన్. 190. ఫలమ్మా-ఆతా-హుమా-సాలిహన్-జఅలా-లహూ-షురకాఅ-ఫీమా-ఆతాహుమా-ఫత-ఆ లల్లాహు-అమ్మా-యుష్-రికూన్.

189. ఆతఁడే మిమ్ము ఒక యాత్మనుండి పుట్టించెను. దానినుండియే దా ని జతను దాని సౌఖ్యము పొందుటకుఁగాను పుట్టించెను. పిదప పురుషుఁడు తన భార్యతో కలియఁగానే ఆమె తేలిక యైన భారము దాల్చెను. ఆమె దాని తో తిరుగుచు నుండెను. పిదప భారము కాఁగా వారిద్దఱు తమ ప్రభువగు దేవునితో "నీవు మాకు ఎట్టి లోపములేని బిడ్డను ఒసంగినచో తప్పక మేము నీకు కృతజ్ఞత సలుపుదుము" అని వేఁడుకొనిరి. 190. ఆపిదప దేవుఁడు వారికి లోపములేని బిడ్డను ఒసంగఁగా దేవుఁడు వారికొసంగిన దానిలో వారు సాటి కల్పింప సాగిరి. మఱివారు సాటి కల్పించు దానికంటె దేవుఁడు గొప్పవాఁడు,

వ్యా॥ 189:190. దేవుఁడు మొట్టమొదట ఆదమును సృష్టించెను. ఆతని సౌఖ్యమునకుఁగాను ఆతనినుండి ఆతని జత అగు హౌవ్వాను పుట్టించెను. వీరి ద్దఱి సంతానమే మానవులు. వారి సంతానము చేయు అధర్మమును గూర్చి యిందు చెప్పఁబడినది. భార్యాభర్తలు కలిసిన పిదప స్త్రీ గర్భము దాల్చును. అది ప్రథమమున తేలికగా నుండును. స్త్రీకి నడచుటలో కష్టము కనుపించ దు. గర్భము వృద్ధియగు కొలఁది భారము హెచ్చును. పూర్తి గర్భము అగు నరికి స్త్రీకి తిరుగుట కష్టముగాఁ దోచును. మఱియు గర్భములో నేమున్నదో ఎవరికిఁ దెలియదు. బిడ్డపుట్టిన అంగహీనుఁడగు నేమో అని సహజముగ భా ర్యాభర్తలకు భీతి గలుగును. అపుడు దేవునితో నీవు మంచిబిడ్డ దయచేసితి వేని మేము నీకు సదా కృతజ్ఞత సలుపుచుందుమని మొఱ పెట్టుకొనుదురు. దేవు ని దయ వలన ఎట్టి యంగలోపము లేని మంచి బిడ్డ గలిగినచో వారు ఆపద లో మొఱ పెట్టుకొన్న దేవుని విషయము మఱచిపోయి మాదేవతలు, భక్తులు (వలీ) అనుగ్రహించినది అని పలుకుచు దేవుఁడొసంగిన దానిలో ఇతరులను సాటి కల్పింతురు. ఏదో యొక దేవతకు మొక్కుబడి చెల్లింతురు. ఇట్లు దేవు నికి సాటికల్పించుట ఘోర పాతకము. దేవుఁడు వీరు కల్పించుసాటికంటె చాల గొప్పవాఁడు. ఆతఁడు పరమ పవిత్రుఁడు. కావున మానవులు తమ్ము సృష్టించి న దేవుని వదలి యితర చిల్లర దేవతలను కల్పింపరాదు అని ఇఁక రాఁబోవు వాక్యములలో చెప్పఁబడుచున్నది.

191. అయుష్-రికూన-మా-లాయఖ్-లుఖు-షై-అన్-వ-హుమ్-యుఖ్-లఖూన్. 192. వలా-యస్-తతీ-ఊన-లహుమ్-నస్రన్-వలా-అన్-ఫుసహుమ్-యన్-సురూన్. 193. వ-ఇన్-తద్-ఊహుమ్-ఇలల్-హుదా-లా-యత్-తబి-ఊ కుమ్-సవాఉన్-అలైకుమ్-అద-ఔ-తుమూహుమ్-అమ్-అన్-తుమ్-సామితూన్. 194. ఇన్నల్-లజీన-తద్-ఊన-మిన్-దూనిల్లాహి-ఇబా-దున్-అమ్-సాలుకుమ్-ఫద్-ఊహుమ్-ఫల్-యస్-తజీబూ-లకుమ్-ఇన్-కున్తుమ్-సాదిఖీన్. 194. అమ్ లహుమ్-అర్-జులున్-యమ్-షూన-బిహా-అమ్-లహుమ్-ఐదిన్-యబ్-తిషూన-బిహా-అమ్-లహుమ్-అఅ-యునున్-యుబ్-సిరూన-బిహా-అమ్ లహుమ్-ఆజా నున్-యస్-మఊన-బిహా-ఖులిద్-ఊ-షురకా-అకుమ్-సుమ్మ-కీదూని-ఫలా-తున్ జిరూని. 196. ఇన్న-వలియ్యి-యల్లాహుల్-లజీ-నజ్-జలల్-కితా-బ-వహువ-యుత

వల్-లస్-సాలిహీన్. 197. వల్-లజీన-తద్-ఊన-మిన్-దూనిహీ-లా-యస్-తతీ ఊన-నస్-రకుమ్-వలా-అన్ ఫుసహుమ్-యన్-సురూన్. 198. వ-ఇన్-తద్-ఊ హుమ్-ఇలల్-హుదా-లా-యస్-మఊ-వ-తరాహుమ్-యన్-జురూన-ఇలైక-వ హుమ్-లా-యుబ్-సిరూన్.

191:192. ఒక వస్తువునైనను సృష్టింపఁజాలకయు తామే సృష్టింపఁబడుచున్నట్టి వారిని, మీరు దేవునికి సాటి కల్పించుచున్నారా! వీరువారికి సహాయముచేయఁజాలరు. మఱి వీరు తమకు తామే సహాయము చేసికొనలేరు. 193. మఱి మీరు వారిని సన్మార్గమునకుఁ బిలిచినచో వారు మిమ్మ అనుసరింపరు. మీరు వారిని పిలిచినను! లేదా మీరు ఊరకున్ననో మీకు సమానమే! 194. మీరు దేవునిని వదలి ఎవరిని పిలుచుచున్నారో వారుకూడను మీవంటి మానవులే. మఱి మీరు వారిని పిలువుఁడు. మీరు సత్యవంతులైనచో వారు మీపిలుపునకు బదులు పలుకవలెను. 195. ఏమి వారికి నడచుటకు కాళ్ళున్నవా! లేదా వారికి పట్టుటకు చేతులున్నవా లేదా వారికి, చూచుటకు కండ్లున్నవా! లేదా వారికి వినుటకు చెవులున్నవా! మీరు కల్పించిన దేవతలను పిలిచికొనుఁడు. పిదప నా విషయము కుట్రలు సలుపుఁడు. మఱి నాకు గడువునొసంగకుఁడు. 196. గ్రంథము పంపినట్టి దేవుఁడే నాకు సహాయుఁడు. మఱి అతఁడే భక్తులకు తోడుపడువాఁడు. 197. మఱి మీరు దేవునిని వదలి ఎవరిని పిలుచుచున్నారో వారు మీకు సహాయము చేయఁజాలరు. మఱి తమకు తాము కూడ తోడుపడఁజాలరు. 198. మఱి మీరు వారిని సన్మార్గమునకు పిలిచినచో వారు ఏమియు వినరు అని ఓ ప్రవక్త! పలుకుము. మఱి వారు నీవంక చూచునట్లుగ నీవు చూచెదవు. కాని వారు ఏమియు చూచుటలేదు.

వ్యా॥ 191. ఇఁక ఈవాక్యములలో దేవుఁడు, విగ్రహములను చిల్లరదేవతలను పూజించుటను రద్దుచేయుచున్నాఁడు. అవిశ్వాసులు దేవతలను, విగ్రహములను దేవునికి సాటిగఁ జేయుచున్నారు. అది ధర్మముకాదు. ఎట్లన, వారు ఒక వస్తువునైనను పుట్టింపఁజాలరు. అదియునుగాక వారుకూడ దేవునిచే సృష్టింపఁబడినవారు. విగ్రహములను మానవులు తమ చేతులార చెక్కి కల్పించుచున్నారు. అవి ఎట్లు మానవులకంటె గొప్పవిగా కాఁగలవు. 192. విగ్రహములును చిల్లర దేవతలును వానిని పూజించువారికి కష్టములందు తోడుపడఁజాలవు. అవి శక్తిలేనివి ఒకరికి తోడుపడుట అటుండనిండు. అవి స్వయముగ తమకు తాము సహాయముచేసికొనఁజాలవు. ఎవఁడైన విగ్రహమును పగులఁగొట్టఁబోయినచో అది తన్ను రక్షించుకొనఁజాలదు అట్టిదితన పూజారులకు

ఎట్లు తోడుపడును. తోడుపడఁజాలదు. 193. విగ్రహములను మంచిమార్గమునకు రమ్మని పిలిచిన అవి యనుసరింపలేవు. వానిని పిలిచిన పిలువక యూరకున్నసమానమే. అవి కదలని మెదలని మొద్దులు. పిలుచువాని పిలుపు వృథాపోవును. 194. సర్వజ్ఞుఁడును సర్వశక్తుఁడును అగు దేవునిని వదలి అవిశ్వాసులు స్వయముగ కల్పించుకొన్న దేవతలును విగ్రహములును మానవులవంటిసృష్టికిఁ జేరినవి. అవికూడ దేవునిచే సృష్టింపఁబడినవి. అచేతనములగు విగ్రహములను పిలిచిన అవి బదులుపలుకలేవు. సందేహమున్నచో పిలిచిచూచుకొనుఁడు. ఓవిగ్రహారాధకులార! మీరు కల్పించు విషయముల్లో మీరుసత్యవంతులైనచో విగ్రహములు మీపిలుపునకు బదులుపలుకవలెను. అట్లు అవి పలుకవు.194.మానవులు కొన్నివిగ్రహములకు కాళ్లు చేతులు కన్నులు చెవులుకల్పించియున్నారు. అందునడచుటకునుపట్టుటకును, చూచుటకును, వినుటకునుశక్తి లేదు. అట్టిశక్తులుగలఅంగములు విగ్రహములకున్నవా ! లేవు. అపుడు వానికంటె మానవులే శ్రేష్ఠులు. వారికి అంగములకుఁ దగినశక్తులు గలవు. అట్టి మానవుఁడు తనకంటె హీనిమైనదానిని దేవతగా గ్రహించుట చాల శోచనీయము. విగ్రహారాధకులు, హజ్రత్ పైగంబరులవారి నిట్లు బెదరించిరి. ఓ ముహమ్మదు నీవు మావిగ్రహముల విషయము ఏమియు చెప్పకుము. అట్లు కానిచో అవి నీకు కీడు గలిగించును. దానికినిందు బదులు ఇయ్యఁబడినది. మీదేవతలను విగ్రహములన్నిటిని పిలిచికొని నాకు ఒక నిముషమైన విరామము నియ్యక ఏయే కుట్రలు నాకు విరోధముగఁ జేయవలెనో చేయుఁడు. 196. నాకు ఖురాన్గ్రంథ మొసంగి నన్ను ప్రవక్తగాఁ జేసిన దేవుఁడే నాకు రక్షకుఁడై తోడుపడును. భయభక్తులుగలవారందఱికిని తోడుపడువాఁడు ఆదేవుఁడే. మీకుట్రలు ఏమియు సాగనేరవు. 197. ఓవిగ్రహారాధకులార ! మీరు దేవునిని వదలి ఎవనిని పూజించుచు పిలుచుచున్నారో వారు మీ కేలాటి సహాయము చేయఁజాలరు. వారు శక్తిహీనులు. తమపైపడు కష్టమునుండి తమ్మొదాము రక్షించుకొనఁజాలరు. మీరు పిలిచినచో మీపిలుపు వృథాపోవును. వారు (విగ్రహములు, చిల్లర దేవతలు) మీపిలుపును వినరు అని పలుకవలెనని దేవుని సెలవయ్యెను. 198. విగ్రహములకు కన్నులున్నవి. అవిచూచునట్లుగకనఁబడును. కానియందుదృష్టి లేదు. కావునఅవిచూడఁజాలవు.

199. ఖుజిల్-అఫ్-వా-ముర్-బిల్-ఉర్ ఫి-వ-అఅ-రిజ్-అనిల్-జాహిలీన్. 200. వ-ఇమ్మా-యన్ జగన్నక-మినష్-షైతాని-నజ్-గున్-ఫస్ - తఇజ్-బిల్లాహి. ఇన్నహూ-సమీఉన్-అలీమ్.

199. క్షమించుచుండుము. మఱి ధర్మమునుగూర్చి ఆజ్ఞాపించుచుండుము. మఱి మూఢులనుండి తొలఁగియుండుము. 200. మఱి సైతానునుండి నీకు

ప్రేరేపణ కలిగినచో నీవు దేవుని శరణు వేఁడుము. నిశ్చయముగ ఆతఁడే సర్వము వినువాఁడు, సర్వము తెలిసినవాఁడు.

వ్యా॥ 199. మునుపటి వాక్యములలో విగ్రహారాధకుల మూఢత్వమును గూర్చి చెప్పఁబడియె. విగ్రహారాధకులు, తమ విగ్రహములనుగూర్చి వినిన మాటలవలన ద్వేషము వహించి వారు నిన్ను దూషించి హింసింతురేమో! కావున ఓ ప్రవక్త! నీవు వారి దూషణలను క్షమించుచు వారికి ధర్మము బోధించుచుండవలెను. క్షమించు గుణము చాల శ్రేష్ఠమైనది. దాని ననుసరించుము. మూఢులతో వారి మాటలకుఁగాను, వారితో జగడములు పెట్టుకొనక వారినుండి తొలఁగిపొమ్ము. వారి మూఢత్వమునకుఁగాను దేవుఁడే వారినిచూచుకొనును. 200. ఓ ప్రవక్త! నీవు మానవుఁడవు. కాఁబట్టి ఒకవేళ నీకు కోపమువచ్చినచో నీపదవికిఁ దగని కార్యమును చేయవలెనని సైతానునుండి నీకు ప్రేరేపణ గలిగినచో తత్క్షణమే దేవుని శరణు వేఁడుము. దేవుఁడు నీమొఱను విని నిన్ను రక్షించును. సైతాను కుట్ర నీపై సాగదు అని దేవుని సెలవయ్యెను.

201. ఇన్నల్లజీ-నత్-తఖౌ-ఇజా-మస్స-హుమ్-మినష్-షైతాని-తజక్కరూ-ఫ-ఇజా-హుమ్-ముబ్-సిరూన్. 202. వ-ఇఖ్ వా-నుహుమ్-యముద్దూ-నహుమ్-ఫిల్-గయ్యి-సుమ్మ-లా-యుఖ్-సిరూన్.

201. భయభక్తులుగలవారికి సైతానునుండి మనోకలఁత గలిగినచో వారు దేవునిని స్మరింతురు. అపుడే వారికి జ్ఞానము గలుగుచున్నది. 202. మఱి సైతానులు తమ సహోదరులను దుర్మార్గములోనే లాగుకొనిపోవుచుందురు. మరల వారు అందు కొఱతచేయరు.

వ్యా॥ 201. సైతాను మానవులందఱికిని మనోకలఁతలు (వస్వాస్)కలుగఁ జేయుచుండును. మానవులకు పాపకార్యములకు ప్రేరేపించుచుండును. వాని మోసములకు మానవులు తఱచుగ లోఁబడి పాపకార్యములుచేయసాగుదురు. అట్టి సమయములలో భయభక్తులుగలవారు దేవుని స్మరింపవలెను. సైతాను కుట్రలనుండి రక్షణపొందుటకై దేవుని శరణు వేఁడవలెను. అపుడు భక్తులకు దైవజ్ఞానముగలిగి తాము సైతాను కుట్రలకు పాలగుచున్నారని తెలిసికొని పాపములను వదలఁగలరు. మఱిపాపముల వలన గలుగు భోగసౌఖ్యములునిత్యములుగావు. వానివలన తుదకు ఉభయలోకములలో వినాశము గలుగును అని బుద్ధి తెచ్చుకొందురు. భక్తులు కానివారు సైతానులకు సహోదరులు. ఆ సైతానులు కల్పించు కలఁతలకును మోహములకును దుష్టులుమోసపోయి పాపములే చేయసాగుదురు. వారికి దేవునియందు భయభక్తులు లేనందున దేవునిని స్మరింపరు. అందుచే వారు సైతాను కుట్రలనుండి రక్షింపఁబడరు. సైతానులు వారికి దుర్మా

ర్గములో పడ వేయుటకు వెనుదీయరు. దుష్టులుకూడ సైతానులను అనుసరిం చుటలో కొంఅత చేయరు. దానివలన తుదకు వారు నశింతురు. కావున ముస ల్మాను భక్తులను ఒకపుడు సైతాను తన కుట్రలవలన పాపములకు ప్రేరేపించు నపుడు తత్క్షణమే దేవుని స్మరించి దేవుని శరణు వేఁడవలెను.

203. వ-ఇజా-లమ్-తాతి-హిమ్-బి-ఆయతిన్-ఖాలూ-లౌ-లజ్ - తబై తహా ఖుల్-ఇన్నమా-అత్-తబిఉ-మా-యూ-హా-ఇలయ్య మిర్ రబ్బీ - హాజా- బసాఇరు-మిర్-రబ్బికుమ్-వ-హుదన్-వ-రహ్మ-మతుల్ లి-ఖౌమిన్‌యూమినూన్

203. మఱి నీవు వారియొద్దకు ఏదైన ఒక సూచన తీసికొనిరాని చో వారు నీవే స్వయముగా దాని నెందులకు కల్పించుకొని తేలేదు అని పలు కుదురు. నేను, నాప్రభువునుండి నాయొద్దకు వచ్చు సందేశమును అనుసరించు వాఁడను. ఈఖురానులో మీప్రభువునుండి వచ్చిన సూచనలును, విశ్వాసులకు సన్మార్గమును, కరుణయునుగలదు అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 203. ఒకపుడు దేవుని సందేశము (వహీ) పైగంబరులవారికి వచ్చుటలో ఆలస్యమైనచో లేకఅవిశ్వాసులు కోరిన సూచన (మోజిజా) దేవుని నుండి వారికి చూపఁబడనిచో వారు "ఓ ముహమ్మదు! నీవే ఖురానువాక్యము లను కల్పించి కొని రమ్ము. లేదా సూచనలనుసృష్టించి మాకు చూపుము అని పలుకుదురు. దానికి సమాధానము నిట్లు ఇయ్యఁబడెను. నేను దేవునివర్తకను. దేవుని సెలవు ననుసరించిపోవువాఁడను. నేను స్వయముగా నెద్దియునుకల్పింపఁ జాలను. దేవుఁడు పంపిన సందేశమును నేను అనుసరించువాఁడను. ఈఖురానును గమనించుఁడు. ఇది జగత్తునకు నంతనుసూచన. ఇది ధర్మమును బోధించునది. దీని ననుసరించు విశ్వాసులకు ధర్మమార్గము లభించును మఱివారు దేవుని కరు ణకు పాత్రులై స్వర్గసౌఖ్యములు పొందుదురు. కావున మీరిట్టి సూచనలుగల గ్రంథమునే విశ్వసింపనిచో మీరు కోరినట్లు సూచనలు దెచ్చినను నమ్మదురని ఎవరికి నమ్మిక గలదు.

204. వఇజా-ఖురి-అల్-ఖున్ ఆను-ఫస్-తమిఉ-లహూ-వ-అన్ సితూ ల- అల్లకుమ్ తుర్-హమూన్.

204. మఱియు ఖురాను పఠింపఁబడునపుడు మీకు కరుణ కలుగుటకై మీరు దానిని చెవియొగ్గి వినుచు నిశ్శబ్దముగా నుండుఁడు.

వ్యా॥ 204. ఖురానెషరీఫు గొప్ప గ్రంథము. అందు సూచనలు గలవు మఱి విని అనుసరింపఁదగి ధర్మములు గలవు. కావున ఇట్టి మహిమగల గ్రంథము పఠింపఁబడునపుడు శ్రద్ధతో వినియందలి భావములను గ్రహింప వలెను. అపుడు

ఏలాటి శబ్దము చేయరాదు. ఖురానును ముసల్మానులు భయభక్తులతో విను నపుడు వారి విశ్వాస తేజము ప్రజ్వలించును. అందుచేవారు దేవుని ప్రీతికి పాత్రులగుదురు. అటులే విశ్వాసులు కాని వారును శ్రద్ధతో వినినచో అందలి ధర్మములు వారి మనస్సులను ఆకర్షించి వారికి విశ్వాసము లభించి భక్తులు అయి దేవుని దయకు పాత్రులు కాఁగలరు. దీనిబట్టియే నమాజులో ఇమామ్ ఖురాను పఠించు నపుడు వెనుక నున్నవారు (ముఖ్తదీలు) నిశ్శబ్దముగా దానిని వినుచు నుండ వలెను అను ధర్మము ఏర్పడెను.

205. వజ్కుర్ రబ్బక-ఫీ-నఫ్సిక-తజర్రు-అన్-వఖీ-ఫతన్-వ-దూనల్-జహ్రి-మినల్-ఖౌలి-బిల్-గుదువ్వి-వల్-ఆసాలి-వలా-తకుమ్ మినల్-గాఫిలీన. 206. ఇన్-నల్లజీన-ఇంద-రబ్బిక-లా-యస్-తక్-బిరూన-అన్-ఇబా-దతిహీ-వ-యుసబ్బి-హూన-హూ-వల హూ-యస్-జుదూన్.

205. మఱియు నీవు నీప్రభువును నీమనస్సులో వినయముతోను భయముతోను ధ్యానింపుము. మఱి ఎక్కువ శబ్దముతో గాక కొద్దిశబ్దముతో ఉదయ కాలములోను సాయంకాలములోను దేవునిని స్మరింపుము. మఱి అజాగ్రత్తగా నుండు వారిలో చేరకుము. 206. నీ ప్రభువునొద్దనున్న వారు ఆతనిప్రార్థన విషయము గర్వము వహింపరు. మఱి ఆతని పవిత్రతను కొనియాడుదురు. మఱి ఆతనికే సాష్టాంగ నమస్కారము (సిజ్దా) చేయుదురు.

వ్యా॥ 205. ఖురానును పఠించుట దేవునిని స్మరించుటయే. దాని గూర్చిన ధర్మము చెప్పఁబడియె. ఇఁక ఈవాక్యములలో సర్వకాలములలోఁ దేవునినెట్లు స్మరింపవలెనో బోధింపఁబడుచున్నది. దేవునిని ధ్యానించునపుడు వినయమును నమ్రతయు నుండవలెను. మనస్సులో భయభక్తులుండవలెను. దేవునిని స్మరించునపుడును ఆతనిని ప్రార్థించు నపుడును మనస్సు చలింపరాదు. నాలుకతో నుచ్చరించునపుడు మనస్సుకూడ అందే నిలుపవలెను. రాత్రింబవలు సదా దేవునిని స్మరించుచు నుండవలసినదే. అయిన ప్రత్యేకముగా ఉదయకాలమందును సాయంకాలమందును దేవునిని ధ్యానించుచుండవలెను. అందు అజాగ్రత్తగా నుండకూడదు. దేవుని దూతలు దేవుని సమ్ముఖమున నుండువారు. వారు కూడ దేవునినిని ప్రార్థించుచు ఆతనికి సాష్టాంగ నమస్కారములు (సిజ్దా)చేయుచుందురు. వారు అందు ఏలాటి గర్వము వహింపరు. దేవుని ప్రార్థనను ఉపేక్షింపరు. సదా దేవునిని స్మరించుచు ఆతని పవిత్రతను కొనియాడు చుందురు. దేవదూతలే అట్లు చేయునపుడు మానవుఁడు ఎట్లుఅజాగ్రత్తగ నుండఁగలఁడు? అట్లుండరాదు. దేవునిని ప్రార్థించు చుండవలెను. దేవునిని ప్రార్థించునపుడు

బిగ్గఱగా కేకలు వేసి ప్రార్థింప కూడదు. కొద్దిశబ్దముతో మెల్లగ దేవునిని ప్రార్థింపవలెను. ఈవాక్యము చదివిన పిదప చదువువారును వినువారును ఒక సిజ్దా చేయవలెను. దీనినే సిజ్దయేతిలావత్ అనుదురు. అయిదుపూటలు నమాజు విధింపఁబడక పూర్వము ఉదయము (ఫజర్) సాయంత్రము (మగ్‌రిబ్) నమాజు చేయవలెనని విధింపఁబడియుండెను.

## సూరయే అన్‌ఫాల్ (విజయధనము) మదనీ 75 వాక్యములు.

ఈసూరా బదరు యుద్ధమునకు తరువాత మదీనా పురములో హజ్రత్ పైగంబరులవారి కొసంగఁబడెను. హజ్రత్ రసూలు వారికి ప్రవక్త పదవి లభించిన పిదప పదిమూఁడు సంవత్సరముల వఱకు హజ్రత్ పైగంబరులవారును వారి శిష్యులును మక్కా ఖురైషులు పెట్టుబాధలకు పాలైరి. వానిని సహించుచుతుదకు తమ జన్మదేశమును వదలి మదీనాపురము చేరిరి. అచ్చటకూడ ముసల్మానులు శాంతిగ నుండునట్లు మక్కా ఖురైషులు వదలలేదు. కుట్రలు సలుపుచు బెదరించుచుండిరి. ఇంతవఱకు ముసల్మానులు విరోధుల బాధలకు ఓర్చుకొని యుండిరి. తుదకు శత్రువులగు కాఫిర్లను మార్కొనవచ్చును అని దేవుని సెలవయ్యెను. మక్కా-ఖురైషులు సిరియా మొదలగు దేశములకు పోయి వ్యాపారముచేసి లాభము సంపాదించుకొను చుండిరి. ఆపైకమును ముసల్మానులకు విరోధముగ నుపయోగించుచుండిరి. అందుకు ముసల్మానులు మదీనానుండి కొందఱు కొందఱుగాఁ బోయి శత్రువుల బిడారులను మార్కొనివారి ధనబలమును తగ్గించుచుండిరి. అపుడు అబూసుఫ్యాను సిరియానుండి మరలి తన వ్యాపారుల బిడారులను తీసికొని వచ్చుచుండెను. ఈ విషయము హజ్రత్ రసూలు వారికిఁ దెలిసి యాబిడారును మార్కొన వలెనని సాధారణమైన ఆయుధములతో 313 మందిని వెంటఁబెట్టుకొని బయలుదేరిరి. ఈసంగతి అబూసుఫ్యానునకుఁ దెలిసి యాతఁడు మక్కా ఖురైషులకు తెలుపఁగా అబూజెహాలు వెయ్యికంటె హెచ్చుగాఁగల గొప్పసైన్యము తీసికొని మదీనాపైకి వెడలెను. ఈ విషయము పైగంబరులవారికిఁ దెలిసి తమ శిష్యులతో సలహాచేసిరి. మక్కా సైన్యమును మార్కొన వలెను అని అందఱు అభిప్రాయపడిరి. వారియొద్ద సరియైన యుద్ధసామగ్రి లేకున్నను దేవునిపై నాధారపడి బయలుదేరి బదరు అను చోటున ఖురైషుల సైన్యమును మార్కొనిరి. అందు దేవుని యనుగ్రహము వలన ముసల్మానులకు గొప్ప జయము గలిగి విజయధనము లభించెను. అందు డెబ్బది మంది ఖురైషుల పెద్దనాయకులు వధింపఁబడి డెబ్బదిమంది ఖైదీలుగా పట్టుపడిరి. ఈ సూరాలో అచ్చటచ్చట ఈయుద్ధమును గూర్చి చెప్పఁబడును.

బిస్మిల్లా-హిర్రహ్మా-నిర్రహీమ్.

పరమ దయాళువును ప్రేమించు వాఁడు నగు దేవుని పేర.

1. యస్-అలూనకు-అనిల్-అన్-ఫాలి-ఖులిల్-అన్-ఫాలు- లిల్లాహి-వర్-రసూలి-ఫత్-తఖుల్లాహా-వఅస్-లిహూ-జాత-బైని-కుమ్-వ-అతీ-ఉల్లాహా-వ-రసూలహూ-ఇన్-కున్తుమ్-మూమినీన్. 2. ఇన్నమ-మల్-మూమినూనల్-లజీన-ఇజా- జుకి-రల్లాహు-వ-జి-లత్-ఖులూ-బుహుమ్-వఇజా-తులి-యత్ అలైహిమ్-ఆయాతుహూ-జాదత్-హుమ్-ఈమానన్-వ-అలా-రబ్బిహిమ్-యత-వక్కలూన్ 3.లల్-అజీన-యుఖీమూనస్-సలాత-వ-మిమ్మా-రజఖ్నా-హుమ్ యున్ఫిఖూన్. 4. ఉలాఇక-హుముల్-మూమినూన-హాఖ-ఖన్-లహుమ్-దరజాతున్ ఇన్ద-రబ్బిహిమ్-వ-మగ్ఫిరతున్-వ-రిజ్ఖున్-కరీమ్.

1. ముసల్మానులు విజయ ధనమును గూర్చి నిన్ను అడుగుచున్నారు. విజయధనము దేవునిది మఱియు ప్రవక్తది. కావున దేవునికి భయపడుఁడు. మీలోమీరే సమాధాన పడుఁడు. మీరు విశ్వాసులైనచో దేవునికిని ఆతని ప్రవక్తను విధేయులై యుండుఁడు. 2. విశ్వాసులైనవారు దేవుని పేరు రాఁగానే వారి హృదయములు భయపడును. మఱి ఆతని వాక్యములు వారి యెదుట పఠింపఁబడఁగానే వారి విశ్వాసము హెచ్చగును. మఱి దేవునిపై నాధార పడుదురు. 3. వారు స్థిరముగా నమాజును సలుపువారు. మఱి మేము వారికొసంగిన దానినుండి ఖర్చు చేయుదురు. 4. ఇట్టివారే నిజమైన విశ్వాసులు. వారికిఁగాను వారి ప్రభువు నొద్ద గొప్ప పదవులును క్షమాపణయును గౌరవమైన యాహారమును గలవు.

వ్యా॥ 1. బదరు యుద్ధములో లభించిన విజయ ధనమును గూర్చి ముసల్మానులలో భేదాభిప్రాయము గలిగెను. యౌవనులు మేము యుద్ధములో ముందంజవేసి మార్కొంటిమి. కావున పూర్తి విజయధనము మాకుఁ జేరవలెను అనియు వృద్ధులు మేము మీ వెనుకనుండి మీకు సహాయ మొసంగితిమి. కావున మాకు పూర్తిగ విజయ ధనము లభింప వలెను. అనియు కొందఱు మేము హజ్రత్ పైగంబరుల వారిని చుట్టుకొని యుండి వారికి రక్షక భటులుగా నుంటిమి. కావున సర్వము మాకే చేరవలెను అని పలుకసాగిరి. దానికి జవాబు నిందు ఇయ్యఁబడినది. జయము దేవుని చేతిలో నున్నది. దేవుని యనుగ్రహము లేనిది యుద్ధములో జయము లభింపదు. కావున యుద్ధములో దొరికిన సొమ్ము దేవునిది. ప్రవక్త దేవునికి ప్రతినిధి. కావున అది ప్రవక్తది. దేవుఁడు తన ప్రవక్త మూలమున ఎట్లు ఆజ్ఞాపించునో అట్లు నడుచుకొనుట ముసల్మానులకు ధర్మము.

దేవుఁడు సెలవిచ్చిన ప్రకారము విజయ ధనము పంచఁబడును. కావున నిజమైన ముసల్మానులు ప్రతివిషయములోను దేవునికి భయపడుచు పరస్పరము ఏలాటితగువులేకుండ సమాధానపడి ప్రేమతోనుండుచు చిన్నచిన్న మాటలకుతగువులాడక దేవునికిని ఆతని ప్రవక్తకును విధేయులు అయి వారి యాజ్ఞలను అనుసరించుచు దేవునిపేరు వినినంతనే భయభక్తులతో వణకుచు దేవుని వాక్యములను వినినపుడు తమ విశ్వాసమును హెచ్చుగా బలిష్ఠముగాఁ జేసికొని ప్రతి కార్యములోను దేవునిపై నాధారపడి యుండుచు తమ సర్వమును దేవుని మార్గమందు వినియోగించుచు ప్రార్థనలు స్థిరముగా సలుపుచు నుండవలెను. ఇట్టి సుగుణము గలవారు నిజమైన భక్తులును విశ్వాసులును. ఇట్టివారు తమకర్మలకుఁ దగినట్లు గౌరవ పదవులను పొందుదురు. మఱి దేవుఁడు వారి పొరపాటులను క్షమించి స్వర్గములోవారికిఁ దగిన గౌరవమైన ఆహారము దయచేయును.

5. కమా-అఖ్-రజక-రబ్బుక- మిమ్-బై తిక-బిల్-హక్ఖి-వ-ఇన్న- ఫరీఖమ్-మినల్-మూమినీన-లకారి-హూన్. 6. యుజాదిలూనక-ఫిల్-హఖ్-ఖిబఅ-ద-మా-తబయ్యన-క-అన్నమా-యుసా-ఖూన-ఇలల్-మౌతి-వహుమ్-యన్ జురూన్. 7. వ-ఇజ్-యఇ-దుకు-ముల్లాహు-ఇహ్-దత్-తాఇ-ఫతైని- అన్నహా-లకుమ్-వ-తవద్దూన-అన్న-గైర-జాతిష్-షౌకతి-తకూను-లకుమ్-వ-యు - రీదుల్లాహు-అన్-యుహిఖ్-ఖల్-హఖ్ఖ-బి-కలి-మాతిహీ-వ-యఖ్-తఅ- దాబిరల్-కాఫిరీన్. 8. లి-యుహిఖ్ ఖల్-హఖ్ఖ-వ-యుబ్-తిలల్-బాతిల - వలౌ - కరిహల్-ముజ్-రిమూన్. 9. ఇజ్-తస్-తగీసూన-రబ్బకుమ్-ఫస్-తజాబ - లకుమ్-అన్నీ-ముమిద్దుకుమ్-బి-అల్-ఫిమ్-మినల్-మలా-ఇకతి-ముర్-దిఫీన్. 10. వమా-జఅల-హుల్లాహు-ఇల్లా-బుష్రా- వలి-తత్-మఇన్న-బిహీ-ఖులూ-బుకుమ్- వ-మన్-నస్రు-ఇల్లా-మిన్-ఇన్-దిల్లాహి- ఇన్నల్లాహ-అజీ-జున్-హకీమ్.

5. ఎట్లుముసల్మానులలో కొందఱు ఇష్టపడకపోయినను నీప్రభువు నిన్ను నీగృహమునుండి సత్యమునకుఁగాను బయటికిఁ దీసెనో (అట్లు విజయధనము దేవునిది). 6. వారు చావును కన్నులార చూచుచు దానివైపునకు పోవునట్లుగ వారికి స్పష్టపడిన పిదపకూడ దానినిగూర్చి వారు నీతో వాదించుచున్నారు. 7. మఱియు రెండు పక్షములలో ఒకపక్షము మీచేతికి చిక్కును అని దేవుఁడు మీతో వాగ్దానము చేయునపుడు ఆయుధములులేని బిడారము మీకు దొరక

వలెనని మీరు కోరుచుంటిరి. మఱి దేవుఁడు తన వాక్యముల మూలమున సత్యమును సత్యపఱచవలెననియు, అవిశ్వాసులను నిర్మూలింపవలెననియు కోరుచుండెను. 8. పాపాత్ములు ఇష్టపడకపోయినను దేవుఁడు సత్యమును సత్యపఱచవలెననియు, అసత్యమును తుడిచివేయవలెననియు కోరెను. 9. మీరు మీ ప్రభువును వేఁడుకొనఁగా ఆతఁడు వరుసగా వచ్చునట్టి వేయిమంది దేవదూతలను మీకు సహాయముగా పంపుదును అని మీ మొఱను అంగీకరించెను. 10. మఱి యిది మీకు సంతోషవార్తగాను, మీహృదయములకు శాంతిగాను చేసెను. వాస్తవముగ దేవునినుండియే సహాయము గలుగును. నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనాపరుఁడును.

వ్యా॥ 5. ముసల్మానులు బదరుయుద్ధమునుగూర్చి యోచింపవలెను. ప్రారంభమునుండి అంత్యమువఱకు దేవుని సహాయమే ముసల్మానులకు తోడుపడియుండెను. ఎట్లు వారికి దేవుని సహాయముచే యుద్ధములో జయముగలిగి విజయధనము లభించెనో అటులే ఆ విజయధనము దేవుని సెలవు ననుసరించి పంచవలెను. (ఎట్లు పంచవలెనో రాఁబోవు వాక్యములలో వచ్చును). అందు ఏలాటి జగడములు పెట్టుకొనరాదు. చూడుఁడు. దేవుఁడు తన ప్రవక్తగృహాము (మదీనా) నుండి సత్యకార్యమునకుఁగాను వెడలునట్లు చేసెను. అప్పటిస్థితి యోచింపఁదగినది. ఖురైషుల వ్యాపార బిడారమును మార్కొనుటకు కొందఱు ముసల్మానులు ఇష్టపడలేదు. అందుకే చాలమంది వెడలక కొద్దిమంది (313) మాత్రము ఎట్టి యుద్ధ ఆయుధములు లేక వెడలిరి. ముసల్మానులు సఫ్రా అనుచోటున చేరినపుడు మక్కా ఖురైషులు గొప్ప సైన్యముతో మదీనాపైకి దాడి వెడలివచ్చుచున్నారని తెలిసెను. అపుడు పైగంబరుఁవారు తమ శిష్యుల అభిప్రాయము అడిగిరి. కొందఱు మాయొద్ద సరియైన యుద్ధ ఆయుధములులేవు. కావున యుద్ధము చేయుట సరికాదు అనిపలికిరి. దేవుఁడు ఇస్లామ్ మతమునకు జయమొసంగును. ముసల్మానులు జయముపొందుదురు అని ప్రవక్తమూలమున ముసల్మానులకుఁ దెలిసియుండెను. అట్లు దెలిసియు సత్యమునుగూర్చి వాదించుచు, యుద్ధము చేయవలెనన్న చావు ఎదుఱుగానున్నట్లు తలఁచుచుండిరి. అపుడు కొందఱు భక్తులు ధైర్యపుమాటలు పలికి యుద్ధమునకే పోవలెను అనినిశ్చయించుకొనిరి. 7. రెండు పక్షములు ఒకటి సిరియానుండి మక్కాకు వచ్చుచున్న వ్యాపారుల బిడారము. రెండవది మక్కానుండి అబూజెహాలు తీసికొనివచ్చుచున్న గొప్ప సైన్యము. ఈ రెంటిలో నేదైన ఒకటి మీచేతికి చిక్కును అని దేవుఁడు సెలవిచ్చియుండెను. అపుడు ముసల్మానులు ఆయుధములులేని వ్యాపారుల బిడారము చేతికి వచ్చిన బాగుండును. అందు యుద్ధము సంభవింపదు. సొత్తు చాల లభించును అని కోరుచుండిరి. కాని దేవుఁడు కొద్దిమంది ముసల్మానుల మూల

మున అవిశ్వాసుల గొప్పసైన్యమును నిర్మూలింపవలెనని యిష్టపడి అట్లుగా వించెను. కొద్దిమంది ముసల్మానులు కాఫిర్ల గొప్పసైన్యమును బదరుమైదానములో ఓడించిరి. అందు దేవుని సహాయమే లేకపోయినచో ముసల్మానులకు జయము ఎట్లు గలుగును. దీనివలన ముసల్మానుల మతము సత్యమైనది. దానికి దేవుఁడు తోడైయున్నాఁడు అని తేటతెల్లమాయెను. మక్కా ఖురైషులు ఓడిపోవుటవలన అవిశ్వాసుల బలము తగ్గెను. తుదకు నశించెను. 9. బదరుయుద్ధము ప్రారంభించునపుడు రసూలువారును ముసల్మానులును దేవుని వేఁడుకొనిరి. దేవుఁడు వారి మొఱను విని దేవదూతలను పంపి సహాయమొనర్చెను. ఇట్లు ముసల్మానులకు సంతోషమును, ఉత్సాహమును గలిగి వారి హృదయములు శాంతిపడెను. వాస్తవముగా గమనించిన సహాయమును జయమును దేవుని చేతిలో నున్నవి. ఆతఁడు సర్వశక్తుఁడు. ఆతఁడు తోడుపడిన శత్రువులు ఏమియు చేయఁజాలరు. ఆతఁడు వివేచనాపరుఁడు. కావున సమయోచితముగ ఎవరికెట్లు చేయవలెనో అట్లు చేయును.

11. ఇజ్-యుగష్-షీకుమున్-నుఆస-అమనతమ్-మిన్‌హు-వ - యునజ్జిలు-అలైకుమ్-మినస్-సమాఇ-మాఅల్-లియు-తహ్హి-హిరకుమ్-బిహీ-వ-యుజ్‌హిబ-అన్-కుమ్-రిజ్-జష్-షైతాని-వలి-యర్ - బిత-అలా-ఖులూబి-కుమ్-వ-యు-సబ్బిత-బిహిల్-అఖ్-దామ్.

11. దేవుఁడు తనయొద్దనుండి మీకు శాంతి గలుగుటకుఁగాను మీకు తూఁగు గలిగించెను. మఱియు మిమ్ము పరిశుద్ధులుగఁ జేయుటకును, మీనుండి సైతానుయొక్క అపవిత్రతను తొలగించుటకును మీహృదయములకు బల మొసఁగుటకును మీపాదములను స్థిరముగా నుంచుటకును, ఆకాశమునుండి నీళ్ళను మీపై కురిపించెను.

వ్యా॥ 11. బదరుయుద్ధములో ముసల్మానులకు చాలకఠినపరీక్షయుండెను. శత్రువుసైన్యము వారికంటె మూడింతలు హెచ్చుగానుండి యుద్ధ ఆయుధములలో మునిగియుండెను. ముసల్మానుల సైన్యము తక్కువ. దానిపై వారియొద్ద సరియైన యుద్ధ ఆయుధములు లేకుండెను. ముసల్మానులు మదీనానుండి వెడలినపుడు యుద్ధమునకుఁగాను సిద్ధులై వెడలలేదు. వ్యాపారుల బిడారమును అడ్డగించవలెనని వెడలియుండిరి. ఇదియునుగాక, బదరు మైదానములో మక్కా ఖురైషులు గట్టి స్థలమును నీళ్ళ వసతులను ముందుగానే ఆక్రమించుకొనియుండిరి. ముసల్మానులు ఉండుచోటు పల్లముగాను, ఇసుకతో నిండినదిగానుండెను. అందు కాళ్లు దూరిపోవుచుండెను. దుమ్ముకూడ హెచ్చుగానుండెను. నీళ్లు

దొరకలేదు. కావునవజూస్నానములకును త్రాగుటకును ముసల్మానులకుఇబ్బంది కలిగెను. ఇట్టి స్థితిలో ముసల్మానులు తాము ఓడిపోవుదుమనిభయపడసాగిరి. దానిపై సైతాను వారి హృదయములలో మీరు సత్యవంతులైనచో మీకీ ఇబ్బందులుగలిగియుండవు. మీకు దేవుని సహాయము గలిగియుండును అని కలతలుపెట్టసాగెను. అపుడు దేవుని అనుగ్రహమువలన గొప్పవర్షము కురిసెను. దానివలన ముసల్మానుల ఇబ్బందులు తొలఁగి చాల సౌకర్యములు కలిగెను. వజూస్నానములకును త్రాగుటకును నీళ్లు ఎక్కువగ లభించెను. ఇసుక గట్టిపడి నడుచుటకు సౌకర్యములు గలిగెను. దుమ్ములేకపోయెను. వర్షమువలన మక్కా ఖురైషులుండు స్థలము బురదతో నిండిపోయి వారి పాదములు జారసాగెను. వానవలన ముసల్మానులకు ఇబ్బందులు దొలఁగినపిదప దేవునిమహిమ వలన ముసల్మానులకు తూఁగువచ్చెను. దానినుండి మేలుకొనిన పిదప వారి హృదయములు శాంతిపడి వారికి భయముపోయి ధైర్యమును బలమునుకలిగెను. ఇట్లు సైతానువలన గలిగిన అపవిత్రత తొలఁగి, వారి హృదయములు శాంతించి వారి పాదములు యుద్ధరంగమునందు స్థిరముగా నుండెను. ఇదంతయు దేవుని సహాయమే గదా!

12. ఇజ్-యూహీ-రబ్బుక-ఇలల్-మలా-ఇకతి-అన్నీ-మఅకుమ్-ఫ-సబ్బితుల్-లజీన-ఆమనూ-సఉల్-ఖీ-ఫీ-ఖులూ-బిల్-లజీన-కఫరుర్-రుఅ-బ-ఫజ్-రిబూ ఫౌఖల్-అఅ-నాఖి-వజ్రిబూ-మిన్-హుమ్-కుల్ల-బనాన్. 13. జాలిక-బి-అన్న-హుమ్-షాఖ్-ఖుల్లాహ-వ-రసూలహూ-వ-మన్-యుషా-ఖి-ఖిల్లాహ-వ-రసూలహూ-ఫ-ఇన్నల్-లాహ-షదీదుల్-ఇఖాబ్. 14. జాలికుమ్-ఫ-జూఖూహు-వ-అన్న-లిల్-కాఫిరీన-అజాబన్-నార్.

12. నీ ప్రభువు దేవదూతలకు "నేను మీతోనున్నాను. కావున మీరు విశ్వాసుల హృదయములు స్థిరముగా నుండునట్లు చేయుఁడు. నేను అవిశ్వాసుల హృదయములలో భయముఁగలిగించెదను. కావున మెడలపైఁ గొట్టుఁడు. మఱి వారివ్రేళ్ళ కొనలనుకోసివేయుఁడు అని సందేశము పంపెను. 13. ఇదియెందు కనగా వారు దేవునికిని అతని ప్రవక్తకును విరోధులైరి. మఱెవఁడు దేవునికిని అతని ప్రవక్తకును విరోధియగునో వానికి నిశ్చయముగా దేవుఁడు చాల కఠినముగా శిక్షవిధించును. 14. ఓ అవిశ్వాసులారా! ఇది మీరు రుచిచూడుఁడు. మఱి అవిశ్వాసులకు నరకాగ్నిబాధ యున్నది యని తెలిసికొనియుండుఁడు.

వ్యా॥ 12. బదరుయుద్ధములో సైతాను, కనానావంశమునకు నాయకుఁ

నైన సురాఖాబిన్ మాలికు యొక్క రూపముదాల్చి తన యనుచరులను మాన వుల రూపములోఁ దీసికొనివచ్చి ఖురైషుల నాయకుఁడగు అబూజెహాలుతో నీవు యుద్ధమాడుము. నేను నాజనులతో నీకు సహాయమొనర్చెదను. నీవే జయ ము పొందుదువు అని కాఫిర్లకు ప్రోత్సాహపఱచెను. (ఈవిషయము ఇంకమీఁద వచ్చును.) అట్లు మక్కా ఖురైషులును వారికి తోడుగ సైతాను సైన్యమును ముసల్మానులను మార్కొన సాగెను. అపుడు దేవుఁడు, జబీ్రలు, మేకాయీలు యొక్క ఆధిపత్యమున దేవదూతలను పంపి మీరు ముసల్మానులకు తోడుపడి వారి హృదయములకు శాంతి గలుగునట్లుచేసి కాఫిర్లను తెగనఱకుఁడు. నేను మీతో నున్నాను అని సెలవిచ్చెను. ఇదియును దేవుని యనుగ్రహమే గదా! 13. మక్కా ఖురైషులు దేవుని వాక్యములు వినక ఆతనికి విరోధులై ఆతని ప్రవక్తయగు మహమ్మదును విరోధించిరి. కావున కాఫిర్లు కఠినశిక్షకు పాత్రు లైరి. యుద్ధములోని బాధ కొంచెము. ఓ అవిశ్వాసులార! దీనిరుచిచూడుఁడు. దీనికంటె ఘోరమైన నరకాగ్నిబాధ మీకుఁ గలుగనున్నదియని తెలిసికొనుఁడు.

15. యాఅయ్యు-హల్లజీన-ఆమనూ-ఇజా-లకీ-తుముల్లజీన - కఫ రూ-జహ్-ఫన్-ఫలా-తువల్లూ-హుముల్-అద్బార్. 16. వమన్-యువల్లిహిమ్ యామఇ-జిన్-దుబురహూ-ఇల్లా-ముత-హర్రి-ఫల్-లిఖితాలిన్-ఔ-ముత - హ య్యిజన్-ఇలా-ఫిఅతిన్-ఫఖద్-బాఅ-బి-గజ-బిమ్-మినల్లాహి-వ- మావాహు-జ హన్నము-వ-బీసల్-మసీర్.

15. ఓ ముసల్మానులార! యుద్ధరంగమందు అవిశ్వాసులను మార్కొను నపుడు వారికి వీఁపియ్యకుఁడు. 16. మఱి యుద్ధతంత్రము చేయుటకుఁగాని లేదా సైన్యములో పోయి చేరుటకుఁగాని తప్పవేఱువిధమున ఆదినమునందు వీఁపిచ్చు వాఁడు దేవుని కోపమునకు పాత్రుఁడాయేను. మఱివాని నివాసము నరకము. అది చాల చెడ్డనివాసము.

వ్యా॥ 15. కాఫిర్లతో యుద్ధమాడునపుడు ముసల్మానులు యుద్ధరంగ మునందు వీఁపిచ్చిపాఱిపోవుట ఘోరపాతకము. అట్లుయుద్ధరంగము వీడి పోఁ గూడదు. కాఫిర్ల సైన్యము రెండింతలున్నను ముసల్మానులు యుద్ధము చేయ వలెను. సమయోచితముగ ఏదైనయుద్ధతంత్రము చేయుటకై వీఁపిచ్చి పోయి తిరిగి యుద్ధము చేసిన లేదా తన సైన్యములో కలిసికొనుటకు వీఁపిచ్చిన అది దోషము కాదు. ఎందుకన అట్టివాని యుద్దేశము తిరిగి యుద్ధము చేయవలెనని యున్నది. పాఱిపోవు నుద్దేశము లేదుగదా! శత్రులకు భయపడి వీఁపిచ్చి పా ఱిపోవువాఁడు దేవుని కోపమునకు పాత్రుఁడైనరక నివాసియగును. అందు అనేక

ఘోర బాధలకు పాలగును. కావున అట్లు పాఱిపోక యుద్ధములో తగులు గాయములకు ఓర్చి ధైర్యముతో యుద్ధమాడుట ముసల్మానుల విధి.

17. ఫలమ్-తఖ్-తులూ-హుమ్-వలా-కిన్నల్లాహ-ఖత-లహుమ్-వమా రమైత-ఇజ్-రమైత-వలా-కిన్నల్లాహ-రమా-వ-లి_యుబ్-లియల్-మూమినీన-మిన్-హు-బలా-అన్-హసనన్-ఇన్నల్లాహ-సమీ ఉన్-అలీమ్. 18. జాలికుమ్-వ-అన్నల్లాహ-మూహిను-కైదిల్-కాఫిరీన్.

17. మీరు వారిని చంపలేదు. కాని దేవుఁడు వారిని చంపెను. మఱి నీవు పిడికెడు మట్టి విసరి వేసినపుడు నీవు విసరి వేయలేదు. కాని దేవుఁడు విసరి వేసెను. ఇది దేవుఁడు తన గొప్ప యనుగ్రహమును ముసల్మానులపై చేయుట కుఁగాను చేసెను. నిశ్చయముగ దేవుఁడు సర్వము వినువాఁడును సర్వము తెలిసినవాఁడును. 18. ఇది జరిగిపోయెను. ఇఁకమీఁద దేవుఁడు అవిశ్వాసుల కుట్రలను బలహీనములుగఁ జేయును అని తెలిసి కొనుఁడు.

వ్యా॥ 17. బదరులో ఘోరముగ యుద్ధము జరుగుచున్నపుడు హజ్రత్ ముహమ్మదు వారు ఒక పిడికెడు మన్ను తీసకొని కాఫిర్ల సైన్యముపై విసరి వేసిరి. అది దేవుని మహిమవలన ప్రతియొకరి కండ్లలో పడెను. కాఫిర్లు తమ కన్నులను నలఁచుకొనసాగిరి. అపుడు ముసల్మానులు వారిపైఁబడి వధింపసాగిరి. ఇట్లు ఒక పిడికెడు మన్ను అందఱికండ్లలో పడునట్లు విసరి వేయుట మానవశక్తికి మించినది. అటులే ఆయుధములు లేని కొద్దిమంది పెక్కుమందిని చంపి జయము కాంచుట మానవ శక్తికి మించినది. కావున అదంతయు దేవుని మహిమవలన గలిగినది. ఇది ముసల్మానులపై దేవుని గొప్ప యనుగ్రహము. దేవుఁడు ముసల్మానుల మొఱను వినుచు వారికర్మలను తెలిసికొను చున్నాఁడు. వారికిఁ దగిన ఫలిత మొసంగుచున్నాఁడు. 18. ఈసమయములో దేవుఁడు మక్కా ఖురైషుల కుట్రనుసాగనీయలేదు. వారికి అపజయ మొసంగెను. ఇఁక మీఁద కూడ వారు పన్ను కుట్రలను బలహీనములుగఁ జేసి వానిని సాగనీయఁడు అని తెలిసికొనుఁడు.

19. ఇన్-తస్-తఫ్-తిహూ-ఫఖద్-జాఅకుముల్-ఫత్‌హు-వఇన్-తన్-తహూ-ఫహువ-ఖైరుల్-లకుమ్-వఇన్-తఊదూ-నఉద్-వలన్-తుగ్-నియ-అన్-కుమ్-ఫి-అతుకుమ్-షై-అన్-వ-లౌ-క-సురత్-వఅన్నల్లాహ-మఅల్-మూమినీన్.

19. ఓ అవిశ్వాసులార! మీరు తీర్పు కోరుచుండినచో మీ యొద్దకుతీర్పు వచ్చెను. మఱిమీరు మానుకొన్నచో మీకు మేలు కలుగును. మఱి తిరిగి మీరిట్లు

చేసినచో మేముకూడ తిరిగి యిదే చేసెదము. మఱి మీ సమూహము ఎంత హెచ్చుగానున్నను మీకు పనికి రాఁజాలదు. మఱి దేవుఁడు ముసల్మానులతో నున్నాఁడని తెలిసికొనుఁడు.

వ్యా॥ 19. ఇందు మక్కా కాఫిర్లకు మందలింపు గలదు. హజ్రత్ ముహమ్మదువారు మదీనా పురమునకు రాకమునుపు వారు మక్కా పురములో నున్నపుడు కాఫిర్లు ఏమయ్యా! నీమధ్య మామధ్య దేవునినుండి ఎపుడు తీర్పు గలుగును. ఎవరు సత్యవంతులో ఎపుడు విశదపడును అనిపలుకుచుండిరి. దానికినిందు జవాబియ్యఁబడినది. సంపూర్ణమైన తీర్పు తుదిదినమునందు జరుగును. అయిన ఇహమునందుకూడ బదరు యుద్ధములో ఒక విధమైన తీర్పువచ్చినది. అదిమీరు మీకన్నులార చూచితిరి. ఎట్లుకొద్దిమంది బలహీనులైనట్టి ముసల్మానులకు మీ బలవంతమైన సైన్యముపై జయము లభించునో ముసల్మానులచేత మీకు ఎట్టిశిక్ష లభించెనో మీరు చూచితిరి. ఇఁక మీసంఖ్య ఎక్కువగానున్నను మీకు పనికిరాదు. కావున ఇప్పుడైనను ఓ అవిశ్వాసులార! మీరు బుద్ధితెచ్చికొని ప్రవక్తతో విరోధము మానుకొని విగ్రహారాధన వదలి విశ్వాసము వహించితిరేని మీకు ఉభయ లోకములలో మేలుకలుగును. అట్లుగాక తిరిగి మీరిట్లు యుద్ధ మాడినచో మేము కూడ ముసల్మానులకు నిటులే తోడుపడి మీకు అపజయమును ముసల్మానులకు జయము మొసంగుదుము. తుదకు మీరు అవమాన పడవలసి వచ్చును. దేవుని సహాయము ముసల్మానుల పక్షమున నున్నపుడు మీ యధిక సంఖ్య ఏమియు పనికిరాదు.

20. యాఅయ్యు-హల్-లజీన-ఆమనూ-అతీ-ఉల్లాహ-వ-రసూలహూ-వలా-తవల్-లౌ-అన్‌హు-వఅన్తుమ్-తస్మ-ఊన్. 21. వలా-తకూనూ-కల్లజీన-ఖాలూ-సమిఅనా-వ-హుమ్-లా-యస్-మఊన్. 22. ఇన్న-షర్-రద్-దవాబ్బి-ఇన్దల్లా-హిస్-సుమ్ముల్-బుక్ముల్-లజీన-లాయఅ-ఖిలూన్. 23. వలౌ-అలి-మల్లాహు-ఫీహిమ్-ఖైరల్-ల-అస్-మఅహుమ్-వలౌ-అస్-మఅహుమ్-లతవల్-లౌ-వహుమ్-ముఅ-రి-జూన్.

20. ఓ విశ్వాసులార! దేవునికిని ఆతని ప్రవక్తకును విధేయులుగ నుండుఁడు. మీరు వినియు ఆతనినుండి మఱలకుఁడు. 21. మఱి ఎవరు మేము వింటిమని చెప్పియు వినకున్నారో వారివలె మీరు కాకుఁడు. 22. ఎవరు గ్రహింపక చెవిటి వారును మూఁగ వారును అయిరో వారు దేవునియొద్ద నిశ్చయముగ జంతువుల కంటెను ఎక్కువ చెడినవారు. 23 మఱియు దేవుఁడు వారియందుమంచితనమున్నది అని యెఱింగినచో వారికితప్పక వినిపించి యుండును. మఱి వారికి వినిపించినను వారు తప్పక ముఖము త్రిప్పుకొని పాఱిపోవుదురు.

వ్యా॥ 20. మునుపటి వాక్యములో దేవుఁడు విశ్వాసులకుతోడైయున్నాఁడని చెప్పఁబడియెను. ఇఁక విశ్వాసులు దేవుని గూర్చియు ఆతని ప్రవక్త విషయము ఎట్లు వర్తింపవలెనో బోధింపఁబడుచున్నది. ముసల్మానులు తమ సర్వకార్యములలోను దేవుని యొక్కయు ఆతని పవిత్ర యొక్కయు ఆజ్ఞలను అనుసరింపవలెను. ప్రతి స్థితిలోను దేవుని యాజ్ఞలనుండి విముఖులు కాఁగూడదు. దేవుని సెలవులు విని గ్రహించి వానిని స్థిరముగా ననుసరింపవలెను. 21.యూదులు మూసా ప్రవక్తతో మేము వింటిమి తిరస్కరించితిమి అని పలికియుండిరి. వారుసరిగధర్మములను అనుసరింపలేదు. మక్కా-కాఫిర్లు మేము ఖురానువింటిమి. మేము కూడ అట్లు పలుకఁ గలమని పలికియుండిరి. మదీనాలో నుండు వంచకు (మునాఫిఖు)లు నోటి మాటలతో విశ్వాసము వెల్లడించి హృదయములలో నమ్మకుండిరి. ఒక నిజమైన ముసల్మాను భక్తుఁడు అట్లు కాఁగూడదు. దేవుని యాజ్ఞలను చెవియొగ్గి విని మనఃపూర్వకముగ వాని ననుసరించుచు నుండవలెను. 22. దేవుఁడు మానవులకు పలుకుటకు నాలుకను వినుటకు చెవులును గ్రహించుటకు బుద్ధి నొసంగి యున్నాఁడు. వీనిని సరిగ నుపయోగింపక ఆశక్తులను వృథా పఱచినవారు జంతువులకంటెను చెడ్డవారు. ఎందుకన వారు తమ నాలుకతో సత్యము పలుకలేదు. సత్యమును విచారింపలేదు. చెవులతో ధర్మమును వినలేదు. బుద్ధితో ధర్మమును గ్రహింపలేదు. 23. ఇట్టి మానవులు తమ శక్తులను వృథాచేసి మంచిది గ్రహించు యోగ్యతను పోఁగొట్టుకొనిరి. మానవుఁడు ధర్మ స్వీకరణమునకు యత్నించిన యెడల దేవుఁడు తన యనుగ్రహము చే మానవునకు ధర్మమును విని గ్రహించునట్టి బుద్ధి నొసంగును. ఒకవేళవారికి దేవుని వాక్యములు వినిపించినను వారు తమ దుష్టస్వభావముచే వానిని గ్రహింపరు. వాని ననుసరింపక ముఖము త్రిప్పికొని పోవుదురు.

24. యాఅయ్యు-హల్-లజీన-ఆమనుస్-తజీబూ-లిల్లాహి-వలిర్-రసూలి-ఇజా-దఆకుమ్-లిమా-యుహ్యీ-యీకుమ్-వఅ-లమూ-అన్నల్లాహ-యహూలు బైనల్-మర్ఇ-వ-ఖల్-బిహీ-వ-అన్నహూ-ఇలైహి-తుహ్షరూన్.

24. ఓవిశ్వాసులార! ఎద్దానిలో మీకు జీవనము గలదో దానికిఁగాను మిమ్ము పిలుచునపుడు మీదేవుని యొక్కయు పవిత్ర యొక్కయు ఆజ్ఞలను వినుఁడు. మఱిదేవుఁడు మానవుని మనస్సును ఆటంక పఱచుననియు మీరందఱు ఆతని యొద్దకే చేరవలసి యున్నదనియు తెలిసికొనుఁడు.

వ్యా॥ 24. దేవుఁడును ఆతని ప్రవక్తయును విశ్వాసులకు విధించు ధర్మములలో సంపూర్ణముగ వారి మేలేయున్నది అందు దైహిక ఆత్మిక ఫలమున్నది. ఉభయ లోకములలో మేలు కలుగును. కావున ముసల్మానులు మనః

పూర్వకముగ దేవునియొక్కయు ఆతని ప్రవక్తయొక్కయు పిలుపును విని యనుసరింపవలెను. వారి ధర్మములను అనుసరించుటలో ఆలస్యముగాని సుస్తీగాని చేయరాదు. ప్రపంచమున మానవుఁడు తన మనస్సులో మంచికార్యములు చేయుటకు అభ్యంతరము వహింపఁడు. కాని సోమరితనము చేసినచో ఆ సోమరితనమే ఆ ధర్మములను అనుసరింపకుండఁ జేయునది. మానవుని చేతిలో వాని మనస్సు లేదు. అది దేవుని చేతిలో నున్నది. కావున సత్కార్యములు చేయఁదలచినపుడే చేసి తీరవలెను. లేనిచో మనస్సు మారిపోవును. మనస్సు మారకుండ స్థిరముగా నుండునట్లు దేవునిని వేఁడుకొనవలెను. తుదకు దేవుని యొద్దకే పోయి చేరవలసియున్నదని తెలిసికొని జాగ్రత్తగానుండి భయభక్తులు వహింపవలెను.

25. వత్-తఖూ-ఫిత్-నతల్-లా-తుసీబన్నల్-లజీన-జలమూ-మిన్-కుమ్ ఖాస్-సతన్ వఅ-లమూ-అన్నల్లాహ-షదీదుల్-ఇఖాబ్.

25. మఱి మీలోని దుర్మార్గులకు మాత్రమే కాక అందఱకును గలుగు కీడునుండితొలఁగియుండుఁడు. మఱి దేవునిశిక్ష చాలకఠినమైనదనితెలిసికొనుఁడు.

వ్యా॥ 25. ఒక సంఘములో పెక్కురు దుర్మార్గమునకును అన్యాయమునకును పూనుకొన్నచో అందలి బుద్ధిమంతులు వారిని నిషేధింపవలెను. మాకేమి యని యూరకుండరాదు. అటులే పాపకార్యములు చేయువారిని నిషేధింపవలెను. లేనిచో దానికీడు అందఱకును పట్టును. దుర్మార్గులకు మాత్రమే పట్టును అని బుద్ధిమంతులైన భక్తులు ఊరకుండరాదు. తమ శక్తికొలఁది ధర్మమార్గముబోధించుచుండవలెను. దేవుని శిక్ష చాలకఠినమైనది. అది యందఱికినిగలుగును. కావున మత ధర్మములు తెలిసినవారు తాము దాని ననుసరించుచు ఇతరులకు కూడ బుద్ధిచెప్పుచునుండవలెను. మత ధర్మముల విషయము మంచివారు సోమరితనము వహించినచో పామర జనులు సంపూర్ణముగ మత ధర్మములను విడనాడుదురు. చూడుఁడు. యుద్ధరంగమందు వీరులు ధైర్యమువహింపనిచో వీరులు కానివారు యుద్ధరంగమువదలి వెన్నిచ్చి పాఱిపోవుదురు. పిదప అపజయము గలిగిన వీరులు దానికి అడ్డుపడఁజాలరు. దాని నష్టము వారికిఁగూడఁ గలుగును. అటులే పాపముల ఫలితము ఊహింపవలెను.

26. వజ్కురూ-ఇజ్-అన్తుమ్-ఖలీలుమ్-ముస్ తజ్-అఫూన-ఫిల్-అర్జి-తఖాఫూన-అన్-యతఖత్-తఫకుమున్-నాసు-ఫఆవాకుమ్-వ-అయ్యదకుమ్-బి-నస్-రిహీ-వ రజఖ-కుమ్-మినత్-తయ్యి-బాతి-లఅల్ల-కుమ్-తష్-కురూన్.

మీరు దేశములో బలహీనులుగా నుండిరి. జనులు మిమ్ము కొట్టుకొని పోవుదు రేమో అని మీరు భయపడుచుంటిరి. అపుడు మీరు కృతజ్ఞులై యుందురని దేవుఁడు మీకు నివాసమిచ్చి మీకు తన సహాయముతో బలమిచ్చి మీకుమంచి వస్తువులను అనుగ్రహించెను.

వ్యా॥ 26. ఓ ముసల్మానులార ! మీరు ధర్మయుద్ధమునుగూర్చి దేవుని యాజ్ఞను అనుసరించుటలో అధైర్యమువహింపకుఁడు. దీనికి పూర్వము మీ స్థితిని స్మరింపుఁడు. మీసంఖ్య కొద్దిదిగానుండెను. మీరు బలహీనులుగ నుంటిరి. మక్కాపురములో నున్నపుడు మీకు శత్రువులు పెట్టరాని బాధలుపెట్టుచుండిరి. మీకు శత్రుభయము చాల నుండెను. అట్టి స్థితిలో మీకు మదీనాపురములో నివాస మొసంగెను. మదీనా వారిని మీకు సహోదరులుగను, సహాయులుగను చేసెను. బదరుయుద్ధములో మీకు తోడుపడి గొప్ప జయమొసంగెను. అందు చాల ధనము మీకు లభించెను. యుద్ధములో చిక్కిన ఖైదీలకు బదులు (ఫిద్యా)గ ధనము లభింపఁజేసెను. కావున మీరు ఆతనికి కృతజ్ఞత సలుపుచు ఆతని యాజ్ఞలను శిరసావహించి నడచుకొనవలెను.

27. యాఅయ్యు-హల్-లజీన-ఆమనూ-లా-తఖూనుల్లాహ-వర్-రసూల-వతఖూనూ అమా-నాతికుమ్-వ-అన్తుమ్-తఅలమూన్. వఅలమూ-అన్నమా అమ్-వాలుకుమ్-వ-ఔ-లాదుకుమ్-ఫిత్-నతున్-వ-అన్నల్లాహ-ఇన్-దహూ-అజ్రున్-అజీమ్-

27. ఓ విశ్వాసులార ! మీరు తెలిసియు, దేవునితోను ప్రవక్తతోను ద్రోహము చేయకుఁడు. మఱి మీరు పరస్పరము అమానతుల విషయమును ద్రోహము చేయకుఁడు. 28. మఱి మీధనమును, మీపుత్రులును మీకు కీడుకలిగించువారలు అనియు, దేవుని యొద్దగొప్పపుణ్యము గలదనియు తెలిసికొనుఁడు.

వ్యా॥ 27. ఇందు సర్వవిధముల నమ్మక ద్రోహములు నిషేధింపఁబడినవి. దేవుని యొక్కయు, ప్రవక్తయొక్కయు ఆజ్ఞలను సరిగ ననుసరింపకుండుట ద్రోహము. ముసల్మానులుగనుండియు కాఫిర్లుచేయునటువంటి పనులుచేయుట ద్రోహమే. యుద్ధములో లభించిన సొత్తును దాఁచిపెట్టుకొనుటకూడ ద్రోహము. ఎవరైన తన యొద్ద అమానతుగా నమ్మకములోనుంచినదానిని తిరిగి యియ్యకుండుట నమ్మికద్రోహము. ముసల్మానులు సర్వవిధముల ద్రోహములను పాపములను మానుకొనవలెను.

వ్యా॥ 28. మానవుఁడు తఱచుగ ధనమునకుఁగాను పుత్రులకుఁగాను దేవునికి అవిధేయుఁడై మానవుల సొత్తును ద్రోహములో హరించును. అందుకుఁ

గాను, ఆ రెంటినిగూర్చి యిచ్చట బోధింపఁబడియెను. ధనమువలన పుత్రుల వలన కీడును ఉపద్రవమును గలుగును. వారిమూలమున మానవుఁడుపరిశోధింపఁ బడుచున్నాఁడు. కావున నమ్మకము (అమానతు) చాల విలువైనది. దాని పుణ్యము దేవునియొద్ద చాల గొప్పది. కావున మానవుఁడు తుచ్ఛలాభములకు ఆశించి సదా యుండు పుణ్యఫలితములను పోఁగొట్టుకొనఁగూడదు.

29. యా-అయ్యు-హాల్-లజీన-ఆమనూ-ఇన్-తత్-తఖుల్లాహ - యజ్-అల్-లకుమ్-ఫుర్-ఖానన్-వ-యుకఫ్-ఫిర్-అన్-కుమ్-సయ్యి-ఆతికుమ్-వ- యగ్-ఫిర్-లకుమ్-వల్లాహు-జుల్-ఫజ్-లిల్-అజీమ్!

29. ఓ విశ్వాసులార! మీరు దేవునికి భయపడినచో దేవుఁడు మీకు జయ మొసంగును. మీనుండి మీ పాపములను తొలఁగించి మిమ్ము క్షమించును. మఱియు దేవుఁడు చాల యనుగ్రహముగలవాఁడు.

వ్యా॥ 29. భక్తులు దేవునికి భయపడి ధర్మమార్గము ననుసరించినచో దేవుని సహాయము వారికి లభించి యుభయలోకములలో జయముచేకూరును. ఇహమునందు వారు శత్రువును జయింతురు. వారికి రాజ్యగౌరవము లభించును. బదరుయుద్ధములో లభించినట్లు జయము లభించును. పాపములు తొలఁగి పుణ్యము లభించి పరలోకమునందు నరకము తప్పి మోక్షము లభించి స్వర్గనివాసము చేకూరును. భయభక్తులు వహించుటవలన మంచిచెబ్బరులను గుర్తించు జ్యోతి హృదయములో ప్రకాశించును. దానిచే ఇది పాపకార్యము, ఇదిధర్మకార్యము అని స్థిరముగాఁ దెలిసికొనఁగలరు.

30. వ-ఇజ్-యమ్-కురు-బి-కల్-లజీన-కఫరూ-లి-యుస్-బి-తూక - ఔ-యుఖ్-తులూక- ఔ-యుఖ్-రి-జూక-వ-యమ్-కురూన-వయమ్-కురుల్లాహు- వల్లాహు ఖైరుల్-మాకిరీన్.

30. మఱి అవిశ్వాసులు నిన్ను చెఱలోనుంచుటకును, లేదా నిన్నువధించుటకును లేక నిన్ను దేశమునుండి వెడలఁగొట్టుటకును కుట్రలు సలుపునపుడు నీపైనున్న దేవుని యనుగ్రహమును స్మరింపుము. మఱి వారు కుట్రలు సలుపుచునుండిరి. దేవుఁడుకూడ యత్నము చేయుచుండెను. ఆదటికంటె దేవునియత్నమే చాలశ్రేష్ఠమైనది.

వ్యా॥ 30. హజ్రత్ ముహమ్మదువారు మక్కాపురములో నున్నపుడు మక్కా కాఫిర్లు, రసూలువారి విషయము దారున్నద్వాలో సమావేశమై, ఇట్లు ఆలోచించిరి. ముహమ్మదు క్రొత్తమతము స్థాపించుచున్నాఁడు. కొందఱు

ఆతనికి శిష్యులైయున్నారు. వీరిసంఖ్య హెచ్చుకాక పూర్వమే వీరిని నశింపఁ జేయవలెను. లేనిచో తిరిగి వారి నెదుర్కొనుట కష్టమగును. కావున మహామ్మదును పట్టి చెఱలో నుంచవలెను. లేదా దేశమునుండి వెడలఁగొట్టవలెను. లేదా కొట్టి గాయపఱచవలెను. అందు అబూజెహాలు, అట్లుకాదు, ప్రతికుటుంబమునుండి ఒక్కొక్క యావనుని ఎన్నుకొనవలెను. అందఱును చేరి ఒక్కతూరి యాతనిపైఁబడి వధింపవలెను. అపుడు మహామ్మదు బంధువులగు బనీహాషిమ్ ఏమియు చేయఁజాలరు. సమయము వచ్చిన అందఱు చేరి హత్యకు బదులు ధనము ఇయ్యవచ్చును అని పలికెను. ఆసభవారందఱును దాని నంగీకరించి అట్లు చేయుటకు సంసిద్ధులైరి. ఇట్లు కాఫిర్లు కుట్రలు సలుపుచుండఁగ అపుడే దేవుఁడు దేవదూత మూలమున హజ్రత్ రసూలువారికి ఆ విషయము దెలిపి మక్కావదలి మదీనాపురము పోవలసినది అని సెలవిచ్చెను. అపుడు పైగంబరువారు దేవుని సెలవు ననుసరించి రాత్రిపూఁట తమ పరుపుపై హజ్రత్ అలీని పరుండపెట్టి తాము తమ గృహమునుండి వెళ్ళిపోయిరి. అపుడుకాఫిర్లు రసూలువారి గృహమును చుట్టుకొనియుండిరి. కాని దేవుని మహిమవలన వారందఱు పైగంబరువారిని ఏమియుచేయ లేకపోయిరి. అట్లు దేవుఁడు రసూలువారిని శత్రులనుండి రక్షించెను. అబూజెహాలు మొదలగు కాఫిర్ల నాయకులు బదరుయుద్ధములో వధింపఁబడిరి. తుదకు కాఫిర్ల కుట్రలు సాగక దేవుని యత్నమే సఫలమాయెను. కావున దేవుఁడు రక్షింపనున్న శత్రువు ఏమియును చేయఁజాలఁడు.

31. వ-ఇజా-తుత్లా-అలైహిమ్-ఆయాతునా-ఖాలూ-ఖద్-సమిఅనా-లౌ-నషాఉ-లఖుల్నా-మిస్ల-హాజా-ఇన్-హాజా-ఇల్లా-అసాతీరుల్-అవ్వలీన్. 32. వఇజ్-ఖాలుల్లా-హుమ్మ-ఇన్-కాన-హాజా-హువల్-హఖ్ఖ-మిన్-ఇన్దిక-ఫ-అమ్తిర్-అలైనా-హిజా-రతమ్-మినస్-సమాఇ-అవితినా-బి-అజాబిన్-అలీమ్. 33. వ-మా-కానల్లాహు-లియు-అజ్-జిబ-హుమ్-వ-అన్త-ఫీహిమ్-వ-మా-కానల్లాహు-ము అజ్-జిబహుమ్-వహుమ్-యస్-తగ్-ఫిరూన్. 34. వ-మా-లహుమ్-అల్లా-యుఅజ్-జిబ-హుముల్లాహు-వహుమ్-యసుద్దూన-అనిల్-మస్-జిదిల్-హరామి-వ-మాకానూ ఔలి-యా-అహూ-ఇన్-ఔ-లి-యా-ఉహూ-ఇల్-లల్ముత్తఖూన-వలాకిన్న-అక్సర-హుమ్-లాయఅ్-లమూన్. 35. వ-మా-కాన-సలా-తుహుమ్-ఇన్దల్-బైతి-ఇల్లా-ముకా-అన్-వ-తస్-దియతన్-ఫ-జూ-ఖుల్-అజాబ-బిమా-కున్తుమ్-తక్-ఫురూన్.

31. మా వాక్యములు పఠించి వారికి వినిపించినచో వారు మేమువింటిమి. మేము కోరినచో మేముకూడ ఇటువంటివి పలుకఁగలము. ఇవి పూర్వీకుల కథలు మాత్రమే అని పలుకుదురు. 32. మఱి ఓ దేవా! నీయొద్దనుండి యిదియే సత్యమైనచో ఆకాశమునుండి మాపై రాళ్ళను కురిపింపుము. లేదా మాకు దుఃఖకరమైన బాధను పంపుము అని పలుకసాగిరి. 33. నీవు వారిలోనున్నంత కాలము దేవుఁడు వారిని శిక్షించువాఁడుకాఁడు. వారు క్షమాపణ కోరుచుండు నంతవఱకు దేవుఁడు వారిని శిక్షింపఁడు. 34. మఱి దేవుఁడు ఏల వారిని శిక్షింప కూడదు,మఱివారు 'మస్‌జిదెహరామ్'నుండి ప్రజలను ఆటంకపఱచుచున్నారు. మఱి వారు దానిపై అధికారముగలవారుకారు. దాని యధికారము భక్తులకు మాత్రమే గలదు. కాని వారిలో పెక్కుమందికి ఆ విషయము తెలియదు. 35. మఱి కాబాయొద్ద వారి నమాజు కూఁతలు పెట్టుట, చప్పటులు కొట్టుట తప్ప వేఱులేదు. కావున మీరు వహించుచున్న అవిశ్వాసమునకు బదులుగ శిక్షను రుచి చూడుఁడు.

వ్యా॥ 31. మక్కాలోని కాఫిర్లు ఖురానువాక్యములు విని దీనిలో ఏమున్నది. పూర్వీకుల కథలే గదా! మేముకోరినచో ఇటువంటివి చెప్పఁగలము అని డంబాలు కొట్టుకొనుచుండిరి. అందు నజ్‌ర్ బిన్ హారిస్ అనువాఁడుముఖ్యుఁడు. కాఫిర్లు ఎందుకు కోరలేదు. ఎందుకు ఖురానువంటిది కల్పించుకొనలేదు! వట్టిమాటలవలన ప్రయోజనములేదు. పూర్వీకులకు సంభవించిన విషయములు విని ఇవి పుక్కిటి గాథలు అని కాఫిర్లు పలుకుచుండిరి. దానికిఁగాను బదరు యుద్ధములో కాఫిర్లు దేవుని శిక్షపొందిరి. 23. ఇందు మక్కా కాఫిర్లు చూపుచున్న తమ ద్వేషమును, అవివేకమును తెలుపఁబడినది. కాఫిర్లు ఓ దేవా! నీవు పంపిన గ్రంథమగు ఖురాను మఱియు ఇస్లామ్‌మతము సత్యమేఅయినచో మేము వానిని నమ్మక తిరస్కరించుచున్నారముగదా! ఎందులకు నీవుఆలస్యము చేయుదువు. పూర్వీకులపై కురిపించునట్లు మాపై రాళ్ళను కురిపింపుము. లేదా ఏదైన యితర బాధ మాకొసంగుము అని పలుకుచుండిరి. అబూజెహలు, సైన్యము తీసికొని మదీనాపై దండువెడలినపుడు కాబామసీదులో అట్లు ప్రార్థించెను. దానికి బదరుయుద్ధములో శిక్షలోని కొంత భాగమువానికిని వాని యనుచరులకును లభించెను. 33. ఇందు దేవుఁడు ఎందులకు అందఱికి శిక్షనొసంగలేదో దాని కారణములు తెలుపుచున్నాఁడు. పూర్వమునుండియు ప్రవక్తలను తిరస్కరించిన అవిశ్వాసులను శిక్షింపవలెనన్న ముందు దేవుఁడు, తన ప్రవక్తలు అచ్చటినుండి పోవలెను అని సెలవిచ్చును. ప్రవక్తలు అవిశ్వాసులపురమును విడిచిపోయిన పిదప దేవునిశిక్ష అవిశ్వాసులకుఁ గలుగును. అదే పద్ధతిని అనుసరించి హజ్రత్ ముహమ్మదువారు మక్కాపురములో నున్నంతకాలము మక్కా

కాఫిర్లకు దేవునిశిక్ష గలుగలేదు. రసూలు వారు మక్కాపురమును విడిచి మదీనాపురము చేరిన పిదప దేవుని శిక్ష మక్కా కాఫిర్లకు బదరుయుద్ధములో లభించెను. కావున హజ్రత్ రసూలువారి మహిమవలన మక్కా కాఫిర్లకు వారున్నంత కాలము అందఱిని నశింపజేయునట్టి దేవుని శిక్షరాలేదు. రెండవ కారణము ప్రజలు దేవునితో క్షమాపణ కోరుచుండునంతవఱకు వారికి దేవుని శిక్షగలుగదు. 34. మక్కా కాఫిర్లు చేయు అక్రమములకు వారికి శిక్ష కలుగవలసినదే! (కాని పై రెండుకారణములవలన శిక్ష రాలేదు.) వారు ముసల్మానుభక్తులను మస్జిదెహరామ్ (కాబామసీదు)లో ప్రార్థనలు సలుపకుండ ఆటంకపఱచుదురు. కాబామసీదునకు మేము ధర్మకర్తలము. మాకు అధికారముగలదు. మాయిష్టము వచ్చినవారిని రానిత్తుము. ఇష్టములేనివారిని రానియ్యము అని పలుకుదురు. వాస్తవముగా ప్రార్థనస్థలమునుండి ప్రజలను నిషేధించుటకు ఎవరికిని అధికారము లేదు. కాబామసీదునకు ధర్మకర్తలుగా భక్తులుండవలెను. కాని అవిశ్వాసులు, విగ్రహారాధకులు కాబామసీదునకు ధర్మకర్తలు కానేరరు. వారు తమకు లేని యధికారమును చలాయించుచున్నారు. కాని యీ విషయము వారిలోని పెక్కుమందికి తెలియదు. తమమూఢత్వమువలన అట్లు భక్తులను అడ్డగించుచున్నారు. 35. కాఫిర్లు నిజమైనభక్తు (ముసల్మాను)లను కాబామసీదులో ప్రార్థనలు (నమాజు) సలుపకుండచేయుచు తాముకూడ భక్తితో నమాజు (ప్రార్థన) చేయుటలేదు. వారచ్చట కూతలు పెట్టుచు (సీటీలు కొట్టుచు) చప్పటులు కొట్టుచుశబ్దములుచేయుదురు. ఇదియే వారిప్రార్థన. ఇట్టి శబ్దములవలన ప్రయోజనములేదు. తుదకు వారు అవిశ్వాసమునకు ఫలితముగ శిక్షపొందవలసియున్నది

36. ఇన్నల్-లజీన-కఫరూ-యున్-ఫిఖూన-అమ్-వాలహుమ్-లి-యసుద్దూ-అన్-సబీలిల్లాహి-ఫస-యున్-ఫిఖూన-హా-సుమ్మ-తకూను-అలైహిమ్-హస్రతన్-సుమ్మ-యుగ్-లబూన-వల్-లజీన-కఫరూ-ఇలా-జహన్నమ-యుహ్షరూన్. 37. లి-యమీ-జల్లా-హుల్-ఖబీస-మినత్-తయ్యిబి-వ-యజ్-అలల్-ఖబీస-బఅ-జహూ-అలా-బఅ-జిన్-ఫ-యర్-కుమహూ-జమీ-అన్-ఫ-యజ్-అలహూ-ఫీజహన్నమ-ఉలాయిక-హుముల్-ఖాసిరూన్.

36. నిశ్చయముగ అవిశ్వాసులైన వారు ప్రజలను దేవుని మార్గమునుండి ఆటంకపఱచుటకుగాను తమ ధనమును ఖర్చు చేయుచున్నారు. మఱి ఇంకను దానిని ఖర్చుచేయుదురు. తుదకు అదివారికి వ్యసనకర మగును. మఱి వారు తుదకు ఓడిపోవుదురు. మఱియు అవిశ్వాసులైన వారు నరకము వైపునకు ద్రోయఁబడుదురు. 37. దేవుఁడు మంచివారినుండి చెడ్డవారిని విడఁదీయుటకును,

చెడ్డవారిని ఒకరితో నొకరిని కూర్చి ఒక గుంపుగాఁ జేర్చి వారినందఱిని నరక ములో పడ వేయుటకు నట్లు చేయును. ఇట్టివారే నష్టము పొందువారు.

వ్యా॥ 36. మక్కా-కాఫిర్లలో పన్నెండుమంది నాయకులు ప్రతిదినము ఒక్కొక్కఁడు బదరు యుద్ధములో నున్న సైనికులకు అన్నము పెట్టుటకు ఒప్పు కొని తమ ధనమును ఖర్చుచేసిరి. బదరు యుద్ధములో వారు ఓడిపోయి మక్కా-పురము చేరి అబూనుఫ్యాను సిరియానుండి తెచ్చిన వ్యాపార ధనమంతయు ముహమ్మదువారికి విరోధముగా ఖర్చు చేయవలెనని తీర్మానించుకొనిరి. అట్లు అవిశ్వాసులు విశ్వసించినట్టి ముసల్మానులను దేవుని మార్గమగు ఇస్లామ్నుండి తొలఁగించుట తమ ధనమును ఖర్చుచేయుచున్నారు. ఇఁక మీఁదను ఖర్చు చే యుదురు. కాని వారి ఖర్చువలన వారికి వ్యసనము తప్ప వేఱు ఫలితము లభిం పదు. వారు ఇహమునందు ఓడిపోయి పరమునందు నరకబాధ పడునపుడు అ య్యో ధనము పోయి కూడ మోక్షమును జయమును లభింప లేదే అని వ్య సనపడుదురు. చూడుఁడు. మక్కా- కాఫిర్లు మొదటితూరి బదరు యుద్ధములోను రెండవతూరి ఒహదు యుద్ధములోను తమ ధనమును దేహబలమును వినియో గించియు వారికి జయము లభింపలేదు. తుదకు కాఫిర్లు ఓడిపోయి నశించిరి. కొందఱు పశ్చాత్తాపము నొంది అవిశ్వాసము వదలిపెట్టిరి. అవిశ్వాసులుగా నే నశించినవారు నరకములోనే పడుదురు. 37. కాఫిర్లు ఖర్చుచేసిన ధన ము వృథాపోయెను. వారికి వ్యసనము గలిగెను. వారు అపజయము నొందిరి. దాని మూలమున దేవుఁడు జనులను పరీక్షించెను. మంచివారినుండి చెడ్డవారు తొలఁగిపోయిరి. ముసల్మానులగు భక్తులు ఎవరు, అవిశ్వాసులై దుర్మార్గులైనవారె వరు అనువిషయము స్పష్టపడెను. ఎవరి అదృష్టములో విశ్వాసముండెనో వారు విశ్వాసులై ఉభయ లోకముల జయముపొందిరి. ఎవరి దురదృష్టములో అవిశ్వా సులుగ చావవలసి యుండెనో వారు అవిశ్వాసులుగ చచ్చి వారందఱును నర కమునకుపాలైరి. ఇట్టియవిశ్వాసులేఉభయలోకములలో చెడినష్టముపొందువారు.

38. ఖుల్-లిల్-లజీన-కఫరూ-ఇన్-యన్-తహూ-యుగ్-ఫర్-లహుమ్-మాఖద్-సలఫ-వఇన్-యఊదూ-ఖద్మజత్-సున్నతుల్-అవ్వలీన్. 39. వ-ఖాతి-లూహుమ్-హత్తా- లా-తకూన-ఫిత్నతున్-వ-యకూనద్-దీనుకుల్లు-హూ- లిల్లాహి-ఫఇ-నిన్-తహౌ-ఫ-ఇన్నల్లాహ-బిమా-యఅ-మలూన-బసీర్. 40. ఫఇన్-తవల్-లౌ-ఫఅ-లమూ-అన్నల్లాహ-మా-లాకుమ్-నిఅ-మల్-మౌలా-వ-నిఅ-మన్-నసీర్.

38. ఓ ప్రవక్తా! అవిశ్వాసులతో నిట్లు పలుకుము. వారు మానుకొన్నచో గడచి పోయినది క్షమింపఁబడును. మఱియు వారు తిరిగి యాపని చేసినచో పూర్వుల పద్ధతి గడచి యున్నది. 39. అవిశ్వాసుల యుపద్రవము లేకుండ పోవునంత వఱకును సర్వత్రి దేవుని యాజ్ఞ స్థిరపడు నంత వఱకును వారితో యుద్ధము సలుపుచుండుఁడు. పిదప వారు మానుకొన్నచో దేవుఁడు వారుచేయు కర్మలను చూచును. మఱి వారు సమ్మతింపక మరలిపోయినచో దేవుఁడు మీకు రక్షకుఁడు అని తెలిసికొనుఁడు. అతఁడు మంచి రక్షకుఁడును మంచి తోడు పడు వాఁడును.

వ్యా॥ 38. ఇపుడు కూడ అవిశ్వాసులు తమ అవిశ్వాసమును వదలి ఇస్లామ్‌నందు తమకున్న ద్వేషమును విరోధమును మానుకొని ముసల్మానులైనచో వారు దీనికి ముందుచేసిన పాపములు క్షమింపఁబడును. కాఫిర్లు ముందుచేసిన విగ్రహారాధన మొదలగు పాపముల శిక్ష తొలఁగిపోవును. అవిశ్వాసులు తమ అవిశ్వాసమును వదలక పైగంబరుల వారియందు ద్వేషమే యుంచినచో వారు తమకంటె పూర్వము గడచిన వారి పద్ధతి చూడవలెను. ఎట్లు పూర్వము గడచిన అవిశ్వాసులు దేవుని శిక్షకు పాత్రులై నశించిరో అదే పద్ధతిని వారు నశింతురు. ఎట్లు దీనికి ముందు బదరు యుద్ధములో మక్కా కాఫిర్లు చచ్చిరో అటులే వీరుకూడ నశింతురు. కావున విశ్వసించి యిస్లామ్‌లో చేరుటయే వారికి మేలు. 40. ముసల్మానులు కాఫిర్లతో కాఫిర్ల బలము నశించి దేశములో శాంతి గలిగి ముసల్మాను భక్తులు తమ మత ధర్మములను నిరాటంకముగా సలుపుకొను వీలుకలుగు నంతవఱకును సర్వ అధర్మములు పోయి దేవుని మతము సర్వత్ర చెల్లుచు దేవుని యాజ్ఞల ప్రకారము సర్వము జరుగునంతవఱకును ధర్మయుద్ధమాడుచునే యుండవలెను. అట్లు కానిచో అవిశ్వాసులకు బలము లభించినచో వారు ముసల్మానులను నశింపఁజేసి మత ధర్మములను అణఁగ ద్రొక్కుదురు. లేక ముసల్మానులను మత భ్రష్టులుగాఁ జేయుదురు. చూడుఁడు. స్పెయిను (ఉన్దులుస్) లో ముసల్మానుల విరోధులకు బలము లభింపఁగానే ఏడువందల సంవత్సరముల వఱకు పరిపాలించుచున్న ముసల్మానులను వారు నశింపఁజేసి వారిని మత భ్రష్టులుగాఁ జేసి దేశములో ఇస్లామ్ మత ధర్మములను అణఁగఁద్రొక్కిరి. కావున ప్రతి కాలములోను ప్రతి దేశములోను శాంతము నెలకొల్పుటకును ముసల్మానులు తమ స్వాతంత్ర్యము పొందుటకును ధర్మయుద్ధము (జిహాద్) సలుపుచునే యుండవలెను. ధర్మయుద్ధము (జిహాద్) యొక్క ధర్మములు ఫిఖా గ్రంథములలో వివరింపఁబడి యున్నవి. అన్నియు నిచ్చట వ్రాయుటకు అవకాశము లేదు. అవిశ్వాసులు తమ యవిశ్వాసమును మానుకొని యిస్లామ్‌లో చేరినచో వారు ముసల్మానులగుదురు. అపుడు వారితో యుద్ధముచేయకూడదు.

వారి హృదయములలో నున్నది దేవునికి నెఱుక. కావున దేవుఁడు వారి కర్మలను చూచుచు నుండును. సత్కార్యములు భక్తి పూర్వకముగఁ జేసినచో వారి విశ్వాసములకు పుణ్యఫలితము లభించును. 40. కాఫిర్లు సదా ముసల్మానులకు విరోధులుగానే యున్నచో దానిగూర్చి చింతపడఁగూడదు.ముసల్మానులకు రక్షకుఁడు దేవుఁడు. ప్రతిసమయములో తోడుపడువాఁడు దేవుఁడు. కావున ముసల్మానులు దేవునిపై నాధారపడి తమ మత ధర్మములను నెఱవేర్చుచు ధర్మయుద్ధము సలుపుచుండవలెను. శత్రుబలమును సైన్యమును హెచ్చుగా నున్నను జంకకూడదు. చూడుఁడు బదరు యుద్ధములో దేవుఁడెట్లు ముసల్మానులకుఁ దోడుపడి జయమొసంగెనో ! ముసల్మానులకు దేవునికంటె మించిన మంచి రక్షకుఁడును మంచి సహాయుఁడును ఎవఁడునులేఁడు.

## పదియవ కాండము

41. వఅ-లమూ-అన్న-మా-గనిమ్-తుమ్-మిన్-షై-ఇన్-ఫ-అన్న- లిల్లాహి-ఖుముసహూ-వలిర్-రసూలి-వలి-జిల్-ఖుర్బా-వల్-యతామా-వల్-మసాకీని-వబ్-నిస్-సబీలి-ఇన్-కున్-తుమ్-ఆమన్-తుమ్-బిల్లాహి-వ-మా- అన్ - జల్నా-అలా-అబ్దినా-యౌమల్-ఫుర్ ఖాని-యౌమల్-తఖల్-జమ్- ఆని - వల్లాహు-అలా-కుల్లి-షై-ఇన్-ఖదీర్.

41. మఱియు దేవునియందును తీర్మానదినము (బదురు) నందు రెండు సైన్యములు మార్కొనిన దినమునందు మాభక్తునకు అంపిన దానియందును మీకు విశ్వాసమున్నచో మీకు లభించు విజయధనమునందు ఐదవభాగము దేవునికిని, ప్రవక్తకును, ఆతని బంధువులకును, తండ్రిలేని బిడ్డలకును నిఱుపేదలకును ప్రియాణికులకు నున్నది అని తెలిసికొనుఁడు. మఱియు దేవుఁడు సర్వశక్తిగలవాఁడు.

వ్యా॥ 41. ఈ సూరాకు ప్రారంభములో విజయధనము (గనీమతు)ను గూర్చి ప్రశ్న కలిగెను. దానిగూర్చి కొన్ని ధర్మము లిచ్చట చెప్పఁబడుచున్నవి. కాఫిర్లతో సంభవించిన యుద్ధములో లభించిన సొమ్మును ఐదుభాగములు చేయవలెను. అందు ఐదింట ఒక భాగము దేవుని పేరుతో తీయవలెను. ఆ భాగము ప్రవక్త తన ఖర్చుకుఁగాను, తనకు తోడుపడుచున్న బంధువుల ఖర్చులకుఁగాను తండ్రిలేని బిడ్డల పోషణకుఁగాను నిఱుపేదలకును, బాటసారులకును సహాయమునకుఁగాను ఉపయోగపఱుపవలెను. మిగిలిన నాలుగు భాగములు సైనికులకు పంచిపెట్టవలెను. అందు రౌతు బంటునకు రెండేసిభాగ

ములను కాలిబంటునకు ఒక్కొక్క భాగము సరిసమానముగా పంచిపెట్టవలెను. హజ్రత్ రసూలువారు పరలోకము చేరిన పిదప యుద్ధములో చిక్కినసొమ్ములో ఐదవభాగము నిఱుపేదలకును తండ్రిలేని బిడ్డలకును బాటసారులకును ఖర్చు చేయవలెను. పైగంబరులవారి బంధువులుకూడ నిఱుపేదల భాగములో తమ భాగము పుచ్చుకొనవలెను. అందు కాబా మసీదు, మఱి యితర మసీదులఖర్చు కుఁగాను కొంత భాగము తీయవలెను. బదరులో యుద్ధము జరిగిన దినము తీర్మానదినము. అందు అవిశ్వాసుల మధ్యను, విశ్వాసులమధ్యను తీర్మానము కలిగెను. సత్యమును అసత్యమును విశదమాయెను. కాఫిర్లు ఓడిపోయి ముస ల్మానులకు జయము లభించినందున ముసల్మానులకు దేవుని సహాయమున్నదని తేటతెల్ల మాయెను. బలహీనులుగ నున్న ముసల్మానులకు బలవంతులైన కాఫిర్లపై గొప్పజయమునొసంగి చాలసొమ్ములభించునట్లు చేసిన దేవునియందు ను ఆతని పరమభక్తులగు మహమ్మదువారి కొసంగిన విజయ సూచనలందును విశ్వాసముగల ముసల్మానులకు విజయధనములో ఐదవభాగము దేవునిపేరుతో తీయుట కష్టముకాదు. దేవుఁడు సర్వశక్తుఁడు. బదరుయుద్ధములో జయమొసం గినట్లు ఇఁకమీఁదను మీకొసంగఁగలఁడు.

42. ఇజ్-అన్తుమ్-బిల్-ఉద్-వతిల్-దున్యా-వహుమ్-బిల్-ఉద్-వతిల్ ఖుస్వా-వర్-రక్బు-అస్-ఫల-మిన్-కుమ్-వలౌ-తవా-అత్-తుమ్-లఖ్-తలఫ్-తుమ్-ఫిల్-మీఆది-వలా-కిల్-లి-యఖ్-జియల్-లాహు-అమ్రన్-కాన-మఫ్-ఊల ల్-లి-యహ్ లిక-మన్-హాలక-అమ్-బయ్యినతిమ్-వ-యహ్-యా-మన్-హయ్య అమ్-బయ్యినతిన్-వఇన్నల్లాహ-ల-సమీ-ఉన్-అలీమ్.

42. అపుడు మీరు సమీపముగనున్న ప్రక్కనుంటిరి. వారుదూరముగా నున్న వైపుననుండిరి. మఱియు బిడారము మీకు క్రిందువైపునకు పోయెను. మఱి మీరు పరస్పరము వాగ్దానమునకు చేసికొనియుంటిరేని తప్పక వాగ్దానము నకు సరిగ ఒకేతూరి చేరియుండరు. కాని దేవుఁడు తాను చేయవలసియున్న కార్యమును పూర్తిచేయుటకును, నశింపనున్నవాఁడు స్పష్టమైన సూచన పిదప జీవించుటకును మిమ్ము ఒకచోట చేర్చెను. మఱియు నిశ్చయముగా దేవుఁడు సర్వము వినువాఁడును, సర్వము తెలిసినవాఁడును,

వ్యా॥ 42. బదరుయుద్ధరంగమునందు ముసల్మానులుండినప్రక్క మదీనా పురమునకు సమీపములో నుండెను. మక్కా కాఫిర్లసైన్యము దిగిన ప్రక్క మదీనాపురమునకు దూరముగ నుండెను. అబూసుఫ్యాను నాయకత్వమున సిరి యానుండి వచ్చుచున్న వ్యాపారుల బిడారము క్రిందుగ దిగి సముద్రతీరమునకు

చేరువగ పోవుచుండెను. ముసల్మానులకును ఆ బిడారమునకు మధ్య అబూజెహాలు తెచ్చిన సైన్యము అడ్డపడెను. ఇట్లు దైవవశముగ ముసల్మానులును, కాఫిర్లును బదరుమైదానములో చేరవలసియుండెను. ముందుగానే ముసల్మానులు యుద్ధమునకుఁగాను కాఫిర్లతో వాగ్దానముచేసి ఫలాని దినము ఫలాని చోటు చేరవలసినది అని ఏర్పాటుచేసికొనియుండినచో సకాలమునకు రాఁజాలకుందురు. బహుశః అభిప్రాయభేదము గలిగియుండునేమో! ఎందుకనముసల్మానులు తమయొద్దనున్న కొద్ది సైన్యమును సరియైనయుద్ధసామగ్రిలేనందున భీతిల్లి యుద్ధమునకు సిద్ధులు కాకపోయియుందురు. అటులే అవిశ్వాసులు ముసల్మానుల త్యాగమును యుద్ధమందలి ధైర్యమును యోచించి యుద్ధమునకుఁగాను ముందంజ వేయకుందురు. కావున దేవుఁడు తాను కోరిన కార్యము నెఱవేర్చుటకై దైవికముగ రెండు సైన్యములును బదరుమైదానములోఁ జేరునట్లు చేసెను. దానిచే సత్యమును, అసత్యమును తేటతెల్లమగును. ముసల్మానులకు జయము గలిగిన పిదప కాఫిర్లు బుద్ధితెచ్చికొని విశ్వాసము వహింతురు. పూర్వమునుండియే విశ్వాసముగలవారి విశ్వాసము దృఢపడును. చనిపోయిన వాఁడును బ్రతుకు వాఁడును నిజము తెలిసికొని చనిపోవును. మఱియు బ్రతుకును. దేవుఁడు, బలహీనులును, దౌర్జన్యమునకుపాలైన వారునుచేయు మొఱను వినువాఁడు. బలహీనులకు ఎట్లు తోడుపడవలెనో దేవునికిఁదెలియును. చూడుఁడు దేవుఁడు ఎట్లు ముసల్మానుల మొఱనువిని వారికి తోడుపడెనో!

43. ఇజ్-యురీ-కహు - ముల్లాహు-ఫీ-మనామిక-ఖలీలన్-వ-లౌ- అరాకహుమ్-కసీరన్-లఫషిల్-తుమ్-వల-తనా-జఅ-తుమ్-ఫిల్-అమ్రి-వలాకిన్నల్లాహ సల్లమ-ఇన్నహూ-అలీ-ముమ్ బి-జాతిస్-సుదూర్. 44. వఇజ్-యురీకుమూహుమ్-ఇజిల్-తఖైతుమ్-ఫీ-అఅయుని-కుమ్-ఖలీ-లన్-వ-యుఖల్-లిలు-కుమ్-ఫీ-అఅ-యుని-హిమ్-లి యఖ్ జి-యల్లాహు-అమ్రన్-కాన-మఫ్ఊలన్-వఇలల్-లాహి-తుర్-జఉల్-ఉమూర్.

43. దేవుఁడు అవిశ్వాసులను కొద్దిమందినిగాని నీకలలో నీకుఁ జూపించినది స్మరింపుము. మఱివారిని ఎక్కువమందినిగానీకుఁ జూపించియుండినచో మీరుధైర్యమువీడి కార్యములో జగడముచేసియుందురు. కాని దేవుఁడురక్షించెను. ఆతనికి హృదయములలో నున్నవి తెలియును. 44. దేవుఁడు కావలసియున్న పని నెఱవేర్చుటకుఁగాను మీరుమార్కొనునపుడు అవిశ్వాసుల సైన్యమును మీకన్నులలో కొద్దిదిగాఁ జేసిమీకుఁ జూపించెను. మఱిమిమ్ము కొద్దిమందిగా వారికన్నులలోఁ జేసి వారికిఁ జూపించెను. మఱి ప్రతికార్యమును దేవునియొద్దకే చేరవలసియున్నది.

వా॥ 43. పైగంబరులవారు కలగాంచిరి. అందు కాఫిర్లు కొద్దిమందిగా కనఁబడిరి. కాఫిర్ల సైన్యము కొద్దిదిగా కనఁబడుటవలన ముసల్మానులకు ధైర్యము వచ్చెను చాలమందిగా కనఁబడినచో కొందఱు యుద్ధమునకు ధైర్యము చేయక అధైర్యమువహించియుండవచ్చును. అందుజగడమువడియుండవచ్చును. కాని అట్లు సంభవింపలేదు. దేవుఁడు తన మహిమవలన ఎట్టి జగడమును భేదాభిప్రాయమును ముసల్మానులమధ్య పడకుండ తప్పించిరక్షించెను. దేవునికిసర్వము తెలియును. హృదయములలోని మర్మములు తెలియును. ఏవిషయమువలన హృదయములో ధైర్యము కలుగును. దేనివలన ధైర్యముపోవునో సర్వము తెలియును. పైగంబరులవారు తమ కలలో కాఫిర్లను కొద్దిమందిగాఁ జూచిరి. వాస్తవముగాను తుదకు అట్లే సంభవించెను. కాఫిర్ల సైన్యములో కొద్దిమంది తప్ప మిగిలిన వారు ముసల్మానులైరి. రాఁబోవు విషయము ముందుగానే కలలో రసూలువారు గాంచిరి. 44. బదరుయుద్ధము జరుగుచున్నపుడు ముసల్మానులకు కాఫిర్లు కొద్దిమందిగాఁ గనఁబడిరి. దానివలన ముసల్మానులకు చాల ధైర్యము వచ్చెను. అటులే యుద్ధప్రారంభములో కాఫిర్లకును ముసల్మానులు కొద్దిమందిగాఁగనఁబడిరి. వాస్తవముగాకూడ ముసల్మానులు కాఫిర సైన్యముకంటె చాల తక్కువగా నుండిరి. పిదప ముసల్మానులు ధైర్యముతో యుద్ధముసలుపునపుడు దేవదూతల సహాయమువచ్చినపుడు ముసల్మానులు రెండింతలుగా కాఫిర్లకు కనఁబడిరి. అట్లు కనఁబడుటవలన కాఫిర్లు ధైర్యమువీడి తుదకు ఓడిపోయిరి ఇదంతయు దేవుఁడు చేయనున్నది సంభవించుటకుగానుచేయఁబడెను. సర్వకార్యములు దేవునియొద్దకే చేరవలసియున్నవి. దాని ఫలితము దేవుఁడొసంగువాఁడు. కావున ముసల్మానులు తమ ప్రతికార్యములో దేవునిపై నాధారపడియుండవలెను.

45. యా-అయ్యు-హల్-లజీన-ఆమనూ-ఇజా-లఖీ-తుమ్-ఫి-అతన్-ఫస్బుతూ-వజ్-కురుల్-లాహ-కసీరల్-లఅల్-లకుమ్-తుఫ్-లిహూన్. 46. వఅతీ-ఉల్లాహ-వ-రసూలహూ-వలా-తనా-జఊ-ఫతఫ్-షలూ-వ తజ్-హబ-రీహుకుమ్ వస్-బిరూ-ఇన్నల్లాహ-మఅస్-సాబిరీన్.

45. ఓ ముసల్మానులార! మీరు ఏసైన్యమునైనను మార్కొనునపుడు మీరు జయముపొందుటకై స్థిరముగానుండి దేవునిని చాల స్మరింపుఁడు. 46. మఱియు దేవునిని ఆతని ప్రవక్తకును విధేయులై యుండుఁడు. మఱి పరస్పరము తగవులాడకుఁడు. మీరు (అట్లు చేసితిరేని) ధైర్యము వీడుదురు. మఱి మీబలము పోవును. మఱి మీరు ఓర్పుకలిగియుండుఁడు. నిశ్చయముగా దేవుఁడు ఓర్పుగలిగి యున్నవారితోఁ నున్నాడు. 45. ఇందు ముసల్మానులు

యుద్ధరంగమం దెట్లుండ వలసినది చెప్పఁబడినది. శత్రువును మూర్కొను నపుడు ధైర్యసాహసములు వహించి వెనుకంజవేయక స్థిరముగా నుండవలెను. దేవునిపై నాధారపడి దేవునిని చాలస్మరించుచుండవలెను. ఇందునమాజు, వేఁడుట (దుఆ) దైవనామస్మరణము తక్బీరు (అల్లాహు అక్బరు అని పలుకుట) మొదలగు ప్రార్థనలు చేరినవి. దేవుని నామస్మరణమువలన ముసల్మానుల చిత్తముశాంతివహించిధృఢపడును. వీనివలనఉభయలోకములలోజయముచేకూరును.

వ్యా॥ 46. ముసల్మానులు దేవునికిని ఆతని ప్రవక్తకును విధేయులై వారి యాజ్ఞలను శిరసావహించి నడచుకొనవలెను. ముసల్మానులు పరస్పరము కలహములు పెట్టుకొనరాదు. ఐక్య మతమువహించియుండవలెను. పరస్పర కలహములవలన బలము తగ్గును. బలము తగ్గిన యుద్ధములో జయము చేకూరదు. జయములేనిచో రాజ్యముకూడ పోవును. కావున ముసల్మానులు ఐక్యముతో యుద్ధారంభమునందు కలుగు కష్టములకు ఓర్చుకొని ధైర్యసాహసములతో నుండవలెను. ఓర్పుగలవారికి తోడుగ దేవుఁడుండును. దేవుని తోడుగల వారికి జయము లభించును. కావున జయము సైన్యముల హెచ్చుతగ్గులవలన లభింపదు. దానికిఁగాను సైనికులు స్థిరముగా భయభక్తులువహించి పరస్పర ఐక్యమతముగలిగి ధైర్యసాహసములుగలిగి దేవునియొక్కయు ప్రవక్తయొక్క ఆజ్ఞలను అనుసరించిపోవు నాయకుల మాటను అనుసరించిపోవలెను. ఈవాక్యములను హజ్రత్ రసూలివారి శిష్యులు సంపూర్ణముగా ననుసరించిరి. అందులకే వారు ముప్పదిసంవత్సరములంత అల్పకాలములోనే గొప్ప గొప్ప శత్రులపై జయము గాంచి లోకమంతటను గొప్పరాజ్యము స్థాపింపఁగలిగిరి. ఆఫ్రికా ఏషియా యూరోపునఁతటను ఇస్లామ్ రాజ్యమును స్థాపింపఁగలిగిరి. ఇప్పటి ముసల్మానులుకూడ హజ్రత్ రసూలువారి శిష్యులను అనుసరించి తమ పూర్వపు రాజ్యమును తిరిగి స్థాపింతురుగాక!

47. వలా-తకూనూ-కల్-లజీన ఖరజూ-మిన్-దియా-రిహిమ్-బతరన్-వరిఆ-అన్-నాసి-వ-యసుద్దూన-అన్-సబీ-లిల్లాహి-వల్లాహు బిమా-యఅ-మలూన-ముహీత్. 48. వఇజ్-జయ్యన-లహు-ముష్-షైతాను-అఅమాలహుమ్ వఖాల-లాగాలిబ-లకుముల్-యౌమ-మినన్-నాసి-వ-ఇన్నీ-జారుల్-లకుమ్-ఫలమ్మా-తరా-అతిల్-ఫి-అతాని-నకస-అలా-అఖి-బైహి వఖాల-ఇన్నీ-బరీ-ఉమ్-మిన్కుమ్-ఇన్నీ-అరా-మాలా-తరౌన-ఇన్నీ-అఖా-ఫుల్లాహ-వల్లాహు-షదీదుల్ ఇఖాబ్.

47. మఱియు తమ యిండ్లనుండి గర్వము వహించుచు లోకులకు చూపుటకు బయలుదేఱిన వారును దేవుని మార్గమునుండి ప్రజలను ఆటంక ప అచునట్టి వారునగు అవిశ్వాసులవలె మీరు కాఁగూడదు. మఱివారు చేయు క్రి యలన్నిటిని దేవుఁడు ఆవరించి యున్నాఁడు. 48. సైతానువారి కార్యములను వారికి మంచివిగా తోచునట్లు చేసి ఈదినము ప్రజలలో నెవ్వరును మిమ్మొ జ యింపఁజాలరు మఱినేను మీకు సహాయుఁడను అని పలికెను. ఆపిదప రెండు సైన్యములు మార్కొనఁగానే సైతాను తన మెడిమిల పై వెనుకకు మరలి ప రుగెత్త సాగెను. మఱి నేను మీకు తోడుగా నుండను. మీరు చూడనిది నే ను చూచుచున్నాను. నేను దేవునికి భయపడుచున్నాను. దేవుని శిక్ష చాల క ఠినమైనది అని పలికెను.

వ్యా॥ 47. ధర్మయుద్ధము (జిహాదు) దేవుని ప్రీతి బడయుటకుఁ జేయఁ బడును. కావున అదియు నొక భక్తియే. అందు ఏలాటి గర్వము గాని లోకులు చూచి పొగడవలెనను ఉద్దేశము గాని యుండరాదు అని ఇందుముసల్మానులకు హెచ్చరిక గలదు. అబూజెహాలు మక్కానుండి సైన్యము తీసికొని మేళ వా ద్యములతో గొప్ప వైభవముతో ముసల్మానులను బెదఱించుటకుఁగాను ఇతర అబ్బులు చూచి భీతిల్లుటకుఁగాను వెడలెను. దారి మధ్యలో అబూసుఫ్యాను అ బూజెహాలునకు కబురు పంపి బిడారమునకు భయములేదు. నీవు మరలి మ క్కాపురమునకు రమ్మని తెలిపెను. అపుడు అబూజెహాలు చాల గర్వముతో "మేము బదురు బావియొద్దకు చేరి వినోదసభ పాటకచేరి చేసి యందు స్త్రీలు విజయ గానములు పాటలు పాడి సారాయిత్రాగి మజాచేసి మూడు దినముల వఱకు ఒంటెలు కోసి అరబ్బులకువిందుచేసిసదా అరేబియాలో మా పేరు నుండు నట్లుగఁ జేసి కొద్ది మందిగానున్న ముసల్మానులు ఇఁకమీద తల నెత్తకుండు నట్లు చేసి తిరిగి మమ్మొ కన్నెత్తి చూడనట్లుగఁ జేసి వత్తుము అంతవఱకు మ రలము అని డంబాలు కొట్టికొనెను. వీఁడిట్లు తలఁచెను. దేవుని యిష్టము వీనికిఁ దెలియలేదు. తాను ఒకటితలఁచిన దైవము వేఱు తలఁచును అను సామితె వీనికి అన్వయించెను. మానవులు చేయుకార్యములను యత్నములును దేవునికిఁ దెలి యును. ఆతఁడు సమస్తమును ఆవరించి యున్నాఁడు. ఆతని యిష్టమునకు విరుద్ధ ముగా నెద్దియును జరుగ నేరదు. కావున తుదకు బదరులో యుద్ధము సంభవించి అబూజెహాలును ఆతనితోఁ బాటు వాని నాయకులును చచ్చిరి. వారికి బదరు బావినీళ్ళకును సారాయి పానమునకును బదులుగ చావు అను పానమును త్రాగవలసి వచ్చెను. పాట కచ్చేరికి బదులుగ బదరునుండి మక్కాపురము వఱకు మరణ దుఃఖసభలు గావింప వలసి వచ్చెను. ఏ సొత్తును డంబాలుగా ఖర్చుచేయవలెననియుండెనో అదిముసల్మానులకు విజయధనముగా లభించెను.

కావున విశ్వాసుల వృద్ధికిఁగాను బదరులో పునాదిఱాయి వేయఁబడెను. దేవుని మార్గమునుండి ప్రజలకు ఆటంక పఱచుచున్న అవిశ్వాసులే తుదముట్ట నశించిరి. కావున ముసల్మానులు ధర్మయుద్ధము చేయుటలో కాఫిర్ల పద్ధతిని పోఁగూడదు. 48. మక్కా ఖురైషులకు తమ అధిక సైన్యముపై చాల గర్వ ముండెను. అయిన "బనీకనానా" అను అరబ్బులనుండి వారికి భయముండెను. ఎందుకన మక్కా ఖురైషులకును బనీకనానా వారికిని ద్వేషముండెను. యుద్ధ సమయములో తమకు విరోధులగుదురేమా అని వారికి భయముండెను. ఆ భ యము లేకుండ చేయుటకై సైతాను బనీకనానా యొక్క నాయకుఁడగు సురా ఖా రూపము దాల్చి తన సైన్యము తీసికొని వచ్చి అబూజెహాలుతో మీరు భయపడవలదు. మేము మీకుఁ దోడుగా నున్నారము. బనీకనానా వారినిగూర్చి మీరు చింతింపకుఁడు అని ధైర్యము చెప్పెను. బదరుయుద్ధము ఘోరముగా కా గానే జిబ్రీలు మొదలగు దేవదూతలను సైతానుచూచి అబూజెహాలు చేతిలో నున్న తన చేతిని విడిపించుకొని వెనకకు తిరిగి చూడక పాఱిపోసాగెను. అపుడు అబూజెహాలు ఓ సురాఖా !నీవు అసలు సమయములో మోసము చేసి యెక్క డికి పాఱిపోవు చున్నావు అని పలుకగా సైతాను ఓయీ ! నేను మీతో నుం డఁజాలను. మీకును నాకును సంబంధములేదు. నేను చూచుచున్న దేవదూత లను మీరు చూచుటలేదు. దేవదూతల వలన నాకు భయము గలుగుచున్నది. ఇఁక మీయొద్ద నుంటినేని దేవుని యొక్క కఠిన శిక్షకు పాత్రుఁడగుదును అని పలికి పాఱిపోయెను.

49. ఇజ్_యఖూలుల్-మునాఫిఖూన-వల్-లజీన-ఫీ-ఖులూ- బిహీమ్-మరజున్-గర్రి-హాఉలాఇ-దీనుహుమ్-వమన్-యత-వక్కల్-అలల్లాహి-ఫఇన్న ల్లాహ-అజీజున్-హకీమ్.

49. వంచకులును ఎవరి హృదయములలో రోగమున్నదో వారును వీరు తమ మతముపై మోసపోయి యున్నారని అని పలికిరి. మఱెవఁడు దేవునిపై నాధార పడునో నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనాపరుఁడును.

వ్యా॥ 49. ముసల్మానుల సైన్యముకొద్దిగా నుండెను. అందుపై వారి యొద్ద యుద్ధసామగ్రికూడ సరిగా లేకుండెను. ఇట్టి స్థితిలో ముసల్మానులు యుద్ధమునకు సాహసించుటను చూచి వంచకు (మునాఫిఖు)లును హృదయ ములలో విశ్వాస బలహీనత మనెడి రోగము గలవారును ఏమయ్యా! ఈముస ల్మానులు ఇట్టి బలహీనత స్థితిలో చావు నోటిలో దుముకుచున్నారు. ముస ల్మానులు తమ మతముపై మోసపోయి అట్లు చేయుచున్నారు అని పలుకసా గిరి. దానికి దేవుఁడు రద్దుచేయుచు ముసల్మానులు మోసపోయి అట్లు చేయుట

లేదు. వారు దేవునిపై నాధారపడి ప్రయత్నము చేయుచున్నారు. సర్వ శక్తుఁడును, సర్వజ్ఞుడు నగు దేవునిపై నాధారపడు వారట్లు చేయుదురు. ఎవరు దేవునిపై నాధారపడి తమ యత్నములు సలుపుదురో వారికి దేవుఁడు తోడు పడును. దానికి బదరు యుద్ధమే సాక్షి.

50. వలౌ-తరా-ఇజ్-యతవఫ్ఫల్-లజీన-కఫరుల్-మలాఇకతు- యజ్-రిబూన-వుజూ-హా-హుమ్-వ-అద్బార-హుమ్-వజూఖూ - అజాబల్- హారీఖ్. 51. జాలిక-బిమా-ఖద్-దమత్-ఐదీకుమ్-వ-అన్నల్లాహా-లైస-బిజల్లా-మిల్- లిల్ అబీద్.

50. మఱియు ఓ ప్రవక్తా ! దేవదూతలు అవిశ్వాసుల ప్రాణములు తీయుచు వారి ముఖములపైనను వీఁపుల పైనను కొట్టుచు కాల్చునట్టిబాధ (శిక్ష) రుచి చూడుఁడు. 51. ఇది మీచేతులుచేసి ముందుగా పంపిన దాని ఫలితము న్నది. దేవుఁడు తన భక్తులకు నేలాటి యన్యాయము చేయువాఁడు కాఁడు. అని పలుకునపుడు నీవు చూచినచో నాశ్చర్య పడుదువు.

వ్యా॥ 50. దేవదూతలు అవిశ్వాసుల ప్రాణములు తీయునపుడు వారిని కొట్టుచు ప్రస్తుతము ఈశిక్షను అనుభవింపుఁడు. ఇఁకమీద మీరు నరకాగ్ని శిక్షను రుచి చూచెదరు. ఇది బర్ జఖ్ అనఁబడును. పరమునకును ఇహమునకును మధ్యనుండు స్థితి. ఇట్టిదుర్గతి బదరులో చచ్చిన అవిశ్వాసులకుఁగూడ పట్టెను. 51. దేవుఁడు మానవులపైరవంత అన్యాయము చేయఁడు. పాపములుచేయని వారిని శిక్షింపఁడు. ఈశిక్ష కలుగుటకు కారణము అవిశ్వాసులు ఇహలోకము నందు కావించుచున్న పాపకార్యములు వారి పాపకార్యముల ఫలితమే నరక శిక్షగా లభించును.

52. కదాబి-ఆలి-ఫిర్-ఔన-వల్-లజీన-మిన్-ఖబ్-లిహిమ్- కఫరూ-బి-ఆయా-తిల్లాహి-ఫ-అఖజ-హుముల్లాహు-బిజునూ-బిహిమ్-ఇన్నల్లాహా-ఖవీయున్ షదీ-దుల్-ఇఖాబ్. 53. జాలిక-బి-అన్నల్లాహ-లమ్-యకు-ముగయ్యి-రన్-ని అ-మతన్-అన్-అముహా-అలా-ఖామిన్-హత్తా-యుగయ్యి-రూ-మా-బి-అన్ఫుసి హిమ్-వఅన్నల్లాహ-సమీఉన్-అలీమ్. 54. కిదాబి-ఆలిఫిర్-ఔన-వల్ - లజీన-మిన్-ఖబ్లి-హిమ్-కజ్-జబూ-బి-ఆయాతి-రబ్బిహిమ్-ఫ-అహ్-లక్నా-హుమ్- బిజునూ-బిహిమ్ వ-అగ్-రఖ్ నా-ఆల-ఫిర్-ఔన-వ-కుల్లున్-కానూ-జాలిమీన్.

52. వీరిపద్ధతి ఫిర్ఔను జనులకును వారి పూర్వులకునుపోలియున్నది. దేవుని సూచనలను తిరస్కరింపఁగా దేవుఁడు వారి పాపములకుఁగాను వారిని పట్టెను. నిశ్చయముగా దేవుఁడు బలవంతుఁడు, కఠినముగా శిక్షించువాఁడు. 53. ఇది యెందుకనగా ఒక సంఘము వారు తమకుతామే తమస్థితిని మార్చుకొనకుండునంతవఱకు దేవుఁడు తానువారికి చేసియున్న తనయనుగ్రహమునుమార్చువాఁడుకాఁడు. మఱియు దేవుఁడు సర్వము వినువాఁడును సర్వము తెలిసినవాఁడును. 54. వీరిపద్ధతి ఫిర్ఔను జనులకును వారి పూర్వులకును పోలియున్నది. వారు తమ ప్రభువు సూచనలను తిరస్కరింపఁగా మేము వారిపాపములకుఁగాను వారిని నశింపఁజేసితిమి. మఱియు ఫిర్ఔను జనులను ముంచి వేసితిమి. మఱివారందఱును దుర్మార్గులుగా నుండిరి.

వ్యా॥ 52. దేవుఁడు హజ్రత్ మహమ్మదువారి కొసంగిన ఖురానె షరీఫును అవిశ్వాసులు తిరస్కరించుచున్నారు. తిరస్కరించువారు దేవుని శిక్షకు పాత్రులగుచున్నారు. ఇట్లు పూర్వమునుండియు జరుగుచునే వచ్చెను. ఫిర్ఔను జనులును వారి పూర్వులును దేవుని ప్రవక్తలను దేవుని సూచనలను తిరస్కరించిరి. వారి పాపములకుఁగాను దేవుఁడు వారిని శిక్షించుచు వచ్చెను. దేవుఁడు బలవంతుఁడు సర్వశక్తుఁడు ఆతని శిక్ష చాల కఠినమైనది. ఆతని శిక్షనుండి తప్పించికొని పోవుట కెవరికిని శక్తిలేదు. 53. మానవులకు శిక్ష కలుగుటకు కారణము వారి దుష్టత్వమే. దేవుఁడొసంగిన ధర్మమార్గమును బుద్ధి జ్ఞానములను భక్తిపూర్వముగ మంచి త్రోవలో నుపయోగించు నంతవఱకు దేవుఁడు వారి ననుగ్రహించుచునే యుండును. వారు తమస్వభావమును చెడఁగొట్టుకొని భక్తిమార్గము వదలి నీచకార్యములకు పాలైనచో అపుడు దేవుఁడు తన అనుగ్రహమును ఆగ్రహముగా మార్చివేయును. అంతవఱకు దేవుఁడు తన అనుగ్రహములను మార్చఁడు. దేవుఁడు మానవుల సర్వపలుకులు వినుచు వారి సర్వవిషయములెఱుంగుచున్నాఁడు. ఎవరికిఁదగినట్లు వారికి ఫలిత మొసంగును. కావున ఎవరు దేవుని యనుగ్రహములు పొంది యుభయలోకములలోను ఉన్నతస్థానము పొందఁగోరుదురో వారు దేవుని యాజ్ఞలను అనుసరించి పోవలెను. అందుఏలాటి మార్పుచేయరాదు. 54. దేవుని సూచనలను తిరస్కరించినవారిని వారిపాపములకుఁగాను శిక్షించినశింపఁజేసెను. పాపములు చేయని వారిని అన్యాయముగా దేవుఁడు శిక్షింపఁడు. ప్రత్యేకముగా ఫిర్ఔను జనులను సముద్రములోముంచి వేసెను. వారందఱు అన్యాయమునకును దుర్మార్గమునకు పాలై నుండిరి. వారి కర్మల ఫలితము వారికి లభించెను. కావున దేవునికి ఒకజాతి వారితో ద్వేషము లేదు. ఎవరైననుసరే పాపములు చేసిన వారిని శిక్షించును.

55. ఇన్న-షర్-రద్-దవాబ్బి-ఇన్దల్లా-హిల్-లజీన-కఫరూ-ఫహుమ్-లా యూమినూన్. 56. అల్లజీన-ఆహత్త-మిన్-హుమ్-సుమ్మ-యన్-ఖుజూన-అహ్-దహుమ్-ఫీ-కుల్లి-మర్రతిన్-వ-హుమ్-లా-యత్త-ఖూన్- 57. ఫ-ఇమ్మా-తస్ఖ-ఫన్నహుమ్-ఫిల్-హర్ బి-ఫ-షర్రిద్-బిహిమ్-మన్-ఖల్-ఫ-హుమ్-లఅల్ల-హుమ్-యజ్-జక్కరూన్. 58. వ-ఇమ్మా-తఖా-ఫన్న-మిన్-ఖౌమిన్-ఖియానతన్-ఫమ్-బిజ్ ఇలైహిమ్-అలా-సవా-ఇన్-ఇన్నల్లాహ-లా-యుహిబ్బుల్-ఖాఇనీన్.

55. తిరస్కరించిన అవిశ్వాసులు దేవుని యొద్ద అన్ని ప్రాణులకంటెను చెడ్డవారు. మఱి వారు విశ్వసించువారును కారు. 56. నీవు వారితోఁ గావించియున్న ఒడంబడికను వారు మాటిమాటికి భయములేకుండ తెంపుచున్నారు. 57. కావున వారు నీకు యుద్ధములో చిక్కినచో వారికి బుద్ధివచ్చునట్లుగను వారి వెనుక వచ్చువారు చూచి పాఱిపోవునట్లుగను వారిని శిక్షించుము. 58. మఱియు ఒడంబడిక గావించియున్నవారు నీకు మోసముచేయుదురని నీకు భయమున్నచో మీరును వారును సరిసమానులగునట్లుగ వారి యొడంబడికను వారి వైపునిసరివేయుము. నిశ్చయముగ దేవుఁడు, మోసముచేయువారిని ప్రేమింపఁడు.

వ్యా॥ 55, 56. దేవుని సూచనలను తిరస్కరించి విశ్వసింపనివారును, తాము చేసిన యొడంబడికను తెంపువారును దేవుని యొద్ధ అన్నిప్రాణుల కంటెను చెడ్డవారు. వారి కేలాటి గౌరవముండదు. వారు శిక్షకు పాత్రులు. హజ్రత్ మహమ్మదువారితో బనీ ఖురైజాయూదులు మొదలగువారు ఒడంబడిక చేయుచు దానిని మాటిమాటికి తెంపుచుండిరి. యూదులు పైగంబరుల వారికి విరోధముగ వారి శత్రులగు మక్కా కాఫిర్లకు సహాయము చేయమని యొడంబడిక చేసియు సమయము వచ్చినపుడు యూదులు తాము గావించిన యొడంబడికకు విరోధముగ మక్కా కాఫిర్లకు సహాయముచేయుచుండిరి. దాని గూర్చి యూదులతో పైగంబరులవారు అడిగినచో మేము మఱచిపోతిమియని తిరిగి యొడంబడిక చేసి మరల దానికి వ్యతిరేకముగా నడచుకొనుచుండిరి. ఇట్టివారినిగూర్చి యేమిచేయవలెనో రాఁబోవువాక్యములో చెప్పఁబడినది. 57. ఈ మోసగాండ్రు ద్రోహులు, ఒడంబడికకు విరోధముగా శత్రువులతో కలసి బహిరంగముగ మీతో యుద్ధమాడినచో అట్టివారిని కఠినముగా శిక్షించుము. ఆశిక్షను చూచి వారి వెనుకవారు బుద్ధితెచ్చుకొని యొడంబడికకు విరోధముగ వర్తింపకయుందురు. 58. ఎవరైన బహిరంగముగ తాము గావించియున్న యొడంబడికకు విరోధముగ వర్తించుకొనక లోలోపల వ్యతిరేకముగ చేయుటకు

కుట్రలు సలుపుచున్నారని భయముగలిగినచో వారి యొడంబడికను రద్దుచేసి వారికిఁ దెలుపవలెను. ఉభయపక్షములవారు తమకుఁదగిన కార్యములు సలుపుకొనవచ్చును. ఒడంబడికను రద్దుచేయకనే లోలోపల ఒడంబడికకు విరోధముగ నడచుకొని మోసముచేయరాదు. నిర్భయముగా శత్రువులను మీయొడంబడిక రద్దుచేసినాము. మీయుద్ధయత్నము మీరు చేసికొనుఁడు. మేము మాయత్నములు చేసికొందుము అని తెలుపవలెను. మోసముచేయువారిని దేవుఁడు ప్రేమింపఁడు. కావున ముసల్మానులు ఎవరికిని మోసముచేయరాదు.

59. వలా యహ్సబన్నల్-లజీన-కఫరూ-సబఖూ-ఇన్నహుమ్-లా-యుఅ్-జి-జూన్.60.వ-అఇద్దూ-లహుమ్ మస్-తతఅ్-తుమ్-మిన్-ఖువ్వ-తిన్-వ-మిన్ రిబాతిల్ ఖైలి-తుర్-హి-బూన బిహీ-అదువ్వల్ లాహి వ అదువ్వ-కుమ్-వఆఖరీన-మిన్-దూనిహిమ్ లా-తఅ్-లమూ-నహుమ్-అల్లాహు-యఅ్-లము-హుమ్-వ-మా-తున్-ఫిఖూ-మిన్ షైఇన్-ఫీ-సబీ లిల్లాహి-యువఫ్-ఫ-ఇలైకుమ్ వఅన్తుమ్-లా-తుజ్-లమూన్.

59. మఱియు అవిశ్వాసులు తాము తప్పించుకొని పాఱిపోతిమి అని వారు తలఁచఁగూడదు. వారెన్నటికిని తప్పించుకొని పోఁజాలరు. 50. వీరితో యుద్ధమాడుటకుఁగాను మీరు సేకరింపఁగల బలమంతను సిద్ధముగా నుండు గుఱ్ఱములను సిద్ధపఱచుకొనుఁడు. దీనివలన దేవునికిని మీకును విరోధులుగా నున్నవారికిని, వీరుగాక దేవునికిఁ దెలిసి మీకుఁ దెలియకయున్న ఇతరులకును, మీరు భయము గలిగింపవలెను. మఱి మీరు దేవుని మార్గమందు ఖర్చుచేయునదంతయు మీకుసంపూర్ణముగలభించును. మఱిమీకెట్టిఅన్యాయము జరుగనేరదు.

వ్యా॥ 59. ముసల్మానులు మోసముచేయరు. కావున మాకుఁ దెలిపియే యుద్ధమునకు సిద్ధులగుదురు. అంతలో మేము బాగుగా యుద్ధమునకు సామగ్రి తయారుచేసికొని జాగరూకులై ముసల్మానులకు విరోధముగ తయారు కావచ్చును అని అవిశ్వాసులు తలంపరాదు. అట్లు తలఁచి సంతసించుటవలన వారికి నుపయోగములేదు. అట్లు యత్నములు చేసిన దేవుఁడు ముసల్మానులకు జయము నొసంగవలెనని కోరినచో దేవునినుండి వారు తప్పించుకొని పాఱిపోఁజాలరు. వారు తప్పక ముసల్మానులకు లోఁబడుదురు. ఎట్టి యత్నముచేసియు అవిశ్వాసులు దేవునినుండి తప్పించుకొని పోఁజాలరు. కావున ముసల్మానులు దేవునిపై నాధారపడి తమ యత్నములుచేసి దేవుని యాజ్ఞలనుఅనుసరించినచో జయము పొందఁగలరు. 60. దేవునిపై నాధారపడుట అనునది సమయోచితముగ ప్రయ

త్నములు చేయక వదలిపెట్టుటగాదు. ముసల్మానులు కాలమునకుఁ దగినట్లు తమ శక్తికొలఁది యుద్ధసామగ్రి సిద్ధపఱచుకొని యుద్ధమునందు నేర్పుగలిగియు యుండవలెను. హజ్రత్ మహమ్మదువారి కాలమునందు, గుఱ్ఱపుస్వారి, కత్తి ఖడ్గములందు నేర్పు, విల్లు బాణములశిక్ష పొందవలసియుండెను. ఇప్పుడు తుపాకి, ఫిరంగులు, విమానములు, నీళ్ళలోపలపోవు స్టీమర్లు, విషవాయువుల నుండి రక్షణలు మొదలగు సామగ్రి సిద్ధపఱచుకొనవలెను. ఇఁకమీఁదను ఏయే ఆయుధములు బయలుదేఱునో ఆయా ఆయుధములు ముసల్మానులు సిద్ధపఱచు కొని అందు గొప్ప నేర్పుగలిగి శత్రువును మార్కొనవలెను. బలము, మంచి నేర్పుగల గుఱ్ఱములు మొదలగు యుద్ధసామగ్రివలన శత్రువు భయపడును. అందువలన ఉపద్రవములు పోయి లోకములో శాంతి గలుగును. ధర్మమునకు, విరోధులైనవారు దేవునికిని ముసల్మానులకును విరోధులే. పైగంబరులవారి కాలముననున్న శత్రువులును, ఇఁకమీఁద రాఁబోవు శత్రువులును, భయపడు నట్లుగ యుద్ధసామగ్రి తయారుచేయవలెను. యుద్ధమునకుఁగాను ఖర్చు చేయు ధనము వృథాపోదు. దేవుఁడు దాని గొప్పఫలితము ముసల్మానులకొసంగును. అందు ఏలాటి కొఱత గలుగదు. కావునముసల్మానులు ధర్మయుద్ధము(జిహాదు) నకుఁగాను ఎంత ఖర్చుచేయుదురో దానికంటె ననేకరెట్లు ఫలితము దేవునిచే వారికి లభించును. ఇహలోకమునందు శత్రువులపై జయము గలుగును. పరము నందు గొప్ప పదవులు లభించును.

61. వఇన్-జనహూ-లిస్-సల్మి-ఫజ్-నహ్-లహా-వ-తవక్కల్-అలల్లాహి ఇన్నహూ-హువస్-సమీ-ఉల్-అలీమ్. 62. వఇన్-యురీదూ-అన్-యఖ్ - ద ఊక-ఫఇన్న-హస్-బకల్లాహు-హువల్ - లజీ-అయ్యదక-బినస్-రిహీ-వ-బిల్ - మూమినీన్. 63. వ-అల్ల-ఫ-బైన-ఖులూ-బి-హిమ్-లౌ-అన్-ఫఖ్త - మాఫిల్ - అర్ జి-జమీ-అమ్-మా-అల్లఫ్త-బైన-ఖులూ-బి-హిమ్-వలా-కిన్నల్లాహ-అల్లఫ-బైనహుమ్-ఇన్నహూ-అజీజున్-హకీమ్. 64. యా-అయ్యు-హన్- నబియ్యు-హస్-బుకల్లాహు-వ-మనిత్-తబఅక-మినల్-మూమినీన్.

61. మఱియు వారు సంధికి దిగినచో నీవును సంధికి దిగుము. మఱినీవు దేవునిపై ఆధారపడుము. నిశ్చయముగా ఆతఁడే సర్వము వినువాఁడును సర్వము తెలిసినవాఁడును. 62. మఱి వారు నిన్ను మోసపుచ్చ నెంచినచో నీకు దేవుఁడే చాలును. ఆతఁడే తన సహాయముతోను ముసల్మానులతోను నీకు బల మొసంగెను. 63. మఱి వారి హృదయములలో ప్రేమము గలిగించెను. నీవు

భూమిలోనున్నది సమస్తమును ఖర్చుచేసినను వారి హృదయములలో ప్రేమము గలిగింపఁజాలకయుందువు. కాని దేవుఁడు వారియందు ప్రేమనుగలిగించెను. ఆతఁడు సర్వశక్తుఁడును, వివేచనాపరుఁడును. 64. ఓ ప్రవక్త! దేవుఁడును, నిన్ను అనుసరించిన ముసల్మానులును నీకు చాలును.

వ్యా॥ 61. అవిశ్వాసులు, ముసల్మానుల బలమునుచూచి భీతిల్లి సంధి చేసికొనుటకు సిద్ధమైనచో ప్రవక్తకూడ సంధికి సిద్ధము కావలెను. అటులే ముసల్మానులు కూడి సంధికిగాను సిద్ధముకావలెను. ఎందుకన ధర్మయుద్ధము వలన ముఖ్యోద్దేశ్యము శాంతి నెలకొలుపుట. ఆ యుద్ధము లేకుండనే సంధి మూలమున శాంతి చేకూరినచో యుద్ధముచేయ నక్కఱలేదు. ఒకవేళ శత్రువులు సంధిసాకుతో మోసము చేయుదురని మీకుభీతియున్నచో మీరుదేవుని పై నాధారపడవలెను. దేవుఁడు అవిశ్వాసులు లోలోపల సలుపు మోసపు మాటలను విని వారి కుట్రల నెఱుంగుచున్నాఁడు. దేవుని యెదుట వారి మోసములు సాగవు. కావున మీరు మాత్రము ఏలాటి మోసము లేకుండ హృదయ పూర్వకముగ సంధి చేసికొనవలెను. 62. వారు (అవిశ్వాసులు) మిమ్మ మోసపుచ్చవలెనని కోరినచో దానిఁగూర్చి చింత చేయవలదు. (ఓప్రవక్త) నీకు దేవుఁడే చాలును. ఆతని సహాయము వలననే బదరు యుద్ధములో నీకు జయము గలిగెను. దేవుఁడు నీకుఁ దోడుగ ముసల్మాను భక్తులను నియమించి యున్నాఁడు. కావున విరోధుల కుట్రలు సాగవు. అవి వృథా పోవును. 63. ఇస్లామ్‌నకు పూర్వము అరబ్బులు పరస్పరము చాల ద్వేషము గలిగి అల్ప విషయములకై సంవత్సరముల కొలఁది పోరాడు చుండెడివారు. మదీనాలోనుండినవారికి ఔసు ఖజ్‌రజ్ అను రెండువంశముల వారిలో గొప్ప విరోధముండెను. ఒకరితో నొకరు యుద్ధమాడుకొనుచుండిరి. ఇట్టి స్థితిలో హజ్రత్ మహమ్మదు వారు దేవుని ప్రవక్తగా వచ్చిరి. ప్రజలు వారికి విరోధులైరి. పెట్టరాని బాధలు పెట్టిరి. అపుడు పశుప్రాయులైనట్టి జనులను మంచి మార్గమునకుఁ దెచ్చి పరస్పరము సోదర భావమును ప్రేమమును కల్పించునట్టి శక్తి యెవరికిఁ గలదు. భూమిలోనున్న ఖజానాల ధనమంతయు ఖర్చు చేసినను పరస్పర విరోధములు నశించి ప్రేమము గలుగుట దుర్లభము. అట్టి దుర్లభమైన సోదర భావమును దేవుఁడు అరబ్బుల మధ్యను మదీనావారి మధ్యను ఇతర జనుల మధ్యను కల్పించి వారిని ముసల్మానులఁగఁ జేసి హజ్రత్ రసూలు వారికి శిష్యులగు నట్లుగఁ జేసెను. ఇది దేవుని గొప్ప యనుగ్రహము. కావున దేవుఁడు సర్వశక్తుఁడు. అసాధ్యములైన పనులుకూడ చేయును. వివేచనా పరుఁడు. కావున ఎవరికెఁదగినట్లు వారికి సమయోచితముగఁ జేయును. 64. ఓప్రవక్త! నీకుతోడు పడుటకు దేవుఁడు చాలును. నిన్ను అనుసరించు ముసల్మాను భక్తులు చాలును.

వారు కొద్దిమంది యైనను పర్వాలేదు. కావున దేవునిపై నాధారపడి యుద్ధ కార్యములు సలుపవలెను.

65. యా-అయ్యుహన్-నబియ్యు హర్రి-జిల్-మూమినీన-అలల్-ఖితాలి-ఇన్-యకుమ్-మిన్-కుమ్-ఇష్ రూన-సాబిరూన-యగ్-లిబూ-మిఅతైని-వ-ఇన్-యకుమ్-మిన్ కుమ్-మిఅతున్-యగ్-లిబూ-అల్-ఫమ్-మిన్నల్లజీన-కఫరూ-బిఅన్నహుమ్-ఖౌముల్-లా-యఫ్-ఖహూన్. 66. అల్-ఆన-ఖఫ్-ఫ-ఫల్లాహు-అన్-కుమ్-వఅలిమ అన్న-ఫీకుమ్-జ అ-ఫన్-ఫఇన్-యకుమ్-మిన్-కుమ్-మిఅ-తున్-సాబిరతున్ యగ్-లిబూ-మిఅ-తైని-వఇన్-యకుమ్-మిన్-కుమ్ అల్-ఫున్-యగ్-లిబూ-అల్-ఫైని బి-ఇజ్నిల్లాహి-వల్లాహు-మఅస్-సాబిరీన్.

65. ఓ ప్రవక్త! యుద్ధమునకుఁగాను ముసల్మానులను ప్రోత్సాహ పఱచుము. మీలో స్థిరముగా నుండువారు ఇరువదిమంది యున్నచో రెండువందల మందిని జయింతురు. మఱి మీలో వందమంది యున్నచో వేయిమంది అవిశ్వాసులను జయింతురు. ఇది ఎందుకన అవిశ్వాసులకు తెలివి (జ్ఞానము) లేదు. 66 ఇపుడు దేవుఁడు మీభారమును తేలికఁగాఁ జేసెను. మఱి మీలో బలహీనత యున్నది యని దేవునికిఁ దెలియును. కావున మీలో స్థిరముగా నుండువారు వందమంది యున్నచో రెండువందల మందిని జయింతురు. మీలో వేయిమంది యున్నచో దేవుని సెలవుచే రెండువేలమందిని జయింతురు. మఱి దేవుఁడు స్థిరముగా నుండువారికి తోడుగా నున్నాఁడు.

వ్యా॥ 65. ఈ వాక్యములో ధర్మయుద్ధమునకై ప్రోత్సాహము గలదు. ముసల్మానులు కొద్దిమంది యుండినను వెనుకంజ వేయరాదు. శత్రువులుఁ తమకంటె పదిరెట్లు హెచ్చుగా నుండినను వారిని మార్కొనవలెను. ముసల్మానులు యుద్ధము చేయునది దేవుని ప్రీతికొఱకు. జయమొందినసరే. లేక యుద్ధములో వధింపఁబడిన స్వర్గలోకములో గొప్పపదవి (షహాదత్) లభించును అని నమ్మకకలదు. అందుచే ముసల్మానులు చావునకుభయపడక త్యాగమువహించి యుద్ధమాడుదురు. కావున వారికి మనోబలము దేవుని సహాయము లభించి కొద్దిమందియున్నను హెచ్చుమందినిజయింతురు. నిజమైన భక్తివిశ్వాసములుగలిగి యుద్ధరంగమందుండు ముసల్మానులు అట్టిజయము పొందుదురు. అవిశ్వాసులు విశ్వాసభక్తులు లేక పరలోకమందలి సదా సౌఖ్యములందు నమ్మకలేక ఇహలోక తుచ్ఛలాభములకై పోరాడుదురు. కావున వారికి చావుభయముండివారికిమనోబలములభింపదు. అందుకు స్థిరముగా త్యాగము వహించి యుద్ధమాడక ఓడిపోవుదురు. 67. మొదటి వాక్యమునకు చాల కాలమునకుపిదప ఈవాక్యము వచ్చెను. ముసల్మానులుకొంత

బలహీనులైరి. అందుచే తమకంటె పదిరెట్లు హెచ్చుగా నుండు సైన్యమును మార్కొనవలె నన్న కొంత భారముగా తోఁచెను. అందుకు దేవుఁడు అనుగ్రహించి భారము తగ్గించెను. ఇప్పుఁడు ముసల్మానులు శత్రువుల సైన్యము రెండింతలున్నచో వారిని మార్కొని యుద్ధమాడవలెను. యుద్ధరంగము వీడి పోఁగూడదు. ముసల్మానులు కొద్దిమందిగా నుండిన కాలమున వారు చాల త్యాగము వహించి తమకంటె పదిరెట్లు హెచ్చుగానుండు సైన్యమును మార్కొనుచు జయము పొందుచు వచ్చిరి. పిదప ముసల్మానుల సంఖ్య హెచ్చు అగుకొలఁది త్యాగము మందగిల్ల సాగెను. అందుచే కనీసము రెండింతలుగా నుండు శత్రువుల సైన్యమును మార్కొని తీరవలసినది అని దేవుని సెలవయ్యెను. సమయము వచ్చినపుడు ముసల్మానులు శత్రువుల యధిక సైన్యమును లెక్కింపక యుద్ధమాడుచునే వచ్చిరి. హజ్రత్ పైగంబరుల వారి కాలములో వేయిమంది ముసల్మానులు ఎనుబదివేలమంది కాఫిర్ల సైన్యమును మార్కొనిరి. మూతాయుద్ధమునందు మూఁడువేలమంది ముసల్మానులు రెండులక్షలమంది కాఫిర్లసైన్యమును మార్కొరి. ఇట్టియుదాహరణములు ఇస్లామ్ చరిత్రములో పెక్కుగలవు. కావున ఇప్పటి ముసల్మానులు కూడ ధైర్య సాహసములు వహించి కాలమునకుఁ దగిన యుద్ధసామగ్రితో సిద్ధులై తమ్ము నాశముచేయ యత్నించు శత్రువును మార్కొని ధర్మయుద్ధము (జిహాద్) చేయవలెను. స్థిరముగా నుండువారికి దేవుని సహాయము తప్పక లభించును.

67. మా-కాన-లి-నబియిన్-అన్-యకూన లహూ-అస్రా-హత్తా - యుస్-ఖిన-ఫిల్-అర్జి-తురీదూన-అరజద్-దున్యా-వల్లాహు-యురీదుల్-ఆఖిరత - వల్లాహు-అజీ-జున్-హకీమ్. 68. లౌలా-కితాబుమ్-మినల్లాహి-సబిఖ-ల-మస్స-కుమ్ ఫీమా-అఖజ్-తుమ్-అజాబున్-అజీమ్. 69. ఫకులూ-మిమ్మా-గనిమ్తుమ్-హాలాలన్-తయ్యిబన్-వత్-తఖుల్లాహ-ఇన్నల్లాహ-గఫూరుర్-రహీమ్.

67. దేశములో (శత్రువును) బాగుగ నణఁకునంతవఱకు ఖైదీలుగా తన యొద్ద నుంచుకొనుట ప్రవక్తకుఁదగదు. మీరు ఇహలోక సొత్తులను కోరుచున్నారు. మఱి దేవుని యొద్ద పరలోకము కావలెను. మఱి దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనా పరుఁడును. 68. దేవునివద్ద ముందుగానే లిఖింపఁబడి యుండనిచో మీరు తీసికొన్న దానికిఁగాను మీకు గొప్పశిక్షగలిగి యుండును. 69. కావున మీకు లభించిన ధర్మమైన పరిశుద్ధమైన విజయ ధనమును తినుఁడు. మఱి దేవునికి భయపడుచునుండుఁడు. నిశ్చయముగ దేవుఁడు క్షమించు వాఁడును దయగల వాఁడును.

వ్యా॥ 67. బదరు యుద్ధములో డెబ్బదిమంది అవిశ్వాసులు ముసల్మాను చేతిలో పట్టుపడిరి. వారి విషయము ఏమి చేయవలెనని పైగంబరులవారు తమ శిష్యులతో నడిగిరి. హజ్రత్ అబూబకరుగారు ఖైదీలనుండి బదులుగ డబ్బు (ఫ్విదా) తీసికొని వదలి పెట్టవలెను అని పలికిరి. హజ్రత్ ఉమరుగారు కాఫిర్లను నఱక వలెనని పలికిరి. హజ్రత్ రసూలువారు ఖైదీలను కనికరించి అబూబకరుగారి అభిప్రాయమును సమ్మతించి ఖైదీలకు బదులుగ సొమ్ము తీసికొని వదలి పెట్టిరి. పెక్కుమంది శిష్యులు ముసల్మానులకు డబ్బు అక్కఱయున్నది యని యభిప్రాయపడిరి. అందుకు దేవుఁడు ఇట్లు ముసల్మానులను మందలించెను. కాఫిర్లను వదల కూడదు. వారిని బాగుగ నఱకవలసినది. ఎందుకన వారికి సమయము దొరకినచో ముసల్మానులను నశింపఁ జేయుటకు యత్నింతురు. మీరు ఇహలోక సొత్తును కోరితిరి. దేవునికి ఇష్టము పరలోకము. కావున మీరు పరలోకము కోరవలెను. దేవుఁడు సర్వశక్తుఁడు వివేచనా పరుఁడు. తాను కోరినట్లు మీకుఁ దోడుపడును. కావున ఆతనిపైననే ఆధారపడి యుండవలెను. 68. డబ్బు తీసికొని వదలి పెట్టుట గొప్పతప్పు. దానికిఁగాను మీకు గొప్ప శిక్ష లభింప వలసినదే. కాని శిక్ష తొలఁగి పోవుటకు కారణము దేవుఁడు ముందుగానే ఇట్లు లిఖించి యుండెను. అది ఏమన ఖైదీలను డబ్బు తీసికొని వదలి పెట్టవచ్చును అను ధర్మము విధించుట. అభిప్రాయములో పొరపాటు గలిగినచో దేవుఁడు శిక్షింపఁడు. డబ్బు తీసికొనగూడదు అని దేవుఁడు నిషేధించి యుండలేదు. కావున దేవుఁడు మీకు గొప్పశిక్షను విధింపక క్షమించెను. 69. కావున విజయధనమును మీరు ఖైదీలకు బదులుగ గ్రహించిన సొత్తును ఏలాటి దోషము లేకుండ ధర్మమైనదిగాను పరిశుద్ధమైనదిగాను ఎంచి భుజింపుఁడు. దేవుఁడు మీరు కావించిన పొరపాటును క్షమించెను. ప్రతివిషయములోను దేవునికి భయపడుచు నుండుఁడు.

70. యాఅయ్యు-హన్-నబియ్యు-ఖుల్-లిమన్-ఫీ-ఐదీకుమ్ మినల్ అస్రా-ఇన్-యఅ-లమిల్లాహు-ఫీ-ఖులూ-బి-కుమ్ ఖైరన్-యుఅతికుమ్ ఖైరమ్-మిమ్మా-ఉఖిజ-మిన్-కుమ్-వ-యగ్-ఫిర్-లకుమ్-వల్లాహు గఫూరుర్-రహీమ్. 71. వ-ఇన్-యురీదూ-ఖియానతక-వఖద్-ఖానుల్లాహ-మిన్-ఖబ్లు-ఫ-అమ్-కన - మిన్-హుమ్-వల్లాహు-అలీమున్-హకీమ్

70. ఓ ప్రవక్తా! మీచేతిలోనున్న ఖైదీలతో మీహృదయములలో భక్తి యున్నదని దేవునికిఁ దెలిసినచో మీవద్దనుండి తీసికొనినదానికంటె హెచ్చుగా మీ కొసంగును. మఱి మిమ్ము క్షమించును. దేవుఁడు క్షమించువాఁడును దయగల

వాఁడును అని పలుకుము. 71. మఱి వారు నిన్ను మోసగింపవలెనని తలఁచినచో వారు దీనికి ముందుకూడ దేవునిని మోసపుచ్చియున్నారు. కావున వారిపై నీకు శక్తినొసంగియున్నాఁడు. మఱి దేవుఁడు సర్వజ్ఞుఁడు వివేచనాపరుఁడును.

వ్యా॥ 70. బదరులో చిక్కిన ఖైదీలలో హజ్రత్ అబ్బాసు మొదలగు వారు మేము ఇస్లామ్‌లో చేరితిమి అనిపలికిరి. దానికి దేవుఁడు "మీరు ఇస్లామ్‌లో చేరి మీహృదయములలో వాస్తవముగ భక్తియున్నచో దేవుఁడు మీ పూర్వపు పాపములు క్షమించును. ఇపుడు మీవద్దనుండి తీసికొనిన ధనము (బదులు) కంటె హెచ్చుగా మీకొసంగును. కావున ధనముపోయెనే అని చింత పడవలదు. భక్తి విశ్వాసములు సంపూర్ణముగ వహింపుఁడు" అని సెలవిచ్చెను. 71. యుద్ధఖైదీలు తాము ఇస్లామ్‌లో చేరితిమి అని పలికి మోసపుచ్చవలెనని యున్నచో దానికి పర్వాచేయకూడదు. ఇది వారి స్వభావమే. దీనికి ముందు కూడ దేవునిని విశ్వసింపక దేవునిని మోసపుచ్చియున్నారు. వారి కుట్ర మోసములు సాగవు. బదరుయుద్ధములో నీకు వారిపై శక్తినిచ్చి కాఫిర్లు నీచేతిలోఁ జిక్కునట్లు సర్వశక్తుఁడగు దేవుఁడు చేసెను. అటులే ఇఁకమీఁదను చేయఁగలఁడు. వారి హృదయములలోని మర్మములు దేవునికిఁ దెలియును. దేవుఁడుసర్వజ్ఞుఁడు. దేవుఁడు వివేచనాపరుఁడు. తాను నిర్మించిన ఏర్పాటులను ఎవరును దాఁటఁజాలరు. దేవుఁడు వాగ్దానము చేసినట్లు ఖైదీలలో ఎవరెవరు స్థిరముగా ఇస్లామ్ నందుండిరో వారికి గొప్ప మేలు లభించెను. అవిశ్వాసులైనవారు తుదముట్ట నశించిరి.

72. ఇన్నల్లజీన-ఆమనూ-వ-హాజరూ-వజాహదూ-బిఅమ్వాలిహిమ్ వ-అన్‌ఫుసిహిమ్ ఫీ-సబీలిల్లాహి-వల్లజీన-ఆవౌ-వనసరూ-ఉలాఇక-బఅ-జుహుమ్-ఔలి-యాఉ-బఅ-జిన్-వల్లజీన-ఆమనూ-వలమ్-యుహాజిరూ-మాలకుమ్-మిన్-వలా-యతిహిమ్-మిన్-షైయిన్ హత్తా-యుహాజిరూ వ-ఇ నిస్-తన్-సరూ-కుమ్-ఫిద్-దీని-ఫ-అలై-కుమున్-నస్‌రు-ఇల్లా-అలా-ఖౌమిమ్ బైనకుమ్ వ-బైనహుమ్-మీసాఖున్-వల్లాహు-బిమా-తఅ-మలూన-బసీర్.

72. ఎవరు విశ్వసించి, గృహములను విడిచి, తమ ధనముతోను తమ ప్రాణములతోను దేవునిమార్గమునందు యుద్ధమాడిరో వారును, ఎవరునివాసము నొసంగి తోడుపడిరో వారును ఒకరికొకరు స్నేహితులు. మఱియు ఎవరు విశ్వసించి తమగృహములనువిడిచిపెట్టలేదో వారుతమగృహములువిడుచునంతవఱకు

వారి స్నేహముతో మీకు పనిలేదు. మఱి వారు మత విషయమునుగూర్చి సహాయము కోరినచో మీరు తప్పక వారికి సహాయము చేయవలెను. కాని ఎవరితో మీయొడంబడికయున్నదో వారికి ప్రతికూలముగ సహాయము చేయరాదు. మఱియు దేవుఁడు మీరు చేయు కర్మలను చూచుచున్నాఁడు.

వ్యా॥ 72. ఇందు ముహాజరులయొక్కయు అన్సారులయొక్కయు సంబంధమునుగూర్చి చెప్పఁబడియెను. తమ జన్మభూమిని వదలి మదీనాపురము చేరినవారు ముహాజిరులు. మదీనాపురములో ముహాజిరులకు నివాసమొసంగి వారికి తోడుపడినవారు అన్సారులు. వీరు పరస్పరము సహోదరులును స్నేహితులును. వారి సుఖదుఃఖములలో వారు భాగముపుచ్చుకొందురు. బంధువులలో వారసుల హక్కులు నియమింపక పూర్వము అన్సారులును ముహాజిరులును ఒకరికొకరు వారసులుగనుండిరి. వీరందఱును దేవునిమార్గమందు తమ ధనమును ఖర్చుచేసి తమ ప్రాణములను వినియోగించిన పరమభక్తులు. కొందఱు ముసల్మానులు తమ యిండ్లను వదలలేక మక్కాపురములోనే యుండిరి. మదీనాపురమునకురాలేదు. మక్కాపురముజయింపఁబడకపూర్వము అది దారుల్ హరబ్‌గా నుండెను. మదీనాపురము దారుల్ ఇస్లామ్‌గా నుండెను. దారుల్ హరబ్ అనగా ముసల్మానులకు స్వాతంత్ర్యములేక అవిశ్వాసులకు అధికారముండు దేశము. దారుల్ ఇస్లామ్ అనగా ముసల్మానులకు స్వాతంత్ర్యముగల దేశము. అందు మత ధర్మములు స్వేచ్ఛగా సలుపుదురు. ముసల్మానులు ఎచ్చట తమ మత ధర్మములను స్వేచ్ఛగా అనుసరింపలేరో అచ్చటినుండి గృహములు వదలి దారుల్ ఇస్లామ్‌నకు వలసపోవలెను. కావున మక్కాపురములోనున్న ముసల్మానులు దారుల్ హరబ్‌లో నున్నందున వారికిని మదీనాలోనున్నవారికి ఏలాంటి స్నేహమును బాధ్యతయును లేకుండెను. విజయధనములో వారికి భాగము లేకుండెను. మఱియు దారుల్ హరబ్‌లోని ముసల్మానులు ఎవరితోనైన సంధి చేసికొన్నచో దారుల్ ఇస్లామ్‌లోనున్న ముసల్మానులు దానికి బాధ్యులుకారు. వీరు ఆ కాఫిర్లపై యుద్ధమాడవచ్చును. కాని దారుల్ హరబ్‌లోని ముసల్మానులు స్వాతంత్ర్యముగల దారుల్ ఇస్లామ్‌లోని ముసల్మానులతో మతవిషయమునందు సహాయము కోరినచో వారు తోడుపడవలెను. కాని దారుల్ ఇస్లామ్‌లోని ముసల్మానులు తాము ఎవరితోనైన సంధి యొడంబడికలు చేసియున్నచో ఆ గడువు తీరునంతవఱకు ఆకాఫిర్లకు వ్యతిరేకముగా దారుల్ హరబ్‌లోని ముసల్మానులకు తోడుపడరాదు. సంధి షరతులను పూర్తిచేయవలెను. అందు ఏలాంటి ద్రోహము చేయరాదు. దేవుఁడు అందఱి కర్మలను చూచుచున్నాఁడు. కావున జాగ్రత్తగా నుండవలెను.

73. వల్లజీన-కఫరూ-బఅ్ జుహుమ్-ఔలి-యావు-బఅ్ జిన్-ఇల్లా - తఫ్-అలూహు-తకున్-ఫిత్ నతున్ ఫిల్ -అర్ జి-వ-ఫసాదున్-కబీర్-

73. అవిశ్వాసులు ఒకరికొకరు స్నేహితులు. మీరట్లు చేయనిచో దేశములో వినాశమును గొప్ప యుపద్రవమును గలుగును.

వ్యా॥ 73. ముసల్మానులకును అవిశ్వాసులకును వాస్తవమైన స్నేహమును సంబంధమునులేదు. ఒకరికొకరు వారసులు కానేరరు. అవిశ్వాసులు వారసత్వము పొందవచ్చును. అవిశ్వాసులు ముసల్మానులకు విరోధముగ ఏకమై పోవుదురు, వారు పరస్పరము స్నేహితులై ముసల్మానులతో విరోధింతురు. కావున ముసల్మానులు (ముహాజిర్లు, అన్సార్లు) పరస్పరము ఐక్యముగలిగి సోదరభావముతో ఒకరికొకరు తోడుపడవలెను. అటులే బలహీనులైన ముసల్మానులు స్వాతంత్ర్యముగల ముసల్మానులతో చేరుటకు యత్నింపవలెను. లేనిచో వినాశము, అశాంతి గొప్ప యుపద్రవము దేశములోగలిగిముసల్మానులకు శాంతిలభింపదు.

74. వల్లజీన-ఆమనూ-వహాజరూ వ జాహదూ-ఫీ-సబీ-లిల్లాహి-వల్లజీన ఆవౌ-వనసరూ ఉలాఇక హుముల్ -మూమినూన-హ ఖ్ ఖన్-లహుమ్-మగ్ -ఫిరతున్-వ-రిజ్ ఖున్-కరీమ్. 75. వల్లజీన-ఆమనూ-మింబ అదు-వ-హాజరూవ-జాహదూ మఅకుమ్-ఫఉలా-ఇక-మిన్-కుమ్-వ-ఉలుల్ -అర్ -హామి-బఅ-జుహుమ్-ఔలా-బి-బఅ జిన్ ఫీ-కితాబిల్లాహి ఇన్నల్లాహ-బికుల్లి-షైఇన్ అలీమ్.

74. మఱియు ఎవరు విశ్వసించి తమ యిండ్లను విడిచి దేవుని మార్గమందు యుద్ధమాడిరో వారును, ఎవరునివాస మొసంగిసహాయముచేసిరోవారును నిజమైన ముసల్మానులు. వీరికి క్షమాపణయును, గౌరవమైన ఆహారముగలదు. 75. మఱి దీని తరువాత ఎవరు విశ్వసించి తమ గృహములనువిడిచిమీపక్షము చేరి యుద్ధమాడిరో వారుకూడమీవారేను. మఱియు బంధుత్వముగలవారు పరస్పరము ఎక్కువ హక్కుగలవారు అని దేవుడు విధించిన ధర్మము. నిశ్చయముగా దేవునికి సర్వము దెలియును.

వ్యా॥ 74. సర్వము దేవునిమార్గమందు వినియోగించు ముహాజిర్లు, అన్సారులు, సత్యమైన భక్తిగల ముసల్మానులు. దేవుడు వీరిని క్షమించి యుభయలోకములలో గౌరవమైన యాహారము ఒసంగి యనుగ్రహించును. 75. మొట్టమొదట తమ యిండ్లను విడిచిన ముహాజిరులలో వారి పిదప వచ్చిన ముహాజిరులుగూడ చేరుదురు. వారికి పరస్పరము సోదరత్వమును స్నేహమును వారసత్వముగలదు. ముహాజిరులలో బంధుత్వమున్నచో ఆస్తిలో హక్కులు

బాధువులకు ఎక్కువ హక్కులు. ఇది దేవుఁడు విధించిన ధర్మము. దేవునికి సర్వము తెలియును. ఎవరికి ఎంత హక్కుగలదో దేవుఁడే నిర్మించును. కావున దేవుని ధర్మములను అనుసరింపుట ముసల్మానుల విధి.

సూరయేతౌబా (క్షమాపణ) మదనీ 129 వాక్యములు.

దీనికి సూరేబరాఅత్ అనియు పేరుగలదు. ఇతర సూరాలకు వలె దీనికి ప్రారంభమున బిస్మిల్లాః వ్రాయఁబడలేదు. బిస్మిల్లాః వలన ప్రత్యేకమైనసూరా అని తెలియఁబడును. హజ్రత్ పైగంబరుల వారి కాలములో ప్రతిసూరాకు ప్రారంభమున బిస్మిల్లాః యుండుచు వచ్చెను. కాని దీనికి ప్రారంభమున బిస్మిల్లాః వ్రాయఁబడలేదు. సూరయేఅన్ఫాల్ లో ఏవిషయమునుగూర్చి ప్రారంభింపఁబడినదో దాని యంత్య విషయము ఈసూరాయందు గలదు. కావున ఇది సూరేఅన్ఫాలునకు తరువాత వ్రాయఁబడెను. సూరేఅన్ఫాలులో ముసల్మానులు పరస్పరము ఐక్యము గలిగి సోదరత్వము వహించి మతమునుస్థాపింప వలెనని చెప్పఁబడెను. దానికిఁగాని ముసల్మానులకుబలముండు ఒకదేశముండవలెను. అందు ఇతర మతస్థుల కెట్టి సంబంధముండరాదు. అందుకుఁగానే అరేబియా ద్వీపకల్ప మంతటను ఇస్లామ్ మతమే యుండవలెను. అచ్చట అవిశ్వాస లుండరాదు అని విధింపఁబడెను. ఈవిషయమును గూర్చియే ఇందు చెప్పబడినది.

1. బరా-ఆతుమ్-మినల్లాహి-వ రసూలిహీ-ఇలల్-లజీన-ఆహత్తుమ్ - మినల్-ముష్రి-కీన్. 2. ఫసీ-హూ-ఫిల్-అర్జి-అర్-బఅత-అష్-హురిన్-వ-అలమూ అన్నకుమ్-గైరు-ముఅజి-జిల్లాహి-వ-అన్నల్లాహ-ముఖ్-జిల్-కాఫిరీన్.

1. మీరు ఒడంబడిక చేసికొని యున్న అవిశ్వాసులతో దేవునియొక్కయు ఆతని ప్రవక్తయు సంబంధము లేదు. 2. కావున ఓ అవిశ్వాసులార! మీరు నాలుగు నెలలవఱకు ఈదేశములో తిరుగుఁడు. మఱిమీరు దేవునినిలొంగఁజేయలేరనియు దేవుఁడు అవిశ్వాసులను అవమానపఱచునుఅనియుతెలిసికొనుఁడు.

వ్యా॥ 1. హిజ్రీ ఆఱవయేఁట హుదేబియాలో హజ్రత్ మహమ్మదు వారికిని మక్కా ఖురైషులకును సంధిజరిగి యొడంబడికకు చేరెను. బనీఖుజాఆ అనువారు ముసల్మానుల పక్షమున చేరిరి. బనీబకరు అనువారు ఖురైషుల పక్షము చేరిరి. సంధిషరతులకు విరోధముగ బనీబకరువారు బనీఖుజాఆవారిపై దండెత్తిరి. అపుడు ఖురైషులు కూడ తమ పక్షమునయున్న బనీ కబరునకు ఆయుధము లిచ్చి తోడుపడిరి. ఇట్లు ఖురైషులును వారి పక్షము వారును హుదేబియా యొడంబడికకు విరోధముగ నడచుకొనిరి. అందుకుఁగాను హజ్రత్ రసూలువారు హిజ్రీ యెనిమిదవయేఁట మక్కాపై దండువెడలి సులభముగా దానిని జయించిరి. దీనిపిదప ఏయేజాతి వారితో ముసల్మానులు గడువునియమింపక యొడం

బడిక చేసి యుండిరో వారికి నాలుగు నెలల గడువు నొసంగఁబడెను. ఈ నాలుగు నెలలలోపల వారు ఇస్లామ్‌లోనైన చేరవలెను లేదా అరేబియా దేశము విడిచి పోవలెను. లేదా యుద్ధమాడవలెను. అవిశ్వాసులతో దేవునికిని ఆతని ప్రవక్తకును ఏలాటి సంబంధము లేదు. అవిశ్వాసులు కుట్రలు పన్ని దేవునిని లోఁబఱచుకొనఁ జాలరు. అవిశ్వాసులు ఇస్లామ్‌లో చేరనిచో వారుఉభయలోకముల లోను చెడుదురు. వారు అవమానమునకు పాలగుదురు. మఱి ఏ యే జాతి వారిలో ముసల్మానులు ఒడంబడిక చేయకుండిరో వారికిఁగూడ నాలుగు నెలల గడువు విధింపఁబడెను. ఈవాక్యములును ఇఁకమీఁద రాఁబోవు వాక్యములును హిజ్రీ తొమ్మిదవ యేఁట మక్కాపురములో కాబాయాత్ర (హజ్) కాలమందు హజ్రత్ అలీగారు అందఱికిఁ దెలియునట్లుగ ప్రకటించిరి.

3. వ-అజానుమ్-మినల్లాహి-వ-రసూలహీ-ఇలన్నాసి-యౌమల్-హజ్జిల్-అక్బరి-అన్నల్లాహ-బరీఉమ్ మినల్-ముష్‌రికీన-వ-రసూలుహూ-ఫ-ఇన్-తుబ్‌తుమ్-ఫ-హువ-ఖైరుల్-లకుమ్-వఇన్-తవల్-లైతుమ్-ఫఅ-లమూ-అన్నకుమ్-గైరు-ముఅ-జీ-జిల్లాహి వ బష్‌షిరిల్-లజీన కఫరూ-బి-అజాబిన్-అలీమ్. 4. ఇల్-లల్ లజీన-ఆహత్తుమ్-మినల్-ముష్-రికీన-సుమ్మ-లమ్-యన్-ఖుసూకుమ్-షైఅన్-వలమ్-యుజాహిరూ-అలైకుమ్-అహదన్-ఫ-అతిమ్మూ-ఇలైహిమ్-అహ్‌దహుమ్-ఇలా-ముద్దతిహిమ్-ఇన్నల్లాహ-యుహిబ్బుల్-ముత్తఖీన్. 5. ఫ-ఇజన్ సలఖల్ అష్‌హురుల్-హురుము-ఫఖ్‌తులుల్-ముష్‌రికీన-హైసు-వజత్తు-మూహుమ్-వ-ఖుజూహుమ్-వహ్‌సురూహుమ్-వఖ్-ఉదూ-లహుమ్-కుల్ల-మర్-సదిన్-ఫఇన్-తాబూ వ-అఖా-ముస్ సలాత-వ-ఆత-ఉజ్-జకాత-ఫ-ఖల్లూ-సబీలహుమ్-ఇన్నల్లాహ-గఫూరుర్-రహీమ్.

3. దేవుఁడును, ఆతని ప్రవక్తయును అవిశ్వాసులతో సంబంధములేక వేఱుగా నున్నారు అని ప్రజలకు పెద్ద యాత్రదినమునందు, దేవునినుండియుఆతని ప్రవక్తనుండియు తెలుపఁబడుచున్నది. కావున మీరు క్షమాపణ వేఁడుకొన్నచో మీకు మేలగును. మఱి మీరు సమ్మతింపక మరలినచో మీరు దేవునిని లొంగఁజేయలేరని తెలిసికొనుఁడు. మఱి ఓ ప్రవక్త! అవిశ్వాసులకు దుఃఖకరమైన బాధ యున్నదను సువార్త వారికి వినిపింపుము. 4. కాని మీతో ఒడంబడిక గావించియున్న అవిశ్వాసులు, మీవిషయము ఏలాటి లోపము చేయక మీకు ప్రతికూలముగ నెవరికిని సహాయము చేయక యుండినచో వారి యెడం

బడికను వారి గడువువఱకు పూర్తి చేయుడు. నిశ్చయముగ దేవుఁడు భయభక్తులుగలవారిని ప్రేమించును. 5. నిదపశాంతి నెలలు గడచిపోయినపుడు అవిశ్వాసులను ఎచ్చట వారు మీకు దొఱికిన నచ్చట వధింపుఁడు. మఱి వారిని ముట్టడింపుఁడు. ప్రతి చోటున వారికై పొంచియుండుఁడు. ఆ పిదప వారు క్షమాపణ కోరి నమాజును స్థిరముగా సలిపి (జకాతు) దానము చేసినచో వారి దారిని వదలిపెట్టుఁడు. నిశ్చయముగ దేవుఁడు క్షమించువాఁడును, దయాళువును.

వ్యా॥ 3. హజ్ (కాబాయాత్ర)ను హజ్జె అక్బర్ (పెద్దయాత్ర) అని చెప్పఁబడియెను. ఎందుకనగా ఉమ్రా (కాబా దర్శనము) హజ్జెఅస్గర్ (చిన్నయాత్ర) అని పిలువఁబడుచున్నది. బకరీదు నెల పదియవ తేదీన ఈ వాక్యములు ప్రకటింపఁబడెను. ఒడంబడిక చేసి దానికి వ్యతిరేకముగ నడచుకొన్న వారి విషయము దేవునితోను ఆతని ప్రవక్తతోను ఏలాంటి సంబంధమువారికిలేదు. ఒడంబడిక తెగిపోయినది. ఉభయలోకములలో మేలుపొందవలెనన్న ఒకమార్గమున్నది. అది వారు తమ అవిశ్వాసమునుండి క్షమాపణ వేఁడి యిస్లామ్‌లో చేరుట. అట్లు వారు ఇస్లామ్‌లో చేరక యుద్ధమునకే సిద్ధమైనచో వారికి దేవుని శిక్ష కలుగును. దేవుఁడు చేయవలెనని కోరిన కార్యమును కాఫిర్లు ఆటంకపఱుపఁజాలరు. దేవుఁడు సర్వశక్తుఁడు. ఆ రేబియాదేశమునుండి అవిశ్వాసులను పాఱఁదోలును. వారి యవిశ్వాసమునకుఁగాను వారికి దుఃఖకరమైన శిక్ష తప్పక లభించును. 5. ఇందు ఏజాతివారితో ముసల్మానులు ఒక గడువుపెట్టి యొడంబడిక చేసిరో వారి విషయము చెప్పఁబడినది. ఇట్టి వారు సంపూర్ణముగ ఏలాంటి లోపములేక సంధి షరతులను పూర్తిచేయుచు ముసల్మానుల శత్రువులకు తోడుపడకయుండినచో ముసల్మానులు సంధి గడువు పూర్తియగువఱకు వారిజోలికి పోఁగూడదు. ముసల్మానులుకూడ సంధి షరతులను పూర్తిగ ననుసరింపవలెను. వారికి వ్యతిరేకముగ నడచుకొనరాదు. తమ యొడంబడికలను అనుసరించుచు భయభక్తులుగలవారిని దేవుఁడు ప్రేమించును. గడువుముగిసిన పిదప తిరిగి యొడంబడిక చేయఁబడదు. వీరుకూడ ఇతర కాఫిర్లవలె తమ విషయము గమనింపవలెను. 5. ఇంక ఈవాక్యములో ఒడంబడికను తెంపినవారినిగూర్చి ధర్మము గలదు. వీరితో తక్షణమే యుద్ధమాడవచ్చును. కాని శాంతి నెలలు గడచువఱకు యుద్ధము సలుపరాదు. కావున ముహర్రమ్ నెల గడచిన పిదప శత్రువులైన అవిశ్వాసులను, యుద్ధములో వధింపవచ్చును. వారిని పట్టవచ్చును. వారిని ముట్టడింపవచ్చును. వారికై పొంచియుండవచ్చును. ఒకవేళ అవిశ్వాసులు తమ యవిశ్వాసమునుండి క్షమాపణ వేఁడి ఇస్లామ్‌లో చేరి నమాజు సలిపి (జకాతు) దానము ఒసంగినచో వారును ముసల్మానులకు సహోదరులగుదురు. వారిజోలికి పోఁగూడదు. వారి హృదయములలో విశ్వాసమున్నదా, లేదా అని పరిశోధిం

చుట ముసల్మానుల పనికాదు. బహిరంగముగా విశ్వాసము వెల్లడించి విశ్వాసమునకు గుర్తు అయినట్టి నమాజు (అయిదుపూటలు) సలిపి విధిదానమగు (జకాతు) చెల్లించినచో వారు ముసల్మానులలో చేరినవారగుదురు. ఇస్లామ్‌లో చేరియు నమాజు చేయక జకాతు ఇయ్యనిచో ముసల్మానుల అధికారి అట్టివారిని శిక్షింపవలెను. హజ్రత్ ఇమామ్ అహ్మదు, ఇమామ్ మాలిక్, ఇమామ్ షాఫయీ అనువారు, నమాజు వదలిపెట్టినవానిని వధింపవలెనని విధించిరి. హజ్రత్ ఇమామ్ అబూహనీఫా గారు, నమాజుచేయక వదలిపెట్టినవానిని వాడు మరణించునంతవఱకును లేదా వాఁడు క్షమాపణ కోరి నమాజు సలుపునంతవఱకును ఖైదులో నుంచవలెనని విధించిరి. కావున ముసల్మానులు భయభక్తులతో అయిదుపూఁటలు నమాజు సలుపుచు ఇస్లామ్ ధర్మముల ననుసరించి జకాతు ఒసంగవలెను.

6. వఇన్-అహ-దుమ్-మినల్-ముష్-రికీ-నస్-తజా-రక-ఫ-అజిర్-హుహత్తా-యస్-మఅ-కలామల్లాహి-సుమ్మ-అబ్-లిగ్-హు-మా-మన హూ-జాలిక-బి-అన్నహుమ్-ఖౌముల్-లా-యఅ-లమూన్.

6. మఱియు, అవిశ్వాసులలో నెవఁడైన నీశరణుచొచ్చినచో వాఁడు దేవుని వాక్యములు వినుటకుఁగాను నీవు వానికి శరణు ఒసంగుము. ఆ పిదప వానినిశాంతియుతమైన స్థలములోచేర్పుము. ఇదియెందుకన వారు సత్యముఁతెలియుని జాతివారలు.

వ్యా॥ 6. మునుపటి వాక్యములో ఇస్లామ్‌లోచేరినచో అభయమున్నది అని చెప్పఁబడియెను. అవిశ్వాసులలో కొందఱకు ఇస్లామ్ ధర్మములును దాని సత్య విషయములును తెలియక, వానిని తెలిసికొనఁగోరి ముసల్మానులయొద్దకు రావలెనని కోరినచో అట్టివారికి ముసల్మానులు అభయమొసంగి తమయొద్ద తావు నియ్యవలెను. వారికి దేవుని వాక్యములగు ఖురానె షరీఫును వినిపింపవలెను. ఇస్లామ్‌నగూర్చి బాగుగ తెలిసిన పిదప ఇస్లామ్‌లో చేరవలెనని బలవంతము లేదు. వారి యిష్టము. వారు ఇస్లామ్‌లో చేరిన సరే. లేనిచో తిరిగి క్షేమముగా వారి శాంతియుతమైన తావున వారిని జేర్చవలెను. ఇస్లామ్‌లో చేరలేదని వధింపరాదు. దేవుని ధర్మముల సత్యమును గ్రహించుటకు అవకాశ మొసంగవలెను. ఇస్లామ్ మతధర్మములు తెలిసియు ద్వేషములో విశ్వసింపనిచో అట్టివారును ఇతర అవిశ్వాసులవలె అగుదురు. అవిశ్వాసులకు సత్యము తెలియదు. కావున అట్లు వారికి అభయమొసఁగి వారికిదేవునివాక్యములు వినిపింపవలెను అని దేవుని సెలవు పైగంబరులవారి కాయెను.

7. కైఫ-యకూను-లిల్-ముష్రికీన-అహ్దున్-ఇన్దల్లాహి-వ-ఇన్ద- రసూలి
హి-ఇల్-లల్-లజీన-ఆ-హత్తుమ్-ఇన్దల్-మస్-జిదిల్-హరామి-ఫ-మస్- తఖా
మూ-లకుమ్-ఫస్-తఖీ-మూ-లహుమ్-ఇన్నల్లాహ- యుహిబ్బుల్ - ముత్తఖీన్.
8. కైఫ-వ ఇన్-యజ్-హరూ-అలైకుమ్-లా-యర్-ఖుబూ-ఫీకుమ్-ఇల్లన్-వలా- జి
మ్మతన్-యుర్-జూనకుమ్-బి-అఫ్-వాహిమ్-వ-తాబా-ఖులూ-బుహుమ్-వ-అక్-
సరు-హుమ్-ఫాసిఖూన్. 9- ఇష్-తరౌ-బి-ఆయా-తిల్లాహి-సమనన్-ఖలీలన్-ఫ
సద్దూ-అన్-సబీ-లిహీ-ఇన్నహుమ్-సాఅ-మా-కానూ-యఅ-మలూన్. 10. లా-
యర్-ఖుబూన-ఫీ-మూమినిన్-ఇల్లన్-వలా-జిమ్మతన్-వ-ఉలా-ఇక - హుముల్-
ముఅ-తదూన్. 11.ఫ ఇన్-తాబూ-వ-అఖాముస్-సలాత-వ-ఆత-ఉజ్-జకాత-ఫ-
ఇఖ్-వానుకుమ్-ఫిద్-దీని-వ-నుఫస్-సిలుల్-ఆయాతి లిఖౌమిన్-యఅలమూన్.

7. ఎట్లు విగ్రహారాధకులకు దేవుని యొద్దను ఆతని ప్రవక్త యొద్ద
ను ఒడంబడిక యుండగలదు? కాని మీరు మస్జిదె హరాము నొద్ద మీరెవరి
తో ఒడంబడిక చేసికొని యున్నారో వారు తమ ఒక ఒడంబడికపై స్థిరముగా
నుండునంత వఱకు మీరును స్థిరముగా నుండుఁడు. నిశ్చయముగ దేవుఁడు భక్త
లను ప్రేమించును. 8. సంధిఎట్లు నిలువగలదు. వారికి మీపై శక్తి గలిగినచో
వారు మీబంధుత్వమును గాని యొడంబడికనుగాని చూడరు. వారు తమ నోటి
మాటలతోనే మిమ్ము సంతోష పఱచుచున్నారు. మఱి వారి హృదయములు
సమ్మతించుటలేదు. మఱి వారిలో పెక్కుమంది అక్రమములు చేయువారు గలరు.
9. వారు దేవుని వాక్యములను కొద్ది వెలకు అమ్మివేసిరి. పిదప దేవుని మార్గ
మునుండి ప్రజలను ఆటంకపఱచిరి. వారు చేయు పనులు చాలచెడ్డవి. 10. ఏ వి
శ్వాసి విషయమైనను వారు బంధుత్వమునుగాని యొడంబడికను గాని పాటిం
పరు. మఱివారు మితిమీఱి పోవువారు. 11. కావున వారు క్షమాపణ వేఁడి
నమాజు సలిపి జకాతు దానము చేసినచో వారు మీమత సహోదరులు మ
ఱి గ్రహించు వారికిఁగాను మేము సూచనలను వివరించి తెలుపుచున్నారము.

వ్యా॥ 7:8. మునుపటి వాక్యములలో విగ్రహారాధకులతో దేవునికిని
ఆతని ప్రవక్తకును ఏలాటి సంబంధము లేదు అని ప్రకటింపఁ బడియెను.
ఇఁక ఈవాక్యములలో దానికి కారణము తెలుపఁబడుచున్నది. అరబ్బులలోని
కాఫిర్లతో ఒడంబడిక యుండ నేఱదు. ఇఁకమీఁద సంధికూడ జరుగ నేఱదు. ఎం
దుకన వారికి ముసల్మానులపై కొంతశక్తి గలిగినను హింసించుటకును నష్టములు

గలిగించుటకును కాఫిర్లు కొఱతచేయరు. అందు బంధుత్వము గలదు అనియు ఒడంబడిక గలదు అనియు చూడరు. తమ దుష్టత్వము మానుకొనరు. కాఫిర్లకు సమయమును శక్తియును లభింపలేదు. అందువలనహృదయములలోలేని స్నేహమునునోటిమాటలలో వెల్లడించి ఒడంబడికచేసికొనిమిమ్ము (ముసల్మానులను) సంతోష పెట్టవలెనని నటించుచున్నారు. వారు మనఃపూర్వకముగా ఆయొడంబడికను సమ్మతించుటలేదు. అందుకే సమయము దొఱకిన ఒడంబడికను త్రెంపి వేయుదురు. కొద్దిమందితప్పచాలమంద్రిద్రోహులుగానున్నారు. ఇట్టిమోసగాండ్రతో దేవుని యొక్కయు అతని ప్రవక్తయొక్కయు ఒడంబడిక యుండనేఱదు. అయిన ఎవరు తమ ఒడంబడికను స్థిరముగా అనుసరింతురో వారి విషయము మీారు కూడ సంధి షరతులను పూర్తి చేయుఁడు. అందు ఏలాటి కొఱత చేయకుఁడు. బనీకనానావారు తాము పైగంబరుల వారితో హుదైబియాలో చేసిన యొడంబడికపై స్థిరముగానుండిరి. వారి యొడంబడిక గడువు ముగియుటకు ఇంక తొమ్మిది నెలలుండెను. కావున ఆగడువు పూర్తిచేయుఁడు అని దేవుని సెలవయ్యెను. ఒడంబడికను స్థిరముగా కాపాడవలెను. అందు ఏలాటి అక్రమము చేయక జాగ్రత్తగ నుండవలెను. అట్లుండు భక్తులు దేవునికి ప్రియులు. 9. అవిశ్వాసులు ఇహలోక తుచ్ఛలాభములకై దేవుని ధర్మములను అనుసరింపక తమ కోరికలను అనుసరింప సాగిరి. అట్లు దేవుని వాక్యములను కొద్ది వెలకు అమ్మిన వారైరి. తాము ధర్మమార్గమును అనుసరింపక యితర జనులను కూడ దేవుని మార్గమునుండి ఆటంకపఱచిరి. ఇట్టి చెడ్డకార్యములు చేయువారు తమ మాటలను నిలుపుదురని ఎవరు నమ్మఁగలరు. 10. కాఫిర్లకు ముసల్మానులు అను పేరుతోనే ద్వేషముగలదు. సమయము దొఱకిన ఏముసల్మానునినైన సరే వారు బంధుత్వమును గాని యొడంబడికను గాని పాటింపక హింసింతురు. ఇట్టి అక్రమములలో వారు మితిమీఱి పోవువారు. 11. కావున వీరిప్పుడైననుసరే తమ అవిశ్వాసము వదలి పాపకార్యములనుండి క్షమాపణ వేఁడి నమాజు స్థిరముగ సలిపి జకాతు దానము చేసినచో వారు ముసల్మానులకు మతసహోదరులగుదురు. ముసల్మానులకు ఎట్టిహక్కులు గలవో వారికి లభించును. వారు దీనికి పూర్వము గావించిన నేరములును పాపములునుక్షమింపఁ బడును. అని గ్రహించుకొనుటకు దేవుఁడు తన ధర్మములను వివరించి దెలుపుచున్నాఁడు.

12. వఇన్ నకసూ-ఐ-మానహుమ్-మిం-బఅ్ది-అహ్ది-హిమ్-వ-త-అ-నూ-ఫీ-దీనికుమ్-ఫ-ఖాతిలూ-అ-ఇమ్మతల్-కుఫ్రి-ఇన్నహుమ్-లా ఐమాన-లహుమ్-లఅల్లహుమ్-యన్-తహూన్. 13. అలా-తుఖాతిలూన-ఖౌమన్ - నక-

సూ-ఐమాన-హుమ్-వ-హమ్మూ-బి-ఇఖ్రా-జిర్-రసూలి-వహుమ్-బదఊ-కుమ్ అవ్వల-మర్ర-తిన్-అతఖ్-షౌనహుమ్-ఫల్లాహు అహఖ్ఖు-అన్-తఖ్-షౌహు-ఇన్-కున్తుమ్-మూమినీన్. 14. ఖాతిలూ-హుమ్-యు-అజ్-జిబు_హుముల్లాహు బి-ఐదీకుమ్-వయుఖ్-జిహిమ్-వ-యన్-సుర్-కుమ్-అలైహిమ్-వ-యష్ఫి-సుదూర-ఖౌమిమ్-మూమినీన్. 15. వ-యుజ్-హిబ్-గైజ-ఖులూ-బిహిమ్-వ-యుతూ-బుల్లాహు-అలా-మన్-యషాఉ-వల్లాహు-అలీమున్-హకీమ్. 16. అ-మ్హసిబ్ తుమ్-అన్-తుత్ రకూ-వలమ్మా-యఅ-లమిల్లా-హుల్-లజీన-జాహదూ-మిన్కుమ్-వ-లమ్-యత్-తఖిజూ-మిన్ దూనిల్లాహి-వలా-రసూలిహీ -వలల్-మూమినీన-వలీ-జతన్-వల్లాహు-ఖబీరుమ్-బిమా-తఅ-మలూన్.

12. మఱియు వారు ఒడంబడిక చేసిన పిదప తమ ప్రమాణములను తెంపుచు మీమతమును నిందించినచో అవిశ్వాసుల నాయకులతో వారుమానుకొనుటకై యుద్ధము చేయుఁడు. నిశ్చయముగా వారిప్రమాణములునిలువలేదు. 13. ఎవరు తమ ప్రమాణములను త్రెంపి ప్రవక్తను పాఱదోలవలెనని యుద్దేశించి ప్రప్రథమున వారేమీతో తగవు మొదలిడిరో అట్టివారితో మీరెందులకు యుద్ధమాడరు. ఏమిమీరు వారికి భయపడుచున్నారా! మఱిమీరు విశ్వాసులైనచో ఎక్కువగా దేవునికి మీరు భయపడవలెను. 14. దేవుఁడు వారిని మీచేతులతో శిక్షించుటకును వారిని అవమాన పఱచుటకును వారిపై మీకు జయమొసంగుటకును ముసల్మానులైన జనుల హృదయములు చల్లారుటకును 15. వారిహృదయములలోని కోపమును తొలఁగించుటకును వారితో మీరు యుద్ధమాడుఁడు. మఱి దేవుఁడు తానుకోరిన వారిని క్షమించును. మఱి దేవుఁడు సర్వజ్ఞుఁడును వివేచనాపరుఁడును. 16. ఏమి మీరు (ఊరక) వదలి పెట్టఁబడుదురని తలఁచుచున్నారా ! ఇంకను దేవుఁడు మీలో నెవరు యుద్ధమాడిరో వారిని ఎవరు దేవునిని ఆతని ప్రవక్తను ముసల్మానులను తప్ప నితరులెవ్వరినిగాని రహస్య స్నేహితులుగ చేసికొనలేదో వారినిస్పష్టపఱచలేదు. మఱియు మీరు చేయు కర్మలు దేవునికిఁ దెలియును.

వ్యా॥ 12. ఇఁక ఒడంబడిక చేసి దానిని తప్పిపోవు వారితో ముసల్మానులెట్లు వర్తింపవలెనో యిందు చెప్పఁబడినది. బనీబకరువారు సంధికి విరోధముగ ఖుజాఅ వారిపై యుద్ధమాడిరి. మక్కా ఖురైషులు కూడ తమప్రమాణములను తెంపి యుద్ధమాడిన బనీబకరు వారికి తోడుపడిరి. ఇట్టి అవిశ్వాసుల నాయకులతో వారు తమ దుష్టత్వము మానుకొనునట్లుగ వారితో యుద్ధ

మాడవలెను. ఇపుడు వారి యొడంబడిక తెగిపోయినది. దానినిపాటింపరాదు.
13. మక్కా-ఖురైషులు తాము హుదైబియాలో గావించినయొడంబడికకు వ్య
తిరేకముగ బనీబకరుకు తోడుపడి ఖుజాఆ వారితో యుద్ధమాడి తమ ప్రమా
ణములను తప్పి పోయిరి. ఇట్లు వారే ఒడంబడికకు వ్యతిరేకముగ ప్రారంభము
చేసిరి. కావున మక్కా- ఖురైషులే సంధిని తెంపినవారలైరి. హజ్రత్ రసూలు
వారు మక్కా-పురములో నున్నపుడు వారికి విరోధముగ అనేకకుట్రలు మక్కా-
ఖురైషులు సలిపిరి. తుదకు వారి కుట్రల కారణముల వలన పైగంబరులవారు
తమ జన్మభూమిని వదలిపెట్టిరి. మక్కా-లోనున్న ముసల్మానులను నిష్కారణ
ముగ ఖురైషులు హింసించిరి. కావున ఇట్టి దుష్టులతో మీరు ఓముసల్మాను
లార! ఎందులకు యుద్ధమాడరు. తప్పక మీరు యుద్ధమాడవలసినది. ఏమి
మక్కా- ఖురైషుల అధిక సైన్యమును వారి యుద్ధసామగ్రిని చూచి వారికి భ
యపడుచున్నారా? అట్లు భయపడకూడదు. దేవునికి భయపడవలెను. లాభనష్ట
ములును జయ అపజయములును దేవుని చేతిలోనున్నవి. భక్తుల హృదయములు
దేవుని భయముతో నిండినచో ఇతర భయము లుండఁజాలవు. కావున ముస
ల్మానులు దేవునియందు భయభక్తులుగలిగి ధర్మయుద్ధము(జిహాద్)సలుపవలెను.
14,15. ఇందు ధర్మయుద్ధము (జిహాదు) లోని ప్రయోజనములు చెప్పఁబడినవి.
ఇస్లామ్‌నకు పూర్వముండిన జనులు పాపములు చేసిన ఏదో యొక శిక్షకు
పాత్రులై తుదముట్ట నశించుచుండిరి. ఇపుడు అట్లుగాక కాఫిర్లకు ముసల్మానుల
చేత యుద్ధమూలమున దేవుని శిక్ష లభించును. అందుకాఫిర్లు ఓడిపోయి ము
సల్మానులకు జయము చేకూరును. కాఫిర్లు తమ దుర్గతిని చూచి సిగ్గుపడివిశ్వా
సులై దేవుని దయకు పాత్రులు కావచ్చును. వారికి అవకాశము లభించును. ము
సల్మానులు తమ జయమును చూచి దీనికిముందు కష్టములు పెట్టుచున్న కాఫి
ర్ల దుర్గతిని చూచి సంతసింపఁగలరు. ముసల్మానుల హృదయములు చల్లారి
శాంతి పడును. దేవుఁడు సర్వము దెలిసినవాఁడు. వివేచనా పరుఁడు. కావున
సమయోచితముగ ఎవరికిఁ దగినట్లు వారికి ఫలమొసంగును. ఆకాశమునుండి
యో భూమినుండియో పూర్వీకులవలె ఈ కాఫిర్లకు శిక్ష రాక యుద్ధ మూల
మున శిక్ష కలుగుట వలన చాలమంది కాఫిర్లు తమ దుష్టత్వము మానుకొని
ముసల్మానులైరి. కావుననే కొద్ది దినములలోనే పైగంబరులవారి కాలములోనే
అరబ్బు లందఱును ఇస్లామ్‌లో భక్తిపూర్వకముగ చేరిరి. 16. ధర్మయుద్ధమున
కుఁగాను ఇందు మరొక కారణము తెలుపఁబడినది. సాధారణముగ అందఱును
నోటి మాటలతో విశ్వాసము వెల్లడింతురు. నోటి మాటలలో ఏలాటి నష్ట
కష్టములు లేవు, కావున పరీక్ష సమయములో స్థిరముగా నిలుచువారును నిలు
వనివారును తేటతెల్లముగ తెలియ నగుదురు. విశ్వాసుల పరీక్ష ధర్మయుద్ధ

మూలమున జరుగును. అందు ఎవరు తమ ధనమును ఆత్మలను దేవుని కొఱకు వినియోగించి దేవునిని ఆతని ప్రవక్తను ముసల్మానులను వదలిపోక స్థిరముగా నుండుదురో తెలియనగును. కావుననే పరీక్ష మైదానములో మాటలకు విలువ లేదు. కార్యము జరుపవలెను. అందులకే ముసల్మానులు ధర్మయుద్ధము సలుప వలెను అని దేవుని సెలవయ్యెను. అందుకూడ భక్తితో యుద్ధముసలుపవలెను. భక్తులు చేయు పనులు, దేవునికిఁదెలియును. వానివానికిఁదగిన ఫలిత మొసంగును. ముసల్మానులు సదా దేవుని యొక్కయు ఆతని ప్రవక్త యొక్కయు ధర్మముల ననుసరించుచు పరస్పరము సఖ్యము గలిగియుండవలెను. ఇస్లామ్‌నకు విరోధులగు వారితో చేరరాదు.

17. మా-కాన-లిల్-ముష్రి-కీన-అన్-యఅ్మరూ-మసా-జిదల్లాహి-షాహిదీన-అలా-అన్-ఫుసి-హిమ్-బిల్-కుఫ్రి-ఉలా ఇక-హాబి-తత్-అఅ్-మాలు-హుమ్-వ-ఫిన్-నారి-హుమ్-ఖాలిదూన్. 18. ఇన్నమా-యఅ్మురు-మసా-జిదల్లాహి మన్-ఆమన-బిల్లాహి-వల్-యౌమిల్-ఆఖిరి-వ-అఖా-మస్-సలాత-వ - ఆతజ్-జకాత-వలమ్-యఖ్ష-ఇల్-లల్లాహ-ఫ-అసా-ఉలా-ఇక-అన్-యకూనూ-మినల్ ముహ్-తదీన్.

17. విగ్రహారాధకులు తాము అవిశ్వాసులమని యొప్పుకొనుచు దేవుని మసీదులను సేవించుటకు వారు అర్హులుకారు. వారి కర్మలు వృథాపోయెను. మఱి వారు సదా నరకాగ్నిలో నుందురు. 18. దేవునిని తుదిదినమును విశ్వసించి నమాజును స్థిరముగా సలిపి జకాతునొసంగి దేవునికిఁదప్ప ఎవరికిని భయపడనివారు మాత్రము దేవుని మసీదులను సేవించువారు. కావున ఇట్టివారు సన్మార్గులలో చేరినవా రగుదురని ఆశయముగలదు.

వ్యా॥ 17. ఇఁక దేవుని మసీదు (ప్రార్థనస్థలము) ను సేవించుటకు ఎవరికి తగునో ఎవరికిఁ దగదో దానిగూర్చి చెప్పఁబడినది. అందు మసీదులకుఁగా నుండు ధర్మకర్తలు కూడ చేరుదురు. మసీదులు దేవుని ప్రార్థనకుఁగాను నిర్మింపఁబడినవి. కావున అందు భయభక్తులతో ప్రార్థనలు హెచ్చుగాభక్తులు సలుపవలెను. ఇదియే ముఖ్యమైనసేవ. అందు ఏలాటి అసహ్యకార్యములు చేయరాదు. దీనిఁబట్టి చూచిన విగ్రహారాధకులగు అవిశ్వాసులు మసీదులను సేవించుటకు యోగ్యులుకారు. ఎందుకన, మక్కా కాఫిర్లు తాము కాబా మసిదునకు సేవకులము, ధర్మకర్తలము అని డంబాలు కొట్టియు దేవుని ప్రార్థనకు విరోధమై విగ్రహములను కల్పించి యందు స్థాపించి యందు దిగంబరులై ప్రదక్షిణములు చేయుచు, సీటీలు కొట్టుచు చప్పటులు కొట్టుచు మసీదులవలని

ముఖోద్దేశ్యమును భంగపఱచుచుండిరి. ముసల్మానుభక్తులను అందు ప్రార్థన సలుపకుండ ఆటంకపఱచుచుండిరి. ఇట్టిదుర్గుణములవలన వారికర్మలు వృథాపోయెను. వారి యవిశ్వాస ఫలితముగ వారి కర్మములవలన దేవుని ప్రీతివారికి లభింపలేదు. తుదకు వారు నరకాగ్ని నివాసులు అగుదురు. మక్కా కాఫిర్లు కాబామసీదునకు సేవకులు కానేరరు అని తెలుపంబడియె. 18. దేవుని మసీదులనుసేవించువారు ఎవరో యీవాక్యములో వివరింపఁబడినది. వారు సంపూర్ణ విశ్వాసులు. దేవునియందును పరలోకమందును వారికి విశ్వాసముగలదు. వట్టి విశ్వాసమే గాక వారు నియమముతో నమాజు (ప్రార్థన) సలుపుదురు. తమకు దేవుఁడొసంగిన ధనములో జకాతు దానము చేయుదురు. దేవునికి మాత్రమే భయపడుదురు. ఇతరులకు భయపడనే భయపడరు. అంతటి ధైర్యసాహసములును, భక్తివిశ్వాసములునుగల ముసల్మానులు సన్మార్గులై దేవుని ప్రీతి పడయుదురని ఆశయముగలదు. ఇట్టి భక్తులే దేవుని మసీదులను సేవించుటకు యోగ్యులు.

19. అ-జఅల్-తుమ్-సిఖాయతల్-హాజ్జి-వ-ఇమారతల్-మస్-జిదిల్-హారామి-కమన్-ఆమన-బిల్లాహి-వల్-యామిల్-ఆఖిరి-వ-జాహద-ఫీ-సబీలిల్లాహి-లా-యస్-తవూన-ఇన్దల్లాహి-వల్లాహు-లా-యహ్-దిల్-ఖౌ-మజ్-జాలిమీన్. 20. అల్లజీన-ఆమనూ-వ-హాజరూ-వ-జాహదూ-ఫీ-సబీ-లిల్లాహి-బి-అమ్వా-లిహిమ్-వ-అన్-ఫుసిహిమ్-అఅ-జము-దర-జతన్-ఇన్దల్లాహి-వ-ఉలాఇక-హుముల్-ఫాఇ-జూన్. 21. యుబష్-షిరుహుమ్-రబ్బుహుమ్-బి-రహ్మ-తిమ్-మిన్హు-వ-రిజ్వానిన్-వ-జన్నాతిల్-లహుమ్-ఫీహా-నఈ-ముమ్-ముఖీమ్. 22. ఖాలిదీన-ఫీహా-అబదన్-ఇన్నల్లాహ-ఇన్దహూ-అజ్రున్-అజీమ్.

19. ఏమి యాత్రికులకు నీళ్ళు త్రాగించుచు కాబా మసీదును సేవచేయువారిని దేవునిని తుదిదినమును విశ్వసించి దేవుని మార్గమందు యుద్ధమాడినవారితో మీరు సరిపోల్తురా! వీరు దేవునియొద్దసరిసమానులుకారు. మఱియు దేవుఁడు దుర్మార్గులైనట్టి జనులకు సన్మార్గము చూపఁడు. 20. ఎవరు విశ్వసించి తమ యిండ్లను విడిచి దేవుని మార్గమందు తమ ధనమును ప్రాణములను వినియోగించి యుద్ధమాడిరో వారికి దేవునియొద్ద గొప్పపదవియున్నది. మఱి వారే జయముపొందువారు. 21. వారి ప్రభువువారికి తన యనుగ్రహమును, ప్రీతియును, సదా సౌఖ్యములుగల స్వర్గవనములు గలవని వారికి సంతోషవార్త నిచ్చుచున్నాఁడు. 22. అందు వారు సదా వసింతురు. నిశ్చయముగా దేవుని యొద్ద గొప్ప పుణ్యఫలిత మున్నది.

వ్యా॥ 19. మక్కా కాఫిర్లు తాము కాబా యాత్రికులకు నీళ్లుఆహారము లొసంగి కాబామసీదునకు మరమ్మతుచేయుచు, అందు దీపములు వెలిగించుచు సేవచేయుచున్నాము. కావున ముసల్మానులు తమ ధర్మయుద్ధములపై డంబాలు కొట్టుకొనిన మేముకూడ కాబామసీదు సేవచేయుచున్నామని డంబాలు కొట్టు కొనిరి. అందుకు నిందు జవాబియ్యఁబడినది. విశ్వసించి దేవునిమార్గమందుయుద్ధ మాడుటయును, కాబా యాత్రికులయొక్కయు కాబామసీదుయొక్కయు సేవ చేయుట సరిసమానులుకావు. కాబా సేవకంటె దేవునిని విశ్వసించి యాతని ప్రీతికొఱకు యుద్ధముచేయుట శ్రేష్ఠమైనది. విశ్వాసములేని కార్యము ప్రాణము లేనిది. కావున విశ్వాసములేక చేసిన కాబా యాత్రికులసేవ ఫలింపదు. ఈ విష యము దుర్మార్గులకు బోధపడదు. వారు సన్మార్గమునకు రారు. 21, 22. విశ్వా సము (ఈమాన్) వహించి తమ జన్మదేశమును విడిచి, తమధనములోను ప్రాణ ములతో దేవుని పక్షమున శత్రువులతో యుద్ధమాడిన ముసల్మాను భక్తులగు వారి విశ్వాసమునకును కర్మలకును ఫలితముగ దేవుని దయయును ప్రీతియును సదా స్వర్గనివాసమును లభించును. ఉభయలోకములలోను జయమును మోక్ష మును చేకూరును. కావున ముసల్మానులు పై విషయములు పొందుటకు కృషి సలుపవలెను.

23. యాఅయ్యు-హల్-లజీన-ఆమనూ-లాతత్-తఖిజూ-ఆబా-అకుమ్-వ-ఇఖ్ వానకుమ్-ఇనిస్-తహబ్బుల్-కుఫ్ర-అలల్-ఈమాని-వ-మన్-యత-వల్ల హుమ్-మిన్-కుమ్-ఫ-ఉలా-ఇకహుముజ్-జాలి-మూన్. 24. ఖుల్-ఇన్-కాన-ఆబా-ఉకుమ్-వ-అబ్నా-ఉకుమ్-వ-ఇఖ్-వానుకుమ్-వ-అజ్-వాజుకుమ్-వ-అషీ-రతు-కుమ్-వ-అమ్వా-లు-నిఖ్-తరఫ్-తుమూ-హా-వ తిజా-రతున్-తఖ్-షౌన-కసాదహా-వ-మసా-కిను-తర్-జౌనహా-అహబ్బ-ఇలై-కుమ్-మినల్లాహి-వ-రసూలి హీ-వ-జిహాదిన్ ఫీ-సబీ లిహీ-ఫ-త-రబ్బసూ-హత్తా-యాతి-యల్లాహు-బి-అమ్రి హీ-వల్లాహు-లా-యహ్-దిల్-ఖౌ-మల్-ఫాసిఖీన్.

23. ఓ విశ్వాసులారా! మీతండ్రులును, మీసహోదరులును, విశ్వా సమునకు బదులుగ అవిశ్వాసమునే స్వీకరించినచో మీరు వారిని స్నేహితులుగఁ జేసికొనకుఁడు. మీలో నెవరు వారిలో స్నేహముచేయుదురో అట్టివారే పాపు లగుదురు. 24. మీతండ్రులును, మీకొడుకులును, మీసోదరులును, మీభార్య లును, మీబంధువులును, మీరు సంపాదించిన ధనమును, మందగించిపోవునేమో అని మీరు భయపడు నట్టి మీవ్యాపారమును, మీకిష్టములైన మేడలును

దేవునికంటెను, ఆతని ప్రవక్తకంటెను, ఆతని మార్గమందు చేయు యుద్ధముకంటెను హెచ్చుగా మీకు ప్రియములైనచో దేవుఁడు తన యాజ్ఞను పంపునంతవఱకు వేచియుండుఁడు. మఱియు దేవుఁడు అవిధేయులైనట్టి జనులకు సన్మార్గము చూపఁడు అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 23. పూర్వపు వాక్యములలో ధర్మయుద్ధమును, ఇండ్లు విడిచిపోవుటయును శ్రేష్ఠములైనవి యని చెప్పఁబడియె. ఇఁక వానిని సలుపుటలో ఏలాటి యాటంకము గలిగినను దానిని పాటింపఁగూడదు సాధారణముగ బంధువుల సంబంధము వీనికి అడ్డుపడును. అందుకుఁగాను విశ్వసింపక అవిశ్వాసమునే స్వీకరించినట్టి తల్లితండ్రులు, సహోదరులు మొదలగువారి స్నేహములోఁబడి దేవుని ప్రీతిపడయు కార్యములను వదలకూడదు. అట్టివారిని స్నేహితులుగఁ జేసికొనఁగూడదు. అట్లు వారి స్నేహమునకు లోనై తమ యిండ్లను వదలక ధర్మయుద్ధముచేయక పాపులు కాఁగూడదు. 24. దేవునియొక్కయు ఆతని పవిత్ర యొక్కయు ఆజ్ఞలను అనుసరించుచు ధర్మయుద్ధము (జిహాద్) సలుపుటలో తల్లి తండ్రులు, భార్య బిడ్డలు మొదలగు బంధువులు వీడిపోవుదురు. ధననష్టమగును. వ్యాపారము మందగించును. సౌఖ్యములుగల మేడలు విడిచి కష్టములు పడవలసివచ్చును అని భీతియున్నచో దేవుని శిక్షవచ్చువఱకు వేచియుండవలెను. ఇట్లు ఎవరు సౌఖ్యములోపడి దేవుని ధర్మములనుపాటింపరో వారికి వాస్తవమైన జయము లభింపదు. వారు ఉభయలోకములలో చెడుదురు. అట్టి యవిధేయులు దుర్గతికి పాలగుదురు. కావున ముసల్మానులు దేవునియొక్కయు ఆతని ప్రవక్తయొక్కయు ఆజ్ఞలను శిరసావహించి లోకసంబంధములను పాటింపక దేవునియందు సంపూర్ణమైన భక్తినవహించి ధర్మయుద్ధము (జిహాద్) సలుపుచు నుండవలెను. ధర్మయుద్ధము సలుపుచునుండునంతవఱకు ముసల్మానులకు ఇహలోకములో గౌరవముండఁగలదు. అది మానుకొన్నచో అవమానము లభించును. అవమానముపోయి లోకములో మానము లభింపవలెనన్న తిరిగి ధర్మయుద్ధమునే సలుపవలెను. కావున ఇప్పటి ముసల్మానులు పై వాక్యములను గమనించి తమ స్థితిని సవరించుకొనుటకు యత్నింతురుగాక.

25. లఖద్-నసర-కుముల్లాహు-ఫీ-మవాతిన-కసీరతిన్-వ-యౌమ-హునైనిన్-ఇజ్-అఅ-జబత్-కుమ్-కస్-రతుకుమ్-ఫలన్-తుగ్ని-అన్-కుమ్-షైఅన్-వ-జాఖత్-అలై-కుముల్-బిమా-రహుబత్-సుమ్మ-వల్-లైతుమ్-ముద్బిరీన్. 26. సుమ్మ-అన్-జలల్లాహు-సకీనతహూ-అలా-రసూలిహీ-వ-అలల్-మూమినీన వ-అన్-జల-జునూదల్-లమ్-తరౌహా-వ-అజ్-జబల్-లజీన-కఫరూ-వ-జాలిక-

జజా-ఉల్-కాఫిరీన్. 27. సుమ్మ-యతూ-బుల్లాహు-మింబఅది-జాలిక-అలా-మన్-యషాఉ-వల్లాహు-గఫూరుర్-రహీమ్.

25. దేవుఁడు అనేక యుద్ధరంగములందును హునైనుదినమునందును మీకు సహాయము చేసియున్నాఁడు. అపుడు మీరు మీయధిక సంఖ్యపై సంతోషపడితిరి. కావున మీ యధిక సంఖ్య మీకు ఏమియుపనికిరాలేదు. భూమి విశాలముగానుండియు మీకు చాల ఇఱుకుగానాయెను. పిదప మీరు వెన్నిచ్చి పాఱిపోతిరి. 26. ఆ పిదప దేవుఁడు తన ప్రవక్తకును విశ్వాసులకునుతనశాంత మొసంగెను. మీకు చూడని సైన్యములను పంపెను. మఱి అవిశ్వాసులను శిక్షించెను. మఱియు ఇదియే అవిశ్వాసులకు శిక్ష. 27. పిదప తాను కోరినవారిని క్షమించి యనుగ్రహించును. మఱి దేవుఁడు క్షమించువాఁడును దయాళువును.

వ్యా॥ 25, 26. మునుపటి వాక్యములలో దేవుని పక్షమునధర్మయుద్ధము (జిహాద్) సలుపునపుడు బంధువులు ధనము మొదలగువానిని చూడ కూడదు అని పలుకఁబడియెను. ఈవాక్యములలో ముసల్మానులు తమ అధిక సైన్యముపై సంతోషపడి గర్వింపరాదు. జయము దేవుని చేతిలో నున్నది. అది సైన్యముయొక్క హెచ్చుతగ్గులపై ఆధారపడియుండదు. చూడుడు, బదరుయుద్ధము మొదలగు యుద్ధరంగములలో ముసల్మానుల సంఖ్య కొద్దిగా నున్నను దేవుని సహాయమువలన జయము లభించెను. ఇఁక హునైనుయుద్ధముయొక్క విషయమును చూచిన దేవుని మహిమ స్పష్టపడును. అందు ఎట్లు ముసల్మానులకు దేవుఁడు సహాయముచేసెనో తెలియనగును. హునైను యుద్ధమునుగూర్చి కొంత వ్రాయుదుము. హిజ్రి యెనిమిదయేఁట హజరత్ రసూలువారు మక్కాపురమును జయించిరి. దానినిచూచి చుట్టుపట్లనున్న అరబ్బులుస్వయముగ ఇస్లామ్‌లో చేరసాగిరి. కాని హవాజిను సఖీఫు అను అరబ్బుల పెద్దకుటుంబములవారు గొప్ప సైన్యము చేర్చుకొని ముసల్మానులపై దాడివెడలి హునైను అనుచోటున మకాముచేసిరి. ఈ విషయము హజ్రత్ రసూలువారికిఁ దెలిసిశత్రువులను మార్కొనుటకు దాడివెడలిరి. పైగంబరులవారితో పండ్రెండువేలమంది సైనికులుండిరి. అందు రెండువేలమంది క్రొత్తగా ఇస్లామ్‌లో చేరినవారుండిరి. ఇంత గొప్ప సైన్యము దీనికి ముందు ముసల్మానులకు లేకుండెను. దీనినిచూచి కొందఱు ముసల్మానులు సంతోషపడి మేము కొద్దిమందిగానున్నపుడు మమ్ము ఎవరును జయింపఁజాలరైరి. ఇఁక మాసంఖ్య ఇంతఉన్నదే. మమ్ము ఎవరుజయింపఁగలరు అని అహంకార వాక్యములు పలికిరి. ఇట్లు భక్తులు పలుకకూడదు. అది దేవునికి ఇష్టముగాదు. కాఫిర్ల సైనికులు నాలుగువేలమంది మాత్రముండిరి. శత్రువులు కూడ చాల రోషముతో యుద్ధమాడుటకువచ్చియుండిరి. హవాజిను

వారు బాణములు ప్రయోగించుటలో చాల గట్టివారు. వారైనను కనుమలో పొంచియుండి ఒక్కపెట్టున ముసల్మానులపైఁబడిరి. క్రొత్తగా ముసల్మానులై వచ్చినవారు చెల్లాచెదరైరి. దానితోబాటు ముసల్మానులు యుద్ధరంగము వీడి చెల్లాచెదరైరి. హజ్రత్ రసూలువారు మాత్రము కొందఱి శిష్యులతో యుద్ధ రంగమునందు స్థిరముగా నిలిచియుండిరి. అంత విశాలమైన భూమి ముసల్మాను లకు ఇఱుకాయెను. ఎచ్చటను నిలుచుటకు తావులేకపోయెను. ఇట్టి ఆపద సమయములో హజ్రత్ రసూలువారు నిర్భయముగా దేవునిపై నాధారపడి నిలిచియుండిరి. పిదప ముసల్మానులకు దేవుఁడు శాంతము నొసంగెను. వారందఱు పైగంబరులవారి పిలుపు విని యుద్ధరంగమునకు వచ్చి ధైర్యసాహసములతో శత్రువులను మార్కొనిరి. దేవుని సహాయము దేవదూతలరూపముగ వచ్చెను. వారు ముసల్మానులకు కనఁబడకుండిరి. అట్లు దేవుని సహాయమువలనఅపజయము తప్పి జయము లభించెను. శత్రువులు యుద్ధరంగము వదలి పాఱిపోయిరి. శత్రువులు చాలమంది ముసల్మానుల చేతిలో ఖైదీలైరి. చాల విజయధనము చేతికి వచ్చెను. పిదప హవాజినువారి జనులను పైగంబరులవారు వదలిపెట్టిరి. కావున ముసల్మానులు హెచ్చరికతో నుండవలెను. 27. పిదప హవాజినుమొద లగువారు తమ పాపములనుండి క్షమాపణ వేఁడుకొనిఇస్లామ్‌లో చేరిరి. దేవుఁడు వారిని క్షమించి యనుగ్రహించెను.

28. యా-అయ్యుహల్-లజీన-ఆమనూ-ఇన్నమల్-ముష్రికూన-నజ-సున్-ఫలా-యఖ్-రబుల్-మస్-జిదల్-హరామ-బఅద-ఆమిహిమ్-హాజా-వ ఇన్-ఖిఫ్‌తుమ్-ఐ-లతన్-ఫసౌఫ-యుగ్-నీ-కుముల్లాహు-మిన్-ఫజ్-లిహీ-ఇన్-షాఅ-ఇన్నల్లాహ-అలీమున్-హకీమ్. 29. ఖాతిలుల్-లజీన-లాయుమి-నూన-బిల్లాహి-వలా-బిల్-యామిల్-ఆఖిరి-వ-లా-యుహర్రిమూన-మా-హర్రమల్లా హు-వ-రసూలుహూ-వలా-యదీ-నూన-దీనల్-హఖ్ఖి-మినల్-లజీన-ఊతుల్ కితాబ-హత్తా-యుఅ-తుల్-జిజ్-యత-అన్-యదిన్-వ-హుమ్-సాగిరూన్.

28. ఓ విశ్వాసులార! విగ్రహారాధకులైనవారు అపవిత్రులు. కావున ఈ సంవత్సరమునకు తరువాత వారు మస్జిదెహరామును సమీపింపఁగూడదు. మఱిమీరు బీదతనము వచ్చునని మీకు భయమున్నచో దేవుఁడు కోరిన యెడ ల యనుగ్రహముచే మిమ్ము భాగ్యవంతులుగఁ జేయును. నిశ్చయముగ దేవుఁ డు సర్వజ్ఞుఁడును వివేచనా పరుఁడును. 29. దేవునిని తుదిదినమును విశ్వసింపక

దేవుఁడును ఆతని ప్రవక్తయును నిషేధించినది నిషిద్ధమనియెంచక సత్యమతమును స్వీకరింపక యున్న గ్రంథములుగల వారిలో వారు అవమానితులై తమ చేతులార జిజ్యాను చెల్లింప నంతవఱకు వారితో యుద్ధమాడుఁడు.

వ్యా॥ 28. దేవుఁడు విశ్వాసుల బలమును పెంచి అరేబియా దేశమునకు ముఖ్యపట్టణమైన మక్కాపురము ముసల్మానుల వశము చేయఁగా చుట్టుపట్లనున్న అరబ్బుల కుటుంబములు గుంపులు గుంపులుగా వచ్చి యిస్లామ్‌లో చేరసాగిరి. కావున హిజ్రీ తొమ్మిదవ యేఁట అవిశ్వాసులును విగ్రహారాధకు లెవరును కాబా మసీదు (మస్జిదెహరాము) సరిహద్దులలో రాకూడదు అని ప్రకటింపఁబడెను. ఎందుకన విగ్రహారాధకులు అవిశ్వాస మనెడి అపవిత్రతలోఁబడి అపవిత్రులుగా నున్నారు. వారు పవిత్రమైన కాబా మసీదులో ప్రవేశించుటకు యోగ్యులుకారు. కావున ఈసంవత్సరము గడచిన పిదప ఎవరును రాకూడదు అని దేవుని సెలవయ్యెను. అట్లు కాఫిర్లు రాఁగూడదు అని ప్రకటించుట వలన యాత్రికులురారు. అందువలన వ్యాపారము మందించి నష్టము గలిగి బీదతనము వచ్చును అని ముసల్మానులు భయపడరాదు. దేవుఁడు సర్వజ్ఞుఁడు, వివేచనా పరుఁడు. దేవుఁడు విధించు ధర్మములలో మేలుండును. కీడుండదు. దేవుని చేతిలో భాగ్యమున్నది. తాను కోరినవారిని భాగ్యవంతులుగఁ జేయును. అటులే దేవుఁడు తన యనుగ్రహము వలన కొద్ది కాలములోనే ముసల్మానులకు గొప్ప రాజ్యమును జయమునొసంగి దేశము లంతటను ఇస్లామును వ్యాపింపఁజేసి వారిని భాగ్యవంతులుగఁ జేసెను. అన్ని దేశములనుండి వ్యాపార సామగ్రి రాసాగెను. వర్షములు మెండుగ కురిసి పంటలు బాగుగ పండెను. యుద్ధములలో విజయధనము లెక్కలేకుండ ముసల్మానులకు లభింప సాగెను. అరేబియా దేశమునుండి కాఫిర్లును యూదులును క్రైస్తవులును లేకుండపోయిరి. అంతటను ముసల్మానులు వ్యాపించిరి. ఇదంతయు దేవుని యనుగ్రహమేగదా! ఇఁక రాఁబోవు వాక్యములలో గ్రంథము గలవారగు యూదులను క్రైస్తవులను గూర్చి చెప్పఁ బడుచున్నది. 29. కాఫిర్లు ముష్రికులు లేకుండపోయిరిగదా. వారి యుపద్రవము తొలఁగెను. ఇఁక యూదులు క్రైస్తవులున్నారు. వీరి బలము తగ్గవలెను. వీరికి బలమున్నచో ఇస్లామ్‌నకు అడ్డుపడుదురు. వీరు కూడ సరిగ దేవునిని తుదిదినము (ఆఖిరతు)ను విశ్వసించుటలేదు. దేవుని యొక్కయు ఆతని ప్రవక్త యొక్కయు ధర్మములను లెక్కచేయరు. వాని ననుసరింపరు. వీరు దేవుని సత్య మతమును నశింపఁ జేయుటకు ప్రయత్నింతురు. కావున వీరు ముసల్మానులకు లోఁబడి జిజ్యాపన్ను ఇచ్చినచో వారిప్రాణములను వారిసొత్తును కాపాడుట ముసల్మానుల విధి. వారట్లు జిజ్యాపన్ను చెల్లింపక యుద్ధమునకు సిద్ధులైనచో వారిలోఁబడి జిజ్యాపన్ను నియ్యనంతవఱకు వారితో

ముసల్మానులు యుద్ధమాడవలెను. అందు ఏలాటి కొఱతచేయరాదు. జిజ్యా అనగా ప్రాణ ధన రక్షణకు బదులుగ గ్రహింపఁబడునది. జిజ్యాపన్ను చెల్లించు రైతులు, దేశముపై దండెత్తి వచ్చిన శత్రువులతో యుద్ధమాడ నక్కఱలేదు. ముసల్మానులే శత్రువులను మార్కొని తమ రైతుల ప్రాణధనములను రక్షింతురు.

30. వ-ఖాల తిల్-యహూదు-ఉజై-రు-నిబ్నుల్లాహి-వ-ఖాలతిన్-నసారల్-మసీ-హుబ్నుల్లాహి-జాలిక-ఖౌ-లుహుమ్-బి అఫ్వాహి-హిమ్-యు-జాహిఊన-ఖౌలల్-లజీన-కఫరూ-మిన్-ఖబ్లు-ఖాతల-హుముల్లాహు-అన్నా-యూఫకూన్. 31 ఇత్-తఖజూ-అహ్బా-రహుమ్-వ-రుహ్బా-నహుమ్-అర్-బాబమ్-మిన్-దూనిల్లాహి-వల్-మసీ-హబ్న-మర్-యమ-వమా-ఉమిరూ-ఇల్లా-లి-యఅ-బుదూ-ఇలాహన్-వాహి-దన్-లాఇలాహ-ఇల్లా-హువ-సుబ్-హానహూ-అమ్మా-యుష్రి-కూన్. 32. యురీదూన-అన్-యుత్-ఫి-ఊ-నూరల్లాహి-బి అఫ్వాహిమ్-వ-యా-బల్లాహు-ఇల్లా-అన్-యుతిమ్మ-నూరహూ-వలౌ-కరిహల్ కాఫిరూన్. 33. హువల్-లజీ-అర్-సల-రసూలహూ-బిల్-హుదా-వ-దీనిల్-హఖ్ఖి-లి-యుజ్-హిరహూ-అలద్-దీని-కుల్లిహీ-వ-లౌ-కరిహల్-ముష్రికూన్.

30. మఱియు ఉజైరు దేవుని కుమారుఁడని యూదులుపలికిరి. మఱియు మసీహు (మెసయా) దేవుని కుమారుఁడని నస్రానీలు పలికిరి. ఇవి వీరి నోటి మాటలున్నవి. దీనికి పూర్వము గడచిన అవిశ్వాసులు పలికినట్లు వీరును పలుక సాగిరి. దేవుఁడు వీరిని నశింపఁజేయుగాక! వారెచ్చటికి మరలి పోవుచున్నారు. 31. దేవుని వదలి వారు తమ విద్వాంసులను గురువులుగా దేవుళ్ళగాఁ జేసికొనిరి. మఱియు మర్యమ్ కుమారుఁడగు మసీహు (మెసయా) ను కూడ దేవునిగఁ జేసికొనిరి. మఱి ఒక్క దేవుని నేమాత్రము వారు ఆరాధింప వలెనని వారికి ఆజ్ఞ యుండెను. ఆతఁడుదప్ప వేఱు పూజ్యుఁడగు దేవుఁడు లేడు. వారు సాటి కల్పించు దానినుండి దేవుఁడు పరమ పవిత్రుఁడు. 32. వారు తమ నోటితో దేవుని జ్యోతిని ఆర్పఁ గోరుచున్నారు. అవిశ్వాసులకు ఇష్టము లేకున్నను దేవుఁడు తన జ్యోతిని సంపూర్ణముగఁ జేసియే తీరును. 33. ఆతఁడే తన ప్రవక్తకు సన్మార్గమును సత్యమతము నిచ్చి విగ్రహారాధకులకు ఇష్టము లేకున్నను సర్వ మతములపై దానికి జయము ఒసంగుటకు ఆతనిని పంపెను.

వ్యా॥ 30. హజ్రత్ రసూలువారి కాలమందు కొందఱు యూదులు, ఉజైరు దేవుని కుమారుఁడు అని పలుకు చుండిరి. అటులే నస్రానీ (క్రైస్తవు)లు

మసీహు (మెసయా) ఏసుక్రీస్తు దేవుని కుమారుఁడని పలుకుదురు. ఇట్లు వీరికి పూర్వమున్న విగ్రహారాధకులు (కాఫిర్లు) కూడ దేవునికి కుమారులు కుమార్తెలు కల్పించుచుండిరి. యూదులును క్రైస్తవులును వారి ననుసరించుచున్నారు. వీరి పలుకులు నిరాధారములు. ఇవి దేవునికి ప్రియులు కావు. ఇట్టి అధర్మ పలుకుల వలన దేవుని కోపమునకు వారు పాత్రులై నశింతురు. దేవుని యేకత్వము (తౌహీదు)ను వదలి వీరు అవిశ్వాస మార్గమునకు మరలి పోవుచున్నారు. అవిశ్వాసమనెడి యంధకారములో పడిచచ్చుచున్నారు. 31. ధర్మాధర్మములను విధించుట దేవునిపని. యూదులును క్రైస్తవులును వారిపండితులును గురువులును తమ యిష్టానుసారముగ మత గ్రంథములకు విరుద్ధముగ కల్పించిన ఆచారములను అనుసరించుచుండిరి. అందుకు వారు దేవుని వదలి తమ విద్వాంసులను గురువులను దేవుళ్ళుగాఁ జేసికొనినవారైరి. క్రైస్తవులు ఏసు క్రీస్తును దేవునిగానే చేసికొని దేవుని వదలి ఆతనినే యారాధించుచున్నారు. ఇవన్నియు దేవుని యాజ్ఞలకు విరుద్ధము. దేవుడు ఎద్దానిని చేయవలెనని విధించి ధర్మము (హలాల్ గా) గాఁ జేయునో దాని ననుసరింప వలెను. అటులే ఎద్దానిని చేయకూడదు అని నిషేధించునో దానిని వదలుకొన వలెను. భక్తులు ఇట్లు అనుసరింప వలెననియే దేవునియాజ్ఞ. దేవుఁడు, మానవులు కల్పించిన కల్పితములనుండి పరమ పవిత్రుఁడు. ఆతనికి సాటిలేదు ఆతనికి సంతానము లేదు. కావున మానవులు చిల్లర దేవతలను కల్పింపక ఒక్క దేవునినే పూజింపవలెను. 33. దేవుఁడు తనప్రవక్త ముహమ్మదునకు ఒసంగిన మతధర్మములును సన్మార్గము (ఇస్లామ్)ను దేవుని జ్యోతియగు ఇస్లామ్ వెలుఁతురును ఆర్పవలెనని యూదులు క్రైస్తవులు మొదలగు అవిశ్వాసులు చాల కుట్రలు పన్నుచున్నారు. వారి కుట్రలు సాగవు. గ్రంథ ప్రమాణములులేని వారి తప్పు విశ్వాసములు, దేవుని జ్యోతి యగు ఇస్లామ్ ముందర సాగవు. అవిశ్వాసులు ఇస్లామ్ వృద్ధిని సహింపలేరు. ఇస్లామ్ లోకములో వ్యాపించి తన వెలుతురు వలన లోకమును ప్రకాశింపఁ జేయుట వారికి ఇష్టములేదు. అయిన దేవుఁడు తన జ్యోతిని సంపూర్ణముగఁ జేసి లోకములో ప్రకాశింపఁజేసి తీరును. దేవుని యిష్టమునకు ఎవరును ఆటంక పఱచఁజాలరుగదా! అటులే దేవుని మహిమవలన ఇస్లామ్ లోకమంతటను వ్యాపించెను. 33. హజ్రత్ రసూలు వారికి దేవుఁడు, సన్మార్గముగల ఖురాను గ్రంథము నొసంగి సత్యమతమగు ఇస్లామ్మత మొసంగెను. ఇస్లామ్ మతముతనయందుండుసత్యములవలన అన్ని మతములపై జయమును ఆధిక్యమును పొందెను. ఇట్లు ఆధిక్యము పొందుట కాఫిర్లకు ఇష్టముకాదు. అయిన వారేమి చేయఁగలరు. ఎట్లు ఇస్లామ్ మతము సర్వ మతములపై ఆధిక్యము పొందెనో అటులే ముసల్మానులు దానిని సంపూర్ణముగ ననుసరించుచు భక్తి గలిగి ధర్మ

యుద్ధములు సలుపుచు అందు స్థిరముగా నుండునంత వఱకు వారికి లోకరాజ్యము లభించుచునే యుండును.

34. యాఅయ్యు-హల్లజీన-ఆమనూ-ఇన్న-కసీరమ్ - మినల్-అహ్బారి వర్-రుహ్బాని-ల-యాకులూన-అమ్వా-లన్నాసి బిల్-బాతిలి-వ-యసుద్దూన-అన్‌సబీ-లిల్లాహి-వల్-లజీన-యక్‌-నిజూనజ్-జహబ-వల్-ఫిజ్జత - వలా - యున్-ఫి-ఖూనహా-ఫీ-సబీ-లిల్లాహి-ఫ-బష్షిర్-హుమ్-బి-అజాబిన్-అలీమ్. 35. యౌమ-యుహ్మా-అలైహా-ఫీ-నారి-జహన్నమ-ఫ-తుక్వా-బిహా-జిబా-హుమ్-వ-జునూ బుహుమ్-వ-జుహూ-రుహుమ్ హాజా-మా-కనజ్-తుమ్-లి-అన్ ఫుసి-కుమ్-ఫ-జూఖూ-మా-కున్తుమ్-తక్-నిజూన్.

34. ఓ విశ్వాసులారా! గ్రంథముగలవారిలోని అనేకమంది విద్వాంసులును, గురువులును, అన్యాయముగ ప్రజల సొత్తును తినివేయుచున్నారు. మఱి దేవుని మార్గమునుండి ప్రజలను ఆటంకపఱచుచున్నారు. మఱెవరు బంగారమును వెండిని పాతిపెట్టుచు దానిని దేవునిమార్గమందు ఖర్చుచేయకున్నారో వారికి దుఃఖకరమైన శిక్షయున్నదను సువార్త నిమ్ము. 35. ఏదినమున ఆ ధనమును నరకాగ్నిలో కాల్చి దానితో వారి నొసళ్ళపైనను వారి ప్రక్కలమీఁదను, వారి వీఁపులపైనను, వాతలు వేయఁబడునో అపుడు ఇది మీరుమీయాత్మలకుఁగాను పాతిపెట్టినది. కావున యిపుడు దాని రుచిపొందుఁడు అని వారితో చెప్పఁబడును.

వ్యా॥ 34. యూదులలోను క్రైస్తవులలోనుగల విద్వాంసులును గురువులు (పాద్రీలు)ను ధనము పుచ్చుకొని మత ధర్మములను మార్చుచు అన్యాయముగా ధనము తినుచుండిరి. అటులే పామర జనులనుండి కానుకలుపొందుటకై పామరులకుఁ దగినట్లు నడచుకొనుచు మత ధర్మములో మార్పులుచేయుచుండిరి. అట్లు చేయుట ఘోరపాతకము. దానివలన కీడు గలుగును. కావున ముసల్మానుల పండితులును గురువులును హెచ్చరికతో నుండవలెను. ధనము సంపాదించి యందు బీదలభాగమగు జకాతు దానము చేయవలెను. అట్లు దానము చేయక లోభమువహించి వెండి బంగారు దాఁచిపెట్టినచో వానికి దుఃఖకరమైన బాధ(శిక్ష)లభించును. 35. ధనికుఁడైనలోభితో నీవు దేవునిమార్గమందు డబ్బు ఖర్చుచేయుము అని యెవరైనపలికినచో వాఁడు నొసలుచిట్లించును. ఎక్కువగా చెప్పినప్రక్కలుత్రిప్పుకొని మరలిపోవును. ఫ్పించుకొనువీలులే నపుడు వెన్నిచ్చిపాఱిపోవును. కావునలోభిపాతిపెట్టిపోయిన వెండిబంగారమును నరకాగ్నిలోకాల్చి వానినొసటిమీఁదను ప్రక్కలపైనను వీఁపుమీఁదను వాతలు వేయఁబడును. ఇట్లు

వాని సొత్తుయే వానికి దుఃఖకరమగును. సంపాదించి పెట్టిపోయిన ధనము యొక్క రుచిచూడుఁడు అని నొప్పించుటకుఁగాను వారితో చెప్పఁబడును.

36. ఇన్న-ఇద్ద-తష్-షుహూరి-ఇన్దల్లా-హిస్న-అషర-షహ్‌రన్-ఫీ-కితా బిల్లాహి-యౌమ-ఖల-ఖస్సమా-వాతి-వల్-అర్జ-మిన్‌హా-అర్-బఅతున్-హు రుమున్-జాలికద్-దీనుల్-ఖయ్యిము-ఫలా-తజ్-లిమూ-ఫీ-హిన్న-అన్-ఫుస-కు మ్-వ-ఖాతిలుల్-ముష్రికీన-కాఫ్-ఫతన్-కమా-యుఖాతిలూ-నకుమ్-కాఫ్-ఫ తన్-వఅ-లమూ-అన్నల్లాహ-మఅల్-ముత్-తఖీన్. 37. ఇన్న-మన్-నసీఉ-జి యాదున్-ఫిల్-కుఫ్రి-యుజల్లు-బిహి-ల్-లజీన-కఫరూ-యుహిల్లూ-నహూ-ఆమ న్-వ-యుహర్రిమూనహూ-ఆమల్-లి-యు-వా-తిఉ-ఇద్దత-మాహర్ర-మల్లా హు-ఫ-యుహిల్లూ-మా-హర్ర-మల్లాహు-జుయ్యి-న-లహుమ్-సూఉ-అఅ-మాలిహిమ్-వల్లాహు-లా-యహ్-దిల్-ఖౌమల్-కాఫిరీన్.

36. దేవుఁడు భూమ్యాకాశముల సృష్టించిన దినమునుండి అతని సెలవు ననుసరించి నెలల సంఖ్య పండ్రెండు. అందు నాలుగు నెలలు గౌరవ నీయ ములు. ఇదియే క్రమమైన మతము. కావున ఈ నెలలో మీయాత్మలకు అన్యా యము చేయకుఁడు. మఱి అవిశ్వాసులు అందఱు కలిసి మీతో ఎట్లుయుద్ధమాడు దురో అటులే మీరు అందఱును కలిసి అవిశ్వాసులతో యుద్ధమాడుఁడు. భయ భక్తులుగలవారితో దేవుఁడున్నాఁడని తెలిసికొనుఁడు. 37. మాసమును వెనుకకు త్రోయుట అవిశ్వాస కాలములో కల్పింపఁబడినది. దానివలన అవిశ్వాసులు దుర్మార్గములో పడుచున్నారు. దేవుఁడుగౌరవనీయములుగాఁజేసియున్న నెలల సంఖ్య పూర్తిచేయుటకు ఆనెలను ఒక సంవత్సరము ధర్మము (హలాలు)గాఁజేసి దానినే మఱొక సంవత్సరము అధర్మము (హరామ్)గాఁ జేసికొనుచున్నారు. మరల దేవుఁడు నిషేధించియున్న దానిని వారు ధర్మముగా (హలాలు)గాఁజేయు చున్నారు. వారి పాపకార్యములు వారికి బాగుగ దోఁచుచున్నవి. మఱియు దేవుఁడు, అవిశ్వాసులైనట్టి జనులకు సన్మార్గము చూపఁడు.

వ్యా॥ 36, 37. ఎట్లు యూదులును క్రైస్తవులును మత ధర్మములలో మార్పులు చేయుచుండిరో అటులే అవిశ్వాసులు కూడ నెలల విషయము మార్పు చేయుచు వచ్చిరి. దానిరద్దు ఈ వాక్యములలోఁ జేయఁబడినది. అరబ్బులు పూ ర్వమునుండియు సంవత్సరములో నాలుగు నెలలు (రజబ్, జూఖాదా, జుల్‌హజ్ ముహర్రము) ను గౌరవింతురు. అందు ఏలాటి కలహముగాని యుద్ధముగాని

చేయరు. వ్యాపారము, యాత్ర, ప్రయాణము, శాంతిగా జరుగుచుండెను. కాని కొందఱు అరబ్బులు ముహర్రము నెలలో యుద్ధముచేయువలెనన్నవారినాయకుఁడు ఈసంవత్సరము, ముహర్రము నెలకు బదులుగ సఫరునెల ముహర్రము నెల అగును అని దానిని వెనుకకు త్రోసి సఫరునెల ముందుగాఁ జేసికొని యుద్ధమాడుచుండిరి. మఱుసటి సంవత్సరము నెలల సంఖ్య పూర్తిచేయుటకైయథాప్రకారము ముహర్రమునెల, ముహర్రముగా నుండును. అందు యుద్ధము చేయరాదు అని ప్రకటించుచుండిరి. అట్లు చేయకూడదు. దేవుఁడు లోకమునుసృష్టించిన దినమునుండి సంవత్సరమునకు పండ్రెండు నెలలు. అందు హెచ్చుతగ్గులు లేవు. అందు నాలుగునెలలు గౌరవనీయములు. అందు యుద్ధము సలుపరాదు. ఇదియే స్థిరమైనమార్గము. దీనికి వ్యతిరేకముగ పోయి అన్యాయము చేయరాదు. ఒకవేళ కాఫిర్లు ఆ నాలుగునెలలలో యుద్ధము ప్రారంభించినచో ముసల్మానులుకూడ వారిని మార్కొనవచ్చును. ముసల్మానులు తామై యుద్ధము ప్రారంభము చేయరాదు. ఎట్లు కాఫిర్లు అందఱును కలిసి యుద్ధమాడుదురో అటులే ముసల్మానులు యుద్ధమాడవలెను. అందు ఏలాటి అక్రమము చేయక భయభక్తులు కలిగియుండిన దేవుని సహాయము కలుగును. 37. అవిశ్వాసులు తాము చేయు పాపకార్యములను మంచివిగాఁ దలఁచుచున్నారు. కావునమంచిచెబ్బరుల తెలివియే లేకపోయినపుడు వారికిసన్మార్గము లభింపదుఅని హెచ్చరింపఁబడియె. పైఁజెప్పిన నాలుగు నెలలలో యుద్ధము నిషేధింపఁబడెను. అవిశ్వాసులు స్వయముగ అందు యుద్ధము చేయవచ్చును అని నిషిద్ధమైనదానిని అనిషద్ధము (హలాల్) గ చేయుచున్నారు.

38. యా-అయ్యు-హల్-లజీన-ఆమనూ-మా-లకుమ్-ఇజా-ఖీల-లకుమున్-ఫి-రూ-ఫీ-సబీ-లిల్లా హిస్-సాఖల్తుమ్-ఇలల్-అర్జి-అరజీ-తుమ్-బిల్-హయా-తిద్-దున్యా-మినల్-ఆఖిరతి-ఫమా-మతా-ఉల్-హయా-తిద్-దున్యా-ఫిల్-ఆఖిరతి-ఇల్లా-ఖలీల్. 39. ఇల్లా-తన్-ఫిరూ-యు-అజ్-జిబ్-కుమ్-అజా-బన్-అలీమన్-వ-యస్-తబ్-దిల్-ఖౌమన్-గైర-కుమ్-వలా-తజుర్రూహు-షై-అన్-వల్లాహు-అలా-కుల్లి-షైఇన్-ఖదీర్.

38. ఓ ముసల్మానులార! దేవుని మార్గమందు బయలుదేరుఁడు అని మీతో చెప్పఁబడగా మీరు భూమిపై పడిపోవుచున్నారే. మీకేమైనది. మీరు పరలోకమును వదలి ఇహలోక జీవనముతో తృప్తిపడుచున్నారా! పరలోకముయెదుట ఇహలోకమునందలి లాభము మఱి చాల స్వల్పము. 39. మీరు

బయలుదేరనిచో దేవుఁడు మీకు దుఃఖకరమైన శిక్షనొసంగును. మఱి మీకు బదులుగ ఇతర జనులను దెచ్చును. మఱి మీరాతనికి కొంచెమైన నష్టము చేయఁజాలరు. మఱియు దేవుఁడు సర్వముపై శక్తిగలవాఁడు.

వ్యా॥ 38. ఈ వాక్యములలో 'తబూకు' యుద్ధమునకుఁగాను ముసల్మానులకు ప్రేరేపణగలదు. పూర్వ వాక్యములలో యూదులతోను క్రైస్తవులతోను యుద్ధమాడవలెనని ప్రోత్సాహముండెను. ఆ వాక్యములన్నియు ఈవాక్యములకు ఉపోద్ఘాతమువంటివి. ఈ వాక్యములు తబూకు యుద్ధమును సూచించుచు వాక్యములకు ఉపోద్ఘాతమువంటివి. మక్కా విజయమునకును, హునైను యుద్ధమునకును తరువాత హిజ్రీ తొమ్మిదవయేఁట సిరియా (షామ్) రాజగు గస్సాను, రోమనురాజు సహాయముతో మదీనాపురముపై దాడి వెడలుచున్నాడని హజ్రత్ ముహమ్మదువారికిఁ దెలిసెను. అందుకు హజ్రత్ రసూలువారు, సిరియా సరిహద్దులకుఁబోయి శత్రువును మార్కొనుట మంచిది యని తలఁచి ముసల్మానులందఱు ధర్మయుద్ధము (జిహాదు) నకై సిద్ధముకావలెనని ప్రకటించిరి. అపుడు తీవ్రమైన యెండకాలము. కఱవుండెను. ప్రయాణము కూడ చాల దూరము. ఖర్జూరపు తోఁటలు పండియుండెను. నీడలలో హాయిగా నుండు కాలము. ఇట్టి స్థితిలో దూరదేశమునకు పోయి రోమనువంటి రాజును మార్కొనవలెనన్న గొప్ప భక్తివిశ్వాసములును ధైర్యమునుకావలసియుండెను. కావున వంచకులు సాకులు పెట్టుకొని బయలుదేరకపోయిరి. కొందఱు ముసల్మానులకు సోమరితనముచే యుద్ధమునకు పోవలెనన్న బరువుగా నుండెను. తుదకు కొందఱు తప్ప అందఱు ముసల్మానులు ముప్పదివేలమందివఱకు బయలుదేరి తబూకు అనుచోటునమకాముచేసిరి. యుద్ధము సంభవింపలేదు. హజ్రత్ రసూలు వారువచ్చిన విషయముసిరియావారికిఁ దెలిసి రోమనురాజు సహాయమువేఁడిరి. కాని రాజు వారికి సహాయము చేయలేదు. కావున సిరియా జనులు యుద్ధమాడక పైగంబరులవారికి కానుకలు పంపిరి. ముసల్మానులు సురక్షితముగా తిరిగి మదీనాపురము చేరిరి. ఈదండయాత్రవలన ఇస్లామ్ విరోధులకు చాల భీతి గలిగెను. వంచకులకు అవమానము చేకూరెను. మదీనాలోనే నిలిచిపోయిన కొందఱు ముసల్మానులు సిగ్గుపడిరి. కావున ఈ వాక్యములో దేవుఁడు ముసల్మానులకు యుద్ధమునకు ప్రోత్సాహపఱచెను. ఇహలోక కొద్ది సౌఖ్యమునకుఁగాను యుద్ధము వదలుట ఉన్నతదశనుండి హీనదశలోఁబడుట. కావున ముసల్మానులు పరలోకమును వదలి ఇహలోక సౌఖ్యములను పాటింపరాదు. వారి కన్ను సదా పరముపైననే యుండవలెను. 39. ఓ ముసల్మానులార ! మీరు సోమరితనము వహించి యుద్ధమునకు మీరు బయలుదేరనిచో దేవుని పని నిలువదు. ఆతనిపని మీపైననే యాధారపడి యుండలేదు. ఆతఁడు సర్వశక్తుఁడు. ఆతఁడు తన

ఇస్లామ్‌మతసేవకొఱకు మీకు బదులుగ ఇతర జనులను నియమింపఁగలఁడు. అపుడు మీరు దేవుని ప్రీతికి పాత్రులు కాకపోవుదురు సుమా! అని హెచ్చరింపఁబడియెను.

40. ఇల్లా-తన్‌సురూహు-ఫఖద్‌నసర-హుల్లాహు-ఇజ్-అఖ్-రజహుల్ లజీన-కఫరూ-సాని-యస్-నైని-ఇజ్-హుమా-ఫిల్-గారి-ఇజ్-యఖూలు-లి-సాహిబిహీ-లా-తహ్జన్-ఇన్నల్లాహ-మఅనా-ఫ-అన్-జలల్లాహు-సకీనతహూ అలైహి-వ-అయ్యదహూ-బి-జునూదిల్-లమ్-తరౌహా-వ-జఅల-కలి-మతల్-లజీన-కఫరుస్-సుఫ్లా-వ-కలి-మతుల్లాహి-హియల్-ఉల్యా-వల్లాహు-అజీ జున్-హకీమ్.

40. మీరు ప్రవక్తకు సహాయము చేయకున్న నేమి! అవిశ్వాసులు ఆతనిని పాఱఁదోలినపుడు ఆతఁడు ఇద్దఱిలో రెండవవాఁడుగానుండియాయిద్దఱు గుహలో నున్నపుడు తన స్నేహితునితో నీవు దుఃఖింపకుము. నిశ్చయముగా దేవుఁడు మనతో నున్నాఁడు అని పలుకుచుండినపుడు దేవుఁడు ఆతనికిసహాయపడెను. పిదప దేవుఁడు ఆతనికి శాంతి నొసంగెను. మఱియు మీరు చూడనట్టి సైన్యములతో నాతనికి బలమొసంగెను. మఱి అవిశ్వాసుల మాటను క్రిందగునట్లు చేసెను. మఱి దేవుని మాటయే సదా పైఁగా నుండునది. మఱి దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనా పరుఁడును.

వ్యా॥ 40. ఓ ముసల్మానులార! మీరు ప్రవక్తకు తోడు పడకున్న నేమి పర్వాలేదు. దేవుఁడే ఆతనికి సహాయుఁడును రక్షకుఁడును. దానికి సాక్ష్యము:- మక్కా-ఖురైషుల కుట్రనుండి తప్పించుకొనుటకై దేవుని సెలవు పొంది ప్రవక్త సౌరుఅను గుహలో మూఁడుదినముల వఱకు దాగుకొని యుండెను. అపుడు ప్రవక్త యొక్క ప్రియుఁడగు అబూబకరుమాత్రము ఆగుహలోనుండెను. అట్టి సమయములో శత్రువులనుండి ప్రవక్తనురక్షించెను అది యెట్లన మక్కా-కాఫిర్లందఱు సభచేసిఅందు హజ్రత్ మహమ్మదువారిని చంపవలెనని తీర్మానించిరి. ఆవిషయము పైగంబరుల వారికిఁదెలిసి దేవుని సెలవు వలన తమ పడకపై హజ్రత్ అలీ గారిని పరుండపెట్టిఇంటిని చుట్టుకొనియున్న కాఫిర్ల గుంపులో నుండియే వెడలి అబూబకరునుతోడుగఁ దీసికొనికొన్నిమైళ్ళ దూరముననున్న సౌరు అను గుహనొద్దకుచేరిరి. ఆగుహ కొండపైన చాల నెత్తులోనున్నది.అందుపోవుటకు ఒక దోవమాత్రముగలదు. ఆదోవయును చాలయిఱుకైనది.నిలిచి, కూర్చుండి అందుండి ప్రవేశించుటకు వీలులేదు. పరుండియేదూరవలెను. ముందు

అబూబకరుగారు గుహలో ప్రవేశించి యచ్చటిచోటును శుభ్రపఱచి రంధ్రములను గుడ్డలతో మూసిరి. ఒక రంధ్రమునకు గుడ్డ లేకుండెను. దానికి తమ మడమనుంచి పైగంబరుల వారిని లోపలికి రమ్మని పిలచిరి. అపుడు పైగంబరుల వారు గుహలో ప్రవేంచి అబూబకరిగారి తొడపై తలనుంచి నిద్రపోయిరి. అపుడు ఒకపాము అబూబకరుగారి మడమను కఱచెను. కాని అబూబకరుగారు పైగంబరులవారి నిద్ర చెడిపోవునేమో అని కాలు కదలింపక యోర్చియుండిరి. హజ్రత్ రసూలువారు నిద్రనుండి మేలుకొని సర్పము కఱచిన విషయము తెలిసి తమ యుమ్మిని పాము కఱచినచోట నటింపఁగా స్వస్థతయాయెను. మక్కా కాఫిర్లు పైగంబరులవారి కాలిజాడలను బట్టి గుహను సమీపించిరి. అప్పటికి దేవుని మహిమ వలన సాలెపురుగు గుహద్వారమునకు వల అల్లియుండెను. అచ్చట పావురముగుడ్లుపెట్టియుండెను. అదిచూచి కాఫిర్లు తమలోతామే ఇందు ముహమ్మదుప్రవేశించి యున్నచో వల తెగి గ్రుడ్లుపగిలియుండును. కావున ఇందు ప్రవేశింప లేదని తలఁచి తిరిగిపోయిరి. కాఫిర్ల పాదములు అబూబకరు గారికి కనఁబడుచుండెను. అదిచూచి చింతించి ఓరసూలల్లాహి! శత్రువులుకొంచెము వంగి చూచినచో మేము వారికి కనబడుదుము అని విన్నవింపఁగా హజ్రత్ రసూలువారు నీవు చింతింపకుము. ఇచ్చట మనమిద్దఱమే లేము. మనకు తోడుగా దేవుఁడున్నాఁడు అని ఓదార్చిరి. అపుడు దేవుని మహిమ వలన పైగంబరుల వారికిని వారి మూలమున అబూబకరుగారికిని మనశ్శాంతి గలిగెను. కన్నులకు కానరాని దేవుని దేవదూతలు వారికి బలము నొసంగుచుండిరి. ఇట్లు వారిద్దఱు అందుమూడుదినములుండి తరువాతసురక్షితముగా మదీనాపురముచేరిరి' చూడుఁడు. దేవునిమహిమ వలన అన్నిటికంటె బలహీనమైనసాలెపురుగువలన గొప్ప కోటకంటె ప్రయోజనకరమాయెను. దేవుఁడురక్షింపనున్న శత్రువులు ఏమి చేయఁగలరు. అట్లు కాఫిర్ల కుట్రను సాగనీయక వారి మాటను క్రిందుగఁ జేసి దేవుఁడు తనమాటను పైఁగాఁజేసెను. సదా దేవుని మాటయే చెల్లును. ఆతఁడు సర్వశక్తుఁడును వివేచనా పరుఁడును. ఆతని ప్రతికార్యములో నేదోయొక రహస్య ముండును.

41. ఇన్-ఫిరూ-ఖిఫాఫన్-వ-సిఖాలన్-వ-జాహిదూ-బి-అమ్వాలికుమ్-వ-అన్ఫుసి-కుమ్-ఫీసబీలిల్లాహి-జాలికుమ్-ఖైరుల్-లకుమ్-ఇన్-కున్తుమ్-తఅలమూన్.

41. తేలికఁగాను బరువుగాను బయలుదేరుఁడు. మఱి మీరు మీధనమును మీ ప్రాణములను దేవుని మార్గమందు వినియోగించుచు యుద్ధమాడుఁడు. మీకు తెలిసినచో నిందు మీకు మేలున్నది.

వ్యా॥ 41. యుద్ధమునకు అందఱు వెడలవలెనని ప్రకటింపఁబడునపుడు కాలి బంటులును రౌతులును, బలహీనులును, బలిష్ఠులును యౌవనులును, వృద్ధులును నిఱుపేదలును, ధనికులును, అందఱును ఏలాటి సాకులు పెట్టుకొనక యుద్ధమునకు వెడలవలెను. యుద్ధము సలుపుటలో ఉభయ లోకములమేలున్నది గ్రహించినవారికి బాగుగ దాని మేళ్లు తెలియనగును.

42. లౌకాన-అరజన్-ఖరీబన్ వ-సఫరన్-ఖాసిదల్-లత్-తబఊక-వలాకిమ్ బఉదత్-అలైహి-ముష్-షుఖ్-ఖతు-వస-యహ్లి-ఫూన-బిల్లాహి-లవిస్-తతఅ నా-ల-ఖరజ్నా-మఅ-కుమ్-యుహ్-లికూన-అన్-ఫుస హుమ్-వల్లాహు-యఅ- ల ము-ఇన్న-హుమ్-ల-కాజి-బూన్.

42. దగ్గఱలోనే సొమ్ముండి ప్రయాణము తేలికగానుండి యుండినచో తప్పక వారు నిన్ను వెంబడించి యుందురు. కానివారికి ప్రయాణముదూరముగ తోఁచెను. ఇఁకవారు మాకు శక్తి యున్నచో తప్పక మేము మీ వెంటబయలు దేఱి యుండుము అని దేవుని పేరుతో ప్రమాణములు చేయుదురు. వారు తమ యాత్మలను నాశము చేసికొనుచున్నారు. మఱివారు అసత్యవంతులని దేవునికిఁ దెలియును.

వ్యా॥ 42. ఈవాక్యమందు వంచకుల విషయము చెప్పఁబడినది. ప్రయాణములో కష్టము లేకుండ సులభముగా సొమ్ము (విజయధనము) లభించునని ఆశయ మున్నచో వంచకులు తప్పక ముస్లిములనుల వెంట యుద్ధమునకు బయలు దేఱి యుందురు. కాని తబూకు యుద్ధము సిరియా సరిహద్దులలో జరుగును. అది చాలదూరము. ఆ ప్రయాణములో చాల కష్టములున్నవి. కావున వంచకులు మదీనాపురములోనే నిలిచి యనేక సాకులు చూపసాగిరి. ముసల్మానులుబయలుదేఱు నపుడును యుద్ధమునుండి తిరిగి వచ్చినపుడును అబద్ధ ప్రమాణములు చేసి తప్పించుకొన వలెనని యత్నింతురు. వంచకులు పలుకునది నిజముకాదు. అది దేవునికి బాగుగఁ దెలియును. వారు ఎన్నిప్రమాణములు చేసినను వారి వంచనదాఁగదు. అదిబయలుపడును. వంచకులుచేయు మోసముల ఫలితము వారికే లభించి తుదకు తమ నాశము చేసికొనుదురు.

43. అఫల్లాహు-అన్-క-లిమ-అజిన్-త-లహుమ్-హత్తా-యత-బయ్యన- ల కల్-లజీన-సదఖూ-వ-తఅ-లమల్-కాజిబీన. 44. లా-యస్-తాజినుకల్-లజీన-యూమినూన-బిల్లాహి-వల్-యామిల్-ఆఖిరి-అన్-యుజా-హిదూ-బి-అమ్వాలి-హిమ్-వ-అన్-ఫుసిహిమ్-వల్లాహు-అలీముమ్-బిల్-ముత్త-ఖీన్. 45 ఇన్నమా

యస్-తా౽జినుకల్-లజీన-లా-యూమి-నూన-బిల్లాహి-వల్-యూమిల్ - ఆఖిరి-వర్-తాబత్-ఖులూ-బుహుమ్-ఫహుమ్-ఫీ-రైబిహిమ్-యత-రద్ద-దూన్.

43. దేవుఁడు నిన్ను క్షమించుగాక! సత్యవంతులు నీకు స్పష్టపడి అస త్యవంతులు నీకుఁ దెలియునంత వఱకు నీవు ఎందులకు వారికి సెలవు నొసంగి తివి. 44. దేవునిని తుదిదినమును విశ్వసించినవారు తమ ధనమును ప్రాణముల ను వినియోగించి యుద్ధమాడుటను తప్పించుకొనుటకై నీతో సెలవు నడుగరు. మఱియు భయభక్తులు గలవారిని దేవుఁడు బాగుగ నెఱుంగును. 45. దేవునిని తుదిదినమును విశ్వసింపనివారు మాత్రమే నీతో సెలవు అడుగుదురు. మఱివారి హృదయములు సందేహములో పడియున్నవి. కావున వారు తమతమ సందే హములోనే పడి దేవులాడు చున్నారు.

వ్యా॥ 43. వంచకులు తబూకు యుద్ధమునకు వెడలక పైగంబరువారి స న్నిధికి వచ్చి మేము రాఁజాలము. మేము మదీనాలోనే యుండునట్లు మాకు సెలవొసంగ వలెను అని విన్నవించిరి. దానికి హజ్రత్ రసూలువారు, వంచ కులు వచ్చుట వలన శాంతిభంగమే గలుగును గాని ప్రయోజనము లేదు అని తలఁచి వారికి సెలవొసంగిరి. అట్లు సెలవొసంగుట వలన వంచకులకు మఱింత సాకు దొరకెను. మేము పైగంబరులవారి సెలవు పొందియే నిలిచి పోతిమి అని పలుకసాగిరి. కావున వారికట్లు సెలవియ్యక వదలి పెట్టినచో వారు తమం తట తామే నిలిచిపోయి యుందురు. అపుడు వారి వంచనయును అసత్యమును అందఱికి స్పష్టముగాఁ దెలిసి యుండును. కావున ఓ ప్రవక్త! నీవెందులకు వారికి సెలవొసంగితివి. ఇది సమయోచితము కాదు. కావున నిన్ను దేవుఁడు క్షమిం చెను. 44:45. ఈవాక్యములలో యుద్ధమునకు పోక నిలిచి పోవుటకు సెలవు అడుగువారెట్టివారు. అడుగనివారెట్టివారు అని సూచింపఁబడినది. నిజమైన భక్తి విశ్వాసములుగల ముసల్మానులు తమ ధనమును తమ ప్రాణములును సర్వ ము దేవుని ప్రీతికై విని యోగించియుద్ధమాడుదురు. వారుయుద్ధమునుండి నిలిచి పోవుటకు సాకులు పెట్టుకొని సెలవు అడుగరు. కాని దేవునిని పరలోకమును నమ్మక సందేహములు గలిగియున్న వంచకులు యుద్ధమునుండి నిలిచి పోవు టకు అబద్ధమైన సాకులు పెట్టుకొని సెలవు కోరుదురు. ఇట్టివారికి దేవుని వా క్యములందు నమ్మకము లేనందున సందేహములలో పడి దేవులాడు చుందురు.

46. వలౌ- అరాదుల్-ఖురూజ-ల-అఅద్దూ-లహూ-ఉద్దతన్-వలాకిన్-కరి హల్లా-హుంబి-ఆసవహుమ్-ఫసబ్బత-హుమ్-వ-ఖీ-లఖ్-ఉదూ-మఅల్-ఖాఇదీన్. 47. లౌ-ఖరజూ-ఫీకుమ్-మా-జాదూకుమ్-ఇల్లా-ఖ-బాలన్-వల-ఔజఊ- ఖిలా-

లకుమ్-యబ్-గూన-కుమల్-ఫిత్-నత-వ-ఫీకుమ్- సమ్మా-ఊన-లహుమ్-వల్లా హు-అలీ-ముమ్ బిజ్-జాలి-మీన్. 48. లఖ-దిబ్ తగ-వుల్-ఫిత్-నత-మిన్-ఖబ్లు-వ-ఖల్లబూ-లకల్-ఉమూర-హత్తా-జా అల్-హఖ్ఖు-వ-జహర-అమ్రుల్లాహి-వహుమ్-కారిహూన్. 49. వమిన్హుమ్-మన్-యఖూ-లూజల్-లీ వ-లా-తఫ్-తిన్నీ-అలా-ఫిల్-ఫిత్నతి-సఖతూ-వ-ఇన్న-జహన్నమ-ల-ముహీ-తతుమ్- బిల్-కాఫిరీన్.

46. మఱియు వారు బయలుదేఱవలెనని కోరియుండినచో తప్పక దానికిఁగాను, వారు సామగ్రి సిద్ధపఱచుకొనియుందురు. కాని వారు వెడలుట దేవుని కిష్టములేదు. కావున వారిని నిలిపివేసెను. మఱికూర్చుండియుండువారితో మీరును కూర్చుండియుండుఁడు అని వారితో చెప్పఁబడెను. 47. వారు మీతో వెడలినను మీవిషయము చెడుగు తప్ప వేఱేమియు వృద్ధి కలిగింపరు. మఱి ఉపద్రవము కలిగింప కోరి మీమధ్య అటునిటు దిరుగుదురు. మఱి మీలో కొందఱు వారికి గూఢచారులు గలరు. మఱి దేవుఁడు బాగుగ దుర్మార్గుల నెఱుంగును. 48. వారు దీనికి పూర్వమును చెడుగు చేయవలెనని కోరుచుండెను. మఱినీకార్యములను తలక్రిందులగఁజేయుచుండిరి. తుదకు సత్యము వచ్చెను. దేవుని యాజ్ఞ స్పష్టముగా జయముపొందెను. మఱి వారికి ఇష్టములేకనే యుండెను. 49. మఱి వారిలో నొకఁడునీవునాకు సెలవు నొసంగుము. నన్ను దుర్మార్గములో పడవేయకుము అని పలుకును. వినుము. వారు దుర్మార్గములోనే పడిపోయినారు. మఱి అవిశ్వాసులను నరకము చుట్టుకొనును.

వ్యా॥ 46. వంచకులు యుద్ధమునకు వెడలవలెనని కోరినచో వారు దండయాత్ర ప్రకటన వినిన తోడనే యుద్ధసామగ్రి సిద్ధపఱచుకొనియుందురు. కాని వారికి పూర్వమునుండియే యిష్టములేదు. అందుచే వారు యుద్ధసామగ్రి సిద్ధపఱచుకొనక లేనిపోని సాకులు పెట్టుకొని యిండ్లలో నుండుటకు సెలవడుగుచున్నారు. వంచకులు యుద్ధమునకుఁగాను వెడలుట దేవుని కిష్టములేదు. అందుచేతనే వారు సోమరులై స్త్రీలవలె గృహములలో కూర్చుండుటకు కోరిరి. అటులే మీరు కూర్చుండుఁడు అని వారితో పైగంబరులవారు పలికిరి. 47 వంచకులు యుద్ధమునకు ముసల్మానులవెంట వెడలినను లాభమునకు బదులుగ నష్టమే గలుగును. వంచకులు తమ పిఱికితనమువలన తాము ధైర్యము వీడునది గాక ముసల్మానులకును అధైర్యులుగాఁ జేయుదురు. లేనిపోని వదంతులు లేపి పరస్పరము కలహములు కల్గించి చెడుగును ఉపద్రవమును వృద్ధి చేయుదురు. అందువలననే దేవుఁడు వారు యుద్ధమునకు వెడలకుండ వారినిచేసెను,

వంచకులు ముసల్మానులవెంట తమ గూఢచారులను పంపిరి. ముసల్మానుల సైనికులలో జరుగు విషయములను చెవియొగ్గి వినుచు వంచకులకుఁ దెలుపుదురు. ముసల్మానుల ధైర్యసాహసములు చూచి గూఢచారులు ఆ విషయము వంచకులకుఁ దెలుపునపుడు వంచకుల గుండెలు పగులును, ఇదియు నొకవిధమైన మేలే గదా! ఎవరు దుర్మార్గులో వారు దేవునికిబాగుగఁ దెలియును. వారికిఁ దగినట్లు శిక్ష విధించును. 48. వంచకులు పన్ను కుట్రలు క్రొత్తవిగావు. దీనికి పూర్వముగూడ అనేక కుట్రలు ఇస్లామ్‌నకు విరోధముగ పన్నియున్నారు. హజ్రత్ రసూలువారు మదీనాపురమునకు వచ్చినపుడు, మదీనాలోని యూదులును వంచకులును అనేక విరోధములు గావించి పైగంబరులవారి కార్యములను తలక్రిందులుగఁజేయుటకు యత్నించిరి. కాని ఇస్లామ్ దినదినము వృద్ధి పొందుటనుచూచి సహింపఁజాలక మండిపడుచుండిరి. తుదకు బదరుయుద్ధములో అవిశ్వాసులు అపజయముపొంది, సత్యము (ఇస్లామ్) స్పష్టముగా జయము పొందెను. ఇది చూచి నోటిమాటలతో మోసపుచ్చవలెనని కొందఱు వంచకులు ఇస్లామ్‌లో చేరిరి. కాని వారి హృదయములు అసూయచే మండిపోవుచు అనేక ద్రోహములు చేయుచు వచ్చిరి. ఒహుదు యుద్ధసమయములో వంచకుల నాయకుఁడగు అబ్దుల్లాబిన్‌ఉబై తన యనుచరులను తీసికొని యుద్ధరంగమును విడిచి మదీనాకు తిరిగిపోయెను. తుదకు ముసల్మానులకు విజయము లభించెను. ముసల్మానుల జయము వంచకులకు ఇష్టముకాదు. దేవుఁడొసంగు విజయమును వంచకులు అడ్డగింపఁగలరా! 49. వంచకులలో నొకఁడు జుద్‌బిన్ ఖైసు అనువాఁడు పైగంబరులవారితో ఓ ప్రవక్త! మీరు నన్ను ఇంటిలోనుండుటకు సెలవు నొసంగుఁడు. రోమనుదేశపుస్త్రీలు చాల సుందరులు. నేను వారిని చూచిన మోహవశుఁడనై దుర్మార్గములో పడుదును. కావుననన్నువదలిపెట్టుఁడు అని పలికెను. దానికి సందు రద్దుగలదు. వంచకుఁడు తన వంచనను భక్తిరూపములో దాఁచుచున్నాఁడు. వీఁడును, ఇతర వంచకులును దుర్మార్గములోనే పడి తుదకు నరక నివాసులగుదురు.

50. ఇన్-తుసిబ్‌క-హసనతున్-తసూ-హుమ్-వఇన్-తుసిబ్‌క-ముసీబతున్ యఖూలూ-ఖద్-అఖజ్నా-అమ్-రనా-మిన్-ఖబ్లు-వ-యత-వల్లా-వ-హుమ్ - ఫరిహూన్. 51. ఖుల్-లన్-యుసీబనా-ఇల్లా-మా-కత-బల్లాహు-లనా-హువ- మౌలానా-వ-అ-లల్లాహి-ఫల్-యత-వక్కల్-లిల్-మూమినూన్.

50. నీకేదైన మేలు గలిగినచో వారి కది కష్టమగును. మఱి నీకేదైన ఆపద సంభవించినచో వారు మేము ముందుగానే మాపని చూచుకొంటిమని

పలుకుచు సంతోషపడుచు మరలిపోవుదురు. 51. దేవుఁడు మాకుఁగాను లిఖించినది తప్ప వేఱు మాకు కలుగదు. ఆతఁడే మారక్షకుఁడు. మఱి ముసల్మానులు దేవునిపైననే ఆధారపడవలెను అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 50. హజ్రత్ రసూలువారికిని వారి శిష్యులకును జయము మొదలగు మేలు కలిగినచో వంచకులు అసూయచే సహింపలేరు. అది వారి మనస్సులకు కష్టముగా నగును. ఎప్పుడైన ముసల్మానులకు యుద్ధములో వధింపఁబడుట మొదలగు ఏదైన ఆపద నష్టము కలిగినచో వంచకులు చాల సంతోషపడుదురు. మఱి మేము ఆపద తప్పించుకొను మార్గము చూచుకొంటిమి. ముందే నష్టము గలుగునని మేము తలఁచితిమి. కావున ముసల్మానులవెంట యుద్ధమునకు పోకుంటిమి అని డంబాలు కొట్టుకొని తమ సభలనుండి యిండ్లకు మరలి పోవుదురు. 51. దీనికి నిట్లు జవాబియ్యవలెనని దేవుని సెలవయ్యెను. సుఖదుఃఖములు దేవుని నియామము (తక్దీరు) ను అనుసరించి గలుగుచున్నవి. మాకు లభించు కష్టసుఖములు దేవునివలననే గలుగుచున్నవి. మేము దేవునికి విధేయులము. అన్ని స్థితులలోను ఆతనిపైననే యాధారపడియున్నారము. ఆతఁడే మారక్షకుఁడు. ఎట్టి కష్టము వచ్చినను దేవునికి విధేయులమైయుందుము. అందు ఏలాటి కొఱత చేయము.

52. ఖుల్-హల్-యత-రబ్బసూన-బినా-ఇల్లా-ఎహ్-దల్-హుస్-నయైని-వ-నహ్‌ను-నత-రబ్బసు-బికుమ్-అన్-యుసీ-బ-కుముల్లాహు-బి-అజాబిన్-మిన్-ఇన్-దిహీ-ఔ-బి-ఐదీనా-ఫ-తరబ్బసూ-ఇన్నా-మఅ-కుమ్-ముత-రబ్బిసూన్

52. మా విషయము రెండు మేళ్ళలో నేదో యొకటి మాకు గలుగవలెనని మాత్రము మీరు వేచియున్నారా! మఱి దేవుఁడు తన శిక్ష మీకుఁ గలిగించును. లేదా మాచేతులనుండి మీకు కలిగించును అని మీ విషయము మేమువేచియున్నారము. కావున మీరును వేఁచియుండుఁడు. మేముకూడ మీతోఁ బాటు వేచియుందుము అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 52. దేవుఁడు మాకు రక్షకుఁడు. కావున మేము యుద్ధములో వధింపఁబడిన మాకు దేవుని ప్రీతియును స్వర్గనివాసము అనెడి మేలు లభించును. లేదా జయముపొందితిమేని విజయధనము అనెడి మేలు లభించును. రెండు మేళ్ళలో నేదో యొకటి మాకు లభించునని మీరు మావిషయము వేచియుండవచ్చును. దీనికి విరుద్ధముగ మీకు రెండు చెడుగులలో నేదో యొకటి దేవునినుండి మీకు కలుగునని మేము వేచియున్నారము. మీవంచనకు శిక్షగా దేవుఁడే మీపైనే దైన ఆపద పంపును. లేదా మాచేతువార మీ వంచనకుఁగాను శిక్ష విధించి మిమ్ము అవమానపఱచును. కావున మన మంద

అము మన గతి యేమి కానున్నదో చూచుటకు వేచియుండవలెను. తుదకు ఎవరికి మంచి ఫలితము లభించునో తెలియనగును.

53. ఖుల్-అన్-ఫిఖూ-తౌఅన్-ఔకర్‌హల్-లన్-యుతఖబ్బల మిన్‌కుమ్-ఇన్నకుమ్-కున్తుమ్ ఖౌమన్-ఫాసిఖీన్. 54. వమా-మనఅ-హుమ్ - అన్-తుఖ్బల-మిన్‌హుమ్ నఫ-ఖాతు హుమ్-ఇల్లా- అన్న - హుమ్ - కఫరూ - బిల్లాహి-వ-బి-రసూలిహీ-వ-లా-యాతూ-నస్-సలాత-ఇల్లా-వహుమ్- కుసాలా-వలా-యున్ ఫిఖూన ఇల్లా వహుమ్ కారి-హూన్. 55- ఫలా-తుఅ-జిబ్‌క - అమ్వాలుహుమ్-వలా- ఔలా-దుహుమ్-ఇన్నమా యురీదుల్లాహు-లి-యు-అజ్ - జిబహుమ్-బిహా ఫిల్-హాయా- తిద్-దున్యా-వ-తజ్-హాఖ-అన్ - ఫుసుహుమ్ - వ హుమ్-కాఫిరూన్.

53. (ఓవంచకులార) మీరు ఇష్టముతోను లేదాఅనిష్టముతోను ఖర్చు చేయుఁడు. (కాని) అది యెన్నటికిని మీనుండి యంగీకరింపఁ బడదు. నిశ్చయయముగమీరు అవిధేయులైనట్టి జనులు అని ఓ ప్రవక్తా! పలుకుము. 54. వారు దేవునిని ఆతని ప్రవక్తను తిరస్కరించి నమాజునకు సోమరి తనముతో వచ్చి యిష్టములేకుండ ఖర్చు చేయుట వలన వారుచేయు ఖర్చులు అంగీకరింపఁబడుటకు వారికి ఆటంకము గలిగెను. 55. కావున వారి ధనము వలనను వారి సంతతివలనను నీకు ఆశ్చర్యముగలుగఁగూడదు. ఇహలోక జీవనమందు దానివలన వారిని శిక్షింపవలెననియు వారు అవిశ్వాసులుగ నుండినపుడు వారిప్రాణములు పోవలెననియు దేవుఁడు కోరుచున్నాఁడు.

వ్యా॥ 53. జుద్‌బిన్‌ఖైసు తాను సిరియా దేశమునకు వెడలినచో అచ్చటి స్త్రీలను చూచి మోహింతును అను సాకుపెట్టి నేను యుద్ధమునకు రానుకాని ధనమొసంగుదును అని హజ్రత్ రసూలు వారితో పలికెను. దానికి నిందు రద్దు గలదు- విశ్వాసము లేనివాని ధనము దేవుఁడు అంగీకరింపఁడు. వంచకులు విశ్వాసములేనివారు. వారుఇష్టముతో మనస్ఫూర్తిగా దేవునిమార్గమందు ఖర్చు చేయరు. ఒకవేళ ఖర్చుచేసినను దేవుఁడు దాని నంగీకరింపఁడు. దానికి కారణము రాఁబోవు వాక్యములోఁ జెప్పఁబడినది. 54. వంచకులు దేవుని మార్గమునందు చేయు దానములు ఖర్చులు అంగీకరింపఁబడవు. దానికి కారణము వారి యవిశ్వాసము. వారికి భక్తి లేనందుననే వారు ప్రార్థన (నమాజన) కు ఉత్సాహముతో రారు. సోమరితనము వహించి దానిని భారముగాఁదలఁచి వత్తురు. వారు ఖర్చు ఇష్టము లేకుండచేయుదురు. కావున అవియంగీకరింపఁ బడవు. 55. ధనము

సంతానము అనునవి దేవుని యనుగ్రహము లేగదా. ఇవి అట్టి దుర్మార్గులకు ఎందులకియ్యఁబడెను అను ఆశ్చర్యము భక్తులకుఁ గలుగ వచ్చును. దానికి నిందు సమాధాన మియ్యఁ బడినది. ధన సంతానముల వలన అవిశ్వాసులకు గొప్ప శిక్షయే గలుగును. వానివలన వారికి మేలుగలుగదు. ఎట్లు మంచి యాహారము రోగులకు హానికరమగునో అటులే ధన సంతానములు అవిశ్వాసులకు హాని కలిగించును. ఎందుకన అవిశ్వాసులు ఇహలోక మోహితులై ధనము సేకరించుటలో చాల పాటుపడుదురు. అందు ఏలాటి నష్టము గలిగినవారు దాని దుఃఖములోనే పడియుందురు. ఇఁక ప్రాణము పోవునపుడు ఇహలోక ప్రేమ వలన వారికిఁ గలుగు కష్టములు ఊహింపఁ జాలము. సదాయా చింతలోనే నిమగ్నులై మనస్సునకు శాంతము లభింపదు. దానికి విరుద్ధముగ ముసల్మానులకు ఇహలోకప్రేమ యుండదు. కాఁబట్టి సర్వము దేవుని మార్గమందు వినియోగించుటలో ముసల్మానులకు ఉత్సాహము గలుగును. ఇదియునుగాక ధన సంతానముల వలన కాఫిర్లకు గర్వము గలుగును. దుర్మార్గము హెచ్చును. తుదకు ప్రాణము పోవునపుడుకూడ అవిశ్వాసమే యుండును. కావున వారికి ధన సంతానము లున్నవని ముసల్మానులు ఆశ్చర్యమొందరాదు.

56. వ-యహ్ లిఫూన-బిల్లాహి-ఇన్నహుమ్-లమిన్-కుమ్-వ-మా-హుమ్ మిన్కుమ్-వలా-కిన్నహుమ్-ఖౌమున్-యఫ్-రఖూన్. 57. లౌ-యజి-దూన మల్ జఅన్-ఔ-మగా-రాతిన్-ఔ-ముద్-దఖ-లల్-ల వల్లౌ-ఇలైహి-వ-హుమ్-యజ్-మ-హూన్. 58. వ-మిన్-హుమ్-మన్-యల్-మిజుక-ఫిస్ సదఖాతి-ఫఇన్- ఉఅతూ-మిన్-హా-రజూ-వఇల్-లమ్-యుఅ-తూ-మిన్హా-ఇజా-హుమ్ - యస్-ఖతూన్. 59. వలౌ-అన్నహుమ్-రజూ-మా-ఆతా-హు-ముల్లాహు-వ - రసూలుహూ-వఖాలూ-హస్-బునల్లాహు-సయూతీ-నల్లాహు-మిన్ఫజ్లిహీ-వ- రసూలుహూ-ఇన్నా-ఇలల్లాహి-రాగిబూన్.

56. మఱియువారు మీతో నున్నారని దేవుని నామముతో ప్రమాణములు చేయుచున్నారు. మఱి వారుమీతో నున్నవారు కారు. కాని వారు మీకు భయపడుచున్నారు. 57. వారికి శరణముగాని గుహలుగాని తలదాఁచుటకు చోటుగాని లభించినచో వారు దాని పైపునకు తొందరగా పరుగెత్తిపోయి యుందురు. 58. మఱివారిలో కొందఱు దానములు పంచువిషయములో నిన్ను నిందింతురు. కావున వారికి దానినుండి యియ్యఁబడినచో వారుసంతోషింతురు.

మఱిదానినుండి వారికియ్యఁ బడనిచో కోపపడుదురు. 59. మఱియు దే వుఁడును ఆతని ప్రవక్తయును తమకు నిచ్చిన దానితో. తృప్తిపడి దేవుఁడు మాకు చాలును శీఘ్రములోనే దేవుఁడును ఆతని ప్రవక్తయును మాకు తమ యనుగ్రహముచే నొసంగుదురు. మాకు దేవుఁడే కావలెను అని వారు పలికి యుండినచో యెంతో బాగుండును.

వ్యా॥ 56: 57. వంచకులు తమ హృదయములలో అవిశ్వాసము దాఁచి పెట్టి ముసల్మానులకు లభించు లాభములను పొంది భయములేకుండ యుండవ లెనని ఓముసల్మానులార! వారు మేము మీతోఁ గలిసి యున్నారము. మేము కూడ ముసల్మానులము అని ప్రమాణములుచేసి పలుకుచుండిరి. దానిగూర్చి దే వుఁడు ముసల్మానులకు వంచకుల వాస్తవమైన విషయము తెలుపుచున్నాఁడు. వారు నిజముగ ముసల్మానులుకారు. ముసల్మానులతో బహిరంగముగ విరోధ ము చేయలేక భీతితో అట్లు నటించుచున్నారు. ముసల్మానుల నుండి తప్పించు కొనుటకు వారికి వీలు దొరకినచో ఎప్పుడో తప్పించుకొని పాఱిపోయి యుం దురు. వంచకులకు శాంతితో నుండుటకు శరణము లభించిన లేదా సౌఖ్యము గా వసించుటకు గుహలు దొరకిన లేదా తలదాఁచుకొనుటకు తావు దొరకిన అ చ్చటికి తప్పక పోయియుందురు. అట్లు వారికి తావు దొరకనందున తప్పు ప్ర మాణములు చేసి ముసల్మానులకు మోసపుచ్చుచున్నారు. 58. కొందఱు వంచ కులును ఆరాబులు (బద్దూలు) దానములును విజయధనమును పైగంబరుల వా రు న్యాయముగ పంచలేదు అని నిందింపసాగిరి. దానికి కారణము వంచకులకు గల పేరాస. వారు కోరినంతవారి కిచ్చినచో వారట్లు పలుకరు. చాల ధనము లభించెనని సంతోష పడుదురు. వారు నిందింపరు. వారు కోరినంత దొరకనిచో వారికిఁగల పేరాసవలన కోపపడుదురు. ఇట్టి పేరాసగల వారికి నెంతలభించిన తక్కువయే! కావున వంచకులకు ముఖ్యముగా కావలసినది ధనమే. వారికి దే వుని ప్రీతి అక్కఱలేదు. ఒక నిజమైన భక్తుని యుద్దేశమిట్లుండకూడదు. ముస ల్మానుల యుద్దేశ మెట్లుండ వలెనో రాఁబోవు వాక్యములోచెప్పఁ బడినది. 59. దేవుడుఁ తన ప్రవక్తమూలమున ఎంత నొసంగునో దానితో తృప్తిచెంది దేవుడు ఇఁకమీఁద తన యనుగ్రహము చేయును అని ఆతనిపై నాధారపడి ధనమునందలి పేరాస వదలిపెట్టి దేవుఁడే చాలును. ఆతనిప్రీతి చాలును. దేవుఁడును ఆతని ప్రవక్తయు నెంతనొసంగుదురో అంతేచాలును అని పలుకుచు తృప్తిచెందియుండుట నిజమైనముసల్మాను భక్తులధర్మము. ఇట్లుతృప్తి చెందియుండుటయే మేలు అని బోధింపఁబడియెను. ఇఁక రాఁబోవు వాక్యము లో జకాతు దానములలో ఎవరెవరికి హక్కులు గలవో వివరింపఁ బడును.

60. ఇన్న-మస్-సద-ఖాతు-లిల్-ఫుఖ-రాఇ-వల్-మసాకీని-వల్-ఆమిలీన

అ ల్లైహీ-వల్-ముఅల్ల-ఫతి-ఖులూబుహుమ్-వఫిర్-రిఖాబి-వల్-గారిమీన-వ-ఫీ-సబీలిల్లాహి-వబ్-నిస్-సబీలి-ఫరీజతమ్-మినల్లాహి-వల్లాహు-అలీమున్-హకీమ్.

60. జకాతు దానములు నిరుపేదలకును అక్కఱ గలవారికిని జకాతు వసూలుచేయు పనిమీఁద నున్నవారికిని ఎవరి హృదయములు ఆకర్షింప వలసి యున్నదో వారికిని మెడలను విడిపించుటకును ఋణికులకును దేవుని మార్గ మందును, బాటసారులకును పంచవలెను. ఇది దేవుఁడు విధించినది. మఱియు దేవుఁడు సర్వము దెలిసిన వాఁడును వివేచనా పరుఁడును.

వ్యా॥ 60. జకాతు దానము పంచిపెట్టుటలో పైగంబరుల వారిని ఎవరు ను నిందింపఁ జాలరు. ఎందుకన రసూలువారు స్వయముగ పంచిపెట్టుటలేదు. దేవుఁడు విధించినట్లు ప్రవక్త పంచిపెట్టును. జకాతు దానములో ఎవరెవరికి హక్కుగలదో యిందు వివరింపఁబడినది (1) నిరుపేదలు (ఫుఖరా) బొత్తిగా నేమియు లేనివారు. (2) అక్కఱగలవారు (మసాకీన్) వారివద్ద కొంత ధనము గలదు. కాని అదివారి యక్కఱలకు పూర్తిగాదు. (3) ముసల్మాను రాజు, ముసల్మానులలో జకాతు వసూలు చేయుటకు కొందఱిని నియమించును. వారు ఆమిలీన్. (4) ఎవరు ఇస్లామ్స్వీకరింతురనిఆశయమున్నదో లేదా ఎవరికి ఇంకను ఇస్లామ్లో స్థిరత్వముగలుగ లేదో వారు ముఅల్లఫతుల్ ఖులూబ్. ఇట్టి వారిని ఆకర్షించుటకై జకాతులో కొంతధనమియ్యవలెను. (5) బానిసలను ఖైదీలను విడిపించుటకును (6) అప్పులవాలై ఋణబాధ పడువారికష్టమును తీర్చు టకును (7) దేవుని మార్గమందు శత్రువులతోయుద్ధమాడువారికి ధనసహాయము చేయవలెను. (8) బాటసారులు ప్రయాణములో వారియొద్ద ధనములేనిచో వారికి ధనసహాయము జకాతు దానమునుండి చేయవలెను. పైనెనిమిది విధము లుగ జకాతుదానము పంచిపెట్టవలెను. ఇది దేవుఁడు విధించినధర్మము. దేవుడు సర్వము తెలిసిన వాఁడును వివేచనా పరుఁడును. కావున ఎవరెవరు దానము గ్రహించుటకు అర్హులో తగినట్లుగ నియమించును. కావున దేవుని విధానము భక్తులు అనుసరింపవలెను.

61. వ-మిన్హుముల్ - లజీన-యూజూ-నన్-నబియ్యా- వ - యఖూలూన-హువ-ఉజు-నున్-ఖుల్-ఉజును-ఖైరిల్-లకుమ్- యూమిను-బిల్లాహి -వ-యూమిను-లిల్-మూమినీన-వ-రహ్-మతుల్-లిల్-లజీన-ఆమనూ-మిన్కుమ్-వల్లజీన-యూ-జూన-రసూలల్లాహి-లహుమ్-అజాబున్-అలీమ్. 62. యహ్-లిఫూన-బిల్లాహి-లకుమ్-లి-యుర్-జూకుమ్-వల్లాహు-వ-రసూలుహూ- అహఖ

ఖు-అన్-యఱ్-జూవఱు-ఇన్-కానూ-మూమినీన్. 63. అలమ్-యఅ్ - లమూ-అన్నహూ-మన్-యుహాదిదిల్లాహ-వరసూలహూ-ఫ-అన్న-లహూ-నార-జహన్న మ-ఖాలిదన్-ఫీహా-జాలికల్-ఖిజ్-యుల్-అజీమ్.

61. మఱియు వారిలో కొందఱు ప్రవక్త విషయము దుర్భాషలాడు చున్నారు. మఱి ఆతఁడు చెవి మాత్రము అని వారు పలుకుచున్నారు. మీకొఱకు మంచి చెవి. అతఁడు దేవునిని నమ్మచున్నాఁడు. మఱి ముసల్మానుల మాటను నమ్మచున్నాఁడు. మీలో విశ్వసించినవారికిఁగాను ఆతఁడు దయామయుఁడు అని పలుకుము. మఱెవరు దేవుని ప్రవక్తవిషయము దుర్భాషలాడుచున్నారో వారికి దుఃఖకరమైనశిక్షయున్నది. 62. వారు మిమ్ము సంతోషపెట్టుటకు మీయెదుట దేవుని ప్రమాణములు చేయుచున్నారు. వారు విశ్వాసులైనచో దేవునిని ఆతని ప్రవక్తను ఎక్కువగా సంతోషపెట్టవలసినది. 63. ఎవఁడు దేవునిని ఆతని ప్రవక్తను విరోధించునో వానికి నరకాగ్ని యున్నది. అందు వాఁడు సదా యుండును. ఇదియే గొప్ప యవమానము అని వారికిఁ తెలియదా!

వ్యా॥ 61. వంచకులు తమ సభలలో కూర్చుండి ఇస్లామ్‌నుగూర్చియు పైగంబరులవారినిగూర్చియు దుర్భాషలాడుచుందురు. అందె ఎవఁడైనఅయ్యో! మాపలుకులు రసూలువారికిఁ దెలియునేమో అని పలికిన ఇతరులు, భయపడ నక్కఱలేదు. ఆయనవద్దకు పోయి తప్పు ప్రమాణములుచేసి తప్పించుకోవచ్చును. ఆయన చెవి. మేము చెప్పినదంతయు విని సమ్మతించును. కావున మా కేమియు హానిలేదు అని పలుకుదురు. వంచకులు ఇట్లు పలుకుటకు కారణ మేమనఁగా హజ్రత్ రసూలువారు తమ సుగుణములచే వంచకులు చేయు ప్రమాణములు తప్పు అని తెలిసియు దానిగూర్చి వంచకులకు ఏమియు చెప్పక వారిని వదలిపెట్టుదురు. అందుకుమూఢులైన వంచకులు, హజ్రత్ రసూలువారు మోసపోయినారని తలంచుదురు. దానికిఁగాను దేవుఁ డిట్లు పలుకుచున్నాఁడు. ఓ వంచకులారా! పైగంబరులవారు అట్లుండుట మీకే మేలుగదా! అట్లు కానిచో మీరు శిక్షింపఁబడుదురు గదా! బహుశః పైగంబరులవారు మిమ్ము క్షమించుటను చూచి మీరు సన్మార్గమునకు వచ్చిన రావచ్చును. మీతప్పు మాటలు విని ప్రవక్త యూరక ఉండుటవలన మీమాటలు ఆయన నమ్మచున్నాఁడని భ్రమపోకుఁడు. ప్రవక్తకు నమ్మకము దేవునియందును భక్తులగు ముసల్మానులందును మాత్రము గలదు. మీలో నెవరు విశ్వాసులని నటించుచున్నారో వారి విషయము ప్రవక్త యూరకుండుట వారియందు కనికరము చేసినట్లు అని యనుకొనుఁడు. ప్రస్తుతము అట్టి కపటులను బహిరంగముగ అవమానపఱచుట లేదు. మఱి వంచకులు చేయు కుట్రలును, దుర్భాషలును దేవునికిఁ దెలియును. అట్టి

వారికి దుఃఖకరమైన శిక్ష కలుగనున్నది. దానికిఁగానువారు వేచియుండవలెను.

వ్యా॥ 62. ఒకపుడు హజ్రత్ రసూలువారు, వంచకులుచేయు కుట్రను పట్టునపుడు వంచకులు ముసల్మానులయొద్దకుపోయి ఓయీ! మేమట్లు చేయలేదు. దేవుని ప్రమాణము అని పలుకుచు ముసల్మానులను సంతోషపెట్టుటకు యత్నింతురు. ఇట్టిది దేవునియొద్దను ఆతని ప్రవక్త యెదుటను సాగదు. వంచకులు నిజమైన విశ్వాసముగలవారైనచో ముందు దేవునిని ఆతని ప్రవక్తను సంతోషపెట్టవలెను. 63. దేవునిని ఆతని ప్రవక్తను విరోధించువారికి సదా నరకాగ్ని నివాసమున్నది. ఇది చాల అవమానకరమైనది అని వంచకులకుఁదెలియ లేదా! ఇహలోకములో వంచకుల మోసము బయలుపడి వారికి అవమానము లభింపకూడదు అని వంచకులు అట్లు కుట్రలుచేయుదురు. కాని పరలోకములో నరక నివాసమువలన లభించు అవమానము ఇహములో గలుగు అవమానమునకంటె నెక్కువగా వంచకులకు లభించును అని హెచ్చరింపఁబడియెను.

64. యహ్-జరుల్-మునాఫి-ఖూన అన్-తునజ్-జల-అలైహిమ్ - సూరతున్-తునబ్బి-ఉహుమ్-బిమా-ఫీ-ఖులూ-బిహిమ్-ఖులిస్ తహ్-జిఊ ఇన్నల్లాహ ముఖ్-రిజుమ్-మాతహ్-జరూన్.

64. తమ హృదయములలో నున్నదానిని స్పష్టముగాఁ దెలుపునట్టి 'సూరా' ముసల్మానులకు లభించునేమో అని వంచకులు భయపడుచునుందురు, మీరు పరిహాసమాడుఁడు. మీరు భయపడుదానిని తప్పక దేవుఁడు బయలుపఱచును అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 64. వంచకులు తమ సభలలో ఇస్లామ్‌మత ధర్మముల విషయమును హజ్రత్ రసూలువారి విషయమును ముసల్మానుల విషయమును పరిహాసమాడుచు అనేక దుర్భాషలాడుచుందురు. వీరి పలుకులు హజ్రత్ రసూలువారికిఁ దెలసిన భయములేదు. తప్పు ప్రమాణములాడినచో ఆయన మన్నించును అని తలఁచియు దేవుఁడు ఖురానులో వంచకుల కుట్రలు తెలుపునేమో అని భయపడుచుందురు. సూరా అనగా కొన్ని వాక్యముల సమూహము. వంచకుల స్వభావమునుబట్టి వారికి ధైర్యములేదు. వారుచేయు రహస్య కుట్రలు బయలుపడునేమో అనివారికిభయము గలుగుచుండును. దానికి దేవుఁడు ఓ వంచకులార! మీరు ఎగతాళిచేయుచు నుండుఁడు. మీరహస్యములన్నియు దేవునికిఁ దెలియును. వానిని బయలుపఱచి మిమ్ము అవమాన పఱచును.

65. వలఇన్-సఅల్-త-హుమ్-లయఖూలున్న ఇన్నమా-కున్నా-నఖూ-జు-వనల్-అబు-ఖుల్-అబిల్లాహి-వ-ఆయా-తిహీ-వ-రసూలహీ-కున్తుమ్ - తస్-

తహ్జిఊన్. 66. లా-తఅ-తజిరూ-ఖద్-కఫర్-తుమ్-బఅద - ఈమానికుమ్ - ఇన్-నఅఫు-అన్-తాఇ-ఫతిమ్-మిన్-కుమ్-నుఅజ్-జిబ్-తాఇ-ఫతమ్-బి - అన్న-హుమ్-కానూ-ముజ్రి-మీన్.

65. మఱియు నీవు వారిని ప్రశ్నించినయెడల వినోదముగ ముచ్చటించితిమని పలుకుదురు. ఏమి మీరు దేవునితోను, ఆతని వాక్యములతోను ఆతని ప్రవక్తతోను పరిహాసములాడుచుండిరా! 66. మీరు సాకులుకల్పింపకుఁడు, మీరు విశ్వాసము వహించిన పిదప అవిశ్వాసులైతిరి. మీలోనికొందఱిని మేము క్షమించినను పాపులైన మఱికొందఱినిశిక్షింతుము అని ఓ ప్రవక్తా! పలుకుము,

వ్యా॥ 65. తబూకు యుద్ధమునకు పోవుచు కొందఱు వంచకులు పరిహాసముగ చూడుడు. ముహమ్మదు సిరియాలోని మేడలను రోమనుల పురములను జయింతును అని కల చూచుచున్నాఁడు. అది నిజమేనా! రోమనులు మమ్ములను బంధింతురు. మా పండితులు (పైగంబరులవారి శిష్యులు) తిండిపోతులు, అబద్ధవాదులు, పిఱికులు రోమనుల సైనికులతో యుద్ధమాడగలరా అని పలికిరి. ఈమాటలవలన ముసల్మానులు పిఱికితనమువహింపవలెనని వంచకుల యుద్దేశము. హజ్రత్ రసూలువారికి ఈ విషయము దెలిసి వంచకులను పిలిచి దానిగూర్చి ప్రశ్నించిరి. దానికి వంచకులు మేము మనఃపూర్వకముగా అట్లు పలుకలేదు. వినోదముగ ప్రయాణము సాగుటకు ముచ్చటించితిమి అని పలికిరి. దానికి నిందు రద్దుచేయఁబడినది. ఏమి పరిహాసమాడుటకు ఇదియేన సమయము. వట్టి నోటిమాటలతోఁగూడ దేవునితోను ఆతని వాక్యములతోను ఆతని ప్రవక్తతోను పరిహాసములాడినచో విశ్వాసముండదు. అవిశ్వాసమగును. ఘోరపాతకమగును. మఱి వంచనతో అట్లు పలికిన ఘోరపాతకమగునని వేఱుగ చెప్పవలయునా! మత విషయములలో పరిహాసములాడుటవలనవిశ్వాసముపోయి అవిశ్వాసము లభించును. 66. ఓ వంచకులార! తప్పు సాకులు ఎందులకు చేయుదురు. దానివలన ప్రయోజనములేదు. ఎవరు వంచనతో పరిహాసములాడిరో వారికి శిక్ష తప్పక లభించును. అయినను ఇపుడు కూడ నెవరు మనఃపూర్వకముగా తమ వంచన వదలి పాపక్షమాపణ కోరుకొని భక్తిమార్గమందున్నచో వారి పాపములను దేవుఁడు క్షమించును. లేనిచో పాపములలో నిమగ్నులై నుండితిరేని తప్పక శిక్షలభించును.

67. అల్-మునాఫిఖూన-వల్-మునాఫి-ఖాతు-బఅ-జుహుమ్-మిమ్-బఅ-జిన్-య-మురూన-బిల్ మున్-కరి-వ-యన్-హౌన-అనిల్-మఅ-రూఫి-వయఖ్-బి-జూన-ఐదియ-హుమ్-నసుల్లాహ-ఫనసియ-హుమ్-ఇన్నల్-మునా-ఫిఖీన

హుముల్-ఫాసిఖూన్- 68. వ-అ-దల్లాహుల్-మునాఫిఖీన-వల్-మునా-ఫిఖాతి వల్-కుఫ్-ఫార-నార-జహన్నమ-ఖాలిదీన-ఫీహా-హియ - హస్బు-హుమ్- వ లఅన హుముల్లాహు-వల-హుమ్-అజా-బుమ్-ముఖీమ్.

67. వంచకులైన పురుషులును, స్త్రీలును ఒకే రీతిగా నున్నారు. వారు అధర్మమును ఆజ్ఞాపించి ధర్మమును నిషేధించి తమ చేతులను ముడుచుకొందురు. వారు దేవునిని మఱచిపోయిరి. కావున దేవుఁడు వారిని మఱచిపోయెను. నిశ్చయముగా వంచకులే అవిధేయులు. 68. దేవుఁడు, వంచకులైన స్త్రీపురుషుల తోను అవిశ్వాసులతోను నరకాగ్నియొక్క వాగ్దానము చేసియున్నాఁడు. అందు వారు శాశ్వతముగా నుందురు. అదే వారికి చాలును. మఱి దేవుఁడు వారిని శపించెను. మఱి వారికి స్థిరమైన శిక్షయున్నది.

వ్యా॥ 67. వంచకులలోని స్త్రీలేమి పురుషులేమి అందఱును ఒకేరీతిగా నున్నారు. వారు నోటిమాటలతో ఇస్లామ్ వెల్లడించియు దానికి విరుద్ధముగా నడచుచుందురు. రాత్రింబవలు కుట్రలు సలుపుచుందురు. ప్రజలకు ధర్మమార్గము నుండి నిషేధించుచు అధర్మమైన పాపకార్యములకు ప్రోత్సాహపఱతురు. ధనము ఖర్చుచేయు సమయము వచ్చినపుడు ఖర్చుచేయక లోభముచేతను చేతులను ముడుచుకొందురు. వారి మాటలవలన వారి ధనమువలన ప్రజలకు లాభముకలుగుటలేదు. కాని నష్టమే కలుగుచున్నది. ఇట్లు వారు దేవుని మఱచి నడచుకొనునపుడు దేవుఁడుకూడ వారిని అనుగ్రహింపక మఱచినవానివలె నరగాగ్నిలో వదలిపెట్టును. 69. ఇందు వంచకులకును అవిశ్వాసు (కాఫిర్ల)లకునులభించు శిక్ష చెప్పఁబడినది. వీరి పాపములకు చాలిన శిక్ష నరకాగ్నినివాసము. దేవుని వారు శాపమునకు పాత్రులై ఉభయలోకములలో చెడుదురు. వారికి లభించు శిక్ష తొలఁగదు. అది స్థిరముగా సదా యుండునది.

69. కల్లజీన మిన్-ఖబ్లి-కుమ్-కానూ-అషద్ద-మిన్‌కుమ్ ఖువ్వా-తన్-వ-అక్సర-అమ్వా-లన్-వ-ఔలాదన్-ఫస్-తమ్-తఊ-బి-ఖలా-ఖిహిమ్-ఫస్-తమ్-తఅతుమ్- బి - ఖలా-ఖికుమ్ కమస్-తమ్-తఅల్-లజీన మిన్-ఖబ్లి-కుమ్-బి- ఖలాఖిహిమ్-వ-ఖుజ్-తుమ్ కల్లజీ-ఖాజూ- ఉ-లా-ఇక-హబితత్-అఅ-మాలు - హుమ్-ఫిద్-దున్యా వల్-ఆఖిరతి-వ-ఉలా-ఇక-హుముల్-ఖాసిరూన్. 70. అలమ్-యాతి-హిమ్-నబ-ఉల్-లజీన-మిన్-ఖబ్లి హిమ్-ఖౌమి-నూహిన్-వ-ఆదిన్-వ-సమూద వ-ఖౌమి-ఇబ్రాహీమ-వ-అస్-హాబి-మద్యన-వల్-మూ-తఫకాతి-అతత్

వ్లహుమ్-రుసులు హుమ్ బిల్-బయ్యినాతి-ఫమా కానల్లాహు లి-యఝ్‌లిమ-హుమ్ వ-లాకిన్-కానూ అన్-ఫుసహుమ్-యఝ్-లిమూన్.

69. (ఓ వంచకులార!) మీరును మీపూర్వికులవలెనున్నారు. వారైతే మీకంటె నెక్కువ బలమును ఎక్కువ ధనమును బిడ్డలును గలిగియుండిరి. పిదప వారు తమ భాగమునుండి లాభముపొంది పోయిరి. ఎట్లు మీపూర్వికులు తమ లాభము పొంది పోయిరో అటులే మీరును మీభాగమునుండి లాభముపొందితిరి. మఱి మీరును వారి పద్ధతిని అనుసరించితిరి. వారి కర్మలు ఇహమునందును పరమునందును వృథాపోయెను. మఱి వారే నష్టముపొందువారు. 70. ఏమి వారి పూర్వులగు నూహుజాతి, ఆదుజాతి, సమూదుజాతి, ఇబ్రాహీము జాతి, మద్యనువారు, తలక్రిందులుగఁజేయఁబడి నాశమొందిన పురములు మొదలగు జాతి వారి వార్త వారియొద్దకు రాలేదా! వారియొద్దకు వారి ప్రవక్తలు స్పష్టమైన సూచనలు దీసుకొనివచ్చిరి. కావున దేవుఁడు వారికి నన్యాయము చేసియుండలేదు. కానివారు తమ యాత్మలకే అన్యాయము చేసికొనుచుండిరి

వ్యా॥ 69. ఇందు వంచకులకు మందలింపుగలదు. పూర్వికులు వారి అదృష్టములో నెంత భాగము ఇహలోకసౌఖ్యములు పొందవలసియుండెనో పొంది పరలోకమును మఱచిపోయిరి. అటులే ఓ వంచకులార! మీరుకూడ పరలోకమును మఱచిపోయి మీభాగ్యములో నున్నంత సౌఖ్యములు పొందుచున్నారు. పరలోకమునుగూర్చి కన్నులు మూసికొనియున్నారు. మీపూర్వికుల పద్ధతివలె మీరీతి యున్నది. వారి కెట్లు దుర్గతి గలిగెనో మీకును గలుగును. వారు మీకంటె హెచ్చుగా బలమును ధన సంతానములును గలిగియుండిరి. అట్టివారే దేవుని శిక్షనుండి తప్పించుకొనలేక నశించిరి. మీరెట్లు తప్పించుకొనఁగలరు. ఇట్లు పరలోక విషయమున నిశ్చింతులై యున్నారు. మీపూర్వికులు చేసిన కర్మలు ఇహమునందును పరమునందునువృథాపోయెను. వానివలనవారికేలాటి లాభము కలుగలేదు. వారికినష్టమే కలిగెను..అటులేమీగతియగును. 70. పూర్వము గడచిన అవిశ్వాసులు దేవుని ప్రవక్తలను తిరస్కరించి పాపములలో నిమగ్నులైరి. కావునవారు దేవుని శిక్షకుపాత్రులైనశించి. వీరివార్తవినియైన వంచకులు బుద్ధి తెచ్చుకొనవలెను. నూహుప్రవక్తను తిరస్కరించినందున దుష్టులు నీళ్ల ప్రళయమువలనను, ఆదుజాతివారు తుపానుగాలివలనను, సమూదుజాతివారు భయంకరమైన శబ్దమువలనను నశించిరి. ఇబ్రాహీము ప్రవక్తకు దేవుఁడు తోడుపడెను. ఆతని శత్రువగు నమ్రూదురాజు నీచమైన చావుపొంది నశించెను. మద్యను జాతివారు భూకంపయుతోను శబ్దమువలనను నశించిరి. లూతుజాతివారి పురములు తలక్రిందులుగఁ జేయఁబడెను. దేవుఁడు ఎవరికిని అన్యాయముచేయలేదు

ముందు ప్రవక్తలను పంపి ధర్మమార్గము బోధించెను. అపుడుకూడ ప్రజలు తమ పాపకార్యములు వదలనపుడు దేవుని శిక్ష వారికి లభించెను. కావున ప్రజలే దేవుని మాట వినక తమ యాత్మలకు నన్యాయము చేసికొనిరి.

71. వల్-మూమి-నూన-వల్-మూమి-నాతు-బఅ-జూహుమ్-ఔ-లి-యాఉ-బఅ-జిన్-యా-మురూన-బిల్-మఅ-రూఫి-వయన్-హౌన-అనిల్-మున్కరి-వ-యుఖీ-మూనస్-సలాత-వ-యూతూ-నజ్-జకాత-వ-యుతీ-ఊనల్లాహ-వ-ర-సూలహూ-ఉలాఇక-సయర్-హముహుముల్లాహు ఇన్నల్లాహ-అజీజున్-హకీమ్.

72. వఅ-దల్లా-హుల్-మూమినీన-వల్-మూమినాతి-జన్నాతిన్-తజ్రీ-మిన్-తహ్-తిహల్-అన్హారు-ఖాలిదీన-ఫీహా-వ-మసాకిన-తయ్యి-బతన్-ఫీ-జన్నాతి-అద్నిన్-వ-రిజ్వా-నుమ్-మినల్లాహి-అక్బరు-జాలిక-హువల్-ఫౌజుల్-అజీమ్.

71. మఱియు విశ్వాసులైన పురుషులును స్త్రీలును ఒకొరికొకరు తోడుపడువారు. వారు ధర్మమును గూర్చి యాజ్ఞాపించుచు అధర్మమును నిషేధించుచున్నారు. మఱియు వారు నమాజును స్థిరముగా సలుపుచున్నారు. మఱియు జకాతును చెల్లించుచున్నారు. వారు దేవునికిని ఆతని ప్రవక్తకును విధేయులై యున్నారు. ఇట్టివారినే దేవుడు కరుణించును. నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తుఁడును వివేచనా పరుఁడును. 72. విశ్వసించిన పురుషులకును స్త్రీలకును కాలువలు ప్రవహించు స్వర్గ వనములును అందుసదా నివాసమును శాశ్వతములుగనుండి వనములలో పరిశుభ్రములైన గృహములును గలవని దేవుఁడు వాగ్దానముచేసియున్నాఁడు. మఱియు దేవుని ప్రీతి అన్నిటికంటెను చాలగొప్పది. ఇదియే గొప్పజయము.

వ్యా॥ 71. దీనికి ముందు వంచకుల గుణములు వివరింపఁబడెను. ఇఁక ఈవాక్యములో విశ్వాసులైన ముసల్మానుస్త్రీ పురుషుల సుగుణములు వివరింపఁబడుచున్నవి. ముసల్మానులు ఒకొరికొకరు తోడుపడుదురు. వారియందు స్నేహభావము సంపూర్ణముగ గలదు. కావుననే తమ స్నేహితుల మేలుకోరి మంచికార్యములు (ధర్మములు) చేయుఁడు అనియు, అధర్మములు (పాపకార్యము) చేయకుఁడు అనియు పరస్పరము బోధింతురు. దేవునిని మఱవక నమాజు (ప్రార్థన) స్థిరముగా భక్తిపూర్వకముగ సలుపుదురు. లోభము వహింపక తమ యొద్దనుండు ధనములో బీదలకు దానము (జకాతు) చేయుదురు. ముసల్మానులు ప్రతి విషయములలోను దేవునికిని ప్రవక్తకును విధేయులై వారి యాజ్ఞలను

అనుసరించు చుందురు. ఇట్టి సుగుణములుగల ముసల్మానులు స్త్రీలేమి పురుషులేమి దేవుని దయకు పాత్రులు. దేవుఁడు సర్వశక్తుఁడు. ఆతని దయకు అడ్డుపడువారెవరును లేరు. 72 ముసల్మానులకు వారికర్మల ఫలితముగ దేవుని అనుగ్రహమువలన స్వర్గము లభించును. అందు ఆత్మిక ఐహిక సర్వ సౌఖ్యములు లభించును. అందు ఏలాటి కొఱతలేదు. అందు సదా నివాసము లభించును. వీని కన్నిటికిని గొప్పది. దేవుని ప్రీతి. ఇది ముసల్మాను భక్తులకు లభించును. ఇదియే గొప్పవిజయమును మోక్షమును కావున ముసల్మానులందఱును దేవుని ప్రీతిపడయుటకై తమ జీవిత కాలములోనే కృషి సలుపవలెను.

73. యా-అయ్యు-హన్-నబియ్యు-జాహి-దిల్-కుఫ్-ఫార-వల్-మునాఫిఖీన-వగ్-లుజ్-అలైహిమ్-వ-మావా-హుమ్-జహన్నము-వ-బీసల్-మసీర్. 74. యహ్-లిఫూన-బిల్లాహి-మా-ఖాలూ-వలఖద్-ఖాలూ-కలిమతల్-కుఫ్రి-వ-కఫరూ-బఅద-ఇస్లామి-హిమ్-వ-హమ్మూ-బిమా-లమ్-యనాలూ-వ-మా-నఖమూ-ఇల్లా-అన్-అగ్నా-హుముల్లాహు-వ-రసూలుహూ-మిన్-ఫజ్‌లిహీ-ఫఇన్-యతూబూ-యకు-ఖైరల్-లహుమ్-వ-ఇన్-యతవల్లౌ-యుఅజ్-జిబ్-హుముల్లాహు-అజాబన్-అలీ-మన్-ఫిద్-దున్యా-వల్-ఆఖిరతి-వ-మా-లహుమ్-ఫిల్-అర్‌జి-మిన్-వలియ్యిన్-వలా-నసీర్.

73. ఓప్రవక్తా! అవిశ్వాసులతోను వంచకులతోను యుద్ధమాడుము. మఱివారి విషయము కఠినముగా ప్రవర్తింపుము. మఱి వారి నివాసము నరకమున్నది. మఱి అదిచాల చెడ్డనివాసము. 74. వారు "తాము పలుకలేదని" దేవుని నామముతో ప్రమాణము చేయుచున్నారు. మఱి నిశ్చయముగా వారు అవిశ్వాసపు వాక్కు పలికి యున్నారు. మఱి వారు ఇస్లామ్‌లో చేరిన పిదప తిరస్కరించిరి. వారికి లభింపనిదానిని వారు కోరిరి. మఱి దేవుఁడును ఆతని ప్రవక్తయును అనుగ్రహించి వారిని ధనవంతులుగఁ జేసినందులకే వారు ఈప్రతీకారము చేసిరి. కావున వారు క్షమాపణ కోరుకొన్నచో వారికి మేలగును. మఱి వారు తిరస్కరించి మరలి పోయినచో దేవుడు ఇహమునందును పరమునందును వారికి దుఃఖకరమైన శిక్ష విధించును. మఱి భూమిలోపల వారికి ఎవరును రక్షకుఁడుగాని సహాయుఁడు గాని లేరు.

వ్యా॥ 73. అవిశ్వాసుల (కాఫిర్లు) ముసల్మానులను తుదముట్ట నశింపఁజేయవలెనని యత్నించుచుండిరి. తబూకు దండయాత్రలో వంచకులకుట్ర బయలుపడెను. కావున ఇట్టివారు మాటలతో వినువారు కారు. వారితో యుద్ధమాడ

వలయును. హజ్రత్ రసూలువారు మృదువైన హృదయము గలవారు. కఠినముగా ప్రవర్తింపరు. దుర్మార్గులు మెత్తని మాటలవలన తమ దుర్మార్గము వదలరు. కావున వారి విషయము కఠినముగా ప్రవర్తింప వలయును అని పైగంబరులవారికి దేవుని సెలవయ్యెను. జిహాద్ అను పదమునకు అధర్మమును తొలఁగించుటకు చాల యత్నించుట అని అర్థము. దీనిననుసరించి శత్రువులతో కత్తితోను వాక్కుతోను కలము (వ్రాత)తోను మార్కొనుట జిహాద్ అనఁబడును. సమయోచితముగ ఈమూడు విధములైన జిహాద్ ముసల్మానులు చేయుచు నుండవలెను. 74. వంచకులు ముసల్మానులకు వెనుక ఇస్లామ్‌ను గూర్చియు హజ్రత్ రసూలువారిని గూర్చియు దుర్భాషలాడుచు నిందించుచుందురు. ఆ విషయము ముసల్మానులకుఁ దెలిసి వానిని పైగంబరుల వారికిఁ దెలిపిరి. వంచకులు వచ్చి ముసల్మానులు మీకుఁ దెలిపినది యసత్యము. మేమట్లు పలుక లేదు అని తప్పు ప్రమాణములు చేసిరి. అపుడు దేవుఁడు ముసల్మానులు విని ప్రవక్తకుఁ దెలిపినది నిజము. వంచకులు ఆమాటలు పలికి యున్నారని తెలిపెను. వంచకులు ముసల్మానులలో చేరియు అట్లు పలికిరి. ఆమాటలు కాఫిర్లు పలుకునది అని వంచకు లనుమందలింపఁ బడిరి. 75. హజ్రత్ రసూలువారు తబూకు దండయాత్రనుండి తిరిగి వచ్చుచు ముసల్మానుల సైన్యమును వదలి కొండదోవన పోయిరి. అపుడు వారివెంట అమ్మారు హుజైఫా అను ఇద్దరు శిష్యులు మాత్రముండిరి. ఆసమయములో రాత్రివేళ పండ్రెండుమంది వంచకులు తమ ముఖములను కప్పుకొని హజ్రత్ రసూలువారిని కొండపైనుండి దొరలింప వలెనని యుద్దేశించి వచ్చిరి. వంచకులు అమ్మారును చుట్టుకొనిరి. హుజైఫా వారిని కొట్టి తరిమెను. హుజైఫా అమ్మారు వంచకులను గుర్తింప లేక పోయిరి. కాని పైగంబరులవారువారి పేర్లన్నియు, వారికితెలిపి ఎవరితో చెప్పకూడదని పలికిరి. అట్లు వంచకులు తాము ఉద్దేశించి వచ్చిన కోరిక వారికి లభింపలేదు. అయిన కుట్రచేసి తమ ద్రోహమును చూపించిరి. మదీనా పురములోని వంచకులు ముసల్మానులతో చేరినందున వారికి దేవుని అనుగ్రహము వలన పైగంబరులవారి మూలమున వారికి గొప్ప ధనము లభించెను. వానలు మెండుగ కురిసి వారి పంటలు బాగుగపండెను దేవుఁడువంచకులకుఁ జేయుమేలునకు బదులుగవారుఅవకారమునకు పూని ఇస్లామ్‌నకును ప్రవక్తకును విరోధముగ కుట్రలు సలుపుచున్నారు. ఇప్పుడైన నరేవారు తమ కుట్రలను మానుకొని భయభక్తులతో పాపముల క్షమాపణ కోరుకొన్నచో దేవుఁడు వారిని క్షమించును. దానివలన వారికి మేలుకలుగును. లేనిచో వారుచేయు తిరస్కారమునకుఁగాను వారు ఉభయ లోకములలో చెడుదురు. దేవుని కఠిన శిక్షకు పాత్రులగుదురు. దేవుని శిక్షనుండి తప్పించువారు వారికి రక్షకులుగాని సహాయులుగాని భూమిలోపలలేరు. కావున

వంచకులు తమ వంచనను మానుకొని నిజమైన ముసల్మానులు కావలెను.

75. వ-మిన్-హుమ్-మ-న్ ఆ-హదల్లాహ-లఇన్-ఆతానా-మిన్-ఫజ్-లిహీ-లనస్-సద్ద-ఖన్న-వల-నకూనన్న-మినస్-సాలిహీన్. 76. ఫలమ్మా-ఆతాహుమ్ మిన్-ఫజ్-లిహీ-బఖిలూ-బిహీ-వత-వల్లౌ-వ-హుమ్-ముఅ-రిజూన్. 77. ఫ-అఅ ఖ బ-హుమ్-నిఫా-ఖన్-ఫీ-ఖులూ-బిహిమ్-ఇలా-యౌమి-యల్-ఖౌన-హూ-బిమా-అఖ్-ల-ఫుల్లాహ-మా-వ-అదూహు-వ-బిమా-కానూ-యక్-జిబూన్. 78. అలమ్-యఅ-లమూ-అన్నల్ల్లాహ-యఅ-లము-సిర్రహుమ్-వ-నజ్-వాహుమ్ వ-అన్నల్లాహ-అల్లా-ముల్-గుయూబ్.

75. మఱియు వారిలో కొందఱు దేవుఁడు అనుగ్రహముచేసి మాకొసంగినచో మేము తప్పక దానములు చేయుదుము. మఱి సత్కార్యులలోఁ చేరుదుము అని దేవునితో వాగ్దానము చేసిరి. 76. ఆ పిదప దేవుఁడు తన యనుగ్రహముచే వారి కొసంగగా వారు అందు లోభమువహించి తిరస్కరించుచు వెనుకకు మరలిపోయిరి. 77. ఆ పిదప వారు దేవునితోఁ జేసిన వాగ్దానమునకు వ్యతిరేకముగఁ జేసినందులకును వారు అబద్ధములు పలికినందులకును వారు దేవునిని చేరఁబోవు దినమువఱకును వారి హృదయములలో వంచన నాటుకొనునట్లు దేవుఁడు చేసెను. 78. ఏమి దేవుఁడు వారి రహస్యములను వారి యాలోచనలను ఎఱుంగుచున్నాఁడననియు, సర్వరహస్యములు దేవునికి బాగుగఁ దెలియును అనియు వారికిఁ దెలియదా!

వ్యా॥ 75. సాలబా బిన్ హాతిబు అను వాఁడు పైగంబరుల వారియొద్దకు వచ్చి నేను ధనికుఁడగునట్లుగ మీరు దేవునితో ప్రార్థన (దుఆ) చేయుఁడుఅని విన్నవించెను. అపుడు రసూలువారు “ఓ సాలబా! దేవుఁడు నీకొసంగియున్న దానిపై తృప్తిచెందుము. ఎక్కువగా ధనము లభించిన దాని హక్కులుభరింపజాలవు. అట్టిది నీకెందులకు అని పలికిరి. కాని ఆతఁడు వినక నేను ధనికుఁడైనచో దేవునిమార్గమందు దానములు చేయుదును. అని వాగ్దానముచేసెను. అపుడు పైగంబరులవారు వాని విషయము దేవునితో ప్రార్థించిరి. దేవునిఅనుగ్రహము వలన సాలబాకు సంపదలో చాలవృద్ధికలుగసాగెను. మేఁకలమందలు ఎక్కువ కాఁగా వాఁడు మదీనాపురమును వదలి ఒక పల్లెలోపోయి బసచేసెను. అందు వాఁడు నిమగ్నుఁడై శుక్రవారము మొదలగు నమాజులకుఁగాను మసీదునకు వచ్చుట మానుకొనెను. కొన్నిదినముల పిదప జకాతు (విధిదానము) వసూలు చేయుటకై రసూలువారు సాలబాయొద్దకు తమ శిష్యులను పంపఁగా జకాతు

దాన మియ్యక తిరస్కరించెను. ఆ విషయము హజ్రత్ రసూలువారికిఁ దెలిసి వాఁడు చెడును అని మూఁడుతూర్లు పలికిరి. ఈ విషయమునుగూర్చి యిందు చెప్పఁబడినది. సాలాబా తన విషయము దేవుని వాక్యములు వచ్చినవి అని తెలిసి ఇష్టము లేకున్నను జకాతు తీసికొనివచ్చెను. పైగంబరులవారు దేవుఁడు నీ జకాతు తీసికొనకూడదు అనిసెలవిచ్చినాఁడు. కావున నేను అంగీకరింపను అని చెప్పి పంపివేసిరి. సాలబా హజ్రత్ రసూలువారి మరణాంతరము జకాతు దీసికొని హజ్రత్ అబూబకరువారియొద్దకు వచ్చెను. వారుకూడ హజ్రత్ రసూలువారు తీసికొనక తిరస్కరించిన జకాతు నేను అంగీకరింపను అని పలికి పంపివేసిరి. ఇటులే హజ్రత్ అబూబకరుగారి మరణాంతము హజ్రత్ ఉమరుగారి ఖిలాఫత్ కాలములో సాలాబా జకాతు తీసికొని రాఁగా వారుకూడ అంగీకరింపలేదు. ఇట్లు హజ్రత్ ఉమరుగారి మరణాంతరము హజ్రత్ ఉస్మానుగారి ఖిలాఫత్ కాలములోని సాలబా జకాతు తీసికొని రాఁగా వారును అంగీకరింపలేదు. హజ్రత్ ఉస్మానుగారి కాలములోనే సాలబా వంచకుఁడై మరణించెను. 77. వాగ్దానములు చేసి దానిపూర్తిచేయక లోభము వహించి అబద్ధకూఁతలు కూయుట వంచకుల పని. కావున అట్టి పాపకార్యములవలన వారి హృదయములలో విశ్వాసము చొరక వంచనయే నాటుకొనఁబడెను. అదివారు చచ్చి దేవునియొద్దకుఁ బోవునంతవఱకుండునది. అది వదలిపోదు. 78. వంచకులు చేయు వాగ్దానములును వారి మాటలును వారి హృదయములలోని రహస్యములును, వారు తమవంటి వంచకులతోఁ జేరి ఇస్లామ్‌నకు విరుద్ధముగ చేయు ఆలోచనలును దేవునికిఁ దెలియును. దేవుఁడు సర్వరహస్యములు దెలిసినవాఁడు. వానికిఁ దగిన ఫలిత మొసంగును అను ఈ విషయములు వారికిఁ దెలియలేదా అని హెచ్చరింపఁబడెను.

79. అల్లజీన-యల్-మిజూ-నల్-ముత్-తవ్వి-ఈన-మినల్-మూమి-నీన-ఫిస్-సద-ఖాతి-వల్లజీన-లాయజిదూన-ఇల్లా-జుహ్‌దహుమ్-ఫయస్ - ఖరూన-మిన్-హుమ్-సఖిరల్లాహు-మిన్-హుమ్-వల-హుమ్-అజాబున్-అలీమ్.

79. ఎవరు, మనఃపూర్వకముగ సంతోషముతో దానము చేయు ముసల్మానులను తమ కష్టముతప్ప వేఱు సంపాదన లేని వారిని నిందించుచు వారితో పరిహాసము లాడుచున్నారో వారితో దేవుఁడు పరిహాస మాడియున్నాఁడు. మఱివారికి దుఃఖకరమైన శిక్షయున్నది.

వ్యా॥ 79. ఒకతూరి హజ్రత్ ముహమ్మదువారు తమ శిష్యులను దానముసు గూర్చి ప్రోత్సాహ పఱచిరి. అపుడు అబ్దుల్ రహ్మాన్ బిన్ ఔఫుగారు నాలుగువేల దిర్‌హములును ఆసిముబిన్ అదీ నాలుగువేలు దిర్‌హముల వెల

గల ఖర్జూరములు పైగంబరులవారి సన్నిధికిఁ దెచ్చి దానమునకుఁగాను సమర్పించిరి. (ఒకదిర్‌హాము నాలుగు అణాలు). ఇది చూచి వంచకులు వారిద్దఱినినిందించుచు వీరు ప్రజలుచూచి మెచ్చుకొనవలెనని యింతదానము చేసినారు అని పలికిరి. అందు ఒక బీదశిష్యుఁడు (సహాబీ) పగలంత కష్టపడి కొన్ని సేర్లు సంపాదించినదానినుండి యొక సాఅ ఖర్జూరములు దానము చేసెను. అదిచూచి వంచకులు పరిహాస మాడుచు ఇంతకొద్ది దానముతో ఏమి అగును అని పలుకసాగిరి. ముసల్మానులు దానము ఎక్కువ చేసినను తక్కువగాఁ జేసినను వంచకులు తమ దుష్టస్వభావముతో నిందించుచు పరిహాసములాడుచుండిరి. దానికి దేవుఁడు వారికి కొంత గడువొసంగి పరిహాసము లాడినట్లుగ వదలిపెట్టెను. తుదకు వంచకుల దుర్మార్గము మితిమీఱి వారినాశమునకు కారణమాయెను. వారు దుఃఖకరమైన శిక్షకు పాలైరి. మంచికార్యములలో నిందించి పరిహాసము లాడుట వంచకుల పని. ఇట్టి దుర్గుణములను భక్తులు మానుకొనవలెను.

80. ఇస్-తగ్-ఫిర్-లహుమ్-ఔ-లా తస్-తగ్-ఫిర్-లహుమ్- ఇన్-తస్-తగ్-ఫిర్-లహుమ్-సబ్-ఈన-మర్రతన్-ఫలన్-య్యగ్-ఫిరల్లాహు-లహుమ్-జాలిక బి-అన్నహుమ్-కఫరూ-బిల్లాహి-వ-రసూలిహీ-వల్లాహు-లా-యహ్దీ - ల్-ఖౌమల్-ఫాసిఖీన్.

80. నీవు వారికొఱకు క్షమాపణఅడుగుము. అడుగకపొమ్ము. వారికొఱకు డెబ్బది తూర్లు నీవు క్షమాపణ వేఁడినను దేవుఁడు ఎన్నటికిని క్షమింపఁడు. ఇది వారు దేవునిని అతని ప్రవక్తను తిరస్కరించి నందునకుఁగాను. మఱి దేవుఁడు, అవిధేయులైనట్టి జనులకు దోవ చూపఁడు.

వ్యా॥ 80. వంచకులకుగాను, దేవునితో వారిని క్షమించుమనట్లుగ ఎన్నిసార్లు కోరినను కోరక పోయినను వారి విషయము సమానమే. దానివలన వారికి ప్రయోజనములేదు. ఎందుకన వంచకులు తిరస్కరించి కాఫిరులైరి. వారు ప్రవక్త బోధవినియు దానిని తిరస్కరించిరి. కావున వారిపాపములను దేవుఁడు క్షమింపనే క్షమింపఁడు. ఈ వాక్యములో వంచకుల నాయకుఁడైన అబ్దుల్లాబిన్ ఉబైను గూర్చి విషయము గలదు. అది ఏమన:- వంచకుల నాయకుఁడగు అబ్దుల్లాబిన్ ఉబై మదీనా పురములో చనిపోఁగా హజ్రత్ రసూలువారు తమ అంగీని వానికి కఫనులో చుట్టుట కొసంగిరి. వానికిఁగాను సమాజె జనాజా (ప్రార్థన) సలిపిరి. వాని క్షమాపణకుఁగాను దేవునిని ప్రార్థించిరి. హజ్రత్ ఉమరుగారు ఓ ప్రవక్తా! మీరెందులకు ప్రార్థింతురు. ఈతఁడు వంచకుల నాయకుఁడే. ఫలాఫలాని సమయములో నష్టము కలిగించి యున్నాఁడే అనివిన్నవించిరి. నా ప్ర

ర్ధన వలన ఈ వంచకునికి లాభము కాక పోయినను ఇతరులకు లాభము గలుగును. ఎట్లన నేను వంచకుల విషయము వర్ణించు సత్ప్రవర్తనమును చూచి యితర వంచకులు తమ వంచన వదలిపెట్టి సంపూర్ణులైన విశ్వాసు లగుదురు. తుదకు హజ్రత్ రసూలువారు పలికినట్లు అనేక వంచకులు సంపూర్ణులైన ముసల్మానులైరి.

81. ఫరి-హాల్-ముఖల్లఫూన-బి-మఖ్-అది-హిమ్-ఖిలాఫ రసూలిల్లాహి వ-కరిహూ-అన్-యుజా-హిదూ-బి-అమ్వా-లి హిమ్-వ-అన్ ఫుసి-హిమ్- ఫీస బీ-లిల్లాహి-ఖాలూ-లా-తన్-ఫిరూ-ఫిల్-హర్రి-ఖుల్-నారు-జహన్నమ- అషద్దు హర్రన్--లౌ-కానూ-యఫ్-ఖహూన్. 82. ఫల్-యజ్-హకూ-ఖలీ-లన్-వల్ యబ్ కూ-కసీరన్-జజా-అమ్-బిమా-కానూ-యక్-సిబూన్. 83. ఫఇర్-రజఅ-క ల్లాహు-ఇలా-తౌఇ-ఫతిమ్-మిన్-హుమ్-ఫస్-తాజనూక-లిల్-ఖురూజి-ఫఖుల్-లన్-తఖ్-రుజూ-మఇయ-అబదన్-వలన్-తుఖాతిలూ-మఇయ-అదువ్వన్-ఇన్న-కుమ్-రజీ-తుమ్-బిల్-ఖుఊది-అవ్వల-మర్ర-తిన్-ఫఖ్-ఉదూ-మఅల్-ఖాలి-ఫీన్.

81. దేవుని ప్రవక్తను వీడి వెనుక నిలిచి పోయినవారు తాము కూర్చుండి నందులకు సంతసించిరి. మఱివారు తమ ధనమును తమ ప్రాణములను దేవుని మార్గమందు వినియోగించి యుద్ధమాడుటకు ఇష్టపడలేదు. మఱియు వారు వేడిమిలో బయలు దేఱకుడు అని పలికిరి. ఓప్రవక్త! నరకాగ్ని దానికంటె చాల వేడిమి గలది అని పలుకుము. వారికి తెలివి యున్నచో(అట్లుచేయరు) 82. కావున వారు చేయుచున్న కర్మల ఫలితమునకు గాను వారుకొంత నవ్వుకొనవలెను. మఱి ఎక్కువ ఏడ్వవలెను. 83. కావున దేవుడు నిన్ను తిరిగి వారిలో కొందఱి యొద్దకు దీసికొని పోయినచో మరలవారు బయలుదేఱుటకు నీతో సెలవు కోరినచో మీరు నావెంట నెన్నటికిని బయలు దేఱరు. మఱి నాపక్షముచేరి శత్రువుతో మీరు యుద్ధమాడరు. మొదటితూరి మీరు కూర్చుండి యుండుటకు ఇష్టపడిరి. కావున మీరు వెనుక నిలిచి పోవువారితో కలిసి కూర్చుండి యుండుడు అని ఓప్రవక్తా ! పలుకుము.

వ్యా॥ 81. ఈవాక్యమునందు తబూకు దండయాత్రకు వెడలక నిలచి పోయిన వంచకుల విషయము చెప్పబడినది. ముసల్మానులు చేయు దానములు మొదలగు సత్కార్యములను వంచకులు నిందించి తాము చేయు అక్రమములపై సంతసించుచున్నారు. ధైర్యము వీడి శత్రువును మార్కొనకపోవుట నింద్యమేగదా! ధనమును ప్రాణమును దేవుని ప్రీతికొఱకు దేవుని మార్గమందు విని

యోగించి శత్రువులతో యుద్ధమాడుట గొప్ప పుణ్యకార్యము గదా! వంచకులు అట్లు చేయలేదు. తాము దండయాత్రకు పోక నిలిచినది గాక ఇతరులతో తీవ్రమైన వేఁడిమి గలదు. కావున మీరు యుద్ధమునకుఁగాను బయలు దేఱకుఁడు అని పలికిరి. ఎండవేఁడిమికి భయపడి నరకాగ్నిలో పడుట బుద్ధిమంతుల పనికాదు. ఈవేఁడిమికంటె నరకాగ్ని వేఁడిమి చాల తీవ్రమైనది. ఈ విషయము వంచకులకుఁ దెలిసినచో అట్లు చేయరు. 82. వంచకులు తాము చేయు అక్రమములపై కొన్ని దినములు సంతసించి నవ్వనిండు. తుదకు వారుతమ కర్మలకు ఫలితముగ సదా ఏడ్చుదురు. 83. హజ్రత్ రసూలువారు తబూకున నిలిచియుండిరి. వంచకులు మదీనాలోనుండిరి. ఇంతలో నెవరైన వంచకులు బహుశః చనిపోవుదురు. కావున వంచకులలోని కొందఱి యొద్దకు తిరిగి మదీనా పురమునకు దేవుఁడు పైగంబరుల వారిని తీసికొని వచ్చినచో అని చెప్పఁబడియె. ఒకవేళ తిరిగి శత్రువులను మార్కొనుటకు వెడలవలసి వచ్చినచో వంచకులు వచ్చి మేముకూడ మీవెంట యుద్ధమునకు బయలుదేఱుదుము. మీరు సెలవు నొసంగుఁడు అని అడిగినచో వారితో మొదటితూరియే మీ ధైర్యము తెలిసినది. ఇఁక మీరు నాపక్షము చేరి యుద్ధము చేయఁజాలరు. కావున ఆఁడువాండ్లతోను బిడ్డలతోను కలిసి కూర్చుండుఁడు. మీరు రానక్కఱలేదు అని వంచకులతో పలుకవలెనని హజ్రత్ రసూలువారికి దేవుని సెలవయ్యెను.

84. వలా-తుసల్లి-అలా-అహదిమ్-మిన్-హుమ్-మాత-అబదన్- వలా-తఖుమ్-అలా-ఖబ్-రిహీ-ఇన్నహుమ్-కఫరూ-బిల్లాహి-వ-రసూలిహీ-వ-మాతూ వహుమ్-ఫాసిఖూన్-

84. మఱి నీవు వారిలో చచ్చినవానికిఁగాను ఎప్పటికిని ప్రార్థన చేయకుము. మఱి వాని గోరియొద్ద నిలువకుము. వారు దేవునిని, ఆతని ప్రవక్తను తిరస్కరించిరి. మఱి వారు అవిధేయులుగ చచ్చిరి.

వ్యా॥ 84. వంచకుల నాయకుఁడు చచ్చిన పిదప సంభవించిన విషయము ముందు వ్రాసియున్నాము. దీని పిదప వంచకులలో నెవఁడైనను చచ్చినచో ప్రార్థన (నమాజెజనాజా) వానికిఁగాను చేయరాదు. వాని సమాధిచేయుటకును వాని పాపముల క్షమాపణ దేవునితో వేఁడుటకుఁగాను వంచకుని గోరియొద్ద నిలువకూడదు అని పైగంబరులవారికి దేవుని సెలవయ్యెను. అట్లు ప్రార్థన చేయకూడదు అనుటకు కారణముకూడ నిందు చెప్పఁబడినది. వంచకులు దేవునిని ప్రవక్తను తిరస్కరించి. చావువచ్చునంతవఱకును వారు తమ దుర్మార్గములను వదలక దేవునికి అవిధేయులుగనే చచ్చిరి.

85. వలా-తుఅ్-జిబ్-క-అమ్వా-లుహుమ్-వ-ఔ-లాదుహుమ్-ఇన్నమా యురీదుల్లాహు-అన్-యుఅజ్-జిబ-హుమ్-బిహా-ఫిద్-దున్యా-వతజ్-హఖ-అన్ఫుసుహుమ్-వ-హుమ్-కాఫిరూన్.

85. మఱియు వారి ధనమువలనను వారి సంతతివలనను నీకు ఆశ్చర్యము గలుగఁగూడదు. ఇహలోకమందు దానివలన వారిని శిక్షింపవలెను అనియు వారు అవిశ్వాసులుగ నుండునపుడు వారి ప్రాణములు పోవలెననియు దేవుఁడు కోరుచున్నాఁడు.

వ్యా॥ 85. దీని వ్యాఖ్యానమునకుఁగాని దీనికి పూర్వము గడచిన 55వ వాక్యమును చూడుఁడు.

86. వ-ఇజా-ఉన్-జిలత్-సూరతున్-అన్-ఆమినూ-బిల్లాహి-వ-జాహిదూ-మఅ-రసూలి-హిస్-తా-జనక-ఉలుత్-తౌలి-మిన్-హుమ్-వ-ఖాలూ-జర్నా-నకుమ్-మఅల్-ఖాఇదీన్. 87. రజూ-బి-అన్-యకూనూ-మఅల్-ఖవాలిఫి-వ-తుబిఅ-అలా-ఖులూ-బిహిమ్-ఫహుమ్-లాయఫ్-ఖహూన్. 88. లాకినిర్-రసూలు-వల్లజీన-ఆమనూ-మఅ-హూ-జాహదూ-బి-అమ్వా-లిహిమ్-వ-అన్ఫుసిహిమ్-వ-ఉలాఇక-లహుముల్-ఖైరాతు-వ-ఉలా-ఇక-హుముల్-ముఫ్-లిహూన్. 89. అ-అద్దల్లాహు-లహుమ్-జన్నాతిన్ తజ్రీ-మిన్-తహ్-తిహల్-అన్హారు-ఖాలిదీన-ఫీహా-జాలికల్-ఫౌజుల్-అజీమ్.

86. మఱియు ఒక సూరా పంపఁబడి, అందు దేవునిని విశ్వసింపుఁడు. ఆతని ప్రవక్త పక్షమున చేరి యుద్ధమాడుఁడు అని యున్నపుడు వారిలోని శక్తి గలవారు నీతో సెలవు అడుగుచున్నారు. మఱి వారు మమ్ము వదలిపెట్టుము. మేము కూర్చుండియుండువారితో నుందుమని పలుకుచున్నారు. 87. వారు వెనుక నిలిచిపోవునట్టి స్త్రీలతో నుండుటకు ఇష్టపడిరి. మఱి వారి హృదయములపై ముద్రవేయఁబడినది. కావున వారు గ్రహింపరు. 88. కాని ప్రవక్తయును, ఆతనితో విశ్వసించినవారును తమ ధనములను ప్రాణములను వినియోగించి యుద్ధమాడిరి. మఱి వీరికేను మేళ్లున్నవి. మఱి వీరేను జయముపొందువారు. 86. దేవుఁడు వీరికొఱకు కాలువలు ప్రవహించు స్వర్గవనములు సిద్ధపఱచియున్నాఁడు. అందు వారు సదా యుందురు. ఇదియే గొప్ప జయము.

వ్యా॥ 86, 87. ఖురానె షరీఫులోని సూరాలో సంపూర్ణముగ విశ్వసింపుఁడు. విశ్వాసమునకుఁ దగినట్లు దేవుని ప్రవక్త పక్షమునచేరి శత్రువులతో

యుద్ధమాడుడు అని ఆజ్ఞ గలిగినపుడు వంచకులు ప్రాణములు దాచుకొందురు. వంచకులలో శక్తిగలిగినవారును, అబద్ధ సాకులు చేయుచు వచ్చి పైగంబరుల వారితో ఓ ప్రవక్తా! మమ్మ వదలిపెట్టుము. మేము మదీనాలోనే యుందుము అని పలుకుచు సెలవడుగుదురు. వంచకులు సిగ్గు రోషములు లేక అధైర్యము వహించి ఇండ్లలో స్త్రీలతోఁజేరి కూర్చుండుటకు ఇష్టపడిరి. శత్రుభయము లేన పుడు చాల డంబాలు కొట్టుదురు. వంచకులలోనుండు వంచన, అధైర్యము, పిఱికితనము మొదలగు దుర్గుణములవలన వారిహృదయములపై ముద్రపడినది. వారికి వారి లోపములు, లోపములుగ కనుపించవు. పిఱికితనముపై సిగ్గుపడు టకు బదులుగ డంబాలు కొట్టుకొందురు. ఏది మేలో అద్దాని గ్రహించి స్వీక రింపరు. మఱియు నష్టకరములైనవానిని తెలిసికొని వానిని వదలిపెట్టరు. 88: 89. వంచకులలోనుండు దుర్గుణములు, నిజమైన ముసల్మానులలో నుండవు. కావున ఇందు ముసల్మానులు ఏరీతిగ ప్రవర్తింతురో చెప్పఁబడినది. ముసల్మానులు, దేవుని ప్రీతికొఱకు దేవునిమార్గమందు ధనముప్రాణములు వినియోగించి యుద్ధమాడుదురు. ఇట్టివారికే ఉభయలోకములలో మేలు గలుగును. శాశ్వత నివాసముగల స్వర్గసౌఖ్యములు లభించును. ఇదియే గొప్ప మోక్షమును జయమును.

90. వ-జాఅల్-ము-అజ్-జిరూన-మినల్-అఅరాబి-లి-యూజన-లహుమ్ వ-ఖఅదల-జీన-కజ-బుల్లాహ-వ-రసూలహూ-స-యుసీ-బుల్ల-జీన-కఫరూ-మిన్-హుమ్-అజాబున్-అలీమ్.

90. మఱియు సాకులు కల్పించునట్టి పల్లెటూరివారలు తమకు సెలవు లభింపవలెనని వచ్చిరి. ఎవరు దేవునితోను ఆతని ప్రవక్తతోను అబద్ధము లాడిరో వారు కూర్చుండిరి. ఇఁక వారిలో అవిశ్వాసులైనట్టివారికి దుఃఖకర మైన శిక్ష యున్నది.

వ్యా॥ 90. ఎట్లు మదీనాపురములో నిజమైన ముసల్మానులును వంచకులును గలరో అటులే మదీనాపురమునకు చుట్టుపట్లనున్న పల్లెలలోనుండు వారిలో పెక్కువిధములగు ముసల్మానులుండిరి. అందు నిజమైన భక్తులునుగలరు. అందు వంచకులును గలరు. ఈ వాక్యములో పల్లెలలోనుండు వంచకుల విషయము దెలుపఁబడినది. తబూకు దండయాత్రకు ముసల్మానులు వెడలవలెనని చాటింపఁబడెను. అది విని పల్లెలనుండి వంచకులు వట్టి లేనిపోని సాకులుకల్పించి తాము తమ ఇండ్లలోనే నిలిచిపోవునట్లుగ సెలవు పైగంబరులవారితో నడిగిరి. ఆ వంచకులలో కొందఱు తప్ప సాకులు చేయుటకునుకూడ రాలేదు. వారు

సెలవు పొందకనే తమ యిండ్లలో కూర్చుండిరి. వీరు ఇస్లామ్‌లో చేరితిమి అని దేవునితోను, ప్రవక్తతోను అబద్ధములాడినవారు. వీరి హృదయములలో విశ్వాసము (ఈమాన్) లేదు. కావున అవిశ్వాసులైరి. అవిశ్వాసులకు దుఃఖకరమైన నరకశిక్షయున్నది అని హెచ్చరింపఁబడియెను.

91. లైస-అలజ్-జుఆ-ఫాఇ-వలా-అలల్-మర్‌జా-వలా-అలల్-లజీన-లా-యజిదూన-మాయున్-ఫిఖూన-హరజున్-ఇజా-నస-హూ-లిల్లాహి-వ-రసూలిహీ-మా-అలల్-ముహ్-సినీన-మిన్-సబీ-లిన్-వల్లాహు-గఫూరుర్-రహీమ్. 92. వలా-అలల్-లజీన-ఇజా-మా-అతౌక-లి-తహ్-మిల-హుమ్-ఖుల్త-లా-అజిదు-మా-అహ్-మిలు-కుమ్-అలైహి-తవల్లౌ-వ అఅ-యును-హుమ్-తఫీజు-మినద్‌దమ్‌ఇ-హజనన్-అల్లా యజి-దూ-మా-యున్-ఫిఖూన్. 93. ఇన్న-మస్-సబీలు అలల్-లజీన-యస్-తా-జినూనక-వ-హుమ్-అగ్-నియా-ఉ-రజూ-బిఅన్-యకూనూ-మఅల్-ఖవాలిఫి-వ-తబ-అల్లాహు-అలా-ఖులూ-బిహిమ్-ఫహుమ్-లా-యఅలమూన్.

91. బలహీనులును, రోగులును, ఖర్చుచేయుటకు శక్తిలేనివారును, దేవునియందును ఆతని ప్రవక్తయందును భక్తివిశ్వాసములు గలిగియుండినపుడు వారికి దోషములేదు. సత్కార్యులపైనెట్టి నిందలేదు. మఱియు, దేవుఁడు క్షమించువాఁడును దయాళువును. 92. మఱియు, ఎవరు సవారి (వాహనము) కావలెనని కోరుచు నీయొద్దకు వచ్చిరో వారితో నీవు నాయొద్ద మీకు సవారికిగా నిచ్చుటకెద్దియును లేదు అని పలికినపుడు తాము ఖర్చుచేయుట కెద్దియును పొందలేదే అను చింతతో నీరు కార్చుచు తిరిగిపోయినవారికిని ఎట్టి దోషములేదు. 93. ధనవంతులయ్యు నీతో సెలవు అడుగువారిపై నిందయున్నది. వారు వెనుక నిలిచిపోవు స్త్రీలతో నుండుటకు ఇష్టపడిరి. మఱియు దేవుఁడు వారి హృదయములపై ముద్రవేసినాఁడు. కావున వారు తెలిసికొనరు.

వ్యా॥ 91. తప్పుసాకులు కల్పించువారివిషయము చెప్పిన పిదప ఈ వాక్యములలో వాస్తవముగ యుద్ధమునకు పోలేనివా రెవరో దెలుపుచున్నాఁడు. ముసలితనమువలన బలహీనత గలిగిన వృద్ధులును, రోగపీడితులై యుద్ధమునకు పోలేనివారును, స్వారి (గుఱ్ఱము) మొదలగు యుద్ధసామగ్రిలేని నిఱుపేదలును యుద్ధమునకు వెడలనిచో వారికి నేలాటి దోషము (పాపము) లేదు. వారు క్షమింపఁబడుదురు. అయిన వారు దేవునియందును ఆతని ప్రవక్తయందును భక్తివిశ్వాసములుగలిగి ఇస్లామ్ మేలు కోరుచుండవలెను. భక్తితో సత్కా-

ర్యములు చేయుచు నుండవలెను. ఇట్టివారిపై నేలాటి నిందలేదు. దేవుఁడుకనిక రించి వారిని క్షమించును. 92. హజ్రత్ రసూలువారి శిష్యులకు ధర్మయుద్ధము (జిహాదు) నందు ఎట్టి యుత్సాహముండెనో ఈవాక్యములోఁ దెలుపఁబడినది. రసూలువారి శిష్యులలో కొందఱికి తబూకుయుద్ధమునకుఁగాను పోవుటకు సవారి జంతు (గుఱ్ఱము) లేకుండెను. అట్టివారు వచ్చి యుద్ధమునకుఁ బోవుటకు సవారి దయచేయుఁడు అని పైగంబరులవారితో విన్నవించిరి. దానికి రసూలు వారు సవారి జంతువులు నాయొద్దలేవు అని పలికినతోడనే శిష్యుల హృదయ ములు చింతలోపడి మేము యుద్ధమునకు ఖర్చుచేసిపోలేమే అని దుఃఖముతో కన్నీరు గార్చుచు వెడలిపోయిరి. ఇట్టివారు యుద్ధమునకుఁ బోనందున వారికి పాపములేదు. ధనికులైన ముసల్మానులు తమ ధనమును ప్రాణమును దేవుని మార్గమందు వినియోగించిరి. కావున శక్తిలేని వారు యుద్ధమునకుఁబోక నిలిచి పోయినందున వారిపై నిందలేదు అని దేవుఁడు తెలిపెను. 93. ఇఁక నిందకు ఎవరు పాత్రులో ఈ వాక్యములో చెప్పఁబడినది. యుద్ధమునకు ఖర్చుచేయు శక్తిగలిగి రోగము, ముసలితనము మొదలగు ఆటంకములేవియు లేకయున్న ధనికులు యుద్ధమునకు వెడలక స్త్రీలతోఁబాటు కూర్చుండుటకు రోషములేక ఇండ్లలో నిలిచిపోయినవారు నిందకు పాత్రులు. ఇట్టివారికి పాపము క్రిమ్మ కొనును. చిరకాలము పాపముల అలవాటుపడుటచే హృదయములో విశ్వా సము చొచ్చుటకు మార్గముండదు. మంచి చెబ్బరులు తోఁచవు. వారికి పాప ములు పుణ్యములుగ తోఁచును. ఇట్టిస్థితిలో దేవునినుండి వారి హృదయము లపై ముద్రవేయఁబడినది అని యూహింపవలెను.

## పదునొకండవ కాండము

94. యఅ-తజి-రూన-ఇలైకుమ్-ఇజా-రజఅ-తుమ్-ఇలై-హిమ్-ఖుల్-లా తఅ-తజిరూలన్నూమిన-లకుమ్-ఖద్-నబ్బఅ-నల్లాహు-మిన్-అఖ్-బారికుమ్-వస-యరల్లాహు-అమ-లకుమ్-వ-రసూలుహూ-సుమ్మ-తురద్-దూన- ఇలా - ఆలి మిల్-గైబి-వష్-షహాదతి-ఫ-యునబ్బి-ఉకుమ్-బిమా-కున్తుమ్- తఅ - మలూన్. 95. సయహ్-లిఫూన-బిల్లాహి-లకుమ్-ఇజన్-ఖలబ్తుమ్-ఇలై హిమ్-లి-తుఅ-రిజూ అన్-హుమ్-ఫ-అఅ-రిజూ-అన్హుమ్-ఇన్నహుమ్-రిజ్-సున్-వమా- వాహుమ్-జ హన్నము-జజాఅమ్-బిమా-కానూ-యక్-సిబూన్. 96. యహ్-లిఫూన-లకుమ్-లి-తర్ జౌ-అన్-హుమ్-ఫఇన్-తర్-జౌ-అన్హుమ్-ఫ-ఇన్నల్లాహ - లాయర్ జా-అనిల్-ఖౌమిల్-ఫాసి-ఖీన్.

94. మీరు వారియొద్దకు మరలి వచ్చినపుడు వారు మీ సమ్ముఖమున సాకులు కల్పింతురు. "మీరు సాకులు కల్పింపకుఁడు. మీమాటలను మేము నమ్మము. దేవుఁడు మీ వృత్తాంతములు మాకుఁ దెలిపియున్నాఁడు మఱియు దేవుఁడును ఆతని ప్రవక్తయును మీ పనులను చూచెదరు. మరల మర్మములను బహిరంగములను నెఱుంగునట్టి దేవుని యొద్దకు మీరు రప్పింపఁబడుదురు. కావున ఆతఁడు మీరు చేయుచున్న దానినిగూర్చి మీకుఁ దెలుపును'' అని ఓప్రవక్త! పలుకుము. 95. ఇఁక మీరువారియొద్దకు తిరిగి వచ్చినపుడు మీరు వారిని వదలి పెట్టుటకుఁగాను వారు మీయెదుట దేవుని ప్రమాణములు చేయుదురు. కావున మీరు వారిని వదలి పెట్టుఁడు. నిశ్చయముగ వారు అపవిత్రులు. మఱి వారి నివాసము నరకము. ఇది వారుచేయుచున్న కర్మలకు ఫలితము. 96. మీరు వారితో సంతోషపడుటకై వారు మీయెదుటప్రమాణములు చేయుదురు. కావున మీరు వారితో సంతోషించినను అవిధేయులైనట్టి వారితో దేవుఁడు సంతోష పడఁడు.

వ్యా॥ 94. హజ్రత్ రసూలువారు తబూకు యుద్ధమునకు వెడలునపుడు వంచకులు, అసత్యములైన సాకులు కల్పించుకొని యుద్ధమునకు వెడలక నిలిచి పోయిరి. అటులే యుద్ధమునుండి ముసల్మానులు తిరిగి మదీనాపురమునకు వచ్చిన పిదప వంచకులు అబద్ధములైనసాకులు కల్పింపఁ బోవుదురు. ముసల్మానులు సంతోషించుటకు తప్పు ప్రమాణములు కూడ చేయఁబోవుదురు. కావున ఓ ప్రవక్త! వంచకులతో మీ మాటలను ప్రమాణములను మేము నమ్మము. ఎందుకనగ మీలోనుండు వంచనయును మీ విషయములును దేవుఁడుమాకు దెలిపియున్నాఁడు. మీసాకులు మాయొద్ద చెల్లవు. తప్పు ప్రమాణము వలన లాభములేదు. జరిగిన విషయము పోయినది. ఇఁక మీఁద మీ నడవడికను మీ పనులను చూచెదము. మీరు పలుకు మాటలలో మీరెంతవఱకు నిజముపలుకుచున్నారో మీక్రియల వలన తెలియనగును. దేవుఁడు సర్వజ్ఞుఁడు. ఆతనికి మీ మర్మములు మీ బహిరంగములు సర్వము తెలియును. ఆతనికి నెద్దియును మఱుఁగులేదు. అందఱును ఆతని యొద్దకు పోవలసియున్నది. అందఱికిని వారి కర్మలను అనుసరించి ఫలితము లభించును అని వంచకులతో పలుక వలసినది యని దేవుని సెలవయ్యెను. 95. తబూకు యుద్ధమునుండి ముసల్మానులు తిరిగి మదీనా పురమురమునకు వచ్చినపుడు వంచకులు వచ్చి మేము కావలెనని యుద్ధమునకు రాక నిలిచిపోలేదు. అనేక ఇబ్బందులుండినవి. కావున మా విషయము మీరు అనుమానించి కోపము వహింపరాదు అని పలుకసాగిరి. అని ఎందుకన వంచకుల కుట్ర బయలు పడిన పిదప హజ్రత్ రసూలు వారును ముసల్మానులును వారిని నిందింతురు అని వంచకులు అట్లుచేసిరి. కావున వారిని వదలి

పెట్టుఁడు, వారినుండి తొలఁగి వారినుండి దూరముగ నుండుఁడు అని ముసల్మానులకు దేవుని సెలవయ్యెను. ఎందుకన వంచకులు తమ కపట అవిశ్వాసము వలన అపవిత్రులు. వారినుండి తొలఁగి యుండుటయే మంచిది. వంచకుల పాపకార్యములకుఁగాను ఫలితముగ వారికి నరక నివాసము లభించును. 96. వంచకులు తప్పుప్రమాణములు చేసి ముసల్మానులను సంతోష పెట్టుటకు యత్నింతురు. సరే ఒకవేళ వంచకుల మోసపలుకులకు ముసల్మానులు సంతోషించిన వంచకులకు లాభమేమి? దేవుఁడే సంతోష పడనపుడు ప్రజలు సంతోషించిన ప్రయోజనము లేదుగదా! దేవుఁడు అవిధేయులైనట్టి జనులతో సంతోషింపఁడు. వంచకులు దేవునికి అవిధేయులు. కావున దేవుఁడెట్లు వారితో సంతోషించును? సంతోషింపఁడు. దేవుఁడు సంతోషింపవలెనన్న దేవునికి విధేయులై యుండవలెను.

97. అల్-అఅ-రాబు-అషద్దుకుఫ్-రన్-వ-నిఫాఖన్-వ-అజ్-దరు- అల్లా-యఅలమూ-హుదూద-మా-అన్‌జలల్లాహు-అలా-రసూలిహీ-వల్లాహు - అలీ-మున్-హకీమ్. 98. వ-మినల్-అఅ-రాబి-మన్-యత్-తఖిజు-మా-యున్-ఫిఖు-మగ్-రమన్-వయత-రబ్బసు-బి కుముద్-దవాఇర-అలైహిమ్-దాఇ-రతుస్-సౌఇ వల్లాహు-సమీఉన్-అలీమ్. 99. వ-మినల్-అఅ-రాబి-మన్-యూమిను- బిల్లాహి-వల్-యౌమిల్-ఆఖిరి-వ-యత్-తఖిజు-మా- యున్-ఫిఖు-ఖురు - బాతిన్-ఇన్దల్లాహి-వ-సల-వాతిర్-రసూలి-అలా-ఇన్నహా-ఖుర్-బతుల్ - లహుమ్ - స-యుద్-ఖిలు-హు-ముల్లాహు-ఫీ రహ్-మతిహీ-ఇన్నల్లాహ- గఫూరుర్-రహీమ్.

98. పల్లెటూరి వారలు అవిశ్వాసములోను వంచనలోను చాలకఠినులు. మఱి దేవుఁడు తన ప్రవక్తకుఁబంపిన మత ధర్మములను వారు తెలిసికొనకుండుటకు యోగ్యులు. మఱియు దేవుఁడు సర్వజ్ఞుఁడును వివేచనా పరుఁడును. మఱి కొందఱు పల్లెటూరి వారలు తాము ఖర్చుచేయు దానిని దండుగగ నెంచుచున్నారు. మఱి మీకు ఆపదలు రావలెనని వారు ఎదురు చూచుచున్నారు. దుఃఖకరమైన ఆపదలు వారికే గలుగుగాత! మఱియు దేవుఁడు సర్వము వినువాఁడును. సర్వము దెలిసిన వాఁడును. 99. మఱియు కొందఱు పల్లెటూరి వారలు దేవునియందును తుదిదినమందును విశ్వాస ముంచువారును గలరు. మఱి వారు తాము ఖర్చుచేయునది తమకుదేవుని సాన్నిధ్యమును ప్రవక్తయొక్క దీవనలను లభింపఁ జేయునని యెంచుచున్నారు. వినుఁడు. అది వారికి సాన్నిధ్యము గలిగించునది దేవుఁడు వారిని తన కరుణలో ప్రవేశింపఁ జేయును. నిశ్చయ

ముగ దేవుఁడు క్షమించువాఁడును దయాళువును.

వ్యా॥ 97. ఇంతవఱకు మదీనా పురములోనున్న వంచకులనుముసల్మాను భక్తులను గూర్చి చెప్పఁబడెను. ఇఁక మదీనా పురమునకు చుట్టుపట్లనున్న పల్లెటూరి వారలను గూర్చి చెప్పఁబడు చున్నది. ఆ పల్లెటూరి వారలలో అవిశ్వాసులును, వంచకులును ముసల్మాను భక్తులును గలరు. సహజముగ పల్లెటూరి వారలు కఠిన హృదయులుగను అనాగరీకులుగను మర్యాదలు బాగుగ తెలియని వారలుగ నుందురు.పట్టణములలో నివసించు వారికిని పల్లెటూరి వారలకును మర్యాదల విషయము చాల వ్యత్యాసము గలదు. అందువలన పల్లెటూరి వారలు అవిశ్వాసములోను వంచనలోను చాల కఠినులుగా నుందురు. వీరికి విద్వాంసుల సహవాసము లభించుట అరుదు. అందుచే వారిలో మూఢత్వము చాల యుండును. మత ధర్మములును దేవుఁడు నియమించిన హద్దులును వారికిఁ దెలియవు. అందుచే వారిలో పెక్కురు పశుప్రాయులై యుందురు. కావున నే దేవుఁడు వారి యోగ్యతకు మించిన భారము వారిపై వేయుట లేదు. ఎవరి జ్ఞానమునకుఁ దగిన భారము వారికి నొసంగును. ఎందుకన దేవుఁడు సర్వము తెలిసిన వాఁడు. వివేచనా పరుఁడు. 98. పల్లెటూరి వారిలో కొందఱు వంచకులు గలరు. దేవుని మార్గమందు ధనము ఖర్చుచేయ వలసిన సమయము పడినపుడు వారికి భారముగా తోఁచును. తాము ఖర్చుచేయునది దండుగగా తలంతురు. సంతోషముతో దేవుని ప్రీతికొఱకు దాన ధర్మములు చేయరు. అదియునుగాక ఆవంచకులు ముసల్మానులకు తీవ్రబాధలు కలిగించి వారిబలము పోయినచో మేము హాయిగా నుండగలమని యెదురు చూచుచున్నారు. వాస్తవముగ వంచకులకే ఆపదలు గలుగునను విషయము వారికిఁ దెలియదు. తుదకు వంచకులు అవమానపడుదురు. ముసల్మానులు విజయమును గౌరవమును పొందుదురు. దేవుఁడు అందఱి మాటలును అందఱి పార్థనలును వినుచు వారి విషయములు ఎఱుంగుచున్నాఁడు కావున వారి వారికిఁ దగిన ఫలిత మొసంగును. 99. ఈ వాక్యములో మూఢులైన పల్లెటూరి వారలలోను ఖురానె షరీఫుమహిమ వలనను హజ్రత్ రసూలువారి బోధన వలనను గొప్ప భక్తులు అయిన వారును గలరు అనిచెప్పఁబడినది. వారు దేవుని యందును తుదిదినమందును దృఢవిశ్వాసము గలవారు. దేవుని మార్గమందు ఖర్చు చేయుదానిని దండుగగ నెంచరు. దాన ధర్మముల వలన దేవుని సాన్నిధ్యము (ఖుర్బత్) నుహజ్రత్ రసూలువారి దీవనలును లభించునని వారికి నమ్మిక గలదు. వారి నమ్మిక ప్రకారముగ వారికి దేవుని సాన్నిధ్యము లభించును. వారు దేవుని కరుణకు పాత్రులగుదురు. వారి పొరపాటులను దేవుఁడు క్షమించును.

100. వస్-సాబి-ఖూనల్-అవ్వలూ-న-మినల్-ముహా-జి-రీన-వల్-అన్-సారి-వల్-లజీ-నత్-తబ-ఊహుమ్-బి-ఇహ్-సానిర్-రజి-యల్లాహు-అన్-హుమ్-వ-రజూ-అన్హు-వ-అ-అద్ద-లహుమ్-జన్నా-తిన్-తజ్రీ-తహ్-తహల్-అన్-హారు-ఖాలిదీన-ఫీహా-అబ-దన్-జాలి-కల్-ఫౌజుల్-అజీమ్.

100. ముహాజిరులలోను ఎవరు ప్రప్రథమముగా ముందంజవేసిరో వారితోను ఎవరుసత్కార్యములు చేయుచువారినిఅనుసరించిరో వారితోను దేవుఁడు సంతోషించెను. మఱియు వారును దేవునితో సంతోషించిరి. మఱియు వారికొఱకుదేవుఁడు, కాలువలుప్రవహించుస్వర్గవనములును సిద్ధపఱచియున్నాఁడు. అందు వారు సదా వసింతురు. ఇదియే గొప్ప మోక్షము.

వ్యా॥ 100. తమ జన్మదేశమును దేవుని ప్రీతికొఱకు వదలినవారు ముహాజిరులు. తమ జన్మదేశమును వదలి మదీనాపురము చేరినవారికి తోడుపడినట్టి మదీనాపుర నివాసులు అన్సారులు (సహాయులు). వీరు ఇస్లామ్ సేవ చేయుటలో నెంత యుత్సాహము చూపుచు అందు ముందంజవేసిరో దానికిఁ దగినట్లు వారికి దర్జాలు గలవు. అట్లు ముహాజిరులను అన్సారులను అనుసరించి సత్కార్యములు చేసి వారి మంచి మార్గమున పోయిన యితర ముసల్మానుభక్తులకుఁగూడ వారివారికిఁ దగిన దర్జాలుగలవు. దేవుఁడు వారితో సంతోషించెను. దేవుని ప్రీతియు సంతోషమును లభించుటయే గొప్ప మోక్షముగు జయమును. నికిఁగాను భక్తులకు సదా నివాసముగల స్వర్గసౌఖ్యములు లభించును. ముసల్మానుభక్తులుగూడ దేవునికి మనఃపూర్వకముగ విధేయులై దేవుని యాజ్ఞలకు శిరసావహించి సంతోషింతురు.

101. వ-మిమ్మన్-హౌ-లకుమ్-మినల్-అఅ-రాబి-మునా-ఫిఖూన-వ-మిన్-అహ్-లిల్-మదీనతి-మరదూ-అలన్-నిఫా-ఖి-లా-తఅ-లముహుమ్-నహ్-ను-నఅ-లము-హుమ్-సను-అను-అజ్-జిబు-హుమ్-మర్రతైని-సుమ్మ-యురద్-దూన ఇలా-అజాబిన్-అజీమ్.

101. మీకు చుట్టుపట్లనున్న పల్లెటూరి వారలలో కొందఱు వంచకులున్నారు. మఱియు మదీనాపుర నివాసులలోను కొందఱు వంచకులును గలరు. వారు వంచనయందు స్థిరముగా నున్నారు. (ఓ ప్రవక్త) నీవు వారిని ఎఱుంగవు. మేము వారి నెఱుంగుదుము. మేము రెండుసార్లు వారిని శిక్షింతుము. మరల వారు గొప్ప శిక్షకు మరల్పఁబడుదురు.

వ్యా॥ 101. మదీనాపురములో దానికి చుట్టుపట్లనున్నపల్లెలలోను కొందఱు

వంచకులు గలరు. వారి వంచన బయటపడదు. వారు వంచనయందు స్థిరముగా నెవరికి తెలియనట్లుగా నున్నారు. వారి వంచన దేవునికిఁ దెలియును. కొన్ని సమయములలో వంచకుల చేష్టలవలన వంచకుల కుట్ర బయలుపడును. అపుడు హజ్రత్ రసూలువారు, వంచకులను ఎఱుంగఁగలరు. కాని కొందఱు వంచకులు చాల తెలివిగ తమ వంచనను దాఁచిపెట్టుదురు. అట్టి వంచకులు దేవునికిఁ దెలియుదురు. కావున వారికి ఇహమునందును శిక్ష లభించును. వారు అవమానముపొందుదురు. అనేక బాధలకు పాలగుదురు. గోరిలోకూడ రెండవ తూరి వంచకులకు శిక్ష లభించును. తుదకు నరకములో గొప్ప శిక్ష లభించును.

102. వ-ఆఖ-రూన-అ- తరఫూ-బిజునూ-బిహిమ్-ఖలతూఅమలన్-సాలి-హాన్-వ-ఆఖర-సయ్యి-అన్-అసల్లావు-అన్ యతూబ-అలై-హిమ్ - ఇన్నల్లాహ-గఫూరుర్-రహీమ్.

102. మఱికొందఱు, తమ పాపములను ఒప్పుకొనిరి. వారు సత్కార్యమును ఇతర పాపకార్యములో కలిపిరి. శీఘ్రముగా దేవుఁడు వారినిక్షమించును. నిశ్చయముగ దేవుఁడు క్షమించువాఁడును దయాళువును.

వ్యా॥ 102. ఇఁక ఈవాక్యములో మదీనాలోనున్న భక్తుల విషయము చెప్పఁబడుచున్నది. భక్తులు పొరపాటుతో ఒకవేళ తప్పుచేసిరేని వారు తమ తప్పులను ఒప్పుకొని దేవునితో క్షమాపణ వేఁడి పశ్చాత్తాపపడుదురు. ఇట్టివారిని దేవుఁడు క్షమించును. తబూకుయుద్ధమునకుఁగాను అబూలబాబా మొదలగు కొందఱు ముసల్మానులు సోమరితనముతో వెడలక మదీనాలోనే నిలిచిపోయిరి. హజ్రత్ రసూలువారు తబూకునుండి తిరిగి వచ్చిన పిదప, అబూలబాబా మొదలగువారు తాము గావించిన తప్పులను ఒప్పుకొని సిగ్గుపడి రసూలువారు మమ్ము క్షమించి మమ్ము స్తంభములనుండి విడదీయునంతవఱకు మేము మసీదు స్తంభములతో కట్టుకొనియుందుమని ప్రతిజ్ఞచేసి స్తంభములకు తమ్మునుతాము కట్టుకొనిరి. వీరి విషయము చూచి హజ్రత్ రసూలువారు దేవుని సెలవగువఱకు నేను విప్పఁజాలను అని పలికిరి. తుదకు ఈవాక్యము వచ్చెను. అపుడు రసూలువారు వారిని విప్పి మీతప్పులు క్షమింపఁబడినవి అను సంతోషవార్త నిచ్చిరి. నమాజు (ప్రార్థన) రోజా (ఉపవాసము) దానము మొదలగునవి సత్కార్యములలో చేరినవి.

103. ఖుజ్-మిన్-అమ్వా-లిహిమ్ సద-ఖతన్-తుతహ్-హిరు-హుమ్-వ-తుజక్కీ-హిమ్-బిహా వసల్లి-అలై హిమ్-ఇన్న-సలాతక-సక నుల్ -లహుమ్-వల్లా

హు-సమీ-ఉన్-అలీమ్.

103. నీవు వారిని పవిత్రులుగఁ జేయుటకును, దానము వలన వారికి శుభములు గలుగఁజేయుటకును వారి సొత్తులనుండి దానము పుచ్చుకొనుము. మఱి వారిని దీవింపుము. నిశ్చయముగా నీ దీవనలు వారికి శాంతము గలిగించునవి. మఱి దేవుఁడు సర్వము వినువాఁడును, సర్వము తెలిసినవాఁడును.

వ్యా॥ 103. అబూలబాబా వారి తప్పులు క్షమింపఁబడినవని వారు కొంత ధనము పైగంబరువారి సన్నిధికిఁదెచ్చి దీనిని దేవుని మార్గమందు దానము చేయుఁడు అని పైగంబరువారితో విన్నవించిరి. దానిగూర్చి ఈవాక్యములలో వారి దానము తీసికొని వారిని దీవింపవలెను అని దేవుని సెలవు పైగంబరుల వారికి నాయెను. దానముచేయుటవలన పవిత్రతయును శుభములును లభించును. పైగంబరులవారు దానము (సదఖా) చేయువారిని దీవింతురు. వారిదీవనలవలన భక్తుల మనస్సులకు శాంతము లభించును. ఈదానములో విధిదానము (జకాతు) కూడ చేరును. ముసల్మాను ధనికులు తెచ్చినదానములనుహజ్రత్ రసూలువారు నిఱుపేదలకు పంచిపెట్టుదురు.

104. అలమ్ - యఅ - లమూ-అన్నల్లాహ - హువ - యఖ్ - బలుత్-తౌబత- అన్-ఇబాదిహీ-వ-యాఖుజుస్-సదఖాతి-వ-అన్నల్లాహా-హువత్-తవ్వాబుర్-రహీమ్.

104. దేవుఁడు తన భక్తుల క్షమాపణ సమ్మతించును. మఱి దానములను తీసికొనును. దేవుఁడే క్షమించువాఁడును,దయాళువునుఅనివారికిఁదెలియదా?

వ్యా॥ 104. క్షమించుట, దానములు సమ్మతించుట దేవుని యిష్టము. సర్వము ఆతనికిఁ దెలియును. ఎవరు ఎట్టి సంకల్పము (నియ్యత్) తో నిత్తురో దేవునికిఁ దెలియును. భక్తిపూర్వకముగ వేఁడిన క్షమాపణను దేవుఁడు సమ్మతించును. అటులే దేవుని ప్రీతికొఱకు చేసిన దానములు అంగీకరించును. ప్రజల మెప్పుకొఱకు చేయు దానములను దేవుఁడు అంగీకరింపఁడు. అని భక్తులకుఁ దెలియదా అని ప్రోత్సహింపఁబడియెను.

105. వ-ఖు-లిఅ-మలూ-ఫస-యరల్లాహు-అమ-లకుమ్-వ-రసూలుహూ-వల్-మూమినూన-వస-తు-రద్దూన-ఇలా-ఆలి-మిల్-గైబి-వష్-షహా-దతి - ఫ-యునబ్బి-ఉకుమ్-బిమా-కున్తుమ్-తఅ-మలూన్.

105. మఱి మీరు పనులు చేయుచునుండుఁడు. మరల దేవుఁడును, ఆతని పరివక్తయును ముసల్మానులును మీపనులను చూచెదరు. మఱి మర్మము

లను బహిరంగములను ఎఱుంగునట్టి దేవుని యొద్దకు మీరు రప్పింపఁబడుదురు. కావున మీరు చేయుచున్న దానినిగూర్చి యాతఁడు మీకుఁ దెలుపును అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 105. క్షమాపణ కోరుటవలన పూర్వపు పాపములు క్షమింపఁబడును. తబూకుయుద్ధములో చేరక గావించిన తప్పు ఇఁక మీద చేయవలదు. సత్కార్యములు చేయుచునుండవలెను. సర్వము దేవునికిఁ దెలియును. ఎవరి కర్మలకుఁ దగిన ఫలితము వారికి నొసంగును.

106. వ-ఆఖరూన-ముర్-జౌన-లి-అమ్-రిల్లాహి-ఇమ్మా-యు-అజ్-జిబుహుమ్-వ-ఇమ్మా-యతూబు-అలై-హిమ్-వల్లాహు-అలీమున్-హకీమ్.

106. మఱికొందఱు దేవుని సెలవుకొఱకు వేచియున్నవారును గలరు. దేవుఁడు వారిని శిక్షించును. లేదా వారిని క్షమించును. మఱి దేవుఁడు సర్వజ్ఞుఁడును. వివేచనాపరుఁడును.

వ్యా. 106. తబూకుయుద్ధమునకు వెడలక మదీనాపురములో నిలిచిపోయిన వారలలో మూఁడు రకములవారుండిరి. (1) కొందఱు తమ వంచనవలన పోక నిలిచిపోయినవారు. (2) కొందఱు ముసల్మానులుసోమరితనముతో పోక నిలిచిపోయి పైగంబరులవారు మదీనాపురమునకు తిరిగి వచ్చిన వార్తను విని తమ్ముతాము మసీదు స్తంభములతో కట్టుకొనినవారు. వీరినిగూర్చి ముందు వాక్యములోఁ జెప్పఁబడినది. (3) మఱికొందఱు ముసల్మానులు ఏలాటి సాకులు పెట్టుకొనక తాము గావించిన తప్పును పైగంబరులవారి సన్నిధిని విన్నవించిరి. వీరు తమ్ముతాము స్తంభములతో కట్టుకొనలేదు. వీరు మగ్గురు. వీరి విషయము దేవుని క్షమాపణ విషయము తెలియుటలో ఆలస్యమాయెను. కావున ఆ ముగ్గురు భక్తులు దేవుని సెలవునకుఁగాను వేచియుండిరి. దేవుని సెలవువచ్చువఱకు ఏబది దినములవఱకు ఆ ముగ్గురితో ముసల్మానులు మాటలాడక బహిష్కారము చేసియుండిరి. ఆ పిదప దేవుఁడు వారినికూడ క్షమించెను. ఈ విషయము రాఁబోవు 118 వ వాక్యమునందు చెప్పఁబడును.

107. వల్-లజీనత్-తఖ-జూ-మస్-జిదన్-జిరారన్-వ-కుఫ్-రన్-వ-తఫ్రీఖమ్-బైనల్-మూమినీన-వ-ఇర్-సాదల్-లిమన్-హార-వల్లాహ-వ-రసూలహూ-మిన్-ఖబ్లు-వల-యహ్-లిఫున్న-ఇన్-అరద్నా-ఇల్-లల్-హుస్నా-వల్లాహు-యష్-హదు-ఇన్నహుమ్-లకాజిబూన్. 108. లా-తఖుమ్-ఫీహి-అబదన్-లమస్-జిదున్-ఉస్సిస-అలత్-తఖ్వా-మిన్-అవ్వ-లి-యౌమిన్-అహఖ్ఖుఅన్

తఖూవ-ఫీహి-ఫీహి-రిజాలున్-యుహిబ్బూన-అన్-యతతహ్హరూ-వల్లాహు యుహిబ్బుల్-ముత్-తహ్హిరీన్. 109. అఫ-మన్-అస్-సస-బున్యా-నహూ అలా-తఖ్వా-మినల్లాహి-వరిజ్వా-నిన్-ఖైరున్ అమ్మన్ అస్-సస-బున్యా-నహూ అలా-షఫా-జు-రుఫిన్-హారిన్-ఫన్-హార-బిహీ-ఫీ-నారి-జహన్నమ - వల్లాహు-లాయహ్-దిల్-ఖౌమజ్-జాలిమీన్. 110. లాయజాలు-బున్యా-నూహుము-ల్లజీ-బనౌ-ఫీరీబతన్-ఫీఖులూ-బిహిమ్-ఇల్లా-అన్-తఖత్-తఅ-ఖు-లూబుహుమ్-వల్లాహు-అలీమున్-హకీమ్.

107. మఱియు వంచకులలో కొందఱు నష్టము గలిగించుటకును, అవిశ్వాసమును బలపఱచుటకును ముసల్మానులను విడదీయుటకును దీనికి పూర్వము దేవునితోను ఆతని ప్రవక్తతోను యుద్ధమాడినవాఁడు పొంచియుండుటకును ఒక్క మసీదును కట్టియున్నారు. మఱి వారు మేము మంచిదియే యుద్దేశించితిమి అని ప్రమాణములు చేయుదురు. మఱి వారు అసత్యవంతులని దేవుఁడు సాక్ష్యమిచ్చుచున్నాఁడు. 108. అందు నీవు ఎన్నటికిని నిలువకుము. నిశ్చయముగ మొదటిదినమునుండియే భక్తిపై పునాది వేయఁబడిన మసీదులో నీవు నిలుచుట నీకు యోగ్యమైనది. అందు పరిశుద్ధులు కాఁగోరువారు గలరు. మఱి దేవుఁడు పరిశుద్ధులను ప్రేమించును. 109. ఎవఁడు దేవుని భక్తి ప్రీతుల పునాదులపై తన కట్టడము కట్టెనో వాఁడు శ్రేష్ఠుఁడా లేక ఎవఁడు తన కట్టడమును పడనున్న గోతివద్దన కట్టెనో వాఁడా! ఆపిదప అది వానినితీసికొని నరకాగ్నిలో పడిపోయెను మఱి దేవుఁడు దుర్మార్గులకు దారి చూపఁడు. 110. వారి హృదయములు తునకలై పోనంతవఱకు వారి కట్టడమువలన వారి హృదయములలో (వంచన) సందేహము సదా యుండును. మఱి దేవుఁడు సర్వము దెలిసినవాఁడును, వివేచనాపరుఁడును.

వ్యా॥107. దీనికిముందువాక్యములో యుద్ధమునకుపోక నిలిచిపోయి ఒకతప్పుగావించి హృదయములలో భయభక్తులు గలిగి క్షమాపణ కోరినవారినిగూర్చి చెప్పఁబడెను. మసీదు కట్టుట చూచువారికి ధర్మకార్యముగాకనుపించినను మసీదు కట్టువారి యుద్దేశము మంచిది కాదు గనుక అట్టిమసీదుకట్టువారు వంచకులు, వీరినిగూర్చి ఇందు చెప్పఁబడుచున్నది. హజ్రత్ రసూలువారు మక్కా-పురము విడిచి మదీనాపురమునకు పోవుచు కొన్ని దినములు అమరుబిన్ ఔఫువారివీధిలో

బసచేసిరి. తరువాత రసూలువారు మదీనాపురము చేరి మసీదు కట్టిరి. అమరు బిన్ ఔఫువారి వీధిలోకూడ మసీదు కట్టఁబడెను. దీనినే మస్జిదె ఖుబా అనుదురు. తరచుగ హజ్రత్ రసూలువారు ప్రతి శనివారము అచట పోయి నమాజు సలుపుదురు. కొందఱు వంచకులు ఆ మసీదునకు విరుద్ధముగ దానికి చేరువలోనే ఒక యిల్లుకట్టి అది మసీదు అని నియమించిరి. దానివలన వంచకులు వేఱుగా ఒకచోట చేరవలెననియు, వీరి కుట్రలు తెలియని ముసల్మానులు ఖుబామసీదును వదలి యచ్చటికి రావలెననియువారికి దురుద్దేశముండెను. దీనికిముఖ్యకారకుఁడు అబూఆమిరు అను నసార్సీఁడు. హజ్రత్ రసూలువారు మదీనాపురమునకురాక మునుపు అబూఆమిరునకు చాల గౌరవముండెను. వాఁడు గొప్ప భక్తుఁడని పేరుపొందియుండెను. కాని హజ్రత్ రసూలువారు మదీనాపురము చేరిన పిదప వానికి మునుపటి గౌరవము లేకపోయెను. అందుచే వాఁడు పైగంబరులవారియెడ అసూయ వహించి వారితో వాదులాడుచు విరోధమువహించియుండెను. ఒక దినము వాఁడు పైగంబరులవారితో వాదించుచు ఎవఁడు అసత్యవంతుఁడోవాఁడు దేశభ్రష్టుఁడై హీనచావుతో చచ్చునుగాత అని పలికెను. దానికి పైగంబరుల వారు ఆమీన్ (అటులే అగుగాత!) అని పలికిరి. బదరుయుద్ధములో ముసల్మానులకు గొప్ప జయను లభించెనుగదా! అదిచూచి అబూఆమిరుసహింప లేక మక్కాపురమునకు పాఱిపోయి అచ్చట కాఫిర్లను ప్రేరేపించి ఖురైషులతో కలిసి మదీనాపై దాడివెడలి వచ్చెను. ఒహదులో యుద్ధము సంభవించెను. అందు వాఁడు మఱుఁగు గుంతలు త్రవ్వించెను. ఆ గుంతవలననే పైగంబరులవారికి గాయము తగిలెను. అబూఆమిరువాఁడైనను యుద్ధమువఱకు కాఫిర్లతో చేరి పైగంబరులవారితో యుద్ధమాడుచుండెను. ముసల్మానుల విజయము చూచి, ఇఁక అరేబియాలో నుండుట క్షేమకరము కాదు అని సిరియా (షామ్) దేశమునకు పాఱిపోయెను. అచ్చటినుండి వాఁడు మదీనాలోనుండిన వంచకులకు నిట్లు వ్రాసెను. "నేను రోమనురాజుతో కలిసి గొప్ప సైన్యము తీసికొని మదీనాపై దాడివెడలి వచ్చి ముసల్మానులను నశింపఁజేయుదును. కావున మీరు మసీదు పేరుతో ఒక యిల్లుకట్టి అందు ముసల్మానులకు విరోధముగ కుట్రలు సలుపుఁడు. నేను పంపు లేఖలు తెచ్చువారుకూడ ఆ మసీదులోనే మీతో కలియుదురు. నేను వచ్చినచో అచ్చట నిలుచుటకు తావు ఉండును" ఈ దురుద్దేశములకుఁగా నువంచకులు మసీదుకట్టి పైగంబరులవారితో "ఖుబా మసీదు మాకు దూరముగా నున్నది. వర్షకాలములోకష్టమగును. కావున మేము మసీదు కట్టినాము. మీరు దయచేసి యందు శుభమునకుఁగాను నమాజు సలుపుఁడు అనిప్రమాణములుచేసి విన్నవించిరి. అపుడు పైగంబరులవారు తబూకు

యుద్ధమునకుగాను వెడలుటకై సిద్ధమైయుండిరి. కావున ఇపుడు వచ్చుటకువీలు లేదు. తిరిగి వచ్చిన పిదప చూచెదము అని పలికి తబూకునకు వెడలిపోయిరి. తిరిగి మదీనాపురమునకు వచ్చునపుడు దారిమధ్యలోనే దేవునిసందేశము (వహీ) వచ్చెను. దీనివలన వంచకుల కుట్ర మసీదు విషయము బయలుపడెను. అపుడు పైగంబరులవారు తమ ఇద్దఱు శిష్యులను పంపి కుట్ర మసీదును పడఁగొట్టి కాల్చివేయవలెను అని సెలవు ఒసంగిరి. అటులే వారిద్దఱు పోయి చేసిరి. అట్లు అబూఆమిరు సిరియాదేశములోనే ఒంటరిగా హీనచావు చచ్చెను. 108. కుట్ర మసీదులో నమాజు సలుపకూడదు. భక్తిపూర్వకముగ ముందుగానేకట్టబడిన ఖబామసీదులో నమాజు సలుపుట యోగ్యము అని పైగంబరులవారికి సెలవయ్యెను. ఖబామసీదులో నమాజు సలుపు ముసల్మానులు చాల భక్తిపరులు, అన్ని విధముల అసహ్యములనుండిపరిశుద్ధులుగా నున్నారు. ఒంటికి రెంటికి మట్టి బెడ్డలు ప్రయోగించి నీళ్ళతో శుద్ధిచేయుదురు. పరిశుద్ధులను దేవుఁడు ప్రేమించును. 109. భయభక్తులతోఁ జేసిన పని శ్రేష్ఠమైనది. అట్టిభక్తులు శ్రేష్ఠులు. భక్తిలేక వంచనతోఁ జేసిన కార్యము నిలువదు. ఎట్లు నీటివరదల వలనకోసికొని పోయిన గోతివద్దపై ఇల్లు కట్టిన నిలువదో అటులే భక్తిలేక వంచనతోకట్టిన కట్టడమువలన నరకాగ్నిలోవంచకులుపడుదురు. దుర్మార్గులుసన్మార్గమునుఅవలంబింపరు. 110. భక్తి విశ్వాసములు లేక వంచన సందేహముతో కట్టినవారి కట్టడమువలన వారికి చావురానంతవఱకు వారి వంచనపోదు. అది స్థిరముగా వారి హృదయములలో నుండును. దేవుఁడు సర్వము తెలిసినవాఁడు. వివేచనాపరుఁడు. ఎవరి కర్మలకును సంకల్పములకును దగిన ఫలితము వారికి నొసంగును. ఒక వీధిలో మసీదు నున్నపుడు పోటాపోటీతో మఱొక మసీదు కట్టఁగూడదు. దానిని మస్జిదె జిరార్ అనుదురు.

111. ఇన్-నల్లా-హష్తరా మినల్-మూమినీన-అన్-ఫుసహుమ్-వ-అమ్వాలహుమ్-బిఅన్న-లహుముల్-జన్నత-యుఖాతిలూన-ఫీ-సబీ-లిల్లాహి - ఫ-యఖ్-తులూనవ- యుఖ్-తలూన-వఅదన్-అలైహి-హఖ్-ఖన్-ఫిత్ - తౌరాతి-వల్-ఇన్‌జీలి-వల్-ఖుర్-ఆని-వ-మన్-ఔఫా-బి-అహ్దిహీ-మినల్లాహి-ఫస్-తబ్-షిరూ-బి-బై ఇ-కుముల్-లజీ-బా-యఅ-తుమ్ బిహీ-వ-జాలిక-హువల్ఫౌజుల్-అజీమ్.

111. నిశ్చయముగ దేవుఁడు విశ్వాసులనుండి వారిప్రాణములను వారి ధనమును వారికి స్వర్గమును వెలగనిచ్చి కొనెను. వారు దేవుని మార్గమందు యుద్ధమాడి వధింతురు. మఱి వధింపఁబడుదురు. తౌరాతులోను ఇన్‌జీలులో

ఖురానులోను నిజమైన వాగ్దానము దేవుఁడు చేసియున్నాఁడు. వాగ్దానము పూర్తి చేయుటలో దేవుని కంటెను మించిన వారెవరు గలరు. కావున మీరు కావించిన బేరమునకు మీరు సంతోషపడుఁడు. మఱి ఇదియే గొప్పజయము.

వ్యా॥ 111. ఈ వాక్యములో ముసల్మాను భక్తులు సర్వము దేవుని ప్రీతి కొఱకు దేవుని మార్గమందు వినియోగింప వలెనని ప్రోత్సాహము గలదు. భక్తుల ప్రాణములును సొత్తును సర్వము దేవుఁడొసంగినదే. అయిన దేవుఁడు తన యనుగ్రహముచే అవి భక్తులవి అని సెలవిచ్చి దేవుని మార్గమందు విని యోగించువారికి వాని వెల స్వర్గమున్నది అనిస్థిరమైన వాగ్దానమొనర్చెను. దేవుఁడు భక్తులనుండి కొనువాఁడు. భక్తులునొసంగుకొద్ది వెలవస్తువులకుఁగానుగొప్ప విలువగల స్వర్గము వెలగా నిచ్చుచున్నాఁడు. ముసల్మానులు యుద్ధమందు శత్రువులను వధించిన లేదా వారు వధింపఁబడిన,వారికి వెల లభించియే తీరును. స్వర్గమను వెల ఇఁకమీఁద దొరకునో లేదో అని సందేహముండ కూడదు. ఎందుకన దేవుఁడు తానిచ్చిన మాటను పూర్తిచేయును. ఆడినమాట తప్పఁడు. ఇట్లు తన వాగ్దానముపూర్తితప్పక చేయుదును అని అన్నిమతగ్రంథములలో చేసియున్నాఁడు. తౌరాతులోను ఇన్జీలులోను ఖురానులోను అట్లు సెలవిచ్చి యున్నాఁడు. కావున ముసల్మాను భక్తులు సమయము వచ్చినపుడు దేవుని మార్గమందు తమ సర్వము వినియోగింప వలెను. దీనివలన ఉభయ లోకములలో జయమును మోక్షమును లభించును. ఇట్టి లాభకరమైన బేరమునకుఁగాను భక్తులు సంతోష పడవలెను.

112. అత్-తాఇ-బూనల్-ఆబిదూనల్-హామిదూనస్-సాఇ-హూనర్-రాకి-ఊనస్-సాజిదూనల్-ఆమిరూన-బిల్-మఅ-రూఫి-వన్-నాహూన-అనిల్-మున్కరి-వల్-హాఫిజూన-లి-హుదూ-దిల్లాహి-వ-బష్-షిరిల్-మూమినీన్.

112. వారు,(ముసల్మానులు) క్షమాపణ కోరువారును, ప్రార్థనలు సలుపు వారును,కృతజ్ఞతలు సలుపు వారును, ఉపవాస ముండువారును రుకూ చేయువారును, సిజ్దా చేయువారును, ధర్మమును ఆజ్ఞాపించు వారును, అధర్మమునునిషేధించువారును, దేవుని నియమములను కాపాడువారును. మఱి ఓప్రవక్తా! ముసల్మానులకు సంతోషవార్త వినిపింపుము.

వ్యా॥ 112. ఇందు పైవాక్యములలో జెప్పఁబడిన ముసల్మానుల సుగుణములు వివరింపఁబడినవి. సంపూర్ణ విశ్వాసులు (ముసల్మానులు) సర్వవిధముల పాపములను విడనాడి పాపక్షమాపణ దేవునితో వేఁడుకొనుదురు. వారు భక్తివిశ్వాసములతో స్థిరముగ ప్రార్థనలు సలుపుదురు. దేవుని మేళ్ళకు కృతజ్ఞత సలుపుచు దేవునిని స్తుతింతురు. వారు ఉపవాసము లుండుదురు. ఉపవాసము

నందు తమకు ప్రియములైన అన్నపానాదులను భోగములను వదలి యాత్మశుద్ధి గావించుకొనుదురు. రుకూ (వంగుట) సిజ్దా సాష్టాంగ నమస్కారములు చేయుదురు. అనఁగా నమాజు సలుపుదురు. ముసల్మానులు తాము సన్మార్గవర్తులై ప్రజల మేలుకోరి వారికి ధర్మమార్గము బోధించి యధర్మ మార్గమును నిషేధింతురు. దేవుఁడు నియమించిన ధర్మములను దెలిసికొని దానిని క్రమముగా అనుసరింతురు. ఎద్ది ధర్మమో దాని అవలంబించి ఎద్ది అధర్మమో దానిని వదలి పెట్టుదురు. ఇట్టివిశ్వాసులకు దేవుని ప్రీతి మోక్షములంభించునను సంతోషవార్త నియ్యవలెను అని దేవుని సెలవు ప్రవక్తకు నాయెను.

113. మా-కాన-లిన్-నబియ్యి-వల్-లజీన-ఆమనూ-అన్-యస్-తగ్-ఫిరూ-లిల్-ముష్-రికీన-వలౌ-కానూ-ఉలీ-ఖుర్బా-మిమ్-బఅది-మా-తబయ్యన-లహుమ్-అన్నహుమ్-అస్-హాబుల్-జహీమ్. 114. వమా-కానస్-తిగ్-ఫారు-ఇబ్రాహీమ-లి-అబీహి-ఇల్లా-అమ్-మౌఇ-దతిన్-వఅద-హా-ఇయ్యాహు-ఫలమ్మా-తబయ్యన-లహూ-అన్నహూ-అదువ్వుల్-లిల్లాహి-తబర్రఅ-మిన్-హు-ఇన్న-ఇబ్రాహీమ-ల-అవ్వాహున్-హలీమ్.

113. దేవునికి సాటి కల్పించువారు (ముష్రికులు) బంధువులైనను వారు నరక నివాసులు అని స్పష్టముగాఁ దెలిసినపిదప వారికిఁగాను ప్రవక్తయును ముసల్మానులును క్షమాపణ కోరుట సరికాదు. 114. ఇబ్రాహీము తన తండ్రితోఁ జేసిన వాగ్దానమును బట్టి యాతఁడు తన తండ్రికిఁగాను క్షమాపణ కోరెను. ఆపిదప ఆతఁడు దేవునికి శత్రువుఁడు అని ఇబ్రాహీమునకు స్పష్టపడఁగానే ఇబ్రాహీము ఆతనిని విసర్జించెను. నిశ్చయముగ ఇబ్రాహీము మృదుహృదయుఁడును సహనము గలవాఁడును.

వ్యా॥ 113. ఇందు అవిశ్వాసులుగానే చచ్చిన బంధువులకుఁగాను ముసల్మానులు క్షమాపణ (ఇస్తిగ్ఫార్) కోరకూడదు అని విధింపఁ బడినది. కొందఱు ముసల్మానులు కాఫిర్లుగా మృతినొందిన తల్లిదండ్రులకును అన్నదమ్ములకుఁగాను దేవునితో వారిపాపములు క్షమించునట్లు వేఁడసాగిరి. అట్లు వేడుట ముసల్మానులకుఁ దగదు. ఎందుకనఁ ముష్రికులు (కాఫిర్లు) దేవునికి విరోధులు. కావునముసల్మానులకువారుబంధువులైననువారుమత విరోధులు.కావున దేవుని ప్రీతి కోరువారు దేవుని శత్రువులను ప్రేమింపరు. 114. హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్త యొక్క తండ్రి విగ్రహములను చేసి వానిని పూజించుచుండెను. ఇబ్రాహీముగారు తన తండ్రిని ఇస్లామ్‌లో చేరుము అని చాల బోధించి అతని కొఱకు దేవునితో క్షమాపణ వేఁడుదును అని వాగ్దానము చేసిరి. వారు తమ

వ్యాఖ్యానము ప్రకారము దేవునితో వేఁడిరి. కాని వారితండ్రి తన యవిశ్వాసమును వదలక అందు స్థిరముగా నుండెను. అదిచూచి ఇబ్రాహీముగారు తన తండ్రికొఱకుగాను క్షమాపణ వేఁడక అతనిని వదలిపెట్టిరి. కావున ముసల్మానులు ఇబ్రాహీము ప్రవక్త తన తండ్రికొఱకుగాను క్షమాపణ కోరెను అనితలంచి వారు కూడ అట్లు చేయరాదు. ఎందుకన ఇబ్రాహీము ప్రవక్త తనతండ్రి విషయము స్పష్టముగాఁ దెలియగానే ఆతనిని వదలుకొనెను.

115. వ-మా-కానల్లాహు-లియుజిల్ల-ఖౌమమ్-బఅద-ఇజ్-హదాహుమ్-హత్తా-యు-బయ్యిన-లహుమ్-మా-యత్-తఖూన-ఇన్నల్లాహ-బికుల్లి-షైఇన్ అలీమ్. 116. ఇన్-నల్లాహ-లహూ-ముల్-కుస్-సమా-వాతి-వల్-అర్జి యుహ్-ఈ-వ-యుమీతు-వ-మా-లకుమ్-మిన్-దూనిల్లాహి-మిన్-వ-లియ్యిన్-వ-లా-నసీర్.

115. మఱియు దేవుఁడు జనులకు సన్మార్గము చూపిన పిదప వారు దేనిని మానుకొనవలెనో స్పష్టముగా వారికి తెలుపనంత వఱకు దేవుఁడువారిని దుర్మార్గులుగాఁ జేయఁడు. నిశ్చయముగ దేవునికి సర్వము దెలియును. 116. ఆకాశములలోను భూమిలోను దేవునిదే ప్రభుత్వమున్నది. అతఁడు ప్రాణము పోయువాఁడును చంపువాఁడును. మఱి ఆతఁడు దప్ప మీకు వేఱు రక్షకుఁడుగాని సహాయుఁడుగాని లేఁడు.

వ్యా॥ 115. దేవుఁడు జనులకు సన్మార్గమును ధర్మమార్గమును చూపును. ధర్మమార్గము స్పష్టముగాఁ దెలిసిన పిదప దాని ననుసరింపక అధర్మ మార్గము పోవువారు దుర్మార్గులై దారి తప్పినవారగుదురు. కావున దేవుఁడుజనులకు సన్మార్గము చూపనిదే దారి తప్పింపఁడు. ఇందు కాఫిర్లను గూర్చి క్షమాపణ కోరు విషయము నిషిద్ధము తెలియక కోరిన ముసల్మానుల తప్పు మన్నింపఁబడును. ఇఁక తెలిసిన పిదప అట్లు కోరువారు సన్మార్గము తప్పిన వారగుదురు అని సూచింపఁ బడియెను. 116. భూమ్యాకాశములలో దేవునిదే ప్రభుత్వమును అధికారమునుగలదు. కావున భక్తులు ఆతనిధర్మములకు విధేయులై నడచుకొనవలెను. అందు ఏలాటి బంధుత్వ సంబంధములను పాటింపరాదు. ఎందుకన దేవుఁడే రక్షకుఁడును సహాయుఁడును. కావున ఇతరులకు భయపడ నక్కఱలేదు.

117. లఖత్-తాబల్లాహు-అలన్-నబియ్యి-వల్-ముహాజిరీన-వల్-అన్-సారిల్-లజీ-నత్-తబఊహు-ఫీసాఅతిల్-ఉస్రతి-మిమ్-బఅది-మా-కాద-యజీగు

ఖులూబు-ఫరీఖిమ్-మిన్-హుమ్-సుమ్మ-తాబ-అలైహిమ్-ఇన్నహూ-బిహిమ్ రఊఫుర్-రహీమ్. 118. వ-అలస్-సలా-స-తిల్-లజీన-ఖుల్-లిఫూ-హత్తా-ఇజా-జాఖత్-అలైహిముల్-అర్జు-బిమా-రహుబత్-వజాఖత్-అలైహిమ్-అన్-ఫుసు-హుమ్-వజన్నూ-అల్-లా-మల్-జఅ-మినల్లాహి-ఇల్లా-ఇలైహి-సుమ్మ-తాబ-అలైహిమ్-లి-యతూబూ-ఇన్నల్లాహ-హువత్-తవ్వాబుర్ రహీమ్.

117. దేవుఁడు ప్రవక్తను ముహాజిరులను అన్సారులను అనుగ్రహించెను. వీరిలో కొందఱి హృదయములు తిరిగి పోవుటకు సమీపించియున్న కష్టకాలమందును వారు ప్రవక్త వెంట నున్నవారు. మరల దేవుఁడు వారిని అనుగ్రహించెను. నిశ్చయముగా దేవుఁడు వారియెడ అనుగ్రహమును దయయును గలవాఁడు. 118. మఱియు ఎవరి క్షమాపణ విషయము ఆలస్యము చేయఁబడెనో యా ముగ్గురిని దేవుఁడు కరుణించెను. తుదకు విశాలమైన భూమియు వారికి నిఱుకుఁగా నాయెను. మఱి వారి ప్రాణములు వారికి కష్టములుగా నాయెను. మఱి దేవుఁడు తప్ప వేఱు శరణము నిచ్చువాఁడు లేఁడని వారు తెలిసి కొనిరి. పిదప వారు తిరిగి క్షమాపణ కోరుటకై దేవుఁడు వారిని కరుణించెను. నిశ్చయముగ దేవుఁడే అనుగ్రహించు వాఁడును కరుణించువాఁడును.

వ్యా॥ 117. కష్టకాలము అనగా తబూకు దండయాత్ర అందు అనేక కష్టములుండెను. ఎండ తీవ్రముగా నుండెను. ప్రయాణము చాలదూరము. ఖర్జూరపు తోఁటలు పండియుండెను. గొప్ప రోమను రాజును ఎదుర్కొనవలసి యుండెను. ముసల్మానుల యొద్ద సరియైన యుద్ధసామగ్రి లేకుండెను. దారిలో నీళ్ళు కఱవు. ఆహారము లేక ఒక్కొక్క సిపాయికి ఒక్కొక్క ఖర్జూరపు పండుపై ఒక్క దినము గడపవలసి వచ్చెను. ఇట్టి కష్టతరమైన స్థితిలో కొందఱు ముసల్మానుల హృదయము చలించి పోవుటకు సమీపించెను. కాని దేవుఁడు వారికి మనోధైర్యమొసంగెను. ముహాజిర్లును అన్సార్లును అట్టి కష్టములకు సహించి పైగంబరుల వారి వెంటయుండి యుద్ధయాత్ర సాగించిరి. అట్టి ధైర్యత్యాగములు గలిగిన వారికి దేవుని యనుగ్రహము కలిగెను. ఇట్టిభక్తులే దేవునికి ప్రియులు, ఉభయలోకములలో జయము పొందువారు. 118. తబూకు యుద్ధమునకు సోమరి తనముతో వెడలక మదీనా పురములో నిలిచిన వారిలో ముగ్గురికి దేవునినుండి క్షమాపణలభింపక వారివిషయము ఆలస్యమాయెను. ఆముగ్గురు (1) కాబుబిన్ మాలిక్ (2) హిలాల్ బిన్ ఉమయ్యా (3) మురార్ బిన్ రబీ, అనువారు. ఏఁబది దినములవఱకు వారి ముగ్గురితో ముసల్మానులు సలామ్ చేయుటగాని మాటలాడుటగాని మానుకొనిరి: కాబు భార్యకూడ భర్తను వదలి

తనతల్లియింటికి పోయెను. అట్లు ఆముగ్గురికి విశాలమైన భూమియు ఇఱుకుగా నాయెను. వారి ప్రాణములు వారికి కష్టములుగాc దోచెను. రాత్రింబవలు ఏడ్చుచు దేవునిని ప్రార్థించుచుండిరి. తుదకు దేవుcడు వారిని క్షమించి కరుణించెను. పైగంబరుల వారును ముసల్మానులును యథాప్రకారముగ కలిసి మెలసి యుండసాగిరి. తిరిగి యేదైనపొరపాటు గలిగినవారు మరల దేవునితో క్షమాపణ కోరవలెను అని దేవుcడు వారిని అనుగ్రహించెను.

119. యాఅయ్యు-హల్-లజీన-ఆ-మను త్-తఖుల్లాహ-వ-కూనూ మఅస్-సాదిఖీన్.

119. ఓ విశ్వాసులార! దేవునికి భయపడుచునుండుcడు. మఱియుసత్యవంతులతో నుండుcడు.

వ్యా॥ 119. సదా ముసల్మానులు దేవునికి భయపడుచు అబద్ధములు పలుకక సత్యము పలుకుచు సత్యవంతుల సహవాసములో నుండవలెను. ఎట్లు ఆ ముగ్గురు సత్యము పలికి రక్షణపొందిరో అట్లు సత్యమువలన సదా మోక్షము లభించును. వంచకులు అబద్ధములు పలికి నశించి నరక నివాసులైరి.

120. మా-కాన-లి-అహ్లి-ల్-మదీనతి-వ-మన్-హౌల-హుమ్-మినల్-అఅ్‌రాబి-అన్-యతఖల్లఫూ-అర్-రసూలిల్లాహి-వలా-యర్-గబూ-బి-అన్-ఫుసి-హిమ్-అన్-నఫ్-సిహీ-జాలిక-బి-అన్న-హుమ్-లా-యుసీ-బుహుమ్-జమ-ఉన్-వలా-నస-బున్-వలా-మఖ్-మ-సతున్-ఫీ-సబీ-లిల్లాహి-వలా-యత-ఊన-మా-తి-అన్-యగీ-జుల్-కుఫ్-ఫార-వలా-యనా-లూన-మిన్-అదువ్విన్-నైలన్-ఇల్లా-కుతిబ-లహుమ్-బిహీ-అమలున్-సాలిహున్-ఇన్నల్లాహ-లా-యుజీఉ-అజ్-రల్-ముహ్-సినీన్. 121. వలా-యున్-ఫిఖూన-నఫ-ఖతన్-సగీరతన్-వలా-కబీరతన్-వలా-యఖ్-తఊన-వాది-యన్-ఇల్లా-కుతిబ-లహుమ్-లి-యజ్-జియ-హుముల్లాహు-అహ్‌సన-మా-కానూ-యఅ్‌మలూన్.

120. దేవుని ప్రవక్త వెంట నుండక వెనుక నిలిచిపోవుట, మదీనాపుర నివాసులకును వీరికి చుట్టుపట్లనుండు పల్లెటూరివారలకును తగదు. మఱి వారు ప్రవక్త ప్రాణముకంటె తమ ప్రాణములను హెచ్చుగా పాటించుటవారికితగదు. ఇదియెందుకనగా యుద్ధవీరులకు దేవునిమార్గమందు గలుగు దాహము, కష్టము, ఆcకలి మఱియు వారు అడుగుపెట్టుటవలన కాఫిర్లకు కోపము గలుగు చోటు,

శత్రువులనుండి లాగుకొన్న వస్తువు, సర్వము వారికిఁగాను సత్కార్యముగా లిఖింపఁబడును. నిశ్చయముగ దేవుఁడు సత్కార్యములు చేయువారి ఫలితమును వృథా చేయఁడు, 121. మఱి, వారు చేయు కర్మలకు మంచి ఫలిత మొసంగుటకుఁగాను, వారు ఖర్చుచేయునది కొంచెమైనను అధికమైనను లిఖింపఁబడును. మఱివారు మైదానములను దాఁటిపోవుటయును వ్రాయఁబడును.

వ్యా॥ 120. ఇందు తబూకు యుద్ధమునకు హజ్రత్ రసూలివారివెంట వెడలక నిలిచిపోయిన మదీనా నివాసులకును చుట్టుపట్లనున్న అరబ్బులకును మందలింపుగలదు. హజ్రత్ రసూలువారికి కష్టములు గలుగుచుండ భక్తులు ఇండ్లలో నుండి సుఖములు అనుభవింపరాదు. తమ యాత్మను పైగంబరులవారికంటె హెచ్చుగా చూచుకొనరాదు. ధర్మయుద్ధము (జిహాదు) లో ఆఁకలి, కష్టము, దాహము, సహజముగ గలుగునవియే. వానికి సహించువారికి పుణ్యములు లభించును. శత్రువులపై దాడి వెడలిపోవుటవలన వారికి కోపము గలుగును. అయిన దానికి ఫలితముగా ముసల్మానులకు పుణ్యము లభించును. శత్రువులపై జయము లభించి వారినుండి లాగుకొను విజయధనమువలనకూడ పుణ్యమే లభించును. 121. దేవుని మార్గమందు ఖర్చుచేయు ధనము కొంచెమైనను అధికమైనను వృథాపోదు. అటులే దండయాత్రలో మైదానములు దాఁటిపోవుటకూడ వృథా పోదు. అవన్నియు పుణ్యకార్యములే. ఇవి మానవుల యధికారములోగల కార్యములు. ఇవి వృథాపోవు. వీనికిఁ దగిన మంచి ఫలితము లభించును.

122. వ-మా-కానల్-మూమినూన-లి-యన్-ఫిరూ-కాఫ్-ఫతన్-ఫలౌ-లా-నఫర-మిన్-కుల్లి-ఫిర్-ఖతిమ్-మిన్-హుమ్-తాఇ-ఫ-తుల్-లి-యత-ఫఖ్-ఖహూ-ఫిద్-దీని-వలి-యున్-జిరూ-ఖౌమ-హుమ్-ఇజా-రజ-ఊ-ఇలై-హిమ్-ల-అల్ల-హుమ్-యహ్-జరూన్.

122. ముసల్మానులందఱునుబయలుదేరుట సరిగాదు. కావున మతజ్ఞానము సంపాదించుటకును, తమ జనులయొద్దకు తిరిగివచ్చినపుడు వారు భయపడుటకై తమ జనులకు భయబోధ నిచ్చుటకును ప్రతి కుటుంబమునుండి కొందఱు ఎందులకు బయలుదేరలేదు,

వ్యా॥ 122. పై వాక్యములలో ఇంతవఱకు ధర్మయుద్ధము. (జిహాదు)నకు వెడలుట గొప్ప పుణ్యకార్యము. పోకుండయుండుట పాపకార్యము అని నొక్కి చెప్పఁబడెను. అందువలన సదా ప్రతి యుద్ధమునకు ప్రతి సమయములలో ముసల్మానులందఱును వెడలవలెను అని బహుశః కొందఱు తలంపవచ్చును. అందుకుఁగాను ఈ వాక్యములో అక్కఱలేనపుడు ముసల్మానులందఱును ఒకపెట్టున

బయలు దేఱకూడదు. ప్రతి కుటుంబము (ఖౌము) నుండి కొందఱు యుద్ధవీరులు యుద్ధములో పాలుగొనవలెను. మిగిలినవారు ఇతర పనులు చూచుకొనవలెను. హజ్రత్ రసూలువారు యుద్ధమునకు వెడలినచో వారివెంట పోవు ముసల్మానులు మతధర్మములను పైగంబరులవారియొద్ద నేర్చుకొందురు. మఱి ప్రయాణములో సంభవించు విషయములవలన అనేక అనుభవములు పొందుదురు. ఆధర్మములను అనుభవములను తాము యుద్ధమునుండి మరలివచ్చిన పిదప ఇండ్లలో నిలిచిపోయిన తమ జనులకుఁ దెలుపఁగలరు. ఒకవేళ హజ్రత్ రసూలువారు మదీనాలోనే యుండి యుద్ధమునకు పోయిన శిష్యులు తిరిగి వచ్చినపుడు పైగంబరులవారి సన్నిధిని ఉండిన శిష్యులు ఆకాలములో తాము నేర్చుకొన్న మత ధర్మములు తమ సహోదరులకు నేర్పఁగలరు. కావున యుద్ధమునకును, మత విద్య నేర్చుకొనుటకును ప్రతి కుటుంబములో కొందఱు బయలుదేఱవలెను. సమయముపడినపుడు అందఱు యుద్ధమునకు వెడలవలసినది యని ముసల్మానుల "ఇమామ్" (అధికారి) ప్రకటించినచో అపుడు అందఱును తప్పక వెడలవలెను. కావున మత విద్య నేర్చుకొని మత విద్వాంసులగుట, యుద్ధముచేయుట ఫర్ జెకిఫాయా అని విధింపఁబడినది. ఫర్ జెకిఫాయా అనగా ఒక గ్రామములో లేక ఒక కుటుంబము (ఖౌము) లో కొందఱు ధర్మము ఆచరించిన చాలును. అందఱు చేయనక్కఱలేదు. అందఱును తప్పక ఆచరింపవలసిన ధర్మమును ఫర్ జైన్ అందురు. ఉ॥ అయిదుపూఁటలు నమాజు సలుపుట, ఉపవాసముండుట మొదలగునవి.

123. యా-అయ్యు-హల్-లజీన-ఆమనూ-ఖాతి-లుల్-లజీన-యలూ-నకుమ్-మినల్-కుఫ్-ఫారి-వల్-యజిదూ-ఫీకుమ్-గిల్-జతన్-వ-అలమూ-అన్న ల్లాహ-మఅల్-ముత్తఖీన్.

123. ఓ విశ్వాసులార ! మీకు చేరువనున్న కాఫిర్లతో యుద్ధమాడుఁడు. మఱి మీయందు కాఠిన్యమున్నదని వారు తెలిసికొనవలెను. మఱి భయభక్తులు గలవారితో దేవుఁడున్నాఁడని తెలిసికొనుఁడు.

వ్యా॥ 125. ధర్మయుద్ధము (జహాద్) ఫరజై కిఫాయా యున్నది. శత్రువులైన అవిశ్వాసుల (కాఫిర్ల) తో ముసల్మానులు యుద్ధమాడవలెను. అందు తమకు చుట్టుపట్లనున్న కాఫిర్లతో యుద్ధమాడుచు పోవలెను. అందు ఏలాటి మృదుత్వము చూపకూడదు. కాఠిన్యము చూపనిచో శత్రువులు దాడివెడలి వచ్చి లోఁబఱచుకొందురు. భయభక్తులు వహించి న్యాయముగవర్తింపవలెను. భక్తులకు దేవుఁడు తోడుగా నుండును. కావున ముసల్మానులు శత్రులవుకు భయ

పడక దేవునిపై నాధారపడి ధర్మయుద్ధములు సలుపుచు లోకములో న్యాయమును శాంతియును నెలకొలుపవలెను. ఈ వాక్యమును అనుసరించి హజ్రత్ రసూలువారును, వారి శిష్యులును ధర్మయుద్ధములు సలిపి గొప్పధర్మరాజ్యము స్థాపించిరి. ముసల్మానులు మతధర్మములను అనుసరించి పరస్పరము ఐక్యము గలిగి శ్రద్ధతో నున్నంతకాలము వారు లోకమంతటకును రాజులుగ నుండిరి. పరస్పరము ఐక్యములేక మతధర్మములను పాటింపకయున్నకొలంది రాజ్యము క్షీణించి పరులకు లోఁబడవలసివచ్చెను. కావున ముసల్మానులు తమ స్థితిని సవరించుకొందురు గాక !

124. వఇజా-మా-ఉన్-జిలత్-సూరతున్-ఫ-మిన్-హుమ్-మన్-యఖూలు-అయ్యుకుమ్-జాదత్‌హు-హాజిహీ-ఈమా-నన్-ఫ-అమ్మల్-లజీన-ఆమనూ-ఫ-జా-దత్-హు-ఈమానన్-వ హుమ్-యస్-తబ్-షిరూన్. 125. వ-అమ్మల్ లజీన-ఫీ-ఖులూ-బిహిమ్-మర-జున్-ఫ-జాదత్-హుమ్-రిజ్-సన్ - ఇలా-రిజ్-సి-హిమ్-వ-మాతూ-వ-హుమ్-కాఫిరూన్.

124. ఏదైన ఒక సూరా వచ్చినపుడు వంచకులలోని కొందఱు ఇది మీలో నెవ్వని విశ్వాసమును వృద్ధి చేసెను అనిపలుకుదురు. కావున ఎవరు విశ్వాసులుగానున్నారో వారివిశ్వాసమును వృద్ధిచేసెను. మఱివారు సంతోషపడుచున్నారు. 125. మఱెవరి హృదయ ములలో రోగమున్నదో వారికి అపవిత్రతపైఅపవిత్రతను హెచ్చుగాఁజేసెను. మఱివారుఅవిశ్వాసులుగనేచచ్చిరి.

వ్యా॥ 124,125. దేవునిచే పైగంబరుల వారికి ఖురానె షరీఫులోని సూరా (కొన్ని వాక్యముల సమూహము) వచ్చినపుడు వంచకులుఎగతాళితో పరస్పరము ఆయ్యా ఈ సూరా ఎవ్వరి విశ్వాసమును వృద్ధి చేసెను అని పలుకుదురు. దానికి నిందు జవాబియ్యఁబడినది. ఖురానె షరీఫు సూరాను వినుట వలన నిజమైన భక్తులగు ముసల్మానుల విశ్వాసము ప్రబలు చున్నది. వారికి ఉత్సాహమును సంతోషమును లభించుచున్నవి. కాని ఎవరి హృదయములలో వంచన అవిశ్వాసపు రోగమున్నదో ఆ అపవిత్రమైన రోగము హెచ్చుగును. వారికి సందేహములు మెండగును. ఆ అవిశ్వాస రోగములోనే వారు చచ్చి నరకమునకు పాలగుదురు.

126. అవ-లా-యరౌన-అన్న-హుమ్-యుఫ్-తనూన-ఫీ-కుల్లి-ఆమిన్-మర్రతన్-ఔ-మర్రతైని-సుమ్మ-లాయతూ-బూన-వలా-హుమ్-యజ్-జక్క-రూన్. 127. వఇజా-మా-ఉన్-జిలత్-సూరతున్-నజర-బఅ-జుహుమ్-ఇలా-బఅ-జిన్-

హాల్-యరా-కుమ్-మిన్-అహ-దిన్-సుమ్మన్-సరఫూ-సరఫల్లాహు-ఖులూ -బి
హుమ్-బిఅన్న-హుమ్-ఖౌముల్-లా-యఫ్ ఖహూన్.

126. ప్రతి సంవత్సరమును ఒక తూరి లేక రెండుతూర్లు వారు పరీక్షింపఁ బడుట వారు చూచుట లేదా! మరల వారు క్షమాపణ కోరుటలేదు. మఱి వారు బోధను గ్రహించుటలేదు. 127. మఱియు ఏదైన ఒకసూరావచ్చినపుడు వారొకరి నొకరు చూచుకొనదురు. ఎవఁడైన ముసల్మానుఁడు మిమ్ము చూచుచున్నాఁడా అని పలుకుదురు. ఆపిదప వెళ్ళిపోవుదురు. దేవుఁడు వారి హృదయములను త్రిప్పివేసెను. ఎందుకనగా వారు గ్రహింపని జనులుగానున్నారు.

వ్యా॥ 126. ఇందు వంచకుల విషయము చెప్పఁబడినది. ప్రతి సంవత్సరము ఒకటి రెండు మార్లు దేవునిచే వంచకులకు పరీక్ష గలుగుచునే యుండును. కఱవు ఈతిబాధలు వారికిఁగలుగుచుండును. ఒకపుడు శత్రువుపై యుద్ధమునకు వెడల వలసి వచ్చును. అపుడు వంచకుల కుట్ర బయలు పడును. వారికి పరిశోధన గలిగినను వారు బుద్ధి తెచ్చుకొని తమ పాపముల క్షమాపణ దేవునితో వేఁడుకొనరు.మఱి బోధను గ్రహించి దాని ననుసరింపరు. తమ వంచనలోనే పడి యుందురు. 127. పైగంబరుల వారి సభలో వంచకులు కూర్చుండి యున్నపుడు దేవుని సందేశము (సూరా) వచ్చి యందు వంచకుల లోపముల గూర్చి యున్నచో దానిని వినుటకు సహింపలేక వంచకులుఒకరినొకరు చూచుకొని కన్నుల సైగలు చేసికొని మెల్లగ ముసల్మానుల కంటఁబడకుండ సభనుండి వెళ్ళిపోవుదురు. అట్లు వంచకులు పైగంబరుల వారి సభనుండి మరలిపోవుట వలన వారి హృదయములు కూడ ధర్మబోధననుండి తిరిగిపోయి వారు బోధను గ్రహింపఁ జాలరైరి.

128. లఖద్-జాఅకుమ్-రసూలుమ్-మిన్-అన్-ఫుసి-కుమ్-అజీజున్-అలైహి-మా-అనిత్-తుమ్-హరీసున్-అలైకుమ్-బిల్-మూమినీన-రఊఫుర్-రహీమ్.
129. ఫఇన్-తవల్లౌ-ఫఖుల్-హస్-బి-యల్లాహు-లా-ఇలాహ-ఇల్లా-హువ-అలైహి-తవక్-కల్తు-వ-హువ-రబ్బుల్-అర్-షిల్-అజీమ్.

128. (ఓ ముసల్మానులార!) మీయొద్దకు మీలోనుండియే ప్రవక్త వచ్చియున్నాఁడు. మీకు కష్టము కలిగించునది ఆతనికి భారముగా నున్నది. ఆతఁడు మీ మేలును చాలకోరువాఁడు. విశ్వాసులయెడ చాల కరుణయును దయయును గలిగి యున్నాఁడు. 129. పిదప వారు ముఖము త్రిప్పుకొనినచో నాకు దేవుఁడు చాలును. ఆతఁడుదప్ప వేఱుపూజ్యుఁడు లేఁడు. ఆతనిపైననే నేనుఆధారపడితిని. మఱి ఆఁతడే గొప్పసింహాసనమునకు స్వామిఅని ఓప్రవక్త పలుకుము.

వ్యా॥ 128. ఇందు దేవుఁడు తాను ప్రవక్తను పంపి ముసల్మానులకుచేసిన మేలును తెలుపుచున్నాఁడు. హజ్రత్ మహమ్మదు రసూలువారు మక్కా పుర ములో అరబ్బుల వంశములోని ఖురైషులలో జన్మించిరి. అందఱు వారివంశగో త్రములను వారి సంపూర్ణ చరిత్రమును వారి సుగుణములను బాగుగ నెఱుంగు దురు. మానవులకు ఉభయ లోకములలో కష్టములు గలిగించు విషయములను వారు సహింపలేరు. కావున మానవుల మేలుకోరి వారికి సన్మార్గము చూపుటకు వారికి చాల యిష్టముకలదు. మఱియు ముసల్మానులయెడ వారికి చాల ప్రేమ కరుణ దయయును గలదు. అందుచే సదా భక్తుల సౌకర్యములను పాటింతురు. 129. మానవులు హజ్రత్ రసూలువారి బోధను అనుసరింపక తిరిగి పోయినేని ప్రవక్తకు దేవుఁడే చాలును. ఆతఁడే తోడుపడువాఁడు. ఆతని సహాయమే చాలును.సర్వము ఆతనికి లోఁబడియున్నది. గొప్పఅధికార సింహాసనము (అర్షు) నకు స్వామి ఆతఁడే ఆతఁడు తప్ప వేఱుపూజ్యుఁడుగా నిదేవుఁడు లేఁడు. హస్ బియల్లాహు (ఆఖరువరకు) అను వాక్యమును ఉదయము సాయంత్రము ఏడేసి తూర్లు పఠించినచో దేవుఁడు భక్తులకు సర్వవిధములు తోడుపడి వారి కష్ట ములను నివారించును అని హదీసులో నున్నది.

సూరయే యూనుస్ - మక్కీ - 109 వాక్యములు,

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్.

అమిత దయగలవాఁడును ప్రేమించువాఁడునగు దేవునిపేర.

1 అలిఫ్-లామ్-రా-తిల్క-ఆయా-తుల్-కితాబిల్-హకీమ్. 2. అకాన-లి న్నాసి-అజాబన్-అన్-ఔ-హైనా-ఇలా-రజులిమ్-మిన్-హుమ్-అన్-అన్ -జి-రి న్నాస-వబష్-షిరిల్-లజీన-ఆమనూ-అన్న-లహుమ్-ఖదమ-సిద్-ఖిన్-ఇన్ద- రబ్బి హిమ్-ఖాలల్-కాఫిరూన-ఇన్న-హాజా-ల-సాహిరుమ్-ముబీన్.

1. అలిఫ్‌లామ్‌రా. ఇవి స్థిరమైన గ్రంథముయొక్క వాక్యములు. 2. ప్ర జలకు భయబోధ నిమ్ము అనియు విశ్వాసులకు వారి ప్రభువునొద్ద ఉన్నత పద వికలదను సంతోషవార్త నిమ్ము అనియువారిలోని ఒక మానవునకు మేముసందే శము పంపినందులకు ప్రజలకు ఆశ్చర్యమైనదా? నిశ్చయము ఈతఁడు స్పష్టమైన జాల విద్య గలవాఁడు అని అవిశ్వాసులు పలుకసాగిరి.

వ్యా॥ 1. అలిఫ్‌లామ్‌రా! ఇవి విడి అక్షరములు. వీని అర్థము నేను దేవుఁడను చూచుచున్నాఁడను అనికొందఱు చేసి యున్నారు. ఖురాను గ్రంథ ములోని వాక్యములు స్థిరమైనవి. అందు జ్ఞానము గలదు. అందలి విద్య జ్ఞాన మును అనుసరించి యున్నది. అందుగలపూర్వికుల విషయములునిజముగా సంభ

వించినవి. అందు ఏలాంటి తారతమ్యములేదు. ఎందుకన ఖురాను షరీఫు సర్వజ్ఞుడగు దేవుఁడు ఒసంగిన గ్రంథము. కాన మానవు లందఱును దాని ననుసరింపవలెను. 2. హజ్రత్ రసూలువారు మానవులే. మానవునకు దేవుని సందేశము వచ్చునా అని ప్రజలు ఆశ్చర్యపడ నక్కఱలేదు. మానవులకు సన్మార్గము చూపుటకును అధర్మ మార్గమును నిషేధించుటకును మానవుఁడే ప్రవక్తగా వచ్చును. ప్రవక్త వచ్చి దేవునియందు విశ్వాసముగల వారికి వారి సత్కార్యములకు ఫలితముగ దేవుని సాన్నిధ్యమునగొప్ప యున్నత పదవి లభించును అని సంతోషవార్త నిచ్చును. అటులే ప్రజలు దేవుని ధర్మములను అనుసరింపక పాపకార్యములు చేసినచో వారికి దేవునిశిక్ష లభించును అని భయబోధ నిచ్చును. కాఫిర్లు ఖురాను వాక్యములను విని అందలి మహిమను గ్రహించి ఇదిజాలవిద్యగానున్నది. దీనిని తెచ్చునాతఁడు జాలవిద్యగాఁడు (జాదూగర్) అనిపలుకసాగిరి. కాఫిర్లు పలుకు నది నిజము కాదు అని ప్రజలు తెలిసికొనవలెను.

3. ఇన్న-రబ్బ-కుముల్లా-హుల్-లజీ-ఖల-ఖస్-సమా-వాతి-వల్-అర్-జ-ఫీ-సిత్తతి-అయ్యామిన్-సుమ్మస్-తవా-అలల్-అర్షి-యు-దబ్బి రుల్-అమ్ర మా-మిన్-షఫీ-ఇన్-ఇల్లా-మిమ్-బఅది-ఇజ్-నిహీ-జాలి-కుముల్లాహు-రబ్బు-కుమ్ ఫఅ-బుదూహు-అఫలా-తజక్క-రూన్. 4. ఇలైహి-మర్-జిఉ-కుమ్-జమీఅన్ వఅ-దల్లాహి-హఖ్-ఖన్-ఇన్నహూ-యబ్-దఉల్-ఖల్ఖ-సుమ్మ-యు-ఈదు హూ-లి-యజ్-జియల్-లజీన-ఆమనూ-వ-అమి-లుస్-సాలి-హాతి-బిల్-ఖిస్తి-వల్-లజీన-కఫరూ-లహుమ్-షరా-బుమ్-మిన్-హమీమిన్-వ-అజా-బున్-అలీ-ముమ్-బిమా-కానూ-యక్ఫురూన్. 5. హువల్-లజీ-జఅలష్-షమ్స-జియా అన్-వల్-ఖమర-నూరన్-వ-ఖద్దర-హూ-మనా-జిల-లితఅ-లమూ-అద దస్-సినీన-వల్-హిసాబ-మా-ఖల-ఖల్లాహు-జాలిక-ఇల్లా-బిల్-హఖ్-ఖి-యుఫస్-సిలుల్-ఆయాతి-లి-ఖౌమిన్-యఅ-లమూన్.

3. ఆకాశములను భూమిని ఆఱుదినములలో సృష్టించి సింహాసనము (అర్షు) పైస్థిరపడి (సృష్టి) కార్యములను నెరవేర్చునట్టి దేవుఁడే మీప్రభువు. ఆతని సెలవు లేనిది ఎవరును సిఫారసు చేయలేరు. ఈ దేవుఁడే మీప్రభువు. కావున ఆతనినే మీరు పూజింపుఁడు. ఏమి మీరు గ్రహింపరు. 4. మీరందఱును ఆతని యొద్దకే మరలవలసి యున్నది. దేవుని వాగ్దానము వాస్తవమైనది.

మొదటితూరి ఆతఁడే పుట్టించుచున్నాఁడు. ఆపిదప విశ్వసించి న్యాయముగ స త్కార్యములను చేసిన వారికి ప్రతిఫల మొసంగుటకుఁగాను తిరిగి రెండవతూరి లేపును. మఱియు అవిశ్వాసులైన వారికి వారి యవిశ్వాసమునకు ఫలితముగ సలసల కాగు నీళ్ళు త్రాగుటకును దుఃఖకరమైన బాధయును గలదు. 5. ఆతఁ డే సూర్యుని ప్రకాశమానముగాను, చంద్రుని కాంతిగాను చేసెను. మఱిమీరు సంవత్సరముల సంఖ్యను లెక్కను తెలిసికొనుటకుఁగా చంద్రునికి స్థానములు నియమించెను. దేవుఁడు ఇదంతయు చాల వివేచనముతోనే పుట్టించెను. తెలివి గల వారికిఁగాను దేవుఁడు సూచనలను వివరించుచున్నాఁడు.

వ్యా॥ 3. ఇఁక ఈవాక్యములో దేవుని ఏకత్వమును గూర్చియు ఆతఁ డు సృష్టించిన సృష్టినిగూర్చియు చెప్పఁ బడుచున్నది. మానవులకు దేవుఁడే సృష్టికర్త. ఆతఁడు తప్ప వేఱు ప్రభువులేఁడు. భూమ్యాకాశములను ఆఱు దిన ములలో క్రమముగా సృష్టించెను. ఆ ఒకదినము ఇప్పటి వేయి సంవత్సరముల కాలమునకు సరిపోవునది. దీనిబట్టి ఆఱువేల సంవత్సరములలో భూమ్యాకాశ ములు ఇప్పటి స్థితి పొందినవి. దేవుఁడు కోరినచో ఒక్క క్షణకాలములోనే స మస్తమును సృష్టింపఁ గలఁడు. కాని యట్లు చేయలేదు. ఎందుకన ప్రతిపనియు క్రమముగా జరుగవలెను అని మానవులకు సూచించుటకు భూమ్యాకాశముల ను సృష్టించి అర్షు అను పీఠముపై విరాజిల్లెను. అనగా సర్వము దేవునికి అ ధీనమై యున్నది అని తెలిసికొనవలెను. దేవుఁడు సర్వసృష్టి కార్యములను నెర వేర్చుచు వాని బందోబస్తు చేయుచు వానిని పోషించుచున్నాఁడు. ఆతని కార్య ములో నెవరును భాగస్థులులేరు. ఏద్దియు ఆతనికి సాటిలేదు. ఆతని సెలవులేని దే ఎట్టి భక్తుఁడైనను ఆతని సన్నిధిని పలుకలేఁడు. మఱి సిఫారసు చేయలేఁడు. మానవులు గమనించి గ్రహించినచో పై వివరింపఁబడిన సర్వేశక్తుఁడగు ప్ర భువుతప్ప వేఱు పూజ్యుఁడెవఁడును లేఁడు. కావున మానవులందఱును సాటి లేని ఒక్క దేవునిని పూజింపవలెను. 4. దేవుఁడే మానవులను సృష్టించెను. తుదకు మానవులందఱును మరల ఆతని యొద్దకే పోవలసియున్నది. తుదిదినము నందు అందఱు తిరిగి సజీవులై తమకర్మల తీర్పునకుఁగాను దేవునిసన్నిధిని నిలువ వలసి యున్నది. విశ్వాసులకు న్యాయముగ వారి పుణ్యకార్యములలో ఏలాంటి కొఱత కాకుండ సంపూర్ణ ఫలితము దేవుఁడు ఒసంగును. కాఫిర్లకు వారి అవి శ్వాసమునకుఁగాను వారికి నరక నివాసము లభించును. అందు సలసల కాగు నీళ్లు వారు త్రాగవలసి వచ్చును. 5. సర్వశక్తుఁడగు దేవుఁడే సూర్యుని చం ద్రుని సృష్టించెను. వానివలన రాత్రింబవలును మానవులకు వెలుతురును ఉష్ణము ను లభించుచున్నది. వానివలన అనేక లాభములు వీరు పొందుచున్నారు. చంద్రునికి స్థానములు నియమింపఁ బడినవి. హెచ్చు తగ్గుల వలన నెలలు సం

వత్సరము లేర్పడు చున్నవి. మానవులు వాని వలన తమ కార్యముల లెక్కలు తెలిసి కొనుదురు. అటులే సూర్యుని వలన సూర్యమానము ఏర్పడుచున్నది. ఆ కాశములలోని సూర్య చంద్రాదులను దేవుఁడు వృథాగా పుట్టించలేదు. వాని వలన మానవులకు అనేక ప్రయోజనములు గలుగుచున్నవి. తెలివి గలవారు వీనిని గమనించి సృష్టికర్త ఒకఁడున్నాఁడని తెలిసి కొనుదురుగాక!

6. ఇన్న - ఫిఖ్ - తిలా - ఫిల్ - లైలి-వన్ -నహారి-వ-మా-ఖల-ఖల్లాహు ఫిస్-సమా-వాతి-వల్ -అర్ జి-ల-ఆయాతిల్ -లి-ఖౌమిన్ -యత్ -తఖూన్.

6. నిశ్చయముగ, రాత్రింబవలు ఒకటి వెనుక నొకటిగ వచ్చి పోవుట లోను భూమ్యాకాశములలో దేవుఁడు సృష్టించిన ప్రతిదానిలోను, భయపడు నట్టి జనులకుఁగాను సూచన లున్నవి.

వ్యా॥ 6. క్రమముగ రాత్రి పగలు వచ్చి పోవుటలోను, లోకములోని ప్రతి వస్తువును గమనించినచో దేవుఁడు ఒకఁడున్నాఁడు అని భక్తులు తెలిసి కొనఁగలరు.

7. ఇన్నల్ -లజీన-లాయర్ -జూన-లిఖాఅనా-వరజూ-బిల్ -హాయా-తిద్ దున్యా-వత్ -మ-అన్నూ-బిహా-వల్ -లజీనహుమ్-అన్ -ఆయాతినా-గాఫిలూన్.
8. ఉలా-ఇక-మా-వాహు-మున్ -నారు-బిమా కానూ-యక్ -సిబూన్.

7:8. నిశ్చయముగ నెవరుమాదర్శనమును ఆశింపక యిహలోకజీవనము తో సంతుష్టులై దానితోనే తృప్తినొంది మాసూచనలఁగూర్చి అజాగ్రత్తగా నున్నారో అట్టివారికి వారి కర్మల ఫలితముగ నరకనివాసమున్నది.

వ్యా॥ 7. అవిశ్వాసులు, ఇహలోక తుచ్ఛభోగములకు మోసపోయి దానికి సంతోషపడి తృప్తిచెంది మేము చచ్చి తిరిగి సజీవులై దేవుని దర్శిం పము అని తలఁచి దేవుఁడు సృష్టించిన లోకమును గమనింపక అజాగ్రత్తగా నుండిపోయిరి. 8. ఇట్టివారు గావించిన పాపకార్యములకును, వారి యవిశ్వాస మునకును ప్రతిఫలముగ వారికి నరకాగ్ని నివాసము లభించును. కావున మాన వులు నరకమునుండి ముక్తిపొందవలెనన్న విశ్వాసము వహించి సత్కార్యములు చేయవలెను.

9. ఇన్నల్ -లజీన-ఆమనూ-వ అమి-లుస్-సాలి-హాతి-యహ్దీ - హిమ్- రబ్బు-హుమ్-బి-ఈ-మాని-హిమ్ -తజ్రీ-మిన్-తహ్-తిహి-ముల్ -అన్-హారు- ఫీ జన్నా-తిన్-నఈమ్.10. దఅ-వాహుమ్ -ఫీహా-సుబ్ -హానక-ల్లా-హుమ్మ-వ- త-

హియ్యా-తు-హుమ్-ఫీహా-సలామున్-వ-ఆఖిరు-దఅ్వాహుమ్-అనిల్-హమ్దు-లిల్లాహి-రబ్బిల్-ఆల-మీన్.

9. నిశ్చయముగ విశ్వసించి సత్కార్యములుచేసినవారికి వారివిశ్వాసము వలన దేవుఁడు సన్మార్గము చూపును. సౌఖ్యములుగల స్వర్గవనములందు వారి క్రిందుగ కాలువలు ప్రవహించును. 10. అందు వారు "ఓ దేవా! నీవు పరమ పవిత్రుఁడవు" అని ప్రార్థింతురు. అందు వారు ఒకరినొకరు దర్శించునపుడు సలామ్ అని దీవించుకొందురు. మఱి సర్వలోకములకు పోషకుఁడగు దేవునికి సర్వస్తోత్రములున్నవని వారి ప్రార్థన ముగియును.

వ్యా॥ 9. ఇఁక విశ్వాసులనుగూర్చి చెప్పఁబడుచున్నది. విశ్వసించిసత్కార్యములు చేసినవారికి వారి విశ్వాసమువలన వారికి దేవుఁడు ఉభయలోకములలో సన్మార్గమును ముక్తిమార్గమును చూపును. దానివలన విశ్వాసులు స్వర్గములో ప్రవేశింతురు. అందు సదా సౌఖ్యములుఅనుభవింతురు. అందు ఆనందకరములైన నీటికాలువలు ప్రవహించును. 10. విశ్వాసులు తమకు దేవుఁడొసంగిన స్వర్గసౌఖ్యములను చూచి ఓ దేవా! నీవు పరమపవిత్రుఁడవు అని ప్రార్థింతురు. అపుడు వారు కోరిన ఫలములు వారికి లభించుచుండును. ఇహమునందు విశ్వాసులు ఒకరినొకరు దర్శించినపుడు సలామ్ చేయుదురు. సలామ్ అనగా మీకు శాంతి లభించునుగాక! అని అర్థము. ఇటులే విశ్వాసులు స్వర్గములో ఒకరినొకరు దర్శించునపుడు సలామ్ చేసికొందురు. స్వర్గములో దేవునిచే లభించు ప్రతి సౌఖ్యము అనుభవించుచు ప్రతి ప్రార్థనకు అంత్యమున కృతజ్ఞత చూపుటకై అల్ హమ్దులిల్లాహి రబ్బిల్ ఆలమీన్ అని ప్రార్థింతురు. మానవులందఱును ఇట్టి స్వర్గనివాసము పొందుటకుఁగాను యత్నింతురుగాక!

11. వలౌ-యు-అజ్జి-లుల్లాహు-లిన్నా-సిష్-షర్రస్-తిఅ-జాలహుమ్-బిల్ ఖైరి-లఖు-జియ-ఇలై-హిమ్-అజలుహుమ్-ఫ-న-జ-రుల్-లజీన-లా-యర్-జూన-లి-ఖాఅనా-ఫీ-తుగ్-యానిహిమ్-యఅ-మహూన్. 12. వ-ఇజా-మస్సల్ ఇన్-సానజ్-జుర్రు-ద-ఆనా-లి-జమ్-బిహీ-ఔ-ఖాఇ-దన్-ఔ-ఖాఇ-మన్-ఫ-లమ్మా-కషఫ్-నా-అన్హు-జుర్రహూ-మర్ర-కఅల్-లమ్యద్-ఉనా-ఇలా-జుర్రిమ్ మస్సహూ-కజాలిక-జుయ్యిన-లిల్-ముస్-రిఫీన-మా-కానూ-యఅ-మలూన్. 13. వలఖద్-అహ్-లక్నల్-ఖురూన-మిన్-ఖబ్లి కుమ్-లమ్మా-జలమూ-వ-జాఅత్-హుమ్-రుసు-లుహుమ్-బిల్-బయ్యినాతి-వ-మా-కానూ లి-యూమినూ-

కజాలిక-నజ్-జిల్-ఖామల్-ముజ్-రిమీన్. 14. సుమ్మ జఅల్నా-కుమ్-ఖలా-ఇఫ ఫిల్-అర్-జి-మిమ్బ-అదిహిమ్-లి-నన్-జుర-కైఫ-తఅ-మలూన్.

11. మఱియు ప్రజలు మేలుశీఘ్రముగ రావలెనని కోరునట్లు, దేవుఁడు వారికిఁగాను కీడు శీఘ్రముగా పంపినచో వారి యాయువుతీరిపోయియుండును. కావున మాదర్శనము లభించునను ఆశలేనివారు తమ దుర్మార్గములోపడి దేవు లాడునట్లు వారిని వదలిపెట్టుచున్నాము. 12. మఱి మానవునకు కష్టము గలిగి నచో అతఁడు పరుండియో లేక కూర్చుండియో లేక నిలుచుండియో మమ్ము వేఁడును. ఆ పిదప మేము వాని కష్టము తొలఁగించినచో వానికిఁ గలిగిన కష్ట మునకుఁగాను మమ్ము వేఁడనట్లుగ వాఁడు వెళ్ళిపోవును. ఇట్లు నియమములు అతిక్రమించిపోవువారికి వారు చేయు కర్మములును ఇష్టములుగా నున్నవి. 13. మఱియు మీకు పూర్వము జనులు అన్యాయములు చేయఁగా మేము వారిని నశింపఁజేసితిమి. మఱి స్పష్టమైన సూచనలు దీసికొని వారియొద్దకు వారి ప్రవ క్తలు వచ్చియుండిరి. మఱి వారు విశ్వసింపనేలేదు. ఇటులే పాపులగు జను లను మేము శిక్షించుచున్నారము. 14. ఆ పిదప మీరెట్లు కార్యములు చేయు దురో మేము చూడవలెనని వారి వెనుక వారికి బదులుగమిమ్ము భువిలో నియ మించితిమి.

వ్యా॥ 11. పైవాక్యములలో దేవునిని దర్శింపలేమని తలఁచువారి నివా సము నరకాగ్ని అని చెప్పఁబడినది. ఇఁక ఈవాక్యములో అట్టివారిని దేవుఁడు తత్క్షణమే శిక్షింపక కొంతకాలము వదలిపెట్టును. అప్పుడు వారు తమ దుర్మార్గ ములో సంపూర్ణులై వారికిఁ దగిన శిక్షకు పాత్రులగుదురు అను విషయము చెప్పఁబడుచున్నది. సహజముగ మానవుఁడు కోపములో తన్ను, తన బిడ్డలను శపించుకొనును. ఎట్లు మేలు శీఘ్రముగ రావలెను అని మానవులు కోరుదురో అటులే వారు కోరు కీడును దేవుఁడుతత్క్షణమే పంపినచో మానవులు నశించిపోవు దురు, దేవుఁడు అట్లు చేయక వారివారి జీవితకాలము పూర్తియగునంతవఱకు వారిని వదలిపెట్టుచున్నాఁడు. అందు భక్తులు సత్కార్యములు చేసి పుణ్యమును సంపాదించుకొందురు. దుర్మార్గులు పాపములు కట్టుకొందురు. 12. మనుష్యుఁడు ప్రప్రథమమున నిర్భయముగా కీడురావలెననికోరును. ఒకవేళ ఏదైనకష్టము గలి గినచో ధైర్యముపీడి దేవునిని వేఁడుకొనును. కష్టమున్నంతకాలము పరుండి కూర్చుండి నిలిచి ప్రతి స్థితిలోను దేవునిని వేఁడుకొనును. మఱి ఆ కష్టములు తొలఁగినంతనే తాను వేఁడిన ప్రార్థనలు మఱచిపోయి తిరిగి ఇహలోకభోగ ములలో నిమగ్నుఁడై దేవునిని మఱచిపోవును. ఇట్లుతాను చేయు పనులను మం చివిగా నెంచును. భక్తులు కష్టములందు ఓపిక వహించి సంపదలు గలిగినపుడు

దేవునికి కృతజ్ఞత వహించియుండవలెను. కష్టములందు అధైర్యము వహించి సంపదలలో మైమఱచి విఱ్ఱవీగకూడదు. 13. మానవులు తాము చేయు పాప కార్యములకు తమకు తత్క్షణమే శిక్ష లభించుటలేదే అని మోసపోయి అలక్ష్యముగా నుండరాదు. పూర్వముకూడ ప్రవక్తల బోధలను వినక పాపములను అన్యాయములను గావించిన దుర్మార్గులు దేవుని శిక్షకు పాత్రులై నశించిరి. ఎందుకన వారు విశ్వాసము వహించలేదు. అందుకు వారు తమ పాపకార్యములకుఁ దగిన శిక్షపొందిరి. 14. మీరు చేయు కార్యములను చూచుటకు దేవుఁడు మీపూర్వికులకు బదులుగ మిమ్ము భువి (దేశము)లో వసింపఁజేసెను. మీరు దేవుని విషయమును అతని ప్రవక్త విషయమును ఎట్లు ప్రవర్తింతురో, మానవుల హక్కులను ఎట్లు పాటింతురో దేవుఁడు చూచును. కార్యములకుఁ దగినట్లు ఫలితము లభించును.

15. వ-ఇజా-తుత్ లా-అలైహిమ్ ఆయాతునా-బయ్యినా తిన్- ఖాలల్ -లజీన-లా-యర్-జూన-లిఖా-అనఅ్-తి-బి-ఖుర్ ఆనిన్ గైరి-హాజా-ఔ బద్దిల్ హు-ఖుల్ -మా-యకూను-లీ-అన్ ఉబద్ దిలహూ మిన్-తిల్-ఖా-ఇ-నఫ్సీ- ఇన్-అత్ -తబిఉ-ఇల్లా-మా-యూహా ఇలయ్య ఇన్నీ-అఖాఫు-ఇన్-అసైతు .- రబ్బీ-అజా-బ యౌమిన్-అజీమ్. 16. ఖుల్ -లౌ-షా-అల్లాహు మాతలౌ తుహూ-అలైకుమ్-వలా-అద్రాకుమ్-బిహీ-ఫ-ఖద్ -లబిస్ తు-ఫీ-కుమ్ ఉము-రమ్-మిన్ ఖబ్ లిహీ-అఫలా-తఅ-ఖిలూన్. 17. ఫమన్-అజ్ లము-మిమ్ మనిఫ్ తరా -అలల్లాహి-కజి-బన్ ఔ కజ్-జబ-బి-ఆయా-తిహీ-ఇన్నహూ-లా యుఫ్-లిహుల్ -ముజ్రిమూన్.

15. మఱియు స్పష్టమైన మావాక్యములు వారియెదుట చదువఁబడునపుడు మాదర్శనమును ఆశింపనివారు ఇది దప్ప వేఱు ఖురాను దీసికొని రమ్ము లేదా దానిని మార్చివేయుము అని పలుకుదురు. స్వయముగా నేను దానిని మార్పఁజాలను. నాయొద్దకువచ్చు దేవుని సందేశమును మాత్రము నేను అనుసరించుచున్నాను. నేను నాప్రభువు సెలవును అతిక్రమించినచో గొప్ప దినమునందలి శిక్ష గలుగునని నేను భయపడుచున్నాను అని ఓ పవిత్రా! పలుకుము. 16. దేవుఁడు కోరినచో నేను మీయెదుట దానిని చదివియుండను. మఱి దేవుఁడు దానిని మీకుఁ దెలిపియుండఁడు. ఎందుకన దీనికిపూర్వము నేను మీలో నా వయస్సును గడపితిని. ఏమి మీరు యోచింపరా! అని ఓ ప్ర

వక్తా! పలుకుము. 17. మఱి దేవునిపై అబద్ధములు కల్పించినవానికంటెను లేదా దేవుని వాక్యములను తిరస్కరించినవానికంటెను ఎక్కుడు దుర్మార్గుఁడెవఁడున్నాఁడు. నిశ్చయముగా పాపులు మోక్షము పొందరు.

వ్యా॥ 15. హజ్రత్ రసూలువారు, ఖురానె షరీఫు వాక్యములను చదివి అవిశ్వాసులకు వినిపించుచుందురు. అందు విగ్రహారాధన చేయకూడదుఅనియు గలదు. అందుకుఁగాను కాఫిర్లు వైరముతో ఈ ఖురానుగాక మఱొక ఖురాను తీసికొనిరమ్ము లేదా అందు మాకు పట్టని విషయములను మార్చివేయుము అని పలుకసాగిరి. దానికి నిందు జవాబియ్యఁబడినది. దేవుని వాక్యములను స్వయముగా ప్రవక్తయును, దేవదూతయును కల్పింపఁజాలరు. మఱి మార్పు చేయఁజాలరు. వారు దేవుని యాజ్ఞలకు బద్ధులైయున్నారు. ప్రవక్త స్వయముగా నెద్దియును దేవునిపై కల్పింపఁజాలఁడు. దేవునినుండి ఏ వాక్యమువచ్చునో దానిని ప్రజలకు తెలుపును. దేవుని వాక్యములను మార్చుట ఘోరపాతకము. అట్లు ప్రవక్త చేయఁడు. ఒకవేళ చేసినచో దేవునిశిక్షకుపాలగును. కావునప్రవక్త దేవునికి చాల భయపడును. కావున ప్రజలుకూడ అట్టి కోరికలు కోరుట పాపకరము. 16. ఇందు ఖురాను వాక్యములు దేవుని వాక్యములని తెలుపఁబడినది. పైగంబరులవారు ఇట్లు తెలుపవలెనని దేవుని సెలవు అగుచున్నది. దేవుఁడు కోరి నాకుఁ దెలిపినది. ఆతని సెలవుచే మీకుఁ దెలుపుచున్నాను. నేను స్వయముగా నేమియు పలుకుటలేదు. దేవుఁడు ఇష్టపడనిచో నేను నాసొంతశక్తితో మీకేమియును దెలుపఁజాలను. నావిషయము మీకుఁదెలిసియేయున్నది. నాకు దేవునినుండి ప్రవక్త పదవి లభింపక పూర్వము నలువదియేండ్లవయస్సువఱకు మీతోనే వసించితిని. నాకు చదువను వ్రాయనురాదు అనువిషయముమీకుఁ దెలిసియేయున్నది. నేను ఏ పాఠశాలలోను ఏ యుపాధ్యాయునియొద్దను విద్యను అభ్యసించలేదు. నేను బాల్యమునుండియు సత్యమే పలుకువాఁడను. అందులకే మీరు సాదిఖ్ (సత్యవాది) ఆమీన్ (అమానత్ దారుఁడు) అని నన్ను పిలుచుచున్నారు. అట్టివాఁడనగు నేను, ఇట్టియద్భుతమైనశైలియు ధర్మములును గల ఖురానె షరీఫు నేను స్వయముగా కల్పింపఁగలనా? మఱి దేవుఁడు తెలుపని విషయములను దేవుఁడు తెలిపెను అని దేవునిపై అబద్ధము పలుకుదునా? ఏమి ఓ జనులార! మీరీ విషయములు గ్రహింపరా! 17. దేవునిపై అబద్ధములు కల్పించుట ఘోరపాపము. అంతకంటె ఎక్కువ అన్యాయము వేఱు గలదా! నేను అట్టి పాపము చేయుదునా! ఎన్నటికిని చేయను. పాపులు మోక్షమును జయము పొందరు. కావున ఓ అవిశ్వాసులార! మీరు దేవుని శిక్షకు భయపడి విశ్వసింపవలెను.

18. య-అబుదూన-మిన్-దూనిల్లాహి-మాలా-యజుర్రు-హుమ్ - వలా-యన్-ఫఉ-హుమ్-వ-యఖూ-లూన-హా-ఉ-లాఇ-షుఫ-ఆ-ఉనా-ఇన్దల్లాహి-ఖుల్-అతు-నబ్బి-ఊనల్లాహ-బిమా-లా-యఅలము-ఫిస్-సమావాతి-వలా-ఫిల్-అర్ జి-సుబ్-హాన-హూ-వ-త-ఆలా-అమ్మా-యుష్‌రికూన్. 19. వ-మా-కానన్-నాసు-ఇల్లా-ఉమ్మతన్-వాహి-దతన్-ఫఖ్-తలఫూ-వలౌ-లా-కలి-మతున్-సబ-ఖత్-మిర్-రబ్బిక-ల-ఖుజియ-బైన-హుమ్-ఫీమా-ఫీహి-యఖ్-తలిఫూన్. 20. వయ-ఖూలూన-లౌలా-ఉన్ జిల-అలైహి-ఆయతుమ్-మిర్-రబ్బిహీ-ఫఖుల్-ఇన్నమల్-గైబు-లిల్లాహి-ఫన్-తజిరూ-ఇన్నీ-మఅ-కుమ్-మినల్-మున్-తజిరీన్.

18. మఱివారు దేవునిని వదలి తమకు నష్టమును లాభమునుచేయఁజాలని వానిని పూజించు చున్నారు. మఱి దేవుని సన్నిధానమున ఇవి మా సిఫారసు చేయునవి అని పలుకుచున్నారు. ఏమి ఆకాశములలోను భూమిలోను దేవునికిఁ దెలియని దానిని మీరు ఆతనికిఁ దెలుపుచున్నారా! ఆతఁడు పరమ పవిత్రుఁడు. వారు సాటి కల్పించు వానికంటె నాతఁడుఅధికుఁడు అనిఓప్రవక్త! పలుకుము. 19. మఱియు మనుష్యు లందఱును ఒకే మతము వారలగానుండిరి. పిదప వారు వేఱు వేఱు గానై పోయిరి. ముందుగానే నీ ప్రభువునుండి మాట అయి యుండనిచో దేని విషయము వారు కలహించుచున్నారో దాని విషయము తీర్పుఅయి పోయియుండును. 20. మఱియు వారు "ఆతని ప్రభువునుండి ఆతనికి ఒక సూచన యెందుకు లభింపలేదు అని పలుకుదురు. కావున అగోచరమైన విషయము దేవునికే తెలియును. కాన మీరు వేచియుండుఁడు. నేనుకూడ మీతోఁ బాటు వేచియుందును అని ఓప్రవక్త! పలుకుము.

వ్యా॥ 18. ఇఁక కాఫిర్లు పూజించు విగ్రహములను దేవతలను గూర్చి చెప్పఁబడుచున్నది. విగ్రహారాధకులు సర్వ శక్తుఁడగు దేవునిని వదలి లాభ నష్టములుచేయలేని చిల్లర దేవతలను విగ్రహములను పూజించు చున్నారు. ఏమయ్యా! ఇట్లు ఎందులకు చేయుదురని వారిని ప్రశ్నించినచో పెద్దదేవుఁడు ఒకఁడున్నాఁడు. ఈవిగ్రహములు చిల్లర దేవతలు. మాపక్షము దేవునివద్ద సిఫారసు చేయును. కావున వానిని సంతోష పెట్టుటకై మేము పూజింతుము. అని పలుకుదురు. దీనికి రద్దు చేయబడుచున్నది. విగ్రహములు సిఫారసు చేయలేవు. ఈ విషయము దేవునికిఁ దెలియదా. భూమ్యాకాశములలోని ఏవిషయము దేవునికి మఱుఁగై యున్నది.ఎద్దియును లేదు. దేవునికి సాటిలేదు. ఆతఁడు పరమ పవిత్రుఁడు. ఇట్టి సంబంధములు ఆతకి లేవు. ఆతఁడు సర్వాధికుఁడు. కావున

ఆతనికి సాటి కల్పింపరాదు. విగ్రహములను చిల్లర దేవతలను పూజింపరాదు. 19. విగ్రహారాధకులు అయ్యా మీమతములో విగ్రహారాధన తప్పుగా నుండిన నుండవచ్చును. కాని మామతములో అది నిషిద్ధముకాదు. అని ముసల్మానుల తో చెప్పిన చెప్పవచ్చును. కావున దానికి నిందు జవాబియ్యఁబడినది. అది యేమన! ఆదము ప్రవక్తనుండియు మనుష్యులందఱును ఒక్క దేవునినే పూజించుచు ఒక మతములో నుండిరి. దేవుఁడు ప్రజలకు నియమించిన మతము ఒక్కటే. దానినేబోధించుటకు ప్రవక్తలు వచ్చిరి. ఆపిదప ప్రజలు వేఱువేఱుగా నైపోయి స్వయము విగ్రహారాధన కల్పించుకొనిరి. విగ్రహారాధన ప్రతికాలములో నిషిద్ధమై యున్నది. అయిన దేవుఁడు బలవంతముగా నందఱిని ఒకేమతమునందు నడిపింపక ప్రజలకు స్వాతంత్ర్యము నిచ్చియున్నాఁడు. ఇహలోకము కర్మలకు స్థలము. అందఱి కర్మల తీర్పు ఇచ్చుటకాదు. దానికి తీర్పుదినమున్నది. ముందుగానే దేవుఁడు ఈమాట సెలవిచ్చియున్నాఁడు. కావునపాపులను తటాలున శిక్షించి నశింపఁ జేయఁడు, అట్లు చేయవలెనని దేవుఁడు కోరినచో చేసియుండును. కాని అట్లుచేయక వదలిపెట్టి యున్నాఁడు. 20. కొండనుబంగారుగా మార్చుట మొదలైన సూచనలుచేసి చూపింపమని 'హజ్రత్ పైగంబరుల వారితో కాఫిర్లు కోరుచుండిరి. వారు కోరినట్లు చేసి చూపుట ప్రవక్తపని కాదు. సర్వశక్తుఁడగు దేవుఁడు తాను కోరినట్లు తన ప్రవక్తలకు సూచన లిచ్చుచున్నాఁడు. కావున కాఫిర్లు తాము కోరినట్టి సూచన ఎందుకు రాలేదు అని అడుగుదురు. దానికి జవాబు సర్వ రహస్యములు దేవునియొద్ద నున్నవి. ఆతఁడు తన యిష్టము చొప్పున చేయును. దేవుఁడు తన ప్రవక్తకు జయము నిచ్చును. విరోధులు అవమానము పొందుదురు. ఇదియునుసత్యమును సూచించును. కావున మీరు వేచియుండుఁడు. మేముకూడ ఎదురు చూచుచుందుము అని పలుకవలెనని ప్రవక్తకు దేవుని సెలవయ్యెను.

21. వ-ఇజా-అజఖ్‌నన్-నాస-రహ్మతమ్-మిమ్-బఅది-జరాఅ-మస్సత్-హుమ్-ఇజా-లహుమ్-మక్రున్‌ఫీ-ఆయాతినా-ఖులిల్-లాహు-అస్రఉ-మక్రిన్-ఇన్న-రుసులనా యక్-తుబూన-మా-తమ్-కురూన్. 22. హువల్-లజీ-యు-సయ్యి-రుకుమ్-ఫిల్-బర్రి-వల్-బహ్రి-హత్తా-ఇజా కున్తుమ్-ఫిల్-ఫుల్కి వజ్రైన-బిహిమ్-బి-రీహిన్-తయ్యిబతిన్-వ-ఫరిహూబిహా-జా-అత్‌హా-రీహున్ ఆసిఫున్-వ-జాఅ - హుముల్ మౌజు - మిన్-కుల్లి మకానిన్-వ-జన్నూ-అన్న-హుమ్-ఉహీత-బిహిమ్ దఅ-ఉల్లాహ-ముఖ్-లిసీన-లహుద్-దీన-లఇన్-అన్-జై

తనా-మిన్-హాజిహీ-ల-నకూనన్న మినష్-షాకిరీన్. 23. ఫలమ్మా-అన్-జాహుమ్-ఇజాహుమ్-యబ్-గూన-ఫిల్-అర్-జి-బి గైరిల్-హఖ్ఖి- యాఅయ్యు-హన్నాసు-ఇన్నమా బగ్-యుకుమ్-అలా-అన్ ఫుసి-కుమ్-మతా-అల్- హయాతిద్-దున్యా-సుమ్మ ఇలైనా-మర్-జిఉకుమ్ ఫ-ను-నబ్బి-ఉకుమ్-బిమా కున్తుమ్ తఅ-మలూన్.

21. జనులకు ఆపద గలిగిన పిదప వారికి మాకరుణ రుచి చూపినపుడు వారు తత్క్షణమే మా సూచనల విషయము తంత్రము చేయుదురు. దేవుఁడు శీఘ్రముగా తంత్రము చేయు నాతఁడు. మీరు చేయు తంత్రములను మాదూతలు వ్రాయుచున్నారు అని పలుకుము. 22. ఆతఁడే మిమ్ము భూమిలోను సముద్రములోను నడిపించుచున్నాఁడు. తుదకు మీరు నావలలో గూర్చుండిరి. అవి ప్రజలను మంచి గాలివలన తీసికొని పోసాగెను. దాని వలన ప్రజలు సంతోషపడిరి. అకస్మాత్తుగా ఆ నావలకు తీవ్రమైన ఎదురుగాలి వీచెను. మఱివారిపై ప్రతిదిక్కునుండి అలలు రాసాగెను. మఱివారు నలుప్రక్కలనుండి క్రమ్మఁబడిరి. అది తెలిసికొని ఓదేవా నీవు ఈయాపదనుండి మమ్ము రక్షించితివా మేము నిశ్చయముగ కృతజ్ఞుల మగుదుము అని భయ భక్తులతో దేవునిని ప్రార్థింప సాగిరి. 23. ఆపిదప దేవుఁడు వారిని రక్షింపఁగానే వారు భూమిలో అన్యాయముగా దుర్మార్గములు చేయసాగిరి. ఓ జనులార! వినుఁడు! మీదుర్మార్గములు మీయాత్మలకే నష్టకరములు. ఇహలోక జీవనమందే సౌఖ్యములు పొందుఁడు. పిదప మీరు తిరిగి మాయొద్దకే రావలసియున్నది. కావున మేము మీరుచేయుచున్న కర్మలను గూర్చి మీకుఁ దెలుపుదుము.

వ్యా॥ 21. మక్కా కాఫిర్లకు ఏడు సంవత్సరముల వఱకు కఱవుగలిగెను. వారు ఆబాధకు ఓర్వలేక పైగంబరుల వారి సన్నిధికి వచ్చి ఈకఱవు పోవునట్లు మీరు దేవునిని ప్రార్థింపుఁడు. మేము విశ్వసింతుము అని విన్నవించిరి. అటులే హజ్రత్ ముహమ్మదువారు ప్రార్థింపఁగా దేవుఁడు కఱవును తొలఁగించి వారికి సౌఖ్యములు గలుగునట్లు చేసెను. ఆపద తొలఁగి పోఁగానే కాఫిర్లు విశ్వసింపక దేవుని వాక్యములనుసూచనలను తిరస్కరించుచు ఎగతాళిచేయుచు దేవుఁడు మమ్ము కరుణింపలేదు. ఆపద తనంతట తానే పోయినది అని తంత్రములును కుట్రలునుచేయసాగిరి. దానికినిందు దేవుఁడు జవాబిచ్చుచున్నాఁడు సరే! మీరు మీతంత్రములును కుట్రలును చేయుఁడు. నేను నాతంత్రము (రహస్య యత్నము) చేయుదును. మఱి మీరుచేయు సర్వ కుట్రలు దూతలు వ్రాసియుంచుచున్నారు. తప్పక వానికిఁదగిన శిక్ష మీకు లభించును. కావునమీరు మీ

కుట్రలకు మోసపోఁగూడదు. దేవుఁడు చేయు యత్నము చాల శీఘ్రముగా న గును. అయిన ఆతఁడు దుర్మార్గులను వదలి పెట్టుచు వారు తమ దుర్మార్గము లో సంపూర్ణులై తగిన శిక్షకు పాత్రులగుటకు వదలి పెట్టుచున్నాఁడు. కావున బుద్ధిమంతుఁడు కష్టసుఖములలోను ఓపిక వహించి దేవునికి దాసుఁడై యుండవలె ను. ఆపద వచ్చినపుడు దేవునిని వేఁడి ఆపద తొలఁగఁగానే దేవునినిమఱచిపోఁ గూడదు. దేవుఁడు కోరిన తిరిగి కష్టములు పెట్టును. కావున భయపడి యుండ వలెను. దీనికి ఉదాహరణముగ సముద్ర ప్రయాణమును వివరింపఁబడుచున్నది.

22,23. మొట్టమొదట నావ అనుకూలమైన (మంచి) వాయువులో ప్రయాణి కులను తీసికొని సముద్రములో పోసాగెను. అందలి ప్రయాణికులుచాల సంతో షపడిరి. కాని అకస్మికముగా తుపాను గాలివచ్చి అన్ని దిక్కులనుండి కొం డలవంటి అలలువచ్చి నావపై పడసాగెను. ప్రయాణికులు చావువచ్చినది, త ప్పించుకొను దోవ లేదని తెలిసికొని తమ చిల్లర దేవతలను విగ్రహములను మఱచిపోయి సర్వశక్తుఁడగు దేవునిని భయభక్తులతో ఓదేవా! మమ్ము రక్షిం పుము. మేము నీకు కృతజ్ఞతలు సలుపుదుము అని వేఁడసాగిరి. దేవుఁడు వారి ప్రార్థనలు విని ఆపత్తునుండి వారిని రక్షించిన వెంటనే సముద్ర తీరముచేరి సముద్రములోని ఆపద పోయెను అని తలఁచి దేవునిని మఱచిపోయి అన్యా యములును దుర్మార్గములును విగ్రహారాధనయును చేయసాగిరి. ఇదియెంత యో కృతఘ్నతగదా! అందులకే దేవుఁడు ఓ జనులార! మీరుచేయు దుర్మార్గ ముల వలన మీకే నష్టము గలుగును. మీకు తప్పక మీకర్మల ఫలితము లభిం చును. తుదకు మీరందఱు నాయొద్దకే తిరిగి రావలసి యున్నది. కొద్దికాలము మీరు ఇహలోక సౌఖ్యములు అనుభవింపుఁడు. మీకర్మలు సర్వముమీకుఁ దెలు పుదును. దానికిఁ దగినశిక్ష విధింతును అని హెచ్చరించు చున్నాఁడు.

24. ఇన్న-మా-మస-లుల్-హయా-తిద్-దున్యా-క-మాఇన్-అన్-జల్నా హు-మినస్-సమాఇ-ఫఖ్-తలత-బిహీ-నబాతుల్-అర్జి-మిమ్మా-యా-కులు న్నాసు-వల్-అన్-ఆము-హత్తా-ఇజా-అఖ-జతిల్-అర్జు-జుఖ్-రుఫహా-వజ్-జ య్యనత్-వ-జన్న-అహ్-లుహా-అన్న-హుమ్-ఖాదిరూన-అలైహా-అతాహా-అమ్ రునా-లైలన్-ఔ-నహా-రన్-ఫ-జ-అల్నాహా-హ-సీదన్-కఅల్-లమ్-తగ్న-బిల్ అమ్సి-కజా-లిక-నుఫస్-సిలుల్-ఆయాతి-లి-ఖౌమిన్-యత-ఫక్క-రూన్. 25. వల్లాహు-యద్-ఊ-ఇలా-దారిస్-సలామి-వ-యహ్-దీ-మన్-యషాఉ-ఇలా- సిరాతిమ్-ముస్-త-ఖీమ్,

24. ఇహలోక జీవనము నీళ్లను పోలియున్నది. మేము దానిని ఆకాశమునుండి కురిపించితిమి. దానివలన మానవులును పశువులును తినుటకు భూమినుండి పైరు మెండుగాఁ గలిగెను. తుదకు భూమి తన శృంగారమును అందమును వహించెను. మఱి భూమివారలు దీనిపై మాకు అధికారము గలదు అని తలఁచియుండిరి. ఆకస్మికముగ రాత్రిపూఁటనో లేదా పగటిపూఁటనో మాయాజ్ఞ దానిగూర్చి వచ్చెను. పిదప మేము అది నిన్న లేకయున్నట్లుగ దానిని నిర్మూలించితిమి. ఇట్లు, యోచించునట్టి జనులకుఁగాను మేము సూచనలను వివరించుచున్నారము. 25. మఱియు దేవుఁడు శాంతియుతమైన గృహమువైపునకు పిలుచుచున్నాఁడు. మఱి తాను కోరినవారికి సన్మార్గము చూపుచున్నాఁడు.

వ్యా॥ 24. ఇందుఇహలోక జీవనము చూచుటకు అందముగాను మనోహరముగానుండి తుదకు శీఘ్రకాలములోనే నశించును. అది స్థిరమైనది కాదు అని సూచించు ఒక ఉదాహరణము చెప్పఁబడినది. ఆకాశమునుండి వాన కురిసి దాని నీళ్లవలన భూమినుండి పలువిధములైన పైర్లు గలుగుచున్నవి. అందు మనుష్యులకును పశువులకును ఆహారము గలదు. వరిగోధుమలలోని ధాన్యమును మనుష్యులును, గడ్డి పొట్టును పశువులును తినుచున్నారు. పైరు పంటలు పెరిగి భూమి అందమువహించి పంటకోయు కాలమున భూమివారలు పంట మాచేతిలోనున్నది అని తలఁచిరి. అపుడు ఆకస్మికముగా దేవుని సెలవుచే తుపానుగాలియో లేదా రాళ్లవానయో లేదా మిడుతలదండో వచ్చి యాపైరుపైఁబడి నిర్మూలించెను. చూచువారికి నిన్న ఇచ్చట పైరులేనట్లుగ తోఁచును. ఇటులే ఇహలోక జీవనమని ఊహింపవలెను. ఇహలోకము ఎంత మనోహరముగ తోఁచినను అది తుదకు నశించును. కావున దానికి మోహితులై మానవులు పరమును మఱచిపోక దేవునిని విశ్వసించి సత్కార్యములుచేసి యుభయలోకములలో శాంతి పడయవలెను. 25. అందులకు దేవుఁడు మానవులను శాంతియుతమైన గృహమగు స్వర్గము (జన్నత్) నకు రండు అని పిలుచుచున్నాఁడు. అచ్చట ఏలాటి దుఃఖములుండవు. కావున మానవులు సన్మార్గమగు ఇస్లామ్ మతములో చేరి దేవునికి ప్రియులై స్వర్గము పొందుదురుగాక!

26. లిల్-లజీన-అహ్సనుల్-హుస్నా-వ జియా-తతున్-వలా - యర్-హఖు-వుజూ-హ-హుమ్-ఖత-రున్-వలా-జిల్ల-తున్-ఉలాఇక-అస్ - హాబుల్ - జన్నతి-హుమ్-ఫీహా-ఖాలిదూన్.

26. సత్కార్యములుచేసినవారికి మేలు గలుగును. మఱి హెచ్చుగా లభించును. మఱి వారి ముఖములు నల్లబడవు. మఱి వారికి అవమానము గలుగదు. వారు స్వర్గనివాసులు. అందు వారు సదా యుందురు.

వ్యా॥ 26. విశ్వసించి సత్కార్యములుచేసినవారికి స్వర్గమనెడి మేలు లభించును. దానిపై హెచ్చుగా దేవుని దర్శనమును ప్రీతియును వారికి లభించును. వారి ముఖములు ప్రకాశించును. వారికి గౌరవము లభించును. వారు స్వర్గములో సదా యుందురు. ఇట్టి పుణ్యము లభించుటకు భక్తులు యత్నింపవలెను.

27. వల్-లజీన-కస-బుస్-సయ్యి-ఆతి-జజాఉ-సయ్యి-అతిమ్-బి-మిస్-లిహా వతర్-హఖు-హుమ్-జిల్లతున్-మా-లహుమ్-మినల్లాహి-మిన్-ఆసిమిన్-క-అన్నమా-ఉగ్-షియత్-వుజూహు-హుమ్-ఖిత-అమ్-మినల్-లైలి-ముజ్-లిమన్ ఉలా-ఇక-అస్-హాబున్-నారి-హుమ్-ఫీహా-ఖాలిదూన్. 28. వ-యౌమ-నహ్-షురు-హుమ్-జమీఅన్-సుమ్మ-నఖూలు-లిల్-లజీన-అష్-రకూ-మకానకుమ్-అన్-తుమ్-వ-షుర-కాఉకుమ్-ఫ-జయ్యల్-నా-బైనహుమ్-వఖాల-షుర-కాఉ-హుమ్-మాకున్తుమ్-ఇయ్యానా-తఅ-బుదూన్.29. ఫకఫా-బిల్లాహి-షహీ-దమ్ బైననా-వబైన-కుమ్-ఇన్-కున్నా-అన్-ఇబాదతి-కుమ్-లగాఫిలీన్. 30. హునా-లిక-తబ్-లూ-కుల్లు-నఫ్-సిమ్-మా-అస్-లఫత్-వ-రుద్దూ-ఇలల్లాహి-మౌలా-హుముల్-హఖ్-ఖి-వ-జల్ల-అన్-హుమ్-మా-కానూ-యఫ్-తరూన్.

27. మఱియు పాపకార్యములు చేసినవారికి పాపమునకుఁ దగినంత ఫలితము లభించును. మఱి వారికి అవమానము క్రమ్ముకొనును. దేవునిశిక్షనుండి వారిని రక్షించువాఁడెవఁడును లేఁడు. రాత్రి చీఁకటి తునకలతో వారి మొగములు కప్పఁబడినట్లుండును. వీరు నరకనివాసులు. అందువారు సదా యుందురు. 28. మఱియు ఆ దినమున మేము వారందఱిని చేర్చి దేవునికి సాటి కల్పించిన వారితో- మీరును మీరుసాటికల్పించుచున్న దైవములును మీమీ స్థానములలోనిలువఁబడుఁడు అనిపలుకుదుము. ఆ పిదప వేఱువేఱుగాఁజేసి వేయుదుము. మఱి వారి దైవములు మీరు మమ్ము పూజింపలేదు. 29. కావున దేవుఁడే మా మధ్యను మీమధ్యను సాక్షిగ చాలును. నిశ్చయముగా మీపూజలు మాకు దెలియవు అని పలుకుదురు. 30. అచ్చట ప్రతిమనుష్యుఁడును తాను ముందుగాఁ జేసి పంపుకొన్న కర్మలను పరీక్షించుకొనును. వారు తమసత్యమైన ప్రభువునొద్దకు మరలుదురు. మఱి వారు కల్పించుచున్న అబద్ధములన్నియు వారిని వీడిపోవును.

వ్యా॥ 27. పాపాత్ములు చేసిన పాపములకుఁ దగిన శిక్ష వారికి లభించును. పాపమునకంటె హెచ్చుగా శిక్ష లభింపదు. దేవుఁడు ఇష్టపడినచో శిక్ష తగ్గించును. లేక క్షమించును. తీర్పుదినమునందు పాపులకు అవమానము

లభించును. వారి ముఖములో కారుచీకట్లు క్రమ్మకొని రాత్రి తునుకలు కప్పఁబడినట్లు నల్లనివిగా నుండును. ఇది వారిపాపఫలితము. సదా నరకములోనుందురు. కావున మానవులు నరకమునుండి ముక్తిపొందుటకు యత్నింపవలెను. 28.తీర్పు దినము (ఖియామతు) దినమునందు మానవులు కల్పించుకొని పూజించుచున్న చిల్లర దేవతలను వారివారికిఁ దగిన స్థానములలో వారు నిలుచునట్లు వారికి దేవుని సెలవగును. కొందఱు తమ ప్రవక్తలను (ఏసుక్రీస్తు మొదలగువారిని), దేవదూతలనుపూజించుచు,వీరుతమ్మురక్షింతురనిమోసపోయియున్నారు.అట్లు కానేరదు. తీర్పుదినమునందు ఏసుక్రీస్తు మొదలగు ప్రవక్తలును, దేవదూతలును ఓ పూజారులార ! మీరు మా అనుమతిలేనిదే మమ్మ పూజించితిరి. మీపూజలు మాకుఁ దెలియవు. మీకు మాకు సంబంధములేదు దీనికి దేవుఁడే సాక్షి అని పలుకుదురు. ఇటులే విగ్రహములు చిల్లర దేవతలును అవిశ్వాసులతో పలుకుదురు. అపుడువిగ్రహారాధకులు ఆశ వదలుదురు. 30. తీర్పు దినమునందు మానవులందఱు తమ కర్మలను చూచుకొందురు. అన్ని యూహలు పోవును. దేవుఁడు తప్పవేఱు రక్షకుఁ డుండడు. అందఱు దేవుని సన్నిధానమునందే నిలుతురు. అపుడు పుణ్యపాపకార్యముల ఫలితము కనుగొందురు.

31. ఖుల్-మన్-యర్‌జుఖు-కుమ్-మినస్‌సమా ఇ-వల్‌అర్‌జి - అమ్మన్-యమ్-లికుస్-సమ్‌అ-వల్-అబ్‌సార-వ-మన్‌యుఖ్-రిజుల్‌హయ్యా-మినల్ మయ్యితి-వ-యుఖ్-రిజుల్-మయ్యిత-మినల్‌హయ్యి-వ-మన్‌యుదబ్బిరుల్ అమ్‌ర-ఫస-యఖూలూ-నల్లాహు-ఫ-ఖుల్-అఫ-లా-తత్తఖూన్. 32. ఫజాలికు ముల్లాహు - రబ్బుకుముల్-హఖ్‌ఖు-ఫ-మాజా-బఅదల్-హఖ్‌ఖి-ఇల్-లజ్‌జలాలు-ఫఅన్నా-తుస్‌రఫూన్. 33. కజాలిక-హఖ్‌ఖత్-కలి-మతు-రబ్బిక-అలల్-లజీన-ఫసఖూ-అన్నహుమ్-లా-యూమినూన్.

31. ఎవఁడు ఆకాశమునుండియు భూమినుండియు మీకు ఆహారమునిచ్చువాఁడు? లేదా చెవులకును కన్నులకును అధికారెవఁడు? మఱియు నిర్జీవుల నుండి జీవులను జీవులనుండి నిర్జీవులను ఎవఁడు తీయుచున్నాఁడు! మఱెవఁడు కార్యములను నెఱవేర్చుచున్నాఁడు? అని అడుగుము. వారు దేవుఁడే అని పలుకుదురు. అటులైనచో మీరెందులకు భయపడరు. 32. మఱి ఈతఁడే మీ నిజమైన ప్రభువగు దేవుఁడు. సత్యము పిదప దుర్మార్గము తప్ప వేఱేమియున్నది. కావున మీరెచ్చటికి మఱలి పోవుచున్నారు అనిపలుకుము. 33. ఇటులే అవిధేయులైన వారు విశ్వసింపరు అను నీప్రభువు వాక్యము నిజ మాయెను.

వ్యా॥ 31. ఇcక ఈవాక్యములలో దేవునియేకత్వమునుగూర్చి చెప్పcబడు చున్నది.ఆకాశమునుండి వాన సూర్యరస్మి భూమిపైc బడును. ఇవి భూమిలోని వస్తువులతో కలియుటచే పైరు పంటలు మొదలగు ఆహారములు మానవులకు లభించుచున్నవి. వినుటకు చెవులును చూచుటకు కన్నులును అద్భుతరీతిగా మానవులకు ఒసంగcబడినవి. వీనినిచ్చి కాపాడువాcడును ఎవcడు? ఆ యధికారము ఎవరికిc గలదు ఇటులేమానవులకు ఒసంగcబడినసర్వశక్తులకు అధికారియెవcడు! (దేవుcడేఅని యొప్పుకొనకమానరు.)నిర్జీవిమైన వీర్యమునుండి గ్రుడ్లనుండి జీవులను ప్రాణులనుండి నిర్జీవియైనవీర్యమును గ్రుడ్లను ఎవcడుతీయుచున్నాcడు? (దేవుcడే).లోకములోని కార్యములను చక్కcబఱచివానిని నడిపించువాడెవcడు అని విగ్రహారాధకులతో నడిగినను వారుకూడ దేవుcడేఅని యొప్పుకొని పలుకుదురు. అట్లు వారికిc దెలిసియు దేవునికి సాటి కల్పించుట వారికితగదు. కావున ఎందులకు వారు భయపడరు అని అడుగవలెను అని ప్రవక్తకు దేవుని సెలవ య్యెను. పై వివరింపcబడిన కార్యములు చేయు దేవుcడు మానవులకు ప్రభువు. ఇదియే సత్యము దీనినివదలియితర దోవకు పోవుట దారితప్పి దుర్మార్గమునకుc బోవుటయే. కావున దేవుని పూజించుటను వదలి విగ్రహారాధనకు మఱలుట సరికాదు. అది ఘోరపాతకము. అదిమానుకొని ఒక్క దేవునినే పూజింపవలెను. 33. అవిధేయులైన దుర్మార్గులు ఎంత బోధించినను విని విశ్వసింపరు అని ముందుగానే దేవునికిc దెలియును. కావున అవిధేయులు విశ్వసింపరు అను దేవుని వాక్యము వారియెడ సత్యమాయెను.

34- ఖుల్-హల్-మిన్-షురకా-ఇకుమ్-మన్-యబ్-దఉల్-ఖల్-ఖ- సుమ్మ-యుఈ-దుహూ-ఫఅన్నా-తూఫకూన్. 35. ఖుల్-హల్-మిన్-షుర-కాఇకుమ్-మన్-యహ్‌దీ-ఇలల్-హఖ్ఖి-ఖులిల్లాహు-యహ్‌దీ-లిల్-హఖ్ఖి - అఫమన్-యహ్‌దీ-ఇలల్-హఖ్ఖి అహఖ్ఖు అన్-యుత్-తబఅ-అమ్మల్-లా- ఇహిద్దీ-ఇల్లా-అన్-యుహ్‌దా-ఫమా-లకుమ్-కైఫ-తహ్-కుమూన్. 36. వ-మా-యత్తబిఉ-అక్-సరు-హుమ్-ఇల్లా-జన్నన్-ఇన్నజ్-జన్న-లా- యుగ్-నీ - మినల్-హఖ్ఖి-షై-అన్-ఇన్నల్లాహ-అలీముమ్-బిమా-యఫ్-అలూన్.

34. మీరు దేవునికి సాటిగc జేసిన వారలలో నెవcడైన సృష్టినిసృష్టించి తిరిగి దానిని సజీవిగాc జేయువాcడు గలcడా! అని ఓప్రవక్త అడుగుము. దేవుcడు తొలుత సృష్టిని పుట్టించి తిరిగి దానిని సజీవిగాc జేయును. కావున మీరెచ్చటికి మఱలి పోవుచున్నారు! అని ఓప్రవక్త పలుకుము. 35. మీరు

దేవునికి సాటిగఁ జేసినవారలలో నెవఁడైన సన్మార్గమును చూపువాఁడు గలఁడా అని ఓ ప్రవక్త! అడుగుము. దేవుఁడే సన్మార్గము చూపువాఁడు. కావున సన్మార్గము చూపువానిమాట వినవలయునా లేక ఒకఁడు తనకు సన్మార్గము చూపనిది తాను సన్మార్గము పొందలేనివాని మాటలు వినవలయునా! కావున మీకేమైనది? మీరెట్లు న్యాయముచేయుచున్నారు అని పలుకుము. 36. మఱివారిలోని పెక్కురు ఊహను మాత్రము అనుసరించుచున్నారు. సత్యమైన విషయములో ఊహలు ఏమియు పనికిరావు. వారుచేయు పనులు నిశ్చయముగా దేవునికిఁ దెలియును.

వ్యా॥ 34. ఇంతవఱకు సృష్టిని గూర్చి చెప్పఁబడియె. ఇఁక పునరుత్థానము (మఆద్) ను గూర్చి చెప్పఁబడుచున్నది. అనఁగా భూమ్యాకాశములను చెవులను కన్నులను చావు బ్రతుకులను సృష్టించువాఁడును వాని నడిపించువాఁడును దేవుఁడని మానవులు ఒప్పుకొనిరి. ఈ విషయము స్పష్టపడిన పిదప లోకము నశించిన తరువాత తిరిగి ప్రాణులను సజీవులుగాఁ జేసిలేపుట దేవుని పనియే అని మానవులు యొప్పుకొని తీరవలెను. అదియును గాక నిజమైన ప్రవక్తల మూలమున దేవుఁడే తిరిగి సృష్టిని సజీవిగాఁ జేసి లేపును అని తెలిసిన పిదప ఒప్పుకొనియే తీరవలెను. కావున దేవుఁడే సర్వశక్తుఁడు. ఆతఁడే సృష్టికర్త. లోకము నశించిన పిదప కర్మల తీర్పునకుఁ గాను అందఱిని తిరిగి సజీవులుగాఁ జేయును. ఇట్టిశక్తి చిల్లర దేవతలకును విగ్రహములకును లేదు అని మానవులు తెలిసికొనవలెను. 35. ఇందు సన్మార్గమును ధర్మమార్గమును చూపువాఁడు దేవుఁడే. ఆతని యాజ్ఞలనే అనుసరింపవలెను అని బోధింపఁబడియెను. సృష్టికర్తయే తన సృష్టి విషయములు మానవులకుఁ దెలుపఁగలఁడు. ప్రవక్తలు కూడ స్వయముగా నెద్దియును తెలుపఁజాలరు. దేవుని సందేశమునను సరించియు ప్రవక్తలు కూడ దెలుపుదురు. ప్రవక్తలే ఇట్లుండఁగా కదలని మెదలని పలుకలేని విగ్రహములు ఏమిసన్మార్గము చూపఁగలవు. కావున మానవులు దేవుఁడు తన ప్రవక్తల మూలమున చూపు ధర్మములను అనుసరింపవలెను. అట్లుగాక విగ్రహారాధకులు, బ్రాహ్మణులు, మహాంతులు మొదలగుపండితులుకల్పించినట్టిఅధర్మముల వైపునకు పోరాదు. ఇది న్యాయము కాదు అని మందలింపఁబడియెను. 36. దేవుఁడు చూపిన సన్మార్గమును వదలి విగ్రహారాధన మొదలగుఅధర్మముల ననుసరించువారి యొద్ద తప్పుయూహలు తప్ప వేఱు ప్రమాణమును ఆధారమును లేదు. ఇట్టి యూహల వలన సన్మార్గము లభింపదు. అవి పనికిరావు. అందఱు చేయు కర్మలు దేవునికి బాగుగఁ దెలియు. దేవుఁడు వారివారి కర్మలకుఁ దగిన ఫలిత మొసంగును.

37. వ-మా-కాన హాజల్-ఖుర్ ఆను అన్-యుఫ్-తరా-మిన్-దూనిల్లాహి వలా-కిన్-తస్-దీఖల్-లజీ-బైన యదైహి-వ-తఫ్-సీలల్-కితాబి-లా-రైబ-ఫీహి మి-ర్-రబ్బిల్-ఆలమీన్. 38 అమ్-యఖూ-లూ-నఫ్-తరాహు-ఖుల్-ఫాతూ-బి సూరతిమ్-మిస్-లిహీ-వద్-ఊ-మనిస్-తతఅ-తుమ్-మిన్-దూనిల్లాహి - ఇన్-కున్తుమ్-సాదిఖీన్. 39. బల్-కజ్-జబూ-బిమా-లమ్-యుహీతూ బి ఇల్-మిహీ-వలమ్మా-యా-తిహిమ్-తా-వీలుహూ-కజాలిక-కజ్-జబల్-లజీన మిన్ - ఖబ్లి-హిమ్-ఫన్-జుర్-కైఫ-కాన-ఆఖి-బతుజ్-జాలిమీన్. 40. వ-మిన్-హుమ్-మన్ యూ మిను-బిహీ-వ-మిన్-హుమ్-మల్-లా-యూమిను-బిహీ-వ-రబ్బుక-అఅ-ల-ము-బిల్-ముఫ్-సిదీన్.

37. మఱియు, ఈఖురానును దేవుఁడు తప్ప మఱెవ్వఁడును చేయఁ జాలఁడు. కాని యిది తనకు పూర్వమున్న గ్రంథములను సత్యపఱచునది. మఱి మానవులకు విధింపఁబడిన ధర్మములను వివరించునది. అందు ఏలాటి సందేహము లేదు. అది సర్వలోకముల ప్రభువునుండి వచ్చినది. 38. ఏమి ఖురానును ముహమ్మదు కల్పించుకొన్నాఁడు అని వారు పలుకుచున్నారా? (అట్లైన) దాని వంటి ఒక సూరాను కల్పించి మీరును తీసికొనిరండు. మఱి మీరు సత్యవంతులైనచో దేవుని దప్ప మీ రెవరిని పిలుచుకొనఁగలరో వారి నందఱిని పిలుచుకొనుఁడు అని ఓ ప్రవక్తా! పలుకుము. కాని వారు తాము గ్రహించుకొనలేని దానిని తిరస్కరింపసాగిరి. మఱి యింకను వారియొద్దకు దాని వాస్తవవిషయము రాలేదు. వీరికి ముందున్నవారును ఇటులే తిరస్కరించుచుండిరి. కావున పాపుల గతి యేమాయెనో చూడుము. 40. మఱి వారిలో కొందఱు ఖురానునునమ్మువారును గలరు. మఱి వారిలో కొందఱు దానిని నమ్మరు. మఱి అల్లరి (ఫసాదు) చేయువారిని నీప్రభువు బాగుగ నెఱుంగును.

వ్యా॥ 37. దీనికి ముందువిగ్రహారాధకులు,నిరాధారము లైన ఊహలనుఅనుసరించుచున్నారు. అట్లు కూడదు. సన్మార్గము చూపువాని మాటవినవలయును అని చెప్పఁబడియెను. దానికిఁగాను ఇపుడు లోకమంతటికిని సన్మార్గము చూపు గ్రంథము ఒక్క ఖురానె షరీఫు మాత్ర మున్నది. ఇందుసర్వధర్మములు గలవు. ఇట్టి మహనీయమైన శైలియు ధర్మములును తత్వములును గల ఖురానును మానవులు చేయఁజాలరు. అది దేవుని గ్రంథము. దీనికి పూర్వము దేవునిచే ప్రవక్తలకు లభించిన మత గ్రంథములు సత్యములైనవి అని ఖురాను సత్య

పఱచును. మానవకోటికి కావలసిన సర్వధర్మములు ఇందు వివరింపఁబడినవి. ఇందు బుద్ధిమంతులు సందేహింపఁగల విషయము లెవ్వియునులేవు. సర్వలోకములకు ప్రభువగు దేవుఁడు పంపిన గ్రంథము. కావున మానవులందఱు దీనిని నమ్మి దీని ననుసరింపవలెను. 38. అవిశ్వాసులు ఖురానును విని ఇది మహమ్మదు స్వయముగా కల్పించుకొన్నది. దేవునిదికాదు అని చెప్పసాగిరి. దానికి నిందు జవాబియ్యఁబడినది. ఓ జనులార ! నేను మీవంటి మానవుఁడను. మీరును మనుష్యులు. ఖురాను దేవుని గ్రంథము కాదు. నేను చేసినది అని మీరు చెప్పుచున్నారు గదా ! సరే ! మీరందఱు విద్వాంసులును పామరులును చేరి ఖురానె షరీఫువంటి ఒక్క సూరా కల్పించి తీసికొనిరండు. అట్లు మీరు చేసితేని ఖురానుకూడ మానవుఁడుచేసికొన్నది అని యొప్పుకొనవచ్చును. కాని మీరు చేయలేరు. ఎందుకన ఎట్లు దేవుఁడు చేసిన సూర్యునివంటి సూర్యునిని దేవుఁడు సృష్టించిన భూమివంటిభూమినిమానవులు చేయలేరో అటులే దేవుని గ్రంథమగు ఖురానువంటి గ్రంథము మానవులుచేయలేరు. ఖురానెషరీఫులో ఆత్మిక రాజకీయ గ్రాహస్థ ధర్మములును తత్వములు పరలోక విషయములను అరబీభాషలో మానవుల శక్తికి మించిన అద్భుతశైలిలో నున్నవి. అందలి ధర్మములు ప్రళయమువఱకు మారనివి. సర్వలోకములవారును వాని ననుసరించి యుభయలోకములలో జయమోక్షములు పొందగలరు. 39. అవిశ్వాసులు, ఖురాను గ్రంథమును బాగుగ గ్రహింపక మూఢత్వముతోను ద్వేషముతోనుమహమ్మదు చేసికొన్న గ్రంథమని పలికి తిరస్కరించుచున్నారు. వారియందున్న ద్వేషమునుబట్టి ఖురానులోని ధర్మములను సరిగయోచింపక అవివేకముతో తమకుఁ దెలియని వానిని తిరస్కరింపసాగిరి. ఖురానులో కొన్ని భవిష్యత్ ప్రకటనలు గలవు. అవి సంభవించు కాలము రాలేదుఅందు దుష్టులకు శిక్ష గలుగును అని కూడ కలదు. కొంత కాలమునకు పిదప దుష్టులుశిక్షింపఁబడిరి. మఱి ఖురానుయొక్క వాస్తవ విషయమును, అర్థమును ఇంకను వారు గ్రహింపలేదు. అందులకు వారు తిరస్కరించుచున్నారు. వీరికి ముందు గడచిన జనులును తమ ప్రవక్తలను దేవుని గ్రంథములను తిరస్కరించి దేవుని శిక్షకు పాత్రులై నశించిరి. అట్టి దుర్గతి ఖురానును తిరస్కరించువారికిని పట్టును. అని హెచ్చరింపఁబడెను. 40. ఇఁకమీఁద వీరిలోనే కొందఱు ఖురానునునమ్మి విశ్వాసులగుదురు. మఱికొందఱు తమ దుష్టత్వముచే విశ్వసింపరు. వారి విషయము దేవునికి బాగుగఁ దెలియును. వారికిఁ దగిన శిక్ష నొసంగును.

41. వ-ఇన్-కజ్-జబూక-ఫఖుల్-లీ-అమలీ-వ-లకుమ్-అమలు-కుమ్- అన్-తుమ్-బరీ-ఊన-మిమ్మా-అఅమలు-వ-అనా-బరీఉమ్- మిమ్మా-తఅ-మలూన్. 42.

వ-మిన్-హుమ్-మన్-యస్ - తమిఊన-ఇలై క-అఫ-అన్త-తుస్-మి-ఉస్సుమ్మ-వలౌ-కానూ-లా-యఅ-ఖిలూన్. 43. వ-మిన్ హుమ్ మన్ యన్-జురు-ఇలై క అఫ-అన్త-తహ్-దిల్-ఉమ్ యు-వలౌ-కానూ-లా- యుబ్ సిరూన్. 44. ఇన్నల్లా హ-లాయజ్లిమున్నాస-షైఅన్-వలాకిన్నన్నాస-అన్-ఫుసహుమ్-యజ్లిమూన్.

41. మఱి వారు నిన్ను తిరస్కరించినచో నాకు నాపని యున్నది. మీకు మీపని యున్నది. నాపని విషయము మీకు బాధ్యతలేదు. మీపనులబాధ్యత నాకు లేదు అని పలుకుము. 42: 43.మఱి వారిలో కొందఱు నీవైపు చెవులుంచుచున్నారు. ఏమి! జ్ఞానములేక చెవిటివారిగ నున్నవారికి నీవు వినిపింపఁగలవా? 44. మఱి వారిలోఁ గొందఱు నీవైపు చూచుచున్నారు. దృష్టిలేక అంధులుగా నున్న వారికి నీవు మార్గము చూపఁగలవా? నిశ్చయముగ దేవుఁడు ప్రజలకు కొంచెమైనను అన్యాయము చేయఁడు. కాని ప్రజలు తమకుతామే అన్యాయము చేసికొనుచున్నారు.

వ్యా॥ 41. ఓ ప్రవక్తా! నీవు సత్యవంతుఁడవు అని తెలుపు సూచనలు తెలిసియు అవిశ్వాసులు నిన్ను తిరస్కరించినచో వారితో నిట్లు పలుకుము. నేను నాయుద్యమమగు మత ప్రచారముచేసి నాపని నెఱవేర్చితిని. బోధించినను మీరు వినకున్నచో మీమార్గము మీది. నామార్గము నాది. నాపనులకు నేను బాధ్యుఁడను మీపనులకు మీరు బాధ్యులు. ప్రతివానికిని వాని కర్మల ఫలితము లభించి తీరును. 42, 43. అవిశ్వాసులలో కొందఱు పైగంబరులవారి వాక్యములను ఖురానెషరీఫును వినునట్లువారలుగ చెవులుంచుదురు. కానివారిహృదయములు వినవు. అందు చెవిటితనమున్నది. కావున బోధ గ్రహింపరు. ఇట్టి చెవిటివారికి బోధ వినిపించుట ప్రవక్త వశములోలేదు. అటులే కన్నులతో చూచెదరు. కాని వారి హృదయములు గ్రుడ్డివి. ఎవని హృదయము గ్రుడ్డిదో వానికి ధర్మమార్గము గోచరింపదు. ఇట్టి హృదయాంధులకు సన్మార్గము చూపుట ప్రవక్త వశములో లేదు. 44. దేవుఁడు మానవులయెడ అన్యాయము చేయఁడు. అందఱికిని సన్మార్గము గ్రహించు శక్తులు ఒసంగియున్నాఁడు. కాని మానవులే తమ దుష్టప్రవర్తనములతో తమ శక్తులను వృథా చేసికొని దుర్మార్గము నకుపోయి తమ యాత్మలకు అన్యాయము చేసికొనినవారలై నరకమునకు పాలగుచున్నారు.

45. వ-యౌమ-యహ్-షురు-హుమ్-కఅల్-లమ్-యల్-బసూ-ఇల్లా-సాఅతమ్-మినన్-నహారి-యత-ఆరఫూన-బైన-హుమ్-ఖద్-ఖసి-రల్-లజీన - కజ్-జబూ-బి లిఖా-ఇల్లాహి-వ-మా-కానూ-ముహ్-తదీన్.

45. మఱియు దేవుఁడు ప్రజలను కూర్చు దినమున వారు దినములో

నొక గడియ మాత్రి ముండినట్లు వారికిఁ దోచును. వారు పరస్పరము గుర్తిం తురు. దేవుని దర్శనమును తిరస్కరించినందున వారు నిశ్చయముగా నష్టములో పడిరి. మఱి వారు సన్మార్గమునకు వచ్చినవారువారు.

వ్యా॥ 45. తీర్పుదినమునందు అందఱు మానవులు సజీవులై దేవునిసాన్ని ధ్యమున చేరుదురు. అప్పటి యాపదలను, కష్టభయములను చూచి ఇహలోకము లో నుండినది ఒక్క గడియ మాత్రమే అని వారు తలంతురు. ఆ కష్టములను చూచిన ఇహలోక భోగములు చాల హీనములుగా వారికిఁ దోచును. మాన వులు పరస్పరము గుర్తింతురు. కాని ఒకరికొకరు తోడుపడఁజాలరు. ఏలాటి బంధుత్వము పనికిరాదు. ప్రతివాఁడును తన సొంత చింతలోనే మునిగియుండును. చచ్చిన పిదప తిరిగి సజీవులై దేవుని దర్శించుటనుగూర్చి తిరస్కరించి దుర్మా ర్గులైనవారు నష్టముపొంది నరకములో పడుదురు. తీర్పుదినమును నమ్మి విశ్వాసు లైనవారు సన్మార్గమునందు పడినవారు నష్టములో పడక, స్వర్గము పొందుదురు.

46. వఇమ్మా-నురి-యన్నక-బఅ జల్-లజీ-నఇ-దుహుమ్-ఔనత-వఫ్ఫ- యన్నక-ఫ-ఇలైనా-మర్-జి-ఉహుమ్-సుమ్-మల్లాహు-షహీదున్-అలా-మా యఫ్-అలూన్.

46. మఱియు మేము వారితో వాగ్దానము చేయువానిలో కొన్నిటిని నీకు చూపిన లేదా నీకు మరణ మొసంగిన వారు మాయొద్దకే మరలి రావ లసి యున్నది. మరల వారుచేయు కర్మలకు దేవుఁడు సాక్షిగా నున్నాఁడు.

వ్యా॥ 46. దేవుఁడు "అవిశ్వాసులను శిక్షింతును. ఇస్లామ్‌నకు జయ మొసంగుదును" అని వాగ్దానము చేసి యుండెను. అందు బదరు యుద్ధములో మక్కా కాఫిర్లకుఁ దగినశిక్ష లభించెను. అట్లు కొంతవఱకు ఇస్లామ్‌నకు జయ ము లభించెను. ఇదిహజ్రత్ రసూలువారి జీవితకాలములో సంభవించినది. ఇస్లామ్ నకుసంపూర్ణ జయమును వ్యాప్తియును పైగంబరువారి మరణాంతరము వారి శిష్యులకాలమునలభించెను, దేవుఁడుచేసిన అన్నివాగ్దానములు పూర్తియైతీరును. ఒకవేళ కాఫిర్లకు తక్షణమే దేవునినుండి శిక్ష లభింపనిచో వారు మోసపోకూ డదు, దేవుఁడు వారి కర్మలకు సాక్షిగా నున్నాఁడు. వారికిఁ దగిన ఫలిత మొసం గును. తుదకు దేవుని సన్నిధానమున మఱలిపోవలసి యున్నది. అపుడు అందఱి కర్మల తీర్పు అగును.

47. వలికుల్లి-ఉమ్మతిన్-రసూలున్-ఫఇజా-జాఅ-రసూలుహుమ్-ఖుజి య-బైనహుమ్-బిల్-ఖిస్తి-వ-హుమ్-లా-యుజ్-లమూన్.

47. ప్రతి జాతివారికి ఒక ప్రవక్త యున్నాఁడు. వారియొద్దకు వారి

ప్రవక్త రాఁగా వారిమధ్య న్యాయముగ తీర్పు ఆయెను. మఱి వారికి అన్యాయ యము చేయఁబడదు.

వ్యా॥ 47. హజ్రత్ రసూల వారికి ముందుకూడ ప్రతి జాతికిని ఒకొక్క ప్రవక్త వచ్చి దేవుని యాజ్ఞలను వారికిఁ దెలుపుచు వచ్చెను. ప్రవక్తల మూలమున ధర్మములు తెలుపనిదే దేవుఁడు పాపులను శిక్షింపఁడు. ముందు ప్రవక్తల నంపి బోధించుచున్నాఁడు. బోధ వినక దుష్టులైన వారిని ఇహమునందును పరమునందును న్యాయముగ శిక్షించును. ఏలాటిఅన్యాయము జరుగదు. తీర్పు దినమునందుకూడ న్యాయముగ కర్మల తీర్పు అగును.

48. వయఖూలూన మతా-హాజల్ వఅదు-ఇన్-కన్తుమ్- సాదిఖీన్. 49. ఖుల్-లా-అమ్-లికు-లి-నఫ్-సీ-జర్రన్-వలా-నఫ్ అన్ ఇల్లా మా-షా-అల్లాహు-లి-కుల్లి-ఉమ్మతిన్-అజలున్-ఇజా జాఅ-అజ-లుహుమ్-ఫలా యస్-తాఖిరూన-సా అతన్-వలా-యస్-తఖ్-దిమూన్.50. ఖుల్-అరఐ-తుమ్-ఇన్ అతా-కుమ్-అజా-బుహూ-బయా-తన్-ఔ-నహారమ్-మాజా-యస్-తఅజిలు-మిన్ హుల్ ముజ్రిమూన్. 51, అ సుమ్మ-ఇజా-మా-వఖఅ-ఆమన్-తుమ్-బిహీ-అల్-ఆన వఖద్-కున్తుమ్-బిహీ-తస్-తఅ-జిలూన్. 52. సుమ్మ-ఖీల-లిల్-లజీన- జలమూ - జూఖూ అజా-బల్-ఖుల్ది-హల్--తుజ్-జౌన-ఇల్లా బిమా-కన్తుమ్-తక్ - సిబూన్. 53. వ-యస్-తమ్-బిఊనక-అ-హఖ్-ఖున్ హువ-ఖుల్-ఈ-వ-రబ్బీ-ఇన్నహూ-ల హఖ్-ఖున్-వ-మా-అన్-తుమ్-బి-ముఅజిజీన్.

48. మఱియు వారు మీరు సత్యవంతులైనచో ఈ వాగ్దానము ఎప్పుడు సంభవించును అనిపలుకుచున్నారు. 49 దేవుఁడు కోరినది తప్ప నాకుఁగాను నేను మేలునుగాని కీడునుగాని చేసికొను అధికారము నాకులేదు. ప్రతి జాతి వారికిని ఒకకాలమున్నది. వారికాలమువచ్చినపుడు ఒకగడియ వెనుకముందు వారు కానేరరు అని ఓ ప్రవక్త! పలుకుము. 50 సరే చూడుఁడు! దేవునిశిక్షమీకు రాత్రిపూఁటయో లేదా పగటి పూఁటయో వచ్చేసినచో దానికిఁగాను ముందుగానే పాపాత్ములు ఏమి చేసికొనఁ గలరు. 51. మరల శిక్షవచ్చిమీపైఁబడిన తరువాతనా! మీరు దానిని నమ్మెదరు. ఏమి ఇపుడు మీరునమ్మితిరి. మఱి దీనికి ముందు దానికొఱకు మీరు తొందఱ చేయుచుంటిరి అని చెప్పఁ బడును. 52. ఆ పిదప పాపాత్ములతో శాశ్వతమైన శిక్షను అనుభవింపుఁడు. మీరు చేయు

చుండిన కర్మల ఫలితమే మీకు లభించును అని చెప్పఁబడును. 53. ఏమి యిది నిజమాఅని వారు నీతో విచారించుచున్నారు. దేవుని ప్రమాణము. ఇది నిజము. మఱిమీరు లొంగఁ జేయలేరు అని ఓ ప్రవక్త! పలుకుము.

వ్యా॥ 48. దేవుని శిక్ష వచ్చును అనిమీరు భయపెట్టు చున్నారే! ఆ వాగ్దానము ఎపుడు పూర్తియగును. అది వట్టి మాటలుగా నున్నది. అట్లుగాక మీరు సత్యవంతులైనచో ఆశిక్షను ఎందులకుఁ దీసికొనిరారు అని ప్రవక్తతో కాఫిర్లు పలుకసాగిరి. దాని జవాబును గూర్చి రాఁబోవు వాక్యములో దేవుని సెలవు ప్రవక్తకు అగుచున్నది. 49. ఓ జనులార! శిక్షపంపుట దేవుని చేతిలో నున్నది. దేవుఁడు తాను కోరినపుడు దుర్మార్గులను శిక్షించును. అందునాకు అధికారము లేదు అదియును గాక నా సొంత విషయములో కూడ నాకు కీడుమేలు చేసికొను అధికారము లేదు. దేవుఁడు కోరినది మాత్రము నాకు లభించుచున్నది. అందునాకు అధికారము గలదు. దేవుని యిష్టము లేనిది ఏద్దియును సంభవించదు. ప్రతి వంశమునకును ప్రతి సంఘమునకు ఒక కాలము నియమింపఁబడి యున్నది. ఆయా జాతివారు అంతకాల ముండుదురు. అందు ఒక నిమిష ముకూడ అటునిటు కానేరదు. శిక్ష రానున్నపుడు వచ్చితీరును. మీరు తొందరపడిన లాభము లేదు. మీరు నిద్రలో నిమగ్నులై యున్నపుడో లేదామీరు ఇహలోక వ్యాపారములో మునిగి యున్నపుడో ఆకస్మికముగ దేవునిశిక్ష మీకు వచ్చినచో పాపాత్ములగు మీరు దానినుండి తప్పించుకొను మార్గము చేసికొనగలరా! లేదుగదా! మఱెందులకు తొందర పడుచున్నారు. దానివలన లాభములేదు. అదిరాకమునుపే బుద్ధిమంతులు దానికిభయపడిసన్మార్గమునకుఁ బోవలెను. 51. దేవుని శిక్షవచ్చి పైఁబడినపుడు అవిశ్వాసులు ఇపుడు మేము నమ్మితిమి అని పలుకుదురు. అప్పటి విశ్వాసము వలన లాభము లేదు. ముందుశిక్ష వచ్చును అని నమ్మిక లేనందుననే అవిశ్వాసులు అది యెప్పుడు వచ్చును అని తొందఱ చేయుచుండిరి. అది రాకమునుపే నమ్మి దానినుండి తప్పించుకొను మార్గము చూచుకొనియుండవచ్చును. తలపై పడినపుడు నమ్ముట వలన ప్రయోజనము లేదు. అపుడు దేవుని నుండి వారితో "ఇపుడు మీరు నమ్మితిరా! దీనికి ముందు తొందర చేయుచుంటిరిగదా! 52. ఇంక మీరుగావించిన పాపకార్యములకును తిరస్కారములకును ఫలితము శాశ్వతమైన నరక బాధను అనుభవింపుఁడు" అని చెప్పఁబడును. 53. అవిశ్వాసులు అజాగ్రత్తలోపడి ఆశ్చర్యముతో "ఏమయ్యా! మేము చచ్చిన పిదప తిరిగి సజీవులై శాశ్వతమైన బాధ అనుభవింతుమా! ఇది నిజమేనా! మేము చచ్చి మట్టిలో కలిసి పోయిన పిదప తిరిగి సజీవు లగుదుమా! ఇది వాస్తవమేనా! అని హజ్రత్ రసూలు వారితో విచారించిరి. దానికి నిట్లు జవాబియ్యఁ బడినది. దీని విషయము ఆశ్చర్యపడ నక్కఱ

లేదు. నేను దేవుని ప్రమాణము చేసి చెప్పుచున్నాను. మీరందఱు తిరిగి సజీవులగుదురు. మీరు మట్టిలో కలిసి పోయిన పిదప తిరిగి మిమ్ము లేపుట సర్వశక్తుఁడైన దేవునికి కష్టముగాదు. మీరు పుట్టకముందు ఏమియు లేకుంటిరి. అట్టివారలగు మిమ్ము పుట్టించిన దేవుఁడు మిమ్ము తిరిగి లేపును. మీకర్మల ఫలితము మీకొసంగును. ఇందు మీరు దేవునిని లొంగఁజేయలేరు. మఱిమీరు దేవుని శిక్షనుండి తప్పించుకొని పోఁజాలరు.

54. వలౌ-అన్న-లికల్లి-నఫ్సిన్ జలమత్-మాఫిల్-అర్జి-లఫ్-తదత్ బిహీ-వ-అస్రరున్-నదామత-లమ్మా-రఅ-ఉల్-అజాబ-వ-ఖు-జియ-బైన-హుమ్-బిల్‌ఖిస్‌తి-వ-హుమ్-లా-యుజ్‌లమూన్.

54. మఱియు పాపములు చేసిన ప్రతి మనుష్యుని యొద్ద భూమిలోనున్న సొమ్మంతయు నుండినచో నిశ్చయముగ తనకు బదులుగ దాని నిచ్చివేయును. మఱివారు శిక్షను చూచునపుడు లోలోపల వారు పశ్చాత్తాపపడుదురు. మఱి వారి మధ్య న్యాయముగ తీర్పు అగును. మఱివారికి అన్యాయముజరుగదు.

వ్యా॥ 54. పాపములు చేసినవారు తీర్పు దినమునందు తమ పాపములనుండి ముక్తిపొందుటకై భూమిలోనుండు ధనమంతయు వారి చేతిలో నుండినచో తమ పాపములకు బదులుగ దానినిచ్చివేయుదురు. కాని అట్లుకానేరదు. పాపులు శిక్షను(బాధను) చూచినపుడు తాము గావించిన పాపములకు పశ్చాత్తాపము నొంది లోలోపలనే సిగ్గుపడి తమపశ్చాత్తాపము వెల్లడికాకుండయత్నింతురు. కాని తుదకు వారు అయ్యో మేమేమి చేసికొంటిమిరా! అని పలుకుదురు. తీర్పు దినమునందు ఏలాటి అన్యాయము జరుగదు. న్యాయముగ తీర్పు జరుగును.

55. అలా-ఇన్న-లిల్లాహి-మాఫిస్-సమావాతి-వల్-అర్జి-అలా- ఇన్న-వఅ-దల్లాహి-హఖ్ఖున్-వలా-కిన్న-అక్‌సరు-హుమ్-లా-యఅ-లమూన్. 56. హువ-యుహ్యీ-వ-యు-మీతు-వఇలైహి-తుర్-జఊన్.

55. వినుఁడు. ఆకాశములలోను భూమిలోనునున్న సర్వము దేవునిదేను. వినుఁడు, దేవుని వాగ్దానము నిజమైనది. కాని వారిలోని పెక్కుమందికి తెలియదు. 56. ఆతఁడే ప్రాణము పోయుచున్నాఁడు. మఱి చావు నిచ్చుచున్నాఁడు. మఱి ఆతని యొద్దకే మీరు పోవలసియున్నది.

వ్యా॥ 55. భూమ్యాకాశములలో దేవుని యధికారము చెల్లును. న్యాయముగ తీర్పు అయితీరును. నేరస్థులు ఆతని శిక్షనుండితప్పించుకొనఁజాలరు. వారు లంచమిచ్చి శిక్షనుండి రక్షణపొందలేరు. తీర్పుదినముగూర్చి దేవుఁడు

చేసిన వాగ్దానము నిజమైనది. కాని దీని విషయము పెక్కుమందికిఁ దెలియదు. కావున తమ నోటికి వచ్చినది పలుకుదురు. తమ యూహకు వచ్చిన దానిని వదరుదురు. 56. ప్రాణమిచ్చుట, చంపుట, దేవుని చేతిలోనున్నది. అట్టి సర్వశక్తుఁడగు దేవునికి, చచ్చినవారిని తిరిగి సజీవులు చేయుట కష్టముకాదు. కావున మానవులందఱు తమ కర్మల తీర్పుకొఱకు తిరిగి సజీవులై దేవుని సన్నిధానమున నిలుతురు.

57. యాఅయ్యు-హన్నాసు-ఖద్-జా-అత్-కుమ్-మా-ఇజతుమ్-మిర్-రబ్బి-కుమ్-వ-షిఫా-ఉమ్-మిర్-రబ్బికుమ్-వ-షిఫాఉల్-లిమా-ఫిస్-సుదూరి-వ-హుదన్-వ-రహ్మ-మ-తుల్-లిల్-మూమినీన్. 58 ఖుల్-బి-ఫజ్-లిల్లాహి-వ-బి రహ్మతిహీ-ఫ-బి-జాలిక-ఫల్-యఫ్-రహూ-హువ-ఖైరుమ్-మిమ్మా-యజ్-మఊన్.

57. ఓ జనులార! మీ ప్రభువునుండి మీ యొద్దకు బోధనయును, హృదయరోగములకు స్వస్థతయును సన్మార్గమును, ముసల్మానులకు కరుణయును వచ్చినది. 58. దేవుని యనుగ్రహమును ఆతని దయనుబట్టి వారు సంతోషపడవలెను. ఇది వారు కూర్చుచున్నదానికంటెను మేలైనదిఅనిఓప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 57. ఈ వాక్యములో దేవదత్తగ్రంథమగు ఖురానెషరీఫు యొక్క గుణములు వివరింపఁబడినవి. అందు మానవులకు బోధగలదు. అది ధర్మ మార్గమును బోధించి అన్నివిధముల పాపములను నిషేధించును. అది అసూయ కపటము, అహంకారము వంచన, అవిశ్వాసము మొదలగు హృదయరోగములను స్వస్థపఱచును. దేవుని ప్రీతి లభించి ఆతని సాన్నిధ్యము లభించు మార్గము చూపును. ఖురానును నమ్మి దాని ననుసరించు ముసల్మానులను ఉభయ లోకములలోను దేవుని ప్రేమకు పాత్రులుగఁ జేయును. 58. దేవుని యనుగ్రహము లభించినది అని సంతోషించుచుట మంచిదియే. అందు దోషములేదు. వాస్తవముగా మానవులకుఁ గావలిసినది దేవుని యనుగ్రహము. మిగిలిన ఇహలోక సంపదలు దానిముందు నిలువలేవు. దేవుని యనుగ్రహమే మేలైనది. కావున మానవులు దేవుని యనుగ్రహము పొందుటకు యత్నింపవలెను.

59. ఖుల్-అర-ఐ-తుమ్-మా-అన్-జలల్లాహు-లకుమ్-మిర్-రిజ్-ఖిన్-ఫ-జ-అల్-తుమ్-మిన్హు-హరామన్-వ-హలాలన్-ఖుల్-అల్లాహు-అజిన లకుమ్-అమ్-అలల్లాహి-తఫ్తరూన్. 60. వ-మా-జన్నుల్-లజీన-యఫ్-తరూన-అలల్లా-హిల్-కజిబ-యామల్-ఖియామతి-ఇన్నల్-లాహ-లజూ-ఫజ్-లిన్-అలన్-నాసి-వలాకిన్న-అక్-సరహుమ్-లాయష్-కురూన్.

59. చూడుఁడు. దేవుఁడు మీకొఱకు ఆహారమును సృష్టించెను. పిదప మీరు అందు కొన్నిటిని నిషేధించుకొంటిరి. మఱికొన్నిటిని ధర్మమైనదిగాఁ జేసికొంటిరి అని ఓ ప్రవక్తా! పలుకుము. ఏమి దేవుఁడు మీకిట్లు సెలవునిచ్చి యున్నాఁడా! లేదా దేవునిపై అసత్యములు కల్పించుచున్నారా? అని పలుకుము. 60. మఱి దేవునిపై అబద్ధములు కల్పించువారు తీర్పుదినమును గూర్చి ఏమి తలఁచియున్నారు. నిశ్చయముగా దేవుఁడు జనులయెడ అనుగ్రహముగలవాఁడు. కాని వారిలోని పెక్కుమంది కృతజ్ఞత సలుపరు.

వ్యా॥ 59. దేవుఁడు మానవులకొఱకు ఆహారము సృష్టించియున్నాఁడు. అందు ఏది ధర్మమో (హలాల్) ఏద్ది అధర్మమో (హరామ్) దేవుఁడేనిర్మింపవలెను. మానవులు తమయిష్టానుసారముగా ధర్మములనుఅధర్మములనునిర్మింపఁజాలరు. దేవుఁడు నియమించిన ధర్మములు దేవుని గ్రంథమగు ఖురానెషరీఫులో నున్నవి. కావున దేవుని ప్రీతి పడయఁగోరువారు ఖురానును అనుసరింపవలెను. అట్లుగాక తమ సొంతబుద్ధులతో ఇది తినవచ్చును. ఇది తినకూడదు అని నియమింపఁగూడదు. అట్లు చేయుటచే దేవునిపై అబద్ధములు కల్పించినవారలగుదుప. 60. అట్లు దేవునిపై అబద్ధములు కల్పించినవారు తీర్పుదినమునందు పట్టువడుదురు. తమ కల్పనలకు కఠినశిక్షపొందుదురు. కావున వారు తీర్పుదినము గూర్చి సులభముగా తప్పించుకొందుమని తలంచుచున్నారు కాఁబోలు! అట్లు తలంపఁగూడదు. దానికి భయపడి శిక్షనుండి తప్పించుకొనుమార్గము ఇహమునందే చూచుకొనవలెను. విశ్వాసమే ముక్తిమార్గము. దేవుఁడు చాల అనుగ్రహముగలవాఁడు. కావున జనులను వదలిపెట్టియున్నాఁడు. ప్రవక్తలనంపి ధర్మమార్గము చూపుచున్నాఁడు. దీనికిఁగాను పెక్కురు జనులు కృతజ్ఞత సలుపుటకు బదులుగ కృతఘ్నత చూపుచున్నారు. కావున జాగ్రత్తపడవలెను.

61. వ-మా-తకూను-ఫీ-షానిన్-వమా-తత్లూ-మిన్‌హు మిన్-ఖుర్‌ఆనిన్ వలా-తఅ్మలూన-మిన్-అమలిన్-ఇల్లా-కున్నా-అలైకుమ్-షుహూదన్-ఇజ్-తుఫీ-జూన-ఫీహి-వమా-యఅ్-జుబు-అర్-రబ్బిక-మిమ్-మిస్-ఖాలి-జర్ర-తిన్-ఫిల్-అర్‌జి-వలా-ఫిస్-సమాఇ-వలా-అస్-గర-మిన్-జాలిక-వలా-అక్బర-ఇల్లా-ఫీ-కితాబిమ్-ముబీన్.

61. మఱియు, ఓ ప్రవక్తా! నీవు ఏస్థితిలోనున్నను, దేవునినుండివచ్చిన ఖురానును నీవు పఠించుచున్నపుడును, (ఓ జనులార.) మీరు పనులను చేయుచు అందు నిమగ్నులైయున్నపుడును మేము మిమ్ము చూచుచున్నారము. (మీకు సాక్షులై యున్నారము.) మఱిభూమిలోనున్న ఆకాశములలోనున్న ఒకరవంత

యును నీ ప్రభువునుండి మఱుఁగుపడియుండదు. మఱి దానికంటె చిన్నదిగాని పెద్దదిగాని స్పష్టమైన గ్రంథములో లేనిదిలేదు.

వ్యా॥ 61. దేవుఁడు తన ప్రవక్తయొక్క ప్రతిష్ఠితిని విషయమును, మత ప్రచారమును అందఱు మానవులు చేయు పనులను చూచుచున్నాఁడు. సర్వము ఆతనికిఁ దెలియును. ఆతనికి నెద్దియును మఱుఁగులేదు. భూంమ్యాకాశములలో నున్న సమస్తమును ఎఱుంగుచున్నాఁడు. పూర్వము గడచినవి, ఇకమీఁద సంభవించునవి సర్వవిషయములును లౌహెమహ్ఫూజ్ అను గ్రంథములోనున్నవి. దేవుని భక్తులు చేయు పుణ్యకార్యములును పాపులుచేయు పాపకార్యములును దేవునికిఁ దెలియును. వారివారికిఁ దగిన ఫలిత మొసంగును. మానవులు దేవునిని తమ కన్నులార చూడలేక పోయినను దేవుఁడు వారికి సాక్షిగానుండి సర్వముచూచుచున్నాఁడు. కావున మానవులు దేవునికిభయపడి పాపములు మానుకొనవలెను.

62. అలా-ఇన్న-ఔ-లియా-అల్లాహి-లా-ఖౌఫున్-అలైహిమ్ - వలా-హుమ్-యహ్-జనూన్. 63- అల్-లజీన-ఆమనూ-వకానూ-యత్-తఖూన్. 64 లహుముల్-బుష్‌రా-ఫిల్-హయా-తిద్-దున్యా-వఫిల్--ఆఖిరతి-లా-తబ్-దీల లి-కలి-మా-తిల్లాహి-జాలిక-హువల్-ఫౌ-జుల్-అజీమ్.

62. వినుఁడు. దేవునికి ప్రియులైనవారికి భయముగాని దుఃఖముగాని యుండనేరదు. 63. ఎవరు విశ్వసించి భయభక్తులుగలిగియుండిరో 64. వారికి ఇహలోకజీవనమందును పరలోకమందును సంతోషవార్తయున్నది. దేవునిపలుకులుమారవు ఇదియే గొప్ప విజయము.

వ్యా॥ 64 : 62. దేవుని స్నేహితుల విషయము చెప్పఁబడినది. విశ్వసించి భయభక్తులువహించి సత్కార్యములుచేయువారు దేవునికి ప్రియులును. స్నేహితులును, దేవునికి ప్రియులైనవారును సర్వ అవస్థలయందు దేవునిపైననే యాధారపడుదురు. అందువలన వారి హృదయములకు శాంతిలభించును. ఉభయలోకములలోను వారికి భయముగాని దుఃఖముగాని యుండనేరదు. వారు సదా స్వర్గములలో నుందురు. వారికి ఇహలోకమందును గొప్పతనము లభించును. వారు నిజమైన కలలు గాంచుదురు. వారికి పరమునందును ఏ చింతలేదనుసంతోషవార్త దేవునినుండి వారికి వచ్చును. దేవుని పలుకులు మారవు. దేవుని వాగ్దానము పూర్తియై తీరును. దేవుని ప్రీతి పడయుటయే గొప్ప విజయమును, ముక్తియును.

65. వలా-యహ్-జున్‌క-ఖౌలు-హుమ్-ఇన్నల్-ఇజ్-జత-లిల్లాహి-జమీ అన్-హువస్-సమీ-ఉల్-అలీమ్, 66. అలా-ఇన్న-లిల్లాహి-మన్-ఫిస్ - సమా

వాతి-వ-మన్-ఫిల్-అర్జి-వమా-యత్-తబి-ఉల్-లజీన-యద్-ఊన-మిన్-దూ నిల్లాహి-షురకాఅ-ఇన్-యత్-తబి-ఊన-ఇల్-లజ్-జన్న-వ-ఇన్ - హుమ్ - ఇల్లా-యఖ్-రుసూన్. 67. హువల్-లజీ-జఅల-లకుముల్-లైల-లితస్ - కునూ-ఫీహి-వన్-నహార-ముబ్-సిరన్-ఇన్న-ఫీ-జాలిక-ల ఆయా-తిల్-లి-ఖౌమిన్- యస్-మఊన్.

65. మఱి వారి మాటలవలన నీవు చింతింపకుము. వాస్తవముగా సర్వ శక్తి దేవునికే యున్నది. ఆతఁడే సర్వము వినువాఁడును, ఎఱుంగువాఁడును. 66. వినుము. ఆకాశములలోను, భూమిలోనున్న సమస్తము దేవునిదేను. మఱియు దేవుని వదలి ఇతరులను (చిల్లర దేవతలను) పిలుచువారు అనుసరించునది యూహలు మాత్రమే. వారు లేనిపోని ఊహలు చేయుచున్నారు. 67. మీరు రాత్రియందు విశ్రాంతి పుచ్చుకొనుటకై ఆతఁడే మీకొఱకు రాత్రిని చేసెను. మఱి వెలుతురు నిచ్చునట్టి పగటిని చేసెను. నిశ్చయముగా నందు వినునట్టి జనులకు సూచన లున్నవి.

వ్యా॥ 65. హజ్రత్ రసూలువారు ప్రచారము చేయునపుడు దుష్టులైనఅవిశ్వాసులు అనేకమాటలు పలుకుదురు. దానికిఁగానుఓప్రవక్తా! నీవుచింతింపకుము. సర్వబలము దేవునికే యున్నది. నీశత్రులు నిన్నేమియు చేయఁజాలరు. దేవుఁడు సత్యమునకు జయ మొసంగును. దుష్టులుఅవమానపడుదురు. దేవుఁడు అందఱి పలుకులు వినుచు నెఱుంగుచున్నాఁడు. వారివారికిఁ దగిన ఫలిత మొసంగును అని ఓదార్చుచున్నాఁడు. 66. భూమ్యాకాశములలోనున్న సర్వము దేవుని యధికారములో నున్నది. దేవదూతలు మానవులు జిన్నాతులు అందఱును దేవుని సృష్టి. దేవునిని వదలి యితరులను దేవునికి సాటిగకల్పించుకొని వారిని పూజించువారు తమ యూహలను అనుసరించుచున్నారు. అది గ్రంథాధారములేనిది. అది అంధకారము. అందు పెక్కు దైవారాధకులు పడి దేవులాడుచున్నారు. 67. రాత్రింబవలను, చీఁకటి వెలుతురులను మంచి దెబ్బరులను చేయువాఁడు దేవుఁడే. రాత్రి విశ్రాంతికొఱకును పగలు సంపాదన కొఱకును నియమించియున్నాఁడు. ఎట్లు రాత్రి చీఁకటి పిదప పగటి వెలుతురు వచ్చుచున్నదో అటులే అవిశ్వాసాంధకారమును తొలఁగించుటకు ఖురాను యొక్క వెలుతురు వచ్చి సర్వ అధర్మముల చీఁకట్లను పోఁగొట్టి దేవుని సన్నిధానముపొందించునట్టి సన్మార్గము చూపుచున్నది.

68. ఖాలుత్-తఖ-జల్లాహు-వలదన్-సుబ్-హానహూ హువల్-గనియ్యు

లనూ మా - ఫిస్ - సమా వాతి-వ-మా ఫిల్ -అర్ జి-ఇన్ ఇన్ద కుమ్ - మిన్-సుల్ తానిమ్-బిహాజా-అతఖూలూన-అలల్లాహి-మాలా తల-లమూన్ .69.ఖుల్ ఇన్నల్-లజీన యఫ్ తరూన అలల్లా-హిల్ కజిబ-లా - యుఫ్లి - హూన్. 70. మతా-ఉన్-ఫిద్-దున్యా-సుమ్మ-ఇలైనా-మర్-జి ఉహుమ్-సుమ్మ-నుజీ - ఖుహు ముల్ అజా-బష్-షదీద-బిమా-కానూ-యక్-ఫురూన్.

68. దేవునికి కుమారుడున్నాడని కాఫిర్లు పలుకుచున్నారు. ఆతడు పరమపవిత్రుడు. ఆతడు అక్కఱలేనివాడు. ఆకాశములలోను భూమియందు నున్న సమస్తము ఆతనిదేను. దీనికిగాను మీయొద్ద ప్రమాణము (సన్నదు) లేదు. మీకు దెలియనిదానిని దేవునిపై నెందులకు అబద్ధములు కల్పించుచున్నారు. 69. దేవునిపై అబద్ధములు కల్పించువారు మేలుపొందరు అని ఓ ప్రవక్తా! పలుకుము. 70. ఇహలోకములో వారు కొంత లాభము పొందవలసినది. మరల వారు మాయొద్దకు మరలి రావలసియున్నది. ఆ పిదప వారి యవిశ్వాసమునకు బదులుగా వారికి కఠిన బాధను రుచి చూపెదము.

వ్యా॥ 68. ఇందు క్రైస్తవులకు రద్దుగలదు. వారు ఏసుక్రీస్తును దేవుని కుమారుడని పలుకుదురు. దేవునికి భార్యబిడ్డలు లేరు. ఆతనికి సంసార సంబంధములు లేవు. దేవుడు పరమపవిత్రుడు. భూమ్యాకాశములలోనున్న సమస్తము ఆతనిదేను. ఆతనికి ఏలాటి అక్కఱలేదు. సర్వము ఆతనిపై ఆధారపడియున్నది. అక్కఱగలవారికి బిడ్డలు కావలెను. ఆ స్థితిపోవు భయముతో మానవులు దత్తు కుమారుడు చేసికొందురు. అట్టి అవసరములు దేవునికి లేవు. దేవునికి కుమారుడు గలడు అని పలుకుట శాస్త్రప్రమాణములేనిమాట. కావున మానవులు ఇట్లు పలుకరాదు. 69 : 70. ఎందుకనగా దేవునిపై అబద్ధములు కల్పించువారు కొంతకాలము ఇహలోకములోలాభములు పొందిన పొందవచ్చును. కానివారికి స్థిరమైన మేలు లభింపదు. వారు ముక్తి మోక్షములు పొందరు. తుదకు తీర్పుదినమునందున వారు కఠిన బాధలకు పాలగుదురు. దేవుని శిక్షనుండి తప్పించుకొనంజాలరు అని హెచ్చరింపబడియెను.

71. వత్లు-అలైహిమ్ నబఅ నూహిన్ ఇజ్-ఖాల-లిఖౌమిహీ-యాఖౌమి-ఇన్-కాన-కబుర-అలైకుమ్-మఖామీ-వ-తజ్-కీరీ-బి-ఆయా-తిల్లాహి-ఫ-అలల్లాహి త-వక్కల్ తు-ఫ-అజ్ మిఊ-అమ్ రకుమ్ వ షుర-కా అకుమ్ -సుమ్మ- లాయకున్-అమ్రు-కుమ్-అలైకుమ్ గుమ్మతన్-సుమ్మఖ్ జూ-ఇలయ్య-వలా-తున్ - జిరూని,

72. ఫఇన్-తవల్-లై తుమ్-ఫమా-సఅల్-తుకుమ్-మిన్-అఙ్రిన్-ఇన్-అఙ్రీ-ఇల్లా-అలల్లాహి-వ-ఉమిర్తు-అన్-అకూన-మినల్-ముస్లిమీన్. 73. ఫకజ్-జబూహు-ఫ నజ్-జైనాహు-వ-మమ్-మ-అహూ-ఫిల్-ఫుల్కి-వ-జ అల్నాహుమ్-ఖలా- ఇఫ-వ-అగ్-రఖ్-నల్-లజీన-కజ్-జబూ-బి-ఆయాతినా-ఫన్-జుర్-కై ఫ- కాన - ఆఖిబ తుల్-మున్ జరీన్.

71. మఱియు నీవు నూహుయొక్క విషయమును వారికి విని పింపుము. ఆతఁడు తన జాతివారితో ఓనా జాతివారలార! నాయుండుటయును మీకు కష్టముగా నున్నచో నేను దేవునిపై ఆధార పడితిని. కావున మీరందఱు కలిసి మీపని మీరు చేయుఁడు. మిఱి మీ చిల్లర దేవతలను సేకరించు కొనుఁడు. మరల మీపనిలో మీకు ఏలాటి సందేహ ముండకూడదు. ఆ పిదప మీరు నావిష యము చేయవలసినదిచేసి తీరుఁడు. మఱి నాకు విరామము ఒసంగకుఁడు. 72. మఱిమీరు ముఖము త్రిప్పుకొని పోయినచో నేను మీతో ఏమియు కూలి నడుగలేదు. నా కూలి దేవునియొద్ద నున్నది. మఱి నేను విధేయుఁడనై యుండు నట్లుగ నాకు ఆజ్ఞ అయినది అని పలికెను. 73. ఆపిదప వారు ఆతనిని తిరస్క రించిరి. కావున మేముఆతనిని తనితోఁబాటునావలో నున్నవారిని రక్షించి వారిని భూమిపై వసింపఁ జేసితిమి. మఱి మా సూచనలను తిరస్కరించిన వారిని ముం చి వేసితిమి. కావునచూడుము! భయబోధనియ్యఁబడినవారిగతి యేమాయెనో!

వ్యా॥ 71. ఇందు మక్కా నివాసులకు, నూహు ప్రవక్తను తిరస్కరించిన వారిగతి యేమాయెనో దెలిపి మక్కావారు హజ్రత్ రసూలు వారిని నమ్మక తిరస్కరించినచో వారికి కూడ అదేగతి పట్టును అని మందలింపఁ బడుచున్నది. మఱియు దుష్టులు పన్ను కుట్రల వలన హజ్రత్ రసూలువారు చింతింపఁ గూ డదు అని వారికి ఓదార్పుగలదు. ఎందుకన పూర్వముకూడ దుష్టులు ప్రవక్తలను తిరస్కరించుచు వచ్చినారు. తుదకు దుష్టులు నశించి విశ్వాసులకు జయము లభించెను. అటులే కాఫిర్లు ఓడిపోయి ముసల్మానులకు జయమును వృద్ధియును గలుగును. నూహు ప్రవక్త అనేక వందల సంవత్సరములు తన జాతివారిని బో ధించెను. కాని కొందఱు తప్ప అందఱును నూహును తిరస్కరించి నమ్మలేదు. నూహు తనజాతి వారిని బోధించుట వారికి భారముగాఁ దోఁచి వారుఅనేక కుట్రలు చేయసాగిరి. దానికినూహు ఓజనులారా! మీరు చేయనెంచిన పను లన్నియు ఏలాటి జంకును సందేహమును లేకుండ చేయుఁడు. మఱి మీకు తోడుగ మీచిల్లర దేవతలను విగ్రహములను మీసహాయముసకుఁగాను పిలుచుకొ నుఁడు. నేను భయపడను. సర్వశక్తుఁడగు దేవుని పైనను ఆధారపడి యున్నాను.

ఆతఁడే నన్నును విశ్వాసులను రక్షించును. కావున మీరు నాకు విరామము (గడవు) నియ్యక మీకుట్రలు సాగింపుఁడు. 72. మీరు నన్నును దేవుని సూచనలను తిరస్కరించి మీరు ముఖములు త్రిప్పుకొని పోయినచో నాకు చింత లేదు. ఏందుకన నేను చేయు మత ప్రచారమునకుఁ గాను మీ నుండి కూలిగాని జీతము గాని అడుగుట లేదు. కావున మీరు కోపపడినచో నా జీతము నిలిచి పోవునేమో అను భయము నాకు లేదు. నాకు పోషకుఁడు దేవుఁడు, నాకు కూలి (జీతము) ఒసంగుట దేవుని పని. నేను దేవునికి విధేయుఁడనై యుండవలెను అనియే నాకు దేవుని సెలవైనది. నేను ఆతనికి విధేయుఁడై యున్నపుడు ఆతఁడే నన్ను పోషించి కాపాడును. 73. నూహు ప్రవక్త యొక్క జాతివారు ఆతని బోధను వినక దుర్మార్గములో మితిమీఱి పోయిరి. తుదకు అవిశ్వాసులు దేవుని శిక్షకు పాత్రులై పెద్ద జల ప్రవాహములో మునిగి చచ్చిరి. నూహు దేవుని సెలవుచే ఒక నావ చేసి యందు ఆతఁడును ఆతనిని విశ్వసించిన కొందఱు విశ్వాసులును కూర్చుండి జలప్రమాదము నుండి రక్షణ పొందిరి. వీరి సంతానమే లోకమంతటను వ్యాపించెను. దుష్టులు నశించిన పిదప విశ్వాసులు భూమిలో వసింపసాగిరి. భయబోధ నియ్యఁబడిన దుష్టులు తమ యవిశ్వాసమునకు ఫలితముగ మునిగి చచ్చిరి. కావున వారికి పట్టిన దుర్గతిని చూచి మానవులు బుద్ధి తెచ్చుకొనవలెను.

74. సుమ్మ-బఅస్‌నా-మిమ్-బఅ-దిహీ-రుసులన్-ఇలా-ఖౌమిహీ-ఫ-జాఊహుమ్-బిల్-బయ్యినాతి-ఫమా-కానూ-లి-యూ-మినూ-బిమా-కజ్-జబూ-బిహీ-మిన్-ఖబ్లు-కజాలిక-నత్‌బఉ-అలా-ఖులూ-బిల్-ముఅ-తదీన్.

74. ఆపిదప మేము నూహు తరువాత ప్రవక్తలను వారివారి జాతివారి యొద్దకు నంపితిమి. ప్రవక్తలు వారియొద్దకు స్పష్టమైన సూచనలను తీసికొని వచ్చిరి. కావున జనులు తాము పూర్వము తిరస్కరించిన దానిని విశ్వసించువారు కాకపోయిరి. ఇట్లు మితిమీఱి పోవువారి హృదయములపై మేము ముద్ర వేయుచున్నారము.

వ్యా॥ 74. నూహు ప్రవక్త పిదప హూదు, సాలిహు, లూతు, ఇబ్రాహీము, షుఐబు మొదలగు ప్రవక్తలను వారివారి జాతియొద్దకు దేవుఁడు పంపించెను. ఆప్రవక్తలు దేవుని సూచనలను జనులకుఁ దెలిపిరి. కాని ఆయా జనులు ప్రవక్తలు రాకమునుపు ఏ మూఢత్వములోను అవిశ్వాసములోనుండి తిరస్కరించుచుండిరో ఆవిషయములను ప్రవక్తల బోధవినియు విశ్వసింపక పోయిరి. దేవుని సూచనలను తిరస్కరించిరి. అట్లు తిరస్కరించుచు నుండినందున ద్వేషము ముదిరిపోయి వారి హృదయములపై ముద్ర పడిపోయెను. మితి

మీఱి పోవువారి సన్మార్గము స్వీకరించు శక్తులు చెడిపోయిన పిదప వారి హృదయములు కఠినము వహించును.

75. సుమ్మ బఅస్నా మిమ్-బఅది హిమ్-మూసా-వ-హారూన-ఇలా- ఫిర్-ఔన-వ-మల-ఇ-హీ-బి-ఆయాతినా ఫస్-తక్-బరూ-వ-కానూ ఖౌమమ్-ముజ్రిమీన్. 76. ఫలమ్మా-జా-అహుముల్-హఖ్ఖు-మిన్ ఇన్దినా-ఖాలూ-ఇన్న-హాజా-ల-సిహ్రుమ్ ముబీన్. 77. ఖాల మూసా-అత-ఖూలూన-లిల్_హఖ్ఖి-లమ్మా-జాఅ కుమ్-అ-సిహ్రున్-హాజా-వలా యుఫ్-లిహుస్ సాహిరూన్. 78. ఖాలూ-అ జీతనా-లి-తల్-ఫితనా అమ్మా వజద్నా అలైహి ఆబా-అనా-వ తకూన-లకు-మల్-కిబ్-రియాఉ-ఫిల్-అర్ జి-వ-మా-నహ్ను-లకుమా-బి - ముామినీన్. 79. వ-ఖాల-ఫిర్-ఔ నూ-తూనీ బికులి-సాహిరిన్ అలీమ్. 80. ఫలమ్మా జాఅస్-సహా-రతు-ఖాల లహుమ్-మూసా-అల్ ఖూ-మా అన్తుమ్-ముల్ ఖూన్. 81 ఫలమ్మా-అల్ ఖౌ-ఖాల-మూసా- మా జీతుమ్ బిహిస్- సిహ్రు-ఇన్నల్లా-హ స-యుబ్-తిలుహూ-ఇన్నల్లాహ-లా యుస్ లిహు-అమలల్-ముఫ్ సిదీన్. 82. వ-యుహిఖ్ఖుల్లా-హుల్ -హఖ్ఖ-బి-కలి మా-తిహీ-వలౌ-కరి హల్ - ముజ్-రిమూన్.

75. మఱల వారి పిదప మూసాకును హారూనునకు మా సూచనలను ఇచ్చి ఫిరౌను వద్దకును ఆతని నాయకుల యొద్దకును పంపితిమి. ఆ పిదపవారు గర్వము వహింప సాగిరి. మఱివారు దుర్మార్గులైనట్టి జనులుగ నుండిరి. 76. పిదప వారి యొద్దకు మా యొద్దనుండి సత్యము రాఁగా ఇది స్పష్టమైనజాలవిద్య అని చెప్పసాగిరి. 77. మీ యొద్దకు సత్యము రాఁగా దానివిషయ మిట్లు మీరు పలుకుచున్నారా! ఏమి ఇది జాలవిద్యయా! మఱి జాల్య విద్యగాండ్రు ముక్తి పొందరు అని మూసా చెప్పెను. 78. మా తాత ముత్తాత లుండిన మార్గము నుండి మమ్ము తప్పించుటకా! మఱి మీయిద్దఱికి భూమిలో అధికారము లభింపవలెననియా! నీవు మాయొద్దకు వచ్చితివా! మఱి మేము మిమ్ము నమ్మువారలము కాము అని వారు పలుక సాగిరి. 79. మఱియు ఫిరౌను జాలవిద్య నెఱిఁగిన ప్రతివానిని నాయొద్దకు తీసికొని రండు అని పలికెను. 80. ఆ పిదప జాలవిద్యగాండ్రు రాఁగా వారితో "మీరు వేయవలెనని యున్న వానిని వేయుఁడు" అని మూసా పలికెను. 81. ఆపిదప వారు వేయఁగామీరుతెచ్చినది జాలవిద్య.

ఇంక దేవుఁడు దీనిని వ్యర్థపఱచును. నిశ్చయముగ దేవుఁడు దుష్టుల కార్యములను చక్కపఱచఁడు. 82. మఱి దుర్మార్గులు ఇష్టపడకున్నను దేవుఁడు తన సెలవుచే సత్యమును సత్యపఱచును. అని మూసా పలికెను.

వ్యా॥ 75. ఈజిప్టు (మిసరు) దేశములో ఫిరౌను మఱియు ఆతని నాయకులు చాల దుష్టులై ఇస్రాయీలీయులను హింసించుచుండిరి. ఫిరౌను తానే దేవుఁడని పలుకుచు విఱ్ఱవీగుచుండెను. వీరిని బోధించుటకై దేవుఁడు మూసా ప్రవక్తను హారూను ప్రవక్తను నియమించి పంపెను. మూసా ప్రవక్త దేవుని సూచనలు చూపి ఫిరౌను జనులను బోధించెను. కాని తమ స్వభావ సిద్ధముగ దుష్టులైన ఫిరౌను జనులు గర్వముతో మూసా ప్రవక్త బోధనువినకనమ్మలేదు. 76. మూసా ప్రవక్త చూపిన సూచనలను చూచి ఆయన బోధించిన వాక్యములను విని ఇది జాలవిద్యగా నున్నది అని ఫిరౌను చెప్పసాగెను. 77. ఇట్లు ఫిరౌను పలుకగా ఏమయ్యా! మీరు దేవుని సూచనలు (మోజిజే) ను జాలవిద్యను ఒకటివిగా నెంచుచున్నారు. దేవుని సూచనలు సత్యములైనవి. జాలవిద్య యిట్లుండునా! జాలవిద్యగాఁడు ఇట్టి ముఖతేజస్సు గలిగి యుండునా! ప్రవక్తల ముఖములు చూచినవారి ప్రభావ తేజస్సు కనబడునుగదా. మాంత్రికుల ముఖములు అట్టి ప్రభావము గలిగి యుండవు. వారి ముఖములపై నీచత్వము కనఁబడును. బంగారుకును ఇత్తడికిని భేదము లేదా! అందు భేదము గుర్తింపలేని వారు వివేకులు కారుసుమా! ఎన్నటికిని మాంత్రికులు ముక్తి జయములు పొందరు సుమా. అని మూసా ప్రవక్త పలికెను. 78. మూసా ప్రవక్త మాటలు విని దిక్కులోచక ఫిరౌను వారలు ఇట్లు నిందింప సాగిరి. ఓహో మీరు ఈ దేశములో నున్న మమ్ము తఱిమి వేసి యందు రాజ్యమును అధికారమును పొందఁ గోరుచున్నరా! రాజ్యమును కోరి మతవేషము వేసికొని వచ్చినారా! మేము మీ మాటలకు లొంగము. మిమ్ము నమ్మము పొందు. 79. మూసా ప్రవక్త చూపిన సూచనలను జాలవిద్య అని ఫిరౌను పలికెనుగదా! దానికిఁగాను దేశములోనున్న జాలవిద్య నెఱింగిన వారిని పిలపించి మిమ్ములొంగఁ జేయుదును అని పలికి దానికిఁగాను మాంత్రికులను రప్పించుటకుఁ గాను దేశములో చాటించెను. 80. అట్లు ఫిరౌను చాటించిన పిదప దేశములోని పెద్దపెద్ద మాంత్రికులు వచ్చి కూడిరి. ఒక దినము అందఱు ఒక మైదానములో కూడిరి. అపుడు మూసా ప్రవక్త ఓ మాంత్రికులారా! మీరు ఏమేమి చేయ వలయునని యెంచి వచ్చితిరో అదంతయు చేయుడు అని పలికెను. 81.అపుడామాంత్రికులు తమ చేతి కఱ్ఱలను త్రాళ్ళను క్రిందపడ వేయఁగా చూచువారికిమైదాన మంతయు పాపములతో నిండినట్లు కనఁబడెను. అపుడు మూసా ఓమాంత్రికులార! మీరు గావించునది జాలవిద్య నేను చూపునది జాలవిద్యకాదు. ఇది దేవుని

సూచన. ఇఁక త్వరలో మీా జాలవిద్యవ్యర్థాపోవును. ఇఁక మీాఅసత్యము తేట తెల్లమగును దేవుఁడు దుష్టుల. కార్యములను సమ్మతింపఁడు. సత్యమును సత్యము గాఁ జేసి దానిని స్థిరపఱచును. అపుడు అసత్యము లొంగిపోవును. సదా సత్యమునకే జయమున్నది. తుదకు అసత్యమే ఓడిపోవును అని పలికి తన చేతికఱ్ఱను బిస్మిల్లాహి అని మూసా పడవేయఁగా అది పెద్దపాము అయి సర్వము మ్రింగివేసెను. తత్క్షణమే మాంత్రికులు విశ్వసించిరి. ఫిరౌను కుట్ర సాగక పోయెను.

83. ఫమా-ఆమన-లి-మూసా-ఇల్లా-జుర్రీ-యతుమ్-మిన్-ఖామిహీ-అలా ఖౌఫిమ్-మిన్-ఫిర్ఔన-వ-మల-ఇహిమ్-అన్-యఫ్-తిన-హుమ్-వఇన్న-ఫిర్ఔన-ల-ఆలిన్-ఫిల్-అర్జి-వఇన్నహూ-లమినల్-ముస్రి-ఫీన్. 84. వఖాల-మూసా-యా-ఖామి-ఇన్-కున్తుమ్-ఆమన్-తుమ్-బిల్లాహి-ఫ-అలైహి-తవక్-కలూ-ఇన్-కున్తుమ్-ముస్లి-మీన్. 85. ఫ-ఖాలూ-అలల్లాహి-తవక్కల్-నా-రబ్బనా-లా తజ్-అల్-నా-ఫిత్-నతల్-లిల్-ఖౌమిజ్-జాలిమీన్. 86. వ-నజ్-జినా-బి-రహ్మ-తిక-మినల్-ఖౌమిల్-కాఫిరీన్.

83. పిదప ఫిరౌను మఱియు ఆతని జనులలోని నాయకులు తమ్మ సన్మార్గమునుండి తప్పింతురు అనుభయముతో ఆతని కులమువారిలో కొందఱు మాత్రము మూసాను విశ్వసించిరి. మఱి ఫిరౌను భూమిపై బలముగలగి మితిమీాఱి పోవుచుండెను. 84. మఱియు ఓనా జనులార! మీరు దేవునిని విశ్వసించి విధేయులైరై యున్నచో ఆతని పైననే ఆధారపడుఁడు అని మూసా పలికెను. 85. అపుడు వారు మేము దేవునిపై నాధారపడితిమి. ఓమాప్రభువా! అన్యాయస్థులైనట్టి ఈజనులు మాపై బలవంతము చేయునట్లుగ మమ్మ వదలి పెట్టకుము. 86. మఱి నీదయతో మమ్మ అవిశ్వాసులనుండి రక్షింపుము అని వారు పలికిరి.

వ్యా॥ 83. ఫిరౌను చాల బలముగలరాజు. ప్రజలు ఆతనికి భయపడుచుండిరి. మఱియు వానినాయకులును అధికారులును చాల అన్యాయములుచేసెడివారలు. అందుకు ప్రజలు భయపడి మూసా ప్రవక్తను విశ్వసింపలేదు. విశ్వసించినచో ఫిరౌను వారలు తమకు చాల బాధలు పెట్టుదురని ప్రజలు జంకుచుండిరి. అయినను కొందఱు సాహసించి ధైర్యముతో తమ విశ్వాసమును వెల్లడించిరి. వీరు ఫిరౌను కాలమునకు చేరినవారు. వీరు యావనులు. బనీ యిస్రాయీలియులందఱును మూసాను విశ్వసించి యుండిరి. ఫిరౌనుకులము వారలుకొందఱు

మాత్రము విశ్వసించిరి. పెక్కురు భయముచే విశ్వసింపలేదు. ఫిరౌను తన బలగర్వముతో మితిమీఱి పోవుచు అనేక అన్యాయములు చేయుచుండెను. 84. ఫిరౌను చేయు హింసలకు విశ్వాసులు ఓర్చి దేవునిపై నాధారపడి యుండవలెను. దేవునిని నమ్మినవారు కష్టములకు భయపడరు. దేవునిపై నాధారపడి ఆతని దయకు పాత్రులు కావలెను అని మూసా ప్రవక్త విశ్వాసులతో చెప్పగా, 85. వారును అటులే మేము దేవునిపై నాధారపడితిమి. దేవుని సహాయమే మాకు కావలెను. ఆతని సహాయము వలన మాకు శత్రువులపై జయము గలుగవలెను. శతృవులు మాపై జయము పొందకూడదు. శత్రువులు జయము బలము పొందినచో తాము సత్యమందున్నారని తలంచి మూపై నన్యాయములు చేయుదురు. కావున వారి యన్యాయములనుండియు వారి దాసత్వము నుండియు దేవుడు మమ్ము రక్షించి కాపాడవలెను అని ప్రార్థించిరి.

87. వ ఔ-హైనా-ఇలా-మూసా-వ-అఖీహి అన్-తబవ్వ ఆ-లి ఖౌమి కుమా-బి-మిస్ర-బుయూ-తన్-వజ్-అలూ-బు-యూతకుమ్-ఖిబ్లతన్-వ-అఖీ-ముస్-సలాత-వ-బష్-షిరిల్-మూమినీన్.

87. మఱియు మూసాకును ఆతని సహోదరునకును మీరు మీజనులకుంగాను మిసరులో గృహములు నియమింపుడు. మఱి మీయిండ్లు ఖిబ్లా వైపుగ నుండునట్లు చేయుండు. మఱి నమాజును స్థిరముగానలుపుడు. మఱి విశ్వాసులకు సంతోషవార్త వినిపింపుము అని సందేశము పంపితిమి.

వ్యా॥ 87 ఫిరౌనులు ఇస్రాయీలియులను చాల హింసించుచుండిరి. మసీదులను పడగొట్టసాగిరి. ఇస్రాయీలియులు బయటికి వచ్చి నమాజు సలుపవలెనన్న చాల కష్టమాయెను. అందుకు దేవుడు మూసా ప్రవక్తకును ఆతని సహోదరుడగు హారూనునకును మీరు మిసరు (ఈజిప్టు) లో నేయుండి ఇండ్లలో ఖిబ్లా వైపున నమాజు సలుపుడు. నమాజు వలననే దేవుని సహాయము గలుగును. కావున నమాజు (ప్రార్థన) వదలకుండు. విశ్వాసులకు ఉభయలోకములలోను జయమును మోక్షమును గలవు అను సువార్త వినిపింపుడు అని దేవుని సందేశము వచ్చెను.

88. వ-ఖాల-మూసా-రబ్బనా-ఇన్నక-ఆతైత-ఫిర్-ఔన-వ-మల-అహూ జీనతన్-వ-అమ్వా-లన్-ఫిల్-హాయాతిద్-దున్యా-రబ్బనా-లి-యుజిల్లూ-అన్ సబీలిక-రబ్బ-నత్-మిస్-అలా-అమ్వా-లిహిమ్-వష్-దుద్-అలా-ఖులూ-బిహిమ్ ఫలా-యూమినూ-హత్తా-యర-ఉల్-అజా బల్-అలీమ్. 89. ఖాల-ఖద్-ఉజీ-

బద్-దఅ-వ-తీఁకుమా-ఫస్-తఖీమా-వలా-తత్-తబి-అన్ని-సబీ-లల్-లజీన - లా-యఅ-లమూన్.

88. మఱియు ఓ మాప్రభువా! నీవు ఫిరౌనునకును ఆతని నాయకులకును, అందమును, ధనమును ఇహలోకమందు నొసంగితివి. ఓ మాప్రభువా! వారు నీమార్గమునుండి ప్రజలను తప్పించుటకుఁగాను ఒసంగితివి. ఓమాప్రభువా! వారి సంపదలను నాశముచేయుము. వారు దుఃఖకరమైన బాధ చూచునంత వఱకు విశ్వసింపక యుండునట్లుగ వారి హృదయములు కఠినములుగఁ జేసి వేయుము. అని మూసా వేఁడెను. 89. మీ యిద్దఱి ప్రార్థన అంగీకరింపబడియెను. కావున మీరు స్థిరముగ నుండుఁడు. మఱి తెలియని వారి మార్గము అనుసరింపకుఁడు అని దేవుఁడు పలికెను.

వ్యా॥ 88. ఫిరౌనులు! మూసాప్రవక్తగారి బోధ వినక దుర్మార్గములు చేయసాగిరి. ఎంత బోధించినను ప్రయోజనము లేకపోయెను. తుదకు మూసాప్రవక్త ఫిరౌనుల వైభవమును అందములను వారి సంపదలను నశింపఁజేయుము. వారు తమ సంపదలను ప్రజలను సన్మార్గమునుండి తప్పించుటలో ఖర్చుచేయుచున్నారు. వారిని కఠిన శిక్షలకు పాత్రులుగఁ జేయుము అని దేవునిని ప్రార్థించిరి. 89. మూసా ప్రవక్తగారు ప్రార్థించుచుండినపుడు హారూనుప్రవక్త ఆమీన్ అని పలుకుచుండెను. అందుచే మీయిద్దఱి ప్రార్థన అంగీకరింపఁబడియెను అని చెప్పఁబడియెను. మీరు మత ప్రచారము స్థిరముగాఁ జేయుచు అందు ఏలాటి ఆతురత చూపకూడదు. తెలియని పామరులు పోవుమార్గమును మీరు పోక అన్ని కష్టములకు సహించి ధర్మప్రచారము చేయుచుండుఁడు అని దేవుని సెలవయ్యెను.

90. వ జా-వజ్నా-బి-బనీ-ఇస్రాయీ-లల్-బహ్ర-ఫ-అత్-బఅహుమ్ ఫిర్-ఔను-వ-జునూదుహూ-బగ్-యన్-వ-అద్-వన్-హత్తా-ఇజా-అద్-రక-హుల్-గరఖు-ఖాల-ఆమన్తు-అన్నహు-లా-ఇలాహ-ఇల్-లల్-లజీ-ఆమనత్-బిహీ-బనూ-ఇస్రాయీల-వ-అనా-మినల్-ముస్లి-మీన్. 91. ఆల్-ఆన-వఖద్ అసైత-ఖబ్లు-వ-కున్త-మినల్-ముఫ్సిదీన్. 92. ఫల్-యౌమ-నునజ్జీక-బి-బదనిక లి-తకూన-లిమన్-ఖల్-ఫక-ఆయతన్-వ ఇన్న-కసీ-రమ్-మినన్నాసి-అన్-ఆయాతినా-ల-గాఫిలూన్.

90. మఱియు మేము ఇస్రాయీలియులను సముద్రమునుండి దాటించి

తిమి. ఆ పిదప ఫిరౌనును ఆతని సైన్యమును, దౌర్జన్యముగాను అన్యాయము గాను వారిని వెంబడించిరి. తుదకు ఫిరౌను మునిగిపోవుచు ఎవ్వనిని ఇస్రాయీలియులు విశ్వసించిరో ఆతఁడు తప్ప వేఱు దేవుఁడే లేఁడని నేను విశ్వసించితిని. మఱి నేను విధేయులతో చేరితిని అని చెప్పెను. 91. ఇపుడా! నీవిట్లు పలుకుచున్నావు. దీనికిపూర్వము అవిధేయత వహించియుంటివి. మఱి నీవు దుర్మార్గులతో చేరియుంటివి. 92. కావున నీతరువాత వచ్చువారికిఁగాను నీవు ఒక సూచనగా నుండుటకై ఈదినము నీశరీరమును పైభాగమున పడవేయుదుము. మఱియు నిశ్చయముగా పెక్కుమంది జనులు మాశక్తి సూచనలనుండి అజాగ్రత్తగానున్నారు. (అని చెప్పఁబడెను).

వ్యా॥ 90- 91. మూసా ప్రవక్త లక్షలకొలఁది ఇస్రాయీలియులనుతీసికొని మిసరునుండి వెడలిపోవుచుండెను. ఈవిషయము ఫిరౌనునకుఁ దెలిసి గొప్ప సైన్యముతో వారిని వెంబడించెను. మూసా ఇస్రాయీలియులతోపోవుచుండగ మధ్యదారిలో ఎఱ్ఱసముద్రము అడ్డువచ్చెను. వెనుక శత్రువు వచ్చుచుండెను. తప్పించుకొను దోవ లేకుండెను. అపుడు దేవుని సెలవుచే మూసా ప్రవక్త తన చేతికఱ్ఱతో సముద్రపు నీళ్ళను కొట్టగా అందు పండ్రెండు దోవలు ఏర్పడెను. ఇస్రాయీలియులందఱును సురక్షితముగా ఆ దోవలనుండి సముద్రము దాటిపోయిరి. ఫిరౌను జనులు ఆ దోవలనుండి పోసాగిరి. అపుడు దారి మధ్యలోనే సముద్రపు నీళ్ళు కలిసిపోయెను. అందఱును మునిగిచచ్చిరి. ఫిరౌను మునిగిపోవుచు దేవునిని నమ్మితిని అని పలికెను. అప్పటి విశ్వాసము పనికిరాదు. కావున అది అంగీకరింపఁబడలేదు. పూర్వమునుండి గావించిన దుర్మార్గములును అన్యాయములును మఱచిపోతివా అని చెప్పఁబడెను. 92. ఫిరౌను మునిగి చనిపోయిన పిదప వాని శవము సముద్రతీరమున వచ్చిపడెను. అది ఇస్రాయీలియులు చూచి దేవునియెడ కృతజ్ఞత సలిపిరి. అటులే చూచువారికి దానివలన బుద్ధి వచ్చును. గర్వమువహించినరాజుగతి యేమాయెనో చూచి మానవులు బుద్ధితెచ్చుకొందురుగాక!

93. వలఖద్-బవ్వా-నా-బనీ-ఇస్రాయీల-ము-బవ్వ-అ-సిద్‌ఖిన్-వ-రజఖ్‌నా-హుమ్-మినత్-తయ్యి-బాతి-ఫమఖ్-తలఫూ-హత్తా-జాఅ-హుముల్-ఇల్ము-ఇన్న-రబ్బక-యఖ్‌జీ-బైన-హుమ్-యామల్-ఖియామతి-ఫీమా-కానూ-ఫీహి-యఖ్-తలిఫూన్.

93. మఱియు మేము ఇస్రాయీలియులకు మంచి స్థానమును తినుటకు మంచి పదార్థముల నొసంగితిమి. కావున వారికి సందేశము వచ్చునంతవఱకు వారు వేఱు వేఱు కాలేదు. నిశ్చయముగ నీప్రభువు వారు కలహించు విషయ

ములనుగూర్చి తీర్పుదినమునందు వారిమధ్య తీర్పుచేయును.

వ్యా॥ 93. దేవుఁడు ఫిరౌనులను నశింపఁజేసి మిసరుదేశమును ఇస్రాయీలీయుల కొసంగెను. కొంతకాలము తరువాత సిరియాదేశములోనున్న అమాలిఖావారిని తొలఁగించి సిరియాదేశమును ఇస్రాయీలీయులకు వశపఱచెను. ఈ దేశములలో మంచిసారవంతమైన భూములును నీటివసతులును గలవు. అందు ఆహారములును ఫలములును చాల లభించును. కావున దేవుని యనుగ్రహమువలన ఇస్రాయీలీయులకు మంచి సంపద లభించెను. ఇఁక ఆత్మిక సంబంధమైన దేవుని యనుగ్రహ మగు సందేశమువారికిపంపెను. అదితౌరాతు గ్రంథము. అందు ధర్మములును, జ్ఞానమును గలదు. ఇస్రాయీలీయులు మత గ్రంథము వచ్చిన పిదప అభిప్రాయభేదములుగలిగి కలహింపసాగిరి. మూసా ప్రవక్తతోనే అనేక వివాదములు పెట్టుకొనిరి. హజ్రత్ రసూలువారినిగూర్చి తౌరాతులోనున్న విషయములను మార్చివేసిరి. తుదకు ఖురాను వచ్చిన పిదప కూడ యూదులు నమ్మక కలహింపసాగిరి. దీనిగూర్చి వాస్తవమైన తీర్పు, తీర్పుదినము (ఖియామతు) నందు అగును.

94. ఫ-ఇన్ కున్-త-ఫీ-షక్కిమ్-మిమ్మా అన్-జల్నా-ఇలైక-ఫస్-అలిల్-లజీన-యఖ్-ర ఊనల్-కితాబ-మిన్-ఖబ్-లిక-లఖద్-జాఅకల్-హఖ్ఖు-మిర్-రబ్బిక-ఫలా-తకూనన్న-మినల్-ముమ్-తరీన్. 95. వలా-తకూనన్న-మినల్-లజీన-కజ్-జబూ-బి ఆయాతిల్లాహి-ఫ-తకూన-మినల్-ఖాసిరీన్. 96. ఇన్నల్-లజీన-హఖ్ఖ-ఖత్-అలైహిమ్-కలిమతు-రబ్బిక-లా-యూమినూన్. 97. వలౌ-జాఅత్-హుమ్-కుల్లు-ఆయతిన్-హత్తా-యర-ఉల్-అజా-బల్-అలీమ్.

94. మఱి మేము నీకు పంపినదానిగూర్చి నీకు సందేహమున్నచో నీకు పూర్వము, గ్రంథమును పఠించుచున్నవారిని అడుగుము. నిశ్చయముగ నీ ప్రభువునుండి నీ యొద్దకు సత్యము వచ్చినది. కావున నీవుసందేహించు వారితోఁ జేరకుము. 95. మఱి దేవునిసూచనలను తిరస్కరించినవారితోఁ జేరకుము. అటులైనచో నీవుకూడ నష్టముపొందినవారితోఁజేరుదువు. 96. ఎవరి విషయము నీప్రభువువాక్యము స్థిరమాయెనో వారు విశ్వసింపరు. 97. ఒకవేళ వారియొద్దకు అన్ని సూచనలు వచ్చినను వారు దుఃఖకరమైన బాధ చూడనంతవఱకు వారు విశ్వసింపరు.

వ్యా॥ 94:97. ఈ వాక్యములలో దేవుఁడు పైగంబరులవారిని సంబోధించినను దేవుని యుద్దేశములో ప్రజలందఱును గలరు. పైగంబరులవారికి దేవుని

సందేశము (వహీ) లో ఏలాటి సందేహములేదు. అందు వారికి దృఢమైననమ్మిక గలదు. విశ్వాసులు కానివారు ఖురాను విషయము సందేహింపసాగిరి. చదువను వ్రాయను తెలియని ముహమ్మదు ఎట్లు ఇట్టి ఖురానును తేగలుడుని ఆశ్చర్యపడి సందేహింపసాగిరి. అందుకుగాను ప్రజలు తమ సందేహములను నివారించుకొనవలెను. దానికి తౌరాతు ఇన్జీలు మొదలగు దేవుని గ్రంథములను పఠించు విద్వాంసులను అడిగి తెలిసికొనుడు. అందు సత్యము తెలుపువిద్వాంసులుగలరు. రాబోవు ప్రవక్తనుగూర్చి ఆయాగ్రంథములలో ప్రకటనలు గలవు. సందేహము నివారించుకొనకపోయినచో సందేహము ప్రబలును. దేవుని వాక్యములను సూచనలను తిరస్కరించి యుభయలోకములలోనష్టముపొందవలసివచ్చును. కొందఱు తమ దుష్టస్వభావమునుబట్టి దేవుని సూచనలన్నియు చూచినను, తమ కన్నులార ఆపదను చూచునంతవఱకు నమ్మరు. అట్టి నమ్మకమువలన ప్రయోజనములేదు. యూనుసు ప్రవక్తయొక్క జనులకు మాత్రము ఆపదకాలమున విశ్వాసము పనికివచ్చెను అని హెచ్చరించుచు యూనుసుప్రవక్తనుగూర్చి రాబోవు వాక్యములలో చెప్పబడుచున్నది.

98. ఫ-లౌ-లా-కానత్-ఖర్-యతున్-ఆమనత్-ఫ-న-ఫ-అహా-ఈమానుహా-ఇల్లా-ఖౌమ-యూనుస-లమ్మా-ఆమనూ-కషఫ్నా-అన్-హుమ్-అజా-బల్-ఖిజ్యి-ఫిల్-హయా-తిద్-దున్యా-వ-మత్-తఅనా హుమ్-ఇలా-హీన్.

98. యూనుసు జనులకు తప్ప ఇతర పురవాసులు విశ్వసించిన పిదప వారి విశ్వాసము వారికి నెందులకును లాభకరముకాలేదు. యూనుసు జనులు విశ్వసింపగా అవమానకరమైన బాధను ఇహలోక జీవనమందు వారినుండి తొలగించితిమి. మఱి ఒక కాలమువఱకు వారికి లాభములు కల్గించితిమి.

వ్యా॥ 98. హజ్రత్ యూనుసు ప్రవక్త మూసలు పురనివాసులను ఏడు సంవత్సరములవఱకు దేవుని వాక్యములు వినిపించుచు బోధ చేయుచుండిరి. కాని పురవాసులు విశ్వసింపలేదు. అందుకు యూనుసు ప్రవక్త ఓ ప్రజలార! మీరు నమ్మనిచో మూడుదినములలోపల దేవునినుండి మీకు ఆపద వచ్చును అని పలికెను. మూడవ దినము రాత్రియందు యూనుసు ప్రవక్త యూరువిడిచి పోయెను. తెల్లవాఱగనే చీకట్లు క్రమ్ముకొనెను. ఆకాశమునుండి పొగ క్రమ్ముకొనెను. ఆపద రానున్నది అని భయపడి ప్రజలు యూనుసు ప్రవక్తను వెదకిరి. ఆయన కనబడలేదు. అప్పుడు జనులందఱును పురమును విడిచి వచ్చి భయభ్రాంతులతో దేవునితో క్షమాపణ కోరి విశ్వసించిరి. దేవుడు కనికరించి యాపదను తొలగించి వారి జీవితకాలము వారికి ఇహలోక సౌఖ్యముల నొసంగెను. ఇట్లు క్షమించి యనుగ్రహించుట దేవుని దయ మాత్రమే. దుష్టులైన అవిశ్వా

సులు శిక్షకు పాత్రులై నశించిరి. కావున ప్రజలు జాగ్రత్తపడవలెను.

99. వలౌ షాఅ-రబ్బుక-లఅ-మన-మన్-ఫిల్-అర్జి-కుల్లు-హుమ్-జమీఆ-అన్-అఫ-అన్త-తుక్-రిహున్-నాస-హత్తా-యకూనూ-మూమినీన్. 100. వ-మా-కాన-లి-నఫ్-సిన్-అన్-తూమిన-ఇల్లా-బి-ఇజ్-నిల్లాహి-వ-యజ్-అలుర్-రిజ్-స-అలల్-లజీన-లా యఅ-ఖిలూన్.

99. మఱి నీప్రభువు కోరినచో భూమిలోనున్న సర్వజనులును విశ్వసించి యుందురు. ఇఁక ప్రజలు విశ్వసింపవలెనని నీవు వారిని బలవంతపెట్టుదువా! 100. మఱి దేవుని సెలవులేనిదే ఎవఁడును విశ్వసింపఁడు. మఱియు యోచింపనివారిపై అపవిత్రతను పడవేయుచున్నాఁడు.

వ్యా॥ 99. ప్రజల హృదయములలో బలవంతముగా విశ్వాసము ప్రవేశింపఁజేయుట ప్రవక్త పనికాదు. బలవంతముగా ఎవనికిని విశ్వాసము కుదరదు. దేవుఁడు ఇష్టపడినచో మానవులందఱును విశ్వసింపఁగలరు. కాని అట్లు దేవుని యిష్టము లేదు. కావుననే ఎవరి యదృష్టములో విశ్వాసమున్నదో వారు విశ్వసించుచున్నారు. 100. లేనివారు అవిశ్వాసులై శిక్షకుపాలగుచున్నారు. దేవుని యిష్టములేనిది ఎవరును విశ్వసింపఁజాలరు. ఎవరు దేవుని సూచనలను యోచించి గ్రహించుచున్నారో వారికి దేవుని సెలవగుచున్నది. వారు విశ్వాసము పొందుచున్నారు. అట్లు యోచించి గ్రహింపనివారిపై అవిశ్వాసముయొక్క అపవిత్రత వారిపైఁబడుచున్నది.

101. ఖులిన్-జురూ-మాజా-ఫిస్-సమా-వాతి-వల్-అర్జి-వమా-తుగ్-నిల్-ఆయాతు-వన్-నుజురు-అన్-ఖౌమిల్-లా-యూమినూన్. 102. ఫ-హల్ యన్-తజిరూన-ఇల్లా-మిస్ల-అయ్యామిల్-లజీన-ఖలౌ-మిన్-ఖబ్లి-హిమ్-ఖుల్-ఫన్-తజిరూ-ఇన్నీ-మఅకుమ్-మినల్-మున్-తజిరీన్. 103. సుమ్మ-నునజ్జీ-రుసులనా-వల్-లజీన ఆమనూ-కజాలిక హఖ్ఖన్-అలైనా-నున్-జిల్-మూమినీన్.

101. ఆకాశములలోను భూమిలోను ఏమేమియున్నవో చూడుఁడు అని పలుకుము. విశ్వసింపని జనులకు సూచనలును, భయపెట్టువారును పనికిరారు. 102. కావున వారు తమకు పూర్వము గడచినవారికి వచ్చిన వంటి దినములు వారికిని రావలెనని నిరీక్షించుచున్నారు. కావున మీరు వేచియుండుఁడు, నేనును మీతోఁగూడ వేచియుందును అని ఓ ప్రవక్తా! పలుకుము. 102. ఆపిదప మేము, మా ప్రవక్తలను విశ్వసించినవారిని రక్షించుచున్నారము. ఇట్లులే విశ్వాసులను రక్షించుట మా బాధ్యతయై యున్నది.

వ్యా॥ 101. యోచించువారికి భూమ్యాకాశములలో దేవుని శక్తి సూచనలును ఆతని యేకత్వమును దెలుపు సూచనలును గలవు. మఱి ప్రతివస్తువును దానికి సృష్టికర్త ఒకడున్నాడని తెలుపుచున్నది. కాని గమనింపనివారికి ఈ సమస్త సూచనలును వృథ. వానివలన వారికి ప్రయోజనములేదు. దేవునిశిక్షను దెలుపుచు భయపెట్టు ప్రవక్తల భయబోధనలవలనకూడ వారికి లాభము లేదు. 102. ఇట్టి ద్వేషముగలిగి ఏ సూచనను నమ్మనివారికి పూర్వము గడచిన దుష్టులకు వచ్చిన వినాశ కాలము వారికి రావలెను. అంతవఱకు వారు నమ్మరు. కావున వీరు దానికై వేచియుండవలెను. ముసల్మానులుకూడ వేచియుండవలెను. అపుడు సత్యాసత్యములు స్పష్టపడును. 103. పూర్వమునుండియు దేవుడు దుష్టులను శిక్షించి ప్రవక్తలను విశ్వాసులను రక్షించుచు వచ్చెను. ఇకమీదకూడ భయభక్తులుగలిగి సత్కార్యములుచేసిన విశ్వాసులను దేవుడు ఉభయలోకముల ఆపదలనుండి కాపాడి రక్షించును. కావున ముసల్మానులు భక్తులు సుగుణములు వహించి ఖురానెషరీఫులోని ధర్మమును పైగంబరులవారి యాచారములను అనుసరింపవలెను.

104. ఖుల్-యా-అయ్యు-హన్నాసు-ఇన్-కున్తుమ్-ఫీ-షక్కిమ్-మిన్-దీనీ-ఫలా-అఅ-బు-దుల్-లజీన-తఅబుదూన-మిన్-దూనిల్లాహి-వలా కిన్-అఅ-బుదుల్లా-హల్-లజీ-యత-వఫ్ఫా-కుమ్-వ-ఉమిర్తు-అన్-అకూన-మినల్-ముఅమినీన్. 105. వఅన్-అఖిమ్-వజ్-హక-లిద్దీని-హనీఫన్-వలా-తకూనన్న-మినల్ ముష్రికీన్. వలా-తద్ఉ-మిన్-దూనిల్లాహి-మా-లా-యన్-ఫఉక-వలా-యజుర్రుక-ఫఇన్-ఫ-అల్-త-ఫఇన్నక-ఇజమ్-మినజ్-జాలిమీన్. 107. వఇన్-యమ్-సస్-కల్లాహుబి-జుర్రిన్-ఫలా-కాషిఫ-లహూ-ఇల్లా-హువ-వఇన్ యురిద్-క బిఖైరిన్-ఫలారాద్ద-లి-ఫజ్-లిహీ-యుసీబు-బిహీ-మన్-యషాఉ-మిన్-ఇబాదిహీ-వ-హువల్-గఫూరుర్-రహీమ్.

104. ఓ జనులార! నామతమునుగూర్చి మీకు సందేహమున్నచో దేవునిని వదలి మీరు ఆరాధించు నట్టివారిని నేను ఆరాధింపను. కాని ఎవడు మీ ప్రాణములను తీయుచున్నాడో అట్టి దేవునిని నేను ఆరాధించుచున్నాను. మఱియు నేను విశ్వాసులలో నుండవలెనని నాకు సెలవైనది. 105. మఱి నిశ్చలభక్తియుతుడవై మతమున స్థిరముగ నుండుము అనియు వెన్క దైవారాధకులలో చేరి యుండకుము అనియు 106. దేవునిని వదలి నీకు మేలును

కీడును చేయలేని వానిని ప్రార్థింపకుము. అట్లు చేసితివేని నీవు దుర్మార్గులతో చేరి పోవుదువు అనియు, 107. దేవుఁడు నీకు కష్టము గలిగించినచో అతఁడు తప్ప మఱెవఁడును దానిని తొలఁగింపువాఁడు లేఁడు మఱి దేవుఁడు నీకు మేలు చేయ దలఁచినచో అతని యనుగ్రహమును ఎవరును అటంక పఱచ (రద్దుచేయ) లేరు. తాను కోరిన తనభక్తులకు మేలుపొందించును. మఱి అతఁడే క్షమించు వాఁడును దయాళువును అని నాకు సెలవైనది అని ఓ ప్రవక్త! పలుకుము.

వ్యా॥ 104:107. అవిశ్వాసులు పైగంబరులవారి మతమునందు సందేహము వహించి యుండిరి. అందుకు ఇస్లామ్ మతము యొక్క ముఖ్యసిద్ధాంతమగు దేవుని యేకత్వమును గూర్చి యిందు చెప్పఁబడుచున్నది. ఓజనులారా! దేవునిని వదలి మీరు పూజించు చిల్లర దేవతలను విగ్రహములను నేను పూజింపను. సర్వ శక్తుఁడును మీకు ప్రాణము పోసి తీసికొను శక్తిగల వాఁడునగు దేవుఁడు పూజలకు అర్హుఁడు. అట్టి దేవునినే నేను ఆరాధించుచున్నాను. నేను విశ్వాసులతో చేరినవాఁడను. సత్యమును నిశ్చలభక్తితో అనుసరించువాఁడను. విగ్రహారాధకులతో చేరను. మేలును కీడును చేయు శక్తి దేవునికేఁగలదు. చిల్లర దేవతలును విగ్రహములును శక్తిహీనులు. కావున చిల్లర దేవతలను పూజింపఁగూడదు. అట్లు ఒక వేళ పూజించితివేని చాల యన్యాయమైన దుర్మార్గుల వర్గములో చేరవలసి వచ్చును. అట్లు ప్రవక్త వలన కానేరదు. దేవుఁడు గలిగించిన కష్టము దేవుఁడే తొలగింపవలెను. ఇతరులు తొలగింప నేరరు. దేవుఁడు చేయఁదలఁచిన మేలును అడ్డుపఱు వారెవరునులేరు. దేవుఁడు తనయిష్టము వచ్చిన వారిని అనుగ్రహించును. కావున క్షమించు వాఁడును దయాళువును అగు దేవునినే పూజింపవలెను అని దేవుని సెలవు.

108. ఖుల్-యా-అయ్యుహన్నాసు-ఖద్-జాఅ-కుముల్-హఖ్ఖు-మిర్-రబ్బికుమ్-ఫ-మనిహ్-తదా-ఫఇన్నమా-యహ్-తదీ-లినఫ్-సిహీ-వమన్-జల్ల-ఫఇన్నమా-యు-జిల్లు-అలైహా-వ-మా-అనా-అలైకుమ్-బి-వకీల్. 109. వత్-తబిఅ-మా-యూహా-ఇలైక-వస్-బిర్-హత్తా-యహ్-కు-మల్లాహు - వహువ - ఖైరుల్-హాకిమీన్.

108. ఓజనులార ! మీప్రభువునుండి మీయొద్దకు సత్యము వచ్చియున్నది. ఇఁక ఎవఁడు సన్మార్గమునకు వచ్చునో అతఁడు తన మేలుకొఱకే సన్మార్గము వహించును. మఱెవఁడు దుర్మార్గుఁడగునో వాఁడు తన కీడు కొఱకే దుర్మార్గుఁడగును. మఱి నేను మీబాధ్యతవహించినవాఁడను కాను అని ఓప్రవక్త!

పలుకుము. 107. మఱి నీయొద్దకు వచ్చు సందేశమును అనుసరింపుము. మఱి దేవుఁడు తీర్పు చేయునంతవఱకు నీవు సహించి యుండుము. మఱి అతఁడే సరియైన తీర్పు చేయువాఁడు. 108. దేవుని నుండి హజ్రత్ రసూలువారి మూలము న జనులకుఁ దెలుపఁబడినది సత్యమైనది. దానిగూర్చి యేలాటి సందేహము జనులు వహింపరాదు. సత్యము అనుసరించి సన్మార్గము అవలంబించిన వారు దాని మేలు పొందుదురు. సత్యమును విశ్వసింపక దుర్మార్గమునకు పోవువారు దానినష్టము పొందుదురు. ఎవరు చేసికొన్న పాపపుణ్యముల ఫలము వారికే లభించును. ప్రవక్త! ప్రజలను బలవంతము చేయఁడు. దాని బాధ్యత ప్రవక్తకు లేదు. 109. ఇందు హజ్రత్ రసూలువారికి ఓదార్పుగలదు. జనులు సత్యము స్వీకరింపక పోయినచో పైగంబరులవారు ఆ చింతలోపడి దుఃఖింప నక్కఱలేదు. వారు దేవుని సందేశమును అనుసరించుచు మతప్రచారము చేయుచు సందుగలుగు కష్టములకు ఓపిక గలిగి యుండవలెను. తుదకు దేవుఁడు సత్యమునకే జయము పొందించును. దేవుఁడు న్యాయముగ సరియైన తీర్పు చేయును. దేవుని తీర్పు వచ్చునంతవఱకు ఓపిక వహించి యుండవలెను అని రసూలు వారికి దేవుని సెలవయ్యెను.

సూరయేహూద్ మక్కీ 123 వాక్యములు.

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అమిత దయగలవాఁడును ప్రేమించువాఁడును అగు దేవునిపేర.

1. అలిఫ్-లామ్-రా-కితాబున్-ఉహ్కిమత్-ఆయాతుహు-సుమ్మ-ఫుస్సిలత్-మిల్ లదున్-హకీ-మిన్-ఖబీర్. 2. అల్లా-తఅ్‌బుదూ-ఇల్-లల్లాహ-ఇన్ననీ-లకుమ్-మిన్‌హు-నజీరున్-వ-బషీర్. 3.వ-అనిస్-తగ్-ఫిరూ రబ్బకుమ్-సుమ్మ-తూబూ-ఇలైహి-యుమత్తి-అ-కుమ్ మతా-అన్-హసనన్-ఇలా-అజ-లిమ్-ముసమ్మన్-వయూతి-కుల్ల-జీ-ఫజ్-లిన్-ఫజ్-లహూ వఇన్ తవల్ లౌ-ఫ-ఇన్నీ-అఖాఫు-అలైకుమ్ అజాబ-యౌమిన్-కబీర్. 4. ఇలల్లాహి-మర్ జిఉకుమ్-వహువ-అలా-కుల్లి-షైఇన్-ఖదీర్. 5. అలా-ఇన్నహుమ్-యస్-నూన-సుదూ-రహుమ్ -లి-యస్-తఖ్ఫూ-మిన్‌హు-అలా-హీన-యస్ తగ్ షూన-సియా-బహుమ్-యఅ్-లము-మా - యుసిర్రూన-వమా-యుఅ్-లినూన-ఇన్నహూ-అలీముమ్-బి-జాతిస్-సుదూర్.

1. అలిఫ్-లామ్-రా. (దీని అర్థము నేను దేవుఁడను చూచుచున్నాఁడను, అనికొందఱు విద్వాంసులు చేసియున్నారు). ఇది గ్రంథమున్నది. దీనివాక్యములు

స్థిరమైనవి. మఱియు ఇవి వివేచనాపరుఁడును సర్వజ్ఞుఁడును అగు దేవునినుండి వివరింపఁబడినవి. 2. (అందు)దదేవుని ప్రనితరులను పూజింపకుఁడు అని సెలవుగలదు. నేను ఆతని పక్షమున మిమ్ము భయపెట్టుచు మీకు సంతోషవార్త వినిపించుచున్నాఁడను. 3. మఱి మీప్రభువుతో పాపక్షమాపణ వేఁడి ఆతనివైపుతిరుఁగుఁడు. ఒక నియమిత కాలమువఱకు మీకుమంచి లాభము కలిగించును. మఱి హెచ్చుగాఁజేయు ప్రతివానికి హెచ్చుగానొసంగును. మఱి మీరు తిరిగిపోతిరేని గొప్పదినమునందలి శిక్ష మీకుఁ గలుగునని భయపడుచున్నాఁడను. 4. మీరు దేవునియొద్దకు మరలి పోవలసియున్నది. మఱియు ఆతఁడు ప్రతివస్తువుపై శక్తిగలిగియున్నాఁడు. 5. వినుము వారు దేవునినుండి దాగుటకై తమ ఱొమ్ములను ముడుచుకొనుచున్నారు. వినుము వారు తమ వస్త్రములు ధరించునపుడు వారుదాఁచునది వెలిపుచ్చునది దేవునికిఁదెలియును. నిశ్చయముగా ఆతఁడు హృదయములోనున్న మాటలను ఎఱుంగువాఁడు.

వ్యా॥1. ఇందుఖురానుగ్రంథమునుగూర్చి చెప్పఁబడినది. ఇదిలచాగొప్పగ్రంథము. ఇందలి వాక్యములు, పదములనుబట్టియు అర్థమునుబట్టియు చాలస్థిరమైనవి. అందు ఏలాటి అర్థదోషముగాని పదదోషముగాని లేదు. దానిశైలి దానివిషయములతీరుదానిధర్మములు దానితత్వములు హెచ్చుతగ్గులులేకఅద్భుతముగానున్నవి. దానివంటిదిగాని దానికంటెమించినదిగానిమానవులుచేయఁజాలరు. అందలియుపదేశములు బోధనలు సర్వజగత్తునకు సర్వకాలమునందును పనికివచ్చునవి. లోకములో నెన్ని మార్పులుగలిగినను అందలి ధర్మములును విషయములును ఆయాకాలములకు సరిపోవునవి. అందు మానవులకు ఉభయలోకములనుగూర్చి తెలియవలసిన అన్నివిషయములు వివరింపఁబడినవి. అవన్నియును సర్వజ్ఞుఁడును వివేచనాపరుఁడును అగు దేవునినుండి వచ్చినవి. 2. ఖురానుగ్రంథము వలని ముఖ్యోద్దేశ్యము మానవులు ఒక్క దేవునిని ప్రార్థింపవలెనని ప్రకటించుట, దానిపద్ధతులుమానవులకు దెలుపుట. కావున ఖురాను గ్రంథము, మానవులు ఒక్కదేవునినే పూజింపవలెనని చాటుచున్నది. కావున ఎవరుదేవుని గ్రంథమగు ఖురానును విశ్వసించి ఒక్కదేవునిని పూజింతురో వారికి ఉభయలోకములలో జయమును మోక్షమునున్నదిఅనుసంతోషవార్తయును ఎవరు నమ్మక తిరస్కరించి పాపకార్యములు చేయుదురో వారికి శిక్షయున్నది అను భయవార్త ప్రవక్త యిచ్చుచున్నాఁడు. 3. మానవులు తాము చేసిన పాపముల క్షమాపణ దేవునితో వేఁడుకొని ఇఁకమీఁద భయభక్తులతోనుండి దేవుని వైపునకు మనఃపూర్వకముగ తిరుగవలెను. దీనివలన ఇహలోకమందు వారిమనస్సులకు శాంతిగలిగి వారు జీవయాత్ర సుఖముగ గడుపవచ్చును. దేవుని యనుగ్రహము అట్టిభక్తులకు లభించును. ఒకవేళ కష్టములు వచ్చినను దేవునిపై నాధార పడియుండుట వలనభక్తులకు కష్టముగాతోఁచదు. అందుకూడ వారికి సంతోషమును లభించును. సత్కార్యములు హెచ్చుగా చేయుకొలఁది దేవునియనుగ్రహము

కూడ అధికముగా లభించును. తుదకు ఉభయలోకములో శాంతము మోక్షము లభించును. తిరస్కరించి ప్రవక్తమాట వినక పోయినచో అవిశ్వాసులకు గొప్పదన ముగు తీర్పుదినమునందు ఘోరమైన శిక్షలభించును, అనుభవింతురు అని హజ్రత్ రసూలువారు పలికి తమకు జనులయెడనున్న ప్రేమను తెల్లడించుచునుండిరి.
4. పాపాత్ములను శిక్షింపవలెనన్న వారు హాజరు కావలెనుగదా! అటులే శిక్షించుటకు శక్తి కూడ నుండవలెను. ఈవిషయమిందు చెప్పబడినది. మానవులందఱును చచ్చిన పిదప తమకర్మల తీర్పునకుగాను దేవునిసన్నిధానమున తిరిగిసజీవులై నిలుతురు. దేవుడు ప్రతిదానిపై శక్తిగలవాడు. అతని శక్తికిమించినది యొద్దియును లేదు.
5. అదియునుగాక పాపులను శిక్షింపవలెనన్న వారి కర్మములు తెలిసియుండవలెను గదా! కావున దేవునికిసర్వము తెలియును. మానవులుగాను చేయుపనులు దేనిని నుండి దాచలేరు. వారి ప్రతివిషయమును మఱివారి హృదయములోనున్న మాటలును దేవునికిఁ దెలియును. వారు దేవునినుండి మఱుఁగుపడవలెనని యత్నించెదరు. కాని వారుగాని వారి కర్మలుగాని దేవుని నుండి మఱుఁగు పడజాలవు అని హెచ్చరింపఁ బడియెను.

## పండ్రెండవ కాండము

6. వమా-మిన్-దాబ్బ-తిన్-ఫిల్-అర్‌జి-ఇల్లా-అలల్లాహి-రిజ్-ఖుహా-వ-యఅ-లము-ముస్-తఖర్రహా-వముస్-తౌదఅహా-కుల్లున్-ఫీ-కితా-బిమ్-ముబీన్.

6. మఱియు భూమిపై సంచరించు ప్రతిప్రాణికి ఆహారమిచ్చుట దేవునిపని. మఱిఅదియుండు స్థానమును అదియుంచఁబడు స్థానమును దేవునికిఁ దెలియును. సర్వము స్పష్టమైన గ్రంథములో నున్నది.

వ్యా॥ 6. సర్వ ప్రాణులకు ఆహారము అందించువాఁడు దేవుఁడు. అతఁడు తన యనుగ్రహము వలన ఆహారమిచ్చు బాధ్యత తాను వహించి యున్నాఁడు. ఎవరికెంత ఆహారము లభింపవలయునో అంత ఆహారము లభించి తీరుచున్నది. సర్వ విధముల ప్రాణులకు అతఁడే ఆహారము కల్పించి పోషించుచున్నాఁడు. ప్రాణుల విషయము తెలిసినగాని వాని యాహార వసతులు కల్పించుటకు వీలుండదుగదా! కావుననే దేవుఁడు సర్వజ్ఞుడు. ప్రాణులు వసించు స్థానములును వాని యునికి పట్టులును, ప్రాణులుంచఁబడు స్థానములును అతనికిఁ దెలియును. మానవుల పుట్టుకనుండి వారి మరణము వఱకును మరణించిన పిదప వారికిఁ గలుగు స్థితి గతులును అతనికిఁ దెలియును. ఎద్దియును మఱుఁగులేదు. స్పష్టమైన గ్రంథము లౌహెమహ్‌ఫూజులో అన్ని విషయములున్నవి అని చెప్పఁబడినది.

7- వ-హువల్-లజీ-ఖల-ఖస్-సమా-వాతి-వల్-అర్‌జ-ఫీ-సిత్తతి-అయ్యా

మిన్-వశాన-అర్ షువహూ-అలల్-మాఇ-లియబ్-లువకుమ్-అయ్యు-కుమ్అహ్ సను-అమలన్-వల-ఇన్-ఖుల్త-ఇన్నకుమ్-మబ్-ఊసూన-మింబఅ-దిల్-మౌతి లయఖూ-లన్నల్ లజీన-కఫ-రూ-ఇన్-హాజా-ఇల్లా-సిహ్-రుమ్-ముబీన్. 8. వల-ఇన్-అఖ్-ఖర్నా-అన్-హుముల్-అజాబ-ఇలా-ఉమ్మతి-మ్-మఅదూ-దతిల్ ల-యఖూ లున్న-మా-యహ్-బిసుహూ-అలా-యౌమ-యా-తీహిమ్-లైస-మస్ రూఫన్-అన్-హుమ్-వహాఖ-బిహిమ్-మాకానూ-బిహీ-యస్-తహ్-జిఊన్.

7. మఱియు ఆతఁడే ఆకాశములను భూమినిఆఱుదినములలో పుట్టించెను. మఱియు ఆతని పీఠము (అర్షు) నీళ్ళపై నుండెను. మీలో నెవరు సత్కార్యములు చేయుదురో అని పరీక్షించుటకు పుట్టించెను. మఱియు మీరు చనిపోయిన పిదప తిరిగి మీరు లేచుదురు అని నీవు చెప్పినచో నిశ్చయముగ అవిశ్వాసులైనవారు ఇది స్పష్టమైన జాలవిద్య మాత్రమే అని పలుకుదురు. 8. మఱి మేము ఒక నియమిత కాలము వఱకు వారినుండి శిక్షను ఆపియుంచినచో శిక్షను ఏద్ది ఆపివేసెను, అని వారు పలుకుదురు. వినుము. ఏదినమున అదివచ్చునో వారినుండి అది తొలఁగింపఁ బడదు దేని విషయము వారు పరిహాస మాడుచుండిరో అది వారిని క్రమ్మికొనెను.

వ్యా॥ 7. ఇందు దేవుని శక్తి దెలుపఁ బడినది. దేవుఁడు భూమ్యాకాశములను సృష్టింపక పూర్వము నీళ్ళను పుట్టించెను. అపుడు దేవుని యధికార పీఠము నీళ్ళపైనుండెను. నీళ్లు దేవునికి లోఁబడి యుండెను. సర్వము మానవులకై సృష్టింపఁబడెను. కావున మానవులు దీనిని గుర్తించి తమ సృష్టికర్తనువిశ్వసించి సత్కార్యములు చేయుదురా లేదా. తిరస్కరించి అవిశ్వాసు లగుదురా అని పరీక్షించుటకుఁగాను సృష్టియేర్పడెను. లోకము మానవుల పాపపుణ్యకార్యముల పరీక్ష కొఱకు ఏర్పడినపుడు వారివారి కర్మల ఫలితము లభించుటకుఁ గాను పరలోక ముండవలెను. అందుకే మానవులు చచ్చిన పిదప తిరిగి సజీవులై తమతమ పాపపుణ్యముల ఫలితము పొందుదురు. ఖురానులోని ఈ విషయము పైగంబరులవారు బోధించుట కాఫిర్లువిని ఇది నిజమేనా ! మాటలు మాత్రము మనోహరమైన జాలవిద్యవలె నున్నవి అని పలుకుదురు. వారు మరణించిన పిదప తిరిగి సజీవు లగుదురని వారికి నమ్మకలేదు. కావున అట్లు పలుకు చున్నారు 8. కాఫిర్లు చేయు దుష్టత్వమునకు వారికిఁ దగిన శిక్ష గలుగును. అని ప్రవక్త భయపెట్టిన పిదప ఆశిక్ష కలుగుటలో ఆలస్య మైనపుడు కాఫిర్లు పరిహాసముతో శిక్ష ఇంకను రాలేదు, దాని నెవరు ఆపివేసిరి. దానికేమైనది అని పలుకుదురు. దానికిమీరు తొందరపడ నక్కఱలేదు. అదితప్పకవచ్చును.

ఆది వచ్చిన పిదప దానిని తొలఁగించుటకు నెవరికిని శక్తిలేదు. ఆమొగతాళి శిక్షయే నలుప్రక్కలనుండి క్రమ్మకొని మిమ్ము నశింపఁజేయును, అని హెచ్చరింప బడెను.

9. వల-ఇన్-అజఖ్-నల్-ఇన్సాన-మిన్నా-రహ్మతన్ - సుమ్మ - నజఅ-నాహా-మిన్హు -ఇన్నహు-లయ-ఊసున్-కఫూర్. 10. వల-ఇన్-అజఖ్నాహు-నఅ-మాఅ-బఅద-జర్రాఅ-మస్సత్హు-ల-యఖూ-లన్న-జహ-బస్ - సయ్యిఆతు-అన్నీ-ఇన్నహూ-ల -లఫరిహున్-ఫఖూర్. 11.ఇల్-లల్-లజీన-సబరూ-వ అమిలుస్-సాలి-హాతి-ఉలాఇక-లహుమ్-మగ్-ఫిరతున్-వ-అజ్రున్-కబీర్.

9. మఱియు మేము మానవునకు మా అనుగ్రహమును గావించిన పిదప వానినుండి దానిని లాగుకొన్నచో వాఁడు ఆశవదలి కృతఘ్నుఁడగుచున్నాఁడు. 10. మఱి వానికి కష్టము గలిగిన పిదప వానికి మేము సౌఖ్యము గలిగించినచో కీడు నన్ను వదలిపోయినది అని పలుకును. నిశ్చయముగా ఆతఁడు సంతోషించుచు డంబాలు కొట్టుకొనువాఁడు. కాని ఎవరు సహించి సత్కార్యములుచేయుదురో వారికి క్షమాపణయును, గొప్ప పుణ్యమును గలదు.

వ్యా॥ 9. ఇందు మానవుని స్వభావము, కష్టసుఖములలో నెట్లుండునో చెప్పఁబడినది. మానవుఁడు, దేవుని శిక్ష ఎందుకు రాలేదు అని చెప్పును. కాని కొన్నాళ్ళు దేవుని యనుగ్రహమువలన సౌఖ్యలును సంపదలునుగలిగి తరువాత కష్టదుఃఖములు గలిగినచో బుద్ధి నిలకడలేక తనకు దేవునివలన లభించిన మేళ్ళను మఱచిపోవును. మఱి నిరాశుఁడై ఇఁకమీఁద మేలుగలుగదు అని ఆశ వదలి పూర్వపు మేళ్లకు కృతఘ్నత చూపుచు ఇఁక మేలు గలుగదు అని నిరాశుఁడగును. 10. కష్టముల పిదప దేవుని యనుగ్రహమువలన మేలు గలిగినచో ఇఁక శాశ్వతముగా సౌఖ్యమే గలుగును. వెనుకటి కష్టకాలము ఇఁక రాదు అని మైమఱచి విఱ్ఱవీఁగును. ఇట్లు చేయుట తగదు గదా ! కష్టములుపోయి సౌఖ్యములు లభించెను అని దేవునికి మనఃపూర్వకముగ కృతజ్ఞతలు సలుపవలెను. 11. ఇందు విశ్వాసులగు భక్తులు కష్టసుఖములలో నెట్లు వర్తింతురో దానిగూర్చి చెప్పఁబడినది. వారికి కష్టములు గలిగినను సహింతురు. సుఖములు గలిగిన దేవునికి కృతజ్ఞత సలిపి సత్కార్యములుచేసి దేవుని మన్నన వడసి దేవుని దయకును, గొప్ప పుణ్యములకును వారు పాత్రులగుదురు.

12. ఫ-ల-అల్లక-తారికుమ్-బఅజ-మా-యూహా-ఇలైక-వ-జాఇ - ఖుమ్-బిహీ-సద్రుక-అన్-యఖూలూ-లౌలా-ఉన్-జిల-అలైహి-కన్-జున్-ఔ-జాఅ- మ

అహ్ హూ మలకున్ - ఇన్నమా - అన్త - నజీరున్ వల్లాహు - అలా కుల్లి షైఇన్ - వకీల్.13 అమ్ - యఖూలూ - నఫ్ - తరాహు - ఖుల్ .ఫాతూ - బి - అష్ - రి - సువరిమ్ - మిస్ - లిహీ - ముఫ్ - తర - యాతిన్ - వద్ - ఊ - మనిస్ - తతఅ - తుమ్ - మిన్ దూనిల్లాహి - ఇన్ - కున్తుమ్ సాదిఖీన్. 14. ఫ - ఇల్ - లమ్ - యస్ - తజీబూ - లకుమ్ - ఫఅ - లమూ - అన్నమా - ఉన్ - జిల - బి - ఇల్ మిల్లాహి - వ - అల్ - లా ఇలాహ - ఇల్లా హువ - ఫ - హల్ - అన్తుమ్ - ముస్లిమూన్.

12. బహుశః నీకు వచ్చు సందేశములోని కొంత భాగము నీవు వదలి పెట్టఁబోయెదవేమో గదా! ఎందులకు ఇతని వెంట ధన బొక్కసము రాలేదు. లేక ఎందులకు అతని వెంట నొక దేవదూత రాలేదు అని వారు పలుకుటవలన నీమనస్సునకు కష్టము గలుగునేమో! భయపెట్టుట మాత్రమే నీపని. మఱి ప్రతిదాని బాధ్యత దేవుఁడు వహించియున్నాఁడు. 13. అతఁడు (ప్రవక్త) ఖురానును కల్పించుకొన్నాఁడు అని వారు పలుకుచున్నారా? అటులైనచో మీరును ఖురానువంటి పది సూరాలనుచేసి తీసికొనిరండు, మఱి మీరు సత్యవంతులు రైనచో దేవునిదప్ప మీరెవ్వరిని పిలుచుకొనఁగలరో వారలందఱిని పిలుచు కొనుఁడు అని ఓ ప్రవక్తా! పలుకుము. 14. ఆ పిదప వారు మీమాటనుచేయ లేకపోయిరేని ఖురాను దేవుని సందేశమువలన వచ్చినది అనియు అతఁడు తప్ప వేఱు పూజ్యుఁడు లేఁడనియు మీరు తెలిసికొనుఁడు. ఇకనైన మీరు విధేయులగుదురా?

వ్యా॥ 12 : 14. హజ్రత్ రసూలువారు మక్కాపురములో ఇస్లామ్ మత ప్రచారముచేయుచు ప్రజలు విగ్రహారాధన చేయకూడదు. పాపకార్యములు చేయరాదు అని బోధించుచుండిరి. దానికి మక్కా కాఫిర్లు కుపితులై పలువిధ ములుగ హజ్రత్ రసూలువారిని హింసించుచు దూషించుచు వచ్చిరి. కాని పైగంబరులవారు తమ ప్రచారము వదలలేదు. తుదకు కాఫిర్లు తాము కోరినట్లు ఆకాశమునుండి ధనబొక్కసమును, దేవదూతయును వచ్చిన మేమునమ్మెదుము. అట్లు ఎందులకు చేయలేవు అని పైగంబరులవారితో పరిహాసములాడసాగిరి అందులకు ఒకపుడు పైగంబరులవారు, చింతింతురు. వారికి నలుప్రక్కలను. విరోధులే యుండిరి. అట్టి సమయములో దేవుని సందేశమువలననే పైగంబరుల వారి హృదయము శాంతి ధైర్యములు వహించుచుండెను. దానిగూర్చి ఓ ప్రవక్తా! నీవు వీరి మాటలకు చింతించి నీవు ప్రచారముచేయుచున్న దేవుని ధర్మ ముల కొన్నిటిని వదలిపెట్టెదవేమో సుమా! అట్లు కానేరదు. ఏయేసందేశము నీకు వచ్చునో నిశ్చయముగా వెల్లడించుచు ప్రజలను భయపెట్టుట మాత్రము

నీవని. కాఫిర్లు ముసల్మానులు కాలేదే అని నీవు చింతింపనక్కఱలేదు. అదం తయు దేవుఁడు చూచుకొనును. వారు కోరిన సూచనలు చూపుటనీపని కాదు. అది మాపని. మేము చూచుకొందుము. వారు కోరినట్లు సూచనలు చూపుట యుక్తము కాదు. అన్ని సూచనలకు మించినది ఖురానె షరీఫు. ఇది గొప్ప సూచన. దీనిని నీవే స్వయముగా కల్పించుకొంటివి. దేవునివద్దనుండి వచ్చినది కాదు అని కాఫిర్లు చెప్పినచో దానికి ఓ జనులార! మీరును అరబ్బులు. గొప్పపండితులు. ఇది మానవుఁడు కల్పించుకొన్నది అని మీరు చెప్పుటలో మీరు సత్యవంతులు రైనచో ఖురానువంటి పది సూరాలను కల్పించుకొనిరండు. మీరును మీ సర్వసహాయులను చేరి యీపని చేయుఁడు. మీ రెన్నటికిని చేయఁజాలరు అని ప్రవక్త పలుకునట్లు దేవుని సెలవాయెను. ఆ పిదప కాఫిర్లు ఖురానువంటి సూరలను చేయలేకపోయిరి. కావున ఖురానె షరీఫు దేవునిగ్రంథమనియు అది దేవునివద్దనుండి వచ్చిన సందేశమనియు మానవులు తెలిసికొని దేవుఁడు ఒక్కఁడే పూజ్యుఁడును సర్వాధికుఁడును అని విశ్వసింపవలెను. ఈవిషయము స్పష్టపడిన పిదప మానవులు తప్పక దేవునికి విధేయులై విశ్వాసులు కావలెనుగదా!

15. మన్-కాన-యురీదుల్-హాయాతద్-దున్యా-వ-జీనతహా-నువఫ్ఫి-ఇలైహిమ్-అఅ-మాలహుమ్-ఫీహా-వ-హుమ్-ఫీహా-లా-యుబ్-ఖసూన్. 16. ఉలా-ఇ-కల్-లజీన-లైస-లహుమ్-ఫిల్-ఆఖి-రతి-ఇల్లన్-నారు-వ-హాబిత-మాసనఉ-ఫీహా-వ-బాతిలుమ్-మా-కానూ-యఅ-మలూన్.

15. ఎవరు ఇహలోక జీవనమును దాని యందమును కోరుదురో వారి కర్మల ఫలితము సంపూర్ణముగ ఇహమునందే ఇచ్చివేయుదుము. అందు వారికి ఏలాటి నష్టము కానేరదు. 16. అట్టివారికి పరలోకమునందు అగ్ని తప్ప వేరేమియు లభింపదు. మఱి వారు ఇహమునందు చేసిన కర్మలు వ్యర్థంబాయెను. మఱి వారు సంపాదించినది చెడిపోయెను.

వ్యా॥ 15. ఖురానె షరీఫ్ దేవుని గ్రంథమని స్పష్టముగాఁ దెలిసియు దానిని విశ్వసింపక ఇహలోకజీవనమును అందలి యింపును సౌఖ్యములను భోగములను కోరుచు కర్మలు చేయువారికి వారి కర్మల ఫలితము ఇహమునందే వారికి మంచి సంపద, సంతానము, కీర్తి రూపమున లభించును. వారి కర్మలయుద్దేశ్యము ఇహలోక సౌఖ్యములే. కావున పరమునందు వారి కేలాటి ఫలితము లభింపదు. యూదులు గాని క్రైస్తవులుగాని పంచకులుగాని విగ్రహారాధకులుగాని ఇట్టివా రెవరైనను సరే విశ్వాసము వహింపక ఇహమునే యుద్దేశించి చేయు కర్మల ఫలితము వారికి ఏలాటి నష్టములేక సంపూర్ణముగ ఇహ

మునందే లభించును. 16. ఇహము నుద్దేశించి కర్మములు చేయువారికి పరలో
కమునందు పుణ్యము లభింపదు. వారికి నరకాగ్ని మాత్రమే లభించును. కాఫిర్లు
అందు సదా వసింతురు. లోకుల మెప్పుకై సత్కార్యములు చేసిన విశ్వాసులకు
వారి కర్మలకుఁ దగినట్లు కొంతకాలము వారు నరకము అనుభవింతురు. తుదకు
వారియందున్న విశ్వాసమునకుఁగాను మోక్షముపొందుదురు. దేవుఁడు కోరినచో
తన యనుగ్రహముచే విశ్వాసులను క్షమించిన క్షమింపవచ్చును. కాని యవి
శ్వాసులకు మోక్షమును క్షమాపణయునులేదు. ఇహము నుద్దేశించి చేసినకర్మ
ములు పరమునందు పనికిరాక వృథా చెడిపోవును. కావున విశ్వాసులుభయ
భక్తులతో మనఃపూర్వకముగా దేవునిప్రీతికొఱకు సత్కార్యములుచేయవలెను.

17. అఫ-మన్-కాన-అలా-బయ్యి-నతిమ్-మిర్-రబ్బిహీ-వయత్-లూహు
షాహి-దుమ్-మిన్‌హు-వమిన్-ఖబ్‌లిహీ-కితాబు-మూసా-ఇమామన్-వ-రహ్మ-మత
న్-ఉలా-ఇక-యూ-మినూన-బిహీ-వ-మన్-యక్-ఫుర్-బిహీ-మినల్-అహ్-జాబి
ఫన్నారు-మౌ-ఇదుహూ-ఫలా-తకు-ఫీ-మిర్యతిమ్-మిన్‌హు-ఇన్నహుల్-హఖ్-ఖు-
మిర్-రబ్బిక-వలా-కిన్న-అక్-స-రన్నాసి-లా-యూమినూన్.

17. ఎవఁడు తన ప్రభువునుండి వచ్చిన సూచనను అనుసరించుచుతన వెంట
దేవుని సాక్షి(ఖురాన్)యును దీనికి ముందు మార్గదర్శిగాను దయకుకారణముగా
(రక్షణోపాయముగా)నున్న మూసాగ్రంథమును సాక్షిగాఁగలఁడో యాతఁడుఇతరు
లతో సరిసమానుడగునా? ఇట్టివారే ఖురాను ననుసరించుచున్నారు. జనులందఱిలో
నెవఁడు దానినితిరస్కరించునో వాని నివాసము నరకాగ్నియన్నది. కావున దాని
గూర్చి నీవు సందేహములోపడకుము. నిశ్చయముగ అది నీప్రభువు నుండి వచ్చిన
సత్యము. కాని పెక్కుమంది జనులు విశ్వసింపరు.

వ్యా॥ 17. ఈవాక్యములో వివరింపఁబడిన గుణములు గలయాతఁడును లో
కుల మెప్పుకొఱకు ఇహమునే యుద్దేశించి కార్యములు చేయునాతఁడును సరిసమా
నులు కానేరరు అని చెప్పఁబడుచున్నది. దేవుని సూచనయగుధర్మమార్గమును అను
సరించుచు ఖురాను తౌరాతుగ్రంథముల సాక్ష్యము పొందినవాఁడుసరియైనభక్తుఁడు.
మానవుఁడు పుట్టుకతో సన్మార్గము (ఇస్లామ్ మతము) నే అనుసరించును. కాని
మధ్యలో వాని బంధువులు తల్లితండ్రులు పోవు తప్పుత్రోవను వాఁడు కూడ పోవు
చున్నాఁడు. ఎట్టి సహవాసములో నుండునో అట్టిగుణములే పట్టువడును. ఇస్లామ్
ననుసరించువారు సన్మార్గులు అని ఖురాను సాక్ష్యమిచ్చుచున్నది. కావున విశ్వా
సులు ఖురాను దేవుని గ్రంథమని నమ్మి దానిననుసరించుచున్నారు. దానినితిరస్కు

ంచు అవిశ్వాసులు నరకాగ్నికి పాలగుదురు. ఖురానె షరీఫ్ దేవుని గ్రంథము అనువిషయములో నెవరికిని సందేహముండకూడదు. కాని అనేకులు ద్వేషముతో నమ్మక యున్నారు. వారుదానికి తగిన శిక్షపొందుదురు. మోక్షము పొందవలెనన్న సర్వమతస్థులును ఖురానును విశ్వసించి దాని ననుసరింపవలెను. ఇదిదప్ప వేఱు మోక్షమార్గము లేదు.

18. వమన్-అజ్ లము-మిమ్-మనిఫ్-తరా-అలల్లాహి-కజి- బన్- ఉలా-ఇక యుఅరజూన-అలా-రబ్బిహిమ్-వ-యఖూలుల్-అష్-హాదు-హా-ఉలా-ఇల్-లజీన-కజబూ-అలా-రబ్బిహిమ్-అలా-లఅ-నతుల్లాహి-అలజ్-జాలిమీన్. 19. అల్-లజీన-యసుద్దూన-అన్-సబీ-లిల్లాహి-వ-యబ్-గూనహా-ఇవజన్ - వహుమ్-ఫిల్-ఆఖిరతి-హుమ్-కాఫిరూన్. 20. ఉలా-ఇక-లమ్-యకూనూ-ముఅ-జిజీన-ఫిల్-అర్-జివమా కానలహుమ్-మిన్ దూనిల్లాహి మిన్ ఔలియాఅ-యుజాఅఫు లహుముల్-అజాబు మా-కానూ-యస్-తతీ-ఊనస్-సమ్అ-వ - మా కానూ-యుబ్-సిరూన్.21. ఉలా-ఇకల్-లజీన-ఖసిరూ-అన్-ఫుసహుమ్-వజల్ల-అన్ హుమ్-మా-కానూ-యఫ్తరూన్. 22. లా-జరమ అన్నహుమ్-ఫిల్-ఆఖిరతి-హుముల్-అఖ్-సరూన్.

18. మఱిదేవునిపై అసత్యములు కల్పించువారికంటె నెక్కువ దుర్మార్గులెవరు గలరు. వారుతమ ప్రభువునెదుట వచ్చెదరు. (అపుడు) వీరే తమ ప్రభువుపై అసత్యములు కల్పించినవారు అని సాక్షులు పలుకుదురు. వినుము! దుర్మార్గులకు దేవుని శాపమున్నది. 19. ఆదుర్మార్గులు దేవుని మార్గమునుండి ప్రజలను అటంకపఱచుచు అందు వంకరను కోరుచున్నారు. మఱి వీరేను పరలోకమును తిరస్కరించువారు. 20. వీరుభూమిలోపాఱిపోయి(దేవునిని)లొంగకజేయలేరు.మఱి దేవుడుదప్ప వేఱు సహాయుడెవడును వారికి లేడు. వారికిఁగాను రెండింతలు శిక్షయున్నది. వీరు విను శక్తిలేకుండిరి. మఱివారు చూడలేకుండిరి. వీరే తమయాత్మల విషయమున నష్టము చేసికొన్నవారు. వీరు కల్పించుచున్నది వారినుండిపిడిపోయెను.22. తప్పకవీరే పరలోకమందు అందఱికంటె నెక్కువ నష్టము పొందువారు.

వ్యా॥ 18. ఖురాను అసత్యమైనదికాదు. దేవునినుండి వచ్చిన సత్యమైన గ్రంథము కావున మనుష్యులు దీనిని నమ్మి తీరవలసినది. ఎవనికి దేవుడు తన సందేశము పంపనిదే తనకు దేవుని సందేశము వచ్చినది అని దేవునిపై అబద్ధములు కల్పించునో వాఁడు అందఱికంటె ఎక్కుడు దుర్మార్గుఁడు. కావున సత్యమైన ఖురాను గ్రంథమును తిరస్కరించువాఁడు కూడ దుర్మార్గుఁడే. తీర్పు

దినమునందు అందఱు దేవుని యెదుటనిలువవలసి వచ్చును. అప్పుడు దేవదూతలును ప్రవక్తలును భక్తులును దుర్మార్గులపై నిట్లు సాక్ష్యమిత్తురు. వీరే దేవునిపై అబద్ధములు కల్పించిన దుర్మార్గులుఅని. 19. దేవునిపైఅబద్ధములు కల్పించి దేవుని మార్గమునుండి ప్రజలను తొలఁగించి సన్మార్గమును దుర్మార్గముగాఁ జేసి ప్రజలకు చూపుటకు యత్నించి యందు వంకరులు వెతకుచు పరలోకమును తిరస్కరించు వారికి దేవుని కోపమను శాపమున్నది అని దేవుడు ప్రకటించు చున్నాఁడు. 20. ఇంత విశాలమైన భూమిలో దుర్మార్గులు దేవుని శిక్షనుండి తప్పించు కొనుటకై పాఱిపోయి దాగుకొనలేరు. వారిని రక్షించు సహాయులెవరును లేరు. రక్షించుటకు దేవుఁడే అర్హుఁడు. తాము దుర్మార్గము నందు నడిచి యితరులను కూడ దుర్మార్గబోధన చేసినందులకు దుర్మార్గులకు రెండింతలు నరకశిక్షలభించును. దుర్మార్గులు ఇహమునందు సన్మార్గము గ్రహించుటకు బుద్ధి జ్ఞానములు ఉపయోగింపక దేవుని వాక్యములను వినక దేవుని సూచనలను చూడక అంధులును చెవిటివారలునై పోయిరి. 21. దుర్మార్గులు తమ పాప కార్యములకు ఫలితముగ నరకము పొంది తమ యాత్మలకు నష్టము చేసికొనిరి. వారు గావించుచున్న అబద్ధ డంబాలు పనికిరాక పోయెను 22. పైవివరింపఁబడినట్లు విశ్వాసములేని దుర్మార్గులు అందఱికంటె ఎక్కువ నష్టము పొందినవారగుదురు. పరలోకమందు మోక్షమువంటి మేలు గోలుపోయిరిగదా!

23. ఇన్నల్-లజీన-ఆమనూ-వ-అమి-లుస్-సాలిహాతి-వ- అఖ్ - బితూ-ఇలా-రబ్బిహిమ్-ఉలాఇక-అస్-హాబుల్ జన్నతి-హుమ్-ఫీహా-ఖాలిదూన్. 24. మసలుల్ -ఫరీ-ఖైని-కల్ -అఅమా-వల్-అసమ్మివల్-బసీరి-వస్-సమీఇ-హల్-యస్ తవియాని-మసలన్-అఫ-లా-తజక్కరూన్.

23. నిశ్చయముగా నెవరు విశ్వసించి సత్కార్యములు చేసి తమప్రభువు నెదుట వినయము చేసిరో వారు స్వర్గనివాసులు. అందువారు శాశ్వతముగా నుందురు. 24. ఈ రెండు తెగలవారి విషయము ఒక చెవిటివానివలెను మఱొక కన్నులు గలిగి వినువాని వలెను నున్నది. వీరిరువురు పోలికలో సమానులగుదురా! మఱెందులకు మీరు యోచింపరు.

వ్యా॥ 23. ఇందు విశ్వసించి దేవుని సన్నిధిని వినయము చూపిన భక్తులకు మోక్షము గలదు అని చెప్పఁబడుచున్నది. వీరు దేవుని ప్రీతికి పాత్రులై సదా స్వర్గసౌఖ్యములు అనుభవింతురు. 24. తిరస్కరించిన అవిశ్వాసులు అంధులును చెవిటివారును వారికి సన్మార్గము కనఁబడదు. దేవుని వాక్యములు ధర్మములు వినఁబడవు. ఇట్టివారు సన్మార్గము చూచి ధర్మములు వినునట్టి కన్నులను

చెవులును గలవారితో సరిసమానులు కాఁగలరా! ఎప్పటికిని కానేరరు. తిర స్కరించిన వారు నరకమునకు పాలగుదురు. భక్తులు స్వర్గము పొందుదురు. కావున మానవులు బాగుగ యోచించి సన్మార్గము అవలంబింతురుగాక!

25. వల-ఖద్-అర్-సల్నా-నూ-హన్-ఇలా-ఖౌమిహీ-ఇన్నీ-లకుమ్-న జీరుమ్-ముబీన్. 26. అల్-లా-తఅబుదూ-ఇల్-లల్లాహ-ఇన్నీ-అఖాఫు-అలైకుమ్ అజాబ-యామిన్-అలీమ్. 27. ఫ-ఖాలల్-మల-ఉల్-లజీ-న-కఫరూ-మిన్-ఖౌమి హీ-మా-నరాక-ఇల్లా-బష-రమ్-మిస్-లనా-వ-మా-న-రా-కత్-త-బ-అక ఇల్-లజీన-హుమ్-అరా-జిలునా-బాది-యర్-రాయి-వమా-నరా-లకుమ్-అలైనా మిన్-ఫజ్-లిమ్-బల్-నజున్ను కుమ్-కాజిబీన్.

25. మఱియు మేము నూహును ఆతని జాతివారి యొద్దకుఁ బంపితిమి. ఆతఁడు నేను స్పష్టముగా మిమ్ము భయపెట్టుచున్నాఁడను. 26. దేవుని దప్ప నితరులను మీరు ఆరాధింపకూడదు. దుఃఖకరమైన దినమునందు మీకు శిక్ష గలుగునని నాకు భయము గలదు అని పలికెను. 27. పిదప ఆతని కులమువారిలో అవిశ్వాసులైన నాయకులు నీవుమాకు ఒకమానవుఁడు మాత్రుఁడవుగా కనఁబడు చున్నావు. వివేకములేని నీచులు మాత్రము నిన్ను అనుసరించుట మేముచూచు చున్నారము. మఱి మీకు మాపై సేలాటి ఘనత మేము చూచుటలేదు. మఱి మీరందఱు అసత్యవంతులని మేము తలఁచుచున్నారము అని పలికిరి.

వ్యా॥ 25. దేవుఁడు నూహును ప్రవక్తగాఁ జేసి ఆతని జాతివారి యొద్దకు పంపెను. నూహుప్రవక్త జనులను చాలకాలము బోధించెను. దేవుని సూచనలను తిరస్కరించినచో దేవుని శిక్ష గలుగును అని స్పష్టముగాభయపెట్టు చు తెలిపెను. 26. నూహుజాతివారు వద్, సువాఅ్, యగూస్, యఊఖ్, నస్రి అను విగ్రహములను పూజించుచుండిరి. అది మానుకొనవలెను. దేవునితప్ప నితరులను పూజింపఁగూడదు. విగ్రహారాధన వదలి పెట్టనిచో కఠిన శిక్షలభిం చును. ఆశిక్ష వచ్చుదినము చాల దుఃఖకరమైనదిగానుండును. ఆదినము రాఁ బోవు తీర్పుదినము లేదా కాఫిర్లు నీటి ప్రళయమున మునిగి నశించినదినము. 27. నూహు ప్రవక్త బోధించిన దానిని విని జనులలో పెద్దలుగ నుండిన నా యకులు "ఏమయ్యా ప్రవక్త అనగా సామాన్యుఁడా! ఆతనికిని నరులకును చాల వ్యత్యాస ముండవలెను. అట్లుగాక నీవు కూడ మావంటి నరుఁడవుగా కను బడుచున్నావు. సరేయిది లేకున్న పోనీ మాకంటె నెక్కువ ధనమును సంపద లును నీకుండ వలెను. అవియును లేవు. ఇదిగాక నిన్ను అనుసరించువారు గొప్ప

వారుకూడ కారు. వారు మాజాతిలో నీచులు. వివేకములేని మూఢులును పేద లును ఇట్టివారితో మేము కలిసియుండుట మాకు అగౌరవము. విచారింపక కొందఱు అధములు నీకు శిష్యులైనారు. నీకును నాశిష్యులకును మాపై నేలాటి ఘనతలేదు. మఱిమీరందఱు అసత్యములు పలుకుచున్నారని మేము తలంచుచున్నామని పలుక సాగిరి. నూహుప్రవక్త వారికిచ్చిన జవాబు రాఁబోవు వాక్యములలో నున్నది.

28. ఖాల-యా-ఖౌమి-అ-ర-ఐతుమ్-ఇన్-కున్తు-అలా-బయ్యి-నతిమ్-మిర్ రబ్బీ-వ-ఆతానీ-రహ్-మతమ్-మిన్-ఇన్-దిహీ-ఫ-ఉమ్మి-యత్-అలై-కుమ్-అనుల్-జిముకుమూ-హా-వ-అన్తుమ్-లహా-కారిహూన్. 27. వ-యా-ఖౌమి-లా-అస్-అలుకుమ్-అలైహి-మాలన్-ఇన్-అజ్-రియ-ఇల్లా-అలల్లాహి-వమా-అనా బి తారి-దిల్-లజీన-ఆమనూ-ఇన్నహుమ్-ములాఖూ-రబ్బిహిమ్-వలాకిన్నీ-అరాకుమ్-ఖౌమన్-తజ్-హలూన్. 30. వ-యా-ఖౌమి-మన్-యన్-సురునీ-మినల్లాహి-ఇన్-తరత్తు-హుమ్-అఫ-లా-తజక్క-రూన్. 31. వలా-అఖూలు-లకుమ్-ఇన్దీ-ఖజా-ఇనుల్లాహి-వలా-అఅ-ముల్-గైబ-వలా-అఖూలు-ఇన్నీ-మలకున్-వలా-అఖూలు-లిల్-లజీన-తజ్-దరీ-అఅ-యును-కుమ్-లన్-యూతి-య-హుముల్లాహు-ఖైరన్. అల్లాహు-అఅలము-బిమా-ఫీ-అన్-ఫుసిహిమ్-ఇన్నీ-ఇజల్-లమినజ్-జాలిమీన్. 32. ఖాలూ-యానూహు-ఖద్-జాదల్-తనా-ఫ-అక్-సర్త-జిదాలనా-ఫా-తినా-బిమా-తఇ-దునా-ఇన్-కున్త-మినస్-సాది-ఖీన్. 33. ఖాల-ఇన్న-మా-యాతీకుమ్-బిహిల్లాహు-ఇన్-షాఅ-వమా-అన్తుమ్-బి-ముఅ-జిజీన్. 34. వలా-యన్-ఫఉ-కుమ్-నుస్హీ-ఇన్-అరత్తు-అన్-అన్-సహ-లకుమ్-ఇన్-కానల్లాహు-యురీదు-అన్-యుగ్-వి యకుమ్-హువ-రబ్బుకుమ్-వ-ఇలైహి-తుర్-జఊన్. 35. అమ్-యఖూ-లూ-నఫ్-తరాహు-ఖుల్-ఇనిఫ్ తరైతుహూ-ఫ అ-లయ్య-ఇజ్రామీ-వఅనా-బరీఉమ్-మిమ్మా-తుజ్రి-మూన్.

28. ఓ జనులార! చూడుఁడు! నేను నా ప్రభువునుండి వచ్చినసూచన ననుసరించుచు, ఆతని అనుగ్రహము పొందుచుండుట మీకు కనఁబడనిచో (నేనేమి చేయఁగలను). మీకు ఇష్టము లేకున్నను దానికిఁగాను మిమ్ము బలవంత

పెట్టుదుమా ! 29. మఱియు ఓ జనులార ! ప్రచారమునకుఁగాను నేను మీతో ధనము అడుగుటలేదు. నాకూలి దేవునిపై మాత్ర మున్నది. నేను విశ్వాసులను తఱిమివేయువాఁడనుకాను. వారు తమ ప్రభువునొద్దకు పోవనున్నవారలు. కాని మీరు నాకు మూఢులుగా కనఁబడుచున్నారు. 30. మఱి ఓ జనులార ! నేను తఱిమివేసినచో దేవుని శిక్షనుండి నన్ను రక్షించువారెవరు గలరు. ఏమి మీరు యోచింపరా ! 31. మఱి నాయొద్ద దేవుని బొక్కసములు (ఖజానాలు) న్నవి అనియు నాకు అగోచరములు తెలియును అనియు మీతో నేను చెప్పుట లేదు. మఱి మీరెవరిని అగౌరవముగాఁ జూచుచున్నారో వారికి దేవుఁడు మేలు చేయఁడు అని పలుకుటలేదు. వారి హృదయములలో నున్నది దేవునికి బాగుగఁ దెలియును. నే నట్లు పలికితినేని నేను అన్యాయస్థులలో చేరినవాఁడ నగుదును అని నూహు ప్రవక్త పలికెను. 32. ఓ నూహు ! నీవు మాతో వాదించితివి. మఱి చాల వాదించితివి. ఇఁక నీవు సత్యవంతుఁడవైనచో నీవు పలుకునది తీసికొనిరమ్ము అని వారు పలికిరి. 33. దేవుఁడు కోరినచో అతఁడు దానిని మీయొద్దకుఁ దెచ్చును. మఱి మీరు అతనిని లొంగఁజేయలేరు. 34. దేవుఁడు మిమ్ము దుర్మార్గులుగాఁజేయ కోరినచో నేను మీమేలు కోరి ఎంత బోధించినను నాబోధవలన మీకు లాభము గలుగదు. అతఁడే మీప్రభువు. మఱి అతని యొద్దకే మీరు తిరిగిపోవలసియున్నది అని నూహు పలికెను. 35. ఏమి వారు ఖురానును (ముహమ్మదు) కల్పించుకొనినాఁడు అని పలుకుచున్నారా ! నేను కల్పించి తెచ్చినచో దాని పాపము నాపై నున్నది. మఱి మీరు చేయు పాపములకు నేను బాధ్యుఁడను కాను అని ఓ ముహమ్మదు పలుకుము,

వ్యా॥ 28. ప్రవక్తలకును ఇతర మానవులకును మధ్య ధనసంపదల వ్యత్యాసముండదు. ప్రవక్తలు తమకు దేవునియందుగల భక్తితోను తమ సుగుణములతోను భూతదయతోను ఇతరులకన్న ఉన్నతస్థానము పొందియుండుదురు. దేవుని సూచనలు అతని యనుగ్రహము వారికిఁ గలుగును. కావున ఓ జనులార ! నాకు దేవుని సూచనలు అతని యనుగ్రహమగు ప్రవక్తపదవియును లభించియున్నది. మీరు అంధులై దానిని చూడలేకపోతే నేనేమి చేయఁగలను. మీరు అంధులై కన్నులెత్తి చూడకున్నను మేము మిమ్ము బలవంతపెట్టవలయునా ? 29. నేను చేయు మతప్రచారమునకుఁగాను కూలిగాని జీతముగాని మీతో అడుగుటలేదు. దాని ఫలిత మిచ్చువాఁడు దేవుఁడు. కావున మీధనముతో నాకు పనిలేదు. నేను మీధనమును ఆశించువాఁడనుకాను. కావున ఎందులకు నేను విశ్వాసులైన పేదలను తఱిమివేయుదును ! నేనుఅట్లుచేయను. విశ్వాసులు దేవుని సన్నిధానమున నిలుతురు. అపుడు అందఱి కర్మలఁగూర్చి విచారణ అగును. నే నిపుడు తఱిమివేసినచో అపుడు నేనేమి జవాబియ్యఁగలను. విశ్వా

సులలో పేదలు ధనికులు అను భేదము నాయొద్దలేదు. అందఱి హృదయ విష
యములు దేవునికి నెఱుక. కాని మీరు విశ్వాసుల పేదఱికమును చూచి వారిని
తఱిమివేసిన మేము విశ్వసించి నీయొద్దకు వత్తుము అని పలుకుట మీమూఢత్వ
మును వెల్లడించుచున్నది. మీరందఱు దేవునియొద్దకు పోవలసియున్నది. అపుడు
అందఱి విషయము తెలియనగును. 30. ఓ జనులార! ఒకవేళ మీమూఢమాట
లను విని నిఱుపేదలను తఱిమివేసితినేని నన్ను దేవునిశిక్షనుండి రక్షించువాఁడె
వఁడు! ఎవఁడును లేఁడు. కావున మీరీవిషయము ఎందులకు యోచింపరు. 31,
32. మీరు నాయొద్ద ధనములేదు అని చెప్పుచున్నారుగదా! అవును. నాయొ
ద్ద ధనబొక్కసములులేవు. అవి నాచేతిలోలేవు. అవి దేవుని చేతిలో నున్నవి.
మఱి నాకు అన్ని రహస్యములును అగోచరములును తెలియవు, నేను దేవ
దూతనుగాను. మీరు నిఱుపేదలను చులకనగా చూచి వారియెడ అగౌరవము
గలిగియున్నారుగదా! అట్లు నేను వారిని అగౌరవింపను. మఱి దేవుఁడు వా
రిని యనుగ్రహింపఁడు అని నేను పలుకను. దేవుఁడు వారి హృదయములలోని
విషయములను ఎఱుంగువాఁడు. భక్తినిబట్టి అనుగ్రహించి వారికి మేలుచేయును.
దేవుని దయకు విశ్వాసులు పాత్రులగుదురు. ఇట్లు కాదు అని నేను చెప్పితినేని
అది అన్యాయమును అధర్మమునగును. కావున నేనట్లు పలుకను అని నూహుప్ర
వక్త తన జనులకు జవాబిచ్చెను. 33. నూహుప్రవక్త జనులను తొమ్మిదివందల
యేఁబది సంవత్సరములు బోధించుచు వారు వేయు ప్రశ్నలకు సమాధానము
పలుకుచు వచ్చెను. జనులుకూడ తమ యిష్టానుసారముగ ప్రవక్తతో వాదించి
తుదకు విసుగుచెంది వాదన చాలమైనది. ఇఁక మేము నమ్మము. మేము నమ్మ
నిచో దేవునిశిక్ష వచ్చును అని ఓ నూహు నీవు పలికితివిగదా! నీవు సత్య
వంతుఁడవైనచో ఆశిక్షను తీసికొనిరమ్ము అని పలుకసాగిరి. దానికి నూహుప్ర
వక్త, ఓ జనులార! శిక్షను మీరు కోరినపుడు తెచ్చుట నాపనికాదు. దానిఅధి
కారము దేవునికిఁగలదు. దేవుఁడు కోరినచో అది తప్పక వచ్చును. అది వచ్చి
నపుడు మీరు దానినుండి తప్పించుకొనఁజాలరు. పాఱిపోయి యెచ్చటను దాఁగు
కొనలేరు. అట్లు దాఁగి మీరు దేవునిని లొంగఁజేయలేరు. ఎందులకు మీరు
తొందరపడుచున్నారు. 34. మీరు నిర్భయులై శిక్ష రావలెననికోరుచున్నారు
గదా! దేవుని యిష్టము కూడ మిమ్ము శిక్షింపవలెనని యున్నచో నాబోధవలన
మీకు లాభము గలుగదు. నేను ఎంత కోరిన నేమి? మీ ప్రభువగు దేవుఁడు
కోరవలెను. మీరు తిరిగి దేవునియొద్దకే పోయి మీకర్మల లెక్క నియ్యవలసి
యున్నది. అపుడు మీకర్మలకుఁ దగిన ఫలితము మీకియ్యఁబడునుఅని పలికెను.
35. మక్కా కాఫిర్లు ఖురానును విని ఇది మహమ్మదు స్వయముగ కల్పించు
కొన్నది. దేవుఁడు పంపినది కాదు అని పలుకసాగిరి. దానికిఁగాను ఇందు జవా

బియ్యఁబడినది. ఒకవేళ నేను స్వయముగా ఖురాను కల్పించుకొన్నచో దాని ఫలితము నాకే లభించును. దానికి మీరు బాధ్యులు కానేరరుగదా! కాని యిది నేనుచేసికొన్నదికాదు. ఈవిషయము సప్రమాణముగా దీనికి ముందు చెప్పఁబడినది. ఓ కాఫిరులారా! స్పష్టముగా తెలిసిన పిదప మీరు దేవుని వాక్యములను తిరస్కరించుచు పాపములు కట్టుకొనుచున్నారు. మీ పాపకార్యములకు మీరే జవాబుదారులు. దానికి నేనుబాధ్యుఁడనుగాను. నాపని ప్రచారము చేయుట మాత్రమేను అని ప్రవక్త పలుకవలెనని దేవుని సెలవు.

36. వ-ఊహియ-ఇలా-నూహిన్-అన్నహూ-లన్-యూమిన-మిన్-ఖౌమిక-ఇల్లా మన్-ఖద్-ఆమన-ఫలా-తబ్తఇస్-బిమా-కానూ-యఫ్-అలూన్. 37. వస్-న ఇల్-ఫుల్క-బి-అఅ-యునినా-వ-వహ్-ఇనా- వలా- తుఖా--తిబ్నీ- ఫిల్-ల జీన-జలమూ-ఇన్నహుమ్-ముగ్-రఖూన్. 38. వ-యస్-నఉల్-ఫుల్క-వ-కుల్ల మా-మర్ర-అ లైహి-మల-ఉమ్-మిన్-ఖౌమిహీ-సఖిరూ-మిన్హు-ఖాల-ఇన్-తస్ ఖరూ-మిన్నా-ఫఇన్నా-నస్ఖరు-మిన్-కుమ్-కమా-తస్-ఖరూన్. 39. ఫసౌఫ-తఅ-లమూన-మన్-యాతీహి-అజా-బున్-యుఖ్-జీహి-వ-యహిల్లు- అలైహి-అజా-బుమ్-ముఖీమ్. 40. హత్తా-ఇజా-జాఅ- అమ్రునా-వ-ఫారత్-తన్నూరు-ఖుల్-నహ్-మిల్-ఫీహా-మిన్-కుల్లి- జౌజైనిస్-నైని-వ-అహ్-లక-ఇల్లా మన్-సబఖ-అలై-హిల్-ఖౌలు వ మన్-ఆమన-వమా-ఆమన -మఅహూ-ఇల్లా-ఖలీల్. 41. వఖా-లర్-కబూ-ఫీహా బిస్మిల్లాహి-మజ్-రేహా వముర్-సాహా-ఇన్న-రబ్బీ ల గఫూరుర్-రహీమ్. 42. వహియ-తజ్రీ-బిహిమ్-ఫీ-మౌజిన్-కల్-జిబాలి-వ-నాదా నూహు-నిబ్నహూ-వ-కాన-ఫీ-మఅ-జిలిన్-యా-బు-నయ్యర్-కమ్ - మఅనా-వ లా-తకుమ్-మఅల్-కాఫిరీన్. 43. ఖాల-స ఆవీ-ఇలా-జబలిన్-యఅ- సిముని-మి నల్-మాఇ-ఖాల-లా-ఆసి-మల్-యౌమ-మిన్-అమ్-రిల్లాహి-ఇల్లా-మర్- రహీ మ-వ-హాల-బైన-హుముల్-మౌజు-ఫకాన-మినల్-ముగ్-రఖీన్. 44. వఖీల-యా అర్-జుబ్-లఈ-మా-అకి-వ-యాసమా-ఉ-అఖ్-లిఈ-వగీ జల్-మా-ఉ-వఖు - జి యల్-అమ్రు-వస్ -తవత్-అలల్-జూదియ్యి-వఖీల-బుఅ-దల్-లిల్-ఖౌ-మిజ్-జాలిమీన్.

36. మఱియు నీకులము వారిలో ముందు విశ్వసించిన వారు తప్ప ఇఁక నితరు లెవరును విశ్వసింపరు. కావున వారు చేయుచున్న కర్మలకుఁగాను నీవు చింతింపకుము అని నూహు యొద్దకు దేవుని సందేశము (వహీ) పంపఁబడెను. 37. మఱి ఓనూహు నీవు మాయెదుట మా సెలవు ననుసరించి నావనుచేయుము. మఱి దుర్మార్గుల విషయము నాతో మాటలాడకుము. నిశ్చయముగా వీరు మునిగి పోవుదురు అని దేవుఁడు పలికెను. 38. మఱి నూహు నావను చేయుచుండెను. మఱి ఆతని కులనాయకులు ఆతని యెదుటనుండి పోవునప్పుడెల్ల ఆతనితో పరిహాస మాడుచుండిరి. మీరు మాతో పరిహాసమాడుచున్నారు. మీరు పరిహాస మాడునట్లు మేముకూడ మీతో పరిహాస మాడుదుము. 39. ఇఁక శీఘ్రములోనే అవమాన పఱచునట్టియు శాశ్వతముగ నుండునట్టి శిక్ష ఎవరికి రానున్నదో మీరు తెలిసికొనఁ గలరు అని నూహు పలికెను. 40. తుదకు మాయాజ్ఞవచ్చి పొయ్యి యుప్పొంగి నపుడు ప్రతిజాతినుండి ఒక్కొక జతయును నీయింటి వారిలో ఎవరి విషయము ముందుగానే మాటయైయున్నదో వారిని తప్ప నితరులను విశ్వాసులందఱిని నావలో నెక్కించుకొనుము అని మేముపలికితిమి. మఱి ఆతనితోఁబాటు విశ్వసించినవారు కొందఱు మాత్రమే. 41. మఱియు మీరు నావలో దేవుని పేరు తీసికొని యెక్కుఁడు. అది దేవుని పేరుతోనే చలించునది. మఱి నిలుచునది. నిశ్చయముగా నాప్రభువు క్షమించు వాఁడును దయాళువును అని నూహు పలికెను. 42. మఱియు నావవారిని కొండలవంటి యలగుండ తీసికొని పోవుచుండెను. మఱి నూహుయొక్క కుమారుఁడు అవతలనుండగా ఓనాకుమారుఁడా! మాతోఁబాటు నీవు నావలోనెక్కుము. మఱి కాఫిరలో కలసి యుండకుము అని పిలిచెను. 43. అపుడు ఆతని కుమారుఁడు నేనొక పర్వతమును ఆశ్రయింతును. అది నేను జలములో మునగకుండ నన్ను కాపాడును అని పలికెను. అపుడు నూహు ఈ దినము ఎవరును దేవుని శిక్ష నుండి తప్పింపఁజాలరు, కాని ఎవనిని దేవుఁడు కరుణించునో వానిని రక్షించును అని పలికెను. మఱి వారిద్దఱిమధ్య ఒక అలరాఁగా వాఁడు మునిగిపోవువారిలో చేరిపోయెను. 44. మఱియు ఓభూమి! నీళ్ళను నీవు మ్రింగుము. ఓఆకాశమా! ఆఁగిపొమ్ము అని దేవుని సెలవయ్యెను. నీళ్లు ఆఱిపోయెను. మఱి కార్యము పూర్తి అయిపోయెను. మఱియు నావ జూదీ అను కొండపై నిలిచెను. మఱి దుష్టులు దేవుని దయనుండి దూరులు అగుదురుగాక అని సెలవయ్యెను.

వ్యా॥ 36. నూహు ప్రవక్త అనేక వందల సంవత్సరములు మతబోధ చేసెను. కాని జనులు ఆతనికి పెట్టరాని హింసలు పెట్టిరి. వారిలో కొందఱు మాత్రము విశ్వసించిరి. అపుడు ఆయన దేవునిని ప్రార్థించి ఓప్రభువా! నేను బలహీనుఁడ నైతిని. నీవు దుష్టులను శిక్షింపుము అని వేఁడుకొనఁగా దేవుఁడు

దుష్టులుచేయు కార్యములకు చింతింపకుము. వారికి శిక్ష రానున్నది. విశ్వసింప
వలసినవారు విశ్వసించిరి. ఇఁకమీఁద ఎవరును విశ్వసింపరు. కావున దుష్టులు శీ
ఘ్రములోనే నశింతురు అని సెలవిచ్చెను. 37. ఆపిదప దేవుఁడు నూహు ప్ర
వక్తతో నీవు ఒక నావ మా రక్షణలో మా యెదుట మా సెలవు ననుసరించి
చేయుము. ఇఁక గొప్ప జలప్రళయము రానున్నది. అపుడు ఈ నావ పనికి వ
చ్చును. దుష్టులు జలములో మునిగి చచ్చెదరు. ఇది తప్పదు అని పలికెను.
38. దానిని ననుసరించి నూహు ప్రవక్త నావచేయ ప్రారంభించెను. అది తయా
రై గొప్ప యోడగా నేర్పడెను. దుష్టనాయకులు నూహుతో ఏమయ్యా!
ఇది యేమి చేయుచున్నావు. ప్రవక్తగానున్న నీవు వడ్రంగి పని చేయుచు
న్నావే అని పరిహాసమాడుచు నడుగ సాగిరి. దానికి నూహు ప్రవక్త నేను
ఒక యిల్లుకట్టుచున్నాను. అది నీళ్ళపై పోవును. మునగకుండ కాపాడును అని
పలికెను. అది విని దుష్టులు ఓహో నేలపై నీళ్ళనుండి రక్షణ పొందుటకై
యత్నించుచున్నావా అని పరిహాసమాడి నవ్వుచుండిరి. దానికి నూహు మీరు
ఇవుడు నవ్వుచున్నారుగదా! ఇఁకమీఁద మీరు మునిగిపోవు నపుడు మేము
కూడ మీపై నవ్వుదుము సుమా! 39. ఇఁక శీఘ్రములోనే యిహమునందు
అవమానమును పరమునందు శాశ్వతమైన శిక్షయు నెవరికి లభింప నున్నదో
మీరే తెలిసికొనఁగలరు. ఎందులకు తొందరపడుచున్నారు అని నూహుప్రవక్త
పలుకుచుండెను. 40. నూహు ప్రవక్తనావ చేయుచు నుండెను. తుదకు దేవుఁ
డు సెలవిచ్చిన ప్రకారము ఆకాశమునుండి ఘోరవాన కురియసాగెను. భూమి
నుండి యూటలు బయలుపడి భూమియంతయు నీళ్ళతో నిండిపోయి రొట్టెలు
చేయు పొయ్యిలనుండియు నీళ్లు ఉప్పొంగ సాగెను. అపుడు నూహు ప్రవక్త
యొక్క కుటుంబములో యాము అను కొడుకును, వాఇలా అను భార్యయును
తప్ప మిగిలిన వారును, దాదాపు ఎనుబదిమంది విశ్వాసులును జంతువులు మొద
లగువానిలో ఒక్కొక జత (పెంటిమగ)ను తీసికొని నావనెక్కవలెనని నూహు
ప్రవక్తకు దేవుని సెలవయ్యెను. నూహు ప్రవక్త అటులే చేసెను. 41. నూహు
ప్రవక్త నావ నెక్కునపుడు విశ్వాసులతో మీరు భయపడకుఁడు. దేవుని పేరు
తీసికొని యెక్కుఁడు. ఈనావ దేవుని చేతిలోనున్నది. అది దేవుని సెలవు ననుస
రించి నీళ్లపై పోవును. మఱి నిలుచును. మునిగిపోవు భయము లేదుసుమా!
దేవుఁడే తన యనుగ్రహముతో మనలను రక్షించును అని పలికెను. నావ
నెక్కునపుడు బిస్మిల్లాహి అని యెక్కవలెను. 42. నావ కొండలవంటి యల
లను చీల్చుకొనుచు పోవుచుండెను. అపుడు నూహుప్రవక్త యొక్క కుమారుఁ
డు యాము (కన్ఆను) అనువాఁడు కాఫిర్లలో కలిసి యుండెను. అపుడునూహు
ప్రవక్త పుత్రవాత్సల్యముతో ఓకుమార! అవిశ్వాసులతో చేరక ఇప్పుడైన నావ

లో మాతోఁబాటు ఎక్కుము. ఈయాపదనుండి నీకు రక్షణ గలుగును అని పిలిచెను. 43. కాని వాఁడు ప్రవక్తమాట వినక ఈజలప్రమాదమునాకేమి చేయును. కొంతకాలములోనే తగ్గిపోవును. అంత ఒక యెత్తు కొండపై నిలిచి ప్రాణము దంక్కుచుకొందును అని గర్వములోను మూర్ఖత్వములోను పలికెను. దానికి ప్రవక్త నీవు భ్రమపడుచున్నావు. ఇది సాధారణమైన జలప్రమాదముకాదు. ఇది దేవునిశిక్ష. దేవుని శిక్షనుండి ఎవరును నిన్ను రక్షింపఁజాలరు. కొండపై నెక్కినను నీకు రక్షణ లభింపదు. దేవుఁడు తాను కోరిన వారిని అనుగ్రహించి రక్షించిన రక్షింపవచ్చును. వేఱు రక్షణ మార్గము లేదు అని పలుకుచుండగనే ఒక్క పెద్ద అల వచ్చి యామును ముంచివేసెను. 44. ఒక కాలము వఱకు నీళ్లు కురిసి భూమినుండి యూటలు ప్రవహించి కొండలు చెట్లు మునిగిపోయి కాఫిర్లందఱు మునిగి చచ్చిరి. నూహు ప్రవక్త యొక్క నావలోనున్నవారు మాత్రము రక్షింపఁబడిరి. ఆపిదప దేవునిసెలవుచే భూమిలోనినీళ్లు ఇంకిపోయెను. ఆకాశమునుండి వాన కురియుట నిలిచి పోయెను. దుష్టులను శిక్షింపవలెనని దేవుఁడు కోరిన కార్యము పూర్తి యాయెను. నావ జూదీ అను కొండపై సురక్షితముగా నిలిచిపోయెను. దుర్మార్గులు దేవుని యనుగ్రహమునుండి దూరులై నాశ మొందుదురుగాక అని చెప్పఁబడియెను. రక్షింపఁబడినవారిలో సామ్, హామ్, యాఫిస్ అను ముగ్గురు నూహు ప్రవక్త కుమారులు. వీరి ముగ్గురి సంతానమే లోకమంతటను వ్యాపించెను.

45. వ-నాదా-నూహుర్-రబ్బహూ-ఫఖాల-రబ్బి-ఇన్నబ్నీ-మిన్-అహ్లీ-వ-ఇన్న-వఅద-కల్-హఖ్ఖు-వ-అన్త అహ్కా-కుముల్-హాకిమీన్. 46. ఖాల-యా-నూహు-ఇన్నహూ-లైస-మిన్-అహ్లిక-ఇన్నహూ-అమలున్-గైరు-సాలిహిన్-ఫలా-తస్-అల్ని-మా-లైస-లక-బిహీ-ఇల్మున్ ఇన్నీ-అఇజుక-అన్-తకూన-మినల్-జాహిలీన్. 47. ఖాల-రబ్బి ఇన్నీ-అఊజు-బి-క-అన్-అస్-అలక-మా-లైస-లీ-బిహీ-ఇల్మున్-వ-ఇల్లా-తగ్-ఫిర్ లీ-వ-తర్-హమ్నీ-అకున్-మినల్-ఖాసిరీన్. 48. ఖీల-యా నూ-హుహ్-బిత్-బిసలామిమ్-మిన్నా-వ-బర-కాతిన్ అలైక-వ-అలా-ఉమ-మిమ్-మిమ్-మమ్-మఅక-వ-ఉమమున్-స-నుమత్తి-ఉ-హుమ్-సుమ్మ-యమస్సు హుమ్-మిన్నా-అజా-బున్-అలీమ్. 49. తిల్క-మిన్-అంబా-ఇల్-గైబి-నూహీహా-ఇలైక-మాకు న్-తఅ-లముహా-అ న్-వలా-ఖౌముక మిన్-ఖబ్లి-హాజా-ఫస్-బిర్-ఇన్నల్-ఆఖి-బత-లిల్-ముత్త-ఖీన్.

45. మఱియు నూహు తన ప్రభువును పిలిచి ఓ నాప్రభువా! నా కుమారుఁడు నా కుటుంబమునకు చేరినవాఁడు. మఱి నీవాగ్దానము సత్యమైనది. మఱి నీవు సర్వాధికారివి అని విన్నవించెను. 46. ఓ నూహు! అతఁడు నీ కుటుంబమునకు చేరినవాఁడుకాఁడు. వాని పనులు మంచివికావు. కావున నీకుఁ దెలియని విషయము నాతో అడుగకుము. నీవు మూఢులతో చేరకుండుటకై నేను నిన్ను బోధించుచున్నాను అని దేవుఁడు పలికెను. 47. ఓనాప్రభువా! నాకుఁ దెలియని విషయమును నీతో అడుగుటనుగూర్చి నీ శరణుజొచ్చుచున్నాఁడను. మఱి నీవు నన్ను క్షమించి యనుగ్రహింపనిచో నేను నష్టముపొందినవాఁడనగుదును అని నూహు విన్నవించెను. 48. ఓ నూహు! నావనుండి సురక్షితముగా దిగుము. నీకును నీవెంటనున్న జనులకును శుభములు గలుగును. మఱి యితరులకును మేము లాభము గలిగింతుము. ఆ పిదప మాయొద్దనుండి వారికి దుఃఖకరమైన శిక్ష లభించును అని సెలవయ్యెను. 49. ఈ విషయము అగోచరమైన విషయములలోనిది. నీకు దీనికిగూర్చి సందేశము పంపుచున్నారము. దీనికిపూర్వము నీకును నీకులమువారికిని తెలియకుండెను. కావున నీవు ఓపిక వహించియుండుము. నిశ్చయముగా మంచి ఫలితము భక్తులకే గలదు.

వ్యా॥ 45 : 49. నూహుప్రవక్తయొక్క కుమారుఁడు (కన్ అను) మునిగిపోయెనుగదా! దానికిఁగాను నూహు తన మనస్సునకు శాంతి గలుగుటకై దేవునితో ఓ ప్రభువా! నీవు నాకుటుంబమునకు చేరిన వారిని రక్షింతువు అని వాగ్దానము చేసియుంటివి గదా! కన్ అను నా కుమారుఁడు. నాకుటుంబమునకు చేరినవాఁడు గదా! నీవు సర్వాధికారివి. నీవు చేసిన పనిలో నేను మాటలాడలేను అని విన్నవించెను. 46. దానికి దేవుఁడు, ఓనూహు! వాఁడు విశ్వసించలేదు. మఱి నిన్ను అనుసరింపలేదు. కావున వాఁడు నీకుటుంబమునకు చేరినవాఁడుకాఁడు. అదియునుగాక వాని పనులు మంచివికావు. వానిహృదయములో విశ్వాసములేదు. అందుకే వాఁడు కాఫిర్లలో చేరిపోయెను. వాని వంచన విషయము నీకుఁ దెలియదు. కావున ఇఁక నీకుఁ దెలియని విషయమునుగూర్చి యడుగవలదు అని నిన్ను బోధించుచున్నాను అని పలికెను. 47. తత్క్షణమే నూహుప్రవక్త దేవునితో క్షమాపణ వేఁడి నీవే నన్నుక్షమించి అనుగ్రహింపవలెను. నాకుఁ దెలియని విషయము అడుగకుండ యుండుటకై నీవే శరణ్యుఁడవు. నిన్ను ఆశ్రయించుచున్నాను అని దేవునిని వేఁడెను. 48. ఆ పిదప దేవుఁడు నూహును ఆతనివెంటనున్న విశ్వాసులను నావనుండి దిగి జూదీకొండనుండి భూమిపై సురక్షితముగాఁ దిగుటకై సెలవిచ్చెను. మఱియు చెడిన భూమి తిరిగి బాగుపడి మీకు శుభములును మేళ్ళును కలుగును అని వారికిఁ దెలిపెను. ఇఁక మీఁద అవిశ్వాసులైన యితరులనుకూడ ఇహమునందు లాభములును సౌఖ్య

ములును గలిగి వారి పాపకార్యములకుఁగాను పరమునందు దుఃఖకరమైన నరక బాధ వారికి లభించును. 49. నూహుప్రవక్త చరిత్రము అరబ్బులకుఁ దెలియదు. అటులే దీనికిపూర్వము హజ్రత్ రసూలువారు నూహు విషయములు విని యెఱుంగరు. తెలియని విషయము వాస్తవముగాఁ దెలిసికొనుట దేవుని సందేశము వలననే వీలగునుగాని వేఱు మార్గమునకానేరదు. కావున రసూలువారు దేవుని ప్రవక్తలుఅని ఋజువగుచున్నది. ఎట్లు నూహుప్రవక్త రక్షింపఁబడి వారి విరోధులు నశింపఁబడిరో అటులే రసూలువారు మంచి ఫలితముపొంది వారి విరోధులు దుర్గతినొందుదురు. కావున కాఫిర్లు పెట్టు కష్టములకు ఓర్చుకొనియుండవలెను అని దేవుని సెలవు హజ్రత్ ముహమ్మద్ రసూలువారి కాయెను.

50. వ-ఇలా-ఆదిన్-అఖాహుమ్-హూదన్ ఖాల-యా-ఖౌ-మిఅ - బుదుల్లాహ-మాలకుమ్-మిన్-ఇలాహిన్ గైరుహూ-ఇన్ అన్తుమ్ - ఇల్లా-ముఫ్ తరూన్. 51. యా-ఖౌమి-లా-అస్-అలుకుమ్ అలైహి-అజ్రన్-ఇన్ అజ్-రియ-ఇల్లా అలల్-లజీ--ఫతరనీ-అఫలా-తఅ-ఖిలూన్. 52. వ-యాఖౌ-మిస్-తగ్ - ఫిరూ-రబ్బకుమ్-సుమ్మ-తూబూ-ఇలైహి-యుర్ సి-లిస్ సమాఅ-అలైకుమ్ మిద్ రారన్-వ-యజిద్ కుమ్-ఖువ్వతన్-ఇలా ఖువ్వ-తికుమ్ వలా-తత వల్ లౌ- ముజ్రిమీన్. 53. ఖాలూ-యా-హూదు-మా-జీతనా బి-బయ్యి-నతిన్ వమా-నహ్ను బి-తారికీ-ఆలి హతినా-అన్-ఖౌలిక-వమా-నహ్ను-లక-బిమూ-మినీన్. 54. ఇన్-న ఖూలు-ఇల్ -లఅ-తరాక-బఅ జు-ఆలి-హతినా-బి-సూఇన్-ఖాల-ఇన్నీ - ఉష్-హిదుల్లాహ-వష్-హదూ-అన్నీ-బరీ-ఉమ్-మిమ్మా-తుష్-రికూన్. 55. మిన్ దూనిహీ-ఫకీదూనీ-జమీఅన్-సుమ్మ-లా-తున్-జిరూని. 56. ఇన్నీ తవక్కల్తు-అలల్లాహి-రబ్బీ-వ-రబ్బి-కుమ్-మా-మిన్-దాబ్బ-తిన్ ఇల్లా-హువ-ఆఖిజుమ్-బి-నాసియతిహా-ఇన్న-రబ్బీ-అలా సిరాతిమ్-ముస్-తఖీమ్. 57. ఫ-ఇన్-తవల్ లౌ-ఫఖద్ అబ్ లగ్-తుకుమ్-మా-ఉర్ -సిల్ తు-బిహీ-ఇలైకుమ్ వ-యస్-తఖ్ లిఫు - రబ్బీ ఖౌమన్- గైరకుమ్-వలా-త-జుర్రూనహూ-షైఅన్-ఇన్న-రబ్బీ-అలా-కుల్లి - షైఇన్-హఫీజ్.

50. మఱియు మేము ఆదువారియొద్దకు వారి సహోదరుఁడగు హూదును పంపితిమి. ఓ జనులార! మీరు దేవునినే యారాధింపుఁడు. అతఁడు తప్ప

మీకు వేఱు పూజ్యుఁడు లేఁడు. మీరు అబద్ధములుమాత్రముకల్పించుచున్నారు. ఓ జనులార! ప్రచారమునకుఁగాను మీయొద్ద నేను కూలి నడుగుటలేదు. నన్ను సృష్టించిన వానిపై నాకూలియున్నది. మఱెందులకు మీరు గ్రహింపరు. 52. మఱి ఓ జనులార! మీప్రభువులో మీ పాపములకు క్షమాపణ వేఁడుడు. మరల ఆతనివైపునకే తిరుగుఁడు. మీకు ఆకాశమునుండి వానధారలు పంపును. మఱి మీకు బలముపై బలమొసంగును.మఱిమీరుపాపులై విశ్వాసమునుండితిరిగి పోకుఁడు అని హూదు పలికెను. 53. (అపుడు) వారు ఓహూదు! నీవు మా యొద్దకు సూచన తీసికొని రాలేదు. మఱి మేము నీమాటపై మా దేవతలను వదలువారలము కాము. మఱి మేము నిన్ను నమ్మువారలముకాము. 54. మా దేవతలలోని కొందఱు నీకు పిచ్చిపట్టునట్టుగ కీడుగలిగించియున్నారు అని పలికిరి. దేవుని వదలి మీరు సాటిగ కల్పించుదానిని నేను వదలిపోవు చున్నాను (అసహ్యపడుచున్నాను) అని నేను దేవునిని సాక్షిగ నుంచుచున్నాను. మఱి మీరును సాక్షిగ నుండుఁడు. కావున, మీరందఱును కలిసి నా విషయము కుట్ర చేయుఁడు. మఱి నాకు విరామము నొసంగకుఁడు. 56. నా ప్రభువును మీప్రభువును అగు దేవునిపై నేను ఆధారపడితిని. భూమిపై సంచరించు ప్రతి ప్రాణి జుట్టు దేవుని చేతిలో నున్నది. నిశ్చయముగా నాప్రభువు సన్మార్గమునందున్నాఁడు. 57. మఱి మీరు ముఖము త్రిప్పుకొనిపోతిరేని మీకొఱకు నాకొసంగఁబడిన సందేశమును మీకందఁజేసితిని. మఱి నాప్రభువు మీకు బదులుగ భూమిలో నితర జనులను వసింపఁజేయును. మఱి మీరు దేవునికి నేలాటి కీడును చేయఁజాలరు. నిశ్చయముగా నాప్రభువు ప్రతి వస్తువునుచూచుచునేయున్నాఁడు అని హూదు పలికెను.

వ్యా॥ 50. దేవుఁడు, ఆదువంశమువారియొద్దకు హూదును ప్రవక్తగాఁజేసి పంపెను. ఆదువారు విగ్రహములను చిల్లరదేవతలను పూజించుచుండిరి. హూదుప్రవక్త జనులకు మీరు విగ్రహారాధన చేయకూడదు. మీరు కల్పించుకొన్న దేవతల విగ్రహములు నిజముకావు., అవికల్పనమాత్రము. వారికి నేలాటి అధికారమునులేదు. 51. నాకు మీధనము అక్కఱలేదు. నేను చేయు మత ప్రచారమునకుఁగాను మీయొద్ద కూలి నడుగను. నన్ను పుట్టించిన దేవుఁడేనన్ను ఇహమునందు పోషించును. పరమునందు నాకు పుణ్యము లొసంగును. మీమేలుకోరి మాత్రము మీకు బోధించుచున్నాను. ఇందు నాకేలాటి ఆశలేదు. ఇంత సాధారణమైన మాటకూడ మీరు గ్రహింపలేరా? 52. కావున మీరు చేసిన పాపములకు దేవుని యొద్ద క్షమాపణ వేఁడుడు. దేవుఁడే క్షమించువాఁడు. దేవునిని భయభక్తులతో ప్రార్థించుటవలన దేవుని అనుగ్రహముగలిగి సకాలముగ వర్షములు కురిసి పంటలు పండి ఇహలోకసౌఖ్యములుగలిగిధనదేహబలములుగలిగి

సంతానాభివృద్ధియై ఆత్మికబలము, శాంతము లభించును. కావున దుర్మార్గులైన పాపులు దేవునికి అవిధేయులై విశ్వాసము వదలిపోవునట్లు మీరు ముఖములు త్రిప్పుకొని పోకుఁడు అని హూదు ప్రవక్త పలికెను. ఆ జనులకు మూఁడు సంవత్సరములనుండి వానలేక బాధపడుచుండిరి. కావున హూదుప్రవక్త ఓ జనులార! మీరు విశ్వసించి సత్కార్యములు చేసితిరేని వాన కురిసి మీకు మంచికాలము వచ్చును అని వాగ్దానముచేసెను. 53. హూదుప్రవక్త బోధనువిని జనులు ఓ హూదు! నీయొద్ద స్పష్టమైన సూచన (సన్నదు) లేదు. కావున మేమునమ్మము. మాదేవతల పూజలు మేము వదలము అని ద్వేషమును దుష్టత్వమును వహించి పలుకసాగిరి. 54. మఱి ఓహూదు! నీవు పిచ్చిపిచ్చిగా మాటలాడుచున్నావు. బహుశః మాదేవతలు కుపితులై నిన్ను పిచ్చివానిగఁ జేసినవి కాఁబోలు. ఎందుకన నీవు మావిగ్రహములను దేవతలను దూషించుచున్నావు. వానిని వదలిపెట్టుఁడు అని మాతో పలుకుచున్నావు అని హూదుతో జనులుపలికిరి. దానికిహూదుప్రవక్త పాపము! ఈరాతివిగ్రహములు నాకేమి కీడుచేయఁగలవు. మీరుబలిష్ఠులుగా నున్నారుగదా! మీరును మీదేవతలును కలిసి యొంటరిగానున్న నావిషయము కుట్రలుసలిపి నాకు కీడుచేయుటకు పూనుకొనుఁడు. ఇందునాకేలాటి గడవుగాని విరామముగాని యియ్యకుఁడు. మీరెంత చేసినను మీరునాకు రవంతయును హానిచేయఁజాలరు. వినుఁడు నేను దేవునిని సాక్షిగనుంచి మీదేవతలను ధిక్కరించుచున్నాను. వానియందునాకు చాల అసహ్యముగలదు. వానితో నాకేలాటిసంబంధములేదు అనిప్రకటించు చున్నాఁడను. మీరును సాక్షులుగానుండుఁడు. మీరుచేయవలసిన ప్రయత్నములు మీరు చేయుఁడు. నేను దేవునిపై నాధారపడి యున్నాఁడను. అతఁడు మీకును నాకును ప్రభువు. సర్వము అతనిచేతిలోనున్నది. అందఱిజుట్టు అతని చేతిలోనున్నది. తాను కోరినట్లులాగఁగలఁడు. సర్వము అతనికి అధీనమైయున్నది. నేరస్థుఁడు అతనినుండి తప్పించుకొని పాఱిపోఁజాలఁడు. అతని శరణుజొచ్చిన భక్తులు అవమానము పొందరు. దేవునియొద్దన్యాయమున్నది. అన్యాయములేదు. అతనిత్రోవసరియైనది. అతఁడునియమించిన సన్మార్గము ననుసరించువారిని కటాక్షించుచు కాపాడుచున్నాఁడు. సన్మార్గమందున్నవారికి అతనిప్రీతి లభించును. 57. ఇట్టి స్పష్టమైన సూచనలును మాటలును వినికూడ మీరు నమ్మక తిరస్కరించి తిరిగిపోతిరేని నాకేలాటి నష్టములేదు. నాపని మతప్రచారము చేయుట మాత్రము. దేవునినుండివచ్చినసందేశమును మీకందఁజేసితిని. నాపనినెఱవేర్చితిని. మీరుచేయు దుర్మార్గములకును ద్వేషములకును ఆకాశమునుండి అపదవచ్చి మిమ్ము నాశముచేయును. మీరు నశించిపోయిన ఏమియు కొఱతలేదు. భూమిచెడి

పోదు. దేవుఁడు మీకు బదులుగ నితర జనులనువసింపఁజేయును. వారుభూమి పైనివసింతురు. వారు మీయానక్తికి వారసులగుదురు. వినుఁడు! మీనాశము వలన దేవునిదిగాని ఆతని ప్రవక్తదిగాని నష్టములేదు. దేవుఁడు సర్వశక్తుఁడు. ఆతఁడు ప్రతివస్తువును చూచుచు కాపాడును అని హూదుపలికెను.

58. వలమ్మాజాఅ అమ్రునా-నజ్జైన-హూదన్-వల్లజీన-ఆమనూ మ అహూ-బి-రహ్మతిమ్-మిన్నా-వనజ్జైనాహుమ్-మిన్-అజాబిన్ - గలీజ్. 59. వతిల్క-ఆదున్-జహదూ-బిఆ-యాతి-రబ్బిహిమ్-వ-అసౌ-రుసు-లహూ-వత్ - త బఊ-అమ్ర-కుల్లి-జబ్బారిన్-అనీద్. 60. వ-ఉత్ బిఊ-ఫీ-హాజి-హిద్ - దున్యా లఅ-నతన్-వ-యౌ-మల్-ఖియా మతి-అలా-ఇన్న-ఆదన్-కఫరూ-రబ్బ హుమ్- అ లా-బుఅ-దల్-లిఆదిన్-ఖౌమి-హూద్.

58. మఱి మాయాజ్ఞ వచ్చినపుడు మేము హూదును ఆతనితోఁబాటు విశ్వసించిన వారిని మా అనుగ్రహముచే రక్షించితిమి. మఱి ఘోర శిక్షనుండి వారిని కాపాడితిమి. 59. మఱి వీరే ఆదువారు. వీరు తమ ప్రభువు సూచనలను తిరస్కరించి దేవుని ప్రవక్తల మాటలు వినక గర్విష్ఠులుగాను దుష్టులునుగా నున్నవారి మాట వినినవారు. 60. ఇహలోకమందును పరలోకమందును వారి వెను వెంట శాపమున్నది. వినుఁడు! ఆదువారు తమ ప్రభువును తిరస్కరించిరి. వినుఁడు! హూదు జనులగు ఆదువారికి శాపమున్నది.

వ్యా॥ 58. ఆదువారు హూదు ప్రవక్త మాట వినలేదు. తుదకు వారికి నాశము గలుగవలెనని దేవుని యాజ్ఞ వచ్చెను. అవియేమన ఏడురాత్రులు ఎనిమిది దినములు ఘోరమైన తుపాను గాలి వీఁచి ఇండ్లు చెట్లుపడి ఎచ్చటనున్న వారచ్చటనే చచ్చిరి. కాని హూదును ఆతనితోఁబాటు దాదాపునాలుగు వేల మంది విశ్వాసులును దేవుని దయవలన ఆ శిక్షనుండి రక్షణపొందిరి. వారి కే లాటి నష్టముగాని కష్టముగాని గలుగలేదు. విశ్వాసులు తమ విశ్వాసమువలన సత్కార్యములవలన దేవునియనుగ్రహముపొంది పరలోక ఘోర శిక్షనుండికూడ రక్షణ పొందుదురు. 59. ఇందు ఆదువారెట్లు నశింపఁబడిరో చూడుఁడు. వారిగతి యేమాయెనో. వారు దేవునిని ఆతని ప్రవక్తలను తిరస్కరించినందున వారెట్లు నాశమొందిరో వారు దేవుని ధర్మములను వినక తమ దుష్టనాయకుల మాట విని ఎట్లు నశించిరో. గమనింప వలెనని జనులకు హెచ్చరిక గలదు. 60. ఈ దుష్టులకు వెంట సదా శాపముండును. ఉభయ లోకములలోను అందుతెగులుకొని యుండును. శాపము వలననే దేవుని కోపమునకు పాత్రులగుదురు. అని హెచ్చరింపఁ బడియెను. ఆరాఫు సూరాలో వీరి విషయమున్నది.

61. వఇలా-సమూద-అఖా-హుమ్-సాలి-హన్-ఖాల-యాఖా మిఅ-బుదుల్లాహ-మాలకుమ్-మిన్-ఇలా-హిన్-గైరుహూ-హువ-అన్-ష-అ-కుమ్-మినల్ అర్ జి-వస్-తఅ-మర-కుమ్-ఫీహా-ఫస్-తగ్-ఫిరూహు-సుమ్మ-తూబూ-ఇలైహి-ఇన్న-రబ్బీ-ఖరీబుమ్-ముజీబ్. 62. ఖాలూ-యా-సాలిహు-ఖద్-కున్త-ఫీనా-మర్-జూవన్-ఖబ్ల-హాజా-అ-తన్-హానా-అన్-నఅ-బుద-మా-యఅ-బుదు-ఆబాఉనా-వఇన్ననా-లఫీ-షక్కిమ్-మిమ్మా-తద్-ఊనా-ఇలైహి-మురీబ్. 63. ఖాల యా-ఖౌమి-అర-ఐ-తుమ్-ఇన్-కున్తు-అలా-బయ్యి-నతిమ్-మిర్-రబ్బీ-వ-ఆతానీ-మిన్హు-రహ్-మతన్-ఫమన్-యన్-సురునీ-మినల్లాహి-ఇన్-అసైతుహూ-ఫమాతజీదూననీ గైర-తఖ్-సీర్. 64. వ-యా-ఖౌమి-హాజిహీ-నాఖ-తుల్లాహి-లకుమ్ ఆయతన్-ఫజరూ-హా-తాకల్-ఫీ-అర్-జిల్లాహి-వలా-తమస్సూహా-బిసూ ఇన్-ఫయాఖుజకుమ్-అజాబున్-ఖరీబ్. 65. ఫ-అఖరూహా-ఫఖాల-తమత్తఊ-ఫీ-దారికుమ్-సలా సత-అయ్యా-మిన్-జాలిక-వఅ-దున్-గైరు-మక్-జూబ్. 66. ఫలమ్మా-జాఅ-అమ్రునా-నజ్జైనా-సాలిహన్-వల్-లజీ-న-ఆమనూ-మఅహూ-బి-రహ్మతిమ్-మిన్నా-వ-మిన్-ఖిజ్ఇ-యౌమి ఇజిన్-ఇన్న-రబ్బక-హువల్-ఖవియ్యుల్-అజీజ్. 67. వ-అఖజల్-లజీన-జల-ముస్-సైహతు-ఫ-అస్-బహూ-ఫీ-దియా-రిహిమ్-జాసిమీన్. 68. కఅల్-లమ్-యగ్-నౌ-ఫీహా-అలా-ఇన్న-సమూద-కఫరూ-రబ్బహుమ్-అలా-బుఅ-దల్-లిసమూద్.

61. మఱియు సమూదువారి యొద్దకు వారి సహోదరుఁడగు సాలిహను పంపితిమి. ఓ జనులారా! మీరు దేవునినే యారాధింపుఁడు! ఆతఁడు తప్ప వేఱు పూజ్యుఁడు మీకు లేఁడు. ఆతఁడే మిమ్ము భూమినుండి పుట్టించి అందే మీకు నివాసము నేర్పఱిచెను. కావున మీరు మీపాపముల క్షమాపణ ఆతని యొద్ద వేఁడుకొనుఁడు. మఱి ఆతని వైపునకు తిరుగుఁడు. నిశ్చయముగా నాప్రభువు దగ్గఱఁగనే యున్నాఁడు. ప్రార్థనలను అంగీకరించుచున్నాఁడు అని సాలిహ పలికెను. 62. వారు ఓసాలిహా! దీనికి పూర్వము మేము నీపై ఆశ పెట్టుకొని యుంటిమి. మాతాత ముత్తాతలు పూజించుచున్న దేవతలను పూజించుటను గూర్చి నీవు మాకు నిషేధించుచున్నావా! నీవు మాకు బోధించు

మత విషయములో వాస్తవముగ మాకు చాల సందేహము గలదు అని పలికిరి. 63. ఓ జనులార! సరే చూడుఁడు! నేను నా ప్రభువు యొక్క సూచనను అనుసరించుచు ఆతని అనుగ్రహమునే పొంది యున్నపుడు నేను ఆతనికి విధేయుఁడ నైతినేని ఎవరు ఆతని శిక్షనుండి నన్ను రక్షింపఁగలరు. మఱి మీరు నాకు పూర్తిగ నష్టమే చేయుచున్నారు. 64. మఱి ఓ జనులార! ఇది మీకు సూచనగా వచ్చిన దేవుని యొంటె యున్నది. కావున అది దేవుని భూమిపై మేయునట్లుగా దానిని వదలి పెట్టుఁడు. మఱి దానికి కీడు చేయకుఁడు. అట్లు మీరు చేసితిరేని శీఘ్రముగానే మీకు శిక్ష కలుగును. అని సాలిహ పలికెను. 65. ఆ పిదప వారు ఆ యొంటెకాళ్లను కోసివేసిరి. అపుడు సాలిహ మీరు మీయిండ్లలో మూడు దినముల వఱకు వసించి లాభములు పొందుఁడు. ఈ వాగ్దానము (గడువు) అబద్ధము కానేరదు అని పలికెను. 66. ఆ పిదప మాయాజ్ఞ రాఁగా సాలిహను ఆతనితోఁబాటు విశ్వాసులను మాయనుగ్రహమువలన రక్షించితిమి. మఱి వీరిని ఆ దినమునందలి యవమానమునుండి కాపాడితిమి. నిశ్చయముగ నీ ప్రభువు బలవంతుఁడును సర్వశక్తుఁడును. మఱి దుర్మార్గులకు భయంకరమైన శబ్దము వచ్చి పట్టగానే తెల్లవాఱు సరికి వారు తమ యిండ్లలో తలక్రిందులుగ పడిచచ్చిరి. 68. అచ్చట వారు వసించి యుండనట్లుగనైపోయిరి. వినుఁడు! సమూదువారు తమ ప్రభువును తిరస్కరించిరి. వినుఁడు సమూదువారికి శాపమున్నది.

వ్యా॥ 61. సాలిహ ప్రవక్తను గూర్చి ఆరాఫుసూరాలో వ్రాసియున్నాము భూమినుండి పుట్టించెను అనఁగా తొలుత ఆదమును మట్టితోఁ బుట్టించెను. ఆతని సంతానమే మానవులు. మనుష్యుల యాహారము భూమినుండియే గలుగుచున్నది. ఆ యాహారమునే తిని మానవులు పుట్టి పెరుగుచున్నారు. భూమిపైననే సంసారము చేయుచు వసించుచున్నారు. తమ్ము పుట్టించిన పెంపుఁజేసిన సృష్టికర్తను మానవులు పూజింపవలెను. దేవునికి సాటిగ చిల్లర దేవతలను కల్పింపరాదు. సర్వపాపముల క్షమాపణ దేవుని యొద్ద భయభక్తులతో వేఁడుకొనవలెను. దేవుఁడు ప్రజల ప్రార్థనలను, మొఱలను సమీపములో నుండి విని వానినంగీకరించుచు వారి కోరికలను నెరవేర్చుచున్నాఁడు. 62. సాలిహ ప్రవక్త చేసిన బోధను జనులు విని ఓసాలిహ! నీవు పెద్దవాఁడవై నీబుద్ధి యోచనల వలన మాసంఘమును వృద్ధి చేయుదువు అని నీయెడ మాకు చాల ఆశ యుండెను. కాని నీవు పలుకుమాటలఁ బట్టి చూచిన మాతాత ముత్తాతలు గావించుచు వచ్చిన ఆచారములు చెడిపోవునట్లుగ నున్నవి. పూర్వమునుండి వచ్చుచున్న పాత కులదేవతలను వదలి ఒక్క దేవునిని పూజింపవలెనని పలుకుచున్నావా! నీవు చేయు బోధ విషయము మాకు చాల సందేహము గలదు. నీవు పూనిన పద్ధతి సరికాదు అని పలికిరి. 63. వీరు చెప్పిన మాటలు విని అయ్యా! మీకు సందేహ

ముస్న మాత్రాన నేను నామత ప్రచారము వదలను. దేవుఁడు తన యనుగ్రహ మువలననాకుప్రవక్తపదవి నొసంగి సూచనల నిచ్చెను. నేను సన్మార్గము నను సరించుచున్నాఁడను. మీమాట విని నేను మత ప్రచారము వదలుకొని దేవుని సందేశమునకు వ్యతిరేకముగ నడచుకొన్నచో దేవుని శిక్షనుండి నన్ను ఎవరు రక్షింపఁగలరు. ఎవరునునన్ను రక్షింపఁ జాలరు. నేను మీమేలు కోరి ధర్మమార్గ ము మీకు బోధించుచున్నాను. నీవు ప్రచారము మానుకొనుము అని పలికి మీరు నానష్టమునకు కారకు లగుచున్నారు. మీవలన నాకు నష్టము తప్ప వేఱేమియు లభింపదు. కావున నేను మీమాటలు వినను. మతప్రచారము మానుకొనను అని పలికెను. 64,65.సమూదువారు సాలిహ్ప్రవక్తతో నీవు మాకొకసూచన చూపుము అని కోరిరి. అపుడు ఒక యొంటె బయలు పడెను. దానిని స్వేచ్ఛగా మేయుటకు వదలిపెట్టుఁడు అని దేవుని సెలవయ్యెను. కాని సమూదువారు దానికాళ్లు తెగనఱికిరి. దానికిఁగాను దేవుని శిక్ష వారికి వచ్చి వారు నశించిరి. దేవుఁడు తన యనుగ్రహమువలన సాలిహను విశ్వాసులను ఆశిక్షనుండి రక్షించెను. దీని గూర్చి వివరము ఆరాఫ్ సూరాలో చూచుకొనునది. దేవుఁడు సర్వశక్తుఁడు. తాను కోరిన వారిని శిక్షించును. తాను ఇష్టపడిన వారిని రక్షించును. 67. 68. సమూదు వారికి రాత్రి వారి యిండ్లలోనే భయంకరమైనశబ్దము గలిగి భూకంపము వలన తలక్రిందులుగ పడి వారు చచ్చిరి. వారు పేరులేకుండ నాశమొందిరి. తమ ప్రభువు సూచనలను ధర్మములను నమ్మక తిరస్కరించిన వారికి నిట్టి గతియే పట్టును. కావున వినువారు బుద్ధితెచ్చుకొని విశ్వాసులు కావలెను అని హెచ్చరింపఁ బడియెను.

69. వల-ఖద్-జాఅత్-రుసులునా-ఇబ్రాహీమ-బిల్-బుష్రా-ఖాలూ-సలామన్-ఖాల-సలామున్-ఫమా-లబిస-అన్‌జాఅ-బి-ఇజ్‌లిన్-హనీజ్. 70. ఫలమ్మా-రఆ-ఐది-యహుమ్-లా-తసిలు-ఇలైహి-నకిర-హుమ్-వ-ఔజస-మిన్-హుమ్ ఖీఫతన్-ఖాలూ-లా-తఖఫ్-ఇన్నా-ఉర్-సిల్నా-ఇలా-ఖౌమిలూత్. 71. వమ్రఅతుహూ-ఖాఇ-మతున్-ఫజహీకత్-ఫ-బష్-షర్‌నాహా-బి-ఇస్‌హాఖ-వ-మిన్-వ-రాఇ-ఇస్‌హాఖ-యఅ-ఖూబ. 72. ఖాలత్-యా-వైలతా-అ-అలిదు-వ-అనా అజూ-జున్-వ-హాజా-బఅలీ-షైఖన్-ఇన్న-హాజా-లషైఉన్-అజీబ్. 73. ఖాలూ-అ-తఅ-జబీన-మిన్-అమ్‌రిల్లాహి-రహ్మతుల్లాహి-వ-బరకాతుహూ-అలైకుమ్- అహ్లల్-బైతి-ఇన్నహూ-హమీదుమ్-మజీద్. 74. ఫలమ్మా-జహబ-అన్-ఇబ్రా

హీ-మర్ రౌఉ-వ-జా-అత్-హుల్-బుష్రా-యుజాదిలునా ఫీ-ఖౌమి - లూత్.
75. ఇన్న-ఇబ్రాహీమ లహలీమున్-అవ్వాహుమ్-మునీబ్. 76. యాఇబ్రాహీము
అఅ్-రిజ్-అన్-హాజా ఇన్నహూ-ఖద్-జాఅ అమ్రు-రబ్బిక-వ-ఇన్నహుమ్- ఆతీ
హిమ్-అజాబున్-గైరు మర్-దూద్.

69. మఱియు నిశ్చయముగా మాదూతలు సంతోషవార్త తీసికొనియిబ్రాహీమునొద్దకు వచ్చి సలామ్ అని పలికిరి. ఇబ్రాహీము సలామ్ అని పలికెను. పిదప ఆలస్యముచేయక కాల్చిన ఆవుదూడను తీసికొనివచ్చెను. 70. పిదప ఆతఁడు వారి చేతులు దానిచుట్టు పోకుండుటను చూచి బెదరి మనస్సులో వారికి భయపడెను. అపుడు వారు నీవు భయపడకుము. మేము లూతుయొక్క-కులము వారియొద్దకు పంపఁబడినాము అని పలికిరి. 71. మఱియు ఇబ్రాహీముభార్య నిలిచియుండెను. అపుడామె నవ్వెను. పిదప మేము ఇస్హాఖు పుట్టును, మఱి ఇస్హాఖు తరువాత యాఖూబు కలుగును అను సువార్త ఆమెకు నిచ్చితిమి. 72. ఓహో! నాకు బిడ్డ పుట్టునా? మఱి నేను ముసలిదానను. మఱి యీనాభర్త ముసలివాఁడై యున్నాఁడు. ఇది చాల ఆశ్చర్యమైన మాటగా నున్నదే అని యామె పలికెను. 73. వారు "నీవేమి? దేవుని యాజ్ఞ విషయమను ఆశ్చర్య పడుచున్నావా? ఓ యింటివారలార! మీకు దేవుని యనుగ్రహమును ఆతని శుభములును గలవు. ఆతఁడు స్తోత్రణీయుఁడు. ఘనతగలవాఁడు అని దేవదూతలు పలికిరి. 74. ఆ పిదప ఇబ్రాహీమునుండి భయము తొలఁగఁగా ఆతనికి సంతోష వార్త రాఁగా లూతుయొక్క జాతివారి విషయము మాతో వాదింపసాగెను. 75. నిశ్చయముగ ఇబ్రాహీము సహనముగలవాఁడును, మెత్తని హృదయముగల వాఁడును. దేవునివైపున తిరుగువాఁడును. 76. ఓ యిబ్రాహీము! దీనిని సడలి పెట్టుము. నిశ్చయముగా నీప్రభువుయొక్క యాజ్ఞ వచ్చివేసినది. మఱి లూతు జాతి వారికి ఆపద రానున్నది. అది తప్పదు అని పలికిరి.

వ్యా॥ 69. ఇబ్రాహీము ప్రవక్తకును లూతుప్రవక్తకును చాలసంబంధము గలదు. అందువలన లూతు ప్రవక్త విషయము తెలుపుటకుముందు ఇబ్రాహీము ప్రవక్త విషయము కూడ నిచ్చట చెప్పఁబడుచున్నది. దేవదూతలు లూతు ప్రవక్తయొద్దకు పోవుచు ఇబ్రాహీము ప్రవక్తయొద్దకు వచ్చి నీకు బీబి సారాయందు ఇస్హాఖు అను పుత్రుఁడు పుట్టును. ఆతఁడు దేవునికిప్రియుఁడు దేవుఁడు, లూతు ప్రవక్తను విశ్వసింపని దుష్ట జనులను సశింపఁజేయును అను వార్త దెలిపిరి. దేవదూతలు వచ్చి ముందు సలామ్ చేసిరి. దానికి ఇబ్రా హీముప్రవక్తకూడ జవాబిచ్చెను. దేవదూతలు సుందరవంతులైన యౌవనుల రూపము దాల్చి వచ్చినందున ఇబ్రాహీముప్రవక్తవారు దేవదూతలు అని గుర్తిం

పక సామాన్య మనుష్యులు వచ్చినారని తలంచి శీఘ్రముగా నింటిలోనికి పోయి ఒక యావుదూడను జబాచేసి బాగుగా కాల్చి దానిని దెచ్చి అతిథులకు పెట్టెను. 70. దేవదూతలు దానిని తినక యూరక కూర్చుండియుండిరి. ఆ కాలములో అతిథులు భుజింపనిచో నేదో యొక చెడ్డతలంపుతో అతిథులు వచ్చినారని తలంచుచుండిరి. దానినిబట్టి ఇబ్రాహీముప్రవక్త బెదరి వారికి లోలోపల భయపడెను. దేవదూతలు చూచి ఓ ప్రవక్తా! నీవు భయపడకుము. మేము దేవుని దూతలము. మేము దేవుని యాజ్ఞపొంది లూతుకులమువారిని శిక్షించుటకు పోవుచున్నారము అని పలికిరి. 71. అపు డచ్చట బీబీ సారా నిలిచియుండెను. ఆవార్త విని సుతసముతో నవ్వెను. అపుడు దేవదూతలు బీబీ సారాతో నీకు ఇస్హాఖు అను పుత్రుండు పుట్టును ఇస్హాఖునకు యాఖూబు అను పుత్రుండు పుట్టును అని సంతోషవార్త వినిపించిరి. బీబీ సారా వయస్సు చెల్లిన ముదుసలి యామె. ఆమెకు సంతానము లేకుండెను. ఆమె సవతియగు బీబీ హాజరాకు ఇస్మాయీలు అను పుత్రుండు గలిగియుండెను. కావున ఆమెకు కూడ సంతానాపేక్ష యుండెను. కాని వయస్సు చెల్లిపోయినందున బిడ్డలు గలుగరు అని ఆశ వదలిపెట్టియుండెను. దేవదూతల మాటలు విని యాశ్చర్యమునొంది నేను ను నాభర్తయును వయస్సు చెల్లిన ముదుసలివారలము. మాకెట్లు బిడ్డలు గలుగుదురు. ఈ స్థితిలో బిడ్డ గలుగుట చాల యాశ్చర్యమే అని పలికెను. 73. అపుడు దేవదూతలు "ఏమి నీవు దేవునియాజ్ఞనుగూర్చి ఆశ్చర్యపడుచున్నావే! మీరు ప్రవక్త గృహస్థులు. దేవుని శక్తిమహిమలనుఎతింగినవారలు. మీపై దేవుని యనుగ్రహమున్నది. మీకు దేవునినుండి శుభములు గలుగుచున్నవి! మీరు దేవునికి కృతజ్ఞతలు సలుపుచు దేవునిని స్తుతింపవలెను. సర్వస్తుతులకు దేవుండే అర్హుండు. ఆతండు గొప్ప ఘనతగలవాండు అని పలికిరి. 74. ఈ మాటలు విని ఇబ్రాహీము ప్రవక్త మనస్సు శాంతించి యాతనినుండి భయము తొలంగి పోయెను. అపుడు లూతుకులమువారి విషయము దేవదూతలతో వాదించుచు అచ్చట దేవుని ప్రవక్త లూతు ఉన్నాండు గదా! ఎట్లు వారు నాశమొందుదురు అని పలుకంగా దానికి దేవదూతలు మేము లూతును, విశ్వాసులనురక్షించి కాపాడుదుము. వారు శిక్షింపంబడరు అని పలికిరి. ఇబ్రాహీము ప్రవక్త చాల దయయును, కనికరమును, సహనమునుగల యాతండు. కావున లూతుజాతివారికి రానున్న ఆపద తొలంగిపోయిన బాగుండును అని దేవదూతలతో సంభాషించెను. దానికి ఓ యిబ్రాహీము! దేవుని సెలవైనది. దుష్టులకు రానున్న ఆపద తొలంగిపోదు. వృథా నీవేల చింతింతువు. ఈవిషయము వదలిపెట్టుము అని సమాధానము పలికిరి.

77. వలమ్మా-జాఅత్-రుసులునా-లూతన్-సీఅ-బిహిమ్-వజాఖ-బిహిమ్-జర్-అన్-వఖాల-హాజా-యౌమున్-అసీబ్. 78.వ-జా అహూ-ఖౌముహూ-యుహ్రఊన-ఇలైహి-వమిన్-ఖబ్లు కానూ-యఅమలూ-నస్-సయ్యి-ఆతి-ఖాల-యా-ఖౌమి హాఉలాఇ బనాతీ-హున్న-అత్-హరు-లకుమ్-ఫత్-తఖుల్లాహ-వలా-తుఖ్-జూని-ఫీ-జై-ఫీ-అలైస మిన్-కుమ్-రజు-లుర్ రషీద్ 79.ఖాలూ-లఖద్-అలిమ్త-మా-లనా-ఫీ-బనాతిక-మిన్-హఖ్ఖిన్-వఇన్నక-ల-తఅలము-మానురీద్. 80.ఖాల-లౌ-అన్న-లీ-బికుమ్-ఖువ్వతన్-ఔ-ఆవీ-ఇలా-రుక్నిన్-షదీద్. 81.ఖాలూ-యా-లూతు-ఇన్నా-రుసులు-రబ్బిక-లన్-యసిలూ-ఇలైక-ఫ-అస్రి-బి-అహ్లిక-బి-ఖిత్ఇమ్-మినల్-లైలి-వలా యల్-తఫిత్-మిన్-కుమ్-అహదున్-ఇల్లమ్-రఅతక-ఇన్నహూ-ముసీబుహా-మా-అసాబహుమ్-ఇన్న-మౌ-ఇద-హుముస్-సుబ్హు-అలైస-స్సుబ్ హు-బి-ఖరీబ్. 82. ఫలమ్మా జాఅ-అమ్రునా జఅల్నా-ఆలి-యహా-స-ఫిలహా-వఅమ్తర్నా-అలైహా-హిజా రతమ్-మిన్-సిజ్జీలిమ్-మన్ జూద్. 83. ముసవ్వ-మతన్-ఇన్ద రబ్బిక-వ మా-హీయ-మినజ్ జాలిమీన-బిబఈద్.

77. మఱియు మాదూతలు లూతునొద్దకు రాగా ఆతఁడు వారి రాకవలన చాల దుఃఖితుఁడాయెను. మఱివారివలన ఆతని మనస్సునకు కష్టమాయెను. మఱి ఈ దినము చాల కష్టమైన దినము అనిపలికెను. 78. మఱియు ఆతని జాతివారు ఆతనియొద్దకు పరుగెత్తుచు వచ్చిరి. మఱి వారు పూర్వమునుండియు చెడ్డపనులు చేయుచుండిరి. అపుడు లూతు ఓజనులారా! ఈ నాకుమార్తెలున్నారు. వీరువారి కంటెను మీకు పవిత్రురాండ్రుగానున్నారు. కావున మీరు దేవునికి భయపడుఁడు. మఱి నాయతిథుల విషయమున నన్ను అవమానింపకుఁడు. ఏమి మీలో ఒకఁడైన మంచిమానవుఁడు లేఁడా అని పలికెను. 79. అపుఁడు వారు, నీకూతుళ్లతో మాకేమి అవసరము లేదను విషయము నీకుఁ దెలిసియే యున్నది. మఱి మేము కోరునది నీకుఁ దెలియును అనిపలికిరి. (అపుడు) లూతు మిమ్ము మార్గ్యానను బలము నాకున్నచో లేక నేను ఆశ్రయించుటకుఁగాను బలమైనకుటుంబము నాకున్నచో నెంత బాగుం డెడిది. అనిపలుకసాగెను. 81. అపుడు దేవదూతలు ఓలూతు! మేము నీప్రభువు దూతలము. వారు నీదెగ్గరకు రాఁజాలరు. కావున కొంత రాత్రియుండఁగనే నీవు వారిని వెంటతీసికొని బయలుదేరుము. మీలో నెవరును వెనుకకుఁ దిరిగి చూడకుఁడును. కాని వారికేమి గలుగవలసి యున్నదో అదే నీభార్యకుఁగలుగును. నిశ్చయముగా

వారివార్ధానకాలము ఉదయమున్నది. ఏమి ! ఉదయము సమీపింపలేదా ! అనిపలికిరి. 82. ఆపిదప మాయాజ్ఞవచ్చినపుడు ఆయూరును తలక్రిందులుగ జేసి వేసి గులుక రాళ్లను వరుసగా వారిపై మేము కురిపించితిమి. 83. అవినీప్రభువునుండి గుర్తువేయఁ బడియుండెను. మఱి ఈ పురము ఈ దుర్మార్గుల నుండి దూరముగ లేదు.

వ్యా॥ 77. దేవదూతలు సుందరమైన మానవరూపము దాల్చి లూతు ప్రవక్తయొద్దకు పోయిరి. లూతుప్రవక్త వారు దేవదూతలు అని గుర్తింపక యతిథులని తలఁచెను. అతిథులు వచ్చినవిషయము దుర్మార్గులకుఁదెలిసినచో వారు వచ్చి దుష్టత్వము చేయుదురేమోఅని దుఃఖించిమనస్సులోకష్టపడెను. అతిథులను రక్షించుటకు నాయొద్ద బలములేదే. ఈ దినము ఎట్లుగడుచునా. ఇదిచాల కష్టముగ నున్నదే అని చింతించుచుండెను. 78. సుందర వంతులైన అతిథులు లూతువద్దకువచ్చి యున్నారను వార్త దుష్టులకు దెలియగానే, వారు పరవశులై పరుగెత్తుకొని లూతువద్దకువచ్చిరి. ఈదుష్టులు చాల చెడ్డపనులు చేయువారు. వీరు పురుషులతో సంభోగించువారు. ఈదుర్మార్గమునందు వారు పడియుండిరి. ఈ చెడ్డపనికిఁగాను వారు లూతుకొద్దకువచ్చి యీ అతిథులను మాకు నొసంగుము. నీవెందులకు వీరిని అతిథులుగాఁ జేసితివి అని బలవంతము చేయసాగిరి. దానికిలూతు ఓజనులారా! మీకుకావలెనంటె నాకుమార్తెలుగలరు. వారినిచ్చి మీకు పెండ్లిచేయుదును. మఱి యితర పడుచు స్త్రీలున్నారు. వారిలో వివాహమాడుఁడు. ఇది మీకు చాలపవిత్రమైన మార్గము. పురుషులతో సంభోగించుట అసహ్యకార్యము. చాలచెడ్డది నా అతిథుల విషయమునన్నుఅవమానింపకుఁడు. వారియెదుట నన్ను అవమానించుట నాయతిథులను అవమానించి నట్లగును. ఏమి మీలో ఒక్కడైనను నామాటలు గ్రహించు మంచివాఁడు లేఁడా ! అని - పలువిధములుగ బోధించెను. 79. కాని దుష్టులు వినక నీమాటలు అటుండనిమ్ము. నీకూతలతో మాకు అక్కఱలేదు. మాకు స్త్రీలు పనికిరారు. మాకుపురుషులే కావలెను. ఈసంగతి నీకుఁదెలిసియేయున్నది అని తమ దుష్టత్వము వెల్లడించిరి. 80. అంత లూతుప్రవక్త, దుష్టులయుద్దేశము తెలిసికొని అతిథుల మానము నెట్లుకాపాడుదునా అనుకొండఅపాటుతో నాకు బలమును, కుటుంబము నుండిన దుష్టులతో మార్కొని అతిథులను కాపాడుదునే అనిపలికెను. 81. ఇంతవఱకు దేవదూతలు ఊరకయుండిరి. లూతుప్రవక్త భీతిల్లి చాలచింతించుచున్నాఁడని మెఱింగి ఓలూతు! నీవు చింతింపనక్కఱలేదు. మమ్ము నీప్రభువగు దేవుఁడుపంపెను. మేము దేవదూతలము. ఈ దుష్టులు మాకేమియుఁజేయఁజాలరు. నీకును ఏలాంటి కీడుచేయఁజాలరు. ఉదయముకాఁగానే దుష్టులకు దేవుని శిక్షరానున్నది. కావున నీవు నీయనుచరులను వెంటఁ బెట్టుకొని కొంత రాత్రియుండఁగనే యూరువిడిచిపొమ్ము. పోవునపుడు వెనుకకు తిరిగి చూడకూడదు. కాని నీభార్యమాత్రము దుష్టులకు రానున్న శిక్షకు లోనై నశించును.కావున

తెల్లవాఱక పూర్వమే బయలుదేరుఁడు. చూడుఁడు ఉదయము సమీపింపనున్నది. మీరు సంతోషపడుఁడు అని లూతుతో పలికిరి. లూతుభార్య దుష్టులతో కలిసి యుండి యెవ్వరైన పురుషులు తనయింటికి అతిథులుగా వచ్చినచో దుష్టులకు దెలుపుచుండెను. అందువలన ఆమెకూడ దేవుని కోపమునకు పాలాయెను. 82:83. దేవదూతలు ఉదయకాలము కాఁగానే యూరును తలక్రిందుగఁ జేసి వేసి పైనుంచి రాళ్ళవాన కురిపించిరి. ఎచ్చటనున్న దుష్టులు అచ్చటనే పడిచచ్చిరి. రాళ్లు ప్రత్యేకముగ గుర్తువేయబడి యొకవిధముగానుండెను. రాళ్లు వరుసగా కురియుచుండెను. లూతును ఆతనితోఁబాటు విశ్వాసులును రక్షింపఁబడిరి. దుష్టులను నశింపఁజేయుశిక్ష దూరముగ లేదు. ప్రతికాలములోను దుష్టులకు ఆపద సమీపములోనే యుండును. లేక దుష్టులు నాశమొందిన యూరు దూరములో లేదు. అది మదీనా పురమునకును సిరియాదేశమునకు మధ్యనున్నది. ఆమార్గమున పోవువారికి అచ్చట పాడుపడిన చోటు కనఁబడును.

**84.** వ ఇలా-మద్యన-అఖాహుమ్-షుఐ-బన్-ఖాల-యాఖౌ-మిఅ-బుదుల్లాహ-మా-లకుమ్-మిన్-ఇలాహిన్-గైరుహూ-వలా - తన్-ఖుసుల్-మిక్-యాల-వల్-మీజాన-ఇన్నీ-అరాకుమ్-బి-ఖైరిన్-వఇన్నీ-అఖాఫు-అలైకుమ్-అజాబ-యౌమిమ్-ముహీత్. **85.** వ-యా-ఖౌమి-ఔఫుల్-మిక్-యాల-వల్-మీజాన-బిల్ ఖిస్తి-వలా-తబ్-ఖ-సున్నాస-అష్-యా-అహుమ్-వలా-తఅసౌ-ఫిల్-అర్జి-ముఫ్సిదీన్. **86.** బ-ఖియ్యీ-తుల్లాహి-ఖైరుల్-లకుమ్-ఇన్-కున్తుమ్-మూమినీన-వమా అనా-అలైకుమ్-బి-హాఫీజ్.

**84.** మఱియు మద్యను వారియొద్దకు వారి సహోదరుఁడగు షుఐబును పంపితిమి. ఓ జనులార ! మీరు దేవునినే పూజింపుఁడు. ఆతఁడు తప్ప మీకు వేఱు పూజ్యుఁడు లేఁడు. మఱి కొలతలలోను తూనికలలోను తక్కువ చేయకుఁడు. మీరు సౌఖ్యములోనుండుటను నేను చూచుచున్నాఁడను. మఱి కప్పుకొను దినమునందు మీకు శిక్ష కలుగును అని నేను భయపడు చున్నాను. **85.** మఱి ఓ జనులార ! న్యాయముగ కొలతను తూనికను పూర్తిగ నియ్యుఁడు. మఱి ప్రజల వస్తువులలో తక్కువ చేయకుఁడు. మఱి భూమిలో నుపద్రవములు చేయకుఁడు. **86.** మీరు విశ్వాసులైనచో దేవుఁడొసంగిన లాభము మీకు మేలైనది. మఱి నేను మీకు రక్షకుఁడను గాను అని షుఐబు పలికెను.

**వ్యా॥ 84.** మద్యను వారి విషయము ఆరాఫు సూరాలో వ్రాసియున్నాము. మద్యను వారు విగ్రహములను పూజించుచు తప్పు కొలతలు తూకములు

పెట్టి ప్రజలకు వస్తువులు తక్కువగా నిచ్చుచుండిరి. అట్లు చేయకూడదు. దేవుని నే పూజింపుఁడు. ఆతని శిక్షకు భయపడి యుండుఁడు. ఇప్పుడు మీకు సంపదలును సౌఖ్యములును లభించి యున్నవి. మీరు పాపములు విడనాడనిచో దేవుని శిక్ష మిమ్ము క్రమ్ముకొనును అని భయబోధ షుఐబు ప్రవక్త జనులకిచ్చెను. 85. ఓ ప్రజలారా! ఇంతవఱకు మీరు కొలతలలోను తూకములలోను చేయుచున్న అన్యాయమును వదలిపెట్టి న్యాయముగ కొలతలు తూనికలు సరిగ నుంచుఁడు. ఇదేగాక ప్రజల సొత్తులను నష్టపఱచక సరిగ వారివారి వస్తువులను వారికి నొసంగుఁడు. దేశములలో ఉపద్రవములు చేయకుఁడు. శాంతిని భంగపఱచకుఁడు. మద్యను వారిలో కొందఱు దొంగతనములు దోపిళ్లు చేయుచుండిరి. కావున ఇట్టి పాపకార్యములు చేసి యల్లరులు చేయకుఁడని ప్రవక్త బోధించెను. 86. న్యాయముగను ధర్మముగను సంపాదించి తగిన ఖర్చులు చేసి మిగిలినది కొంచెమైనను అది దేవుని యనుగ్రహము కాఁబట్టి అది చాల మంచిది. అన్యాయముగ లోకులసొమ్ము తప్పుకొలతల వలనను తప్పు తూనికల వలనను దొంగతనము వలనను సంపాదించిన చాల సొత్తుకంటె న్యాయముగ సంపాదించిన కొద్దిసొమ్ము చాల శ్రేష్ఠమైనది. ఇది విశ్వాసులకు శ్రేష్ఠము. నేను మీకు బోధ చేసితిని ఇఁక మీయిష్టము. నేను బలవంతము చేయువాఁడను కాను అనిషుఐబుప్రవక్త పలికెను.

87. ఖాలూ-యాషుఐబు-అసలాతుక-తామురుక-అన్ నత్-రుక-మా-యఅబుదు-ఆబా-ఉనా-ఔ-అన్-నఫ్-అల-ఫీ అమ్వాలినా-మా నషాఉ-ఇన్నక-ల-అన్తల్-హలీ-ముర్-రషీద్. 88. ఖాల-యా ఖౌమి-అర-ఐతుమ్ ఇన్- కున్తు-అలా-బయ్యి-నతిమ్-మిర్-రబ్బీ-వ-రజఖనీ-మిన్ హు-రిజ్-ఖన్-హసనన్-వ-మా- ఉరీదు-అన్-ఉ-ఖా-లిఫకుమ్-ఇలా-మా అన్-నహా-కుమ్. అన్ హు-ఇన్-ఉరీదు - ఇల్లల్ ఇస్లాహ-మస్-తతఅతు వమా-తౌఫీఖీ-ఇల్లా-బిల్లాహి-అలైహి-తవక్కల్తు-వఇలైహి ఉనీబ్. 89. వ-యా ఖౌమి-లా-యజ్-రిమన్నకుమ్ - షిఖాఖీ-అన్-యుసీ-బకుమ్-మిస్లు-మా అసాబ-ఖౌమ-నూహిన్-ఔ-ఖౌమ-హూదిన్ - ఔ ఖౌమ-సాలి-హిన్-వమా-ఖౌము లూతిమ్-మిన్ కుమ్-బిబఈద్. 90. వస్-తగ్-ఫిరూ-రబ్బ-కుమ్-సుమ్మ-తూబూ-ఇలైహి-ఇన్న రబ్బీ- రహీమున్ - వదూద్. 91. ఖాలూ-యా-షుఐబు-మా-నఫ్-ఖహు-కసీరమ్-మిమ్మా-తఖూలు- వఇన్నా-లనరాక-ఫీనా-జఈఫన్-వలౌ-లా-రహ్తుక-లరజమ్నాక వ-మా-అన్త-అలైనా బి

అజీజ్. 92. ఖాల-యా-ఖౌమి-అ-రహ్‌తీ-అ-అజ్‌జు-అలై-కుమ్-మినల్లాహి-వత్ తఖజ్-తుమూహు-వరా-అకుమ్-జిహ్-రియ్యన్-ఇన్న-రబ్బి-బిమా-తఅమలూన ముహీత్. 93. వ-యా-ఖౌ-మిఅ-మలూ-అలా-మకానతికుమ్ ఇన్నీ ఆమిలున్-సౌఫ-తఅ-లమూన-మన్-యాతీహి-అజాబున్-యుఖ్-జీహి-వ-మన్-హువ-కాజిబున్-వర్-తఖిబూ-ఇన్నీ-మఅకుమ్-రఖీబ్. 94. వ-లమ్మా-జాఅ-అమ్రునా-నజ్జైనా-షుఐ-బన్-వల్ల-జీన-ఆమనూ-మఅ-హూ-బి-రహ్-మతిమ్-మిన్నా-వ-అఖజతిల్-లజీన-జల-ముస్-సైహతు-ఫ-అస్-బహూ-ఫీదియా-రిహిమ్-జాసిమీన్. 95. క-అల్-లమ్-యగ్-నౌ ఫీహా-అలా-బుఅ-దల్-లిమద్యన కమా-బఇదత్-సమూద్.

87. వారు ఓషుఐబు మా తాత ముత్తాతలు పూజించుచున్న దేవతలను మా సొత్తులలో మాయిష్ట ప్రకారముగా మేము చేయుట వదల వలెనని నీకు నీనమాజు నేర్పినదా! నీవు చాల సహనముగలవాఁడవుగాను మంచివాఁడవుగా నున్నావే! అని పలికిరి. 88. అపుడు షుఐబు ఓ జనులార! చూడుఁడు నేను నా ప్రభువు యొక్క సూచన ననుసరించుచు ఆతనినుండి మంచి భాగ్యము పొందియు నే నెట్లు మీమాట విసుదును. మఱి నేను మీకు నిషేధించు దానికి విరుద్ధముగా చేయుటకు నేను కోరలేదు. నాకు సాధ్యమైనంత వఱకు సవరించుటకు నేను కోరుచున్నాఁడను. మఱి దేవుని సహాయమువలననే నాయత్నము నెరవేఱును. ఆతని పైననే నేను ఆధారపడితిని. మఱి ఆతని వైపునకే తిరుగుదును. 89. మఱి ఓ జనులార! నాతో ద్వేషము చేసి నూహు ప్రజలకును లేక యూదుప్రజలకును సాలిహ్ జనులకును లభించినట్టి శిక్షకు మీరు పాత్రులు కాకుండుఁడు. మఱి లూతు ప్రజలు మీకు దూరమున లేరు. 90. మఱిమీరు మీప్రభువుతో మీ పాపముల క్షమాపణ వేఁడి యాతని వైపునకు మరలుఁడు. నిశ్చయముగ నాప్రభువు దయలగల వాఁడును ప్రేమించు వాఁడును అని షుఐబు పలికెను. 91. అపుడు వారు ఓషుఐబు! నీవు పలుకు మాటలు చాల మట్టుకు మేము గ్రహింపకున్నాము. మఱి నీవు మాసంఘములో బలహీనుఁడవుగా మాకు కనబడుచున్నావు. మఱి నీ కుటుంబములవారు లేకున్నచో నిన్ను ఱాళ్లతో రువ్వి కొట్టియుందుము. మఱి నీగౌరవము మాయొద్ద నేమియు లేదు అని పలికిరి. 92. (అపుడు) షుఐబు ఓ జనులార! దేవుని కంటెను నాకుటుంబము మీయొద్ద ఎక్కువ గౌరవము గలిగి యున్నదా! మఱి దేవునిని మఱచిపోయి యాతనిని మీ వీపు వెనుక పడవైచి

నారా! నిశ్చయముగా నాప్రభువు మీరుచేయు పనులను క్రమ్ముకొని యున్నాఁడు. 93. మఱి ఓ జనులార! మీరు మీచోటున మీపనులు చేయుఁడు. నేనుకూడ నాపని చేయుదును. శీఘ్రముగనే అవమాన పఱచునట్టిశిక్ష యెవరికి రానున్నదో మఱెవరు అబద్ధములు పలుకుచున్నారో మీరు తెలిసికొనఁగలరు. మఱి మీరును వేచి యుండుఁడు. నేనును మీతోఁబాటు వేచి యుందును అనిపలికెను. 94. మఱియు మా యాజ్ఞరాఁగా షుఐబును ఆతని వెంటనుండిన విశ్వాసులను మా యనుగ్రహముచే రక్షించితిమి. మఱి దుర్మార్గులైనట్టి వారికి భయంకరమైన శబ్దము వచ్చి పట్టఁగా వారు తెల్లవాఱుసరికి తలక్రిందులుగ తమ యిండ్లలోనే పడి చచ్చిరి. 95. వారచ్చట ఎన్నడును వసించి యుండలేద నునట్లుగ నైయిపోయిరి. వినుఁడు! ఎట్లు సమూదువారికి శాపము గలిగెనో అట్లే మద్యను వారికిని శాపమున్నది.

వ్యా॥ 87. షుఐబు ప్రవక్త బోధను యవిశ్వాసులు విని పరిహాసముగా ఓయి షుఐబు! నీవు చాల పెద్దమనుష్యుఁడవుగా నున్నావు. మా జనులందఱిలో నీవు ఒక్కఁడే మంచివాఁడవుగా నున్నావు కాఁబోలు! మిగిలిన వారందఱు మూఢులా! నీబోధ అటుండనిమ్ము! పూర్వమునుండి వచ్చుచున్న మా తాతముత్తాతల యాచారమగు విగ్రహారాధనను వదలిపెట్టి మాధనమును మాయిష్టాను సారముగ ఖర్చుచేయక మా చేతులు కట్టుకొని యుండవలెననియు నీ ప్రార్థన (నమాజు) మాకు నాజ్ఞాపించుచున్నదా! అట్లైన నీ ప్రార్థనలు నీవు చేసికొనుము! మా జోలికి రాకుము. లౌకిక వ్యవహారములలో నీవు చొరకుము మాయిష్టము చొప్పున కొలుతుము, తూయుదుము అని పలుకసాగిరి. 88. దానికి ప్రవక్త ఓ జనులార! దేవుఁడు నాకు సూచనయును సన్మార్గమునొసంగి యున్నాఁడు. ఆతని యనుగ్రహము వలనమంచిభాగ్యమగు ప్రవక్తపదవి లభించి యున్నది. మీ మాటలకు భయపడి నేను దేవుని ధర్మములను మత ప్రచారమును వదలఁజాలను. మీమాట వినను. ఏ పాపకార్యములను గూర్చి మీకు నిషేధించు చున్నానో యా పాపకార్యములు నేను చేయుటలేదు. మీకు బోధించుచున్న సత్కార్యములు నేను ముందుగానే ఆచరించుచున్నాను. నాబోధకు వ్యతిరేకముగా నాయాచారము లేదు. కావుననాబోధ నిర్మలమైనదికాదు అని మీరెట్లు నన్ను నిందింపఁగలరు? నేను మీయుభయ లోకముల స్థితిని సవరించుటకు యత్నించు చున్నాను. మీకిపుడున్న హీనస్థితి పోయి మీకున్నత స్థితి రావలెనని నాకోరిక. దానికిఁగాను నాశక్తికొలఁది ప్రయత్నము సాగించుచున్నాఁడను. నాయత్నము ఫలించి నాయత్నము సాగుట దేవుని సహాయము వలననే యగును. కావున నేను ఆతని పైననే ఆధారపడి యున్నాను. నా ప్రతి పనినిగూర్చి ఆతని సముఖముననే విన్నవించుచు ఆతనివైపున కేమరలు చున్నాను.

89. కావున మీరు నాయందు ద్వేషము గలిగి పాపకార్యములు చేసి
తిరేని మీకును మీ పూర్వీకులగు నూహు మొదలగు ప్రవక్తల జాతివారికి
లభించినట్లు శిక్ష మీకును లభించును. ఆదుర్మార్గులు దేవుని ప్రవక్తలగు నూ
హు హూదు సాలిహను తిరస్కరించి శిక్షకు పాత్రులై నశించిరి. మరియు లూతు
కులమువారి కాలము మీకు దూరముగ లేదే. మీకు పూర్వము సమీప కాలము
లోనే వారు తమ పాపముల ఫలితము పొంది నశించిరిగదా! 90. కావున మీ
రు బుద్ధి తెచ్చుకొని యికనైన మీపాపముల క్షమాపణ దేవునిలో వేడుడు.
దేవుడు చాల దయ ప్రేమలు గలవాడు. ఎట్టి ఘోర పాపము నైనను మనసు
పూర్వకముగ క్షమాపణ కోరినచో క్షమించి కరుణించును అని పలికెను.
91. దానికి జనులు బోధను విని గ్రహించియు ద్వేషముతో [illegible] ఏమి
య్యా! నీవు బోధించునది చాలమట్టుకు మేము గ్రహింపకున్నాము. ఏమేమో నీవు
వదరుచున్నావే! నీకు బలముకూడ లేదే. ఇట్టి స్థితిలో లోకనుంతటిలో [illegible]
ము పెంచుకొను చున్నావే! నీ గౌరవముకూడ మాయొద్ద లేదు. నిన్ను గౌర
వించి వదలి పెట్టుటలేదు. నీకుటుంబమువారు మాతో కలిసియున్నారు. కావున
వారి మొగము చూచి నిన్ను వదలిపెట్టు చున్నారము. లేని యెడల నిన్ను రాళ్లతో
రువ్వి చంపియుందుము సుమా! అని పలికిరి. 92. దానికి షుఐబు నేను మీ
మాటలకు విచార పడుచున్నాను మీరు నన్ను వదలిపెట్టినది నా కుటుంబ గౌర
వమును బలమును చూచియా! నేను దేవుని ప్రవక్తను. సత్యమైన దేవుని సూ
చనలను మీకు తెలుపుచు చూపుచున్నాను అని కాదా. అటులైన [illegible] దే
వుని గౌరవమును బలముకంటె నాకుటుంబ గౌరవము ఎక్కువగా నున్నదా!
మీరు దేవుని శక్తి మహిమలను మఱచిపోయి యాతనిని వెనుక [illegible]!
అటులైనచో మీరు జ్ఞప్తి నుంచుకొనుడు. మీరు చేయు సర్వ కార్యములు దే
వుని యధికారమునకు లోబడి యున్నవి. వానిని దేవుడెఱుంగును. వానికి దగి
న శిక్ష లభించి తీరును. ఎవరును తప్పించుకొనజాలరు. 93. సరే మీరు మీ
ద్వేషములోనే పడియుండి మీపనులు, మీరుచేయుడు. నేను సన్మార్గము న
నుసరించుచు నేను నా పనులు చేయుదును. శీఘ్రములోనే ఎవరు దేవుని శిక్ష
కు పాత్రులై యవమానము పొందుదురో మఱెవరు సత్యవంతులో [illegible]వరు అబ
ద్ధములు పలుకువారో తెలియనగును. కావున మన మందఱము దేవుని యాం
జ్ఞకై యెదురుచూచు చుందుము అని పలికెను. 94. ఆపిదప [illegible]
భయంకరమైన శబ్దము గలిగి అవిశ్వాసులు తమ యిండ్లలోన పడి [illegible].
షుఐబు పరివర్తయు విశ్వాసులును దేవుని యనుగ్రహము [illegible] శిక్షనుండి
రక్షింపబడిరి. 95. అవిశ్వాసులు తుదముట్ట నశించిరి. వారు [illegible] నెన్న
డును వసించి యుండలేదు అనునట్లు వారైపోయిరి. ఎట్లు సమూదువారు [illegible]

వలనచ చ్చిరో అటులేమద్యనువారుకూడ చచ్చిరి. వీరుభయులకు ఒకే విధమైన శాపము (వినాశము లభించెను).

96. వల-ఖద్-అర్-సల్నా-మూసా-బి-ఆయాతినా-వసుల్-తానిమ్-ము బీన్. 97. ఇలా ఫిర్ఔన-వ-మల-ఇహీ-ఫత్-తబఊ అమ్ర-ఫిర్ఔన-వ - మా-అమ్రు-ఫిర్-ఔన-బిరషీద్. 98. యఖ్దుము-ఖౌమహూ-యౌమల్-ఖియామతి-ఫ-ఔ-రద-హుమున్నార వ బీసల్-విర్దుల్-మౌరూద్. 99. వ-ఉత్-బిఊ-ఫీ-హాజిహీ-లఅ-నతన్-వ-యౌమల్-ఖియా-మతి- బీసర్-రిఫ్-దుల్ మర్-ఫూద్.

96,97. మఱియు నిశ్చయముగా మేము మూసాకు మా సూచనలను స్పష్టమైన సనదునిచ్చి ఫిరౌను యొద్దకును ఆతని నాయకుల యొద్దకును పంపితిమి. పిదప వారు ఫిరౌను యొక్క యాజ్ఞను అనుసరించిరి. మఱి ఫిరౌను యాజ్ఞ సరియైనదికాదు. 98. తీర్పు దినమునందు ఫిరౌను తన జనులకు ముందుముందుగా నుండును. పిదప వారిని అగ్నిలోనికిఁ గొనిపోవును. మఱి వారుపోవు స్థలమగు నరకము చాల చెడ్డది. 99. మఱి ఇహలోకము నందునుతీర్పుదినము నందును వారిని శాపము వెంబడించును. వారికి లభించిన బహుమానము చాల చెడ్డది.

వ్యా॥ 96,97. దేవుఁడు మూసాను ప్రవక్తగాఁ జేసి ఫిరౌను జనుల యొద్దకు పంపెను. మూసా ప్రవక్తకు తోడుగ ఆతని సహోదరుఁడగు హారూను ప్రవక్తయుండెను. వారు ఫిరౌను యొద్దకుఁబోయి దేవుని సూచనలను వారికి చూపి బోధించిరి. కాని ఫిరౌను జనులు మూసా ప్రవక్తమాట వినక ఫిరౌను యొక్క యాజ్ఞను అనుసరించిరి. ఫిరౌను మాటలవలన వాని జనులకు లాభము కలుగలేదు వాని మాటలు మంచివికావు. కావుననే ఫిరౌను జనులు దేవుని శిక్షకు పాత్రులై మునిగి చచ్చిరి. 98. ఎట్లు ఫిరౌను ఇహలోకమునందు దుర్మార్గులకు నాయకుఁడై ముందుముందుగా పోవుచుండెనో అటులే తీర్పుదినము (ఖియామతు) నందుకూడ తన జనులకు ముందుముందుగా నడచి వారిని నరకాగ్నిలోనికిఁ దీసికొని పోవును. నరక నివాసము చాల చెడ్డది. అచ్చట చెప్పరాని కష్టములకుపాలు కావలసి వచ్చును. 99. ఇహలోకముండువంత వఱకును ఫిరౌను జనులను లోకులు శపించుచుందురు. అట్లు తుదిదినమునందు దేవదూతలు అచ్చటనుండువారు ఫిరౌను జనులను శపింతురు. వారు సదా శాపమునకు పాత్రులై తమ పాపకర్మల బహుమానము పొందుచుండుదురు. ఇది చాల చెడ్డ బహుమానముగదా!

100. జాలిక-మిన్-అమ్బా-ఇల్-ఖురా-నఖుస్సుహూ-అలైక-మిన్హా-ఖాఇ

మున్వ-హసీద్. 101.వ-మా-జలమ్నా-హుమ్-వలాకిన్-జలమూ-అన్-ఫుసహుమ్-ఫమా-అగ్-నత్-అన్-హుమ్-ఆలి-హతుహు-ముల్-లతీ-యద్-ఊన-మిన్-దూనిల్లాహి-మిన్-షైఇన్-లమ్మా-జాఅ-అమ్రు- రబ్బిక-వ-మా-జాదూ-హుమ్-గైర-తత్ బీబ్. 102. వ-కజాలిక-అఖ్జు-రబ్బిక-ఇజా.అఖ-జల్-ఖురా - వహియా - జాలిమతున్-ఇన్న-అఖ్-జహూ-అలీమున్- షదీద్.

100. ఇది నాశమొందిన పురముల యొక్క కొంత వృత్తాంతము. దీనిని నీకుc దెలుపుచున్నారము. అందు కొన్ని నిలిచియున్నవి. మఱికొన్ని నిర్మూలింపcబడినవి. 101. మఱి మేము వారిపై నన్యాయముచేయలేదు. కాని వారే తమ యాత్మలకు తామే అన్యాయముచేసికొనిపోయిరి. ఆపిదప నీ ప్రభువు ఆజ్ఞవచ్చినపుడు, వారు దేవుని వదలి ఏదేవతలను పిలుచుచుండిరో యాదేవతలు కొంచెమైనను వారికిపనికిరాలేదు. మఱి వారియెడ నాశముతప్ప వేఱేమియు వారు పొందింపలేదు. 102.మఱియు నగరములవారు అన్యాయములు గావించునపుడు ఇట్లునీప్రభువువారినిపట్టును.నిశ్చయముగ ఆతనిపట్టుచాలదుఃఖకరమైనది.చాలకఠినముగలది.

వ్యా॥ 100. ఇంతవఱకు ప్రవక్తలనుగూర్చియు వారి జనులనుగూర్చియు వృత్తాంతములు తెలుపcబడియెను. అందు ప్రవక్తలను నమ్మిన విశ్వాసులు దేవుని దయకుపాత్రులై ఆతని శిక్షనుండి రక్షింపcబడిరి. అందు తిరస్కరించిన అవిశ్వాసులు నాశమొందిరి.అందుకొన్నిగ్రామములు ఇంకనునిలిచి యున్నవి.ఫిరౌనుని నగరమగు మిసరు(ఈజిప్టు) ఉన్నది. కొన్నినిర్మూలింపcబడినవి. అందు లూతుజాతివారినగరములు పాడుపడిపోయినవి. 101. దుష్టులునశించుటకు ముఖ్యకారణములు వారిదుష్టత్వమును,వారియన్యాయములును.కాని దేవుcడు ఎంతమాత్రమును అన్యాయము వారికి చేయలేదు. అవిశ్వాసులే పాపకార్యములలో మితిమీఱిపోయి తమకు తామే అన్యాయము చేసికొనిరి. దేవుని యాజ్ఞచే శిక్ష (ఆపద) వచ్చినపుడు దేవుని వదలి వారు పూజించుచున్న దేవతలును విగ్రహములును వారిని శిక్షనుండి రక్షించుటకు కొంచెమైనను పనికిరాలేదు. చిల్లర దేవతలు ఏల పనికి వత్తురు. మఱింత నష్టమునకు కారణమగుదురు. వారు చేసిన దేవతల పూజలు వృథాపోయినది గాక మఱింత హెచ్చుగ నరకాగ్నికి, కారణమాయెను. 102. దుర్మార్గులకు చాలమట్టుకు విరామము ఒసంగcబడును. వారు తమ దుర్మార్గములు విడువక దుర్మార్గములోనే మితిమీఱిపోవునపుడు దేవుని శిక్ష కఠినముగా వారిని పట్టును. అందు చాలదుఃఖముగలదు. దేవునిశిక్షనుండితప్పింగుకొనcజాలరు.

103. ఇన్న-ఫీ-జాలిక-ల-ఆయతల్-లిమన్-ఖాఫ-అజా-బల్-ఆఖిరతి-జాలి

క-యౌముమ్-మజ్-ఘూఉల్-లహున్నాసు-వ-జాలిక-యౌముమ్-మష్-హూద్. 104. వ-మా-నుఅఖ్-ఖిరుహూ-ఇల్లా-లి.అజ-లిమ్-మఅ-దూద్. 105. యౌమ-యాతి-లా-తకల్లము-నఫ్సున్-ఇల్లా-బి-ఇజ్నిహీ-ఫ-మిన్-హుమ్-షఖియ్యున్ వ-సఈద్. 106. ఫ-అమ్మల్-లజీన-షఖూ-ఫ-ఫిన్నారి-లహుమ్-ఫీహా-జఫీరున్-వ-షహీఖ్. 107. ఖాలిదీన-ఫీహా-మా-దామతిస్-సమావాతు-వల్-అర్జు-ఇల్లా-మా-షాఅ-రబ్బుక-ఇన్న-రబ్బక-ఫఅ-ఆలుల్-లిమా-యురీద్. 108. వ-అమ్మల్-లజీన-సుఇదూ-ఫ-ఫిల్-జన్నతి-ఖాలిదీన-ఫీహా-మా-దామతిస్-సమావాతు-వల్-అర్జు-ఇల్లా-మా-షాఅ-రబ్బుక-అతా-అన్-గైర-మజ్-జూజ్. 109.ఫలా-తకు-ఫీ-మిర్-యతిమ్-మిమ్మా-యఅ-బుదు-హా-ఉలాఇ-మా-యఅ-బుదూన-ఇల్లా-కమా-యఅ-బుదు-ఆబా-ఉ-హుమ్-మిన్-ఖబ్లు-వ-ఇన్నా-లము-వఫ్-ఫూ-హుమ్ నసీ-బహుమ్-గైర-మన్-ఖూస్.

103. నిశ్చయముగా నిందు పరలోక శిక్షకు భయపడువారికి సూచన గలదు. ఆ దినమునందు జనులందఱును కూడుదురు. మఱి ఆదినమునందు అందఱును హాజరగుదురు. 104. మఱి దానిని ఒక నియమితకాలమువఱకు మాత్రము ఆపియున్నారము. 105. ఆ దినము వచ్చినపుడు ఆతని సెలవులేని దే యెవరును మాటలాడఁజాలరు. కావున వారిలో కొందఱు పాపాత్ములుందురు. మఱికొందఱు పుణ్యాత్ములుందురు. 106. మఱి పాపాత్ములైనవారు అగ్నిలోపడుదురు. అందు వారు నిట్టూర్పు విడుచుచు వలవింతురు. 107. నీ ప్రభువు కోరిన సమయము తప్ప వారు అందు ఆకాశములును భూమియు నుండునంతవఱకుందురు. నిశ్చయముగా నీప్రభువు కోరినది చేయును. 108. మఱి పుణ్యాత్ములైనవారు స్వర్గములో నుందురు. నీప్రభువు కోరిన సమయము తప్ప వారందఱు అందు ఆకాశములును, భూమియు నుండునంతకాలము వఱకుందురు. ఇది యెడతెగని యనుగ్రహమున్నది. 109. కావున ఈజనులు పూజించు దేవతల విషయమున నీవు మోసపోకుము. దీనికి పూర్వము వీరి తాతముత్తాతలు పూజించుచున్నట్లు వీరును పూజించుచున్నారు. మఱి మేము వారి శిక్షలోనిభాగమును ఏలాటిలోటులేకుండ సంపూర్ణముగ వారి కొసంగుదుము.

వ్యా॥ 103. ఇహలోకము కర్మలోకము. ఇందు మానవులు కర్మ చేయుదురు. పరలోకము ఫలితము లభించు లోకము. కర్మలోకమునందు దురాత్ములు దేవుని ప్రవక్తలను తిరస్కరించి దుర్మార్గములు చేసినందులకు కఠిన శిక్ష లభించు

టను చూచి బుద్ధిమంతులు బుద్ధితెచ్చుకొనవలెను. ఇందు పరలోక శిక్షను భయపడువారికి బోధన గలదు. ఇహమునందే యిట్లు శిక్ష గలుగునప్పుడు పరలోకమం దెట్టి శిక్ష గలుగునో యూహించి మానవులు పాపములను మానుకొనవలెను. మోక్ష మెట్లు లభించును అని బుద్ధిమంతుఁడు గమనింపవలెను. తీర్పుదినము నందు మానవు లందఱు దేవునియెదుట కూడుదురు. అప్పుడు అందఱు ప[illegible]గు దురు. ఎవ్వఁడును తప్పించుకొని పాఱిపోలేఁడు. అప్పుడు అందఱి కర్మలనుగూర్చి తీర్పు అగును. 104. తీర్పుదినము వచ్చు కాలము దేవుని యొద్ద [illegible] యున్నది. ఆ గడియవచ్చువఱకు ఆ దినము ఆగియుండును. [illegible] సందేహించి అది రాదు అని తలంపఁగూడదు. అది తప్పక దాని గడువునకు వచ్చి తీరును. 105. తీర్పుదినమునందు ఎవరును దేవుని సెలవునొందనిదే మాటలాడఁ జాలరు. మాటలాడినను దేవుని యిష్టానుసారముగ మాటలాడుదురు. [illegible] విశ్వసించి మంచి పనులు చేసినవారు పుణ్యాత్ములు. విశ్వసింపక పాప కార్యములు చేసినవారు పాపాత్ములు. వారు తమ తమ కర్మలకుఁ దగిన ఫలితమునొందుదురు. 106. పాపాత్ములు నరకాగ్నిలో పడి యుండి చాల బాధలనుపొంది నిట్టూర్పు విడుచుచు పలవించుచుందురు. 107:8 అందు సదా యుందురు. భూమ్యాకాశము లుండు కాలమువఱకు అనఁగా సదా యుందురు. దేవుఁడు కోరినవారిని నరకనివాసులను అందుండి తీయును. కాని దేవుఁడు అవిశ్వాసులను సదా నరకములోనే యుంచును. వారందుండి బయటికి రాఁజాలరు అని యితర వాక్యములలో చెప్పబడినది. విశ్వాసులు పుణ్యాత్ములు. వీరు స్వర్గములో సదా యుందురు. దేవుఁడు కోరిన వీరిని స్వర్గమునుండి తీయును. దేవునికి సర్వాధికారము గలదు. దేవుని యిష్టము చొప్పుననే నరకమును స్వర్గమును మానవులకు లభించును. అయినను విశ్వాసులు సదా స్వర్గములోనే యుందురు. వారుదానినుండి రారు అని దేవుఁడు ఇతర వాక్యములలోఁ దెలిపియున్నాఁడు. తీర్పుదినమునందుండు భూమ్యాకాశ ములు ఇప్పటి భూమ్యాకాశములు గాక వేఱుగా నుండును. అవి సదా నుండు నవి. కావున పాపాత్ములు నరకములోను,పుణ్యాత్ములు స్వర్గములోను [illegible] కాల ముందురు అని చెప్పఁబడియెను. 109. లోకమునందు అనేకమంది జనులు విగ్రహారాధన చేయుచున్నారే! వీరికి తక్షణమే శిక్షలభించుటలేదే! ఇట్టివారు అని భక్తులు మోసపోయి సందేహములో పడకూడదు. విగ్రహారాధకులు తమ తాతముత్తాతల పద్ధతిని బుద్ధి యోచనలు లేక అంధులవలె నడుచుచున్నారు. ఎట్లు వీరి పూర్వికులకు వారి విగ్రహములు చిల్లర దేవతలును పనికి రాలేదో అటులే వీరికిఁగూడ పనికిరావు నిశ్చయముగా వీరికి పరలోకములో సంపూర్ణముగ ఎట్టి లోటులేక నరక శిక్ష లభించును.

110. వల-ఖద్-ఆతైనా-మూసల్-కితాబ-ఫఖ్ తులిఫ-ఫీహి-వలౌ-లా కలి-మతున్-సబఖత్-మిర్-రబ్బిక-లఖు-జియ బైన-హుమ్-వ-ఇన్నహుమ్-లఫీ-షక్కి-మ్-మిన్‌హు-మురీబ్. 111. వ-ఇన్న-కుల్లల్-లమ్మా-ల-యు-వఫ్-ఫి-యన్నహుమ్-రబ్బుక-అఅమాల హుమ్-ఇన్నహూ-బిమా-యఅ-మలూన-ఖబీర్. 112 ఫస్-తఖిమ్-కమా-ఉమి ర్త-వ-మన్-తాబ-మఅక వ-లాతత్ గౌ-ఇన్నహూ-బిమా-తఅ-మలూన-బసీర్. 113. వలా-తర్-కనూ-ఇలల్-లజీన-జలమూ-ఫత- మస్సకుమున్నారు-వ-మా-లకుమ్-మిన్-దూనిల్లాహి-మిన్-ఔ-లియాఅ-సుమ్మ - లాతున్-సరూన్. 114. వ-అఖి-మిస్-సలాత-తర-ఫ-ఇన్-నహారి-వ-జులు-ఫమ్-మినల్-లైలి-ఇన్నల్-హసనాతి-యుజ్-హిబ్-నస్-సయ్యి-ఆతి-జాలిక-జికా్రా-లిజ్-జాకిరీన్. 115. వస్-బిర్-ఫ-ఇన్నల్లాహ-లా-యుజీఉ-అజ్-రల్-ముహ్‌సినీన్.

110. మఱియు నిశ్చయముగా మేము మూసాకు గ్రంథమొసంగియుంటిమి. పిదప నందు అభిప్రాయభేదములు గలిగెను. మఱినీప్రభువుమాట ముందుగానే కాకయున్నచో వారిమధ్య తీర్పుఅయిపోయియుండును. వారు దానిగూర్చి చాల సందేహము గలిగియున్నారు. 111. అందఱి కాలము వచ్చినపుడు వారి కర్మల ఫలితము సంపూర్ణముగా నీప్రభువు వారి కిచ్చివేయును. వారు చేయు కర్మలు ఆతనికి దెలియును. 112. కావున నీకు ఆజ్ఞయైనట్లు నీవును నీతో క్షమాపణకోరి నీతోబాటునున్న వారునుస్థిరముగానుండవలెను. మఱిమితిమీఱిపోకుఁడు. నిశ్చయముగామీరుచేయు కర్మలను బాగుగ ఆతఁడుచూచుచున్నాఁడు. 113.మఱిదుర్మార్గుల పక్షమున మీరు వ్రాలకుఁడు.అటులైనచో మీకుఅగ్ని తాకును. మఱి దేవుఁడు తప్ప మీకు ఇతరు లెవ్వరును సహాయులు లేరు. పిదప మీకెచ్చటయును సహాయము లభింపదు. 114. మఱిఉదయమునుసాయంత్రమును రాత్రి కొంతకాలమును నమాజు సలుపుము. నిశ్చయముగా పుణ్యములు పాపములను పోఁగొట్టుచున్నవి. ఇది బోధను గ్రహించువారికిఁగాను బోధన యున్నది. 115 మఱి నీవు సహించియుండుము. నిశ్చయముగ దేవుఁడు సత్కార్యములు చేయు వారి పుణ్యములను వృథా చేయఁడు.

వ్యా॥ 110. దేవుఁడు మూసాప్రవక్తకు తౌరాతుగ్రంథమిచ్చి ఇస్రాయీలియులనొద్దకుఁ బంపెను. అందు జనులకు అభిప్రాయభేదములు గలిగెను. కొందఱు నమ్మిరి. కొందఱు తిరస్కరించిరి. ఇపు డిట్లే ఖురానె షరీఫు విషయము కూడ సంభవించుచున్నది. అవిశ్వాసులు తిరస్కరించుచున్నారు. విశ్వా

తమ స్థితిని సవరించుకొనుచు సత్కార్యములు చేసినచో దేవుఁడు అట్టివారియొక్క పురములను అన్యాయముగను బలవంతముగను నాశము చేయఁడు. దుర్మార్గములు మితిమీఱిపోయి పాపములతో దేశము నిండుకొనినపుడే దేవుని శిక్ష వారికి లభించును. 118. దేవుఁడు కోరినచో బలవంతముగ అందఱును ధర్మమార్గమునందు నడచునట్లు చేయగలఁడు. కాని యట్లు చేయలేదు. మానవులకు బుద్ధినొసంగి యున్నాఁడు. దానినిబట్టి దేవుని దయ పొందినవారు ధర్మమార్గమును గూర్చి కలహింపరు. అందు అభిప్రాయ భేదములు వహింపరు. కాని ఎల్లప్పుడును సన్మార్గమును ధర్మమును తిరస్కరించి దానిగూర్చి కలహించి వివాదములు అభిప్రాయ భేదములు వహించువారుందురు. 119. లోకసృష్టియే దీనికొఱకు కలిగెను. మానవులు, జిన్నాతులు, అభిప్రాయభేదములుగలిగి కొందఱు సన్మార్గమునందు పోయి దేవుని ప్రేమకు పాత్రులై స్వర్గము పొందుదురు, మఱికొందఱు దుర్మార్గమునందు నడచి దేవుని కోపమునకు పాత్రులై నరకము పొందుదురు. ఇట్టి పూర్వమే దేవుఁడు నియమించినమాట యున్నది. ఇది పూర్తిగానెఱవేరును. కావున కొందఱు పుణ్యాత్ములును మఱికొందఱు పాపాత్ములును కావలసి యేర్పడియున్నది.

120. వ-కుల్లన్-నఖుస్సు-అలైక-మిన్-అమ్ బాఇర్-రుసులి-మా-నుసబ్బితు బిహీ-ఫుఆ-దక-వ-జా-అక-ఫీ-హాజిహిల్-హఖ్ఖు-వ-మా-ఇ-జ-తున్-వ-జిక్రా-లిల్-మూమినీన్.

120. మఱి ప్రవక్తల వృత్తాంతములలో నీమనస్సును దృఢపఱచునట్టి సర్వ విషయములు నీకుఁ దెలుపుచున్నారము. మఱి యీసూరాలో నీకొఱకు సత్యము వచ్చినది. మఱి విశ్వాసులకు బోధనయును జ్ఞానమునుగలదు.

వ్యా॥ 120. ఈసూరాలో దీనికి ముందు ప్రవక్తల వృత్తాంతములు వివరింపఁబడినవి. వీని యుద్దేశ్యమునిందు చెప్పఁడినది. పూర్వము గడచినప్రవక్తల నిజమైన విషయములు తెలిసినందున హజ్రత్ ముహమ్మదు ప్రవక్త యొక్క మనస్సు దృఢపడి వారికి మనశ్శాంతిలభించును. విశ్వాసులకు నిజమైనవృత్తాంతములుతెలిసినందున వారికిబోధనయును బుద్ధిజ్ఞానములునులభించును. పూర్వము అవిశ్వాసులును దుర్మార్గులును పాపములు చేసి నశించిరి. అను విషయము వినుట వలన రవంత బుద్ధిగలవాఁడును ఆపాపములు చేయకూడదు అని బుద్ధితెచ్చుకొని పాపములు మానుకొనును. అటులే విశ్వాసులు పూర్వము సన్మార్గమునందుండి శిక్షనుండి రక్షింపఁబడిరి అను విషయము విని మానవుఁడు బుద్ధితెచ్చుకొని ఆమార్గమున పోవుట మంచిది యని ధర్మమార్గమునకుఁ బోవును. మానవులకు బుద్ధిజ్ఞానములు గలుగవలెననియే ఖురానులో పలుచోట్ల పలువిధములుగ పూర్వము గడచిన ప్రవక్తల వృత్తాంతములు చెప్పఁబడినవి.

121. వ-ఖుల్-లిల్లజీన-లా-యూ మినూ-నఅ-మలూ-అలా-మకా- నతి కుమ్-ఇన్నా-ఆమిలూన్. 122. వన్-తజిరూ-ఇన్నా-మున్-తజిరూన్.

121. మఱి విశ్వసింపని వారితో మీరు మీచోటున మీపనులుచేయుచునుండుఁడు. మేము కూడ మాపనులు చేయుచుందుము. 122. మఱి మీరు వేచి యుండుఁడు మేముకూడ వేచియుందుము అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 121,122. ఓ అవిశ్వాసులార! మీరు నేనుచేయు బోధను వినక ద్వేషములోనే పడి యుండవలెనని మీరుకోరుచుండినచో అందేమీరు పడి యుండి మీపనులు మీరు చేయుఁడు. నేను నామతమార్గమందు స్థిరముగా నుందును. మీరు నావిషయము ఏమి కానున్నదో దానికి వేచియుండుఁడు. నేను కూడ మీపాపములకు శిక్షవచ్చి మీకు పట్టు దుర్గతికి నేను వేచి యుందును. తుదకు దుర్మార్గుల గతి యేమగునో తెలియనగును.

123. వలిల్లాహి-గైబుస్-సమావాతి-వల్-అర్జి-వ-ఇలైహి-యుర్-జఉల్-అమ్రు-కుల్లుహూ-ఫఅబుద్ హు-వ-తవక్కల్-అలైహి-వ-మారబ్బుక-బి-గాఫిలన్-అమ్మా-తఅ-మలూన్.

123. మఱియు ఆకాశముల యొక్కయు భూమి యొక్కయు సర్వ రహస్యములు దేవుని యొద్దనే యున్నవి. మఱి సర్వకార్యములును ఆతని యొద్దకే మరలును. కావున ఆతనినే పూజింపుము. మఱి ఆతని పైననే ఆధార పడుము. మఱి మీరు చేయు కర్మలనుఁడి దేవుఁడు అజాగ్రత్తగాలేఁడు.

వ్యా॥ 123. ఓ ప్రవక్త! నీవు అవిశ్వాసుల దుష్టత్వమునకును హింసలకును చింతింపకుము. భూమ్యాకాశముల రహస్యము లన్నియు దేవునియొద్ద నున్నవి. ఆతనికి నెద్దియును మఱుఁగులేదు. సర్వము ఆతనికిఁ దెలియును. నీవు దేవునిపై నాధారపడి నీమత ప్రచార కార్యము చేయుచు నుండుము. అన్ని కార్యములు తుదకు దేవుని సాన్నిధ్యమున చేరవలసి యున్నది. కావున నీవు భయభక్తులతో దేవునిని పూజించుచు ఆతనిపై నాధారపడి యుండుము. మీకర్మలన్నియు దేవునికిఁ దెలియును. ఎద్దియును ఆయనకు తెలియనిదిలేదు. దుష్టులు తాముచేయు పాపముల ఫలితము పొందుదురు. భక్తులు తాము చేయు పుణ్యములఫలితము పొందుదురు. దేవుఁడు సర్వజ్ఞుఁడు. కావున ఎవరికర్మలకుఁ దగిన ఫలితము వారికొసంగును.

సూరయే యూసుఫ్ మక్కీ 111 వాక్యములు.

ఈ సూరాలో హజ్రత్ యూసుఫ్ ప్రవక్త విషయ మున్నది. కావున దీనికి సూరయే యూసుఫ్ అని పేరు వచ్చెను.

బిస్మిల్లా-హిర్రహ్మా-నిర్రహీమ్.
అమిత దయగలవాఁడును ప్రేమగల వాఁడునగు దేవుని పేర.

1. అలిఫ్-లామ్-రా-తిల్క-ఆయాతుల్-కితాబిల్-ముబీన్. 2. ఇన్నా-అన్-జల్నాహు-ఖుర్-ఆనన్-అర-బీయల్-లఅల్లకుమ్ తఅ-ఖిలూన్. 3. నహ్-నుు-నఖుస్సు-అలైక-అహ్-సనల్-ఖససి-బిమా-ఔ-హైనా-ఇలైక-హాజల్-ఖుర్ ఆన-వఇన్-కున్త-మిన్-ఖబ్-లిహీ-లమినల్-గాఫిలీన్.

1. అలిఫ్ లామ్ రా! (దీనియర్థము నేను దేవుఁడను, చూచుచున్నాను అని కొందఱు విద్వాంసులు చేసి యున్నారు. దేవుఁడు మానవులందఱి కర్మలను చూచుచున్నాఁడు అని తెలిసికొనునది.) ఇవి స్పష్టమైన గ్రంథముయొక్క వాక్యములు. 2. మీరు గ్రహించుటకై ఖురానును అరబీ భాషలో నంపితిమి. 3. మేము నీకు పంపిన ఈ ఖురాను మూలమున చాల యుత్తమమైన ఒక విషయము నీకుఁ దెలుపుచున్నారము. మఱి దీనికి పూర్వము నీకిది తెలియకుండెను.

వ్యా॥ 1. ఖురాను గ్రంథములోని ధర్మములును విషయములును చాల స్పష్టమైనవి. ఖురాను దేవుని గ్రంథము అను విషయము కూడ చాల స్పష్టమైనది. అందు నేలాటి సందేహము లేదు. ఇవి అట్టి గ్రంథములోని వాక్యములు. 2. ఖురానె షరీఫు అరబీ భాషలోనున్నది. హజ్రత్ ముహమ్మద్ వారియొక్కయు వారి జాతివారలగు అరబ్బుల యొక్కయు భాష అరబీ. కావున వీరు దానిని బాగుగ గ్రహించి దీని ప్రచారము లోకమంతటను చేయఁగలరు. అరబీ భాష అన్ని భాషలకంటెను చాల శ్రేష్ఠమై గంభీరముగాను స్పష్టముగాను వినువారికి ఇంపుగానుండును. మఱి ఖురానుభాషఅన్న చాల అద్భుతముగా నుండును. దానిరుచి దాని నెఱింగిన వారికే తెలియును. వినువారు పరవశులగుదురు. 3. ఖురానె షరీఫు మూలమున ఒకయుత్తమమైన విషయము (కథ) తెలుపుచున్నాను. అందు గ్రహింపదగిన అనేక విషయములును నీతులును గలవు. ఆవిషయము యూసుఫు ప్రవక్తయొక్క చరిత్రము. వీరికథలో గ్రహింప దగిన విషయములు పెక్కు గలవు. అందు దేవుని నియామకము (తఖ్-దీర్) మారదు, దేవుని యనుగ్రహమును నెవరును రద్దు చేయలేరు. తాను కోరినవారికి మేలు కలిగించును. మానవుఁడు కష్టములను సహించి స్థిరముగా నున్నచో ఉభయలోకములలో జయము పొందును. అసూయ వహించిన వారికి తుదకు అపజయమును నష్టమును తప్ప వేఱేమియు చేకూరదు. మానవుఁడు తన బుద్ధిబలముచే అనేక కష్టకార్యములను సాధింపగలఁడు. మంచి గుణశీలములు గలవారిని విరోధులుకూడ గౌరవింతురు అను పెక్కువిషయములు ఈకథచేఁ దెలియనగును. యూసుఫుప్రవక్త

చరిత్రమునకును ముహమ్మద్ వారి విషయములకును చాల పోలికగలదు. కావున దానివలన ప్రవక్తగారికి చాల మనశ్శాంతి లభింపఁగలదు. అదియును గాక యూదులు మక్కా కాఫిర్ల మూలమున పైగంబరుల వారితో ఇబ్రాహీమును ఆతని సంతతివారును సిరియా దేశ నివాసులే. వారెట్లు మిసరు (ఈజిప్టు) దేశమునకు పోఁగలిగిరి. ఎట్లు మూసా ప్రవక్త ఫిరౌనుతో మార్కొనుటకు వీలు గలిగెను అని ప్రశ్నించిరి. దానికిఁగాను రాఁబోవు వాక్యములలో యూసుఫు ప్రవక్త గారి మూలమున ఇస్రాయీలియులు మిసరు చేరవలసి వచ్చెను అని తెలుపఁబడుచున్నది. ఈ విషయము ఖురానె షరీఫులో రాకమునుపు పైగంబరుల వారికిని దేశస్థులగు అరబ్బులకును తెలియకుండెను.

4. ఇజ్-ఖాల-యూసుఫు-లి-అబీహి-యా-అబతి-ఇన్నీ-రఐతు-అహద-అషర-కౌ-కబన్-వష్-షమ్స-వల్-ఖమ-ర-రఐ-తుహుమ్-లీ-సాజిదీన్. 5. ఖాల-యా-బునయ్య-లా-తఖ్-సుస్-రూయాక-అలా-ఇఖ్-వతిక-ఫయకీదూ-లక-కైదన్-ఇన్నష్-షైతాన-లిల్-ఇన్-సాని-అదువ్వుమ్-ముబీన్. 6. వ-కజా-లిక-యజ్-తబీక-రబ్బుక-వ-యు-అల్లి-ముక-మిన్-తా వీలిల్-అహాదీసి-వ-యుతిమ్ము-నిఅ-మత-హూ-అలైక-వ-అలా-ఆలి-యఅ-ఖూబ-కమా అతమ్మహా-అలా-అబవైక-మిన్-ఖబ్లు-ఇబ్రాహీమ-వ-ఇస్-హాఖ-ఇన్న-రబ్బక-అలీమున్-హకీమ్.

4. యూసుఫు తన తండ్రితో ఓ నాయనా! నాకు స్వప్నములో పదునొకండు నక్షత్రములును సూర్య చంద్రులును కనఁబడినవి. అవి నాకు సాష్టాంగ నమస్కారములు చేయుచుండుటను నేను చూచితిని అని చెప్పినపుడు. 5. ఓ నా చిన్నకుమారా! నీ స్వప్నము నీ సోదరులకుఁ దెలుపకుము. అపుడు వారు నీకు కుట్రలు చేయుదురు. నిశ్చయముగా సైతాను మానవునకు స్పష్టమైన విరోధి. 6. మఱియు నిట్లు నీప్రభువు నిన్ను ఎన్నుకొనును. విషయముల వాస్తవమును నీకుఁ దెలుపును. మఱియు నెట్లు నీతాత ముత్తాతలగు ఇబ్రాహీమును ఇస్ హాఖును సంపూర్ణముగ అనుగ్రహించెనో అటులే నీకును యాఖూబు యింటివారికిని సంపూర్ణముగ తన యనుగ్రహ మొసంగును. నిశ్చయముగ నీప్రభువు సర్వజ్ఞుడును వివేచనా పరుఁడును అనిఆయన పలికెను.

వ్యా॥ 4,5. ఇబ్రాహీము ప్రవక్తకు బీబీసారాయందు ఇస్ హాఖు అను పుత్రుఁడు గలిగెను. యాఖూబుయొక్క కుమారుఁడు యూసుఫుప్రవక్త. యూసుఫు తన బాల్యములో స్వప్నమందు పదునొకండు నక్షత్రములును, సూర్య చంద్రులును తనకు సాష్టాంగపడుచున్నట్లు చూచెను. ఈ స్వప్నము వృథా

కాదు. దీనిభావము స్పష్టమైనది. యూసుఫునకు పదునొకండుమంది సోదరు లుం డిరి. వీరు సవతితల్లి కుమారులు. నక్షత్రములు సోదరులు అని సూర్యచంద్రులు తల్లిదండ్రులని భావము. వీరు ఒక దినము గౌరవార్థము యూసుఫునకు సాష్టాంగ పడుదురని సూచించును. ఈ విషయము నీసోదరులు తెలిసికొందురు. నీవు వారికి ఈ స్వప్నము దెలుపకుము. వారు నీయందు అసూయవహించి నీ విషయము కు ట్రలు సేయుదురేమో ! ఎందుకన సైతాను మానవులకు చాల విరోధి. మన స్సులలో లేనిపోని కలతలను పెట్టి వారు దురుద్దేశమునకు పూనునట్లు చేయును. అని యాఖూబు ప్రవక్త హెచ్చరించెను. 6. ఎట్లు నీకు మంచి స్వప్నము నను యనుగ్రహించెనో అటులే దేవుఁడు తన యనుగ్రహముచే నిన్ను బహుగా గౌరవించి గొప్ప దర్జా లొసంగును. స్వప్నముల భావము తెలుపుచు శాస్త్రధర్మములు యర్థములను విషయములను నీకుఁ దెలుపును. నీకు పరలోకమునందే గాక యిహ మునందుకూడ గొప్పరాజ్య మొసంగును. అన్ని కష్టములను నివారించును. ఎట్లు ఇబ్రాహీము ప్రవక్తను దేవుఁడు తనకు ప్రియునిగా జేసికొని అతని విరోధులను నశింపజేసి యాతని కాపాడి యనుగ్రహించి నీతాతయగు ఇస్హాఖును గొప్ప ప్రవక్తగా చేసి అతని సంతానములో ననేక ప్రవక్తలను రాజులను చేసెనో అటులే నిన్నుకూడ దేవుఁడు అనుగ్రహించును. దేవునికి సర్వము దెలియును. అతఁడు యుక్తాయుక్తములు తెలిసినవాఁడు. కావున ఎవరికిఁ దగిన పదవులను ఫలితములును వారి కొసంగును అనియాఖూబుతనకున్న దివ్యజ్ఞానమువలనపలికెను

7. లఖద్-కాన-ఫీ-యూసుఫ-వ-ఇఖ్-వతిహీ-ఆయాతుల్-లిస్-సాయి- లీన్. 8. ఇజ్-ఖాలూ-లయూసుఫు-వ-అఖూహు-అహబ్బు-ఇలా-అబీనా మిన్నా వ-నహ్-ను-ఉస్-బతున్-ఇన్న-అబానా-లఫీ-జలా-లిమ్-ముబీన్. 9. ఉఖ్-తులు- యూసుఫ-అవిత్-రహూ-అర్-జన్-యఖ్-లు-లకుమ్-వజ్-హు-అబీకుమ్-వ-తకూ- నూ-మింబఅ-దిహీ-ఖౌ-మన్-సాలి-హీన్. 10. ఖాల-ఖాఇ-లుమ్-మిన్-హుమ్ లా-తఖ్-తులూ-యూసుఫ-వ-అల్-ఖూహు-ఫీ-గయా-బతిల్-జుబ్బి-యల్- తఖిత్-హు-బఅ-జుస్-సయ్యా-రతి-ఇన్-కున్తుమ్-ఫా-ఇలీన్.

7. ప్రశ్నించువారికొఱకు యూసుఫుయొక్కయు అతని సోదరులయొక్క యు కథలో నిశ్చయముగా సూచనలున్నవి. 8. యూసుఫును అతని తమ్ముఁ డును మన తండ్రికి మనకంటెను చాల ప్రియులుగా నున్నారు. మఱి మనము బలముగలిగిన చాలమందిగా నున్నారము. నిశ్చయముగా మనతండ్రి స్పష్టమైన పొరపాటులోపడియున్నాఁడు. 8. యూసుఫునుచంపివేయుఁడు. లేదా తెలియని

దూరదేశములో వదలిపెట్టుఁడు. ఇట్లు చేసిన మీతండ్రి గమనము మీపై ననే యుండును. మఱి ఆ పిదప మీరు మంచివారలై యుండుఁడు అని వారు పలికిరి. 9. అపుడు వారిలో నొకఁడు యూసుఫును చంపకుఁడు. మఱి మీరు చేయ వలెననియున్నచో అతనిని ఎవరైన బాటసారులు ఎత్తుకొనిపోవునట్లుగ ఒక లోఁతుబావిలో పడవేయుఁడు అని పలికెను.

వ్యా॥ 7. యూసుఫుప్రవక్త కథనుగూర్చి యడుగువారికి నిందు చాల సూచనలును, నీతులును గలవు. ఆతని సహోదరులు ఆతని విషయ మెట్లు ప్రవర్తించిరి. తుదకు దాని ఫలిత మెట్లు ఆయెను అను విషయమును గమనించు వారికి దేవుని శక్తిమహిమలు తేటతెల్లమగును. చదువునేర్చని మహమ్మద్ వారు ఈ విషయమును వాస్తవరూపములోఁ దెలుపుట స్వాంతముగా కానేరదు. దేవుని సందేశమువలననే తెలుపనగును. అని స్థిరమగును. ఎట్లు యూసుఫు సోదరులు ఆతనియందు అసూయవహించి యనేక కష్టములుపెట్టి లోఁతుబావిలో వేసి యూరినుండితఱిమి వేసిరో తుదకు దేవునిమహిమవలన యూసుఫుప్రవక్త రాజై తన సోదరులు తనయొద్దకు అక్కఱపడి వచ్చినపుడు శిక్షింపక వారి నేరములను క్షమించి కరుణించెనో యటులే మహమ్మద్ ప్రవక్తకూడ ఇఁక మీఁద తన దేశసోదరులచే హింసింపఁబడి జన్మభూమియగు మక్కాపురమువదలి మదీనాపురము చేరి యచ్చటనుండి కొన్ని సంవత్సరముల పిదప మక్కాపురమును జయించి తన్ను హింసించిన దేశసోదరుల నేరములను క్షమించి కరుణించును అను విషయము సూచింపఁబడినది. ఎందుకన ఈ వాక్యములు మదీనా చేరక మునుపు మక్కాపురములో రసూలువారుండినపుడు వచ్చినవి. 8, 9. యూసుఫునకు ఒక సొంత తమ్ముఁడు బిన్‌యామీన్ అను నతఁడుండెను. వీరిద్దఱు అందఱికంటెచిన్న వారు. వీరిద్దఱి తల్లి చనిపోయియుండెను. యూసుఫు చాల సౌందర్యముగలిగి బాల్యములోనే మంచి గుణశీలములుగలిగి యుండెను. అందుచే యాఖూబు ప్రవక్త వారిని కడు ప్రేమతో చూచుచుండెను. దానికి యూసుఫు సవతితల్లి కుమారులు సహింపలేక మనము పెద్దలము. మనము చాలమందిగా నున్నారము. మనము సమయమునకు పనికివచ్చు వారలము. ఈచిన్నపిల్లలు ఏమిచేయఁగలరు. మన తండ్రి మనలను ప్రేమింపక వీరిని ప్రేమించుచున్నాఁడు. ఇట్లు మనతండ్రి గొప్ప పొరపాటులో పడియున్నాఁడు అని వారు పరస్పరము చెప్పుకొని తండ్రి మనయందే ప్రేమగలిగియున్నట్లు చేయవలెను. దానికిఁగాను యూసుఫునుచంప వలెను. లేదా ఏదోయొక తెలియని దేశములో వదలి వచ్చిన తిరిగి యిచ్చటికి రాఁజాలఁడు. ఈపాపమునకు దేవునితో క్షమాపణ వేఁడుకొని యిఁకమీఁద మంచివారలముగనై యుండవచ్చును అని యాలోచనలు చేసిరి. 10. అపుడు

...కూడా అనునతఁడు చంపుటఘోరపాతకము. అట్లుచేయరాదు. మా యు ద్దేశము వేఱుమార్గమున పూర్తిచేసికొనవచ్చును. ఎందులకు సోదర హత్యకు పూనవలెను. కావున ఏదో తెలియని లోఁతు బావిలో పడవేయుఁడు. ఎవ్వరైన బాటసారులు వచ్చి యెత్తుకొనిపోవుదురు. అపుడు హత్య పాపము రాదు. యీయూ సుఫుకూడ తొలఁగిపోవును అని పలికెను. ఇట్లు వారు నిశ్చయించుకొని తమ వెంట యూసుఫును పంపవలెనని తమ తండ్రిని అడుగుచున్నారు. ఇది రాఁబోవు వాక్యములో నున్నది.

11. ఖాలూ-యా-అబానా-మా-లక-లా-తామన్నా-అలా-యూసుఫ-వ-ఇన్నా-లహూ-ల-నాసిహూన్. 12. అర్-సిల్ హు-మఅనా-గదన్ యర్-తఅ-వ-యల్ అబ్-వ-ఇన్నా-లహూ-ల-హాఫిజూన్. 13. ఖాల-ఇన్నీ-ల-యహ్ జునునీ-అన్ తజ్ హబూ-బిహీ-వ-అఖాఫు-అన్-యా-కుల-హుజ్ జీబు-వ-అన్ తుమ్ అన్ హు-గాఫిలూన్. 14. ఖాలూ-లఇన్ అక-లహుజ్-జీబు-వ నహ్ను-ఉస్-బతున్-ఇన్నా-ఇజల్ లఖాసిరూన్. 15. ఫలమ్మా-జహబూ-బిహీ-వ-అజ్-మఉ-అన్-యజ్-అలూహు-ఫీ-గయా-బతిల్ జుబ్బి-వ-ఔ-హైనా-ఇలైహి-ల-తునబ్బి అన్న హుమ్ బి-అమ్ రిహీమ్-హాజా-వహుమ్-లాయష్-ఉరూన్. 16. వ-జాఊ-అబా-హుమ్-ఇషా-అన్-యబ్ కూన్. 17. ఖాలూ-యా-అబానా-ఇన్నా-జహబ్నా నస్-తబిఖు-వ తరక్నా-యూసుఫ-ఇన్ద-మతాఇనా-ఫ-అక-లహుజ్-జీబు వ-మా-అన్ త-బి-మూ-మినల్-లనా-వలౌ-కున్నా-సాదిఖీన్. 18. వ జాఊ-అలా-ఖమీ-సిహీ-బిదమిన్ కజి-బిన్ ఖాల-బల్-సవ్వలత్-లకుమ్-అన్ ఫుసుకుమ్-అమ్రన్ ఫ-సబ్ రున్-జమీలున్-వల్లా-హుల్ ముస్-త-ఆను-అలా-మా-తసిఫూన్.

11. ఓ మాతండ్రీ ! నీకేమైనది. యూసుఫు విషయము మమ్ము నమ్మవు. మఱి మేము ఆతని మేలు కోరువారలమే. 12. రేపు ఆతనిని మా వెంట పంపుము, బాగుగ ఫలములు తినును. మఱి ఆటలాడుకొనును. మఱి మేము ఆతనికి రక్షకులుగా నున్నారము అని వారు పలికిరి. 13. (అపుడు) మీరు ఆతనిని దీసికొనిపోవుటవలన నాకు దుఃఖము గలుగును. మఱి మీరు ఆతని విషయము అజాగ్రత్తగా నుండుటవలన తోఁడేలు ఆతనినితిని వేయును అనినాకు భయముగలదు అని ఆతఁడు పలికెను. 14. (అపుడు) వారు ఆతనినితోఁడేలు తినివేసినచో మేము బలవంతులమైయుండియు సమస్తము పోఁగొట్టుకొనినవారలమగుదుము అని పలికిరి. 15. అ

పిదప వారు ఆతనినిదీసికొనిపోయి లోఁతు బావిలో నాతనిని వేయవలెనని నిశ్చ
యించుకొనిరి. మఱియు తప్పక నీవు ఈ వృత్తాంతమును వారికిఁ దెలుపుదువు.
అపుడు వారు నిన్ను గుర్తింపకయుందురు అని మేము ఆతనికిసందేశము పంపితిమి.
16. మఱి రాత్రి చీకటికాఁగానే వారు తమ తండ్రియొద్దకు ఏడ్చుచు వచ్చిరి.
17. ఓ నాయనా! మాలో నెవరు ముందు పోవుదురనిపరుగెత్తుటకుఁగానుపోవుచు
మాసామానునొద్ద యూసుఫును వదలిపోతిమి. పిదప తోఁడేలు ఆతనిని తిని
పోయెను. మఱి మేము సత్యము పలికినను నీవు మామాట నమ్మవు అని పలి
కిరి. 18. మఱి వారు ఆతని యంగిపై అబద్ధపు రక్తమును తగిలించితెచ్చిరి.
అపుడు యాఖూబు ఇది కానేరదు. మీకుంగాను మీయాత్మలు ఒక మాటను
కల్పించినవి. ఇఁక సహనమే మంచిది. మఱి మీరు పలుకు మాటల విషయము
దేవుని సహాయమే వేఁడుచున్నాఁడను అని పలికెను.

వ్యా॥ 11. పై విధమున కుట్ర నుద్దేశించి తమ తండ్రియొద్దకు పోయి
ఓ నాయనా! యూసుఫు విషయమున నీవు మామాట నమ్మవు. ఏమియు చింత
పడవలసిన యక్కఱలేదు. మేము ఆతని మేలు కోరువారము. కీడుచేయము. కా
వున ఆతనిని మా వెంటఁ బంపుము. అడవిలో ఫలములు బాగుగ తిని యాట
లాడును. ఇంటిలో నుండుటవలన దేహారోగ్యము బాగుగ నుండదుగదా! పొల
ములలో తిరిగి యాడుటవలన దేహమునకు బలమువచ్చునుగదా! మేము ఆతనికి
ఏలాటి యపాయము కలుగకుండ కాపాడుదుము అని పలువిధములుగ పలికిరి.
13. యూసుఫును విడిచి నేను ఉండలేను. మఱి మీ వెంట పంపవలెనన్న నాకు
దుఃఖమగుచున్నది. అదియునుగాక యూసుఫు పిల్లవాఁడు. మీరుఅజాగ్రత్తగా
నున్నపుడు అడవిలోన తోఁడేలు వచ్చి తినివేయునేమో అని భీతికూడగలదు
అని యాఖూబు ప్రవక్త పలుకఁగా, 14. వారు ఏమి నాయనా! నీవట్లు పలుకు
చున్నావు. మేము పదునొకండుమంది బలిష్ఠుల మున్నారమే! మేమింతమందియుండి
మా చిన్నతమ్ముని తోఁడేలు తినివేసినచో మేముండిమేమి ఫలము? మేముసర్వము
పోఁగొట్టుకొని నవారలమగుదుముగదా! అట్లు కానేరదు. నాయనా! అని
సమాధానము పలికిరి. 15. ఇట్లు వారు తమ తండ్రితో పలికి తమవెంట యూసు
ఫును అడవిలోనికిఁ దీసికొనిపోయి తా ముద్దేశించియుండిన ప్రకారము ఒక
లోఁతు బావి యడుగున పడవేసిరి. అపుడు దేవుఁడు యూసుఫుప్రవక్తకు నీవు
భయపడకుము. నిన్ను నేను రక్షించి నీకు గొప్పస్థానము నొసంగుదును. నీసహో
దరులు చేసిన ఈ కార్యమును ఇఁకమీఁద వారికిఁ దెలుపుదువు. అపుడు వీరు
నిన్ను గుర్తింపలేరు అని సందేశము పంపి యోదార్చెను. 16. యూసుఫుసహో
దరులు తాము పన్నిన కుట్ర ప్రకారముచేసి రాత్రి చీకటి పడిన తరువాత దొంగ
యేడ్పులు ఏడ్చుచు తమ తండ్రియొద్దకు వచ్చి, 17. ఓ నాయనా! మేము ఏమి

చేయుదుము. మేము పరుగుపందెములాడుచు ఎవరు మించిపోవుదురో చూతము అని పరుగెత్తిపోతిమి. మాసామానువద్ద కావలిగా యూసుఫునుంచితిమి. మేము తిరిగి వచ్చుసరికి తోడేలు వచ్చి యూసుఫును తినిపోయెను. మేము నిజము చెప్పు చున్నారము. అయిన నీవు నమ్మవు అని పలుకుచు తాము మేకనో జింకనో చంపి దాని రక్తము యూసుఫు అంగీకి తగిలించి తెచ్చిన యబద్ధపు రక్తమును చూపి నీవు మామాట నమ్మకపోయినచో ఈఅంగీని చూడుము! అని పలికిరి. ఆ అంగీ చినగకుండ బాగుగ నుండెను. అదిచూచి యాఖూబుప్రవక్త తోడేలు తినినచో అంగీ చినగకుండ అటులే యుండునా అని తలచి మీరు చెప్పునది నిజముకాదు. అట్లు కానేరదు. మీరు మీయాత్మల దుష్టత్వమును అనుసరించి కుట్ర చేసియున్నారు. నేను ఓపిక వహింతును. మిమ్ము శిక్షింపను. నేను దేవుని సహాయమును కోరుచున్నాను. ఆతడే నాకు తోడుపడి తిరిగి యూసుఫును కన్ను లార చూచుభాగ్యము నాకొసంగునుగాక యని పలికి యూరకుండెను.

19. వ-జా-అత్-సయ్యా-రతున్-ఫఅర్-సలూ-వారిదహుమ్-ఫ-అద్లా దల్వహూ-ఖాల-యా-బుష్రా-హాజా-గులా-మున్-వ-అసర్రూహు-బిజా-అతన్-వల్లాహు-అలీముమ్-బిమా-యఅ-మలూన్ 20. వ-షరౌ-హు-బి-సమ-నిమ్-బఖ్సిన్-దరా-హిమ-మఅ-దూదతిన్-వ-కానూ-ఫీహి-మినజ్-జాహిదీన్.

19. మఱి ఒక బిడారము వచ్చి వారిలో నొకనిని నీళ్లు తోడుకొని తెచ్చుటకు ఆబావినొద్దకు పంపగా ఆతడు తన చేదను బావిలో వేసి ఏమిదా! ఎంత సంతోషమైన మాట! ఇదిగో ఒక బాలుడు అని పలుకసాగెను. మఱి వారు ఆబాలుని వ్యాపార సొత్తుగా నెంచి దాచిపెట్టిరి. మఱి వారు చేయు నది దేవునికి బాగుగ తెలియును. 20. మఱి ఆతని సహోదరులు ఆతనిని తక్కువ వెలకు కొన్ని పావులాలలో నమ్మి వేసిరి. మఱివారు వాని విషయము అసహ్య పడుచు నుండిరి.

వ్యా॥ 19. యూసుఫు ఆబావిలో మూడు దినములుండెను. ఆతని సహోదరులలో నొకడు వచ్చి ఆహారము నిచ్చిపోవుచుండెను. ఆ దినములలో అచ్చటికి మద్యనునుండి యీజిప్టునకు పోవు బిడారము వచ్చెను. ఆ బాటసారు లు నీళ్లు తెచ్చుటకు నొకనిని పంపిరి. ఆతడు బావిలో చేదను వేయగా నే యూసుఫు త్రాడునుపట్టుకొని చేదలోగూర్చుండెను! నీళ్లుచేదునాతడు చూచి సంతోషముతో ఇదిగో చాల సుందరవంతుడైన బాలుడు అని కేకవేసెను. నీ ళ్లకొఱకు వచ్చినవాడు తన వారితో ఈ విషయమునుదాచి నేను ఈబాలుని యాతని యజమానులతో వెలకుకొంటిని యని పలికెను. యూసుఫు విషయము

వారు చేయుచున్న అన్ని విషయములు దేవునికిఁ దెలియును. ఆతనిసహోదరులు, ఆతనిని దేశ భ్రష్టునిగా చేయవలెననియు బాటసారులు ఆతని వెలకు అమ్మి డబ్బు సంపాదించుకొనవలెననియు కోరుచుండిరి. కాని దేవుఁడు యూసుఫును ఈజిప్టు దేశములోని ధనపు ఖజానాలకు యజమానినిగాఁ జేయవలెననియుద్దేశించెను. కావున సర్వము తెలిసియు దేవుఁడు, దుష్టులు చేయు కార్యములకు ఆటంక పఱచలేదు. 20. బాటసారులు యూసుఫును దీసికొని పోవుచున్నారని తెలిసి వారియొద్దకు పోయి-ఈతఁడు మా బానిస పాఱిపోయినాఁడు. ఈతఁడు ఎప్పుడు చూచిన పాఱిపోవుచునుండును. కావున మీరు కోరినచో మేము అమ్మివేయుదుము కానిమీరు జాగ్రత్తగానుండవలెను. లేనిచో పాఱిపోవును అని పలికి పదునెనిమిది (18) దిర్హమ (పావులా) లకు నమ్మివేసిరి. ఇంత కొద్ది వెలకు అమ్ముట వలన ఆశ్చర్యము పడరాదు. ఎందుకన వారు యూసుఫు విషయముచాలఅసహ్యాపడియుండిరి. వెలలేకుండ నేయినిచ్చివేయుటకు సిద్ధమైరి. అయిన డబ్బు వచ్చినంతకులాభమేఅనికొద్దివెలకు అమ్మివేసిరి.

21. వఖాలల్-లజిష్-తరాహు-మిమ్-మిస్ర-లి-ఇమ్-రఅ-తిహీ- అక్రి-మీ-మస్-వాహు-అసా-అన్-యన్-ఫఅనా-ఔ-నత్-తఖి-జహూ-వలదన్ - వ-కజాలిక-మక్-కన్నా-లియూసుఫ- ఫిల్-అర్-జి-వ-లి-ను-అల్లి-మహూ-మిన్- తావీలిల్-అహాదీసి-వల్లాహు-గాలిబున్-అలా-అమ్-రిహీ-వలా-కిన్న-అక్- సరన్నా-సి-లాయఅ-లమూన్. 22. వలమ్మా-బలగ-అషు-ద్దహూ-ఆతైనాహు- హుక్మన్-వ-ఇల్మన్-వ-కజాలిక-నజ్-జిల్-ముహ్సినీన్.

21. మఱియు మిసరులో యూసుఫును కొనినవాఁడు తన భార్యతో- ఈతనిని గౌరవముతో నుంచుము. బహుశః ఈతఁడు మనకుఁ బనికివచ్చును. లేదా మనము ఈతనిని పుత్రునిగాఁ జేసికొందుము. అని పలికెను. మఱియు యూసుఫునకు విషయముల వాస్తవమును దెలుపుటకుఁ గాను ఇట్లు యూసుఫునకు ఆ దేశములో నివాసము నొసంగితిమి. మఱి దేవుఁడు తన కార్యముపై శక్తి గలవాఁడు. కాని జనులలో పెక్కుమంది దీనిని దెలిసికొనలేరు. 22. మఱియు యూసుఫు తన యుక్త వయస్సునకు రాఁగా ఆతనికి బుద్ధిని జ్ఞానము నొసంగితిమి. మఱియు నిట్లు సత్కార్యములు చేయువారికి మేము ఫలిత మొసంగుచున్నారము.

వ్యా॥ 21. బాటసారులు యూసుఫును మిసరు (ఈజిప్టు) నకుఁ దీసికొని పోయిరి. అచ్చట వేలము వేసిరి. అందు అచ్చటి మంత్రి ఆతనినికొనెను. ఆతనిని తన యింటికిఁ దీసికొని పోయి తనభార్యతో నీతనిని బాగుగ గౌరవముతోను

ప్రేమతో నుంచుము. ఈతనిని బానిసగా చూడకుము. ఈతడు పెద్దవాడైన మాకుప నికివచ్చును. లేదా మాకు పుత్రులు కలుగనిచో ఈతనిని పుత్రునిగాఁ జేసికొందుము అని పలికెను. ఇట్లు దేవుడు యూసుఫును సోదరుల కుట్రనుండి రక్షించి ఆతని మంచితావున నివాస మొసంగెను. మంత్రి హృదయములో ఆతని ప్రేమ వేసెను. మిసరువారుకూడ యూసుఫును చాల గౌరవముతో చూడసాగిరి. మంత్రియింటిలో నుండుట వలన రాజ్యాంగ విషయములను బాగుగ తెలిసికొన సాగెను. అదియునుగాక దేవుడు ఆతనికి రహస్యార్థములును విషయముల వాస్తవమును తెలిసికొను శక్తి నొసంగెను. దేవుడు తాను కోరిన కార్యము సాగించును. చూడుడు! యూసుఫు యొక్క సహోదరులు ఆతనిని అధమ స్థితిలో పడవేయఁ దలచిరి. కాని దేవుడు ఆతనికి ఉన్నత స్థానము నొసంగెను. దేవుని మహిమలు ప్రజలలో పెక్కురు తెలిసికొనలేరు. మానవుల యత్నములు దేవుని విరోధముగా సాగవు. దేవుడు కోరినదే నెరవేఱును. 22. యూసుఫునకు బాల్యము పోయి మంచి యుక్తవయస్సు వచ్చి సర్వాంగములు బలము గలవిగా నాయెను. దేవుడు ఆతనికి బుద్ధి జ్ఞానము లొసంగెను. చిక్కు వ్యవహారములను సులభముగా కుదుర్చుచుండెను. ప్రజల తగవులు మహా నేర్పుతోను న్యాయముగను తీర్చుచుండెను. మతధర్మములలో సూక్ష్మ విషయములను బాగుగ గ్రహింపసాగెను. మంచి గుణశీలములు గలిగి ప్రజలకు మార్గదర్శియాయెను. స్వప్నముల భావము తెలుపుటలో ఆయనకు చాల ప్రాముఖ్యత లభించెను. ఆయన చెప్పు స్వప్నభావము సరిగా సంభవించుచుండెను. ఇటులే ఎవరు కష్టములను సహించి సత్కార్యులై యుందురో వారికి మంచి ఫలితము దేవుడొసంగును.

23. వ-రా-వదత్-హుల్-లతీ-హువ-ఫీ-బైతిహా-అన్-నఫ్-సిహీ-వ గల్లఖతిల్-అబ్వాబ-వ-ఖాలత్-హైత-లక-ఖాల-మఆ-జల్లాహి-ఇన్నహూ-రబ్బీ-అహ్సన-మస్-వాయ-ఇన్నహూ-లా-యుఫ్-లిహుజ్-జాలి-మూన్. 24. వల-ఖద్-హమ్మత్-బిహీ-వ-హమ్మ-బిహా-లౌ-లా-అర్-రఆ-బుర్-హాన-రబ్బిహీ-కజాలిక-లి-నస్-రిఫ-అన్-హుస్-సూఅ-వల్ ఫహ్-షాఅ-ఇన్న-హూ-మిన్-ఇబాదినల్-ముఖ్-లసీన్. 25. వస్-తబఖుల్-బాబ-వ-ఖద్దత్-ఖమీ-సహూ-మిన్-దుబురిన్-వ-అల్-ఫయా-సయ్యిదహా-లదల్-బాబి-ఖాలత్-మా-జజాఉ-మన్-అరాద-బి-అహ్-లిక సూఅన్-ఇల్లా-అన్-యుస్-జన-ఔ-అజాబున్-అలీమ్. 26. ఖాల-హియ-రావదత్నీ-అన్-నఫ్సీ-వ షహిద-షాహిదుమ్-మిన్-అహ్-లిహా-ఇన్

కాన-ఖమీసుహూ-ఖుద్ద మిన్-ఖుబులిన్-ఫ-సద-ఖత్ వహువమినల్-కాజిబీన్. 27. వఇన్-కాన-ఖమీ-సుహూ-ఖుద్ద-మిన్-దుబు-రిన్-ఫకజబత్ - వహువ - మినస్-సాదిఖీన్. 28. ఫలమ్మా-రఆ-ఖమీ-సహూ-ఖుద్ద-మిన్-దుబురిన్-ఖాల-ఇన్నహూ-మిన్-కైది-కున్న-ఇన్న-కైద-కున్న-అజీమ్. 29. యూసుఫు-అఅ-రిజ్-అన్-హాజా-వస్-తగ్-ఫిరీ-లి-జమ్ బికి-ఇన్నకి-కున్ తి-మినల్-ఖాతి-ఈన్.

23. యూసుఫు ఎవతె యింటిలో నుండెనో యామె ఆతని మనస్సును చలింపఁ జేయుటకై యాతనిని మోహించెను. ఆమె తలుపును మూసివేసి నీవు శీఘ్రముగ రమ్మని పలుకఁగా నేను దేవుని శరణుచొచ్చుచున్నాను. నాయజమానుఁడు నాకు బాగుగా నుంచి యున్నాఁడు. నిశ్చయముగా అన్యాయము చేయు వారలు మేలుపొందరు అని యూసుఫు పలికెను. 24. మఱియు నిశ్చయముగా నామె యూసుఫు నుద్దేశించెను. యూసుఫు తన ప్రభువు యొక్క సూచన చూచి యుండనిచో ఆమెను నుద్దేశించి యుండును. ఇట్లు ఆతనినుండి కీడును పాపమును తొలఁగించుటకుఁ జేసితిమి. నిశ్చయముగా ఆతఁడు మాపవిత్రులైన భక్తులలో చేరిన యాతఁడు. 25. వారిద్దఱు తలుపు వైపునకు పరుగెత్తిరి. మఱి యామె ఆతని యంగీని వెనుకటి వైపునుండి చింపివేసెను. మఱియు వారిరువురును తలుపునొద్ద నామె భర్తతో కలిసిరి. అపుడు ఆమె నీయింటివారిని చెఱుప వలెనని దలఁచిన వానికి చెరలో నుంచుట లేదా దుఃఖకరమైన శిక్ష నొసంగుట తప్ప వేఱుశిక్షలేదు అని పలికెను. 26. (అపుడు) యూసుఫు నేను నామనస్సును ఆపుకొనక యుండుటకై యామెయే నన్ను కోరెను. అని పలికెను. మఱి ఆమె కుటుంబము వారిలో నొక సాక్షి ఆతని యంగి ముందు వైపు నుండి చినిగి యున్నచో నామె పలికినది సత్యము. మఱియాతఁడు పలికినది యబద్ధము. 27. మఱి యాతని యంగీ వెనుక చినిగి యున్నచో ఆమె పలికినది అబద్ధము. మఱి యాతఁడు పలికినది నిజము అని సాక్ష్యమిచ్చెను. 28. ఆపిదప ఆమె భర్త, యూసుఫు అంగీ వెనుకటి భాగమునుండి చినిగి యుండుట చూచి నిశ్చయముగా నిది స్త్రీలగు మీ కుట్రయున్నది. నిశ్చయముగా మీకుట్ర చాల గొప్పది. 29. ఓ యూసుఫు! ఈ విషయము పోనిమ్ము. మఱి ఓసి నీవు నీపాపమునకుఁగాను క్షమాపణ వేడుకొనుము. నిశ్చయముగా నీవే పాపముచేసిన దానవు అని పలికెను.

వ్యా॥ 23. అట్లు యూసుఫును దేవుఁడు అనుగ్రహించుచుండఁగ ఆతనిని ధర్మమార్గమునుండి చలింపఁ చేయుటకై మంత్రి భార్యయగు జలీఖా యూసుఫు సౌందర్యమునకు మోహితురాలై అనేక కుట్రలు సలిపెను. కాని దేవుఁడు యూ

సుఫును ఆమె కుట్రలనుండి రక్షించెను. ఈ విషయమును గూర్చి యీ వాక్యములలో చెప్పఁబడెను. జలీఖా యూసుఫును మోహించి యాతని మనస్సును చలింపఁ జేయుటకై అన్ని విధముల యలంకార శృంగారములు చేసికొని యూసుఫు ఒంటరిగా నున్నపుడు ఆతని యొద్దకు పోయి తలుపులు మూసివేసి రమ్మని పిలిచి పైఁబడఁబోయెను. అపుడు ఎట్టి భక్తుఁడైనను పరవశుఁడై ధర్మమార్గము వీడునుగదా! కాని దేవుని భక్తుఁడగు యూసుఫు తన మనుస్సును చలింపఁ జేయక నీ దుష్టత్వమునుండి నన్ను రక్షింపవలెనని దేవుని శరణుచొచ్చుచున్నాను. దూరముపొమ్ము. నేను నా యజమానుఁడు (మంత్రి) నాకు మేలుచేసి యున్నాఁడు. ఆతని మానమునందు నమ్మిక ద్రోహము చేయను. అది చాల అన్యాయము. అన్యాయస్థులు జయము పొందఁజాలరు. ఇంక సర్వజ్ఞుఁడగు దేవుఁడు చూచుచున్నాఁడుగదా! ఆతనికి భయపడవలెను, ఆతని మేళ్లు లెక్కలేనివి అని యూసుఫు పలికి ఆమె కుట్రనుండి తప్పించుకొనుటకు నాలోచించెను. 24. జలీఖా ఆతనిని తన వశము చేసికొనవలెనని చాల యత్నించెను. కాని యూసుఫు దేవుని సూచనలను చూచి యాతనికి భయపడి యాపాపమునకుఁ బూనుకొనలేదు. వ్యభిచారము ఘోర పాపము అని యూసుఫునకుఁ దెలియును. ఇది చాల చెడ్డపని అని గుర్తించియే దానికి లొంగలేదు. ఇట్లు దేవుఁడు యూసుఫు మనస్సును చలింపఁ జేయక ధర్మమార్గమందు స్థిరముగా నుంచి యాతనిని పాపకార్యమునుండి రక్షించెను. కావుననే యూసుఫు దేవుని భక్తులలో చేరినవాఁడు అని దేవుడు పొగడెను. 25. యూసుఫు జలీఖానుండి తప్పించుకొనుటకై తొందరగా తలుపు తెఱచుకొని పోవలెనని పరుగెత్తసాగిరి. జలీఖా ఆతనిని పట్టుకొనుటకు వెనుక వెంబడించెను. ఆ తొందరలో యూసుఫు అంగియొక్క వెనుకటి భాగము జలీఖా చేతిలో చిక్కుకొనెను. ఆమె పట్టి లాగఁగా అది చినిగిపోయెను. యూసుఫు తప్పించుకొని యింటినుండి వచ్చుచుండెను. ఆతని వెనుక జలీఖా పరుగెత్తుచు వచ్చుచుండెను. ఆసమయములో జలీఖా భర్త తలుపు దెగ్గఱ ఎదురుపడెను. వారిద్దఱిని ఆతఁడు చూచెను. తత్క్షణమే జలీఖా మాటలు కల్పించి ఓయీ భర్తా! చూడుము, ఈతఁడు నన్ను చెఱుప వలెనని యత్నించెను. కావున ఈతనిని చెఱలో నుంచవలెను. లేదా ఏదైన కఠినశిక్ష నొసంగ వలెను అని పలుక సాగెను. అపుడు యూసుఫు ఇందు నాదోషమేమియు లేదు. ఆమెయే నన్ను మోహించి నామనస్సును చలింపఁ జేయవలెను అని యత్నించెను. నేను ఆమెనుండి తప్పించుకొని వచ్చుచున్నాను అనిపలికెను. అపుడు జిలీఖా కుటుంబములో నొక బంధువుఁడు నిజమైన వృత్తాంతము తెలిసికొని యాతఁడు నిష్పక్షపాతముగ యూసుఫు అంగీ ముందుభాగమునుండి చినిగి యున్నచో ఆమె మాట నిజము. యూసుఫు మాట అబద్ధము. ఆతఁడు నేరస్థుఁడగును. ఎందుకన యూసుఫు

మోహించినచో ఆతని ముఖము ఆమె వైపున నుండును. ఆమె లాగుటలో ముందుభాగము చినిఁగి యుండును అనియు అంగీ వెనుకటి వైపున చినిఁగి యున్నచో యూసుపు మాట సత్యము. ఆమెమాట అబద్ధము. ఎందుకనయూసుపు తప్పించుకొని పాఱిపోవు నపుఁడు ఆతని వీఁపు జలీఖా వైపున నుండును. ఆమె తన కోరికను నెరవేర్చుటకు ఆతనిని లాగునపుడు అంగీ వెనుకటి భాగము చినిఁగి పోవును, అని సాక్ష్యము పలికెను. అపుడు జలీఖా భర్త, యూసుఫు యొక్క యంగీయొక్క వెనుకటి భాగము చినిఁగి యుండుట చూచి యూసుఫుయొక్క తప్పుకాదు. తన భార్యదే తప్పుఅని తెలిసికొని ఓసీ! మీాయాడవాండ్ర కుట్రలు చాల ఘోరమైనవి. ఇది నీదే తప్పు కావున నీవు చేసిన తప్పునకు దేవునితో లేదా యూసుఫుతో క్షమాపణ వేఁడుకొనుము. ఇఁకమీాఁద నట్లు చేయకుము అని తన భార్యతో పలికి ఓయూసుఫు! అయినదియైపోయినది. ఈవిషయమును పోనిమ్ము. ఇది నెవరితో చెప్పకుము. అభిమానముపోవును అని పలికెను. హెచ్చరిక:- కొందఱు విద్వాంసులు సాక్ష్యమిచ్చినవాఁడు మాటలాడలేనిపొత్తిబిడ్డ అనియు దేవుని శక్తివలన ఉయ్యాలలోనే యూసుఫు ప్రవక్తను గూర్చి సాక్ష్య మిచ్చెను అని పలుకుదురు.

30. వ-ఖాల-నిస్-వతున్-ఫిల్-మదీన-తిమ్-రఅ-తుల్-అజీజి-తురా-విదు-ఫతాహా-అన్-నఫ్-సిహీ-ఖద్-షగ-ఫహా హుబ్బన్ ఇన్నా-ల-నరాహా-ఫీ-జలాలిమ్-ముబీన్. 31 ఫ-లమ్మా-సమి-అత్-బిమక్-రిహిన్న-అర్-సలత్-ఇలైహి-న్న-వ-అఅ-తదత్ ల-హున్న-ముత్ తక-అన్-వ-ఆతత్-కుల్ల వాహిదతిమ్ మిన్ హున్న సిక్కీ-నన్-వ-ఖాల-తిఖ్-రుజ్-అలైహిన్న-ఫలమ్మా-ర-ఐ - నహూ - అక్బర్-నహూ-వఖత్త-అన-ఐదియ-హున్న-వ-ఖుల్న-హాష లిల్లాహి-మా- హాజా బషరన్-ఇన్-హాజా-ఇల్లా మలకున్-కరీమ్. 32. ఫజాలి-కున్నల్-లజీ-లుమ్-తున్ననీ-ఫీహి-వ-లఖద్ రావత్తుహూ-అన్-నఫ్-సిహీ-ఫస్-తఅ-సమ-వల-ఇల్-లమ్-యఫ్ అల్-మా-ఆమురుహూ-ల-యుస్ జనన్న-వ-ల-యకూనమ్ - మినస్-సాగిరీన్. 33. ఖాల-రబ్బిస్-సిజ్ను-అహబ్బు-ఇలయ్య-మిమ్మా-యద్ - ఊననీ-ఇలైహి-వ-ఇల్లా-తస్-రిఫ్-అన్నీ-కైద-హున్న-అస్బు ఇలైహిన్న-వ- అకుమ్-మినల్-జాహిలీన్. 34- ఫస్-తజాబ-లహూ-రబ్బుహూ ఫ-సరఫ-అన్ హు - కై

డ-హూ-న్న-ఇన్నహూ-హువస్-సమీ-ఉల్-అలీమ్. 39.సుమ్మ-బదలి-లహుమ్-మిమ్-బ
ఆదిమా-రఅ-వుల్-ఆయాతి-ల-యస్-జునున్నహూ-హత్తా-హీన్.

30. మఱియు, ఆ పురములోని స్త్రీలు అజీజు యొక్క భార్యగాన యుక్త
వయస్సున్న యువకునిని మోహించి యాతని మనస్సును చలింపఁజేయుటకు కోరు
చున్నది. ఆమె హృదయములో యూసుఫు ప్రేమ నాటుకొన్నది. ఆమె స్పష్ట
మైన తప్పులో నున్నట్లు మేము చూచుచున్నారము అని పలుకసాగిరి. 31. ఆ
పిదప ఆమె వారి కుట్రలను విని వారిని పిలిపించి వారికొఱకు నొక సభను ఏర్పఱ
చి ఒక్కొక్కరికి నొక్కొక్క కత్తినిచ్చెను. మఱి ఆమె ఓ యూసుఫూ! వారి
యెదుటకు రమ్ము అని పలికెను. పిదప ఆ స్త్రీలు యూసుఫును చూచినంతనే
ఆశ్చర్యపడి తమ చేతులను కోసికొని దేవుఁడు పరమపవిత్రుఁడు. ఇతఁడు
మనుష్యమాత్రుఁడు కాఁడు. గొప్ప దేవదూతగా నున్నాఁడు అని పలుకసాగిరి.
32. (అప్పుడు) ఆమె, ఈతని విషయములో మీరు నన్ను నిందించితిరి. మఱి నేనే
ఆతని మనస్సును చలింపఁజేయుటకు కోరి యత్నించితిని. కాని యాతఁడు మన
స్సును స్థిరముగా నుంచుకొనెను. మఱి నేను ఆతనితో చెప్పునది ఇతఁడు
చేయనిచో తప్పక యాతఁడు చెఱలో పడును. మఱి అవమానము పొందును అని
పలికెను. 33. యూసుఫు ఓ 'నా ప్రభువా! ఈ స్త్రీలు నన్ను దేనికై పిలుచు
చున్నారో దానికంటె నాకు చెఱశాలయే ప్రియమైనది. మఱి నీవు కుట్రలను
నుండి తొలఁగింపనిచో నేను వారి వైపునకు వ్రాలుదును. మఱి పామరులలో
చేరిపోవుదును అని పలికెను. 34. కావున ఆతని ప్రభువు ఆతని ప్రార్థనను
అంగీకరించి ఆతనినుండి స్త్రీల కుట్రను తొలఁగించెను. నిశ్చయముగ ఆతఁడే
వినువాఁడును సర్వము దెలిసినవాఁడును. 35. ఆ పిదప, వారు సూచనలు చూ
చియు ఆతనిని కొంతకాలము చెఱలో నుంచవలెనని వారికి తోఁచెను.

వ్యా॥ 30. మిసరు నగరములోని స్త్రీలకు మంత్రి అజీజు భార్య విషయము
తెలిసి గొప్ప ఉద్యోగుని భార్యయై తన యింటిలోనుండు బానిసను మోహించి
యాతని హృదయము చలింపఁజేయుటకు యత్నించుచున్నది. ఇట్లు చేయుట
యామెకు తగునా! ఆమె హృదయములో ఆతని ప్రేమము, కామము, నాటు
కొన్నవి. ఇది చాల తప్పు అని నిందింపసాగిరి. 31. అట్లు పురములోని స్త్రీలు
జలీఖాను నిందించుచున్నారను విషయము ఆమెకుఁ దెలిసెను. ఆ స్త్రీలు రహస్య
ముగా గుసగుసలాడుచు జలీఖాను నిందించుచు తాము కళంకములేని పవిత్రులము
అని తలఁచుచు తమ హృదయములో యూసుఫు ఎట్టి సుందరుఁడో చూడ
వలెనని కోరికలు దాఁచుకొనియుండిరి. అందువలన వారి సంభాషణలు, కుట్రలు
అని చెప్పఁబడియెను. జలీఖా ఆ స్త్రీలను విందుకు పిలిచి యొకసభ ఏర్పాటు

చేసెను. అందు కొన్ని వస్తువులు కత్తితో కోయందగినవి యుంచియొక్కొక్క
తెకు నొక్కొక్క కత్తి నొసంగెను. విందు సభను పూర్తిగా సవరించి యందఱు
స్త్రీలు కూర్చుండిన తరువాత జలీఖా యూసుఫును ఆ సభలోనికి రమ్మని పిలి
చెను. అపుడు యూసుఫు అచ్చటికి వచ్చిన తక్షణమే యాస్త్రీలు ఆతని సౌంద
ర్యమునుచూచి పరవశులై తమచేతులలోని కత్తులతో ఫలములను కోయుటకు
బదులుగ తమ చేతులను కోసికొనిరి. యూసుఫు తలవంచుకొనియే యుండెను.
స్త్రీల ముఖమువైపుకూడ చూడలేదు. స్త్రీలు యూసుఫును చూచి యీతఁడు
మనుష్యమాత్రుఁడుకాఁడు. దేవుని దూతవలె నున్నాఁడు. ఈతఁడు మంచి
గుణశీలములు గలవాఁడు. ఎట్టి దోషములేనివాఁడు అని ఆశ్చర్యముతో పలుక
సాగిరి. అపుడు స్త్రీలు తాము జలీఖాను నిష్కారణముగా నిందించుచుంటిమి.
ఇట్టి సౌందర్యము చూచిన ఏ స్త్రీయైనను యూసుఫును ప్రేమింపకయుండదు.
పాపము! జలీఖా యూసుఫును చూచి తనబుద్ధిని పోఁగొట్టుకొన్నది. యూసుఫు
దేవదూతవలెనున్నాఁడు. ఆ పాపమునకు పోకతప్పించుకొని పోయినాఁడు అని
నిశ్చయించిరి. దీనివలన యూసుఫు నేరస్థుఁడుకాఁడు అని ఋజువు ఆయెను.
32. స్త్రీలు పరవశులగుట చూచి జలీఖా తన నిజమైన వృత్తాంత మిట్లు చెప్ప
సాగెను. మీరు నన్ను నిందించుచుంటిరి గదా! యూసుఫును చూచి మీబుద్ధి
ఎట్లు పోయెనో మీరే యోచింపుఁడు. ఇందులకేనా మీరు నన్ను నిందించు
చుంటిరి. నేనే మోహించి యత్నించితిని. కాని యాతఁడు నామాట వినక తన
మనస్సును స్థిరముగా నుంచుకొని పాపమునకు పూనలేదు. ఇట్లు జలీఖా తన
నోటితోనే తనతప్పు స్త్రీలయెదుట ఒప్పుకొనెను. ఇదియును యూసుఫునిర్దోషి
యని సూచించుచున్న సాక్ష్యము. తన తప్పు ఒప్పుకొని తిరిగి యూసుఫును
బెదరించుచు నామాట విననిచో ఆతనికి చెఱలో పోవలసివచ్చును. మఱి అవ
మానముపొందవలసివచ్చును అని పలికి యింకమీఁదనైన తన కోరిక నెరవేర్చు
నేమో అని ఆశించెను. స్త్రీలు కూడ జలీఖాపక్షమున మాటలాడిరి ఓయూసుఫు!
నీవు జలీఖా మాట వినవలెను. ఆమె నీకుచాల యుపకారము చేసియున్నదిఅని
సిఫారసు చేసిరి. 33. కాని యూసుఫు వారి మాటలకు లొంగలేదు. తుదకు స్త్రీల
కుట్రలకు విసిగి ఓ దేవా! నన్నుయీస్త్రీల కుట్రలనుండి కాపాడుము. లేనిచో
వీరి మాటలకు లొంగిపోయి పామరులలో చేరిపోదునేమో! వీరు పాపము
నకై నన్ను ప్రేరేపించుచున్నారు. దీనికంటెనాకు చెఱసాలలో నుండుటయే
ప్రియము అని భయభక్తులతో దేవునిని ప్రార్థించెను. 34. దేవుఁడు యూ
సుఫు ప్రార్థన విని యంగీకరించెను. ఆతనిని స్త్రీల కుట్రనుండి కాపాడి యాతని
మనస్సు చలింపకుండ స్థిరముగా ధర్మమార్గముపై నుండునట్లు చేసెను. దేవుఁడే
అందఱి ప్రార్థనలు వినుచుతెలిసికొనుచున్నాఁడు. 35. ఆ పిదప యూసుఫు

నిర్దోషి యని ఋజువు అయి కూడ మంత్రి మొదలగు వారు కొంత కాలము యూసుఫును చెఱలో నుంచుట మేలు. దీనివలన జలీఖా నిర్దోషి యనియు నేర రము యూసుఫుది. కావున చెఱలో పడినాఁడుఅని లోకులు తెలిసికొందురు. నేరము దూరమగును. జలీఖా యూసుఫునుచూడకపోవుటవలనక్రమముగా ప్రేమ వదలి పెట్టును అని వారు తలఁచిరి. కాని జలీఖా యూసుఫుఖైదులోని కష్టములకు విసిగి మెత్తపడి నామాట వినును అని తలఁచి ఆతనిని చెఱలో నుంచుటకు యత్నించెను. ఆమె చెప్పినట్లుగ చెఱలో నుండవలసివచ్చెను. కష్టములు వచ్చినప్పుడు భక్తులు దేవునితో ఆపదతొలఁగి సౌఖ్యములును మేళ్లను గలుగవలెనని ప్రార్థింపవలెను. కాని చెడుగు రావలెనని కోరరాదు. రానున్న ఆపద రానిమాన్దు. అయిన మేము, ఆపద రావలెనని కోరరాదు. కొందఱు కష్టములకు విసిగి చావు వచ్చిన బాగుండునే యని కోరుదురు. అట్లు కోరరాదు.

36. వ-దఖల-మఆ-హుస్-సిజ్న-ఫత-యాని - ఖాల-అహ-దుహుమా-ఇన్నీ-అరానీ-అఆ-సిరు-ఖమ్-రన్-వఖాలల్-ఆఖరు-ఇన్నీ-అరానీ-అహ్మిలు-ఫౌఖ-రాసీ-ఖుబ్-జన్-తా-కులుత్-త్తైరు-మిన్‌హు-నబ్బినా-బితావీలిహీ-ఇన్నా నరాక-మినల్-ముహ్-సినీన్. 37. ఖాల-లా-యాతీ-కుమా-తఆ-మున్-తుర్‌జ ఖానిహీ-ఇల్లా-నబ్బా-తుకుమా-బితా-వీలిహీ ఖబ్ల-అన్‌యాతియ-కుమా-జాలికుమా మిమ్మా-అల్లమనీ-రబ్బీ-ఇన్నీ-తరక్‌తు-మిల్లత-ఖౌమిల్-లాయూమినూన బిల్లా హి-వహుమ్-బిల్-ఆఖిరతి-హుమ్-కాఫిరూన్. 38. వత్-తబ-అతు మిల్లత-ఆబా ఈ-ఇబ్రాహీమ-వఇస్-హాఖ-వ-యఅ-ఖూబ-మాకాన-లనా-అన్-నుష్-రిక-బిల్లా హి-మిన్-షైఇన్-జాలిక-మిన్-ఫజ్-లిల్లాహి-అలైనా-వ-అలన్నాసి -వలా- కిన్న-అక్-సరన్నాసి-లా-యష్-కురూన్. 39. యా-సాహి-బ-ఇస్-సిజ్‌ని-అ-అర్బా బుమ్-ముత-ఫర్రి-ఖూన-ఖైరున్-అమిల్లా-హుల్-వాహి-దుల్-ఖహ్హార్. 40. మా-తఆ బుదూన-మిన్- దూనిహీ-ఇల్లా-అస్మా-అన్-సమ్మైతుమూహా-అన్‌తుమ్-వ-ఆ-బాఉకుమ్-మా-అన్-జలల్లాహు-బిహా-మిన్-సుల్తానిన్-ఇనిల్-హుక్‌ము-ఇల్లా-లిల్లాహి-అమర-అల్లా-తఅ-బుదూ-ఇల్లా - ఇయ్యాహు-జాలికద్-దీనుల్ ఖయ్యిముపలాకిన్న-అక్-సరన్నాసి-లా-యఅ-లమూన్. 41. యా-సాహి-బ-ఇస్-సిజ్‌ని-అమ్మా-అహదుకుమా-ఫ-యస్-ఖీ-రబ్బహూ-ఖమ్‌రన్-వ-అమ్మల్-ఆఖరు-

ఫ-యుస్-లబు-ఫ-తాకు-లుత్-తైరు-మిర్-రాసిహీ-ఖుజియల్-అమ్-రుల్-లజీ ఫీహి-తస్-తఫ్తియాన్. 42. వఖాల-లిల్లజీ-జన్న-అన్నహూ-నాజిమ్-మిన్-హుమ జ్-కుర్నీ-ఇన్ద-రబ్బిక-ఫ-అన్-సాహుష్-షైతాను-జిక్ర-రబ్బిహీ-ఫలబిస-ఫిస్-సిజ్ని-బిజ్అ-సినీన్.

36. యూసుఫుతోఁగూడ ఇద్దఱు యువకులును చెరశాలలోనికి వచ్చిరి. ఆయిద్దఱిలో నొకఁడు నేను ద్రాక్షరసము తీయుచున్నట్లుగ నేనుకలలో చూచితిని అని పలికెను. మఱి రెండవవాఁడు నేను నాతలపై రొట్టెను మోయుచున్నట్లుగను దానినుండి పక్షులు తినుచున్నట్లుగను నేనుకలకంటిని. మాకు దీని భావమేమో! తెలుపుము. మేము నిన్ను సత్కార్యములు చేయువానిగా చూచుచున్నారము అని పలికిరి. 37. అపుడు యూసుఫు మీకు దినము లభించు భోజనము మీయొద్దకు రాక పూర్వమే దీనిభావము మీకుఁ దెలుపుదును. ఈ విద్య నాకు నాప్రభువు నేర్పినది. దేవునిని విశ్వసింపక పరలోకమును తిరస్కరించునట్టి జనుల మతమును నేను విడనాడితిని. 38. నాతండ్రులగు ఇబ్రాహీము, ఇస్హాఖు, యాఖూబుల వారి మతమును అనుసరించితిని. దేవునికిసాటిగ నితరులను జేయుట మాపనికాదు. ఇది మాకును సర్వజనులకు నున్న దేవుని యనుగ్రహము. కాని జనులలో పెక్కుమంది కృతజ్ఞత సలుపరు. 39. చెఱలో నాతోఁబాటునున్న స్నేహితులారా! అనేక చిల్లర దేవతలు మేలా! లేదా ఒక్క సర్వశక్తుఁడగు దేవుఁడుమేలా! 40. దేవునినివదలి మీరుపూజించుచున్న దేవతలు మీరును మీతాతముత్తాతలును పెట్టుకొన్న పేర్లు మాత్రమే. దానిగూర్చి దేవుఁడెట్టి ప్రమాణము (సన్నదు) పంపలేదు. దేవునికితప్ప నితరులకెవరికిని అధికారము లేదు. ఆతని తప్ప నితరులను పూజింపఁ గూడదు అని దేవుఁడు ఆజ్ఞాపించి యున్నాఁడు. ఇదియే స్థిరమైన ధర్మమార్గము. కాని జనులలో పెక్కుమందికిఁ దెలియదు. 41. ఓ చెఱలో నాతోఁబాటు నున్న స్నేహితులారా! మీలో నొకఁడు తన యజమానునకు ద్రాక్షరసము త్రాగించును. మఱి రెండవవాఁడు సిలువపై నెక్కింపఁ బడును. ఆతని తలను పక్షులు తినుదురు. మీరిద్దఱు అడుగుచున్న భావమును గూర్చి యిట్లు విధింపఁ బడినది అని పలికెను. 42. మఱియు వారిద్దఱిలో నెవని గూర్చి విడుదల గావింపఁబడును అని యూసుఫు తలఁచెనో ఆతనితో నీయజమానుని యొద్ద నా విషయము పలుకుము అని యూసుఫు పలికెను. కాని ఆతని యజమానునివద్ద యూసుఫు విషయము పలుకుటను గూర్చి సైతాను ఆతనిని మఱపించెను. కావున యూసుఫు చెఱలో మఱికొన్ని సంవత్సరము లుండెను.

వ్యా॥ 36. యూసుఫు చెఱశాలకుఁ బోయిన కాలమునందే యిద్దఱు

యువకులు చెఱసాలనుంచఁబడిరి. అందు రయ్యాను బిన్ వలీద్ అనువాఁడు మిసరు రాజునకు ద్రాక్షరసము త్రాపించువాఁడును మఱొకఁడు రాజుకొఱకు రొట్టె చేయువాఁడును. ఈ యిద్దఱు రాజునకు విషము నిచ్చిరి యను నేరములో పట్టువడిరి. యూసుఫు చెఱశాలలో చాల భక్తుఁడనియు పుణ్యాత్ముఁడు అనియు ప్రసిద్ధి కెక్కియుండెను. ఆయిద్దఱు ఖైదీలు యూసుఫునకు చాల పరిచితులై ప్రేమను వెల్లడించుచుండిరి. ఆయిద్దఱు ఒకదినము తాముగాంచిన కల యూసుఫుతో పలికిరి. ద్రాక్షరసము త్రాగించుచున్న యువకుఁడు ద్రాక్షరసము తీయునట్లు చూచెను అఁయు రొట్టెలు చేయువాఁడు తన తలపై రొట్టెలు మోసుకొనిపోవుచుండఁగా పక్షులు వచ్చి తినునట్లు కలనుగాంచెను అని వివరించి దీనిభావమేమి చెప్పుము అని యూసుఫు నడిగిరి. ఎందుకన వారిద్దఱు యూసుఫును గొప్ప భక్తుఁడుఅని తలఁచిరి. 37. అపుడు యూసుఫు వారిద్దఱితో మీస్వప్నభావము శీఘ్రముగాఁ దెలుపుదును. మీకు ప్రతిదినము వచ్చు ఆహారము మీయొద్దకు రాక మునుపే చెప్పివేయుదును. తొందరపడనక్కఱలేదు అని శాంతిమాటలు పలికి ముందు స్వప్నభావముకంటె లాభకరమైన ఒక విషయము మీకుఁ దెలుపుదును. వినుఁడు అని పలికి స్వప్నభావము నేను నేర్చుకొన్నదికాదు. నేను జ్యోతిష్కుఁడను కాను సుమా! ఈవిద్య నాకు దేవుఁడు నేర్పినది. దేవుని యనుగ్రహమువలన నాకు లభించినది. నేను అవిశ్వాసుల మతమును విడనాడినాను. అవిశ్వాసులకు దేవునియందును పరలోకమందును విశ్వాసములేదు. కావున అవిశ్వాసుల ననుసరింపఁగూడదు. 38. నా పితృలగు ఇబ్రాహీము, ఇస్హాఖు, యాఖూబు అను ప్రవక్తల సత్యమతమును నేను పట్టితిని. వీరి సన్మార్గము ననుసరించుచున్నాను. దేవుఁడు ఒక్కఁడు. ఆతనికి సాటిలేదు. చిల్లర దేవతలను పూజింపరాదు. దేవుఁడు ఒక్కఁడు అని విశ్వసించుటచే మాకును సర్వలోకులకును దేవుని యనుగ్రహము కలుగును. పెక్కుమంది జనులు దీనిని గుర్తింపక తప్పుత్రోవను పోయి పాపములకు పాలగుచున్నారు, కృతజ్ఞతనలుపుటకు బదులుగ కృతఘ్నత వహించుచున్నారు. ఇది సరికాదు. 39. ఓ స్నేహితులార! మీరే యోచింపుఁడు! శక్తిలేని పెక్కు చిల్లర దేవతలు మేలా! లేదా సర్వశక్తుఁడును సర్వాధికారుఁడును అగు ఒక్క దేవుఁడు మేలా! సర్వశక్తుఁడగు దేవునినే పూజించి యాతనినే వేఁడుట మేలు. ఆతని శక్తికి మించినది యొద్దియునులేదు. ఆతని శిక్షనుండి తప్పించుకొనుటకు వీలులేదు. 40. మీరుపూజించు విగ్రహములును చిల్లర దేవతలును మీరు పెట్టుకొన్న పేర్లుమాత్రమే. అవి వాస్తవములుకావు. అవి వట్టివి కావున మీరు పూజించు దానికి శాస్త్రప్రమాణము (సన్నదు) లేదు. ఎందుకన పూర్వమునుండియు ప్రవక్తలును భక్తులును దేవుఁడు ఒక్కఁడు. ఆతనినే పూజింపవలెను. ఆతనికి సాటి కల్పింపరాదు అని సప్రమాణముగ బోధించుచు వచ్చిరి.

కావున విగ్రహారాధన చేయవచ్చును అని సూచించు ఒక్క ప్రమాణముకూడ లేదు. కావున ఒక్క దేవుని నే పూజించుటయే స్థిరమైన ధర్మమార్గము. ఇందు ఏలాటి వంకరలు లేవు. ఈ సన్మార్గమునపోవువారు తప్పక దేవునిని పొందఁగలరు. అయినను దీనిని చెక్కమంది జనులు తమ మూఢత్వముచేతను, ద్వేషముచేతను గ్రహింపకున్నారు. 41. యూసుఫు ధర్మమార్గమును బోధించి వారిస్వప్నభావము నిట్లు చెప్పుచున్నాఁడు. ఎవఁడు ద్రాక్షరసమును తీయునట్లు చూచెనో వాఁడు చెఱనుండి విడుదలపొంది తిరిగి రాజునకు ద్రాక్షరసము త్రాపించును. పూర్వపు యుద్యోగము వానికి లభించును. ఎవఁడు తన తలపై నిడుకొన్న రొట్టెలను పక్షులు తినుచున్నట్లు చూచెనో వాఁడు శిక్షపొంది సిలువపై నెక్కించఁబడును. వాని తలను పీకి పక్షులు తినును. ఇది తప్పక జరుగును. ఇందు ఏలాటి వ్యత్యాసము గలుగదు అని పలికెను. ఆయన పలికినట్లే నేరము రొట్టెలు చేయువానిది యని ఋజువు అయి ద్రాక్షరసము త్రాపించువాఁడు నిర్దోషి యని ఋజువు ఆయెను. కావున రొట్టెలు చేయువాఁడు శిక్షపొంది సిలువపై నెక్కింపబడెను. వాని తలను పీకి పక్షులు తినెను. 42. ఆ యిద్దఱు ఖైదీలు విచారణకుఁగా చెఱ నుండి పోవునపుడు, ఎవఁడు విడుదల గావింపఁబడునో యని యూసుఫుఎఱింగి యుండెనో వానితో ఓయి! నీవు నావిషయము నీరాజుతోఁ జెప్పుము తప్పు లేక నేను నిష్కారణముగా చాలకాలమునుండి చెఱలోపడియున్నానని పలుకుము. నీవు చూచిన నిజమైన విషయము తెలుపుము. నేరము త్రోసివేయఁబడిన వాఁడు తాను రక్షింపఁబడెను అను సంతోషముచేతను సైతాను వాని మనస్సును కలఁతపెట్టినందుచేతను వాఁడు యూసుఫు విషయము రాజుతో చెప్పుటకు మఱచి పోయెను. దానివలనయూసుఫు ఇంకకొన్ని సంవత్సరములు చెఱశాలలో నేయుండ వలసివచ్చెను. కొన్ని సంవత్సరముల పిదప రాజు ఒక కలను గాంచెను. దాని భావము ఎవరును చెప్పలేకపోయిరి. అపుడు విడుదలపొందినవానికి యూసుఫు జ్ఞప్తికి వచ్చి తన రాజుతో యూసుఫునుగూర్చి తెలిపెను. ఈవిషయము రాఁబోవు వాక్యములలో చెప్పఁబడును.

43. వ-ఖాలల్-మలికు-ఇన్నీ-అరా-సబ్ అ-బఖరాతిన్-సిమానిన్-యా-కులు-హున్న సబ్-ఉన్-ఇజా-ఫున్-వ సబ్ అ-సుమ్‌బు లాతిన్-ఖుజ్-రిన్-వ-ఉఖర-యా-బిసాతిన్-యా-అయ్యు-హల్-మలఉ-అఫ్-తూనీ-ఫీ-రూయాయ-ఇన్-కున్తుమ్-లిర్-రూ-యా-తఅ-బురూన్. 44. ఖాలూ-అజ్-గాసు-అహ్-లా-మిన్-వ మా-నహ్‌ను-బి తా-వీలిల్-అహ్-లామి-బి-ఆలి-మీన్. 45. వ ఖాలల్-లజీ-

నజా-మిన్-హుమా-వద్-దకర-బఅద-ఉమ్మ-తిన్-అనా-ఉనబ్బి-ఉకుమ్-బి-తా - వీ లిహీ-ఫ-అర్-సిలూన్. 46. యూసుఫు-అయ్యు-హస్-సిద్దీఖు-అఫ్-తినా-ఫీ-సబ్ ఇ-బఖ-రాతిన్-సిమానిన్-యాకులు-హున్న-సబ్ ఉన్-ఇజా-ఫున్-వ సబ్-ఇ సుమ్ బు-లాతిన్ - ఖుజ్ రిన్-వ-ఉఖర-యాబిసాతిల్-ల-అల్లీ-అర్-జిఉ-ఇలన్నా సి-ల-అ ల్ల-హుమ్-యఅ-లమూన్. 47. ఖాల-తజ్-ర-ఊన-సబ్ అ-సినీన-దఅ-బన్ ఫమా హసత్తుమ్-ఫ జరూహు-ఫీ-సుమ్ బులి హీ-ఇల్లా-ఖలీ-లమ్-మిమ్మా-తా కులూన్. 48.సుమ్మ-యాతీ-మిమ్ బఅది-జాలిక-సబ్-ఉన్-షిదాదున్-యాకుల్న-మా-ఖద్దమ్ తుమ్-లహున్న-ఇల్లా-ఖలీలమ్-మిమ్మా-తుహ్-సినూన్. 49. సుమ్మ-యా తీ-మిమ్ బఅ-ది-జాలిక-ఆమున్-ఫీహి-యుగా-సున్నాసు-వ-ఫీహి-యఅ సిరూన్.

43. మఱియు రాజు, ఏడు బక్కచిక్కిన ఆవులు ఏడు బలిసిన ఆవులను తిని వేయుచున్నట్లును, మఱిఏడు పచ్చ వెన్నులును ఇతర ఏడు ఎండి పోయినవిగాను కలలో చూచితిని. ఓ నాయకులార ! మీరు స్వప్నముల అర్థము చేయుట తెలిసి యున్నచో నా స్వప్నమునకు అర్థము పలుకుఁడు అని పలికెను. 44. (అపుడు) ఇవి కల్పడమైన స్వప్నములు. మాకిట్టి స్వప్నములకు భావము తెలి యదు అని వారు పలికిరి. 45. మఱియు, ఆయిద్దఱిలో విడుదల పొందినవాఁడు చాలకాలమునకు పిదప జ్ఞప్తికిఁ దెచ్చుకొని నేనుదాని యర్థముమీకు తెలుపుదును. కావున నన్ను పంపుఁడు అని పలికెను. 46. అతఁడుపోయి సత్యవంతుఁడవగు ఓ యూసుఫు! ఏడు బక్కచిక్కిన ఆవులు ఏడు బలిసిన ఆవులను తినుచున్నవి. మ ఱిఏడు పచ్చని వెన్నులును ఏడు ఎండిన వెన్నులున్నవి. వీనినిగూర్చి నాకు జవా బియ్యుము. ప్రజలు తెలుసికొనుటకై నేను వారియొద్దకు మరలి పోవుదును అని పలికెను. 47. అపుడు యూసుఫు మీరు యథా ప్రకారముగ ఏడు సంవత్సర ములు సేద్యము చేయుఁడు. మరల మీరు కోసిన ధాన్యములో మీరు తినుటకుఁ గావలసినది తప్పఁ తక్కినది వెన్నులలో వదలి పెట్టుఁడు. 48. ఆపిదప చాల కఠినములైన ఏడు సంవత్సరములు వచ్చును. మీరు వీనికై యుంచిన ధాన్య మును తినివేయుదురు. కాని విత్తనమునకుఁగాను కొంత ఉంచిపెట్టవలెను. 49. ఆపిదప ఒక సంవత్సరము వచ్చును. అందు ప్రజలకు బాగుగ వర్షములు కురియు ను. అందు ద్రాక్షరసములు తీయుదురు అని పలికెను.

వ్యా॥ 43:47. ఈజిప్టు దేశపు రాజు రయ్యాను ఒక కలగాంచెను. అం దు ఏడు బక్కచిక్కిన ఆవులు ఏడు బలిసిన యావులను తినివేయుచుండెను.

పచ్చని యేడు వెన్నులను ఏడు ఎండిన వెన్నులు చుట్టుకొని యుండెను. ఆరాజు దీనియర్థము తెలిసికొనలేక తనయొద్దనున్న నాయకులతోను మంత్రులతోను అడిగెను. వారందఱును, ఇది కలయున్నది. అది లేనిపోని విషయములతో కల్పడమగు నిద్రలో నట్లే కనఁబడును. దానికి భావము ఎచ్చటి నుండి కలుగును. అదియునుగాక మాకు స్వప్నశాస్త్రము తెలియదు అని పలికిరి. 45. అపుడు యూసుఫు పలికిన స్వప్న యర్థమును బట్టి విడుదల యైనవాఁడు రాజు దర్బారులో నుండెను. వానికి ఈ సందర్భములో యూసుఫు విషయము జ్ఞప్తికి వచ్చి రాజుతోను నాయకులతోను నన్ను చెఱశాలయొద్దకు పంపుఁడు. అందు యూసుఫు అను ఒకభక్తుఁడున్నాఁడు. ఆయన దీని భావము చెప్పును. నేనుకూడ ఒక కల గాంచితిని. దానిభావము ఆతఁడు చెప్పెను. అది నిజమాయెను అనిపలికెను. దానికి రాజు సమ్మతించి యాతనిని పంపఁగా ఆతఁడు వచ్చి సత్యవంతుఁడవైన యూసుఫా! మా రాజు ఒక కల గాంచెను. దాని భావము తెలుపుము. నీమాట సత్యమగును. ఈయర్థమును గొనిపోయి ప్రజలతోఁ జెప్పెదను. వారు దీనిని తెలిసికొనుదురు. మఱి నీఘనత కూడ వారికిఁ దెలియనగును అని విన్నవించెను. యూసుఫు తత్క్షణమే యా స్వప్నభావము ఆతనికిఁ దెలిపెను. ఆతనితో నీవు ఇంతకాలము నాకు మఱచితివే అనికూడ ప్రశ్నింప లేదుగదా! ప్రవక్తలు ఇట్టి సుగుణములుగల వారలుగా నుందురు. యూసుఫు స్వప్నయర్థము "ఏడు బలిసిన యావులును, ఏడు పచ్చని వెన్నులును, ఏడు మంచి సంవత్సరములు. అందు పైరుపంటలు సేద్యము బాగుగా జరిగి ధాన్యము పండును. ఈ యేడు సంవత్సరముల పిదప కఠినమైన యేడు సంవత్సరములు వచ్చును. అందు వర్షము కురియదు. ముందు పండించిన ధాన్యము జాగ్రత్తగ చెడకుండ వెన్నులలోనుంచి కఱవుకాలములోనుపయోగింపవలెను. అందువిత్తనమునకుఁగాను కొంత ధాన్య ముంచవలెను. కఱవు కాలము పోయిన పిదప మంచికాలము వచ్చును. మంచి వర్షములు కురియును. ద్రాక్ష తోఁటలు బాగుగ ఫలించును. ప్రజలుదాని రసములు దీయుదురు. మంచి సంపదలు వారు పొందుదురు అని స్వప్నభావము తెలుపుచు కఱవులో నెట్లు జాగ్రత్తగా నుండి యేర్పాటులు చేయవలెనో అదియును చెప్పి మంచికాలము వచ్చును అని సంతోషవార్త గూడ నిచ్చెను.

50. వ-ఖాలల్-మలి-కూ-తూనీ-బిహీ-ఫలమ్మా-జాఅ-హుర్-రసూలు-ఖాలర్-జిఅ-ఇలా-రబ్బిక-ఫస్-అల్-హు-మా-బాలున్-నిస్-వ-తిల్-లాతీ-ఖత్తఅ్-నా-ఐ-దియ-హున్న-ఇన్న-రబ్బీ-బి-కై-ది-హిన్న-అలీమ్. 51. ఖాల-మా-ఖత్-బుకున్న-ఇజ్-రావత్-తున్న-యూసుఫ-అన్-నఫ్-సిహీ-ఖుల్-న-హాషా-లిల్లాహి

# పదమూడవ కాండము

మా-అలిమ్నా-అలైహి-మిన్-సూఇన్-ఖాల-తిమ్-రఅతుల్-అజీ-జిల్ ఆన-హస్ హసల్-హఖ్ ఖు అనా రావత్తు-హూ-అన్-నఫ్-సిహీ-వఇన్నహూ-లమినస్-సాదిఖీన్. 52. జాలిక-లి-యఅ-లమ-అన్నీ-లమ్-అఖున్ హు-బిల్ గైబి-వ-అన్నల్లాహ-లాయహ్దీ-కైదల్-ఖాఇనీన్. 53 వమా-ఉబర్రిఉ-నఫ్సీ-ఇన్నన్నఫ్సల అమ్మారతుమ్-బిస్-సూఇ-ఇల్లా మారహిమ-రబ్బీ-ఇన్నరబ్బీ-గఫూరుర్ రహీమ్.

50. మఱియు రాజు, ఆతనిని నాయొద్దకు తీసికొని రండు అని పలికెను. ఆ పిదప రాజు పంపిన మనుష్యుఁడు యూసుఫు నొద్దకు రాఁగా నీవు నీ యజమానుని యొద్దకు తిరిగి పోయి తమ చేతులు కోసికొన్న స్త్రీల వ్యాపారమెట్టిది అని మేమో ఆతనితో నడుగుము. నిశ్చయముగా వారి కుట్రలు నా ప్రభువునకుఁ దెలియును అని యూసుఫు పలికెను. 51. (అపుడు) రాజు స్త్రీలను రప్పించి మీరు యూసుఫు యొక్క చిత్తమును చలింపఁ జేయవలెనని కుట్ర పన్నినప్పుడు మీ విషయము ఏమి జరిగినది అని అడుగగా 'స్త్రీలు దేవుఁడు పరమపవిత్రుఁడు. యూసుఫులో నెట్టి దోషమున్నట్లు మాకుఁ దెలియలేదు' అని పలికిరి. అజీజు భార్య ఇపుడు సత్యము బయలుపడెను. నేనే ఆతని మనస్సును చలింపఁ జేయుటకు కోరితిని. మఱి యాతఁడు సత్యవంతుఁడు అనిపలికెను. 52. ఇది అజీజునకు తెలియక రహస్యముగ నేనుఆతనికి ద్రోహము చేయలేదనియు ద్రోహులకుట్రను దేవుఁడు సాగనీయఁడుఅని అజీజు తెలిసికొనుటకుఁగాను అని యూసుఫు పలికెను. మఱి నేను నాయాత్మను గూర్చి అదిపవిత్రమైనది అని చెప్పను. నిశ్చయముగా ఆత్మ దుష్టత్వమునకు ప్రేరేపించును. కాని నాప్రభువు అనుగ్రహించినప్పుడు అట్లు కానేరదు. నిశ్చయముగా నా ప్రభువు క్షమించు వాఁడును దయాళువును.

వ్యా॥ 50. యూసుఫు చెప్పిన జవాబును గొనిపోయి రాజునకు వినిపించెను. ముందు తన సేవకుఁడు పలికిన మాటకే యూసుఫునందు ఆతనికి భక్తి గలిగెను. ఇఁక ఆతని స్వప్నభావమును దానికిఁదగిన యేర్పాటులును వినుట వలన భక్తి ఆతనియందు గలిగి యూసుఫును దర్శింప వలెనని రాజునకు మిక్కిలి తహతహము గలిగెను. అందుకు రాజు తన సేవకునితో నీవు పోయి శీఘ్రముగా నాతనిని నాయొద్దకు పిలిచికొని రమ్ము. ఆతనికిఁ దగినట్లు నేను మర్యాదలు గావింతును అని యుత్తరవు చేసెను. సేవకుఁడు పోయి యూసుఫుతో నీకు విముక్తి కలిగినది. రాజు నిన్ను పిలుచుచున్నాఁడు అని తెలిపెను. అపుడు యూసుఫు చాల కాలము వఱకు చెఱలో కఠినమైన కష్టములు పడియు రాజునాజ్ఞ విని తొందరపడక తనపై మోపఁబడిన అపనిందను గూర్చి రాజు విచారింపవలెను. విందునాఁడు తమ చేతులు కోసికొన్న స్త్రీల విషయము విచారింపవలెను అని నీరాజుతో పోయి

చెప్పుము అని పలికి సేవకుని పంపివేసెను. 51. రాజసేవకుఁడుపోయి యూసుఫు పలికిన విషయమును రాజుతోఁ జెప్పెను. రాజు ఆ స్త్రీలను మంత్రియగు అజీజుయొక్క భార్యయగు జలీఖాను తన కొలువు కూటమునకు రప్పించి విచారించెను. నిజమైన వృత్తాంతము తెలుపుఁడు అనియడుగఁగా స్త్రీలందఱును మేము యూసుఫులో నేలాటి దోషము చూడలేదు. ఆతఁడు నిర్దోషి అని పలికిరి. అపుడు జలీఖా సత్యము బయలు పడెను. దాఁచిన ప్రయోజనములేదు అని తానే యూసుఫును మోహించెను. కాని ఆతని చిత్తము చలింపలేదు. ఆతఁడు వ్యభిచార పాపమునకు పూనుకొనలేదు. ఆతఁడు సత్యవంతుఁడు. తనదే తప్పు అని యొప్పుకొనెను. దీనివలన ప్రజలందఱును యూసుఫు సత్యవంతుఁడు. మంచిగుణశీలము గలవాఁడు. నిర్దోషి యని నిశ్చయముగాఁ దెలిసికొని యూసుఫునందు గౌరవ భావము వహించిరి. 52. జలీఖా తప్పు తనది అని ఒప్పుకొన్న విషయము యూసుఫునకు తెలిసి నేను విచారణ చేయవలెనని కోరినది, ఎందుకనగా నేరము ఎవరిదో బయలుపడి నేను నాయజమానుఁడగు అజీజుయొక్క పత్ని విషయము నేను ద్రోహము చేయలేదు అని అజీజును ప్రజలును తెలిసికొన వలెను. నేనునిర్దోషి యని ఋజువు కావలెను. ద్రోహులకుట్ర సాగదు అని ప్రజలు తెలిసికొన వలెనని యూసుఫు పలికెను. 53. నేను పాపము చేసిన వాఁడను కాను అని చెప్పుట వలన గర్వభావము సూచించునేమో కాని నాయాత్మ నన్నుకూడ దుష్టత్వమునకు ప్రేరేపించును. దేవుని యనుగ్రహము వలన నేను పాపములజోలికి పోవుటలేదు. కావున దేవుని అనుగ్రహము లేనిదే ఎద్దియును లభింప నేరదు. కావున దేవుని అనుగ్రహము వలననే పాపములు క్షమింపఁబడును దేవుని దయ లభించిన ఆత్మలకు శాంతి లభించుచున్నది అని యూసుఫు వెల్లడించెను.

54. వ-ఖాలల్-మలి-కూ-తూనీ బిహీ-అస్-తఖ్లిస్హు-లి- నఫ్సీ - ఫలమ్మా-కల్లమహూ-ఖాల-ఇన్నకల్-యౌమ-లదైనా-మకీనున్-అమీన్. 55. ఖాలజ్-అల్నీ అలా-ఖజాఇనిల్-అర్జి-ఇన్నీ-హఫీజున్-అలీమ్, 56. వ-కజాలిక మక్-కన్నా-లి-యూసుఫఫిల్-అర్జి-యత-బవ్వఉ-మిన్హు-హైసు-యషాఉ- నుసీబు-బి-రహ్మతినా-మన్-నషాఉ వలా-నుజీఉ-అజ్-రల్-ముహ్-సినీన్. 57. వ-ల-అజ్రుల్-ఆఖిరతి-ఖైరుల్-లిల్-లజీన-ఆమనూ-వ-కానూ- యత్తఖూన్.

54. మఱియు రాజు, ఆతనిని నాయొద్దకుఁ దీసికొనిరండు. నేను ఆతనిని నాపనికొఱకు ప్రత్యేకముగా నుంచుకొందును అని పలికెను. ఆ పిదప రాజు యూసుఫుతో సంభాషించి నిశ్చయముగా నీవు ఈ దినమునుండి మాయొద్ద

నమ్మకముపొంది మంచిస్థానమునుపొందినవాఁడవైతివి అని రాజు పలికెను.
55. (అపుడు) యూసుఫు నీవు దేశములోని ఖజానాలపై నన్ను నియమింపుము.
నేను బాగుగ కాపాడుదును. నేను బాగుగ తెలిసినవాఁడను అని పలికెను.
56. మఱి మేమిట్లు భూమిలో యూసుఫునకు అధికార మొసంగితిమి.
అందు తాను కోరిన చోటున స్థాన మేర్పఱచు కొనుచుండెను. మేము
కోరిన వారికి మా యనుగ్రహము కలిగించు చున్నారము. మఱి సత్కా-
ర్యములు చేయువారి ఫలితమును వృథాపఱచము. 57. మఱి విశ్వసించి భయ
భక్తులు వహించినవారికి పరలోక పుణ్యము చాల శ్రేష్ఠమైనది.

వ్యా॥ 54. తిరిగి రాజు యూసుఫు గుణశీలములను తెలిసికొని యాతనిని తన కొలువుకూటములో నుంచుకొనవలెనని యుద్దేశించి నాయొద్దకు ఆతనిని పిలిచికొనిరండు అని తన సేవకులకు ఆజ్ఞాపించెను. దాని ననుసరించి యూసుఫు రాజునొద్దకు వచ్చెను. రాజు ఆతనితో సంభాషించి యాతనియోగ్యతనుచూచి సంతోషించి నేను నిన్ను ప్రత్యేకముగా నాపనికిఁగాను నియమించుచున్నాను. నాకు నీయెడ పూర్తి నమ్మకముగలదు. రాజకీయ వ్యవహారములలో నీవు పాలు గొనవలెను అని గొప్పపదవి నొసంగెను. 55 అపుడు యూసుఫు రాఁబోవుకష్ట కాలమునకుఁగాను సరియైనయత్నములు చేయుటకుఁగాను దేశములోనిధనధాన్యపు ఖజానాలపై నాకు అధికారిగా నియమింపుము. నేను అన్నిపనులు సక్రమపఱచు దును. నాకు దాని విషయము బాగుగ దెలియును అని యాభారము తానువహిం చెను. కఱవు రానున్నది. అందు ప్రజలు, ప్రాణులు, కష్టపడకుండ కాపాడుట చాల యున్నతమైన పని. అందు ప్రజల మేలున్నది. కాఁబట్టి తానుస్వయముగ తన యోగ్యతను రాజుకుఁ దెలిపెను. ఆ యుద్యమము పొందుటవలన ప్రవక్త పదవికి నేలాటి దోషము లేదు. 56. అట్లు దేవుఁడు యూసుఫునకు ఈజిప్టుదేశ ములో గొప్ప స్థానము నొసంగెను. రాజుకు బదులుగ యూసుఫు రాజ్యమును నడుపసాగెను. తన యిష్టప్రకారము దేశములో ఏర్పాటులు చేయసాగెను. ఇదంతయును దేవుని యనుగ్రహముగదా! యూసుఫు సహోదరులు ఏమి కోరిరి. తుదకు ఏమాయెనో చూడుఁడు! పుణ్యాత్ములకు ఇహలోకమందును వారి పుణ్యసత్కార్యముల ఫలితము వృథాపోదు. దానికి మంచిఫలితము లభించి తీరును. 57. మఱి పరలోకమునందు భక్తులగు విశ్వాసులకు మంచి పుణ్యఫలిత ములు లభించును. పరలోక ఫలితము ఇహలోక ఫలితముకంటెను చాల శ్రేష్ఠ మైనది. యూసుఫు ఇట్లు తన జన్మదేశమగు సిరియాను వదలి మిసరునకువచ్చి చేరెను. ఇఁక రాఁబోవు వాక్యములలో ఆతని సహోదరులు మిసరునకు ఎట్లు వచ్చిరో వారి విషయము యూసుఫు ఎట్లు ప్రవర్తించెనో ఎట్లు యాఖూబు ప్రవక్త తన కుమారుని దర్శింపఁగలిగెనో చెప్పఁబడుచున్నది.

58. వ-జాఅ-ఇఖ్-వతు-యూసుఫ-ఫ-దఖలూ-అలైహి-ఫ-అరఫ-హుమ్-
వహుమ్-లహూ-మున్-కిరూన్. 59. ఫలమ్మా-జహ్హజ-హుమ్-బి-జహాజిహిమ్
ఖాలఅ-తూనీ బి-అఖిల్-లకుమ్-మిన్-అబీకుమ్-అలా-తరౌన-అన్నీ-ఊఫిల్-కైల
వ-అనా-ఖైరుల్-మున్-జిలీన్. 60.ఫ-ఇల్-లమ్-తాతునీ-బిహీ-ఫలా-కైల-లకుమ్
ఇన్దీ-వలా-తఖ్-రబూని. 61. ఖాలూ-స-నురావిదు-అన్హు-అబాహు-వఇన్నా
ల-ఫాఇలూన్. 62. వఖాల-లి-ఫిత్-యాని-హిజ్-అలూ-బిజా-అత-హుమ్-ఫీ-
రిహాలిహిమ్-ల-అల్లహుమ్-యర్-జిఊన్. 63. ఫలమ్మా - రజఊ - ఇలా -
అబీహిమ్ ఖాలూ-యా-అబానా-మునిఅ-మిన్నల్-కైలు-ఫ-అర్సిల్ - మఅనా-
అఖానా-నక్-తల్-వఇన్నా-లహూ-లహాఫిజూన్. 64. ఖాల-హల్-ఆమను-
కుమ్-అలైహి-ఇల్లా-కమా-అమిన్-తుకుమ్-అలా-అఖీహి-మిన్ - ఖబ్లు-ఫల్లాహు-
ఖైరు-హాఫిజన్-వ-హువ-అర్హము-ర్-రాహిమీన్.

58. మఱియు యూసుఫు యొక్క సహోదరులు వచ్చి యాతని యొద్ద
ప్రవేశించిరి. అప్పు డాతఁడు వారిని గుర్తించెను. మఱి వారుఆతనిని గుర్తింపఁ
జాలరైరి. 59. మఱియు వారికొఱకు వారి సామగ్రిని సిద్ధపఱచి మీతండ్రినుండి
గలిగిన మీసహోదరుని నా యొద్దకుఁ దీసికొనిరండు. నేను కొలత పూర్తిగా
నిచ్చుటను నేను అతిథులను బాగుగ సన్మానించుటను మీరు చూచుట లేదా!
60. కావున మీరు ఆతనిని నా యొద్దకుఁ దీసికొని రానిచో నాయొద్ద మీకుధాన్య
పుభర్తీ (కొలత) లభింపదు. మఱి మీరు నా యొద్దకు రాకూడదు అని పలికెను.
61. వారు మేము ఆతనికిఁగాను ఆతని తండ్రితో నడిగెదము. మఱి మేము తప్పక
చేయుదుము అని పలికిరి. 62. మఱియు యూసుఫు తన సేవకులతో వారిడబ్బును
వారి మూటలలో వేయుఁడు. వారు తమ యిండ్లకుఁబోయి దానిని దెలిసికొని
బహుశః వారు తిరిగి వత్తురు అని పలికెను. 63. ఆ పిదప వారు తమ తండ్రి
యొద్దకు చేరినపుడు ఓ తండ్రీ! ధాన్యపుభర్తీ (కొలత) మాకుఁగాను నిషేధింపఁ
బడినది, కావున మా సహోదరుని మా వెంటఁ బంపుము. మేము ధాన్యపు
భర్తీ తీసికొని వత్తుము. మేము నిశ్చయముగా నాతనిని బద్రముగా కాపాడు
దుము అని పలికిరి. 64. అపుడు యాఖూబు దీనికి ముందు ఆతని సహోదరుని
విషయము మిమ్ము నమ్మినట్లు గదా! ఈతని విషయము మిమ్ము నమ్మవల
యును. కావున దేవుఁడే బాగుగ కాపాడువాఁడును, ఆతఁడే సర్వదయాళువుల
కంటెను నెక్కుడు దయాళువు అని పలికెను.

వ్యా॥ 58. రాజు హజ్రత్ యూసుఫును ఆర్థిక మంత్రిగ నియమించెను. ఏడు సంవత్సరములవఱకు బాగుగ పైరు పంటలు పండెను. తినుటకు కావలసి నంత ధాన్యము తప్ప మిగిలినదంతయు జాగ్రతగ సేకరించుచుండెను. ఆ పిదప వానలు లేక దేశమంతటను కఱవు గలిగెను. అపుడు యూసుఫు తాను సేకరించి యుంచిన ధాన్యమును మితమైన వెలకు విక్రయింపసాగెను. యాఖూబు పరివక్కన్‌ఆనులో నుండెను. యూసుఫు సహోదరులు మిసరులో ధాన్యము సరసముగా దొరకుచున్నది అని వినికొనుటకు మిసరునకువచ్చిరి. యూసుఫు పరదేశులకుఁగాను ఒక యొంటె మోయునంత భర్తీమూటల ధాన్యము నిచ్చునట్లు ఏర్పాటుచేసియుండెను. యూసుఫు సహోదరులు, ఆర్థికమంత్రిగానున్న యూసుఫునొద్దకు పోయి ఆతనికి తమ వంశమును జన్మదేశమును తెలిపి ధాన్యమును అడిగిరి. యూసుఫు తన సహోదరులను గుర్తించెను. కాని వారుఁ తనినిగుర్తింప లేకపోయిరి. ఎందుకన యూసుఫు బాల్యములో వారిని వీడియుండెను. అదియునుగాక యూసుఫు గొప్ప యుద్యోగములో నుండునా అనివారికినమ్మకము లేదు. 59. యూసుఫు తన సహోదరులకు బాగుగ మర్యాదలుచేసి తల ఒకటికి నొక యొంటె భారము ధాన్య మిచ్చెను. అది చూచి ఆతనిసహోదరులు, మాకొక చిన్నతమ్ముఁడు బిన్‌యామిన్ అనువాఁడు గలఁడు. ఆతఁడు తండ్రి యొద్ద నున్నాఁడు. ఆతని భాగముకూడ నీయుము అని యూసుఫు నడిగిరి. దానికి ఆతఁడు హాజరు కానివారికి ధాన్య మియ్యఁబడదు. మీకు నిజముగ తమ్ముఁడున్నచో ఆతనిని నా యొద్దకు పిలిచికొనిరండు. చూడుఁడు! నేనెట్లు మిమ్ము గౌరవించి అతిథిపూజలు సలిపి మీకు ధాన్యపు మూటలు ఒసంగుచున్నానో నా మర్యాదలను చూచి మీరు తప్పక మీతమ్ముని దీసికొని వత్తురు అని నేను నమ్ముచున్నాను. 60. మీరు తీసికొని రానిచో మీరు అబద్ధము పలికి ధాన్యము మోసముగ పొంది కొని పోవలెనని యున్నారని తెలియనగును. కావున మోసగాండ్లను మా దేశము లోనికి రానియ్యము. మీరు గావించిన నేరమునకుఁగాను మీకుఁగూడ ధాన్యము దొరకదు అని పలికెను. యూసుఫు తన సొంతసోదరుని చూడవలెనని మిక్కిలి యపేక్షించెను, అందులకు నొక్కిపలికెను. 61. అపుడు వారు మా నాయనకు ఆతనియందు చాల ప్రేమగలదు. ఆతఁడు పంపునో లేదో అయిన మేము ప్రయత్నించి పిలుచుకొని వత్తుము అని పలికిరి. 62. యూసుఫు తన సహోదరులతో వెల పుచ్చుకొనుట మంచిది కాదనియు, తిరిగి వారు రావలెనన్న వారి కడ డబ్బున్నదో లేదో అనియు, రాజు వెలకూండ వాపసుచేసెను. మేల పోయిన బాగుండును అని యుత్సాహముతో తిరిగివత్తురు అని తలఁచి వారిడబ్బు వారి మూటలలోనే యుంచుఁడు అని తన సేవకులతోఁ జెప్పెను. వారట్లే చేసిరి. 63. యూసుఫు సహోదరులు మూటలు దీసికొని మిసరునుంచి తమ యిండ్లకు

వచ్చి చేరి తమ తండ్రితో ఓ నాయనా! రాజు బిన్యామీనును పిలుచుకొని రమ్మని చెప్పినాఁడు. ఆతని పిలుచుకొని పోనిచో ఆతఁడు మాకు ధాన్యము నొసంగఁడు. కావున యూసుఫువిషయము చింతించినట్లు చింతింపక మా వెంట బన్యామిన్‌ను బంపుము. మేము బిన్యామీనును బద్రముగాఁదీసికొనిపోయి తిరిగి వత్తుము అని విన్నవించిరి 64. దానికి యాఖూబు ప్రవక్త దీనికిముందు మీరు యూసుఫును దీసికొనిబోవునపుడుకూడ ఇటులే పలికి దీసికొనిపోతిరి. మిమ్ము ఎట్లు నమ్మవలెను. అయిన యిపుడు పంపవలసివచ్చినది. లేనిచో ధాన్యము దొరకదు. కావున నేను దేవునిపై నాధారపడుచున్నాను. ఆతఁడే అన్ని ఆపదల నుండి కాపాడి రక్షించువాఁడు. ఆతఁడు అమిత ప్రేమగలవాఁడు అని పలికెను.

65. వలమ్మా-ఫతహూ-మతా-అహుమ్-వజదూ-బిజాఅ-తహుమ్-రుద్దత్ ఇలైహిమ్ ఖాలూ యా-అబానా మా-నబ్ గీ-హాజిహీ బిజా-అతునా-రుద్దత్ ఇలైనా-వనమీరు-అహ్లనా-వ-నహ్ఫ-ఫుజు -అఖానా - వ-నజ్-దాదు-కైల-బఈర్-జాలిక-కైలున్-యుసీర్. 66. ఖాల-లన్-ఉర్ -సిలహూ-మఅ-కుమ్-హత్తా-తూ-తూన-మా-సి-ఖమ్-మినల్లాహి-ల-తా తునన్ననీ-బిహీ-ఇల్లా - అన్ యు-హాత-బికుమ్-ఫలమ్మా ఆతౌహు-మా-సిఖ-హుమ్ ఖాలల్లాహు- అలా మా నఖూలు-వకీల్.

65. మఱియు వారు తమ సామగ్రిని విప్పగా నందు తమ డబ్బును పొందిరి. అది వారికి వాపసు చేయఁబడెను. ఓ నాయనా ! మా కింకేమి కావలయును. ఇదిగో మాధనము మాకు వాపసు చేయఁబడినది. ఇఁక మరల పోయి మాయింటికొఱకు ధాన్యము తెచ్చెదము. మఱి మాతమ్మునిని జాగ్రత్తగా కాపాడుదుము. మఱి యెక్కువగా నొక యొంటె భర్తీ ధాన్యము తీసికొనుదుము. ఈభర్తీచాలసులభమైనదిఅనిపలికిరి. 69. మీరుపట్టువడినదప్ప ఆతనిని నాయొద్దకు తెత్తుమని మీరు నాకు దేవుని ప్రమాణముచేసినగానినేను ఆతనిని మీ వెంటనంపను అని యాఖూబు పలికెను. ఆ పిదప వారందఱును ఆతనికి తమ వాగ్దానము నొసంగగా మేము పలుకుమాటలకు దేవుఁడే రక్షకుఁడు అనియాఖూబు పలికెను.

వ్యా। 65. యూసుఫు సోదరులు తమ ధాన్యపు మూటలనువిప్పిచూచిరి. అందు వారిచ్చిన వెల ధనముండెను. అది చూచి వారు సంతసముతో నాయనా! చూడుము. మాధనము మాకు తిరిగి యియ్యఁబడినది. కావున నీవు బిన్‌యామీనును పంపినచో ఆతని భాగమునకు వచ్చు ఒక యొంటె భారము ధాన్యము తెచ్చుకొనెదము. ఇది సులభముగా లభించును. మేము బిన్‌యామినును బాగుగ

గాపాడుదుము. నీవు చింతింపనక్కఱలేదు. కావున తప్పక మరల పోయి ధాన్య
ము తీసికొని రావలసినదే అని పలికిరి. 66. మీరు దేవునిమీద ప్రమాణము
చేసి నాకు వాగ్దానము గట్టిగ చేయవలెను. మీరు అదృష్టవశమున పట్టుబడినచో
దానికి మీరేమి చేయఁగలరు శక్తికొలఁది బిన్యామీను కాపాడి తిరిగి
తెచ్చి నాకు అప్పగింతుమని మీరు శపథము చేయనంతవఱకు నేను మీ వెంట
పంపను అని యాఖూబు పలికెను. యూసుఫు విషయమున జరిగినది ఆతని మదిలో
నుండెనుగదా! అపుడు వారుఅటులే మేము దేవునిపై ప్రమాణముచేసి వాగ్దానము
చేసితిమని పలికిరి. అపుడు యాఖూబు ప్రవక్త మనమాటలు దేవుఁడు వినుచు
న్నాఁడు. ఆతఁడేమనమాటలను సంరక్షించి మమ్ము కాపాడువాఁడు. కృషి చేసిదాని
ఫలితమునకై దేవునిపై భారము వేయవలెను. ఆతనిపైననే యాధారపడియుం
డవలెను అని సెలవిచ్చెను. భక్తులు తమ శక్తివంచనలేక కార్యములను సాధిం
చుటకై యత్నించి దానిని సఫలముగాచేయుటకై దేవునిపైనాధారపడియుండవలెను.

67. వ-ఖాల-యాబునయ్య-లా-తద్-ఖులూ-మిం-బాబిన్-వాహిదిన్-
వద్-ఖులూ-మిన్-అబ్వాబిమ్-ముత-ఫర్రిఖతిన్-వ-మా-ఉగ్నీ-అన్కుమ్-మిన
ల్లాహి-మిన్-షైఇన్-ఇనిల్-హుక్ము-ఇల్లా-లిల్లాహి-అలైహి-తవక్కల్తు-వ-
అలైహి-ఫల్-యత-వక్కలిల్-ముత-వక్కిలూన్. 68. వ-లమ్మా-దఖలూ-మిన్
హైసు-అమర-హుమ్-అబూ-హుమ్-మా-కాన-యుగ్నీ-అన్-హుమ్-మినల్లాహి-
మిన్-షైఇన్-ఇల్లా-హాజ-తన్-ఫీ-నఫ్సి-య-అఖూబ-ఖజాహా-వ-ఇన్నహూ-లజూ-
ఇల్-మిల్-లిమా-అల్-లమ్నాహు-వలాకిన్న-అక్-సరన్నాసి-లా-యఅలమూన్.

67. మఱియు ఓ పుత్రులారా! మీరు ఒక ద్వారమునుండి ప్రవేశింప
కుఁడు. మఱి వేర్వేఱు ద్వారములనుండి ప్రవేశింపుఁడు. మఱి దేవుఁడు నియమిం
చిన దానినుండి మిమ్ము తప్పింపఁజాలను. దేవునికే అధికారమున్నది. ఆతనిపైననే
నేను ఆధారపడియున్నాఁడను. మఱి ఆధారపడువారు ఆతనిపైననే ఆధారపడ
వలెను అని యాఖూబు పలికెను. 68. మఱి వారు తమ తండ్రి యాజ్ఞాపించిన
చోటునుండి పురములో ప్రవేశించిరి. దేవుఁడు నియమించిన దానినుండి యాఖూబు
వారిని తప్పింపఁజాలఁడు. కాని యాఖూబు మనస్సులోనున్న యొక కోర్కెను
ఆతఁడు తీర్చుకొనెను. మఱి మేము ఆతనిని నేర్పినదానిబట్టి యాతఁడు జ్ఞానము
గలవాఁడు. కాని పెక్కుమంది కిది తెలియదు.

వ్యా! 67. యాఖూబు తన పుత్రులను మిసరునకు పంపుచు ఓ పుత్రు
లారా! మీరు పురము ప్రవేశించినపుడు ఒకే ద్వారమునుండి మీరందఱును

ప్రవేశింపకుడు. మీరు వేర్వేరై వేర్వేరు ద్వారములనుండి మనుష్యుల కంటఁ బడకుండ పొండు. ఒకే తూరి ఒక తండ్రి యొక్క సౌందర్యవంతులైన పదునా కండుమంది కుమారులు పోవుట ప్రజలు చూచిన దృష్టి తగులును. ఇది మా యత్నము. దేవుఁడు నియమించినదానినుండి తప్పించుకొనఁజాలము. రానున్నది రాకమానదు. అయిన మానవుఁడు తనకు వీలైనంతవఱకు యత్నించి దేవునిపై నాధారపడవలెను. తమ యత్నములకు మోసపోకూడదు సుమా! సర్వము దేవుని చేతిలో నున్నది. అతని యధికారమే చెల్లును అని పలికెను. 68. యాఖూబు ప్రవక్త పలికినట్లు వారు వేర్వేరు ద్వారములనుండి మిసరులో ప్రవేశించిరి. దృష్టినుండి తప్పించుకొనుటకై యాఖూబు తన పుత్రులతో పై విధమున పలికియుండెను. యాఖూబు పరివక్త దేవునివలన జ్ఞానమువిద్య పొందియుండెను. అందుకు అట్లు పలికియు దేవునిపై నాధారపడెను. ఈవిషయము పెక్కుమందికిఁ దెలియదు. కావున కొందఱు దేవునిపై నాధారపడక తమ యత్నములనే నమ్మి యుండి దేవుని శక్తిని మఱచిపోవుదురు. తాను ఒకటి దలఁచిన దేవుఁడు ఒకటి దలఁచును అనుదానిని స్మరింపరు. మఱికొందఱు తమ శక్తిలోనున్న సాధనములను ఉపయోగింపక దేవునిపైననే యాధారపడుదురు. ఇదికూడ సరికాదు. కావున ధర్మపద్ధతిగ బుద్ధినుపయోగించి యత్నించుచు దేవునిపై నాధారపడి కార్యములు చేయవలెను.

69. వలమ్మా-దఖలూ-అలా-యూసుఫ-ఆవా-ఇలైహీ-అఖాహు-ఖాల-ఇన్నీ-అనా-అఖూక-ఫలా-తబ్-తఇస్-బిమా-కానూ-యఅ-మలూన్. 70. ఫలమ్మా-జహ్హ-జహుమ్-బి జహాజిహీమ్-జ అలస్-సిఖాయత-ఫీ-రహ్లి- అఖీహీ-సుమ్మ-అజ్-జన-ము-అజ్-జినున్-అయ్యతు-హాల్-ఈరు-ఇన్న-కుమ్-లసారి-ఖూన్. 71. ఖాలూ-వ-అఖ్-బలూ-అలైహిమ్-మా జా-తఫ్-ఖిదూన్. 72. ఖాలూ-నఫ్ ఖిదు-సువా-అల్-మలికి-వలి మన్-జాఅ-బిహీ-హిమ్లు బఈరిన్-వ-అనా-బిహీ-జఈమ్. 73. ఖాలూ-తల్లాహి-లఖద్-అలిమ్-తుమ్-మా-జీనా-లి-నుఫ్-సిద-ఫిల్'అర్ జి-వ-మా-కున్నా-సారి-ఖీన్. 74. ఖాలూ-ఫమా జజా-ఉహూ-ఇన్-కున్తుమ్-కాజి-బీన్. 75. ఖాలూ-జజా-ఉహూ-మన్-వుజిద-ఫీ-రహ్లి-హీ-ఫహువ జజా-ఉహూ-కజాలిక-నజ్-జిజ్-జాలిమీన్. 76. ఫ-బదఆ-బి-ఔ-ఇ-యతి-హిమ్-ఖబ్లవి-ఆఇ-అఖీహి-సుమ్మస్-తఖ్ రజహా-మిన్-విఆఇ-అఖీహి. కజాలిక-కిద్నా-లి-యూసుఫ-మా కాన-లి-యాఖుజ-అఖాహు-ఫీదీనిల్-మలికి-ఇల్లా-అన్-యషా-అల్లా

హు నఫ్-షడు-దర-జాలిమ్-మన్-నపాఉ వఫౌఖు-కుల్లి-జీ-ఇల్మిన్-అలీమ్. 77. ఖాలూ-ఇన్-యస్‌రిఖ్-ఫఖద్-సరఖ-అఖుల్-లహూ-మిన్-ఖబ్లు-ఫ-అసర్రహా యూసుఫు-ఫీ-నఫ్‌సిహీ-వలమ్-యుబ్-దిహా-లహుమ్ ఖాల-అన్-తుమ్-షర్రుమ్-మకానన్-వల్లాహు అఅ-లము-బిమా-తసిఫూన్. 78. ఖాలూ-యా-అయ్యుహల్-అజీజు ఇన్న-లహూ అబన్-షైఖన్-కబీరన్-ఫ ఖుజ్-అహ-దనా-మకానహూ-ఇన్నా-నరాక-మినల్-ముహ్‌సినీన్. 79. ఖాల-మఆజల్లాహి-అన్-నాఖుజ-ఇల్లా-మన్-వజద్నా-మతా-అనా-ఇన్‌దహూ-ఇన్నా-ఇజల్-ల-జాలిమూన్.

69. మఱియు వారు యూసుఫునొద్దకు పోగా యూసుఫు తన తమ్ముని తన యొద్దకుఁజేర్చి నేను నిశ్చయముగా నీసహోదరుఁడను. కావున వారు చేసిన పనులకుఁగాను నీవు దుఃఖపడకుము అని పలికెను. 70. ఆ పిదప వారి కొఱకు వారి సామగ్రి సిద్ధపఱచినపుడు తన తమ్ముని మూటలో గిన్నెను పెట్టెను. ఆ పిదప కేకవేయువాఁడొకఁడు బిడారులార! నిశ్చయముగ మీరు దొంగలు అని కేక వేసెను. 71. వారు వారివైపున తిరిగి మీ దేమి పోయినది అని పలికిరి. 72. (అప్పుడు) రాజు గిన్నె పోయినది. మఱి ఎవఁడు దానిని దీసికొని వచ్చునో వానికి ఒక యొంటె భారము ధాన్యము లభించును. మఱి దానికి నేను జామీనుదారుఁడను అని పలికెను. 73. వారు దేవుని యాన! మేము ఈ దేశములో అల్లరిచేయుటకు రాలేదు అని మీకు బాగుగ తెలియును. మఱి మే మెన్నఁడును దొంగతనము జేసియుండలేదు అని పలికిరి. 74. అప్పుడు వారు భటులు మీరు అబద్ధము చెప్పియుండినచో దీనికేమి శిక్ష లభించవలెను అని పలికిరి. 75. ఎవని మూటలో ఆగిన్నె దొరకునో ఆతఁడు దానికి బదులు న్నాఁడు. ఇటులే మేము దుర్మార్గులను శిక్షింతుము అని వారు పలికిరి. 76. ఆ పిదప యూసుఫు తన తమ్ముని మూటను వెదకుటకు ముందు వారి మూటలను చూచుటకు ప్రారంభించెను. పిదప తన తమ్ముని మూటలోనుండి యాగిన్నెను తీసెను. ఇట్లు మేము యూసుఫునకు యుక్తి చూపితిమి. దేవుఁడు కోరినది తప్ప, యూసుఫు తన తమ్ముని ఆరాజు చట్టమునుబట్టి తీసికొనఁజాలకుండెను. మేము కోరిన వారి దర్జాలను గొప్పవిగాఁ జేయుదుము. తెలిసిన ప్రతివానికంటెను ఎక్కువ తెలిసినవాఁడొకఁడున్నాఁడు. 77. వారు ఈతఁడు దొంగిలించిన, దీనికి ముందుకూడ ఈతని అన్న దొంగలించియున్నాఁడు అని పలికిరి. అప్పుడు యూసుఫు తన మనస్సులో మెల్లగా వారికిఁ దెలియపఱచక మీరే చాల చెడ్డవారలు. మఱి మీరు పలుకునది దేవునికిఁ బాగుగఁ దెలియును అని చెప్పికొనెను.

78. వారు ఓ మంత్రీ! ఆతనికి చాల వయస్సుచెల్లిన తండ్రికలఁడు. కావున ఆతనికి బదులు మాలో నొక్కని నుంచుకొనుము. నీవు మేలు చేయువాఁడవుగా మాకు కనఁబడుచున్నావు అనిపలికిరి. 79. యూసుఫు మా సొమ్ము యెవ్వనియొద్దలభించి నదో వానినివదలి యింకొకనిపట్టుకొనకుండుటకై నేను దేవుని శరణుజొచ్చుచున్నాను. అట్లు చేసినచో మేము అన్యాయముచేసినవారల మగుదుముఅని పలికెను.

వ్యా॥ 69. యూసుఫు సహోదరులు యూసుఫునొద్దకు పోయిరి. యూసుఫు తన సొంత తమ్మునిని చాల గౌరవించి యేకాంతములోనున్నపుడు నేను యూసుఫును. నేనునీ సొంత అన్నను అని తెలియఁజేసి నీవుదుఃఖింపకుము. సహోదరులుచేసిన హింసలకు చింతింపకుము అని యూరడించెను. 70. ఆపిదప యూసుఫు తనసహోదరులకు ధాన్యపుమూటలు కట్టించి ఎవరికిఁదెలియకుండ తనతమ్ముని మూటలో వెండిగిన్నె నుంచెను. సహోదరులు మూటలు ఒంటెపై నుంచుకొని ప్రయాణము సాగించిరి. వారు కొంతదూరము పోయినపిదప రక్షకభటులు గిన్నె పోయినది అని తెలిసికొని యందు ఒకఁడు ఓ బిడారమువారలార! నిలువఁబడుఁడు. మీరు దొంగలు గాకనఁబడుచున్నారు అని కేక వేసెను. 71. అది విని యూసుఫు సహోదరులు నిలిచి ఏమయ్యా! మీ సొమ్ము ఏమి పోయినది అని పలుకఁగా 72. భటులు మా రాజుయొక్క వెండిగిన్నె పోయినది. అది కనఁబడుటలేదు. ఎవఁడు ఏలాటి యాలస్యము చేయక ఆ గిన్నె నిచ్చివేయునో వానికి ఒక యొంటె భారధాన్యము బహుమానము లభించును. దానికి నేను జామినుదారుఁడను అని రాజభటులలో నొకఁడు పలికెను. 73. దానికి యూసుఫు సహోదరులు, అయ్యా! మేము దొంగలముకాము. మా విషయము మీకుఁ దెలిసియే యుండును. మీరు మా గుణము తెలుంగుదురు. మేము అల్లరి దొంగతనము చేయుటకు రాలేదు అని పలుకసాగిరి. 74. దానికి రాజభటులు మీరు వృథా మాటలాడుచున్నారు. దానివలనలాభము లేదు. మీయొద్ద దొంగసొమ్ము దొరకిన మీకేమి శిక్షనియ్యవలెను అని యడిగిరి. 75. దానికి సహోదరులు తాము దొంగిలించలేదుగదా! అని దొంగకుఁగాను తమ మతములోనున్న శిక్ష నిట్లు చెప్పసాగిరి. అయ్యా! ఎవనియొద్ద దొంగసొమ్ము దొరకునో వానిని మీరు పట్టుకొని ఒక సంవత్సరము మీయొద్ద బానిసగా నుంచుకొనుఁడు. ఇదే విధముగ మేము దుర్మార్గులకు శిక్ష విధింతుము అని పలికిరి. ఇట్లు వారు పలికి తమ పలుకులోనే తాము పట్టువడిరి 76. ఈ సంభాషణ జరిగిన పిదప రాజభటులు వారందఱిని పట్టుకొనిపోయి యూసుఫుతో జరిగిన వృత్తాంతము తెలుపఁగా వీరి మూటలు సామానులు పరిశోధించి చూడుఁడు అని యాజ్ఞాపించెను. ముందు సహోదరుల మూటలు చూచిరి. అందు ఆగిన్నె కనఁబడలేదు. తుదకు బిన్యామీను సంచులను వెదకిరి. అందు ఆగిన్నె కనఁబడెను. ఈవిధమున

దేవుఁడు యూసుఫునకు తన తమ్ముని తనయొద్ద నుంచుకొనునట్లుగ యుక్తిని చూపించెను. లేనిచో ఈజిప్టురాజుయొక్క చట్టములో దొంగకు బానిసగా నుంచుకొనవలెను అనిలేదు. దేవుఁడు తాను కోరినవారికి గొప్పదర్జాలొసఁగును. చూడుఁడు! ముందు యూసుఫు సహోదరులు దొంగతనముగా యూసుఫును అమ్మివేసిరి. ఇప్పుడు వారే దొంగలుగ యూసుఫు నెదుట నిలిచియున్నారు. లోకములో తెలివి జ్ఞానములందు ఒకరికంటె నొకరు మించినవారు గలరు. కాని అందరికంటె నెక్కువ దెలిసినవాఁడు దేవుఁడు. అతఁడు సర్వజ్ఞుఁడు. యూసుఫు తన సొంతతమ్ముని తన యొద్దనుంచుకొనుటకుఁగాను జేసినది మంచి యుపాయము. ఇందు ఏలాటి దోషములేదు. **77.** యూసుఫు సహోదరులు రాజు గిన్నె బిన్‌యామీనుయొక్క మూటలో దొరకుట చూచి ఈఁడే దొంగగాదు. ముందు ఈతని యన్న కూడ దొంగతనము చేసియున్నాఁడు అని పలుకసాగిరి. ఈమాట విని యూసుఫు ఓపిక వహించి తన రహస్యమును బయటపెట్టక మనస్సులోనే మీ విషయము దేవునికి బాగుగఁ దెలియును. ఎవరు యూసుఫును తండ్రి నుండి మోసముతోఁ దీసికొని పోయి యమ్మివేసిరో! మీరు చాల దుర్మార్గులుగ నున్నారు అని చెప్పుకొనియూరకుండెను. 78. యూసుఫు సహోదరులు ఆతనితో ఓ మంత్రీ! నీవు మేలు చేయువాఁడవుగా మాకు కనఁబడుచున్నావు. దయచేసి, బిన్‌యామీనునకు బదులుగ మాలో నొక్కని దీసికొనుము. ఈతని తండ్రి చాల వయస్సు మళ్లిన ముసలివాఁడు. యూసుఫు పోవుటవలన ఆయనకు చాల దుఃఖము గలిగెను. ఈతఁడు కూడ లేనిచో చాల దుఃఖపడును అని విన్నవించిరి. 79. దేవుఁడు మమ్ము రక్షించుఁ గాత! ఎవనియొద్ద మా సొమ్ము దొరకినదో యాతనినే మా చట్టము ప్రకార ముంచుకొందుము. లేనిచో మేము అన్యాయము చేసినవారలమగుదుము. మే మట్లు చేయలేము అని పలికి, బిన్‌యామీనును తన యొద్ద నుంచుకొనెను.

80. ఫలమ్మస్-తైఁ-అసూ-మిన్‌హు-ఖలసూ-నజియ్యాన్ - ఖాల- కబీరు-హుమ్-అలమ్-తఅ-లమూ-అన్న-అబా-కుమ్ ఖద్ అఖజ-అలైకుమ్-మౌ-సిఖమ్-మినల్లాహి-వ-మిన్-ఖబ్లు-మా-ఫర్రత్-తుమ్-ఫీ-యూసుఫ-ఫలన్-అబ్-రహల్-అర్-జ-హత్తా-యాఁజన-లీ అబీ ఔ-యహ్‌కు-మల్లాహు-లీ-వ-హువ-ఖైరుల్-హాకిమీన్. 81. ఇర్-జిఊ-ఇలా-అబీకుమ్-ఫఖూలూ-యా-అబానా-ఇన్నబ్-నక-సరఖ-వ-మాషహిద్నా-ఇల్లా-బిమా-అలిమ్నా-వ-మాకున్నా-లిల్-గైబి-హాఫిజీన్. 82. వస్-అలిల్-ఖర్యతల్-లతీ-కున్నా-ఫీహా-వల్-ఈరల్-లతీ-అఖ్-బల్నా-ఫీహా-వఇ

న్నా-లసాదిఖూన్. 83. ఖాల-బల్-సవ్వలత్-లకుమ్-అన్-ఫుసుకుమ్-అమ్రన్-ఫస బ్రున్-జమీలున్-అసల్లాహు-అన్ యాతి యనీ_బిహిమ్-జమీఅన్- ఇన్నహూ_ హువల్-అలీముల్-హకీమ్. 84. వ-తవల్లా-అన్-హుమ్-వఖాల-యా-అసఫా- అ లా-యూసుఫ-వబ్-యజ్-జత్-ఐనాహు- మినల్-హుజ్ని-ఫహువ- కజీమ్. 85. ఖాలూ-తల్లాహి-తఫ్-తఉ-తజ్కురు-యూసుఫ-హత్తా-తకూన-హారజన్_ ఔ- త కూన-మినల్-హాలికీన్. 86. ఖాల-ఇన్నమా-అష్కూ-బస్సీ-వహుజ్నీ- ఇలల్లా హి-వ-అఅ-లము-మినల్లాహి-మా-లాతఅ-లమూన్.

80. పిదప వారు ఆతని విషయము నిరాశులై ఆలోచించుటకు నేకాం తమున చేరిరి. వారిలో పెద్దవాఁడు మీ తండ్రి దేవుని ప్రమాణము చేయించి వా గ్దానము మీనుండి గైకొని యున్నాఁడు అని మీకుఁ దెలియదా. మఱి మీరు దీనికి ముందు యూసుఫు విషయము నేరము చేసి యున్నారు. కావున నాతండ్రి నాకు సెలవు నొసంగునంతవఱకును లేదా నావిషయము దేవుఁడు ఆజ్ఞాపించు నంత వఱకును నేను ఈ దేశమును వదలిపెట్టను. మఱి దేవుఁడు సరియైన యాజ్ఞ చేయు వాఁడు. 81. మీరు మీతండ్రియొద్దకు తిరిగిపోయి ఓతండ్రీ! నీ కుమారుఁడు దొంగ తనము చేసినాఁడు. మఱి మాకుఁ దెలిసిన దానినే మాత్రము మేము పలి కితిమి. మఱి మేము మఱుఁగు విషయములు తెలిసిన వారలము కాము. 82. మఱి మేమున్న యూరివారలతోను మేము వచ్చిన బిడారము వారితో నడుగుము. మే ము నిశ్చయముగా సత్యము పలుకుచున్నారము అని పలుకుఁడని చెప్పెను. 83. యాఖూబు మీయాత్మలు ఒక మాటను కలిపించి కొన్నవి. ఇఁక ఓపిక చేయు టయే మేలు. బహుశః దేవుడు వారలందఱిని నాయొద్దకు తీసికొని వచ్చును. నిశ్చయముగా ఆతఁడే సర్వజ్ఞుఁడును వివేచనా పరుఁడును అని పలికెను. 84. మఱియు ఆతఁడు వారినుండి ముఖము త్రిప్పుకొని అయ్యో యూసుఫా! అనిపలి కెను. మఱి ఆతని కన్నులు దుఃఖము వలన తెల్లనాయెను. కావున ఆతఁడు దుఃఖ ముతో నిండియుండెను. 85. వారు దేవునియాన! నీవు క్షీణించి పోవునంత వఱకును లేదా చచ్చి పోవునంతవఱకును నీవుయూసుఫును జ్ఞప్తిచేయుచునేయుం దువు అని పలికిరి. 86. అపుడు యాఖూబు నావిచారమును దుఃఖమును దేవునికే తెలుపుచున్నాను. మఱి మీకుఁ దెలియనిది దేవుని నుండి నాకుఁ దెలియును అని పలికెను.

వ్యా॥ 80. యూసుఫు సహోదరులు, యూసుఫు, తమ కిచ్చిన జవా బును విని ఇఁక బిన్యామీను విడుదల కాఁడు అని తెలిసికొని నిరాశులై

ఏకాంతమున అందఱు చేరి యాలోచింప సాగిరి. అందుచాలమంది [illegible] దేశ
మునకు పోవలెనని అభిప్రాయపడిరి. అందు పెద్దవాడొకఁడు ఇంటికిపోయి [illegible]
తండ్రికి ఏమని ముఖము చూపగలము. మేము ప్రమాణములు చేసి యిచ్చిన [illegible]
నమునకు బదలేమి పలుకఁగలము. దీనికి ముందు యూసుఫు విషయములో [illegible]
ము చేసియున్నాముగదా! ఇఁక బిన్ యామీనును వదలి పోతిమేని చాల సిగ్గు
లేనివని యగును. కావున నేను మీ వెంట రాఁజాలను. ఈయూరిలోనే [illegible]
దును. తండ్రి సెలవిచ్చినచో దేశమునకు వత్తును. లేదా దేవుఁడే నా విషయము
ఏమి యాజ్ఞాపించునో అదిజరుగును. దైవవిధిగా చావు వచ్చిన నేను [illegible]నే
మరణింతును. లేదా బిన్ యామీనును విడిపించుకొనుటకు యత్నము [illegible]
అని పలికె. 81. మీరందఱు నన్నువదలి దేశమునకు పోయి తండ్రితో [illegible]గిన
వృత్తాంతమంతయుఁ దెలుపుఁడు. మేము మాశక్తికొలఁది [illegible]. [illegible]
తనము చేసినవానిశిక్ష మామత ప్రకారము పలికితిమి. మాతమ్ముఁడే [illegible]
తనము చేసెను. మఱుఁగు విషయములు మాకు తెలియవు. [illegible]
నీకొడుకే దొంగలించి పట్టుపడెను. 82. మామాటపై నీకు నమ్మ[illegible]
మిసరులోని జనులతోను మావెంట వచ్చిన బిడారముతోను విచారి[illegible]. వా
స్తవ విషయము నీకు తెలియనగును. మేము పలుకునదినిజము అని [illegible]
కుఁడు అని చెప్పి పంపెను. 83. వారు దేశముచేరి యన్నియు తండ్రితో [illegible].
యాఖూబు ప్రవక్తవిని ఇది యొక కల్పితమైన మాటగా నున్నది. [illegible]
లు కల్పించికొన్నది. ఓర్పుచేయుటయే యుత్తమము. దేవుని[illegible]
దును. నేను నిరాశ చెందను. ఆతఁడే యూసుఫును బిన్ యామీనును [illegible]
యిన పెద్దవానిని నాయొద్దకుఁ దీసికొని వచ్చును. ఆతనికి సర్వము [illegible].
ఆతనికి యుక్తాయుక్తములు తెలియును. ఎవరికిఁ దగిన [illegible]
ను అని పలికెను. మీరు కల్పించుకొన్న మాటఅని పలుకుట [illegible]. ఎ[illegible]
కన యూసుఫు గిన్నె బిన్ యామీను మూటలో వేసి ఒక యుక్తి కల్పి[illegible].
అదియునుగాక గిన్నె మూటలో నున్నంత మాత్రాన దొంగఅని [illegible]
వచ్చును. ఎవరైన మూటలో వేసి యుందురు అను సందేహము [illegible]గా!
ఇట్లు మీ రెండులకు వాదింపక మీరు బిన్ యామీను అన్న[illegible]
దొంగతనము చేసియున్నాఁడు అని పలికి బిన్ యామీను దొంగ అని [illegible]
తిరి. కావున మీరు ఇపుడువచ్చి మాటలు చేయుచున్నారుగదా! 84. యా[illegible]
వారితో సంభాషణ ముగిసిన పిదప వారినుండి ముఖము త్రిప్పుకొ[illegible]. [illegible]
త్త దుఃఖము వలన యూసుఫు పోయిన పాతదుఃఖము కూడ [illegible]
ఖించుచు అయ్యో! యూసుఫూ! అని చింతించెను. మనస్సులోని దుఃఖము[illegible]
రై పాఱుచు తుదకు కండ్లు తెల్లనాయెను. అందు దృష్టిలేక పోయెను. [illegible]

దుఃఖముతో నిండిపోయెను. దాని నణచుకొనియుండెను. 85.యూసుఫుసహోదరులు తమ తండ్రి చింతను చూచి నీవెపుడు యూసుఫునే జ్ఞప్తి చేయుచునుందువు. నీవు క్షీణించి బలహీనుడవగు వఱకును లేదా నీకుచావు వచ్చునంత వఱకును ఆచింత వదలవు అని 86. పలుకగా యాఖూబు మీరు నాకు నేర్పుచున్నారా! నేను నాదుఃఖ సమాచారము మానవులతోఁ జెప్పుకొనుట లేదు. నా ప్రభువగు దేవునితోనే నాకష్ట దుఃఖములను చెప్పుకొనుచున్నాను. దేవుఁడు నన్ను పరీక్షించు చున్నాఁడు. నాప్రియకుమారుఁడగు యూసుఫు చావలేదు. బ్రతికి యున్నాఁడు ఆతనిస్వప్న భావము పూర్తిగా తీరును. దేవునినుండి నాకుఁదెలియు విషయములు మీకుఁ దెలియవు అని పలికెను.

87. యా-బునయ్యజ్-హబూ-ఫత-హస్-స సూ-మిన్ యూసుఫ-వ-అఖీహి వలా తై-అసూ-మిర్-రౌ-హిల్లాహి-ఇన్నహూ-లా-యై-అసు-మిర్-రౌ-హిల్లాహి-ఇల్లల్-ఖౌముల్-కాఫిరూన్. 88. ఫలమ్మా-దఖలూ-అలైహి-ఖాలూ-యా-అయ్యుహల్-అజీజు-మస్సనా-వ-అహ్లల-నజ్-జుర్రు-వ-జీనా-బి-బిజా-అతిమ్-ముజ్-జాతిన్-ఫ-ఔఫి-లనల్-కైల-వ త-సద్దఖ్-అలైనా-ఇన్నల్లాహ-యజ్జిల్-ముత-సద్దిఖీన్.89.ఖాల-హల్-అలిమ్-తుమ్-మా-ఫఅల్-తుమ్-బి-యూసుఫ-వ-అఖీహి-ఇజ్-అన్తుమ్-జాహిలూన్. 90.ఖాలూ-అ-ఇన్నక-లఅన్త-యూసుఫు ఖాల-అనా యూసుఫు-వహాజా-అఖీ-ఖద్-మన్నల్లా-హు అలైనా-ఇన్నహూ-మన్ యత్తఖి వ-యస్ బిర్-ఫ-ఇన్నల్లాహ-లా-యుజీఉ అజ్-రల్-ముహ్-సినీన్. 91. ఖాలూ-తల్లాహి-లఖద్-ఆసర-కల్లాహు అలైనా-వఇన్-కున్నా-ల ఖాతి-ఈన్-92. ఖాల-లా-తస్-రీబ అలైకుముల్-యౌమ యగ్-ఫిరుల్లాహు-లకుమ్-వహు-అర్-హముర్-రాహిమీన్. 93. ఇజ్-హబూ-బిఖమీసీ-హాజా-ఫఅల్-ఖూహు-అలా-వజ్ హి-అబీ యాతి-బసీరన్-వ-అతూనీ-బి-అహ్-లికుమ్-అజ్మఈన్.

87. ఓనా పుత్రులార! మీరు పోయి యూసుఫును ఆతని సహోదరుని వెదుకుఁడు. మఱిమీరు దేవుని దయనుగూర్చి యాశ వదలకుఁడు. నిశ్చయముగ అవిశ్వాసులు తప్ప నితరులు దేవుని దయను గూర్చి ఆశ వదలరు. అనియాఖూబు పలికెను. 88. ఆపిదప వారు యూసుఫు నొద్దకుఁజేరి ఓమంత్రీ! మాకును మాయింటికిని చాలకష్టము కలిగినవి. మఱి మేము కొంత డబ్బు తెచ్చియున్నా

రము. కావున మాకు సంపూర్ణమైన భర్తీ నొసంగుము, మఱి మాకు దాన మొసంగుము. నిశ్చయముగ దేవుఁడు దానము చేయువారికి ఫలిత మొసంగును అని పలికిరి. 89. మీరు అజ్ఞానులుగా నున్నపుడు యూసుఫునకును ఆతని సహోదరునకు మీ రేమి చేసితిరో మీకుఁ దెలియునా అని యాతఁడు పలికెను. 90. ఏమి? నీవు వాస్తవముగ యూసుఫువేనా అని వారు పలికిరి. నేను యూసుఫును, మఱి యీతఁడు నాతమ్ముఁడు. దేవుఁడు మాకు మేలు చేసియున్నాఁడు. నిశ్చయముగ నెవరు భయపడి యోర్పుగలిగి యుందురో అట్టి సత్కార్యుల ఫలమును దేవుఁడు వృథా చేయఁడు అని యూసుఫు పలికెను. 91. వారు దేవుని యాన! నిశ్చయముగ దేవుఁడు మాలోనుండి మాయందు నిన్ను ఎన్నుకొని యున్నాఁడు. మఱి మేమే తప్పు చేసి యున్నారము అని పలికిరి. 92. ఈ దినము మీపై నేలాటినిందయు లేదు. దేవుఁడు మిమ్ము క్షమించునుగాక! మఱి ఆతఁడే అందఱికంటెను నెక్కువ దయగలవాఁడు. 93. ఈనాయంగీ తీసికొని పోయి దానిని నాతండ్రి ముఖముపై వేయుఁడు. ఆతని కన్నులకు దృష్టివచ్చును. మఱి మీయింటివారి నందఱిని నాయొద్దకుఁ దీసికొనిరండు అని యూసుఫు పలికెను.

వ్యా॥ 87. దేవుని దయ చాల గొప్పది. ఎంతటి కష్టము గలిగినను దేవుని దయగలుగును అను ఆశ భక్తుఁడు వదల కూడదు. ఆశ వదలువారు భక్తులు కారు. కష్టములకు భీతిల్లి దేవుని దయను గూర్చి యాశ వదలువారు అవిశ్వాసులు. కావున ఓ నాపుత్రులారా! మీరు శక్తివంచన లేకుండ విచారించి యూసుఫును వెదకుఁడు. దేవుని దయవలన ఆతఁడు మీకు లభించును. ఆతని తమ్ముఁడగు బిన్‌యామీనును విడిపించుటకుఁగాను యత్నించుఁడు. బిన్‌యామీను విడుదల పొందినచో నిలిచిపోయిన మీ సహోదరుఁడు కూడ వచ్చును అని ధైర్యము చెప్పి యాఖూబు తన పుత్రులను సాగనంపెను. 88. వారు తమ తండ్రి యాజ్ఞను అనుసరించి మరల ఈజిప్టునకు ప్రయాణమై పోయి యూసుఫు నొద్దకు చేరి ఓ మంత్రీ! యీతూరి కఱవువలన మాకును మాయింటివారికిని చాల బాధ కలిగినది. ఇంటి సామానంతయు అమ్మి వేసితిమి. కొంతడబ్బు మాత్రము తెచ్చినారము. ముందునీవు చాల మేలుచేసి యున్నావు. కావునదయచేసి మాకు పూర్తి ధాన్యపు మూటలు ఒసంగుము. ఇట్లు చేయుట వలన నీవు మాకు దానము ఒసంగిన వాఁడవగుదువు అని పలుకఁగానే, 89. యూసుఫు యొక్క హృదయము మెత్తపడి కన్నీరు కార్చుచు జ్ఞానములేక మీరు యూసుఫు విషయము చేసిన కార్యము మీకుఁ దెలియునా. బిన్‌యామీనును యూసుఫును వేఱుపఱచి వారియందు ద్వేషము వహించిన విషయము మీకుఁ దెలియునా అనియడిగెను. కాని యేమియు దండింపలేదు. ఇదియును వారు చాలసంవత్సరముల క్రిందటి సమాచారము జ్ఞప్తికిఁ దెచ్చుకొన వలెను అని యడిగెను.

**90.** అపుడువారునీవుయూసుఫేనా!అనిఆశ్చర్యముతోప్రశ్నించిరి, దానికిఁకొను నేను యూసుఫును. ఈ బిన్ యామీను నాతమ్ముఁడు. నాయొద్ద నున్నాఁడు. దేవుఁడు మమ్ము అనుగ్రహించి మా కష్టములు తొలఁగించి సంపదలును మసరునొసంగెను. భయభక్తులు గలిగి కష్టములకు ఓర్చుకొన్నవారికి తప్పక దేవుఁడు మంచి ఫలిత ము నొసంగుచున్నాఁడు. సత్కార్యులు, చేసిన పుణ్యకార్యములు వృథాపోవు అని పలికెను. 91. వాస్తవము వారికి తెలిసిన పిదప తాము చేసిన తప్పు నొప్పు కొని దేవుఁడు నిన్ను అనుగ్రహించి మాకంటె నీకు గొప్పగా చేసెను. నీస్వప్న ము నిజమాయెను. మేము నిన్ను గౌరవింపలేదు అని పలికిరి. 92. అపుడు యూ సుఫు ఈవిషయము వదలి పెట్టుఁడు. మీతప్పులను క్షమించితిని. మిమ్ము నిందిం పను. దేవుఁడు అమిత దయగవాఁడు. ఆతఁడు మిమ్ము క్షమించుగాక! ఆతని యనుగ్రహము వలననే నేను మిమ్ముల కనికరించుచున్నది. 93. నేను ఇపుడు మీవెంట రాఁజాలను. మీరు దేశమునకుఁబోయి మీయింటివారి నందఱిని పిలుచు కొని రండు. తండ్రి కన్నులదృష్టి పోయినది గదా! దానికి నాయంగీ తీసికొని పోయి ఆతని ముఖముపై కప్పుఁడు. తత్క్షణమే దృష్టిగలిగి బాగుగ చూడఁ గ లఁడు అని పలికి తన చొక్కాయనిచ్చి పంపెను.

**94.** వలమ్మా-ఫస-లతిల్-ఈరు-ఖాల-అబూ-హుమ్ ఇన్నీ-లఅజిదు-రీహ యూసుఫ లౌలా-అన్-తుఫన్ని-దూని. **95.** ఖాలూ-తల్లాహి-ఇన్నక-లఫీ-జలా లి కల్-ఖదీమ్. **96.** ఫలమ్మా-అన్-జాఅల్-బషీరు-అల్-ఖాహు-అలా-వజ్-హి హీ-ఫర్తద్ద-బసీరన్-ఖాల-అలమ్-అఖుల్-లకుమ్-ఇన్నీ-ఆఅలము-మినల్లాహి-మా లా-తఅ-లమూన్. **97.** ఖాలూ-యా-అబా-నన్-తగ్-ఫిర్-లనా-జునూ-బనా- ఇన్నా-కున్నా-ఖాతి-ఈన్, **98.** ఖాల-సౌఫ-అస్-తగ్-ఫిరు-లకుమ్-రబ్బీ - ఇన్న హూ-హువల్-గఫూరుర్-రహీమ్.

94. మఱియు బిడారము వెడలఁగనే వారితండ్రి "నీవు బుద్ధిపోయిన ముసలివాఁడవు అనిమీరు నన్ను చెప్పకున్నచో నిశ్చయముగా నాకు యూసుఫు వాసన వచ్చుచున్నది" అని పలికెను. 95. దేవునియాన! నీవు నీపురాతన పొరపాటులో పడియున్నావు అని వారు పలికిరి. 96. ఆపిదప సువార్త తెచ్చు వాఁడు వచ్చి యాతని ముఖముపై ఆ। యంగీనివేయఁగా నాతఁడు చూడఁ గలి గెను. మీకుఁ దెలియనిది నాకు దేవునినుండి తెలియును అని మీతోఁ జెప్పలేదా అని యాఖూబు పలికెను. 97. వారు "ఓ మాతండ్రీ! మా పాపముల విషయ ము దేవుని యొద్ద మా కొఱకు క్షమాపణ వేఁడుము. నిశ్చయముగా మేముతప్పు

చేసిన వారలను అని పలికిరి. 98. కొంత నిదానించుఁడు నాప్రభువుతో మీ కొ
అకు క్షమాపణ వేఁడుదును. నిశ్చయముగా ఆతఁడే క్షమించువాఁడును, దయా
ళువును అని యాఖూబు పలికెను.

వ్యా॥ 94. యూసుఫు సహోదరుల బిడారము యూసుఫు ఇచ్చిన చొ
క్కాయను తీసికొని ప్రయాణమైరి. ఈ విషయము దేవునివలన యాఖూబునకుఁ
దెలిసెను. యూసుఫు యొక్క యంగీ సువాసన వచ్చుచున్నది అని పలుక సా
గెను. తాను ఈ విషయము చెప్పక మునుపు తన యింటివారితో నేను ఒకవిష
యము పలుకుదును. కాని మీరు దానిని గ్రహింపక నీవుముసలి వాఁడవు. మతి
చెడి మాటలాడు చున్నాఁడవు అని మీరు నాతో చెప్పుదురని జంకుచున్నా
ను అని పలికి యూసుఫును గూర్చి తెలిపెను. 95. అది విని నీహృదయములో
యూసుఫుప్రేమ నాటుకొన్నది. ఆతఁడు బ్రతికి యున్నాఁడనియే నీకుతోచును.
ఇది క్రొత్తకాదు! పూర్వమునుండి నీవిట్లు పొరపాటులో పడి యున్నావు. నీవు
యూసుఫును తిరిగి చూచుట కల్ల అనిపలుకసాగిరి. 96. కొన్నాళ్ళకు బిడారము
కన్ఆనునకు వచ్చిచేరెను. ముందుగానే యూసుఫుయొక్క చొక్కాయను ఒకఁ
డు తెచ్చి యాఖూబు ముఖముపై వేయఁగానే తత్క్షణమే దృష్టిగలిగి యాఖూ
బు చూడగలిగెను. ఇది యూసుఫు ప్రవక్తయొక్క మహిమ వలన గలిగెను.
సహజముగ మహాసంతోషము గలుగుట వలనను కూడపోయిన దృష్టితిరిగి గలు
గును. అనేక సంవత్సరముల పిదప పోయిన పుత్రుఁడు బ్రతికియున్నాఁడు అను
సువార్త వినుట వలన మహానందము యాఖూబునకుఁ గలిగెను. యాఖూబు
యూసుఫు వాసన వచ్చుచున్నది యని పలికినపుడు ఇంటివారు నమ్మలేదుగదా!
దానికి ఏమి నేను ముందే పలికినది నిజము కాలేదా! దేవుఁడు నాకుఁ దెలుపు
నది మీకుఁ దెలియదు అని చెప్పలేదా! 97. అపుడు యూసుఫు సహోదరులు
తమ తండ్రితో ఓ నాయనా! మేము అనేక తప్పులు కావించి యున్నారము.
మాపాపములను నీవు ముందు క్షమించి భయభక్తులతో మాపాపములు పోవు
నట్లు దేవునితో మాకొఱకు క్షమాపణ వేఁడుము. నీ ప్రార్థన అంగీకరించి దేవుఁడు
మమ్ము క్షమించును అని విన్నవించిరి. 98. అపుడు యాఖూబు ప్రవక్త తొందఱ
చేయకుఁడు. కొంతనిదానించుఁడు. ప్రార్థన అంగీకరింపఁబడుగడియ వచ్చినపు
డు దేవుఁడు మిమ్ము క్షమించునట్లు దేవునిని వేఁడుదును. ఆతఁడే క్షమించు వాఁ
డును; దయాళువుసు అని పలికి యటులే దేవునిని వేఁడెను.

99. ఫలమ్మా-దఖలూ-అలా యూసుఫ-ఆవా - ఇలైహి-అబ-వైహి-వ-
ఖాలద్-ఖులూ-మిస్‌ర-ఇన్-షా అల్లాహు-ఆమినీన్. 100. వ రఫఅ-అబవైహి-అలల్
అర్షి-వ-ఖర్రూ-లహూ-సుజ్జదన్-వ-ఖాల-యా-అబతి-హాజా - తావీలు-రూ-

యా-యు-మిన్-ఖబ్లు-ఖద్-జఅలహా-రబ్బీ-హఖ్ఖన్-వ-ఖద్-అహ్సన-బీ-ఇజ్-అఖ్-రజనీ-మినస్-సిజ్ని-వ-జాఅ-బికుమ్-మినల్-బద్వి-మింబఅ-ది-అన్-నజ-గన్-షైతాను-బైనీ-వబైన ఇఖ్-వతీ-ఇన్న-రబ్బీ-లతీఫుల్-లిమా-యషాఉ-ఇన్నహూ-హువల్-అలీముల్-హకీమ్. 101. రబ్బి-ఖద్-ఆతైతనీ-మినల్-ముల్కి-వ-అల్లమ్-తనీ-మిన్-తావీలిల్-అహాదీసి-ఫాతిరస్-సమా-వాతి-వల్-అర్జి-అన్త-వలియ్యీ-ఫిద్-దున్యా-వల్-ఆఖిరతి-తవఫ్-ఫనీ-ముస్-లిమన్-వ-అల్-హిఖ్నీ-బిస్-సాలిహీన్. 102. జాలిక-మిన్-అంబా-ఇల్-గైబి-నూహీహి-ఇలైక-వ-మాకున్త-లదైహిమ్-ఇజ్-అజ్-మఊ-అమ్-రహుమ్-వ-హుమ్-యమ్కురూన్. 103. వ-మా-అక్-సరున్నాసి వలౌ-హరస్త-బి-ముఅమినీన్. 104. వ-మాతస్-అలుహుమ్-అలైహి-మిన్-అజ్రిన్-ఇన్-హువ ఇల్లా-జిక్-రుల్-లిల్-ఆలమీన్.

99. పిదప వారు యూసుఫునొద్దకు పోయి చేరఁగా ఆయన తన తల్లిదండ్రులకు తనయొద్ద స్థానము నొసంగెను. మఱి దేవుఁడు కోరినచో శాంతియుతముగా మీరు మిసరులో ప్రవేశింపుఁడు అని యూసుఫు పలికెను. 100. మఱియు ఆతఁడు తన తల్లిదండ్రులను సింహాసనముపై కూర్చుండఁబెట్టెను. మఱి వారందఱు ఆతనికి సాష్టాంగపడిరి. మఱియు యూసుఫు ఓతండ్రీ! పూర్వము నాకువచ్చిన స్వప్నముయొక్క భావమిది. దానిని నాప్రభువు నిజమైనదిగాఁ జేసెను. మఱి ఆతఁడు నన్ను చెఱశాలనుండి దీసినపుడు నన్ను అనుగ్రహించెను. మఱి నాకును నాసహోదరులకును సైతాను కలహము కలిగించిన పిదప గ్రామమునుండి మిమ్ము తీసికొనివచ్చినాఁడు. నిశ్చయముగా నాప్రభువు తాను కోరినది, ఉపాయనుగాఁ జేయుచున్నాఁడు. నిశ్చయముగా ఆతఁడే సర్వము తెలిసినవాఁడును, ఉపాయశాలియును. 101. ఓనాప్రభువా! నీవునాకు కొంతరాజ్యము నొసంగితివి విషయముల వాస్తవమును నాకు నేర్పితివి. ఆకాశములకును భూమికిని సృష్టికర్తవు నీవే. ఇహమునందును పరమునందును నాకు రక్షకుఁడవు. నీవు నన్ను భక్తునిగానే మరణింపఁజేయుము. మఱి పుణ్యాత్ములతోఁ జేర్చుము అని పలికెను. 102. ఓ ముహమ్మదు ! ఇది యగోచరములైన విషయములలోనిది. దీనిని నీకుఁ దెలుపుచున్నారము. మఱి వారు తమ కార్యమును నిశ్చయిరిచి కుట్రచేయుచున్నపుడు నీవు వారియొద్ద లేకుంటివి. 103. నీవెంత కోరినను పెక్కురు విశ్వసించువారుకారు. 104. నీవు ఖురాను ప్రచారమునకుఁగాను వారితో బదులు అడుగుటలేదు. ఇది సర్వజగత్తునకుఁగాను బోధన మాత్రమే.

వ్యా॥ 99, 100. హజ్రత్ యాఖూబు తన పుత్రులను దీసికొని ఈజిప్టునకు ప్రయాణమైపోయిచేరిరి. ఈవిషయముయూసుఫునకుఁ దెలిసిగొప్ప మర్యాదలతో స్వాగతమిచ్చి పిలుచుకొని వచ్చి తన దగ్గర సింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టి ఇఁక మీకు ఏలాటి చింతయుండకూడదు. మీరు శాంతిగా మిసరులో నుండ వచ్చును. ఇదియును దేవుని యిష్టమే. అట్లు యూసుఫు తన తల్లిదండ్రులను గౌరవింపఁగా వారిద్దఱును, ఆతనిసహోదరులుందఱును ఆకాలపు మర్యాదనుబట్టి యూసుఫునకు సాష్టాంగపడిరి. అపుడు యూసుఫు తన తండ్రితో ఓ నాయనా! పూర్వము నేను చూచిన స్వప్నము యొక్క ఫలమిది. దేవుఁడు దానిని నిజముగఁ జేసెను. దేవుఁడు నన్ను చెఱశాలనుండి విడిపించి గొప్ప గౌరవమును అనుగ్రహించెను. సైతాను కుట్రవలన కలహముచెందిన నా సహోదరులును తిరిగి నా యొద్దకు వచ్చి చేరునట్లు చేసెను. మీదర్శనము తిరిగి లభించునట్లు దేవుఁడు చేసెను. దేవుఁడు సర్వజ్ఞుఁడు. చూడుఁడు! ఎట్లు తాను కోరిన కార్యము ఉపాయముతో నెఱవేర్చును అని దేవుని యుపకారములను జ్ఞప్తికిఁ దెచ్చుకొని తన తండ్రితోఁ జెప్పెను. ఇందు తన సహోదరులు గావించిన కుట్రను చెప్పలేదు. ఎట్లు దేవుఁడు తన్ను బావిలోనుండి రక్షించెనో ఆ విషయము చెప్పలేదు. దాని వలన సహోదరుల మనస్సులకు నొప్పికలుగును గదా! హజ్రత్ ముహమ్మదు వారికి పూర్వము, మర్యాదకుఁగాను సాష్టాంగనమస్కారము (సిజ్దా) చేయుట ధర్మముగా నుండెను. దాని ననుసరించియే యూసుఫు సహోదరులును తల్లిదండ్రులును సాష్టాంగపడిరి. కాని యిప్పుడు ఇస్లామ్ మతములో దేవునికిఁదప్ప నితరులకు సాష్టాంగ పడరాదు. యూసుఫు తల్లి చనిపోయెను ఆతనిపినతల్లి(ఖాలా) యుండెను. ఆమెకూడ తల్లితో సమానమే. ఆమెనుగూర్చియే యిచ్చట చెప్పఁబడెను. 101. దేవుఁడుయూసుఫునకు రాజ్యమును. దివ్యజ్ఞానమునుసంపూర్ణముగ నొసంగియుండెను. అది దేవునితో విన్నవించుచు ఇఁక నీదర్శనమునకు మార్గమైన చావును నాకు దయచేయుము. పుణ్యాత్ములతోఁ జేర్పుము. ఉభయలోకములలోను నీవు నాకు రక్షకుఁడవు. పోషకుఁడవు. నేను సదా నీకు విధేయుఁడనై యుండి మరణించునట్లు దయచేయుము అని వేఁడుకొనెను. 102. ఇఁక హజ్రత్ ముహమ్మదుతో దేవుఁడిట్లు సంబోధించుచున్నాఁడు. ఓ ముహమ్మదు! యూసుఫుయొక్క వృత్తాంతము దీనికి ముందు నీకుఁదెలియదు. యూసుఫుసహోదరులు యూసుఫును లోతుబావిలో పడవేయవలెనని రహస్యముగా కుట్రలు చేయుచున్నపుడు నీవు వారి యొద్దను ఉండలేదు. నీవు ఒకరి యొద్దచదివినవాఁడవు కావు. కావున మేము ఇట్టి గుప్తవిషయములను సందేశ (వహీ) మూలముగ నీకుఁ దెలుపుచున్నారము. 103. నీవు నిజముగ దేవుని ప్రవక్తవుఅని సూచించు అనేక ప్రమాణములున్నను పెక్కురు విశ్వసించుటలేదు. దానివలన నీవు

చింతింపనక్కఱలేదు. 104. జనులు విశ్వసింపనిచో నీకేమియు నష్టములేదు. నీపని ఖురాను ప్రచారము చేయుట మాత్రమే, నీవది చేయుచునే యున్నావు. ఈప్రచారమునకుఁగాను జనులయొద్ద నీవు జీతము (బదులు) అడుగుటలేదు. వారు ప్రచారమును సహింపక నీజీతమును ఆపివేయుదురేమో అను భయము నీకులేదు. ఖురానులో జగత్తున కంతయు బోధనయున్నది. దాని ప్రచారము అగుచున్నది. ఇఁకమీఁదకూడ కాఁగలదు. అందు ఏలాటి లోపము రానేరదు. దాని ననుసరించినవారు ఉభయలోకములలోను జయమును మోక్షమును పొందుదురు అని సెలవిచ్చెను.

105. వ-క-అయ్యిమ్-మిన్-ఆయతిన్-ఫిస్-సమావాతి-వల్-అర్‌ది - య మర్రూన-అలైహా-వహుమ్-అన్-హా-ముఅ-రిజూన్. 106. వమా-యూమినుఅక్-సరుహుమ్-బిల్లాహి-ఇల్లా-వహుమ్-ముష్-రికూన్. 107. అఫ-అమినూ-అన్ తా-తి-యహుమ్-గాషి-యతుమ్-మిన్-అజా- బిల్లాహి- ఔ- తా- తి- యహుముస్-సాఅతు-బగ్తతన్-వహుమ్-లా-యష్-ఉరూన్.

105. మఱియు ఆకాశములోను భూమిలోను అనేక సూచనలు గలవు. వారు వానిని చూచుచు గమనింపకపోవుచున్నారు. 106. మఱి వారిలోని పెక్కుమంది దేవునిని విశ్వసించుటలేదు. కాని వారు దేవునికి సాటి కల్పించుచున్నారు. 107. ఏమి! దేవునిశిక్ష వచ్చి వారిని క్రమ్ముకొనును అనియు లేదా ఆకస్మికముగ వారికిఁ దెలియకుండగా ప్రళయకాలము వచ్చును అనియు వారికి భయములేదా!

వ్యా॥ 105. ఎట్లు అవిశ్వాసులు దేవుఁడు పంపిన ఖురాను వాక్యములను వినియు విశ్వసింపరో అటులే భూమ్యాకాశములలోనుండు దేవునిశక్తిసూచనలు చూచియు అందు గమనింపక దేవుని యేకత్వమును నమ్మకపోవుచున్నారు. వారు వినునది చూచునది సాధారణములైనవి. ఏలాటి యోచన ధ్యానములు లేక వినుచు చూచుచున్నారు. బాగుగ దేవుని సృష్టియందు విచారించి గమనించి చూచినచో వారికి లాభకరమై యుండును. కాని వారు గమనించుటయే లేదు. కావున ఎట్లు వారికి విశ్వాసము లభించును. 106. అనేకులు నోటిమాటలతో దేవుఁడున్నాఁడు అని పలుకుదురు. కాని దానితోఁబాటు కొందఱు చిల్లర దేవతలను, విగ్రహములను, దేవదూతలను దేవునికుమార్తెలుగ, కల్పించికొనియారాధింతురు. మఱికొందఱు తమ పండితులకును పాదరీలకును గురువులకును దేవునివంటి యధికారములిచ్చి వారిని దేవునితో సమానులుగఁ జేయుదురు. మఱి కొందఱు గోరీలను, పీర్లను పూజించి దేవుని యేకత్వమును చెఱుచుచున్నారు.

కావునకొద్దిమందివిశ్వాసులు మాత్రమే నిజమైన దేవునియందుభక్తివిశ్వాసములు గలిగియున్నారు. తక్కిన పెక్కురు పలువిధములుగ దేవునికి సాటి కల్పించు చున్నారు. 117. అవిశ్వాసులు పాపములలోఁబడి దేవునిశిక్ష వారికిఁగలుగును. ప్రళయము (ఖియామత్) తెలియకుండ ఆకస్మికముగ వారికివచ్చి పట్టును అనిభయము వారికేలలేదు. ఏమి వారు దానినుండి తప్పించుకొనుటకు నేమైన యేర్పాటులు చేసికొనియున్నారా? మరేల వారు నిర్భయులుగా నున్నారు. అట్లుండ రాదు. దేవునిశిక్ష తప్పక దుష్టులకుఁ గలుగును. ప్రళయము (ఖియామత్) తప్పక వచ్చును. అపు డేమియు చేయఁజాలరు. కావున యిప్పుడే దాని యాపదలనుండి రక్షణపొందుటకై మానవులు యత్నింపవలెను.

108. ఖుల్-హాజిహీ-సబీలీ-అద్-ఊ-ఇలల్లాంహి-అలా-బసీ-రతిస్-అనా-వ-మనిత్-తబ-ఆనీ వ-సుబ్-హానల్లాహి-వ-మా-అనా-మినల్-ముష్రికీన్.

108. ఇది నామార్గమున్నది. నేనును నన్ను అనుసరించిన వారును స్పష్టమగు సూచన ననుసరించి దేవుని వైపుపిలుచుచున్నారము. మఱి దేవునికి సాటి కల్పించువారితో నేను లేను అని ప్రవక్త! పలుకుము.

వ్యా॥ 108. దేవుఁడు ఒక్కఁడు అని విశ్వసించుట నామతము. అన్నిగమ్ము విశ్వాసములు వదలి సర్వశక్తుఁడగు ఒక్క దేవుని వైపునకు రండు అని లోకు లందఱిని నేను పిలుచుచున్నాను. ధర్మమార్గమును అనుసరించి దేవునియందు నిజమైనభక్తి విశ్వాసములు, వహింపుఁడు అని నా పిలుపు. నేనును నన్ను అనుసరించు ముసల్మానను భక్తులును సన్మార్గమందుండి స్పష్టమైన సూచనల వెలుగును బట్టి ధర్మమార్గమునందు పోవుచున్నారము. మఱి ఇస్లామ్ మత ప్రచారము చేయుచున్నారము. దేవుఁడు పరమ పవిత్రుఁడు. ఆతనికి సాటిలేదు. భార్య బిడ్డలు లేరు. కావున దేవునికి సాటి కల్పించు విగ్రహారాధకులతో నేను లేను. వారిమార్గము ననుసరింపను అని ప్రజలకుఁ దెలుప వలెనని దేవుని సెలవు.

109. వమా-అర్-సల్నా-మిన్ఖబ్లిక-ఇల్లా-రిజా లన్-నూహీ-ఇలైహిమ్ మిన్-అహ్-లిల్-ఖురా-అఫ-లమ్-యసీరూ-ఫిల్-అర్జి-ఫ-యన్-జురూ-కైఫ కాన-ఆఖి-బతుల్-లజీన-మిన్-ఖబ్-లిహిమ్-వల-దారుల్-ఆఖిరతి-ఖైరుల్-లిల్లజీనత్-తఖౌ-అఫలా-తఅ ఖిలూన్.110. హత్తా-ఇజస్-తై-అసర్-రుసులు-వ-జన్నూ-అన్న-హుమ్-ఖద్-కుజిబూ-జాఅ-హుమ్-నస్-రునా-ఫ-నుజ్-జీ మన్-నషాఉ-వలా-యురద్దు-బాసునా-అనిల్-ఖౌమిల్-ముజ్రిమీన్. 111. లఖద్-కాన-ఫీ

ఖస-సిహిమ్-ఇబ్-రతుల్-లి-ఉలిల్-అల్-బాబి మా కాన-హదీసన్-యుఫ్-త రా-వలాకిన్ తస్ దీ-ఖల్-లజీ-బైన-యదైహి-వ తఫ్-సీలకుల్లి-షైఇన్- వహుదన్-వ-రహ్-మతల్-లిఖా-మిన్ యూమినూన్.

109. మఱియు నీకుఁ బూర్వము మేము ప్రవక్తలఁగాఁజేసి పంపిన వారందఱును నగర నివాసులగు పురుషులేను. వారికి మేము సందేశము పంపుచుంటిమి. మఱేమి ఈజనులు తమ పూర్వుల గతి యేమాయెనో చూచుటకు దేశములో సంచారము చేయలేదా! మఱి భయభక్తులు గలవారికి పరలోక గృహముచాల మేలైనది. ఏమి! మీరిప్పుడైనను గ్రహింపరా! 110. తుదకు ప్రవక్తలు నిరాశ చెందుచు వారితో అబద్ధము పలుకఁ బడినది యని తలచుచుండఁగా వారికి మా సహాయము వచ్చెను. ఆ పిదప మేము కోరిన వారిని రక్షించితిమి. మఱి పాపాత్ములైన వారినుండి మాశిక్ష తొలఁగదు. 111. నిశ్చయముగా బుద్ధిమంతులకు వారి వృత్తాంతములలో బోధన గలదు ఖురాను కల్పింపఁ బడిన మాట కాదు. కాని యిది తనకు పూర్వమున్నవానిని సత్యపఱచునది. ప్రతి విషయమును వివరించునది. మఱియు విశ్వసించు జనులకు నిది సన్మార్గమునకును దయకును మూల కారణము.

వ్యా॥ 109. ఓ ముహమ్మదు! మేము నీకు ముందు పంపిన ప్రవక్తలు కూడ నీవంటి పురుషులే. వారు దేవదూతలు (ఫరిష్తే) కారు. వారు నగరములలో వసించు వారలే. ప్రవక్తలను నమ్మకతిరస్కరించిన వారి దుర్గతి యేమాయెనోలోకులు చూచుకొనవలెను. కాఫిర్లకు ఇహమునందుసంపదలును సౌఖ్యములును గలిగినను వారికి పరమునందు స్వర్గసౌఖ్యములు లేవు. భయభక్తులు గలిగి విశ్వసించి, విగ్రహారాధన మొదలగు పాపములు వదలుకొన్నవారికి పరలోకమునందు స్వర్గమనెడి గృహము చాల మేలైనది. కావున మక్కా కాఫిర్లు బాగుగ యోచించి పూర్వుల విషయములను విని తాము బుద్ధి తెచ్చుకొనవలెను. ఈవాక్యమును బట్టి వచ్చిన ప్రవక్త లందఱును నగర నివాసులగు పురుషులేయని ఏర్పడుచున్నది. మఱి స్త్రీలు ప్రవక్తలుగా రాలేదు. 110. దేవుని శిక్షదుష్టులకు శీఘ్రముగా రాలేదు. ఆలస్యమైనందు వలన అవిశ్వాసులు మోసపోఁగూడదు. పూర్వము కూడ అవిశ్వాసులను శిక్ష ఆలస్యముగానే వచ్చి పట్టెను. అట్లు ఆలస్యమైనందున అవిశ్వాసులు ఇఁక దేవుని శిక్ష రాదులే అని నిర్భయులై దుష్టత్వములో చెలరేఁగి పోయి పాపములు మఱిహెచ్చుగాఁ జేయసాగిరి. తుదకుఈవిషయము ప్రవక్తలు చూచి ఇఁక అవిశ్వాసులు విశ్వసింతురను మాట వట్టిది అని నిరాశ చెందిరి. దానిపైన దేవుని శిక్ష వచ్చుటలో చాల ఆలస్యమాయెను. అందుకు

ప్రవక్తలు ఏమిరా! మామాట అబద్ధమై పోవునేమో అని తలంపసాగిరి. దుష్టులు దేవుని శిక్ష వచ్చుట కల్లఅని నిశ్చయింప సాగిరి. ఇట్టి స్థితిలో ప్రవక్తలను వారితోఁబాటు విశ్వాసులను దేవుఁడు కాపాడి అవిశ్వాసులను శిక్షించి నశింపఁజేసెను. దేవుని శిక్షనుండి దుష్టులు తప్పించుకొనఁ జాలరు. అదివచ్చినచో తిరిగి పోదు. కావున మక్కా కాఫిర్లు బుద్ధి తెచ్చుకొనుదురు గాక! 111. ప్రవక్తల వృత్తాంతములు, నవలకాదు. అందు బుద్ధిమంతులు యోచించినచో వారికిబోధన (బుద్ధి) గలుగును. ప్రవక్తల వృత్తాంతములు గల ఖురానెషరీఫు కల్పితమైనది కాదు. ఇది దేవుని యొద్దనుండి వచ్చిన గ్రంథము. ఇది పూర్వమువచ్చిన దేవుని గ్రంథములను సత్యపఱచుచున్నది. ఇది వలయు విషయము లన్నిటిని ధర్మము లన్నిటిని వివరించుచున్నది. దీని ననుసరించు విశ్వాసులకుసన్మార్గము లభించును. దేవుని దయకు వారు పాత్రులగుదురు. కావున మానవు లందఱును ఇట్టి యుత్తమోత్తమ గ్రంథమును గమనించి చదివి గ్రహించి యుభయ లోకములలోను జయమును మోక్షమును పొందుదురుగాక.

సూరయే రఅద్ (ఉఱుము) మక్కీ 43 వాక్యములు.

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్.

అమిత దయాళువును అనుగ్రహించువాఁడునగు దేవుని పేర.

1. అలిఫ్-లామ్-మీమ్-రా-తిల్క-ఆయాతుల్-కితాబి-వల్లజీ-ఉన్జిల-ఇలైక-మిర్-రబ్బికల్-హఖ్ఖు-వ-లాకిన్న-అక్-సరన్నాసి-లా-యూమినూన్.

1- అలిఫ్‌లామ్-మీమ్‌రా.(నేను దేవుఁడను, సర్వజ్ఞుఁడను. మీరు చేయు నన్నిటిని నేను చూచుచున్నాఁడను అని కొందఱు విద్వాంసులు దీనికి అర్థము చేసియున్నారు.) ఇవిఖురానుగ్రంథము యొక్క వాక్యములున్నవి. [illegible] నీప్రభువు నుండినీకుపంపఁబడినదంతయుసత్యమైనది. కానిపెక్కుమందిమనుష్యులువిశ్వసింపరు.

వ్యా॥ 1. ఈ సూరాలో పఠింపఁబడు వాక్యములన్నియు దేవదత్తగ్రంథమగు ఖురానులోనివి. ఓ ప్రవక్తా! నీకు పంపఁబడిన గ్రంథము దేవుని యొద్దనుండి వచ్చిన సత్యమైన గ్రంథము. అందు ఏలాటి సందేహము లేదు. అందఱును విశ్వసింపఁదగినది. కాని పెక్కురు విశ్వసించుటలేదు. ఇది చాల యాశ్చర్యకరమైన విషయము. ఎందుకన ఇట్టిస్పష్టమైనవిషయమునుమానవులెట్లు తిరస్కరింపఁగలరు.

2. అల్లా-హుల్లజీ-రఫ-అస్-సమావాతి బి-గైరి-అమదిన్- త[illegible]-నహా-సుమ్మస్-తవా-అలల్-అర్షి-వ-సఖ్ఖ-రష్-షమ్స-వల్-ఖమర-కుల్లున్- యజ్రీ-లి-అజలిన్-ముసమ్మన్-యుదబ్బి-రుల్-అమ్ర-యు-ఫస్సిలుల్-ఆయాతి-ల-అల్ల

కుమ్-బి-లిఖాఇ-రబ్బి-కుమ్-తూ-ఖినూన్. 3. వహువల్-లజీ-మద్దల్-అర్‌జ-వ-జఅల-ఫీహా-రవాసియ-వ-అన్-హారన్-వ-మిన్-కుల్లిస్ సమరాతి-జఅల-ఫీహా- జౌ-జైనిస్-నైని-యుగ్-షిల్-లై-లన్-నహార-ఇన్న-ఫీ-జాలిక-ల-ఆ - యాతిల్-లి-ఖామిన్ యత-ఫక్క-రూన్. 4. వ-ఫిల్-అర్‌జి-ఖితఉమ్-ముత-జావి - రాతున్-వ-జన్నాతుమ్-మిన్-అఅనాబిన్-వ-జర్‌ఉన్-వ-నఖీలున్-సిన్-వానున్- వ- గైరు-సిన్వానిన్-యుస్-ఖా-బి-మా-ఇన్-వాహిదిన్-వ-నుఫజ్-జిలు-బఅ-జహా-అలాబఅ జిన్-ఫిల్-ఉకులి-ఇన్న-ఫీ జాలిక-ల-ఆయా-తిల్-లి-ఖామిన్-యఅ- ఖిలూన్.

2. స్తంభములు లేకయే ఆకాశముల నెత్తుగా నిలువఁబెట్టిన యాతఁడే దేవుఁడు. దానిని మీరు చూచుచున్నారు. ఆ పిదప పీఠముపై స్థిరపడెను. మఱి యాతఁడు సూర్యుని చంద్రుని పనిలో నియమించెను. ప్రతియొకటియును నియమిత కాలమువఱకు తిరుగుచుండును. ఆతఁడు కార్యమును నెరవేర్చును. మీరు మీ ప్రభువును దర్శింపఁబోవుదురు అను విషయమును మీరు నమ్ముటకై మీకు ఆతఁడు సూచనలను వివరించుచున్నాఁడు. 3. మఱియు ఆతఁడే భూమిని పఱచి అందు పర్వతములను నదులను జేసెను. మఱియు ప్రతిఫలమును రెండేసి రకములుగఁ జేసెను. ఆతఁడు పగలుపై రాత్రిని కప్పుచున్నాఁడు. ఇందు ధ్యానించు జనులకు సూచనలున్నవి. 4. మఱియు భూమిలో అనేకవిధములైన నేలలు ఒకదాని కొకటి చేరువగా నున్నవి. మఱియుఁ ద్రాక్షతోటలును పొలములును మొదలు చీలి రెండు మొదళ్ళుగా అగునట్టియు, అట్లుకాక ఒకే మొదలుగా నుండునట్టియు ఖర్జూరపుచెట్లును గలవు. అన్నిటికిని ఒకే నీళ్ళు ఇయ్యఁబడుచున్నవి. మఱి మేము వాని రుచులు ఒకదానికంటె నొకటి మించి నట్లు చేయుచున్నారము. ఇందు గ్రహించునట్టి జనులకు సూచనలు గలవు.

వ్యా॥ 2. ఈ వాక్యములలో దేవునిగూర్చి చెప్పఁబడుచున్నది. ఆకాశమును మేము చూచుచున్నారము. అది మనపైనే నిలిచియున్నది. దానికి స్తంభములులేవు. దేవునిశక్తివలననే అది నిలిచియున్నది అని చెప్పక తప్పదు. ఎవఁడు ఆకాశమును స్తంభములు లేకుండ నిలువఁబెట్టి యందు సూర్యచంద్రులను చేసి వానికి పనులందు నియమించి లోకమును నడిపించుచున్నాఁడో ఆతఁడే దేవుఁడు. సూర్యుఁడు ఒక సంవత్సరములోను చంద్రుఁడు ఒక నెలలోను తన ప్రయాణము పూర్తి చేయును. ఇట్లు ప్రళయమువఱకు జరుగును. పై వివరింపఁబడిన మహావస్తువులను సృజించిన దేవుఁడు, మానవులను తిరిగి సజీవులు చేయఁ

గలఁడు. ఇది దేవునికి కష్టముకాదు. కావున దేవుని శక్తిసూచనలను చూచి మానవులు తాము దేవుని దర్శింతురు అని నమ్మవలెను. 3 ఆకాశమునుగూర్చి చెప్పి ఇఁక భూమినిగూర్చి చెప్పఁబడుచున్నది. దేవుఁడు భూమినిపఱచి దానిందు నిలిచియున్నట్లుగ పర్వతములను జేసెను. అందు నదులు ప్రవహింపఁజేసినాఁడు. ఫల ములను పుట్టించెను. అందు తీపు, పులుపుగలిగి చిన్నవిగను పెద్దవిగను రంగుల భేదములుగలిగినవిగా నున్నవి. పగలు వచ్చి పోయిన పిదప రాత్రి వచ్చు చున్నది. రాత్రింబవళ్ళు వచ్చుచు పోవుచున్నవి. ఇందు గమనించు జనులకు దేవుని శక్తి సూచనలు గలవు. 4. ఎట్లు ఆకాశములో సూర్యుని చంద్రుని పని వేర్వేఱుగానున్నదో అటులే భూమిలోని నేలలు, వ్యత్యాసముగలిగియున్నవి. చూడుఁడు! చేరువులలోనున్న నేలలు పలువిధములుగ నున్నవి. ఒకటి సేద్యపు పంటలకు తగినదిగా నుండును. దాని ప్రక్కనుండు నేల చవటిగానుండి సేద్యము చేయుటకుఁ దగదు. పంటలకు వృక్షములకు తోఁటలకు ఒకే నీళ్ళు ఇయ్యఁబడు చున్నను, పలువిధములైన రుచులు, రంగులుగల ఫలములు, పుష్పములు మొదలగు ధాన్యములు గలుగుచున్నవి. ఇవన్నియు దేవుని శక్తివలన గలుగుచున్నవి అని బుద్ధిమంతులు గ్రహింపఁగలరు. ఇందునాస్తికులకురద్దుగలదు. లోకము సృష్టికర్త లేకయే తనంతట తానే స్వభావమునుబట్టి కలిగెనచో ఒకనేలనుండియే పలువిధము లైనఫలములుపువ్వులు ఒకేనీళ్లువలన ఎట్లుగలుగగలవు. స్వాభావికముగలిగి నచో ఒకేవిధమైనఫలములుపువ్వులు కావలెనుగదా! అట్లుగాక పలువిధములగుటకు కారణమేమి!సృష్టికర్త ఒకఁడున్నాఁడుకాఁబట్టిఅట్లగుచున్నది.ఇట్లుండఁగా ఇటులేవిన్న ఇటులేఒక్క ఖురాను గ్రంథమువినియుప్రజలుపలువిధములగబోధలు గైకొనుచున్నారు.

5. వ-ఇన్-తఅ-జబ్-ఫ-అజబున్-ఖౌలు-హుమ్-అఇజా-కున్నా-తురాబన్ అఇన్నా-లఫీ ఖల్-ఖిన్-జదీదిన్-ఉలా-ఇకల్లజీన-కఫరూ బిరబ్బిహిమ్. వ-ఉలా ఇ-కల్-అగ్ లాలు-ఫీ-అఅ-నాఖిహిమ్-వ-ఉలా-ఇక-అస్-హాబున్నారి హుమ్ ఫీ హా-ఖాలిదూన్. 6. వ-యస్-తఅ-జిలూనక-బిస్-సయ్యి-అతి-ఖబ్ లల్ హసనతి వఖద్-ఖలత్-మిన్-ఖబ్-లిహిముల్-మసులాతు-వఇన్న-రబ్బక-లజూ-మగ్ ఫిర-తిల్-లిన్నాసి-అలా-జుల్మి-హిమ్-వఇన్న-రబ్బక-ల-షదీదుల్-ఇఖాబ్. 7. వ-యఖు లుల్-లజీన-కఫరూ-లౌలా-ఉన్-జిల-అలైహి-ఆయతుమ్-మిర్-రబ్బిహీ--ఇన్న మా-అన్త-మున్-జిరున్-వ-లి-కుల్లి-ఖౌమిన్-హాద్.

5. మఱి ఓ ముహమ్మదు! నీవు ఆశ్చర్యపడినచో "మేము మట్టియై పోయిన పిదప తిరిగి క్రొత్తసృష్టి మాకుఁ గలుగునా" అని వారు పలుకు మాట

చాల యాశ్చర్యకరమైనది. వీరే తమ ప్రభువును తిరస్కరించినవారు. వీరి మెడలలో పట్టీలు వేయఁబడును. మఱి వీరే నరకనివాసులు అందు వీరు సదాయుందురు. 6. మఱి వారు మేలునకు ముందే కీడు తొందరగా తెమ్మని నిన్ను అడుగుచున్నారు. మఱి వారికి ముందు అనేక యుదాహరణములు గడచియున్నవి. మఱి ప్రజలు అన్యాయము చేయుచున్నను నీప్రభువు వారిని క్షమించువాఁడు. మఱి నీప్రభువుయొక్క శిక్షకూడ చాల కఠినమైనది. 7. మఱియు అవిశ్వాసులైనవారు ఆతనియొద్దకు ఆతని ప్రభువునుండి ఎందులకు నొక సూచన రాలేదుఅని పలుకుచున్నారు. భయబోధ నిచ్చుట మాత్రమే నీపని. మఱి ప్రతి జాతికిని సన్మార్గము చూపువాఁ డొకఁడు వచ్చియున్నాఁడు.

వ్యా॥ 5. దేవుని శక్తి సూచనలు చూచియు దేవునిని పరలోకమును అవిశ్వాసులు తిరస్కరించుచున్నారే అని నీవు ఓ మహమ్మదు! ఆశ్చర్యపడుచున్నావా ? చచ్చిమట్టియైన పిదప తిరిగి క్రొత్తగా సజీవులగుదుమా అని అవిశ్వాసులు పలుకునది చాల యాశ్చర్యకరమైనది. సర్వశక్తుఁడగు దేవుఁడు లేనిదానిని సృష్టించెను. ఇఁక పుట్టి గిట్టినదానిని తిరిగిసజీవిగాచేయలేఁడుఅని చెప్పుట సరికాదు గదా! పుట్టి చచ్చినదానిని తిరిగి లేపుట దేవునికి చాల సులభమైన పనిగదా ! చచ్చిన వారిని తిరిగి లేపఁడు అని పలికి దేవుని శక్తిని తిరస్కరించినవారి మెడలలో పట్టీలును కాళ్ళు చేతులలో బేడీలును వేసి నరకములో పడవేయుదురు, అందే వారు సదా శిక్షను అనుభవించుచుందురు. 6. అవిశ్వాసులు సత్యమును స్వీకరించి యుభయలోకములలో మేలుపొందక తిరస్కరించి శిక్షను తెమ్మని ప్రవక్తను తొందరపెట్టుచున్నారు. ఇట్టి వారు తమకుముందు గడచిన అవిశ్వాసుల వృత్తాంతమును తెలిసికొనవలెను. వారెట్లు తమ పాపములకుఁగాను శిక్షపొంది నశించిరో తెలిసికొని బుద్ధితెచ్చుకొనవలెను. పూర్వము గడచిన యుదాహరణములు పెక్కుగలవు. దేవుఁడు క్షమించి కరుణించువాఁడు. కావున పాపములకుఁగాను తత్క్షణమే శిక్షింపఁడు. ఆతఁడు శీఘ్రముగా శిక్షింపనందున దుష్టులు మోసపోఁగూడదు. అన్యాయములు పాపములు చెలరేఁగినపుడు తప్పక దేవునియొక్క కఠినశిక్ష దుష్టులకుఁ గలుగును. అపుడు శిక్షనుండి తప్పించుకొనుటకు వీలుండదు. 7. హజ్రత్ మహమ్మదువారితో అవిశ్వాసులు తాము కోరినట్లు ఒక సూచన నీవు చూపుము అని కోరుచుండిరి. వారు కోరిన సూచన రానపుడు ఎందులకు మేము కోరిన సూచన ప్రవక్తయొక్క ప్రభువు పంపఁడు, పంపినచో విధిలేక మేము విశ్వాసులముఅగుదుము గదా ! అని పలుకుచురు. దానికి దేవుఁడు ప్రవక్తతో ఓ మహమ్మదు ! మతప్రచారముచేసి భయబోధ నిచ్చుట నీపని. సూచనలు తెచ్చి చూపుట నీపని కాదు. అది మాపని. నీకు పూర్వముకూడ ప్రతిజాతికిఁగాను ప్రతి దేశములో

భయబోధనిచ్చి సన్మార్గముచూపువారు వచ్చియున్నారు. వారుమాయిష్టప్రకారముగా సూచన (మోజిజా) లు తెచ్చి చూపుదుము అని పలికియుండలేదు. వారు తమ తమ జాతివారికి బోధించిరి. మఱి నీవు సర్వలోకమునకుఁగాను ప్రవక్తగావచ్చియున్నాఁడవు. మతప్రచారము చేయుటయేనీపనిఅనిపలుకుచున్నాఁడు.

8. అల్లాహు-యఅ్-లము-మాతహ్-మిలుకుల్లు-ఉన్-సా-వమా- తగీ- జుల్-అర్-హాము-వ-మా-తజ్‌దాదు-వ-కుల్లు-షైఇన్-ఇన్దహూ-బి మిఖ్-దార్. 9. ఆలిముల్-గైబి-వష్-షహా-దతిల్-కబీ-రుల్-ముత-ఆల్. 10. సవా ఉమ్-మిన్-కుమ్-మన్-అసర్రల్-ఖౌల-వ-మన్-జహర-బిహీ-వ-మన్-హువ-ముస్-తఖ్-ఫిమ్- బిల్-లైలి-వసారి- బుమ్-బిన్-నహార్. 11. లహూ-ము-అఖ్-ఖి-బాతున్ - మిమ్-బైని-యదైహి-వ-మిన్-ఖల్-ఫిహీ-యహ్.ఫ-జూనహూ-మిన్-అమ్-రిల్లాహి- ఇన్నల్లా-హ-లా-యుగయ్యిరు-మా-బి-ఖౌమిన్-హత్తా యుగయ్యి-రూ-మా-బి- అన్-ఫు-సి హిమ్-వఇజా-అరా-దల్లాహు-బి-ఖౌమిన్-సూఅన్ ఫలా-మరద్ద-లహూ- వమా-లహుమ్-మిన్-దూనిహీ-మిన్-వాల్.

8. ప్రతి స్త్రీగర్భములోఁ దాల్చునదియును గర్భములు తగ్గుటయు పెరుగుటయు దేవునికిఁ దెలియును. మఱి ప్రతివస్తువుయొక్క నియమము ఆతని యొద్దనున్నది. 9. ఆతఁడు రహస్యములను బహిరంగములను ఎఱింగిన వాఁడు. గొప్పవాఁడును సర్వాధికుఁడును. 10. మీలో నెవఁడు రహస్యముగా మాటలాడునో వాఁడును, ఎవఁడు గట్టిగా మాటలాఁడునో వాఁడును మఱెవఁడు రాత్రిపూఁట దాఁగికొనునో వాఁడును పగటిపూఁట వీధులలో తిరుగునో వారందఱును ఆతనికి సమానమే. 11. దేవుని సెలవు పొంది మనుష్యునిని కనిపెట్టు దేవదూతలు మనుష్యునకు ముందును వెనుకను కావలిగా నుందురు. నిశ్చయముగా ఒక జాతివారు తమ యాత్మలను మార్చుకొననంత వఱకు దేవుఁడు వారి స్థితిని మార్చువాఁడు కాఁడు. మఱి దేవుఁడు ఒక సంఘమువారికి కీడుచేయఁ దలచినచో అది తిరుగదు. మఱి ఆతఁడు తప్ప నితరులెవ్వరును వారికి సహాయులులేరు.

వ్యా! 8. ఈ వాక్యములలో దేవునికి సర్వము తెలియును. ఏద్దియును ఆతనికి మఱుఁగు లేదు అని చెప్పఁబడుచున్నది. స్త్రీల గర్భములో నేమున్నదో మగపిల్ల, లేద ఆఁడుపిల్ల, లేదా సంపూర్ణముగా నున్నదో లేక అరగొరగా నున్నదో మంచిదో చెడ్డదో సర్వము దేవునికిఁ దెలియును. గర్భములోనిరహస్యములు హెచ్చుట తగ్గుట మొదలగు విషయములన్నియు దేవునికి నెఱుక. ప్రతివస్తువు

రెయొక్క-నియమము దేవునికిఁదెలియును. దానిదానికిఁదగినట్లు ఏర్పాట్లుచేయును. 9. లోకములోని రహస్యములు అగోచరములు బహిరంగములు సర్వము దేవునికి తెలియును. సర్వము ఆతనికి అధీనమైయున్నది. మహామహిమగలవాఁడు, సర్వాధికుఁడు ఆతనికి మించినది యెద్దియును లేదు. 10. దేవుఁడు సర్వజ్ఞుఁడు కావున మానవులు ఏయే స్థితులలో నున్నను సర్వము ఆతనికిఁ దెలియును. రహస్యముగా మాటలాడినను గట్టిగా మాటలాడినను దేవుని యొద్ద సమానము. దానిని దేవుఁడెఱుంగును. అటులే రాత్రిపూఁట చీఁకటిలో దాఁగుకొని చేసిన పనులును పగటిపూఁట బహిరంగముగా వీధులలోఁ జేసిన పనులును దేవునికిఁ దెలియును. అంతయు దేవునికి సమానమే. 11. ప్రతి మనుష్యుని వెంట దేవదూత లున్నారు. వారు మానవులు చేయు పనులను వ్రాయుదురు. దేవునిసెలవు ననుసరించి వారికి కావలిగా నుందురు. ఆపదలనుండి కాపాడుచుందురు. ఏజాతి సంఘమైనను తన యాత్మలందుండు స్వభావ గుణములను మార్చుకొననంతవఱకు దేవుఁడు వారి స్థితిని మార్చఁడు. ఎప్పుఁడు వారు న్యాయము వీడి దుర్మార్గమునకు పాలగుదురో దేవుఁడు వారికిచ్చియున్న మంచిస్థితిని సంపదలను రాజ్యమును దీసికొని వారిని అధమ స్థితిలో పడవేయును. దేవుఁడే వారినిరక్షించి తోడు పడవలెను. ఆతఁడు తప్ప నితరులెవ్వరును రానున్న ఆపదను తప్పింపఁ జాలరు. కావునమానవులు దేవునియందు విశ్వాసముంచి ధర్మమార్గమునందు నడువవలెను.

12. హువల్లజీ-యురీ-కుముల్-బర్‌ఖ-ఖౌఫన్-వతమ్-అన్-వయున్-షి-ఉస్ సహా-బస్-సిఖాల్. 13. వ యు-సబ్బిహుర్-రఅదు-బి-హమ్‌దిహీ-వల్-మలా-ఇకతు-మిన్-ఖీ-ఫతిహీ-వ-యుర్-సిలుస్-సవాఇఖ-ఫ-యుసీబు-బిహా మన్ - యషాఉ-వహుమ్-యుజాదిలూన-ఫిల్లాహి-వహువ-షదీదుల్-మిహాల్. 14. లహూదఅ-వతుల్-హఖ్-ఖివల్లజీన-యద్ఊన-మిన్-దూనిహీ-లా-యస్-తజీ-బూన-లహుమ్-బి-షైఇన్-ఇల్లా-క-బాసితి-కఫ్-ఫైహి-ఇలల్-మాఇ-లియబ్-లుగ-ఫాహు-వ-మాహువ-బి-బాలి-గిహీ-వమా-దుఅ-ఉల్-కాఫిరీన-ఇల్లా-ఫీ-జలాల్. 15. వలిల్లాహి-యస్-జుదు-మన్-ఫిస్-సమా-వాతి-వల్-అర్‌జి-తౌఅన్-వ-కర్ హన్-వ-జిలా-లుహుమ్-బిల్-గు-దువ్వి-వల్-ఆసాల్.

12. ఆతఁడే మీకు మెఱుపును చూపించుచున్నాఁడు. దానివలన మీకు భయమును ఆశయును గలుగుచున్నది. మఱి బరువైన మేఘములను లేపుచున్నాఁడు. 13. ఉరుము ఆతనిని స్తోత్రించుచున్నది. మఱియు దేవదూతలు

కూడ ఆతని భయముచే ఆతని పవిత్రతను కొనియాడుచున్నారు. మఱియు ఆ తఁడు పిడుగులను పంపి తాను కోరిన వారిపైఁ బడవేయు చున్నాఁడు. మఱి అవి శ్వాసులు దేవుని విషయము వాదించుచున్నారు. మఱి ఆతఁడు కఠినముగ పట్టు ను. 14. సత్యమైన పిలుపు ఆతనికే గలదు. మఱి ఆతనినివదలి వారెవరిని పిలు చుచున్నారో వారు వారికి పనికిరారు. ఒకఁడు నీళ్ళు తన నోటిలోనికి రావలె నని దాని వైపు తన రెండు చేతులు చాచి దానిని పిలిచినచో అవి వాని నోటి లోనికి రానట్లు వారి పిలుపున్నది. మఱి అవిశ్వాసుల ప్రార్థన (పిలుపు) వృథా యగునది. 15. మఱియు ఆకాశములోను భూమిలోనున్న వారందఱును సంతో షము తోను బలవంతముతోను దేవునికి సాష్టాంగ పడుచున్నారు. మఱి వారి నీడ లు ఉదయము సాయంత్రము సాష్టాంగ పడుచున్నవి.

వ్యా॥ 12. మునుపటి వాక్యములో దేవుఁడు ప్రజలను కాపాడు చున్నాఁ డు అను విషయము చెప్పఁబడినది. ఇందు పాపముల వలన ప్రజలకు వచ్చు ఆ పదలను గూర్చి చెప్పఁబడుచున్నది. మెఱపులు కారుమేఘములు వచ్చునప్పుడు ప్రజలకు భయమును ఆశయును గలుగును. మెఱపులను మేఘములను చూచి వానవచ్చును అని సంతోషింతురు. మెఱపు హెచ్చి పిడుగుపడిచచ్చెదమేమో అనియు గొప్ప వర్షము వలన నీటి వరదలు వచ్చునేమో అని జనులకు భయ ము గలుగును. కావున భక్తులు దేవుని దయ తమకు గలుగునని యాశ గలిగి మితిమీఱినచో తమకు శిక్ష గలుగును అని భీతియు గలిగి యుండవలెను. 13. గర్జించు మేఘములును దేవదూతలును దేవునిని స్తుతింతురు. ప్రతి వస్తువును దే వుని పవిత్రత కొనియాడుచున్నది. కాని మానవులు దానిని గ్రహింపఁ జాలరు. దేవదూతలందఱును దేవునికి భయపడి సదా దేవునిని స్తుతించుచుందురు. దేవుఁ డు పిడుగులను పంపి తాను కోరిన వారిపై వైచి చంపును. వారు దానినుండి త ప్పించుకొనఁ జాలరు. ఉరుములు మెఱపులు పిడుగులు, దేవుని శక్తిని సూచిం చుచున్నవి. అట్టి దేవుని విషయము అవిశ్వాసులు, హజ్రత్ రసూలు వారితో వాదించుచున్నారు. అవిశ్వాసులు జాగ్రత్తగ నుండవలెను. వారిపై దేవునాజ్ఞచే పిడుగు పడు నేమోఅని వారు భయపడవలెను. దేవుని శిక్ష చాల కఠినమైనది. దానినుండి తప్పించుకొనుటకు వీలులేదు. ఉఱుములు గలుగునప్పుడు "సుబ్ హాన మన్-యుసబ్బిహుర్ రఅదు-బిహమ్ దిహీ-వల్-మలాఇకతు-మిన్-ఖీఫతిహీ- అల్లా హుమ్మ-లాతఖ్ తుల్నా-బి-గజబిక-వలా తుహ్ లిక్నా-బి-అజాబిక-వ-ఆఫినా-ఖబ్ల- జాలిక్-అని చదువ వలెను. 14. దేవునినే పిలువ వలెను. ఆతనినే వేఁడి ప్రా ర్థింప వలెను. ఆతఁడు దానికిఁ దగిన వాఁడు. ఆతఁడు ప్రార్థనలను విని యంగీకరిం చును. మేలు కీడు చేయు అధికారము ఆతనికే గలదు. ఆతఁడు సర్వశక్తుఁడు

కావునఅతని నే పిలువవలెను. శక్తి లేని చిల్లర దేవతలను విగ్రహములను ప్రార్థించుట వలన ప్రయోజనము లేదు. ఒకఁడు తన దాహము తీర్చుకొనుటకు బావి యొద్దను నిలిచి తన చేతులు చాచి ఓనీళ్ళు! నీవు వచ్చి నానోటిలో పడుము అని బతిమాలినచొ అది వాని నోటిలోనికి రాఁజాలదు గదా! అది నిష్ప్రయోజనము గదా! అటులే దేవునిని వదలి యితర దేవతలను విగ్రహములను తమ సహాయము కొఱకు పిలుచుట నిష్ప్రయోజనము. విగ్రహములు చిల్లర దేవతలు ఏలాటి సహాయము చేయఁజాలవు. కావున వారి ప్రార్థనలు పిలుపులు వృథాపోవును. 15. విశ్వాసులు సంతోషముతో దేవునికి సాష్టాంగపడుదురు. అవిశ్వాసులుకూడ ఇష్టము లేకున్నను దేవునికి అధీనులై యున్నారు. నీడలుకూడ భూమిపైఁబడి తాము దేవునికి సాగిల పడుచున్నాము అనిసూచించును. ఉదయముసాయంకాలము నీడలు బాగుగా పడుచుండును. అందులకు ఉదయము సాయంకాలములో అని చెప్పఁబడియెను. సర్వము దేవునికి లోఁబడియున్నది. సర్వము అతని సెలవుచే జరుగుచున్నది. ఇచ్చట ఒక సిజ్దా చేయవలెను.

16. ఖుల్-మర్-రబ్బుస్-సమా-వాతి-వల్-అర్‌జి-ఖులిల్లాహు ఖుల్-అఫత్-తఖజ్-తుమ్-మిన్-దూనిహీ ఔ-లియా అ-లాయమ్-లికూన-లి-అన్-ఫుసిహిమ్-నఫ్అ-న్-వలా-జర్రన్-ఖుల్-హల్-యస్-తవిల్-అఅ్-మా-వల్-బసీరు అమ్-హల్-తస్-తవిజ్-జులు-మాతు-వన్‌నూరు-అమ్_జఅలూ-లిల్లాహి_షుర-కాఅ-ఖలఖూ-క-ఖల్ ఖిహీ-ఫ-తషా-బహల్-ఖల్ ఖు-అలైహిమ్-ఖులిల్లాహు-ఖాలిఖు-కుల్లి-షైఇన్-వహువల్-వాహిదుల్-ఖహ్హార్. 17. అన్-జల-మినస్-సమాఇ-మాఅన్-ఫసాలత్-ఔ-దియతుమ్-బి-ఖదరిహా-ఫహ్-తమ-లస్-సైలు-జబదర్-రాబియన్-వ-మిమ్మా-యూఖిదూన-అలైహి-ఫిన్-నారిబ్-తిగాఅ-హిల్-యతిన్-ఔ-మతా-ఇన్ జబ-దుమ్-మిస్-లుహూ కజాలిక-యజ్-రిబుల్లాహుల్-హఖ్-ఖ-వల్-బాతి-ల-ఫ-అమ్మజ్-జబదు-ఫ-యజ్-హబు_జుఫాఅన్ వ-అమ్మా-మాయన్-ఫఉన్-నాస-ఫ-యమ్-కుసు-ఫిల్-అర్‌జి-కజాలిక యజ్‌రి-బుల్లాహుల్-అమ్‌సాల్.

16. భూమ్యాకాశములకు ఎవఁడు ప్రభువు! అని ఓ ప్రవక్త! అడుగుము. దేవుఁడే అని నీవు పలుకుము. మఱేమి మీరు దేవునిని వదలి తమ యాత్మలకే మేలుగాని కీడుగాని జేసికొనఁజాలనట్టి వారిని సహాయులుగాఁ జేసికొన్నరా! అని చెప్పుము. గ్రుడ్డివాఁడును చూడఁగలవాఁడును సమానులు కాఁగలరా! లేదా అంధకారమును వెలుతురును సమానము కాఁగలవా అని పలుకుము. ఏమి

వారు దేవునికి సాటి కల్పించుకొన్నారా! దేవుడు సృష్టించినట్లు వారేదైన సృష్టించి యున్నారా! అందుకు సృష్టిలో వారికి సందేహముగ కనఁబడినదా! దేవుఁడే ప్రతివస్తువును సృష్టించువాఁడు. మఱియాతఁడు ఒక్కఁడు, సర్వశక్తుఁడు అని పలుకుము. 17. ఆతఁడు ఆకాశమునుండి నీళ్లు పంపఁగా కాలువలు తమతమ కొలత కొలఁది ప్రవహింపసాగెను. పిదప ఆనీటి ప్రవాహముపై ఫేనము (నురుగు) ఉప్పొంగి వచ్చెను. మఱియు నిటులే నగలును సామానులును చేయుటకుఁగాను అగ్గిలో కఱఁగించు దానిలోను నురుగు వచ్చును. ఇట్లు దేవుఁడు సత్యమును అసత్యమును పోల్చి వివరించుచున్నాఁడు. కావున నురుగు ఎండిపోవును. మఱి ప్రజలకు పనికి వచ్చునది భూమిలో నిలిచి పోవును. ఇట్లు దేవుఁడు ఉదాహరణములు వివరించుచున్నాఁడు.

వ్యా॥ 16. సర్వ శక్తుఁడగు ప్రభువు ఆకాశములకు భూమికిని ఒక్కఁడే. ఈ విషయము తెలిసియు, దేవునిని వదలి తమకు తామే మేలుచేసికొను శక్తి లేని చిల్లర దేవతలకు సహాయులుగ మీరేల చేసికొను చున్నారు. ఇది సరికాదు. దానివలన ప్రయోజనము లేదు, దేవునిని విశ్వసించువారు కన్నులు గలవారిని పోలినవారు. దేవునికి సాటికల్పించు అవిశ్వాసులు అంధులవంటివారు. చూచువారును అంధులును సమానులు కానేరరు. అటులే దేవుని యేకత్వము (తౌహీదు) వెలుతురు వంటిది. దేవునికి సాటి కల్పించుట అంధకారము వంటిది. వెలుతురును చీఁకటియును సరికావు. కావున విశ్వాసులు తమ విశ్వాసమనెడి వెలుతురులో సన్మార్గమునందు పోయి యుభయ లోకములలోను మేలుపొందుదురు. విగ్రహారాధన అనెడి చీఁకటిలో పడి అంధులవలె దేవులాడు అవిశ్వాసులు ముక్తి మార్గము పొందఁగలరా! ఎన్నటికిని పొందఁజాలరు. ఓ అవిశ్వాసులార! ఏమి మీ దేవతలును విగ్రహములును దేవుఁడు సృష్టించినట్లు ఏదైన వస్తువును సృష్టించినవా! అదిచూచి అవి దేవుళ్ళు అని మీకు సందేహము గలిగినదా! అట్లేదైన యుండిన చూపుఁడు. పాపము! శక్తిలేనియావిగ్రహములు ఏమి సృష్టింపఁగలవు. అవికూడ దేవునిచే సృష్టింపఁబడినవియే. సర్వమునకు దేవుఁడే సృష్టికర్త. ఆతఁడు అద్వితీయుఁడు(ఒక్కఁడు)సర్వశక్తుఁడు. ఆతనికి మించినది ఎద్దియును లేదు. సర్వము అతనికే అధీనమై యున్నది అని పలుకవలెనని హజ్రత్ రసూలువారికి దేవుని సెలవు. 17. ఆకాశమునుండి దేవుని సెలవుచే వాన కురియుచున్నది. దానివలన నీటికాలువలు తమతమ విశాలము కొలఁది ప్రవహించుచున్నవి. నీటి ప్రవాహము వలన కసువుమట్టి కలిసి నురుగు పొంగి పైకి వచ్చుచున్నది. అటులే నగలు సామానులు పనిముట్లు చేయుటకై వెండిబంగారు ఇనుము అగ్గిలో కఱఁగించునపుడు నురుగువలె మట్టిపొంగి పైకివచ్చును. కాని కొంత సేపటిలోనే నురుగు ఎండిపోయి మనుష్యులకు కావలసిన నీళ్లు కఱఁగిన లోహము

నిలిచి పోవును. దానివలన వారు పలు విధములుగ లాభములు పొందుదురు. ఇటులే సత్యము అసత్యము యొక్క యుదాహరణము నూహింపవలెను. దేవునినుండి సందేశము వర్షము వలె వచ్చి మానవుల హృదయములపై పడుచున్నది. మానవులు తమ హృదయముల శక్తి కొలఁది దీనిని గ్రహించుచున్నారు. దేవుని సందేశమును (వహీని) గ్రహించిన వారితో అసత్యమునకు లోనైనట్టి వారు కలహింతురు. ముందు చూచుటకు నురుగువలె అవిశ్వాసుల బలము కనఁబడును. తుదకు సత్యమే నిలిచి అసత్యము నురుగువలె మఱుగై పోవును. ఇటులే విశ్వాసుల అవిశ్వాసుల పోరాటము నూహించునది. ముందు అవిశ్వాసులు నురుగువలె చాలమందిగా కనఁబడుదురు. తుదకు అవిశ్వాసులే ఓడిపోయి విశ్వాసులు నిలుతురు. కావున అసత్యము పైకి చూచుటకు గంభీరముగా నున్నను తుదకు నశించునదే. ఇట్లు దేవుఁడు మనుష్యులు గ్రహించుటకై యుదాహరణముల వివరించి తెలుపుచున్నాఁడు. రాఁబోవు వాక్యములో సత్యము అసత్యము యొక్క ఫలితము చెప్పఁబడుచున్నది.

18. లిల్-లజీనస్-తజాబూ-లి-రబ్బి-హిముల్-హుస్నా-వల్లజీన-లమ్-యస్తజీబూ-లహూ-లౌ-అన్న-లహుమ్ మాఫిల్-అర్జి-జమీ-అన్-వ-మిస్-లహూ మఅహూ-లఫ్-తదౌ బిహీ ఉలా ఇక లహుమ్-సూఉల్-హిసాబి-వ-మా-వా-హుమ్-జహన్నము-వ-బీసల్-మిహాద్.

18, ఎవరు తమ ప్రభువునాజ్ఞను సమ్మతించిరో వారికి మేలున్నది. మఱి యెవరు ఆతని యాజ్ఞను సమ్మతింపరో వారికి భూమిలోని సమస్తమును దానితోఁబాటు దానియంతటిది వారికుండి దానిని తమకు బదులుగ నిచ్చివేయుదురు. వారికికఠినమైన లెక్కయున్నది. మఱి వారి నివాసము నరకము. మఱి యది చాల చెడ్డ నివాసము.

వ్యా॥ 18. దేవుని విశ్వసించి యాతని యాజ్ఞలను సమ్మతించి సత్కార్యములు చేసినవారికి ఉభయ లోకములలోను మేలున్నది. ఇహమునందు మనస్సునకు శాంతియు జయమును పరమునందు స్వర్గసౌఖ్యములును మోక్షమును పొందుదురు. ఎవరు విశ్వసింపక దేవుని యాజ్ఞలను తిరస్కరించి పాపకార్యములు చేయుదురో వారికి ఇహమునందు ఎట్లు జరిగినను పరమునందు వారు చాల కష్టములు పొందుదురు. అపుడు వారికిఁ గలుగు నరకశిక్షలనుండి తప్పించుకొనుటకై భూమిలోనుండు సమస్తమును దానితోఁబాటు అంతటి ధనమును వారి కుండిన దానిని బదులుగ నిచ్చుటకు కోరుదురు. కాని అట్లు కానేరదు. అవిశ్వాసుల ప్రతి కర్మ యొక్క లెక్క కఠినముగా తీసికొనఁబడును. వారి కర్మల ఫలితముగ

వారికి నరకము లభించును. అందు వారు సదా కష్టములకు పాలగుదురు.

19. అఫ-మన్-యఅ-లము-అన్న- మాఉన్-జిల-ఇలైక-మిర్- రబ్బికల్
హఖ్ఖు-కమన్-హువ-అఅమా-ఇన్నమా-యత-జక్కరు-ఉలుల్-అల్- బాబ్.
20. అల్ల-జీన-యూఫూన-బి- అహ్-దిల్లాహి-వలా- యన్-ఖుజూ - నల్ - మీ
సాఖ. 21. వల్ల-జీన-యసి- లూన-మా-అమ-రల్లాహు-బిహీ-అన్- యూ సల-వ-
యఖ్-షౌన-రబ్బ-హుమ్-వ-యఖా-ఫూన-సూఅల్-హిసాబ్. 22.వల్ల-జీన-సబ
రుబ్-తిగాఅ-వజ్-హి-రబ్బిహిమ్-వ-అఖా-మున్-సలాత-వ-అన్-ఫఖూ- మిమ్మా
రజఖ్నా-హుమ్-సిర్రన్-వ-అలా-నియతన్-వ-యద్-రఊన-బిల్- హసన - తిస్-
సయ్యి-అత-ఉలా-ఇక-లహుమ్-ఉఖ్‌బద్-దార్. 23. జన్నాతు - అద్ - నిన్.
యద్-ఖులూ-నహా-వ-మన్-సలహ- మిన్-ఆబా-ఇహిమ్-వ-అజ్-వాజి-హిమ్-వ-
జుర్రి-యాతి-హిమ్ వల్-మలా-ఇకతు-యద్-ఖులూన-మిన్ - కుల్లి-బాబ్. 24.
సలామున్-అలైకుమ్-బిమా-సబర్-తుమ్-ఫనిఅమ-ఉఖ్-బద్-దార్.

19. నీప్రభువునుండి నీకు పంపఁబడినది సత్యము అని యెఱుఁగువాఁడు,
గ్రుడ్డివానితో సమానుఁడగునా ! బుద్ధిమంతులే బోధన గ్రహించువారు. 20.
ఎవరు, దేవుని వాగ్దానమును పూర్తిచేయుచు ఒడంబడికను తెంపరో, 21. మఱి
వరు దేవుఁడు కలుపుఁడు అని యాజ్ఞాపించినదానిని కలుపుచు, తమ ప్రభువునకు
భయపడుచు కఠినముగా లెక్క అగునేమో అని భయపడుచున్నారో, 22. మ
ఱెవరు తమ ప్రభువు ప్రీతికొఱకు సహనము వహించి, నమాజునుసలిపి, మేము
వారి కొసంగినదానిలో రహస్యముగను, బహిరంగముగను ఖర్చుచేసి కీడునకు
బదులుగ మేలుచేయుచున్నారో వారికిఁగాను పరలోక గృహమున్నది. 23.
వారి కుండుటకు స్వర్గవనము లున్నవి. అందు వారును సత్కార్యములు చేసిన
వారి తాత ముత్తాతలును, వారి భార్యలును, వారి బిడ్డలును ప్రవేశింతురు. మఱి
యు దేవదూతలు ప్రతి ద్వారమునుండి వారియొద్దకు వత్తురు, 24. మీరుసహిం
చినదానికిఁగాను మీకు శాంతి కలుగుగాక ! మఱి మంచి పరలోక గృహము
లభించినది అని పలుకుదురు.

వ్యా॥ 19. మునుపటి వాక్యములలో విశ్వాసులకును అవిశ్వాసులకును లభించు ఫలితమునుగూర్చి చెప్పఁబడెను. ఇందు అట్టి వేర్వేఱు ఫలితములు గుటసరియైనది అని తెలుపఁబడుచున్నది. అవిశ్వాస మనెడి గ్రుడ్డితనము గలగ్రుడ్డి

వాఁడు అవిశ్వాంసాధకారములోపడి దేవులాడును. విశ్వాసమనెడి వెలుతురును నమ్మికయునుగల విశ్వాసుఁడు తెలివిగలిగి ధర్మమార్గమునందు పోవును. కావున కన్నులు గలవాఁడును, గ్రుడ్డివాఁడును సమానులు కానేరరు. బుద్ధిమంతులే ధర్మ బోధ ననుగ్రహించి దాని ననుసరింతురు. 20. మానవులు పుట్టక పూర్వము తాము దేవుని సన్నిధానమున ఆత్మలోకము (ఆలమె అర్వాహ)లో నీవు దేవుఁడవు అని యొప్పుకొని వాగ్దానము చేసియున్నారు. దాని ననుసరించి విశ్వాసులు ఇహమునందు కూడ దేవుఁడే మాప్రభువు అని నమ్ముచు తాము ప్రవక్తలతోను మానవులతోను గావించిన యొడంబడికలను తెంపక పూర్తిచేయుదురు. ఆడిన మాట ధర్మవిరుద్ధము కానిచో తప్పరు 21. దేవుని యాజ్ఞను అనుసరించి బంధువుల హక్కులను నెరవేర్చుచు మానవులతో నుపకారముచేయుచు, ముసల్మానులు తను మత సోదరత్వమును స్థిరముగా నుంచుదురు. ఐక్యము వహింతురు. దేవుని శక్తిని ధ్యానించి భయభక్తులు వహింతురు. తీర్పుదినమునందు తమ కర్మల లెక్క ఎట్లు జరుగునో అని కూడ ముసల్మానులు భయపడుదురు. 22. విశ్వాసులు దేవుని ప్రీతికొఱకు ఇస్లామ్ మార్గమందు తమకు ఇహమునందు గలిగిన కష్టములకు ఓర్చుకొనిరి. కష్టములకు బెదరి ప్రార్థనలు వదలక స్థిరముగా అయిదు పూఁటలు నమాజు సలుపుచు రహస్యముగను వెల్లడిగను దానములు చేయుచు ఎవఁడైన కీడుచేసినచో దానికి బదులు కీడుచేయక మేలు చేయుదురు. వీరు పాపముచేసినచో తక్షణమే క్షమాపణ వేఁడుకొందురు. పాపములువదలి పుణ్యములు చేయుదురు 23. ఇట్టి సుగుణములుగల విశ్వాసులు పరలోకమునందునిత్యమైన స్వర్గనివాసము పొందుదురు. విశ్వాసులతోఁబాటు పుణ్యములుచేసియుండినవారి తల్లిదండ్రులును తాతముత్తాతలును వారి భార్యబిడ్డలును, స్వర్గమునందు ప్రవేశించి ఒకేచోట నుందురు. ఇదియును దేవుని యనుగ్రహము. విశ్వాసులైన బంధువులందఱును ఒకేచోట స్వర్గసౌఖ్యములు అనుభవింతురు. 24. స్వర్గము (జన్నతు)నకు ఎనిమిది ద్వారములు గలవు. ప్రతిద్వారములోను భక్తుల గౌరవార్థమై దేవుని సెలవుచే దేవదూతలువచ్చి మీకుసలామ్ (శాంతికలుగుగాక)అనిభక్తులతో పలుకుదురు. అందు భక్తులు ఇహమునందు దేవుని ప్రీతికై కష్టములుసహించి స్థిరవిశ్వాసము గలిగియుండినందున ఈ స్వర్గనివాసము మీకు లభించెను అని దేవదూతలు భక్తులకు సువార్త వినిపింతురు. కావున ముసల్మానులు పై వాక్యములలోని సుగుణములు వహించి దేవునిప్రీతి పడయుదురుగాక !

25. వల్లజీన యన్-ఖుజూన-అహ్ - దల్లాహి-మింబఅది-మీసాఖిహీ వ-యఖ్ తఊన-మాఅమ-రల్లాహు-బిహీ-అన్-యూసల-వ-యుఫ్-సిదూన - ఫిల్-అర్జి-ఉలా-ఇక-లహుము-ల్-లఅ-నతు-వల-హుమ్-సూ-ఉద్ దార్.

25. మఱెవరు దేవుని వాగ్దానమును స్థిరపఱచిన పిదప దానిని తెంపుచు దేవుఁడు కలుపుఁడు అని యాజ్ఞాపించినదానిని తెంపుచు, భూమిలో నుపద్రవములు కల్గించుచున్నారో అట్టివారికిఁగాను శాప మున్నది. మఱి వారికి చెడ్డనివాసము గలదు.

వ్యా॥ 25. మునుపటి వాక్యములో విశ్వాసులైన పుణ్యాత్ములకులభించు మంచి ఫలితము చెప్పఁబడియెను. ఇందు దుష్టులైన అవిశ్వాసులకుఁ గలుగుదుర్గతినిగూర్చి చెప్పఁబడుచున్నది. దుష్టులు తాము చేసిన యొడంబడికలను లెక్కపెట్టక దానిని తెంపుచు దేవుఁడు కలుపుఁడు అని యాజ్ఞాపించిన బంధుత్వము మొదలగు విషయములను తెంపుచు దేశములో శాంతికిభంగముగలిగించుచు నుందురు. ఇట్టి దుర్మార్గులు దేవుని దయనుండి దూరము చేయఁబడి దేవునికోపమగుశాపమునకుపాత్రులగుదురు. చాలచెడునివాసమగునరకమువారు పొందుదురు.

26. అల్లాహు-యబ్-సుతుర్-రిజ్ ఖ-లిమన్ యషాఉ-వ-యఖ్ దిరు వ-ఫరిహూ-బిల్-హాయా-తిద్-దున్యా-వ-మల్-హాయా-తుద్-దున్యా-ఫిల్-ఆఖిరతి-ఇల్లా-మతాఉన్.

26. దేవుఁడు తాను కోరినవారికి సంపదలు ఎక్కువగాను, తక్కువగాను ఒసంగుచున్నాఁడు. అవిశ్వాసులు, ఇహలోకజీవనమునకు సంతోషపడియున్నారు పరలోక జీవనమునకు ముందర ఇహలోక జీవనముతుచ్ఛమైన సౌఖ్యమాత్రమే.

వ్యా॥ 26. ఇహలోకములో కొందఱికి చాల సంపదలు, ఆహారసౌఖ్యములు లభించును. మఱికొందఱికి సంపదలు లేక చాల ఇబ్బంది గలుగును. సంపద సౌఖ్యములుగలవారు దేవునికి ప్రియులు అనియు సంపదలులేని పేదలు దేవునికి ప్రియులుకారు అని తలంపఁగూడదు. అది దేవుని యిష్టము. భక్తులను పరీక్షించుటకు వారికి అనేక కష్టములు గలిగించును. దుర్మార్గులు సంపదలలో తులదూగుచు నుందురు. కావునభక్తులకు మంచి ఫలితమును దుష్టులకు శిక్షయును లభించుటకుఁగాను పరలోకముగలదు. అందు భక్తులగు విశ్వాసులు సదా తమ కర్మలఫలితమగు స్వర్గసౌఖ్యములు అనుభవింతురు. పరలోకమునకు ముందర ఇహలోకములోని సంపదలు తుచ్ఛములు. దానికి సరిపోలవు. శీఘ్రముగ నశించునవి. సముద్రములో వ్రేలుముంచి తీసినచో యెంత నీళ్ళు దానికి తగిలివచ్చునో అంత విలువ ఇహలోకమునకుఁ గలదు. పరలోకము సముద్రములోని నీళ్ళవంటి గొప్పది. అవిశ్వాసులే ఇహలోక సంపదలకు మోసపోయిసంతసింతురు. భక్తులు పరము నుద్దేశించి యిహమునందు మంచి కార్యములు చేయుదురు.

17. వ-యఖూలుల్-లజీన-కఫరూ-లౌలా-ఉన్ జిల-అలైహి- ఆయతుమ్-

మిర్-రబ్బిహీ-ఖుల్-ఇన్నల్లాహ-యుజిల్లు-మన్-యషాఉ-వ-యహ్దీ-ఇలైహి-మన్-అనాబ్. 28. అల్లజీన-ఆమనూ-వ.తత్-మఇన్ను-ఖులూ-బుహుమ్-బి-జిక్రిల్లాహి-అలా-బిజిక్రిల్లాహి-తత్-మ-ఇన్నుల్-ఖులూబ్.29. అల్లజీన- ఆమనూ వ-అమిలుస్-సాలిహాతి-తూబా-లహుమ్-వ-హుస్ను-మఆబ్.

27. మఱియు అవిశ్వాసులు, ఎందులకు ఆతని యొద్దకు ఆతని ప్రభువు నుండి సూచన రాలేదు అని పలుకుచున్నారు. దేవుఁడు తాను కోరినవారిని మార్గమునుండి తప్పించుచున్నాఁడు. మఱి ఆతనివైపునకు వచ్చినవారికి తన మార్గము చూపుచున్నాఁడు అని పలుకుము 28. వారు విశ్వసించినవారు. మఱి వారి హృదయములు దేవుని ధ్యానించుటవలన శాంతిపడుచున్నవి. వినుము! దేవుని ధ్యానించుటవలన హృదయములు శాంతిపొందుచున్నవి. 29. ఎవరు విశ్వసించి సత్కార్యములు చేసిరో వారికి ఆనందమును, మంచి నివాస మున్నది.

వ్యా॥ 27. అవిశ్వాసులు అనేక సూచనలు (మోజిజే) చూచియు తాము కోరినట్లు మక్కాలోనుండు కొండలు తొలఁగిపోయి సేద్యమునకుఁగాను భూమి యేర్పడవలెను. చచ్చిన తాతముత్తాతలు బ్రతికి తమతో మాటలాడవలెను అని ప్రవక్తను కోరిరి. వారు కోరినట్లు సూచన దేవుఁడుపంపలేదు. ఎందుకన అవిశ్వాసులు కోరినట్లుసూచనవచ్చి పిదప వారువిశ్వసింపనిచో వారు దేవుని శిక్షకు పాత్రులైనశింతురు. కావున దేవుఁడుకనికరించి శక్తిగలిగియు వారుకోరినట్లు సూచనపంపలేదు. కావునమానవులుతామేసన్మార్గముకోరక ద్వేషముతో దుర్మార్గమునకేపోవునపుదేవుఁడుకూడవారిని దుర్మార్గములోనే వదలిపెట్టును. మఱెవరు దేవునివైపునకువచ్చి విశ్వసింతురోవారికితన ప్రీతిమార్గముచూపును. 28. విశ్వసించినవారికి దేవునిధ్యానముచేవారి మనస్సులకు శాంతిలభించును. దేవుని ధ్యానించుటయే మనశ్శాంతికి ముఖ్యసాధనము. ఖురానె షరీఫును పఠించుటయువినుటయు దేవుని ధ్యానించుటయే. దానివలన విశ్వాసుల మనస్సులకు శాంతి లభించును. వారి సందేహములు తొలఁగిపోవును. రాజ్యము, అధికారము, సంతానము, ధన సంపదలవలన మనస్సునకు శాంతి లభింపదు. ఒక్క దేవుని స్మరించుటవలననే శాంతి లభించును. 29. విశ్వసించి సత్కార్యములు చేసినవారికి స్వర్గములో ఆనందమును మంచి నివాసమును లభించును. తూబా అనుపేరుగల ఒక వృక్షము స్వర్గములో గలదు. దాని నీడలో స్వర్గనివాసులు ఆనందమును సంతోషమును పొందుదురు.

30. కజాలిక-అర్-సల్నాక-ఫీ-ఉమ్మతిన్-ఖద్-ఖలత్-మిన్-ఖబ్-లిహా-ఉమ-ముల్-లి-తత్-లువ-అలైహి-ముల్-లజీ-ఔ-హైనా-ఇలైక-వ-హుమ్-

యక్-ఫురూన-బిర్-రహ్మాని-ఖుల్-హువ-రబ్బీ-లా-ఇలాహ-ఇల్లా-హువ-అలై హి-తవక్కల్తు-వ-ఇలైహి-మతాబ్.

30. ఇటులే, మేము నీకు పంపిన సందేశమును జనులకు వినిపించుటకుఁ గాను, నిన్ను వారిలో పంపితిమి. వీరికి ముందు అనేక జాతులవారు గడచి యున్నారు. మఱి వీరు రహ్మానును తిరస్కరించిరి. 'ఆతఁడే నాప్రభువు. ఆతఁడు తప్ప వేఱు పూజ్యుఁడు లేఁడు, ఆతనిపైననే నేనుఆధారపడితిని. ఆతని వైపునకే నేను మరలుదును' అని ఓ ప్రవక్త! పలుకుము.

వ్యా॥ 30. ఎట్లు ముందు ప్రవక్తలను పంపి దేవుని వైపునకు వచ్చువారికి దేవుఁడు సన్మార్గము చూపుచు వచ్చెనో, అటులే ఓ ముహమ్మదు! ఈ ప్రజల యొద్దకు వారికి సన్మార్గము చూపుటకును ఖురాను షరీఫును చదివి వారికి వినిపించుటకును నిన్ను ప్రవక్తగాఁ జేసి పంపెను. నీవు ప్రవక్తగా వచ్చుట క్రొత్తది గాదు. నీకు పూర్వము. అనేక జాతులవారి యొద్దకు అనేక ప్రవక్తలు వచ్చియున్నారు. అందు తిరస్కరించినవారికి దుర్గతిపట్టెను. అటులే నిన్ను తిరస్కరించువారిగతి యగును అని యవిశ్వాసులు గమనింపవలెను. రహ్మాను దేవుని పేరు. పరమదయాళువు అని యర్థము. దేవుఁడు తన దయచే ఖురాను గ్రంథమును హజ్రత్ రసూలువారికిచ్చి పంపెను. అట్టి పరమదయాళువగు దేవునిని అవిశ్వాసులు తిరస్కరించుచున్నారు. మఱి రహ్మాను అను దేవునిపేరు మాకుఁ దెలియదు. మేము తిరస్కరించుచున్నారము అని మక్కా ఖురైషులు పలికిరి. అందుకు రహ్మాను నాప్రభువగు దేవుఁడు. అతఁడు ఒక్కఁడే పూజ్యుఁడు. ఆతనికి సాటిలేదు. నేను ఆతనినే యారాధించి యాతనిపైననే యాధారపడియున్నాను. నాప్రారంభమును, అంత్యమును ఆతని చేతిలో నున్నది. మీరు తిరస్కరించుటవలన నేను భయపడను. నాకు నష్టము లేదు. నేను ఆతని వైపుననే మరలుదును సర్వము ఆతనికే వినియోగింతును అని పలుకునట్లు రసూలువారికి దేవుని సెలవాయెను.

31. వలౌ-అన్న-ఖుర్-ఆనన్-సుయ్యిరత్-బిహిల్-జిబాలు-ఔ-ఖుత్తి-అత్-బిహిల్-అర్జు-ఔ-కుల్లిమ-బిహిల్-మౌతా-బల్-లిల్లా-హిల్-అమ్రు-జమీఅన్-అఫ-లమ్-యైఇ-అసిల్లజీన-ఆమనూ-అల్-లౌ-యషా-ఉల్లాహు-లహదన్నాస-జమీఅన్-వలా-యజాలుల్-లజీన-కఫరూ-తుసీ-బుహుమ్-బిమా-సనఊ-ఖారిఅతున్-ఔ-తహుల్లు-ఖరీబమ్-మిన్-దారిహిమ్-హత్తా-యాతియ-వఅదుల్లాహి-ఇన్నల్లాహ-లా-యుఖ్-లిఫుల్-మీఆద్.

**31.** మఱియు ఏదైన గ్రంథముండి దానివలన కొండలు చలించునట్లు చేయఁబడిన లేదా దానిచే భూమి బ్రద్దలు చేయఁబడిన లేదా దానివలన మృతులు మాటలాడునట్లు చేయఁబడినచో అది యీ ఖురానుమే అయియుండును. కాని సర్వకార్యములు దేవుని చేతిలో నున్నవి. ఏమివిశ్వసించినవారు, దేవుఁడు కోరినచో జనులందఱికిని సన్మార్గము చూపును అని తెలిసియు వారు తృప్తి పడలేదా ! దేవుని వాగ్దానము వచ్చునంతవఱకును అవిశ్వాసులకు వారి కర్మలకుగాను ఎల్లపుడును ఆపదలు గలుగుచునే యుండును. లేదా అది వారి యిండ్లకు సమీపములో పడుచునే యుండును. దేవుఁడు ఎప్పటికిని తన వాగ్దానమునకు వ్యతిరేకముగా చేయఁడు.

వ్యా॥ **31.** అవిశ్వాసులు తాము కోరిన సూచనలు ప్రవక్త చూపవలెనని కోరుచుండిరి. దానికి నిందు దేవుఁడు పంపిన ఏ గ్రంథమువలననుకొండలను చలింపఁచేయుట, భూమిని బ్రద్దలుగఁజేయుట, గోరీలలోని మృతులు లేచి మాటలాడుట, సంభవించియుండినచో అది యీ ఖురానుగ్రంథమువలననేయై యుండును. ఎందుకన పూర్వగ్రంథములకంటెను ఖురాను చాలమహిమగలగ్రంథము. ఇట్టిది మానవులు కల్పించుకొనఁజాలరు. పశుప్రాయులై కఠినహృదయులై గుణములు నశించి మృతులకు సమానులైనట్టి జనులును ఖురాను మహిమవలన మానవులలో శ్రేష్ఠులై జ్ఞానులై సుగుణులై ప్రాణులగుచున్నారు. ఇట్టి మహిమగల సూచనను చూచియు దుర్మార్గులు విశ్వసింపకున్నారు. ఒకవేళ దుష్టులు కోరునట్లు కొండలు చలించినను భూమి బ్రద్దలైనను మృతులు మాటలాడినను అవిశ్వాసులు తమ ద్వేషముచే నమ్మరు. లేనిపోని సందేహములు గలిగి పెడవాదములు పెట్టుకొందురు. కావున వాస్తవముగా అన్నివిషయములు దేవుని చేతిలో నున్నవి. ఎవరు మనఃపూర్వకముగ సన్మార్గము స్వీకరింపవలెనని యత్నింతురో వారికి దేవుఁడు సన్మార్గము చూపును. ఇష్టములేనివారికిబలవంతముగ దేవుఁడు సన్మార్గులుగఁ జేయఁడు. కొందఱు ముసల్మానులు, ప్రజలు కోరిన సూచనలు చూపించినవారు విశ్వసింతురేమో యని తలఁచిరి. దానికి దేవుఁడు కోరిన సూచనలు చూపకయే అందఱిని సన్మార్గులుగఁ జేయఁగలఁడు. కాని యిట్లు బలవంతముగ అందఱిని విశ్వాసులుగఁ జేయుట దేవుని యిష్టముకాదు. మానవులు కోరి యత్నించినచో వారికి సన్మార్గము లభించును. ఈ విషయము తెలిసికొని ముసల్మానులు తృప్తిపడవలెను. అవిశ్వాసులు తాము కోరినట్లు సూచనలు వచ్చినను వారు నమ్మువారుకారు. వారికి, కష్టములు గలుగుచు నుండవలెను. లేదా వారికి సమీపములో చుట్టుపట్లనున్నవారికైన ఆపదలు వచ్చుచునుండవలెను. అపుడు మాత్రము వారు బుద్ధితెచ్చుకొందురు. మక్కాపురము జయింపఁబడును అని దేవుఁడు ముసల్మానులతోఁ గావించియున్న వాగ్దానము

పూర్తియగువఱకు అట్లు జరుగుచుండును. దేవుఁడు తానిచ్చినమాట పూర్తి చేయును. అటులే మక్కా విజయము ముసల్మానులకుఁ గలిగెను. అపుడు ప్రజలందఱు ఇస్లామ్‌లోఁ జేరిరి.

32. వల-ఖదిస్-తుహ్జీ-అ-బి-రుసులిమ్-మిన్-ఖబ్-లిక-ఫ-అమ్-లైతు-లిల్ల-జీన-కఫరూ-సుమ్మ-అఖజ్-తుహుమ్-ఫకైఫ-కాన-ఇఖాబ్.

32. మఱియు నీకు పూర్వము వచ్చిన అనేక ప్రవక్తలతో ఎగతాళి చేయఁబడెను. కావున తిరస్కరించినవారికి నేను విరామము నిచ్చితిని. ఆ పిదప వారిని పట్టితిని. కావున నాశిక్ష యెట్లుండెనో (చూచితివా !)

వ్యా! 32. దుష్టులగు అవిశ్వాసులు హజ్రత్ రసూలువారికి కష్టములు పెట్టుచు వారితో పరిహాసములాడుచుండిరి. అందుకు పూర్వము గడచిన ప్రవక్తల విషయము దేవుఁడు హజ్రత్ రసూలువారికిఁ దెలిపి యూరడించుచున్నాఁడు. పూర్వముకూడ అవిశ్వాసులు ప్రవక్తలతో పరిహాసమాడుచువచ్చిరి. వారు దానికి సహించిరి. ఓ మహమ్మదు ! నీవుకూడ సహింపవలెను. దేవుఁడుతత్క్షణమే దుష్టులను శిక్షింపక కొంతకాలము వారిని వదలిపెట్టును. అందుకు దుష్టులు మోసపోఁగూడదు. దేవుఁడు కఠినముగా శిక్షించును. పూర్వముకూడ తిరస్కరించినవారికి దేవుఁడువిరామము నిచ్చి ఆపిదప కఠినముగా వారిని శిక్షించెను. కావున వారికి దేవుని శిక్ష వచ్చి ఎట్లు వారిని పట్టునో చూడవలెను. అది చూచి జనులు బుద్ధితెచ్చుకొనవలెను.

33. అఫ-మన్-హువ-ఖాఇ-మున్-అలా-కుల్లి-నఫ్-సిమ్-బిమా-కసబత్-వ-జఅలూ-లిల్లాహి-షుర-కాఅ-ఖుల్-సమ్మూ-హుమ్-అమ్-తునబ్బి-ఊనహూ-బిమా-లా-యఅ-లము-ఫిల్-అర్-జి-అమ్-బి-జా-హిరిమ్-మినల్-ఖౌలి-బల్-జుయ్యిన లిల్ల-జీన-కఫరూ-మక్-రుహుమ్-వసుద్దూ-అనిస్-సబీలి-వ-మన్-యుజ్-లి-లిల్లాహు-ఫమా-లహూ-మిన్-హాద్. 34. లహుమ్-అజా-బున్-ఫిల్-హయా-తిద్-దున్యా-వ-ల-అజా-బుల్-ఆఖిరతి-అషఖ్ఖు-వ-మా-లహుమ్-మినల్లాహి-మిన్-వాఖ్. 35. మసలుల్-జన్న-తిల్-లతీ-వు-ఇదల్-ముత్తఖూన-తజ్-రీ-మిన్-తహ్-తిహల్-అన్-హారు-ఉకులుహా-దా-ఇ-మున్-వజిల్లుహా-తిల్క-ఉఖ్-బల్-లజీన-నత్-తఖౌ-వ-ఉఖ్-బల్-కాఫిరీ-నన్నార్.

33. ఏమి ప్రతి ఆత్మ చేసినదాని నెఱుంగువాఁడు విగ్రహములతో సరిపోలునా ! మఱివారు దేవునికి భాగస్థులు ఏర్పఱచుచున్నారు. మీరువారి పేర్లను

తెలుపుఁడు. లేదా ఏమి భూమిలో దేవునికి తెలియని దానిని మీరాతనికిఁ దెలుపుచున్నారా! లేదా పైకి మాటలాడుచున్నారా ! అని పలుకుము. అట్లు కాదు. అవిశ్వాసులకు వారి కుట్రలు మంచివిగా తోఁచుచున్నవి. వారుమార్గము నుండి ఆటంకపఱుపఁబడిరి. మఱి దేవుఁడు ఎవనికి దారి తప్పించునో వానికి ఎవఁడును సన్మార్గము చూపలేఁడు. **34.** వారికి ఇహలోక జీవితమందు శిక్షయున్నది. మఱి పరలోకములోని శిక్ష చాల కఠినమైనది. మఱి దేవుని (శిక్ష) నుండి వారిని రక్షించువాఁడెవఁడునులేఁడు. 35. భక్తులకుఁగాను వాగ్దానముచేయఁబడిన స్వర్గముయొక్క ప్రతి విషయము (ఏమన)అందుకాలువలుప్రవహించుచున్నవి. అందలి ఫలములును నీడయును సదా నుండునది. ఇది భయభక్తులుగలవారి ఫలితమున్నది. మఱి అవిశ్వాసుల ఫలితము నరకాగ్ని యున్నది.

వ్యా! 33. ప్రతి మనుష్యుఁడు చేయు కర్మలను ప్రతిక్షణమునందును దేవుఁడు చూచుచునే యుండును. ఆతఁడు సర్వజ్ఞుఁడు. ఆతనికి నిద్దియును మఱుఁగులేదు. ఆతఁడు సర్వప్రాణులకు రక్షకుఁడు. ఇట్టి దేవునికి విగ్రహములు సరిపోలునా ? సరిపోలవు. విగ్రహములు శక్తిలేని జడములు అవి వినలేవు. చూడలేవు. కదలమెదలలేవు. ఇట్టి విగ్రహములు దేవునికి నెట్లు భాగస్థులును సాటియు కాఁగలవు. కానేరవు గదా ! అట్లుండియు అవిశ్వాసులు దేవునికి సాటి కల్పించుచున్నారు. ఇట్టి వారికి శిక్ష తప్పక త్వరగానో ఆలస్యముగానో లభించును. సరే ఓ అవిశ్వాసులార ! మీరు దేవుని వదలి పూజించు విగ్రహముల పేర్లు తీసికొనుఁడు. వాని వాస్తవము తెలియనగును. అవిమీరు పెట్టుకొన్న పేర్లు మాత్రమే గదా ! వాస్తవము తెలిసి యు సిగ్గుగల మానవుఁడు శక్తిలేని విగ్రహముల పేర్లు తీసికొనలేఁడుగదా ! ఎవరును భూమిలోపల దేవునికి సాటిలేరు కావున ఎవరు సాటిగా నున్నారో దేవునికిఁ దెలియదు అని ఆవిషయము మీరు ఆతనికి తెలుపుచున్నారా ! అవి వట్టిపేర్లు. వానికి వాస్తవములేదు. దేవునికి సాటి ఎవఁడునులేఁడు. మీరుకూడ పైకి మాటలాడుచున్నారు. మీరు యోచించిన మీమనస్సులుకూడ దేవునికి సాటిలేదని సాక్ష్యమిచ్చుచునే యుండును అని పలుకునట్లు హజ్రత్ రసూలువారికి దేవుని సెలవయ్యెను. అవిశ్వాసులు దేవుని యేకత్వమునకు వ్యతిరేకముగ పెక్కుదైవములను కల్పించుకొనుటకు కారణము వారి భ్రమయే. అందుకు వారు చేయుకుట్రలు యత్నములు వారికి మంచివిగా తోఁచుచున్నవి. కావున వారు సన్మార్గమునకు రాకున్నారు. కావున ఎవరికి దేవుఁడు సన్మార్గమును చూపఁడో వారి కెవఁడు సన్మార్గము చూపఁగలఁడు. సన్మార్గమునకుఁగాను యత్నించినవారికి దేవుఁడు సన్మార్గము చూపును. కోరనివారికి సన్మార్గము చూపఁడు. ఇహలోకమునందు ముసల్మానులు

వీరులచే లేక దైవికముగా అవిశ్వాసులకు శిక్షయు అవమానము కలుగును ఇహా ముకంటెను పరలోకములోని శిక్ష చాల కఠినమైనది. దేవుని శిక్షనుండి అవి శ్వాసులను ఎవరును రక్షింపఁజాలరు. ఏ విగ్రహములును ఏచిల్లరదేవతలును అడ్డుపడఁజాలవు. 35. ముసల్మానుల భక్తులకు స్వర్గమిత్తునని దేవుఁడు వాగ్దానము చేసియున్నాఁడు. ఆ స్వర్గ మెట్టిదో చెప్పఁబడినది. అందు కాలువలు ప్రవహించును. అందు సదా భక్తులు కోరిన ఫలములు వారికి లభించును. అందు వారికి ఎండ చలిబాధలుండవు. సదా సౌఖ్యమునిచ్చు నీడ యుండును. ఇది దేవునికి భయపడి పాపములు విగ్రహారాధన వదలుకొన్న భక్తులకు లభించు ఫలితము. దేవుని విశ్వసింపక పాపము చేసినవారి ఫలితము నరకాగ్ని. అందు వారు సదా కష్టములు పడుచుందురు. కావున మానవులు నరకాగ్నినుండి ముక్తిపొందుటకుఁ గాను విశ్వసించి సత్కార్యములు చేయవలెను.

36. వల్లజీన-ఆతైనా-హుముల్-కితాబ-యఫ్-రహూన-బిమా- ఉన్-జిల-ఇలైక వ మినల్-అహ్-జాబి-మన్-యున్‌కిరు-బఅ-జహూ-ఖుల్-ఇన్నమా-ఉమిర్తు-అన్-అఅ-బుదల్లాహ-వలాఉష్‌రిక-బిహీ-ఇలైహి-అద్ఊ-వ ఇలైహి-మ ఆబ్. 37. వ కజాలిక-అన్-జల్నా-హు-హుక్మన్-అర-బియ్యన్-వల-ఇనిత్-తబ అత-అహ్-వా-అహుమ్-బఅద మా-జాఅక-మినల్-ఇల్మి- మాలక-మినల్లాహి-మిన్-వలియ్యిన్-వలా వాఖ్.

36. మఱియు వారికి మేము గ్రంథము నొసంగితిమో వారు నీకు పంపినదాని వలన సంతోష పడుచున్నారు. మఱికొందఱు జనులు దానిలోని కొంతభాగము ను తిరస్కరింతురు. నేను దేవునినే పూజింప వలెను అనియు ఆతనికి సాటి కల్పింపరాదు, అనియు నాకు ఆజ్ఞయైనది. నేను ఆతని వైపునకు పిలుచుచున్నాఁడను. మఱి ఆతని వైపునకే నేను మరలుదును అని ఓ ప్రవక్త! పలుకుము. 37. ఇటులే మేము ఖురానును అరబీ భాషలో నొక ఆజ్ఞగా నంపితిమి. మఱి నీకు విద్య (జ్ఞానము) వచ్చిన పిదప వారి కోరికలను నీవు అనుసరించితివేని దేవుని నుండి తప్పించి నిన్ను రక్షించువాఁడు ఎవఁడును లేఁడు.

వ్యా॥ 36. దేవుఁడు హజ్రత్ రసూలు వారికి పంపిన సందేశమగు ఖురాను గ్రంథమునకు మునుపున్న తౌరాతు ఇన్జీలు గ్రంథములు గలవారు యూదులును నస్రానీలును ముసల్మానులు ఖురానును ఉభయ లోకములోను తమకు ముక్తి మార్గము చూపునది యని నమ్మిరి. కావున వారు సంతోషించుట సహజమే. అటులే న్యాయ వంతులైన యూదులు క్రైస్తవులు

ఖురానులోని విషయములను వారి ప్రవక్తల గౌరవమును చూచి సంతోషించుచున్నారు. ఇట్టి స్వభావముగల యూదులు నస్రానీలు తుదకు ఇస్లామ్‌లో చేరిరి. ప్రజలలో కొందఱు తమకోరికలకు వ్యతిరేకమైన విషయములు ఖురానులో విని తిరస్కరించుచున్నారు. ఎవరు సంతోషించిన తిరస్కరించిన నేమి? నేను ఒక్క దేవుని పూజించి యాతని యాజ్ఞలను అనుసరించుచున్నాను. ఆతనికి సాటి కల్పింపను. దేవుఁడు నాకు పంపిన సందేశమును ప్రజలకుఁ దెలుపుచు దేవుని వైపునకు రండు అని పలుచు చున్నాను. నా ప్రచారమును సాగించుట దేవుని పని. దేవుని పైననే నేను ఆధారపడి యున్నాఁడను. ఆతని వైపునకే మరలుదును అని పలుకవలెనని ప్రవక్తకు దేవుని సెలవు. 37. ఓ ప్రవక్త! ఎట్లు నీకు పూర్వము తౌరాతు ఇన్జీలు మొదలగు గ్రంథములను దేవుఁడు ప్రవక్తలకు పంపెనో అటులే ఖురాను గ్రంథమును అరబ్బీ భాషలో నీకు పంపెను. అది దేవునాజ్ఞ. అందు సర్వధర్మములు గలవు. దాని ననుసరించువారికి ఉభయ లోకములలోను జయము, మోక్షము లభించును. ఓ ప్రవక్త! తిరస్కరించువారి మాట నీవు వినకుము. నీపని నీవు చేయుచు నుండుము. ఒకవేళ నీవు వారి మాటలకు లొంగిపోయి వారి అధర్మ కోరికలను అనుసరించితివేని దేవుని శిక్షనుండి నిన్ను తప్పించి రక్షించువాఁడెవఁడును లేఁడు సుమా! ఇందు అందఱు భక్తులకు బోధన గలదు. కావున అందఱు భక్తులును ధర్మమార్గమునందు స్థిరముగా నుండవలెను.

38. వల-ఖద్-అర్సల్నా-రుసు-లమ్ మిన్-ఖబ్లిక-వ-జఅల్నా-లహుమ్-అజ్-వాజన్-వ-జుర్రి-యతన్-వ-మా-కాన-లి-రసూలిన్-అన్-యాతియ-బి-ఆయతిన్-ఇల్లా-బి-ఇజ్-నిల్లాహి-లి కుల్లి-అజలిన్ కితాబ్. 39. యమ్-హుల్లాహు-మా-యషాఉ-వ-యుస్-బితు-వ-ఇన్-దహూ-ఉమ్ముల్-కితాబ్. 40. వ-ఇమ్మా-నురియన్నక-బఅ్-జల్ లజీ-నఇ-దుహుమ్. ఔ-నత-వఫ్ఫ-యన్నక-ఫఇన్నమా-అలైకల్-బలాగు-వ-అలైనల్-హిసాబ్. 41. అవ-లమ్-యరౌ-అన్నా-నాతిల్-అర్జ-నన్-ఖుసుహా-మిన్-అత్రాఫిహా వల్లాహు-యహ్‌కుము-లా-ముఅఖ్ఖిబ-లి-హుక్మిహీ-వహువ-సరీఉల్-హిసాబ్. 42. వ-ఖద్-మక-రల్-లజీన-మిన్-ఖబ్లిహిమ్-ఫ-లిల్లాహిల్-మక్రు-జమీఅన్-యఅ-లము-మాతక్-సిబు-కుల్లు-నఫ్-సిన్-వ-సయఅ-లముల్-కుఫ్ఫారు-లిమన్-ఉఖ్-బద్-దార్. 43. వయఖూలుల్-లజీన-కఫరూ-లస్‌త-ముర్సలన్-ఖుల్-కఫా-బిల్లాహి-షహీదమ్-బైనీ-వబైన-కుమ్

వ-మన్-ఇన్-దహూ-ఇల్ముల్-కితాబ్.

38. మఱియు నీకు పూర్వము మేము, అనేకమంది ప్రవక్తలను పంపియున్నారము, మఱి మేము వారికి భార్యలను బిడ్డలను ఒసంగితిమి. మఱి ఏప్రవక్తయును దేవుని సెలవు లేనిదే ఏ సూచనయును తీసికొని వచ్చి యుండలేదు. ప్రతికాలము వ్రాయఁబడి యున్నది. 39. దేవుఁడు తాను కోరునది తుడిచి వేయును. మఱియు స్థిరపఱచును. మఱి ఆతని యొద్ద అసలు గ్రంథమున్నది. 39. మఱి మేము వారికిఁ జేయు వాగ్దానములోనేదైన నీకు చూపించినను లేదా నీ ప్రాణమును దీసికొని పోయినను ప్రచారము చేయుటయే నీపని. మఱి మాపని లెక్కతీసికొనుట. 41. ఏమి మేము భూమిని దాని కొనలనుండి తగ్గించుచు వచ్చుట వారు చూచుట లేదా! మఱి దేవుఁడు ఆజ్ఞాపించును. ఆతని యాజ్ఞను రద్దుచేయువాఁడెవఁడును లేఁడు. మఱిఆఁతడు శీఘ్రముగా లెక్కతీసికొనువాఁడు. 42. మఱి వారికి పూర్వమున్నవారు కుట్రలు చేసియున్నారు. కావున అన్ని కుట్రలు దేవుని చేతిలో నున్నవి. ప్రతి ఆత్మచేయు కర్మలను ఆతఁడు ఎఱుంగు చున్నాఁడు మఱి పరలోక ఫలితము ఎవరికి నున్నదో అవిశ్వాసులు తెలిసికొనఁగలరు. 43. మఱియు అవిశ్వాసులు నీవు ప్రవక్తవుకావు అని పలుకుచున్నారు. నామధ్యను మీమధ్యను దేవుఁడును ఎవరికిగ్రంథము తెలియునో వారునుసాక్షులుగ చాలును అని ఓ ప్రవక్త! పలుకుము.

వ్యా॥ 38. అవిశ్వాసులు 'ప్రవక్తకు భార్య బిడ్డలుండునా! ఆతఁడు మానవుఁడగునా!' అని యాశ్చర్య పడుచుండిరి. దానికిఁగాను దేవుఁడు ఓమహమ్మదు! నీకను ముందు ప్రవక్తలు వచ్చి యున్నారు. వారుకూడ నీవంటి మనుష్యులే. వారు ఆకాశమునుండి వచ్చిన దేవదూతలు (ఫరిష్తే) కాదు. వారును పెండ్లాడి బిడ్డలు కనుచుండిరి. వారును ఇహలోకములో వసించి అన్నము తినుచుండిన వారలే. కావున ఎందులకు అవిశ్వాసులు ఆశ్చర్య పడవలెను. అవిశ్వాసులు తాము కోరిన సూచనలు నీవు చూపలేదు అని అనుకొన్నారేమో! పూర్వము వచ్చిన ప్రవక్తలు కూడ స్వయముగా ఏ సూచనయును దేవుని సెలవు లేనిది చూపలేదు. దేవుని యాజ్ఞవలన సూచనలు చూపిరి. నీవును అటులే దేవుని సెలవును అనుసరించి ధర్మములను దెలుపుచు సూచనలు చూపుదువు. దేవునియొద్ద ప్రతివిషయమునకును ధర్మమునకును ఒక కాలము నియమింపఁ బడియున్నది. ఎవరును దానిని మార్పఁజాలరు. కావున ప్రతి ప్రవక్తయును దేవుని సెలవు ప్రకారము ప్రతికాలమునకుఁ దగిన ధర్మములు తెచ్చెను. అటులే హజ్రత్ రసూలువారు కూడ దేవుని సెలవుచే ఖురానులోని ధర్మములు ప్రజలకుఁ దెలుపు చున్నారు. 39. దేవుఁడు తాను కోరిన ధర్మములను రద్దుచేసి తానుకోరినట్లు ధర్మ

ములను నియమించును. తాను కోరిన జాతులను నశింపఁజేసి తన యిష్టము వచ్చిన జాతులకును సంఘములకును వృద్ధినొసంగును. సర్వము ఆతని చేతిలో నున్నది. సర్వ నియామకములు ఆతని యొద్ద అసలు (మూల) గ్రంథములో నున్నవి. అవి రద్దు కావు. దాని ననుసరించియే లోకములోని విషయములు సంభవించును. 40. దేవుఁడు అవిశ్వాసులకు శిక్షయు, అవమానము నొసంగుదును అని వాగ్దానము చేసెను. వానిలో కొన్నిటిని ఓ ప్రవక్త! నీ జీవిత కాలములోనే పూర్తి చేయుదుము. నీవు చూడఁ గలవు. లేదా నీ మరణాంతరము వానిని పూర్తి చేయుదుము. సర్వము దేవుని చేతిలో నున్నది. ఆ బాధ్యత నీకు లేదు. నీపని ప్రచారము చేయుటయే. అది నీవు చేయుచునే యున్నావు. ఇఁక మీఁద కూడ చేయుచుండుము. తిరస్కరించువారిఁగూర్చి వారి కర్మల లెక్క తీసికొనుట మాపని. మేము వారి కర్మలకుఁ దగిన శిక్ష తప్పక ఒసంగుదుము. 41 దినదినము ఇస్లామ్ వ్యాపించుచు మక్కాకు చుట్టు పట్లనున్న అవిశ్వాసుల అధికారము తగ్గుచు నుండుటయు ఔసు ఖజ్‌రజ్ అను గొప్పగొప్ప కుటుంబములవారు ఇస్లామ్‌లో చేరుటయు తిరస్కరించువారు చూచుట లేదా! రానురాను విశ్వాసుల రాజ్యము తగ్గి ఇస్లామ్ రాజ్యము వ్యాపించుట ఒక గొప్ప సూచనయే గదా! అవిశ్వాసులు తమ గతి యేమి కానున్నదో వారు గమనింపరా! దేవుఁడు తాను కోరినది యాజ్ఞాపించును. దాని ననుసరించియే జరుగును. ఎవరును దానిని రద్దు చేయఁజాలరు. దేవుఁడు కోరినది తప్పక సంభవించును లెక్క దీసికొనఁబడు దినము వచ్చినపుడు లెక్క శీఘ్రములో తీరిపోవును. అందు ఏలాటి యాలస్యము కాదు. 42. పూర్వము అవిశ్వాసులు ప్రవక్తల విషయము కుట్రలు గావించి వారికి కష్టములు పెట్టి దేశములనుండి వెడలఁగొట్ట వలెనని యత్నించిరి. కాని తుదకు అవిశ్వాసులే నష్టము పొంది నశించిరి. వారి కుట్రలు దేవుని యెదుట సాగవు. అన్ని కుట్రలు దేవుని చేతిలో నున్నవి. ఆతఁడు వానికిఁ దగిన ప్రతీకారము చేయును. మక్కా కాఫిర్లు కూడ హజ్రత్ రసూలు వారికి కష్టములు పెట్టి వారు మక్కా విడిచిపోవునట్లు చేసిరి. తుదకు మక్కాపురము జయింపఁ బడెను. మఱి కాఫిర్లు అవమానము పొందిరి. ముసల్మానులకు జయము లభించెను. ప్రతి మనుష్యుఁడు చేయు కుట్రలు యత్నములు దేవునికిఁ దెలియును. ఎవరికి మంచి ఫలితము గలుగునో ఎవరికి దుర్గతి పట్టునో అను విషయము తెలిసికొనఁగలరు. ముసల్మానులు ఉభయ లోకముల లోను జయము మోక్షము పొందుదురు. అవిశ్వాసులు రెంటిలోను చెడుదురు. 43. కాఫిర్లు హజ్రత్ రసూలువారిని తిరస్కరించి నీవు ప్రవక్తవు కావు అని పలికిరి. దానికి వారు తిరస్కరించిన యేమి. నీవు ప్రవక్తవు అని దేవుఁడును ఆతని గ్రంథమగు ఖురానుయును సాక్ష్యమిచ్చుచున్నారు. అటులే పూర్వ గ్రంథములు గల భక్తులును మనః పూర్వకముగ సాక్ష్యమిత్తురు. ఖురానును నమ్మిన

మసల్మానులును సాక్ష్యమిత్తురు. వీరి సాక్ష్యము నీకు చాలును. కాఫిర్లు తిరస్కరించిన పర్వాలేదు. తౌరాతు ఇన్జీలు (బైబిలు) లో హజ్రత్ రసూలు వారిని గూర్చి ప్రకటనలు గలవు. వాని ననుసరించియే అనేకమంది యూదులు నస్రానీలు సాక్ష్యమిచ్చి మసల్మానులైరి.

## సూరయే ఇబ్రాహీమ్ మక్కీ 52 వాక్యములు.

బిస్-మిల్లా-హిర్రహ్మా నిర్రహీమ్.

పరమదయాళువును ప్రేమించువాఁడు నగు దేవునిపేర.

1, 2. అలిఫ్-లామ్-రా-కితాబున్-అన్-జల్నాహు-ఇలైక-లి- తుఖ్-రిజన్నాస మినజ్-జులుమాతి-ఇలన్-నూరి-బి-ఇజ్ని-రబ్బిహిమ్-ఇలా - సిరాతిల్-అజీ-జిల్-హమీ-దిల్లా-హిల్-లజీ-లహూ-మా-ఫిస్-సమా-వాతి-వమా - ఫిల్-అర్జి-వ వైలుల్-లిల్-కాఫి-రీన-మిన్-అజా-బిన్-షదీద్. 3.అల్-లజీన యస్తహిబ్బూ-నల్-హయాతద్-దున్యా-అలల్-ఆఖిరతి-వ-యసుద్దూన-అన్- సబీలిల్లాహి-వ-యబ్-గూనహా-ఇవ-జన్- ఉలా-ఇక-ఫీ-జలా-లిమ్-బఈద్. 4. వమా అర్-సల్నా-మిర్-రసూలిన్-ఇల్లా-బి-లిసాని - ఖౌమిహీ-లి-యుబయ్యిన-లహుమ్-ఫ-యు-జిల్-లుల్లాహు -మన్-యషాఉ-వ-యహ్దీ-మన్-యషాఉ-వ-హువల్-అజీ-జుల్-హకీమ్.

1, 2. అలిఫ్‌లామ్‌రా (నేను దేవుఁడను. మీరు చేయు సర్వము చూచుచున్నాఁడను.) నీవు ప్రజలను అంధకారములనుండి తీసి సర్వశక్తుఁడును స్తవనీయుఁడునగు దేవుని యొక్క మార్గము అనెడి కాంతివైపునకు దేవుని సెలవుచే తెచ్చుటకుఁగాను ఈ గ్రంథమును నీకుఁ బంపితిమి. ఆకాశములలోను భూమిలోనున్న సమస్తము ఆ దేవునిదేను. మఱి అవిశ్వాసులకు కఠినశిక్షఅనెడి యాపదయున్నది, 3. ఆ యవిశ్వాసులు పరలోకమునకు బదులుగ ఇహలోక జీవనమును ప్రేమించుచున్నారు. (స్వీకరించుచున్నారు). మఱి వారు దేవునిమార్గమునుండి ఆటంకపఱచుచు నందు వంకరలు తీయుటకుఁ గోరుచున్నారు. వీరు చాల దూరమైన తప్పుదారిలో పడియున్నారు. 4. మఱియు జనులకుఁ దెలుపుటకుఁగాను ఆయాజనుల భాష తెలిసినట్టి ప్రవక్తలను మాత్రము పంపియున్నారము. ఆపిదప దేవుఁడు తాను కోరినవారికి సన్మార్గ మొసంగుచున్నాఁడు. మఱియు ఆతఁడు సర్వశక్తుఁడును వివేచనాపరుఁడును.

వ్యా॥ 1-2. ఖురాను చాల గొప్పగ్రంథము. దానిని పంపువాఁడు సర్వ

శక్తుఁడగు దేవుఁడే. దానిని పొందిన ప్రవక్తకూడ చాల గొప్పవాఁడు. దాని వలన యుద్దేశము కూడ చాల గొప్పది. పవిత్ర లోకములోనున్న జనులందఱికిని దానివలన దేవుని సెలవుచే సన్మార్గము చూపి, అవిశ్వాసము, పాపములనెడి యంధకారములోనుండి దీసి దేవుని మార్గమగు వెలుతురులోనికి దీసికొని రావలెను. ఆమార్గమును అనుసరించి భూమ్యాకాశములకు ప్రభువునగు దేవుని ప్రీతి ప్రజలు పొందఁగలరు. 2. ఖురానువంటి గ్రంథము వచ్చిన తరువాత కూడ విశ్వసింపక దానిని తిరస్కరించి విగ్రహారాధన మొదలగు పాపములు చేయువారు ఉభయలోకములలోను చాల కఠిన శిక్షలకు పాత్రులు కావలసియున్నది. 3. ఇందు, ఆ యవిశ్వాసుల విషయము వివరింపఁబడినది. వారు పరలోకమునందలి స్వర్గసౌఖ్యములకు బదులుగ ఇహలోకములోని తుచ్ఛసౌఖ్యములకుమోసపోయి ఇహమునే ప్రేమించుచు దానినే స్వీకరించుచున్నారు. రాత్రింబవలు, దానిలోనే మునిగియున్నారు. తాము మునిగినది గాక యితరులనుకూడ సన్మార్గమునుండి ఆటంకపఱచుచు ఇహలోకములోనే నిమగ్నులగునట్లు చేయుచున్నారు. అందులకు వారు దేవుని మతములో లోపములు, వంకరలు కనిపెట్టుటకు కోరుచు యత్నించుచున్నారు. వాస్తవముగా వీరు సన్మార్గమునుండి తొలఁగి చాల తప్పుదారిలోపడియున్నారు. అందుండి వారు సన్మార్గమునకు రాఁజాలరు. వారు కఠిన శిక్షపొందునంతవఱకు కన్నులు తెఱచువారుకారు. 4. ఓ ప్రవక్తా! మే మెట్లు ప్రజలకు ధర్మమార్గము చూపుటకై నీకు ఖురాను గ్రంథమునిచ్చి నిన్ను పవిత్రగాఁ జేసి పంపితిమో అటులే పూర్వముకూడ ప్రవక్తలను పంపి ధర్మమార్గము ప్రజలకు చూపుచు వచ్చితిమి. ఏయే జనులయొద్దకు ఏయే ప్రవక్తలను పంపితిమో ఆయాపవిత్రులు ఆజయానల భాషలలో వారికి బోధించిరి. ఆయా మత గ్రంథములుకూడ ఆయా భాషలలోనుండెను. జనులు తమ మాతృభాషలలో ధర్మములు సులభముగ గ్రహింపఁగలరు. అందుకే ఆయా జనుల భాషలో తెలిసినప్రవక్తలు ఆయాజనులయొద్దకువచ్చిరి అనిహజ్రత్ రసూలువారికి దేవుని సెలవు అరబ్బుల మాతృభాష అరబ్బి. కావుననే హజ్రత్ రసూలువారికి లభించిన ఖురాను గ్రంథముకూడ అరబ్బీభాషలో నున్నది. ముందు అరబ్బులు తమ మాతృభాషలోనున్న ఖురానను బాగుగ గ్రహించి అరబ్బీ తెలియనివారికి వారివారి మాతృభాషలో ఖురానును బోధించిరి. కొద్దికాలములోనే రోమను, పారసీక దేశములవారు ఖురానును గ్రహించి గొప్ప అరబ్బీభాష పండితులై ఇస్లామ్ మతమును వ్యాపింపఁజేసిరి. అట్లు లోకమంతటను ఖురానుధర్మములను ప్రజలు గ్రహించి ముసల్మానులైరి. పై విధమున దేవుఁడు సన్మార్గము ప్రజలకు చూపుటకై యేర్పాటులు చేసిన పిదప మనఃపూర్వకముగా నెవరు ధర్మమును అనుసరింప కోరిరో వారికి సన్మార్గ మొసంగెను. ఎవరు తిరస్కరించి ద్వేషమువహించి

రో వారిపై బలవంతముచేయక దుర్మార్గములోనే పడియుండునట్లుగ వారిని వదలిపెట్టెను. దేవుఁడు సర్వశక్తుఁడు- తాను కోరినచో బలవంతముగ నంద ఱను ధర్మమార్గమునందు బోవునట్లు చేయఁగలఁడు. కాని అట్లు చేయక ప్రజలకు ధర్మస్వీకారమునందు కొంత అధికారము నొసంగియున్నాఁడు. ఎందుకన ఆతఁడు వివేచనాపరుఁడు. సర్వము తగినట్లు చేయును.

5. వల-ఖద్-అర్-సల్నా-మూసా-బి-ఆయాతినా-అన్. అఖ్ రిజ్-ఖౌమక మినజ్-జులు-మాతి-ఇలన్-నూరి-వ-జక్కిర్-హుమ్-బి-అయ్యా-మిల్లాహి- ఇన్న-ఫీ-జాలిక-ల-ఆయా-తిల్-లి-కుల్లి-సబ్బారిన్-షకూర్. 6. వ-ఇజ్-ఖాల-మూసా-లి-ఖౌమి-హిజ్-కుర్ నిఅ-మతల్లాహి-అలైకుమ్-ఇజ్-అన్-జాకుమ్-మిన్-ఆలి-ఫిర్ ఔన-యసూ-మూనకుమ్-సూఅల్-అజాబి-వ-యుజబ్బి-హూన-అబ్-నాఅకుమ్ వ-యస్-తహ్-యూన-నిసా అకుమ్-వ-ఫీ-జాలికుమ్-బలా-ఉమ్-మిర్ - రబ్బి-కుమ్-అజీమ్. 7. వ-ఇజ్ తఅజ్-జన-రబ్బు-కుమ్-లఇన్-షకర్-తుమ్-లా-అజీ-దన్న కుమ్-వ-లఇన్-కఫర్-తుమ్-ఇన్న-అజాబీ-ల-షదీద్. 8. వ-ఖాల-మూసా-ఇన్-తక్-ఫురూ-అన్-తుమ్-వ-మన్-ఫిల్-అర్ జి-జమీ-అన్-ఫ-ఇన్నల్లాహ - ల - గని య్యున్-హమీద్.

5. మఱియు మేము మూసాకు మాసూచనల నిచ్చి పంపి, నీజనులను అంధకారములనుండి వెలుతురు వైపునకు తెమ్ము. దేవుని దినములు వారికి జ్ఞప్తికి దెమ్ము. నిశ్చయముగా నందు, సహించి కృతజ్ఞత సలుపు వారికిఁగాను సూచనలు గలవు అని మేము పలికితిమి. 6. మఱియు మూసా తన జనులతో ఫిరౌను జనులు మీకు ఘోరబాధలు పెట్టుచు, మీపుత్రులను వధించి, మీకుమార్తెలను సజీవులుగ వదలిపెట్టుచుండఁగ దేవుఁడు మిమ్ము రక్షించి మీకు గావించిన మేలును జ్ఞప్తిచేయుఁడు, అందు మీకు గొప్ప పరీక్షయుండెను. 7. మఱి మీప్రభువు, మీరు కృతజ్ఞత సలిపినచో మఱి హెచ్చుగా మీకు నొసంగుదును. మఱి మీరు కృతఘ్నత చేసితిరేని నాశిక్ష చాల కఠినమైనది అని మీకువినిపించియున్నాఁడు అని పలికినది నీవు జ్ఞప్తిచేయుము. 8. మఱియు మూసా 'మీరును భూమిలో నున్న అందఱును దేవునిని తిరస్కరించినచో దేవుఁడు లెక్కచేయనివాఁడు. ఆతఁడు స్తవనీయుఁడు' అని పలికెను.

వ్యా॥ 5. ఓ ముహమ్మదు! నిన్ను ప్రవక్తగా పంపినట్లు నీకు ముందు మూసాను ప్రవక్తగాఁజేసి పంపియున్నాము. ఆతనికి సూచనలు ఒసంగితిమి.

మూసా జనులకు సన్మార్గముచూపి అవిశ్వాసమనెడి అంధకారములనుండి దీసి ధర్మమార్గము యొక్క వెలుతురులోనికి దీసికొనిరమ్ము. దేవునిదినములు (అనగా ఆయాకాలములో సంభవించిన వృత్తాంతములు) జ్ఞప్తికి తెచ్చుకొనుఁడు అని పలుకుము. వారి కష్టకాలములో దేవుఁడు వారిని రక్షించెను. ఈవిషయములలో బుద్ధిమంతులకు బుద్ధివచ్చును. కష్టములకు సహింతురు. సంపదలు గలిగినపుడు గర్వము వహింపక దేవునికి నమ్రులై కృతజ్ఞతవహింపఁగలరు. ఇట్టి వారికి నిందు సూచనలు గలవు అని దేవుఁడు మూసాతో పలికెను. 6, 7. ఇస్రాయీలియులు మిసరు (ఈజిప్టు)లో నుండిరి. అచ్చటి రాజగు ఫిరౌను వారిని బానిసలుగఁ జేసికొని అనేక కష్టమైన పనులు తీసికొనుచుండెను. వారికి పుట్టు పుత్రులను చంపుచుండెను. వారి కూతులను తన సేవకొఱకు కావలెనని చంపక వదలి పెట్టుచు నుండెను. ఇట్టి స్థితిలో దేవుఁడు మూసా ప్రవక్తను పంపి ఆయన మూలమున ఇస్రాయీలియులను రక్షించి వారికి మేలు చేసెను. అదియును గొప్ప పరీక్షయే. కావున ఆమేలును జ్ఞప్తికిఁదెచ్చుకొని కృతజ్ఞులరైయుండుఁడు. కృతజ్ఞత సలుపువారికి ఉభయలోకములలో హెచ్చుగా ననుగ్రహింతును అని దేవుఁడు ప్రకటించియున్నాఁడు. అటులే దేవుఁడు చేసిన మేలు మఱచి కృతఘ్నత వహించువారికి కఠినశిక్ష కలుగును. దేవుఁడొసంగియున్న సంపదలుకూడ తొలఁగిపోవును అని దేవుఁడు మీకుఁ దెలిపియున్నాఁడు అని మూసాప్రవక్త తన జనులతో పలికెను. 8. మీరు కృతఘ్నతను చేసినచో మీకే నష్టము గలుగును. దేవునికి నేమియు నష్టములేదు. మీరేకాదు. లోకులందఱును దేవునిని తిరస్కరించికృతఘ్నులైనచో దేవునికి లెక్కలేదు. ఆతని కేమియు హానిలేదు. ఆతఁడు సదా స్తవనీయుఁడే. ఎవరునమ్మినగాని తిరస్కరించినగాని ఆతనికి పర్వాలేదు. అందఱు భక్తులైనను ఆతని మహిమ హెచ్చదు. మఱి అందఱు అవిశ్వాసులైనను ఆతని మహిమ తగ్గదు అని మూసాప్రవక్త తన జనులతోఁ జెప్పెను.

9. అలమ్‌యాతికుమ్-నబ-ఉల్-లజీన-మిన్-ఖబ్-లికుమ్-ఖౌమి-నూహిన్-వ-ఆదిన్-వ-సమూద-వల్లజీన-మింబఅదిహిమ్-లా-యఅ-లము-హుమ్-ఇల్లల్లాహు-జాఅత్-హుమ్-రుసు-లుహుమ్-బిల్-బయ్యి-నాతి-ఫ-రద్దూ-ఐ-ది-యహుమ్-ఫీ-అఫ్-వాహి-హిమ్-వ-ఖాలూ-ఇన్నా-కఫర్నా-బిమా-ఉర్-సిల్తుమ్-బిహీ-వఇన్నా-లఫీ-షక్కిమ్-మిమ్మా-తద్-ఊననా-ఇలైహి. 10. ఖాలత్-రుసు-లుహుమ్-అఫిల్లాహి-షక్కున్-ఫాతి-రిస్-సమా-వాతి-వల్-అర్జి-యద్-ఊకుమ్-

లి-యగ్-ఫిర-లకుమ్ మిన్-జునూ-బికుమ్-వ-యు-అఖ్-ఖిరకుమ్- ఇలా-అజ-లిమ్-ముసమ్మన్-ఖాలూ-ఇన్-అన్-తుమ్-ఇల్లా-బష-రుమ్-మిస్-లునా-తురీ - దూన-అన్-త-సుద్దూనా-అమ్మా-కాన-యఅ-బుదు-ఆబా-ఉనా ఫాతూ-బి- సుల్- తా నిమ్-ముబీన్. 11. ఖాలత్-లహుమ్-రుసులుహుమ్- ఇన్-నహ్-ను- ఇల్లా- బష-రుమ్-మిస్-లుకుమ్-వ-లా-కిన్నల్లాహ-యమున్ను-అలా-మన్-యషా-ఉ-మిన్ ఇబా దిహీ-వ-మా-కాన -లనా-అన్-నాతి-యకుమ్- బి-సుల్-తానిన్ ఇల్లా-బి- ఇజ్-ని ల్లాహి-వ-అలల్లాహి-ఫల్-యత-వక్క-లిల్-ముూమినూన్. 12. వ-మా-లనా-అల్లా నతవక్క-ల-అలల్లాహి-వ-ఖద్-హదానా సుబులనా-వల-నస్-బి-రన్న- అలా-మా-ఆజై-తుమూనా-వ-అలల్లాహి-ఫల్-యత-వక్క-లిల్-ముత-వక్కి-లూన్.

9. ఏమి మీకు పూర్వమున్న నూహు ఆద్ సమూదు లజాతివారివృత్తాం తములును వీరికి తరువాతి వారి విషయములును మీకు రాలేదా. దేవుఁడు తప్ప వారిని ఎవరును ఎఱుఁగరు. వారియొద్దకు వారి ప్రవక్తలు సూచనలు తీసికొని వచ్చిరి. ఆపిదప వారు తమ చేతులను నోట నుంచుకొని నిశ్చయముగా మేము మీకు పంపఁబడిన దానిని తిరస్కరించితిమి. మఱి మీరు దేనికై మమ్ముపిలుచు చున్నారో! దాని గూర్చి మేము చాల సందేహములో పడి యున్నారము అని పలికిరి. 10. ఆ ప్రవక్తలు ఏమి ఆకాశములను భూమిని సృష్టించిన దేవుని విషయము సందేహము గలదా! అతఁడు మీ పాపములను క్షమించుటకును, నియమింపఁబడిన కాలము వచ్చువఱకు మిమ్ము వదలి పెట్టుటకుఁగాను మిమ్ము పిలుచుచున్నాఁడు, జనులు మీరు మావంటి మనుష్యులేగదా! మీరు మా తాత ముత్తాతలు పూజించుచున్న వానినుండి మాకు ఆటంక పఱప వలెనని కోరుచు న్నారు! కావున స్పష్టమైన ప్రమాణము (సనదు) ను తీసికొని రండు అని పలుక సాగిరి. 11. ప్రవక్తలు వారితో మేము కూడ మీవంటి మనుష్యులమే. కాని దే వుఁడు తన భక్తులలో తాను ఇష్టపడిన వారికి మేలు చేయుచున్నాఁడు. మఱి దే వుని సెలవు లేనిది మేము మీ యొద్దకు ప్రమాణము (సనదు) తీసికొనిరాలేము. మఱి విశ్వాసులు దేవునిపై నాధారపడవలెను. 12. మఱి మాకేమైనది. మేమొ దులకు దేవునిపై నాధార పడము. మఱి యాతఁడే మాకు మా మార్గములు చూపెను. మఱిమీరు మాకు పెట్టుకష్టములను మేము సహింతుము. మఱి ఆధా ర పడువారు దేవునిపైననే యాధార పడవలెను అని పలికిరి.

వ్యా॥ 9. ఇఁక ఈవాక్యములలో దేవుడు పూర్వము గడచిన జనుల విష

యమును గూర్చి దేవుఁడు ముసల్మానులను హెచ్చరించుచున్నాఁడు. పూర్వము నూహు, ఆద్, సమూదువారి జాతి యొద్దకును వీరికి తరువాతి వారియొద్దకును అనేక ప్రవక్తలు వచ్చిరి. అపుడు అందలి అవిశ్వాసులు ప్రవక్తలు దేవునినుండి తెచ్చిన స్పష్టమైన సూచనలు తిరస్కరించి తమ యాశ్చర్యమును లేదా కోపమును, అనిష్టమును, సూంచిచుటకు తనుచేతులను తమనోళ్ళపై నుంచుకొని మేము మీరు తెచ్చిన సందేశము నమ్మము. మీరుచేయు ప్రచార విషయములో మాకు సందేహముగలదు అని పరిహాసముతో పలుకసాగిరి. 10. దానికి ప్రవక్తలు మేము దేవుని యేకత్వమును గూర్చి ప్రచారము చేయుచున్నారము. దేవుని విషయము సందేహము ఎందులకు గలుగును. ఆతఁడే ఆకాశములను భూమిని సృష్టించినవాఁడు. అందలి యేర్పాటులను గమనించినచో సర్వశక్తుఁడగు దేవుఁడు ఒకడున్నాఁడు అని అందఱు తప్పక యొప్పుకొనవలసి వచ్చును. చిల్లర దేవతలు కల్పించుకొన్నవారు కూడ ఒక పెద్ద దేవుఁడున్నాఁడనియే పలుకుదురుగదా! కావున దేవుఁడు ప్రవక్తల మూలమున మీపాపములను క్షమించి మీజీవితకాలమునందు మీకు సౌఖ్యము లిచ్చుటకు గాను సన్మార్గము వైపునకు పిలుచుచున్నాఁడు. మీరు సన్మార్గము అనుసరించితిరేని మీకు దేవుని ప్రీతి లభించును. అని ప్రవక్తలు తమ జనులతో పలికిరి. దానికి జనులు దేవుని విషయము అటుండనిండు. మీవిషయమే పలుకుఁడు. ఏమి! మీరు ఆకాశమునుండి దిగి వచ్చిన దేవదూతలా కాదుగదా! మీరును మావంటి మనుష్యులేగదా! ఎట్లు మీమాటలను మేము నమ్మవలెను. మీరు మాతాత ముత్తాతల మతమునుండి మమ్ము తొలఁగించి మమ్ము మీకు విధేయులుగఁ జేసికొన వలెనని కోరుచున్నారు. అది కానేరదు. అట్లు మీరు కోరుచుండినచో మీగొప్పతనమును సూచించు స్పష్టమైన ప్రమాణము (సన్నదు) మాయొద్దకుఁ దీసికొని రండు. అపుడు చూతము. మేముకోరినట్లు సూచనలు చూపవలెను సుమా! అని పలుకసాగిరి. 11. అపుడు ప్రవక్తలు మేము కూడ మీవంటి మానవులమే. మేము వేఱుజాతికి సంబంధించిన వారలము కాము. మానవ జాతికి సంబంధించిన వారలమే. కాని దేవుఁడు తనయనుగ్రహమువలన మాకు ప్రవక్త పదవి నొసంగి యున్నాఁడు. అది దేవుని యిష్టము. తాను కోరిన వారికి మేలు చేయును. మానవులలో బుద్ధి దేహబలమును బట్టి వ్యత్యాసమున్నది గదా! అటులే ఆత్మిక బలములో కూడ వ్యత్యాసము గలదు. దేవుఁడు ప్రవక్తలకు ఆత్మిత బలము నొసంగి యున్నాఁడు. ఆతఁడు తన సందేశము వారికిఁ బంపుచున్నాఁడు. మేము ప్రవక్తలమని సూచించు ప్రమాణ సూచనల మేము ముందే మీకు చూపి యున్నారము. బుద్ధిమంతులకు అవి చాలును. ఇఁకమీరు కోరు సూచనలు చూపవలెనన్న అది మాచేతిలో లేదు అది దేవుని యిష్టము. తాను కోరిన సూచనలు చూపును. మీరు కోరిన సూచనలు మీరు చూచినను

మీకు విశ్వాసము సన్మార్గము లభించదు. అది దేవుని యనుగ్రహమువలన లభించును. కావున విశ్వాసులు దేవుని పైననే ఆధార పడవలెను. 12. మీరు తిరస్కరించి మాకు కష్టములు పెట్టి మమ్ము హింసించినచో మేము దానికి సహించి దేవుని సహాయము పైననే మేము ఆధార పడుదుము. మాకు చింతలేదు. దేవుఁడు మాకు జ్ఞాన మొసంగి యాతని ప్రీతి పడయు మార్గములు మాకు చూపి యున్నాఁడు. ఆమార్గములనే మేము అనుసరింతుము. మీయిష్టము వచ్చినట్లు మాకు కష్టము పెట్టుఁడు. మేము సహింతుము. ఆతని పైననే యాధార పడుదుము. మేము మా ప్రచారము వదలము స్థిరముగా నుందుము అని పలికిరి.

13. వ-ఖాలల్-లజీన-కఫరూ-లి-రుసులిహిమ్-లనుఖ్-రిజన్నకుమ్-మిన్ అర్జినా-ఔ-ల-తఊ-దున్న ఫీ-మిల్లతినా-ఫ-ఔహా-ఇలైహిమ్-రబ్బుహుమ్-ల-నుహ్లి-కన్న-జ్-జాలిమీన్. 14. వల-నుస్-కినన్న-కుముల్-అర్జ-మింబ-అ-దిహిమ్-జాలిక-లిమన్-ఖాఫ-మఖామీ-వ-ఖాఫ-వఈద్. 15. వస్-తఫ్-తహూ-వ ఖాబ-కుల్లు-జబ్బారిన్-అనీద్. 16. మిన్-వరా-ఇహీ-జహన్నము-వ-యుస్ఖా-మిమ్-మాఇన్-సదీద్. 17. యత-జర్రఉహూ-వలా-యకాదు-యుసీగుహూ-వ యాతీ-హిల్-మౌతు మిన్-కుల్లి-మకానిన్-వమా-హువ-బి మయ్యితిన్-వ-మిన్-వరా-ఇహీ-అజాబున్ గలీజ్.

13. మఱియు అవిశ్వాసులు తమ ప్రవక్తలతో తప్పక మేము మా భూమి (దేశము) నుండి మిమ్ము వెడల గొట్టుదుము లేదా మీరు మామతము లోనికి తిరిగిరండు అని పలుకఁగా వారి ప్రభువు, మేము దుర్మార్గులను నశింపఁజేయుదుము, 14. మఱి వారి పిదప ఆ భూమిలో మిమ్ము వసింపఁ జేయుదుము. ఇది ఎవఁడు నాయెదుట నిలుచుటకు భయపడునో ఎవఁడు నాశిక్షను గూర్చి యున్న వాగ్దానమునకు భయపడునో వానికిఁగా నున్నది అని ప్రవక్తలకు సందేశము పంపెను. 15. మఱియు ప్రవక్తలు జయమును కోరిరి. మఱి ద్వేషియగు ప్రతి గర్వికుఁడును నష్టము పొందెను. 16. వానికి ముందు నరకమున్నది. వానికి చీమునీళ్ళు త్రాపుదురు. 17. వాఁడుదానిని గుటిక గుటికగాత్రాగును. మఱి అది సులభముగా గొంతులోనికి పోవునది కాదు. మఱి వానికి ప్రతి దిక్కునుండి చావు వచ్చుచుండును. కాని వాఁడు చావఁడు. మఱి వానికి ముందు కఠిన బాధ యున్నది.

వ్యా॥ 13. అవిశ్వాసులు ప్రవక్తల బోధలు విని మీమాటలు అటుండనిండు. ఈ రెంటిలో నేదైన ఒకటి జరిగియే తీరవలెను. మీరు మా పాతమతము

లో తిరిగి చేరుడు. లేనిచో మిమ్ము మా దేశమునుండి వెడలఁ గొట్టుదుము అని దండింప సాగిరి. 14. అపుడు దేవుఁడు తన ప్రవక్తలకు నిట్లు సందేశము పంపి యూరడించెను. ఈ దుర్మార్గులు మిమ్ము వెడలఁ గొట్టఁజాలరు. వీరు మాశిక్షకు పాత్రులై నశింతురు. మరల వారు తిరిగి రాలేరు. ఈదుష్టులకు బదులుగా మిమ్ము మీతోఁబాటు మీ యనుచరులను అందు వసింపఁ జేయుదుము. ఈ విజయము దేవునికిభయపడి భయభక్తులువహించి, దేవుఁడుతమ్ము చూచుచున్నాఁడు అని తలఁచి పాపముల జోలికి పోక తీర్పు దినమునందు కర్మల తీర్పుకుఁగాను దేవుని యెదుట నిలువవలసి యున్నది. ఆతని కఠిన శిక్షనుండి తప్పించు వారెవరును లేరు అని భయపడు వారికిఁ గలదు. హెచ్చరిక:- మక్కాలోని కాఫిర్లు హజ్రత్ రసూలువారిని మక్కాపురము విడిచి పోవునట్లు చేసిరి. తుదకు మక్కాపురము జయింపఁబడి యందు కాఫిర్లు లేక ముసల్మానులే వసింప సాగిరి. 15. అవిశ్వాసుల దుష్టత్వము హెచ్చుకాఁగా ప్రవక్తలు దేవునియొద్దసహాయము వేఁడి తీర్పు కావలెనని కోరిరి. ప్రవక్తలు పార్థించినట్లు ప్రవక్తలకు దేవునిసహాయము వచ్చెను. వారును వారి యనుచరులును రక్షింపఁ బడిరి. సత్యమును తిరస్కరించి విశ్వసింపక గర్వము వహించి వారందఱు దేవుని శిక్షకు పాత్రులై నశించిరి. 16. ఇది యిహమునందు గలిగెను. పరమునందు చాల కఠిక నరకబాధ యున్నది. అందువారికి చాల దప్పి గలుగును. దానికి చీమునీళ్లు త్రాగుటకు వారికి నియ్యఁబడును. 17. నరక నివాసులు దానిని సంతోషముగా త్రాగరు. బలవంతముగా త్రాగలేక త్రాగుదురు. అది సులభముగా కడుపులో పోదు గొంతులో నిలుచుకొనును. కడుపులో పోయి పేగులను కోసివేయును. ప్రతి దిక్కునుండి వారికి చావు వచ్చును. చాల బాధ కలుగును. ఆబాధల సహింపలేక చావు వచ్చిన బాగుండును అని కోరుదురు. కాని వారు చావరు. వారికి ఒకబాధ వెనుక మఱొక క్రొత్తగా కఠినబాధ గలుగుచుండును. (దేవుఁడు మమ్ము రక్షించుగాత)

18. మసలుల్-లజీన-కఫరూ-బిరబ్బి-హిమ్-అఅ-మాలు-హుమ్-క-రమాదినిష్-తద్దత్_బిహిర్-రీహు-ఫీ-యౌమిన్-ఆసిఫిన్-లా-యఖ్-దిరూన-మిమ్మా-కసబూ-అలా-షై-ఇన్-జాలిక-హువజ్-జలా-లుల్-బఈద్.

18. తమ ప్రభువును తిరస్కరించిన వారి కర్మల (గతి) విషయము తుపాను దినమున గొప్పగాలి తగిలిన బూడిదవలె నున్నది. వారు తాము చేసిన కర్మలపై శక్తి పొందరు. ఇది చాల దూరమైన దుర్మార్గమున్నది.

వ్యా॥ 18. ఈవాక్యములో దేవునిని నమ్మని యవిశ్వాసుల కర్మలు నిష్ఫలమగును అని చెప్పబడినది. అవిశ్వాసులు తాము మంచికార్యములు చేయుచు

న్నారుగదా! ఇహలోకములోని మా కర్మలు పరమునందు పనికి వచ్చును అని యూహించిరి. విశ్వాసము లేనిచో మంచికార్యములు పరలోకమునందు పనికిరావు. ఎట్లు తుపాను గాలి వీచునపుడు బూడిద చెల్లాచెదరై యెగిరి పోయి చేతికి చిక్కదో అటులే అవిశ్వాసులు ఇహమునందు చేసిన కర్మలు పరమునందు వృథాపోవును. దానికి పుణ్య ఫలితము కాఫిర్లకు లభింపదు. దానిని పొందుటకు వారికి శక్తియుండదు. తీర్పుదినమునందు పుణ్య కార్యములు చాల అవసరము లైనవి. అట్టి సమయములోనే అవి దొరకవు. కావున ఇది చాలదూరమైన దుర్మార్గము యొక్క ఫలితము.

18. అలమ్-తర-అన్నల్లాహ-ఖల-ఖస్-సమా-వాతి-వల్-అర్జ-బిల్-హఖ్ఖి-ఇన్ యషా-యుజ్-హిబ్-కుమ్-వ-యాతి-బి-ఖల్ ఖిన్-జదీద్. 20. వమా జాలిక-అలల్లాహి-బి-అజీజ్. 21. వ-బరజూ-లిల్లాహి-జమీ-అన్-ఫ-ఖాలజ్-జుఅ ఫాఉ-లిల్ల-జీ నస్-తక్-బరూ-ఇన్నా-కున్నా-లకుమ్ తబ-అన్-ఫహల్ - అన్-తుమ్-ముగ్-నూన-అన్నా-మిన్-అజా-బిల్లాహి-మిన్-షైఇన్-ఖాలూ-లౌ-హదా నల్లాహు-లహదైనా-కుమ్-సవా-ఉన్-అలైనా-అ-జ-జిఅ నా అమ్-సబర్నా-మా లనా-మిమ్-మహీస్.

19. ఏమి, దేవుడు ఆకాశములను భూమిని స్థిరముగా సృష్టించుటను నీవు చూడలేదా! దేవుడు కోరినచో మిమ్ము దీసి వేసి క్రొత్త సృష్టిని చేయును. 20. మఱియిది దేవునికి కష్టమైనదికాదు. 21. మఱియు వారందఱును దేవుని యెదుట నిలుతురు. ఆ పిదప బలహీనులు గర్వులతో మేము మిమ్ము అనుసరించితిమి. కావున మీరు మానుండి దేవుని శిక్షను కొంచెమైనను తొలగింపఁ గలరా అని పలుకుదురు. వారు దేవుఁడు మమ్ము సన్మార్గములో నడిపించి యుండినచో మేము కూడ మిమ్ము సన్మార్గములో నడిపించియుందుము. ఇపుడు మేము సహింపక పోయినను సహించినను మావిషయము సమానమే. మాకు మోక్షము లేదు అని పలుకుదురు.

వ్యా॥ 19,20. కాఫిర్లు మేము చచ్చి మట్టియై పోయి తిరిగి సజీవులై శిక్షపొందుట వట్టిమాటలు అని తలంప సాగిరి. దానికి నిందు దేవుఁడు సర్వశక్తుడు. భూమ్యాకాశములను స్థిరముగా సృష్టించెను. అట్టి సర్వశక్తుఁడు మిమ్ము తిరిగి సజీవులుగా చేయఁ గలఁడు. లేదా మీకు బదులుగ క్రొత్తసృష్టిని చేయఁగఁ గలడు. ఇది దేవునికి కష్టమైన పనికాదు. అతఁడెద్దియును వృథా పుట్టించలేదు. ప్రతి దానికిని కారణమున్నది. మానవసృష్టివృథాలేదు. కావున ఈలోకమునకుపిదప

పరలోకమున్నది. అందు మానవసృష్టి ఫలితము బయలుపడును. 21. తీర్పుదినము నందు అందఱును దేవుని యెదుట తమ తమ కర్మల తీర్పుకై నిలుతురు. అప్పుడు ఇహమునందు ప్రవక్తలను నమ్మక తిరస్కరించి గర్వము వహించిన పెద్దలను బల హీనులు అనుసరించిరిగదా! ఆ బలహీనులు దేవునిశిక్షకు లోనై నరకములోఁబడి తమ నాయకులతో అయ్యా! మీరు మా పెద్దలు. మీరు మమ్ము దేవుని శిక్ష నుండి కొంచెము తప్పించుఁడు అని వేడుకొనుదురు. అపుడు ఆనాయకులు మే మేమియు చేయలేము. మేము సన్మార్గము పొందియుండినచో మిమ్ముకూడ స న్మార్గమునందు నడిపించి యుందుము. కాని మేము సన్మార్గము తప్పి మేము చెడి నది గాక మిమ్ము చెఱచితిమి. మేము సహింపక యేడ్చిన ఫలములేదు. సహించి యూరకుండిన ప్రయోజనములేదు. మనకున్న బాధ తొలగదు. మనలకు మోక్షము లేదు అని పలుకుదురు.

22. వ-ఖాలష్-షైతాను-లమ్మా-ఖుజి-యల్-అమ్రు-ఇన్నల్లాహ-వఅద-కుమ్-వఅ-దల్-హఖ్ఖి-వ-వఅత్తు కుమ్-ఫ-అఖ్ లఫ్-తుకుమ్-వ-మా - కాన-లీ అలై-కుమ్-మిన్-సుల్తానిన్-ఇల్లా అన్-దఔ-తుకుమ్-ఫస్-తజబ్-తుమ్ - లీ-ఫ లా-తలూమూనీ-వలూ-మూ-అన్-ఫుసకుమ్-మా-అనా-బి-ముస్-రిఖి-కుమ్ - వ-మా-అన్తుమ్-బి-ముస్-రి-ఖియ్య-ఇన్నీ కఫర్తు-బిమా-అష్-రక్తుమూని - మిన్-ఖబ్ లు-ఇన్నజ్-జాలిమీన-లహుమ్-అజాబున్-అలీమ్. 23. వ-ఉద్-ఖి-లల్-లజీన-ఆమనూ వ-అమి-లుస్-సాలిహాతి-జన్నాతిన్ - తజ్రీ-మిన్-తహ్-తిహల్-అన్హారు-ఖాలిదీన-ఫీహా-బి-ఇజ్ని-రబ్బిహిమ్-త-హియ్యతుహుమ్ - ఫీహా-సలామ్.

22. మఱియు సర్వకార్యములగూర్చి తీర్పు అయినపుడు నిశ్చయముగా దేవుఁడు మీకు సత్యమైన వాగ్దానము చేసియుండెను. మఱి నేను మీతో వాగ్దా నము చేసితిని. పిదప దానికి వ్యతిరేకము చేసితిని. మఱి నాకు మీపై నధికార బలము లేకుండెను. కాని నేను మిమ్ము పిలిచితిని. మీరు నామాట అంగీకరించి తిరి. కావున మీరు నన్ను నిందింపకుఁడు. మఱి మీరు మీయాత్మల నేనిందించు కొనుఁడు. నేను మీకు తోడుపడఁజాలను. మఱి మీరు నాకు సహాయముచేయఁ జాలరు. దీనికిముందు మీరు నన్ను (దేవునితో) సమానునిగాఁజేసిన విషయము తిరస్కరించుచున్నాఁడను. నిశ్చయముగా దుర్మార్గులకు దుఃఖకరమైన శిక్షయు న్నది అని సైతాను పలుకును. 23. మఱియు విశ్వసించి సత్కార్యములు చేసిన

వ్రాకి కాలువలు ప్రవహించు స్వర్గవనములున్నవి. అందు వారు తమ ప్రభువు సెలవుచే సదా యుందురు. అందు వారు సలామ్ అని అభినందించుకొందురు.

వ్యా॥ 22. తీర్పుదినము (ఖియామతు) నందు అందఱి కర్మలగూర్చి తీర్పు అయి విశ్వాసులు స్వర్గములోను, అవిశ్వాసులు నరకములోను ప్రవేశింతురు. అపుడు నరకములోనికి బోవు అవిశ్వాసులు, సైతానును నిందించుచు మేము నీమాట విని చెడితిమి! ఇపుడు మామోక్షమునకుఁగాను సిఫారసుచేసి యత్నించుము అని పలుకుదురు. దానికి సైతాను, ఇట్లు బదులు పలుకును. నిశ్చయముగా దేవుఁడు తన ప్రవక్తల మూలమున, విశ్వాసులకు స్వర్గము మోక్షము నిత్తును అనియు అవిశ్వాసులకు నరకము నిత్తును అనియు వాగ్దానము చేసెను. అది నిజమైనది. నేను పలికిన మాటలు, నావాగ్దానములు అసత్యములు. దానికి మీరు మోసపోయి నామాట వింటిరి. మీరు కొంచెము యోచించియుండినచో నాయర్థము మీకుఁ దెలిసియుండునది. కాని మీరట్లుయోచింపక నామాట అంధులై విని యవిశ్వాసులైతిరి. నేను మీకు బలవంతముచేయలేదు. నాకు మీపై అధికారముకూడ లేకుండెను. కాని మిమ్ము ప్రోత్సాహపఱచి పాపములవైపునకు పిలిచితిని. మీరు నామాట విని పాపములు చేసితిరి. కావున నన్ను నిందించుట సరికాదు. అది మీయాత్మల తప్పు. కావున మీరు మీయాత్మలనే నిందించుకొనుఁడు. ఇపుడు నేను మీకేలాటి సహాయముచేయలేను. మీరు కేకలు వేసి పిలిచిన ఫలములేదు. మీరుకూడ నాకు తోడుపడఁజాలరు. మనము ఉభయులమును పాపముచేసినవారలమే. ఇహమునందు మీరు నన్ను దేవునితో సమానునిఁగఁజేసి నన్ను పూజించితిరి. దానిని నేను తిరస్కరించుచున్నాను. నేను దానికి బాధ్యుఁడనుకాను. దుర్మార్గములుచేసినవారికి తప్పక నరకబాధ గలుగును. ఇపుడు మొఱలుపెట్టిన ఫలములేదు అని పలుకు సైతానుమాటలు అవిశ్వాసులు విని నిరాశులగుదురు. కావున మానవులు రాఁబోవుతీర్పుదినమునకుఁగాను ఇపుడే మంచి ప్రయత్నములుచేసి మోక్షము పొందవలెను.23.విశ్వసించి మంచిపుణ్యకార్యములు చేసినవారికి మోక్షము లభించి స్వర్గములభించును. అందు దేవుని సెలవుచే సదాయుండి సౌఖ్యములు పొందుచుందురు. స్వర్గనివాసులు ఒకరితోనొకరు కలిసినపుడు సలామ్ అని పలుకుదురు. ఇహమునందు సలామ్ అనగా శాంతిగలుగుగాక అని యర్థము. పరమునందు మోక్షము లభించినందులకు అభివందనము.

24. అలమ్-తర-కైఫ-జర-బల్లాహు-మసలన్-కలిమతన్-తయ్యి-బతన్-క-షజ-రతిన్-తయ్యి-బతిన్-అస్లుహా-సాబితున్-వ-ఫర్ ఉహా-ఫిస్-సమాఇ. 25. తూతీ-ఉకులహా-కుల్ల-హీనిమ్-బి-ఇజ్ని-రబ్బిహా-వ-యజ్-రిబుల్లా-హుల్-అమ్

సాల-లిన్నాసి-లఅల్లహుమ్-యత-జక్కరూన్. 26. వ-మసలు-కలిమతిన్-ఖబీ-సతిన్-క-షజ-రతిన్-ఖబీ స-తినిజ్-తుస్సత్-మిన్-ఫౌఖిల్-అర్జి-మాలహా - మిన్-ఖరార్. 26. యుసబ్బి తుల్లా-హుల్-లజీన-ఆమనూ-బిల్-ఖౌ-లిస్ సాబితి-ఫిల్ హయాతిద్-దున్యా-వ-ఫిల్-ఆఖిరతి-వ యుజిల్-ఉల్లా-హుజ్-జాలి- మీన వ-యఫ్-అలుల్లాహు-మా యషాఉ.

24. మంచిమాట మంచిచెట్టువలె నున్నది. దాని వేరు స్థిరముగా నాటు కొనియున్నది. దాని శాఖలు ఆకాశములో నున్నవి. 25. దేవుని సెలవుచేదాని ఫలములు ప్రతి కాలమ్ములో వచ్చుచున్నవి అను పోలిక నెట్లు దేవుఁడు వివరించెనో నీవు చూడలేదా! జనులు గమనించుటకై దేవుఁడు పోలికలను వివరించుచున్నాఁడు. 26. మఱియు చెడ్డమాట, భూమిపైనుండి పెల్లగింపఁబడిస్థిరత్వము లేని చెడ్డచెట్టువలె నున్నది. 27. దేవుఁడు స్థిరమైన మాటచే ఇహలోక జీవన మందును పరలోకమందును, విశ్వసించినవారిని స్థిరపఱచును. మఱి దేవుఁడు అన్యాయస్థులకు దారి తప్పించును. మఱి దేవుఁడు తాను కోరునది చేయును.

వ్యా॥ 24: 25. దేవుని యేకత్వము సూచించు వాక్యము, విశ్వాసము, సత్యము మొదలగునవి మంచిమాటలో చేరినవి. ఖర్జూరపు వృక్షము మొదలగునవి మంచి చెట్టులో చేరినవి. దేవుఁడు మంచిమాటను మంచి వృక్షముతో సరి పోల్చియున్నాఁడు. ఆ చెట్టుయొక్క వేళ్లు భూమిలో చాల లోతుగ నాటుకొని స్థిరముగా నున్నవి. దాని శాఖలు చాల యెత్తుగ పోయి ఆకాశమువఱకు వ్యాపించినవి. దానికిఫలములు దేవుని సెలవుచే ప్రతికాలములో వచ్చును. ఇట్టి చెట్టు పెద్దగాలి తగిలినను పడక స్థిరముగా నిలుచును. దానిఫలమువలన చాల ప్రయోజనముగలదు. అటులే మంచిమాట (విశ్వాసము) భక్తుల హృదయములో నాటుకొని యెన్ని సందేహములు గలిగినను అది మందగిల్లక దాని జ్యోతి ఆకాశమువఱకు వ్యాపించి దాని మంచి ఫలితము సదా విశ్వాసులకు లభించును. ఇందు విచారించుకొనఁది జనులకు జ్ఞానము కలుగును. కావున దేవుఁడు వివరించు పోలికలను మానవులు గమనింపవలెను. 26. అవిశ్వాసము, అబద్ధము, వంచనపుమాటలు చెడ్డమాటలో చేరినవి. వెఱ్ఱిపుచ్చు మొదలగునవి చెడ్డచెట్టులో చేరినవి. చెడ్డచెట్టుయొక్క వ్రేళ్లు భూమిలో నాటుకొనక పైపైననే పెల్లగింపఁబడియుండి నిలకడ, స్థిరములేకయుండి కొంచెము గాలి తగిలినంతనే పడిపోవును. అటులే అసత్యమునకు, అవిశ్వాస మాటలకును స్థిరత్వముండదు. కొంచెము గమనించినచో అవి అసత్యములని తెలియనగును, భక్తులు విశ్వాస

మునందు స్థిరముగా నుందురనియు అవిశ్వాసులకు స్థిరమైన బుద్ధియుండదనియు ఈ పోలికవలన తెలియుచున్నది. 27. దేవుఁడు విశ్వాసులను వారి విశ్వాసపు వాక్యములవలన ఉభయలోకములలోను వారిని స్థిరముగానుంచును. వారికి ఎన్ని కష్టములు వచ్చినను వారియందున్న విశ్వాసము వలన వారు చలింపక స్థిరముగా నుందురు అవిశ్వాసులును, విగ్రహారాధకులును సన్మార్గముతప్పిపోవుదురు. న్యాయమార్గమును వదలి అన్యాయమునకుఁ బోయినవారు. కావున దేవుఁడు వారు కోరినట్లు వారిని దుర్మార్గములోనే యుంచును. దేవుఁడు తాను కోరినట్లు ఎవరితో నెట్లు ప్రవర్తింపవలెనో వారితో నట్లు ప్రవర్తించును.

28. అలమ్-తర-ఇలల్-లజీన-బద్దలూ-నిఅ్-మ-తల్లాహి-కుఫ్-రన్-వ అహల్లూ-ఖౌమ-హుమ్-దారల్-బవార్. 29. జహన్నమ-యస్-లౌనహా-వ బీసల్ ఖరార్. 30. వ-జఅలూ లిల్లాహి-అన్-దాదల్-లి-యుజిల్లూ-అన్ - సబీలిహీ-ఖుల్-తమత్తఉూ-ఫఇన్న-మసీ-రకుమ్-ఇలన్నార్.

28. దేవుఁడు చేసిన మేలునకు బదులుగ కృతఘ్నతచేసి తమ జనులను వినాశ గృహములో దింపినవారిని నీవు చూడలేదా ! 29. అది నరకము. అందు వారు ప్రవేశింతురు. అది చాలచెడ్డనివాసము. 30. మఱి వారు దేవునిమార్గము నుండి ప్రజలను తప్పించుటకై దేవునికి సమానులుగ (నితరులను) నియమించిరి. మీరు లాభములు పొందుఁడు. పిదప మీరు నరకాగ్నివైపునకుపోవలసియున్నది అని ఓ ప్రవక్తా ? పలుకుము.

వ్యా॥ 28. అవిశ్వాసుల నాయకులు తమకుఁ గలిగిన దేవుని మేళ్ళను మఱచిపోయి, కృతఘ్నత చేయసాగిరి. దేవుఁడు జనుల మేలుకొఱకు తన ప్రవక్తను పంపి ఖురానుగ్రంథము నొసంగెను. ఖురైషులను అరబ్బులపై నాయకులుగఁ జేసెను. దేవుఁడు గావించియున్న ఉపకారమునకు బదులుగ ఖురైషులు మొదలగు అవిశ్వాసులు, హజ్రత్ రసూలువారిని నమ్మక వారికి ననేక కష్టములుపెట్టి వారిని చంపవలెనని యత్నించిరి. దేవుని మాటలను తిరస్కరించిరి. తుదకు తమ జనులనుకూడ వినాశములో పడవేసిరి. ఇహమునందు అవమానము పొంది పరమునందు నరకములో ప్రవేశింతురు. నరకము చాల చెడ్డది. అందు ఘోరబాధలు వారికిఁ గలుగును. 30. అవిశ్వాసులు దేవుని యనుగ్రహములను తలఁచి దేవునికి విధేయులై యుండుటకు బదులుగ కృతఘ్నులై దేవునికిసమానులుగ విగ్రహములను చిల్లరదేవతలను కల్పించిరి. దానివలన ప్రజలను సన్మార్గమునుండి తప్పించుటకు యత్నించుచు మూఢులను మోసపుచ్చుచున్నారు. ఇట్లు మూఢులను మోసపుచ్చి వారివలన ఇహమునందు కొంత లాభముపొందుఁడు.

తరువాత దానికి ఫలితముగా నరకాగ్ని మీనివాసమగును.

31. ఖుల్ లి-ఇబా-దియల్-లజీన-ఆమనూ-యు-ఖీ-ముస్-సలాత-వ-యున్ఫిఖూ-మిమ్మా-రజఖ్నాహుమ్ సిర్రన్-వ-అలా-నియతమ్-మిన్-ఖబ్లి అన్-యాతియ-యౌముల్-లా-బైఉన్-ఫీహి-వలా-ఖిలాల్.

31. విశ్వసించినట్టి నాభక్తులతో వారు నమాజులను స్థిరముగా సలుప వలెను అనియు వ్యాపారముగాని, స్నేహముగాని, చెల్లని దినము రాకమునుపే మేము వారికి నొసంగిన దానిలో రహస్యముగను, వెల్లడిగను ఖర్చు చేయవలెను. అనియు ఓ పవిత్రుడా! పలుకుము.

వ్యా॥ 31, ఇందు ముసల్మాను భక్తులు ఏలాగుండ వలెనో బోధింపఁబడినది. వారు భయభక్తులతో అయిదు పూఁటలుక్రమముగా నమాజుసలుపవలెను. దేవుఁడొసంగిన ధనధాన్యములలో కొంత భాగము దేవుని ప్రీతికొఱకు నిఱుపేదలకు దానము చేయవలెను. సమయోచితముగ ఎవరికిఁ దెలియకుండ రహస్యముగను, వెల్లడిగను దానము చేయవచ్చును. ఇహలోకమునందే పుణ్యకార్యములు చేసికొన వలెను. తీర్పు దినమునందు వ్యాపారముగాని స్నేహముగాని పనికిరావు. అప్పుడు డబ్బిచ్చి పుణ్యములు కొనఁజాలరు. ఏ స్నేహితుఁడును తన పుణ్యములు ఒసంగఁడు. మానవునకు తన కర్మలే పనికి వచ్చును.

32. అల్లాహుల్లజీ-ఖల-ఖస్-సమావాతి-వల్-అర్జ-వ-అన్-జల-మినస్-సమాఇ-మా-అన్-ఫ అఖ్-రజ-బిహీ-మినస్-సమ-రాతి రిజ్-ఖల్-లకుమ్ వసఖ్ఖర లకు-ముల్-ఫుల్ కలి-తజ్-రియ-ఫిల్-బహ్రి-బి-అమ్రిహీ-వ-సఖ్ఖర-లకుముల్-అన్హార్. 33. వ-సఖ్ఖర-లకుముష్-షమ్స-వల్-ఖమర-దా-ఇబైని-వ-సఖ్ఖర-లకుముల్-లైల-వన్-నహార్. 34. వ-ఆతాకుమ్-మిన్-కుల్లి-మా-సఅల్-తుమూహు-వ-ఇన్-త-ఉద్దూ-నిఅ-మతల్లాహి-లా-తుహ్-సూహా-ఇన్నల్ ఇన్సాన-ల-జలూముఙ్-కఫ్-ఫార్.

32. ఎవఁడు ఆకాశములను భూమిని సృష్టించి ఆకాశమునుండి నీళ్ళను దింపి దాని నుండి మీ యాహారము కొఱకు ఫలములను దీసెనో, ఆతఁడే దేవుఁడు. మఱియు ఆతఁడు తన సెలవుచే సముద్రములో నావలు పోవుటకుఁగాను వానిని మీ అధీనము చేసెను. మఱియు నావలను మీ వశము చేసెను. 33. మఱియు ఆతఁడు మీపనికిఁగాను సూర్యుని చంద్రుని సరిగా నొక నియమమునందు నుంచియున్నాఁడు. మఱి రాత్రింబవలను మీ పనిలో తగిలించియున్నాఁడు.

34.మఱియు మీరు అడిగిన దానినంతయు మీ కొసంగి యున్నాఁడు. మఱియు మీరు దేవుని యనుగ్రహములను లెక్కింప వలెనన్న మీరు లెక్క చేయఁజాలరు. నిశ్చయముగా మానవుఁడు చాల అన్యాయస్థుఁడును, కృతఘ్నుఁడును.

వ్యా॥ 32. దీనికి ముందు అవిశ్వాసులను విశ్వాసులను గూర్చి చెప్పఁబడియెను. ఇఁక మానవులందఱును యోచించి దేవుని మహిమను కొనియాడఁదగిన విషయములు దెలుపఁ బడుచున్నవి. దేవుఁడు మానవులను చాల యనుగ్రహించియున్నాఁడు. భూమ్యాకాశములను సృష్టించి యందు మానవులను వసింపఁజేసి వారి యాహారమునకుఁ గాను ఆకాశము నుండి నీళ్లు కురిపించుచు యానీళ్ళవలన అనేక ఫల ధాన్యములను పుట్టించు చున్నాఁడు. ఇట్టి సర్వశక్తుఁడే దేవుఁడు కాఁగలఁడు. కావున మానవులు ఆతనినే యారాధింప వలెను. భయంకరమైన సముద్రములు దాఁటుటకుఁగాను నావలు ఓడలు మానవులకు దేవుఁడొసంగి యున్నాఁడు. అటులే నదుల వలన అనేక లాభములు మానవులు పొందుచున్నారు. 33. ఇటులే సూర్యచంద్రులు తమ నియమము ప్రకారము వచ్చిపోవుటచే మానవులు అనేక పనులను చేయుచున్నారు. మానవులు వానివలన అనేక లాభములు పొందుచున్నారు. అటులే రాత్రింబవలు మానవుల పనికి వచ్చుచున్నవి. 34. మానవులకు కావలసిన వన్నియు సమయోచితముగ దేవుఁడొసంగి యున్నాఁడు. అందు ఏలాటి కొఱతలేదు. దేవుఁడు మానవులకు గావించిన మేళ్లు లెక్కకు మించినవి. ఎవరైనలెక్క చేయవలెనని యత్నించిన వారిచేత కానేరదు. ఎవరును దేవుని యనుగ్రహములను లెక్కింపఁ జాలరు. కావున మానవులు దేవుని మేళ్ళను తలఁచి దేవునికి కృతజ్ఞులై యుండవలెను. కాని మానవజాతిలో పెక్కురు చాల అన్యాయములు చేయుచు కృతఘ్నులై యున్నారు.

35. వ-ఇజ్-ఖాల-ఇబ్రాహీము-రబ్బిజ్-అల్-హాజల్- బలద- ఆమినన్-వజ్-నుబ్ నీ-వ-బనియ్య-అన్-నఅ-బుదల్-అస్-నామ్. 36. రబ్బి-ఇన్న-హున్న అజ్-లల్న-కసీ రమ్-మినన్-నాసి ఫ-మన్-తబి-అనీ-ఫ-ఇన్నహూ-మిన్నీ-వ-మన్-అసానీ-ఫ-ఇన్నక-గఫూరుర్-రహీమ్. 37. రబ్బనా-ఇన్నీ అస్ కన్తు-మిన్-జుర్రీ-యతీ-బి-వాదిన్ గైరి-జీజర్ ఇన్-ఇన్ద బైతి-కల్-ముహర్రమి రబ్బనా లి యుఖీ-ముస్సలాత-ఫజ్-అల్-అఫ్-ఇ-దతమ్-మినన్-నాసి-తహ్వీ-ఇలైహిమ్-వర్-జుఖ్-హుమ్ మినస్ సమ రాతి-ల-అల్ల-హుమ్-యష్-కురూన్. 38. రబ్బనా-ఇన్నక-తఅ-లము-మా-నుఖ్ ఫీ-వమా-నుఅ లిను వమా-యఖ్ ఫా-అలల్లాహి-మిన్-షైఇన్ ఫిల్-అర్ జి-వలా-ఫిస్-సమాఇ. 39. అల్-హమ్ దు-లిల్లా-హిల్లజీ-వహబ-లీ-అ

లల్-కిబరి-ఇస్మాఈల-వఇస్-హాఖ-ఇన్న-రబ్బీ-ల-సమీ-ఉద్-దుఆఇ. 40. రబ్బిజ్అల్-నీ-ముఖీ-మస్-సలాతి-వమిన్-జుర్రీ-యతీ రబ్బనా-వత-ఖబ్బల్-దుఆఇ. 41. రబ్బనగ్-ఫిర్లీ-వలి-వాలి దయ్య-వలిల్-మూమినీన-యౌమ-యఖూముల్-హిసాబ్.

35. మఱియు ఇబ్రాహీము "ఓ నా ప్రభువా! ఈపురమును శాంతియుతమైనదిగాఁ జేయుము. మఱి విగ్రహముల పూజనుండి నన్ను నా సంతానమును దూరముగా నుంచుము. 36. ఓ నా ప్రభువా! అవి పెక్కుమందిని దుర్మార్గములో పడవేసినవి. కావున ఎవఁడు నన్ను అనుసరించెనో వాఁడు నావాఁడగును. మఱెవఁడు నామాట వినడో నీవు క్షమించువాఁడవు. దయాళువు. 37. ఓ మా ప్రభువా! నా సంతానములో కొందఱిని పైరుపంటలేని మైదానములో గౌరవనీయమైన నీగృహమునొద్ద వసింపఁజేసితిని. ఓ మాప్రభువా! వారు స్థిరముగా నమాజు సలుపుటకుఁగాను (వసింపఁ జేసితిని.). కావున ప్రజలలో కొందఱి హృదయములను వారి పక్షము వ్రాలునట్లు చేయుము. మఱివారు కృతజ్ఞత సలుపుటకుఁగాను వారికి ఫలముల నొసంగుము. 38. ఓ మా ప్రభువా! మేము దాఁచి చేయునదియు, వెలిబుచ్చి చేయునదియు నీకుఁదెలియును. మఱి భూమిలోగాని ఆకాశములోగాని యెద్దియును దేవునికి మఱుఁగులేదు. 39. ముసలితనములోనాకు ఇస్మాయీలును ఇస్హాఖును ప్రసాదించినట్టి దేవునికి కృతజ్ఞత. నిశ్చయముగా నాప్రభువు ప్రార్థనను వినుచున్నాఁడు. 40. ఓ నా ప్రభువా! నేనును, నాసంతానమును నమాజు సలుపునట్లుగ మమ్ము చేయుము. ఓ నా ప్రభువా! నాప్రార్థనను అంగీకరింపుము. 41. ఓ మా ప్రభువా! నన్నును నాతల్లిదండ్రులను విశ్వాసులను లెక్క జరుగుదినమునందు క్షమింపుము" అని పలికినది నీవు జ్ఞప్తి చేయుము.'

వ్యా॥ 35. మక్కా ఖురైషులు హజ్రత్ ఇబ్రాహీము సంతతివారు. కావున ఇబ్రాహీము ప్రవక్త వృత్తాంతమును వారికిఁ దెలిపి వారు బుద్ధితెచ్చుకొని దేవునికి విధేయులు కావలెనని యిందు హెచ్చరింపఁబడుచున్నది. ఈపురమును అనగా మక్కాపురమును శాంతియుతముగాఁ జేయుము అని ఇబ్రాహీము వేఁడినట్లు దేవుఁడు మక్కా సరిహద్దులలోను శాంతి గలిగించెను. విగ్రహారాధన మహాపాపము. కావున దానినుండి తొలఁగి దూరముగనుండునట్లు ఇబ్రాహీము ప్రవక్త వేఁడుకొనెను. 36. విగ్రహముల వలన అనేకమంది జనులు సన్మార్గము తప్పి పోవుచున్నారు. వానిని పూజించి దుర్మార్గులగుచున్నారు. కావున ఎవఁడు నామతమగు దేవుని యేకత్వమును అనుసరించి విగ్రహారాధన మానుకొనునో

వాఁడు నామతమునకు చేరినవాఁడు. మఱి నామాట వినక దుర్మార్గములోపడి విగ్రహా రాధన చేసిన వానిని సన్మార్గము చూపి క్షమించుట ఓ ప్రభువా ! నీపని. ఎందుకన నీవు సర్వశక్తుఁడవు, క్షమించువాఁడవు, దయగలవాఁడవు. 37. ఇబ్రాహీము ప్రవక్త దేవుని సెలవుచే తన జ్యేష్ఠ కుమారుఁడగు ఇస్మాయీలును, బీబీ హాజిరాను, పైరుపంటలేని మైదానములో వదలి పోయెను. అపుడు ఇస్మాయీలు పాలుత్రాగు బిడ్డ. దేవుని శక్తి వలన అచ్చట జమ్‌జమ్ బావి యేర్పడెను. ఆ మైదానములో నీళ్లుండుట చూచి జుర్‌హూము బిడారము బీబీహాజిరా అనుజ్ఞపొంది అచ్చట వసింపసాగెను. కొంత కాలములో నచ్చట పురము ఏర్పడెను. అదియే మక్కాపురము. హజ్రత్ ఇబ్రాహీము యొక్క మొదటిభార్య బీబీసారా సిరియా (షామ్) దేశములో నుండెను. వారు అపుడపుడు సిరియాను డి మక్కాపురము వచ్చి ఇస్మాయీలును చూచి అచ్చటి నివాసులను దీవించుచు పోవుచుండిరి. కాబా మసీదుకూడ మక్కాపురములోనే వారు తమ చేతులారకట్టి యుండిరి. దేవునితో మక్కా పురవాసులకుఁ గాను సౌకర్యములు గలుగ వలెనని ఇబ్రాహీము ప్రవక్త ప్రార్థించిరి. వారు ప్రార్థించినట్లుగ దేవుఁడు ప్రసాదించెను. అప్పటినుండి యిప్పటి వఱకును ప్రతి సంవత్సరము లక్షల కొలఁది యాత్రికు (హాజీ) లు కాబా మసీదు దర్శించుటకు పోవుచు వచ్చుచు న్నారు. కావలసిన ఫలధాన్యములు చుట్టుపట్లనుండి యచ్చటికి వచ్చుచుండును. ఇవన్ని వసతులకుఁగాను తన వారు నమాజు సలిపి కృతజ్ఞత సలుపవలెనని ప్రార్థించెను. 38. దేవునికి సర్వము తెలియును. భూమ్యాకాశములలో నెద్దియును ఆతనికి మఱుఁగులేదు. రహస్యముగఁ జేసినను బహిరంగముగఁ జేసినను దేవునికిఁ దెలియును. 39. హజ్రత్ ఇబ్రాహీమునకు ముసలి తనములో బీబీ హాజిరాయందు ఇస్మాయీలు, బీబీ సారాయందు ఇస్‌హాఖు గలిగిరి. అందుకు వారు దేవునికి కృతజ్ఞత సలిపిరి. 40. తన సంతానము నమాజు సలుపవలెననియు తన ప్రార్థనలు అంగీకరింప వలెననియు ఇబ్రాహీము ప్రార్థన. తీర్పుదినమునందు అందఱి కర్మల లెక్క జరుగును. అపుడు తన్ను, తన తల్లిదండ్రులను అందఱు విశ్వాసులను క్షమింప వలెనని ఇబ్రాహీము దేవునిని ప్రార్థించెను.

42. వలా-తహ్‌సబన్నల్లాహా-గాఫి-లన్-అమ్మా- యఅ- మలుజ్- జాలిమూన్-ఇన్నమా-యు-అఖ్-ఖిరు-హుమ్-లి-యౌ-మిన్-తష్-ఖసు- ఫీహిల్- అబ్-సార్. 43. ముహ్‌-తి-ఈన-ముఖ్-నిఈ-రుఊ-సిహిమ్-లా- యర్- తద్దు- ఇలైహిమ్-తర్‌ఫు-హుమ్-వ-అఫ్-ఇ-దతుహుమ్-హవాఉ.

42,43. మఱి దుర్మార్గులు చేయు కర్మలనుండి దేవుఁడు అజాగ్రత్తగా

నున్నాఁడని నీవెప్పటికిని తలంపకుము. జనులు కన్నులు తెఱచుకొని తమ తలలను పైకి నెత్తుకొని పరుగెత్తుచు పోవునట్టి దినము వఱకు మాత్రము వారిని వదలిపెట్టి యున్నాఁడు. ఆదినమున వారికన్నులు వారికి తిరిగిరావు. మఱి వారి హృదయములు ఖాలీ శూన్యమై యుండును.

వ్యాః॥ 42, 43. దుర్మార్గులగు పాపాత్ములకు తత్క్షణమే వారి పాప కర్మలకు శిక్ష లభించుట లేదు. అందుచే దేవుఁడువారి కర్మలను ఎఱుగంగ వారి విషయము అజాగ్రత్తగా నున్నాఁడని తలంపరాదు. ఆతనికి సర్వము తెలియును. అయిన పాపులకు తత్క్షణమే శిక్ష విధింపక కొంతకాలము వదలి పెట్టు చున్నాఁడు. ఆకాలములో కొందఱు బుద్ధి తెచ్చుకొని తమపాపములను మానుకొనుదురు. మఱి కొందఱు తమ పాపములలోనె చెలరేగి పాపమును సంపూర్ణముగఁ జేసికొని శిక్షకు పాత్రులగుదురు. తీర్పుదినమునందు పాపులు భయమునొంది వారి కన్నులు తెఱచుకొని పోవును. ఱెప్పలు కొట్టుకొనఁ జాలరు. భయముతో తలలు నెత్తుకొని ఒకే వైపుననే చూచుచు పరుగెత్తు చుందురు. ఆ వైపునను వదలి రెండవ ప్రక్క చూడరు. వారిహృదయములలో మేలు కలుగును అని యాశ లేకుండును. శూన్యములై పోవును. పాపులకు తీర్పు దినమునందు భయమే గలుగును. శాంతి లభింపదు.

44. వ-అన్‌-జిరిన్నాస-యౌమ-యాతీ-హిముల్‌-అజాబు-ఫ-యఖూలుల్‌లజీన-జలమూ-రబ్బనా-అఖ్ఖిర్నా-ఇలా-అజలిన్‌-ఖరీబిన్‌-నుజిబ్‌-దఅ-వతక - వ-నత్‌-తబి-ఇర్‌-రుసుల-అవ-లమ్‌తకూనూ-అఖ్‌-సమ్‌తుమ్‌-మిన్‌-ఖబ్లు-మాలకుమ్‌ మిన్‌-జవాల్‌. 45. వ-సకన్‌తుమ్‌-ఫీ-మసా-కినిల్‌-లజీన-జలమూ - అన్‌ - ఫుసహుమ్‌-వ-తబయ్యన-లకుమ్‌-కైఫ-ఫఅల్నా-బిహిమ్‌-వ-జరబ్నా-లకుముల్‌- అమ్‌సాల్‌. 46. వఖద్‌-మకరూ-మక్‌-రహుమ్‌-వ-ఇన్దల్లాహి-మక్‌- రుహుమ్‌ - వఇన్‌కాన-మక్‌-రుహుమ్‌-లి-తజూల-మిన్‌హుల్‌-జిబాల్‌. 47. ఫలా-తహ్‌-సబన్నల్లాహ-ముఖ్‌-లిఫ-వఅదిహీ-రుసు-లహూ-ఇన్నల్లాహ-అజీజున్‌-జున్‌-తిఖామ్‌. 48. యౌమ-తుబద్దలుల్‌-అర్‌జు-గైరల్‌-అర్‌జి-వస్‌-సమా-వాతు-వ-బరజూ - లిల్లాహిల్‌-వాహిదిల్‌-ఖహ్హార్‌. 49. వ-తరల్‌-ముజ్‌-రిమీన-యౌ-మఇ-జిమ్‌-ముఖర్రనీన-ఫిల్‌-అస్ఫాద్‌. 50. సరా-బీలుహుమ్‌-మిన్‌-ఖతి-రానిన్‌-వ-తగ్‌షా-వు-జూహ-హుమున్నార్‌. 51. లి-యజ్‌-జియల్లాహు-కుల్ల-నఫ్‌-సిమ్‌-మాకసబత్‌

ఇన్నల్లాహ-సరీఉల్-హిసాబ్.52.హాజా-బలాగుల్-లిన్నాసి వలి యున్‌జరూ బిహీ-వలి-యఅలమూ-అన్నమా-హువ ఇలాహున్-వాహిదున్ వలి – యజ్-జక్కరూ-ఉలుల్-అల్బాబ్.

44. మఱియు జనులకు శిక్షగలుగుదినమునుగూర్చి వారిని భయపెట్టుము. అపుడు దుర్మార్గులు, ఓమాప్రభువా! మమ్ము కొంతకాలము వదలిపెట్టుము. మేము నీ పిలుపును స్వీకరింతుము. మఱి నీప్రవక్తలను అనుసరింతుముఅని పలుకుదురు. ఏమి! మీరు దీనికి ముందు మీకు వినాశము లేదు అని మీరుప్రమాణము చేసి పలికియుండలేదా! 45. మఱి ఎవరు తమ యాత్మలకు నన్యాయములు చేసికొనిరో వారుండు స్థలములయందు మీరు వసించియుంటిరి. మఱి మేమువారి నేమి చేసితిమో మీకు స్పష్టముగాఁ దెలిసెను. మఱి మేము మీకు అందఱి వృత్తాంతములును తెలిపితిమి అని వారితోఁ జెప్పఁబడును. 46. మఱి వారు కుత్రలు పన్నియున్నారు. మఱి దేవునియొద్ద వారి కుత్రలున్నవి. మఱి వారికుత్రల వలన పర్వతములు కదలఁజాలవు. 47. కావున దేవుఁడు తన ప్రవక్తలతోఁ జేసియున్న వాగ్దానమునకు వ్యతిరేకముగ తాను చేయును అని తలంపకుము. నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తుఁడును, ప్రతీకారముచేయువాఁడును. 48. ఈభూమి మఱొక భూమిగా మాఱిపోయి, ఆకాశములు మాఱిపోవు దినమునందు అద్వితీయుఁడును సర్వశక్తుఁడునగు దేవునియెదుట సర్వజనులు నిలుతురు. 49. మఱి ఆదినమునందు పాపాత్ములకొకరొ కొకరికి, సంకెళ్ళుతగిలింపఁబడును. 50. వారి బట్టలు గంధకముతో చేయఁబడినవిగా నుండును. మఱి అగ్ని వారిమొగములను క్రమ్ముకొనును. 51. ప్రతివానికిని తాను చేసిన కర్మల ఫలితము నొసంగుటకుఁగాను దేవుఁడు అట్లు విధించెను. నిశ్చయముగా దేవుఁడు శీఘ్రముగా లెక్క-దీసికొనువాఁడు. 52. ఈ ఖురాను సందేశము, ప్రజలకు భయబోధ నిచ్చుటకును, దేవుఁడు ఒక్కఁడు అని జనులు తెలిసికొనుటకును, బుద్ధిమంతులు గమనించుటకును పంపఁబడెను.

వ్యా! 44. ఇందు శిక్షదినము వచ్చునపుడు మానవుఁ డేమి కోరునో చెప్పఁబడినది. అపుడు కోరుటవలన ఫలములేదు. ఇహమునందు శిక్షవచ్చి పట్టినపుడును, చావువచ్చినపుడు అవసానకాలమందు మానవుఁడుతనకు కొంతకాలము వదలిపెట్టినచో ఇంతవఱకు చేసిన పాపములను మానుకొని దేవుని నమ్మి దేవుని ప్రవక్తల బోధలను అనుసరింతును అని కోరును. అటులే తీర్పుదినమునందు అవిశ్వాసులు తిరిగి మేము ఇహలోకము పోయినచో విశ్వసించి సత్కార్యములు చేయుదుము అని పలుకుదురు. దీనివలన ప్రయోజనములేదు. దీనికి దేవుఁ డిట్లు

జవాబు పలుకును. ఓ ప్రభూ! మీరు మీసంపదలలో విఱ్ఱవీఁగుచు మాసంపదలు నశింపవు. మేము ఇహమును వదలి పరము చేరము అని ప్రమాణముచేయుచుపలుక లేదా! 45. అదియునుగాక దుర్మార్గులు మాశిక్షకు పాత్రులై నశించిన పిదప ఆయాగ్రామములలో మీరు బసచేసితిరి. వారి పాపములకుఁగాను ఎట్లు వారిని శిక్షించితిమో మీకుఁదెలిసియేయుండెను. అట్లుతెలిసియుమీరుపాపకార్యములు చేసియున్నారు. 46. పూర్వము దుష్టులు, ప్రవక్తలను విరోధించి యనేక కుట్రలు చేసియున్నారు. కాని దేవుఁడు ప్రవక్తలను విశ్వాసులను రక్షించి కాపాడెను. దుర్మార్గులు చేసిన కుట్రలన్నియు దేవునియొద్ద నున్నవి. వానికిఁ దగిన శిక్ష విధించును. దుష్టుల కుట్రలవలన పర్వతములుకూడ తమ స్థానము వదలి కదలవు. ఇఁక పర్వతములకంటె నెక్కువ స్థిరముగా సన్మార్గమునందు నిలిచి యుండు ప్రవక్తలు వారి కుటిలకు చలించి లోఁబడరు. వారు తమ మతప్రచారము వదలరు. 47. దేవుఁడు ప్రవక్తలకు తోడుపడును. వారిని దుష్టులనుండిరక్షింతును అని వాగ్దానముచేసియున్నాఁడు. ఆతఁడు తన వాగ్దానము పూర్తిచేయును. ప్రవక్తలకు సహాయము చేయును. దుష్టులను శిక్షించును. ఆతనిశిక్షనుండి, ఏ దుష్టుఁడును తప్పించుకొనిపోఁజాలఁడు. 48. తీర్పుదినము (ఖియామతు) నందు ఇప్పటి భూమి ఆకాశములుండవు. అవి దేవుని యిష్టప్రకారముగా తీర్పుదినమునకుఁ దగినట్లు మాఱిపోవును. అపుడు అందఱు జనులు తమ కర్మల తీర్పుకొఱకు తిరిగి సజీవులై దేవునియెదుట నిలుతురు. 49, 50. ఆ దినమున ఒక్కొక్కవిధమైన పాపులను కలిపి సంకెళ్లతో కట్టఁబడును. పాపుల బట్టలు, అచ్చట తగినట్లు గంధకముతో చేయఁబడినవిగా నుండును. అందు చెడ్డవాసన యుండును. అవి భగ్గునమండి పాపులను బాధించుచుండును. మఱి పాపులకుచుట్టు నరకాగ్ని యుండును. ప్రత్యేకముగ వారి మొగములపై క్రమ్ముకొనుచుండును. 51. తీర్పుదినము తప్పక శీఘ్రములో వచ్చును. ఆ దినమున అందఱి లెక్క కొంతకాలములోనే దేవుఁడు తీర్చివేయును. అందు ఏలాటి ఆలస్యము కానేరదు. ప్రతి మనుష్యునికిని తానుచేసినకర్మలఫలితము తప్పకలభించును. 53. ఖురానుసందేశము సర్వజనులకుఁగాను పంపఁబడినది. దానివలన అందఱు మానవులు భయభక్తులు వహింపవలెను. దాని సూచనలు చూచి దేవునికి సాటిలేదు అని వారు తెలిసికొనవలెను. ఖురానును గమనించి బుద్ధిమంతులు బోధను గ్రహింపవలెను.

సూరయే హిజ్ రి మక్కీ 98 వాక్యములు.

బిస్మిల్లా హిర్రహ్మా-నిర్రహీమ్.
పరమదయాళువును ప్రేమించువాఁడు నగు దేవునిపేర.

1. అలిఫ్-లామ్ రా-తిల్క-ఆయాతుల్-కితాబి-వ ఖుర్ఆనుమ్-ముబీన్

# పదునాల్గవ కాండము

2. రుబమా-య వద్దుల్-లజీన-కఫరూ-లౌ-కానూ-ముస్-లి-మీన్. 3. జర్-హుమ్-యా కులూ-వ-యత-మత్తఊ-వ యుల్-హి-హిముల్ -అమలు-ఫ-సౌఫ-యఅ-లమూన్.

1. అలిఫ్-లామ్ రా. ఇవి గ్రంథము యొక్కయు స్పష్టమగు ఖురాను యొక్కయు వాక్యములు. 2. ముసల్మానులై యుండినచో బాగుండునే అని తిరస్కరించినవారు అనేకసార్లు కోరుదురు. 3. వారు తిని లాభములుపొంది యాశలు పెట్టుకొనియుండనిమ్ము. ఇఁకమీఁద వారు తెలిసికొనఁగలరు.

వ్యా॥ 1. అలిఫ్ లామ్ రా. (దీనియర్థము ముందువ్రాసియున్నాము.) ఈమహానీయములైన వాక్యములు దేవుని గ్రంథములోనివి. ఇట్టిదిమే గ్రంథము అనఁదగును. ఆ వాక్యములు స్పష్టముగా తెలుపు ఖురానులోనివి. కావున మానవులు వానిని గమనించి వినవలెను. 2. ఇపుడు అవిశ్వాసులు ఖురానును ఇస్లామ్‌ను తిరస్కరించుచున్నారు. ఇఁకమీఁద అనేక పర్యాయములు తాము ముసల్మానులై యుండిన బాగుండునే అని కోరుదురు. ఆ సమయము ఇహమునందును పరమునందును వచ్చును. ముసల్మానులకు జయము గలుగునపుడు మేము ముసల్మానులై యుండిన మాకుకూడ జయముగలిగియుండునే అనియు అవసానకాలమందు కూడను, తీర్పుదినమునందును అప్పటి కష్టములు సహింపలేక అవిశ్వాసులు తాము ముసల్మానులై యుండిన తమకు మోక్షము లభించియుండునే అని కోరుదురు. 3. అవిశ్వాసులకు నీవు చేయు బోధనవలన వారికి బుద్ధి రాకున్నచో నీవు చింతింపనక్కఱలేదు. వారిని వదలిపెట్టుము. వారు పశువులవలె తినిత్రాగి లాభములు పొంది ఆశలకు మోసపోయియుండనిమ్ము. శీఘ్రములోనే వారిగతి ఏమి కానున్నదో వారు తెలిసికొనఁగలరు.

4. వ-మా-అహ్-లక్నా-మిన్-ఖర్-యతిన్-ఇల్లా-వలహా కితాబుమ్- మ అలూమ్.5. మాతస్-బిఖు-మిన్-ఉమ్మతిన్-అజలహా-వమా-యస్-తాఖిరూన్.

4. మఱి మేము ఏ పురమును నాశము చేయలేదు. కాని దాని కాలము లిఖితమై నియమింపఁబడియుండెను. 5. ఏ జనులును తమ నియమిత కాలమునకు ముందుగాని వెనుకగాని కాఁజాఁరు.

వ్యా॥ 4. ఇందు మక్కా-పురమువారికి హెచ్చరిక గలదు. మక్కా-కాఫిర్లు చేయు పాపములకు ఎందుకు శిక్ష రాలేదు అని వారు మోసపోకూడదు. ప్రతి

దానికిని దేవునియొద్ద ఒక కాలము నియమింపఁబడినది. ఏ యే కాలమునకు ఏది సంభవింపవలెనో తప్పక సంభవించును. పూర్వము కూడ దేవుఁడు అనేక పురములను నశింపఁజేసియున్నాఁడు. దానికికూడ ఒక కాలము నియమింపఁబడియుండెను. దానికి సరిగ వారు నశించిరి. కావున మక్కాకాఫిర్లు తమ దుష్టత్వమును మానుకొనవలెను. 5. చావు బ్రతుకు, ఉన్నతదశ హీనదశ, మంచిది చెడ్డది, శుభము వినాశము మొదలగునవి తమ తమ కాలమునకు సంభవించును. దేవుఁడు నియమించిన కాలమునకు ఒక్క నిమిషము వెనుకగాని ముందుగాని కానేరదు అని హెచ్చరింపఁబడియెను.

6. వ-ఖాలూ-యా-అయ్యు-హల్ లజీ-నుజ్-జిల-అలై-హిజ్ - జిక్రు-ఇన్నక-ల-మజ్నూన్- 7. లౌమా-తా తీనా-బిల్-మలా-ఇకతి-ఇన్-కున్త-మినస్ సాదిఖీన్. 8. మా-ను నజ్-జిలుల్-మలా ఇకత-ఇల్లా-బిల్ హఖ్ఖి-వ-మా-కానూ-ఇజమ్-మున్-జరీన్. 9. ఇన్నా-నహ్ను-నజ్-జల్-నజ్-జిక్ర-వ-ఇన్నా-లహూ-లహా-ఫి-జూన్. 10. వలఖద్ అర్ సల్నా-మిన్-ఖబ్ లిక-ఫీ-షియ - ఇల్-అవ్వలీన్. 11. వ-మా-యాతీహిమ్-మిర్-రసూలిన్-ఇల్లా-కానూ-బిహీ-యస్ తహ్-జిఊన్ 11. కజాలిక-నస్-లుకుహూ-ఫీ-ఖులూ-బిల్-ముజ్ - రిమీన్. 13. లా-యూమినూన-బిహీ-వ-ఖద్-ఖలత్-సున్న-తుల్-అవ్వలీన్. 14. వలౌ ఫత హ్నా-అలైహిమ్-బాబమ్-మినస్-సమా ఇ-ఫజల్లూ-ఫీహి-యఅరుజూన్. 15. ల ఖాలూ-ఇన్నమా-సుక్కి రత్-అబ్-సారునా-బల్-నహ్ను-ఖౌముమ్ - మస్-హూరూన్.

6 అవిశ్వాసులు "ఓయీ ! ఖురానుపొందినవాఁడా ! నిశ్చయముగ నీవు పిచ్చివాఁడవు. 7. నీవు సత్యవంతుఁడవైనచో నీవెందులకు దేవదూతలన్ను మాయొద్దకు తీసికొనిరావు" అని పలుకుచున్నారు. 8. మేము దేవదూతలను వృథాగా పంపము. మఱియు నపుడు వారికి విరామము దొరకదు. 9. నిశ్చయముగా మేమే ఖురానును పంపితిమి. మఱి మేమే దానిని కాపాడుదుము. 10. మఱియు మేము నీకు పూర్వము గడచిన జనులలో ప్రవక్తలను పంపియున్నాము. 11. మఱి వారియొద్దకు వచ్చిన ప్రతి ప్రవక్తతోను వారు పరిహాసమాడుచునే యుండిరి. 12. ఇట్లు దానిని పాపుల హృదయములలో నాటుచున్నారము. 13. వారు ఖురానును నమ్మరు. మఱి పూర్వీకుల పద్ధతి గడచియున్నది. 14. మఱి మేము వారికొఱకు ఆకాశములో నొక ద్వారమును తెఱచి అందు వారు ఎగ

లంతయు నెక్కినను, 15. వారు మాకన్నులు కట్టువడినవి. మఱి మాపై జాల విద్య చేయఁబడినది అనియే పలుకుదురు.

వ్యా॥ 6, 7. మక్కాలోని అవిశ్వాసులు హజ్రత్ రసూలువారితో పరిహాసమాడుచు ఓయీ! నీకు ఖురాను వచ్చినదా! నీవు ఆఖరు ప్రవక్తవా! నీవే జయము పొందుదువు అనిపలుకుదువా. నీవు పిచ్చివాఁడవు. నీవే సత్యవంతుఁడవైన చో నీవే దేవునికి ప్రియుఁడవైనచో దేవునియొద్దనుండి నీవు వచ్చియుండినచో దేవుని సైన్యమగు దేవదూతలు నీ వెంట ఎందులకు రాలేదు. నీవు వారిని ఎందులకు తీసికొనిరాలేదు. వారు వచ్చి మాయెదుట నీవు ప్రవక్తవు అని మాతో నెందులకు పలుకరు. మేము తిరస్కరించినచో మమ్ము ఎందులకు శిక్షింపరు అని పలుకసాగిరి. దానికి జవాబు రాఁబోవు వాక్యములలో చెప్పఁబడినది. 8. భయభక్తులుగల మానవులు విశ్వసింపవలెనన్న వారికి అనేక సూచనలు గలవు. అట్లుగాక ద్వేషముగలవారికి దేవదూతలు వచ్చి వారితో మాట్లాడినను ప్రయోజనములేదు. వారు విశ్వసింపరు. అదియునుగాక దేవదూతలు వచ్చుట పిల్లల యాటకాదు. అక్కఱలేనిదే వృథాగా దేవదూతలు రారు. వారు వాస్తవమైన పనికిఁగాను వత్తురు. దుష్టులు మితిమీఱిపోయి సన్మార్గమునకు రాక అంత్యస్థితిలో నున్నపుడు దూతలు వత్తురు. అపుడు దుష్టులను నశింపఁజేయుదురు. అపుడు దుష్టులు తప్పించుకొనఁజాలరు. వారికి అవకాశము దొరకనేరదు. ప్రస్తుతము శిక్ష రాలేదు అని మక్కావారు మోసపోఁగూడదు. 9. ఓ అవిశ్వాసులార! మీరు చేయు పరిహాసమువలన హజ్రత్ ముహమ్మదుయొక్కయు ఖురానుయొక్కయు నష్టమేమియులేదు. ఖురానునుగూర్చి మా ప్రకటన వినుఁడు. ఖురానను మేము పంపియున్నారము. మేము దానిని సర్వవిధముల కాపాడుదుము. దేవుఁడు చేసిన ప్రకటన వాగ్దానము పూర్తియాయెను. ఖురాను సంపూర్ణముగ ఏలాటి మార్పులేకయున్నది' అందలి ఒక యక్షరముగాని, పొల్లుగాని మార్పుచెందలేదు. అనేక వందల సంవత్సరములయ్యు ఖురానులోను దాని యర్థభాష్యములలోను ఏలాటి మార్పులు లేక ఎట్లు హజ్రత్ రసూలువారికి నొసంగఁబడెనో యటులే యున్నది. దానిలోని ధర్మములు సదా అమలులోనికి రాఁగలవు. అనేకవందలయేండ్లు గడచినను దానిలోని ధర్మములే లోకము అనుసరించును. ఎనిమిది పదియేండ్ల ముసల్మాను బాలుఁడు పూర్తి ఖురానును కంఠపాఠము చేయును. లక్షలకొలఁది ముస్లిములు ఖురానును కంఠపాఠముచేసినవారు ప్రతికాలములోను గలరు. ఇపుడు లోకములో సర్వవిధముల రక్షింపఁబడిన మతగ్రంథమెద్దియును ఖురాను తప్ప వేఱులేదు. ఇదంతయును దేవుని యనుగ్రహము. అందులకే మ్యోర్ అను ఆంగ్లేయ పండితుఁడు "మాకు తెలిసినంతవఱకు లోకములో 12 వందల సంవత్సరములయ్యు మార్పుచెందకయున్న గ్రంథము

ఒక్క ఖురాను మాత్రమే. అట్టిది రెండవగ్రంథము లోకములో లేదు" అని పలికి యున్నాడు. 10. 11. ఈవాక్యములందును రాబోవు వాక్యములందును అవిశ్వాసులు చేయు పరిహాసమునకుగాను చింతపడకూడదు. ఇట్లు పరిహాసమాడుట పూర్వమునుండి దుష్టుల పద్ధతియై యున్నది. నీకు పూర్వము అనేక జాతుల వారియొద్దకు ప్రవక్తలు వచ్చిరి. అందలి దుష్టులు ప్రవక్తలను పరిహసించుచు వచ్చిరి. ప్రవక్తలు సహించుచు వచ్చిరి. కావున నీవుకూడ సహింపవలెను అని యూరడింపబడెను. 12. దుష్టులు ప్రవక్తలతో పరిహాస మాడుట క్రొత్తదిగాదు, దుష్టులు పాపములకు లోనై దుష్టత్వము చేయుచుందురు. అపుడు ప్రవక్తల బోధ వారు విని దానిని తిరస్కరించి పరిహాసమాడసాగుదురు. ఇది వారికలవడును. హృదయములలో పరిహాసము నాటుకొనును.అదితొలగదు. 13.కావునమక్కా వారుకూడ ఖురానునువిని పరిహాసమాడి దానిని విశ్వసింపక యున్నారు. పూర్వమునుండియు నిటులే జరుగుచు వచ్చెను. దుష్టులు ప్రవక్తలను తిరస్కరించి పరిహాసమాడి తుదకు దేవునిశిక్షకుపాత్రులై నశించిరి. భక్తులు దేవునిచే రక్షింపబడిరి. 14,15.దేవదూతలను భూమిపైకి పంపుటఆశ్చర్యముకాదు. కాని ఒకవేళ ఆకాశద్వారము తెఱవబడి వారు పైకి నెక్కి యాకాశములో పగలంత తిరిగి చూచిననుఆదుష్టులు సత్యమును నమ్మరు. అపుడుఏదో మాయచేయబడినది. మాకన్నులకు కట్టు కట్టబడినది. మాపై జాలవిద్యచేయబడినది అని చెప్పుదురు. కావునదుష్టుల మాటలను లెక్కచేయకూడదు.

16. వల-ఖద్-జఅల్నా-ఫిస్-సమా-ఇ-బురూ-జన్-వ-జయ్యన్నాహా లిన్-నాజిరీన్. 17. వ-హ-ఫిజ్నా-హా-మిన్ కుల్లి-షై-తానిర్-రజీమ్. 18. ఇల్లా-మనిస్-తర-ఖస్-సమ్అ-ఫ అత్ బఅ-హూ షిహాబుమ్-ముబీన్. 19. వల్-అర్ జ-మదద్నాహా-వ-అల్-ఖైనా-ఫీహా-రవాసియ వ-అంబత్నా-ఫీహా- మిన్- కుల్లి- షై-ఇమ్-మౌజూన్. 20. వ-జ-అల్నా-లకుమ్ ఫీహా-మఆ-ఇష వమల్-లస్-తుమ్-లహూ-బి-రాజిఖీన్. 21. వ-ఇన్-మిన్-షై ఇన్-ఇల్లాఇన్దనా-ఖజా- ఇనుహూ- వ-మా- నునజ్-జిలుహూ ఇల్లా-బిఖద-రిమ్-మఅలూమ్. 22. వ-అర్-సల్-నర్-రి-యాహ-లవా-ఖిహ-ఫ-అన్-జల్నా-మినస్-సమాఇ- మాఅన్-ఫ- అస్- ఖైనా-కుమూహు-వ-మా-అన్తుమ్-లహూ-బి-ఖాజినీన్. 23. వ-ఇన్నా- ల- నహ్ను-నుహ్ఈ-వ నుమీతు-వ-నహ్నుల్-వారిసూన్.24. వలఖద్-అలిమ్-నల్-ముస్-తఖ్-దిమీ-న-మిన్-కుమ్-వ-లఖద్-అలిమ్-నల్-ముస్- తాఖిరీన్. 25. వ-ఇన్న-

రబ్బిక-వ-హువ-యహ్హా. షురుహూమ్.ఇన్నహూ-హ కీమున్-అలీమ్.

16. మఱియు మేము ఆకాశములో రాసులను (బురుజు) లను చేసితిమి. మఱి చూచువారికిఁగాను వానిని అలంకరించితిమి. 17. మఱి కోపమునకు పాత్రులైన ప్రతి సైతానునుండి మేము వానిని కాపాడియున్నాము.18. కాని యెవఁడైన దొంగతనముతో విని పోవునపుడు మండు అగ్ని వాని వెంటఁబడును. 19. మఱియు మేము భూమిని పఱచి అందు పర్వతములనుంచి యందు ప్రతివస్తువును సరిగా పుట్టునట్లు చేసితిమి. 20 మఱియు నందు మీకొఱకు ఆహార వసతులను కల్పించితిమి. మఱి మీకొఱకు మీరు ఆహారము పెట్టనివారినికూడ చేసితిమి. 21. మఱి ప్రతివస్తువుయొక్క ఖజానాలు (బొక్కసములు) మాయొద్దనున్నవి. మఱి నియమింపఁబడియున్న తీరున దానిని దింపుచున్నారము. 22. మేము మేఘములను బరువుగాఁ జేయునట్టి గాలులను పంపి ఆకాశమునుండి నీళ్ళు కురిపించితిమి. పిదప దానిని మీకు త్రాగనిచ్చితిమి. మఱి మీరు దానిని సేకరించుకొనలేరు. 23. మఱి మేమే ప్రాణము పోయుచున్నారము. మఱి మేమే చంపుచున్నారము. మఱి మేమే అందఱికిని వారసులము. 24. మఱి మీలో ముందుపోయిన వారిని మేము ఎఱింగి యున్నారము. మఱి వెనుక నున్నవారిని ఎఱింగి తెలిసికొని యున్నారము. 25. మఱియు నీప్రభువే వారిని సేకరించును. నిశ్చయముగా అతఁడు వివేచనా పరుఁడును సర్వము దెలిసినవాఁడును.

వ్యా॥ 16.దేవుఁడు ఆకాశములో బురుజులను చేసియున్నాఁడు. గొప్పనక్షత్రములును రాసులును బురుజులు అనఁబడును. అవి ఆకాశములోనికోటలు. అందు దేవదూతలు పారా నిచ్చుచుందురు అని కొందఱు విద్వాంసులు పలుకుదురు. నక్షత్రములచే ఆకాశము అలంకరింపఁబడి యున్నది. చూచువారికి చాల ఆనందము గలిగించును. అందు గమనించువారికి దేవుని శక్తి సూచనములున్నవి మానవులు విశ్వసింప వలెనన్న దేవదూతలు ఆకాశమునుండి దిగి రానక్కఱ లేదు. వారు ఆకాశముపై నెక్కి పోనక్కఱలేదు. బుద్ధిమంతులకు భూమ్యాకాశములలోనే దేవుని యేకత్వమును దెలుపు అనేకసూచనలుగలవు. 17,18. ఆకాశములలో సైతానులకు నెట్టి అధికారము లేదు, రాఁబోవు విషయములను గూర్చి దేవదూతలకు దేవుని యాజ్ఞ అగుచుండును. దానిని వినుటకై సైతానులు చాల ప్రయత్నింతురు, కాని వెంటనే ఆకాశమునుండి వారిపై అగ్నిజ్వాలములు పడి సైతానులు నశింతురు. ఎవఁడైన సైతాను దొంగతనముగ నేదైన నొక మాట విని తప్పించుకొని పోయినచో అందు అనేక అబద్ధములు చేర్చి తన యనుచరులగుఁ జ్యోతిష్కులకుఁ దెలుపును. వారు రాఁబోవు విషయములను గూర్చి పలుకు అనేక మాటలలలో ఒకటిరెండు నిజములైనచో ప్రజలుమోసపోయి

సన్మార్గము వీడి వారిమాట విని దుర్మార్గములో పడుదురు. 19,20. దేవుఁడు భూమిని పఱచి అందు ప్రాణులు వసించుటకు తగినట్లు చేసి భూమి కదలకుండ పర్వతములనుంచెను, అందు కావలసిన ప్రతివస్తువును పుట్టించెను. మానవులకొఱకు ఆహారపు వసతులను కల్పించెను. పశువులను పుట్టించి మానవులకులోఁబఱచెను. వానికి ఆహారము దేవుఁడే ఒసంగుచున్నాఁడు. అటులే సేవకులు, బానిసలుయూహించునది. వారుతమ యజమానుల సేవ చేయుదురు. దేవుఁడు వారికి ఆహారము నొసంగుచున్నాఁడు. ఇదంతయు దేవుని కృపయు మేలును కావున మానవులు దేవునిమేళ్ళను మఱవకూడదు. 21. ప్రతి వస్తువును దేవునిచేతిలో నున్నది. తాను కోరినపుడు ఎంత లోకములో పంపవలెనని యుద్దేశించునో అంత పంపును. దానివలన కొఱతరాదు. సర్వము సమయోచితముగ దేవుని శక్తివలన సంభవించును. కావున అన్ని వస్తువుల ఖజానాలు దేవునియొద్ద నున్నవి. 22. వానరాకముందు నీళ్ళతో నిండిన మేఘములను గాలులు తీసికొని వచ్చుచున్నవి. వాని వలన నీళ్లు కురియు చున్నవి. ఆనీళ్లు బావులలోను చెఱువుల లోను నదుల లోను చేరి మానవులకు ఉపయోగ పడుచున్నవి. అది త్రాగుటకు పనికి వచ్చుచున్నది. దేవుఁడు కోరినచో నీళ్లు ఉప్పగానై త్రాగుటకు తగనిదిగా నుండ వచ్చును. కాని అట్లు దేవుడు చేయలేదు. నీళ్లు మానవుల అధికారములో లేదు. వాన రానిచో వారు నీళ్లు కురిపింపలేరు. బావులలో నీళ్ళు ఎండిపోయినచో నీళ్లు తీసికొని రాలేరు. కావున దేవుఁడు తాను కోరినపుడు వాన పంపుచున్నాఁడు. తాను కోరినపుడు వాన పంపక నీళ్లకఱవు కల్పించును. 23. ప్రాణము పోయుట, ప్రాణము తీయుట దేవుని చేతిలో నున్నది. అందఱు నశించిన పిదప దేవుఁడు ఒక్కఁడేయుండును. అపుడు అందఱికిని ఆతఁడే వారసుఁడు. అన్నివస్తువులు దేవునికి చేరును 24. దేవునికి సర్వము తెలియును. ముందు గడచిన వారును, వెనుక రాఁబోవు వారును దేవునికిఁ దెలియును. అందఱు చేసిన కర్మములు దేవునికిఁ దెలియును. దానికిఁ దగినట్లు తీర్పు దినమునందు తీర్పు చేయఁబడును. 25. నిశ్చయము దేవుఁడు తాను కోరినపుడు మానవు లందఱిని సజీవులుగఁ జేసి తీర్పునకుఁగాను ఒకచోట సేకరించును. అట్లు చేయుట దేవునికి కష్టము కాదు. అది చాల సులభమైనపని. గోరిలోనున్నను సముద్రములో నున్నను ఆకాశ మధ్య నున్నను జంతువుల కడుపులో నున్నను సర్వము దేవునికిఁ దెలియును. ఆతఁడు తనసర్వశక్తిచే అన్నిటిని సేకరించును.

26. వల-ఖద్-ఖలఖ్ నల్-ఇన్-సాన-మిన్-సల్-సాలిమ్-మిన్-హమ-ఇమ్ మస్నూన్. 27. వల్-జాన్న-ఖలఖ్ నాహు-మిన్-ఖబ్లు-మిన్ నారిస్-సమూమ్.

26. మఱియు మఱిగి గనగనమని శబ్దించు బురద మట్టిలో మేము మ

నుష్యుని పుట్టించితిమి. 27. దీనికిముందు జ్వలించు అగ్నితో జిన్నాతులను మేము పుట్టించితిమి.

వ్యా॥ 26. ఇక మనుష్యుఁడు తన సృష్టిని గూర్చి గమనింప వలెను అని వాని పుట్టుకను గూర్చి చెప్పఁబడుచున్నది. మనుష్యుఁడు (ఆదము) మట్టితో సృజింప బడెను. ముందు మఱిగిన బురదతో ఆదముయొక్క శరీరము చేయఁబడెను. అది ఎండి కాలి గనగనమని మ్రోగుస్థితికి వచ్చి ఆత్మ ప్రవేశించునట్టి స్థితి పొందఁగా దేవునియాజ్ఞచే నందు ఆత్మ ప్రవేశించెను. అపుడు ఆదము మానవులకు మూలపురుషుడుగా నేర్పడెను. 27. మనుష్యుఁడు పుట్టక పూర్వము. జిన్నాతుపుట్టెను. జన్నాతు అగ్ని జ్వాలనులతో పుట్టింపఁ బడెను. వాని సంతానమే సైతానులు. ఇబ్లీసుకూడ అందు చేరినవాఁడే.

28. వఇజ్-ఖాల-రబ్బుక-లిల్-మలా-ఇకతి-ఇన్నీ-ఖాలిఖుమ్-బషరమ్-మిన్-సల్-సాలిమ్ మిన్-హమ-ఇమ్-మస్-నూన్. 29. ఫ-ఇజా-సవ్వైతు-వ-నఫఖ్-తు-ఫీహి-మిర్-రూహీ-ఫ-ఖఊ-లహూ-సాజిదీన్. 30. ఫ-సజదల్-మలా-ఇకతు-కుల్లు-హుమ్-అజ్-మఊన్. 31. ఇల్లా-ఇబ్లీస అబా-అన్-యకూన-మఅస్-సాజిదీన్. 32. ఖాల-యా-ఇబ్లీసు-మాలక-అల్లా-తకూన-మఅస్-సాజిదీన్. 33. ఖాలి-లమ్-అకుల్-లి-అస్ జుద-లి-బషరిన్-ఖలఖ్-తహూ-మిన్-సల్-సాలిమ్-మిన్-హమ-ఇమ్-మస్-నూన్. 34. ఖాల-ఫఖ్-రుజ్-మిన్‌హా-ఫఇన్నక-రజీమ్. 35. వఇన్న-అలైకల్-లఅలత ఇలా-యౌమిద్దీన్. 36. ఖాల-రబ్బి-ఫ-అన్-జిర్నీ-ఇలా-యౌమి-యుబ్-అసూన్. 37. ఖాల-ఫఇన్నక-మినల్-మున్‌జరీన్. 38. ఇలా-యౌమిల్-వఖ్‌తిల్-మఅలూమ్. 39. ఖాల - రబ్బి - బిమా- అగ్‌వైతనీ-ల-ఉజయ్యి-నన్న-లహుమ్-ఫిల్-అర్‌జి-వల-ఉగ్‌వి యన్న-హుమ్-అజ్-మఈన్. 40. ఇల్లా-ఇబాదక-మిన్-హుముల్-ముఖ్-లసీన్. 41.ఖాల-హాజా-సిరాతున్-అలయ్య-ముస్-తఖీమ్. 42. ఇన్న-ఇబాదీ-లైస-లక-అలైహిమ్-సుల్-తానున్-ఇల్లా-మనిత్-తబఅక-మినల్-గావీన్. 43. వఇన్న-జహన్నమ-ల-మౌ-ఇదహుమ్-అజ్-మఈన్. 44. లహా-సబ-అతు-అబ్వా-బిన్-లి-కుల్లి-బాబిమ్-మిన్-హుమ్-జుజ్-ఉమ్-మఖ్-సూమ్.

28. మఱియు నీప్రభువు దేవదూతలతో మ్రోగి గణగణమని శబ్దించుబురద
మట్టితో ఒక మనుష్యుని సృజించెను. 29. ఆపిదప వానిని సరిగాఁజేసి నాయాత్మ
వానియందు పోసినపుడు మీరు నాయెదుట సాష్టాంగనమస్కారములుచేయుఁడు
అని పలుకగా, 30. అపుడు దేవదూతలందఱును చేరి సాష్టాంగపడిరి. 31. కాని
యిబ్లీసు సాష్టాంగపడువారితో చేరుటకు తిరస్కరించెను. 32. ఓ యిబ్లీసు! నీకే
మైనది. నీవు సాష్టాంగపడువారితో చేరకుంటివి అని దేవుఁడుపలికెను. 33. మ్రోగి
గణగణమని శబ్దించు బురద మట్టితో నీవు చేసిన మనుష్యునికి నేను సాష్టాంగ
పడువాఁడనుకాను అని యిబ్లీసు పలికెను. 34. ఇచ్చటినుండి నీవు వెడలిపొమ్ము.
నీవు దూరముచేయఁబడితివి. 35. మఱి తీర్పుదినమువఱకు నీకు శాపమున్నది
అని దేవుఁడు సెలవిచ్చెను. 36. ఓ నాప్రభువా! చచ్చినవారు తిరిగి సజీవులగు
దినమువఱకును నాకు విరామ మొసంగుము అని యిబ్లీసు పలికెను. 37, 38.
ఆ నియమింపఁబడిన కాలము వచ్చు దినమువఱకు నీకు విరామము నొసంగితిని
అని దేవుఁడు పలికెను. 39. ఓ నాప్రభువా! నీవు నన్ను మార్గమునుండితప్పించి
నందున భూమిలో వారి నందఱికిని పాపములు మంచివిగా కనఁబడునట్లు చేయు
దును. మఱి వారి నందఱిని సన్మార్గమునుండి తప్పింతును. 40. కాని వారిలో
నీవు ఎన్నుకొన్న నీభక్తులను సన్మార్గమునుండి తప్పింపఁజాలను అని యిబ్లీసు పలి
కెను. 41. ఇది భక్తిమార్గము. నేరుగా నాకు చేరునది. 42. నాభక్తులపై నీ బ
లము సాగదు. కాని దుర్మార్గులలో నెవఁడు నిన్ను అనుసరించునో వానిపై నీ
బలము సాగును. 43. మఱి నిశ్చయముగా నరకము వారందఱికిఁగాను లిఖింపఁబడి
యున్నది. 44. దానికి ఏడు ద్వారములు గలవు. ప్రతి ద్వారమునకుఁగాను వారి
లో నొకభాగము పంచఁబడియున్నది.

వ్యా॥ 28, 29. ఇఁక యీవాక్యములలో ఆదిపురుషుఁడగుఆదముయొక్క
సృష్టినిగూర్చియు, ఆతనిని దేవదూతలు గౌరవించిన విధానమునుగూర్చియు,
ఇబ్లీసు (సైతాను) గర్వించి చేసిన తిరస్కారమునుగూర్చియు చెప్పఁబడుచున్నది.
దేవుఁడు ఆదమును సృష్టింపక ముందే నేను మట్టితో మానవుని చేసి యందు
నాయాత్మను పోసినపుడు మీరు ఆతనికి సాష్టాంగపడవలెను అని దేవదూతల
తో పలికెను. నాయాత్మ అని దేవుఁడు గౌరవార్థము పలికెను. దేవుని సెలవుచే
ఆత్మ గలిగెను. కావున అట్లు చెప్పఁబడియెను. 30. దేవుఁడు సెలవిచ్చిన ప్రకా
రము దేవదూతలందఱును ఆదమునకు సాష్టాంగపడిరి. 31. కాని యిబ్లీసు
(సైతాను) తాను అగ్నిజ్వాలలలో పుట్టెను అనియు మనుష్యుఁడు మట్టితో
సృజింపఁబడెను అనియు తానే శ్రేష్ఠుఁడని గర్వించి దేవునాజ్ఞనుమీఱి సాష్టాంగ
పడలేదు. 34. అందుకు దేవుఁడు నీవు స్వర్గమునుండి వెడలిపొమ్ము. నీకు లభించి

యుండిన స్థానమునుండి తొలఁగిపొమ్ము. నీవు దేవుని దయనుండి దూరము చేయఁబడితివి. తుది దినము (ఖియామతు) వఱకును నీకు శాపమున్నది. నీవు కోపమునకు పాత్రుఁడవైతివి అని దేవుని సెలవయ్యెను. 36. అపుడు యిబ్లీసు నేను నాయిష్టప్రకారము చేసికొనుటకు తుది దినమువఱకు నాకు గడువు (విరామము) నొసంగుము అని పలుకఁగా 37. 38. సరే నీకుగడువిచ్చితిని పొమ్ము అని దేవుని సెలవయ్యెను. 39. ఓ దేవా! నా ఉన్నతస్థానము పోయినది. ఎవని వలన నాకు ఈదుర్గతి పట్టినదో వానిని వారి సంతానమును మోసపుచ్చెదను. వారు ఇహలోకభోగములలో పడి సన్మార్గము వీడునట్లు చేయుదును. పాపములు మంచివిగా కనుపడునట్లు చేయుదును. వారు పాపనిమగ్నులై నీసన్మార్గము వీడుదురు. కాని నీవు ఎన్నుకొన్న నీభక్తులను నేను మోసపుచ్చఁజాలను. వారు నామాయలోఁబడరు అని మనుష్యులయందు తనకుఁగల ద్వేషమును సైతాను వెల్లడించెను. 41. భక్తులుపోవు భక్తిమార్గము నన్ను చేరును. అందు ఏలాటి వంకరలులేవు. అది సరియైన త్రోవ. భక్తిమార్గమునందు పోవువారు ఇబ్లీసు మోసములకు లోఁబడరు. వారు సన్మార్గమునందు స్థిరముగాఁ బోయి స్వర్గము పొందుదురు. ఎవరు ఇబ్లీసును అనుసరింతురో వానితోఁబాటువారుకూడ నరకములోఁ బడుదురు అని హెచ్చరించెను. 42. ఓ యిబ్లీసు! వాస్తవముగ నేను ఎన్నుకొన్న నాభక్తులపై నీబలముగాని యధికారముగాని చెల్లదు. వారు నీమాయలకు మోసపోరు. కాని దుర్మార్గులు మాత్రము నీమాయలకు మోసపోయి నశింతురు. 43. నీకును నీయనుచరులకును నరకము విధింపఁబడియున్నది. అందు సదా యుండవలసివచ్చును. 44. నరకమునకుఏడుద్వారములున్నవి. పాపాత్ములు వానినుండి నరలోకములో ప్రవేశింతురు. కొందఱు విద్వాంసులు, నరకములో ఏడు దర్జాలు (అంతస్థులు) గలవు. ఒకటిపై నొకటి యుండును. అన్నిటికంటె క్రింద నుండు భాగము చాల ఘోరమైనది అని పలుకుదురు.

45. ఇన్నల్‌ముత్తఖీన-ఫీ-జన్నాతిన్-వ-ఉయూనిన్. 46. ఉద్-ఖులూహా-బి-సలామిన్-ఆమినీన్. 57. వ-నజ అనా-మా-ఫీ-సుదూరిహిమ్-మిన్-గిల్లిన్- ఇఖ్వానన్-అలా-సురు-రిమ్-మత-ఖాబిలీన్. 48. లా-యమస్సు-హుమ్ - ఫీహా-నసబున్-వమా-హుమ్-మిన్‌హా బి-ముఖ్-రజీన్. 49. నబ్బీ-ఇబాదీ-అన్నీ-అనల్-గఫూరుర్-రహీమ్. 50. వ-అన్న-అజాబీ-హువల్-అజాబుల్-అలీమ్.

45. నిశ్చయముగా భక్తులు స్వర్గవనములయందును, ఊటలయందును వసింతురు. 46. సురక్షితముగాను శాంతియుతముగాను అందు ప్రవేశింపుఁడు అని వారితోఁ జెప్పఁబడును. 47. మఱి వారి హృదయములలోనున్న కపట

మును మేము తీసివేయుదుము. వారు సహోదరులై పీఠములపై ఒకరికొకరు ఎదురుగా కూర్చుందురు. 48. అందు వారికి ఏలాటి కష్టముగలుగదు. మఱి అచ్చటి నుండి వారి నెవరును వెడలఁగొట్టఁజాలరు. 49. నేను క్షమించవాఁడును, దయాళుఁడును అనియు, 50. మఱి నాశిక్ష చాల కఠినమైన శిక్ష అనియు నాభక్తులకుఁ దెలుపుము.

వ్యా॥ 45. ఇందు భక్తులకు లభించు ఫలితమునుగూర్చి చెప్పఁబడియెను. పాపముల విడనాడి భక్తిపూర్వకముగ సత్కార్యములు చేసిన భక్తులు పరలోకమునందు స్వర్గముపొందుదురు. అందు వనములు, ఊటలు గలవు. వారందు వసించి ఆనందింతురు. 46. స్వర్గములో ఓ భక్తులార! మీ కేలాటిదుఃఖములు గాని కష్టములుగాని గలుగవు. మీరు సురక్షితముగా శాంతితో స్వర్గములో ప్రవేశింపుడు అని చెప్పఁబడును. 47. స్వర్గములో ప్రవేశించిన పిదప వారి హృదయములో ఒకరినిగూర్చి మఱియొకరికి కపటముండదు. దేవుఁడు స్వర్గనివాసుల హృదయములను పరిశుద్ధముగాఁ జేయును. వారికి పరస్పరము అసూయ యుండదు. సహోదరులై చాల ప్రేమగలిగి ఒకరినొకరు చూచి సంతోషింతురు. స్వర్గవాసులు గౌరవముతో పీఠములపై కూర్చుండి ఒకరికొకరు అభిముఖులై సంభాషించుచు ఆనందింతురు. 49. భక్తులు స్వర్గములో సదాయుందురు. వారి కేలాటి రోగముగాని, కష్టముగాని, దుఃఖముగాని లభింపదు. వారు అన్నివిధముల సుఖముపొందియుందురు. వారిని అచ్చటినుండి వెడలగొట్టువాఁడెవఁడును లేఁడు. 49, 50. దేవుఁడు భక్తుల పాపములను క్షమించి కరుణించును. అటులే పాపములు చేయువారిని శిక్షించును. కావున దేవుని దయను ఆశించుచు, దేవునిశిక్షకు భయపడుచు నుండవలెను.

51. వ-నబ్బిహుమ్-అన్-జైఫి-ఇబ్రాహీము. 52. ఇజ్ దఖలూ-అలైహి-ఫ-ఖాలూ-సలామన్-ఖాల ఇన్నా మిన్-కుమ్-వ-జిలూన్. 53. ఖాలూ-లా-తౌ-జల్-ఇన్నా- నుబష్-షిరుక-బి-గులా-మిన్-అలీమ్. 54. ఖాల-అ-బష్షర్-తుమూనీ-అలా-అమ్-మస్-సనియల్-కిబరు-ఫ-బిమ-తుబష్-షి-రూన్. 55. ఖాలూ బష్-షర్నాక-బిల్-హఖ్ఖి ఫలా-తకుమ్-మినల్-ఖానితీన్. 56. ఖాల-వమన్-యఖ్-నతు-మిర్-రహ్మతి-రబ్బిహీ-ఇల్లజ్-జాల్లూన్. 57. ఖాల-ఫమా-ఖతే-బుకుమ్-అయ్యు-హల్-ముర్-సలూన్. 58. ఖాలూ-ఇన్నా-ఉర్-సిల్నా-ఇలా-ఖౌమిమ్-ముజ్-రిమీన్. 59. ఇల్లా-ఆల-లూతిన్-ఇన్నా-లమునజ్జూహుమ్-అజ్మఈన్. 60. ఇల్లమ్‌రఅ-తహూ-ఖద్దర్నా-ఇన్నహా-లమి-నల్-గాబిరీన్,

51. మఱియు ఇబ్రాహీముయొక్క అతిథులనుగూర్చి వారికిఁ దెలుపుము. వారు ఆతనియొద్దకు వచ్చినపుడు సలామ్ అని పలికిరి. అపుడు ఇబ్రాహీము మాకు మీవలన భయముగలుగుచున్నది అని పలికెను. 52. వారు నీవు భయపడవలదు. నీకు ఒక జ్ఞానముగలపుత్రుండు గలుగును అని మేము నీకు సువార్త వినిపించు చున్నారము అని వారు పలికిరి. 53. ఏమి నాకు ముసలితనమువచ్చినపుడు నాకు సువార్త వినిపించు చున్నారా? ఇఁక దేనిగూర్చి సువార్త వినిపించుచున్నారు అని పలికెను. 54. మేము నిజమైన సువార్తను నీకు వినిపించితిమి. కావున నీవు ఆశను విడనాడు వారితోఁ జేరకుము అని వారు పలికిరి. 55. దుర్మార్గులు తప్ప ఎవఁడు తన ప్రభువుయొక్క కృపనుండి ఆశ వదలును అని పలికెను. 56. మఱి ఓ దేవదూతలార! మీపని యేమియని యిబ్రాహీము పలికెను. 57. పాపులైనట్టి జనుల యొద్దకు మేము పంపఁబడితిమి. 58. కాని లూతు యింటివారి నందఱిని మేము రక్షింతుము. కాని లూతుభార్య వెనుకయుండిపోవు వారిలో చేరును అని మేము నియమించియున్నారము అని వారు పలికిరి.

వ్యా॥51,52 దేవుఁడు ఇందు దేవదూతలు ఇబ్రాహీము ప్రవక్త యొద్దకువచ్చినపుడు ఆయనవారిని అతిథులనితలంచిఆవుదూడను కాల్చితెచ్చితినుఁడని పలుకఁగా వారు తినకపోవుటవలన ఆయన భయపడుట మొదలగు విషయములు చెప్పఁబడుచున్నవి. వీనివివరము-సూరయే హూదులో గడచినది. అచ్చట చూచుకొనేది. 53. నీవు భయపడనక్కఱలేదు. నీవు సంతసింపుము. నీకు ముసలితనములో దేవుని కృపవలన మంచి విద్య, జ్ఞానములుగల పుత్రుఁడు గలుగును అని ధైర్యముచెప్పిరి. ఈసువార్తను అనుసరించి హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తకు బీబీసారాయందు ఇస్హాఖు పుట్టెను. 54. ఇబ్రాహీమును ఆతని భార్యయును ముసలివారు. ఆ ముసలితనములో బిడ్డ గలుగును అను వార్త విని ఆశ్చర్యము నొంది ఇంకను ఆ వార్తను నిశ్చయముగా వినవలెనని ఏమి? మీరు ముసలితనములో నాకు బిడ్డ గలుగును అని పలుకుచున్నారు అని ఇబ్రాహీము దేవదూతలతో నడిగిరి. 55. అందు దేవదూతలు నొక్కి తిరిగి సువార్త వినిపించి, ఆశ వదలకుము అని పలికిరి. 56. దానికి నేను దేవుని కృపగలుగును అనియే ఆశగలిగియున్నాను. దుర్మార్గులు ఆశ వదలుదురు. నేను అట్టివాఁడనుకాను. ముసలితనములో నాకు బిడ్డ గలుగును అని నేను దేవునిశక్తిని కొనియాడుచున్నాను అని పలికెను. 57. ఏమి మీరు ఈసువార్తను తెలుపుటకే వచ్చినారా? లేదా వేఱుపనికూడ మీకుఁగలదా? అని యిబ్రాహీము దేవదూతల నడిగెను. 58. అపుడు మాకు ఇంకొక పనిచేయవలసియున్నది. అవిశ్వాసులైన పాపుల యొద్దకు పోయి వారిని నశింపఁజేయవలెను. అందు లూతుప్రవక్త యింటివారిని రక్షింతుము. వారు శిక్షనుండి రక్షణపొందుదురు. కాని లూతుభార్య అవిశ్వా

సులతోఁబాటు శిక్షకుపాత్రులై నశించును. అట్లు నియమించియున్నారము అని పలికిరి.

61. ఫలమ్మా-జాఅ-ఆల-లూతి-నిల్-ముర్-సలూన్. 62. ఖాల-ఇన్నకుమ్ ఖౌముమ్-మున్-కరూన్. 63. ఖాలూ-బల్-జి'నాక బిమా-కానూ-ఫీహి-యమ్తరూన్. 64. వ-అతైనాక-బిల్-హఖ్ఖి-వ-ఇన్నా-లసాదిఖూన్. 65. ఫ-అస్రి బి-అహ్లిక-బి-ఖిత్-అమ్-మినల్-లైలి-వత్-తబిఅ-అద్-బారహుమ్ - వలా-యల్-తఫిత్-మిన్-కుమ్-అహదున్-వమ్-జూ-హైసు-తూమరూన్. 66. వ-ఖజైనా-ఇలైహి-జాలికల్-అమ్ర-అన్న-దాబిర-హాఉలాఇ - మఖ్తూఉమ్- ముస్-బిహీన్.

61. ఆ పిదప ఆ దూతలు, లూతు యింటికి వచ్చిరి. 62. నిశ్చయముగా మీరు క్రొత్త మనుష్యులుగా నున్నారే అని పలికెను. 63. లేదు. వారు (అవిశ్వాసులు) దేని విషయము వాదించుచుండిరో దానిని మేము తీసికొనివచ్చినారము. 64. మఱి మేము నిజమైనమాటను తీసికొనివచ్చినారము. మఱి మేము సత్యము పలుకుచున్నారము. 65. కావున నీవు కొంత రాత్రియుండగనే నీ యింటివారిని తీసికొని వెడలుము. మఱి నీవు వారి వెనుకనే పొమ్ము. మీలో నెవరును వెనుక తిరిగి చూడకూడదు. మఱి మీకు ఆజ్ఞయైన చోటునకు వెడలి పొండు అని పలికిరి. 66. మఱి తెల్లవారుసరికి ఈజనులు నిర్మూలింపఁబడుదురు అని లూతునకు సందేశము పంపితిమి.

వ్యా॥ 61. దేవదూతలు లూతుప్రవక్త యొద్దకు పోయిరి. ఆయన దేవదూతలను చూచి గుర్తింపక మీరు ఈయూరివారు కారే. క్రొత్తవారలుగా నున్నారే అని అడిగిరి. లూతుప్రవక్త ఉండు గ్రామమువారు చాల దుర్మార్గులు. ఎవరైన అతిథులు వచ్చినవారిని చెఱచుచుండిరి. అందుకు లూతుప్రవక్త భయపడెను. దానికి దేవదూతలు నీవు భయపడవలదు. మేము మనుష్యులము కాము. దేవదూతలము. దేవుని శిక్షరాదు అని అవిశ్వాసులు వాదించుచుండిరి గదా! అది నీవు వచ్చును అని పలుకుచుంటివి గదా! శిక్షనే తీసికొని వచ్చినారము. దుష్టులు నశింతురు. తెల్లవాఱుసరికి ఆ శిక్ష గలుగును. కావున నీ యింటివారిని కొంత రాత్రియుండగనే తీసికొని బయలుదేరుము. నీవు వారికి వెనుక వెనుక పోవలెను. ఎవరును తిరిగి చూడకూడదు. మీకొఱకు నియమింపఁబడిన దేశమునకు పొండు అని పలికిరి. ఆ దేశము సిరియా అని విద్వాంసులు పలుకుదురు. 66. దేవుఁడు తన దూతల మూలమున అవిశ్వాసులు తెల్లవాఱుసరికి నిర్మూలింపఁబడుదురు అని లూతుప్రవక్తకుఁ దెలిపెను.

67. వ జాఅ అహ్లు-ల్ మదీనతి-యస్-తబ్-షిరూన్. 68. ఖాల-ఇన్న హాఉలాఇ-జైఫీ ఫలా-తఫ్-జహూన్. 69. వత్తఖుల్లాహ-వలా-తుఖ్-జూని. 70. ఖాలూ--అవలమ్-నన్-హక-అనిల్ - ఆలమీన్. 71. ఖాల-హాఉలాఇ-బనాతీ-ఇన్-కున్తుమ్-ఫాఇలీన్. 72. ల-అమ్ రుక-ఇన్నహుమ్-లఫీ-సక్-రతిహిమ్-య అ-మహూన్. 73. ఫ-అఖ-జత్-హుముస్-సైహతు-ముష్రిఖీన్. 74. ఫజ-అల్నాహా ఆలి-యహా-సాఫిలహా-వ-అమ్-తర్నా-అలైహిమ్-హిజా-రతమ్ మిన్ - సిజ్జీల్. 75. ఇన్న-ఫీ జాలిక-ల-ఆయా-తిల్ --లిల్ ముత-వస్సిమీన్. 76. వఇన్నహా-ల-బి-సబీలిమ్ ముఖీమ్. 77. ఇన్న-ఫీజాలిక-ల-ఆయ-తల్-లిల్-మూమినీన్.

67. మఱి పురజనులు సంతోషములు చేయుచు వచ్చిరి. 68. వీరు నా యతిథులు. కావున మీరు నన్ను అవమానింపకుఁడు. 69. దేవునికి భయ పడుఁడు, నావూనము తీయకుఁడు అని లూతు పలికెను. 70. ఏమి ! నీవెవ్వరికిని ఆ తిథ్య మియ్యకూడదు అని మేము నిన్ను నివేధించి యుండలేదా ! అని వారు పలికిరి. 71. మీరు చేయవలెనన్న ఈనా కుమార్తె లున్నారు అని లూతు పలికెను. 72. (ఓ మహమ్మదు) నీ జీవముయొక్క యాన- నిశ్చయముగా వారు తమ కైపులోపడి దేవులాడుచున్నారు. 73. ఆపిదప ఉదయము అగుసరికి వారిని భయంకరమైన కేక (శబ్దము) వచ్చి పట్టెను. 74. పిదప మేము ఆపురము తల క్రిందులగఁ జేసి వేసితిమి. మఱి వారిపై గులక రాళ్ళను కురిపించితిమి. 75. నిశ్చయముగా నిందు ధ్యానించు (గమనించు) వారికి సూచన లున్నవి. 76. మఱి ఆ పురము వచ్చుపోవు మార్గమునందున్నది. 77. నిశ్చయముగ నిందు విశ్వాసులకు సూచన లున్నవి.

వ్యా॥ 67. లూతు ఇంటికి సుందర వంతులైన మగవారు వచ్చినారు అని పురమువారు విని సంతోషములు చేయుచు దుర్బుద్ధితో లూతు యొద్దకువచ్చిరి. దీని వివరము సూరేహూదులోను సూరేఆరాఫులోను వ్రాసియున్నాము. అచ్చట చూచుకొనేది. 68. అపుడు లూతు ప్రవక్త వీరునాయతిథులు. అతిథులను అవమానించట నన్ను అవమానించుటలే. కావున వారి జోలికి పోకుఁడు. దేవుని శిక్షకు భయపడుఁడు. దుష్టత్వము వదలుఁడు. నామాటలు విని అతిథులను అవమానింపకుఁడు. లేనిచో నామానము పోవును అని లూతుపలికెను. 68. అందుకుదుర్మార్గులు, మేముదీనికిముందేనీవువెవ్వనికిని అతిథిగానిలుపకూడదు. అనినివేధించితిమి నీవుమామాటవినలేదు. కావుననీవే నీచేతులారఅవమానముపొందుచున్నావు అని పలికిరి. 70. ఏమి మగవారితో సంభోగముచేయుట చాలఅసహ్యకార్యము గదా!

అట్టిది చేయుటకు మీరెట్లు సాహసింతురు. నాకు కుమార్తెలువంటి వారలగు మీభార్యలు మీయొద్ద నున్నారు. వారితో మీ కోరికలను ధర్మమార్గమున నెఱవేర్చుకొనుఁడు తప్పుత్రోవల పోవకుఁడు అని లూతు పలికెను. 72. ఇందు దేవుఁడు హజ్రత్ ముహమ్మదు వారిని సంబోధించుచున్నాఁడు. వారిని గౌరవించి వారి జీవముయొక్క ప్రమాణము చేసి పలుకుచున్నాఁడు. దుష్టులు తమ దుర్మార్గమనెడి కైపులో పడి తెలివితప్పి దేవులాడుచుదుర్మార్గులైపోవుచున్నారు. వారికి చావువచ్చిన విషయము వారికిఁ దెలియక తమ కోరికలను నెఱవేర్చుకొనుదుమని సంతోషములు చేసి ఆనందించుచున్నారు. 73,74. తుదకు ఉదయమగు సరికి భయంకరమైన ఘోరశబ్దము గలిగెను. ఆపురము తలక్రిందులుగనై పైనుండి రాళ్లు కురిసి దుష్టులు నశించిరి. 75. లూతు జనులు వృత్తాంతములో గమనించువారికి సూచనలు గలవు. చూడుఁడు! దుష్టులెట్లు గర్వించి పాపకార్యము చేసిరో! తుదకు ఎట్లు వారు నశింపఁబడిరో! కావున ప్రవక్తలను విరోధించువారి గతి యిటులేయని గ్రహింపవలెను. 76. మక్కానుండి సిరియా దేశమునకు వచ్చుపోవు మార్గమునందు ఆపురమున్నది. దాని పాడుపడిన గుర్తులున్నవి. 77. ఇట్టి పాడుపడిన యూర్లను చూచినచో విశ్వాసులకు భయభక్తులు గలుగును. అందు సూచనలు గలవు. దానివలన వారికి భక్తి కుదురును.

78. వఇన్-కాన-అస్-హాబుల్-ఐకతి-లజాలి-మీన్. 79. ఫన్-తఖమ్నా మిన్-హుమ్-వఇన్నహుమా-ల-బి-ఇమామిమ్-ముబీన్.

78. నిశ్చయముగా వన నివాసులు దుర్మార్గులై పాపులై యుండిరి. 79. కావున మేము వారినుండి బదులు తీసికొంటిమి. మఱి ఈ రెండు పురములు స్పష్టమైన త్రోవలో నున్నవి.

వ్యాll 78,79. వననివాసులు (అస్‌హాబుల్ ఐకా) షుఐబు ప్రవక్త యొక్క జాతివారు. షుఐబు ఆజనులను బోధించుచుండెను. ఆజనులు, విగ్రహారాధన, దోఁపిడి, కొలత, తూకములలో మోసము చేయుట మొదలగు పాపములలో పడి దుర్మార్గులై యుండిరి. వీరు మద్యను పురములో నుండిరి. దానికి చేరువన వనముండెను. అందుకూడ ఆ పాపులు నివసించుచుండిరి. వారు దేవుని శిక్షకు పాత్రులై నశించిరి. వారిపాపములకు బదులుగ వారు శిక్షకు పాత్రులైరి. లూతువారి పురమును షుఐబు వారి పురమును, మక్కానుండి సిరియాకు పోవు బాటలో నున్నవి. దానిపాడుపడిన ప్రదేశములు బాటసారులకు స్పష్టముగ కనఁబడును. షుఐబు జనులను గూర్చి సూరయేహూదులోను ఆరాఫులోను వ్రాసియున్నాము.

80. వలఖద్-కజ్జ-బ-అస్-హాబుల్-హిజ్రిల్-ముర్-సలీన్. 81. వ-ఆ

తైనా-హుమ్-ఆయా-తినా-ఫ-కానూ-అన్ హా- ముఅ్- రిజీన్. 82. వ-కానూ-యన్-హితూన-మినల్-జిబాలి-బుయూ-తన్-ఆమినీన్. 83. ఫ-అఖ-జత్ - హుముస్-సైహతు-ముస్-బిహీన్. 84. ఫమా-అగ్నా-అన్-హుమ్-మా-కానూ-యక్-సిబూన్.

80. మఱియు నిశ్చయముగా హిజ్ర్ నివాసులు, ప్రవక్తలు సత్యవంతులుకారు అని పలికిరి. 81. మఱి మేము వారికి మాసూచనల నొసంగితిమి కాని వారు వానినుండి ముఖము త్రిప్పుకొను వారైరి. 82. మఱివారు పర్వతములను తొలచి సురక్షితముగా ఇండ్లను నిర్మించుకొనుచుండిరి. 83. ఆపిదప ఉదయము అగుసరికి వారిని భయంకరమైన శబ్దము వచ్చి పట్టెను. 84. పిదప వారికి తాము సంపాదించుచున్నది పనికిరాలేదు.

వ్యా॥ 80. హిజ్రీ నివాసులు సమూదు జాతి. వీరిదేశముపేరు హిజ్ ఇది మదీనా పురమునకు ఉత్తర దిక్కున నున్నది. హజ్రత్ సాలిహా ప్రవక్త సమూదువారిని బోధించెను. కాని వారు ఆతనిమాట వినక నీవు అసత్య మాడుచున్నావు అని తిరస్కరించిరి. ఒక్క ప్రవక్తను తిరస్కరించినచో ప్రవక్తలందఱిని తిరస్కరించినట్లగును. కాబట్టివారు ప్రవక్తలు అసత్యవంతులుఅనిపలికిరని చెప్పబడియెను. 81. సమూదువారికి దేవుని సూచన అగు ఒంటె వచ్చెను. ఒంటె రాతి బండనుండి బయలుపడెను. ఇంక ఇతర సూచనలు (మోజిజాలు) సాలిహా ప్రవక్త వారికి చూపెను. కాని వారునమ్మక తిరస్కరించిరి. 82. సమూదువారు ఇహలోక కార్యములలో పడి తమ సంపదలపై గర్వించి కొండలు తొలచి యందు పెద్దపెద్ద యిండ్లు కట్టుచుండిరి. మఱి యిట్టి స్థిరమైన గృహములలో నెట్టి ఆపదరాదు అని నిర్భయులై యుండిరి. 83,84. తుదకు దేవుని శిక్షకు హిజ్ (సమూదు) వారు పాలై నశించిరి. అపుడు వారి కట్టడములు వారి సంపదలు ఏమియు పనికిరాలేదు. దేవుని శిక్షనుండి వారిని రక్షింపలేదు. కావున భక్తులు అట్టివారి పాడుపురములను చూచినచో భయభక్తులతో దేవుని ధ్యానించి అట్టి శిక్షనుండి దేవుడు రక్షించు గాత అని వేడుకొన వలెను. వినోదముగా నష్టపురములను చూడకూడదు.

85. వ మా-ఖలఖ్-నస్-సమా-వాతి వల్-అర్జ-వమా-బైనహుమా-ఇల్లా బిల్-హఖ్ఖి-వ ఇన్న-స్-సాఅత-ల-ఆతి-యతున్-ఫస్-ఫ హీస్- సఫ్-హాల్-జమీల్. 86. ఇన్న-రబ్బక-హువల్-ఖల్లా-ఖుల్-అలీమ్. 87. వలఖద్-ఆతైనాక-సబ్-అమ్-మినల్-మసానీ వల్-ఖుర్-ఆనల్-అజీమ్. 88. వలా-తముద్దన్న-ఐనైక

ఇలా-మా-మత్త అ-నాబిహీ-అజ్-వాజమ్-మిన్ హుమ్-వలా-తహ్జ - జన్ - అలైహిమ్-వఖ్-ఫిజ్-జనాహాక-లిల్-మూమినీన్. 89. వఖుల్-ఇన్నీ-అనన్-నజీరుల్-ముబీన్. 90. కమా-అన్-జల్నా-అలల్-ముఖ్-తసిమీన్. 91. అల్లజీన-జఅలుల్-ఖుర్-ఆన ఇజీన్. 92. ఫవ-రబ్బిక-లనస్-అలన్నహుమ్ అజ్-మఈన్. 93. అమ్మా కానూ-యఅ-మలూన్. 94. ఫస్-దఅ-బిమా-తూమరు-వ-అఅ-రిజ్-అనిల్ ముష్రికీన్. 95. ఇన్నా-కఫైనా-కల్-ముస్-తహ్-జిఈన్. 96. అల్లజీన-యజ్-అలూన-మఅల్లాహి-ఇలా-హన్-ఆఖర-ఫ-సౌఫ యఅ-లమూన్. 97. వల-ఖద్-నఅలము-అన్నక-యజీఖు-సద్ రుక-బిమా-యఖూలూన్. 98. ఫసబ్బిహ్-బి-హమ్ది-రబ్బిక-వ కుమ్-మినస్-సాజిదీన్. 99. వఅబుద్-రబ్బక-హత్తా-యాతియకల్-యఖీన్.

85. మఱియు మేము ఆకాశములను భూమిని వానిమధ్య యున్నవానిని వృథాగా పుట్టించలేదు. మఱి నిశ్చయముగ తీర్పుదినము రానున్నది. కావున నీవు బాగుగ (వారిని) మన్నింపుము. 86. నీ ప్రభువే పుట్టించువాఁడును సర్వము దెలిసిన వాఁడును. 87. ముఱి మాటిమాటికి పఠింపఁబడు ఏడు వాక్యములను గొప్ప ఖురానును మేము నీకు నొసంగి యున్నారము. 88. అవిశ్వాసులలోని పలుతెగలకు మేమొసంగిన సంపదల వైపు నీవు కన్నెత్తి యైన చూడకుము. మఱి వారిని గూర్చి చింతింపకుము. మఱి నీవువిశ్వాసులయెడ వినయము వహింపుము 89. మఱి నేను స్పష్టముగా భయబోధ నిచ్చువాఁడను అని ఓ ప్రవక్త! పలుకుము. 90. 91. దేవుని గ్రంథమును పలు భాగములుగ చేసి వేసిన వారిపై శిక్ష మేము పంపినట్లు శిక్షను పంపుదుము. 92,93. నీ ప్రభువు యొక్క యాన! వారు చేయుచున్న కర్మలను గూర్చి వారి నందఱిని మేము తప్పక ప్రశ్నింతుము. 94. కావున నీకు ఆజ్ఞ అయిన దానిని వివరముగా వెల్లడింపుము. మఱి దేవునికి సాటి కల్పించువారినుండి తొలఁగిపొమ్ము. 95. పరిహాసములాడు వారినుండి నిన్నురక్షించుటకు మేమునీకుచాలుదుము. 96. వారు దేవునితో నితర దైవములను కల్పించుచున్నారు. వారు త్వరలోనే తెలిసికొనఁదురు 97. వారు పలుకు మాటల వలన నీహృదయమునకు కష్టము కలుగును అని మాకు దెలియును. 98. కావున నీప్రభువు యొక్క స్తోత్రములను కొనియాడుము. మఱి సాష్టాంగములు చేయువారితోఁ జేరుము. 99. మఱి నీకు నిశ్చయముగ చావు వచ్చునంత వఱకు నీప్రభువును నీవు ప్రార్థించుచునుండుము.

వ్యా॥ 85. భూమ్యాకాశములను దేవుఁడు వృథా గావివేచనములేకుండ సృష్టింపలేదు. వాని సృష్టి వలన గొప్ప కార్యము నెఱవేరవలసియున్నది. అన్ని తీర్మానములు సంపూర్ణముగ తీర్పు దినమునందగును. కాఁబట్టి అదితప్పక వచ్చును. అపుడు అందఱికర్మల తీర్పు అగును. కావున ఓ మహమ్మదు! నేను మత ప్రచారము చేసితిని. కాఫిర్లు సమ్మతించుట లేదు అని చింతింపకుము. వారు పెట్టుబాధలకు నీవు సహించి వారిని క్షమించి మన్నింపుము. తుదకు దేవుని సెలవు వచ్చును అని దేవుని సెలవు. 85. దుష్టులు చేయు అక్రమములను నీవు వహించు ఓపిక యు దేవునికిఁ దెలియును. ఆతఁడే సృష్టికర్త. ఒకతూరి మానవులను పుట్టించిన దేవునికి తిరిగి మానవులు చచ్చిన పిదప వారిని సజీవులు చేయుట కష్టము కాదు. అపుడు ప్రతికర్మకుఁ దగిన ఫలితము లభించి తీరును. 87. నమాజులో మాటిమాటికి పఠింపఁబడు ఏడువాక్యములు సూరయేఫాతిహా లోనివి. ఇవి చాల మహిమగల వాక్యములు. ఇవి ఖురానునకు ప్రారంభమున నున్నవి. ఈ యేడు వాక్యములలో నున్న విషయములు మిగిలిన ఖురానులో వివరింపఁబడును. గొప్ప ఖురానుకూడ సూరేఫాతిహాను అన్వయించును. ఇట్టి గొప్ప విషయముగల సూరాను దేవుఁడు నీకు ప్రసాదించెను. కావున ఓపవిత్ర! అవిశ్వాసులు పెట్టు బాధలకు లెక్కచేయకుము. 88. యూదులు మొదలగు అవిశ్వాసులకు ఇహలోక సంపదలు గలవు. అవి నశించునవి. వానివైపు కన్నెత్తియైన చూడకూడదు. కాఫిర్లు ముసల్మానులు కాలేదే అను చింత నీకువలదు. మతప్రచారము చేయుటయే నీపని. మఱిముసల్మానుల విషయము కనికరము గలిగి వారియెడ వినయము వహించుట నీపని. అట్లుచేయుట వలన ముసల్మానులకు మనశ్శాంతి గలుగును. 89. ఒకరువిశ్వసించిన విశ్వసింపకపోయిన నీకుబాధ్యతలేదు. నీపని ప్రచారము చేసి భయబోధ నిచ్చుట అని ప్రవక్తకు దేవుని సెలవు. 90. యూదులు నస్రానీలు తమ తమగ్రంథములను భాగములుభాగములుగఁ జేసి కొన్నిటిని నమ్మి కొన్నిటిని తిరస్కరించి దేవుని శిక్షకు పాల్పైరి. అటులే ఖురానును నమ్మనివారిపై దేవుని శిక్ష వచ్చును అని హెచ్చరింపఁ బడెను. 92,93. తీర్పు దినమునందు అవిశ్వాసుల నందఱిలోను మీరెందులకు విశ్వసింపలేదు. మీరెవరిని పూజించితిరి. మీరు ప్రవక్తలఁ గూర్చి యెట్లు ప్రవర్తించితిరి. దేవుఁడు ఒక్కఁడు అనిమీరెందులకు నమ్మలేదు అను ప్రశ్నలు దేవుఁడు ప్రశ్నించును. 94,95. ఓప్రవక్త! నీవు మత ప్రచారము చేయుము. దేవుని యాజ్ఞలను వెల్లడించి ప్రకటించుము. నీతో పరిహాసములాడు వారిని మేము చూచుకొందుము. వారు నీకేలాటి హాని చేయఁజాలరు. మేము నిన్ను కాపాడుటకు చాలుదుము. 96. పరిహాసము లాడువారు దేవునికి సాటి కల్పించుచున్నారు. వారు చేయు పరిహాసమునకును

విగ్రహారాధనకును ఫలితమేమి లభించనున్నదో వారు త్వరలోనే తెలిసికొనం గలరు. 97,98. అవిశ్వాసులు విశ్వసింపక హజ్రత్ మహమ్మదువారి విషయము అనేక మాటలు పలుకుచుండిరి. వానివలన ప్రవక్తగారి హృదయము కష్టపడుచు నుండెను. దానికిగాను దేవుఁడు నీహృదయమునకు గలుగు కష్టము మాకుఁదెలియును. నీవుచింతింప నక్కఱలేదు. మనస్సు శాంతిపడుటకుఁగాను స్తోత్రము చేసి నమాజు సలుపుము అని సెలవిచ్చెను. దీనిబట్టియే రసూలు వారికి ఏదైన కష్టము గలిగినచో తత్క్షణము నమాజు సలుపుదురు. దానివలన వారికి శాంతిలభించుచుండెను. 99. యఖీన్ అనుపదమునకు అరబ్బీ భాషలో చావు అని అర్థము. నిశ్చితము (చావు) వచ్చునంతవఱకు దేవునిని ప్రార్థించుచునే యుండవలెను. ఇదియే భక్తులపని. ఏకాలమునందును దేవుని ధ్యానము లేకుండ యుండకూడదు. సదా దేవుని ధ్యానించుచు నుండవలెను అని దేవుని సెలవు.

సూరయే నహల్ (తేనెటీఁగ) మక్కీ 128 వాక్యములు.

బిస్మిల్లా-హిర్రహ్మా-నిర్రహీమ్.
పరమదయాళువును ప్రేమించువాఁడునగు దేవునిపేర.

1. అతా-అమ్రుల్లాహి-ఫలా-తస్-తఅ-జిలూహు-సుబ్-హానహూ-వ-త-ఆలా అమ్మా-యుష్-రికూన్. 2. యునజ్-జిలుల్-మలా ఇకత-బిర్ - రూహి-మిన్-అమ్ రిహీ-అలా-మన్-యషాఉ-మిన్-ఇబాదిహీ-అన్-అన్ జిరూ-అన్నహూ లా-ఇలాహ-ఇల్లా-అనా-ఫత్-తఖూన్.

1. దేవుని యాజ్ఞ వచ్చివేసెను. కావున దానికిగాను తొందర చేయకుఁడు. ఆతఁడు పరమపవిత్రుఁడు. వారు కల్పించుకొను సాటికంటె చాల ఉన్నతుఁడు. 2. దేవుఁడు తన యాజ్ఞచే సందేశమునిచ్చి దూతలను తన భక్తులలో తాను కోరిన వారియొద్దకు నేను తప్ప వేఱు దేవుఁడులేఁడు. కావున నాకే భయపడుడు అని భయబోధ నిచ్చుటకు పంపుచున్నాఁడు.

వ్యా॥ 1. హజ్రత్ రసూలువారిశిష్యులు విజయముపొందుదురు. దుష్టులు పరాజితులై లోఁబడుదురు. ఇహమునందు ముసల్మానుల చేతులనుండియు పరమునందు దేవునివలనను వారికిశిక్షలభించును అని దేవుని యాజ్ఞవచ్చివేసినది. మఱితీర్పుదినము కాలము సమీపించినది. అదికూడ దూరములేదు. తొందరపడకూడదు. అదిసంభవించునపుడు ఎవరును ఆటంకపఱచలేరు. కావున దేవునినమ్మి విగ్రహారాధన మానుకొనవలెను. దేవుఁడు పరమపవిత్రుఁడు. అవిశ్వాసులు దేవునికి సాటిగ కల్పించుకొను చిల్లరదేవతలు దేవుని యాజ్ఞను శిక్షను రద్దు చేయలేరు. దేవుఁడు సర్వాధికుఁడును సర్వాధికారియును. 2. దేవుఁడు తాను

కోరినవారికి ప్రవక్తపదవి నొసంగి వారియొద్ద తన సందేశము దేవదూతలచేతికి నిచ్చి పంపుచున్నాఁడు. ప్రవక్తలు దేవుఁడు ఒక్కఁడు. ఆతని నేప్రార్థింపవలెను. ఆతని శిక్షకు భయపడవలెను అని ప్రజలకు భయబోధ నిచ్చెదరు. జబ్రీలుదూత ప్రవక్తలయొద్దకు సందేశము (వహీ) తెచ్చు నాతఁడు.

3. ఖల-ఖస్-సమా-వాతి-వల్-అర్‌జ-బిల్-హఖ్ఖి-తఆలా-అమ్మా-యుష్రికూన్. 4. ఖలఖల్-ఇన్ సాన-మిన్-నుత్-ఫతిన్-ఫఇజా-హువ- ఖసీముమ్-ముబీన్. 5- వల్ అన్-ఆమ-ఖలఖహా-లకుమ్-ఫీహా-దిఫ్ఉన్-వ-మనా- ఫిఉ-వ-మిన్‌హా-తాకులూన్. 6. వలకుమ్-ఫీహా జమాలున్-హీన-తురీ-హూన-వ-హీన-తస్ - ర - హూన్. 7. వతహ్‌మిలు - అస్ - ఖాలకుమ్ - ఇలా - బలదిల్-లమ్-తకూనూ-బాలి-గీహి-ఇల్లా-బి-షిఖ్ఖిల్-అన్-ఫుసి-ఇన్న- రబ్బకుమ్-ల-రఊ-ఫుర్-రహీమ్. 8. వల్-ఖైల-వల్-బిగాల-వల్-హమీర-లి-తర్-కబూహా-వ-జీనతన్-వ-యఖ్-లుఖు-మా లా-తఅ-లమూన్. 9. వ-అలల్లాహి-ఖస్-దుస్ సబీలి-వ-మిన్‌హా-జాఇరున్-వలౌ-షాఅ లహదాకుమ్-అజ్-మఈన్.

3. దేవుఁడు ఆకాశములను భూమిని తగినట్లుగా సృష్టించెను. వారుకల్పించుకొను సాటికంటె చాల యున్నతుఁడు. 4. ఆతఁడు ఒక బిందువులో మనుష్యుని పుట్టించెను. పిదప వాఁడు అపుడే వాదించువాఁడుగను మాటలాడువాఁడుగ నాయెను. 5. మఱియు ఆతఁడు మీకొఱకు పశువులను పుట్టించెను. అందు మీకు వస్త్రములును, అనేక లాభములును గలవు. మఱివానిలో కొన్నిటినిమీరు తినుచున్నారు. 6. మఱియు సాయంకాలము వానిని మేపి తోలుకొనివచ్చునపుడును వానిని మేపుటకుఁ గొనిపోవునపుడును మీకు వానివలన అందమున్నది. 7. ప్రాణ కష్టములతో తప్ప మీరు పోయి చేరఁజాలని పురములకు అవి మీ భారములను మోసికొనిపోవును. నిశ్చయముగా మీప్రభువు అనుగ్రహించువాఁడును దయాళువును. 8. మఱి మీరు స్వారిచేయుటకును మీకుఅందములభించుటకును గుఱ్ఱములను, కంచరగాడిదలను, గాడిదలను,ఆతఁడుపుట్టించియున్నాఁడు. మఱి మీకుఁ దెలియనిదానినికూడ పుట్టించును. 9. మఱి సన్మార్గము దేవునిని చేరుచున్నది. మఱి కొన్ని మార్గములు వంకరవిగా నున్నవి. మఱి ఆతఁడు కోరినచో మీకందఱికిని సన్మార్గము చూపియుండును.

వ్యా॥ 3. దేవుఁడు ఆకాశములను భూమిని తగినట్లుగా పుట్టించి వానిని క్రమముగాను స్థిరముగాను నడిపించుచున్నాఁడు. వీని క్రమములో నేలాటి తార

తప్పులు లేక సరిగా నుండుటవల్లను వీనికి ఒక్క సృష్టికర్తయే యున్నాఁడని తెలియుచున్నది. పెక్కుదైవములున్నచో యెపుడో ఈలోకము పాడైపోయి యుండును. అసలే లోకమే పుట్టకయుండును. అందువలన దేవునికి నెవరునుసాటి లేరు అని తెలిసికొనునది. 4. భూమ్యాకాశములను సృష్టించిన పిదప దేవుఁడు మనుష్యుని పుట్టించెను. మానవుఁడు ఒక బిందువుతో ఇట్టిరూపముదాల్చి తల్లి గర్భమునుండి పుట్టుచున్నాఁడు. కావున మానవుడు తన పుట్టుకను గమనించినచో తన విషయము తెలిసికొనఁగలఁడు. ఒక రేతస్సుబిందువువలనపుట్టెను. పుట్టినపుడు మాటలాడలేకుండెను. పెద్దవాఁడైయిపుడు దేవునికివిరోధముగవాదించుచున్నాఁడు. కావునమానవుఁడు తనపుట్టుకను గమనించినబాగుఁడును. 5. ఒంటె, ఆవు, గొఱ్ఱె, మేఁకలను దేవుఁడుమానవులకొఱకుపుట్టించెను. వానిలో కొన్నిటిరోమములవలన కంబళ్లు, గుడారములు వెచ్చనివస్త్రములుతయారుచేసికొందురు. పాలు, పెరుగు, నెయ్యి మొదలగువస్తువులు వాని వలనలభించుచున్నవి. వానిమాంసము తిందురు. వానిచర్మములతో అనేకమైనవస్తువులుచేసికొందురు. వానివలనపొలములుదున్ని పైరు చేయుదురు. మానవులు వానివలన అనేక లాభములు పొందుచున్నారు. ఇవన్నియు దేవుని యనుగ్రహములు గదా! 6. సాయంకాలను పశువులు మేసి తిరిగి వచ్చునపుడును, ప్రొద్దున మేతకు పోవునపుడును చాల అందముగ నుండును. అవి మందలు మందలుగా పోవుటనుచూచి వానిస్వామి చాల యానందించును. వానివలన వానికి గౌరవమును లభించును. 7. మనుష్యులు ఒంటరిగా పోవుటలోనే ప్రాణకష్టనుండునట్టి దూరదూరదేశములకు భారములు పశువులు మోసికొనిపోవును. వీనివలన యెంతో సౌకర్యము లభించెను. ఇవంతయు సృష్టికర్త అగు దేవునియనుగ్రహమును దయయును. ఆతఁడు పశువులను మానవులసేవకుఁగాను నియమించి అనేక సౌకర్యములు కల్పించెను. 8. గుఱ్ఱములు కంచర గాడిదలును స్వారికి ఉపయోగపడుచున్నవి. అలంకారమునకుఁగాను వాని నుంచుదురు. ఇవిగాక మానవులకు నుపయోగపడు అనేక వస్తువులను ఇఁకమీఁద దేవుఁడు పుట్టించును. ఇప్పుడు ఆ వస్తువులు మానవులకు తెలియవు. ఖురానె షరీఫు వచ్చిన మొదలు ప్రళయమువఱకు తయారగువస్తువులన్నియు నిందు చేరినవి. ఇప్పటి రైళ్లు, మోటార్లు, విమానములు, ట్రాములు మొదలగునవి యిందు చేరినవి. ఇఁకమీఁద తయారగు వస్తువులుకూడ నిందు చేరును. అరేబియా దేశములోని గాడిదలు చాల విలువైనవి. కొన్ని గాడిదలు బరువుమోయుటలోను స్వారిలోను గుఱ్ఱములకు మించిపోవును. గాడిదపై స్వారిచేయుట అరేబియాలో అలవాటుగలదు. అది లోపముగా నెంచఁబడదు. 9. భూమిలో దేశములకు పోవుటకు మార్గములు గలవుగదా! అటులే ఆత్మికమార్గముకూడ గలదు. దేవుని చేరుటకు సన్మార్గముగలదు. అది విశ్వాసమార్గము.

బుద్ధిమంతులు లోక సృష్టియందు గమనించి ఒక్క సృష్టికర్తను నమ్మి భక్తిసన్మార్గమున పోయి దేవుని పొందుదురు. అవివేకులు తప్పుత్రోవలం బడి దేవులాడి నశింతురు. దేవుండు కోరినచో బలవంతముగా నందఱిని ఒక్కసన్మార్గముపై తగిలింపం గలండు. కాని అట్లు చేయుట యుక్తముకాదని మానవుల యిష్టముపై వదలిపెట్టియున్నాండు.

10. హు-వల్లజీ అన్-జల మినస్-సమాఇ మాఅల్-లకుమ్ మిన్హు-షరా బున్-వ-మిన్హు-షజరున్ ఫీహి-తుసీమూన్. 11. యుమ్బితు-లకుమ్-బిహిజ్-జర్అ-వజ్-జైతూన-వన్-నఖీల వల్ అఅ-నాబ-వ మిన్-కుల్లిస్-సమ-రాతి ఇన్న ఫీ-జాలిక-ల-ఆయతల్-లి-ఖౌమిన్-యత-ఫక్కరూన్. 12. వ సఖ్ఖర లకుముల్ లైల వన్-నహార వష్ షమ్సవల్-ఖమర వన్-నుజూము ముసఖ్ఖ-రాతుమ్-బి-అమ్రిహీ-ఇన్న ఫీ-జాలిక-ల-ఆయాతిల్-లి ఖౌమిన్-యఅ-ఖిలూన్. 13. వ-మా జరఅ-లకుమ్-ఫిల్-అర్జి ముఖ్-తలి-ఫన్-అల్-వానుహూ-ఇన్న-ఫీ-జాలిక-ల-ఆయతల్-లి-ఖౌమిన్-యజ్-జక్కరూన్.

10. ఆతండే మీకొఱకు ఆకాశమునుండి నీళ్లను కురిపించెను. దానినే మీరు త్రాగుదురు. దానివలన కలుగు వృక్షములను మీరు మేపుదురు. 11. దానివలననే మీకొఱకు పైరును, ఆలివివృక్షము (జైతూను)లను ఖర్జూరపుచెట్లును ద్రాక్షను సర్వవిధములగు ఫలములను పుట్టించుచున్నాండు. నిశ్చయముగా నిందు గమనించునట్టి జనులకు సూచనగలదు. 12. మఱియు రాత్రింబవళ్లను సూర్యుని చంద్రుని మీసేవలో నియమించియున్నాండు. మఱియు నక్షత్రములు ఆతనియాజ్ఞకుం లోంబడి పనిలోం దగిలియున్నవి. నిశ్చయముగా నిందు బుద్ధిమంతులకు సూచనలు గలవు. 13. మఱి మీకొఱకు భూమిలో పలువిధములైన వస్తువులు వ్యాపింపంజేసియున్నాండు. నిశ్చయముగా నిందు యోచించువారికి సూచనగలదు.

వ్యా॥ 10. ఇంక దేవుండు మానవులకొఱకు కల్పించిన ముఖ్యసౌకర్యములును వసతులును చెప్పంబడుచున్నవి. నీళ్ళు కురిపించి దానికి త్రాగుటకు తగినట్లుగం జేసెను. నీళ్ళవలన గడ్డి, మొక్కలు, వృక్షములు పుట్టుచున్నవి. వానిని పశువులు మేయుచున్నవి. పశువులవలన అనేక లాభములు మానవులు పొందుచున్నారు. 11. ఆ నీళ్ళతోనే మానవుల ఆహారముకొఱకు పలువిధములైన పైరుపంటలు ధాన్యములు, ఆలివి ఖర్జూరము, ద్రాక్ష మొదలగునవియు సర్వవిధములైన ఫలములు పుట్టుచున్నవి. ఒక్క భూమి, ఒక్క ఆకాశము, ఒక్క రకమైన నీళ్లు, ఒక్క సూర్యుండుండియు పలువిధములైన ఫలములు పుట్టు

చున్నవే అని మానవులు గమనించినచో వారు దేవుని శక్తి మహిమలను గ్ర హింపగలరు. కావున ఇందు గొప్ప సూచనగలదు. 12. రాత్రింబవలు క్రమ ముగా వచ్చిపోవుట, సూర్యచంద్రులు క్రమముగ ఉదయించి అస్తమించి తమ పనులు నెరవేర్చుట సర్వము మానవుల లాభముల కొఱకేను. ఇవన్నియు మాన వులకు దాసులవలె సేవచేయుచున్నవి. ఇవి లేనిచో మనుష్యుఁడు ఒక్క నిమి షము బ్రతుకఁజాలఁడు. పగలు లోకవ్యవహారములకొఱకు. రాత్రి విశ్రాంతి కొఱకు. నక్షత్రములుకూడ దేవుని సెలవుచే మానవులసేవచేయుచున్నవి. వాని వలనకూడ లాభములు కలవు. కాని ఇవి మానవులకు చేయు సేవ స్పష్టముగా కనఁబడుటలేదు. అందులకే అవి దేవుని యాజ్ఞకు లోఁబడియున్నవి అని చెప్పఁ బడినొను. ఇందు బుద్ధియోచనలుగలవారికి దేవుని శక్తిని సూచించు గొప్ప సూచనలు గలవు. 13. పై వివరింపఁబడిన వస్తువులు మానవుల సేవ చేయు నట్లు వారి లాభమునకై భూమిలో ననేక వస్తువులను దేవుఁడు సృష్టించి యున్నాఁడు. అవి పలువిధములైనవి. పలువిధముల రంగులు, రూపములుగలవి. ఇందు జంతువులు, వృక్షములు, జడములు, గనులు మొదలైన భూమిలోని వస్తు వులు చేరును. కావున వీనిని యోచించువారికి దేవుని శక్తిని సూచించు సూచ నలు గలవు. కావున మానవులు గమనించి సృష్టికర్తను నమ్మవలెను. ఆతనికి భక్తులై కృతజ్ఞత గలుపవలెను.

14 వ-హువల్ లజీ-సఖ్ ఖరల్-బహ్ర-లితా-కులూ-మిన్ హు-లహ్మ- మన్-తరీయన్-వతస్-తఖ్ రిజూ-మిన్ హు-హిల్ యతన్ తల్ - బసూనహా-వ-త రల్ ఫుల్ క-మవా ఖిర-ఫీహి వలి-తబ్ తగూ-మిన్-ఫజ్ లిహీ-వ-ల - అల్లకుమ్- తష్-కురూన్. 15. వ-అల్-ఖా-ఫిల్-అర్ జి-రవాసియ-అన్- తమీద-బికుమ్-వ అన్-హారన్-వ-సుబు లల్ లఅల్లకుమ్ తహ్-తదూన్. 16. వ అలా మాతిన్-వ బిన్-నజ్ మి-హుమ్-యహ్ తదూన్. 17. అఫ-మన్-యఖ్ లుఖు-కమల్-లా- యఖ్ లుఖు-అఫలా-తజక్కరూన్. 18. వ ఇన్-తఉద్దూ-నిఅ-మతల్లాహి - లా- తుహ్ -సూహా-ఇన్నల్లాహ ల గఫూరుర్-రహీమ్. 19. వల్లాహు-యఅ - లము- మాతుసిరూన-వ-మా-తుఅ-లినూన్. 20. వల్ల-జీన-యద్-ఊన-మిన్- దూనిల్లా హి-లా-యఖ్ లుఖూన-షైఅన్-వ-హుమ్ యుఖ్ లఖూన్. 21. అమ్ వాతున్- గైరు-అహ్-యా ఇన్-వ-మా-యష్-ఉరూన అయ్యాన యుబ్-అనూన్.

14. మఱియు ఆతఁడే సముద్రమునుండి తాజా మాంసము (చేపలు)

మీరు తినుటకును మీరు ధరించు నగలను అందుండి మీరు తీయుటకును దానిని
మీ కధీనము చేసియున్నాఁడు. మఱియు నందు నీళ్ళను చీల్చుకొని పోవు నావలను
నీవు చూచుచున్నావు. మఱి దేవుని యనుగ్రహమును వెదకఁబోవుటకును మీరు
కృతజ్ఞత సలుపుటకును సముద్రమును మీకు ఆధీనము చేసెను. 15. భూమి మీకుఁ
దీసికొని చలింపకుండుటకై దానిపై పర్వతములను దేవుఁడుంచెను. మఱి ఆతఁడు
మీరు మార్గములు పొందుటకుఁగాను నదులను త్రోవలను చేసెను. 16. మఱి
గుర్తుల నుంచెను. మఱి జనులు నక్షత్రములనుబట్టి త్రోవలు కనుఁగొనుచున్నారు.
17. మఱేమి సృష్టించువాఁడు సృష్టింపనివానితో సరిసమానుఁడగునా ? ఏమి
మీరు గమనింపరు ! 18. మఱి మీరు దేవుని యనుగ్రహములను ఎంచినచో
మీరు లెక్కపెట్టఁజాలరు. నిశ్చయముగా దేవుఁడు క్షమించువాఁడును దయాళు
వును. 19. మఱి మీరు దాఁచునదియును వెలిబుచ్చునదియును దేవునికిఁ దెలి
యును. 20. దేవుని వదలి ఆవిశ్వాసులు ఎవరిని ప్రార్థించుచున్నారో వారేమి
యు పుట్టించుటలేదు. మఱి వారే పుట్టింపఁబడయున్నారు. 21. వారు ప్రాణము
లేని నిర్జీవులు. మఱి వారెప్పుడు లేపఁబడుదురో వారు ఎఱుంగరు.

వ్యా॥ 14. ఇందు దేవుఁడు మానవులకుఁ జేసిన మేళ్లు చెప్పఁబడుచున్నవి.
భయంకరమైన సముద్రము మనుష్యులకు లోఁబడియున్నది. వారు అందు చేఁపలు
పట్టుచు తాజా మాంసము భుజించుచున్నారు. సముద్రములో మునిగి యందలి
పగడములను ముత్యములను దీసి నగలుచేసి ధరించుచున్నారు. దేవుఁ డొసంగిన
బుద్ధిచే, నావలు, ఓడలు, స్టీమర్లుచేసి భయంకరమైన అలలను చీల్చుకొని దూర
దేశములకుఁ బోయి వ్యాపారములు చేయుచు అనేకలాభములుపొందుచున్నారు.
ఇదంతయును దేవుని యనుగ్రహము. కావున మనుష్యులు దేవునికి కృతజ్ఞులై
యుండవలెను. 15. ప్రప్రథమమున భూమి కంపించుచుండెను. అది స్థిరముగానుండి
కదలకుండ నుండుటకు నందు పర్వతములను దేవుఁడుంచెను. దానివలన మను
ష్యులు సురక్షితముగా భూమిపై వసించుచున్నారు. మనుష్యులు నదులలో
తమ ప్రయాణము సాగించుచు వానివలన అనేక లాభములు పొందుచున్నారు.
అటులే భూమిలోకూడ మార్గములున్నవి. వానినుండి ఒక దేశమునుండి యితర
దేశములకుఁ బోవుచున్నారు. ఇవన్నియు దేవుని యనుగ్రహములే. 16. బాట
సారులు, బిడారములు, మార్గములను కనుఁగొనుటకుఁగాను పర్వతములు చెట్లు,
నదులు, ఊటలు, ఇసుక కుప్పలు గుర్తులుగా నున్నవి. వానిని చూచువారు
మార్గమును కనుఁగొనుచున్నారు. రాత్రిపూఁట సముద్రములోను భూమిపైనను
ప్రయాణముచేయువారు నక్షత్రములను చూచి తాము పోవు దిక్కులను మార్గ
మును కనుఁగొనుచున్నారు. ఇవన్నియు దేవుని యనుగ్రహములే గదా ! 17.
పై వాక్యములలో వివరింపఁబడినవానిని దేవుఁడు సృష్టించియున్నాఁడు. ఒక్క

యీఁగను, ఒక దోమ కాలును ఒక గింజను పుట్టింపలేనివారిని దేవునికి సాటిగ కల్పించి వారిని దేవునితో సమానులుగఁ జేయుట అవివేకము గదా! అట్లు చేయు విగ్రహారాధకులు వివేకులు కారుగదా! సృష్టించు సర్వశక్తుఁడును సృష్టింపలేని శక్తిహీనులును ఒకటిగా కాఁగలరా! బుద్ధిమంతులు గమనింప వలెను. 18. దేవుని యనుగ్రహములలో కొన్ని మాత్రమేపైన వివరింపఁబడినవి. మిగిలిన యనుగ్రహములను లెక్కపెట్టవలెనన్న మానవులచేతకాదు. అవిలెక్కకు మించినవి. కావున మానవుఁడు తన శక్తికొలఁది దేవుఁడు చేసిన యుపకారములను తలఁచి కృతజ్ఞతసలుపవలెను.అందేమైనలోపమున్నచో దేవుఁడుక్షమించి కరుణించును. 19. మానవులు దాఁచునది వెలిబుచ్చునది సర్వము దేవునికిఁ దెలియును. ఎవరు మనఃపూర్వకముగా విశ్వసించి కృతజ్ఞత సలుపుదురో అదియును ఎవరు వంచనచేయుదురో అదియును సర్వము దేవునికిఁ దెలియును. ఆతనికెద్దియునుమఱుఁగులేదు. ఎవరిభక్తివిశ్వాసములకుఁదగినట్లువారికిఫలితమొసంగును. అటులే అవిశ్వాసులను శిక్షించును. 20. ఇఁక విగ్రహారాధకుల అవివేకము చూడుఁడు. సర్వమును సృష్టించిన దేవుని వదలి పుట్టింపలేని చిల్లరదేవతలను ప్రార్థించుచున్నారు. ఆ చిల్లర దేవతలుకూడ దేవునిచే సృష్టింపఁబడినవారలే వా రెద్దియును సృష్టింపలేదు. 21. అవిశ్వాసులు పూజించు దేవతలు విగ్రహములు ప్రాణములేని నిర్జీవులు. విగ్రహములు జడములు. మహాపురుషులనుకూడ కొందఱు మూఢులు పూజింతురు. వీరుకూడ చచ్చినవారే. చావకయుండువారెవరును లేరు. ఒక్క దేవుఁడే సదా యుండువాఁడు. అవిశ్వాసులు పూజించు దేవతలకు ప్రళయము ఎప్పుడు వచ్చును. ఎప్పుడు తీర్పుదినము (ఖియామత్) అగును అను విషయము కూడ దెలియదు. అట్టివా రెట్లుదేవుళ్ళు కాఁగలరు.

22. ఇలా-హుకుమ్-ఇలా-హున్-వాహిదున్-ఫల్లజీన-లా-యూమినూన బిల్-ఆఖిరతి-ఖులూ-బుహుమ్-మున్-కిర-తున్-వహుమ్-మున్-తక్-బిరూన్. 23. లా-జరమ-అన్నల్లాహ-యఅ-లము-మాయుసిర్రూన వ-మా-యుఅ-లినూన-ఇన్నహూ-లా-యుహిబ్బుల్-ముస్-తక్బిరీన్. 24. వఇజా-ఖీల-లహుమ్-మాజా-అన్-జల-రబ్బుకుమ్-ఖాలూ-అసాతీరుల్-అవ్వలీన్. 25. లియహ్-మిలూ-ఔజారహుమ్-కామిలతన్-యౌమల్-ఖియామతి-వ-మిన్-ఔజారిల్-లజీన-యుజిల్లూ-నహుమ్-బిగైరి-ఇల్మిన్-అలా-సాఅ-మా-యజి-రూన్.

22. మీ నిజమైన పూజ్యుఁడు దేవుఁడు ఒక్కఁడే. కావునపరలోకమును

విశ్వసింపని వారి హృదయములు తిరస్కరించుచున్నవి. మఱి వారు గర్వి తులుగా నున్నారు. 23. వారు దాఁచునదియును వెలిబుచ్చునదియును నిశ్చ యముగా దేవునికిఁ దెలియును. నిశ్చయముగా దేవుఁడు, గర్వించువారిని ప్రే మింపఁడు. 24. మఱియు వారితో మీ ప్రభువు ఏమి పంపెను అని చెప్పినచో పూర్వీకుల కథలు అని వారు పలుకుదురు. 25. తీర్పుదినమునందు వారు తమ పాపముల భారములను సంపూర్ణముగను, తెలివిలేక తాము ఎవరిని దారి తప్పిం చిరో వారి పాపములలోని కొంత భారమును మోయుటకుఁగాను అట్లు పలుకు దురు. వినుము. వారు మోయు భారము చాల చెడ్డది.

వ్యా॥ 22. పై వాక్యములలో వివరింపఁబడిన దేవుని శక్తిసూచనలు గమనించినచో నిజమైన పూజ్యుఁడు, ఒక్క దేవుఁడే అని తెలియనగును. మాన వులు పూజింపఁదగిన దేవుఁడు ఒక్కఁడే. పెక్కు చిల్లర దేవతలుకావు. పరలో కమును నమ్మిన మానవులు గమనించినచో నమ్మఁగలరు. కాని పరలోకమందు విశ్వాసములేనివారు నమ్మరు. వారి హృదయములు తిరస్కరించును. అట్టివారు దేవునికి భయపడరు. ప్రవక్తలను నమ్మరు. ఎందుకన వారికి పరమునందు తీర్పున్న ది అను భయము లేదు. అందులకే గర్వము వహించి అనేక పాపములకు పాలగు చున్నారు. 23. గర్వము దేవునికి ఇష్టములేనిది. గర్వితులను దేవుఁడు ప్రేమింపఁ డు. హృదయములలో దాఁచు అవిశ్వాసమును వెలిబుచ్చు సర్వము దేవునికిఁ దెలియును. కర్మలకుఁదగినట్లుఫలితమిచ్చును. 24, 25. తిరస్కరించు అవిశ్వాసు లతో ఏమయ్యా! మీప్రభువు ఏమి సందేశము పంపెను అని ఎవరైన అడిగి నచో తిరస్కారముతో పూర్వీకుల కథలుమాత్రమే. ఏమున్నది అనిపలుకుదురు. అవిశ్వాసులు ఖురానును విని అందలివిషయములు వినియు ద్వేషముతో అట్లు పలుకుదురు. అట్లు పలికి ఇతర ప్రజలనుకూడ సన్మార్గమునుండి తప్పింతురు. 25. దాని ఫలితముగ తాము గావించినపాపముల భారమును, తాము సన్మార్గ మునుండి ఎవరినితప్పుబోధచేసి తప్పించిరో వారిపాపములలోని కొంతభారమును తీర్పుదినమున మోయుదురు. ఈపాపపుమాటలు మోయుటకు అట్లుపలుకుదురు. ఆ పాప భారములు చాల చెడ్డవి.దాని ఫలితము నరకము.

26. ఖద్ మకర-ల్లజీన-మిన్-ఖబ్-లిహిమ్-ఫ-అతల్లాహు-బున్యానహుమ్-మి నల్-ఖవా-ఇది-ఫ-ఖర్ర-అలై-హిముస్-సఖ్ఫు-మిన్-ఫౌ-ఖిహిమ్- వ- అతా-హు ముల్-అజాబు-మిన్-హైసు-లా-యష్-ఉరూన్- 27. సుమ్మ-యౌ-మల్-ఖియా మతి-యుఖ్-జీహిమ్-వ-యఖూలు-ఐన-షుర-కాఇ-యల్లజీన-కున్తుమ్-తుషాఖ్ ఖూన-ఫీహిమ్-ఖాలల్-లజీన-ఊతుల్-ఇల్మ-ఇన్నల్-ఖిజ్-యల్-యౌమ-వస్-

సూఅ-అలల్-కాఫిరీన్. 28. అల్లజీన-తత-వఫ్ఫాహుముల్-మలాఇకతు-జాలిమీ-అన్-ఫుసిహిమ్-ఫఅల్-ఖు-ఉస్-సలమ-మాకున్నా-నఅ-మలు-మిన్-సూఇన్-బలా-ఇన్నల్లాహ-అలీముం-బిమాకున్తుమ్-తఅ-మలూన్. 29. ఫద్ఖులూ అబ్వాబ-జహన్నమ-ఖాలిదీన-ఫీహా-ఫల-బీస-మస్వల్-ముత-కబ్బిరీన్.

26. వీరికి పూర్వమున్నవారు కుట్రలు పన్ని యున్నారు. పిదప దేవుని యాజ్ఞ వచ్చి వారికట్టడములు పునాదులతో(బాటు పడి వారిపైన కప్పులు కూడ పడెను. మఱివారికి తెలియనిచోటునుండి వారికిశిక్షకలిగెను. 27. మరల దేవుడు తీర్పు దినమునందు వారికి అవమాన పఱచును. మఱియు మీారు ఎవరిని నాకు సాటిగాక కల్పించి వారి విషయము మీరు వాగులాడు చుంటిరో వారెక్కడ అని పలుకును. ఎవరికి జ్ఞానము నొసంగ(బడెనో వారు ఈదినమునిశ్చయముగా దేవు(డు అవమానమును కీడును అవిశ్వాసుల కున్నది అని పలుకుదురు. 28. తమ యాత్మలకు తామే అన్యాయము చేసి కొన్నట్టివారి ప్రాణములు దేవదూతలు తీయు నపుడు వారు మేము ఏలాటి పాపము చేయనే లేదే అని విధేయత చూపుదురు. ఎందుకులేదు. మీారు చేయుచుండిన కర్మలు దేవునికి బాగుగ తెలియును. 29. కావున నరక ద్వారములలో ప్రవేశింపు(డు. అందు సదా యుండు(డు, గర్విష్ఠుల స్థానము చాల చెడ్డది అని చెప్ప(బడును.

వ్యా॥ 26. హజ్రత్ ముహమ్మదువారికి విరోధముగ అవిశ్వాసులు అనేక కుట్రలు పన్నుచున్నారు. ఇటులే వీరికి పూర్వముకూడ ప్రవక్తలకు విరోధముగ దుష్టులు కుట్రలుపన్ని సన్మార్గమునుండి ప్రజలను తప్పించిరి. తుదకు వారు పన్నిన కుట్రవలన వారికే నాశము వచ్చెను. వారికుట్రలు సాగలేదు. దేవుని శిక్షకు పాలై వారు తమరక్షణకొఱకు కట్టిన కట్టడములే దేవునాజ్ఞచే వారిపై(బడి వారు నశించిరి. 27. తీర్పు దినమునందు కూడ వారి కుట్రలు బహిరంగ మగును. చిల్లర దేవతల పక్షమున, దేవుని ప్రవక్తలతో అవిశ్వాసులు వాదించుచుండిరి. ఓ అవిశ్వాసులార! ఆచిల్లర దేవతలు ఎక్కడ నున్నారు. ఇపుడు ఏలమీాకు తోడు పడరు అని దేవు(డుఅడుగును. దీనివలనఅవిశ్వాసులకు అవమానము గలుగును. అవిశ్వాసులు ఏమియు బదులు పలుక(జాలరు. అపుడు దేవునిచే జ్ఞానము పొందియున్న ప్రవక్తలును భక్తులును, ఇహమునందు మేము పలుకుచుండలేదా! ఈదినము (ఖియామతు) నందు అవిశ్వాసులకే అవమానము కీడు లభించును అని పలుకుదురు. 28. అవిశ్వాసులు తమ జీవిత కాలమంతయు అవిశ్వాసము వహించి అనేక పాపములు చేసి తమ యాత్మలకున్యాయము చేసికొని తుదకు అవిశ్వాసులుగానే చచ్చిరి. అట్టి వారి ప్రాణములు దేవ

దూతలు తీయునపుడు వారు తమకున్న పూర్వ గర్వమువదలి విధేయతచూపుచు మేము పాపకార్యములు చేయలేదే అని పలుకుదురు. ప్రాణము పోవునపుడు మోసము చెల్లదు. సర్వము దేవునికిఁ దెలియును. మీరు చేయుచున్న కర్మలు దేవునికిఁ దెలియును. వానికిఁ దగిన శిక్ష తప్పక లభించును. 27. అదియే నరక నివాసము. అందు సదా యుండవలెను. అదిచాల చెడ్డనివాసము అని చెప్పఁబడును.

30, వఖీల-లిల్ల-జీ-నత్-తఖౌ-మాజా-అన్ జల-రబ్బుకుమ్-ఖాలూ-ఖైరన్ లిల్లజీన-అహ్సనూ-ఫీ-హాజి-హిద్-దున్యా హస-నతున్-వల-దారుల్-ఆఖిరతి-ఖైరున్-వల-నిఅమ-దారుల్-ముత్తఖీన్. 31. జన్నాతు-అద్-నిన్-యద్-ఖులూనహా తజ్ రీ-మిన్-తహ్తిహల్-అన్-హారు-లహుమ్-ఫీహా-మా-యషా-ఊన-క జాలిక యజ్-జిల్లాహుల్-మత్తఖీన్. 32. అల్ల-జీన-తత-వఫ్ఫా-హుముల్-మలా-ఇకతు-తయ్యి-బీన-యఖూలూన-సలామున్-అలైకు-ముద్-ఖు-లుల్-జన్నత-బిమా కున్తుమ్-తఅమలూన్.

30. మఱియు భయభక్తులు గలవారితో మీప్రభు ఏమి పంపెను అని పలుకఁగా వారు మేలైనదే పంపెను అని పలుకుదురు. ఎవరు ఈ లోకములో సత్కార్యము చేసిరో వారికి మేలున్నది. మఱి పరలోక గృహము చాలమేలైనది. మఱి భక్తిపరుల గృహము చాల మేలైనది. 31. అది సదాయుండు స్వర్గవనములు గలది. అందువారు ప్రవేశింతురు. అందు కాలువలు ప్రవహించును. అందు వారు కోరునది వారికిఁ గలదు. ఇట్లు దేవుఁడు భక్తిపరులకు ఫలిత మొసంగును. 32. ఆ భక్తుల ప్రాణములు దేవదూతలు తీయునపుడు వారు పవిత్రులుగానుందురు. దేవదూతలు "మీకు శాంతము గలుగుగాత! మీరు చేయుచున్న కర్మల ఫలితముగ మీరు స్వర్గములో ప్రవేశింపుఁడు" అని పలుకుదురు.

వ్యా॥ 30. ఇఁక భయభక్తులుగల విశ్వాసుల విషయము నిందు చెప్పఁబడుచున్నది. ఖురానును గూర్చి వారితో మీ ప్రభువు ఏమి సందేశము పంపెను అని వారితో నడిగినచో వారు సర్వవిధముల మేలు కూర్చు దేవునిసందేశము ఖురాను వలన మాకు లభించినది అని భక్తిపూర్వకముగా పలుకుదురు. ఇట్టి భక్తులుచేయు సత్కార్యములు వృథా పోవు. తప్పక దాని మంచిఫలితము ఇహమునందు కూడ చేకూరును. పరలోకములోని మేళ్లు సౌఖ్యములు చాల మేలైనవి. భక్తులకు అచ్చట అవన్నియు లభించును. వారినివాసములుచాల మేలైనవి. అవి స్వర్గవనములు అవి సదాయుండునవి. అందు భక్తులు కోరు దైహిక, ఆత్మిక

సర్వవిధముల సౌఖ్యములు వారికి లభించును. ఎట్టికొ అత యుండదు. అవిశ్వాసము వదలి పాపములనుండి క్షమాపణ వేఁడి భయభక్తులు గలవారికి దేవుఁడు అట్లు ఫలితము (బదులు) ఒసంగును. 32. ఆ భక్తులు తమ జీవిత కాలమంతయు అవిశ్వాస మనెడి అపవిత్రతతో పవిత్రులై పాపముల జోలికి పోక మరణకాలమందు తమ ప్రాణములు దేవుని దర్శనము లభించునను సంతోషముతో ఒప్పగింతురు. ప్రాణము పోవునేయని వారికి చింత యుండదు. అట్టి భక్తులతో దేవదూతలు మీకు శాంతము లభించుగాత! మీరు సర్వ విధముల సౌఖ్యములు పొందుటకు మీరు ఇహమునందు గావించిన సత్కార్యముల ఫలితముగ స్వర్గములో ప్రవేశింపుఁడు అని పలుకుదురు. కావున మానవులు పరమునందు మంచి స్థానము పొందుటకుఁగాను ఇహమునందు విశ్వసించి భక్తిమార్గమునందు నడవవలెను.

33. హల్-యన్‌జురూన-ఇల్లా-అన్-తాతియు-హుముల్-మలాఇకతు-ఔయాతియ-అమ్‌రు-రబ్బిక-కజాలిక-ఫ-అలల్-లజీన-మిన్-ఖబ్-లిహిమ్-వ-మా-జలమ-హుముల్లాహు-వలాకిన్-కానూ-అన్-ఫుసహుమ్-యజ్‌లిమూన్. 34. ఫ-అ-సాబ-హుమ్-సయ్యి-ఆతు-మా-అమిలూ-వహాఖ-బిహిమ్- మాకానూ - బిహీ యస్-తహ్‌-జి-ఊన్.

33. ఏమి అవిశ్వాసులు తమ యొద్దకు దేవదూతలు రావలెనని లేక నీ ప్రభువుయొక్క యాజ్ఞ రావలెనని ఎదురు చూచుచున్నారా! ఇటులే వీరికి పూర్వమున్నవారు చేసిరి. మఱి దేవుఁడు వారికి నన్యాయము చేయలేదు. కాని వారేతమ యాత్మలకు నన్యాయములు చేసి కొనుచుండిరి. 34. పిదప వారు గావించిన పాపకార్యముల ఫలితము వారికి లభించెను. మఱి వారు దేనిగూర్చి పరిహాసమాడుచు నుండిరో అదే వారిచుట్టు ముట్టుకొనెను.

వ్యా॥ 33,34. పరలోకములోని స్వర్గము చాల శ్రేష్ఠమైనది. దానికిఁగాను ఇహమునందే కృషి సలుపవలెను అని ప్రోత్సహించిన పిదప దానిఁగూర్చి అజాగ్రత్తపడి ఇహలోక భోగములలోనే నిమగ్నులై యున్నవారిని దేవుఁడు హెచ్చరించుచున్నాఁడు. ఏమి దేవదూతలు వచ్చి వారిప్రాణములు తీయునంతవఱకును వారు అజాగ్రత్తగానుండి దానికొఱకు వేచి యున్నారా! లేక దేవుని యాజ్ఞచే ప్రళయము రావలెని యెదురు చూచుచున్నారా! అప్పటి విశ్వాసము క్షమాపణ వేడుట పనికిరాదు. కావున బుద్ధిమంతులు చావు రాకముందే పరలోకమును గూర్చి శ్రద్ధవహించి విశ్వాసము వహించిసత్కార్యములు చేయవలెను. వీరికి పూర్వమున్న అవిశ్వాసులు కూడ గర్వము వహించి దుష్టత్వమునందు చెలరేగి అధర్మమునకు పూనికొని తప్పుత్రోవలఁ బోయి

దేవుని ప్రవక్తలను తిరస్కరించి వారితో పరిహాసమాడుచు వారికి విరోధులైరి. క్షమాపణ వేడలేదు. తుదకు వారి పాపముల ఫలితమును వారిపరిహాసముల ఫలితమును వచ్చి వారిని పట్టెను. దేవుని శిక్షకు పాలై తుదముట్ట నశించిరి. దేవుఁడు వారికి నేలాటి అన్యాయము చేయలేదు. వారే తమ చేతులార తమ యాత్మలకు నన్యాయములు చేసికొని తాము చేసిన కర్మల ఫలితము తామే అనుభవించిరి.

35. వ-ఖాలల్-లజీన-అష్రకూ-లౌ-షా-అల్లాహు-మా-అబద్నా-మిన్-దూనిహీ-మిన్-షైఇన్-నహ్ను-వలా-ఆబాఉనా-వలా-హర్రమ్నా-మిన్-దూనిహీ-మిన్-షైఇన్-కజాలిక-ఫ అలల్-లజీన-మిన్-ఖబ్-లిహిమ్-ఫహల్-అలర్-రుసులి ఇల్లల్-బలాగుల్-ముబీన్. 36.వలఖద్-బఅస్నా-ఫీ-కుల్లి-ఉమ్మతిన్-రసూలన్-అనిఅ-బుదుల్లాహ-వజ్-తని-బుత్-తాగూత-ఫ-మిన్-హుమ్-మన్-హదల్లాహు-వమిన్-హుమ్-మన్-హఖ్-ఖత్-అలై-హిజ్-జలాలతు-ఫ-సీరూ-ఫిల్-అర్జి ఫన్-జురూ-కైఫ-కాన-ఆఖిబతుల్-ముకజ్-జిబీన్. 37. ఇన్-తహ్-రిస్-అలా-హుదాహుమ్-ఫ ఇన్నల్లాహ-లా-యహ్-దీ మన్-యుజిల్లు-వ-మా-లహుమ్-మిన్-నాసిరీన్.

35. పెక్కు దైవములను కల్పించువారు, దేవుఁడు కోరినచో మేమును మాతాత ముత్తాతలును ఆతని వదలి దేనినైనను ఆరాధించియుండము. మఱి ఆతని యాజ్ఞలేనిదే మేము ఎద్దానినైనను నిషేధించుకొనియుండము అని పలుకుదురు. ఇటులే వీరికి పూర్వమున్నవారు చేసిరి. కావున ప్రవక్తల పని స్పష్టముగా ప్రచారముచేయుట మాత్రమేను. 36. మఱి మీరు దేవునినే ఆరాధింపుఁడు. మఱి చిల్లరదైవములను విగ్రహములను వదలుకొనుఁడు అని సెలవిచ్చి ప్రతిజాతివారియొద్దకు ప్రవక్తలను పంపియున్నారము. పిదప వారిలో కొందఱకు దేవుఁడు సన్మార్గము చూపెను. మఱికొందఱు దుర్మార్గమునకు పాలైరి. కావున దేశములలో సంచారము చేయుఁడు. తిరస్కరించినవారి గతి యేమాయెనో చూడుఁడు. 37. నీవు వారిని సన్మార్గమునకు తేవలయునని యత్నించిన నేమి లాభము. దేవుఁడు నెవరిని మార్గము తప్పించునో వారికి సన్మార్గము చూపఁడు. మఱి వారికి తోడుపడువా రెవరును లేరు.

వ్యా॥ 35. ఇఁక విగ్రహారాధకులు చూపించు నిరాధారములైనసాకులు రద్దుచేయఁబడుచున్నవి. మేము చేయు విగ్రహారాధన పాపకార్యములు, దేవునికి ఇష్టములు కానిచో ఆతఁడు మమ్ము ఎందులకు నిషేధించలేదు. ఆతఁడునిషే

ధించిన పిదప మేము వదలినచో ఎందులకు తక్షణమే మమ్ము శిక్షింపలేదు. కావున ఇట్లే మేము చేయు పనులు చెడ్డవి కావు అని వారు పలుకుదురు. దానికి దేవుఁడు ప్రవక్తలను పంపెను. విగ్రహారాధన మొదలగు పాపములను నిషేధించెను. అవిశ్వాసులు పలుకునది సరికాదు. వీరి పూర్వికులుకూడ అటులే పలికిరి. ప్రవక్తల పని ధర్మప్రచారము చేయుట మాత్రమే. వారు బలవంతపెట్టరు. దేవుఁడు మానవులకు ధర్మా ధర్మములను స్వీకరించుటలో స్వాతంత్ర్య మిచ్చి యున్నాఁడు. బలవంత పెట్టుఁడు. మనుష్యులు జడములవలె కాదు. వారికి బుద్ధి నొసంగఁబడియున్నది. దాని ననుసరించి మంచి చెడ్డలను గమనించి వారు స్వీకరింపవలెను. 36. ప్రతి కాలములోను ప్రతి దేశములోను దేవుఁడు ప్రవక్తలను పంపియున్నాఁడు. ఆయా ప్రవక్తలు దేవుని సందేశములను ఆయా ప్రజలకు అందఁజేసిరి. వారి శిష్యులుకూడ దూరదూర దేశములకు పోయి ధర్మ ప్రచారము చేసియున్నారు. ప్రవక్త లందఱకు కట్టకడపట దేవుఁడు తన ప్రవక్త యగు ముహమ్మదువారిని పంపెను. వీరి మూలమున లోకమంతటికిని మతబోధ యాయెను. ప్రవక్తలందఱును వచ్చి మనుష్యులకు దేవునినే పూజింపుఁడు. ఆతనికే విధేయులై యుండుఁడు. అధర్మమునకుఁ బోకుఁడు. విగ్రహారాధన చేయకుఁడు అని బోధించుచు వచ్చిరి. అందు బోధ వినినవారు భక్తులై దేవునికి ప్రియులైరి. మఱికొందఱు తమ దుష్టస్వభావమునుబట్టి దుర్మార్గము స్వీకరించి పాపములకు పాలై దేవుని శిక్షకు పాత్రులై నశించిరి. 37. అవిశ్వాసులు, విశ్వాసము వహింపలేదే అని హజ్రత్ రసూలువారికి చాలచింతగలిగివారు దానికొఱకు చాల పాటుపడుచు నుండిరి. దానికి దేవుఁడు మీరు చింతపడి ప్రయోజనము లేదు. మీపని ప్రచారము చేయుట మాత్రమే. ఎవఁడు తన దుష్టస్వభావమును బట్టి అవిశ్వాసియగునో వానిని ఎవరును విశ్వాసిగఁ జేయలేరు. మఱి అట్టి అవిశ్వాసులను దేవుని శిక్షనుండి తప్పింపలేరు అని యిందు సెలవిచ్చెను.

38. వ-అఖ్ సమూ-బిల్లాహి-జహ్ద-ఐమాని-హిమ్-లా-యబ్ అసుల్లాహు-మన్-యమూతు-బలా-వఅదన్-అలైహి-హక్ఖన్-వలా-కిన్న అక్-సర న్నాసి-లా-యఅ-లమూన్. 39. లియుబయ్యిన-లహుముల్-లజీ-యఖ్-తలిఫూన ఫీహి-వలి-యఅ-లమల్-లజీన-కఫరూ-అన్నహుమ్-కానూ-కాజిబీన్. 40. ఇన్నమా-ఖౌలునా-లిషైఇన్-ఇజా-అరద్నాహు-అన్-నఖూల-లహూ-కున్-ఫయకూన్.

38. మఱియు వారు దేవుని ప్రమాణములు చేసి చనిపోయినవారిని

దేవుఁడు లేపఁడు అని పలుకుదురు. ఎందుకు లేపఁడు తప్పక లేపును. దీనిగూర్చి అతని స్థిరమైన వాగ్దానము అయియున్నది. కాని జనులలో పెక్కుమందికి తెలియదు. 39. వారు దేనిగూర్చి వాదించుచుండిరో దానిఁగూర్చి వారికిఁ దెలుపుటకును, అవిశ్వాసులు అబద్ధములుపలికిరిఅనివారు తెలిసికొనుటకును దేవుఁడులేపును. 40. మేము దేనినైనఁ జేయఁదలఁచినచో దానిని అగుము అని చెప్పినమాత్రాన అది అగుచున్నది.

వ్యా॥ 38. అవిశ్వాసులు, చాల కఠినముగ ప్రమాణములు చేసి చచ్చిన పిదప తిరిగి సజీవులము కాము. అట్లు దేవుఁడు లేపఁడు. కావున శిక్షకు భయపడనక్కఱలేదు. అవన్నియు వట్టిమాటలే అని పలుకుదురు. దానిని దేవుఁడు రద్దుచేయుచు ఓ అవిశ్వాసులార! మీరు ప్రమాణములుచేసి పలికిన మాత్రాన మీమాట నిజముకాదు. చచ్చినవారిని తీర్పుకొఱకు తిరిగి తప్పక దేవుఁడు లేపును. దేవుఁడు తాను ఇట్లు చేయును అని స్థిరమైనవాగ్దానముచేసియున్నాఁడు. అది పూర్తియై తీరును. ఈ విషయమును దానిరహస్యములను పెక్కుమందికిఁ దెలియదు. అందులకే తమ యూహలనుబట్టి తిరస్కరింతురు. కాని తెలివిగలవారు లోకసృష్టి మర్మములను తెలిసికొని తిరిగి తాము సజీవులగుదుము అని నమ్ముదురు. 39. ఇందు తీర్పుదినము ఎందులకు అవసరమో చెప్పఁబడినది. చచ్చిన పిదప తిరిగి సజీవులు కానిచో ఇహలోకములో జరిగిన పలువిధములైన కార్యములకు ఫలితమును, మంచి చెడ్డలకు ఫలమును వివాదనగల విషయములో ఎద్ది వాస్తవమో స్పష్టపడి వాని వానికి తగిన ఫలితము లభించుటకు వీలులేదు. కావున తీర్పుదినమునందు, అన్ని విషయములఁగూర్చి తీర్పు జరిగి పాపపుణ్యముల ఫలితము లభించును. ఇహమునందు ప్రవక్తలను తిరస్కరించి విశ్వసింపనివారు తాము అసత్యవంతులు అని వారు తెలిసికొందురు. కావునఆదినము తప్పక వచ్చును. 40. అది వచ్చుట కష్టముకాదు. దేవుఁడు తాను కోరిన దానిని అయిపొమ్ము అని సెలవిచ్చిన తోడనే అది సంభవించును. కావున చచ్చినవారందఱిని తిరిగి సజీవులు కండు అని చెప్పుట తోడనే అందఱు సజీవులగుదురు అని దేవునిశక్తినిగూర్చి హెచ్చరింపఁబడియెను.

41. వల్లజీన-హాజరూ-ఫిల్లాహి-మింబఅది-మాజులిమూ-లనుబవ్వి-అన్నహుమ్-ఫిద్-దున్యా-హసనతన్-వల-అజ్‌రుల్-ఆఖిరతి-అక్బరు-లౌ-కానూ-యఅలమూన్. 42. అల్లజీన-సబరూ-వ-అలా-రబ్బిహిమ్-యతవక్కలూన్.

41. మఱియు ఎవరు, దేవుని కొఱకు బాధలు సహించి యిండ్లను వదలిపోయిరో వారికి ఇహమునందు తప్పక మంచి నివాసము నొసంగుదుము. మఱి పరలోకములోని పుణ్యము చాల గొప్పది. వారి కది తెలిసిన బాగుండును. 42.

వారు, ఓపికవహించి తమ ప్రభువుపై నాధారపడినవారు.

వ్యా॥ 41. ఇందు తీర్పుదినము వచ్చును అనుదానికి ఒక హేతువు సూచింపఁబడుచున్నది. దుష్టులు విశ్వాసులను చాల హింసించిరి. తుదకు దేవుని ప్రీతికొఱకు విశ్వాసులు తమ యిండ్లను వదలి యితర దేశములకు పోయిరి. అట్టి భక్తులకు దేవుఁడు ఇహమునందు మంచి నివాసము నొసంగును. అది వారి సత్కార్యములకు కొంత ఫలితము. అయిన వారి సంపూర్ణ ఫలితము పరలోకములో లభించును. అనేక భక్తులు ఇహమునందు తమ కర్మల ఫలితము పొందకయే పరలోకము చేరుదురు. అట్టి వారి కర్మల ఫలితము పరమునందే లభించును. ఇహమునందలి ఫలితముకంటె పరమునందలి ఫలితము (పుణ్యము) చాల గొప్పది. ఈ విషయము ఇతరులకు తెలిసిన బాగుండును. వారుకూడ పరలోక పుణ్యములకుఁగాను దేవుని కొఱకు తమ యిండ్లను వదలి దేవుని మార్గమందు బాధలపడి సహింతురు. ఎవరును వెనుకఁబడరు. ఇందు మక్కాపురములోని కాఫిర్లచే బాధలుపడి తుదకు తమ యిండ్లను వదలి అబిసీనియాకు పోయినట్టి ఎనుబది (80) మంది ముసల్మానులనుగూర్చికూడ చెప్పఁబడినది. తుదకు వీరందఱు అబిసీనియానుండి మదీనాపురము సురక్షితముగా చేరి మంచి నివాసము పొందినవారైరి. 42. తమకు కాఫిర్లుపెట్టు హింసలకు భక్తులు సహింతురు. స్థిరముగా నుందురు. వారి మనస్సు చలింపదు. వారు దేవుని సహాయము పైననే ఆధారపడుదురు.

43. వమా-అర్‌సల్నా-మిన్-ఖబ్-లిక-ఇల్లా-రిజాలన్-నూహీ-ఇలైహిమ్ ఫస్-అలూ-అహ్-లజ్-జిక్రి-ఇన్-కున్తుమ్-లా-తఅ-లమూన్. 44. బిల్-బయ్యినాతి-వజ్-జుబురి-వ-అన్-జల్నా-ఇలైక-జ్-జిక్ర-లి-తుబయ్యిన-లిన్నాసి-మానుజ్జిల-ఇలైహిమ్-వ-ల-అల్లహుమ్-యతఫక్కరూన్.

43. మఱియు నీకు పూర్వముకూడ పురుషులనే ప్రవక్తలుగాఁజేసి వారికి మాసందేశమును పంపియున్నారము. కావున మీకుఁ దెలియనిచో తెలిసిన వారిని అడుగుఁడు. 44. మేము వారికి సూచనలును గ్రంథములును ఒసంగి పంపియున్నారము. మఱి ప్రజలకుఁగాను వచ్చినదానిని వారికి నీవు తెలుపుటకును ప్రజలు యోచించుటకును నీకు గ్రంథము నొసంగితిమి.

వ్యా॥ 43. దేవుఁడు ముసల్మానుభక్తులకు వారిసహనమునకును వారిసత్కార్యములకును ఉభయలోకములలోను జయమును, మోక్షము నొసంగుట క్రొత్త కాదు. హజ్రత్ ముహమ్మదువారికి పూర్వముకూడ దేవుఁడు పురుషులను ప్రవ

క్తలుగాఁ జేసి తన యాజ్ఞలు వారికి నొసంగి పంపియున్నాఁడు. ఆ ప్రవక్తలు, పాపములను నిషేధించి, సత్కార్యములు చేయుఁడు అని ప్రజలకు బోధించిరి. విశ్వసించినవారు జయముపొందిరి. తిరస్కరించిన దుష్టులు నశించిరి. ఒకవేళ పూర్వీకుల చరిత్రము మీకుఁ దెలియనిచో ప్రవక్తల విషయము తెలిసినవారిని అడిగి తెలిసికొనుఁడు. పూర్వము ప్రవక్తలు వచ్చినారా లేదా! విశ్వాసుల, అవిశ్వాసుల గతి యేమాయెనో విచారించి తెలిసికొనుఁడు. తమకు దుష్టులు పెట్టు బాధలకు భక్తులు ఓర్చి తుదకు దేవుని సహాయముపొంది విజయమును మోక్షమును పొందిరి. దుష్టులు దేవుని శిక్షకుపాత్రులైనశించిరి. తెలిసినవారిలో తౌరాతు ఇన్జీలు తెలిసిన యూదులును నసారీలును చేరుదురు. తెలియని విషయమును తెలిసినవారి నడిగి తెలిసికొనవలెను. 44. పూర్వము మేము ప్రవక్తలకు సూచన (మోజిజా) లను, మతగ్రంథములను ఒసంగి పంపియున్నాము. అటులే ఓ ముహమ్మదు! నీవు జగత్తునకంతకును బోధించుటకును జనులు దానిని యోచించుటకును ఖురానుగ్రంథము నీకొసంగియున్నారము. కావున నీవు ఖురానులోని ధర్మములను స్పష్టముగా వివరించి ప్రజలకుఁ దెలుపుము. ప్రజలు అందలి విషయములను బాగుగ యోచించి గ్రహింపవలెను. పూర్వము వచ్చిన గ్రంథములలోని మత ధర్మముల విషయము నిండు గలదు. కావున అందఱు జనులు ఖురానును పఠించి గ్రహింపవలెను.

45. అఫ-అమినల్-లజీన-మక-రుస్-సయ్యి-ఆతి-అన్-యఖ్-సిఫల్లాహు-బిహి-ముల్-అర్జ-ఔ-యాతి-యహు ముల్-అజాబు-మిన్-హైసు-లా-యష్-ఉరూన్. 46. ఔ-యాఖుజ-హుమ్-ఫీ-తఖల్లు-బిహిమ్-ఫమా-హుమ్-బి-ముఅ-జిజీన్. 47. ఔ-యా-ఖుజహుమ్-అలా-తఖవ్వు-ఫిన్-ఫ-ఇన్న-రబ్బకుమ్-ల- రఊఫుర్-రహీమ్. 48. అవలమ్-యరౌ-ఇలా-మా-ఖలఖల్లాహు-మిన్-షైఇన్-యతఫయ్యఉ-జిలా-లుహూ అనిల్-యమీన్-వష్-షమా-ఇలి-సుజ్జదల్ - లిల్లాహి వ హుమ్-దాఖిరూన్. 49. వలిల్లాహి-యస్-జుదు-మాఫిస్-సమా-వా తి-వమా-ఫిల్ అర్జి-మిన్-దాబ్బతిన్-వల్-మలాఇకతు-వహుమ్-లా-యస్-తక్-బిరూన్. 50. యఖా-ఫూన-రబ్బహుమ్-మిన్ఫౌఖి-హిమ్-వ-యఫ్అలూనమా-యూమరూన్.

45. ఏమి? చెడ్డ ప్రయత్నములు చేయువారు, దేవుఁడు వారిని భూమిలోనికి దింపివేయుననియు లేదా వారికి తెలియనిచోటునుండి శిక్షవచ్చి వారిని పట్టుననియు, 46. లేదా వారు తిరుగుచున్నపుడు వారిని పట్టుకొనును. మఱి

వారు లొంగఁజేయలేరు అనియు 47. లేదా వారిని భయపెట్టిన పిదప వారిని పట్టుకొనును అను భయము వారికి లేదా ! మీ ప్రభువు చాల కనికరముగలవాఁడును దయాళువును. 48. ఏమి ? వారు దేవుఁడు సృజించినట్టి ప్రతి వస్తువును చూచుటలేదా ! వాని నీడలు దేవునికి దీనముగ సాష్టాంగపడుచు కుడిప్రక్కనుండియు, ఎడమప్రక్కనుండియు వ్రాలుచున్నవి. 49. మఱియు ఆకాశములలోను భూమిలోనున్న ప్రాణులును, దేవదూతలును దేవునికి సాష్టాంగపడుచున్నారు. మఱి వారు గర్వమువహించుటలేదు. 50. వారు తమపైనున్న ప్రభువునకు భయపడుచున్నారు. మఱి వారు తమకు ఆజ్ఞయైనదానిని జేయుచున్నారు.

వ్యా॥ 45. మక్కాలోని యవిశ్వాసులు తమకు పూర్వము ప్రవక్తలను తిరస్కరించినవారిగతి యేమాయెనో అను విషయము వినియు ఖురానువంటి గ్రంథమును వినియు, ఇంకను తమ దుష్టయత్నములు వదలిరా ! దేవునిశిక్షవచ్చి వారిని భూమిలో అణఁగద్రొక్కును అని వారికి భయములేదా ? లేక తెలియని చోటునుండి దేవుని శిక్షవచ్చి వారిని పట్టును అని వారికి భయములేదా ! మక్కా ఖురైషులు బదరుయుద్ధములో ముసల్మానులచేత ఓడిపోయిరి. అవిశ్వాసులు తమ సైన్యబలమును, ముసల్మానుల బలహీనతను చూచి తమకు అపజయముగలుగునని వారుతలఁచియుండలేదు. 46. లేకఆకస్మికముగాఅవిశ్వాసులు పనులు చేయుచు అటు యిటు తిరుగుచున్నపుడు దేవుని శిక్ష పట్టును అని వారికి భయములేదా ! దేవుఁడు ఆకస్మికముగ శిక్షింపఁగలఁడు. ఆతనికిశక్తిగలదు, ఆతఁడు మానవులనులొంగఁజేయును. కాని మానవులు దేవునిని లొంగఁజేయలేరు. 48. లేక దేవుఁడు అవిశ్వాసులను హెచ్చరించి, తన శిక్ష సూచనలు చూపిన పిదప కూడ పట్టును అని భయములేదా! దేవుఁడు అవిశ్వాసులను తత్క్షణమే శిక్షింపఁగలఁడు. కాని ఆతఁడు కనికరము దయగలవాఁడు. కావున పాపాత్ములు తమ పాపములకు క్షమాపణ వేఁడుకొని భక్తులు అగుటకు వారికి అవకాశము నొసంగుచున్నాఁడు. లేనిచో ఒక్క నిముషములోనిర్మూలింపఁగలఁడు. 48. మానవులు దేవుని సృష్టిని చూడవలెను. ప్రతి వస్తువును దేవునికిఆధీనమై దీనమువహించి దేవునికి సాష్టాంగపడుచున్నది. నిలిచిన వస్తువుల నీడలుకూడ హెచ్చుచు తగ్గుచు కుడియెడమప్రక్కలకు వ్రాలుచు దేవునికి సాష్టాంగపడుచున్నవి. కావున మానవుఁడు మనఃపూర్వకముగ దేవుఁడు నియమించిన ధర్మములకు విధేయుఁడై వాని ననుసరింపవలెను. 49. భూమ్యాకాశములలోనున్న ప్రాణులన్నియు దేవునికి దీనములై సాష్టాంగపడుచున్నవి. దేవునిసాన్నిధ్యము పొందిన దేవదూతలుకూడ ఏలాటి గర్వములేక దేవునికిసాష్టాంగపడుచున్నారు. ఇఁక మానవుని లెక్కయేమి? 50. దేవదూతలు దేవునిసాన్నిధ్యమునఉండియు ఆతనికి చాల భయపడుచు దేవుని యాజ్ఞ చొప్పున తత్క్షణమే కార్యములు చేయు

దురు. దేవుఁడు అందఱిపైని అధికారముగలవాఁడు. అట్టి దేవుని శిక్షకు భయపడవలెను. ఇచ్చట ఒక సిద్దా చేయువలెను.

51. వ-ఖాలల్లాహు-లా-తత్-తఖిజూ-ఇలా-హైని-స్నైని-ఇన్నమా-హువ-ఇలాహున్-వాహిదున్-ఫ-ఇయ్యాయ-ఫర్-హబూన్. 52. వలహూ-మా-ఫిస్-సమావాతి-వల్-అర్జి-వ-లహుద్-దీను-వాసిబన్-అఫ-గైరల్లాహి-తత్తఖూన్. 53. వ-మా-బికుమ్-మిన్-నిఅ-మతిన్-ఫ-మినల్లాహి-సుమ్మ-ఇజా-మస్స-కుముజ్-జుర్రు-ఫఇలైహితజ్-అరూన్. 54. సుమ్మ-ఇజా-కష-ఫజ్-జుర్ర-అన్కుమ్-ఇజా-ఫరీ-ఖుమ్-మిన్-కుమ్-బిరబ్బిహిమ్-యుష్రికూన్. 55. లియక్-ఫురూ-బిమా-ఆతైనాహుమ్-ఫత-మత్తఊ-ఫసౌఫ-తఅ-లమూన్.

51. మఱియు ఇద్దఱు దేవుళ్లను కల్పింపకుఁడు. దేవుఁడు ఒక్కఁడు మాత్రమే. కావున నాకే భయపడుఁడు అని దేవుఁడు పలికెను. 52. ఆకాశముల లోను భూమిలోను ఉన్న సమస్తము ఆతనిదేను. మఱి సదా ఆతనినే పూజింపవలసినది. కావున దేవునికిఁ గాక యితరులకు మీరు భయపడుచున్నారా! 53. మఱి మీకున్న ప్రతిమేలును ఆతని యొద్దనుండి గలిగినది. పిదప మీకు కష్టము గలిగినపుడు మీరు ఆతనినే వేఁడుకొనుదురు. (ఆతనితోనే మొఱపెట్టుకొనుదురు) 54. ఆపిదప ఆతఁడు మీనుండి కష్టమును తొలఁగించునప్రుడు మీలోని కొందఱు జనులు తమ ప్రభువునకు సాటి కల్పింప సాగుదురు. 55. మేము ఒసంగిన దానికి కృతఘ్నత చేయుటకుఁగాను అట్లుచేయుదురు. కావున మీరు సుఖములను అనుభవింపుఁడు. తుదకు మీరు తెలిసికొనఁ గలరు.

వ్యా॥ 51. పై వాక్యములలో సర్వము దేవునికి అధీనమై యున్నది అని తెలుపఁబడెను. కావున ఇఁక దేవుని పూజలో భాగము పొందుసాటి ఎచ్చటి నుండి వచ్చును. కావున ఒక్క దేవునినే నమ్మి పూజింపవలెను. ఆతనికే భయపడవలెను. రెండుగాని రెండుకంటె నెక్కువగాగాని అనేక చిల్లర దేవతలను విగ్రహములను కల్పింపరాదు అని దేవుని సెలవు. 52, భూమ్యాకాశములలో నున్న సర్వము ఆతనిదేను. వానికి సృష్టికర్త యాతఁడే. కావున అందఱును సదా ఆతనినే పూజింపవలెను. ఆతని వదలి ఇతరులకు భయడపరాదు. 53. అన్ని మేళ్ళు దేవుఁడు మానవులకు అనుగ్రహించుచున్నాడు. ఆతఁడే అందఱి కష్టములను ఆపదలను నివారించువాఁడు. కావుననే ఎట్టి విగ్రహారాధకుఁడైనను కష్టములలో చిక్కుకొన్నపుడు దేవునితోనే మొఱలు పెట్టుకొనును. ఆతని సహాయమే వేఁడును. చిల్లర దేవతలను వదలుకొనును. కావున సర్వశక్తుఁడగు దేవుఁడు పూ

జలకు అర్హుఁడు. 54,55. ఇందు ఆపద తొలఁగిన పిదప మానవులు ఎట్లు ప్రవర్తింతురో చెప్పఁబడినది. ఆపదలో చిక్కుకొన్నపుడు ఒక్క దేవునిని తలఁచి ఆపద తొలఁగఁగానే దేవుఁడుచేసిన మేలు మఱచి దేవునికి సాటి కల్పింప సాగుదురు. అట్టి కృతఘ్నులకు సిగ్గులేదు. కావున వారు తమ లోకసౌఖ్యములను భోగములను బాగుగ అనుభవింప వలసినది. తుదకు దాని శిక్ష ఏమి రానున్నదో వారికే తెలియనగును. కావున మానవుఁడు కష్టములు తొలఁగినవి అని దేవునిని మఱచి పోకూడదు.

56. వ-యజ్-అలూన-లిమా-లా-యఅ్-లమూన-నసీబమ్-మిమ్మా- రజఖ్నా-హుమ్-తల్లాహి-ల-తుస్-అలున్న-అమ్మా-కున్తుమ్-తఫ్- తరూన్. 57. వ-యజ్-అలూన-లిల్లా-హిల్-బనాతి-సుబ్-హానహూ-వలహుమ్- మా- యష్-తహూన్. 58. వఇజా-బుష్ షిర-అహ-దుహుమ్-బిల్-ఉన్సా- జల్ల- వజ్- హుహూ-ముస్-వద్దన్-వహువ-కజీమ్. 59. యత-వారా-మినల్-ఖౌమి- మిన్-సూఇ మా-బుష్ షిర-బిహీ- అ-యుమ్-సికుహూ-అలా హూనిన్-అమ్- యదుస్సుహూ-ఫిత్-తురాబ్. 60. అలా-సాఅ-మా-యహ్-కుమూన్. 60. లిల్లజీన-లా-యూ-మినూన-బిల్-ఆఖిరతి-మస-లుస్-సౌఇ వ-లిల్లా-హిల్-మసలుల్-అఅలా- వ-హువల్-అ జీ-జుల్-హకీమ్.

56. మఱియు పెక్కు దైవారాధకులు మేము వారికి నొసంగిన దానిలో నొక భాగము తమకు తెలియని వారికిఁగాను నియమించుచున్నారు. దేవునియాన! మీరు కల్పించుచున్నవాని గూర్చి తప్పక మీరు ప్రశ్నింపఁబడుదురు. 57. మఱియు వారు దేవునికి కుమార్తెలు కల్పించుచున్నారు. దేవుఁడు అట్టి సంబంధముల నుండి పరమ పవిత్రుఁడు. మఱి తమ కొఱకు తాము కోరినది నియమించుకొనుదురు. 58. వారిలో నెవ్వనికైన కుమార్తె గలిగెను అని సంతోషవార్త వానికి నియ్యఁబడినచో వాని ముఖము నల్లపడి పోవును. మఱివాఁడు దుఃఖముతో నిండిపోవును. 59. తనకుఁ చెప్పఁబడిన సంతోష వార్త వలన కీడుచే ప్రజల నుండి దాఁగిదాఁగి తిరుగును. అవమానము స్వీకరించి దానినుంచుకొన వలెనా! లేదా దానిని మట్టిలో పాతిపెట్ట వలెనా! అను యోచనలో పడును. వినుము. వారుచేయు తీర్మానము చాల చెడ్డది. 60. పరలోకమును విశ్వసింపని వారి విషయము చాల చెడ్డది. మఱి దేవుని విషయము చాలగొప్పది. (ఉన్నతమైనది) మఱి యాతఁడు సర్వశక్తుఁడును వివేచనా పరుఁడును.

వ్యా। 56. అవిశ్వాసులు, తమకు దేవుఁడొసంగిన పశువులలోను ధాన్యములలోను, వ్యాపారములలోను కొంతభాగము చిల్లర దేవతలకును విగ్రహములకును తీయుదురు. అట్లు వారు తమ మొక్కుబడులను చెల్లించి దేవుని కోపమునకు పాత్రులగుదురు. దేవుఁడొసంగిన సంపదలలో విగ్రహములను భాగస్థులుగఁ జేయుట ఘోరపాతకము. కావున దీనిగూర్చి తీర్పుదినమున ప్రశ్న గలుగును. దాని శిక్ష పొందవలసి యున్నది. 57. బనూఖుజాఆ మొదలగు వారు దేవదూతలు దేవుని కుమార్తెలు అని నమ్మి అట్లు పలుకుచుండిరి. దానికి నిందు రద్దు చేయఁబడినది. దేవుఁడు పరమ పవిత్రుఁడు. ఆతనికి భార్య లేదు. ఆతనికి కుమార్తెలు లేరు. ఇట్టి సంబంధములు ఆతనికి లేవు. దేవునికి కుమార్తెలు గలరు అని పలుకువారు తమకు మాత్రము మగ బిడ్డలే గలుగవలెనని కోరుదురు. కుమార్తెలను కోరరు. 58. వారిలో నెవ్వరికైన కుమార్తె పుట్టినది అని వానితో పలికినచో కుమార్తె పుట్టెనా! అని దుఃఖములో ముఖము నల్లగాఁ జేసికొని చింతలో మునిగి పోవును. ఈ పీడ ఎచ్చట వచ్చెనా! యని దుఃఖపడును. ఎందుకనఁ దుష్టులు కుమార్తెలను ప్రేమింపరు. 59. ప్రజలకు ఏమి ముఖము చూపుదునా! అని సిగ్గుతో దాగిదాగి వారికంట పడకుండ తిరుగును. కుమార్తె బ్రతికి పెద్దదియైనచో నెవ్వనికైన నిచ్చి పెండ్లి చేయవలెనే! ఈ యవమానము ఎట్లు సహింతును. అవమానమునకులోనై బ్రతుక నిత్తునా! లేదా ప్రాణముతోనే మట్టిలో పూడ్చి పెట్టుదునా! అని యాలోచింపసాగును. ఇస్లామ్‌నకు పూర్వము కొందఱు దుష్టులు తమ కుమార్తెలను ప్రాణముతోనే పూడ్చి పెట్టుచుండిరి. ఇస్లామ్ ఆ పాపమును నిషేధించి కుమార్తెలను గౌరవముతో పోషింప వలెను అని విధించెను. ఇస్లామ్ వలన అట్టి ఘోర పాతకము నిలిచిపోయెను. దుష్టులు తమ కుమార్తెల విషయము చేయు తీర్మానము చాల చెడ్డది. దీనికంటె చాల చెడ్డది దేవునికి కుమార్తెలు కల్పించుట. తాము అసహ్యపడు కుమార్తెలు దేవునికిఁ గలరు అని చెప్పుట చాల ఘోరపాతకము గదా! 60. పరలోకమును విశ్వసింపని అవిశ్వాసుల విషయము చాల చెడ్డది. వారు బీదతనమునకును అవమానమునకు భయపడి కుమార్తెలను వధించుట వారిపని. తమ ముసలి తనములో తోడుపడుటకు వారికి కుమారులు కావలెను. తుదకు వారి పాపకార్యముల ఫలితము వారికి లభించును. కావున వారికి దుర్గతి పట్టును. దేవుఁడు అట్టి యక్కఱలు గలవాఁడు కాఁడు. ఆతని విషయము చాల యున్నత మైనది. ఆతని మహిమ ఎంత కొనియాడినను అది కొంచెమే. ఆతఁడు సర్వశక్తుఁడు. తాను కోరినచో దుర్మార్గులకు తత్క్షణమే శిక్ష నొసంగఁ గలఁడు కాని వారికి అవకాశము నిచ్చి కొంతకాలము వదలి పెట్టుచున్నాఁడు అంతే బుద్ధిమంతులు తమ పాపములను మానుకొని భక్తులగుదురు. దేవుఁడు వివేచనా పరుఁడు. కావున అట్లు చేయుచున్నాఁడు.

61. వలౌ-యుఆ ఖిజుల్లా-హున్నా స-బి-జుల్ -మిహిమ్-మాతరక- అలైహా-మిన్-దాబ్బతిన్-వలా-కిన్-యు-అఖ్ -ఖిరుహుమ్-ఇలా- అజ- లిమ్- ముసమ్మన్ ఫఇజా- జా అ-అజలుహుమ్-లా-యస్-తౌఖిరూన-సాఅతన్- వలా- యస్-తఖ్ దిమూన్. 62. వయజ్-అలూన-లిల్లాహి-మా-యక్-రహూన- వ- తసిఫు-అల్-సిన-తుహుముల్ -కజిబ-అన్న-లహుముల్ -హుస్ నా-లా-జరమ-అన్న-లహుమున్నార-వ అన్నహుమ్ ముఫ్-రతూన్.

61. మఱియు మనుష్యులు చేయు అన్యాయమునకుఁగాను దేవుఁడు వారిని పట్టినచో భూమిపై నొక ప్రాణిని కూడ వదలఁడు. కాని ఒక నియమిత కాలము వఱకు వారిని వదలి పెట్టుచున్నాఁడు. పిదప వారికాలము వచ్చి చేరినపుడు వారు ఒక గడియ వెనుకగాని ముందుగాని పోఁజాలరు. 62. తమకు ఇష్టము లేని దానిని దేవుని కొఱకు నియమించుచున్నారు. మఱి తమకు మేలున్నది అని వారి నాలుకలు అబద్ధములు, పలుకుచున్నవి. తప్పక వారికి నరకాగ్ని యున్నది. నిశ్చయముగ వారు నరకములోనికి ముందుగా పంపఁబడుదురు.

వ్యా॥ 61. మనుష్యులు చేయు అన్యాయములకును పాపములకును తత్తణమే దేవుఁడు వారినిపట్టి శిక్షింప మొదలు పెట్టినచో కొన్ని గడియలు కూడ ఈలోక ముండ నేరదు. ఎందుకన లోకములో దుర్మార్గుల సంఖ్యయే ఎక్కువ. పాపము చేయని మానవుఁడు లేఁడు. పాపులందఱు నాశ మొందిన పిదప ప్రవక్తలు కూడ రానక్కఱలేదు. భూమిపై మనుష్యులే లేనపుడు ఇతర జంతువులుండుటకు అవసరము లేదు. అవికూడ నుండవు. కావున దేవుఁడు తత్తణమే శిక్షింప కోరినచో లోకము ఒక నిమిషములో నశించి పోవును. కాని దేవుఁడు అట్లు చేయక పాపులను కొంత కాలము వదలి పెట్టుచున్నాఁడు. వారు తమ పాపముల క్షమాపణ కోరి తమ తప్పులను దిద్దుకొనుటకు వారికి అవకాశము నొసంగుచున్నాఁడు. తుదకు వారికాలము తీరినపుడు ఒక గడియ అటు ఇటుగాక వారు నశింతురు. 62. అవిశ్వాసులగు మనుష్యులు తమకు ఇష్టములేని కుమార్తెలు దేవునికి నున్నవి అని పలుకుదురు. అటులే తమ సొత్తులలో నితరులకు భాగస్థులగఁ జేయుటకు వారు ఇష్టపడుదురు. అట్టి విషయము దేవునికి సాటియున్నది. అని పలుకుచు దేవునికి నంట కట్టుదురు. అట్లు తమకు ఇష్టములేని దానిని దేవుని కొఱకు నియమింతురు. మఱియు వారు మాకు ఇహమునందు మేలుగలుగుచున్నది. పరలోకమున్నచో అచ్చటకూడ మాకు మేలుగలుగును. మోక్షము స్వర్గము లభించును అని పలుకుదురు. వారు పలుకునది నిజముకాదు. వారుచేయు పాప

కార్యములకుఁ గాను తప్పక వారికి నరకాగ్ని లభించును. కాని మోక్షము లభించదు. వారు తప్పక నరకములో ప్రవేశింతురు. ఈవిషయము స్థిరమైనది. ఇందు ఏలాటి సందేహము లేదు.

63. తల్లాహి-లఖద్-అర్-సల్నా-ఇలా-ఉమమిమ్-మిన్-ఖబ్-లిక -ఫ జయ్యన-లహు-ముష్-షయాతీను-అఅమా-లహుమ్-ఫహువ-వలియ్యు-హుముల్-యౌమ-వలహుమ్-అజాబున్-అలీమ్. 64. వమా-అన్-జల్నా-అలైకల్-కితాబ-ఇల్లా-లితుబయ్యిన-లహుముల్-లజీఖ్-తలఫూ-ఫీహి-వ-హుదన్-వ-రహ్మతల్-లిఖౌ-మిన్-యూమినూన్. 65. వల్లాహు-అన్-జల-మినస్-సమాఇ-మా-అన్-ఫఅహ్యా-బిహిల్-అర్-జ-బఅద-మౌతిహా-ఇన్న ఫీ-జాలిక-ల-ఆయతల్-లి-ఖౌమిన్ యస్-మఊన్.

63. దేవుని యాన! మేమునీకు పూర్వమున్న జాతులవారియొద్దకు ప్రవక్తలను పంపియున్నారము. పిదప సైతాను వారి కర్మలను వారికి బాగుగ తోఁచునట్లుగఁ జేసెను. కావున ఈ దినము ఆతఁడు వారి స్నేహితుఁడు. మఱి వారికి దుఃఖకరమైన శిక్షయున్నది. 64. మఱియు వారు వాదించుకొను విషయమును నీవు వారికి స్పష్టముగా తెలుపుటకును సన్మార్గము బోధించుటకును, విశ్వసించు వారిని అనుగ్రహించుటకును మేము నీకు గ్రంథము పంపితిమి. 65. మఱియు దేవుఁడు ఆకాశమునుండి నీళ్ళను కురిపించెను. పిదప చచ్చిన భూమిని దానివలన బ్రతికించెను. నిశ్చయముగా వినునట్టి జనులకు అందు సూచన గలదు.

వ్యా॥ 63. మక్కాలోని కాఫిర్ల చెడ్డనడతలను తెలిపి వీరి దుర్మార్గముల వలన పైగంబరులవారు చింతపడకూడదు అని దేవుఁడు యోదార్చుచు నీకు పూర్వముకూడ అనేక ప్రవక్తలను మేము పంపియున్నారము. ఆయాజాతుల వారు సైతాను దుర్బోధవలన ప్రవక్తలను తిరస్కరించి తాము చేయు పాప కార్యములు మంచివి అని తలఁచుచు మితిమీఱిపోయి దేవుని శిక్షకు లోనైరి. వారి స్నేహితుఁడగు సైతాను వారికి ఈదినము పనికిరాడు. వారిని శిక్షనుండి తప్పింపఁజాలఁడు. ఇట్టి దుర్గతియే నీ విరోధులకు పట్టును. నీవు చింతపడవలదు. 64. ఇందు దేవుఁడు హజ్రత్ రసూలువారికి ఖురానెషరీఫు ఎందుకు నొసంగెనో ఆ విషయము చెప్పఁబడుచున్నది. దేవుని యేకత్వము మొదలగు ధర్మములలో ప్రజలు భేదాభిప్రాయములుగలిగి వాదించుకొను విషయములను వివరించి స్పష్టముగా నేలాటి సందేహములు గలుగకుండ తీర్మానింపవలెను. ఆపిదప ప్రజల యిష్టము. నమ్మిన నమ్మవచ్చును. లేదా తిరస్కరించిన తిరస్కరింపవచ్చును.

దాని విషయము ప్రవక్త చింతింపనక్కఱలేదు. సన్మార్గమునందు పోయి దేవుని యనుగ్రహమునకు పాత్రులగువారు విశ్వాసులు, ఖురానును విని నమ్మెదరు. దాని ననుసరింతురు. 65. భూమి యెండిపోయిన పిదప వర్షమువలన తిరిగి పచ్చబడును. ఎండుట చచ్చునట్లును, పచ్చబడుట బ్రతుకునట్లును. ఇటులే భయభక్తులతో ఖురానును వినినచో పామరులు, విద్యావంతులగుదురు. చచ్చిన హృదయములు ప్రాణములు పొందును. కావున మానవులు ఖురానును గమనించి విని ఉభయలోకములలో జయము, మోక్షము పొందవలెను.

**66.** వ-ఇన్న-లకుమ్-ఫిల్-అన్-ఆమి-ల-ఇబ్రతన్-నుస్-ఖీకుమ్-మిమ్మా-ఫీ-బుతూనిహీ-మిమ్‌బైని-ఫర్-సిన్-వ-దమిల్-లబనన్-ఖాలి-సన్-సాఇ-గ్-లిష్ షారిబీన్. **67.** వ-మిన్-సమరాతిన్-నఖీలి-వల్-అఅ-నాబి-తత్-తఖి-జూన-మిన్హు-సకరన్-వ-రిజ్-ఖన్-హసనన్-ఇన్న-ఫీ-జాలిక-ల-ఆయతల్-లి-ఖౌమిన్-యఅఖిలూన్.

**66.** మఱియు మీరు పశువులలో గమనింపవలసిన విషయము గలదు. మేము వాని కడుపులలోని పేడ రక్తముల మధ్యనుండి స్వచ్ఛమైన పాలును మీకు త్రాగనిచ్చుచున్నారము. అది త్రాగువారికి మనోరంజకముగ నుండును. **67.** మఱియు మీరు ఖర్జూరము, ద్రాక్షపండ్లనుండి మత్తును మంచి యాహారమును చేయుచున్నారు. అందు బుద్ధిమంతులకు సూచనగలదు.

వ్యా॥ 66. ఒంటె, ఆవు, గేదె మొదలగు పశువులు గడ్డి మేయుచున్నవి. అది కడుపులో పోయి, మూఁడు వస్తువులుగ మారిపోవుచున్నది. ఒకటి పేడ, రెండవది రక్తము, మూఁడవది పాలు. దేవుఁడు తన శక్తిచే పేడ రక్తములమధ్య నుండి పాలును దీయుచున్నాఁడు. ఆ పాలు త్రాగువారికి మనోరంజకముగ నుండును. బలము నొసంగును. మానవులు దీనిని గమనించిన దేవుఁడు ఒక్కఁడే సర్వశక్తుఁడు అని నమ్మఁగలరు. 67. ఖర్జూరము, ద్రాక్షఫలములనుండి ప్రజలు మత్తుపదార్థములు తీసి త్రాగుదురు. ఈ వాక్యము మక్కాలో వచ్చినది. సారాయి మొదలగు మత్తుపదార్థములు మదీనాపురములో నిషేధింపఁబడినవి. నిషిద్ధము కాక ముందు ప్రజలు దానిని త్రాగుచుండిరి. నిషిద్ధమైన పిదప దాని జోలికి పోలేదు. ఆ ఫలములనుండి మంచి యాహారమగు, పానకము, నబీజు, సిర్కా పులుసు, ఎండిన ఖర్జూరములు, ద్రాక్ష మొదలైనవి గ్రహించి ప్రజలు భుజింతురు. ఇవన్నియు దేవుని యనుగ్రహమువలన గలుగుచున్నవి. దీనిని బుద్ధిమంతులే గ్రహింతురు.

68. వ-ఔహా-రబ్బుక-ఇలన్-నహ్లి-అనిత్-తఖిజీ-మినల్-జిబాలి-బుయూతన్ వమినష్-షజరి-వ-మిమ్మా-యఅ-రిషూన్. 69. సుమ్మ-కులీ-మిన్-కుల్లిస్-సమరాతి-ఫస్-లుకీ-సుబుల-రబ్బికి-జులు-లన్ యఖ్-రుజు-మిన్-బుతూనిహా - షరాబుమ్-ముఖ్-తలిఫున్-అల్-వానుహూ-ఫీహి-షిఫా- ఉల్-లిన్నాసి-ఇన్న-ఫీజాలిక-ల-ఆయతల్-లి-ఖౌమిన్-యత-ఫక్క-రూన్.

68. మఱియు నీప్రభువు తేనెటీఁగ నుద్దేశించి నీవుకొండలలోను, చెట్లలోను మనుష్యులు నిర్మించు కట్టడములలో నిండ్లను కట్టుకొనుము. 69. పిదప అన్ని రకముల పండ్లను తినుము. పిదప నీప్రభువు స్పష్టముగా నేర్పఱచియున్న త్రోవలలో నడువుము అని ఆజ్ఞాపించెను. వాని కడుపులనుండి త్రాగఁదగిన వస్తువు వచ్చును. అది పలురంగులు గలదిగా నుండును. అందు ప్రజలకుఁగాను రోగ స్వస్థతయును గలదు. నిశ్చయముగా అందు గమనించువారికి సూచనగలదు.

వ్యా॥ 68, 69. ఇందు తేనెటీఁగనుగూర్చి చెప్పఁబడినది. ఒక ఈఁగకు దేవుఁడు ఎంత బుద్ధి నేర్పినోసుగెనో బుద్ధిమంతులు యోచింపవలెను. అది తన గూఁటిని నెట్లు నిర్మించుచున్నదో చూడుఁడు. అందలి అన్ని అరలు (గదులు) యొడములేకుండ ఆఱుకోణములు గలవిగా నుండును. అవి యన్నియు ఒక పెద్ద ఈఁగకు లోఁబడి నడచుకొనును. దేవుఁడు అది గూఁడు కట్టవలెను. ఫలములను తినవలెను అని ఆజ్ఞాపించెను. అనగా దాని స్వభావము అపనులకుఁగాను దేవుఁడు నిర్మించెను అని భావము. తేనెటీఁగ కొండలలోను చెట్లలోను, మనుష్యులు కట్టిన పందిళ్లలోను ఇండ్లలోను తన గూఁడుకట్టుకొనును. అది తనగూఁటి నుండి ఎంత దూరముపోయినను త్రోవ మఱచిపోక తనచోటునకు వచ్చును. అందులకే దాని త్రోవలు స్పష్టముగా దేవుఁడు చేసెను. దాని కడుపునుండి తేనె వచ్చుచున్నది. అది తెల్లగాను, ఎఱ్ఱగాను, పసుపుగా నుండును. ఋతువులను ఆహారమును తేనెటీఁగ వయస్సును వాని భేదములనుబట్టి రంగులు మారును. తేనె అనేక మందులలో నుపయోగింతురు. దానివలన దేవుని సెలవుచే అనేక రోగములు బాగుపడును. అందు అనేక లాభములు గలవు. బుద్ధిమంతులు యోచించినచో వారికి నందు దేవుని శక్తిని సూచించు సూచన గలదు.

70. వల్లాహు-ఖలఖ-కుమ్-సుమ్మ-యత-వఫ్-ఫా కుమ్-వ-మిన్-కుమ్-మన్ యురద్దు ఇలా-అర్-జలిల్-ఉమురి-లి-కై లా-యఅ-లమ-బఅద-ఇల్మిన్- షైఅన్-ఇన్నల్లాహ-అలీమున్-ఖదీర్.

70. మఱియు, దేవుఁడు మిమ్ము పుట్టించెను. పిదప మీకు చావునిచ్చును. మఱి మీలో కొందఱు తుచ్ఛమగు వయస్సును పొందుచున్నారు. అందు నేఱిం గిన పిదప నేమియు నెఱుంగకుందురు. నిశ్చయముగా దేవుఁడు సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును.

వ్యా॥ 70. ఇంతవఱకు లోకములోని శక్తిసూచనలను గమనింపవలెను అని చెప్పఁబడియెను. ఇఁక మనుష్యుఁడు తన సంగతినే గమనింపవలెను. ఆతఁడు పుట్టక పూర్వము ఏమియు లేకుండెను. అట్టివానిని దేవుఁడు పుట్టించెను. మానవుఁడు లోకములో జీవించి కాలము తీరక పిదప మృతినొందుచున్నాఁడు. దేవుఁడిచ్చిన ప్రాణమును తీసికొనుచున్నాఁడు. అపుడు మానవుఁడు ఏమియు చేయలేఁడుగదా! కొందఱు మనుష్యులు మృతినొందక పూర్వము తుచ్ఛమైన వయస్సు పొందుదురు. అనగా చాల ముసలితనము పొందుదురు. ఆవయస్సులో తాము నేర్చుకొన్నది, ఎఱింగినది సర్వము మఱచిపోవుదురు. బలముండదు. లేచుట కూర్చుండుట దుర్లభమగును. ఏమాటను గ్రహింపఁజాలరు. చావువచ్చిన బాగుండును అను స్థితిలో నందురు. కావున మనుష్యులు, దేవునికి సర్వము తెలి యును, ఆతఁడే సర్వశక్తుఁడని గ్రహింపవలెను. దేవుఁడు తన యిష్టమువచ్చినంత అనుగ్రహించును. తాను కోరినపుడు వాపసు తీసికొనును.

71. వల్లాహు-ఫజ్-జల బఅ-జకుమ్-అలా-బఅజిన్-ఫిర్-రిజ్ఖ-ఫమల్ల-జీన ఫుజ్-జిలూ-బిరాద్దీ-రిజ్-ఖిహిమ్-అలా-మా-మల-కత్-ఐమాను-హుమ్-ఫహుమ్ ఫీహి సవా ఉన్-అఫ-బి-నిఅ-మతిల్లాహి-యజ్-హదూన్.

71. మఱియు దేవుఁడు ఆహార సంపదల విషయము మీలో నొకరిపై నొక రికి ఘనతనొసంగియున్నాఁడు. కావున ఎవరికి ఘనత నొసంగఁబడెనో వారు తమ సంపదను తమ చేతులలోనున్న బానిసలకు, వారు సరిసమానులగుటకుఁగాను ఒసఁగువారుకారు. వారేమి? దేవుని అనుగ్రహములనుతిరస్కరించుచున్నారా!

వ్యా॥ 71. లోకములోమనుష్యుల స్థితిగతులందుచాలవ్యత్యాసముగలదు, కొందఱు మంచిసంపదలు, అధికారముగలిగియున్నారుమఱికొందఱువారిచేతులలో బానిసలు గాను సేవకులుగా నున్నారు, ఒకరిపై నొకరికిఘనతగలదు. ఇది దేవుఁడు అనుగ్రహించినదే! సంపదగలవారు, తమ ఆస్తిలోను అధికారములోను నితరు లను భాగస్థులుగఁ జేయుటకు సమ్మతింపరు. తమ బానిసలను తమ యాస్తిని పంచిపెట్టి వారు తమకు సరిసమానులుగ నగుటకు సమ్మతింపరు. బానిసలుకూడ మనుష్యులే గదా! కావున బానిసత్వమును, యజమానునితో సరిసమానమగు టయును ఒకచోట చేరవు. అట్టివారు దేవునికి సాటి ఎట్లు కల్పింతురు. సర్వము

దేవుఁడు సృష్టించినదే గదా! దేవునికి అధీనమైన సృష్టి ఆతనికి సరిసమానము కానేరదు. కావున దేవుఁడు కావించిన మేళ్ళకును అనుగ్రహములకును కృతఘ్నులై మానవులు తిరస్కరించుచున్నారు. అట్లు చేయుట వారికి తగదుగదా!

72. వల్లాహు-జఅల-లకుమ్-మిన్-అన్-ఫుసికుమ్- అజ్వాజన్- వజఅల-లకుమ్-మిన్-అజ్-వాజికుమ్-బనీన-వ-హఫదతన్-వ-రజఖ-కుమ్-మినత్-తయ్యిబాతి-అఫ-బిల్ బాతిలి-యూ-మినూన-వ బి-నిఅ-మతిల్లాహి-హుమ్- యక్-ఫురూన్. 73. వ-యఅ-బుదూన-మిన్-దూనిల్లాహి-మా-లాయమ్-లికు-లహుమ్-రిజ్-ఖమ్ మినస్-సమావాతి-వల్-అర్-జి-షైఅన్-వలా-యస్-తతీ-ఊన్. 74. ఫలా-తజ్రిబూ-లిల్లా-హిల్-అమ్సాల-ఇన్నల్లాహ-యఅలము-వఅన్తుమ్-లా-తఅలమూన్.

72. మఱియు దేవుఁడు మీకొఱకు మీజాతినుండియే మీ స్త్రీలను పుట్టించెను. మఱి మీ స్త్రీలనుండి మీకు పుత్రులను మనుమలను నిచ్చెను. మఱి ఆహారమునకుఁ గాను మీకు మంచి వస్తువులను అనుగ్రహించెను. ఏమి? వారు అసత్యములను నమ్ముచున్నారా! మఱి వారు దేవుని యనుగ్రహమును తిరస్కరింతురా. 73. మఱియు ఆకాశము నుండియు భూమినుండియు వారికి కొంచెమైన ఆహారము నొసంగు అధికారము లేనివారిని వారు పూజించుచున్నారు. మఱి వారికి శక్తిలేదు. 74. కావున దేవునికి నుదాహరణములు కల్పింపకుఁడు. నిశ్చయముగా దేవుఁడు ఎఱుంగును. మఱి మీ రెఱుంగరు.

వ్యా॥ 72. పురుషులకుఁగాను భార్యలు మానవ జాతినుండియే దేవుఁడు పుట్టించెను. ఒక జాతిగ నుండుట వలన పరస్పరము ప్రేమగలిగి సంసారము సాగును. సంతానము నిలిచి వృద్ధి గలుగుటకుఁగాను పుత్రులును మనుమలును దేవుఁడొసంగి యున్నాఁడు. మానవుఁడు జీవించి యుండుటకు మంచి యాహారవసతులు దేవుఁడు కల్పించి యున్నాఁడు. అసత్యములగు విగ్రహములను అవిశ్వాసులు నమ్మి అవి తమకు మేళ్లు చేయును అని తలఁచి యున్నారు. అది అబద్ధము. మానవులకు సర్వము నొసంగువాఁడు దేవుఁడే అట్టి దేవుని నమ్మక కృతఘ్నులగుదురు. 73. విగ్రహములు చిల్లర దేవతలు ఆకాశమునుండి వర్షము కుర్పించి భూమినుండి ధాన్యము పుట్టింపలేవు. వానికట్టి అధికారమును శక్తియును లేదు. అట్టి శక్తిహీనులను అవిశ్వాసులు పూజించుచున్నారు. అట్లు చేయుట సరికాదు. 74. అవిశ్వాసులు చిల్లర దేవతలును విగ్రహములును దేవుని సన్నిధానమునందు మా సిఫారసు చేయుదురు. ఈ అధికారము వారికిఁ గలదు. మధ్యస్థులు లేనిది గొప్ప రాజు సాన్నిధ్యము లభింపదుగదా అని యుదాహరణములు కల్పింతురు. అట్లుసామె

తలు దేవుని గూర్చి కల్పింపరాదు. అది సరికాదు. సర్వము దేవుని చేతిలోనున్నది. సర్వము దేవుడే చేయును. సర్వము ఆతనికి తెలియును. ఇహలోక అధికారుల వలె దేవుని నూహింపరాదు.

75. జరబల్లాహు మసలన్-అబ్-దమ్ మమ్-లూకల్-లా-యఖ్ దిరు-అలా-షైఇన్-వమర్ రజఖ్ నాహు-మిన్నా-రిజ్-ఖన్-హసనన్ ఫహువ-యున్-ఫిఖు మిన్ హు-సిర్రన్-వ-జహ్-రన్-హల్-యస్-తవూన్. అల్-హమ్ దు-లిల్లాహి బల్-అక్-సరుహుమ్-లా-యఅ-లమూన్. 76. వ-జరబల్లాహు-మస-లన్-రజు-లైని-అహ్-దుహుమా అబ్ కము-లా-యఖ్ దిరు-అలా-షై ఇన్-వ-హువ-కల్లున్ అలా మౌలాహు-ఐన-మా-యు-వజ్ జిహ్ హు-లా-యాతి-బిఖైరిన్-హల్-యస్-తవీ-హువ-వమన్-యామురు బిల్-అద్ లి-వహువ-అలా-సిరాతిమ్-ముస్-తఖీమ్.

75. దేవుడొక ఉదాహరణ మిచ్చెను. ఇతరులకు సొత్తుఅయి యెద్దానికిని శక్తిలేని ఒక బానిసయును. ఒకనికి మేము మాయొద్దనుండి మంచి సంపద నొసంగి యున్నారము. కావున ఆతడు రహస్యముగాను వెల్లడిగాను దానినుండి ఖర్చు చేయుచున్నాడు. ఏమి వారు సరిసమానులగుదురా! సర్వస్తోత్రములు దేవునికే యున్నవి. కాని పెక్కుమందికి దెలియదు. 76. మఱియు దేవుడుమఱొక యుదాహరణము నిచ్చెను. ఇద్దఱు పురుషులున్నారు. అందు ఒకడు మూగ. ఆతడు ఏపనియును చేయజాలడు. మఱి వాడు తన యజమానునకు భారమై యున్నాడు. వాని కెచ్చట పంపినను వాడు ఏమేలును తీసికొనిరాడు. మఱొకడు ప్రజలకు న్యాయము చెప్పుచు తాను సన్మార్గమునందు నున్నాడు. వీరిద్దఱు సరిసమాను లగుదురా !

వ్యా॥ 75,76. ఇంక ఈవాక్యములో విగ్రహములు శక్తిలేనివి అనియు దేవుడు సర్వశక్తుడు అనియు బోధించునట్టి రెండు ఉదాహరణములు చెప్పబడినవి. మొదటిది. ఒకని చేతిలో బానిసగా నుండి తాను స్వయముగా చేయు అధికారమును శక్తియును లేక యున్న వాడొకడు. మఱొకడు స్వాతంత్ర్యము గలిగి దేవుని యనుగ్రహము వలన తాను పొందిన మంచి సంపదల నుండి తన యిష్టానుసారముగ రహస్యముగను బహిరంగముగను ఖర్చు చేయుచున్నాడు. వీరిద్దఱు సరిసమానులు కానేరరు. అటులే కదలని మెదలని విగ్రహములు మానవులచేత నిర్మింపబడి శక్తిలేనివి. దేవుడు సర్వశక్తుడు, సర్వాధికారుడు. సర్వము ఆతనికి లోబడి యున్నది. కావున ఆతనికే అన్నివిధములైన

స్తోత్రములు చెందును. అతఁడే పూజ్యుఁడు. కావున శక్తి లేని విగ్రహములును సర్వ శక్తుఁడగు దేవుఁడును సరిసమానులు కానేరరు. ఇటులే దేవునికి విధేయుఁడై భక్తి మార్గమున పోవు విశ్వాసియును విగ్రహారాధకుఁడగుఅవిశ్వాసియును సరిసమానులు కానేరరు. అని యూహించునది. రెండవది. ఒకఁడు మూఁగ. సాధారణ మగ మూఁగ చెవిటిగా నుండును. వాఁడేమియు చేయఁజాలఁడు. వాని వలన వాని యజమానునకులాభము లేదు. వాఁడు వానికిభారముగానుండును. ఏ పనికి పంపినను పనిచేయలేఁడు. ఏ మేలును లాభమును తీసికొని రాఁజాలఁడు. మఱొకఁడు తాను సన్మార్గమునందు నడచుచు నితరులకు న్యాయ మార్గము బోధించును. వీరిద్దఱునుఁ సరిసమానులు కానేరరు. వీరిద్దఱే సరిసమానులు కానపుడు శక్తిలేని విగ్రహములును చిల్లర దేవతలును సర్వశక్తుఁడగు దేవుఁడును ఎట్లు సరిసమానులు కాఁగలరు. ఇట్లులే దేవుఁడొసంగిన ఆహారము తినుచు విశ్వాస భక్తులు లేని అవిశ్వాసియును దేవుని యందు భయభక్తులుగలిగి కృతజ్ఞుఁడై యున్న విశ్వాసియును సరి సమానులు కానేరరు అని యూహించునది.

77. వలిల్లాహి-గైబుస్-సమావాతి-వల్-అర్జి-వమా-అమ్రుస్-సాఅతి-ఇల్లా కలమ్-హిల్-బసరి ఔ-హువ అఖ్రబు-ఇన్నల్లాహ-అలాకుల్లి-షైఇన్-ఖదీర్. 78. వల్లాహు-అఖ్రజకుమ్-మింబుతూని-ఉమ్మహాతి కుమ్-లా-తఅలమూన-షైఅన్-వ-జఅల-లకుముస్-సమ్అ-వల్-అబ్-సార-వల్-అఫ్-ఇదత లఅల్లకుమ్-తష్-కురూన్. 79. అలమ్-యరౌ-ఇలత్-తైరి ముసఖ్-ఖరాతిన్-ఫీ-జవ్విస్-సమాఇ-మా-యుమ్-సికహున్న-ఇల్-లల్లాహు-ఇన్న-ఫీ-జాలిక-ల-ఆయాతిల్-లి-ఖౌమిన్-యూమినూన్.

77. మఱియు ఆకాశముల యొక్కయు భూమి యొక్కయు రహస్యములు దేవుని యొద్దనే యున్నవి మఱి పునరుత్థానము యొక్క విషయము ఒక ఱెప్పపాటు కాలమో లేదా దానికంటె సమీపములోనో యున్నది. నిశ్చయముగా దేవుఁడు సర్వమునకు శక్తిగలవాఁడు 78. మఱియు దేవుఁడు మిమ్ము మీ తల్లుల గర్భములనుండి బయటికిఁ తీసెను. మీకేమియు తెలియకుండెను. మఱి మీరు కృతజ్ఞులై యుండుటకు మీకు చెవులు, కన్నులు, హృదయములు దేవుఁడొసంగెను. 79. ఆకాశ మధ్యలో వశములై యున్న పక్షులను వారు చూడలేరా! దేవుఁడు తప్ప ఇతరు లెవ్వరును వానికి ఆధార మొసంగుటలేదు. నిశ్చయముగా విశ్వసించువారికి నిందు సూచనలు గలవు.

వ్యా॥ 77. సృష్టి అంతయు సరిసమానముగ లేదు. అందుచాల వ్యత్యాసము

గలదు. ఒకని స్థితి మఱొకనివలె లేదు. దీని రహస్యము దేవునికే తెలియును భూమ్యాకాశముల రహస్యములు దేవునియొద్ద నున్నవి. అన్నిటి ఫలితము తుదిదినము (పునరుత్థానము) నందు బయలు పడును. అందఱు తిరిగి సజీవులగుట దినము దూరము లేదు. అది దేవుఁడు కోరినపుడు రెప్పపాటు కాలముకంటెను తక్కువ కాలములో దానిని సంభవింపఁ జేయును. అందు ఏలాంటి కష్టము లేదు. ఎందుకన దేవుఁడు సర్వశక్తుఁడు. 77. మీరు మీతల్లుల గర్భములనుండి పుట్టితిరి. అపుడు మీకేలాంటి తెలివి లేకుండెను. దేవుఁడు మీకు వినుటకు చెవులు చూచుటకు కన్నులు గ్రహించుటకు హృదయము (బుద్ధి) నొసంగెను. మీరు వృద్ధి పొందుకొలది మీ తెలివితేటలు వృద్ధిపొందసాగెను. ఇట్లు అనుగ్రహించిన దేవునికి మీరు కృతజ్ఞులురై యుండవలెనని అట్లు ప్రసాదించెను. కాని మీరు కృతజ్ఞతకు బదులుగ చిల్లర దేవతలను విగ్రహములను పూజించుచు దేవునికి కృతఘ్నులై యున్నారు. 79. దేవుఁడు మానవులకు దగిన శక్తులు వారి కొసంగెను. అటులే పక్షులకు వానికిఁ దగిన వస్తువులు వానికొసంగెను. చూడుఁడు అవి ఎట్లు ఆకాశమధ్య ఎగురుచున్నవో! అవి భూమియొక్క ఆకర్షణ వలన క్రింద పడవు. అవి దేవునియాజ్ఞకు లోఁబడి మధ్యనెగురుచునిలుచుచున్నవి. దేవుఁడే వానికి ఆధారపడి వాని నిలుపుచున్నాఁడు. ఇందు విశ్వాసులకు సూచనలు గలవు. కొందఱు తాము విశ్వసించినచో తమ సంపదలు పోవునేమో అని భయపడి విశ్వసించుటకు వెనకంజ వేయుదురు. దేవుఁడు పసిబిడ్డలను పక్షులను ఎట్లు కాపాడుచున్నాఁడో అని యోచించినచో వారికట్టి సందేహముండ నేరదు.

80. వల్లాహు-జఅల-లకుమ్-మిన్-బుయూతి-కుమ్-సకనన్-వ-జఅల-లకుమ్ మిన్-జులూదిల్-అన్-ఆమి-బుయూ-తన్-తస్ తఖిఫ్ఫూనహా-యౌమ-జ అ-ని కుమ్-వ-యౌమ-ఇఖా-మతికుమ్-వమిన్-అస్-వాఫిహా-వ-ఔబారిహా-వ-అష్-ఆరిహా-అసాసన్-వ-మతా-అన్-ఇలా-హీన్. 81. వల్లాహు-జఅల-లకుమ్-మిమ్మా-ఖలఖ-జిలా-లన్-వజ-అల-లకుమ్-మినల్-జిబాలి-అక్-నానన్-వజఅల-లకుమ్-సరా బీల-తఖీ-కుముల్-హర్ర-వ-సరాబీల-తఖీ-కుమ్-బాస-కుమ్-కజాలిక-యుతిమ్ము-నిఅ-మతహూ-అలైకుమ్-ల-అల్లకుమ్-తుస్-లిమూన్. 82. ఫ-ఇన్-తవల్లౌ-ఫఇన్నమా-అలైకల్-బలా-గుల్-ముబీన్. 83. యఅ-రిఫూన-నిఅ-మతల్లాహి-సుమ్మ-యున్-కిరూనహా-వ-అక్-సరు-హుముల్-కాఫిరూన్.

80. మఱియు దేవుఁడు మీయిండ్లను మీకు నివాసముగా నేర్పఱచెను.

మఱి పశువుల చర్మములను మీకు గుడారములుగఁ జేసెను. మీరు ప్రయాణము లో నుండు దినములందును మీరు ఇండ్లలోనుండు దినమునందును అవి మీకు చులకనఁగా నుండును. గొఱ్ఱెల యున్నితోను, ఒంటెలరోమములతోను, మేఁకల వెంట్రుకలతోను, అనేక సామానులనునియమిత కాలము వఱకు నుపయోగపడు వస్తువులను చేసెను. 81. మఱియు దేవుఁడు తాను సృష్టించిన వస్తువుల నీడలను మీకుఁగాను జేసెను. మఱిమీకుఁగాను కొండలలో మీరు తలదాచుఁకొను స్థలములను నిర్మించెను. మఱి వేడిమినుండి మిమ్ము కాపాడు అంగీలను, యుద్ధములో మిమ్ము కాపాడు అంగీలను మీకొసంగియున్నాఁడు. ఇటులే మీరు విధేయులై యుండుటకు తన అనుగ్రహము మీకు పూర్తిగాఁ జేయుచున్నాఁడు. 82. పిదప వారు వెనుదిరిగి పోయినచో స్పష్టముగాఁ దెలిపి ప్రచారము చేయుటయే నీపని. 83. వారు దేవుని మేలును ఎఱుంగు చున్నారు.మరల వారుదానిని తిరస్కరించుచున్నారు. మఱి వారిలో పెక్కుమందికృతఘ్నులుగా నున్నారు.

వ్యా॥ 80. ఈ వాక్యములలో దేవుఁడు మానవులకు నొసంగిన అనుగ్రహములను తాను వారికి చేసిన ఉపకారములను తెలుపుచున్నాఁడు వసించుటకు ఇండ్లును, పశువుల చర్మములతోఁ జేసి గుడారములును వారి రోమములతో చేయఁబడు పలువిధములైనవస్త్రాదివస్తువులును దేవుఁడుమానవులకు నొసంగియున్నాఁడు. ఇవన్నియు అతఁడుమానవులకు దయచేసియున్న బుద్ధితో వారునిర్మించుకొనుదురు. దానికిఁ దగిన సామగ్రికూడ దేవుఁడు అనుగ్రహించి యున్నాఁడు. 81. మేఘములు, వృక్షములు, ఇండ్లు, పర్వతములు మొదలైనవి మానవులకు నీడల నొసంగుచున్నవి. వానివలన మానవులు హాయి పొందుచున్నారు. కొండలలో వర్షము వేడిమి శత్రువులనుండి తలఁదాచుకొనుటకు గుహలు గలవు, చలి వేడిమినుండి కాపాడు కొనుటకు వస్త్రములును యుద్ధములో గాయములు తగులకుండ కాపాడు కొనుటకు కవచములును గలవు. ఇవన్నియు దేవుని యనుగ్రహములు. మానవులు దీనిని గమనించినచో వారు తప్పక దేవునికి విధేయులై యుందురు. 82. దేవుని యనుగ్రహములను మేళ్లను చూచియు అవిశ్వాసులు విశ్వసింపక వెనుక దిరిగి పోయినచో ఓ ప్రవక్త! నీవు చింత పడ నక్కఱలేదు. ధర్మ ప్రచారము చేయుట నీపని. నీవు నీపని స్పష్టముగా చేసితివి. కావున నీయుద్యమము నెరవేఱినది. కావున నీవు చింతింప నక్కఱలేదు. 83. మానవులలో కొందఱు మాత్రమే దేవునికి విధేయులై కృతజ్ఞత సలుపువారు. పెక్కుమంది దేవుని మేళ్లను ఉపకారములను ఎఱింగియు దేవునికి విధేయత, కృతజ్ఞత సలుపు సమయము వచ్చునిపుడు అట్లుచేయక దేవుని మేళ్ళను మఱచి కృతఘ్నులగుచున్నారు.

84. వ-యౌమ-నబ్-అసుమిన్-కుల్లి-ఉమ్మతిన్-షహీ-దన్-సుమ్మ - లా -

యూజను-లిల్ల-జీన-కఫరూ-వలా-హుమ్-యుస్-తఅ-తబూన్. 85. వ-ఇజా-ర అల్-లజీన-జల-ముల్-అజాబ-ఫ- యుకఫ్- ఫఫు-అన్‌హుమ్-వలా-హుమ్-యు న్-జరూన్! 85. వఇజా-రఅల్లజీన-అష్-రకూ-షురకాఅ-హుమ్-ఖాలూ - రబ్బ నా-హాఉలాఇ-షుర-కాఉ- నల్లజీన-కున్నా-నద్ఊ-మిన్-దూనిక-ఫఅల్-ఖౌ-ఇలై హిముల్-ఖౌల-ఇన్నకుమ్-లకాజి- బూన్. 87. వ-అల్ ఖౌ-ఇలల్లాహి-యౌ-మఇ జనిస్-సలమ-వ-జల్ల-అన్-హుమ్-నూ కానూ-యఫ్-తరూన్. 88.అల్ల-జీన-కఫరూ వ-సద్దూ-అన్-సబీ-లిల్లాహి-జిద్నా-హుమ్-అజాబన్-ఫౌ- ఖల్-అజాబి - బిమా- కానూ- యుఫ్-సిదూన్.

84. మఱియు ఆ దినమున ప్రతి జాతినుండి ఒక సాక్షిని నిలువఁబెట్టు దుము. పిదప అవిశ్వాసులకు సెలవు నొసంగఁబడదు. మఱి వారి క్షమాపణ అంగీకరింపఁబడదు. 85. మఱి దుర్మార్గులు శిక్షను చూచునపుడు అది తగ్గింపఁ బడదు. మఱి వారికి వ్యవధి దొరకదు. 86. మఱియు పెక్కు దైవారాధకులు తమ చిల్లరదేవతలను చూచునపుడు ఓ మా ప్రభువా! వీరు మాచిల్లరదేవతలు. మేము నిన్ను వదలి వీరిని పిలుచుచుంటిమి అని పలుకుదురు. అపుడు చిల్లర దేవ తలు మీరు అసత్యవంతులు అని వారిపై మాట వేయుదురు. 87. ఆ దినమున వారందఱును దేవుని యెదుట నమ్రులై పడుదురు. మఱి వారు తాము కల్పించు చున్న అసత్యములను మఱచిపోవుదురు. 88. ఎవరు తిరస్కరించి దేవునిమార్గము నుండి ప్రజలను ఆటంకపఱచిరో వారు చేయుచున్న అక్రమములకుఁగాను వారికి శిక్షపై శిక్షను హెచ్చించెదము.

వ్యా॥ 84. ఇఁక అవిశ్వాసము యొక్కయు కృతఘ్నత యొక్కయు ఫలి తము చెప్పఁబడుచున్నది. తప్పక తీర్పుదినము రానున్నది. అందు సర్వాధికారి యగు దేవునియెదుట అన్నిజాతులవారును తమ తమ కర్మల తీర్పునకుఁగాను వచ్చి నిలుతురు. ఆయాజాతుల (మతస్థుల) వారి ప్రవక్తలు తమ జనులగూర్చి సాక్ష్యమిత్తురు. దేవుని విషయమును, ఆతని సందేశము (వహీ) విషయమును, ఆతని ప్రవక్తల విషయమును వారెట్లు ప్రవర్తించిరో దానిగూర్చి సాక్ష్యము పలుకుదురు. అపుడు అవిశ్వాసులకు నోరు తెరచుటకు సెలవునొసంగఁబడదు. లేక అపుడు వారు తమ పాపముల క్షమాపణ కోరుకొనుటకు వారికి వీలుండదు. అప్పటి క్షమాపణ అంగీకరింపఁబడదు. మఱి వారి యితర సాకులు చెల్లవు. 85. దుర్మార్గులు శిక్షను చూచి దాని యనుభవించునపుడు అది తగ్గదు. మఱి వారు

కొంత విశ్రాంతి పొందుటకు వారికి వ్యవధికూడ లభించదు. సదా నరకములోనే యుండి దాని బాధలను అనుభవించుచుందురు. 86. తీర్పుదినమునందు దేవునికి సాటిగ కల్పింపఁబడిన చిల్లరదేవతలను, అవిశ్వాసులు చూచి వీరివలన మేము నశించితిమి. మేము నిర్దోషులము అని పలుకుదురు. దానికి బదులుగ వారు మే మెప్పుడు మీతో మమ్మ పూజింపుఁడు అని పలికితిమి. మీరు అబద్ధములుపలుకు చున్నారు. మీరే మమ్మ దేవునికి సాటిగ కల్పించుకొంటిరి. మేము దానికిబాధ్యు లముకాము అని పలుకుదురు. కొందఱు, ప్రవక్తలను భక్తులను దేవునికి సాటిగ కల్పింతురు. ప్రవక్తలును భక్తులును దేవునికి సాటి కల్పింపవలదు అని నొక్కి-జోధించియున్నారు. కావున వారు దానికి బాధ్యులుకారు. కావున తీర్పుదిన మునందు అవిశ్వాసులకు నెవరును పనికిరారు. నరకశిక్షనుండివారినిరక్షింపజాలరు 87. ఇహమునందు తాము అవిశ్వాసులు కల్పించుచున్న ద్రోహములు, కుట్రలు మఱచిపోవుదురు. వారి గర్వము అపుడు సాగదు. అందఱును దేవుని యెదుట నమ్రులై యుందురు. 88. దుర్మార్గులు తాము పాపములు చేసినదికాక యితర ప్రజలనుకూడ దేవుని ధర్మమార్గమునుండి ఆటంకపఱచుచుండిరి. అందుకు వారికి రెండు శిక్షలు కలుగును.

89. వ-యౌామ-నబ్-అసు-ఫీకుల్లి-ఉమ్మతిన్-షహీదన్-అలైహిమ్ - మిన్-అన్-ఫుసి-హిమ్-వ-జీనా-బిక-షహీదన్-అలా-హాఉలాఇ-వ-నజ్-జల్నా - అలై కల్-కితాబ-తిబ్-యానల్-లికుల్లి-షైఇన్-వ-హుదన్-వ-రహ్-మతన్-వ-బుష్రా లిల్-ముస్-లిమీన్.

89. మఱియు, ఆ దినమున ప్రతిజాతివారినిగూర్చి సాక్ష్యము పలుకు టకుఁగాను వారినుండియే యొకనిని నిలువఁ బెట్టెదము. మఱి వీరినిగూర్చి సాక్ష్యమిచ్చుటకు నిన్ను తీసికొనివచ్చెదము. మఱి మేము నీకు గ్రంథము పంపి తిమి. అది ప్రతిదానిని స్పష్టముగాఁ దెలుపునది. విధేయులకు సన్మార్గమును దయయును చూపునది. మఱి సంతోషవార్త నిచ్చునది.

వ్యా॥ 89. తీర్పుదినమునందు ప్రతి ప్రవక్తయును తనజాతివారినిగూర్చి సాక్ష్యమిచ్చును. అటులే హజ్రత్ ముహమ్మదు రసూలువారు తమ జనులను గూర్చి సాక్ష్యమిత్తురు. దేవుఁడు హజ్రత్ రసూలువారికి ఖురానుగ్రంథమునొసం గెను. అందు అన్ని ధర్మములును స్పష్టముగాఁ దెలుపఁబడినవి. అందు పరలోక విషయమును, తీర్పుదినము సంభవించు విషయములును స్పష్టముగా తెలుపఁబడి నవి. ఇది విధేయులకు సన్మార్గమును దయయును చూపుచున్నది. విశ్వసించిన ముసల్మానులు దేవునికి విధేయులు. వీరికి ఉన్నతస్థితి గలదు అని సంతోష

వార్త నిచ్చును. ఇట్టి గొప్ప గ్రంథముపొందిన ప్రవక్తయు చాల గొప్పవాఁడు. ఆతని సాక్ష్యముకూడ చాల గొప్పది.

90. ఇన్నల్లాహ-యామురు-బిల్-అద్‌లి-వల్-ఇహ్‌సాని - వ-ఈతా-ఇ-జిల్-ఖుర్బా-వ-యన్‌హా-అనిల్-ఫహ్‌షా ఇ-వల్-మున్-కరి-వల్-బగ్ ఇ-యఇజుకుమ్-ల-అల్లకుమ్-తజక్క-రూన్.

90. న్యాయము చేయవలెను అనియు, మేలు చేయవలెను అనియు, బంధువులకు నొసంగవలెననియు దేవుఁడు ఆజ్ఞాపించుచున్నాఁడు. మఱియు సిగ్గుమాలినతనమును, అధర్మమును, దౌర్జన్యమును ఆతఁడు నిషేధించుచున్నాఁడు. మీరు జ్ఞాపకముంచుకొనుటకుఁగాను దేవుఁడు మిమ్ము బోధించుచున్నాఁడు.

వ్యా॥ 90. ఇందు సర్వధర్మములును ఇమిడియున్నవి. అన్ని అధర్మకార్యములును నిషేధింపఁబడినవి. ఈ వాక్యమును బాగుగ గమనించినచో సర్వము బోధపడును. సర్వధర్మములకును న్యాయము, మేలు(పరోపకారము) బంధువుల సేవ మూలధర్మములు. ప్రతి విషయములోను న్యాయమును పాటింపవలెను. విశ్వాసములు (అఖాయిద్) కర్మములు, గుణములు, లోక వ్యవహారములు, మొదలగు విషయములలో హెచ్చుతగ్గులు లేకుండ ధర్మముగా నుండుట న్యాయము. ఎట్టి విరోధి విషయమైనను న్యాయమే పాటింపవలెను. త్రికరణశుద్ధి లభించినగాని న్యాయము లభింపనేరదు. మేలు, (ఇహ్‌సాన్) చేయుటకు తాను ముందు ధర్మముగా నడచుకొని, పరులకు మేలు చేయవలెను. పరుల మేలు కోరవలెను. పరోపకారము చేయుటలో అందఱు స్నేహితులు, విరోధులు, తనవారు పరాయివారు సమానులే. అయిన బంధుత్వము గలవారికి చాల శ్రద్ధతో మేలు, సేవ చేయవలెను. నిషేధింపఁబడిన విషయములుకూడ ముఖ్యమైనవి. మానవులలో పశుబలము, పిశాచబలము, మృగబలమువలన నీచకార్యము, సిగ్గుమాలిన పాపకార్యములు మానవుఁడు చేయును. పిశాచబలమువలన తెలివిమాలిన పనులుచేయును. అవియే అధర్మకార్యములు. మృగబలమువలన, కోపమునకులోనై దౌర్జన్యము అన్యాయములు చేయును. కావున మనుష్యుఁడు భక్తుఁడు కావలెనన్న ఈమూఁడు బలములవలన గలుగు పాపములను వదలుకొనవలెను. అందులకే అవి యీ వాక్యమునందు నిషేధిరపఁబడినవి. ఈ విషయములను జ్ఞప్తికిఁ దెచ్చుకొనినచో మానవునకు బోధగలిగి బుద్ధివచ్చును.

91. వ ఔఫూ-బి-అహ్-దిల్లాహి-ఇజా-ఆహత్తుమ్-వలా-తన్-ఖు-జుల్-ఐమాన-బఅద తౌకీదిహా-వఖద్-జఅల్-తుముల్లాహా-అలై-కుమ్-కఫీలన్- ఇన్నల్లా

హా-మతి-లము-మా-తఫ్-అలూన్. 92. వలా-తకూనూ-కల్లతీ-నఖ-జత్-గజ్-లహా-మింబఅది-ఖువ్వ తిన్-అన్-కాసన్ తత్-తఖి-జూన-ఐమా-నకుమ్- దఖలమ్ బైనకుమ్-అన్-తకూన-ఉమ్మతున్-హియ-అర్ బా-మిన్-ఉమ్మతిన్ - ఇన్నమా-యబ్-లూ-కుముల్లాహు బిహీ-వ-లయుబయ్యినన్న-లకుమ్-యౌ-మల్-ఖియామతి-మా-కున్తుమ్ ఫీహీ-తఖ్-తలిఫూన్.

91. మీరు ఒకరితో నొకరు ఒడంబడిక చేయునపుడు దేవుని వాగ్దానమును పూర్తిచేయుఁడు. మఱి మీరు ప్రమాణములను స్థిరముగా చేసిన పిదప వానిని తెంపకుఁడు. మఱి మీరు దేవునికి తమ జామీనుదారునిగాఁ జేసికొని యున్నారు. మీరు చేయునది దేవునికిఁ దెలియును. 92. దారమును గట్టిగా వడికిన పిదప దానిని తునకలు తునకలుగా తెంపివేసిన స్త్రీవలె మీరు కాకుండుఁడు. ఒకజాతి మఱొకజాతికంటె నెక్కువగా నగుటకు, మీరు మీ ప్రమాణములను (మోసమునకు) సాకుగా చేయుదురా? దీనివలన దేవుఁడు మిమ్ము పరీక్షించుచున్నాఁడు. మఱి తీర్పుదినమునందు మీరు వివాదములాడు విషయములను స్పష్టముగా మీకుఁ దెలుపును.

వ్యా॥ 91. ఇందు, ఒడంబడికలు పూర్తి చేయవలెను అనియు, అందు ఏలాటి ద్రోహముచేయరాదు అనియు బోధింపఁబడుచున్నది. దేవుని పేరుతో ప్రమాణములుచేసి ఒక జాతివారితో ముసల్మానులు ఒడంబడిక చేసినపుడు దాని వలన ఎన్ని కష్టములు వచ్చినను సహించి ఒడంబడికను పూర్తిగాఁ జేయవలెను. దానికి వ్యతిరేకముగాఁ బోఁగూడదు. దేవుని పేరుతో చేసిన ఒడంబడికలకు దేవుఁడు సాక్షిగను జామీనుదారుఁడుగ నుండును. ఒడంబడిక తెంపినచో దేవుని వాగ్దానము తెంపినట్లగును. కావున మీరు ద్రోహముచేసితిరేని, అది దేవునికిఁ దెలియును. దానికి తగిన శిక్ష నొసంగును. 92. ఒడంబడిక చేసి తెంపుట చాల అవివేకము. అది యొక యుదాహరణ మూలమున వివరింపఁబడినది. ఒకతె దినమంతయు నూలువడికి మరల దానిని తునకలు తునకలుగా తెంపివేయును. ఆమె చేయునది వివేకములేనితనముగదా! అటులే యొడంబడికను తెంపువారు అని యూహింపవలెను. ప్రమాణములును, ఒడంబడికలును ద్రోహముచేయుటకుఁ గాను ఒక అడ్డుగాఁ జేసికొనఁగూడదు. ఇస్లామ్‌నకు పూర్వము, కొందఱు తమ కంటె బలవంతులుగా నున్నవారితో ఒడంబడిక (సంధి) చేసికొందురు. వీరికంటె బలవంతులువచ్చినచోపూర్వముతాముచేసిన యొడంబడికనువిడిచిపెట్టి యితరులతో సంధి చేసికొందురు. మఱితాము సంధిచేసికొన్నవారిబలము తగ్గిపోయినచో తిరిగి తమ సంధి షరతులను విడనాడి ద్రోహముచేయుదురు. ప్రస్తుతము యూరోపీయనులు సమయము వచ్చినపుడెల్ల తమ వాగ్దానములు ఒడంబడికలు తెంపు

చున్నారు. ఒకజాతి బలముతగ్గి మఱొకజాతివారి బలము హెచ్చుటలో దేవుని పరీక్షయున్నది. ఒడంబడికలను పూర్తిచేయుఁడు అని యాజ్ఞాపించుటలోకూడ దేవుని పరీక్షకలదు. ఎవరు తమ వాగ్దానములను నెరవేర్తురో ఎవరు ద్రోహములు చేయుదురో దేవుఁడు చూచును. తాము ఒడంబడిక చేసికొన్నవారి బలము తగ్గినను దానికి వ్యతిరేకముగ పోక అందు స్థిరముగా నుండవలెను. ద్రోహము చేయువారు తుదకు నష్టములు పొందుదురు. ఇహలోకమునందు మనుష్యులపరీక్ష యున్నది. దాని సంపూర్ణ ఫలితము తీర్పుదినమునందు గలుగును. అన్ని జగడములు తీరును అని హెచ్చరింపఁబడియెను.

93. వ-లౌషా-అల్లాహు ల-జఅల-కుమ్-ఉమ్మతన్-వాహి-దతన్-వలా-కిన్-యుజిల్లు-మన్-యషాఉ-వ-యహ్-దీ-మన్-యషాఉ-వల-తుస్ అలున్న-అమ్మా-కున్తుమ్-తఅ-మలూన్. 94. వలా-తత్ తఖిజూ-ఐమానకుమ్-దఖలమ్-బైనకుమ్-ఫతజిల్ల-ఖదముమ్-బఅద-సుబూతిహా వ-తజూ-ఖుస్ సూఅ-బిమా-సదత్తుమ్-అన్-సబీ-లిల్లాహి-వలకుమ్ అజాబున్-అజీమ్. 95. వలా తష్-తరూ- బి-అహ్-దిల్లాహి-సమనన్ ఖలీలన్-ఇన్నమా-ఇన్దల్లాహి-హువ-ఖైరుల్-లకుమ్-ఇన్ కున్తుమ్-తఅ-లమూన్. 96. మా-ఇన్దకుమ్-యన్ ఫదు-వమా-ఇన్దల్లాహి బాఖిన్-వల - నజ్-జియన్నల్-లజీన-సబరూ అజ్ రహుమ్-బి అహ్ సని-మా - కానూ-యఅ-మలూన్.

93. మఱియు దేవుఁడు కోరినచో మిమ్ములను ఒక్క మతమువారిగనే చేసియుండును. కాని తాను కోరినవారిని మార్గము తప్పించుచున్నాఁడు. మఱి తాను కోరినవారికి సన్మార్గము చూపుచున్నాఁడు. మఱి మీరు చేయుచున్న కర్మలనుగూర్చి మీరు తప్పక ప్రశ్నింపఁబడుదురు. 94. మఱి మీరు మీప్రమాణములను పరస్పరము మోసము చేయుటకుఁగాను చేయకుఁడు. అట్లు చేసినచో పాదము స్థిరముగానైన పిదప జాఱిపడును. మఱి మీరు దేవుని మార్గమునుండి ఆటంకపఱచినవారలై శిక్షను రుచి పొందవలసివచ్చును. మఱి మీకు చాల కఠిన శిక్ష గలుగును. 95. మఱి దేవుని యొడంబడికకు బదులుగ కొంత ధనమును పుచ్చుకొనకుఁడు. మీకుఁ దెలిసినచో దేవునియొద్ద నున్నది. నిశ్చయముగా మీకు మంచిది. 96. మీ యొద్ద నున్నది నశించును. మఱి దేవుని యొద్ద నున్నది శాశ్వతముగా నుండునది. మఱిసహించియుండువారికి వారుచేయు మంచి కార్యములకు మంచి ఫలితము మేము తప్పక యొసంగుదుము.

వ్యా॥ 93. మానవులలో నేలాటి మతభేదము లేకుండ ఒకే మతము

వారలుగఁ జేయు శక్తి దేవునికిఁ గలదు. కాని దేవుఁడు అట్లు చేయక మానవుల యిష్టముపై వదలిపెట్టి వారికి కొంత స్వాతంత్ర్యము నొసంగియున్నాఁడు. ఈ విషయము దీనికి ముందు అనేక చోట్ల వ్రాసియున్నాము. మానవులు చేయు కర్మలనుగూర్చి తప్పక ప్రశ్న గలుగును. కావున ముసల్మానులు తాము యితర మతస్థులవారితో చేసిన యొడంబడికలను సంపూర్ణముగా నెరవేర్పవలెను. అందు ఏలాటి మోసముగాని లోపముగాని చేయరాదు. 94. ఒకవేళ ముసల్మానులు తమ యొడంబడికలను తెంపి మోసము చేసినచో ఇతర జాతులవారు చూచి వీరు నమ్మిక ద్రోహులు, వీరి గుణములు మంచివి కావు అని సందేహించి యిస్లామ్ (దేవుని మార్గము) లో రాకపోవుదురు. దానికి కారకులు అయి దాని శిక్ష అనుభవింపవలసివచ్చును. 95. దీనికి ముందు మానవులు పరస్పరముచేయు ఒడంబడికలను తెంపకూడదు అని చెప్పఁబడియెను. ఇఁక దేవునితోఁ జేసిన యొడంబడికలను తెంపకూడదు అని చెప్పఁబడుచున్నది. ధన లోభముచే దేవుని ధర్మములను విడనాడకూడదు. లోకములోని ధనము నశించునది. దానికి శాశ్వతములేదు. దేవునియొద్దనుండు మోక్షము భక్తులకు చాల మంచిది. కావున ధర్మములను పాటింపవలెను. 96. శాశ్వతముగానుండు దానిని వదలి నశించు దానిని గ్రహించుట వివేకముకాదు. ఒడంబడికలలో స్థిరముగానుండి, అందు కలుగు కష్టములకు సహించి సత్కార్యములు చేయువారి కష్టము వృథాపోదు. వారికి తప్పక మంచి ఫలితము దేవునియొద్ద లభించును.

97. మన్-అమిల-సాలి-హన్-మిన్-జకరిన్-ఔ-ఉన్‌సా- వహువ- ముూమినున్- ఫల-నుహ్‌యి-యన్న హూ-హయాతన్-తయ్యి-బతన్-వల- నజ్- జియన్న-హుమ్-అజ్రహుమ్-బి-అహ్‌-సని-మా-కానూ-యఅ-మలూన్. 98 ఫఇజా-ఖురఅతల్-ఖుర్ఆన-ఫస్-తఇజ్-బిల్లాహి-మినష్-షైతా-నిర్రజీమ్. 99. ఇన్నహూ-లైస-లహూ-సుల్ తానున్-అలల్-లజీన-ఆమనూ-వఅలా- రబ్బిహిమ్- యత- వక్కలూన్. 100. ఇన్నమా-సుల్ తానుహూ-అలల్-లజీన-యతవల్లౌ- నహూ- వల్లజీన.హుమ్-బిహీ-ముష్-రికూన్.

97. పురుషుఁడుగాని స్త్రీగాని విశ్వాసులై సత్కార్యము చేసినచో మేము వారికి పవిత్రమైన జీవన మొసంగుదుము. మఱి వారు చేయుచున్న సత్కార్యములకు బదులుగ వారికి ఫలిత మొసంగుదుము. 98. కావున నీవు ఖురాను పఠింపఁబోవు నపుడు దేవుని దయనుండి తొలగింపఁ బడిన సైతాను కుట్రనుండి తప్పింపఁ బడుటకై దేవుని శరణు చొచ్చుము. 99. విశ్వాసులై దేవునిపై నా

ధారపడు వారిపై వానికి శక్తి లేదు. 100. ఎవరు వానిని స్నేహితునిగాఁ జేసి కొనుచున్నారో మఱెవరు దేవునికి సాటి కల్పించుచున్నారో అట్టి వారిపైవానికి శక్తి గలదు.

వ్యా॥ 97. సత్కార్యములుచేసి వాని ఫలితము పొందుటలో స్త్రీ పురుషులు సమానులు. సత్కార్యములు విశ్వాస పూర్వకముగాఁ జేయవలెను. అట్లు చేయువారికి దేవుఁడు ఉభయ లోకములలోను పవిత్రమైన జీవన మొసంగును. ఇహామునందు దేవుని ధ్యానమందు వారికి రుచి కలుగును. వారి మనస్సులకు శాంతి లభించుచు దేవుని పైననే యాధార పడుదురు. ఎంత లభించిన దాని పైననే తృప్తిచెంది లోభము పేరాసలు లేక సుఖముగా జీవింతురు. గోరీలోను కూడ వారికి సౌఖ్యము లభించును. తీర్పు దినమునందు మోక్షము స్వర్గము లభించును. కావున భక్తుల సత్కార్యములు వృథా పోవు. వాని ఫలితము తప్పక లభించును. 98. ఖురానె షరీఫును పఠించుట అన్ని సత్కార్యములలో చాల మేలైనది. దానిని గ్రహించి దానిననుసరించినచో ఉభయలోకములలో మేలుగలుగును. కావున సైతాను భక్తులకు విరోధి. ముసల్మానులు ఖురానె షరీఫును పఠింపకుండునట్లుగఁ చేయుటకు కుట్రలు చేయును. అందు వాని కుట్రలు సాగకుండ దేవుని శరణు కోరవలెను. మనఃపూర్వకముగ దేవుని శరణు చొచ్చుచు నాలుకతోఁగూడ ఖురాను పఠింపఁ బోవునపుడు అఊజు- బిల్లాహి-మినష్- షైతా-నిర్రజీమ్- అని చదువవలెను. 99. దేవునిపై నాధారపడి దేవుని సహాయము కోరు నట్టి భక్తులపై సైతానుల కుట్రలు చెల్లవు. వీరిని మోసపుచ్చుటకు వానికి శక్తి లేదు. ఒక వేళ భక్తులు అజాగ్రత పడి సైతాను కుట్రకు మోసపోయినను తత్క్షణమే దేవునిని ధ్యానించి సైతాను కుట్రనుండి తొలఁగి పోవలెను. 100. ఎవరు సైతానును తమకు స్నేహితునిగ పాటించుచు వాని సహాయముకోరుచు దేవునికి సాటి కల్పించి చిల్లర దేవతలను పూజింతురో వారు సైతాను కుట్రకు లోనై నశింతురు. వానిశక్తి వారిపై చెల్లును. వారు వాని యిష్టాను సారముగా పాపకార్యములకు లోనై వర్తింతురు.

101- వఇజా-బద్దల్ నా-ఆయతమ్-మకాన-ఆయతిన్- వల్లాహు- అఅ-లము-బిమా-యునజ్-జిలు-ఖాలూ-ఇన్నమా-అన్త-ముఫ్ తరిన్-బల్ - అక్- సరుహుమ్-లాయఅ-లమూన్. 102. ఖుల్ -నజ్-జలహు-రూహుల్ -ఖుదుసి-మిర్-రబ్బిక-బిల్ -హాఖ్ ఖి-లి-యుసబ్బి-తల్ల జీన-ఆమనూ-వ హుదన్-వ- బుష్రా-లిల్ -ముస్-లిమీన్. 103. వలఖద్ -నఅలము- అన్నహుమ్ - యఖూలూన-ఇన్నమా

యుఅల్లిము-హూ బషరున్-లిసానుల్ లజీ-యుల్-హిదూన-ఇలైహి-అఅ జమి
య్యున్-వహాజా-లిసానున్-అర-బీయుమ్ ముబీన్.

101. మఱియు మేము ఒక వాక్యమునకు బదులుగ మఱొక వాక్యమును మార్చినపుడు అవిశ్వాసులు నీవు కల్పించి తెచ్చుచున్నావు అని పలుకుదురు. దేవుఁడు పంపునది దేవునికి బాగుగ తెలియును. కాని వారిలో పెక్కుమందికిఁ దెలియదు. 102 విశ్వాసులకు స్థిరత్వము నిచ్చుటకును ముసల్మానులకు సన్మార్గము చూపుటకును సువార్త నిచ్చుటకును నిజముగ నీప్రభువునుండి పరిశుద్ధుఁడైన దేవుని దూత దానిని తీసికొని వచ్చెను అని ఓ ప్రవక్త! పలుకుము. 103. మఱి ఆతనిని ఒక మనుష్యుఁడు నేర్పుచున్నాఁడు అని వారు పలుకునది బాగుగమాకుఁ దెలియును. వారు ఎవని గూర్చి పలుకుచున్నారో వాని భాష అజమీ భాష. మఱి ఈ ఖురాను స్పష్టమైన అరబీ భాషలో నున్నది.

వ్యా॥ 101. ఖురాన్ షరీఫు సంపూర్ణముగ-ఒకే తూరి రసూలు వారికి లభింపలేదు. సమయోచితముగ దేవుని వాక్యములు జిబ్రీలు దూతతీసికొని వచ్చుచుండెను. ముందుముందు దుష్టులు చేయు హింసలకు ముసల్మానులు ఓర్చుకొని యుండవలెను అని దేవునియాజ్ఞ యుండెను. యుద్ధము చేయుటకు సెలవులేకుండెను. ఆ పిదప ముసల్మానులు యుద్ధము చేయవచ్చును అని దేవుఁడు సెలవిచ్చెను. ముందు వచ్చిన యాజ్ఞకు పిదప ఈయాజ్ఞ వచ్చెను. ఇట్టి మార్పులను చూచి అవిశ్వాసులుఖురాను దేవునిగ్రంథము కాదు. మహమ్మదుస్వయముగాకల్పించుకొని తెచ్చుచున్నాఁడు అని పలుకసాగిరి. ఒక యాజ్ఞ తరువాత మఱొక యాజ్ఞవచ్చుట వలన ఏలాటి లోపములేదు. అది ధర్మ విరుద్ధముకాదు. దాని రహస్యములు మేళ్లు దేవునికిఁ దెలియును. అవిశ్వాసులకుఁ దెలియదు అని హెచ్చరింపఁ బడియెను. ఒక బుద్ధిమంతుఁడగు వైద్యుఁడు రోగి స్థితిగతులను బట్టి మందులు మార్చుచుండునుగదా! అందువలన వైద్యుఁడు అవివేకుఁడు అని ఏ బుద్ధిమంతుఁడును చెప్పఁడు గదా! అటులే ఖురానులో ఒకటి తరువాత మఱొక ధర్మము వచ్చినది అని యూహింపవలెను. 102. అవిశ్వాసులు ఖురాను దేవుని గ్రంథము కాదని చెప్పుచున్నారు. దానికి బదులు "ఖురానునునేను సొంతముగా కల్పించుకొన్నది కాదు. ఇది యితర మానవులు కూడ కల్పించినది కాదు. దేవుఁడు తన పరిశుద్ధ దూతయగు జిబ్రీలు మూలమునకాకుపంపినది. ఖురానువలన విశ్వాసులకువిశ్వాసములోస్థిరత్వముగలుగును. ముసల్మానులుసన్మార్గమునుఅనుసరించిఉభయలోకములలో తాము జయము మోక్షము పొందుదుమని సువార్తవిని యానందింతురు అని పలుక వలెనని ప్రవక్తకు దేవుని సెలవు. 103. అవిశ్వాసులు ఖురాను దేవుని గ్రంథము కాఁదు. లేనిచో దాని ధర్మములు ఎందులకు మార్పులు పొందును.

ముహమ్మదు చదివిన యాతఁడు కాఁడు. కావున ఆతనికి నెవఁడో నేర్పుచున్నాఁడు అని పలుకుచుండిరి. దానికి నిందు రద్దుగలదు. మక్కాపురములో అరబ్బులు కాని వారు కొందఱు బానిసలుండిరి. వారి భాష అరబీకాదు. అజమీ. అరబీ కాని భాష అజమీ. బానిసలునేర్పుచున్నారు అని అవిశ్వాసులు అపనింద కల్పిరి. అరబీ భాష తెలియనివారు ఎట్లు ఖురానును నేర్పఁగలరు. ఎందుకన ఖురానె షరీఫు అద్భుతమైన అరబీ భాషలో నున్నది. అట్టిశైలి, అట్టితీరు, అట్టిభాష, అట్టిధర్మములు, అట్టి విషయములుగల వేఱు గ్రంథము దానికి పోటిగ అరబ్బులే చేయలేక పోయిరి. కావున అవిశ్వాసులు పలుకునది అపనింద మాత్రమే అని స్పష్టమగుచున్నది.

104. ఇన్నల్లజీన-లా-యూమినూన-బి-ఆయా-తిల్లాహి-లా-యహ్-దీ-హిముల్లాహు-వలహుమ్-అజాబున్-అలీమ్. 105. ఇన్నమా-యఫ్-తరిల్-కజి-బల్-లజీన-లా-యూమినూన-బి-ఆయాతిల్లాహి-వ-ఉలాఇక-హుముల్-కాజిబూన్.

104. ఎవరు దేవుని వాక్యముల విశ్వసింపరో వారికి దేవుఁడు మార్గము చూపఁడు. మఱి వారికి దుఃఖకరమైన శిక్ష యున్నది. 105. దేవుని వాక్యములందు విశ్వాసము లేనట్టి వారు అసత్యములు కల్పింతురు. మఱి యిట్టివారే అసత్య వంతులు.

వ్యా॥ 104. దేవుని సూచనలు చూచియు విశ్వసింపని వారికి నెంత బోధించినను వారు సన్మార్గమునకు రారు. వారు తమ ద్వేషములోనే యుందురు. అట్టివారికి దేవుఁడు కూడ వదలి పెట్టును. వారు మోక్షమార్గమునకురారు. తుదకు దుఃఖకరమైన శిక్షకు పాలగుదురు. 105. హజ్రత్ పైగంబరుల వారికి పవిత్ర పదవి లభింపక పూర్వమే ప్రజలు వారికి సాదిఖ్ (సత్యవంతుఁడు) అని బిరుదు నొసంగి యుండిరి. అట్టి మహాత్ములు దేవునిపై అసత్యములు కల్పరు. కావున కాఫిర్లు ఎట్లు వారిని గూర్చి అట్లు చెప్పఁగలరు. దేవుని వాక్యములను వినియు సూచనలు చూచియు నమ్మనివారు అబద్ధము పలుకుదురు. కాని దేవుని ప్రవక్త యెన్నటికిని అబద్ధము పలకఁడు.

106. మన్-కఫర బిల్లాహి-మింబఅది-ఈమానిహి-ఇల్లా-మన్-ఉక్-రిహ-వ-ఖల్-బుహూ-ముత్-మఇన్నుమ్-బిల్-ఈమాని-వలా-కిమ్-మన్-షరహ-బిల్-కుఫ్రి-సద్రన్-ఫ-అలైహిమ్-గజబుమ్-మినల్లాహి-వలహుమ్-అజా-బున్-అజీమ్. 107. జాలిక-బిఅన్నహుముస్ తహబ్బుల్-హయా-తద్-దున్యా-అలల్-

ఆఖిరతి-వఅన్నల్లాహ-లాయహ్‌దిల్-ఖౌమల్-కాఫిరీన్. 108. ఉలాఇకల్లజీన తబఅల్లాహు-అలా-ఖులూబిహిమ్-వసమ్‌ఇహిమ్-వ-అబ్‌సారిహిమ్ వఉలాఇక-హుముల్-గాఫిలూన్. 109. లా-జరమ అన్నహుమ్- ఫిల్-ఆఖిరతి - హుముల్-ఖాసిరూన్. 110. సుమ్మ-ఇన్న-రబ్బక-లిల్- లజీన- హాజరూ- మింబఅది-మాఫుతినూ-సుమ్మ-జాహదూవ-సబరూ-ఇన్నరబ్బక-మింబఅదిహా-లగఫూరుర్ రహీమ్.

106. మఱియెవరు విశ్వసించిన పిదప దేవుని తిరస్కరింతురో వారికి కఠిన శిక్షయున్నది. కాని యెవరిపై బలవంతము చేయఁబడి, వారి మనస్సు విశ్వాసము పైననే నిలిచి యుండునో వారికి శిక్షలేదు. కాని ఎవరు మనఃపూర్వకముగ అవిశ్వాసు లగుదురో వారిపై దేవుని కోపమున్నది. మఱి వారికి గొప్ప శిక్ష యున్నది. 107. ఇది యెందుకనఁగా వారు పరలోకమునకు బదులుగ ఇహలోక జీవనమును ప్రేమించి స్వీకరించిరి. మఱి దేవుఁడు, తిరస్కరించునట్టి జనులకు మార్గము చూపఁడు. 108. ఇట్టివారి మనస్సులపైనను చెవుల పైనను, కన్నులపైనను దేవుఁడు ముద్ర వేసెను. మఱి వీరే అజాగ్రత్తలోపడిన వారు. 109. పరలోకమునందు వీరు నష్టము పొందుదురను విషయములో నేలాటి సందేహములేదు. 110. మరల ఎవరు బాధలుపడిన పిదప తమ జన్మభూమిని విడిచిపెట్టి ధర్మయుద్ధము (జిహాద్) చేసి సహించిరో నిశ్చయముగా నీప్రభువు వీని తరువాత క్షమించు వాఁడును. దయాళువును.

వ్యా॥ 106. ఇందు విశ్వసించిన తరువాత సైతాను కుట్రలకు లోనై విశ్వాసము వదలి మత భ్రష్టులు అగువారికిఁ గలుగు కఠిన శిక్షను గూర్చి చెప్పబడినది. ఒకవేళ విరోధులు బలవంతముచేసి విశ్వాసమునకు విరుద్ధము చేయుమని ముసల్మానులను హింసించిన యెడల ప్రాణము దక్కించుకొనుటకు, అవిశ్వాస వాక్యములు పలికిన దేవుఁడు క్షమించును. మనస్సులోనున్న విశ్వాసము చలింపక యున్నచో అట్టివారు మత భ్రష్టులుకారు. ప్రాణరక్షణ కొఱకు అట్లు చేసిన దోషము కాదు. కాని ప్రాణము పోయినను అవిశ్వాసులకు లొంగకుండుట చాల శ్రేష్ఠము. మక్కా ఖురైషులు హజ్రత్ బిలాలు మొదలగు ముసల్మానులకు పెట్టరాని బాధలు పెట్టిరి. కాని వారు విశ్వాసమునకు విరుద్ధముగ ఒక మాట కూడ పలుకలేదు. 107. మత భ్రష్టులగు వారు దేవుని కోపమునకు పాత్రులగుదురు. వారికి ఘోరమైన శిక్ష గలదు. మత భ్రష్టులగు వారు ఇహలోక తుచ్ఛ లాభముల కొఱకు విశ్వాసము వీడి దేవుని కోపమునకు పాత్రులగుదురు.

పరలోకమే చాల ఉత్తమమైనది. దానికిఁగాను భక్తులు కృషి సలుపవలెను. ఇహలోక భోగములకు లోనైన వారికి సన్మార్గము గోచరింపదు. 108. మతభ్రష్టులు ఇహలోక ప్రేమకు లోనై సత్యమును చెవులతో వినరు. కన్నులతో చూడరు. మఱి మనస్సులతో గ్రహింపరు. కావున అవి వృథాయై వానిపై ముద్ర వేయఁబడును. వారు చాల అజాగ్రత్తలో పడియున్నారు. కావున పరలోకము లోని మేళ్ళు వారికి గోచరింపవు.109. దేవుఁడొసంగిన కన్నులు చెవులు హృదయము మొదలగు శక్తులను సరియైన త్రోవలో నుపయోగింపక పరమునందు చెడిరి. దీనికంటె వేఱు నష్టమేమున్నది. కావున తప్పక వీరు నష్టము పొందుదురు. 110. మక్కా ఖురైషులు ముసల్మానులకు పెట్టరాని బాధలు పెట్టుచుండిరి. అందు అమ్మారు, యాసిరు, సమియ్యా అను వారిని కాఫర్లు చాల హింసించిరి. యాసిరు, సమియ్యా (భార్యాభర్తలు) అవిశ్వాసపు మాట పలుకక ఆబాధలు పడుచు పరలోకము చేరిరి. అమ్మారు (యాసిర్ కుమారుఁడు) ప్రాణరక్షణ కొఱకు అవిశ్వాసపు పలుకు పలికి తప్పించుకొనెను. కాని ఆమాటకు ఆతని మనస్సు ఒప్పక యుండెను. ఆయన ఈ విషయము హజరత్ రసూలు వారికిఁ దెలిపెను అపుడు ఈవాక్యము వచ్చెను. మనస్సులో విశ్వాసముండి అట్లు పలికిన దేవుఁడు క్షమించును. పిదప అట్టివారు దేవుని ప్రీతికొఱకు తమయిండ్లను వదలిపెట్టి ధర్మయుద్ధములు చేసి కష్టములను సహించిరి. కావున అట్టి విశ్వాసులను దేవుఁడు క్షమించి యనుగ్రహించును.

111. యౌమతాతీ-కుల్లు-నఫ్సిన్-తుజాదిలు-అన్-నఫ్సిహా-వ-తువఫ్ఫా కుల్లు-నఫ్సిమ్-మా-అమిలత్-వహుమ్-యుఌలాజ్-లమూన్.

111. ఆ దినమున ప్రతి ఆత్మయును తన విషయము వాదించుచు వచ్చును. మఱి ప్రతి వానికిని తాను చేసికొన్న కర్మల ఫలితము సంపూర్ణముగా లభించును. వాఱికి నేలాటి అన్యాయము జరుగదు.

వ్యా॥ 111. తీర్పుదినమునందు ప్రతి ఆత్మయును తన ముక్తి మార్గము చూచుకొనును. ఒకరి కొకరు పనికిరారు. బంధువులు పనికిరారు. ప్రతివాఁడు తన విషయమే లేనిపోని విషయము వాదించుచు వచ్చును. అపుడు సత్కార్యములు చేసిన వారికిఁ దగిన పుణ్యఫలితము సంపూర్ణముగ లభించును. అందు నేలొటి కొఱత కాదు. పాపము చేసిన వారికి వారి పాపముల కంటె నెక్కువ శిక్ష లభింపదు. వారి కేలాటి అన్యాయము జరుగదు.

112. వ-జర-బల్లాహు-మసలన్-ఖర్ యతన్-కానతన్-ఆమినతమ్-ముత్మఇన్నతన్-యాతీహా-రిజ్-ఖుహా-రగదమ్-మిన్-కుల్లి-మకానిన్-ఫకఫ - రత్-బి-

అన్ ఉమిల్లాహి-ఫ-అజాఖ-హల్లాహు-లిబాసల్-జూఇ-వల్-ఖౌఫి - బిమా-కా
నూ-యస్-నఊన్. 113. వలఖద్-జా అహుమ్-రసూలుమ్-మిన్-హుమ్-ఫకజ్ జ
బూహు ఫ-అఖజ-హుముల్-అజాబు-వహుమ్ జాలిమూన్. 114. ఫకులూ-మి
మ్మా రజఖ-కుముల్లాహు హలాలన్ తయ్యిబన్-వష్-కురూ-నిఅ-మతల్లాహి-ఇన్-
కున్తుమ్-ఇయ్యాహు-తఅ-బుదూన్. 115. ఇన్నమా-హర్రమ-అలై - కుముల్-
మైతత-వద్-దమ-వ లహ్-మల్-ఖిన్ జీరి వమా-ఉహిల్ల-లిగై రిల్లాహి - బిహీ-ఫ-
మనిజ్-తుర్ర-గై ర-బాగిన్-వలా ఆదిన్-ఫ ఇన్నల్లాహ-గఫూరుర్-రహీమ్. 116.
వలా-తఖూలూ-లిమా-తసిఫు అల్-సినతు-కుముల్-కజిబ హాజా - హలా- లున్-
వహాజా హరాముమ్-లితఫ్-తరూ-అలల్లాహిల్-కజిబ-ఇన్నల్లజీన-యఫ్-తరూన
అలల్లాహిల్-కజిబ-లా-యుఫ్-లిహూన్. 117. మతాఉన్-ఖలీలున్-వలహుమ్-
అజాబున్ అలీమ్.

113. మఱియు, దేవుఁడు ఒక్క పురమువారి విషయము తెలుపుచున్నాఁడు. వారు శాంతిపొందియుండిరి. వారికి ప్రతిచోటునుండి విస్తారముగా ఆహారము వచ్చుచుండెను. పిదప వారు దేవుని అనుగ్రహములకు కృతఘ్నతచూపిరి. కావున ఆ జనులు చేయుచున్న కార్యములకు బదులుగ దేవుఁడు వారికి ఆఁకలియొక్కయు భయముయొక్కయు రుచి చూపించెను. 113. మఱి వారియొద్దకు వారిలోనుండియే ప్రవక్త వచ్చెను. పిదప వారు అతనిని తిరస్కరించిరి. పిదప వారికి శిక్ష కలిగెను. మఱి వారు అన్యాయస్థులుగా నుండిరి. 114. కావున మీరు దేవునిని పూజించువారలైనచో అతఁడు మీకొసంగిన ధర్మమైన, పవిత్రమైన దానిని తినుఁడు. మఱి దేవుని యనుగ్రహములకు కృతజ్ఞత సలుపుఁడు. 115. చచ్చినదానిని రక్తమును పంది మాంసమును దేవుని పేరుతో గాక యితరుల పేరుతో వదలఁబడినదానిని దేవుఁడు మీకు నిషేధించెను. పిదప ఎవఁడైన దార్జన్యము చేయక, అతిక్రమింపక విధిలేక (తిననిచో) దేవుఁడు క్షమించువాఁడును, దయాళువును. 116 మఱి దేవునిపై అసత్యములు కల్పించుటకుఁగాను, మీ నాలుకలు పలుకు అసత్యములనుబట్టి ఇది ధర్మము, ఇది యధర్మము అని మీరు పలుకకుఁడు. ఎవరు దేవునిపై అసత్యములు కల్పింతురో వారు మేలుపొందరు. 117. వారు కొంత లాభము పొందవచ్చును. మఱి వారికి దుఃఖకరమైన శిక్షయున్నది.

వ్యా॥ 112. ఇందు మక్కాపురము యొక్క విషయము చెప్పఁబడినది. మక్కా

పురములో కాబామసీదు ఉండుటవలన అచ్చట శాంతియుండెను. అందు బయట నుండి వచ్చు విరోధుల భయము లేకుండెను. పురములోపల కూడనుపద్రవములు గలుగునను భయము లేకుండెను. అచ్చటి నివాసులు చింతలేకుండవసించుచుండిరి. మక్కాపురమునకు చుట్టుపట్లనుండి దండిగ ఫలములు ధాన్యములు మొదలగు ఆహారవస్తువులు వచ్చుచుండెను. కఱవుబాధ లేకుండెను. ఇవన్నియు వారికి నున్న దేవుని యనుగ్రహములు. కాని అచ్చటి వారు దేవుఁడు అనుగ్రహించిన సుఖములలో పడి మైమఱచి దేవునికి కృతఘ్నత చూపసాగిరి. దేవునికి సాటి కల్పించుచు అనేక దుష్టకార్యములకు లోనైరి. తుదకు దేవుఁడు వారు చేయు కర్మలకు ఫలితముగ కఱవును, భయమును వారికి గలిగించెను. 113. ఇదియును గాక దేవుఁడు మక్కాలో ఖురైషుల వంశములోనే ప్రవక్తను పంపెను. వారు ప్రవక్తను అనుసరించి యుభయలోకములలో మేలుపొందుటకు బదులుగ ప్రవక్తను తిరస్కరించి, ఆతనిని, ఆతనితోఁబాటు విశ్వసించిన ముసల్మాను లను హింసించి దేవుని శిక్షకు పాత్రులైరి. అందుకే మక్కావారికి ఏడు సంవత్స రములవఱకు కఱవు గలిగెను. బదరుయుద్ధములో పెక్కుమంది ఖురైషులు వధింపఁ బడిరి. భయము లేకయుండిన మక్కావారికి ముసల్మాను వీరుల భయముగలిగెను. తుదకు ముసల్మానులు మక్కాపురమును జయించిరి. కాఫిర్లు లోఁబడిరి. 114. ఇందు ముసల్మానుభక్తులకు హెచ్చరిక గలదు. మక్కావారు పాపములుచేసి కష్టములకు పాలైరి గదా! అట్లు మీరు చేయక, ధర్మముగా భయభక్తులతోనుండి సదా ధర్మ యాహారములను భుజించుచు దేవుని మేళ్ళకు కృతజ్ఞత సలుపుచు నుండ వలెను. 115. దేవుఁడు నియమించిన ధర్మములను ధర్మముగా నెంచి ఆచరింప వలెను. దేవుఁడు నిషేధించిన దానిని మానుకొన వలెను. ఈ వాక్యములోని వివరము సూరయే బఖరా, సూరయేఅన్ ఆమ్‌లో గడచినది. అచ్చట చూచు కొనునది. 116. ధర్మము, అధర్మము నియమించుట దేవుని పని. దేవుఁడు ఖురాను షఫులోవానిని వివరించియున్నాఁడు. దేవుఁడు నిషేధింపనిదానిని నిషేధించెననియు పలుకుట దేవునిపై నసత్యములు కల్పించినట్లగును. కావున ముసల్మానులు ఏదైన విషయముగూర్చి స్వయముగా ఇది ధర్మము (హలాల్) ఇది అధర్మము (హరామ్) అని పలుకకూడదు. ప్రతిదానికి మతాధారములుండవలెను. గ్రంథా ధారములేనిది యెద్దియును విధింపఁగూడదు. దేవునిపై అబద్ధములు కల్పించు వారు ఉభయలోకములలోను చెడుదురు. వారెట్టి మేలును పొందఁజాలరు. 117. మక్కా కాఫిర్లు హజ్రత్ రసూలువారిని తిరస్కరించుచు లేనిపోనివి దేవునిపై కల్పించుచున్నారు. వీరు ఇహలోకములో కొంతకాలము లాభముపొం దవచ్చును. కాని తుదకు దేవుని కఠినశిక్షకు పాలై సదా వారు నరకనివాసు లగు దురు. అటులే ధర్మముగానున్న దానిని అధర్మము అని చెప్పువారును అధర్మ

ముగా నున్నదానిని ధర్మము అని పలుకువారును శిక్షపొందుదురు.

118. వ-అలల్-లజీన-హాదూ - హర్రమ్‌నా మా-ఖససా్నా-అలైక-మిన్-ఖబ్‌లు-వమా-జలమ్-నాహుమ్ వలాకిన్-కానూ-అన్-ఫుసహుమ్-యజ్‌లిమూన్. 119. సుమ్మ-ఇన్న-రబ్బక-లిల్లజీన-అమిలుస్-సూఅ - బిజహా-లతిన్ - సుమ్మ-తాబూ-మింబఅది-జాలిక-వ-అస్-లహూ-ఇన్న-రబ్బక-మింబఅ-దిహా-ల-గఫూరుర్-రహీమ్.

118. మఱియు, మేము దీనికి పూర్వము నీకుఁ దెలిపినదానిని యూదులైనట్టివారికి నిషేధించియుంటిమి. మఱి మేము వారికి అన్యాయము చేయలేదు. కాని వారే తమకుతామే అన్యాయములు చేసికొనుచుండిరి. 119. ఎవరు అజ్ఞానముచే దుష్టత్వముచేసి దాని పిదప క్షమాపణ వేఁడుకొని తమ పనులను సవరించుకొనిరో దాని పిదప కూడ నీప్రభువు తప్పక క్షమించువాఁడును,దయాళువును.

వ్యా॥ 118. సూరయే అన్ ఆమ్‌లో 'వఅలల్ లజీనహాదూహర్రమ్నా' అను వాక్యములో యూదులకు నిషేధింపఁబడిన వస్తువులు వివరింపఁబడినవి. దాని వ్యాఖ్యానము చూచుకొనేది. 119. ఎవరైన తమ అజ్ఞానముచే ధర్మమును (హలాలు) ను అధర్మము (హరామ్) అని పలికి దేవునికి అవిధేయులైనవారు ఆశ వదలకూడదు. వారు తమ పాపముల క్షమాపణ కోరుకొని తమ పనులు మంచివిగాఁ జేసికొన్నచో దేవుఁడు అట్టివారి పాపములను క్షమించి అనుగ్రహించును, మనుష్యుఁడు ఏదైన పాపము చేయునపుడు వాని జ్ఞానము స్థిరముగా నుండదు. కావున వాఁడు చేయునది అజ్ఞానమువలననే చేయును. జ్ఞానమున్నచో పాపముల జోలికిఁ బోఁడు.

120. ఇన్న-ఇబ్రాహీమ-కాన-ఉమ్మతన్-ఖానితల్-లిల్లాహి- హనీఫన్-వలమ్ - యకు - మినల్ - ముష్ - రికీన్. 121. షాకిరల్ - లి-అన్ - ఉమిహీ-ఇజ్-తబాహు.వ-హదాహు-ఇలా-సిరాతిమ్-ముస్-తఖీమ్. 122. వ-ఆతైనాహు-ఫిద్-దున్యా-హసనతన్-వ-ఇన్నహూ-ఫిల్ - ఆఖిరతి-లమినస్ - సాలిహీన్. 123. సుమ్మ-ఔ-హైనా-ఇలైక-అనిత్-తబిఅ-మిల్లత-ఇబ్రాహీమ - హనీఫన్-వమా-కాన-మినల్-ముష్-రికీన్.

120. వాస్తవముగ ఇబ్రాహీము మత నాయకుఁడుగను, అన్నిటిని వదలి ఒక్క దేవునికి విధేయుఁడుగ నుండెను. మఱి అతఁడు విగ్రహారాధకులలో

చేరిన యాతఁడు కాఁడు. 121. ఆతఁడు దేవుని మేళ్లకు కృతజ్ఞుఁడై యుండెను. దేవుఁడు ఆతని నెన్నుకొనెను. మఱి ఆతనిని సన్మార్గమునందు నడిపించెను. 122. మఱియు మేము ఇహమునందు ఆతనికి మేలు నొసంగితిమి. మఱి యాతఁడు పరమునందు పుణ్యాత్ములలో చేరిన యాతఁడు. 123. ఆ పిదప స్థిరభక్తుఁడగు ఇబ్రాహీము మతమును నీవు అనుసరింపుము అని మేమునీకు సందేశము పంపితిమి. మఱి ఆతఁడు విగ్రహారాధకులలో చేరిన యాతఁడు కాఁడు.

వ్యా॥ 120. దీనికి ముందు, అవిశ్వాసులు చేయు అధర్మములను రద్దు చేసి యిక ఇబ్రాహీమునుగూర్చి చెప్పఁబడుచున్నది. అరబ్బులు ఇబ్రాహీము వంశమునకు చేరినవారు. వారు, ఆతనిని తమకు పెద్దగా తలంచుచుండిరి. కావున ఇబ్రాహీము ప్రవక్త యెంత భక్తితో నుండెనో అది వివరింపఁబడుచున్నది. ఆయన ఒక్క దేవునిని నమ్మి ఆతనినే పూజించుచు ఆతనికే విధేయుఁడైన మత నాయకుఁడు. ఆతఁడు స్వయముగా నెద్దియును ఇది ధర్మము, ఇది అధర్మము అని విధింపలేదు. ఎద్ది దేవుని నుండి సెలవయ్యెనో అదియే ధర్మముగా నెంచెను. ఆతఁడు దేవునికి పరమభక్తుఁడు. ఆతనికి విగ్రహారాధన పట్టదు. అట్టివారి సహవాసమునందుకూడ నుండలేదు. కావున మక్కాలోని కాఫిర్లు తాము ఆతని యనుచరులము అని యెట్లుపలుకఁగలరు. 121. కాఫిర్లు దేవుని యనుగ్రహములకు కృతఘ్నత చూపి పాపములు చేయసాగిరి. కాని ఇబ్రాహీము ప్రవక్త సదా దేవుని యనుగ్రహములకు కృతజ్ఞుఁడై యుండెను. అందులకే దేవుఁడు ఆతనిని తనప్రియునిగా నెన్నుకొని ఖలీలుల్లాహి (దేవుని ప్రియుఁడు) అను బిరుదు నొసంగెను. భక్తిమార్గమందు ఆతనిని నడిపించెను. 122. దేవుఁడు ఇబ్రాహీమునకు ప్రవక్త పదవి, మంచి సంతానము, మంచి సంపదలు, గౌరవము నొసంగి మత నాయకునిగాఁ చేసెను. అందులకే అన్నిజాతులవారును, యూదులేమి, క్రైస్తవులేమి, ముసల్మానులేమి ఆతనిని గౌరవింతురు. పరలోకమునందుకూడ స్వర్గములో ఉన్నతస్థానముపొంది గొప్ప పుణ్యాత్ములైన ప్రవక్తలతోఁబాటు ఉండెను. 123. ఇబ్రాహీము ప్రవక్త పిదప అనేక ప్రవక్తలు వచ్చిరి. అందఱికి కట్టకడపట హజ్రత్ ముహమ్మదు రసూలువారు వచ్చిరి. ధర్మము(హలాల్)హరామ్(అధర్మము)లలోఅందఱికిని ఇబ్రాహీముప్రవక్త మత నాయకుఁడు. ఆ విషయమున అందఱును ఆయననే అనుసరింపవలెను. కావున హజ్రత్ రసూలువారుకూడ హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తను అనుసరింపవలెనని దేవుని సెలవు. ఈవిషయము సూరతే అన్ ఆముల్లో దీనన్ ఖయ్యిమన్ అను వాక్యము యొక్క వ్యాఖ్యలో వ్రాసియున్నాము. దానిని చూచుకొనునది.

125. ఇన్నమా-జుఇ-లస్-సబ్తు-అలల్-లజీ - నఖ్-తలఫూ- ఫీహి-

వఇన్న-రబ్బక-లయహొకుము బైన హుమ్-యౌమల్-ఖియామతి-ఫీమా-కానూ ఫీహి-యఖ్-తలిఫ్లూన్.

124. ఎవరు, శనివారమునుగూర్చి భేదాభిప్రాయములు గలిగియుండిరో వారికి దాని ధర్మము విధింపఁబడినది. మఱి నీప్రభువు తీర్పుదినమునందు వారు వివాదపడు విషయమునుగూర్చి వారి మధ్య తప్పక తీర్పుచేయును.

వ్యా॥ 124. ఇబ్రాహీముప్రవక్తయొక్క మతములో శనివారమును గూర్చి ధర్మములు విధింపఁబడలేదు. కావున ముసల్మానులకును ఆ ధర్మములు చెల్లవు. మధ్యలో యూదులు, మూసా ప్రవక్తయొక్క యుపదేశమునుగూర్చి అభిప్రాయభేదములు గలిగి శనివారము విశ్రాంతి దినముగా నెన్నుకొనిరి. అపుడు మీరు కోరినట్లే శనివారమును గౌరవింపుఁడు. ఆ దినము చేపలు వేఁటాడ కుఁడు అని యూదులకు విధింపఁబడెను. అందు దానిని కొందఱు అనుసరించిరి. మఱికొందఱు దానినివ్యతిరేకించి దేవునిశిక్షకు పాత్రులైనశించిరి. ఈ వివాదము లును, ఎవరు సత్యమును అనుసరించుచున్నారు ఎవరు లేదు, అను విషయములు సంపూర్ణముగ తీర్పుదినము (ఖియామతు) నందు తీర్మానింపఁబడును.

125. ఉద్ఉ-ఇలా-సబీలి రబ్బిక-బిల్-హిక్-మతి-వల్-మౌఇ-జతిల్-హసనతి-వ జాదిల్ హుమ్-బిల్లతీ-హియ-అహ్సను-ఇన్న-రబ్బక-హువ- అఅలము-బిమన్-జల్ల-అన్-సబీలిహీ-వహువ-అఅ-లము-బిల్-ముహ్-తదీన్. 126. వఇన్-ఆ ఖబ్-తుమ్-ఫ-ఆఖబూ-బి-మిస్ లి మా-ఊఖిబ్-తుమ్-బిహీ-వ-లఇన్ సబర్ తుమ్-లహువ-ఖైరుల్-లిస్-సాబిరీన్. 127. వస్-బిర్-వమా-సబ్ రుక-ఇల్లా-బిల్లాహి-వలా-తహ్ జన్-అలైహిమ్-వలా-తకు-ఫీ-జైఖిమ్-మిమ్మా యమ్-కురూన్. 128. ఇన్నల్లాహ-మఅల్లజీ-నత్-తఖౌ-వల్లజీన-హుమ్-ముహ్-సినూన్.

125. వివేకముతోను మంచి బోధనతోను ప్రజలను దేవుని మార్గమునకు పిలువుము. మఱి మేలైన విధముగ వారితో వాదింపుము. ఎవరు అతని మార్గ మును తప్పిపోయిరో వారిని నీప్రభువు బాగుగ నెఱుంగును. మఱి అతఁడు స న్మార్గులను బాగుగ నెఱుంగును. 126. మఱి మీరు బదులు తీసికొన్నచో మీకుఁ గలిగిన కష్టము లంత బదులు దీసికొనుఁడు. మఱి మీరు ఓర్చుకొన్నచో అది సహించువారికి చాల మేలైనది. 127. మఱి నీవు ఓర్పుచేయుము. దేవుని సహా ములోనే నీకు ఓర్పు కలుగఁగలదు. మఱి వారిని గూర్చి చింతింపకుము. మఱి చేయువారు కుట్రలకుఁగాను నీవు దుఃఖపడకుము. 128. నిశ్చయముగ దేవుఁడు

భయభక్తులు గలవారికిని సత్కార్యములు చేయువారికినితోడుగా నున్నాఁడు.

వ్యా॥ 125. ఇంతవఱకు హజ్రత్ రసూలువారు, హజ్రత్ ఇబ్రాహీము యొక్క ధర్మములను అనుసరించుచున్నారు. కావున మానవుల ఉభయ లోకములలో మేలుకోరినచో హజ్రత్ రసూలు వారిని అనుసరింపవలెను అనిబోధింపఁ బడియెను. ఇఁక ఈవాక్యములలో రసూలువారు మతప్రచార మెట్లు చేయవలెనో చెప్పఁబడుచున్నది. మనుష్యులకు మూఁడు విధములుగ బోధ చేయవలెను. ఎందుకన మనుష్యులు, స్వభావమును బట్టి మూఁడు విధములుగ నున్నారు. బుద్ధివివేకము గలవారు. వారికి వివేకపు మాటలు పలుకవలెను. వారికి సూచనలు ప్రమాణములు తెలిపినచో వారు గ్రహించి సన్మార్గమునకు రాఁగలరు. కొందఱు బోధన విని సన్మార్గమునకు వచ్చువారు గలరు. అట్టివారికి పుణ్యకార్యముల మంచి ఫలితమును పాపకార్యాల శిక్షను మంచి విధముగా తెలుపవలెను. ఎట్టి కఠిన చిత్తుఁడైనను విని మెత్తపడును. కొందఱు సూచన ప్రమాణములు బోధనలువినియు వాదించు వారలు గలరు. లేనిపోని సందేహములు పెట్టి ద్వేషముతో వాదింతురు. అట్టివారితో వారి సందేహములను తీర్చునట్లుగ మంచి పద్ధతితో ఉద్రేకము లేకుండ నెమ్మదిగా న్యాయముగా శాంతితో వాదించి సత్యమును స్థిరపఱచవలెను. వాదించునపుడు దుర్భాష లాడకూడదు. మృదు మధుర పలుకులతో సత్యము నిరూపించవలెను. కావున మత ప్రచారము సరిగాఁజేసిన పిదప ఎవరు నమ్మిరి. ఎవరు నమ్మక దుర్మార్గులైరి అను చింతలో పడకూడదు. మత ప్రచారము చేయుట ప్రవక్త పని. దాని ఫలితము దేవుని చేతిలో నున్నది. ఎవరికిఁ దగిన ఫలితము వారి కొసంగును. 126. మత ప్రచారము చేయునపుడు, విరోధులు హింసలు బాధలు పెట్టినచో, ఆ విరోధులతో బదులు తీసికొను శక్తి గలిగినచో యెంత బాధలు వారు పెట్టుదురో దానికి సరిగ హెచ్చుతగ్గులులేకుండ న్యాయముగ బదులు తీసికొన వచ్చును. కాని సహించి క్షమించుట చాల శ్రేష్ఠమును చాల మేలైనదియును. ప్రచారము చేయువారికి ఓర్పునకుఁగాను మంచి పుణ్యము లభించును. ఆ యన్యాయములు చూచువారు కనికరించి సన్మార్గమునకు వత్తురు. తుదకు దౌర్జన్యములు చేయువారు కూడ భక్తుల యోర్పుచూచి తమ దౌర్జన్యములు మానుకొని ధర్మమార్గమునకు వచ్చి మేలు పొందఁగలరు. 127. విరోధులు పెట్టు హింసలకును బాధలకును ఓర్చుకొనుటకు సహన శక్తి దేవుని సహాయము వలననే ప్రవక్తకుఁ గలుగును. అటులే అందఱు భక్తులకు ఓర్పు నొసంగువాఁడు దేవుఁడే లేనిచో శక్తి గలిగియు ఓర్పు చేయుట సులభమైన పని కాదు. దుష్టులు పెట్టు బాధలకు దుఃఖపడ కూడదు. 128. భయభక్తులు గలిగి సత్కార్యములు చేయు భక్తులకు వారిభక్తి విశ్వాసముల కొలది దేవుని సహా

యము వారికి లభించును. కావున ఇట్టి-భక్తులు, విరోధులు తమకు పెట్టు బాధలకును వారు చేయు కుట్రలకును దుఃఖపడక దేవుని పై నాధారపడి యుండవలెను అని దేవుని సెలవు.

## పదునైదవ కాండము

సూరయే బనీ యిస్రాయీల్. మక్కీ. 111. వాక్యములు.

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్.

పరమదయాళువును ప్రేమించు వాడునగు దేవుని పేర.

1. సుబ్ హా-నల్లజీ-అస్రా-బి-అబ్ దిహీ-లైలమ్-మినల్-మస్-జిదిల్-హరామి-ఇలల్-మస్ జిదిల్-అఖ్-సల్-లజీ-బారక్నా-హౌలహూ-లి-నురి-యహూ-మిన్-ఆయాతినా-ఇన్నహూ-హువస్-సమీఉల్-బసీర్.

1. మస్ జిదె హరామునుండి మా శుభములు క్రమ్ముకొని యున్న మస్ జిదె అఖ్ సా వఱకు, మా కొన్ని శక్తి సూచనలను చూపుటకుగాను రాత్రి వేళ తన భక్తుని దీసికొని పోయిన యాతడు పరమ పవిత్రుడు. నిశ్చయముగా ఆతడు వినువాడును, చూచువాడును.

వ్యా॥ 1. మస్ జిదెహరాము అనగా మక్కా-పురములోనుండు కాబా మసీదు. అది చాల మహిమ గలిగి గౌరవ నీయ మైనది. మస్ జిదెఅఖ్ సా అనగా ఎరూషలేములో నున్న బైతుల్ ముఖద్దసుఅను మసీదు. ఇచ్చట ఇబ్రాహీము ప్రవక్త మొదలగు అనేక ప్రవక్తలు వసించిరి. ఇది చాల పుణ్యస్థలము. ఇచ్చట పలు విధములైన ఫలములుగలవు. దీనికి చుట్టువట్టు చాల దేవుడొసంగిన శుభములు గలవు. ఈ వాక్యములో సర్వశక్తుడగు దేవుడు తన ప్రియభక్తుడగు ముహమ్మదు ప్రవక్తను మక్కా మసీదునుండి రాత్రి వేళ బైతుల్ ముఖద్దసు వఱకు దీసికొని పోయి అచ్చటనుండి గగన ప్రయాణము (మేరాజ్) చేయించిన విషయము చెప్పబడినది. మక్కా మసీదునకును బైతుల్ ముఖద్దసునకు చాలదూరముగలదు. రాత్రి వేళ అంత ప్రయాణము సాగించి మరల గగన ప్రయాణము చేసిరి అను విషయము సాధారణముగ మానవులకు ఆశ్చము కలిగించునది. కాని దేవునిచే సృష్టింపబడిన మానవులు తమ బుద్ధిచే విమానములు మొదలగు యంత్రములు తయారుచేసి దూరప్రయాణము కొన్ని నిమిషములలో సాగించుచున్నారుగదా! సర్వశక్తుడగు దేవుడు తన భక్తునిని బురాఖ్ అను స్వారిపై నెక్కించి ఒక రాత్రిలో అంత ప్రయాణము సాగింపలేడా! సాగింపగలడు. ఆతనికి శక్తిగలదు. ఆతని శక్తికి మించినది యొద్దియును లేదు. కొందఱు తప్ప అందఱు మత విద్వాంసులు హజ్రత్ రసూలు వారు

దేహముతోనే గగన ప్రయాణమునకుఁ బోయిరి అని తీర్మానించి విశ్వసించియున్నారు. దేవునికి సర్వము తెలియును. సర్వము వినుచు చూచుచున్నాఁడు. మేరాజు వివరము జగత్ప్రవక్త మొదటిభాగము చూచుకొనేది.

2. వ-ఆతైనా-మూసల్-కితాబ-వజఅల్నాహు- హుదల్- లిబనీ- ఇస్రాయీల-అల్లా తత్-తఖిజూ-మిన్-దూనీ-వకీలా. 3. జుర్రీయత-మన్-హమల్నా-మఅ-నూహిన్-ఇన్నహూ-కాన-అబ్దన్ షకూరా.

2. మఱియు మూసాకు గ్రంథము నొసంగితిమి. మఱి దానిని ఇస్రాయీలియులకు సన్మార్గము బోధించునదిగాఁ జేసితిమి. మీరునన్ను దప్ప మఱొకనిని రక్షకునిగాఁ జేసికొనకుఁడు అని వారితోఁ జెప్పఁబడెను. 3. నూహుతోఁ బాటు మేము నెక్కించినవారి సంతతివారిలార! నిశ్చయముగా, ఆతఁడు కృతజ్ఞత గలుగు భక్తుఁడుగా నుండెను.

వ్యా॥ 2. పైవాక్యములో బైతుల్ ముఖద్దసు విషయము వచ్చెను. కావున ఇఁక ఈ వాక్యములలో దాని ధర్మకర్తలగు ఇస్రాయీలియులను గూర్చి చెప్పఁబడుచున్నది. ఇస్రాయీలు యాఖూబు ప్రవక్త. ఆతని సంతతియే ఇస్రాయీలియులు. ఆతని సంతానములో ననేక ప్రవక్తలు వచ్చిరి. అందు దేవుఁడు, మూసా ప్రవక్తకు తౌరాతు గ్రంథ మొసంగెను. అందు ఒక్క దేవునినే పూజింపవలెను. ఒక దేవునినే రక్షకునిఁగాఁ దలంపవలెను. ఆతని పైననే యాధారపడవలెను అని బోధగలదు. 3. నూహు ప్రవక్త జలప్రమాదమునుండి రక్షణ పొందుటకు దేవుని సెలవుచే నౌక నావ చేసెను. అందు ఆయనతోఁ బాటు కొందఱు విశ్వాసులు ఎక్కి రక్షణ పొందిరి. మానవులందఱు వారిసంతానమే. కావున తమ పెద్దలకుఁ జేయఁబడిన మేలును తలఁచుకొని వారి సంతానము వారు దేవుని యెడ కృతజ్ఞులై యుండవలెను. చూడుఁడు నూహు ప్రవక్త గొప్ప భక్తుఁడును దేవునికి చాల కృతజ్ఞుఁడును. మీరు ఆతని సంతతి వారలై యెట్లు దేవుని మేళ్లు మఱచి పోవుచున్నారు. అట్లు మఱచి పోకూడదు.

4. వ-ఖజైనా-ఇలా-బనీ-ఇస్రాయీల ఫిల్-కితాబి-ల-తుఫ్-సిదున్న-ఫిల్-అర్జి-మర్రతైని-వల-తఅలున్న-ఉలువ్వన్ కబీరా. 5. ఫ-ఇజా-జాఅ-వఅదు-ఊలా హుమా-బఅస్నా-అలైకుమ్-ఇబాదల్-లనా-ఉలీ-బాసిన్-షదీదిన్-ఫ-జాసూ-ఖిలాలద్-దియారి- వ-కాన-వఅదమ్-మఫ్ఊలా. 6. సుమ్మ-రదద్నా-లకుముల్-కర్రత-అలైహిమ్-వ-అమ్దద్నా-కుమ్-బి-అమ్వాలిన్- వ - బనీన-వ -

జఅల్నా-కుమ్-అక్-సర నఫీరా. 7. ఇన్-అహ్-సన్తుమ్-అహ్-సన్తుమ్ - లి అన్-ఫుసికుమ్-వఇన్-అసాతుమ్-ఫ-లహా-ఫ-ఇజా-జాఅ-వఅదుల్-ఆఖిరతి-లి- యసూఊ-వుజూ-హకుమ్-వలి-యద్-ఖులుల్-మస్-జిద-కమా-దఖలూహు - అవ్వల-మర్రతిన్-వ-లి-యుతబ్బిరూ-మా-అలౌ-తత్-బీరా. 8. అసా-రబ్బుకుమ్-అన్-యర్-హమ కుమ్-వ-ఇన్-ఉత్తుమ్-ఉద్నా-వ జ-అల్నా-జహన్నమ-లిల్-కాఫిరీన హసీరా.

4. మఱియు మేము, ఇస్రాయీలు సంతతివారికి మీరు దేశములో రెండుసారులు తప్పక ఉపద్రవములు చేయుదురు. మఱి మీరు చాల మితిమీఱి పోవుదురు అని స్పష్టముగా గ్రంథములోఁ దెలిపితిమి. 5. పిదప మొదటివాగ్దానము రాఁగా ఘోరయుద్ధముచేయు మా సేవకులను మీపై నంపితిమి. కావున వారు పురములలో దూరి వచ్చిరి. మఱి ఆ వాగ్దానము అయి తీరవలసియుండెను. 6. మరల వారిపై మీకు బలము నొసంగితిమి. మఱి ధనములతోను పుత్రులతోను మిమ్ము బలపఱచితిమి. మఱి మీసైన్యమును అధికముగాఁ జేసితిమి. 7. మీరు మంచి చేసినచో మీరు మీమేలు చేసికొంటిరి. మఱి మీరు చెడుగు చేసినచో మీకీడు కొఱకేను. పిదప రెండవ వాగ్దానము రాఁగా మీ ముఖములను పాడుచేయుటకును మొదటిసారి మసీదులో దూరినట్లు మరుటకును, అధికారము పొందిన చోట్లను నాశము చేయుటకును ఇతరులను పంపితిమి. 8. మీప్రభువు మీపై కనికరింపవచ్చును. మఱి మీరు తిరిగి అటులే చేసితిరేని మేముకూడ తిరిగి అటులే చేయుదుము. మఱి అవిశ్వాసులకుఁగాను నరకమును చెఱశాలగాఁ జేసి యున్నారము.

వ్యా॥ 4. తౌరాతు గ్రంథములో ఇస్రాయీలియుల విషయము ముందుగానే యిట్లు ప్రకటింపఁబడెను. వారు రెండుసార్లు దేశములో ఉపద్రవములు, అన్యాయములు చేసి గర్వముతో మితిమీఱిపోవుదురు. దానికిఁగాను దేవుఁడు కఠినముగా శిక్షించును అని తౌరాతు గ్రంథములో ప్రకటింపఁబడినట్లు ఇస్రాయీలియులు, మత ధర్మములకు విరుద్ధముగా అనేక దుర్మార్గములకుపాలై దేవుని శిక్షకు పాత్రులైరి. ఈ విషయములే ఇందు చెప్పఁబడుచున్నవి. 5. దేవుఁడు సెలవిచ్చిన ప్రకారము మొదటిసారి ఇస్రాయీలియులకు శిక్ష గలిగెను. ఇస్రాయీలియుల యూళ్ళలో విరోధులు వచ్చి వారి యిండ్లలో ఘోరమైనహత్యలు గావించి సొమ్ములను దోఁచుకొనిరి. మసీదును పాడుచేసినది మొదటిసారివచ్చిన విరోధిజాలూతు. తరువాత దేవుఁడు, దావూదుపవిత్ర మూలమున జాలూతునునశింపఁజేసెను. 6 ఇస్రాయీలియుల విరోధులవలన శిక్షపొంది బుద్ధి తెచ్చు

కొని దేవునితో క్షమాపణ వేడుకొనిరి. అపుడు దేవుఁడు వారిని క్షమించి తిరిగి వారికి బలము, అధికారము నొసంగెను. శత్రువుల భయము పోయెను. ధనసంపదలలోను సంతానములోను వృద్ధిగలిగెను. ఇస్రాయీలియుల సైన్యము శత్రుసైన్యముకంటె అధికముగానే బలముపొందెను. 7. మంచి చెబ్బరల ఫలితము చేయువారికే లభించును గదా! అటులే ఇస్రాయీలియులకు వారికి మంచికి మేలు, కీడుకు చెడుగు లభించెను. మరల ఇస్రాయీలియులు మొదటిసారివలె ధర్మములను విడనాడి అన్యాయములకును పాపములకును లోనైరి. మొదటిసారివలె రెండవసారి బఖ్తెనసరు అను శత్రువు ఇస్రాయీలియులపై పడి వారికి నాశము చేసెను. బైతుల్ ముఖద్దస్ మసీదును పాడుచేసెను. అప్పటినుండి యూదుల బలముతగ్గిపోయి వారికి దుర్గతిపట్టెను. 8. హజ్రత్ ముహమ్మదువారు ప్రవక్తగా వచ్చియున్నారు. ఇస్రాయీలియులు వారి ననుసరించినచో దేవుఁడు కనికరించును. లేనిచో పూర్వమువలె మీరు దుర్మార్గములు చేసితిరేని తిరిగి మిమ్ము ముసల్మానులచేత శిక్షింతును. పరలోకములో తప్పక నరకమున్నది అని యిస్రాయీలియులకు నిందు దేవుని హెచ్చరిక గలదు.

9. ఇన్నహాజల్-ఖుర్-ఆన-యహ్దీ-లిల్లతీ-హియ-అఖ్వము- వ - యుబష్షిరిల్-మూమినీ-నల్-లజీన-యఅ్-మలూ-నస్-సాలిహాతి-అన్న-లహుమ్-అజ్రన్-కబీరా. 10. వ-అన్నల్-లజీన-లా-యూమినూన- బిల్-ఆఖిరతి-అఅ్ తద్నా-లహుమ్-అజాబన్-అలీమా.

9. ఈ ఖురాను అన్నిటికంటె స్థిరమైన చక్కని మార్గమును చూపుచున్నది. మఱి సత్కార్యములు చేయునట్టి విశ్వాసులకు గొప్ప పుణ్యఫలితమున్నది అను సంతోషవార్త వారికి వినిపించుచున్నది. 10. మఱి పరలోకమును నమ్మనివారికిఁగాను మేము దుఃఖకరమైన శిక్షసిద్ధపఱచియున్నామని తెలుపుచున్నది.

వ్యా॥ 9. తౌరాతుగ్రంథము ఇస్రాయీలియులకు సన్మార్గము చూపుచున్నది అని ముందు చెప్పఁబడెను. ఇఁక ఖురానుగ్రంథ మెట్టిదో యిందు తెలుపఁబడుచున్నది. ఖురానుగ్రంథము, లోకమంతటికిని సన్మార్గము చూపుచున్నది. అది ఒక దేశమునకును ఒక జాతికి మాత్రమును మార్గదర్శకముకాదు. మానవజాతి కంతకును అన్నిమతములకంటె నెక్కుడు స్థిరమైన చక్కనిమార్గము చూపుచున్నది. అన్ని ధర్మములు ఖురానులోనే బోధింపఁబడియున్నవి. కావున ఖురానును నమ్మి దాని ననుసరించి సత్కార్యములుచేయు విశ్వాసులకు ఇహమునందు జయము పరమునందు ముక్తియును లభించును అను సంతోషవార్త నిచ్చుచున్నది. 10. అటులే నెవరు నమ్మక పరలోకమును తిరస్కరింతురో వారికిఁ

గాను దేవుఁడు దుఃఖకరమైననరకశిక్షసిద్ధపఱచియున్నాఁడుఅనిప్రకటించుచున్నది.

11. వ-యద-ఉల్-ఇన్-సాను-బిష్-షర్రి-దుఆ-అహు-బిల్-ఖైరి-వకా-నల్-ఇన్సాను-అజూలా.

11. మఱియు మనుష్యుఁడు మేలు కోరుకొనునట్లు కీడునుకోరుచున్నాఁడు. మఱి మనుష్యుఁడు చాల ఆత్రపడువాఁడు.

వ్యా॥ 11. ఇందు మనుష్యుని స్వభావము చెప్పఁబడినది. ఖురానుమంచి మార్గమునకు పిలుచును. కాని మనుష్యుఁడు వినియు గ్రహింపక ఆత్రములో కీడునకుఁ బోవుచున్నాఁడు. అందులకే కొందఱు అవిశ్వాసులు ఓ దేవా! మహమ్మదు పలుకునది నిజమైనచో మాపై రాళ్ళవర్షము కురిపించుము అని కోరిరి. అటులే కొన్ని సమయములలో మనుష్యుఁడు విసిగి తన్ను లేక తన భార్యబిడ్డలను శపించుకొనును. అట్లు చేయకూడదు. ఆత్రతవలన నష్టమే. కావున బాగుగ యోచించి స్థిరబుద్ధితో ఓపికతో పనులు చేయవలెను.

12. వజ-అల్-నల్-లైల-వన్-నహార-ఆయతైని-ఫ-మహౌనా-ఆయతల్లైలి-వ-జ-అల్నా-ఆయతన్-నహారి-ముబ్-సిరతల్-లితబ్-తగూ-ఫజ్లమ్-మిర్రబ్బికుమ్-వలి-తఅ-లమూ-అద-దస్-సినీన-వల్-హిసాబ-వకుల్ల-షై-ఇన్-ఫస్సల్నాహు-తఫ్-సీలా.

12. మఱియు, మేము రాత్రిని పగటిని రెండు సూచనలుగాఁ జేసియున్నారము. మరల మేము రాత్రి సూచనను కాంతి లేనిదిగాఁ జేసితిమి. మఱియు మీరు దేవుని యనుగ్రహమును కోరుటకుఁగాను పగటి సూచనను, వస్తువులను చూపునదిగాఁ జేసితిమి. మఱి మీరు సంవత్సరములసంఖ్యను లెక్కను తెలిసికొనుటకుఁగాను అట్లు చేసితిమి. మఱి మేము ప్రతి విషయమును వివరించి స్పష్టముగాఁ దెలిపితిమి.

వ్యా॥ 12. ఇందు రాత్రింబవలులోనున్న దేవుని శక్తిసూచనలు దెలుపఁబడినవి. రాత్రియందు చీఁకటి, పగటిపూఁటయందు వెలుతురు, వాని హెచ్చు తగ్గులు, రాత్రులలో చంద్రుఁడు హెచ్చుట తగ్గుట, పగలు మార్యునికాంతి మొదలుగు వానిలో దేవునిశక్తి సూచనలుగలవు. రాత్రిల్లో చీఁకటి క్రమ్ముకొనును. అందుచే దానినికాంతిలేనిదిగాఁజేసెను. పగటిపూఁట, సూర్యుని ప్రకాశములో అన్ని వస్తువులు బాగుగ కనఁబడును. మానవులు తమ తమ పనులుచేసి యాహారము సంపాదించుకొందురు. రాత్రింబవలు వచ్చి పోవుటలోను, సూర్యుఁడు, చంద్రుఁడు ఉదయించి అస్తమించుటలోను సంవత్సరములు, లెక్కలు

వాని ననుసరించి తెలిసికొందురు. మనుష్యులు బాగుగ గమనించి ప్రతి విషయ్య ములో ఆతురత లేకుండ పనులు చేయవలెను. కీడు మేలు మొదలగు ప్రతిదియు తన కాలమునకు వచ్చును. ఎట్లు రాత్రింబవలు నియమముగా వచ్చి పోవు చున్నవో అటులే ప్రతిదియు సంభవించును. తొందఱపడుట వలనప్రయోజనము లేదు. ప్రతి విషయమును స్పష్టముగ దేవుఁడు తెలిపియున్నాఁడు. దానికొఱకే ప్రవక్తలను పంపి వారికి గ్రంథము లొసంగెను. మానవులు చేయు ప్రతికర్మయు తీర్పుదినమునందు తప్పక స్పష్టముగాఁ దెలియనగును.

13. వకుల్ల-ఇన్-సానిన్-అల్-జమ్నాహు-తా-ఇరహూ-ఫీ-ఉనుఖిహీ- వ నుఖ్రిజు-లహూ-యౌమల్-ఖియామతి-కితాబన్-యల్-ఖాహు- మున్షూరా.
14. ఇఖ్రఅ-కితాబక-కఫా బి-నఫ్సి-కల్-యౌమ-అలైక-హసీబా.

13. మఱి ప్రతి మనుష్యునకును వాని కర్మ వాని మెడలోనే తగిలించి యున్నారము. మఱి తీర్పుదినమునందు ఒక లేఖ దీసి వానికి చూపెదము. అది విప్పి వానికి నొసంగఁబడును. 14. నీవు నీలేఖను చదువుకొనుము. ఈదినము నీ లెక్క చూచుకొనుటకు నీవే చాలును.

వ్యా॥ 13,14. మనుష్యుఁడు చేయు కర్మలువానికే చుట్టుకొనియుండును. అవి వాని మెడకుఁ దగులుకొని యుండును. అవివానిని వదలిపోవు. తీర్పుదినము నందు, వానికి అవియే కనఁబడును. వాఁడు ఇహలోకములో చేసిన కర్మలన్నియు వ్రాయఁబడిన కర్మల లేఖ వానికి చూపఁబడును. మఱి వానితో నీకర్మల లేఖ నీవే చదువుకొనుము. నీలెక్క నీవేచదువుకొనుము. నీలెక్క నీవే చూచుకొనుము. నీవు చేసిన కర్మలలో నేదైన వదలిపోయినదా! లేదా చేయని కర్మ వ్రాయఁబడినదా! చూచుకొనుము అని చెప్పఁబడును. అపుడు ప్రతి మనుష్యుడును తాను చేసియున్న చిన్న పెద్ద కర్మలన్నియు అందు వ్రాయఁబడి యుండునట్లు కనుగొను. ఆ లేఖ వానికి విప్పి చూపఁబడును. కావున మనుష్యుఁడు ఇహమునందు విశ్వసించి సత్కార్యములు చేయవలెను.

15. మనిహ్-తదా-ఫ-ఇన్నమా-యహ్-తదీ-లి-నఫ్సిహీ-వమన్-జల్ల-ఫ ఇన్నమా-యజిల్లు-అలైహా-వలా-తజిరు-వాజిరతున్-విజ్ర- ఉఖ్రా - వమా-కున్నా-ముఅజ్జిబీన-హత్తా-నబ్-అస-రసూలా.

15. ఎవఁడు సన్మార్గమునకు వచ్చునో వాఁడు తన మేలుకొఱకే సన్మార్గమునకు వచ్చెను. మఱెవఁడు దుర్మార్గుఁడాయెనో, వాఁడు తన కీడుకొఱకే దుర్మార్గుఁడాయెను. మఱి ఒకరి బరువును మఱొకరు మోయరు. మఱి మేము ప్రవక్తను

పంపనిదే శిక్షించువారలము కాము.

వ్యా॥ 15. దేవుఁడు మానవులందఱికిని సన్మార్గము చూపెను. తనగ్రంథ మగు ఖురానును హజ్రత్ ముహమ్మదువారి కొసంగెను. ఎవరు దాని నమ్మి సన్మార్గమునకు వత్తురో ఉభయలోకములలో వారికి మేలున్నది. సన్మార్గమునకు రాక దుర్మార్గములోనే పడియుండినచో వారికే నష్టము గలుగును. ఎవరు చేసిన పాపములమూట వారే మోయవలెను. కాని ఒకరి పాపముల భారము ఇతరు లెవ్వరు మోయరు. పాపకార్యములకు తప్పక శిక్ష కలుగును. అందులకే దేవుఁడు, ఆదమ్ప్రవక్త మొదలు మానవులకు బోధించుటకు అనేక ప్రవక్తలను పంపెను. ఆ ప్రవక్తలు వచ్చి జనులకు బోధించిరి. కావున దేవుఁడు తన ప్రవక్తలను పంపనిదే పాపములు చేసినవారిని శిక్షింపఁడు.

16. వ-ఇజా అరద్నా-అన్ నుహ్లి-క-ఖర్యతన్-అమర్నా-ముత్రఫీహా ఫ-ఫసఖూ-ఫీహా-ఫ-హఖ్ఖ-అలైహల్-ఖౌలు-ఫదమ్మర్నాహా-తద్-మీరా.

16. మఱియు మేము ఒక పురమును నాశముచేయవలెనని కోరినచో అందు సౌఖ్యములు అనుభవించువారికి ఆజ్ఞ పంపుదుము. ఆ పిదప వారు అందు అవిధేయత చూపిరి. కావునవారిపై మాటనిలిచెను. పిదపవారిని నిర్మూలించితిమి.

వ్యా॥ 16. దేవుఁడు ఒకపురమును తత్క్షణమే నశింపఁజేయుఁడు. మున్ముందు ప్రవక్తల మూలమున లేదా వారి శిష్యుల మూలమున, నగరములోని నాయకులకు ఆజ్ఞ పంపును. ధర్మములు వారికిఁ దెలుపఁబడును. ఆ ధనవంతులైన నాయకులు దేవుని మాట వినక, అవిధేయులై పాపములు చేయుచు పురమునంతను పాపములు నిండుకొనునట్లు చేయుదురు. అపుడు వారిపై మాట నిలుచును. కావున వారు దేవుని శిక్షకు పాత్రులై నశింతురు. కావున నగరములో మాట చెల్లు పెద్దలు తమ ప్రజలకు మంచిమార్గమునకుఁ దీసికొని రావలెను.

17. వకమ్-అహ్లక్నా-మినల్-ఖురూని-మింబఅ-ది-నూహిన్-వకఫా-బిరబ్బిక-బిజునూ-బి-ఇబాదిహీ-ఖబీరమ్-బసీరా.

17. మఱి మేము నూహునకు తరువాత అనేక జాతులవారిని నాశము చేసితిమి. జనులు చేయు పాపములను తెలిసికొనుటకును చూచుటకును నీ ప్రభువు చాలును.

వ్యా॥ 17. ఆదము ప్రవక్తనుండి నూహుప్రవక్తవఱకు జనులు దేవునికి విధేయులగుచుండిరి. నూహుప్రవక్త కాలమున పాపములు చెలరేగినవి. అందుకు నూహుప్రవక్త వందల సంవత్సరములు బోధించెను. తుదకు అజాతివారు జల ప్రళయములో మునిఁగి నశించిరి. నూహుప్రవక్త తరువాత ఆదు, సమూదు

మొదలగు జాతులవారు దేవుని శిక్షకు పాత్రులై నశించిరి. దేవుఁడు నిష్కారణముగ జనులను శిక్షించుటలేదు. జనులు చేయు పాపములను బాగుగ దేవునికి తెలియును. వానిని చూచుచున్నాఁడు. కావున ఎవరి పాపములకుఁ దగిన శిక్ష వారికి విధించును.

18. మన్-కాన-యురీదుల్-ఆజిలత-అజ్జల్నా-లహూ-ఫీహా-మా-నషాఉ-
లిమన్-నురీదు-సుమ్మ-జఅల్నా-లహూ-జహన్నమ-యస్-లాహా-మజ్-మూమమ్-
మద్-హూరా. 19. వమన్ అరాదల్-ఆఖిరత-వ-సఆ-లహా-సఅ్-యహా-వహువ
వ-మూమినున్-ఫ-ఉలాఇక-కాన-సఅ్-యుహుమ్-మష్-కూరా. 20. కుల్లన్-ను
మిద్దు-హాఉలాఇ-వహాఉలాఇ-మిన్-అతాఇ-రబ్బిక-వమా-కాన-అతాఉ-రబ్బిక-
మహ్-ఝూరా. 21. ఉన్-జుర్-కైఫ-ఫజ్జల్నా-బఅ్-జహుమ్-అలా-బఅ్-జిన్-వలల్
ఆఖిరతు-అక్-బరు-దరజాతిన్-వ-అక్బరు-తఫ్-జీలా.

18, ఎవఁడు ఇహలోక సౌఖ్యములను కోరునో అందు మాకు ఇష్టము
వచ్చినయంత మేము కోరినవానికి తొందరగానే యొసంగుదుము. పిదప వానికి
నరకము నియమింతుము అందు వాఁడు అవమానము పొంది, నెట్టఁబడినవాఁడై
ప్రవేశించును. 19. మఱెవఁడు పరలోకమును కోరి దానికిఁగాను కృషిసలిపి
విశ్వాసియై యుండినచో అట్టివారి కృషి సఫలమగును. 20. వీరికిని వారికిని నీ
ప్రభువు యనుగ్రహము గలిగించుచున్నారము. మఱి నీప్రభువుయొక్క యను
గ్రహమునకు అడ్డులేదు. 21. చూడుము. ఒకరిపై నొకరికి మేమెట్లు ఘనతనొసం
గితిమో ! మఱి పరలోకమునందు గొప్ప దర్జాలును, ఘనతయును గలదు.

వ్యా॥ 18. ఇహలోక తుచ్ఛసౌఖ్యములు కోరుచు వానికిఁగాను ప్రయత్నముచేయువారికి దేవుఁడు తన యిష్టానుసారముగ సౌఖ్యములను సంపదల నొసంగును. వారు పడిన కష్టములకు పరలోకములో మంచి ఫలితము లేకున్నను ఇచ్చటనే వారికి ఫలము లభించును. తుదకు పరమునందు అవమానముపొంది నెట్టఁబడుచు నరకములో పడుదురు. కావున మనుష్యుఁడు తనకు ఇహలోకసౌఖ్యములు దండిగా లభించినవి అని మైమఱచి పాపములు చేయరాదు.
19. విశ్వసించి పరలోకమునకుగాను సత్కార్యములుచేయుచు కృషిసలిపినవారికి దేవుఁడు మంచి పుణ్యఫలిత మొసంగును. వారి కృషి వృథాపోదు.
20. దేవుఁడు మనుష్యులందఱికి విశ్వాసములేమి, అవిశ్వాసులేమి ఇహమునందు వసతులు ఒసంగుచున్నాఁడు. వాని యనుగ్రహములకు అడ్డు ఆటంకములులేవు. లేదా, ఇహము

కోరినవారికి ఇహమును. పరముకోరినవారికి పరము నొసంగుచున్నాఁడు. దేవుఁ డొసంగుదానికి అడ్డుపడు వారెవరును లేరు 21. ఇహలోకములో ధనము, గౌరవము, అధికారము మొదలగు విషయములలో మనుష్యులయందు వ్యత్యా సము గలదు. ఒకరిపై నొకరికి ఘనతగలదు. ఇహముకంటె పరమునందు, కర్మల వ్యత్యాసములఁబట్టి, నరకములోను, స్వర్గములోను దర్జాలు గలవు. ఎవరి కర్మ లకుఁ దగిన దర్జా (స్థానము) వారికి లభించును. మనుష్యుఁడు పరలోకములో మోక్షముపొందు మార్గము చూడవలెను. ఆమార్గ మెట్టిదో రాఁబోవు వాక్య ములలో వివరింపఁబడుచున్నది.

22. లా-తజ్-అల్-మఅల్లాహి-ఇలాహన్-ఆఖర-ఫ-తఖ్ ఉద-మజ్-మూ నుమ్-మఖ్-జూలా

22. దేవునితో మఱొక దేవతను నియమింపకుము. అపుడు అవమాన మును పొంది సహాయములేనివాఁడవై కూర్చుందువు

వ్యా॥ 22. ఇందు దేవునికి సాటి కల్పింపఁగూడదు దేవుఁడు ఒక్కఁడే పూజలకు అర్హుఁడు. ఆతనితోఁబాటు ఇతర దేవతలను విగ్రహములనుపూజింప గూడదు. అట్లు చేసిన వారికి అవమానము లభించును. కష్టములలో తోడు పడువా రెవరును ఉండరు. మనుష్యుఁడు తన చేతులార చెక్కిన విగ్రహము లను పూజించుట చాల అవమానమైన పనిగదా ! చిల్లర దేవతలు ఎవరి కష్టము లను తొలగింపలేవు. అట్టివానిని పూజించిన అవి కష్టములలో తోడుపడునవి కావు. కావున బుద్ధిమంతుఁడు ఒక్క దేవునినే నమ్మి యాతనినేఆరాధింపవలెను.

23. వ-ఖజా రబ్బుక అల్లా-తఅ-బుదూ ఇల్లా-ఇయ్యాహు-వ_బిల్ - వాలి దైని-ఇహ్-సానన్-ఇమ్మా-యబ్-లుగన్న-ఇన్దకల్-కిబర-అహదుహుమా - ఔ- కిలా-హుమా-ఫలా తఖుల్-లహుమా-ఉఫ్-ఫిన్-వలా-తన్-హర్-హుమా-వఖుల్ లహుమా-ఖౌలన్-కరీమా. 24. వఖ్-ఫిజ్-లహుమా-జనా-హజ్-జుల్లి - మినర్- రహ్మతి-వఖుర్-రబ్బిర్-హమ్హుమా-కమా-రబ్బయానీ-స గీరా.25. రబ్బుకుమ్ అఅలము బిమా-ఫీ-నుఫూ-సికుమ్-ఇన్-తకూనూ-సాలిహీన-ఫఇన్నహూ- కాన లిల్-అవ్వాబీన-గఫూరా.

23. మఱియు నీప్రభువు తన్ను తప్ప నితరులను మీరారాధింపకూడదు అనియు తల్లిదండ్రులకు మేలు చేయవలెను అని ఆజ్ఞాపించెను. నీయెదుటి వారి ద్దఱిలో నొకరుగాని లేదా వారిద్దఱుగాని ముసలితనము పొందినచో వారిని

ఉఁ (ఛీ) కూడ అనకూడదు. మఱి వారిని గద్దింపకూడదు. మఱి వారితో మర్యాదగా మాటలాడుము. 24. మఱియు వారియెడ భక్తివినయములు గలిగి యుండుము. మఱియు, ఓ ప్రభువా! వారెట్లు నన్ను బాల్యమునందు పెంచిరో అట్లు నీవు వారియెడ దయచూపుము. 25 మీ మనస్సులలోనున్నది మీప్రభువునకు బాగుగఁ దెలియును. మీరు మంచివారలుగ నున్నచో క్షమాపణ కోరువారిని ఆతఁడు క్షమించును.

వ్యా॥ 23. దేవుఁడు సృష్టికర్త. కావున ఆతనినే మానవులు పూజింపవలెను. ఆతనివదలి చిల్లరదేవతలను విగ్రహములను పూజింపఁగూడదు అని దేవుని సెలవు. బిడ్డను దేవుఁడే పుట్టించుచున్నాఁడు. అయిన తల్లిదండ్రులు కారకులుగా నున్నారు. కావుననే ఖురానె షరీఫులో అనేకచోట్ల దేవుఁడు తన హక్కును తెలిపిన పిదప తల్లిదండ్రుల సేవకు సంబంధించినధర్మములుతెలుపుచున్నాఁడు. తల్లిదండ్రులుగలవారు ధన్యులు. వారి సేవచేసి దేవునిప్రీతి పడయఁగలరు. వారి సేవ చేయక వారిని హింసించువారు పరమ దుష్టులు. వారికి కఠిన శిక్షగలదు. తల్లి పాదములక్రింద స్వర్గము గలదు అని హజ్రత్ రసూలువా రుపదేశించియున్నారు. అనఁగా తల్లి పాదసేవ చేసిన దేవుఁడు స్వర్గమొసంగును. కావున అన్నివిధముల తల్లిదండ్రుల సేవచేసి వారి దీవనలు పొందవలెను. ముసలితనములో వారికి సహాయము నెక్కువగా కావలెను. కావున ఆస్థితిలో వారి సేవ చేయుటలో విసుగుచెందక వారియెడ అమర్యాదను సూచించు ఎట్టిమాటలైనను పలుకక, గద్దింపక భక్తి వినయములుగలిగి మర్యాదతో సేవింపవలెను. 34. ఓ దేవా! నాతల్లిదండ్రులు, నన్ను బాల్యములో పోషించిరి, నే నపుడు శక్తిలేనివానిగా నుంటిని. ఇపుడు వారు ముసలివారైనారు. నాశక్తికొలఁది వారి సేవ చేయుచున్నాను. అందు ఏలాటి కొఱఁతయైనచో నీవు క్షమించి, వారిని కరుణించుము అని దేవునిని భక్తుఁడు వేఁడుకొనవలెను. మానవుఁడు తనబాల్యములోవానికొఱకుతల్లిదండ్రులుపడినపాట్లుజ్ఞప్తికిఁదెచ్చుకొన్నయెడల యెన్నటికిని వారిని కష్టపెట్టఁడుగదా! 25. తల్లిదండ్రులసేవ భక్తిపూర్వకముగను మనోల్లాసముగను కుమారులు చేయవలెను. మంచి బుద్ధితోనే ఒకపుడు ఏదైనపొరపాటు అయినచో దేవుఁడు క్షమించును. కావున తల్లిదండ్రులసేవ మనఃపూర్వకముగ చేయవలెను. అందు ఏదైన కొఱఁతయైనచో దేవునితో క్షమాపణ కోరుకొనవలెను. దేవుఁడు క్షమించును.

26. వఆతి-జల్ ఖుర్బా-హఖ్ఖహూ-వల్-మిస్కీన-వబ్-నస్-సబీలి-వలా-తుబజ్జిర్-తబ్-జీరా. 27. ఇన్నల్-ముబజ్-జిరీన-కానూ-ఇఖ్-వానష్ - ష

యాతీని-వ-కానష్-షైతాను-బి-రబ్బిహీ-కఫూరా. 28. వఇమ్మాతుఅ-రిజన్న-అన్-హుముబ్-తిగాఅ-రహ్మా-మతిమ్-మిర్-రబ్బిక,తర్-జూహా-ఫఖుల్-లహుమ్-ఖౌలమ్-మైసూరా.

26. మఱియు బంధుత్వముగలవానిహక్కు వాని కియ్యుము. మఱి నిఱుపేదలకును, ప్రయాణికులకు నియ్యుము. మఱివృథాఖర్చు చేయకుము. 27. నిశ్చయముగ, వృథాఖర్చుచేయువారు సైతానుయొక్క సహోదరులు. మఱి సైతాను తన ప్రభువునకు కృతఘ్నుఁడైనవాఁడు. 28. మఱినీవు వారితో ముఖము త్రిప్పుకొనవలసివచ్చినపుడు, నీకు నీప్రభువు అనుగ్రహము గలుగని ఆశయుండి దానికి నీవు వేచియుండినచో వారితో మృదువైనమాట పలుకుము.

వ్యా॥ 26, 27. ఇందు బంధువులకు మేలుచేసి వారిహక్కులను నియ్యవలెను అనియు నిఱుపేదలకును, ప్రాయాణికులకు సహాయముచేయవలెను, అని దేవునిసెలవు. ఖర్చుచేయుటలోవృథాచేయరాదు. సమయోచితముగ ధర్మమైన కార్యములలో మితముగా ఖర్చుచేయవలెను. డబ్బున్నది అని యిష్టానుసారముగా వృథాఖర్చుచేయరాదు. మనుష్యులకు ధనము దేవుఁడొసఁగుచున్నాఁడు. కావున దానిని పాపకార్యములలో సెలవు చేయకూడదు. మంచికార్యములలో కూడ మితముగ శక్తికొలఁది ఖర్చుచేయవలెను. ధనమువలన అనేక మతకార్యములు జరుగును. పుణ్యములు లభించును. అట్టి దానిని వృథాఖర్చుచేసి సమయము వచ్చినపుడు చేతిలో డబ్బులేక వడ్డీకి అప్పుదీసి పాపము సంపాదించుకొనవలసివచ్చును. అట్లు సైతాను ప్రేరేపణవలనచేయుదురు. కావునవారు సైతానునకు సహోదరులగుదురు. సైతాను, దేవునికి అవిధేయుఁడై కృతఘ్నతచేసినవాఁడు. కావున వృథాఖర్చు చేయువారు కూడ దేవునికి కృతఘ్నులగుదురు. కావున ముసల్మాను సహోదరులు, ఈ వాక్యములను బాగుగ గ్రహించి వృథాఖర్చులను మానుకొనవలెను. 28. ఎల్లపుడు దానముచేయువానియొద్ద ఒకపుడు లేనపుడు యాచకులను వట్టిచేతులతో నెట్లు త్రిప్పవలెను అని దాత మనస్సునకు కష్టము గలుగును. అట్టి సమయములలో తనయొద్ద నిపుడులేదు. దేవుని యనుగ్రహము వలన డబ్బువచ్చినచో ఒసంగుదును అని మృదువైన మాటలు పలికి యాచకులను పంపవలెను. కాని కఠినముగాపలికి తిట్టి పంపకూడదు. అట్లుచేసినచో ముందుచేసిన దానములు పుణ్యములు వృథాపోవును.

29. వలా-తజ్-అల్-యదక-మగ్-లూ-లతన్-ఇలా-ఉనుఖిక వలా-తబ్-సుత్-హా-కుల్లల్-బస్తి-ఫ-తక్-ఉద-మలూమమ్ మహ్-సూరా. 30. ఇన్న-రబ్బక-

యబ్సుతుర్-రిజ్ఖ-లిమన్-యషాఉ-వయఖ్దిరు-ఇన్నహూ-కాన-బి-ఇబాదిహీ ఖబీరమ్-బసీరా.

29. మఱి నీచెయ్యిని నీమెడతో కట్టుకొని యుండకుము. మఱి దానిని పూర్తిగాకూడ విప్పివేయకుము. అట్లుచేసిన నీవు నిందపొందినవాఁడవై, శక్తి హీనుఁడవై కూర్చుందువు. 30. నిశ్చయముగ నీప్రభువు తానుకోరిన వారికి సంపదలు విశాలముగా నిచ్చును. మఱి ఆతఁడే తగ్గించును. మఱి ఆతఁడే తన సేవకులను ఎఱుంగువాఁడును చూచువాఁడును.

వ్యా॥ 29. చెయ్యిని మెడతో కట్టుకొనకూడదు అనఁగా ఖర్చుచేయుటలో పరమ లోభితనము వహింపకూడదు. అట్లు లోభముచేసినచో ప్రజలు లోభియని నిందింతురు. చెయ్యిని సంపూర్ణముగ విప్పివేయుట, అనఁగా శక్తికిని రాబడికినిమించి ఖర్చుచేయుట. అట్లు మితము మీఱి ఖర్చు దానముచేసినచో తుదకు తానే భిక్షమెత్తవలసివచ్చును. ఆతఁడు శక్తిహీనుఁడగును. కావున ఎప్పుడును మితముగా ఖర్చుచేయవలెను. మితముగా ఖర్చుచేసిన బీదతనము రాదు. కావున చాల లోభితనము వహింపరాదు. మఱి మితముమీఱి ఖర్చు చేయరాదు. 30. హజ్రత్ రసూలువారు చాల దానముచేయువారు. ఒకపుడువారి యొద్దలేనపుడు ఎవఁడైన బీదవాఁడు వచ్చిన వారికి చాలచింతగలుగుచుండును. అందుకు దేవుఁడు మీరు చింతచేయనక్కఱలేదు. మీరిచ్చినిమాత్రాన పేదవాఁడు ధనికుఁడుకాఁడు. మీరు ధనికులుకారు. సర్వము దేవునిచేతిలోనున్నది. అందఱి విషయములు దేవునికిఁదెలియును. సంపదలు హెచ్చించుట తగ్గించుట,ధనవంతులు చేయుట నిఱుపేదలుచేయుట, దేవునిపని అని హజ్రత్ వారికి సెలవిచ్చెను. సాధారణముగ అనేకులు లోభమువహించువారుగలరు. కావున అట్టివారు తప్పక దానముచేయవలసినది అని విధింపఁబడియున్నది.

31. వలా-తఖ్తులూ-ఔలాదకుమ్-ఖష్యత-ఇమ్-లాఖిన్-నహ్ను-నర్జుఖుహుమ్-వఇయ్యాకుమ్-ఇన్న-ఖత్లహుమ్-కాన-ఖిత్-అన్-కబీరా.

31. మఱి మీరు పేదఱికము వచ్చును అనుభయముతో మీ బిడ్డలనుచంపకుఁడు. మేము వారికిని మీకును ఆహారము నొసంగుచున్నారము. నిశ్చయముగా వారిని చంపుట ఘోరపాతకము.

వ్యా॥ 31. ఇస్లామ్‌నకు పూర్వము కొందఱు కాఫిర్లు బిడ్డకు ఆహారము ఎచ్చటినుండి పెట్టవలెనని చంపుచుండిరి. అది ఘోరపాతకము. అదియునుగాక బీదతనము వచ్చునను భయముతో కన్నబిడ్డలను దయలేక వధించుట గొప్ప పాపము. ఆహారమిచ్చుట దేవుని పని. ఎట్లు మీకు దేవుఁడు ఆహారము ఒసంగు

చున్నాఁడో ఆటులేమీబిడ్డలకుఁగూడ ఆహారమొసంగును. ఇట్టివాక్యమేసూరయే అన్ ఆములోఁగడచినది. దానివాఖ్యానము చూచుకొనేది.

32. వలా-తఖ్ రబుజ్-జినా. ఇన్నహూ-కాన-ఫాహిషతన్-వసాఅ-సబీలా

32. మఱియు వ్యభిచారమును సమీపింపకుఁడు. అది సిగ్గులేని పని. మఱి చాల చెడ్డత్రోవ.

వ్యా॥ 32. ఇందు వ్యభిచారము నిషేధింపఁబడినది. దానిని సమీపింప కూడదు.అది ఘోరపాతకము. కావున పరస్త్రీలను మోహముతో చూచుట గాని, దానికి సంబంధించిన మాటలు, ముద్దులాట మొదలగునవి పరస్త్రీలతోఁ జేయరాదు. వ్యభిచారము చాలసిగ్గుమాలినపని. దానివలన అనేక జగడములు హత్యలు గలుగును. అది చాలచెడ్డత్రోవ. ఒకఁడు హజ్రత్ రసూలువారి యొద్దకు వచ్చి ఓప్రవక్త! నేను వ్యభిచారము చేయుదును. దానికిఁగాను నాకు సెలవి య్యుఁడు అని విన్నవించెను. అచ్చటనున్న శిష్యులు వానిని మందలించిరి. కాని హజ్రత్ రసూలువారు వానిని దగ్గఱకు పిలిచి ఓయీ! ఎవఁడైన ఆపని నీతల్లి తోఁగాని, నీకూతురుతోఁగాని, నీఅక్కచెల్లెండ్రలతోఁగాని, నీమేనత్తలతోఁ గాని, నీపిన్నమ్మలతోఁగాని చేసిన నీవు సమ్మతించెదవా అని అడిగిరి. దానికి ఆతఁడు సమ్మతింపను అని విన్నవించెను. అపుడు హజ్రత్ రసూలువారు ఇతర ప్రజలుకూడ ఆపనితన తల్లులతోను కూతుర్లతోను, అక్కచెల్లెండ్రు మొద లగు స్త్రీలతో సమ్మతింపరుసుమీ! అని పలికి ఓదేవా! యీతని పాపమును క్షమింపుము. ఈతని మనస్సు పవిత్రముగాఁజేయుము. ఈతని మరమాంగమును పాపమునుండి కాపాడుము అని దేవునితో ప్రార్థించిరి. అప్పటినుండి యీతఁడు పరస్త్రీలవంక చూడకయుండెను. చదువరులు. దీనిని బాగుగ గ్రహింతురుగాక!

33. వలా-తఖ్ తులున్-నఫ్-సల్-లతీ-హర్రమల్లాహు-ఇల్లా-బిల్-హఖ్ఖి వమన్-ఖుతిల-మజ్ లూ-మన్-ఫఖద్-జఅల్నా-లి-వలియ్యిహీ-సుల్-తానన్- ఫ లాయుస్రిఫ్-ఫిల్ ఖత్ లి- ఇన్నహూ-కాన-మన్-సూరా.

33. న్యాయమునకుఁదప్ప దేవుఁడు నిషేధించిన యాత్మలను చంపకుఁడు. మఱెవఁడు అన్యాయముగా చంపఁబడునో వాని వారసునకు అధికార (బలము) ము ఒసంగియున్నారము. కావున ఆతఁడు చంపుటలో మితిమీఱిపోకూడదు. ఆతనికి సహాయము నొసంగఁబడును.

వ్యా॥ 33. న్యాయముగా ఒకనిని చంపవచ్చును అనఁగా ఒకఁడు ఎవని నైన చంపినచో వానిని ఆహత్యకు బదులుగ చంపవచ్చును. పెండ్లియైనవాఁడు వ్యభిచారముచేసినచో వాఁడుకూడ వధింపఁబడును.ఎవఁడైన మతభ్రష్టుఁడైనచో

వానినికూడ చంపవలెను. మిగిలిన విషయములలో చంపకూడదు అని దేవుడు నిషేధించియున్నాడు. కావున అన్యాయముగా నెవని ప్రాణముకూడ తీయరాదు. ఎవడైన అన్యాయముగ చంపబడినచో చచ్చినవాని వారసునకు హత్యకు బదులు తీసికొను అధికారముగలదు. వారసులు, అధికారుల మూలమున తమ బంధువునకు బదులుగ హంతకుని చంపవచ్చును. లేక క్షమించి హత్యకు బదులుగ అపరాధము గ్రహింపవచ్చును. హత్యకుబదులు తీసికొనుటలో వారసులు మితిమీఱిపోకూడదు. అనగా హంతకునకు తోడుగ హత్యచేయనివానినికూడ చేర్చుట, లేక హంతకుడు దొరకనిచో వాని బంధువులను చంపుట, లేక హంతకుని ముక్కుచెవులు కోయుట, ఇవన్నియు మితిమీఱిపోవుటలో చేరునవి.

34. వలా-తఖ్‌రబూ-మాలల్-యతీమి-ఇల్లా-బిల్లతీ-హియ-అహ్సను-హత్తా-యబ్-లుగ-అషుద్దహూ-వ-ఔఫూబిల్-అహ్‌ది-ఇన్నల్-అహ్‌ద-కాన-మస్-ఊలా.

34. మఱియు తండ్రిలేనిబిడ్డ తన యుక్తవయస్సు పొందునంతవఱకు మంచి మార్గముతప్ప వేఱుదోవన వాని సొత్తును సమీపింపకుడు, మఱి వాగ్దానమును పూర్తిచేయుడు. నిశ్చయముగా వాగ్దానమునుగూర్చి ప్రశ్నగలుగును.

వ్యా॥ 34. తండ్రిలేనిబిడ్డ సొత్తును కాపాడవలెను. ఆబిడ్డసొత్తును పాడుచేయరాదు. ఆతడు తన యుక్తవయస్సుపొంది లోకవ్యవహారములను బాగుగ గ్రహించునపుడు వానిసొత్తువానికి నప్పగింపవలెను. తండ్రిలేని బిడ్డలసొత్తు మ్రింగివేయువారు ఘోరశిక్షకు పాలగుదురు. తాము దేవునితోగాని, ప్రజలతోగాని చేసిన వాగ్దానములు పూర్తిచేయవలెను. ఆడినమాట తప్పరాదు. సంధి యొడంబడికలు తెంపినచో దానిగూర్చి దేవుడు విచారించును. అందులకు శిక్ష విధించును.

35. వ-ఔఫుల్-కైల-ఇజా-కిల్తుమ్-వ-జినూ-బిల్-ఖిస్-తాసిల్-ముస్‌తఖీమి-జాలిక-ఖైరున్-వ-అహ్సను-తావీలా.

35. మఱియు మీరు కొలుచునపుడు నిండుగా కొలిచి యియ్యుడు. సరియగు త్రాసుతో తూయుడు. ఇది శ్రేష్ఠము. మఱి దీనిఫలితముచాలమంచిది.

వ్యా॥ 35. తప్పుకొలతలు, తూనికలు చేయరాదు. కొలియునపుడు తూయునపుడు సరిగ సంపూర్ణముగ నియ్యవలెను. త్రాసుసరిగ నుండవలెను. అందు ఏలాటి మోసముచేయరాదు. ఇది చాలమేలు. సరిగ కొలిచి తూచి యిచ్చువారి బేరము సాగును. వారికి మంచి ఫలితము లభించును. అందఱును నమ్ముదురు. నమ్మకమే వ్యాపారమునకు ముఖ్యము. లేనిచో మోసము ఒకటి

రెండు తూర్లుచెల్లును. తుదకు మోసము బయలుపడి ప్రజలునమ్మరు. వాని వ్యాపారము నశించును. అధికారులు పట్టుకొని శిక్షింతురు. మానముపోవును.

36. వలా-తఖ్ ఫు-మా లైస-లకబిహీ-ఇల్ మున్-ఇన్నస్-సమ్ అ-వల్-బసర వల్-ఫుఆద-కుల్లు-ఉలాఇక-కాన-అన్ హు-మస్-ఊలా.

36. నీకుఁ దెలియని దాని వెనుకఁబడకుము. నిశ్చయముగా చెవి, కన్ను, మఱియు మనస్సు, వీనినన్నిటిగూర్చి ప్రశ్న గలుగును.

వ్యా॥ 36. తెలియని విషయములను తెలిసియున్నట్లుగ చెప్పరాదు. గమనించి విచారించి గ్రహింపకనే ఒక విషయమును పలుకరాదు. చూడని, వినని దానిని చూచి విన్నట్లుచెప్పరాదు. ఎద్దాని వెనుకనైనను అంధులవలె వెంబడించరాదు. బాగుగచూచి వినిగ్రహించి యేదైనపని చేయవలెను. ఒకనిపై అపనింద మోపుట, చాడీలువిని ఒకనిపై కోపపడి, వానిని హింసించుట మొదలగు కార్యములు చేయరాదు. ఎప్పటికినిచూచి, విని గ్రహించి సత్యమును వాస్తవమును తెలిసికొని పనిచేయవలెను. దేవుఁడు మానవులకు చెవులు కన్నులు, మనస్సు, మొదలగునవి ఒసంగినది వృథాకాదు. వానినెట్లు ఉపయోగించిరో వానిగూర్చి తీర్పుదినము (ఖియామత్) నందు ప్రశ్నగలుగును. మానవులు దానికి జవాబియ్యవలసివచ్చును. కావున, తమ శక్తులను ధర్మమార్గమునందు ఉపయోగింపవలెను.

37. వలా-తమ్ షి-ఫిల్-అర్ జి మరహన్-ఇన్నక-లన్-తఖ్-రిఖల్-అర్ జ వలన్-రిబ్-లుగల్-జిబాల-తూలా. 38. కుల్లు-జాలిక-కాన-సయ్యి-హూ-ఇన్ద-రబ్బిక మక్-రూహా. 39. జాలిక-మిమ్మా-ఔహా ఇలైక-రబ్బుక-మినల్-హిక్-మతి-వలా తజ్-అల్ మఅల్లాహి-ఇలాహన్-ఆఖర-ఫ తుల్ ఖా-ఫీ-జహన్నమ - మలూ-మమ్-మద్-హూరా.

37. మఱియు నీవు భూమిపై విఱ్ఱవీఁగుచు నడవకుము. నిశ్చయముగ నీవు భూమిని చీల్చలేవు. మఱి పొడవులో పర్వతములకు చేరలేవు. 38. ఇవన్నియు దుర్మార్గములు. నీప్రభువునకు ఇష్టము కానివి. 39. ఇది, నీప్రభువు నీకు పంపిన జ్ఞానయుక్తమైన విషయములలోనిది. మఱియు నీవు దేవునితోఁబాటుగ మఱొక దైవమును చేర్పకుము. అట్లు చేసినచో నిందింపఁబడినవాఁడవై నెట్టఁబడినవాఁడవై నరకములో వేయఁబడుదువు.

వ్యా॥ 37. మానవుఁడు గర్వించి విఱ్ఱవీఁగి భూమిపై నడవకూడదు. వినయముతో నడవవలెను. వాఁడు విఱ్ఱవీఁగి తన కాలి బలముతో కొట్టి భూమిని

చీల్పలేడు. మఱి తలనెత్తి, ఱొమ్ము ఉబ్బించినను ఎత్తయిన కొండలంత పొడవు కాలేడు. ఇంత బలములేనివాడు విఱ్ఱవీగుట సరికాదు. 37. ఇంతవఱకు వివరింపఁబడిన పై వాక్యములలో నిషేధింపఁబడిన విషయములన్నియు దుర్మార్గములును, చెడ్డవియును వానిని చేయువారును దేవునికి ఇష్టులు కారు. అట్లు చేయుఁడు అని ఆజ్ఞాపించిన మంచిపనులను చేయనివారు కూడ దేవునికి ప్రియులు కారు. 38. పై వాక్యములలో బోధింపఁబడిన నీతులు గొప్పవి. వానిని ప్రవక్తల మూలమున ప్రజలకు బోధించెను. అవి జ్ఞానసంబంధమైన విషయములు. అవి బుద్ధితో గ్రహింపఁదగినవి. పై వివరింపఁబడిన బోధనలు, దేవునినే పూజింపవలెను అని దేవుని యేకత్వముతో ప్రారంభింపఁబడెను. ఆ బోధనలకు అంత్యమునకూడ, దేవునితోఁబాటుగా ఇతర దైవములను కల్పింపరాదు. ఆతఁడు ఒక్కఁడే పూజింపఁదగినవాఁడు అని దేవుని యేకత్వమునుగూర్చి చెప్పఁబడియెను. చిల్లరదేవతలను పూజించువారు సిగ్గునకుపాలై నరకములోకి నెట్టఁబడుదురు.

40. అఫ-అస్-ఫాకుమ్-రబ్బుకుమ్-బిల్-బనీని-వత్-తఖజ-మినల్-మలాఇకతి-ఇనాసన్-ఇన్నకుమ్-లతఖూ-లూన-ఖౌలన్-అజీమా.

40. ఏమి? మీప్రభువు మీకు కుమారులు ప్రత్యేకముగా నొసంగి తనకొఱకు దేవదూతలను కుమార్తెలనుగాఁ నేర్పఱచుకొన్నాఁడా? మీరు చాల పెద్దమాట పలుకుచున్నారు.

వ్యా॥ 40. విగ్రహారాధకులు, దేవదూతలు, దేవునికి కుమార్తెలు అని పలికి, వారిని పూజించుచుండిరి, సాధారణముగ వారు కుమార్తెలను తమకొఱకు కోరరు. తమకు పుత్రులే కావలెనని కోరుదురు. దేవునికి అసలు బిడ్డలు లేరు. దానిపై బిడ్డలు కల్పించిరి. తమకు ఇష్టములు కానివి దేవునికి కల్పించిరి. ఇదంతయు తప్పు. ఇట్లు దేవునిగూర్చి పలుకుట చాల దోషకరమును, భక్తిగౌరవములు లేని పలుకులు అని మందలింపఁబడియెను.

41. వల-ఖద్-సర్రఫ్‌నా-ఫీ-హాజల్-ఖుర్ఆని-లి యజ్-జక్కరూ-వమా-యజీదహుమ్-ఇల్లా-నుఫూరా.

41. మఱియు వారు బోధను గ్రహించుటకై అన్నివిధములుగ ఈ ఖురానులో బోధించితిమి. కాని వారి తిరస్కారము హెచ్చుగుచునే యున్నది.

వ్యా॥ 41. ఖురానె షరీఫులో అన్నివిధములుగ బోధింపఁబడుచున్నది. అనేక సూచనలు ప్రమాణములు వివరింపఁబడుచున్నవి. అవిశ్వాసులు వానిని గ్రహించి సన్మార్గమునకు వచ్చుటకు బదులు మఱింత హెచ్చుగ తిరస్కరించుచు సన్మార్గమునకు రాక పాఱిపోవుచున్నారు.

42. ఖుల్-లౌ-కాన-మఅహూ-ఆలిహతున్-కమా-యఖూలూన-ఇజల్-లబ్-తగౌ-ఇలా-జిల్-అర్-షి-సబీలా. 43. సుబ్-హానహూ-వతఆలా - అమ్మా-యఖూలూన-ఉలువ్వన్-కబీరా.

42. వారు పలుకునట్లుగ దేవునితోఁబాటు ఇతర దైవములున్నచో, అపుడు వారు సింహాసనముగలవానిపైఁ బోవుటకు మార్గము తీసియుందురు అని ఓ ప్రవక్తా! పలుకుము. 43. ఆతఁడు పరమపవిత్రుఁడు. మఱి వారు పలుకు మాటల కంటె ఆతఁడు చాల దూరముగ నున్నాఁడు.

వ్యా॥ 42. విగ్రహారాధకులు, విగ్రహములను, చిల్లర దేవతలను దేవునికి సాటిగ కల్పింతురు. దానికి నిందు రద్దుచేయఁబడినది. విగ్రహారాధకులు పలుకునట్లుగ ఇతర దైవములున్నచో వారు దేవునికి లోఁబడియుండరు. వారందఱు సర్వలోకమునకు అధికార సింహాసనమువహించిన దేవునిపై దండెత్తిపోయియుందురు వారట్లు చేయలేదు. అటులైనచో శక్తిలేనివారి నెట్లు దేవునితో సమానులుగఁ జేయుదురు. దైవములు సర్వశక్తుఁడగు దేవునికిఁ లోఁబడియున్నారు అని పలికినచో సర్వశక్తుఁడగు దేవుని వదలి లోఁబడినవారిని పూజించుట వివేకముకాదుగదా! 43. దేవునికి సాటిలేదు. ఆతఁడు పరమపవిత్రుఁడును, అద్వితీయుఁడును, కాఫిర్లు పలుకు అవిశ్వాస పలుకులకును దేవునికెని సంబంధములేదు.

44. తుసబ్బిహూ-లహుస్-సమా-వాతుస్-సబ్-ఉ-వల్-అర్-జు-వమన్-ఫీహిన్న-వఇమ్-మిన్-షైఇన్-ఇల్లా-యుసబ్బిహు-బిహమ్-దిహీ-వలా-కిల్-లా-తఫ్ఖహూన-తస్-బీహ-హుమ్ ఇన్నహూ-కాన-హలీమన్-గఫూరా.

43. ఏడు ఆకాశములును, భూమియును, అందుండువారును, ఆతని పవిత్రతను కొనియాడుచున్నారు. ఆతని స్తోత్రములు చేయనిది యెద్దియును లేదు. కాని వారి స్తోత్రములు మీరు గ్రహింపలేరు. నిశ్చయము ఆతఁడు చాల క్షమగలవాఁడును క్షమించువాఁడును.

వ్యా॥ 44. భూమ్యాకాశములలోనున్న సమస్తము జడములు, ప్రాణులు దేవుని స్తోత్రములు చేయును వానివానికిఁ దగినట్లు అవి స్తుతించును. కాని మానవులుదానిని గ్రహింపఁజాలరు. దానిని వినుశక్తి వారికిలేదు. కావున తిరస్కరింతురు. అది చాల లోపము. సర్వము దేవుని కీర్తనలు పాడుచుండఁగా అట్టి దేవునికి సాటిగ చిల్లర దేవతలను కల్పించుట, ఆతనికి కుమార్తెలున్నారు అని పలుకుట, చాల పాపముగదా! అట్టి పాపమునకు దేవుఁడు తత్క్షణమే శిక్షింపక క్షమ (ఓర్పు) వహించి క్షమాపణ కోరువారి పాపములను క్షమించుచున్నాఁడు.

45. వ-ఇజా-ఖరఅ్-తల్-ఖుర్ఆన-జఅల్నా-బైనక-వబైనల్-లజీన-లా-యూమినూన-బిల్-ఆఖిరతి-హిజా-బమ్-మస్-తూరా. 46. వ-జఅల్నా-అలా ఖులూ-బిహిమ్-అకిన్న-తన్-అన్-యఫ్-ఖహూహు-వఫీ - ఆజానిహిమ్- వఖ్-రన్-వఇజా-జకర్త-రబ్బక-ఫిల్-ఖుర్ఆని-వహ్దహూ- వల్లౌ - అలా - అద్బారి హిమ్-నుఫూరా. 47. నహ్ను-అఅ్లము-బిమా-యస్-తమి-ఊన - బిహీ-ఇజ్-యస్-తమిఊన-ఇలైక-వఇజ్-హుమ్-నజ్వా-ఇజ్యఖూ-లుజ్- జాలిమూన-ఇన్ తత్తబి-ఊన-ఇల్లా-రజులమ్-మస్-హూరా. 48. ఉన్జుర్-కైఫ-జరబూ-లకల్-అమ్సాల-ఫజల్లూ-ఫలా-యస్-తతీఊన-సబీలా.

45. మఱియు నీవు ఖురానును పఠించునపుడు నీమధ్యను పరలోకమును విశ్వసింపనివారి మధ్యను, కనఁబడని తెర వేయుచున్నారము. 46. మఱి వారు గ్రహింపకుండునట్లు వారి మనస్సులపై తెరలను వారి చెవులలో భారమునుంచు చున్నారము. మఱియు నీవు ఖురానులో నీ అద్వితీయ ప్రభువునుగూర్చి పలుకు నపుడు వారు తిరస్కారముతో వెనుకకు తిరిగి పారిపోవుదురు. 47. వారు నీ వైపున చెవిపెట్టి వినునపుడు వారెందులకు వినుచున్నారో అను విషయమును మఱి వారు పరస్పరము గుసగుసలాడుచు మీరు అనుసరించునట్టి యాతఁడు జాల విద్య తగిలిన యాతఁడు అని ఆ దుర్మార్గులు పలుకునదియును మాకు బాగుగఁ దెలియును. 48. చూడుము. వారు నిన్నెట్టి యుదాహరణముతో పోల్చు చున్నారో ! మఱి వారు సన్మార్గము తప్పిరి. కావున వారు మార్గము పొందరు.

వ్యా॥ 45. ఎవరు పరలోకమును విశ్వసింపక, తమ మంచి చెడ్డ ఫలితము లను గమనింపరో వారు బోధ వినరు. గ్రహింపరు గదా ! అట్టివారికి మోక్ష మునుగూర్చి శ్రద్ధలేనపుడు ప్రవక్త పలుకు బోధలను గమనింపరు. మఱి ప్రవ క్తను లక్ష్యపెట్టరు. నమ్మరు. కావుననే అట్టివారి మధ్యను ప్రవక్తమధ్యను కాన రాని తెరపడియున్నది అని చెప్పఁబడియెను. 46. అవిశ్వాసులు ఖురానును గ్రహింపరు. దాని ననుసరింపరు. ఖురానులోనుండు మహాసూచనలను వారు గ్రహింపకుండుటకు కారణము వారి హృదయములు తెరలోపడియుండుటయే. ఎట్లు భూమిలోపలనుండు ఇంటిలోనున్నవానికి సూర్యకాంతి లభింపదో అటులే తెరలలోనున్న హృదయములు ఖురానుబోధను గ్రహింపవు అని యూ హించునది. మఱి అవిశ్వాసులు లాభముపొందవలెనను మనస్సుతో ఖురానును వినినచో అది బోధపడును. కానివారు లక్ష్యములేక యుందురు. అందుకు వారి చెవులలో భారము (చెవుడు) ఉన్నది అని చెప్పఁబడియెను. ఖురానులో దేవుఁడు

ఒక్కఁడు అని చెప్పఁబడునపుడెల్ల అవిశ్వాసులు ఆవిషయమును విని తిరస్కార భారముతో వెనుకకు మరలి పాఱిపోవుదురు. అది వారికి ఇష్టముకాదు. ఒకపుడు వారి దైవముల విషయము చెప్పఁబడినచో సంతసింతురు. 47. అవిశ్వాసులు ఖురానును, హజ్రత్ ప్రవక్తవారి పలుకులను బోధను గ్రహించుటకై వినుట లేదు. పరిహాసములాడుటకుఁగాను విందురు. భక్తితో వినరు. మఱి వారు పరస్పరము ఇట్లు గుసగుసలాడుదురు. మహమ్మదుపై నెవరో జాలవిద్య చేసినారు. అందులకే పిచ్చిపిచ్చిగా మాటలాడును అని లేనిపోని మాటలు పలుకుదురు. ఇవన్నియును దేవునికి బాగుగఁ దెలియును. వీరికి తప్పక దానికి శిక్ష దొరకును. 48. అవిశ్వాసులు హజ్రత్ రసూలువారినిగూర్చి ఒకపుడు ఆయన కవి అనియు మఱొకపుడు మంత్రకాఁడు అనియు పిచ్చివాఁడనియు పలువిధములైన యుదాహరణములతో పోల్చుచున్నారు. వీరు భక్తులను సన్మార్గమునుండి తప్పించుటకు చేయుతమ ప్రయత్నములలో సఫలము కాలేదు. వారియొక్క మాటకునునిలకడలేదు. ఎద్ది నోటికి వచ్చిన అది వదరుచుందురు. వారు తాము పన్నిన కుతంత్రములలో మార్గము పొందలేరు అని మందలింపఁబడియెను,

49. వ-ఖాలూ-అఇజా-కున్నా-ఇజామన్-వరుఫాతన్-అ-ఇన్నా-లమబ్-ఊసూన ఖల్-ఖన్-జదీదా. 50. ఖుల్-కూనూ-హిజా-రతన్-ఔ.హదీదన్- 51. ఔ-ఖల్-ఖమ్-మిమ్మా-యక్-బురు-ఫీసుదూ-రికుమ్ ఫ-స-యఖూలూన - మన్-యు-ఈదునా-ఖుల్లిల్లజీ-ఫతరకుమ్-అవ్వల-మర్రతిన్ ఫస-యున్-గి-జూన-ఇలైక-రు-ఊసహుమ్-వయఖూ-లూన-మతా-హువ-ఖుల్-అసా అన్-యకూన-ఖరీబా. 52. యౌమ-యద్-ఊకుమ్-ఫతస్-తజీ-బూన-బిహమ్దిహీ-వ-తజున్నూన-ఇన్ లబిస్-తుమ్-ఇల్లా-ఖలీలా.

49. మఱియు మేము ఎముకలై తునకలు తునకలై పోయినపిదప క్రొత్త సృష్టియై లేచెదమా అని వారు పలుకుదురు. 50. మీరు ఱాయి లేదా ఇనుము 51. లేదా మీ హృదయములలో నెద్ది కష్టతరమైన సృష్టియని తోఁచునో యది కండు అని ఓ ప్రవక్తా! పలుకుము. పిదప ఎవఁడు మమ్ము తిరిగి లేపును అని వారు పలుకుదురు. మొదటిసారి ఎవఁడు మిమ్ము సృష్టించెనో ఆతఁడే అని ఓ ప్రవక్తా! పలుకుము. ఇఁక వారు తమ తలలను నీవైపునకు నూఁపి మఱెపుడు అది కలుగును అని పలుకుదురు. అది బహుశః సమీపములోనే యున్నది. 52. ఆ దినమున దేవుఁడు మిమ్ముపిలువఁగానే మీరు ఆతనిని కొనియాడుచువత్తురు. మఱి మీరు కొంతసేపు మాత్రమే యుంటిరి అని తలంతురు అని పలుకుము.

వ్యా॥ 49. అవిశ్వాసులు తాము చచ్చిన పిదప తిరిగి సజీవులు కాము అని పలుకుచు నిట్లు చెప్పసాగిరి. మేము, మనుష్యులు చచ్చుట చూచుచున్నారము. కొంతకాలములోనే దేహము కుళ్లి చెడిపోయి ఎముకలు నిలుచును, అవి కూడ కొద్దికాలములో పాతపడి తునకలై మట్టియై మట్టిలో కలిసిపోవును. ఇట్టి మట్టి తిరిగి దేహముగ నేర్పడి ప్రాణముపొంది తిరిగి బ్రతుకునా? ఇట్టి మాటలు పిచ్చివాఁడే పలుకవలెను. బుద్ధిమంతుఁడు పలుకఁడు. దీనికి రాఁబోవు వాక్యములలో సమాధాన మియ్యఁబడుచున్నది. 50, 51, 52. శవములో ముందు ప్రాణముండెనుగదా! ఆపిదప ప్రాణముపోయి అది మట్టియైనది. అందు తిరిగి ప్రాణముపొందు యోగ్యతగలదు. అది అసంభవముకాదు. రాయి, ఇనుములో ప్రాణముపొందు యోగ్యతలేదుగదా! అట్టి వస్తువులుకూడ మీరు కండు. లేదా వానికంటె ప్రాణముపొందుటకు యోగ్యతలేని వస్తువు కండు. అనఁగా చావుకే కండు. అట్టి స్థితిలోకూడ సర్వశక్తుఁడగు దేవునికి నందు ప్రాణముపోసి తిరిగి లేపుట కష్టముకాదు. అది చాల సులభము. అవిశ్వాసులు మమ్ము తిరిగి ఎవడు సజీవులుగ జేయును అని ప్రశ్నింతురు. అందుకు మీరు పుట్టక పూర్వము ఏమియు లేకయుంటిరి. అట్టివారిని ప్రాణము పోసి పుట్టించెను. ఏమియు లేనివారిని పుట్టించుటకు శక్తిగల దేవునికి తిరిగి సజీవులుగఁ జేయుటకు శక్తిలేదా? ఎందుకు లేదు. తొలుత మిమ్ము పుట్టించిన దేవుఁడే తిరిగి మమ్ము మీ రెట్టిస్థితిలో నున్నను సరే సజీవులుగఁ జేయును. ఇది విని అవిశ్వాసులు పరిహాసముతో తల లూఁపుచు సరే అయ్యా! కుళ్లిన యెముకలలో ప్రాణమెప్పుడు పడును. మృతులు సజీవులై ఎపుడు లేచెదరు అని పలుకుదురు. దేవుఁడు పునరుత్థాన దినమువచ్చు సరియైన గడియ నెవరికిని తెలుపలేదు. ఆ గడియ యాతనికే తెలియును. ఆయిన ఆ దినము సమీపములోనే యున్నది. చాల దూరములేదు. ఆదినము దేవుని సెలవు (పిలుపు) కాఁగానే అందఱు తత్క్షణమే సజీవులై తీర్పు మైదానములో వచ్చి నిలుతురు. అపుడు ఎవరికిని తిరస్కరించు అధికారముండదు. అందఱు విధేయులై దేవుని మహిమలను కొనియాడుచు వత్తురు. అప్పుడు విధిలేక అవిశ్వాసులు చేయు దేవుని స్తోత్రము, వారికి పనికిరాదు. అపుడు విశ్వాసులు అల్ హమ్దు లిల్లాహిల్ లజీ-అజ్ - హబ- అన్నల్ - హజన్ - (మా నుండి దుఃఖమును తొలఁగించినట్టి దేవునికి సర్వస్తోత్రములున్నవి) అని పలుకుదురు. ఇహలోకమునందున్నపుడు తీర్పుదినము ఎప్పుడు వచ్చును అని అవిశ్వాసులు తొందఱచేయుచున్నారు. ఆదినమునందు సజీవులైనపుడు ఇహమునందుండినది కొద్దికాలము మాత్రమే అని వారుతలంతురు.

53. వఖుల్-లి-ఇబా-దీ-యఖూ - లుల్లతీ - హియ-అహ్సను - ఇన్నష్ -

షైతాన యన్-జ గు-బై న-హుమ్-ఇన్నష్-షైతాన-కాన-లిల్-ఇన్‌సాని-అదువ్వ్ మ్-ముబీనా.

53. మఱియు నాభక్తులు చాలయుక్తమైన మంచిమాటలనే పలుకునట్లు వారితోఁ జెప్పుము. సైతాను వారి మధ్య తగవు కల్పించును. సైతాను మానవులకు స్పష్టమైన విరోధి.

వ్యా॥ 53. ఇందు దేవునిభక్తులైన ముసల్మానులకు బోధగలదు. ఇస్లామ్ ప్రచారముచేయునపుడు అవిశ్వాసులు సత్యమును స్వీకరింపక వారుచేయు మూఢత్వమునకును నిందలకును, పరిహాసములకును, కుపితులై యుక్తము కానిమాటలు పలుకకూడదు. నెమ్మదిగ మంచి మాటలు పలుకవలెను. కోపగించుకొన్నచో పరస్పరము తగవులు సంభవించును. అపుడు విరోధము చెలరేఁగును. అవిశ్వాసులు బోధను వినరు. మేలునకు బదులుగ కీడుగలుగును. కోపము కల్పించి తగవులు పెట్టుట సైతాను పని. అతఁడు మానవులకు విరోధి. సమయముచూచుచు తగవులు కల్పించును. కావున జాగ్రత్తగ నుండవలెను. ముసల్మానులు పరస్పరముకూడ చాలవినయముతో యుక్తమైన సంభాషణలు సలుపవలెను. కోపమునకును తగవులకును కారణమగు సంభాషణలు కూడదు.

54. రబ్బుకుమ్-అఅ-లము-బికుమ్-ఇన్‌యషా-యర్-హమ్-కుమ్-ఔ-ఇన్-యషా-యు-అజ్-జిబ్-కుమ్-వమా-అర్-సల్నాక-అలైహిమ్-వకీలా. 55. వరబ్బుక-అఅ-లము-బిమన్-ఫిస్-సమా-వాతి-వల్-అర్‌జి-వలఖద్-ఫజ్-జల్నా-బఅ-జన్-నబీ-యీన-ఆలా-బఅ-జిన్-వ-ఆతైనా-దావూద-జబూరా.

54. మీప్రభువునకు మీ విషయము బాగుగఁదెలియును. అతఁడు ఇష్టపడినచో మిమ్ము కరుణించును. మఱి కోరినచో మిమ్ము శిక్షించును. మఱి మేము ఓమహమ్మదు! నిన్నువారిపై రక్షకునిగాఁజేసి పంపలేదు. 55. మఱి ఆకాశములలోను భూమిలోనున్న వన్నియు నీప్రభువునకు బాగుగఁదెలియును. మఱికొందఱు ప్రవక్తలకు కొందఱు ప్రవక్తలపై ఘనతనొసంగి యున్నారము. మఱి దావూదునకు జబూరు గ్రంథము నొసంగితిమి.

వ్యా॥ 54. దేవుఁడు మానవుల స్థితిగతులన్నియు నెఱుంగును. ఎవరుసన్మార్గమునకు యోగ్యులో వారు సన్మార్గము స్వీకరించుటకుఁగాను వారికి బుద్ధిజ్ఞానము లొసంగును. సన్మార్గము ననుసరించుటవలన వారు దేవుని కరుణకు పాత్రులగుదురు. కొందఱు సన్మార్గముస్వీకరింపక దుర్మార్గులై పాపకార్యములుచేసి అవిశ్వాసులుగానే మరణించి దేవుని శిక్షకు పాత్రులగుదురు. కావున హాజ్రత్ మహా

మ్మదు ప్రవక్తవారిపని బోధించుట మాత్రమే. ఎవరు ప్రవక్తబోధను విని సన్మార్గులగుదురో వారు మోక్షముపొందుదురు. ఎవరు ప్రవక్తను తిరస్కరింతురో వారునరకములో పడుదురు. సన్మార్గులు కాలేదే అను బాధ్యత పైగంబరుల వారికిలేదు. ఎందుకన ప్రవక్త ప్రజల రక్షకుడుకాఁడు. కావున ఆతఁడు బలవంముచేయఁడు 55. భూమ్యాకాశములలోనన్న సమస్తము దేవునికి తెలుసు. వారివారి యోగ్యతకు తగినట్లు దేవుఁడువారి విషయము చేయును. మానవులలో ప్రవక్త పదవికి యోగ్యులైన వారికి ప్రవక్తపదవి నొసంగెను. అందుకూడ ఒకరిపై నొకరికి ఘనతనొసంగియున్నాఁడు. అందు హజ్రత్ దావూదు ప్రవక్తకు జబూరు గ్రంథమునొసంగెను. వారు గ్రంథము పఠించి బోధించుచుండిరి. మఱి ధర్మ యుద్ధము (జిహాద్)కూడ చేయుచుండిరి. ఇటులే హజ్రత్ పైగంబరులవారు కూడ ఖురాను గ్రంథము ప్రజలకు బోధించుచు ధర్మయుద్ధముచేయుదురు.

55. ఖులిద్-ఉల్-లజీన-జ అమ్‌తుమ్-మిన్-దూనిహీ-ఫలా- యమ్‌లికూన కష్-ఫజ్-జుర్రి-అన్‌కుమ్- వలా తహ్వీలా. 57. ఉలాఇ-కల్లజీన యద్‌ఊన-యబ్‌తగూన-ఇలా-రబ్బి-హిముల్-వసీ-లత-అయ్యు-హుమ్-అఖ్‌రబు-వ-యర్‌జూన-రహ్మ-మతహూ-వ-యఖాఫూన-అజాబహూ- ఇన్న-అజాబ-రబ్బిక-కాన-మహ్‌జూరా.

56. దేవునివదలి మీరెవరిని దైవములుగా తలంచుచున్నారో వారిని పిలువుఁడు. మీనుండి ఆపదను తొలఁగించుటకుఁగాని దానిని మార్చుటకుఁగాని వారికి అధికారములేదు. 57. అవిశ్వాసులు ఎవరిని వేఁడుచున్నారో వారే తమ ప్రభువు సాన్నిధ్యమును పొందఁగోరుచున్నారు. అందు ఎవరు దేవునిసాన్నిధ్యము ఎక్కువ పొందుదురో అని యత్నించుచున్నారు. మఱి వారు ఆతనిదయను ఆసించుచున్నారు. మఱి ఆతని శిక్షకు భయపడుచున్నారు. నిశ్చయముగా నీప్రభువు యొక్క శిక్షకు భయపడవలసినదే.

వ్యా॥ 56. సర్వముతెలిసి కరుణించుటకును శిక్షించుటకును సర్వవిధముల శక్తిగలవాఁడే దేవుడు కాఁగలఁడు. శక్తిలేనివారు దైవములు కానేరరు. కావున అవిశ్వాసులు తాము దేవునిని వదలి పూజించు దైవములను పిలువవలెను. వారికిట్టి శక్తిగలదా! ఓఅవిశ్వాసులారా, మీనుండి ఆపదకొంచెమైనను తొలఁగించుటకుఁగాని తగ్గించుటకుఁగాని మార్చుటకుఁగాని వారికి శక్తిలేదు. అట్టి శక్తిహీనులను దైవములుగ కల్పించుకొని పూజించుట ఎట్లు ధర్మమగును? కానేరదు. 57. అదియునుగాక అవిశ్వాసులు, ఎవరినిగూర్చి దైవములని తలఁచివారిని పూజించుచు వారి సహాయము కోరుచున్నారో అట్టివారే దేవుని పూజించి

దేవుని సాన్నిధ్యము పొందగోరుచున్నారు. అందు ఎవరు దేవుని సాన్నిధ్యము ఎక్కువ పొందుదురో అని కృషిసలుపుచున్నారు. మఱి దేవుని దయగలుగును అని ఆశగలిగి దేవునిశిక్షకు భయపడుచు దేవుని ప్రీతిపడయుటకు యత్నించుచున్నారు. దేవునియందు భయభక్తులు హెచ్చుకొలఁదిని దేవుని సాన్నిధ్యము పొంద భక్తులుకోరుదురు. దేవదూతలు, పవిత్రులు, అట్లు దేవుని సాన్నిధ్యము పొందఁగోరువారలే. ఇట్టివారిని దైవములుగ కల్పించుకొని పూజించుటతగదు. ఇది దేవునికి ప్రీతికాదు.

58. వఇమ్ మిన్-ఖర్యతిన్-ఇల్లా-నహ్ను-ముహ్లికూహా-ఖబ్ల-యౌమిల్-ఖియామతి-ఔ-ముఅజ్ జిబూహా-అజాబన్-షదీదన్-కాన-జాలిక-ఫిల్ - కితాబి-మస్-తూరా.

58. మఱి మేము పునరుత్థాన దినమునకుముందు ప్రతిపురమును నాశము పఱచెదము. లేదా దానిపై ఘోరమైన యాపద పంపుదుము. ఇది గ్రంథములో వ్రాయబడియున్నది.

వ్యా॥ 58. పురనివాసులుచేయు ఘోరపాపములకుఁగాను ఆయాపురములు దేవుని కోపమునకుపాలై నశించును. లేదా యేదైనా గొప్పయాపదకు పాలగును. మఱి పునరుత్థానదినమురాకముందు ఇట్లు జరిగితీరును. ఇది దేవుఁడు నియమించియున్న గ్రంథమగు, లౌహిమహ్ఫూజులో ముందుగానే వ్రాయఁబడియున్నది. దీని ప్రకారము తప్పక సంభవించును. కావున మానవులు దేవుని శిక్షకుభయపడి దేవుని ప్రీతిపడయుటకు విశ్వసించి సత్కార్యములు చేయవలెను.

59. వమా-మనఅనా అన్ నుర్సిల బిల్-ఆయాతి-ఇల్లా-అన్-కజ్-జబ-బిహల్-అవ్వ-లూన్-వఆతైనా-సమూదన్-నాఖత-ముబ్-సిరతన్ ఫజలమూ-బిహా వమా-నుర్-సిలు-బిల్-ఆయాతి-ఇల్లా-తఖ్-వీఫా. 60. వఇజ్-ఖుల్నా - లక - ఇన్న-రబ్బక-అహాత-బిన్నాసి-వమా-జఅల్నర్ రూయల్-లతీ-అరైనాక - ఇల్లా-ఫిత్-నతల్-లిన్నాసి-వష్-షజ రతల్-మల్-ఊనత-ఫిల్-ఖుర్ఆని వ-నుఖవ్విఫుహుమ్--ఫమా-యజీ-దుహుమ్-ఇల్లా-తుగ్-యానన్-కబీరా.

59. పూర్వికులసూచనలను తిరస్కరించినందు వలన మేము సూచనల పంపుటనునిలిపివేసితిమి. మఱిమేము ఒంటెను సమూదునకు సూచనగానొసంగితిమి. పిదప వారు దానిపైనన్యాయముచేసిరి. మఱి మేము (ప్రజలకు) భయపెట్టుటకుఁగాను సూచనలను పంపుచున్నారము. 60. మఱి నీప్రభువు ప్రజలను

ఆవరించియున్నాఁడు అని మేము నీతో చెప్పినది జ్ఞప్తికి దెచ్చుకొనుము. మఱి మేము నీకు చూపినదృశ్యము ప్రజల పరీక్షకుఁగాను. మఱి ఖురానులో శపింపఁ బడియుండు వృక్షము పరీక్షకుఁ గా నే. మఱియు మేము వారికి భయపెట్టుచుండఁ గా వారి దుర్మార్గము చాల హెచ్చుచున్నది.

వ్యా॥ 59. మక్కాలోని అవిశ్వాసులు పైగంబరులవారితో సఫా పర్వ తమును బంగారుగాఁజేసి వేయుము. లేదా ఈ ప్రాంతములోనున్న కొండలను తొలఁగించి భూమిని సేద్యమునకు తగినదిగాఁజేయుము. లేదా ఈ ప్రాంతములో పెద్దపెద్ద నీటికాలువలు ప్రవహించునట్లు చేయుము. ఇట్టి సూచనలు నీవుచూపి నచో మేము నిన్ను నమ్మెదము అని పలికిరి. అపుడు ఈ దేవుని సందేశము (వహీ) వచ్చెను. ఓప్రజలారా, మీరుకోరు సూచనలనుచూపుట దేవునికి కష్ట ము కాదు. ఆతఁడు కోరిన చూపఁగలడు. అట్లుచూపకుండుటకు కారణము ఏమ నగా. మీకు పూర్వమున్న జనులు మీరు కోరినట్లు తమతమ ప్రవక్తలతో సూచనలుకోరిరి. దేవుఁడు వారు కోరినట్లు సూచనలు పంపెను. కాని అవిశ్వా సులు నమ్మక మఱిహెచ్చుగా దుర్మార్గములుచేయ సాగిరి. తుదకు దేవుఁడు తన పద్ధతి ప్రకారము అవిశ్వాసులను శిక్షించి తుదముట్ట నశింపఁజేసెను. అటులే మీరుకోరు సూచనలు పంపినచో మీరు నమ్మరు అని దేవునికిఁదెలియును. మఱి మీవిషయముకూడ నట్లేయున్నది. కావున సూచనలు పంపినపిదప మీ దుర్మార్గము హెచ్చును. మీరు నిర్మూలింపఁబడుదురు. అట్లు దేవునికి ఇష్టము లేదు. ఎందుకన ఇస్లామ్ లోకములో వ్యాపింపనున్నది. లోకములో అనేకులు ముసల్మానులుకాఁగలరు. పూర్వికులకు పట్టిన దుర్గతి విని మీరు బుద్ధితెచ్చుకొన వలెను. అందుకు నిందు సమూదువారికి సంభవించిన విషయము తెలుపఁబడినది. సమూదువారిని సాలిహ్‌ప్రవక్తచాల బోధించెను. సమూదువారు రాతిబండ నుండి ఒక యొంటె బయలుపడినచో మేము నమ్మెదము అని పలికిరి. అటులే ఒక పెద్దయొంటె దేవునిశక్తిచే బయలు పడెను. ఆసూచనచూచి సమూదువారు నమ్మక దానిని హింసించుచు తుదకు కాళ్లునఱికి చంపిరి. అందుకు సమూదు వారు దేవుని శిక్షకు పాత్రులై, తుదముట్టనశించిరి. ప్రజలుసూచనలుచూచియే సన్మార్గము పొందుదురను మాటలేదు. సూచనలు భయపెట్టుటకుఁగానువచ్చును. అట్టి గొప్పసూచనలు పంపియు ఇపుడు ప్రయోజనములేదు. ఎందుకన అవిశ్వా సులు నమ్మరు అని దేవునికిఁదెలియును. మఱియు వీరిని తుదముట్ట నశింపఁ జేయవలెననికూడ దేవునికి ఇష్టములేదు. సాధారణముగ భయపెట్టు సూచనలు వచ్చుచునేయుండును. 60. తాము కోరిన సూచనలు చూపనందుకు అవిశ్వా సులుపరిహాసములాడుదురేమో అను చింత పైగంబరులవారు పెట్టుకొనకూడదు.

సర్వజనులు దేవునిచేతిలో నున్నారు. సర్వము దేవునికిఁ దెలియును. దుర్మార్గులు దేవుని శిక్షను తప్పించుకొనఁజాలరు. తుదకు వీరు ముసల్మానులు కాఁగలరు. పైగంబరులవారికి దేవుఁడుచూపిన దృశ్యము మేరాజ్. ఈవిషయము ఈసూరాకు ప్రారంభములో వచ్చియున్నది. దీనివలన జనులు పరీక్షింపఁబడిరి. విశ్వాసుల నమ్మకము స్థిరపడెను. స్థిరవిశ్వాసములేనివారు చలించి అది నిజముకాదు అని పలికిరి. శపింపఁబడిన వృక్షమునుగూర్చి ఖురానులోనున్నది. ఇది నరకములోని ఒక వృక్షము. దీనిని అరబీలో జఖ్ఖూమ్ (జెముడు) అని చెప్పుదురు. ఇది నరకనివాసులకు ఆహారము. ఈవిషయము విని ముసల్మానులు నమ్మిరి. అవిశ్వాసులు అగ్నిలో పచ్చని వృక్షమెట్లుండఁగలదు అని సందేహములు గలిగి నమ్మక పోయిరి దీనిని బట్టియే అవిశ్వాసులు దేవుని మహిమ విషయము ఎట్లు ప్రవర్తింతురో యూహించునది. ఎవరిహృదయములలో దేవునిగూర్చి భయభక్తులు లేవో వారిని భయపెట్టినచో వారు భయపడరు. మఱి హెచ్చుగా దుర్మార్గములు చేయుదురు. ఇట్టి వారు తాము కోరిన సూచనలుచూచియు సత్యము నమ్మెదురు అను ఆశ లేదు.

61. వఇజ్-ఖుల్నా-లిల్-మలాఇక-తిస్-జుదూ-లిఆదమ-ఫస-జదూ-ఇల్లా-ఇబ్లీస-ఖాల-అ-అస్-జుదు-లిమన్-ఖలఖ్-త-తీనా. 62. ఖాల అర ఐతక-హాజల్లజీ-కర్రమ్ త-అలయ్య-లఇన్-అఖ్-ఖర్-తని-ఇలా-యౌమిల్-ఖియా మతి-ల-అహ్-తనికన్న-జుర్రీ-యతహూ-ఇల్లా-ఖలీ-లా. 63. ఖాలజ్-హబ్-ఫమన్-తబిఅక-మిన్ హుమ్-ఫఇన్న-జహన్నమ-జజా-ఉకుమ్-జజా-అమ్-మౌ ఫూరా. 64. వస్-తఫ్ జి జ్-మనిస్-తతఅత-మిన్ హుమ్-బిసౌతిక-వఅజ్లిబ్-అలైహిమ్-బి-ఖైలిక-వ-రజలిక-వ-షారిక్-హుమ్ ఫిల్-అమ్-వాలి-వల్-ఔలాది వఇద్-హుమ్ వమా-యఇదు హుముష్-షైతాను-ఇల్లా-గురూరా. 65. ఇన్న-ఇబాదీ-లై స-లక-అలైహిమ్-సుల్-తానున్-వకఫా-బి-రబ్బిక-వకీలా.

61. మఱియు మేము దూతలతో మీరు ఆదమునకు సాష్టాంగము (సిజ్దా) చేయుఁడు అని పలుకఁగా ఇబ్లీసు తప్ప అందఱు సాష్టాంగపడిరి, నీవు మట్టిలోఁ జేసిన మానవుని నేను సాష్టాంగపడవలయునా! అని ఇబ్లీసు పలికెను. 62. సరే చూడుము. నీవు నాపై ఈతనిని ఘనత నొసంగితివిగదా! నీవు పునరుత్థాన దినమువఱకు నన్ను వదలినచో ఈతని సంతానములో కొందఱిని తప్ప నందఱిని వశపఱచుకొందును అని యిబ్లీసు పలికెను. 63. 'పొమ్ము. వారిలో నెవరు

నిన్ను అనుసరింతురో వారికిని,నీకును మీయావత్తుమందికిని నరకము సంపూర్ణమైన శిక్షగా నున్నది. 65. మఱి నీవు నీశబ్దముతో వారిలో నెవరిని కదలింపఁగలవో వారిని కదలింపుము. మఱి నీరౌతులతోను నీకాలిబంటులతోను వారిపై దాడి వెడలుము. మఱి సొత్తులలోను సంతానములోను వారికి భాగస్థుఁడుగ అగుము. మఱి వారితో వాగ్దానము చేయుము. మఱి సైతాను వారితో చేయు వాగ్దానము మోసము మాత్రమేను. 66. నాభక్తులపై నీకేలాటి అధికారములేదు. మఱి నీప్రభువు రక్షించుటకు చాలును. అని దేవుఁడు సెలవిచ్చెను.

వ్యా॥ 62. ఈవిషయము ముందు చాలసారులు వచ్చియున్నది. సైతాను మానవులకు పాత విరోధి. మఱి దేవుని యాజ్ఞలందు సందేహములు పడుట సైతాను పని. దేవుని యాజ్ఞలను శిరసావహించుట దేవదూతల పని. కాఫిర్లు కూడ సైతానును అనుసరించుచు దేవుని యాజ్ఞలను శిరసావహింపకున్నారు. సైతానుకు పట్టు దుర్గతి ఈకాఫిర్లకు పట్టును. 63. సైతాను తన గొప్పదనము చెప్పుకొని నేను ఆదము వలన చెడితిని. ఈతని సంతానములో కొందఱిని తప్ప మిగిలినవారి నందఱిని నా వశము చేసికొని నీ ప్రీతికరమైన సన్మార్గమునుండి తొలఁగించి దుర్మార్గులుగఁ జేయుదును. నాకు తీర్పుదినము (ఖయామతు) వఱకు వదలిపెట్టవలెను అని దేవునితో చెప్పెను. 64.సరే పొమ్ము. అటులేచేయుము. నీబలమును నీశక్తులన్నియు నుపయోగించుము. నీకును నీయనుచరులకును నరకము అను చెఱ సిద్ధముగా నున్నది. అందు మిమ్ము లందఱిని వేయుదును. ఇది మీపాపములకు సంపూర్ణమైన శిక్ష. 65. సన్మార్గమునుండి కదలించి దుర్మార్గములో పడవేయుటకుఁగాను నీశక్తులన్నియు నుపయోగించుము. అందు సైతాను పాపములకు పిలుచు పిలుపు. ఇది మానవుల హృదయములలో చంచలము, తప్పు యూహలకు కారణమగును అందు వాద్యములుకూడ చేరును. మానవులను సన్మార్గమునుండి తొలఁగించుటకునీసర్వవిధముల బలములగు రౌతులను, కాలిబంటులను తీసికొని వారిపైఁబడుము. అధర్మమార్గములో యుద్ధముచేయు ప్రతి మానవుఁడును జిన్నాతు యను సైతాను సైన్యములో చేరినవాఁడగును. మానవులు అధర్మమార్గమున సొత్తు సంపాదించి, తప్పుత్రోవలలో ఖర్చుచేయుటకునువ్యభిచారమువలనను సంతానము పొందుటకును లేకసంతానమును పాపములకు పోవునట్లు చేయుటకును వారిని ప్రోత్సహింపుము. వారి సొత్తులలో వారి సంతానములలో నీవు భాగస్థుఁడవు గమ్ము. నీవు మానవులకు మోసపుచ్చు వాగ్దానములు చేసి వారిని మోసపుచ్చుము. నీమోసములో మూఢులే తగులుకొందురు. 66. నాభక్తులు నీమోసములకు లొంగరు. నీఅధికారము వారిపై చెల్లదు. ఎవరు దేవుని నమ్మి దేవునిపై నాధారపడుదురో దేవుఁడు వారిని సైతాను కుట్రల నుండి రక్షించి కాపాడును. మఱి అన్నివిధములతోడుపడునుఅని తెలుపఁబడియె.

66. రబ్బుకు-ముల్లజీ-యుజ్ జీ-లకుముల్-ఫుల్క-ఫిల్-బహ్రి-లి-తబ్-తగూ-మిన్-ఫజ్-లిహీ-ఇన్నహూ-కాన-బికుమ్-రహీమా. 67. వఇజా-మస్సకు-ముజ్-జురు-ఫిల్-బహ్రి జల్ల-మన్-తద్-ఊన-ఇల్లా-ఇయ్యాహు - ఫలమ్మా-నజ్జాహుమ్-ఇలల్-బర్రి-అఅ-రజ్-తుమ్-వకానల్-ఇన్సాను-కఫూరా. 68. అఫ అమిన్-తుమ్-అన్-యఖ్-సిఫ బికుమ్-జానిబల్-బర్రి-ఔ-యుర్ సిల-అలైకుమ్-హాసిబన్-సుమ్మ-లా-తజిదూ-లకుమ్-వకీలా. 69. అమ్-అమిన్తుమ్-అన్ - యుఈద కుమ్-ఫీహి-తారతన్-ఉఖ్రా-ఫయుర్-సిలఅలైకుమ్-ఖాసిఫమ్-మినర్-రీహి-ఫ-యుగ్-రిఖకుమ్-బిమాకఫర్-తుమ్-సుమ్మ-లాతజిదూలకుమ్-అలైనా బిహీతబీఆ.70. వలఖద్-కర్రమ్నా-బనీ-ఆదమ-వ-హ-మల్నాహుమ్-ఫిల్-బర్రి-వల్-బహ్రి-వ ర జఖ్నాహుమ్-మినత్-తయ్యిబాతి వ-ఫజ్-జల్నా-హుమ్ అలా-కసీరిమ్ - మిమ్మన్-ఖలఖ్నా-తఫ్-జీలా.

66. మీరు దేవుని యనుగ్రహము వెదకుటకుఁగాను మీకొఱకు నావలను సముద్రములో నడపించునట్టి యాతఁడే మీ ప్రభువు. ఆతఁడే మీపై దయగలవాఁడు. 67. మఱి సముద్రములో మీకు ఆపదవచ్చునపుడు దేవునితప్ప మీరు పిలుచుచున్నవారి నందఱినిమఱచిపోవుదురు. మిమ్మురక్షించి నేలమీఁదకుఁ దెచ్చిన పిదప మీరు తిరస్కరింతురు. మఱి మానవుఁడు చాల కృతఘ్నుఁడు. 68. నేలమీనికుఁదెచ్చి దేవుఁడు మిమ్ము పూడ్చివేయునను భీతి మీకు లేకపోయెనా లేక మీపై ఱాళ్ళను కురిపించునట్టి తుపాను గాలి పంపునను భీతిలేకపోయెనా! ఆ పిదప మీరు మీకొఱకు రక్షకుని పొందఁజాలరు. 69. లేక రెండవసారి మిమ్ము సముద్రములోఁ గొనిపోయి నావలను తెంపునట్టి గొప్పగాలిని మీపైనంపి మీరు కావించిన కృతఘ్నతకుఁగాను మిమ్ము ముంచివేయునను భీతి లేకపోయెనా? ఆ పిదప దానిగూర్చి మీపక్షమున మాతో నడుగువాఁడు మీరు పొందఁజాలరు. 70. మఱి మేము ఆదము సంతానమునకు ఘనతనొసంగియున్నారము. మఱి మేము నేలమీఁదను సముద్రములోను వారికి సవారి నొసంగితిమి. మఱిపవిత్రమైన ఆహారవస్తువుల నొసంగితిమి. మేము సృష్టించిన వారిలో పెక్కురి పై వారికి ఘనతనొసంగియున్నాము.

వ్యా॥ 66. ఇందు దేవుఁడు మానవులకు తాను చేసిన మేలు నుదహరించుచున్నాఁడు. ఆతఁడు సముద్రములను మానవులకు లొంగఁజేసెను. మానవులు నావలపై నెక్కి వ్యాపారమునకుఁగాను ఒక దేశమునుండి మఱొక దేశమునకు

సురక్షితముగా ప్రయాణము చేయుచు దేవుని యనుగ్రహమగు సంపదను వెదకు చుదానిని పొందుచున్నారు. ఇదంతయు దయామయుడగు దేవుని దయవలన గలుగుచున్నది. 67. మనుష్యులు సముద్రములో ప్రయాణము చేయునపుడు తుపాను గాలి మొదలగు ఆపదలలో చిక్కుకొన్నపుడు ముందు తాము కొలుచుచున్న చిల్లర దేవతలను మఱచిపోయి సర్వశక్తుడగు దేవునిని ప్రార్థించి యీ ఆపదనుండి రక్షించుము అని వేడుకొందురు. దేవుని యనుగ్రహమువలన ఆపదనుండి రక్షింపబడి నేలమీదకు రాగానే దేవుని మఱచిపోయి దేవునికి కృతఘ్నులగుదురు. ఇది మానవుని స్వభావము. ఇట్లు చేయరాదు. 68. సముద్రములో మునిగిపోలేదు అని మనుష్యులు నిర్భయులు కాకూడదు. నేలమీదకూడ భూకంపమువచ్చి భూమిలో పూడ్పబడుదురు. ఇట్లు చేయుటకు దేవునికి శక్తి గలదు. లేక ఱాళ్ళు కురిపించు గాలివలన నశింపజేయును. కావున దేవుడు కోరినచో సముద్రములో నేమనుష్యులను ముంచి చంపనక్కఱలేదు. భూమిపైకూడ చంపగలడు. కావున శిక్షనుండి తప్పించుకొనజాలరు. 69. మరల విధిలేక సముద్రప్రయాణము చేయవలసివచ్చును. అపుడు కృతఘ్నులనుముంచి చంపును. ఇదియును దేవునిచేతిలో నున్నది. ఆతనిశక్తికి మించినదిలేదు. దేవుడు చంపినాడని ఎవడు ఆతనిని అడుగగలడు. ఆతని నెదరించువారు ఎవరు గలరు? ఎవరును లేరు. కావున మానవులు దేవుడు ఒక్కడే అని నమ్మి ఆతనినే సర్వదా వేడవలెను. 70. ఇందు దేవుడు మానవులకు నొసంగిన ఘనతను తెలుపబడుచున్నది. మానవులందఱు ఆదము సంతతివారు. దేవుడు మానవునకు సౌందర్యము, మాటలాడు శక్తి బుద్ధి జ్ఞానములు ఇంద్రియములు ఒసంగియున్నాడు. వీనివలన మంచి చెబ్బరలను గుర్తించుచు లాభనష్టములను గమనించుచున్నాడు. వీనివలన తన సౌకర్యములను వృద్ధిచేసికొనుచున్నాడు. జంతువులను తన వశము చేసికొని వానివలన లాభములు పొందుచున్నాడు. నేలపై పలువిధములైన ప్రయాణ సౌకర్యములు పొందియున్నాడు. సముద్రముపై కూడ నావలమూలమున తన ప్రయాణము సాగించుచున్నాడు. పలువిధములైన ఆహారములు, గృహవసతులు సౌఖ్యములు పొందుచున్నాడు. ఇవన్నియు దేవుని యనుగ్రహమువలన గలుగుచున్నవి. వీనిని తలచి మానవుడు దేవునికి కృతజ్ఞుడై యుండవలెను.

71. యౌమ-నద్ఊ-కుల్ల-ఉనాసిన్-బి-ఇమామిహిమ్-ఫమన్-ఊతియ-కితాబహు-బి-యమీనిహీ-ఫ-ఉలాఇక-యక్రఊన-కితాబహుమ్ - వలా-యుజ్లమూన-ఫతీలా. 72. వ-మన్-కాన-ఫీ-హాజిహీ-అఅమా - ఫహువ-ఫిల్-ఆఖిరతి-అఅమా-వ-అజల్లు-సబీలా.

71. మేము మానవులందఱిని వారి వారి నాయకులతో సహా పిలుచు దినమునందు ఎవరి కర్మల పత్రములు వారి కుడిచేతిలో నియ్యబడునో వారు తమ లేఖలను చదువుదురు. మఱి వారికి రవంతయును అన్యాయము జరుగదు. 72. మఱెవడు ఇహలోకమునందు గుడ్డిగా నుండెనో యాతఁడు పరలోకమునందును గుడ్డివాఁడు, మఱి మార్గమునుండి చాల దూరముపడినవాఁడగును.

వ్యా॥ 71. ఇందు మానవులకు నొసంగఁబడిన ఘనతను వారెంతవఱకు పాటించి సన్మార్గులై దేవుని ప్రీతి పడసిరో మఱెవరు దానికి వ్యతిరేకముగా వారితోఁబాటు చెడిరో అది హెచ్చరింపఁబడుచున్నది. తీర్పుదినమునందు అందఱు మానవులు సజీవులై తాము అనుసరించుచున్న నాయకులను వెంబడించి వత్తురు. విశ్వాసులు, ప్రవక్తలను మత నాయకులను వెంబడింతురు. అవిశ్వాసులు, తమ దుష్టనాయకులను సైతానులను చిల్లర దేవతలను వెంబడింతురు. అపుడు మానవులు ఇహలోకమునందు చేసిన కర్మలన్నియు పత్రములలో వ్రాయఁబడి వారివారికి నొసంగఁబడును. విశ్వాసులైన పుణ్యాత్ములను వారివారికర్మల పత్రము (ఆమాల్ నామా)లు కుడిచేతిలో నొసంగఁబడును. ఇది శుభచిహ్నము. వీరు మోక్షము పొందుదురు. అవిశ్వాసులైన పాపాత్ముల కర్మలపత్రములు వారి యెడమచేతిలో లభించును. దీనివలన వీరు నరకపాత్రులు అని తెలియనగును. విశ్వాసులు ఇహమునందు తమ బుద్ధిజ్ఞానములను సన్మార్గమునందు నుపయోగించినందున వారికి మోక్షము లభించును. వారు తమ కర్మల లేఖలను చూచి సంతోషముతో చదివి తమ స్నేహితులకు చూపించి చదువుఁడనికూడ పలుకుదురు. ఖర్జూరపు విత్తనము మధ్య కొంత చీలియుండును. అందు సన్నని దారము వంటి రవ్వయుండును. దానిని ఫతీలు అందురు. అనగా పుణ్యముల ఫలితముసంపూర్ణముగ లభించును. అందు రవ్వంత కొఱఁతయు నుండదు. 72. దేవుఁడుమానవులకు ఘనతనొసంగెనుగదా! దానికి మీరు వ్యతిరేకముగాఁబోయి ఇహలోకజీవితమునందు సన్మార్గమునుండి కన్నులు మూసికొని గుడ్డివాఁడుగనున్నట్టి అవిశ్వాసి పరలోకములోకూడ స్వర్గమార్గమును చూడలేక అంధుఁడుగా నుండును. నరకములో పడును. స్వర్గమునుండి చాల దూరములో పడును.

73. వఇన్-కాదూ-లి-యఫ్-తినూనక-అనిల్లజీ-ఔ-హైనా-ఇలైక-లి-తఫ్-తరియ-అలైనా-గైరహూ-వఇజల్-లత్-తఖజూక-ఖలీలా. 74. వలౌ-లా-అన్-సబ్-బత్నాక-లఖద్-కిత్త-తర్-కను-ఇలైహిమ్-షైఅన్-ఖలీలా. 75. ఇజల్-ల-అజఖ్-నాక-జిఅ-ఫల్-హయాతి-వ-జి-అఫల్-మమాతి-సుమ్మ-లాతజిదు-లక-అలైనా-నసీరా. 76. వఇన్-కాదూ-లయస్-తఫిజ్జూనక-మినల్-అర్-జి-లియుఖ్

రిజూక-మిన్‌హా-వ ఇజల్-లాయలబ్-బిసూన-ఖిలా-ఫక-ఇల్లా-ఖలీలా. 77.సున్నత మన్-ఖద్ అర్-సల్నా-ఖబ్లక-మిర్-రుసులినా-వలా-తజిదు-లి-సున్నతినా-తహ్వీలా.

73. మఱి మేము నీకు పంపిన సందేశము కాక యితరము మాపై నీవు కల్పించుటకుఁగాను అవిశ్వాసులు మేము పంపిన సందేశమునుండి నిన్ను తొలఁగించుటకుఁగాను కోరుచున్నారు. మఱియు నపుడు వారు నిన్ను స్నేహితునిగాఁ జేసికొనియుందురు. 74. మఱి మేము నిన్ను స్థిరముగా నుంచి యుండకపోయినచో నీవు వారివైపునకు కొంత ఒరఁగియుందువు. 75. అటులైనచో తప్పక నీకు జీవితమునందును చావునందును రెండింతల శిక్ష రుచిచూపియుందుము. ఆ పిదప మాశిక్షనుండితప్పించుటకు ఎవఁడును సహాయుఁడు నీకు లభించియుండఁడు. 76. మఱియు అవిశ్వాసులు నిన్ను ఈభూమి (దేశము) నుండి వెడలఁగొట్టుటకుఁగాను నిన్ను ఈభూమినుండి కదలింపఁగోరుచున్నారు. మఱియు నపుడు నీ వెనుక వారుకూడ కొద్దికాలము మాత్రము ఉండఁగలరు. 77. మేమునీకుముందుగా పంపిన మా ప్రవక్తల పద్ధతి యిటులే జరుగుచువచ్చెను. మఱి నీవు మా పద్ధతి యిటులే జరుగుచువచ్చెను. మఱినీవు మాపద్ధతిలో నేలాటిమార్పు పొందఁజాలవు.

వ్యా॥ 73. ఇందు ఇహలోకములో అంధులైన దుష్టులు చేయు కుట్రలు చెప్పఁబడుచున్నవి. హజ్రత్ పైగంబరులవారు మక్కా-పురములో ప్రజలకు దేవుని సందేశములు బోధించుచు విగ్రహారాధన చేయకూడదు అని పలుకుచుండిరి. విగ్రహారాధకులకు ఆమాట పట్టలేదు. అందుకుఁగాను దుష్టనాయకులు పైగంబరులవారి యొద్దకు వచ్చి మీరు మావిగ్రహములనుగూర్చి పలుకకూడదు. ఈ విషయమును వదలిపెట్టుఁడు. దీనికిఁగాను మేము మీకు ధనము, సుందర స్త్రీలు రాజ్యము నొసంగుదుము అని పలుకుచు పేరాసలు చూపిరి. దుష్టులు చూపిన పేరాసలకు పైగంబరులవారు లొంగినచో వారు పవిత్రను స్నేహితునిగాఁ జేసికొనియుందురు. కాని పైగంబరులవారు లొంగక ఓ యవిశ్వాసులార! మీరు నాకుడిచేతిలో చంద్రుని దెచ్చిపెట్టినను నేను నాధర్మప్రచారము వదలను. నాప్రచారమైనను సాగవలెను. లేదా యీయుద్యమములోనాప్రాణమైన పోవలెను అని పలికి తమ మత ప్రచారమునందు స్థిరముగా నుండిరి. 74. దుష్టులు చేయు ప్రయత్నములవలన పైగంబరులవారు దేవుని సందేశమునుండి తొలఁగిపోక స్థిరముగా నుండిరి. ఇట్లు స్థిరముగానుండుటకు దేవుని రక్షణయే కారణము. లేనిచో కొంతవఱకైన దుష్టుల కుట్రలకు లొంగిపోవలసివచ్చును. అట్లు కాలేదు. కావున పైగంబరులవారి స్థిరత్వము సహజముగ చలింపనిది యని స్పష్టమైనది. 75. ఇందు పైగంబరులవారి ఘనత సూచింపఁబడినది. గొప్పవారి

చిన్న పొరపాటుకూడ పెద్ద తప్పిదముగా నెంచఁబడును. దానికి శిక్షకూడ కఠినముగా విధింపఁబడును. కావున దుష్టులుచేయు కుట్రలకు పైగంబరులవారు కొద్ది మాత్రమైనను లొంగియుండినచో శిక్షకూడ చాల కఠినముగా విధింపఁబడియుండును. దేవుని శిక్షనుండి ఎవరు తప్పింపఁజాలరు. కావున దేవుని మహిమశక్తి అధికారముల యెదుట నెవరి యధికారము చెల్లదు. 76. మక్కాలోని దుష్టనాయకులు హజ్రత్ పైగంబరులవారిని బెదరించి, మక్కా భూమినుండి కదలించుటకు యత్నించుచున్నారు. ఓ ప్రవక్త! నీవు మక్కాపురమును విడిచిపోయినచో నీ వెనుక దుష్టనాయకులుకూడ మక్కాపురములో కొద్దికాలముమాత్రమే ఉండఁగలరు. వారు తప్పక నశింతురు. దేవుఁడు సెలవిచ్చినట్లే యాయెను. మక్కాపురములోని దుష్టనాయకుల హింసలకు హజ్రత్ పైగంబరులవారు మక్కాపురమువిడిచి మదీనాపురము చేరిరి. వీరు మదీనాపురము చేరిన తరువాత ఒకటిన్నర సంవత్సరముల పిదప మక్కాలోని దుష్టనాయకులు బదరుయుద్ధమునకు వచ్చి ముసల్మానులచేత వధింపఁబడిరి. కొందఱు ఖైదీలుగా పట్టుఁవడిరి. (దీని వివరము తెలిసికొన గోరువారు జగత్ ప్రవక్త చూచునది. 77. పూర్వముకూడ అనేక ప్రవక్తలు వచ్చిరి. ఆయాకాలమునందు ఆయాప్రవక్తలు దుష్టుల హింసలవలన పురములు వదలిపోయిరి. ప్రవక్తలు పోయినపిదప దుష్టులు దేవుని శిక్షకు లోనై నశించిరి. ఇట్లు పూర్వమునుండి వచ్చుచున్నది. ఇందు ఏలాటి మార్పు కలుగదు. కావున హజ్రత్ రసూలువారు మక్కాపురము విడిచిపోయిన తరువాత అచ్చటి దుష్టులు తమంతటతామే యుద్ధమునకు వచ్చి నశించిరి.

78. అఖి-మిస్-సలాత-లిదులూ-కిష్-షమ్సి-ఇలా గసఖిల్-లైలి-వఖుర్-ఆనల్-ఫజ్రి-ఇన్న-ఖుర్-ఆనల్-ఫజ్రి-కాన-మష్-హూదా. 79. వమినల్-లైలి-ఫత-హజ్జద్-బిహీ-నాఫి-లతల్-లక-అసా-అన్-యబ్-అసక-రబ్బుక- మఖామమ్-మహ్-మూదా.

78. సూర్యుఁడు వాలునప్పటినుండి రాత్రి చీఁకటివఱకు నమాజును సలుపుము. తెల్లవాఱునపుడు ఖురాను పఠింపుము. నిశ్చయముగ తెల్లవాఱునపుడు ఖురాను పఠించునపుడు దేవదూతలువచ్చి యుందురు. 81. మఱి రాత్రిలోకొంత భాగము ఖురాను పఠించుచు మేలుకొనియుండుము. అది నీకుఁగాను హెచ్చుగా నున్నది. సమీపములోనే స్తుతి స్థానమునందు నిన్ను నీప్రభువునిలువఁబెట్టును.

వ్యా। 78. ఓప్రవక్త! దుష్టులుచేయు కుట్రలను లెక్కచేయకుము. నీవు నీప్రభువు సాన్నిధ్యమున నిలిచి నమాజు సలుపుము. దీనివలన నీమనస్సునకు శాంతిలభించును. అన్నికష్టములుసులువైపోవును. ధైర్యము, స్థైర్యములభించును.

సూర్యుఁడు వాలినప్పటినుండి రాత్రి చీఁకటి బాగుగా క్రమ్ముకొనువఱకు నమాజు స్థిరముగా భయభక్తులతో సలుపవలెను. ఇందు నాలుగువేళల నమాజు చేరును. అవి జోహర్, అసర్, మగ్‌రిబ్, ఇషా, నమాజులు. తెల్లవాఱునపుడు నమాజుచేయవలెను. అందు ఖురానెషరీఫుచాల పఠింపవలెను. దీనినే ఫజర్ నమాజు అనుదురు. ఇది చేరి అయిదుప్రొద్దుల నమాజు ఆయెను. ఫజర్ నమాజునందును అసర్ నమాజు సమయమందును, రాత్రింబవళ్ల దేవదూతలు మారుదురు. అపుడు భక్తులు పఠించు ఖురానెషరీఫును వినుదురు. దీనివలన భక్తులకు హెచ్చుగా శాంతిలభించును. ముఖ్యముగా ఫజర్ నమాజులో భక్తుల మనస్సు చాల నిలకడగానుండును. దేవదూతలు దేవుని సాన్నిధ్యమున తాము ముసల్మానుభక్తులను నమాజు చేయుచుచూచితి మనికూడ సాక్ష్యమిత్తురు. 79. ఇందు హాజ్రత్ రసూలువారు తహజ్జుద్ నమాజుచేయవలెనని విధింపఁబడినది. ఈ నమాజు అర్ధరాత్రిపోయిన పిదప మేల్కొని చేయవలెను. ఇందు ఖురాను పఠింపవలెను. హాజ్రత్ రసూలువారు ఈనమాజునుచాల పట్టుదలతో సలుపుచుండిరి. నమాజులో నిలిచి నిలిచి పాదములు నొప్పిపట్టి వాఁపుకూడ వచ్చుచుండెను. స్తుతిస్థానము (మఖామె మహ్‌మూద్) ఇది గొప్పస్థానము, తీర్పుదినమునందుప్రజలు తమతీర్పుకై తొందఱపడుదురు. అపుడుదై వభీతిచేఏప్రవక్తయును పలుకలేఁడు. అపుడు హాజ్రత్ ముహమ్మదువారు దేవుని సాన్నిధ్యమున ప్రజల తీర్పుకై వేఁడుదురు. వారు నిలిచివేఁడు స్థానమునకు మఖామెమహ్‌మూదు అని పేరు. అపుడు అందఱును పైగంబరులవారిని కొనియాడుదురు దీని నేషఫాఅతెకుబ్రా అనుదురు. అనఁగా ప్రజలతీర్పు కావలెనని దేవునితో సిఫారసుచేయుట.

80. వఖుర్-రబ్బి-అద్-ఖిల్‌నీ-ముద్-ఖల-సిద్ ఖిన్ వ-అఖ్‌రిజ్‌నీ-ముఖ్-రజ-సిద్ ఖిన్-వజ్-అల్-మిల్-లదున్‌క-సుల్ తానన్-నసీరా. 81. వఖుల్-జాఅల్-హాఖ్ ఖు-వజహ-ఖల్-బాతిలు-ఇన్నల్-బాతిల కాన-జహూఖా. 82. వను-నజ్-జిలు-మినల్-ఖుర్ ఆని-మా-హువ-షి ఫాఉన్-వ రహ్-మతుల్-లిల్- మూమినీన-వలా-యజీ-దుజ్-జాలిమీన-ఇల్లా-ఖసారా.

80. మఱియు ఓనాప్రభువా! గౌరవముగానన్ను ప్రవేశింపఁజేయుము. మఱి గౌరవముగానన్ను గొనిపొమ్ము. మఱి నీయొద్దనుండి నాకు అధికార సహాయము నొసంగుము అని ఓప్రవక్త! వేఁడుము. 81. మఱి సత్యమువచ్చెను. అసత్యము పాఱిపోయెను. నిశ్చయముగా అసత్యము పాఱిపోవునదియే అని పలుకుము. 82. మఱియు ముసల్మానులకు స్వస్థతయును దయయును కలిగించు

నట్టి విషయములను ఖురానులో పంపుచున్నారము. మఱి పాపాత్ములకు వీని వలన నష్టమే అధికమగును.

వ్యా॥ 80. హజ్రత్ రసూలువారు దేవునినిట్లు వేడవలెనని దేవుని సెలవగుచున్నది. మదీనాపురములో నన్ను గౌరవముగా ప్రవేశింపఁజేయుము. సత్యమునకు బలము నొసంగుము. దీనివలన ముసల్మాను భక్తులకు కూడ శాంతములభించును. మక్కాపురమునుండి దుష్టులచేతిలో చిక్కకుండ గౌరవముగా నన్ను గొనిపొమ్ము. నీరక్షణలో దీసికొనిపొమ్ము. దీనివలన విరోధులు అవమానము పొందుదురు. స్నేహితులు సంతోషింతురు. ధర్మములు అమలులోనికిఁ దెచ్చుటకు అధికారము కావలెను. అధికారబలములేనిదే దుష్టులు శాంతింపరు. ఎన్నియుపదేశములు వినినను దుష్టులు స్వయముగా తమ దుండగములు మానుకొనరు. కావున అధికారము కావలసినదే. ఈ అధికారమునకు దేవునిసహాయము కావలెను. దీని వలన ధర్మము సత్యము స్థాపింపఁబడును. అధర్మములు నశించును. 81. ఇది గొప్ప భవిష్యత్ ప్రకటన (పేషీన్‌గోయీ). హజ్రత్ రసూలు వారికి మక్కాపురములో ఏలాటి బలముగాని అధికారముగాని లేకుండెను. అట్టి స్థితిలో ఈ వాక్యము ప్రకటింపఁబడెను. ఖురాను, ఇస్లామ్ సత్యమైనవి అవి తప్పక అధర్మమగు విగ్రహారాధనను నశింపఁజేయును. మక్కాపురము నుండియు అరేబియాదేశమునుండియు అసత్యము పాఱిపోయి సత్యమగు ఇస్లామ్ నిలుచును. సత్యమునకు నెదుట అసత్యము నిలువఁజాలదు. ఈ ప్రకటనపూర్తియాయెను. కొలఁది కాలములోనే మక్కాపురము ముసల్మానుల వశమాయెను. కాబామసీదులోనున్న 360 విగ్రహములు పడిపోయెను. హజ్రత్ పైగంబరుల వారు మక్కావిజయమునందు ఈ వాక్యము పఠించుచు విగ్రహములను పడఁగొట్టిరి. (చూడు జగత్ప్రవక్త). 82. ఖురానులోని వాక్యములు క్రమముగా వచ్చుచుండెను. ఎట్లు సత్యమువచ్చిన పిదప అసత్యము పాఱిపోవునో అటులే ఖురాను వాక్యములవలన విశ్వాసుల హృదయములలో ఆత్మికరోగములైన, అవిశ్వాసము, కపటము, సందేహము, తప్పునమ్మకములు, దుర్గుణములు తొలఁగిపోయి ఆత్మికస్వస్థత లభించును. తఱచుగఖురానువాక్యములవలన దేహరోగములుకూడ తొలఁగిపోవును. విశ్వాసులు వీనివలన దేవునిదయకు పాత్రులగుదురు. కాని దుష్టులైన అవిశ్వాసులు ఖురానువాక్యములు విని వారు తిరస్కరించి మఱింత దుర్మార్గములో పడుదురు. వారి మనోరోగములగు అవిశ్వాసము, కపటము, ద్వేషము, దుర్గుణములు హెచ్చును. వారు మఱింత నష్టములో పడుదురు. ఎట్లు ఒక రోగి వైద్యునిమాట వినక మందు సేవింపక తన రోగమును హెచ్చుచేసకొనునో అట్లే అవిశ్వాసులు తమ మనోరోగముల హెచ్చుచేసికొనుదురు. దుష్టులైన పాపాత్ములదే తప్పు. కాని ఖురానుతప్పు కాదు

83. వఇజా అన్-అమ్నా-అలల్-ఇన్సాని-అఅ్రజ-వనఆ-బిజానిబిహీ-వఇజా-మస్స-హుష్-షర్రు-కాన-యఊసా. 84. ఖుల్-కుల్లున్-యఅ్మలు - అలా - షాకి-లతిహీ-ఫ-రబ్బుకుమ్-అఅ-లము-బి-మన్-హువ-అహ్దా-సబీలా.

83. మఱియు మేము మనుష్యునకు సౌకర్యములు ఒసంగినపుడు ఆతఁడు ముఖము త్రిప్పుకొని తొలఁగిపోవును. మఱి వానికి కీడుగలిగినపుడు ఆశవదలును. 84. ప్రతివాఁడును తన మార్గమునుబట్టి పనిచేయుచున్నాఁడు. కావున ఎవఁడు మంచిమార్గము పొందెనో నీప్రభువునకు బాగుగఁదెలియును అని పలుకుము.

వ్యా॥ 83. ఇందు మనుష్యుని లోపము తెలుపఁబడినది. కొందఱు భక్తులు తప్ప అందఱు ఈలోపమునకు లోనై యున్నారు. దేవుఁడు తన అనుగ్రహము వలనమానవులకు సౌఖ్యములును సంపదలునొసంగుచున్నాఁడు. కాని మానవుఁడు దేవుని కృతజ్ఞత సలుపఁడు. సౌఖ్యములుహెచ్చుకొలఁదిని దేవుని మఱచిపోవును దేవుని మార్గమునుండి దూరమై తొలఁగిపోవును. ప్రార్థనలు సలుపడు. ఆపిదప కీడుగలిగి ఆపదలలో చిక్కుకొన్నపుడు ఇఁక మేలుగలగదు అని ఆశవీడును. దేవునిని ధ్యానింపఁడు పై రెండు స్థితులును సరికావు. సౌఖ్యములలో దేవుని మేలుకు కృతజ్ఞత సలుపవలెను. కష్టములు పడునపుడు దేవుని సహాయమువేఁడి దేవుని యనుగ్రహము గలుగునని ఆశ గలిగి యుండవలెను. 84. విశ్వాసులు, అవిశ్వాసులు, సన్మార్గులు, దుర్మార్గులు ప్రతివారును తమ తమ మతమును మార్గమునుబట్టి పనులుచేయుదురు.అందఱును తమతమ పద్ధతిని మతమును మంచిది అని తలంతురు. కాని యెద్ది సన్మార్గమో సర్వజ్ఞుఁడైన దేవునికిఁ దెలియును. మానవుల ప్రతి కర్మయును దేవునికిఁదెలియును. వారివారి కర్మలకుఁదగిన ఫలితము ఆతఁడొసంగును.

85. వయస్ అలూ- నక-అనిర్-రూహి-ఖులిర్-రూహు-మిన్-అమ్రి-రబ్బీ వమా-ఊతీ-తుమ్-మినల్-ఇల్మి-ఇల్లా-ఖలీలా.

86. మఱివారు ఆత్మనుగూర్చి నిన్ను అడుగుచున్నారు. ఆత్మ నాప్రభువు యొక్క ఆజ్ఞ వలననున్నది. మఱిమీ కొసంగఁబడిన జ్ఞానము స్వల్పమే అని ఓప్రవక్త! పలుకుము.

వ్యా॥ 85. మక్కాలోని ఖురైషులు యూదుల ప్రోత్సాహము వలన హజ్రత్ రసూలువారితో ఆత్మనుగూర్చు అది యెట్టిది. దాని తత్వమేమి? అని ప్రశ్నించిరి. అందుకు నిందు సమాధాన మియ్యఁబడినది. ఆత్మయొక్క తత్వమును గూర్చి చాల చర్చగలదు. అది సాధారణముగ గ్రహింపఁదగినదికాదు. మానవుల స్థూలదేహములో నొక అతి సూక్ష్మమైన వస్తువుగలదు. అది దేహములో

నున్నంతకాలము మనుష్యుఁడు తన యింద్రియముల నుపయోగించుచు పనులు చేయును. అది దేహమునుండి పోఁగానే ఏమియునుచేయలేఁడు. ఆస్థితినే చావు అని పలుకుదురు. స్థూలదేహములోనున్నది ఏమిటి అనునది విచారింపఁదగినది. ఈ వాక్యములో అది దేవుని యాజ్ఞ అని చెప్పఁబడినది. అది అతిసూక్ష్మమైన జ్యోతి. అది దేవుని యాజ్ఞవలననే స్థూలదేహములో ప్రవేశించి తిరిగి యాజ్ఞ యైనపుడు దేహమును వదలిపోవుచున్నది. ఆత్మయును దేవునిచే సృష్టింపఁబడినదే. అది అనాదికాదు. మానవులకు నొసంగఁబడిన జ్ఞానము (తెలివి) చాల స్వల్పము. కావున ప్రతి వస్తువుయొక్క తత్వము తెలిసికొనుట సులభముకాదు. సర్వజ్ఞుడు దేవుఁడే. దేవునియెదుట మానవుల జ్ఞానము సముద్రములోని నీళ్ల యెదుట ఒక బిందువువలె నున్నది. కావున, మానవులు దేవుని యాజ్ఞలను ధర్మములను అనుసరించి సత్కార్యములు చేయవలెను. దానిని వదలి మోక్షమునకు ఉపయోగపడని తత్వములనుగూర్చి వాదించుట యుక్తముకాదు.

86. వల-ఇన్-షీనా-లనజ్-హబన్న-బిల్లజీ-ఔ-హైనా-ఇలైక-సుమ్మ-లా తజిదు-లక-బిహీ-అలైనా-వకీలా. 87. ఇల్లా-రహ్-మతమ్-మిర్-రబ్బిక - ఇన్న-ఫజ్-లహూ-కాన-అలైక-కబీరా.

86. మఱియు మేము కోరినచో నీకు పంపిన సందేశమును లాగుకొని పోవుదుము. ఆపిదప నీకుదానిగూర్చి మాకు విరోధముగా నీకు సహాయుఁడెవఁడును దొరకుఁడు. 87. కాని నీప్రభువుయొక్క దయవలనదానినొసంగియున్నాఁడు. ఆతని యనుగ్రహము నీపై చాల యున్నది.

వ్యా॥ 86, 87. ఈ వాక్యములలో దేవుఁడు తన శక్తిని తన యనుగ్రహమును తెలుపుచున్నాఁడు. దేవుఁడు కోరినచో ప్రవక్తకు పంపిన ఖురాను సందేశము తాను గొనిపోఁగలఁడు. మరల దానిని తిరిగి తెచ్చియిచ్చువాఁడెవఁడును లేఁడు. కాని దేవుఁడు అట్లు చేయఁడు. ఎందుకన ఆతని దయ అనుగ్రహములు పైగంబరులవారికి చాల గలవు. మానవుఁడు ఎంతగొప్పవాఁడైనను, దేవునికి అధీనుఁడు. సర్వము దేవుని యనుగ్రహమువలన లభించును.

88. ఖుల్-ల-ఇనిజ్-తమ-అతిల్-ఇన్సు-వల్-జిన్ను-అలా-అన్-యాతూ బి-మిస్లి-హాజల్-ఖుర్ఆని-లా-యాతూన-బి-మిస్-లిహీ-వలౌ-కాన-బఅ్-జు హుమ్-లి బఅ్-జిన్-జహీరా. 89. వల-ఖద్-సర్రఫ్‌నా-లిన్నాసి-ఫీ-హాజల్-ఖుర్ ఆని-మిన్-కుల్లి-మసలిన్-ఫ-అబా-అక్-స-రున్నాసి-ఇల్లా-కుఫూరా. 90.వఖాలూ లన్-నూమిన-లక-హత్తా-తఫ్-జుర-లనా-మినల్-అర్‌జి-యమ్-బూఆ. 91. ఔ

తకూన-లక-జన్నతుమ్-మిన్ నఖీ-లిన్-వఇనబిన్-ఫ-తుఫజ్జి-రల్-అన్-హార-ఖిలా-లహా-తఫ్-జీరా. 92. ఔ-తుస్-ఖితస్-సమాఅ-కమా-జ-అమ్త అలైనా-కిసఫన్ ఔ-తాతియ-బిల్లాహి-వల్-మలా-ఇకతి-ఖబీలా. 93. ఔ-యకూన-లక బైతుమ్ మిన్-జుఖ్-రుఫిన్-ఔ-తర్ఖా-ఫిస్-సమా ఇ-వలన్-నూమిన-లి రుఖియ్యిక-హత్తా తునజ్-జిల-అలైనా-కితా-బన్-నఖ్-రఉ-హూ-ఖుల్-సుబ్-హాన-రబ్బీ-హల్-కున్తు-ఇల్లా-బష-రర్-రసూలా.

88. ఈ ఖురానువంటిది తీసికొనివచ్చుటకుగాను మానవులును జిన్నాతులును చేరి ఒకరికి నొకరు తోడుపడినను, అట్టిది యెన్నటికిని తీసికొని రాలేరు అని పలుకుము. 89. మఱియు మేము ఈ ఖురానులో ప్రజలకుగాను పలువిధములుగ విషయములను బోధించియున్నారము. కాని పెక్కుమంది ప్రజలు తిరస్కరింపక యుండరు. 90. మఱి వారు భూమినుండి మాకొఱకు ఒక యూట ప్రవహింపజేయునంతవఱకును, 91. లేదా నీకొఱకు ఒక ఖర్జూరపులోట ద్రాక్షతోట యేర్పడి అందు నీవు నీటికాలువలు ప్రవహింపజేయునంతవఱకును. 92. లేదా నీవు పలుకునట్లుగ మాపై ఆకాశమును తునకలు తునకలుగా జేసి పడవేయునంతవఱకును లేదా యెట్టయెదుట దేవునిని దేవదూతలను నీవు తీసికొనివచ్చునంతవఱకును, 93. లేదా నీకొఱకు ఒక బంగారు ఇల్లు ఏర్పడునంతవఱకును, లేదా నీవు ఆకాశముపైకి నెక్కిపోవునంతవఱకును నీమాట నమ్మము. మఱి మేము చదువునట్లు గ్రంథమును మాపై నీవు దింపునంతవఱకు నీవు ఆకాశముపైకి నెక్కినది నమ్మము అని పలికిరి. నాప్రభువు పరమపవిత్రుడు. నేను దేవునిచే పంపబడిన మానవుడను మాత్రమే అని ఓ ప్రవక్తా! పలుకుము.

వ్యా॥ 88. ఇందు ఖురానె షరీఫుయొక్క మహిమము తెలుపబడినది. ఖురానువంటి గ్రంథము మనుష్యులుగాని జిన్నాతులుగాని కల్పించి తీసికొని రాజాలరు. ఈవిషయము ముందు పెక్కుచోట్లు వచ్చియున్నది. మఱియు జగత్ ప్రవక్త గ్రంథము చూచిన తెలియగలదు. 89. మానవుల మేలుకుగాను ఖురానె షరీఫులో బోధలు పలువిధములుగ బోధింపబడుచున్నవి. కావున ప్రజలు వానిని గ్రహించి వాని ననుసరించి ఉభయలోకములలో మేలుపొందుచు దేవునికి కృతజ్ఞత సలుపవలెను. కాని పెక్కుమంది అట్లు చేయక తమ అవివేకమున వాని తిరస్కరించి దేవునికి కృతఘ్నులగుచున్నారు. 90, 91. మక్కా ఖురైషులు ఖురాను మహిమను చూచి తాము అరబీభాషలో ప్రవీణులై

కూడ అటువంటి ఖురాను కల్పింపలేకపోయి తుదకు తమ ద్వేషమువలన పనికి రాని కోరికలు కోరసాగిరి. వానివలన బోధ గ్రహించి సన్మార్గులు కావలెనని వారికి ఇష్టములేదు. వట్టి ద్వేషము చూపగలిగిరి. మక్కాలోని యెడారి ప్రదేశమునుండి యొక గొప్ప యూట బయలుదేరవలెను. అందు కాలువలు ప్రవహించి నేల సేద్యమునకుఁ దగినట్లు కావలెను. ఖర్జూరపుతోఁట ద్రాక్షతోఁట ఏర్పడవలెను. 92. ఆకాశము మాపైపడి నశించునట్లుచేయు దేవుఁడును దేవదూతలును ప్రత్యక్షమై నీవు సత్యము పలుకుచున్నావు అని సాక్ష్యమియ్యవలెను. 93. ఇల్లుబంగారులో చేయఁబడిన శృంగారముగలదిగా నుండవలెను. నీవు నిచ్చెనతో ఆకాశముపైకి నెక్కిపోవలెను. నీవు ఆకాశములో నెక్కినందుకు గురుతు అచ్చటినుండి మేము చదువునట్లు గ్రంథము తీసికొని రావలెను. ఈ విషయములు చేయునంతవఱకు మేము నిన్ను నమ్మము అని పలికిరి. ఇట్టి కోరికలు ఒక బుద్ధిమంతుఁడు కోరఁడు. పూర్వముకూడ అనేక ప్రవక్తలువచ్చిరి. వారుకూడ మానవులే. వారికి దేవునివంటి అధికారము లేకుండెను. వారు దేవుని సందేశము ప్రజలకు అందఁజేయుచుండిరి. అటులే నేనుకూడ మానవుఁడను. దేవుని ప్రవక్తను ఆతఁడు పంపిన సందేశము, ధర్మములు ప్రజలకుఁ దెలుపుట నాపని. మీరు కోరు పనికిమాలిన కోరికలు నెఱవేర్చుట నాపనికాదు. దేవుఁడు కోరినచో చూపగలఁడు. ఇట్టివి చూపుము అని దేవునితో కోరుట ప్రవక్తల పనికాదు. ఆతఁడు పరమపవిత్రుఁడు. ఎట్టి లోపములేనివాఁడు అని పలుకుము అని దేవుని సెలవు ప్రవక్తకు అగుచున్నది.

94. వమా-మన-అన్నాస-అన్-యూమినూ-ఇజ్-జా-అ - హుముల్-హుదా-ఇల్లా-అన్-ఖాలూ-అ-బఅ-సల్లాహు-బషరర్-రసూలా. 95. ఖుల్-లౌ-కాన-ఫిల్-అర్‌జి-మలా-ఇకతున్-యమ్-షూన-ముత్-మఇన్నీన-లనజ్-జల్నా అలైహిమ్-మినస్-సమాఇ-మలకర్-రసూలా-

94. మఱియు ప్రజలయొద్దకు సన్మార్గము (బోధ) రాఁగా ఏమి? దేవుఁడు మానవుని ప్రవక్తగాఁ జేసి పంపినాఁడా అని పలికి విశ్వసింపకుఁడిరి. 95. భూమిమీఁద దేవదూతలు వసించుచు తిరుగుచున్నచో మేము వారికేగాను దేవదూతను ప్రవక్తగాఁ జేసి పంపియుందుము అని పలుకుము.

వ్యా॥ 94. దేవుఁడు, ప్రజలు సన్మార్గులు కావలెనని ప్రవక్తల మూలమున బోధను పంపెను. ఆ పిదప ప్రజలు బోధను గ్రహింపక యేమి దేవుని ప్రవక్త మానవుఁడు ఎట్లు కాఁగలఁడు. ఒక దేవదూత ప్రవక్తగా రావలెను అని బలుకుచు విశ్వసింపక పోయిరి. లేనిచో బోధవలన వారికి ఏలాటి ఆటంకము

గలుగ లేదు. దీనికి రాఁబోవు వాక్యములో సమాధాన మియ్యఁబడినది. 95. భూమిపై మానవులకు బదులుగ దేవదూతలు బసచేసి తిరుగుచున్నచో దేవదూతయే దేవుని ప్రవక్తగా వచ్చియుండును. అట్లుకాదుగదా ! భూమిపై వసించువారు మానవులు. మానవులయొద్దకు మానవుఁడే ప్రవక్తగా రావలెను. లేనిచో మానవులు బోధ నెట్లు గ్రహింపఁగలరు? దేవదూత తన స్వరూపములోవచ్చిన మానవుల కన్నులు, హృదయములు ఆతని దృశ్యమును భరింపఁజాలవు. దాని వలన ప్రయోజన ముండదు. దేవదూత మానవుని రూపములో వచ్చినచో మానవుఁడే అను సందేహమే గలుగును గదా! కావున మానవులకు మానవుఁడే ప్రవక్తగా రావలెను.

96. ఖుల్-కఫా-బిల్లాహి షహీ-దమ్-బైనీ-వ-బైనకుమ్-ఇన్నహూ-కాన బి-ఇబాదిహీ-ఖబీరమ్-బసీరా.

96. నామధ్యను మీమధ్యను దేవుని సాక్ష్యమే చాలును. ఆతఁడు తన భక్తులను బాగుగ నెఱుంగుచు చూచుచున్నాఁడు అని ఓ ప్రవక్త ! పలుకుము.

వ్యా॥ 96. అవిశ్వాసులు దేవుఁడు మాకు ప్రత్యక్షమై పలికినచో మేము నమ్మెదుము అని పలికియుండిరి. దానికిఁగాను దేవుఁడు, నన్నునాపనులనుబాగుగ చూచుచున్నాఁడు. నేను దేవుని ప్రవక్తను అని పలుకునది దేవునికి బాగుగఁ దెలియును. నేను దేవునిపై అసత్యము కల్పించుచున్నచో ఆతఁడు నన్ను తప్పక శిక్షించి నశింపఁజేయును. నాయుద్యమము సఫలము కాదుగదా ! అట్లుగాక దినదినము నాయుద్యమము సాగుచు వృద్ధిపొందుచున్నది. ఇదియే దేవుని గొప్ప సాక్ష్యము. ఇది చాలును. ఇవి క్రియారూపమైన సాక్ష్యము. దీనివలన నేను దేవుని సత్యమైన ప్రవక్తను అని ఋజువు అగుచున్నది.

97. వమన్-యహ్‌దిల్లాహు-ఫ-హువల్-ముహ్‌తది-వమన్-యుజ్‌లిల్-ఫలన్-తజిద-లహుమ్-ఔలియాఅ-మిన్-దూనిహీ-వ-నహ్‌షురుహుమ్-యౌమల్-ఖియామతి-అలా-వుజూహిహిమ్-ఉమ్‌యన్-వ-బుక్మన్-వ సుమ్మన్-మావాహుమ్-జహన్నము-కుల్లమా ఖబత్-జిద్నా-హుమ్-సఈరా. 98. జాలిక-జజా-ఉహుమ్-బి-అన్నహుమ్ కఫరూ-బి-ఆయా-తినా-వ-ఖాలూ-అఇజా-కున్నా-ఇజామన్-వ-రుఫా-తన్-అఇన్నా-లమబ్-ఊసూన-ఖల్-ఖన్-జదీదా. 99. అవ-లమ్-యరౌ-అన్నల్లాహల్లజీ-ఖల-ఖస్-సమా-వాతి-వల్-అర్‌జ-ఖాదిరున్-అలా-అన్-యఖ్‌లుఖ-మిస్-లహుమ్-వ-జఅల-లహుమ్-అజలల్-లారైబ-ఫీహి-ఫ-

అబజ్-జాలిమూన-ఇల్లా-కుఫూరా. 100.ఖుల్-లౌ-అన్తుమ్-తమ్-లికూన-ఖజా-ఇన-రహ్మతి-రబ్బీ-ఇజల్-లఅమ్-సక్తుమ్-ఖష్-యతిల్-ఇన్ఫాఖి-వకానల్ - ఇన్సాను-ఖతూరా.

97 మఱియు, దేవుఁడు ఎవరికి మార్గముచూపునో వారే మార్గము పొందువారు. మఱెవరిని దారి తప్పించునో వారికి దేవునిదప్ప నితరు లెవరిని వారికి స్నేహితులుగా నీవు పొందఁజాలవు. మఱి మేము పునరుత్థాన దిన మునందు వారిని అంధులుగ మూఁగలుగ చెవిటివారలుగఁజేసి తలక్రిందులుగవారి ముఖములపై నడిపింతుము. వారి నివాసము నరకము. అది చల్లాఱునపు డెల్ల వారిపై నగ్నిని ప్రేల్చుదుము. 98. వారు మాసూచనలను తిరస్కరించి నందులకును, ఎముకలై ముక్కలై పోయిన పిదప మేము తిరిగి క్రొత్తగాఁ జేయఁ బడుదుమా! అని వారు పలికినందులకును ఇది వారికేఁగల శిక్ష. 99. ఏమి ఆకాశములను భూమిని సృష్టించినట్టి దేవుఁడు వారివంటి వారిని సృష్టించుటకు శక్తి గలిగి యున్నాఁడు అని వారు తెలిసికొనలేదా! మఱి వారికిఁగాను ఒక కాలము నియమించి యున్నాఁడు. అందు ఏలాటి సందేహాము లేదు. కాని పాపా త్ములు కృతఘ్నత చూపనిది యుండరు. 100. నా ప్రభువుయొక్క అనుగ్రహపు ఖజానాలు (బొక్కసములు) మీచేతిలోనున్నచో అవి ఖర్చుఅయిపోవునను భీతిచే వానిని (ఖర్చుచేయక) ఆఁపియుందురు. మఱి మానవుఁడు చాల లోభిగా నున్నాఁడు.

వ్యా॥ 97. దేవుని అనుగ్రహమువలన మానవుఁడు సన్మార్గమునుపొంది సత్కార్యములుచేయుచు మోక్షము పొందఁగలఁడు. ఎవఁడు తన ద్వేషము వల నను దురదృష్టమువలనను సన్మార్గమువీడి దుర్మార్గములో పడినవానికి దేవుఁడు సహాయపడనిచో ఎవరు వానిని సన్మార్గమునకు మరల్పఁగలరు ? ఎవరును మరల్ప లేరు. తీర్పుదినమునందు అవిశ్వాసులు తలక్రిందులుగ తమ ముఖములపై నడతురు. ఏమియు చూడలేరు, పలుక లేరు. వినలేరు. వీరి నివాసము నరకాగ్ని. అందు వారికి బాధ తగ్గదు. వారి దేహములు చర్మములు కాలి పోవునపుడెల్ల క్రొత్త చర్మములు వారికి వచ్చుచు. తీవ్రమైన బాధ గలుగుచుండును. 98. అవిశ్వా సులు ఇహలోకమునందు దేవుని సూచనలను, వాక్యములను పునరుత్థాన దినము ను నమ్మక తిరస్కరించుచుండిరి. దీనికిఁగానే వారికి ఈనరక శిక్ష లభించినది. పునరుత్థానము లేదు, నరకములేదు అని, తిరస్కరించుచున్న విషయములను అం దులోపడి అనుభవించునపుడు తెలిసికొనఁగలరు. 99. భూమ్యాకాశముల వంటి గొప్ప వస్తువులను సృష్టించుటకు శక్తిగల దేవునికి మానవునివంటి స్వల్ప

వస్తువును సృష్టింపలేడా! సృష్టింపఁగలఁడు. ఇంతమంది మనుష్యులు చచ్చి పోయినారే! వీరందఱు ఎప్పుడు లేయుదురు అని అవిశ్వాసులు చెప్పుదురు. అందుకు నిదు సమాధాన మియ్యఁబడినది. మృతులు సజీవులగుటకు ఒక కాలము నియమింపఁబడినది. అదితప్పకవచ్చును. అందు ఏలాంటి సందేహములేదు. అది వచ్చుటలో ఆలస్యమైనది. కావున అదిరాదు అని సందేహించుట వివేకము కాదు. దేవుఁడు పంపు సూచనలను విషయములను పాపాత్ములు వినికూడ నమ్మక అవిశ్వాసులై కృతఘ్నులగుచున్నారు. 100. ఈ వాక్యములకు పూర్వము, హ్రజత్ రసూలువారిపై దేవుని యనుగ్రహము చాలయున్నది అని చెప్పఁబడియెను గదా! పవిత్రపదవి దేవునిగొప్ప అనుగ్రహము. ఇతర సంపదలు కూడ దేవుని యనుగ్రహమువలన లభించును. దేవుని యనుగ్రహములకు మితములేదు. అవి లెక్కకు మించినవి. దేవునియనుగ్రహములు తఱగనివి. ఒకవేళ యాఅనుగ్రహములు ప్రజలచేతిలోనున్నచో వాని నెవరికి నొసంగక అవి తగ్గిపోవునేమో అని ఆపియుంచుదురు. అటులే ధనధాన్యములు ఖర్చుచేసినచో తఱిగిపోవునేమో! పేదఱికమువచ్చునేమో! అని భయపడి ఖర్చుచేయక లోభముచే దాఁచిపెట్టుదురు. ఇది మానవస్వభావము. కాని దేవుఁడు ఎవరికి బుద్ధి జ్ఞానములు ఒసంగునో వారు అట్లుచేయక ధనసంపదలను సమయోచితముగ ఖర్చుచేయుదురు.

101. వలఖద్-ఆతైనా-మూసా-తిస్అ-ఆయాతిమ్-బయ్యినాతిన్-ఫస్-అల్-బనీ-ఇస్రా-ఈల-ఇజ్-జాఅ-హుమ్-ఫఖాల-లహూ-ఫిర్-ఔను-ఇన్నీ-ల-అజున్నుక-యా-మూసా-మస్-హూరా. 102. ఖాల-ఖఖద్-అలిమ్త-మా-అన్-జల-హా ఉలా ఇ-ఇల్లా-రబ్బుస్-సమా-వాతి-వల్-అర్జి-బసాఇర-వఇన్నీ-ల-అజున్నుక యా-ఫిర్ఔను-మస్-సూరా. 103. ఫ-అరాద-అన్యస్-తఫిజ్-జహుమ్-మినల్ అర్జ-ఫఅగ్-రఖ్నాహు-వ-మమ్-మఅహూ-జమీఅ. 104. వ-ఖుల్నా-మిమ్-బఅ-దిహీ-లి-బనీ-ఇస్రా-ఈ-లస్-కునుల్-అర్జ-ఫఇజా-జాఅ-వఅదుల్-ఆఖిరతి-జీనా-బికుమ్-లఫీఫా.

101. మఱియు, మేముమూసాకు స్పష్టమైన తొమ్మిదిసూచనల నొసంగితిమి. నుఱి ఆతఁడు ఇస్రాయీలియుల వద్దకువచ్చినపుడు, ఫిరౌను ఆతనితో ఓ మూసా! నీపై జాల విద్యచేయఁబడినది అని నేను తలఁచుచున్నాను అని పలికిన దానిగూర్చి యిస్రాయీలియులతో నడుగుము. 102. ఈ సూచనలు భూమ్యాకాశముల ప్రభువు పంపియున్నాఁడని నీవుఁ దెలిసియే యున్నది. మఱి

ఓ ఫిరౌను! నీవు నశింపనున్నావు అని నేను తలంచుచున్నాను అని మూసా పలికెను. 103. ఆ పిదప ఫిరౌను వారిని భూమి (దేశము) నుండి కదలింపఁగోరెను. పిదప ఫిరౌనును, అతని వెంటనుండినవారి నందఱిని ముంచి వేసితిమి. 104. మఱియు అతని వెనుక మీరు భూమిలో వసించుఁడు. మఱి పరలోక వాగ్దానము వచ్చినపుడు మిమ్ము చేర్చి తెచ్చెదము అని యిస్రాయీలియులతో మేము పలికితిమి.

వ్యా॥ 101. ఇందు దేవుఁడు మూసాప్రవక్తకు నొసంగిన అనుగ్రహములు తెలుపఁబడినవి. ఈజిప్టు (మిసరు) రాజగు ఫిరౌను ఇస్రాయీలియు (యూదు) లను చాల హింసించుచు వారిని బానిసలుగాఁజేసికొనియుండెను. వారిని రక్షించి స్వాతంత్ర్యము నిప్పించుటకు దేవుఁడు మూసాను ప్రవక్తగాఁజేసి ఫిరౌను యొద్దకు పంపెను. మూసాకు తొమ్మిది సూచన (మోజిజా) లు ఒసంగెను. అవి ప్రకాశించుహస్తము, గొప్పసర్పము అగునట్టి చేతికఱ్ఱ, దుష్టులపై వచ్చిన కఱవు, ఫలనష్టము, తుపానుగాలి, మిడుతదండు, కప్పలు నెత్తురు అనునవి. వీనిగూర్చి సూరయే ఆరాఫులో వివరించియున్నాము. మూసాప్రవక్త ఫిరౌను యొద్దకు బోయి దేవుని సూచనలు చూపినపిదప అతఁడు నమ్మక ఓయిమూసా! నీపై జాల విద్యచేయఁబడినది. కావున పిచ్చిపిచ్చిగా పలుకుచున్నావు అని పలికెను. ఈ విషయములనుగూర్చి యూదుల విద్వాంసులతో నడిగిచూడుఁడు. రసూలు వారు పలుకునది నిజమని తెలియనగును. అని దేవుని సెలవు. 102. అపుడు మూసా ,,ఓయీ! ఫిరౌను, ఈసూచనలు మానవులు కల్పించుకొనునవి కావు. అవిభూమ్యాకాశముల ప్రభువగు దేవుని శక్తివలన గలుగుచున్నవి అని నీహృదయము సాక్ష్యమిచ్చుచున్నది. నీవు తిరస్కరించిన యేమి. ఈసూచనలు నీకన్నులకు తెలియఁగలవు. నీవు గర్వముతో దేవునిసూచనలను నమ్మక తిరస్కరించుచున్నావు. దీని ఫలితము నీనాశమే అని పలికెను. 103. హజ్రత్ మూసా ప్రవక్త బోధను ఇస్రాయీలియులు వినుచుండిరి. దినదినము వారి విశ్వాసము వృద్ధిపొందుచుండెను. వారి బలము హెచ్చసాగెను. ఇది ఫిరౌను చూచి ఇస్రాయీలియులు దేశములో బలపడుదురు అని భీతిచే వారిని మఱింత హింసింపసాగెను. మఱివారిని దేశములో శాంతముతో నుండకుండ చేసి వారిని దేశమునుండి కదలింపవలెనని కోరెను. కాని ఫిరౌనుకోరిక పూర్తి కాలేదు. అతఁడే దేవుని శిక్షకుపాత్రుడై తన దేశమునుండి వెడలి మార్గమధ్యమందు ఎఱ్ఱసముద్రములో తన సైన్యముతోఁబాటు మునిఁగిచచ్చెను. ఈ విషయము ముందు వచ్చినది. 104. దేవుఁడు మూసాయొక్క శత్రువును నిర్మూలించెను. ఆపిదప ఇస్రాయీలియుల బానిసత్వము తొలఁగించి ఓయిస్రాయీలియులారా! శత్రు భూమియగు ఈజిప్టు

లోను, సిరియాలోను స్వేచ్ఛగా వసించుడు. లోకము నశించి తీర్పుదినము వచ్చునపుడు మిమ్ములందరినిచేర్చి, సజీవులుగఁజేసి తెచ్చునపుడు మీ కర్మల తీర్పుఅగును. పుణ్యాత్ములు మోక్షము పొందుదురు. మఱి పాపాత్ములు నరకము పొందుదురు.

105. వబిల్‌హఖ్ఖి అన్‌జల్‌నాహు-వబిల్‌హఖ్ఖి నజల - వమా అర్‌సల్నాక-ఇల్లా-ముబష్-షిరన్ వ-నజీరా. 106. వఖురానన్-ఫ-రఖ్‌నాహు-లి-తఖ్‌రఅహూ-అలన్నాసి-అలా-ముక్-సిన్-వనజ్-జల్నాహు-తన్-జీలా.

105. మఱియు మేము ఈఖురానును సత్యముతో నంపితిమి. మఱియు అది సత్యముతోనే వచ్చినది. మఱి నీవు సంతోషపువార్త నిచ్చువాఁడవుగను భయపెట్టువాఁడవుగను చేసి నిన్ను పంపితిమి. 106. మఱియు నీవు తిన్నగాఖురానును పఠించి ప్రజలకు వినిపించుటకుఁగాను దానిని కొంచెము కొంచెముగా పంపితిమి. మఱి దానిని మెల్లమెల్లగా నంపితిమి.

వ్యా॥ 105. దీనికి ముందు హజ్రత్ మూసా ప్రవక్తకు నొసంగఁబడిన సూచనలు చెప్పఁబడెను. ఇఁక హజ్రత్ రసూలు వారికి దేవునిచే నొసంగఁబడిన విద్యా సంబంధమైన మహిమ (మోజిజా) అగు ఖురానునుగూర్చి చెప్పఁబడు చున్నది, ఖురాను సత్యములతోఁ గూడినది. అందలి ధర్మములు, సత్యములు. అవి అనుసరింపఁదగినవి. దేవుఁడు పంపినట్లుగ మధ్య ఏలాటి మార్పులేక జిబ్రీలుదూత మూలమున హజ్రత్ రసూలువారికిఁ జేరినది. దాని ననుసరించి హజ్రత్ ముహమ్మదువారు విశ్వసించి సత్కార్యములు చేసినవారికి ఉభయలోకములలోను జయము, మోక్షములున్నవి అను సంతోషపువార్త వినిపింతురు. తిరస్కరించి విశ్వసింపనివారికి నరకమున్నది అని భయపెట్టుదురు. ఇందులకే దేవుఁడు రసూలు వారిని ప్రవక్తగాఁజేసి పంపెనని చెప్పఁబడియెను. 106. ఖురానె షరీఫు ఒకేసారి పూర్తిగా దేవునిచే హజ్రత్ రసూలువారికిలభింప లేదు. ఇరువదిమూఁడు సంవత్సరములలో మెల్లమెల్లగా కొంచెము కొంచెము సమయోచితముగ వచ్చుచుండెను. అందువలన భక్తులు సులువుగ ధర్మములు గ్రహింపఁగలిగిరి. ఖురానె షరీఫుయొక్క ముఖ్యోద్దేశ్యము దాని పఠించి విషయములు గ్రహించి వాని అనుసరించుటయే. ఇందులకే ఖురాను ఒకేసారి రాక మెల్లమెల్లగా వచ్చెను.

106. ఖుల్-ఆమినూ-బిహీ-ఔ - లా-తూమినూ-ఇన్నల్లజీన-ఊతుల్-ఇల్మ-మిన్-ఖబ్లిహీ-ఇజా-యుత్లా-అలైహిమ్ యఖిర్రూన-లిల్-అజ్-ఖాని - సుజ్జదన్. 107. వ-యఖూ-లూన-సుబ్ హాన-రబ్బినా-ఇన్‌కాన వఅదు- రబ్బినా

లమఫ్-ఊలా. 109. వ-యఖి(రూన-లిల్-అజ్ - ఖాని- యబ్-కూన వ-యజీ-దుహుమ్-ఖుషూఅ. 110. ఖులిద్-ఉల్లాహ-అవిద్-ఉర్-రహ్మాన-అయ్యమ్-మా తద్ ఊ-ఫల-హుల్-అస్మా-ఉల్-హుస్నా-వలా-తజ్ హర్-బి-సలా తిక-వలా- తుఖాఫిత్-బిహా-వబ్-తగి-బైన-జాలిక-సబీలా. 111. వఖులిల్-హమ్దు-లిల్లా-హిల్లజీ-లమ్-యత్-తఖిజ్-వలదన్-వలమ్-యకుల్-లహూ-షరీకన్-ఫిల్-ముల్కి-వలమ్-యకుల్-లహూ-వలీయుమ్-మినజ్-జుల్లి-వ-కబ్బిర్-హు-తక్బీరా.

107. మీరు ఖురానును నమ్మండు లేక నమ్మకుండుడు. దానికి పూర్వము ఎవరికి (శాస్త్ర) జ్ఞానము నొసంగబడెనో వారియెదుట అది పఠింపఁబడునపుడు వారు చిబుకముల బలమున సాష్టాంగపడుదురు. 108. మఱి మాప్రభువు పరమ పవిత్రుఁడు. మా ప్రభువు వాగ్దానము పూర్తి అయి తీరును అని పలుకుదురు 109. మఱియు వారు ఏడ్చుచు చిబుకముల బలమున పడుదురు. మఱి ఖురాను వారికి వినయము హెచ్చించును అని పలుకుము. 111. అల్లాః అనియు లేక రహ్మాను అనియు పిలువుఁడు. ఎద్దానితో పిలిచినను మంచిదియే. అవన్నియు ఆతని మంచి పేర్లే అని పలుకుము. మఱి నీనమాజును చాల గట్టిగాఁ జేయకుము. మఱి నిశ్శబ్దముగాకూడ దానిని చేయకుము. వాని మధ్యమార్గమును అవలంబింపుము. 111. సంతానములేనట్టియు అధికారములో సాటిలేనట్టియు, శక్తిలేని కారణముచే తనకు సహాయుఁడు కావలెనను నది లేనట్టియు అగు దేవునికే సర్వస్తోత్రములున్నవి అని పలుకుము. మఱి నీవు ఆతని మహిమను గొప్పగాఁ దలఁచి కొనియాడుము.

వ్యా॥ 107. ఖురానును నమ్మని అవిశ్వాసులతో నిట్లు పలుకవలెనని దేవుని సెలవు. ఓ అవిశ్వాసులారా! మీరు ఖురానును నమ్మిన నమ్మకపోయిన సరే. దానివలన నష్టమేమియులేదు. అది దేవుని గ్రంథము. అది సత్యము అను విషయమునకు లోటులేదు. ఖురానునకు పూర్వము తౌరాతు, ఇన్జీలు మొదలగు దేవదత్తగ్రంథములు పొందిన శాస్త్రజ్ఞులు ఖురానును వినినప్డు దాని మహిమకులోనై భయభక్తులతో సాష్టాంగపడి దేవునికి కృతజ్ఞత సలుపుదురు. మఱి ఖురానును సత్యమైన దేవుని గ్రంథమనియు, హజ్రత్ రసూలువారు దేవుని ప్రవక్త అనియు నమ్మెదురు. వారి మత గ్రంథములలో రాఁబోవుఆఖరు ప్రవక్తనుగూర్చియు ఆతనికి నొసంగఁబడు గ్రంథమునుగూర్చియు ముందుగానే ప్రకటనలు గలవు. కావున వాని ననుసరించి న్యాయముగల విద్వాంసులు తప్పక నమ్మవలసియున్నది. (ఈ విషయమునుగూర్చి జగత్ ప్రవక్త చూడుఁడు.) 108.

వారి గ్రంథములలోఁగల భవిష్యత్ ప్రకటనలు పూర్తి అయినందున వారి గ్రంథములు సత్యములు అనియు స్పష్టమైనది. కావున మా ప్రభువు వాగ్దానము నెఱవేరినది. అది తప్పక నెఱవేరునది అని భక్తిపూర్వకముగ పలుకుదురు. 109. వారు ఖురానును వినునపుడు అందలి విషయములు భావములు గ్రహించి భయ భక్తులతో కన్నీరు కార్చుచు సాష్టాంగము (సిజ్దా) చేయుదురు. అందు చిబుకముల బలము అనుదానిలో వారి మఱింత భక్తి వినయములు హెచ్చుగా స్పష్టమగుచున్నది. 110. పై వాక్యములలోని భక్తిపూర్వకమైన సాష్టాంగ సంబంధమువలన ఇందు దేవునిని పిలుచు (ప్రార్థన) పద్ధతియును దీని సంబంధమును బట్టి రాఁబోవు వాక్యములో నమాజు విషయము చెప్పఁబడినది. దేవునికి పెక్కు పేర్లు గలవు. అందు విగ్రహారాధకులైన అరబ్బులలో అల్లాహ్ అనుపేరు చాల వాడుకలో నుండెను. రహ్మాను అను పేరు వారికి చాల వాడుకలో లేకుండెను. కాని యూదులు రహ్మాను అను దేవుని పేరును చాల వాడుచుండిరి. అందుకు అరబ్బులు దేవునికి రహ్మాను అనిపలుకుటకు శంకించుచు వెనుదీయుచుండిరి. రహ్మాను అను పేరు హజ్రత్ రసూలువారి నోట విని అరబ్బులు ఏమి? ఈ పేరుగల మఱొక దేవుఁడు గలఁడా? అటులైన ప్రవక్త మేము పెక్కు దైవములను పిలుచుచున్నామని ఎందులకు మమ్ము నిందించుచున్నాఁడు అని వాదించుచుండిరి. యూదులు, రహ్మాను అను పేరు ఎందులకు నెక్కువగా పైగంబరులవారు పలుకుట లేదు అని పలుకుచుండిరి. ఇందు వీరికి సమాధాన మియ్యఁబడెను. అల్లాహ్, రహ్మాను అను రెండు పేర్లను దేవునికి అన్వయించుచున్నవి. పేర్లు రెండు అగుటఁబట్టి రెండు దైవములున్నవి అని ఏర్పడదు. దేవునికి పెక్కు పేర్లుగలవు. అవన్నియు మంచివి. ఏ పేరుతో పిలిచినను పిలువవచ్చును. అందు ఏలాటి లోపము తప్పు లేదు. సమయోచితముగ ఆయా పేర్లు వచ్చుచుండును. నమాజు ప్రార్థనలలోను గట్టిగా ఖురానును పఠించునపుడు మధ్యమార్గము అవలంబించవలెను, గొంతు పడిపోవునట్లుగ గట్టి శబ్దముతో ఎలుగెత్తి పఠింపనురాదు, మఱి ప్రక్కనున్న వారికిఁగూడ వినరానట్లు మెల్లగా నిశ్శబ్దముగాకూడను పఠింపరాదు. ప్రక్కనున్నవారు వినునట్లు మితమైన శబ్దముతో నమాజులో ఖురాను పఠింపవలెను. హజ్రత్ రసూలువారు మక్కాలో నున్నపుడు నమాజు చేయునపుడు ఖురానును గట్టిగా పఠించిన దుష్టులు విని పరిహాసమాడుచు దుర్భాషలాడుదురని చాల నిశ్శబ్దిముగా నమాజులోనున్న శిష్యులకుకూడ వినరానట్లుగ చదువుచుండిరి, అందుకు దేవుఁడు ఈ వాక్యము పంపి అట్లు వలదు. మధ్య మార్గము అవలంబింపవలెనని సెలవిచ్చెను. కాని ఉపన్యాసము చేయునపుడు గంభీరముగా అందఱు వినునట్లు ఖురాను పఠించి వినిపింపవలెను. 111. నమాజు తరువాత దేవుని యేకత్వము (తౌహీదు)నుగూర్చి యిందు నుపదేశించి ఈ సూరాను సమాప్తము

చేయఁబడెను. దేవునికి బిడ్డలులేరు. ఆతనికి సంసారసంబంధము లేదు. ఆతని యధికారములో నెవరును భాగస్థులు లేరు. ఆ[illegible]టిలేదు. ఆతను ఇతరుల సహాయము కోరుటకుఁగాను ఆతనియందు ఏలాటి బలహీనత లేదు. ఆతఁడు సర్వవిధముల పరమ పవిత్రుఁడు, ఆతఁడు లోపములులేని సర్వాధికారుఁడు. ఇట్టి దేవుఁడే సర్వస్తోత్రములకును మహిమలకును దగినవాఁడు. ఒకరి సహాయముకోరుట మూఁడు విధములుగ నుండును. 1. తండ్రి తన సంతానముతో సహాయము కోరు విధముగ తనకంటె చిన్నవారితో సహాయము కోరుట, 2. తనతో సరిసమానుఁడగు భాగస్థుని (సాటి)తో సహాయము కోరుట. 3. బలహీనుఁడు, తనకంటె నెక్కువబలము, శక్తిగలవానితో ఆపదలందు సహాయము కోరుట. ఈమూఁడు విధములగు సహాయము దేవునికి అక్కఱలేదు అని ఈవాక్యమునందు సూచింపఁబడినది. అంత్యమున మానవులు సర్వశక్తుఁడగు దేవుని మహిమలను ఎఱిఁగి మనఃపూర్వకముగ కొనియాడవలెను అని చెప్పఁబడియెను. ఇందు దేవునికి సంతానమున్నది అని పలుకు నస్రానీలకును, దేవునికి సాటి (భాగస్థులు) గలరు అని పలుకు పెక్కుదైవారాధకులకును, దేవుఁడు ఒకరికి లొంగిపోవునని పలుకునట్టి యూదులకును రద్దు గలదు. 109 వ వాక్యము చదువునపుడు సిజ్దా చేయవలెను.

మొదటి సంపుటము సంపూర్ణము.

---

పరమ దయాళువగు అల్లాః అనుగ్రహము వలన మొదటి సంపుట ముద్రణ హిజ్రీ శకము 1367 రమ్‌జాన్ నెల 11వ తేది, (19-7-1948) సోమవారమునాఁడు సంపూర్ణమాయెను.

ఇందు సూరయే ఫాతిహా నుండి సూరయేబనీ యిస్రాయీల్ వఱకు పదునేడు సూరాలుగలవు. రెండవ సంపుటము సూరయే కహ్ఫుతో ప్రారంభమై సూరయే నాస్‌తో పూర్తియగును.



---

Printed at Premier Press, Secunderabad-Dn.